# భారతి

## సచిత్రమాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు



ఆంధ్రపత్రికా కార్యాలయము—మద్రాసు

౧౯౨౪

# విషయానుక్రమణిక

## చిత్రపటముల వివరము

రంగులపటములు: ౧. మహాత్మాగాంధి—చిత్రకారుడు: శిఖ సూర్యనారాయణగారు, ౨. శ్రీకృష్ణభగవానులు, ౩. శ్రీరాధ, ౪. ఆంధ్రబాలిక,—చిత్రకారిణి: దా. సత్యవాణిగారు, ౫. శ్రీకృష్ణునియమునావిహారము, ౬. పాపికొండ గోదావరి, దా. రామారావుగారు.

ఇతరపటములు: ౧. పోతనభాగవతరచన—చిత్రకారుడు: చి. పట్టాభిరామయ్యగారు, బి. ఏ. ఎల్. టి., ౨. కీర్తిశేషులైన కావ్యనిధి చెలికాని లచ్చారావుగారు, ౩. కీర్తిశేషులైన పండిత వంగూరి సుబ్బారావుగారు, ౪. దేశభక్త కొండా వేంకటప్పయ్య గారు, ౫. మౌలానా మహమ్మదాలీగారు, ౬. మౌలానా షౌకతాలీగారు, ౭. జవహరిలాలు నెహ్రూ గారు, ౮. ఆచార్య ప్రఫుల్లచంద్ర రే గారు, ౯. ౧౦. సేట్ జమ్నాలాల్ బజాజుగారు, ౧౧. బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు, ౧౨. హార్డికర్ గారు, ౧౩. కళా వెంకటరావుగారు.

---

# భారతి

## సచిత్రమాసపత్రిక

### ప్రతిచాంద్రమాసాదిని ప్రచురింపఁబడును

#### చిత్రలేఖనము — పటములు

ప్రతిసంచికయందును మూఁడు నాలుగు రంగుల చిత్రపటములు ఇతరపటములు ప్రచురింపఁబడును.

ప్రాచీన నవీనచిత్రపటములు గలవారు పటములను పంపిన, వానికి ప్రతులను తీసి పటములు భద్రముగను తిరిగి పంపఁబడును.

క్రొత్తగ చిత్రపటములను వ్రాయువారు పటములను బంపిన, యథాశక్తిని సత్కరింపఁబడుదురు.

ఆంధ్రదేశమునందు జరుగు వేడుకలు పండుగలు ఉత్సవములు మొదలగువానిఫోటోలను బంపిన వారలకు వందనముల నర్పించుచుఁ దగిన సత్కారమొసంగఁబడును.

ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధస్థలములకును క్షేత్రములకును పురుషులకును సంబంధించిన ఛాయాపటములను చిత్రపటములను బంపినవారలకును యథాశక్తిని సత్కార మొసంగఁబడును.

ఈఛాయాపటము లన్నియును క్రొత్తవిగఁ దీసినవిగ నుండవలయును.

తామ్రశిలాశాసనములును నితరశాసనములును గలవారు వానిని పంపిన నుపయోగించి తిరిగి వారికిఁ బంపబడును.

#### శిల్పములు, స్థాపములు

ఆంధ్రదేశమునందు గల శిల్పములకును స్థాపములకును సంబంధించిన వ్యాసములు సచిత్రములుగను బ్రచురింపఁబడును. ఈ విషయములందు పరిచయము గల పండితులు చిత్రయుతముగ వ్యాసములను వ్రాసి పంపుటకుఁ బ్రార్థితులు.

#### సారస్వతము

భారతియందు వాఙ్మయమునకు సంబంధించిన విషయములు యథోచితముగఁ బ్రచురింపఁబడును. వాఙ్మయమునకు సంబంధించిన విమర్శనలు పాటలు పద్యములు కథలు నవలలు నాటకములు మొదలగువానికి సంబంధించినవిషయము లిందుఁ బ్రకటింపఁబడును.

కథలను చిన్నికథలను నాటకములను వ్రాసి పంపెడివారు వీ లైనయెడలఁ జిత్రసహితముగను బంపఁ బ్రార్థితులు.

అముద్రిత గ్రంథములు: ప్రాచీనము లైనయముద్రితగ్రంథములు గలవారు వానిని బంపిన గ్రంథమును వ్రాయించిగాని పరిశోధించిగాని తిరిగి పంపఁబడును.

# భారతి ప్రకటన ధరలు

| ఒకమాసమునకు మాత్రము | | | 6 మాసములకు అంతకు పైన సాధారణ పుట 1 కి | | |
|---|---|---|---|---|---|
| సాధారణ పుట 1 కి | రూ. | 25 | నెలకు | | రూ. 20/- |
| ,, $\frac{1}{2}$ | ,, | 12-8 | ,, | $\frac{1}{2}$ | ,, 10/- |
| ,, $\frac{1}{4}$ | ,, | 8 | ,, | $\frac{1}{4}$ | ,, 6/- |

వ్యాసములుగల పుటలమధ్యగల పుటలకు 6 మాసములకుపైగా కంట్రాక్టుతీసికొనిన, పుట 1 1 నెలకు రూ. 30/- వంతున చార్జిచేయబడును. ఇతరవివరములు తెలియగోరువారు ఈ దిగున విలాసమునకు వ్రాయవలెను.

మేనేజరు, భారతి,
తపాలపెట్టె నెంబరు 212, మద్రాసు.

# ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక ప్రకటన ధరలు

| | | | వ్యాసములమధ్య ప్రకటించువానికి | | | |
|---|---|---|---|---|---|---|
| సాధారణ పుట 1 కి | రూ. | 30 | పుట | 1 కి | రూ. | 40 |
| ,, $\frac{1}{2}$ | | 16 | ,, | $\frac{1}{2}$ | | 20 |
| ,, $\frac{1}{4}$ | | 9 | ,, | $\frac{1}{4}$ | | 10 |

ఇతర వివరములకు ఈ దిగువవిలాసమునకు వ్రాయవలెను.

మేనేజరు, ఆంధ్రపత్రికా కార్యాలయము,
తపాలపెట్టె నెంబరు 212, మద్రాసు.

ఆంధ్రప్రపంచము సహజమైన యౌదార్యమును జూపి భారతిని లాలించి యాదరించి పోషించి ఈముద్దుదేవికి స్వాగతంబు నొసంగుటకుఁ బ్రార్థితులు.

సంపాదకుఁడు, భారతి,
7, తంబుసెట్టివీథి, మద్రాసు.




చెన్నపట్టణము, జనవరి ౧౯౨౪

సంపుటము ౧. రుధిరోద్గారి సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧.


# గాంధి శతకము


మంగిపూడి వేంకటశర్మ గారు




నిరుపమకల్యాణగుణా
భరణా జనకాభయోగివందితచరణా
పురుషార్థభరితచరితా
కరుణామృతపూరితాత్మ ! గాంధిమహాత్మా. ౧

క. నీ వవతరించుటను నా
ర్యావర్తము పూత మయ్యె ! సనని తరించెన్
శ్రీవైశ్యకులము మెఱసెను
కావఁబడె భరతమాత ! గాంధిమహాత్మా. ౨

క. నీ వేసు వనుచు బుద్ధుఁడ
వీవనుచున్ రాముఁడనుచుఁ గృష్ణుఁడ వనుచున్
భావింతురు నీవందఱుఁ
గావలయు నటంచు నెంతు ! గాంధిమహాత్మా. 3

క. క్రూరు లయి హింసఁ జేసెడు
వారలఁ బ్రేమించునట్టి ! వ్రత మూనితి వా
కారణమునఁ గ్రీస్తందురు
గార్దనమున జనులు నిన్ను ! గాంధిమహాత్మా. ౪

క. భూతముల నెల్ల సహజ
ప్రీతిన్ గనుఁగొనుచు । నొకపిపీలికకేనిన్
ఘాతఁ దలంపని కతమున
గౌతమబుద్ధుఁడ వటంద్రు । గాంధిమహాత్మా. ౫

క. తిలకింపఁ బరశురాముఁడు
తిలకై జన్మింప నతని। తేజముఁ గొనుచున్
వెలసితివఁట కాదా మరి
కలియుగరామావతార । గాంధిమహాత్మా. ౬

క. సదయత వలువ లొసఁగి ద్రౌ
పదిఁ బ్రోచిన కృష్ణుఁ డనఁగ। భావ్య మగుక్ మ
ప్పదిమూఁడుకోట్లఁ బ్రోచితి
గద మానము నిల్పి నేఁడు। గాంధిమహాత్మా. ౭

క. ఖండాంతరపండితులు న
ఖండం బగు దివ్యశక్తి । గలవాఁ డనుచుక్
ఖండితముగఁ బల్కుదు రా
ఖండలనిభనిర్మలాత్మ । గాంధిమహాత్మా. ౮

క. వైరులును మహాత్ముఁడ వని
పేరుకొనక మాన లేరు । భీతిన్ బ్రీతిన్
వారక యెల్లరుఁ దలఁతురు
కారణజన్ముఁడవు నీవు । గాంధిమహాత్మా. ౯

క. లోకంబున నిర్యేడఁ గల
లోకోత్తరపురుషమణులలో। నెల్లను నీ
వే కన్నాకు వటందురు
గా కలకవిలోక మెల్ల । గాంధిమహాత్మా. ౧౦

క. వింతగద నీచరిత్రము
శాంతమె కన్పించు నీదుచర్యలయందున్
శాంతనిశాంతా సర్వది
గంతనటత్కీర్తికాంత । గాంధిమహాత్మా. ౧౧

క. కామక్రోధంబులు నీ
సామీప్యముఁ జేరఁగొంకు । జంకుఁ జుమీ నీ
కా మదమాత్సర్యంబులు
కామాదివికారదూర । గాంధిమహాత్మా. ౧౨

క. నీభాగ్య మేమి చెప్పుదు
లోభము మోహమును నిన్ను। లోఁగొనవమ్యెన్
నీభవము తరించెను గం
గాభవనిభ నిర్మలాత్మ । గాంధిమహాత్మా. ౧౩

క. సంగరహితుఁడవు కావని
సంగ రహితుఁడనుచుఁగాదె । సాధుజనులు నీ
సంగతిఁ గోరుదు రఘములు
కంగా రగు నిన్ను విన్న । గాంధిమహాత్మా. ౧౪

క. సత్యమె నిత్య మటంచును
సత్యము విడనాడ వెట్టి। సమయమునందున్
సత్యమె నిను రక్షించు న
గత్యముగాఁ దోడు నిల్చి। గాంధిమహాత్మా. ౧౫

క. జ్ఞానము ఋషికోటికి వి
జ్ఞానములకు నెలవు । భరతఖండం బనఁగా
దీనిసరి దేశ మొందును
గానముగద లోకమందు । గాంధిమహాత్మా. ౧౬

క. భోగముల కాటపట్టది
త్యాగములకు నిలయ మిద్ది । ధర్మంబులకున్
బాగగు నెల విది స్వర్గము
కాఁగలదా దీని కుద్ది । గాంధిమహాత్మా. ౧౭

క. గరితలకుఁ బుణ్యాసంప
ద్భరితులకున్ సాధులకును । భగవత్సేవా
నిరతులకు సుచరితుల కా
కరముగదా! భరతభూమి । గాంధిమహాత్మా. ౧౮

(సశేషము)

# స్వవిషయము

ఉ. కాటుకకంటి నీరు చను।కట్టుపయిం బడ నేల యేడ్చె? దో
కైటభదైత్యమర్దనుని । గాఁదిలికోడల! యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను । నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల । కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ.

పోతన.




శ్రీమదాంధ్ర భాగవతమును రచియించు సందర్భముననుమహానుభావుఁడైన పోతనామాత్యునకును భాగ్యభోగప్రియుఁడైన శ్రీనాథునకును సంబంధించిన కథ లనుశ్రుతముగ వచ్చుచున్నవి. ఆ గాథలయందు భాగవతకృతిసమర్పణమునకు సంబంధించినగాథయు నొకటి గలదు. ఆ గాథయును పోతరాజునకు సహజమైన స్వాతంత్ర్య భావవైభవమును మనోహరముగ దెలుపుచున్నది.

పోతరాజు తన భాగవతకృతి నేరాజునకో ఇచ్చి దుర్భరమైన దారిద్ర్యమును బాపుకొనుట వివేకమని శ్రీనాథుడు పోతరాజును హెచ్చరించెను. శ్రీనాథుని పలుకులు పోతరాజునకుఁ గొంత సంభ్రమమును గలుగఁజేసినవఁట! తన మనోవికారమువలనను భారతికి గలిగిన సంతాపమును పోతన గనుఁగొని పై పద్యమును వ్రాసి భారతికి దుఃఖోపశమనమును జేసినాఁడట! పరాధీనస్థితియం దున్న భారతి విశుద్ధమైన దేశభాషారాధకులకు గలుగఁజేసెడి హృదయసంతాపము నీ పద్యార్థము విశదముఁ జేయుచున్నది.

పోతరాజు పరమస్వతంత్రుఁడు. ఆ మహాకవికి కావ్యసామ్రాజ్యానుభవమున కాటంకము లెవ్వియును లేవు. భాషయందును భావములందును విజ్ఞానమునందును జీవనప్రవృత్తియందును పూర్ణ స్వాతంత్ర్యమును గలిగి స్వాధీనభారతి నారాధింపఁ గలిగినను కృతివిక్రయభావము పోతరాజునకు సంతాపమును గలుగఁజేసినపుడు సకల విధములను స్వాతంత్ర్యమును గోల్పోయి యిపుడు పరాధీనస్థితియం దున్న భారతిని గనుగొనునపుడు గలుగగల సంతాపమునకు మితిమేరలుం గలవా? మన నిర్మాణమునకు మన పరాధీనస్థితికి మూలశక్తియైన భారతియొక్క పరాధీనస్థితియె మూలము. స్వీయసాంప్రదాయాచారసిద్ధమైన భారతీస్వరూపమును సంకల్పించి ధ్యానించి పూజించి వర్ణించి చిత్రించి కీర్తించి భారతిని ప్రత్యక్షము చేసికొనుటయె స్వాధీనస్థితికి సాధనము.

భారతి దీనదశ ననుభవించు చున్నది. అంగములు శుష్కించినవి. కాంతికళలు పోయినవి. విషమస్థితి గలిగినది. ఈ మహాపద్రవమునందు మునిఁగి తేలుచున్న భారతి నుద్ధరించి శుభస్థితిని గల్పింపవలయు నను సంకల్పము భారతహృదయము

నందు గలిగినది. సేవాపరాయణులు పలువిధముల నీ దేవి నారాధించుచు దివ్యరూపసందర్శనమును జేయగోరుచున్నారు. ఆరాధనాభిలాష యితర రాష్ట్రములందు వలె నాంధ్ర రాష్ట్రమునందును గల దు. ఆ యభిలాషను సఫలము చేయుటకు పత్రిక లను ప్రచురించుచున్నారు. గ్రంథములను వ్రాయు చున్నారు. చిత్తరువులను చిత్రించుచున్నారు. పాట లను పాడుచున్నారు. ఈ ప్రయత్నము లన్నియును భారతిని బ్రత్యక్షము చేయుచు నాత్మవికాసమునకు సాధనంబు లగుచున్నవి.

భారతి ఆదిశక్తి, మహాశక్తి, సావిత్రి, సర స్వతి, మహాలక్ష్మి, త్రిపురసుందరి. కైలాస శిఖర మునందును కన్యాకుమారియందును, శ్రీ గిరియం దును వేంకటాద్రియందును, వటమునందును మాత ముసందును, మత్తేభమునందును మరాళమునందును, అజంతాయందును ఎల్లోరా యందును, కమలము లందును కేదారములందును, మందిరములందును మహలులందును, వేదములందును కావ్యములం దును, పాటలందును పద్యములందును సర్వత్ర భారతి ప్రత్యక్షముగ నున్నది. సర్వత్ర కన్నులుగల వారికి ప్రత్యక్షముగ నున్న భారతిని యథాశక్తి నారాధించి భారతీప్రసాదమును బడయుటయె ఆత్మోపలబ్ధికి సాధనము.

భారతి దేశభాషారీతుల ననుసరించి బహురూప ములను నెల్లెడలను వెలయుచున్నది. ఆమహాదేవి వంగ మహారాష్ట్రాదిదేశములందు నవవికాసముతో విహ రించుచున్న విధమును నారాష్ట్రముల కళావాఙ్మ యముల వికాసము విశదముచేయుచున్నది. వంగ భాషయందుఁ బ్రచురింపఁబడుచున్న గ్రంథములు చిత్రపటములు పత్రికలు పరిశోధనలు వారి యుత్సా హమునకు నిదర్శనములు. ఆంధ్రభారతియును వంగభారతియును కర్ణాటకభారతియు నుభారతీస్వరూ పములు. భారతీదేవి నెవ రేరీతిని గొలిచిన వారికా రీతిని బ్రత్యక్షమగుచు కామితార్థముల నొసంగు చున్నది. శ్రీకాకుళమునుండి నాశికవఱకును మహా వైభవవిలాసములతోఁ బూర్వ మానందముగ నాం ధ్రావనియందు విహరించినభారతి యిపుడు పరా ధీనమై దైన్యము ననుభవించుచున్నది. స్వాతంత్ర్య వాతావరణము చెలరేఁగుచున్న వర్తమానసమ యమునందు దైన్యదశ కంటికిఁ బాగుగఁ బొడగట్టు చున్నది. మానవులకు భావదాస్యవిమోచనము గలు గకను బాహ్యదాస్యవిమోచనము గలుగఁజాలదు. ఆత్మవికాసమునకుసాధనంబులైన భాష భావములు కళలు శాస్త్రములు సాంప్రదాయాచారములు కాంతికళలు లేకను జీవనప్రవాహము సంకుచిత మైనది. హృదయవికాసమునకు సాధనంబు లైన కావ్యకళానాటకాదుల యుద్ధరణమున కాత్మసంస్మ రణము సాధనముగ నున్నది. ఆత్మసంస్మరణమున కవరసమైన దేశావృతమైన సాధనల నారాధించి భావదాస్యవిమోచనమును బడయవలసిన శుభ ముహూర్తము సంప్రాప్తమైనది.

ఆంధ్రయువజనహృదయ ముత్సాహపూరితమై వర్తమానసమయమునందు భావకర్మరంగములందు నిర్మాణమార్గమునవలంబించుటకుపరితపించుచున్నది. కళాభిజ్ఞులు కళాభ్యుదయమునకుఁ బాటుపడుచున్నా రు. పండితులు శాస్త్రపరిశోధనలకుఁ బూనుకొను చున్నారు. కవులు మనోభావములను వర్ణించుచు న్నారు. గాయకులు పాడుచున్నారు. చిత్రకారులు చిత్రించుచున్నారు. శాస్త్రజ్ఞులు పరిశోధించు చున్నారు. అన్ని దిశలయందును జిజ్ఞాసకాంతులు ప్రసరించుచున్నవి. అన్ని కులములవారును మతములవారును ఆత్మోపలబ్ధిని బడయఁ గోరు చున్నారు. ఆంధ్రహృదయమునందు స్వకీయమైన స్వరూపస్వభావములను నిర్ణయించి స్వధర్మము నా రాధింపవలయు నను సంకల్పము గలిగినది. ఆసంక ల్పమును సఫలముచేయుటకు చరిత్రకారులు పండి

తులు పరిశోధకులు కళాప్రవీణులు ప్రచార
కులు చేయుచున్న పరిశ్రమ దేశవ్యాప్తమై
ప్రజాపోషణమును బడయుచున్నది. దేశవ్యాప్తము
లైన ప్రయత్నముల నేకముఖమునను నాంధ్ర
ప్రపంచమునకు వ్యక్తముచేసి ప్రజాదృష్టిని నవ
జీవనప్రవృత్తియందు లగ్నముచేయవలసిన యవ
సరము గలిగినది. ఆ యవసరమును సఫలముచేయుట
కాంధ్ర ప్రపంచము పూర్వాపరసంస్కారములను
సమన్వయమును జేయుటకు బూనుకొనుచున్నది.
ఆంధ్రప్రవృత్తిని పరిశీలించునపు డీ విషయము
సువ్యక్తమగుచున్నది.

ఆంధ్రవ్యక్తిత్వముచిరకాలాగతంబైన సంస్కార
ఫలము. ఆ వ్యక్తిత్వమునందును నితరవ్యక్తిత్వము
లందువలె విశేషణములు గలవు. ఆంధ్రహృదయ
శీల మభివ్యాపకముగాని వ్యావర్తకము గాదు;
ఉదారముగాని సంకుచితముగాదు; సరళముగాని
వక్రముగాదు. ఆంధ్రహృదయక్షేత్రమునం దీవిశే
షణము లాదికాలమునుండియు నప్రతిహతముగఁ
బ్రకాశించుచున్నవి.ఆంధ్రభాష,వాఙ్మయము,మత
సాంప్రదాయాచారములు, ఆచారవ్యవహారములు,
కళలు, శిల్పములును నీశీలమును విశదము చేయు
చున్నవి. దేశవ్యాప్తము లైన ప్రతిష్ఠాపనలం దీ
సహజశీలము గోచరంబగుచున్నది. శ్రీశైలము వేద
యుగమునను ఋష్యాశ్రమము; బౌద్ధయుగమునను
బౌద్ధవిహారము; శంకరయుగమునను శివక్షేత్రము;
బసవయుగమునను జంగమమఠము; ఇపుడు శిథిల
క్షేత్రము. శ్రీశైలము దశాభేదముల పాలైనను
నేటికిని సుప్రసిద్ధమైన యాంధ్రక్షేత్రముగ నున్నది.

ఆంధ్రభాష సంస్కృతసాంప్రదాయబద్ధమైనను
ద్రవిడసాంప్రదాయబద్ధమైనను ప్రత్యేకసాంప్రదా
యముల ననుసరించి వికసించినది. ప్రాకృతసంస్కృత
ద్రవిడభాషలసంపర్కము భాషాభ్యుదయమునకుఁ
దోడ్పడినను భాషాశీలమును శిథిలము చేయలేదు.
ఆంధ్రభాష స్వరాంతమై సరళవర్ణరంజితమై మృదు
మధురస్వభావమును గాపాడుకొనఁ గలిగినది.
ఆంధ్రవాఙ్మయము ప్రాకృతసంస్కృతకర్ణా
టకవాఙ్మయముల సంపర్కమును గలిగినను
ప్రత్యేకరీతిని వికసించినది. మతాచారములు
వైదికజైనబౌద్ధశంకరవీరశైవరామానుజాది మత
సంపర్కమును గలిగియున్నను జ్ఞానమార్గము
నవలంబించుచు వ్యక్తిత్వమును విశదము చేయుచు
న్నవి. కళలు దేశకాలపాత్రలస్థితిగతుల కనుగుణము
గను వృద్ధిక్షయములను బొందినను ప్రత్యేకలక్షణము
లను గలిగియున్నవి. జీవనప్రవాహము నిమ్నో
న్నతతలముల నధిగమించినను నిర్మలాకృతిని గలిగి
ప్రవహించుచున్నది.

ఆంధ్రవ్యక్తిపరిణామమును నిరూపించుట
కపారమైన విషయావగాహనమును జేయుట
కాంధ్రలోకము పూనుకొనవలసియున్నది.
విషయావగాహనమునకు సాధనములైన
ప్రాచీనమందిరములు బౌద్ధస్తూపములు తామ్ర
శిలాశాసనములు తాళపత్రగ్రంథములు కళావిచి
త్రములు వాఙ్మయస్వరూపములు నిగూఢములై
ప్రకాశము నపేక్షించుచున్నవి. ఆంధ్రవ్యక్తిద్యోత
కములైన అమరావతి సాంచి మొదలగు స్తూప
ములవైభవ మజ్ఞాతముగ నున్నది. శాసనపరిశోధ
నాలయమునందు వందలకొలఁదితామ్రశాసనములు
త్రుప్పుపట్టి పోవుచున్నవి. ప్రాచ్యలిఖితపుస్తక
భాండారమునందును తంజావూరు గ్రంథభాండా
రమునందును ప్రాతప్రతులు శిథిలము లగుచున్నవి.
అజంతాయందలి మనోహరమైన చిత్తరువులు
ప్రకాశమును గోరుచున్నవి. రసవంతమైన వాఙ్మ

యము ప్రకాశమును పరిశీలనమును గోరుచున్నది. దేశమునందు మూలమూలలను దాఁగియున్న శాసనములు గ్రంథములు కళలు వెలుతురును గోరుచున్నవి. ఈ విషయావగాహనమునకు దోడుగను ఆంధ్ర ప్రపంచమునందు భావరంగమునందు గలిగిన మహాసంచలనము సాదరపరిశోధనమును ప్రకాశమును గోరుచున్నది. గ్రంథకర్తలు చిత్రకారులు కళాప్రవీణులు సరసములైన నవరచనలను జేయుచు నవజీవనోదయమును జేయుచున్నారు. ఈ మహోదయసమయమునందు యథాశక్తిని భారతిని గొలుచుట కవకాశము లారాధకులకు గలవు.

ఈ విషయావలోకనమునకును సంస్మరణమునకును గారణ మాత్మసందర్శనాభిలాష గాని స్వకీయప్రతిష్ఠ గాదు. విషయసాగరమథనమును ప్రాజ్ఞులుచేయుచు నాత్మసందర్శనమును జేయుచున్న విధమును విజ్ఞానకాంతులు విశదము చేయుచున్నవి. పరిశోధకమండలులు పత్రికలు సాహిత్యసంఘములు చిత్రకళాసంఘములు విద్యానిలయములు విషయసాగరమథనమును జేయుచు ఫలప్రాప్తికి సాధనములను విశదముచేయుచున్నవి. ఈస్వల్పారంభమును లబ్ధావకాశములను విషయావగాహనమును జేయుట కేర్పడినదిగాని మహత్ఫలమును సమకూర్పఁబడునను నభిమానముతో నేర్పడ లేదు.

భారతియందు భాష వాఙ్మయము శాస్త్రములు కళలు మొదలగు విషయములు సాదరభావముతోఁ జర్చించుట కవకాశములు గల్పింపబడును. వాఙ్మయనిర్మాణమున కిపుడు జరుగుచున్న ప్రయత్నములు పరిస్ఫుటము చేయబడును. శిల్పమునకు చిత్రలేఖనమునకు శాసనములకు సంబంధించిన విషయములు చిత్రములతో బ్రచురింపఁబడును. సామాన్యముగఁ బత్రికాప్రచురణమునందుఁ గల సాధకబాధకము లనుభవవేద్యము లైనను ఈక్రొత్తప్రయత్నము సాహసకార్యముగఁ గనఁబడును. మాసపత్రిక నొకదానిని బ్రచురింపవలయు నని తలఁచి కార్యసిద్ధికి బ్రయత్నములు జరిగినవి. విజ్ఞానసంపన్నులు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారీ భారమును బూనుట కంగీకరించిరి. ఆ మహానుభావునకు నూఱేండ్లు నిండినవి. వారిసహాయము దుర్లభ మైనది. రెండేండ్లు లక్ష్మణరావుగారి నిమిత్తమునను గతించినవి. సంకల్పము రిక్తమనోరథముగ నిలిచినది. కొంతకాలము పెరిఁగినసంకల్పమును చేసిన ప్రయత్నములను సఫలముచేయుటకుఁ గల యవకాశములను వినియోగించుట కీప్రయత్నము కారణము. ఫలము దైవాధీనమునందు గలదు.

విపులమైన యాంధ్రావనియందిట్టి ప్రయత్నములకెన్నిటికైనను నవకాశములు గలవు. భారతిని పెంచి పోషింపవలసినభార మాంధ్రలోకాధీనమైయున్నది. ముఖ్యముగ నీభారము విద్యావంతులమీఁదను గలదు. పత్రికకు జీవకళను విద్యావంతుల వ్యాసములు సమకూర్చునట్టులు బొమ్మలును పటములును నచ్చును సమకూర్పఁజాలవు. విద్యాసంపన్నులు యథాశక్తిని సకలవిధములను భారతిని బోషించుటకుఁ బ్రార్థితులు. వ్యాసములను పద్యములను పాటలను చిత్రపటములను బంపి ప్రచురణమునకుఁ దోడ్పడిన మహాజనులకు వందనశతంబులు. ఆంధ్రమహాజనులు సదయహృదయులై భారతికి స్వాగతంబు నొసంగి దీవించి నాప్రయత్నమును సఫలము చేయుటకు సాయపడుదురు గాక !

సంపాదకుఁడు.

# తెలుఁగుపాట

మంగిపూడి వేంకటశర్మ గారు

తెలుఁగు నుడికారంపు సొంపును
తెలుఁగుకైతల తియ్యఁదనమును
తెలుఁగుపలుకుల కలికిపెంపును
తెలిసి పాడవె భారతీ! ౧

తెనుఁగుబాసకు తొలకరింపఁగ
తెనుఁగురచనలు పల్లవింపఁగ
తెనుఁగు మనములు పులకరింపఁగ
మొనసి పాడవె భారతీ! ౨

నవరసంబులు పొంగి పొరలఁగ
నవ్యభావము లుల్లసిల్లఁగ
నవనవోన్మేషము చెలంగఁగ
తవిలి పాడవె భారతీ! 3

తెలుఁగుభాగ్యరమావిలాసము
తెలుఁగునాఁడుల భోగమహిమము
తెలుఁగురాజుల రాజ్యవిభవము
చెలఁగి పాడవె భారతీ! ౪

తెలుఁగుకోటల తెలుఁగుపేఁటల
తెలుఁగుతోఁటల తెలుఁగుపాటల
తెలుఁగుమాటల సోయగంబులు
తెలిసి పాడవె భారతీ! ౫

వేఁగి నగరపు ప్రాభవంబును
విజయనగరపు వైభవంబును
బాగు మీఱెడు పంచమస్వర
భణితిఁ బాడవె భారతీ! ౬

రాణ గల శ్రీకాకుళోన్నతి
రాణ్మహేంద్రపురంబు కీరితి
పోణి గల పెనుగొండపురముల
పొలుపు పాడవె భారతీ! ౭

ధరణికోట యశోవిశేషము
ధన్యకటకము ధాన్యకటకము
సిరులు మించిన సింహనగరము
చెలువు పాడవె భారతీ! ౮

కొండవీఁడుపరాక్రమము గో
ల్కొండ గన్న యఖండభాగ్యము
కొండపల్లియశంబు దిక్కులు
నిండఁ బాడవె భారతీ! ౯

ఓరుగల్లు పరాక్రమంబును
పేరు గల పల్నాటివీర్యము
వీరబొబ్బిలి వింతశౌర్యము
కేరి పాడవె భారతీ! ౧౦

విష్ణువిక్రము శాలివాహను
విష్ణుదేవుని విష్ణువర్ధన
కృష్ణరాయల రాజరాజుల
కీర్తిఁ బాడవె భారతీ! ౧౧

తెలుఁగురాజ్యపురమను తెలుఁగుల
పలుకుచెలి తంజామునం దిడి
యలరిచిన రఘునాథరాయల
యశము పాడవె భారతీ! ౧౨

---

౮. సింహనగరము=నెల్లూరు. ౧౧. విష్ణుదేవుఁడు=ఆంధ్ర విష్ణువు అను ఆంధ్రనాయకుఁడు. రాజరాజు=రాజనరేంద్రుడు
౧౨. తంజాము=అందలము, తంజావూరు.

రెడ్డిరాజుల పౌరుషంబును
దొడ్డవెలమల సాహసంబును
గడ్డుమగ లగు రాచబిడ్డల
కడిమిఁ బాడవె భారతీ! ౧౩

కమ్మదొరల యశఃప్రభావము
కాపువీరుల ఘనప్రతాపము
కుమ్మరాదుల క్షాత్రతేజము
కోరి పాడవె భారతీ! ౧౪

గండు మిగిలిన శత్రుశూరుల
గుండెలను నిద్రించినట్టి య
ఖండుఁడగు తిమ్మరుసు బుద్ధుల
కొండఁ బాడవె భారతీ! ౧౫

ఇదిగో! ఢిల్లీశ్వరునిఁ గొనిపో
యెద నటంచును చాటి చెప్పుచు
చదురుచేసిన చిత్రచర్యల
సచివుఁ బాడవె భారతీ! ౧౬

పండితుండై యాజియై యు
ద్దండకవియై మంత్రిమణియై
దండిగాయకుఁడై చెలంగిన
ధన్యుఁ బాడవె భారతీ! ౧౭

కావ్యతిక్కన కలముపోడిమి
ఖడ్గతిక్కన కత్తివాఁడిమి
దివ్య లక్కజ మంది మెచ్చఁగ
తీర్చి పాడవె భారతీ! ౧౮

కడిఁదిశత్రువు లెత్తివచ్చిన
కరుకు పద్దెము లంపి సిగ్గున
వెడలఁజేసిన కైత పెద్దల
నుడులు పాడవె భారతీ! ౧౯

భాగవతసత్తములు పోతన
త్యాగరాయల రామదాసుల
భాగధేయంబైన భక్తిని
తోఁగి పాడవె భారతీ! ౨౦

రెడ్డి వేమనయోగి చెప్పిన
దొడ్డవేదాంతముల భావము
గడ్డు దెలిపి తెనుంగుపడుచుల
జడ్డుఁ బాపవె భారతీ! ౨౧

పోటి మెఱుఁగని వేదగానము
సాటి మించిన శాస్త్రజ్ఞానము
మేటిచిత్రకళాభిమానము
చాటి పాడవె భారతీ! ౨౨

తెలుఁగునాకల నెక్కి మిక్కిలి
తెలివి మెఱయఁగ నెల్లసీమల
వెలఁగి చెలఁగిన నగరలక్ష్ముల
మేలు పాడవె భారతీ! ౨౩

వ్యాసకుంభజులకు శరణ్యము
వాస మల దక్షునకు మోక్షపుఁ
గోశమగు దక్షపురి మహిమము
కొసరి పాడవె భారతీ! ౨౪

నవ్యమతి భవభూతి విద్యా
నాథ సుకవుల భావబంధుర
దివ్యకావ్యరసామృతమురుచి
తెలిసి పాడవె భారతీ! ౨౫

రాజవీథులు వేదవిద్యా
రణ్యములలోఁ దీరిచిన బుధ
రాజు సచివులరాజు శ్రీయతి
రాజుఁ బాడవె భారతీ! ౨౬

---

౧౬. యుగంధరమంత్రి. ౧౭. తంజాపూరునందున్న గోవిందదీక్షితులు. ౧౯. అల్లసానిపెద్దన. ౨౩. మోటుపల్లి మొద
లగునవి. ౨౬. విద్యారణ్యస్వామి.

# శివకవులు

## వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

వీరశైవులు నాస్తికు లనఁబడు జైన బౌద్ధమతముల వారినే కాక శ్రౌత స్మార్తకర్మము లాచరించు వైదికమతములవారిని గూడ గర్హించిరి. వారు వీరవ్రతులు. భవులతో దర్శనస్పర్శన సంభాషణాదిసాంగత్యము వారికిఁ దగదు. (భవు లనఁగా శైవేతరులు) శైవులలోఁ గవీశ్వరు లగువారు శివునిమీఁదను దద్భక్తులమీఁదను దక్కనితరు లగు భవులమీఁద నెప్పుడును గృతులు చెప్పెడువారుకారు. కావున వారికి శివకవు లని పేరు కల్గెను. కర్ణాటకాంధ్రగ్రంథములలో శివకవుల ప్రశంస పెక్కుచోట్లఁ గలదు. శివకవులు భవికవులను గర్హించిరి. కవితలోఁగూడ శివకవులు వేఱుమతమువా రయిరి.

### శివకవుల గ్రంథములు

మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమును బాల్కుఱికి సోమనాథుని బసవపురాణాది గ్రంథములును నన్నిచోడని కుమారసంభవమును నిప్పుడు మన కుపలబ్ధములయిన శివకవుల గ్రంథములలోఁ బ్రాచీనములు. మల్లికార్జున పండితుని కృతులు మఱికొన్ని దొరకవలసి యున్నవి. మల్లికార్జున పండితునికంటెఁ బూర్వుఁడు శ్రీపతిపండితుఁడుకూడఁ గవియట! ఆయన బెజవాడలో నున్నవాఁడు. ఆయన తెనుఁగుకృతు లేమేని రచించెనేమో యెఱుఁగరాదు. పండితారాధ్యచరిత్రలో నీక్రింది గ్రంథములు పేర్కొనఁబడినవి.

"అంచితబాణ గద్యాక్షర గద్య
పంచగద్యాదులు పటుగణాడంబ
రంబు వర్ణాడంబరంబు వ్యాసాష్ట
కంబును శ్రీనీలకంఠ స్తవంబు
శ్రీరుద్రకవచంబు శారభంబును మ
యూర స్తవము హాలాయుధ మనామయము
మలహణమును మహిమం బను స్తవము
మలయరాజీయంబు మానిదండకము
స్తుతిమూలమగు మహాస్తోత్రసూత్రములు
శతకంబు శివతత్త్వసారంబు దీప
కళిక మహానాటకము నుదాహరణ
ములు రుద్రమహిమయు ముక్తకావళులు
గీతసూక్తములు భృంగి స్తవంబులు పు
రాతన మునిముఖ్యరచితాష్టకములు
హారలీల—"

శివతత్త్వసారము తెలుఁగుకృతిగాన పై వానిలో నింక నొకటి రెండేనయినఁ దెలుఁగుకృతులయి యుండవచ్చునేమో కాని తక్కిన వన్నియు సంస్కృతగ్రంథములే. సోమనాథుఁ డింకను దుమ్మెదపదములు, ఆనందపదములు, నివాళిపదములు, దండనాయకగీతములు మొదలగు పదకృతులను దెలుఁగువానిని పేర్కొన్నాఁడు. దీనినిబట్టిచూడఁగా నీ శివకవుల తెలుఁగు కృతులు పద్యరచనము గలవి మల్లికార్జున పండితారాధ్యునికంటెఁ బూర్వకాలమున లేవేమో యని సంశయము కలుగుచున్నది. ఉన్నచో సోమనాథుఁడు పేర్కొని యుండును గదా! సోమనాథునికంటె నర్వాచీను లగు శివకవులకృతు లనేకము లున్నవి. శివకవుల రచనారీతులను బరిశోధింపఁగా వీరి గ్రంథములకును నన్నయ తిక్కనాదు లగు (భవి) కవుల గ్రంథములకును బెక్కుభేదములు గానవచ్చుచున్నవి. ఈ విషయ మించుక వివరించి తెల్పెదను.

### రచనాభేదములు

ఛందస్సు:— ద్విపదరచనలో శివకవుల విధము వేఱు, ఇతరకవులవిధము వేఱు. తాళ్లపాక తిరువేం

గళనాథుఁడుద్విపదలక్షణము నిట్లునిర్వచించినాఁడు.

"వాసవుల్ మువ్వురు నన జాప్తుఁ డొకఁడు
భాసిల్ల నది యొక్క పదము శ్రీకాంత
క్రమమున నవి నాల్గుగణములు నడచుఁ
గ్రమదూరముగఁ బ్రయోగము సేయరాదు
ఆ పాదమునకు మూఁడవగణం బాది
దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింప నవి ప్రాసయుతము లై రెండు
ద్విపద నా విలసిల్లె వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁ జెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితరభాషలను
యతులలోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులుఁ జెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు ప్రయోగింప నదియ యుక్తంబు
మఱియు సంస్కృతపు సమాసరూపమున
నెఱయ నెన్నిటినైన నిర్మింపఁదగును.........
అను లక్షణమ్ములు నను వొందిఁ సుకవి
జన సుప్రయోగైకశరణమై—"

అష్టమహిషీకళ్యాణము.

రంగనాథునిరామాయణము గౌరనహరిశ్చంద్ర చరిత్ర మొదలగు ద్విపదలందుఁ గానవచ్చువిధమునే యీలక్షణము చెప్పుచున్నది. శివకవులద్విపదరచన మిందులకు విరుద్ధముగా నున్నది. రంగనాథరామాయణాదులందుఁ గానరాని ప్రాసయతి బసవపురాణము మొదలగు శివకవుల గ్రంథములం దున్నది. మఱియు, ద్విపదయుద్విపదయుఁ గలయునప్పుడొక్క పదమే యిటు కొంత యటు కొంత యగునట్లు రంగనాథాదు లెక్కడను గూర్పరయిరి. పాల్కురికి సోమనాథాదు లగు శివకవులు పదమధ్యమందే ద్విపదము ముగియునట్లు పెక్కుచోట్ల రచనము నెఱపిరి. సోమనాథుఁడు "జాతులు మాత్రానుసంధానగణవి, నీతులుగాన యనియతగణైర, నియును బ్రాసోవా యనియు యతిర్వా య, నియుఁ జెప్పు ఛందోవిని హితోక్తిగాన, ప్రాసమైనను యతిపై నడిమైన, దేసిగా నిలిపి యాదిప్రాసనియతి, తప్పకుండఁగ ద్విపదలు రచియింతు"నని మాత్రాగణఘటితమగుటచే ద్విపదలో ప్రాసయతి చెల్లు ననుటను సంస్కృత సూత్రములను గూడ నుదాహరించి చెప్పినాఁడు. ద్విపదము ప్రాసయతి గలిగియుండుటయు, రెండేసి చరణములకుఁ దునుకలు గాక ద్విపదమునుండి ద్విపదమునకుదూఁకునట్లు పదమధ్యసంధి గలిగి జడవాటి యుండుటయు శివకవులకృతులలో నే కానవచ్చును.

మఱియు నన్నయాదులకృతులలోఁ బ్రాసము లందు హల్సామ్యము దప్పక కానవచ్చును. అనఁగా మొదటిచరణము ద్వితీయాక్షరమున నెన్ని హల్లులు సంయుక్తములుగా నున్నవో యన్ని సంయుక్తహల్లులను దక్కిన మూఁడుచరణములందు నుగూడఁ బ్రాసస్థానమున నుండును. శివకవు లీ నియమము నంతగాఁ బాటింపరైరి కతిపయహల్సామ్యమున్నఁ జాలు నని వీరు తలంచిరి. ఒక్కహల్లు హెచ్చో తక్కువో యయినను బ్రాసమును వీరు పరిగ్రహించిరి.

క. నమ్మిన భక్తుఁడు కన్నప
బమ్మయ సద్భక్తి మహిమ పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యము గాదె య
ధర్మంబును ధర్మ మయ్యెఁ దత్త్వాతీతా.

శివతత్త్వసారము.

ప్రాతప్రాతలలో "ధర్మ్మ" ఉండును.

"మర్త్యలోకమునకు మఱి వేఱెయొకఁడు,
కర్త యున్నాఁడె లోకత్రయవరద,—
తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యఁ
డై త్రిపురాంతకుఁ డభినుతిఁ బేర్చు.-బసవపురాణము

ఇత్యాదులు పెక్కు లున్నవి.

మఱియు, నన్నయాదికవీశ్వరులు ప్రాసములం దెక్కడను బూర్ణబిందువును నర్ధబిందువును బొందింపరయిరి. శివకవుల గ్రంథములలో నది కానవచ్చుచున్నది.

క. పోఁడిగ నగజతపశ్శిఖి
మూఁడుజగమ్ములను దీవ్రముగఁ బర్విన బ్ర

హృష్మాండము గాంచిన కాంచన
భాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసిత మై.
కుమారసంభవము.

పాండురాంగం బైన పడఁతిగర్భమున
బోఁడిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁ డీక్రియను.
బసవపురాణము.

ఇత్యాదులు పెక్కు లున్నవి.

ఇట్టి ఛందోలక్షణవిశేషములు గాక, శబ్ద ప్రయోగములందును గూడ శివకవులకు నితరకవులకుఁ బెక్కుభేదము లున్నవి.

శబ్దప్రయోగములు.

తెలుఁగువోలె, వడువువోలె,—ఇట్టి ప్రయోగములు శివకవుల గ్రంథములందే నాకుఁ గానవచ్చినవి.

"తెరువుదాఁ దీర్చి చూపెడు తెలుఁగువోలె,—బలసి కొలువున్న సురగిరి భంగివోలె—నందన వనము గాపువచ్చు వడువువోలె— పాలకడలిలో నిల్చిన భంగివోలె—" కుమారసంభవము.

"వచ్చు పవిత్రంబు వడువునుబోలె—, కరమర్థి నందిచ్చు కరణియుఁబోలె—" బసవపురాణము.

పూంచు, పూన్చు,—ఈధాతువు నన్నయాది కవీశ్వరుల గ్రంథములందుఁ బెక్కుచోట్లఁ బ్రయోగింపఁబడి యున్నది. అది పూనుధాతువు ప్రేరణరూపము. పూనఁ జేయుట దానియర్థము. అరదము పూంచి, ఇత్యాది ప్రయోగము లున్నవి. శివకవుల గ్రంథములందెల్ల నీధాతు వింకొకయర్థమునఁ బ్రఖ్యాతముగాఁ గానవచ్చుచున్నది. పూన్చు= పూజించు. ఈధాతువు నీయర్థమున నన్నయాదులు ప్రయోగించినట్లు కానరాదు.

క. కన్నువడిఁ బుచ్చి పూన్చిన
వెన్నుని భక్తికి వరంబు వెదచల్లు క్రియన్.
క. మొఱటద వంకయ దనతల
లఱిమె ల్వాడఁ దఱిగి నీపదాంబుజములఁ గ్ర
చ్చులుఁ బూన్చి మగుడఁ బడయఁడె.
క. ఉన్నతభక్తి శిరంబుల
బన్నుగ శివుఁ బూన్చి కరుణఁ బడసిన భంగిన్
ము న్నేవిధులం గొలిచియుఁ
జన్నదశాననుఁడు వడయఁజాలెనె చెపుమా!
శివతత్త్వసారము

చ॥ హరి వికచామలాంబుజసహస్రము పూన్చి.—
కుమారసంభవము.

ద్విపదాంబురుహములధృతిఁ బసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూన్తు
ఈపద్మములఁగాదె యింతి యాకుంతి
పాపఁ బూజించి పడసెఁ బాండవుల
చెండి యీపద్మముల్ శివుఁ బూన్చి కాదె
సుందరి భృగుపత్ని శుక్రునిఁ బడసె
అది గాక యీ పూల హరుఁ బూన్చికాదె
సుదతి కౌసల్య సత్సుతు రాముఁ బడసె.
పండితారాధ్యచరిత్ర.

పూజించుటయందుఁ బూన్చు ప్రయోగము శివకవుల గ్రంథములలోఁ బెక్కుచోట్లఁ గలదు.

మఱియు సమూహి, దాసి (దాసుఁ డనుటకు), ముల్లోకనాథుఁడు, పుడమీశ్వరుఁడు, సర్వాంగకచ్ఛడము, దీపగంభములు, తవనిధి, మొదలగు ప్రయోగము లెన్నో శివకవులు తఱచుగాఁ బ్రయోగించినవి కలవు. ఇట్టి పదములు కొన్ని యితరకవుల కృతులలోఁగూడఁ గ్వాచిత్కముగాఁ గానవచ్చును గాని శివకవులే వీనిని తఱచుగాఁ బ్రయోగించిరి. ఇటీవలి లాక్షణికులు కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, దినవెచ్చము మొదలగు పదములను గొన్నింటిని మాత్రము త్రోసి పుచ్చఁజాలక యనింద్య గ్రామ్యము లని పేరుపెట్టి ప్రయోగార్హము లనిరి. శివకవుల కృతులలో లాక్షణికులను గ్రహింపనివి యిట్టివి కుప్ప తెప్పలుగా నున్నవి. మఱియు నిప్పటి వ్యాకరణమును దలక్రిందు లొనర్చు ప్రయోగము లనేకము లున్నవి. మఱియు నపూర్వశబ్దములు శబ్దరత్నాకరమందుఁ గానఁబడనివి యనేకము లున్నవి. శివకవుల కృతులలోని వింత ప్రయోగములను వేఱొకట వివరించి తెల్పుదును.

ఇతరకవులు వీరిని గర్హించిరి

ఇట్టి రచనావిధానము లితరాంధ్రకవులకు సమ్మతములు గావయ్యెను. వారు పాటించిన ఛందో నియమములను భాషానియమములను వీరు సరకు సేయక కొంత నడలించఁజాగిరి. పాల్కురికి సోమనాథుని కాలముననే దీనింగూర్చి యోరుఁగంటిలోఁ దగవు నడచినది.

సీ. ఒకనాఁడు శివభక్తు లోరుఁగంటను స్వయం
భూదేవుమంటపంబున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ
హరునిఁ గొల్వఁ బ్రతాపుఁ డచటి కేఁగి
యాసంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన
విన నాపురాణంబువిధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుఁ డొకండు భర్తఁ జేరి
గీ. పాలకుర్కి సోమ పలితుఁ డీ నడుమను
బెనచె మధ్య (ప్రాస?)వస్లు పెట్టి ద్విపద
నప్రమాణ మిది యనాద్యంబు పద మన్న
సరిగ రాజు——"

తర్వాత సోమనాథుఁ డోరుఁగంటికి వచ్చి యచ్చట చర్యలచే స్వరచనమును సమర్థించుకొన్నట్టు పద్యబసవపురాణమం దున్నది. ఈకారణముచేతనే యీ శివకవుల కావ్యములను బ్రాచీన లాక్షణికులు ప్రయోగములు సంతగాఁ గయికొన రయిరి. గ్రంథారంభమున దుష్టగణ ప్రయోగము చేసి యుద్ధములోఁ జచ్చె నని నన్నిచోడని నథర్వణుఁ డాక్షేపించెను.

*క. మగణమ్ము గదియ రగణము
వగవక కృతిమొదట నిలుపువానికి మరణం
బగు నిక్కము డ్రు మడియఁడె
యగునని యిడి తొల్లి చోకనాదిత్యుఁ డనిక్.

బమ్మెరపోతరాజుగారి గ్రంథములనుగూడ లాక్షణికులు కైకొనమి కిది కారణము గావచ్చును. ఆయనవీరభద్రవిజయరచనమును శివకవిసంప్రదాయము ననుసరించియే యున్నది. (వీరభద్రవిజయము భాగవతకర్తయగు పోతరాజుగారు రచించినది కావచ్చు నని నాతలంపు.)

ఒకశివకవి యిట్లు చెప్పుచున్నాఁడు:——

ఇలఁ బాలకురికి సోమేశుఁడు మున్ను
తొలఁగక ప్రాసయతుల్ ద్విపదలను
లలి రచించుట యది లక్ష్యంబుగాను
అలమి రేఫరకారములు శివకావ్య
ములయందుఁ జెల్లుఁ దప్పులు గావు, గాన
ఆ పాల్కురికిసోము ననుమతి నేను
దీపితప్రాసయతిచ్ఛదసరణి
నామహాగురుదేవు ననుమతియట్ల
శ్రీ మెఱయంగ రచించితి నిట్లు:——

మతిబసవపురాణము.

ఇతరకవులు గర్హించినను దర్వాతి శివకవులు సోమనాథాదులమార్గమును వెన్నాడిరి. ఇప్పటికి రెండువందలయేండ్లకు ముందున్నకవులు అత్తలూరి పాపకవి మొదలగువారు కూడ నా సంప్రదాయముననే పాటించిరి. పాల్కురికి సోమనాథుని గ్రంథములలో నితరకవులకు విరుద్ధము లయిన ప్రయోగము లేవి కలవో యవి పాపకవి మొదలగువారి గ్రంథములలోఁ గూడ నున్నవి. మఱియుఁ బాల్కురికి సోమనాథుఁడు చూపినత్రోవ యగుటచేతఁ గాఁబోలును శివకవు లనేకులు ద్విపదకృతులను రచియించిరి.

వీరు తెనుఁగునే ప్రేమించిరి

ద్రవిళదేశమున శైవులును వైష్ణవులును సంస్కృతభాషకంటెఁ దమ తమిళభాషనే పూజ్యమయిన మతభాషగాఁ జేసికొన్నట్టుగా నీ తెనుఁగు దేశమునఁగూడ వీరశైవులు తెలుఁగుభాషనే మతభాషగాఁ జేసికొనఁదలంచిరి. మల్లికార్జున పండితారాధ్యుఁడు శాస్త్రార్థములతోఁ గూడిన మతగ్రంథమును శివతత్త్వసారమును దెనుఁగుననే రచియించెను. పాల్కురికి సోమనాథుఁడుకూడఁ దాను

* ఈ పద్యమును శ్రీరామకృష్ణకవి గారు, కుమారసంభవపీఠికలో నుదాహరించిరి.

ర్తృత్తగా వెలయించిన బసవపురాణము, పండి తారాధ్యచరిత్రము, చతుర్వేదసారము మొదలగు గ్రంథములను దెనుఁగుననే రచియించెను. వీరు సంస్కృతమునఁగూడ గొప్పవిద్వాంసులే. బసవపు రాణమును బండితారాధ్యచరిత్రమును సోమనాథుఁ డు తెనుఁగుననే రచియింపఁగాఁ దర్వాతివారు వానిని గర్ణాటమునకును సంస్కృతమునకును బరివర్తించు కొనిరి. బసవపురాణ పండితారాధ్య చరిత్రాది గ్రంథములను శైవులు భారత రామాయణాదుల వలెఁ బవిత్రగ్రంథములుగాఁ బూజించుచుందురు. ఇది తెనుఁగునకు కొకగొప్పగౌరవము. తన గ్రంథ ములు సర్వసామాన్యములుగా నుండవలె ననియు, నట్లుండుటకుఁ దెనుఁగుద్విపదమే తగినదనియు గద్య పద్యాదిపూరిత మయిన సంస్కృతప్రాయరచన సర్వ సామాన్యముకాదనియు సోమనాథుఁడు చెప్పినాఁడు.

"తప్పకుండఁగ ద్విపదలు రచియింతు
నొప్పదు ద్విపద కావ్యోక్తి నా వలదు
ఆరూఢగద్యపద్యాది ప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుదెనుఁగు విశేషము ప్రసన్నతకు.

పండితారాధ్యచరితము.

మఱియు:—

ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జానుదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కి దైవాఱఁ
దెలుఁగుమాట లనంగవలదు వేదముల
కొలఁదియకాఁ జూడుఁ డిల నెట్టు లనిన—

బసవపురాణము.

తెలుఁగుమాటలు గదా యని తేలఁదలఁప వలదు. వేదములవలెఁ జూడుఁడని చెప్పినాఁడు!

జానుదెనుఁగు

మఱియు జానుదెనుఁగు మిక్కిలి ప్రసన్న మయిన దనియు సర్వసామాన్య మయిన దనియుఁ జెప్పినాఁడు.

నన్నిచోడఁడు కూడ నీ జానుదెనుఁగును బ్రశంసించినాఁడు.

చ. బలు పొడతోలుచీరయును
　　పాపపెలల్ గిలుపారుకన్ను వె
　న్నెలఁతల చేదుకుత్తుకయు
　　నిండిన వేలుపుటేఱు పల్గుపూ
　సలుగల తేనిలెంక వని
　　జానుఁ దెనుంగున విన్నవించెదన్
　వలపు మదిన్ దలిర్ప బసవా!
　　బసవా! బసవా! వృషాధిపా!

వృషాధిపశతకము.

చ॥ సరళముగాఁగ భావములు జానుదెనుంగున నింపుపెంపుతో.　　కుమారసంభవము.

ఆకాలమున నీజానుదెనుఁగు మిక్కిలి ప్రస న్నమై సర్వసామాన్యమై యుండెను. తర్వాతి మన కవీశ్వరులు సంస్కృతప్రాయమైనరచనను దెనుఁగున జొప్పించి జానుదెనుఁగును సన్నగిలఁ జేసిరి. ఇటీ వలఁ దెనుఁగురచనలలో రుచ్యము లయిన తెలుఁగు పలుకుబళ్లు మిక్కిలి తక్కువ కాఁ జొచ్చెను. పాల్కురికి సోమనాథుని గ్రంథములలోను నన్ని చోడని కుమారసంభవములోను మన కిప్పు డర్థము కాని తెలుఁగుపలుకు లనేకము లున్నవి. సంస్కృత ప్రాయమగు రచనకు మన మలవడుటయే దీనికిఁ గారణము. ఇప్పుడు పాల్కురికి సోమనాథుని గ్రంథ ములను బ్రహ్మశ్రీ, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు సరిగా ముద్రించుచున్నారు. అచిర కాలముననే శివకవుల రచనావిశేషములను జాను దెనుఁగు ప్రసన్నతను నంధ్రలోక మరసిచూడఁ గలదు. ఆంధ్రకవిత శివకవులమూలమున గొప్ప యభ్యుదయము గాంచిన దన్న వాస్తవవిషయ మప్పుడు ప్రవ్యక్తము కాఁగలదు.

# రవీంద్రుఁడు - విశ్వభారతి

## వేంకట పార్వతీశ్వర కవులు

వాసంతికానందవైభవంబును బాడు - రమణీయకోకిలారవముఁ బోలి,
ఉన్ముఖబ్రాహ్మముహూర్తంబుఁ గీర్తించు - వరతామ్రచూడారవంబుఁ బోలి,
అమృతప్రపూర్ణవర్షాగమంబు నుతించు - బర్హికేకావిరావంబుఁ బోలి,
సర్వేశ్వరాత్మసాక్షాత్కారమును దెల్పు - ప్రణవఘంటావిరావంబుఁ బోలి,
పుణ్యమయవిశ్వభారతీమూర్తి వైన - ధన్యు నినుఁగూర్చి మా కవితాలలామ,
సరసగతిఁ బాడుచున్నది సాధుగీతి - ప్రణయరససాంద్ర! సుకవిచంద్రా! రవీంద్ర! .

సీ. సుకవితారసవాహినికిఁ బుట్టినిల్లైన - చొక్కంపువిరిదేనెసోన వీవు,
సరసభావసుగంధసరణికి నిరవైన - తోరంపుఁ బువ్వులతోఁట వీవు,
ప్రణయకళాపరంపరకు మూలంబైన - నిద్దంపుఁ బండువెన్నెలవు నీవు,
దివ్యవిజ్ఞానకాంతికి నిధానంబైన - తెల్లంపు రతనాల దివ్వె వీవు,
మోటుమ్రాఁకులఁ జిగిరించు పాట వీవు - పాటలోఁ జొక్కి చొక్కించు పక్షి వీవు,
పక్షిలో భావగతిఁ జూపు ప్రౌఢ వీవు - ప్రణయరససాంద్ర! సుకవిచంద్రా! రవీంద్ర!

సీ. కన్నులలోఁ బొంగి కరుణామృతరసంబు - గంగాభవానికి గతులు సూప,
మాటలలోఁ బుట్టి మధురసంగీతంబు - ప్రణవగీతమునకుఁ బటిమ సూప,
నవ్వులలోఁ దేలి నవ్యకళాలీల - శీతాంశురేఖకుఁ జెలువు సూపఁ,
దలఁపులలోఁ దోఁచి తత్త్వదివ్యజ్యోతి - వేదాంతసరణికి వెలుఁగు సూప,
శాంతిసదనంబునం దుండి సరసమధుర - మృదులకవితారసంబులో మేను మఱచి,
యఖిలము నెఱుంగఁగల రాజహంస వీవు - ప్రణయరససాంద్ర! సుకవిచంద్రా! రవీంద్ర!

ఉ. పువ్వులతోఁటలో, విరిసి పొంగిన వెన్నెల వెల్లి తేటలో,
నవ్వులమాటలో, నిలువునం బులకించిన వీణపాటలో,
మవ్వపురూపుఁ గన్న రసమంజరి నీ కవితాలతాంగి కిం
కెవ్వరు సాటివత్తురు సుధీంద్ర! రవీంద్ర! కవీంద్రశేఖరా!

మ. నవలీలాలలితంబుఁ బ్రేమమయ మానందోజ్జ్వలం బాత్మనై
భవసంపూర్ణ మనంతశాంతరససంపన్నంబు నై యొప్పు నీ
కవితాలోకమునందుఁ గన్గొనిన యా కల్యాణతేజంబు స
త్కవిరూపంబునఁ గాంతు మెప్పుడు రవీంద్రా! సాంద్రతేజోనిధీ!

ఉ. కూనలనైన మ్రింగు పులి కోఱలఁ బువ్వులు పూయ, నెంతవి
జ్ఞానుల నైన నొంచు ఘనశంకలసంకులు మ్రోయ, రేబవల్
మానక లోకముం గలఁచు మాయల వెన్నెలఁ గాయఁ, బ్రేమలోఁ
దానము సూపు నీకవిత ధన్యుఁడ వీవు రవీంద్రసత్కవీ!

# ఆంధ్రవాఙ్మయమున ఆంగ్లసారస్వత ప్రోద్బలము

దేవులపల్లి అప్పలనరసింహం గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

## ఉపోద్ఘాతము

సుమారు నలువది సంవత్సరములనుండి ఇంగ్లీషు భాష మన ఆంధ్రదేశమున మిక్కిలి వ్యాప్తి గాంచినందుకు ఫలితముగా నది మన వాఙ్మయమును కొన్నికొన్ని నూతనరీతులను ప్రోద్బలము జేయుచున్నది. పత్రికలు ప్రబలుట యొకటి ముఖ్యఫలము. ఇవి ప్రబలిననాటినుండి వాఙ్మయమున శైలి ఆశయములు మాఱుటయు, నూతనసారస్వతజాతములు తలజూపి కొద్దిగనో గొప్పగనో వఱలుటయును గనుచున్నాము. ఇందు ఆంగ్లవాఙ్మయప్రోద్బలమే ముఖ్యముగా గనుపడుచున్నది. వర్ణనకవిత్వములు (Descriptive Poems) పాటకత్తుకవిత్వములు (Lyric Poems), చిన్న కథలు (Short Stories) ఇట్టివి కృష్ణాపత్రికలో మొదటను, తరువాత ఆంధ్రపత్రికాసారస్వతానుబంధమునను క్రమాభివృద్ధిని గనుపర్చుచున్నవి. విమర్శనములు అనేకవిధముల చారిత్రాంశశోధనలకు తోడ్పడుచున్నవి. వ్యాసములు సంఘజీవితమును విమర్శన జేయుచు అందు ప్రవేశించుచున్న కొఱగాని మార్పులను నిరసించి పారద్రోల సమకట్టుచున్నవి. ఇట్టి బహువ్యాప్తమైన ఆంగ్లవాఙ్మయప్రోద్బలమును విమర్శింప నెంచి సౌకర్యము కొఱకు ఈవ్యాసమును నాలుగుభాగములుగా విభజించి వ్రాయుచున్నాను: ౧. సూక్ష్మచారిత్రావలోకనము, ౨. మన నాటకవాఙ్మయము, 3. మన గద్యవాఙ్మయము, ౪. మన పద్యవాఙ్మయము అని వానికి పేర్లిడితిని. చదువరులు నా వ్యాఖ్యానములలోని పొరబాట్లను మన్నించి తమ తమ సవరింపులను వ్యాసరూపకముగా గాని అన్యథా గాని తెలుపుచు వాఙ్మయాభివృద్ధికి తోడ్పడ ప్రార్థితులు. ముఖ్యాంశములను సాదరమనస్కులై గమనింతురు గాక.

## I. సూక్ష్మచారిత్రావలోకనము

### ౧. ఆదిస్థితి

ఆంధ్ర మహాభారతమున సంపూర్ణకళలతో నుద్భవించిన వాఙ్మయశిశువు పిండరూపమున నెన్ని శతాబ్దములు కాలగర్భమున తపించెనో తెలియరాదు. నాలుగవశతాబ్దికి ముందు వఱలిన ఆంధ్ర రాజులు ప్రాకృతమున వ్యవహరించిరి. వాఙ్మయమునకు దగిన ఆంధ్రభాష యున్నట్లు నిదర్శనములు లేవు. మధ్యాక్కర యను కర్ణాటవృత్తమును, అరసున్న గల పదములను గల ఎనిమిదవ శతాబ్ది తాలూకు బెజవాడ యుద్ధమల్లుని శాసనమొకటి కనుపడుచున్నది. తొమ్మిదవశతాబ్దినాటిదని చెప్పబడు నన్నెచోడుని "కుమారసంభవము" ఒకటి ద్రావిడభాషాసంపర్కమును గనుపర్చు శబ్దరూపములను గలిగి శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారిచే మిగుల ప్రశంసింపబడినది. వంశపరంపరగా ఆంధ్రదేశమున కొన్ని భాగవత కుటుంబములలో నాట్యప్రయోగమును బొందుచు, స్థలకాలనిర్ణయము జేయ వీలులేని ఉద్భవము గలవియై, ప్రజారంజక మగు మిశ్రశైలితో గాననాట్యప్రయోగనిపుణములైన "యక్షగానములు" అను నాటకములు కనుపడుచున్నవి. చెంచునాటకము, కృష్ణలీల

లును బొమ్మలాటలోని రామాయణ, భారతకథ
లును ఇట్టివి. కేవలబర్మాభాషలోను, సింహళ
భాషలోను భాషాంతరీకరణము నొందినట్లు చెప్పు
కొనుచున్న బౌద్ధగ్రంథములవలన శ్రీ వేమూరి
విశ్వనాథశర్మగారిచే ఊహింపబడుచున్న "ఆంధ్రార్థ
కథల" ప్రశంస వినబడుచున్నది. కాని గ్రంథరూప
ముగా ఏసూచనలును గానరావు. అయినను కందము,
సీసము, ద్విపద, మధ్యాక్కర యను ఛందస్సులను
బట్టి రాజసభాలంకారము గాకపోయినను సామాన్య
జనరంజకము లైన పాటలు పద్యములు పెక్కు
లుగా నుండియుండనోపు నని తలంచెద. ద్విపద
కును, సీసమునకును గణ యతి సంబంధము
ఎక్కువగా కనుపడును. పాటలలో ప్రజల కింపగు
టను వానిని కొంచెము సంస్కరించి పండితకవులు
గూడ వానిని గ్రంథములలో ప్రయోగించి రని
తోచెడిని. వాఙ్మయపాటవమునకును గాంభీర్యము
నకును సరిపడక యింపుగొలుపని మధ్యాక్కరవంటి
వృత్తములను రుచిజూచి విడిచి రని తలచెదను.
అందుచేతనే గాబోలు ద్విపదకావ్యములలో విశేష
ముగ గనుపడదు. అక్కడక్కడ అలంకారప్రాయ
ముగా మాత్రము ద్విపదలు రగడలు ఉపయో
గించుట గలదు. ఇవి గోంగూరపదములు మొదలు
కుసలాయకమువఱకు గల జనుల పాటలయందు
విశేషముగా వినబడుచుండును. ఈ సామాన్యపు
పాటలకును, ఉన్నతవాఙ్మయమునకును నడిమి
తీరున నుండు ఛందస్సును శైలియును ద్విపదకావ్య
ములయందు గన నగును.

### ౨. తరువాత నభివృద్ధి

రాజసభాలంకారమై ధీమంతుల మెప్పింపదగు
పటిమ ఆంధ్రమునకు సంస్కృతసంగతివలన గలిగిన
దనుట రూఢియే. సుమారు ౧౦,౧౧వ శతాబ్దముల
వఱకును సంస్కృతభాషయందే గ్రంథరచన కల
వడిన పండితమండలి రాజరాజనరేంద్రుని ప్రోద్బల
మున దేశజనుల కుపయోగ మగునట్లు ఆంధ్రమున
కనయించుటకు ఇయ్యకొనినట్లు ఆంధ్రభారత
పీఠికవలన గ్రహింపవలసి యున్నది. ఇట్టి గ్రంథ
కర్తలకు ఆదర్శము సంస్కృతవాఙ్మయమే. కేవ
లము కావ్యములనే గాక చంపూకావ్యములను
ఆదర్శముగా నుంచుకొనుటవలన గద్యమును పద్య
మును కలిపి మహాభారతమును దెనిగించిరి. తరు
వాత నెల్లూరు, ఏకశిలానగరము, కొండవీడు,
హంపి, విజయనగరము, నంద్యాల, తంజావూరు,
కళింగవిజయనగరము, పెద్దాపురములయందు తత్త
ద్రాజవరుల ఆదరణమున ఆంధ్రసారస్వతము అభి
వృద్ధినొందినను, భాషాంతరీకరణమునుండి స్వతంత్ర
కావ్యశతకాది కల్పనకు గడంగినను, సంస్కృత
వాఙ్మయపువాడుకలను ఆదర్శముగా నుంచుకొనుట
మానలేదు. సంస్కృతమున రానురాను వెలసిన
శ్లేషయమకాదులు బంధకవిత్వములు, సమాసగుం
భితశైలి మొదలగు సాముగరిడీలను ఆంధ్రకవులును
గద్యకారులును మిక్కిలిగా ప్రేమించి ఉపయో
గించినటుల గనుపడుచున్నది.

పూర్వరాజుల తరువాత ఆంగ్లవిద్యాశాఖాధి
కారుల యొక్కయు, యూనివర్సిటీల యొక్కయు
ప్రోద్బలమున వాఙ్మయము కొంచె మభివృద్ధి జెంది
నది. అనగా దేశజనులకు తమ వాఙ్మయగ్రంథ
ములు అచ్చుపడి సులభముగా దొరకుట కారంభ
మైనవి. ఊరికొకభాగవత ముండుట దుర్లభ మగు
రోజులు పోయి యింటింట నొక రామాయణము,
భారతము, భాగవతము గూడ ఉండుటకు వీలు
గలిగినది. పిల్లలకు పెద్దక్లాసులలో గూడ పఠ
యము లగుటవల్ల వాఙ్మయమునందు ఆదరము

సర్వత్ర ప్రబలినది. ఇప్పుడు యీ యుగమున, ఆంధ్ర వాఙ్మయము కేవలరాజసభాలంపటమును వదలి ప్రజల ఆదరణపై నాధారపడి ప్రజల జీవితములోనికి వేళ్లునాటి దానినుండి నూతనబలవికాసములను బొంద నెంచుచున్నది.

అందువలన క్రొత్తరకముల గ్రంథములు ప్రబలుటయు శైలి మారుటయు తటస్థించుచున్నది. దినపత్రికలు, మాస వార పత్రికలును, రాజసభలను మించి సారస్వతమును ఆదరించుచున్నవి. దేశజీవిత ప్రవాహముతోబాటు భాషయును వాఙ్మయమును గూడ మార్పు జెందుచున్నవి. సారస్వత మెప్పుడును ఈషత్ప్రాచీనతను గనుబఱచుచుండునేగాని, యిప్పుడు ప్రజాజీవితముతో సమానముగా పరుగిడజూచుచున్నది. శబ్దములయొక్క రూపములలోను, శైలిలోనుగూడ అనేకులకు తెలియుటయే ముఖ్యనిదానముగా నుంచుకొని వ్రాతరులు వ్రాయవలసి యుంటున్నది. ఇట్టి సమయమున నొకపరి సింహావలోకనము జేసి మన వాఙ్మయ ప్రవాహమునకు తగుమైనత్రోవల చూపించుట విధిగా నెంచి వ్రాయుచున్నాను.

### 3. నూతనయుగస్థితి

నూతనయుగమున మరల రాజమహేంద్రవరమును, మచిలీపట్టణమును ముఖ్యపీఠములనుగా నేర్పఱచుకొని ఆంధ్ర సారస్వత మపూర్వాభివృద్ధిని గాంచుచున్నది. పైయుగములలో నన్యభాషలతో సంబంధము మిక్కిలిగ నున్నను, ఆయా వాఙ్మయములతో సంబంధము విశేషముగ గనుపడదు. “హంపీ విజయనగర” యుగమున కన్నడముతోను, “తంజావూరు” యుగమున బహుప్రాచీనకాలము నుండియు మణిమేఖల, తిరుక్కురళ్ మొదలగు మంచి గ్రంథములు గలిగి స్వతంత్రవాఙ్మయముతో నొప్పరు తమిళభాషతోను పరిచయ మున్నను ఆయాగ్రంథములతోగాని ఆయాకాలపు కవులతోగాని సంబంధము ఆయాచోట్ల వ్రాయబడిన తెలుగు గ్రంథములలో గానము. వేంగిరాజ్యపాలకులగు చాళుక్యులకును, చోళరాజులకును ఎనిమిదినుండి పండ్రెండవ శతాబ్దమునఱకు సంబంధములు తరుచుగానుండినను ఆంధ్ర తమిళవాఙ్మయముల కేమాత్రపు సంబంధమును కనుబడదు. దీనికి కారణము తెలియదు. ఇప్పటికిని యావాఙ్మయములకు అన్యోన్యము తెలిసికొనవలెనన్న అపేక్ష లేనట్లే నూహించుచున్నాను. ఇట్టి యుపేక్ష జాతీయజీవితమునకు ఆతంకకారి యని చెప్పుదును.

ఆంగ్లవిద్య నభ్యసించి అందలి అనేకశాస్త్రములను జదివిన ధీరుల సహాయమున ఆయాశాస్త్రముల సారములను “వివేకవర్ధని” “చింతామణి” మొదలగు పత్రికలు ఆంధ్రలోకమునకు అందజేయుచు వచ్చినవి. “విజ్ఞానమండలి” ప్రచురణములు ఇట్టిప్రయోజనమును అధికముగ జేసినవి. ఆంగ్లగద్యపద్యకవితలను చదివి ఆనందించిన విద్యావంతులు ఆరీతి నాటకములను, నవలలను వ్యాసములను రచింప నారంభించిరి. ఈ ఫక్కిని ప్రథమమార్గదర్శకులు వీరేశలింగము పంతులుగారును, వివేకవర్ధనీ పత్రికయును యని నాకు తెలిసినంతవరకు తోచుచున్నది. వీరును వీరితోటి గ్రంథకర్తలును భాషాంతరీకరణములనుగూడ జేయుట కారంభించిరి. ఇందుకు పూర్వాంధ్రకవులవలె సంస్కృత సారస్వతమునుండి శకుంతలాది నాటకములను గ్రహించిరి. ఇట్టి భాషాంతరీకర్తలలో వసురాయ కవిగారు, వేదము వేంకటరాయ శాస్త్రిగారును పేరెన్నిక గాంచిరి. నాటకములకొఱకును నవలలకొఱకును ఆంగ్లవాఙ్మయము ఆలోడన చేయబడెను.

"రాజశేఖరచరిత్రము" అను నవలను చిన్నతనమున జదివి మిగుల ఆనందించితిని. దాని ఆదిరూప మగు "వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్" జదివిన తరువాత ఆ యానందము కొంత తగ్గెను. అటుతరువాత నవలలు పలుత్రోవల ద్రొక్కినవి. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు చారిత్రకనవలలయందును ఇటీవల చింతా శంకరదీక్షితులు గారు నేరసంశోధకనవలల యందును మిగుల కుశలతను జూపిరి. దేశమంతయు శాంతిస్థైర్యముల నొంది ఒక కేంద్రస్థానము నలవఱుచుకొనినపిదప ఆత్మశోధనకు గడంగును. అట్టి ఆత్మశోధనవలన నీతులను నిత్యకార్యాచరణయందు గమనింపదగు రీతులను ప్రజాహృదయమునకు చిత్రరచనలతో బోధజేయు నవలలును నాటకములును వఱలి ఆంధ్రదేశప్రజలను నాగరికమున మిన్నలను జేయగలుగును. ఇటీవల సంఘనవలలకు నూతనమార్గ మొకటి ద్రొక్కబడినను కారణాంతరములవలన నది సకలసువిదితంబు గాకపోయెను.

నా నేర్పుకొలది మన ఆంధ్రసారస్వతమున నాటక గద్య పద్య భాగములను విడివిడిగా దీని తరువాతిభాగములలో పరిశీలించి వానిలో అన్య వాఙ్మయప్రోద్బలమున నుదయించిన జాతులను, శైలియందు దుదయించిన నూతనరీతులను నిరూపించుటకు యత్నించెదను. సంస్కృతసారస్వతప్రోద్బలమున కలిగినవియును, స్వతంత్రముగా ఆంధ్రమున నుద్భవించినవియును జూపయత్నించెదను. ప్రస్తుతపు భారతభాషలలో బంగాళీభాషయొక్క ప్రోద్బలముమాత్రమే గానబడును. అదియును నవలా భాగమునందు మాత్రమే గలదు. ఇటీవల రవీంద్రుని కవనమును ఆశయముగా నేర్పఱుచుకొని కొన్ని కవితలు బయలుదేరుట గంటిని. తక్కిన భారత భాషలలోని వాఙ్మయములతో సంబంధము నాకు గోచరించలేదు. ఆంగ్లసారస్వతప్రోద్బలము మన గద్యవాఙ్మయమున ముఖ్యముగా గనబడును. నాటకములయం దంతగా గనబడదు. పద్యవాఙ్మయమున ఇప్పుడిప్పుడు ఎక్కువగుచున్నది. ఆంగ్లవాఙ్మయమువల్ల మనసారస్వతము ఇంకను ఏయేరీతుల నభివృద్ధి నొందనగునో ఆయాభాగవిమర్శనలయందు సూచించెదను.

అన్యవాఙ్మయ మేల మనకు ఆదర్శము కావలయు నని చదువరులు ప్రశ్నింపవచ్చును. లోకమంతయు ఒకరినొకరు చూచి క్రొత్తరీతుల నవలంబించు యత్నము జేయుటవలననే అభివృద్ధినొందుచున్నది. మహాప్రజ్ఞావంతులును, ఉదారభావపూరితులునగు మిల్టను, వర్డ్సువర్తు, కార్లైలు, రస్కిను మొదలగు రచయితలతో నొప్పారు నాంగ్లవాఙ్మయము వలన మన మెంతయో నేర్చుకొనవలసి యున్నది. ఆంధ్రమునకు మన పాఠశాలలలోను, విద్యాపీఠములనదగు యూనివర్సిటీలలోను ప్రాముఖ్యము గలిగిన కొలదిని అట్టి మహోదారు లగు గద్యపద్యకర్తల వ్రాతలు మనభాషలోనికి తర్జుమా చేయబడుట వల్లనుగాని, వాని ననుసరించి దేశాభివృద్ధికి ఆయా యదనుల నవసరమగురీతుల గ్రంథములు వ్రాయబడుటవలనగాని మనసారస్వతము క్రమక్రమాభివృద్ధినొందగలదు. తదితరదేశవాఙ్మయపరిచయము కూడ కలుగజేసికొన వచ్చును. కురానుకును, బైబిలునకును ముఖ్యమగు బౌద్ధగ్రంథములకును తగిన భాషాంతరీకరణముల నమర్చి ఆంధ్రదేశీయులగు సర్వమతస్థులకును సామరస్యమును సమకూర్చుటకు తోడ్పడవచ్చును. శ్రీమదాదిగురువు కృపను అనంతజ్ఞానాభివృద్ధికి ఆలవాలమై మన సారస్వత మభివృద్ధిని జెందవచ్చును.

## II. మన నాటకములు

నాటకము లనేకములు నల రామ పాండవ యాదవకుల పూర్వగాథల ననుసరించియు, 'చంద్రహాస', 'చంద్రకాంత', 'గోపీచందు' మొదలగు పుక్కిటిపురాణకథల ననుసరించియు వ్రాయబడు చున్నవి. శైలిలోను సంస్కృతనాటకములవలె పద్యగద్యాత్మకము లై యుండును. ప్రస్తుతము నిత్యనాటకశాలాభవనసమాశ్రితుల రుచుల ననుకరించి సంగీతము మెండుగా జొనుపబడి కథారసమును కవితారసమును నీరసపఱుచుచున్నది. ప్రజలకు స్థిరమైన అభిరుచులు ఏర్పడి ప్రజాభిప్రాయము ప్రాముఖ్యము వహించునెడల క్రమముగా ఈ సంగీతమును కథానమయసందర్భములకు కట్టువడగలదు.

ఇంగ్లీషునాటకసరళి మన నాటకముఖ్యభాగములలో ననుకరింపబడుట లేనేలేదు. సీనులను రంగమును అలంకరించుటయందు మాత్రమే కన బడుచున్నది. సంభాషణమునంతను షేక్స్పియరు నాటకములయందువలె పద్యశైలిని వ్రాయుటకు వీరేశలింగము పంతులుగారిచే యత్నము చేయబడెను. అది వారు చేసిన "వెనిస్‌వర్తకుడు" అను నాటకభాషాంతరీకరణమునందు ఇంగ్లీషు వాఙ్మయమువల్ల మనము నేర్చుకొనినవి, విషాదనాటకములు, ఫార్సులు, ప్రహసనములు. భాసుని "ఊరుభంగ" మను నాటకము విషాదాంతమే మైనను, మొత్తముమీద విషాదనాటకములు మనకు క్రొత్త. "విషాద సారంగధర" అను నాటకము ఇంగ్లీషు వాఙ్మయములోని "ట్రాజిడీ" అను రూపకమును అనుకరించుచున్నదని చెప్పవలెను. ఇట్టివానియందు మనదేశమున కభిరుచి కుదిరినట్లు కనుపడదు. ఇక్కాలపు ఆంగ్లవాఙ్మయమునకూడ విషాదనాటకము లరుదు.

ఇంగ్లీషులో "కామెడీ" అను రూపకముల ననుసరించి కొలది శృంగారకథతో కలిసిన హాస్యవినోదచర్యలను వస్తువుగా గొని "ప్రహసనము"లు ఆంధ్రమున వ్రాయబడినవి. సంస్కృతప్రహసనములపేరు ఆలంకారికులచే చెప్పబడుటయే గాని నాకు లభించలేదు. సరస్వతీపత్రికలో "పాదతాడితకము" అను విటజీవితాశ్రయ మగు ప్రహసనము దొరకినట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. ప్రహసనములలో శృంగార కథాసమ్మిశ్ర ముండదు. కేవలహాస్యభూయిష్ఠమై ఇంగ్లీషులో ౧౬ వ శతాబ్దమున ఆ వాఙ్మయము యొక్క అప్రౌఢదినములలో నుద్భవించిన "ఇంటర్ల్యూడ్" అను నాటికలను బోలియుండును. వీరేశలింగముగారిచే వ్రాయబడిన "గానప్రియుడు" అను ప్రహసనమున శృంగారకథ ముఖ్యవస్తువుగా నుండుటచేత అది షేక్స్పియరు కవియొక్క కామెడీలను బోలియున్నది. ఇట్టివి ఏలాకో ఆంధ్రలోకమున నాదరణ బడసినట్లు కనుపడదు. "బలవంత బ్రాహ్మణార్థప్రహసనము" "కనకశునకప్రహసనము" అనునవి మనోరమ పత్రికలో చదివితిని. బహుచిన్నవి యగుటను రంగప్రదర్శనము బడయలేదు. ఇవి కేవలము ఇంగ్లీషుభాషలోని ఇంటర్ల్యూడ్సును బోలియున్నవి. సంఘాచారముల యందు గల వైకృతములను విపరీతముగా గనుపర్చి నవ్వుపుట్టించుచు సంఘమును బాగుజేయుట వీని ఆశయము. అతిచుఱుకగు వ్యావహారికభాషాప్రయోగములతో నిండి మిక్కిలి నవ్వు పుట్టించునవి యైనను యీ ప్రహసనములు వ్రాయునప్పటికే చాల కాలముక్రిందట ప్రాతబడిన సంఘాచారములను వెక్కిరించుటచే తగిన వ్యాప్తిని చెందలేదనుకొందును. హాస్యరసభూయిష్ఠములై మనుజుల నడనడి

లోని వికృతములను ప్రదర్శించుచు చదువరులకును చూపరులకును మంచి ఆనందము కలిగింప నోపును.

ఈ "నవ్యనాటకముల"లో హాస్యరసమునం దైతే నేమి, జనులయొక్క ఆశయములలోను, సంభాషణలలోను, చేష్టలలోను పలువిధము లగు వైకృతములను ప్రతిబింబించు నైపుణ్యమునం దైతే నేమి పే రెన్నిక గాంచిన "కన్యాశుల్కము"ను "కంఠాభరణము"ను ఇచట పేర్కొనియెదను. గిరీశము, వేపారిపంతులు అను వ్యవహారములందు చతురత, కల్పనలయందు ప్రత్యుత్పన్నమతి గల పోకిరీమిస్నలును, వారి కౌశల్యమునకు గుఱి యైన కామలోభదంభకాతరత్వపులగము లనదగిన లుబ్ధావధానులు, సుబ్బిశెట్టి యను పాత్రములును వీనిలో ముఖ్యముగా గనుపించును. కన్యాశుల్కములోని పాటలయొక్క సరళత, నేర్పు, కథాసందర్భానుసరణము మిక్కిలి పశంసించదగియున్నవి. ఇట్టి నాటకములు సంఘసంస్కరణమునకును, ప్రజల నీతులు నడవడికలు తిన్ననగుటకును ఎక్కువగా తోడ్పడును. దేశముయొక్క దృష్టి అతితీవ్రము లగు ప్రాణాధారసమస్యలపై గుఱిపడి యుండుటవలన యిటువంటి మరలలేదు. దేశమునకును పజలకును నిశ్చితాశయములు ఏర్పడినగాని సాంఘికనవలలు, ప్రహసననాటకములు, "సాక్షి"వంటి వ్యాసరాజములు విశేషముగా వఱలుటకు వీలుపడదు.

ఇప్పు డున్న నాటకము లన్నియు రాజకుటుంబములు, వారి యుద్ధములు, వివాహములు మొదలగు కార్యములతోనే కించిన్మాత్రరూపభేదములతో కాలము గడుపుచున్నవి. ఇవి గఱపు నీతులన్ననో శృంగారవీరకారుణ్యాద్భుతభావములనో, అత్యంతశాంతభావములనో ఆశ్రయించుకొనుచు ప్రకృతి ప్రతిబింబము లన వీలులే కున్నవి. జీవిత ప్రకృతియొక్క ప్రతిబింబము లైననే నాటకములు మనస్సునకు తృప్తిని గలుగజేయును. ప్రకృతిరూపసామ్యము లేని కవితాకల్పనలు తత్కాలప్రశంసితము లైనను, చూపరుల మనస్సులను విశ్వాసము గొల్పి నిత్యాదర్శముగ నుండతగిన భావములతో నింపజాలవు. ఇట్టి నాటకములలోని వీరరసములకు ప్రియమైన పాత్రలు బాణాసురుడు, భీమసేనుడు, అశ్వత్థామ మొదలగు వీరులు; చెంచునాటకములోని చెంచుశిఖనాయకుని అట్టహాసవైఖరికిని యీ పాత్రలు మన నాటకరంగముల ప్రదర్శింపబడు వైఖరికిని భేదము లేదు. మొదటినుండి తుదవఱకు అటుచుట గుస్తులు త్రిప్పుట అట్టహాసము జేయుటయే వీరరసమునకు ముఖ్యాశయమును జేయుచున్నారు. భాషాంతరీకృతనాటకములలో తప్ప తక్కిన యీ యుగపు తెలుగునాటకములలో శృంగారరసము కూడా తరుచుగా ఔచిత్యరహితమై అతిశయోక్తి పూరితమై సందర్భమునకు సరిపడని పదమాధుర్యమును భావవ్యక్తిని కలిగియుండును. ఇట్టి అతిశయోక్తిప్రయోగమును చారిత్రాత్మకమైన "విజయనగరసామ్రాజ్యము" అను నాటకప్రదర్శనమునందు నేను చూచితిని. ఎప్పుడును వింతలు, వేడుకలు; వేషభాషాద్భుతములయందే లక్ష్యముండిన ప్రజలకు వీనితోనే తృప్తియగును. ప్రజలయందు నూతనబుద్ధివికాసము గలిగి యిట్టి కేవలబాల్యానుకూల మగు అభిరుచులు మారిననేగాని ప్రకృతి సామ్యమునే ఆదర్శముగా నుంచుకొనుట ముఖ్యవిధి యని నాటకాదికర్తలును, వానిని ఆదరించు నటవర్తకసంఘములును గ్రహింపజాలవు. వీరిపని ప్రజలకు కావలసిన వస్తువులను వేడుకలను సమకూర్చుటయే గదా! షేక్స్పియర్ మొదలు ఈకాలమువరకును గల ఇంగ్లీషు నాటకచరిత్రమువలన

మనము నేర్చుకొనవలసిన ముఖ్యాంశ మిదియే. వాఙ్మయమున ఆదర్శములై చిరకాలముగ నుండవలసిన గ్రంథములు జనులయొక్క జీవితవిమర్శయందు అతిశయోక్తికి ఎడమీయక సత్య మరయు నభిలాషయే ముఖ్యముగ నుంచుకొన వలయును. మనుజులు భావములలో కష్టసుఖానుభవముల వలన జెందుమార్పులు, కనుబరచు ధైర్యస్థైర్యములు, చేయు పోరాటాలు, అనుభవించు పరితాపములును, ఒకదాని నొకటియంటి ప్రవాహమువలె మనుష్యుని మొదటి యూహలను మించి చెలరేగి మఱి విభ్రమణము కలిగి పనోపు నడతలు,—వీని కన్న సద్భావము లేమి గలవు? లలితకళలన్నిటిలోను కవిత ఇట్టి నడతలను వాని నాశ్రయించి పలువిధముల త్రిప్పుచుండు భావములను సవిమర్శముగా ప్రదర్శించి మహోన్నతపదము నాక్రమించి యున్నది.

కేవల కథావైచిత్ర్యములు అనగా రక్కసులు వచ్చుట, రాజ్యములు పోవుట, తిరిగి లభించుట, అశ్వినీ దేవతలు అగపడి ఆకలి దప్పులు లేని కంకణముల దయచేయుట, పదినెలల పిల్లవానికి పద్రెండేండ్ల రాకొమరితను పెండ్లిజేయుట, ఆమె చిన్నమగని పెంచుటకు కానల కేగుట మొదలగు అసాధారణములును ఒకప్పుడు అతీతమానుషములును నగు సంగతులకన్న పైన బేర్కొనబడిన మనస్సు పోకడలు రంగస్థలమున నట్టహాసముగ గనుపడకపోయినను అంతరంగమున కాహ్లాదమును బుద్ధికి సూక్ష్మతను తృప్తిని గలిగించును. స్వర్గమునుండి దివ్యరథమున దుష్యంతుడు దిగుట, శకుంతలా పుత్రుడు సింహపుపిల్లయొక్క దంతలు విడదీయుటకన్న తా నెఱుగనితండ్రి సమీపించి తనను "తనయా" యని పిలచినప్పుడు కనుపఱచు నద్భుతమును, "కేళీశకుంతము నిచ్చెదను సింహకిశోరమును విడువుము" అనెడు ముదుసలితాపసయువతి వచనము విని నామసామ్యమున భ్రమపడి "మా అమ్మ ఎక్కడ" అని అడుగుటయును, తరువాత "తనయా" యని తన్ను పిలుచు నీ క్రొత్తమానిసి ఎవరు అని తల్లిని అడుగుటయును, సందేహముచేత అణచబడిన సంతోషాశ్చర్యములుగల మనస్సుతో నామె "నీ అదృష్టము నడుగుము" అని బదులాడుటయును, పతివ్రతపాదములపై బడి దుష్యంతుడు పలికిన అత్యంత పశ్చాత్తాపగర్భిత మగు వాక్యమును—ఇట్టి సంభాషణములు, భావవ్యక్తీకరణములు ఆలోచనగల నరులయొక్క మానసములకు అత్యంత తృప్తి నొసగూర్చునని చెప్పనగును. సంస్కృతమున కాళిదాస భవభూతులయందు యిట్టివి మెండుగా గాననగును. అద్భుతరసమునకు బలుతావులవారి నాటకములలో చోటిచ్చినను భావనిరూపణయందలి ఔచిత్యము, సత్యము, కుశలత ఆ నాటకములను నేటికిని అగ్రస్థానమున నుంచుచున్నది.

కల్పనాస్వాతంత్ర్యము జూపు నాటకము లరుదు. సులభమును లలితమును నగు శైలి గలిగి ప్రాతక్రొత్తసంఘాచారముల మధ్య దందడించు హైందవగృహములయందలి పెద్దలకు సహనమును పిన్నలకు ఓరిమిని విధేయతను బోధించుచు కల్పనాస్వాతంత్ర్యమును పాత్రౌచిత్యమును గలిగియుండు ఆచంట సాంఖ్యాయన వెంకట్రాయ శర్మగారిచే రచింపబడి విశాఖపట్నములో నచ్చుపడిన 'మనోరమ" యనునాటకమును ఉదహరించెదను. ఈనాటకము ఇప్పుడు వాడుకలో గానము. దీనియొక్క ప్రాశస్త్యము సకలవిధముల 'సీతామనోహరము" అను నాటకముతో బోల్చినయెడల తేటపడును. రెండును సంఘసంస్కారాశయము గలవియే. ఏది

రంగప్రయోగార్హమో యువజనపఠనార్హమో చదువరు లవలీల నిర్ణయింప గలుగుదు రనుకొందును. కేవలాద్భుతకథాభాగములే ఆధారముగా నుంచుకొను నాటకములకు విశాఖపట్నమున అచ్చుపడిన "మానవతి" యనునాటకమును ఉదహరించవచ్చును. దీనికథను ఎక్కడనో యదివఱకే కథలపుస్తకములలో చదివినట్లు జ్ఞాపకము. గోపాలవర్మ యను రాజయువకుడు "స్త్రీమానమును ఎవరు కాపాడవలయును" అనుప్రశ్నకు సదుత్తర మీయగలుగు యువతికొఱకు దేశదేశముల తిరుగుట, అట్టి "మానవతి" లభించినపిమ్మట ఆమె యెట్లు తన మానమును కాపాడుకొనునో యని పరీక్షించుటకొఱకు ఆమెను ఏకాకినిగా నొక గ్రామముచెంత విడిచిపోవుట, తరువాత ఆమె వర్తకునిబారినుండి, జంగముబారినుండి, దొంగలబారి నుండి యింక ననేకబాధలనుండి తనయొక్క సౌజన్యముచేతను నేర్పుచేతను తప్పించుకొని పురుషవేషముతో తన మామగారి రాజ్యమును జేరుట, వారిమన్నన బడసి తన స్త్రీ ఆకృతి గల చిత్తరువును సత్రమున గట్టించి దాని ద్వారా పట్టువడిన తనభర్తను, తదితరులను గుర్తించి, తనమామకు తెలుకపఱచి, సర్వజనసమక్షమున తన మానమును స్థిరపఱచుకొని తనభర్తతోగలసి రాజ్యసంపదల ననుభవించి సుఖించుట —— ఇవి యిందలి కథాంశములు. ఇందు మానవతిచారిత్రము ఉత్తమోత్తమ మైనను ప్రకృతి కనువగునట్లు నిరూపింపబడినట్లు స్ఫురించుటలేదు. గోపాలవర్మ తనభార్యను విడనాడుటకు హేతుభూత మగు నాతనిమనోభావములు సరిగా సూచింపబడలేదు. గోపాలవర్మ మానవతులకు అనురాగజననముకొఱకై ప్రథమసమావేశము ఉద్యానవనమందు సమకూర్పబడినది. దీనికిని తరువాత మామూలురీతిని ప్రశ్నోత్తరరూపమగు రాజానుజ్ఞను పొందిన సమావేశమునకును భావసంబంధము బాగుగ గనుపడదు. దీనివంటి విచిత్రవరణమును ఆధారముజేసికొన్న "వెనిసు వర్తకుడు" అను నాటకములో షేక్స్పియర్ అను కవి "పోర్షియా" యను నాయికయొక్క మనోభావముల కలవరమును నిరూపించి ఆయసాధారణ వరణపద్ధతిని కొంతవఱకు ప్రకృతి కనుగుణముగా నొనర్చియున్నాడు. ఇంద్రజాలములు, రాక్షసమాయలు మెండుగా నుపయోగించియును, అతివిస్తారమగు కథాంశములు కలిగియున్నను, చక్కని రచనాకౌశలమును, ఇంపై ప్రకృతి ననుసరించు పాత్రపోషణమును గల "త్రిలోకసుందరి" యను కొత్తపల్లి సూర్యారావుగారిచే రచియింపబడిన నాటకము నొకదాని నిచ్చట నుదహరించెదను. ఇది రంగప్రదర్శనమునకును, వేడుకగా చదువుటకును గూడ మిక్కిలి తగియున్నది. ప్రద్యుమ్న చంద్రకాంతలే గాక తదితర పాత్రములును సమయోచితానురాగ పశ్చాత్తాపాదిభావములను గనుపఱచు చున్నవి. అద్భుతరస మటుండ నాయికానాయకుల యొక్క నడవడికయును మాటలును భావములును సహజములును వారిపదవికి తగినవియును అయియున్నవి. చదువరులకును జూపఱులకును తప్పక ఆనందమును భావోన్నతిని గలుగజేయు ననుకొందును. దీనికథ కొంతమట్టుకు మదనకామరాజుకథనుండి గ్రహింపబడినదని తోచుచున్నది.

"ప్రకృతి ననుసరించుట కథావస్తువునందు లేకపోయినను పాత్రపోషణమునందైనను ముఖ్యాశయము" అనునదిగాక మననాటకములలో కొన్ని గమనించదగు విషయములను ముక్తసరుగా నిచ్చట వివరించెదను:——

### 1. పాటలు

నాట్యరంగమునకు పాటలు ఒక అలంకారము. నాటకములోని భావవ్యక్తీకరణకు సహాయములు. అంతేగాని ముఖ్యాలంకారముగాని ముఖ్యసాధనము గాని కానేరవు. సంభాషణయే నాటకకారుని ఆశయమును నెరవేర్చుటకు ముఖ్యసాధనము. దీనిని స్పష్టమైన ఉచ్చారణ లేకపోవుటవల్ల నాటకులు వ్యర్థముచేసినవారగుదురు. ఎక్కడబడితే అక్కడ వారు చిత్తమునకు వచ్చినదరువులు, రాగములు, మట్లు జొనుపుచుందురు. దీనివలన నాటకమునకు మిక్కిలి హాని జరుగుచున్నది. ఇది యటుండ వీరి వలన అభిరుచులలో తరిఫీదు అయిన గ్రంథకర్తలు ప్రతినాటకమునను సంభాషణము పాటలయందేనడుపుటగనుచుందుము. ఇది "ఆపెరా" (Opera) యను సంగీతప్రధానములగు ఇంగ్లీషునాటకములయందు సహజము. ఇట్టిపాటకత్తుసంభాషణ మనయక్షగానములలో సహజము. వీనిలోని కథలు అందఱకు తెలిసినవి. ఆపెరాలలో కథలు సులభగ్రాహ్యములు. జనులు వీనియందు వేషముల చూచుటకొఱకును పాటలు వినుటకును మాత్రమే కుతూహలము గలిగి యుందురు. మన "సంగీతసత్యహరిశ్చంద్ర" "సంగీత చంద్రకాంత" యను నాటకములు కథా సందర్భములను, పాత్రలాడెడుమాటలను, కనుపఱచు భావంబులను తెలియనీయకుండా సభవారి కండ్లను జిలుగువేషములతోను, వారి వీనులను రసౌచితి లేని పలుకులతోను స్పష్టోచ్చారణ లేని సంగీతములచేతను లాలిత్యము లేని సంగీతపుపెట్టెల స్వరసన్నాదముతోను చీకాకుపఱచు చుండును. సురభికంపెనీవారిచే ప్రదర్శింపబడిన దొకటి చింతామణినాటకశాలయం దొకటి నేను జూచితిని. సందర్భములు, రసములు, భావములు అవసరము లేకుండా కేవలము స్వరాలాపలయకుశలతలయందే తగులుకొని వినగూడిన సభికులలో నూటికి తొంబది మందికైనను విసువు జనించునట్లు మన సంగీత సభలు చేయు పొరబాటును యిట్టిదే. నాటకము యొక్క ఆశయము కేవలసంగీతప్రదర్శనము గాదు. సంగీతసభయొక్క ఆశయము కూడినసభికుల యొక్క అభిరుచినిబట్టి యుండవలయును. ఏదో రీతిని తల లాడించుట గానసభలకు వెళ్లువారికిని, ఒకరినిజూచి ఒకరు మెప్పుచప్పట్లు చేయుచుట నాటకశాల చూపరులకును వాడుక యైనది. నాయభిప్రాయము ఏమనగా నాటకప్రదర్శనమున సంభాషణము ముఖ్యము. స్పష్టమైన ఉచ్చారణ ప్రాణము వంటిది. పాత్రముల నడవడికయు భావములను తెలుపుటకు ముఖ్యసాధనమగు సంభాషణము సరిగా సభవారి చెవులను పడక నాటకములయందలి ఆదరమును తగ్గించివేయును. నాటకరచయితలు కూడ భావమంతయు స్పష్టమగునరకును గద్యపద్యములతో తృప్తినొంది, భావమును విస్తరింపజేయు నవసరము గలిగినచోట్లను మాత్రమే తమచేత రచింపబడినవి గాని పూర్వకవికృతములై జనానుమతములైనవిగాని యగు పాటలను మితముగా పొందుపఱచవలెను. ఇందుకు మాళవికాగ్నిమిత్రములోని అగ్నిమిత్రుని వాక్యములయందు భావపూరితము లగు చిన్న వృత్తములు సంగీతరసానుకూలము లని తోచును. అంతనాటకములోను మాళవికచే పాడబడిన ప్రాకృతగీతిక యొకటియే కేవలసంగీతవిధానము నను సరించియున్నది. అది యెంతయు సందర్భానుసారముగ నున్నది. విక్రమోర్వశీయములో చతుర్థాంకము మాత్రము సంగీతభూయిష్ఠమై యున్నది. ఆరంగము ఏకపాత్రప్రయోజితము. అందలి విరహభావము మొదటినుండియు జూపఱులకు స్పష్టము.

ఇక నాపైని సంగీతపు విసరులు కవికిని పరమరసి
కులకును తృప్తియగునంతవరకు నడుపుకొననచ్చును.
కుంభకోణకాలేజివిద్యార్థులు ఈ నాటకమును
సంస్కృతమున క్రిందటి డిసెంబరులో ప్రదర్శించిరి.
చతుర్థాంకములో హంస, మేఘము, కొండచ
రియ వీనితో విరహోన్మత్తుడు మాటలాడు భాగ
ములను మాత్రమే ప్రదర్శించిరి. తక్కినభాగము
లను విడిచిపెట్టిరి. పద్య మొకపరి చదివినతరువాత
రాగప్రయోగము జేయుచుండిరి. సంభాషణలు బహు
స్పష్టముగా నుచ్చరింపబడెను. ఆనాటకము సర్వ
జనామోదితమాయెను. సంగీతమే ప్రధాన మగు
నాటకములలోని సంభాషణ అంతయుగాని చాల
భాగముగాని రాగ గీతికలలో నుండవచ్చును.
అవియైనను స్పష్టోచ్చారణ లేనియెడ వ్యర్థపయు
క్తము లగు నని నానమ్మకము. ఆంగ్లసంగీతనాటక
ములలో (Operas) ప్రదర్శింపబడు భావములు అత్యు
దారములు గాని అతినీచములు గాని అతిక్రూర
ములుగాని అతిలలితములుగాని అమరియుండును.
గ్రహించుట సులభము. సంభాషణలో
చాతుర్య మక్కఱలేదు. ఇంపు గొల్పు పదజాల
ముంటే చాలును. కథ జీవితప్రకృతిని అనుసరించ
నక్కఱలేదు. మన యక్షగానములలోను నిట్లే.
"సీతామనోహరము" అను నాటకములో సీతకును,
భుజంగరావుకును జైలులో జరిగిన సంభాషణలు
సంగీతకత్తులో పెంపుగ నమర్చబడి యున్నవి. గద్య
వాక్యముల నుండిన సహజముగాను మనోహరము
గాను నుండెడిని.

ఇంగ్లీషువాఙ్మయమున ౧౭-వ శతాబ్ది పూర్వ
భాగమున విలసిల్లిన "మేస్కు" (Masque) అను
నాటకరకము మనలో కానము. నాటకులు కృత్రిమ
ముఖములను ధరించి ఆడుచుండెడివారు. వీనిలో
నృత్యము అలంకారము వేషము విచిత్రరంగప్రదర్శ
నము ఇవియే ముఖ్యముగా నుండెను. ఇవి అత్యంత
ధనికుల యిండ్లలో ఏర్పాటుచేయబడుచుండెను.
నాటకులు ముఖమునకు కోటా వేసుకున్నను, మన
యక్షగానములు ఈ భాగములో జేరవు.

2. పద్యములు వాడదగిన సమయములు

మానవునకు సామాన్యవ్యవహారములో గద్య
యే సహజము. దాని ననుకరించి నాటకకవులు కూడ
అట్లే సంస్కృతములోను తెలుగు వాఙ్మయములోన్ను
ఉపయోగించుచున్నారు. కేవలహాస్యప్రధానమగు
భాగములయందు మాత్రము చుఱుకుగల దేశ్యపద
వాక్యసరళిని ఉపయోగించి, తక్కినచోట్ల కఠిన
ములుగాని ఉన్నతపదవాక్యసరళిని ప్రయోగింతురు.
గ్రీకునాటకములలో గద్యవాడుక కానరాదు.
ఇంగ్లీషులో మొదట అన్నిరకముల నాటకముల
లోను పద్యవరుసయే వాడబడినను, రానురాను
హాస్యభాగములయందు గద్యను వాడుట ఆచార
మాయెను. ఉన్నతపాత్రల సంభాషణకును విషా
దాది రసప్రదర్శనమునకును వాడుకభాషను
గాంభీర్యము చాలదని కాబోలు పద్యశైలినే వాడు
చుండిరి. ౧౯-వ శతాబ్దముచివరనుండి ఆయాచారము
మారినది. ఇంగ్లీషునాటకములు సహజ మగు
గద్యయందే వ్రాయబడుచున్నవి. గద్యపద్యములను
ఉచితరీతిని కలిపి వాడుట మననాటకములలో ఎన్న
దగిన అంశము. మననాటకములలో నీ క్రొత్త విష
యము గమనించదగును. పద్యప్రయోగము భావో
న్నత్యము, భావోద్రేకము గలిగిన చోట్లనే కాన
నగును. లేనిచోట్ల గద్యమే వాడుచుందురు. వర్ణ
నలు అధికముగ వచ్చుచోటనుతప్ప పద్య మంతగా
ప్రయోగింపరు. పాత్రములు దీర్ఘప్రసంగములు
గావించుటయును గానరాదు. పద్యప్రయోగము

సంభాషణలో హెచ్చుస్థాయిని తెలియబర్చుచు, సోపానములయందు విశ్రాంతికొఱకు అచ్చటచ్చట నమర్చబడు విశాలమగు రాతిపలకలను బోలి యుండవలెను. రసోచిత మగు పద్యవృత్తాదులను ఎంచి ఉపయోగించుట కాళిదాసుని నాటకముల యందు ముఖ్యముగా గాననగును. పద్యముకన్న గద్యయే మెండు. పాండవులు శ్రీకృష్ణుని రాయ బారమునకు పంపు ఏకాంకరంగము ఒకసారి రాజ మండ్రి కాలేజీలో ప్రదర్శింపబడగా చూచితిని. పద్యములతో నిండియుండెను. పాత్రములు గోడ నమర్చబడిన బొమ్మల వలె నా గంటసేపు ఎట్లో కూర్చుండిరి. ఒక్క భీముడుమాత్ర మొక సారి గద త్రిప్పి వినాసము నులివెట్టెను. ఇంగ్లీషు ప్రభువుల సభయందైనను యింత ఏకనాద ఏకతాళ వాదప్రతివాదము లుండ వనుకొందును. అధిక మన్నన లవసరమగు రాజసభలయం దైనను యింతకన్న కదలికయును జీవకళయును ఉండును. ప్రకృతిని ఆదర్శముగా నుంచుకొననిచో నాటకము లిటులనే తయారగును. " పాండవవిజయము " అను నాటకము అనేక విధముల ఆదర్శప్రాయముగా నున్నది.

౩. శైలి

దీనినిగురించి నేను జెప్పవలసినది ఏమనగా శైలి, భావముల ననుకరించి పలుకుతుల మెలగినను మొత్తముమీద జనబాహుళ్యమునకు ఆనందము నొసగూర్చగూడిన నాటకములు సులభపదజాల ములతో నొప్పారుట సమంజస మని తలచెదను. దీనిలో పద్యముననైననేమి గద్యముననైన నేమి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే భాషాంతరీక రింపబడిన భాసనాటకముల శైలి ఆదర్శముగా నుండ నోపునని తోచుచున్నది. "త్రిలోకసుందరి" యందు గూడ సంభాషణ సరళమై చురుకుగల దేశ్య ప్రయో గములను యుక్తస్థలములయందు వాడుచు నొప్పారు చున్నది. దానిలో పద్యములయందుగూడ ఇట్టి శైలియే గలదు. భవభూతి కఠినశైలిని అట్టహాసము గల చోట్లను, కొన్ని వర్ణనలలోను ప్రయోగించి నను, మొత్తముమీద సులభస్ఫురణ గలుగు శైలినే వాడియున్నాడు. ఇంగ్లీషున షేక్స్పియర్ కవియొక్క విషాదనాటకములలో ముఖ్యపాత్రములు అతివిషమ స్థితిలో పడి భావవైకల్యమును బొంది తమమనస్సు తమకే స్పష్టముగా తెలియని అవస్థలలో క్లిష్టశైలిని సంభాషింతురు గాని ఇట్టిచోట్లరుదు. (సశేషము)

# ప్రణయగీతములు

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.

లేతవలపునిప్రేమమే । బలమైన దంచు
చిలుక లాకాశాన । లలితముగఁ బాడె.
కనరానిప్రేమమే । ఘన మైన దంచు
ఆకులలో గాలి । హాయిగాఁ బాడె.
పలుకనిప్రేమమే । పావనం బంచు
చల్లగా మదిలోన । జానకి పాడె.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా!

**చిలుకూరి వీరభద్రరావు గారు**

ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులా? అనార్యులా? నాగరికులా? అనాగరికులా? ఇప్పటి యాంధ్రులును ప్రాచీనాంధ్రులును వేఱ్వేఱు జాతులవారా? ఒక్కజాతివారు కారా? అను ప్రశ్నములను ప్రఖ్యాతపండితు లైన విజాతీయపరిశోధకులు చర్చించుచు విపరీతసిద్ధాంతములను చేయుచున్నప్పుడును, మతభేదబుద్ధితోఁ బ్రాచీన ధర్మశాస్త్రవేత్తలు కొందఱు చరిత్రజ్ఞానము చాలమినో, ద్వేషముచేతనో సత్యమును మఱుఁగుపఱచి భారతప్రపంచము నంధకారములోఁ బడి దారి తెన్నులు గానకుండునట్లుగాఁ జేయు వ్రాఁతలు వ్రాసియున్నప్పుడును, భరతఖండములో 'ఆంధ్ర'నామము మఱవకుండ ననేకశతాబ్దులుగాఁ బట్టుకొని విడువక మర్యాదను గాపాడుకొనుచు వచ్చిన మనము వానిని సహించి యూరకుండుట యెట్లు? అయ్యవి సత్యములు కావని మనము గ్రహించినప్పుడు వానిని సహేతుకముగా ఖండించి లోకమునకు సత్యమును శ్రుతపఱచుట మనకు విధ్యుక్తధర్మము కాదా? ఇందు గర్వసంరంభ మేమియున్నది? భరతఖండము నిజమగు నాంధ్రతత్త్వచరిత్రమును సరిగా సంపూర్ణముగా గ్రహించునాఁటికిఁ గృత్రిమజాతిభేదములు వాటంతటవియే సమసిపోఁగలవు. చూచితిరా యీ చిత్రము? స్మృతికారులకునెల్లఁ బెద్ద యగు మను వేమనుచున్నాఁడో చిత్తగింపుఁడు. కారావర స్త్రీయందు నిషాదునకుఁ బుట్టినవాఁడు చమారీ (చర్మకారుఁడు) వాఁడట! బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకు జనించినవాఁడు వైదేహుఁడఁట! వైదేహస్త్రీయందు చమారీవానికిఁ బుట్టినవా రాంధ్రులును మేదులునఁట! వీ రుభయులును గ్రామములలో నివసింపరాదఁట! ఆంధ్రులు చండాలజాతిభేదముగ నిరూపించి వ్రాసెను.*

మనుస్మృతిలో నీవాక్యమునుగూర్చిన బుద్ధిమంతున కెట్టిచరిత్రజ్ఞానము కలదో యింకఁ జెప్పవలయునా? ఇంతకంటెను మేధావి యైన మఱియొక శాస్త్రవేత్త యాంధ్రులకును మేదులకును వీథులలోఁ బెంటలెత్తుటయును, పాకీపనులు చేయుటయు, గుహ్యావయవముల స్పృశించుటయు వృత్తు లని చెప్పియున్నవాఁడు (శూద్రకమలాకరము). వీరికంటెను మఱియొక బుద్ధిమంతుఁడు మేదస్త్రీయందు నాంధ్రునకుఁ బుట్టినవాఁడు యవనుఁడైన తురుష్కుఁడనియు వానికి గోవధఁజేసి జీవించుట వృత్తియనియుఁ జెప్పియున్నాఁడు.

మేదస్యవనితా కార్యా త్సంగతాంధ్రేణచేద్రహః । సా
సూత యవనపుత్రం తురుష్క స్సప్రకీర్తితః । ప్రసిద్ధో మ్లేచ్ఛ
దేశేయో గోవధేనాస్య జీవనమ్." (శూద్రకమలాకరము)

ఇయ్యవి ధర్మశాస్త్రవేత్తలయిన మన్వాదులు వచించిన వాక్యములు గావున మనవారు కొందఱు వీనిని విశ్వసించి తా మాంధ్రులమని చెప్పుకొనుటకు సిగ్గుపడుచుందురు. ప్రాచీనాంధ్రులకును మనకును సంబంధము లేదని చెప్పుచుందురు. భరతఖండములో

* కారావరం నిషాదాత్తు చర్మకారం ప్రసూయతే । వైదేహకా దంధ్రమేదౌ బహిర్గ్రామవ్యవస్థితౌ ॥

నితర ప్రదేశములవారు సహితము మన మాంధ్రులము కామనియె నిన్న మొన్నటివఱకు తలంచుచుండిరి. భరతఖండములోఁ జాతుర్వర్ణ్యము తలయెత్తుటకుఁ బూర్వమునుండియు నున్న లక్షలకొలఁది జనసంఖ్య గల జాతులను సయితము సంకీర్ణజాతులనుగఁ జెప్పిన మనుప్రవాక్యము లెట్లు విశ్వాసార్హములగునో విషయవిమర్శ చేసి మనవారు చర్చింపరు. భారతవర్షీయజాతుల పరిణామచరిత్రము నెఱింగిన యేచరిత్రకారుఁడును మనువు చెప్పిన సంకీర్ణజాతులను ప్రత్యేకజాతులనుగఁ బరిగణించునే గాని మఱియొక విధముగాఁ గళంకయుతము లని తలంపఁజాలఁడు. బ్రాహ్మణస్త్రీలు శూద్రులతో వ్యభిచరింపఁగా చండాలజాతి పుట్టిన దని చెప్పుట బ్రాహ్మణులకే యవమానముగాని చండాలురకు గాదు. లక్షలకొలఁది జనసంఖ్య గల చండాలజాతి ప్రత్యేకవ్యక్తిత్వముగల స్వతంత్రజాతి. మనుస్మృతికారుఁ డెట్టి యంధకారములో నుండి యనులోమవిలోమజాతులతత్త్వము దెలిపెనో యా వివరమును మఱియొకవ్యాసమున దెలిపెదను. ఆంధ్రులనుగూర్చి మిడిమిడిజ్ఞానముతోఁ ధర్మశాస్త్రవేత్త లేమి వ్రాసినను వీరికంటెను బూర్వము పుట్టిన యైతరేయ బ్రాహ్మణములో నాంధ్రుల ప్రశంస గలదు. అందు భారతవర్షభుఁడయిన విశ్వామిత్రుని సంతతిగాఁ జెప్పబడినారు.* ఇందలి యైతిహ్య మిట్లున్నది. ఇక్ష్వాకువంశములో పుట్టిన విదేహుని కొడు కగు హరిశ్చంద్రుఁ డను రాజునకు నూర్వురుభార్య లున్నను పుత్రసంతానము లేకపోయినదఁట! అతఁ డొకనాఁడు తన యింటిలో నున్న పర్వతనారదు లనువారితోఁ జెప్పకొనఁగా వారు 'కొడుకు పుట్టిన నీకు బలియిచ్చెద' నని వరుణుని బ్రార్థింపు మనిరి. అతఁ డట్లు చేసెనఁట! వరుణ ప్రసాదమున నాతని కొక కుమారుఁడు కలిగెను. వానికి రోహితుఁ డని పేరు పెట్టెను. పిమ్మట వరుణుఁ డెన్నిసారు లడిగినను హరిశ్చంద్రుఁడు కొడుకును బలిపెట్టక కొడుకు పెద్దవాఁ డగువఱకు సాకులు చెప్పుచువచ్చెనఁట! ఒకనాఁడు రాజు తన కుమారునకీ విషయము దెలుపఁగా నతఁడు తిరస్కరించి విల్లు చేతఁ బట్టుకొని యరణ్యమునకుఁ బోయి సంవత్సరకాల మచట నుండెనఁట! దీని నంతయు విని వరుణుఁడు హరిశ్చంద్రునిఁ బట్టుకొనియెనఁట! అంత హరిశ్చంద్రుని కడుపుబ్బెనఁట! అచట వనములో నాఱువత్సరములవఱకు హరిశ్చంద్రునికొడుకు సంచారము చేయుచుండి యొకనాఁ డొక ఋషిని గనియెను. అతఁడు సుయవసుని కొడుకు అజీగర్తుఁ డనువాఁడు. అతఁడు క్షుద్బాధాపీడితుఁడై యుండెనఁట! వానికి శునప్రచ్ఛుఁడు, శునశ్శేపుఁడు, శునలాంగూలుఁడు అను మూవురుపుత్త్రు లుండిరఁట. తనకు బదులుగా బలి యిచ్చుటకై వానికుమారులలో నొకని నొసంగినయెడల నూఱుగోవుల నిత్తు నని రోహితుఁడు వాని నడిగెనఁట! తండ్రి పెద్దవానివల్ల కాదని కౌఁగిలించుకొనియెనఁట! కడపటివానిని తల్లి కౌఁగిలించుకొనియెనఁట. మధ్యవాఁ డగు శునశ్శేఫు నిచ్చుటకు తల్లిదండ్రు లంగీకరించిరి. రోహితుఁడు వారలకు గోవుల నిచ్చి శునశ్శేఫుని గొనివచ్చి తండ్రికావృత్తాంతమును జెప్పెనఁట! తండ్రి వానిం గొనిపోయి వరుణునకు సమర్పింపఁగా నతఁడు 'బలికి క్షత్త్రియునికంటెను బ్రాహ్మణుఁడే తగినవాఁ' డని

---

* "తస్యహ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః పంచాశత్ ఏవజ్యాయాంసో మధుచ్ఛందసః, పంచాశత్ కనీయాంసః తద్యే జ్యాయాంసోన తే కుశలమ్ మేనిరే. తాన్ అను వ్యాజహారాన్ తాన్ వః ప్రజాభక్షీ ష్టేతిత ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందామూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః.

పలికి హరిశ్చంద్రుని రాజసూయము చేయు మని యుత్తరు విచ్చెనట! హరిశ్చంద్రుఁడు వీని జంపి దేవతలను సోమపానముచే సంతృప్తులను గావింపఁ దలంచెను. ఈ మహాయజ్ఞమును నెఱవేర్చుటకు విశ్వామిత్రుఁడు హోతగను, వసిష్ఠుఁడు బ్రహ్మగను, జమదగ్ని అధ్వర్యుఁడుగను, అయాస్యుఁడు ఉద్గాతగను నేర్పడిరట! శునశ్శేపుని యజ్ఞయూపమునకుఁ గట్టి కత్తి చేతఁబుచ్చుకొని వానిఁ జంపువాఁడు లేకపోఁగా వందలకొలది గోవులను లంచముగాఁ గైకొని అజీగర్తుఁ డను ఋషి తన కుమారుని తానే చంపుటకు సిద్ధపడియెనట! అప్పుడు శునశ్శేపుఁడు తన్ను నిశ్చయముగ (జంపుదు రని యూహించి యేకమంత్రముతో ప్రజాపతికడకుఁ బోయెనట. అతఁ డగ్నికడకును, అగ్ని సవిత్రుని కడకును, సవిత్రుఁడు వరుణునికడకును, వరుణుఁడు అగ్నికడకును, అగ్ని విశ్వేదేవులకడకును, విశ్వేదేవులు ఇంద్రునికడకును, ఇంద్రుడు అశ్వినులకడకను, అశ్వినులు ఉషస్సుకడకును పంపఁగా శునశ్శేపుఁడు మూఁడుమంత్రములచే బ్రార్థింపఁగా వాని బంధనములు విడిపోవుటయె గాక హరిశ్చంద్రుని కడుపుబ్బు పోవుటయె గాక స్వస్థచిత్తుఁ డయ్యెనట! శునశ్శేపుఁడు మిగిలిన యజ్ఞభాగమునఁ బాల్గొనియెనట! యజ్ఞము ముగిసిన పిమ్మట అజీగర్తుఁడు విశ్వామిత్రునికడకు వచ్చి తనకుమారు నిమ్మని యడిగెను. విశ్వామిత్రుఁడు 'వల్లకాదు. దేవతలు నాకొసంగినారు గనుక నతఁడు దేవరాతుఁ డనఁబరఁగెను. అతఁడు విశ్వామిత్రునిపుత్రుఁడు గాని నీ పుత్రుఁడు కాఁడు పొమ్మ'నియెను. కాపిలేయులు, బభవ్రులు వీనిసంతతివా రని చెప్పెను. అంత అజీగర్తుఁడు తనకుమారునితో నిట్లు పలికెను. 'ఋషిమైన అజీగర్తుని పుత్రుఁడ వగుటచేత నంగీరసుఁడవుగ నున్నాఁడవు. ఓ ఋషీ! నీ పూర్వులమార్గమును దప్పకుము.' దీనికి దేవరాతుఁ డిట్లు ప్రత్యుత్తరము చెప్పెను. "నన్ను బలి యిచ్చుటకై నీవు కత్తిచేతఁ బట్టుకొనియుండఁగా వారు చూచినారు; ఇట్టిపని చేయువారు శూద్రులలోఁ గూడఁ గానరారు. నాయొక్క విలువ మూడువందల గోవులుగా గ్రహించినావు. సంస్కరింపరాని దురాగతము నొనరించినావు." అంతట విశ్వామిత్రుఁడు నిన్ను బలి యిచ్చుటకు సిద్ధపడినవానికి పుత్రుఁడవుగా నుండకుము. నాకు పుత్రుఁడవుగా నుండువుగాని రమ్ము, అని పలికెను. 'అంగీరసుఁడ నైన నేను నీ కెట్లు పుత్రుఁడుగా నుందు. నీ పుత్రులు నన్ను గైకొనుట కంగీకరింతురా?' యని ప్రశ్నించెను. అప్పుడు విశ్వామిత్రుఁడు తన నూర్వురుపుత్రుల నడిగెను. మధుచ్ఛందసుఁడు మొదలగువారేఁబదిమంది కడపటి వారు మాత్రము వానిని విశ్వామిత్రునిపెద్దకొడుకునుగా నంగీకరించుటకు సమ్మతించిరి. వారి జ్యేష్ఠులేఁబదిమందియు సమ్మతింపరైరి. అందుకు విశ్వామిత్రుఁడు కోపించి వారిని దేశము సరిహద్దులలోను డునటులు శపించెను. వారే ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతిబాలు మొదలగు నామములతో నొప్పుచున్నారు. దస్యులలో ననేకులు విశ్వామిత్రునుండియె యుద్భవించినారు."

ఇది యొక చిత్రమైన యితిహాసము. ఇట్లు శబరపుళిందాదులతోఁ జేర్చుటవలన నాంధ్రులనార్యులనియు, ననాగరికులనియు పాశ్చాత్యులు పెక్కండ్రు తలంచుచున్నారు. అనార్యులనిగాని అనాగరికులని గాని పై బ్రాహ్మణవాక్యములలో నేమియుఁ గానరాదు. అయ్యవి పాశ్చాత్యుల యూహలు. ఆంధ్రులు దస్యులలోఁ బరిగణింపఁబడిన మాట వాస్తవము. దస్యు లనాగరికులని వేదములు ఘోషించు

చున్నవని పాశ్చాత్యపండితులు వ్రాసెడి వాక్యములు సప్రమాణములుగఁ గైకొనరాదు. పూజావిధానమున సంభవించిన భేదములచేతనే ఆర్యానార్య శబ్దములు పుట్టినవిగాని జాతిభేదముచేఁగాని, అనాగరికభేదముచేఁగాని పుట్టినవిగావు. ఆర్యులెట్టినాగరికులుగ నుండిరో దస్యులుగూడ నట్టినాగరికులుగానే యుండిరి. ఇంద్రాగ్నులను దస్యులు పూజింపరు. అవ్రతులు, అపవ్రతులు, అన్యవ్రతులు, అనగ్నిత్రులు, అయజ్యులు, అయజ్వానులు, అబ్రహ్మలు, బ్రహ్మద్విషులు, అనింద్రులు, అని దస్యులు ఋగ్వేదములో పలుచోట్ల వర్ణింపబడిరి. ఇంద్రాగ్నులను బూజించువారుగను, యజ్ఞకర్మలను జేయువారుగను ఆర్యులు వర్ణింపఁబడిరి. దస్యులు కర్మనాశకులని వ్యక్తముగఁ బేర్కొనఁబడిరి. కర్మయుక్తులార్యులనియు, కర్మహీనులు దస్యులనియు స్పష్టముగ బోధపడఁగలదు. అనఁగా వారికిని వీరికిని పూజావిధానములు భిన్నములని తెలుపునేగాని యార్యజాతులవారికంటె దస్యులు భిన్నజాతులవారని తెలుపు శబ్దప్రయోగములు గానరావు. దస్యుల విషయములో ఋగ్వేదమున నొకచోట (ఋగ్వే. మం. ౫-౨౯-౧౦) అనాసశబ్దమును బ్రయోగించుటచేత దస్యులు చప్పిడిముక్కులు గలవారని యర్థములు గావించి పాశ్చాత్యపండితులార్యులు వేఱనియు, దస్యులు వేఱనియు, వింత సిద్ధాంతములను జేల్చి ప్రపంచమునంతను గగ్గోలు పెట్టుచున్నారు. ఆ శబ్దమునకు నోరులేనివారనఁగా మంచిసంభాషణము లేనివారని సాయనాచార్యులవారు భాష్యములో వ్రాసియుండఁగా మోక్షమూలరు (Max Muller) పండితుఁడు ముక్కులేనివారని యర్థము చేసియున్నారు. వీనిపైని వింతసిద్ధాంతములు బయలుదేఱినవి. ఋగ్వేదమును జక్కఁగా మనము పరిశీలించితిమేని దస్యులార్యులకన్నను నాగరికులని బోధపడక మానదు. దస్యులు నగరములలో నివసించుచుండిరి. (ఋ. మం. ౧-౫౩-౮) (ఋ. మం. ౧-౧౦౩-౩). వారికి గోవులు, అశ్వములు, రథములుగలవు. (ఋ. మం. ౮-౪౦-౬). (ఋ. మం. ౨-౧౫-౪). వారు వానిని నూఱు ద్వారములు గల నగరములలో నుంచిరి. (ఋ. మం. ౧౦-౯౯-౩). దస్యులు భాగ్యవంతులుగ నుండిరి. (ఋ. మం. ౧-౩౩-౪). వారికి బయళ్లమీఁదను కొండలమీఁదను సొత్తు గలదు. (ఋ. మం. ౧౧-౬౯-౬). వారికిని బంగారమును, నగలును గలవు. (ఋ. మం. ౧-౩౩-౮). వారికనేకదుర్గములు గలవు. (ఋ. మం. ౧-౩౩-౧౩, - మం ౮-౧౭-౧౪). ఆర్యులవలెనే దస్యులును యుద్ధములలో రథము నుపయోగించుచుండిరి. (ఋ. మం. ౮-౨౪-౨౭, మం. ౩-౩౦-౫, ఋ. మం. ౨-౧౫-౪). వీనివలన దస్యులనాగరికులు కారనియు, ఆర్యులవలెనే నాగరికులనియు, పూజావిధానమున నార్యులకంటె భిన్నులనియును, జాత్యంతరులు కారనియు బోధపడఁగలదు. ఈ విషయమును గూర్చి సంపూర్ణముగాఁ జర్చించుటకు నిచట తావుచాలదు. ఋగ్వేదములో ౧,౫౩,౮౨౬ పదములు గలవని చెప్పుదురు. వానిలో 'ఆర్య'శబ్దము ౩౩ సార్లును, 'దస్యు'శబ్దము ౨౦ సార్లును, దాసశబ్దము ౫౦ సార్లును మాత్రమే ప్రయోగింపఁబడియుండె ననియు, ఇయ్యవి జాతిపదముగఁ బ్రయోగింపఁబడియుండలేదని వేదవిమర్శకులు వక్కాణించుచున్నారు. కనుక నైతరేయబ్రాహ్మణములో 'ఆంధ్రుల'ను దస్యులలోనివారిగఁ జెప్పుటచేత వారి ననాగరికులుగఁ బరిగణింపరాదని స్పష్టము కాఁగలదు. అనాగరికులైన పుండ్ర శబర పుళిందాదులతోఁ జేర్చుటవలన నాంధ్రు లనాగరికు లని

చెప్పవత్తురు. ప్రతిజాతిలోను నాగరికులు ననాగరికులు కూడ నుండిరి. వీరిలో నాగరికులు లేరని యే ప్రమాణములతోఁ జెప్పఁగలరు? పుండ్ర, శబర, పుళిందాదులలోఁ గూడ నాగరకులుగలరని యనేక ప్రమాణములను జూపవచ్చును. ఆ విషయమును ప్రత్యేకముగఁ జర్చింపవలయునే కాని నేఁ డీ చిన్న వ్యాసమునఁ దెలుప సాహసింపరాదని మఱియొక మాఱునకు దానిని నిలుపుచున్నాను. ఐతిరేయ బ్రాహ్మణకాలమును నిర్ణయించుటలోఁ జరిత్రపరిశోధకులు భిన్నాభిప్రాయులై యున్నారు. అందు పేర్కొనఁబడిన జ్యోతిశ్శాస్త్రసంబంధము లయిన వానిని బురస్కరించుకొని ప్రొఫెస్సరు కోల్‌బ్రూకనువా రిప్పటికి ౩౩౦౦ సంవత్సరముల క్రిందట రచింపఁబడి యుండవచ్చు నని తెలుపుచున్నారు. ప్రొఫెస్సరు మ్యాక్సుముల్లరు పండితుఁడు ౨౧౦౦-౨౮౦౦ సం॥ల నడుమ రచింపఁబడి యుండవచ్చు నని తలంచుచున్నాఁడు. ప్రొఫెస్సరు విల్సను పండితుఁడు క్రీస్తునకు పూర్వము ౧౦-౧౧ శతాబ్దులనఁగా నిప్పటికి ౩౦౦౦ సం॥ల క్రిందట నైతరేయ బ్రాహ్మణము రచింపఁబడియుండవచ్చు నని తెలుపుచున్నాఁడు. మఱియును సుప్రసిద్ధుఁడైన రామకృష్ణ గోపాల భాండార్కరు గారు విల్సను పేర్కొనిన కాలముకంటెను బూర్వమునకుఁ బోవలయు నని వక్కాణించి యున్నారు. ఐతరేయ బ్రాహ్మణమును భాషాంతరీకరించిన డాక్టరు 'హాగ్' అను వారు ౪౧౦౦ సం॥లకుఁ బూర్వమె యైతరేయ బ్రాహ్మణము పుట్టియుండు నని చెప్పియున్నారు. వీరి సిద్ధాంతము లెట్టి వయినను బహుప్రాచీన మైన గ్రంథ మనుటకు సంశయింప బనిలేదు. అయినను నిట్టి పురాతన బ్రాహ్మణములలో సహితము నూతన విషయములు చొప్పింపఁబడి యుండక మానలేదు. ఆ విషయ మటుండ నిండు: ఇంతటి ప్రాచీన మైన బ్రాహ్మణములో 'ఆంధ్రు'ల నామములు వినంబడుచున్నవి. దస్యులు నాగరికు లని బుగ్వేదమువలన రుజువు చేసితిమి గావున నాంధ్రులు దస్యులలోని వారని చెప్పుటచేత నాంధ్రులు గూడ నాగరికులే యని తేటపడుచున్నది. ఇప్పటికి మూఁడు వేల సవత్సరములకుఁ బూర్వమే నాగరికు లయిన యాంధ్రజాతులవా రున్నట్లు మన కీ బ్రాహ్మణము వలనఁ దేటపడుచున్నది. మఱియు నింకొక విశేషము గలదు. భారతులలోనివాఁ డని వక్కాణింపఁబడిన విశ్వామిత్రుని సంతతివా రని వీరు తెలుపఁబడుట చేత వీరలు భారతీయశాఖలోనివా రని సారాంశము తేలుచున్నది. భారతవర్షభుఁ డైన విశ్వామిత్రుఁడు సామాన్యుఁడు గాఁడు. ఆర్యకర్మలలోనికి దింపి భారతజాతిని సముద్ధరించినవాఁడు విశ్వామిత్రుఁడు. సుప్రసిద్ధ మైన గాయత్రీమంత్రముచే నొప్పెడి బుగ్వేదములోని మూఁడవమండలమునకు నధికారి యైన బుషి విశ్వామిత్రుఁడే. ఇతఁడు మొదట నార్యులకు రాజుగ నుండిన సుదాసునకుఁ బురోహితుఁడుగ నుండి తృప్తికరముగఁ గార్యములు నిర్వహించుచున్నను, వసిష్ఠునితో స్పర్ధ యేర్పడి త్రిత్సులను నార్యశాఖవారిని విడిచి భారతులనుజేరి సుదాసునితోడను, వసిష్ఠునితోడను, త్రిత్సులతోడను బోరాడెను. త్రిత్సులలోనివాఁడు వసిష్ఠుఁడు. భారతులలోనివాఁడు విశ్వామిత్రుఁడు. వీరికి జరిగిన యుద్ధములు బుగ్వేదములోను, బ్రాహ్మణములలోను, పురాణేతిహాసములలోను, వర్ణింపఁబడినవి. విశ్వామిత్రుఁడు గొప్ప సంస్కర్తగఁ గనుపట్టును. ఇతనికి మొదట నపజయము సంభవించెనుగాని తరువాత విజయము లభించె నని గ్రంథములు చాటుచున్నవి. చదువరులార! ఇం

దొక ముఖ్యవిషయమును జ్ఞప్తియం దుంచుకొనుఁడు! ఆంధ్రులవలెనే విశ్వామిత్రసంతతిగాఁ జెప్పబడి యజ్ఞసంస్కారముచే పూతుఁడైన దేవరాతుని జ్యేష్ఠునిగ నంగీకరించిన మధుచ్ఛందులను, ఋషభులను, రేణులను, అష్టకులను మఱవకుఁడు! అనఁగా నాంధ్రాదిజాతులవారి సోదరజాతు లని చెప్పఁదగిన యీజాతులు విశ్వామిత్రునిసంస్కారముల నంగీకరించి పరశురామాదిబ్రాహ్మణులకు జన్మస్థానము లయినవి. వీనింగుఱించి యొక పెద్దగాథ కలదు. ఆ గాథ వలన చండాలత్త్వము బాగుగా బోధపడఁగలదు. దానిం బ్రస్తుత కిది యదను గాదు. ఈ బ్రాహ్మణములో విశ్వామిత్రుని భారతర్షభా యని సంబోధించుట చూడ విశ్వామిత్రుఁడు ఋషభశాఖలోని వాఁడు గావలయును. విశ్వామిత్రునికి మేనక యను నప్సరసయందు శకుంతల జనించి దుష్యంతునికి భార్యయై భరతునిఁ గన నతఁడు రాజ్యభారమును వహించి పరిపాలించుటచేత నీయార్యావర్తదేశమునకు భరతఖండ మని పేరు గలిగినది. వీని సంతతివార మని చెప్పుకొను భారులు లేక రాజభారు లను తెగవా రిప్పటికి నుత్తరదేశమునందు గలరు. భారతులు చాలకాలము పరిపాలనము చేసి ప్రాగ్దేశము నాక్రమించియుండిరి. కనుక పాణిని గూడ "బహువచ ఇఞః ప్రాచ్యభారతేషు" అని ప్రాచ్యభారతులఁ బేర్కొనియున్నాఁడు. ప్రాచీనకాలములోనే వీరలు రెండు తెగలుగా విడిపోయినట్లు గనుపట్టగలదు. వారే కురుపాంచాలురు. ఋగ్వేదములో కురుపాంచాలురని కలిపిగాని ప్రత్యేకముగా కురుజనులనిగాని పాంచాలురనిగాని వాడియుండుట గానరాదు. కాని ఋగ్వేదమునం దొకచోట భారతులలోని రెండుపక్షములను సుదాసుఁడు జయించిన విషయమును శ్లాఘించుచు వసిష్ఠుఁడు రెండు వైకర్ణజాతులలోను ఇరువదియొక్క కుటుంబముల వారిని సుదాసుఁడు చెల్లాచెదరు గావించె నని చెప్పఁబడిన రెండు తెగలును కురు కృవ్రులు గాని కురుపాంచాలురు గాని యై యుండు రేమో విచారింపవలయును.* ఋగ్వేదములోని రెండు ఋక్కులలో 'కృవు' లనువారు అసిక్నీ సింధు నదులకు నడుమ పైభాగమున నివసించుచుండిరని తెలుపఁబడియుండెను. (కృవయ ఇతిహవై పురా పాంచాలనాచక్షతే.) పాంచాలురకు కృవు లను నామము పరిహాసముగ వాడఁబడినట్లు గనుపట్టుచున్నది. పుస్తకము గిస్తకము, గుఱ్ఱము గిఱ్ఱము, శాస్త్రము గీస్త్రము, అన్నట్లు కురుశబ్దము కృవిశబ్దముతోఁ జేర్పఁబడినట్లు దోఁచఁగలదు. దానిని పాంచాలురకు వర్తింపఁజేయుట చూడఁ బాంచాలు రొకప్పుడు పరిహాసపాత్రులుగఁ జూడఁబడినట్లు గనుపట్టఁగలదు. కురుపాంచాలాదులు కొంతకాలము కలసిమెలసియుండి గంగాతీరమునఁ గాలము గడపియుండిరి గాని కొంతకాలమునకుఁ బ్రబలమైన మనఃస్పర్ధలు పెరిగి తుదకు మహాయుద్ధములు జరిగియు నేఁటికాలమువఱకు నా స్పర్ధలు నిలిచియుండి యింకను భరతఖండమును పీడించుచుండుట మనయొక్క దురదృష్టము గాని మఱియొండు గాదు.

ఈ కురుపాంచాలురు ఒక్కకూటమివారే యని తెలుపుటకు పురాణాదులలో వర్ణింపఁబడిన వీరి వంశములే సాక్ష్యమీయఁగలవు. మొదట భరతసంతతివారు రాజ్యము చేయుచుండిరి. వారిలో సంవరణుఁ డను రాజుతో భరతసంతతి తుదముట్టినట్లు గనుపట్టగలదు. భరతునివంశములోఁ బుట్టిన అజామీఢుని వంశములో ముద్గలుఁడు, సృంజయుఁడు,

* "ఏకంచయో వింశతించ శ్రవస్యా వైకర్ణయోర్జనాన్ రాజాన్యస్తః." ఋ. మం. ౭. ౧౮. ౧౧.

బృహదిషుఁడు, ప్రవీరుఁడు, కాంపిల్యుఁడు ననునైదుగురు పుత్త్రులును పాంచాలు రయిరని పురాణములు చాటుచున్నవిగాని వివరము దెలుపుటలోఁ బరస్పర విరుద్ధములుగా నున్నవి. సంవరణుని కాలమున దుర్ముఖుఁ డను పాంచాలరాజు వానిని యుద్ధములో నోడించి తఱుమఁగా నతఁడు సింధుతీరమునకుఁ బాఱిపోయి కొంతకాల మక్కడనున్నట్టు ఐతరేయబ్రాహ్మణమువలనఁ గన్పట్టఁగలదు. తరువాత సంవరణుఁడు వసిష్ఠుని పురోహితునిగాఁ జేసికొని మరల పాంచాలురను జయించి తన రాజ్యమును సంపాదించి సూర్యపుత్రిక యగు తపతిని వివాహము చేసికొని ప్రజారంజకముగఁ బరిపాలనము చేసెను. వీనితరువాతనే వీని పుత్త్రుఁడు 'కురు' అనువాఁడు రాజ్యభారమును వహించి పరిపాలనము చేయుట చేతనే యా దేశమునకు 'కురుజాంగల' దేశ మని ప్రఖ్యాతి గలుగుటయు, 'కురుక్షేత్రము' వీనితపస్సు చేత పావనమగుటయు సంభవించినది. పాంచాలురను గూర్చిన చరిత్రము మహాభారతములో చెప్పిన దానికిని హరివంశము విష్ణుపురాణాదులలోఁ జెప్పిన దానికిని పెక్కుభేదములతోఁ గాన్పించుచున్నది. పాంచాలురవలననే పంజాబునకు పాంచాల మని పేరు వచ్చినది. దేశమును సంరక్షించుటకుఁ దన నైదుగురుపుత్త్రులు చాలుదురు గనుక పాంచాలు రని పేరువచ్చినట్లు హర్యాశ్వుఁడు పలికినట్లు హరివంశము నందుఁ జెప్పఁబడినది.* పంచనదులమధ్య నైదు విషయములుగలది గనుక పంచనదమైనదని భాగవత పురాణము.(పాంచాలాః పంచవిషయా యన్మధ్యే నవకంపురం-భా. పు. ౯. ౪.౨౯.౭.) జరాసంధుని కాలమున పాంచాలురు దక్షిణమునకుఁ దఱుమఁబడి రని భారతము తెలుపుచున్నది. ఏకారణమైన నేమి యుత్తరపాంచాలు రని దక్షిణపాంచాలు రని రెండు తెగలవా రయిరి. పాణినికాలమునఁ బ్రాక్పాంచాలురు, పశ్చిమపాంచాలు రను తెగ లున్నట్లుగఁ బాణిని పేర్కొనియున్నాఁడు. ఈ పాంచాలురను విదేశీయచరిత్రకారు లయిన టాలమీ, అర్రియాన్, ప్లీనీ మొదలగువారు పేర్కొని యున్నారు. మొత్తముమీఁద పాంచాలుర భూములను కురుసంతతివా రాక్రమించుకొనిరి. ఇవన్నియుఁ బురాణాదులలోఁ జెప్పఁబడిన సూక్ష్మవిషయములు. వీనిని విమర్శించి వ్యాఖ్యానముచేయ మొదలుపెట్టినఁ గావలసినంతచరిత్రము బయలుదేఱును. పంచపాండవులును పాంచాలురకు సంబంధించినవా రని మహాభారతమును బట్టి మన మెఱుఁగుదుము. కురువంశములో ధృతరాష్ట్ర పాండురాజులు జనింపక పూర్వము నడచిన కురు పాంచాలుర యుద్ధములు ప్రథమభారతమునకు సంబంధించిన వని సులభముగా గ్రహింపవచ్చును. కురువంశమున ధృతరాష్ట్ర పాండురాజుల జన్మముతో 'ఆంధ్రులచరిత్ర' ప్రారంభ మగుచున్నది. ఆంధ్రులు కురు పాంచాల శాఖలకు సంబంధించినవారేగాని యన్యులు కారు. అంధరాజపుత్త్రు లయిన కౌరవులును, పాండవులును ఆంధ్రులు. మా చదువరుల కిది యొక వింతగాఁ గన్పట్టవచ్చును. ఇది వింతకాదు. సత్యమని త్రికరణశుద్ధిగా విశ్వసించుచున్నాఁడను. ప్రబలప్రమాణములు గలవు. అయినను నేఁ డొక సూక్ష్మవిషయమును మాత్రము వక్కాణించి విడిచెదను.

* "ముద్గలా శ్చ సృంజయా శ్చైవ రాజా బృహదిషు స్స్మృతః । యవీనర శ్చ విక్రాంతః కృమిలాశ్వ శ్చ పంచమః
పంచైతే రక్షణాయాలం దేశానాం ఇతి విశ్రుతాః । పంచానాం విద్ధి పాంచాలాన్ స్ఫీతై ర్జనపదై ర్వృతాన్."
(హరివంశము—అ. 3౨. ౬౫. ౬౬)

ఆంధ్రసోదరులారా! వినండి. ఈ వినండి యను దానిలోఁ గనంబడెడి 'అండి' అనుపద మేమిటి? ఇ దేభాషలోనిది? ఆంధ్రదేశములో నాబాలవృద్ధులు, స్త్రీపురుషాదులు సర్వులు వాక్యాంతముల గౌరవసూచకపదముగా ప్రయోగించుచు వ్యవహరించుచున్నారు. 'అవునండీ, కాదండీ, నేను వెళ్లలేనండీ, నేను వెళ్లుతానండీ' ఈ విధముగా సంభాషణములలో 'అండి, అను గౌరవవాచకపదమును జేర్చి సంభాషించుట సర్వజనవిదితముగదా! ఈయది ప్రాచీనాంధ్రభాషాపద మైన 'ఆండి' యొక్క రూపాంతరము. ఆండి యనఁగా ప్రభువని యర్థము. ఆండవాన్ అనునది మఱియొక రూపాంతరము. ఆండవాన్ యొక్క బహువచనము 'ఆండవార్' అనునది. వీనికి 'ఆండాన్, ఆండార్' అనునవి రూపాంతరములు. ప్రాచీనాంధ్రభాషలో నుండి పుట్టినవి గనుక తమిళభాషలో నీ పదములు గ్రంథస్థములై నిఘంటువులలోఁ జేర్పఁబడి వ్యవహారమునం దున్నవి. ఇప్పుడు మనము 'ప్రభువనకు' రాజు శబ్దము వాడుకొనుచున్నట్లు ప్రాచీనకాలమున 'అంధజాతులవారు 'ఆండి'శబ్దమును వాడుచుండిరి. ప్రాచీనకాలమునుండి పర్వతములలో నివసించుచున్న కురవజాతులవారు సయితము తమ తెగల దొరతనమును వహించిన తెగలను 'ఆండకురవ' లని వ్యవహరించుచుండఁగా మనము వినుచున్నాము. ప్రాచీనకాలమున నార్యావర్తదేశమున నార్యుల పూజాకర్మవిధానముల నంగీకరింపక వారితోఁ బోరాడి సరిహద్దుల దేశములకుఁ దొలఁగిపోయి వెఱమతముల నవలంబించిన తమ తెగలవారిని పై యార్యకర్మవిధానములకు లోఁబడిన కురు పాంచాలాదులు 'అంధు'లని వ్యవహరింపుచుండిరి. వీరినే యిటీవలి పురాణకారులు ద్రావిడు లని వ్యవహరించిరి. ఇంతియెకాని మహాభారతములో వక్కాణించినట్లు వసిష్ఠుని హోమధేనువుయొక్క శక్రన్మూత్రములలో ద్రమిళులు పుట్టినారని తలంచుట సంబద్ధము గాదు. దానికి గూఢమైన చరిత్రార్థముగలదు. అంధజాతులవారికి నెల్ల తలమానికమై నిలిచి యార్యకర్మలవలంబించిన భారతులకు (కురు పాంచాలురకు) నెదురొడ్డి బహుకాలము పోరాడి ప్రముఖులై ముందు నిలువంబడుటచేత నాంధ్రులను గూడ నంధులుగనే వ్యవహరించిరిగాని యీ పోరాటములలో నంధజాతులలో ధృతరాష్ట్రులయినవా రాంధ్రులు అనఁగా రాజ్యమును బొందినవారు. వీరి చరిత్రము రెండవ భారతమునకు సంబంధించినది. ధృతరాష్ట్రుఁడను సంస్కృతశబ్దమునకు 'ఆండకురవ' అను నాంధ్రభాషాశబ్దము సమానార్థమును బోధింపఁగలదు. ఆండాన్ శబ్దము "ఆంధ్రా"శబ్దముగా సంస్కృతీకరింపఁబడినది. పల్లవాన్ + ఆండి పల్లవాండియై పల్లాండియై పాండియైనది. ఆండయ అన్న; పాండయ తమ్ముఁడు. వీరి భ్రాతృత్వమును గూర్చి మఱియొకమాఱు ముచ్చటించెదను.

ఆండయ పాండయ సంతతులే యాంధ్రు లనంబడుచున్నారు. ఎవ్వరినిగూర్చి మీరు నిరంతరము మహాభారతములోఁ జదువుచుందురో అట్టి కౌరవ పాండవులే యాంధ్రు లని తెలిసికొనుఁడు. దేనికైనను సంశయింపవచ్చును. దీనికి సంశయింపం బని లేదు. కాఁబట్టి సోదరులారా! ఆంధ్రు లనుమీరు మన్వాదిశాస్త్రవేత్తలు తలంచినట్లు చండాలురుగఁ దలంతురా? మీరు పాంచాలురను, కౌరవపాండవులను, గౌడద్రావిడులను గూడ చండాలురుగనే పరిగణింపవలసివచ్చును. మీరు కురుపాంచాలాదులను, కౌరవ పాండవులను, గౌడద్రావిడులను ఆర్యులనుగఁ దలంతురా యాంధ్రులు నార్యులే యని

మన్వాదులను విశ్వసింపక వారి వాదముల త్రోసి పుచ్చవలసి యుండును. నామట్టునకు నార్యునకు చండాలునకు గుణకర్మములం దక్క భేదము జాతిలోఁ గన్పట్టదు. తా మార్యులమని విఱ్ఱవీఁగుచున్న యింగ్లీషువారు, జర్మనులు, ఫ్రెంచివారు మొదలగువారు మనకంటె జాతిలో భిన్నులు గారు. ఆ చిత్ర చరిత్రము మఱియొకమాఱు వినిపింతును. ఆర్యులనువారికంటె ద్రావిడు లనువారి నాగరికత ప్రాచీనమైనది. ఆర్యులయొక్కయు, ద్రావిడులయొక్కయు, అనార్యులయొక్కయు నాగరికతాసమ్మేళనమే యిప్పటి హిందూనాగరికత. ప్రాచీనవైదిక బ్రాహ్మణుని నాగరికతకంటె నిప్పటి హిందూ బ్రాహ్మణుని నాగరికత గొప్పది యనుటకు సంశయము లేదు. భరతఖండములో బ్రాహ్మణుడెంతవఱకు గోవధలను జేయుచు గోమాంసమును మెక్కుచుండెనో అంతవఱకు అస్పృశ్యతాదోషము చండాలురకుఁ బట్టలేదు. ఎప్పుడు బ్రాహ్మణుఁడు గోవులను చంపుట మాని గోమాంసమును బరిత్యజించి గోవులను బూజించుటకుఁ బ్రారంభించెనో అప్పటినుండియుఁ జండాలజాతు లంటరాని వైనవి. మన మాంధ్రుల మనుట కెంతమాత్రమును సందియము లేదు. ఆర్యులు మనకంటె భిన్నులు కారు.

---

* ఒక మహాగ్రంథములోఁ జెప్పవలసిన విషయములను సంగ్రహపఱచి బహు సూక్ష్మముగా నీ చిన్న వ్యాసములో సూచింపవలసివచ్చినది. సంస్కృతమహాభారతములోని ప్రతిపదమును బట్టుకొని విమర్శ చేసినచో నెంతయో చరిత్రము బయలుదేఱక మానదు. ఆ పనియే నే నిప్పుడు చేయుచున్నాను. మన చరిత్రమంతయు మహాభారతమునం దిమిడియున్నది. ఇది రెండువేల పుటలకు మించినగ్రంథ మగుచున్నది. ఈ గ్రంథమును నేను బ్రకటింపఁగలిగినయెడల నాదేశమునకును నా ప్రజలకును నేను దీర్పవలసిన ఋణమును దీర్చుకొన్నవాఁడ నగుదును.

## క న్నీ రు

దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు, బి. ఏ. (సాహితీసమితి సభ్యుఁడు.)

కలుషదుర్దాంతపంకసంకలితకుహర
ముల జనించు మదీయాశ్రుమలినధార
స్వామి, భవదీయపాదదేశమునఁ బాఱి
పరమపావనజాహ్నవీప్రతిభఁ గాంచు.

గాటమగు లజ్జవలన దుఃఖమ్మువలన
నాకనుల జాఱు నుష్ణాశ్రుశీకరములు
హృదయముఁ గలంచి, విదలించి, యేర్చి, వెడలు
సాంద్రశోణితబిందువర్షమ్ము సుమ్ము!

తావకీనపదసరోజదళములందు
నిలువని మ్మొక్క వేఁడి కన్నీటి చుక్క!
కడలఁ బ్రసరించు నెత్తావికమ్మఁదనముఁ
ద్రావని మ్మో ప్రభూ, దానిఁ దనివి తీర!

# భారతనీతి

వింజమూరి రంగాచార్యులు గారు, ఎం. ఏ. బి. యల్.

"భారతీయులంట! రాజనీతియంట! ముక్కుమూసికొని తపస్సుచేసికొనుట తప్ప వేఱేమియుఁ దెలియని భారతీయు లెక్కడ? కేవల పాశ్చాత్య నాగరిక జన్య మైన రాజ్యనీతిశాస్త్ర మెక్కడ?" అని ఆశ్చర్యముతోఁ దలపోయు పాశ్చాత్యీకృత భారతీయు లనేకులు గలరు. కాని మిక్కిలి ప్రాచీనకాలమునందే అనగా అరిస్టాటిలు (Aristotle) పాశ్చాత్య రాజనీతిశాస్త్రమునకుఁ బునాదులైనను వేయక పూర్వమే భారతీయు లీశాస్త్రమును సంపూర్ణముగా నధిగమించి యనేక గ్రంథములను రచించియుండిరనియు, అన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతు లను నాలుగువిద్యలలోను, మొదటి మూఁడు నయితము దండనీతిపై నాధారపడియుండుటచే, సర్వవిద్యలకును దండనీతియే మూలముగా పరిగణింపఁబడుచుండె ననియు, తెలిసికొనినప్పుడు వారి యాశ్చర్యము ద్విగుణీకృతము కాకమానదు. కాని యిది యసత్య మెంతమాత్రమును లేదు. మహాభారతమునందలి శాంతిపర్వమును దిలకించితిమేని అందు శుక్రుఁడు, భరద్వాజుఁడు, బృహస్పతి మున్నగు రాజధర్మానుశాసకుల సిద్ధాంతములు క్రోడీకరింపఁబడి చర్చింపఁబడియుండుటను మనము కనుఁగొనఁగలము. భారతమునందలి రాజనీతివిషయములను గూర్చి పాఠకలోకమున కించుక విన్నవించెదను. సంస్కృతమహాభారతమునందలి ముఖ్యవిషయము లన్నియుఁ దెనుఁగు భారతములో నైతము కన్పట్టుచుండుటచేత తిక్కన్నగారి తెనుఁగు భారతమునుండియే ప్రమాణములు చూపెదను.

దండనీతి జన్మప్రకారము భా-శాం-ద్వి ౧౯౯-౨౦౫ వఱకుఁ గల పద్యములయందు వివరింపఁబడియున్నది. వసుహోముఁడు మాంధాతృనకుఁ జెప్పిన దండోత్పత్తిప్రకారము భా-శాం-తృ ౧౧౫-౧౨౦ వఱకుఁ గల పద్యములలో వివరింపఁబడినది. కాని యది యంతముఖ్యము కాకుండుటచే దానిని విడిచెదము. పూర్వకాలమున కృతయుగమునందు దండనీతిమంతుఁడైన రాజని యొకఁడు లేఁడు. ప్రజలు ధర్మబద్ధులై యొండొరుల రక్షించుకొనుచుండిరి. కాని కాలవశమున లోభము పెచ్చుపెరిఁగి, ధర్మము కుంఠితమై, కామరాగాదు లొదవి జనులు విమార్గచరితులై వేదవిధ్వంసకులై యకార్యకరణములకుఁ గడంగిరి. అప్పుడు కర్మములును వేదములును జెడుటకు భయపడి యింద్రాదులు బ్రహ్మదేవుని యొద్దకు వెళ్లి మొఱపెట్టుకొనిరి. బ్రహ్మదేవుఁడును దీనికిఁ బ్రతివిధానము చేసెదను వెఱవవలదని యభయమిచ్చి స్వామ్యమాత్య రాష్ట్ర దుర్గకోశసుహృద్బలంబు లను రాజ్యాంగ సప్తకమును, అరిమిత్రోదాసీనాదిక ద్వాదశరాజ మండలమును, సంధివిగ్రహయానాసన ద్వైధీభావ సమాశ్రయము లను షాడ్గుణ్యమును, మంత్రప్రభుత్వోత్సాహశక్తులును, మొదలుగాఁగల నానావయవములు కలిగి ధర్మార్థకామమోక్షములకు సాధక

మయియుండునట్లుగా నూఱువేలధ్యాయములు గల నీతిశాస్త్రమును రచించి యది లోకచరిత్ర నిర్మలీకరణమునకు సాధనము కాఁగలదని యనుగ్రహించెను. పిమ్మట బ్రహ్మదేవుని లలాటమునందు శ్రీవిరూపాక్షుఁడు విశాలాక్షుఁడను నామముతో నావిర్భవించి, ఆశాస్త్రము నంతయు నధిగమించి, అట్టి మహాగ్రంథమును జదువుటకు మర్త్యులకు నాయుర్బలములు చాలవని తలఁచి, దానినే సంక్షేపరూపమున వైశాలాక్ష మను పేరుతోఁ బదివేలధ్యాయముల గ్రంథమును నిర్మించెను. పిమ్మట ఇంద్రుఁడు అయిదువేలధ్యాయముల గ్రంథమును, దేవగురుఁడైన బృహస్పతి మూఁడువేలధ్యాయములుగను, శుక్రాచార్యులు వేయి యధ్యాయములుగను రచించిరి. మనుష్యుల శక్తిదౌర్బల్యమును గ్రహించి మును లనేకులు సంక్షేపరూపముగా ననేకగ్రంథములు రచించిరి. ప్రపంచమున నీతిశాస్త్రప్రవర్తనప్రకార మిదియని భారతములోఁ జెప్పఁబడియున్నది.

భారతమునందు వివరింపఁబడిన రాజనీతివిషయము లన్నియు నొక్క వ్యాసములో నిముడ్చుట యసాధ్యము. రాజ్యోత్పత్తిప్రకారమును గూర్చియు ప్రజాప్రభు సంబంధమును గూర్చియు మహాభారతమునందుఁ జెప్పఁబడిన యంశములను మాత్రమించుక చర్చించెదను. రాజ్యోత్పత్తిప్రకారము మహాభారతమునందు శాంతిపర్వద్వితీయాశ్వాసమున ౨౧౭-౨౫౬ వఱకుఁ గల పద్యములలోఁ జెప్పఁబడియున్నది. ఈ పద్యములలోఁ జెప్పఁబడిన భావములు ఫ్రాన్సు విప్లవమునకుఁ గారణభూతుఁడైన రాజ్యతత్త్వజ్ఞుఁడగు రూసో (Rousseau) యొక్క సాంఘికసమయసిద్ధాంతమును (Social Contract Theory) ఆంగ్లరాజ్యతత్త్వజ్ఞుఁడగు లాక్ (Locke) అను వాని పాలకపాలితసమయసిద్ధాంతమును బోలియున్నవని చెప్పినచోఁ జదువరులకు నాశ్చర్యకరముగా నుండవచ్చును. కాని యది యథార్థమే యనియు, భారతపద్యముల కపూర్వవ్యాఖ్య చేసి నాస్వీయాభిప్రాయముల నారోపించుచుండుట లేదనియు, పాఠకులకు స్పష్టముగా తెలిసియుండఁగలందులకు ఆ పద్యముల నిచ్చట నుదాహరించుచున్నాను.

"సీ. జను లొక్కతఱిఁ దొల్లి । సమయంబుఁ దమలోన
జేసి, క్రూరతయు నుచ్ఛ్రిమియు ఱంకు
సైఁపక, యట్టి దుర్జను నందఱును గూడి
శాసించువారు గాఁ । జాలి, తమకు
నధిపతియుఁగ నొరు । నాసపడకయుండి,
నషవడి బహుకారణములఁ జిక్కు
వడిన విషణ్ణులై । బ్రహ్మఁ గావఁగఁ బోయి
మాకు రక్షకుఁడుగా । మహిపుఁ డొకఁడు
గీ. వలయు రూపింపు మాతనిఁ । గొలిచి బ్రదుకు
వార మనుటయు నజుఁడును । వారివలని
కరుణ మనువు నిరూపించె । నరు లసత్య
చరితులని పాలనమునకుఁ । జొరఁడయతఁడు

వ. చొరకున్న సజ్జనంబు లమ్మహాత్మునితో నీకుం బుయిలోడనేల? ప్రజలచేతఁ బసువులయందుఁ బసిండిని నేఁబది యగు నంశంబును, ధాన్యంబున దశమభాగంబును, భండారంబుగాఁ బుచ్చికొని శస్త్రోపజీవుల నెల్ల నీవారి జేసికొని బలవంతుఁడవై దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనం బాచరింపుము. ఏ మందఱము ననుసరించి నీ పనుపు సేయం గలవార మధర్మవర్తనులు నీచేతం జెడు వారు ధర్మవర్తనులు సేసినధర్మంబున నాలవపాలు నిన్నుం జేరఁగలయదిగా నొడంబడితి మింద్రుఁడు దేవతల రక్షించుమాడ్కి మమ్ము రక్షించుకొని సుఖంబుండు మనుటయు.

కం. అతఁడొడఁబడి యత్తెఱఁగున
నతిబలవంతుఁడయి నీతి నంచితమగు ను
ద్ధత విక్రమమునఁ దగ నీ
క్షితిఁ బాలించె సుఖులైరి శేషజనముల్."

భారతము, శాంతిపర్వము.

దీనిని బట్టి మిక్కిలి ప్రాచీనమగు కాలమున రాజ్యములు కాని శాసనములు కాని లేవు. కాలక్రమమున మానవసంఘము విస్తరిల్లుటయు, మదలోభాదు లంకురించుటయు, పరస్పర సహకారము ననే కాని ప్రవర్తిల్లుట మనుజులకు నసంభవమగుటయుఁ దటస్థించి జనులు సంఘములుగా నేర్పడి క్రూరత్వము చోరత్వము జారత్వము మొదలగునవి దోషములనియు నట్టి చర్యలను సంఘమంతయు గర్హించి దండింపవలెననియు నొక సమయమును అనఁగా ఒడంబడికను గావించుకొనిరి. కాఁబట్టి సమస్తశాసనములును వ్యక్తి సంఘమును విడిచి ప్రత్యేకముగా నుండఁజాలని కారణముచేత ఇచ్ఛాపూర్వకముగా అంగీకరించిన సమయముపై నాధారపడి యున్నవి. ఏతత్సమయబద్ధుఁడు కానంతవఱకు వ్యక్తి సర్వస్వతంత్రుఁడు. కాఁబట్టి స్వాతంత్ర్యము మానవునకు స్వతస్సిద్ధమైన హక్కు. ఇదియే రూసో యను పరాసు రాజ్యతత్త్వజ్ఞుఁడు నూటయేఁబది సంవత్సరములక్రిందటఁ బ్రతిపాదించిన సాంఘిక సమయసిద్ధాంతము. కాని యీ విధముగా సంఘముండుటచేతఁ బ్రపంచవ్యవహార మనేక కారణములచేతఁ జక్కఁగా సాగకపోవుటవలన జనులు దుఃఖాక్రాంతులై బ్రహ్మదేవుని పాలికి వెళ్లి మాకు రక్షకుఁడుగా రాజు నొకనిఁ బ్రసాదింపుమని ప్రార్థింపఁగా బ్రహ్మదేవుఁడు మనువును నియమించెను. కాని మనువు నరు లసత్యచరితు లగుటచేత వారినిఁ బాలించుట కంగీకరింపలేదు. అప్పుడు జనులు తమధనములోను బశువులలోను నేఁబదియవవంతును ధాన్యములోఁ బదియవ వంతును రాజునకుఁ జెల్లించి యతని యాజ్ఞావర్తులై యుండునట్లును, దీనికిఁ బ్రత్యుపకృతిగా మనువు పాలనాధర్మమును స్వీకరించి ప్రజాసంరక్షణ గావించునట్లును ఒడంబడిక జరిగెను. తదనుగుణముగా మనువు నీతిశాస్త్రానుసారముగా భూమిని బాలింపఁగా నశేషజనములును సుఖపడిరి. కావునఁ బాలకపాలితసంబంధము కూడ సమయసంజాతమే. అన్యోన్యక్షేమకరమైన యీ సమయమును ప్రజాప్రభువు లెంతవఱకు మన్నించెదరో యంతవఱకు నుభయులకును సర్వశ్రేయములు చేకూరును.

కం. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్.

భారతమునందుఁ జెప్పఁబడ్డ దండోత్పత్తి రాజ్యోత్పత్తిక్రమములను బట్టి నాలుగు ముఖ్యసూత్రము లేర్పడుచున్నవి.

౧. రాజు దైవాంశసంభూతుఁడు.

౨. దైవాంశసంభూతుఁ డైనను రాజు నిరంకుశుఁడు కాఁడు. శాసనకర్తృత్వ మాతనికి లేదు. ప్రజలవలెనే యాతఁడును నీతిశాస్త్రముచే బద్ధుఁడు.

౩. రాజాధికారమునకు మూలము ప్రజాంగీకారము.

౪. ప్రజాప్రభుసంబంధము సమయసంజాతమగుటచేత రక్షాధర్మమును నీతిశాస్త్రానుసారముగా నిర్వహింపని రాజునెడలఁ బ్రజలకు అర్చనాధర్మము విధి కాదు. అనఁగా దుర్మార్గుఁడగు ప్రభువుపైఁ బ్రజ తిరుగఁబడవచ్చును; ఆతని పదభ్రష్టునిఁ గావింపవచ్చును.

ఈ నాలుగు ముఖ్యసూత్రముల నించుక విపులీకరించెదము. హిందూధర్మశాస్త్రానుసారముగా రాజు దైవాంశసంభూతుఁ డను విషయము సర్వజనవిదితము. "నా విష్ణుః పృథివీపతిః" అను వాక్య మాబాలగోపాల మంద తెలిసినదే. ఈ భావమే యాంధ్ర మహాభారతమున నిట్లు వివరింపఁబడినది.

"రా జని యొకండు గలిగిన తెఱంగును రాజ్యస్థాపనంబును రాజు మిగిలి వర్తింప దక్కిన జనంబులకు రాకుండుటయు విష్ణువిహితంబులు; విష్ణుండు రాజుల నిజతేజోంశంబులం బ్రవేశించియుండు; నట్లగుటం జేసి దైవనిభుండగుచు రా జెల్లవారిచేతను మ్రొక్కులం గొనంజాలుఁ; దద్రక్షణంబు నాచరించు నొక్కనివశంబున లోకం బంతయు వర్తిల్లుటకు దేవసంబంధకలితంబైన గుణంబు వెలిగా నొండు కారణంబు గలదే? యాకర్ణింపుము.

మ. హరిఫాలంబునఁ బుట్టి ధర్మమున కాలయ్యై
యర్థమన్ పుత్రకున్, సిరి గాంచెన్; దగ వారు
ముప్పురును సుస్థేమోన్నతిన్ సంశ్రయింతురు
భూపాలకు; నాతఁ డన్యజనతాంతులోద్భవుం
డెట్లు నిర్జరలోకార్హసమగ్రపుణ్యావితతి ప్రా
ప్తుండు గా కారయన్.

దివంబునుండి దండనీతి నయించుటకు వచ్చి వాసుదేవమహత్త్వభావితుం డైన మహానుభావుండు గావున వర్ణంబులు నాశ్రమంబులు సదాచారప్రవర్తనంబు లైన వేదపురాణేతిహాసంబులును రాజున కధీనంబులు; తదీయ మాహాత్మ్యంబున నతనియందు సౌందర్యశౌర్యచాతుర్యాదిగుణంబులు గలుగ జనంబులు దలంతురు; తదాజ్ఞకు లోనై వర్తింతురు; ఇది రాజులు దేవసము లైన తెఱంగు."

భా. శాం. ద్వి. ౨౧౬-౨౧౮.

రాజు లిట్టి మహత్త్వవిభావితులు కావుననే

క. విను నృప సమ్రాట్టు విరా
ట్టనియెడు శబ్దములఁ బొగడు! నాగమములు నె
ట్టన భూపాలకు ననిన న
తనిఁ దగ సర్చింపఁకుండఁ! దగునె యొరులకున్.

భా. శాం. ద్వి. ౨౭౨.

రాజు విష్ణ్వంశసంభూతుఁ డని చెప్పినంతోడనే భారతనీతిశాస్త్రము ప్రకారము రాజు నిరంకుశుఁ డనియు, అతనివాక్యమే వేద మనియు, అతఁ డెట్టి యక్రమములు గావించినను బ్రజలు సహించియే యుండవలె ననియుఁ జదువరులలోఁ గొందఱు ముఖ్యముగా యూరోపుచరిత్రవాసన గలవార లూహింపవచ్చును. దైవదత్తాధికారసిద్ధాంతము మఱుఁగునఁ బాశ్చాత్యదేశములలోని నిరంకుశప్రభువులును వారి సహకారు లయిన మతగురువులును గావించియుండిన ఘోరదుష్కృత్యములను గూర్చి చదివినవార లట్టియూహకు లోనగుట సహజమే కాని యది యెంతయుఁ బ్రమాదజనితము. ప్రాచీనభారతవర్షమున రాజు నిరంకుశుఁడు కాఁడు. ఇదివఱకుఁ జెప్పఁబడిన రాజ్యోత్పత్తి ప్రకారమును బట్టియే ప్రాచీనరాజధర్మానుశాసకుల మతమున రాజాధికారమునకు మూలము ప్రజాంగీకార మని స్పష్టపడుచున్నది. ఈభావమునే పాశ్చాత్యులు " The people's will is the ultimate source of sovereignty " అని తెలిపెదరు. ఇది కాక ప్రాచీనభారతరాజ్యాంగతంత్రమున రాజునకు శాసనకర్తృత్వము లేదు; శాసనపరిపాలనయే యతని విధ్యుక్తధర్మము. లోకచరిత్ర నిర్మలీకరణమునకై బ్రహ్మదేవుని చేత నేర్పఱుపఁబడిన నీతిశాస్త్రానుసారముగాఁ బ్రజాపాలనము చేయుటయే యతనివిధి. ప్రజలవలెనే ప్రభువుకూడ నీతిశాస్త్రముచే బద్ధుఁడు. కాని పాశ్చాత్యదేశ

ములలో నున్న పద్ధతిని బోలిన ప్రజాస్వామ్యము భారతకాలమునాఁటికి లేదని చెప్పవచ్చును. బ్రహ్మకల్పిత మైన నీతిశాస్త్రముచే నిర్బంధింపబడినంత వఱకుఁ దప్ప నెల్లవిషయముల వ్యక్తి సర్వస్వతంత్రుఁడు. బహుసంఖ్యాకుల యభిప్రాయము కూడ నతని సంపూర్ణస్వాతంత్ర్యము నపహరించుటకు సమర్థము కాదు. కావున నేఁటి పాశ్చాత్యప్రజాస్వామ్యమునందు కంటెను ప్రాచీననీతిశాస్త్రానుసారమగు రాజ్యమున వ్యక్తిస్వాతంత్ర్యమునకు సంపూర్ణ మైన రక్షణ ముండె ననుట యతిశయోక్తి కానేరదు.

ప్రజాప్రభుసంబంధము సమయసంజాత మని యిదివఱకే గమనించియుంటిమి. కాఁబట్టి యెప్పుడు రాజు తనకు విధ్యుక్తమైన రక్షాధర్మమును నీతిశాస్త్రానుసారముగా నిర్వహింపఁడో, అప్పుడే ప్రజలు తమవిధియైన యర్చనాధర్మమును నిర్వర్తింప నక్కఱలేదు. ప్రాచీన రాజధర్మానుశాసకుల మతమునఁ బ్రజ లత్యంతపవిత్రముగా నర్చింపవలసినది రాజపదవినిగాని రాజును గాదు. భారత శాంతిపర్వ ద్వితీయాశ్వాసమున ౨౧౫—౨౧౫ వఱకుఁ గల పద్యములలోఁ దెలుపఁబడిన వేనునియొక్కయు నతనికుమారుఁ డగు వైన్యునియొక్కయు నితిహాస మిందునకుఁ బ్రమాణము. పూర్వకాలమున వేనుఁడను రా జొకఁ డుండెను. అతఁడు మాతామహదోషంబునంజేసి రాగద్వేషములకు లోనయి ప్రజలను విరుద్ధం డయ్యెను. "అట్లగుటయు మహామునులు గూడి యేతెంచి మంత్రపూతంబు లగు కుశసంచయంబుల నతనిం బ్రశమితుం జేసిరి." అప్పు డామునులు వేనుని దక్షిణబాహువును మథింపఁగా ఉజ్జ్వలత్కవచశరశరాసనభాసమానుండును, వేదవేదాంగధనుర్వేదపారగుండును నగు పరమాకారవంతుఁ డుదయించెను. వైన్యాభిధానుఁడగు నతనిని రాజుగాఁ జేసికొనుటకుఁ బూర్వము మునులును తదితరప్రజయు నతనియొద్దఁ బ్రజాస్వాతంత్ర్యసంరక్షక మైన ప్రతిజ్ఞను, ఆంగ్లేయచారిత్రమున మేగ్నా కార్టాను బోలినదానిని గైకొనినట్లు కూడ భారతములోఁ జెప్పఁబడినది చూడుఁడు.

సీ. మానలోభములఁ గామక్రోధములఁ బాసి
సర్వజంతువులకు । సముఁడ వగుచు
నియతధర్మము నీవు । నిశ్శంక నడుపుము;
ప్రియము నప్రియము నుపేక్షఁ గూర్పు;
"దండనీత్యాశ్రయధర్మంబు నాపని
దీనిఁ జేయుదు సావధానవృత్తి
రక్షింతు శ్రుతుల, వర్ణముల సంకరములు
పొరనీ, నదండ్యులు । ధరణిదివిజు
లరయువాఁడ నే భూప్రజ" । నని ప్రతిజ్ఞ
యను మహోన్నతపద మెక్కు । మనుడు నాతఁ
డవనిసురులు సహాయత్వ । మాచరించి
రేని నట్లగుఁగా కని । యెం గుమార !

భా. శాం. ద్వి. ౨౧౦.

ఈ యితిహాసమును జదివినవాఁ డెవ్వఁడు ప్రాచీనరాజధర్మానుశాసకుల మతమున రాజు నిరంకుశుఁ డని వచింప సాహసింపఁగలఁడు ?

(సశేషము)

# తు పా ను గీ త ము లు

దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరి గారు

రాదు! రా దిఁక నెచ్చెలి! రాదు! రాదు!!
ప్రొద్దుగ్రుంకెను జీఁకట్లు పొరలిపోయె;
ఱేఁగి బ్రహ్మాండమెల్లను ఱెచ్చిపోవ
గంప మందించె నపుడు ప్రకంపనుండు;
మబ్బు లెల్లెడ వ్యాపించె; నుబ్బుమీఱ
వాన రాఁజొచ్చె; నవలఁ దుపాను వట్టె.

పొరలివచ్చెడు దుఃఖంబు పొంగిపోవ
నాఁగఁజాలక కన్నీటి నాఁపలేక
చక్రవాకం బదొక్క వృక్షంబులోని
గూటిలోపలఁ గూర్చుండి కుందఁజొచ్చె:

"అన్న మున్నను లేకున్న నాఁగఁగలను,
చత్తునే పోవలదు మది జడుపు గల్గె
నేఁడు; మున్నిట్టిభయము జనింప దెపుడు
నంచు నెన్నియోసార్లు ప్రార్థించి, 'సఖియ!
వినుము నామాట' యంటిని, వినకపోయె,
నెచటనో చిక్కె! తడవాయె! నింక రాదు
మరల నెచ్చెలి గన్గొను టరిది నాకు."

జోరుజోరున వాన రాఁజొచ్చె, నాక
సంబునకుఁ జిల్లులువడిన సరణిగాను;-
గాలి యుఝ్ఝాంత లూఁపఁగాఁ గదలెఁ జెట్లు;-
పుట్టలును గట్టులును పడిపోవుచుండె.

గడెలు - నిముసాలు - ఱెపపాట్లు - గణనసేసి
కంట నీర్వొట్టి యేదేనిఁ గదలెనేని
నెచ్చెలియ వచ్చె నని చూచి నివ్వెఱపడి
వెదకి వేసారియుం బిట్ట వెదకుచుండె.

"కరుణలేదె మీ రిటు వడగండ్లచేతఁ
గొట్టనేటికి నాపైనఁ గోపమొక్కొ?
నెచ్చెలివియోగమునను గణింపరాని
బాధపడుచుంటిఁ గాని నేఁ బల్లు నెత్తి
తిట్టలే దెప్పుడును మిమ్ముఁ దిట్టి యెఱుఁగ
గాలివానలు! నాపైని గరుణగొనుఁడు!"

"అయయొ! నెచ్చెలి! దయమాలినట్టిదాన
వైతి విటు నేను గష్టంబు నందుచుండఁ
గాంచ రా విది యేల? యీకరణి నన్ను
హింస గావింతువే? దటి నిట్టివేళ
నుండి కాదొకో నెచ్చెలు లూఱటను బొ
నర్త్రు? - కరుణతో దఱినుండి నన్ను నాద
రించు నీ మృదులకరము - ఈ యవస్థ
నెల్ల సౌఖ్యంబువోలెఁ గావింపఁగలుగు -
మృదులకరపల్లవంబు - నో సుదతి నాకుఁ
గఱవుచేసితే! నాకు నీకరణి గాఁగ"

"ఎంతయో యవసరమగు నిట్టివేళ
ప్రేమపూరిత యగు చెలి ప్రేమమయ్య -
ఆమె యంకతలమునందు ఆమె వ్రేళు
లల్లన శరీరమును దాఁకి వ్యథలనెల్ల
సౌఖ్యములు గాఁగ హాయిగాఁ జచ్చునట్టి
వ్రాత నాకు నెన్నుదుటను వ్రాయరాదె
దైవమా! ఇది నీకును - ధర్మమగునె?
-కరుణఁ జూపఁ దలఁతువేని - గలదు వ్యవధి,
ప్రాణముల్ నిల్వ, వైనను భయము లేదు,
ప్రేమపూరిత మైన నా ప్రేయసి కర

## శ్రీ రాధ



రాధాం కృష్ణ పదారవింద మధుపీం సర్వాంగి సుస్నార్ద్రికాం
నానాభూషణ భూషితాంగ రుచిరాం స్వర్ణరక్తవస్త్రాం శుభాం
ధ్యాయేసంతత కృష్ణభావలలితాం కేయూర హేమాంగదాం
కృష్ణానందకర ప్రియాం సుమధురాం సర్వాంగ శోభాన్వితాం

మొగలుచిత్రకళావైఖరి, ౧౭ వ శతాబ్ది పూర్వభాగము

పల్లవంబులమధ్య నా ప్రాణములను
సంతసంబున విడుతు, నీ స్వల్పవాంఛ
కరుణతో నిమ్ము, నాకు నే కొఱత లేదు,
కరుణతో నిమ్ము నాకు నే కొఱత లేదు."
ఉఱుము లుఱుమంగఁ జొచ్చె నెక్కుమ్మడిగను
ప్రాణికోట్లు తెల్లఁ గడుఁ గంపంబు నంద,
జీవకోట్లు సర్వము కడుఁ జీకువడఁగ,
నెల్ల దిశలుఁ బ్రతిధ్వను లిచ్చుచుండఁ,
బ్రళయ మప్పుడ వచ్చెడుపగిది దోఁచు
చుండె లోకంబు సర్వంబు. గుండె లడలి
పగుల విగతాసు లగుచును "బ్రళయకాల
మిపుడె వచ్చెను, నేటితో సృష్టి యెల్ల
నంత మగుఁ, బ్రాణులం దొక్కటైన నింక
నుండ" దంచును నెండొరు లొకట దైన్య
మునను భీతితోడను జెప్పుకొనిరి కూడి.
పిట్ట కన్నీరు విడుచుచు నట్టివేళ
గుండెఁజొచ్చెను నెమ్మది డిందువడఁగ
"ఇంక నెచ్చెలి యేడఁ? దానింటి కేడ
తిరిగివచ్చు నేడ?—ఇదియు జరుగఁగలదె?
ఎల్ల బ్రహ్మాండములు నశియించుచుండె!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!!"
"కడపటి కవుంగిలి నయినఁ గరుణతోడ
నొసఁగఁగా రాదె దైవంబ! యూర కిట్లు
నాదు ప్రార్థనంబును ద్రోయ న్యాయ మగునె?
యొక్కచూ పిచ్చి మఱియును నొక్కమాట
యిచ్చి పిదపఁ బ్రాణంబు హరింపుమయ్య!—
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!"
"ఆదరంబునఁ జేరిచినట్టి-యామె
యంకతలమునఁ బ్రాణముల్ తరలెనేని
ధన్యతముఁడను, నాకింకఁ దక్కు వొకటి
లేదు, కోరఁగాఁ దగినది లేదు లేదు—
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!"
ప్రళయకాలంబె తా నయి వచ్చువేళ—
చెలఁగి ప్రకృతిలోకమును నశింపఁ జేయు
వేళ—నెచ్చెలిదగు ముఖవీక్షణంబు
గలుగు నంచును నిట్టులు తలఁతు వేల?
పిచ్చియా నీ కిది! యెటులు లభించుఁ బక్షి!—
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!
"ఆశ! యెంతటివెఱ్ఱివో! యకట నీవు
చెలిని జూడ నిప్పటికిఁ గాంక్షింతు విట్లు
జగములన్నింటి కొకట నాశంబు గల్గు
చుండఁ బిచ్చిపిట్టకు నీకు నుండు కోర్కె.
తీరునే! యయ్యొ! యెచ్చటికోరిక! యిది!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!"
మెఱయుచున్నట్టి క్రూరంపు మెఱపులకును
ఉఱుముచున్నట్టి కఠినంపుటుఱుములకును
ఫెళఫెళమనుచుఁ బ్రేలెడి పిడుగులకును
దోడుగా వచ్చి చలియును దోడువడియె;
అక్కటకట! బ్రహ్మాండమే యడలుచుండఁ
దొణఁకి లోకంబు సర్వంబు వణఁకుచుండ,
ఒక్కచో నొక్కతూఁటిలో నొంటిగాఁగ
గూరుచుండి దుఃఖమ్ముతోఁ గుందుచున్న
పక్షి! చక్రవాకంబు తా వణఁకకున్నె?
తడిసిముద్దయయ్యెఁ, జలికిఁ గడగడమని
వణఁకెఁ, బిదపఁ గన్నులు మూతవడియె, నైన
నింకను బెదవు లవి యుచ్చరించుచుండె,
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!
రాదు! రా దింక నెచ్చెలి! రాదు! రాదు!

పిట్టనోటను మెల్లగా విడలునట్టి
"రాదు! రాదిక నెచ్చెలి! రాదు!" బలము
ప్రకృతిహృదయంబు కరఁగించివైచె నోటు!
కడఁగి బ్రహ్మాండ మంతయుఁ గదలిపోవ
నూఁగు లాడించుచున్న దా యుగ్రపవనుఁ
డంతఁ గ్రమముగాఁ దగ్గె, నాయభ్రపటలి
సన్నగిలెఁ, గుంభవృష్టి తుషారమయ్యె,
మెఱపులవిమాత్ర మంతయుఁ దఱచులగుచుఁ—
—ప్రకృతి రమ్యనేత్రంబులు పఱచి గాఢ
మగు తుపానుచే లోకంబునందు నెందు
ఏమియయ్యెనో యనుచు వీక్షించుచుండె—
ననఁగ సౌందర్యవంతమై యలరె జగము.
గడగడవణంకు తనువుతోఁ, గాళ్లు రాక
పడియడుగులు వైచుచు, నటుపైని గొంత
వఱకుఁ జెట్టుపైఁ గూర్చుండి విరతిఁ గనుచు,
ఆతురపడుచుఁ—బోయెడినట్టి—వచ్చు
నట్టి—యూపిరితో నూఁగులాడుచుండి,
ఎడపక మెఱయు మెఱపుల నిల్లు వెదకి
కొనుచు, మాంసఖండమునోటఁ గొనుచు నంతఁ
జల్లఁజల్లఁగ రాఁ జొచ్చెఁ జక్రవాకి!
"వలదు వల దన్నకొలఁదిని బట్టుపట్టి
వచ్చితి నయయొ! సఖుఁడు తుపానువలన
నేమి యయ్యెనో! యింక నేనేమిసేతు!
పాపి నెట్టులెట్టులో నాదుప్రాణములను
నిలుపుకొంటి, నేమాయెనో నెచ్చెలికిని?"
ఎట్టులెట్టులో వెదకుచు నింటి కేగి
యాతురపడుచుఁ దఱిఁ జేరె నక్కటకట!
మాట రాలేదు భర్తకు నూట లేదు,
"రాదు! రా దిఁక నెచ్చెలి! రాదు! రాదు!
రాదు! రా దిఁక నెచ్చెలి! రాదు! రాదు!"
అనుచు స్మరియించుచుండె; నాయదటు గాంచి
గుండె వగులఁ బ్రియసఖుని యండఁ జేరి
మూర్ఛఁ గనె, నదె శాశ్వతమూర్ఛ యయ్యె!
శక్తి కన్పట్టరాక ప్రశాంత మయిన
దృష్టిఁ జక్రవాకంబు వీక్షించె సతిని—
మొగమునను దోఁచె వింత సమ్మోద మపుడు,
ప్రాణ మయ్యది యాకాశపథము పట్టె;
సరసవల్లీపరీవృతసాలములను
చారుశృంగమ్ము లొప్పారు సౌధములను
ఉల్లసత్ఫుల్లసుమము లౌ వల్లికలను
ఇదియు నదియు ననుచు వచియింప నేల?
ప్రకృతికన్యక సర్వరూపమ్ము లందు
జలజల మటంచుఁ గన్నీరు జాఱుచుండె.

---

# ప్ర పం చ ము

భమిడిపాటి రామసోమయాజులు గారు

ఒగరు నెత్తావి సిరుల వా-యువ్రలు గొనగ,
మేనిపస సూర్యకాంతులు - మ్రింగివేయ,
నేలబడి, పారిజాతము - గోలుమనుచు
నేడ్చె, దుస్థితి నిముసంబు - నెదగలంప.

ఎపుడు గ్రొత్తగ వెల్గొందు - నిందు బింబ
మల్ల తొలిదిక్కు కొండపై - నవతరింపఁ
బులకిత శరీరమౌచుఁ, బ్ర-ఫుల్లమౌచు
పుణ్యమంతయు దన దని - పొంగె కలువ.

# బ్రహ్మాండపురాణము

## జనమంచి శేషాద్రిశర్మ గారు

లోకమునకు మహోపకారము చేయువానిలోఁ బురాణములు అగ్రతాంబూలార్హములు. ఇవియే చరిత్రమును దెలుపుచు, నీతులను బోధించుచుఁ గర్ణరసాయనములగు కథలను బోధించుచుండును. ఆకథలు కొందఱు కల్పితమందురు. కొందఱు సత్యములే యందురు. ఆ మాటల కేమిగాని మనము పురాతనేతివృత్తములు వాస్తవములనియే గ్రహింతుము. కల్పితము లన్నచో నిప్పటి విషయములు మఱికొంతకాలమునకుఁ గల్పితము లని కొందఱు చెప్పవచ్చును. ఆ మాటలకు హద్దులేదు. ఏవియో వాల్గు మాటలు చెప్పవచ్చును. అవి బాగున్నవని మఱికొందఱు పొగడవచ్చును. అంతమాత్రమున దానికి గౌరవము కలదా? పురాణకథలకది లేకపోవునా? ఆమాట లవ్వలఁ గట్టిపెట్టుదము.

పురాతనచరిత్రములను దెలుపుటంబట్టియే పురాణములని వానికిఁ బేరు కల్గినది. కేవల చరిత్రమును మాత్రమే యవి దెల్పునా? కాదు. దాని నెపమున సత్ప్రవర్తన మలవడు పద్ధతుల బోధించును. "కథాచ్ఛలేన బాలానాం।నీతిస్తదిహ కథ్యతే" అన్న మాట పురాణములనుండి నేర్చుకొనినదే.

అట్టి పురాణములు మువ్విధములుగా భాగింపవచ్చును. కథాభాగప్రధానములు, ధర్మభాగప్రధానములు, సృష్టిభాగప్రధానములు- అని. ఈవిభాగము మనమూహించునది కాని ఋషిప్రోక్తము కాదు. భాగవతాదులు కథాప్రధానము లనవచ్చును. విష్ణువామనాదులు ధర్మప్రధానము లనవచ్చును. బ్రహ్మాండాదులు సృష్టిప్రధానము లనవచ్చును. పైఁ జేర్కొనినవానిలో ధర్మకథాసృష్టిరూప త్రివిధ పద్ధతులు లేవా యను ప్రశ్నము రావచ్చును. అవి లేవని కాదు. ప్రధాన మొక్కొక్క విషయమని తెలుపుటకే యీనిర్ణయము పనికి వచ్చును.

బ్రహ్మాండపురాణము పేరుచేతను వలె సకలవిషయముల చేతను సృష్టిప్రధానమే యనుట కావంతయు శంక యంకురింపనక్కఱ యుండదు. సృష్టిపద్ధతు లితరపురాణములం దింతగాఁ గానరావు. ప్రపంచరచనాచమత్కృతి వర్ణింపఁబడుటచేతనే దీనికి బ్రహ్మాండపురాణ మని పేరు గలిగినది. పురాణము చాల పెద్దదియగుటచే నీపేరు దీనికిఁ గలిగియుండవచ్చు నని భ్రాంతిపడి పుస్తకమును జూడకయే కొందఱు ఎన్నియో కథలను గల్పించి యవి బ్రహ్మాండపురాణాంతర్భూతము లని వ్రాసియున్నారు. ఒక్క యుదాహరణము దెలిపి యీ విషయమును వదలెదను. శ్రీవేంకటాచలమాహాత్మ్యము సర్వజనవిదితము. ఎవరో యొక గ్రంథమును సంస్కృతాక్షరములతో ముద్రించిరి. దానిపేరు "అష్టాదశపురాణాంతర్గతవేంకటాచలమాహాత్మ్యము" అని. ఆర్యులార! చూచితిరిగదా. భాగవతము జనసామాన్యమునకుఁ దెలియును గదా. దానిలోఁ గూడ శ్రీవేంకటాచలమాహాత్మ్యము కొన్ని యధ్యాయములున్నట్లు ప్రకటింపఁబడినది. జనసామాన్యమునకు దెలిసినభాగవతముగతి యిట్లుండ నిఁక బ్రహ్మాండాదిపురాణముల మాట యిటుఁ జెప్పనేల? ఇట్లు నిరంకుశముగా మనలోఁ గొందఱు కుక్షింభరులు గ్రావజీవితులు స్వేచ్ఛగాఁ గథలను గల్పించి సాహసించి ముద్రించి యాపొత్తముల విక్రయించి జీవింపఁ జూచుచున్నారు. ఇట్టి ప్రయత్నముచే లేని గౌరవము క్షేత్రముఖ్యములకు వచ్చుటకు బదులు ఉన్న గౌరవ మూడి పోవుచున్నది. ఇంతకన్నఁ బాపపుఁగార్యము వేఱెదియున్నది?

బ్రహ్మాండపురాణము సర్వపురాణమూలకంద మని యందఱు అంగీకరించినవిషయమే. దీనియందుఁ బ్రధానవిషయము సృష్టిపరిణామము. ఆవిషయము విచిత్రముగానుండును. ఆసందర్భపుఁ బద్ధతు లిందుఁ గానరావు. ఇప్పటి కాలమున భూగోళతత్త్వవేత్తలము మేమే యని మీసములు మెలి వెట్టుచున్నవారు సిద్ధాంతీకరించిన విషయము లీపురాణమున నెన్నియో గలవు. సృష్టిపరిణామము విచిత్రముగ నిందు విస్తృతమయ్యెను. నాగరికత యెట్లభివృద్ధియయ్యెనో స్పష్టముగా నీపురాణమునఁ జెప్పఁబడియె. దానిం బరికించినయెడల నద్భుతానందములు పెనఁగొనకపోవనుట యతిశయోక్తి గాదు.

మనుష్యాదులు సృజింపఁబడుటయు, వారి జీవికలు, తదనుగుణపదార్థముల యుత్పత్తి, వానిని వా రుపయోగించినవిధము బ్రహ్మానందమును బుట్టింపక మానవు. ఇంచుక విశ్రాంతిని గలిగించుకొని యేకాంతముగాఁ గూరుచుండి మనస్సును బ్రాక్సృష్టివిభాగమువంకకుఁ ద్రిప్పినచో నిద్రాహారములు స్మృతికి రావనుట కల్ల గాదు.

మనుష్యు లుద్భవిల్లి వృక్షములనుండి యాహారమును సం

పాదించుకొనుచు దాన సంతృప్తినొందుచుఁ గొంతకాల ముండిరఁట. కాలము జరుగఁగా వారికి ఆ పత్రపుటప్రవన్మధుధారల స్వీకరింప నిచ్ఛ గలిగెనఁట. ఆ పిదపఁ గొలఁదిదినములకే ఆ సృష్టి నశించెనఁట. అంత వారు కుయ్యో మొఱ్ఱో యని పలవింప నారంభించిరఁట. సర్వేశ్వరుండు వారి కాశాపాశములు తగిలియుండుటుం బరికించి తదనుగుణముగా సృష్టిని బ్రసాదించెనఁట. వారపుడు వృక్షమూలనివాసము వలనుపడమి గుహలందుఁ జేరి శీతవాతాతపబాధల నాపుకొన నలవాటుపడిరఁట. అమీఁద వారికి వసతు లేర్పఱుప నూహలు గలిగెనఁట. ఆయూహలు నశింపకుండ వారు నియమముల నేర్పఱుచుకొనఁజాలి ఆ నియమముల ననుసరించి గృహముల నిర్మించుకొనిరఁట. మఱి కొలఁదిదినములకే గ్రామము లేర్పడఁగా నమ్మానవులపు డొక్కఁడు పాలకుఁడుగా నుండకపోయిన ప్రజావితతి సన్మార్గప్రవర్తనమున కలవాటుపడదని యూహించిరఁట. ఆయూహ కనుకూలముగా బాహుబలమున నొరులకు సహాయపడఁ గలవారిని పాలకులనుగా నుండఁ బ్రార్థించిరట. వారందులకీకొని తమప్రాణములనైన నర్పించి వారిని గావఁ బ్రతిన సేసిరఁట. వారియుండఁ బాయక మనుజులు మెలంగుచుఁ గష్టములపాలు గాక ప్రవర్తింప సాగిరఁట. అంత వారికిఁ బన్నుల నిచ్చుపద్ధతి నేర్పాటు గావించిరఁట. పిదప వారికి నివాసార్హము లెట్లుండవలె నను నూహయొక్కటి యుప్పతిల్లఁగాఁ దత్కాలమున సంసారపరిత్యాగ మొనరించి తపోవిభూతి మెలంగు మహర్షులం బ్రార్థించి వారి యాజ్ఞానుసారము శాస్త్రమును నిర్మించి నగరములు వానికిఁ జుట్టుపట్టుల నెంతెంతదూరమున నెట్లెట్లు గ్రామములుండవలయునో విమర్శించి యారీతిం గట్టిరఁట.

అంతట మనుజులలోఁ గొందఱు కామక్రోధాభిభూతులు బలిష్ఠులుదేఱిరఁట. ద్రవ్యాశచే నొరుల బాధించువారు వర్తిల్లం గాంచి తద్భీతి దొలంగుపొంటెఁ గోటలు కట్టిరఁట. ఆ కోటల నిర్మించుపద్ధతియు శాస్త్రరూపమున వెలసెనఁట. ఆకోటలలోనుండి రాజులు తమప్రాణముల లెక్కచేయక శత్రువులగు దుష్టమానవులనుండి తమప్రజలను గాపాడుచుండిరఁట.

అట్లు కొంతకాలము నిర్బాధకముగా జరుగుచుండ నారాజులు ధనమదాంధులై ప్రజల దాసులఁగా భావించి స్వేచ్ఛఁగా బ్రవర్తింపసాగిరఁట. మహాత్ము లొక్కచోఁగూడి వారి నిగ్రహించుచు నవీనపాలకులను ధర్మమార్గావలంబకు లగువారి నేర్పఱుచుకొనుచుఁ గాలమును గడపిరఁట.

అత్తఱి భూభుజులు విఱ్ఱవీఁగి దోర్బలము మెఱయ విచ్చలవిడి మనుజుల బాధించుచు ధర్మనాశనముఁ గావింపఁ బూనిరఁట. మనుజుల శ్రమపరంపరలు రాజుల దుష్కృత్యపరంపరలు పరికించి భగవంతుఁడు వారిగర్వము నడంచి మనుజహితైకతత్పరులనుగా జేయదలచెనఁట. ఇంతలో రాజుల నేకులుగా నేర్పడి నిరంకుశముగా మహర్షులను గూడ బాధించుచు, వారిపదార్థములఁ గైకొనుచు మేఱలేని విహారముల నానందించుచుండ సర్వేశ్వరుఁడు త్వరపడుట మేలని నిశ్చయించి తన యమోఘకళావిశేషము నొకబుషి కుమారునియందుఁ బ్రవేశపెట్టెనఁట. ఆ కుమారుఁడు తేజోవిశేషంబుల దుర్నిరీక్ష్యుండై విపక్షావళీశిక్షాదీక్షుం బూనెనఁట. అందులకుం దగు శక్తిని సంపాదించుకొనఁ బ్రయత్నించెనఁట. ఆకాలముననే రాజులు గూడ మహర్షి కరుణాపాత్రులై మంత్రశక్తిసంపాదితానేకాస్త్రసహితులై యుండుటచేతనే నైప్రయత్నమున కవకాశ మేర్పడెనఁట.

ఆ మునిబాలకుం డొక్కండె మహారణ్యసీమలకుం జని ఘోర తపంబుచేయఁబూన నాతనికి వాంఛానుకూలశక్తి ననుగ్రహింపఁ దలంచి సర్వేశుఁడు ముందు తన్మనోదార్ఢ్యమును బరికింప నిశ్చయించి యానేపమున నితరులకుఁ దన వినోదమును గనఁబఱుపఁ గోరి వ్యాఘ్రరూపమున నచ్చటికిఁ బోయి తపోభంగకరములు, తపశ్శక్తిదుర్బల మని తెలుపునవియు నగుమాటలం బలుకనాబాలకుండు తన పూన్కి మానక గంభీరముగా భాషింపనందుల కాసర్వేశ్వరుం డానందించి యాతనికి నిజరూపంబుఁ బ్రసాదించి యింకను గొంతకాలంబు నియమమునఁ బ్రవర్తిల్లుమా యని యనుజ్ఞ నొసంగెనఁట. ఆ పరమపురుషుని యాజ్ఞను దలఁదాల్చి యట్లే మహాక్షేత్రములం దిరిగి తిరిగి సంయమముల సేవించి లబ్ధమనశ్శక్తియై మరల భగవంతునిం గొలువ హిమాలయమున కరిగి తపం బొనరించెనఁట. లోకనాయకుండు ప్రత్యక్షంబై యాతని కాంక్షితమును ఫలింపఁజేయు సకలాస్త్రముల నొసంగెనఁట.

పరమేశ్వరకరుణాపాత్రుఁడై యామునితనయుఁడు మరలి వచ్చి యవార్యగర్వమున విఱ్ఱవీఁగి మేఱలేక యధర్మపథమున విహరించు ధరణీపాలకుల నసంఖ్యాకసేనాసమేతుల నొక్కండ చెండాడి తపశ్శక్తిని లోకులకు వెల్లడి జేసెనఁట. అంతట మానక యట్టిదుక్షత్రియుల ననేకులఁ బెక్కుపర్యాయములు పరిమార్చెనఁట.

ఇట్లు విహరించు నామునితనయునివిక్రమాటోపంబున క్షత్రియకులమే నశించునట్లు కాఁగా నట్లగుటయు లోకుల కపకారముగాఁబట్టి దానిని మాన్ప శాంతధనులగు మహర్షులు ప్రయత్నించి యెట్లో యామునితనయుని నుపశాంతక్రోధావేశునిఁ జేసి శేషించినభూపాలకతనయులఁ బెంచి పెద్దవారలంజేసి విద్యాబుద్ధులఁ గఱపి రాజ్యభారముం బూన్పంజేసి తమపని నెఱవేర్చెఁ

గదా యని సంతసంబున మరలఁ దపస్సుచేయనరిగెరఁట. ఈసందర్భమునవైె గాథకనుకూలములగు విషయములు పెక్కులుగలవు. రాజవంశములు వానిభేదములు విశేషముగా నీభాగమున వర్ణితములైయున్నవి. వారి యాచారములు ధర్మానుష్ఠానవైఖరియు విపులముగ ననువదింపఁబడినవి.

మునుల వంశపరికీర్తనావసరమున నెన్నిజాతులవారాయా మునులలోఁ గలిసిరో తేటపఱుపఁబడినది. మును లనఁగా బ్రాహ్మణులే యన్నమాట వాస్తవము గాదని యందులకుఁ గావలసిన శాంతముఖ్యగుణములు గలవా రందులోఁ జేరుదు రని నిర్వచింపఁబడినది.

ఓహో! ఈ పైవిషయములఁ దెల్పు ఘట్టముల నెట్టనఁ బరికించునపుడు మై పులకరింపకమానదు. ప్రజాసంఘ మెన్నికష్టములఁ బాలైనది? ఎంతకాలమునకు సుఖస్థితి నొందఁగలిగినది? అందులకు మార్గము లెవ్వి యని తేలినవి? భగవంతుని యుద్దేశ్య మెట్టిది? మహర్షులయాశయ మేవిధమున నుండును? శాస్త్రము లెట్టిసహాయము మనుజులకుఁ జేయుచుండును? తత్కర్త లెంతటి ఘనమనీషులు? వా రెట్టిలాభములను గోరిరి? ఈ మొదలగు విషయముల నిర్వ్యాజబుద్ధితో నేకాంతమునఁ గూరుచుండి చర్చించుకొనుచుండిన నూర్వ్యాస్తమయము తోఁచునా? ఆయానందమునకు పరిమితి గలదా?

పాఠకమహాశయులారా! ప్రపంచ మిట్లు క్రమక్రమముగా నభివృద్ధియై నాగరకతను సంపాదించుకొన్నయది. ధర్మసూక్ష్మభాగములు సైతము క్రమరీతి నలవడినవే, గాని యొక్క కాలమున వచ్చినవిగావు. మనయాచారములుకూడ నెన్నియో మార్పులఁ జెందుచుండునవియే గాని యేకరీతిగా నుండ వని పై గాథలవలననే విశదమయ్యెఁగదా. మహామతులందఱును లోకసుఖమే స్వసుఖముగా భావించుకొని తమయావచ్ఛక్తిని తన్నిమిత్తమై వ్యయించుట వినుచున్నారము కదా. అందును దపోనిరతులయ్యు విరక్తులయ్యు లోకమునకు మహాపద వాటిల్లునెడ మహర్షులు తపోనియమములను మాని లోకుల కెట్టియుపకృతి నొనరించి ధన్యులయిరో యను విషయమును స్మరించినచో మనమామహితాత్ముల విషయమున నెట్టికృతజ్ఞత చూపవలెనో తేటపడకమానదు. కీర్తికేకాక స్వకృత్యమని మనపూర్వులు లోకోపకారపరాయణులైరి. కాఁబట్టియే యాచంద్రరవితారకముగా యశఃకాయమును బ్రపంచమున నునుపఁగల్గిరి.

ఈ గాథలలో నసంగతము లనఁదగినవెవ్వి యని యాలోచించిన నొక్కటియైనఁ గలదా? జలమయముగా నుండుతఱి జలజంతుసృష్టియు, స్థలము బయలుపడఁగా కూర్మాది జలస్థలసంచరణశీలములగు జంతుసృష్టియు, స్థలము సమంచితముగా నెలకొని వనసమన్వితము కాఁగా వరాహాదివనచరజంతుసృష్టియు నారీతిఁ గొంతకాలము కాఁగా తిర్యఙ్మనుష్యభాగద్వయయుక్తమగు సృష్టియు, నాపిదప వామనజనసృష్టియు, నామీఁద వరుసగా మనుష్యసృష్టియు గల్గెనన్న వాదము మహామతివిభూతిఁ గనిపెట్టఁబడిన దన్నవాదము స్తుతిపాత్రమగునపుడు ఈవిధ మంతయు మనపురాణములలో శ్లోకమూలనే యిమిడియున్నదని చెప్పవీలగునా కాదా? ప్రపంచోపకారకములగు విషయము లెన్నిగలవో, నాగరకతను జెంపొందించున వెన్నిగలవో యన్నియును క్తములే గాని క్రొత్తవి కనిపెట్ట శక్యము గాదు. కనిపెట్టితిమన్నను నవియుఁ బ్రాగుక్తవిషయాభాసములే గాని క్రొత్తవి గానేకావు. సంక్షిప్తవిషయమును విస్తరించిచెప్పుట నవీనసృష్టి కాదు. మన మట్లే భావించుకొని తృప్తినొందవచ్చును గాని కొంతకాలమునకది ప్రాచీనతమ మని యొకరు నిర్ధారణ మొనర్తురు. అప్పుడు ప్రాచీనకాలమహత్త్వము స్పష్టమగును. అంత నవీనసృష్టి నొనర్చితి మనుకొనువారికి నస్మత్ప్రాక్కాలికుల శక్తిపాటవములు తేటపడును. అంత వారును కృతజ్ఞు లగుదురు.

ఇఁక జీవహింసావిషయమును గొంచెము పురాణానుసారము విచారింపవలయు. పూర్వకాలమున నందఱకు నాహారము మాంసమే ప్రధాన మని చెప్పవచ్చును. దాని నడంచుటకే పూర్వమహర్షులు యజ్ఞముల నొనరించికాని, శ్రాద్ధకాలమునఁగాని, అతిథిపూజయందుఁ గాని మాంస ముపయోగింపఁదగును గాని యిష్టానుసారము జంతువుల హింసించి మాంసము భక్షింపరాదని నియమమునొనర్చిరి. అనఁగా నేదోయొక కాలమునఁదప్ప నితరకాలముల నది నిషేధ మనుటచే సర్వకాలమాంసాహారనిరోధకము గల్గెఁగదా. క్రమక్రమముగ నలవాటుతప్పినచో నది నశించు నని వారి భావము.

ఒకానొకప్పుడు యజ్ఞ మొకచో సాగుచుండెను. దేవతలు హవిర్భాగములఁ గొనవచ్చియుండిరి. ఋత్విక్కులాయుధపాణులై యజ్ఞపశుహింస చేయఁబూని యుండిరి. ఆ పశువులు దీనాననములఁజేయునది లేక ప్రాణహంతలపైఁ దమ దీనదృష్టులం బ్రసరింపఁజేయుచు నుండినవి. ఆసమయమున నా యజ్ఞముం జూడ మహర్షు లరుదెంచిరి. దీనాననముల నిలుచుఁడి సంరక్షకుఁడు లేమికిఁ జింతిల్లుచున్న మృగములం జూచిరి. వారి యంతరంగము లపుడు కరుణాతరంగితము లయ్యెను. కత్తి నెత్తియున్న ఋత్విగ్గణము నాపి మఖము నొనరించు నింద్రుం గాంచి మహాత్మా, లోకత్రయపాలకా! పశుహింస పాపములలోఁ బాపఫలప్రదము. దానిం జేయుదే? యజ్ఞము నభిప్రాయమిద్ది యగునే? ఇంక దీనినాపుము. దీనములగు నీసాధుజంతువులఁ గాపాడుము.

యజ్ఞమునకు పలయు పరికరములు ధాన్యాదులు గలవు? అని మొఱ్ఱపెట్టిరి. కాని యింద్రుం డధికారగర్వమునఁ గన్నులు కానకున్నవాఁడౌట వారిమాటల వీటఁబుచ్చి యజ్ఞము హింసాప్రధానమని వాదించెను. మునులమ్మాటల సమ్మతించి వేదస్మృతులయభిప్రాయ మిట్లే యగునేని మేము చెప్పవారము గాము. ఈ విషయము ధర్మకర్తయగు వసువు నిర్ణయింపవలసిన దనిరి. వసువు శతమఖునిపైఁగల పక్షపాతమున యజ్ఞము హింసాకర్మమే యనియె. దాన నాతఁ డూర్ధ్వలోక సంచారి యయ్యు నధోలోకపతితుఁ డాయెను.

ఈకథాతాత్పర్యమును దలంచినచో సృష్టిలోఁ గొంతకాలము జరగఁగాఁ దత్పూర్వముండిన దురాచారములు నశింపఁ బ్రయత్నములు జరగినటులఁ దేలునుగదా. ఇట్లు కథారూపమున భూతహింసాదిఘోరకృత్యములు సలుప మహాపాతక మలవడఁగల దని బోధించుపురాణములు మహోపకారకము లనుట దప్పనిం కేమనవలయు?

ఇట్లు సకలవిధముల నీ బ్రహ్మాండ మహాపురాణము మహోపకారక మయి యలరారుచున్నది. ఇద్యాది సర్వపురాణశిరోమణి యని కొందఱనుచున్నారు గాని యట్లనుటకన్న నీ పురాణము సృష్టికథాప్రధాన మనియుఁ, బ్రవృత్తిమార్గమునఁగల చమత్కారములఁ దెలుపుననియుఁ జెప్పుట సమంజసము. పెక్కువిషయములు నిర్దుష్టములుగా దీనినుండి గ్రహింపవచ్చును. కాఁబట్టియే దీనిని గొందఱు పురాణరత్న మనుచున్నా రన్నను సాహసము కాదు. నాగరకత యెట్లెట్లు కాలక్రమమున లభించెనో యీపురాణము చదివినఁ గాని చక్కఁగాఁ దెలియదనుటయు నిర్వివాదాంశము.

మునులలో నేయే తెగలు చేరినవో దాని కట్టియోగ్యత కావలయునో యీపురాణము చక్కఁగా బోధించును. ఈ పురాణములో నున్నట్లు పెక్కుస్థలపురాణములు పెక్కువ్రతములు పేర్కొనఁబడుచున్నవి. కాని యవి యసంగతములు. దీనియం దట్టిగాథలు లేనేలేవు. ఉన్నవనుటకుఁ గూడ నవకాశము లేదు. కల్పితగాథల నందందుఁ జేర్చుట కవకాశము లేకుండ నంతటి కట్టుదిట్టములతో నీపురాణము రచింపఁబడినది. "సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ, వంశానుచరితం చేతి లక్షణాంతు పంచకమ్" అను లక్షణానుసార మీపురాణ మలరారుచున్నది. జాతులు తద్వృత్తులు భూభాగపరిస్థితులు తద్వాసుల కాయుర్దాయము, వారి యాచారాదులు వానికిందగు కారణములు యుక్తియుక్తముగా నిందు వర్ణింపఁబడినవి. ద్వీపములు ద్వీపగతపర్వతములు పర్వతసంభూతనదులు తజ్జలపానజనితదృఢత్వసూక్ష్మబుద్ధిత్వాదులు చక్కఁగా నిందు విస్తృతములు. ఆకాలమున నందుఁ గొన్ని మార్పు లుండవచ్చునుగాని విశేష భేదములు కానరావు.

ఇట్టిపురాణములను నిర్మించిన మహాత్మునకు వ్యాసమహర్షికి మనము కృతజ్ఞులమగుటకన్నఁ జేయఁదగిన దేదియు లేదు. ఇప్పురాణమును జక్కఁగాఁ బఠించి మనపూర్వులబుద్ధిచమత్కృతిని గొనియాడుటయే వారికి మనముచేయు మహోపకారము.

ఈ పురాణమునుగుఱించి యీచిన్నివ్యాసము దాని మహిమను గొనియాడఁజాల దనుట నిక్కము. ఐనను పురాణరత్న మిది యనుటకైన నించుక దెల్పఁగల దని నమ్ముచున్నాఁడను.

# ప్రణయినీ గీతములు

"సౌదామిని"

సంజె జారె, చుట్టుపక్క
మినుకుమినుకు దీపమ్ములు
వెలుగుచుండె, దూరమ్మున
కోవెలలో హాయిగాను
మేళము వినవచ్చుచుండె,
చల్లగ వెన్నెలలు కన్న
తల్లివోలె కాయు గాని
మన ప్రేమో మాటుమణిగె!

# భాషావిషయము

## పారనంది రామశాస్త్రిగారు

భాష యనఁగా "భాష్యత ఇతి భాషా" అను వ్యుత్పత్తివలన భాషింపఁబడునది. శబ్ద స్వరూపము. ఈభాష దేశములనుబట్టి కొన్ని భేదములఁ గలిగియుండును. వానినే దేశ్యభాష లందురు. దీనివలన నన్ని దేశములకు సామాన్య మగు నొకభాష యుండి యుండవలయు నని సిద్ధించుచున్నది. అది యెద్ది యనఁగా దేవభాష. దేవతలకుఁ గూడ వ్యవహారములో నున్న భాష యని యభిప్రాయము. అదియే మనుష్యులకును పూర్వము వ్యవహారములో నుండునట్లు తెలియఁబడును. దానినుండియే కొన్నిశబ్దములు విడఁబడి యుచ్చారణభ్రంశము నొంది వికృతిశబ్దము లని చెప్పఁబడుచున్నవి. వీనిని "తద్భవము" లందురు. సంస్కృత శబ్దమే, తెనుఁగు ప్రత్యయము మాత్రము గలిగి "తత్సమ" మనఁబడుచున్నది. దేశ్యగ్రామ్యములకు నియమము లేదు. ఈ శబ్దము లన్నియు "వ్యుత్పన్నములు, అవ్యుత్పన్నములు"నుగాను రెండువిధములుగా నున్నవి. "వ్యుత్పన్నము"లనఁగ', నేశబ్ద, మేయర్థమం దేయేధాతుప్రత్యయాదులయోగముచే నయినది తెలుపఁబడినవి. అట్టి సందర్భము లెవ్వియు లేకయే, యేదో యొక యర్థమందు రూఢమయి లోకములో వాడఁబడుచున్నవి యవ్యుత్పన్నములు. వ్యుత్పత్తికల్పన వ్యాకరణకర్తలచేఁ జేయఁబడినది. దేవభాషలోనే, మన ప్రాచీనవేదశాస్త్రాదు లన్నియు నున్నవి. వీనిలోనుండు శబ్దరూపములకు, లోకములో వాడుకలోనికి వచ్చియున్న శబ్దరూపములకును, గొంచెము వ్యత్యాసములు కన్పించుచుండఁగా నప్పుడు పాణిన్యాదిమహర్షు లీదేవభాషను సంస్కరించి ధాతుప్రత్యయాదుల నిరూపించి శబ్దస్వరూపములను నిర్ణయించినారు. ఇట్లు సంస్కరింపఁబడిన దగుటచేతనే దీనిని "సంస్కృత" మందురు. సభ్యుల వ్యవహారమందు రూఢమయి యున్న శబ్దముల సంస్కారముకొఱకే వ్యాకరణము లేర్పడినవి. ఇట్లుండ నీ యాంధ్రలోకమువారి భాషయే యాంధ్రభాష యనఁబడుచున్నది. దీనికిని వ్యాకరణము లనేకములు పూర్వులచే రచింపఁబడియున్నవి. మొట్టమొదట నీభాషను, లోకవ్యవహారమందు మాత్ర మున్నదానిని గ్రంథార్హ మగునట్లు గొన్ని నియమముల నేర్పఱచి నన్నయభట్టారకుఁడు దీనిలో సంస్కృతమహాభారతమును భాషాంతరీకరించినాఁడు. అప్పు డీభాషను "తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యము" లను నాల్గువిధము లగు శబ్దములచేత పుష్కలముగాఁ జేసి దీనిచే గ్రంథరచనఁ గావించెను. ఈ గ్రంథరచనతోడనే భాషానిబంధనముగా "నాంధ్రశబ్దచిన్తామణి" యనుపేర నొక వ్యాకరణమును సంస్కృతభాషలో నతిగభీరాశయమున సంక్షిప్తముగ నార్యావృత్తములతో రచించెను. పిమ్మట నొకకొంతకాలమునకు నథర్వణాచార్యుఁడు "వికృతివివేక" మనుపేర నొకవ్యాకరణము నీషద్భేదములతో రచించెను. తరువాత మఱికొంత కాలమునకు చిన్తామణికి "ఎలకూచి బాలసరస్వతి, అప్పకవి" మున్నగువారు కొందఱు వ్యాఖ్యానములఁ జేయుచు నుదాహరణములను దమకుఁ దోఁచినవాని నిచ్చియున్నారు. వ్యాకరణమూలకర్త

లు, వ్యాఖ్యాతలు నందఱును నాంధ్రభాషకు "గ్రామ్య" మను నొకభాగమును ప్రథమాచార్యుఁడగు నన్నయభట్టుఁ డంగీకరించినట్లే తామును నంగీకరించి చెప్పుచున్నారు. కాని యీ "గ్రామ్య" మనుదానింగూర్చి ప్రథమాచార్యుని యభిప్రాయ మేమో వీ రరసి చెప్పుచున్నట్లు గానరాదు. ప్రథమాచార్యుఁడు "నియమము, దప్పినది గ్రామ్య"మని గభీరముగాఁ జెప్పి విడిచినాఁడు. ద్వితీయాచార్యుఁ డపభ్రంశము గ్రామ్యమని దానిని నిందించినాఁడు. కేతన కొన్ని శబ్దస్వరూపముల నెత్తి యిట్టివి గ్రామ్యము లని చెప్పినాఁడు. బాలసరస్వతి చింతామణికిఁ దాను వ్యాఖ్యానముఁ జేయుదునని యారంభించి ప్రథమాచార్యుని కారికలనే కాక ద్వితీయాచార్యుని కారికలనుగూడ నెత్తుచుఁ దన యభిప్రాయానుసారముగ నుదాహరణముల నిచ్చియున్నాఁడు. అప్పకవియు చింతామణికి వ్యాఖ్యాన మనియే చెప్పుచు మీఁదఁ జెప్పినట్లె ప్రథమ ద్వితీయాచార్యుల యిరువురయొక్కయు కారికల నెత్తుచు పద్యరూపమగు దనవ్యాఖ్యానగ్రంథమందు గ్రామ్యములు "వస్తాడు, తేస్తాడు, కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము మొదలగునవి" యని చెప్పుచు వానికి లక్షణము తేలికగా "గ్రామీణజనముఖమున నుచ్చరింపఁబడుట నట్టివి" అని చెప్పినాఁడు. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, ఇవి సమ్మతములే యైనట్లు ద్వితీయాచార్యుఁడు చెప్పినాఁడు. కేతన వానిని జేర్చియుండలేదు. కేతన చెప్పినవానిని వీరు చేర్చిన లేదు. ఎవరిదానిలోను లక్షణము సరిగాఁ గానరాదు. అప్పకవి తనకుఁ దోఁచినట్లే చెప్పినట్లున్నది. చిన్నయసూరి మొదలగు బిమ్మటివా రప్పకవి యన్నవానినే గతానుగతికముగఁ జెప్పియున్నారు. కాని యప్పకవి చెప్పిన లక్షణమునకును లక్ష్యములకును సంబంధ మున్నదా? లేదా? అని విచారించి చెప్పినట్లు గానరాదు. "వస్తాడు, తేస్తాడు, కఱకంఠుఁడు" మొదలగువానిలో తేలికయుచ్చారణ మెట్లు? లేకయే యవి గ్రామ్యము లెట్లు? అని యీ విచార మప్పటికిని ఎవ్వరును జేయలేదు. ఇది యిట్లుండ నీనడుమను గ్రామ్య గ్రాంథికవాద మొకటి బయలు దేఱినది. అది యవిచారితముగానే పెఱిగినది. దానిలో "గ్రామ్యవాదులు, గ్రాంథికవాదులు" అని రెండుకక్ష్యలవా రేర్పడినారు. వీరిలో మొదటి పక్షమువారు మనవాడుకలో శబ్దరూపము లెట్లున్నవో యట్లే గ్రంథములందును ప్రయోగింప వచ్చు నని చెప్పుదురు. రెండవపక్షమువారు "మన వాడుకలో గ్రామ్యరూపములు గలవు. అవి గ్రంథార్హములు కావు గావున వానిని గ్రంథములలో ప్రయోగింపరాదు. గ్రంథార్హ మయినదే గ్రాంథిక భాష యని అర్హముకానిదే గ్రామ్యమనియు జెప్పుదురు. వారివాద మిట్లు జరుగుచునే యున్నది. ఈ విషయమున భాషాజ్ఞు లందఱును నేదో యొక కక్ష్యలోఁ జేరి వాదమును బెంచువారే కాని విషయతత్త్వమును పరిశీలించి యభినివేశమును విడిచి యైక్యమును బొందినవారు కారు. ఇక మధ్యస్థులనఁదగినవారు కొందఱు కలరు. కాని వా రుదాసీనులుగ నున్నారు. ఇట్టిస్థితిలో వీరి యౌదాసీన్య ముచితమా? వారివాదములే యుచితములా? అనునది యింకొకటి విచారణీయము కలిగినది. కక్ష్యలలో నొకరిది మఱియొకరి కనుచితము. ఈ యౌదాసీన్యములో నట్లు గాదు. ఎవరిది వారికే యనుచితమగును. కాన దానికంటె నిదియే యెక్కుడు తప్పు గావచ్చును. కావున నింక భాషాజ్ఞానము సభిమానము గలవా రెల్లరును దమ యౌదాసీన్యము నుపేక్షింపక కక్ష్యవారిలోనివాద మెద్ది యెంతవఱ

కుచితము? కాని దెంతవఱకు?" నని విచారించి వారి యందలి పక్షపాతమును విడిచి భాషయందు మాత్రము పక్షపాత మవలంబించి విషయనిర్ధారణముఁ జేయుట యుచిత మగుటచే నెల్లవారును దాని యెడల లబ్ధావకాశు లయియే యున్నారు. కావున నామదికిఁ దోఁచినదానిని నేనును జెప్పుటకు సాహసించుచున్నాఁడను. "నసాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి" అను న్యాయముచే నొకప్పుడు సాహసము మంచికావచ్చునను తలంపుచేత నే కాని, యెల్లవారికంటె నా యుత్కర్షముఁ దెలుపుకొనుటకుఁ గాదని, విచక్షణులగు సహృదయులు మన్నింతురుగాక. మీఁదఁ జెప్పిన గ్రామ్యగ్రాంథికవాదుల కుభయులకును నొక విప్రతిపత్తి నిచ్చి మధ్యస్థులు విచారింపవలసి యున్నది. ఎట్లన, వ్యాకరణకర్త లందఱును గ్రామ్యము నంగీకరించియు, నిషేధించియు నున్నారుగదా? వా రంగీకరించిన గ్రామ్య మెట్టిది? నిషేధించినది యెట్టిది? అని. అట్టి విచారణలోఁ గొందఱు వ్యాకరణకర్తలే "యార్యవ్యవహారదృష్ట మగునది గ్రామ్యమయ్యును గ్రాహ్యమే" యని చెప్పె కేతనకంతుఁడు, ప్రాణగొడ్డము మున్నగునవి గ్రాహ్యములే యని యంగీకరించి యున్నారు గదా? వీనికి గ్రామ్యలక్షణము పట్టినదా? లేదు. లేకయే గ్రామ్యము లెట్లగును? అది యట్లుండ నప్పకవి చెప్పిన తేలికయుచ్చారణము "వస్తాడు, తెస్తాడు" మొదలగువానిలోఁ గానరాదు. ఆర్యుల వ్యవహారములో నవి కాన్పించుచునే యున్నవి. కాన నట్టివానికి గ్రామ్యత లేనట్లును గ్రాహ్యము లగునట్లును విధానమును కల్పించుట యుచితము గాదా? లోకమం దార్యుల వ్యవహారములో రూఢము లయి యశ్లీలతాదిదోషములు లేకున్నను ప్రాచీనమహాకవులచే గ్రంథములం దుపయోగింపఁబడక యుపేక్షింపఁబడి యున్న కొన్ని దేశ్యశబ్దములకు వ్యుత్పత్తిసాధ్యము లగువానికి వ్యుత్పత్తులను దెలుపుచు రూపనిష్పత్తిఁ జేయుటయేకదా వ్యాకరణముల స్వభావము? సంస్కృతశబ్దముల గుఱించి మన మేమియుఁ గ్రొత్తగఁ జేయవలసినది లేదు. అట్లుసేయనురాదు. తద్భవములకును పూర్వనిబంధనములచే నియంత్రితములకుఁ గాక, మిగిలిన దేశ్యగ్రామ్యములలో నార్యవ్యవహారసమ్మతములగు వానికొఱకు "వ్యవహారభాషావ్యాకరణ" మను పేర నిబంధనమును రచించుట యావశ్యక మని తోఁచి నా యీ యుద్యమమును సహృదయుల ప్రోత్సాహముకొఱకు వెల్లడించితిని. ఇట్టి మహోద్యమము నావంటి యల్పజ్ఞునకు దుశ్శక్యమయ్యును నిది సమర్థుల ప్రవృత్తికి జ్ఞాపకమయినఁ గాకుండునా? యని ప్రాచీననిబంధనములకు విరోధింపకుండు నట్లు పూర్వకవులచేఁ గొన్ని గ్రంథములం దుపయోగింపఁబడకున్నను నిషేధములేదు గావున నట్టి దేశ్యగ్రామ్యముల నిష్పత్తికొఱకు నొక నిబంధనము రచియింప నుద్యోగించుచున్న నా యుద్యమమునకు సహృదయు లెల్లరును దోడ్పడుదు రని నమ్ముచున్నాఁడను. దేశ్యపదములు దేశకాలములనుబట్టి మార్పు లొందవచ్చునని "ప్రవాహినీదేశ్యా" అను దానిచే వాగనుశాసనుఁడే యనుజ్ఞనిచ్చినట్లు భావించుచు నట్టి దేశ్యముల గుఱించియే యీ నా యుద్యమమును దెలుపుచున్నాను. గ్రామ్యము లను నవి యల్పదేశ్యము లనిన ననవచ్చును. కాకున్నను, వ్యవహారములే కావున, వానింగూర్చి యైన నిది, వ్యవహారభాషావ్యాకరణ మని నా యభిప్రాయము.

---

# వాఙ్మయ సామ్యము

కురుగంటి సీతారామయ్యగారు, ఎమ్. ఏ.

విమర్శనము వాఙ్మయ సోపానములలో నొక పైమెట్టు. విమర్శన మెక్కువగ నే వాఙ్మయంబున నుండునో యది యుత్తమవాఙ్మయములలో నొకటి. ఆంగ్లవాఙ్మయమున కింత ప్రసిద్ధి యెట్లు వచ్చెనో కనుగొనినయెడల నీ సత్యము మనకు తేటతెల్లము కాగలదు. వాఙ్మయమును ప్రసిద్ధికి తెచ్చుటలో కవు లెంతముఖ్యులో విమర్శకు లంతముఖ్యులు. ఆంగ్లవాఙ్మయమున విమర్శకులు సామాన్యకావ్యములను కూడ తమ తెలివితేటలచే మిన్నునకు బొగడి కవివాక్యమున నుద్దేశించని రసమును కూడ నారోపించి వాఙ్మయమునందు పాఠకప్రపంచమున కభిరుచి కలిగించి వాఙ్మయకీర్తిని విస్తృతముచేసిరి. కవికి కావలసినయంత భావనాశక్తి విమర్శకునకు లేకపోయినను కొంతయైన నుండవలయును. ఏలన సమయమువచ్చినప్పుడు కవి వ్రాసిన యెట్టి సామాన్యపు వ్రాతలనైనను రసవంతముగ కనబడునట్లు చేయుశక్తి యుండవలయును. ఆంగ్లవాఙ్మయమునందలి కావ్యములన్నియు నట్లు ప్రసిద్ధికి తేబడినపుడు వాఙ్మయము కీర్తిని వడసినదియన్న నాశ్చర్యమేమి? పందొమ్మిదవ శతాబ్దమున విమర్శనమే వాఙ్మయము. సృష్టి మిక్కిలి కొద్దిగ జరిగినది. ఇప్పుడుకూడ గద్యవాఙ్మయమే తప్ప పద్యవాఙ్మయసృష్టి బహుస్వల్పముగ జరుగుచున్నది మన యాంధ్రవాఙ్మయమునగూడ సృష్టి కొంచెముగనే జరుగుచున్నది. నవ్యకవిత్వ మనునది తప్ప మిగిలిన దారుల సృషినడక తక్కువగనే యున్నది. నవ్యకవిత్వము మాత్రము వేలంవెఱ్ఱిగా జరుగుచునే యున్నది. నాటకము, అపరాధపరిశోధకనవల యీకాలమున బహుజనులచే చదువబడుచున్నవి. విశ్వవిద్యాలయములన్నిటిలో సారస్వతముకంటె శాస్త్రముల కెక్కువ ప్రాముఖ్య మొసగబడుచుండుటచే శాస్త్రలక్షణములు కొన్నిదానికికూడ నుండుటచే విమర్శనముకూడ నొకశాస్త్రమువలె పెరుగు నవస్థ వచ్చుచున్నట్లు తోచుచున్నది. ఆంగ్లవాఙ్మయమున నది యొకశాస్త్రప్రాయమైనది. కవిత్వసూత్రములు నిర్వచింపబడినవి. మన విమర్శకులు క్రమముగా వారి ననుకరింప మొదలిడినారు. ఇక విమర్శనము పెరుగవలయు. కవులగువా రావిమర్శనమును పాటించుచు సృష్టిని సాగింపవలయు. విమర్శన మెంతవృద్ధియైన సృష్టి యంత తగ్గుచుండును. పాండిత్యము హెచ్చిన కొలది కల్పనాశక్తి కుంఠీభూత మగును. అందును పాండిత్య ముండినట్లు స్వానుభవమునకు వచ్చిన కొలదిని వ్రాయు ప్రతియక్షరమునందును లోపములగపడుచుండును.

౧౯ వ శతాబ్దమున యూరపుఖండమునందలి ప్రతిదేశమునందుండు ప్రజలును ఫ్రెంచిస్వాతంత్ర్య వ్యాపనముచే నొకవిధమైన కలవరమునకు పాలైరి. మధ్యయుగములందలి మర్యాదలు నధికారములును మాఱిపోయెను. ప్రజలయొక్క సంపూర్ణదృష్టి స్వాతంత్ర్యముపైకి ప్రసరించెను. స్వాతంత్ర్యము కవితకు ప్రాణదాయకము లగు నంశములలో నొకటి.

ఇప్పటి మన యనుభవమువలననే యట్లు సిద్ధాంతము చేయవచ్చును. స్వాతంత్ర్య మన్న నొక్క-రాజకీయ మనియే నా యాశయము కాదు. మత విషయముల గాని, సాంఘికవిషయముల గాని నూతనాభిప్రాయములు కలిగి వాని ప్రోద్బలముచే ప్రాతయభిప్రాయము లంతరింపవలసిన యవస్థ గాని, మాఱవలసిన యవస్థ గాని తటస్థించినప్పుడు జనుల మనంబు లొకవిధమైన నూతనోద్వేగమునకు గుఱి యగును. మతమునంగతి చూతము. వెనుకనుండు మతములో మార్పులు చెందవలసినకాలము సంభవించినపు డెంత వాఙ్మయము బయలువెడలునో చూడుడు. బ్రహ్మసమాజమతవ్యాపనసందర్భమున నేకేశ్వరారాధనమును గూర్చియు, విగ్రహారాధనాది పూర్వాచారనిరసనమును గూర్చియు నెంత నూతన వాఙ్మయము బయలువెడలెను! అట్లె విధవా వివాహసందర్భంబున రండాముండనాదివిషయములపైనను, బాల్యవివాహములపైనను నెంత వాఙ్మయము వ్యాపించెను! పాదరీలు క్రీస్తుమత వ్యాపనముకొఱకు చేసిన కీర్తనలను మన మెఱుగమా? గీతములకు మనస్సు నాకర్షించు శక్తి యున్నట్లు దీనివలన స్పష్టమగుచున్నది. సమస్తమైన కవిత్వమును మతముపై నాధారపడియున్నది. ఏ వాఙ్మయమునందైనను మతమే కవిత్వమునకు బీజభూతము. ఋగ్వేద మేమి! ఉపనిషత్తు లేమి! బైబిలుగ్రంథ మేమి! జెందవస్తా యేమి! ఇవి యన్నియు మతగ్రంథములే కదా? మొన్నటి స్వరాజ్యాందోళనమున నెన్ని స్వరాజ్యగ్రంథమాలికలు వెలువడి, నాటకములను, లఘుకావ్యములను, పద్యావళులను, పాటలను కుప్పతిప్పలుగా ప్రకటించిరి! ప్రకటించుచున్నారు! కావున స్వాతంత్ర్యేచ్ఛ కవిత్వమున కుజ్జీవకము.

౧౯ వ శతాబ్దమున నింగ్లాండునందలి కవులు స్వాతంత్ర్యదేవతారాధనము నెన్ని విధముల చేయవలయునో యన్నివిధముల గావించిరి. తరువాత శాస్త్రపఠనము పెంపొందెను. దానిచే పండితులకు విమర్శనాశక్తి హెచ్చెను. చరిత్రమునకు నూతనజీవనము కల్పింపబడెను. సంపూర్ణముగ శల్యపుంజమువలె సంవత్సరముల పట్టిక గాక వర్ణనాంశముల జేర్చి రసవంతముగ చేయబడినది. ప్రజల యాదర్శములే మాఱిపోయెను. సర్వతోముఖవృద్ధితో వాఙ్మయముకూడ వృద్ధి నొందెను. కవులు నియమశృంఖలావిచ్ఛేదము గావించిరి. విమర్శకులే యీ పరిస్థితులకు ముఖ్యకారకులు. విమర్శకులు విమర్శించినకొలది కవులకు స్వాతంత్ర్యమె చ్చయ్యెను. ఈ విమర్శనాకవిత్వము లన్యోన్యాశ్రయమును కోరు నంశములు. విమర్శకులు ప్రాచీన వాఙ్మయమున వెదకి దానిని వెలయింప మొదలిడిరి. పూర్వవాఙ్మయమథనసాహాయ్యముచే నవీనకవిత్వము ప్రజలయందు వాఙ్మయాభిరుచిని పెంపొందజేసెను. రాజకీయవిషయములందుగాని మరి యే యితర విషయములందు గాని యూరపుఖండమున కంతకును వెలుతురును వెదజల్లినది ఫ్రాంసుదేశము. ఈ ౧౯ వ శతాబ్దియందు కూడ, యింగ్లాండునకు మార్గదర్శి ఫ్రాంసుదేశమే. వర్డ్సువర్తు, కోలెరిడ్జి, షెల్లీ మొదలగు ప్రతిభాశాలు రగు కవులు తమ గుణపాఠములను ఫ్రాంసుదేశము నుండియే నేర్చుకొనిరి. ౧౯ వ శతాబ్దపు కవిత్వము వీరి యనుసరణమే యని చదివిన ప్రతివానికిని తేటతెల్లము కాగలదు. యూరపుఖండమున నాధునికవిమర్శనమునకు కోలెరిడ్జియే తండ్రి. ఆంగ్లేయకవి యగు షేక్స్పియరును ప్రపంచకవిని చేసిన జర్మనుల విమర్శనమునకు కోలెరిడ్జియే ప్రేరకుడు. ఆయ్యన

ప్రేరణమును గైకొనియే తరువాతివా రందఱును విమర్శనమును సాగించిరి. విమర్శనమునకు సానుభూతి ముఖ్యము. ప్రథమమున నాంగ్లవిమర్శనము మన ప్రస్తుతవిమర్శనమువలె సానుభూతిరహితమై రంధ్రాన్వేషణమాత్రమై యుండెను. ఈ రంధ్రాన్వేషణము కూడ తన కర్తవ్యమును నిర్వర్తించెను. విమర్శన మట్లు పెరుగుటచేతనే తరువాత షెల్లీ, కీట్సు, టెన్నిసను మొదలగు మహాకవులు బయలు వెడలి మానవజీవితమునందలి యుత్తమాంశముల గ్రొంజవు లొల్కునట్లు పాడగలిగిరి. ప్రకృతి వారి యెదుట నాట్యమాడి వారికి వశురాలై పోయెను. వారు ప్రకృతియు కూడ నైక్యమైపోయిరి. ఎటు చూచిన నానందమే యనుభూత మయ్యెను. భగవానుని యంశ మెంత సూక్ష్మవస్తువునం దైనను కన్పట్టెను. ప్రపంచంబున నేహ్య మగు వస్తువే యగపడలేదు. ఇది యంతయు స్వాతంత్ర్యఫలము. సానుభూతిసహితవిమర్శనముకూడ దీనికి సహాయకారి యయ్యెను. ఈ విమర్శన మెప్పుడు మేరమీఱి పెరిగెనో యప్పుడు సృష్టి కుంఠీభూత మయ్యెను. తరువాతికాలమున నంతటి మహాకవి జన్మింపనే లేదు.

ఆంగ్ల వాఙ్మయమునందువలె నాంధ్రవాఙ్మయమునందు కూడ కవులకును దారిద్ర్యమునకును చుట్టఱిక మెక్కువ. కవుల కెప్పుడును కోటీశ్వరులమగుదుమను నాశయుండదు. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం" అని పెద్దలు చెప్పుదురు. రాజ్యభోగములు కూడ వారికి తృణప్రాయముగ గనుపట్టును. కాని వారిని జీవనమునకు వెదకుకొనకుండ చేయు కర్తవ్యము దేశమున కున్నది "ప్రపంచమును నాగరకముగ జేసి వారి మనస్సులపై ప్రోద్బలముచేసి వారిని విద్యావంతులుగను, సత్ప్రవర్తనాయుతులుగను చేయుటకు భగవంతునిచే పంపబడిన దూతలు కవు"లని కార్లైలను మహనీయుడు చెప్పుచున్నాడు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అట్టి యానందమును వాక్పటములచే చదువరుల హృదయనేత్రములకు గన్పట్ట జేయువారు కవులు. "నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై జల్లెడువాడు మౌళిపరిసర్పితపింఛమువాడు" అని చదువునపుడు కవి కృష్ణుని దివ్యమంగళస్వరూప మెట్లు మనంబుల తాండవమాడించి చదువరుల నెట్లానందాంబుధి నోలలాడించుచున్నాడో చూడుడు! కావుననే తమవిధి యని మన పూర్వపు రాజులు కవులను పోషించిరి. సంస్కృతవాఙ్మయధురంధరులగు కాళిదాసాదులు కూడ రాజాస్థానరంగనటులైనట్లే మనకు తెలియును, ఇంగ్లండుదేశమున కూడ దాదాపు మిల్టను, వర్డ్సువర్తు, టెన్నిసను మొదలగు కవులు కూడ రాజాస్థానముననే వఱలిరి. కడుపునకు వెదకికొనకుండ కవులను చేయుట దేశముయొక్క విధి. మనదేశమున దేశీయరాజ్యములడుగంటిన తర్వాత కవుల యవస్థలు బయటపడెను. ఇతరవృత్తుల జూచుకొనవలసివచ్చెను. దాన వారి ధార కట్టుపడెను. ఒకవేళ నావృత్తినే స్వీకరించిన బట్టుకవిత్వముచే ధనవంతుల బొగడి పొట్టపోసికొనవలసివచ్చును. పాశ్చాత్త్యుల ప్రభుత్వము వేళ్లు ప్రాకిన కొలదిని రాజులకు చేయుపనులు లేక వారి పరాక్రమము నామావశిష్టమయ్యెను. కోడిపందెములందును, వృథాధనవ్యయమునందును, వారు కాలమును వ్యర్థపఱచుచున్నారు. పందొమ్మిదవ శతాబ్దముయొక్క యుత్తరార్థమున నాంధ్రదేశమున నెక్కడనో యొకరిద్దఱు రాజులు తప్ప కవులకు ప్రాపొసంగినవారు గానరారు, ఒకవేళ కొందరిప్పటికి నుండినను వారు రాజులనునవ్వించుచువిదూషకప్రాయు

లైయున్నారు. నేటివఱకును కవులగలియత్లేయున్నది. కాని యిటీవల కొన్ని వత్సరంబులనుండి పొడమిన నూతనస్వాతంత్ర్యేచ్ఛవలన కొంచెముగ మరల కవుల కావేశము కలుగుచున్నది. స్వాతంత్ర్యపరిణామము ప్రకృతికవిత్వము గాన నిక నది బయలు వెడలవలయు. తత్సూచనలు కూడ కనబడుచున్నవి. అక్కడక్కడ కొన్ని భావపూర్ణవ్యక్తు లవ్యక్తమధురగానముచేయ సమకట్టినారు. ఆ గానముతో దిక్కులు మాఱుమ్రోగవలయు. తలనెప్పి జనింపవలయు. స్వాతంత్ర్యము మిక్కుట మైనపు డది కూడ నసహ్యమగును. ఖండకావ్య మీప్రకృతి కవిత్వసూచకము. నవలకూడ యీకాలమునకు సంబంధించినదియే.

"ఉద్రేకము కవితాశక్తికి ప్రాణాధార మైన కారణము." ఉద్రేకము లేని కవిత్వ ముత్తచెత్తవలె నీరసముగా నుండును. అట్టి కవిత్వ ముద్రేకము లేనివారికే రుచించును. ఉద్రేక మన్న బొత్తుగ మైమఱచుట కాదు. మైమఱచిన నంత ప్రమాదము లేదు. కవిత్వము నట్టి యాబ్దికమంత్రమునవలె కేవలసమయపూరిత మైనయది మాత్రము బొత్తిగ శిరోబాధ కలిగించును. కవిత్వ మన్న ప్రథమపఠనము పునఃపఠనమునకు పాఠకుని పురికొల్పవలయు. ఉద్రేకము విమర్శకుని యాజ్ఞకు లోబడునది కాదు. "కవి నిరంకుశుడు" కాని యీ నిరంకుశత్వమునకు మేర కలదు. కేవల నిరంకుశత్వము సాంఘికమునందువలె సారస్వతవిప్లవమును కలుగజేయును. స్వాతంత్ర్యమని వ్యభిచరించుట తగునా? స్వాతంత్ర్యమని యితరులను కొట్టుట తగునా? స్వాతంత్ర్యమని అతిగ భోజనముచేసిన ప్రకృతి యూరకుండదు. కావున నియమబద్ధ మైన స్వాతంత్ర్యమే సుఖదాయి; ఈ నియమము కవిత్వమునకు కూడ వర్తించు నని నా యభిప్రాయము.

కవిత్వమునకును విమర్శనమునకును పరస్పరసంబంధమున్నదని మున్నె విన్నవించితి. సాధ్యమైనంతవఱకు విమర్శకుడు కవి యగుట కష్టము. ఒకవేళ కొన్ని వ్యక్తులయం దీరెండుశక్తు లున్న నేదియు నుసంపూర్ణముగ నభివృద్ధి నొందనేరదు. అట్టి కొన్ని వ్యక్తుల వ్రాతల పరీక్షించిన నీ సత్యమును మనము గ్రహింపగలము. అల్పసంఖ్యాకు లగు కొన్ని యద్భుతవ్యక్తు లీ నియమమునకు లోబడకపోవచ్చును. ప్రకృతిశాస్త్రనియమము కాదు గాన సాపవాద మైనను ప్రమాదము లేదు. ఆంధ్రవాఙ్మయమున వెదకగా నట్టి వ్యక్తి యొక్క పింగళిసూరన యలవడును. విమర్శనాశక్తి మెండుగ నుండు కవులలో సృష్టికి తగినంత యుద్రేకము గానరాదు. ఉద్రేకమున పోతనామాత్యు డసమానుడు. ఆయన ను చెప్పిన నోట నింకొక కవిని చెప్పుటకు వీలు లేదు. కవి యైనవాని కెక్కుడుగ పాండిత్య మలవడిన కవిత యంతర్వాహిని యై బయటకు వచ్చునపుడెల్ల దాని కభ్యంతరము కలుగుచునే యుండును. పండితకవి గ్రంథముల వ్రాసిన నవి పరిడితులకేగాని సామాన్యజనులకు గావు. శ్రీ కొక్కొండ వేంకటరత్నంపంతులవారియొక్కయు, వంకపాక పార్వతీశ్వరశాస్త్రిగారి యొక్కయు గ్రంథముల జూచిన నీ సత్యము తేటపడగలదు. కొన్ని స్థలముల గ్రంథకర్తలే టీక వ్రాయవలసిన యవసరము కలదు. మఱియు కాలపరివర్తనముచే నట్టి గ్రంథములకాదరణము తగ్గినది. ఇప్పుడు ముల్లు రెండవకొన నున్నది. ఎంత బట్టబయలుగ వ్రాసిన నంత రసవంత మని కొనియాడబడుచున్నది. సహృదయత్వము బూతులుగా పరిణమించునేమో.

"The lunatic, the lover, and the poet are of imagination all compact."

ఈ వాక్యములను ప్రపంచంబున గొప్పకవులలో నొకడగు షేక్స్పియరను కవి చెప్పియున్నాడు. కవి భావపూర్ణహృదయుడై యుండు నని దీని యభిప్రాయము. అతనిసృష్టియే వేఱు. అతని ప్రపంచమే వేఱు. ఎక్కడచూచిన నతనికానందమే కన్పుట్టుచుండును. భావపూర్ణ మగుటచే హృదయమున నేఱొండు విషయమునకు దావులేదు. కవినిరంకుశత్వమున కీయుదాహరణ మొక్కటిచాలును. "నభ్రాతరం తార్కికం" అనియు "మీమాంసానిపుణం నపుంసక ఇతి జ్ఞాత్వా నిరస్యాదరాత్" అనియు నీ భావమునే బిల్హణుడు మధురమైన వాక్యములతో చెప్పినాడు. విమర్శకుం డింత భావపూర్ణుడై యుండుట కవకాశము లేదు. ఉండకూడదు. కావున విమర్శకునకు కవి బాగుగా వ్రాయలేదని చెప్పుట కధికారములేదు. కవిహృదయప్రవేశ మొనర్చిన బాగుగ లేదనినభాగముకూడసమంజసముగనేతోచవచ్చును.

కవిత్వమునకు విషయాకారములు అనగా శబ్దార్థములు రెండును ముఖ్యములె. రెంటికిని సమానమగు ప్రాముఖ్యమునిచ్చి యేకవి వ్రాయునో యాకవి గ్రంథములు మిక్కిలి రసవంతములుగ నుండునని వేఱ చెప్ప బనిలేదు. కొందఱు కవులు విషయముపైననే యెక్కువ యనురాగ మున్నట్లు కన్పట్టుదురు. మఱికొందఱు విషయముకంటె కవిత్వాకారమునకే యెక్కుడుశ్రద్ధ వహించినట్లు గన్పట్టుదురు. రెండును కవిత్వమునకు సమానముగ కావలసిన యంగములు.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం."

"యువతేరివ రూపమంగ కావ్యం
స్వదతే స్వచ్ఛగుణం తదప్యతీవ
విహితప్రణయం నిరంతరాభి
స్సదలంకారవికల్పకల్పనాభిః."

ఆంగ్లములోకూడ "Matter & Form" అని విమర్శకు లందఱును రెంటికిని కవిత్వమున ప్రాధాన్యము నొసంగినారు. పాఠకప్రపంచము కూడ నట్లె రుచిభేదముచే విషయమన్న కొందఱును నాకారమన్న మఱికొందఱును మెచ్చుకొనుచుందురు. విషయ మెక్కువగ హృదయము నాకర్షించును. ఆకారము బుద్ధి నాకర్షించును. రెండును నానందమొందవలసినదే గాన రెండు కూడ నెక్కువ తక్కువలు కాకుండ నుపయోగింపవలయును. కవులలోను పాఠకులలోను నిరుతెగలు కలవని తెలియుచున్నది. వీనిబట్టి గ్రంథము లుండును. మఱియు నొకకాలమునకు రుచి యొకవిధముగ నుండును. క్రిందటి యుగమున మిగిలిన యలంకారముల కెక్కువ యాదరము. ఈ యుగమున స్వభావోక్తి కెక్కువ పలుకుబడి. క్రిందటియుగమున ప్రబంధ కవిత్వమున కెక్కువ పోషణము. ఇపుడు ఖండ కావ్యము రాజ్యమేలుచున్నది. అటులనే పదునెనిమిదియవ శతాబ్దమున తెనుగు కవులందఱును విషయము సందుకంటె నాకారమున శ్రద్ధ నెక్కుడుగ చూపిరి. అది ప్రబంధయుగము. జనసామాన్యము యొక్క రుచిభేదమును బట్టి యాకాలపు రచన యుండును. కాని యన్నికాలము లందు కూడ నన్ని తెగలవా రుందురు. పాఠకప్రపంచముయొక్క రుచినిబట్టి ప్రధానరచన సాగుచుండును. విషయము నందే యెక్కువశ్రద్ధ నుంచవలయునని వాదించు నిక్కాలంబున గూడ నాకారముపైననే దృష్టి గల కవులును పండితులును లేకపోలేదు. మన పదునెనిమిదియవ శతాబ్దమునందువలెనే యాంగ్లవాఙ్మయమును పరిశీలించిన గూడ నా శతాబ్దమందు కవులు (Dryden మొదలగువారు) కేవలకవిత్వాకారమునే యారాధించినట్లు గన్పట్టుచున్నది.

అందువలననే యాంగ్లవాఙ్మయమున నా కాలము (Age of Commonsense) సాధారణజ్ఞానయుగ మని పిలువబడుచున్నది. తరువాత నసంతృప్తి కాపరిస్థితులే కారణము లని యాంగ్లవాఙ్మయచరిత్ర పఠనముచే తెలియుచున్నది. మన వాఙ్మయమున నీ యసంతృప్తి యీ శతాబ్దమున వచ్చినది. పరికించిన మన మొక్క-శతాబ్దము వెనుకపడినట్లు తోచుచున్నది. ఏల యన ఆంగ్లవాఙ్మయమున పందొమ్మిదవశతాబ్ద పరిస్థితులు మన ప్రస్తుతస్థితికి వర్తించు చున్నవి. పందొమ్మిదవ శతాబ్ద మంతయు నాంధ్ర కవిత్వము, గతానుగతిక మైపోయెను. కొందఱు వ్యక్తుల హృదయములలో నీ యసంతృప్తి యీ శతాబ్దాంతముననే ప్రారంభించినది. అది క్రమముగ పూర్వాచారసంఘట్టనమున సానపెట్టబడి యిప్పుడు కొంత సామగ్రి కూర్చుకొని ప్రస్తుతపు ప్రకృతికవిత్వ మనుదానికి బునాదివైచినది. ప్రకృతికవిత్వ మిక పెరిగి శాఖలు పారవలయు. కొందఱు ఖండకావ్యములను వ్రాయుచున్నారు. మఱికొంద ఱనేకవృత్తములలో బహుపంక్తులను కొండపేటిచేత్రాడులవలె వ్రాయుచున్నారు. ఇంక కొందఱు సామాన్యవిషయముల నున్నవాని నున్నయట్లు వ్రాయుచున్నారు. ఇవి యన్నియు ప్రకృతికవిత్వసూచకములా యని యాలోచింపవలసి యున్నది. కొందఱు పూర్వాచారపరాయణులు వీని నన్నిటిని నిరసించుచున్నారు. మొత్తముమీఁద బహుమంది వ్రాయసకాండ్ర మనంబుల నీ యసంతృప్తి వ్యాపించియున్నది. మాది తొలకరికవిత్వ మని గాని, మాది భావప్రాధాన్యకవిత్వ మని గాని చెప్పుకొనువారిది నిజమైన ప్రకృతికవిత్వమో కాదో విమర్శకులు విచారింపవలసి యున్నది.

# దొంగాట

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. యే., బి. యల్.

ఉత్తుత్తీపల్లు
ఉత్రాణీపల్లు
నేరేడీపల్లు
నిమ్మాపల్లు.
తోడి పిల్లల్లార! దొంగైనపిల్ల
తన మొగుడిపేరేమొ తానె చెప్పాలి!

ఉత్తుత్తీపల్లు - ఉత్రాణీపల్లు
నేరేడీపల్లు - నిమ్మాపల్లు. (లలితదొంగ)
ముద్దు లలితా! నీ మొగుడి పేరేమె?
నా మొగుడి పేరొచ్చి నారింజపండు!

ఉత్తుత్తీపల్లు - ఉత్రాణీపల్లు
నేరేడీపల్లు - నిమ్మాపల్లు. (రమణమ్మదొంగ)
చిట్టిరమణా! నీచెల్వు పేరేమె?
నాచెల్వు పేరొచ్చి—నే చెప్పనమ్మ!
చెప్పవా? దొంగైతె తప్ప దోయమ్మ!
నాచెల్వు పేరైతె నా చిట్టిమొగుడు!

ఉత్తుత్తీపల్లు - ఉత్రాణీపల్లు
నేరేడీపల్లు - నిమ్మాపల్లు. (అన్నపూర్ణదొంగ)
అన్నపూర్ణా! నీచిన్నిమొగు డెవఁడె?
నా చిన్నిమొగుడొచ్చి ఆ చందమామ!

ఉత్తుత్తీపల్లు - ఉత్రాణీపల్లు
నేరేడీపల్లు - నిమ్మాపల్లు. (సీతమ్మదొంగ)
సొగసుసీతా! నీ మొగుని పేరేమె?
పాలసంద్రమ్మీఁది బాలకృష్ణుఁడు!

# శ్రీ వేంకటాచలః

దేవులపల్లి అప్పలనరసింహం గారు, యం. యే., యల్. టి.

ఆహో పదం మురరిపోః ఫణిశైలమూర్ధ్ని
సౌవర్ణగోపురశిఖాధృతశంఖచక్రమ్
శ్రీపాదదర్శనకుతూహలిభక్తలోక
ఫుల్లాననాక్షిశతపత్ర సమర్చ్యమానమ్. ౧

శ్రీ శేషాచల శిఖరమందు సువర్ణగోపురశిఖరమందు నమర్పబడిన శంఖచక్రములచే ప్రకాశించుచున్నదియును, జగద్గురువుయొక్క దివ్యపాదములను దర్శించు వేడుకచే వికసించుచుండు భక్తులయొక్క ముఖపద్మములచేతను నేత్రపద్మములచేతను పూజింపబడుచున్నదియును నగు ఈమహావిష్ణువుయొక్క ఆలయము మిక్కిలి ప్రశంసనీయమై యున్నది.

గాయంతి కేచిదతిగీతి మలభ్యవృత్తిమ్
నృత్యంతి కేచి దిహదైత్యరిపుం భజంతః
కేచిత్ప్రదక్షిణమముం పరితో వ్రజంతి
వేదాం స్తథా ద్రవిళవాక్యనుతీః పఠంతః. ౨

కొందఱు భక్తులు పాటలకందరాని తెలియశక్యముగాని పోకడలు గలిగిన కృష్ణునిగుఱించి పాడుచున్నారు. కొందఱు వేదములను ద్రవిడభాషలోని (తిరునాయ్‌మొళి అను గ్రంథములోని) స్తోత్రములను పఠించుచు ప్రదక్షిణములను చేయుచున్నారు.

తుంగాని భక్తకృతపానగృహైర్యుతాని
సోపానవిశ్రమపదేష్విహ గోపురాణి
నామాని భక్తజనకోటివిలేఖితాని
స్నిగ్ధాని భక్తపదసాధుశిలాతలాని. 3

సోపానపంక్తిలో నచ్చటచ్చట విశ్రాంతికొఱకేర్పడిన విశాలప్రదేశములయందు భక్తులచే నేర్పఱుపబడిన చలివేంద్రలతో నొప్పారు గోపురములు ఉన్నతములై విలసిల్లుచున్నవి. సోపానములయందు అనేకకోట్ల భక్తులయొక్క పేర్లు చెక్కబడియున్నవి. సోపానశిలాతలము లన్నను లెక్కలేని భక్తులయొక్క రాకపోకలచే నున్ననై యాత్రికులకు సుఖకరము లైనవి.

రాజంతి శైలశిఖరాణ్యపిధాతుగౌరా
ణ్యాభోగజాల మివ నాగకులాధిపస్య
నీలాంబరస్య కిమిహానుకరోతి శైలే
సాంద్రప్రకీర్ణతరుగుల్మలతావితానమ్. ౪

ఈ వేంకటాద్రియొక్క శిఖరములను జూడ గౌరవర్ణములు గలిగి ఆదిశేషుని పడగలవలె విరాజిల్లుచున్నవి. ఈ కొండనున్న చెట్లు చేమలు పొదలు లతలు వీనియొక్క సెంపు ఆదిశేషునియొక్క నీలాంబరపు సొంపు ననుకరించుచున్నదా ఏమి?

శోభాం దధాన ఋతుభేద నిరాకరిష్ణుః
సత్త్వాధినాథపదసంగతి శాంతసత్త్వః
దిక్సానుశృంగజలదౌఘ విహంగజాల
ప్రత్యుద్గృహీతమధుమాధవకృష్ణశబ్దః. ౫

ఋతుభేదములను సరకుసేయని శోభను ధరించుచు, సత్త్వగుణనిధి యగు మహావిష్ణువుయొక్క పాదసంస్పర్శవలన శాంతములుగఁ జేయబడిన అడవిమృగములను గలిగి అన్నిప్రక్కలను భక్తులచే నుచ్చరింపఁబడు మధు, మాధవ, కృష్ణయను నారాయణుని నామంబులను దిక్కులనుండి చరియలనుండి శిఖరములనుండి మేఘపంక్తులనుండి పక్షులరవములనుండి ప్రతిధ్వనింపఁ జేయుచు ఈవేంకటాద్రి మిక్కిలి మనోహరముగా నున్నది.

పశ్య త్వనః పునరపీహ నతృప్తిమేతి
చక్షు ర్గిరీన్ వనతరూన్ బహువర్ణపుష్పాన్
శ్రుత్వా శ్రుతిగ శుకమయూరపికాళినాదాన్
హర్షం పరంపర ముపైతిహి వేంకటాద్రౌ. ౬

ఈ కొండయందుగల శిఖరములను, అడవిచెట్లను, పలురంగుల పువ్వుచయమును చూచి చూచి చక్షువు తృప్తినొందకున్నది. చిలుకలు, నెమళ్లు, కోయిలలు మొదలగు పక్షిగణములయొక్క నాదములను విని విని శ్రవణేంద్రియము ఈవెంకటాద్రియందు మిక్కిలి వృద్ధి యగు నానందమును బొందుచున్నది గదా.

శ్రీమా న్గిరిర్వనజనేత్రవిలాసభూమిః
భూదేవతాకుచయుగాయితముఖ్యశృంగః
తద్దర్శజాశ్రుపులకం కుసుమాంకురాద్యైః
పద్మాపతే ర్భజతి సాంద్రకరానమర్త్యాత్. ౭

పద్మాత్ముఁనకు విలాసభూమియై భూదేవతయొక్క కుచద్వంద్వమో యన భాసిల్లు ముఖ్యశృంగములు గలిగి యొప్పారు నీ కొండ భూదేవికి లక్ష్మీపతి తనశరీరమును ఆదరణతో నిమిరిన కారణమున జనించిన సంతోషసూచకము లగు బాష్పపులకము లనెడు పుష్పములు చిగుళ్లు మొలకలు మొదలగువానిద్వారా వ్యక్తము చేయుచున్నట్లు తోఁచెడిని.

వైశ్వానరః కిముత కోమలసప్తశృంగః
శేషాద్రిభావ మభజ ద్బహుపాపనాశః
క్లేశార్దితానివ వదన్ కలికాలరాత్రౌ
మా మేత మాధవ మిహాశ్రయతాభయం వః. ౮

రమ్యములగు సప్తశృంగములను గలిగి, పాపనాశాదిబహుతీర్థములను గలిగి, కలికాలమను పెనుచీఁకటియందు క్లేశములచే పీడింపఁబడు మనుజులకు "నావద్దకురండు, ఇక్కడ మాధవుని ఆశ్రయింపుఁడు, మీకు భయము తొలఁగును" అని చెప్పుచున్నట్లు వఱలు నీశేషాద్రి సప్తశృంగుఁడును పావకుఁడు (పవిత్రులఁగ జేయువాఁడు)ను నగు అగ్నిహోత్రుని అవతారమా?

---

# జన్మసాఫల్యము


**నోరి నరసింహశాస్త్రి గారు, బి. ఏ.,**

(సాహితీసమితి)


జన్మ జన్మల నీ పద। స్మరణ గోరి
కడకుఁ గృతపుణ్యఫల మిప్డు। కాంచఁ గంటి
ప్రాణనాథ, లోకోత్తర। భవ్యచరిత,
ఎట్లు నినుఁ గాక నేనాశ్ర।యింతు నెరుల?
ఎందఱెందరో నిన్నాశ్ర।యించి యుండు,
రెందరో త్వదీయామృత।స్య దిమధుర
వాగ్విధుల శాంతచిత్తలఁ। బడసి యుండ్రు,
ధన్యలై యుండ్రు నీ సమా।దరము కలిమి.
ఆత్మసుఖ మట్లు కోర దీ। యల్పురాలు
అట్టి వాంఛ లే దీ దాసి। యాత్మయందు
హృదయమథన, నీ పొందు కాం।క్షించు వేళ
కోరికలు వేరు నా మనః।కోరకమున.
నవసమాగమభాగ్యదిఁ।నంబులందు
చకితచకితకటాక్షమా।లికలమాల
దాసి కఖిలావయవప్రసా।ధన మొనర్చి
కించిదానందలీలఁ గ్రీ।డించు నపుడు;
దయిత, సుమసుకుమార మీ। దాసురాలి
తనువు దృఢదీర్ఘభుజయుగాం।తరమునందు
గాఢపరిరంభణంబునఁ। గదియఁ బొదివి
పరవశత నీవు నీమేను। మరచు నపుడు;
ముఖము ముఖము కపోల క।పోలములును
అధర మధరము గవచేసి। యనఘ, ఢ వయి
చుంబనాసవమత్తతి। సోలి నీవు
ఈ కృతిని వక్షమున విశ్ర।మించు నపుడు;
సఫలతం బొందు నీ దాసి। జన్మ మపుడు!
నేను నా కల సర్వమ్ము। నీకు నీదు
సుఖమునకె కాక వేర నిఁల్చుట యదేల?
అనుభవింపు యథేచ్ఛ నా।త్మైకనాథ!

# భారవి

## చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

### మొదటి ప్రకరణము

భారవి సంస్కృతమహాకవులలో నొకఁడు. బ్రాహ్మణుఁడు. కిరాతార్జునీయ మను మహాకావ్యమును సంస్కృతములో రచించెను. ఈతని కవిత్వము మిక్కిలి యర్థగాంభీర్యము గలిగి రసవంతమయియుండును. "భారవే రర్థగౌరవ" మ్మను నట్టి యార్యోక్తి పయివిషయమును స్థిరపఱుచుచున్నది. ఈ మహాకవినిగూర్చి చిత్రమయిన యొక కథ కలదు. ఇది సత్యమయినదని మేము స్పష్టముగా చెప్పఁజాలము. సత్యమయినను గాకపోయినను చిరకాలమునుండి పండితముఖమునుండి పారంపర్యముగ వచ్చుటచేతను, వినోదకరముగా నుండుటచేతను ఈకథ వ్రాయుచున్నాము. భారవిభట్టు యొక్క తండ్రి భవానీభట్టు. ఈతఁడుగూడ గొప్ప పండితుఁడు. అట్లగుటచేఁ దనకుమారునకు యుక్తవయస్సువచ్చినతోడనే వానిని విద్యాప్రవిష్టునిఁ జేసి యతని కిరువది సంవత్సరములు దాఁటకమున్నె గొప్పపండితునిఁ జేసెను. బాల్యవయస్సు. వయస్సునకు మించిన పాండిత్యము. పాండిత్యమునకుఁ దగిన కవిత్వము. విద్యాకవిత్వములకుఁ దగిన వినయసంపత్తి భారవిభట్టునకుఁ బెట్టనియలంకారము లయి, వానికి విశేషకీర్తిని సంపాదించెను. "పుత్రాదిచ్ఛేత్పరాజయ"మ్మను నార్యోక్తి భవానీభట్టునందు సార్థకమయ్యెను. భారవి పాండిత్యమునందు సత్కవిత్వమునందు శాస్త్రవాదములందు తన జనకుని మించెను. అందుచే భవానీభట్టు సర్వవిధముల తన్ను ధన్యునిగా భావించెను. భారవిభట్టుయొక్క ప్రజ్ఞావిశేషములను మెచ్చి విద్వాంసులెవరయిన భవానీభట్టు నుద్ద కుమారుని స్తోత్రము చేసినప్పుడు భవానీభట్టు "కుఱ్ఱవాఁడు. వానికేమి తెలియును? వానికేమియు రాదు. మీకు వానియందు గల యభిమానముచేత నట్లనుచున్నారు. స్తోత్రముచేయఁదగినంత గొప్పతనము వానియందు లేదు" అని పలుకుచుండును.

కుమారునిస్తోత్రము తండ్రి వినఁగూడదనియు నెవ రయిన పొగడినప్పు డీవిధముగానే పలుకవలయు ననియు మన పెద్దలు చెప్పుదురు. ఇతరులతోపాటు తండ్రి కొడుకును మెచ్చుకొనినపక్షమున కుమారున కాయువు క్షీణ మగు నని మనవారి యభిప్రాయము. అదియును గాక "ఆత్మావై పుత్రనామాసి" అను వేదవాక్యము కలదు. మనుష్యుఁడు తానే పుత్రరూపమయి జన్మించుచున్నాఁడని వాని తాత్పర్యము. అందుచేత జనకుఁడు పుత్రుని మెచ్చుకొనుట తన్ను మెచ్చుకొనుటయే యగును. ఆ కారణముచేతఁ గూడ తండ్రి కుమారుని స్తోత్రము వినఁగూడదని పండితులయభిప్రాయము. ఇవి యన్నియు మనస్సులో బెట్టుకొని భవానీభట్టు కుమారునిపొగడ్తకు విముఖుఁ డయ్యెను. ఇది భారవిభట్టునకు మిక్కిలి కష్టమై తోఁచెను. దిగ్దంతులవంటి మహాపండితులు దేశదేశములనుండివచ్చి తన్ను స్తోత్రము చేయుచున్నప్పుడు తన తండ్రి వారితోఁ గలసి తన్నుఁ బొగడకపోవుటయే గాక మీఁదు మిక్కిలి తన్ను హీనునిఁగా తండ్రి

పరిగణించుటచేత భారవిభట్టునకు తండ్రిమీఁద మిక్కిలి కోపము వచ్చెను. తన పాండిత్యప్రకర్షముం జూచి, యోర్వలేక తండ్రి యిట్లు చేయుచున్నాఁడని యతఁడు భావించెను. కొడుకుపొగడ్త తండ్రి వినఁగూడదను సంప్రదాయము భారవిభట్టు వినలేదు. అందుచే నతనికి తండ్రియభిప్రాయమించుకయినఁ దెలియక యావిధమయిన క్రోధమునకు వశుఁడయ్యెను. అటులుండ నొకనాఁడొక గొప్పసభ జరిగెను. ఆ సభలో సుప్రసిద్ధు లయిన మహావిద్వాంసులు భారవిభట్టుచే నోడింపఁబడిరి. అప్పుడు సభాసదులెల్ల భళీభళీ యని భారవిభట్టును మెచ్చి పొగడిరి. కుమారునివిజయమునకు తండ్రి మహానందబాష్పములు విడిచి లోలోన సంతోషించియు "వాని కేమి తెలియును? వాని కేమి తెలియును? వానియొద్ద స్తోత్రము చేయఁదగిన గొప్పతనము లేదు." అని తన వాడుకప్రకారము ప్రశంసను మందీకృతము చేసెను. అప్పు డప్పు డొకరిద్దఱు పండితులయొద్దనే తండ్రి తన ప్రజ్ఞ నల్పముగఁ జేసి మాటలాడినందుకే మనస్సులో నెంతో కుందుచున్న భారవిభట్టున కాసమయమున జనకుఁడు పల్కిన పలుకులు ముల్కులవలె నాటెను.

నాటుటయు, నాతఁడు చివాలున సభలోనుండి లేచి యింటికిఁ బోయి తల్లికడకుం జని యిట్లనియె— "అమ్మా! యెన్నిదినములనుండియో నీతో నే నొక మాట చెప్పందలంచి యెప్పటికప్పుడే పోని యెందుకని యూరకుండుచు వచ్చితిని. నాపాండిత్యముం జూచి నాయన యోర్వలేక నన్నందఱముందు నిందించుచుండును. నా స్తోత్రము గిట్టదు. ఎవ రెప్పుడు నన్ను స్తోత్రముచేసినను 'వాఁ డేమెఱుఁగును? కుఱ్ఱవాఁడు. వాని కేమియురాదు.' అని నన్ను హీనునిగాఁ బరిగణించుచుండును. దేశములో నున్న పండితులకందఱకు నెంతో పూజ్యుఁడనయియున్న నేను వీని కంటికి గడ్డిపరకగా గనఁబడుచున్నాను గాబోలు! ఈతనిపాండిత్య మెంత? ఈతఁ డెంత? నాముందరనిలుచుండుటకయినఁ దగఁడు. ఈతనిం జంపివేయవలయు నంతకోపము నాకు వచ్చుచున్నది. ఈతఁడు నాకు తండ్రి కాఁడు పరమశత్రువు. ఈతని మొగము జూడఁదలంచుకోలేదు. వీని మొగముజూచిన మహాపాతకము వచ్చును. ఇతనియింట నుండఁదలఁచుకోలేదు. ఇంకొకసారి యీవిధముగా నన్ను గుఱించి ప్రశంసించినపక్షమున నెత్తురుకన్నుల జూచెదనని స్పష్టముగాఁ జెప్పుము. నేటిదినము మహావిద్వాంసులసభలోఁ గూడ నీవిధముగానే పరాభవించినాఁడు. దీనిని సహింపఁజాలనని చెప్పుము." ఆపలుకులు వినఁగానే తల్లి నిశ్చేష్టితురాలయి, కొంతవడి కిట్లనియె. "నాయనా తొందరపడకు. మీనాయనగారు వయస్సుచేతను విద్యచేతను మిక్కిలి పూజ్యులు. ఆయన యవివేకులుగారు. ఆయన యెందుచేత నిట్లనుచున్నారో, కారణము తెలిసికొని చెప్పెదను. అంతవఱకు తొందరపడకు నాయనా," యని చెప్పఁగానే, "సరే కనుఁగొని నాతోఁ జెప్పుము. కారణ మేముండును? ఓర్వలేనితనమె" యని సణగుకొనుచు నతఁ డావలికిబోయి గదిలోఁ గూర్చుండెను. తర్వాత భవానీభట్టు గృహమునకువచ్చెను. రాఁగానే, భార్య కొడుకు తనతో చెప్పినమాట లాయననడిగి, కుమారునియొక్క మనోవైకల్యము నంతయుఁ దెలిపెను. భవానీభట్టు విషాదసంతప్తమానసుఁడయి యిట్లనియె. "నా కుమారుఁడింత తెలివితక్కువవాఁ డగునని నే నెప్పుడు తలంపలేదు. తండ్రి కుమారుని దానుస్వయముగా స్తవమొనరింపఁగూడదు. మఱియొకరు స్తవమొనరించుచున్నప్పుడు విని యూరకుండఁగూడదు. తానుఁగూడ నితరులతోఁ గలసి కొడుకును మెచ్చుకొన్న, కొడు

కున కాయుః క్షీణమగును. అందుకు భయపడి వాని కేమి తెలియనని పలుకుచువచ్చితిని. వాని కేమి తెలియ దని నా యభిప్రాయము కాదు. వాఁడు నాకంటె గొప్పపండితుఁడు. నాకంటెనే కాదు. వానితో సమానుఁ డయిన విద్వాంసుఁ డీనాఁటి పండితులలో లేనేలేడని చెప్పవచ్చును. నా కొడుకును బొగడుట నన్ను నేఁ బొగడుకొనుట యని మానితిని గాని వాని కీర్తి తగ్గించుటకు గాదు. ఇటువంటి కుమారరత్నము నాకుఁ గలిగినందుకు మనస్సులో నే నెంత సంతసించుచున్నానో పరమేశ్వరుఁ డెఱుఁగును. వాడు నా కులదీప మని, నా వంశాలంకార మని, నా పుణ్యముపంట యని, నేను సంతోషించుచున్నాను. చిన్నతనముచేత వాని కీవిషయము తెలియక దురభిప్రాయపడినాఁడు. మనస్సులో నట్టి యభిప్రాయ ముంచుకోవద్దని యాతనితోఁ జెప్పుము." ఈమాటలు గదిలో నున్న భారవిభట్టుచెవిని బడెను. పడఁగానే యతఁడు తాను తండ్రివిషయమయి పడిన దురభిప్రాయమునకు మిక్కిలి పశ్చాత్తాప మొంది, మెడకు బట్టఁజుట్టుకొని కన్నీళ్లతోఁ దండ్రి కాళ్లపయిఁ బడి తా జేసిన నేరము క్షమింపుమని వేఁడుకొని చేయఁదలఁచిన పితృద్రోహ మహాపాతకమునకు దగిన ప్రాయశ్చిత్తము విధింపుమని ప్రార్థించెను. పాదములపయి బడ్డకొడుకును లేవనెత్తి తండ్రి "సంవత్సర మత్తవారియింట నుండి రమ్ము. దీని కిదే ప్రాయశ్చిత్త" మని విధించెను.

## రెండవ ప్రకరణము - అత్తవారియింట నివాసము

తండ్రిని నిందించినందుకుఁ జంపదలచినందుకు మహాప్రాయశ్చిత్తముగా భారవిభట్టు కొంతకాల మత్తవారియింటఁ దనతండ్రి యానతిచ్చినచొప్పున వాసము చేయుటకు నిశ్చయించుకొని తల్లిదండ్రులను విడువవలసివచ్చినందుకు మిక్కిలి విచారించి నయనములు బయలుదేఱిపోయెను. కొడుకును విడువలేక తలిదండ్రులు విచారించిరి. భారవిభట్టుయొక్క భార్య పుట్టినింటనే యుండెను. పునస్సంధానమయినది కాని యామె నత్తవారింటికిఁ బంపలేదు. అల్లుండు వచ్చినతోడనే యత్తమామలు బావమఱఁదులు ప్రత్యుత్థానముచేసి సాదరముగా సగౌరవముగా లోపలికిఁ దీసికొనిపోయి, సకలోపచారములు చేసిరి. మూడునాలుగుదినము లయినతరువాత మామగారు వచ్చినపని యేమని యడిగిరి.

తనదుర్వినయమునకు ప్రాయశ్చిత్తముగాఁ నత్తవారింట నుండవలసి వచ్చినట్లు చెప్పక కొన్ని కారణములచేతఁ దనకుం దండ్రికి మనఃస్పర్ధలు బయలుదేఱుటచేతఁ గొంతకాల మిక్కడ నుండవలసి వచ్చినట్లు చెప్పెను. అది విని మామగారు పెదవి విఱిచెను. ఆ దినము మొదలుకొని భారవిభట్టునకదివఱకు జరుగుచుండిన గౌరవాదులు క్రమక్రమముగా సన్నగింపఁజొచ్చెను. మొదటి మూఁడుదినములయందువలె నెగునపీఁటలు దిగునపీఁటలు వేసి యల్లునిఁ గూర్చుండఁబెట్టుటలేదు. అడుగకముందే యతనికిఁ గావలసిన వస్తువులు పూర్వము వాని యొద్దకు వచ్చుచుండెడివి. ఇప్పుడు పదిసార్లడిగినను వచ్చుచుండుట లేదు. పూర్వ మల్లునకు భోజనము పెందలకడఁ జేసి పెట్టుచు వచ్చిరి. ఇప్పు డందఱతోపాటు రెండుజాములు దాఁటినపిమ్మటనే మొదటి భోజనము జరుగుచు వచ్చినది. ఇతరసౌఖ్యములన్నియు నీవిధముగానే యడుగంటినవి. బావమఱఁదులు భారవిని దమపొలములోనికి రమ్మని తీసికొని వెళ్లి మెల్లమెల్లగా నొక్కొక్కపనిఁ జేయించి తుట్టతుదకు పాఱగునపము తట్ట చేతికిచ్చిరి. భారవిభట్టు సకలపురాణములు సకలేతిహాసములు చదివిన మహావిద్వాంసుఁ డగుటచే 'నవస్థాభేదమును బట్టి

రాజ్యసుఖములు విడిచి రథసారథియైన నలచక్రవర్తికంటె, చండాలసేవ జేసిన హరిశ్చంద్రునికంటె, సన్న్యాసియైన ధర్మరాజుకంటె, వంటలవాఁడయిన భీమునికంటె, జడలు దాల్చి వనవాసము చేసిన రామునికంటె మన మెక్కువవారమా? యనుభవింపవలసివచ్చినప్పుడు సుఖదుఃఖముల రెంటిని సమానముగ ననుభవింపకతప్ప" దని మనస్సు కుదురుపఱచుకొని యత్తవా రేపనిఁ జెప్పిన నాపని శ్రద్ధాళుఁడయి కూలివానికంటె నెక్కువ జాగరూకతతో జేయఁజొచ్చెను. కొన్నిదినము లెవరో యొకరు పొలములో నుండవలసివచ్చినందున భావమఱఁదులు భారవిభట్టునే యక్కడ నుండు మని యాజ్ఞాపించిరి. అతఁడు వారియాజ్ఞ శిరసా వహించి యక్కడనే యుండెను. అత్తవారు వానికి భోజనము భార్యచేత ప్రతిదినము పొలమునకుఁ బంపుచువచ్చిరి. భారవి నెంత అవమానపఱచినను నెంత అలుసు చేసినను భార్యమాత్ర మాతనియందుఁ బరమభక్తి గలిగి తన పుట్టినింటివారు తనభర్తయెడల చేయుచున్న యపచారమునకు మిక్కిలి కుందుచు దాను జేయునదేమియులేక తనశక్తివంచనలేక యాతనికి సకలోపచారములు చేయుచు, నెప్పుడు తన పుట్టినింటనుండి తా మిద్దఱును బయలుదేఱివెళ్లి సుఖపడుకాలము వచ్చునా యని మంచిదినములకై యెదురుచూచుచు ననుదినము భర్తకాహారము పొలములోనికి దీసికొని వెళ్లి కడుపారఁ గుడువఁబెట్టి యాతనిమనస్సున కుల్లాసము గల్గించి వచ్చుచుండును. ఆ యూరిలోనివా రందఱు, భారవిభట్టుయొక్క యవస్థఁ జూచి "యాహాహా! ఈశ్వరసంకల్పముయొక్క వైచిత్ర్యములు!! మెచ్చఁదగినవి. గంటము పట్ట నలవాటుపడినవానికి గడ్డపాఱ చేతికి వచ్చినది. మహారాజసభలలో నుండువానికిఁ బొలములలో నుండవలసివచ్చినది. తర్కమీమాంసావ్యాకరణాది శాస్త్రములను వాదము సేయు నోటితో దుక్కిటెడ్లను చోయిచోయి యని నడిపించి పాలేళ్లను బిలువవలసి వచ్చినది. భుజములమీఁద శాలువ ధరించువానికి నాగళ్లు ధరింపవలసివచ్చినది." అని తమలోఁ దాము చెప్పుకొని జాలిపడుచుండిరి. ఈ యూహాలలో నొకటియైన భావమఱఁదులకుఁ గాని మామగారికిఁగాని తోఁపలేదు. పొలములో నల్లుఁ డెంత కష్టపడినను, సరిగాఁ బని చేయలేదని, యాతనిమీఁద వారందఱు విసుగుకొందురు. "తిండికి కేనుఁగు పనికి పీనుఁగు" నని పరిహాసమునకై కొన్ని మాటలు, నిజముగ కొన్నిమాటలు చెప్పుచువచ్చిరి. పిల్లిమీఁదఁ బెట్టి యెలుకమీఁదఁబెట్టి సాధించుచు వచ్చిరి. శూలములవంటి సూటిపోటుమాటలచేత నతనిమనసు నొప్పింపఁజొచ్చిరి. ఎక్కడలేని సామ్యములు పోలికలు వానినిమిత్తమయి తీసికొనుచువచ్చిరి. చదువుకొనియు భారవి యప్పుడేమియు సంపాదింపకపోవుటచేత చదువుకొన్నవానికంటె చాకలివాఁడు మేలనియు చదువునే నమ్ముకొని పిల్ల నిచ్చుటకంటె పిల్లను గంగలో దింపుట మంచి దనియు నేవో లేనిపోనిసందర్భములు తీసికొనివచ్చి యత్తగారు పలుమాఱు అనఁజొచ్చెను. చదువుకొన్నవానికి శాంతమె పరమభూషణ మని భారవి నమ్మియుండుటచేత నీపలుకులెల్ల వినియు విననట్లేయుండి, శరీరము దాఁచుకొనక వారిని మెప్పించుటకయి బహువిధముల పాటుపడుచు వారితో నెన్నఁడు వివాదపడక తండ్రి యేర్పఱచిన నియమితకాలము ముగియువఱకు కాతఁడు పనిచేయఁజొచ్చెను. సుఖపడుచున్నప్పుడు కాలము ఱెక్కలు కట్టుకొని మిక్కిలి వేగముగఁ బరుగెత్తును. మనుష్యుఁడు కష్టపడుచున్నప్పుడు కాలము సంకెలల కాళ్లతో నడుచువానివలె మందగమనము గలిగి

యుండును. భార్యకు నాతనికి గూడ దినములు సంవత్సరము లయినట్లు తోఁచెను. ఇటులుండఁగా శ్రావణమాసము వచ్చెను. భారవిభట్టుమీఁద మామయు బావమఱఁదులు చేయు హుంకారధ్వనులవలెనే యుఱుము లాకాశమున వినంబడెను. భారవియొక్కయు భార్యయొక్కయు మనంబుల గ్రమ్మిన విచారపటలమువలెనే మేఘపటల మాకాశమున నిండెను. భారవి భార్యయొక్క కన్నుదమ్ములనుండి యప్పుడప్పుడు వెడలెడు బాష్పబిందువులవలెనె చినుకులు రాలఁజొచ్చెను.

ఒక్కొక్కప్పు డామెకు వచ్చు పెద్దదుఃఖము వలెనే గొప్పవానయు గురియఁజొచ్చెను. దుఃఖమధ్యమున నడుమనడుమఁ గనిపించు స్వల్పమయినయాశ వలెనే మేఘములలోనుండి యప్పుడప్పుడు తళుకుతళుక్కని మెఱపులు మెఱయఁజొచ్చెను. అదృష్టవంతురాండ్రయిన పుణ్యస్త్రీలకు శ్రావణమాసము మిక్కిలి మనోహర మయినది. ముత్తయిదువలు నోఁచుకొనునట్టి నోములు పెక్కు లీ మాసముననే యున్నవి. మంగళవారవ్రతము చేయని గృహమే యుండదు. శుక్రవారవ్రతములు భాగ్యవంతుల గృహములలో జరుగుచుండును. లక్ష్మీదేవి కూడ భాగ్యవంతుల గృహములలో నుండును గాని పేదల గృహములకు రాదుకదా. కొందఱు పేదలు సయితము నాలుగయిదురూకలు కూడఁబెట్టుకొని యే పిల్లకాసో తెచ్చుకొని నోము చేసికొందురు. భారవియొక్క బావమఱఁదుల భార్యలు కాసులఁ దెప్పించుకొని శుక్రవారవ్రతములఁ జేయఁదలంచిరి. తమ భార్యలకు కాసులు తెచ్చి యిచ్చి నోములు నోమించిన పక్షమున తమచెల్లెలు చిన్నవోఁ నేమో యనుమాట వారికిఁ దోఁచినది కాదు. భారవిభార్య మిక్కిలిచిన్నఁబోయి యుండెను. రేపు వ్రతమనఁగా నామెభర్త కన్నము దీసికొని పోయి యాతఁడు భుజించినపిదప మిక్కిలి చిన్నఁబోయి యక్కడఁ గూర్చుండెను. చిన్నఁబోయి యుండుటకు కారణమేమని భర్త యడిగెను. ఓదార్చువారుఁ గారణము లడుగువారు నున్నప్పుడు దుఃఖములు పొంగి పొరలి వచ్చుచుండును. భర్త యడుగఁగానే భార్యకు దుఃఖము పాలపొంగువలెనే పొరలి పొరలి వచ్చెను. కాటుకకన్నులనుండి నీరు జలజల ప్రవహించెను. భారవి కారణ మేమని యెక్కువ యాత్రముతో మరల మరల నడిగెను. కొంత సేదదేఱి యామె యి ట్లని చెప్పెను: "మా వదినెలు బంగారునాణెములు తెప్పించుకొని శ్రావణ శుక్రవారము నోములు నోఁచుకొనుచున్నారు. నాకు నాణెములు లేవు సరికదా యూరక వ్రతమయిన నోఁచికొమ్మని యయిన మావాండ్రనలేదు. నాణెములు లేనందుకు వచ్చిన దుఃఖముకంటె మావాండ్రు నాకుఁ జేసిన యనాదరణమున కెక్కువదుఃఖము వచ్చుచున్నది. మా పుట్టినయింటనుండి మన మెప్పుడు వెళ్లుదుమో నాకు దెలియకున్నది." ఆ మాటలు విన్నతోడనే భారవి యి ట్లనియె: "ఓసీ వెఱ్ఱిదానా! మాతండ్రి యొకసంవత్సరము గడువు పెట్టెను. గడువు దాదాపుగా ముగియవచ్చినది. ఇంక రెండుమాసము లున్నవి. ఈ గడువు దాటినపిదప నేను నీకు గావలసినన్ని రూక లిచ్చెదను. అయినను విచారపడకుము. నా కొక్కయుపాయము దోఁచుచున్నది. నేను కిరాతార్జునీయ మను మహాకావ్యము రచియించుచున్నాను. అందులో నొకశ్లోకమున్నది

శ్లో॥ సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదమ్
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః.

అర్థము : సాహసించియేపని చేయఁగూడదు. అవివేకము మిగుల ఆపదలకుఁ గారణము. సంపదలు గుణములయం దాసక్తి గలిగినవి. అందుచేత నవి చక్కఁగా నాలోచించి కార్యములు చేయువానినే యాశ్రయింపుఁడు.—ఈ యూరిలో నొకకోమటి యున్నాఁడు. అతఁడు విద్వాంసుఁడు. ఈశ్లోక మాతనియొద్ద తాకట్టుఁ బెట్టి కొన్నిరూకలు తెచ్చుకొని యందులో నొక కొంతఁ బెట్టి నాణెము కొని తక్కినసొమ్ము బెట్టి నీకుఁ గావలసిన వస్తువులు దెచ్చుకొని మిక్కిలి శోభాకరముగా వ్రతముఁ జేసికొనుము. ఇది వెండియా? బంగారమా? దీని మీఁద నెవ్వడు సొమ్మిచ్చునని తలంపకుము. ఆ కోమటి తక్కినవర్తకులవంటివాఁడు గాఁడు. చదువుకొన్నవాఁడు. నాసామర్థ్య మెఱిఁగినవాఁడు. అతఁడు తప్పక దీనిమీఁద నీకోరినసొమ్మిచ్చును. ఈశ్లోకము తాకట్టు వదలించుకొనకుండ నేను పుస్తకమును ప్రకటింపనని యాతనితోఁ జెప్పుము. నామాట నతఁడు శిరసావహించును." అని తాటాకు, గంటము పుచ్చుకొని యాశ్లోకమును వ్రాసి యిచ్చి భార్యను బంపెను. శ్లోకమును తాకట్టుపెట్టుట యామె కని విని యెఱుఁగదు. వర్తకుఁడు శ్లోకమును కుదువఁ బెట్టించుకొని సొమ్మిచ్చునను నమ్మక మామెకు లేదు. లేకపోయినను మగనిమాట చెల్లింపవలయునని యామె దానిం దీసికొని వర్తకునియొద్దకు బోయి వానిచేతి కిచ్చి సొమ్మడిగెను. వర్తకుఁడు దానిని జదువుకొని యామె నేవో కొన్ని ప్రశ్న లడిగి యామె సమాధానము చెప్పినతరువాత కొన్నిరూక లామె కిచ్చి కవిలె కట్టలో పద్దు వ్రాసికొని శ్లోకము వ్రాసినతాటాకును వ్రాసిన గంటమును నొక వెదురుగొట్టములో బెట్టి యాగొట్టమునకు మూఁత వేసి దానిని చూరులో దోఁపెను. రూపాయలు తీసికొని యామె పరమానందభరితురాలయి బంగారునాణెము, వలయు పదార్థములు దెప్పించుకొని వదినెలకంటె నెక్కువ వైభవముతో వ్రతము చేసికొనెను. శ్లోకముతాకట్టుమీఁద సొమ్ము తెచ్చుకొనుట విని యామె యన్నదమ్ములు తల్లిదండ్రులు మిక్కిలి యాశ్చర్యము నొందిరి. ఊరివారందఱు విని విస్మయము నొందిరి. కొందఱు కోమటి వెఱ్ఱివాఁడనిరి. భారవి రాళ్లయొద్దఁగూడ డబ్బుపుట్టింపఁగలఁడని కొంద ఱనుకొనిరి. బ్రాహ్మణులకు వ్రతమునిమిత్తము సొమ్మిచ్చుట పుణ్య మని వర్తకుఁడు భావించి సొమ్మిచ్చెనే గాని శ్లోకముతాకట్టుమీఁద సొమ్మిచ్చియుండఁ డని, కొందఱు పలికిరి. "ఇప్పు డియ్యఁగానె సరికాదు వడ్డికి వడ్డి గట్టి కవీశ్వరుఁడుగారి కొంప గోలె మమ్మించి పుచ్చుకొను" నని కొంద ఱనిరి. ఏ మన్న నేమి కార్యము నెఱవేఱనదికదా!!

### మూఁడవ ప్రకరణము - ప్రతిజ్ఞాపూర్తి

శ్లోకము తాకట్టు పెట్టిన కొన్నిదినములలోనే వర్తకుఁడు వ్యాపారముమీఁద ద్వీపాంతరమునకుఁ బయనమయి వెళ్లెను. దైవవశముచేత నప్పు డెదురుగాలి వీచుటచే నతఁ డెక్కిన యోడ సరిగా నడువదయ్యెను. తరువాత కొన్నాళ్లకా యోడ పగిలిపోయెను. ఒకద్వీపమును చేరుటకు బదులుగా నతఁడు మఱియొకద్వీపమును జేరెను. ఆ ద్వీపమునందతని నెఱిఁగినవారుగాని యాతనిభాష మాటలాడు వారుగాని లేనందున నతఁ డచ్చట నెన్నిచిక్కులు పడవలయునో యన్నిచిక్కుల బడెను. వెంటఁ దీసికొనిపోయిన ధనమంతయు నోడ పగిలినప్పుడు సముద్రముపాలయ్యెను. లక్షలకొలఁదిరూకలతో వ్యవహరించునాతని కొక్కరూక కఱవయ్యెను. ఎన్నఁడలవాటు లేకపోయినను స్వకాయకష్టమువల్ల నతఁడు జీవింపవలసివచ్చెను. లక్షాధిపతులను భిక్షా

ధిపతులుగను భిక్షాధిపతులను లక్షాధిపతులుగను జేయునట్టి యనిర్వచనీయ ప్రభావుఁ డగుటఁ బరమేశ్వరునియాజ్ఞాబలమునకు గించిజ్ఞుఁడైన మనుష్యునిబుద్ధిబల మెదురై ప్రతిఘటింప నేర్చునా?

ఇట భారవి తండ్రియాజ్ఞ ప్రకారము మామగారియింట నుండవలసిన కాల ముండి గడువుచెల్లిన తోడనే యా యత్తమామలవద్ద సెలవు పుచ్చుకొని బావమఱఁదులను వీడ్కొని భార్యాసమేతుఁడై స్వగ్రామమునకుఁ బోయెను. తన్నారీతి నవమానముచేసిన బావమఱఁదుల యందుఁగాని అత్తమామలయందుఁగాని యాతనికి ద్వేషము జనింపలేదు. అక్కడకు వచ్చినప్పు డతనిమన స్సెంత యుల్లాసముగా నుండెనో వెళ్లునప్పుడు నంతయుల్లాసముగా నుండెను. వెళ్లునప్పుడు మునుపటికంటె నెక్కువయుల్లాసముగా నుండె నని కూడ చెప్పవచ్చును. అట్లుండుట కొక కారణము గలదు. మామగారియింటనున్న కాలములో నతఁ డెక్కువ లోకానుభవము సంపాదించెను. ఏమనుష్యుఁడుగాని తాను స్వయముగా కష్టపడి ధనసంపాదనము సేయక యొకరికి భారముగా నున్నపక్షమున నాతని గౌరవ మొక క్షణములో బోవుననియు నాత్మగౌరవము నిలుపఁదలఁచుకొన్న ప్రతిమనుష్యుఁడు ప్రాలుమాలక లేక మేనువంచి పనిచేసి స్వకుటుంబపోషణము చేసికొనవలసిన దనియు నతఁ డనుభవము వలన నేర్చుకొనెను. ఈ యనుభవసిద్ధమయిన జ్ఞానము తండ్రివద్ద కష్టపడి దెబ్బలు తిని చీవాట్లు తిని నేర్చుకొన్న తర్కశాస్త్రముకంటె వ్యాకరణశాస్త్రముకంటె మీమాంసాశాస్త్రముకంటెఁ గవిత్వముకంటె నాతని కెక్కువలాభకారి యయి యుండెను. లోకానుభవముకూడ విద్యయే. విద్య యనఁగా కేవలము పుస్తకము విప్పి పాఠము చదువుట కాదు. లోకానుభవము పుస్తకములు ననునీ రెండింటివల్లను మనుష్యుఁడు జ్ఞానసంపాదనము సేయును. లోకానుభవమే లేకపోయినయెడల జ్ఞానముసంపూర్ణము కాదు. ఈ యనుభవ మాతనికి బహుద్రవ్యముకంటె నెక్కువ యుపయుక్తమై యుండెను. శాస్త్రజ్ఞానము నేర్చుకొనుచున్నప్పుడు గురువుగారు చెంపకాయలు కొట్టినను మనుష్యుఁడెట్లు సహించి యూరకుండునో లోకానుభవజ్ఞానము నేర్చుకొనునప్పుడు నదియుఁగూడ విద్యయే యని బాధలు సహింపవలెను. భారవి స్వగృహమునకు వెళ్లినతరువాత తన కిరాతార్జునీయకావ్యమును సమాప్తము చేసి సవరించియు దానిం బ్రకటింపలేదు. ఏల యనఁగా నందులో నొకశ్లోకము లేక పుస్తకము సమాప్తము కాదు. అసమాప్తగ్రంథము ప్రకటించుట యతని కిష్టము లేదు. ఆ శ్లోకము నీతఁడు ప్రకటించినను, వర్తకుడు తగవులాడఁడు. పైగా వర్తకుడు దేశములో లేడు. అయినను భారవి నీతిసంపన్నుఁ డగుటచే వణిజుని సొమ్ము వణిజున కిచ్చి శ్లోకమును విడుదల చేసికొనకముందు దానిని తాను గ్రహించి ప్రకటించుట దుర్నీతి యని నమ్మి యూరకుండెను. అట్లు పదునెనిమిది సంవత్సరములు గతించెనట. ప్రకటించుట యనఁగా నా దినములలో నచ్చువేయుట కాదు. ఇతరులు వ్రాసికొనుటకై తన తాటియాకు పుస్తకము నిచ్చునదియే. ఆ మహాకావ్యము ప్రకటింపఁబడక పోయినందులకు విద్యార్థులు పండితులు మిక్కిలి విచారించిరి. వర్తకునియొద్దనుండి వర్తమాన మేనాఁటికిం దెలియలేదు. అతఁడు మృతి నొంది యుండు నని బంధువులు నిశ్చయించిరి. ఉత్తరక్రియలు జరిగించుట సముచితమా యని బంధువులు ధర్మశాస్త్రజ్ఞుల నడుగఁ జొచ్చిరి. ధర్మశాస్త్రజ్ఞులు తమ

ప్రాతతాటియాకులు ధర్మశాస్త్రములుతిరుగవేయఁ జొచ్చిరి. అప్పు డయినను భారవి తన గ్రంథము ప్రకటింపఁదలఁచుకొనలేదు. వర్తకుని నిశ్చితవార్త తెలియవలెను, గ్రంథము ప్రకటింపవలెనని యూరకుండెను.

భారవి-నాలవ ప్రకరణము-తాకట్టువిడఁదల.

పదునెనిమిది సంవత్సరములు గతించి పందొమ్మిదవ సంవత్సరము నడచుచుండఁ జిరప్రవాసదుఃఖితుఁడయిన వర్తకుఁడు స్వస్థలముం జేరెను. స్వగ్రామమునకు సమీపమం దున్న రేవుపట్టణములో నతఁడు నావ దిగి స్వగృహము జేరునప్పటికి రాత్రి జాము ప్రొద్దు పోయెను. చిరకాలము క్రిందట చూచుటచేతను రాత్రి యగుటచేతను వాని నెవ్వ రానవాలు పట్టలేదు. ఇంటికి వచ్చి యతఁడు తలుపు తట్టినతోడనే గృహసేవకులు తలుపుతీసిరి. ఎవరు మీరని సేవకులడుగఁగా నే నింటియజమానుఁడగు వర్తకుఁడనని యతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాటలు విని సేవకులు తెల్లబోయిరి. అందొకఁడు పోయి యజమానురాలితో నీ వార్త విన్నవించెను. ఆ మాటలు వినఁగానె యామెసంతోషాశ్చర్యంబులు మనంబున మల్లడిగొన పదునెనిమిది సంవత్సరముల వయస్సుగల యొకపడుచువానిని వెంటఁబెట్టుకొని భర్త దర్శనమునకు వచ్చెను. ఆ పడుచువాఁడు వర్తకుని జూచి 'నాయనగారు నమస్కార'మని పాదములపయిఁ బడెను. 'వీఁ డెవ్వఁడని' వర్తకుడు భార్య నడిగెను.'వీఁడు మీకుమారుఁ'డని భార్య ప్రత్యుత్తర మిచ్చెను. ఆ మాటలు వినఁగానే వర్తకుఁడు కోపము నాశ్చర్యము సందడించు హృదయముతో నిట్లనియె: "ఓసీ దుర్మార్గురాలా! నేనీ స్థలము విడిచివెళ్లునప్పటికి నాకు లేనికొడుకు నేను వెళ్లిన తరువాత బయలు దేఱినాఁడా? దేవతావరప్రసాదముచేతనో నీ పతివ్రతాధర్మముచేతనో భర్త దేశాంతరమం దుండఁగనే నీకు కుమారుఁడు జన్మించినట్లు తోఁచుచున్నది. వీఁడు నీకొడుకయినమాట నిజమే. కాని నాకొడుకయి యుండఁడు. వీఁడెవనికొడుకో వానికే వెళ్లి నమస్కారము చేయవలసినదిగాని నాకు చేయఁగూడదు. నీవింతదుర్మార్గురాలవని నే నెన్నఁడు దలపోయలేదు. నేను దేశాంతరమందు మృతినొందితి ననుకొని నీ కొడుకు నీవు సుఖముగ జీవింపవచ్చు ననుకొంటివి గాబోలు. మీ దౌర్జన్యము బయలుపెట్టుటకే భగవంతుఁడు నన్ను బ్రతికించినాఁడు. ఛీ! మీరు నా యెదుటనుండి లేచి యవ్వలకుఁ బొండు. మీ మొగములు చూచుట మహాపాతకము" అని తూలనాడు. చుండ భార్యయుఁ గుమారుఁడు నిశ్చేష్టులయి ప్రత్యుత్తరము నీయఁజాల రయిరి. ఆతని కేకలు విని యిరుగుపొరుగువారనేకులు వచ్చి వర్తకునితో "నీవు వెళ్లునప్పటికి నీభార్యకు నెల తప్పినది. అది నీ వెఱుఁగవు. నీవు వెళ్లినతరువాత నీ కుమారుని బ్రసవించినది. ఆమె పరమపతివ్రత. ఆమెయందు దోషము లేదని చెప్పిరి. కాని యాతనికి తృప్తి జనింపదయ్యెను. అందఱు ఎవరిగృహములకు వారు పోయిరి. వర్తకుఁడు కంటికి నిదుర రామిచే గోడకుఁ జేరఁబడి కూర్చుండెను. తనకు భర్త గావించిన పరాభవమునకు దుఃఖితయై భార్య కంటికి నేలకు నేకధారగా నేడ్చుచుండెను. కుమారుఁడును గాఢమయిన యవమానముచేత తలవంచుకొని విచారింపసాగెను. తనయెడ ద్రోహము చేసిన భార్యను, నామెకుమారుని నాఁటిరాత్రి యెట్లయిన సంహరింపవలయునని వర్తకుఁడు తలపోయఁజొచ్చెను. అట్లు తలపోయుచు నాయుధ మేదయిన సంపాదింపవలయు నని యిట్టట్టు తిరుగసాగెను. అట్లు తిరుగుచుండఁగా మూలలో నతని కొకవెదురుగొట్టము కనఁబడెను. ఆ గొట్టము

లాగి తెఱచిచూడ నందులో నొకగంటము తాటాకు గనఁబడెను. గంటముతో వ్రాసిం బొడిచి చంపవచ్చు నని సంతోషించి యాతాటాకులో నే మున్నదో చూడవలయు నని కుతూహలము పొడమ దానిం దీపపువెలుఁగునకు దీసికొనిపోయి చదువుకొనెను. అది తనయొద్ద భారవి తాకట్టుఁబెట్టినశ్లోక మయ్యెను. శ్లోకము చదువఁగానే దానియర్థ మతని మనంబున నాటెను.

అర్థము బోధపడినతోడనే గంటము క్రిందపాఱ వైచిపైకిచూచుచు నతఁ డాలోచనముచేయసాగెను. "ఏమిది! సాహసించి, ఏకార్యమును చేయఁగూడదు. అవివేకము మహాపదల కాస్పద మని కదా యీ శ్లోకార్థము. మహాకవి యైన భారవి యీశ్లోకము నాకు తాకట్టు పెట్టెనుగదా! దీనియం దెంతో విలువ యుండుటంబట్టియే గదా నాలుగు బంతుల శ్లోకమునకు నాలుగు వరహాలు నే నిచ్చితిని. నే నిప్పుడు చేయఁబూనిన పని మహాసాహసము. ఇది యవివేకము. చక్కఁగా విచారించి వీ రిద్దఱు దోషు లని తెలిసినపిదప నే నీకార్యము చేసెదను. ప్రస్తుతము విరమించెదను." అని యీ యుద్యమ ముపసంహరించి మఱునాఁడు గ్రామమం దున్న పెద్దలం గలసికొని తన గృహవృత్తాంత మంతయు వారి నడిగి తెలిసికొనెను. వా రందఱు నైకకంఠ్యముగ ని ట్లనిరి: "నీభార్య మహాపతివ్రత. ఈతఁడు నీ కుమారుఁడు. నిష్కళంక మయిన మనసుతో నీవు వానితోఁ గాఁపురము సేయవచ్చును." ఆ మాటలు విని తృప్తినొంది వర్తకుఁడు దారపుత్రులం జేరఁదీసి మరల సంసారి యయ్యెను.

వర్తకుఁడు వచ్చినవార్త విని భారవి శ్లోకము తాకట్టు వదలించుకొని గ్రంథము ప్రకటించుకొను సమయము వచ్చెనని పరమానందభరితుఁ డయి యాతనియొద్ద పుచ్చుకొన్న నాల్గువరహాలు వడ్డితోఁ గూడ దీసికొని వచ్చి యతని కిచ్చి తాకట్టు శ్లోకము నిమ్మని యడిగెను. తాను వచ్చువఱకు శ్లోకము వదలించుకొనువఱకు గ్రంథము ప్రకటింపక నీతికి నిలువఁబడియున్న యమ్మహానుభావుని భారవిని గని వర్తకుఁడు లేచి దృఢప్రణామంబు గావించి యాతని కిట్లనెను: 'మహాత్మా! యీ శ్లోకము నిమిత్తమయి గ్రంథ మంతయు ప్రకటింపక యాఁగిన నీవంటి మహానుభావులు తఱుచుగా లోకమున సంభవింపరు. నీయొద్ద నేను సొమ్ము గ్రహింపఁజాలను. ఏల యనిన శ్లోకమువలన నేను మహోపకారము నొందితిని. ఆశ్లోకమువలన నాకు భార్యయుబిడ్డయు బ్రతికిరి. దానివలననే నాకీర్తి నిలిచెను. మీశ్లోకము అక్షరలక్షలు విలువగలది. అందుచేత నేను మీయొద్ద సొమ్ము పుచ్చుకొనను సరేగదా విశేషించి మీకు గొప్పబహుమానము గూడ చేయదలంచుకొన్నాఁడను" అని వేయిమాటపదాలు లాయన కిచ్చి నమస్కరించి పంపెను.

# గవేషణ

వేలూరి చంద్రశేఖరం గారు, బి. యే.,

౧

ప్రాలె మలుసంజ, యసకలవ్యక్తమైన
రేక జాబిల్లి యొంటరి రిక్కతోడ
నల్ల నల్లన డిగఁజొచ్చె నాకసంబు;
దవ్వు దవ్వుల శైలరుద్ధస్రవంతి
సేయు నాక్రోశ మరుదెంచె వాయునిహాలి;
వలని చీఁకటిమ్రాకుల వనమునుండి
కారుచీఁకటు లెల్లెడఁ గవియఁ జొచ్చె;
సత్యకాముఁడు ముఖరితజగము వీడి,
స్వల్పసుఖములయందు క్షోభమును జెంది
జనతకుఁ బరాఙ్ముఖుం డయి, సత్యదర్శ
నేచ్ఛ యందుండి ప్రిదులని యెడఁదతోడ,
నిశ్చలమనస్కుఁ డగుచు ధ్యానించుచుండె.

జగముమోమునఁ దళుకొత్తు సొగసుపూఁత,
దాని దుఃఖపు జడఁదను దాఁచనట్టి
యతని భ్రమయింపలే, దపర్యాప్తమైన
యతని కామన మేరలం దణఁగలేదు,
విశ్వహృదయమ్మునందు నివిష్టమైన
శోకమున వానియెడఁద పర్యాకులంబు,
పరుల వేదనచేత జర్జరితుఁ డైన
వానికనుదోయి యశ్రుసంప్లావితంబు;
తాపమయమైన యతని యంతరమునుండి
నీరవాక్రందనం బిట్లు నింగి కెగసె:
"ఓ జగత్పతి! యెవ్వరే నీజగాన
నీయెఱుక లేక శోకము నించినారె?
ఏటి కీయశ్రువులు నీదుసృష్టియందు?

ఏల యీ యుగ్రదంష్ట్రాకరాళవక్త్ర?
మేల యీ విషదంత్ర, మీయెదలలోన
నేల యీ బడబానలజ్వాల లకట?
పెనిమయీవిని జెఱుచు నీద్వేష మేల?
హృదయమును హృదయమున లయింపనీక
యాఁక పడియెడు వింజమనీక మేల?
మనసు పోకల మేరలం దణఁచిపట్టి
దట్టమగు తెరచాటున దాఁగుకొనుచు
నింద్రజాలము వఱపఁగా నేల నీకు?
హృదయమును నీత్రిశూల మందిడియగ్రుచ్చి
తెలియికం గూడ బమ్మెర గొలుప నేల?
ఓ జగద్రథసారథి! నీజవంబు
సడలిచి యొకింత నీయశశ్చక్రపంక్తి
సేయు నీక్రూరహింస వీక్షింప వలదె?
లేక యార్తరవంబులు, శోకముద్ర
చే వికృతమైన మోములు, శీర్ణమైన
యంగకంబులు నీకుఁ బ్రియంబు లొక్కొ!
నన్నిట క్షమింపుమో జగన్నాథ! నాదు
స్వాంతమున సర్వతో వ్యాపి యైన యంధ
మేలికవిధానఁ బ్రభుత వహింపఁ జొచ్చె;
దెసలఁ దెలియంగఁ జాలను, తెరువు చూడ్కి-
కగపడదు, నీదు కిరణ మొక్కటైనఁ బంపు
మనుసరించుచు దానిఁ గల్యాణతమము
నీదురూపముఁ దలఁతు యత్నింతు నింక."

అమరలోకములోని సింహాసనమ్ము

లించుక చలించె నాతని మెడఁదనుండి
బయలు వెడలిన యుచ్ఛ్వాసబలముకతన,
వల్కలాంబర మైన యప్సరస మూర్తి
మెల్ల మెల్లన డిగఁజొచ్చె మింటనుండి.
సత్యకాముని తాపితస్వాంతమందు
సాంత్వనం బల్ల నల్లన సంచరించె,
ధ్యానసుప్తము లైన నేత్రము లొకింత
తెఱచి మెల్లన దృక్కులఁ బఱపినంత
నతని కగపడె నా గగనావతీర్ణ.
అనుప్రలూను శిలావిగ్రహంబురీతి
సత్యకాముఁడు లేచి యంజలి ఘటించి,
యామె రూపము నెల్లలో ననుభవించి;
పలికె నిట్టులు రాల్పడు నెలుఁగుతోడ:
"నిర్నిమేషమై జ్వలించు నీ నేత్రయుగము
చాటెడిని నీవు స్వర్గసంచారి వగుట,
దేవి! మైననిదేల నీ తేజ మెల్ల
ధూసరములైన నారలతోడఁ గప్పె,
తల్ల నీకనుగొనలయం దశ్రులట్లు
కానిపించెడి, మిన్నులపైని గూడఁ
గలదొకో యిటఁబోలె నశ్రులనుఁ దావు!
ఓతపస్విని! నీకు డాచేతియందుఁ
గలఁతియ యదేమి? యగ్నికీలలను గ్రక్క,
అంధశోకజరామృతప్రసందుఁ గన్న
గానక తపించు నాకు నేదేని తెన్ను
దృగ్గత మొనర్చి నను వెల్వరింపఁగదవె!"
పలుకులందునఁ బూర్తిగాఁ దెలుపలేని
స్వీయ మా వేదనము చూడ్కి వేఁడుకోలు
సాయమున వ్యక్త మొనరించి సత్యకాముఁ,
డగ్గలపు వలపుఁ దఱిఁ జేరాసతోడ
సజలజలదముఁ జూచు కర్షకువిధంబు,
సాంత్వనామయమా వియచ్చరిముఖంబు
నందుఁ బఱపెఁ బిపాసితమైన దృష్టి.
వర్ష సందేశహారియౌ వాయువెటులు
వృక్షశాఖలలో మర్మరించిపోవు
నట్టు లత్తఱి మధురమౌ నామెయెలుఁగు
పర్వ కడలొత్తెఁ గాకలీస్వనమునందు.
"సత్యకామా! యెఱుంగు మప్సరస నగుట
నిజము, నామెద దుఃఖైకనిష, మిందుఁ
బక్షులవిధంబు సకలజీవప్రపంచ
దుఃఖముల్ వచ్చి చేరు, నార్తులరవంబు,
ననదల యెలుంగు, నిఱుపేద లైనవారి
కుయ్యి, మరణమునాఁటి గగ్గోలు, ప్రేమ
వంచితములైన యెదల యుచ్ఛ్వాసపంక్తి.
భ్రమయు నీహర్ష శోకచక్రంబునుండి
బాహిరపడంగఁ దమకించువారి కెల్ల
నీగలంతియ త్రావఁగా నిచ్చుచుందు;
శోక మార్పెడు చాతురి నాకు లేదు;
దాన నధికృతురాలు సోదరి యొకర్తు;
స్వాంతనం బిత్తు, శోకఝంఝూరయంబు
నాఁగ బల మిత్తు, మఱియు నీయాసవంబు
నందుఁ బావకమైనట్టి యగ్ని కలదు
దీనిఁ గ్రోలు"మటంచు నాదేవి యొసఁగ
గలఁతియను, గేలఁగొని సత్యకాముఁ డద్ది
త్రావులోపల నామె యంతర్ధి చెందె.

(సశేషము)

# రఘువంశౌచిత్యము

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు

శ్లో. సంసార విషవృక్షస్య ద్వే ఏవ రసవత్ఫలే। కావ్యామృతరసాస్వాదః సంగమః సజ్జనైః సహ.

పూర్వము సారవంత మగు నే విశాలభారతసారస్వతారామభూమి యందు భావోన్నతము లగు సరస కావ్యరసాలము లుదయించెనో, ప్రకృత మానవభువి నే చిత్రవిచిత్రము లగు నవీన కావ్యవిటపములు విరివిగాఁ బెరుగుచున్నందులకు సంతసమే కాని, యిందుఁ గొన్ని యుత్తమబీజసంస్కారము లేక నానావర్ణములు గల పర్ణసంచయముతోఁ గూడి, నూతనముగా సంకుచితావకాశము గల కుండ్లలో నెదుగుచున్న యాకుమొక్కలను బోలి, కేవలవినోదైక ప్రయోజనముగా నున్నందులకు మాత్రము కొంత విచారము కలుగుచున్నది.

ఈ క్రొత్తయాకుమొక్కలకుఁ గేవల పర్ణాడంబరమే గాని పథికజనసంతాపనివారక మగు చల్లనినీడ గాని, ఘ్రాణానంద సంపాదక మగు హృద్యసుమామోదము గాని, రసనావినోద హేతువగు మధురఫలము కాని, తుదకుఁ బాకరచన కక్కఱకు వచ్చు గట్టికట్టెలు కాని లేక నిరర్థకము లగుచున్నయట్టుల, నవకావ్యపాదపములు కూడ శాస్త్రీయసంస్కారబీజములు లేక, భిన్నవర్ణములుగల పత్రసమితితో నిండి సంసారతాపనివారకములగు శ్రీలోపదేశశీతలచ్ఛాయలను గాని, ఘనానందసంధాయకములగు హృద్యపద్యకుసుమామోదములను గాని, రసికాధిక సంతోషజనకము లగు మధురభావఫలములను గాని, తుదకు గానరచనానుకూలము లగు నెట్టిగట్టిచుట్టలను గాని ప్రకటింపజాలకున్నయవి.

కాలవైపరీత్యముచే జనులును నాకుమొక్కలవలె సంకుచిత భావవ్యక్తి కల నీరసకావ్యములనే ప్రేమించుట కలవాటు పడుచుండుటచే భావవిశాలములగు కావ్యరసాలములు బయలు వెడలుట యరుదగుచున్నయది. భావఫలవిరహితము లగు నిట్టి కావ్యములఁ బ్రకటించుటచే నచ్చుకూటములకు పచ్చరాబడి హెచ్చుచున్నది కాని, జనుల సచ్చరితులనుగా మార్చుట కక్కఱకు వచ్చురచనలు వీనియందు మచ్చునకైన గానవచ్చుటలేదు. భావౌన్నత్యములేని కావ్యౌన్నత్య మెంత వృద్ధియగుచున్నను, ప్రయోజనము లేదు. అది దేశౌన్నత్యమున కెంతమాత్రమును నుపకరింపదు. ప్రస్తుతము స్వదేశసాహిత్యామృతపూర్ణచంద్రచంద్రికల వలుఁగుపఱచి యావరించుచున్న విదేశవిద్యామోహాంధకారము జార, గనుల కఱవు దీర, వివేక ముదయింప, హృదయము పల్లవింప, సద్భావములు పుట్ట, ప్రాగ్దిగ్రమాసతి చేపట్ట నర్హమగు రీతినిఁ దేజరిల్లు నుత్తమకావ్యప్రభాకరబింబ మొకటియుఁ గూడ నుదయించుటలేదు. పూర్వము మన దేశమున భావామృతపూరితము లగు మహాకావ్యవాహినీసములఁ బ్రజల నవరత మాస్వాదించుట కనువగు తీర్థరాజములు పెక్కు లుండుటచేతనే, సారస్వతసంపదయందు భారత దేశము సకలదేశమూర్ధన్యమై వెలయుచుండెడిది. ప్రాచీన కావ్యముల కింతటి మహిమ కలదా యని శంకింపవలదు. నిపుణులగు కావ్యనిర్మాతలు జనుల సన్మార్గముల నడుపఁ బూనినచోఁ, గాముఁ డస్త్రసన్న్యాసము చేయవలసినదే. క్రోధాదులు దేశాంతరముల కేగవలసినదే కాని మాఱుమాటాడుట కామారాదులకు శక్యము కాదు.

లోకమును దమయద్భుతరచనలచే నాశ్చర్యానందముల నోలలాడింపఁగలవారలలో నలువురు ముఖ్యులు. వారెవరన విధాత, కవి, శిల్పి, గాయకుఁడు. మొదట విధాత అవ్యక్తములును, అతిసూక్ష్మములును, వ్యస్తములు నగు పరమాణుబీజముల చేర్చి యెట్టు లవ్యక్తమగు నీ సమస్తప్రకృతిసృష్టిని చేయుచున్నాఁడో, యట్టులనే కవియు అస్ఫుటార్థములును, భిన్నములు నగు నక్షరబీజముల సమకూర్చి సమస్తకృతిసృష్టినిఁ జేయుచున్నాఁడు. ఆ విధముననే శిల్పియు అగోచరములును, భిన్నములు నగు వర్ణబీజములఁ గలిపి సమస్తాకృతిసృష్టినిఁ జేయుచున్నాఁడు. ఆ రీతిగానే గాయకుఁడును అవికసితములును, విభిన్నములు నగు, స్వరబీజముల మేళగించి సమస్తగానకృతిసృష్టిని జేయుచున్నాఁడు. ఈ నలుగురు స్రష్టలలోను మొదటివాఁడు పురాణబ్రహ్మ, మిగిలినముగ్గురును నవబ్రహ్మలు.

ఈ నలుగురు బ్రహ్మలలోను కవియే మానవుల కత్యంతోపకారి యని నాయభిమానము. అట్టి యసాధారణ ప్రతిభాశాలి

యగు కవియొక్క రచనయే కావ్యము. శ్రుతిలయ మగు మనోహరరాగకళతోఁగూడిన నాదమునకు సంగీతమని పేరు. అటులనే హృదయరంజక మగు భావకళతోఁగూడిన శబ్దమునకుఁ గవిత్వమని పేరు. రాగకళాహీనమగు నాదము శ్రోతల నాకర్షింప నగుగానము కానియటులనే, భావకళాశూన్య మగు శబ్దమును పాఠకుల నానందింపఁజేయుకవిత కానేరదు. గానారంభము మొదలు తుదివఱకు రాగకళ చెడకుండ రంజకముగాఁ బోషించువాఁడే నిజమగు గాయకశిఖామణి. కావ్యారంభము మొదలు గ్రంథసమాప్తి యగునఱకు భావకళను గాపాడువాఁడే నిక్కమగు కవివరేణ్యుఁడు. అటులఁ గానిచోఁ గవిగాయకులిరువురును లోకమునకు నానందసంధాయకులు కాఁజాలరు.

కుసుమములయందు సౌరభమును, కాంతలయందుఁ బాతివ్రత్యమును, దేహములందు జీవమును, దీపములందుఁ గాంతియు, మానవునియందు నీతియు, రాజులయందు సత్యమును, నెటుల ముఖ్యములో యటులనే కావ్యమునందు భావము ముఖ్యము. పృథివ్యాదిభూతసంయోగము ప్రకృతిసృష్టికిఁ గారణమైనటులఁ గావ్య నిర్మాణమునకు శబ్దార్థముల సమ్మేళనము సాధనము. సహజవస్తునిర్మాణనిపుణుఁడగు విధాత యెంతటి ధీశాలియో, నిసర్గసుందరగ్రంథరచనాకుశలుఁడగు కవియు నంతటి ప్రతిభాశాలియే. స్వర్లోకమున వ్యాధి జరామరణములఁ బాఁదోలి, జీవకళ నుద్దీపింపఁజేయుచు, శాశ్వతానందమును సమకూర్చురసమునకే యమృతమని పేరు. భూలోకమునఁ దాపత్రయము నణచి, భావకళను బ్రకాశింపఁజేయుచు, మానవానందమును సమకూర్చురసమునకే కవిత్వమని పేరు. హృద్యమగు భావఫలపుష్కలత కావ్యరసాలమునకు వన్నె తెచ్చురీతిని కేవల పత్త్రిబహుళతయుఁ బదసంఘాతమును, దానికి గౌరవమును దేఁజాలవు. కుసుమోద్యానమున జతురముగఁదిరిగి, తాఁ గాంచిన సుమమంజరులనుండి సంగ్రహించిన మకరందబిందువులఁ దేఁటి గూటిలో భద్రముగాఁజొనిపి, పరానందమును సమకూర్చురీతిని, కవియు లోకమున నలుదిక్కుల సంచరించి, తాఁ గనుగొనిన ప్రకృతి విలాసములలోనుండి సంపాదించిన జ్ఞానామృత సంపదల సాహిత్యపేటికలో నిడి, రసికానందమును సంఘటింపఁజేయుచున్నాఁడు. అళికవు లిరువురును పరసుఖసంపాదన పరాయణతలోఁ దుల్యు లనుట కెట్టిసందేహమును లేదు. కాని వీరిరువురకును గొంత తారతమ్యము కలదు. అళికి మకరందమును జేర్చుటలోఁ బక్షపాతముకలదు. కవికి భావమును గూర్చుటలోఁ బాక్షికత లేదు. అళి యనాహూతముగా శ్రీనిలయము లగు సరోజరాజులకడకేగి, యవి విసినను, విసరకున్నను దనవాగాడంబరమును బ్రకటించుచుండును. కవియో సాదరాహూతుడైన గాని శ్రీమంతుల రాజాధిరాజు కడ కేగి, తన వాగ్వైభవమును బ్రదర్శింపనోపఁడు. చంచరీకముచే సంచితమైనతేనెయు శాశ్వతముగాక చంచలమై యాస్వాదింపకొలఁదిఁ దఱిఁగిపోవుచుండును. కవి కావ్యపేటిని బూరించిన భావమకరందమో నిశ్చలమై చిరస్థాయిగా నుండి యనుభవించుకొలది నభివృద్ధియై నవరుచులఁ బుట్టించుచుండును. షట్పదసంపాదితరసము రసనేంద్రియమును మాత్ర మానందింపఁజేయును. కవివిరచితరసము హృత్పుండరీకమును వికసింపఁజేసి, సర్వేంద్రియసమితికి నానంద పరవశతను సమకూర్చును. మొదటి దానియందు మధురరస మొక్కటియే కలదు. రెండవదానిలో నవరసములును గలవు. కావునఁ గొన్ని విషయములలోఁ గవిభృంగమునకంటెను, కవిత్వము తేనెకంటెను హెచ్చని చెప్పవచ్చును.

మానవుల సన్మార్గముల నడిపి యభివృద్ధిని సమకూర్చుటకుఁ దలిదండ్రులు, మిత్రుఁడు, గురుఁడు, పత్ని, రాజు, కావ్యమును ముఖ్యసాధనములు. కాని తలిదండ్రులు లోనగువారు పరిమిత కాలజీవులగుటచేఁ దాము జీవించియున్నకాలముననే హితము గఱపఁగలరు. కాని భూతభవిష్యత్కాలములలో మంచి దెలుపఁజాలరు. కావ్య మన్నచో కల్పాంతస్థాయియై త్రికాలాబాధితముగా నీతినిఁ గరబదరసదృశముగాఁ గనఁబఱచుచుండును. అట్టికావ్యరాశిలో గీర్వాణమనోరథఫలముల సదా సమకూర్చు నాకలోకమునఁ గల్పవృక్షపంచకమెట్లు సుమనస్సంసేవ్య మగుచున్నదో యటులనే మానవలోకమున గీర్వాణకావ్యపంచకము విబుధజనస్తోత్రపాత్ర మగుచున్నది. మందార, పారిజాత, సంతాన, కల్పక, హరిచందనములని పేరుగాంచిన పంచదేవతరులవలె రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ, శిశుపాలవధలు ప్రసిద్ధిగాంచిన పంచకావ్యకల్పకములలోను మందార తరువువలె లోకమున సమంవాదరముగల రఘువంశ మన్నివిధముల నగ్రగణ్య మగుటచే నా మహాకావ్యముయొక్క యౌచిత్యము గూర్చి కొంచెము తెలుపఁదలఁచితిని. కాని మహోన్నతము రజతగిరిశిఖరము నుండి యతివేగముతోఁ గూలంకషయై గంభీరముగా ప్రవహించుచున్న పావనభాగీరథీవేణివలె మహోన్న స్వభావుఁడగు కవివరునివదనగహ్వరమునుండి మహారయముతో భావపూర్ణమై నవరసములతోఁ బ్రవహించుచున్న రఘువం వాణీతరంగిణీతీరమున నిర్భయముగ నిలుచుటకుఁగూడ శక్తుఁడ కాని నేను, ఈ ప్రథమకావ్యనదీప్రవాహములోనికి దిగి యం మధురరసములఁ బైకిఁదేఁ బ్రయత్నించుచున్నందులకు రసజ్ఞు విద్వాంసులు కోపింపక నన్ను ప్రేమించి దీవింపఁగోరుచున్నా

ఈసున కావ్యసౌధమును నిర్మించినమహానుభావుఁడు పండితమండలీజేగీయమాన యశస్కుఁడగు కాళిదాసుఁడు. ఈమహాకవి మహిమనుగూర్చి మీకుఁ దెలుపఁబోవుట సూర్యుని తేజమునుగూర్చి మీకు బోధచేయుటవంటిదే యగును. కావునఁ ప్రస్తుత మాకవికుల సార్వభౌముని దివ్యచరిత్రమును విడిచి, యాకవిగణాగ్రగణ్యుఁడు విరచించిన శ్రవ్యకావ్యత్రయములోను మొదటికావ్య మగు రఘువంశమునుగూర్చి కొంచెము ప్రశంసింపఁబోవుచున్నాను.

రఘువంశకావ్యరసార్ణవమును బాగుగాఁ దఱిచినవారికి జ్ఞానామృతసిద్ధి తప్పక చేకూఱును. ఇందలివర్ణనములు వర్ణనాతీతములు. పెక్కేల యీకావ్యరసాస్వాదసుఖమగ్నులై యున్న మానవులను మధురగాన మాకర్షింపఁజాలదు. చంద్రవదన చేరనేరదు. సుమసౌరభము చలింపఁజేయఁజాలదు. మాక్షికామాధురిమ మఱల్పజాలదు. మలయానిలుఁడు మాటాడింపనేరఁడు. మఱెట్టి విషయములును వీరిఁ జేరఁజాలవు. ఈకావ్యమునందు పందొమ్మిది సర్గములు గలవు. సాహిత్యోదగ్రరమ్యహర్మ్యాగ్రవరోహణ మొనర్చి యందలివిహారసౌఖ్య మభిలషించువారల కీసర్గలు సోపానపరంపరలవలె సాహాయ్య మొసఁగుచున్నయవి. ఈకావ్యమునందు వివిధరసములును మనోహరముగా వర్ణింపఁబడియున్నవి. ఇందలి పదలాలిత్యము సుమదళములకుఁగూడ లేదనినచో నతిశయోక్తి కాఁజాలదు. ఈకావ్యమంగారము నృపసింహులకు రాజనీతిని కవివరులకు గవిత్వతత్త్వమును వైరాగ్యధనులకు వేదాంతబోధను వీరులకుఁ బరాక్రమధనమును సాధ్వీలలామలకుఁ బాతివ్రత్యసౌభాగ్యమును విద్వాంసులకు సకలశాస్త్రమర్యాదలను సగ్రమముగా సమకూర్చు సుధార్ణవమువలెఁ జెజరిల్లుచున్నయది.

ఈ కావ్యమునకు మల్లినాథుఁడు లోనగు ముప్పదుగురు పండితులు వ్యాఖ్యానముల విరచించియున్నారు. ఇందుఁ బొమ్మిదివ్యాఖ్యానములు సంపూర్ణముగా నున్నయవి. ఈ వ్యాఖ్యానములలో వ్యాఖ్యాతలు మిగిలిన వ్యాఖ్యానముల పేళ్లనో, వ్యాఖ్యాతల పేరులనో యుదాహరించియున్నారు. వ్యాఖ్యాతృవ్యాఖ్యానముల నామముల నీ క్రింద నిచ్చుచున్నాను.

| వ్యాఖ్యాత | వ్యాఖ్యానము |
|---|---|
| 1 మల్లినాథసూరి | సంజీవిని |
| 2 హేమాద్రి | దర్పణము |
| 3 చరిత్రవర్ధనుఁడు | శిశుహితైషిణి |
| 4 వల్లభుఁడు | రఘువంశపంజిక |
| 5 సుమతివిజయుఁడు | సుగమాన్వయప్రబోధిక |
| 6 ధర్మమేరువు | రఘువంశటీక |
| 7 విజయాగ్ని | సుబోధిక |
| 8 దినకరుఁడు | సుబోధిని |
| 9 పద్మపాదదాసుఁడు | రఘువంశసూత్రవృత్తి |
| 10 భగీరథుఁడు | జగచ్చంద్రచంద్రిక |
| 11 బృహస్పతిమిశ్రుఁడు | రఘువంశవివేకము |
| 12 కృష్ణపతివర్మ | అన్వయలాపిక |
| 13 గుణవినయాగ్నిగణి | విశేషార్థబోధిక |
| 14 నారాయణుఁడు | భావదీపిక |
| 15 భావదేవమిశ్రుఁడు | సుబోధిని |
| 16 రామభద్రుఁడు | విద్వన్మోదిని |
| 17 దక్షిణావర్తుఁడు | |
| 18 నాథుఁడు | |
| 19 కృష్ణభట్టుఁడు | |
| 20 భోజుఁడు | |
| 21 విస్తారకారుఁడు | |
| 22 ప్రభాకరుఁడు | |
| 23 జనార్దనుఁడు | |
| 24 గోపీనాథకవిరాజు | |
| 25 త్రివిధకారుఁడు | |
| 26 ఉదయకరుఁడు | |
| 27 భరతసేనుఁడు | |
| 28 విగ్నధరుఁడు | |
| 29 మహేశ్వరుఁడు | |
| 30 సముద్రసూరి | |

మఱియు, అద్వైతసారస్వతసూత్రి, కథంభూతి, పదార్థదీపిక, అను వ్యాఖ్యానముల పేరులు కానవచ్చుచున్నవి. వ్యాఖ్యాతల పేరులు తెలియవచ్చుటలేదు. ఇటు లనేకవిద్వాంసులీ కావ్యమునకు వ్యాఖ్యానముల విరచించియుండుటచే దీని యాధిక్యము వ్యక్తమగుచున్నది. ఈ వ్యాఖ్యానములన్నిటిలోను మల్లినాథసూరిచే రచింపఁబడిన సంజీవనీ వ్యాఖ్యానమే యగ్రగణ్యముగా నున్నయది. మల్లినాథుఁడు తెలుఁగు బ్రాహ్మణుఁడు; నివాసము కడపజిల్లాలోని త్రిభువనగిరి యను గ్రామము; తెలగాణశాఖ; ఇంటిపేరు కోలచలమువారు. వీరి వంశమువా రిప్పటికిని కడపజిల్లాలో నున్నారు. వారు తాము మల్లినాథసూరి సంతతివారమని చెప్పుకొనుచున్నారు. సుప్రసిద్ధ నాటకకర్తలు బళ్లారి వాస్తవ్యులు కీర్తిశేషులు కోలాచలము శ్రీనివాసరావుగారు మల్లినాథసూరివంశజులు.

### కావ్యనామము.

రా॥ కృష్ణమాచారి యనువారు రఘువంశవిమర్శములోఁ గవి

రఘువంశ మని పేరుపెట్టుటకుఁ గారణమేమని శంకించుకొని, కాళిదాసు సూర్యవంశమునకు రఘువునే కూటస్థునిగా నిర్దేశించి యీ కావ్యమును వ్రాసెననియుఁ, గావుననే "యాజన్మశుద్ధానాం" మొదలగు విశేషణములన్నియు రఘువు నుద్దేశించియే ప్రయోగించె ననియు, వ్రాసియున్నారు.

ఇది సరికాదు. కవి రఘువునే కూటస్థునిగాఁ జేయఁదలఁచినచో రఘుచరితముతోనే కావ్యమును బ్రారంభించియుండును. మఱియు "రఘూణా మన్వయం వక్ష్యే" అని బహువచనమును జెప్పక రఘో రన్వయం వక్ష్యే యని యేకవచనమునే యుపయోగించియుండును. ఈ బహువచనప్రయోగము కావ్యమున వర్ణింపఁబడినవారందఱును ముఖ్యులే యని తెలుపుచున్నది. కాని రఘువే ముఖ్యుఁడనియు, తక్కిన నృపాలు రముఖ్యులనియుఁ దెలుపుట లేదు. "వైవస్వతో మనుర్నామ" అని వైవస్వతమనువు రఘువంశమునకుఁ గూటస్థుఁ డని కవి కంఠోక్తిగాఁ దెలుపుచుండ శ్రీయాచార్యులవారు రఘువునే కవికూటస్థునిగా నిర్దేశించెనని చెప్పుటకుఁ దగు నాధారము కానరాదు. వీరు ప్రథమసర్గలో 5, 6, 7, 8, శ్లోకములలో వర్ణింపఁబడిన గుణములన్నియు రఘువు నుద్దేశించియే వర్ణింపఁబడినవని తెలిపిరి. పరిశీలించిచూడ నివియు సరికావు. ఈ గుణములన్నియు రఘువునందు కంటె దిలీపునందు సమగ్రముగఁ గనిపించుచున్నవి. కవి కావ్యాదిని సూర్యవంశ రాజులకుఁ గల ప్రధానగుణములు వర్ణించి, వెంటనే యాగుణములన్నిటికిని లక్ష్యభూతునిగా దిలీపమహారాజును వర్ణించెను. కనుఁడు.

| | |
|---|---|
| 1 ఆజన్మశుద్ధానాం | శుద్ధిమత్తరః |
| 2 ఆఫలోదయకర్మణాం | ఫలానుమేయాః ప్రారంభాః |
| 3 ఆసముద్రక్షితీశానాం | పరిఖీకృతసాగరాం |
| 4 ఆనాకరథవర్త్మనాం | పురాశక్రముపస్థాయ, |
| 5 యథావిధిహుతాగ్నీనాం | దుదోహ గాం స యజ్ఞాయ |
| 6 యథాకామార్చితార్థినాం | త్యాగేశ్లాఘావిపర్యయః |
| 7 యథాపరాధదండానాం | స్థిత్యైదండయతో దండ్యాన్ |
| 8 యథాకాలప్రబోధినాం | ప్రజానా మధిపః ప్రభాతే |
| 9 త్యాగాయ సంభృతార్థానాం | ప్రజానామేవ భూత్యర్థం |
| 10 సత్యాయమితభాషిణాం | జ్ఞానే మౌనం |
| 11 యశసే విజిగీషూణాం | మర్థేధనిషి చాతతా |
| 12 ప్రజాయై గృహమేధినాం | పరిణేతుః ప్రసూతయే |
| 13 శైశవేభ్యస్త విద్యానాం | విద్యానాంపారదృశ్వనః |
| 14 యౌవనే విషయైషిణాం | కలత్రవంత మాత్మానం |
| 15 వార్ధకే మునివృత్తీనాం } | అథ సవిషయవ్యావృత్తాత్మా |
| 16 యోగేనాన్తే తనుత్యజాం } | |

ఈ పదునాలు గుణకళలను దిలీపరాజచంద్రునియందుఁ బూర్ణముగా వర్ణించెను. ఇంత విపరముగను విరివిగను మిగిలిన రాజుల వర్ణింపలేదు. ఆచార్యులవారును దిలీపుఁడు రఘుమహారాజునకుఁ దండ్రియగుటచేఁ దెలుపఁబడెనుగాని ప్రధానుఁడగుటచే వర్ణింపఁబడలేదను భావమును వ్యక్తము చేసిరి. ఇది సరికాదు. ఈ కావ్యమునఁ గల 19 సర్గలలోను 1, 2 లలో దిలీపచరితమును 3, 4 లో రఘు చరితమును 5, 6, 7, 8, లో అజచరితమును 9 లో దశరథచరితమును 10, 11, 12, 13, 14, 15 లో శ్రీరామ చరితమును 16 కుశచ 17 లో అతిథిచరితమును 18 లో నిషధుఁడు మొదలు సుదర్శనునివఱకుఁ గల యిరువదియొక్క రాజుల చరితములును 19 లో అగ్నివర్ణుని చరితమును వర్ణింపఁబడినవి. దీనింబట్టి చూడ నాచార్యులవారు ప్రధానుఁ డనిన రఘుచరితమును, నప్రధానుఁ డనిన దిలీపచరితమును సమముగానే కవిచే వర్ణింపఁబడినవి. కావున నాచార్యులవారియూహ కాధారములేదు.

కవి రఘువంశమని పేరుపెట్టుటకుఁ గలకారణము రఘువు నుద్దేశించినది కాదు. "కవేర్వృత్తస్యనానామ్నా నాయకస్యేతరస్యవా" అను నాలంకారికనియమము ననుసరించి, యేదో యొక పేరు పెట్టెనేకాని మరేవిశేషమును నున్నట్లు గోచరము కాదు. కావ్యముల పేళ్లు సామాన్యముగా నిట్లు కథలోని యేకదేశము నాశ్రయించి పెట్టఁబడినవిగాఁ గానవచ్చుచున్నవి. కాళిదాసు "వైవస్వతో మనుర్నామ" అని వైవస్వతమనువును గూటస్థునిగా వర్ణించి, యతని పుత్రుఁ డగు నిక్ష్వాకుని విడిచి, దిలీపు నెత్తుకొనుటచేఁ గవి, దిలీపగుణము లాకర్షించెనని స్ఫురించుచున్నది. ఇక్ష్వాకుఁడు సామాన్యుఁడగుటచే విడిచెననుటకు వీలులేదు. ఈతఁడు విష్ణుభక్తుఁడు; వంశకర్త. "ఇక్ష్వాకు వంశప్రభవో రామోనామ జనైః శ్రుతః" అని వంశకర్తనుగా వాల్మీకిరామాయణము తెలుపుచున్నది. కావున నిక్ష్వాకు సుప్రసిద్ధుఁడు. కాఁబట్టి కవికి రఘువునందు కంటె దిలీపునందే గౌరవము హెచ్చు. అందుచే దిలీపునే రఘువంశమునకుఁ గూటస్థునిగా వర్ణించెనని కూడ చెప్పవచ్చును.

కాళిదాసు రఘువంశమునందు వర్ణించిన వర్ణనములు శ్రీమద్రామాయణమునందలి వర్ణనములఁ బెక్కింటిని బోలియున్నవి. కొందఱు విమర్శకులు అశ్వఘోషుఁడు విరచించిన బుద్ధచరిత్రమును గాళిదాసుఁ డనుకరించె నని తెలిపిరి. మఱికొందఱు కాళిదాసుఁ డశ్వఘోషునకంటె రెండుశతాబ్దములు పూర్వపువాఁ డగుటఁ గావున నశ్వఘోషుఁడే కాళిదాసవిరచితగ్రంథముల ననుకరించి, బుద్ధచరితము వ్రాసెననియు సహేతుకముగా విమర్శించియున్నారు.

(సశేషము)

# ఖురాన్

ఉమర్ అలీషా కవిగారు

ఇది మహమ్మదీయమతమును శాసించు నీశ్వర వాణి (వేదము). వేదమును నిదియు ననేక విషయములలో ననురూపమును బొంది సొంపు సంపాదించుచున్నవి. కాని యవిమర్శనము అనధ్యయనము అభావతాదాత్మ్యమువలన నిద్రాణంబులై పడియున్నవి.

ఖురానన(ఁ)గా అధ్యయనముచేయు గ్రంథ మని స్వరయుక్తముగాఁ జదువఁదగినది యని యర్థము. దీనికి మహమ్మదువారు (ఋషి.) రసూల్.

మహమ్మదువారు క్రీస్తు పుట్టిన తరువాత ౫౭౦ వ సంవత్సరము అరబ్బీదేశమునకు ముఖ్య పట్టణమగు మక్కానగరమున "ఖొరేష్" అను ప్రభు గోత్రమున "హాషం" అను కుటుంబమునందు పేరువడసిన "అబ్దుల్లా - అమీనా" అను ఉత్తమోత్తమదంపతులకు జన్మించిన యొకమహాయోగ పురుషుఁడు.

వీరు "ఇస్లాం" అనఁగా సమ్రత లేక భక్తి అను మతము—ఇందు పరమేశ్వరుం డగు "అల్లా" "లాయిలాః యిల్లల్లా" అనఁగా (త్వమేకం శరణ్యం) ఈశ్వరుఁ డొక్కఁడే పూజింపఁ దగినవాఁడు "వహదహు లాషరీకలహు" అనఁగా (ఏకమేవాద్వితీయం బ్రహ్మ) అల్లా (ఈశ్వరుఁడు) ఒకఁడు రెండు కానివాఁడు—అను నిజమును సిద్ధాంతీకరించి యాచరింపజేయ సమకట్టెను.

ఆ దేశీయు లనేక దేవతల నుపాసించువారుగ నుండిరి. మఱియును మిక్కిలి క్రూరులు. వధావిధానము వారియింట పుట్టిపెరిఁగి దశదిశలకు గంతులు వేయుచుండెను. అలాఁటి భయముచే సంక్షుభిత మగుచున్నకాలమున మన మహమ్మదువారు ఈశ్వరగీతము సుధామధురరసము లుట్టిపడు నట్లుగా గానముచేయ నారంభించెను. ఆ శృంగ ధ్వని విని యందు ముఖ్యముగా సగోత్రికులైన ఖురేషీయులే తమ ప్రియమైన ప్రాచీనమహా సిద్ధాంతములచే గరిష్ఠమైన మతమునకు మహమ్మదువారు హానికలిగించుచున్నాఁడని అలిగి యెన్నియో సారులు కలహించి యొకనాఁడు వారిని చంపివేయ వలయునని ప్రయత్నించిరి. ఈ జాడ మహమ్మదువారెఱింగి తాను శాత్రవులచేతిలోఁ బడి భౌతికశరీరమును గోల్పోవునెడల తనమనోవీథిని విరాజిల్లు నీశ్వరసందేశము లోకమున వెల్లడింపఁబడ దని తలపోసి యర్ధనిశీథినిని గృహము వెలువడి యెడారులలోఁ బడి వడివడిగా నడచి యెట్టకేలకు మూఁడు వందలమైళ్లు గడచి "మదీనా"అను పురము క్రీస్తుశకము ౬౨౨ వ సంవత్సరము జూలై ౧౬వ తేదీని పోయి చేరెను. అక్కడనుండి మతప్రచారము శతముఖముల వ్యాప్తము గాఁ జొచ్చెను. ఆ ప్రవాహములో "ఖురాన్" ఒక తరంగము.

అఖిలలోకకల్యాణదాయక మైనఈ "ఖురాన్" జిబ్రీల్ (బ్రహ్మ) ముఖద్వారమున అప్పు డప్పుడు సూరా అనఁగా సూక్తములు అందు "ఆయెత్" అనఁగా ఋక్కులుగా భాగింపఁబడి వెలువడుచు మహమ్మదువారి కర్ణపుటములకు వినంబడుచుండెడివి. అవి వెంటనే శిష్యుల కెఱింగించుచుండెను. వారవి హృదయకుహరంబుల ముద్రించి కంఠ

స్థము చేయుచుండిరి. కొందఱు తెల్లనిరాళ్లపైని తోలుముక్కలపైని దుమ్ములపైని ఖర్జూరపు ఆకులపైని వ్రాసి చదువుకొనుచు ఖిలము గాకుండ నుంచినారు. ఇది తొమ్మిదియేండ్లకు పూర్తియైనది.

“ఖురాన్” ముప్పదిజూజు (అనువాకము) లుగా విభాగింపఁబడి ౧౧౪ సూరా(సూక్తము) లు గలిగి, ధర్మశాస్త్ర న్యాయశాస్త్ర విజ్ఞానశాస్త్ర మంత్రశాస్త్రాది సమస్తవిశ్వమానవ ప్రపంచ వ్యవహార సంగ్రహము సమగ్రభావగంభీరయుక్తముగ నిర్వచింపఁబడినది. ఇది యొక యపురూపమైన మోక్షగ్రంథము. ఒక్కసారి సాంతముగ నర్థయుక్తముగ పఠించినంతమాత్రమున అస్థిమాంస వసావికారరూపకమైన భౌతికదేహములయందు నిద్రాణంబులై పడియున్న యనంత మగు నాధ్యాత్మికశక్తులుదయించి ప్రబోధ మగుటయేగాక ఈశ్వరవిశ్వాసము ఆత్మసాక్షాత్కారముతత్త్వదర్శనముమోక్షోపలబ్ధి యగు ననుటలో నతిశయోక్తి యొక్కింతయును లేదు.

“ఖురాన్” వెలువడిన కాలమున నరబ్బుల యింటింట విద్య దాస్యముచేయుచుండెను. అప్పటి కవులలో నెందఱో సార్వభౌమబిరుద మందినవారు కలసి “యిది దేవదత్తమైనవాణి గాదు. మహమ్మద్ స్వకపోలకల్పితమైన గాథ”యని వాదించిరి. వారితో మహమ్మద్‌వారు “ఫాతూబె అలాసూరతె మిన్ మిస్లెహి” ‘ఈ ఖురాన్ పౌరుషేయ మైనయెడల దీనివంటి యొక సూరా (సూక్తము) మీరును ఈ ధరాప్రపంచమును ముక్కోటిదేవతలును కలిసి రచింపుఁడు’ అను ఆయెత్ చదివెను. కాని వారు విశ్వప్రయత్నము చేసి ఒకసూక్తము రచించిరి. కాని మిగుల నీరసమైపోయినది. అది ఏ దనిన- “అల్‌ఫీల్ మల్‌ఫీల్ ఒమా అదరాక. మల్‌ఫీల్ జన్ బహు హాలీలున్ ఒఖుర్‌తూమహుతవీల్” అనఁగా” ఏనుఁగు ఏమియేనుఁగు నీవేమి యెఱుంగుదువు? ఏమనుకొన్నావు ఏనుఁగు దానితోఁక చిన్నది ముక్కు పెద్దది.”. అని అర్థము క్రమము లేనిదానిని రచించి భగ్నమనోరథులై తమ యవజ్ఞతకు వగచి మహమ్మదువారిపదసరోజముల కెరఁగి దాసులైపోయిరి. కాని లుబేద్ అనువాఁడు “సుమ్మ అబసన సుమ్మనరజ” కనుబొమల పైకెత్తెను. దీక్షగా వీక్షించెను. తిరిగి ముంగల కొరిగెను. తరువాత నేలలబడిపోయెను. కాని యెంతకు ‘ఇది (ఖురాన్) పౌరుషేయము’ అని దురభిప్రాయ మొసంగినాఁడు.

మహమ్మదువారిట్టి మహాగ్రంథము రచించుట కాయన యేపాఠశాలలోను శిక్షితుఁడు కాలేదు. అశిక్షితులకు సాధ్యముగాని లాక్షణిక మార్గము లిం దనేకములు గలవు.

“అల్ హందొలిల్లా హైరబ్బిల్ ఆలమీన్” అను ఖురానులోని మొదటి సూక్తమును క్రమాలంకారమును పెట్టుకొన్నఁగాని అర్థము కానేరదు. ఇట్లే గాయత్రియు క్రమాలంకారమునఁ గలదు- (దీనివివరము నేను వ్రాసిన ఖురాన్ తెలుఁగు వ్యాఖ్యానమున విపులముగా వ్రాయఁబడినది.

దీనికి “దలీల్” అనెదరు. దలీల్ అనఁగా “శ్రుతి” అని యర్థము. స్మృతికి “హదీస్” అనెదరు. ఇది వేదమున వలెనే ప్రభుసమ్మితము- “యథేమాంవాచం” అనునట్టులుగానే ఖురానులోని మంత్రములు “ఖుల్‌హు తల్లాహు అహద్” (ఓ మహమ్మద్)‘భగవంతుఁ డొక్కఁడని(నన్నుఁగూర్చి) చెప్పుము’ అని యాజ్ఞాపించినట్లు ప్రేరణార్థకమునఁ జెప్పఁబడినది. తక్కిన పారసీల జింద్ క్రైస్తవుల బైబిలునం దీమార్గ మగపడదు.

వేదమునకుఁ గల సంప్రదాయములు మార్గ

ములు చరిత్రములన్నియు ఖురానునకు నీషన్మాత్ర భేదమున సరిపోవుచున్నవి. ఖురానులో ముఖ్యముగా నలుగురు దేవతలు నిర్వచింపఁబడినారు.

జిబ్రీల్ = బ్రహ్మ; మెకాయిల్ = ఇంద్రుఁడు; ఇస్రాఫీల్ = ఈశానుఁడు; ఇజ్రాయిల్ = యముఁడు.

సృష్టికిని వేదమునకును బ్రహ్మ యెట్టివాఁడో ఖురానునకును మానవసృష్టికిని "జిబ్రీల్" అట్టివాఁడు. ఒక్క ఖురానే గాక వేదములు నాలుగువలెనే "ఇంజీల్, తౌరేత్, జబ్బూర్, ఫురఖాన్" అని నాలుఁగు - ఇంద్రుఁడు వర్షమున కధినాథుఁడైనట్లే "మెకాయిల్" మేఘాధిపతి వర్షములను కురుపువాఁడు. "ఈశానుఁడు = రుద్రుఁడు "మహాకాలో మహానటః" అనునట్లు "ఇస్రాఫీల్ ప్రళయమును కలిగించువాఁడు. యమునివలెనే "ఇజ్రాయీల్ ప్రాణములను దీయువాఁడు.

యజ్ఞము (అర్పణము)నకు ఖుర్బానీ అని, దేవపూజకు "నమాజ్" అని యందురు. ఈ రెంటికిని వేదమునకువలెనే ఖురానులో "ఇన్నా ఆతౌమెనా" అను సూరమె "కౌసర్"లో మిక్కిలి ప్రాముఖ్య మొసంగఁబడినది. కాని యీసిద్ధాంతము కొందఱు మహమ్మదీయు లొప్పుకొనరు.

ఢిల్లీచక్రవర్తి యగు ఔరంగజేబునకు అన్నయగు"దారా" ఉపనిషత్తులు పారసీభాషలో తర్జుమాచేసిన సందర్భమున ఖురానులోని ఆయత్.

"అలీఫ్‌లాంవిహాంజాలెకల్ కితాబెలారై భఫీజీడెహా"

"ఇది (ఖురాన్)నే నొకరహస్యమైన గ్రంథమునుండి యెత్తి తీసినాఁడను. ఆ రహస్యగ్రంథము వేద మనియు వేదమునుండి ఖురాను తీయఁబడిన" దనియు ప్రతిపాదించినాఁడు. ఈ ప్రతిపాదన మానని మోటమికిని సంహారమునకును గల కారణములలో నొకటిగా పరిణమించిన దని చారిత్రజ్ఞులుదాహరించిరి.

ఏది యెట్లులైనను వేదమును ఖురానును భిన్నభిన్నమైన దేశములయందును భాషలయందును బయలువెడలిన రెండు ఏకస్వరూపసాయుజ్యములుగల స్వర్గనూన పదార్థములే. రెండును ఒక చెట్టున పూచి కాచిన ఫలములే. రెండును నొకగనిలో బయలువెడలిన రత్నములే. పంచమస్వరము విపంచికచేత పలికించినను లేక కలకంఠకంఠ "హార్మోనియము"చెంగటఁ గూర్చుండి యెలుఁగెత్తి పాడినను అది కోకిలకే అన్వయమగుచున్నది. నది ప్రవాహవేగమున రెండుగాఁ జీలిపోయి వేఱువేఱు దేశములకు పాఱి యావసుంధరను వసుంధరగా మార్చి యుండవచ్చును. ఆ రెండు జలములు గ్రోలినతజ్ఞులిది మేఘములనుండి జాఱిన వర్షజలము వెల్లువలైన రెండుభాగము లని చెప్పకమానరు. ఇదే సమస్తవిశ్వమానవసమత్వమునకు మూలభిత్తి. ఇదే యీశ్వరాశయమును నెఱుఁగు దుర్భిణీయంత్రము. ఒకేభావము రెండుభాషలలో పలుకుట విపరీతముగాదు. అసంభవమునుగాదు. పరమేశ్వరుండగు అల్లా సంస్కృతభాషలో వేదమును, అరబ్బీభాషలో ఖురానును లోకకల్యాణార్థము నిర్వచించి యుండవచ్చును. కావుననే ఖురానులో "ఒయిన్‌బిన్ ఉమ్మతిన్ ఇల్లా ఖలాఫీహానజీర్" "ఏ మతమును నాదూత (ప్రవక్త) అనఁగా రసూల్ (ఋషి)లేనిదే కాలేదు" అని స్పష్టముగా వాకొనఁబడినది. కావున వేదమునఁ జేర్కొన్న విశ్వామిత్రుఁడు, మధుశ్ఛందసుఁడు మున్నగు ఋషులు మహమ్మదువారి వంటివారేయని యెఱుంగవలయును. మఱియు "లకుందీనకుం వలియద్దీన్" అనఁగా "మయ్యేవ సకలం జాతం, మయిసర్వం ప్రతిష్ఠితం"

అని లోకసంగ్రహార్థము నిర్వచించిన దీనిలో మత ద్వేషమునకు నెంతమాత్ర మవకాశె మియ్యలేదు.

ఈరీతిగా హైందవ వేదశాస్త్రముల నన్నిటికి సమన్వయమగు గాథలన్నియు నిందు తు, చాలు తప్పిపోకుండ సందం దగపడుచున్నవి. మఱియు విధ్యుక్తములు ఆచారములుగూడ నొక్కటే.

ఫరిస్తా = దేవత; కిరామన్ కాతెబీన్ = చిత్రగుప్తులు; జన్నత్ = స్వర్గము; దోజఖ్ = నరకము; బుర్రాఖ్ = కామధేనువు; జంజం = ఆకాశగంగ; కౌసర్ = అమృతము; పరీ = దేవకన్య; వరీయత్ = కర్మ; వజూ = ఆచమనము; నమాజ్ = పూజ; మురాఖెబా = సమాధి; జకాత్ = దానము; గొసుల్ = స్నానము; హజ్ = యాత్ర; వలీ = ఋషి; మస్జిద్ = ఆలయము; రోజా = ఉపవాసము; నియ్యత్ = సంకల్పము వ్రతము; సున్నత్ = నైమిత్తికకర్మము; ఇట్లే తక్కినవియు నెఱుఁగవలయును.

౧౪ లోకములందు పైని. ౭ ఆకాశములు. క్రింద ౭ భూములు. ౭ సముద్రములు. ౭ వారములు. వారములకేది మొదటిదియో అదే యెల్లవారికి మొదటిదిగా నున్నది. వంబా = సూర్యునిదినము. ఆదిత్యవాసరము. ఇంగిలీషులో సన్‌డే = సూర్యునిదినము; దూః = జీవము; హఖ్ = ఆత్మ లేక బ్రహ్మ; తసవ్వుఫ్ = ఆధ్యాత్మికవిద్య; ఇట్లే తక్కినవియు నెఱుంగవలయును.

ఈరీతిగా నేకార్థమునం దన్నియు సరిపోలుచున్నవి. ఇవి కేవలము పోలికలుగాక భాషాంతరీకరించిరా యను భ్రాంతి కలుగకపోదు.

ఇంక "ఖురాన్" ఏకేశ్వరప్రతిపాదకత్వమునకై చాల తీవ్రసిద్ధాంతములు గావించినది. అట్లే వేదమునందలి యుపనిషత్తులు గూడ ఖఃడించినవి కాని వేదమునందలి మంత్రభాగ మంతయు అనేక దేవతోపాసనముల కాకర మగుటచేత కేవలము ఒకఁడే దేవుఁ డనుదివ్యభావము చెడిపోయినది. దీనిపై చార్వాకులకాలమున దేవాలయముల బూతు బొమ్మలు, దేవునికి గర్భాధానాదిమానవసంబంధమైన యింద్రియలోలత్వములు ప్రతిపాదింపఁబడినవి. ఇట్టి పామరజనరంజకమైన కర్మను ఖురాను మిక్కిలి గర్హించుచున్నది.

"మసీదు" ఇంచుమించు శివాలయమును పోలియున్నది. శివాలయములోని లింగము స్తంభాకారముగ నున్నదానిని సామాన్యముగా మసీదున కిరుపార్శ్వముల నెత్తఁబడు స్తంభములుగను, చంద్రధ్వజులు మహమ్మదీయులు, చంద్రచూడుఁడు ఈశ్వరుఁడు, జటాజూటధారియైన ఫాలాక్షునినెత్తి నెత్తిన నెలయును, "స్థాణూ రుద్ర ఉమాపతిః" ఉమాపతిని, స్థాణుః= స్తంభముగాను పోల్చి చిత్రించినచో నది చంద్రధ్వజ మని వేఱుగ దానిని నిరూపింపనక్కఱలేదు.

ఇంక ఖురాన్ వేదము ఒక్క యీశ్వరమన నమున తక్క తక్కినవానినన్నిటిలోను సమన్వయమగు చున్నది.

ఖురానులో మొదటి ఆయత్ బుక్కు—

"అల్‌హందొలిల్లా హైరబ్బిల్ ఆలమీన్"

అని. వేదములో మొదటి బుక్కు— ౧

"అగ్నిమీళే పురోహితం" అని ప్రారంభింపఁబడినది- అనఁగా. ౨

ఓ అల్లా ! నీకు స్తోత్రము. ౧

ఓ అగ్నీ ! నీకు స్తోత్రము ౨

అని వినఁబడుచున్నది. అయిన నిది యొకే అర్థమునందున్నను "అల్లా" అగ్ని అనుటలో చాల భేద మేర్పడుచున్నది. కాని ఈయగ్నికి ఆర్యసమాజమున దయానందుఁ డీశ్వరపరమైన యర్థావసానమును సాధించినాఁడు.

ఖురాను కేవల నిరాకార నిరంజన నిర్వికారుఁడైన ఈశ్వరుఁడు తక్క రెండవవస్తు వేదియు నీశ్వరత్వమున కర్హము గాదని సిద్ధాంతీకరించినది. దాని

నెవ్వరును కాదనఁ జాలరుగాని కొన్నిగాథలవలన అగ్నిని వేదములు పూజించుట కాధారము లగపడు చున్నవి.

అగ్ని పంచభూతములలో నొకటి గాఁగలదు. దానికై మన మిప్పుడు ఖండనమండనములు గావింప బూనుకొనలేదు. అగ్ని "తేజస్సు గల"దను ఆధ్యాత్మికభావమున సమన్వయము జేసికొనునెడల, ఖురానులో "మోసే"గారి కీశ్వరుఁడు అగ్నిరూపమున సాక్షాత్కారమైనాఁడు. ఆ మోసేగారు తనశిష్యుల కీశ్వరసందర్శనము సేయింపవలసివచ్చిన సందర్భమున అగ్నినే చూపవలసివచ్చినది. మఱియు ఇబ్రాహీం ఖలీలుల్లాగారిని నమ్రూద్ అగ్నిగుండమున పడవేసినప్పుడు అగ్ని ఆరామమై పుష్పాలతో నిండిపోయినది" ఇట్లే మఱికొన్నిగలవు. ఇప్పటికిని పవిత్రమైన మసీదులలో అగరుసాంబ్రాణిచే ప్రజ్వలితమైన అగ్నియుండుట కాక్షేపణములేదు. ప్రతి పండుగకును మహమ్మదీయులు "అల్లా, మహమ్మద్, ఫాతిమా అలీ, హసన్, హుస్సేన్, పిరానేపీర్, మున్నగువారికి అనేక పక్వాన్నములు ఫలములు నైవేద్యము (ఫాతెహా) పెట్టునప్పుడు, అగ్ని లేకుండ ఆ సమారాధనము సాగనేరదు. ఇదేగాక ఒక సదాచారము—పీర్లపండుగనాఁడు త్రొక్కి అగ్నిగుండమున కాళ్లు కాలవనుట ప్రత్యక్షము.

ఇట్లే తక్కినవియు నెఱుంగవలయును. మఱియు వేదమున కథలున్నయట్లే ఖురానులోను పూర్వపు కథ లున్నవి. వేదములో వసిష్ఠవిశ్వామిత్రుల తిట్టులున్నట్లే ఖురానులో "అబూజహల్"ను తిట్టిన మంత్రములు గలవు. పింగళనాగుఁడు మొదలగువారు వేదమునకు ఛందము గలదనినట్లే కొందఱు ఖురానునకును ఛందముగలదని భావింతురు. అది మహమ్మదీయమతము ఒప్పుకొనదు- ఖురాను పౌరుషేయమగునను ప్రసంగము రాఁగూడ దని భావము. వేదమునందు

"నీలతోయద మధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా"

అను అనుష్టుప్ లున్నట్లే ఖురానులో గూడ నగపడుచున్నవి చూడుఁడు.

"ఇన్నఆతొ నకల్ కౌసర్ ఫసల్ లైరబ్బె కవనహార్"

ఇట్టి ప్రమాణము లెన్నియో గలవు. దీనినిబట్టి యీ రెండును ఒకే యీశ్వరపరికల్పిత మగు శబ్దములని (వేదము లని) సమర్థింపవచ్చును. లేనిచో రెండు భిన్నమైన భాషలు ఉదయాస్తాచలముల వంటి మొడమైన భాషలలో నొక లక్షణలక్షితమైన ఛందము లుండుట సాధ్యము గాదు. ఈ పద్ధతి అరబ్బీలో తక్కిన యే భాషాగ్రంథమునందును అగపడదు. వేదభాష యెట్టిదో ఖురాను భాషయును అట్టిదే - అనఁగా అనన్యసామాన్య మని భావము.

# ప్ర పం చ ము

**భమిడిపాటి రామసోమయాజులు గారు**

జ్ఞానమూర్తుల కందరు - సము లటంచు,
దెలుప, వసుధను గల యెల్ల-స్థలములకును,
గిరణజాలము బంచుచు - నరుణమూర్తి
లేత బంగరువెల్గు ధ-రించి వచ్చె.

తనదు బంట్ల వినాశము, - ధరణి జనుల
కరవుబాధ, మహాపాత-కములు, మరచి,
యుద్ధవిజయ సముద్రాన - నోలలాడి
కన్నుఁగానక వర్తించె - క్ష్మావిభుండు.

# ప్రేమతత్త్వము



మ. సూర్యనారాయణశాస్త్రి గారు

ప్రేమప్రశంస

ప్రథమభాగము

ఆనందమయుఁడు సత్య, జ్ఞానానంతాత్ముఁ డఖిలజగదుదయలయ
స్థానుం డగుపరమాత్ముని, ధ్యానించి మదాత్మఁ బ్రేమతత్త్వ మొనర్తున్.

చ. సకలజగంబు దేనికి వశంవద మై । యలరారు, దేనిలో
నకుటిలచిత్తవృత్తుల నిజాకృతు । లారయవచ్చు, దేనిచే
నొకని కొకండు కట్టువడు । నుల్లమునం దకలంకవృత్తి, న
య్యకలుష మైన ప్రేమ మొకఁ । డద్భుతశక్తి జగీషు వయ్యెడిన్.

ఉ. కామితభోగభాజన మకాంక్షితదైవవిపాకపాత్రమున్
దామసవృత్తి రాజసగుణస్థితి సాత్త్వికవర్తనత్రయా
ధామము లోకమానసపదస్థిరనిత్యనివాస మైనయా
ప్రేమ మొకండె చిత్రము విభిన్నగతిన్ జగ మాక్రమించెడిన్.

చ. అవనిఁ బిపీలికాదిమను । జాంతము జన్మము లెత్తినట్టి జం
తువుల శరీరపోషణవినోదవిధాన విరోధసఖ్యబాం
ధవపరితాపముఖ్యచరితంబు పరామరిసించి చూడ ని
క్కువముగ దాని కంతకును । గూరిమి కారణ మంచుఁ దోఁపదే?

చ. మన నయకోవిదుల్ తెలివి । మాలినవారిఁ గఁ జూచి లెక్క చే
యని పశుపక్షికీటకము । లన్నియు నోరును వాయి లేక జీ
వన మొనరించునట్లు కనవచ్చుచు । నున్నను, వానిచేష్టలన్
గనుఁగొనఁ బ్రేమ ముట్టిపడు । నైపుణి యెంతయుఁ దోఁప కుండునే?

సీ. ఎప్పు డెక్కడ కేని । నెడఁబాయ కెరలకై - చనుచుండు పక్షుల । జతలయందు
దొరకినయెర పరస్పరము సంగోరుగాఁ - జవిచూచు పక్షుల । జంటలందు
వలపించు ముక్కుగూర్పుల టెక్కుదార్పులఁ - గ్రీడించుపక్షుల । జోడులందుఁ
దమకించు పిలుపుఁగూతల సంజకడ గూండ్ల - కడఁ గూడు పక్షుల । కవలయందు.

గీ. గూండ్ల ముంగిండ్లఁ దల్లులకొఱకు సంజ, వేళలం గూయుపక్షుల । పిల్లలందుఁ
గాంచువారల కన్నుల । కలవు దీఱఁ, బ్రేమదేవత సాక్షాత్కరించు గాదె?

సీ. బారులు తీరి యంబరవీథి వేడ్కమై - విహరించుచుండెడి । విహగములను,
దమలోన నొకటి బంధములోనఁ జిక్కుచో - నసలు చార్చుచునుండు । నండజముల,
గ్రుడ్లు పెట్టుట కనుకూలంబుగా గూండ్లు - కట్టుచుండెడిపోతు । పెట్టజతల,

నాగ్రుష్లు పొదిగెడి । యాఁడుపిట్టల కెర - కొని వచ్చి యిచ్చు శ।కుంతములను,

గీ. జక్కఁగాఁ జూచిన విహంగ । జాతులందు - నైకమత్య విధానంబు । నధికమైత్రి
సహజసంసారసుఖలాల।సత్వ మెల్లఁ, గన్నులకుఁ బండు వగునట్లు । కానరాదె?

సీ. తల్లిపిల్లలలోని । తమకంబు గోమహి-ష్యాదిజంతువులందు । సరయవచ్చుఁ
బ్రాణసంరక్షణ।ప్రకటానురాగంబు - హరిణాదిమృగముల । నరయవచ్చుఁ
జిన్నపెద్దలలోని । ప్రేమ యారణ్యక - కరిసంఘములయందుఁ । గాంచవచ్చుఁ
నాత్మజాతిప్రసి।ద్ధానురాగరసంబు - వానరంబులయందుఁ । గానవచ్చు,

గీ. మఱియు నిది యెల్ల సర్వసా।మాన్య మగుచు, స్పష్టపడుఁ గాదె చూడుఁడీ । సృష్టిమహిమ!
వానికూర్మియె యట్టు లే।పారుచుండ, మానవప్రేమ మింక సా।మాన్య మగునె?

ఉ. వీనులుఁ గన్నులుం దనకు । వేగులవా రయి వార్త దెల్ప; సే
నానియుఁ గామఁ డాపరిజ।నంబును మున్నరుదేరఁ బ్రేమభూ
జాని జిగీష వెల్వడి య।సాధ్యపదంబుల గెల్చి పూన్కి-మై
మానసరాజధానికి స।మస్తసుఖార్థముఁ జేర్చు నెల్లెడన్.

చ. ఇది యది నాక యే దయిన । నెందలి దైనను బొందఁ గోరుచో
మొదలఁ దలంచు సామమున । ముట్టఁగ నంతటఁ జూపు దానమున్
బదపడి భేద మాపయిని । బట్టును దండము రాజనీతికో
విదుఁ డగుప్రేమభూవరుఁ డ।భీష్టపదార్థము సేకరింపఁగన్.

సీ. కనుకట్టువిద్య నేర్చినయట్టి మాయావి - కామినీకాముక।ఘటనదూత
సంసారరథచక్ర।సంచారపురవీథి - బహువిధార్థార్జనో।పాయవక్త
శత్రుత్వమిత్రత్వ । శౌర్యసాహసపేటి - పాపపుణ్యముల ని।క్షేపభూమి
బహుళశృంగారరూ।పకసూత్రధారుండు - పరమసంతోషస।బ్రహ్మచారి

గీ. వివిధరసకావ్య । నాయక వేషధారి, దుఃఖసుఖముల నెఱుఁగని।దోషకారి
ధీరసహకారి వృత్తివి।కారి నాఁగ, మానవప్రేమ దేదీప్య।మాన మగును.

క. జగ మంతయుఁ బ్రేమమయం, బగు నసఁగాఁ జెల్లుఁ గాని । యది యిది యనఁగాఁ
దగు నొక్కొ! పరిశీలిం, పఁగఁ గూరిమి లేనియొక్క।పనియుం గలదే?

### అవతారిక

చ. ఇది యొకచిత్తవృత్తి యని । యెంచిరి పెద్దలు గాని దీనినే
యెద జనియించునట్టి బహు । వృత్తులమూలము గా వచింప రై,
రదియును గాక దీని వివి।ధాకృతిచేష్టలు నిర్వచింప రై,
రది గద దీనిరూపు తెలి।యందగుచర్చకు మూల మయ్యెడిన్.

గీ. ప్రేమ యొక్కటియే వేఱు। వేఱుకార, ణముల వెవ్వేఱు నామరూ।పములఁ జెందు,
మట్టి యొక్కటె ధూళిజం।బాలలోష్ఠ, కుంభకుడ్యాదిసంజ్ఞలఁ । గూడినట్లు.

చ. గురుజనమందు భక్తియును, । గోమలియం దనురక్తి, బంధుసో
దరులయెడం బ్రియత్వమును, । దాససుతాదుల వత్సలత్వముం,
బరహితచిత్తులందును స।మానమనస్కులయందు హార్ద మై
పరగుచుఁ బ్రేమ యొక్కఁడె వి।వర్తము లొందు విభిన్నరూప మై.

గీ. అట్లు వే ఱయ్యు నెక్కఁడే యనఁగఁ దగియు, వేఱుపడునట్టి । యొక్కొక్క।విధమునందు
మరల బహువిధ తారత।మ్యంబు లొందె, ప్రేమ శాఖోపశాఖలై । వెలయుచుండు.

చ. కామినిఁ గౌఁగిలించుటను । గాదిలికూఁతును గౌఁగిలించుటన్
బ్రేమము వేఱువృత్తులఁ జ।రించినపద్ధతి, నట్లె యన్యకాం
తాముఖసోదరీవదన । తామరసంబులు చూచునాఁటియా
ప్రేమవిచిత్రవృత్తిపద।విం దలపోసిన, దానివృత్తి మా
యామహిమంబు దాని కిర । వైనమనంబు నెఱుంగఁ జాలునే?
యమనవచ్చుఁ, గోరినది।యే తన కబ్బినయప్పు డట్టిదే
కామితవస్తు వొండు పర।కాంక్షితమై లభియించనప్పు డా
ప్రేమము తొంటిదాని విడి । రెండవదానికె తత్తఱిల్లు, నౌ
రా! మును దా సమానము గ । నర్మిలిఁ జూపిన వస్తుజాతమం
దేమయినం బదార్థ మొకఁ । డెట్లొ నశించిన నున్నవానిపైఁ
ప్రేముడి యంత యేక మయి । పేర్మిగఁ బోయినదానిమీఁదఁ బో
రామిని జూపు, నైనను ది।రంబుగ నెందును నుండఁ బోక యీ
ప్రేమము చంచలం బయి చ।రించు నటంచును గొంద ఱందు, రిం
దేమియు లేదు తాను నరి।యించిన వస్తులమార్పుఁబట్టి యీ
ప్రేమము మాఱు నంచు వివ।రింతురు గొందఱు, మాటిమాటికిన్
బూమెలు దాల్చుదీని కొక । పున్నెము నన్నెము మంచి చెడ్డ య
న్నేమము లేదు నింద్యమున । నింద్యము సాధ్య మసాధ్య మొందుగాఁ
బ్రామిడియై తలంచి పయి।వ్రాలెడు; నెక్కనికై మఱొక్కనిన్
బాములఁ బెట్టు; దీని నెద । నమ్మిన మోస మటంచుఁ గొందఱున్,
బ్రేమమె జీవయాత్ర నడ।పింపఁగ మూలము దాన నింద్రియ
స్తోమము మోద మందు ననుఁ।చున్ మఱి కొందఱు నందు, రింత యే
లా మఱి! తీఁగ తీసినకొలం।దిని డొంక చలించు నన్నయా
సామెత నిక్క మయ్యె మన।చర్చకు వచ్చిన ప్రేమఁ గూర్చి యె
ట్లేమహనీయచర్చ మది । కెక్కెను చూతము ప్రాజ్ఞకోటికిన్ !

# పారిజాతాపహరణము — పాత్రపోషణము

ఆం డ్ర శే ష గి రి రా వు గా రు

సారస్వతసమాజము

క. మాకొలఁది జానపదులకె, నీకవనపుఁ ద్రావ? యబ్బ! నే కూపసట

ద్భేకములకు? నాకధునీ, శీకరములచెమ్మ? నంది! సింగయతిమ్మా!

చాటుధార.

ఆంధ్రప్రబంధరాజములలోఁ బారిజాతాపహరణ మొక యమూల్యమణి. దీనియందలి చవి, చక్కఁన — జవము, జీనము — గలుగు ఆంధ్రతా వాసనల మిటారించి, పరిమళించు మృదుమధుర కవితఁ దనివి తీఱఁ జూఱకొని కవికుంజరులు— 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' - అను బిరుద మిడిరి. పారిజాతాపహరణ మాంధ్ర ప్రబంధశిరోమణి యని నానమ్మిక. ఎట్లందురా? ప్రథమ ప్రబంధ మగు మనుచరిత్రకు వస్త్వైక్యము లేదు. వసుచరిత్రకు వస్తువే లేదనుట యతిశయోక్తి కాదు. ప్రబంధమున కనువగు వస్తువు, ఆ వస్తువునకుఁ దగిన యైక్యత పారిజాతాపహరణమున సిద్ధించినది. పూవునకుఁ దావి యబ్బిన దన్నమాట. ఇందలి పలుకులు తియ్యందనము చదువువారి కింపుఁ జెంపు సంపాదించును. ఈ కవికమలాసనుని కావ్యప్రపంచకల్పనాచాతుర్య మపూర్వము. భాగవత దశమస్కంధములోని యేఁబదితొమ్మిదవయధ్యాయమునందు మూఁడుశ్లోకములలో నతిలఘువుగ వర్ణింపఁబడినకథావస్తువు నెంచి తీసి, పెంచి పెంచి, మెఱుంగువెట్టి సుకుమార ప్రబంధముగఁ గ్రొత్తవెల్వరించె. తులఁదూఁచి తీర్చిచినట్లు హత్తినది, ఇందలి పదముల పొందిక. నోరూరునట్లు రసము చిల్కు రచనలు—ముద్దులు మూటకట్టి మురిపించుచుండు సులలితాంధ్రపదప్రయోగములు — రసోదంచితములు, అలంకారవిలసితములు నైనవర్ణనాచాతుర్యములు— ముక్కుతిమ్మనార్యుని కుగ్గుఁబాలతోఁ బెట్టినవి. మధ్యయుగకవులలోఁ గన్పట్టు సంస్కృతసమాసముల యాడంబర మిం దంతగా లేదు. శ్రీకృష్ణుఁడు సత్యభామ పొలయలుక తీర్చు ఘట్టమందలి స్వభావోక్తి కృష్ణరాయలు తిలకించి ఎంతలరియుండునో! సమయానుగుణముగఁ జక్కని జాతీయములు లోకోక్తులిముడ్చి స్వభావోక్తిని వర్ణించు కవులలో నితని కితండె సాటి. ఈతని కవిత్వమందలి సారస్యసారళ్యములు రామరాజభూషణాదులకు సైత మబ్బినవి కావు. ఒక విశేషము. అనేకాంధ్రప్రబంధములలో మందునకైనఁ గానరాని సముచిత పాత్రసంపోషణ మీ గ్రంథమున సెబా సని శిరఃకంపము చేయవలసివచ్చునట్లు నిర్వహింపఁబడినది. నారదుఁడు, సత్యభామ, శ్రీకృష్ణుఁడు — పారిజాతాపహరణమునఁ బ్రధానపాత్రలు. కథాప్రారంభమునందే ముఖ్యపాత్రలతోఁ బాఠకులకు స్నేహము కల్పించుట గొప్పకవిలక్షణము. కవిసాంప్రదాయము కూడ. షేక్సుపియరు తన నాటకములందుఁ బ్రథమాంకముననే ప్రధానపాత్రలకుఁ జదువరులతోఁ జనవు కల్పించు ననుట ఏతత్కవికృత నాటకపాఠకుల కనుభవ పునరుక్త మ

గును. ముక్కు తిమ్మనార్యుఁడు కూడఁ బ్రథమా శ్వాసముననే ప్రధానపాత్రలతో మనకుఁ బరిచయము కల్గించియున్నాఁడు. ఈ పాత్రల స్వభావ పరిపోషణము కవి యెట్లు నిర్వహించెనో ప్రత్యేకించి విమర్శించుకొందము.

## నా ర దుఁ డు

నారదుఁడు కలహాశనుఁ డనుట జగమెఱిఁగిన విషయము. ఆతని కలహప్రియత్వ మిందు లెస్సగాఁ జక్కఁగాఁ జిత్రితము. ఈ 'పోరోగిరము తిండిపోతు, శ్రీకృష్ణుఁడు రుక్మిణీకాంతగృహంబులో జూద మాడుచుండ నచ్చటి కరుదెంచి పారిజాతకుసుమరాజ మాతని కొసంగెను. ఆతం డది భోజనందన కిచ్చె. కయ్యము కల్పించుటకు 'నారి వేరంపుఁదపసి'కి సందు దొరకినది. ఆతండు 'కలహసంభ్రమపరుఁ డై' పారిజాతప్రసూనప్రభావము తెలియఁజెప్పి రుక్మిణితో నిట్లనియె-

'నెఱిఁగొప్పున నీకుసుమంబు దాల్చుటచే సవతులు వచ్చి నీ చరణసారసయుగ్మము నాశ్రయింతురు. ధవుఁ డబలేని కూర్మి జవ దాఁటక నీ పలుకాదరించును'. మనబాఁపఁడంతటితో నూరకుండెనా? లేదు. ఊరకుండుచోఁ గలహబీజ మేది? స్తుతివాక్యములలోఁ గలహకారణములు మేళవించి-

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బేరెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁడంచుఁ దా, నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్, స్రుక్కక యున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్.

అని రుక్మిణికిఁ గోపజనకంబు లగు పలుకులు వచించినాఁడు. ఔరా! నారదునిచాకచక్యము! స్తుతివాక్యములలోఁ గూడఁ గలహము వర్జింపఁడాయె! ఇఁక నేమున్నది? అనుకొన్నంతయు నైనది. ఈ వృత్తాంతము సత్యకుఁ దెలిసినది. ఆపె మూతి ముడిచినది. కంసారి కాళ్ల మీఁదఁ బడి వేఁడికొనఁగా నాతనిశిరమును వామపాదమునఁ దొలఁగం ద్రోచినది. పారిజాతవృక్షమే తెత్తు నని శ్రీకృష్ణునిచే ననిపించినది. నారదునికలహబీజము లిట విత్తఁబడి మొల కెత్తినవి. మునీశ్వరుఁడు సత్యభామకుఁ గోపము పై కెత్తునట్లు నిందించి రుక్మిణీకృష్ణులకును నామెకును మనసులో రవరవలు పుట్టించినాఁడు. అంతతో నిలిచెనా? పారిజాతకుసుమసంపాదనకై మురారి వృత్రారితోఁ గయ్యము చేయవలసియుండును. దీనం జేసి ఇంద్రునకును గృష్ణునకును గూడ నారదుఁడే పోరు కల్పించినాఁ డనవచ్చును గదా! ఒకటికి రెండు కల్పించిన నారదునిబుద్ధి వైశద్య మే మని కొనియాడఁగలము?

చిత్రము కనుఁడు. రుక్మిణీకాంతగృహములో సత్యను నోరికొలందు లాడిన నారదుఁడే సాత్రాజితి కావించిన యతిథిసత్కారము లందికొని, పండేరము లారగించి, త్రేఁపులు ద్రేఁచుచు—'సతుల ప్రాభవవైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నినుం బోలం గల రబ్జగంధు లన విం టే యెందు సాత్రాజితీ!'—అని మొగమిచ్చ మాటలాడెను. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట లాడు'—నారదుని సమయోచితకార్యనిర్వహణవైదుష్య మెంత నేర్పుతోఁ గవి చిత్రించినాఁడో కంటిరా? సత్యను ముఖస్తుతి చేయుకాలమునందే—'అని కైనం బతి నిన్నుఁ బాసి చనునో'—యని సాభిప్రాయముగా వచించి కృష్ణునితో నాకమున కామెకూడఁ బోవునట్లుఁ బొసంగించెను. మొల కెత్తినకలహబీజ మిట చెట్టయి కాచి పూచి ఫలించినది. స్తుతిలోఁ గలహకారణములు మేళవించుటయే నారదుని చాకచక్యము. అదియే ఆతఁడొనర్చు చమత్కారము.

పారిజాతతరువు దెచ్చినపదంపడి నారదుఁడు తిరిగి వచ్చి- 'హేమనిభగాత్రి ! నీ భాగ్య మేమి చెప్ప!—అని సత్యను సన్నుతిచేసి, ఆమెచేఁ బుణ్యక వ్రతమును జేయించి, వ్రతదక్షిణగా నామెవలనఁ గృష్ణుని గ్రహించి, యతనిచే వెడఁగు పనులఁ జేయించి యెల్లరయుల్లంబుల హాస్యము దొప్పఁదోఁగించె. పరమభాగవతశిరోమణియు, భక్తాగ్రేసరుఁడును నగునారదుఁడు నవ్వటాల కట్లొనర్చెనే కాని నిక్కంపు మనముతోఁ గాదు. ఆతండు యొక్కవాని భక్తుఁ డనుటకు రుక్మిణీసద్మమునను, పుణ్యకవ్రతానంతరమునను శ్రీకృష్ణభగవానుని స్తుతించినపద్యములే చాలును.

కాని, యొక్కవిషయమున నారదునిస్వభావ పరిపోషణమునం దనౌచిత్యము కనిపించుచున్నది. ఏది యందురా? పారిజాత ప్రభావము రుక్మిణితో వర్ణించు నెడ నారదుఁడు.

మ. అలినీలాలక ! నీవు నీపతి రహఃస్యక్రీడ వర్తించు వే, ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబుఁ గల్పించు నుజ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసం జాత ధారాళఘ, ర్మలవంబు ల్దొలఁగింపఁగా సుర టిమైరంజిల్లు నిచ్చాగతిన్.

అనుట అనౌచిత్యముగను నసమంజసముగను నున్నది. ఈ మాటలు మునులనోటనుండి రాఁదగినవి కావు. భార్యాభర్తల యెదుట నారదుని వంటి సకలశాస్త్రపారంగతుఁ డిట్టి యసభ్యశృంగారవచనము లుచ్చరించెననుట అనాగరకము కదా! ఈసుట్టమున ముక్కుతిమ్మన్న నారదునిస్వభావపరిపోషణము చెడఁగొట్టి పప్పులోఁ గాలు వైచెననుటలో సందియము లేదు. పాత్రపరిపోషణమునం దీకవి గావించినలోప మిది యొక్కటే.

(సారము.) నారదుని కలహప్రియునిఁ గా, 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కామాట లాడి' సమయోచితముగఁ గార్యము నిర్వహించుకొనుట యందు నిపుణుఁగా, భక్తాగ్రగణ్యుఁగా, తిమ్మనార్యుఁ డతిచాకచక్యముతోఁ జిత్రించియున్నాఁడు. పారిజాతాపహరణమునందు రణభోజనునిపాత్ర ప్రధానమైనది. ఇందలి కథాకల్పనకు నాతఁడే సూత్రధారుఁడు. ఆతఁడు లేనిచోఁ గథయే లేదు.

### సత్యభామ

సత్యభామ రాజసికగుణము గలస్త్రీరత్నము. 'కులమును రూపము న్మగనికూరిమియుం గలది.' సౌందర్యవతి. మానవతి. మహనీయ సౌభాగ్యవతి. కావుననే నారదుఁ డాడిన మాటలు విని లాఁతిదే వేరులు చల్లచల్లఁగ నూరకున్నను మానవతి యగు సత్య "వ్రేటు వడ్డ యురగాంగనయుంబోలె, నేయి వోయ భగ్గని దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి'— నారదుఁడు 'అతులమహానుభావ మని యవ్విరి' యచ్యుతునకు నూడిదగా నిచ్చుఁగాక; 'తా నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణచేసినఁ జేసెఁగాక; ఆ మతకరి వేలుపుందపసి మమ్ము దలంపఁగ నేల?" యని బిట్టు వగచినది. రుక్మిణి యనక 'ప్రియంబు గల్గునెడ' కని భోజనందనను సూర్చి పల్కుటచే సత్యకు నామెయెడఁ గలుగు చూపోపమి యగ్గలము తెల్లమగును. 'మమ్ము' అను గౌరవార్థకబహువచనప్రయోగముచే నామె రాజసికగుణము తెలియ నయ్యెడిని.

ఆమెకుఁ గృష్ణునిపైఁ గినుక వొడమినది. 'ధూర్తగోపాలుఁడ'ని మగనిం దూలనాడినది. 'శరదంబుదచలచిత్తులు పురుషు లన్నది. 'ఆహా ! యిట్టిమాటలు చెవులకు వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా, నోఁచితి నింక నెట్టివి కనుంగొన నున్నదాననో"—యని యనర్థములకుఁ దలంకి

నది. ఆమెకోపము క్రమముగా నెట్లగ్గల మగుచున్నదో కనుఁడు. మరల నంతలో భర్తృప్రేమ తలంచుకొన్నది. వగల మిగుల నొగిలినది. 'మాసిన చీర గట్టికొని, నిరస్తభూష మై'—'చీఁకటింటికడ కంకటిపై గాఢమనోజవిషాదవేదనచే' బొరలినది. ఇదంతయు నెందులకు? తనకు నలుగురిలో నలుసుఁదనము వచ్చిన దని. ఈసందర్భమున స్త్రీజన సహజంబు లగు అసూయాదిగుణములు కూర్పు నేర్పుతో కవి మనోహరముగ వెల్వరించియున్నాఁడు.

కృష్ణుఁడు సత్రాజిత్తనయ నెన్నియో రీతుల ననునయించెను. 'పాటలగంధికోపభరము దీర్పఁజాలక 'మృదుపల్లవకోమలతత్పదద్వయీపాటల కాంతిమాళిమణిపంక్తికి వన్నెవెట్ట నాజగన్నాటకసూత్రధారి' మ్రొక్కెను. రజోగుణప్రధాన యగు సత్య 'జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరము వామపాదంబునం దొలఁగం ద్రోచె.' ఆహా! రాజసమా! జగన్నాటకసూత్రధారి, లతాంతాయుధు కన్నతండ్రి నీకు మ్రొక్కినను నీదొరతనంపు నీటు రవ్వంతైన సరే తగ్గించుకొంటివి కాదుగదా! సత్యభామ స్వాభిమానసంరక్షణప్రియత్వము, స్త్రీ సహజ మగు నసూయయు నిచ్చోఁ బ్రదర్శితము.

కృష్ణభగవానునివాక్యము లామెను నూఱట పుచ్చలేదు. అతినిని నిందింప దొరఁకొన్నది. పసులకాపరికి భావజమర్మకర్మములు తెలియ వన్నది. 'మాయలు నీకు వెన్నతోఁ బెట్టినవి.' 'ఇంకిటు నిను నమ్మను' అన్నది. 'మానరహిత మైన బ్రదుకు మానిని కేలా?' అని ఆత్మగ'రవనాశనమునకై వగచినది. 'నను నెవ్వతెగాఁ జూచితివి' అని మరల రాజసము మెఱపించినది. అంతలోఁ జూపోపని పెంపుచే నామెకు విచారము గల్గినది. స్త్రీలకుఁ గన్నీ రాయుధమనంటిది కదా! గాసిలి యేడ్చినది. నరకాసురదమనుఁ డామెకుఁ బూర్తిగ లొంగిపోయి నెయ్యముఁ దియ్యముఁ దోఁప—'పారిజాతవృక్షంబునే తెచ్చి నీపెరటిచెట్టుగ నాటింతుఁ బెంపుఁ గనుము'- అన్నాఁడు. అంత సత్యామానిని 'సీపలతికవోలెం గనుపట్టె.' ఆమె సంతుష్టి చెందినది. నాథునకు మజ్జనభోజనాదులు యథావిధిగ నర్పినది. చిన్ని సంగతుల కైనను స్త్రీలు పెనువంతఁగుంది యంతలో మరల నూఱడిల్లుట స్త్రీజన స్వభావసిద్ధము. మఱియుఁ జీటికి మాటికిఁ జిఱ్ఱుబుఱ్ఱు మనువారేత్రుటిలోఁ బొగడ్తలకుఁ బొంగిపోవుదురు. లతాంతమాత్రమునకే మూతి ముడిచిన సత్య మరల నంతలో సంతసించినది. ఆలుమగల యలుక 'అద్దముమీఁద పెసరగింజ నిలుచునంత కాల ముండు'నని సామెత. అట్లే సత్య కృష్ణుని దూఱియుఁ దన్నియుఁ బారిజాతపాదపము తెత్తు ననుటతోడనే హెచ్చుగా మెచ్చుకొన్నది. అందుచే నామె అల్పసంతోషి యని వచింపవచ్చును. రుక్మిణీసదనంబునఁ దన్నుఁ దూలనాడిననారదుఁడే తన్ను పొగడిన వెంటనే సత్య పొంగిపోయినది. దీనిచే నామె అమాయికురా లని నిర్ధారణచేయవచ్చును. నారదునకు సత్కారము లొనర్చుటచే నామె బ్రాహ్మణభక్తియు, నుదాత్తగుణములును తెలియ నయ్యెడిని.

శ్రీకృష్ణుఁడు సురతరువు పెకలించినపుడు నందనపాలురు వారించిరి. వారికిఁ గృష్ణుఁడు జవాబీవలసి యుండఁగాఁ దన కార్యము నెగ్గిన దను గర్వముతో, తనముద్దు చెల్లిన దను నహంభావముతో- 'ఏమో వచింపఁబూను హృదయేశ్వరునిఁ గరసంజ్ఞ మాన్చి'— సురేశ్వరవనపాలకులతో సత్య— 'వార్ధిఁ బొడమిన యీదివ్యభూరుహమున కింద్రాణి

యెవ్వతె? ఇంద్రుఁ డెవ్వఁడు? ఇందిరను గౌస్తుభము
నెవ్వఁడు చేకొనె నతఁడె దీని కధికారి. తెక తేరయిది
యేమి యొకరిసొమ్మె?' అన్నది. అంతతోఁబోక.—

'ఇదె నాదువిభునిచే నీ వదాన్యనగంబు
నెడియించుకొని యేఁగుచున్నదాన'-

అన్నది. తిలకించితిరా సత్యగర్వము? విశేష
మే మనఁగా శ్రీకృష్ణుని 'సత్యభామావిధేయుఁ'
డన్నది. ఆమెగర్వము సోడుముట్టినది. ఆమెయహం
భావము ఆకాశ మంటినది.

నారదునిపంపునఁ బుణ్యకవ్రతము సల్పుటచే
నామె వ్రతనిష్ఠ సదాచారసంపత్తి గలది యని
ప్రస్ఫుట మగును. సురమునీశ్వరుఁడు నాథుని
ధారోదకపూర్వకముగ దాన మొసర్పు మని యనిన
తోడనే సత్యభామ - 'మధుకైటభమర్దన! చిత్త
గించితే మునిపతిమాట'? — అన్నది. భావము వెలి
పుచ్చక, మర్మము చెడక, నోరు వెలితిచేసికొనక.
తన భావానుగుణముగ నాథుని ఒప్పుకోలు వడసి
నది, ఏమి! ఆమె తెలివితేటలు!

(సారము) సత్యభామ ఆత్మగౌరవము గలది.
మానవతిరజోగుణప్రాధాన్యముగలకాంతారత్నము.
స్త్రీలకు సహజముగ సవతులమెడఁగల అసూయాది
గుణములు గలది. అల్పసంతోషి. అమాయికు
రాలు. బ్రాహ్మణభక్తి గలది. సువ్రత. సదా
చారిణి. గర్వము కలది. అహంభావముకూడఁ గలది.
కృష్ణుని మన్ననలఁ గన్నది. తెలివితేటలు గలది.
ఇట్టి విశేషగుణములు నేర్పుతో మెలఁకువతో
వర్ణించి వివరించిన నందితిమ్మనార్యుని విశేష శేముషీ
ధురంధరత్వము నిరుపమానము కదా!

### శ్రీకృష్ణుఁడు

శ్రీకృష్ణుఁడు శృంగారపురుషుఁడు. రసిక
శిఖామణి. ఆతఁడు సత్యభామ ననునయించుటకై
పన్నిన మాయలు, సల్పిన సరసములు, వచించిన
ముద్దుమాటలు, ఒనర్చిన కృత్యములు, నాతని రసి
కత్వము, శృంగారరసస్వరూపవిజ్ఞానము వేయినోళ్ల
వెల్లడిచేయుచున్నవి. 'నయగారపుం బ్రియములు,
మొగమిచ్చుమాట' లాడి సత్య ననునయింపఁ జూచె
ను. సత్య యెందు కలిగినదో తనకుఁ దెలిసియున్నను
ఏమియు నెఱుఁగనివానివలె— 'మైకోడవు లేల
ధరింపవు'—అని పృచ్ఛించెను. చూచితిరా 'మురారి
మాయాకల్పనాచాతురి! శతధా సహస్రధా
కీర్తింపవలసియున్నది. కోపోపశమనమునకై ఆమెను
బతిమాలెను. చివరకు మొక్కెను. అప్పుడైన సత్య
భామ కోపాగ్ని చల్లారినదా? లేదు. పేరలుకం
జెంది యామె పురుషోత్తమునుత్తమాంగము వామ
పాదముతోఁ దన్నినది. దానికిఁ గృష్ణుఁడు గ్రుడ్లెఱ్ఱ
చేసెనా? మండిపడెనా? లేదు. లేదు. రసికజన
శిఖామణి, 'భావజమర్మకర్మము లెఱింగిన పసుల
కాపరి,' శృంగారరసస్వరూప మెఱింగిన మేటి యగు
అతఁ డక్కోల చేయును? ప్రత్యగ్ర 'శిరీషకుసుమ
కోమలసుధామమోక్తుల'—

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ
గిన్కఁ బూని తాఁ, చినయది నాకు మన్ననయ?
చెల్వగు నీపదపల్లవంబు మ, త్తనుపులకాగ్ర
కంటకవితానముసోఁకిన నొచ్చునంచు నే,ననిమెద
నల్కమానవు గదా యికనైన నరాళకుంతలా!

అని యనునయించి పారిజాతపాదపము దెచ్చి సత్య
భామకేళివనములో నాటుదు నని ప్రతిన యొన
ర్చెను. చిత్ర మారయుఁడు. సత్యభామ నెయ్యపుఁ
గిన్కఁ బూనినదఁట. ఔరా! కృష్ణుని గడుసు
మాటలు! కోపము ప్రసాదముగాఁ దీసికొనుట
యందు మురారి దిట్ట. కోపము ప్రసాదముగ స్వీకరిం
చుటయే కోపాగ్ని చల్లార్చుటకు, తద్వేగము తగ్గిం

చుటకు ముఖ్యసాధనము. ఇట్టి సాధనము స్వాధీనములో నుంచుకొనినకంసారి ఎంతటి మాయాకల్పనాచతురుఁడో, గడుసువాఁడో యోచింపుఁడు. ఈ ఘట్టమునందలి శ్రీకృష్ణుని శృంగారవిలాసరహస్యజ్ఞానము, మాయాకల్పనాచాతుర్యము, గడుసుందన మసదృశముగాఁ జిత్రింపఁబడినవి.

స్వర్గయాత్రకుఁ బోవుచుఁ దనకాంతకు విశేషవస్తు వర్ణనలు చేయుటచే నాతఁడు సత్యభామాప్రియుఁ డని తేటతెల్ల మగును. పారిజాతాపహరణమునకై ప్రియకాంత వేగిరించుచున్నను నందనవనములోఁ గొంతకాలము విహరించుటచే నాతని క్రీడాప్రియత్వము తెలియవచ్చెడిని. సముద్రమువలె సురసైన్యము దన్ను చుట్టుముట్టినను వెనుకంజవేయక తా నొక్కఁడే నిలిచి నిశ్చలధైర్యముతో నిర్నిద్రసాహసముతోఁ బోరాడుటచే నాతఁడు మహావీరుఁ డని నిర్ణయింపవచ్చును. ఇంద్రుఁ డోడి సాఁగఁబడి మ్రొక్కిన కృష్ణుఁడు కృపార్ద్రచిత్తుఁడై ఆతని వజ్ర మాతని కిచ్చె. పిటికికండ లేని కడింది మగం డగుకంసారి - 'చంపఁ దగినయట్టిశత్రువు తన చేతఁ జిక్కెనేని పొసఁగ మేలుచేసి పొ మ్మను' - విశాలహృదయుఁ డనియు, సకరుణుం డనియు, దీనిచేఁ జెప్పఁజెల్లును. 'నీ మఱందలు కోరిన పారిజాతము చేకొంటిని' - అని నేరము సత్యభామపైఁ బెట్టి - 'వలసినచోఁ దీసికొమ్ము' - అని యింద్రునితో ననిన నరకాసురదమనుని సంభాషణసమీచీనత, నాగరికత, గడుసుఁదనము ఏ మని కొనియాడఁగలము.

పారిజాతముతో నిజనగరి కేతెంచి దేవకీవసుదేవులకు బలభద్రునకుఁ దక్కఁ గలపెద్దలకు నమస్కరించె నని చెప్పుటచే శ్రీకృష్ణుని గురుజనభక్తి వెల్లడి యగును. పుణ్యకవ్రతసందర్భమున నారదునకుఁ దాను దాన మీయఁబడుట కొప్పుకొలిచ్చుటచే నాతని సుకుమారసరసశృంగారరసజ్ఞానప్రాగల్భ్యము తెల్ల మగును. నారదునిపంపున వెడఁగు పనులొనర్చుటచే నాతఁడు 'కపటనటనాపరుం డనియు,' లీలామానుషశరీరుం డనియు, భక్తాభీష్టప్రదాత యనియు, బ్రాహ్మణభక్తిపరాయణుం డనియు స్ఫురించును.

(సారము) శ్రీకృష్ణుఁడు రసికజనశిఖామణి. శృంగారవిలాసవినోదవిచక్షణుఁడు. 'సత్యభామావిధేయుఁడు.' మహావీరుఁడు. అట్లయ్యు కృపార్ద్రచిత్తుఁడు. మాయాకల్పనాచతురుఁడు. బ్రాహ్మణభక్తి పరాయణుఁడు. క్రీడాప్రియుఁడు. గురుజనభక్తి కలుగువాఁడు. గడుసరి. విశేషించికాంతల కనుసన్నల మెలఁగువాఁడు. ఇట్టి సందర్భోచిత పాత్ర సంపోషణ మసదృశముగా నొనర్చి ఆంధ్ర ప్రబంధకవులకుఁ బూజ్యలింగమైన కవికుంజరుఁడు - ముక్కు తిమ్మనార్యున కొక్క నమస్కారము.



# నీతిభవనము

## క్రొత్తపల్లి సూర్యారావుగారు

### ప్రథమభూమిక - ముప్పదిసోపానములు

శ్రీకరు, సత్ప్రవాళరుచి, । సింధురహస్తు సుమాళి నెవ్వఁడే
బ్రాకటభక్తిఁ గొల్చినను । వాక్కులు నెమ్మదియబ్బు, భాగ్యల
క్ష్మీకరుణాకటాక్షమున । మేకొను వానిగృహంబు, శోకబా
ధాకలితంబుగా, కహరహంబును వర్ధిలు మేనుజానుగన్. ౧

చ. ఒకనికి మేలు చేసి సన । యుండెదు రెన్నఁడు మాఱుమేలు సేఁ
తకుఁ గనరా దతండును గృతఘ్నుఁడుగాఁ జనదెంచిచూడ నా
రికెడము పాదమూలమునఁ । బ్రీతిని గొన్న జలంబు మిన్నుము
ట్టి కడు శిరంబుతోడను గడిందిగ నిచ్చుట తారకాణ యౌ. ౨

గీ. మంచివారి కొసర్చిన । మంచి తాతి, మీఁదివ్రాలట్లు । స్థిరమగు; మేల్మి లేని
వారి కొనరించినట్టి మేల్వారిమీఁది, వ్రాతకు సమానమగుఁ జూడరాదె యెందు. ౩

గీ. పరువమున లేమివచ్చిన । గరముఁ గష్ట మగును, ముదిమిని సుఖమును । నగును గష్ట
మరయుమ యకాలమునఁబూచినట్టి పూవు, నాయకుఁడులేని సతియౌవనంబు । నొకటి. ౪

ఉ. క్షీరము లెంత కాఁచిన రుచిం బెడఁబాయదు; నిర్దయు లెందా
చేరిక చేసినన్ హృదయసీమల కార్ద్రత గొంచురారు; స
ద్వారమదెంత చెడ్డను బ్రధానగుణం బగు కూర్మి పోదు; వే
సారులు మాడ్చిన స్వాదునె । శంఖము సాజపుఁదేజ మెప్పుడున్. ౫

గీ. తడవతడవకును భగీరథ ప్రయత్న, మాచరించిన సమయమునందుఁ గాక
పనులుగా వెంత చిలవలు । పలవలేచి, క్రాలు చెట్టనిఁ బంపిద కాలమునను. ౬

ఉ. మానధనుం డొకప్పు డవమానము సంభవమైనఁ బ్రాణముల్
దాను ద్యజించుఁగాని తన । దాయకు లోఁబడఁబోఁడు; నిక్కమే
పూన నశక్యమైన బరువు న్దనపై నిడ తాతిదూల మే
మాను బరుక్కున న్విఱిగి । మైనను బోవనుగాని వంగునే. ౭

గీ. నీటికొలఁదినె తామర । నిల్చుఁ గొలనఁ, జదువుకొలఁదినె జ్ఞానంబు । నెఁదవు నరుని
తపముకొలఁదినె యైశ్వర్య । ముపగమించుఁ, గులముకొలఁదినె యుండును । గుణముగూడ. ౮

గీ. సజ్జనుల దర్శనంబును । జాలసేపు వారితో భాషణంబును । వారి బోధ
వినుటయును వారిగుణములు । వినుతిసేఁత,యును సుఖంబుగ వారితో । మనికి మేలు. ౯

గీ. దుర్జనుల దర్శనంబును । దుఃఖమొసఁగు, వారిమాటలు వినుటయు । వారిగుణము
లెంచుటయు వారితోడ భా।షించుటయును, వారితోఁగూడి మనుటయు । వసుధఁ గీడు. ౧౦

గీ. వరిమడికి నీరుపాఱింపఁ । బ్రక్కనున్న, పచ్చికకుఁగూడ నాతేమ । బలుపు నిచ్చు
మంచివాఁడొక్కనికిఁ గాఁగ । మబ్బుగురియఁ, జెడ్డవారల పొలముల । చేటుపోదె? ౧౧

గీ. క్షితిని మొలకెత్త బియ్యపు।గింజ ముఖ్యమైన, నుముకతొలంగిన । యేని మొలవ
దట్లె యెంతటి దక్షున । కైనఁగాదు, గ్రహబలము దప్పియుండినఁ । గార్యచయము. ౧౨

చ. మొగలినిజూడు పట్టతెగ । మూరెఁడు, తావికొలంత; చిన్నదా
పొగడకొ? కావ్రసం దెగడఁ।బోలదు హీను లటంచు నెవ్వరిం
బొగడఁగరాదు పెద్దని స।ముద్రము బిందువునైన ముట్టఁగా
నగునె సమీపపుంజెలమ।యట్టులు పాంథుఁడు దప్పి తీరఁగన్. ౧౩

గీ. కొమ్మలును రెమ్మలును గల్గి । గుజ్జుగా వ,నమున నిల్చినవెల్ల వృ।క్షములు గావు
చదురులో నిల్చి కమ్మను । జదివి వక్క,ణను దెలియఁజెప్పఁజాలని । జనులుగాని. ౧౪

గీ. నెమలి పురివిప్పి యాడెడు।నేర్పుఁ జూచి, తొండపుంగోడి తాను శి।ఖండిన యని
చిట్టియీఁకల తోఁకెత్తి।చేయు నృత్య, మట్లె దుష్కవి సత్కవి । ననుసరించు. ౧౫

గీ. క్రోలుపులికి వచ్చినవ్యాధిఁ । గుదురఁబెట్టి, దానిచే మ్రింగఁబడిన వై।ద్యవరునట్లు
చెల్మి యెఱుఁగని చెనఁటికిఁ । జేయుమేలు, ఱాతిపై వైచు మృత్పాత్ర।భాతి యగును. ౧౬

గీ. అడఁగి మడఁగి యుండెడువాని । నజ్ఞుఁ డనుచు, నెన్ని యెదిరింపఁజూచుట । చిన్నతనము
మడువతలఁ ఛాఱు చిఱుచేప । విడిచి తగిన, చేపకై వేచు కొంగ నీ।క్షింపరాదె. ౧౭

గీ. వట్టిపోయిన చెఱువును । వదలునీటి, పిట్టలట్టులు దుఃఖంపు।వేళ విడుచు
వారుగా, రుల్ల చెఱువును । వదలకుండు, తామరను బోలువారు బాం।ధవులుగాని. ౧౮

గీ. మంచివాఁ డెత్తువడినను । మంచివాఁడె, చెడ్డవాఁ డెప్పుడును దాను । జెడ్డవాఁడె
హేమపాత్రము చితికిన । హేమమె యగు, మట్టిపాత్రము చితికిన । మట్టియె యగు. ౧౯

ఉ. మానికఁ జేతఁ బట్టి యతి।మాత్రపు లోఁతగు నబ్ధిముంచినన్
మానెఁడెగాక నాల్గయిదు । మానలు ముంపఁగరానియట్లె యె
వ్వానికి నెంతవిత్తమును । బ్రాభవ మున్నను బూర్వజన్మక
ర్మానుగుణంబెగాక యణు।వైనను నెక్కుడు మెక్కుఁ దక్కనే. ౨౦

గీ. తోడఁబుట్టినవారు బం।ధువులుగారు, తోడఁబుట్టదె వ్యాధి యె।త్తుకొనిపోవఁ
గొండపైఁబుట్టి వేర్వేల్ల।కలును దెవ్వలు, కుదురుచును వానిఁబోలెఁ జి।క్కుదురు హితులు. ౨౧

గీ. ఇంట నిల్లాలుగలిగిన । నింటలేని, దేదియును లేదు కలుగదే । నేది లేదు
ఇంట నిల్లాలు వాయాడి।యేని నరుస, కిల్లు. గాదది పులిపొద।రిల్లుగాని. ౨౨

క. తలవ్రాఁతయట్లె కలుగును, దలఁచినగతిఁ గలుగదుర వృథా మందమతీ!
నిలు, కల్పతరువు నడిగినఁ, గలుగుఁ దురదగొండికాయ।కాలము చెయిదిన్. ౨౩

చ. కినిసిన మానవాధములు । కేవలతుల్యులు తాటిబీటకుం
బనుపడ రింక; మధ్యముల । వచ్చును బోల్పఁగఁ బొన్నుబీటకుం
బనుపడవచ్చుఁ గూర్పఁ బ్రతి । వచ్చెద రుత్తము లమ్ము గ్రమ్మఁగాఁ
దనికిన నీటిబీటకు య।థాస్థితి కప్పుడె వారు వచ్చుటన్. ౨౪

గీ. తామరకు నంచ చేరెడు । దారి విజ్ఞు, విజ్ఞుఁడే చేరుచుండును । నజ్ఞు నజ్ఞుఁ
డెప్పుడును జేరుచుండు నీ । యిలను గాకి, రుద్రభూమిని శవముఁ జే।రువిధ మొప్ప. ౨౫

చ. తనతలలో విషం బునికిఁ । దాని తలంచి సురుంగుఁ ద్రాఁచు, వ
చ్చును భయ మింత లేక యొక।చోటికిఁ బాటిగ నీరుకట్టె వం
చనము మనంబునం గలుగ । సందులగొందులఁ దూఱు దుష్టుఁ డెం
దును బయలెక్కి సజ్జనుఁడు । దోఁచును వంచన లేకపోవుటన్. ౨౬

గీ. రాజు నొకసిబ్బిలోఁ గవి।రాజు నొక్క, సిబ్బిలో నుచి తూఁచినఁ । బ్రబ్బుఁ గవియె,
రాజు తన దేశముననె గౌ।రవము గాంచుఁ, గాంచుఁ గవిరాజు సకలప్ర।పంచముననుు. ౨౭

గీ. అరఁటి కగుఁ దన కాయయే । యముఁడు, వట్టి కఱటి కగు సజ్జనుని పల్కు । కాల యముఁడు,
లోభి కగు ధర్మపన్నంబు । లుయముఁ, డర్థశోభి కగు ననువ్రతగాని । సుదతి యముఁడు. ౨౮

గీ. గంధపుంజెక్క యఱిగిపోఁ।గాక తన సు,గంధమును వీడఁబోదు జ.గత్ప్రసిద్ధ
దాతయగు రాజు ధనమెంత । తఱుఁగనిమ్ము, తఱుఁగనీఁడు మనంబు । నుదారగుణము. ౨౯

గీ. లక్ష్మితోఁగూడ వచ్చుఁ జె।ల్వమును బంధు,జాలమును రూపరేఖయు । సత్కులంబు,
లక్ష్మితోఁగూడఁ బోవుఁ జె।ల్వమును బంధు,జాలమును రూపరేఖయు । సత్కులంబు. ౩౦

గీ. చచ్చునందాఁక నపకృతిఁ । జల్పిరేని దుష్టు, లుపకృతియే చల్పు।దురు మహాత్ము;
లగుఁగదా! చెట్టు మొదలంటఁ । దెగనఱకెడు, వాని కొసఁగదె యిలఁ బదు।నఱుకు నీడ. ౩౧

## గద్యము

ఇది సుప్రసిద్ధ విదుషీమణి "అవ్వయారు" రచించిన "వాక్కుండామ్" అను ద్రావిడనీతిపుస్తకము నకుఁ గ్రొత్తపల్లి సూర్యారావు కావించిన యాంధ్రపరివర్తనము.

# గుణగ విజయాదిత్యుని సాతలూరు తామ్రశాసనము*

కీర్తిశేషులగు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు గారు, ఎమ్. ఏ.

ఈ శాసనము కొంతకాలము క్రిందఁ గృష్ణా జిల్లా, బందరు తాలూకాలోని సాతలూరు గ్రామమున పాటిదిబ్బ త్రవ్వుచుండఁగా దొరకెను. ఇది యొక కుండలో భద్రముగాఁ బెట్టఁబడి యుండెను. ఇది యాంధ్రపత్రికాధిపతులైన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి మూలమున నాకు లభించెను.

### శాసన వర్ణనము.

శాసనమునందు నేడు రాగిరేకు లున్నవి. ఒక్కొక రేకు 9½ అంగుళములు పొడవు: 4 అంగుళములు వెడల్పు కలది. రేకులు దళసరముగ నుండును. మొదటి రేకునకుఁ బై వైపున నక్షరములు లేవు. చివర రేకునకుఁ గ్రిందివైపున, అనఁగా రెండవ వైపున నెనిమిది యక్షరములు మాత్రము కలవు. మిగిలిన యన్ని రేకులమీఁద రెండువైపులను పూర్తిగ వ్రాత కలదు. ఒక్కొకవైపు ఏడుపంక్తులు కలవు. ౬, ౭ రేకులమీఁద మాత్రము ఎనిమిదేసి పంక్తులు కలవు. ఈ యేడు రాగిరేకులును ఒక రాగికడియములోఁ దూర్చఁబడి యుండెను. ఈ రాగి కడియము వ్యాసము (Diametre) 4½ అంగుళములు పొడవు. ఈ కడియమునకు నొక గుండ్రటి ముద్ర తగిలింపఁబడి యున్నది. ముద్రయొక్క వ్యాసము 2⅘ అంగుళములు. దీనిపై వరాహ, అంకుశ, సూర్య, చంద్ర విగ్రహములును, 'త్రిభువనాంకుశ' యను అక్షరములును గలవు. ముద్రకు వెనుకప్రక్క సందముగఁ జెక్కఁబడిన లక్ష్మి, వినాయక విగ్రహములు కడియమునకుఁ జేరియొక వైపునఁ గలవు. ఇంతవఱకుఁ గానవచ్చిన పూర్వ చాళుక్య ముద్ర లన్నిటిలో నిదియే మిక్కిలి యందమైనదని నా యభిప్రాయము.

### అక్షర స్వరూపము.

గుణగ విజయాదిత్యుని కాలములో రెండు విధములైన వ్రాతకత్తులుండెనని మనకుఁ దెలియును. ఒకటి అందమైన గుండ్రటికత్తు. రెండవది కుడి ప్రక్కకు వ్రాలిన 'ఏటవాలు' కత్తు. ఇందు మొదటిది జనానురాగమునకుఁ బాత్రమైనది. సాధారణముగ నదియే వాడుకలోనుండెను. రెండవకత్తు కొద్దిమంది మాత్రమే వ్రాయువారు. గుణగ విజయాదిత్యుని శాసనములలో ఈ సాతలూరు శాసనమును, మచిలీపట్టణము శాసనమును, గుంటూరు, పోణంగి శాసనములును గుండ్రటికత్తులో వ్రాయఁబడినవి. తెలుఁగుబాసలోనున్న ఈరాజుయొక్క నెల్లూరు శాసనములును గుండ్రటి కత్తులోనే వ్రాయఁబడియున్నవి. ఇవి శిలాశాసనములు. ఉరుటూరు, పాములపాడు తామ్రశాసనములు రెండవ కత్తులో వ్రాయఁబడినవి. అక్షరములు గుండ్రముగ వ్రాయు పద్ధతియే చాలకాలమువఱకు నిలిచి యుండినట్లు తెలియుచున్నది. మొదటి రాజరాజు కాలమువఱకుఁ గూడ ఈ శాసనమునందలి యక్షరముల వంటివే వాడుకలోఁ గలవు. కాలక్రమమున నక్షరస్వరూపము మాఱినను జనానురాగమును బడసిన కత్తు మాత్రము గుండ్రటిదే.

---

* సాతలూరుశాసనము రెండేండ్లకుబూర్వము కీ. శే. కొ. లక్ష్మణరావుగారికి పరిశోధనమున కీయబడినది. వారు పరిశోధించినను ప్రకాశమునం దాలస్యము గలిగినది. ఆ పరిశోధనను శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సరిచూచి పూర్తిచేసి ప్రకటించిరి.

ఈ శాసనమునందలి యక్షరములు ఈ రాజు యొక్క మచిలీపట్టణము తామ్రశాసనము[1]నందలి యక్షరములను బోలి చాల సుందరముగ నున్నవి. కాని వ్రాయసకాఁడు మిక్కిలి యశ్రద్ధతో నక్షరముల వ్రాసినట్లు తోఁచుచున్నది. వ్రాతతప్పులు చాలఁ గలవు. దీర్ఘము లీయవలసినచోట్ల హ్రస్వముగ వ్రాసియు, హ్రస్వముగ వ్రాయవలసినచోట్ల దీర్ఘము లిచ్చియు, సున్నచుట్టవలసినచోట్ల మానియు, మానవలసినచోట్లచుట్టియు, నిట్టి వ్రాతపొరపాటులు లేఖకుఁడు చాల చేసెను. ఇంతియకాక యితఁడు కొన్నికొన్నిచోట్ల సంస్కృతశబ్దస్వరూపమునుగూడ సరిగ గమనించినట్లు కనఁబడదు.

'ఋ' వ్రాయవలసినచోట 'రి' అని వ్రాయఁబడి యున్నది. ఈ శాసనమున 'జ'కారము రెండు విధములుగ వ్రాయఁబడినది (౮, ౯ పంక్తులు చూడఁదగును). అం దొక విధము ౮వ పంక్తిలో 'దోగరాజః' అన్న చోటను, ౧౨వ పంక్తిలో 'విజయాదిత్యః' అన్న చోటను జూడ నగును. రెండవ విధము ౮ వ పంక్తిలో 'జయసి[ం]హవల్లభః' అన్నచోటను, ౯ వ పంక్తిలో 'తస్యానుజః' అన్న చోటను జూడనగును; ఇట్లే శాసనమునందంతటను జూచునది. 'జయసి[ం]హ'లోని 'జ'కారరూపము గుణగ విజయాదిత్యునికిఁ బూర్వపు శాసనములందును, రెండవరూపము విజయాదిత్యుని తరువాతి శాసనములందును వాడుకచేయఁబడినది. ఈ 'జ' అను అక్షరమునకు గుణగ విజయాదిత్యునికాలము మార్పుకాలము. వెనుకటిరూపము ప్రాతగిలి క్రొత్తరూపము సాధువగుచుండిన కాలమది.

లేఖకుఁడు 'ద'కార, 'డ'కారములకు భేదము స్పష్టముగ నీ శాసనమునఁ జూపియున్నాఁడు. ఇతర శాసనములలో నీ భేదమంతగ పాటింపఁబడలేదు. ౪౧ వ పంక్తిలో 'ద', 'డ'లు రెండు నొకేచోటవచ్చినవి. 'ద','డ'లకు రెండింటికి కుడిచేతి వైపు వంపు పైకున్నను, 'డ'కారమునకు వంపు పైభాగము చివర ఒక ఒత్తుచుక్క కూడఁ గలదు. 'ఱ' అను అక్షరము ఈ శాసనమున మూఁడుచోట్ల కానవచ్చుచున్నది. (పంక్తులు ౫౪, ౫౫, ౮౨). తొమ్మిదవ శతాబ్దమునాఁటి కింకను తెలుఁగు వారీవర్ణమును, స్వరమును వదలలేదను విషయము గమనింపఁ దగినది.

భా షా వి క ము లు.

శాసనపుభాష సంస్కృతము. గద్యములు: పద్యములుకూడఁ గలవు. పద్యములు పదునొకండు గలవు (పం ౧౭-౧౯; ౨౨-౨౫; ౩౧-౩౭; ౭౮-౮౦; ౮౨-౮౫). మిగిలిన శాసన భాగమంతయు గద్యమయము.

ఇందలి పద్యములలో నొకదానిలో విశేషము కలదు. కలివిట్టరుఁ డనఁబడు విష్ణువర్ధనుని వర్ణించుచు సంస్కృతమున నొక చంపకమాలావృత్తము చెప్పఁబడినది. దాని నాలుగు చరణము లందును ప్రాస కలదు. యతి మాత్రము సంస్కృతసంప్రదాయము ననుసరించియే యున్నది; ఆంధ్రసంప్రదాయము ననుసరించి లేదు. ఆ పద్య మెట్టిదయనిన—

మ॥ అరినృపవాజివారణపదాతిమహోద్భవవిరామ మారుతః। పరకరిముష్టితాసిధరుచిప్రవినాశన భానుసన్నిభః। గురుతరదీనభాగవతమానవమానిత కల్పపాదపః। వరకరిగల్లభూమిపభుజాసిరిహాజిభువిప్రహాసతే॥

చంపకమాలావృత్తము సాంస్కృతిక మైనను దానికి సంస్కృతవాఙ్మయమునందు విశేష ప్రచా

1. Ep. Ind. Vol V. P 123.

రము లేదనుట యందఱకుఁ దెలిసిన విషయమే. సుప్రసిద్ధకవు లెవ్వరు దానిని వాడియుండ లేదు. కర్ణాటాంధ్రభాషలయందు నీ వృత్తము విశేషముగఁ గాన్పించుచున్నది. అట్లే ద్వితీయాక్షర ప్రాస విషయమును. ఈ రెండును దేశభాషలందుఁ గలవు. సంస్కృతమునందు లేవు. కావున పై పద్యము సంస్కృతమునం దున్నను అది దేశభాషాసంప్రదాయము ననుసరించి వ్రాయఁబడె ననుటకు సందియము లేదు. అనఁగా తొమ్మిదవ శతాబ్దమునందు గుద్రవార విషయములో, అనఁగా గుడివాడ ప్రాంతమునందుఁ దెనుఁగుకవులు ప్రాసయుక్తమైన చంపకమాలా వృత్తమును రచించుచుండిరని మన మీ సంస్కృతశ్లోకమువలన నూహింపవచ్చును. అప్పటికి వృత్తములలో యతి పాటింపఁబడు చుండెనో లేదో ఈ పద్యమును బట్టి మనము నిశ్చయముగఁ జెప్పలేము. కన్నడమునందువలెనే యతినియమము తెనుఁగునందు మొదటలేక యుండెనేమో? భావి పరిశోధనలవలనఁగాని యీ సంగతి తేలనేరదు.

శాసనవిషయములు.

శాసనమునందు మొదటఁ జాళుక్యుల నామములు బిరుదములు చెప్పఁబడినవి[౧-౫ పంక్తులు]. తరువాత కుబ్జవిష్ణువర్ధనుని మొదలు వంశము వర్ణింపఁబడినది. కుబ్జవిష్ణువర్ధనుఁడు ౧౮ సంవత్సరములును, అతని కుమారుఁడు సకలలోకాశ్రయ జయసింహవల్లభుఁడు 33 సంవత్సరములును, అతని తమ్ముఁడగు ఇంద్రభట్టారకుని ప్రియ తనయుఁడు విష్ణురాజు ౯ సంవత్సరములును, అతని కుమారుఁడు మంగిదోగ (?) రాజు ౨౫ సంవత్సరములును, అతని కుమారుఁడు జయసింహవల్లభుఁడు ౧3 సంవత్సరములును, అతని సవతితమ్ముఁడు కొక్కిలి ఆఱునెలలును, అతనియన్నయైన విష్ణురాజు తన తమ్ముని నూడఁబీకి 3౭ సంవత్సరములు, అతని కుమారుఁడు విజయాదిత్యమహారాజు ౧౮ సంవత్సరములును, అతనికుమారుఁడు విష్ణువర్ధనుఁడు 3౬ సంవత్సరములును పన్నెండువేల ప్రమాణముగల వేఁగీమండలము నేలిరి. ఆతనియన్న విజయాదిత్యుఁడు సకలగంగకులమును గెలిచి, అష్టోత్తరశతసంఖ్యేశ్వరదేవాలయములకుఁ గర్త యయ్యెను. వల్లభేంద్ర దండనాయకులతో పన్నెండేండ్లు యుద్ధముచేసెను. తనతమ్ముఁడైన భీమ 'సళుకి'యను పేరుగలవానిని నిర్జించి వేంగీమండలమును దీసికొనెను. అతఁడు ౪౦ సంవత్సరములు రాజ్యముచేసెను. అతని కుమారుఁడు కలివిట్టరుఁడు సంవత్సరమునర రాజ్యమేలెను. అతని కుమారుఁడు విజయాదిత్యుఁడు పెక్కు సువర్ణతులాభారములను దూగి బ్రాహ్మణులను తృప్తిపఱచి 'గుణకేనల్లాన్' అని కీర్తింపఁబడి దక్షిణాపథసత్రికలింగదేశమును బరిపాలించెను. ఇట్లు 'విష్ణువర్ధన' నామముగలవారైదుగురును జయసింహనామముగలవా రిద్దరును, మంగి యువరాజొక్కఁడును, విజయాదిత్యనామముగలవారు ముగ్గురును [గలరు]. వారిలో మూఁడవవాఁడయిన విజయాదిత్యుఁడు తనతమ్ముఁడయిన నృపకాముని ప్రేరణవలన సూర్యగ్రహణ సమయమున నూఱుగురు విప్రులకు గుద్రవార విషయములోని శంతగ్రామము సర్వకరపరిహారముగనిచ్చెను. గ్రామమునకు హద్దులు. తూర్పున పెనుబూణ్డి; దక్షిణమున అలుతగూరు; నైఋతిన మ్ముంజులూరు; పశ్చిమమున ఉరవి; ఉత్తరమున తుంబుఱుబల్లి. ఈశాన్యమున ములుఁడుబెన్దోఱు. ప్రతిగ్రహీతలు వేదవేదాంగేతిహాసపురాణాదిచతుష్షష్టికళానిశాకరులు, పరమబ్రహ్మవిదులు, పరీతాగ్నిహోత్రాద్యనుష్ఠానపరులు, శమదమయమనియమాశ్రిత

శౌచాచారశీలగుణగణాలంకృతులు; ధాత్ర్యమా
దిద్వాదశాదిత్యసమానభ్రాజితకీర్తులు. వీరిలో
భట్ట బిరుదముగలవారు ౨౦ మంది. మూఁడు వేద
ములు చదివినవారు 3౦ మంది: నాలుగు వేద
ములు చదివినవారు 3౦ మంది; ఒకవేదము చదివిన
వారు ౨౦ మంది. ప్రతిగ్రహీతల పేళ్లు శాసనము
నందు ౪౪ వ పంక్తి మొదలు ౭౮ వ పంక్తివఱకు
నీయఁబడినవి. కాని ప్రతి గ్రహీతల పేళ్లు చెప్పు
టలో శాసనమున ౭౯ పేళ్లు వ్రాయఁబడినవి. ౨౧
పేళ్లు కనఁబడుటలేదు. ఈపేళ్లు ఉద్దేశ పూర్వకముగ
వదలివేయఁబడినవో, లేక పొరపాటున వదలివేయఁ
బడినవో మనము చెప్పలేము. ప్రతి గ్రహీతల
గోత్రములు, నివాసస్థలములు, గ్రామమునందు
వారికీయఁబడిన భాగములు శాసనమున వివరముగఁ
దెలుపఁబడినవి. ఈ విషయములను దెలుపు పట్టిక
వేఱొకచోట పొందుపఱిచినాను. ఈ శాసనమున
కాజ్ఞప్తి మహాగుణవంతుఁడైన పాండరంగఁడు. శాస
నమును రచించినవాఁడును, చెక్కినవాఁడును లేఖ
కాదిత్యుఁడు. (పంక్తులు ౮౨-౮౪)

### శాసనమునందలి నూతన విషయములు.

రాజుల రాజ్యకాలపరిమితిని దెలుపుచు, సం
పూర్తిగ వంశానుచరితము నిచ్చిన పూర్వ చాళుక్య
రాజులలో ఈ మూఁడవ విజయాదిత్యుఁడే యింత
వఱకుఁ దెలిసిన మొట్టమొదటి రాజు. ఇతనికిఁ
బూర్వపురాజుల శాసనములలో పూర్వచాళుక్య
రాజుల రాజ్యకాల పరిమితిగాని, వారి వంశాను
చరితముగాని కానరాదు. ఇంతవఱకుఁ దెలియ
వచ్చిన యీ మూఁడవ విజయాదిత్యుని ఆఱుశాసన
ములలో మచిలీపట్టణము (?) తామ్రశాసనమున[1]
ఇతనికిఁ బూర్వపురాజుల పేళ్లుగాని, వారి రాజ్య
కాల పరిమితికాని సంపూర్తిగఁ దెలుపఁబడియుండ
లేదు. అందువలన నా శాసనము వెనుకటి
రాజుల యాచారము ననుసరించి వ్రాయింపఁబడి
నదిగ మనము గ్రహింపవలసియుండును. తన
వంశకర్తయైన కుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలుకొని తన
వెనుకటి రాజులను, వారిరాజ్యకాల పరిమితిని
పేర్కొనుపద్ధతి నితఁడే మొట్టమొదట నవలంబించి
నట్లు కనఁబడును. ఇతనికిఁ బూర్వపురాజుల శాసన
పత్త్రములు దీనివిషయములు కనఁబడకపోవుటచే నిది
నిజమని నిశ్చయింపవచ్చును. అట్లగునెడల నదివఱ
కుండిన రాజ్యవృత్తాంతముల ననుసరించియు, శాసన
పత్త్రముల ననుసరించియుఁ దనపూర్వుల రాజ్య
కాలపరిమితి మొదలగు వృత్తాంతముల నితఁడే
తయారుచేసి యుండవచ్చును 'ఏవం పంచవిష్ణువర్ధన
నామానః, ద్వా జయసింహనామానే, ఏకోమంగి
యువరాజః, త్రయోవిజయాదిత్య నామానః'
(పంక్తులు ౨౭-౮వ) అని రాజులపేళ్ల నొకపట్టికగ
సంగ్రహించి చెప్పుటచూడ ఈరాజే తనవంశ
వృత్తాంతమును మొదట తయారుచేయించినవాఁ
డనియు, వంశచారిత్రకథనమునందలి ప్రాముఖ్య
మును గ్రహించినవాఁడనియు నిశ్చయింపవచ్చును.
ఈతనికి సమకాలికులైన రాష్ట్రకూట రాజులుగాని;
పూర్వ, పశ్చిమ గంగరాజులుకాని, పశ్చిమచాళుక్య
రాజులుకాని ఎవ్వరు నిట్టిపద్ధతి నవలంబింపని కాల
మున నీరాజిట్లుచేయుట ప్రశంసనీయమైన యీ
తని నైసర్గికచారిత్రకాభిరుచికి ప్రబల నిదర్శన
ముగ నున్నది.

ఉత్తరకాలపు చాళుక్యుల శాసనములలోఁ
దెలుపఁబడిన రాజ్యకాలపరిమితికి, నీ విజయాది
త్యుని శాసనములందుఁ దెలుపఁబడిన రాజ్యకాల

1. Ep. Ind. Vol V. P. 123.

పరిమితికి నచ్చటచ్చట స్వల్పవ్యత్యాసమున్నది. రాజుల రాజ్య పరిమితినిగుఱించి పరకాలమందలి శాసనములకంటెఁ బూర్వశాసనములే యెక్కువ ప్రమాణములగుటచేతను, అందు రాజ్యపరిమితి నిచ్చిన శాసనములలో నీతనివే మొదటివగుటచేతను ఈ రాజ్యకాలపరిమితి విషయమున నీతని శాసనములే యత్యంతప్రమాణములుగఁ గైకొనఁదగినవి. ఉదా:—జయసింహవల్లభుఁడు ౩౦ సం॥లు పరిపాలనము చేసినట్లు రెండవ అమ్మరాజు పడంకలూరు శాసనమునను,[1] రెండవ కులోత్తుంగచోడ దేవుని చెల్లూరు తామ్రశాసనమునను కలదు. ఫ్లీటు దొరగారు పూర్వ చాళుక్యరాజుల రాజ్యకాలనిర్ణయముచేయుచు మొదటి జయసింహుఁడు ౩౦ సం॥లు పరిపాలనముచేసినట్లు గ్రహించియున్నారు.[3] కాని మూఁడవ విజయాదిత్యుని శాసనములలో నతఁడు ౩౩ సం॥లు పరిపాలించినట్లుకలదు. అందువలన నిదియే జయసింహుని సరియైన రాజ్యకాలపరిమితిగ గ్రహింపవలసియుండును. రెండవ చాళుక్య భీమునియొక్కయు[4], రెండవ అమ్మ రాజుయొక్కయు[5], నితరచాళుక్యులయొక్కయు[6] శాసనములలో విజయాదిత్య నరేంద్ర మృగరాజు ౪౪ సం॥లు పరిపాలించినట్లు కలదు. కాని మూఁడవ విజయాదిత్యునియొక్కయు, మొదటి చాళుక్యభీముని యొక్కయు[7] శాసనములలో ఆరాజు ౪౦ సం॥లు పాలించినట్లు కలదు. అందువలన నలువదియేండ్లే యారాజుయొక్క సరియైన రాజ్యకాలపరిమితిగ గ్రహింపఁదగును.

కాని యీరాజ్యపరిమితి విషయమున విజయాదిత్యుని శాసనములలోనే స్వల్పభేదములు కలవు. ఈరాజు శాసనములం దిచ్చిన రాజ్యపరిమితి పట్టిక రూపమున నీదిగువ నిచ్చుచున్నాఁడను.

| | చాళుక్యరాజుల పేళ్లు | సాతలూరు తామ్రశాసన ప్రకారము | పాములపాడు తామ్రశాసనము | గుంటూరు తామ్రశాసనము | ఊరుటూరు తామ్రశాసనము | ఫ్లీటుదొరగారి మతప్రకారము |
|---|---|---|---|---|---|---|
| 1 | కుబ్జవిష్ణువర్ధనుఁడు | ౧౮ సం. | ౧౮ సం. | ౧౮ సం. | ౧౮ సం. | ౧౮ సం. |
| 2 | జయసింహుడు | ౩౩ ,, | ౩౩ ,, | ౩౩ ,, | ౩౩ ,, | ౩౦ ,, |
| 3 | విష్ణువర్ధనుఁడు | ౯ ,, | ౯ ,, | ౯ ,, | ౯ ,, | ౯ ,, |
| 4 | మంగియువరాజు | ౨౫ ,, | ౨౫ ,, | ౨౫ ,, | ౨౫ ,, | ౨౫ ,, |
| 5 | జయసింహుడు | ౧౩ ,, | ౧౩ ,, | ౧౩ ,, | ౧౩ ,, | ౧౩ ,, |
| 6 | కొక్కిలి | ౬ నెలలు | ౬ నెలలు | ౬ నెలలు | ౬. నెలలు | ౬ నెలలు |
| 7 | విష్ణువర్ధనుఁడు | ౩౫ సం. | ౩౬ సం. | ౩౬ సం. | ౩౬ సం. | ౩౬ సం. |
| 8 | విజయాదిత్యుఁడు | ౧౮ ,, | ౧౯ ,, | ౧౯ ,, | ౧౯ ,, | ౧౮ ,, |
| 9 | విష్ణురాజు | ౩౭ ,, | ౩౬ ,, | ౩౫ ,, | ౩౬ ,, | ౩౫ ,, |
| 10 | విజయాదిత్యుఁడు | ౪౦ ,, | ౪౧ ,, | ౪౦ ,, | ౪౧ ,, | ౪౪ ,, |
| 11 | కలివిష్ణువర్ధనుఁడు | ౧౮ నెలలు | ౨౦ నెలలు | ౨౦ నెలలు | ౨౦ నెలలు | ౧౮ నెలలు |

పై పట్టికచూచిన రాజ్యపరిమితియందలి భేదములు స్పష్టపడఁగలవు మూఁడవ విష్ణువర్ధనుఁడు

1. Ind. Ant. Vol VII, P 15.
2. Ind. Ant. Vol XIV, P 55.
3. Ind. Ant. Vol XX, P P 12. 13.
4. Ind. Ant, Vol XIII, P. 213 ; Ep. Ind. Vol. V. P134.
5. Ind. Ant. Vol XII, P 91; Ep. Ind. Vol V. P. 139 Etc.
6 I d. Ant. Vol XIV, P 48; S. I. I. Vol I. P 49 Etc.
7. Ep Ind. Vol V. P 130; ఆం. సా. ప. ప. సం ౧౧. సం ౬.

౩౨ సంవత్సరములు రాజ్యముచేసినట్లు పాములపాడు,[1] గుంటూరు,[2] ఉరుటూరు[3] తామ్రశాసనములు తెలుపుచుండ సాతలూరు తామ్రశాసనము ౩౬ ఏండ్లు పాలించినట్లు తెలుపుచున్నది. కాని విజయాదిత్యుని పెక్కుశాసనములలోను, ఇతనితరువాతి రాజుల శాసనములలోను ఈవిష్ణువర్ధనుఁడు ౩౨ ఏండ్లెపాలించినట్లుండుటచేత ౩౨ ఆరాజు రాజ్యపరిమితిగ గ్రహింపవలసియుండును. మఱియొక వ్యత్యాసము. ప్రథమవిజయాదిత్యుఁడు ౧౯ సంవత్సరములు రాజ్యముచేసినట్లు పాములపాడు, గుంటూరు, ఉరుటూరు శాసనములందున్నది కాని సాతలూరు శాసనమున నాతఁడు ౧౮ సం॥ లు రాజ్యమేలెనని వ్రాయఁబడియున్నది. కాని యీభేద మంతగాఁ బాటింపఁదగినదికాదు. ఏలయన నారాజు ౧౮ సంవత్సరములమీఁదఁ గొన్నినెలలు రాజ్యము చేసియున్నయెడల నొకరు ౧౮ అనియు, మఱియొకరు ౧౯ అనియు వ్రాయుట సంభవింపవచ్చును. ఇట్లే విష్ణురాజ, రెండవవిజయాదిత్యుల కాలములును సమర్థింపఁదగినవి. ఈస్వల్ప వ్యత్యాసము లెటులున్నను ఉత్తరకాలీన శాసనములకంటె ఈ మూఁడవ విజయాదిత్యుని శాసనములే యెక్కువ ప్రమాణములనుటకు సందియములేదు.

వేంగీమండలము ద్వాదశసహస్రప్రమాణము కలది (౧౧ వ పంక్తి) యనునది ఈ శాసనమందలి క్రొత్తవిషయములలో నొకటి. ప్రాచీనద్రావిడ కర్ణాటశాసనములలోను, కొన్నిసంస్కృతశాసనములందును ఒకనాడుపేరుచెప్పునప్పుడు దానికి నొకసంఖ్యకూడఁ దగిలించిచెప్పుట యొకయాచారమై యున్నది. రట్టవాడి సార్ధసప్తలక్ష: గంగవాడి ౯౬౦౦౦ లు: నోలంబవాడి ౩౨౦౦౦ లు: వనవాసి ౧౨౦౦౦ లు అని శాసనములందుఁ గానవచ్చును. అట్లె కొన్ని తెలుగునాళ్లనుగుఱించియుఁ గానవచ్చుచున్నది. పాఁకనాఁడు ౨౧౦౦౦ ల పరిమితి కలదియని కొణిదెనశాసనమునందును, నన్నెచోడుని కుమారసంభవమందును గలదు.[4] పాలకురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమునందు హిందూదేశమునందలి వేలువేలు దేశముల మితి యీ ప్రకారమిచ్చియున్నాఁడు.

> ఎంతెంతబరుస దానేతెంచిచొచ్చు
> నంతంత విస్తీర్ణమగు శివాలయము
> ఎంతెంతబరుస దానేతెంచి కాంచు
> నంతంత యున్నతంబగు లింగమూర్తి
> లక్షింపఁగ సపాదలక్ష నేపాళ
> మీక్షింపఁగ సపాదలక్ష సంజనిత (?)
> లక్షింపఁగ సపాదలక్ష కేదార
> మీక్షింపఁగ సపాదలక్ష దిక్‌హాత్ర
> లక్షింపఁగ సపాదలక్ష కాశ్మీర
> మీక్షింపఁగ సపాదలక్ష కన్నోజ
> లక్షింపఁగ సపాదలక్ష కొంకణము
> నీక్షింప శిరహట్ట మిల సప్తలక్ష

---

1. అముద్రితము. 2 C. P No 5 of 1911—1912. ౩. ఆం. సా. ప. ప. సం ౧. పుట ౧౮౦.

4. "అరినరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి పాఁకనాఁటియం దిరువదియొక్క వేయిటి కధీశుఁడు నా. జనుచోడబల్లికిం...."
—కుమారసంభవము.

మంచనకవి తనకేయూరబాహుచరిత్రమున 'ఏకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై। ధరణిం బేర్చిన పాఁకనాఁడు' అని చెప్పియున్నాఁడు. కాని నాఁడుపేరుతో సంఖ్యనిచ్చిన శాసనములేవియు ఆసంఖ్య గ్రామములను దెలియఁజేయునని తెలిపియుండలేదు. శాసనములేకాదు. మంచనకవికిఁ బూర్వులును అట్లు తెలిపియుండలేదు. అందువలన నది గ్రామసంఖ్య తెలియఁజేయునాయని సంశయింపఁదగినది.

> క్రమమొంద సాళ్వాధరం బదిలక్ష
> ప్రమితియా దశలక్ష బంగాళభూమి
> గుర్జసప్తతి సహస్ర గుజరాష్ట్రభూమి
> మఱియట దశలక్షమాళవభూమి
> జానొంద నివలి పంచద్రావిళముల
> లో నవలక్షతెలుంగు; దీనికిని
> యిమ్మడి ముమ్మడి యితరదేశములు
> నిమ్మహి దేశంబులెన్నంగ నేల [పర్వతప్రకరణం.

ఈ పై ద్విపదను బట్టిచూడ తెలుఁగుదేశపు ప్రమాణము తొమ్మిదిలక్షలనియు, అందు మన శాసనానుసారము వేంగినాఁడు ౧౦,౦౦౦ల ప్రమాణము గలదియనియుఁ దెలియుచున్నది. కాని యీ పన్నెండు వేలును, నవలక్షయు నేమిటి? ఈ సంఖ్యలను గుఱించి పండితు లనేకవిధములఁ దర్కించియున్నారు. ఇవి యాయాప్రదేశములలోని గ్రామ సంఖ్యలని ఫ్లీటుగారి యభిప్రాయము. కాని దీనిని అంగీకరించుటకు వీలులేదు; ఏలయన నిన్ని గ్రామము లొకవిషయమున నుండుట యసంభవము. వేంగినాఁడు ఏలూరు, భీమవరము, కొవ్వూరు తాలూకాలు వ్యాపించియుండెననుకొనినను ఈ మూఁడు తాలూకాలలోఁ గలసి ౧౯౨౧ వ సంవత్సరము జనాభా లెక్కప్రకారము ౪౭౧ గ్రామములుకలవు; కృష్ణాజిల్లా యంతయు గలసి ౧౭౧౯ గ్రామములును, గోదావరిజిల్లా యంతటిలో ౮౧౮ గ్రామములును, గుంటూరుజిల్లా యంతటను గలసి ౯౨౩ గ్రామములునుకలవు. పూర్వముకంటె నిప్పుడు అడవి యెక్కుడు తెగి, గ్రామాదులసంఖ్య హెచ్చినదికాని తగ్గలేదు. కావున ౧౧౦౦ ల సంవత్సరములకుఁ బూర్వము వేంగివంటి చిన్ననాఁటిలో ౧౨౦౦౦ల గ్రామములుండుట యసంభవము. ఇట్లే యితర నాడులనుగుఱించి యెఱుఁగవలయును. రాజున కాయానాడులవలన వచ్చెడి పన్నును ఈసంఖ్యలు సూచించునని మఱికొందఱు చెప్పెదరు. కాని పండితారాధ్యచరితములోని ద్విపదలనుచూడ నాకివి ఆయాదేశములందలి మొదటి జనసంఖ్యయని తోచెడిని. ఆయాదేశముల జనసంఖ్య యింతయనియు, వారందఱును శ్రీశైలయాత్రకు వచ్చిరనియు, ఎందఱు వచ్చినను గుడిలో తావు అందఱికి సరిపోవుచుండెననియుఁ జెప్పుట కవియొక్క యాశయము.

రెండవ విజయాదిత్యునికి భీమసళుకి యను పేరుగల సోదరుఁడుండెననునది ఈశాసనమువలనఁ దెలియవచ్చిన మఱియొక క్రొత్తవిషయము. విజయాదిత్య నరేంద్ర మృగరాజు పన్నెండేండ్లు స్వానుజుఁడైన యాభీమసళుకితోఁ బోరాడి, యాతనిని నల్లభేంద్ర దండనాయకులతోసహ నిర్జించి వేంగిదేశమును సంపాదించెను (పంక్తులు ౨౦-౨౧) అని యీశాసనమునఁగలదు. ఇందువలన భీమసళుకి రాష్ట్రకూటరాజుల నాశ్రయించి వారిసాయమునఁ గొంతకాలము వేంగిదేశము నాక్రమించినట్లును, ౧౨ సంవత్సరములు వారితో హోరాహోరిగఁ బోరి నరేంద్రమృగరాజు రాజ్యమును మఱల సంపాదించుకొనెననియు నిందునబట్టి మనమూహింపవలసియున్నది. ఈ నరేంద్రమృగరాజు గంగులతోడ కూడఁ బోరాడి వారిని నిర్జించినట్లు "సకలగంగకులగర్జజ్జలదఘటకోటివిత్రాసన విశిష్టమారుత:" (పంక్తులు ౧౬-౧౭) అను దానివలనఁ దెలియఁగలదు. విజయాదిత్య నరేంద్రమృగరాజు అష్టోత్తరశతసరేంద్రేశ్వరాలయములకుఁ గర్తయనియు, గాంగులతోడను, రాష్ట్రకూటులతోడను ౧౨ ఏండ్లు యుద్ధముచేసినవాఁడనియు ఈ మూఁడవ విజయాదిత్యుని గుంటూరుశాసనమును,[1] ప్రథమ చాళుక్య భీముని అత్తిలి తామ్రశాసనమును,[2] మొదటి అమ్మరాజు శాసనమును[3] స్థిరపఱుచుచున్నవి.

1. Madras Epi. Rep. 1912 P 84. 2. Madras Ep. Rep. 1918. P. 131. 3. S. I. I. Vol I. P 36.

ఈ భీమసల్కిని గుఱించి యింకను దెలిసి కొనఁగోరువారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో (౧౧ వ సంపుటము ౨౮౬ వ పుట) ప్రథమ చాళుక్య భీముని అత్తిలి తామ్రశాసనము సందర్భమున నేను వ్రాసినది చూడఁగోరెదను.

ఈ పై మూఁడు శాసనములవలన సల్కి, సళుక్కి, సళుకేపదములు పర్యాయపదములనియు దేశ్యములనియు, అవి చాళుక్యపదమునకు సమానములనియు రూఢిపడినది.

మఱియొక క్రొత్తవిషయమేమన, ఈ శాసనమువలన మూఁడవ విజయాదిత్యునికి నృపకాముఁడు అను అనుజుఁడొకఁ డుండినట్లు (పంక్తి 3౧) తెలియుచున్నది. ఈ నృపకాముని ప్రేరణవలననే విజయాదిత్యుఁడు శక్తిగ్రామమును నూఱుగురు విప్రులకు దానముచేసెను. ఇతరశాసనములవలన ఈ మూఁడవవిజయాదిత్యునికి విక్రమాదిత్యుఁడు, యుద్ధమల్లుఁడు అను నిరువురు సోదరు లుండినట్లు మనకుఁ దెలియునుకానియితరశాసనములవలన నీతఁడెట్లు మనకుఁ దెలియరాలేదో యట్లే యీతని యనంతర వృత్తాంతమును మనకుఁ దెలియవచ్చుటలేదు.

**గుణగవిజయాదిత్యుని యితరశాసనములు.**

ఈ సాతలూరు శాసనముగాక ఈ రాజు శాసనములు ఎనిమిదికలవు. (౧) మచిలీపట్టణము తామ్రశాసనము.[1] (౨) ఉరుటూరు తామ్రశాసనము[2] (3) గుంటూరు తామ్రశాసనము[3] (౪) పోణంగి తామ్రశాసనము[4] (౫) పాములపాడు తామ్రశాసనము[5] (౬)ధర్మవరము శాసనములు[6] (౭) కందుకూరు శాసనము[7] (౮) అద్దంకి శాసనము.[8] వీటిలో మచిలీపట్టణము తామ్రశాసనము ఇంగ్లీషులో ప్రకటింపఁబడినది. రెండవది ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో తెలుఁగునఁ బ్రకటింపఁబడినది. 3, ౪, ౫ శాసనము లింతవఱకుఁ బ్రకటింపఁబడలేదు. ౬, ౭, వ శాసనములు శిలాశాసనములు. ఇవి బటర్‌వర్త్ వేణుగోపాలచెట్టిగార్లచేఁ బ్రకటింపఁబడిన 'నెల్లూర్ ఇన్‌స్క్రిప్షన్సు' అను గ్రంథమునందుఁ బ్రకటింపఁబడినవి. ధర్మవరము శాసనములు చాల చెడిపోయినవి కావున వాటిలో నచ్చటచ్చటఁ గొన్నికొన్ని యక్షరములును, మాటలును దెలియవచ్చుటలేదు. కందుకూరు, అద్దంకి శాసనములలోఁ పద్యములు కలవు. కందుకూరు శాసనమున సీసపద్యమును, అద్దంకి శాసనమున తరువోజయుఁగలవు.[9] ఇవియే ఆంధ్రవాఙ్మయమున నింతవఱకుఁ గానవచ్చు మొదటి పద్యములు. గుణగ విజయాదిత్యుఁడు క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ద ద్వితీయభాగమున నున్నవాఁడని పూర్వచాళుక్యశాసనముల ననుసరించి స్థిరపఱుపఁబడినది. ఇందున బట్టిచూడ తొమ్మిదవ శతాబ్దమునాఁటికే తెలుఁగుకవిత్వ ముండెననియు, శాసనములలోఁగూడఁ దెలుఁగుపద్యములు చెప్పుచుండిరనియుఁ దెలియుచున్నది. గుణగ విజయాదిత్యునినాఁడు తెలుఁగుకవిత్వము శాగుగ వృద్ధిలో నుండుటచేతనే సంస్కృతకవులకుఁ దెలుఁగునందునలెఁ బ్రాసయుక్తముగఁ బద్యములుచెప్పుటకుఁ బ్రోత్సాహము కలిగెనని మనము నిశ్చయింపవచ్చును.

**గుణగవిజయాదిత్యుని విజయములు:**
**తరువాతివా రీతనినిగుఱించి చెప్పిన సంగతులు.**

ఈతని విజయములనుగుఱించి యితనిశాసనములలోకలదె నితనితరువాతిరాజుల శాసనము

1. Ep. Ind. Vol. V. P. 123. 2. ఆం. సా. ప. ప. సం ౧. 3. C. P No 5 of 1912-1913. 4. C. P. No 3 of 1908-1909 5. అముద్రితము. 6. Nel. Ins. Vol II. O. 39, 40. P 966. 7. Ibid, Kan 31, & 32, P 544. 8. Ibid. O 4, P P 896-97. 9. చిత్రాడ, ఆంధ్రపరిశోధకమహామండలి, (1922) అధ్యక్షోపన్యాసము.

లలో నెక్కునగఁ జెలుపఁబడియున్నది. ఈతని మచిలీపట్టణము తామ్రశాసనమునమాత్రముఇతఁడు మంగిరాజుతో యుద్ధముచేసి, ఆతనిని జయించి నట్లును, ఈ విజయ సంసిద్ధికై తనకు వినయడిశర్మ యను బ్రాహ్మణుఁడు 'అద్భుతాదేశము' నొసంగి నట్లును, దానికి సంతుష్టిఁజెంది యా విప్రునికి 'ట్రంప పట్టు' అను గ్రామమును దానముచేసినట్లును గల దు.[1] ఈతనిసంపూర్ణ విజయములు ఈతని తరువాతి రాజుల శాసనముల[2] ననుసరించియే తెలియవచ్చు చున్నవి. అవియేవన (౧) ఈతఁడు గంగరాజుల నోడించి వారు గంగకూటమెక్కునట్లుచేసెను. (౨) వల్లభులనుపేరఁ బరగు రాష్ట్రకూటులకు రాజైన కృష్ణునోడించి, మఱల నతని పదవి నతని కొసంగెను. (3) డాహలాధీశుఁడైన సంకిలుని ఓడించెను. (౪) నోడంబరాష్ట్ర నృపతియైన మంగిరాజు తలఁద్రుం చెను. (౫) కిరణపురము, అచలపురము, ఉరు నెల్లూరుపురము- ఈ మూఁటిని దహించెను. చక్ర కూటమును దహించెనని యుఁ జెప్పఁబడుచున్నది. (౬) కళింగ గాంగులనోడించి రజతాదికమును, ఏనుఁ గులను, కోసలరాజులయొద్దనుండి గజాదికమును, పాండ్య, పల్లవులయొద్దనుండి సువర్ణాదికమును గ్ర హించెను.

డాహలదేశముచేది. చేదిదేశపురాజులకు, రాష్ట్రకూటరాజులకు సంబంధబాంధవ్యములు కలవు.[3] దానంజేసియైయుండనోపు వల్లభేంద్రుఁడైన కృష్ణుఁడును; చేదిరాజగు సంకిలుఁడును ఇరువురును గలిసి కిరణపురమున నివసించుచుండిరనియు, వా రిరువురను విజయాదిత్యుఁ డోడించి, వారి పుర మును దహించెననియు ఆతని విజయములందుఁ జెప్పఁబడినది. వల్లభేంద్రుఁడైన కృష్ణుఁడు ఈతనికి సమకాలికుఁడైన రెండవ కృష్ణరాజు. ఈతఁడు క్రీ. శ. ౮౭౪ మొదలు ౯౧౩[4] వఱకు రాజ్యము చేసెను. 'వల్లభనృపసమభ్యర్చితభుజః' డని విజ యాదిత్యుఁడు రెండవ అమ్మరాజు కలుచుంబఱ్ఱు శాసనమునఁ[5] గీర్తింపఁబడియున్నాఁడు. ఈ వల్లభ నృపుఁడు పైనిచెప్పిన కృష్ణరాజనుటకు సందియము లేదు.

స్థ ల ని ర్దే శ ము.

ఈ శాసనమునందుఁ బేర్కొనఁబడిన స్థలములు సులభముగ గుర్తింపవచ్చును. గుద్రవార విషయము సుప్రసిద్ధమైన ప్రాచీనదేశవిభాగము. ఇది పూర్వచాళుక్యుల పెక్కుశాసనములలోఁ బేర్కొనఁ బడినది. ఈ గుద్రవార విషయము కృష్ణాజిల్లాలోని యిప్పటి గుడివాడ, బందరు, కైకలూరు తాలూ కాలు వ్యాపించియుండినట్లు కనిపించును. దాన మొసంగఁబడిన శన్నగ్రామము శాసనము దొరకిన (బందరు తాలూకాలోని) సాతలూరై యుండ వచ్చును. ఇట్లు నిర్ధారణచేయుటలో నా గ్రామమున కొసంగఁబడిన సరిహద్దు గ్రామములు మనకుఁ దో డ్పడఁగలవు. శాసనమునఁ బేర్కొనఁబడిన సరిహద్దు గ్రామములలో ఉరివి, అఱుతగూరు, ముంజులూరు, తుంబుఱుబల్లి అను ఊళ్లు ఇప్పటికిఁ గలవు. ఉరివికి ఇప్పటికి ఆపేరేకలదు. అఱుతగూరు ఇప్పుడు అఱ్ఱ మూరు. ముంజలూరు ఇప్పటి ముంజలూరే, తుంబు ఱుబల్లి ఇప్పుడు తుంబిడి అను పేరఁ బరగుచున్నది. సాతలూరికి ఉరివి వాయువ్యదిశను, ముంజలూరు

1. Ep. Ind. Vol V. P. 123. 2. ఆం. సా. ప. ప. సం 11, పుట 254, పంక్తులు 12-17.

Ep. Ind Vol IV, P 239, Text Vers:s 9 and 10 Ind. Ant. Vol XIII, P 213, Text line 16.
S. I. I. Vol 1, P 42, Text Verse10. Ep. Ind. Vol, IX, P 47, Text Verses 3 and 15.

3. Ind. Aut. Vo lXII, P 263, 4. Mysore Gazetteer, Vol I. P 324. 5. Ep. Ind. Vol VII, P 186.

ఆగ్నేయదిశను, తుంబిడిగ్రామ ముత్తరమునను, అత్తిమూరు తూర్పునను గలవు.

గ్రామమునకు ఊరు అనునది తెలుఁగుమాట. దానమీయఁబడిన గ్రామమము శాన్తగ్రామమనియు (పంక్తి 33), శన్త గ్రామమనియుఁ గూడఁ (పంక్తి ౪౦) జేర్కొనఁబడియుండుటచే నది శాన్తలూరు లేక శన్తలూరు[1] అని యగును. క్రమముగా ఈ పేరులోని అను నాసికము లోపింప తుదకు శాతలూరు, శతలూరు అను రూప మేర్పడుచున్నది. ద్రావిడభాషలలో శవర్ణము సవర్ణమగుట తరుచుగ జరుగు మార్పే. దానంజేసి యది సాతలూరు (సతలూరు) కానచ్చును. లేదా అసలు గ్రామముపేరు సన్తలూరు అయియుండ కవి దానిని శాన్త (శన్త) గ్రామముగ సంస్కరించియు నుండవచ్చును. అది యటుండ సరిహద్దు గ్రామముల ననుసరించి చూచి ననుగూడ ఇప్పటి సాతలూరే శాన్తగ్రామము లేక శాన్తలూరు అని నిశ్చయింప వీలగుచున్నది. వంగిపఱ్ఱు, కారంచేడు, కట్త్రోటి, వగిపఱ్ఱు, ఉప్పుటూరు, క్రాంజ, క్రోప(శ్రీ), రాయూరు, కుందురు, శ్రీపురము అనుగ్రామములు ప్రతిగ్రాహకుల నివాసస్థలములుగఁ జెప్పఁబడినవి. కరమిచేడు, కారమిచేడు, అనునవి కారంచేడుయొక్క రూపాంతరములు. ఈ గ్రామములలో కారంచేడు, ఉప్పుటూరు గ్రామములు గుంటూరుజిల్లా బాపట్లతాలూకాలోఁ గలవు. వంగిపఱ్ఱు ఆ తాలూకాలోని వంగిపురము కావచ్చును. వగిపఱ్ఱు అనునది వంగిపఱ్ఱు అయియుండవచ్చును. లేఖకుఁడు పొరపాటున సున్నవిడిచినాఁడని నా యూహ. క్రంజ బందరు తాలూకాలోని కాఁజ కానచ్చును. సిరిపురమనుపేర తెనాలితాలూకాలో (గుంటూరుజిల్లా) ఒక గ్రామముకలదు. అది శాసనమునందలి శ్రీపురమగునేమో. కట్త్రోటి, కుందరులను గుఱించి యేమియుఁ దెలియరాదు.

ఆజ్ఞప్తి

ఈ శాసనమున కాజ్ఞప్తి పాండరంగఁడు. (పంక్తులు ౮౨-౮3). విజయాదిత్యుని యన్నిశాసనములలోను ఈ పాండరంగని పేరే ఆజ్ఞప్తిగా నచ్చును. ఈతఁడే కిరణపురమును దహించినట్లు రెండవ అమ్మరాజు మలయంపూండి శాసనమునఁ[2] దెలుపఁబడియున్నది. అద్దంకి శాసనమున నీతఁడు 'కిట్టపుదుర్గంబు కడు బయల్సేసి'నట్లు కలదు. ఈ కిట్టపుదుర్గమే కిరణపురమేమో? ఇదమిద్ధమని నిర్ధారింపవీలులేదు. ఇతని తండ్రిపేరు 'కడెయరా' జని విజయాదిత్యుని పోణంగితామ్రశాసనమునఁ[3] గలదు. ఆతఁడు పరచక్రరాముఁడను బిరుదముగల యీ విజయాదిత్యునికి బాసటగ యుద్ధముచేసి, తన స్వామిహితమునకై ఆయుద్ధమునఁ దన తనువు సమర్పించెనని ఆ శాసనమునఁ దెలుపఁబడియున్నది. పాండరంగని మనుమఁడు కడెయరాజని మొదటి చాళుక్యభీముని బెజవాడతామ్రశాసనమున[4]గలదు. గుణగ విజయాదిత్యుని శాసనములన్నిటిలోను పాండరంగనిపేరు ఆజ్ఞప్తిగవచ్చునట్లు ఆతని మనుమఁడైన కడెయరాజుపేరు మొదటచాళుక్యభీముని అన్ని శాసనములలోను ఆజ్ఞప్తిగావచ్చును. పాండరంగని సంతతివాఁడయిన దుర్గరాజు అనునతఁడు రెండవ అమ్మరాజునకు మంత్రిగనుండినట్లు ఆతని మలయంపూండి శాసనము[5]నఁ గలదు. కావున పాండరంగని వంశమువారు తరతరములుగ చాళుక్యుల కొలువులోనుండిరని మనమూహింపవచ్చును.

1. తెనుఁగున ఉచ్చారణలోని శ్రావ్యతకొఱకును, అతుకు (లోపము) కనఁబడకుండుటకును 'శంత + ఊరు'లమధ్య 'ల' వచ్చును. ఉదా: ఇట్లే వేము + ఊరు=వేములూరు; ఉప్పు + ఊరు=ఉప్పులూరు; పావు + ఊరు=పావులూరు.

2. Ep. Ind. Vol IX, P 47. Text verse 15. 3. C. P. No 3 of 1908-1909. 4. Ep. Ind. Vol V, P 128. 5. Ep. Ind. Vol IX. P 47.

లేఖకుఁడు: కవి.

శాసనము చెప్పిన కవియు, లేఖకుఁడును గూడ లేఖకాదిత్యుఁడు అని శాసనమునఁ దెలుపఁబడినది. ఈతఁడు విశ్వకర్మవంటివాఁడనియు, స్వయముగ ఘంటశాల (Bell Factory)ను జేసినవాఁడనియు శాసనము చెప్పుచున్నది. నేను చెప్పునది సరియైన దగునెడల, పెద్ద ఘంటశాలయొకటి నిర్మింపఁబడి, ఘంటశాలయను పేరు పెట్టఁబడెనను ముఖ్యవిషయ మొకటి మనకుఁ దెలియవచ్చుచున్నది. ఆపేరుగల యూరిప్పటికి బందరు తాలూకాలోఁగలదు. అదియే యీ ఘంటశాలయైయుండవచ్చును.

సాతలూరుశాసనమందలి ప్రతిగ్రాహకుల పేళ్లు.

| సంఖ్య | ప్రతిగ్రహీత పేరు | గోత్రము | గ్రామము | భాగములు |
|---|---|---|---|---|
| ౧ | యజ్ఞశర్మ | | వంగిపఱ్ఱు | ౩ |
| ౨ | గుండశర్మ | | ,, | ౧ |
| ౩ | విదడిశర్మ | | ,, | ౧ |
| ౪ | ద్రోణశర్మ | | ,, | ½ |
| ౫ | ద్రోణశర్మ | పరాశర | కరమిచేడు | ౧½ |
| ౬ | కంచిశర్మ | | ,, | ౨ |
| ౭ | ద్రోణశర్మ | | ,, | ౨ |
| ౮ | బద్దిశర్మ | | ,, | ౫ |
| ౯ | శివనశర్మ | భారద్వాజ | కట్ట్రోఱి | ౩ |
| ౧౦ | శేవశర్మ | | ,, | ౧ |
| ౧౧ | శివికుఱ్ఱిశర్మ | | ,, | ౧ |
| ౧౨ | పేతశర్మ | శండిల | ,, | ౧ |
| ౧౩ | అయ్యప్పశర్మ | | ,, | ౧½ |
| ౧౪ | వకశర్మ | దేవరత | ,, | ౧ |
| ౧౫ | సవ్వశర్మ | | ,, | ౧ |
| ౧౬ | కుండిశర్మ | | ,, | ౧ |
| ౧౭ | బుదడిశర్మ | కత | వగిపఱ్ఱు | ౨ |
| ౧౮ | వెన్నశర్మ | | ,, | ½ |
| ౧౯ | శేవశర్మ | హరీత | ,, | ౨ |
| ౨౦ | ద్రోణశర్మ | | ,, | ౧½ |
| ౨౧ | శ్రీధరశర్మ | కౌణ్డిన్య | ,, | ౩ |
| ౨౨ | దమశర్మ | | ,, | ౧ |
| ౨౩ | కేశవశర్మ | | ,, | ౧ |
| ౨౪ | త్రివిక్రమశర్మ | | వగిపఱ్ఱు | ½ |
| ౨౫ | కొండిశర్మ | కౌశిక | ఉప్పటూరు | ౨ |
| ౨౬ | ఋద్వశర్మ | కాశ్యప | ,, | ౧ |
| ౨౭ | గోళశర్మ | | ,, | ½ |
| ౨౮ | ఋద్వశర్మ | | ,, | ౧½ |
| ౨౯ | గోళశర్మ | | ,, | ౧ |
| ౩౦ | ఎఱిశర్మ | | ,, | ౧ |
| ౩౧ | మహాకాళశర్మ | కాశ్యప | క్రంజ | ౨ |
| ౩౨ | దోణమశర్మ | | ,, | ½ |
| ౩౩ | నారాయణశర్మ | | ,, | ౧ |
| ౩౪ | పిట్టమశర్మ | కౌశిక | ,, | ౧ |
| ౩౫ | ద్రోణశర్మ | కౌణ్డిన్య | ,, | ౧ |
| ౩౬ | సర్వశర్మ | కణ్వ | కారమిచేడు | ౨ |
| ౩౭ | చామిశర్మ | | ,, | ౧ |
| ౩౮ | కంచిశర్మ | హారీత | ,, | ౧ |
| ౩౯ | మహిధరశర్మ | | ,, | ౧ |
| ౪౦ | దివాకరశర్మ | | ,, | ౧ |
| ౪౧ | శంకరశర్మ | | ,, | ౧ |
| ౪౨ | నారాయణశర్మ | రథీతర | క్రోవత్రి | ౧ |
| ౪౩ | అగ్యపశర్మ | భారద్వాజ | ,, | ౧ |
| ౪౪ | వెన్నశర్మ | | ,, | ౧ |
| ౪౫ | గుండశర్మ | | ,, | ౧ |
| ౪౬ | తూర్కశర్మ | కత్స | ,, | ౨ |
| ౪౭ | బొప్పణశర్మ | | ,, | ౧ |
| ౪౮ | రకణశర్మ | కౌశిక | ,, | ౧ |
| ౪౯ | గోయిందశర్మ | లోహిత | కారంచేడు | ౧ |
| ౫౦ | ఇరుగమశర్మ | కౌణ్డిన్య | ,, | ౧ |
| ౫౧ | భీమశర్మ | | ,, | ౧ |
| ౫౨ | మధువణశర్మ | | ,, | ౧ |
| ౫౩ | కేశవశర్మ | భారద్వాజ | ఉప్పటూరు | ౧ |
| ౫౪ | గుండశర్మ | | ,, | ౧ |
| ౫౫ | నాగశర్మ | | ,, | ౧ |
| ౫౬ | నారాయణశర్మ | ఆత్రేయ | ,, | ౩ |
| ౫౭ | మయిందమశర్మ | అగ్నివేశ్య | రాయూరు | ౧ |
| ౫౮ | బొపశర్మ | కశ్యప | ,, | ౧ |
| ౫౯ | ద్రోణశర్మ | గౌతమ | కుందురు | ౨ |
| ౬౦ | కందశర్మ | భారద్వాజ | ,, | ౧ |
| ౬౧ | వీరశర్మ | పరాశర | ఉప్పటూరు | ౧½ |
| ౬౨ | చామిశర్మ | | ,, | ౧ |
| ౬౩ | త్రివిక్రమశర్మ | | ,, | ౧ |
| ౬౪ | భీమశర్మ | | ,, | ౧ |
| ౬౫ | బవ్వశర్మ | | ,, | ౧ |
| ౬౬ | దుగశర్మ | | ,, | ½ |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧౭ | భీమశర్మ | | ఉప్పటూరు | ౧ | ౨౪ | ఎఱిశర్మ | భారద్వాజ | కారంచేడు | ౧ |
| ౧౮ | బటశర్మ | గౌతమ | వంగిపఱ్ఱు | ౧ | ౨౫ | ద్రోణశర్మ | | ,, | ౧ |
| ౧౯ | సోమశర్మ | కౌణ్డిన్య | ,, | ౧౫ | ౨౬ | శివశర్మ | | ,, | ౫ |
| ౨౦ | ద్రోణశర్మ | | ,, | ౧ | ౨౭ | వల్లవయ్యశర్మ | | ,, | ౧ |
| ౨౧ | మాధవశర్మ | | ,, | ౧ | ౨౮ | శేవశర్మ | | ,, | ౧ |
| ౨౨ | ద్రోణశర్మ | | ,, | ౧ | ౨౯ | సబడిశర్మ | హారీత | శ్రీపురము | ౨౫ |
| ౨౩ | ద్రోణశర్మ | కౌశిక | కుంచుర | ౧ | | | | | |

## శాసనపు రాగి కడియము



వినాయకవిగ్రహము



లక్ష్మీవిగ్రహము

## మూలము[1]

### మొదటి రేకు

౧. స్వ [స్తి] శ్రీమ [తాంస] కలభువనసంస్తు[2] యమానమానవ్యసగోత్రానా[3] హారీతిపుత్రానాం[4] కౌ

౨. [శి] కీ వరప్రసాదలబ్ధరాజ్యనాం[5] మాతృగన[6]పరిపా[7]లీతానాం స్వామిమహాసేన పాదా

౩. నుధ్యాతానాం భగవన్నా[8] రయణ ప్రసాదసమాసాదితవరవర[9] హలాఞ్ఛనేక్షున[10]ంక్ష

౪. ణ[11]వశీకృతారాతి మణ్డలానా[12] అశ్వమేధావభృతస్న[13] నపవిత్రీకృతవపుషాం చాలు

౫. క్యానాం కులమలంకరిష్ణోః సత్యాశ్రయవల్లభేన్ద్రస్య భ్రాతాకుబ్జ[14]విష్ణువర్ధనః[15] అష్టాద

౬. శవర్షణి[16] తస్యసూనుః సకలలోకాశ్రయో జయసింహవల్లభః త్రయస్త్రింశద్వర్షాణి[17]

౭. తస్యానుజస్య ఇన్ద్రభట్టారకస్య ప్రి[18]యతనయః విష్ణురాజః నవవర్షాణి[19] తస్యసుతం[20]

---

౧. నాయొద్దనున్న రేకుల ననుసరించి. ౨. సంస్తూయ-అని యుండవలె. ౩. గోత్రాణాం-అని. ౪. పుత్రాణాం-అని. ౫. రాజ్యాణాం-అని. ౬. గణ-అని. ౭. పాలి-అని. ౮. న్నారా-అని. ౯. వరాహ అని. ౧౦. క్షణ-అని. ౧౧. ణవశీ-అని. ౧౨. లానాం-అని. ౧౩. స్నానపవిత్రీ-అని. ౧౪. కుబ్జ-అని. ౧౫. ఈ యక్షరముపైని రెండుచుక్కలు కలవు. ౧౬. వర్షాణి-అని. ౧౭. త్రయస్త్రింశద్వర్షాణి-అని. ౧౮. ప్రియ-అని. ౧౯. వర్షాణి-అని. ౨౦. సుతః-అని.

రెండవరేకు : మొదటిప్రక్క.

౮. మంగిదాశరాజః[1] పఞ్చవింశతివర్షాణి[2] తస్యపుత్రః జయసి[3]హవల్లభః త్రయోదశవ

౯. షాణి[4] తస్యానుజః ద్వైమాతురకోక్కిలిః షణ్మా[5]సాత్ తస్యాగ్రజః విష్టురజః[6] స్వా[7]నుజముచ్చా

౧౦. ట్యపఞ్చత్రింశ[8]ద్వషాణి[9] తస్యాత్మజః విజయాదిత్యా(త్య)మహారాజ అష్టాద[శవ]షాని[10] తస్యత

౧౧. నయః విష్ణువర్ధనః పఞ్చత్రింశ[10]ద్వర్షాణి ద్వాదశసహస్ర ప్రమాణ వే[11][స]గీ మణ్డలం[12]

౧౨. మన్వపాలయన్[13] తస్యజ్యేష్ఠః విజయాదిత్యః ఆదిత్య ఇవ సతతోదయకరి[14] విఖ్యాట

౧౩. వివ[15] సువంశశైతాధారః మేరురివ సువర్ణ[16]వర్ణీకృతతను[ః*] హరజట(టా)మకుట ఇ[వగం]గా

౧౪. రవప్రతిబన్ధనసమర్థ[17] సురపతిగజ ఇవ సతతదాన [కరీ] విష్ణురి[వ]బ

---

౧. శస్పష్టముగలేదు : ४ కావచ్చును. ౨. వర్షాణి అని యుండవలెను. ౩. సింహ-అని. ౪. ర్షాణి-అని. ౫. షణ్మాసాత్-అని. ౬. విష్ణురాజః-అని. ౭. స్వాను-అని. ౮. త్రింశ-అని. ౯. ర్షాణి-అని. ౧౦. త్రింశద్వర్షాణి-అని. ౧౧. వేంగీ-అని ౧౨. 'ల' మీది అనుస్వారము తీసివేయవలెను. ౧౩. పాలయత్-అని. ౧౪. కారీ-అని. ౧౫. వీక-అని. ౧౬. సువర్ణవర్ణీకృత-అని. ౧౭. సమర్థః-అని.

రెండవరేకు : రెండవప్రక్క.

౧౫. లీ(లి)రిపుమథనః[౧] శేషమహానాగఇవ భూధరణక్షమభుజః మహాన్ప్రతీ[౨]వ మహాశంఖ

౧౬. ధ్వనివిరాజనః స[కలగంగ]కులగజ్జజ్జలదఘటకోటివిత్రాసనవిశిష్టమా

౧౭. రుతః అపిచం[౩][౧*] శ్రీ[మద్ధర్మ]స్యమూర్త్తి(ర్త్తి)స్సుభ[ట]మథుపస[ద్*] బోధనాం[౪] భోరు

హాభ[:।*] శౌర్యాగస్య[౫]

౧౮. త్పత్తి(త్తి)బీజప్రియ[౫]వచనమనే(జో)రాకరః సర్వసన్తో [।*]కీర్త్తిస్త్రీ[౬]వల్లభస్సత్కలగృహమ

౧౯. మలం సత్యవాసీ[౭] కుమార్యాః [:।*] విద్వద్బృన్దస్యధామ ప్రకటమవనిపో గోత్రనిస్తార[౮]కాం

కః[॥౧*]

౨౦. అష్టోత్తరశతస [రే*] న్ద్రేశ్వరదేవ(వా)లయానాంకర్త్తా ద్వాదశ వర్ష[౯] యుద్ధం వల్లభేన్ద్రదణ్డ

౨౧. నాయకైః సహ భీమసళుకె నమా[౧౦]న స్వనుంజ[౧౦] నిర్జిత్య గృ[హీం*]త వేగి మణ్డల [:] చత్వారింశ[౧౧]

౧. మథనః-అని యుండవలెను. ౨. ప్రతీవ-అని. ౩. చమిాది అను స్వారము తీసివేయవలెను. ౪. నాంభో-అని ౫. ప్రియ-అని. ౬. కీర్త్తిస్త్రీ-అని. ౭. వాణీ-అని. ౮. నిస్తార-అని. ౯. నామాసం-అని. ౧౦. స్వానుజా-అని. ౧౧. రింశ-అని.

మూడవరేకు: మొదటిప్రక్క

౨౨. ద్వపాణీ(ప్రాణి) తస్యసుతః [।*] అరినృపవాజివారణపదాతిమహాభ్రవిరామమారుతః [।*] పర

౨౩. కరికరి సస్తి[1]తాసిభరుచి ప్రవినాశన భానుసన్నిభః [।*] గురుతరదిణ[2]భాగ [వ*]త

౨౪. మనవమనిత[3] కల్పపాదపః [।*] వరకరిగల్లభూమిపభుజ[4]సిగిహాజీ(జి)భువి ప్రహా

౨౫. సతే [॥౨*] కలివిట్ట× నామావర్షద్ధ[5] తస్యసూనుః విజయాదిత్యః అనేకతులాధృతసువన్న[6]

౨౬. దానధారాసన్తప్పి[త బ్రహ్మ]ణాని కుమ్మః[7] గుణక్కేనల్లనితి జయగియమానకీర్త్తి[8] స

౨౭. న్దక్షిణాపథ సత్రికలింగదేశ మన్వపాలయా[9] ఏవం[10] పఞ్చవిష్ణువర్ద్ధ[11]నామానః ద్వా జ

౨౮. యసి[12]హనామానో ఏకో మగియూవరాజ[13] [ః*] త్ర[14]య విజయాదిత్య నామానః ।[।*]

తత్ర త్రితి[15]యవి

---

౧. కరసుస్థి-అని యుండవలెను. ౨. దీన-అని. ౩. మానవమా-అని. ౪. భుజాసిరిహాజిభువి-అని. ౫. వర్షార్థం-అని. ౬. సువర్ణ-అని. ౭. సన్తర్పిత బ్రాహ్మణాని కుర్మః-అర్థము విచారింపఁదగినది. ౮. జయగీయమానకీర్తిః-అని ౯. పాలయత్-అని. ౧౦. ఏవం-అని. ౧౧. వర్ధన-అని. ౧౨. సింహ-అని. ౧౩. ముంగియు-అని. ౧౪. త్రయో-అని. ౧౫. తృతీయ-అని.

మూడవ రేకు: రెండవప్రక్క

౨౯. జయాదిత్య ద్వారి ప్రతిష్ఠాపిత గంగాయము[౧]న చన్ద్రాదిత్యహాలీకేతన సమధిగతః

౩౦. పఞ్చమహాశబ్ద శ్రవణవిత్రాసితమతురా-[౨]శశ్చకే (?) వర[౩]హాలాఞ్ఛన వీరమకరధ్వజ [ః।*]

౩౧. సత్యేన ధర్మ్మపుత్రః కన్నర్[౪][స్*]త్యాగేన విక్రమేన[౫]హరిః [।*] నృపకామ [ః*] స్వామ్యనుజో

విప్రేభ్యోదీ

౩౨. ది [శ] ద్గ్రామ[౬] [॥౩*] అదాద్భువనకన్దర్ప[౭]ః గ్రామ[౮]ద్విజశతాయతం [।*] ప్రేరిత స్వానుజే

నాథ నృప

౩౩. కామేనసూ[౯]రయే [॥౪*] శాన్త గ్రామమముం రజ[౧౦] సోపగ్రామ[౧౧] వినాకరమ్ [।*] నాతికుణ్ఠేన సాకం

౩౪. హిదత్త వాన్మ[౧౨]త్త భుసుర[ః ॥౫*] పునరపితస్మై [వ*] రాజ్ఞ [ః*] విశేషణ[౧౩]॥ సత్యవచనోయ

[మ]సునో

౩౫. న ససురాధిపభయాద్భవతి సత్యవచనః [।*] శౌర్య్యగుణవాన్మృగ[ప] తిన్నస వివేకమ

---

౧. యమునా...హాలకేతన-అని. ౨. చతురా-అని. ౩. వరాహలాఞ్ఛన అని. ౪. కర్ణ-అని. ౫. విక్రమేణ-అని. ౬. ద్గ్రామం-అని. ౭. కన్దర్పో-అని. ౮. గ్రామం-అని. ౯. సూరయే-అని. ౧౦. రాజా-అని. ౧౧. గ్రామం-అని. ౧౨. వాన్నత భూ-అని. ౧౩. విశేషణం-అని.

నాలుగవ రేకు: మొదటి ప్రక్క

౩౬. తిత్తో భవతి శౌర్య్య గుణవా[న్] [।*] దానవిభవో రవిసుతేన సపతిస్వబలత్తో భవ

౩౭. త్తి దానవిభవః [।*] సత్యవరశౌర్య్యపరదానవిభవస్తు నృపకామనృపతిః ప్రకృతితః [॥౬*]

౩౮. విజయాదిత్య భు(భూ)పతి[ః*] స్వానుజేన నృపకామే[న*] ప్రేరిత[ః*] సు(సూ)ర్య్యగ్రహణ
నిమిత్త్యా[1] స విజ

౩౯. యాదిత్య[ః*] రాష్ట్రకూటప్రముఖాన్కుటిబి[2]న సర్వ్వా[3]నిత్థ మాజ్ఞ[4]పయతి [।*] విదిత స(మ)స్తు
వా[5]స్మ

౪౦. భిః గుద్రవారవిషయే శక్తగ్రామే[6] నాతికుణ్ణసహితం[7] ద్విజశతా[య] దత్త[8]వాన్ [।*] వేదివేదా[9]

౪౧. ఙేతిహాసపురాణాదిచతుష(ష్ష)ష్టికలానిశాకతే[10]భ్య[ః*] [ప]రమబ్రహ్మవిద్భ్యః పరి[11]తాగ్ని

౪౨. హోత్రాధ(ద)ధ్యనుష్ఠానపరేభ్యః శమదమయమనియమాశ్రి(శ్రి)త శౌచాచారశీలగుణగ[12]నా

---

౧. నిమిత్తం-అని యుండవలెను. ౨. కుటుంబినః-అని. ౩. సర్వా-అని. ౪. జ్ఞాపయతి-అని. ౫. వోస్మా-అని. ౬. గ్రామే-అని. ౭. సహితః-అని. ౮. దత్తః-అని. ౯. వేదవేదాం-అని. ౧౦. కరేభ్యః-అని. ౧౧. పరీతా-అని. ౧౨. గణా-అని.

నాలుగవరేకు : రెండవప్రక్క

౪౩. లంకృత శరీరపద్భ్యః ధాత్ర్యా[1]యామాదిద్వాదశాదిత్య సమాన భ్రాజిత కీర్త్తి(ర్తి)భ్య [ః*] తథా
హి ప్రతి

౪౪. గ్రాహకా [ః*] స్వస్తిశ్రీమత్ వంగిపత్యాస్తవ్యాయ యజ్ఞశర్మ్మణే త్రయోభాగాః గుణ్డశర్మ్మ
ణే ఏకోభాగ[ః]

౪౫. విదడిశర్మ్మణే ఏకోభాగః ద్రోణశర్మ్మణే అర్ధ[2]శః కరమిచేడు వాస్తవ్యాయ పర(రా)శరగో

౪౬. త్రాయద్రోణశర్మ్మణే అర్ధ్యర్ధకోభాగః కఞ్చిశర్మ్మణేద్వా భాగ ద్రోణశర్మ్మణేద్వా భా[గః]బ

౪౭. ద్దిశర్మ్మణే పఞ్చమో[3]భాగాః కట్టోఊవాస్తవ్యాయ భారద్వ(ద్వా)జగోత్రాయ శివన శర్మ్మణే
త్రయోభా

౪౮. గాః రేవశర్మ్మణే ఏకోభాగాః[4] శివికుట్టశర్మ్మణే ఏకోభాగా[5] శణ్డిలగోత్రాయ శేతశర్మ్మణే

౪౯. ఏకోభాగః అయ్యప్పశర్మ్మణే అర్ధ్యర్ధ[6]కోభాగః దేవరతగోత్రాయ వకశర్మ్మణే ఏకోభా[గః]

---

౧. ధాత్ర్యా-అని యుండవలెను. ౨. అర్థాంశః-అని. ౩. పఞ్చమోభాగః, లేక పఞ్చభాగాః-అని. ౪. భాగః-అని
౫. భాగః అని. ౬. అర్ధ్యర్ధకో-అని.

అయిదవరేకు : మొదటిప్రక్క

౫౦. సవ్వ శర్మ్మణే ఏకోభాగాః[1] కుణ్డిశర్మ్మణే ఏకోభాగాః[2] నగిపత్వాస్తవ్యాయ కతగోత్రయ[3]బు

౫౧. దడి శర్మ్మణే ద్వాభాగా వెన్నశర్మ్మణే అర్ద్ధాశః హారీతగోత్రాయ రేవశర్మ్మణే ద్వాభాగా
ద్రోణ

౫౨. శర్మ్మణే అర్ద్ధ్యర్ద్ధకోభాగః కోణ్డిన్ద గోత్రాయ శ్రీధరశర్మ్మణే త్రయోభాగాః దమశర్మ్మణే
ఏకో[భా]

౫౩. గాః కేశవశర్మ్మణే ఏకోభాగః త్రివిక్రమశర్మ్మణే అర్ద్ధ(ర్ద్ధాం)శ[4] ఉపూటూరు[6] వస్తవ్యాయ కౌ

౫౪. శికగోత్రాయ కొణ్డిశర్మ్మణే ద్వాభాగా కాశ్యపగోత్రాయా(య)బుద్వశర్మ్మణే ఏకోభాగః గో

౫౫. ళ శర్మ్మణే అర్ద్ధాంశః బుద్వ శర్మ్మణే అర్ద్ధ్యర్ద్ధకో భాగః గోళశర్మ్మణే ఏక (కో)[5]భాగః
ఎఱశర్మ్మణే ఏ

౫౬. కోభాగః క్రంజవాస్తవ్యాయ కాశ్యపగోత్రాయ మహాకాళశర్మ్మణే ద్వాభాగా [ద్రోణ]మ
శ[ర్మ్మ]

---

౧. భాగః-అనియుండవలెను. ౨. భాగః-అని. ౩. కతగోత్రాయ-అని. ౪. అర్ధాంశః-అని. ౫. భాగః-అని. ౬. వాస్త-అని.

అయిదవరేకు : రెండవప్రక్క

౫౭. ణే అర్ద్ధాంశః నారాయణ శర్మ్మ[ణే ఏకో]భాగః కౌశికి గోత్రాయ పిట్టమశర్మ్మణే ఏకోభాగః
కోణ్డిన్ద

౫౮. గోత్రాయ ద్రోణ[శర్మ్మ]ణే ఏకోభాగః కారమిచేడువాస్తవ్యా[1]య కణ్వగోత్ర[2]య సర్వ్వశర్మ్మ
ణే ద్వా

౫౯. భాగా చామిశర్మ్మణే ఏకోభాగః హారీత గోత్ర(త్రా)య కఞ్చిశర్మ్మణే ఏకోభాగః మహీధర
శర్మ్మ ణే

౬౦. ఏకోభాగః దివకరశర్మ్మణే ఏకోభాగః శంకరశర్మ్మణే ఏకోభాగః క్రోవశ్రీ వ[3]స్తవ్యా

౬౧. య రథీతరగోత్రాయ నారాయణశర్మ్మణే ఏకోభాగః భారద్వాజగోత్రాయ ఆగ్యపశర్మ్మణే

౬౨. ఏకోభాగః వెన్నశర్మ్మణే ఏకోభాగః గుణ్డశర్మ్మణే ఏకోభాగః కుత్సగోత్రాయ తూర్కశర్మ్మణే

౬౩. ద్వాభాగా బొప్పణశర్మ్మణే ఏకోభాగః కౌశికగోత్రాయ రవిణశర్మ్మణే ఏకోభాగఃకార

---

౧. వాస్తవ్యాయ-అని యుండవలెను. ౨. గోత్రాయ-అని. ౩. వాస్తవ్యాయ-అని.

ఆఱవ రేకు : మొదటి ప్రక్క.

౬౪. ఛ్ఛేడు[౧]వ స్తవ్యాయ లోహితగోత్ర[౨]య గోయిన్దశర్మ్మణే ఏకోభాగః కోణ్డిన్యగోత్రాయ ఇరుగమశ
౬౫. ర్మ్మణే ఏకోభాగః బీమశర్మ్మణే ఏకోభాగః మధువణశర్మ్మణే ఏకోభాగః ఉప్పటూరువా
౬౬. స్తవ్యాయ భారద్వాజగోత్రాయ కేశవశర్మ్మణే ఏకోభాగః గుణ్డశర్మ్మణే ఏకోభాగః నాగశ
౬౭. ర్మ్మణే ఏకోభాగః ఆత్రేయగోత్రాయనారాయ[ణ*]శర్మ్మణే త్రయోభాగాఃరాయూరువాస్తవ్యా
౬౮. య అగ్నివేశ్యగోత్రాయా[౩] మయిన్దమశర్మ్మణే ఏకోభాగః కశ్యపగోత్రాయ బాపశర్మ్మణే
౬౯. ఏకోభాగః కుణ్డురువాస్తవ్య(వ్యా)య గౌతమగోత్రాయ ద్రోణశర్మణే ద్వాభాగా భారద్వాజ
 గోత్రాయ క
౭౦. న్దశర్మ్మణే ఏకోభాగః ఉపు(ప్పు)ట్టూ(టూ)రువాస్తవ్యాయ ప[౪]రశరగోత్ర(త్రా)య వీరశర్మ్మణే
 అర్ద్ధర్ద్ధకోభాగః
౭౧. చామిశర్మ్మణే ఏకోభాగః త్రివిక్రమశర్మ్మణే ఏకోభాగః భీమశర్మ్మణే ఏకో

౧. వాస్త-అని యుండవలెను. ౨. గోత్రాయ-అని. ౩. గోత్రాయ-అని. ౪. పరాశర-అని.

ఆరవ రేకు : రెండవ ప్రక్క.

౭౨. భాగః బవ్వశర్మ్మణే ఏకోభాగః దుగశర్మ్మణే అర్ద్ధా[౧]ంశః బీమశర్మ్మణే ఏకోభాగః [వ]ంగిపవ్వా
౭౩. [స్త]వ్యాయ గౌతమగోత్ర(త్రా)య బటశర్మ్మణే ఏకోభాగః కోణ్డిన్యగోత్రాయ సోమశర్మ్మణే
 అర్ద్ధర్ద్ధ [కో]
౭౪. భాగః ద్రోణశర్మ్మణే ఏకోభాగః మాధవశర్మ్మణే ఏకో-భాగః ద్రోణశర్మ్మణే ఏకోభా[గః]కుందురు
౭౫. వ[౨]స్తవ్యాయ కౌశికగోత్ర[౩]య ద్రోణశర్మ్మణే ఏకోభాగః కారఞ్చేడువాస్తవ్యాయ[భా]రద్వా[౪]
౭౬. భారద్వాజగోత్రాయ ఎఱశర్మ్మణే ఏకోభాగః ద్రోణశర్మ్మణే ఏకోభాగః శివ[శర్మ్మణే] అ
౭౭. ర్ద్ధా[౫]ంశః వల్లన[య్య]శర్మ్మణే ఏకోభాగః రేవశర్మ్మణే ఏకోభాగః శ్రీపురవాస్తవ్య (వ్యా) య
 హారీతగోత్రా
౭౮. య సబడిశర్మ్మ[ణే అర్ద్ధర్ద్ధకో] ద్వా భాగా॥ భట్టనాం[౬] వింశతిశ్చాపి[౭] ఏకవేదా[౮] చ వింశతి
 [॥*] త్రై(త్రి)ంశ త్రివేదిన
౭౯: స్తద్వత్ చతు[ర్వేదవదాశ]తి[౯] [॥౭*] తత్రానుష్ఠీయమా[౧౦]నస్తే ఆశీర్ద్దత్వా స్వభూభృతే [।*]
 సదాస[౧౧] (ఘుష్ట?)

౧. అర్ధాంశః-అని. ౨. వాస్తవ్యాయ-అని. ౩. గోత్రాయ అని. ౪. 'భారద్వా' రెండుమారులు వచ్చినందున ఒకటి వదలివేయవలెను. ౫. అర్ధాంశః-అని. ౬. భట్టానాం-అని. ౭. వింశతిశ్చాపి-అని. ౮. ఏకవేదాశ్చ-అని. ౯. ర్వేదాశ్చత్రింశతి-అని. ౧౦. మానాస్తే-అని. ౧౧. సంఘుష్ట-అని.

ఏడవరేకు : మొదటిప్రక్క.

౮౦. వేదాశ్చసుఖంజీవన్తుభూసురాః [॥*౮] అస్యానధయః పూర్వ్వతః [ః*] పెనుబూణ్డిసీమై [వ*] దక్షిణ(ణ)త అఱుత

౮౧, నూరుసి(సీ)మై [వ*] నైఋతితః[ః*]మ్ము(ము)ంజలురుసీమై [వ*] పశ్చిమతఃఉరివిసీమై[వ*]ఉతరతః౨ తుంబుటుబల్లిసి(సీ)

౮౨. మై[వ*]ఐశానతఃములుడుబెన్దోఱుసీమై[వ*]చతురవధి క్షే త్ర౪ ద త్తవాన్॥ఆజ్ఞప్తిరస్యధమ్మ[౯]స్యపా

౮౩. ణ్డరంగోమహాగుణః[।*]స(సా)సిధారాసముచ్ఛిన్నవిద్విడ్బ(డ్బ)న్దోపవన్దిత [ః॥*౯] కృతవాన్భట్ట కాలస్య

౮౪. పుత్రపౌత్రో మహి(హీ)తలే [।*] గగణా౫దిగర్భ్బసద్బుద్ధిశ్శాసనసంకమ్మ౬సన౭నమ్ [॥*౧౦] లేఖకో

౮౫. లేఖకాదిత్య [ః*] శాసనస్యాస్యపణ్డితః [।*] విశ్వకమ్మవమోభాతి ఘణ్టశాలాం స్వకారకమ్ [॥*౧౧] బహుభి

౮౬. ర్వ్వసుధాదత్త౮ బహుభిశ్చ(శ్చా)నుపాలితా[।*]యస్యయస్యయదాభమి౯తస్యతస్యతదా౧౦ఫలః౧౧[॥*] స్వదత్తా౧౨

౮౭. పరదత్తాం౧౩ వాయోహరేతు౧౪ వసున్ధరః౧౫ [।*] షష్టివర్ష సహస్రని౧౬ విష్ఠాయా౧౭ జాయతే క్రిమి [ః॥*]

---

౧. నైఋతి-అని. ౨. ఉత్తరతః-అని. ౩. ఐశానతః-అని. ౪. క్షేత్రం-అని. ౫. గగనాది-అని; అర్థము విచారింపదగినది. ౬. కమ్మశాసనం-అని. ౭. దత్తా-అని. ౮. భూమిః-అని. ౯. తదా-అని. ౧౦. ఫలం-అని. ౧౧. స్వదత్తాం-అని. ౧౨. పరదత్తాం-అని. ౧౩. హరేత-అని. ౧౪. వసున్ధరాం-అని. ౧౫. సహస్రాణి-అని. ౧౬. విష్టాయాం-అని.

ఏడవరేకు : రెండవప్రక్క.

౮౮. దత్తహరయితాభూమి౧

---

౧. ఇంతటితో నసంపూర్తిగ వదలివేయఁబడినది.

సాగలూరుశాసనపు చాళుక్య ముద్ర.

# తాజ్ మహల్

బసవరాజు

అప్పారావు గారు, బి. ఏ.

మామిడిచెట్టును అల్లుకొన్నదీ
మాధవీలతొకటీ,
యేమా రెండిటి ప్రేమసంపదా
ఇంతిం తన లేమూ!
చూడలేని పాపిష్టి తుపానూ
ఊడబీకె లతనూ,
మోడైపోయీ మామిడిచెట్టూ
మొగము వేలవేసె!

ముచ్చటైన ఆకులు కాయలనే
వెచ్చని కన్నీళ్లోడ్చీ
పచ్చనాకులా బొమ్మరింటిలో
పండొక్కటి రాల్చీ,
మామిడిచెట్టూ మాధవిలతతో
మాయలో గలిసింది,
కామిత మిచ్చే మామిడిపండూ
కవులకు మిగిలింది!

---

# ప్రణయలీల

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

నిండుజాబిల్లి వెలుఁగులోఁ నుండు మురుపు
పాలమున్నీటి నురువులోఁ గ్రాలుహరువు
పుట్టతేనియ తేటలోఁ బొదలు తీపు
సంజపయ్యెరకమ్మవాసనలకోపు
భాగ్యరేఖలై తోఁచుఁ గాదుఁ బ్రణయలీల.

*　　*　　*

మత్తకోకిలరవళిలో మలయుపాట
కారుతుమ్మెదపాటలోఁ దేరు తేట
ప్రేమమయమానసమునుండి వెడలుమాట
పలుకు నవిముక్తముగ్ధసంభాషణములఁ
బరమకల్యాణగుణలీల ప్రణయలీల.

*　　*　　*

సంజ పాటారుతఱిఁ బ్రాఙ్నికుంజ మెడలి
వచ్చి గిలిగింత చనవుల వలపుఁగూర్చి
కలువపూఁగన్నెనునుసిగ్గు కలఁక వఱచి
చొక్కిచొక్కించు రేరాజు సుంత మెఱుఁగు
భాగ్యగరిమం బదెట్టిదో ప్రణయలీల.

---

# స్వాగతము

### శర్మానంద గారు

భావప్రకటీకరణ మసంభావ్య మైనచో, అగ్రాహ్యంబు లంతర్భూత మగు ననియో, అకృతైచ్ఛికము లగు ననియో, తలంచుట ప్రమాదము. ఆత్మప్రకటనమునకు, అలౌకికభాషా ప్రయోగమును, ప్రాపంచికానుగతికంబులకు, సాధారణ భాషానియమమును, యాదృచ్ఛికములకు, ఉభయేతరేతరసాంప్రదాయమును, అనుగమితము లగుట, విబుధాచారము. ఏది యెట్లైనను, విషయావగాహన మగు భాషాప్రయోగప్రచారమే, సమంజసము. కావున ప్రమాదజనితంబు లగు దోషలేశంబులం గైకొనక, ధారాళహృదయులరై, మా చదువరులు విషయగ్రహణం బొనర్తురుగాత.

అపూర్వప్రసంగంబుల, అఖిలభారత పూర్వాపూర్వప్రస్తావనంబుల, నైహికాముష్మికవిషయావబోధవిధానంబుల, సుప్రసిద్ధకథాకథితవ్యాసగంబుల, సదమలవిశదయశోవిరాజమానం బగు సుగంధగంధిలప్రఫుల్లహృదయకుముదినియై, సవనవోద్బుద్ధవిబుధామోదితభారతరహస్యవిలసనామోఘవ్యవసాయానుభూతతత్త్వవిమర్శనాకౌశల్యంబున, కుసుమవర్షంబులం గురియుచు, కోమలప్రణయగీతామృతరసప్రవాహంబుల, నభ్రగంగయో యన, ఆత్మసంతానహృదయకలుషక్షాళనకుతూహలియై, విస్తృతవృత్తంబుల, పండితపామరారాధ్యయై, మృదుపదవచనరచనాశృంగారవిలాసలాలసియై, కమ్మదెమ్మెరలగమగమలతో, ఉత్తరాభిముఖియై, ఆంధ్రసర్వస్వంబును పవిత్రం బొనర్ప, నిదే! మా నవ్య ' భారతి ' యీదెసనుండి ముద్దుగుల్కు లేనడలతో, బయలువెడలినది.

విజయోస్తు, 'భారతీ!' విజయోస్తు. వర్ణత్రయీ! స్వాగతము. 'భారతీ'మతల్లీ! సుస్వాగతము. అమ్మా! నీ పుత్రపుత్రికాసహస్రంబుల సానురాగదృక్కులఁ ననుగ్రహింపుము. నీ చతురంతయానమును, వీథివీథికిం జననిమ్ము. నీ వింటింట విందవు కమ్ము. మా పరిచర్యల నామోదింపుము. మా స్తోత్రపాఠములకు తావిమ్ము. మా గీతాగానంబుల కామోదింపుము. హితబోధలొనర్పుము. తరణోపాయముం జూపుము. ధర్మతత్పరులం జేయుము. అభీష్టాభిసిద్ధి కాశీర్వదింపుము. వే యేల! మమ్మెల్లర నీబిడ్డల మనిపింపుము. ఇదియ నా ప్రథమాంజలి.



# వ్యవసాయచరిత్ర

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

## ప్రస్తావన

శ్రీ ఆద్యంతరహితుఁ డగు పరమేశ్వరుఁడు పృథివ్యాది భూతములను సృజించి, పిమ్మటను, భూతపంచీకరణముచే, పృథివియం దోషధులను సృజించి, తరువాతను పశుపక్షి మనుష్యాదులను సృజించె నని, 'శ్రుతులు' బైబిలు మొదలగు ప్రాచీన గ్రంథములు చెప్పుచున్నవి. పాశ్చాత్య "పరిణామ సిద్ధాంత" వేత్తలగు, "డార్విన్" మొదలగువారు "అమీబా" (వికారిణి) వంటి సూక్ష్మజీవిప్రారంభసృష్టి యనియు, మనుష్య సృష్టి కలుగు నాఁటికి పరిణామకాలము అనేక యుగములగు ననియు, ఆ మనుష్యుఁ డైనను అండమాన్ దీవులు ఆఫ్రికా ఆస్ట్రేలియాలలోని యనాగరిక మనుష్యునివంటివా డగు ననియు, గోపాలకావస్థ వచ్చి పిమ్మట "హాలికుఁ" డగు నాఁటికి మఱి కొన్ని శతాబ్దములు గడచు ననియు తలపోయుచున్నారు. ఈ యనుమానప్రమాణమును మన శబ్దప్రమాణము సమర్థించుచున్నది. చూడుఁడు.

(1) బ్రహ్మ ధ్యానమాత్రముచే నీప్రపంచమును సృజింపఁ గల్గెను. దేవరాక్షసాది సృష్టికిఁ బిమ్మటను ముఖబాహూరు పాదములవలన వేయేసి దంపతులు పుట్టిరి. వారికి క్షుద్రోగాదులు కలుగమిచేతను గృహపట్టణాదు లక్కఱలేకయే పర్వత నదీసముద్రాదిప్రదేశముల నాశ్రయించి చాలకాలము జీవించి యయ్యుగాంతమున భూమిపై బడెదరు. త్రేతాయుగంబున వారు వృక్షంబుల నాశ్రయించి తేనియలం ద్రావుచు జీవింతురు. పిమ్మట వృక్షంబుల నఱికి, పల్లెలను గ్రామంబులఁ గట్టుకొనెదరు. వారు చెట్లను నఱకుటచేఁ దేనియలు దొరకక యాహారంబునకుఁ జీకాకుపడుచుండ దైవయోగమున వర్షము కురియుఁగా నోషధులు దున్నకయే ఫలించినవి. ఆ యోషధులచే కొంతకాలము జీవించిరి. పిమ్మట కొంతకాలమునకా "యకృష్టౌషధులు" నశింపఁగా జనులు బ్రహ్మను బ్రార్థించిరి. ఆ బ్రహ్మ మేరునగంబును, "క్రేపు" గా నిర్మించి భూమిని మొదవుగాఁ జేసి పిదుకంజేసిన దానినుండి బీజంబు లుత్పన్నంబయ్యె. నాఁటనుండి దున్ని విత్తుటచేఁ "బదునేడు" విధము లగు ధాన్యంబు లుత్పన్నం బయ్యె-పై కథయందలి యకృష్టౌషధు లంతర్హిత మగుటచే మేరువు క్రేపగుట మొదలగు గాథ నీక్రిందిగాథ మిగుల బలపఱుచుచున్నది.

(2) వేనుని రాజ్యాంతమునం దరాజక మగుటచే భూమి యోషధుల నీయకపోఁగా జనులు కృశించి నవీనముగాఁ బట్టాభిషిక్తుఁ డగు "పృథుచక్రవర్తిం" గని మొఱ్ఱవెడిరి. అపుడు భూమి గోరూపధారిణియై పరుగిడ పృథువు ధనర్ధరుఁడై భూమిని లొంగఁదీసి, మేరువును దోగ్ధగాఁ జేసి యోషధులఁ బిదికి నిమ్నోన్నతప్రదేశము లను శరములచేఁ జెక్కి బీజములఁ జల్లి భూమి సస్యాఢ్య యయ్యెను.

సృష్ట్యాదిని నరులు వృక్షచరులుగా నుండిరనుటకు "వానర" శబ్ద వ్యుత్పత్తి సహకారి యగుచున్నది. వానర=వానర, నరునకు సమానుఁడు, లేక వికల్పనరుఁడు "వాస్యాద్వికల్పోపమయోః" అని నిఘంటువు. ఇందువలన మనుజుఁ డొకప్పుడు వానరావస్థలో నుండె నను పరిణామసిద్ధాంతుల వాక్యములు దృఢపడుచున్నవి. మార్కండేయపురాణగాథ కూడ పరిణామసిద్ధాంతమును మిగుల బలపఱచుచున్నది గదా? ఆస్థితిలో సృష్టి యుండినపుడు వ్యవసాయమే లేక క్రమముగా "పృథుచక్రవర్తి" కాలమునకు దున్నుటను విత్తుటను జనులు ప్రారంభించిరని స్పష్టమగుచున్నది. ప్రాచీనకాలమున నామమాత్రముగ నుండిన భారతీయుల వ్యవసాయము ఏకోత్తరాభివృద్ధి నొంది, నేఁటికాలమున పాశ్చాత్య సంపర్కముచే ననేక నూతనవృత్తులు కల్పింపఁబడి పెక్కండ్రాయావృత్తులచే నాకర్షింపఁబడినను, నేఁటికిని భరతఖండమునందు నూటికి డెబ్బదిమంది వ్యవసాయమే వృత్తికలవారుగా నుండుట యత్యాశ్చర్యకరము. ప్రపంచమునందు వ్యవసాయకదేశములలో మొదటిదిగా నుండిన మన దేశపు ప్రజల మతసాంఘికాచారవ్యవహారములు కూడ వ్యవసాయవృత్తి ననుసరించియే యున్నవి. మతాచారము వ్యవసా

(1) మార్కండేయ పురాణము 44 అధ్యాయము. (2) భాగవతము 4 స్కంధము, 17, 18 అధ్యాయములు - మత్స్య పురాణము 10 అధ్యాయము - విష్ణుపురాణము 1 అంశము 13 అధ్యాయము.

యిక వృత్తి ననుసరించుట వేదకాలమునుండియు కలదు. ఓషధీసూక్తము కృషి లాంగలకర్మ అంకురారోపణము అనడుత్సవము వృషభస్తుతి గోపూజ వృషోత్సర్జనము మొదలగునవి యిందులకు తార్కాణములు. శ్రౌత గృహ్యధర్మసూత్రాదులయందు దీనిలకు నిబంధనలు పెక్కులున్నవి. "ఏకక్రియాద్వ్యర్థకరీ" యను నటులు మతికొన్ని మతసాంఘికాచారములు ప్రత్యక్షముగ వ్యవసాయాభివృద్ధి కుపయోగించుచున్నవి చూడుడు. పంటలు పండెడు కాలమగు శరదృతువునందు సస్యములను నశింపఁజేయు నట్టివియు పశువులను బాధించునట్టివియు నగు మిడుతలు దోమలు మొదలగు పుర్వులు వృద్ధినొంది యుండును. ఆకాలమునందే మతము పేరున మనము దీపావళులను ఆకాశదీపములను బహిర్దీపములను అఖండదీపములను పెట్టుచుందుము. ఆ దీపసమూహములు వైక్రిమికీటకముల నాకర్షించి హతమార్చి సస్యాభివృద్ధికిఁ దోడ్పడుట, ప్రశంసనీయము కాదా? కార్తికమాసమునందు కడపటి జలప్రవాహమున విడువఁబడు దీపావళి నీటికాలువల నాశ్రయించి యుండు శలభముల మారణమునకుఁ దోడ్పడి, సస్యవృద్ధిహేతు వగుట యాశ్చర్యకరమై యున్నది - మతియు సర్వసాధారణముగా వ్యవసాయకుల యిండ్లయందు కోళ్లు పెంపఁబడుచుండును. కోళ్లు స్థూలదృష్టిచే భోజ్యపదార్థములుగానే కాన్పించును గాని, సూక్ష్మదృష్టి నాలోచించిన వ్యవసాయమున కప్రత్యక్షమగు రెండుపకృతులఁ జేయుచున్నవి.

(1) కోళ్లు మేఁతను వెదకుకొనుటలో కాళ్లతో దున్ని దాఁగుకొనిన పుర్వులను భక్షించును. ఆపురుగులు సస్యములఁ బాడుచేయు పురుగులో, ఆపురుగుల కాహారమగు పురుగులో యై యుండును. ఈ మూలమున సస్యాభివృద్ధి కప్రత్యక్షోపకారము కలుగును. (2) కుక్కుటమలములో పేడ మొదలగు యెరువులకంటె "అమ్మోనియా" యను సస్యోపయోగకరమగు పదార్థము విశేషముగా నుండి పొలములకు మిగుల బలకారియగును. ఇది యొక యప్రత్యక్షోపకారము. ఇట్టి వనేక వ్యవసాయకోపకారకమత సాంఘికాచారములు మనజాతిలో నిమిడియున్నవి. ప్రాచీనకాలమునుండియు మన వ్యవసాయ మెటులు పరిణమించినదియు ముందు సూచింపఁబడును. వాఙ్మయమునందు ఋక్సంహిత ప్రాచీన మని తలంపఁబడుచున్నది గాన, నాఁటి వ్యవసాయస్థితిని ముందుగఁ బరిశీలింతము.

### ఋగ్వేదకాలవ్యవసాయచరిత్ర

క్రీ. పూ. 2000 మొదలు క్రీ. పూ. 1400 వఱకు

భారతీయవాఙ్మయమున ఋగ్వేదసంహిత మిక్కిలి ప్రాచీన మని ప్రాచీప్రతీచీపండితమండలి తలంపై యున్నది. ఋగ్వేదమునందుండిన వర్ణనములఁబట్టి చూడ ఋగ్వేదకాలముననే నాగరికత హెచ్చుగ నుండినటులు గాన్పించుచున్నది. నాఁటికే వ్యవసాయ పాశుపాల్య వాణిజ్యవృత్తు లతిశయించి యున్నవి. నాఁటి వ్యవసాయస్థితిని దానికి ననుసరించిన యితర సంబంధములను సమయానుసారముగా వ్రాసెదను. అనంతరకాలములలో జరిగిన మార్పులు శాస్త్రకాలానుచరితములలో వివరింతును. నేటి వ్యవసాయశాస్త్రవేత్తలు వ్యవసాయకర్మలలో నీ క్రిందిభాగములు చేరియుండునందురు.



(1) సామాన్యకృషి (ధాన్యవిశేషములఁ బండించుట).

(2) ఉద్యానకృషి (శాక ఫల పుష్పములఁ బెంచుట).

(3) పశుపాలనము (పశువృద్ధి, రోమ సంపాదనాదికము)

(4) తరుకృషి (చెట్ల నభివృద్ధి చేయుట).

(5) సరఘావర్ధనము (తేనెపురుగులఁ బెంచుట, తేనెతుట్టల సంపాదనము).

(6) పట్టుకృషి (పట్టుపురుగులఁ బెంచుట).

(7) కుక్కుటపాలనము (కోళ్లను బెంచుట).

ఇందు 6, 7, కృషులగుఱించి ప్రాచీను లెట్టి ప్రయత్నములఁ జేసిరో వైదికవాఙ్మయమున నాధారములు కాన్పింపవు. కాని, ప్రాచీనకాలమునుండి మనదేశపు పట్టుబట్టల

ఖండాంతరముల యందు వినకరి గాంచినవి. కుక్కుటపాలనమునకుఁ గూడ స్వల్పప్రయత్నము జరిగియుండును. రాజాధిరాజులు కోడిపందెములను వేసి సంతసించిరి. కోళ్లరంగు ననుసరించి జయాపజయముల నిర్ణయించు తిథివారాదికనిర్ణయగ్రంథములుకలవు. కాని నా కాగ్రంథములు లభింపలేదు. నైకృషి గుఱించి యాయాకాలములలో నెంతవఱకు ప్రయత్నము జరిగెనో, సందర్భానుసారముగ వివరింతును. ఇదు సామాన్యకృషికి ముఖ్యములగు పరికరములలో పొలమును దున్ని విత్తనములఁ జల్లి నూతినుండి కాని చెఱువునుండి కాని నదినుండి కాని నీటిని సంపాదించి పొలమును తడపి పైరును వృద్ధినొందించి, పండినపిమ్మటఁ గోసి కుప్పవేసి నూర్చి యెగరఁబోసి పొల్లును విడదీసి మంచి ధాన్యము నింటికిఁ దెచ్చుకొని, గాదెలలోఁబోసి జాగ్రత్తచేసికొనుటయే. ఈసామాన్యకృషినిగుఱించి ఋగ్వేదకాలమున నెంత ప్రయత్నమును నాటివారు చేసిరో చూతుము.



భారతీయ సాంప్రదాయమునందు ప్రతికర్మకు నొక "యధిష్ఠానదేవత" యుండునని తలంచి అధిష్ఠానదైవతారాధనము ముందుగఁ జేయవలసియుండును. ఋగ్వేదకాలమున "క్షేత్రపతి" యను నొక దేవత, పొలములయందుండునని నమ్మి దున్నుటకు ముందీక్రిందివిధమున ప్రార్థించుచుండిరి.

వామదేవుఁడు ఋషి.

(1) మేము మాగోవులను గుఱ్ఱములను సుఖముగా బోషించి, సుఖపెట్టుచున్న క్షేత్రపతిచేతను, హితవుగానే జయమునొందెదము. 4-57-1

పిమ్మటను దున్నుటకు మొదలుపెట్టినపుడీ ప్రోత్సాహజనకవాక్యము ననుచున్నాఁడు.

(1) వేదమంత్రములకు ఋషులు కలరు. ప్రత్యేకమంత్రములకే కాక, కాండలకును వేరు ఋషులుకలరు. మంత్రర్షి యనగా మంత్రమును కనిపెట్టినవాఁడని కాని, మంత్రమును జేసినవాఁడని కాని, తాత్పర్యము. ఇది సకల్పన కాదు.

"అరుణము" యొక్క 4 పన్నమునందు, "నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః". దీనికి విద్యారణ్యభాష్యమునం దిటులు కలదు "తద్వ్యృషిభ్యో నమస్కారోస్తు. కీదృశేభ్యః? మంత్రకృద్భ్యః మంత్రం కుర్వంతీతి మంత్రకృతః సంప్రదాయప్రవృత్త్యా మంత్రాణాం పాలనా న్మంత్రపతయ ఇత్యుచ్యంతే" అనఁగా మంత్రములఁ జేయువారికి మంత్రకృత్తులనియు, మంత్రసంప్రదాయప్రవృత్తిచే మంత్రములఁ గాపాడువారికి మంత్రపతు లనియుఁ దాత్పర్యము. మొదటివారిని మంత్రర్షులనియు రెండవవారిని కాండర్షులనియుఁ దలంపవలసియున్నది. చూడుఁడు. కలకత్తాకూర్పు, సభాష్యకారుణం 166 పుట. నైయర్థము నే "తారానాథ వాచస్పతి" తన నిఘంటువునందును, "అనుక్రమణికలో," విద్యారణ్యులను దృఢపఱచియున్నారు. కాని గ్రంథవిస్తరభీతిచే దానిని వదలితిని. ఋగ్వేదమంత్రములకుఁ, బ్రతిదానికిని ఋషి తెలియుచుండును. కాని తక్కిన వేదములలో కాండర్షులే కాని "మంత్రర్షుల" పేరులు కాన్పింపవు. అందువలన ఋగ్వేద మంత్రములకు ఋషుల నుదాహరించితిని. తక్కినవానికి వ్రాయలేదు. ఏమంత్రమే ఋషిప్రోక్తమో ఆఋషి యామంత్రమునే గాక, యామంత్రార్థకర్మనుఁగూడ చేసియుండెనని తలంపవలసియున్నది.— ఉదాహరణము "క్షేత్రస్య పతినావయం" అను మంత్రకర్త "వామదేవుఁడు." కాన వామదేవుఁడే యటుల ప్రార్థించెననియు అతఁడే మంత్రమును జేసెననియుఁ దాత్పర్యము.

"క్షేత్రస్య పతినావయంహి తేనేవ జయామసి గా మశ్వం పోషయిత్వా నోవృళా తీదృశే. ఋగ్వేదమ్-(4-57.1.)

* ఎద్దులు సుఖముగా నాగలిని వహించుఁగాక. దున్నువారు సుఖముఁ జేతురుగాక. నాగలి సుఖముగ దున్నుఁగాక. మోకులు సుఖముగా నాఁగలికిఁ గట్టఁబడుఁగాక. కొరడాను సుఖముగాఁ బ్రయోగింపుఁడు-(4-57-4).

పిమ్మట వర్షము కురియుటకును గాలిపాటు సరిగ నుండుటకును కాఁబోలు ఇంద్రవాయుదేవతల నీ క్రింది విధమున నుతించుచున్నాడు.

1 ఓయింద్రవాయుదేవతలారా! ఈ మావాక్యమును సేవింపుఁడు. ఆకసమున మీరు నిర్మించిన యుదకముతో నీ భూమినిఁ దడుపుఁడు.

పిమ్మట నాఁగేటిచాలు నీవిధమున నుతించుచున్నాఁడు.

2 మంచిధనవంతురాలవగు నో నాఁగేటిచాలా! నీకు నమస్కారము. ఎటులు మాకు ధనముకలుగునో ఎటులు మాకు మంచిఫలము కలుగనో అటులు ముందునకు సాగుము.

3 ఇంద్రుఁడు సీతాధారక మగు "నేడికోల"ను గ్రహించుఁగాక. దానిని "పూష" ప్రేరేపించుఁగాక. ఆకసము ప్రతి వత్సరమును వర్షించుఁగాక.

♦ కఱ్ఱులు సుఖముగా భూమిని భేదించుఁగాక. దున్నువారు సుఖముగా వృషభములతో నడతురుగాక పర్జన్యుఁడు సుఖముగాఁ దివ్యని నీటిచేఁ దడుపుఁగాక. వాయ్వాదిత్యులు మాకు సుఖము నిత్తురుగాక. పైఋక్కుల యర్థముచే భూమిని దున్నుట, కఱుకోల గల నాఁగలిని మోకులతోఁ గట్టి యెద్దులతో దుక్కిని సాగించుట తెలియనగుచున్నది. మఱియు యజమాని యుదయమున తన పనివారల కిటులు బోధించుచున్నాఁడు.

బుధుఁడు ఋషి.

4 ఓ స్నేహితులారా ఒకచోటున నుండిన మీరందఱును నిద్రనుండి లెండు. "దధిక్రాగ్నుష్య" దేవతల నింద్రునితోఁ గూడ నాహ్వానముఁ జేయుఁడు.

5 నెమ్మదిగా స్తోత్రముఁ జేయుఁడు. బుద్ధులను వికసింపఁ జేయుఁడు. తెడ్డుతో నావను నాఁటింపుఁడు. ఆయుధముల ధరింపుఁడు. ఓ స్నేహితులారా, తూర్పు మొగముగా యజ్ఞము నారంభింపుఁడు.

పై రెండు ఋక్కుల యర్థమునలనను, వ్యవసాయకులొకచో నిద్రింప, యజమాని తెల్లవాఱుజామున మేలుకొలిపి దైవప్రార్థనముఁ జేయఁ బ్రోత్సహించి యేటియావలనుండిన పొలమునకుఁ బోయి తూర్పు మొగముగా బనిముట్టులతోఁ బనినిఁ జేయ నియమించుట ద్యోతకమగుచున్నది. పనిఁజేయు వారలను యజమాని 'స్నేహితులారా'యని పిలుచుటయు కూలివాండ్రకు దైవప్రార్థనము బోధించుటయు, కూలివాండ్రను యజమాని పుత్రులవలెను మిత్రులవలెను నాఁటికాలమున తలంచెనని ద్యోతకమగుచున్నది. ఇప్పు డట్టిపద్ధతి యెచటనైనఁ గలదా? అట్టి పద్ధతి పుట్టిననాఁడే, కృతయుగప్రారంభ మని తలంపవచ్చును.

6 నాఁగళ్లకుఁ గాడులను గట్టుఁడు; దున్నఁబడిన భూమిలో విత్తులఁ జల్లుఁడు; మంత్రములఁ బఠించి పైరు పెరుఁగనిండు; పండిన పిమ్మటను దగ్గఱదగ్గఱగ "పస" పడునట్లు "కొడవండ్ల" నుపయోగింపుఁడు.

‡ దేవతలయందు భక్తి కలిగి బుద్ధిమంతులైన మా పనివాండ్రు నాఁగళ్లకు వేర్వేరుగాఁ గాడిలఁ దగులుచున్నారు

"నాగళ్లకు వేర్వేరుగాఁ గాడిలఁ దగుల్చుచున్నారు" అనుటవలన నాఁడు ఒక్కొక నాఁగలికిఁ బెక్కు-కాడిలఁ దగిల్చెడు నలవాటు కలదని తోఁచుచున్నది. నేఁడును బళ్లారి ప్రాంతమునం దట్టిపద్ధతి కలదు. ఇది నిర్జలప్రదేశమునను బావుల నుండి నీటినిఁ దోడు ప్రదేశమునను గానలసియుండును. దాని నుండి నీటినిఁ దోడుప్రదేశమున నే అట్టి "దుక్కి"ని సాగించుచున్నటుల ఋక్కర్థము చెప్పుచున్నది.

(సశేషము)

---

* శునంవాహాః శునంనరః, శునంకృషతులాంగలం। శునం వరత్రా బధ్యంతాం శున మష్ట్రా ముదింగయ-(4-57-4).

1 సునాసీరావిమాం వాచం జుషేథాం యద్దివి। చక్రథుః। పయః తేనే మా ముపసించతం- (4-57-5). 2 అర్వాచీ సుభగే భవసీతే వందామహేత్వా। యథానః సుభగాససి యథానః సుఫలాససి-(4-57-6). 3 ఇంద్రః సీతాంనిగృహ్ణాతు తాం పూషాను యచ్ఛతు సానః పయస్వతీదుహా ముత్తరా ముత్తరాం సమాం- 4-57-7).

♦ శునం నః ఫాలా, వికృషంతు భూమిం శునం కీనాశా, అభియంతు వాహైః। శునం పర్జన్యో మధునా పయోభిః, శునాసీరా శునమస్మాసు ధత్తం॥ (4-57-8)

4 ఉద్బుధ్యధ్వం, సమనసః, సఖాయః సమగ్నిమిన్ధ్వం బహవః సనీళాః॥ దధిక్రా మగ్ని ముషసంచ దేవీ, మింద్రావతో౽వసేనిహ్వయేవః॥ (10-101-1) 5 మంద్రాకృణుధ్వం ధియ ఆతనుధ్వం నావమరిత్ర పరణీంకృణుధ్వం। ఇష్కృణుధ్వ మాయుధారం కృణుధ్వం ప్రాంచం యజ్ఞం ప్రణయతా సఖాయః॥ (2) 6 యునక్త సీరావియుగా తనుధ్వం, కృతేయోనావపతేహబీజం। గిరాచశ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్॥ (3)

‡ సీరాయుంజంతి కవయో యుగా వితన్వతే, పృథక్ ధీరా దేవేషు సుమ్నయా-(10-101-4).



భమిడిపాటి రామసోమయాజులు గారు బి. ఏ.

## 1. కళాప్రపంచమున దాని స్థానము

ప్రకృతివైచిత్ర్యములఁ జూచి సర్వజనులు నానందింతురు. బుద్ధిమంతులు వాని నూరకచూచి యానందించుటే కాక, వానియాత్మలందుఁ జొచ్చి యందలి నిజతత్త్వ మెఱుంగఁ బ్రయత్నించుచుందురు. జ్ఞాను లందుననే పరమాత్ముని గాంచి యాతనిలో నైక్య మగుచుందురు. ఇంతవఱకు, వారివారి మనస్సులలోననే ప్రకృతిసందర్శనజనితములగు మార్పులు కానబడును. ఇది మొదటియవస్థ. మనములలోఁ గలిగినమార్పులు కొన్ని యభిప్రాయములుగా రూపించుట రెండవ యవస్థ. ఈ రెండవగతి సర్వసామాన్యుల కందఱకును గలుగదు. చూచిన దానికి తగినపాటి యుద్రేకము సామాన్యులకు వెంటనే కలిగి మరల వెంటనే యస్తమించును. కాని, చూచిన విషయములఁగూర్చి లెస్సగా నాలోచించు సామర్థ్యము గలవారికే, వారి యాలోచనా ఫలితి మభిప్రాయరూప మై, యాలోచనతోఁ గ్రమక్రమముగా పరిపక్వము నొందుచుండును. అటు పిమ్మట, నట్టియభిప్రాయము నితరుల కెఱుకపఱచుట మూఁడవమెట్టు. ఈ సామర్థ్యము మరల నభిప్రాయముల నూనగలిగిన కొలదిమందిలోఁ గొందఱకు మాత్రమే యుండును. అట్టులు తమకుఁ గలిగిన యభిప్రాయములను పై కెఱింగింపఁగలుగుట బుద్ధికిఁ గలుగు నేర్పు. ఈ నేర్పు ఒక్కొక బుద్ధిమంతునికడ నొక్కొకతీరుగాఁ బరిణమించుచుండును. ఒకఁడు, తనకుఁ గలిగినయుద్దేశముల, నితరులకు బాగుగా బోధపడురీతిని, భావముల కుచిత మగు భాషానైపుణితోఁ జెప్పును. వేఱొకఁడుతనభావములనే బొమ్మలుగా వ్రాసి, చూచువారు గ్రహించునట్లు చేయును. మఱియొకఁడు తనభావములను గ్రంథరూపమున వ్రాసి, ప్రపంచమునకు వెల్లడిచేయును. ఇంకొకఁడు తనభావములను రాతిపై బొమ్మలుగాఁ జెక్కి యగపఱచును. ఇట్లనేకులు బుద్ధిమంతులు, అనేకవిధ

ములుగా, అనేకరూపములుగా, తమ భావములను, ప్రపంచమునకుఁ జూపుదురు. చిత్రలేఖన మట్టి నేర్పులలో నొకటి. శిల్పము, చిత్రలేఖనము, చిత్రకల్పనము, నొకేజాతిలోని శక్తులు. కవిత్వము, వాక్చతురత వేఱుజాతిలోని వైనను, వానికిని వీనికిని గమ్యస్థాన మొక్కటియే యగుటచే, నివియన్నియు సమానశక్తు లని చెప్పవలయును.

ఏదైన నొక వస్తువునుగాని, వస్తుచలనముంగాని, వస్తుచలనసంభవ మగు శబ్దముగాని, కనుట వినుట జరిగినప్పుడు, అందఱకును మనస్సునం దొక విధమగు మార్పు కలిగి, వెంటనే దాని కనుగుణమగు శరీరచలనము కూడ గలుగును. ఇది ప్రకృతి ధర్మము. ఈ ధర్మము ప్రతి జీవజంతువు నెడలను సత్యమై యున్నది. మానవునం దీమనశ్శరీరచలనములు, తక్కినజీవులలో కంటె నెక్కుడుగా గానబడును. మేఘగర్జనము నాలించి, మనము చలింప, మృగముల నేకములు పరుగులెత్తుచుండును. పచ్చని బయళ్లను జూచి సంతోషముతో బసవులు వాని జేరుకొనుచుండును. పుష్పవర్ణములజూచి పసిబాలుర మనముల నొకవిధమగు నానందము కలుగ, చిన్న చిన్నసవ్వుల నవ్వుచుందురు. పక్షులయొక్క పలుకు లాలకించి బాలురు సంతసించుచుందురు. పిచ్చివారలకైనను, దేనినైనను జూచినప్పుడుకాని, వినినప్పుడు కాని, యిట్టి ద్వివిధచలనము కలుగకమానదు.

కాని యీ మార్పే, చూచి వినినవానిని గూర్చి, బాగుగా దెలిసికొను నాలోచనమై వెలయుట అందఱకు నుండదు. మృగజాతిలో ప్రకృతి తత్త్వ మెఱుంగగోరి దీర్ఘాలోచన సల్పుట యుండనే యుండదు. మానవులయం దైన నట్టియాలోచన కొంతమంది కేయుండును. అట్టియాలోచన యున్నను మానినను, మనుష్యేతరజీవులలోను, మనుష్యులలోను గూడ, చూచి విన్నవాని యనుకరణము మాత్రము, చాలవఱకు స్వాభావికమైయున్నది. ఈ యనుకరణము ఆలోచనయొక్క బీజము. అనుకరణమునకు, విని చూచిన సంగతులయొక్క తత్త్వ మెఱుగు టక్కఱలేదు. చిలుక మనుజులవలెనే పలుకఁ గలుగుచున్నది. బాలుఁడు కోయిలవలె కూయ గలుగుచున్నాడు. కోతి మనుజులచర్యల ననేకముల ననుకరించుచున్నది. పులి, జంతువులపైఁబడి కఱచి చంపితినుటఁజూచి, దానిపిల్ల లాపనినే చేయనారంభించుచున్నవి. అనుకరణము బుద్ధికి బాల్యావస్థ. అనుకరణమునకు మూలములోని యర్థ మెఱుగ నక్కఱలేదు. చిలుక తా ననుకరించుపదముల కర్థము తెలియకుండగనే పలుకగలుగుచున్నది. కాని యనుకరణసాహాయ్యమున గ్రమముగా మూలముయొక్క తత్త్వము నెఱుంగవచ్చును. ఒక మనుజుని "రామా" యని పిలుచుట ననుకరించిన చిలుక, మనుజులవలెనే యాతని కాపేరని యెఱింగి, యాతడగపడినపుడెల్ల, "రామా"యని పిలువనేర్చును. పసుల నాపేర బిలువదు. పసుల జంపితినుట ననుకరించిన పులిపిల్ల, రుచి దెలిసి, యది తనకాహారమని యెఱింగి, యాపైనందు దన నేర్పులు గల్పనలు జూపించి, బ్రదుకనేర్చును. సత్పురుషుని చర్యల ననుకరించినవాడు, తొలుత నారంభించినప్పు డామార్గమునందలి మేలు నెఱుంగకున్నను, గ్రమముగ దెలిసికొనగల్గును. ఇట్లు తెలియనిదాని నెఱుంగుటకనుకరణ మొకయాధారము. ఈ యనుకరణ మొకప్పుడు పై శరీరచైతన్యరూపమునగాక, మానసికమైయుండును. అనగా బుద్ధిమంతులకు వస్తుతత్త్వ మెఱుంగుటకు, శరీరచైతన్యయుతమగు ననుకరణమక్కఱలేదు. మంచిమార్గము కొన్నిదినము లనుకరింపనక్కఱలేకయే, బుద్ధిమంతులైనవా డా మార్గము వలని ప్రయోజనములు,

మనస్సులో నామార్గానుకరణము జేసి, గ్రహింపగలుగును. మొత్తముమీద, మనస్సునందుగాని, శరీరమందుగాని, యీయనుకరణము జరిగినపిమ్మటనే, యాలోచన పరిపక్వ మగును.

ఆలోచన, మనుష్యేతరజీవులయందు చాల తక్కువగాను, మనుష్యులయందు మెండుగాను కలదు. ఇది యందఱకు నొకేతీరుగ నుండక, హెచ్చుదగ్గులు గలిగి యుండును. మనుష్యులలో కొంతమంది, బాగుగా నాలోచింపగలరు. అది యొకొక్క బుద్ధిసారముం బట్టి యొకొక్కతీరుగా బ్రబలుచుండును. బుద్ధిమంతులు, ప్రకృతిపై చిత్రసందర్శనమున గ్రమక్రమముగా, మంచి యాలోచనల జేసి, ప్రపంచముంగూర్చి కొన్నియభిప్రాయములు గలిగియుందురు. ప్రతివస్తువును, జన్మించుట, యౌన్నత్య మనుభవించుట, వినాశముం జెందుట, జూచి, దేనికిని శాశ్వతపదవి లేదని సుబుద్ధులు గ్రహించిరి. ఆరీతినే, యనేకము లగు నిజములను దెలిసికొని, వానిని కొందఱు తక్కుంగల మానవులకు బోధింతురు. అట్లు బోధింపగలుగుట యొక శక్తి.

ఈశక్తి, వాక్చతురత, కవిత్వము, శిల్పము, చిత్రలేఖనము, చిత్రకల్పనము, మున్నగు రూపములతో నొప్పును. తనయుద్దేశములను జనులకు బోధపడ బలుకగలుగు మాటలచతురత కొందఱకు గల్గును. బుద్ధదేవుడు, శంకరాచార్యుడు, మున్నగు మహాబుద్ధులు మతస్థాపకు లగుటకు నీశక్తి చాల తోడ్పడినది. ప్రపంచనిజతత్వ మిదియని ప్రజలకు నమ్మకము కలుగునట్టులు చెప్పి, తాము వచించుచున్నమార్గములగుండా గాని, ముక్తిగాంచుటకు వేఱుదారి లేదని, యందఱు తెలిసికొనునట్లు చేయు వాక్చాతుర్యము వారి కుండెను. కవిత్వము కూడ నట్టిశక్తియే. మఱికొందఱకు శిల్పశక్తి, మఱికొందఱకు జిత్రలేఖనము, చిత్రకల్పనము గలుగును.

ఈశక్తి మనస్సునందే కలుగును. అట్టి శక్తి కలిగినమనస్సు, నాల్కకు మాటలను, బుద్ధికిపద్యములల్లుట, చేతిబొమ్మలు చెక్కుట, వ్రాయుట, కల్పించుట, మున్నగునవి నేర్పును. భావములేని వాగ్ధోరణి, పద్యరచన, చిత్రలేఖనము, చిత్రకల్పనము, శిల్పము, నిజమగు శక్తులు కావు. భావము లేనిచే వానికి జీవము లేదు.

చిత్రలేఖనాశక్తి, కవిత్వమువలెనే,యొకానొక మానవుని కబ్బుచుండును. చిత్రలేఖన మనగా బొమ్మలవ్రాయుట—బొమ్మల చెక్కుట శిల్పము ; బొమ్మలచేయుట చిత్రకల్పనము; బొమ్మలవ్రాయుట చిత్రలేఖనము. బొమ్మ యనగా రూపు ; కంటికి కానవచ్చున దెల్ల రూపే యగును. చిత్రలేఖకుని కంటికి గనవచ్చిన వస్తువుగాని, యనేకవస్తువుల సమూహముం గాని, వస్తువులో నొకకొంతభాగముం గాని, యాతడు వ్రాయగలడు. అందుచేత, చిత్రలేఖకునికి నేత్రము ప్రధానమైనయంగములలో నొకటి. గాయకునకు నేత్రములు లేకున్నను, పాట యాగిపోనేరదు. కవికి నేత్రములు లేకున్న కవితాప్రవాహ మడ్డుపడదు. కాని చిత్రకారునికి నేత్రములులేకున్న చిత్రలేఖనముగాని, చిత్రకల్పనముగాని, శిల్పముగాని, చేయుటకు వీలులేదు. అట్లయ్యును, చిత్రలేఖనమునకు నేత్రములే ప్రధానములుగా గాని, వ్రాయుచేతులే ప్రధానములుగా గాని, పనిముట్లు ప్రధానములుగా గాని, యన్నవనుటకు వీలులేదు. వీనియన్నిటికంటె ముఖ్యమైనది, భావము. భావములేకుండ నివియన్నియు కలిగినను ప్రయోజనము లేదు. కొందఱు చిత్రలేఖనము నేత్రహస్తాభ్యాసములమైత్రియని వచియించి

యన్నారు. కాని, యానేత్రములకును, హస్తము
లకును, స్వకీయమగు శక్తి లేనికతన, వానిచే భావ
మే పనుల జేయించుచున్నదనుట నిజము. చిత్రలే
ఖనాశక్తి మనస్సునకే గాని తక్కినయంగములకు
లేదు.

మన కగపడు ప్రకృతినే చిత్రలేఖకుడు తన
పటముపై జూపుచున్నాడు. ప్రకృతి విపరీతము
చిత్ర మనబడదు. చిత్రలేఖకుడు మన కగపడు
రూపుల పటమునందు జూపుటకు నవకాశ మెట్లు
గల్గుచున్నదో చర్చింప వలసియున్నది. పలుచని
వస్తువగు కాగితముపైననో, గుడ్డపైననో, బల్లపై
ననో, సమమట్టముగా నున్న గోడపైననో, కొం
డలు, నదులు, మనుష్యులు, చెట్లు, మున్నగునవి,
యున్నట్టు లెట్లు వ్రాయుట? తొలుత ప్రకృతిలో
మన కావస్తువులు కానవచ్చుటకు గారణ మేమి?

గాలి యున్నదని మన మెఱుంగుదుము కాని,
దానిని కంటితో జూడజాలము. పర్వతములను జూడ
గలుగుచున్నాము. గాలిని చూడ లేకుంటకును
పర్వతమును జూడగల్గుటకును, గారణ మేమైయుండు
ను? గాలికి స్వరూపము లేదు, రంగు లేదు. స్వరూ
పమును రంగును కలిగినగాని వస్తువు గోచరింపదు.
పర్వతమున కారెండును గలవు. అందుననే దానిని
చూడగలుగుచున్నాము. ఆకార మున్నగాని, వస్తు
వును జూడజాలము. కంటికగపడు వస్తువులందు రంగు
లేని వస్తువులేదు. ఏదియో యొకరంగు, వస్తువునకు
స్వకీయముగా గాని, వెలుగునీడలవలన గాని కలు
గక తప్పదు. ప్రతివస్తువును గానవచ్చుటకు వెలుగు
నీడలుకూడ తోడ్పడుచున్నవి. వెలుగును నీడయు
వస్తువుపైన బడినప్పుడు వస్తువు కంటికి గోచరించు
చున్నది. ఆకారమును రంగును వెలుగునీడలును
వస్తువు కానవచ్చుటకు నగుచున్న గుణములు. ఈ
గుణములు, ఒక్కొక్కవస్తువున కొక్కొక్కతీరున నుం
డును. అనేకాకారములు ననేకరంగులు ననేక
విధముల బరిణమించు వెలుగునీడలు ప్రకృతిలో
గానవచ్చుచున్నవి. వస్తుగోచరకరణము లగు నీ
గుణములు తా మెచ్చట వెలసియున్న నచ్చటనే
వస్తువు కాననగుచున్నది. ఈ గుణములనే పటము
పై జిత్రకారుడు నిపుణతతో జూపి వస్తువులం జూ
పించుచున్నాడు. ఈగుణములలో నేది లేకున్నను
వస్తురూపము చెడిపోవును. అందువలన చిత్రము
వికృతమగును.

ఎన్నియోమైళ్లు పొడవు, వెడల్పు, ఎత్తు, గలి
గిన పర్వతమును చిన్నకాగితముపై సమమట్టము
గలిగిన పత్రముపై చిత్రకారుడు చూపింపగలుగు
టకు నీ గుణములే తోడ్పడుచున్నవి. వస్తుభారము
కంటికి తెలియదు. అందువలననే, చిత్రమునందు
భారగుణము జూపింప నక్కఱలేదు. అట్లే, య
నేక గుణములు, చిత్రకారుడు ప్రత్యేకముగా జూ
పింప నక్కఱలేకయే, తక్కినగుణములను నేర్పుగా
జూపించుటంబట్టి, యున్నట్టులే మనస్సునకు జిత్ర
మునందు దోచుచుండును. ఆరీతినే ప్రాణముకూడ
నున్నట్లు దోచు చిత్రములు గలవు. జీవకళ కాన
వచ్చు చిత్రములే చిత్రకారునియొక్క శక్తిని
జూపింపజాలును.

---

# మధురకవితలు

## వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

ఆశు (మృదు) మధురచిత్ర విస్తరభేదముచే దేశి కవిత నాల్గువిధములు గలది. ఏలలు, జోలలు, సువ్వాలలు, ధవళములు, అర్ధచంద్రికలు, తుమ్మెదపదములు, కోవెలపదములు చందమామ పదములు, మొదలగునవి మధురకవిత లని ప్రాచీన లాక్షణికు లనిరి. పదుమూఁడవశతాబ్దిలో నున్న ప్రఖ్యాతాంధ్రకవి పాల్కురికి సోమనాథుఁ డిట్టి రచనములను గొన్నింటిని బేర్కొన్నాఁడు.

> "మది నుబ్బి సంసారమాయాస్తవంబు
> పదములు, తుమ్మెదపదముల్, ప్రభాత
> పదములు, పర్వతపదము, లానంద
> పదములు, శంకరపదముల్, నివాళి
> పదములు, వాలేశుపదములు, గొబ్బి
> పదములు, వెన్నెలపదములు, సెజ్జ
> వర్ణన, మణిగణవర్ణనపదము,
> లర్ణవఘోషణఘూర్ణిల్లుచుండఁ
> బాడుచు నాడుచుఁ బరమహర్షమున
>
> పండితారాధ్యచరిత్రము.

శ్రీశైలమెక్కు భక్తులు పయివాని బాడిరంట! దీనిని బట్టి యిట్టి రచనములు తెలుఁగులో బహు ప్రాచీనకాలమునుండియుఁ గల వని యెఱుఁగనగును. ప్రాచీనకాలమగు తుమ్మెదపద మొకటి యిక్కడఁ జూపుచున్నాఁడను.



### తుమ్మెదపదము

శివశివయన మేలు తుమ్మెదా, శివ
యంటేను శివ మేలు తుమ్మెదా.
శివునిభక్తులాకు తుమ్మెదా, శివ
శరణన్న మేలె వో తుమ్మెదా.—
శ్రీకంఠుడను పువ్వు తుమ్మెదా,
మూఁడు లోకము లాయెనె తుమ్మెదా,
సాకారమై యుండు తుమ్మెదా, పర
మైకాంతమున జూడు తుమ్మెదా.—శివశివ. ౧

ముట్టీముట్టని పువ్వు తుమ్మెదా, అది
ముట్టింది జగమెల్ల తుమ్మెదా,
ముట్టి కూడవే వో తుమ్మెదా, దాని
ముట్టి పాయలేవె తుమ్మెదా.—శివశివ. ౨

యవ్వనమందేవె తుమ్మెదా, చాల
పువ్వులవాసన తుమ్మెదా
కొవ్వి నీ వెఱుగవె తుమ్మెదా, నీ
నెవ్వ నేరమూల తుమ్మెదా!—శివశివ. 3

ఆఱు రేకుల పువ్వు తుమ్మెదా, అది
మీఱినవాసనె తుమ్మెదా,
వేఱుసేయక నీవు తుమ్మెదా, శివు
జేరి భజించవె తుమ్మెదా!—శివశివ. ౪

ఈడపింగళాలు తుమ్మెదా, సుషుమ్న
నాడిమధ్యమున తుమ్మెదా,
మేలిమెఱుగి నీవు తుమ్మెదా, శివ
కేళి జరించవె తుమ్మెదా! — శివశివ. ౫
ఏడుగురు రాజులు తుమ్మెదా, నీకు
ఈడుజోడుబంట్లు తుమ్మెదా,
చూడు పాడు ఒంపె తుమ్మెదా, భక్తి
రూఢి కెక్కు మట్టె తుమ్మెదా! — శివశివ.
ఆసపాపజాతి తుమ్మెదా, వట్టి
ఆస వీడు మంటి తుమ్మెదా,
మోసపోకు మంటి తుమ్మెదా! భక్తి
వాసికెక్కు మంటి తుమ్మెదా! — శివశివ. ౭
అష్టదళముమీద తుమ్మెదా! నీవు
అంటి చరించవె తుమ్మెదా,
కష్టము లెఱుగవె తుమ్మెదా! నీవు
స్రష్టవై యందువె తుమ్మెదా! — శివశివ.
తొమ్మిదివాకిళ్ల తుమ్మెదా! నీవు
నమ్మి చరించవె తుమ్మెదా
ముమ్మూలకోనల తుమ్మెదా! నీవు
నెమ్మది నుండవె తుమ్మెదా — శివశివ. ౯
పదిపదిహేనింట తుమ్మెదా, ఉండే
పదకొండోతాన్రన తుమ్మెదా!
మెదలక నిల్చిన తుమ్మెదా! నిన్ను
కదలించగలరటె తుమ్మెదా! — శివశివ.
ఆనతోటపుష్ప తుమ్మెదా! నీ
వానక మానవె తుమ్మెదా!
దానిలో జిక్కిన తుమ్మెదా, తోట
వానిచే బడుదువె తుమ్మెదా! — శివశివ.
సింగి నేల యాను తుమ్మెదా
గంగా గౌరు లని తుమ్మెదా, ఉ
ప్పొంగుచు నెక బోడ తుమ్మెదా! వేయి
భంగుల నటియించు తుమ్మెదా! — శివశివ.
వేయురేకులపూవు తుమ్మెదా! అది
వెదకి కానలేవె తుమ్మెదా!
సద్గురు నడుగవె తుమ్మెదా పూవు
సద్య చూపు నీకు తుమ్మెదా! — శివశివ.
గురునకు హరునకు తుమ్మెదా! అం
తరువు లేదు నిజము తుమ్మెదా!
గురుపాదపద్మములు తుమ్మెదా! నిన్ను
దరిసించు మంటినె తుమ్మెదా! నిన్ను
దరిసించు మంటినె తుమ్మెదా!
శివశివ యనవే వో తుమ్మెదా!



## ప్రణయినీగీతములు

"సౌదామినీ"

ఆకసమున మబ్బు దట్టె
మైక్రమ్మెను, చిటపటమను
చినుకుల తీయని పాటలు
చెవులకింపుగూర్చుచుండె,
గున్నమావికొమ్మలందు
కోకిల పాడెడు పాటలు
వినవచ్చుచునుండె, నిల్లె
వేచియుంటి నెప్పుడు ప్రియు
డరుదెంచెదునా, నే నెపు
డా ముద్దుమొగమ్ము గాంతు
నా యంచున్ నా హృదయ
మ్మాతురతన్ జెందుచుండె.



# గానము

కాశీనాథుని భైరవమూర్తి గారు

"ఓంకారపంజరశుకీం। ఉపనిషదుద్యానకేళికలకంఠీం।
ఆగమవిపినమయూరీం। ఆర్యా మన్తర్విభావయే గౌరీమ్."

"బ్రహ్మగ్రంథిజమారుతానుగతినా చిత్తేన హృత్పంకజే,
సూరీణా మనురంజకః శ్రుతిపదం యోయంస్స్వయం రాజతే,
యస్మాద్గ్రామ విభాగవర్ణ రచనాలంకార జాతిక్రమో,
వందేనాదతనుం తముద్ధరజగద్గీతం ముదే శంకరమ్."

శ్రీమదఖండ సచ్చిదానంద స్వరూపుండును, ఆదిమధ్యాంతరహితుండును, సృష్టిస్థితిలయకారకుండును, దహరాకాశవిహారుండును, నాదబిందుకళాతీతుండును, సాక్షాత్ప్రణవస్వరూపుండునగు నప్పరమేశ్వరుండు సృష్టికిఁబూర్వము, తరంగరహిత సముద్రమువలె, నిర్మేఘాకాశముభంగి బ్రహ్మాత్మ నారాయణాది సర్వశబ్దవాచ్యుండై వెలుఁగుచుండును.

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః.
స బ్రహ్మా స శివః స హరి స్సేంద్ర స్సోక్షరః
పరమ స్స్వరాట్" (ఇత్యుపనిషత్.)

ఋచస్సామాని..........వేదాహ..........
నాన్యః పన్థా అయనాయ విద్యతే॥ (పురుషసూక్తము.)

సర్వపరిపూర్ణుండై నిత్యుండైనయప్పరమేశ్వరునియందు వహ్నియందుష్ణశక్తివలెను, బీజమునందు వృక్షశక్తివలెను, జలమందు ద్రవశక్తివలెను, స్వాభావికమై యజాతమైన చిచ్ఛక్తి యుండును.

ఏతచ్చిచ్ఛక్త్యవచ్ఛిన్నుఁడగు పరమశివుఁడు స్వస్వరూపమగు నాదమును తద్గుణకమైన యాకాశమును సృజించెను.

పరమభక్తాగ్రేసరులలో నొకరై, వాగ్గేయ కారకులలో మిగులఁ బ్రఖ్యాతి వడసి నారదాంశా సంభూతులై భువిని వెలసిన శ్రీత్యాగరాజస్వామి యిట్లు చెప్పియున్నారు:

చిత్తరంజని - ఆది

పల్లవి

నాదతనుం అనిశం శంకరం.

అనుపల్లవి

మోదకర నిగమోత్తమ సామ - వేదసార వారం వారమ్.

చరణం

సద్యోజాతాది పంచవక్త్రజ-సరిగమపధనీ సప్తస్వర విద్యాలోలం విదళితకాలం- విమలహృదయ త్యాగ రాజపాలమ్.

శ్లో. నాదోపాసనయా దేవాః బ్రహ్మవిష్ణుమహేశ్వ రాః, భవన్త్యుపాసితా నూనం యస్మా దేతే తదాత్మకాః.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ"; "చైతన్యం సర్వ భూతానాం నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే"

ఇత్యాద్యనేకప్రమాణములచే సాక్షాత్ప్రణవనాద స్వరూపులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులీ నాద ము నుపాసించుటచే నిశ్చయముగ నుపాసితులగు చున్నారు. మోక్షైకమార్గ మని నిరూపింపఁబడిన పరమేశ్వరైక్యము నాదోపాసనవలననే కల్గి జీవ న్ముక్తు లగుదు రనియుఁ గలదు.

శేగడ - ఆది

పల్లవి

నాదోపాసనఁ జేసే శంకర నారాయణ విధు లన వెలసిరి ఓమనసా.

అనుపల్లవి

వేదోద్ధారులు వేదాతీతులు విశ్వ మెల్ల నిండి యుండేవారలు.

చరణం

మంత్రాత్ములు యంత్రతంత్రాత్ములు మహామంత్ర ము లెన్నో గలవారలు, తంత్రీలయస్వరగాన వినోదులు త్యాగరాజవంద్యులు స్వతంత్రులు.

ఇత్యాద్యనేకప్రమాణములచే సర్వదేవతాస్వరూప మగు నీనాదమునకు—

"నకారం ప్రాణనామానం దకార మనలం విదుః, జాతః ప్రాణాగ్నిసంయోగా త్తేన నాదోఽభి ధీయతే." (సంగీతదర్పణమ్.)

'న'కారము ప్రాణ మనియు 'ద'కారము అగ్ని యనియు సంజ్ఞలు గావున ప్రాణానలసంయో గమువలన నాద మేర్పడుచున్నది. ఈనాదము వర్ణా త్మక మనియు, ధ్వన్యాత్మక మనియు రెండువిధం బులు. అందు వర్ణాత్మకము "ననాద ఢక్కాం నవ పంచవారం" అనుదానిచే "అ ఇ ఉణ్ ఋ ఌక్" ఇత్యాది వర్ణములు అచ్చులు హల్లులుగ విభాగములై వెలసి, ఛందోవ్యాకరణాదులకును వేద వేదాంగములకును, రామాయణాది సకలపురాణేతిహాసములకే కాక సకలవాఙ్మయ ప్రపంచమునకును మూలముగఁ బరిణామ మంది నది. వీనికి పాంచభౌతిక, అధిదేవత, జాతి, 'చూచేచోలే' త్యాది జ్యోతిష, మిత్రత్వ, శత్రుత్వ, లింగ, కాంతి, విష, అమృతేత్యాద్యనేకగుణరూప ములకు సమన్వయముఁ జేయుటయే గాక, శరీర మునం గల సకలావయవములకును, అంగన్యాస కరన్యాసాదులందు నిప్పటికి నెఱుంగనగు సంబంధ మున :—అ-శిరస్సు, ఆ-లలాటము, ఇ-దక్షిణకర్ణ

ము, ఈ-వామకర్ణము, ఉ-ద-నేత్రము, ఊ-వా-నేత్రము, ఋ-ద-కపోలము, ౠ-వా-కపోలము, ఌ-ఊర్ధ్వోష్ఠము, ౡ-అధరోష్ఠము, ఏ-ద-భుజము, ఓ-వా-భుజము, ఐ-ద-కక్షము, ఔ-వా-కక్షము, అం-గళము, అః,ద-వా-స్తనాగ్రములు, కవర్గము-ద-హస్తాంగుళులు, చవర్గము—వా-హస్తాంగుళులు, టవర్గము-పృష్ఠము, తవర్గము-ఉదరము, పవర్గము జఘనము, య,ర,ల,వ, ద-పాదము, శ,ష,స,హ-వా-పాదము అనియు, మఱియు వివరముగ మాతృకాన్యాస(మంత్రశాస్త్ర)మునందు విపులముగ నిరూపించి యున్నారు.

అచ్చులలో— 1-10-4=రక్తవర్ణము లనియు, 3-6-8 = అసితము లనియు, 5-11 = పచ్చవన్నె యనియు, శేషించిన, 2-7-9-12-13-14-15-16= ఇందునిభము లనియు నిరూపించిరి.

సీ. శ్యామలశుభశో। ణార్జునకృష్ణంబు
లసితవినీలారు। ణాంజనాభ
కాళిమలరుణశు। క్లభవోవిపీతసి
తేతరరక్తంబు । లిందుకాంతి
హరిణమేచకహరి। ద్రాభపాండురములు
సితకృష్ణధవళలో। హితసుపర్వ
పతిశిలాభంబులు । స్పర్శవర్గములకుఁ
గృష్ణారుణాసిత । క్షీరరుచులు
గీ. నాల్గునంతస్థములకుఁ గుందనపుఁదేట
గెంపుఁజాయయును బవడంపుఁజిగియు
మొల్లవిరిమిసిమియు నూష్మములకుఁ దెలుపు
నెఱిళకారంబునకు వన్నియలు వరుస.

ఆ. "విభుశరీరకాంతి । వీక్షించి తత్కాంతి
గలుగునక్షరములఁ । గావ్యములను
మొదల నిలుపఁ దేజ । మొదవు వేఱొకచాయ
వర్ణ మిడినఁ దెవులు । వచ్చు నిజము."

(అప్పకవీయము)

ఇట్లు కావ్యాదులందుఁ గృతిపతి జన్మతార దేహకాంతి మొదలగువానికిని కృత్యాద్యక్షరసంపుటమునకునుగల పరస్పరసంబంధమును, సకలమంత్రములు నోంకారమాది యైనకరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాదిగ నుండుటకుఁ గారణమును, అందుఁ గల శవర్ణ రేఫ ఈకారాధిపతులు మువ్వురును శుభప్రదు లౌట యనియు నిత్యాదికము లనేకము లుదాహరింపఁబడినవి. ఇవన్నియు నాధునిక ప్రకృతిశాస్త్రతత్త్వవేత్తలచే నిటీవలఁ గనుపెట్టఁబడి మన కుద్బోధితము లగుచున్నవి. ఇంకను కాఁగలవు.

ఇది గాక ప్రతిమంత్రమునకును బీజసంపుటిఁ జేయుటచే పాశుపత, అఘోర, ఆగ్నేయ, బ్రహ్మాద్యనేకాస్త్రప్రయోగోపసంహారములకు నుపయోగింపఁబడుట వినియున్నాము. ఇటీవలఁగూడ, భట్టుమూర్తి వేములవాడభీమకవి మొదలగుమహాకవులు మంత్రము లేకయే విషబీజాక్షరసమన్వితము లగు కబ్బములచేఁ దిట్టినట్లును ఋషీశ్వరులశాపముల వలెనే ఇవియును శత్రుమారకములుగఁ బ్రయోగింపఁబడినట్లును వినుచున్నాము.

ద్వితీయము ధ్వన్యాత్మకము. ఇది ఆహతము, అనాహతము అని ద్వివిధము. అందు అనాహతము రేచక పూరక కుంభ కాదులచే మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, విశుద్ధ, లలనాఖ్య, ఆజ్ఞాసంజ్ఞిక, మన స్సోమ చక్రములకుఁ గ్రమముగ ఈనాదమును రేపి యూర్ధ్వరేతస్కులై బ్రహ్మరంధ్రమున సహస్రారకమలమునందు నిల్పి నిర్వికల్పకసమాధినిమగ్నులై, తత్త్వజ్ఞానులై, పరబ్రహ్మైక్యానుసంధిం జేసి సచ్చిదానందము ననుభవింప మహాయోగీంద్రులకు మాత్రము సాధ్యము మోక్షసాధనము.

ఖరహరప్రియ - ఆది

పల్లవి.

నడచినడచిమాచే రయోధ్యానగరము గానరే.

అనుపల్లవి.

పుడమిసుత సహాయుఁడై చెలంగే పూర్ణుని ఆత్మ
రాముని.

చరణం.

అట్టె కన్నులు మూసి తెలిచి సూత్రముఁ బట్టి
వెదకి వేషధరులై పుట్టు చావు లేనితావు దెలి
యక పొగడేరు త్యాగరాజాప్తుని. నడచి॥

(త్యాగరాజీయము)

శరీరమే సర్వ మనియుఁ బరిపూర్ణుం డగునా
త్మారాముఁ డుండు అయోధ్యానగరమే యనియుఁ
జిత్తైకాగ్రతకన్న మిన్న లేదనియు నభిప్రాయము.

ద్వితీయము ఆహతము. నాదతరంగములు
శ్రుతిపుటములఁ బ్రవేశించుటచే మనకు వినఁబడు
నాదము. ఇందు శ్రోతృపేయ మగునది గానము. ఇది
గాత్రజము యంత్రజము.

"గీతిగానేన యోగస్స్యాత్, యోగాదేవ శివై
క్యతా । గీతిజ్ఞో యది యోగేన । సయాతి పర
మేశ్వరమ్" (సూతసంహిత)

భక్తితో నొకదేవతనుగూర్చి మంత్రజపముల
చే నారాధించిన నేఫలమో, దాని కధికముగను
సద్యఃఫలమును గానముచే నారాధించినఁ గల్గును.
చిత్తైకాగ్రతయునుగలిగించును. అదియె యోగము.
దానఁ బరమాత్మైక్యసిద్ధి.

"నాహం వసామి వైకుణ్ఠే న యోగిహృదయే
రవౌ। మద్భక్తా యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి
నారద॥" (విష్ణుపురాణమ్)

అని సాక్షాత్ శ్రీకృష్ణభగవానుఁడు నుడివి
యున్నట్లు గలదు. దేవతలందఱకును బ్రీతిజనకము
గాన్రన మానవాదులకుఁ జెప్ప నవసరము లేదు.
మఱియు,

"త్రివర్గఫలదా స్సర్వే దానయజ్ఞజపాదయః।
ఏకం సంగీతవిజ్ఞానం చతుర్వర్గఫలప్రదమ్॥"

(శివసర్వస్వము)

దాన, యజ్ఞ, జపాదులు ధర్మార్థకామము
లగు త్రివర్గఫలదములే గాని సంగీతవిజ్ఞాన మొక్క
టియే యీమూఁటిని గాక తురీయ మగు మోక్ష
మును గూడ నొసంగు ననియుఁ గలదు.

ముఖారి - ఆది

పల్లవి

సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్యదమే మనసా॥

అనుపల్లవి

శృంగారరసాద్యఖిలసారపూజిత రామకథానందాబ్ధి
యుత॥

చరణం

ప్రేమ భక్తి సుజనవాత్సల్యమును - శ్రీమద్రమా
వరకటాక్షమును - నేమనిష్ఠయశోధనము గల్గునే-
నేర్పుగల్గు త్యాగరాజవినుత॥ (త్యాగరాజీయం)

దీనినే, సామవేదజము గాన గాంధర్వవేద
మనియుఁ జెప్పుట గలదు. దీనిచే సర్వజ్ఞుఁడైన సదా
శివుండును శ్రీమహావిష్ణువును పరబ్రహ్మయు సం
తుష్టు లగుదు రనియుఁ జెప్పంబడినది.

"తస్యగీతస్య మాహాత్మ్యం కే ప్రశంసితు మీశతే।
ధర్మార్థకామమోక్షాణా మిదమేవైకసాధనమ్॥"

(సంగీతరత్నాకరము)

దీనం జేసి సంగీతము ప్రతిజీవునకును ముఖ్య
ము. ఐహికాముష్మికఫలమునకు సాధనమగుచున్నది.

"సద్యఃఫలం సంగీతమ్" సామాన్యముగ భిక్షు కులలోఁగూడ గానమును భజనను జేయువానికే యధికముగను వేగముగను భిక్షము లభియించుటఁ గనుచున్నాము. దేవతలు సామగానలోలు రగుటచే నాముష్మికము కరతలామలక మనుటకు సందియము లేదు.

"శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణిః।
సఏవ శంకరో వేత్తి సమగ్రం వేత్తినాపరః॥"
"సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం,
ఏక మాపాతమధురం అన్య దాలోచనామృతమ్.
(సంగీతదర్పణమ్.)

"రహి మించు జంత్రగాత్రముల తా ల్గరఁగించు" (వసుచరిత్ర)

అనునట్లు గానము తదితరవిద్యలవలెఁ గాక, సవ్యక్తమధుర మై సకలచరాచరములఁ దనతరంగములచేఁ బ్రచలింపఁజేయఁ జాలును.—దీనికి విరుద్ధమగు జన్మము,

"సంగీతసాహిత్యరసానభిజ్ఞః సాక్షా త్పశుః పుచ్ఛ విషాణహీనః"

సంగీతసాహిత్యరసము ననుభవింపనేరని జనుఁడు తోఁకయును కొమ్ములును లేనిపశువుతోఁ బోల్పఁబడెను. మఱియు, హూణదేశపుఁ గాళిదాసన నొప్పు షేక్స్పియరుమహాకవి 'వెన్నిసువర్తకుఁడు' అను నాటకమున సంగీతరసానుభవము లేనినరుఁడు ప్రాణహింస, రాజద్రోహాదిమహాపాపములఁ జేయ నెఱుఁ డనియు వ్రాసియున్నారు. మఱియు,

సారమతి - ఆది

పల్లవి

మోక్షముగలదా భువిలో జీవన్ముక్తులు గానివారలకు

అనుపల్లవి

సాక్షాత్కార నీసద్భక్తి సంగీతజ్ఞానవిహీనులకు

చరణం

ప్రాణానలసంయోగమువలనఁ-బ్రణవనాదము సప్త
స్వరములై పరఁగ- వీణావాదనలోలుఁడౌ
శివ మను-విధ మెఱుఁగరు త్యాగరాజవినుత.

అని శ్రీ త్యాగరాజస్వామి నుడివియున్నారు. అట్టి యీగానమునఁ గల్గు ప్రతిస్వరమున నొక్కొక యాకార ముదయించు ననియు, ప్రతి ధ్వనికిని నసేకాకృతు లంతరాళమునఁ గల్గుచుండు ననియుఁగలదు. దీనికుదాహరణముగసన్నని రేకునకు మధ్యమున నొకకఱ్ఱను బిగియఁ గొట్టి అనఁగా కఱ్ఱ స్తంభాకారముగను రేకు దానిపై బల్లపఱుపుగ నుండునట్లును నిల్పి, దానిపై సన్నని యిసుకను బోసి రేకుచివరను ఫిడేలును వాయించు కమానుతో గీఁచినయెడల, తజ్జనితము లగు తరంగములవలన రేకు కంపితమై దానివలన నిసుకరేణువులు చలించి యనేకాకృతులుగ నేర్పడును. సమాన వేగముగను బలముగను గీచిన యాకృతులు సమములుగను, లేనిచో విషమముగను అనఁగ నాకృతి తదనుగుణముగను నేర్పడును. ఈనాదరూపవర్ణములను 'మిస్ హ్యూగ్స్', అనునామె 'ఈడోఫోన్' అను యంత్ర సహాయమున 'లార్డు లెయిటన్'గారి ప్రాసాదమున బ్రదర్శించిరఁట. చిత్రవిచిత్ర రూపములును తేజోరేఖనములును జూపి యందఱ నాశ్చర్యమగ్నులఁ జేసిరఁట. పలురకముల చూర్ణముల సమ్మేళనమున స్వరములకు రూపవర్ణపటములఁగూడఁ గల్పించి మిగుల ఖ్యాతి వడసిరి. అట్లే గాత్ర, జంత్రజ మగు గానమునకు స్వరసమ్మేళనమున వివిధాకారములు గల్గునని మనపూర్వు లనాదిగ నిరూపించియేయున్నారు. మనము పాటించుటయే లేదు. హూణగ్రంథపఠ

నమె ముఖ్యాంశము. మన శాస్త్రములు గురుపరంపరాగతములు కనుకనే కొన్ని శ్రుతులుగను, కొన్ని స్మృతులుగను నిప్పటికిని వ్యవహరింపఁబడుచున్నవి. కాలానుగుణముగా తాళాదిపత్రలిఖితము లైనవి. అవియు నిపుడు శిథిలములు. తత్రాపి భాష సంస్కృతమౌటఁ మఱియు దురూహము లగుటచేఁ, జూచువారు పల్చనైనకతమున మూలఁ బడి రూపు మాసినవి; మాయుచున్నవి. దేశోద్ధారకుల సాయముచే నచ్చొత్తింపఁబడకున్న నింకను రూపు మాయఁగలవు.

"నాదాచ్ఛ శ్రుతయో జాతా స్తాభ్యః షడ్జాదయ స్స్వరాః । తేభ్యో రాగస్సముత్పన్నో గీతం త స్మాచ్చ జాయతే॥"

"అతో నాదాత్మకం గీతం వాద్యం గీతాను వర్తిచ ॥ (సంగీతరత్నాకరమ్.)

నాదమువలన శ్రుతులును శ్రుతులవలన షడ్జాదిస్వరములును, స్వరములవలన రాగములును, రాగమువలన, గీతమును నేర్పడుచున్నవి. కాన గీతము నాదస్వరూపము. వాద్యము గీతానుకరణము. కావునఁ దద్రూపమే యనఁజెల్లును.

"ఆత్మనా ప్రేరితం చిత్తం వహ్ని ర్దేహంతి దేహజం బ్రహ్మగ్రన్థి స్థితం ప్రాణం సంప్రేరయతి పావకః. (సంగీ దర్పణమ్.)

ఆత్మ బుద్ధిని ప్రేరేపించును. బుద్ధి శరీరస్థ మగు నగ్నిని లేపును. ఆయగ్ని వాయువు (ప్రాణము) నుద్బోధించును. కాన, నాత్మ మనస్సు అగ్ని వాయువు నీనాల్గును కారణములై నాదమును బుట్టించును.

" బ్రహ్మగ్రంథిస్థితో నాదః । క్రమాదూర్ధ్వపదే చరన్ నాభిహృత్కంఠమూర్ధాసు । ఆవిర్భవతి సధ్వనిః॥ (సంగీతదర్పణమ్)

బ్రహ్మగ్రంథిజ మగునీనాద మూర్ధ్వముగఁ జరించి క్రమముగ నాభి, హృదయ, కంఠ, మూర్ధముల నెడలినదై

"మంద్రోహృన్మధ్యమగ కంఠో శిరస్తారక సంజ్ఞకం"

హృదయమున-మంద్రమును (ఇడ) కంఠమున-మధ్యమమును (పింగళ) మూర్ధమున - తారకము (సుషుమ్న) సను పేరిట స్థాయికిస ప్తస్వరములఁచొప్పున త్రిస్థాయిల నమరును.

"స్వతో రఃజయతీతి స్వరం" స్వయముగ రంజింపఁజేయునది గాన స్వర మనంబడును. ఇవ్విధమున నాహతనాదము సప్తస్వరములై షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములని నిర్ణయింపఁబడినవి. వీనికి సంకేతాక్షరములే ప్రథమాక్షరములు స-రి-గ-మ-ప-ధ-ని యని పేర్కొనఁబడినవి.

" మయూరశ్చా తకశ్చాగః । క్రౌంచ కోకిల వాజినః । గజశ్చ సప్త షడ్జాదీన్ స్వరాం శ్చోచ్చారయం త్యమీ"॥ (సంగీతనారాయణమ్)

స-మయూరమువలెను, రి-ఎద్దువలెను, గ-మేకవలెను, మ-క్రౌంచపక్షివలెను, ప-కోకిలవలెను, ధ-అశ్వమువలెను, ని-ఏనుఁగువలెను, ధ్వనిఁ జేయుననియు—

శ్లో. పద్మాభః పింజరీ స్వర్ణో । వరకుంద ప్రభ స్సితః పీతః కర్బుర ఇత్యేతే । స్వరాణాం వర్ణనిర్ణయః (స్వరవేశకళానిధి)

స-ఎఱ్ఱదామర, రి-మయూరగ్రీవము, గ-స్వర్ణము, మ-మల్లిపుష్పము, ప-పంచవర్ణము, ధ-పసపు, ని-ధూసర, వర్ణములు గలిగి యుండు ననియుదాహరింపఁబడినది. దీనినిఁబట్టి స్వరసమ్మేళనము లగురాగములకు, రాగపూరితము లగు కీర్త

నాదిగాన మంతకును ప్రత్యేకముగా వర్ణ రూప నిర్ణయవిషయము మహావిపులము.

శ్లో. చూత ఖర్జూర కదళీ జంబీరా దాడిమీ తథా।
ద్రాక్షా పున్నాగ వృక్షాశ్చ షడ్జాదీనాం ప్రకీర్తితాః॥
(నారదీయము.)

స-మామిడి, రి-ఖర్జూర, గ-అరఁటి, మ-నేరేడు, ప-దానిమ్మ, ధ-ద్రాక్ష, ని-పొన్న, ఈ వృక్షములు సప్తస్వరములకు వాసములుగ నిరూపింపఁబడినవి. దీనినిఁబట్టి ఆయాస్వరములబలము నాయామూలికల ప్రయోగమునఁ గలుగు చికిత్సల కుపయోగింపనగు నని తేలుచున్నది. దీనికి నిదర్శనముగ నిటీవలనే నాదమునకు విద్యుచ్ఛక్తిసాహాయ్యమున బలమును బ్రదర్శింపవచ్చు ననియు, దేహమేయేపదార్థలోపముచే వ్యాధిగ్రస్త మగుచున్నదో దానిని గనుఁగొని దాని కనుగుణమును స్వరపూర్ణము నగు సంగీతశ్రవణమాత్రముననే యారోగ్యమును గల్గింపవచ్చు ననియును, పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులు నుడివియున్నారు. ప్రస్తుత పాశ్చాత్యచికిత్సావిధానమును బరికించినను మూత్రాదులఁ బరీక్షించి, యేపదార్థనష్ట మనారోగ్యకారణమో గమనించి తత్పూర్తికై యౌషధ ప్రయోగమును జేయుచున్నారు. దీనికిఁ బ్రత్యామ్నాయముగ నీశబ్దతరంగచికిత్సయుఁ గ్రొత్తగఁ బాశ్చాత్యులచేఁ గనుపెట్టఁబడిన దని వినుట ఆశ్చర్య సంతోషజనకముగ నున్నది.

ఇదివఱలో జర్మనీ మొదలగుదేశములలోఁ జికిత్సాలయములయందు సంగీత మత్యంతావశ్యకమనియు, నొకమాసమునఁ గుదురు వ్యాధిని పదిరోజులకే సంగీతమును రోగికి వినిపించుచుంటచే, గుదుర్ప వీలగుననియు మాత్రము దెలియును. ఏలయన, రోగికి వ్యాధియం దుండు ధ్యాస కొంతవఱకు మాఱి, దినమునఁ గొంతభాగ మైనను సంగీతశ్రవణకాలక్షేపమున నాతని యాతన కొంచెము శమించుటయే కాక తదనంతరము గూడ నాశ్రవణసుఖము వాని నోలలాడించుచుండును.

శ్లో. నాదాబ్ధేస్తు పరం పారం నజానాతి సరస్వతీ,
అద్యాపి మజ్జనభయా త్తుంబం వహతి వక్షసి.
(ఆంజనేయమ్)

సదాసంగీతశ్రవణాభిలాషచే గాననిపుణు లగు వాసుక్యాదిమహానాగముల నీశ్వరుఁడు కుండలాది భూషణములుగ ధరించె ననియు, విష్ణుమూర్తి యాదిశేషునేశయ్యగాఁగొని క్షీరా(ఆనంద)బ్ధితరంగడోలికలనూఁగుచున్నాఁ డనియుఁ గలదు. కావున గానశ్రవణసుఖము ప్రాపంచికము లగు నాధివ్యాధిబాధల మఱపించి శీఘ్రనివృత్తికై సాయపడును. ఇది సామాన్యాభిప్రాయము. కాని గానశ్రవణమున నాదతరంగములు, శ్రోతలశ్రవణపుటములఁ జొచ్చి శరీరమందలి నరములకు మూలస్థాన మగు మెదడునకుఁ జేరి, తద్ద్వారా శరీరమున నుండు నన్నినరములను జలింపఁ జేసి విద్యుచ్ఛక్తివలెను, తంత్రీవార్తాహరణమువలెను, వ్యాపించుటచేఁ జెడిన నరముల సరిచేయునేమో యెవరికిఁ దెలియును? ఇపుడు తేలుచున్నది. దీనినిబట్టి యాలోచించిన నొక్కొక స్వరమున కొక్కొకవర్ణము (రంగు)రూపము మాత్రమే కాక ఓషధులగుణములుఁగూడఁ గల వని నవీన ప్రకృతిశాస్త్రజ్ఞు లిపుడు దెల్పుచున్నటుల మనపూర్వులిదివఱకే నిరూపించియుండుటఁ గనుచున్నాము.

ఇదిగాక యన్నివ్యాధులకును నాదతరంగముల వలెనే సూర్యకిరణములచేఁ జికిత్స నిరూపింపఁబడినది. ఉష్ణోపశాంతికై నీలపురంగును, వాతరోగములకు నారింజపండురంగును, మొదలగునాయావ్యాధుల కేర్పఱుపఁబడిన యాయారంగులసీసాలలోఁ

బరిశుభ్ర మగు నీరు నించి, అరుణోదయము మొదలు, సూర్యరశ్మి సాయంకాలముపర్యంతము దగులునటులునిచి సేవించిన వ్యాధినివారణ మగుట కని విని యున్నాము. అనఁగ, నొక్కొకజాడ్యమునకు నాయావర్ణసంపర్కమున నీటియందు తల్లక్షణ మేర్పడి ఆరోగ్యమును గలుగఁజేయు ననఁగ తద్వర్ణగుణకము లగు నాయాస్వరము లేల పనిఁ జేయకుండును? వాని ప్రయోగములు మనకు దురూహ్యములు. "ఓమి త్యేకాక్షరం బ్రహ్మ" "తత్ సవితు ర్బృహాత్మనే" "అసావాదిత్యో బ్రహ్మ" ఇత్యాదిసంబంధములచే నాదబ్రహ్మాత్మకమే సూర్యుఁ డనఁదగును.

పాశ్చాత్యప్రకృతితత్త్వవేత్త లగునొక రిటీవల నాదతరంగబలమును బ్రత్యక్షముగఁ బ్రదర్శించిరి. వారు పేర్కొనినవిధమున నొకగ్లాసును బల్ల మీఁద నుంచి దానికి సమీపమున గానముఁ జేయఁగా నది తుత్తునియ లై చూచువారి నాశ్చర్య సాగరమున ముంచివైచెనఁట.

అమెరికావాస్తవ్య లగునొకరు సికారు నెడలి యొకవంతెనపైఁ గూర్చుండి గానము నారంభింప, నది కంపింపఁ దొడఁగెనఁట. దాని కాతఁ డాశ్చర్య మంది గానము విరమింపఁ, గంపించు టణఁగెనఁట. గానము, పునఃప్రారంభముఁ జేయ మరల కంపము మొదలిడెనఁట. ఈ చిత్రము నాసాయంసమయముననే పెక్కుమంది కా గానము మూలముననే వంతెన కంపించుటఁ జూచెనఁట. మఱియొక తీరునఁ బాడినఁ గంపము లేదఁట. దీనిని మనపూర్వు లగు గోపాలనాయకు లనువారు-తాళార్ణవ, రాగకదంబ గ్రంథకర్తలు-ఉత్తరదేశమున నొకరాజసభ యందు దీపకరాగమును బాడి దీపములఁ బ్రజ్వలింపఁ జేసినట్లును, తంజావూరి మహారాష్ట్రసభయందు వీరరాఘవయ్యగారు గ్రీష్మకాలమున వసంతరాగముఁ బాడి చల్లనిగాలిని వెప్పించినట్లును అందుచేత నాయనకు చల్లగాలి వీరరాఘవయ్యగారను పేరు వచ్చినట్లును, దీక్షితులుగారు అమృతవర్షిణి యనురాగముఁ బాడి వర్షము గురిపించినట్లును సంకేతసంప్రదాయప్రదర్శినియందుఁగలదు.

ఇది యంతయు నాదతరంగబలమే గదా! కాని వర్ణాత్మక నాదజములగు పాశుపతాఽఘోర, బ్రహ్మ, నారాయణాది మహాస్త్రములవలెనే, ధ్వన్యాత్మకాహతనాదస్వరూపము లగు నీ నాదతరంగబలమును మనకగోచరముగ నేర్పడుట మిక్కిలి శోచనీయము. దురూహ్యములే గాక పాశ్చాత్యులు బహిరంగపఱచునంతదనుక పరిహాసాస్పదములుగూడ నగుచున్నవి. ఏలయనఁ బురాణాదికముల వర్ణించిన వైమానికాదుల మనకుఁ బ్రత్యక్షప్రమాణములుగ పాశ్చాత్యప్రకృతిశాస్త్రవేత్తలు చూపిన నిపుడు విశ్వసించుచున్నాముగద!

మఱియు నీ సప్తస్వరములకు వంశములు, జాతులు, జన్మస్థానములు, జన్మమును దర్శించిన ఋషీశ్వరులు, అధిదేవతలు, ఛందస్సులు, జన్మతారలు, స్థూలాదిశరీరములు, వయస్సు, భోజనములు వస్త్రములు, లేపనములు, పుష్పాద్యలంకారములు, రత్నభూషణములు, ఆయుధములు, వాహనములు, భార్యలు, వీనినన్నిటి వేర్వేఱ నేర్పఱచి యున్నారు. (రాగసాగరము). ఇవన్నియు సమన్వయము గావలసియున్నవి. క్రమముగఁ బాశ్చాత్యబహిర్గమితవిద్యుచ్ఛక్తిసహాయమునఁ దేలఁగలవు. మన శాస్త్రసుగూఢోక్తుల యాథార్థ్యముల నుద్బోధింపఁగలవు. పరమేశ్వరునియందుఁ ఇచ్ఛాశక్తి యను యుండునని చెప్పియుంటిమిగద. ఏతచ్చిచ్ఛక్త్యవచ్ఛిన్నుఁ డగు పరమశివునివలన స్వస్వరూప మగునా

మును తద్గుణక మగునాకాశమును సృజింపఁబడెను. ఆకాశావచ్ఛిన్నుం డగునీశానునివలనను తచ్ఛక్తి యగు పరాశక్తివలనను శబ్దస్పర్శాత్మక మగువాయు వుద్భవిల్లెను. తద్వాయుతత్త్వావచ్ఛిన్నతత్పురుషుని వలనను తచ్ఛక్తియగు నాదశక్తివలనను, శబ్దస్పర్శ రూపాత్మక మగు వహ్ని జనియించెను. తద్వహ్న్య వచ్ఛిన్నాఘోరునివలనను తచ్ఛక్తి యగునిచ్ఛా శక్తివలనను, శబ్ద, స్పర్శ, రూప, రసాత్మక మగు జల ముదయించెను. తజ్జలావచ్ఛిన్నుఁడగు వామ దేవునివలనను తచ్ఛక్తియగు జ్ఞానశక్తివలనను శబ్ద స్పర్శ రూప రస గంధాత్మక మగు పృథివి యావి ర్భూత మయ్యెను. ఏతత్పృథివ్యవచ్ఛిన్నసద్యోజా తునివలనను తచ్ఛక్తియగు క్రియాశక్తికారణ ముగ సచరాచరాత్మక మగు ప్రపంచ ముదయించెను. శబ్దస్పర్శరూపరసగంధగుణకము లగు పంచ భూతము లగు పృథివ్యాపస్తేజోవాయురాకాశవికా రములగు సర్వచరాచరాత్మకములలో మానవశరీర మొకటి.

"గుణశబ్దాదికం పంచ పంచకర్మేంద్రియాణి చ
జ్ఞానేంద్రియాణి పంచైతే ప్రాణాదిదశవాయవః
మనో బుద్ధి రహంకార శ్చిత్తం చేతి చతుష్టయం
ప్రాణాదిపంచకం చైవ తద్వద్వ్యోమాదిపంచకం
శ్రోత్రాదిపంచకం చైవ తథా వాగాదిపంచకం
భూతాదిపంచకం చైవ తథేశానాదిపంచకం
......................తథాశక్త్యాదిపంచకం
కర్మేంద్రియాణిపంచైవ పంచజ్ఞానేంద్రియాణి చ.

(మహాదేవవచనము)

వీని కన్నిటికిని శరీరమునకును నాదమునకును సమన్వయము వేదాంతమునందు మహావిపులము. కాన గ్రంథవిస్తరభీతి నిటఁ బ్రస్తుతము విరమితము.

పాంచభౌతికమగు నీశరీరాంతమును పరికించి నను ఆకాశగుణకమగు శబ్దము ప్రథమమునను, పిమ్మట వాయురూపమగు ప్రాణము, తరువాత నగ్నిరూపమగు నుష్ణమును తేజమును, అనంతరము జలరూపమగు ద్రవమును, కడపటను పృథ్వీస్వరూప మగు నస్థిపంజరమును, క్రమముగ నాయాభూ తములం జేరుట గమనింపఁదగును. దీనినిబట్టియుఁ బంచభూతములకును బ్రథమ మాకాశమే. కాన గగనగుణకములగు తత్త్వాదులు తదితరతత్త్వముల కతీతము లనునది నిర్వివాదాంశము. సకలతత్త్వవేత్త లగుమనపూర్వు లన్నిటిని క్రోడీకరించియే యున్నారు.

మఱియు నాధునికవైద్యవిధానము గమనించినఁ బ్రథమమునఁ బృథివీతత్త్వజములగు నోషధులును, పిమ్మట నంతకన్న మిన్నయను ద్రవరూపములు నగు కషాయాదులు, దానికన్నను ప్రశస్తమగు కూనీగారి "ఆవిరి" వాయ్వగ్నిరూపమును, అనంత రము సూర్యకిరణములచేఁ జికిత్స, విద్యుచ్ఛక్తిరూ పక మగు"ఎక్స్ రేస్" చికిత్స,వీనికన్నిటికి నతీత మగు "రేడియం" చికిత్సయును గ్రమముగ బహిర్గత మయి నవి. పంచభూతాత్మకములగు నీచికిత్స లన్నిటికిని మూలమగు నాదతరంగచికిత్స యనఁగ శబ్దబ్రహ్మ సేవనము పరమపావనము, నైహికాముష్మికసాధన ము నను విషయ మిపుడు పాశ్చాత్యులవలన మరల బహిర్గత మగుచున్నది.

దీనికిఁ దార్కాణముగ "యా కుందేందు తుషార...సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా"అని మామూలుగ నిప్పటికిని కావ్యాద్యధ్యయనాదులందుఁ బఠించు ధ్యానశ్లోకమును గమనించినను సాక్షాత్పర బ్రహ్మకు నానందదాయినియగు సరస్వతీదేవి వీణా పుస్తకధారిణి యౌటం జేసి ధ్వన్యాత్మక, వర్ణాత్మక,

నాదస్వరూపిణి యనియును ఆనాదసేవనమే నిశ్శేష జాడ్యాపహ మనియును దెలుచున్నది.

సూర్యరశ్మియందు సప్తవర్ణములు గల వని యంద ఱెఱింగినవిషయమే. వర్షకాలమున నింద్ర ధనుస్సునందు, మనము గనుఁగొననగును. పలకలు గల్గినయద్దముగుండ మనము చూచినను స్పష్టముగ నీరంగులే కననగును. ఈ సప్తవర్ణము లెట్లో కలసి పోయి దేదీప్య మగు తెల్లనిసూర్యకాంతి యగు టనిన నీశ్వరసృష్టివైచిత్ర్యము. సూర్యునకు "రథస్యైకం చక్రం." అయినను రథాశ్వములు ఏడు. అశ్వ మనునది అశ్వబోధివృక్షము అశ్వత్థ మనియు సమన్వయించి, తజ్జనితమగు సోడియమ్మను లోహ సంబంధములగు నేడులవణము లనియుఁ బెద్దలు నిరూపించియున్నారు. వీని నౌషధాదుల నుపయోగించుచున్నారు. విషయము విపులము. ఇట్లే వర్ణాత్మకమును, ధ్వన్యాత్మకము నగునాదమున నేర్పడిన స్వరములకును రాగములకును, నక్షరములకును, మంత్రములకును ఆధ్యాత్మిక శారీరకాంతరార్థము లనే గాక పదార్థనిరూపణవిషయమునఁ గూడ సమన్వయించి యున్నారు. కావున సూర్యునిస్వచ్ఛవర్ణమునుండి సప్తవర్ణము లేతీరున నేర్పడెనో అట్లే యీ యాహతనాదమునుండి సప్తస్వరములు జనితములైనవి. రెండును సమస్వాభావికములే. ఆధివ్యాధినివారణసాధనములే. వైదికస్మార్తశ్రౌతాది సకలమంత్రములును ఉదాత్తానుదాత్తాదిస్వరయుక్తములు కానిచే ఫలదములు కావని యెల్లరకుం దెల్లమే. సామవేదస్థ మగు నీ సప్తస్వరములును దత్సాంకేతికములును గూడ ననాదిసిద్ధములే. ఛందస్సునందును శిక్షయందును వేదాంగములందును అథర్వణవేదమునఁ జేరిన గర్భోపనిషత్తునందును గాననగును.

స్వరము లనఁగ నుచ్ఛ్వాసనిశ్వాసములకును సమన్వయము గలదు. స్వరశాస్త్రమున నిడ పింగళ లనెడుసూర్యచంద్రనాడుల ననుసరించి యుండును. సౌరము పగలు ఇడ, చాంద్రము రాత్రి పింగళ, వీనికి నడుమను సుషుమ్న సంధ్య దీన నీశ్వరారాధనము విధి యనియును తద్వారా నాదబిందు కళాతీత మగునట్టియుఁ బరబ్రహ్మస్వరూప మగునట్టియుఁ బరమనిరతిశయానందస్థానమున తారస్థాయిని గుర్తెఱింగి "అమృత ఇహాభవతి" అనువాక్యమును సార్థకము గావింపఁగల్గు ననియుఁ గలదు. ఇదియే సచ్చిదానందనాదము. దీని కనుగుణముగ మహావిద్వాంసులును వాగ్గేయకారకులును "గురుగుహ" ముద్ర గలిగియుండు కీర్తనాదుల మిగుల రక్తిగ గీర్వాణభాషయందు రచించి కీర్తిగాంచిన ముద్దుస్వామి దీక్షితులుగా రిట్లు నుడివిరి.

కేదార - రూపకం.

పల్లవి.

ఆనందనటనప్రకాశం - చిత్సభేశం
ఆశ్రయామి శివకామవల్లీశం.

అనుపల్లవి.

భానుకోటి కోటి సంకాశం - భక్తిముక్తిప్రద
దహరాకాశం దీనజనసంరక్షణచణం - దివ్యపతం
జలి వ్యాఘ్రపాదదర్శిత కుంచితాబ్జచరణం॥

చరణం.

శీతాంశుగంగాధరం - నీలకంధరం - శ్రీ కేదా
రాదిక్షేత్రాధారం, భూతేశం - శార్దూలచర్మాం
బరం-చిదంబరం-భూసురత్రిసహస్ర మునీశ్వరం
విశ్వేశ్వరం, నవనీతహృదయం - సదయహృద
యగురుగుహతాతం - ఆద్యం - వేదవేద్యం-వీత
రాగిణ మప్రమేయాద్వైతప్రతిపాద్యం- సంగీత
వాద్యవినోదతాండవజాతబహుతరభేదచోద్యం

ఇడ, పింగళ, లను దివారాత్రములకు మధ్యను సుషుమ్న యను సంధ్య యం దీశ్వరతాండవము, సచ్చిదానందరూప మని గ్రాహ్యము.

ఈ సప్తస్వరములును గొండలిమతమున నిరువదిరెం డనియు, మఱికొండలిమతమున నిరువదినాల్గనియు, సోమనాథమతమున నీ శుద్ధస్వరములు ఏడును వికృతస్వరములు ఏడును మొత్తము=14-అనియు నంతర్భాగముల నేర్పఱచి యున్నారు. దీని వివరము రాఁబోవు సంచికయందు విపులముగ వ్రాయఁబడును. ఈ ద్వావింశచ్ఛ్రుతులలో

"తత్ర తుర్యశ్రుతౌ షడ్జ స్సప్తమ్యాం ఋషభో మతః। తతో నవమ్యాం గాంధార స్త్రయోదశ్యాం తు మధ్యమః॥ పంచమ స్సప్తదశ్యాం తు, ధైవతో వింశతి శ్రుతే। ద్వావింశే తు నిషాదస్స్యాత్, శ్రుతిష్విద్ధం స్వరోద్భవః ॥ ఏతే షడ్జాదయః సప్త స్వరాః శుద్ధాః ప్రకీర్తితాః.

—స్వరమేళకళానిధి.

వీనిలో షడ్జ పంచమములు మాత్రము శుద్ధములు. అనఁగ నొక నాదమునే యిచ్చునవి. ప్రభేదము లిందు లేవు. మిగిలిన ఋషభ, గాంధార, మధ్యమ, ధైవత, నిషాదములందు ప్రభేదములు గల వగుటచే వికృతు లని చెప్పఁబడును. వీనికి క్రమముగ, తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతి, దయావతి, రంజని, రతిక, రౌద్రి, క్రోధ, వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని, క్షితి, రక్త, సందీపిని, ఆలాపిని, మదవతి, రోహిణి, రమ్య, ఉగ్ర, క్షోభిణి- యనునామములఁ వేర్వేఱ నిరూపించియున్నారు. కాని ప్రకృతమందు వాడుకయం దున్నవి షోడశస్వరములే. ఇందున నేడు శుద్ధములు, తొమ్మిది వికృతములు. వీనిలో నాల్గుస్వరములు మఱినాల్గింటితో నేకీభవించుటచే మొత్తము మీఁద శుద్ధవికృతస్వరములుచేరి ద్వాదశమయ్యెను. దాని వివరము:—

| | |
|---|---|
| ప్రథమము—షడ్జమము.<br>ద్వితీయము—శుద్ధఋషభము | శుద్ధములు. |
| తృతీయము-చతుశ్శ్రుతి ఋషభం, దీనినే శుద్ధగాంధార మందురు.<br>చతుర్థము—షట్శ్రుతిఋషభము, దీనినే సాధారణగాంధార మందురు. | వికృతములు |
| పంచమము—అంతర్గాంధారము, శుద్ధము. | |
| షష్ఠము—శుద్ధమధ్యమము.<br>సప్తమము—ప్రతిమధ్యమము | వికృతములు |
| అష్టమము—పంచమము.<br>నవమము—శుద్ధధైవతము. | శుద్ధములు. |
| దశమము— చతుశ్శ్రుతిధైవతము, దీనినే శుద్ధనిషాద మందురు.<br>ఏకాదశము — షట్శ్రుతిధైవతము,దీనినే కైశికీనిషాద మందురు. | వికృతములు |
| ద్వాదశము—కాకలీనిషాదము, శుద్ధము. | |

ఈ పండ్రెండు స్వరములు మాత్రమే ప్రస్తుత ప్రపంచమున వాడుకలోనున్న గానమున నుపయోగింపఁబడుచున్నవి. కాని, కొండలిమతమున శంకరాభరణరాగములోని కాకలీనిషాదము కళ్యాణిరాగమందున్న కాకలీనిషాదమునకన్న, షడ్జమమునకు సమీపముననుండునని యందురు. కాని గమనించువారరుదు. ఇట్లే వరాళీమధ్యమ మనియు, సావేరిగాంధార మనియు ద్వావింశచ్ఛ్రుతులలోని శేషములు హంపీవిరూపాక్షమందలి పూర్వపు శిథిలనిర్మాణములవలెఁ గాన్పించుచున్నవి. కాని ద్వావింశచ్ఛ్రుతులుండినప్పటికన్న పండ్రెండుశ్రుతులు గల్గినఁ బ్రస్తుతమందే వేంకటమఖి యను తెనుఁగు బ్రాహ్మణులు 72 మేళముల నేర్పఱచి యొక్కొక మేళమున 484 జన్యములు గల్పించి, వక్రములు గాకనే 34848

ఔఢవ, షాడవసంపూర్ణములు గల్పించియున్నారు. ఇవన్నియు శుద్ధరాగములే. వీనిలోఁ గొన్ని లెక్కకు మాత్రమే గాని సరిగపదసా- సదపగరిసా, అను మోహనరాగము, హరికాంభోజి, ధీరశంకరాభరణము, వాచస్పతి, మేచకళ్యాణిమేళముల సమములే. అట్లే అనేకరాగములు ఏకీభవించుచున్నవి. ఈవిషయము ముందు విపులముగ వ్రాయఁబడును.

ఈ గానము వైదిక (సామవేదగానము)
వ్యాఖ్య (రామాయణాదిపారాయణము)
లౌకిక (గీర్వాణాదిభాషయందలిస్తోత్రగానము)


భైరవిరాగిణులు.

దేవతాస్తుతి లేకయూరకచేయు గానము కేవల లౌకికము అనియు సూతసంహితయందుదాహరింపఁబడినది. ఇందు చతుర్థమే విశేషముగ నాధునికగానముగఁ బరిణామ మందినది.

సంగీతమన శ్రోతల కింపుజనింపఁజేయునదిగదా! పాశ్చాత్యభాషలలో నిటలీవారిభాష మిక్కిలి శ్రావ్యమని చెప్పుట సుప్రసిద్ధము. అట్లే పూర్వభాషలలో నెల్ల 'పూర్వపుటిటాలియన్' అని పేర్కొన్నయాంధ్రభాష సంగీతమునకు మిగుల ననుకూలమైన దనిన ప్రతిష్ఠను బడసినది.

ఇది గాక యొకకవీశ్వరుఁడు గానము నొకస్త్రీకిఁ బోల్చి హిందుస్థానీగానము పసిబిడ్డ యగుటచే నందఱకును ముద్దులు మూటగట్టు ననియు, దాక్షిణాత్యగానముఁ యౌవనస్త్రీకిఁ బోల్చుటచేఁ దద్రసజ్ఞులకు మాత్రము అనుభవసాధ్య మనియు, విజయనగరప్రాంతగానము వృద్ధదశకు బోల్చుటచేతను, అనుభవము లన్నియున్నను ఏరికి నింపు జనింప నవకాశ మొసఁగ దనియును, తుదకు మార్వాడీ దేశమునకు వచ్చి చచ్చినదనియును, మార్వాడీ పండితు లొకరు సెల విచ్చియున్నారు. ఇట్టి ఖ్యాతిగాంచిన దాక్షిణాత్యగానమునందును త్యాగరాజస్వామి రచియించిన తెనుఁగు కీర్తనములను, క్షేత్రజ్ఞులవారి శృంగారభక్తిరసభూయిష్ఠము లగు పదములను విశేషముగ వాడుటయు మెప్పొందుటయుఁ గనుచున్నాము. ఇప్పటికిని దాక్షిణాత్యులు వారి భాషగాకపోయినను ఇంటింటను రామాయణాది మహాపారాయణగ్రంథపఠనమువలె త్యాగరాజస్వామికృతాంధ్రకీర్తనల నఱవమునఁదర్జుమాచేయించి యర్థముగ్రహించి గానము సేయుచున్నారు. ఆంధ్రులమైన మనమో తద్వ్యతిరిక్తముగ సంగీతమును దానిసభ్యసించినవారినిగూడ నాదరించుట లేదు సరిగదా నిరసించుచున్నాము. ఇది కడుంగడు శోచనీయము. ప్రోత్సాహముండినఁగదా విద్యలు పైకివచ్చుట! లేనిచో క్రమముగ నశించిపోవుట నిశ్చయము. ఇట్టిదురవస్థ యొకమనయాంధ్రదేశమునకే కల్గుట మిగుల విచారకరము. దేశోద్ధారకులును మహారాజులును దగినప్రోత్సాహ మిడిన విద్యలలో నాదవిద్య యనందగు నీనాదవిద్య నుద్ధరించినవా రగుదురు. లేనిచో సాక్షాద్భగవదంశమగు గానము నాదరింపమి సచ్చిదానందసులభైకసాధనమును గోల్పోవు టగును.

మన హైందవులలోనే గాక క్రైస్తవులలోను మఱియుఁ బ్రపంచమం దంతటను దైవారాధనయందుఁ గూడ గానము నుపాసించుచున్నారు.

ఈ స్వరములందు వాది సంవాది వివాది అనువాది అని నాల్గుభేదములు. అందు వాది జీవ న్యాసస్వరము.

"సమౌ, సపౌ, రిధౌ చైవ నిగౌ సంవాదినౌ మిథః। ఏవం శుద్ధస్వరేషూక్త స్సంవాది స్స్వర నిర్ణయః॥ (చతుర్దండి ప్రకాశిక)

"రిగౌ ధనీ చ శుద్ధేషు స్వరౌస్యాతాం వివాదినౌ। సాధారణాంతరౌ చైవ, కైశికీ కాకలీ స్వరౌ। మధౌ వివాదినౌ జ్ఞేయౌ వికృతేషు స్వరేష్వపి।

పై నుదాహరింపఁబడిన మూఁడును గానిది అనువాది. సేవకునిరీతి ననుకరించునది. వివాదిస్వర ములగు స్వరములు రాకయుండునట్లు గానముచేయ నగును. అట్టివి సంభవించినను గమకాదులచే శ్రుతి కటువు గాకయుండునటులు గానము చేయనగు నని పెద్దలు వక్కాణించియున్నారు. ఇట్టి సమ్మేళనము రాగము. ఇందు రక్తి రాగములు, ఘనరాగములు, నయరాగములు. సంకీర్ణములు పలురాగజాతులు గలిసి రంజనము గలిగించునవి. ఇత్యాదిప్రభేదము లనేకములు గలిగియున్నవి. పూర్వమున సంపూర్ణ ము, షాడవము, ఔఢవము, స్వరాంతము, సామి కము, గాథకము, ఆర్చికము అని రాగభేదములు గాని ప్రస్తుతము మొదటిమూఁడుమాత్రమే వాడు కలో నున్నవి. ఇటీవలఁ గొన్నిగ్రంథములందు నాల్గు స్వరముల రాగములును ప్రచారములం దున్నట్లు వ్రాసియున్నారు.

స్కాందపురాణమునందు "శ్రీరాగప్రముఖారా గాఃతస్యపుత్త్రాః మహౌజసః,అమూర్తాశ్చైవ తేపుత్త్రాః హరదేవసముద్భవాః। ఏకైక స్యచ షడ్భార్యాః సర్వాసాంచ పితామహః। తాభిస్స హైవతే రాగాః లీలావపుర్ధరా...... మహా ఘనః... శ్రీరాగః ప్రథమః పుత్త్రః ఈశ్వరస్య విమోహనః। ఆసాంచ క్రే భృవోర్మధ్యే పరబ్ర హ్మప్రదాయకః। ద్వితీయోద్ధి వసంతో భూత్క టిదేశా న్మహాయశాః... పంచమస్తు తృతీయో భూత్ ... నాసాదేశాత్సముద్భూతో భైరవో భైరవ స్స్వయం। పంచాశచ్చ తదావర్ణాః। అం కానామమహేశ్వరాత్ ...ఆధారాచ్చమహా షష్ఠో నటో నారాయణోఽభవత్।......భార్యా స్తేషాం సముద్భూతాః శిరోభాగాత్పినాకినః"

"గౌరీ కోలాహలీ ధీరా ద్రావిడీ మాలకౌశికీ, షష్ఠీస్యా ద్దేవగాంధారీ శ్రీరాగస్యప్రియాఇమే" ఆంధోళీ కౌశికీ చైవ తథాచరమ మంజరీ, గండగిరీ దేవశాఖారామగిరీ వసంతగాః త్రిగు ణా స్తంభతీర్థాచ ఆహిరీ,కుంకుమాతథా। వైరాటీ సామవేరీచ షడ్భార్యాః పంచ మేమతాః॥

"భైరవీ గుర్జరీ చైవ భాషావేళాగుళీ తథా కర్ణాటకీర క్తహంసా షడ్భార్యా భైరవానుగాః॥

"బంగాలీ మధురాచైవ కామోదాచాభినారికా దేవగిరీచ దేవాలీ మేఘరాగానుగాః ఇమాః-

"త్రోటకీ మోదకీ చైవ నభాదుంబీ తథైవచ మల్హారీ సింధుమల్హారీ నటనారాయణానుగాః

"ప్రతాపి గిరిశం నత్వా మహేశంచ మహేశ్వరం స్వమూర్తినాహనోపేతాః స్వభర్తాసహితా స్థితాః. సంగీతదర్పణమందు.

"సద్యో జాతాత్ శ్రీరాగః, వామదేవా ద్వ సంతః అఘోరా ద్భైరవో జాతః, తత్పురుషా త్పంచమోఽభవత్, ఈశానాన్మేఘరాగస్యాత్ .. గిరిజాబ్జముఖాజ్జాతో నటనారాయణ స్తథా" అనియు,

"భోద త్తిలమహారాగ భేదాన్ వక్ష్యామి త చ్ఛృణు, భైరవ శ్చాపి భూపాలః శ్రీరాగ

ఫలమంజరీ, వసంతో మాళవ శ్చాపి బంగాళో నాటక స్తథా, ఏతేష్టరాగా స్సర్వత్ర పుంరాగా ఇతికీర్తితాః."—స్వరమేళకళానిధి. నారదీయము.

వీనియందు జాతిభేదములు. భైరవభూపాలములు విప్రులు సామవేదినులుగను, శ్రీరాగమంజరులు యజుర్వేదక్షత్రియు లనియు, వసంతమాళవరాగములు ఋగ్వేదవైశ్యులనియు, బంగాళనాటకములు అథర్వణశూద్రజాతు లనియుఁ జెప్పియున్నారు.



భైరవిరాగిణులు.

మఱియు నొక్కొక పుంరాగమునకు మూఁడు భార్యలచొప్పున స్త్రీరాగములు 24+8 పురుషరాగములు మొత్తము 32 అనియు, రాగనిర్ణీత శృంగారాది రసమును, రాగ గాన కాల నిర్ణయమును నిరూపిములు.

రాగాః షడేవతు ప్రోక్తాఃరాగిణ్యాః త్రింశదేవహి.

—సంగీతనారాయణం.

"శ్రీరాగోధ వసంతశ్చ భైరవః పంచమ స్తథా మేఘనాదో బృహన్నాట షడేతే పురుషాహ్వాయాః"

—సోమేశ్వరమతం.

"భైరవః కౌశిక శ్చైవ,ఆందోళో (హిందోళ) దీపక స్తథా, శ్రీరాగో మేఘరాగశ్చ, షడేతే పురుషాహ్వయాః"

(హనూమంతమతం.)

"భైరవః పంచమోనాట, మల్హారీ గౌడమాళవః, దేశాఖ్యశ్చేతి షడ్రాగాః, ప్రోచ్యన్తే లోకవిశ్రుతాః"

(రాగార్ణవమతం.)

"ప్రధానరాగాః,ద్వాత్రింశత్, తేష్వష్టౌ పురుషాస్మృతాః

"తేషాం యోషా ఇతి జ్ఞేయా చతురుత్తరవింశతిః.

(శివతత్త్వరత్నాకరము)

"ప్రాయో బంగాళభూపాలౌ భైరవో మాళవ స్తథా

"శ్రీరాగోథవసన్తశ్చ సాళఙ్గ ఫలమంజరీ;

"పురుషాహ్వయరాగాణాం ఏకైకస్య మనీషిభిః;

"స్త్రీరాగాః ప్రవిభజ్యన్తే త్రిస్త్రిస్త్రోఙ్గనా ఇతి"

"భైరవః కౌశిక శ్చైవ హిందోళో దీపక స్తథా శ్రీరాగో మేఘ రాగశ్చ షడేతే పురుషాహ్వయాః.

ఈమతభేదములందు నిరూపించినపురుష రాగములకు, స్త్రీరాగవిషయమునఁగూడ మతవిభేదము గలదు. ఇవి యెట్లున్నను స్త్రీరాగవిషయమున శుద్ధరాగములు స్వీయము లనియు, సాళవయనఁగా ఛాయాలగములగు రాగములు పరకామినులనియు, సామాన్యములను సంకరము లనియు త్రివిధంబులు. వీనికి పుత్రపుత్రికా దూతికా రాగ మిశ్రరాగ నిరూపణముఁ జేయబడి కుటుంబములుగ నేర్పడి మిత్రత్వశత్రుత్వములచే నొప్పి విలసిల్లినటులు చెప్పియున్నారు. ఇందు ముఖ్య మగు విప్రపుంరాగములందుఁ బ్రథమము భైరవరాగము దీనివిషయమున దేవక్రియా, మేఘరంజి, కురంజి అని మూఁడే భార్య లని, నారదీయమున మతభేదము గలదు.

"త్రివిధా భైరవః ప్రోక్తః భైరవానందభైరవౌ వసంతభైరవ శ్చేతి మునిభి స్సర్వదా పురా॥

(రాగసాగరం)

"నిత్యం కర్ణాటికాచైవ భైర వస్య చ దూతికాః"

అనియు, రాగరూపనిర్ణయమున ధ్యానశ్లోకము లి ట్లుదాహరించియున్నారు.

భైరావి రాగిని



"వినోదయన్తీ దయితం సుకేశీ సుకంకణాచామరచాలనేన
కర్ణే దధానా సురవృక్షపుష్పం వరాంగనేయం కథితా వరాటీ"

భైరవ రాగము



" శ్రుతిస్వరమహోదధి సకలతాళమానామృతం
శివార్చనమనోరథం భసితలేపితాఙ్గం సదా
జటామకుటభాసురం శిశుశశిప్రభామాలినం
కపాలభరణం భజే నటనకౌశలం భైరవమ్"

సైంధవి రాగిని



"త్రిశూలపాణి శ్శివభక్తియుక్తా రక్తాంబరా ధారితబంధుజీవా
ప్రచణ్డకోపా రసవారియుక్తా సా సైంధవీ భైరవరాగినీయమ్"

మధు - మాధవి రాగిని



"పశ్యసహాసం ప:రభ్యకామం సుచుంబితాస్యా కమలాయతాక్షీ
స్వర్ణచ్ఛవిః కుంకుమలిప్తదేహా సా మధ్యమాదిః కథితామునీంద్రైః"

## బంగాళీ రాగిని



"కక్షానివేశిత కరణ్డధరాయతాక్షీ
భాస్వత్ త్రిశూలపరిమణ్డితవామహస్తా
భస్మోజ్జ్వలా నిబిడబద్ధజటాకలాపా
బంగాళికేత్యభిహితా తరుణార్కవర్ణా"

## భైరవి రాగిని



"స్ఫటికరచితపీఠే రమ్యకైలాసశృంగే
వికచకమలపత్రై రర్చయన్తీ మహేశం
కరధృతఘనవాద్యా పీతవర్ణాయతాక్షీ
సుకవిభిరిహముక్తా భైరవీ భైరవస్త్రీ"

"స్రుతిస్వరమహోదధిం సకలతాళమానామృతం
శివార్చనమనోరథం భసితలేపితాంగం సదా
జటామకుటభాసురం శిశుశశిప్రభామాలినం
కపాలభరణం భజే నటనకౌశలం భైరవమ్.
(స్వరమేళకళానిధి)

"గంగాధరః శశికళాతిలకః త్రినేత్రః
సర్పైర్విభూషితతను ర్గజకృత్తివాసాః
భాస్వత్త్రిశూలకర ఏష నృముండధారీ
శుభ్రాంబరో భైరవఆదిరాగః.(శివతత్త్వరత్నాకరం)

దీనికి స్వరము " ధ ని స గ మ ప ద మ " అనియు నిరూపితము.

నారదీయే:—సరిగమపదనిస - సనిదపమగరిస ప్రస్తుతమునను నింతియే॥ దీనికి విగ్రహమును, ముక్తావిద్రుమ...అనుదానికిఁ గాను శ్రీ విగ్రహమును రవివర్మ వ్రాసినట్లు పూర్వ మేర్పఱచి యున్నారు. ఆ విగ్రహము దీనిలో ముద్రిత మైనది. కాని రాగమునకు యథార్థ మగురూపనిర్ణయము మన కగోచర మైనది. బయలుపడవలసి యున్నది. అనఁగ నారాగము శుద్ధముగఁ బాడిన నారూప దర్శనము కావలయును. గాని మంత్రానుష్ఠానము వలన మంత్రాధిదేవతారూప దర్శనమువలె నిదియు మన కగోచర మై యున్నది. ధీమంతులగు పూర్వు లేర్పఱచిన భైరవిరాగమునకు భార్యలు.

"మధ్యమాపి చ భైరవీచ బంగాళీచ వరాటికా
సైంధవీచ పునర్జ్ఞేయా భైరవస్య వరాంగనాః"
(శివతత్త్వరత్నాకరమ్)

వీనికి ధ్యానశ్లోకములు విగ్రహములు నిందుఁ బొందుపఱుపఁబడినవి. ఈ ధ్యానశ్లోకములు శివతత్త్వరత్నాకరమునందలివి.

౧. మధ్యమాది:—(దీనికే మధుమాధవి యనియుఁ గలదు.

"పత్యా సహాసం పరిరభ్యకామం
సుచుంబితాస్యా కమలాయతాక్షీ
స్వర్ణచ్ఛవిః కుంకుమలిప్తదేహా
సా మధ్యమాదిః కథితా మునీంద్రైః"

స్వరం:—మ ప ధ ని స రి గ మ.

౨. భైరవీ:—

"స్ఫటికరచితపీఠే రమ్యకైలాసశృంగే।
వికచకమలపత్రై రర్చయన్తీ మహేశం।
కరధృతఘనవాద్యా పీతవర్ణాయతాక్షీ।
సుకవిభిరియముక్తా భైరవీ భైరవస్త్రీ॥"

స్వరం—(మపధని సరిగమ, స ని స గ మ ప ధ మ)

3. బంగాళీ:—

"కమండలువేశిత కరంజధరాయతాక్షీ
భాస్వత్ త్రిశూలపరిమండితవామహస్తా
భస్మోజ్జ్వలా నిబిడబద్ధజటాకలాపా
బంగాళికేత్యభిహితా తరుణార్కవర్ణా"

భాస్వత్ అనుటకు ఉద్యత్ అనియు, అర్కవర్ణా యనుటకు అర్కరోచిః యనియు, "కలాపా" అనుటకు తపస్వీ యనియు నిత్యాది పాఠభేదములు గలవు. దీనికి స్వరము:—స గ మ ప ని స-మ ప ధ ని స రి గ-

౪. వరాళీ:—

"వినోదయన్తీ దయితం సుకేశీ
సుకంకణాచామరచాలనేన
కర్ణే దధానా సురవృక్షపుష్పం
వరాంగనేయం కథితా వరాటీ"

స్వరం:—స రి గ మ ప ధ ని స.

౫. సైంధవి:—

"త్రిశూలపాణిః శివభక్తియుక్తా
రక్తాంబరా ధారితబంధుజీవా
ప్రచండకోపా రసవారియుక్తా
సా సైంధవీ భైరవరాగిణీయమ్"

స్వరము:—స రి గ మ ప ధ ని స - స గ మ ప ధ ని స.




# ఆర్షవిచారము

కౌశిక

క్రీస్తుశకము పందొమ్మిదవ శతాబ్దాంతమున వెలసిన ఇంగ్లీషుమహాకవియగు బ్రౌనింగు తన 'రబ్బి బెన్ ఎజ్రా' యను చిన్నకావ్యమున మనుజునకును ఇతరజీవితకోటికిని నుండు గొప్పభేదమును వివరించుచు 'పొట్ట నిండినపశువు పరికింప జొచ్చునే[1]? యని నుడివియున్నాడు.'జంతువుల కాహారమందిన జాలును. మఱియొకవిచారము వానిని బాధింపదు. మానవునికే, తత్వవిచారము, జిజ్ఞాసాద్యాదర్శము లుండును' అని యితని యభిప్రాయము. కాని యిది కేవలము నిజముకాదు. జంతువులకును పక్షులకును కొన్నిసమయములయందు ఆహారముకూడ నభీష్టము కాజాలదు. సహజసహవాసములకు విఘ్నములు వీనిని బాధించును. మిత్రవర్గమును కానకున్నను, బంధుజాలమును విడనాడినను ఇవి పడుసంకటము లింతింత యని చెప్పనలవికాదు. అట్టి సమయములలో నాహారావసర ముండినను నాహారాపేక్ష వానిమనసుల జొరదు. ఇదియును నొక విధమున మానసికాహారాపేక్షయే కాని యాహారాపేక్షాస్థితిని మించినస్థితి వీనికి లేదని వాదింపవచ్చునేమో. అది యంత సమంజసముగ కానరాదు. ఇష్టవర్గము దూరమైన కష్టపడు జంతుకోటియును, వేలకొలది సమకూడి మంటిగూడును కట్టుకొను చీమలజాతియును, ఐకమత్యముతో వేటకానినుండి తప్పించుకొని పోనెంచి వలతోడ నెగసి పారిపోయిన హితోపదేశములోని పక్షిజాతియును కేవలమాహారాపేక్షాపూరితములే కావు. వీనికిని పూర్వజ్ఞానమును పురోదృష్టియును నున్నవి. ఇష్టమిత్రులతోడ గూడుకొనియుంటిమే యిపు డవి కనబడలేదే యను కొఱతయు విచారమును వీని మనసులకు దోచును. ఇదియే ప్రాణులకుండు పూర్వస్మృతి కంకురము. అయినను మానవున కీపూర్వస్మృతి చాల నెక్కువగ నున్నది. ఇతరుల తోలుత తనసంఘము

---

1. Frets doubt the maw crammed beast

యొక్కయు దేశముయొక్కయు సంతతట సమగ్రముగ మానవకోటియొక్కయు సంపూర్ణమైనపూర్వస్థితినిగుఱించి యెఱుంగుటకు ప్రయత్నించును. ఇదియే మానవత్వముయొక్క విశేషగుణము. సంపూర్ణజ్ఞానమునకును సంపూర్ణాత్మతృప్తికిని మానవకోటియొక్క సమగ్రచరిత్ర నెఱింగి దానియొక్క నిజతత్త్వమును తెలిసికొని యందుమూలమున దీర్ఘపూర్వదృష్టిచే జీవితతత్త్వమును నిర్ణయించుట మానవుని గొప్పప్రయత్నమై యున్నది.

ఈప్రయత్నమునకు తోడ్పడునవియే సకల వేదములును, శాస్త్రములు, ఇతిహాసములును, కళలు మున్నగునవి. కావున చారిత్రకజ్ఞానమును సంపూర్ణముగ సంపాదించిననే గాని యీప్రయత్నము లెస్సగ కొనసాగ రదు. సకలమానవకోటియొక్క చరిత్రను నిజస్థితిలో వెలువరించిన గాని దాని స్వభావము బయలుపడదు. ఆ స్వభావము బయలుపడిననే గాని యిపుడు లోకము నావరించి యుండు జాతివైషమ్యములును, నాగరిక భేదముల వలన బుట్టు దురభిమానములును, జాతీయాహంకారములును అనురాచరణములు మాని మానసికారోగ్యమును, శాంతియును, పరస్పరగౌరవము, దయ, భ్రాతృభావము మున్నగు నుత్తమ గుణములు ప్రబలి లోకమును స్వర్గతుల్యముగ జేయజాలవు. మనుజుల నిక్కమైన నాగరికతకు వారిలో నీమంచిగుణములయొక్క రూఢియైన స్థాపనయే మూలబలము. అదియే ముఖ్యచిహ్నము. కావున ఈనాగరికత జనించుటకు సంపూర్ణ చారిత్రకజ్ఞానమావశ్యకము. చారిత్రకజ్ఞానమునకు ఆర్షవిచారము ప్రథమసోపానము.

చరిత్రకును నాగరికతకును మఱియొక గొప్ప మైత్రియున్నయది. సంఘముయొక్క నాగరికత దానియొక్క ధర్మశాస్త్రములను ఆచారములను బట్టి తెలియనగును. ఈధర్మశాస్త్రములన్నో యీసంఘముయొక్క పూర్వకపు మహనీయుల సచ్చరిత్రముల ననుసరించి క్రోడీకరింపబడినవియై యుండును. మహనీయులచరితము లనేకములు చేరి యాయా సంఘముయొక్క చరిత్ర యగుచున్నది. కావున నాయాసంఘములయొక్క చరిత్ర యంతయును చేరి యాయాసంఘములయొక్క ధర్మరూపమున ప్రతిఫలించును. చరిత్ర తల్లియును, ధర్మము బిడ్డయును నగుచున్నవి. కావున చారిత్రకాన్వేషణముయొక్క ఫల మింత యని కాని వానియొక్క యావశ్యకత యింత యని కాని చెప్ప నలవిగాదు. ఈచారిత్రకాన్వేషణమున ఆర్షవిచార మెంతయు నావశ్యకము. చారిత్రకాన్వేషణమున కితరము లనేకములు తోడ్పడవలయును. వేదములు, పురాణములు, మహనీయుల జీవచరితములు, స్తోత్రములు, కావ్యములు, వ్యాకరణములు, పాటలు, యక్షగానములు మొదలగు నిట్టి గ్రాంథికసామగ్రి చారిత్రకాన్వేషణమునకు చూరరాని ఖని యగుచున్నది. అయినను యీఖనిని జొచ్చి యందలిచారిత్రకాంశములను వెలువరించుట యెంతయు నావశ్యకము. ఇవి గాక పురాతనపు గట్టడములు,—ఇవి మతసంబంధమైన గుహలో, గుహదేవాలయములో, దేవాలయములో, బౌద్ధస్తూపములో, చైత్యములో, జైననిశీథులో తురకల మసీదులో, యివి గాక రాజసంబంధమైన కోటలో, బురుజులో,— యివియన్నియును నిపుడు కొన్ని కొన్ని శిథిలమై యుండినను దేశముయొక్క చరిత్ర కందిచ్చుసామగ్రి చాలవిలువ గలదియును విస్తారమైనదియునుగా నున్నది. వీనికాలములను, కారణములను కారకులను నిర్ణయించుటకు వీని కట్టడపు



అనంతపురంజిల్లా కంబదూరు గ్రామములోని డాల్మెను శివాలయములు



అనంతపురంజిల్లా కంబదూరు గ్రామములోని పెద్ద డాల్మెను శివాలయము

పద్ధతులును వీనిని చేరియుండు శిలాశాసనములును మూర్గదాయకములు.

ఇటీవల ముప్పది నలువది సంవత్సరములనుండి మనదేశము విషయమున నీ పౌరాతనముల పరీక్ష కొంతవఱకు సాగియున్నది. పాశ్చాత్య దేశముల విషయమున నీపరీక్ష చాల వృద్ధిపొంది యున్నది. మనదేశమున నింకను నెంతయో జరుగవలసి యున్నది. పురాణ చిహ్నములయొక్క సంఖ్యయును స్థానములును నిప్పటికిని సంపూర్ణముగ నిర్ణయింప బడియుండలేదు. వీనియొక్క పట్టీలను పూర్తి చేయుటకే కొంతకాలము పట్టునట్లున్నది. ఈశాస్త్రవిచారమును ప్రోత్సాహపఱుప నెంచి సర్కారువారు 'ఆర్కియలాజికల్' డిపార్టుమెంటును నిర్వహించుచున్నారు. కాని దేశముయొక్క విస్తీర్ణమునకును దానియొక్క పురాతన పుగట్టడముల సంఖ్యకును, శాసనముల సంఖ్యకును నిప్పుడు జరుగు ప్రయత్నము చాలదని చెప్పవలసియున్నది. ఈ విషయమున సర్కారువారింకను నెక్కువశ్రద్ధను వహించి యెక్కువధనమును నొసంగి ప్రోత్సాహపఱుపవలెను. వీరికి విద్యావంతులును, ధనసంపన్నులును, సాహిత్య పరిషత్తులును తోడ్పడుట, యత్యావశ్యకము. ప్రస్తుతమున జనసామాన్యమునకు చదువుకొనిన వారిలోన నేరులకును 'ఆర్షవిచారము' నెడల నశ్రద్ధమెకాని వేఱొండు కానరాదు. ఇది కేవలము నిందార్హమైన స్థితి. దేశోద్ధరణ కిట్టి యశ్రద్ధ యెంతమాత్రమును తోడ్పడ జాలదు. ఇప్పటి యశ్రద్ధ కజ్ఞానమే కారణము. దేశీయభాషలలో వీనినిగుఱించిన వర్ణనలుగాని, చర్చలుగాని జనుల కందని కారణమున దారిద్ర్యవంతమైన మనదేశమున నీవిచారమును పోషింపగలిగిన సంఘములు గాని యితర ప్రయత్నములు గాని యేర్పడుట కవకాశము లేకున్నది. ఈ విషయమునను, నితర విషయములలోను ఆధునికాభిప్రాయములు దేశభాషలలో వెలువడుట సంఘోపకారియను శాస్త్రోద్ధారియును నగును. ఈ ప్రయత్నమునకు పూనుకొనిన మీయాంధ్ర 'భారతి' వలన నాంధ్రలోకమంతయును చాలజ్ఞానలాభమును పొందు ననుటకు సందియము లేదు.

'ఆర్కియాలజీ' యను పాశ్చాత్యపదము గ్రీకుభాషలోని 'ఆర్కియస్' అనగా 'పురాతన' మను మాటనుండి వచ్చినది. సంస్కృతగ్రంథములలో నిపుడు వాడుకలో లేని పూర్వికప్రయోగములకు 'ఆర్ష' మని చెప్పుట సంప్రదాయమై యున్నది. సంస్కృతపదమైన 'ఆర్ష'మే గ్రీకుల 'ఆర్కియస్'అను పదమునకు మూలమని తోచుచున్నది. కావున 'ఆర్కియాలజీ' యనుటకు మాఱుగ మనవాఙ్మయమున 'ఆర్షవిచారము' అని యుపయోగించుట సమంజసముగా నుండును.

ఈ 'ఆర్షవిచారమున పెక్కుశాఖ లున్నయవి. వీనినిగుఱించి యిక మునుముందీ పత్రికయందే చర్చింపవలసి యుండును. ఈ వ్యాసమును ముగించుటకు పూర్వము ఇందుతో ననుబంధించి యుండు రెండు పటములను చదువరులకు చూపి విరమించెదము. వీనికి డాల్మెనులని చెప్పుదురు. ఈ 'డాల్మెను' యొక్కకాలము, తత్త్వము, మున్నగు వానినిగుఱించి యికముందు చర్చించెదము.

---

# కాకినాడపురము

## కాశీనాథుని నాగేశ్వరరావు గారు

ఆంధ్రావనియందు గోదావరిమండలము సుప్రసిద్ధమైన ప్రదేశముగ నున్నది. రాజమహేంద్రవరము చాళుక్యరాజ్యమునకు రాజధానియై భారతకృతిని గనిన భాగ్యమును బడసినది. కోనసీమ పుష్పఫలసస్యశోభితమై యుద్యానవనముగ నొప్పుచు యాంధ్రదేశమున కలంకారభూతముగ నున్నది. చిరకాలమునుండియు కవీశ్వరులకును పండితోత్తములకును నుదారప్రభులకును బ్రసిద్ధిని బడసిన గోదావరిమండలము వర్తమానకాలమునందును నాంధ్రరాష్ట్రమునందు రాజకీయసాంఘికవ్యవహారములందును విద్యావ్యాపనమునందును ముందంజవేయుచు 3౮-వ కాంగ్రెసు మహాసభను ఇతరమహాసభలను జయప్రదముగను నిపుడు నిర్వహింపగల భాగ్యమును బడసినది.



మసీదు

గోదావరి మండలము పురాణేతిహాసప్రసిద్ధములైన పట్టణములను గలిగి యున్నను కాకినాడపురము పాశ్చాత్యవ్యాపారసంజనితమైన నవనిర్మాణముగ నున్నది. డచ్చివారు జగన్నాథపురమునందు వర్తకశాలను నిర్మించి వ్యాపారము నారంభించిరి.

వేదాధ్యయనపరాయణులకును పండితోత్తములకును బ్రసిద్ధిని బడసినది. పీఠికాపురము ప్రాచీనకాలము నుండియు శూరులకును నుదారప్రభువులకును విద్యాపోషణమునకు పేర్వాసి గాంచినది. భద్రాచలము శ్రీసీతారామలక్ష్మణులు వనవాసముచేసిన ప్రదేశ మీమండలము నలంకరించుచున్నది. గోదావరిమండలమునందు పురాణేతిహాసప్రసిద్ధములైన పుణ్యక్షేత్రములును ప్రదేశములును ననేకములు గలవు. గోదావరిమండలము 2,545 మైళ్ల విస్తీర్ణమును 1470863 ప్రజలను రూ 1,50,000 రూప్యముల యాదాయమును గలిగి

ఈ ప్రాంతము 1825-వ సంవత్సరమునందు బ్రిటీషువారివశమైనది. జగన్నాథపురమును డచ్చివారు విశాలమైన వీథులతో పురోభివృద్ధి కనుకూల



జగన్నాయకపురము వంతెన



జలాశయము

యనాథశరణాలయ మాంధ్రదేశమున కంతకును నాదర్శశరణాలయముగ నున్నది. మహారాజుగారు పోషించుచున్న కళాశాలయును నూతనముగ నిర్మించిన దైవమందిరమును చూడదగియున్నవి. మల్లాది సత్యలింగము నాయకరుగారు స్థాపించిన ధర్మప్రతిష్ఠాపనలును గమనార్హములు. కాకినాడయందుత్తరదక్షిణ ప్రాంతములందువలె జూడదగిన మందిరములును మసీదులును దేవాలయములును సపురూపములు.

ముగను నిర్మించినను బ్రిటిషువారు వెనుకముందును యోచింపకను కాకినాడను, యథేచ్ఛగ పెరుగనటులు విడిచిపెట్టిరి. కాకినాడపురము చిరకాలమాంధ్రదేశమునకు ప్రధానమైన రేవుపట్టణమై శ్రీమంతులను గనగలిగినది. సముద్రవ్యాపారము క్షీణించుటవలనను కాకినాడభాగ్యము కొంతవఱకు తగ్గినను నిప్పటికిని నాంధ్రదేశమునందు ప్రసిద్ధపురముగ నున్నది. కాకినాడ 53,348 ప్రజలను గలిగి గోదావరిమండలమునకు ప్రధానస్థానముగ నున్నది. కాకినాడ గతించిన పదేండ్లయందును కొంత క్షీణించినది. ఈపురమునందు జూడందగిన స్వదేశపరిశ్రమలుగాని ప్రాచీనమందిరములుగాని కనిపింపవు. సమీపమున గల తాళ్లరేవునందు పడవల పరిశ్రమ సజీవముగనున్నది. శ్రీపిఠాపురము మహారాజుగారు పోషించుచున్న

ఈ పురమునందు జూడదగిన మందిరాదుల పటములు కొన్ని దీనియందు ముద్రింపబడినవి.

కాకినాడ పట్టణసౌకర్యములను పల్లెటూరి సౌకర్యములను గలిగి నివాసయోగ్యమైన పురముగ నున్నది. పట్టణనిర్మాణ నిపుణుడు గెడ్డిసు పండితుడు కాకినాడకు గల సౌకర్యములను బాగుగ దెలిపెను. గాంధినగర మాక్రమించుకొనిన ఎల్వినుపేట గెడ్డిసు పండితుని యుపదేశానుసారముగ నిర్మితమై యన్వర్థముగ గాంధినగరముగ బరిణమించుచు గాత!



పిఠాపురము మహారాజాగారి అనాథశరణాలయము

# కావ్యనిధి చెలికాని లచ్చారాయ స్మృతి

ఏకముగాఁ జిరాయువగుఁ ♦ గ్రాలుటకన్నను బూఁటయేనిఁ దా
గోకిలమై వసంతము గనుట ♦ కోవిదమాన్య మటన్నపక్కి నీ
కే కద? దక్కెఁ, నీకునయి ♦ యేడ్వఁగ నేటికిఁ గీర్తికాయ మీ
లోకమునందు డించితివి ♦ లోకహితమ్ముగ లచ్చరాణ్మణీ!

చ. తిరుపతిశాస్త్రి కెంతయు వి♦ధేయుఁడ వీ వతఁ డేగె నప్పురం
దరునిపురమ్ము; నాతనిఁ గ ♦ నన్ మనమందలి కోర్కె నీకు దు
ర్భర మయి యేగియుందు, వది ♦ భావ్యమ యయ్యెడుఁ గాని, నీదు సో
దరిని దలంపవైతి, గుణ♦ధన్యను, మాన్యను, రామయాంబికన్.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు, శతావధాని

మ. తెలుఁగుంబాసకు భూషణంబు లిడ ను♦ద్దేశించి నానాముఖం
బుల నాంధ్రత్వము సాటి త్యాగవిభవం♦బుం జూపి వర్తించు ను
జ్జ్వలసేశాలి కపీంద్రకల్పకుఁడు ల♦చ్చారాయధీరుం డహా!
కలిదౌష్ట్యంబునఁ గాకయున్న విడునే ♦ కాయంబు ప్రాయంబునన్?

శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు

సీ. తాళపత్రగ్రంథ♦తతి నిల్వఁజాలిన పట్టుగొమ్మయు నేఁడు ♦ భగ్నమయ్యె
ఘనతరాముద్రిత♦గ్రంథసర్వస్వంబు - ప్రచుర మార్గంబు ♦ పాడువాఱె
రామవిలాసస♦ద్గ్రంథమాలయుఁ గాంతి - వాయుచు నెంతయు ♦ వాడియుండె
సుమతిసంస్కృతపరి♦శోధకమండలి - కన్నుల నశ్రులు ♦ గాఱుచుండె,

గీ. నాంధ్రభాషావిలాసిని ♦ యసద యయ్యె - నాశ్రితుల బందుగులను దుః♦ఖాబ్ధి ముంచి
నీవు మరణించుకతమున ♦ నిఖిలభూమి - భృచ్ఛయపురస్కృతుండవ యో ♦ లచ్చరాయ!

దివాకర్ల వేంకటావధాని గారు

శా. భాషాయోష నిజాప్తబంధుఁ డగు భూ♦పాలుండు భోజుండు తా
భాషాపోషక కృష్ణరాయనృపు సం♦భావించి నాకంబునన్
భాషాసత్సభ చేయ నెంచి మిము నా♦హ్వానించెనా? యిట్లు మా
భాషాయోష ననాథఁ జేసి చన దే♦వా! లచ్చరాయాగ్రణీ!

ప్రత్తి వేంకటరత్నము గారు

# పండిత వంగూరి సుబ్బరాయ స్మృతి

కాలమా! ఏల యిట్టియాగడము నీకు? - తెనుఁగుబాస వర్ధిలు చుంట గనఁగలేవా!
ఆమలమృదుపదశోభిత మైన యాంధ్ర - భాషకై నిరతంబును బ్రాఁకులాడు
సుగుణమణిఖనులను నీవు చూడలేవా! - కానిచో నించుకంతైనఁ గరుణ లేక
ప్రథిత వంగూరికుల సుబ్బరాయ కవినిఁ - బొట్ట నిడుకొందువే! నీవు బుద్ధి లేక.
జెట్టులగు దన కొమరులఁ జేయి వదలి - ఛేలమై విలపించుచు జాలి గొలుపు
నాంధ్రవాక్సతి నీ కేమి హానిఁ జేసె? - ఊర కిట్టుల బాధించు టుచిత మగునె?
బ్రతికినన్నాళ్లు భాషకై పాటుపడితి, వన్యవ్యాపారములు లేక; ధన్యమతివి;
నీదు నాత్మను శాంతియే నెగడుఁగాక, సుగుణధౌరేయ! వంగూరి సుబ్బరాయ!

దివాకర్ల కామేశ్వరరావు గారు

శా. అన్నా! వంగురి సుబ్బరాయ! భవదీయాస్మన్మనో రీతు లే
కౌన్నత్యంబున నుండకున్నను, ద్వదీయం బైనవాక్యంబు లం
తర్నైర్మల్యముతోడ మెప్పు; నిసుమంతంగాని కాపట్యముం
గ్రన్నం గాంచవు; కాన, నీవలె నెసంగంజాలు మిత్రంబు లే
కున్నన్ మన్నన యెట్లు మాదృశుల కయ్యో! యంచుఁ జింతించెదన్!!

శా. ఏలా? యాశ నశింప? మిత్రమణి! యీయేఁటన్ జరిత్రంబుదా
లీలన్ జూడఁగ, భాషఁ గొల్వఁదగువా రెల్లకన్ దివిం జేరినా;
రాలాగెందుకు? స్వర్గమందుఁ గలభాషానూనతల్ కాంచిరా;
నాలాగెంతయుఁ గాలమే జరగ, మీరందఱ్మహిం జేరరే?
నాలీలం దగు మిత్రకోటియు దివంబందున్ గనున్ మిమ్ములన్!!

దోమా వేంకటస్వామి గుప్త గారు

చం. ............ఒకవిధంబున నూఱటఁ జెందుచుండ వం
గురి కులభూషణున్, విశదకోవిదు, నాంధ్రమునందు నూత్నమా
ర్గ రచనమున్ ఘటించిన యఖండవిమర్శకు, సుబ్బరాయఁ, నీ
యిరవున జేర్చుకొంటి, విఁకఁ దృప్తినిఁ బొందుము, చాలు నీదుచో,
పురయఁగ నాపెకంటితడి యాఱఁగనీయ వటంచు దోఁచు బం
ధురపరితాపబాష్పములతో వల తే నతతాభిషేకమున్?

ఆచంట సూర్యనారాయణరాజు గారు

# ప్రథమ సాంధికుఁడు

[టాల్‌స్టాయిచే ప్రణీతము]

శతావధాని వేలూరి శివరామ శాస్త్రిగారిచే ఆంధ్రీకృతము

## పాత్రములు

[సంసారి, ఆతనిభార్య, తల్లి, తాత, కూఁతురు,
పొరుగింటివాఁడు, నలుగురు గ్రామపెద్దలు, స్త్రీలు, ముదికలు, ఆఁడుపిల్లలు, మగపిల్లలు.
భూతాధిపతి, ఆతనిమంత్రి, వేలిగాఁడు అనుదయ్యము, కొన్నిదయ్యములు, సారావాఁడు ద్వారపాలకులు.]

### ౧-వ అంకము

[మొట్టమొదట కల్లుబట్టీ దింపినవాఁడు]

సంసారి:—[దున్నుచు పైకి చూచి] నడిప్రొద్దయినది. ఇఁక ఊడఁదీయ వచ్చును. ఊఁ! పద! అలసి పోతివా? ముదిడొక్కా? మఱొక్కమాఱు. దానితో సరి. పిదప అన్నము. నేను అన్నమును ఇచటికి తెచ్చికొనుట మంచి ఊహయే. ఇంటికి పో నక్కఱలేదు. నూతిప్రక్కల కూరుచుండి రెండుమెతుకులు తిని విశ్రమింతును. ఇంతలో ఎడ్లు కూడ కొంచెము మేయఁగలవు. పిదప ఈశ్వరానుగ్రహమున సకాలముననే దుక్కిపని ముగియును.

[వేలిగాఁడు అను దయ్యము ప్రవేశించి
ఒక పొదచాటున దాఁగియుండును]

వేలి:—చూచితివా వాఁడెంత మంచివాఁడో! ఈశ్వరుని స్మరించుచునేయున్నాఁడు. అబ్బాయీ! క్షణకాలము ఆఁగు—కొలఁదికాలములోనే ఈ దయ్యమును స్మరించుచుందువు. నేనా అన్నపుగడ్డను లాఁగివేసెదను. ఇఁక అది దొరకక నీవు కొట్టుకొందువు. వెదకులాడుదువు. ఆఁకలి రెపరెపలాడఁగా తిట్టి దయ్యమును తలఁతువు.



[అన్నపుగడ్డను తీసి ఆతఁడేమిచేయునోయని నిరీక్షించుచు పొద
వెనుక కూరుచుండును.]

సంసారి:—[నాఁగలి ఊడఁదీసి] ఈశ్వరానుగ్రహము!
[ఎడ్లను ఊడఁదీసి అన్నపు మూట కట్టిన చెట్టుకడకు వెళ్లి]
నాకు ఆఁకలి కరకరలాడుచున్నది. ఇంటిది పెద్ద

అన్నపుగడ్డ కట్టినది. అదంతయు నేను తినఁగలనా? [కొమ్మకు కట్టిన మూట తాఁకి] పోయినదే! ఇంకను లోపలగా నున్నదా? [పట్టుకొని ఎత్తి] లోపలఁగాను లేదు. ఏమైనది? [అని విచారించును.]

వేలి:—[పొదవెనుక] ఊఁ ఊఁ వెదుకు వెదుకు! అది గట్టిగా నాకడ ఉన్నది లెమ్ము.

[అని క్రిందపడవైచి దానిమీఁద కూరుచుండును.]

సంసారి:—[నాఁగలి కదిల్చి పగల మూట విడిచి] ఏమిటి ఆశ్చర్యము! పెద్దవింత! ఇట ఎవరూ లేరు. అన్నము పోయినది. ఒకవేళ పిట్టలు తిన్న మెసల కొన్ని మెతుకులు క్రింద పడియుండును. ఇచట ఎవరూ లేకపోయినప్పటికీ అన్నము ఎటులో మాయమైనది.

వేలి:—[లేచి చూచి] ఆ! ఇఁక ఇతఁడు దయ్యమును ఆహ్వానించును.



సంసారి:—మంచిది. అది ఇఁక దొరకునట్లు తోఁపదు. పోనీ! నేను ఆఁకలిచే చచ్చిపోవను. ఎవరేని తీసికొన్నచో తీసికొందురుగాక! తిందురుగాక! అది వారికి సుఖమిచ్చుఁగాక!

వేలి:—[కుమిసి] ఛీ పాడు సంసారి! వీఁడు వీరిని వారిని తిట్టుటకు బదులు 'అది వారికి సుఖమిచ్చుఁగాక!' అని మాత్రము ఆశీర్వదించుచున్నాఁడు! ఇట్టివానిని ఎవఁడేమి చేయఁగలఁడు?

[సంసారి విశ్రాంతి గొని శిరమునించి పరిస్మరణమొనర్చి అవులించి నిదురించును. వేలిగాఁడు పొదచాటునుండి వెలువడి వచ్చి]

ఇపుడు మా రాజుతో మాటలాడుట ఆవశ్యకము. మా అధిపతి—'నీ వెపుడును నరకమునకు తగినంతమంది కర్షకులను తీసికొనిరావేమి? చూడు! ఎంతమంది బ్రాహ్మణులు కోమటులు క్షత్రియులు లోనగు అన్ని జాతులవారును క్రిక్కిఱియుచున్నారో!' అని దండించుచుండును. ఇటువంటివానిని సాధించుట యెటులు? ఇతనిని స్వాధీనపఱచుకొను ఉపాయమేదియు లేదు. అతని నోటిలోని అన్నమును నేను అపహరింపలేదా? ఇంతకంటె ఎక్కువ నేనేమి చేయఁగలను? అప్పటికీ ఇతఁడు కలఁగఁబడి తిట్టఁడు. నా నేరుపు అంతయు ముగిసినది. మంచిది. నేనుపోయి ఈ విషయమును మా నాయకునకు విన్నవించుకొందును.

[అని నేలలో దూఱి అంతర్ధానము చేయును.]

## ౨-వ అంకము

[నరకమునందు ఒక ప్రదేశము. దయ్యముల ఱేఁడు సింహాసనాసీనుఁడై ఉండును. మంత్రి వ్రాతపనిముట్లతో క్రింద కూర్చుండును. ద్వారపాలకులు ఇరుకెలఁకుల నిలువఁబడియుందురు. వేఱువేఱు పనులలో అధికారము కల దయ్యములు కుడి ప్రక్కను తలుపునకు దాపుగా ఎడమప్రక్క పారావాఁడును నిలువఁబడియుందురు. భూతాధిపతియందు వస్త్రాదులచే అలంకృతుఁడగు ఒక దయ్యము నిలువఁబడియుండును.]

అలం. దయ్యము:— ఈ మూఁడేండ్లనుండి నేను ౨౨౦౦౦౯ మందిని సంపాదించితిని. ఇపుడు వారందఱు నా పరముగా నున్నారు.

భూతాధిపతి:—మంచిది. నీకు శుభము. వెళ్లుము. [అతఁడు కుడివైపునకు పోవును] [మంత్రితో] నేను అలసితిని. ఇంకను పని చాలా ఉన్నదా యేమి? ఇంకనూ ఎవరి విన్నపములు కలవు? ఇంకను రావలసియున్న వెన్ని?

మంత్రి:—[వ్రేళ్లమీఁద లెక్కిడుచు దయ్యములకు కుడివైపునకు పోవ సంజ్ఞ చేయును. నిర్దేశింపఁబడిన ప్రతిదయ్యము నమస్కరించుచు కుడిప్రక్కకు జరుగును.] మనకు బాఁపనదయ్యముయొక్క విజ్ఞాపనము అందియున్నది. అతఁడు మొత్తముమీఁద ౧౮౩౬ గురిని కొనివచ్చినాఁడు. కోమటిదయ్యము ౬౪౩ గురిని. ఉద్యోగులనుండి ౩౪౨౩ గురు వచ్చిరి. స్త్రీలు మొత్తము ౨౦౩౭౯౩. ఇందు వివాహితలు ౧౮౬౩౧౯. కన్యలు ౧౭౪౩౮. ఇఁక మిగిలినవారు ఇద్దఱు. ప్లీడర్లదయ్యము. సంసారుల దయ్యము. ఇప్పటికి వెరసి ౨౨౦౦ ౯ మంది.

భూతాధిపతి:-మంచిది. అటులగుచో అంతయు నేఁడే ముగించుట మేలు. [పారావానితో] వానిని ప్రవేశపెట్టుము.

[ప్లీడర్లదయ్యము ప్రవేశించి నమస్కరించును.]

నీ విషయ మెటు లున్నది?

ప్లీడరు దయ్యము:—[నవ్వుచు చేతులు బాడించుకొనుచు]

సరిగానె యుండె నా సకలమాత్రోవ
కలదూప మనఁ దెల్లగా దేవదేవ!

సృష్టి మొదలుకొని ఇటువంటివారిని నేను చూచియుండ లేదు.

భూతాధిపతి:—ఏమీ చాలమందిని సంపాదించికొని వచ్చితివా?

ప్లీడరుదయ్యము:—ఎక్కువ మొత్తమునుబట్టి కాదు. ౧౩౯౦ మందియే కాని వీరందఱు విచిత్రులు. దయ్యములను గూడ సిగ్గుపఱచునంతవారు. వీరు మాకంటె ఎక్కువగా మనుష్యులలో భేదము కల్పింపఁగలరు. నేను వారిలో ఒక క్రొత్త పద్ధతిని ప్రవేశపెట్టితిని.

భూతాధిపతి:—అది యేమి?

ప్లీడరుదయ్యము:—పూర్వము ప్లీడర్లు జడ్జీలవద్ద తనాయితుగా ఉండి జనులను మోసగించుచుండువారు. ఇపుడు నేను జడ్జీలనుండి విడిగానే పని చేయుటకు ఏర్పాటు చేసితిని. ఎవరు లెస్సగా ధన మిత్తురో వారు వారి పక్షమున నుందురు. వారు గాలి పోగుచేసి కేసుల పుట్టింప పాటుపడుదురు. జనులకు ప్లీడర్లకు నడుమ నుండు చెట్టుక్రింద ప్లీడర్లు గుమస్తాలు మొదలగు ఉద్యోగులు కూడ మాకంటె ఎక్కువగా జనులలో భేదము పుట్టింపఁగలరు.

భూతాధిపతి:—మేలు. నాకు వారిని చూడవలె నని యున్నది. సరియ. నీవు వెళ్లవచ్చును.

[అతఁడు కుడివైపునకు పోవును]

[పారావానితో] చివరవానిని ప్రవేశపెట్టుము.

[సంసారుల దయ్యము అన్నపుగడ్డ చేకొని ప్రవేశించి దండ ప్రణామ మొనరించును.]

సం-దయ్యము:—నే నిఁక ఇటులు ఎంతో కాలము బ్రదుకలేను. నాకు వేతేషని దయచేయుఁడు.

భూతాధిపతి:—వేతేషని యేమి? ఏమి వదరెదవు? లెమ్ము. అర్థయుక్తముగా మాటలాడుము. నీ విజ్ఞాపనపత్ర మిటు తెమ్ము. నీవు ఈవారములో ఎంతమంది సేద్యగాండ్రను తీసికొనివచ్చితివి?

సం-దయ్యము:—[ఏడ్చుచు] ఒకఁడునూ లేఁడు.

భూతాధిపతి:—ఏమి? ఒకఁడూ లేఁడా? నీ ఉద్దేశ మేమి? నీ వేమి చేయుచుంటివి? నీ వచట సోమరి పెత్తనములు చేయుచున్నావు?

సం-దయ్యము:—[మూలుగుచు] నేను సోమరిగా తిరుగుటలేదు. ప్రతినిమిషమున నా ప్రతినరమును పని చేయుచునేయున్నది కాని లాభము లేదు. నేను వారిలో దూతి మాటలోని అన్నపుగడ్డ ఎత్తుకొని పోఁగా ఆతఁడు తిట్టి గగ్గోలుపడుటకు బదులు అది ఎత్తుకొనిపోయినవానికి మేలు చేయును గాక అని ఆశీర్వదించినాఁడు.

భూతాధిపతి:—ఏమి యేమి? ఏమి నములుచున్నావు? ముక్కు చీఁదుకొని సరిగా అర్థయుక్తముగా మాటలాడుము. నీ మాటలవలన ఎవనికీ తలాతోఁకా తెలియదు.

సం-దయ్యము:—అచట దున్నుకొనుచున్న ఒక సంసారి కలఁడు. అతఁడు తినుటకు అన్నము తెచ్చుకొన్నాఁడు. తినుటకు అంతకన్న వేతేమియు లేదు. నేను ఆ యన్నము దొంగిలితిని. న్యాయముగా అతఁడు నన్ను తిట్టవలసి యుండెను; కాని ఆతఁ డేమి చేసెనా? 'ఎవరు దానిని తీసికొనినారో అది వానికి సుఖ మిచ్చును గాక' అని. నే నాఅన్నమును ఇదిగో [చైకెత్తి] తెచ్చితిని.

భూతాధిపతి:—సరి. మిగిలినవారి మాట?

సం-దయ్యము:—వా రందఱూ అదేమాదిరి. ఒకనినిఁ గూడా తీసికొని రాలేకపోతిని.

భూతాధిపతి:—నాముందు శూన్యహస్తాలతో కానిపించుటకు నీ కెంత ధైర్యము? అది చాలక ఈ అన్నపుగడ్డను చూపఁదెచ్చితివా? ఇది యేమి హాస్య మనుకొంటివా? నీ వీ నరకమున నివసించి సోమరితనమను అన్నమును తిన నెంచితివా? మిగిలిన దూత లందఱూ వారి శక్తికొలఁది పాటుపడుచున్నారు చూడు! వారు [స్త్రీతో చూపుచు] ఒకొక్కరు పది వేలు ఇరువది వేలు రెండులక్షలు సరఫరా చేయుచున్నారు. నీవో శూన్యహస్తములతో రెండు అన్నపు మెతుకులతో తయారయి ఏకులు వడుకుదువా? నీవు ఊరక వాగుదువు. పాటుపడవు; అందువలననే నీకు వారిపై అధికారము లేదు. కాని మంచిది నాయనా నీకు ఒకటియో రెండో ఉపదేశింతును.

సం-దయ్యము:—అయ్యా! తాము నన్ను శిక్షింపని ముందు నా మనవిని ఆలకింపుఁడు. మిగిలిన దూత లందఱకూ కడు సులభము. బ్రాహ్మణులు వైశ్యులు స్త్రీలు ఆహా! వా రెంత సులువు? బ్రాహ్మణుఁడు గాని రాజు గాని దొరకిన చాలును. ఎటు చెప్పిన నటు విందురు. కోమటియు అంతే. వానికి డబ్బు చూపి లోభమును లేపవచ్చును. అది వానికి ముక్కుతాడే. స్త్రీలును అంతే. వారికి సొగసుఁదనము. తీయని తినుబండారాలము. ఇఁక సంసారులు. వీరితో పని తలనుండి తోఁకకు వచ్చును. ప్రొద్దుటినుండి చీకటిపడువఱకూ— కొన్ని వేళల నడిజేయి వఱకూ—పాటుపడుచునే యుండును. ఈశ్వర

స్మరణము మానియుండఁడు. ఇఁక వానిని లొంగఁ
దీయు టెట్లు? అయ్యో! నన్ను వీరినుండి
తొలఁగింపుఁడు. ఇది నా చావునకు వచ్చినది.
ఇంతేకాక తమకుఁగూడ కోపకారణ మైనది.

భూతాధిపతి:—ఓరి సోమరిపోతా! నీవు దగాచేయు
చున్నావు. నీ నితరుల విషయమై మాట
లాడి లాభము లేదు. వారు బ్రాహ్మణుల
మీఁద వైశ్యులమీఁద స్త్రీలమీఁద చలా
యించుచున్నారు. ఏల? వారితో ఎట్లు సంచ
రింపవలెనో వా రెఱుఁగుదురు. వారికోసము
క్రొత్తభోనులను గూడ పన్నిరి. అదుగో ప్లీష
రులదూత—అతఁడు క్రొత్తపద్ధతుల కనిపెట్టి
నాఁడు. నీవును కొంత ఆలోచించి చేయవలసి
యుండఁగా ఏవో రెండు మెతుకులను ఎత్తుకొని
వచ్చి ఏమేమో వాగుచున్నావు. అబ్బ! ఎంత
పని! వారి చుట్టును వలలు పన్నినను. ఎందు
లోనో ఒకందులో పడక మానరు. నీవు సోమరి
వై తిరుగుచు వారిని స్వేచ్ఛగా వదలుటచే
నీ సంసారులు రెచ్చిపోయినారు. వారికి ప్రాణా
ధార మగు అన్నము పోయినను లక్ష్యపెట్టరు.
ఇంకను వా రీమార్గములలోనే ఉండి వారి
స్త్రీలకును అటులే నేర్పుచో ఇఁక మన అధీ
నతకు రారు. ఏదో కనిపెట్టు. మొత్తములో
నీకు చేతనగునంత మంచివారిని కొంతమందిని
లాఁగుకొని రమ్ము.

సం-దయ్యము:—నాకు అయోమయముగా ఉన్నది.
నన్ను పోనిండు. నే నిఁక ఎంతమాత్రమును
నిభాయింపలేను.

భూతాధిపతి:—[కోపముతో] నిభాయింపలేవా?
అయితే నీ ఊహ ఏమని? నీపని నేను చేసేదా?

సం-దయ్యము:—నేను నిభాయింపలేను.

భూతాధిపతి:—చాలవా? కొంచె మాఁగు. ఓరీ!
అదో! ఆ చువ్వ లిటు తెమ్ము; ఊ ఒక్క
చఱుపు.

[ద్వారపాలురు వానిని పట్టుకొని బాదుదురు]

సం-దయ్యము:—అయ్యో! అయ్యో! ఓయ్యో!

భూతాధిపతి:—ఏమైన ఆలోచించితివా?

సం-దయ్యము:—అయ్యో! ఓయ్యో! నే భరింపఁ
జాలను.

భూతాధిపతి:—మరి కొన్ని చఱుపులు [ద్వారపాలురు
చఱుతురు] ఏమని తోఁచినదా?

సం-దయ్యము:—ఆ. ఆ.

భూతాధిపతి:—చెప్పు.

సం-దయ్యము:—వారి సందఱను నా పిడికిటిలోనికి
రావింపఁగల ఉపాయ మొకటి తట్టినది. అయితే
తమరు నన్ను ఆతనిపాలేరుగా ఉండు ఏర్పాటు
లనుగ్రహింపవలెను. ముందుగా నే నా ఉపాయ
మును వివరింపఁజాలను.

భూతాధిపతి:—మంచిది. నీవు మూఁడేండ్లలోపుగా
ఈ మహాపాతకమునకు ప్రాయశ్చిత్తమును చేసి
కొనకున్నచో బ్రతికియుండఁగనే నీ తిత్తొల్చె
దను.

సం దయ్యము:—ఈ మూఁడేండ్ల లోపుగా వారంద
ఱూ నావారే యవుదురు.

భూతాధిపతి:—మంచిది. మూఁడేండ్లూ కడఁచినపిదప
నేను స్వయముగా వచ్చి చూతును.

## 3-వ అంకము

[ధాన్యపు కొట్టు. ఒల్లెలలో నింపఁబడిన దాన్యము కల బండ్లు
నిలువఁబడి యుండును. సంసారుఁడ య్యము పాలేరుగా
ఉండును. సంసారి జల్లానుండి ధాన్యము త్రోయుచుండఁగా
బుట్టలలో నించికొని పాలేరు కొట్టున పోయుచుండును.]

పాలేరు:—ఏడు.

సంసారి:—ఎన్ని బల్ల లయినవి ?

పాలేరు:—పుట్టికి బల్ల కదా ! ఏడు బల్లలు మూసి తిని. ఏడు పుట్లు.

సంసారి:—[బండినుండి తొంగిచూచి] ఇఁక అది పట్టన ట్లున్నది.

పాలేరు:—పట్ట కేమి? లోని కేగి సవరన చేయుచో ఇంకొక పుట్టి పట్టును.

సంసారి:—అట్లే చేయుదును. [అని బండి దిగి సవరన బల్ల పట్టులోని నిష్క్రమించును.]

పాలేరు:—[ఏకాంతమునందు- పాగ తీసివేయును. మిడిగ్రుడ్లు కాఁడును] ఆతేఁడు వచ్చుసరికి నా ముఖము దురదగా ఉన్నది. అబ్బ! గోఁకికొందును [ముడివడిన బొమలు, మున్మూల ముసు,-, జుంజురు వెండ్రుకలు, వెట్టి నవ్వు. పెదవులు కనలమీఁదికి ఉన్న చింపిబి కపాలము బయటఁబడును. గోఁకికొని] ఈ ముచ్చెలనుగూడ తీసివేసెదను. ఆతఁ డున్నపుడు వీలు లేదు. [అని ముచ్చెలు తీసివైచును. కొంకి వ్రేళ్లు, వెడ జిరిగిన అకు గులు, వెండ్రుకలతోఁ గూడిన నరికాళ్లు కానిపించును. గడప మీఁద కూర్చుండి] ఇది మూడవ యేఁడు గడువు సమీపించినది. ఈ యేఁడు పండినపంటకు ధాన్యపు కొట్లు చాలవు. ఇఁక ఈతనికి బోధింప వలసిన దొకటియే శేషించియున్నది. పిదప అధిపతి స్వయముగా పరీక్షించుకొనుఁ గాక ! నన్ను క్షమించుఁగాక !

[పొరుగింటివాఁడు ప్రవేశించును. పాలేరు తన వికృతాకార మును ఉపసంహరించును.]

పొరుగింటివాఁడు:—సుప్రభాతము.

పాలేరు:—తమకును.

పొరుగిం:—మీ దొర ఎక్కడ ?

పాలేరు:—లోపల సర్దఁబోయినాఁడు. అది పట్టన ట్లున్నది.

పొరుగిం:—మీ దొరమీఁదికి అదృష్టదేవత ఎట్లు పరుగు లెత్తుకొని వచ్చినది! కొట్లు పట్టనంత పంట! మీ దొరకు ఈ రెండేండ్లు అయిన పంట మాకు ఆశ్చర్యముగా ఉన్నది. ఆతనికి ఎవరో భవిష్యత్తు తెలిపిన ట్లున్నది. పోయిన యేఁడు వానలు లేవు. అతఁడు మదగలో విత్తి నాఁడు. ఏ ఆసామికీ గుప్పెఁడు గింజలు లేవు. మీదొరకు కళ్లమునిండా కంకులే. ఈ యేఁడు అతివానలు. మీ దొర బుద్ధిసూక్ష్మత ఎట్టిదో కొండ దిబ్బలలో విత్తినాఁడు. అందఱి పైరు పేరు లేకుండా ఊడ్చుకొనిపోయినవి. ఔరా మీ దొరకు ఎంతపంట ! ఎంతపంట ! ఆహా ! ఎంత ధాన్యము ! ఎంతధాన్యము ! [కొంతధాన్యము చేతి లో పోసికొని బరువు చూచి నలిపి పొట్టు ఊఁది నములును.]

సంసారి:—[ప్రవేశించి] గంగన్నా ! ఏమిటి విశేషాలు?

గంగన్న:—సుదినము. నీ వెంతదూరదృష్టి కలవాఁడవో అదియు ఇంకా ఆ మాయిసంగతు లన్నియు మీ పాలేరుతో చెప్పుచున్నాను. ఇపుడు ప్రతి వానికీ నీ మీఁదనే చూపు. ఇంచు మించు అసూయ అంటే నమ్ము. ఆహా! ఎన్ని కుప్పలు పడ్డవి ! ఎంత కుప్పలు ! పది యేండ్లకుఁ గూడ ఈ ధాన్యమునంతయు నీవు తినఁజాలవు.

సంసారి:—ఈ మెలకువ అంతయు పాలేరు దాలె న్నది. [పాలేరును చూపుచు] అది వాని అదృష్టము. పోయిన యేఁడు నాఁగలి కట్టి పంపితిని. అతని కేమి తోఁచెనో కాని వట్టిమదగ నేలలో దున్నినాఁడు. నేను వద్దని ఎంత నొక్కి చెప్పినను అచటనే విత్తు మని దయ్యపుపట్టు పట్టినాఁడు. చూతమని అట్లే విత్తితిని. అంతయు మేలుగనే పరిణమించి నది. ఈ యేఁడుకూడా దాలెన్న సరిగనే పసి పట్టినాఁడు. కొండదిబ్బలమీఁద పంట !

గంగన్న:—ఆతనికి ఋతుధర్మములు తేటతెల్లముగా

తెలిసినటులున్నవి. నీకు పూరా పంట పండినది. చచ్చు లేదు. [వైశ్మద్యము] నాకు బస్తా గోధుమలు అప్పు కావలెను. మా పంట అంతయూ తింటిమి. మఱుసటి యేఁట తీర్చెదను.

సంసారి:—మంచిది ఆలాగే.

పాలేరు—[సంసారిని మెల్లగా గోఁకి ఈయవద్దని సంజ్ఞచేయును.]

సంసారి:—[పాలేరుతో] తిరుగుమాట లేదు. [గంగన్నతో] కొలుచుకొనుము.

గంగన్న:—ఇంటికి వెళ్లి గోనె తెత్తును.

పాలేరు:—[లోనలో] ఇతనికి పాఁత పద్ధతులు మాఱలేదు...ఇంకను ఇచ్చుచునేయుండును. ఏమాటా వినఁడు. కాని కొంచె మాఁగు. ఇఁక ఈయఁడు లెమ్ము.

[గంగన్న నిష్క్రమించును.]

సంసారి:—[గడపపై కూర్చుండి], మంచివాని కెఁదు కీయఁగూడదు?

పాలేరు:—ఇచ్చుట ఒకటి పుచ్చుకొనుట మరియొకటి. ఇచ్చుట అనఁగా కొండనుండి త్రోయుట. పుచ్చుకొనుట అనఁగా కొండమీఁదికి చేఁదుట. ఇది నేటిమాట కాదు. ఇక్ష్వాకులనాఁటిది.

సంసారి:—ఆఁ. ఫరవా లేదు. మనకు కావలసినంత ధాన్యము కలదు.

పాలేరు:—అయితే?

సంసారి:—మన కింకను మూడేండ్లదాఁకా పండకున్నను ఇబ్బంది లేదు. మన మీ ధాన్య మంతయు నెత్తిపైని వేసికొందుమా?

పాలేరు:—అదేమి? నేను ఈధాన్యమునుండి నీజీవితమంతయు ఆనందములో ఓలాడిపోవునట్లు చేయఁగల ఒక విచిత్రమును చేయుదును.

సంసారి:—ఏమి చేయుదువు?

పాలేరు:—నే నొక పానీయమును చేసెదను. అది నీవు బలహీనుఁడ వైనపుడు బలము ఇచ్చును. ఆఁకలి కొన్నపుడు నిండుచేయును. ఏమియు తోఁపక అల్లాడెడునపుడు నిద్ర పట్టించును. దుఃఖము కలిగినపుడు సంతోషము కలిగించును. అధైర్యము కలిగినపుడు ఉత్సాహము పుట్టించును. ఇట్టిది నేను చేయఁగది.

సంసారి:—వట్టి చెత్త.

పాలేరు:—నిజమే చెత్త. నేను వట్టి మదగ...ఉల్లారములో విత్త మన్నటువంటిదే! కొండదిబ్బ... అట్టిదే ఈ పానీయమును.

సంసారి:—దేనినుండి చేయుదువు?

పాలేరు:—ఈ ధాన్యమునుండియే.

సంసారి:—అది పాపము కాదా?

పాలేరు:—నీ మాట వినవలసినదేనే! అది పాపమా? ప్రతిదియు మనుష్యుని సుఖమునకే ఈయఁబడినది.

సంసారి:—దాలెన్నా! ఈ చిత్రవిచిత్రము లెచట నేర్చుకొంటివి? నీవు చూచుటకు సాధారణుని వలె ఉందువు. అతిగా పాటుచేయుదువు. నాకడ పాలేరుగా కుదిరినదిమొదలు ఒకనాఁడైనను బట్టలు విడిచినటులు ఉతుకుకొన్నటులు కనుపట్టదు. కాని నీకు అన్ని సంగతులు తెలిసినటులున్నవి. నీ వెచట నేర్చికొంటివి?

పాలేరు:—నాకు తెలియును.

సంసారి:—నీవు చేయు ఈ పానీయము బలకరమేనా?

పాలేరు:—కొలఁది కాలములోనే చూతువుగాని అది చేయు తమాషా.

సంసారి:—దాని నెట్లు చేయుట?

పాలేరు:—నీ వొకసారి చూచిన తరువాత మరల చేయుట కడు తేలిక. రెండు సల్లీలు కల కుండలు వడపోఁతగిన్నె మాత్రమే కావలెను.

సంసారి:—అది రుచ్యముగా ఉండునా?



పాలేరు:—తేనె. నీవు రుచి చూచి మరల మానఁ గలవా ?

సంసారి:—ఆ ఆలాగా? గంగన్నగారి లోగిలిలో వడపోఁతగిన్నె ఉన్నట్లున్నది. కుమ్మరితో కుండలమాట చెప్పెదను. గంగన్న గోని తీసికొని రాకముందే వడపోఁతగిన్నె కనుగొందము పద.

### ౪-వ అంకము.

[పాక. నడుమ ఒక ప్రొయిపై సారాయిబట్టీ ఉండును. దాని మీఁదనుండి ఆవిరి చుట్టలుచుట్టుకొని ఎగిరిపోవుచుండును.]

పాలేరు—[సల్లీ త్రిప్పి గళాసులో సారా పట్టి క్రోలును] దోరా! భేష్! సిద్ధమైనది.

సంసారి—[గొంతు గూర్చుండి చూచుచు] ఎంత చిత్రమైన పదార్థము! ఈ కషాయమునుండి ఇదిగో నీరు వచ్చుచున్నది. అసలు నీ వీ నీరు నెందుకు పోనిచ్చుచున్నావు?

పాలేరు—అది నీరు కాదు. అది సారాత్తు పదార్థమే.

సంసారి—అది అంత శుభ్రముగా నున్నదేమి? అది ధాన్యమువలె ఆకుపచ్చగా నుండు ననుకొంటిని. ఇది సరిగా నీరే.

పాలేరు—కొంచెము వాసన చూడు.

సంసారి—ఆ ఎంత పరిమళము! నోటికి ఎటులుండునో చూతము. కొంచెము రుచి చూడనిమ్ము.

[అని పాలేరు చేతినుండి గళాసును తీసికొనఁ బోవును.]

పాలేరు—అయ్యో! అది పొరలి పడి పోవును! జాగ్రత్త! [సల్లీ త్రిప్పి త్రావి రొట్టలు వేయును] ఇఁక తయారయినది. ఇదిగో తాగు.

సంసారి—[త్రాగి మొదట చప్పరించి మరికొంచెము మరికొంచెము తీసికొని ఉత్తరిచేసి గళాసు ఇచ్చును] మరి కొంచెము! ఈ రెండుబొట్లతో ఏమి రుచి తెలియును?

పాలేరు—[నవ్వుచు] నీకు రుచిగా ఉన్నట్లున్నది. [మరి కొంచెము పోయును]

సంసారి—[త్రాగి] ఆః ఆ-లాగుండ వలెను. ఇంటి దానిని పిలుతును. ఏయ్ పిల్లా! రా రా! తయారయినది. ఉన్నట్లు రా.

[భార్యయు చిన్న పిల్లయు ప్రవేశింతురు.]

భార్య—ఏమి టిది? ఏమిటి ఈ అల్లరి?

సంసారి—మేము బట్టీ దింపినది కొంచెము రుచి చూడు! [గళాసు ఆమెకు ఇచ్చి] వాసన చూడు!

భార్య—[మూ చూచి] ఓ సె మ్మా!

సంసారి—తాగే!

భార్య—ఒకవేళ ఇది ఒంటికి అపకారం చెయ్యదుగద!

సంసారి—తెలివి మాలినదానా! తాగు!

భార్య—[తాగి] నిక్కం. బాగా ఉంది.

సంసారి—[కొంచెము మైకము పొంది] సత్యముగా బాగుగా నున్నది. కొంచె మాఁగు ఎట్లుండునో! దాలెన్న చెప్పుచున్నాఁడుకదా— ఎముకల లోనుఁడి బడలిక అంతా ఎగిరిపోవు నని. పసి వాంప్రు ముదివాం డ్రగుదు రని, కాదుకాదు. ముదివాంప్రు పసివాం డ్రగుదు రని, ఇపుడే నేను రెండుగళాసులు పుచ్చుకొన్నాను! అపుడే నా ఎముక లన్నియు ఉల్లాసముగా నున్నవి. (నిమ్మ ఎక్కును) చూచితివా? నీవూ నేనూ ప్రతి దినమూ తాగుచో మరల పిల్లల మగుదుము. సత్తెం. రా! [కౌఁగిలించుకొనును]

భార్య—ఆతలికి పో! ఏ మిది! ని న్నిది కొంటెవాణ్ణే చేసింది.

సంసారి—అహో చూడు! దాలెయ్యా నేనూ ధాన్యము పాడుచేయుచుంటి మని నీ వందువు కాని చూడు మేము ఎట్టిపదార్థమును కనిపెట్టితిమో! ఏమి మంచిదా చెడుదా?

భార్య—తప్పకుండా ముసిలాళ్లని పడుచాళ్లని చేస్తే. చూడు అది నిన్ను ఎంత ఉల్లాసపఱిచిందో! నేను కూడా ఆనందంగా ఉన్నాను. ఊ పాడు. కలిసిపాడు! ఆ ఆ ఆ. [పాడును]

సంసారి—అదే త్రోవ మన మందఱము పడుచువార మగుదుము.

భార్య—అత్తగారిని కూడా పిలవాలి. ఆవెడ ఎప్పుడూ దుఃఖంగాను ధుమధుమ లాడుతూను ఉంటుంది. ఆ వెణ్ణి కొత్తపడెయ్యాలి. ఆవిడె పడుచుదై తే కోపం అంథా పోతుంది.

సంసారి—[మత్తుగొని] ఔను. అమ్మమ్మను పిలు! తాతను కూడా! అమ్మాయీ! నీవుపోయి అమ్మమ్మను తాతయ్యను పిలుచుకొని రా! వారిని పడుచువారిని చేయుదము. ఊ పో. ఒకటి రెండు మూడు. ఊ వెళ్లు! తుపాకిగుండులాగా [పిల్ల పరువెత్తును. భార్యతో] ఊ! మనము ఇంకొక గళాసు!

[పాలేరు గళాసునిండా పోసి ఇచ్చును.]

సంసారి—[త్రావి] మొదట మననోటిలో నాలుకచివర భాగము పడుచుతనము పొందినది; పిదప అది చేతులలోనికి జాఱినది. ఇపుడు కాళ్లలోనికి దిగినది. ఇపుడు నాకాళ్లు పడుచుతనము పొందినట్లు అనుభవము అగుచున్నది. వాని యంతట అవియే కదలు చున్నవి.

[నృత్యము చేయుచు బయలుదేఱును.]

భార్య—[త్రావి] నీవు చాలా తెలివికలవాఁడవు దాలెన్నా! ఊ వాయించు.

[పాలేరు డప్పుమీఁద వాయించును. సంసారియు అతని భార్య సత్తెమ్మయు నృత్యము చేయుదురు. పాలేరు కనులు మూయుచు తెఱచుచు నవ్వుచు వారి చేతులు కనిపట్టుచు డప్పు వాయించుచుండును. పిదప డప్పు మానును. మానినను వారు నృత్యముచేయుచు నే యుందురు.]

పాలేరు—అన్నపుగడ్డ లాభించును లెమ్ము. మా నాయకుఁడు తన కిష్టము వచ్చినపుడు వచ్చి చూచుకొనవచ్చును.

[ప్రసన్నదృష్టి కల ఒకముదియ జనపనారవలె నెఱసిన వెండ్రుకలు కల ఒక ముసలివాఁడు ప్రవేశింతురు.]

తాత—ఏమి యిది? మీకు పిచ్చి యెత్తినదా? అందఱూ పనిపాటలు చేసికొనుచుండఁగా ఆడెద వేమి?

భార్య—[ఆడుచు చేతులు తాటించుచు ఓ ఓ ఓ పాడును]

నా పాపపుంజ మంతయు నాడె పొండె
పాపంబు లేకుండువాఁడు దేవ్రుండె.

అమ్మ—ఓసీ అభాగ్యురాలా! వంటిల్లూ పొయిలూ ఏమీ బాగుచేయకుండా ఇక్కడ ఆడుతున్నావు?

సంసారి—ఆఁగు! అమ్మ! కొంచె మాఁగు! ఇచట ఏమిజరుగుచున్నదో చూడు! మేము ముసలివారిని పడుచువారినిగా చేయుదుము. ఇదిగో కొంచెము తాగు. [అని గళాసు ఇచ్చును.]



అమ్మమ్మ—నూతిలో కావలసినంత నీరున్నది. [మూచూచి] ఏమి ఇందులో పెట్టారు? అబ్బా! ఏమి ఈవాసన?

సంసారి-కొంచెము తాగు.

అమ్మమ్మ-[రుచి చూచి] ఓసెమ్మో! ఎవరూ తాగరుకదా!

భార్య-నీ కింకా ఎక్కువ ప్రాణము వచ్చును. నీవుమళ్లీ పద్దెనిమిదేళ్ల పెళ్లికూఁతుర వౌతావు.

అమ్మ- అర్థం లేదు. [త్రావి] కాని బాగా ఉంది. మన పానీయాలకన్న బాగాఉంది. తాతకుకూడా కొంచెం ఇయ్యి.

[తాత క్రింద గూర్చుఁడి వద్ద తేఁ యూఁపును.]

సంసారి-ఆయన పుచ్చుకోనకున్న పోనిమ్ము. అమ్మకు మరో లోటా. [అని ఒక లోటా యిచ్చును.]

అమ్మ-అపకారం కలుగకుంటేనే. [త్రేఁచి] కాలుస్తూంది. కాని రుచిగా ఉంది.

భార్య-తాగు. నీ నరాలలో పరిగెత్తుతూ ఉన్నట్లు కనఁబడుతూంది.

అమ్మ మంచిది. [త్రావును]

భార్య. ఇప్పటికి నీ అడుగులలోకి చేరిందా?

అమ్మ. ఔనే. అది నీలో పరిగెటుతూంది. అది ఇక్కడ ఉన్నట్లు అనుభవం ఔతూంది. తేలిక చేస్తూంది. రా. మరికొంచెం పొయ్యి. [మరల త్రాగి] భేష్. నేను మళ్లీ పిల్లనైనాను.

సంసారి- నే చెప్పలేదా?

అమ్మ-మా ఆయన ఎంతో కాలం ఈలోకంలో ఉండకుండా పరలోకంలోకి వెళ్లడం ఎంత దురదృష్టం! నేను నాపడుచుతనంలో ఏలా ఉన్నానో ఆతఁడు చూసేవాఁడు.

[పాలేరు డప్పుకొట్టును. దపతులు నృత్యమొనర్తురు. అమ్మ నడుమకు వచ్చును.]

అమ్మ-ఆట అనఁగా ఇదా? నేను చూపిస్తా చూడు. [ఆడును] ఇదీ మాదిరి! తర్వాత ఇల్లా, ఇల్లా, చూసావా?

[తాత బట్టీవద్దకు పోయి నల్లీ త్రిప్పి మద్యము నంతయు నేలపై ప్రవహింప జేయును.]

సంసారి—[చూచి తాతకడకు పరువిడి] ఓరి ముసిలిముండాకొడుకా! నీవు చేసినది ఇదా? ఇంతమంచి పదార్థమునా పాఱఁబోయుట? ఓరి మతిమాలిన

ముదిగొడ్డా! [అతని ఆవలికి త్రోసి నల్లీక్రింద గళాసు పట్టి] నీవంతయు ఉత్తది చేసితివి.

తాత—ఇది చెడుదికాని మంచిది కాదు. నీవూ నీవారునూ తినుటకు దైన నింత ధాన్యము పుష్కలముగా ఈయఁగా దానిని ఈ దయ్యపు సారాయిగా మార్చివేయుదురటరా? దీనివలన మేలు లేదు. ఈ పాడుపనిని మానుము. కానిచో నీవు చత్తువు. ఇతరులనూ చంపుదువు. నీవు దీనిని పానీయ మని తలఁతువా? ఇది అగ్గి. నిన్ను కాల్చి చంపివేయును.

[అని అగ్నినుండి కొఱకచ్చు గొని నేలమీఁదఁ బడిన సారాయిని ముట్టించును. అది బగ బగ మని మండిపోవును. అందఱూ భయముతో చూతురు.]

౫ వ అంకము

[పాకలోపల పాలేరు ఒకఁడే ప్రవేశించును. అతని తిరుగుడు కాళ్లు, మిడిగ్రుడ్లు, కన్నులమీఁదికి వ్రాలుచున్న పల్ల తల మొదలగు భయంకరాకారము కానఁబడును.]

పాలేరు—ధాన్యము పుట్లకు పుట్లు ఉన్నది. ఎక్కడా కొట్లు చాలుట లేదు. ఇపుడితఁడు రుచిమరగి నాఁడు కూడా. మరల మేము సారాయి ఒక పీపా దింపి దాఁచితిమి. మేము ఎవరినీ ఆనన సరముగా ఆదరించి విందు చేయఁ బోవము కాని ఎవరివలననైనా పని పట్టినపుడు వారిని ఆదరింతుము. ఇతనికిని ఇతనితాతకును పంపకము చేయవలసియున్నది. ఆస్తిలో తాతకు ఏమీ లేకుండ ఇతనికే పంచిపెట్టుటకుఁగాను గ్రామపెద్దల రావించి వారికి కల్లువిందు ఏర్పాటు కావించితిని. నా మూఁడేండ్ల గడుపు నేటితో ఆఖరు. నా పనియు నెఱవేఱినది. మారాజుగారు వచ్చి పరీక్షించుకొనుఁగాక! ఆతఁడు చూచు నెడ నేను సిగ్గిలవలసిన పని లేదు.

[భూతాధిపతి నేలలోనుండి పైకి ఆవిర్భవించును.]

భూతాధిపతి—సమయ మయినది! నీవు నీ అన్నపు గడ్డపాతకమును పోఁగొట్టుకొంటివా? నేను స్వయముగా వచ్చి చూతునని నీతో చెప్పితిని. నీ వా సంసారిని తోవకు తెచ్చితివా?

పాలేరు—పూర్తిగా. నీవే పరీక్షించుకొనుము. వారు కొందఱు ఇక్కడ గుమిగూడుదురు. ఇదిగో ఈ ప్రోయిలో దూఱి వారు చేయునది చూడు. నీకు సంపూర్ణముగా తృప్తి కలుగును.

భూతాధి—[ప్రోయిలో దూఱి] చూతము.

[సంసారియు నలుగురు ముదుసలి గ్రామ- పెద్దలును ప్రవేశింతురు. భార్య కుంపటి మొ. వానితో వెనుకనుండి ప్రవేశించును. అందఱు గంభీరముగా కూర్చుందురు. భార్య కొంచెము దూరముగా కుంపటి పెట్టి ఉడుకు చుక్కలు కాల్చును. ముసలివారును సంసారియు పరస్పరము ధన్యవాదములు పలికికొందురు.]

ముసలి—పానీయము ఇంకను ఎక్కువ తయారు చేసితివా?

పాలేరు—ఔను. మనకు కావలసినంతా దింపితిని. విలువగల వస్తువులను ఏల వృథా చేయవలెను?

౨ ముసలి—నికారసుగా దింపుట చేతైనదా?

పాలేరు—ఓ, మొదటికంటె ఎక్కువగా.

౨ ముసలి—నీ వెక్కడ నేర్చుకొంటివి?

పాలేరు—ప్రపంచకమున తిరుగ మొదలిడుచో అనేక విషయములు తెలియును.

3 ముసలి—ఔనౌను నీవు తెలిసినవాఁడవయ్యా!

[భార్య లోనికి జని సారాయి గళాసులు తెచ్చును.]

సంసారి—పోయుము.

[భార్య గళాసులలో పోసి యిచ్చును.]

భార్య—మాకు న్యాయం చేయండి.

ముసలి—[త్రాగి] మీకు సుఖం. ఆహా మంచిది! ఇది సూటిగా అన్ని సంధులలోనూ ప్రవహించు



చున్నది. అటువంటిదే మంచిదని నా ఊహ.

[తిరిమ్మా ముగ్గురును తాగుదురు. భూతాధిపతి ప్రోయినుండి లేచును. పాలేరు అతనిని సమీపించి నిలువఁబడి.]

పాలేరు—[భూతాధిపతితో] ఇపు డేమి జరుగునో చూడుము. నేను కాలితో కొంచెం ఆమెను [కాలు జాడించుచు] ఇట్లా అండును. సారాయి తొణికి క్రింద పడును. వెనుక ఇతఁడు తన నోటిలో ముద్దపోయినపుడు కిమ్మన లేదు కాని సారాయి బొట్టు చిందుచో ఏమి చేయునో చూడుము.

సంసారి—ఓసీ! మరల పూరించి వరుసగా అందఱకు ఇమ్ము- మొదట మన స్నేహితునకు ఇచట, పిదప వెంకయ్యగారిసాబ్బయ్యకు.

[భార్య గళాసులు పూరించి నిర్ణీత ప్రకారము ఈయఁబోవును. పాలేరు కాలు అడ్డము పెట్టును. ఆమె తొట్రుపడి గళాసు తలక్రిందు చేయును.]

భార్య—ఆహా! ఏమి ఈ అనుగ్రహము? కింద పోయింది! నాకు అడ్డం వచ్చి ఏల అటూ ఇటూ చేసావు?

సంసారి—[భార్యతో] మోట పశువా! నీ వేళ్లన్నియు బొటన వేళ్లే! పైఁగా ఇతరులను తిట్టుటకు బయలుదేఱినది! చూడండి! ఎంత మంచి పదార్థమును పాఱఁబోయుచున్నదో!

భార్య—నేను చేయాలని చేయలేదు.

సంసారి—చేయవలయు నని యే చేసితివి. నిజముగా. నేను వచ్చుచున్నాను ఉండు! నేల మీఁద పాఱఁబోయుట ఎటులో బుద్ధి చెప్పెదను. [పాలేరు కేసి చూపుడు వ్రేలి చూపుచు] నీవునూ ధూర్తా! త్రొక్కట పెట్టుదువూ? వీరిచుట్టూ ఏల కదం త్రొక్కెదవు? పో! దయ్యాలలోకి పో!

[భార్య మరల పూరించి గళాసులను వరుసగా ఇచ్చును.]

పాలేరు—[ప్రోయి దాపునకు పోయి భూతాధిపతితో] చూచితివా! లోఁగడ నోట్లో ముద్దకు ఏమీ అనని వాఁడు ఇప్పు డొక కల్లుబొట్టుకు పెండ్లమును తిట్టి నన్ను నీకడకు-దయ్యముకడకు పంపివేయుచున్నాఁడు.

భూతాధి—సంతుష్టుఁడ నయితిని. మేలు.

పాలేరు:—కొంచెము మాఁగు. బుడ్డి ఖాళీ కానిమ్ము— పిదప ఏమగునో చూతువు. ఇప్పటికే వారు పరస్పరము తేనెమూట లాడుకొనుచున్నారు. ఇఁక వారు నక్కవినయములు చూపుదురు.

సంసారి:—అయ్యా స్నేహితులారా! నా వ్యాపారములో మీ అభిప్రాయ మేమి? చాల కాలము

నుండి నూ తాత నాకడనే ఉండి ఉండి ఇపుడు దౌహిత్రునికడకు పోయినాఁడు. ఆస్తి పంచుకొని తన వాటా ఆతని దఖలు పఱుప తలఁచుచున్నాఁడు. మీరు బాగుగా ఆలోచింపుఁడు. మీరు వివేకులు. మీరు లేనియెడల మాకు తలలు లేనట్లే. ఈయూరిమొత్తములో మీ కాలిగోరుకు పోలినవాఁడు లేఁడు. స్తోత్రము కాదు—ఉదాహరణముగా తెల్పెదను. భీముని అయ్యన్న—ఈయనను ప్రతివాఁడూ పెద్ద తలకాయ అని చెప్పఁడా? ఇఁక నా ఉద్దేశము నిక్కముగా తెల్పెదను. అయ్యన్నా! నీవు ముందూ తలిదండ్రులు తరువాతా. ఇఁక సరప్ప అంటే మాకు ప్రాణస్నేహితుఁడే.

౧ ముసలి:-[సంసారితో] యోగ్యునితో మాటలాడుట మంచిది. అది వివేకము సంపాదించు త్రోవ. అది సరిగా నీకు పట్టినది. నిన్నుమాత్రము పోలువాఁ డెవ్వఁడు?

౨ ముసలి:-వివేకము ప్రేమా కలవాఁడవు-అందుల కనియే నీ వంటే నాకు ప్రాణం.

3 ముసలి:-నీ వంటే నాకు ఇష్టం. దానిని తెలుప నాకు మాటలు రావు. నేఁడే ఈవిషయమును మా ముసలిదానితో చెప్పుచున్నాను......

౪ ముసలి:-స్నేహితుఁడు. సరియైన స్నేహితుఁడు.

పాలేరు:-[భూతాధిపతిని చేతితో తట్టి] వినుచుంటివా అన్నియు అసత్యాలే. నోళ్లు నుతించుచుండఁగా మనసులు వెక్కిరించుచున్నవి. ఇదివఱకల్లా దూషించుకొని ఇపుడు ఈ కల్లువిందు వచ్చునరికీ తోఁకలు ఆడించు కుక్కలవలె ఎంత తియ్యని మాట లాడుకొనుచున్నారో! ఇదంతయు కల్లునుండియే ఉద్భవించుచున్నది.

భూతాధి:-భేష్. ఆ కల్లు మంచిది. ఇట్లే వా రసత్యపరులై యున్నచో ఇఁక మన ఇలాకాలోవారే. చాలా బాగున్నది. తృప్తిపడితిని.

పాలేరు:-కొంచె మాఁగు. రెండవ సీసాకూడా ఉత్తదగునెడల ఇఁకా తమాషా.

భార్య:-[పోయుచు] ఇంకో లోటా.

౧ ముసలి:-ఇఁక ఎక్కువ కాదా? ఐనను తాగుదును. [త్రావి] యోగ్యునితో త్రావుట ఆనందము.

౨ ముసలి:-తాగకుండా ఉండఁగలగడమే! మీకు సుఖ మగుఁగాక!

3 ముసలి:-స్నేహితులారా! మీకు ఆనందము.

౪ ముసలి:-ఇది సరియైనసారా. మన మానందింతము గాక! మేము మీకు సరిగా న్యాయము చేయుదుము. అదంతయు నా పని.

౧ ముసలి:-నీ పనియా? నీదే కాదు. నీకంటె పెద్దలున్నారు. వారు చెప్పినట్లు.

౪ ముసలి:-నాకంటె పెద్దలు పెద్దవెధవలు. ఎక్కడినుండి వచ్చావో అక్కడికి పో.

౨ ముసలి:-ఇంతవఱకూ నీ వెవరు? వెధవా!

3 ముసలి:-అతఁడు చెప్పుచున్నది నిక్కం. వాఁ డెందుకు? ఇతఁ డూరక మాకు విందుచేయుట లేదు. ఆతనికి కావలసినది వ్యవహారము. అది సరిగా తీర్పుచేయఁబడును. నీవుమాత్రము విందు చేయుచుండుము. మమ్ము సరిగా గౌరవింపుము. ఎందుచేతనంటే నీకు నాతో పని ఉండికాని నాకు నీతోడు లేదు. నీ వసలుపందికి అన్నవో తమ్ముఁడవో.

సంసారి: అది నీవే! ఎందులకు అఱతువు? నన్ను మాయం చేస్తావు? పొట్టలు నింపునపుడు మీరందఱూ తిండిలో మెండు.

౧ ముసలి: నీ వేమిటి మహాడాబు చేయుచున్నావు?



చూడు నీ ముక్కు మెలిపెట్టక పోతే.

సంసారి:-చూతాము ఎవరి ముక్కో.

౨ ముసలి: నీవే మహా మేటివా? పో దయ్యాలలో కలిసి. చావు. నేను నీతో మాటలాడను. నేను లేచిపోదును.

సం-[ఆతని పట్టుకొని] ఏమి నీవుమనగోష్ఠిని చెఱతువా?

౨ ముసలి-నన్ను పోనీ లేదా నేను వారినీ వీరినీ సాయం పిలుస్తాను.

సం-నేను పోనీయను. నీ కేమి హక్కు కలదు-వారి-

౨ ముసలి-ఈ హక్కు. [అని కొట్టును.]

సం-[మిగిలిన వారితో] అయ్యో అయ్యో చూశారా?

[వారొకరిపై నొకరు పడి అందఱూ కలగలుపుగా మాటలాడుదురు.]

౧ ముసలి-ఎందుచేత నంటే పండుగ కాఁబట్టి పనీ పాటా లేకుండా రిజాలాగా కాలక్షేపం చేస్తున్నాం కాఁబట్టి.

౨ ముసలి-నే సంతయు సమకూర్పఁగలను.

3 ముసలి-మాకు కొంచెము పోయ్.

సంసారి-[భార్యతో] మరో సీసా పట్టుకో రా.

[అందఱు మరల గుండ్రముగా కూర్చుండి త్రాగుదురు.]

పాలేరు-[భూతాధిపతితో] నీవు గ్రహించితివా? వారిలోని తోఁడేటినెత్తురు జాగరిల్లఁజేయఁబడినది. అట్లుకాఁగా వారు తోఁడేళ్లవలె భయంకరులై పోయిరి.

భూతాధిపతి-అది మంచి పానీయము. నాకు సంతసముగా నున్నది. తృప్తి అయినది.

పాలేరు-కొంచె మాఁగు. మూడవ సీసా ఖాళీ కానిమ్ము. విషయము లింకను మరీ తృప్తిగా నుండును.

౬ వ అంకము.

[ఊరివీధి. కడిప్రక్క కొందఱు ముదిమలును తాతయు దుంగలమీద కూర్చుండియుందురు. వీధినడుమ స్త్రీలు మగపిల్లలు ఆఁడుపిల్లలు వలయాకారముగా ఉందురు. వారందఱు గుండ్రముగా తిరుగుచున్నా ఆట ఆడుచుందురు. కల్లుపాకనుండి గోల వినఁబడును. త్రావుటచేఁ గలుగు త్రుళ్లింతల చప్పుడు వినఁబడును. ఒకము సలివాఁడు తూలుమాటలతో కరతాళముచేయుచు వచ్చును. సంసారి అతనిముందు నడచుచుండును.]

తాత-ఆహా: ఎట్టి పనులు! ఎట్టిపనులు! ఏరువాక పున్నమనాఁడు పాలేరుల కుదుర్చుకొనుట నాఁగళ్లు చేయించుకొనుట ఏఁడికోలలు చెక్కించుకొనుట మోకులు పలుపులు వేయుట ఈ మొదలైనవి కాని భార్యాబిడ్డలతో పెద్దలతో తన సంసారపు చిక్కులు సంప్రతించుటకాని పురాణము వినుట కాని ఇటువంటివి కాక-ఇంతకంటె వేఱే ఏమిపను లుండును? కుఱ్ఱవాండ్రగుచో చెడుగుడో లేక ఏదో ఆట. అదుగో ఆడుచున్నారు!-చూడ ముచ్చట అగుచున్నది. [పాకలోపల కేకలూ కేలిసలూ] అయితే ఈమాదిరిపను లెట్టివి? ఇవి దుర్మార్గములలోనికి దింపును. ఇవి రాక్షసకృత్యములు. ఇవి వారికి ఆనందకరములు. కావలసినదానికన్న ఎక్కువ ఉండుచో ఇటువంటిబుద్ధులుపుట్టును.



[తప్పఁద్రావి తూలి పడుచున్న మనుష్యులు కొందఱు ప్రవేశించి చప్పటులు చఱచుచు ఆఁడుపిల్లలను పట్టుకొందురు.]

ఆఁడుపిల్లలు-వదులు బుల్లెన్న తాతా! ఛీ ఏమిటది? నీకు మతిపోయిందా?

మగపిల్లలు-ఓయ్! మన మందఱము సంతలోకి పోదాం. ఇక్కడ ఆడ్డానికి ఇఁక వీలు లేదు.

[ఆడుకొనుచున్న వారందఱు నిష్క్రమింతురు.]

సంసారి-[తాతకడ కేగి] నీ కిపు డేమి దక్కినది? పెద్ద లందఱు సమస్తమును నాకే యిత్తురు. [బుగ్గలు పొడిచి] ఇది నీకు. తెలిసినదా? అంతయు నాదే! నీ కేమియు లేదు. వారంతట వారే నీతో ఇటులు చెప్పుదురు లే. [గ్రామ-పెద్దలు నలుగురు ఒక్కసారిగా చెప్పుదురు.]

౧ ముసలి-ఏల యనఁగా ఏది యెట్టిదో నాకు తెలుసు. [అని తూలుమాటలతో చెప్పును.]

౨ ముసలి-అందఱూ నామాటవింటారురా
ఎందుకంటే వృద్ధపక్షీని రా. [పాడును]

3 ముసలి-మిత్తరమా! పిరియ మిత్తరమా!
పిరియతరమిత్తత్తరమా!

౪ ముసలి-పాకలో వెంకాయి పక్కలో వెంకాయ్
ఏకన్నె ఎక్కడా తల దాఁచుతుందోయ్

[అనిపాడుచు] ఇహ రండి.

[గ్రామ-పెద్దలు పరస్పరము హస్తముల గ్రహించి తూలుచు జంటజంటలుగా ఒకజంట వెనుక ఒకజంట నిష్క్రమింతురు. సంసారి పాకకై మరలి కొన్ని అడుగులు వైచి చేరక ముందే క్రిందపడిపోయి తెలియరానిమాట లాడును. గురుగురుమని ధ్వనిచేయుచుండును. తాతయు ఆటవన్న మనియలును లేచి ఆవలకు వెళ్లిపోవుదురు. పాలేరు భూతాధిపతియు ప్రవేశింతురు.]

పాలేరు:-చూచితివా ఇపుడు వారిలోని పందినెత్తురు ఉద్గతమైనది. తోఁడేళ్లనుండి పందులుగా మారిరి. [సంసారిని చూపుచు] అదుగో ఇతఁడు డొబురదలో పడి పందివలె గురుగురుమనుచున్నాఁడు.

భూతాధి:-నీవు జయించితివి. మొదట నక్కలు పిదప తోఁడేళ్లు ఇపుడు పందులు! అదీ పానీయ మనఁగా! అది నక్కలు తోఁడేళ్లు పందులు వీని నెత్తురుకషాయ మనుకొందును.

పాలేరు-ఓ కాదు. నే నతనికి ధాన్యముమాత్రమే ఎక్కువ అగునట్లు చేసితిని. తనకు సరిపడునంత ధాన్యము మాత్రమే ఉన్నపుడు నోటిముందరి అన్నపుగడ్డ ఎగురఁ గొట్టినను కోపపడలేదు. ఏమి చేయవలయునో యెఱుఁగనంత ఎక్కువ పంట పండఁగానే అతనిలోని నక్కనెత్తురు తోఁడేటినెత్తురు పై కుబికినది. అతనికి సర్వదా లోన జంతురక్త ముండును. కాని దానిది మాత్రము పై చెయ్యి కాలేకపోయినది.

భూతాధి-మేలు. నీవు ఘనుఁడవు. నీవు నీ అన్నదోషమునకు ప్రాయశ్చిత్తము చేసికొంటివి. ఇఁక వారికి కల్లు త్రాగుట మాత్రమే ఆవశ్యకము. ఇంచుమించుగా వారందఱూ ఇఁక మన వారే.

సమాప్తము



3౮-వ దేశీయమహాజన సభాధ్యక్షులు

మౌలానా మహమ్మదాలీగారు



అఖిలభారత ఖిలాఫత్ సభాధ్యక్షులు

మౌలానా షౌకతాలీగారు



౩౮-వ దేశీయమహాజనసభ సన్మానసంఘాధ్యక్షులు

దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులుగారు



అఖిలభారత విద్యార్థిమహాసభ
సన్మానసంఘాధ్యక్షులు
కళా వెంకట్రావు గారు



అఖిలభారత
హిందీ సాహిత్యసమ్మేళన సభాధ్యక్షులు
సేటు జమ్నాలాలు బజాజు గారు



ఆంధ్రరాష్ట్రీయ సేవకమండలసభ
సన్మానసంఘాధ్యక్షులు
శ్రీయుత బ్రహ్మజోస్యుల
సుబ్రహ్మణ్యం గారు



అఖిలభారత రాష్ట్ర సేవక మండల కార్యదర్శి

హార్డికార్ గారు



ఖద్దరు ప్రదర్శనోత్సవ నిర్వాహకులు

ఆచార్య ప్రఫుల్లచంద్ర రే గారు



అఖిలభారత రాష్ట్ర సేవక మండల

అధ్యక్షులు

జనహారిలాలు నెహ్రూ గారు

భా ర తి

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచపరిస్థితు లతివేగముగ బరివర్తనమును బొందుచున్నవి. ఐరోపా పరిస్థితులు విపరీతముగనున్నవి. ప్రాంతవాసనలు ప్రాంతరాజ్యనీతి యూరపుఖండమును పూర్వమువలెనే బాధించుచున్నవి. జర్మని పతనములో యూరపురాజ్యములస్పర్థ లంతరించుననునాశ నిరాశమైనది. గ్రేటుబ్రిటనుకు మొదటిస్థానము పోయినను ఫ్రాన్సు ప్రధానస్థానము నాక్రమింప జాలకున్నది. నష్టపరిహారసందర్భమునను ఫ్రాన్సు తాను పట్టిన మొండిపట్టును విడువవలసివచ్చినది. ఇటలి బెల్జియములు ఫ్రాన్సు నుద్దేశములతో నారంభమున నేకీభవించినను నిపు డేకీభవింపక ఫ్రాన్సుమనోరథమును భగ్నము చేసినవి. ఇటలీ స్పెయినులు ప్రత్యేకముగ సంధిని జేసికొనినవి. బెల్జియము నష్టపరిహారవిషయమునందు గ్రేటుబ్రిటను అమెరికారాజ్యములతో నేకీభవించుచున్నది. నష్టపరిహారవిషయములందు నూతననిర్ణయమవసరమని గ్రేటుబ్రిటను అమెరికా జర్మని కోరుచున్నవి. ఇటలి బెల్జియము రాజ్యములు కొంతవరకీయభిప్రాయముతో నేకీభవించుచున్నను ఫ్రాన్సు అవలంబించినమార్గమును విరమించుటలేదు. అమెరికా దేశము ప్రత్యక్షముగ యూరపురాజ్యములందు జోక్యమును గలుగజేసికొనుటకుగాని నష్టపరిహారపు ధనరాశిని తగ్గించుటకుగాని నిరాకరించినది. ఫ్రాన్సు రూరు ప్రాంతాక్రమణమునందు పట్టినపట్టును తగ్గించుటలేదు. రూరు ప్రాంతమును ప్రత్యేకరాజ్యముగను జేసి నష్టపరిహారసమస్యను నిర్ణయింపవలయు నని కోరుచున్నది. ఈవ్యవస్థను జర్మనిగాని యితర యూరపురాజ్యములుగాని యంగీకరించుట లేదు. స్థలాక్రమణమును జేసి స్థిరాసనమును వేసిన ఫ్రాన్సుదేశమును రూరు ప్రాంతమునుండి కదలించుటకు సాధనము సామ దాన భేదోపాయములను యూరపు రాజనీతిజ్ఞులకు గోచరము గాకున్నది. ఈ పీఠమునందు యూరపుఖండమునకు మహాసంగ్రామబీజములు సుప్రతిష్ఠితములు. రూరు ఆక్రమణము జర్మని జీవప్రవాహమును ప్రత్యక్షముగను యూరపు వ్యాపారసంపదలను ముఖ్యముగను బ్రిటీషువ్యాపారసంపదలను పరోక్షముగను బంధించినది. పరదేశాపేక్ష జీవనాధారమైన దేశముకీ స్పర్ధయును స్పర్ధఫలమైన సంరంభమును సహజావస్థలు. సంగ్రామానలము చల్లారకపూర్వమె సంగ్రామసామగ్రి తిరిగి సిద్ధమగుచున్నది.

* * * *

జర్మనిదేశము స్వయంకృతాపరాధమునకు ఫలము ననుభవించుచున్నది. ప్రజ లన్నాతురులై దుఃఖము ననుభవించుచున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్ర మాహారపదార్థముల కప్పును పెట్టుట కంగీకరించినది. దేశమునందు స్థిరమైన ప్రభుత్వము దుస్తరముగ నున్నది. అనేకప్రభుత్వములు మారినవి. జర్మని వర్సేల్సు సంధి నియమములను ఫ్రాన్సు పాలింపవలయునని కోరుచున్నది. ఫ్రాన్సు దేశాక్రమణమును జేయుటయును ఇతరభాగములు విడిపోవుటయును వర్సేల్సు సంధినిపాలించుటకు ప్రతిబంధకములను మొలబెట్టుచున్నది. నష్టపరిహారమునుసఫలముచేయుటకు 1. దేశప్రాంతము స్వాధీనము గావలయుననియును 2. అప్పులను జేయుట కానుకూల్యమును గల్పింపవలయు ననియును 3. నష్టపరిహారసమస్య పునర్వి

మర్శనమును బొందవలయు ననియును జర్మని కోరు చున్నది. డిశంబరు మాసాంతమునందు పేరిసునందు గూడనున్న నష్టపరిహారోపసంఘము మేమి నిర్ణయించు నదియును కాలము తెలుపగలదు. బలవంతమైన ఫ్రాన్సుదేశమునకు జేసెడి మొఱ అరణ్యరోదనముగ నున్నది. రూరు ప్రాంతమును ఫ్రాన్సువశమును జేసిన పక్షమునకు జర్మనుమొఱలను ఫ్రాన్సు ఆలకించు ననుటకు సూచనలు గానిపించుచున్నవి.

* * *

గ్రేటుబ్రిటను పరిస్థితులయోమయముగ నున్నవి. అనుద్యోగసమస్య ప్రత్యక్షముగ దుఃఖ కారణముగనున్నది. ఈసమస్యను నిర్ణయించుటకు బాల్డువినుగారు పన్నిన మాయోపాయము ప్రజలను మోసపుచ్చజాలదు. సంరక్షణవ్యాపారనీతిని ప్రకటించిన బాల్డువిను పక్షమునకు ఎన్నికలయందు పరాజయముకలిగి ఎన్నికలు ప్రయోజనశూన్యము లైనవి. కన్సర్వేటివు పక్ష సభ్యులసంఖ్య 346 నుండి 259 కి తగ్గినది. లిబరలుపక్ష సభ్యులసంఖ్య 117 నుండి147 కిని లేబరుపక్ష సంఖ్య 144 నుండి 187 కిని హెచ్చినవి. కన్సర్వేటివు పక్షపు రాజ్యనీతిని ప్రజలు నిరసించినవిధమును ఎన్నికలు రుజువుచేసి నవి. లేబరుపక్షము క్రమక్రమముగను వికసించు చున్నది. ఆదర్శములందు భేదము గల యీమూడు పక్షములందును ఏరెండుపక్షములకును సంయోగము సాధ్యముగాదు. రాజ్యభారమును నిర్వహించుటకుశక్తిలేనిబాల్డువినుపక్షము రాజీనామా నీయక పదవులను బట్టుకొని వ్రేలాడుచుండుట విచిత్రముగ నున్నది. అనతికాలముననె తిరిగి ఎన్నికలు సంప్రాప్తమగుట సంభవముగ నున్నది. లిబరలుపక్ష విజయము సంతృప్తికరమైనను భారతదేశమున కధిక మైన ప్రయోజనము గలుగదు. భారతదేశపు ముక్తి భారతదేశవాసులవలననె కలుగవలసియున్నది.

* * *

భరతఖండమునందంతటను ఎన్నికలు జరిగినవి. లిబరలుపక్షము సంపూర్ణముగ మాయమైపోయినది. నిరంకుశాధికారవర్గమునకును సహకార సోదరులకును నీ పరాజయము జ్ఞానోదయమును గలుగజేయవలసియున్నది. మంత్రులైన సర్ సురేంద్రనాథ బెనర్జి పరాంజపే చింతామణి సీతల్వాడు గారులు పరాజయమును బొందినపుడు లిబరలు పక్షపు భవిష్యము బయటపడినది. స్వరాజ్యపక్షము కొంతవఱకు విజయమును బొందినది. ఆ పక్షము వారు డిశంబరు మాసాంతమునందు కాకినాడ యందును జనవరి మాసారంభమునందు ప్రయాగ యందును గూడి కార్యవిధానమును నిర్ణయించునటులు దేశబంధుదాసుగారు ప్రకటించిరి. స్వరాజ్య పక్షమునందు గలవారేకభావముతో గలసి పని చేయుటకనకాశములు లేని విధమును చెన్నరాష్ట్ర శాసనసభయందలి శ్రీయుత సత్యమూర్తిగారి ప్రవర్తనము వ్యక్తము చేసినది. సత్యమూర్తిగారు కమిటియందు సభ్యులుగ జేరుచున్నారు. ప్రభుత్వ సహాయము నపేక్షించెడి తీర్మానముల నామోదించుచున్నారు. దేశబంధుదాసుగారు లిట్టను ప్రభుపువలయందు జిక్కుకొనక యధికారస్వీకారమును నిరాకరించుట సమంజసముగ నున్నది. వంగ రాష్ట్రసభయందు 45 గురు స్వరాజ్యపక్షమువారు గలరు, అధికసంఖ్య గల స్వరాజ్యపక్షసహాయము లేకను లిట్టనుప్రభుపు రాజ్యాంగరథము నెటులునడప గలడో కాలము వ్యక్తముచేయఁగలదు. సహకార ధర్మము నవలంబించుటకు 1. రాష్ట్రీయ స్వపరిపాలనమును 2. గాంధిమహాత్ముని విమోచన

మును 3. రాజకీయ నిర్బంధితుల విమోచనమును 4. నిర్బంధ శాసనముల సంహారమును దేశబంధు దాసుగారు గోరుట సమంజసమైనను స్వరాజ్యసిద్ధి వీనివలనను గలుగజాలదు. స్వరాజ్యపక్షము వా రన్ని సందర్భములందును నేవిధముగ నాస్థితిని మార్చుకొనవలసివచ్చునదియును నీ సంద ర్భములు విశదముచేయుచున్నవి. సామ్రాజ్య శాసనసభయందు స్వరాజ్యపక్షమున కధికబలము గలుగు నని ఎన్నికల ఫలములు తెలుపుచున్నను పరి ణామముమాత్రము సంశయాస్పదముగ నున్నది.

* * * *

చెన్నపురి రాష్ట్రమునందు ఎన్నికలు నూతనా కృతిని దాల్చినవి. మొదటి ఎన్నికలందు నిరాటంక ముగ గెలిచినవా రీ యెన్నికలందు విశేషశ్రమపడ వలసివచ్చినది. జస్టిసు పక్షమువా రన్నిద్వారము లను నధికారబలముచే బంధించినను ప్రజాభిప్రాయ ము కొంతవఱకు విశదమైనది. బ్రాహ్మణేతరపక్షము సహజముగ నిలిచియున్నను నిరంకుశత్వమును పోషించిన జస్టిసుపక్షమధోగతిపాలైనది. కట్టమంచి రామలింగారెడ్డిగా రుపపాదించిన "అవిశ్వాస తీర్మానము" ఓడిపోయినను జస్టిసు పక్షపు పస బయటపడినది. అధికారసభ్యులసహాయముతో మంత్రులు వ్యవహరించుట రాజ్యాంగధర్మమునకు విరుద్ధమైనను అధికారకాంక్ష యవినీతికి మూల మగుచున్నది. శ్రీరాజా పానుగంటి రామారాయనిం గారి మంత్రిత్వకాల మనతికాలమున నె యంతము నొందిన విచిత్ర ముండదు. మాంటుఫర్డుసంస్కార ణముల వైపరీత్యమును శాసనసభావ్యవహార క్రమము విస్పష్టము చేయుచున్నది.

* * * *

శ్రీయుత పండిత వంగూరి సుబ్బారావుగారి యొక్కయు శ్రీయుత కావ్యనిధి చెలికాని లచ్చా రావుగారియొక్కయు అకాలమరణ మాంధ్రదేశ మును దుఃఖాక్రాంతము చేసినది. లచ్చారావుగారి పోషణముక్రిందను సుబ్బారావుగారు భాషాసేవను జేయఁగలిగిరి. వీరిరువురును ఆంధ్రపరిశోధకమండ లిని స్థాపించి భాషాభ్యుదయమునకుఁ దోడ్పడిరి. లచ్చారావుగారి యకాలాకస్మికమరణము సుబ్బా రావుగారిమరణమునకు దోడ్పడినది. సుబ్బారావు గారు భారతి కెంతయో సహాయముచేయవలయునని తలఁచియుండిరి. భారతికి వారివ్యాసాలంకారమును బడయఁగల యదృష్టము గలుగ లేదు. వీరిరువురును మృతు లైనను వారి నామవిలాసములు చిరకాల మాంధ్రవాఙ్మయమునందు ప్రతిష్ఠను బడయు చుండఁగలవు. సదాశివుడు వీరియాత్మలకు శాంతిని వీరి కుటుంబములకు దుఃఖోపశమనమును ననుగ్ర హించుగాక!

---

# గౌఁళ్ళ చెల్లాయి కూతురు

అడివి బాపిరాజు గారు, బి. యే.

గాఁళ్ళ చెల్లాయి కూతురు
కడుచక్కఁదని జూతురు!
దానికళ్ళు నీలిగుళ్ళు
దానిపళ్ళు మొగలిముళ్ళు,
దాన్నిపలకరిస్తె వళ్ళు
మోహానా గగురుపుళ్ళు! గాఁళ్ళ.

వెఁడివడ్డాణాఁ మొలకు
సన్నాగాజులు చేతులకు,
మెడను వేసిఁ దీ తీరు
పిల్ల కాసులా పేరు! గాఁళ్ళ.

కల్లుకన్నా రుసి కలుగు
దానిపెదిమె కెఁపువెలుగు,
దానిచేతిసోలు కొఁటే
సొర్గాసౌక్య మేమిటంఁటే! గాఁళ్ళ.

డబ్బులిస్తూ ప్రస్సు వేళ
దిట్టరివాఁడైన తాళ,
లేక రాగి బిళ్ళ బదులు
వెఁడిడబ్బు లిచ్చి కదులు! గాఁళ్ళ.

---

# తిరుపతి యాత్ర

నండూరి వేంకటసుబ్బారావు గారు, బి. యే.

యెంకీ నాతోటీ రావే!
మన
వెఁకటేశరుణ్ణి మెల్లీ సూశొద్దాము
మెఁకీ నాతోటీ రావే!

ఆవుల్ని దూడల్ని
అత్తోరి కాడుంచి
మూటా ముల్లీ గట్టి
ముసిలోళ్లతో సెప్పి మెఁకీ నాతోటీ రావే!

ఆసామీ మీదెన్నో
వూసూ లాడూకొఁట
కొండామెట్లన్నీ నీ
కొంగట్టు కెక్కాలి యెంకీ నాతోటీ రావే!

శేతిరి పగటేల
శెప్పెయ్య కెఁకీని
సల్లంగ సూడమాని
సామీతో సెప్పాలి
యెఁకీ నాతోటీ రావే!
మన
వెఁకటేశరుణ్ణీ మెల్లీ సూశొద్దాము
యెంకీ నాతోటీ రావే!




చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౨౪

సంపుటము ౧. రుధిరోద్గారి సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨.

# గాంధి శతకము

మంగిపూడి వేంకటశర్మ గారు

భూతదయ కాలవాలము
నీతికి నిధి నిత్యసత్యనియతి నెలవు వి
స్ఫీతసుశీలముఖుని భవ
కాతరులకు రక్ష గాదె గాంధిమహాత్మా.

క. చెలఁగి రిటఁ జక్రవర్తులు
వెలసిరి బహురాజనీతివిద్యావిదులై
గులగిరిధీరులు శూరులుఁ
గలిగిరిగద పూర్వ మిందు గాంధిమహాత్మా.

క. పణతులును శస్త్రశాస్త్రము
ఫణితు లెఱిఁగి సాహసమున బగతురశిర
ముల్ పుణికి యగణ్యపు గణ్యత
గణియించి వెలుంగలేదె గాంధిమహాత్మా.

క. తనమాంస మిచ్చె నొక్కఁడు
తనవెన్నముకిచ్చె నొకఁడు తనువొకఁడిచ్చెన్
ధనధాన్యము లిడు టరుదా
ఘనదాతలు భరతభువిని గాంధిమహాత్మా.

క. శాపానుగ్రహశక్తులు
తాపసచంద్రులు పతివ్రతలు సుకవీంద్రుల్
దీపించిరి ము న్నచ్చటఁ
గాపురుషుల గుండె లదర గాంధిమహాత్మా.

క. చీమలకు హాని సేయరు
పాముల బెబ్బులులఁ జంప భావింపరు ప్రో
ద్దామదయాధామయశః
కాములుగద భరతసుతులు గాంధిమహాత్మా.

క. తనుఁ జంప వచ్చు శత్రువు
తనచేతనె భంగ మొంది తను శరణన్నం,
తనె యభయ మిచ్చి ప్రోచెడు
ఘను లార్యులు గాక కలరె గాంధిమహాత్మా.

క. తనధనముఁ దనదు ప్రాణముఁ
దనమానముఁ గూడ మదినిఁ దనునమ్మినయా
తని కై యర్పణఁ జేసెడు
ఘనులొండొకభూమిఁ గలరె గాంధిమహాత్మా

క. తనసామ్రాజ్యముఁ దనసతిఁ
దనసుతు సత్యమున కిడు వదాన్యోత్తము నె
క్కని లోక మెల్ల వెదకినఁ
గనఁగల మే యిందుఁ గాక గాంధిమహాత్మా.

క. తన రాజసుతుని ప్రాణా
వనమున కై తనదు సుతుని ప్రాణము బలియి
చ్చినయంగనామణుల భువిఁ
గనఁగల మే యిందుఁ గాక గాంధిమహాత్మా.

క. తనబిడ్డల నిద్రాణులఁ
దునిమిన ఖలుఁ దును ముని భుని తో మొఱలిడి
తజ్జననీశోకము మాన్పిన
కనికరపుంగనులు గలరు గాంధిమహాత్మా.

క. భారతవర్షమహత్త్వమె
మారె నిటీవలను దాని మార్చితి వౌరా
కోరి యహింసాధర్మము
గారవమున బోధ సేసి గాంధిమహాత్మా.

క. చోరుల జారులను దురా
చారులఁ గ్రూరులను సుగుణసంపన్నమహో
దారులఁ జేసితి వౌరా
గారవమున జ్ఞాన మిచ్చి గాంధిమహాత్మా.

క. రాగాంధుల భోగదురు
ద్యోగుల లోభోపహతుల దుర్మతుల మహో
త్యాగమతులఁ జేసితి వా
జ్ఞాగరిమన్ నీవు మరల గాంధిమహాత్మా.

క. ఇల ధర్మరాజొకండే
యలరారె నజాతశత్రుఁ డనఁగా నిపు డీ
వలరితి వజాతరిపుఁడవు
కలియుగమున నెంతవింత గాంధిమహాత్మా.

క. ఖిల మైన యాత్మబలము
జ్జ్వలమయ్యెన్ భరతభువిని భవదీయతపో
బలము మహత్త్వము నెన్నం
గలమయ్యా నిర్మలాత్మ గాంధిమహాత్మా.

క. శోధించి యహింసాపర
మోధర్మ యటన్న సూక్తి ముఖ్యమటంచున్
బోధించి యాచరించితి
గాథలు పెక్కేలమాకు గాంధిమహాత్మా.

క. గుజరాతియందు భగవ
ద్భజనావాసమునఁ బోరుబందరునం దూ
రుజకులమునఁ బుట్టితి వఘ
గజకేసరి నిర్మలాత్మ గాంధిమహాత్మా. ౩౬

క. కేసరియుఁ గర్మచంద్రుఁడుఁ
జేసిన యాపుణ్యమేమొ శ్రీకరముగ నీ
వాసుజనులగర్భంబులఁ
గైసేసితి వలిదయాత్మ గాంధిమహాత్మా.

క. కేసరి కేసరియనఁదగు
కేసరిగర్భమునఁ బుట్టి కరలితి వౌరా
కేసరికిశోరమే యనఁ
గా సరి నీసరి యిఁకేరి గాంధిమహాత్మా.

క. కేసరినందనుఁ డొకఁడే
నీసరి యగునేమొ ఆత్మనిగ్రహశక్తిన్
కాసరవాహనుఁ డొక లె
క్కా సరిధర్మమున నీకు గాంధిమహాత్మా.

క. భూసురబృందములో న
గ్రేసరులును భక్తితోడఁ గొల్మొత్తురు నీ
భాసురతేజముఁ గని గం
గాసరిదతిపూతచరిత గాంధిమహాత్మా.

క. దాసరులై నీయాజ్ఞల
కోసరమైయెపుడుఁ గోట్లకోలఁది సహచరుల్
వేసరక వేచియుందురు
క్ష్మాసురవినుత ప్రభావ గాంధిమహాత్మా.

క. మోహనగుణవిలసితుఁ డని
మోహనదాసనుచు నామ మునిచిరి నీకున్
మోహనముగ నీగురు లవ
గాహనులై హర్షకంధి గాంధిమహాత్మా.

క. నీజనని విదుషి యగుటను
తాఁజెప్పెను నీకు స్వమతధర్మములెల్లన్
మోజుగ బాల్యమున నదే
గా జీవిత మిట్లుమార్చె గాంధిమహాత్మా.

క. బాయఁగఁ జేసిరి నీకున్ [భో
ఛాయగ నీ హృదయమెఱిఁగిచరియించుశు
పాయిని, నిరుపమశుచిగం
గాయినిఁ గస్తూరిబాయి గాంధిమహాత్మా.

క. కేసరికడఁ దొలివిద్యా
భ్యాసముఁ గావించి హూణభాషను బడి స
భ్యాసముఁ జేసితివంట ప్ర
జ్ఞాసాగర నిర్మలాత్మ గాంధిమహాత్మా.

క. దీక్షను జదివి ప్రవేశప
రీక్షను గెలుపొంది హితులుప్రేరేపఁగ నాం
గ్లక్షితి బారెట్లా యను
కౌక్షేయక మందినావు గాంధిమహాత్మా.

క. అలదక్షిణాఫ్రికాలో
పలఁగలవ్యాజ్యమున భరతవర్తకులవహిన్
నిలువ బలువడిగఁ జని యా
కలహమునజయించినావు గాంధిమహాత్మా.

క. భారతులందఱు నీసహ
కారం బాసించి యచటఁ గాఁపురముండన్
గోరఁగ వారలకోరిక
గారవమునఁదీర్చినావు గాంధిమహాత్మా.

క. అట నిను గొందఱు బోయరు
కుటిలమతులు పరిభవించి కుండించిరి యు
త్కటకష్టములన్ ముంచి ర
కటనీమహిమెఱుఁగలేక గాంధిమహాత్మా.

క. హైందవులనాయకుఁడవై
యందఱకును సాయపడుచు నట విజ్ఞానా
నందులఁ జేసితి వందఱఁ
గ్రందుగ బోధలనొనర్చి గాంధిమహాత్మా.

క. అందఱును నీతిమంతుల
నందఱు సత్యవ్రతులను నతిశాంతదయా
సుందరులఁ గార్యశూరులఁ
గందువగతిఁ జేసినావు గాంధిమహాత్మా.

క. నీసంపాదన మంతయు
నీసహదేశీయజనుల నిత్యక్షేమం
బాసించి వెచ్చఁబెట్టితి
గా సహజౌదార్యధుర్య గాంధిమహాత్మా.

క. కరపత్రంబులు పత్రిక
లరుదగుపొత్తములు వ్రాసి హైందవులకు
రాజ్యరహస్యతంత్ర మెల్లను
గరబదరముఁ జేసినావు గాంధిమహాత్మా.

క. నీనేర్పువలన హైందవు
లానందముతో మితవ్యయముతో సిరితో
జ్ఞానముతో విలసిల్లఁగఁ
గానఁగలేరైరి శకులు గాంధిమహాత్మా.

క. స్థిరముగ భారతు లుటఁ గాఁ
పురముండుట కిష్టపడక బోయరు లీర్ష్యా
పరవశులై నిష్కరుణా
కరులై కడగండ్ల నిడిరి గాంధిమహాత్మా.

క. ఆదటను నలుపుఁ దెలుపు వి
భేదంబును మదులఁ జొనిపి బెడిదపు బెడఁదల్
సోదర హైందవుల కిడిరి
కాదని మొఱవారు లేక గాంధిమహాత్మా.

క. తలతలకు పన్ను గట్టిరి
స్థలముపదలఁ గూడదని ముదలఁ బెట్టిరి వ్రే
ళులముద్ర లొకటి పెట్టిరి
ఖలులై న్యాయమును నెట్టిగాంధిమహాత్మా.

క. బడులందుఁ జదువఁ గూడదు
నడుదారుల నడువరాదు నాళ్లనడుమ నె
న్నడు నలుగురితో సరిగాఁ
గడుకొని నివసింపరాదు గాంధిమహాత్మా.

క. గడియింపరాదు పొలములు
గడుధనికుండైన వర్తకము సేయఁగ రా
దడరి బజారులలో నం
గడులిడి బాహాటముగను గాంధిమహాత్మా.

క. గడుమన్నెమైన దేశముఁ
గడుఫలవంతముగఁ జేయఁ గడుగడగండ్లన్
బ నట్టి హైందవుల క
క్కడ నిలువగ నీడలేదె గాంధిమహాత్మా.

క. ధనమధికమిత్తుమని న [యా
చ్చిన సదుపాయమ్ము లెన్ని చేయుదు మని
నను గొలిపి తొల్లి బలువ
క్కణములు సేయంగ లేదె గాంధిమహాత్మా.

క. నదిదాటి తెప్పగాల్చు ప
గిదిఁ దమపనితీఱినపుడు గౌరవములు చే
యుదు రే బోయరు లిది యం
గదలకు మూలంబుగాదె గాంధిమహాత్మా.

క. తెల్లనివారే ఘనులును
నల్లనివారెల్ల నీచ నరులను భావం
బల్ల సిరిమీది భ్రమ యీ
కల్లరిపనులకు మొదళ్లు గాంధిమహాత్మా.

క. పడవలును రైళ్లు బళ్ల
క్కడివారలతో సమంబుగా నెక్కఁగ రా
దెడలేక కలసి మెలఁగుట
గడుఁదప్పట వారితోడ గాంధిమహాత్మా.

# శ్రీ సూక్తము

## వేంకట పార్వతీశ్వర కవులు

### నాంది

శ్రీ మనోహరనూపురాశింజినాద
మాదనుకరింపు హృదయవీణారవమున
మృదుమధుర సుస్వరములతో మేళవించి
యఖిలసృష్టికి శ్రీసూక్త మగునుగాక!

శ్రీ:—(సమీపించి) ఆర్యా! ఇంకను యోగ నిద్రాముద్రితుండవై యుంటివేమి?

పురుషుఁడు:—(మేల్కాంచి తనలో) నన్ను మేల్కొలిపిన యీ మనోహరనూపురారవ మెవ్వరిది? (పరికించి) కల్యాణీ! నీ వెవ్వరు?

శ్రీ:—కల్యాణము నపేక్షించి వచ్చినకన్యకను.

పురు—వత్సా! నీవు ధన్యురాలవు.

శ్రీ:—పురుషోత్తమా! నీయాశీర్వాదసూక్తిచే నే ననుగ్రహింపఁబడితిని.

పురు:—శోభనాంగీ!

ఆ. మఱపులోన మంద మధురగానములోనఁ
దెలియఁబడనియట్టి తెలివిలోన
మనసునిలిపి మేను మఱచియుండిననన్నుఁ
గలఁచి యేల మేలుకొలిపినావు?

శ్రీ:—సుకవిచంద్రా! కల్పనాతీతములగు నీ భావములవలెనే నీపలుకులును దలఁపుల కందకున్నవే! నన్ను నీవు మేలుకొలిపితివా; నిన్ను నేను మేలుకొలిపితినా?

పురు:—ఏమిది! నిన్ను నే నెఱుంగనైన నెఱుంగనే!

శ్రీ:—మేరువును దృణముగను దృణమును మేరువుగను జేయుటకై యింటికిని మంటికిని సూత్రములను బన్ను నవసరమున నిన్ను నీవే మఱచిపోవుచుందువు. ఇఁక నామాటఁ జెప్పవలయునా?

పురు:—నీ పలుకులు గడువింతగా నున్నవే! అట్లయినచో నిన్నే నేను పిలిచి మేలుకొలిపితినా?

శ్రీ:—కాకున్నచో స్వయముగ నేనే వచ్చితినా?

క. కలఁగనుచుంటివో, సరిగా
మెలఁకువరాలేదో, మతిభ్రమించినదేమో
పిలువని పేరంటమునకు
బలిమిని వచ్చితినె తెలిసి పలుకఁగవలదే!

ఆ. చదువుకొన్నవారు సామంతు లగువారు
కులము గుణము గలుగు గొప్పవారు
తలలు గొట్టుకొనుచుఁ బిలిచినఁ బలుకని
చెలువ నింతయలఁతిఁ జేసె దేల?

పురు:—ఇన్నిమాట లేల? నీ వెవ్వరో చెప్ప రాదా?

శ్రీ:—చెప్పుట కేమున్నది? నేను కన్యను.

పురు:—కన్యకవా? అయినచో నీయవగుంఠనమేల?

శ్రీ:—అది కాంతలకు— కులకాంతలకు రక్షకమైనదిగదా!

పురు:—ఏమనుచున్నావు? కులకాంతవా! నీ పలుకులు పరస్పరవిరుద్ధములుగా నున్నవే!

శ్రీ:—మీరే యిట్లనుచున్నచో నిదియును నాకొకయలంకారమే.

పురు:—అసత్యవాదినులగు నాఁడువాండ్ర కన్నియు నలంకారములే.

శ్రీ:—ఆ యలంకారము లన్నియు మీరు కల్పించుకొనుచున్నవే గావా?

ఆ. మెఱుపుఁదీవియలను । మిసులగుత్తులుగోయ
వెలఁదివెన్నెలలను । వెన్నఁ దీను;
కలికిచూపుగములఁ । గఱకుటమ్ములు సేయ
నేర్చుమీకుఁ బలుకు । నేర్పవలెనె?

పురు:—ఓహెూ! నీవు చదువులసానివలె నున్నావే!

శ్రీ:—ఈచదువ్వులసానితనమునకు మీయయ్యావారితనమే కారణము.

పురు:—(ఆశ్చర్యముతో) నీవు నాశిష్యురాలవు కూడనా?

శ్రీ:—అవును. నీవే నన్నింతదానిని జేసితివి.

పురు:—నే నేమి చేసితిని?

శ్రీ:—సృష్టి.

పురు:—ఓహెూ! నాకంటె నన్ను నీవే బాగుగ నెఱింగిన ట్లున్నావే! నేను సృష్టికర్తను గూడనా?

శ్రీ:—కాదా మఱి!

ఆ. కన్నుపాపలో జ । గంబులఁ బుట్టించి
మనసుతెరలఁ జాటు । మాటు చేసి
తోఁచి తోఁపకుండ । దోబూచులాడించు
కర్త, సృష్టికర్త । గాక యెవరు?

కవిశిరోమణీ! నన్ను సృష్టించినవాఁడవు నీవే కావా? నాతరళకటాక్షములచేఁ గలువపూవ్వలతోరణములఁ గట్టించినవాఁడవు నీవే కావా? నా చిఱునవ్వదొంతరలచే వెన్నెలమేలుకట్టుల వెలయించినవాఁడవు నీవే కావా? నాపరువంపు మొగ్గదంతంపునిగ్గులచే ముత్యాలముగ్గులు పెట్టించినవాఁడవు నీవే కావా? నా యలవోకవలపుటూర్పులచేఁ గడ లెల్లఁ గమ్మతావులఁ గ్రుమ్మరించినవాఁడవు నీవే కావా? నా జిలిబిలికలికిపలుకులచే సరసంపువిరిదేనియలఁ గురియించినవాఁడవు నీవే కావా? నాయొయారంపువింతసోయగముచే మాయఁ జేసి లోకంబును మఱపించినవాఁడవు—

పురు:—ఏమి యిక్కవితాధోరణి! నిరంకుశముగా నున్నదే!

శ్రీ:—నిరంకుశులు కవులు; నీవు కవివి—నీధోరణియే నేను—నేను కవితను, నీవింద్రుఁడవు—నేను శచిని; నీవు చంద్రుఁడవు—నేను చంద్రికను; నీవు దినకరుఁడవు—నేను దీప్తిని; నీవు పరబ్రహ్మస్వరూపుఁడవు—నేను భారతిని; ఈసృష్టిలో నీవు కావింపని దేమున్నది? నేను కాని దేమున్నది? నేను నీదానను—నీవు నావాఁడవు.

పురు:—(ఆశ్చర్యముతో) కల్యాణీ! నీవేనా! ఎంత వెఱ్ఱినై పోయితిని!

గీ. తెలిసితెలియనితెలివితోఁ । దెలిసికొంటిఁ
జూచిచూడనిచూపుతోఁ । జూచికొంటిఁ
గాని, నీదివ్యమూర్తి, నిక్కముగ, నేఁటి
తీరున నెకప్పుడును జూడ । నేరనైతి.

నీవె నాజీవనతరంగిణివి; నా ప్రేమామృత లతికవు; నాకీర్తిపతాకవు; నాదివ్యశక్తివి; నాసత్యసూక్తివి; నాసూక్ష్మబుద్ధివి; నా తపస్సిద్ధివి—అవును. నాకు నీవు కాని దేమున్నది?

శ్రీ:—పురుషోత్తమా! నీవు స్రష్టవు; నీసృష్టికిని నీకును భేదము లేదు—నేను సృష్టిని; నీకును నాకును భేదము లేదు. కావుననే నే నెప్పుడును నిన్నెడఁబాయ కున్నాను.

గీ. పలుకకుడవచ్చి । మెలఁగుచుందును జెంత
బలుకరింపకుడఁ । బలుకుచుందు,
నిశ్చయముగఁ జూడ । నీతోడిలోకమే
కాక, వేఱేకేమి । గలదు నాకు?

పురు:—ఓదివ్యమూర్తీ! తెలిసినది. నిత్యసత్య స్వరూపిణి వగునీవు నాలోనుండియే న న్నింతవానిగాఁ జేసియున్నావు.

శ్రీ:—కావుననే యోపురుషోత్తమా! నిరంతరము నన్ను నీలో నుండనిమ్ము.

పురు:—దేవీ! నేనెప్పుడు నీకటాక్షకింకరుఁడనే మైయున్నాఁడను. నేను నీయవ్యాజప్రేమకు వశీభూతుఁడనై పోయితిని.

సీ. నీమేనిచాయల । నిగ్గుదేఱినమించు
తీఁగల నుయ్యాల । లూఁగినాఁడ
నీసోయగంబున । నెఱమించుచుక్కని
చుక్కలతేరిపై । నెక్కినాఁడ
నీప్రేమరసమున । నిండినమిన్నేటి
క్రొందమ్మిపువ్వులఁ । గోసినాఁడ
నీనవ్వువెన్నెల । లాసిన నిద్దంపు
టద్దంపుమేడల । నలరినాఁడఁ
దలఁచుకొన్నవేళఁ । బులక లెత్తినవేళఁ
గన్నవేళ మఱపుఁ । గన్నవేళ
నింతలేసి పనుల । నేఁ జేయఁగలుగుట
నీ దయార్ద్రదృష్టిఁ । గాదె దేవి!

శ్రీ:—ప్రభూ! మన యిరువురి నడుమను సేవ్యసేవకభావము లేదు. తన్మయత్వమున నన్ను నీవు కలిసికొనుచున్నావు—నిన్ను నేను గలియుచున్నాను.

పురు:—ఓదివ్యప్రకృతీ! నీసాక్షాత్కారముచే నేను ధన్యుఁడ నైతిని.

శ్రీ:—ఓసనాతనసుకృతీ! నీయాశ్రయ మొసంగి నాకును సనాతనత్వమును బ్రసాదింపుము.

పురు:—శుభాంగీ! భారతీ! మన యీ నిత్యసమ్మేళనము లోకము నానందతరంగితముగఁ జేయుఁగాక! ఇఁకఁ గోరఁదగిన దేమున్నది?

శ్రీ:—ఆర్యా!

ఆ. భావవీథిఁ దోఁచు:పరమార్థతత్త్వంబుఁ
బలుకుఁడీవలందుఁ । బల్లవించి
దిశల మేలుకొలుపు । దివ్యసంగీతమై
విశ్వమెల్ల నిండి । వెలయుఁగాత!

పురు:—తథాస్తు.

# తెలుఁగుపాట

మంగిపూడి వేంకటశర్మ గారు

చతురగతి రసభరిత కర్ణా
 మృతతరంగములను రచించిన
యతుల లీలాశుకుల నారా
 యణులఁ బాడవె భారతీ! ౨౭

దివ్యశిల్పుల శిల్పకల్పనఁ
 దెగడి నగవెడు నాగ్నజిత్తుని
భవ్యశిల్పపు వింతసంతన
 పనులఁ బాడవె భారతీ! ౨౮

అర్ధరాత్రిని నేటి నీఁదుచు
 నన్నమును గొనిపోయి మాలల
నుద్ధరించిన తెనుఁగుబాపని
 నర్థిఁ బాడవె భారతీ! ౨౯

దోమబాధల నొందుపశువుల
 దురదఁ దీర్పఁగ రాళ్లు పాతిన
కోమలం బగు తెలుఁగుప్రభువుల
 ప్రేమఁ బాడవె భారతీ! ౩౦

జాదువిద్యల నాటి తేజీన
 జాణభాస్కరమంత్రి చతురత
శ్రీదుఁ డగు భాస్కరుని చేగపు
 చెలువుఁ బాడవె భారతీ! ౩౧

తెలుఁగుమాలల నూలు నాణెము
 తెలుఁగు సాలెల నేతపోణిమి
తెలుఁగు పని విన్నాణమును మదిఁ
 దెలిసి పాడవె భారతీ! ౩౨

తెలుఁగు గృహిణుల దివ్యశీలము
 తెలుఁగు మహిళల సాహసంబును
తెలుఁగు బిడ్డల చారుచరితలు
 చెలఁగి పాడవె భారతీ! ౩౩

ప్రాణపతి నిందించు జనకుని
 పలుకుములుకుల కోర్వఁజాలక
మేను విడిచిన సతి సుశీలత
 పూని పాడవె భారతీ! ౩౪

పోరితంబుల విఱిగి వచ్చిన
 పూరుషులఁ బురికొల్పి పంపిన
వీరమాతల వింతకతలను
 చేరి పాడవె భారతీ! ౩౫

చేత మలరఁగ మొల్లతావుల
 రీతు లొలయఁగ మధురవాణుల
కైత లల్లిన మోహనాంగుల
 కతలఁ పాడవె భారతీ! ౩౬

రామరాజ్యము చందముగ నభి
 రామముగ రాజ్యముల నేలిన
కోమలాంగుల బుద్ధికుశలత
 కోరి పాడవె భారతీ! ౩౭

గొనబు మించిన దేశభాషల
 తెనుఁగు లెస్స యనంగ నొప్పిన
యనుపమానపు బిరుదు సార్థక
 మనఁగఁ బాడవె భారతీ! ౩౮

తెలుఁగు మీఱిన దన్న సామెత
 తెలుపుచున్న తెలుంగుప్రతిభను
తలఁపఁ జేయుచుఁ దెలివితేటలు
 మెలపి పాడవె భారతీ! ౩౯

గౌతమీకృష్ణాపినాకీను
 లాతరఁగతీఁగలను మీటుచు
నేతలినిఁ గీర్తించు నామన
 మాతఁ బాడవె భారతీ! ౪౧

---

౨౯. డొక్కా జోగన్నగారు, ౩౦. ధర్మ అప్పారావన్న బిరుదుగన్న నరసింహాప్పారావుగారు, ౩౧. గుంటుపల్లి భాస్కరమంత్రి, రాయని భాస్కరమంత్రి. ౩౪. సతీదేవి, ౩౫. ఖడ్గతిక్కనతల్లి, భార్య మొదలగువారు, ౩౬. మొల్ల, మధురవాణి, మోహనాంగి మొదలగువారు, ౩౭ రుద్రమదేవి.

# ఆంధ్ర వాఙ్మయమున ఆంగ్లసారస్వత ప్రోద్బలము

దేవులపల్లి అప్పలనరసింహంగారు, ఎమ్. ఏ., ఎల్. టి

(గతసంచికానుబంధము)

### III. మన గద్యవాఙ్మయము

౧. మన గద్యవాఙ్మయము ముఖ్యముగా ఇంగ్లీషుభాషలో ప్రాముఖ్యము గాంచిన గద్య గ్రంథములయొక్క ప్రోద్బలముననే ఏర్పడినదని చెప్పవచ్చును. భారత భాగవతముల లోను తదితర కావ్యములలోను గద్యమిశ్రణము చాలా యున్నను అదియు పద్యకవితకు తగిన యమకానుప్రాసశ్లేష రూపకాతిశయోక్తి ఉపమాభూయిష్ఠమై తఱుచుగా కఠినసమాసగుంఫితమగు శైలిలోనే యుండును. రసము లన్నియు ఇందులోకూడ గలవు అని చూపుటకొఱకు పెక్కు కావ్యములలోనుండి ఉదాహరణములు తీసిన ప్రయోజనము లేదు. అట్టి గద్యకవితకును పద్యకవితకును వృత్తభేదము తప్ప వేఱొకభేదము లేదు.

గద్యమునకు అలంకారము అక్కఱలేదా? యని ప్రశ్నించినచో నేను చెప్పునది ఏమనగా:- గద్యము మితముగా అలంకారములను స్వీకరించినను దాని ముఖ్యలక్ష్యము అంశములను విరివిగాను క్రమప్రకారముగాను సుబోధముగాను చెప్పుటయైయున్నది. పద్యమున గ్రంథకర్త తన మనోభావప్రవాహమును తప్ప చదువరియొక్క మనస్సును తనతో ఎగురుటకు అతనికి శక్తి గలదా లేదా యనుటను గమనింపడు. పల్కులరాణియొక్క ఆదరణకు పాత్రుడై సృష్టిలోని వైచిత్ర్యములను కష్టసుఖములను గాంచి పరవశుడై అట్టి భావప్రవాహసరళిని అనుకరించు వాగ్జాలమును వృత్తపరంపరను ప్రయోగించును. ఇందలి లక్ష్యము తన భావములను గలంచి యుద్రేకింపజేయు విషయములను తన మనఃప్రతిభకు సమముగ చిత్రించుటయే. గద్యకారు డన్ననో చదువరియొక్క గ్రహణశక్తిని, చెప్పబోవు కథలయొక్క నీతిని, వర్ణింపబోవు వస్తువులను వాటి స్థితులను, వీనియందలి క్రమమును లక్ష్యముగానుంచుకొనక తప్పదు- అందుచే మన కావ్యములలో గనుపడు "నరసింహదేవుని ఆవిర్భావఘట్టము, గజేంద్రుడు ప్రవేశించు నడవి వర్ణనము" మొదలగు గద్యశిరోమణులు కవిత్వభాగము (Poetry)లో చేర్చబడవలయునే గాని గద్యవాఙ్మయమున జేర్చవలను పడ దని నా యభిప్రాయము. ఇట్టి కావ్యములలోకూడా వేదాంతమును బోధపర్చుపట్లను, అవతారములు లెక్కించుపట్లను పోతనకవి అనతిక్లిష్టమును, అలంకారములు తక్కువగా గలదియు నైన గద్యనే ప్రయోగించియున్నాడు. పాండవులు వనవాసమున కేగు సందర్భమున కవితాలంకృతులను సహా

యముచేసికొనియే ఆ కష్టదశలో పాండవు లును ద్రౌపదియును కనుపఱ్చిన అత్యున్నత భావస్ఫూర్తిని గలుగజేయు ధీరతను ఆత్మ నిగ్రహమును మిక్కిలి ప్రతిభతో అత్యున్నత మైన వాక్యసరళి గలగద్యతో నన్నయ ప్రదర్శించియున్నాడు. కవిత్వప్రతిభ ఇట్లు ఒకప్పుడు గద్యను, ఒకప్పుడు పద్యమును ఉపయోగించుకొన్నను, మొత్తముమీద గద్యగ్రంథములయొక్క లక్ష్యమును పద్యగ్రంథముల యొక్క లక్ష్యమును వేఱ్వేఱుగానుండు నని చెప్పవలసియున్నది.

౨. ఇట్టి గద్యగ్రంథములు తెలుగులో వ్రాయుటకు చిన్నయసూరి "నీతిచంద్రిక"యే త్రోవచూపెనని తెలుగువాఙ్మయమున బాగుగా ప్రవీణతగలవారు చెప్పగా వింటిని. ఈ మధ్య దక్షిణజిల్లాలనుండి సంపాదింపబడి యచ్చు పడిన గద్యరామాయణకథ యొకటి చూచితిని. వ్యావహారికభాషలో నున్నది. ఇంపుగా వ్రాయబడినది. ఇట్టివి యింకా దొరకవచ్చును. గిడుగు రామమూర్తి పంతులుగారు కంపెనీ పరిపాలన నాటి లాగ్రంథమును జూపించిరి. మన కావ్యవ్యాఖ్యానములలోను వ్రత కల్పములలోను గద్యము వ్యావహారిక భాషా ప్రయోగములను బహుళముగా నాడినట్లు చూపించిరి. ఇది యథార్థము. ప్రజలందఱికిని తెలియజేయబూనుట గద్యకు ముఖ్యలక్ష్యము. అందులకై అవసర మగుచో నీచభావసంపర్కము లేనటువంటి పదములను వ్యావహారికమునుండి సంగ్రహించి ప్రయోగించుట గద్యకారునకుగాని పద్యకారునికిగాని విధి. మనసు గరగించుపట్లను, పరిహాసముచేయుటయందును వాడుకభాషలోని పదములు మొదలగునవి కవులు వాడుచునేయుందురు. కాని శ్రుతికి అతిపరిచితము లగుటచే గ్రామ్యవ్యావహారిక పదవాక్యసరళులు ఉన్నతభావస్ఫురణ గలుగ జేయుటకు జాలవు. ఇందులకై భాష ఎల్లప్పుడును కొంచెము ఆర్షపదములను రూపములను వెదకుచుండును. ఇవి గ్రంథకర్తలయొక్క సుప్రయోగములవలన ఆధునికభాషాప్రవాహమున తిరిగి ప్రవేశించి దానిని నిలుకడగా పారునట్లు చేయుచుండును. ఇందులో బహుళముగా దేశజనులచే నాదరింపబడు గ్రంథముల శైలియును ప్రయోగములును ఆదర్శముగా నుంచుకొనదగినవి. వీనినిబట్టియే వ్యాకరణశాస్త్రములు తమ సూత్రములను కాలోచితరీతిని మార్చుకొనుచుండవలెను. ఆంధ్రపత్రిక కృష్ణాపత్రికయును ఇట్టి గ్రాంథిక వ్యావహారికపదవాక్యసరళుల క్రమసమ్మేళనమున భాష అభివృద్ధి యగుటకు ఏర్పాటులు చేయుచున్నవి. ఈ పత్రికల దూరదర్శిత్వము కడుశ్లాఘ్యము.

3. గద్యగ్రంథములు పలు రకములు ఇంగ్లీషు వాఙ్మయమున గలవు. అందులో ముఖ్యమైనవి ఆరు:— (a) దేశచరిత్రములు, (b) వ్యక్తిచరిత్రములు, (c) వ్యాసములు, (d) సారస్వతవిమర్శనములు, (e) లేఖలు (f) నవలలు, (g) చిల్లరరకములు. వీనిలోని శైలి, వర్ణన, కథానిరూపణ, ఉద్బోధన, ప్రేరేపణ యను గద్యగ్రంథములకు ఉండెడు ఆశయములను బట్టి సందర్భానుసారేణ మారుచుండెను. ఇం

గ్లీషులో 18-వ శతాబ్దమున ముఖ్యముగా శైలియందు నిర్దుష్టవాక్యప్రయోగము, విస్పష్ట రచనయును ఆదర్శములుగా నుండెను. 19-వ శతాబ్దములో వ్యక్తిస్వేచ్ఛ యధికమై గద్య రచన పలురీతుల వెలువసాగెను. ఒకానొక ప్పుడు కార్లైలు, రస్కిను అను నీతిబోధకుల గద్యములు పద్యకవిత్వము త్రోవలలోనికి ఊగు లాడునట్లు తోచించును. మొత్తముమీద వ్యక్తిప్రభావముల చేత గద్యవాఙ్మయము పద్య వాఙ్మయముతో సమత్వమునకు తేబడెను. అట్టి మహనీయబోధకుల గ్రంథములను చదివి సుమారు 50 ఏండ్ల క్రిందటనుండియు మన ప్రముఖులు గూడ గద్యమును పలు రీతుల వాడ దొడంగిరి ఆంధ్రగద్యశైలికి వీరి చేతులలో వ్యాకరణ కట్టుబాట్లను తప్పకుండా సంస్కృతసమాసకాఠిన్యమును మానుకొని, నిర్మలమై, సులభగ్రాహ్యమైయుండుట ఆశయ మైనది. ఇది గోల్డ్‌స్మిత్, ఎడిసన్ అను ఇంగ్లీషుగద్యను సంస్కరించి సర్వజనోపయోగ ముగా జేసిన ప్రధానపురుషులయొక్క వ్యాస ములలోని శైలిని అనుకరించుటవలని ఫలితము. మన గద్యవాఙ్మయమున చిన్నయసూరితరు వాత నాకు తెలిసినంతవఱకు గురజాడ శ్రీ రామమూర్తి పంతులుగారును వీరేశలింగం పంతులుగారును మార్గదర్శకులు.

౮. ఇటుపైన మన వాఙ్మయమున ఇంగ్లీషు అనుకరణమున ప్రబలిన భాగములను ఒకటితరువాత నొకటి సూక్ష్మముగా విమర్శింతును:

(a) దేశచరిత్రములు

సంస్కృతమున గాని తెలుగున గాని యిదివఱకు లేవు. విజ్ఞానచంద్రికామండలియే యిందులో ప్రశంసనీయమగు పని జేసినది. హిందూదేశ చరిత్రము, ఆంధ్రుల చరిత్రమును ప్రచురింపబడినవి. రానడేగారు రచించిన మహారాష్ట్రులచరిత్రము తర్జుమా చేయబడినట్లు నాకు జ్ఞాపకము. ఇంకా ఈ భాగము చాలా అభివృద్ధికి రావలసియున్నది. ఇప్పటికి వాఙ్మయ మింకా ప్రత్యేక రాజచరిత్రల యందే ఆసక్తి గలిగి యున్నది. దేశముయొక్కయు సంఘములయొక్కయు అభివృద్ధిని అత్యున్నతదృష్టితో తిలకించి గమనీయమార్గములను బోధించుటకింకను చారిత్రము పూనుకొనవలసియున్నది ఆపని అక్కడక్కడ ఉపన్యాసకులు ఏదో ఒకరీతిగా జరిగించుచున్నారు. ఇప్పుడు దేశమంతయు నూతనసంఘల ద్రొక్కుచు తనచారిత్రమును నిర్మాణముచేసికొనుచున్నది. వ్రాయుటకు సమయము పిమ్మట చేకూరును. అట్టి ఉన్నత దృష్టితో వ్రాయబడునప్పుడు చరిత్రలు చితా ఆవరజాలస్థితి నతిక్రమించి, వాఙ్మయ మనిపించుకొనును. అతిశయోక్తి పూరితమై రాజవంశావళులను వర్ణించు కావ్యములు చరిత్రమునకు ఆధారము లగును గాని చారిత్రకవాఙ్మయమున జేరవు.

(b) వ్యక్తిచరిత్రములు (Biography)

ఇవియును కేవలము ఇంగ్లీషు వాఙ్మయ ప్రేరేపణమువలననే మనకు గలిగినవి. ఇట్టివి సంస్కృతవాఙ్మయమున కానము. రాజతరంగి

ణియం దున్న వ్యక్తుల కథలను పుక్కిటి పురాణములనుండి వ్యక్తపఱచుటకు సాధ్యముకాదు. అయినను దేశచరిత్ర తెలియుటకు కొంచెము తోడ్పడుచున్నది.

జాన్సను వ్రాసిన "కవిజీవితములు" అను గ్రంథము ననుకరించి గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారును, కందుకూరి వీరేశలింగం పంతులు గారును ఆంధ్రకవిజీవితములను ఆంధ్రకవుల చరిత్రలను వ్రాసిరి. ఇటీవల సంస్కృతకవులజీవితములు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిచే వ్రాయబడినవి. కవిచరిత్రలకు సంబంధించినచర్చలు మనపత్రికలలో అచ్చటచ్చట జరుగుచునేయున్నవి. హైదరాబాదుప్రాంతకవులు కొందఱి చరిత్రములు, వారి అముద్రితగ్రంథపీఠికలు ఆంధ్రపత్రిక ద్వారా తెలియబఱుపబడినవి. ఇవియును కొలదికాలములో సద్గ్రంథరూపమును దాల్చునని యాసించెదను.

"ఆంధ్రవీరులు" అను గ్రంథము వ్యక్తిజీవితచారిత్రభాగమును ఇంకొకప్రక్కను విస్తరింపజేయుచున్నది. ఈరీతిని ఆంధ్రరాజముఖ్యులు, మంత్రిప్రవరులు, పండితప్రముఖులు, ఇతరప్రసిద్ధపురుషులు ఈ వాఙ్మయభాగమున ప్రసిద్ధినిగాంచి జనహృదయములను ఉదారాశయపూరితములను జేయవలసియున్నది. ప్లూటార్కు (Plutarch) అను గ్రీకుగ్రంథకర్త గ్రీసు, రోముదేశములలోని మహనీయులను గూర్చి వ్రాసిన "జీవితములు" యూరపుఖండమున నన్నివాఙ్మయములలోను ఆదర్శముగా గొనబడియున్నవి. అవి మనభాషలోనికి తర్జుమా చేయనచ్చును. లేదా ఆరీతిని మనదేశజనులకు దెలియదగిన జీవితములు వ్రాయబడవచ్చును.

వ్యక్తిజీవితము వ్రాయుటయందు ముఖ్యముగా గ్రంథకర్తకు ఆవ్యక్తితో పరిచయ మవసరము. లేనిచో తగినన్ని నమ్మదగిన ఆధారము లుండవలెను. విమర్శనలో నిష్పాక్షికముగనుండుట ముఖ్యమైనను, ఆమహనీయుని వ్యక్తితో సానుభూతియు ఉదారభావమును ఉండిననేగాని అట్టిజీవితచరిత్రలు పరుషములు అయినను కావచ్చును, లేదా నీరసములైనను కానచ్చును. ఆ వ్యక్తియొక్క స్థితిగతులలో మనోభావము లెట్లుమాఱెనో, ఏరీతిని ఆమహనీయుడు ఉదారాశయముల నలవఱచుకొనెనో, క్లిష్టసందర్భములయందు ఎట్టి ధీరత్వాది సుగుణములను కనుపర్చెనో చక్కగా విమర్శించినయెడల అట్టి వ్యక్తిచరిత్రములు బహుసంతోషదాయకములును నీతిబోధకములును నగుటకు సందేహము లేదు. ఇట్టివిమర్శనగలుగు వ్యక్తిజీవితములు ఇంకను వ్రాయబడవలసియున్నవి. చిన్నదైనను చిలకమర్తిలక్ష్మీనరసింహముగారు వ్రాసిన "నందునిచరిత్ర" సానుభూతిగల విమర్శనకు ఆదర్శప్రాయముగా నున్న దని యీసందర్భమున ఉదాహరించుచున్నాను. ఇంగ్లీషున "బాస్వెల్" (Boswell) వ్రాసిన "జాన్సను జీవితము"న్నూ "లాక్హార్టు" (Lockhart) వ్రాసిన "స్కాట్ జీవితము" న్నూ ఆదర్శములుగ గణింపబడుచున్నవి.

"స్వీయచరిత్రములు" యీ వ్యక్తిజీవితభాగమున ముఖ్యమైనవి. వ్యక్తియే తనజీవిత

మును వ్రాసుకొనినయెడల చదువరులకు సందేహములుండవు. ఇవి ఇంగ్లీషులోనుకూడా అధికముగ లేవు. తననడవడికనుగుఱించి సందియములుండనోపునని తోచినపుడు మహాపురుషులిట్లు వ్రాయగడంగుదురు. ఒకప్పుడు వినోదార్థముకూడా వ్రాయవచ్చును. కందుకూరి వీరేశలింగముగారి స్వీయచరిత్రము మొదట చెప్పబడినరకము. రెండవరకమున కొక ఉదాహరణ కలదు. అది అచ్చుపడినను ప్రచురణ కాలేదు. విశాఖపట్నంజిల్లా వడ్డాది చోడవరంలోని ప్లీడరు జగన్నాథశాస్త్రి అను వారొకరు వ్రాసుకొన్నది. సుబోధమును ఆడంబరరహితమును నగు శైలిని వ్రాయబడి సాధారణస్థితిగతులలో ఉత్తమభావములను గను పఱచుచు శాంతిస్థైర్యములను గల గృహస్థుని జీవిత మగుటను స్త్రీపురుషులు చదివి నీతి నేర్చుకొనదగియున్న దని నేను చెప్పగలను. వీరేశలింగముగారి స్వీయచరిత్రము విలువను గుఱించి అభిప్రాయభేదము లున్నట్లు వింటిని. వారిశైలి స్ఫటికనైర్మల్యము గలిగి చక్కని ధారగలిగి నిర్దుష్టమై యొప్పుచుండును. మహాపురుషుడును దేశసేవాపరాయణుడును తనను గుఱించి చెప్పుకొనుసంగతులు అన్నియు సబహుమానముగా వినుర్వించనగును. దేశమును సంఘసంస్కరణములోను, వాఙ్మయములోను క్రొత్తరీతుల నడిపించిన మహాపురుషునియొక్క జీవితాంశములు దేశమంతటికిని తెలియదగియున్నవి.

(c) వ్యాసములు: (Essays) ఇవి పలు రకములు. కేవలము శాస్త్రదృష్టితో చర్చలను జరుపునవి నిత్యము పత్రికలలో గనుచుందుము. ఇంతకన్న దీర్ఘములై అతిసూక్ష్మ విమర్శనములతో నిండియుండునవి శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యగారి కౌరవ పాండవదాయవిభాగనిర్ణయము, రాజశేఖరచరిత్ర విమర్శ మొదలగునవి. ఇట్టిదే మనుచరిత్ర విమర్శయనునదియును. ఈ విమర్శలు (లిటరరీ క్రిటిసిజమ్) "వాఙ్మయవిమర్శనము" అను భాగమున చేర్పదగును. పలు శాస్త్రభాగముల శోధననుగుఱించి వివేకవర్ధనీ మొదలు నేటి సరస్వతీపత్రికవఱకు గల పత్రికల నలంకరించు వ్యాసరాజములు జనసామాన్యమునకు విజ్ఞానమధికము జేయుటకు ఉపయోగపడునవి యెన్ని యేని గలవు- వీనిలో సారస్వతమునకు ఉచితమగు నానందము ముఖ్యలక్ష్యముగాదు గనుక వీనిని ఇచ్చట పరిశీలింపనక్కఱలేదు. వీనిలో గూడ శైలిభేదములవలనను, చెప్పదగినయంశముల రచనయందు గనుపఱచు సౌష్ఠవమువలనను, కొన్ని అగ్రస్థానమును వహింప నర్హములగుచున్నవి- వీనికి ముఖ్యలక్ష్యము శైలియందు సౌలభ్యము, స్పష్టత, శాస్త్రార్థములకు తగిన తెలుగుశబ్దములను కూర్చుట. సులభముగా తగిన శబ్దములు లభింపకపోయిన యెడల కల్పింపవచ్చును. అన్యభాషలనుండి స్వీకరించి మనభాష కనువగురీతిని సంస్కరించి ప్రయోగింపవచ్చును. కాశీభట్ల బ్రహ్మయ్యగారు తాము రచించిన పలురకముల వ్యాసములు చేర్చి ఒక పుస్తకము ప్రచురించి యున్నారు. చిన్నవ్యాసములకు విమర్శలకువలయు నైర్మల్యాదిసుగుణములువీనియందుగలవు.

సాంఘిక వ్యాసములును మతవిషయిక వ్యాసములును వాదప్రతివాదతీవ్రతను బట్టియు, వ్యాసరచయితయొక్క మనోభావోద్రేకమును బట్టియు పలు తెఱగుల చదువరులకు పలువిధముల తృప్తిని గలిగించుచున్నవి. ఇట్టి వానిలో అత్యున్నతభావపూరితమై విశాలదృష్టిని నిర్మలభక్తిని గనబర్చు వ్యాసరాజ మొకటి ముట్నూరి కృష్ణారావుగారిచే కృష్ణాపత్రికలో ప్రచురింపబడినది నాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఆత్మయజ్ఞమును గుఱించి కృష్ణాపత్రికలో మూడునాలుగు సంవత్సరముల క్రిందట ప్రచురణమైన వ్యాసపరంపరయు, ఆంధ్రపత్రిక గత నాలుగైదు సంవత్సరాది సంచికలలోని ప్రస్తావనలును ఉన్నతశైలికైన నేమి, దేశభక్త్యుత్సాహములకైననేమి ఆదర్శములని నమ్ముదును

చదువరులకు ఆనందమును గలుగజేయుటకును, బహుళవ్యాప్తి గల ఇట్టి వాఙ్మయభాగమున ఆదర్శములుగనుండుటకును మంచి వ్యాసములను ఏర్చి యొకటిరెండు సంపుటములుగ ప్రచురింపజేయుటకు విజ్ఞానచంద్రికా మండలి గాని ఆంధ్రపత్రికాధిపతులు గాని యత్నింప నర్హులు.

విమర్శనములు, మీమాంసాదిచర్చలు, ఖండనములు సంస్కృతమున మెండుగా గలవు. ఇవి శాస్త్రదృష్టిగల వ్యాసభాగములు. ఇట్టి చర్చలు కేవలము పాశ్చాత్యవాఙ్మయము నుండి గ్రహింపబడలేదు. కాని పత్రికలు ప్రాముఖ్యమునకు వచ్చిననాటనుండియు ఇంగ్లీషు పత్రికలలోని వ్యాసములు మనకు ఆదర్శములై యుండుట వింతగాదు. న్యూసు పేపర్లు, మాసపత్రికలు, కేవలము ఇంగ్లీషు ప్రోద్బలమునసే ఏర్పడుటవలన ఇది సహజము. దినదినమును క్రొత్త యంశములు క్రొత్త చర్చలు బయలుదేఱుచుండుటచే దీర్ఘవ్యాసములు ఆదరింపబడవు. రాజకీయ, సాంఘిక వ్యవహారములనుగుఱించి మహావక్తలు చేయు నుపన్యాసములు దినపత్రికలలో అచ్చుపడుచుండును. ఇవి వ్యాసశైలికి చుఱుకు బుట్టించుటకు తోడ్పడుచుండును. ఇట్టి ఉపన్యాసములును వ్యాసముల క్రింద పరిగణింపబడవచ్చును.

ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో ప్రచురింపబడిన "సాక్షి"యును "వసంత లేఖలు"ను 18-వ శతాబ్దమున ఇంగ్లండులో నాగరకలోకమునకు పలువిధముల నీతులను మర్యాదలను నేర్పుతో గరపిన "స్పెక్టేటర్" పత్రిక ననుసరించి యున్నవి. లేఖరూపమును మృదుహాస్యరసస్ఫురితమగు శైలియును ఆ ఇంగ్లీషు "సాక్షి" వ్యాసములనుండియే గ్రహింపబడినవి. దీనికే మొదట ఇంగ్లీషున ఎస్సే (Essay) అను పేరు వాడబడెను. ఇవి ఒక అంశమును చర్చించుటయందు కేంద్రీకరింపబడక అయత్నసులభముగ ప్రవహించు సంభాషణను బోలి యుండును. ఇట్టి వ్యాసములలో కొంచెము అతిశయోక్తి యుండును. నవ్వు పుట్టించుటకును మన సంఘలోపముల యొక్క వైకృతిని మనకు నచ్చచెప్పుటకును అది అవసరము. ఇదియె కాక, మన "సాక్షి" అనేకవిధముల చదువరులకు జ్ఞానదాయకమై యుండెను. మనకు "సాక్షి" ప్రసాదిం

చిన వాణీదాసు, జంఘాలదాసు లను మిత్రు
లను ఆంధ్రలోకము మఱవజాలదు. వసంత
లేఖలు సాక్షికన్న కొంచెము పారుష్యమును
అక్కడక్కడ కనుబఱచుచుండును. సాక్షిలో
కన్న వీనిలో హాస్యరసము కొంచెము మందము
గా నుండును. వ్యాజనిందాలంకారము కడు
తీవ్రముగా ప్రయోగింపబడుచుండును, గాని
ముత్తెమునిూద సాక్షి త్రోవనే నడుచుచు
న్నవి. అంతకన్న ఈ లేఖలు చిన్నవి. ఇది
గమనింపదగును. ఇట్టివ్యాసములు గప్‌చుప్
మిఠాయి ఉండవలె చిన్నవియైననే మనోహర
ముగా నుండును. ఈ వ్యాసభాగ మింకను
సారస్వతాభిరుచి దేశమున వ్యాప్తి జెందిన
కొలది వృద్ధియగును. కాని ఇంగ్లీషు వాఙ్మ
యమున సుమారు నూఱు సంవత్సరముల
నుండి యీ మృదుహాస్యరంజితములై వింత
వింత ఊహల అల్లికలకు ఎడమిచ్చుచు సరో
వరతలమునుండి సూర్యకిరణములతో సరసము
లాడు చిన్నయలల బోలి హృదయానందము
నుండి వఱలు చిన్ని నిర్మలవ్యాసరాజములు
అరుదైనవి. నవలలయందు జనులకు ఆదరణ
అధికమైనందున వీనియందు ఆదరణ తగ్గిపో
యెను. మనసారస్వతమునకు నవలలయందు
విసుపు పుట్టినతరువాత నివి ఉద్భవించినవి.
ఇంకను అభివృద్ధి చెందదగును.

(d) వాఙ్మయ విమర్శనము (Literary Criticism)

కవులు గ్రంథకర్తలు అగు వ్యక్తుల జీవి
తములలో కొంతవఱకు గ్రంథవిమర్శనము
గూడ నిమిడియుండ నోపును. చిన్నచిన్న
వ్యాసములలో పత్రికలలో విమర్శనములు
జరుగుచునే యుండును. నూతన పుస్తకము
లను అందుకొనినపుడు వాని నొకసారి అవలో
కించి చదువరుల అభిరుచులను రేపుటయందు
ప్రాముఖ్యము వహించినపత్రికలు తమ అభిప్రా
యములను ప్రచురించుచునే యుండును. ఇట్టి
చిన్నచిన్నవ్యాసములు కవిత్వమును గుఱించి
గాని, లలితకళలను గుఱించి గాని సారస్వ
తముయొక్క ఆశయములను కొంతవఱకు
సూక్ష్మముగా చర్చించుచు వ్రాయబడును.
ఆంధ్రపత్రిక రుధిరోద్గారి సంవత్సరాది సంచి
కలో "ఏకోరసః కరుణ ఏవ" "ఆంధ్రశృంగార
కావ్యములు," "ఆంధ్ర వాఙ్మయ నిరీక్షణము"
అను వ్యాసములు గమనింప దగియున్నవి.
విషాదనాటకములను గుఱించి పూర్వసంచిక
లలో చదివినట్లు జ్ఞాపకము. ఇట్టి విమర్శన
ములలో గ్రంథరూపము దాల్చినది ఒక్కటే
యిదివఱకు నాకు తెలియును. అది రామలిం
గారెడ్డిగారిచే రచింపబడిన "కవిత్వతత్త్వవిచా
రము" శైలి సులభము. వాక్యసరళి చుఱుకుగ
ప్రవహించును. మన శృంగారకవితలలోని
అశ్లీలములను సాంఘికాభివృద్ధికి అభ్యంతర
మును కలుగజేయునవిగా నిరూపించి ఘంటా
పథముగా ఖండించుచున్నది. ఇది ఎంతయు
సమంజసము. కాని కవిత్వతత్త్వమును విచారిం
చుచో పింగళి సూరన్నయొక్క కృతులను
మాత్రమే ఆదర్శముగా నెంచుటవలనను,
అందులోను కేవలలోకోక్తుల బోలు నతని
వాక్యసరళిని, స్వభావమును అనుకరించు వర్ణ
నలు గల భాగములను మాత్రమే నెక్కి
నెక్కి ఆదర్శములుగా జెప్పుటవలనను, కవి

త్వతత్త్వము సమగ్రముగా విచారింపబడలేదని చెప్పుటకు సాహసించుచున్నాను. ఇట్టివిచారణలు వాఙ్మయాభివృద్ధికి తోడ్పడును. ఇంకను విస్తారము వలయునలయును.

అలంకారములను గురించి మాగురువుగారగు శ్రీమేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు విజయనగరంకాలేజీ పత్రికలో వ్రాయుచున్నారు. సమగ్రముగా ఆంగ్ల సంస్కృత ఆలంకారికుల యభిప్రాయములను సరిపోల్చి ఆంధ్రమునకు ఉపయోగకరమగు పద్ధతులను తేటపఱుపవలసి యున్నది. "లలితకళల"ను గురించి శ్రీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన వ్యాసములు మిక్కిలి ప్రశంసనీయములు. ఇందులో చిత్రకళకును కవిత్వకళకును వలసినప్రతిభాసామ్యము చక్కగా తెలుపబడినది.

ఇట్టి విమర్శనలలో పైవ్యాసభాగమున నుదాహరించిన 'రాజశేఖరచరిత్రవిమర్శనము' "మనుచరిత్ర విమర్శనము" గాక "వేమన" "ఆంధ్రశృంగారనైషధ విమర్శనమును" నాకు తెలిసినంతవఱకు గమనింపదగిన గ్రంథములు. ఇంగ్లీషున మహాకవిషేక్స్పియరునుగూర్చి నే నొక చిన్నిపొత్తమును విమర్శతోకూడా ఉదాహరణకొఱకు ఇంగ్లీషుపద్యములలోనికి తర్జుమాచేసిన పెంపుడుభాగములను జేర్చి ప్రచురించి యుంటిని. అది ఆంధ్రమున వ్రాయుటకు కుతూహల మున్నదిగాని వీలు కలుగలేదు.

ఇట్టి విమర్శనలు కేవలము కవికాలనిర్ణయాది చర్చలలో వ్యాకులపడుటకన్న, కవిత్వాశయములు, కవిభావములు, కవియొక్క శైలి చర్చించుచు, నితరు లగు స్వదేశ విదేశ కవులతో పోలికలు కనిపెట్టి తెలియజేయుచు చదువువారలకు విచక్షణశక్తిని గలిగించుటకు తోడ్పడవలయును. ఇట్టి ఆశయమును గలిగియున్న ఈ విమర్శనభాగము మిగుల అభివృద్ధి జెందును- నిజముగ జనులకు ఉపయోగముగ నుండగలదు. ఈ భాగమున మనకృషి మిగుల స్వల్ప మని చెప్పుచున్నాను. ఇంగ్లీషువాఙ్మయ విమర్శకులనుండి తర్జుమాలను చేయవలసి యున్నది. వారినల్ల చాలా నేర్చుకొనవలసి యున్నది- చదివిన గ్రంథములయొక్క మహిమను దానివలన తాము అనుభవించిన బహువిధానందమును సకారణముగా సవిమర్శముగా మన విద్యార్థులు ప్రచురణజేసి సారస్వతాభిరుచి ప్రణేతృత్వము పూనుకొనవలసియున్నది. మాసపత్రికలు, సారస్వతానుబంధములు ఇట్టివానికి చోటొసంగుచున్నవి. సంస్కృతకవులను గురించియు, తదితరభాషలలోని కవులనుగురించియు తెలిసికొనిన విద్యావంతులు ఆంధ్రమున వారినిగురించి. తమదేశజనులకు తెలియజేయ నుద్యోగింపవలయును. ఇట్లు సవిమర్శముగ తెలుపుటవలన మానవప్రపంచమున వివిధములై వఱలు నభిరుచులను దేశకాలానుగుణ్యముగ మాఱు ఆశయములను గమనించి మన ఆంధ్రలోకము విశాలభావములను, ఉదారదృష్టిని పొందగలదు. వాఙ్మయాభివృద్ధికి ఇది తఱుగనిగని.

(e) లేఖలు

వ్యవహారముకొఱకు నిత్యమును వ్రాసికొను లేఖలు వాఙ్మయమున జేరజాలవు,

"సాక్షి" లేఖలు "వసంత" లేఖలు కృత్రిమములు. ఇట్టివి వ్యాసభాగమున జేరును. దూరమున నున్న మిత్రులతోను, ఆప్తబంధువులతోను ఏకాంతసల్లాపము జరుపునట్లుగా వ్రాయబడి రసములొలుకుచు, వ్రాయువానికి ప్రియములగు వస్తువులయొక్కయు, తెలిసిన వింతలయొక్కయు వర్ణనలతోగాని, వాని స్వకీయమనోభిరుచులను తెలుపు భావవ్యక్తీకరణములతోగాని నిండియుండునవియే లేఖావాఙ్మయమున జేర్పబడును. ఇట్టి లేఖలు ముద్రణప్రచురణాదులకొఱకుగాని గ్రంథకర్తలయొక్క భావాపబరమునకు గాని వ్రాయబడవు. అందుచేత వానిలోని యంశములు విశ్వసింపదగియుండును. వ్రాతరికి పరులు విందురనుశంక యుండదుగాన నిరాతంకముగా భావములను వెలిబుచ్చును. ఆలోచనలును భావములును హృదయమునుండి వచ్చినవి వచ్చినట్లుగనే వ్రాయబడును. వ్రాయువ్యక్తినిగుఱించియు నాతనికాలపు విశేషములను గుఱించియు మనకు గమనింపదగిన ఆంతరంగికములను దెలుపును. చరిత్రలను, మహావ్యక్తుల జీవితములను వ్రాయుటలో సరియైన దృష్టి నిచ్చును. సహజమార్దవము, నాగరికత గలిగినవారిచే వ్రాయబడిన లేఖలు సరసమైన శైలితో హృద్యముగా అనేకతరములవారు ఆనందింపదగి యుండును. ఇట్టి లేఖలు మన వాఙ్మయములలో కానము. ఇవి వఱలుటకు దేశము శాంతియుతమై ఐశ్వర్యయుతమై నానా కళల కాటపట్టైయుండవలయును. దేశభాషల యందు దేశజులకును, దేశస్థులకును ప్రేమాదరము లుట్టిపడుచుండవలయును- కాగితముల వాడుక వృద్ధియగుటయు, పలురకముల వాఙ్మయభాగము లుద్భవించుటయు మన దేశమునకు ఏబది సంవత్సరముల లోపలిసంగతి. కనుక ఇట్టి లేఖావాఙ్మయము లేకపోవుట వింత గాదు. విశేషవ్యాపారములు కలిగి యున్న వారు ఇట్టి లేఖలను వ్రాయజాలరు. ఐహికములకు మిక్కిలి పాటుపడనవసరములేక లలితమగు అభిరుచులు గలిగి బందుగులయెడలను స్నేహితులయెడలను ప్రేమ గలిగి యున్నను కొంతవఱకు ఒంటరిబ్రతుకున కలవాటుపడిన వ్యక్తులకు లేఖలు వ్రాయుట ఒకకాలక్షేపముగ నుండును. స్త్రీలు వ్రాయు లేఖలు మిగుల మార్దవమును గలిగి యుండును. పురుషుల వ్రాతలకన్న సులభములును సహజసరసమును గలిగియుండును. ఈ వాఙ్మయభాగమున దేశమేమి యభివృద్ధిని గనుపర్చునో చూడవలసి యున్నది.

(f) నవలలు : (Novels)

ఇంగ్లీషు వాఙ్మయమున ననేక రకముల నవలలు గలవు. వానిలో మూడు ముఖ్యమైనవి: (౧) అద్భుతకథనములు, (౨) చారిత్రకములు, (౩) సాంఘికములు. వీనిలో మొదటి రెండిటికిని అద్భుతకథ సామాన్యమైనను రెండవరకములో ఏదోయొక ప్రాతకాలపు చరిత్రమును ఆధారమును చేసుకొని ఆకాలపు జనమర్యాదలను వేషభాషలను ఊహించి చిత్రించుటవలన ప్రత్యేకరకముగా ఎన్నుకొనుట మంచిది. కొంతవఱకు సంఘుజీవనము ఏకాలపు సంబంధమైన దైనను చిత్రింపబడును

గనుక పైన జెప్పిన మూడవరకమునకుగూడ సంబంధించియుండును. ఇంగ్లీషు విచక్షణులు "నవల" (Novel) అను శబ్దమును ఈ మూడవ రకమునకే ఉపయోగింతురు. కాని ఆశబ్దము యొక్క వ్యుత్పత్తిని ఇటలీభాషలో విచారించి చూడఁగా అది క్రొత్తదైన అద్భుతకథకు ప్రయోగింపబడినటుల గనుపడును. అయినను కాలక్రమమున శబ్దములు రూపమునను అర్థమునను మాఱుట సహజము. అందుచేత ఈ మూడురకములను "నవలలు" అని యనుటలో తప్పేమియు లేదు. వానివాని ముఖ్యోద్దేశమును బట్టి వానికి ప్రత్యేకనామకరణములను జేయవచ్చును.

అద్భుతకథనములకు మన "కాదంబరి" సంస్కృతవచనమునను, "కళాపూర్ణోదయము" ఆంధ్రపద్యమునను మార్గదర్శకములైనను, అన్నిరకముల ఆంధ్రనవలలు ఇంగ్లీషు ప్రోద్బలముననే ఉద్భవించినవనుట సాహసోక్తి గాదు. బెంగాలీనవలలకుగూడ ఇంగ్లీషు అనుకరణమే బీజము. "రాజశేఖరచరిత్రము" అనునది గోల్డ్‌స్మిత్ యొక్క 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' (Vicar of Wakefield) అనుదానికి ఆంధ్రరూపాంతరము - భాషాంతరీకరణము కాదు- ప్రథమమున త్రోవఁజూపినవానిలో నిది యొకటి. ఇందులోను వీరేశలింగం పంతులు గారు షెరిడన్ అను కవికృతమగు "రైవల్స్" (Rivals) నాటకమునకు జేసిన భాషాంతరీకరణమునందును, అన్యదేశాచారములు మనదేశజనులకు నచ్చురీతిని కొంచెము మార్పు జేయబడి ప్రదర్శింపబడినను, మొత్తముమీద ఆ ప్రథమకృతులయందువలె సుఖసరళి కుదురలేదు. అయినను రాజశేఖరచరిత్రమును మన సాంఘిక నవలలలోనే చేర్పవలసి యుండును. వివేకవర్ధనిలో భాగములుగా ప్రచురింపబడిన ఖండవిల్లి రామచంద్రుడు మొదలగువారలచే వ్రాయబడిన నవలలు ఈత్రోవనే త్రొక్కినవి. ఇట్లు ప్రారంభమున సాంఘికనవలలు వ్రాయబడినను మన నవలావాఙ్మయము త్వరలోనే తక్కిన రెండురకముల త్రోవకును మళ్లెను. ఇటీవల "మాలపల్లె" యను నొక సాంఘిక నవల వ్రాయఁబడెను. అది రాజకీయాటంకములను బాసి వ్యాప్తి గాంచినచో ఆదర్శముగ నుండనోపును.

అద్భుతకథనములకు "ప్రఫుల్ల" ఉదాహరణముగా తీసికొనబడవచ్చును. బ్రాహ్మణ యువతి యొకతె ఐశ్వర్యమదగర్వితులగు అత్తవారిప్రోద్బలమున భర్తృపరిత్యక్తయై అతి కష్టములనొంది పిమ్మట అడవులబడి దొంగల చేత దేవిగా భావింపబడి, పూర్వయుగమున కట్టబడి యిప్పుడు భూగర్భితములై యున్న అంతర్మాళిగలలో నివసించుచు అడవిజనుల చేత పూజల నొంది, తుదకు అదృష్టవశమున నదీయానసందర్భమున తనభర్తను సపత్నిని గలసికొనుట అత్యద్భుతరీతిగా నల్లబడినది. బంకిమ్ చంద్రుని నవలలు మనభాషలోనికి చాలా మట్టుకు తర్జుమాచేయబడినవి. ఈ నవలలు కొంతవఱకు క్రిందటితరమునాటి బంగాలీ భూస్వాములు, కాయస్థబ్రాహ్మణులయొక్క సంఘమర్యాదలను యథాస్థితిగా తెలుపుచున్నను కథాద్భుతములను ముఖ్యముగా నాధారము

జేసికొనియున్నవి. వీనితో పోల్చిన రమేశచంద్రదత్తుగారి "తాళసరస్సు" అనునవల సాంఘికనవలగా పరిగణింపబడవలెను. ఉమ్రాలీషాగారు వ్రాయుననవలలు-ఈఅద్భుతకథనములలో జేరును.

శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నవలలు కథాద్భుతములను గలిగియున్నను, ప్రాతచారిత్రకాంశములను ఉదాహరించు ముఖ్యోద్దేశమును గలిగియున్నవి. ఇవి చారిత్రకము లననోపు. ఇందువలననే ఇంగ్లీషున చారిత్రకాద్భుత నవలలను మెండుగా వ్రాసిన స్కాట్ (Scott)తో వీరిని కొందఱు పోల్చగా వినియున్నాను. అయితే స్కాట్ నవలలలో వలె వీనిలో పూర్వసంఘాచారములను వేషభాషలను సరిగా నరయుటకు విశేషయత్నము చేయబడలేదు. వీరి "గణపతి" హాస్యరసము ఉద్రేకముగా నున్నను సాంఘిక రకములో జేర్పవలయును. ముగింపుగాలేదు. దిట్టరితనమును విచిత్ర ప్రతిభయును అపూర్వ జీవశక్తియును వరములుగా నొందిన "గణపతి" యొక్క చర్యలకు అంత మెట్లుండును? "శ్రీదేవి" యను నవల పెద్దాపుర సంస్థాన చరిత్రము నాశ్రయించియున్నది. ఇందు చరిత్రాంశములును కథాద్భుతములును సమముగా నిమిడియున్నవి. ప్రతాపరుద్రుని కాలము నాశ్రయించిననవల యొకటి చదివితిని. పేరు జ్ఞాపకమురాలేదు. ఈరకపునవలలలో పూర్వకాలపు జనుల వేషభాషలను ఆచారములను గూడ నరసి చిత్రించుట దేశోద్బోధమునకు సహాయకారి యగును. చారిత్రకజ్ఞానమును సులభముగా వెదజల్లును.

సాంఘికములు గూడ గతతరపు మనుజులయొక్క ఆచారవ్యవహారములను వ్యక్తీకరించినప్పుడు కొంతవఱకు చారిత్రకములయియుండును. కాని ఎంతప్రాతవి యైనను సంఘములలో ఆచారములు కొలదిసంవత్సరములలో విశేషమార్పు జెందుట అరుదు గనుక ఇవి సాంఘికనవల లని చెప్పుటయే యుక్తము. ఇట్టి వింకా ఎక్కువగా వ్రాయబడుటవలన ఆంధ్రదేశమునకు ఆత్మావబోధము నిండుగా గలుగు ననుకొందును. కంపెనీనాటిపరిపాలన, కళింగరాజులు, నవాబులు, రెడ్డిరాజులు, అనేక జమీందారులు వీరల పరిపాలనకాలముల నాటి మనదేశజనులయొక్క స్థితి సువ్యక్తము చేయబడవలసియే యున్నది. మన్యములోను నెల్లడియందు గల పరిస్థితుల భేదములు ప్రజలయొక్క వేషభాషాచారాదులలోని తారతమ్యములు ఇట్టి అనేక అంశములను గూర్చి నవలారూపముగా దేశప్రజలెల్లరు ఉద్బోధమును పొందదగియున్నారు. ఏదో ఒకకథను అల్లి ఒకటి రెండు ముద్రణములతో నిలిచిపోవు నవలలను ఆపుటకు వీలులేదు గాని దేశము తగినప్రోత్సాహ మొసగిన విద్యావంతులు మేధావంతులు, అనుభవము గలవారును ఇట్టి ఉపయోగకరమైన నవలలను నాటకములను వ్రాయ బూనుకొందు రని నమ్ముదును. "కాళింగు"లను వారి సంఘాచారములను గుఱించి చిలుకూరి నారాయణ రావుగారు వ్రాసిన వ్యాసమువంటి వ్యాసములు ఈ సాంఘిక నవలలకు ఆధారములు కాగలవు.

(g) చిల్లరకముల గద్య: (Miscellaneous Prose)

గద్యవాఙ్మయమున నింక యెన్నియేని రకములు బయలుదేఱవచ్చును. మిశ్రజాతులటుండ "ఉపన్యాసముల"ను నొక ముఖ్యజాతిగ జెప్పవచ్చును. అది యిప్పుడు రాజకీయ సాంఘికములలో మిక్కిలి వ్యాప్తి నొందుచున్నది. ప్రస్తుతము ప్రపంచమంతటను న్యూస్ పేపర్ల మూలమునను నూతనజాతీయాశయముల మూలమునను నవలలకంటె ఎక్కువప్రాముఖ్యమును వహించి యున్నది. వ్యాసరచనవంటిదే యైనను ప్రత్యక్షముగా ప్రజలయెదుట మాటలాడుటవలన జనించెడు మార్పులను గలిగియున్నది. మిక్కిలి తబిశీలు వలనుపడదు. వినువారలకు వెంటనే స్ఫుటముగా నంశములను స్ఫురింపజేయు నలంకారములను ఉదాహరణములనే తెచ్చుచుగా వాడవలయును. కాని ఇప్పుడు చాలభాగము వక్తలు ఇంటివద్ద ముందుగా వ్రాసికొని వచ్చిన వ్యాసములనే చదువుట అలవాటు అయినది. కాంగ్రెసులలోను, కాన్ఫరెన్సులలోను అట్టి మహోపన్యాసములను ముందుగానే ముద్రించి సభికులచేత బెట్టుట యాచారమైనది. వక్తలు చదువుట కేవల ఆచారానుసరణమై మీటింగులను బొమ్మలాటలనుగా మార్చుచున్నది. గోలమీలైబ్రరీ సంఘమువారు వక్తృత్వము వృద్ధిసేయుటకు పోటీపరీక్షలు నడుపుట ప్రశంసనీయము. వక్తృత్వమును నేర్పుటకు క్లాసులు కూడా ఏర్పాటు చేయబడవలయును.

మన హరికథలు ఆంగ్లవాఙ్మయమున సెర్మన్ (Sermon) అను మతబోధక ఉపన్యాసములను బోలును గాని ఇది కథను ఆశ్రయించుకొని పాట, పద్యము, వచనము, సంభాషణము మొదలగు రీతుల నన్నిటిని కలుపును. ఈరకమున నేటియుగమున ముఖ్యకవి యగు నారాయణదాసుగారు చెప్పినట్లు ఈ హరికథలు "కోదువాండ్ల వ్యవసాయంబుల వలె" పలుజాతుల నెక్కుమెప గలుపును. ఇందులో వక్త ప్రత్యుత్పన్నమతియై అప్పటికప్పుడు సమయోచితముగ స్ఫురించుమార్పులను జేయవచ్చును. ఇవి సాంఘికమతాదికబోధనలకు చాలాఉపయోగించును. ఏకనటునిచే నడుపబడు నాటకములు అని కూడ ఈ హరికథలను వర్ణింపవచ్చును. ఇట్టికథ వేషము వేసికొని పాటరూపముగా ఆయా సందర్భముల కనువగు అభినయాదులను జేయుచు ఒకడు పాడగా తిరువనంతపురము (Trivandram) లో నేను జూచితిని. వాడు పాడినది ద్రౌపదికొరకు భీముడు సౌగంధికపుష్పమును దెచ్చు కథ. గంతులువేయుచూ పరుగిడుచూ పాడుట నటనచేయుటను బట్టి మలయాళములో నీవిధము కథ ప్రదర్శనమును "ఓట్టమ్ తుళ్లల్"(Running and Jumping) అని యందురు. సుద్దులు పార్థనపదములు మొదలగు జానపదవినోదములలో నిట్టి యభినయాదులను ఇప్పటికిని అచ్చటచ్చట చూడవచ్చును. కాని వచనమే ముఖ్యాధారము అయియుండుటవల్లను, నటనకన్న కథచెప్పుటయు, కథాంశముల నాశ్రయించి సమయోచితముగ సాంఘికాచారములపైని వ్యక్తులనడతలపైని వ్యా

ఖ్యానములు చేయుచు జనరంజకముగ బోధన జేయుచుండుటవలనను నే నీహారికథలను "చిల్లరగద్య" భాగమున జేర్చితిని. "చిల్లర" అనుటవల్ల విలువలేదని యర్థముగాదు. స్పష్టముగా నొక్కతీరు లేనందున ఇట్టిరకము లన్నియు సదుపాయముకొఱకు "చిల్లర భాగములు" (Miscellaneous) అను భాగముక్రింద జేర్ప బడినవి.

చిన్నకథలు: (Short Stories)

అను క్రొత్తభాగము ఆంగ్లవాఙ్మయము ననుసరించి నూతనముగా మన పత్రికలలో తలయెత్తుచున్నది. చింతా శంకరదీక్షితులు గారు రచించిన నేరసంశోధకకథలు ఈ భాగములో చేరవచ్చును. కొంతవరకు ఈ కథలు ఇప్పటి మన సంఘాచారములను ఆధారము జేసికొనుచున్నవి. కాని కథాంశము చిన్నదిగా నుండును. ఏదో ఒక్క నేరవిమర్శనమునందే కేంద్రీకరింపబడును. ఒకవ్యక్తియొక్క ముఖ్యమగు చెయిదము, ఏదో ఒకవింత, లేదా అద్భుత మగు నేదో యొక్క ప్రకృతిసందర్శనము, ఇట్టి వానిని ఆశ్రయించుకొని యీచిన్నకథలు వ్రాయబడును. అతివ్యాప్తియు, పలువిధవ్యక్తుల చెయిదములతోగాని యితర కథలతోగాని సంబంధమును పెట్టుకొనినయెడల ఈ చిన్నకథలోని ఘాటు చెడిపోవును. తలపెట్టిన ఒక్క కథాంశమునకు దగిన సన్నాహము మాత్రమే చేయనగును. ఒకకుఱ్ఱవానిని సంరక్షకుడగు వానియన్న ఉపేక్షింపగా వాడు దీనస్థితిలో పడియుండగా, దైవప్రేరితులై పిల్లలు లేని ఒకభాగ్యశాలిదంపతులు వచ్చి వానిని తీసికొనిపోయి పెంచుకొనుటయు, తరువాత వాడు మేజిస్ట్రేటు అధికారమున నుండగా వానియన్న నేరస్థుడై యు కోర్టుకు వచ్చుటయు, క్షమింపబడి పశ్చాత్తాపయుక్తుడగుటయు ఇందలి కథాంశము. ఇందులో కథాకారుడు కథను వివిధవ్యాప్తిని బొందనీయక పూర్వస్థితిని ప్రస్తుతస్థితిని చదువరిదృష్టియెదుట నిలిపి భాగ్యపరివర్తనము లిట్లుండనోపును, మానవు లిట్లు హ్రస్వదృష్టి గలిగి వర్తింతురు అని గ్రహింప జేయుచున్నాడు. ఈ రీతిని మితవ్యాప్తిని గలిగి చదువుటకు సులభమై, అద్భుతానందములను గలుగజేయును. ఈ చిన్నకథలను సంఘాచారములను చిత్రించుటకు నుపయోగింపవచ్చును. ఇప్పుడు యూరోపునందును, అమెరికాలోను మంచి మంచి పత్రికలు ఈ చిన్నకథలను ప్రోత్సహించుచున్నవి. నవలయొక్క ఆశయము వేఱు; ఈ చిన్నకథలయొక్క ఆశయము వేఱు. చిన్నకథను "నవలిక" యనరాదు. "కథిక"యని నామకరణము చేయవచ్చునేమో పండితవరులు యోచింతురుగాక. బౌద్ధకథలను గల "అవదానకల్పలత" సరస్వతీ పత్రికలో తెలుగుచేయబడి ప్రచురింపబడుచున్నది. ఇవి చక్కని చిన్నకథలు. ఆంధ్రపత్రిక రుధిరోద్గారి సంవత్సరాది సంచికలోని ఉఱుముకథ, గౌతమియనుపక్షియొక్క స్వీయచరిత్రమును చక్కని చిన్నకథలు.

ఈ రీతిగ మన గద్యవాఙ్మయము అంతయు ఇంగ్లీషుగద్యగ్రంథముల ప్రోద్బలమున జనించిన దనిన్ని, దానియభివృద్ధికి యింకను

పలుశ్రేవ లున్నవనిన్నీ, అన్నిటను ఇంగ్లీషు వాఙ్మయమును అనుసరింపవలసి యున్నద నిన్నీ చెప్పుచున్నాను. సంస్కృతకావ్యనాటకాదులను తెలుగు గద్యమున జనులందఱకు నందింపవచ్చును. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రఘువంశమును తెలుగు గద్యలోనికి తర్జుమాచేసినారు. రసపుష్టిగలిగి క్లిష్టముగాని శైలితో నొప్పుచున్నది. నోరి గురులింగ శాస్త్రులుగారు వ్రాసిన భారత ఇతిహాసకథల శైలి చక్కగా నున్నది. తప్పులులేకుండ అచ్చుపడినయెడల చాలా ఉపయోగముగా నుండును. ఆనందప్రెస్సులో నచ్చుపడిన ఆంధ్ర గద్యభగవద్గీత చాలా యింపగు శైలిని వ్రాయబడినది. అక్కిరాజు ఉమాకాంతము గారి "షేక్స్పియర్ కథలు" మనపిల్లలు చదువుటకు తగిన సులభశైలిని సూక్ష్మముగా వ్రాయబడియున్నవి. జపాను చీనాదేశ నాటక కథలు ఇంగ్లీషునచూచితిని. చాలాబాగున్నవి. అవి మనభాషలోనికి తర్జుమా శీఘ్రముగా చేయబడు నని యాశించెదను.

---

## వేగంటివారి వచనాలు

ఆనందమయుడు గావలెను - తాను తానైయున్న తావు గనవలెను॥ ఆనం॥

సుగుణములు భరియింపవలెను - మదిని తగులుసిగి శాంతవర్తనుడు గావలెను -
సుగుణములు వెరవు గనవలెను-అందు సుగుణసంపూర్ణసమాధి సరవి గనవలెను॥ ఆ॥

వాయువులు కుంభించవలెను - మిక్కిలి ఉపాయమున కుండలిని పైకెత్తవలెను-
తోయజంబులు దాటవలెను - అందు బాయకుండెడి నాదుపల్కు వినవలెనూ. ౨

మనసుపదిలము శాయవలెను - తన మనసులోపల తెలిసి తాను గనవలెను -
కనుమూపు లోకటె గావలెనూ - అందు ఘనసుధాకారలింగం చూడవలెనూ. 3

మూడుయేరులు దాటవలెను - అందు జోడుబాయనిహంసజాడ గనవలెనూ -
మేడమీదికి చారవలెనూ - అందు పండువెన్నెల ముత్తిబయలు గనవలెనూ. ౪

కేబగళ్లొకటి గావలెను - అందు వేయిరేకులమీది వెలుగు గనవలెనూ -
అందు బాయకుండెటి పరమగురుని గనవలెనూ - ఆనంద॥ ౫

---

# రఘువంశౌచిత్యము

## కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు

(గత సంచిక శేషము)

కొన్ని యాంధ్రకావ్యములయందు రఘువంశములోని వర్ణనములు కానవచ్చుచున్నవి. ఈరఘువంశకావ్యమును కొందఱు సంస్కృతకవులును, తెలుఁగుకవులును గూడ ననుకరించి రనుట నిర్వివాదాంశము. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నిటిని వ్రాయక విడిచితి.

కాళిదాసు రఘువంశమున వర్ణించిన వంశావళి వాల్మీకిరామాయణమునందలి వంశక్రమమునకును, విష్ణుపురాణములోని వంశక్రమమునకును, భిన్నముగా నున్నయది వాయుపురాణములోని వంశమర్యాదకుఁ గొంత సరిపోవుచున్నది. దీనింబట్టి చూడఁగాఁ గాళిదాసు "అథవా కృతవాగ్ద్వారే" అని పూర్వులగు కవులు చూపిన మార్గము నాధారముగాఁ దీసికొని రఘువంశమును వర్ణించుచున్నానని చెప్పుటచే, రామాయణాది ప్రాచీన కావ్యములఁ బెక్కింటినిఁ బరిశీలించి యీ వంశక్రమమును వర్ణించెనని యూహింపవలసి యున్నది.

కవి కావ్యాంతమున భర్తయొక్క యకాలమరణమునకు దుఃఖించుచున్న యగ్నివర్ణునిభార్య సింహాసనాసీనయై సచివసాహాయ్యముచే రాజ్య మేలినట్లు చెప్పి కావ్యమును ముగించెను. కొందఱు కాళిదా సిట్లు కావ్యము ముగించియుండడనియు నగ్నివర్ణుని పుత్రుఁ డగు శీఘ్రుని చరితమును వర్ణించు నిరువదియవ సర్గమును గూడ వ్రాసియుండు ననియు నూహించుచున్నారు. కాని యీ యూహకుఁ దగిన కారణములు కానరావు.

సారస్వతసారవేదులగు ప్రౌఢు లీకావ్యమును జదువ నర్హులు గాని శబ్దార్థసంబంధము తెలియఁగని బాలిశులు దీనిఁ బఠింప సమర్థులు కారు. కాని మన దేశమున నీ రఘువంశమహాకావ్యము సంస్కృతమును జదువ నభిలషించు బాలురకుఁ బ్రథమపఠనీయగ్రంథముగా నాసేతుహిమాలయమునుగల భారతదేశమున నుపయోగింపఁబడుచున్నది. బాలు రీగ్రంథరాజమునందలి నిరుపమానములగు భావామృతములఁ గ్రోలి యానందింపఁజాలునంతటి ప్రతిభాశాలురు గారు. దీనియందలి శ్లోకములను వ్యాఖ్యానసహితముగాఁ గంఠపాఠమును మాత్రము జేయజాలుదురు. మఱియు దీనియందలి పందొమ్మిది సర్గలలోను నేవో కొన్ని సర్గలు మాత్రమే పఠనపాఠక్రమములోన నున్నవి. కాని గ్రంథ మామూలాగ్రముగాఁ జదివింపఁబడుట లేదు. మొదట మన యాంధ్రలిపితో ముద్రితమైన రఘువంశమునందుఁ బదిసర్గలు మాత్రమే యున్నవి. కాని యిటీవలఁ గీర్తిశేషులైన యస్మద్గురువర్యులగు మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులయ్యవార్లంగారు తమ యార్ష ముద్రణాలయమునఁ దెలుఁగు లిపితో రఘువంశమును బూర్ణముగా ముద్రించి యాంధ్రలోకమునకు మహోపకారమును జేసిరి.

ఈకావ్యము క్లిష్టాన్వయములు లేక తేలికగా నన్వయించుట కనువగుటచేతను అతిదీర్ఘసమాసములు లేక చక్కనిమాటలతో నిండియుండుటచేతను బాలురకనాయాసముగా బోధింపవచ్చునని తలఁచి మనపండితు లీకావ్యమును విద్యార్థులకు మొదట బోధించుచున్నారు.

ఈకవిసింహుఁడు విరచించిన శ్రవ్యకావ్యత్రయములోను రఘువంశమే ప్రాథమికకృతి యని యిందలి దైవప్రార్థన శ్లోకమువలనను యతఁడు చూపిన వినయరీతులవలనను, సువ్యక్తమగుచున్నది. ఇది యీ మహాకవి యాదిమకృతి యగుటచే ముందుదాఁ బోషింపఁబోవు కవితాలత నిర్విఘ్నముగాఁ గొనసాగుటకుఁ గవిత్వాదిని నాదిమదంపతులగు పార్వతీ, పరమేశ్వరులఁ బ్రస్తుతించి యున్నాఁడు. ఇతరములగు కావ్యముల రెంటను దేవతానమస్కృతిఁ జేయక వస్తునిర్దేశముతోడనే కావ్యములఁ బ్రారంభించి యున్నాఁడు. కావున మొదటి

కావ్యము రఘువంశమే యని బోధపడుచున్నది. మొదటి కావ్యమును దివ్యచరితముగా నొనర్చక మానవరాజచరితముగాఁ జేయుటకుఁ గారణ మేమన లోకములోఁ బురుషార్థము లన్నియు సత్పరిపాలనముచేఁ దున్న యప్పుడే నిర్విఘ్నముగా నెఱవేఱఁగలుగును గాని, ధార్మికపరిపాలనము లేకున్నచో నవి యడుగంటి, యచిరకాలములోనే దేశ మధోగతిపాలగుట నిశ్చయము. కావుననే యార్యులు "రాజానం ప్రథమం విందేత్తతః క్షేత్రం తతో ధనం తస్మిన్నసతి లోకేస్మిన్కుతః క్షేత్రం కుతో ధనం" అని యైహికసుఖప్రదాత సుపరిపాలకుఁడే యని బోధించి యున్నారు. మానవులు ధర్మరతు లగుటకును కష్టపడి సంపాదించుకొనిన వస్తువుల నిర్భయముగా ననుభవించి యానందించుటకును ప్రధానసాధనము సత్పరిపాలనమే. అది లేకున్న నీలోకము యమలోకమే యగును. కావున లోకముయొక్క సమస్తకళ్యాణములును రాజుపై నాధారపడియున్నవి. అట్టి నృపవరేణ్యునిచరితమే ప్రథమవర్ణ్యమగుటంజేసి, నిరుపమానగుణరత్నరత్నాకరు లగు రవికుల సార్వభౌముల పావనోదారచరితముల వర్ణించుటయే తన కవితాద్రాక్షాలతకు నమూల్య మగు ప్రాథమిక ఫలసిద్ధి యని తలఁచి యీ రఘువంశరాజ చరితమును వర్ణించెను.

కాళిదాసు మొదట మహారాజచరితమును వర్ణించుటయే యుక్తము. ఏ మందురా? ఏ సార్వభౌములు ప్రజలఁ గన్నబిడ్డలకైవడి యధికానురాగముతోఁ బోషించుచుఁ బ్రజాక్షేమమే తమక్షేమముగా నెద నెంచుచుఁ, గంటిని రెప్పవలె దేశమును గాపాడుచుండెడివారలో, శత్రుభయములనుండి స్వరాజ్యముల రక్షించుటలోనే మహారాజులు చూపిన పరాక్రమక్రమము లత్యాశ్చర్యజనకములో, యేచక్రవర్తులు భీకరాహవభేరీనినాద మాకర్ణించినతోడనే, మదగజకంఠరవమునాలించి యిభయూథములపైకి లంఘించు మృగేంద్రములమాడ్కిఁ గ్రూరశత్రుసంఘములపైఁ బడి చెండాడుచుండెడివారో, యే భూపాలచంద్రులు సత్యపరిపాలనమునకును, ధర్మరక్షణముకొఱకును, దా మొనర్చిన యనన్యసాధ్యము లగు ఘనకార్యపరంపరలచే మానవకోటి నాశ్చర్యానందమగ్నమునుగాఁ జేయుచుండెడివారలో, పరపురుషులఁ గన్నెత్తిచూడ నెఱుంగని యేపరినారీమణులు కూడ స్వరాజ్యరక్షణార్థమై రాణివాసముల వీడి, రణాంగముల కేగి ఘల్లుఘల్లుమని నిజకంకణధ్వనులు చెలఁగఁ గత్తులు దూసి, రిపుల కుత్తుకల ఖండించుచుండెడివారో, శిరీషాతి సుకుమారలై యెండయననేమో యెఱుఁగక యంతఃపురములలో హంసతూలికలపై సంచరించుట కలవాటుపడిన రాజయువతులు పాతివ్రత్యధర్మపాలనముకై భాగ్యభోగ్యాదుల సూరసేయక నిజనాథులతో గూడఁ గారడవుల గాఁపురములఁ జేయుచు దమ్ముఁ జూచు మునిభార్యలకుఁగూడ ముదము లొదవునటు లమితానందముతోఁ, బతిదైవతముల సేవించుచు, సతికిఁ బతియే గతి యనెడి యార్యమానినీధర్మమును బ్రకటించుచుండెడివారలో, మఱియు మానరక్షణపరాయణ లగు నే భూపాలభామినులు తా మబలలయ్యుఁ బరు లెంకటి బలాఢ్యులైనను లక్ష్యము సేయక, మోహాంధులై యామందులు చేయు నింద్యకృత్యములనుండి మరల్చుటకు సమయము చిక్కనప్పుడెల్ల వారినిఁ గ్రమ్మియున్న యవివేకాంధకారము తొలఁగునట్లు తగు జ్ఞానోపదేశజ్యోతులఁ బ్రసరింపఁ జేయుచుండెడివారలో, యెక్కలేల పాలు ద్రావి పక్కలపై హాయిగాఁ బొన్న పసిబాలురు గూడ సపత్నీకోలాహల మాకర్ణించినతోడనే దిగ్గున లేచి వైరులఁ గొట్టఁ బిడికిళ్లు బట్టుచుండెడివారో, అట్టి దయాసాగరులతోడను, అట్టి వీరసింహులతోడను, అట్టి సత్యరతులతోడను, అట్టి వీరమాతలతోడను, అట్టి సతీమతల్లులతోడను, అటువంటి తేజశ్శాలినులతోడను, అట్టి బాలవీరులతోడను, నిండి విరాజిల్లుచున్న యుత్తమక్షత్రియవంశముల జనించి స్వదేశసంరక్షణమునకై సర్వసంపదల సంతోషముతో ధారవోసిన రారాజుల పూతచరితములఁ గవివరులు మొదట వర్ణింప కున్నను, ప్రజలట్టి చరిత్రముల బ్రాతఃకాలమున స్మరింప కున్నను, కృతజ్ఞులను కీర్తినిఁ బడయ నేరరు.

నిజరాజసుధాకరచరితములఁ దెలుప నేరని గ్రంథరచన తండులరహిత మగు తుషపచనమువంటిది. అట్టి సారదూర మగు కావ్యమును నాస్వాదించుటచేఁ బురుషుల కెట్టి శక్తియుఁ గలుగ నేరదు. పావనమగు పతివ్రతాచరితముల వర్ణింప నెఱుంగని గ్రంథగుంభనము ఆమోదహీన మగు పుష్పగ్రథనమువంటిది. అట్టి సౌభాగ్యగుణశూన్య మగు పాత్రమును జేకొను స్త్రీల కెట్టికళ్యాణమును సమకూరఁజాలదు. కావునఁ గాళిదాసు కవిత్వాదిని దీర్ఘ

దారులగు నృపవరేణ్యుల చరిత్రములను, వర్ణించి యున్నాఁడు.

మన పూర్వంపు సార్వభౌముల చరితములు దివ్య చరితములకుగూడ మించి తేజరిల్లుచున్నయవి. కావుననే సామాన్యముగా మన యార్యావర్తమునఁ గల యున్నత సాహిత్యపథము లన్నియు నీరాజచంద్రులకీర్తికౌముదీ కాంతులతో నిండి వెలయుచున్నవి. ప్రత్యక్షదైవతము లనఁదగు నాఁటి సార్వభౌములఁ గన్నులకఱవుదీఱ సేవించిన మన కవివరులు పృథివీపతిచరితములనే పెక్కింటిని విరచించిరి. కొన్ని దివ్యచరితములు కూడ కలవు. కాని యవి యింతటివృద్ధినిఁ బొందియుండలేదు. సురాజ చరితమును మించిన ఘనచరితము వేఱొకటి లేదు. కావుననే కాళిదాసు రఘువంశ రాజచరితమును మొదట రచించి యున్నాఁడు. అనేక రాజవంశము లుండ సూర్యవంశమును వర్ణింపటయేల యని ప్రశ్నించుకొని "తద్గుణైః కర్ణమాగత్య చాపలాయ ప్రచోదితః" అని స్వయముగా రఘువంశరాజగుణగరిమను వర్ణించియున్నాఁడు.

కాళిదాసమహాకవి రఘువంశమునఁ దననాఁటి నాగరికతావధూటి నతిరమ్యముగాఁ జిత్రించి యున్నాఁడు. క్రీస్తునకుఁ బూర్వము ఆఱవ శతాబ్దమున మానవ సౌభాగ్యమునకు నిదర్శక మగు నార్యనాగరికత మన భారతావనియందు నెంతటి యౌన్నత్యమును గలిగియుండి నదియు నీకావ్యము నామూలాగ్రముగాఁ జదివినచోఁ గరతలామలకమట్లు గోచరమగును.

ఈ కావ్యమున మొదటఁ గవి యొనర్చిన పార్వతీ పరమేశ్వరస్తవము బహురమ్యముగా నున్నయది. ఆదిమ దంపతు లగు నీశ్వరుల వాగర్థములవలె నెడఁబాటులేని దాంపత్యము కలవారని చక్కఁగాఁ బోల్చియున్నాఁడు.

"ఉపమా కాలిదాసస్య" అను విబుధోక్తికి నిట్టి యుపమానములే యుదాహరణములు. కావుననే పండితా ఖండలుఁడగు నప్పయదీక్షితులవారు చిత్రమీమాంసలో నీ శ్లోకరాజమును వ్యంగ్యార్థవిలాసాదులచే నత్యంతచమత్కారముగా నున్నదని వ్రాసియున్నారు. మఱియు విజయగణి, చరిత్రవర్ధన, దినకర, సుమిత్ర, విజయాది వ్యాఖ్యాతలీపద్యముపై మంచివ్యాఖ్యానముల వ్రాసియున్నారు. నిక్క మగు కావ్యరసజ్ఞు లగు వైష్ణవ పండితప్రకాండు లెల్లరు నీశ్లోకరాజమును గొనియాడుచున్నారు. యాదవాభ్యుదయకావ్యకర్త లగు వేదాన్త దేశికులవా రీశ్లోకము ననుకరించుచు యాదవాభ్యుదయమున "వందే బృందావనచరం" అని చక్కఁగా వర్ణించెనని అభినవభట్టబాణబిరుదాంచితు లగు కృష్ణమాచార్యులవారు తాము రచించిన యాదవాభ్యుదయ వ్యాఖ్యానమున వివరించియున్నారు. కాని, రా. కృష్ణమాచారి యను నొకతమిళవైష్ణవపుంగవుఁడు ఈశ్లోకము నెవఁడో పాత్తరల బట్టు బాపఁడు విరచించెను కాని కాళిదాసుఁడు రచింపలేదనియు, నిది "భోజనం దేహి రాజేంద్ర ఘృతసూపసమన్వితం" అనుశ్లోకమువలె శ్రుతి కటువుగా నున్నదనియు, నిందలి యుపమానము బాలురకు బోధపడదనియు నిట్టు లేమేమో రఘువంశవిమర్శను పాత్తమున విలిఖించియున్నాఁడు. కాని పాప మీ దాక్షిణరసవేది యగు నాచార్యునకు నీశ్లోకమునందలి రసము స్ఫురింపలేదు. కాళిదాసు తనకు వాగర్థలాభము చేకూరుటకు వాగర్థములవలె నిత్యసంశ్లిష్టులైన పార్వతీ పరమేశ్వరుల నుతించెను. ఇట 'వాగర్థములవలె' నను నుపమానము, తమిళస్వామి రుచించినది కాదు. "దధ్యోదనములవలె" సంశ్లిష్టులైన అని కాళిదాసు వర్ణించినచో నీ స్వామికి నత్యంతప్రియముగా నుండియుండును. వాగర్థాభిలాషి యగు కవి యిప్పటున పార్వతీపరమేశ్వరుల కలయిక నెట్లు పోల్పవలయునో రసవేత్త యగు నీస్వామి "వాగర్థావివ" అను నుపమానమును జూపుట కీతని జీవితకాల మంతయు గడపుగా నొసంగినఁ జూపఁగలుగునా? ఈ శ్లోకము "భోజనం దేహి" అను ఛాందస శ్లోకమును బోలియున్నచో నాల్గవసర్గలోని "సరాజ్యం గురుణాదత్తం ప్రతిపద్యాధికంబభౌ" అనుశ్లోకమును నిట్టిదియే యగును. ఇట్లు చూచినచో నీకావ్యమునందలి శ్లోకము లనేకము లీ తిరిపెమెత్తు దాసరయ్యయో చేసి యుండునని చెప్పవలసివచ్చును. ఈ తమిళాచారి యాంగ్లేయభాషాపరీక్షోత్తీర్ణుఁడై పూర్వజన్మసుకృతపరిపాకమున కొన్ని సాంస్కృతికపదముల నుచ్చరించు భాగ్యమబ్బినమాత్రాన తనకుగల పశ్చిమజ్ఞానలవము నాధారముగాఁ దీసికొని విపశ్చిత్కార్య మగు కావ్యవిమర్శమునకుఁ బూనుట యతిసాహసము. ఈ యాచార్యశేముషీ మహిమాభివర్ణన మటుంచి ప్రస్తుతవిషయమునకు వరలెదను.

### వినయప్రకటనము

కావ్యాదిని కాళిదాసు గంభీరముగాఁ దన నమ్రతను వెల్లఁడించినాఁడు. కనుఁడు. "క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయామతిః । తితీర్షుర్దుస్తరం మోహా దుడుపే నాస్మి సాగరం" అనఁగా చిన్న తెప్పకట్టి నాధారముగాఁ జేసికొని మహాసముద్రమున కడ్డుపడువాఁ డెంతటి పిచ్చివాఁడో యటులే స్వల్పమగు తెలివి నాధారముగాఁ జేసికొని గంభీర మగు సూర్యవంశము ను వర్ణింపఁ గడఁగిన నేనును అట్టివాఁడనే యని నిష్ఠముగా నిజ నమ్రతను దెలుపుకొనెను. ఇటు మహాసముద్రము నల్ప సహాయముచే నడ్డమీఁద దిగఁదీయఁ డెట్టిప్రజ్ఞాశాలిగా నుండవలయునో యీఘనవంశమును వర్ణించుటకుఁ బూనుకొనినవాఁడును నట్టి సమర్థుండుగానే యుండవలయును. కాని నీరసున కీకార్యము సాధ్యము కానేరదు. కావున నట్టిపని నావంటివాఁడే పూనవలయును. కాని యన్యులకు సాధ్యము కాదని గంభీరముగా స్వోత్కృష్టతను గూడ ధ్వనింపఁజేసెను. అనంతరము అల్పజ్ఞుఁడ వని తెలిసియు నీ కేల నీమహాకావ్యరచనకు దిగితి వందురా? యని శంకించుకొని "అథవా కృతవాగ్ద్వారే వంశేస్మి న్పూర్వ సూరిభిః । మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః॥" ఘనమగు నీ రాఘువవీరచరితమును వర్ణించుటకు నే బూనుకొనుటకు నాధారముగాఁ బూర్వపు కవివరేణ్యులచేఁ జూపఁబడిన మార్గము దొరకుటచే రత్నశలాకచేఁ దొలవేయబడిన రత్నమున దుర్బల మగు దారమునకు వలె నాకు ప్రవేశావకాశము కలిగినది. అనఁగా వాల్మీకి లోనగు ప్రాచీనమహాకవులు తమ ప్రబంధఖనులయందు మణిగణములవలె వెలయుచున్న గుణగణములుకల సూర్యవంశరాజచరిత్రముల వర్ణించి యున్నారనియుఁ గాని యా గుణరత్నములు సుసమగు సరముగా నుండక విడివిడిగాఁ బడియుండుటచేఁ గంఠధార్యములు కాకుండుటను జూచి వాని నెల్లఁ బరిశీలించి యేర్చి హారముగాఁ గూర్చితిని గావున నీ రఘువంశ రాజమణిహార మందఱకును సుగ్రాహ్యముగా నుండునని గంభీరముగాఁ బ్రస్తావించెను.

### విమర్శకప్రశంస

"తంసంతః శ్రోతుమర్హంతి సదసద్వ్యక్తిహేతవః" గుణాగుణవిభాగనిపుణు లగు పండితులు తన కావ్యమును విమర్శింప నర్హులని, సద్విమర్శకులఁ బ్రశంసించి యున్నాఁడు. అనఁగా లోకమున సత్కావ్యనిర్మాతలెంతముఖ్యులో గుణదోషవివరణాభిజ్ఞు లగు విమర్శకులును నంతటిప్రముఖులే యని తెలుపఁబడినది. కాని మన యాంధ్రకవులలో కొందఱవలె విమర్శకుల దూఱలేదు.

### ఆదిరాజప్రశంస

భారతవర్షమునందలి పూర్వసార్వభౌములు దేహబల మనోబలముల నెట్టివారుగా నుండెడివారలో, వారి జీవితమర్యాద లెట్టివో, రాజ్యపాలనమున వారు చూపిన ధర్మమార్గము లెయ్యవియో, యా విషయములు బాగుగా వర్ణింపఁబడినవి. కనుఁడు, "శైశవేభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం । వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజాం" ఆనాఁటి మహారాజు లాగర్భశ్రీమంతు లయ్యుఁ జతురుదధిపరివేష్టితమహీమండల పాలనచతురు లయ్యుఁ "జతురాశ్రమనియమానుసారము ధర్మబద్ధులై నిజజీవితములఁ జతుర్వర్గసాధకము లగునటులు గడపిరే కాని యావజ్జీవము విషయమోహితులై వ్యర్థము చేసి యెఱుఁగ" రని వర్ణింపఁబడినది.

### దిలీపవర్ణనము

#### దేహశక్తి

మృగాధిపతి యగు సింహమున కెట్టి దేహబల ముండునో మానవాధిపతి యగు నృపసింహునకును నట్టి శరీరబల ముండవలయును. ప్రభుశక్తికి దేహ బల మత్యవసరము. కావునఁ గవి దిలీపుని యాకారమును జక్కఁగా వర్ణించి యున్నాఁడు :

శ్లో. వ్యూఢోరస్కో వృషస్కంధః సాలప్రాంశుర్మహాభుజః
ఆత్మకర్మక్షమం దేహం క్షాత్రోధర్మ ఇవాశ్రితః.

అనఁగా సువిశాల మగు నురమును, వృషభము యొక్క మూఁపురమువలె నున్న భుజశిరస్సులును, మద్దిచెట్టువలెఁ బొడవైన దేహమును, ఆజానుబాహువులును, గల యామహారాజు పరాక్రమమునకుఁ దగిన దేహమును దాల్చి భూమిపై నవతరించిన రాజధర్మమువలె నుండె నని భావము.

#### ధీశక్తి

శ్లో. ఆకారసదృశప్రజ్ఞః ప్రజ్ఞయాసదృశాగమః
ఆగమైః సదృశారంభ ఆరంభసదృశోదయః,

అనఁగా నాకారమునకు సమమగు తెలివియు, బుద్ధికి సరియగు విద్యయు, విద్యకు సదృశమగు కార్యమును, కార్యమునకుఁ దగినఫలమును, నామహారాజునకుఁ గలవని భావము.

## ప్రజానురాగము

ఆనాఁటిపాలకులకుఁ బాల్యులపైఁ గల ప్రేమాతిశయమును గనుఁడు.

శ్లో. ప్రజానాం వినయాధానా ద్రక్షణా ద్భరణా దపి
స పితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః.

అనఁగాఁ బ్రజల విద్యావినయసంపన్నులను గాఁ జేయుట, వారిని జోరభయాదులనుండి కాపాడుట, వారి కన్నవస్త్రాదుల నొసఁగి రక్షించుటలోనగు సకలరాగపూరితము లగు కృత్యములచే నాతఁడే, ప్రజకు నిజమగు తండ్రి యనియు, వారిని గన్న తలిదండ్రులు కేవలజన్మకారణు లనియుఁ, దెలుపఁబడినది. మఱియు,

శ్లో. ప్రజానా మేవ భూత్యర్థం స తాభ్యో బలి మగ్రహీత్
సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః.

అనఁగా సూర్యభగవానుఁ డేరీతిగాఁ దాను గ్రహించినదానికంటె వేయిరెట్లధికముగాఁ దిరుగ వర్షించుటకే భూమినుండి రసమును దీసికొనుచున్నాఁడో ఆ విధముగానే యామహారాజు ప్రజాసంపద నభివృద్ధిఁ జేయుటకే వారినుండి పన్నుల గ్రహించుచున్నాఁడు. కాని కేవల ధనకాంక్షచేఁ బ్రజలఁ బీల్చి పిప్పిచేయుట లేదు. ఈ శ్లోకార్థములఁ దిలకింప నానాఁటి రాజమార్తాండులు ప్రజాక్షేమమునకై యెన్ని యనాథశరణాలయములఁ గట్టించి యుందురో, యెన్ని కళాశాలల స్థాపించియుందురో, యెన్ని వైద్యాలయముల నెలకొలిపి యుందురో, యెట్టి కృషివాణిజ్యసౌకర్యముల నేర్పఱచి యుందురో, మఱెట్టి సదుపాయముల సాగించియుందురో, తెలియనగును.

## సచివానుకూలత

దిలీపమహారాజు పుత్త్రార్థియై వసిష్ఠమహర్షి యాశ్రమమునకుఁ బోవునప్పుడు సకల రాజ్యభారమును సచివులపైనుంచి పుత్త్రులపై రాజ్యభార మిడిన తండ్రివలె నిశ్చింతగా వెడలిపోయెను. దీనివలన మంత్రికి నృపునకు నొండొరులపైఁ గల భక్తివిశ్వాసములు వ్యక్తమగుచున్నవి.

## ప్రకృతి వర్ణనము

దిలీపుఁడు కోసలపురిని వీడి వసిష్ఠాశ్రమమున కేగునప్పుడు మార్గమధ్యమున నున్న శ్రోత్రియాగ్రహారములఁ గనుఁగొనుచు, గొల్లగూడెముల నరయుచు, మునిపల్లెల దర్శించుచు నిట్లు ప్రయాణమును సాగించెను. కవి యిట వనమార్గమును బ్రకృతిసౌందర్యమును నిరూపించుచు మనోహరముగా వర్ణించెను. కనుఁడు.

శ్లో. శ్రేణీబన్ధా ద్వితన్వద్భి రస్తంభాం తోరణస్రజం
సారసైః కలనిర్హ్రాదైః క్వచి దున్నమితాననౌ.

అనఁగా స్తంభములులేని తోరణమాలలవలె నింగిని బారులుదీరి చెవి కింపగునట్టుల ధ్వనులు చేయుచున్న బెగ్గురుపక్షులయొక్క పంక్తులను దలపైకెత్తి చూచుచు, ప్రయాణమును సాగించెను అని వర్ణించెను. ఈ భాగమున నిట్టి రమ్యమగు శ్లోకములు పెక్కులు గలవు. గ్రంథవిస్తరభీతిచే విడిచితిని.

## ఆశ్రమ వర్ణనము

కవి యొనర్చిన వసిష్ఠాశ్రమవర్ణనమును చదువునప్పుడు పాఠకుని కంటికి శాంతమగు నాశ్రమముయొక్క సహజరమ్యత గోచర మగుచుండును. ఆ భాగమునుండి యొక పద్యమును నుదాహరణముగా నిచ్చుచున్నాఁడను.

శ్లో. ఆకీర్ణ మృషిపత్నీనా ముటజద్వారరోధిభిః
అపత్యైరివ నీవార భాగధేయోచితై ర్మృగైః.

అనఁగా నివ్వరిధాన్యముయొక్క భాగమును పొందుటకు హక్కు గలయట్టియు పర్ణశాలలయొక్క గుమ్మములకడ నడ్డుగ నిలిచినట్టియు ఋషిభార్యలచేఁ బుత్త్రులవలెఁ బ్రేమింపఁబడుచున్నట్టియు, లేళ్లతో నిండియున్న యాశ్రమమునఁ బ్రవేశించె నని భావము.

దిలీపమహారాజు కులగురునితో తనకు సంతతి లేదని వగచుచు జెప్పినవాక్యములు కొండనుఁ గూడ గరగించుననుటకు సందియము లేదు.

దిలీపుఁ డొకప్పుడు స్వర్గమునఁ గొంతకాల ముండెను. ఆ సమయమున స్వేచ్ఛావిహారానుకూల లగు నప్సరసలమధ్య సంచరించుచున్నను గడుదూరమున నున్న తనసతిపై మతినిఁ బోనిచ్చెనే కాని యా నాకాంగనల నావంతయుఁ గన్నెత్తి చూడఁడాయె. నిదిగదా! ధీరతయన.

పెద్దలఁ బూజించుట
"ప్రతిబధ్నాతి హి శ్రేయః పూజ్యపూజా వ్యతిక్రమః"

అనఁగాఁ బూజనీయులఁ బూజింప కుండుటవలన నెంతటి మహారాజులకును గూడ కార్యభంగము కలుగునని భావము. ఈ సర్గములోఁ జేయఁబడిన నందినీవర్ణన మానందదాయకముగా నున్నయది. ఇందలి ప్రతిసర్గమును గూర్చియు ముచ్చటింపవలయుననియే, నాకుతూహలము. వ్యాసము విపులమగు నని తలఁచి యిప్పటికి ప్రథమసర్గ ప్రశంసతో నీ యుపన్యాసమును ముగించుచున్నాను. కాని సహజమగు కవిత్వమాధుర్యమును బ్రకటించు పెక్కువిషయములు మిగిలిన 18 సర్గములలోఁ గలవు. వాని నన్నటినిఁ గ్రమముగా ముందు వివరించెదను. మొత్తముమీఁద నుత్తమపురుషుల కుండవలసిన గుణవిశేషము లన్నియు, మనసునకు నాటునట్లీతన్నమున సంపూర్ణముగా విశదీకరింపఁబడి యున్నవి. ఇట్టి కావ్యములఁ బఠించిన మానవుఁడు నిక్కమగు మానవుఁడై, మాననీయుఁడగు ననుటకు సంశయ మింతయును లేదు. ఆంధ్రకవులు గూడ నిట్టి ఘనకావ్యముల వ్రాసి మన యాంధ్రసారస్వతము నభివృద్ధిలోనికిఁ దెత్తురు గాక.

---

# ఏమి చేయుచునుండునో యింటిలోన?

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. ఏ. బి. యల్.

పడుచు లెల్లఁ గులాయముల్ పట్టిపోయె
చల్లఁగా మెల్లఁగా వచ్చెఁ జందమామ
ఏమి చేయుచునుండునో యింటిలోన
నాదు జానకినారతనాలబొమ్మ?
పలుకుపలుకున రాగంబు లొలుకుచుండ
ప్రాణవిభుతోడ గూటిలో బాసలాడు
పులుఁగుజవరాలి మాటలు కులికిపడునొ?
నాదుజానకి నారతనాలబొమ్మ!
తారకావిస్ఫుటాంకురహారరచిత
ప్రవిమలాకాశనిత్యకావ్యంబులోన
విరహిణీజనచిత్రంబు లరయునేమొ?
నాదుజానకి నారతనాలబొమ్మ!
సామ్యలీలలఁ దలపోసి సఖ్య మెంచి
ప్రణయముప్పొంగహాయిగాఁ బాడునేమొ
లేఁతగొంతున గోపికాగీతములను?
నాదు జానకి నారతనాలబొమ్మ!
చిరవియోగభారంబునఁ బరితపించు
నన్నుఁ జూచిన చందురు కన్ను జూచి
వలపుచెలికాని వేదన తెలిసికొనునొ?
నాదుజానకి నారతనాలబొమ్మ!
వెన్నెలలఁజూచుచొక్కింత కన్నుమూయ
సిగ్గు తెరఁ జీల్చి ప్రణయంపునిగ్గుతేల్చు
కలల హృదయేశు కౌఁగిటనిలుచునొక్కొ?
నాదు జానకి నారతనాలబొమ్మ!
భావసుందరపుష్పదంపతుల నూత్న
ప్రణయపరిమళంబులను వీవనల వీచు
వాయువులఁ గాంతు సందేశవార్త వినునొ?
నాదుజానకి నారతనాల బొమ్మ!

---

# పావులూరు గణితము

వేమూరి విశ్వనాథశర్మగారు ఎమ్ ఏ

ఆంధ్రులలో పావులూరు గణితము పేరు తెలియనివా రుండరు. ఇప్పటికిని పల్లెకూటములలో పావులూరుగణితము నుండి కొన్ని పద్యములు చదివించెదరు. యకరములు, సెంట్లు సామాన్యప్రచారములోనికి రాని ప్రదేశములలో మల్లన్నగారి క్షేత్ర గణితసూత్రములనే కరణా లనుకరించుచున్నారు. ఇట్టి సుప్రసిద్ధమైనట్టియు, మిక్కిలి పురాతనమైనట్టియు పావులూరు గణితమును గురించిన యంశములు ప్రతి యాంధ్రునకుఁ దెలియవలె ననుకాంక్షతో నీ వ్యాసమును వ్రాయుచున్నాను.

ద్రావిడ భాషలలో పావులూరు గణితము మొదట పుట్టిన శాస్త్రగ్రంథమని చెప్పవచ్చును. ఇది రమారమి వేయిసంవత్సరముల నాటి గ్రంథము. పావులూరు గణితమునకు మాతృక గణితసారసంగ్రహమను సంస్కృత గ్రంథము. దీనిని రచించినది మహావీరాచార్యుఁ డను జైనమతాచార్యుఁడు. ఈతఁడు రచించిన నూటయేబది సంవత్సరములలో పావులూరు మల్లన ఆ గ్రంథమును సమగ్రముగ నాంధ్రమున ననువదించుట గణితశాస్త్రము నందు తెలుఁగువారికిఁ గల యభిరుచిని జాటుచున్నది. రమారమి యీ కాలమునందే కన్నడభాషలోనికిఁగూడ గణితసారసంగ్రహము తర్జుమా చేయఁబడినది.

పావులూరి గణితము మల్లన్న వ్రాసిన గణితశాస్త్రముయొక్క మొదటిపుస్తకమునకే పేరు. తన జన్మభూమి యగు పావులూరు ప్రాంతముల వాడుకలో నున్న మానములను (తూనికలు, కొలతలు మొదలగునవి) వర్ణించుటచేత ఈ మొదటిభాగమునకు పావులూరి గణిత మని పేరుబెట్టెను. ఈ భాగము సంస్కృతమున కనువాదము గాని తర్జుమా కాదు.

నూటయిరువది సంవత్సరముల క్రితము "బెంజిమన్ హైన్" అను నతడు సామర్లకోటలో కంపినీ యేజంటుగా నుండెను. అతడు పావులూరి మల్లన్న గణితములోని క్షేత్రగణితమును ఇంగ్లీషులోనికి తర్జుమా చేసెను. అప్పటికే యీ గణితశాస్త్రములో ప్రవీణత నెందిన కరణా లరుదుగ నుండి రనియు, ఒక సంవత్సరము ప్రయత్నింపగా బందరు సమీపమున నెకవృద్ధబ్రాహ్మణుడు లభించె ననియు ఆయనవలన పావులూరిగణితము విషయమై సర్వమును నేర్చుకొని క్షేత్రగణితమును ఇంగ్లీషులోనికి మార్చిరనియు హైను దొరగారు వ్రాసిరి ! పావులూరి గణితమును గురించి మన కిప్పుడు తెలియనివిషయములు కొన్నియుండుట చేత నిచ్చటఆవిషయము కొంచెము వ్రాసెదను.

ఈ మధ్య మనము మఱచి పోయినను, పావులూరి గణితము సంస్కృతగ్రంథమునకు

తజ్ఞమా యని యావృద్ధబ్రాహ్మణుడు దొరగారికి చెప్పెను. మహావీరాచార్యుని పేరు మాత్రము పేర్కొనలేదు. ఇందు దశవిధ గణితములు గలవు. అందుచేత మల్లన్న వ్రాసినవి పదిపుస్తకములు. ఇవి క్రమముగ.

(1) పావులూరు గణితము- ఇందు పావులూరు ప్రాంతముల వాడుకలో నుండిన మాసములు, కొలతలు, మొదలగునవి వర్ణింపఁబడినవి.

(2) భాగహారగణితము:—వజ్ర వైడూర్యాది మణుల వ్యాపారములో వాడెడితూనికలు, తూనికలనుబట్టి వెల నిర్ణయించుటను దెలుపును.

(3) సువర్ణగణితము: — వరిపిడిని బట్టియు, తూనికను బట్టియు వెండిబంగారముల నిగ్గు దేల్చు భాగము.

(4) మిశ్రితగణితము:— దీని విషయము తెలియదు.

(5) భిన్నగణితము :— భిన్నాంకములు చేసి వస్తువులయొక్క వెల నిర్ణయించుట.

(6) క్షేత్రగణితము:— భూమికొలత, ఇందు వాడెడి పరిభాషాపదములు, భూమికొలతలలో చేర్చుటకు వీలులేని డొంకలు మొదలగు ప్రదేశములు, కొలతనుబట్టి భూమియొక్కపరిమితి దేల్చుటకు కావలసిన లెక్కల వివరము క్షేత్రగణితమునందు వర్ణింపఁబడినవి.

(7) ఖాతగణితము:— చెఱువులకొలత, వానిలోనుండు నీటియంచనా, నీటిమట్టము, చెఱువులు కాలువలు త్రవ్వుటకు నీటిమట్టముయొక్క యుపయోగము, కోటలు అగడ్తలు నిర్మించువిధములు, వెల్లువలు రాకుండ కట్టలు పోయు మార్గములు మున్నగునవి యీ పుస్తకములో సవిస్తరముగ వర్ణింపఁబడినవి.

(8) ఛాయాగణితము:— నీడనుబట్టి వస్తువుల యొక్క దూరము, ఎత్తు కనుగొనుట.

(9) సూత్రగణితము:— అంక గణితాది శాస్త్రములకు సంబంధించిన చిక్కులెక్కలు తేల్చుటకు సూత్రము లీభాగమునందు చెప్పఁబడినవి. ఉదాహరణము-నిత్యనక్షత్రమును జెప్పుటకు సూత్రము. "గీ॥ చనిన మాసములను చయ్యన రెట్టించి గత దినంబులందు గలయఁ గూడి, యశ్విని మొదలు గ నవి లెక్కబెట్టిన, నిత్యతార వచ్చు నిజముగాను." ఇట్టె "మున్నూటరువదిమాడలు, నెన్నగ బదియుంగరంబు లెంత్తైతో భటుం డెన్నాళ జీత మడిగిన నన్నాళ్లకు నుంగరంబు లారాజిచ్చున్" అను సమస్యకు "ఒకటి రెండు మూడు నొనరంగ నాల్గిడి, యవియు బెట్టి సున్న లమరఁబెట్టి, నూరు బెట్టి పిదప నూటయే బది బెట్టి, యుంగరముల మొత్తు లెరుగ వచ్చు (?)" అను సూత్రము.

(10) ప్రకీర్ణగణితము:— ఇందు బీజగణిత పరికర్మంబులు చెప్పఁబడినవి.

ఈ పదిపుస్తకములు చేరిన గ్రంథమునకు "దశవిధ గణితముల"నియు "సారసంగ్రహ" మనియు, మొదటి పుస్తకపు పేరును బట్టి "పావులూరు" గణిత మనియు పేర్లు మన

దేశమున వాడుకలో నున్నవి. పాత పెద్ద బాలశిక్షలో "సారసంగ్రహ గణితమునందు సూత్రగణితము సమాప్తము" అనియుండును. సూత్రగణితము మొమ్మిదవ పుస్తకమగుటచేత "పావులూరు గణితము"ను పేరు దీనికి చెల్లదు. మొదటి పుస్తకమునకుమాత్రమే పావులూరు గణితమనుపేరు. దీనిని బట్టి చూడగా, "సార సంగ్రహ" మను మాతృకయొక్క పేరే మల్లన తన గణితశాస్త్రసముదాయమునకుం బెట్టినట్టు కనంబడుచున్నది.

ఇప్పటికిని క్షేత్రగణితము పల్లెటూరికరణాలవద్ద ప్రచారములో నున్నది. ఆంధ్రదేశములో భూములు కొలుచుటకు "కుంటలు"ను 'కుంచెడునేల' "పుట్టిభూమి" అను పొలము యొక్క పరిమితి దెలిపెడి సమాసములును ఇప్పటికిని ప్రచారములో నున్నవి.

కీసరపాటి కొలత, సింగంపాటి కొలత అని భూమికొలతలో రెండు విధములగు మానములు వాడుకలో నున్నవి. ఇప్పటికిని నెల్లూరుజిల్లాలో సింగంపుట్టి, కైలుపుట్టియని ధాన్యపుకొలతలో రెండు విధములున్నవి. క్షేత్రగణితములో ముఖ్యముగ కీసరపాటి కొలతలె చెప్పంబడినవి. కీసరపాటి కొలతకు మూలము "అంగుళము"దీనిపొడవు మూడువిధముల తేల్చవచ్చును. మూడువడ్లగింజల పొడవుగాని, బొటమనవ్రేలి మధ్యకణుపు యొక్క చుట్టుకొలతలో సగముగాని, నడిమివేలు యొక్క మధ్యకణుపు చుట్టుకొలతలో సగముగాని, 'అంగుళి' ప్రమాణము. ఇట్టివి.

| | |
|---|---|
| 12 అంగుళములు | 1 జేన |
| 32 జేనలు | 1 గడ |
| 4 చదరపు గడలు | 1 కుంట |

దీనికి కీసరపాటి మానమని పేరు. కొందరు దీనిని కేసరిపాటి కొలతని యందురు. కాని యాపేరు సరియైనది కాదు. 'కేసరి' యనునది "సింగంపాటి" కొలతకు పర్యాయపదము కావచ్చును. కీసరపాటిమానమున కా పేరు నచ్చిన కారణ మీవిధముగ చెప్పం బడి యున్నది.

కీసరయనునది గ్రామముపేరు. ఆ గ్రామపువెట్టివాడగు కీసర యనునతడు కులాచార ప్రకారముభూములకొలుచుచుండెను. రాజుగారొకనాడు బ్రాహ్మణులకు భూదానముచేసి కీసరను భూమికొలిచి యిచ్చుట కాజ్ఞాపించెను. ఏకొలత ప్రకారమని కీసర రాజుగారి నడుగగా "నీజానతో కొలువుమ"ని రాజు చెప్పెను. కాని కీసర మరిగుజ్జువా డగుటచేత జానచిన్నదై భూమి కొంచెము వచ్చినందున బ్రాహ్మణులు కోపగించుకొనసాగిరి. బ్రాహ్మణుల కోపము మాన్పి పుణ్యము సంపాదించుటకు కీసర తన కుడిచేతియందలి అంగుష్ఠముకు తర్జనికి మధ్యనున్న భాగమును చీల్చి జాన పొడిగించెను. ఈ త్యాగమునకు మెచ్చి నాటినుండియు పైను దహరించిన మానమునకు కీసరపాటి కొలతని పేరు పెట్టిరి.

కీసరపాటి మానమే కాక ఆంధ్రదేశములో నాయాప్రాంతముల వాడుకలో నుండిన కొలతలు గూడ చెప్పంబడినవి. మధ్యరాష్ట్రము అనంగా బందరు ప్రాంతములలో నీదిగువ కొలతలువాడుచుండినట్లుసూచించియున్నాడు.

| | |
|---|---|
| 12 అంగుళములు | 1 జేన |
| 2 జేనలు | 1 మూర |
| 32 మూరలు | 1 గడ |
| 4 చదరపుగడలు | 1 కుంట |
| $1\frac{1}{4}$ కుంటలు | 1 కుంచము |
| 2 కుంచములు | 1 ఇరస |
| 2 ఇరసలు | 1 తూము |
| 5 తూములు | 1 ఏదుము |
| 4 ఏదుములు | 1 పుట్టి |

దీనినిబట్టి ధాన్యపుకొలతకును భూమి కొలతకును ఒకేమాన మేర్పడియుండినట్లు స్పష్టమగుచున్నది. ధాన్యపుకొలత కిప్పుడు కూడ పైమానము నెల్లూరిజిల్లాలో వాడుచున్నారు. 'కుంచెడుపొలము' "పుట్టెడునేల" అనుపదము లిప్పటికినిసర్వసామాన్యములు. ఇవి చల్లకమునకు సంబంధించిన లెక్కలు. "పుట్టెడువిత్తనాల మాగాణి" యనుట నెల్లూరిజిల్లాలోని యాచారము. ఈ కొలత ప్రకారము పుట్టెడు భూమియనగా కొంచెము తక్కువగ తొమ్మిదిన్నర యకరముల విస్తీర్ణము గలది. కాని భూమికొలుచునప్పుడు గడకు గడకు మధ్యను గోష్పాదమంత భూమి పెచ్చు వదలుట యాచారముం డెడిది. ఇవి చేర్చినయెడల పుట్టెడుభూమియొక్క విస్తీర్ణము సరిగా పది యకరము లగును. పైరులు పెట్టుట కదనైన ఋతువులు భూముల విస్తీర్ణము ననుసరించి ఆయాపైరుల చల్లకమునకుఁ గావలసిన విత్తనముల కొలతలును క్షేత్రగణితమునందున్నవి.

మల్లన్న వ్రాసిన గణితము మహావీరాచార్యుని గ్రంథమునకు సరియైన ఆంధ్రీకరణ మని తోఁచదు. సూత్రములుమాత్రము సంస్కృతము నుండి తెలిగించి యుదాహరణములను లెక్కలను కొంతవరకు స్వంతముగ కల్పించినట్లు కనఁబడుచున్నది. ఈ లెక్కలలో చాలవరకు మన సంఘస్థితులును, ఆచార వ్యవహారములును వ్యక్తము లగుచున్నవి. ఇవి చదువుటకు మిక్కిలి మనోహరములుగ నుండును. ఈ కారణమును బట్టియైనను మల్లన గణితశాస్త్రమును సమగ్రముగ సంపాదించి ప్రచురించినయెడల బాగుండును. పల్లెటూళ్లలో కరణములవద్దను, చెన్నపట్టణములోని ప్రాచ్యలిఖితభాండాగారములోను పావులూరు గణిత ప్రతులు చాలఁగలవు. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారములో పావులూరి గణితము, ఖాతగణితము, సూత్రగణితము, క్షేత్రగణితము గలవు. ఇవిగాక దశవిధగణితము లనుగ్రంథము వేరుగ నున్నది. ఈ ప్రతులనుబట్టి సంపూర్ణగ్రంథమును సంపాదించుట దుర్లభము కాదు. ఈ యమూల్యగ్రంథ ప్రకటనము సాహిత్యపరిషత్కార్యనిర్వాహకులు సమర్థించినచో మిక్కిలి శ్లాఘనీయము.

---



యశోధర, బుద్ధదేవుని సతి

సేటు పురుషోత్తము విశ్రాంమాజీ గారి యనుమతిని పునర్ముద్రితము. ఎ. హెచ్. చిత్రకారుడు: ముల్లరు గారు

# గవేషణ

వేలూరి చంద్రశేఖరం గారు, బి. ఏ.,

(గత సంచిక శేషము)

౨

జనుల జగతికిఁ గ్రమ్మఱి సత్యకాముఁ
డూర్ధ్వలోకమునుండి నియుక్తుఁ డైన
వానిపోలిక, దుఃఖితప్రాణి కెల్ల
సాంత్వనంబు నొసంగుచు సంచరించె.
అవిటి కాతఁడు కేలూఁత, యంధజనున
కతఁడు కనుదోయి, తలదాఁప నైనఁగాని
పంచ లేనట్టిపేదకుఁ బ్రాపతండు.
పెరిమ లేరియెడందల విషమునించు
వారల కతండు వెజ్జు, సంసారయుతు.
మరసి బమ్మెరవోయెడు నట్టివారి
కతఁడు సేదోడు, సత్యవీక్షాభిలాష.
పరికనుల జ్వలించు నవ్వారి కతఁడు
మార్గదర్శకుఁ, డీరీతి మనికితంబు
నలకరించుట జీవితవ్రతము గాఁగ
సత్యకాముని దినములు జరుగఁజొచ్చె.
ఆయెడఁద శోకవీచిక లంతరింప
నయ్యె విషఫేనిలమ్ము కా వపుడు పోలె;
అతని యశ్రువు లింకిపో, నైనఁగాని
తొల్లినలెఁగాక, తోఁచె మాధుర్యమందు;
లోనివేదనచే మోము మ్లాన మగుట
బదులు వింత ప్రసన్నతఁ బడయఁజొచ్చె;
మనుజు దుఃఖాగ్నియందున నినుముపగిదిఁ
దప్త మొనరించి శుచిచేయు దైవశిల్ప
మించుక యెఱింగికొని యీ ప్రపంచనియతి
కెగ్గు తలపోసి క్రుద్ధుఁడై యెదురుకొనుచు
మోహితుఁడు కాఁడు సత్యకాముండు నేఁడు;
కాని సత్యనిరీక్షణాకాంక్షమాత్ర
మెప్పటట్లులఁ దీవ్ర మాయెడఁదయందు.
నాఁటియట్లు తమాలవనమ్ము చెంతఁ
బూర్ణిమాచంద్రచంద్రికాభ్యుదయవేళ
ధ్యానమగ్న మొనర్చె స్వాంతమ్ము నతఁడు.
క్రోధమాలిన్య మెల్ల వీడ్కొలిపియుంట,
వాఁడి యయ్యును మ్రదిమము వడసినట్టి
యతని వేదన పేశలమైన యీని
వేదనమ్మందు మెల్లన వెలలె నపుడు:
"ఓయి హృదయాంతరనివాసి! యొకట, శోక
తప్తమైనట్టి నాయెద సుప్తమైన
క్రోధసర్పము మేల్కని క్రోయునాల్క
లైన పలుకటి పడగ లందంద చాఁచి
పఱచె దుర్విషఫూత్కారపంక్తు, లంత
వాని నాఁకిపి నాకు సాంత్వన మొసంగి
నాఁడ, వీకేయి క్రమ్మఱ నా యెలుంగు
నాలకింపుము; కలవు నీ కేలునందుఁ
గడిఁదియాఁవులు, చే సాఁచి యడుగువాని
కుపనతమ్ములు దేవ! యీ యుగ్రశోక
భోగ మంతయు నీచేతి యాగి గాఁగ

ననుభవించితి, నింక నీయగ్నిశుద్ధి
ముగియఁగా లేదె? దుఃఖపుఁ బొత్తునుండి
తెరలఁజేయవె నన్ను, నీతెరల నెల్ల
నపసరించి భవద్రహస్యమ్ము కడకుఁ
జేరిపింపవె యిఁక నాలసింపఁబోక."
ఇటులు ప్రార్థించు నతని చెంగట నమర్త్య
మూర్తి స్మిత సంప్లుతం బైన మూర్తితోడ,
శోకనిర్వాపకం బైన చూడ్కితోడ
నిలిచి యనె నిట్లు మధువొల్కు నెలుఁగునందు
"ఓయి! వగపున దురపిల్లు నీ యెలుంగు
చే బలాత్కృత నగుచు వచ్చితి నిచటకు.
జ్యోతిరావసథంబుల నుండు మేము
మంటిపై నున్న మిమ్ము మఱపునొంది
యుందు మనుకొకు, మెవ్వఁడే డెందమందు
నలఁదురి యెలుంగు సేయు నయ్యలని కేమః
సాయ మొనరింతు, మింక దుస్స్వప్నమట్లు
మఱచిపోఁగల వీయలందురుట యెల్ల.
సౌమ్య! యీ పాత్రలోని యాసవము గ్రోలు
మామని యనారతంబు నీయందు నిలుచు,
మధుమయం బగు నింక నీమనికి యెల్ల.
ఉమ్మలిక మేడ నచటికిఁ బొమ్ము, నీదు
నిలువుమాత్రాన దుఃఖము నెలలఁ గలదు."
సత్యకాముని విలులితస్వాంతమందు
నమృతలహరిని బొరలించు నాపెకంత
మాఁగిపోయె నదాటుగ, నాపెరూపు
తెలియకయమున్న జాబిల్లి తెలివెలుంగు
లోన గుఱుతింపరాకుండ లీన మయ్యె.

3

పూర్వమట్టుల సత్యకాముండు నేఁడుఁ
బరులశోకముఁ బోకార్చు వ్రతమునందు
దీక్ష గొనియుండె, నాతనిదృష్టి నడ్డు
తెరలగము లెల్ల మెల్లనఁ దెరలఁ జొచ్చె;
మధువు వర్షించె మిన్నులు, మారుతంబు
స్పర్శయందును మధువుంచె, జలములందు
మధువు స్రవియించెఁ, బృథ్వియు మధువునించె,
జ్యోతియందును దాఁపుర మున్న మధువుఁ
గిరణములు డించె నతని యంతరమునందు;
హృదయదహరమునందును ప్రేమ మిపుడు
పూర్ణబింబముతోడ నభ్యుదిత మయ్యె.
తన ప్రియుం డన్ని మోముల వెనుకనుండి
తన్నుఁ బిల్చుచునున్న చందమ్ము తోఁచె.
రోగముల నెల్లఁ దాను నీ రోగి యగుచు
మాన్పువైద్యునిచందము మనుజు మనువు
నాక్రమించెడు నట్టి విహ్వలత నెల్లఁ
గ్రిందు పడఁజేసెఁ దాను నిర్లిప్తుఁ డగుచు.
సత్యకాముని మనుగడ జనతయందు
జీవనదివోలెఁ బ్రవహించి నేమ మెల్ల
కడల వెదచల్లె, నాతనికడకుఁ జేరి
రెఱుకకై! శేషవల్ తపియించువార
లతఁడు పల్కినపల్కు కావ్యములయందు
దిశదిశలయందుఁ గూడ నుద్గీత మయ్యె,
సత్పథాసక్తు లైన రాజన్యవరులు
చేరవచ్చెద రతనియాశీస్సు గోరి;
ఐన నిత్యగవేషణావ్యగ్ర మైన
యతని మన మెట్టియుపలబ్ధియందుఁగాని
కడనిలుకటంచు నాఁగి తాఁ గడఁక విడదు.
ఒక్కనాఁడు నిశాంతముహూర్తవేళ
నలహిమాచలసితసానువులను మెట్టి

సత్యకాముఁడు తీవ్రమాశంసతోడఁ
దత్పరత వేచెఁ దా నుషోదయముకొఱకు.
చరమసత్యము నెల్ల నంతరమునందుఁ
జేకొనుకడంక, యింకను జిత్తమందుఁ
గోపురంబున్న యస్ఫుటశక్తుల వెలార్పఁ
దేజము గడించుతమి వానిఁ దీవరించె.
క్రింది చీకటిగ్రంధులు ప్రిదులు పూర్వ
మాహిమాచలసాన్వగ్రమందు నున్న
సత్యకాముని చూడ్కి కుషస్సు తోఁచెఁ
జామ కలసిన లేత కెంజాయతోడ.
అంత సమ్మోదసంప్లుతమైన మెలుఁగు
నందు, సంభ్రమవివశుఁడౌ నతని మెఱుక
దప్పులకే, యున్మనుండైన కవికవిత్వ
మటుల, యాతని తలఁపులు వ్యక్తమయ్యె:
"ఏ నుషస్సుల నెన్నిటి నింతదనుక
నోదిగాఁ జేర్చి పేర్చితి నుల్లమందు,
నోయుషాదేవి! యిట్టి నీ యుదయ మెపుడు
కాననైతిని, నీసౌభగంబు గతము
లౌ నుషస్సులకుం దఱియంగ నగునె!
నీవు గైకొనివచ్చెడు నేఁటిదినము
దినములకు నెల్ల సుదినము, నిను మనంబు
నందు లగియింతు నించుక యాఁగు మచట!
వేల్పు లెల్లరలోఁ దొలివేల్ప వీవ,
జగముతేని మహారహస్యంబు లెల్ల
నీ వెఱుంగుదు, వతనిసందేశ మీవ
తఱియఁ బంపుదు వీప్రభాతములయందు.
దేవి! వెలుఁగులఁ గ్రక్కు నీతేరునుండి
యవతరింపుమ యీమర్త్యభువనమునకు.
అరుణచరణద్వయంబు నాయందు నిలిపి
పాఱఁదోలుమ చీఁకటిబలగ మెల్ల."

సత్యకాముని మెలుఁ గాకసమ్మునందు
మ్రోఁగి,మార్మ్రోఁత లీనుటముగియ మునుపె,
యాయుషస్సీమనుండి ప్రయాత మొక్కఁ
డరుణతేజము పొడవయ్యె నతనిమ్రోల.
ఆపెమేను వెలుఁగు, వెలుం గాపె చీర,
యాపెనగ లెల్ల వెలుఁ, గాపె యంజయందు
వెలుఁగు దామర శతదళకలిత మగుచు
విడిగె, వెలుఁ గాపెచుట్టును సుడియఁజొచ్చె.
ఆపెయానందదోహన మైన మెలుఁగు
ఝుంకృతం బయ్యె నాహిమాచలముమీఁద:
"సత్యకామా! మదీయ తేజమును జూచు
వార లీహర్ష శోకసంపర్క మెడలి
యవిషయం బైన యానందమందు నిలువ
నోపుదురు సుమ్ము, వారలయుల్ల మెల్ల
సత్యమయ మౌ, సితాసితకృత్యములను
మున్ను నెడలు ప్రవృత్తి యీభువన మేలు
తేని యభిసంధియందు వర్తింప నేర్చు,
నోయి! నీచూడ్కి వెనుకకుఁ ద్రోయు తెరలు
సర్వముం బ్రోవ్వడు, రహస్యంబు లెల్లఁ
దెల్ల మగు"నంచుఁ బల్కి యాదేవి యతని
శిరమునందును జేయి యాశీర్వదించు
రీతి నిడె, సత్యకాము శరీరమందు
నమృతలహరీప్రపాతము లవతరించు
నటులు దోఁచె, నిమీలిత మయ్యెఁ గనులు
సంజ్ఞ లోలోన లీనమై శమముఁ జెందె.
అతఁడు తెప్పిఱి మఱల సంస్మృతిని బడసి
కన్నులను విచ్చుతఱి కహస్కరుఁడు మింటి
కెక్కెఁ, దలపోసి వేకువవృత్త మెల్ల
సత్యకాముఁడు క్రమ్మఱె జనులభువికి.

# వ్యవసాయచరిత్ర

## పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

(గత సంచిక శేషము)

పశువులు1 నీరు ద్రావుటకు, "తొట్టి" చేయుఁడు. "తోలు"తోఁ జేయఁబడిన త్రాడు గట్టుఁడు. ఎప్పుడు నెండిపోక లోఁతుగలిగి చక్కఁగనున్న యీ బావిలోనుండి నీరు తోడెదము.

2. పశువుల కొఱకుఁ దొట్లు చేయఁబడినవి. ఎప్పుడు నెండిపోక లోఁతుగలిగిన చక్కని బావిలోఁ దోలుత్రాడు శోభించుచున్నది. నీళ్లు సులభముగాఁ బైకి వచ్చినవి.

3. ఎద్దులకు విశ్రాంతిఁ గలుగఁజేయుఁడు; రాశిఁ జేసిన ధాన్యముఁ దీయుఁడు. దానినిఁ దీసికొనిపోవ బండిఁ జేయుఁడు. పశువులు నీరుద్రావ నీబావి సమృద్ధి యైనది. ద్రోణ (10 సెంట్ల భూమి) వైశాల్యము కలది. దానికి రాతిగిలక కలదు. మనుష్యులు నీరుఁ ద్రావు జలసంగ్రహము నీటితో నింపుఁడు.

ఈ ఋక్కునందు "అశ్వ" శబ్దము కలదు. దానికి "గ్రిఫిత్" మొదలగు పాశ్చాత్యపండితులు, గుఱ్ఱము లని యర్థముఁజేసి, యాఁడుగుఱ్ఱములతో దున్నుచుండిరని వ్రాసియున్నారు. కాని "విద్యారణ్యులు" సాయనభాష్యమున "అశ్వాన్" వ్యాపనశీలాన్ బలీవర్దాన్ చురుకుగ నడచెడి యెద్దు లని 'నిర్వచనముఁ' జేసియున్నారు. పాశ్చాత్యదేశములలో గుఱ్ఱములతో దున్నుట కలదు. కాని, మన వాఙ్మయమున నిటుఁ దప్ప దున్నునపు డెచటను అశ్వశబ్దము నుపయోగించుటఁ గానము. గో బలీవర్ద వాహ శబ్దములే ఋగ్వేదమునఁ దఱుచు కానిపించుచున్నవి. గుఱ్ఱములతో దున్నుట యనునది మన దేశమునకుఁ గ్రొత్తమాట.

దున్నుట విత్తుట పండించుట మన మనుకొనెడి ఋగ్వేదకాలమునకే ప్రాచీనమై మన దేశస్థులకు దెలిసియుండె నని ఈ క్రింది ఋక్కుయొక్క అర్థముకలనఁ దెలియుచున్నది.

4. ఓయశ్వినీదేవతలారా, మీరు మనువునకు నాగటితో దున్ని "యవలను" జల్లి పండించుటకు నేర్పితిరి. మీరు వజ్రముచే శత్రువుం జంపి పూజ్యుడగు మనువునకు జ్యోతిస్సుం గలుగఁజేసితిరి. (కక్షీవంతుఁడు) పంటలభివృద్ధి యైనపుడే ప్రజ లభివృద్ధి నొందిరని యిట్లు చెప్పఁబడెను.

అంగిర ఋషిపుత్రుఁడు (సవ్యుడు.)

5. ఓ యింద్రా! ఎపుడు భూమి పదిరెట్లు ఫలించెనో అపుడు ప్రజలభివృద్ధి నొందిరి. మంచినీటి పారుదలచే చవిటి నేల పంటల కనువగు నని, నాటి కాలపువారే యెఱిగినటుల నీ క్రింది ఋక్కుయొక్క భావము వలన దెలియుచున్నది.

6. సూర్యుఁడు తన కాంతిచే విశ్వముం బ్రకాశింపఁజేయులాగున నీ "మరుద్దేవతలు" వర్షముచే నూషరక్షేత్రము నంతయు బాగుపడునటులఁ జేయుచున్నారు. (అగస్త్యుఁడు).

---

1. నిరాహావాన్ కృణోతన సంవరత్రా దధాతన । సించామహా అవత ముద్రిణం వయంసుషేక మనుపక్షితం. (10-101-5). 2. ఇష్కృతాహావ మవతం సువరత్రం సుషేచనం । ఉద్రిణంసించే అక్షితం. (10-101-6). 3. ప్రీణీతాశ్వాన్హితం జయాథస్వస్తి వాహం రథ మిత్కృణుధ్వం । ద్రోణాహావ మవతమశ్మ చక్రమంసత్రకోశం సించతా నృపాణం. (10-101-7). 4. యవం వృకేణాశ్వినావపంతేషం దుహంతా మనుషా ఘదస్రా । అభిదస్యుంబకురేణా ధమంతోరుజ్యోతిశ్చక్రథురార్యాయ. (1-117-21). 5. యదిన్విందర్ పృథివీదశభుజి రహాని విశ్వాతతనంత కృష్టయః. (1-52-11). 6. అధయదేషాం సుదినేశరస్విశ్వ మేరిణం ప్రుషాయంతసేనాః. (1-186-9).

ఋగ్వేదకాలమున "యవల" (బార్లీ)ను మాత్రమె వ్యవసాయముఁ జేయునటులఁ దోచును. ఋగ్వేదమున నెచటఁ జూచినను యవలు యవలనియే కాని మరియొక ధాన్య విశేషము కానరాదు. కాని 1-82-4 లో "హరియోజన" మనుబియ్యపుఁ బ్రశంస, కాన్పించుచున్నవి. అయినను యవలు ప్రధానముగాను, ఇతర ధాన్యము "లప్రధానము"గాను ఉండెనని, తలంపవలసి యున్నది. నాటిభోజ్యవస్తువులు యవ్యము (యవబియ్యముతో వండినయన్నము) గవ్యము (పాలు, పెరుగు, నేయి) సోమము (సోమరసము) మాత్రమె, ప్రధానములై యుండె నని యీ క్రింది ఋగర్థము చెప్పుచున్నది. అగస్త్యుఁడు ఋషి.

1. ఓ సోమరూప మగునన్నమా, దధి, పయో, రూపమగు నన్నమును, యవరూప మగునన్నమును భక్షించుచున్నాము. కాన శరీరమా వృద్ధినొందుము. యజ్ఞకర్మలలో నెపుడు పశువులఁ జంపుటయందు, కొందఱకయిష్టము కలిగెనో, నోటినుండి "పురోడాశము" (బియ్యపుపిండితోఁ జేయుహోమద్రవ్యము) "పశువిశసన"మునకు మారుగఁ బ్రవేశించెను. కాని, పురోడాశశబ్దము ఋగ్వేదమునందు మృగ్యము. క్షాత్రకాలమునఁ బురోడాశముతో హోమముఁ జేయుటకుఁ బ్రారంభించిరని తోఁచుచున్నది. దాని నట వివరింతును. పురోడాశము పిపిండితోనే చేయఁబడునని "పాణిన్యాచార్యులవారు" తన యష్టాధ్యాయియం దిటులు వివరించిరి.

2. వ్రీహిమయము, పురోడాశము.

గోపురీషమునకు గోమయశబ్ద మెట్లగునో, అట్లే పురోడాశము వ్రీహిమయశబ్దపరమై యొప్పునని తాత్పర్యము "శాయనాచార్యుల"వారు తమ ఋగ్వేదభాష్యమునందు. 1-140-2 ఋక్కులోని "త్రివ్వదన్నం" (మూడురకములగు నన్నము) అనుదానికి "ఆజ్య, పురోడాశ, సోమ" రూపాన్నము లని, యర్థమును వ్రాసిరి. మరియొకస్థలమున పురోడాశశబ్ద ముండిన గాని యీ యర్థము సార్థకము కాదు. ఋగ్వేదమున నెచటనైన వ్రీహిశబ్దము కలదేమో యింకను వెదకవలెను వ్రీహిశబ్దము లేనియెడల "త్రివ్వదన్న" శబ్దమునకు యవ్య, గవ్య, సోమ, పరములుగానే, తలంపవలసి యున్నది. యవల గురించి ఋగ్వేదమున నెట్లుఁ గలవో స్వల్పముగా వ్రాయుచున్నాను.

3. యవల నుద్దేశించి కాఁబోలు నెద్దులచే దున్నుచున్నాడు (మేధాతిథి).

4. యవసస్యము వర్షముచేతను సంతోషించుచున్న దానివలె నున్నది (గృత్సమదుఁడు)

5. గాదెను యవలతో నిండించినటులు, సోమము చేత నింద్రుని కడుపు నిండింపుఁడు. అది మీకు మేలుఁ జేయును.

6. ఓయింద్రవాయువులారా, మీకొఱకు గోవులు పాల నిమ్చుచున్నవి. యవలు వండఁబడుచున్నవి. (పరుచ్ఛేపుఁడు)

ఇంకను యవలవృత్తాంతము ఋగ్వేదమున విస్తారముగా కలదు. కాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. కాయధాన్యముల గురించియు ఋగ్వేదమునఁ గానరాదు కాని-

7. ఓ యన్నమా, నీసంబంధ మగు రసములు, వాయువు లాకసమున వ్యాపించిన రీతిని, లోకమునందలి జనులలో వివిధముగా వ్యాపించియున్నవి. (అగస్త్యుఁడు)

ఈ ఋక్కునందలి "రస" శబ్దమునకు శాయనాచార్యులవారు షడ్రసము లని యర్థమును వ్రాసియున్నారు.

8. ఓ సూర్యకిరణములారా, మీరు ఉన్నతము లగు పర్వతములయందు తృణధాన్యములను నిమ్న ప్రదేశములయందు నీటిని జనోపయోగముకొఱకు నిర్మించితిరి. (దీర్ఘతముండు)

---

1. యత్తేసోమ, గవాశిరో, యవాశిరో, భజామహే, వాతాపేపీవ ఇద్భవః (1-187-9) 2. వ్రీహేః పురోడాశే—అష్టాధ్యాయి (4-3-148) 3. గోభిర్యవంనచర్కృషత్ (1-23-15). 4. యవోవృష్టీవ మోదతే (2-5-6) 5. తమూర్దరం, నపృణతా, యవేనేంద్రం, సోమేభి స్తదపోస్తు (2-14-11) 6. సాకం గావః సువతే పచ్యతే యవః (1-135.8) 7. తవ త్యేపితో రసారజాంస్యనువిష్ఠితా, దివి వాతా ఇవ శ్రితాః (1-187.4) 8. ఉద్వత్సస్మా అకృణోతనతృణం నివత్స్వపః స్వపస్యయానరః (1-161-11)



ఋక్కు వలన సోమరసముతోఁ బాలను తోడు పెట్టుటయు, దానిచే నన్నముఁ గలిపికొనుటయు, ధ్వనియగుచున్నది.

గౌతముఁడు ఋషి.

1. ఓసోమమా! నిన్నుఁ బాలు కలిసికొనుఁగాక, అన్నము కూడుఁగాక. సోమరసముచేఁ బాలను తోడుపెట్టుట. "ఛాందోగ్యోపనిషత్తు" నందు స్పష్టముగా నున్నది. కాని యావాక్య మిట ప్రసక్తము కాదని విడిచితిని. సోమరసమునుఁ బానముఁజేయునపుడు దానిని దోషరహితమగునటుల "అభిషవాది" సంస్కారములఁ గొన్నిటిఁ జేయుచుండిరని, (1-2-1) ఋక్కులో చెప్పఁబడియున్నది. ఇందువలన పరిశుభ్రతను ఋగ్వేదార్యులు గుర్తించుచుండి రని తెలియవచ్చుచున్నది.—

సోమ రసమును "చమస" ములను దారుపాత్రలలో నునిచి పానముఁజేయుచుండి రని ఋగ్వేదమున పెక్కుచోటుల వర్ణింపఁబడెను. సోమలతను పెద్దరాతిపై నునిచి, చిన్నరాతితో నూరి, రసముఁ దీయుచుండినట్లును వర్ణింపఁబడెను. నేటి సన్నికలు, రాతిరోలు, ఖల్వములును, ప్రాచీనకాలముననే మాతృరూపము లేర్పడియుండెను.

మరియు నేఁడు మనదేశమునం దచట నచటను (కర్నూలు ప్రాంతమున) కల్లును తోలుతిత్తులయం దునిచి బండ్లపై తీసికొనిపోవుచుండినటుల సోమరసమును నా డెద్దుచర్మపు తిత్తులయం దునిచి తీసికొనిపోవుచున్నట్లు నీక్రిందిమంత్రమువలనఁ దెలియనగుచున్నది.

పై ఋక్కునందు మిట్టనేలలయందు దృణధాన్యము లనుటచేఁ గాయధాన్యము లని యర్థ మగుచున్నది. సంభారద్రవ్యముల గుఱించియుఁ, గాయధాన్యముల గుఱించియు, నింతకన్న హెచ్చుగ ఋగ్వేదమున నుండెనేమో శోధింపవలసియున్నది. అన్నమును నేతితోను, పాలతోను, పెరుగుతోను, భక్షించు చుండినటులును, సోమరసమును ప్రత్యేకము పానముచేయుటయె కాక, పాలతోను, పెరుగుతోను గలిపి భక్షించుచుండినటులు గానిపించుచున్నది. తీపి గల వస్తువులనే నాఁటివారు విశేషముగ భుజించుచుండి రని తోఁచుచున్నది. మాంసభక్షకులై యుండిరి కాని, యీగ్రంథమున కది యనవసరమగుటచే వ్రాయఁబడదు.

దధ్యాద్యన్నప్రసక్తి ఋగ్వేదమునం దచట నచట కలదు. దిఙ్మాత్రముగ వానిని సూచించుచున్నాఁడను.

1 మండలము 87 సూక్తమున కన్నసూక్త మని పేరు. ఇందు (1) ఋక్కునందు తేనెతోఁ గలిపిన యన్నమును గుఱించియు, (9) ఋక్కున సోమ, దధి, పయో, రూపాన్నముల గుఱించియు, (10) ఋక్కున దధిసక్త్వాన్నమును గుఱించియుఁ గలదు. ఈక్రింది

1. సంతే పయాంసి సముయంతు వాజాః —(1-91-18.)

1. ఓ ఋత్విజుడా, "అభిషవ" పలకలయందు, నిష్పాదింపగా, మిగిలిన సోమమును బండిమీద వేసి, అంతకు మిగిలిన సోమమును "దశాపవిత్ర" మనుపాత్ర యం దునిచి, అంతకు మిగిలినసోమమును వృషభచర్మ మునం దుంపుము(శునశ్శేపుడు.)

ఋగ్వేదముయొక్క 10 వ మండలము 97 సూక్తమునకు "ఓషధీసూక్త"మని పేరు. అది రోగనివారణమునకాయాయోషధులచే, రోగిని సమ్మార్జనముఁ జేయుటకే వినియోగమని, "కల్ప"ము చెప్పుచున్నది. ఈ యోషధీ సూక్తమునే పాఠభేదములతోఁ "కృష్ణ యజుర్వేదు" లితరకర్మల కుపయోగింతురు. అవృత్తాంత మును "శాస్త్ర", సూత్ర", "కాలచరితములలో విస్తరింపఁబోవుచుంటిని. కాన నిట విస్తరింపలేదు. ఋగ్వేద కాలమున నోషధుల నెన్నివిధములైనవానినిగాఁ దల పోయుచుండిరో, అందునుగురించి మాత్ర మిట ఋక్కునొకదానిని వ్రాయుచున్నాఁడను.

2. కేవలపుష్పముల నిచ్చునవి (మల్లెవంటివి) పుష్పింపక ఫలించునట్టివి (యవలవంటివి), గుబ్బములవలె పెరుగెత్తెడు తీగలు (సోమలతలవంటివి) నగు నోయోషధులారా, రాగములనుండి తరింపఁజేయుఁడు. ఇందువలన, ఋగ్వేదార్యులు, కేవలపుష్పముల నిచ్చులతావృక్షాదులను, ఫలపాకాంతము లగు నోషధులను, సోమలతాదులను, స్వప్రయోజనమునకు, గుర్తెఱిగియుండిరి. శాస్త్ర కాలమునం దింతకంటెను, సూత్ర, బౌద్ధకాలాదులయం దంతకంటెను, ఏకోత్తరాభివృద్ధిగా, నోషధీప్రయోజనములఁ గనుపెట్టిరి.

### నీటి వసతులు

ఋగ్వేదమునం దనేకప్రదేశములలో వర్షమును గుఱించియు, నదులగుఱించియు, వర్ణనలు కలవు. నీరే ప్రాణాధారము. నీరు లేకుండిన, పశు, పక్షి, మనుష్యాదులు జీవింపవు. నీటిసదుపాయ ముండినఁ గాని, పంటలు పండవు. అందువలన నార్యులు, నీటికొఱకు, దైవ ప్రార్థనముఁ జేయుచుండిరి. నాటివారు, పెక్కువిధములగు, నూతులను, బావులఁ ద్రవ్వికొనుటయేకాక, నదుల కడ్డకట్టలఁ గట్టి, కాలువలఁ ద్రవ్వి రనికూడ, క్రిందిమంత్రార్థములకలనఁ దెలియగలదు. మరియు, నీటిపాఱుదల విషయమై, నాఁటికాలముననే, పెక్కు యుద్ధములు కూడ జరిగినట్లు గాన్పించుచున్నవి. "వృత్ర, కుయవా"సురులతో, నార్యులు, నీటిని గుఱించియే, పోట్లాడిరని, ఋగ్వేదమునం జదివినఁ దెలియగలదు.

### వర్షోదకము

3. ఓయింద్రా, సూర్యకిరణోత్పన్నములగు మేఘము లెపుడు వర్షింప నారంభించునో, ప్రేరకుఁడవగు నీవపుడు వర్షము భూమిపైఁ బడకుండ నావరించు "నవరోధము"ను నివారించుచున్నావు. సూర్యరూపమున నుండు నీవు ప్రకాశించునపుడే సత్కర్మ లనుష్ఠింపఁదగినవి. అపుడే గోపాలుఁడు గోవుల దోలుకొని పోవుటకుఁ ద్వరపడును. కట్టెలఁ గొట్టువాఁ డరణ్యమునకు బండితో బోవును. (కక్షీవంతుఁడు)

4. పరాక్రమశాలి వగు నోయింద్రా, వానలు లేక పోవుటచే నీభూమియుఁ "ద్యష్ట్ర" సమాగమంబున ద్యావాభూములు భీతిల్లినటులు, హవిర్భాగంబులు లేక పోవుటచే ద్యులోకమును భీతిల్లిచున్నది. (పరుచ్ఛేపర్షి)

సూర్యకిరణములచే భూమియందలి నీరావిరియై మింటి కెగసి పిమ్మట వర్షరూపమున భూమిపైఁ బడునని ఋగ్వేదార్యు లెఱిగినటు లీక్రింది ఋగర్థముచే సూచింపఁబడి యున్నది.

5. ఉత్కృష్టుఁ డగు సూర్యుని కిరణములు వర్షమును గలిగించి ప్రకాశించుచున్నవి. సూర్యమండలము నాచ్ఛాదించియుండు నీకిరణములే మరల జలమును

---

1. ఉచ్ఛిష్టం చమ్వోర్భరసోమంపవిత్ర ఆసృజ । నిధేహి గోరధిత్వచి (1 28.9.) 2. ఓషధీః ప్రతిమోదధ్వం, పుష్పావతీః ప్రసూవరీః । అశ్వా ఇవ సజిత్వరీర్వీరుధః, పారయిష్ణవః (10-97-3.) 3. సిధ్మాయద్వన ధితి రపస్యాత్సూరో అధ్వరేపరిరోధనాగోః యద్ధప్రభాసికృత్వ్యాఅనుద్యూననర్విశే పశ్విషేతురాయ (1-121-7) 4. అవర్మహ ఇంద్రదాదృహి శృధీనః శుశోచ హిద్యౌః । క్షామ నభీషా అద్రివోఘృణాన్నభీసా (1-133-6) 5 ఇహబ్రవీతుయ ఈ మంగవేదాస్య వామస్య నిహితం పదం । వేః శీర్ణః క్షీరందుహ్రతే గావో అస్య వవ్రింవసానా ఉదకంప దాపుః (1-164-7)

ధానముఁ జేయుచున్నది. ప్రత్యక్షస్వరూపుఁడును, బ్రార్థనీయుఁడు నగు నీసూర్యుని రూపతత్త్వ మతిగూఢ మైనది. ఎవఁడీసూర్యతత్త్వమును వేగముగాఁ జెప్పఁగలఁడు ? (దీర్ఘతముఁడు)

సూర్యకిరణప్రసరణమువలననే గాక వాయు ప్రసరణము ననుసరించి వానవచ్చుననియు, భూచలనము వలన వాయుప్రచారభేదము కలుగు ననియు, నాఁటి యార్యు లెఱిఁగినటులు వ్రాయఁబోవు ఋగర్థమువలనఁ దెలియనగును.

1. భూమివలనఁ బుట్టినవాయువు లెపుడు ప్రకాశింతురో, నగలనుధరించినవాయువు లపుడు శత్రుధ్వంసకు లగుదురు. ఈవాయువుల మార్గము ననుసరించి వాన కురియును. మరుత్తు లెచటికిఁ బోదురో వాననీరును నచటికిఁ జేరును. (గౌతముఁడు)

సకాలవర్షము నే నాఁటివా రాశించుచుండినటులు 1-౭-8 వలనఁ దెలియఁగలదు. రాతిగిలకఁ గలిగి "ద్రోణ" వైశాల్యము గల నూతిని గుఱించి యింతకుఁ బూర్వమె ముచ్చటించియుంటిని. దానిని బావి యనవచ్చును. నూతులలోని విశేషభేదము లానాఁడు కలవు. నూతియొక్క సాధారణనామము "అవత"ము. బండిచక్రముచేఁ గప్పటకుఁ దగిన చిన్న నూతికిఁ "గూప"మని పేరు. కూపము నకు "పర్శన"ము లను పార్శ్వాస్థులు కలవు. అవి "వర" లు కాని, రాతికట్లు కాని, యగునని తలంపవలసియున్నది. అప్పటి నూతులకు, కూప కాట, ఆరణ, జామిత్వ, ఋచస, శబ్దము లుపయోగింపఁబడెను. ఈనూతుల వృత్తాంతము ఋగ్వేదమునందు 1-104 సూక్తము మొదలు 1-109 సూక్తమువఱకు వర్ణింపఁబడెను. 1-8౯-10,11 ఋక్కులలో నూతినిఁ బెల్లగించుటయు, నూతియొక్క మూతిని వంకరగాఁ ద్రవ్వవలసివచ్చుటయు, నూతినిఁ ద్రవ్వునపుడు పర్వతముల భేదించుటయుఁ గలదు. అందే "వీణా" వాద్యము గూడ వర్ణించుట

యాశ్చర్యకరము. పాతాళనూతులు (ఆర్టిజన్ వెల్సు) లను శాస్త్రకాలమునఁ "ద్రవ్విన నిదర్శనములు కలవు. వాని నట సూచించెదను. ఋగ్వేదకాలపు నూతుల గుఱించి యింకను వ్రాయుట యనవసర మని వదలుచున్నాఁడను. ఋగ్వేదమునందు 99 నదులు కలవని వ్రాయఁబడెను. విశేషించి సింధునదియు, దాని యుపనదులు వర్ణింపఁబడెను. నద్యుదకమువలనఁ బోషింపఁబడుచుంటిమని చెప్పుచోటులఁ గలదు. కొన్నిటి నిట నుదాహరించుచున్నాను.

2. సింధునది, లేగను పాలిచ్చి రక్షించు గోవు వలె, నుదకములచే రక్షించుచున్నది. (అగస్త్యుఁడు)

౩. ఏనదులు ప్రవణ దేశమున (నాలుగు దేశముల కూడిక) కేగుచున్నవో; ఏవి పల్లమున కేగుచున్నవో, ఏవి యున్నతప్రదేశమున కేగుచున్నవో, ఏవి నీరు కలవో, ఏవి నీరులేనివో, ఆనదులు మమ్ముఁ దృప్తినొందించి, రోగములఁ బోఁగొట్టి, శుభకరములై, మమ్ము సంతోషపెట్టుఁ గాక. నదులనుండి కాలువలఁ ద్రవ్వుట.

4. పదసంఖ్యచేఁ గొలిచి, యెటులు గృహనిర్మాణముఁ జేయుదురో, అటులే యింద్రుఁడు నదులను వజ్రముచేఁ బ్రాఙ్ముఖముగాఁ ద్రవ్వెను. నదులఁ జిరకాల మొక్క మార్గమునఁ బ్రవహించునట్లు చేసెను. ఈపనులను సోమరస బలముచేతనే చేయఁగలిగెను. (గృత్స్న మదుఁడు)

"నదులం జిరకాల మొక్క మార్గమున నడచునట్లు చేసెను" అనుటవలన, 'గోదావరి' మొదలగు నదులకు "పోతగట్టుల" పోయునట్లు, నాఁడునుఁ బోతగట్టులఁ బోయుచుండి రనియు, "మానముచేఁ గొలిచినటులు ద్రవ్వెను" అనుటచే, "యింజినీరింగు" నెఱిఁగియుండి రనియు స్పష్టమగుచున్నది.

5. ఇంద్రుఁడు సింధునది నుత్తరాభిముఖముగా ద్రవ్వెను. (విశ్వామిత్రుఁడు)

---

1. గోమాతరో యచ్ఛుభయంతే అంజిభిస్తనూషు శుభ్రాదధిరే విరుక్మతః । బాధంతే విశ్వమభిమాతిన మప వర్త్మాన్యేషా మనుదీయతే ఘృతం॥ (1-85-3.) 2. శిశుం న పిప్యుషీవ వేతి సింధుః (1-186-5) 3. 'యాః ప్రవతో నివత ఉద్వత ఉదన్వతీరనుదకాశ్చయాః । తా అస్మభ్యంపయసాపిన్వమానాః శివా దేవీ రశిపదా భవంతు సర్వానద్యో అశిమిదా భవంతు 7-49-1. 4. సద్మేవ ప్రాచో విమిమాయ మానై ర్వజ్రేణ ఖాన్యతృణన్నదీనాం । వృథాసృజత్పథిభి ర్దీర్ఘయాథైః సోమస్యతామద ఇంద్రశ్చకార 2-15-3. 5. సోదంచ సింధు మరిణాన్మహిత్వా 2-15-6



ఒక్క "సింధునది" నుండి మాత్రమె కాక "గంగ" మొదలగు నాలుగునదులనుండి కాలువల ద్రవ్వి నీరు ప్రవహింపఁజేయఁబడె నని ఈ క్రిందిఋగ్మంత్రమువలన ధ్వని యగుచున్నది.

1. దస్యునియొక్క డగు నింద్రుఁడు భూసమీపము నం దుంపఁబడిన మధురోదకములుగల గంగానదీశతద్రు యమును ప్రవహింపఁజేయుట యను కర్మ, యితరుల కశక్య మైనదియు, మిక్కిలి పూజ్య మైనదియు, అంద మైనదియు నై యున్నది.

2. ఇంద్రుఁడు వజ్రబాహుఁడై నదులకు "పరిధుల" (అడ్డకట్టుల) కట్టిన "వృత్రుం" జంపి నదులకుఁ గాలువలఁ ద్రవ్వెను. 3-33-6 (విశ్వామిత్రుఁడు.)

3. విచిత్రకాంతులు గల యోయగ్నిదేవా, నద్యుదకము కాలువలకుఁ బ్రవహించునట్లు, మాకు ధనము నిచ్చి యజమానునకు కర్మఫలమునిచ్చుచున్నావు. (శునశ్శేపుఁడు)

నాఁడు ఎన్నివిధములగు నీటిపారుదలలు కలవో ఈ క్రింది ఋగ్మంత్రము చెప్పుచున్నది.

4. ఆకసమునుండి కురిసినవర్షమును, నదీప్రవాహోదకమును త్రవ్వి ప్రవహింపఁజేసిన యుదకమును, ఊటనీరును, సముద్రగాములగుచున్నవి. ఆపవిత్రోదకములు నన్నుఁ గాపాడుఁగాక. కాలువలఁ గురించి ఇంకను కలదు కాని, గ్రంథము పెరుఁగునని వ్రాయుటలేదు.

## పశుపాలనము

ఋగ్వేదకాలార్యులు, విశేషపశుపాలకులై, పయోదధి ఘృతములచే విశేషసౌఖ్యముననుభవించిరని గ్రంథవర్ణనలవలనఁ దెలియనగుచున్నది. గవ్యప్రాశనముచే నాయురారోగ్యబలములు కలుగునని, ప్రాచీన నవీన వైద్యశాస్త్రజ్ఞుల తలంపై యున్నది. ప్రస్తుతకాలమున గవ్యాభావముచే నాయురారోగ్యబలహీనత కలుగుచున్న దని దీర్ఘదృష్టి గల పండితులు తలంచుచున్నారు. ఋగ్వేదమున గోసమృద్ధి విశేషముగ వర్ణింపఁబడెను. గోసంబంధము లగు సూక్తములందు నెక్కుడు కలవు. గ్రంథవిస్తరభీతిచే క్లుప్తముగానే వ్రాయుచున్నాఁడను. పాడి విశేషముగా కలదని యీ క్రింది ఋగ్మంత్రములవలనఁ దెలియును.

5. అన్నసమృద్ధికి హేతువులగు నేతిధార లంతటనుఁ బ్రవహించుచున్నవి. (కక్షీవంతుఁడు.)

6. స్వనయుఁ డను మహారాజు కక్షీవంతుఁ డను ఋషిపుత్రునకు కపిలవర్ణముగల గుఱ్ఱములఁ బూన్చిన పది రథములను వేయినఱువది (1060) యావుల నొసంగెను. వీనినన్నిటి నా కక్షీవంతుఁడు వెంటనే తీసికొనిపోయి తనతండ్రి కిచ్చెను. (కక్షీవంతుఁడు.)

7. గొల్లవాండ్రచేఁ దోలికొని రాఁబడు వేలకొ

---

1. తదు ప్రయక్షతమమస్య కర్మ దస్మస్య చారుతమ మస్తి దంసః। ఉపహ్వరే యదుపరా అపిన్వన్మధ్వర్ణసో నద్యశ్చతస్రః॥ 1-62-6. 2. ఇంద్రో అస్మాఁ అరద ద్వజ్రబాహు రపాహన్ వృత్రం పరిధిం నదీనాం॥ 3-33-6. 3. విభక్తాసి చిత్రభానో, సింధోరూర్మా ఉపాక, ఆసద్యో దాశుషే క్షరసి. (1-27-6). 4. యా ఆపో దివ్యా, ఉతవా స్రవంతి ఖనిత్రిమా ఉతవా యాః స్వయంజాః। సముద్రార్థా యాః శుచయః పావకాస్తా ఆపో దేవీరిహ, మామవంతు. (7-49-2.) 5. శ్రవస్యవో ఘృతస్యధారా ఉపయంతి విశ్వతః (1-125-4.) 6. ఉపమాశ్యావాః స్వనయేన దత్తా వధూమంతో దశరథాసో అస్థుః। షష్టిః సహస్ర మనుగవ్య మాగాత్సన త్కక్షీవా అభిపిత్వే అహ్నాం॥ (1-126-3.) 7. చత్వారింశద్దశరథస్య శోణాః సహస్రస్యాగ్రే శ్రేణిం నయంతి। మదచ్యుతః కృశనావతో అత్యాన్ కక్షీవంత ఉదమృక్షంత పజ్రాః॥ (1-126-4.)

లంది గోసమూహమును దానికి ముందు నలువది గుఱ్ఱము లంబూన్చిన పదిరథములును పరుసగంబోయి గమ్యస్థానముం జేరినతోడనే, కక్షీవంతుని పరిచారకులు మదించిన యా గుఱ్ఱములకుం గడ్డి వేసి మార్గాయాసము పోవునట్లు దోముచున్నారు. (కక్షీవంతుండు.)

పై ఋక్కులచేతను నాఁడు విశేషముగ పాడి కలదనియు, మహారాజులు బీదలకు విశేషముగ గోవుల దానము చేయుచుండిరనియు తెలియవచ్చుచున్నది. ఘృతప్రవాహము నేఁడు మహారాజుల యిండ్లకడకూడ పూజ్యమని తలంపవలసియున్నది. (1-126-4) ఋక్కునందు ప్రయాణానంతరము గుఱ్ఱముల యాయాసము పోవునట్లు శరీరముం దోముట యనునది నేఁటివారికి ఋగ్వేదార్యులే గురువులని మార్గదర్శకు లని కంఠోక్తిగం జెప్పుచున్నది.

గోవులు నేఁటివలెనే నాఁటికాలమునను పగటి పూఁట నడవులలో మేసి రాత్రికాలమునందు గోష్ఠములకుం జేర్పంబడుచుండెడి వని యీక్రిందియంశములు స్పష్టపఱుచుచున్నవి.

1. గోవులు గోష్ఠమున నిద్రించుచున్నవి. (అగస్త్యుఁడు.)

2. అనేకులచే స్తుతింపఁబడు వరుణునిఁగూర్చి నా బుద్ధులు గోవులు సాయంకాలమున గోష్ఠమును గుఱించి వెనుకకుఁజూడకుండఁ బోవునట్లు పోవుచున్నవి. (శునశ్శేఫుఁడు.)

3. ఓ గోవా! మంచిగడ్డిఁ దినుచు క్షీరసమృద్ధి గలిగియుండుము. నీవలన మేము భాగ్యాభివృద్ధి కలవార మగుదుముగాక. సర్వకాలము తృణములఁదినుచు నిచ్ఛావృత్తి సంచరించుచు నిర్మలజలములఁ ద్రావుచుండుము. (దీర్ఘతముఁడు.)

1-80-11 ఋక్కునందు "శిప్రిణీ" శబ్దము పొడుగుమూతిగల యావునం దుపయోగింపఁబడెను. అందువలన నాఁడు వివిధజాతిగోవులు కలవని తలంపఁబడుచున్నవి. నాఁడు నేఁటివలెనే కవ్వముతోఁ బెరుఁగుం జిలుకుటకలదని యీక్రిందిసంగతివలనఁ దెలియనగును.

4. ఏ కర్మయందు గుఱ్ఱపు కళ్లెములవలె కవ్వమును లాగుచున్నారో. (శునశ్శేఫుఁడు.)

గోసమృద్ధి కలిగినపుడు గోవులకు రోగములు కలుగుటయు రోగనివారణోపాయావశ్యకతయు కలుగనుగదా? ఋగ్వేదమునందు అశ్వినీదేవతలు ఋభుదేవతలు పశువైద్యులుగా వర్ణింపఁబడిరి. చూడుఁడు.

5. ఓ యశ్వినీ దేవతలారా? మీరుగోవునందు క్షీరము లుండునట్లుఁ గాపాడితిరి. గొడ్డావునందు పక్వములగు క్షీరములఁ గలుగఁజేసితిరి. (అగస్త్యుఁడు.)

6. ఏ రక్షణ క్రియలతో నీనఁజాలని "శంయువు" యావునకుఁ బాల నిచ్చుదానినిగాఁ జేసితిరో ఓయశ్వినులారా! ఆరక్షణలతో రండు. (కుత్సుఁడు.)

7. ఓఋభువులారా! మీరు గోచర్మముతో గోవును సృష్టించి దానిని లేగతోఁ గలిపితిరి. (కుత్సుఁడు)

8. ఓఋభు దేవతలారా? మృతినొందిన గోచర్మమునుండి నూతనగోవును సృజించితిరి. (దీర్ఘతముఁడు.)

అశ్వినీదేవత లావు నీనునటులను పాలు విశేషముగ నిచ్చునటులను వైద్యవిశేషముచేఁ జేసియుందురు ఋభుదేవతలు చేసినది నేడును నచటనచట నుపయోగించు "చేతిపెయ్య"కు మాతృకయేమో యని తలంపవలసియున్నది. నేడు లేగ చచ్చినయెడల మృతదేహమునుండి యావుచేపుటకుఁగాను చేతఁపెయ్యఁజేయుదురు. ఋభు దేవత లావునే సృష్టించుట యెందులకో తెలియదు. నిజముగ గోవునే బ్రతికించుటయైన మహత్తముకాదా? 1 మండలము 85 సూక్తము

1. గావఃగోష్ఠే అవసదన్—(1-191-4.) 2. పరామేయంతి ధీతయో, గావోనగవ్యూతీరను, ఇచ్ఛంతీ రురుచక్షసం (1-25-16.) 3. సుయవసాద్భగవతీ హి భూయా అథోవయం భగవంతః స్యామ, అద్ధితృణ మఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధముదక మాచరంతీ॥ (1-164-40.) 4. యత్రమంథాం విబధ్నతే రశ్మీ న్యమితవా ఇవ (1-28-4.) 5. యువంపయ ఉస్రియా యామధత్తం, పక్వమా మాయా, మవ పూర్వ్యంగోః (1-18-3.) 6. యాభిశ్శయుం ధేనుమస్వం పిన్వథో, నరాతాభిరూషు, ఊతిభిరశ్వినాగతం॥ (1-112-3.) 7. నిశ్చర్మణో ఋభవో, గామపింశత, సంవత్సేనాసృజతా, మాతరం పునః॥ (1-110-8.) 8. నిశ్చర్మణోగామరిణీత, ధీతిభిః॥ (1-161-7.)

1 ఋక్కున, "సంసగ" శబ్దము ఆఁబోతుపరముగా వ్రాయఁబడెను. దీనిచే నాఁడును గోజాత్యభివృద్ధికి యెద్దుల కచ్చువేసి విడుచుట కలదని తోఁచుచున్నది. నాటి కాలమునందు గుఱ్ఱములకు "దాణా"గా సెనగలనో గోధుమలనో పెట్టుచుండి రని యీ క్రింది ఋగర్థము చెప్పుచున్నది.

1. అన్నివిధముల యజ్ఞసాధనములై విశేషాన్నములనిచ్చు నాముసలోలూఖలములు గోధుమలు మొదలగువానిని భక్షించు నింద్రాశ్వములవలె తలుమ సంచరించినవి (శునశ్శేఫః) ఆర్యులయొక్క శత్రువు లార్యుల గోవుల నపహరించుటయు, శత్రువుల జయించి యార్యులాగోవులం దెచ్చుకొనుటయు, శత్రుగోబృందము నార్యు లపహరించుటయు, ఋగ్వేదమునఁ బెక్కుచోట్ల వర్ణింపంబడెను. కాని గ్రంథవిస్తరభీతిచే ఈ వృత్తాంతములను వ్రాయుటలేదు. ఆర్యులకు గోబృందమే ముఖ్యధనమైయున్నది. (సరఘావర్ధనము) తేనెటీఁగల నుండి తేనెను సంపాదించుట.

2. ఆందఱికింపగు తేనెను దేనెటీఁగలవలన సంపాదించిన యోయశ్వినులారా! ఆ రక్షణసాధనములతో రండు. (కుత్సుఁడు.)

3. ఓయశ్వినీదేవతలారా! ఆథర్వణ పుత్రుఁ డగు దధీచి గుఱ్ఱపుఁదలతో మీ కీమధువిద్య నుపదేశించెను. (ఉశిక్కను అంగదేశపు రాజు భార్యయందు దీర్ఘతమునకుఁ బుట్టిన) కక్షీవంతుఁడు.

పై ఋక్కునకు విద్యారణ్యులు భాష్యమును వ్రాయుచు "శాట్యాయన వాజసనేయు" లీ క్రింది కథనుఁ జెప్పుదు రని బృహదారణ్యకోపనిషత్తుయొక్క చతుర్థాధ్యాయము పంచమబ్రాహ్మణములోని గాథను వ్రాసియున్నారు.—ఆకథ యిది.

ఇంద్రుఁడు దధీచికి "ప్రవర్గ్య" విద్యను మధువిద్య నుపదేశించి దీని నితరులకుఁ జెప్పిన నీతలను నఱుకఁగలవనెనఁట. ఒక కారణమువలన దధీచి యశ్వినీదేవతల కావిద్యను పదేశింపవలసివచ్చెను. అపు డశ్వినులు దధీచితలను నఱికి యొకచోట నునిచి గుఱ్ఱపుతలను నఱికి దధీచిమొండెమున కదుకఁగా, దధీచి యశ్వినులకు ఋగ్యజుస్సామములను ప్రవర్గ్యను మధువిద్యం దెలుపు సామమునుం జెప్పెను. దానిం దెలిసికొని యింద్రుఁ డాతనితలను నఱికెను. పిమ్మట నశ్వినీదేవత లాదధీచిని నిజశిరస్సుతోఁ గూర్చిరి.

4. ఓయశ్వినులారా! అథర్వణపుత్రుఁ డగు దధీచికి అశ్వశిరము సంధానముఁ జేసితిరి. ఆ దధీచి సత్యమునం దాదరముకలవాఁడై, ఇంద్రునివలన నుపదేశింపఁబడిన మనువిద్యను ప్రవర్గ్యవిద్యను మీకుఁ జెప్పెను. (కక్షీవంతుఁడు)

5. ఓయశ్వినీదేవతలారా! మధువుగల మిమ్మాతేనెటీఁగ స్తుతించెను. ఉశిక్కుని పుత్రుఁడగు కక్షీవంతుఁడు సోమముచే మీకుఁ దృప్తిగొంటింపఁ బిలుచుచున్నాఁడు. మీరు దధీచిమనస్సును సేవించితిరి. పిమ్మట నశ్వశిరము నాతని కతుకఁగా మీకు మధువిద్య నాతఁడొసఁగెను. (కక్షీవంతుఁడు)

పైఋక్కుల యర్థము నాలోచింపఁగానింద్రుఁడు మొదటను తేనెపట్టులనుండి తేనెనుఁ దీసికొనుటఁ గని పెట్టి దానిని దధీచికి రహస్యముగఁ జెప్పి ఈరహస్యము నెవరికిఁ జెప్పవద్దనగా దధీచి యేకారణముననో యశ్వినీదేవతలకుఁ జెప్పగా దధీచితల నింద్రుఁడు పగులఁగొట్టియుండును. ప్రఖ్యాతవైద్యు లగు నశ్వినీదేవతలు దధీచితలనతికియుందురు. అశ్వినీదేవతలు తేనెటీఁగలనుండి కలుగు తేనెను లోకమునకు వెల్లడిఁ జేసియుందురు. వైద్యులకు తేనె మిక్కిలి యవసరమగుటఁ జూచుచునేయున్నాము.

## ఋగ్వేదకాలార్యుల వ్యవసాయపుపనిముట్లు

ఇదివరకు వ్రాసిన ఋగ్విశేషములవలన దున్నెడి సాధనములును నీరుఁ దోడు సాధనములును సస్యముఁ గోసెడి యాయుధము, ధాన్యమును మోసికొనెడిబండి,

1. ఆయజీవాజసాతమా తాహ్యు చ్చావిజర్భృతః హరీ ఇవాంధాంసిబప్సతా॥ (1-28-7.) 2. మధు త్రయం భరథో, యత్సరడ్భ్యశ్త్రాభి, రూషు ఊతభి, రశ్వినాగతం॥ (1-111-20.) 3. దధ్యఙ్ హయన్మధ్వాథర్వణో వామశ్వస్య శీర్ ష్ణారీ ప్రయదీమువాచ —(1-115-12.) 4. అథర్వణా యాశ్వినా దధీచేశ్వ్యంశిరః ప్రత్యై రయతం సవాం మధు ప్రవోచదృతా యన్త్వాష్ట్రం యద్దస్రావపి కక్ష్యంవాం (1-117-47) 5 ఉతస్యావాం మధుమన్మక్షికారపన్మదే సోమస్యౌశిజోహువస్యతి । యువం దధీచో మన ఆవివాసథోఽథా శిరః ప్రతివామశ్వ్యం వదత్ (1-117-9)

పెరుగుఁజిలుకు కవ్వము, మొదలగునవి వర్ణింపఁబడెను. తక్కినవానిని దిఙ్మాత్రముగ నుదాహరింతును.

1. వడ్రంగి యరణ్యమునందలి చెట్టును గండ్ర గొడ్డలితో నరికినట్టుల నరికితివి. (పరుచ్ఛేపుఁడు)

2. పనిచేయుటచే నడుమునొప్పిగల వడ్రంగివలె లేచుచున్నది. (త్రితుఁడు)

3. ఓయగ్నీ! నీవు రథచక్రముయొక్క ఆకుఁను బండికట్టువలె రక్షించుచున్నావు. (దీర్ఘతమః)

4. చక్రపుఁ గమ్మి చక్రమునువలె చుట్టుకొని యున్నది. (సోమాహుతి)

ఋగ్వేదకాలార్యులే బండిచక్రమున "కాపుల" దగుల్చుట చక్రముల కినుపకట్టులను వేయుట నూఁ దెలిసియుండిరి. నేటివారికి నినుపయిరుసును వేయుట మాత్రమె హెచ్చుగఁ దెలియును. 1-1 2-17 కొర డాను, 1-28-1,5,7 ఋక్కులలో రోలు, రోకలిని, 2-18-7 లో బండికాడిని వర్ణించియున్నాడు. 2-20-1 లో నన్నము గావలసినవాడు బండి సంపాదించు కొనునని కలదు. 1-88-5 బంగరుచక్రములు గల బండికి నినుపకమ్ములను వేసి రని వర్ణింపఁబడెను. 1-121-12లో నాయుధములను సానఁబట్టుట వర్ణింపఁబడెను. ప్రతి యింటను రోలు రోకలి కలదని స్థలాంతరమున వర్ణింపఁ బడెను. సర్వవిధముల నేటి జనపద వ్యవసాయకులకు ఋగ్వేదకాలార్యులు మార్గదర్శకులై యున్నారు.

### ఋగ్వేదకాలపు టార్యుల కోరికలు

5. ఓయశ్వినీదేవతలారా! మిమ్ము నుతించువారు బంధుమిత్రాదులఁ బోషింపఁదగిన ధనమును మీవలనఁ బొందుచున్నారు. కాన మిమ్ము స్తుతించుమాకుఁ బుష్కలముగ నన్నమును ధనమును బాడియావుల నొసంగుఁడు (కక్షీవంతుఁడు)

6. స్తోత్రార్హుఁడవగు నోయగ్నీ! మమ్ము సకలదురితములనుండి (యజ్ఞాదులచే) దాటింపుము. అనేకము లగు పురములను, సస్యసమృద్ధిగల భూములను, మాకుఁగలుగఁ జేయుము. దీనిచే మాపుత్రపౌత్రాదులు సుఖింతురు గాక! (అగస్త్యుఁడు)

7. ఓయింద్రా! గోవులుకలిగి గుణములచే శ్రేష్ఠమై విశేషాన్నము కలిగి, అపరిమితాయుః కారణమై, నాశము లేనిధనమును మాకు విశేషముగా నిమ్ము (మధుచ్ఛందసుఁడు)

8. తృణోపలక్షితమును, సకలౌషధీయుక్తమునగు దేశమును బొందింపుము (కణ్వుఁడు)

9. రుద్రుడు మాకు గుఱ్ఱములను, మేకలను, ఆడు మేకలను, దాసదాసీజనమును, గోవులను సుఖము నిచ్చుచున్నాడు. (కణ్వుడు)

10. మంచిపొలమునందపేక్షచేతను, మంచిత్రోవను పొందు కోరికచేతను, ధనాపేక్షచేతను, అగ్ని నర్చించు చున్నాము (వత్సుఁడు)

పై కోరికలు నేటి వ్యవసాయకుల కోరికలవంటి వే యై యున్నవి. 1-189-2 లో నుండిన "పురముల నిమ్ము" అనునదియే, వ్యవసాయకునకు కల్పితమైన కోరిక గా కాన్పించునుకాని "మాకు" అను బహువచనము నుపయోగించుటచే మాసంఘమునకునని యర్థముఁజేసిన, నేటి వ్యవసాయకుల కోరికలవంటివే వారికోరికలునని తెలియవచ్చును.

### ఋగ్వేదార్యుల వ్యవసాయమున కనుకూలించు విశేషాంశములు

ఋగ్వేదమునందచట నచట వర్తకపుసరకులతో నోడలు సముద్రముపై బోవుట, ఓడ సముద్రమునఁ బ్రద్దలగుట, నూరు తెడ్లతో నోడను నడుపుట, మొదలగు వర్ణనలు కలవు. ఆవర్ణనలంబట్టిచూడ పంట

---

1. త్వష్టేవ వృక్షం వనినో నివృశ్చసి పరశ్వేవ నివృశ్చసి (1-130-4) 2. ఉజ్జీవంతే నివాయ్యా త్వష్టేవ పృష్ఠ్యా మయా (1-104-18) 3. ఆరాన్న నేమిః పరిభూరజాయథాః (1-141-9) 4. నేమిశ్చక్రమివాభవత్ (2-5-3)
5. ఋభూమన్మత్ర్రగ్నితయే, యువావాదు రా యేచనో మిమీతం, వాజవత్యై ఇషేచనో మిమీతం ధేనుమత్యై (1-120-9)
6. అచ్ఛత్వాపారయా నవ్యో అస్మాన్స్వస్తిభి రతి దుర్గాణివిశ్వా, పూశ్చపృథ్వీబహులాన ఉర్వీ భవాతోకాయ తనయాయశంయోః (1-189-2) 7. సంగోమదింద్ర వాజవదస్మే పృథుశ్రవో బృహత్ విశ్వాయుర్ధేహ్యక్షితం (1-9-7)
8. "అభినోయవసం నయ" (1-42-8) 9. శంనః కరత్యర్వతే సుగంమేషాయ మేష్యే నృభ్యో నారిభ్యో గవే (1-43-6)
10. సుక్షేత్రియా సుగాతుయా వసూయా చ, యజామహే (197-2)-

సరకు లొకచోటున నుండి మఱియొకచోటున కెగుమతి యగుచుండెననియు, కోస్తాలనుండి ధాన్యవిశేషములు దిగుమతి యగుచుండెననియు, దోచును. కాని ప్రస్తుత గ్రంథమున నావర్ణన లనావశ్యక మని వ్రాయ లేదు.

ఈ క్రింది ఋక్కుల తాత్పర్యము నాలోచింపగా నడవులం దగులబెట్టి పిమ్మట దున్ని వ్యవసాయముం జేయుచు డిరనితోచుచున్నది. గ్రంథవిస్తరభీతిచే రెండుఋక్కులనే వ్రాసితిని.

1. ఉత్కృష్టకిరణములుగల సూర్యాగ్ని వాయువులు తమ తమ ఋతువులయందు భూమినిం జూచుచున్నారు. అందొకండగు నగ్ని సంవత్సరాంతమున (మంగలివలె) గొరుగుచున్నాండు. (దీర్ఘతముండు)

2. అగ్ని సమస్తాన్నములను గర్భమునందు ధరించుచున్నాడు. నూతనము లగు నోషధుల గర్భములలో సంచరించుచున్నాడు. (కుత్సుండు)

ఋగ్వేదార్యులు పొలములను కొలచుట (సర్వే) గూడ తెలిసియుండి రని యీ క్రింది ఋగర్థము చెప్పుచున్నది.

3. "పొలమునుంగొలిచినట్టులంగొలిచిరి. (కుత్సుండు)

పిండి విసరుట, బట్టల నేయుట, మాంసాదులను వండుట మొదలగు నితరవృత్తులు ఋగ్వేదమున వర్ణింపంబడెను. అవి వ్యవసాయాంగములు కానందున వ్రాయలేదు. బట్టలు నేయుటకు దూది యున్ని నార పట్టు లొనగునవి కావలసియుండును. ఒకస్థలమున "బూరుగ" చెట్టు వర్ణింపంబడెను. బూరుగదూది నూలువడుకుట కుపయోగించిరేమో శోధింపవలసి యున్నది. మేకలు విస్తారముగ కలవారగుటచేతను "ఉన్ని" బట్టలను ధరించియుండిరనుట స్పష్టమగుచున్నది. 1-191 సూక్తమున 21 విధము లగు నెమళ్లు వర్ణింపంబడినవి. అందు కోళ్లుకూడ నిమిడియుండుననియు, కుక్కుటపాలనము కూడ వారికిం దెలిసియుండుననియు, దలంతును. అనూక్తమునందే తృణవిశేషములుకూడ వర్ణింపంబడియున్నందున పశుపాలనమునందు వారప్రమత్తులై యుండిరని యూహింపంబడుచున్నది. ఋగ్వేదమునంతయుం జదివి చూడగా, నాటి వ్యవసాయకులస్థితి, ప్రస్తుతకాలమునందాంధ్రదేశపుస్థితి, విశేషించి గోదావరీ కృష్ణామండలముల నందలి వ్యవసాయకులస్థితికి, తక్కువకాని స్థితి కలవారై యుండిరనియు, వీరికంటె పశుసంపదయందును, దేహబలమునందును, ఆయుర్వృద్ధియందును, దైవభక్తియందును హెచ్చుస్థితి కలవారుగా నుండిరనియుం దలంపవలసియున్నది. ఇతరవృత్తాంతములను శాస్త్రకాలచరిత్రమున వ్రాయంగలను.

1. త్రయః కేశిన ఋతుథా విచక్షతే సంవత్సరే వపత ఏక ఏషాం (1-164-44.) 2. విశ్వా సనాని జఠరేషు ధత్తేఽంతర్నవాసు చరతి ప్రసూషు (1-95-10.) 3 "క్షేత్రమివ విమముః" (1-109-5.)

---

# వ సం త గా న ము

## జంధ్యాల వేంకట శివకవులు

(పూర్వసంచికనుండి)

నల్లని రూప మొప్పి, విపినంబుల యెల్లెని లేంజిగుళ్ల రా
జిల్లెడు మావిగున్నల వసించుచు, నంబరవీథి స్వేచ్ఛగా
నల్లల నాడుచుం దిరుగుచున్నట్టి పికంబ! జనుల్ నుతింపంగాం
జల్లంగం బ్రకృతి స్తవము సల్పుమ, పంచమసుస్వరంబునన్!

# నారదవిలాపము

గుంటిమెడ వేంకట సుబ్బారావు గారు

నల హరిశ్చంద్ర భూనాథు లేలినయట్టి, భద్రవాసమె యీ దరిద్ర సీమ!
చెలఁగి పాండవయోధ సింహముల్ తిరిగిన, శౌర్యధామమె యీ శ్మశానవాటి!
చండతేజస్సముజ్జ్వలతపోధను లుండు, పావనస్థలమె యీ పాడుభూమి!
వాల్మీకిపక్షి పావనరామకథ పాడు, శృంగారవనమె, యీ చెనఁటినేల!
గీ. భళిరె! వైకుంఠవాసు, విశ్వప్రకాశు, నాట్యమందిర మైన పుణ్యస్థలంబె
అరయ నీపాడుకొంపవిద్యాలకొంప!, కాలదేవతా! నీ ప్రజ్ఞ కాలిపోను!

సీ. గంగపాలైతివా కాశికావిశ్వేశ!, అన్నపూర్ణమ్మ! యే మైతివమ్మ!
కాలి బొగ్గైతివే కాళీమహాశక్తి!, భువనేశ్వరాధీశ! పుడమి లేవె?
నిద్రబోయితివయ్య! భద్రాద్రిరఘురామ!, అవసానమా! నీకు పవనతనయ!
జీవచ్ఛవం బైతె సింహాద్రినరసింహ!, కనులు కానవె నీవు కనకదుర్గ!
గీ. ఆర్తరక్షణదీక్షావిహారుల మని, బూటకాల్ పల్కి, యెన్నెన్నొ పూజ లంది
అరులఁ గని నేఁడు భయమందియడఁగినారె!, పొందు పొందిక మీ క్షేత్రములను విడిచి.

సీ. అసురసంహారకార్యార్థివై నీ వేగ, ఆశ్రయం బిడిన దయాంబురాశి,
ముక్కోటిసురలతో పుడమి కీ వరుదేర, గర్భమం దిడికొన్న కలుషహీన,
నీభుజక్రాంతనిర్నిద్రదిగ్విజయ వార్తలకు పెల్లుబ్బు నుత్తమగుణాఢ్య,
సరి లేని నీ యశస్సాంద్రచంద్రికల దిక్తటుల నింపినయట్టి ధన్యచరిత,
గీ. విడువ కేవేళ నీనామవిమలమంత్ర, జపము చేయుచునుండు నిష్కల్మషాత్మ,
కటకటా! నీకు విసరాని కన్నతల్లి! కరుణ రాదె నీకైన నో కమలనయన !

గీ. మాతృవిద్రోహి వై ధర్మమార్గ ముడిగి, ఈనె రాక్షసవృత్తి వర్తించుచుండ
సాగునే యింక ధర్మరాజ్యంబు జగతి?, మచ్చునకు లేక నీ కీర్తి మాయకున్నె?

సీ. మాతృవిద్రోహు లై మహిని జరించు దుర్మార్గవర్తను లెల్ల మాయువఱకు,
వసుధావృతం బైన బహుళదౌర్జన్యదుర్వారదావాగ్ని చల్లారువఱకు,
చటులరాక్షసకార్యసానుకూలము లైన, ధూర్తప్రభుత్వముల్ దూలువఱకు,
ఈ దేశమాతముఖేందుమండలము చల్లని నవ్వు వెన్నెలల్ కాయువఱకు,
గీ. ప్రకటభవదీయభయదచక్రానలమున, లోకకంటకశలభముల్ గూలువఱకు,
ప్రవిమలం బగు నమరసామ్రాజ్య మింక, చొచ్చి వైకుంఠపురి నీవు చూడఁదగునె?

———

# ఇస్లాములోని ప్రార్థన

**చిలుకూరి నారాయణరావుగారు ఎమ్. ఏ. ఎల్. టి.**

ఇస్లాములోని ప్రార్థన రెండుభాగములుగా ఉండును. మొదటిభాగమునకు 'ఫర్జ్' అని పేరు. 'ఫర్జ్' అనగా అందరును కలిసి చేసేది. ఈ ప్రార్థన మసీదులో చేయడము మంచిది. దీనిలో 'ఇమాము' అనగా ఒక మత పెద్ద అధికారిగా ఉండి తక్కినవారిచేత ప్రార్థన చేయించును. రెండోభాగమునకు 'సున్నత్' అనిపేరు. ఇది ఎవనిమట్టుకువాఁడే తనయింటిలో చేసుకోవలసిన ప్రార్థన. రోగము చేతగాని, మరియే కారణముచేతగాని ఎవడైనా 'ఫర్జు'ను సంఘముతో కలిసి చేయలేనప్పుడు, సున్నత్ వలెనే తన యింటిలో ఒక్కడే చేసుకోవచ్చును. ఈ రెండు భాగములలోను ఆయా కాలములలో కొన్ని 'రకత్తులు' ఉండును.

రకత్తు

ఈ క్రింద చెప్పేపనులు, ప్రార్థనలు, అన్నిటికీ ఒక రకత్తు అని పేరు:—

(౧) 'కిబ్లా' అనగా మక్కా. అటునైపు తిరిగి నిలుచుండి చేతులు చెవులదగ్గఱ చేర్చి,

"అల్లా ఉ అక్బర్
దేవ ఏవ పరః
దేవుఁడు సర్వాధికుఁడు"

అని అనవలెను. ఇట్లుచేయుటకు 'తక్బీర్-ఇ-తహారిమహ్' అని పేరు.

(౨) తరువాత 'ఖియామ్' చేయవలెను. అనగా నిలబడే ఉండి కుడిచేయి గుండెమీదుగా ఎడమచేతిమీద ఉంచి, ఈ క్రిందిప్రార్థన గాని, అందులో ఒక కొంతగాని చెప్పవలెను.

"ఇన్ని వజ్జహ్తు వజ్-హాయ లిల్లజి ఫటర్-అస్-సమావాత్-ఇ వల్-అర్దా హనిఫన్ వ మా అన మిన్-అల్-ముష్రికిన్. ఇన్న షలాతి వ నుసుకి వ మహ్యాయ వ మమాతి లిలాహ్-ఇ రబ్బ ఇల్-ఆలమిన్, లాషరీక లహూ వ బిజాలిక ఉమిర్తు వ అన మిన్ అల్-ముస్లిమిన్. అల్లాహుమ్మ అంత్-అల్-మలికు లా ఇలాహ ఇల్లా అంత, అంత రబ్బీ వ అన 'అబ్దుక జలమ్తు నఫ్సి వ' తరఫ్తు బిజన్బి ఫఘ్ఫిర్లి జునూబిజమి' అన్ ఇన్నహూ లా యఘ్ఫిర్-ఉజ్-జునూబ ఇల్లా అంత, వహ్దిని లి-అహ్సన్-ఇల్-అఖ్లాఖి లా యహ్దీ లి అహ్సనిహా ఇల్లా అంత, వష్రిఫ్ అన్ని సయ్యి 'అహా లాయస్రిఫు 'అన్ని సయ్యి 'అహా ఇల్లా అంత."

"స్వర్గస్యచ పృథివ్యాశ్చ సృష్టిర్యస్మాత్ర ఎ భూయతే। ప్రణిపత్యాభిముఖ్యేన వందే తం నాన్యదేవతాః॥ త్యాగశ్చ ప్రార్థనాచైన జీవో మృత్యుస్తథైవచ। దేవాయ మమ తత్సర్వం జగన్నాథాయ కల్ప్యతే॥ దేవస్య హా సమో నాస్తి త్వాజ్ఞా మే వర్తతే శుభా। తస్యాహం దాసభావేన భవేయుం కింకరస్సదా॥ త్వం చక్రవర్తీ జగతాం త్వదన్యో నాస్తి కశ్చన। ప్రభుస్త్వం కింక

రశ్చాహం మామే వాపకరో మ్యహమ్॥
నివేదయా మ్యహం సర్వా నపరాధాన్
క్షమస్వ తాన్। తేభ్యో ఽపరాధేభ్యశ్చ
త్వదన్యో మే న రక్షకః॥ సన్మార్గగామీ భ
వితుం సన్మార్గేణ నయస్వ మామ్। సన్మార్గ
దర్శకో నాస్తి త్వదన్యః పురుషః ప్రభో॥
మదీయా దుష్టచింతాశ్చ కుచర్యాశ్చ వినా
శయ। తేషా మపహర్తా త్వం త్వదన్యో
నాస్తి కశ్చన॥"

"ధర్మనిరతుఁడవై స్వర్గమర్త్యముల సృజించిన యాతని కభిముఖుఁడ నగుచున్నాను. నేను బహుదైవారాధకులలో నివాఁడను గాను. నా ప్రార్థన, నాత్యాగము, నాప్రాణము, నామృత్యువు, సర్వమును జగన్నాథుఁడగు అల్లాకే సమర్పించుచున్నాను. అతనికి సముఁడు లేఁడు. ఇట్లే నా కాజ్ఞ అయినది. ప్రణతులగువారిలో నేను చేరుచున్నాను దేవా, నీవు చక్రవర్తివి. నీవు తప్ప మఱియొక దేవుఁడు లేఁడు. నీవు నాకు ప్రభుడవు, నేను నీకు కింకరుఁడను. నాకు నేనే అధర్మముగా ప్రవర్తించుచున్నాను. నాయపరాధముల నన్నిటిని నీకు నివేదించికొనుచున్నాను. వానినుండి నన్ను రక్షింపుము. నన్ను మంచినీతిమార్గమున నడపుము. అట్లు నడపఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు. నన్ను దుర్నీతివిముఖుని చేయుము. దుర్నీతినుండి నన్ను మఱలఁపఁగలవాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు."

పైప్రార్థనకు బదులుగా సాధారణముగా ఈ క్రింది చిన్నప్రార్థనను చెప్పుచుందురు.

"సుబ్హానక అల్లాహుమ్మ వ బి-హమ్ది-
ఇ క వ తబారక్-అస్మ్-ఉ-క వ త' ఆలా
జద్ద్-ఉ-క వ లా ఇలాహ ఘైర్-ఉ-క అ'
ఊజుబిల్లాహిమిన్-అష్ షైతాన్-ఇర్-రజీమ్"
"జయ దేవపరోఽసి త్వం స్తుత్యః పరమపావనః
సేవ్య స్త్వదన్యః కోవాఽస్తి త్వా మహం
శరణం గతః, తస్మా త్త్వం ఘోరపాపేభ్య
స్త్రాతు మర్హాసి మాం ప్రభో"

"దేవా, నీవు మహిమావంతుఁడ వగుదువుగాక! నీవు స్తోత్రార్హుఁడవు; నీ నామము ధన్యము. నీ ప్రభావము నిరతిశయము. నీవు తప్ప సేవింపఁదగిన వాఁడితరుఁడు లేఁడు. సైతాను నుండి నన్ను రక్షింతువని నిన్ను శరణుఁ జొచ్చియున్నాను."

ఈ ప్రార్థన అయినతరువాత 'ఫతీహా' చదువుదురు. 'ఫతీహా' అనఁగా కురానులోని మొదటి అధ్యాయము (సురా.)

"బిస్మిల్లా-ఇర్ రహ్మాన్-ఇర్ రహీమ్
అల్-హమ్దు ఉ లిల్లా ఇ రబ్బిల్-'ఆలమిన్.
అర్. రహ్మన్ ఇర్ రహీమ్. మాలిక్ ఇ-
యామ్ - ఇద్ - దిన్ ఇయ్యాక న'బుదు వ
ఇయ్యాక న స్త' ఇన్. ఇహ్దీ-నష్-షిరాత్-
అల్-ముస్తాఖిమ్, షిరాత్ - అల్లజిన అన్
'అమ్త "అలైహిమ్ గైర్-ఇల్ మఘ్-దూబ్
ఇ అలైహిమ్ వ లద్దాఅల్లిన్."

"జగన్నాథాయ దేవాయ దయాదాక్షిణ్య
మూర్తయే। ధర్మనిర్ణయకాలేచ తుభ్యం
ధర్మాధికారిణే। నమోఽస్తుతే జగన్నాథ
త్వా మహం శరణం గతః। సేవే త్వామేవ
యాచేచ త్వామేవ శరణం ప్రభో॥ గత్వా
యేన సుమార్గేణ లభంతే సజ్జనా వరాన్,
నగత్వా యేన మార్గేణ దుర్జనా యాంతి
దుర్గతిమ్। తేనైవాపి సుమార్గేణ నేతు
మర్హాసి మాం ప్రభో॥

"దయాదాక్షిణ్యమూర్తి యగు దేవుని పేర జగన్నాథుఁడును, దయాదాక్షిణ్యమూర్తియు, జగన్నాథుఁడునగు దేవుఁడే సర్వస్తుతులకును అర్హుఁడు. మేము నిన్నే సేవింతుము. సహాయముకొఱకు నిన్నే ప్రార్థింతుము. నీప్రసాదమును బడసినవారి కవలంబించు సన్మార్గమున మాకును దారి చూపుము. తప్పుత్రోవఁ బడి నీకోపమునకుఁ బాత్రులగువారి మార్గమును మాకు పరిహరింపుము."

ఈ 'ఫతీహా' చెప్పినతరువాత 'అమీన్' 'తథాస్తు' 'అట్లే అగుఁగాక!' అని చెప్పు దురు. తరువాత బాగుగా వల్లెవేసిన కురాను లోని ఒక 'సురా' (అధ్యాయము)ను చదువు దురు. సాధారణముగా కురానుకొస నుండు చిన్న అధ్యాయము నొకదానిని చదవడము వాడుక. కురాను చదువనివారు 'అల్-ఇఖ్ లాష్' (ఏకత్వము) అను సురాను చదువు చుందురు.

"ఖుల్ హువ్-అల్లాహు అహద్. అల్లా హ్-ఉష్-షమద్ లమ్ యలిద్ వ లమ్ యూ లద్. వ లమ్ యకుల్ - ల - హూకుఫువన్ అహద్."

"స ఏకో దేవ స్తస్మాచ్చ స్వతంత్రో, నాస్తి కశ్చన, అజో ఽసదృశో; న కంచి జ్జన యిష్యతి స ప్రభుః".

"దేవుఁ డొక్కఁడే అతనినుండి స్వతంత్రముగా నుండునది దేదియు లేదు. అతఁడు పుట్టినవాఁడు కాఁడు, అతనికి పుట్టినవారు నెవ్వరును లేరు. అతఁ డసదృశుఁడు' అని చెప్పును.''

3. తరువాత "అల్లా-ఉ-అక్బర్" "దేవ ఏవ పరః" "దేవుఁడు సర్వాధికుఁడు" అని పలికి, ప్రార్థన చేయువాఁడు తల వంచి అరచేతులు మోఁకాళ్ల వఱకు చేరునట్లు చేయును. ఇట్లు చేయుటకు 'రుకూ' అనిపేరు. ఇట్లుండి అతఁడు దేవునిమహిమ నీ క్రింది వాక్యములతో స్మరించును.

"సుబ్ - హాన్-అ రబ్బ్ - ఇయ్-అల్ -' అజీమ్-" "జయమే పరమప్రభో!" "పరముఁ డగు నా ప్రభువు మహిమావంతుఁ డగుఁ గాక!" దీని కీ క్రిందిమాటలు చేర్పవచ్చును; లేదా దానికి బదులుగా చెప్పవచ్చును. "సుబ్-హానక-అల్లాహుమ్మ రబ్బనా వ బిహమ్దిక అల్లాహుమ్ మఘ్ఫిర్ లి"

"జయ దేవ ప్రభో రక్ష స్తువే త్వామేవ సర్వదా,"

"దేవా, ప్రభువా, నీవు మహిమావంతుఁడ వగుదువుగాక. నీవు స్తుత్యుఁడవు. దేవా నాకు రక్షణ నొసంగుము."

౪. పిమ్మట నిలుచుండి—

"సమి' - అల్లా - ఉ లిమన్ హమి దహ్" "యో దేవం స్తౌతి తం నిత్యం స్వీక రోతి ప్రభుస్సదా, తస్మా త్త్వాలయ మాం నాథ స్తౌమి త్వామేవ హి ప్రభో"

"తన్ను స్తుతించువానిని దేవుడు స్వీకరించును. నాథా, నీవు స్తోత్రార్హుఁడవు" అనవలెను.

౫. తరువాత సాష్టాంగపడవలెను. రెండు పాదముల బొటనవ్రేళ్లు, రెండుకాళ్ల మోఁకాళ్లు, రెండుచేతులు, నుదురు, ఇవి నేల తాఁకవలెను. ఈ సాష్టాంగమునకు 'సజ్‌దహ్' అని పేరు. ఇట్లు సాష్టాంగపడి,

"సుబ్‌హాన రబ్బియల్-అ' లా"

"జయ ప్రభో పరాత్పర"

"ప్రభువా, పరాత్పరా, నీకు జయము"

అని మూఁడు సార్లయినను అనవలెను.

ఈ క్రిందివాక్యమును పైదానికి కలుపవచ్చును; లేదా, దానికి బదులుగా అనవచ్చును.

"సుబ్హాన-క అల్లాహుమ్మ రబ్బ-నా వ బి-హమ్దిక అల్లాహుమ్-మఘ్ఫిర్ లి."

"జయ స్తవనీయ హే పాలయ మామ్"

"దేవా, స్తవనీయా, నన్ను రక్షింపుము" ఇది మొదటి "సజ్‌దహ్"

౬. తరువాత ప్రార్థనాపరుఁడైనవాఁడు భక్తియుక్తుఁడై కూర్చుండవలెను. ఇట్లు కూర్చుండుటకు "జల్‌సహ్" అని పేరు.

౭. పిదప రెండవసారి అయిదవపేరాలో చెప్పినట్లే సాష్టాంగపడవలెను. ఇది రెండవ "సజ్‌దహ్". అక్కడ చెప్పిన వాక్యములనే ఇప్పుడును అనవలెను.

౮. ఇక్కడితో ఒక 'రకత్తు' సంపూర్ణమగును. అప్పుడు ఆరాధకుఁడు లేచి రెండవ 'రకత్తు' కొఱకు నిలుచుండి, మొదటి 'రకత్తు' చేసినట్లే చేయవలెను. రెండవరకత్తు అయిన తరువాత మఱి నిలబడనక్కఱలేదు. భక్తితో మోఁకాళ్లపై కూర్చుండి, దైవస్తోత్రముతో పాటు ప్రవక్త యగు మహమ్మదు పైగంబరు కొఱకును, ఇతరభక్తుల (ముస్లిముల) కొఱకును, తనకొఱకును కొన్ని స్తుతివాక్యములను పఠించును. ఈ స్తోత్రమునకు 'తహియ్య' అని పేరు.

అత్ తహియ్యాత్ ఉ లిల్లా ఇ వస్-సలవాత్ ఉ వత్-తయ్యిబాత్ ఉ. అస్-సలామ్ ఉ, అలైక అయ్యుహన్ నబియ్ ఉ వ రహ్మత్-ఉల్లా ఇ వ బరకాతుహ్. అస్-సలామ్ ఉ' అలైనా వ' అలా'ఇబాద్-ఇల్లా-ఇష్ షాలిహీన్. వ అష్-హదు అల్-లా ఇలా అ ఇల్ల-ల్లాహు వ అష్-హదు అన్న ముహమ్మదన్ 'అబ్దు-హూ వ రసూలుహ్".

"పూజాః ప్రార్థనాశ్చైవ యా వాగ్భిః కర్మభిః కృతాః। సంపద్భిశ్చాపి తా స్సర్వా స్తే దేవా యా స్తు సర్వదా॥ ప్రవక్తశ్శాంతిస్తే హ్యస్తు కృపా దేవస్య యే వరాః। వయం తస్యైవ దాసా స్స్యాం ధర్మే నిత్యం ప్రతిష్ఠితాః॥ తస్మా దస్మాకమప్యస్తు శాంతిః; సేవ్య స్స ఏవహి। తస్య ప్రవక్తా దాసశ్చ ముహమ్మ దితి నిశ్చయః॥"

"మాటలచేతను, క్రియలచేతను, ధనముచేతను చేసిన ప్రార్థనలును, ఆరాధనయు, సర్వమును దేవునికే చెందుచున్నది. ముహమ్మదా, నీకు శాంతి యగుఁగాక! దేవుని వరములకును కరుణకును నీవు పాత్రుఁడవగుదువుగాక! మాకును దైవకింకరులకును శాంతి యగుఁగాక! దేవుఁడు తప్ప సేవింపఁదగినవాఁడు లేఁడు. ముహమ్మదు పైగంబరే అతనిముఖ్యకింకరుఁడు, అతని ప్రవక్త."

౯. ఇప్పటికి రెండు 'రకత్తు' లగును. రెండు 'రకత్తు'లకంటెను ఎక్కువ చెప్పఁదలఁచినయెడల, తిరిగి నిలుచుండి, యెప్పటివలెనే ఆరంభింపవలెను. రెండురకత్తులు మాత్రమే చెప్పఁదల,చినయెడల, ప్రవక్తకొఱకు ఈ క్రింది ప్రార్థనను కూడ చేయవలెను. అంతమున 'సలామ్' చెప్పక పూర్వము ఈ ప్రార్థనను దీని తరువాతి ప్రార్థనను చేయవలెను.

"అల్లాహుమ్మ షల్లి 'అలా ముహమ్మదిన్ వ 'అలా ఆలి ముహమ్మదిన్ కమా షల్లఇత 'అలా ఇబ్రాహీమ వ 'అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమిద్-ఉమ్ మజీద్. అల్లాహుమ్మ బారిక్ 'అలా ముహమ్మదిన్ వ 'అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త 'అలా ఇబ్రాహీమ వ 'అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీద్-ఉమ్-మజీద్."

"సర్వా అపి తే స్తుతయ స్తవైవ మహిమా పరా, ఇబ్రాహీ మనుగంతార స్త్వత్ప

సాదా జ్జయం గతాః, తథా ముహమ్మ జ్జయతు తథా తదనుసారిణః, ఇబ్రాహీ మనుగంతారః ప్రాప్నువ న్నుత్తమా న్వ రాన్, తథైవ ప్రాప్నుయా ద్దేవ ముహమ్మ దనుసారిభిః."

"దేవా, ఇబ్రాహీమునకును అతని ననుసరించిన వారికిని జయము నిచ్చినట్లే ముహమ్మదునకును అతని ననుసరించువారికిని జయము నిమ్ము. నీవు స్తుత్యుఁడవు. పర ముఁడవు. దేవా, ఇబ్రాహీమును అతనియనుచరులను అనుగ్రహించినట్లే, ముహమ్మదును అతనియనుచరులను అనుగ్రహింపుము నీవే స్తుత్యుఁడవు, పరముఁడవు."

దీనికీ క్రింది ప్రార్థనను చేర్చవలెను:-

"అల్లాహుమ్మ ఇన్ని జలమ్తు నఫ్సీ జుల్మన్ కసిరన్ వలా యఘ్ఫిర్-ఉజ్-జునూబ ఇల్లా అంత, ఫఘ్ఫిర్ లీ మఘ్ఫిరతన్ మిన్ 'ఇందిక వర్హమ్నీ ఇన్నక అంత్-అల్-ఘ ఫూర్ ఉర్-రహీమ్.

"అపరాధసహస్రాణి కృతవా నస్మి కేవలమ్।
త్వం తేభ్యో ఽపరాధేభ్యో రక్షితాన్యోన కశ్చన । తస్మా త్కారుణ్యభావేన రక్ష మాం పరమప్రభో । క్షమాచ కరుణా చైన తనైవ హి పరాత్పర॥"

"దేవా, నే నెన్నియో యపరాధములఁ జేసి యున్నాను. అపరాధములనుండి రక్షించువాఁడవు నీవే, ఇతరుఁడు లేఁడు. కావున నీవే నన్ను రక్షించి కరుణఁ జూడుము. క్షమించువాఁడవును, కరుణామయుఁడవును నీవే."

దీనికి బదులుగా ఈ క్రింది స్తోత్రమును పఠింపవచ్చును:—

"రబ్బ్-ఇజ్-'అల్నీ ముఖీమ్-అస్-సలతి వ మిన్ జుర్రియ్యతి రబ్బనా వ తఖబ్బల్ దు 'ఆ, రబ్బన్-అఘ్ఫిర్ లి వలిల్-ము-'మినీన యౌమ యఖూమ్-ఉల్-హిసాబ్."

"యథా హం మత్ప్రజా శ్చైవ భవేమ ప్రార్థనా పరాః। తథాంగీకురు స్వామిన్నాథ ప్రార్థనాం; రక్ష నః ప్రభో । యదాస్మాకం పరీక్షా హ్యై ధర్మనిర్ణయతత్పరః । పరీక్షేథా స్తదా రక్ష మాం భక్తాంశ్చ పిత్రాం స్తథా."

"ప్రభువా, నన్నును నాసంతతివారిని ప్రార్థనా పరులనుగునట్లు చేయుము., ప్రభువా, మాప్రార్థన నంగీక రింపుము. ప్రభువా, మా యపరాధములను లెక్కపెట్టు కాలమున నాకును నాతలిదండ్రులకును భక్తులకును నీరక్షణ నొసంగుము."

10. ఇంతటితో ప్రార్థన యగును. పిదప ఈ క్రిందిరీతిగా సలాము చెప్పవలెను. ముస్లి ములు ఒకరినొకరి ట్లే సలాము చెప్పికొందురు. సలామ్ చెప్పునప్పు డొకసారి తలను కుడిప్రక్క కును ఒకసారి ఎడమప్రక్కకును త్రిప్పుచు ఇట్లు చెప్పవలెను:—

"అస్-సాలాము 'అలైకుమ్ వ రహ్మత్-ఉల్లహ్."

"దేవస్య కరుణాపాత్రో శాంతియుక్త స్సదా భవ."

నీకు శాంతియు, దేవునికరుణయుఁ బ్రాప్తించుఁ గాక!"

11. రెండు 'రకత్తు'లే చెప్ప నుద్దేశిం చినవారి ప్రార్థన యింతవఱకు చెప్పఁబడినది. కాని, మూఁడు నాలుగు రకత్తులు చెప్ప నెం చినయెడల, 8-వ పేరాలో చెప్పినట్లు 'ఖదా' యును, 'తహియ్యా' యును చెప్పి, తిరిగి నిలుచుండి 'అల్లా-ఉ-అక్బర్' 'దేవ ఏవ పరః' 'దేవుఁడు సర్వాధికుఁడు' అని చెప్పి, మొదటి ఏడు పేరాలలో చెప్పిన ప్రకారము రెండు

'రకత్తు'లను పూర్తిచేయవలెను. ఎప్పుడును తుదకు భక్తితో మోఁకరించుట, 'తహియ్యా' చేయుట, ముహామ్మదు పైగంబరుకొఱకు ప్రార్థన మొదలగునవి, 8,9 పేరాలలోని ప్రార్థన, ఆఖరుకు 'సలాము,—ఇవన్నియు జరుగవలెను.

ఇది గాక, ఆరాధకుఁడు తనయిష్టము వచ్చిన ట్లుండి ప్రార్థన చేయవచ్చును. భక్తుఁడగువాఁడు సర్వకాల సర్వావస్థలయందును దేవునికి నమ్రుఁడై యుండును. ముస్లిములకు ప్రార్థన నిత్యకృత్యము. వారు నిలుచున్నను కూర్చున్నను, పరుండియున్నను, మోకరించి ఉండినను, ఏయవస్థలో ఉన్ననునరే ప్రార్థనను మానరు. ఒక ప్రక్కనుండి మఱియొక ప్రక్కకు తిరుగునప్పుడెల్ల వారు దేవుని మహిమను కొనియాడుచునేయుందురు. 'రుకు' (చూడుము— 3-వ పేరా) చేసి నిలుచున్నప్పుడెల్ల "సమి' అల్లాహు లిమన్—హామిదహా."

"స్తోతారం దేవో ఽనుగృహ్ణాతి"

"తన్ను స్తోత్రముచేయువానిని దేవుఁడు స్వీకరించును" అనుచుండును.

నలుగురును చేరి సంఘముగా ప్రార్థన చేయునప్పుడు, అచ్చట చేరినవా రందఱును ఇమాము చెప్పిన ప్రార్థనల నన్నిటిని, ఫతీహాతో సహా చెప్పుచుందురు. 'ఫతీహా' తరువాత ఇమాము చదువు కొరాను భాగములను మాత్రము తక్కినవా రుచ్చరింపరు. ఇమాము మ్రొక్కుచుండు స్థితినుండి లేచి సమి 'అల్లాహు లిమన్ హామిదహ్" అనినప్పుడు, "రబ్బనా వ లక్ అల్-హమ్ద్" (చూడుము, పేరా ౪.) అని అందురు.

౧౨ మూఁడవపేరాలో చెప్పిన 'రుకూ' చేసిన తరువాతగాని అది ఆరంభింపక పూర్వము నిలుచున్నప్పుడుగాని, 'ఖునూత్' అను ప్రార్థన చేయఁబడును. 'ఇషా' ప్రార్థనలో ఆఖరు మూఁడు రకత్తు లప్పుడు మాత్రము ఈ ప్రార్థనను సాధారణముగా చేయుచుందురు. అట్టి "ఖునూత్" ప్రార్థనలలో బాగుగా ప్రచారములో ఈ క్రిందిది ఉన్నది—

"అల్లాహుమ్—మహ్దినీ ఫి మన్ హదైత వ 'ఆఫిని ఫి మన్ 'ఆఫైత వ తవల్లనీ ఫి మన్ తవల్లైత వ బారిక్ లి ఫి మా అ'తైత వ ఖిని షర్ర మా ఖదైత ఫ-ఇన్నక తఖ్దీ వ లా యుఖ్దా 'అలైక ఇన్నహూ ల యజుల్లు మన్ వాలైత తబారక్త రబ్బనా వత'ఆలైత్."

"సన్మార్గే యేగతా స్తేషాంమార్గే మామపి చోదయ। రక్షాం తే యే గతా స్తేషాం తద్రక్షాం దేహి నః ప్రభో। మైత్రీం తే యే గతా స్తేషాం మిత్రతాం మాం ప్రసాదయ॥ యన్మాం దాస్యసి తత్సర్వం ధన్యం మాం కర్తు మర్హతి। ధర్మనిర్ణయకాలే చ యో దోషో దృశ్యతే మయి। క్షమస్వ నాథ తత్సర్వం ప్రార్థయామి నిరంతరమ్। త్వం ధర్మనిర్ణయే స్వామీ త్వాం నకశ్చన నిందతి, మిత్రతాం యో గత స్తే నకదాచిదపహీయతే, ధన్యోఽసి త్వం ప్రభో నాథ దేవదేవ పరాత్పర॥"

"దేవా, సన్మార్గమున నీవు దారిచూపిన వారిలో నాకును దారిచూపుము. నీవు కాపాడినవారితోఁగూడ నన్నును కాపాడుము. నీవు స్నేహముచేసినవారితో పాటు నాతోఁగూడ స్నేహము చేయుము. నీవు నాకు ప్రసాదించినదానితోపాటు నన్నాశీర్వదింపుము. నీవు

సాయంకు చూచినదోషమునుండి నన్ను రక్షింపుము. ధర్మనిర్ణయము చేయువాఁడవు నీవే; నిన్నెవ్వరును త్రేలెత్తి చూపఁజాలరు. నీమైత్రిని బడసినవాని కగౌరవ మనున దుండదు. నాథా! పరాత్పరా! నీవు ధన్యుఁడవు."

పైదానికి బదులుగా కొందఱు ఈ క్రింది ప్రార్థనను చేయుదురు:—

"అల్లాహుమ్మ ఇన్నా నస్త 'ఇనుక వ నస్తఘ్ఫిరుక వ ను 'మినుబిక వ నతవక్కలు 'అలైక వ నుస్నీ 'అలైక్-అల్-ఖైర వ నష్కురు-క వ లా నక్ఫురు క వ నఖ్‌ల' ఉ వ నత్రుకు మన్ యఫ్‌జురు-క. అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదు వ లకనుసల్లి వ నస్‌జుదు వ ఇలైక నస్ 'ఆ వ నహ్ఫిదు వ నర్జూ రహ్మతక వ నఖ్‌షా 'అజాబక ఇన్న 'అజాబక బిల్-కుఫ్ఫార్-ఇ ముల్ హిఖ్"

"హువేమ త్వాం సహాయార్థం రక్షాం తే ప్రార్థయామహే। త్వాంతు విశ్వసిమో దేవ త్వయి బుద్ధిం ప్రకుర్మహే । ఉచ్చైస్తు స్తువేమ త్వా మేవ నమస్కారో యథావిధి। కృతఘ్నా మాభవేమ త్వ దభక్తా న్వర్జయేమ చ । సేవా మహేచ త్వామేవ త్వామేవ ప్రార్థయామహే।త్వామేవ ప్రణతా స్స్యామ త్వాం శీఘ్రం శరణం గతాః। యాచేమ త్వద్దయాం నాథ దండనాదై భయాకులాః । దండనాం తవ విందంతే భక్తిహీనా స్సునిశ్చయమ్॥"

"దేవా, మేము నీ సహాయమును వేడుచున్నాము. నీరక్షణను కోరుచున్నాము. నిన్ను విశ్వసించుచున్నాము. మాకు తెలిసిన ఉత్తమమార్గమున నిన్ను స్తుతించుచున్నాము. నీకు వందనములాచరించుచున్నాము. మేము నీకు కృతఘ్నులమై యుండలేదు. నీయాజ్ఞలను మన్నింపనివారిని విడిచిపెట్టి వారికి దూరముగ పోవుచున్నాము. దేవా నిన్నే సేవింతుము, నిన్నే ప్రార్థింతుము, నీకే నమస్కరింతుము. శీఘ్రముగ నీయొద్దకే పరుగెత్తి వచ్చుచున్నాము. నీవు మమ్ము కరుణింతువని ఆశపెట్టుకొనియున్నాము. నీదండనకై భయపడుచున్నాము. విశ్వాసహీనులను దండన అనుసరించుచునే ఉండును."

ఇట్టిప్రార్థనయందు ముస్లిమగువాఁడు తన సర్వమును దేవునిచే - నుసమ్మకము గలిగి యంతయు నతనియధీనము చేయును. మనుష్యుఁడు తన సృష్టికర్తయెడల నెట్లు ప్రవర్తింపవలెనో, ఆతనినామము నెట్లు స్మరింపవలెనో సర్వకాలసర్వావస్థలయందును ఆతనిస్తోత్రము నెట్లు చేయుచుండవలెనో, ఈ ఇస్లాములో విధింపఁబడిన ప్రార్థన తెలుపుచున్నది. ఇందు ఇతరమతములకు విరుద్ధమైన ఒక్క అక్షరమును లేదు. అందుచేత, సర్వమతముల వారికిని ఈ ప్రార్థనను సామాన్యముగా విధించుట కెట్టి యాక్షేపణయు నుండఁగూడదు.



# ఆంధ్రము

**శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు**

అన్నం బక్కఱ లేద యాంధ్ర మన నా। కర్థంబు తానైనఁ గా
కున్నన్ నన్నయ తిక్కనెఱ్ఱనల నా।యూరించు పల్కన్న నీ
రెన్నన్ జానుఁదెనుంగు సోముల మహా।శృంగారి శ్రీనాథు ప
ల్కన్నన్ గాలి యదేల ? పోతనయఁ బ।ల్కన్నం దలంపన్ మెయిన్.

క. ఇదె నావేదము శాస్త్రం, బిదె నా శాస్త్రార్థగోష్ఠి। యిదె నా కవితా
పద మిదె భుక్తియు ముక్తియు, నిదె తెలుఁగు తెలుం గటంచు।నే నాదింతున్.

మ. అమరారామమునందుఁ గల్పకుజశా।ఖాంతంబునం దంటుఁ గ
ట్టి మధుస్యందము లందునందుఁ బరిపా।టిం బోసి పోషించి నె
య్యమునన్ గానపు దోహదం బిడి మెఱుఁ।గా యాంధ్రభాషాలతన్
దమి మీఱంగను నాటెనో యతనికిన్। నాభక్తి గీతాంజలుల్.

సీ. ఆంధ్రము నాభాష। యని యెంతునేని నానాఁటికిఁ జాలు నా।నందమునకు
ఆంధ్రము నాదేశ।మని తలంచిన మత్తనాగంబువలె నుబ్బు। నాదుమేను
ఆంధ్రులు నావార। లని చూడ ధృతరాష్ట్రునంతటి బలగంబు। చెంత నాకు
ఆంధ్రులు వీరు సుం।డని యెవండేని పక్కాణింప నదె నాకు। గౌరవంబు
ఆంధ్రభాష యనంగ నా।యాంధ్రభాష, ఆంధ్రదేశ మనంగ నా।యాంధ్రదేశ
మాంధ్రు లాంధ్రులటన్న నా।యాంధ్రు లహహ, కలదె నా కింతకంటెను। గౌరవంబు?

క. ఇఁక నెన్ని జన్మములు మా, మకజీవపు దుంపయందు। మాఁటుపడెనొ యా
సకలపు జన్మమ్ములలో, నొక యాంధ్రమె వ్యక్తమగుచు। నుండు గాతన్.

సీ. రాజులందును మహా।రాజైన శ్రీకృష్ణ, దేవరాయల నామ।ధేయ మూని
మంత్రులందును మహా।మాత్యులౌ శ్రీయుగం, ధర తిక్కనార్యుల। నామ మెన్ని
సేనాపతుల దేవ। సేనాపతివ్రతార్పితు ఖడ్గ తిక్కన్న। పేరు చెప్పి
కవులయందును మహా।కవివర్యుఁ డౌ నన్న, పార్య బ్రాహ్మణధుర్యు।నాఖ్య పల్కి
నదులయందును గౌతమీ।నదిని దలఁచి, దేశములయందులన్ మహా।దేశమైన
కోనసీమయభిఖ్య పే।ర్కొన్నపైని, జచ్చిపోవుదు నీయది। చాలు నాకు.

# గంజాము మండలమం దాంధ్రభాష

డి. యన్. శర్మ గారు

గంజాము తెనుఁగు సామ్రాజ్యమున కుత్తరద్వారము. పదునేనవ శతాబ్ద మీయుత్తరత్వమును స్థిరపఱచుటకుఁ గొంతయాధారభూత మగుచున్నది. ప్రతాపరుద్రునితో సంధిచేసికొనిన యాంధ్రభోజునకు ఋషికుల్యానదిపర్యంతము గల ప్రదేశము స్వాధీన మయ్యెను. అప్పుడుత్కళరాజులకు సామంతులుగ బాత్రులనఁబడెడు వారు మొహిరి ఖండము (ఇప్పటిబరంపురము) నుండి విశాఖపట్టణమునఁగల మాడుగులుతాలూకావఱకు బాలించుచుండిరి. వీరు రాయని కరిగాపులై యుండిరి. ఈప్రదేశము తెనుఁగు చక్రవర్తికి లోఁబడుటయే తెనుఁగు భాషావ్యాప్తికిఁ దావొసంగుట యైనది. ఇది యొక మార్గము.

ఆంధ్రసమజ్ఞావిశేషము వేదయుగమునను పురాణయుగమునను, దిగంతవ్యాప్తి నొంది వంగ మహారట్ట దేశములలో సహితము అధికారము వహించి యుండెననియు, నప్పటినుండియే యుత్తరకళింగము నాఁబడు నీప్రదేశములలో దెలుఁగు పలుకుల నిలిపియున్న దని యొక మొదటి దారి యూహాగోచర మగుచున్నది. ఈ రెండుదారులును తెనుఁగునుడి యీచోట్ల దొలుతటినాఁటినుండియుఁ బలుకుబడి కలిగియున్నదని విమర్శకులకు సమీపస్థమార్గమునందఁ జేయుచున్నది రెండుదారు లేర్పడినపుడు మూఁడవ దారినిఁ జేర్ప గలుగుదుముగదా? పదునేనవశతాబ్ద మధ్య కాలమునఁ గొందఱాంధ్రభద్రవ్యక్తు లీప్రాంతసామంత పాత్రులకడ నుద్యోగస్థులుగ వచ్చి రను తలంపు తృతీయ పథము. "ప్రతాపరుద్రదేవుని యుత్తరకళింగమున రాచకార్యములు చక్కఁబెట్టుటకు నెన్నికగన్న కొందఱు తెలుఁగు బ్రాహ్మణులు తెలుఁగునాయకులు (తెలఁగాలు) ను వచ్చియుండిరి" అని కీ॥ శే॥ డబీక్ కృష్ణమూర్తి సూరి గారు 'కళింగ' పత్రికలో వ్రాసియున్న వాక్యము మనకుఁ దృతీయపథము సమర్థించునదిగ నున్నది. ఇంకొక బలవత్తరాంశము:— ఇచ్ఛాపురమునుండి దేవాలయనిర్మాణము తెనుఁగు రాతిపనికి సంబంధించియుండుట. ఈ కోవెల లీప్రాంతమున నెప్పుడు కట్టఁబడెనో యను ప్రశ్నమునకు జగన్నాథాలయనిర్మాణ కాలము పదునొకండవశతాబ్దము కావున దానివెనుకనే యనుసమాధానము స్ఫురించుచున్నది.

పై కారణములన్నియుఁ గాలించినచోఁ దెనుఁగు భాష పదునెనిమిదవశతాబ్దపర్యవసానముననే గంజాము ప్రాంతములలో ముమ్మందు పరిచయపడినట్లు తేలుచున్నది. సముద్రతీరస్థము లగు ఉద్దానము కళివాఁకె (ఉద్యానము, ఉప్పుపల్లి)లలోని పల్లెటూళ్లన్నియుఁ దెనుఁగుపల్లెలుగఁ బుట్టుట కాకాలమె లగ్నకాలమై యుండెను. రాయఁ డస్తమించిన మీఁదట మనస్థలచరిత్రము లస్తంగతము లయ్యె. ఆకాలగర్భముననే కళింగరాష్ట్రము నుత్కళులసామ్రాజ్యము లీనములైపోయెను గాఁబోలు! ముఖలింగశాసనము పరిశీలించినచోఁ గళింగరాజ్యపరిసమాప్తికి రాయని తరువాతికాలమే శరణ్యము కావచ్చునని విజ్ఞులు కొందఱు తలంచుచున్నారు. కొందఱు చిన్న నవాబులు అనఁగా: 1565 షేర్ మహమ్మదు (శిఖాకోల్) శ్రీకాకుళమున సైత్ఖాను ఇచ్ఛాపురమున, హుస్సేను హుస్సేనుపేటను, మీరాసాహేబు కళింగపట్టణము కడగ్రామముల నేలినట్లు స్థలచరిత్రములు మ్రోఁగుచున్నవి. ఇంకొకఁ బూర్వమే గజపతులు పదునెనిమిది జమీలుగ విభాగించుకొని యీ కిలాతిని (మహానదీవంశధారా మధ్యస్థదేశము పార్వతికప్రదేశముచు) పాలించుచుండిరని చరిత్రములు గట్టిగ జెప్పుచున్నవి. పదునాఱవ పదునేఁడవ శతాబ్దములలో గంజాము చీలికలయి బహునాయకత్వము క్రింద వనియె ననుట నిస్సందేహాంశము.

ఇన్ని మార్పులు విప్లవములు మూఁడినను మొదటఁ బునాదులు వేయఁబడియున్న తెనుఁగుఁ పల్లెలలోని తెనుఁగునుడి మాత్రము చెక్కుచెదరక, యిప్పటి నేలకామందుల యొకకంటికి గంటి కాక, కడకంటికి దరియై, తామర తంపర యగుచునుండెను.

పెద్దపుస్తకములను రచించినవారకాలమున నుండిరని సాంప్రదాయసాక్ష్యములు కలవు కాని గ్రంథస్థములు కామింజేసి యవి యంతవిశ్వసనీయములుగనుండునట్లు కనఁబడదు. కాని యాంధ్రభాష దేశభావనలెనీ ప్రదేశముల బాఁదుకొన్నదనుమాట నమ్మకమునకిమ్మొసంగుచున్నది. పదునెనిమిదవ శతాబ్దమున గంజామునందాంధ్రసారస్వతము యౌవనదశనెత్తుట తత్కాలకవుల వలన స్థిరపఱుచబడుచున్నది. భాషావ్యాప్తికి రాజాదరణము, కవులయూహావిలాసములు, ప్రజలగాఢాభిమానము లూఁతకొమ్మ లగుచున్నవి. మొదటికొమ్మ యీ మండలాంధ్రికి బట్టుగొమ్మ కాకపోయినను, తరువాతను ఫలసిద్ధి జేకూర్ప గలిగినది. అగ్రహారములందలి బ్రాహ్మణులు, మొఖసాలందలి శిష్టకరణములు, మాన్యములందలితెలఁగాలు ఆంధ్రబ్రాహ్మికి బ్రహ్మరథము పట్టినకాల మొకటి యుండెను. ఈ కులస్థులవలనఁ దెలుఁగు వృద్ధిపఱుపబడిన దని దక్షిణజాతులచరిత్రము పక్షపాతబుద్ధి లేక పలుకుచున్నది.

## ఆంధ్ర గ్రంథరచనము

జగత్తులోని భాషలన్నింటికిఁ గన్నతల్లి యైన సంస్కృతము మామండలమున నుచ్చదశయం దుండెను. పండితచూడామణి యగు నాంధ్రుఁడు కుమారిలభట్టు జయంతిపురమున జన్మించె నని స్థలచరిత్రము ఘంటాపథమునఁ జాటుచున్నది. ఓఢ్రులలో కవిరత్నము త్సావుపట్నాయకు ఆతగడలోను (ఇచట యశోకునిశిలాశాసనము కలదు) మహాకవి ఉపేంద్రభంజుగుము సూర్వంతర్గత కుల్లాడలో నుదయించిరి. ఈ విధముగ నెందఱ విద్యాధికుల దివ్యదేహములే కాక భవ్యకావ్యసంపత్తి, పవిత్రనామధేయములు కాలముఖమున గబళింపఁబడి భూగర్భమున జీర్ణములై యున్నవో గదా!

సంస్కృతమాతృముఖమునుండి యుత్కళభాష వికసించి తద్యశోమూర్తిగ గోపాలకృష్ణ పటనాయకకవిచంద్రుని పర్లాఖిమిడిలో బ్రకాశింపఁజేసి, యీతని కవితాహృదయము ప్రాపంచికకవీంద్రుడు రవీంద్రునితోఁ గొన్ని యెడల దులతూఁగుచుండునని యోఢ్రసహోదరులు సతోషాతిశయముల నినుపడింప జేసినది. పర్లాఖిమిడిరాజాసాహేబువారు కీ॥ శే॥ గోపాలకృష్ణ కవీశ్వరుని యల్లికలను ముద్రించి మాతృభాషాగౌరవమును పెంపొందించుచున్నారు.

సంస్కృతజనని యుత్కళిని బెంచి పెద్దఁజేసినట్లాంధ్రిని కడుపారగని చేతులారఁబెంచి ప్రజలయొక్కయనురాగహస్తములందు విడిచెను. ప్రజలు యథావిధి నాంధ్రిని (పూర్వోక్తప్రకారము) నిలువేల్పు జేసికొనిరి. కవులు గ్రామగర్భములకలననుండి బయలుదేఱివాగ్దేవిని, గేవల మారాధించినంతమాత్రమున బుణవిముక్తి కానేరదని కావ్యకన్యను బోషింప నడుముకట్టిరి. ఇట్టి పవిత్రవంతమైన సేవయందు కొన్ని గ్రామములు సంపూర్ణముగ సర్వశక్తులును, కొన్ని కుటుంబములు యావజ్జీవనమును ధారవోసియున్నవి. చూడుడు! జలుమూరు, సిద్ధాంతము, కళ్లేపల్లి, కొర్ని, ఉర్లాము, రామనగరము, కరవంజి, పిండ్రువాడ, జాడుపూడి, నందిగాము, కుద్దిగాము, గుజ్జువలస, శ్రీకాకుళము. వీనిలో జలుమూరు, సిద్ధాంతము, కళ్లేపల్లి, యాంధ్రకవిసింహులకు జన్మభూమిమై యిప్పటికిని నాంధ్రభాషాసేవలో నిమగ్నములైయున్నవి తెనుఁగున ప్రబంధములు వ్రాసిన కుటుంబములు 1. కాకరపర్తి, వారణాసి, ప్రవ లేక ప్రభ, జయంతి, 2. డబీరు, కళ్లేపల్లి, మణిపాత్ర, బెహర. 3. మచ్చ త్రిపురాణము. మా చదువరుల సంతోషార్థము గొందఱ కవుల నిట వ్రాయుచున్నారము. సత్యాకృష్ణ సంవాద ప్రబంధము కాకరపర్తి తిరుపతిగారు, కుముద్వతీ పరిణయము కాకరపర్తి అబ్బయ్యగారు, శ్రీకృష్ణ కథాసుధారసమును వారణాసి అచ్యుత రామశాస్త్రి గారు, ఆంధ్రీకృత మాఘకావ్యంబును ప్రభగోపాల కృష్ణశాస్త్రిగారు, సుమనోవిలాసినిని పంతుల సీతారామ శాస్త్రి, పరబ్రహ్మనందబోధ ముండూరి వీరనయోగి, జానకీవరశతకము మహాదాత జయంతి కామేశము పంతులుగారు, హనుమద్విలాసాదులు ఏఁబదియాఱు గ్రంథములను డబీర్ కృష్ణమూర్తి సూరిగారు, నరసింహ వ్యాకరణమును కళ్లేపల్లి వరాహ నరసింహముగారు, నిర్వచన విచిత్ర రామాయణమును ఈతని కుమారుఁడు వేంకట నృసింహమూర్తిగారు, భూలోక వైకుంఠ మహత్తు, మణిపాత్ర భాస్కరకవిగారు, సత్యనారాయణవ్రతవిధానము చింతాడ పురుషోత్తముగారు, నిర్వచన నిరోష్ఠ్య శుద్ధాంధ్రకంసరాట్చరిత్రాదులను మచ్చ వేంకటకవీశ్వ

రుడు, రామోత్కర్షను మచ్చ లక్ష్మీనారాయణ కవీశ్వరుడు, దేవీభాగవతము త్రిపురాణము తమ్మయ్యగారు, మొదలగు కవీశ్వరులు రచించి తమ కీర్తిశరీరమును నిలిపి యున్నారు. వీరల చరిత్రములతోను గంజాము మండలాంధ్రకవుల చరిత్రమును కూర్చి యాంధ్రమాతకుఁ బాదార్పణముచే యనుద్యుక్తుఁడనగుచున్నాఁడ. ఈయర్పణమున కాంధ్రులెల్లరు తమ పూర్వులు రచించిన గ్రంథజాలముల సహాయ మొసంగి నన్ను గృతార్థుం జేయ బ్రార్థనము.

ఆర్యులారా! చూచితిరా? మనపూర్వు లెంత శ్రద్ధాభక్తులతో నాంధ్రజననిని షోడశోపచారవిధిఁ బూజించిరో? హృదయపూర్వకముగ సేవించిరో! తెనుఁగున వ్యాకరణము, ప్రబంధములు, నాటకములు, గద్యములు, శతకములు, యక్షగానములు రచించి, యనఁగ:— సారస్వతమునకు సంబంధించిన సర్వపరికరములను సమకూర్చి కీర్తిఁ బొందిరో?

ఈకీర్తి యంతటితో నిలిచిపోక ప్రసిద్ధకవీశ్వరులను, విమర్శకులను గంజామునకుఁ బ్రసాదించి యున్నది.

భాషకుఁగల యిప్పటిసదుపాయములు

పల్లెపల్లెలకుఁ బోవుపత్రికలును, పురపురంబునఁ గల గ్రంథాలయములును, గ్రంథవిక్రయశాలలును, పాఠశాలలును, ఇప్పటి మన తెనుంగు భాషాభివృద్ధికిఁ దోడ్పడుచున్నవి. మండలసంబంధపత్రికలలో గతించినవి శ్రీకాకుళమున వెలువడిన కళింగయు, మొన్నటివఱకు ప్రచురింపఁబడిన యాంధ్రవాణియు, ఆంధ్రలక్ష్మియు, వేగుఁజుక్క పత్రికయు నై యున్నవి. ఇవన్నియు నించుమించుగ దేశసేవకును భాషావృద్ధికిని బాటుపడునవియు నై యున్నవి. బహుజనోపకారిణి యాంధ్రవాణి యాంధ్రవాణి యైనది వేఁగుఁజుక్క యుదయకాల బాలకాంతులఁ దాండవమాడి యొకదేశోపకారిహస్తావలంబనమున నున్నది. ఆంధ్రలక్ష్మి యింటింటఁ బ్రసన్న యగుచున్నది. ఆంధ్రభారతి నొకదాని నారోగించుట కవియన్నియు సంకల్పించుకొని, శపథముచేసినట్లు భావిసూచనము దోఁచుచున్నది. గ్రంథాలయములు బరంపురమున, బారువను, హీరమండలమున, మఱికొన్నిచోట్లను గలవు. వీనిలోఁ గొన్ని బాలారిష్టములు పొందినవి! కొన్ని జీవచ్ఛవములై యున్నవి! టెక్కలి కాళిదాసగ్రంథాలయములవంటివి తుపానుదెబ్బలు తిన్నను ప్రజాదరణమున శివంకరస్థితిలోనున్నవి. మొత్తముమీఁద గ్రంథాలయములవలన భాషావ్యాప్తికి సదుపాయములు కలుగుచున్నవని యుత్సాహముతో వ్రాయవచ్చును. గ్రంథవిక్రయశాల యొకటి కూడలితావువంటిది మనమండలమున లేదు. ప్రతిస్థలమున నున్నతపాఠశాలలు, నిమ్నపాఠశాలలు, నేలంటుబడు లున్నవి. కాని మాతృభాషకంతబాసట వానివలన వాటిల్లుట యరుదుగా గనఁబడుచున్నది.

మండలసంబంధగ్రామచరిత్రములు, ప్రాఁతగిలియున్న కవుల గ్రంథములు, శాసనాదికములు అన్వేషకులకు, కీ॥ శే॥ క. వీరేశలింగ పండితులు పడినంత శ్రమలేక, లభ్యము కాఁగలవు. ఆంధ్రభాషావిషయ మైన సమస్తరహస్యములను భాషాసంస్కర్త రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి యుపన్యాసములవలన నందఱకు సులభముగ దెలియఁబడుచుండును. గీర్వాణాంధ్రములందును, గానకళయందును అసమాన పాండిత్యము కలిగిన బ్ర॥ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారివంటి బుధవరేణ్యులవలన భాషార్థులయభిమతములు సిద్ధించుచున్నవి. కవిగ్రామణి, పండిత త్రిపురాణము ప్రసాదరావునాయఁడుగారివంటిప్రౌఢకవులవలన నాంధ్రకవిత్వసంపద శోభిల్లుచున్నది. సువిమర్శకులును ప్రఖ్యాతపండితకుటుంబస్థులైన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివంటి పరిశోధకులవలన భూగతద్రవ్యములు తెలియబడునట్లు ఖిలగ్రంథసామగ్రి యన్వేషకులకు లభించుచున్నది. వీరందఱు సారస్వతసర్వస్వమునకు నిధు లని వ్రాసినచో ముఖస్తుతివాక్యము గాక యదార్థవాదవాక్యము కాక మానునా?

ఉపసంహారము

ప్రస్తుత మీమండలమునఁ దెనుఁగు రమణీయముగ నున్నది. పలువురు యువకులు కైతజగ్గులు బహిరంగముగఁ బ్రకాశింపఁ జేయుచున్నారు. మామిడల్లము సుభద్రమ్మగారు రఘ్యాత్మరామాయణము రచించి, యిచటితెనుఁగు పూఁబోండ్లకు మార్గదర్శినియై విఖ్యాతి వడసిరనుట భాషా

మనుశకుఁ బ్రబలోదాహరణముగ నున్నది. అయినను మన యాంధ్రసోదరులు సద్గ్రంథములు రచించి మాతృసేవలో ముందంజ వేయవలసియున్నది. గ్రంథాలయముల సాముదాయికసభలు జరుగుచుండవలెను. ప్రజలు గ్రంథాలయముల గౌరవించి పూజింపవలెను. పంచాననవంటి సంఘపత్రికలును, ఆయుర్వేదపత్రికను బోలు విజ్ఞానప్రదర్శనపత్రికలును బయలువెడలవలసియున్నవి. ఎల్ల పాఠశాలలోనివిద్యార్థులు మాతృభాష నాదరించి నేర్చినవారు గాక యాంధ్రికసత్సంతానము గావలసియున్నది. ఈ కోరికలన్నియును నే జగద్బంధుఁడో, ధర్మమూర్తియో, యే దివ్యరూపుఁడో ఫలోన్ముఖముగఁ దెచ్చునుగాక! ఈశ్వరుఁ డాశీర్వదించుఁ గాక!

---

# ఏ కాం త సు ఖ ము

## దే వు ల ప ల్లి కృ ష్ణ శా స్త్రి గా రు బి. ఏ.,

ఈయడవి దాగిపోనా?
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా?

ఆకులో ఆకునై
పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై
నునులేత రెమ్మనై
ఈయడవిదాగిపోనా
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా ?

గలగలని వీచు చిఱు
గాలిలో కెరటమై,
బలబలని పాడు
సెలపాటలో తేటనై
ఈయడవిదాగిపోనా
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా ?

తరులెక్కి యలసీల
గిరులెక్కి మెలమెల్ల
చదలెక్కి జలదంపు
నీలంపునిగ్గునై
ఈయడవిదాగిపోనా
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా ?

ఆకలా దాహమా
చింతలా వంతలా
ఈకరణి వెఱ్ఱినై
ఏకతమ తిరుగాడ ?
ఈయడవిదాగిపోనా
ఎక్కడైన
ఇచటనే ఆగిపోనా ?

# మాయింట్లో పిల్లి

("మారుతి" - సాహితీసమితి)

పిల్లులకీ యితర జంతులకీ తెలివితేటలు లేవనీ, ప్రపంచంలో వున్న తెలివితేటలన్నీ మనిషిలోనే మూర్తీభవించినవనీ, చెప్పేవాళ్ళకీ నాకూ స్నేహం లేదు. అలాగని చెప్పి అన్నిజంతువులతోటీ నేను నేస్తంకట్టను. ఆమాట కొస్తే కుక్కకీ నాకూ పరమశత్రుత్వము. కారణము—కుక్కకూ ఇంగ్లీషువాడికీ పరమస్నేహం కాబట్టి.

పిల్లిమీద నాకు ఒకమోస్తరు కోపం. అయినప్పటికీ దానిమీద అభిమానం లేకపోలేదు. ఏమంటారా మా మేనత్త—ఆవిడకు నేనంటే చాలా మమకారం. నేను వాళ్ళింటి కెప్పుడు వెళ్ళినా చాలా ఆదరించి, వచ్చావా నాయనా అని, నాకు జంతికలుచేసి పెట్టుతుంది కాబట్టి—ఒకపిల్లిని పెంచుతుంది. అన్నట్టు చెప్పడం మరిచిపోయాను; మా మేనత్త వితంతువు. వితంతువులకీ పిల్లులకీ ఒకమోస్తరు సంబంధం వుండివుండాలి; ఈ జన్మంలో కాకపోయినా పూర్వజన్మంలో నైనాను. లేకపోతే, వారిద్దరికీ యింతటి మక్కువ ఎందుచేతనో నాకు బోధపడడంలేదు. నా అదృష్టమేమో కాని—దురదృష్టం అనండి. మాయిష్టం—నేను ఎందరోవితంతువులను చూచాను. ప్రతీ వితంతువూ ఒకపిల్లిని—తెల్లపిల్లీ, గండుపిల్లీ, నల్లపిల్లీ, పొడలపిల్లీ, పిల్లికళ్ళపిల్లీ, ఇంగ్లీషు పడుచుల్లాగ నీలికళ్ళపిల్లీ—ఏదో ఒక పిల్లిని పెంచడమే చూచాను. వెనకటికి ఎవరో ఒక యిల్లాలు వుండేదిట, మా మేనత్త చెప్పేది. ఆవిడకు పెంచుతూన్నపిల్లంటే ప్రాణం. వారానికొకమాటు దానికి నూనెరాసి కుంకుడుకాయ పులుసుతో రుద్ది తల నీళ్ళుపోసేదిట! చెవ్వలో నూనెకూడా పోసేదిట! మధ్యాహ్నం వంట చేసుకొని, తా నింత తిని పిల్లి కింతపెట్టి, వీధి అరుగుమీద కూచుని, చేటలో పెసరపప్పు ఎండలో పెట్టి, పిల్లిని ఒళ్లో కూచోపెట్టుకొని, కాకుల్ని కొట్టుతూ, గులివితెడ్డుతో గులివి తీసేదిట! ఎంత మమకారమో! అయితే స్వేచ్ఛకోరి, యిష్టానుసారం తిరిగి, మనుష్యులను లక్ష్యపెట్టని, పిల్లి యిన్ని విధాలుగా యిబ్బంది పెట్టుతూఉంటె ఎలాగ వూరుకుందో అనుకుంటాను. కాని యీపిల్లి సామాన్యపు పిల్లి కాకపోవచ్చును. పూర్వజన్మంలో, బహుశా యీ వితంతువుకు దగ్గరబంధువని మాత్రము నానిశ్చితాభిప్రాయం. ఎలకలని పట్టి చంపడానికని పిల్లిని పెంచుతారుగాని, వాస్తవానికి పిల్లి ఎలకలని పట్టదని నా నమ్మకం. తినడానికి తగినంత ప్రసన్నమయితే, ఏపిల్లీ ఏ ఎలకజోలికీ వెళ్లదని నేను నమ్ముతాను. యదార్థానికి పిల్లు

లున్నచోటే ఎలకలు ఎక్కువగా వుంటాయి. కడుపునిండిన పిల్లిదగ్గర ఎలకలు తైతక్కలాడతాయి.

ఈసంగతి ఒక దేశపు గవర్నమెంటువారు బాగా గ్రహించినట్లు తోస్తుంది. ఆ మధ్య ఖర్చు తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తూ తక్కువ ఉద్యోగస్తుల జీతాలూ స్కూలు మేష్టర్ల జీతాలూ తగ్గించారు. ఆరీతిగానే పిల్లుల కిచ్చేభత్యంకూడా తగ్గించినట్లు తెలియ వస్తోంది. ఏదో వూళ్లో ఏదో ఆఫీసులో ఎలకలు విస్తారముగా వున్నాయిట. ఆ ఎలకల బాధ పడలేక, ఆఫీసులో ఒకపిల్లికి ఉద్యోగం యిచ్చారట! ఆపిల్లి యథావిధిగా తన విహితధర్మము నిర్వహిస్తూ, దొరతనమువారు వేతనరూపకముగా యిచ్చే భృత్యము ననుభవిస్తూ, లోకముతో సంతృప్తి జెంది వుండేదట. ఆ మధ్య జీతములు తగ్గిస్తూ పిల్లి భృత్యమును ఆ దొరతనము తీసివేసినారు. తీసివేస్తూ అన్నారట, "ఎలకలను తినే పిల్లికి వేరే ఆహారంకోసం భృత్య మెందుకు? భృత్యంతో ఆహారము కొనివేస్తే అది మళ్లీ ఎలకలను ముట్టదు కాబట్టి, ఎలకలను ముట్టనిపిల్లి ఆఫీసు కెందుకు?" అని. ఆమాట నిజము. ఇందులో ఇంకో విశేషం వుంది. జీతములు తగ్గుటచే, బాధపడుచున్నవాళ్లము; స్కూలు మేష్టర్లము, మే మొక్కరమే అని వాళ్లు విలపిస్తూంటే, వాళ్లకు సహవాసంగా పిల్లికూడా దొరికింది. ఈ మార్జాలసహవాసమును స్కూలుమేష్టర్లకు కల్పించినందుకు, ఆ తైనవారం దిహూ ఆ గవర్నమెంటు బుద్ధిపైభవమునకు సంతోషిస్తూ, వారియెడల కృతజ్ఞత కలిగి వుంటారని నేను దృఢముగా నమ్ముచున్నాను. ఇట్లా వున్నట్లయితే వారికి కుక్క మున్నగు యితరజంతువుల సహవాసముకూడ అచిరకాలములోనే సమకూరగలదని నమ్ముచున్నాను. మామేనత్తమీద నాకు మక్కువ. ఆ కారణంచేత ఆవిడిపిల్లిమీద నాకు అభిమానం. ఎంత అభిమానం వున్నా రాత్రి భోంచేసి, పరుపు వేసుకొని పండుకొని, మంచి నవల చదువుకుంటూన్నప్పుడు, సద్దులేకుండా వచ్చి భ్రష్టుపిల్లి—వెధవపిల్లి — పక్కను పడుకొని, గుర్రుమంటూంటే, ఎవళ్లకి ఒళ్లుమండుకుపోదు—వికంతువులకు తప్ప. ఆసంగతి అలా వుండగా శుభ్రంగా అరటిఆకు వేసుకొని, యిష్టమైన పదార్థాలు ఆప్యాయంగా తినే సమయాన్ని, ఎదురుగుండా కూచుని ఈపిల్లి రెప్ప వెయ్యకుండా చూస్తూ, నీవు తినే అన్నంముద్దలు లెక్కపెట్టుతూంటే, ఒళ్లు మండుకుపోతుందా పోదా? ఏమంటారా,—మనం హిందువులము కాబట్టి, దృష్టిదోషం అంటే నమ్మకం యింకా పోలేదు. పచ్చకళ్లతో యీ పిల్లి యీ విధంగా చూస్తూంటే, దృష్టిదోషం తగలదని ఎలాగ అనుకోగలము? అన్నం అరగక అజీర్ణరోగము రాదని ఎలాగ అనుకోగలము? ఆ సమయంలో, పక్కనున్న నీళ్ల చెంబు తీసుకొని మొహంబద్దలగొట్టవలె నని బుద్ధి పుట్టకపోదు. నీళ్లచెంబంటే జ్ఞాపకం వచ్చిరది. పిల్లి అంటే నాకు కోపానికి ఒక కారణం వుంది. తల్లితండ్రుల గుణాలు కొన్ని గాకపోయినా కొన్నైనా పిల్లలకు వస్తాయని చెప్తారు.

పిల్లిని చూచి అసహ్యించుకోవడం అనేగుణం నాకు మా అమ్మనుంచి వచ్చింది. మా అమ్మ చాలా ఆచారవంతురాలు. కడిగిందే కడుగుతూ, తోమిందే తోముతూ, స్నానాల మీద స్నానాలుచేస్తూ మాకు సాధారణంగా మూడోఝాముసగాని భోజనం పెట్టేదికాదు. ఆవిడకూ పిల్లికీ బద్ధవైరం. ఆవిడున్నచోట పిల్లి వుండదు. పిల్లి వున్నచోట ఆవిడ—పిల్లిని వుండనియ్యదు. ఎంచేతనంటే?

పిల్లికి ఆచారం తెలియదు. ఎప్పుడేనా స్నానం చేస్తుందో లేదో మనకు తెలియదు. మనం ఎరిగినంతమట్టుకు చూస్తూన్నంతమట్టుకు దానికి స్నానం లేదు. తరువాత అది అన్నం తిని మూతి కడుక్కోదు. మా అమ్మకు దాని మీద కోపానికి యిదే ప్రధానకారణం. విస్తళ్లలో మిగిలిన అన్నం మెతుకులు రెండు తిని యీ పిల్లి యింట్లోవున్న వస్తువులన్నీ ముట్టుకుంటుంది. మా అమ్మగారు దానిని ఆ సందర్భంలో చూచినట్లయితే, దాని నుద్దేశించి ఒక చిన్న వుపన్యాసం చేసేది,—"ఎక్కడ దాపరించిందమ్మా యీ వెధవపిల్లి? నూరుకళ్లతో చూస్తూన్నా, ఎక్కడా వుండేమార్గం అగుపడదు. ఎక్కడదని, నేను చూడగలను? పోనీ, దాన్ని పట్టుకొని సంచీలో పెట్టి ఎక్కడేనా వదలిపెట్టరమ్మంటే చెవినిబెట్టరు. (యిది మొగాళ్లను ఉద్దేశించి). ఇది పూర్వజన్మంలో, నాకు సవితికాబోలు. లేకపోతే యిలా వేపుకు తింటుందా? ఎంతమట్టుకని చూస్తూ వూరుకోను? మెతుకులన్నీ పొట్టవిచ్చేలాగ తిని ఆ అంటుమూతితో యింట్లో కూరలబుట్ట ముట్టుకుంది. దాన్నంతా యిప్పుడు కడుక్కోవాలి. ఆ అంటుమూతితో ఊరగాయల కుండ ముట్టుకుంటే ఇంకేమేనా వుందా?" ఇత్యాదిగా గబగబ ఒక ఉపన్యాసం యిచ్చి చెంబెడు నీళ్లు తరుముకువెళ్లి దాని నెత్తిమీద పోసి దావిడ—చచ్చి స్వర్గానున్నది. అంటు మూతిపిల్లికి, ఆ చెంబెడు నీళ్లతోనూ శుద్ధి అయేది. ఒక్కొక్క గండుపిల్లి తప్పించుకు పోయేది కూడాను. ఆ సందర్భంలో మా అమ్మకు కోపమూ దుఃఖమూ ఇంతా అంతా కాదు. ఎంచేతనంటే—ఈ వెధవపిల్లి ఊరూరూ ఇల్లిల్లూ తిరిగి, అందరి ఎంగిళ్లూ కలిపివేసి, ఆ ఎంగిలి మాయింటికి మళ్లీ తీసుకు వస్తుందని. మా అమ్మ అప్పుడప్పుడు పిల్లిని పట్టుకోడానికి ప్రయత్నించేదికూడాను. ఖర్మంచాలక ఏదేనా ఒక పిల్లి దొరకినట్లయితే దాన్ని బిందెలో వేసి, బిందెనిండా బట్టలు వేసి, నీళ్లకు వెళ్లేటప్పుడు కాలవకు తీసుకు వెళ్లేది. అక్కడ ఆ పిల్లిని వదలిపెట్టి, రెండుదాన్ని తిట్టి, బట్టలు వుతుక్కొని, స్నానంచేసి, మడినీళ్ల బిందెతో యింటికి వచ్చేది. ఇంట్లోకి వచ్చి, నీళ్లబిందె దింపి "విరగడైందమ్మా వెధవపిల్లి" అనేది. అనీ అనడంతోనే మ్యావని ఆపిల్లే గదులో పెట్టె మీదనుంచి దిగి ప్రత్యక్షమయ్యేది.

ఏలాగైతేనేమి నాకు పిల్లిమీద కోపానికి మా అమ్మే కారణం. ఇక మా పిల్లి సంగతి. మా అమ్మ బతికివున్నన్నాళ్లూ మా యింట్లో పిల్లి కాలుపెట్టలేదు. దరిమిలాని ఒక పిల్లి—పాపము చూలాలు—మా యింటికివచ్చి యిల్లంతా శోభా చూచి వెళ్లింది. కొన్నాళ్లు

పోయాక, ఒక తెల్లపిల్లిపిల్లని మా యింటి దగ్గిర వప్పగించింది. దాన్ని పూర్వపు అలవాటును బట్టి తరిమి వెయ్యడానికి ప్రయత్నం చేశాము. ఎంతచేసినా, మాయిల్లు మాత్రం అది వదిలీదికాదు. ఇల్లంతా కర్రతీసుకు తరిమి, ఇంట్లోంచి వెళ్లిపోయిందని అనుకుంటూంటే, ఏబుట్టలోంచో, ఏపొయ్యి పెడలోంచో, ఏ అలమారు లోంచో మ్యావ్రు అనేది. దాన్ని తరిమీమార్గం దొరక్క, పోనీ మా అమ్మ లేదుగదా పిల్లి వుంటే ఏమి పోయిందని వూరుకున్నాం. ఊరుకోవడానికి యింకోకారణంకూడా వుంది. మా చంటమ్మాయికీ, యీపిల్లిపిల్లకీ, ఒకవిధమైన స్నేహం కుదిరింది. మా అమ్మాయిదగ్గిరకు వెళ్లి తోక లాగినా, చెవ్రులు పీకినా, ఊరుకునేది ఈపిల్లి. మేమెవరమేనా దగ్గిరకు వెళ్లితే మాత్రం పారిపోయాడి. కొత్తలో మా అమ్మాయి, పిల్లిని వింతగా చూచేది కాని దగ్గిరకువెళ్లేది కాదు. రానురాను దానిదగ్గిరగా వెళ్లి దానితో ఆడుకొనేది ఒక ఆటబొమ్మతో ఆడుకొన్నట్లు. అంటే జ్ఞాపకంవచ్చింది. ఒకనాడు ఒక ఇల్లాలు చంటిపిల్లను చంకబెట్టుకొని, చుట్టపు చూపుకు వచ్చిందొ సాయంత్రానికి. చంటిపిల్లను నడవలో వదలి, ఆవిడ మాఅమ్మాయితల్లితో గుమ్మంముందర కూచుని కబుర్లు చెప్పాతోంది. మా అమ్మాయి చంటిపిల్లను చూచి దగ్గిరగా వెళ్లింది.

ఇద్దరూ కొంచెం ఎడంగా కూచుని ఒకరినొకరు పరిశోధించి కొంత సేపు చూచుకున్నారు. ఒకరినొకరు కొంతసేపైనతరువాత తాకినారు. తరువాత ఒకరినొకరు లాగిచూచుకున్నారు. చివరకు ఒకరినొకరు ఒకబొమ్మగా నిశ్చయంచేసుకున్నారు. చేసుకుని ఒకరిజుట్టు ఒకళ్లుపట్టుకుని లాగుకోవడం ప్రారంభించారు.

"ఊఁ"

"ఊఁ"

"ఊఁ ఊఁ"

"ఊఁ ఊఁ"

తరువాత రోదనాలధ్వని విని ఇద్దరు పిల్లలనీ, తల్లులు విడిపించారు. ఆచంటిపిల్లలాగ యీపిల్లిపిల్ల, మాఅమ్మాయితో కలియబడి దెబ్బలాడలేదు. అందుచేత ఆపిల్లిపిల్ల దగ్గిర మాఅమ్మాయికి చనువు.

ఈ పిల్లిపిల్లను యింట్లో వుంచడానికి ఇంకోకారణంకూడా కద్దు. మా అబ్బాయికి కూడా ఈపిల్లిపిల్లంటే ఎంతో సరదా. పిల్లిపిల్లకు మాత్రం మావాడంటే అతిభయం. పిల్లిపిల్ల నెమ్మదిగా ఒకమూల కూచుని, హాయిగా కళ్లుమూసుకొని, ప్రపంచాన్ని మరిచిపోతూన్న సమయంలో, మావాడు నెమ్మదిగా దానివెనకాలే వెళ్లి తోక లాగుతాడు. అది ఏమి జరిగిందో గ్రహించలేక దిక్కుతోచకుండా పరుగెత్తుతుంది. మావాడు గంతువేసి నవ్వతాడు. ఒక్కొక్కప్పుడు పిల్లిపిల్లని కర్రపుచ్చుకొని యిల్లంతా తరుముతాడు కూడాను. మా వాడికి, పిల్లిమీద ఎంత అభిమానం అంటే.

ఒకనాడు "ఒరే అబ్బాయీ, వంటింట్లో ఎవరూ లేరు. పిల్లివచ్చి ఏమేనా ముట్టుకోగలదు చూస్తూండు" అన్నాను.

కొంతసేపు వంటింట్లో కూచోనిఉండి తరవాత మావాడు వచ్చి "నాన్నా, నాన్నా, పెద్దపిల్లా చిన్నపిల్లా" అన్నాడు. చిన్నపిల్లి అంటే వాడి కంత ప్రేమ.

ఒకనాడు మావాడు పిల్లిపిల్లతో ఆడుకుంటున్నాడు. మేము చూసీ చూడకుండా ఊరుకున్నాము. కొంతసేపటికి మావాడు మాదగ్గిరకు వచ్చి నవ్వడం మొదలు పెట్టేడు. మాకు అర్థమయిందికాదు. "ఎందుకురా నవ్వతా" వంటే మాట్లాడడు. అప్పుడు అక్కడ వారెవరో "పిల్లేదిరా" అన్నారు. మావాడు గట్టిగా నవ్వి "నూతులోపడవేశాను" అన్నాడు. ఎక్కడ పిల్లిబ్రహ్మహత్య వస్తుందో అని దాన్ని కష్టపడి పయికి తీశాము. తీసినందుకు విశ్వాసమేనా చూపకుండా, అది పారిపోయింది. మావాడు చేసినపని చెడ్డపని అని యిది చదివేవాళ్లందరూ అనుకుంటున్నారని నాకు అనుమానంగా వుంది. మావాడి మనస్సులో వున్నవూహాలే వాళ్లందరకూ వుంటే, మావాడికి వున్న ఉత్సాహము, జంతువులమీద ప్రేమా, చదువు సంధ్యలు మాని పిల్లిపిల్లలతోటీ కుక్కపిల్లలతోటీ ఆడుకుందామనే ఆసక్తీ వాళ్లందరకూ ఉన్నట్లయితే, మావాడికివలెనే వారందరూకూడా ప్రత్యేకంగా ఒకపిల్లిపిల్లను సంపాదించి నూతులోపడవేస్తారనేనానమ్మకం. అట్లా పడవెయ్యకపోయినట్లయితే, అధమపక్షం ఆలాగ పడవెయ్యడానికి యిచ్ఛయేనా లేకున్నట్లయితే వారిమెడ నాకు గల సదభిప్రాయము మార్చుకోవలసి వస్తుం దని వినయపూర్వకంగా మనవిచేస్తున్నాను.

ఎన్నికారణాలువున్నా ఈపిల్లి యింట్లో ప్రవేశం నాకు మట్టుకు చాలా అయిష్టంగా వుంది. ఏమంటే, తెల్లవారగానే కళ్లు నులుపుకొని, శ్రీరాములుని తలుచుకొని, కళ్లు తెరిచేటప్పటికి—ఎదురుగా సిద్ధం యీపిల్లి. ఏదైనా తొందరపనిమీద వెళ్లవలెనని గడప దాటి గుమ్మాలు దిగుతూవుంటే— ఎదురుగా సిద్ధం యీపాడుపిల్లి. నేనిలాగంటే యిదంతా మూఢవిశ్వాసం అంటారు దొరలు. ఆమాటకు వస్తే దొరలకిమాత్రం లేవా మూఢవిశ్వాసాలు? "దీనిమెహం ఈడ్చా, తెల్లారకుండా వచ్చి నా మొహంఎదట పడింది, ఈపాడుపిల్లి" అని మనం అఘోరిస్తే, వాళ్లు—అంటే ఇంగ్లీషు దొరలు—తెల్లారీటప్పటికి నల్లపిల్లిగానే కళ్ల ముందర పడ్డట్లయితే ఆవేళ ఏదోచక్రవర్తిత్వం వచ్చినట్లు సంతోషిస్తారు.

ఇదిమాత్రం మూఢవిశ్వాసం కాదూ? నట్టిగడ్డిబండి ఎదురుపడ్డట్లయితే తక్షణం కళ్లు మూసుకొని, ఒకకోరిక కోరుకొని, బండి పోయేదాకా కళ్లు తెరవకుండా వున్నట్లయితే ఆకోరిక తప్పకుండా సిద్ధిస్తుం దని వాళ్ల నమ్మకం—బండిమాత్రం కళ్లు మూసుకున్నప్పుడు మీదనుంచి పోకుండా వుంటే సరి.

గుండుసూది దొరికితే లాభం ఆరోజున. కత్తెర విడదీసివున్నది చూస్తే ఆరోజున కలహం. ఎవరేనా తుమ్మినప్పుడు మనము 'చిరంజీవ' అన్నట్లే, వాళ్లు "భగవంతుడు నిన్ను రక్షించుగాక," అంటారు. సోమవారం తుమ్మితే అపాయం. మంగళవారం తుమ్మితే కొత్తవాళ్లువస్తారు. బుధవారం వుత్తరం

నస్తుంది. గురువారం మంచిది. శుక్రవారపు తుమ్ము దుఃఖానహము. శనివారపుతుమ్ము వలన మరునాడు ప్రేయసి లభ్యమవుతుంది. లేవకముందు ఆదివారం తుమ్మినట్లయితే భోజనానికి ముందే నీమనోహారిణి దర్శనమిస్తుంది. ఇవి వాళ్లకొన్ని నమ్మకాలు. వాళ్ల మాటెందుకు మనకు? ఇంక మనపిల్లి సంగతి.

చిన్నతనంలో మా అమ్మ జోలలుపాడేటప్పుడు నాకు పిల్లిమీద గొప్ప అభిప్రాయం వుండేది. ఆ అభిప్రాయానికి కారణము పిల్లి యొక్క గొప్పతనమో పాట గొప్పతనమో నేను నిర్ణయించలేకపోతున్నాను. ఆపాటలు యిక్కడ రాస్తాను. మీరు నిర్ణయించగలరేమో చూచుకోండి.

౧. ఉళళ......హాయీా
హాయివారమ్మాయి నీళ్ల కెళ్లింది,
పాలైన యిచ్చావా ఓ కుక్కపిల్లా?
ఉళళ......పిల్లీ
పిల్లమ్మ వెళ్లింది పల్లెల్లు దాటి,
అబ్బాయి వెళ్లేడు రచ్చల్లు దాటి.

౨. ఉళళ......పిల్లీ
పిల్లి రావే తల్లి పిల్లల మర్రీ,
మర్రికిందా వాడు తొర్రి నాగన్న!
తొర్రినాగన్నకూ తోడెవ్వరమ్మా?
గుర్రాలు కాసేటి గురవడే తోడు.

3. పిల్లి వారింటికీ చల్ల కెడితేను,
అల్లవారీకుక్క భొంయి మన్నాది;
నా కాళ్ల గజ్జెల్లు ఘల్లు మన్నాయి;
నాచంకలో బిడ్డ కేరు మన్నాడు.

౪. హాయి హాయీా హాయి ఆపదలు కాయి
చిన్నవాళ్లను కాయి శ్రీవెంకటేశా
పిల్లమ్మ కన్నుల్లు బీర పువ్వుల్లూ,
అబ్బాయి కన్నుల్లు కలవ రేకుల్లూ;
చిన్నారి పొన్నారి చిరుతవే నీవు,
చిగురుమామిడికింద చిన్నకోయిలవు: హా.

నిర్ణయించలేకపోయినా యీ గొప్పతనం పాటదీ కాదు. పిల్లిదీ కాదు- మాఅమ్మదని నాదృఢాభిప్రాయం.

పిల్లిమీద అభిమానం వున్నా, లేకపోయినా, మాయింట్లో పిల్లికి మాత్రం నేను అన్నం తినేటప్పుడు ఒక్క మెతుకైనా విదపలేదు. మాకుర్రాడుమాత్రం కొంచెం అన్నం పెట్టేవాడు. నేను చూచి వూరుకునేవాణ్ణి. ఒకనాడు ఎంచేతనో కోపం వచ్చి, ఒక మెతుకేనా యింట్లో దొరకనిచ్చేను కాను. ఏలాగైనా రెండు మెతుకులు పొట్టలో వేసుకోవాలని పిల్లి ప్రయత్నించిందిగాని లాభంలేకపోయింది. అది వెళ్లిపోయి కొంత సేపటికి వాళ్లమ్మను తీసుకువచ్చింది. వాళ్లమ్మతో పిల్లి అన్నం పెట్టడంలేదని ఫిర్యాదు చేసింది కాబోలు. అది సంగతి సందర్భాలు కనుక్కుందామని వచ్చి వుంటుంది. వాళ్లమ్మతో ఫిర్యాదు చెయ్యడం యిది మొదటిపర్యాయం కాదు. వాళ్లమ్మ మా యింట్లో దాన్ని ప్రవేశపెట్టిన కొత్త ప్రియాన్ని పిల్లిపిల్ల మా పసుపుచుట్టలమీద పండుకునేది. వాళ్లమ్మ మా యిల్లు అంతా శోదాచూచి యిక్కడ పండుకుంటూవుండు, యిప్పుడిప్పుడు యీయీ వస్తువులు తింటూ వుండు, అని నీతిబోధలు చేసి వెళ్లిపోయింది.

ఆ రీతిగా అది పండుకుంటూవుండేది. ఒక నాడు నేను పరుపు తీసుకోవలసివచ్చి పరుపు చుట్టమీద చెయ్యివేతును గదా వెచ్చగా మెత్తగా ఏమిటో తగిలింది. ఇదేమిటి చెప్మా అని, దీపంతీసుకువచ్చి చూసేసరికి యీవెధవ పిల్లి ముడిచిపెట్టుకు పండుకుంది. చాలాకోపం వచ్చింది నాకు. కర్ర చేత్తోపుచ్చుకు తరమడం మొదలుపెట్టేను. హోరునవానకురుస్తోంది బయట. ఎలాగైతే నేమి యింట్లోంచి వానలోకి కొట్టేశాను. మరునాడు తగవుతీర్చడానికి వాళ్లమ్మ వచ్చింది పిల్లను వెంటబెట్టుకుని. రెంకుపిల్లులూ యిల్లంతా చూచుకున్నాయి. వాళ్లమ్మ వెళ్లిపోయింది.

ఇంకోమారు ఏమి జరిగిందంటే.——

సాయంకాలం అవడంతోటే పాలవాడు చిన్నచెంబుతో పాలిచ్చి వెళ్లిపోయాడు. ఆ



చెంబుతోనే పాలుకాచి అవి భోజనానంతరం తాగి మేమంతా విశ్రమిస్తున్నాము. ఇంతట్లోకే ఏమూలనుంచో పిల్లిపిల్ల వచ్చి చెంబును సమీపించింది. అంచులు, ప్రక్కలూ జాగ్రత్తగా నాకింది. ఒకకాలు చెంబుమీద పెట్టి లోపలచూచి నెమ్మదిగా తలదూర్చి, లోపల కూడా నాకడం ప్రారంభించింది. పూర్తిగా నాకివేసిన తరవాత తలతీసుకోవడానికి తలమెత్తింది. తలతోకూడా చెంబు లేచింది. చెంబు నేలను కొట్టింది. మళ్లీ తలమెత్తింది. చెంబు మళ్లీ లేచింది. పిల్లికి గాభరాపుట్టింది. రంయి రంయి మని చెంబు నేలను కొట్టుతూ యిల్లంతా పరుగెత్తడం ప్రారంభించింది పిల్లి. మా అమ్మాయి కేరుమని ఏడవడం ప్రారంభించింది. మా అబ్బాయీ, తల్లీ మంచంమీద కెక్కి నిలబడ్డారు. వుమ్మరావులవంటి మొగా

ళ్లము మేమిద్దరం దానివెనక పరుగు దొరకిం చుకున్నాం. మాకు దొరికితేనా అది. అది ముందూ మేం వెనకాను. "తలుపులేనా తీసే య్యండి బయటికి పోతుందేమో" అంది, నా భార్య. "చెంబుమాటేమిటి"? అన్నాను నేను. "పిల్లి బ్రహ్మహత్య వస్తుందేమో"! అంది నా భార్య. టక్కు టక్కున నేలమీద చెంబు కొట్టుతూ ముందరకు వెనక్కు, పక్కలకి, ఎగరడం, దూకడం, గెంతడం —— ఇల్లంతా అల్లకల్లోలం వైంది. పట్టుకుని తీసేద్దామంటే మాకుదొరకడం లేదు. ఏమిసాధనం? "అయ్యో అయ్యో! లాంతరు దీపం పడగొట్టింది. చెంబు దాన్నేసికొడుతోంది. చూస్తూ వూరుకుంటా రేం"? వూరుకోక ఏమిటిచేసేది?

వెనకటికి ఒకయిల్లాలు యింట్లోకి తేలు వస్తే "చూస్తూ వూరుకుంటా రేమిటి? మొగాళ్లనేనా పిలుచుకురాకూడదా" అందిట భర్తతో! "నాన్నా, నాన్నా, నాపలకనేసి కొడుతోంది చెంబు" అన్నాడు మావాడు. మాఅమ్మాయి ఏడుపు విడవడం లేదు. పిల్లికి గాభరా ఎక్కువైపోతోంది. దానిమనస్సులో ఏమేమి వూహాలు పరుగువారుతున్నాయో గ్రహించడం కష్టం. మగవాళ్లం మేమిద్ద రమూ పంచకట్టు బిగుంచుకున్నాం. రెండు వేపులా కాసేము.

"పట్టుకో"

"పట్టుకో"

మమ్మల్ని తప్పించుకొని చెంబుము ఖంతో పిల్లి నడవలోకి వెళ్లింది. మేము నడవ లోకివెళ్లేము. "ఈమాటుఅలాకాదోయి, జం బుకానా తీసుకురా" అన్నాను.

జంబుకానా తీసుకు వచ్చి రెండు వేపు లాయిద్దరమూ పట్టుకొని దానిమీదఒకమారు కప్పినాము. పిల్లికి కొత్తగాభరా పుట్టింది. చెంబు తీవ్రంగా నేలను పెట్టికొట్టుకోంది. గోళ్లన్నీబయటకు తీసి బరుకుతోంది.

జంబుకానామీద చేతులు వేసి దానిని అదిమిపట్టినాను నేను. మావాడు నెమ్మదిగా జంబుకానాఎత్తుతూ-చెంబు ఒక్కమారు లాగి నాడు. చెంబు జారిపోయింది.మళ్లీ చెంబు నెమ్మ దిగా పట్టుకుని చుట్టూరా తిప్పి లాగినాడు. లాగి చెంబుతో కూడా ఒక్కమాటు మంచం ఎక్కేడు. పిల్లి ఒక్కగంతువేసి పారిపోయింది. పోయి తల్లితో ఫిర్యాదు చేసింది.

మరునాడు తల్లీ పిల్లా మళ్లీవచ్చారు. మావల్ల ఏమితప్పూ లేదుకదా, అని తల్లి గ్ర హించింది కాబోలు, మమ్మల్ని ఏమీ అడగ కుండా యిటూ అటూ తిరిగి పోయింది. పోయి పిల్లిపిల్లకు నీతి వుపదేశంచేసివుంటుంది:

"అన్నం లేదని వాళ్లమీద ఫిర్యాదు చేసే బదులు—ఎలకపిల్లల్ని పట్టుకుపోరాదా" అనీ —"పరుపుచుట్టమీద పండుకో నియ్యక పోతే వెచ్చగా వుంటుంది పొయ్యిపెడలో పడుకోకూడదా, యీమాత్రందానికి నాతో ఫిర్యాదు చెయ్యాలా, ఎప్పటికప్పుడు యిలాగ నేను నీతులు చెప్తూవుంటేనే ప్రపంచంలో నెగ్గలేకుండావున్నావు. నేను లేకపోతే ఏమి చేద్దువో"అనీ—"వెధవసంత వచ్చింది ఎంతవర కని సర్దుకురా"ననీ ఏమోమో అనివుంటుంది, బహుశా మమ్మల్నందరినీ అదితిట్టిందేమోఅని కూడా నా అనుమానం. చెంబువిషయంలో

ఏమి నీతి నుపదేశించిందో తెలియలేదు. ఎంచేతనంటే మరునాటినుంచీ యథాప్రకారం పాలచెంబు నాకడం అది ప్రారంభించింది కాని దానితలమాత్రం మళ్లీ చెంబులో చిక్కుకోలేదు.

ఇంతకే, యింతఅనుభవమైన తరువాత మళ్లీ, నీతివున్న పిల్లైతే, మాయింటికి రాదనుకున్నాను. ఈ పిల్లివిషయమై నాకు మంచి అభిప్రాయంపోయింది. నీతిలేకపోయాక ఇంకబతకడం ఎందుకు? చెంబుగొడవ తలచుకొని మాయింటికి యీపిల్లి రాదుగదా, అనుకుంటూంటే నాకు ఆశాభంగమైంది. పిల్లి మళ్లీ యింటికిరాకుండా చెయ్యడానికి ఒకవుపాయముందని నాస్నేహితుడొకడు నాతోరహస్యంగా చెప్పినాడు. జాగ్రత్తగాపిల్లిని పట్టుకొని దానిని ఒకకుండలో పెట్టవలెనట. ఆకుండమూతి కట్టివెయ్యవలెను. తరవాత జాగ్రత్తగా ఆకుండను యింటికప్పుమీదకు తీసుకవెళ్లవలెను. ఆ కుండను ఆ కప్పుమీదనుంచి దొర్లించవలెను. కుండదొల్లిదొర్లి ఒక్కమారు గంయిమని కిందబడి ధమ్మమని పగులుతుంది. పిల్లి మళ్లీయింటికిరాదు. ఈవుపాయం చాలామంచి దని నాకుతోచింది. ఏమంటారా?—మొదట చీకటికుండలో కదలలేక మెదలలేక కూచోవడం—తరవాత కుండదొర్లుతూన్నప్పుడు, భూకంపం వచ్చి భూమి అల్లల్లాడిపోతున్నట్లు గొడవా, ధ్వనీ, గిర్రుగిర్రున కుండలో పిల్లిమంత్రాలూ,—తరవాత గాలిలోంచి పడడం—అలాగ పడేటప్పుడు, శబ్దమూ, దొర్లడంఆగి, ఒక్కమారు శ్శబ్దంగా, అప్రయత్నంగా,ఎక్కడకోపాతాళలోకానికి పోతూన్నట్లుండడమూ— తరవాత పిడుగు పడ్డట్లు ధామ్మని శబ్దమూ, — కుండపెంకులూ, చీకటిలోంచి ఒక్కమారువెల్తురూ—ఈఅనుభవాలన్నిటివల్లా పిల్లికి మతిపోయి తీరుతుంది. మళ్లీ ఎప్పుడు మీాయింట్లో అది కాలుపెట్టదు.

ఈ సలహాప్రకారం చెయ్యవలె నని నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. కాని ఏనాటికానాడు, మాయింట్లోపిల్లి పెద్దదై, మమ్మల్నందరినీ నిర్లక్ష్యభావంతో చూడడమున్నూ పట్టుకోబోతే తిరగబడికరవబోవడమున్నూ—చేస్తూవుండడంవల్ల దానిని పట్టుకోవడం మాత్రం చాలాకష్టంగావుంది. పిల్లికి విశ్వాసం లేదు మొత్తంమీాద. పుట్టినప్పటినుంచి మాయింట్లో అన్నం తిని బతుకుతూ, మా యింట్లో ఎలకలను తిని పెరుగుతూ, మేము పట్టుకోవాలంటే దొరక్క పోవడంకన్న అవిశ్వాస మేమిటి?

కుక్కపిల్ల అలాగ కాదు. ఎప్పుడు పట్టుకోవాలంటే అప్పుడు దొరుకుతుంది పాపము. ఈ ప్రయోగం కుక్కపిల్ల విషయంలో చేద్దును కాని—కుక్కలనుచూస్తే నాకు కోపమని చెప్పనే చెప్పేను మొదట.

---

# వికృత గాథలు

నిడుమోలు కనకసుందరము గారు, బి. ఏ., (ఆనర్సు)

## ౧. విషాదుడు.

మార్గశిర బహుళ యేకాదశినాఁడు నాకొక యుత్తరము చేరినది. దాని నంపినది నాబాల్యస్నేహితుఁడగు విషాదుఁడు. అతని భృత్యుఁడగు వాహనుఁడే యా లేఖను నాచేతి కందిచ్చెను. దానిఁ జదువుకొనక పూర్వమేఁ నా మిత్రుని క్షేమవృత్తాంత మెఱుంగఁగోరి యాతని బలుకరించితిని. వాఁడు కన్నెత్తి నన్నుఁ జూడలేదు. పల్లెత్తి నామాటకు సమాధానముఁ జెప్పలేదు. రెండు చేతులను జోడించి నాకు నమస్కరించి వాఁడు తటాలున వెనుకకుఁ దిరిగి నాగృహాంగణము దాఁటి పోయెను.

ఈ చర్య నాకుఁ గడువిపరీతముగఁ దోఁచినది. వాఁడు ప్రాకారద్వారమును గడచి నా దృక్పథమునుండి తొలఁగి పోవువఱకును రెప్ప వాల్పక వానివంకనే చూచితిని. విస్మితుఁడనైతిని. ఆ యుత్తరమును విప్పినప్పుడు నా హస్తములు ప్రకంపితములైనవి. దానిఁ జదువ మొదలిడఁగనే నా గాత్రము పులకాంకితమయ్యెను.

'మిత్రమా!

'నా విశాలాంగణము శ్మశానమువలె నున్నది. గ్రంథసంచారులగు వ్యక్తులు భూతప్రేతములు. వీణానిస్వనములు ఆర్తారవములు. చిత్రవిచిత్రసమన్వితమగు బీభత్సమూర్తి నా మనోవీథియందు నిరంతరము తాండవమాడుచుండును. నాకు శాంతి లేదు. నా యాశాపాశములు త్రుటితములైనవి. ఆవేదన యపరిమితమైనది. దౌర్బల్యము హెచ్చుచున్నది. జీవితముపై వాంఛ తొలఁగిపోవుచున్నది. వినాశము సమీపస్థమైయున్నదని భయము కలుగుచున్నది.

'వాత్సల్యబంధములతో నాకుఁ గట్టఁబడిన జీవితము లన్నియుఁ జెల్లినవి. నా యజ్ఞానము దుర్భరముగ నున్నది. మిత్రసత్తముఁడవగు నీ దర్శనము నభిలషించుచున్నాను. ఈ కష్టసమయమున నీవు నాకోర్కె నెరవేర్పఁ జాలకున్న, గోహత్యామహాపాతకమునకుఁ బాత్రుఁడ వగుదువు. నీ నిర్దాక్షిణ్యస్వభావమును చిత్రగుప్తుఁడు గుఱుతింపకపోఁడు. దయయుంచి తప్పక రమ్ము.

విషాదుఁడు.'

చదువుట ముగియఁగనే యా కాగితమప్రయత్నముగ నాహస్తములలోనుండి జాఱి నేలపైఁ బడినది. కండ్లు చీఁకటులు గ్రమ్మినవి. ప్రపంచముయొక్క తీవ్ర సంచలనము నాకపుడు ప్రత్యక్షముగ దోఁచినది............ నా మిత్రుఁ డెపుడు వికారభావోన్మాది

యయ్యెనో నాకుఁ దెలియదు. బాల్యమున, సహపాఠులమై సంచరించినకాలమున, నాతఁడు చింతానిమగ్నమానసుఁడై యుండి యనవరతము విచారతరంగముల నోలలాడుచుండెడివాఁడనుట నిజమే. సంసారయాతనానుభవరహితులై సుఖాదర్శావేశులైన యుత్సాహవంతులగు బాలకులకు దూరస్థుఁడై నిర్జనారణ్యపథముల నాతఁ డేకాకియై తిరుగుచుండెడివాఁడే. ఆగర్భశ్రీమంతుఁడల్లరిపిల్లలతో నాడుకొనుట యవమానకరమేమో యనుకొనెడివారము. పాఠశాలను విడిచినపిదప, అపరగిరినగరాంతఃపురములందు మామిత్రుఁడుసుఖముగఁగాలము గడపుచుండె ననుకొంటిని. కడచిననాలైదు సంవత్సరములనుండియు నాతని సమాచారములు నాకుఁ దెలియుటలేదు. కాని యీ వికారభావప్రదర్శనమువలన నా శిరముపై నొకపిడుగు బిట్టరచిన ట్లయ్యెను. నాపాదముల కడఁ బడియున్న యాకాగితముఁ జూచుచు, నిశ్చేష్టితుఁడనై యొకించుకసేపు కూర్చుంటిని. అందలియక్షరములు రక్తముతో రచింపఁబడినటులసోహముకల్గినది. దుశ్చింతఁ బాసి గుండె పదిలపఱచుకొంటిని. అపరగిరికిఁ బ్రయాణమొనర్చుట సాధ్యమా యని యోజించితిని. నామిత్రుని శాపవచనముల నింకొకసారి తలపోసితిని. తత్క్షణమే బయలుదేఱుట యసాధ్యము. అమవసతిథి విశ్రాంతిదివసము. ఈలోపుగ నామిత్రునిసందర్శింపఁజాలను. సమాధానమంపుదమన్న వాహనుఁడంతర్హితుఁడయ్యెనే!

అమవసనాఁడు తెల్లవాఱుజామున నే కాకఘోషములకు మేల్కాంచితిని. ఉడుగణములచే విరాజిల్లవలసిన వినీలాకాశ మపుడు సంక్షుభితమేఘాచ్ఛాదితమై నిబిడాంధకారపరివృతమై యుండెను. సేవకుఁడు నాయశ్వము ప్రయాణమున కాయత్తపఱచి తెచ్చి యుండెను. నా ప్రియవాహకుని మెడలు నిమిరి, కళ్లెముత్రాళ్లఁ బట్టుకొని, యొక్కయూఁపున దాని నవరోహించితిని. గుఱ్ఱము బిగ్గరగ దగ్గినది. సమీపమున నున్న వృక్షము పైని వసించు కాకము లొక్కసారిగ "కావు కావు" మని యఱచుచు, నా శిరమునకు మీదుగా నెగిరిపోయినవి. వాజు ముందడుగిడ లేదు. వెనుక వెనుకకు నడచినది. కొరడాతో నొకటిరెండుచుఱుకుదెబ్బ లిడి వాజు నొప్పించితిని. అంత నది ముందునకు దుమికి పరుగెత్త సాగెను. ఘూక మొండు భయంకరముగ గూసినది. నా మిత్రుని దురవస్థను దలచి కుందెడి నాహృదయము ఈ యశుభసూచకములచే మరింత బరువెక్కెను. శిలామయమగు రాజమార్గమున మహావేగమున గదలెడి వాజు యొక్క గిట్టలచప్పుడుతో లయ గలిపి నా గుండెలు దడదడ కొట్టుకొనుచుండెను.......
తెల్లవాఱినది. కాని యంశుమంతుఁడు దృగ్గోచరుడు కాలేదు. కారుమబ్బు లాకసమున దట్టముగ గ్రమ్మినవి. భూనభోంతరములకు తమోవిముక్తి లభింపలేదు. ఒకచిన్న గుట్టను చుట్టి పోయి మలుపుదిరుగగనే అపరగిరి నాదృక్పథమున గోచరించెను.

అంధకారబంధుర మగు నర్ధరాత్రమున గంగానదీమహాప్రవాహముల దేలిపోయెడి యోడ తెరచాపవలె—యమపురి సామీ

శ్యము జేరిన యైరావతమువలె — వికార స్వరూపుడగు మహాపాతకి మైలబొట్టువలె— నల్లని కాగితముపై జిత్రింపబడిన మృత్యుదేవతాప్రతిమవలె — కారు మబ్బులలముకొనిన యపరదిశను గన్పట్టెడి యాసమున్నత ధవళప్రాసాదమే నా మిత్రుని నివాసము. దీర్ఘయానముచే డస్సియున్న యశ్వము నొక్కసారి యదలించి, భయవిహ్వలతచే గ్రుంగుచున్నమది నొకించుక దిటపఱచుకొని అపరగిరి నగర ప్రదేశ మొనర్చితిని. అరుణచ్ఛాయా చిత్రితములగు నాప్రసాదగవాక్షద్వారములు, శ్వేతరాక్షసుని రక్తసిక్తములగు దంష్ట్రలవలె భీతావహములై యుండెను. వీటి కన్నిటి కేమిగాని, గంభీరమగు నా కట్టడము నట్టనడుమను బీటువాఱియున్నట్లు నాకువిస్పష్టముగ పొడగట్టెను. ఆ ప్రసాదముఁజుట్టియున్న గంభీరమగు కందకమందలి నిశ్చలోదకములందు దాని ప్రతిఫలముగాంచి, నే నులికిపడితిని. నాయశ్వమైనను ముందున కడుగిడ లేదు. సింహద్వారముకడ నొక్కభృత్యుఁడైనను లేడు. చేరువనున్న తరుకాండమునకు రాజును గట్టివైచి ద్వారబంధమునుండి వ్రేలుచున్న ఘనశంఖము రెండుచేతుల నెత్తి, నోట నూని దీర్ఘోచ్ఛ్వాసము దీసికొని, మరల నాసశ్వాసముతో దానిం బూరించితిని. కింకరునిబోలె నా పాదమస్తకము నల్లని దుకూలముల ధరించిన సేవకుఁడొకడు,నన్ను దన వెంటరమ్మని చేసన్న జేసి లోనికి బోసాగెను. నేనును వాని వెంటనే పడి, దుర్గంధయుతములగు ప్రాంగణములగడచి వెనుదిరిగి చూడక నొక యరగడియకాలము గడచిపోయితిని. తుద కాసేవకు డొకగది ద్వారమును తెఱచి త్రోసి ప్రక్క కొదిగి నిలిచెను......వాని యుద్దేశ్యము గ్రహించి నే నాగదిలో బ్రవేశించితిని. ఆ చీకటిగది యందు నల్లనిగుడ్డచే గప్పబడిన బల్లకు బైగా వాలిపోయిన ముఖమున గుంటలు పడిననేత్రద్వయము నన్నెదుర్కొనినవి. ఆ కన్నులలో నుండి బయల్వెడలిన యదృశ్యములగు తీక్ష్ణశరములు రెండు నా హృదయమున గాటముగ గ్రుచ్చుకొనినవి! ఈ నాల్గు సంవత్సరములలో నా మిత్రు నావహించిన మార్పు వర్ణనాతీతము......విషాదుఁడు నా కెదురుగ లేచి వచ్చి, ననుగౌగలించుకొని, శిరమును నా భుజస్కంధమున నానించి, పొంగి పొరలి వచ్చెడి దుఃఖమును దిగమ్రింగుచు నస్రుజలముతో నా యుత్తరీయముఁ దడిపివైచెను. నేనాతని మెల్లగ నడిపించుకొని, ధూళిధూసరసమాశ్రిత మగు సెజ్జపై జేర్చితిని. అవ్యక్తము లగు నాతని సంభాషణములవలన సుకుమారగాత్రయగు నాతని యనుంగుసోదరి పరలోకప్రాప్తి నందినదనియు, నొకప్పుడు ఫలపుష్పశోభితమగు ఉన్నతవంశవృక్షమున నిప్పుడు విషాదుడేకాకియై యొంటిగ మిగిలి యుండెననియు గ్రహింపగలిగితిని. ఆతడు సోదరిమృతకళేబరమున కగ్నిసంస్కార మొనర్పక, దాని నొక లోహపేటికయందు గుప్తపఱచి యా గృహమునందే యొకగదిలో నుంచెనట. నే నాతని దుఃఖోపశమన మొనర్చుట కుచితరీతిని మాటాడితినేగాని, యాతని సమాధానముల వినినకొలది, నాతని ము లక్షణములను పరిం

కించినకొలదిని, విషాదుని మరల మానవ మాత్రునిగా జేయుట యసాధ్య మను నిరాశ ప్రబలమయ్యెను............ఆ రాత్రి విశ్ర మించుటకు స న్నొక శయనమందిరమునకు జేర్చిరి కాని పరస్థలమగుటవలననో, నా హృద యము నావహించిన విపరీతాందోళనమువల ననో, ఆ రాత్రి నా కన్నులు మూతవడ లేదు. మృత్యుదంష్ట్రల జిక్కి యున్నవానివలె వికృత రూపుడై శల్యమాత్రావశిష్టుడై యున్న విషాదుని మూర్తియు, నాతని సోదరి ప్రేత స్వరూపమును, ఆ సౌధమున కామూ లాగ్రము వ్యాపించి యున్న నెఱియయు నొకటి వెనుక నొకటి నా మనోవీథియందు సంచరించుచు, నా నిశాసమయమున నాకు విశ్రాంతిః దక్కనీయ లేదు... ..ఇంతలో నా గదిద్వారమును దటాలున దెఱచుకొని విషా దుడు లోన బ్రవేశించి "చూచితివిగదా?— నీవు—చూచితివిగదా?" యని వికలస్వరమున నఱచుచు నన్ను గౌగిలించుకొని యొక గవాక్ష ద్వారముః దీసెను. ఆ సమయమున నాకస మంధకారబంధురమై యతిభయంకరముగ నుండెను. కారుమబ్బులా సౌధశిఖరముల మ్రింగుచున్నట్లుండెను. అసంఖ్యాకములగు తారకాగణములలో నొక్కటేనియు దృగ్గో చర మగుట లేదు. "బాగు. బాగు. అస్వస్థుడ వగు నీకీగాలి సరిపడదు! గవాక్షములమూయ నిమ్ము. సద్గ్రంథపారాయణ మొనర్చుకొందము రమ్ము" అనుచు నే నాకవాటమును బంధించి విషాదుని శయ్యపైకి జేర్చితిని. అంత నట బడి యున్న యపూర్వగ్రంథము నొండెత్తికొని దాని నిట్లు చదువ నారంభించితిని:

'క్షుద్బాధాపీడితుం డగు పద్మార్కుం డా మాని నివాసంబునకుం జని, ద్వారబం ధంబునఁ గరాఘాతంబు సేసి బిట్టఱచిన సమాధానంబు రాకునికి...... యొక్క ముష్టిఘాతంబున నా శిథిలద్వారముం దుని యలుగా నొనర్చి లోనం బ్రవేశించి'...

నే నావాక్యము జదువుట ముగింపగనే యొక తలుపు తటాలున దెఱచుకొనినట్లు మాకొక శబ్దము వినవచ్చెను. నేనింక నిట్లు జదువుచునే యుంటిని:

'లోన మానిం గానక విస్మితుండై నల్దిశల బరికించి, సక్రోధ మగు మహోరగము తనపై గవియుచుండుట గమనించి, నిజ గదాదండంబుచే దాని మడియ నేసె'

అప్పుడే మా కొకమహాధ్వని వినిపించి నది. విషాదుడు గడగడ వణకసాగెను. కతిపయ నిమేషములు గడవగనే, యాతని సోదరి తూలుచు నడచివచ్చి ద్వారబంధము నాను కొని నిలిచియుండెను. "నే ననుకొనినదంతయు జరిగినది! పద్మార్కుడు గుహలో బ్రవేశించు టయే నాసోదరిపేటికలోనుండి బయల్వెడ లుట— పద్మార్కుడు మహోరగమును మడియవ్రేయుటయే నా సోదరి యా గది ద్వారమును బలవంతముగ దెఱచుకొనుట.— ఆహా! నేను మందభాగ్యుడను. ఆమెను జీవ ములతో సమాధిలోనికి జేర్చితిని!" అని యఱచుచు నాతడు రిక్కవైన సోదరికడకు బరు గెత్తికొనిపోయి యామెను గౌగిలించుకొనెను.

సోదరసోదరీమణు లిరువురును మూలచ్ఛేదిత కదళీవృక్షములకరణి నొక్క క్షణములో నేల గూలిరి!—నిర్జీవులైరి! ......నే నిక నచ్చట నిలువలేదు. భయకంపితగాత్రుడనై కటిక చీకటియందు కండ్లు గానకున్నను, సోపాన పరంపరల నొకటివెనుక నొకటి దాటి పాఱి పోవుచుంటిని. నే నెంతో దూరము గడచి పోవక పూర్వమే, యా గృహమందలి చీకటి విచ్చిపోవుచుండెను. అందులకు గారణ మరయుచు, శిర మెత్తి చూడగ నా సౌధోపరి భాగము రెండుగ విడిపోవుచున్నట్లుండెను. నేనిదివఱ కందుగాంచియుండిన నెరియ క్రమ క్రమముగ బెద్ద దగుచుండెను. ఆకసమున నూర్ధ్వబిందుప్రాంతములందు మృగవ్యాధుడు ప్రకాశవంతముగ వెలుగుచుండుట గాంచితిని. ప్రాణాశచే జనించిన యోపికచే మఱింతతీవ్రముగ బరుగెత్తి—ఆ సౌధరాజము సోదర సోదరీమృతకళేబరములతో కందకజలముల గలియకమునుపే—బయటబడితిని.

---

# పు రో గా మి

## పెద్దిభట్ల పూర్ణశర్మగారు (సాహితీసమితి సభ్యుడు)

“ఎచటి కేఁగుచునుంటి వోయీ
యాగభీరనిశీథమందున!
ముందు వెనుకల తోడు లేరే
యెందుఁ బోయెదవు?
చదలఁ గ్రమ్మెఁబయోధరమ్ములు
తమము లెల్లెడ నల్లికొనియెను
ఉల్లమును బిగఁబట్టి యెచటికి
వెళ్ళుచున్నావు?”

“ మెఱపుకాంతిని గాంచినంత నె
పరమహర్షము చెంది పొంగను
కారుమబ్బులు గాంచి మదిని వి
చారమును జెందన్.
“ నడచుచుందును ముందునకు నే
నడచు చుందు నిరంతరంబును
ముందు వెనుకలఁ గూర్చి చింతన
జెందమున లేదు! ”

---



# చిత్రలేఖనము

భమిడిపాటి రామసోమయాజులు గారు

## 2. వెలుఁగునీడలు; రంగులు; ఆకారము; వస్తుతారతమ్యము; దూరము.

ప్రపంచమున వస్తువులు కానవచ్చుటకు నే గుణములు వస్తువుల నాశ్రయించి మనకుఁ దోఁపడుచున్నవో, అవియే, చిత్రకారుఁడు చిత్రమందుఁ జూపించి, ప్రకృతి స్వభావానుగుణముగ నుండునట్లుచేసి, చూచువారి కానందము గొల్పుచున్నాఁడని, యిది వరకు జెప్పఁబడినది. ఇందు నాగుణములెవ్వియో, అవి యేతీరున జిత్రకారునికిఁ దోఁపడుచున్నవో క్లుప్తముగాఁ జర్చింపవలయును.

మానవదృష్టికి వెలుఁగు మూలాధారము. వెలుఁగు లేనిదే మనదృష్టి కవకాశము లేదు. అటులని, వెలుఁగొక్కటే ప్రపంచమంతటను నిండుకొనియున్నయెడల వస్తువులు మిక్కిలి బాగుగానగుపడునని చెప్పుటకు వీలు లేదు. విశేషమేమనఁగా, నట్టియెడ వస్తువులు బొత్తుగా కానరావు. ఇది సృష్టిరహస్యము. ప్రాణవాయువు ప్రపంచమందు జీవనాధారమై యెల్ల జీవులకు బ్రదు కిచ్చుచున్నను, సర్వప్రపంచమును గ్రమ్మి యొక్కప్రాణవాయువే యున్నపట్టున జీవులన్నియు నశించును. అట్లే నీడకూడ వెలుఁగుతోపాటు ప్రపంచములో నుండినగాని వస్తువులు గోచరింపవు. ప్రతివస్తువునందును కొంత వెలుఁగును కొంతనీడయు నావరించియుండును. ఒక్కొకప్పుడు వెలుఁగును, మరియొకప్పుడు నీడయును, వస్తువులకు హెచ్చుగా నుండును. ఇంటిలోపలిగదిలోఁ గూరుచున్న మనుజునిశరీరముపై నీడ హెచ్చుగానుండును; వెలుఁగు తక్కువగా నుండును. ఆమనుజుఁడే, బయట నిలచియున్నప్పుడు వెలుఁగు హెచ్చుగను నీడ తక్కువగను గానిపించును. మొత్తము

పై నొక విషయము మాత్రము నిశ్చయము: వెలుఁగు చీకటుల కూటమి లేని వస్తువు లేదు.

ఒకబంతిపై వెలుఁగు పడుచున్నది. కాని, బంతికంతకును పడలేదు. దానిలో కొంత భాగముపైననే పడుచున్నది. తక్కుంగలయర్ధ భాగమును జీకటి కప్పియున్నది. భూమిపై రాత్రింబవళ్లు కల్గుట కీన్యాయమే కారణ మగుచున్నది కాదా? గవాక్షము తెఱచి యున్నగదిలోని వస్తువులపై, నా గవాక్షము నైపునఁగల భాగములపై వెలుఁగును,తక్కిన భాగములపై నీడయుఁ బడును. లతలు చెక్కిన పాత్రపైన వెలుఁగునీడలు పడుచున్న వను కొందము.అప్పుడు వెలుఁగుపడుచున్న భాగము నందు గల లతలు స్పష్టముగా మన కంటికి గానిపించును. నీడలోని లత లంత బాగుగా కానరావు. నీడ మిక్కిలిగా నున్నప్పుడు బొత్తుగా కానరావు. వెలుఁగు మిక్కిలిగా నున్నను గానరావు. కాలుచున్న యినుప బంతిపై లతలున్నను, లేనట్టులే యెఱ్ఱనిముద్ద వలె గానుపించును. చీకటిదట్టముగా నున్న గదిలోఁ గూడ నాబంతికాని లతలు కాని కానరావు. విపరీతావస్థలు సమానములే. (Extremes are alike)ఇది వెలుఁగునీడలయొక్క స్వభావరహస్యము.

వస్తుఘనస్వభావము, వెలుఁగు నీడల సాహాయ్యముననే కానవచ్చుచున్నది. గుండ్ర ముగా కత్తిరించిన తెల్ల కాకిత మొకటియు, దానితో సరియగు చుట్టుకొలత గలిగిన తెల్లని బంతి యొకటియు, వెలుఁగునీడలచే నొసంగఁ బడు మార్పు లేకున్న, నొకే తీరున మనకగు పడవలసినదే: కాని ప్రకృతిలో నారెండు వస్తువులు గోచరించుటలో భేదము దెలియు చున్నాము. అందులకుఁ గారణమేమి? బంతి పై నొకప్రక్క వెలుఁగును వేఱొకప్రక్క నీడయుఁబడుచున్నది. పలుచనైనట్టి యాగుండ్రనికాగితముపై నట్లుకాక, వెలుఁగొక్కటే పడుచున్నది. అనఁగా, పలుచనై, సమమట్ట ముగా నుండుకాగితము మున్నగు వస్తువులపై వెలుఁగుగాని నీడగాని యొక్కటే పడఁగలదు. బంతియట్లుగాకకొంత ఘనతగల్గిముందునకుబ్బ కొనియుండుటంబట్టి, వక్రగతి లేని వెలుంగు టమ్ములు, దానిపై నంతటను పడుట కవకాశ ములేకుండుటచే, తమతిన్ననిదారి కడ్డువచ్చు భాగముపైననే పడుచుండును. వెలుఁగు లేని భాగము చీఁకటిగానుండును. చీఁకటియనునది, వేఱుగా నొకపదార్థము గాక, వెలుఁగులేమి యే యైయున్నను, దానికి గూడ వెలుఁగు నకుఁగల ప్రాముఖ్య మున్నది. కామెరాయం త్రముతోడ ఫొటోగ్రాఫులఁ దీయుట యీ వెలుఁగునీడలవలననే జరుగుచున్నది. చిత్ర కారుఁడు ప్రకృతిలోనవలెనే, వస్తువులకుఁ దన చిత్రమున, వెలుఁగునకుఁ దెలుపును, నీడకు నలుపును వేసి, నిజవస్తుస్వభావమును జిత్ర మునకుఁ గలిగించుచున్నాఁడు.

ప్రతివస్తువునకును నెల్లప్పుడును, విధిగా నొక ప్రక్క వెలుఁగును రెండవప్రక్క నీడ యునై యుండు ననియును జెప్పరాదు. ఒక గదికి వెలుఁగువచ్చుమార్గములు నాలుగున్న వనుకొందము. అట్టియెడల నాగదిలో మధ్య నున్నవస్తువుపై నాలుగు ప్రక్కలనుండి వెలుఁ

గుపడును. అట్టియెడలఁ జీకటియుండునా, యుండదా యని ప్రశ్నింపవచ్చును. అప్పుడైనను నీడయుండును. కాని చాల స్వల్పముగాఁ గానవచ్చును. నాలుగు ప్రక్కలనుండియు పడుచుండిన వెలుఁగులుగల నాలుగుస్థలములలో, వెలుఁగుప్రక్కకును వెలుఁగుప్రక్కకునుమధ్య స్వల్పమగునీడ, నీతవలెం గానగును. అందుచే వెలుఁగునీడలు ప్రపంచమున నీవస్తువున కీతీరున, నీస్థలమున నీతీరున నుండునని ముందుగాఁ జెప్పుట కవకాశము లేదు. వెలుఁగులు పడు సందర్భముల ననుసరించి వస్తువులకు నీడలు కల్పింపఁబడుచుండును. వెలుఁగెంచుకొని యాక్రమించుకొనఁగా మిగిలిన భాగమునను నీడ యాక్రమించుకొనును. సమయసందర్భానుసారములుగా వెలుఁగునీడలుమాఱుచుండును.

వెలుఁగునీడ లెట్లు ప్రకృతిలో నెల్లెడల వ్యాపించి యున్నవో, రంగులుగూడ నట్లే వ్యాపించియున్నవి. రంగు లనేకములు;అనంతములు. ప్రతివస్తువునకును స్వకీయముగాఁగాని ప్రతిబింబకారణమునఁ గాని, వెలుఁగు నీడల వలనఁ గాని, యేదియైన నొకరంగు, లేక, కొన్ని రంగులకూటము గలుగుచుండును. రంగులేని వస్తువు కంటికి గానరాదు.

తెలుపు, నలుపు, పసుపు, నీలి, ఎఱుపు ముఖ్యమగురంగులు. ఈ రంగులయొక్క యనంతములగు కూటములే అనేకరంగులుగా పరిణమించుచున్నవి.కంటికిఁగానవచ్చు నేరంగునైనను పైనిచెప్పిన యైదు రంగులయొక్క కాని, కొన్నింటియొక్క కాని, కూటమువలన జూపింపవచ్చును. ప్రకృతిలో నిట్టికూటముల ననేకముల మనము ప్రతినిముసంబును జూచుచున్నాము. ప్రతిక్షణము మనము తిలకించు నేల, యాకాశము,నీరు,అగ్ని, మున్నగాఁగల వానియం దన్నిటియందును, చాలరంగుల యొక్క కూటము కానవచ్చుచున్నది. ఆకాశము నీలవర్ణము గలదని పెక్కురు వర్ణించుచున్నను, ఎప్పుడో కాని దానియందు స్వచ్ఛమైననీలవర్ణముం జూడఁజాలము. మధ్యాహ్నకాలమున నాకాశము తెలుపు, నీలి, కలసి యొప్పును. సంధ్యాకాలములయందు నీలవర్ణము, పింగళవర్ణము, రక్తవర్ణము, సువర్ణవర్ణము, నింక వీనిలో ననేకకూటములు గలసి యొప్పును: సాయంకాలమునందు సూర్యుఁడస్తమించుసమయమున బ్రకృతిని గనుపెట్టినచో, అంధకారమగ్నమై భూమి గోచరము కాకుండునంతవఱకుఁ గానవచ్చురంగులకు, లెక్క యుండదు. ఆపశ్చిమాకాశ మొకరంగులగని; చిత్రములమూక; సొగసుల పుట్ట. ప్రతిక్షణము రంగులు మాఱిపోవుచునే యుండును. సౌందర్యము హెచ్చిపోవుచునే యుండును. చూచువారి యానంద మంతరహితమై మితిలేనిమెత్తునకుఁ దేలియాడిపోవుచునే యుండును! ఓహో, ఆసమయమున బ్రకృతిని దిలకించుటకు రెండుకన్నులు చాలునా ? చాలినను చూచి గ్రహింపఁ గల్గుటకు నవకాశ ముండునా?అల్పశక్తుఁడగు మానవుఁడు, తనచేతఁగామి మోమున రూపింపఁగా, భగవచ్ఛక్తి నతిభక్తిఁ బొగడు హృదయముఁ గలవాఁడై , నిస్వారపడవలసినదే కాని, మాటాడ నశమా? అట్టి మహాసౌందర్యము నొసఁగు

రంగులు ప్రతిదినమును గానఁబడుచుండును. అట్లని, యొకనాఁటి సొగసు మఱియొకనాఁడు లేదు; ఒకనాఁటిరంగులకూటమింకొకనాఁడు లేదు. సృష్టిచిత్రకారునియొక్క మహాశక్తి నల్పాల్పుఁడగుమానవుఁ డేమనివర్ణింపఁగలఁడు? మనచిత్రకారుఁడు ఈసొగసును, ఈ భగవచ్ఛక్తిని, తక్కుంగల తనసోదరులకుఁ జాలవఱకుఁ జూపింపఁజాలును. చిత్రకారుఁడు తొలుతఁ జెప్పఁబడిన యైదురంగులనుండి యెన్నెనిరంగులఁ గల్పింపనేర్చును. అట్టిరంగుల కూటముఁ జేయు శక్తి, స్వరములనుగూటముఁ జేసిపాడుగాయకుని శక్తివంటిదే; కవియొక్క పదములకూర్పువంటిదే. వెలుఁగునీడలకంటెను, రంగులకంటెను వస్తురూపము నిశ్చయింపఁగలుగునది, యాకారము. ఒక్కొక్కవస్తువున కొక్కొక్కయాకార మున్నది. వస్తుభేదమును జాలవఱకు నీయాకారము చూపింపఁగలదు. ఒక్కొకప్పుడు రంగును వెలుఁగుచీఁకటులును, లేకున్నను, ఆకారము వస్తువు నెఱిఁగింపఁగలదు. కాని యాకారము లేనిపట్ల రంగుగాని వెలుఁగునీడలుగాని వస్తువు నెఱిఁగింపఁజాలవు. ఆకారమునం దంతగొప్పతన మున్నది. వస్తువుల యాకారము వాని నిలుకడంబట్టి మాఱుచుండును. ఏనుఁగు యెదురుగా నిలుచున్నప్పు డొక యాకారమును, వెనుకకుఁ దిరిగియున్నప్పు డొకయాకారమును, పండుకొనినప్పు డొకయాకారమును, నీరీతిగా దానియునికినిబట్టి యాకారము మార్పుచెందుచుండును. ఆరీతినే యనేకవస్తువులకు, ననేకావస్థలును, అనేకాకారములును గలుగుచుండును. చిత్రకారునిబుద్ధి యీమార్పుల నన్నింటిని గ్రహించి జ్ఞాపకముంచుకొని, చిత్రముల వ్రాయుటయందు జాగరూకతతో నుపయోగించుచుండును. చిత్రకారుని మనమునందుఁ గలశక్తి, ప్రకృతిసందర్శనమునఁ గ్రమక్రమముగా మించి, యేవస్తువునైన నొకయవస్థలోఁ జూపించినయెడల, నావస్తువు నింకేయవస్థలోఁ జిత్రింపుమన్నను జిత్రింపఁగలదు. శక్తియుతుఁడగు చిత్రకారుఁ డేవస్తువునకేయే యవస్థలలో నెట్టిమార్పులు కలుగునో గ్రహించి, వానిని వ్రాయఁగల్గును. ఒకమనుష్యుని జాగ్రత్తగాఁ బరిశీలించినచిత్రకారుఁడు, ఆమనుష్యునియవస్థల నన్నింటి నూహింపఁజాలును. అట్లూహనలననే జాగ్రత్తగాఁ బరిశీలించినప్పటివలె, వ్రాయఁగల్గును.

ఈ యాకార మొక్కటినే సన్నని గీతగాఁ జూపించి, రంగులనుగాని వెలుఁగునీడలనుగాని చూపింపకయే వస్తువులఁ జూపించుటకూడ గలదు. అట్టిగీతలబొమ్మలు, ప్రకృతి కనుగుణముగా నుండి, నేత్రానందకరము లగుటకు, వస్తువుల యాకారజ్ఞానము చిత్రకారునికి మెండుగా నుండవలయును. దీనివలెనే, ఆకారమును రంగును జూపించి, వెలుఁగునీడలఁ జూపింపకే వ్రాయబడు చిత్రము లున్నవి. వానిలో, రంగుల కూటమియు, నాకారమును, రెండును గల్గియుండుకతన, నొక్క గీతలవలననే చూపింపఁబడు చిత్రములకంటె, నవి యెక్కుడు నేత్రపర్వ మొనర్ప గల్గును. ఆకారము, రంగులు, వెలుఁగునీడలు, మూఁడును గానసగు చిత్రమును, ఆకారమును వెలుఁగు నీడలనుండి రంగులు లేకుండుచిత్రమును, (అనఁగా తెలుపు,

నలుపులతోఁ జూపింపఁబడు చిత్రములు)కూడ
గలవు. ఒక్క వెలుఁగునీడలే కానఁగు చిత్ర
ములు కాని, రంగులే కానఁగు చిత్రములు
కాని, యీ రెంటినుండి, యాకార మొక్కటి
లేనిచిత్రములు కాని సాధ్యములు కావు.
రంగులకుఁగాని, వెలుఁగునీడలకు గాని, చిత్ర
మం దాకారసహితములైనఁగాని, యర్థమే
లేదు. అందువలనఁ బ్రతి చిత్రమునందును
వస్తువుయొక్క ఆకారము చూపించుట చిత్ర
కారునికిఁ దప్పనిసరి. ఆకారగుణమునకు నా
ప్రత్యేకగౌరవము కలదు.

పైని జెప్పిన, వెలుఁగునీడలు, రంగులు,
ఆకారమునను గుణములు కాక, చిత్రము
నందు (ప్రకృతిలోఁగూడనని వేఱచెప్పనక్కఱ
లేదు.) మఱిరెండు గుణములు, వస్తుస్వభా
వమును గ్రహించుటకుఁ దోడ్పడుచున్నవి.
అందు మొదటిది, వస్తుతారతమ్యము. రెండవ
యది వస్తుదూరము. ప్రపంచమునందు, వస్తు
వునకును వస్తువునకును, విస్తీర్ణములో నొక
విధమగు సంబంధ మేర్పడియున్నది. కొండలు
పెద్దవి: చెట్లు చిన్నవి: ఏనుఁగు లంతకంటెను
జిన్నవి: మనుష్యులు వానికంటెను జిన్నవారు:
పిల్లులు ఎలుకలు, మఱియుఁ జిన్నవి యై
యున్నవి. చీమలు దోమలు నంతకంటెను
స్వల్పశరీరములుగా ప్రపంచమునఁ గానవచ్చు
చున్నవి. చైతన్యయుతజీవప్రపంచమునను,
చైతన్యవిహీన మగు నిర్జీవప్రపంచమునను,
నీవస్తుతారతమ్యమును జూచుచున్నాము. ఒక
మనుజుఁడొక చెట్టుపద్ద నిలువఁబడియున్నాఁడను
కొందము. ఆచెట్టు నలువది యడుగుల యెత్తు
గలది యనుకొందము. ఆమనుజుఁ డైదడుగుల
వాఁడనుకొందము. ఆ హెచ్చుతగ్గులువిస్పష్టము
గాఁగానవచ్చుచుండును గదా? ఆమనుష్యుఁడు
పొడవున కాచెట్టులో నెనిమిదవవంతే కానిపిం
చును. ఈరీతినే ప్రపంచమున నొకవస్తువునకు
నింకొకవస్తువునకును, నొకవిధ మగు తారత
మ్యసంబంధ మున్నది. ఒకదానియంత మరొ
కటి లేకున్నను, దానిని సంబంధ మని యనుట
యెట్లన, దానికన్న నింకొకవస్తువు కొన్నిరెట్లె
క్కువో, తక్కువో, విధిగా నున్నది. కావున,
నట్టిపరస్పరసంబంధముఁ గలిగియున్న దని
చెప్పవచ్చును.

చిత్రకారుఁడు తనచిత్రమునం దీగుణము
లఁగూడ ముఖ్యముగాఁ జూపవలసినది. అట్లు
విఘ్యుక్తముగాఁ జూపించినగాని చిత్రము ప్ర
కృతితో సంబంధింపదు. ప్రకృతివైపరీత్యము
చిత్రముకాదు. చెట్టంత మనుష్యుని చెట్టునొద్ద
ను, వానిపాదములయొద్ద నొకయెలుకంతటికొం
డను, వానివెనుక కొండంతచీమను, వానిచే
తిలో పెద్దగొడుగంతటి గులాబిపూవును, ఆమ
నుజుని యంగములందే యొకకన్ను బండిచక్ర
మంతను, రెండవయది చింతాకంతను, చేటల
వంటి చెవులును, ప్రేళ్లవంటి చేతులును, గడ
కొయ్యలవంటి కాళ్లును, మున్నుగా వ్రాసిన
జిత్రమును, బాలుర మొదలు జ్ఞానులవఱకుఁగల
వారందఱుఁ జూచినన వ్వుదురుకదా? ఆచిత్రము
నందే యొక్కొక్క వస్తువును, నొక్కొక్క
యంగమును, ప్రత్యేకముగా పరిశీలించినయె
డల, ప్రకృతివైపరీత్యమేమియు లేక బాగుగా
నుండుటే తటస్థించినను, అట్టివస్తుసమూహ

ముం జూపించునప్పుడు, ఆవస్తువులకుఁ గల పరస్పరసంబంధమును జాగ్రత్తగా సరిగాఁ జూపించినగాని, చిత్రము ప్రకృతివిపరీతమై పోవును. అందువలన వస్తుతారతమ్యము గూడ చిత్రకారునిభావము నాశ్రయించి యుండవలసిన గుణములలో నొకటియై యున్నది.

వస్తుతారతమ్యమునవలెనే వస్తుదూరము గూడఁ జిత్రకారుఁడు, జాగ్రత్తగాఁ దనభావమునందు నిలుపుకొని, పిమ్మటనే చిత్రమును జిత్రింపవలయును. కొండ చెట్టుకంటె చాల పెద్దదయ్యును, మనమున్నతావున కాచెట్టు కంటె చాలదూరముగా నున్నయెడల, జాల చిన్నదిగాఁ గానిపించును. దూరమైపోయిన కొలఁదిని మనకంటికి వస్తువు చాలచిన్నదాని వలెఁ గానిపించును. అది మనదృష్టిస్వభావము. గవాక్షమెంతచిన్నదైననుదానిగుండా మనము, లెక్కలేనన్నిమైళ్లు నెడల్పు పొడవు గలిగిన ప్రదేశముం గాంచఁగలుగుచున్నాము. అందు మనము చూచు చిన్నకిటికీకంటె చాలరెట్లు పెద్దనగువస్తువులనేకములు చిన్నచుక్కలవలెఁ గానఁబడుచుండఁగా జూచుచున్నాము. ఈదూరమువలన వస్తువులు చిన్నవై కానఁబడుటనే, చిత్రకారుఁడు సంతతముచూచి, తనమనంబున నాజ్ఞానమును బాగుగా నెంచుకొని, యెంత దూరమునను న్న యేయేవస్తువు లెంతెంతగాఁ గానవగునో బాగుగా నెఱింగియుండి, తాను చిత్రించుచిత్రముననాదూరమునుస్వభావానుగుణముగాఁ జూపించినప్పుడే, చిత్రము చూపరుల కానందముఁ గలుగఁజేయుచున్నది.

మొత్తముపైని చిత్రకారుఁడు, తనచిత్రమునందు వెలుఁగునీడలను, రంగులను, ఆకారమును, వస్తుతారతమ్యమును, వస్తుదూరభేదమును, జూపించుచున్నాఁడు. ఈగుణములను జిత్తమున బాగుగాఁ జూపించినచో వస్తుభావము, వస్తుజీవము, మున్నగునవి, చిత్రకారుని భావము ననుసరించి, కానవచ్చుచుండును. చిత్రకారుని భావ మెట్టిదైనను, దానిని జూపించుటకు నీయైదుగుణములే యాధారములు. అవి యన్నియు నాతఁడు చూపించినచో నాతని భావము విస్పష్టముగానుండును. అందుఁ గొన్నింటిని విడిచిపెట్టియు, భావమే ప్రధానమని, కొందఱు తక్కిన గుణముల గొన్నింటినే తమచిత్రములందుఁ జూపించుచున్నారు. దానిని గూర్చిన విషయములు ముందు చెప్పవలసియున్నది. ప్రస్తుతాంశమునకు, ప్రకృతివిపరీతములు కాని స్వచ్ఛమగు చిత్రములం దీయైదుగుణములను బ్రకృతిలో వలెనే చిత్రకారుఁడు చూపింపవలయు నని చెప్ప టొప్పగును.

# ఉమర్ ఖయ్యాం

బ స వ రా జు అ ప్పా రా వు గా రు

ఉమర్ ఖయ్యాం ఖోరాసాన్ మండలము నందు నైషాపురమున 11 వ శతాబ్దము రెండవభాగములో జన్మించి 1123 వ సంవత్సరమున జన్మస్థానమందే మృతినొందెను. ఇతడు తర్కము వేదాంతము గణితము జ్యోతిషము మొదలగు శాస్త్రములయం దపారపాండిత్యము సంపాదించికొని 'రుబయ్యాత్' లనుకావ్యఫణుతులలో నిజహృదయమును ప్రపంచమునకు వినిపించెను. కాని ఎడ్వర్డుఫిట్జెరాల్డ్ అను నాంగ్లేయకవియొక్క భాషాంతరీకరణమువలననే ఉమర్ ఖయ్యాం 'రుబయ్యాత్'లకుమహమ్మదీయేతరదేశములలో ప్రచారము కలిగెను. ఫిట్జెరాల్డుతరువాత చాలమంది వీనిని భాషాంతరీకరించిరిగాని అతనిరసస్ఫూర్తి, ధారాశుద్ధి, పద్యముల ఊపు ఇతరుల కెవ్వరికి నలవడలేదు.

ఫిట్జెరాల్డుభాషాంతరీకరణములో ఉమర్ ఖయ్యాంఇంచుమించు మనదేశములోనిఅచల మతావలంబులతో తుల్యుడుగ గన్పించును. ఈ శరీర మస్థిరము గావునను, పరలోకస్థితిగతులు దుర్గ్రాహ్యములు గావునను, మన కర్మము విధినిర్ణీతము గావునను మానవుడు లేనిపోని వేదాంతములతో తల బ్రద్దలుకొట్టుకొనక, లభ్యము లైనంతవఱ కిహలోకభోగములతో తనివిజెంది మన్ను మన్నులో గలసినట్టు లస్తమయమును పాటించు అచలమతావలంబులభావమునే ఫిట్జెరాల్డు తనభాషాంతరీకరణమున ప్రదర్శించెను. ఫిట్జెరాల్డు భాషాంతరీకరణమును జూచిన వా రెల్లరును ఉమర్ ఎపికూర్యరియను మతమునకు జెందినవాడనియు, భోగపరాయణు డనియు నభిప్రాయపడుచున్నారు. అసలు ఎపికూర్యరియన్ మతమే భోగపరాయణత్వము కాదనియు, మితభోగానుభూతిని సక్రమమార్గములను పొందుట మాత్రమే యనియు తత్త్వవేత్త లభిప్రాయమునగుచున్నారు. అది కాక ఫిట్జెరాల్డు మూలములోనిభావమును యథార్థముగ ననువదింపక, ఉమర్ విషయమున లేనిపోనియపోహల కవకాశ మొసగె నని ముస్లిమ్ పండితులు తెలుపుచున్నారు.

వీరివాదముప్రకారము ఉమర్ ఖయ్యాం సుఫీమతసిద్ధాంతములకు సాంకేతిక మగు భావసంచారము కల్గించెననియు, అతడు కాంక్షించిన మధుపానము కేవలమధుపానము గాక భక్తాగ్రగణ్యుడగు ప్రహ్లాదుడు తెల్పినట్టి "అంబుజోదరదివ్యపాదారవిందచింతనామృతపాన"మే యనియు, మధుశాలయీ ప్రపంచమేయనియు, సౌందర్య మనగా భగవంతునిపరిపూర్ణత్వమే యనియు, సాకీ (మధువు నందిచ్చుపరిచారిక) యనగా గురువే యనియు, ప్రియుడనగా సర్వశక్తిమంతుడగు భగవానుడే యనియు, నిషా

(మత్తత) యనగా భగవచ్చింతనామృతపానమత్తతయే, యనియు ప్రణయిని యనగా భగవద్భక్తుడే యనియు, సాంకేతికాన్వయములు సుఫీకవులు కల్పించి రనియు, ప్రాచ్యభాగవత భావములం దనధిగతుడగుటచే పాశ్చాత్యుడగు ఫిట్జెరాల్డు ఉమర్ ఖయ్యాం హృదయమును సరిగ గ్రహింపలేక, అతనిశీలమునకు లేనిపోని కళంక మాపాదించెననియు ముస్లిమ్ విద్వాంసులు వాదించుచున్నారు. వీరివాదము చాలవఱకు సత్యము. ఎట్లన:—మన దేశమునందలి వైష్ణవకవులవలెనే సుఫీకవులును భగవంతునకును భక్తునకునుమధ్య ప్రణయసంబంధము కల్పించి భక్తికవిత్వమున నొకరసవంతమగు సమయమును పోషించియున్నారు. ఈకవిసమయముయొక్క సివృతయాథార్థ్యమును పరమార్థమును గ్రహింపనివారు పైకవుల భక్తిగీతములందలి కావ్యరసము నాస్వాదింప జాలరు. భగవంతునితో ప్రణయసంబంధమును కల్పించికొని యాతనికి నిజమనోభావమును నివేదించుపట్ల నీకవులు గైకొను చనవు, అనురాగము, స్వాతంత్ర్యము, ప్రభుత మొదలగు భావవిశేషములు పైకవిసమయము తెలియనివారికి విపరీతములును దుర్గ్రాహ్యములును నగును.

ఉమర్ ఖయ్యాం చిత్తప్రవృత్తి కొన్ని విషయములలో వేమనచిత్తప్రవృత్తిని బోలియుండును. వేమనవలెనే ఉమర్ ఖయ్యాం పూర్వాచారపరాయణత్వము నధిక్షేపించి, చిత్తశుద్ధి, యేకాంతధ్యానలగ్నత, యోగసిద్ధియు భక్తలక్షణములుగా ప్రతిపాదించెను. ఇరువురును మానవుడు కర్మబద్ధుడని యంగీకరించిరి. జీవితపరిమాణము కొలదియగుటచే ఇరువురును లేనిపోనితర్కముల దడవక యిహజన్మయందే సిద్ధి బడయదగునని యుద్బోధించిరి. ఇరువురు నైహికసంపదలు తృణప్రాయములని నిరసించిరి. ఇరువురును నిష్కామ్యోపభోగసిద్ధియే కర్తవ్యముగ నిరూపించిరి. (Here with a loaf of bread beneath the bough, A flask of wine, a book of verse. and thou Beside me singing in the wilderness, And wilderness is paradise enow) అని ఉమర్ ఉద్బోధించెను.

"త్రాగిత్రాగి ధరణిపై బడుదాక తాగినట్టివాడెతన్ను దెలియు, తాగలేనివాడె త్రాగుబోతరయంగ విశ్వదాభిరామ వినర వేమ" యని వేమన ఛాందసులు దిగులుపడ రణభేరి మ్రోయించెను. ఉమర్ ఖయ్యాం శైలి రమణీయత, పటుత్వము, చమత్కారము, అలంకారశోభ, గభీరతయు కలిగి విద్వన్మనోరంజకమై యొప్పును. వేమన శైలి పెడసరమై, కట్టెవిఱిచినట్లు "నిర్మొగమాటము"తో కూడుకొన్నదై, అలతియలతి తెనుగుపలుకుతునుకలలో గభీరాశయముల నొక్కొకప్పుడు బట్టబయలుగను, వేఱొకప్పుడు నర్మగర్భితముగను, మఱియొకప్పుడు మర్మముగను ప్రదర్శించుచుండును. ఇంచుమించు ఒకేవిధమగు కావ్యవస్తువునే ఇరువురును వేఱె యొకపాకమున రచించిరి. కావున పారసీకకవిశిఖామణియనదగు నుమర్ ఖయ్యాం రచించిన 'రూబయాత్తులు' వేమనవికటవేదాంతము జదువ నలవాటువడిన యాంధ్రరసికాగ్రేసరులకు నవ్యమధురరసాస్వాదనానందము నొడగూర్పకమానవని విశ్వాసమువొడముచున్నది.



చిత్రకారుఁడు:—భ. రామసోమరాజులుగారు

చ. లెమ్మ! నిశాకమండలతంలిన్ బడఁగా విసరెన్ ప్రభాతసం, దమ్ములు జిమ్మె దిఙ్మణిని, తారక లావలఁ బోయెఁ, గాంతిసూ
త్రమ్ములయుచ్చు లొడ్డెను స్సుతారపు తూరుపువేఁటకాఁడు రమ్యమ్మగు పాదుషా కనకహార్మ్యశిఖాకలశాలిఁ గట్టఁగన్.

# మ ధు క ల శ ము

## రా య ప్రో లు సు బ్బా రా వు గా రు

### (ఉమర్ ఖాయ్యామున కనువాదము)

లెమ్ము! నిశాంకమండలత । లిన్ బడఁగా విసరెన్ ప్రభాత మం
దమ్ములు జిమ్మి దిఙ్మణిని, । తారక లావలఁ బోమెఁ, గాంతి సూ
త్రమ్ములయుచ్చు లొడ్డెను సు । తారపు తూరుపువేఁటకాఁడు ర
మ్య మ్మగు [1]పాదుషా కనక । హర్మ్యశిఖాకలశాలిఁ గట్టఁగన్. ౧

చ. చదల నుషఃకుమారి చెయి । చాయలు దోఁపఁగఁ గల్వరించుచున్
మెదలక యాలకించితి స । మీపసురాభవనమ్మునం దిటుల్
“నిదురలు మాని మేలుకొని, । నింపుఁడు పాత్రలు చిన్నలార! త
త్సదమలజీవనార్ద్ర మధు । ధారలు నెండకమున్నె గిన్నెలన్.” ౨

ఉ. ఆమధుశాలవాకిటఁ బ్రి । యాన నిలంబడి కోడి కూయఁగా
నీమెయి చప్పటుల్ చఱచి । రెందుల కూరక నాలసింత్రు? రా
రేమి? కవాటముల్ తెఱువ । రేమి? ముహూర్తము మించిపోయినన్
రా మిఁక నెన్నియేండ్లకును, । ప్రజ్వలితాసవ మెండు నింతలోన్. ౩

చ. ముదిసిన ముచ్చటల్ మఱల । మోసలు వోయ నుగాది, భావనా
స్పద మగు నాత్మయున్ విజన । వాటికకై విరమించు, నచ్చటన్
సదమలశాఖిశాఖల గ । నంబడు [2]మోసెసు శ్వేతహస్త, మిం
పొదవఁగ భూమినుండి పయి । కుబ్బెడు జీససు దివ్యతేజమున్. ౪

ఉ. వాఁడె గులాబిపుష్పపరి । వారముతోడ ‘[3]ఇరాముతోఁట,’ [4]జె
మ్షీడు నృపాలకుండును శ । మించెఁ [5]త్రికాలఘటీసమేతుఁడై
చేడియ! నేఁటికిన్ మధువు । చిందెడు ప్రాఁగిలి యైన ద్రాక్ష, రా
పాడు జలప్రవాహముల । ప్రక్కలఁ బూచెడుసుమ్మి తోఁటయున్. ౫

---

౧. చక్రవర్తి. ౨. మోసెసు, క్రైస్తవపురాణపురుషుఁడు. ఆయనతపః ప్రభావముచేఁ గలిగినది శ్వేతహస్తము. 3. మన నందనవనమువంటిది. పారసీకసారస్వతమునందు సుజీవితము. ౪. ౫. ఇతఁ డొక పారసీక చక్రవర్తి. ఆయనవద్ద సప్తరేఖలు గల ఒకగిన్నె యుండెను. అది త్రికాలదర్శిని యై సత్యమును జూపుచుండెను.

మ. తమసంగీతము లాపి, మౌనమున గంధర్వుల్ కడం బోయి రే
కముగాఁ గాని, యనుఁగు [1]బుల్బులి సుధాకంఠంబుతోఁ గూయ తీ
యము లూఁగన్ మధువో! ప్రవాళమధువో! యంచున్ గులాబీకపో
లములన్ [2]మాసిన పస్పు రేకలు పునర్లావణ్యముం బొందఁగన్. ౬

చ. మఱుగు వసంత మెండినదు మన్ బడ నీ యనుతాపశీతచీ
వరమును బాఱవేసి మధుపాత్రము నింపఁగ రమ్ము నెచ్చెలీ!
పఱచు వయశ్శకుంతరస నల్పఖమున్ కడుఁ గొంచె మున్న, దా
తురమున విచ్చెడిన్ వలపుతో తనకుచ్చులరెక్క లల్లదే! ౭

ఉ. వేలకువేలు పూజతలు వేకువతో వికసించుఁ జూడుమీ!
రాలెడు నేలపా లగుచు రామరో! యింకొక వేయిపూలు, రో
జాలను దెచ్చు నీశుభవసంతము దూరముఁ జేసె చూడు ది
క్పాలవతంసు లౌ, [3]కయికొబాదు నృపాదులఁ, గీర్తిపాదులన్. ౮

(పాఠాంతరము)

ఉ. ఆ యమరావతీనగరి నైనను, పల్లియపొంత నేనియున్
పాయసమో విసంబొ నినుఁ బన్నలె ఖాత్రిక, నందునుండి కెం
జాయల జీవితాసవము జాఱు కణాలు కణాలుగా సఖీ!
ప్రాయపు నిగ్గుటాకులును రాలెడు నొక్కటివెన్క నొక్కటై. ౯

చ. అడవికి తోఁటకున్ నడుమ హా ద్దగు నీపొదరింటిదండ నె
న్నఁడును నృపుండు సేవకుఁడనన్ జనుభేదము సుంతయేని లే
ర్పడ, దపరంజిగద్దెపయి రాచరికమ్ములు సల్పుచున్ సుఖిం
బడు [4]సులతానుపట్ల మగువా! యనుకంప వహింతు మర్థిమై. ౧౦

ఉ. ఈసుమశాఖ చెంగట చెలీ! రుచు లీనెడు వెన్న రొట్టెయున్,
ఆసవపూర్ణపాత్రమును నందపు పాటలపుస్తకమ్ము సా
వాసముఁ జేయ, నీ వడవివాడల నాడుచు పాడికొంచు నా
తో సుఖ ముండు వేని కల దో! వని స్వర్గము గాక భూమిపై. ౧౧

---

౧. పికమువంటి పారసీకవిహంగము. ౨. పసుపువన్నె పారసీకకవితయందు గ్లానిసూచకము. మన విరహపాండిమ వంటిది. ౩. సుప్రసిద్ధుఁ డయిన చక్రవర్తి. ౪. సుల్తాన్ శబ్దభవము.

చ. మరగిన యైహికేచ్ఛల భ్రమన్ పెనగొందురు కొంద, తన్నుఁదో
యొఱఁగెడి స్వర్గభోగముల । కోపిక లీడ్చెద రింకఁ గొంద, తీ
తిరుగుడు లేటికో! అసలు । తీసుక శేషము నాసఁజేయ, కా
తురపడి పర్వులెత్తుదురు । దూరపుసాటల కెంతచిత్రమో! ౧౨

చ. మన మొగసాల విచ్చు సుకు । మారి గులాబిని జూడు మిట్లు ప
ల్కెను సఖి! "నవ్వుచున్ వసుధ । కున్ జని యందుల త్రెంతు నాదుచ
క్కనివరహాలసంచుల మొ । గాలు బిగించిన పట్టుత్రాళ్లు, ప
చ్చనిపువుఁదోఁటలోఁ గలయఁ । జల్లుదు మామకశోభనాంశువుల్." ౧౩

చ. జను లతికాంక్షతో వలచు । జంగమభోగము లొక్కవేళఁ బం
డిన తెగబండవచ్చు, నవనిన్ । బడి యెండిన నెండవచ్చు, మో
హనశిశిరప్రభాతసమ । యంబుల నిర్జలశుష్కకానలో
మినుకుమెఱుంగు లీనవె ని । మేషము చారుతుషారబిందువుల్? ౧౪

ఉ. సన్నపసిండిసస్యమును । సంతనఁజేసిన భాగ్యవంతు, లా
కన్నెకడానివిత్తనము । గాలికి జల్లెడి భోగమూర్తులున్
మన్నయిపోదు రంతె సఖి! । మాఱురు బంగరుదూళి గాఁగ నే
సన్నల నుద్యమింపరు ప్ర । జల్ మఱి వారల త్రవ్వి యెత్తఁగన్. ౧౫

ఉ. రేలుబవల్ కవాటముల । రెక్కలుగాఁగల నీమొడారి స
త్రాలకు వచ్చుచుంద్రు సుల । తాను లొకం డెడలంగ నొక్కఁ డాం
దోళిక లెక్కి ప్రాభవము । తో! వసియింతురు రెండుమూడునా
ళ్లోలగ మాపి యంత నెట । కో! విరమింతురు కంటె నెచ్చెలీ! ౧౬



# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

చిలుకూరి వీరభద్రరావు గారు

ధర్మశాస్త్రవేత్తలలో నెల్ల ప్రామాణికాగ్రగణ్యుం డని ప్రఖ్యాతిగన్న మనువు వైదేహకస్త్రీలకును చర్మకారులకును బుట్టిన వా రాంధ్రు లని వక్కాణించిన విధమును భారతి ప్రథమసంచికలోం జర్చించి యుంటిని గదా! వైదేహులెవ్వరు? చర్మకారులెవ్వరు? చండాలురా! ఆర్యులుకారా! అను ప్రశ్నము లను జర్చించి విషయవిమర్శ గావించి సత్య మును లోకసంగ్రహణార్థము ప్రకాశింపం జేయుట చరిత్రపరిశోధకుని ముఖ్యకర్తవ్య మై యున్నది. 'కారావరం నిషాదాత్తుచర్మకారం' అనంగా కారావరస్త్రీకిని నిషాదునకుం బుట్టిన వాండు చర్మకారుండని మనువు చెప్పెను. కాని, ఆదిపురాణమునందు:—

'ఆయోగవ్యాం బ్రాహ్మణాత్తు జాయతో ధిగ్వణో నరః, స చర్మకారో విజ్ఞేయో గర్హిత శ్చర్మజీవనః' అనంగా బ్రాహ్మణున కాయోగవికిని (అనంగా వైశ్యస్త్రీకిని శూద్రునకుం బుట్టినకన్య) బుట్టినవాండు చర్మముల పనిచేసి జీవించుధిగ్వణుండని వక్కాణింపంబడియున్నది. ఆయోగవులను లోకవ్యవహారమున నెట్టిపేరు తో వ్యవహరింతురో తెలిసికొనవలసియున్నది.

ఉశనసమునివచనము:—

'నృపాయాం వైశ్యసంసర్గా దాయోగవ ఇతిస్మృతః, తంతువాయా భవంత్యేతే వస్త్రకాంస్యోపజీవనః, శాలికా కేచి దత్రైవ జీవనం వస్త్రనిర్మితమ్.' అనంగా క్షత్రియ స్త్రీయందు వైశ్యునకుం బుట్టినవాం డాయోగవుం డనియు, వారే తంతువాయు లనంగా దేవరు లనియు, వస్త్రములు నేయుట వారివృత్తి యనియు, వీరిలో శాలికులు (సాలె)గూడం గలరనియు, వారికి నదే వృత్తి యనియు వక్కాణింపంబడెను." ఇందుకు భిన్నముగా దేవలవసిష్ఠమన్వాదులాయోగవులను శిల్పకారులని (అనంగా వడ్రంగులు, కమ్మరులు, కంచరులు మొదలగువారని) వక్కాణించుచున్నారు.

'తష్టి రాయోగవస్య చ' అని మనువు చెప్పినాండు. 'తష్టి' యనంగా బాడిసపని చేయువాండు. అతండే వడ్రంగి, మఱియు దేవలుండును.

"ఆయోగవస్తు శూద్రేణ వైశ్యాయాంతు భవేత్తు సః। తక్షస్థపతి రిత్యుక్తో రాజ్ఞాం వేశ్మకర స్సదా" అనంగా వైశ్యస్త్రీయందు శూద్రునకుం బుట్టినవాం డాయోగవుం డనంబడును. అతండే తక్షుండు లేక తకుండు లేక వడ్రంగి; అతండే స్థపతి; కాశీ(తాపీ) పనిచేయు శిల్పి' అని వక్కాణించెను. ఆయోగవులకు, ఇనుము, రాగి, సీసము, వీనిపనియు, నాయుధములు చేయుటయు, వానికూర్పును, పట్టణ

ములను గట్టుటయు వృత్తులని వసిష్ఠుఁడు వక్కాణించెను. క్షత్రియస్త్రీయందు వైశ్యునకుఁ బుట్టినవాఁ డాయోగవుఁడని ఉశనసుఁడు పలికినట్లుగానే బోధాయనుఁడు పలికెను. వీనికి వ్యతిరేకముగా గౌతముఁడు శూద్రస్త్రీయందు బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁ డాయోగవుఁడని వక్కాణించెను ఉశనసునకు, బోధాయనునకు భిన్నముగా 'క్షత్రియా మాగధం వైశ్యాత్' అని క్షత్రియస్త్రీకిని వైశ్యునకుఁ బుట్టినవాఁ డాయోగవుఁడు గాక మాగధుఁడని యాజ్ఞవల్క్యుఁడు పలికెను. ఇంక బ్రాహ్మణస్త్రీకిని వైశ్యునకుఁ బుట్టినవాఁడు వైదేహకుఁడని ధర్మశాస్త్రవేత్తలెల్లరు నైకకంఠ్యముగా నొప్పుకొన్న విషయమునుగుఱించి నేనిచట విస్తరించి చర్చించుట మాని వైదేహులవృత్తినిగుఱించి మాత్రము కొంచెముగఁ జర్చింతును. వైదేహులకు నాటకాంగములలో నటవృత్తియని కొందఱును, వస్త్రములను చింపికట్టుటయు, నుదుకుటయు, వాపీకూపతటాదులజలము తెచ్చుటయు, తోఁటలఁ దుడుచుటయు వృత్తులని మఱికొందఱును బలికిరి. కాని;, మనువు 'వైదేహకానాం స్త్రీకార్యం' అని వైదేహకులకు నంతఃపురమందు సౌకరీ యని చెప్పుచున్నాఁడు. ఇందుకు భిన్నముగా విశ్వంభరశాస్త్రమునందు "బ్రాహ్మణ్యాం తు సుకో జాతో వైశ్యాద్వైదేహక స్మృతః । పాషాణకాష్ఠయోశ్శిల్పం తస్య జీవన ముత్తమమ్" అనఁగా బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుఁ బుట్టినవాఁడు వైదేహకుఁడు; వానికి రాళ్లు కఱ్ఱలు చెక్కుట వృత్తి యని వక్కాణింపఁబడియెను. వీనినంతయు మనము విమర్శించిచూచునపుడు వీరికులములనుగుఱించియు, వీరివృత్తులనుగుఱించియు ధర్మశాస్త్రవేత్తల యభిప్రాయములలో నేకీభావము గన్పట్టక పరస్పరభిన్నములుగ నున్న వని చదువరులు సులభముగా గ్రహింపఁగలరు. వీనింబట్టి మన్వాదిశాస్త్రవేత్తలయందు మన కెట్టిగౌరవ మున్నను వారికి నీకులములయొక్కయు, వృత్తులయొక్కయు తత్త్వచరిత్రము బోధపడియుండలేదని యికముందట తెలుపువిషయములవలనే చదువరులకుఁ జక్కఁగా బోధపడఁగలదు. వైదేహకులన వర్తకులనియు,బట్టులనియు నర్థము. మననిఘంటువులలోఁ గూడ వ్రాయఁబడియున్నది. (శబ్దరత్నాకరముచూడుఁడు) బట్టులన మాగధులు. మాగధులును వైదేహులలోనివారే యని తెలిసికొనుటకు సందేహింప నక్కఱలేదు. పూర్వకాలమున విదేహదేశమనియు మగధదేశ మనియు రెండు దేశము లున్నట్లు మనపురాణేతిహాసగ్రంథములవలన మన మెఱింగియున్నాము. ఈరెండుదేశములను నేటికాలమున బేహారను చున్నారు. ఉత్తరబేహారమునకు విదేహమనియు, దక్షిణబేహారమునకు మగధ యనియుఁ, బూర్వపునామము లయియున్నవి. వైదేహశబ్దమునకు బేహారనునది వైకృతము. బేహారి యన్నవర్తకుఁ డన్న యర్థము నేఁడును బ్రవర్తింపఁబడుచున్నది. కాఁబట్టి నిఘంటువులలోనియర్థము సరియైనదని మన మంగీకరింపవచ్చును. ధర్మశాస్త్రవేత్తలు వైదేహ

కులను, మాగధులను వర్ణసంకరు లనియు, దస్యువులనియుఁ జెప్పినను దుష్టమైన వైశ్యవృత్తిని చేయుదురని చెప్పి యొప్పుకొనిరి. ఇట్లు వైదేహమాగధకరణులను 'దుష్టాని వైశ్యకర్మాణి తేఽపి కుర్వంతి దస్యవః' అని దుష్టములైన వైశ్యకర్మలను జేయు దస్యువులలో జేర్చిరి. ప్రస్తుతము మాగధకరణులను విడిచి వైదేహులనుమాత్ర మెత్తికొనియెదను. ఏదేశమునకైనను ప్రజలనామమునుబట్టి కాని, ఆపేరుగల రాజునుబట్టి కాని పేరు వచ్చియుండును. కనుక వైదేహులనుబట్టి దేశమునకుఁ బేరువచ్చినదా లేక వైదేహుఁడను రాజును బట్టి దేశమునకుఁ బేరువచ్చినదా? యను విషయమును దెలిసికొనవలసియున్నది. ప్రజలనుబట్టి దేశమున కాపేరు వచ్చిన దందమా విదేహదేశ మేర్పడుటకుఁ బూర్వమే యాపేరుగలప్రజ లుండిరని సిద్ధాంతము కాఁగలదు. విదేహుఁడను రాజునుబట్టి యాదేశమునకు పేరు వచ్చినదందమా యారాజునకుఁ బూర్వమాపేరుగల ప్రజలు గలరని కాని లేరని కాని యూహింప నవకాశము గలదు. వైదేహకులు వైశ్యులను ప్రజాసంఘమునకుఁ జేరినవారినియు, వర్ణసంకరులనియు నైకకంఠ్యముగా శాస్త్రవేత్తలెల్లరు నంగీకరించిన విషయమును బట్టి దేశ మేర్పడుటకుఁ బూర్వము వైదేహకులు లేరని చెప్పరాదు. వైశ్యులార్యులనుటకు సందియము లేదు. ఏమన:— "అర్య స్స్వామివైశ్యయోః" అని పాణిని చెప్పిన (3-1-103) 'అర్యశబ్దము' ఈయార్యశబ్దము పర్యాయపదము లయినట్లు వేదమంత్రములవలనఁ దెలియుచున్నది. 'యచ్ఛూద్రే యదర్యే యదేనశ్చకృమవయమ్' అని వాజసనేయసంహిత (౨౦-౧౭) యందు గన్పట్టుచున్నది. దానునికి విరుద్ధ మగు నార్యపత్నీత్యాది సమాసములు గన్పట్టుటచే ఋగ్వేదమునందుఁగూడ నర్యశబ్ద మార్యుఁడనునర్థమునందుఁ బ్రయోగింపఁబడియున్నది. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను చతుర్వర్ణము లేర్పడినపిమ్మట నీయర్యశబ్దము ద్విజసామాన్యమును జెప్పుటయెగాక ప్రత్యేకముగా వైశ్యులకుఁ బేరమ్యెను. లాట్యాయనశ్రౌతసూత్రమునందొకానొకశ్రౌతకర్మను విధించి 'ఇది యర్యుఁ డాచరింపవలసినకర్మ' అర్యుఁడు దొరకనియెడ నార్యుఁ డైనఁ జేయవచ్చు ననియున్నది. 'అర్యాభావే యః కశ్చ నార్యోవర్ణః—' దీనివ్యాఖ్యానము 'యది వైశ్యో నలభ్యతే యః కశ్చనార్యో వర్ణస్స్యాత్ బ్రాహ్మణోవా క్షత్రియోవా' ఇట్లని 'ఆర్యభాషావిభాగ' మనుతమవ్యాసముఁ విజయనగరము సంస్కృతకళాశాలా పండితులగు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు వ్రాసియున్నారు. (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. ౧౧ సంచిక ౪,౫. పుట౧౫౫) కావున వైదేహకవైశ్యులను ఆర్యులందమా? మన్వాదిధర్మశాస్త్రవేత్త లైకకంఠ్యముగా వచించినట్లు దస్యువు లందమా? బుద్ధిమంతులగు చదువరులు యోచింపవలయును. మనము మన్వాదిధర్మశాస్త్రవేత్తలయం దుండెడి గౌరవముచేత వారివాక్యములందు ప్రామాణ్యబుద్ధినిలిపి వైదేహకులను వర్ణసంకరులనియు దస్యువులనియు భావింతమన్న నీమన్వాదిధర్మశాస్త్రవేత్తలనుమాత్రమెగాక

సూర్యవంశక్షత్రియు లనియు, ఇక్ష్వాకువంశీ
యులనియు నుత్తమకులీనులుగాఁ బరిగణింపఁ
బడుచున్నసీతారామలక్ష్మణులను, మహాజ్ఞాని
యై రాజర్షి యని ప్రఖ్యాతిగన్న జనకమహా
రాజును గూడ దస్యువులుగానే భావింపవలసి
వచ్చును. యజుర్వేదసంహితలో విదేహదే
శములోనిగోవులు ప్రశస్తము లయిన వని
వక్కాణింపబడియెను. తైత్తిరీయసంహితా
భాష్యమున 'వైదేహి' యనువిశేషణమునకు
నర్థము వ్రాయుచుఁ 'వసిష్ఠదేహసంబంధినీ' అని
వ్రాయఁబడినది. [1]కాని విదేహదేశమునకు విదే
హమాధవుఁడను నొకరాజువలన నాపేరువచ్చి
నట్లు శతపథబ్రాహ్మణములోని యీక్రింది
కథవలనఁ దెలియుచున్నది. విదేహుఁడైన
మాథవుఁడు అగ్నివైశ్వానరుని నోటఁగలుచు
కొని బయలుదేరెను. రాహుగణములోఁ
జేరిన గోతమ ఋషి (గోతమరాహుగణుఁడు)
యతనిఁ బలుకరింపఁగా నోటనున్నయగ్ని పడి
పోవునన్నభయముచే మాటాడకుండెను.
"ఆజ్యాహుతిఁగన్నయోయీ! నిన్నుఁదోడ్పడఁ
బ్రార్థించుచున్నాము." అని యతఁడు మాటా
డకున్నను బురోహితుఁడు పలికెను. ఆజ్యము
పేరెత్తినతోడనే అగ్నివైశ్వానరుఁడు రాజు
నోటనుండి జ్వాలలఁ బ్రజ్వలింపఁ జేసెను. మా
థవుఁడు బిగబట్టుట కశక్తుఁడయ్యెను. అతని
నోటనుండి జారి యీభూమిపైఁ బడెను. అ
ప్పుడు విదేహమాధవుఁడు సరస్వతీనదియొడ్డున
నుండెను. అంత వైశ్వానరుఁడు భూమినిఁ
దగులఁబెట్టుకొనుచు ప్రాచీదిక్కునకై పునకుఁ
బోయెను. పిమ్మట విదేహమాధవుఁడనురాజు
ను గోతమరాహుగణుఁడను పురోహితుఁడును
వైశ్వానరుని వెంబడించి పోయిరి. ఈనదుల
నన్నిటిని దగ్ధముగావించెను గాని హిమవత్ప
ర్వతమునుండి ప్రవహించుచున్నసదానీర (గం
డకీ) యనునదిని మాత్రము దగ్ధము గావిం
పఁజాలక పోయెను. అందువలన బ్రాహ్మణు
లు పూర్వకాలమున నానదిని దాటరైరి. అ
యినను ఇప్పుడు దానికిఁ దూర్పునఁ బెక్కం
డ్రు బ్రాహ్మణులు గలరు. ఆకాలమునం దాన
దికిఁ దూర్పున నుండు దేశము వైశ్వానరుఁడు
రుచిచూడనందున వ్యవసాయము లేక బీడుప
డి గడ్డిగాదములతో నిండియుండెను. అయిన
నీదినములలో యజ్ఞములమూలముగా బ్రా
హ్మణులు వైశ్వానరునకు రుచిచూపించినం
దున భూమి విరివిగా వ్యవసాయముచేయఁ
బడుచున్నది. మిక్కిలిశీతము గలదగుటచేత
నానది వేసవికాలమునందు సయితము దగ్ధ
ము గావింపఁబడని నదివలెనె ప్రవహింపుచుం
డును. పిమ్మట విదేహమాధవుఁడు నే నెక్క
డ నివసింపవలసినవాఁడ నని యగ్నినిగూర్చి
పలికెను. ఈనదికిఁ దూర్పుభాగమున నివసిం
పు మని పలికెను. ఇప్పటికి సయితము సదా
నీరనది (గండకీ) కోసలవిదేహదేశములకు
సరిహద్దుగా నున్నది. ఎందువల్లనన వీరుమా
థవునిసంతతివారు గనుక. (శతపథబ్రాహ్మణ
ము. 1, 4, 1) ఈగాథ బ్రాహ్మణమతవ్యాప్తి

1. Vedic Index Vol. II. p. 298 and Keith's Veda of Black Yajus School Vol. I. p. 138.

ని దెలియఁజేయుచున్న దనుటకు సందియము లేదు. కనుక నీదేశము విదేహమాధవునిచే జయింపఁబడిన దేశము గనుక విదేహదేశమని పేరువచ్చినట్లుపై గాథమూలమునఁ దెలియుచు న్నది. కాని, యిందుకు భిన్నముగా మఱియొ కగాథ విష్ణుపురాణమునందు గలదు. ఒకప్పు డు ఇంద్రునియజ్ఞమును బరిసమాప్తి నొందిం చి వసిష్ఠుఁడు నిమియను రాజుయొక్క యజ్ఞ మును ప్రారంభించుటకై మిథిలానగరమునకుఁ బోయెను. అతఁడు వెళ్లినప్పటికి 'నిమి' యను రాజు గౌతమునిద్వారా యజ్ఞములను బరిస మాప్తములను జేసికొని నిద్రవోవుచుండెను. తన్ను విడిచి గౌతముని చేబట్టి యజ్ఞకార్య ము ముగించినందులకుఁ గోపించి వసిష్ఠుఁడు నిమి (రాజు) విదేహుఁడు- విగతదేహుఁ డగు గాక యని శపించెనఁట! రాజు మేల్కాని నిద్రవోవువానిని శపించినందున వసిష్ఠుఁడును విగతదేహుఁ డగుగాక యని ప్రతిశాప మిచ్చె నఁట! అంత ఋషులు నిమియొక్క మృతకళే బరమును మథించిరి. ఆమథనమువలన 'నిమి' యను కొడుకు పుట్టె నఁట! నిమియొక్క కొ డుకు మిథి యనియు నతఁడే మిథిలానగర మును నిర్మించి జనకుఁడనఁ బరఁగెననియు భవి ష్యత్పురాణమున 'నిమేఃపుత్రస్తు తత్రైవ... పూరిజననసామర్థ్యాత్ జనకః సచ కీర్తితః' అ ని చెప్పఁబడియున్నది. ఇందొకవిశేషము గన్ప ట్టుచున్నది. నిమికొడుకైన మిథియనురాజు మిథిలానగరమును నిర్మించె నని భవిష్యత్పు రాణము దెలుపుచుండఁగా నిమికాల మునసే మిథిలానగర మున్నట్లును ఆ మిథి లా నగరమునకు వసిష్ఠుఁడు వెళ్లినట్లును విష్ణుపురాణము దెలుపుచున్నది. మఱియు నింకొకవిశేషము గూడఁ గన్పట్టఁగలదు. విదేహుఁడైన నిమిపరిపాలించుటచేత నేయాదేశ మునకు విదేహదేశమని పేరుకల్గినట్లు చెప్పుట చేత విదేహమనుపేరువచ్చుటకుముందే మిథిలా నగరమేర్పడినట్లు గన్పట్టఁగలదు. నిమిపుత్రుఁ డైన 'మిథి' యనువాఁడు 'తస్య పుత్రో మి థిర్నామ మిథిలా యేన నిర్మితా। ప్రథమో జనకో నామ జనకాదప్యుదానసుః" అని మిథి లానగరమును నిర్మించిన ప్రథమజనకుఁ డని పేరు గన్నట్లు రామాయణమునఁ గూడ వ క్కాణింపఁబడియెను. కాని 'నిమి' విదేహుఁ డెట్లయ్యెనో విష్ణుపురాణములోఁ జెప్పినకథ రామాయణమునఁ గన్పట్టదు. ఇంకొక విచి త్రము రామాయణములో గన్పట్టఁగలదు: దశరథాత్మజులగురామలక్ష్మణులు విశ్వామి త్రునితోఁ గూడ సీతను వివాహమాడుటకై మిథిలానగరమునకుఁ బోవునపుడు నడుమ నైశాలిపురమునకు వచ్చి యాపురమును బరి పాలించు నిక్ష్వాకువంశీయుఁడైన సుమిత్రునిచే సత్కారములను బొందినట్లు చెప్పఁబడినది. ఈసందర్భమున విశ్వామిత్రుఁడు,

"దితిం యత్ర తపస్సిద్ధా మేనం పరిచ చారసః
ఇక్ష్వాకోస్తు నరవ్యాఘ్ర! పుత్రః పరమధార్మికః
అలంబుసాయా ముత్పన్నో విశాలఇతి విస్రుతః
తేన చాసీ దిహ స్థానే విశాలేతి పురీ కృతా."

అని యిక్ష్వాకునిపుత్రుఁడయిన విశాలుఁ డనువాఁడు తన పేరిట నాపురమును నిర్మించి నట్లుగాఁ జెప్పినాఁడు. ౧ విశాలుఁడు, ౨ హేమ

౩ చంద్రుడు, ౪ సుచంద్రుడు, ౫ ధూమ్రాశ్వుడు, ౬ సృంజయుడు, ౭ సహదేవుడు, ౮ కుశాశ్వుడు, ౯ సోమదత్తుడు ౧౦ కకుత్థ్సుడు ౧౧ సుమతి, వీరిని వైశాలికు లని చెప్పినాడు. సుమతియనువాడు రామలక్ష్మణులకు సమకాలికుడు. ఇక్ష్వాకుని పుత్త్రుడయిన నిమి (విదేహుని) వంశమునఁ బుట్టిన కుశధ్వజుఁడే సీతజనకుఁ డని రామాయణమునఁ జెప్పఁబడియుండెను. ౧ నిమి, ౨ మిథి ౩ ఉదావసు ౪ నందివర్ధనుడు ౫ సుకేతు ౬ దేవరాతుడు ౭ బృహద్రథుడు ౮ మహావీరుడు ౯ సుధృతి ౧౦ దృష్టకేతు ౧౧ హర్యశ్వుడు ౧౨ మరుడు ౧౩ ప్రతీంధకుడు ౧౪ కీర్తిరథుడు ౧౫ దేవమీఢుడు ౧౬ మహీధ్రకుడు ౧౭ కీర్తిరాతుడు ౧౮ మహారోముడు ౧౯ స్వర్ణరోముడు ౨౦ హ్రస్వరోముడు ౨౧ కుశధ్వజుడు. ఈకుశధ్వజుడే సీతతండ్రియైనజనకుఁ డని రామాయణమున వక్కాణింపఁబడియెను. (బాలకాండము, ఏకసప్తతితమస్సర్గము) ఇంక నిక్ష్వాకునకు దశరథునకు నడుమఁ గలరాజు లెందఱో పరిగణించెము. ఇక్ష్వాకునకు ౧ కుక్షి ౨ వికుక్షి ౩ బాణుడు ౪ అనరణ్యుడు ౫ త్రిశఙ్కుడు ౬ దున్దుమారుడు ౭ యవనాశ్వుడు ౮ మాన్ధాత ౯ సుసన్ధి ౧౦ ధ్రువసన్ధి ౧౧ భరతుడు ౧౨ అసిత్తుడు ౧౩ సగరుడు ౧౪ అసమంజసుడు ౧౫ అంశుమ తుడు ౧౬ దిలీపుడు ౧౭ భగీరథుడు ౧౮ కకుత్థ్సుడు ౧౯ రఘువు ౨౦ కల్మాషపాదుడు ౨౧ శంఖణుడు ౨౨ అగ్నివర్ణుడు ౨౩ మరుత్తు ౨౪ అంబరీషుడు ౨౫ నహుషుడు ౨౬ యయాతి ౨౭ నాభాగుడు ౨౮ అజుడు ౨౯ దశరథుడు ౩౦ రాముడు. ఇక్ష్వాకువంశము బహుపురాణములలో బహువిధములుగాఁ జేర్కొనఁబడియున్నది. దశరథుడు, జనకుడు, సుమిత్రుడు, ఇక్ష్వాకువంశములోఁ బుట్టినసమకాలికు లయినను ఇక్ష్వాకునకు దశరథుడు ౩౦ దవ తరమువాఁడుగను జనకుడు ౨౪ వ తరమువాఁడుగను సుమిత్రుడు ౧౨ వ తరమువాఁడుగను నొక్కరామాయణము బాలకాండలోనే వక్కాణింపఁబడుట యీవంశానుఘలయొక్క సత్యచరిత్ర మెట్టిదో చెప్పకయ చెప్పుచున్నది. విస్తారములలో నెల్ల విస్తారము మఱి యొక్కటి గలదు. దశరథుడును జనకుడును సూర్యవంశక్షత్రియులు ఇక్ష్వాకువంశీయులు. జ్ఞాతులు. సగోత్రికులు. అట్లయ్యును తమబిడ్డలయినసీతారాములకు వివాహము గావించుట నింద్యముగ నశాస్త్రీయముగఁ గన్పట్టఁగలదు. ఇట్టి వివాహముల కొడంబడినవారిని

"యస్తు ప్రవ్రజితా జ్జాతో
బ్రాహ్మణ్యాం యశ్చ శూద్రజః
తా వుభౌ విద్ధి చండాలౌ
సగోత్రా ద్యశ్చ జాయతే"

అని సన్న్యాసికిఁ బుట్టినను, బ్రాహ్మణస్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడును సగోత్రస్త్రీయందుఁ బుట్టినవాఁడును చండాలు రని యంగిరసస్మృతియందును,

"ఆరూఢ పతితా పత్యం బ్రాహ్మణ్యాం యశ్చ శూద్రజః । సగోత్రోఢాసుత శ్చైవ

ఛండాలాస్త్రియ ఈరితాః” అని మీఁద చెప్పి నరీలినే యమస్మృతియందును చండాలు రని వక్కాణింపఁబడియుండెను. ఇట్లు సగోత్రికుల వివాహములు కూడవని స్మృతులు నిషేధించుచుండ వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమాదిమహర్షులును జనకాదిరాజర్షులు నిట్టియశాస్త్రీయ వివాహముల కెట్లంగీకరించిరని యిప్పటివారికి నాశ్చర్యము కలుగవచ్చును. కాని ప్రాచీన కాలమున సూర్యవంశక్షత్రియులైన యిక్ష్వాకువంశీయులలో పవిత్రమైనరక్తమును కులీనతను గాపాడుకొనుటకై తోఁబుట్టువులను జ్ఞాతులపుత్రికలను వివాహముఁ జేసికొనునాచార ముండినటులు గ్రంథాంతరములవలనఁ దెలియుచున్నది. వర్తమానకాలమున మహామ్మదీయులలో గొప్పకుటుంబములలోఁ బినతండ్రులయొక్కయుఁ బెదతండ్రులయొక్కయు పుత్రికలను వివాహము జేసికొనునాచార మచ్చటచ్చట గల దని వినుచున్నారము. ఇట్టి యాచారమే పూర్వ మిక్ష్వాకులలో నుండెను. శ్రీమద్రామాయణమున వక్కాణింపఁబడిన సూర్యవంశక్షత్రియులైన యిక్ష్వాకువంశీయులు శాక్యులుగను, వైశాలికులు లిచ్ఛవీలుగను, మైథిలులు వైదేహులుగను, వీరెల్లరును వసిష్ఠగోత్రీయులయిన క్షత్రియు లనియును బౌద్ధగ్రంథములం దంతటను గానన గును. వైదేహులనుగూర్చి ధర్మశాస్త్రములేమి వచించెనో మీ కిదివఱకే తెలిపియున్నాను. ఇంక శాక్యులనుగూర్చియు లిచ్ఛవీలను గూర్చియుఁ జెప్పవలసియున్నది. వీరిని

“ఝల్లో మల్లశ్చ రాజన్యా ద్లిచ్ఛిభిరేవచ
నట శ్చ కరణ శ్చైవ ఖసో ద్రమిడ ఏవచ”

అనియు,

“ శనకై స్తు క్రియాలోపా దిమాః క్షత్రియ
జాతయః, వృషత్వం చ గతా లోకే
బ్రాహ్మణా దర్శనేన చ, పౌండ్రకా
శ్చౌఢ్ర దవిడాః కాంభోజా యవనాశ్శకాః
పారదా పల్లవా శ్చీనాః కిరాతా దరదాః
ఖశాః”

అని మనువు శూద్రక్షత్రియులనుగఁ జెప్పియున్నాఁడు. కాని జైనగ్రంథరాజములలోను బౌద్ధగ్రంథరాజములలోను వీర లుత్తమ క్షత్రియులుగా వక్కాణింపఁబడిరి. ఇక్ష్వాకువంశీయులు శాక్యులే యనుట రుజువుచేయవలసియున్నది. బౌద్ధమతస్థాపకుఁడైన గౌతమ బుద్ధుఁడును జైన మతస్థాపకుఁ డైన మహావీరుఁడనునాతఁడు నీక్షత్రియకుటుంబములలో నుండి జనించినవారగుటచేతను ఈవంశీయులే వీరిశాఖలవారే భరతఖండమునందును విదేశములందును జైనబౌద్ధమతములవ్యాప్తికిఁ గారకు లగుటచేతను ఆకాలమునఁ బ్రజలకు వీరియం దత్యంతానురాగముండుటచేతను జైన వాఙ్మయమునందును, బౌద్ధవాఙ్మయము నందును ఈ క్షత్రియులనుగుఱించి విశేషముగ వ్రాయఁబడియుండెను.

శాక్యసింహుఁడైన గౌతమబుద్ధుఁడు శాక్యులలోనివాఁడని పాలీభాషాగ్రంథములమూలమునఁ దెలియుచున్నది. శాక్యు లనువారు ‘ఒక్కాక’ ఇక్ష్వాకుసవంశీయు లని దీర్ఘనికాయాదిబౌద్ధగ్రంథములవలనఁ దెలిసికొనుచున్నారము. ఒక్కాక (ఇక్ష్వాకుఁడు, రాజు తన

ప్రియభార్యయొక్క తనయుఁడుమాత్రమె సిం
హాసన మధిష్ఠింపఁగోరి తనజ్యేష్ఠపుత్త్రులయిన
ఒక్కాముఖుని, కారండుని, హస్తినికిని,
సినిపురుని ప్రవాసమునకుఁ బంపఁగా వారు
హిమవత్పర్వతసానుప్రలలో నొకసరోవరము
సమీపమున నున్న 'ఒకు'(శాక) వృక్షమునమీ
పమున నివసించిరి. తమరక్తముయొక్క పరి
శుద్ధత్వమును గాపాడుకొనుటకై వారు తమ
తోఁబుట్టువులనువివాహముజేసికొనిరి. ఒక్కా
క(ఇక్ష్వాకుఁడు) రాజునకు 'దిశా' యనునొక
బానిసపడుచు గలదు. ఆమెకు కృష్ణవర్ణుఁ
డొకశిశువు జనించెను. ఆశిశువు జనించిన
తోడనే 'తల్లీ! నన్ను తుడువుము; తల్లీ!
నన్ను స్నానము చేయింపుము; తల్లీ! నేను
నీ కుపయోగపడునట్లుగా నామురికి నంతయుఁ
బోగొట్టుము;' - నిమొఱవెట్టెనఁట! అపుడు
ప్రజలు 'ఇది పుట్టఁగానే మాటాడుచున్నది.
ఇది నల్లనిదయ్యము పుట్టినది' అని చెప్పుకొన
సాగిరఁట! ఈనల్లనిశిశువునకుఁ బుట్టినవారే
కష్ణాయనులఁట! (కృష్ణాయనుట) అంబష్ఠసుత్త
'అంబష్ఠసూత్రము'నందీవాక్యములు గన్పట్టు
చున్నవి.

"అవును; అంబష్ఠా! ఎవ్వఁడైనను నీపూ
ర్వనామమును నీవంశమును అనుసరింపఁగోరిన
యెడల నీతల్లిపంకవారికిని నీతండ్రిపంకవారి
కిని 'శాక్యులు' ఒకప్పుడు యజమానులునుగ
నుండిరనియు, వారిబానిసపడుచులకు మీరు
పుట్టినసంతతివారయినటులు గన్పట్టఁగలదు.
బౌద్ధగ్రంథములే కాదు; మన పురాణములు
కూడ శాక్యులిక్ష్వాకులలోనివారే యని
తెలుపుచున్నవి. ఇక్ష్వాకువంశములో బృహ
ద్బలుడు పుట్టెననియు వానికి బృహత్క్షణుఁడు,
వానికి గురుక్షేపుఁడు, వానికి వత్సుఁడు,
వానికి వత్సవ్యూహుఁడు, వానికి ప్రతివ్యోముఁడు,
వానికి దివాకరుఁడు, వానికి సహదేవుఁడు,
వానికి బృహదశ్వుఁడు, వానికి భానురథుఁడు,
వానికి సుప్రతీకుఁడు, వానికి మరుదేవుఁడు,
వానివంశమున శునక్షత్త్రుఁడు, కిన్నరుఁడు, అం
తరిక్షుఁడు, సువర్ణుఁడు, అమిత్రజిత్తు, బృహ
ద్రాజుఁ బుట్టిరి. కృతంజయునకు వీరు పూర్వులు.
వీరికి రణంజయుఁడు పుట్టెను; రణంజయునకు
సంజయుఁడు, సంజయునకు శాక్యుఁడు పుట్టె
నని విష్ణుపురాణమువలనఁ దెలియుచున్నది.
అమరకోశమునకు వ్యాఖ్యానము వ్రాసినభర
తాచార్యుఁడు తనవ్యాఖ్యానములో 'శాక'
అనునది యొకవిధమైనవృక్షము. ఇక్ష్వాకువం
శీయుఁడైన యొకరాజు శాకవృక్షము సమీప
మున నివసించినందువలన శాక్యుఁ డనుపేరు,
వహించెను. వానిసంత వారే శాక్యులయిరి.
అని వ్రాసెను. త్రివిష్టపు (Tibet) దేశపుగ్రంథ
ములలో నొకదానిలో విరూఢకుఁ డనురాజు
తనసుందరసుకుమారులేమయిరని సభాసదుల
నడిగెనట! వారికి వాని కొమాళ్ల సాహసకృ
త్యము వక్కాణించిరఁట! బలె! అతిసాహస
వంతులయిన యువకులారా! అని తండ్రి పేర్కొ
నెనఁట! ఇట్టిశీలము గలవారగుటచేత వారు
శాక్యులయిరని చెప్పఁబడినట్లుగా తాము
వ్రాసిన బుద్ధచరిత్రములో 'రాకుహిల్లు'
(Rockhill) గారు వ్రాసినారు.

ఇఁక నిక్ష్వాకువంశీయు లయిన వైశాలికులు లిచ్ఛవీక్షత్రియు లని యిదివఱకే తెలిపి యున్నదానికిఁ గారణ మిచ్చట వివరింతును. వైశాలిపురమును గూర్చియు లిచ్ఛవులను గూర్చియుఁ బ్రత్యేకవ్యాసము వ్రాయవలయును గాని యిచట విశేషము వ్రాయ సాధ్యము కాదు. ముఖ్యాంశమును మాత్రము వివరింతును. విశాలపురమనునది యిక్ష్వాకునిపుత్త్రుఁ డగు విశాలునిచే నిర్మింపఁబడినట్లుగా రామాయణమునఁ జెప్పఁబడియెనని యిదివఱకుఁ దెలిపి యుంటిని. కాని యిక్ష్వాకువంశీయుఁడైన తృణబిందుకొడుకగు విశాలునిచే నిర్మింపఁబడియె నని విష్ణుపురాణమునఁ జేర్కొనఁబడినది. కాని బౌద్ధగ్రంథములలో వజ్జియనులచే వేసలి యను వైశాలిపురము నిర్మింపఁబడినదని వ్రాయఁబడియున్నది. లిచ్ఛవీలును, వైదేహులును వారిలోనివారే యని యేతద్గ్రంథములమూలముననే తెలియుచున్నది. శాక్యులు లిచ్ఛవులు వైదేహులు కోసలులు, కాశీలు మొదలగు తెగల క్షత్రియు లెల్లరు నాప్తబంధువులు నేకసంఘముగఁ బ్రవర్తించుచుండి రని యేకకంఠ్యముగా జైన బౌద్ధగ్రంథములు చాటుచున్నవి. వీరు వ్రాత్య క్షత్రియు లని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి. బ్రాహ్మణములు పురాణములునిక్ష్వాకువంశీయు లయిన యుత్తమక్షత్రియులనుగా దెలుపుచున్నవి. కావున వీనితత్త్వమును విపులముగాఁ జర్చించి వీ రెవ్వరో తెలిసికొన్నఁ గాని ప్రాచీనాంధ్రులచరిత్రము సంపూర్ణముగా బోధపడదు. చండాలజాతితత్త్వమును బోధపడదు. ఇప్పటికి వైదేహులు వజ్జియనులలోనివారని తెలిసికొన్నారము గనుక వజ్జియనులనుగూర్చి మూఁడవవ్యాసమున విపులముగా వివరించుచున్నాను.

---

# సానుస్మరణము

శ్రీ శేషాద్రిరమణకవులు

త్రోలుదొల్త పోతఁ డున్నిసభూమిలోఁ
గసవు గానైనను గాకపోతి
పోతన కాయఁగాఁ బూనినపసులలోఁ
బసుజన్మ మైనను బడయనైతి
పోతన తిరిగినపొలిమేరలో నీడ
లొలయించుతరువునై యుండ నైతి
పోతన దున్నిన పొలములలోఁ బలు
పాంసులత్వం బైనఁ బడయనైతి
ఆంధ్రభాగవతము వ్రాయునవసరమున
గంటముగ నైన జన్మంబుఁ గాంచనైతి
పారతంత్ర్యాకరం బైన భారతమున
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబుకరణి.

# నీతిభవనము

## క్రొత్తపల్లి సూర్యారావు గారు

(ద్వితీయ భూమిక)

ప్రాలుఁ దేనె పానకమును । బప్పు నాల్గుఁ, గలిపి యర్పింతు సుందర । గజముఖుండ
వచన పద్య నాటకరూప । భాష నాకుఁ, గరుణసేయుము నిర్దోష।సరణియందు. ౧

గీ. పుణ్య మొనరింపఁదగుఁ బాప।మును ద్యజింపఁ, దగును దొలిపుట్టునాఁటియా।ద్వయము నేఁడు
పాలుపడు నేమశేమువారుఁ।బలుక నిదియె, దుష్కృతముమాయఁగాసత్కృ।తుల నొనర్పు.

గీ. జాతు లివి రెండెగాని యొ।చ్చటను వేఱు, లేవు నీతిమార్గమ్ముఁ బా।లించిచూడ
నిచ్చవా రెచ్చుకులమువా । రీనివారు, తగ్గుకులమున వారు శా।స్త్రవిధియందు. 3

గీ. ఇడుమలను దాఁప నిడు సంచి।యొకలు దీని, శాశ్వతం బని యెంచంగఁ । జనదు ధర్మ
మొనరఁజేయుఁడు దాన యా।తనయు దుఃఖ, ములును బోవును సిద్ధించు । ముక్తి మీకు.

గీ. తాఁదలఁచునొక్కటియుఁ జేయఁ । దరముగాదు, పుణ్యఫల మగు సమయంబు।పొడముదాఁక
గుడ్డివాఁడు మామిడికాయఁ । గొట్టఁ గల్లు, విసరు టొప్పును, దటితోఁస । వెలయు ఫలము.

గీ. ఎంత వేఁడిన రాని దొ।కింత రాదు, వచ్చునది వల దన్నను । వదలిపోదు
తెలియఁజాలక హృదయంబు।గలఁగఁ బెక్కు, తలఁచి కూర్కొనుటయ మను।ష్యులపనియగు.

గీ. స్వార్థమునకంటె నెక్కుడు । వలసి యొకని, సౌఖ్యమును బల్మిచేఁ గొనఁ । జాలని యిలఁ
గడలి యద్దరి కేగినఁ । గాని నొసటి, వ్రాఁత కెక్కుడు దొరక దీ।ప్రాణి కింత. ౭

గీ. ఎన్నివిధముల నెంచిన । నీశరీర, మఖిలరుజలకు బాధల । కాకరంబు
నస్థిరం బని తెలిసి మ।హాత్ము లబ్జ, పత్రమున నీరుపోలె వే।ర్పడి చరింత్రు. ౮

గీ. ఎంత యత్నించినను విధి । యెంతొ దాని, కెక్కుడర్థము రా దది । యేల యత్న
మున గడింపుఁడు మర్యాద।యును యశంబు, సుస్థిరంబులు తక్కిన । వస్థిరములు. ౯

గీ. ఏటినీ రెండి కాలెడు । నిసుకలోన, నూటచెలమలు లోకుల । కుపకరించు
సత్కులుఁడు లేమిపడియు యా।చకు లడిగిన, లేదని వచింపఁజాలఁడు । లేశ మైన. ౧౦

గీ. పండ్లకొలఁది దొరలి । యేడ్చినఁ జచ్చిన, వారు రారు వలదు । వారిదారి
మనకుఁ దప్ప దప్ర।మాదులరై హాయి, గుడుచు చోరుల కిడుపఁ । గడపరయ్య. ౧౧

ఉ. ఒక్కదినంబు తిండి యిడు।గుండుమన న్విస విష్ఠ చక్కఁగా
మెక్కము రెండునాళ్లకన । మేకొని మెక్కను చాలుఁజాలు లే
యొక్కదినంబు నాదు వెత । యోజనసేయక కష్టపెట్టు నాఁ
డొక్క! యతిప్రమాదము క।డు న్నినుఁ గూడి చరించు నాకగున్. ౧౨

గీ. ఏటిదరి నున్న చెట్టును । నెపుడు రాజు, విడువకుండెడు నుద్యోగి । పడుదు రిలను
దున్నుకొని జీవనముసేయు । టెన్న మిన్న, కడమవృత్తులు దినదిన।గండదములు. ౧౩

గీ. బాగుపడఁబోవు వారి నా।పంగ నెవ్వ, రోపుదురు, చావనున్నచో । నుడుపువారు
గలరె, తిరిసెడువారి క।క్షయధనంబు, లిడుదు రెవ్వరు? గీటేరు । తుడువఁగలరు? ౧౪

గీ. ఇచ్చకము లాడి యాచించి । యేటి తెచ్చి,కొని భుజించుచు బ్రదుకుట । కూడదబ్బె
ముష్టిఁ గొని పొట్ట నింపుచు । మురియుకంటె, మానహాని గాకుండిన । మరణ మొప్పు.

గీ. శ్రీశివాయ నమో యంచుఁ । జింత సేయు,వారి కెన్నఁ డపాయంబు । వచ్చు టరుదు
ఇదియె మంచియుపాయమా । నింతకంటె, విధిని గెల్చుట కుపపత్తి । వెదక లేదు. ౧౬

గీ. నీటిగుణము నేలనుబట్టి । మేటిగుణము, దానమునుబట్టి తెలియు నే।త్రగుణ మార్ద్రి
హృదయమునుబట్టి తెలియును । స్త్రీలగుణ మ,దీలువునుబట్టి తెలియనౌ।నెఱిఁగికొనుఁడు.

గీ. తొంటిమేనునఁ జేసిన । దుష్కృతంబు, డీలకుండఁగ దైవంబు । దూఱఁ గలిమి
వచ్చి పడునెక్కొ యపు డీని।వారి కిపుడు, వట్టికుండను బొంగునె । పాలు పైకి. ౧౮

గీ. జనకులకు సోదరులకు స।జ్జనుల కాప్తు, లకు నొసంగరు లోభులు । లాంతివారు
శరణటన్నను బెట్టరు । చోరవఁగొట్టి, యెత్తుకొని పోవ,దొంగల కిత్తు రెల్ల. ౧౯

ఉ. పట్టెఁడుకూటికై కడుపు । వట్టి చరింతుము సేవచేసి యె
వ్వట్టున దేహి యం చడిగి । వార్ధులు దాటియు స్తోత్రపాఠముల్
నెట్టన చేసి రాజు లయి । నీచులకుం గృతు లిచ్చి యిస్సిరో
తట్టదు ముక్తిసాధనప।థంబునఁ బో నొకనాఁడు నెమ్మదిన్. ౨౦

గీ. సన్నికలు గట్టుకొని యేట । జాఁజనల్లె, కన్నెలను వెంబడించి రొక్కంబు దొలఁగఁ
బెట్టుకొని యిహపరములు । వృథ యొనర్చి, దద్దిరమునకు విత్తమ్యొ।దరు కుజనులు. ౨౧

గీ. వంచనాస్వభావము లేని । వారి కిచ్చు, నేలయును నీడ ధాన్యంబు । నీరుఁ బాలు
ధనము వాసియుఁ గీర్తియు।త్సవము నూరు, నాయు రారోగ్యములును లచ్చమ్మతల్లి. ౨౨

గీ. పాటుపడి కూర్చి ధనమును । బాఁతిపెట్టి, పాడువడుజనులార! యో । పాపులార!
యసుఱు గూఁడును విడిచి తా । నోసరిలిన, నాధనంబు నెవ్వరు గొని । యనుభవింత్రు.

గీ. ధర్మసభలోనఁ బకుపాతలంబు చెప్పు, నతనియింటను వేతాళ । మధివసించు
మొలచు జిల్లేడుఁ, బాతాళ । మూలి త్రాఁచు, పాము తూఱును బెద్దమ్మ।వారు నిలుచు.

గీ. భూతి పెట్టనినొసలును । నేతిబొట్టు, లేనిభోజన మూఁడుది । లేనియిల్లు
నేఱు లేనట్టిదేశంబు । నింపుఁ బాడు, పాడు తోడఁబుట్టులు లేని।వాని మేను. ౨౫

గీ. రాబడిని మించువ్యయము గౌ।రవముఁ జెఱచు, మఱిని బోఁగొట్టు నోరులన।మ్మకమునుడుపు;
సప్తజన్మంబు లంటించుఁ । జౌర్యగుణము, కల్లలాడించు నిహపర।గతులు మాల్చు. ౨౬

గీ. మానము, కులంబు, విద్యయు,।దాన, మాధి,సత్యమును, దాతృత, తపంబుఁ।బనియు,గౌర
వమును, గామంబు, ననునిట్టి । పదియు గెలువఁ, జాల కాంక్షలి వచ్చిన । జరగిపోవు. ౨౭

గీ. ఒకటి దలఁచిన నది చెడి । యొక్కటి యగు, లేక యద్దియ యగునెప్డు । లేశ మైనఁ
దలఁపనిది వచ్చి ముందఱ । నిలుచు నగుర, మనలఁ గాపాడు నీశ్వరు మహిమవలన. ౨౮

గీ. సోలెఁడు భుజించుఁ గట్టును । నాలుగైదు, మూరలది, యెంచఁ గోటులు । మూర్ఖుఁ డజ్ఞ
తావశంబున మట్టిపా । త్రంబునట్లు, లామరణమును జంచల । మప్పర బ్రదుకు! ౨౯

గీ. ఫలములున్న చెట్టునకు గ । బ్బిలము నెవరు, పిలిచెదరు రాఁగఁ బాలుచే । పి మొదవు దన
దూడకిడునట్లు దాతయెం । దు వసియించు, నచ్చటికిఁ దాను యేగెద । రర్థులెల్ల. 3౦

గీ. గతభవంబునఁ జేసిన । కార్యముల ఫ,లమును దముదామ కుడుతురు । కమలజువిధి
దుర్జనుల నేరు తీర్తురు। తొలఁగఁ ద్రోయ, వశమె యారెల్లఁ జేరియు । వారివిధిని. 3౧

గీ. తప్పపద్దెముకంటెను । నొప్పు మాట, గొప్పకులము కంటెనునొప్పు । గుణము పోర
వీఁగువీరునికంటెను। రోగి యొప్పు, ననతిఁగోనుకంటె బ్రహ్మచర్యంబె యొప్పు. 3౨

గీ. ఏఱునలనను గలిగెడు। నెగుడుదిగుడు, లట్లు కల్మియుఁ బెరుఁగును। నణఁగుఁ గాన
నన్నపానంబు లొసఁగుఁడీ । యర్థులకును, దీనివలనను జిత్తశు । ద్ధియగు మీకు. 33

చ. కఠినపదార్థమేనియు నొకప్డు । మృదుప్రకృతిం జయింపదా
కఠినపుటమ్ము మత్తకరి । కాయముఁ గాఁడును దూడిఁ గాఁడు నే
కఠినపు గడ్డపాఱకుఁ బగల్ప । నశక్యపుఱాతిబండ దాఁ
బెళిలున బ్రద్దలౌఁ దృణము । వేరులుపాఱిన వింత చూడుఁడా. 3౪

గీ. చదువుకొనకున్న ధనము వి । స్తారమున్న, యతని నందఱు నెదురేగి । యాదరింత్రు,
నిర్ధనుని భార్యయొల్లదు । నెరయఁ గనిన, తల్లి యొల్ల దతనిమాట । చెల్ల దెందు. 3౫

ఉ. పూయక కాచు వృక్షములు । భూమిని గల్గును జెప్పకుండనే
చేయఁగలట్టి బుద్ధిగల । చిన్నలు నుందురు, దున్ని మెత్తగా
జాయఁగ విత్తిన న్మొలవఁ । జాలని విత్తనమట్లు దుర్జనుం
డాయక యెంత చెప్పి బతి । మాలిన బోధము పుట్టునే మదిన్. 3౬

గీ. పీత, శుక్తి, కదళి । వెదురును నశియింపఁ, గనినబిడ్డ । యగును గారణంబు
తెలివి విద్య ధనముఁ । బొలియఁ గారణమగు, పరసతులనుగోరుఁ । వారిమనసు. 3౭

గీ. విధినిదొలఁగ జేయ । వేదాదివిద్యలు, చాల వాకటఁ జూపఁ । జాలుఁగాని
మనస! యెఱుఁగుమంచి । మార్గమునను ముక్తి, వెదకువారి కెట్టి । విధులు లేవు. 3౮

గీ. ముప్పదేఁడులవయసున । మూఁడు విడువ, వేద్యుఁ డగు భగవంతుని । వెదకకున్న
నతివమోముసుబట్టి ప్రా । యంబుఁ దెలియు, నట్టు లాతనిజ్ఞానంబు । నరయఁబడును. 3౯

గీ. వేదములు నుపనిషత్తులు । ద్వీపజన్ము, సూత్రములు గీతలును ధర్మ । సూత్రములును
శాంతి యధ్యాత్మరామాయ । ణాంతమునగు, నన్నియు నుమారమణుఁ దెల్పు । నవియె నమ్మ.

గద్యము. ఇది సుప్రసిద్ధవిదుషీమణి "అవ్వయార్" రచించిన "నల్వాషి" యనుద్రావిడ పుస్తకమునకుఁ గ్రొత్తపల్లి సూర్యరావుగారు కావించిన యాంధ్రపరివర్తనము.

---

శ్రీశైలమున కనిర్వచనీయమైన శోభను గలుగజేయుచున్నవి. శ్రీశైలము పురాతనమైన పుణ్యక్షేత్రమని దేశచరిత్రము, స్థలపురాణము, ప్రాచీనశిల్పము తెలుపుచున్నవి. శ్రీశైల మార్యులదక్షిణప్రస్థానమునం దొక ముఖ్యఘట్టముగ బరిగణింపబడిన విషయమును నిత్యసంకల్పము విశదము చేయుచున్నది. నిత్యకర్మానుష్ఠానమునందు హిందువులు సంకల్పమును జేయునపుడు స్థలనిర్దేశమునందు శ్రీశైలసంకీర్తనమును జేయుట నేటికిని పరంపరాగతమైన యాచారముగ నున్నది. సంకల్పమునందు

"పఞ్చాశత్కోటియోజనవిస్తీర్ణమహీమణ్డలే లక్షయోజనవిస్తీర్ణ జమ్బూద్వీపే। భరతవర్షే। భరతఖణ్డే మేరోర్దక్షిణదిగ్భాగే। శ్రీశైల స్యాగ్నేయప్రదేశే కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే। స్వగృహే। సమస్తదేవతా మాహేశ్వరసన్నిధౌ......................

అని దాక్షిణాత్యులు—ముఖ్యముగ నాంధ్రకర్ణాటకులు—శ్రీశైలసంకీర్తనమును జేయుదురు. ఈ సంకీర్తనము శ్రీశైలము పురాణప్రసిద్ధమైన మహాస్థలమని తెలియజేయుచున్నది.

### స్థలచరిత్రము

శ్రీశైలక్షేత్రచరిత్ర మితర పుణ్యతీర్థముల చరిత్రమువలె భావగర్భితమై పరమేశ్వరలీలావిలాసములను రమ్యముగ బోధించుచున్నది. శ్రీశైలము సుజలపూరితము; తరులతాగుల్మపరిశోభితము; ధాతుభరితము; దివ్యౌషధీవిరాజితము; సకలతీర్థవిభాసితము. మహర్షులు శ్రీగిరి నాధ్యాత్మికదృష్టితో జూచిన విధమును స్థలపురాణము దెలుపుచున్నది.

కృతయుగమునందు శిలాదుడను ఋషిపుంగవు డుండెను. ఆ శిలాదుడు లోకమచ్చెరువొంద శివుని గూర్చి మహాతపం బొనరించెను. ఆ మహనీయు డీశ్వరసాక్షాత్కారమును గోరుచు, నిడాపింగళాద్వారములనువశీకరణము చేసికొని, సర్వాంగనను మేలుకొలిపి, యోగాగ్నిని ప్రజ్వలింపజేసి, చిత్తంబును సహస్రారకమలంబునందు హత్తించి, సర్వేశ్వరుని గని మహదానందసమాధియందు మెలంగుచుండెను. పరమేశ్వరుడు ప్రసన్నుండై తపంబునకు మెచ్చి వరంబుల ననుగ్రహించెను. ఈశ్వరవరప్రసాదమున నిరువురు సుతులు గలిగిరి. వారు శైవదీక్షాపరాయణులై పర్వతుడు నందికేశుడు అను నామములను ప్రసిద్ధిని బడసిరి. పర్వతుం డఖండశివభక్తిపరవశుండై హిమవన్నగమునం దుగ్రతపం బొనరించెను. శివుడు తపంబునకు మెచ్చి ప్రత్యక్షమై పర్వతునకు కోరినవరంబుల నొసంగి యంతర్హితుండయ్యెను. శివప్రసాదమున పర్వతుండు శ్రీపర్వతరూపమును దాల్చెను. ఆ పర్వతమునందు మేరువు మొదలగు నగములు గంగాది పుణ్యతీర్థములు బ్రహ్మాద్యమరులు గణేశాది ప్రమథులు బసవేశ్వరాదిభక్తులు వెలయునటు లనుగ్రహించెను. మఱియును శిఖరసందర్శనమాత్రమునను జీవజాలంబులకు దురితాపహరణంబును భక్ష్యం డనుగ్రహించెను. శ్రీపర్వతంబునందు పార్వతీపరమేశ్వరులు భ్రమరాంబా మల్లికార్జున రూపంబుల వెలసిరి.

నందికేశ్వరుండును మహాతపం బొనరించి శంక
రునిమెప్పించి నందికేశ్వరత్వంబును వహించెను.

శ్రీగిరినామము

కృతయుగాంతమునందు సుమతి యను
మునిపుంగవుండు విలసిల్లెను. ఆమునికి శ్రీ
యను కన్నియ గలిగెను. ఆ కన్యక ఘోర
తపంబును జేసి మహాదేవుని మెప్పులను బడసి
పర్వతంబునకు స్వనామాంచితంబైన శ్రీపర్వ
తాభిధానంబును స్థాపించెను.

చంద్రగుప్తపురము

పూర్వకాలమునందు శ్రీశైలప్రాంతము
నందు మల్లికాపురంబను నొకపట్టణము
విలసిల్లుచుండెను. ఆ పురమును చంద్రగుప్త
మహారా జేలుచుండెను. చంద్రగుప్తమహా
రాజు సంతానార్థియై తీవ్రమైన తప
స్సును జేసి శంకరువరప్రసాదంబున సంతాన
లాభవరమును బొందెను. ఆసమయమునందు
చంద్రగుప్తుడు శత్రుసంహారవ్యసహారనిమ
గ్నుండై పండ్రెండేడులు దేశాటనమును జేయు
చుండెను. రాణి గర్భమును దాల్చి యొకకన్ని
యను గనెను. ఆ రాచకన్నియకు పురోహి
తులు జాతకర్మలను జేసి చంద్రమతి యను
నామకరణమును జేసిరి. చంద్రమతి నవయౌ
వనావిర్భూతమైన మనోహరాకారమును గలిగి
పెరుగుచుండెను.

చంద్రగుప్తుడు శత్రువులను జయించి
విజయధ్వానములతో సైన్యపరివారసమేతుడై
నిజనగరమును జేరెను. చంద్రమతి పితృ
వాత్సల్యప్రేరితయై పరమానందభరితయై
మృదుమధురగానములతో దండ్రికి కర్పూర
నీరాజనంబుల నెత్తి స్వాగతంబు నొసంగెను.
చంద్రగుప్తుడు లావణ్యామిషలోలుడై మోహా
పరవశుండై తనకూతును గామించి నీతిబా
హ్యంబులైన సంభాషణలను జేయుచుండెను.
సతీసుతలు మంత్రిపురోహితులు పరివారజన
ములు చేసిన ధర్మోపదేశములు రాజునకు
వెగటుగ నుండెను. ఆప్తజనముల హితోప
దేశములు, సాంత్వనవాక్యములు, నిందోక్తులు,
ధిక్కారవచనములు, నిరర్థకములుగ బరిణమిం
చెను. చంద్రమతి ధర్మారూఢయై తన తలి
దండ్రులను గృహమును పురమును వదలి, ఒక
గోపకుని సహాయమున కృష్ణానదిని దాటి, శ్రీ
గిరిని జేరి యుగ్రతపంబును జేసెను.

శ్రీగిరియందు తనపాడియావు పాలు పితు
కకపోవుటకు గారణం బరయుటకు గోపకుని
నియోగించెను. గోపకుడు స్వయంభువలింగ
మునకు గోవుక్షీరాభిషేచనమును జేయుట గను
గొని చంద్రమతికి నివేదించెను. చంద్రమతి
యుగ్రతపంబును జేయుచు మల్లికాకుసుమము
లతో బ్రత్యహము శివునిబూజించుచు గాలము
ను గడపుచుండెను. పరమశివుడు సుప్రీతుండై
చంద్రమతికి నిరంతరశివారాధన వరమును
బ్రసాదించెను. మల్లికాకుసుమార్చనలచే సు
ప్రీతుడైన మహాదేవుడు శ్రీగిరిమల్లికార్జున
నామమున బ్రసిద్ధిని గాంచెను. చంద్రమతి
యును మల్లికాకుసుమంబుల మల్లికార్జునుని
నర్చించుచు సకలలోకభజనీయమైన నీయం
బాహూపమున శ్రీశైలమునందు శాశ్వతవా
సమును గైకొనెను. భ్రమరాంబాలయము
మల్లికార్జునాలయమునకు దూరముగనున్నది.

ఇతరక్షేత్రములందు వలె శ్రీశైలక్షేత్రము నం దంశాలయము శివాలయమునకు పార్శ్వముననందు లేదు. చంద్రగుప్తపురము మల్లికా నగరము శాపగ్రస్తమై పాడుపడినది. శ్రీశైలమున కనతిదూరమునందు పాతాళగంగ కావలియొడ్డున పాడుపడియున్న చంద్రగుప్తపట్టణము నేటికిని నీపురాణగాధను సంస్మరింపజేయుచున్నది. కామరాజావృతంబైన మల్లికానగరము చైతన్యరహితమై జడత్వమునుబొందినది. త్యాగరాజావృతమైన మల్లికార్జునాలయము విపత్పరంపరల పాలయ్యు చైతన్యప్రదంబై సర్వజనారాధ్యంబై ప్రకాశించుచున్నది. మహాసంసారమునందు త్యాగభోగముల సమన్వయమును శ్రీశైలేతిహాస మతిరమణీయముగ బోధించుచున్నది. కామ మధోగతియందు భోగరూపముననను నూర్ధ్వగతియందు త్యాగరూపముననను బరిణమించుచు సుఖదుఃఖములకు మూలబీజ మగుచున్నది.

చంద్రమతి శివుని సతీత్వమును వేడలేదు. సంతానమును గామింపలేదు. సంపదలను గోరలేదు. కీర్తి నభ్యర్థింపలేదు. శివమయమైన నిరంతరశివారాధనమును శివారాధనలబ్ధమైన యంబాత్వమును వరించినది. భ్రమరాంబ భ్రమరకీటకన్యాయమున లోకాంబయై భక్తులకు సారూప్యము నొసంగి శుభస్థితి ననుగ్రహించుచున్నది. ఆదిశక్తి, అమ్మ-అంబ.భ్రమరాంబ స్వరూపములను నాత్మసమర్పణముచేయుచువిశ్వవికాసమునుజేయుచున్నది. ఈపరమరహస్యమునునితరక్షేత్రములవలెశ్రీశైలక్షేత్రమాహాత్మ్యమును బోధించుచున్నది.

### శ్రీపర్వతద్వారములు

శ్రీశైలపర్వతమునకు నాలుగుదిశలందును నాలుగు ముఖ్యద్వారములు గలవు. ఆ ద్వారములు త్రిపురాంతకము సిద్ధవటము అలంపురి ఉమామహేశ్వరము అనుపుణ్యద్వారములై ప్రసిద్ధిని గాంచినవి. ఆనాలుగు ద్వారముల నడుమనుగల భూమి పుణ్యప్రదమైన శ్రీశైలఖండనామమున బ్రసిద్ధిని బడసినది. శ్రీశైలఖండము ముప్పదియోజనముల పొడవును ముప్పదియోజనముల వెడలుపును గలిగి తొమ్మిదివందల యోజనముల విస్తీర్ణము గలిగియున్నది. ఈపర్వతమునకు ౧. పాకశాసనము ౨. వైడూర్యము 3. త్రిపురాంతకము ౪. పశ్చిమము ౫. బ్రహ్మేశ్వరము ౬. మాణిక్యము ౭. ప్రవాళము ౮. పుష్పశైలము నాఁబరఁగునెనిమిదిశృంగంబులు గలవు. పాకశాసనశృంగమునందు సానందసనంద,శుక్లయును, వైడూర్యశృంగమునందు గోమతియు కీర్తికళయును, త్రిపురాంతకమునందు తామ్రజాహ్నవి, చిత్రయును, పశ్చిమ శృంగమునందు భారతి, చారుఘోషిణి, అరుణయును, బ్రహ్మేశ్వరమునందు మహాజ్యోతి, జయ, విజయయును, మాణిక్యశిఖరమునందు వక్రపృథ, అతిస్మృతియును, ప్రవాళశిఖరంబునందుజ్యోతి,అర్చి,చతుర్వక్రములును, నష్టమంబగు పుష్పశైలశిఖరమునందు నుత్సవ,క్షేమ,శుక్లయనుతీర్థంబులును ముక్తిప్రదంబులై భాసిలుచుండును. మఱియును నాశైలంబునందున్నతంబులైననాలుగుశృంగములు గలవు. పూర్వశిఖరము దేవతావర్గమునకాలయమై గాంగేయమయమై హేమకూట

మని వెలయుచుండును. దక్షిణశిఖర మహో బిలమున మరకతరత్నస్థగితమై నారాయణున కాలయమై యలరుచుండును. పశ్చిమశృంగము నందిమండలమున వజ్రమయమై నందీశ్వరున కాలయమై భాసిలుచుండును. ఉత్తరగోపురము సోమేశ్వరమున ధాతుమయమై కుమార స్వామికి వాసస్థలమై విరాజిలుచుండును.

గలవు. శ్రీకాయ కరక్కాయ మాచికాయ తేనె మైనము మోదుగమాడలు మొదలగు వన్యజము లీయరణ్యమున నుత్పన్నము లగుచున్నవి. రాగి ఇనుము సీసము బంగారము వజ్రములు మొదలగు ఖనిజములు నల్లమలకొండ లందుగలవు. అడవియందంతయును కాగితములను జేయుట కనుకూలమైన వెదురుపొదలతో నిండియున్నది.



యాత్రికులు అన్నము వండుకొని భుజించుట

గుండ్లకమ్మ, రాళ్లమడుగు, తీగలేరు, కండ్లేరు, దువ్వలేరు, సాగిలేరు, గాలేరు, భవనాశి మొదలగు నదీనదములు నల్లమల కొండలందు పుట్టుచున్నవి. నల్లమలకొండ లందు 3000 అడుగులు ఎత్తు గలశృంగములు

### భౌతికలక్షణములు

నల్లమల ఎఱ్ఱమలకొండలు కర్నూలు మండలమునందు విశేషమైన ప్రదేశము నాక్రమించుకొనుచున్నవి. వెల్లికొండలను వేఱొక కొండలవరుసలు కర్నూలునకును నెల్లూరికిని నడుమను గలవు. నల్లమలయడవులు ౨౦౦౦ చదరపుమైలుల ప్రదేశము నాక్రమించుకొని యున్నవి. అడవియందు తేకు మద్ది చంద్ర చందనము బిల్వము మొదలగువృక్షరాజములు

గలవు. ఈ కొండలందు బుట్టుచున్న ఏఱులు కంబము త్రిపురాంతకము మొదలగుచెఱువుల నీటికాధారములుగ నున్నవి. అరణ్యములందు పెద్దపులులు చిఱుతపులులు ఎలుగుబంట్లు పందులు మొదలగు క్రూరమృగములు గలవు. నగశృంగములు కొండలోయలు కారడవులు విశాలోన్నతవృక్షములు వెదురుపొదలు కొండవాగులు నదీనదములు పెద్దచెఱువులు నీటిబుగ్గలు మున్నగు ప్రకృతివైభవములు

శ్రీశైలయాత్ర కనిర్వచనీయ మైన శోభను గలుగజేయుచున్నవి. యాత్రికులు కులగోత్ర భేదములను మఱచి వనభోజనములను జేయుచు గుంపులు గుంపులుగా కొండల నెక్కుచు దిగుచు శివనామస్మరణమును జేయుచు కీర్తనలను బాడుచు శ్రీశైలయాత్రను పరమోత్సాహముతోఁ జేయుచుందురు. మనుజులు తమయల్పత్వమును మఱచి దైవమహత్వమును ధ్యానము చేయుటకు శ్రీశైలయాత్రాపరిసరములు పరమప్రయోజనకరములు.



మల్లికార్జునస్వామివారి ఆలయము

శ్రీశైలచరిత్రము

నిత్యకర్మానుష్ఠానసంకల్పమునందు దేశనిర్దేశమును జేయుటకు శ్రీశైలసంకీర్తనమును జేయుటవలనను శ్రీశైల మార్యులకు బురాతనమైనవాసస్థలమనిస్పష్టమగుచున్నది. మహర్షులు శ్రీశైలమునం దాశ్రమములను గల్పించుకొని యార్యవిజ్ఞానమును దక్షిణాపథమునందు వ్యాపింపజేసినటులు సంకల్పవిధానము స్పష్టము జేయుచున్నది. ఋషియుగమునం దే మహర్షులు శ్రీశైలాద్రియందు నివాసము చేసినదియును నిర్ణయించుటకు దగిన యాధారములు కనబడవు. మహాభారత రామాయణములందు శ్రీశైలక్షేత్రము పేర్కొనబడినది. గోకర్ణస్వామియును నవనాథసిద్ధులును శ్రీశైలమునందు నివసించినటులు గాథలుగలవు. ఋషియుగమునందు వేదవిజ్ఞానవ్యాపనమునకువలె బుద్ధయుగమునందు బౌద్ధధర్మవ్యాపనమునకు శ్రీశైలక్షేత్రము తోడ్పడినది. కృష్ణానది కెడమ పార్శ్వమునందు గల శిథిలమైన చంద్రగుప్తపురము గుప్తరాజ్యవ్యాపనమును దెలుపుచున్నది. చంద్రగుప్తపురము మౌర్యవంశజుడైన చంద్రగుప్తునిపేరను స్థాపితమై యుండవచ్చునని చరిత్రకారులు నమ్ముచున్నారు. దపశాలిప్రాంతమునగల అశోకుని ధర్మ శిలాశాసనములు శ్రీశైలప్రాంతమునందుఁ గానరాకున్నను శ్రీశైలము బౌద్ధమతవ్యాపనమున కశోకచక్రవర్తికాలముననే ప్రఖ్యాతిని గాంచినదని శ్రీశైలక్షేత్రపరమైన చరిత్రవలన నూహింపఁదగియున్నది శాలివాహనశకారంభమునకుఁ బూర్వము నివ నాగార్జునుడు శ్రీశైలక్షేత్రమునందు

సించినటులు బౌద్ధగ్రంథములు వెల్లడిచేయు చున్నవి. శ్రీగిరియం దొకభాగము నాగార్జున కొండ యనుపేరిట నొప్పుచున్నది. నాగార్జును డాంధ్రదేశస్థుడని చరిత్రకారులు నిర్ణయించు చున్నారు. నాగార్జునుడు రసవాదమునందు పరిశ్రమచేసి దేశమునందంతటను ప్రసిద్ధిని గడించిన సిద్ధపురుషుడు. ఓషధుల తత్త్వ ము బరిశీలించి ఆయుర్వేదమును వృద్ధి చేసెను. బౌద్ధధర్మమును భరతవర్షము సందర్శించిన చీనాయాత్రికుడు హియాన్ సాంగు శ్రీశైలబౌద్ధారామమును వర్ణించెను. శ్రీశంకరాచార్యులు ద్వాదశలింగ స్తోత్రము నందును శివానందలహరియందును నిటులు స్తవముచేసెను.

శ్లో. సంధ్యారంభవిజృంభితం, శ్రుతిశిర
స్థానాంతరాధిష్ఠితం,
సప్రేమభ్రమరాభిరామ మసకృ
త్సద్వాసనాశోభితం,



అలమపు ప్రహరీయందలి శిల్పము

నందును త్రివిష్టపమునందును వ్యాపింపఁ జేసి సిద్ధత్వమును బడసెను. నాగార్జునుని కాలమునందు శ్రీశైలక్షేత్ర మమరావతి వలె నాంధ్రదేశమునందు సుప్రసిద్ధమైన బౌద్ధా రామముగ నుండియుండెను. ఆంధ్రరాజుల వినాశము బౌద్ధమతసంక్షయము శ్రీశైల క్షేత్రక్షీణదశకుఁ గొంతకారణం బైయుం డును. ఏడవశతాబ్దమునందు భరతఖండమును

భోగీంద్రాభరణం, సమస్తసుమనః
పూజ్యం, గుణావిష్కృతం,
సేవే శ్రీగిరిమల్లికార్జున మహా
లింగం శివాలింగితం.
(శివానందలహరి.)

శ్రీశైలశృంగే విబుధాతిసంగే
తులాద్రితుంగే౽పి ముదా వసంతమ్
త మర్జునం మల్లికపూర్వ మేకం
నమామి సంసారసముద్రసేతుమ్॥
ద్వాదశజ్యోతిర్లింగస్తోత్రం.

(సశేషము)

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(ప్రేమస్వరూపనిరూపణము)

## ప్రథమభాగము

అద్వితీయైకపరమేశ్వరాభిలాష, జనితమాయాప్రపంచనిసర్గమైన
వాఙ్మనసకాయకర్మప్రవర్తనముఁ, బ్రేమ మూలంబ మనుట వివేకిమతము.

గీ. అరయ నాప్రేమ కాశ్రయం బగు మనస్సు, గాన దానిస్వరూపంబు గాంచి పిదప
నాశ్రయాశ్రయిసంబంధ మనుసరించి, దాని కబ్బినగుణములు గాన నగును.

గీ. బుద్ధియు నహంకృతియుఁ జిత్తమును మనస్సు, నాఁగ నంతఃకరణ మొప్పు నలుఁదెఱఁగుల
నందు మనప్రేమ కాశ్రయ మైనమనసు, నేకరణి నిర్వచించిరో యెఱుఁగవలయు.

క. ఆరయ నశరీరవ్యవ, హారుండగు పురుషునింద్రియంబుల కెల్లన్
శారీరకమీమాంసా, సారజ్ఞుఁడు వల్కు మానసం బధిపతిఁ గాన్.

సీ. [1]కామసంకల్పవికల్పాత్మకంబయి, ధర్మార్థసాధనాధార మగుచు
సుఖదుఃఖములకును జోటగుచుండియు, నసకలేంద్రియప్రవర్తకము నగుచు
[3]శాంతివైరాగ్యదిశాంతవృత్తులకును, రాగలోభాదిఘోరంబులకును,
మోహభయాదికమూఢవృత్తులకుఁ బదంబును, [2]జ్ఞానసాధనము నగుచు
నంతరింద్రియమను మనస్సలరు ననుచు, నిర్వచించిరి వేత్తలానిర్ణయమున
నన్నివృత్తుల నిమిడినయట్టిప్రేమ, నాగుణంబులు గలుగుట యబ్బురంబె?

గీ. ఆమనసె యంతరింద్రియ మనఁగ హృదయ, మనఁగ మానస మనఁ జిత్త మనఁగ బరఁగి
కర్మబంధమోక్షములకుఁ గారణంబు, గాఁగఁ బ్రేమంబునకు నాలవాల మయ్యె.

గీ. మఱియు నమ్మానసంబు తామసము రాజసంబు సాత్త్వికమగుచుఁ దక్కంకులంబు
నగుచుఁ బ్రాక్తనసంస్కార మనుసరించి తత్తదనురూపవిషయప్రవృత్త మగును.

గీ. అట్టిత్రిగుణాత్మకంబైన యంతరంగ, మెందుఁ జొచ్చిన నది ప్రేమహేతుకమని
సకలలోకానుభూతదృష్టాంతసరణిఁ, దరిచి చర్చింపఁగా నిజ మరయవచ్చు.

చ. హృదయము నంటి యుండుటఁ దదీయగుణంబులు ప్రేమ కబ్బఁగా
నదియును దామసాదికగుణాంచితమై బహువేషధారియై

---

౧. కామఃసంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతి రధృతి హ్రీర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మనః—ఇతి శ్రుతిః

౨. ౪. న్యాయమతము. 3. సాంఖ్యమతము.

మొదఁ బొడిగొన్నయట్టివివిధేచ్ఛల కుద్భవబీజమై తదా
స్పదమయి యింద్రియంబులు వశంబులుగా విహరించు నెల్లెడన్.

గీ. సరవి నది తామసంబు రాజసము సాత్త్వి, కంబు సద్వయ మద్వయాకార మనఁగఁ
బంచవిధ మయ్యె బహుభంగిఁ బరఁగుచుండు, వరుసఁ దల్లక్షణంబుల నరయవలయు.

సీ. మదమోహమాంద్యాదిమలిన మైనట్టిది, తామసప్రేమ నాఁ దనరుచుండు
మత్సరలోభకామక్రోధకలుషంబు, రాజసప్రేమ నాఁ దేజరిల్లు
భక్తి ధర్మజ్ఞానభాసురం బైనది సాత్త్వికప్రేమ నా జగతి వెలయు
జీవేశ్వరవిభేదభావ ప్రసిద్ధంబు, సద్వయప్రేమ నా సందడించు,

గీ. విమలవైరాగ్యసదసద్వివేకమూల, శమదమాదికసాధనసంపదుదిత
మహితమహిమాత్మధీభాసమాన, మైన దద్వయప్రేమ యగును సోఽహ మ్మనంగ.

క. తామసరాజసములు ధర, నీమండల మెల్ల మెసల నిండుట మున్నా
ప్రేమంబుల బహుగతు లగు, బూమెలు వివరింతు లక్ష్యపూర్వకఫణిశిలిన్.

గీ. ఇంద్రియసుఖంబులకుఁ బ్రాణి యింద్రియంబు, లెల్లవిషయంబులందుఁ బ్రవృత్తిఁ గాంచు
నదియె రాజసగుణ మయ్యె నందుఁ గలుగు, మంచిచెడ్డలు గనమి తామసగుణంబు.

గీ. కాన బహువిధవిషయ సుఖప్రవృత్తిఁ, గాంచి రాజసతామసాకార మగుచు
లౌకికప్రేమ యొప్పుఁ దల్లక్షణంబు, లుభయనామంబుల నభేద మొందు నిందు.

గీ. జనకపతిదారతనయాదిజనులయందు, నొక్కరొక్కరి కొరులపై నున్నయట్టు
లరయవచ్చెడిప్రేమ మహాత్మార్థ మగుటఁ, సహజసిద్ధంబ యగు నరజాతి కెల్ల.

సీ. ఇలరయ ననాద్యవిద్యానిమిత్తంబును, జన్మపరంపరాసంగతంబు
దారపుత్రాద్యన్యధర్మంబులును దేహ, ధర్మంబు లింద్రియధర్మములును
దనయందుఁ జూచునధ్యాసభావంబున, సిద్ధమై యాజన్మసిద్ధము నగు
నేను నా దనియెడిమానవవ్యవహార, మంతటఁ బ్రత్యక్ష మగును గాదె?

గీ. అట్టినైసర్గిక వ్యవహారమునకు, బీజ మాతామసిక మైనప్రేమ గాదె?
యట్లగుట సాజ మైహిక మైనప్రేమ, సర్వ మాత్మార్థ మనుట విస్పష్ట మయ్యె.

గీ. ఇట్టి దయ్యును సత్త్వాంశ మించు కంత, యందు నందును గన్పింప నలరి, రాజ
సంబు తామస ముభయమిశ్రంబు నైన, ప్రేమనై చిత్రి జగ మావరించె నిట్లు.

నైసర్గికప్రేమ

ఉ. జీవుఁడు పూర్వజన్మమునఁ జేసినచేఁతల మంచిచెడ్డలు
న్రీవలయంబునం దనుభవింపక తీఱనిదాన దానవి

౧. ''తత్ప్రేమాత్మార్థ మన్యత్ర నైవ మన్యార్థ మాత్మని'' పంచదశి ౨. శంకరాచార్యమతము.

ద్యావశవర్తియై జనన మందుచునుండును గాని యొక్కనిం
గావఁగ నొక్కఁ డిం దొడలు గాంచఁ డటందురు తత్త్వకోవిదుల్.

గీ. తల్లికడుపునఁ బడినట్టి తఱిని జీవి, తనదుకర్మంబునకుఁ దగుతనువు దాల్చి
యాశరీరంబు దాను గా నవనిఁ బుట్టు, నదియె దేహాత్మబుద్ధిమాయాగుణంబు

క. కావున నాత్మప్రేమము, జీవుల కాగర్భవాససిద్ధం బగుచున్
భావింప నేక మయ్యును, వేవిధముల దోఁచుచుండు విరిసినకొలఁదిన్.

చ. ఒకనిముసంబు తల్లిఁ గన కుండిన నెంతయుఁ బోరుపెట్టుపి
ల్లకుఁ గలభావ మేమి? తను లాలన సేయుచుఁ బాలొసంగి యె
త్తికొనఁగఁ దల్లి వచ్చు ననుకోఱమియే కద! కాక యున్న మ
చ్చికపడి దాదిచెంతకును జేరునె? దానికి నట్టు లేడ్చునే?

చ. తెలియఁగఁ దాను గాని దగుదేహము దానుగ నమ్మి దానికై
పలువిధ మైనరక్షకు నుపాయము లారయు చింత కాలిలో
ములు దిగెనేని పోయె నని మొఱ్ఱలు వెట్టుచు వచ్చుకష్టముల్
దలఁపక యాశరీరము యథార్థముగాఁ దలపోయుచుండఁడే?

గీ. తనువు శాశ్వత మని నమ్ముమనుజులందుఁ, దనువు లొఱఁగినజీవుల తనువు లింకఁ
గనఁగ రాకున్కి నిచ్చలు గనుచునున్న, దనతనువు నిక్క మనుభ్రాంతి తలఁగు నెక్కొ?

చ. కలిగిన లేక యున్నఁ దనకాంతను బుత్రులఁ గూర్మిఁ గాచు టెం
దుల కని? తా సుఖంబునిధిఁ దోఁగుటకేకద! కానినాఁడు వా
రలు గతియించిరేని వనరం బని యేమి? తదాత్మసౌఖ్యముల్
తలఁగిన వన్నదుఃఖము గదా? కనుఁ డిందలిప్రేమతత్త్వమున్.

ఉ. కారణ మిట్టి దైనను జగంబునఁ బెక్కురు ప్రేమమూఢులై
దారసుతాదిపోషణవిధానమునం బడరానిపాట్ల వే
సారుచు నాత్మసౌఖ్యలవసంగతి లేకయ తాము వారికై
ధారణిఁ బుట్టినట్లు పరితాపము నొందరె చచ్చునంతకున్?

గీ. ఈవిచారణ యి ట్లుంచి యింక నిపుడు, ప్రేమవైచిత్రి మొదలఁ జూపింపఁ దలఁచి
చదువరుల కొక్కమాట యీసమయమందు, మనవి చేయుచునున్నాఁడ మఱవరాదు
తనకుఁ దనయందు నొరులయందును గనఁబడు, వివిధ మైనట్టిమనుజునిప్రేమ మెల్లఁ
దలఁప నాత్మార్థ మగుట సత్యంబ యయ్యుఁ, గార్యవశమున వేఱుగాఁ గానవచ్చు
నంతమాత్రాన నన్యార్థ మగు నటించు, ననఁగ రా దనునదియ నామనవి, యింక
శైశవం బాదిగా దానిచర్య లెల్ల, నరయఁగాఁ దగు లోకంబు తరిచి తరిచి.

---

# శ్రీ రామా!

(ఒక కథ)

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు

౧

"ఓలమ్మోయి! ఓలప్పోయి" యని కీళ్ల నెప్పులచే మూల్గుచు నులకమంచముపైఁ బరచిన ప్రాతకంబళిపైఁ జిన్నపీటఁ దలక్రిందఁ బెట్టుకొని ప్రక్కవారుగఁ బండుకొని యున్న ముసలిమొగపుఁ జంద్రవదన కుడిచీలమండ కమృతాంజనమును రాయుచు రామరావు కాళ్లకడ నున్న చేదత్రాళ్లవరుసపై బొట్టనవ్రేళ్ల మోపి కూరుచుండెను. "అబ్బ! నిమ్మళిమయ్యా యని చెప్పఁగ నంతగట్టిగ రాచెద వేల? మనుష్యుఁడవు కావా? దున్నపోతవా?" యని యావృద్ధవేశ్యామాత రామరావును దిట్టి యెడమపాదముతో నట్టె తన్నెను. సుఖాసీనుఁడు కాకపోవుటచేఁ గాఁబోలు హఠాత్తుగ లభించిన పాదతాడనమున నాతఁడు మంచము నుండి క్రిందికిఁ బడిపోయెను. పడుచువాఁడు కావున వెంటనే కందుకమువలెఁ బైకుబికి 'నన్నుఁ దన్నెదవా' యని యాతఁడు ముసలిదానిపైఁ దీండ్రించెను. "ఏమోగోల! దిక్కుమాలినకొంప. ఎండవేళ రవంతసేపు నడుము వ్రాల్చెదనన్న నొక్కటేయల్లరికదా! మీమొగములు మండ!" యనుచుఁ జవాలున గది తలుపు తెఱచి, యెడమయఱచేతి నెండకాపునకై చికిలికన్నులకడ్డముపెట్టుకొని, పైఁట మోచేతిలోవంపువఱకు జాఱి వ్రేలాడ, నిదురమబ్బున వదలిపోయినకచ్చను ప్రక్కబారున వంగి కుడిచేత సర్దుకొనుచు గదిముందరి చిన్నయరుగుమీఁదికి వచ్చి సరసిజాక్షి నిలువఁబడెను. "సరమ్మా! చూచినావఁటె! నీమగఁడు నన్నుఁ గొట్టఁబోవుచున్నాఁ" డని కూఁతుతోఁ దల్లి మొఱపెట్టుకొనెను. "నన్నుఁ దన్నినప్పుడు నేను దానిపైఁ గోపపడుట తప్పా" యని రామరావు తనకు జరిగినపరాభవమును సరసిజాక్షితో విన్నవించుకొనెను. "నేను నిన్నుఁ దన్నితినా? ఒట్టుపెట్టుకొని చెప్పఁగలవా? ఒక్కకొడుకును బెట్టుకొని బ్రదుకుచున్నాను. అడ్డుగోడమీఁది చీట్లపేక నెత్తిపైఁ బెట్టుకొని ప్రమాణముచేయు" మని చంద్రవదన రామరావును గద్దించెను. "అత్తయల్లురపరిహాసములా? ఏడ్చినట్లే యున్నది. నీకు సిగ్గు లేదు. అతనికి సిగ్గు లేదు. తిండికిఁ బూటకూటింటికిఁ బోయినవాఁడవు వెంటనే రాక యింతయాలస్య మేల చేసితివి? ఇంటికిఁ బోయితివి కాఁబోలు! నీయిల్లు మాసిపోను! ని న్నెంత నెత్తిమీఁదఁ బెట్టుకొన్నను, నీకింటి దృష్టిమాత్రము చచ్చిననైన వదలదు. నాకే బుద్ధి లేక వలపులాడినై దేవులాడుచున్నాను" అని సరసిజాక్షి రామరావునకు సంసారపరిత్యాగమునుగూర్చి సంక్షేపముగ బోధించి స్ఫోటకపుమచ్చలచే మొక్కజొన్నపొత్తివలె నున్న మొగముపైఁ బీచువలె ముంగురులు

వ్రేల గిరుక్కున గదిలోనికిఁ బోయెను. "బ్రాహ్మణుఁడు కాఁడు. ఏమనుకొన్నావో" గాయత్రితోడు. ఇంటికిఁ బోయితి ననుచున్నావా? నాకేమి బుద్ధి లేదను కొన్నానా? అయినయింటివాఁడను గానను కొన్నావా ? అడుగు మంతురసాని నడుగు. ఆసుపత్రికి మీయమ్మకు మాత్రలకొఱకుఁ బోయితినో లేదో. సర్జనుగారిబిడ్డ సమర్తాడుటచేత నాతఁ డాలస్యముగ వచ్చినాఁడు. రెండుమాత్రలు తెచ్చి మీయమ్మ కిచ్చితినో లేదో మీయమ్మ నడుగు" మని పలుకుచునే రామరావు గదిలోనికిఁ బోయెను.

సర: నెల కొకరూపాయ నల్లమందు కొఱకా ముండమొగమునఁ గొట్టరాదా? అది కారాలు మిరియాలు నూఱుట యెందులకు? నీవు దేవులాడుట యెందులకు? నే నిప్పించినాను గానని యాముసలిది నన్నుఁ గోసికొని తినుట యెందులకు?

రామ: ఒకరూపాయ నాకెట్లువచ్చునను కొన్నావు? పదునాలుగెకరాలపొలము నీపేర వ్రాసియిచ్చితినిగదా! ఆసిస్తేకో నీవే వసూలు చేసికొనుచున్నావు కదా! నాతిండిమట్టుకుఁ బూఁటకూటియింటిదానికి నీవే యిచ్చుచున్నావుకదా! నేను రూపాయ నెక్కడనుండి తీసికొనిరాగలను? పేకయాటలో బేస్తుడబ్బులు నాలుగు మిగిలినప్పుడు చుట్టలు కాల్చుచున్నాను. లేనప్పుడు లేనేలేదు.

సర: పదునాలుగెకరాలపొల మని పదే పదే దేవ్రులాడెద వెందులకు! నాపేర వ్రాసియిమ్మని నేను గోరితినా? ఆపొలము క్రిందటిసంవత్సరము పండినదా యేడ్చినదా? టొక్కుమని క్రొత్తకాసు పొలమునుండి రాలేదు. వంటపూఁటయమ్మకు నెలకుఁ బండ్రెండురూపాయలు నిత్యవిధిలాగున నిచ్చుకొనుచున్నాను.

రామ: అందులకు నే నేమి చేయవలసినది?

సర: నే నింక బూఁటకూటిసూరమ్మకు నెలముడుపులు కట్టలేను. నీయిష్టమైనయెడల మాతోపాటు రెండుపూఁటల నాల్గుమెదుకులు తినుము.

రామ: అయ్యయ్యో! బ్రాహ్మణత్వము భగ్నమైపోదా?

సర: నీ కిప్పు డుండి యేడ్చినదా?

రామ: ఏఁటేఁట నింటికిఁబోయి తండ్రితద్దినము పెట్టుచున్నానుగాదా? బ్రాహ్మణత్వమున కంతకంటె నేమినిదర్శనము కావలయు?

సర: పోనీ! తిండికిఁగూడ మీయింటికే పోవుచుండఁగూడదా?

రామ: నేనుబోను. ఎవరైనఁ జచ్చినప్పుడింటికి వెళ్లవలసినదేకాని యీలోపలఁ బోవనని ప్రతిజ్ఞ చేసికొన్నాను.

సర: మీయమ్మయొద్దఁ గొంతముల్లెయున్నదఁటే ?

రామ: ఉన్న వినియోగ మేమి? ఆమె చావఁబోవునప్పు డది కోడలికిచ్చునుగాని నాకీయదు.

సర: చేతగానిపెద్దమ్మవు. ఆమె యిచ్చుట యేమి? నీవు పుచ్చుకొనుటయేమి? నెత్తినాయఁ గొట్టి యాసొమ్మేదో నీవు తీసికొనరాదా?

రామ: ఆసొమ్మింటియొద్ద నున్నట్లు లేదు. ఎవరికో కాని మాయమ్మ బదులిచ్చిన

దనుకొందును. నా కాసంగతియేమియుఁ దెలియదు. ఆసొమ్మువడ్డీ పెట్టుకొని కాఁబోలు వారుముగ్గురు గంజిత్రాగుచున్నారు. వారి జోలి నా కక్కఱలేదు; నాజోలి వారి కక్కఱలేదు. ఆలాగున నామనస్సులో నిదివఱకే స్థిరపఱచుకొనియున్నాను.

సర: అట్లైన ముందుమాట నేమి?

రామ: ముందుమాటముష్టి. బ్రాహ్మణునకది తప్పుగాదులే.

సర: చూడు. ముష్టియనఁగా జ్ఞప్తికివచ్చినది. చేబియ్యపుశాస్త్రులుగారి నెఱుఁగుదువా?

రామ: నే నెఱుఁగను.

సర: ఆఁ! ఎఱుగ కేమి? నల్లగాఁ బొట్టిగా నుండును. మనయూరిలోనికచ్చేరిలోఁ జెట్టుక్రింద వకాల్తిపని చేయుచున్నాఁడే! ఆయన——

రామ: సరే. ఆయనమాట యేమి?

సర: ఆయన, యావలివీధిలోనున్న సిమ్మిసానితో నన్నాఁడఁట-ఏమనియా?

రామ: ఏమన్నాఁడో తరువాతఁ జెప్పవచ్చును గాని నే నెఱుగనిసిమ్మిసాని యెవతె?

సర: సిమ్మిసాని నెఱుఁగవు? సీమంతిని. సిమ్మి యని ముద్దుపేరు.

రామ: ఆలాగా? దానితో వకీలుగా రేమన్నారు?

సర: రామరావు సరసిజాక్షమ్మగారికి వ్రాసియిచ్చినపత్రము చెల్లదు. అది పిత్రార్జితమైనపొలము. మైనరు పెద్దవాఁడైన తరువాత దావా రాక తప్పదని యన్నాఁడట.

రామ: నాలుగేండ్లగొట్టెకాయ బ్రదుకుట పెద్దవాఁడగుట ఏమో? ఎక్కడిమాట. గుండ్రాలు కూలిపోవుచున్నవి.

సర: నీనోటివాక్యమున నట్లు జరుగునెడల బాధయే లేదు. ఒకవేళ బ్రదికి పెద్దవాఁడైనయెడల నెట్లు?

రామ: అది పేకతోఁ జేరిన వ్యవహారమగునెడల నేను జెప్పఁగలనుగాని, యది 'లా' తోఁ జేరినసంగతి కాఁబోలు నాకెట్లు తెలియును? ఆవకీలునే యడుగలేకపోయినావా?

సర: నే నడుగలేదుకాని సిమ్మియే యడిగినది.

రామ: ఏమన్నాఁడు?

సర: ఆపిల్లవాఁడు రామరావుకుఁ బుట్టలేదని యెదురువాదము వచ్చునెడలఁ బత్రము స్థిరపడు నని చెప్పినాఁడఁట.

రామ: ఆవాద మెన్నడు నెగ్గదనుకో. అది యిల్లాలు. అది కాక నాకొడుకునకు నాకు మూఁడుమూర్తులను భేద మేమియు లేదు.

సర: అంతయిల్లాలు-అంతమగనాలు అంతె అరుంధతియే యగునెడల నామెనేలవదలితివి?

రామ: నేను నిజముచెప్పుచున్నాను. నీయభినయమును జూచి నేను నీకు వశుఁడనైతిని. అంతకుఁబూర్వ మిల్లు కదలి యెఱుఁగను. కరణముగారి పెండ్లిలో మొదట నీయభినయమును జూచితిని. అప్పటికి నాభార్యకై దవనెల చూలు. అప్పటినుండియు నీయధీనుఁడ నైతిని. సమయము కనిపట్టి తండ్రిగారు కూడఁ జల్లఁగ వెడలిపోయినారు. ఇఁక నేము

న్నది ? ఆడినది యాట పాడినది పాట. నీకుఁ దెలియని యంశమా యేమి?

సర: చూడు రామరావు ! నాయభినయ మంతసొగసుగా నున్నదంటోయి ?

రామ: నీయభినయములో జీవకళ యున్నది. నే నది యేదో తిన్నఁగఁ జెప్పలేకుండ నున్నాను. నీవు కోరచూపభినయించెదవనుకో. ఆచూపక్కడనే నిలిచిపోదు. ఆకోర కోర కొంతదూరమునకుఁ బ్రాకిపోవును. ఏలూరి సానియభినయమును గూడఁ జూచినాను. అది పట్టిచిట్టకట్టు; నీయభినయములోఁ గల్పన యున్నది. అంతేగాక ఈయుబుకు, ఈయొయ్యారము, ఈరామణీయకము, ఈరాచకేవి, దాని యభినయమున నెక్కడివి ?

సర: రామరావూ ! సానిపలుకులలో సత్య మెక్కడనని లోకమందలి వెఱ్ఱిముండ కొడుకులతోపాటు నీవుగూడ నన్నమెచ్చఁ జెప్పలేనుగాని నీవిద్యారసికతను గ్రహించియే నీకు దక్కితిని. నగలకేమి నాణెములకేమి ? మాన్యములకేమి మళ్లకేమి ? కావలసినది విద్య పనికిమాలిన తనువులు ! ఈవేళ పోవు నెడల రేపటికి రెండు. రామరావు సరసిజాక్షికి మగఁడన్నకీర్తి లోకములో నున్నంతకాలము నీకు స్వర్గలోకమే కదా.

రామ: స్వర్గలోకమునకుఁ బోవు నెడల మాత్ర మేమున్నది ? రంభయేకాదా ? అది యిచ్చటనే యున్నదికాదా ? ఎండపొడ గదిలోనికి వచ్చుచున్నది. తలుపు వైతునా ?

సర: సరేకాని యావిసనకఱ్ఱ యొక్కసారి పట్టుకో. నీకుఁ గాసికిఁబోయినంత పుణ్యము.

రామ: నాకుఁ గూడనిద్ర వచ్చుచున్నది. నేనుగూడఁ బండుకొందును.

సర: నీయిష్టము కాని యదేనిద్ర పోయెద వేమో? ఈదినము శనివారమని తెలియునా? పసువులసంతకుఁ బోయి ముజ్జుపాలు తీసికొని రావలయును?

రామరావు సరసిజాక్షియునిద్రించిరి.

౨

“ అమ్మా!వీరాయింటిదొడ్డిలో సీమచిత్ర మూల మున్నదా ” అని సాన తనముందు పెట్టుకొని మందులసంచి విప్పుచున్నదేండ పీర భద్రుఁడు సీతమ్మ నడిగెను. ‘ సీమచిత్రమూల మేలాగున నుండునో నేనెఱుఁగ”నని యామె బదులు చెప్పెను. “ ఆకుదెముడాకో ” యని దేండ్రధన్వంతరి యామె నడుగ నే నెఱుఁగనని యామె ప్రత్యుత్తరమిచ్చెను. “అమ్మా! నాల్గు తమలపాకులు తెమ్మ”ని తిరుగ నాతఁ డడుగ నామె తల వంచుకొని కొంతసేపటివఱకు ఒక్కమొగము పైచుకొని నిట్టూర్పుపుచ్చి తమలపాకులు లేవని యామెచెప్పెను. ఆకులు తెప్పించెదమన్న నడురాత్రి కొట్లు తెఱచి యుండునా? ఉండినను దెచ్చిపెట్టువారెవ్వరు? ఇంటిలో నులకమంచముపై నొక ముసలి యామె శ్లేష్మబాధచే గొండ్రించుచున్నది. ఆమెకు గుండెలురాయుచుఁ బ్రక్కలొత్తుచుఁ గాళ్లు పట్టుచు సీత సకలోపచారములు చేయుచుండెను. త్రైలోక్యచింతామణి రెండుగురి వెండపూసలమెత్తు నీటితో నరుగ దీసిచిన్న గరిటెలోఁ బోసి “ అమ్మా! ఇది మీ యత్తగారిగొంతులోఁ బోయు”నిమ

వైద్యుఁ డామెచేతి కిచ్చెను. ఆమె యట్లొనర్చెను. పిమ్మట వాఁకిటిలో వైద్యుఁడు చుట్టఁగాల్చుకొనుచుఁ గూరుచుండెను. కొంత సేపటి కామె కాయాసము తగ్గినట్లుండెను. “అమ్మా! సీతా! సానియింటనుండి నాకొడుకు రాఁడు. నాకుఁ గొడుకవైనను గోడలవైనను నీవే. నాయవసానమును గనిపెట్టియుండుము పంచపాళిలో రుబ్బురోటి క్రిందఁ గొంతధన మున్నది. నాకర్చులకుఁ దగుమాత్రము వినియోగపఱచి శేషించినదాని నెటనైన దాఁచికొని వంశాంకురమైన కుఱ్ఱవానిని బెంచుకొనుచుండుము. నీవు మహాత్మురాలవు. పుణ్యశీలవు. నీకు భగవంతుఁడు కష్టశాంతిని శీఘ్రముగఁ జేయును. నీవు కంటఁ దడిపెట్టకుము” అని నిమ్మళముగ సీతతో నామె యత్త చెప్పెను. “అత్తా! మీపరిచర్య నాకింక ఋణము లేకపోవునా? మీకుమారుఁ డింటికి రాకున్నను మీ రింటిలోఁ బెద్దదిక్కుగా నుండుటచేతనే నేనును బిల్లవాఁడును బ్రదుకుచున్నాముకాని మీరు లేకున్నయెడల బ్రదుకుటెట్లు? అత్తా! కర్మాధికారియైన కొడుకు మీయవసానమున మీయొద్ద నుండవలయును గాని, నిర్భాగ్యురాలనైన నేనున్న వినియోగమేమి? అదిగాక నాభర్తకు మీ కవసాన సేవఁజేయు పుణ్యము లభింపక పోవునెడల నాయనయుత్తరగతికి భంగకరము కాదా? ఆయన కీసుకృతము దక్కించుటకైన నేను వేశ్యయింటికిఁ బోయి యాయన నిక్కడకుఁ దీసికొనివత్తును. అనుజ్ఞ నీయవేఁడుచున్నాను.” అని సీత తన యత్తతో మనవిచేసికొని యేడ్చెను. కనకమ్మ పలుకలేదు. ఒక్కనిమిషము చూచి అత్తా! అత్తా! యని సీత బిగ్గఱగ నఱచెను. పిలుపున కుత్తరము రాకపోవుటచేఁ జప్పున వాఁకిటిలోనికిఁ బోయి వైద్యుని బిలిచెను. అతఁడు చేయి చూచి “నాడిలేదు. గరళము వేయవలసియున్నది. నాల్గురూపాయ లిచ్చినయెడలఁ దెల్లవాఱుసరికి దానిని దెచ్చి ప్రయోగించెద నని చెప్పి యాసొమ్ము చేతిలో వేయించుకొని యాతఁడు వెనుకఁజూడకుండఁ బోయెను................................

సీతమ్మ “అత్తా! అత్తా! యని తిరుగఁ బిలిచెను. ఆమె పలుకలేదు. ఇంతలోఁ బిల్లవాఁడీ కేకలు విని కాఁబోలు లేచియేడువ సాగెను. అతఁడు లేచియుండినయెడల జడిసికొనునేమో యని చప్పున గదిలోనికిఁ బోయి యాతని జోకొట్టుచు నిట్లు యోజించుకొనెను. “ప్రక్కయింటివారి నెవ్వరినైనఁ బిలుతునా? వారెవ్వరైన వచ్చినెడల నాభర్త యీసమయమునఁగూడ నింట లేకుండుటచే వారాయనను మఱింత దూషింతురేమో? నామూలమున నాభర్త కేల నింద రావలయును? ఇంటిలో బ్రాఁచిపని చేయు దాసిని సహాయురాలిగఁ బిలిచిన మంచిదేమో? పాపము అది మంచిది. వైద్యునిగూడ నదినే పిల్చుకొనివచ్చినది. దానికిఁ బ్రాఁతకోక యిచ్చెదను.” అని యూహించుకొని లేచి సమీపమున నేయున్న దాసియింటికిఁ బోయి దానితో రెండునిమిషములలోనే తిరుగ నింటికివచ్చెను. దానిని బిల్లవానియొద్దఁ గూరుచుండఁబెట్టి తా నత్తగారి తలవైపునఁ గూరుచుండి నిమ్మ

శముగ నామెచెవిలో నారాయణస్మరణ మొనర్చుచుండెను.........................

ఒకలింక వేఁడిగనే యున్నది. శ్వాసము బాగుగా నాడుచునేయున్నది. గుండెలు తీవ్రముగాఁ గొట్టుకొనుచున్నది. నాభీస్థానమున నెగుపులు బలముగానున్నవి. ఇంటిలో భద్రపఱచిన గంగోదక మామెనోటఁ దనభర్తచేఁ బోయించినఁగాని యామెకుఁ దనభర్తకుఁ గూడ గతు లుండవని నిశ్చయపఱచుకొని లేచి "వెంకీ! ఇటురా! పిల్లవాఁడు నిద్రించుచున్నాఁడు. కావున నీవు మాయత్తగారి మంచమునొద్దఁ గూరుచుండుము. నేనిప్పుడే వచ్చెద"నని చెప్పెను. "అమ్మా! చీఁకటిలో నెక్కడకుఁ బోవుదుర"ని యది ప్రశ్నింప" నాభర్తను దీసికొని వచ్చెద" నని చెప్పి తలుపుతీసికొని వీథిలోనికిఁ బోయెను.

ఆహాహా! సీతమ్మా! ఎంతసాహసము గలదానవు? వేశ్యయింటియొద్ద నున్న భర్తను దెచ్చుటకుఁ జీఁకటిలో నొంటరిగాఁ బోవుచుంటివా? ఆహా! పుణ్యశీలా! నీవొంటరిగాఁ బోవుచున్నావని మేము తెలియక యనుకొనుచున్నాము కాని దేవదూతలు బంటులై నీముందు నడచుచున్నారు. తల్లీ! చీఁకటిలో నీవుపోవుచున్నావని మే మాందోళన మొందుచున్నాముకాని నీపాతివ్రత్యతేజము నీముందు విద్యుద్దీపికవలె నడచుచున్నది. సర్వాభయప్రదాతయగు పరమేశ్వరుఁడు నీహృదయమున నున్నాఁ డనుజ్ఞానము నీకుండగ నీకు భయమేమి? సీతమ్మా! భర్త వేశ్యయింటిలో నుండగ నటకుఁ బోఁగూడదని యెఱుఁగవా? ఇంటిలోనున్న వెంకినైన నీభర్తకొఱకుఁ బంపలేక పోయితివా? అది పిలిచినయెడల నీభర్త రాకపోవునేమో యని నీవు బయలుదేఱితివా? కానీ, కానీ - ఎందులకు బయలుదేఱితివో బయలుదేఱితివి కదా!..................

అదిగో! ఆదిత్యతేజము భోగమువీథిలోనికి మఱలినది. ఒకయింటిలో నింక దొంతనపు దిబ్బులు వినఁబడుచున్నవి. ఒకయింటి యరుగుమీఁద వేశ్యామాత యడ్డపొగఁ ద్రాగుచు నుబ్బసపుదగ్గు దగ్గుచున్నది. మఱియొకయింటి యరుగుమీఁదఁ బసుపులసంతవారు కాఁబోలు గుఱ్ఱుతీయుచున్నారు. ఆగుఱ్ఱును సుతిగాఁ జేసికొని ప్రక్కదొడ్డిలోని పంది పైస్థాయిని ఘుర్ఘురించుచున్నది. ఈప్రక్కనున్నది విఘ్నేశ్వరాలయమే కాఁబోలు నని సీతమ్మ తనలో ననుకొనునంతలో వెనుక పాడుదొడ్డిలోని చింతచెట్టుపై బండిపులుఁగు "ఊఁ" యని ప్రత్యుత్తరమిచ్చెను. "ఇదివఱకు వినిన ప్రకార మింక రెండిండ్లే కాఁబోలు దాఁటవలయు" నని సీతమ్మ తనమనస్సులో ననుకొనుసరికి తాణాగడియారము టంగుటంగున రెండు కొట్టెను. ఆహాహా! పతివ్రత ప్రశ్నములకుఁ బ్రకృతి ప్రత్యుత్తరమిచ్చును గాఁబోలు!..................

మూఁడవయింటి గుమ్మములో నామె తలుపుపైఁ జేయివైచి నిలువఁబడెను.......

అమ్మా! సీతమ్మా! నీకు గుండె లేమైనఁ గొట్టుకొనుచున్నవా? కాళులైన వడఁకుటలేదా? ఆహా! ఎంతశౌర్యసంపన్నురాలవు!.....

అత్తగారిసద్గతి నభిలషించి, పనికిమా
లినభర్తకుఁ బ్రజానింద కలుగునేమో యను
భయముచే నీపని చేసితివి! అమ్మా! అట్లు
లికిపడెద వేల? పిల్లవాఁ డేడ్చినట్లు వినఁబడి
నదా? వాఁడు నీపిల్లవాఁడు కాఁడమ్మా! ఎదు
టియింటిలో నెవ్వరో సంసారు లున్నారు.
వారిపిల్లవాఁడమ్మా. భర్తసామీప్యమునఁ
బిల్లవానిమాట యట్టె స్మరింపఁగ న్నిట్టే
చెమ్మగిల్లినదా? అటులైనఁ బిల్లవానిసన్ని
ధిని వేశ్యయింటిలోనున్న భర్త సంతతము
మనస్సునకు రాఁగ నాల్గుసంవత్సరములనుండి
యెంత యేడ్చుచున్నావో! నిన్నింత యేడ్పిం
చిన భర్తపై నీకు రవంతకోపమైన లేదా?
కాసంత యుడుకుఁబోతుఁదనమైన లేదా?
ఆహా! యాఁడుది యనగ నీవే..............

అమ్మా! వేశ్యగుమ్మములో నిలువఁబడి
యట్లూరకుందువేల? పాపము! ఊరకుండక
యేమిచేయఁగలవు? ఎవరిని బిలుతువు- ఏమని
పిలుతువు - తలుపు నిమ్మళముగఁ ద్రోచినయె
డలఁ గుక్కయని సందేహింతురేమో? అదిగో
లోపలినుండి వీథిని బడుచున్నమాటల నాల
కించుచున్నావా? ఏమని? ఇస్తోకు - మూఁడు
దెబ్బలరెండుపాళ్లు బేస్తూ పై బేస్తూ. అమ్మా!
నీవు చదువుకొన్న భాగవతాదిగ్రంథములలో
నీమాట లెచ్చటనైన వచ్చినవా? వీథితలుపు
కొట్టినట్లుండ లోపలినుండి "ఎవరువారు" అను
ధ్వని వినఁబడినది. కనకమ్మకోడలి నని చె
ప్పునా? రామరావుభార్య నని చెప్పునా? సర
సిజాక్షిసవతి నని చెప్పునా? "నేను-నేను" అను
పలుకు వీథినుండి లోనికిఁబడఁగ "నెవఁడవు
నీవు" అని గద్దించుచు రామరావు కఱ్ఱ తీసి
కొని తలుపులు తెఱచి యీవలకు వచ్చెను.
ఎదుటిదీపకాంతిచే సీతమ్మమోము జిగజిగ
మెఱసిపోవుచుండెను. భార్యను గుర్తించి
రామరావు తెల్లఁబోయి "నీ విప్పు డిచ్చట
కేలవచ్చితి" వని హుంకరించెను. "అత్తగారికిఁ
బ్రాణముమీఁదికివచ్చినది. మీరు వెంటనేరావ
లయు" నని భార్య పెదవులు తడుపుకొనుచుఁ
జెప్పెను. "నేను వచ్చి బ్రదికింపఁగలనా?
పోపో" యని రామరావు లోనికిఁ బోఁబోవు
చుండఁగ, నాతని కడ్డువచ్చి "అట్లుకాదు. మీరు
లేకుండ మీతల్లిగారు మరణింపఁదగదు. అటు
లైన నామెయు మీరుకూడ దుర్గతిపా లగు
దురు. రాక తప్ప"దని ధైర్యముతో నామె
పల్కెను" నీవిచ్చటికివచ్చి నామాట కెదురాడి
నన్నల్లరిపెట్టి సానివీథిలో నాపరువు తీసివై
చెదవా" యని కఱ్ఱతో నామె ప్రక్కటెముక
లలోఁ బొడిచి లోని కాతఁడు పోయెను. "హరి
హరీ" యని యామె వీథియరుఁగుపైఁ గూలఁ
బడెను. భార్యపలికిన యీమాత్రపుమాటకే
పరువు పోయినదా? వేశ్య తిట్టినప్పుడు వేశ్యా
మాత తన్నినప్పుడు పరువు పోలేదా! నీపరువు
మండ..............................

"వచ్చినవారెవ్వరోయి" యని సరసిజాక్షి
యడుగ "మాయమ్మకేమో ప్రాణముమీఁదికి
వచ్చినదఁట. నన్నుఁ దీసికొనిపోవుటకు మా
యింటిదాసి వచ్చినది." అని రామరావు
ప్రత్యుత్తరము చెప్పెను." ఆలాగా? భార్యగారి
రాయబారములా? సిగ్గుబిడియములు లేక—
ఛీ! మీయమ్మకు నూకాలమ్మకును జబ్బేమి?



రామరావు తనను పిలచికొనిపోవుటకై వేశ్యగృహమునకువచ్చిన భార్యను కొట్టి వెలికి నెట్టుట

నిన్నింటికి లాగుకొనిపోవుట కిది యొకతంత్రము" అని వేశ్యపలుక "నట్లుకాదు. జబ్బుసంగతి నిశ్చయమనియే నా నమ్మక" మని రామరావు ప్రత్యుత్తరమిచ్చెను. "అటులైనఁ బోలేకపోయినావా? అభము శుభ మెఱుఁగకుండ నర్ధరాత్రమున నీవు మానిండుకొంపలో నేడ్చచుందుల"కని వేశ్య యాతనిని మందలించెను. తెల్లవాఱునపిదపఁ బోవచ్చునని రామరావేదో వంకపెట్టుకొని వీథిలోనికిఁ బోయి భార్య యచ్చట లేకుండుట చూచి రవంత సంతసించి తిరుగ లోనికిఁబోయి పేకమాని పండుకొనెను. హృదయమున నేదియో కాని పీకిన ట్లుండెను. ఆబాధను బ్రయత్నమున నావలఁ ద్రోచివైచికొని తల్లి మరణింపఁ దనకు లభింపబోవు సొమ్మెంతయుండునో యని యోజించుకొనుచుఁ బండుకొనఁగఁ గొంతసేపటి కాతనికిఁ గలఁత నిద్దుర పట్టెనుగాఁబోలు.....................

కొంతసేపు దేకి, కొంత సేపుకుంటి, కొంత సేపు ప్రక్కెముకలను గట్టిగ నడఁచి పట్టుకొని నిమ్మళముగ నడచి, హరి నామస్మరణ మొనర్చుకొనుచు సీతమ్మ మెటులో యిల్లు చేరి యత్తగారితలవైపున నేడ్చుచుఁ గూరుచుండెను. అత్త కొడలి వేఁడిమి తగ్గినది. ఎగుపులు తగ్గుచున్నవి. నుదుటిపైఁ జిల్లగింజలంత స్వేదబిందువులు నిలిచియున్నవి. ఇఁక నవసానమగుచున్నదని నిశ్చయపఱచుకొని కాళులుచేతులు గడిగికొని మడిబట్టకట్టుకొని పడమటింటిలోనికిఁ బోయి దేవతార్చనవేదికపై నున్న గంగోదకపాత్రమును దీసికొని యీవలికివచ్చి తుంగచాపఁ బరచి యత్తగారిని బాహువులందు గట్టిగఁ బట్టుకొని నారాయణస్మరణ మొనర్చుచు నెత్తి చాపపైఁ జేర్చి తలవైపునఁ గూరుచుండి యామెతలను దొడపై నిడుకొని గంగోదకము నామెపైఁ గొంతచల్లి, యుద్ధరిణెతోఁ గొంత నోటిలోఁ బోయుచుఁ జెవిలో నారాయణ నారాయణ యని స్మరించుచు నుండెను. ఇంతలో గుబ్బుమనుధ్వని వినఁబడెను. పరీ



సీతమ్మ అత్తగారికి తులసితీర్థము పోయుట

లించిచూడఁగ నది ప్రక్కగదిలోఁ బండుకొని నిద్రించుచున్న వెంకిగుఱ్ఱు కాని మఱియొకటి కాదు. మఱి పదినిముసములలో నత్తగారు దేహమును జాలించిరి.......................

అట్టిస్థితిలో నొక్కమగవాఁ డెవ్వఁడైన నిట్లాచరింపఁగలఁడా? ఆహా ఆఁడుదాని ప్రకృతి యనిర్వచనీయముకదా! సంపదలలో సహజభీరువైన యాఁడుది యాపదలలో నపరమేరువు కాదా! సంసారములలోని కష్టములన్నియుఁ గాంతలమూలముననే యింతవఱకైన సహ్యముగాఁ గన్పట్టుచున్నవి. మగవాని ప్రకృతివంటిదే మగువ కున్నయెడల నీప్రపంచ మొక్కపగటిలోఁ బ్రళయ మొందఁగలదు. నిజముగా సంసారములోని కష్టములన్నియు నాఁడుదానివే. సుఖాభాసము లేమైననున్నయెడల నవి మగవానివి. ఆ మాత్రమున కేమగవాఁడడలియఁబలి యా సుళ్లోఁ గండెవలె నల్లలాడి పోవును. అబ్ధి మధ్యమునఁ బగడపుగుట్టవలె నాపదల నడుమ నాఁడుది నిశ్చలముగ నిలువఁబడును గాని టోఁకునా? మనుజజన్మ మేదనఁగ మొదట నాఁడుదానిదని చెప్పినపిమ్మట మగవానిమాట చూచుకొనవలసినదే.......................

3

ఔర్ధ్వదైహిక క్రియ లాచరించి ఆదివారమున రెండుజాములకు రామరావింటికి వచ్చి ప్రక్కశూలతో మహాకష్టమున సీతమ్మ వండినయన్నమును దిని పిల్లవానిని గొంతసేపాడించి సాయంకాలమగువఱకింటిలోనే యుండెను. దీపములు పెట్టినపిమ్మట భార్యాభర్త లిట్లు మాటలాడుకొనుచుండిరి.

రామ: చూడు సీతా! ఒక్కసారి వీథిలోనికిఁ బోవుదునా?

సీత: తిరుగ దానియింటికే పోయెదరా?

రామ: పోయినను మొగముచూపి చక్క వత్తును.

సీత: ఆశౌచములో నక్కడకుఁ బోవుట తప్పు కాదా?

రామ: నేనెవ్వరినైన ముట్టుకొందునా? నాలుగేండ్లనుండి యలవాటుపడిన స్థలము కావున నిక్కడకుఁ దోఁపకుండనున్నది.

సీత: అట్లైన మీయిష్టము. ప్రక్క శూల హెచ్చుగా బాధించుచున్నది. రాత్రి తప్పక వచ్చెదరు కాదా?

రామ: పట్టజాలనికోపముచే నట్లుచేసి తిని. నాచేతులు కాలిపోను. నేనుదుర్మార్గుఁడను. నన్ను క్షమింపుము. రాత్రి తప్పకవత్తును.

రామరావు వేశ్యయింటికిఁ బోయెను. రాత్రి సీతమ్మకు శూల క్రమముగా హెచ్చి పోయినది. పండ్రెండుగంటలవఱకుఁ జూచి సీతమ్మ వెంకిని వేశ్యయింటికిఁ బంపెను. అది గుమ్మమునొద్ద నెంతయఱచినను వారెవ్వరు పలుకకుంటచే వెంకి తిరుగవచ్చెను. కుంపటిలో నిప్పులు వైచి యాకుంపటి మంచమునొద్దఁ బెట్టి వెంకి యామెప్రక్క కాచుచుండెను. బాధయేమియు శాంతింపలేదు. బిడ్డను బ్రక్కను బెట్టుకొని సీత లోలోపల బాధచే నేడ్చుచుండెను.................................

వేశ్యయింటనే రామరావు శయనించెను. కడచినరాత్రి నిద్రలేకపోవుటచేతను బగలా యాసమొంది యుండుటచేతను రామరావు నకుఁ దెల్లవాఱువఱకు మెలఁకువ రాలేదు. తెల్లవాఱినపిమ్మట నాతఁడు సరసి క్షీని జూచి యింటికిఁబోయెద నని చెప్పెను.

సర: నీ విప్పు డింటికిఁబోవునెడల మా యమ్మ కాసుపత్రినుండి మం దెవరు తెచ్చి పెట్టెద రనుకొంటివి?

రామ: మఱి యెవ్వరినైనఁ బంపరాదా?

సర: నీవు జీతమిచ్చి పోషించుచున్న బంట్లు మాయింట నెందఱున్నారో యెఱుఁగవా? అయినను నీ విప్పు డింటికిఁబోయి చేయ వలసిన దేమున్నది? అయిన దేదో యయినది కాదా? ఇఁకఁ గావలసినది మఱేమున్నది? మం దిక్కడకుఁ దెచ్చి తొమ్మిదిగంటల కింటికిఁ బోవచ్చును.

రామరావు సరేయని వేశ్యమాతచీటి తీసి కొని యాసుపత్రికిఁ బోయెను. అక్కడ వెంకిని జూడఁగనే యతనిప్రాణము లెగిరి పోయెను. "ఇక్కడకు వచ్చితివేల" యని తొందరతో దానినడిగెను. మీబిడ్డ కుంపటిలోఁ బడి కాలి పోయినాఁడని యామెచెప్పెను. నిల్వున విఱుచుకొనిపడి కొంతసేపటికి స్మృతినొంది "ఏడీ? నాబిడ్డ యేఁడీ?" యని బిగ్గఱగ నఱచెను. "గదిలో సర్జనుగా రాతనికి మందు రాచు చున్నా"రని వెంకి చెప్పెను. గదిలోనికిఁ బోయి యాతఁడు గోలుగోలున నేడ్వసాగెను. నా బిడ్డను బ్రదికింపుఁ డని వైద్యునికాళులపైఁ బడెను. బిడ్డ స్మృతిలేక పడియుండెను. ఎడమ ప్రక్కయంతయుఁ గాలియుండెను. కొంతసే పేడ్చి వెంకియొద్దకువచ్చి "నాభార్య యెట్లున్న" దని దాని నడిగెను. "ఆమెకు శూల హెచ్చి పోయినది. నేను వచ్చునరికే చాల జబ్బుగా నున్న"దని వెంకి చెప్పఁగ "నిక నిక్కడ నెందులకు?" అని నెత్తి గొట్టుకొని యేడ్చి "అయ్యో!



"సీతా! సీతా! మనబిడ్డను జూడవా? మనబిడ్డను జూడవా?"

"నాబిడ్డండే! నా జానకి రాముండే!" యని యఱచి "యిక్కడకుం దేలేక పోయితివా" యని యామెతో ననెను. (మొదలో నానున్నది కావున) వైద్యుడు నాకీయ నన్నాండని యది బదులు చెప్పెను.

నాబిడ్డను నేనింటికిం దీసికొనిపోదునా?" యని వైద్యు నడిగెను. ఇప్పుడిక్కడనుండి కదల్చుటకు వీలులేదని యాతండుకఠినముగం జెప్పెను. అంత బిడ్డయొద్ద వెంకినుంచి గుండెలు గొట్టుకొనుచు నాతం డింటికిం బరుగెత్తుకొని వచ్చి "సీతా! సీతా" యని యఱచెను. ఆమె పలుకలేదు. ఆమెకుం గూడ స్మృతి తప్పెను. ఆమె రెండుపాదములతోం దనతలపైం గొట్టుకొని 'సీతా సీతా యని యేడ్చెను.

ఎవ్వరోకొందఱు జనులు వచ్చి విచారించి పోవుచుండిరి. ఇంతలో వెంకి యేడ్చుచు నింటికివచ్చి బిడ్డచనిపోయినాండని చెప్పెను. పడిపోయినరామరావు చివాలున లేచి తూలిపడి "వెంకీ! నీ విచ్చట నుండుము. వాండుచచ్చిపోలేదు. నాబిడ్డను నేను దెచ్చుకొందును." అని చెప్పి యొక్కపరుగులో నాసుపత్రికిం బోయి పిల్లవానిశవమును జేతులలోం బెట్టుకొని యింటికిం దెచ్చి మంచమునొద్ద నిలువంబడి "సీతా! సీతా! మనబిడ్డను జూడవా? మనబిడ్డను జూడవా" యని యిల్లెగిరిపోవ నఱచెను. "వెఱ్ఱివాండా! ఇంక నెక్కడిసీత? అన్నియు నైనవి. శాంతింపు" మని యెవ్వండో యచ్చటివారిలో ననెను. "అంతే! అంతే! నాకు సీత లేదా? నా జానకిరాముండే నాకు లేండా? ఇంక నే నెందులకు" అని గొట్టపొట్టేలు పర్వతమును డీకొనునట్లు గోడపైం దలగొట్టుకొని నేలంగూలెను.

# ఘోరపతనము

వేదుల సత్యనారాయణశాస్త్రి గారు, శతావధాని, (సాహితీసమితి)

ఎవ్వఁడను నేను, నాజాతి వృత్త మేమి?
విమలచారిత్ర మైన యేవీరమాత
తల్లి యై నాకుఁ బకృతిలోఁ దావాసంగె?
ధర్మపథ మేది? నాకుఁ గర్తవ్య మేమి?
అనుచు నిన్నాళ్ళు యోజించుకొనగ నైతి!
క్రమ్ముకొనుచున్న మోహాంధకారపటలి
లోన నే నొకనలుసునై లీన మైతి.
చుట్టుప్రక్కలఁ దలయెత్తిచూచుకొలఁది
గాఢపరవశతయె నన్నుఁ గలఁచివైచె.
ముందు దురదృష్టదేవతామూర్తి వేయి
జిహ్వికలతోడ నన్ను గ్రసించుచుండె.
పాడువాఁడిన నాదుహృద్భవనమందె
కాక దృక్పథావర్తలోకంబునందు
విపులతిమిరంబె మూర్తీభవించిపోయె.
దారి దొరకక వెదకంగఁ దలఁపు లేక
శాంతిసుఖములు లేక స్వేచ్ఛయును లేక
తోడు లేక కనుల్ విప్పి చూడ లేక
వెనుక ముం దేమి లేక నివ్వెఱఁగుసోఁక
అంతు లేనట్టి ఘోరదాస్యాంబునిధిని
మునిఁగితిని గానఁబడకుండ మునిఁగిపోతి.
చెదరుగనడుసును బ్రవహించు జీవనంబు
దక్క నే నూఁతగొని నిల్వ దిక్కు లేదు.
సమదవిద్వేషవిచలితోచ్ఛలిత మైన
కలుషకీలాలతుంగభంగ ప్రచండ
శిఖరమున వాతహతిని నాశిరము చిన్ని
నునుఁగుబుగ్గయుఁగాకుండనుజుకుచుండె.
హృదయవీథిని నిఃస్పృహాప్రేరిత మగు
భావనాలీల కలదో లేదో వచింపఁ
జాల! నా నలుగడలఁ గల్లోలకలిత
జలతరంగతిరస్కారకలనదక్క
వేఱు కనుపట్ట దయ్యె గంభీర మైన
సుడులు నన్ను గ్రసింపఁగఁజూచుచుండె,

---

# అజ్ఞాతబంధము

నోరి నరసింహశాస్త్రి గారు (సాహితీసమితి)

చండశాసన శృంఖలాకాండములను
కాలు సేతులె బంధించఁగలడు నృపుడు
చాటువాక్యపరంపర జయము గాంచి
కాయసౌరభమే క్రోలఁగలడు విభుడు
పారవశ్యంబు గల్పించి ప్రణయలీల
ఘనసుఖాంభోధి దేలించఁగలడు ప్రియుడు
నను జయించి రక్షించి యజ్ఞాతరీతి
నా సమస్తము బంధించినాడ వెవరు?




కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. సరిగమపధనిస తాంతాం । వీణాసంక్రాంతకాంత హస్తాం తాం ।
తాం శాంతాం మృదులస్వాంతాం । కుచభరతాంతాం నమామి శివకాంతాం.

గత సంచికయందు స్వరశ్రుతులవిషయము క్లుప్తమైనందున నిందు విరళముగ వ్రాయఁబడినది. సప్తస్వరములు వానిసాంకేతికములు నుదాహరింపఁబడినవి. అందు స=పరమశివునియందును, రి, గ, మ, ప, ధ, లు క్రమముగ సద్యోజాతాదిపంచముఖములందును, ని = మహేశ్వరునియందును ఉద్భవించినట్లు గలదు. "నాసాకంఠ ఉరస్తాలుజిహ్వాదంతాశ్చ సంస్పృశన్ షట్జం సంజాయతే యస్మాత్ తస్మాత్ షట్జమితీరితంషట్ + జ. అనగ పైనారింటిచే జనితమగుటచే షట్జమగును. శేషించిన షట్ స్వరలోప మగు గానము గలదుగాని షట్జము అనగ శ్రుతిలేని గానముఁ గానము. గాన శేషించిన షట్స్వరములకును మూలమగుటచేఁగూడ నీషట్జనామము సార్థకమగుచున్నది. సప్తస్వరములకును మధ్యనుంటచే మధ్యమమును, నైదవదగుటచే పంచమమును యగుచున్నట్లును గలదు. సర్వదేవతామయమనియునిరూపింపఁబడినది. దీనికిఁ దార్కాణముగ శ్రీ త్యాగరాజస్వామి వారిట్లు నుడివియున్నారు.

జగన్మోహిని-రూపకము.

ప. శోభిల్లు సప్తస్వర - సుందరుల భజింపవే
మనసా.

అ. నాభిహృత్కంఠరసన-నాసాదులయందు॥ శో॥

చ. ధర ఋక్సామాదులలో - వరగాయత్రీ
హృదయమున-
సురభూసురమానసమున-శుభత్యాగరాజు
నియెడ॥ శో॥

ఈ సప్తస్వరములకును సంబంధించిన శ్రుతు లిరువదిరెం డనియు జెప్పఁబడినది. దీనివిషయమున మతభేదములు గలవు.

"శ్రూయన్తయితి శ్రుతయః"

(చతుర్దండిప్రకాశిక)

"శ్రవణేంద్రియ గ్రాహ్యత్వా ద్ధ్వని రేవ శ్రుతి ర్భవేత్" (విశ్వావసుః)

"శ్రవణార్థస్య ధాతోః క్తి ప్రత్యయేచసుసం శ్రితే। శ్రుతిశబ్దః ప్రసాధ్యోయం శబ్ద జ్ఞైః కర్మసాధనైః॥ (మతంగః)

"ద్వికత్రిక శ్చతుష్కాస్తు జ్ఞేయా నంశ గతాః స్వరాః। కంపమానార్థముక్తా శ్చ వ్యక్తముక్తాజ్ఞులిస్వరాః॥"

(వేణావాదము)

"ద్వావింశతిం కేచి దుదాహరన్తి। శ్రుతీః శ్రుతిజ్ఞాన విచారదక్షాః। షట్షష్ఠి భిన్నాః ఖలు కేచిదాసాం। ఆనన్త్య మేవప్రతిపాదయన్తి॥"

"ఆనన్త్యం హి శ్రుతీనాంచ సూచయన్తి విపశ్చితః। యథా ధ్వనివిశేషాణాం మమానం గగనోదరే॥"

"ఉత్తానపవనోద్వేల్లజ్జలరాశిసముద్భవాః ఇయత్వాః ప్రతిపద్యన్తే న తరంగపరంప రాః॥ (కోహలః)

"మతంగాది దర్శితేషు నవసు పక్షేషు"

"తాసాం ద్వావింశత్ శ్రుతీనాం మధ్యే చతుర్థీ ప్రభృతిషు శాస్త్రానుసారేణ పూర్వోత్తరావధి ప్రదర్శనపూర్వకం షడ్జాదిసప్తస్వరస్థాపనం"

"చతుశ్శ్రుతి రితి" స్వాభివ్యక్తీకరణత్వేన చతస్రః శ్రుతయో యస్యేతి స తథోక్తః ఏవం త్రిశ్రుతి రిత్యాదా ద్రష్టవ్యం.

"అధరాధరతీవ్రాస్తాః। తజ్జోనాదః శ్రుతిర్మతః॥

(సంగీతరత్నాకరం)

దీనినిబట్టిచూచిన మన చెవులతో విని గమనింపదగినది శ్రుతి యనంబడునని తేలు చున్నది. సప్తస్వరములకును సంబంధించిన శ్రుతులవిషయక మగు మతభేదములు పెక్కులు గలవు. ఇది మహారాష్ట్ర, సౌరాష్ట్ర, దక్షిణ, ద్రావిడమతములనే గాక పాశ్చాత్య లగు ఇటలీ, జర్మని, ఫ్రాన్సు, ఇంగ్లాండు, ఈజిప్టు, ఇత్యాది దేశముల గూడ నీభేదములు గలవు. అందునందఱకును స్వరములు మాత్రము సరిగ నేడే యగుట చిత్రము. గాని శ్రుతివిషయము న మాత్రము భేదము గలదు. దీనివివరము తృతీయచక్రమున జూచిన దెల్ల మగును. కొందఱు మతమున నిరువదిరెండనియు, మఱి కొంద ఱిరువదినాల్గనియు, కొంద ఱిరువది యొక్కటే యనియు భిన్నాభిప్రాయు లైరి.

"చతుశ్చతు శ్చతుశ్చైవ షడ్జ మధ్యమ పంచమాః। ద్వే ద్వే నిషాదగాంధారౌ త్రీ స్త్రీఃఋుషభ ధైవతౌ"(సంగీతదర్పణం)

ద్వావింశత్ శ్రుతులలో షడ్జమధ్యమపంచ మములు నాల్గుచొప్పునను, నిషాదగాంధార ములు రెండు చొప్పునను, ఋషభధైవత ములు మూడుచొప్పునను బంచికొనినవి. దీనినే చతుర్దండి ప్రకాశిక గ్రంథకర్త లగు వేంకట మఖి యనువారు (1) షడ్జమ శు. ఋషభము లకు మధ్యను (2) శు. మధ్యమ ప్రతిమధ్యమ ములకు నడుమను (3) పంచమ శు. ధైవతము లకు మధ్యమునను, రెండేసి శ్రుతులును (1)



రాజపుత్ర యువతుల విహారము

రజపుత్ర చిత్రః శావైఖరి, ౧౭ వ శతాబ్ది రెండవ భాగము.

శు. రిషభ, శు. గాంధారములకును (2) ష. రిషభ అంతర్గాంధారములకును (3) శు. ధైవత శు. నిషాదములకును (4) ష. ధైవత, కా. నిషాదములకును నడుమను నొక్కొక్క శ్రుతి యును, మొత్తమునఁ బదిశ్రుతుల నిప్పటిగాన వ్యవహారమున నున్న ద్వాదశశ్రుతుల మధ్య జేర్చిన ద్వావింశత్ శ్రుతు లగుచున్నవని చెప్పి యున్నారు. దీని వివరము ప్రథమచక్రమున గమనించిన స్పష్టమగును. కాని ప్రస్తుతము వాడుకనున్న చతుశ్రుతి ఋషభ, చతుశ్రుతి ధైవతములనిన బాధకము గల్గును. ఏలనన చతుశ్రుతి బదులు పంచశ్రుతి యగుచున్నది. కనుకనే వేంకటమఖి యనువారు, చతుశ్శ్రుతి యని వాడక వారి గ్రంథమున పంచశ్రుతి ఋషభ పంచశ్రుతి ధైవతమనియు నిరూపించి సమన్వయించియున్నారు. ఇట్లు మార్చుట కిచ్చగింపక కొందఱు ద్వాదశశ్రుతులను సమ భాగములుగ విభాగించి చతుర్వింశతి శ్రుతులుగ నేర్పఱచి సులభోపాయముజేసి సమన్వయించియున్నారు. దీని వివరము ద్వితీయచక్రమున గాననగును. వీనిలో కొందఱ మతమున షడ్జాదిగ గణనము జేయవలయుననియు గలదు. అట్లగుచోఁ ప్రథమచక్రమున నిరూపించినరీతి చ.శ్రుతి ఋ ఆఱవదియు, ద్వితీయ చక్రమున నైదవ యు, నగుచు చతుశ్శ్రుతి, షట్శ్రుతియనుటకు బాధకమేర్పడుచున్నది. ఇంతేకాక ప్రథమచక్రమున చతుశ్శ్రుతి,షట్ శ్రుతి ధైవతములు క్రమముగ ౧౯. వదియు ౨౦వదియు, ద్వితీయమున ౧౯ వదియు ౨౧ వదియు నగుడు, ఏకవింశతి, వింశతి, ఏకోనవింశతి శ్రుతి ధైవతము లనవలసివచ్చును. ఇది మిగులహాస్యాస్పదము. గాన నసందర్భమాటచే షడ్జాదిగణ నారంభము తగదు. చతుశ్శ్రుతి ఋషభధైవతము లనుదానిని ఋషభ ధైవతములకు సంబంధించిన శ్రుతులలో మాత్రము పరిగణనముచేసి ఇన్నవశ్రుతి యనుట సమంజసమని తేలుచున్నది. ఈ చతుర్వింశత్ శ్రుతులు మఱియొకవిధమునఁ గాననగును.పరాసువారు జర్మనీ ఇటలీ, ఇంగ్లీషు, వీరల షడ్జము (C) కొంచెము వ్యత్యాసముగ శ్రుతి గలిగిన దాటచే అచ్చటినుండి వచ్చు హార్మోనియములఁ గొన్నిటిఁ గమనించిన నొకదానిమొదటి శ్రుతి (C) మఱియొకదాని మొదటిదానితోఁ గలియక, స. శు. రి, లకు మధ్యనుండుటచే నీశ్రుతులును గలియక చతుర్వింశత్ శ్రుతుల గనఁబఱచుచు గాత్రమున ననుకరింప వీలగుచున్నది. ఇవ్విధమున ద్వావింశత్ శ్రుతులే గాక చతుర్వింశత్ శ్రుతిసముదాయముగూడ నిరూపితమగుచున్నది. ఇట్లే వీణాదితంత్రీవాద్యజంత్రములందు ప్రతిమెట్టునకును మధ్య నగమున మఱియొకదాని నమర్చిన నిరువదినాల్గగును. (ద్వితీయచక్రమునఁ గాననగును) దీని గమనించిన, చ.రిషభము ఋషభ శ్రుతులలో నాల్గవదియు, చతుశ్శ్రుతిధైవతము ధైవతశ్రుతులలో నట్లే నాల్గవదియు నగుచు సమన్వయమగుచున్నది. కానిచో పూర్వులచే నేర్పఱుపఁబడిన చతుశ్శ్రుతినామమునకు భిన్నము గల్గును. కాని, ద్వావింశత్ శ్రుతులును పూర్వులే నిర్మించియున్నారు. ఇదియు సమన్వయము గావలసియేయున్నది. అట్లుగాక చతు

ద్వ్యంశతి యనినను ప్రమాదమే. కాన "నెగదీసిన బ్రహ్మహత్యయు దిగదీసిన గోహత్యయు" యనినయట్లుండి ముడివడుట దుర్లభముగ నున్నది. దీననే యనేకపూర్వపక్షసిద్ధాంతములు, చర్చలు జరిగియు ముగియలేదు. తృతీయచక్రమున నుదాహరించినటుల పాశ్చాత్యులు నిరువదియొకటియే యనిరి. ఇది యునుగాక స్కాందపురాణములో తృతీయాధ్యాయమున సంగ్రహచూడామణియందు పరమశివుండు పార్వతీదేవికుపదేశించిన శ్లైవరో వ్రాసినవచనకావ్యమున నిట్లు నిరూపింపఁబడినది. దీన ద్వావింశత్ శ్రుతులనేగాక చతుశ్శ్రుతి రిషభధైవతేత్యాదిసర్వమును సమన్వయించియున్నారు. దీనివివరము చతుర్థచక్రమున గమనించిన విశదము కాఁగలదు. ప్రతిమధ్యమపంచమములకును కాకలీనిషాదషడ్జములకును మధ్యమాత్రము వదలి, యిప్పటిద్వాదశశ్రుతులలో శేషించినపదిశ్రుతులకును మధ్య నొక్కొకవిభాగముఁ జేసిన నిరువదియగును. షడ్జపంచమములఁజేరి యిరువదిరెం డగును. ఇందు చతుశ్శ్రుతిఋషభధైవతములు, రిషభధైవతశ్రుతులలోఁ గ్రమముగ నాల్గవశ్రుతియందేర్పడినసమన్వయమగుచున్నది. ప్రాచీనపద్ధతిప్రకారము శార్ఙ్గదేవులమతము ననుసరించినశ్రుతుల గమనించిన, పదునాలుగు స్థానములలో పందొమ్మిది శుద్ధవికృతిస్వరములు గలవు. అప్పటికాలమున మధ్యమముయొక్క రెండవశ్రుతిని బొందిన అంతర్గాంధారమును, షడ్జముయొక్క రెండవశ్రుతిని బొందిన కాకలీనిషాదమును అల్పప్రయోగములు గలవని సంగీతరత్నాకరమం దుదాహరించి యున్నారు. ఇటులే రామామాత్యులును నుడివియున్నారు. శార్ఙ్గదేవులకు వెనుకటివారును వేంకటమఖి యనువారికి ముందటివారు నైన రామామాత్యులవారి కాలమునకును మునుపే మధ్యషడ్జముల రెండవశ్రుతులను బొందిన అంతర్గాంధారకాకలీనిషాదములు బొత్తుగ వాడుకలోనుండి తొలఁగినవనియు పిమ్మట మూఁడవశ్రుతిస్థానములను బొందినవనియు, ఈ రామామాత్యులవారు వీణయందు పండ్రెండుస్థానములనే నిరూపించియుండుటవలనను చ్యుతమధ్యమగాంధారమని యంతర్గాంధారమునకును, చ్యుతషడ్జనిషాదమని కాకలీనిషాదమునకును, పేరుపెట్టియుండుటవలనను తెల్లమగును.

"చ్యుతమధ్యమగాంధారచ్యుతషడ్జనిషాదకౌ, క్రమాదంతరకాకల్యోః స్థానే ప్రతినిధుం విదుః. (స్వరమేళకళానిధి)

కాని వేంకటమఖి యనువారికాలమునకె చ్యుతమధ్యమగాంధారము, చ్యుతషడ్జనిషాదమనెడునామములు మాఱిపోయి అంతర్గాంధార, కాకలీనిషాదము లను నామము లంది వాడుకలో నుండియుండుటవలన వీనినిమాత్రము నిట్లే నిరూపించిరి. కాని చతుశ్శ్రుతిరిషభధైవతముల సమన్వయించుటలో మాత్ర మిదివఱలో నిరూపింపఁబడినటులు పంచశ్రుతిరిషభధైవతము లని స్వతంత్రించి యుపయోగించియున్నారు. దీనినే రామామాత్యులును

శ్లో. లక్ష్యేతు కుత్రచిచ్ఛుద్ధగాంధారస్థానమాశ్రయన్, ఋషభః కీర్త్యతే ఽస్మాభిః

పంచశ్రుత్యృషభాహ్వయః, శుద్ధే నిషాదే
నా మాస్య త్స్యా త్పంచశ్రుతిధైవతః॥
(స్వరమేళకళానిధి)

ఇట్లు పంచశ్రుతిరిషభధైవతములని నామ
మిచ్చుటకు సహేతుకముగ వ్రాసియున్నారు.
గాని పూర్వ మేర్పఱచిన చతుశ్శ్రుతినామ
మును మాత్రము స్వతంత్రించి మార్చివైచిరి.
వీని నన్నిటిని చతుర్థచక్రమున నిరూపించిన
వివరమున సమన్వయముఁ జేసియున్నారు గాని
స్కాందపురాణమున సీసంగహచూడామణి
లోఁగల యీశ్రుతినిరూపణము గానరానికార
ణమునను, ఈమార్గము సంగీతరత్నాకరము
మొదలగు మిగుల ప్రాచీనములగు గ్రంథముల
లోన నుదాహరింపమియు, భరతమతంగాదు
లు గూడ నిరువదిరెండు శ్రుతులలో నేయే
శ్రుతులందు ఏయేస్వరము లుద్భవిల్లినట్లు
నుడివియుండిరో దానికి వ్యత్యాసముగ నుండి
నందునను, స్వరములకు వివాదిదోషము లేర్ప
డుటవలనను ఈమతమును మిగుల నేర్పరితన
మునుగనఁబఱచి సమన్వయము జేసియుంచినను,
నమ్మఁదగినది కాదని తోఁచుచున్నది.

తంత్రీవాద్య మగు వీణయందు షడ్జము
నకును, శుద్ధరిషభమునకును మధ్య నొకస్వ
రముఁ జేర్చినయట్లే ద్వాదశస్వరమధ్యమం
దును నొక్కొకస్వరము గల్పించిన నిరువది
నాల్గు శ్రుతు లగునట్లు, ఒక్కొకస్వరమును
మూఁడుగ విభాగించిన ముప్పదియాఱుగను,
నాల్గుగ భాగించిన నలుబదియెనిమిదియు నిట్లే
ఎన్నివిభాగములుచేసిన నన్నిద్వాదశశ్రుతు
లుగఁ బరిణామ మందుచున్న దనుట గాన
నగును దీని కంతము లేదు.

ఒక్క స, కును, శు. రి, కిని మధ్యనే
యనంతములగుశ్రుతులుండఁగ ద్వాదశశ్రుతు
లకు ద్వాదశానంతము లనవలసివచ్చును.
కాని వీనిని గుర్తించుటకు మనచెవి కెంత
వఱకు సాధ్యమో పిమ్మట గాత్రమున నెంత
వఱకు సాధ్యమో ముఖ్యముగ గమనీయాంశ
మగుచున్నది. తంత్రీమూలమున నెన్నిటినైన
జూపింపవచ్చును గాని గాత్రమున పల్కిం
చుట దుష్కరము. దానిని చెవి గుర్తించు
టయు దుస్సాధ్యము. ఇరువదినాల్గు చూపుట
సుకరము. ముప్పదియాఱు చూపుటయు, సాధ్య
మగును. నలుబదియెనిమిది చూపుట దుస్సా
ధ్యము జంత్రమున జూపనగును, గాత్రము
జేర్చనగునేగాని గమనించు టరిది. ఈశ్రుతి
విమర్శనమున వీనినాదతరంగములసంఖ్యగూడ
గమనింపవలసియున్నది. ఇదియుఁగాక ప్రపం
చమందుఁగల పాశ్చాత్యగానమునఁ బరికించి
నను సప్తస్వరములే గాక నిరువదియొకటి
గల్పించికొనియుండుట గనుచున్నాము. (తృతీ
యచక్రము) కాని వీనినివరుసగ గానమున
బ్రయోగించిన శ్రుతికటువుగనుండుటచేతగ్గించి
ద్వాదశశ్రుతులలోనికి వీరును మనవలెనే దిగి
నవారే. మనవలె వారే దిగిరో వారివలె
మనమే దిగితిమో తేలవలసియున్నది. ఇది
మున్ముందు వివరింపఁబడును. ఇపుడు క్లుప్తీకరిం
పఁబడిన ద్వాదశశ్రుతులలోను గూడ వివాది
స్వరము లున్నటు లిదివఱలో నిరూపింపఁబడి
నది. ఇఁక ద్వావింశత్, చతుర్వింశత్ శ్రుతు
లలోని మాట చెప్ప నవసరము లేదు. ప్రస్తుత
ద్వాదశశ్రుతులను ప్రస్తరింపఁగా గల్గిన డెబ్బది

రెండు సంపూర్ణ రాగములలో ఈదోషయు క్తములు నలువదిమేళములు కలవు. మిగిలి నవి ముప్పదిరెండే. ఈసంఖ్య నారదీయవాక్య మున గల్గు "అష్టావేవ పుంరాగాః తేషాం యోషా ఇతి జ్ఞేయాః చతురుత్తరవింశతి" (శివతత్త్వరత్నాకరం) అను వాక్యమును స్మరణమునకుఁ దెచ్చుచున్నది. (వివరము మున్ముందు నిరూపింపఁబడును) కాని యీరా గములు సంపూర్ణరాగములుగఁ జూపియుండ లేదు. నిరువదియొకటి, ఇరువదిరెండు, ఇరువదినాల్గు శ్రుతులలో నెన్నిరాగములు వివాదిదోషయుక్తములో చెప్పనగును గాని గ్రంథవిస్తరభీతినిటవిరమింతము.యీశ్రుతులు సమవ్యవధి గలవగునా కాదా యనువిషయము మహావిపులము. అది కొంతవఱకు నిరూపింపఁ బడును. తృతీయచక్రమున రెండు, మూడు, కలములలోఁజూచిన నాయాస్వరములపరస్పర నాదతరంగసంబంధ ప్రమాణము గననగును. ఇయ్యవి సమవ్యవధి గలవి కావని తేలుచు న్నది. అయినను మనము ప్రస్తుతపు హా ర్మోనియంశ్రుతుల గమనించిన, నవియట్లే గాని పించుచున్నవి. అనఁగ షడ్జమ శుద్ధరిషభము లకు నెంత తారతమ్యమో శుద్ధరిషభమునకు చతుశ్శ్రుతికి నంతే యనునట్లు గమనింప నగును. మొదటి తెల్ల మెట్టు శ్రుతి (స) గ నుంచిన, దానిపై నల్లది శు. రి. యగును. పిమ్మటనుండు తెల్లది చ. రి. యు నిట్లు నలు సగ 12 శ్రుతులు నగును. మొదటితెల్లదాని స్థానమున మొదటినల్లదానిని శ్రుతి (స) గ నుంచిన రెండవ తెల్లది శు. రి. గను, రెండవ నల్లది చ-రి. గను క్రమముగ 12 శ్రుతులగుచు సమవ్యవధి గలవగునట్లు సామాన్యముగ తెలి యనగును. కాని తృతీయచక్రమునఁజూచిన నవి యట్లు గానియట్టు స్పష్టమగును. అయిన ను మిగులస్వల్పమగు భేదముగలవగుటచే చెవికి గ్రహించుట సామాన్యముగ నలవిగాదు. పరి శుభ్రముగఁ గాననగుజలబిందువు మైక్రాస్కో పను యంత్ర సాయమునజూచిన నెన్నియో జంతువులఁ గాననగునట్లే సామాన్య శ్రోత్రేంద్రి యము గమనింప వీలులేని బహుస్వల్ప భేద ములనైతము పాశ్చాత్యులచేఁ గనుపెట్టబడిన సావర్ట్సు టూత్ డ్ వీల్ అనుజంత్ర సాయ మున నింక ననేకములగు నితరయంత్రముల సా యమునను గననగును ప్రతిస్వరమునకును ఆకా రములుగూడ గననగును. వీనినిగుఱించి ముందు సంచికయందు విపులముగ వ్రాయఁబడును.

ప్రథమచక్రము

అనాదిగ నిరూపింపబడిన ద్వావింశత్ శ్రుతులును వానికిఁ బ్రస్తుతవ్యావహారికమున నున్న ద్వాదశ శ్రుతులకును సప్తస్వరముల కును సంబంధముల దెలుపబడినది.

ద్వితీయ చక్రము.

దీన నిటీవల చతుర్వింశత్ శ్రుతులను ద్వాదశ శ్రుతులనడుమ నమర్చుటచే చతుశ్శ్రుతి ఋషభ ధైవతముల సాధించి సమన్వయించి, సప్తస్వరస్థానముల వివరమును దెలుపబడినది.

తృతీయ చక్రము

దీన సప్తస్వరములు వీటికిని ద్వాదశ శ్రుతుల యొక్కయు ద్వావింశత్ శ్రుతుల యొక్కయు నేకవింశత్ శ్రుతులయొక్కయు

సంబంధము జూపును. మన హైందవ గానమున నే గాక వీటికి తుల్యమగు పాశ్చాత్యమున హూణ, ఫ్రాన్సు, జర్మనీ, ఇటాలియన్, ఈజిప్తు దేశములగానమునగలయా యా శ్రుతుల నామములును వీనికింగల పరస్పరనాదతరంగ బలములును పరిమాణమును దెలుపుటయే గాక సప్తస్వరములకును గ్రహములకును గల సంబంధముయొక్క వివరము గనబడుచును.

చతుర్థ చక్రము

స్కాందపురాణమందు తృతీయాధ్యాయమున సంగ్రహచూడామణియందు వచన కావ్యరూపమున పార్వతికి నీశ్వరు డుపదేశించి నటుల షడ్జపంచమముల వర్జించి శేషించిన పది శ్రుతులకును నడుమ నొక్కొక్క శ్రుతి సమర్చిన నిరువదియగుటయు వాని జేర్చిన ద్వావింశత్ శ్రుతులగుటయు దీననేచతుశ్శ్రుతి ఋషభ దైవతములు సమన్వయింప బడుటయు నిత్యాదివివరము దెలుపబడినది.

---

# కోకిల - కల్యాణము

తురగా వేంకటరామయ్య గారు.

క. యన కోయటంచుఁ గడఁ
గొంకులతోఁ దలపట్లు పట్టి క్రొం
దీయనిరాగసంపద న
దేటికి వ్యర్థము సేతువమ్మ! మా
కోయిల! పాడుమా! మధుర
కోమలగానము, భారతీకరా
బ్జాయితవల్లకీ శ్రుతర
వామృతవీచుల మేళవింపుచున్.

గీ. రాగసంపద నలరిన రమ్యమేమి?
తీయఁదనమేమి రసన చోటీయకున్న?
భారతీగానబాంధవ్యభాగ్య మంది
ప్రాక్కళాపూర్ణుకే ల్పట్టరాదె బాల!

ఉ. బాలరసాలమా! చిన్నరు
పాన్పు సమర్పుము; జాతివల్లి! పు
ష్పాలసరమ్ము లిమ్ము; మధు
పా! శ్రుతిగీతము లాలపింపు; ప్రా
గ్బాలకళా ప్రపూర్ణు నెల
బ్రాయపుఁగోయిల తెన్గుతోఁటఁ బెం
డ్లాడును భారతీశుభక
రాంచితమంగళసూత్రధారణన్.

---

| ప్రథమ చక్రము | | చతుర్థ చక్రము | |
|---|---|---|---|
| 1 | తీవ్రా | 1 | తీవ్రా |
| 2 | కుముద్వతీ | 2 | కుముద్వతీ |
| 3 | మందా | 3 | మందా |
| 4 | ఛందోవతీ | 4 | ఛందోవతీ |
| 5 | దయావతీ | 5 | దయావతీ |
| 6 | రంజనీ | 6 | రంజనీ |
| 7 | రతికా | 7 | రతికా |
| 8 | రౌద్రీ | 8 | రౌద్రీ |
| 9 | క్రోధా | 9 | క్రోధా |
| 10 | వజ్రికా | 10 | వజ్రికా |
| 11 | ప్రసారిణీ | 11 | ప్రసారిణీ |
| 12 | ప్రీతీ | 12 | ప్రీతీ |
| 13 | మార్జనీ | 13 | మార్జనీ |
| 14 | క్షితీ | 14 | క్షితీ |
| 15 | రక్తా | 15 | రక్తా |
| 16 | సందీపినీ | 16 | సందీపినీ |
| 17 | ఆలాపినీ | 17 | ఆలాపినీ |
| 18 | మదంతీ | 18 | మదంతీ |
| 19 | రోహిణీ | 19 | రోహిణీ |
| 20 | రమ్యా | 20 | రమ్యా |
| 21 | ఉగ్రా | 21 | ఉగ్రా |
| 22 | క్షోభిణీ | 22 | క్షోభిణీ |

ద్వితీయ చక్రము: 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 23, 24

| స్వరములు | |
|---|---|
| షడ్జము ... ... | 1 |
| శుద్ధఋషభం ... ... | 2 |
| చతుశ్శ్రుతి ఋషభం-లేక శుద్ధ గాంధారం .. | 3 |
| షట్శ్రుతి ఋషభం లేక సాధారణ గాంధారం | 4 |
| అంతర్గాంధారము ... | 5 |
| శుద్ధమధ్యమం ... | 6 |
| ప్రతిమధ్యమం ... | 7 |
| పంచమం ... ... | 8 |
| శుద్ధధైవతం ... ... | 9 |
| చతుశ్శ్రుతి ధైవతం-లేక శుద్ధనిషాదం ... | 10 |
| షట్శ్రుతి ధైవతం లేక కైశికీ నిషాదం ... | 11 |
| కాకలీ నిషాదం ... | 12 |

# తృతీయ చక్రము.

| నెంబరు. | Relative Vibration No. | Ratio. | Italian. | French. | German. | English. | Intervals. | (Hindu) Eastern. | జాతి | (Hindu) Eastern. | Western. | Nomenclature used in Harmony. | నెంబరు. | [illegible] | రిమార్కులు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | శ్రుతుల పేర్లు. | | | | | | | సప్త స్వరములు. | | | | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 1 | ·9200 | 25 : 23 | Do. Bemolle. | Ut. Bemol. | Ces. | C. flat. | Diminished 1st | తీవ్రా | దీప్తా | | Do. | Tonic or Key.<br>Note. | | Do. | —బృహస్పతి |
| 2 | 1·0000 | 1 : 1 | Do. | Ut. | C. | C. | 1st or Unison | కుముద్వతీ | ఆయతా | | | ,, | 1 | | |
| 3 | 1·0417 | 24 : 25 | Do. diesis. | Ut. diese. | Cis. | C. sharp. | Augmented 1st | మందా | మృదు | స | | ,, | | | |
| 4 | 1·0800 | 25 : 27 | Re. Bemolle. | Re. Bemol. | Des. | D. flat. | Minor 2nd | ఛందోవతీ | మధ్య | | Re. | Super Note | | Re. | —అంగారకుడు |
| 5 | 1·1250 | 8 : 9 | Re. | Re. | D. | D. | Major 2nd | దయావతీ | కరుణా | | | ,,<br>,, | 2 | | |
| 6 | 1·1719 | 64 : 75 | Re. diesis. | Re. diese. | Dis. | D.sharp. | Augted. 2nd | రంజనీ | మధ్య | రి | Mi. | Medient. | | Mi. | —సూర్యుడు |
| 7 | 1·2000 | 5 : 6 | Mi Bemolle. | Mi. Bemol. | Es. | E. flat. | Minor 3rd | రతికా | మృదు | | | ,, | 3 | | |
| 8 | 1·2500 | 4 : 5 | Mi. | Mi. | E. | E. | Major 3rd | రౌద్రీ | దీప్తా | గ | | ,, | | | |
| 9 | 1·3022 | 96 :125 | Mi diesis. | Mi. diese. | Eis. | E.sharp. | Augd. 3rd | క్రోధా | ఆయతా | | Fa. | Sub dominent.<br>,,<br>,, | 4 | Fa. | —శుక్రుడు |
| 10 | 1·2800 | 25 : 32 | Fa Bemolle. | Fa. Bemol. | Fes. | F. flat. | Dimd. 4th | వజ్రికా | దీప్తా | | So'l | Dominent. | | Sol. | —బుధుడు |
| 11 | 1·3333 | 3 : 4 | Fa. | Fa. | F. | F. | Perfect 4th | ప్రసారిణీ | ఆయతా | | | ,, | 5 | | |
| 12 | 1·3888 | 18 : 25 | Fa diesis. | Fa. diese. | Fis. | F. sharp. | Augd. 3th | ప్రీతి | మృదు | మ | | ,, | | | |
| 13 | 1·4400 | 25 : 36 | Sol. Bemolle. | Sol. Bemol. | Ges. | G. flat. | Dimd. 5th | మార్జనీ | మధ్య | | La. | Sub medient or Super dominent. | | La. | —చంద్రుడు |
| 14 | 1·5000 | 2 : 3 | Sol. | Sol. | G. | G. | Perfect 5th | క్షితి | మృదు | | | | 6 | | |
| 15 | 1·5625 | 16 : 25 | Sol diesis. | Sol. diese. | Gis. | G. sharp. | Augd. 5th | రక్తా | మధ్య | ప | | ,, | | | |
| 16 | 1·6000 | 5 : 8 | La Bemolle. | La. Bemol. | As. | A. flat. | Minor 6th | సందీపినీ | ఆయతా | | | ,, | | | |
| 17 | 1·6666 | 3 : 5 | La. | La. | A. | A. | Major 6th | ఆలాపినీ | కరుణా | | Si. | Leading note or sub tonic. | | Si. | —శని |
| 18 | 1·7361 | 72 :125 | La diesis. | La. diese. | Ais. | A. sharp. | Augd. 6th | మదంతీ | కరుణా | ధ | | ,, | 7 | | |
| 19 | 1·8000 | 5 : 9 | Si Bemolle. | Si. Bemol. | Bes. | B. flat. | Minor 7th | రోహిణీ | ఆయతా | | | ,, | | | |
| 20 | 1·8750 | 8 : 15 | Si. | Si. | B. | B. | Major 7th | రమ్యా | మధ్య | ని | | | | | |
| 21 | 1·9531 | 63 :125 | Si diesis. | Si. diese. | Bis. | B. sharp. | Augd. 7th | ఉగ్రా | దీప్తా | | | | | | |
| 22 | 2·0000 | 1 : 2 | ... | ... | ... | ... | Perfect 8th | క్షోభిణీ | మధ్య | | Do. | Octave. | 8 | Do. | |

# మనీషాపంచకము

టి. శివశంకరం పిళ్లగారు, ఎమ్. ఎల్. ఎ.



తలంపునందిమిడియుండు శక్తి అపారమయినది. జగములసృష్టికి తలంపే కారణ మని వేదాంతులు చెప్పెదరు. పాశ్చాత్యశాస్త్రజ్ఞానులు నయితము ఇప్పటి పరిశోధనలచే ఈ తత్త్వమునే స్థిరపఱచుచున్నారు. మనలో నెల్ల ఒక్కొక్కరి జీవితమందలి కార్యక్రమమును పరిశీలించినప్పుడు, వారువారు తలంచిన కార్యములన్నియు, తాము కోరినట్టు నెఱవేఱకపోయినను సాధించిన కార్యములన్నిటికిని తలంపులే మూలమనుట విశదపడకపోదు.

మొన్న కాకినాడ కాంగ్రెస్సుకై యేర్పడిన గాంధీనగర నిర్మాణమునకు మూలకారణ మేది? ఆంధ్రదేశాభిమానుల తలంపు. రోజునకు 20 వేల మందికి అన్నపానాదులతో ఆతిథ్య మొసంగిన సాహసకార్యమునకు ఆరంభకారణ మేది? కన్నులకు కానరాక చెవులకు వినని వారి మనసుల దాఁగియుండిన దయగలతలంపుల పుంజము. లోకమందెల్ల అతిసుందరమయిన దని కొనియాడబడు ఆగ్రానగరపు 'తాజ్‌మహాల్' చలువరాళ్లచే కట్టఁబడుటకు మునుపు షాజహాన్ చక్రవర్తియొక్క మనోరథమై యుండెనన్న ఎవరు కాదందురు? అభినవపార్థుడని పొగడదగిన కెమాల్‌పాషా తురుష్కదేశమునకే స్వాతంత్ర్యమునొసగించి దానిని సామ్రాజ్యపదమున నెలకొల్పినాడన్న నట్టి కార్యసాధనకు మూలము తలంపులబలిమి కాక మఱి యేమి? భారతీయుల మనోవృత్తుల నుద్ధరించి వానిని పరార్థోన్ముఖములుగ వెలయఁ జేయుటకై వ్రాసిన మహాభాగవతము తలంపులచే నిర్మింపఁబడిన లోకోత్తర శిల్పము కాదా? ఇంతేల? ఒక్కొక్కరియింటను దాఁగియుండు తలంపులశక్తిచే ఈశ్వరుడే తానని యుద్బోధించు 'సోఽహం' అను మంత్రరాజమునకు భారతదేశము పుట్టినిల్లై యుండ తలంపుల బలముచే మానవుఁడే కార్యమును సాధింపలేడు? సృష్టిక్రమమందు తలంపులవిన్యాసము పరమాద్భుతము. ఒక్కొక్కఁడును తన కిచ్చవచ్చి

THE GANDHI NAGAR, COCANADA



గాంధి నగరము - కాకినాడ

LADY VOLUNTEERS OF THE CONGRESS, COCANADA



౩౮ వ జాతీయసభా యువతీసేవాబృందము - కాకినాడ

SRIMATI KASTURIBAI GANDHI ADDRESSING THE LADIES' CONFERENCE, COCANADA



కాకినాడ మహిళా మహాసభ, శ్రీమతి కస్తూరిబాయమ్మగారి యుపన్యాసము

THE KHILAFAT PANDAL, COCANADA



ఖిలాఫతుమహాసభామంటపము - కాకినాడ

నట్లు తలంపులు తలంపవచ్చును. చీకటియనక వెల్తురనక యెట్టి అవస్థలయందైనను తలంపులు వచ్చుచునే యుండును. తలంపులు ఒకచోటనుండి మఱియొకచోటికి కొనిపోవుటకును భద్రపఱచుటకును కర్చుగాని కష్టముగాని కాబట్టదు. శరీరమునకు ఊపిరిని బయటవిడిచి లోగొనుట యెట్లో మెదడునకు తలంచుట యట్లు. నిద్రయందు సయితము మెదడు తలంచుచునేయుండునుగాని మనసు విశ్రమించియుండుటచే తలంచిన తలంపులన్నియు జాగ్రదవస్థయందు జ్ఞాపకమునకు రావు.

కోరినతలంపులు, కావలసినన్ని తలంపులు, శ్రమలేక ఒకచోటినుండి మఱియొకచోటికి కొనిపోదగిన తలంపులు, దాచిపెట్టుటకై పెట్టెలుగాని బుట్టలుగాని కాబట్టని తలంపులు మానవులవశమై యుండుటయు, అట్టి తలంపులు ఎట్టి కార్యసాధనకేగాని మూలమై యుండుటయు సృష్టిచిత్రమందు అత్యుదారమగునట్టియు అత్యాశ్చర్యకర మగునట్టియు సంగతి యని విచారపరులకు తోపక పోదు.

ఇట్టి సులభసాధనసంపత్తి దైవ మనుగ్రహించి యుండ అందలి తత్త్వమును మనము మఱచి వర్తించుట చేతనే దేశాభ్యుదయమునకై జరుగుచుండు యత్నములకు బిగువుచాలక కార్యసాఫల్య మాలస్యమగుటకు మూలము.

లోకోద్ధారకము లగు ఆదర్శములు మొట్ట మొదటి స్థితియందు కేవలశబ్దమాత్రమై కర్ణతాడితము లగుటయు, కాలక్రమమున అవి భావములై పాదుగట్టుటయు, అట్టి భావములు పునశ్చరణచే ప్రాణవంతములై నెగడి తీవ్రమయిన మనోరథములుగా జనుల బ్రదుకులనే యావేశించుటయు, అట్టి యావేశము వారిలో నణగియుండు శక్తుల నుద్రేకించి వానిని కార్యోన్ముఖములం జేయుటయు, యత్నముల కంతరాయములు కలిగి దాటుకోలది సంకల్పములు దీక్షగా పరిణమించుటయు, అట్టిదీక్ష పుట్టినపుడు ఎట్టిత్యాగమునకైనను మనసు వెఱవకుండుటయు, కార్యసాఫల్యమందుగాక, సాధనయందే సంతోషమును పుట్టించుటయు తలంపులసరణి యనుట యనుభవవేత్తలకు దృశ్యము. గాంధీమహాత్ముడే ఈ తత్త్వమునకు సజీవ దృష్టాంత మన్న ఎవరు కాదందురు!

మానవయత్నములకు అభ్యంతరము లవశ్యములు. లోకచరిత్రమును దీర్ఘముగ విమర్శించి పరికించినపుడే మహత్కార్యమైనను అభ్యంతరముదాటక సాధింపబడ లేదనుట స్పష్టమగును. ఒక్కొక అభ్యంతరమును దాటుకొలది కార్యవిధానమందు పటుత్వము హెచ్చును. ఇట్టి యభ్యంతరములనే వేదాంతులు సంసారమందురు. కనుకనే తరణము సంసారమునకు లక్షణము. ఈపరిజ్ఞానము మనసులందు నెలకొనువఱకు సంసారము మోక్షసాధనమే కాని బంధకారణమే యుండదు.

స్వరాజ్యసంపాదన భరతఖండమునకే జాతీయ సంకల్పమై యున్నది. స్వరాజ్యమన నేమియో మఱియొకసారి నిరూపింతము. ఈ మహత్కార్యసాధనకు అభ్యంతరము లెన్నియో యున్నవనియు అందు మనలో వ్యాపించియుండు అస్పృశ్యతాదురాచారము మొదటిదనియు నాయకులు వేనోళ్ల దిక్కుదిక్కులకు మ్రోగుచుండుట కర్ణతాడితమైయున్నది. తాకిన మాత్రమున సచేలస్నానము చేయదగినంతటిమైల మనల నావహించునట! ఇట్టి జనులసంఖ్య మనప్రజలలో నూటికి ఇరువదివంతున ఆఱుకోట్లకున్నారు. మలయాళము మున్నగుచోట్ల ఇట్టివారు వీథులయందు సహితము నడవకూడదు. వారి బిడ్డలు సర్కారు బళ్లయందు చదువుట కవకాశములేదు. అందరితోపాటు గుళ్లయందు వారు పూజచేయుటకు రాగూడదు. ఇట్టివారిని కుక్కలు పిల్లులకంటె హీనముగ చూతుము. అయిదింట నొకపాలు జనము చండాలురను పేరుతో ఇట్టి కడగండ్లపాలై యుండ జాతీయైక్యమునకు వెల్తి యింతకన్న ఏమి కావలె? ఇట్లుండు మనలోనుంచుకొని కెన్యాదేశమందు తెల్లవారు మనజనులను హీనముగ చూతురన్న వారిని అధిక్షేపించుటకు మననాయకులకు నోరెట్లాడును? ఏమొగముతో మనప్రజలు స్వరాజ్యక్రమమును అపేక్షింప గలుగుదురు? ఈలోపమును గ్రహించియే మహాత్ముడు దీర్ఘాలోచనచేసి అస్పృశ్యతాదురాశాపిశాచమును పోదోలుయత్నమునకు నిర్మాణకార్యక్రమమందు ముఖ్యస్థానము నొసగియున్నవాడు. ఈసంకల్పము ఒక్కొక కాంగ్రెసునందును బలపఱుపబడుచునేయున్నది గాని ఒక కాంగ్రెసునకును మఱియొక కాంగ్రెసునకును నడుమ 12 నెలల కాలమందు ఈసంగతినిగూర్చి పట్టణములందును పల్లెటూళ్లయందును జరుగుచుండు కార్యభాగ మత్యల్పమనుట విషాదకరము. ఆభాసకారణము. పరికించి చూచినపుడు; ఈయస్పృశతా దోషము నివారించుటకు

మనము అనుదినము మిసికితే నింపించుచుండు అధికారవర్గమైనను కొంతపనిచేయుచున్నది. కొంత మన నేల యెక్కువయనియే చెప్పవలెను. మునిసిపాలిటీలు లోకల్‌బోర్డు సభలలో నిమ్నజాతిప్రతినిధులు ఎక్కువజాతి వారితో సమానముగ కూర్చొననిచ్చుట మొదటిది. సర్కారు బళ్లలో ఆజాతివిద్యార్థులకు సమానప్రవేశ మొసగుట రెండవది. శాసనసభలందు ప్రాతినిధ్య మొసగుట మూడవది. నిర్మాణకార్యక్రమమందు ఈ భాగమును సాధించుటకై దేశమందు కాంగ్రెస్ కమిటీల యత్నము లెట్టివియని నిర్ణయించుటకు సామగ్రియే లేదేమో! ఇక పండ్రెండు నెలలకు కర్ణాటకరాజ్యమందలి బిజాపు మున కాంగ్రెసుసభసమావేశము కానున్నది. ఈవిష్కంభమున జనులయత్నములు జాతీయనిమ్నతను పూడ్చుటకై మొనయుమార్గముల సూచించుటయే ఈవ్యాసముయొక్క యుద్దేశము.

ఈసంగతియందు సంఘముయొక్క అంతరాత్మయందే (Social Conference) మార్పు కలుగవలసియున్నది. ఇట్టిమార్పుల కలిగించుటకు తలంపులకన్న వేరుసాధనము లేదు. నిమ్నతాభావము దేశాదృష్టమని ప్రజల మనసుల నావేశపజేయుటకు వెతకిచూచిన యెడల పెద్దలు నెలకొల్పిన ఆదర్శము లెన్నియో యున్నవి.

మనీషాపంచకము ఇట్టి యాదర్శములకు మేల్బంతి-కాదు శ్రీకారమనియే చెప్పనొప్పును. ఇది చరిత్రాంశము. అద్వైతమత సిద్ధాంతస్థాపకులగు ఆదిశంకరులను సహితము ఒకానొకప్పుడు అస్పృశతారుగ్మత బాధించెనట. శ్రీవారు గంగాస్నానమొనర్చి కాశీనగరవీధియందు మదుగుతో పాదచారులై వచ్చుచుండిరి. అంత్యజవృద్ధు డొకడు దోవకడ్డమయ్యెను. శ్రీవారు వారిని దూరముగ తొలగిపొమ్మనిరి. అందుకువాడీతీరునప్రత్యుత్తరమిచ్చెను. తామదూరముగపొమ్మని యాజ్ఞాపించినది నాశరీరమునా? లేక నాయాత్మనా? శరీరమే యగుపక్షము తమశరీరమెట్లు రక్తమాంసశల్యనిర్మితమో నా శరీర మట్లే. శరీరమును కాదు ఆత్మనే దూరముగపొమ్మని సెలవిచ్చితిరా? మీలోనుండు నాత్మయు, నాలోనుండునాత్మయు పరమాత్మయొక్క ప్రతిబింబములే యనుట తమకు తెలియని యంశముకాదు. అనినతోడనే ఆదిశంకరుల యంతరాత్మ ప్రబోధింపబడి యాభావనాబలముచే అస్పృశతాభ్రాంతి నశించి వారిని యీ యంత్యజవృద్ధునికి సప్రదక్షిణసాష్టాంగప్రణామము లాచరింపజేసినది. ఈ ఇతిహాసము శంకరుల జీవితచరిత్రమందు మనీషాపంచకముపేరితో చేటికిని వ్యవహరించుచున్నాము. ఈవ్యాసారంభమందు చిత్రింపయుండు ప్రతిమ వ్యక్తపఱచుట ఈభావమునే.

ఒక్కొక కాంగ్రెస్ కమిటీవారును పల్లె యనక పట్టణ మనక ఇట్టియాదర్శముల వ్యాపింపజేయుట కర్తవ్యము. చదువురానివారు సహితము గ్రహించునటులు ఈభావమునే బొమ్మలు చిత్రించి అమృతాంజనము యొక్క ప్రకటనవలె తిరిగిన దిక్కులందెల్లయు కనబడునట్లు ప్రచురించుట మతియొకయుక్తి. మనీషాపంచకమును తందనపాటగా నల్లి, సంక్రాంతి, కామునిపండుగ, మహర్నవమి, దీపావళి మున్నగువినోదకాలములందు విద్యావంతులగు యువకులు హాస్యరసమువెల్లివిరియ ఉచితవేషములతోను సాధనములతోను పాడుచు జనులమనసుల నీయాదర్శముల కాకర్షింపజేయుట దేశసేవ. కాంగ్రెస్ సమావేశములందు దినదినము ప్రాతఃకాలమున వెడలు భజనకూటములు తమదేశీయగీతములతోపాటు, మనీషాపంచకమందలి యాదర్శములవంటి భావములను పాటలుగా కట్టి వర్ణించుటయు ప్రయోజనకారియై యుండును. నాటకప్రదర్శనకాలమందు విష్కంభములలో ఇట్టి భావములను ప్రహసనరూపములుగ ప్రదర్శించుట వింతే కాక వివేకము నాపాదించినట్లగు. సినీమాలవారు సయితము ఇట్టిభావముల ప్రదర్శించుటచే తమ యుద్యమమందలి యుత్తమకర్తవ్యభాగమును నెఱవేర్చినవారగుదురు.

ఈతీరున దేశీయాభ్యుదయకార్యక్రమము దొక్కొక సోపానమునకును ప్రస్తుతమైయుండు భావముల వెదకి వానిని ఇతుపకారులవలె మొనగలుగ గొట్టి వానితో ప్రజల మానసక్షేత్రముల దున్నినపుడు కార్యబీజముల విత్తుట కనువగును.

అథ మనీషాపంచకప్రారంభః

సత్యాచార్యస్య గమనే కదాచి న్ముక్తిదాయకమ్,
కాశీక్షేత్రం ప్రతి సహగౌర్యా మార్గే తు శంకరమ్. ౧

అంత్యవేషధరం దృష్ట్వా గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్,
శంకర స్సోపి చాండాల స్తం పునః ప్రాహ శంకరమ్. ౨

అన్నమయా దన్నమయం, అథవా చైతన్య మేవ చైతన్యాత్,
ద్విజవర! దూరీకర్తుం, వాంఛసి కిం గచ్ఛగచ్ఛేతి. ౩

కిం గంగాంబుని బింబితేంబరమణౌ చాండాలవాటీ పయః
పూరే చాంతర మస్తి? కాంచనఘటీమృత్కుంభయో ర్వాంబరే?
ప్రత్యగ్వస్తుని నిస్తరంగసహజానందావబోధాంబుధౌ
విప్రోఽయం శ్వపచోఽయమిత్యపిమహా న్కోఽయం విభేద భ్రమః? ౪

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యా సంవి దుజ్జృంభతే
యా బ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ,
సై వాహం నచ దృశ్యవ స్త్వితిదృఢప్రజ్ఞాపి యస్యాస్తిచేత్
చాండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురు రి త్యేషా మనీషా మమ. ౫

బ్రహ్మైవాహ మిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయా శేషం మయా కల్పితమ్.
ఇత్థం యస్య దృఢా మతి స్సుఖతరే నిత్యే పరే నిర్మలే
చాండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురి త్యేషా మనీషా మమ. ౬

శశ్వ న్నశ్వర మేవ విశ్వ మఖిలం నిశ్చిత్య వాచా గురోః
నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజశాంతాత్మనా,
భూతం భావిచ దుష్కృతా ప్రదహత స్సంవిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు రి త్యేషా మనీషా మమ. ౭

యా తిర్యఙ్నరదేవతాభి రహ మి త్యంతః స్ఫుటా గృహ్యతే
య ద్భాసా హృదయాక్షదేహవిషయా భ్రాంతి స్స్వతో చేతనాః,
తాం భాస్యైః పిహితార్కమండలనిభాం స్ఫూర్తిం సదా భావయన్
యోగి న్నిర్వృతమానసోహి గురు రి త్యేషా మనీషా మమ. ౮

యత్సౌఖ్యాంబుధి లేశలేశత యిమే శక్రాదయో నిర్వృతాః
య శ్చిత్తే నితరాం ప్రశాంతకలనే లబ్ధ్వా ముని ర్నిర్వృతః,
యస్మి న్నిత్యసుఖాంబుధౌ గలితధీః బ్రహ్మైవ స బ్రహ్మవిత్
యః కశ్చిత్ స సురేంద్రవందితపదో నూనం మనీషా మమ. ౯

మనీషాపంచకం సంపూర్ణమ్

# గ్రంథస్వీకారము

## మన కీ దారిద్ర్యమేల?

## భారతవర్ష ఆర్థికచరిత్రము

గ్రంథకర్తలు దేశిరాజు రామచంద్రరావు, సత్యసుబ్రహ్మణ్యముగారలు. భారతవర్ష 'ఆర్థికచరిత్రము' అను నామాంతరము గల యీగ్రంథము ఆంధ్రయువజన స్వరాజ్యసభవారి ప్రచురణములం దాఱవప్రచురణము. దీనియందు భారతదేశ దారిద్ర్యమునకు మూలములైన కారణములు సవిస్తరముగ చర్చింపబడినవి. రమేశచంద్రదత్తు, దాదాభాయి నౌరోజీ, డిగ్బి, వాచా, గోఖ్లే, హిండ్మను, మాలవ్యా, లజపతిరాయి, లక్ష్మణరావుగార్లు మొదలగువారిగ్రంథముల సారాంశమును ప్రభుత్వమువారి నివేదికముల లెక్కల సారాంశమును నిందు జేర్పబడి ఆర్థికచరిత్రమంతయును సంక్షేపముగను 15 ప్రకరణములందు బాగుగను క్రోడీకరింపబడినది. భరతఖండము సహజసంపదలను గలిగియుండియును నేల దారిద్ర్యము ననుభవించుచున్నదియో గనుగొనుటయును దారిద్ర్యమునకు ప్రతీకారములను నిర్ణయించుటయును స్వరాజ్యస్థాపనమునకు సాధనములుగ నున్నవి. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు పీఠికయందు వ్రాసినటులు "స్వరాజ్య మన్న ప్రజల కన్నవస్త్రములసమస్య" యని రాజ్యాంగచరిత్రము విశదము చేయుచున్నది. ఆంగ్లరాజ్యతంత్రజ్ఞులు భారతఖండము బ్రిటీషుపరిపాలనముక్రింద సంపదలతో దులదూగుచున్నదని సిద్ధాంతము చేయుట యాచారమైనది. కర్జన్ప్రభు వీసిద్ధాంతమును స్థాపించుటకు శ్రమపడి పుస్తకమును బ్రకటించెను. ప్రతిసంవత్సరమును ప్రభుత్వమువారు ప్రకటించెడి నివేదికము లన్నియును సంపదభివృద్ధిని సూచించెడి లెక్కలతో నిండి యుండును. కాని ఆలెక్కలను బాగుగ బరిశీలించెడివారలకు పైపూతలు పోయి లోపలిగుట్టు బయటబడుచున్నది. ఈగ్రంథ మట్టిపరిజ్ఞానమును సంపాదించుట కుపయోగపడుచున్నది.

భారతదేశమును జూచినవారలకు బ్రత్యక్షముగ మొదటివిషయము ప్రజల దుర్భరదారిద్ర్యము. అమెరికాయందు తలయొకటికి రూ 750 ల ఆదాయమునకును భరతఖండమునందు తలయొకటికి రూ 30 ల యాదాయమునకును గల తారతమ్యమె దేశదారిద్ర్యమును చెప్పక చెప్పుచున్నది. దేశదారిద్ర్యమునకును పరాధీనస్థితికిని గల సంబంధ మీగ్రంథమునందు లక్ష్యలక్షణములతో నిర్ణయింపబడినది. మూడవప్రకరణమునందు భరతఖండమునందు ప్రపంచమునం దేదేశమునందు లేనివిధమున భూమిపన్ను వృద్ధిచేయబడినవిధము తెలుపబడినది. నాల్గవప్రకరణమునందు దేశపరిశ్రమ బలవంతముగ నాశనము చేయబడినవిధము తెలుపబడినది. అయిదవప్రకరణమునందు నౌకావ్యాపార మంతయును బ్రిటిషుప్రజలస్వాధీనమైనవిధము విమర్శింపబడినది. బ్రిటీషుద్వీపముల కేటేటను బోయెడి కోట్లధనప్రవాహము దారిద్ర్యమునకు మూలమై క్షామదేవతకును మృత్యుదేవతకును దేశ మాటపట్టైన విధ మితరప్రకరణములందు జర్చింపబడినది. అపారమైన సైనికవ్యయము రైల్వేలవ్యయము స్వదేశబంధనమునకును పరదేశలాభమునకును వినియోగపడుచున్న విధము తెలుపబడినది. పదియైదవప్రకరణమునందు దారమునకు పూసలను గ్రుచ్చినటుల నూటయేబదేండ్ల బ్రిటీషుపరిపాలనము సమకూర్చిన యనర్థపరంపరలు తెలుపబడినవి.

స్వరాజ్యసంపాదనమునకు మహాందోళనము జరుగుచున్న కాలము నందు భారతపుత్రులు తమప్రాచీనౌన్నత్యమును వర్తమానదుర్దశను గనుగొనక భావిపరిణామమును నిర్ణయింపజాలరు. గ్రంథమునందు సామాన్యముగ దెలిసినవిషయములె యున్నను 328 పుటలయందు భారతదేశార్థికచరిత్ర యంతయును జక్కగ నిముడ్పబడి గ్రంథము సకలజనోపయోగకరముగ నున్నది. గ్రంథము తేటతెనుగున వ్రాయబడి స్వరాజ్యప్రచారకులకును విద్యాలోచనమునకును నుపయోగకరముగ నున్నది. గ్రంథకర్త లీగ్రంథమునందు కేవలము బాహ్యసాధనదృష్టినే

కాక నాంతరంగికసాధనదృష్టిని సయితము పర్యాలోచనముచేసిన గ్రంథోపయోగ మతిశయిల్లి యుండును. స్వరాజ్యసంపాదనమునకు ప్రతిబంధకముల పరిజ్ఞానముతోపా టాత్మపరిజ్ఞానమును నవసరమగుచున్నది. గాంధి మహాత్ముడు నిర్దేశించిన యాంతరంగికసాధనములకు సయితము ప్రజాలక్ష్యమును మరల్చుట స్వరాజ్యసంపాదనమున కవసరం బగుచున్నది. ఆంధ్రయువజనస్వరాజ్యసభవారి యీప్రయత్నమును నాంధ్రప్రపంచ మాదరించి వారి ప్రయత్నములకు ప్రోత్సాహ మొసంగి స్వరాజ్యరథప్రచారమునకు దోడ్పడుట ధర్మము.

రాయలు అక్టేవో ౭౭౩ పుటలు వెల రూ 1—8—0.

దేశిరాజు రామచంద్రరావుగారు,

గాంధిమహావిద్యాలయము, ఏలూరు, కృష్ణాజిల్లా.

* * * *

### కర్ణభారము

భాసకవికృతము. విద్వాన్ కోపల్లి శివకామేశ్వరరావుగారిచే నాంధ్రీకృతము. తెనాలిలో ప్రకటితము.

పూర్వచరిత్రగాథల నరయుటకై పండితులు పరిశోధనము గావించిన సందర్భమున బయల్పడిన గ్రంథజాలములోనెల్ల భాసమహాకవికృతులు మిక్కిలి రసవంతములుగ నున్నవని రసికులంగీకరించియున్నారు. వానిలో నీకర్ణభారమొకటి. పరిమాణమునచిన్నదయ్యు కావ్యోత్కృష్టమున నుదారత నతిశయించు నీచిన్నిరూపకమును విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావుగారు చక్కగ తెనిగించి ఆంధ్రసారస్వతమునకు మేలు గావించిరి. దానకర్ణుడని పేర్గన్న కర్ణునకు తనకు జన్మకాలమున లభించినవియు, ప్రాణసంరక్షకములునునగు కవచకుండలములనుఅర్జునప్రాణరక్షణార్థియై కపటయాచకుడై వచ్చిన యింద్రునకు సమర్పించి ధన్యుడగుటయే ఈరూపకమునందలి యుదారకథనము. తెనిగింపులో మూలకృతియొక్క పటుత్వము చెడకుండ కాపాడినందుకు శ్రీశివకామేశ్వరరావుగా రభినందనార్హులే కాని పద్యము లచ్చటచ్చట విషమగతుల నడచుచు శ్రవణసుభగములు కాకున్నవి. గీత, కందపద్యములనడక సరళముగనుండ నటులు కవి పడెడు శ్రమ మెన్నటికి వృథ కానేరదు,

"కావునఁ బ్రజలఁ బాలింపఁగలుగుధర్మ" అను గీతపద్యపాదమును; "ఇనతురగసమానములు నరనాథమాన్యములు రాజ్యరమకుం దగునా" అను కందపద్యపాదములును గణబద్ధములై యున్నను చెవి కింపు నింపుటలేదు. కవిగా రిట్టి విషయముల నొకించుక సహృదయులయభిప్రాయమును మన్నించి యనుష్ఠింతురుగాక. గ్రంథము రవీంద్రుని గ్రంథములమాదిరిని చక్కగ ముద్రింపబడి ముద్దులొలుకుచున్నది.

* * * *

### నృత్యకళ (సచిత్రము)

ఎలెనార్ ఎల్డర్ గారు. దివ్యజ్ఞానప్రచురణాలయము, అడయార్, మద్రాస్. వెల రు. 0—12—0

ఈ గ్రంథమున అంగవిక్షేపప్రధానమగు పాశ్చాత్యనృత్యకళయొక్క సంప్రదాయమును పూర్వపు గ్రీకు లేర్పరచినసూత్రముల ననుసరించి రేమాండ్ డంకను ఇసాడోరా డంకను అను అన్నచెల్లెండ్రు సర్వజనసులభముగను, సహజసుందరముగను నుండునట్లు సంస్కరించి నిర్వచించినరీతి సచిత్రముగ నభివర్ణింపబడినది. అంగవిక్షేపప్రధానమగు పాశ్చాత్యనృత్యకళ నూత్నరసభావాభివ్యంజనకు చాలదని నాట్యకళారహస్యవేదులు గ్రహించుచున్నారు. అంగవిక్షేపమువలన రసభావధోరణులు స్థూలముగ మాత్రమే సూచితములు కాగలవు. డంకన్ పద్ధతిని ప్రస్తుతపాశ్చాత్యనర్తకులును, నృత్యవిద్యాలయములును balance, profile dancing లను ప్రధానముగ పోషించు గ్రీకునృత్యకళను ప్రస్తుతనాగరికతకును, విద్యాపద్ధతులకును శరీరవ్యాయామసాంప్రదాయములకును నను వగురీతి నవలంబించుచున్నారని గ్రంథమున తెలుపబడినది.

ఈగ్రంథమునందలి విషయములు భారతీయులకంతవిశేషములుగ దోపజాలవు. ఏలననగా:— భారతీయనాట్యకళ అంగవిక్షేపమును భావాభినయమును సమన్వయముజేసి పోషించుచున్నది. కేవలాంగవిక్షేపప్రధానమగు నాట్యకళకు నృత్యమనిపేరు. ఇది తాండవ, లాస్య, రాసాది విభేదములతో నొప్పుచున్నది. భావాభినయసహితమగు నృత్యము నాట్యమని పిలువబడుచున్నది. భావరాగతాళసహితమగు నాట్యము భరత మనబరగును. భరతశాస్త్రభాగములలో మొదటిదియగు భావాభినయమభినయశాస్త్రనియమితము. రాగతాళవిషయము సంగీతశాస్త్రనియమితము. అభినయశాస్త్రముపై నందికేశ్వరునిచే సంస్కృతభాషలో రచింపబడి శ్రీయుతులగు దుగ్గిరాల

గోపాలకృష్ణయ్య, ఆనందకుమారస్వామి పండితులచే నాంగ్లభాషలోనికి తర్జుమాచేయబడిన "అభినయదర్పణము" అను గ్రంథము నేటికిని ప్రమాణముగ నంగీకరింపబడుచున్నది. ప్రాచీననృత్యముయొక్క ఛాయలు నేటికిని రాసము కోలాటము మొదలగునృత్యములయందు వ్యక్తమగుచున్నవి. అభినయము నిత్యమును వారకామినీ నృత్యమునందు ప్రదర్శితమగుచునే యున్నది. భారతీయ నటులు, వారిలోముఖ్యముగ నాంధ్ర భాగవతులు, నృత్యాభినయములను రెండిటిని జతపఱచి సమన్వయముచేసి నృత్యముచేయుచు రసభావాభివ్యంజనము గావించుచున్నారు. ఇట్టినటులలో శ్రీఆదిభట్ల నారాయణదాసు గారును, కూచిపూడిభాగవతులలో నొకరగు వేంకట నారాయణ గారును ప్రత్యేకప్రశంసార్హులు. వీరు సూక్ష్మాతిసూక్ష్మములగు రసభావములనుగూడ నలిపనోహారముగను ప్రత్యక్షముగను నభినయించుచు నృత్యము చేయుదురు. విజాతీయనాట్యసంప్రదాయదాసులగుచున్న ప్రస్తుతాంధ్రనటకులు వీరినృత్తవిశేషముల నలవఱచికొని నాట్యకళను పెంపొందింపదగును. వారకాంతల పాలై పసవు దక్కిపోయిన భారతీయనాట్యకళ నుద్ధరింప బద్ధకంకణులగువారి నట్లుచేయుట కాలసింపవలదని యీగ్రంథము ప్రోత్సహించుచున్నది.

*      *      *      *

### ఏకాంతసేవ

వేంకట పార్వతీశ్వరకవులు, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, కాకినాడ.

ఈకావ్యమునకు తెలుగు ఇంగ్లీషుభాషలలో పీఠికలువ్రాసిన విమర్శకులు గ్రంథము విమర్శనాతీతమని చెప్పుచు 144 వ సెక్షన్ ప్రయోగించియు కారణములనుమాత్రము తెలుపక విడిచినందున శాసనోల్లంఘనము తప్పనిసరి యైనది. రాధామాధవుల ప్రణయమును వర్ణించు నీకావ్యము పాశ్చాత్యసారస్వతమున Idyll అనుపేరబరగు కావ్యధోరణికి సరిపోవును. కావ్యవస్తువు మానవహృదయాంతర్గతభావని వేదనమే యయ్యు ప్రకృతివర్ణనముతో విశేషముగ మేళవింపబడి ప్రస్తరింపబడినది. ఈ ప్రస్తారము కేవలప్రాచీనసంప్రదాయానుసారముగ గాని కేవలనవీనసంప్రదాయానుసారముగ గాని కావింపక నీజంటకవులు "కొత్తపాతల మేలు కలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మగా" ద్విపదలలో సాధ్యమైనంతవఱకు లక్షణయుక్తమును సులభమును నగు శైలిలో పాశ్చాత్యవాఙ్మయపరిచయమువలన నుద్బుద్ధములగు భావములను ప్రాచీనభారతీయకవిసమయములతో సమన్వయముజేసి పోషించి వర్ణించిరి. రాధకు మాధవుని యెడ గల యనురాగమును, మాధవుని దాక్షిణ్యస్వభావమును, మాధవుని దక్షిణనాయకత్వము మూలమున రాధ హృదయమున జనించు స్త్రీసహజములగు నీర్ష్య, ప్రణయకోపము, శంక, దైన్యము మొదలగు గుణములును రాధయొక్క వినిశ్చలభక్తితో మేళవింపబడి చక్కగ పోషింపబడినను, భాగవతపురాణమును వైష్ణవకవుల కావ్యములను, గీతగోవింద, కృష్ణకర్ణామృత, కృష్ణలీలాతరంగిణీ రాధికాసాంత్వన మాదిగాగల కావ్యములను జదివినవారికి కొంతవఱకు పరిచితములే. కాని పల్లవి నొక్కొక్కదాని నూతగా గొని సులభశైలిని రచింపబడిన గీతికలతో నీకావ్య మొప్పుచున్నది. ప్రకృతివర్ణనముకూడ ప్రాచీనభారతీయకవిసమ్మతమార్గముననే కావింపబడిన దని మానమ్మకము. "ప్రణయవనంబులోపలి పువ్వొథము, తుమ్మెదా వేవేగ తోలి తేవమ్మ!" "విరిబోణి యీమాట విన్నావటమ్మ? కనకాంగి నానాథు కన్నావటమ్మ?" "చిత్తమా, చిత్తమా, చెదరబోకమ్మ" "పాడవే కోయిల్యా పాడవే పదము" "తోలవే తుమ్మెదా తోలవే రథము" మొదలగు పల్లవులు వినసొంపుగనున్నవి. "నెలవంకదొన్నెలో నిర్మలామృతము" అనుప్రయోగము నిజముగ నమృతమును చవిజూపించుచున్నది. "భీకరజంతుగంభీరనాదముల, గిరికొన్న యుద్దండగిరిగహ్వరమున, చలువరాతిన్నెపై సకలంబు మఱచి, నెఱబాలునింబోలి నిదురించు"చుండిన శ్రీ గోపకృష్ణుని మనోహరరూపదర్శనము నీకవులు పాఠకుల మనోనేత్రములకు లక్ష్యంపజేసిరి. రాధాస్వభావము సుకుమారముగనే వర్ణింపబడినది. సహజశీలము, అనురాగము, భక్తి మొదలగు సద్గుణము లామె కలంకారములుగ కవులు ప్రసాదించిరి. కాని యామెభావప్రస్తారమున నవత యంతగా ప్రస్ఫురించుటలేదు. రాధయొక్క హృదయమర్మమును గోచరము కాకుండగ ప్రకృతివర్ణనలు కొంచెము మఱుగుపఱచుచున్నవేమో యని అనుమానము వొడముచున్నది. వర్ణనలయందుగాని భావప్రస్తారమునందుగాని మితమును పాటింప నీకవిశ్రేష్ఠులను గోరు

చున్నాము. శైలి సులభమును రసపోషకమునై నను కొన్ని పట్టుల కేవలము చమత్కారప్రధానముగుచు రసపుష్టికి కొరంత వాటిల్లజేయుచున్నది. ప్రక్రమాలంకారము మితముగ నుపయోగించినచో గుణమగును కాని విశేషముగ ప్రస్తరించినచో రోకంటిపాటయట్లయి కావ్యపటుత్వమును సడలించును. భావసాక్షాత్కారము బాగుగ పొందినకవి చేయు వర్ణనలయందు మితభాషణమును రూపైక్యసిద్ధియు ప్రస్ఫుటమగుచుండును. భావసాక్షాత్కారము చాలినంతగ కలుగనప్పుడే చమత్కారప్రధానములగు కవిసమయములకును, అతిశయోక్తులకును, దీర్ఘవర్ణనములకును, విపరీతభావప్రస్తారములకును ప్రసక్తి కలుగును. భావశక్తి (Imagination) కావ్యవస్తువును కలిగించి పోసిపోసి రూపైక్యసిద్ధినొందించును. ఊహాశక్తియు చమత్కారమును కావ్యవస్తుగుణవిశేషములను ప్రస్తారమమాత్రము కావించునే గాని రూపైక్యసిద్ధి నొందింపజాలకున్నవి. ఈ "ఏకాంతసేవ" యందు చమత్కారమే కొన్నిచోట్ల ప్రధానముగ పోషింపబడుట కావ్యము యొక్క రససిద్ధికి లోటుగల్గించుచున్నది. ప్రక్రమాలంకారమును విరివిగ వాడవలెనను నిచ్ఛయే ఈ చమత్కారవిలసనమునకు కారణమగుచున్నది. ఏతత్కావ్యభావసౌకుమార్యమునకు ద్విపదతోపాటు వాడుకభాషయు దోహదము కావింపగలిగెడిదే మోయనునాశ రసికులలో కొందఱను పీడింపక మానదని మా విశ్వాసము. ఏది ఎట్లున్నను నీకవులింత గసవంతముగ నీకావ్యము రచించినందు కభినందనార్హు లనుట నిస్సంశయము.

*   *   *   *

"భారతీయకళలను పరిశ్రమలను ఉద్ధరించు మార్గము"

ఈ. బీ. హావెల్. దివ్యజ్ఞానప్రచురణాలయము, అడయార్, మద్రాస్.

పాశ్చాత్యవిజ్ఞానవ్యామోహితులై భారతీయులు తమ కళాసంప్రదాయములను తృణీకరించు స్థితి వచ్చినయదనున సత్యమును వారికి దృగ్గోచరము జేసి భారతీయకళాపునరుద్ధరణ గావించిన మహనీయుడే ఈ గ్రంథకర్త. భారతీయులలో నెల్ల ప్రప్రథమమున పాశ్చాత్యనాగరికతకు దాసులై అపమార్గదర్శకులు కాజొచ్చిన వంగదేశీయులకు భారతీయకళారహస్యమును ప్రత్యక్షము గావించి అవనీంద్రనాథఠాకూరు మొదలగు చిత్రకారులను ప్రోత్సహించి, అభినవవంగీయ చిత్రకళాసంప్రదాయమున కొకరీతిగా జన్మకారణుడయ్యెనీ హావెల్ దొరగారు. భారతీయశిల్పమును గూర్చియు, చిత్రకళను గూర్చియు నిత డుద్గ్రంథముల రచించెను. విమర్శనపాత్రమగు నీగ్రంథమున హావెలుగారు భారతీయపరిశ్రమల యభివృద్ధికి పాశ్చాత్యదేశములలో పరిపాటియగుచున్న యంత్రనిర్మాణమును, ఫ్యాక్టరీ విధానమును తోడ్పడజాలవనియు భారతీయకళాధర్మముల ప్రకారమును స్వకులధర్మముల ప్రకారమును వివిధపరిశ్రమల నవలంబించుచున్న శిల్పిశ్రేష్ఠుల నాదరించి ప్రోత్సహించుటయే సాధనోత్తమ మనియు, భారతీయ విద్యాధికులు తమధనమును విదేశాగతమగు వస్తుసామగ్రికై వెచ్చింపక ఆనందజనకమగు చిత్రకళాసౌందర్యముతో నొప్పారు భారతీయచిత్రశిల్పాదులకై వినియోగించి భారతీయకళలను పోషించి ధన్యులు కాదగుననియు నుద్బోధించిరి. విద్యావిధానమున చిత్రకళాజ్ఞానము ప్రధానాంగముగ నుండవలెనని వీరు తెల్పిన విషయము వాస్తవము. నేడు మనవిద్యాధికులలో ననేకులు తమ బి. యే., యం. యే., బి. యల్. మొదలగు పట్టములను కేవలధనార్జనోపాయముల గావించి జీవితపరమావధిని సమగ్రముగ ననుభవించి చరితార్థులు కాజాలకున్నారు. ఇందుకు రసికతలేమియే కారణము. విద్యావిధానమున రసికతను పోషించు సంగీత, సాహిత్య, చిత్ర, శిల్పాదిశాస్త్రములను విద్యాధికారులు చేర్పకపోవుటచే నిట్టియనర్థము వాటిల్లుచున్నది. సంగీతసాహిత్యాదిశాస్త్రములు నేర్చిన ప్రయోజనమేమి? పొట్టనిండునా? యను భావము విద్యాధికులలో ప్రబలుట విచారకరము. ధనధాన్యాదికములవలన సంపాదింపదగిన సుఖముకన్న సంగీత, సాహిత్య, చిత్ర, శిల్పాదికములవలన లభించు నానందము వేయిమడుంగు లుత్తమమని గ్రహింపవలసి యున్నది.

గ్రంథమున స్త్రీలు కావింపదగిన పరిశ్రమలవిషయమున నత్యుపయోగకరమగు నొకసూచన గావింపబడినది. అది యేమనగా స్త్రీలు నూలువడికి వస్త్రములను చేతిమగ్గములపైన నేయవలెననియే. గృహలక్ష్మి యనదగు

గృహిణియే గృహమునకు శోభయు నలంకారమును గూర్చును. అట్టిగృహిణి తనయలంకారమునపట్ల నెంతశ్రద్ధ వహించునో గృహాలంకారములపట్లను, గృహపరికరముల పట్లను నంతశ్రద్ధ వహించినచో భారతీయపరిశ్రమల భవిష్యత్తునుగూర్చి భయమొంద నవసరములేదు. గ్రంథకర్త చెప్పినట్లు స్త్రీలు నూలువడికి వస్త్రములను స్వహస్తములతో నేసి అద్దకముచేసినచో నేఁటేట వస్త్రములకు గాను విదేశముల కేగు ధనప్రవాహము నరికట్టగలుగుదుకు. గాంధీమహాత్ముని చలువచే తిరిగి ఈ విషయమున స్త్రీలను పురుషులునుగూడ నభిమానమును శ్రద్ధను వహించుచుండుట శుభావహము. భారతీయచిత్రకళల విషయమై పాశ్చాత్యపండితులు వెలిబుచ్చిన యపోహల కీగ్రంథమున చక్కని సమాధానము లొసగబడినవి. గ్రంథము రచింపబడి చాలసంవత్సరములైనను ఇందలివిషయము నేటికిని రసికులకు విచారణీయమై సకలజనులకు నాదరపాత్ర మగుచున్నది.

* * * *

## భారతీయకళలు - పరిశ్రమలు

స్టెల్లా క్రామ్రిష్, ఆర్. శ్రీనివాసన్, కృష్ణస్వామి పిళ్ళ, డబ్ల్యు. డీ. యస్. బ్రౌను గార్లచే విరచితము; దివ్యజ్ఞాన ప్రచురణాలయము, అడయార్, మద్రాస్.

అడయారున 1922వ సం॥ డిసెంబరు నెలలో జరిగిన చిత్రకళా ప్రదర్శనము సందర్భమున పైన పేర్కొనబడినవారిచే నొసగబడిన యుపన్యాసములే ఈగ్రంథరూపమున ప్రకటింపబడినవి. "భారతీయకళాపరమార్థము" అను వ్యాసమున స్టెల్లా క్రామ్రిషుగారు భారతీయకళాభిజ్ఞులు స్వకీయభావసాక్షాత్కారమును సంప్రదాయాగతవిజ్ఞానముతో మేళవించి జాతీయజీవితమును తమరచనలయందు బ్రస్ఫుటముగ బ్రతిఫలింపజేసినవిధము నభివర్ణించి, భారతీయ కళాసంప్రదాయమునందలి ప్రమాణము, రూపభేదము, లావణ్యయోజనము, భావము, సాదృశ్యము, వర్ణవిన్యాసము మొదలగు నియమముల పరమార్థమును దెలిపి, భారతీయకళాభిజ్ఞుల మతమున నీతికిని రసానుభూతికిని వైరుధ్యము లేదనియు, పరస్పరవిరుద్ధవిషయసమన్వయరూపమగు శాంతియే, ఐక్యమే భారతీయకళకు పరమావధియనియు, దృష్టాదృష్టముల రెండిటిని శిల్పి రసోద్బోధకములుగ ప్రదర్శించుననియు "అభిసారికా" చిత్రసాహాయ్యముతో సువ్యక్తము గావించిరి.

ఈమెయే "నవీనపాశ్చాత్యకళాసంప్రదాయము" లను వ్యాసమునందు వర్ణవిన్యాసప్రధానమగు Impressionism, సూచనప్రధానమై ఇటాలియనులచే నవలంబింపబడిన Futurism, స్వరూపయాథార్థ్యప్రదర్శనప్రధానమై ఫ్రెంచివారిచే నవలంబింపబడిన Cubism, రసానుభవప్రదర్శనప్రధానమై భారతీయకళకు దరిదాపుగా వచ్చునదియై జర్మనులచేతను రష్యనులచేతను నవలంబింపబడిన Expressionism, చిల్లరకర్ణవలె ప్రధానముగ గలిగిన Constructionalism, వినోదమే ప్రధానముగ గలిగిన Dadaism మొదలగు కళాసంప్రదాయముల పోకడలను చక్కగ వివరించెను.

"దాక్షిణాత్యగానము" అనువ్యాసమున ఆర్. శ్రీనివాసన్ గారు కర్నాటకగానధోరణి, ఆశాస్త్రమునకు సంబంధించిన ఆధారములను, నియమములను, సంప్రదాయములను వివరించి, ఆయారాగములను పాడదగిన సమయమును నిరూపించి, కీర్తన, పల్లవి, రాగాలాపన, తేవారం, తిల్లానా, జావళీ మొదలగు గానఘణతుల స్వరూపస్వభావములను విశదము గావించిరి. వీరు తెల్పిన విషయములలో నెల్ల కర్ణాటకగాయకులు శారీరసంపత్తి నలవఱచికొని రసపోషణమునే లక్ష్యమునం దుంచుకొనవలెనను సూచనయు, జంత్రము లెప్పుడును గాయకుని "గాత్రపుపాట"కు లోబడియుండవలెనే గాని దానిని మ్రింగివేయ యత్నింపదగదను సూచనయు, గాయకులు కేవలగానకళయందే కాక ఇతరలలితకళలయందు సైతము కొంతయభినివేశము పొందదగునను సూచనయు, సకలకర్ణాటకగాయకాదరపాత్రములని మా యభిప్రాయము.

కృష్ణస్వామిపిళ్లగారు తమవ్యాసమునందు దక్షిణభారతదేశమున నిన్నమొన్నటివరకు ప్రచారములోనుండి నేడు క్షీణత నొందుచున్న వడ్రంగము, చెక్కడము, దంతపుపని, శిల్పము, వెండిబంగారపుపని, మొదలగు పరిశ్రమలస్థితిగతులను వర్ణించి వానికి తగినప్రోత్సాహము నొసగదగునని యుద్బోధించిరి.

డబ్ల్యు. డీ. యస్. బ్రౌనుగారు ట్రేడుగిల్డులనుపేర జరగు కార్మికసంఘనిర్మాణము ద్వారా భారతీయపారిశ్రామికులయొక్కయు వివిధశిల్పులయొక్కయు స్థితిగతుల నభివృద్ధినొందించి వారిని పెట్టుబడిదారుల ప్రాబల్యమునకు దాసులు గాకుండ కాపాడుట యావశ్యకమని తమవ్యాసమున స్పష్టీకరించిరి.

ఈగ్రంథము చక్కగా ముద్రింపబడి కళాభిమానులకును భారతీయపరిశ్రమాభిమానులకును నత్యంతాదరపాత్రమై యొప్పుచున్న దని మాయభిప్రాయము.

# పత్రికాస్వీకారము

### సారస్వతసర్వస్వము

పత్రికాధిపతి ఏలేరుపాటి రామభద్రయ్యగారు, తణుకు.

త్రైమాసపత్రికయొక్క నాలుగవసంచిక మా కార్యస్థానము చేరినది. రంగులతో వేయబడిన సరస్వతీ చిత్రము ముఖపత్రము నలంకరించుచున్నది. సారస్వతమునకు సంబంధించిన వివిధవిషయములను గూర్చి పలువురు పండితులు వ్రాసినవ్యాసములతో పత్రిక యొప్పుచున్నది. బ్రహ్మశ్రీ. వేలూరి శివరామశాస్త్రిగారిచే రచింపబడిన "నాగటిచాలు" అను ఖండకావ్యము రసభరితముగనున్నది. మిగిలిన వ్యాసములలో రాజశేఖరకవి - గూర్చి బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారును, పూర్వగ్రంథముల యవస్థలనుగూర్చి శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారును, వ్రాసినవ్యాసములును "అసురహాతక మహా జు" అను పేరుతో తెనిగింపబడిన టాల్స్టాయి కథయు ప్రత్యేకప్రశంసకు తగియున్నవి. ముద్రణము మునుపటికన్న బాగుగనున్నది.

### "సౌత్ ఇండియన్ రిసర్చి"

పత్రికాధిపతి శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారు, బి. యే. యల్. టీ. పైపత్రిక ఆంగ్లభాషలో ప్రతిమాసమును ప్రకటింపబడుచు భాషావిషయికములగు నపూర్వపరిశోధనములతో విలసిల్లుచున్నది. "ప్రాచీన తమిళకము"నుగూర్చి ఆర్. రంగాచారియార్ యం.ఏ. యల్. టి. గారును, ప్రాగ్దేశనాగరకతను గూర్చి యస్. భీమశంకరరావు బి. యే. గారును, "ప్రాచీనాంధ్రభాష" "ప్రాచీనాంధ్రులకును శాతవాహనులకునుగల సంబంధము" నుగూర్చి పత్రికాధిపతులును, వ్రాసిన వ్యాసములు చరిత్రపరిశోధకులకును జిజ్ఞాసువులకును విజ్ఞానదాయకములగ నున్నవి. ఇట్టి పత్రికలవలన ప్రాచీనాంధ్రనాగరకతాస్వరూపము నేడు మనకు కొంతవఱకైనను గోచరము కాగలదని విశ్వసించుచున్నాము.

---

# కలువకన్నె

### వేంకట పార్వతీశ్వర కవులు

శ్రీ. లకిలను నవ్వి నన్నాలకింపఁ జేసి
సొంపు పెంపున ననుఁ దమకింపఁ జేసి
కేలిగిలిగింత ననుఁ బులకింపఁ జేసి
చక్కఁ బోయెద విదియేమి చందమామ!

గీ. మోము నెత్తితి నీముద్దుమోము జూడఁ
గనులఁ దెఱచితి నీచక్కఁదనముఁ జూడ
మనసు విచ్చితి నీచల్లఁదనము నీడ
కుణిక మాఁగినఁ దప్పేమి చందమామ!

గీ. నావలపుఁజూపు తనకంట నాటెనేమొ
చక్క నీకంటనే నన్నుఁ జూచి నవ్వె;
చెంత చెలి మెచ్చి నన్నిట్లు చిన్నవుచ్చి
చనుటయే నీకు న్యాయమా చందమామ!

ఆ. కమ్మదేనెసోనఁ గలదు మైక మటంచు
వలపుగాలి మరులు గొలుపు ననుచుఁ
గలువకన్నె బ్రదుకు గారడిగాఁ జేసి
చనుట తగునె నీకుఁ జందమామ!

ఆ. మంతనంబు లమ్మొ మాటలు లేకుండ
మోహముద్ర లమ్మొ ముట్టకుండఁ
గలలఁ గాంచుటమ్మొ గనుమోడ్పు లేకుండ
నింద లేల నాకుఁ జందమామ!

---

# సాభిప్రాయ విశేషములు

## రుష్యాపరివర్తనము

ప్రపంచపరివర్తన మదృశ్యముగ జరుగుచున్న విధమును నానాదేశ వ్యవహారములు విశదముచేయుచున్నవి. వివిధదేశములందును చిరకాలభుక్తములైన ధనాభిమానమునకును కులాభిమానమునకును బలాభిమానమునకును మతాభిమానమునకును పదచ్యుతి గలుగుచు మహాపరివర్తనము తాండవమాడుచున్నది. రుష్యాయందు మహాపరివర్తనబ్రహ్మణ్యుఁడు లెనిను పరమపదమునకేగినను లెనిను స్థాపించిన నవధర్మవాసనలు ప్రపంచావృతమై నవయుగనిర్మాణమున కస్థిభారముగ నున్నవి. లెనిను రక్తప్రవాహముతో స్థాపించి పోషించిన సోవియెటు విధానము స్వరూపభేదములను పొందినను ప్రాచీనవిధానములు పదచ్యుతిని బొందినవిధమును పొందుచున్నవిధమును ప్రపంచేతిహాసము విశదము చేయుచున్నది. రుష్యాయందు నిరంకుశముగ నేలిన మఠములు రాజప్రాసాదములు యంత్రాలయములు విద్యాలయములు పదచ్యుతిని బొందుచు కార్మిక రాజ్యము ప్రబలుచున్నను పశుబలప్రాజాపత్యము పూర్వమువలె నవిచ్ఛిన్నముగ నేలుచున్నది. రుష్యాయందు జరుగుచున్న మహాపరివర్తనమునందు రూపవర్తన మధికముగను ధర్మపరివర్తనము న్యూనముగను గోచరం బగుచున్నది. భౌతికలక్ష్యముల నారాధించెడి ప్రజలకు రూపారాధనమునందు లక్ష్యము నిలుచుటయును సహజము. ప్రజాలక్ష్యము భౌతికభోగారాధనము నుండి ధర్మారాధనమునకు మరలనంతవఱకును పరివర్తనఫలము ప్రపంచ శాంతికి సాధనము గాఁజాలదు. నవయుగధర్మ నిర్మాణమును జేయుటకు తనకు శక్తి లేకపోయినను ప్రాతవాసనలను నిర్మూలముచేయుటకు యావచ్ఛక్తిని వినియోగించి జయభేరిని ప్రపంచమునందతటను మ్రోగించిన లెనిను మహావ్యక్తిగను ప్రపంచేతిహాసములందు పరిగణింపఁబడగలఁడు. పెట్రోగ్రాడునకు 'లెనిను గ్రాడు' అని నామకరణము చేయుటయును సోవియెటు ప్రభుత్వమును ఇటలి గ్రేటుబ్రిటను లంగీకరించుటయును లెనిను ప్రతిభను చాటుచున్నవి.

*  *  *  *

## కార్మిక ప్రభుత్వము

గ్రేటు బ్రిటనునందు కార్మికపక్షవిజయము నూతనశకారంభమునకు నిదర్శనముగ నున్నది. పూర్వాచారపరాయణత్వమునకు నిలయమైన గ్రేటుబిటనునందు రుష్యాయందు వలెనే కార్మికపక్షము రాజ్యాధికారమును బూనినది. ప్రభుప్రలును ప్రభువర్గాభిమానులును నిరసించిన రామ్సె మాక్డొనాల్డు గారును వారి వర్గమువారును పరిపాలనాధికారమును

వహించుచున్నారు. కార్మికవర్గమువారి యధికారము చిరకాలము సాగినను సాగకపోయినను గ్రేట్బ్రిటనునందు జరుగుచున్న పరివర్తనమును కార్మికవిజయము విశదముచేయుచున్నది. కార్మికవిజయము ప్రపంచశాంతికి సాధనము గాకపోయినను ప్రాతవాసనలను నిర్మూలము చేయుటకు సాధనంబై నవధర్మనిర్మాణమునకు దోడ్పడగలదు. పనివాండ్రు స్త్రీపురుషులు మంత్రులగుట యొకవిశేషమైనను మంత్రివర్గపు నిర్మాణము లిబరలు పక్షప్రాబల్యమును కార్మికపక్షపు దౌర్బల్యమును ప్రయోజనాభావమును సూచించుచున్నది. పెద్దమాటలను చెప్పిన రామ్సేమాక్డొనాల్డు గారు భారతరాజ్యాంగమునకు సానుభూతి గల కర్నలు వెజివుడు బెన్స్పూరు హాల్డేనుప్రభువుగార్లను వదలి సర్ సిడ్ని ఆలివరుగారిని మంత్రినిగ నియమింపవలసిన యవసరమె మంత్రివర్గపు దృష్టిని విశదము చేయుచున్నది. మహాపండితులును కర్మదక్షులును గల మంత్రివర్గమైనను నిరంకుశాధికారబద్ధమై స్వప్రయోజనపరాయణమైన రాజ్యాంగవిధానమునకు ప్రాణము నొసంగజాలదు. సంకల్పసామ్యత్వము లేని మంత్రివర్గము బ్రిటీషుద్వీపములకును భారతభూమికిని విశేషమైన ప్రయోజనమును సమకూర్ప జాలదు. లిబరలుపక్షసహాయము మీద నాధారపడియున్న లేబరుపక్ష మే ముహూర్తమునం దైనను నిర్గమించుట సంభవమైనను కార్మికపక్షము పొందిన విజయనాదము నవయుగనిర్మాణమునకు దోహదంబు నొసంగుచున్నది. గ్రేటుబ్రిటనునందు కార్మికవిజయము రుష్యాయందువలె పశుబలాధారమునను గాకను భావబలాధారమునను గలుగుట ప్రపంచశాంతికిని ధర్మసంస్థాపనమునకును శుభసూచకముగ నున్నది. మితవాదనాయకులు ధన్యవాదముల నర్పించుచు రామ్సేమాక్డొనాల్డుగారికి పంపిన సందేశములు గౌరవచిహ్నములైనను నిరర్థకములని కాలము తెలుపగలదు. ఉదారహృదయులైన సర్ సిడ్ని ఆలివరు గారును భారతరాజ్యాంగసింహాసన ప్రభావమువలనను సంకుచితహృదయమును పూనుట సహజము. సోవియటు ప్రభుత్వమును పూర్తిగ నంగీకరించిన కార్మికప్రభుత్వము స్వధర్మారాధనమును నిర్భయముగఁ జేయుట ప్రశంసార్హమై నవయుగధర్మాభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది.

* * * *

**కాకినాడసభలు**

భారతజాతీయమహాసభ భగవదనుగ్రహమువలనను కాకినాడపురమునందు జయప్రదముగ పరిసమాప్తము నొందినది. ఈ మహాభారమును జయప్రదముగ నిర్వహించిన కాకినాడ పౌరులును వారికి దోడ్పడిన వారును ప్రశంసలకు పాత్రులు. గాంధినగరనిర్మాణమునందును కార్యభారనిర్వహణమునందును గల సాధకబాధకములు కాంగ్రెసును జూచినవారలకు దెలిసియున్నవి. వందలసేవకులకును వేలప్రజలకును అన్నపానాదులను వసతులను గల్పించుటయందు గల కష్టముల కాద్యంతము లుండవు. గాంధినగరమునం

దీనివిషయములందు చక్కనియేర్పాటులు చేయ
బడి ప్రజలు సౌఖ్యము ననుభవించిరి. కాకి
నాడయందు గాంధినగరమునకు గలిగిన రైలు
నీటివసతుల సౌకర్యములునుసదుపాయములును
సామాన్యముగ నితర కాంగ్రెసులందు దపు
రూపముగ నుండెను. బొంబాయి కలకత్తా
మద్రాసు ఢిల్లీ అహ్మదాబాదు నగరములందు
నాగరకసంపద లధికముగ నుండియుండినను
కాకినాడయందు లభించిన సౌకర్యములు ప్రతి
నిధుల కితర ప్రదేశములందు లభించియుండవు.
జీవనోపాధికిని కాంగ్రెసువ్యవహారముల
కును సంబంధించిన సదుపాయము లన్ని
యును గాంధినగరమునందు సౌలభ్యములై
వ్యయప్రయాసము లనవసరము లైనవి.
స్వచ్ఛందసేవకుల వినయవిధేయతలు ప్రతి
నిధులమన్ననలను బడసినవి. మహిళాసేవక
దళము ఖద్దరు బట్టలను ధరించుచు జేసిన
సేవయు నగరసంకీర్తనములును ఆంధ్రస్వరూప
స్వభావములను భారతభూమికి సువ్యక్తము
చేసినవి. పరార్థపరాయణుండైన ప్రఫుల్ల
చంద్రరాయిపంకితుని ప్రశంసలకు పాత్రమైన
యాంధ్రత్వము నిజస్వరూపమును వ్యక్తము
చేసి ధర్మసంస్థాపనమునకు యథాశక్తిని పాటు
పడుగాత!

* * * *

కాంగ్రెసుమహాసభ

కాకినాడ సభలకు మౌలానా మహమ్మ
దల్లీ షౌకతల్లీ గారల సాన్నిధ్యసాహచర్యము
లనిర్వచనీయమైన ప్రతిభను గలుగజేసినవి.
దేశసేవకై నిర్బంధముల ననుభవించిన యాలీ
సోదరులు ప్రజాప్రియులు. వారి సాహచ
ర్యము కాకినాడసభల విజయమునకు దోడ్ప
డినది. ముప్పదియెనిమిదవ భారత జాతీయ
మహాసభ కధ్యక్షతను వహించిన మహమ్మ
దాలీగారి వ్యక్తిత్వము సభావిజయమునకు
దోడ్పడినది. మహమ్మదాలీగారి శౌర్యగాంభీర్య
వివేకములు కాంగ్రెసు విజయమున కుపచ
రించినవి. మహమ్మదాలీగారి హాస్యస్వభా
వము చిత్తప్రవృత్తి కాంగ్రెసు రంగమునందు
శాంతిస్థాపనమునకు దోడ్పడినవి. ఢిల్లీకాం
గ్రెసునం దంగీకృతమైన సమాధానతీర్మాన
మునకు మహమ్మదాలీగారు కారకులైనపు
డాసమాధానమును మహమ్మదాలీగారి యధ్య
క్షత క్రిందను జరిగిన కాంగ్రెసునయితే మంగీ
కరించుట యవసరము. కాంగ్రెసునందుగల
రెండుపక్షములవారును వారివారి విశ్వాస
ముల కనురూపముగ బ్రవర్తించుట కవకాశ
ములను కాంగ్రెసు తీర్మానము కల్పించి కాం
గ్రెసు రంగమునందు శాంతిని స్థాపించినది.
బహిష్కారధర్మమునందు విశ్వాసము గల
రాజగోపాలాచార్యులు గారికిని సభాప్రవేశ
ధర్మమునందు విశ్వాసముగల దేశబంధుదాసు
గారికిని సమాధాన మేర్పడినపుడు శాసన
సభాప్రవేశనిషేధవాదముల బలము పోయి
నది. రెండుపక్షములందును పట్టుదల గలవార
లకు కాకినాడతీర్మాన మసంతృప్తిని గలుగ
జేసినను సభానంతరము దేశమునందు ప్రబ
లిన శాంతవాతావరణము సమాధానావసర
మును విశదముచేసినది. కాకినాడకాంగ్రెసు
తీర్మానము ననుసరించి దేశము నిర్మాణకార్య
దీక్షను బూనవలసియున్నది. ఆ వ్రతమును
దేశ మెంతవఱ కనుష్ఠించునదియును కాలము
విశదముచేయగలదు. నిర్మాణకార్యవిధానము
నందు ముఖ్యాంగమైన ఖద్దరుప్రచారమునం
దాంధ్రదేశమునకు గల యవకాశములను
కాకినాడకాంగ్రెసు విశదముచేసినది. దీని
యందు బ్రచురించిన కాంగ్రెసు పటముల
సందర్శనము విషయావగాహనమునకు దో

ద్పడగలదు. ఖద్దరుగుడారము ఖద్దరువస్త్ర ధారణము ఖద్దరుప్రదర్శనము ఖద్దరుప్రచారమున కాంధ్రదేశమునకు గల యవకాశము లను స్పష్టముచేసినవి. ఈ యవకాశముల నాంధ్రప్రజలును నాయకులును ఖద్దరు బోర్డును వినియోగించి నిర్మాణకార్యవిధానాంగమైన ఖద్దరుప్రచారమునకు దోడ్పడి కాకినాడకాంగ్రెసు సమాధానమును సార్థకముచేయుట ధర్మము. శాసనసభలయందు స్వరాజ్యపక్షమునకు గలిగిన బలము ప్రతిష్టంభనమునకును స్వరాజ్యసంపాదనమునకును నుపయోగకరములు గావని యనుభవము విశదము జేయగలదు. దేశబంధు చిత్తరంజనదాసు గారి పట్టు నెగ్గినది. అసహాయయోగసంరంభమునం దలసట చెందిననాయకులకు విశ్రాంతి గలిగినది. అసహాయోద్యమావలంబకులకు మహత్తరమైన యాశాభంగము కలిగినది. దైవనిర్ణయములను శిరసావహించి స్వధర్మ నిర్వహణమును జేయుట కాంగ్రెసుప్రచారకులకు ధర్మమై యున్నది.

* * *

ఇతరమహాసభలు

ఖిలాపతుసభాధిపత్యమును వహించిన మాలానా షౌకతాలీగారి సరళస్వభావమును గాంభీర్యపరాక్రమశీలమును ఖిలాఫతు సభా విజయమునకువలె కాంగ్రెసు విజయమునకును దోడ్పడినవిధమును సభావ్యవహారములు విశదముచేసినవి. షౌకాతాలీగారి విశాలహృదయ ఢంకానాదము సమ్మోహజనకమై విభేదములను మఱపించినది. ఆలీసోదరులందు భీమాకారమును కోమలహృదయమును గల షౌకతాలీగారి సంబోధనలు సర్వత్ర ప్రజావిశ్వాసమునకు పాత్రములగుచు ప్రజాహృదయమునందు సంచలనమును గలుగజేసినవి.

కాకినాడయందు జాతీయవారమునం దితరమహాసభలును యథాప్రకారము సమావేశమై జాతీయహృదయమునం దుదయించిన మహాసంచలనమును విశదముచేసినవి. హిందీ సాహిత్యసమ్మేళనసభ హిందూస్థానీభాషను సాధ్యమైనంతవఱకు కాంగ్రెసు వ్యవహారమునందు జాతీయభాషనుగ నుపయోగింపవలయునని నిర్ణయించినది. వాలంటియరులసభ హిందూస్థానీ సేవాదళవిధానమును నిర్ణయించినది. మహిళాసభ ఖద్దరుప్రచారవ్రతమును స్వీకరించినది. విద్యార్థిమహాసభ జాతీయవిద్యావసరమును నిర్ణయించినది. సంఘసంస్కరణ మహాసభ సకలజాతులకును స్త్రీపురుషులకును సాంఘికస్వాతంత్ర్యావసరమును ప్రతిపాదించినది. ఆస్తికమహాసభ గానమహాసభ దైవోపాసనవిధానమును నాదోపాసనక్రమమును నిరూపించినవి. కాకినాడయందు గూడిన మహాసభ లన్నియును నాంధ్రహృదయక్షేత్రమునందు ప్రబుద్ధమైన మహాచైతన్యమును విశదముచేసినవి. కాకినాడ సభలందు సువ్యక్తమైన మహాసంచలనము దేశావృతమైన సకల సంస్థాపనలందును గోచరంబగుచు జాతీయ జీవనతరంగములను సువ్యక్తముచేయుచున్నది. ఆంధ్రప్రపంచము కాకినాడయందు గాంధి నగరమునందు మహాసభలయందు వ్యక్తము చేసిన కార్యపరత్వమును సేవావిధానమును సహనశీలతను నిత్యజీవనవిధానమునం దభ్యసించుచు నాంధ్రత్వసిద్ధిని బడసి భారతజాతీయ జీవనమునందు యథార్థస్థానమును బడయును గాత! సంపూర్ణమైన గాంధినగరమునందు గాంధిమహాత్మునకు ప్రత్యక్షముగ లేకపోవుట గొప్ప కొఱతగ నుండెను.

* * * *

## గాంధిమహాత్ముడు

గతమాసమునందు గాంధియనారోగ్యస్థితి పిడుగువలె నాకస్మికముగ వ్యక్తమై ప్రజాహృదయమునందు మహాసంక్షోభమును గలుగజేసినది. వెనుకటిదినమునను నారోగ్యముగనున్న గాంధిమహాత్ముడు మఱుదిన మనారోగ్యముగ నుండుట యసంభవము గదా! ఈయసంభవవార్తలను రామదాసు గాంధికి దెలిపిన వైద్యుడసమర్థుడో వంచకుడో యనుధర్మ రాజున కెఱుక. ఏది యెటులున్నను గాంధిమహాత్ముని ప్రాణమును రక్షించిన కర్నలు మేడకుగారు వంద్యులు. ఆపత్సమయమునందు సయితము గాంధిమహాత్ముడు వ్యక్తముచేసిన సహనము త్యాగము శాంతము సాధుశీలము యథార్థముగ మహాత్ముని జేయుచున్నవి. ప్రాణోపద్రవసమయమునందు సయితము శ్రీనివాసశాస్త్రిగా రభ్యర్థించినను సత్యశీలమును సంరక్షించుకొనుటకై దేశమునకు సందేశమును దెలుపుటకు నిరాకరించి యాత్మధర్మమును గాపాడి మహాత్ముడు తనధర్మశీలమును విశదముచేసెను. అట్టి మహానుభావుని ప్రాణాపాయసమయమునందు సయితము నిర్బంధమునందుంచుట యధర్మమైనను సధర్మవిధానసంరక్షకుల కహంకారరక్షణమునందు గల విశ్వాసము ధర్మసంరక్షణమునందు గలుగకున్నది. ప్రపంచమంతయును తలక్రిందులగుచున్నను మాయాధికారపూజారులు మాత్రము ధర్మరహస్యమును గ్రహింపజాలకున్నారు. ప్రపంచమంతయును శాంతమూర్తియైన గాంధివిమోచనమును గోరుచున్నను నిరంకుశాధికారహృదయము మాత్రము దుర్భేద్యముగ నున్నది. ఇంగ్లాండునందు లేబరుపక్ష మధికారులైనను స్వదేశమునందు స్వరాజ్యపక్షము ప్రబలినను మితవాదులు స్వతంత్రవాదులు కోరినను నిరంకుశదుర్గమునందు జేరిన గాంధిమహాత్మునకు మోక్షణోపాయ మసాధ్యముగనె యున్నది. సామ్రాజ్యశాసనసభయందు గాంధిమహాత్మునివిమోచనమునకు సంబంధించిన ప్రతిపాదన మామోదితము గాకపూర్వమె రీడింగు వర్గమువారిహృదయమునందు వివేకోదయ మగు నని యాశించినవారికి రాజప్రతినిధి భారతశాసనసభలో నొసగిన యుపన్యాసము అధికారుల చిత్తవృత్తి యింకను మాఱనివిధమును సువ్యక్తము జేయుచున్నది. పశుబలసాధనమునను భౌతికభాగ్యభోగముల మూలమునను మహాపరివర్తనసంరంభమునందు మునిగి యున్న ప్రపంచమునకు అహింసాసాధనమును త్యాగమును శాంతిప్రదమైన యాత్మయోగమును బోధించిన మహానుభావుడు నిర్బంధదుఃఖము ననుభవించుట నవయుగోదంతమునందు విచిత్రాధ్యాయముగ నుండగలదు. ఆంగ్లలోకము గాంధిమహాత్ముని యాదేశములను బాలించి యీశ్వరప్రసాదమును బడయునుగాత! ఈ రెండవ సంచికను ముగించెడి సమయమునను గాంధిమహాత్ముని బొంబాయిప్రభుత్వము విడుదలజేసినదను శుభవార్తను విని దయామయుడైన పరమేశ్వరునకు ప్రణామములను సమర్పించుచున్నాము. పుష్య బ॥ ౧౩ భానువారమున మహాత్ముని సందర్శించినపుడె మహాత్ముని విమోచనము ధ్రువమని యంతరంగమునందు విశ్వాసము గలిగినది. ఈవిశ్వాసమును మిత్రు లంగీకరింపకపోయినను అది యథార్థమైనందుల కానందము నొందుచు గాంధిమహాత్మునకు సంపూర్ణారోగ్యము గలుగుటకు పరమేశ్వరుని వేడుచున్నాము.

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thumbu Chetty Street, G. T. Madras.

THE MAIN ENTRANCE TO THE CONGRESS PANDAL



3౮ వ జాతీయమహాసభాసింహద్వారము - కాకినాడ

THE KHADDAR PANDAL OF THE 38TH INDIAN NATIONAL CONGRESS, COCANADA



౩౮ వ జాతీయమహాసభ - ఖద్దరు గుడారము - కాకినాడ

THE AUDI-ANDHRA BHAJAN PARTY, COCANADA




ఆదిమాంధ్రుల భజనసంకీర్తనము - కాకినాడ

WEAVING EXHIBITION OF THE KHADI ASRAM, BONTALAKODUR, COCANADA



ఖద్దరు నిర్మాణ విధానము - బొంతలకోడూరునందలి ఖాదిఆశ్రమనివాసుల ప్రదర్శనము - కాకినాడ

# విషయానుక్రమణిక

## చిత్రపటముల వివరములు

రంగుల పటములు:— బుద్ధుఁడు; బుద్ధుని వివాహోత్సవము.

ఇతరపటములు:—మాయాదేవి స్వప్నము; బుద్ధుని ప్రథమ నగరప్రవేశము; అసితముని భవిష్యత్కథనము; బుద్ధుని భార్యాన్వేషణము; స్వర్ణపంజరబంధము; బుద్ధుని నగరవిహారము; బుద్ధుని ప్రబోధము, విషాదము; బుద్ధుని సంసారవిసర్జనము; బుద్ధుని మహాత్యాగము.

---

# బుద్ధదేవుడు

అజంతాచిత్రము క్రీ॥ పూ॥ ౧-వ శతాబ్దము

శ్లో. ఆచార్యం స్వస్తికాసీనం జ్ఞానముద్రాంచ పుస్తకం, బిభ్రన్తం బుద్ధియోగాఢ్యం వన్దేహం కరుణానిధిమ్.



చ. ప్రియయువతిం బ్రభుత్వమును వీడి యరణ్యముఁ జేరెఁ దత్త్వవి
జ్ఞేయమునకై మహాతపముసల్పి కృతార్థతఁ గాంచె నెల్లెడన్
దయయు నహింసయుం బరమసత్యములం దెలుపంగఁ జెప్పె నమ్మహా
దయుఁడగు బుద్ధదేవునిపదంబుల నేను నమస్కరించెదన్. —వేటూరి ప్రభాకరశాస్త్రి.

శ్రీ ఆర్ట్ ప్రెస్స్—బొంబయి.




చెన్నపట్టణము, మార్చి ౧౯౨౪

సంపుటము ౧. రుధిరోద్గారి సంవత్సరము ఫాల్గుణమాసము సంఖ్య 3.

# గాంధి శతకము

మంగిపూడి వేంకటశర్మ గారు

ఇటఁ బెండ్లి యైనసతి స
చ్చట మరలన్ బెండ్లిగాక సరిగాదట యీ
యటమటలు మిక్కుటంబుగఁ
గటువులుగద వినుటకైన గాంధిమహాత్మా.

క. నీ విట్టి యాగడంబుల
నేవిధముననైన మాన్ప నెంచి ప్రభులతో
నేవిధముల మొరలిడి పని
గావించితి విసువులేక గాంధిమహాత్మా.

క. మనరాజప్రతినిధితో
మనవినిఁ గావించి యచటిమనయనమానా
లను మాన్పఁగ యత్నంబులు
ఘనముగ నొనరించినావు గాంధిమహాత్మా.

క. మొరలాలకింపకున్నన్
సరకారు నెదుర్పఁదలఁచి శాంతముతో సో
దరులఁ గలసి యాందోళనఁ
గర మొప్పఁగఁ జేసినావు గాంధిమహాత్మా.

క. నీ విట నుండఁగ బోయరు
భూవరులను దిట్టితనుచుఁ బోరాటంబున్
గావింప వత్తువనుచున్
గానలు లంపిరఁట వార్త గాంధిమహాత్మా.

క. పొగవోడ నెక్కి పోవఁగ
దిగనీయక యడ్డి రచటి తెంపరులు నినున్
వెగటార్పఁ జూడ బ్రతుకు టె
గగనం బయ్యెనుగదన్న గాంధిమహాత్మా.

క. వమ్మయ్యె నెల్లయత్నము [చున్
లిమ్మెయి సత్యాగ్రహంబె యిఁక గతియను
సమ్మె యొనర్పఁగఁ జేసితి
గమ్మున హైందవులచేత గాంధిమహాత్మా.

క. కట్టువడియుఁ బనులెల్లన్
వట్టము దిట్టముగఁ దెల్లవారికి వచ్చెన్
కట్టలుకన్ బట్టిరి నిను
గట్టడికిని మూలమంచు గాంధిమహాత్మా

క. శిక్షించిరి నిన్నును నీ
పక్షపునాయకులనెల్ల బహుసహచరులన్
లక్షింపక న్యాయంబును
గక్ష ప్రధానంబుఁ జేసి గాంధిమహాత్మా.

క. నీకొమరుల నీసతిని న
నేకులబిడ్డలను స్త్రీల నిలిచిరి చెఱలన్
పాకీపని చేయించిరి
కాకన్ నీచేతఁ గూడ గాంధిమహాత్మా.

క. ఎన్నికడగండ్లఁ బెట్టిన
జన్నపుదీక్షవలె నోర్చి జయలక్ష్మిని జే
కొన్నావు శాంతరణము జ
గన్నుతమగు సరణినడిపి గాంధిమహాత్మా.

క. సేవాసంఘముఁ బెట్టి భ
యావహమగు ప్లేగు రేఁగినప్పుడు ప్రజలన్
సేవించితి నిజుపేదలఁ
గావా సమదర్శి నీవు గాంధిమహాత్మా.

క. బోయరుయుద్ధములో నాం
గ్లేయులభటులున్న చోటి కేగి చొరవమై
సాయపడవె బృందముతో
గాయపడినవారికెల్ల గాంధిమహాత్మా.

క. ఈదేశమునకు వచ్చిన
మీఁదన్ స్థితిగతులు తెలియ మెలఁగితివీహిం
దూదేశమెల్లఁ జూచితి
గాదగునాయకులనెల్ల గాంధిమహాత్మా.

క. రహినిలిపి సబర్మతితట [ని
మహి నొకసత్యాగ్రహాశ్రమము నింద్రియ
గ్రహ మాదిశిష్యుల కను
గ్రహమున బోధించినావు గాంధిమహాత్మా.

క. పంట మొదలంట చెడి యా
కంటికి సంకటముపడెడు ఖైరాప్రజలన్
దంటతనంబునఁ బ్రోచితి
కంటకమగు పన్నుమాన్పి గాంధిమహాత్మా.

క. కూలి తగినట్లిడక యం
త్రాలయములవా రహమ్మదాబాదునఁ గూ
లీల నలఁప మాన్పితి ది
క్కాలురడలనుపవసించి గాంధిమహాత్మా.

క. ద్విజవరచాంప్రాన్ తోఁటల
యజమానులు కూలిజనుల నలయింపఁగ స
క్కజముగఁ గలహము దీరిచి
గజిబిజిమాన్పించినావు గాంధిమహాత్మా.

క. జర్మని చెలరేఁగి వడిన్
మార్మసగెడు వేళ మిత్రమండలివహి స
ద్ధర్మమని తోడ్పడవె స
త్కార్మిక, కరుణామృతాత్మ గాంధిమహాత్మా.

క. రౌలట్టుచట్టమును బరి
పాలకులొనరింప వద్దు వద్దని ప్రబలాం
దోళనమును గావింపవె
కాలజ్ఞుఁడవైననీవు గాంధిమహాత్మా.

క. జర్మనుల కష్టపడితిమి [లో
కూర్మిని నాంగ్లులకు జయముఁ గూర్చితి మని
మార్మ్రోలు రౌలటయ్యె నె
కర్మముఁ దప్పింపఁగలమె గాంధిమహాత్మా.

క. రాజప్రతినిధి నిన్నున్
దాఁ జీరికిఁగొనకపోయెఁ దగదిఁకఁ జాగన్
యోజన సత్యాగ్రహకో
గ్రాజికిఁ దలఁపడితివయ్య గాంధిమహాత్మా.

క. భారతులకీర్తి కీయతి
ఘోరపుఁజట్టము కళంకగునుగావున స్త్రీ
పూరుషులెల్ల రసంగీ
కారముఁ దెల్పనలెననవె గాంధిమహాత్మా.

క. హిందువులు ముసల్మానులుఁ [వా
బాంధుగఁ బార్శీలు క్రైస్తవులు మున్నగు
రందఱికిని నుపవాసముఁ
గ్రందుగ నీవాజ్ఞనిడవె గాంధిమహాత్మా

క. శోకము సూచించెడుగతి
నేకార్యముసేయఁగూడ దీకృత్యమె మీ
కేకత్వం బిడునని ప్ర
జ్ఞాకౌశలయాజ్ఞనిడవె గాంధిమహాత్మా.

క. నీయాదేశము చొప్పున
నీయార్యావర్త మెల్లయెడ హారదినమున్
జేయదె యత్యద్భుతముం
గా యోగిజనాగ్రగేయ గాంధిమహాత్మా.

క. సరకారులు నీదు ప్రభా
భరమున వెరగంది నిన్ను బంధించిరి దు
ర్భరమగు నవ్వార్త రుషా
కరులన్ గావించె నరుల గాంధిమహాత్మా.

క. హరితాళోత్సవములలో
జరిగెను ఘుర్షణలు కొన్ని జనులకు సర్కార్
సరులకు నొక్కొకయెడ ము
ష్కరపుఁ బనులు సంభవించె గాంధిమహాత్మా

క. అత్యంతము మదిఁ జింతిలి
సత్యాగ్రహదీక్షనిలుప శాసించితి వౌ
ద్ధత్యము నెల్లనికతమున
గత్యంతరమేమి లేక గాంధిమహాత్మా.

క. నినుబంధించిన కారణ
మునఁగద యీఘోరకృత్యములు పుట్టె
చును విడిచి రంతనంతట [నటం
ఘునశాంతమునిందుకొనియె గాంధిమహాత్మా

క. జరిగినగత్తరలో నలు
గురైదుగురు తెల్లవారు కూలిరనుచు డ
య్యరుఁడు నిరపరాధుల ని
ష్కారుణను వేటాడినాఁడు గాంధిమహాత్మా.

క. ఆవేఁట సభాభిషమునఁ
గావించుటకతన బాలకాంతావృద్ధుల్
వేవురు చచ్చిరి నొచ్చిరి
కావన్ గతిగాన లేక గాంధిమహాత్మా

క. అసాధువధలు జరిగిన
వాసరముననుండి యాంగ్లపాలకులెడ వి
శ్వాసము పోయెను నీయెడ
గాసిల్లెను చింతనంత గాంధిమహాత్మా.

క. పాలనవిధిలోఁ గల లో
పాలనుసవరింపుమనుచుఁ బ్రార్థించిన వా
రాలనపాలన సేయక
కాలంబునుగడపినారు గాంధిమహాత్మా.

క. నైరంకుశాధికారుల
ఘోరపువర్తనముఁ జూచి కోపించి మహో
దారుఁడవు సహాయతిర
స్కారము శాసించినావు గాంధిమహాత్మా.

క. రాటమున నూలువడుకుచు
నీటుగఁ జేమగ్గములను నేసినబట్టల్
పాటింపఁగవలె నని యు
ద్ఘాటించితి వెల్లరకును గాంధిమహాత్మా.

క. చరకమె చక్రము, సూక్తుల [శాం
నురిమెడు "యంగిండియా" యెయురుశంఖము
తరసంబెగద యహింసయె
కరవాలం బిపుడు నీకు గాంధిమహాత్మా.

క. మరయేడ రాటమెక్కడఁ
దరమే రాటములు మరల ధాటికి నిల్వన్
సరిసరియని నినుసవ్వీరి
కరమరుదుగ నెల్లవారు గాంధిమహాత్మా.

క. శాసనసభలును విద్యా [గ్రస్
వాసంబులు కోర్టు కల్లు వదలుఁడు. కాం
శాసించినట్లు నడుస్తఁడు
గాసి వదలునంటిగాదె గాంధిమహాత్మా.

---

# రా గ భ య ము

నోరి నరసింహశాస్త్రి గారు, బి. ఏ. [సాహితీసమితి]

నీ యెదుట నిల్వగనె
నా ఎడద దడదడను
మనసు భయ విహ్వలత మైక మెత్తెడిని.

నీ నాలుక కదల్ప
నానాల్క తడియారు
గొంతులోనే స్వరము కుంఛించి పోవు.

కీలింప కేల్ కేల, కేలు వడవడ వడకు
తనువు చిరుచెమ్మటల, తానమాడెడిని.

ఇక నీవు ముద్దీయ, సకట! యట భగ్గు మను
సురసురా చర్మమట, చూడిపోవునురా.

కన్నగింట చేర్చితివి, శివ మెత్తి అరచితిని
కనుల బొట బొట నీరు, కార నేడ్చితిని.

చిరునవ్వు నవ్వితివి, గరిసారె నాపెదవి
ముఖము వెల్వెల్లనై, ముడుచుకొని పోయె.

ఈదీన నిటు నాథ, ఆదరించుట ఏల?
బాధించు టది ఏల?, భయపెట్టు టేల?

# కళింగమండలి ఆంధ్రులు

బుర్రా శేషగిరిరావు గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

ఆంధ్రు లుత్తరదేశపు క్షత్రియు లనియు దక్షిణదేశపు పడమటిభాగములకు వలస వచ్చి "దక్షిణాపథపతి"త్వమును చేకూర్చుకొని రనియు పలువురు చరిత్రకారు లూహింతురు. ఈయూహల కాధారములు పురాణములందు గల ఆంధ్రవంశపురాజుల చరిత్రలు, శతకర్ణి వంశపురాజులశాసనములు, ఆవంశపురాజుల నాణెములు దొరకినస్థలములు. ఈ ఆంధ్ర వంశపురాజులకు క్రీ॥ శ॥ ౧, ౨, శతాబ్దములలో ఇప్పటి ఆంధ్రదేశమున గుంటూరు ప్రాంతపుధరణికోటయు, బొంబయిరాజధాని లోని పైఠాన్ అనబడు ప్రతిష్ఠానపురమును రాజ్యస్థానములుగా నుండెను. చరిత్రకారు లలో కొందరు ధాన్యకటకమే అసలు ఆంధ్ర వంశపుకోవవారికి ముఖ్యస్థానమనియు, కొంద రు ప్రతిష్ఠానమే ముఖ్యస్థానమనియు మత భేదము కల్పించినారు. ప్రయోజన మేమ నగా; — ధరణికోటయే ముఖ్యస్థానమైతే ఆంధ్రవంశము దక్షిణాపథమున తూర్పునుండి పడమటికి విస్తరించిన దనవలసివచ్చును; ప్రతి ష్ఠానమే ముఖ్యస్థానమైనయెడల పడమటినుండి తూర్పునకు విస్తరించిన దనవలసివచ్చును. ఆంధ్రజాతిలో నొకకోవవారు తూర్పుగాను, మరియొకకోవవారు పడమరగాను దక్షిణా పథమున కుత్తరమునుండి వలసలు వచ్చి యుందురన్నచో వివాదములకు సమన్వయము కలుగకపోదు. కాని యిట్టిసమన్వయమున కాధారము లుండవలయును. అట్టి యాధార ములలో కొన్ని యిం దుదాహరింపబడును.

ఐతరేయబ్రాహ్మణమున ఆంధ్రుల ప్రశంస గలదు. అందాంధ్రులు శబరపుళిందులతో చేర్కొనబడిరి.

బృహస్పతి బ్రాహ్మణులు చేరరాని దేశములు చెప్పుచు "కారస్కరాః కళింగాశ్చ తథాఽంధ్రశబరాదయః" అని కళింగ, ఆంధ్ర, శబరజాతులను సన్నిహితవర్తులుగా నుదా హరించెను.

ఈయాధారములనుబట్టి ఆంధ్ర, కళింగ, పుళింద, శబరజాతులవలసలు ఒకదాని కొకటి యందు విడిగా నుండిన ట్లూహింపవచ్చును.

బ్రహ్మాండపురాణమున భరతఖండమందలి దేశములజాబితాలు కలవు. వీటివల్ల! నీయాంధ్ర కళింగజాతుల సన్నికటత్వము కొంత తేటపడ గలదు. బ్రహ్మాండపురాణోక్తముగా

(౧) మధ్యదేశమందలి జనపదములు :— కురు, పాంచాల, సాల్వ, మాద్రేయ, శూర సేన, భద్రకార, బోధ, పతచ్చర, మత్స్య, కుశల, కౌసల్య, కుంతల, కాశి, కోసల, గోధ, భద్ర, కళింగ, మగధ, ఉత్కళ"ములు.

(౨) ఉదీచీప్రాంతపు జనపదములు:— బాహ్లిక, వాతధాన, ఆభీర, కాలతోయక, అపరాంత, సహ్యా, పాంచాల, చర్మమండల, గాంధార, యవన, సింధు, సౌవీర, చీనా, తుషార, పల్లవ, గిరిగహ్వర, శాక, భద్ర, కులింద, పారద, వింధ్యాచమళిక, అభీష, ఉలూట, కేకయ, దశమాలిక, కాంభోజ, దరద, బర్బర, అంగ, లౌహిక, భారద్వాజ, ప్రస్థల, దసేరక, లమక, తాలసాల, భూషిక, ఈర్జిక"ములు.

(3) ప్రాచీదేశములు:— అంగ, వంగ, చోళ, భద్ర, కిరాత, తోమర, హంసభాగ, కాశ్మీర, తేంగణ, ఝిల్లిక, ఆహక, హూణ, దర్వ్య, ఆంధ్రవాక, ముద్గరక, అంతర్గిరిక, ప్లవంగ, మాలావర్తిక, సమంతర, ప్రావృషేయ, భార్గవ, గోపక, ప్రాగ్జ్యోతిష, పుండ్ర, విదేహ, తామ్రలిప్తక, మల్ల, మగధ, గోనర్ద"ములు.

(౪) దక్షిణాపథమందలి జనపదములు:— పాండ్య, కేరళ, చోళ, కుల్య, సేతుక, మూషిక, కుపణ, మహారాష్ట్ర, మహిషిక, కళింగ, ఆభీర, ఈషిక, సరవ, పుళింద, వైదర్భ, పౌరిక, మాలిక, ఆశ్మక, భోగవర్ధన, కోంకణ, ఆంధ్ర, కులింద, అంగర, మారిష"ములు.

ఈజాబితాలనుబట్టి చూడగా కళింగులు మధ్యదేశములో కోసల, మాగధ, ఉత్కళులతో కలిసిమెలిసి యుండినట్లును, దక్షిణాపథమందు ఆభీర, సరవ (శబర) పుళిందులతో కలిసిమెలిసి యుండినట్లును తోచును. ఈ పురాణగాథలు ప్లినీ వ్రాసినభూగోళశాస్త్రము వల్లను, కాలచూరివంశపురాజులశాసనముల వల్లను, ప్రస్తుతము గంజాంమండలములోని గ్రామనామములవల్లను సమర్థనీయము లగుచున్నవి. బరపురంతాలూకాలోని కొళింగొదాళ, గుంసూరుతాలూకాలోని కొళింగొపాదారొ, బల్లిగుడమాళియాలోని కొళింగి, కొల్లింగిబాడి, ఉదయగిరి మాళియాలోని కళింగిపు గ్రామము లీప్రాచీనకళింగులవలన లనదగియున్నవి.

ఇట్లే ఆంధ్రులు ప్రాచీనజనపదములందును దక్షిణాపథమందునుకూడా చెప్పబడినారు. కొంకణులతో చెప్పబడిన ఆంధ్రులు పైరాణ ప్రాంతపువారై యుందురు. వీరిశాసనములు చాలావరకు బొంబయిరాజ్యమందు కనబడుటవల్ల వీరే అసలు ఆంధ్రులనువాదము వచ్చినది.

బౌద్ధజాతకకథలందు తెలివాహా (తెలివాక) నదీప్రాంతమున ఆంధ్రరాజ్యము లుండినట్లు చెప్పబడినది. ఈజాతకములు క్రీ॥పూ॥ ౯ శతాబ్దమునాటివని కొందరు, క్రీ॥ పూ॥ ౬శతాబ్దమునాటివని కొందరును అందురు. బుద్ధుని పూర్వజన్మవృత్తాంతములు గనుక, బుద్ధునికి పూర్వపుదేశస్థితిని తెలియజేయు ననుట నిర్వివాదము. తెలివాహానది విశాఖపట్టణము మండలమునకును, మధ్యదేశము (Central Provinces), బస్తరుప్రాంతమునకును సరిహద్దుగా పారుచున్నది. గంజాంప్రాంతమున కొంచుకపడమరగానే ఉండును. ఈగాథలకును

ప్రాచీనజనపదములందు "ఆంధ్రవాక" లను చెప్పిన బ్రహ్మాండపురాణమునకును కొంత సమన్వయము కుదురుచున్నది. ఇప్పటి గంజాం విశాఖపట్టణమండలములు పూర్వపు కళింగ దేశములోనివనులు శాసనములవల్ల స్థిరపడ్డది. ఈప్రాంతమందు క్రీ॥ పూ॥ శతాబ్దములనాటి ఆంధ్రులవలసల జాడలు కనబడుచున్నవి. ఇవి బౌద్ధజాతకములలో చెప్పబడినవే అయియుండ వలెను. ఈప్రాంతములనుండి ఆంధ్రులు గోదావరి కృష్ణా డెల్టాలలోకి దిగినప్పటికే తెలుగులతో నైక్యమయియుండవలెను. గ్రామనామములే యిందుకు దృష్టాంతము.

గంజాంమండలము

ఆంధ (ఆంధ్ర) వరము + ఒడ్డె (ఓఢ్ర) పాడు (శ్రీకాకుళంతాలూకా,

ఒంఢరోకోట (ఆంధ్రకోట)—గుంసూరు తాలూకా.

ఒంధరోగాం (ఆంధ్రగ్రామ)— బల్లిగుడ మాళియా.

ఒంధలిగుమ్మ (ఆంద్రగుమ్మ) }
ఒంధలిఝూల్ల } — పర్లా ఖిమిడిమాళియా.

ఒంద్రసింగి }
ఒంద్రగుడ } —రామగిరిమాళియా.

ఒండరిబండి—సురడామాళియా.

ఒంద్రెగుడ + ఒడ్డునాయు— ఉదయగిరి మాళియా,

విశాఖపట్నం మండలము

ఒంఢరులిమ్మ—బిస్సంకటకంమాళియా.

ఆంధ్రదొడ్డి—గొల్లగొండమాళియా.

ఒంద్రుగుడ—గుణుపురంమాళియా.

ఒండ్రముండ—జయపురంమాళియా.

అంద్రవుడ—నవరంగపురంమాళియా.

ఈగ్రామనామములలో చాలాభాగము మాళియా (ఏజన్సీ) ప్రాంతమందు కనబడుట విచారణీయము. ఆంధ్రులాప్రాంతములకు వలసవచ్చి కళింగులు, తెలుగులు, ఓఢ్రులు, సవరలు, గదబలు, పుళిందులు, కోందులు మొదలగు వారిమధ్య నివాసములు కల్పించుకొనిననాడాప్రాంతభూములు నాగరకములై యుండును నేడవి యడవి బలిసిపోవుటనుబట్టి, యవి యిప్పటివలెనే యుండెననుటకు వీలులేదు.

ఈ యాధారములనుబట్టి పురాణములలోను జాతకకథలలోను అనుశ్రుతముగ వచ్చు గాథలు నమ్మదగినవనియు, ఆంధ్రులు, తెలుగులు కళింగులు కలిసిపోయి నేటి ఆంధ్ర=తెలుగుజాతిగా పరిణమించుటకు పూర్వపుస్థితి యిచ్చటకనబడుచున్నదనియు, ఈఆంధ్రులలో నొకకోన-అది ధాన్యకటకపుకోన కావచ్చును. గుంటూరుజిల్లాలోని కీయుత్తరకళింగభూముల నుండి వలసవెళ్లియుండవచ్చుననియు తోచుచున్నది. ధాన్యకటక మనియు అమరావతి యనియు శాసనప్రసిద్ధిగాంచిన ధాన్యకటకము ఆంధ్రుల కళింగమండలి ధాన్యకటకము పేరిట—ధన్నుపురో (ధాన్యపుర-జయపురం మాళియా) స్థాపింపబడియుండును.

ఈగ్రామములు ప్రాచీనాంధ్రులవలస లనుటకు మరియొకయాధారము గలదు. ఈగ్రామనామములలో పెక్కులు గ్రాంధికభాషారూప

ము లనదగియున్నవి. వ్యాకరణము చూచి గ్రామములకు నామకరణము చేయరు. ఆ రూపము లప్పటిసర్వజనవ్యవహారమున ప్రసిద్ధములై యుండును. ఎట్లనగా:—

పినకోట, సిరసమోము (సంస్కృత ప్రాకృతమిశ్రసమాసము), ప్రాతిపురము, యేనుంగు, తంతురగుడ, కోమలిబొంద, కొదమగుడ, పెదపల్లంకి, రాక్కసరాయి, పగర, కొండెములు, తురంగి, తొలంగు, చెచ్చెరగుడ, వేలుపురాయి, వంతలుగుడ, పెంజ్లిబయలు, చెరంగులు, లంజియగుడ.

ఈగ్రామనామములనుబట్టి గ్రాంధికాంధ్ర మనబడు భాషకు ప్రాచీనత యేర్పరుపఁదగిన యెడల నీభాష జాతకకథలలో చెప్పిన తెలివాహానదీప్రాంతపు ఆంధ్రరాజ్యములలో వాడబడిన దనవలయును. ఈయూహ సిద్ధాంతము చేయగలిగితే ఆంధ్రము క్రీ॥ ము॥ ౯ లేక ౬ శతాబ్దమందే ప్రబలియుండెనని తేలును. ఇందు చూపబడిన జాడలు విమర్శనీయము లని మాత్రము నొక్కి చెప్పదగియున్నది.

---

# ప్రేమ ఫలము

పాపినేని వేంకటేశ్వరరావు గరు

ప్రణయ భిక్షార్థులౌ యెట్టివారికైన
శాశ్వత సుఖానుభూతి యీజగతిజరుగ,
దలివిషాద భయంకర మైన బ్రదుకు
పంచదార గ నెంచి భ్రమించెదేల?

చైత్రమున చిగురించు వృక్షంబులెల్ల
శిశిరమం దాకులపాటు నెందు నిజము
సృష్టినిం బోలె ప్రేమైక జీవితమున
పరిణతులు గల్గుచుంటి స్వాభావికంబు.

కన్ను లరవిప్పి నే నిన్నుగాంచి నపుడె
ఆర్ద్రహృదయంబు చలియించి యవశమాయె;
ప్రణయ కావ్యాంతి మాశ్వాసమును ముగించి
తనిసితిని నేను దుఃఖాశ్రు తర్పణముల.

జలుగు ప్రాయంపుటెడద పుష్పించినట్టి
ప్రేమ లతనెట్లొ కన్నీటఁ బెంచుకొంటి;
విఫలితాశాతప మున తపించి పోయి
జీవలత చావ నెంతె కృశించుచున్న!

స్వప్నమందైన దృఢభుజా బంధనంబు
ప్రాయపుటెడంద రాచిఱుంపాన బెట్ట
తొడిమ విడిపోవుచో గాలిపడెడు సుమము
పగిది కన్నీరు రాత్రి గర్భమున రాలు.

ప్రణయమన దుఃఖమనెడు విశ్వాసమొకటె
ఎడద నిడికొని యోర్పు వహింప వలయు
పదు గురితొ బాటు గడచె నీబ్రదుకు గూడ
ఏల ముణ్ణాళ్ల ముచ్చట కింతవగపు?

# దివ్యదర్శనము

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

(గత సంచికా శేషము)



ఎవ్వఁడో యతఁ; డచ్చటికి నేటికి వచ్చెను; యెల్లనన్నవాఁ
డవ్వనితాలలామ మిడినట్టివి యట్టె భుజించుచెట్టొ; యా
యవ్వయు నెవ్వగం దలఁప కాతని కోయిర మేల తెచ్చెనో;
యెవ్వరు గుర్తెఱుంగ రిది యెంతయు వింత యొకింత చెప్పెదన్. ౧౧

ఉ. బాల్యమునుండియుం గడుఁ బ్రపన్నుఁడు నీశ్వరతత్త్వభావనా
లౌల్యమునం జెలంగు నకలంకుఁడు నాతఁడు సచ్చిదర్థసా
కల్యము దెల్పి యవ్యయసుఖం బొడఁగూర్చు గురుం గుఱించి చా
పల్యమునన్ జరించె నట భారతవర్షము పెక్కువర్షముల్. ౧౨

సీ. అద్వైతమతము సాక్షాద్విరుద్ధముదీని, కిది విశిష్టాద్వైతు లిష్టపడరు,
ద్వైతు లిట్లు వచింతు, రీతీరు బాదరా,యణసూత్రఫక్కికి నన్వయింప,
దుపనిషదర్థ మిట్లు పరిస్ఫురించు, వి,ద్యారణ్యు లిట్లు భాష్యము రచించి,
రిందు మాగురు లర్థ మిట్లు కల్పించిరి, పలువురు దీనఁ దప్పులు గడించి,
రంచుఁ బెదపెద్దపండితుల్ స్వానుభవము, లేనిచదువులు వినుపింపఁ బూని రెండు
నెందుఁ గాంచిన నతనికి సందియంబు, డిందుపడ దయ్యె, హెచ్చయ్యెఁ గొందలంబు. ౧౩

క. పలుమతములుఁ బలుదగవులుఁ, బలుసిద్ధాంతములుఁ బూర్వపక్షము లింకం
బలుసందేహమ్ములు గల, పలువురఁ గని యతఁడు మిప్పులఁ బరితాపించెన్. ౧౪

సీ. కటకటా! జగమెల్లఁ గటికిచీకటిలోనఁ, జీకాకుపడుట కేమోకతంబు?
పట్టు చిక్కకపోవు చెట్టొకో యిద్దాని, యాదికారణ మెట్టి దానొకాని?
ఇదమిత్థ మని నిశ్చయింపఁగా సత్యప్ర,కాశ మించుక యేని కానరాదె?
ఈశ్వరుం డొక్కరుం డెసఁగుచున్నాఁ డందు, రది యేమి యనృతమా! హా! మఱేమి?
పుట్టుపూర్వ మేమొ? గిట్టినపర మేమొ? నడిమి మూఁడునాళ్ల నటన మేమొ?
దేశకాలములస్థితిగతులు నేమొ? నే, నేమొ? యింక సర్వమేమొ? యేమొ? ౧౫

శా. వెన్నుం గానఁగలేని కన్నులివి యీ విశ్వప్రపంచార్థపుం
దెన్నుం గానఁగనేర్చునే కటకటా! దేవాధిదేవుం డొకం

డున్నాఁ డన్నిటి కాదిమూల మతఁ డేదో కార్య మూహించి యీ
యన్నింటిన్ సృజియించె నందు రది యట్లైయుండు నెట్లో గదా! ౫౬

ఉ. ఈశ్వరుఁ డొక్కరుండు కలఁడే యని యొప్పినయప్పు డాతఁడున్
నశ్వరుఁ డౌనె యజ్ఞుఁ డగు నావలెఁ, గాక యనంతశక్తియున్
శాశ్వతుఁడేని, తత్కృతియు శాశ్వతమై విలసిల్ల కేటికీ
విశ్వము నశ్వరంబయి యవిజ్ఞతతో నెత లందఁగావలెన్? ౫౭

చ. తలఁపఁ దలంపఁగా మది వితాను జనించు జగమ్ము లీగతిన్
గలుగుట కేమికారణమొ? కల్గుఫల మ్మదియేమొ? దీనికిం
దొలుతటియున్కి యెట్టిదియొ? తుట్టతుదం గనునో? యనేక రీ
తులు తులకింప హేతువు నెదో? యది యెట్టిదొ? యేమికర్మమో? ౫౮

క. బ్రదికినచో లభియించెడి, ముద మేమో? చచ్చినంతఁ బోయెడి దేమో?
తుద యేమో? మొద లేమో? యెదియేమో తెలియలేక యేఁకరుటయ్యెన్. ౫౯

క. మోహ మిది తొలఁగకుండిన,చో హానికి వెఱవ నేల? సుఖపడ నేలా?
దేహాభిమాన మేలా? ఆహారం బేల? ఏ ప్రయత్నం బేలా? ౬౦

వ. అని యప్పటికిఁ గొన్నినాళ్లనుండి కఠోరనియమమ్మునఁ దదేకతానుఁడై తపించుచున్నవాఁ డతఁడు పలుదడవలు స్వప్నములం "దిట్టిబెట్టిదపుఁ బట్టుదల విడువుము. నాతిచిరకాలమ్మున నీసంశయమ్ములు సమయఁగలవు. లోకకళ్యాణము చేకురగల" దని స్ఫటికసచ్ఛాయ స్వచ్ఛవిగ్రహుఁ డొక్కమహనీయమూర్తి నిబోధించుచుండ నయ్యది నిరంతరస్వచింతన సంస్కారజనితస్వప్నసామాన్యలక్షణమ కాఁదలంచి యవగణించుచుండె. మఱియు నాయా స్వప్నములందు సందృష్టములగుచుండు విషయములు కొన్ని పిదప జాగ్రద్దశఁ బ్రత్యక్షము లగుచుండుటయుఁ జూచుచుండెఁగాని యపరిస్ఫుటము లగునట్టియనుభవముల నతఁడు సరకుగొనకుండె. ఇట్లుండ నక్కాలంబునఁ జేరునాఁటికి మూఁడునాళ్లకుముం దొకవివిక్త స్థలంబున నిరాహారుఁడై కనులు మూసికొని తదేకచింతతో ధ్యానించుచున్నెడ. ౬౧

సీ. శీర్షంబు తగ బిగించినయట్లు గనుపట్టె, ఫాలభాగమునందు బరువు దోఁచె;
భ్రూమధ్యమున నెదో మోపెట్టినట్లయ్యె, నెదురఁ గన్పడె వెల్గు చెదరిచెదరి;
సుళ్లువాఱుచుఁ జక్షుఃకోణ మ్మగుచు మెర్గుఁ, దీవ లిట్టటుఁ గొంత దిరుగఁజొచ్చె;
నిశ్చలంబయి యంత నిల్చెఁ దెల్లనిపట్టు, తెర గట్టినట్టు జ్యోతిష్సలంబు;
అందు బంగారురాపాడిఁ బొందుపఱిచి, నట్టిదివ్యాక్షరములు గన్పట్టె బంతి
గట్టి విస్పష్టముగఁ జక్కఁగాఁ దళత్త,ళద్యుతులు గన్నులకు సురాళమ్ముగొలుప. ౬౨

వ. "స్వప్నసాక్షాత్కారమును సంశయించితివి. పరిమితశక్తియగు నీకన్న మమ్ముఁ గనఁ జాలదు. నీవలె నెందఱో కావలె ననువారున్నారు. లోకకళ్యాణము ఛేకురనున్నది. శరీర హింస చాలింపుము. విజయవాడకు వెడలుము. కనకదుర్గగుడికడ జ్యేష్ఠము చెల్లించుము. ఒక్కపుణ్యాంగన నీ కక్కడ భోజనమిడును. భుజింపుము. మాయంశ మగు కనకదుర్గ నీకుఁ బ్రత్యక్షమై కాఁగలది తెలుపును. శుక్రవారము నిశాముఖమునఁ జూడఁగలవు. ఇదే బెజవాడ; కొండ; దుర్గగుడి; ఆహారమిడునామె; సందర్శింపుము." అని యీవిధమున నా యక్షరము లుండెను. బెజవాడనగరము, పర్వతము, దుర్గాలయము, చక్కఁగాఁ గానవచ్చెను. భోజన మొసఁగు పుణ్యాంగన పండ్లగంపతోఁ బ్రస్ఫురించెను. దీని కావల దివ్యద్యుతితో "ఆదిమూర్తి" యని చేవ్రాలుండెను. కొన్నినిమిషము లివి మెల్ల నాతఁడు తేఱిపాఱఁ దిలకించెను. అంత నాతనికిఁ దలతిరిగెను. మేను గగురుదాల్చెను. కను లున్మీలితము లయ్యెను. చూడఁగాఁ జేరువ నొకపాలుఁడు పారమార్థిక కార్యతత్పరుఁ డిట్లు ప్రార్థించుచుండెను. "ఆర్యా! నిరాహారవ్రతమున నీబోఁటిమహనీయుఁ డిక్కడ నవయుట పాడిగాదు. విజయవాడకొండపయిఁ బలువురు తపస్వులు ప్రతివసియింతురు. తొల్లి యర్జునుండు తప మాచరించి యక్కడ శివునిచేఁ బాశుపతాస్త్రంబుఁ బడసె నని ప్రఖ్యాతి కలదు. తపస్సిద్ధిప్రద మాస్థలమని వినికి. కనకదుర్గ ప్రత్యక్షదేవత. ఇచ్చగింతురేని నేనును వచ్చి మి మ్మక్కడ విడుతును. విచ్చేయుఁడు." అంత వింతంబడి విస్మితుఁడై యాతఁ డాతనితో బయల్వెడలి యక్కొండకు వచ్చి చేరెను. ఆనాఁ డక్కడ కనులకుఁ గానవచ్చినట్లే బెజవాడకొండ, దుర్గాలయము, పుణ్యాంగన యీనాఁ డిక్కడఁ గానవచ్చుట కాతఁ డచ్చెరువడెను. దైవలిఖిత మది తప్పక జరుగునని తృప్తిచెందెను. అడ్డు పలుకఁ జాలఁడయ్యెను. ఆహార మారగించెను. ఇంక నాపుణ్యాంగన భోజనపదార్థములను గొని తేరఁ గల్గుటకూడ నెట్లో యెఱుఁగఁదగును. ఆమె పరమభక్తురాలు. విజయవాడకు విచ్చేయుమహనీయుల నామె వెదకి గుర్తించి తఱచుగా నాతిథ్యసత్కారములు నెఱపుచుండును. స్వప్నములందు సాక్షాత్కరించి యామెకుఁ గనకదుర్గ కర్తవ్య ముపదేశించుచుండును. "శే పాకమహనీయుఁడు నాకొండపై నిరాహారుఁడై వచ్చి నిలువనున్నాఁడు. ఈ జ్యేష్ఠాంతమున కాయనయిష్టసిద్ధి యగును. ఆయన కందాఁక నాహార మర్పించుచుండుము." అని యామె స్వప్నమున దుర్గాదేవిచే నిబోధితయై నాఁ డట్లాహారముఁ గొని వచ్చెను. ఇదియ పూర్వవృత్తాంతము. ౬౩

శా. చేరెం దొల్తటి శుక్రవార మతఁ డాక్షేత్రంబు జ్యేష్ఠంబునన్
బై రానుండిన మూఁడువారములలోఁ బ్రత్యక్షమా చెప్పఁడో

ఏరీతిం గనుఁగొందునో యపుడు నా కేమేమి విజ్ఞానముం
గూరంజేయునొ దుర్గతల్లి యనుచుం గొండంత యుప్పొంగుచున్. ౬౪

క. లెక్కించుచుండ నాతని, కక్కాంక్షన్ జనియె నిర్వదైదుదినము లిం
కొక్కటియె శుక్రవారం, బెక్కువ యాసించునది యదే చనుదెంచెన్. ౬౫

గీ. తప్పకుండ నాఁడు దర్శనమిచ్చు దు,ర్గాంబ తన కటంచు నమ్మె నతఁడు
వేచె వేచెఁ గన్ను వేఁదుఱు గొని యర,వాయిలేక కొంత రేయిదాఁక. ౬౬

క. "చీకటితప్ప మఱేమియు, నాకంటికిఁ దోఁప దిచట నాతల్లియు నా
రాక కెదురెదురె చూచుచు, నాకంటికి నవయుచుండు" నని యట వెడలెన్. ౬౭

సీ. నాఁడు స్వర్ణాక్షరములు గన్నాఁడు బ్రహ్మ,పదము చెందినయంతగా ముదము చెందె;
నేఁడు తనయాస వీడుకొన్నాఁడు నరక,లోక మందినయంతగా శోక మందె. ౬౮

ఉ. ఓవిశ్వేశ్వర! యోపరాత్పరతరా! యోసర్వనిర్వాహకా!
దేవా! నాపరిదేవితంబులకు నేదీ తగ్గ ప్రత్యుత్తరం?
బూవిల్తూర్చితి; వాస గొల్పితివి, యేమేమొ యత్యద్భుత
శ్రీవిస్ఫూర్తులు తోఁపఁ జేసితివి తత్సిద్ధిన్ విడంబింతువా? ౬౯

శా. నాచిత్తంబు పరీక్షచేసికొనుచున్నాఁడన్ యథార్థంబుగాఁ
బోఁచం బైనను దుష్ప్రవర్తనము దుర్బోధం బెఱుంగన్, బవి
త్రాచారంబున బ్రహ్మతత్త్వపరమార్థానందముం గూర్చి యా
లోచింతుం బలవింతుఁ జింతిలుదు నేలో నన్ను వంచించుటల్. ౭౦

ఉ. "క్షిప్రత లోకశోక మడఁగింతును మిమ్ము సముద్ధరింతు" నం
చప్రతిమద్యుతిస్ఫురణ నక్షరరూపమునన్ ననున్ బ్రబో
ధప్రతిపన్నుఁ జేసి పరితాపము వాపి యిదేమి? మోసపుం
గొప్రము వెట్టి తిప్పు తలకుం గడకుం జగదేకనాయకా! ౭౧

శా. నాసంకల్పము లేను గన్గొనినవింతల్ సుంతయేన్ దోషమా
యాసంసర్గము లేనివేయగుట తథ్యం బంటకున్ మన్మనో
వ్యాసంగంబును బుణ్యసాధ్వి మఱి యయ్యైచోటులున్ సాక్షు లిం
ద్దేసం దేహము కల్గఁజేసితివి యిం కేమందు నోయీశ్వరా! ౭౨

శా. దుస్సంకల్పముచేత నీ కసృత మేదో చూపఁగాఁబోలు, ర
క్షస్సే యింక మఱేదో యంచు నెవరేన్ సందేహమందన్ మనం

బుస్సూరంచుఁ దపించెదున్ గటకటా! యొండేమి బెండైనదే
నిస్సామాన్యమహానుభావుఁ డగు నీనిర్వాహ మోయీశ్వరా! ౭౩

శా. "నీ వేమో తలపోయుచుంటి వదియే నీకన్నులం దోఁచె; భ్రాం
త్యావిష్టుండవు గుర్తెఱుంగ" వనుప ల్కాంగీకరింపందగున్
నావైక్లబ్యముచేతఁ గల్గినద టే నాతండ్రి! యానాఁడు ధ్యా
నావిర్భూతము దివ్యదర్శనము! మిథ్యార్థంబుల ట్లుండునే? ౭౪

శా. ఆశ్చర్యంబుగఁ దోఁచె విద్యుతులుఁ జెల్గాడెన్ విచిత్రంబుగా,
నైశ్చల్య మ్మొదవెన్ ద్యుతిస్థలికి, స్వర్ణచ్ఛాయముల్ దాన న
త్యాశ్చర్యంబుగ నక్షరంబులును నయ్యైస్థానముల్ కన్పడెన్,
పశ్చాద్దృష్టము లిందుకున్ సరిపడెన్, భ్రాంతత్వ మిం దేదియో? ౭౫

చ. కలఁడు కలండు సృష్టికిని గర్త మహాద్భుతశక్తిమంతుఁడన్
దలఁపున నింతదాఁకఁ బరితాపముఁ జెందుచునుంటి నయ్యయో!
కలఁడు కలం డనంబడెడుకర్త యొకండు కలండొ లేఁడొ? హా!
తలఁచిన హృత్పుటంబు శతధా పగులున్ దుద కెంతమోసమో! ౭౬

క. అంచుం బలవించుచు జను,దెంచె నతం డంతఁ గొంపదిగి యానాఁ డీ
వంచనఁ బడి మది నెదియుం, గాంచండయ్యెన్ భుజించుకాలము దాఁకన్. ౭౭

గీ. శుక్రవారంబగుటనేమొ శుభ్రవస్త్ర, భూషణమ్ములు దాల్చి యప్పుణ్యకాంత
భక్ష్యభోజ్యంబు లాయత్తపఱచి యెదురు, చూచుచుండె నాతం డట వొచ్చుటయును. ౭౮

చ. "కడపటిశుక్రవార మవ్వఁ గావునఁ దప్పక దేవి దర్శనం
బిడియెదు నేఁ డటంచు మది నెంతయు సంతస మంది యప్పముల్
వడలును బాయసం బెదిరొ వండితి నయ్యవి చల్లనారెడున్
గడుఁ దడవయ్యె వేగ మడికట్టుకొనంగదవయ్య! నాయనా"! ౭౯

వ. అని యామె పలుకుటయు నాతండు,

శా. "తల్లీ! వందనమమ్మ! నాకనినవింతల్ నన్ను సంతోషపుం
గల్లోలమ్ముల ముంపఁగాఁ గనకదుర్గం గాంచెదన్ బ్రహ్మాత
త్త్వోల్లాసంబునఁ దేల్చు నామె నను నంచున్నాఁడ నిన్నాళ్లిటం
బొల్లై పోయెను నేఁటి కేటి కిఁక నీభక్తిం బ్రసక్తింపఁగన్? ౮౦

శా. తల్లీ! వాదన మమ్మ! యొక్కనెలగాఁ దంటాలు నాచేతఁ బా
టిల్లెన్ నీకును, నేఁటితోఁ గడుపు నిండెన్ దిండి నా కేటికో?
యెల్లన్ శూన్యము; సత్పదార్థ మొకయింతే లేదు లోకమ్మునన్
గల్లల్ పొల్లలు; లేఁడ యీశ్వరుఁడు; దుర్గాదేవి లే; దమ్మరో! ౮౧

వ. ఇట్లనుచుండ, ౮౨

ఉ. "ఆడకు నాడకోయి తనయా! యనయార్థము; లాగు నాగు; ము
న్నాఁడు జగన్నియంత పరమాత్ముఁడు; తత్కళ దేవి దుర్గయుం
గూడ నెసఁగుచున్నది; యగోచర మీశ్వరశక్తి, చూచియుం
జూడక నీ వెదో పలుకుచుంటివి తన్మహిమానభిజ్ఞతన్. ౮౩

క. అగులే నాకంటికి ని, ష్ఠగపడలే దందు; వింత యాహారింపం
దగు; నింత విశ్రమింపం, దగు; నవకాశంబు లేదొ తథ్యము తెలియన్. ౮౪

శా. చక్షుర్గోచరమైన యీజగతికిం జాలై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ కలదు తద్విజ్ఞానసర్వస్వమున్
లక్షింపన్ దగు శక్తి మర్త్యులకుఁ గల్గన్ లేద, యద్దానఁ బ్ర
త్యక్షంబైనది నీకొకింత, యట మాపై యింక నేమున్నదో! ౮౫

శా. కానన్ రాదనె దామె నీయెదుర సాక్షాత్కారమై నిల్చినన్
గానం గాఁదగుశక్తి యున్నదటె నీకంఁదోయికి న్నాయనా!
ఈనాఁ డింకను జాముప్రొద్దరుగలేదే? నీకుఁ జేకూరు న
య్యానందమ్ము నిజమ్ము భోజనము చేయన్ లెమ్ము నన్ నమ్ముమీ!" ౮౬

వ. అంచు నప్పుణ్యసాధ్వి యుత్కంఠ నుద్దీపింపఁజేయుపలుకులు ప్రాభవంబు దోఁపఁగాఁ బలు
కుటయు నాతండు మాతముకదా యనుచు మాటాడనేరక భోజనమ్మున కంగీకరించె. ౮౭

మ. అమృతప్రాయములైన భక్ష్యములు భోజ్యంబుల్ ఫలంబుల్ మన
శ్శ్రమ మల్లంతనె చల్లనారునటు లాసాధ్వీలలామంబు నె
య్యముతోఁ దియ్యముతో వినోదములు మాటాడించుచు బెట్టె, నా
సమయం బేమివిచిత్రమో యతనికిన్ సంతోషముం గూరిచెన్. ౮౮

క. కుడిచినతోడనె నిద్దుర, పడఁ ద్రోచెన్ జూచె నామె "పవళింపుమి యి
క్కడనే నేఁ" డనుచుం దల,గడగా నొకమూట చక్కఁగట్టి యొసంగెన్. ౮౯

క. ఈయం గ్రైకొని యాతం, డాయింటియరుంగుమీఁద నటె శయనించెన్
మై మెఱుఁగఁడు నిద్దురలో, "నాయన! నాయన!" యనన్ వినంబడి లేచెన్. ౯౦

క. లేచెన్ శ్రీవిగ్రహముం, జూచెన్ సంతోషపరవశుండై యట ప్రా
ణాచారము పడి స్తుతికిన్, వాచారంభణముచేసె వాంఛాపూర్తిన్. ౯౧

గీ. ఆమె మొఱపెట్టు "నిదియేమి యన్న! యి ట్టుపక్రమించితి వాఁకంట బడలియొక్కొ
ఓగిరముతోడఁ గొండపై కేఁగి చుట్టి, చుట్టి నినుఁ గాన కిదె వచ్చుచుంటి నన్న! ౯౨

క. ఎంతకు రావైతివి నేఁ, డింతాలస్యమ్ముకత మదేమో యని వి
భ్రాంతి ఫలాహార మ్మిదె, సంతనకట్టుకొని కొండచాయకుఁ జనితిన్." ౯౩

గీ. అంచు నయ్యమ వివరింపఁ గాంచికూడ, వీడఁ డాపట్టు మఱియిట్టు వేఁడఁదొడఁగె
"తల్లి! దుర్గాంబ! నీరూపు దాఁచి వచ్చి, తమ్మ! మెఱుఁగుదు ని న్నేను నమ్మనమ్మ!" ౯౪

శా. దేవీ! యీవిధ మేల చేసెదవు? సాధ్వీమూర్తిఁ బ్రత్యక్షమై
యీవీఁ జెండిఁ బరీక్షచేయఁ దలఁతే యేమమ్మ! యాహార మా
హావుట్టం దగఁ బెట్టె నిప్పుడెకదా యాయమ్మ లోనుండెడిన్
"రావమ్మా" యని పిల్వ వెల్వడును దుర్గాయమ్మ మాయమ్మహా! ౯౫

వ. అనుటయు, ౯౬

శా. "ఎట్టెట్టా! భుజియింపఁ బెట్టెనట యిం దేతెంచి యాతల్లి నీ
వట్టే యేల మెఱుంగ నేరవయి తన్నా!" యంచు లోఁజొచ్చి క
న్గట్టం గాంచెను గాంచనోజ్జ్వలము లెన్నోగిన్నె లా సాధ్వి, యా
దట్టుండుర్క్ వెసఁ జొచ్చి దీపముకడన్ దర్శించె దద్రూపమున్. ౯౭

క. గమగమవలిచెడు పలుభక్ష్యములం గనె గిన్నెలందు సాధ్వి, యతండున్
భ్రమితుండై యేమియుఁ దెలి,యమిఁ దెల్లమొగంబు వెట్టి యట్టె నిలిచెన్. ౯౮

గీ. "కనకదుర్గాంబ నీకు దర్శన మొసంగెఁ, బండె నీభాగ్య" మని యామె ప్రస్తుతించె;
"శుద్ధమూర్ఖుండఁ జూచియుఁ జూడనేర, నైతిఁగా" యని యాతండు కాతరించె. ౯౯

ఉ. "వాయికివచ్చినట్టుగ నవాకులు పల్కితిఁ దొల్త నన్న దే
దో యది "వందనం" బనెడి దుండఁగ, దుండగమే సమస్తమున్

పూయ మొనర్చె నన్నుఁ దియమాటలఁ దియ్యనిపిండివంటలన్;
హేయము నాయకార్య; మిపు డెక్కడ రోయుదు నేమి చేయుదున్" ౧౦౦

వ. అంచు నాతండు పరిపరివిధమ్ములఁ బరితపించుచుండ నాయమ యిట్లనియె. ౧౦౧

శా. "సంతోషింప వనా! స్వహస్తమున నా సాతాన్మహాదేవియే
సంతర్పించెను దివ్యభోజ్యములతో సంపర్శనం బిచ్చె, నీ
కంతే చాలును నాకుఁ జేకురెనటయ్యా! కొండచుట్టుం బరి
భ్రాంతిం బొందుటతక్కఁ జక్క గృహమం దాయమ్మ షేంచేయఁగన్. ౧౦౨

గీ. ఆరగింపఁ బెట్టె నంతేకా కింక నీ, లేదె నీకు దేవి యేదియేని
చక్క సంస్మరించి సర్వ మప్పటికథ, నుడువు" మంచు నామె యడుగ నతఁడు. ౧౦౩

క. "తలక్రిందఁ బెట్టుకొనుమని, తలగడ యొక టిచ్చె" ననుచు దానిం దెచ్చెన్
వెలుఁగునఁ జూడఁగ నందుం, గల దొకతాట కుపుస్తకము గుప్తంబై. ౧౦౪

క. అచ్చెరువడి యద్దానిన్, విచ్చి కనుంగొనిరి వర్ణవిన్యాసములో
నచ్చొత్తినట్టు కనులకు, ముచ్చట గల్పించెఁ జదువ మొదలిడి రంతన్. ౧౦౫

ఇది పూర్వకథ

---

# నలుపైన నేమె?

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. యే. బి. యల్.

చక్కనిదాన వే జానకీనీవు
నల్లనివానినే పెళ్లాడినావు?
వలపునిలిపినవాడు నలుపైన నేమె?
కలిమిచూపులవాడు నలుపైననేమె?
నామదిగొనువాడు నలుపైననేమె?
నాబాలకృష్ణుండు నలుపైననేమె?
నాకాంతు ముద్దాడ నలుపంటదమ్మ!

నానాథుఁ బ్రేమింప నలుపంటదమ్మ!
నాపతి నవ్వంగ నలుపంటదమ్మ!
నాబాలకృష్ణుండు నలుపైననేమె?
వరలక్ష్మి వలచేటి వైకుంఠుడమ్మ!
సీతమ్మ చేపట్టు శ్రీరాముడమ్మ!
గోపిక ల్గొలిచేటి గోపాలుడమ్మ!
నాబాలకృష్ణుండు నలుపైననేమె.

# ఆంధ్ర వాఙ్మయమున ఆంగ్లసారస్వతప్రాబల్యము

దేవులపల్లి అప్పలనరసింహం గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

(గతసంచికానుబంధము)

IV వ పద్యవాఙ్మయము

ఈ భాగములో ఆంగ్ల వాఙ్మయ ప్రాబల్యము ఇటీవలనే ప్రారంభించినదని చెప్పవలయును. అనేక అముద్రితప్రాచీన గ్రంథములను వెలికిదీసి యచ్చువేయించు కుతూహలమును గలుగజేయుట యటుండ, మూడు విధముల నీ ప్రాబల్యము గలుగుచున్నట్లు నాకు తోచుచున్నది:- (1) చిన్నకవితలను ప్రోత్సహించుట మొదటివిధము. పెద్దకావ్యములను వ్రాయుట కాలానుసరణమున ఇంగ్లీషునగూడా తగ్గిపోయినది. గ్రంథవిస్తరభయ మీకాలమున నన్నిదిక్కులను గనుపడుచున్నను, పద్యవాఙ్మయమును ముఖ్యముగా నరికట్టుచున్నది. పలువ్యాపారములయందు మనస్సు చెదరుచుండుటను ఇక్కాలమున పద్యకవితను అనుభవించు సావకాశము వ్యక్తులకు లేకుండుట వింతగాదు. (2) ప్రకృతివర్ణనముల నెక్కుడు జేయుట రెండవవిధము. దీనికి 19-వ శతాబ్ద ప్రారంభ కాలపు ఆంగ్ల కవిరాజు వర్డ్సువర్తు (Wordswo:th) నాటినుండి ఆంగ్ల వాఙ్మయమున ప్రాముఖ్యము గలిగినది. ఆ కవి కృతములను జదువజదువ మన ఆంధ్రమునకు గూడ దృష్టియావంక మరలినది. ప్రకృతియొక్క వివిధరూపములనుమార్పులను చూచి యానందించుటయు, "ఉన్నది యున్నయట్లు మధురోక్తుల"తోడను ఉత్ప్రేక్షలతోడను వర్ణించుటయు మొదటిసోపానము. ప్రకృతి రూపవైకృతాదులయందొక ప్రత్యేక మహావ్యక్తి యొక్క చర్యను చూచుచున్నట్లు గమనించి యానందించుట రెండవసోపానము. ఆ మహావ్యక్తితో మానసికసల్లాప మనుభవించుట, అద్దాని చర్యలయందు మానవజీవితమునకు మార్గదర్శములగు సూచనలు గనిపెట్టి తెలివినొందినట్లు భావించుట, యిట్టి ప్రకృతిభావనకు లక్షణములు. ఇందలి ఆఖరుసోపాన మేది? ప్రకృతిమననము క్రమక్రమముగా హెచ్చి త్వరలో అంతరాత్మను ప్రబోధించి, జీవాత్మకును ప్రకృతికిని పరాత్పరునితో గల సంబంధమును మనస్సు గ్రహించి స్థైర్యమును నిత్యానందమును పొందుట. అన్నిత్రోవలును పరాత్పరుని తెలిసికొనుటకే. వేదాంతము తర్కము యజ్ఞములు మొదలగువానికన్న సూక్ష్మమగు త్రోవ యిది. సర్వభూతస్థుడైయున్న తన్ను తెలిసికొనుమనిగదా యర్జునునకు విశ్వరూపమును శ్రీకృష్ణుడు గనుపర్చెను! ఈభావము కవిత్వమున ప్రాముఖ్య మొందించుటకు వర్డ్సువర్తుకవియే కారకుడు. ఇట్టి ప్రకృతివర్ణనము వాల్మీకిరామాయణములోకొన్నిచోట్లగలదు.

సీతారాములు చిత్రకూటమున నివసించు సందర్భమున ప్రకృతిని జూచి యానందించుటయు, దానివలన ప్రేక్షకుని మనోభావములు పెంపొందుటయు జూడనగును. "మృగయూథనిపీతములై కలుషములైన మందాకినీజలములు రామునిమనస్సును హరించుచు"న్నట్లు సీతతో చెప్పుచున్నాడు. రాముడు "గిరివనప్రియుడు"ను "సీత ప్రియకానన సంచార"యును "వనోన్మత్తయును" అని అనేకసారులు వర్ణింపబడుట చూడ వాల్మీకిమహాకవియొక్క ప్రకృతి మననానందము మనకు తేటపడగలదు. తరువాతికవులలో మంచివర్ణనలు గలవు గాని యిట్టి మనోభావములతో సంబంధము లేదు. వర్ణనలు ఒకవిధిగా భావించి ప్రబంధములలో అమర్పబడుచు వచ్చెనేగాని వాల్మీకి, వర్డ్స్‌వర్త్ వర్ణనలవలె కవిహృదయోద్భవములు గావు. ప్రకృతిని సఖిగాను, పరమవేదాంతరహస్యబోధినిగాను, దుఃఖితాంతరాత్మకు శాంతిదాయకమగు నోషధిగాను, మననముజేసిన కవిని మనభారతవాఙ్మయములయందు గానము.(3) జానపదకవితను (Popular poetry) ప్రోత్సహించుట మూడవవిధము: "జానపదకవిత" యన విద్యలేని జనసామాన్యమునకు రుచించు కవిత యని నాయర్థము. మోటుతనము ఉండనక్కరలేదు. కొంచెము గ్రామ్యశైలిని కలిగి యుండవచ్చును. నాగరికతవలన పైమెరుగు లేకపోయినను మానవప్రకృతికి సహజమగు యాథార్థ్యము, అన్యోన్యప్రేమ, అవ్యాజప్రేమ, అల్పసంతోషము మొదలగుభావములతో నలరారు ముగ్ధకవితకు జానపదకవితయని పేరుపెట్టితిని. ఇందులో చిన్నకథలు బొబ్బిలిపాటవంటివి చేరును. "కన్యక" "సుమబాల" యనునవి ఈజానపదకవిత్వాశైలిని సలవరుచుకొని విద్యాధికులచే వ్రాయబడినవి. ఇట్టి ముగ్ధభావములుగూడా వాఙ్మయమున నాదరింపదగునని ఆంగ్లదేశమున వర్డ్స్‌వర్త్ మొదలగువారు పోరిరి. పల్లెజనులకథలు, భాషణములు ఆధారములుగా జేసికొని అనేక చిన్నకవనములను జేసిరి. అవి ఆదర్శములై కొన్నాళ్లు వరలినను ఇప్పుడు ఇంగ్లాండులో ప్రాముఖ్యము గలిగియుండలేదు. ప్రపంచమునందు దాశయములు మారుచున్నవి. అయినను మన ఆంధ్రదేశమున పామరజనప్రబోధమునకును, వారియెడల నాగరికజనమునకు సానుభూతిని భ్రాతృభావమును పెంపొందించుటకును ఇట్టి చిన్నికవితలు తోడ్పడును.

వైద్యజ్యోతిషాది శాస్త్రగ్రంథములను కంఠపాఠముచేయుటకు సులభముగా నుండుటకై పద్యములలో వ్రాయువాడుక అన్నిభాషలలోను గలదు. 'సస్యానంద"మను నొకప్రాతకావ్యము దొరకినట్లు నేటి ఆంధ్రపత్రికలో చదివితిని. ఇవి యటుండ ఇంగ్లీషువాఙ్మయమునయున్న రకము లన్నిటికిని ఏవో కొన్ని ఉదాహరణముగా మనసారస్వతమున కనుపర్చవచ్చును. అటుల కనుపర్చుసందర్భమున మన పద్యవాఙ్మయాభివృద్ధి కనువగుత్రోవలను నాకు గోచరించినంతవరకు సూచించెదను. ఇంగ్లీషు పద్యవాఙ్మయమున నీ యారుభాగములను ముఖ్యముగా గాననగును:—

(1) కావ్యకవిత(Epics.) దీనిలో సహజ వీరకావ్యములు (Natural or Heroic Epics), పద్యకథలు. (Verse Tales, Narrative pcems), పాటకథలు (Ballads), వికటప్రబంధము లును జేరును. "Ballads" అను పదమునకు సరియైన తెలుగుమాట "పాట" యను శబ్దము వాడుకలోనున్నది. "బొబ్బిలిపాట" ఉదాహరణము "పాటకథలు" అను శబ్దము బాగుండు నని తోచి ఉపయోగించితిని.

(2) నీతి కవిత: (Didactic and Satiric Poetry) శతకములును తిట్టుకవిత్వములును ఈభాగమున జేరును.

(3) పాటకవిత: (Lyric Poetry) కీర్తనలు, తరంగములు, యాలపాటలు ఇందులో జేరును.

(4) గోపవిహారములు: (Pastorals)

(5) మృతస్మృతులు: (Elegies)

(6) వర్ణనములు: (Descriptive Poetry)

కృష్ణాపత్రికలో "చిత్రమాలికలు"—అను రవివర్మవ్రాసిన బొమ్మల వర్ణనములు, "వివిధ కుసుమావళి"యును, ఇప్పుడు పత్రికలలో తఱుచుగా పడుచున్న ప్రకృతిసౌందర్యవర్ణనలును ఈభాగమున జేరును.

(1) కావ్యకవిత: (Epic Poetry) అన్యాదర్శములు లేక సహజముగా స్వదేశపు పూర్వ వీరులకథల నాశ్రయించి ఉద్భవించెడు రామాయణము భారతము వంటి కావ్యములను సహజకావ్యములని వీరకావ్యములని వ్యవహరింప నొప్పును. ఇట్టివి ఆంగ్లమునగాని ఆంధ్రమునగాని లేవు. భాషాంతరీకరణముల వల్ల యీరెండుసారస్వతములకును ఈకొఱత కొంత తీరినది.

ఈకావ్యములను కొంతవఱకు ఆదర్శముగా తీసికొని కథ కొంచెముగాను, వర్ణనలు కవితాచమత్కృతులు ఎక్కువగాను గలిగి, శైలి కౌశల్యము, ఉత్ప్రేక్షాద్యలంకార ప్రయోగ చతురతను గనుపర్చుటకు తంటాలుపడెడు కావ్యమును, సభాకావ్యములు (Court Epics) కృతకకావ్యములు (Artificial Epics) అని చెప్పవచ్చును. వీనికి ప్రబంధము లని పేరు ఆంధ్రవాఙ్మయమున వాడబడుచున్నది. ఈ ప్రబంధములకు సంస్కృతములోని సభాకావ్యములు ఆదర్శములు. మనుచరిత్రములు, ప్రభావతీప్రద్యుమ్నము, తెలుగు వాఙ్మయమున ముఖ్యకావ్యములు. కళాపూర్ణోదయము ప్రబంధశైలితో కాదంబరిని బోలు అద్భుత కథారచనను కలుపుచున్నది. ఈ కావ్యమున శ్లేష తీసివేసినయెడల "పద్యనవల" యనదగి యుండును. దీనిని రామలింగారెడ్డిగారు బాగుగ విమర్శించియున్నారు. ఇది యొకనూతన శక్తి—కావ్య మని చెప్పవచ్చును. 'అల్లికజిగిబిగి' విశేషముగ గల ఇట్టి కావ్యముల కల్పించు కాలము పోయినది. దీనిని బోలు కావ్యము ఇంగ్లీషులో స్పెన్సరు రచించిన ఫెయిరీక్వీన్ "(Faerie Queen)" ఒకటి గలదు. అది అసంపూర్ణము. టెన్నిసను (Tennyson) దాని మోస్తరు కావ్యము వ్రాయసమకట్టెను గాని అది చిన్నచిన్నపద్యకథలక్రిందపరిణమించెను. బ్రౌనింగు సతి యను "కవయిత్రి" వ్రాసిన

"అరోరాలీ" ఒక పద్యనవల. ఇందులో అద్భుత కథనములు లేవు. సాంఘికవిషయములే. మొత్తముమీద కళాపూర్ణోదయము మహోత్కృష్టకావ్యశైలిని వ్రాయబడియు, ఇంపుగొలుపు దేశ్యప్రయోగసరళితో నొప్పారుచు, అపూర్వమగు కథారచనయందలి చమత్కృతిని గనబరచుచు నొకవింతరీతిని శోభిల్లుచున్నది. ఆరీతిని అది అసమాన మనియే చెప్పవచ్చును.

ఈ ప్రబంధములలోని సుగుణము లటుండ సంస్కృతకవులయాదర్శములను మీరు నతిశయోక్తులును, ఏవగింపును గూడ గలిగింపదగు శృంగారవర్ణనలును, శ్రీ రామలింగారెడ్డి గారిచే తగురీతిని వారి కవిత్వతత్త్వవిచారములో నిందింపబడినవి. శైలి యన్ననో అతి సంస్కృతసమ్మిశ్రమో, అతిప్రాచీనాంధ్ర శబ్దయుతమో, నిరోష్ఠ్యాదినియమకర్కశమో యగుచు కొన్ని కావ్యములను సారస్వతమునకు ముఖ్యలక్షణమగు చిత్తాకర్షణగుణమును లేనిదిగా నొనర్చుచున్నది.

కావ్యములలో పద్యముతో వచనమును గూడ వాడుటవలని లాభములు రెండు: ఆంగ్లసారస్వతమునందువలె గద్యపద్యములకు స్పర్ధ లేకుండుట యొకటి. (18-వ శతాబ్దమందు) గద్యము కవనమునకు తగదను వాదము ఇంగ్లాండున ప్రబలియుండెను. 19-వ శతాబ్దమం దంతటను కార్లైల్, రస్కిన్ మొదలగు గద్యకారులు ప్రతిభాయుతమగు వర్ణనలను జేయుటయందును భావోద్దీపనమును గలిగించుటయందును పద్యకారులను మించి కవయించుచు విచక్షణులచే గద్యపద్యములు రెండును కవితకు సర్వసాధనములే యని నిరూపింపబడుటకు కారకులైరి. అట్టి వివాదకు మనవాఙ్మయములయందు "కాదంబరి" వ్రాసిన బాణకవినాటినుండియు త్రోవ లేనే లేదు. కాని "నిర్వచనోత్తరరామాయణము" వంటి దీక్షా కావ్యములను జూడ గద్యయందు కొంత నిరసనభావ మున్నట్లు తోచును.

రెండవలాభము చదువరులకు సులభగోచరము. చెవికి విసుపు జనింపకుండుటకై వృత్తముల మార్పుట, గద్యముల నాయాచోట్ల జొనుపుట అవసరమనియే కవిత్రయమునాటినుండియు మనకవులు తలంచినట్లు స్పష్టము. పరిమితి తక్కువయైనను భారతములోని నలోపాఖ్యానము, భాగవతములోని వామనచరిత్రము, గజేంద్రమోక్షము, రుక్మిణీకల్యాణము, కుచేలోపాఖ్యానమును ప్రబంధశైలికిని రచనకును ముఖ్యాదర్శములైయున్నవి అని నా అభిప్రాయము. వర్ణనలలోను, భావవివరణములలోను, పాత్రపోషణలోను ముఖ్యమగు పాశ్చాత్యకావ్యములకు తీసిపోవు.

ఈ ప్రబంధభాగములో ననేకగ్రంథములు ప్రాతవి కలవని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఆంధ్రపత్రికలో (11-5-1917) "అపూర్వవాఙ్మయపరిశోధనము" అనువ్యాసమున తెలియజేసియున్నారు. వానిపేర్లనుబట్టి అవి మన పురాణేతిహాసకథలను అనుసరించి వ్రాయబడినట్లు తోచును. కవులపేర్లుకూడ ప్రసిద్ధిగలవే. అందుచేత నివి ప్రచురణ మందదగును.

ఇంతవఱకును సంస్కృతవాఙ్మయప్రోద్బలమే విమర్శించితిని.

ఆంగ్లవాఙ్మయప్రోద్బలమునకు పూర్వము దేశమునం దొకతీరున నుద్భవించియున్నను, పాటశైలిని చెప్పబడిన "బొబ్బిలికథ," "దేసింగు రాజుకథ" అనునవి సామాన్యప్రజలలో అత్యాదరమును పొందుచున్నను వానిలోని అతిశయోక్తిగల శైలిని తగ్గించి వాని సారస్వతపు విలువను పెంపొందించుటకు మార్గము జయంతి గంగన్నగారిచే. చాళుక్యచోళచరిత్రములకు సంబంధించి పాట కనువగు ఛందస్సున వ్రాయబడిన 'సుమబాల" యను కథచే జూపబడుచున్నది. దాసరులు పాడుపాటకథల యందువలె పల్లవి ఉపయోగింపబడుట లేదు. ఆర్భాటము, పునరుక్తులు లేవు. బహుసరసముగా చెప్పబడినది. ఇష్టమున్నచో చితారు మీటుచు తాళములు వేయుచు పాడవచ్చును. లేదా మనస్సుననే యీరెండును జరిపించుకొని చదివి యానందింపవచ్చును. ఇంగ్లీషున లే (Lay), బేలడ్ (Ballad) అను రకములకవిత యిట్టిది. కృష్ణాపత్రికలో పడిన "కన్యక" ఆంధ్రపత్రిక రుధిరోద్గారి సంవత్సరాదిసంచికలోని 'రాణిసారంధ" సారస్వత సర్వస్వము అను మాసపత్రిక రెండవసంచికలోని "చందనచర్చ", "విధేయత" యనునవి యిట్టిపాటకథలే. నీతిబోధించుచున్నను కథారచన సహజసరళమై క్లిష్టత లేక యున్నది. "విధేయత" యనునది ఇంగ్లీషున "కేసాబియాంకా" యనుదానికి ఆంధ్రపరివర్తనము. మూలముయొక్క దీప్తి ననుకరించుచున్నది. "అల్లీ ప్రభునికూతురు" అనుకథకూడ ఇదేరీతిశైలిని ఇంగ్లీషునుంచి ఆంధ్రములోనికి పరివర్తనచేయబడినది చూచితిని. తందానపదములు, బాలనాగమ్మకథ మొదలగునవి ఈ జాతిలో చేరును. వీనిని శుద్ధపరచి పునీకరించి ప్రచురింపదగును.

వీనివలె సులభరచనగలిగియు పాటతీరు ఛందస్సునగాక చదువుట కనువగు ద్విపద వంటి ఛందస్సున వ్రాయబడిన పద్యకథలు ఆంధ్రపత్రిక దుందుభిసంవత్సరాదిసంచికలో గాననగును. "ఏకాంతప్రేమ" "వీరశిఖామణి" యనుపేరులు గలిగియున్నవి. కవికొండల వేంకటరావుగారి "వివిధకుసుమావళి"లోని "సారంగధర"యు ఇట్టి పద్యకథయే. సారంగధరమెట్టకు విలాసముగ వెళ్లిన ఇద్దరు యువకుల ప్రశ్నకు జవాబుగ నొకగొల్లనిచే సారంగధరుని విషాదకరమగు యుదంత మంతయు సహజమృదులముగాను అల్లికజిగిబిగి లేకుండగను చెప్పబడినది. "చండప్రతిజ్ఞ" యను పద్యకథ సారస్వతసర్వస్వములో పడుచున్నది. ఇది క్రొత్తరీతికథనమును ప్రబంధవృత్తములతో కలుపుచున్నది. శైలికూడ ప్రబంధశైలిగానే యున్నది. అంతసహజముగా గనుపడుట లేదు. అదియే మొదటిసంచికలో "గీతిక"యని పాటకథశైలిని వ్రాయబడినది. కథ యీశైలి కనువై యున్నది. ఈ పాటకథలకు ఉపయోగింపబడు ఛందస్సు యతినియమముమాత్రము గలిగిన చిన్నపంక్తులతో నొప్పుచు సర్వసులభమై శ్రావ్యమై యుండును. వెంటనే చదువరికి బోధపడు రూ

పక ఉపమాన అతిశయోక్తి మొదలగు అర్థాలంకారములను మాత్రమే ఉపయోగించును. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన "అలవాటు," సారస్వతసర్వస్వములో పడిన "టక్కరి" యను గబ్బిలపుకథ; ఇట్టి నీతికథలు పద్యకథలలో చేర్పనగును. ఇట్టివి ప్రజలలో తెలివి యెక్కువయయినకొలదిని తగ్గు ననరాదు. భాషయందలి గౌరవము ప్రేమ ఎక్కువ మైనకొలదిని కృత్రిమనాగరికతాపాశములు సడలి, అకృత్రిమములును, ప్రకృతిసహజములును నగు మనుజులయొక్క నడతలయందును భావములయందును గల రామణీయత ఎల్లరహృదయముల నాకర్షించుకొలదిని అభివృద్ధి నొందు ననుకొందును. బైరను (Byron) వంటి ఆంగ్లకవులు ఒకప్పుడు కథను ఉద్దీప్తిగా ప్రదర్శించుటకై దానిలోని సంగతులను వరుసగా చెప్పుట మాని దానిలోని ముఖ్యభాగములను విడివిడిగా నాటకసీనులవలె ప్రదర్శించి వీనిని పొందుపఱచు కథాసూత్రమును అంతర్లీనముగా నుంచుట వాడుక కలదు. "రాశిసారథలో" ఇట్టితీరు అనుకరింపబడినది.

ఇట్టి "పద్యకథ" పాటకథరకములకు ప్రాముఖ్యము కలుగుచుండుట కేవల ఇంగ్లీషు వాఙ్మయప్రోద్బలమున అనియే చెప్పనచ్చును. ఇవియేకాక, "స్త్రీలపాట"లనుపేర చక్కని దేశ్యభాషయందు రచించబడిన కుశలవకథ, ధర్మరాజుజూదము మొదలగు పాటకథలు పండితజనమనములనుగూడ నాకర్షించుచుండుటకు కారణము ఇట్టి జనప్రియకవితకు ఆంగ్ల వాఙ్మయమున 19-వ శతాబ్దమున చేకూరిన అధికమన్ననయే.

ఈ కావ్యభాగమున "గీరతము" వంటి వికటప్రబంధములను చేర్పవలయును. ఆంగ్లకవి పోప్ (Pope) రచించిన మూఢవిజయము (Dunciad) అను వికటప్రబంధమును బోలియున్నను అట్టి రచనాకౌశలమునుగాని సంపూర్ణవిజృంభణమునుగాని "గీరతము"న గానము. మన ప్రసిద్ధకవులు పలుతడవుల వ్రాయబడిన పద్యపుంజములను "మేకుబిగింపు పర్వము" మొదలగు ఇతిహాసానుకరణ పదములతో నామకరణ మిడి ఒకచో చేర్చి యచ్చువేసిరి. ఇంతకన్న పద్యకథ (Narrative Poems) అనదగిన వారి "నానారాజ సందర్శనము" ఎక్కువ రచనపొందికను గలిగి యున్నది. వికట ప్రబంధములు మనకు క్రొత్త గాదు. "రావణదమ్మీయ" మనుద్వ్యర్థి కావ్యము విస్పష్టముగా రెండర్థములను ప్రయోగించుచు కవియొక్క శత్రుప్రసకు హేళనీయప్రభను గల్పించి సర్వజనసమక్షమున కొరతదీయుటకు ఉపయోగింపబడినది. ఇట్టివి హాస్యప్రియమగు మానవజాతికి ఒకరీతి ముదము గొల్పును. అయినను వీనియందు విశేషప్రతిభ గానరాదు. దీనిని ఘనతరకవిత యనరాదు. ఇట్టిచిట్టికావ్యములలో వాగ్దేవతను బహునీచశైలికి దింపిన కవులును గలరు. వారికావ్యములను శ్రీ దొరతనమువారణచివేసి లోకోపకృతి జేసిరి అని చెప్పవలసి యున్నది.

(2) నీతికవిత: కావ్యములలో నీతిభాగములు మెండుగా నుండును. భారతములోని భీష్మపర్వము కేవలము నీతిబోధకము. అయితే ఇవి ప్రత్యేకవాఙ్మయభాగములుగావు.

నీతిభాగములపే రెత్తగనే, సుమతి వేమన మొదలగునీతిశతకములుజ్ఞాపకమునకువచ్చును ఇవి ఆటవెలది, కందము, ద్విపద మొదలగు సులభమైన ఛందస్సుల నలరారి పండితపామరుల పిన్నపెద్దల పెదవులయందు నిత్యము వినబడుచుండును. భర్తృహరినీతిశతకము పెద్దవృత్తములలో ననువదింపబడినది.

శతకములు ఏదోఒక దేవతనుగాని ప్రభువునుగాని సంబోధించుచు, దుర్జనులను దుష్టములగు సంఘాచారములను దూషించు తిట్టు కవిత్వమును మెండుగా గలిగి, మనదేశమున మిక్కిలి వ్యాప్తిగాంచియున్నది. వేణుగోపాలశతకము, రామలింగేశశతకము, నరసింహశతకమును ఇక్కడ నుదహరించవలయును వీనిలో కొన్నిచోట్ల ముతకమాటలను భావములను గందుము. అయినను మొత్తముమీద నివి ఉదారభావములుగలిగిన కవివరులచే వ్రాయబడినవి. ఇవి వికటప్రబంధములవలె వ్యక్తులయెడల నసూయచే నుద్భవించినవి కావు. దుర్జనదురాచారతిరస్కారము లోకస్వాదు నిర్మలమై ధర్మబద్ధమైన ఆగ్రహముతో నిండియుండును. అట్టిభావములలో ఉద్రేకించునప్పుడు మహాప్రతిభగల కవిత్వ భాగములోనికి తలమెత్తును.

ఈనీతికవనములు సంస్కృతవాఙ్మయప్రోద్బలమునే గనుపర్చుచున్నవి. "అలవాటు" "టక్కరి" యను నీతిబోధకములగు చిన్నకథలను ఈభాగమున జేర్చవచ్చును. ఇవి పద్యకథలు. తెలివి లేనివారగు తల్లిదండ్రులచే అతిముద్దుచేయబడిన యువకుని చెయిముట్టుసరసములు మితిమీరినందున తనకును అట్టి మోటుతనము అలవాటు అను నెపమున ఒకబుద్ధిమంతుడు వానికిని వానియబ్బకును బుద్ధిచెప్పుట ఈ "అలవాటు"లోని కథ. "టక్కరి" గబ్బిలపుకథ, మోసపుచ్చుటయే నీతిగాగల గబ్బిలము యిరుతెగలచేతను ధిక్కృతమై గొందుల నణగుట యిందలి కథ. ఇంగ్లీషున గే, డ్రైడెన్ అనుకవులు వ్రాసిన "ఫేబిల్సు" చిన్నకల్పనాకథలతీరున వ్రాయబడినవి. పత్రికల సాయముననే యిట్టి చిన్నకవితలు వరలనోపును. తరువాత క్రమముగా సంపుటముల క్రింద ప్రచురణ కావచ్చును.

ఆంగ్లభాషాప్రోద్బల మీ భాగమున బహుతక్కువ. "సోలోమోను నీతిసామెతలు" బహు ఉత్కృష్టమైన నీతిగ్రంథము. సరియైన తెలుగువాక్యప్రయోగసరళిలేనందున తెలుగు వాఙ్మయమున జేర్చుటకు వలనుపడదు. ఇది చక్కని చిన్నపద్యములతో లేక ద్విపదఛందస్సునసర్వజనములకుఆకర్షకమునుసులభగ్రాహ్యమును జేయవచ్చును. ఇది నూతనవేమనలకు సూచనగా జెప్పుచున్నాను. నీతిని వేదాంతమును బోధించుపాట లెన్నియో గలవు. "ఈశ్వరోపాసనము" అను నేకపాట వరుసకవిత రుధిరోద్గారి సంవత్సరాది సంచికలో కలదు. ఇది నీతివాక్యపూరితము. బాగున్నది. జాన్సన్ (Johnson) కవి వ్రాసిన

"మానవవాంఛానిష్ఫలత "(Vanity of Human Wishes) భాషాంతరీకరింపబడ వచ్చును. గాని ఉదాహరణములు మనదేశ ప్రబోధమునకు దగినరీతిని మార్చబడవల యును. ఈనీతికవితలు విసువుజనించునంత విస్తీర్ణముగ నుండరాదు. పలువిధముల నూతనోద్బోధము గలుగవలసిన ఈదినములలో అత్యుదారములగు ఇంగ్లీషుకవుల నీత్యుక్తులు సంగ్రహించి తెలుగుపద్యశైలిని ఆంధ్ర జన సామాన్యమున కందింపవచ్చును.

3 పాటకవిత:--- కవితనంతయును పాటగానే ఎంచనగును. కొన్నిభాగములు పాడబడును. కొన్నిచదువబడును. అన్నియును కవి హృదయములోని భావములు లోలోన ఉద్రేకించి పాడిననేగాని పైకి వాగ్రూపమున విజృంభింపనేరవు. నాటకరీతిని ఇతరుల భావప్రపంచమును ప్రతిభతోనూహించి చిత్రించుటయందును ఇట్టి సానుభూతి, మెళ్లెక్కి మొదటకవి మనమున పాటరీతిని విజృంభించును. లేదా, భక్తి, వేదాంతబోధ, ఎద్దియేని నూతనోద్బోధము, ప్రియజనవిహారము మొదలగు వానిచే తరువబడిన కవియొక్క స్వంత మనస్సులో నుండి భావతరంగపరంపర పెల్లెగసి వాగ్రూపము దాల్పవచ్చును. ఇది రాగలయబద్ధముగావింపబడి పాటగావచ్చును. ఛందోమాత్ర బద్ధమై పద్యగీతమై పరిణమించనచ్చును. రాగము పాటకుని స్వేంగితవివరణమందు ఉచ్చస్థాయిని నడుచునట్లే, పరేంగితనిరూపణ కవిత (Objective Poetry) కన్న కవియొక్క స్వేంగితనిరూపణకవిత (Subjective Poetry) ఉచ్చస్థాయిని జెంది పాటయొక్క తీవ్రతను గనుపరుచును. మహాప్రతిభాశాలురగు కవులు రెండువిధముల కవితయందును సమతీవ్రతను గనుపరచుచుందురు.

భావగీతములు అనుపేరుతో కొన్నిచిన్న పద్యమంజరులు పత్రికలలో వెలువడుచున్నవి. వానిపేరు సార్థకము. ఇవి కవియొక్క మనస్సున సుఖదుఃఖాది అనుభవములలో నేదో యొకటి నిండియుండి వెల్లువయై పారునప్పుడు ధరించు రాగయుక్తమగు పద్యరూపము అని జెప్పదగును. ఇట్టి నిజమానసికాంతరానుభవములను కవి మననముచేయునప్పుడు వానికితగిన పద్యపుతోడుగు సహజముగనే రమ్యరూపశబ్ద భావాదులతోనిండియుండు కవిమమునకు తానే స్ఫురించును. ఒకప్పుడు "అస్పృశ్యుల యాలాపము" నందువలె కవి తనయొక్క ప్రేమపూరితమగు హృదయమువల్లను, ప్రతిభాశక్తి వలనను ఇతరుల ఇంగితములను ఊహించి, గ్రహించి, తన్మయత్వమును జెంది ప్రదర్శించును. ఇది క్రొత్తఫక్కి యనవచ్చును. ఇట్టి వానికి రూపకగీతికలు, లేదా నాటకశైలి గీతికలు (Dramatic lyrics) అనిపేరు. భావ గీతికలు కవియొక్క యింగితమున జనించినవి. రూపకగీతికలు పరేంగితనిరూపణము నందు జనించినవి. ఇట్టివి ఒకటొకటిగా పత్రికలలో పడుచున్నవేగాని పుంజీకృతములై విమర్శనకు తావిచ్చుటలేదు. "సీతకృతజ్ఞత" యను నొకరూపకగీతిక "సారస్వతసర్వస్వము" 2-వ సంచికలో పడినది. దీనిలో ప్రతిభ చక్కగా ఉపయోగింపబడినది. గాని, ఇట్టి

కృతజ్ఞతావాక్యము లేయదనుస సీతాదేవి నోటినుండి వెకలియుండునో సూచింపబడక పోవుట యిట్టి రూపకగీతికలకు లోపము. దువ్వూరి రామిరెడ్డిగారి "సమరతృష్ణాగీతము" శాంతియుద్ధమునకు పురికొల్పుచున్నది. బాగు న్నదిగాని భావతీవ్రత చాలదు. అయినను శాంతియుద్ధమునకు ఇంతకన్న తీవ్రతగలుగ నోపునా? సుమారు ఇట్టిశాంతి భావయుతంబై తనరారు "ఉత్తమస్మృతి" రుధిరోద్గారి సంవత్సరాది సంచికయందే కానవగును. "అశ్రుతర్పణము" అను భావగీతిక లలితముగనున్నది గాని అశ్రుతర్పణమును జేయించు భావతీక్ష్ణత గీతికలోని ఉత్ప్రేక్షాపరంపరలలో నిముడ్చ బడలేదు.

దుర్మతి సంవత్సరాదిసంచికలో "భావగీతముల"నుగురించి సుధాకరుడు వ్రాసినవ్యాసములో పోతన సరస్వతిని సంబోధించు చోటు పద్యములును, శ్రీనాథుడు చేసిన శారదాంబ ప్రార్థనమును ఈభాగములో జేర్చియున్నారు. వీనితో తిరుపతి వేంకటేశ్వర కవులుజేసిన "హేయంబైన సభాపరాభవము రానీకమ్మ కాత్యాయనీ" అను కాత్యాయనీసంబోధనము తులతూగును. భాగవతములోని భ్రమరగీతలుకూడా చేర్చబడినవి. యివి కావ్యాంతర్భాగములుగనుక యీభాగమున జేర్చ వలనుగాదు. ధూర్జటికవియొక్క కాళహస్తీశ్వరశతకమునుగూడా యీభాగమున జేర్చియున్నారు. భక్తి శతకములన్నియును నీభావగీతములలో జేరును. ఒకభేదముమాత్రము గననగును. ఈభక్తిశతకములలో కవి భావములయొక్క విపులమగు ఆలాపనకన్న ఈశ్వరమహిమానువర్ణనమెక్కుడుగనుండును. యిక్కాలపు ఇంగ్లీషును అనుకరించు భావగీతములలో కవిహృదయవివరణమేముఖ్యము. యింకొకఅంశములో వారి అభిప్రాయముతో నేకీభవింపజాలను- భావగీతములను చిత్తరువులకు బోల్చిరి- నేను పాటకుపోల్చితిని. లలితకళలన్నియు నక్కచెల్లెండ్రే. అయినను వర్ణనము ఆధారము గనుక చిత్రకళకును కవితకును మిక్కిలి సామ్యముగలదని చెప్పనచ్చును. స్వేంగితవ్యక్తీకరణమునందు కవిహృదయవీణాగానమునే విందుము. కేవలవాక్కుల గానమును కాదు. భావగీతములయందు గానకళతో నెక్కుడు పోల్కి గననగునని నాయభిప్రాయము.

సంస్కృతమునందున్న "గోపికాగీత"లను నవి వాని పాటకత్తు చెడకుండా ఆంధ్రమున యింకను భాషాంతరీకరింపబడవలసియున్నవి. కీర్తనల రూపకమున నొకభిక్షుకుడు పాడగా వింటిని. అవి యచ్చునచూపించగా చూచితిని. అంతవిశేషముగ జెప్పదగినరీతిని పరివర్తనము జేయబడలేదు- "హరిభజనమంజరులు" అను పేర వసురాయకవిచేత భజగోవిందశ్లోకములు సులభమగు పాట కనుయుక్తమగు పద్యవరుసను తెనిగింపబడినవి. ఇంగ్లీషునుంచి ఇట్టి గీతికలు ఏమియును తర్జుమా చేయబడినవి నాకంటబడలేదు.

నూతనముగా నెన్నియోరకముల గీతము లచ్చుపడుచున్నవి. ఇది ఆంగ్లభాషా ప్రాద్బలమువలననే యనిచెప్ప వలనుపడదు.

దేశమందంతటనుగల పలువిధమైన ప్రబోధము కారణమగును. కాని కొన్ని జాతీయగీతములలో తప్ప విశేషప్రతిభ, భావోద్దీపనము, పదలాలిత్యము గాంచియుండుట గానము. భారతదేశమునంతను నొక స్త్రీవిగ్రహముగా భావించి నదులను ముక్తావళులనుగాను, ఒడ్యాణముగాను వర్ణించి "ఎంతో మహాత్ము రాలవు మాయమ్మా" యని సంబోధించు నొక ఉత్తమగీతము నాకు జ్ఞాపకము వచ్చుచున్నవి- "ఆంధ్రతేజమ" యను నొక ఉద్దీపకజాతీయగీతము ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో చూచితిని- ఇవి ఓడ్స్ (Odes) అను ఆంగ్లగీతికలను బోలియున్నవి.

ముద్దుగొలుపు "జాబిల్లి వెలుగుల" వంటి పిల్లల నాడించుపాటలును "తుమ్మెద"పాట వంటి యాలపాటలు, అనేకములగు స్త్రీల పాటలును ప్రచురణమందుచున్నవి- మనస్సును కరగించి జ్ఞానమును నచ్చజెప్పు వేదాంతపుపాట లనేకములు వాడుకలో వినుచుందము. "మూడ చక్కనిచిన్నదీ, కడమేడ గదిలో నున్నదీ" యని అంతరాత్మను గురించి పాటయొకటి. "గురుబోధమనియే దీపముంచక పడవ నడపవె చెల్లెలా" యను సంవాదరూపకమగు జ్ఞానబోధకగీత యొకటి యిచ్చుట నుదాహరించెదను. ఇవి లాలిత్యము, చక్కని ఏకాగ్రభావమును గలిగియున్నవి. రసవిహీనమగు పదమాధుర్యమైనను లేని బ్రహ్మంగారు సిద్దయ్యగారల సంవాదమువంటి గీతములను కూడా చదువరులు వీథులలో విని యుందురు. ఇట్టిపాటలలో దేశ్యము ఎక్కువగా నుండుటవల్లను, శబ్దములయొక్క ఉచ్చారణ భాగము ననుసరించి విపరీతరీతుల పరిణమించుట వల్లను ఇవి వాఙ్మయమున గణింపబడుటలేదు. గాని సంగ్రహించి ఏర్పరచినచో ఒకటి రెండు సంపుటములుగా ప్రచురింపదగును. గోదావరి లంకలో నొక సాయంకాలము పసులకాపరి కుర్రవాడు పాడగా నీ క్రింది లలితగీతికాచరణము నొక్కటిని వింటిని.

"ఆహాచిన్నదీ! చక్కని చిన్నదీ! చేమంతిపువ్వది!
ఏమిచేతునన్న యీ కానిపలముదీ"

తక్కిన చరణములు దొరుకునేమోయని ప్రయత్నించితిని; దొరకలేదు. శైలికైతేనేమి భావోన్నతికైతేనేమి రామదాసు చరిత్రములోని కీర్తనలు, త్యాగరాజ కీర్తనలు అగ్రగణ్యములు. అచ్చువేయుటలో శబ్దములు సరిగా వేసినయెడల వానికి పాటకవితయం దత్యున్నత స్థానమిచ్చుట కేమియభ్యంతరము?

ఈ "పాటకవిత"కు "మధురకవిత" యను పేరు వాడుకలో నున్నట్లు నామిత్రులగు శ్రీయుత వేమూరి విశ్వనాథ శర్మగారు చెప్పిరి. ఉన్నను మధురశబ్దము అనేక కవితాభాగములలో గుణమును తెలియ జేయుటకు అవసరమగుటచేతను, కేవలము "పాట" కత్తు కవితను వినువారి మనస్సునకు స్ఫురింపజేయని కారణమునను నేను ఉపయోగించిన "పాట కవిత" (Lyric Poetry) అనుపేరే తగియుండునని చెప్పుదును. విచక్షణులరసి నిశ్చయింతురుగాత!

4. గోపవిహారానుసరణములు: ఇవి గ్రీకుభాషలో 2.వ శతాబ్దమున జనించినవి.

మొదట గోగోపజీవితమునగల శాంతిసంతోషకరములును అకృత్రిమములును లలితతరములును అగు పచ్చికబయళ్లు వనములు, నదీప్రాంతసరత్ప్రాంతభూములు మొదలగు వానియందలి సంచారములను, మోటుతనములేని ప్రాకృతజనసహజమగు ఆటలను పాటలను సంభాషణలను వానివలన జనించు మృదులభావములను వర్ణించుటయందు మతి కెక్కినవి. క్రమముగా రాజకీయాద్యనేకవిషయములను గురించిన అభిప్రాయములను అన్యాపదేశముగా నిరూపించుట కుపకరించినవి. ఇట్టివి మనభాషలో విడిగా గానము. శ్రీమదాంధ్రభాగవతమున దశమస్కంధములో ప్రథమ భాగమున శ్రీకృష్ణబలరాములు గోవుల మందలలోను జేసిన విహారములు చక్కని ఉదాహరణములు- ఇవి నిర్మలగోపజీవన వర్ణనములు. అన్యాపదేశమగునవి మనవాఙ్మయములలో నాకు గనుపడలేదు. ఆంగ్లవాఙ్మయమున ఇట్టి గోపాపదేశకవితలో వర్ణనలు, కథలు, మృతస్మృతులు, నాటకములును గలవు. ఈభాగమున మన నూతనకవుల కింకను అభిరుచి గలుగలేదు. ఇట్టి అన్యాపదేశమగు డొంకతిరుగుడు కవితయందు పలుశాస్త్రచర్చలకలవడిన యీయుగమున ఆదరణముండదని తలచెద. గాని ప్రకృతిసౌందర్యమును, అలజడిలేక శాంతియుతమై మనోరంజకమగు గోపల్లెమునిపల్లెల జీవితములను మనస్సునకు నచ్చునట్లు జేయుటయం దుపయోగింపబడవచ్చును.

౮. మృతస్మృతులు: (Ebgies) మొదట ల్యాటిన్ (Latin) భాషలో నొకరీతి ఛందస్సునకు పేరై చెలంగిన ఈ 'ఎలిజీ'యను మాట, ఆఛందస్సున తరుచుగా వ్రాయబడుచువచ్చిన "విచారభావకవితల"కే క్రమముగ పేరై బరగెను. ఆంగ్లవాఙ్మయమున 'ఎలిజీలు' మృతస్మృతులే. సంస్కృతమున పండితరాయ కృతమగు "భామినీవిలాసము"న కొన్నిచోట్ల నీ "ఎలిజీ" లక్షణములు కనుపడును. గాని ప్రత్యేకము ఈభాగము కవితలను సంస్కృతమున నాకు జూచిన జ్ఞాపకములేదు. ఆంధ్రమున పెద్దనామాత్యుడు కృష్ణదేవరాయ నిర్యాణమును గురించి చెప్పిన పద్యములు చాటువుగా వినియున్నాను. ఇప్పటి మన సారస్వతమున వసురాయకవి కృతమగు "సుతస్మృతి" యును, దేవరకొండ జగన్నాథముగారు రచించిన "మిత్రస్మృతి"యను నేను జూచితిని. ఇవి వృత్తములతో నల్లబడినను స్మరణపదములకొరకును జేర్చబడుటవలన శతకములలోను వలె నొకవిధమగు పాటకత్తును గలిగియున్నవి. శతకములలో పలురసములు చేరవచ్చును. ఇట్టి స్మృతులలో వీలులేదు గనుక విస్తరించనకొలదిని పాటకత్తును మార్చి కథాసరళి వర్ణనసరళిలోనికి దిగవలయును.

దేశసేవాతత్పరులగు మహాపురుషులు మనలను విడనాడి చనినప్పుడు పద్యరూపముగా విచారము గనుపర్చుట పద్యములయందును సభలయందును నిత్యమును గనుచున్నారము. ఇవియన్నియు మృతస్మృతులని చెప్పవచ్చును గాని ఇట్టి తత్కాలస్మరణములును ప్రచురణములును ఉన్నతకవితాభాగమున జేరవు. ఆంగ్లమున ఇట్టి కవితలకు "Copy of verses"

(పద్యావరుసలు) అని యందురు. దుఃఖబీజములు కవియొక్క అంతరంగముననాని నాని, ఉబ్బి, కేవలగుణప్రశంస, అతిశయోక్తులతో మాత్రమే నింపబడక, కవికి స్వానుభూతమై నిజమైన ప్రేమతోఁగూడిన విచారమును సూచించుచు చదువువారలకు కవితోను, కవియొక్క ప్రశంసకును విచారమునకును పాత్రమైన మృతజీవునియెడలను సానుభూత్యాదరములను గలిగించునవియే కవితాభాగమనదగు మృతస్మృతులని చెప్పనగును. ఇంతియగాక, ఇట్టిప్రేమయుతమగు దుఃఖమును గనుపర్చదగిన వ్యక్తిని లోకమునకు ఆదర్శప్రాయుడనునట్లును, వ్రాయుకవికేగాక లోకమున కంతటికిని ఆనష్టము యొక్క నొప్పి గలుగతగునని చదువరులకు ద్యోతమగునట్లును, కవి ప్రదర్శించుట ఉత్తమ మృతస్మృతులకు లక్షణము. విచారమునుజూపి, మైత్రినిదెలిపి, గుణములనేర్చిప్రదర్శించి, ఉద్భోధమును శాంతినితాను పొందినరీతిని దూరదృష్టితో యిట్టి స్మృతికిని కవికల్పించనగును. చిన్నదైనను రుధిరోద్గారి సంవత్సరాదిసంచికలోని రాజారామేశ్వర రాయలస్మృతి గమనించదగియున్నది. ఆయుత్తమపురుషుని గురించి యింకను విరివిగ తెలియవలెనను కుతూహలము గలిగించుచున్నది.

6. వర్ణనములు:- (Descriptive Poetry) దీనిలో రెండురకముల నేర్పరుపవచ్చును. వ్యక్తిరూపవర్ణన, ప్రకృతిరూపవర్ణన. ఇవి తక్కిన కవితాభాగములలో నంగముగా నుండుట బాహుళ్యముగా గనుచున్నాము. శకుంతలకు వెళ్లుత్రోవలో నక్రూరుడు చూచిన జానపదసీమలవర్ణన, గజేంద్రుడు విహరించిన అడవిసీమలవర్ణనయు నిట్టివి- కళాపూర్ణోదయమున వారవనిత యుయ్యెలనూగుట, నారదునిరాక, మేఘముల ఆర్భాటము, వర్షము పూలతోట యిట్టియంశములవర్ణనలు ఎన్నియేనిగలవు- ఇవి యొకప్పుడు పాత్రానుగుణముగా కావ్యనాటకాదులలో గల ప్రధాన వ్యక్తుల నోట నమర్చబడును. కవి అగ్నిమిత్రునిచే వసంతవనలక్ష్మిని వర్ణింపజేయించినాడు. వర్షము, కారుమబ్బులను అభిసారికయగు వసంతసేనచేత మృచ్ఛకటికయందు వర్ణింపజేసినాడు- బల్హణీయములోని చంద్రవర్ణనమును గమనింపదగును.

అన్యకవితాభాగములయందిమిడియుండు వ్యక్తివర్ణనమునకు మేరయే లేదు. నాయికల సౌందర్యము ఆయానాటకములందు నాయకులచేత జేయబడును. రఘువంశములో దిలీపుని శరీరవర్ణన మానసికగుణవర్ణనమును కలిపి ఒకమహాపురుషవిగ్రహమును గన్నుల యెదుటబెట్టినట్లు చేయుచున్నవి. విజయవిలాసములోని సుభద్ర చేసిన "ఎగుభుజంబులవాడు" అను అర్జునుని వర్ణన జనసామాన్యమునోట నుండిగూడ వినబడుచుండును. గోపికలు తిరోహితుడైన శ్రీకృష్ణుని గురించి మల్లెతలను సంబోధించుచు జేయు "నల్లనివాడు పద్మనయనంబులవాడు" అను వర్ణన ఆంధ్రలోకమునకు నిత్యానందదాయియై యొప్పుచున్నది. కావ్యములలో నిట్టి వర్ణనములను కవి స్వయముగానే చేయుట కూడా వాడుకయై యున్నది- పైనిజెప్పబడిన దిలీపుని

వర్ణన, మనుచరిత్రలోని ప్రవరాఖ్యుని వర్ణన మును యిందుకు ఉదహరించెదను. విడివర్ణనల యందువలె వీనిలోను కవియొక్క చాతురి ప్రకృతిని అనుకరింపవచ్చును; లేదా, ప్రకృతి నొక మూలనుంచి నైషధములోని సరస్వతీ వర్ణనవలె శ్లేషోత్ప్రేక్షములతో వినోదించ వచ్చును. వినువారల రసికతను బట్టియు, దేశ కాలాభిరుచులనుబట్టియు ఇట్టివి మారు చుండును. దీనికంతకు మనకు సంస్కృత వాఙ్మయమే ఆదర్శము.

అతిశయోక్తి ప్రయోగబాహుళ్యము సంస్కృతాదర్శమున వ్రాయబడిన కావ్యములం లోనే గాదు; జానపదకవితయందు ఇంతకు ఇంతకన్న మిక్కిలిగా గనుపడును. బొబ్బిలి పాటలో రావువారి బల్లెము ఒక పంక్తిలో ముప్పదిమూరలు యింకొకపంక్తిలో మెను బదిమూరలు నని పాడబడినది. ప్రాసకొరకు ప్రకృతిని మరచుటగలదు. భారతినే గను నించు జానపదసభికులకు ఇది తప్పుగా దోచదు. రసికులగు నాగరసభికులకైనను ఇట్టివి జానపదకవితయందు సహజగుణమగు టను చిరునవ్వునకు మించిన విమర్శనకు గురి గానేరవు.

యికె విడివర్ణనలన్ననో ఆంధ్రమున క్రొత్తతీరు కవితలని చెప్పుదును. నాకు తెలిసి నంతవరకు కాళిదాసు యొక్క "ఋతుసంహా రము" ఒక్కటియే కథ నాశ్రయించుకొనని వర్ణన. వర్ణనాప్రధానమైనను "మేఘసందే శము"యక్షుని విరహకథను ఆశ్రయించుకొని నందున కావ్యభాగమందు గణింపబడుచున్నది. ఆంధ్రమున విడివర్ణనలు కౌపర్, వర్డ్స్‌వర్త్ మొదలగువారి పఠనమువలన నేర్చుకొనబడి నవి. "వివిధకుసుమావళి"లో ఇట్టివి చాలా ఉన్నవి. ఇవి చిన్నవిమై తమంతట తాము ప్రచురణకు రాజాలవు గనుక పత్రికలు బాగుగా ప్రతిష్ఠనొందిన తరువాత ఎక్కువ యగుచున్నవి. కృష్ణాపత్రికయందు శెట్టి లక్ష్మీనరసింహంగారిచే ప్రచురింపబడిన "చిత్ర మాలికలు" ఇట్టివి. ఇవి రవివర్మబొమ్మల లోని వ్యక్తులయొక్కయు, ప్రకృతియొక్కయు రామణీయకమును వాగ్రూపమున చిత్రించుచు అందలి సూక్ష్మభావములను వ్యక్తముసేయు చున్నవి. వీని శైలిమాత్రము కొంచెము క్లిష్ట మని చెప్పవచ్చును. రుక్మాంగద మోహినీ వర్ణనలు హృద్యముగానున్నవి. ఈమాలి కలు ఇంగ్లీషులోని "సానెట్సు" అను పదు నాలుగు పంక్తులలో నిముడు చిన్నకవితలను బోలియున్నవి. అవి వర్ణనలకును కవికి అప్పు డప్పుడు ధ్యానమున పొడము వివిధభావము లను వ్యక్తీకరించుటకును ఉపయోగింపబడు చున్నవి. ఒంటిగా నిలుచుటకు చాలక "మాలి కలు" (Series) రూపమున ప్రచురింపబడును. అప్పుడు జనదృష్టిని ఆకర్షించును. ఈ "చిత్ర మాలికల" రీతి నింకేవియును నాకంటబడలేదు. ఆంధ్రపత్రిక సారస్వతానుబంధమున "కోకి లము," "ప్రేమ," "సూర్యాస్తమయము" వర్ణ నలను చూచుచునేయున్నాను. 10-11-23 తేది పత్రికలో దీపావళి వర్ణనలో చిచ్చుబుడ్లు నందనసుమము లిట్లుండునని తెలుపుచున్నవి యనియు, టపాకాయ గుణబద్ధమైన జీవాత్మ

వలె రూపుమాసియుండియు జ్ఞానోదయమున సర్వప్రాణాత్మకమునందు కలియుననియు చక్కగా నుత్ప్రేక్షింపబడినది. గాని టపాకాయ వర్ణనము కొంచె మతిదీర్ఘమని తోచును. దీపావళి వర్ణన చాలాభాగమును మనమామూలు కావ్యశైలిని జేయబడినది. రుధిరోద్గారి సంవత్సరాది సంచికలోని 'శరద్రాత్రి' 'సంధ్యారాగము' గమనింపదగియున్నవి. 'కొండవీడు' వర్ణన కావ్యశైలిని జేయబడినది-చాలా బాగుగనున్నది. ఆదర్శప్రాయములగు ప్రకృతి వర్ణనలు యింకను వెలువడవలసియున్నవి.

వ్యక్తివర్ణనలు పైనుదహరించబడిన చిత్రమాలికలలో దప్ప యిదివరకు నేను చూచినట్లు జ్ఞాపకములేదు. అట్టి విడియగు వ్యక్తివర్ణనలు చిత్తరువులనుగాని, కథలనుగాని, ఏదో కవికి గలిగిన చురుకగు భావ పరంపరనుగాని ఆధారము చేసుకొనకుండా తటస్థించుట అరుదు. ప్రకృతిసౌందర్యవర్ణనలను మాత్రము విడిగా జేయుటకు వీలున్నది. ఇట్టి వర్ణనలకైనను తన్మయమున కవికి గలుగు మనోభావములే అర్థగౌరవము నిచ్చును; లేనిచో, వర్ణనలు వట్టిభట్టుకవి తలుగాని లేక వట్టి జాబితాలుగాని అగును. సూర్యాస్తమయవర్ణన జేయుచు నొకకవయిత్రి సంధ్యారుణసూర్యబింబము కుంకుమనీళ్లు కలిపియుంచిన మంగళహారతి పళ్లెమువలె నున్నది అనువర్ణన యొకటి నాకు జ్ఞాపకమున్నది- ఇది ఆంధ్రపత్రికలో నెప్పుడో చూచితి ననుకొందును. ఈఉపమానముయొక్క ఉచితత్వమును ఇంపును చదువరులు గమనింప నగును. మంచివర్ణనల కుండవలసిన మితిని గణువలేదు. ఒకప్పుడు ఉపమానములతో గాక కవియొక్క మనస్సులో గలుగుచుండు వివిధభావములను వాటిలోని మార్పులను నిరూపణచేయుట వల్లను వర్ణన ప్రశస్తి నొందగలదు- వర్డ్స్ వర్త్ యారో అనునదిని వర్ణించుచు దానిని జూచుటకై తనకు గలిగిన కుతూహలము నొక చిన్ని కులకమందును, తరువాత నదిని చూచి నప్పుడు గలిగిన యుత్సాహమును వివిధాలోచనలనింకొక కులక (Small Poem) మందును, అటుపిమ్మట దానిని మానసమున స్మరించి మననముచేయగా గలిగిన భావములను వేరొకకులకమందును వ్యక్తపరచియున్నాడు. ఆస్రవంతియొక్క అందమునకు కవియొక్క భావములు మితిలేని విలువను గలిగించు చున్నవి.

మనభాగవతములోని రామకృష్ణుల బృందావనవిహారవర్ణనము పాత్రోచితి, సమయోచితిని గలిగి మిక్కిలి హృద్యముగా నున్నను, విడివర్ణన గానందున యీభాగమున జేర్పవలను పడదు. బాహ్యప్రపంచము, ప్రకృతియందము మానుషభావముల నేరీతిని వృద్ధిపరచగలవో యిందు చూడనగునని మాత్రము చెప్పుచున్నాను.

ఈరీతిని నానేర్చుకొలదిని ఆంధ్రసారస్వతమున నాటక గద్య పద్యభాగములను దిఙ్మాత్రముగా పరిశీలించి వానిలో నవ్య వాఙ్మయ ప్రోద్బలము వలన నుదయించిన జాతులను, శైలియందు ఉదయించిన నూతనాదర్శములను నిరూపించితిని. విమర్శనల యందు గాని, ఇతర విధములనుగాని యీవ్యాసముల గల పొరబాట్లను లోపములను చదువరులుదారబుద్ధితో మన్నించి నేను జేసిన వివిధ సూచనల విలువను పరిశీలించి మనసారస్వతమును తమ తమ శక్తికొలది ప్రోత్సహించి పెంపొందింతురని యాసించుచున్నాను.

# భావతరంగములు

## శ్రీ శేషాద్రిరమణకవులు

“సరసముగాఁ గవిత్వమును సల్పఁగ నేరిచి శాస్త్రవేత్తనై
పరగితి, నన్నెదుర్కొనెడి వాఁడు సగౌరవదృష్టితోడ స
న్నరసెడి వాఁడు కానఁబడఁ, డాంధ్రధరాస్థలి గొడ్డుపోయెనో?
కటా నరుడెంచెనో సుకవికాంతులపాలియకాలమృత్యు వై? ౧

సీ. భట్టారకునిచేత భారతపర్వముల్, రచియింపఁగాఁ జేసె రాజరాజు;
సోమనాథునిఁ గవిత్వామృతరసమును, గ్రోలి కోరిక దీర్చె రుద్రవిభుఁడు;
అల్లవిద్యానాథు నాంధ్ర సింహాసన, స్థలి నిల్పె శ్రీమత్ప్రతాపనృపుఁడు;
శంభుదాసునిచేత సత్కావ్యమును బొంది, వేయాఱు లర్పించె వేమరెడ్డి;

గీ. సంస్కృతాంధ్రంబులందు భాషాస్వరూప, మరసి కవనంబుఁ జెప్ప నిరంకుశునకుఁ
గామితముల నొసంగు భూకాంతుఁ డొకఁడు, కానఁబడఁ డేమనందు నీ కలియుగమునఁ!

మ. సరసాగ్రేసరచక్రవర్తులయి భాషావేత్తలై యుండు భూ
వరులే కన్పడరేమి కాలఫలమో ప్రారబ్ధమో; సాహితీ
పరిణామంబులు గాంచి తొల్లిటివలెన్ స్వర్ణాభిషేకంబు లె
వ్వరు గావింపరు నేఁటి ఱేండ్రు; గవి నెవ్వాఁ డింక వీక్షించెడిన్? 3

మ. వినమత్కాకతిసార్వభౌముఁడును సద్విద్యాబ్ధియౌ పద్మనా
భునిపౌత్రుండను, సంస్కృతాంధ్రకవితాభాషాయితప్రాభవుం
డను, శ్రీనాథుఁడ, నైన నే నిటులె దైన్యం బొందుచో సత్కవీం
ద్రుని కెవ్వానికిఁ గావ్యకల్పనమునందుం జిక్కుఁ బ్రోత్సాహముల్? ౪

చ. తురకల కాంధ్రభూవిభుల దోర్బలభారము లోకువయ్యె; భూ
వరులును సర్వవేళల నవాబులకున్ దలలోనినాల్కలై
తిరుగుచు నున్నవా రెటులు దేశికవిత్వము వృద్ధినొందు? నే
సరణి నొనర్చెదన్ గవనసన్న్యసనంబును శూన్యబుద్ధి నై? ౫

ఉ. ఎందుల కేగినం గవనమే విన వచ్చెడియాంధ్రమండలం
బందుఁ గవిత్వతత్త్వవిభవాశ్రయంబుల మెచ్చుభూవరుల్
మందున కేనిఁ గన్పడరు; మాతృధరాస్థలి పొందునైచ్య మే
మందును? నెందు నాప్రతిభ నాంధ్రులముందటఁ జూపఁజాలుదున్? ౬

సీ. ఆదరించును లేదొ యన్న వేమారెడ్డి, స్వాతంత్ర్యసత్కవిసామజమును!
పాలించునో లేదొ ప్రౌఢరాయన్నృపుండు, దేశీయసుకవితాదిగ్గజమును!
సత్కరించును లేదొ సర్వజ్ఞనృపమౌళి, పద్మనాభామాత్యపౌత్రమణిని!
అనుమతించునొ లేదొ యవచి తిప్పయసెట్టి, సకలవిద్యానాథు శాసనంబు!

తే. గౌరవించును లేదొ భాస్కరుఁడు కావ్య,కల్పనానల్పశోభితుఁ గవివరేణ్యు!
ఘూర్జరాయల శిష్యుఁడౌ కోవిదునకుఁ, గవికి శ్రీనాథునకె తెన్ను గానరాదె! ౭

చ. కవులస్వతంత్రముం జెఱిపి కావ్యవినోదసుఖైకదూరులై
భవనము వీడఁబోని నరపాలురు గన్పడుచుంద్రు గాని నా
కవితకు నర్హుఁడౌ ధరణికాంతుఁడు గన్పడఁ డెందునైన, గౌ
రవము తొలంగినన్ బ్రదుకరాదుగదా కవి యైనవానికిన్! ౮

మ. నరనాథుల్ నిజపాదపీఠములచెంతన్ నిల్వఁ, గావ్యేందిరల్
పరిచర్యామతి సంచరింప, సుకవివ్రాతంబు సేవింపఁగా
ధరణీమండల మేలఁజాలు కవితాతత్త్వజ్ఞుఁ డేరీతిగాఁ
బరదాస్యంబున బద్ధుఁడై బ్రతుకు నిష్ప్రాపంపుఁగాలంబునన్? ౯

మ. వడగాడ్పుల్ చెలరేఁగఁగా దొడఁగెడిన్, వైశాఖమౌ వచ్చె, నా
యడుగుల్ పొక్కులు పొక్కె, నాంధ్రకవితావ్యాసంగుఁడౌ భూపుఁడౌ
వ్వఁడు గన్పట్టఁడు, మామకీనకవితావారాశిభంగార్భటుల్
కడ కేరీతిని దేశమాతృహృదయాకంపంబుఁ జల్లార్పునో? ౧౦

తే. ప్రౌఢరాయక్ష్మాపాలు పరిసరమునఁ, గలఁడు డిండిమభట్టారకప్రభుండు,
మొసలి మసలుసరోవరంబునకుఁ బోలెఁ, జనరు నృపుదరి కీపండితునకు వెఱచి. ౧౧

క. సర్వజ్ఞసింగభూవిభుఁ, డుర్వీపతులందు నుత్తమోత్తముఁడు కలా
ధూర్వహుఁ డగుటను నుర్వీ, గీర్వాణులు పోననుత్సుకింపరు భీతిన్. ౧౨

తే. భట్టనారాయణుఁడు వచ్చి పాదుకొనియె, సన్న వేమమహీపాలు నంగణమున;
　　శాస్త్రవేత్తలకైన దర్శనఫలంబు, లొసరఁబోసఁట రెడ్డియొడ్డోలగమున. ౧౩

తే. రసికుఁడై సుకవిత్వగౌరవము దెలిసి, భావ మెఱిఁగింప వచ్చి తిప్పయ్యసెట్టి
　　క్షారవారాశిలోపలిజలము వోలె, లోచనానందకరముగా లుబ్ధధనము. ౧౪

సీ. డిండిమభట్టుపాండిత్య మేపాటిదో, వాదంబులోఁ దేటపఱుపవలయు;
　　సర్వజ్ఞభూవిభుసాహిత్య మెట్టిదో, సంపాదిగా గ్రహియింపవలయు;
　　వేమభూపాలకు విద్యానురక్తి యే, పరిపాటి నుండునో యెఱుఁగవలయు;
　　అవచి తిప్పయసెట్టి యజ్ఞతాసటనంబుఁ, జెఱపి త్యాగాత్ముని జేయవలయు;

తే. ఘోంటెరాయకృపాప్రాప్తకోమలాంధ్ర, కవితచే దేశమంతయుఁ గైవసంబు
　　సలుపఁగావలె" నంచు, దీక్షను ధరించి, బయలుదేఱెను శ్రీనాథపండితుండు. ౧౫

మ. ప్రతిభాభానుఁడౌ కవీశ్వరునిచే భాషామహారాజ్యము
　　స్నతినిం జెందుటెగాక దేశమునకున్ బ్రజ్ఞాబలప్రాభవా
　　కృతి చేకూరు నటంచుఁ బల్కు నుడి నిర్జీవంబు గాదంచు నా
　　చతురత్వం బది సాటుగాక కవితాసర్వంకషవ్యాప్తిచేన్. ౧౬

ఉ. కొండలదండ నెక్కుపురి గోచరమయ్యెను, ప్రొద్దు గ్రుంకె నె
　　వ్వండొ యశీతివర్షములవాఁ డొకఁ డిట్టుల వచ్చుచుండె నేఁ
　　డుండెద నిందు రేపకడ యోగ్యతలంబున కేగవచ్చు, దే
　　వుం డెటు లేరికిం గపఁ బూనునొ యట్లగు, నేల జంకెనల్? ౧౭



# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులుకారా?

చిలుకూరి వీరభద్ర రావు గారు

(గతసంచికానుబంధము)

"ఆంధ్రులు గంగాతీరవాసులని ప్రబల ప్రమాణములుగాన్పించువఱకు వారు దక్షిణాపథవాసులనియును, వారిదేశము దక్షిణాపథదేశమనియు అదియె కృష్ణా గోదావరీ నదీ గర్భదేశమనియును మనము నిశ్చయింతము." అని యాంధ్రుల చరిత్రములోని ప్రథమ భాగమునఁ బదునైదేండ్ల క్రిందట వ్రాసియున్నాఁడను. ఈపదునైదు సంవత్సరములనుండి చేసిన పరిశోధనము లాంధ్రులు గంగాతీరమున నుండియే దక్షిణాపథమునకును, అందుండి దక్షిణాపథాంతదేశమునకును బోయియుండిరని తెలుపుచున్నవి. విదేహదేశపు స్త్రీలే యాంధ్రమాతలని వక్కాణించుటచేత మన్వాది శాస్త్రవేత్తల యభిప్రాయమునుబట్టి యాంధ్రులాత్తరాపథులని వ్యక్తమగుచున్నది. మఱియు హరివంశమునందు కరూశదేశాధిపతి యగు చాణూరమల్లుఁ డాంధ్రుఁడని వక్కాణింపఁబడినది. ఇతఁడు కృష్ణునితోఁడనైన యుద్ధమున మరణముఁ జెందెనని చెప్పఁబడినది. అందువలననే 'చాణూరాంధ్రనిషూదన' అను నామము విష్ణుసహస్రనామములలో నొకటిగాఁ జేర్పఁబడినది. తన యాశ్రమమునకును మిథిలా నగరమునకు నడుమ కరూశదేశ మున్నట్టు రామాయణము బాలకాండములో వాల్మీకి పేర్కొనియున్నవాఁడు. మఱియును బౌద్ధగ్రంథములలోఁ గూడఁ బెక్కుతావుల నాంధ్రులుత్తరమునఁ గూడ నున్నట్టు గన్పట్టఁగలదు. వానినిగూర్చి ప్రత్యేక వ్యాసమునఁ దెలిపెద. ఉత్తరకోసలమునకు రాజధానియగు శ్రావస్తి నగరప్రాంతమున నాంధ్రు లున్నట్టు సావత్థియాం అంధకవనలెనే, అని కొన్ని ప్రదేశముల పాలీభాషా గ్రంథములలోఁ బేర్కొనఁబడియుండుటచేత మనము దెలిసికొనుచున్నాము. ఆంధ్రశబ్దము పాలీభాషలో (ఆంధ్రప్రాకృతము) అంధశబ్దముగా వ్యవహరింపఁబడినదని బౌద్ధవాఙ్మయమునుండి పెక్కు దృష్టాంతములను జూపవచ్చును. శివస్కందవర్మ మైదవోలు తామ్రశాసనములో 'ఆంధ్రపథ'మునకు 'అంధపదియ' అని వ్రాయఁబడినది. (ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౬. పే. ౮౭). ఏఁడవ శతాబ్దములో భరతఖండమును జూడవచ్చిన చీనాదేశపు యాత్రికుఁడగు హూయనుత్సాంగు' అను వాఁడు దక్షిణ కోసలమును మహా 'ఆంధ్ర' మని వక్కాణించినాఁడు. (See Edition of Thomas Watters) క్రీస్తుశకమునకుఁ బూర్వము రెండవశతాబ్దములో కళింగమును బరిపాలించుచుండిన ఖారువేలునికాలమున దక్షిణకోసలము శాతకర్ణి (ఆంధ్రరాజు)

పరిపాలించుచుండెనని 'హాతిగంఫా' శాసనము వలనఁ దెలియుచున్నది. చీనావాఙ్మయము నందును కోసల దేశమును (దక్షిణ) శాతవాహనరాజు పరిపాలించు చుండెననియు నతఁడు నాగార్జునునకుఁ బరమమిత్త్రుఁ డనియును వ్రాయఁబడియుండెను. మగధదేశమును బరిపాలించు "బలి" యను రాజునకు 'ఆంధ్రు' డను కుమారుఁ డున్నట్లు భాగవతమునఁ బేర్కొనఁబడియుండెను. * ఇట్టి సంస్కృత ప్రాకృత భాషాగ్రంథములలో ఆంధ్రు లౌత్తరాహు లయినట్లు స్పష్టము కాఁగలదు. అఱవలు మనల వడుగు (ఉత్తరాదివారు) లనుట కిదియే కారణము కాఁబోలు. ఇప్పటి కాంధ్రులు కోసల విదేహ దేశములలో నుండిరని తెలిసికొంటిమి. ఆంధ్రుల కీ దేశములు జన్మస్థానములా లేక వీరికి జన్మస్థానము మఱొకచోట నైనఁ గలదా యను విషయముల నింకను బరిశోధించి తెలిసికొనవలసియున్నది. వైదేహు లెవ్వరో కొంతవఱకు రెండవ వ్యాసమున జర్చించియున్నాను. వైదేహు లిక్ష్వాకువంశీయులయిన క్షత్రియులనియును వారు శాక్యులకును లిచ్ఛవీలకును బంధువు లనియును పురాణములును బౌద్ధగ్రంథములును దెలుపుచున్నవని తెలిపియున్నాను. వీరలను గుఱించి వక్కాణింపవలసినవిషయములు పెక్కులు గలవు. వీరలను (శాక్యులను, లిచ్ఛవీలను) సూర్యవంశీయులయిన క్షత్త్రియులని రామాయణమును వసిష్ఠగోత్రులయిన క్షత్త్రియులని బౌద్ధగ్రంథములును జాటుచుండఁగా మనుధర్మశాస్త్రకారుఁడు వ్రాత్యక్షత్త్రియులనియును, వైదేహులను వర్ణసంకరు లనియుఁ జెప్పనేల? ఇప్పటి యాంధ్రులకును బైనజెప్పిన క్షత్రియ సంఘములకును రక్తసంబంధము గన్పట్టుచుండుటచేత వీరిసంపూర్ణచరిత్రము మన కత్యావశ్యకమై యున్నది. శాక్యులకుఁ బ్రతినిధిగ శ్రీరాముని, లిచ్ఛవీలకుఁ బ్రతినిధిగ లక్ష్మణుని, వైదేహులకుఁ బ్రతినిధిగ వైదేహిని మనస్సులో నుంచుకొని వారు దక్షిణదేశ దండయాత్రకు బయలుదేఱి యార్యమతమును, ఆర్యనాగరికతను వ్యాపింపఁ జేసిన విధమే వర్ణింపఁబడినదను నూహతో శ్రీమద్రామాయణమును జదివినచో వీరియొక్క చరిత్రము చాలవఱకు బోధపడఁ గలదు. ఈ విషయము గూడఁ బ్రత్యేకవ్యాసమునఁ దెలుపఁదగినదే. ఇంక వ్రాత్యుల నెవ్వరో రెండవవ్యాసమునఁ దెలిపినవిగాక ధర్మశాస్త్రములనుండి మఱికొన్ని వాక్యములను దెలిపెదను.

"బ్రాహ్మణాః క్షత్త్రియా వైశ్యా స్త్రయో వర్ణా ద్విజాతయః,
[illegible]
[illegible]"

అనఁగా బ్రహ్మక్షత్త్రవైశ్యులకు విధింపఁబడిన కాలమునం దుపనయనమునకు సంవత్సరము దాటినచో వ్రాత్యు లగుదురు, వారు శూద్రసములని మనుస్మృతి,

"ఆషోడశాద్ద్వావింశాచ్చతుర్వింశాచ్చ వత్సరాత్,
బ్రహ్మక్షత్త్రవిశాం కాల ఔపనాయనికః పరః,
అత ఊర్ధ్వం పతన్త్యేతే సర్వధర్మబహిష్కృతాః,
సావిత్రీ పతితా వ్రాత్యా వ్రాత్యస్తోమాదృతే క్రతోః"

* అంగ వంగ కళింగాన్ధ్రేష్వపి సౌరాష్ట్రమగధేషు చ; తీర్థయాత్రాం వినా గచ్ఛన్ పునః సంస్కారమర్హతి॥

అనఁగా బ్రహ్మక్షత్రవైశ్యులకుఁ గ్రమముగా పదారు నిరువదిరెండు నిరువదినాలుగు వత్సరములవఱకు నుపనయనకాల మనియును, ఆపైని గాయత్రీభ్రష్టులై వ్రాత్యు లనఁబడి వ్రాత్యస్తోమ మను క్రతువుతప్పఁ దక్కినకర్మలం దనధికారులగుదురనియు యాజ్ఞవల్క్యుఁడును వక్కాణించిరి.

మఱియుఁ బ్రాచీనకాలమున వ్రాత్యులు శైవసన్న్యాసులుగ నుండిరని యథర్వణవేదమువలనఁ దెలియుచున్నది. వీరు మునులకంటె భిన్నులు. రెండెడ్లు గట్టిన బండిమీఁద గూరుచుండి బండివాడు కొరడా చేతబుచ్చుకొని బండి నడుపుచుండ వీరు వాని నధిష్ఠించి దేశద్రిమ్మరులై తిరుగుచుండు సాధువులు. వీరు పోవుచుండ వెనుక నిరువురు పరిష్కందులు వెంబడింప ముందు నిరువురు మనుష్యులు పరువిడుచుందురు. వీరు తలవెండ్రుకలను పొడవుగాఁ బెంచుకొందురు. పైనవస్త్రమును, తలపాగను ధరింతురు. విండ్లు చేతఁ బూనెదరు. అందెల ధరింతురు. ఇంతియగాక యొకపుంశ్చలియు, మాగధయు పరివారముతో నుందురు. (అ. వే. ౧౫-౧-౨) ఈ కాలమందు సాధువు లెట్టి జీవితమును వహించియున్నను, యోగ్యత యున్నను లేకపోయినను గౌరవింపఁ బడుచుండుట మనము చూచుచున్నాము. అట్లే పూర్వకాలమందును వ్రాత్యులు ప్రజలచే గౌరవింపఁబడుచుండిరి. వారు గొప్పవారుగను దేవదేవులుగను, జూడఁబడుచుండిరి. (అ. వే. ౧౫-౧) మఱియును భవుఁడు, శర్వుఁడు, ఈశానుఁడు, రుద్రుఁడు, మహాదేవుఁడు వారికి సన్నిధానవర్తులై యుందురు. (నిశ్చయముగా వారు శివభక్తులు) (అ. వే. ౧౫-౫) వారిని రాజులు పూజించిరి. (అ. వే. ౧౫-౧౦) వారు గౌరవముగల యతిథులని బ్రాహ్మణులు వారి కాతిథ్య మిచ్చుచుండిరి. (అ. వే. ౧౫-౧౨) ప్రాచీనకాలమున నప్పటి బ్రాహ్మణులు వీరిని పూజనీయులుగఁ దలంచినను, వైదికుల స్మార్త కర్మానుష్ఠానములు ముదిరిన వెనుక పై వ్రాత్యులను కర్మచండాలురని ధర్మశాస్త్రవేత్తలు వక్కాణింపుచువచ్చిరి. ఇట్లథర్వవేదమున ౧౫వ కాండమున 'వ్రాత్యమహిమ' విశేషముగా వర్ణింపఁబడినది. "వ్రాత్యుఁ డధికారి; వ్రాత్యుఁడు మహానుభావుఁడు; వ్రాత్యుఁడు దేవప్రియుఁడు; బ్రాహ్మణ క్షత్రియ వర్చస్సులకు మూలము; దేవాధిదేవుఁడు;" అని యథర్వవేదమున వర్ణింపఁబడిన వ్రాత్యుఁ డుపనయనాది సంస్కారహీనుఁడైన పురుషుఁడయి యజ్ఞాది వేదవిహితకర్మలకు ననధికారియై వ్యవహారయోగ్యుఁడు కాఁడని ధర్మశాస్త్రవేత్తలెందుకుఁ జేర్కొనవలసి వచ్చినది? తాండ్య బ్రాహ్మణములో వ్రాత్యులు 'నహి బ్రహ్మచర్యం చరన్తి నకృషిం నవాణిజ్యం.' (బ్రహ్మచర్యము చరింపరు, వ్యవసాయము చేయరు, వర్తకము చేయరు) అని చెప్పఁబడియున్నది. (౧౭-౧-౨) ఇవన్నియు నెందుకు? 'అతఁ డెక్కడికిఁ బోవునో యచ్చటికి విశ్వమంతయు దేవతలును వానివెంట వెళ్లుదురు. వాఁడు కూర్చుండినఁ గూర్చుందురు; కదలినఁ గదలుదురు; వాఁడు రాజవలె నడుచును.' అని యథర్వవేదము వక్కాణించుచున్నది. అత్య

ద్భుతముగా వర్ణింపఁబడిన 'వ్రాత్యమహిమ' యెట్టిదిగానుండెనో చదువరుల వినోదము కొఱకు నాభాగముల, భాషాంతరీకరణమును 'విజ్ఞాన సర్వస్వము'నుండి యెత్తి చూపు చున్నాను.

(౧౫-వ కాండము, ౧౩-వ పర్యాయ సూక్తము)

"ఎవరి యింటికైనను విద్వాంసుఁడగు వ్రాత్యుఁడు అతిథిగా వచ్చినయెడల స్వయ ముగా నా గృహస్థుఁడు అతని కెదురుపోయి యిట్లనవలెను:- "వ్రాత్యుఁడా! నీ నివాసమేది? వ్రాత్యుఁడా! ఇదిగో జలముఁ. వ్రాత్యుఁడా! అవి నీకు తృప్తిఁగలిగించుగాక! వ్రాత్యుఁడా! నీకు బ్రియమెద్దియో య ట్లగుగాక. వ్రాత్యుఁడా! నీకు వశమెద్దియో యట్లగుఁగాక. వ్రాత్యుఁడా! నీకోరిక యెద్దియో యట్లగుగాక. వ్రాత్యుఁడా! నీ నివాసమెద్ది యన్నందున దేవయానమును పొందును. వ్రాత్యుఁడా! యిదిగోజలమన్నందున జలము పొందును. వ్రాత్యుఁడా! అవి నీకుతృప్తి గలిగించుగాక యన్నందున దీర్ఘాయుస్సును జెందును. వ్రాత్యుఁడా! నీకుఁ బ్రియమెద్దియో యట్లగుగాక యన్నందునఁ దనకేమి ప్రియమో వానిని బొందును. ఇట్లు తెలిసికొనిన వాని యొద్దకు బ్రియము వచ్చును. వాఁడు ప్రియ నకుఁ బ్రియుఁడగును. వ్రాత్యుఁడా! నీకు వశ మెద్దియో య ట్లగుగాక యన్నందున వానికి వశము వశమగును. ఇట్లు తెలిసికొనిన వానికి 'వశము' స్వాధీనమగును. వాఁడు వశులను గూడ వశము చేసికొనును. వ్రాత్యుఁడా! నీ కోరిక యెద్దియో యట్లగుగాక యన్నందున వాని కోర్కెలన్నియు సిద్ధించును. ఇట్లు తెలిసి కొనినవానియొద్దకు కోర్కెవచ్చును. వానికిఁ గోర్కెలలో గోర్కెలన్నియు ఫలించును."

వ్రా త్య మ హి మ.

(౧౫-వ. కాండము. ౬-వ. పర్యాయసూక్తము.)

"ఎవనియింట్లో విద్వాంసుఁడైన వ్రాత్యుఁ డు ఒకరాత్రి అతిథిగానుండునో వానికిఁ బృథ్వి మీఁదనున్న పుణ్యలోకములు ప్రాప్తించును. ఎవనియింట్లో విద్వాంసుఁడైన వ్రాత్యుఁడు రెండవరాత్రి అతిథిగా నుండునో వానికి అంతరిక్షమునందలి పుణ్యలోకములు ప్రాప్తిం చును. ఎవనియింట్లో విద్వాంసుడైన వ్రాత్యుఁడు మూఁడవ రాత్రి అతిథిగా నుండునో వానికి నాకమందు (దివి) నేపుణ్య లోకములు కలవో యవి ప్రాప్తించును. ఎవని యింట్లో విద్వాంసుఁడైనవ్రాత్యుఁడు నాల్గవ రాత్రి అతిథిగా నుండునో వానికి పవిత్రమైన వానిలో పవిత్రమైన (పుణ్యానాం పుణ్యాః)లోక ములు లభించును. ఎవనియింట్లో విద్వాంసుఁ డైన వ్రాత్యుఁడు అపరిమితరాత్రులు అతిథియై నివసించునో వానికి నపరిమితములైన పుణ్య లోకములు లభించును."

ఈ పైవర్ణనమునంతను జదివి సాయనభా ష్యముతోఁగూడ నథర్వవేదము నచ్చొత్తిం చిన శంకర పాండురంగ పండితుఁడు "స గచ్ఛ తీత్యాది, నపునరేతత్ సర్వవ్రాత్యపరం ప్రతి పాదన మపితు కంచిత్ విద్వత్తమం మహాధి కారం పుణ్యశీలం విశ్వసమ్మాన్యం కర్మపరైః బ్రాహ్మణై ర్విద్విష్టం వ్రాత్యం అనులక్ష్యవ చనం ఇతిమన్తవ్యం" "ఇది యంతయు నందఱు వ్రాత్యులను గుఱించి కాదు. విద్వాంసుఁడు,

మహాధికారి, పుణ్యశీలుఁడు, విశ్వమాన్యుఁడు, అయినప్పటికి కర్మపరులయిన బ్రాహ్మణులచే ద్వేషింపఁబడుచున్న యొకానొక వ్రాత్యునిగు జెంచి వ్రాయుఁడవచ్చును." అని వ్రాసియు న్నాఁడు. (అథర్వణసంహిత ౧౫ సంపుటము). ఇంతటి ప్రజ్ఞావిశేషములు లేకున్నను ఈకాల మందున దక్షిణదేశమున 'పండారము' లను శైవ సన్న్యాసులు గలరు. అయితే పైని పేర్కొనఁబడిన వ్రాత్యునివంటి మహానుభావుని నెవ్వనినైన నొక్కని మనపురాణేతిహాసముల నుండి చూపవచ్చునా యని ప్రశ్నించుకొందు మేని నట్టివారు వందలకొలఁది గాన్పింతురు. గాని యందు ముఖ్యముగా మహాభారతము నకు గర్తయని చెప్పఁబడెడి కృష్ణద్వైపాయ నుఁడను వ్యాసమహామునీంద్రుని జెప్పఁదగును. అథర్వవేదమున వర్ణింపఁబడిన వ్రాత్యమహిమ యంతయు నీతనియందు గన్పట్టును. కాశీరాజ పుత్రికలగు (వైదేహకస్త్రీలు) అంబికాంబా లికలయందు దేవరన్యాయమున నీతనికిఁ బుట్టిన వారే ధృతరాష్ట్ర పాండురాజులని మహాభార తమువలన మన మెఱుంగుదుము. వైదికస్మార్త కర్మానుష్ఠానములు ముదిరిన వెనుక పైనుడివిన వ్రాత్యులను కర్మచండాలురని( భ్రష్టులు) ధర్మ శాస్త్రవేత్తలు వక్కాణించిరి.

ఒకానొకస్మృతిలో:—

"కర్మచండాలకా త్పుత్రం వైదేహీ పాండుశోపకమ్
లేభే బురుడజాతిత్వం సదా వంశవిదారణమ్."

(అనఁగా భ్రష్టసన్న్యాసికివైదేహస్త్రీయందు పాండుశోపకుఁడని పుట్టును. వీఁడే బారుడజాతి యనఁగ మేదరవాఁడు; వానికి వెదురు బద్దలు చేయుట వృత్తియని చెప్ప బడియెను.) ఇట్లే మనువుకూడ:—

"చండాలా త్పాండుశోపాక స్త్వక్సారవ్యవహారవాన్
ఆహిండకో నిషాదేన వైదేహ్యా మేవజాయతే."

(అనఁగా చండాలునికి వైదేహియందు పాండు శోపకుఁడు పుట్టి వెదురుబద్దలుచేసి జీవించును. మఱియు దానియందే నిషాదున కాహిండకుఁ డనువాఁడు పుట్టును. వెదురుపేళ్లచేఁ బని చేయుటయే వృత్తి. ఇదే మేదరజాతి,) అని చెప్పెను. కాశీ కోసలదేశములందలి స్త్రీలు వైదేహకస్త్రీ లయినట్లుగా జైనగ్రంథము లను బట్టియు, బౌద్ధగ్రంథములను బట్టియు హిందూగ్రంథములనుబట్టియు స్పష్టపడగలదు. ఆంధ్రులును, మేదులును సోదర జాతు లని యును, చండాలు రనియు మనువు చెప్పిన విష యము నింతకుఁ బూర్వము తెలిసికొనియే యున్నాము. దీనినంతయుఁ బరిశీలించి చూచు నప్పుడు మన కొక్కవిషయము బోధపడఁ గలదు. కృష్ణద్వైపాయనునకు బహుకాల మునకుముందే అనఁగా ఋగ్వేదకాలముననే శివయతుల ప్రభ దేవజాతులలో వెలుఁగుచుం డెను. వారినిబట్టి దేవాంశసంభూతులయిన మనుష్యులలోను వెలుఁగుచుండె . ఋగ్వేద కాలమునకుముందు లింగార్చనమతము వేఱుఁ గను శైవమతము వేఱుగ నుండెను గాని ఋగ్వేదకాలమున శైవులు లింగార్చనమత మవలంబించినట్టు గాన్పించుచున్నది. ఎట్లయిన నేమి? ఋగ్వేదములో అనఁగా ప్రాచీనమంత్ర ములలో లింగార్చకులు, శివులు కూడ నుదాహరింపఁబడిరి. లింగార్చకులు శిశ్నదేవు

లని వక్కాణింపఁబడిరి. ఇంద్రుఁడు తనబుద్ధి చాతుర్యముచేత శిశ్న దేవులను సంహరించి నూఱుద్వారములుగల వారి నగరములోని యైశ్వర్యమునంతయుఁ జూఱఁగొనెను. (ఋ. మం. ౧౦-౯౯-3) శిశ్నదేవు లనఁగా సాయ నాచార్యులవారు తమభాష్యములో:—

"శిశ్న దేవాః శిశ్నేన దీవ్యంతి క్రీడంతి ఇతి శిశ్న దేవాః అబ్రహ్మచర్యాః ఇత్యర్థః, తథాచ యాస్కః...... శిశ్న దేవాః అబ్రహ్మచర్యాః"

(అనగా శిశ్నముతో క్రీడించువారును, అబ్ర హ్మచర్యులును గావున శిశ్న దేవులగుచున్నా రనియు, యాస్కాచార్యుఁడుకూడ శిశ్నదేవు లన అబ్రహ్మచర్యులని చెప్పె)నని వ్రాసినారు. (ఋ-మం ౭-౨౧-౫). ఇంద్ర పూజకులయిన త్రిత్సులపైకి శివజాతివారు దాడివెడలినట్లు చెప్పఁబడినది. (ఋ-మం ౭-౧౮-౭) శిశ్న దేవులుగూడ నింద్రుని నెదుర్కొనిరనికూడఁ జెప్పఁబడినది. (ఋ. మం. ౧౮-౯౭-౧౦) ఇం కను బెక్కుచోట్ల నుదాహరింపఁ బడి యుం డెను. మొట్టమొదట భరతఖండములో లింగ మతము శైవజాతులవారవలంబించి భరతఖండ ములో లింగమతము శైవజాతులవా రవలం బించి భరతఖండమునం దంతటవ్యాపింపఁజేసిరి. ఈలింగమతము భరతఖండముననేకాదు, ప్రా చీనకాలమున కాల్డియా, ఈజిప్టు, పార్థియా, మేదియా గ్రీసు, ఫొనిషియా, ఇటలీ మొద లగు పాశ్చాత్యదేశములందుఁగూడ వ్యాపించి యుండెను. ఆవిషయము నేటివిషయమున కం తగా సంబంధించినది కానందున దానిని విడిచి ప్రస్తుతాంశమునకు వచ్చుచున్నాను. ప్రాచీన ఋగ్వేద మంత్రములలోఁ శిశ్నదేవులుగ వర్ణింపఁబడిన వ్రాత్యులు అథర్వ వేదమంత్రము లలోఁ బూజ్యులుగను, దేవ దేవులుగను వర్ణింపఁబడుటచూడ నా యుభయపక్షముల వారికిఁ గొంత కాలము స్పర్థలవలనను కుల మతాచార భేదములవలనను, పోరాటములు జరిగిన పిమ్మట కడపటి పక్షమువారికే క్రమక్రమముగా విజయము కలుగుచు వచ్చె నని స్పష్టపడఁగలదు. ప్రాచీనకాలమున నీశివ యోగులను 'ఆండీ' లని జనసామాన్యము వ్యవహరించుచుండిరి. ఈ 'ఆండీ' లను శివ యోగులు యజ్ఞాదివైదికకర్మలయం దనాద రము కలవారగుటచేతను, వారు వీరినే తత్క ర్మ లాచరించు సమయమున నాహ్వానింపకుం డుటయు జరుగుచువచ్చెను గాని కొంత కాలము నకు నట్టిగౌరవమును తాముకూడ పొందవల యునని శివయోగులు ప్రయత్నింపుచువచ్చిరి. దక్షుఁడు యజ్ఞముసేయుటకై దన యల్లుడైన శివుని, బిలువఁబోయినపు డతఁడు మాట్లాడక యవమానపఱచినందున నాతని నాహ్వానింపక యే యజ్ఞము ప్రారంభించుటయు నాసమయ మున శివునిభార్యయగు సతి దక్షుని కూతురు గాన, తండ్రి పిలువక పోయినను యజ్ఞము నకుఁ బోవుటయు, తండ్రి యామె నాదరిం పక శివుని దూషించుటయు, అందుకు సహిం పక సతి యగ్నిప్రవేశము గావించుటయు, దీని నంతయుఁ దెలిసికొని శివుఁడు వీరభద్రుని సృజించుటయు, అతఁడు దక్షాధ్వరధ్వంస మును గావించుటయు మొదలుగాగల విషయ ములతోఁ గూడుకొన్న పౌరాణికగాథలకు

మూలము పైఁజెప్పిన స్పర్థలే కారణము. ఇందువలననే వీరిని దస్యువులని ఋగ్వేదాది గ్రంథములలో వ్యవహరించిరి.

మం. అకర్మా దస్యు రభినో అమన్తు రన్య వ్రతో౽మానుషాః, త్వం తస్యామిత్రహన్ వధ ర్దాసస్య దంభయ. (ఋ. సం. ౧౦. ౨౨. ౮.)

'కర్మహీనా శత్రవః' (ఋ. స. ౬-౬౦-౬)

"ఉపక్షపయిత్రీన్ కర్మవిరోధినః జలప్రభృతీ నసురాన్." (ఋ. సం. ౬-౩౩-౬)

"అనుష్ఠా తౄణా ముపక్షపయితారః శత్రవః" (ఋ. స. ౧-౧౦౩-౩)

ఇందువలన మనము గ్రహింపవలసిన దేమన, యజ్ఞాది వైదికకర్మ లాచరించు తెగలవారికిని వైదికకర్మలకు విద్వేషులై శైవ శాక్తేయాదిమతము లవలంబించిన తెగల వారికిని నెడతెగని పోరాటములు స్పర్థలు గల వని తేటపడుచున్నది. లింగారాధనమతమె శైవులచే నవలంబింపఁబడి శైవమతమె లింగారాధన మతముగా నేర్పడుటయు, క్రమముగా యజ్ఞాదికర్మ లాచరించువారి ప్రభకన్న శివ యోగుల ప్రభావము దేశమున విస్తరించుట చేతను, అప్పటి విశ్వాసములనుబట్టి సమస్త ప్రజలకు వారు దేవదేవులుగఁ గన్పట్టుచుండిరి. శైవమతపరిణామచరిత్రము ల్లక్కిలి మనోజ్ఞముగ నుండును. అథర్వవేదమున 'వ్రాత్యో బ్రాహ్మణ క్షత్రియయో ర్వర్చసో మూలం' అనగా బ్రాహ్మణ క్షత్రియుల వర్చస్సునకు మూలము వ్రాత్యులని చెప్పి యుంఁడుటచేత బ్రహ్మక్షత్రియులకు సృష్టికర్తలు శివదేవులే యని చెప్పవలయును. కాఁబట్టి శాక్యులను, లిచ్ఛవీలను వ్రాత్యక్షత్రియులని మన్వాదులు వచించుటకుఁ గారణము వీరు వ్రాత్యులవలన సృజింపఁబడిన క్షత్రియు లగుటచేతనే గాని మఱియొండువలన గాదని మనకిపుడు స్పష్టము కాఁగలదు. ఆండీలే (శివదేవులు) దేవదేవులు. ఆంక్షీలే రాజులు. వైదికకర్మ లాచరించుదేవ జాతులవారికి ప్రభువు ఇంద్రుఁడే. ఇంద్రశబ్దమునకు రాజని యర్థము కలదు.

శ్రు. త్వామిన్ద్రాదిరాజః ప్రపద్య స్వాభూ రభిభూతి ర్జనానామ్, త్వం దేవీ ర్విశ ఇమా విరాజ యుష్మత్ క్షత్ర మజరంతే అస్తు. (అ. వే. ౬ కాండము ౯౮ సూక్తము. ౫ అనువాకము ౨ మంత్రము ౨ వ సంపుటము. ౨౦౧ పత్రము.

ఇందు 'త్వామింద్రాదిరాజః' అనునప్పుడు ఇంద్రుఁడన రాజనియు రాజన క్షత్రియుం డనియు నర్థము చెప్పఁబడినది.

విద్యారణ్యభాష్యమునందు "ఇంద్రాభేదే నరాజ్ఞః స్తుతిః" అనియు "క్షత్రమ్ బలమ్ అస్తు భవతు" అనియు 'రాజతిః ఐశ్వర్యా కర్మా' అనియు చెప్పఁబడియుండుటచేత ఇంద్ర రాజ క్షత్ర శబ్దములను బర్యాయపదములుగ గ్రహింపవచ్చును.

మఱియు ఋగ్వేదములో :—

"ఆరాజానామహ ఋతస్య గోపా సిన్ధురాతీ క్షత్రియా యాతసర్వాక్, ఇడాంసోమిత్రావరుణాత వృష్టిమవదివ ఇన్వతంజీరదీనూ (ఋ. మ. ౮ సూ. ౧౧)

"విద్యారణ్య భాష్యమ్, హేరాజానా సర్వస్య స్వామినౌ, హే మహాంతౌ ఋతినోదకస్య యజ్ఞస్య గోపా గోప యితారౌ సుభామంత్రి తేపరాంగ్వర్సరే ఇతి పరాగవ ద్భావాత్, హే సిన్ధుం పతీనద్యాః పాలయితారౌ హే క్షత్రియా౽బలవంతౌ యువాం అర్వాగస్మదభిముఖం ఆయాతమాగచ్ఛతు ఇతి సాయణాచార్యః"

అని యుండుటచేత క్షత్రియుఁడని బల వంతుఁడని యర్థమగుచున్నది. అదియునుం గాక:—

"శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలా యనమ్, దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభా వజమ్." (భగ. ౧౮ అ. ౪౩ శ్లో.)

అనఁగా శౌర్యము, తేజస్సు, ధైర్యము, చాతుర్యము, యుద్ధమున సుస్థిరత, సామ ర్థ్యము అనునవి క్షత్రియునకు స్వభావ జన్యములైన గుణములని భగవద్గీతలు బోధిం చుచున్నవి. కాఁబట్టి యీ వ్రాత్యులనుగూడ ఇంద్రులనుగఁ బరిగణించినకాలము గలదని చెప్పవచ్చును. ఇంద్రశబ్దము ఆంద్రశబ్దముగ 'జెంజావేస్టా' మను పారసీవేదమునందు వ్యవ హరింపఁబడినది. వైదికులు ఇంద్రుని దేవుఁడన జెండులు ఆంద్రుని దయ్యమనిరి. ఆంద్రశబ్ద మును ఇంద్రశబ్దమునకుఁ బర్యాయపదముగ వక్కాణించుట చూడ నొకే యర్థమునందు వాడిరని తెలియఁగలదు. ఇందునుగూర్చి శ్రీమాన్ పి. టి. శ్రీనివాసయ్యంగారు (ఎమ్.ఏ. ఎల్.టి.) తమచే రచింపఁబడిన "Life in Ancient India in the age of the Mantras" అను గ్రంథములో

"His name, too, occurs but twice in the Avesta in the form of Andra, as that of a minor demon and that not in the earliar **Gathas** but in the latter **Vendidad** and even there, the passage where it occurs is omitted in two of the oldest manuscripts (Haug: Essays on the Paris p. 272). These facts clearly point to the conclusion that Indra was an Indian God who was not known on the Bactrian plateau and come to be known to the writers of the Vendidad as a foreign god to whom no great honour was due. The theory that the separation of the speakers of the Vedic and the Zend dialects was due to the acceptance by the former of Indra as the chief god, has no shred of evidence to support it. Possibly future research will discover the root from which the name Indra is derived and it will perhaps prove to be a Dravidian root."

అని వ్రాసియున్నారు. అనఁగా, అతనిపేరు సహా "ఆంద్ర" అనురూపముతో ఒకపిన్న దయ్యముగా 'అవేస్తా'లో రెండుసారులు పేర్కొనఁబడినది. అదియును ప్రాచీనగాథ లలో గాక కడపటి 'వెండిడాడ్'లో పేర్కొనఁ బడినదిగాని యచటనైనను నాపే రాప్రాచీన లిఖితపత్రములలో రెండిట నదృశ్యమై యున్నది.

ఈ విషయములు, ఇంద్రుఁడు బాక్ట్రియా పీఠభూములలోఁ దెలియఁబడక, "వెండి డాడ్" వ్రాసినవారికి నెక్కువ గౌరవములేని విజాతీయదేవుఁడుగఁ మాత్రముఁ దెలిసికొనఁ బడిన హిందూదేవుఁడయినట్లు సిద్ధాంత మగు చున్నదని స్పష్టముగా సూచించు చున్నవి. వైదికభాషావిదులు ఇంద్రుని ముఖ్యదేవునిగ నంగీకరించుటచేతనే జెండూభాషల మాట్లా డువారితో వేఱుపడవలసివచ్చినదను సిద్ధాంత మును బలపఱచుటకు రవంతయిన సాక్ష్యము గానరాదు. భావిపరిశోధనమునలన ఇంద్ర శబ్దముయొక్క వ్యుత్పత్తి అనఁగా నెందుండి యదిపుట్టినదో తెలిసికొనుట సాధ్యము కావ

చ్చును. బహుశః ద్రావిడశబ్దమునుండియె పుట్టి నటుల ఋజువయినఁ గావచ్చును."

వీరి యభిప్రాయము ప్రత్యేక వ్యాసమున విమర్శింపవలసిన దగుటచేత నేడు నిలిపి ప్రస్తుత విషయమునకుఁ గడంగుచున్నాను. ఇంత వఱకు చదువరులు తెలిసికొన్నది ఆంధ్రశబ్దము ప్రాచీన పారశీకుల వేదములో నుండుటచేత "ఆంధ్ర"శబ్దము భరతఖండమునుదాటి ఇరాన్ దేశమున కేగఁ బ్రాకినదని. దీని జ్ఞప్తియం దుంచుకొనుఁడు. శాక్యులు, లిచ్ఛవీలు వ్రాత్య క్షత్రియులని మన్వాదులు వచించుటకుఁ గారణము కూడఁ దెలిసినది. ఇప్పుడు బ్రాహ్మణ స్త్రీకిని శూద్రునకుఁ బుట్టినవాఁడును, కర్మ చండాలునకు వైదేహక స్త్రీకిని బుట్టిన వాఁడును, సగోత్రస్త్రీని వివాహము చేసి కొన్నవాఁడును చండాలురని చెప్పుటకును గారణము తేటతెల్లమయినదిగదా! ఒకప్పుడు సదాచారములుగఁ బరిగణింపఁ బడుచున్న ప్రాచీనాచారములను సంఘసంస్కరణ పరాయణులగు మన్వాదులు తమతమ ధర్మశాస్త్రములలో దూషింపుచుండిరని మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. కారణమేమి? వారికాలము నాఁటి కయ్యవి దూష్యములుగఁ బరిగణింపఁబడుటయె. లోకపరిణామ చరిత్రమునం దొకప్పుడు సదాచారములుగ నుండునవి మఱియొకప్పు డయ్యవి దురాచారములుగాఁ బరిగణింపఁబడి నిషేధింపఁ బడుట సామాన్యవిషయమె. ఒకప్పుడు స్త్రీలు సర్వ తంత్రస్వతంత్రలై వివాహబంధములు సరిగా లేక భర్తలకుగాని బంధువులకుగాని లోఁబడిన వారు గాక స్వేచ్ఛావిహారిణులై వర్తించు చుండిరని పూర్వగ్రంథములు సాక్ష్యమిచ్చు చున్నవి. అయ్యవి యిప్పుడు మనకు దూష్యముగఁ గన్పట్టు ననుటకు సందియము లేదు. పూర్వకాలమునందు స్త్రీలు గృహములలో నుండక భర్తలయొక్కయుఁ బంధువుల యొక్కయు పోష్యములో నుండక స్వేచ్ఛా విహారిణులై కామభోగాసక్తలై యుండిరనియు, అట్లుండుట పాపముగాఁ దలంపఁబడు చుండలేదనియు, అట్టి విప్లవానికి నుత్తరకురు భూములం దుండెననియు, తనతండ్రి యెదుటనే తనతల్లిని గొనిపోవు బ్రాహ్మణుని ఉద్దాలక ఋషిపుత్త్రుఁ డయిన శ్వేతకేతువు కన్నులారఁ గాంచి నాటినుండి యా దురాచారములు పోవునటులు శపించి శాసించెనని పాండుమహారాజు కుంతీదేవితో నీ క్రింది శ్లోకములలోఁ జెప్పెను:

'అథా త్విదం ప్రవక్ష్యామి ధర్మతత్త్వం నిబోధ మే
పురాణం ఋషిభి ర్దృష్టం ధర్మవిద్భి ర్మహాత్మభిః
అనావృతాః కిల పురా స్త్రియ ఆసన్ వరాననే!
కామచారవిహారిణ్యః స్వతంత్రా శ్చారుహాసిని!
తాసాంవ్యుచ్చరమాణానాం కౌమారా త్సుభగే!పతీన్
నధర్మోఽభూ ద్వరారోహే!సహిధర్మః పురాభవత్.
తం చైవ ధర్మం పౌరాణం తిర్యగ్యోనిగతాః ప్రజాః
అద్యా ప్యనువిధీయంతే కామక్రోధవివర్జితాః,
ప్రమాణదృష్టో ధర్మోఽయం పూజ్యతే చ మహర్షిభిః
ఉత్తరేషు చ రంభోరు! కురు ష్వద్యాపిపూజ్యతే,
స్త్రీణా మనుగ్రహకరః సహిధర్మః సనాతనః.
అస్మిం స్తు లోకే న చిరా న్మర్యాదేయం శుచిస్మితే!
స్థాపితా యేన యస్మాచ్చ తన్మే విస్తరతః శృణు
బభూ వోద్దాలకో నామ మహర్షి రితి నః శ్రుతమ్
శ్వేతకేతురితి ఖ్యాతః పుత్ర స్తస్యాభవ న్మునిః,
మర్యాదేయం కృతా తేన ధర్మ్యా వై శ్వేతకేతునా

"కోపాత్కమలపత్రాక్షి ! యదర్థం తం నిబోధ మే
శ్వేతకేతోః కిల పురా సమక్షం మాతరం పితుః
జగ్రాహ బ్రాహ్మణః పాదౌ గచ్ఛావ ఇతి చా బ్రవీత్
ఋషిపుత్ర స్తతః కోపం చకా రామర్షచోదితః
మాతరం తాం తథా దృష్ట్వా నీయమానాం బలాదివ
క్రుద్ధం తం తు పితా దృష్ట్వా శ్వేతకేతు రువాచ హ
మాతాత! కోపం కార్షీ స్త్వం ఏష ధర్మ స్సనాతనః
అనావృతా హి సర్వేషాం వర్ణానా మంగనా భువి
యథా గావః స్థితా స్తాత! స్వేస్వే వర్ణే తథా ప్రజాః
ఋషిపుత్రో తతం ధర్మం శ్వేతకేతు ర్నచక్షమే
చకార చైవ మర్యాదా మిమాం స్త్రీపుంసయోః రితి."

ప్రాచీనకాలమునందలి యిట్టి దురాచారముల మనస్సులం దుంచుకొని మన్వాదులు తెలిసి కొంతయుఁ దెలియక కొంతయు నూహలపై నూహల నల్లి యేమేమో వ్రాసిరి. ఏమైన సాంకర్యమున్నచోఁ బైనుదాహరించినవానిం బట్టి యీ సాంకర్యము సమస్తవర్ణములకుం బట్టును. అదియనుగాక యీ వర్ణసాంకర్య వృత్తాంతము వర్ణధర్మము లేర్పడుటకు ముందెన్నఁడో జరిగినదియై యుండవలయును. ఉత్తరకురుభూములు, ఉత్తరమద్రభూములలో సత్పరిపాలన ముండెననియు, ఉత్తరకురుభూములు దేవతాస్థానములుగ నుండి మనుష్యమాత్రులకు జుగుంప సాధ్యము గాక యుండెననియు నైతరేయ బ్రాహ్మణములోని యీ క్రింది వాక్యములవలన బోధపడఁగదు.

"యదా బ్రాహ్మణ ఉత్తరకురూన్ జయేయం అథ త్వం ఉహ ఏవ పృథివ్యై రాజా స్యా స్సేనాపతి రేవ తే హం స్యామితి స్తహోవాచ వసిష్ఠ స్సాత్యహవ్యో దేవక్షేత్రం వై తన్ నవై తన్ మర్త్యో జేతు మర్హ త్యద్రుక్షోమే ఏత ఇదం దదా ఇతి."

ఉత్తరకురుభూములు, ఉత్తరమద్రభూములు నైరాజ్యములుగ నుండెననియు, నయ్యవి హిమాలయమునకు దూరముగా నుత్తరభాగమున నుండెననియు నైతరేయ బ్రాహ్మణములోని యీ క్రిందిభాగములవలన దెలియుచున్నది.

"తస్మాత్ ఏతస్యా ముదీచ్యాం దిశి. యేకే చ పరేణ హిమవంతమ్ జనపదాః ఉత్తరకురవః ఉత్తరమద్రా ఇతి వైరాజ్యాయా ఏవ తే ఒభిషిచ్యంతే."

ఎప్పుడో పైయుత్తరకురుభూములనుండి కురుపాంచాలురు వసులతోడను ఉశీనరులతోడను గంగాతీరమునకు వచ్చి రాజ్యమును స్థాపించి రాజులను బిరుదములను గాంచిరని యైతరేయ బ్రాహ్మణములోని:—

"యే యే చ కురుపాంచాలానాం రాజానః స వశోశీనరానాం రాజ్యా యైవ తే ఒభిషిచ్యంతే, రాజేత్యేనాన్ అభిషిక్తాన్ ఆచక్షతా."

అను వాక్యములవలన బోధపడుచున్నది. ఇఁక మనము వీరికిని శాక్యులకు లిచ్ఛవీలకు నెట్టిసంబంధముగలదో వానింగూడఁ దెలిసికొనవలయును. సార్వచక్రవర్తియైన చంద్రగుప్తుని మగధసింహాసనముపైఁ గూరుచుండఁ బెట్టిన విష్ణుగుప్తుఁడను చాణక్యుఁడు వ్రాసిన యర్థశాస్త్రమునందు:—

"లిచ్ఛివికా వృజికా మల్లకా మద్రకా కుకుర కురు పాంచాలాదయో రాజశబ్దోపజీవినః"

అని చెప్పియున్నాఁడు. పై చెప్పఁబడిన కులములు తమ్ముఁ దాము పరిపాలించుకొను చిన్నసంఘములుగా నుండి రాజశబ్ద బిరుదముతో నొప్పుచున్నవని తాత్పర్యము. అనఁగా నీ సంఘములోఁ జేరిన ప్రతిసభ్యునకు రాజను బిరుదము కలదనుట. కనుకనే వీరు క్షత్రియులుగాఁ బరిగణింపఁబడుచుండిరి. ఈ సంఘముల

వారు భిన్నకాలములందు భిన్నమతము లవలంబించిరి. వీరిలో వీరికి స్పర్థలు మతభేదములచేత బెఱిగినవి. కొందఱు వైదికమతమును, కొందఱు శైవశాక్తేయాదిమతములను; మఱి కొందఱు జైన బౌద్ధమతములను, ఈమతముల వారే యిటీవలకాలమున వైష్ణవమతములను, వైదికమతములనవలంబించియాయామతముల నధమావస్థనుండి యుత్తమావస్థకుఁ దెచ్చి దేశముయొక్కయు, సంఘములయొక్కయుఁ బురోభివృద్ధికిని, నాగరికతాభివృద్ధికిని, రసజ్ఞతాభివృద్ధికిని నెంతో తోడ్పడిరి. సంఘములలో పరస్పరస్పర్థలవలన తత్త్వజిజ్ఞాస బలపడి శాఖోపశాఖలతో విస్తరించినది. మనము వీని తత్త్వమునంతయు సహనబుద్ధిగలిగి గ్రహించినఁగాని వారికివారికి నుండు భేదములసంప్రదాయ చరిత్రములు బోధపడవు. వానిం దెలిసికొన్నఁగాని మనలో మన కైకమత్యము కలుగఁజాలదు.

# కాకమ్మ

మునిమాణిక్యం నరసింహరావు గారు, బి. ఏ., (సాహితీసమితిసభ్యుఁడు)

వరలక్ష్మి మాటలు వరహాల మూట
కన్నతల్లీ చూపు కనకాల మెఱుపు
బుల్లెమ్మ నిలువెల్ల బంగారు కొండ
బువ్వనూ తినవమ్మ బొజ్జ నిండాను!
మామయ్య తెస్తాడు మల్లె మొగ్గల్లు
అత్తయ్య తెస్తుంది ముత్యాల పేరు
బాబాయి తెస్తాడు బంతి పువ్వల్లు
పట్టుకుచ్చు జెల్లో పెట్టుకో వచ్చు.
కాకమ్మ, కాకమ్మ, గంతేసి చెప్పు!
వరలక్ష్మి మామయ్య వస్తాడ రాడ
తెల్లటీ పరికిణ తెస్తాడ తేడ?

* * * *

మావూరు నుంచిమా మామయ్య వస్తే
తెల్లటీ పరికిణ నే కట్టుకొంటా.
అక్కయ్యతో గూడ నేనాడు కొంటా,
కాకమ్మ కాళ్లకు గజ్జ గట్టిస్తా.
గజ్జ ఘల్లుమనగ గంతేసి చెప్పు,
కాకమ్మ నీబిడ్డ కుగ్గు పోయిస్తా!
కాలెత్తి ఘల్లున గంతొక్క టెయ్యి!
వరహాల గంతునీ వొక్కటీ వేస్తే
ఘల్లున నీవొక్క గంతూను వేస్తే
వరలక్ష్మి మోమున వెన్నెలా గాయు
మెల్లగా నవ్వితే ముత్యాలు గారు
కిలకిల నవ్వితే కెంపులు జారు
పకపక నవ్వితే పగడాల తీరు.

* * * *

తోలకే కాకిని తోడుగా నేను
గంతూకు వంతుగా గంతు వేస్తాను;
కాళ్లను గజ్జెలు ఘల్లు మంటాయి
అమ్మకు వళ్లంతా ఝల్లు మంటుంది.

# సుశీలా రూపసులు

పారనంది జగన్నాథస్వామి గారు, ఎం. ఏ. ఎల్. టి.

మదనుడు — రూపసి (సుశీల వదిన; అన్న భార్య; విధవ) — చిన్నపిల్ల (సుశీల చెల్లెలు) — తాతమ్మ (సుశీల తల్లితల్లి) — శిథిలమగుచున్న ఒక ద్వీపస్తంభం; దాని గోపురము.
సుశీల

[గదిలో ఒకమూల తాతమ్మ ఒక ఎత్తైన కుర్చీలో నిద్రపోవుచున్నది. సుశీల మదనుల ప్రవేశము]

## అంకము ౧

మదనుడు:— రూపసి వ్రాసిన ఉత్తరము చదివి వినిపిస్తాను. విను. "నన్ను కలియాలని బయలుదేరి రావద్దు. నీ వేగదిలో సాయంకాలము వేళ మామూలుగా ఉంటావో, అక్కడనే ఉండు:— అలాగైతే నేను రావడం చుట్టం వచ్చినట్లుండదు. నీవద్దకు రావడానికి ఎక్కిన పడవను దిగీ దిగడములో ఈ ఉత్తరము వ్రాస్తున్నాను. ఇక్కడ అంతా నెమ్మదిగాను చూపుకింపుగాను ఉన్నది; కాని రోడ్లు మాత్రము వర్షపు నీటితోనిండియున్నవి. ఏలోగిల్లో నామరదలు సుశీల నాకొరకు చక్కని బస యేర్పాటుచేసిందో, ఆ యింటి ఉద్యానవనములో ఒక కొసను ఉన్న ఒంటి స్తంభ గోపురములు నాకు అగుపడేసరికి సూర్యుడు బహుశః అస్తమిస్తాడు."

సుశీల:— (చప్పట్లు కొట్టుతూ) ఆ! అదిగో సూర్యుడు అస్తమిస్తున్నాడే! ...... చూడు, చూడు...... అందుచేత ఆమె చాలాదగ్గిరికి వచ్చి యుండవలెను...... నేను చూతునా......

మదనుడు:— [ఆగమని చేతితో సంజ్ఞ చేసి, ఉత్తరమును కడతేరా చదవసాగెను] "మదనా, నిన్నొకమారే చూచాను. అదెప్పుడో జ్ఞాపకమున్నదా! నా వివాహము గడబిడలలో— నా వివాహమా! చాలు...... ఎవరూ పిలవకపోయినా వచ్చి, అందరూ కోరే సౌఖ్యమును తొలగింపజేసే అతిథిని ఎవరూ ఆ వివాహసమయములో చూడము. ఆ ఒక్కమారే నిన్ను చూచాను. చూచి మూడేండ్లైనది. అయినప్పటికీ చిన్నప్పటి నుండీ ఒక్క ఉయ్యాలలో నిద్రబోతూ కలిసి మెలిసి ఉండేవారు ఎంత చనువుతో ఒకరి దగ్గిరికి ఒకరు పోగలరో, అంత చనువుగా నీ వద్దకు నేను వస్తున్నాను..."

సుశీల:—(ప్రక్కకు తిరిగిచూచి) ఆహా! తాతమ్మ ఇంకా నిద్రబోతూ ఉన్నదే! ...... రూపసిరాగానే తాతమ్మను లేపుదామా?...

మదనుడు:—లేపమనే ఆమెచెప్పింది...

సుశీల:— (తాతమ్మవైపు చూస్తూ) తెల్లనిజుత్తులోనుండి కండ్లు కనబడవు......ఈ రాత్రి కులాసాగా ఉన్నట్లు కనబడదు...... ఒక్కమారు రాణిను ముద్దాడవలెనని ఉన్నది.

మదనుడు:— జాగ్రత్త. ఇంత వేగిరముగా లేపకు. [తిరిగి చదవసాగెను.] "నీదగ్గిరికి వస్తున్నాను; నీవు నన్ను సుహృద్భావముతోనే పలకరిస్తావని నాకు తెలుసును...కొంచెమే మనము మాట్లాడేము. కొంచమైనా, ఇతరులు మాట్లాడే మాటల వంటివి కావు మనమాటలు"......

సుశీల:— అంతతొందరగా చదవవద్దు.

మదనుడు:— "అంతేకాదు. సుశీలను కౌగలించుకోవలెనని ఉన్నది.......నిన్నామె ప్రేమించడముచేతను, నీవామెను ప్రేమించడముచేతను నేను ఒకటి ఊహిస్తున్నాను. ఆమె మంచి మనిషి, సుందరి కావలసి ఉంటుంది. నీకంటె ఎక్కువగా ఆమెను నేను ప్రేమిస్తానని అనుకొంటున్నాను: ఎందుచేతనంటే, ఎక్కువ ప్రేమను చూపుట నాకు తెలుసును. నాకు సౌఖ్యము లేకపోయిందిగదా... నాకు కష్టము వచ్చినందుకు ఇప్పుడు సంతోషిస్తున్నాను; దుఃఖమువల్ల నాకు ప్రాప్తించిన సర్వమును నీకు పంచిపెట్టగలను. నాకు ప్రాప్తించినది మన ముగ్గిరికి సరిపడవచ్చునని నే నప్పుడప్పుడు తలస్తూవుంటాను. దురదృష్టము మనలను బాధించడానికి ఏమీ హక్కు లేదనిన్నీ, ఇకముందు మనజీవితమంతా క్రొత్తగా ఉండవచ్చుననిన్నీ, నేను తలస్తున్నాను. ఆనందము కొరకు మనము ప్రయత్నింతాము. మనలను, మన పరిసరములను సౌందర్యముతో నింపి, దుఃఖమునకు ఎట్టి అవకాశమూ లేకుండా ఉండేటట్లు చేదాము. అప్పటికీ అది బలత్కారముగా దారిచేసికొని రాగలిగితే, మనలను చేరే లోపల అదికూడా సౌందర్యముతో నిండేటట్లు పరిణమించును."

[తలుపు తెరుచుకొని చిన్నపిల్ల ప్రవేశించును]

చిన్నపిల్ల:— అక్కయ్యా, దొరికిందే తాళంచెవి, దొరికిందే.

మదనుడు:— ఏమిచెవి?

సుశీల:— గోపురద్వారం తాళంచెవి.

మదనుడు :—పోయిందనుకొన్నామే...

సుశీల:—మరొకటి చేయించాను.

మదనుడు:— అదికూడా పోతే ఎంత బాగుంటుంది!

సుశీల:—[తాళంచెవి ఇటు అటుత్రిప్పి చూచి] ఎంత పెద్దచెవి.....పోయిన దానివలె లేదే......

చిన్నపిల్ల:— చిన్నక్కా! తాళానికి ఈచెవి సరిపడుతుందోలేదో అని వాళ్లు పరీక్షచేసి చూచినపుడు నేనక్కడ ఉన్నాను. తాళం వేసి తీసి మూడుసార్లు చూచారు. తుప్పుపట్టిపోయిన ఆచెవికంటె ఇదేబాగుంది. ......కడసారి మాత్రము తలుపు వేయడము కష్టమైనది; పెద్దగాలివేసి, తలుపు పడ్డాది కాదు......ఈరాత్రి గాలి హెచ్చుగా ఉంది. గోపురముచుట్టూ ఎగురుతూ ఉన్న సముద్రపు కాకులధ్వని వినబడలేదు......అవి ఇంకా నిద్రపోలేదు.

సుశీల:—నాకోరకవి ఎదురు చూస్తున్నవి; నన్ను చూచి చాలా రోజులైంది... రేపు వెళ్తాను.

చిన్నపిల్ల:—నన్ను తీసికొని వెళ్లవూ?

సుశీల:—నీ విప్పుడు వెంటనే పరుంటే ఆలాగే తీసికొని వెళ్తాను. నీకొరకు దాధి కని పెట్టుకొని ఉన్నది... [చిన్నపిల్ల వెళ్లినది.] ఆమె చక్కనిదేనా?...

మదనుడు:—ఎవరు?

సుశీల:—రూపసి.

మదనుడు:—ఆ. రూపసే.

సుశీల:— ఎవరివలె ఉంటుంది?

మదనుడు:— ఎవరివలె ఉండదు... ఆమెసౌందర్యము వేరు. అంతే నేను చెప్ప గలిగేది... వింతగాను, దివ్యముగాను ఉం టుంది. ఎప్పుడూ ఒక్కలాగే ఉండదు; వేరు వేరు రీతులు ఉంటూ ఉంటుందని చెప్పవచ్చు నేమో... ఆ సౌందర్యమును అనుసరిస్తే ఆనం దమునకు ఎట్టి ఆటంకమూ ఉండదని చెప్ప గలను...

సుశీల:—నేను చక్కనిదానను కానని నాకు తెలుసును.

మదనుడు:— ఆమె ఇక్కడకు వచ్చిన తరువాత నీ వాలాగున భావించవు. ఆమె యెదుట నమ్మదగనిది, ఉపయోగం లేనిది ఎవరూ చెప్పలేరు. సత్యం కానిదేదీ ఆమె ఉన్నచోట ఉండలేదు.

సుశీల:— సత్యంకానిదేదీ ఆమె ఉన్న చోట ఉండలేదు...

మదనుడు:— సుశీలా?

సుశీల:— మదనా?

మదనుడు:—మనము కలిసిఉండి నాల్గు సంవత్సరములైనదికదూ.

సుశీల:— ఈ వేసవి ఆఖరికి నాల్గో సంవత్సరము పూర్తి అగుతుంది.

మదనుడు:— ఈ నాల్గుసంవత్సరములు నాతో కలిసి ఎల్లప్పుడూ సొగసుగాను, మనో హరముగాను, అనురాగముతోను ఉంటూ ఉంటివి. నీ పెదవులను ప్రకాశింప జేయు చుండే నీ ముద్దునవ్వు నీ ఆత్మను నింపి యున్న ఆనందమును వ్యక్తపరుస్తూ ఉండెను... ఈ నాల్గేండ్లలో ఎప్పుడైనా నీకంట నీరు ఒల్కినదేమో చెప్పుమా! ఎప్పుడైనా ఒక వేళ రెండుబొట్లు జారిపడ్డా, అందుకు కార ణము నీ పెంపుడు చిలుక పారిపోయిందనో, లేక తాతమ్మ కొంచము కోపముపడినదనో, లేకపోతే నీవు పెంచుతూవున్న సన్నజాజులు వాడిపోయినవనో అనికదా. అందుచేత ఆ పిట్ట గూటికిరాగానే, నీ తాతమ్మ ముద్దిడ గానే, నీవు నవ్వుతూ, పాడుతూ గదిలోనికి పరుగెత్తివచ్చి, బడినుండి ఇంటికివచ్చు చిన్న పిల్లవలె ముద్దాడుతూ నా ఒడిలో ఆడుచుండే దానవు. ఎందుకు ఇదంతా, మనము సుఖ దాంపత్యము గడపుచుంటిమని చెప్పవచ్చును. ఆలాగైనప్పటికి మనము ఉండవలసినంత సన్నిహితులుగా ఉంటిమా అనేశంక అప్పు డప్పుడు నా మనస్సున పొడముచుండెను. నిన్ను అనుసరింప నాకు ఓర్మి లేకుండెనో లేక నీవు అతివేగముతో ముందుకు పరుగెత్తి పోవుచుంటివో నాకు తెలియదు. ఇప్పుడు మాట్లాడుతూ ఉన్నట్లు ఎప్పుడైనా నీకు నా మనస్సులో ఉన్నదంతా చెప్పవలె నని ఉద్దేశించి మాట్లాడడము ప్రారంభించగానే,

నాకు అవగాహనకాని యేవో కారణముల చేత కాబోలు మరొకలోకమునుండి మా ట్లాడునట్లు ప్రత్యుత్తర మిచ్చుచుంటివి...... ఈ సాయంకాల మెందుకు ఇంతస్ఫుటముగా ఈ భావము నాకు ఉదయించవలెనో నాకు తెలియదు.

రూపసిమాట నాకు బాగా జ్ఞప్తిని ఉం డుటచేతనా? ఆమె వ్రాసిన ఉత్తరమువల్ల ఆమె వచ్చినదన్న వార్తవల్ల మన ఆత్మప్ర వాహమునకుండే అడ్డు కొట్టుకోపోయినదా? మనము పరస్పరమూ చూపగల్గే ప్రేమనంతా చూపినామా అని తోస్తున్నది. ఆమె ఇక్క డికి వచ్చినతరువాత అధికముగా మనము ఒకరిపై ఒకరు ప్రేమ జూపగలము. మన ప్రేమలో మార్పు, ఒకవిధమైన గాంభీర్యము, రావచ్చును.—ఆ సంగతి నీకుకూడా తెలు స్తుందికదా...

సుశీల:— ఆలాగైతే నీవు ఆమెపై అనురాగము కల్గిఉండు. నేను వెళ్లిపోతాను...

మదనుడు:— సుశీల!

సుశీల:— నాకేమీ అర్థముకాలేదు.

మదనుడు:— నీ క ర్థ ము కా కే మి సుశీలా? తెలియలేదని నీవు అన్నా నీకు తెలు స్తుందని నాకు తోచబట్టే, నీతో ఈ సంగ తులగురించి మాట్లాడుతున్నాను. నీ హృద యముయొక్క లోతును ఎప్పుడూ అందు నీనువు నలేకదా, దానిని కప్పిపెట్టిఉంచుట నీకు చాలాసరదా... అరే, ఎందుకు ఏడు స్తున్నావు? సుశీలా, నిన్నేమీ అనలేదే...

సుశీల:—నేను ఏడ్వలేదు. ఎందు కేడ్వ వలెను?

మదనుడు:— చూడు, నీపెదవు లెట్లు వణుకుచున్నవో, చూడు......

సుశీల:— నా ఆలోచనలు నన్నువిడిచి చాలా దూరమున ఉన్నవి... ఆమెకు సౌ ఖ్యము లేదన్నమాట నిజమేనా?

మదనుడు:— అవును నీ అన్నవల్ల ఆమెకు సౌఖ్యము లేకుండెను.

సుశీల:— బహుశః, ఆమె అందుకు తగియుండలేదు కాబోలు...

మదనుడు:— అబల, దుఃఖముపాలు అగుటకు తగియుంటుందని నేను అనుకోను.

సుశీల:—నా అన్న ఏమిటి చేసేవాడు?

మదనుడు:— నీతో చెప్పవద్దని ఆమె నన్ను బ్రతిమాలుకొన్నది.

సుశీల:— మీ రిద్దరూ ఉత్తర ప్రత్యు త్తరములను వ్రాసుకొంటూ ఉంటారా?

మదనుడు:— అప్పుడప్పుడు.

సుశీల:— నీ వెప్పుడూ చెప్పలేదే.

మదనుడు:— నీ కెన్నోమార్లు చూ పేను. కాని నీకు చూడాలని లేకుండెను.

సుశీల:— నాకు జ్ఞాపకమే లేదు.

మదనుడు:— నాకుమాత్రము బాగా జ్ఞప్తిలో ఉన్నది.

సుశీల:— ఆఖరిమారు ఆమెను ఎక్కడ చూశావు?

మదనుడు:— ఒక్కమారే చూచానని చెప్పేనుకానూ. నీ అన్నయ్యఇంటి ఉద్యాన

ములో చూచాను. మాచుట్టూ విస్తరించి ఉన్న పెద్ద పెద్ద వృక్షములతోను...

సుశీల:— సాయంకాలమప్పుడా?

మదనుడు:— ఆ!

సుశీల:— ఆమె యేమి చెప్పింది?

మదనుడు:— మేము మాట్లాడినవి చాలా తక్కువ. కాని మా ఇద్దరి జీవితములకు ఒకే ఆదర్శము ఉన్నట్లు మేము పోల్చుకోగలిగేము.

సుశీల:—ముద్దాడుకొన్నారా?

మదనుడు:— ఎప్పుడు?

సుశీల:— ఆసాయంకాలము.

మదనుడు:— అప్రను. నేను వెళ్లిపోతున్నప్పుడు.

సుశీల:— ఆ! ఆలాగా!

మదనుడు:— సుశీలా! ఆమె కొద్ది రోజులే మనతో కలిసి ఉంటుందని అనుకొంటాను.

సుశీల:—ఆలాగుకాదు. ఆలాగుకాదు; ఆమె ఇక్కడ ఉండాలనే నాకోరిక...... [బయట చప్పుడు] అదిగో, అంగణములో లాంతరువెలుతురు.

[నిశ్శబ్దము. వీధిద్వారం తలుపు తెరిచారు. రూపసిప్రవేశించును. ఒక్కమాటైనా ఆడకుండా దగ్గిరగా వచ్చి, సుశీలను తేరిపార చూస్తూ, నిలుచుండెను.]

మదనుడు:—ఏమీ! ముద్దాడుకోరూ?

రూపసి:— తప్పకుండా. [సుశీల అధరములను నొక్కి ముద్దుపెట్టుకొని, మదనుని సమీపించి, అతనినికూడా ఆలాగే ముద్దాడును.] మరి, నీవో.........

సుశీల:— నేను తాతమ్మను లేపాలి.

రూపసి:— (తాతమ్మను చూస్తూ)ఏమి గాఢముగా నిద్రపోతున్నది!

మదనుడు:— గంటలకొద్ది ప్రతీరోజూ ఈలాగే నిద్రపోతుంది...... ఆమెచేతులకు వాతము తగిలింది......దగ్గిరగా వెళ్లుదూ; ఈరాత్రి చూడాలని అన్నది.

రూపసి:— [తాతమ్మ చెయ్యిమీద చెయ్యివేసి, మెల్లగావంగి] తాతమ్మా!

తాతమ్మ:—(తెలివితెచ్చుకొని) సుశీల! (కళ్లు తెరిచి చూచి) ఆ, నీవెవరు?

రూపసి:— రూపసిని......

తాతమ్మ:—అబ్బా, తులుక్కుపడ్డాను.

రూపసి:— ముద్దివ్వవూ, తాతమ్మా.

తాతమ్మ:— నీకు తాతమ్మనా నేను? భాగా కనబడలేదు నీవెవరో...నీవెనక ఎవరు వారు?

సుశీల:— (ముందుకు వచ్చి) నేను, తాతమ్మా.

తాతమ్మ:— ఆ! నీవా, సుశీలవా... నీవు అగుపడ్డావుకావు......దీపము కొంచము దగ్గిరగా తెమ్మా పిల్లా......

[సుశీల దీపము తెచ్చింది. వెలుతురు రూపసిపై పడగానే, రూపసిని చూచి]...... ఓహో, నీవు రూపసివే!......

రూపసి:— ముద్దివ్వవూ, తాతమ్మా!

తాతమ్మ:— అబ్బా వద్దు. ఈరాత్రి నన్ను ముద్దు పెట్టుకొనవద్దు. మామూలు

కంటె బాధ ఎక్కువగా ఉంది. ఆయాసము ఎక్కువ కాకుండా నన్ను ముద్దు పెట్టుకొన గలిగేది ఒక్క సుశీలే.

రూపసి:— నా కది నేర్చుకోవాలని ఉన్నది. ఆయాసము ఎక్కువ కాకుండా ఉండేటట్లు ముట్టుకోవడము ఏలాగో నాకు నేర్చుకోవాలని ఉంది......

తాతమ్మ:— సుశీలా, తిరిగి నిద్ర రాక ముందే ఒక్కముద్దుపెట్టుకొని దీపము దూరంగా తీసుకోపో. ఒక చిత్రమైన కలలో తెలివి వచ్చింది.

సుశీల:—(దీపము తీసుకోపోతూ) తప్పు పట్టుకోకుమీ. ఆమెకు ఆయాసము అధికముగా ఉంటుంది.

రూపసి:— తప్పు కేముంది ఇప్పుడు, సుశీల? ఏదో జారిపోయింది......ఏమిటిది నేల మీద పడ్డది? (తీసిచూచి) ఏమిచిత్రంగా ఉంది ఈతాళంచెవి!

సుశీల:— నాగోపురద్వారం తాళం చెవి ఇది. దానిలో తాళం తీసిచూస్తే ఏమి కనబడుతుందో నీకు తెలియదు.

రూపసి:— ఎంత చిత్రంగా ఉంది. ఎంత బరువుగా ఉంది..... నే నొక బంగారం తాళం చెవిని తెచ్చాను. నీవు చూడుగాని...... చెవి కంటె చిత్రమైన వస్తువు మరేదిన్నీ లేదు సుమా; అది తెరిచిచూపేదేమిటో తెలియ నంతవరకు, దానంతచిత్రమైంది మరొకటి లేదు.

సుశీల:— రేపు తెలుస్తుంది నీకు...... నీవు వస్తున్నప్పుడు నీకు అగుపడే ఉంటుంది; నీ ఇంటి ఉద్యానము చివరికి పాడవుతూ పాడవుతూ ఉన్న గోపురము నీకు కనబడ్డదా?

రూపసి:— ఆ, చూచాను. ఆకాశము నకు తగులుతున్నదా అన్నట్లు అగుపడ్డది.శిథిలమై పోతున్న దే. దాని గోడల పగుళ్లలోనుండి నక్షత్రములు కనబడినవి.

సుశీల:— అదే. ఆ. అదే నాగోపురము... పూర్వ మొకప్పుడు పడవలకు దారి జూపే దీప స్తంభం అది. దానిమీదికి ఇప్పుడు ఎవరు వెళ్లరు. చాలా సేపు చుట్టూతిరుగుతూ మెట్ల దారిగుండా పోవలెను. దాని ద్వారం తలుపుతీసే తాళంచెవి నాకు దొరికింది. కాని ఆ వెంటనే పోయింది... మరొకటి చేయిం చాను; నే నెక్కడ్రినే అక్కడికి వెళ్లుతూ ఉంటాను. అప్పుడప్పుడు చిన్నపిల్లను తీసుకొని వెళ్తాను. మదనుడు ఒక్కమారే వెళ్లేడు. తలతిరిగిందట. అబ్బా చాలాఎత్తు నీవు చూడు గాని. ఎదుట సముద్రము. దాని గోడలచుట్టూ నురగపడుతూనే ఉంటుంది. సముద్రపు పక్షులన్నీ గోడల సందులలో గూళ్లుకట్టుకొని ఉంటవి నన్ను పోల్చి, అవన్నీ అరుస్తవి. వేల కొలది గువ్వపిట్టలు ఉన్నవి. వాటిని పార దోలాలని చాలా ప్రయత్నములు చేశారు. గానిఅవి పోవు...ఆయాసముగా ఉందాఏమిటి?

రూపసి:—కొంచము ఆయాసముగానే ఉంది సుశీలా. చాలాదూర ప్రయాణం చేశాను గదా...

సుశీల:— అవును అవును... రేపక్కడికి వెళ్దాము; అంతేకాకుండా ఈ రాత్రి విశేషముగా గాలి వీస్తున్నది. [నిశ్శబ్దము]

మదనుడు:—ఏమి టాచిత్రం? రూపసీ! నీతో చెప్పవలసిన దెంతో ఉంది... ఆరంభించగానే మొదటి కొన్ని నిమిషములవరకూ అంతా మౌనమే (నిశ్శబ్దమే). ఎందుకోసమో మనము కనిపెట్టుకొని ఉన్నామా అన్నట్లు నాకు తోస్తూఉంటుంది.

రూపసి:— ఆ నిశ్శబ్దమే * మాట్లాడాలని మనము కనిపెట్టుకొని ఉన్నాము.........

మదనుడు:—నీ కేమిటి చెప్పతున్నది ఆ నిశ్శబ్దము?

రూపసి:— అదిచెప్పతూ ఉన్నదంతా మళ్లా నేను చెప్పగల్గితే అది వాస్తవమైన నిశ్శబ్దమేకాదు ... కొన్నిమాటలనే, చక్కగా అర్థముకానిమాటలనే - ఎవరైనా సరే అనుకొనే మాటలనే- మనము మాట్లాడికొన్నాము. అయినప్పటికీ మనకు ఒకవిధమైన మనశ్శాంతి కలిగిందికాదా! ఆమాటలకు మించిన అర్థము మనకు స్ఫురించినట్లు మనకు తెలిసింది కాదా! బాగా పరిచయము లేనివారు కలుసుకొన్నప్పుడు అనుకొనే ము భా వ న మాటలే మనమూ అనుకొన్నాము; కాని మన ముగ్గురి హృదయములలోను ఉప్పొంగిన భావములన్నింటినీ ఎవడు వ్యక్తపరిచి చెప్పగలడు? అట్టి మాటలలోని ఏ ఒక్కమాట ద్వారానైనా ముందు రానున్నదంతా నిశ్చితము కాలేదని ఎవడైనా చెప్పగలడా?...... ఈ నిశ్శబ్దము నాకొక సంగతిని విశదపరిచినది. సుశీలను నాచెల్లెలిగా చూసుకొంటూ ఆమెపై ప్రేమ కలిగి పెట్టీపెట్టగానే నా ఆత్మద్వారా నాకు ఆలాగు ఒకధ్వని వినబడ్డది. అంతెందుకు —ఆధ్వని ఒక్కటే నాకు స్పష్టముగా వినబడ్డది...... [సుశీలను దగ్గరగా తీసుకొని] సుశీలా, ఎందుచేతనే ఎవరుపడి తేవారు నిన్నింత అనురాగముతో ప్రేమిస్తారు? నిన్ను ముద్దుపెట్టుకొంటే నీకంటను ఎందుకు ఈ బాష్పబిందువులు వాటి అంతట అవే ఒలుకుచుండును? [పెదవులను నొక్కుతూ చాలా సేపు సుశీలను ముద్దు పెట్టుకొని] మదనా, నిన్నుకూడా. [మదనునికూడా ఆలాగే ముద్దాడి] ఈ ముద్దుకొరకే కాబోలు మనమందరము కనిపెట్టుకొని ఉన్నాము. ఈరాత్రి మనము పాలించే మౌనమునకు ఈ ముద్దే తగిన ముద్ర.

(నిష్క్రమించును.)

(నిశ్శబ్దము అంటే ఏమిటి అని చర్చచేయవచ్చును. రూపసియొక్క మాటలను జాగ్రత్తగా పరీక్షించినచో నిశ్శబ్దము సాధారణార్థములో ఉపయోగించలేదని తేలుతుంది. కొంతవరకు మోసమునకు పర్యాయముగా ఈ మాటను ఉపయోగించినట్లు లెట్టవచ్చును. ఇంగ్లీషులోని silence కు తగిన మాటగా దానిని నేను వాడినాను. కవి ఆ ఇంగ్లీషు పదమువలన ఏమిటి సూచించవలచెనో నేను సరిగా చెప్పలేను. మాట్లాడుతూ ఉన్న ఇద్దరికిన్నీ బాహ్యమైన మరొకచేతనపదార్థముగ దీనిని భావించి, ఆస్వరగతమైయున్న దానిలో వీరున్నట్లున్నూ, దాని కదలికలచేత వీరి ఆత్మలలోకూడా కదలిక పుట్టుచున్నట్లున్నూ, కవి భావనచేసినాడా అని నాకు తోచుచున్నది. అట్టి గూఢార్థము ఇక్కడ ఉన్నదని నేను ఆలోచించి, నిశ్శబ్దమని తర్జుమాచేసినాను. రూపసి మదనుల మనస్సులలో ఉన్న భావములను వ్యక్తపరచలేకుండ ఉన్న అవస్థను నిశ్శబ్దమని పేరుపెట్టలేదని నావ్యాఖ్యానము.)

* అంకముయొక్క అంతమున ఉన్న వ్యాఖ్యానమును చూడవలెను.



# అవస్థాభేదము

బసవరాజు అప్పారావు గారు, బి. యే.,

లేమావిగుళ్ళ
మెక్కే పికమా!
లేక తిండి నీ
కేలనే?
పూవుల జాడల
బోయే హరిణీ!
ముళ్ళడొంక బో
నేటికే?

సురనదిజలముల
తూగే హంసీ!
మురికిగుంట జొర
నేలనే?
ఇంగిత మెరిగిన
మనసా! నీ కీ
యెంగిలియోచన
యేటికే?

---

# దోణిబిళ్ళాట

మాలే రాఘవరావు గారు

ఒక్క మధుమాసయామినిఁ ఱిక్కరేని
నిండుచెల్వంబు జగమెల్లఁ బిండియారఁ
బోసినట్టుల దిశల విభాసిలంగ,
మందగామియై పవనుండు మందిరాంగ
ణములనుండు జనంబుల నవయఁజేయఁ,
దాపసంతప్తదేహనై, తోపుచీర
వల్లెవాటొకవింత చెల్వం బొసంగ,
సురటిఁ జేఁబూని ననుడాయ, నిరువురమ్మ
నింటిచేరువ నున్నట్టి పంటకాల్వ
సైకతస్థలిఁ జేరి విశ్రాంతిఁ గొనుచు;
నాటలాడంగ మదివేడ్క యపుడువొడమ
నెదురుగదియంగఁ గూర్చుండి, ముదముమీఱ
దోణిబిళ్ళాట నాడంగ దొడరి, యందుఁ [అ
గోరి నేనోడిపోవంగఁ, గేరడంబుఁ
జేయుచు నిసుము నాదుకోసింటఁ బోసి,
కంచుకవిముక్తమైయొప్పు గబ్బిగుబ్బ
కవను వీపున మోవంగఁ గరములెత్తి
కన్నులనుమూసి, మెల్లనగదుముకొనుచుఁ,
గొంచుకొనిపోయిపోయి యాపంచనెటనొ
పారఁబోయింప, నందున్న పూరిపుడకఁ
బోవిడక జాగరూకతఁ బొదలి నేను
గుప్తముగ వ్రేళ్ళసందున గుదురుపఱుప,—
హస్తగతమైనయద్దాని నరయ కంత
నాటనాడిన నెలవ్రన కతిరయమున
దిరుగఁ దోత్తెచ్చి గిరగిరఁ ద్రిప్పి విడచి,
"దోణిబిళ్ళను గొనితెత్తువేని నిన్ను
మెత్తు" నని నీవు పల్క, "ఏమిత్తువబల!
కాలుఁగదపక యే నీదు కాంక్షితంబుఁ [దు
జూపుదును జూడుమిదె"యంచుఁ జూపనపు
మందహాసంబుతో "నీదుమాయలెల్ల
నెఱిఁగియును మోసపోయితి, నీవు బళిరె!
యింద్రజాలికుఁడ"వటంచు నెదను జేర్చి
ముద్దునొసఁగితి వయ్యది ముగుద! నేను
మఱువనేర్తునె వేయిజన్మములకేని?—

# మాణిక్యము

(ఒక చిన్న కథ)

రాయసము వేంకటశివుడు గారు, యం. ఏ. యల్. టి.

లోకులు నన్నుగుఱించి విపరీతముగఁ జెప్పుకొనిన నేమి? వారు పరిహసించినను పొగడ్తలు సలిపినను నాకొక్కటియే. నన్ను గుఱించిన సంగతులన్నియు వారికిఁ దెలియవు. కావుననె వా రీవిధముగ నావిషయమై యపోహములు పడుచున్నారు.

వసంతకాలమున లేతమామిడిపిందెల సువాసనలు నా కనుకొలుకుల నేల దుఃఖబాష్పములతో నింపవలయును? "ఇస్సీ, మనోహర మెంతటి పిఱికివాఁడు! అతనికి మల్లెమొగ్గలనిన నెంతో భయము!" అని బాలకులు సహితము నన్ను గేలిచేయఁజూచెదరు. ఇంకఁ బెద్దవారలకు నా బ్రహ్మచర్యము విపరీతపుచర్య. ఎంతయో నియమముతో నేఁ బూనిన దీక్ష వారు నిరర్థకమును ఛాందసమును ననుకొనుచున్నారు. కానిండు. వారితో నాకుఁ బని యేమి? పాఠకోత్తములారా! నాచిన్ననాఁటిసంగతి యొకటి మీకు వినిపించెదను. దానిని బట్టి మీరు సత్యమును గ్రహింతురుగాక!

### మా ప్రయాణము

పరీక్షలో గెలుపొంది, యుద్యోగమునఁ జేరనఁగాని నేను వివాహముసంగతి తలపెట్టనని చిన్ననాఁడు నియమము పూనితిని. ఎట్టకేలకు నాయుద్దేశము నెఱవేఱె పరీక్షలోఁ దేఱి, యుద్యోగమును స్వీకరించితిని. అంత నాకువచ్చిన వివాహపుసంబంధములను గొన్ని కన్నులారఁ జూచి మఱి పరిణయము గాఁ గోరి, నామిత్రుఁడు నేనును బయలుదేఱితిమి. ఆ సంవత్సరమున వసంతకాలమున నెండలు తీవ్రముగ నుండెను. పగటిపూఁటయం దధికముగఁ బ్రయాణముచేసి, వేళకు భోజన సదుపాయములు లేకపోవుటచేత, మే మిరువురముసు దేహస్వాస్థ్యము తప్పి, యొకానొక నాఁటియుదయకాలమున నొకగ్రామము చేరితిమి. అది కుగ్రామము. మిత్రుఁడును నేనును డస్సియుంటిమి. ఊరిలో నడుగఁగా, ఒకచోట మాకు బస చూపించిరి. ప్రయాసముతో మేము బండిదిగి, ఎట్టులో దేహముల నాయింటఁ జేర్చితిమి.

అది పూరిల్లు. ఐనను వాసస్సౌఖ్య మెఱిఁగినవారు కట్టినట్టిదిగఁ దోఁచెను. ఇంట నెవ్వరును లేరు. యజమానుఁడు ఉద్యోగపు కార్యములమీఁద నెచటికో పోయి యుండెను. స్త్రీలజాడయైనను గానిపింపలేదు. మా ప్రయాణములో భోజనవిచారణను గుఱించి స్నేహితుఁడే శ్రద్ధఁ బూనుచుండును. ఇపుడాతఁ డాయిల్లు నలుదిశలును బరికించి,

“ఈదినము మనకు హరివాసరమే!” యని, తాపత్రయము పంక్తులు మూఁడుగాఁదీర్చి మొగమునఁ జిత్రింపఁబడెనా యనునట్లుగ మోము చిట్లించి, నేను బండుకొనియుండు చాపమీఁదఁ దాను నట్టె గూలఁబడెను.

కొంతసేపటికి కోనేటినుండి నీటిబిందె



భుజము మీఁదఁ బెట్టుకొని బాలయొకతె వచ్చెను. ఆబాలికతో నేతెంచు పెద్దవారి నెవరినైనఁ బలుకరించెద మనుకొంటిని కాని, అట్టి వారెవ్వరును రాలేదు. పగలు పదిగడియల ప్రొద్దెక్కినది. కాని మట్టమధ్యాహ్నమప్పటివలె సూర్యరశ్మి తీవ్రముగఁ దోఁచెను. ఆఁకలి మమ్మిరువురను బీల్చి పిప్పిచేయుచుండెను. మాటాడుటకైనను శక్తిలేక నామిత్రుఁడుండెను. నేనును శోషిల్లియుంటిని. చిక్కినవారు సిగ్గెఱుఁగరు. నేనపుడు మోమోటము వదలి, “అమ్మాయీ! మేము మార్గస్థులము. మిక్కిలి యాఁకలితో నున్నాము. పాపము, మీయింట నీవుతప్ప నెవరు నున్నట్లు తోఁపదు. వంటచేయుమని నిన్ను బాధించుట తగదు. మాకుఁ గొంచెము బియ్యమును పాత్రయును జూపించిన యెడల, వంటఁజేసికొనెదము” అని మరియాదకై నేనంటినే కాని, నిజముగాఁ గాలుకదలించుటకైనను మాకు శక్తిలేకుండెను.!

కాని సిగ్గునణఁచుకొని యాబాలిక, “ఆశ్రమమీకెందుకు? వంటయగుచున్నది. మానాయనయు నిపుడె వచ్చెదరు. శీఘ్రమే భోజనము చేయవచ్చును.” అని పలుకఁగా, మా కామాట లమృతోపమానములయ్యెను. మేము

కోరకయే మాకాతిథ్య మీయనున్న యా
బాల, అన్నపూర్ణాదేవిని మాకు స్ఫురణకుఁ
దెచ్చెను. కృతజ్ఞతను దెలుపుటకు మాటా
డుటకైన శక్తిలేక, కన్నుల యానందబాష్ప
ములను మఱుఁగుపఱుచుచు, నేనంత నేల
నెఱిగితిని. మిత్రుఁడు నేను నంత గాఢసుషు
ప్తియందు మునిఁగి పోతిమి.

పరులయింట విందు

"అయ్యా! మిక్కిలి ప్రొద్దెక్కినది. కాళ్లు
కడిగికొని భోజనమునకు రండు!" అను నొక
పురుషుని కంఠస్వరము రెండు మూఁడు
సారులు నాకు వినఁబడి, నిద్రనుండి లేచితిని.
"నేను వచ్చువఱకును మీకు భోజనమేల
పెట్టలేదని మా యమ్మాయిమీఁద నేను
కోపపడితిని. లెండి." యని గృహాధిపతి
భోజనశాలలోనికి మమ్ముఁ గొనిపోయెను.

అనాఁటి యుదయభోజనపు వృత్తాంతము
నాకంతగ జ్ఞప్తిలేదు. ఇంటియజమానుఁడు
భోజనసమయమున మాతో ననుచుండిన
మాటలు బావిలోఁ బడినవాని చెవులకువలె
మావీనులకు వినవచ్చుచుండెను. నిద్దురతో
మేము తూఁగుచునే భుజించితిమి. కాని యన్న
రసము జఠరమునఁ బ్రవేశించిన కొలఁదిని
నిద్దురమత్తు కొంత తగ్గెను. మేమెట్టులో
మెతుకులు నోటవేసికొని, తిరిగి చావడి
మీఁదికిఁ జేరితిమి. సాయంకాలమునందలి
యీ రెండ గానఁబడువఱకు మాకు నిద్దుర
నుండి మెలఁకువ రాలేదు. అప్పుడు లేచి
చూడఁగా, గృహమేధి యుద్యోగసంబంధపు
కార్యమందును, పుత్రిక రాత్రిభోజన ప్రయ
త్నమునను నుండిరి.

భోజన సమయమునకు మాకుఁ గన్నులు
విచ్చెను. అంతవఱకును, ఇంటియజమానుఁడు
"మీ దేయూరు? పనియేమి?" అను ప్రశ్న
ములు మమ్మడుగలేదు. అడిగియుండినను
మాకు జ్ఞప్తిలేదు. స్థితిగతులు కొంత సన్న
గిల్లినను, ఆయన సాధుపురుషునివలె మాకగ
పడెను. కొలఁదికాలము క్రిందటనె పత్నీవి
యోగము సంభవించుటచేత, తనకీ యేక
పుత్రికయే యాధారమని యాయన చెప్పి
నప్పుడు, మాకు విషాదముగలిగెను. తన గోడ
వలో మా సమాచారమడుగ మఱచితినని
యాయన పలుకఁగా, నా మిత్రుఁడు రామ
నాథము మా ప్రయాణవృత్తాంతము సం
గ్రహముగఁ జెప్పి, "అయ్యా! మా మనో
హరము పెండ్లిపయనములలో నిట్లు మాజవ
సత్త్వము లడిగిపోవుచున్నవి. ఒకటి కుదిరిన
నొకటి కుదురకున్నది. చదువున్నఁ జక్కఁ
దనములేదనియు, సంగీతములేని సౌందర్య
మేల యనియును, సందియములతో, దల్ల
డిల్లుచున్నాఁడు. ఈతని పెండ్లిసంగతి యేక
దేవునికిఁ దెలియునుగాని, నేను శీఘ్రముమెయిలు
చేరనిచో మాట దక్కునట్లు తోఁచదు" అని
యతఁడు చెప్పివేసెను.

రామనాథము మంచివాఁడు. శాంత
మూర్తి. ఏపనిగాని వేగిరపడి చేయువాఁడు కాఁడు;
ఇతరులు చేసిన నోర్చువాఁడును గాఁడు. ఆ
రాత్రి నిద్రించుటకుఁ బూర్వము మేమిరువుర
మునుగలసి మాటాడుకొంటిమి. "మనో
హరమూ! పెండ్లివిషయమున నీ కింతటి గట్టి
పట్టు ఉండఁగూడదు. ఇంక ఖండాంతరములు

గడచిపోయినను, నీ కంటికింపగు కాంత గానఁ బడుట కష్టము!" అని విసుగుచుఁ బలికెను.

మఱునాటి యుదయమున రామనాథము మాటలు వినఁబడి, పడకనుండి దిగ్గున లేచితిని. ఒడలంతయు భారముగఁ దోఁచెను. కన్నులు మండుచుండెను. బండిచప్పుడు వినఁగనే రామనాథము నాయొద్దకు వచ్చి, "మనోహరమూ! నేను బోయివచ్చెదను నీ వీబడలికతోఁ బయనము చేయఁగూడదు. పరులయింట నుభయులమును నిలిచియుండుట భావ్యముగాదు. కాన నేను బోవుచున్నాను. నీవు నెమ్మది గలిగినతోడనే బయలుదేఱుము" అని నాకు బోధించెను. అంత నేను, "సరేకాని, మనము వచ్చినపని పూర్తికాలేదే?" యని పలుకఁగా, ఎప్పుడు పోవుదునాయని యాతురతతో నపుడే బండిలోఁ గాలుపెట్టుచుండు నా మిత్రుఁడు "దానికేమిలే మనసు కుదిరినచో మను వెంతసేపు?" అనుచు బండి సాగించెను.

ఆదినమంతయు తీవ్రజ్వరము నన్నుఁ బీడించెను. ప్రొద్దెక్కిన కొలఁదిని ఉష్ణమతిశయిల్లెను. కాలుసేతులు పీకుకొనిపోవుచుండెను. దగ్గఱనుండు స్నేహితుఁడుకూడ విడిచిపోయెనే యని నేను బరితపించితిని. పగటికంటె రాత్రి నాబాధ యధికమయ్యెను. అప్పుడప్పుడు కనులు తెఱచి చూచునపుడు, నాకుఁ గాళ్లు పట్టుచు గృహస్థుఁడును, పాసియమిచ్చుచుఁ గుమార్తెయును, కలఁగని బొమ్మలవలెఁ గానవచ్చుచుండిరి.

క్రొత్తబంధువులు

ఒక పవలురాత్రియు మాత్రమే నన్ను జ్వరము పీడించినను, నాశరీరము నందలి జవసత్త్వముల నది మొదలంటఁ గొనిపోయెను. అన్నమనిన బొత్తిగ నిశవులేకుండెను. పడక విడిచి రెండడుగులు వేయఁగనే కన్నులు గిరగిర తిరుగుచుండెను. అపరిచితులందు నాకా గృహస్థుఁడే దిక్కు. ఆయన సౌజన్య మింతింతయని చెప్పఁజాలను. "చుట్టమై చూడవచ్చి దయ్యమై పట్టుకొనె" నన్నట్లు, అతిథిగా నేతెంచి వారింటికడ నేను దినములకొలఁది నిలిచితినని నామీఁద నించుకయు నాతఁడు విసివికొనఁడు. వలసిన యౌషధము లిచ్చుచును, ఇంపగు మాటలు చెప్పుచును, ధైర్యము వలెన న్నాయన కాపాడెను. ఇంకను నధికముగ నాకు సాహాయ్యము చేయలేదనియే యాయన నొచ్చుకొనుచుండును.

ఇంక నాతని పుత్రికను గుఱించి యేమని చెప్పఁగలను? జనకుని శాంతభావమంతయు స్త్రీరూపము దాల్చివచ్చెనా యనునట్లుగ నాబాల గానఁబడెను. అంతటి లేవయస్సున నట్టి వివేక సౌజన్యములను గలిగియుండు వారెచటఁ గలరు? కరఁగియుఁ గలుగని నిపుణతతోనే యామె యిట్టిపనులు దిద్దుకొనుచు, కోపము విసువు ననునవి యెఱుఁగకఁ అన్నమనిన వాంఛ లేకుండు నాజిహ్వకుఁ దిరిగి యాహారమునందు రుచి గలుగఁజేయుటకై, లెక్కలేని చిన్నచిన్న పచనములు పచ్చడులును గల్పించుచుండును. సదయహృదయ యగు నాకోమలి యుపచారములవలననే నేను దెప్పిఱిలి, తప్పటడుగులిడుచుఁ గ్రమమున శక్తి గలవాఁడనైతిని. బాలికలందు నైసర్గికముగ మాతృగుణములు దాఁగి యుండునను శాస్త్ర

వచనము నాకప్పుడు స్ఫురణకు వచ్చెను. ఈ మాణిక్యము మాణిక్యమేయని నేనపుడు గ్రహింపఁ గలిగితిని

ఒకనాఁటి మధ్యాహ్నసమయమున నేను మంచముమీఁదఁ బండుకొని, నాస్థితిగతులను గుఱించి యిట్లు తలపోయ సాగితిని. "ఆహా! దైవసంఘటనము లెంత విచిత్రములు! ఒకకార్యార్థమై మిత్రునితోఁ బయనము చేయుచు, మార్గమధ్యమున దేహస్వాస్థ్యము తప్పి పరులయింటఁ జేరితిని! ఇప్పుడు నాకీ గ్రామమే జన్మస్థలమయ్యెను! ఇంటివారు చిరకాలపు స్నేహితులైరి! కాని పరులయింట నీ లంకణములలోని మనుగుడుపులలో నామనుప్రసంగతి మటుమాయమయ్యెనే!"యని, యిట్టి విడ్డూరమున కాశ్చర్యపడితిని.

పథ్యపు మెతుకు లొంటఁబట్టినకొలఁది, పూర్వపు వేగముతో నామనస్సు తిరుగఁ జొచ్చెను. రామనాథము వెడలిపోవుచుఁ బలికినపలుకులు మఱల మఱల తలంపునకు వచ్చుచుండును. అతని వాక్కులే నిక్కమవమైనచో, ఇంకను ధాత నాకొఱకు వధువును సృజింపనే లేదు! కానిచో, చూచిచూచి లోపములతో నున్న యేబాలనో నేఁగట్టుకొననలయును! ఇట్లు మనుప్రసంగతి నాలోచించిన కొలఁదిని తెంపులేని యూహలకుఁ దావలమై నామనస్సు డస్సిపోవుచుండుటచేత, అది యెటులైన మఱచిపోవుటకుఁ బ్రయత్నించుచుందును.

మా ణి క్య ము

మనస్సునకు వేఱు వ్యాయామము లేకపోవుటచేత, ఆదినములలో నేను జుట్టునుండు వస్తుసముదాయమును బరిశీలించుటయందే ప్రొద్దు పుచ్చుచుంటిని. ఈ జగన్నాటకరంగమున నాకన్నులకపుడు గోచరమగు పాత్రములు రెండే. వారు మాణిక్యము, ఆమె జనకుఁడును. పితాసుతల గుణావలోకనమే యపుడు నేనుమనస్సునకు ముఖ్యవిషయముగఁ గల్పించుకొని వినోదించుచుందును. జనకుని సౌజన్యాది గుణములు మాణిక్యమునందు ద్విగుణీకృతమై యొప్పారుచుండును. కాని యీలలన రూపలావణ్యాదులపోలికడలుమాత్రమంతగ జనకునియాకృతియందుఁ బొడకట్టవు. మాణిక్యముయొక్క రూపవర్ణనము చేయునపుడొక సంగతి పరికింపవలయును. పదిమంది బాలికలనడుమనిలువఁబడినపుడు మాణిక్యముయొక్కయందమంతగఁ గానవచ్చునదిగాదు. శరీరసౌకుమార్యమునందును, ముఖకాంతియందును,ఆకాంతనుమించు మించుఁబోఁడులు పలువురు గానవచ్చెదరు.ఆచాన చక్కఁదనము చూచినతోడనే చూపఱకన్నుల మిఱుమిట్లు గొల్పునట్టిది గాదు. అట్టి సుదతుల సౌందర్యమును గుర్తించుటయందు పురుషులు సామాన్యముగ మోసపోవుదురు. జ్ఞానముచే నుత్తేజితమగు నాసుందరిచక్షువులను బరిశీలించు వారికిమాత్ర మా చెలువ చక్కఁదనము విస్పష్టమగును. సోగకన్నులనుండి సౌందర్యలహరి బయలువెడలి మందగమనమున నా ముదిత ముఖసీమయంతటను నాట్యము సల్పుచుండునటులఁ దోఁచును.

మాణిక్యముయొక్క యందము ఆకలికి విశాలనయనములందేగాక, పలుకు పలుకు

నందును, చేయు ప్రతికార్యమునందును బ్రకటీకృతమగుచుండును. ఆ ముద్దియ ముద్దు పల్కులు, నిర్మలినమును గరుణాపూరితమును నగు హృదయముయొక్క ప్రతిబింబములే. ఆ తీయ్యలితేనెపలుకులు దేహమనఃక్లేశములను దూరీకృతముచేయుటకు సమర్థములుగా నుండును. ఆడుచుబాడుచు నాచేడియచేయు చిన్నిపనులు, గృహకృత్యములం దారితేఱినవారు చేయువానికంటె హృద్యములుగ నుండును. వానియందు లోపములున్నను, ఆ లోపములె వానికిఁ గ్రొత్తదనమును గల్పించునటు లుండును.

గ్రామ నివాసియగు మాణిక్యముయొక్క యాటపాటలు వినోదములును నేను గుతూహలముతోఁ గనిపెట్టుచుందును. పనులన్నియు దానే చక్కఁబెట్టవలసి వచ్చినను, ఎప్పుడును వానిలోనే మునుఁగుచుఁ దేలుచునుండక, అప్పుడప్పు డాయువిద విశ్రాంతి గైకొనుచుండును. మధ్యాహ్న మాకోమలి కాటవిడుపు సమయము. అప్పు డా బాల పొరుగిండ్లకును, పొరుగింటి బాలికలు వీరింటికిని, రాకపోకలు సలుపుచుందురు. ఆటలలో వీరు ధరించు భూషణములు పెరటిలోని మల్లెమొగ్గలును, కోనేటిలోని చెంగలువపూవులును. మాణిక్య మీనగలను బిమ్మటను దాల్చుచుండును. అపుడా మెలనాగ సోయగమునకుఁ గ్రొత్తవన్నె వచ్చినటు లుండును.

మనుష్యసంగతి మఱచిపోవలయు నని ప్రయత్నించు నామనమున కిట్లు మాణిక్యమురూపగుణావలోకనము మఱల దానినే జ్ఞప్తికిఁ దెచ్చెను. కాని యీసూటు రామనాథము మాటలసత్యము నా కనుభవమునకు వచ్చెను. నా మనస్సును వెతనొందించెడి సందియము లిఁక వీడినవి. పరిణయ మపేక్షించితినా నేను జేసికొనవలసిన బాల లోకములో నొకర్తుకయ కలదు. "ఆ కన్నియ చేకూఱెనా, నా కిహలోకసౌఖ్యము. లేనిచో నేను గృహస్థాశ్రమమునకు వెలియయ్యెదను", అని నేను నిర్ధారణ చేసికొంటిని.

ఆబాల యెవతెయో పాఠకులకుఁ దెలుపవలయునా?

దుఃఖవార్త

తరువాతి వృత్తాంతము త్వరితముగఁ జెప్పవచ్చును. నా యుద్దేశమును మెల్లఁగ మాణిక్యము జనకునితోఁ జెప్పితిని. ప్రథమమున నాశ్చర్యనిమగ్నుఁడయ్యెను, బాగుగ నాలోచించి యాయన దానికి సమ్మతించెను. ఆయనవలనఁ దనవివాహప్రవృత్తాంతమును విని యుండిన మాణిక్య మంతె నాకంటబడుటమానెను. ఇంక నొకటి రెండు దినములలోనే నేను బయలుదేఱి స్వగ్రామమునకు మఱలి వచ్చితిని.

పట్టనమందలి వృత్తిసంబంధమగువ్యాపారములలో నేనంతఁ దిరిగి ప్రవేశించి, పనులు జరుపుకొనుచుంటిని. ఇట్లు దినములు వారములును గడచిపోయెను. నేను ఉద్యోగస్థానమందలి కృత్యములలో గొట్టుమిట్టాడుచుండుటవలన మాణిక్యముసంగతి తఱచుగఁ దలంచుటకుఁగాని, వారిరువురి సేమ మరయుటకుఁగాని, నా కవకాశము లేకపోయెను. ఇటులుండఁగ నొకా

నొకదినమున నాకొకరు ఉత్తరమొకటి తెచ్చి యిచ్చిరి. అది నేను విప్పిచూడఁగ నందిటు లుండెను.——

చి. మనోహరమునకు,　　　కలువలూరు.

నావెనుకటి యుత్తరము నీకిదివఱకే చేరి యుండును. దైవమునకువలెనే నీకును మామీఁదఁ గరుణ తప్పినది. లేనియెడల నిదివఱకే వచ్చియుందువు. అమ్మాయి గడియల మీఁదనున్నది. కాని నిన్నుఁజూచినఁగాని ప్రాణము విడిచిపోనట్టుగ నున్నది. ఒకసారి వేగమె రావలెనని వేఁడుచున్నాను. ఇదే నాకోరిక.

వెంకటేశ్వరులు

ఈలేఖ రెండు పర్యాయములు నేను జదివినను, దానియర్థము నాకు మొదట బోధపడలేదు. పొరఁబాటున నాకింకొకరి యుత్తరమిచ్చిరేవని నేను జెప్పినను, లేఖ నాదేయని యాతఁడు పలికెను. కలువలూరివారికిని నాకును జుట్టఱికమెట్టిదని నేనచ్చెరువందితిని. కాని లేఖ గొనివచ్చినవాఁడు తెలిపిన యొకటిరెండానవాళ్లనుబట్టి, వెనుకటి సమాచారమంతయు నాకు జ్ఞప్తికి వచ్చెను. ప్రాణసమానయని నేను భావించిన మాణిక్యమును గుఱించియే యీలేఖ! ఆమె జనకుఁడే యిది వ్రాసి పంపెను! వ్యాధిగ్రస్తయగు మాణిక్యమును నేనిట్టి సమయమున సందర్శింపరాదని యూహించి మాయింటనుండువారు మొదటి యుత్తరము నాకంటఁబడనీయలేదని నాకిపుడు తెలిసినది. ఆహా! ఎంతటి మూర్ఖపుఁబని చేసిరి! లేనిచో నేనిదివఱకే మాణిక్యమును జూచుటకవకాశము గలిగెడిది. కాని యింక జాగు చేయఁగూడదని యెంచి, వేగముగఁ బోవు గుఱ్ఱపుబండి నెక్కి, శీఘ్రమే గమ్యస్థానముఁ జేరితిని. సరస్సున వెనుక నెంతో కలకలమను నెఱ్ఱకలువ లిపుడు ముఖములు ముడుచుకొని నటు లున్నవి! వీథిలో నగపడువా రెవ్వరును నన్నుఁ బలుకరింపకుండిరి!

అప్పుడు నేను వాయువేగమున నిల్లు సొచ్చితిని. "ఇప్పుడేలపోయెదరు?" అని యడ్డగించువారి మాటల సరకుగొనక నేను రోగి మంచము దగ్గరకుఁ బోయి నిలిచితిని. తులసిదళములతో జలబిందువులను మెల్లఁగ రోగి గొంతులోఁ బోయుచున్న మాణిక్యము జనకుఁ డపుడు నన్నుఁజూచి, "వచ్చితివా నాయనా!" యని కంటఁ దడిపెట్టి పలికెను. ప్రాణావసాన స్థితియందున్న మాణిక్య మపుడు, తన సోగకన్నులు తెఱచి, నావైపునకు దృష్టి నిగిడించెను. విషజ్వరప్రకోపమువలన దేహము మిగుల శుష్కించియున్నను, చక్షువులు మాత్రము సహజసౌందర్యముతో నింకను వెలుంగుచుండెను. ప్రభాతసమయమున నల్లకలువమొగ్గలనుండివలెనే యపు డా లలన కన్నులనుండి జలబిందువులు జలజలమని రాలెను. మిగుల ప్రయాసతో బాలిక యంత తనకుడిచేతి నెత్తి సైగచేయఁగా, నేను మిక్కిలి దగ్గరగఁ బోయి, కలువకాఁడవలెఁ జల్లనగుచున్న యాహస్తమును దాఁకితిని. అప్పుడు నాచేతిని మెల్లఁగఁ దనకెదవుల యొద్దకుఁ గొనిపోయి, ముద్దిడి, మాణిక్యము మెడ వెనుకకు వేసెను. "మాణిక్యమా! నేను

వచ్చితిని. నీకిఁక భయములేదు సుమీ!" యని ప్రోత్సాహపఱుప నెంచి మెల్లో నేఁ బలికితిని. ఔనని సూచించుటకై తలయూఁపనెంచి, యా కాంత యంతటఁ గన్నులు తేలవైచెను. ఆకనుకొలుకుల నుండియే జీవము లేచి పోయెను.

నా నియమము

ఇంక నేఁ జెప్పవలసినదేమిగలదు? నా మనోనాయికయగు మాణిక్యము చెల్లి పోయెను. నా కిఁక మను వక్కఱలేదు. స్త్రీ జాతితో నాకు సంబంధము తీఱిపోయెను. మాణిక్యము సుందరాంగకములఁ బోలిన పదార్థములును, ఆలలనామణిని జ్ఞప్తికిఁ దెచ్చు వస్తువిశేషములును, నాకిపుడు కంటకసదృశములు. ఆ సుందరి సోగకన్నులను బోలిన నీలోత్పలములను జూచి నేను శోకింతును. జడలో నెంతో సింగారముగ నా రమణి ముడుచుకొను మల్లెమొగ్గలు నాకు విషప్రాయములు. చిన్నిచేతులతో నా కోమలి కోసి నాజిహ్వకుఁ జైతన్యము గలిగించిన మామిడి పిందెల సువాసనలు, హృదయకమలముఁ గమలఁజేయు వహ్నికీలలు!

మాణిక్యము గతించి యిప్పటి కనేక వత్సరములైనను, ఆ కాంత కౌఁగపు వేడిమి నాశరీరమున కింకను సోఁకుచునేయున్నది. ఒకానొకప్పుడు నాకీలోకము యమలోక సదృశమగును. అప్పుడు వృత్తియు వ్యాపారమును విడిచి నేనిఁక జడునివలె లోకమునఁ దిరుగాడఁ జూచెదను. కాని జీవితముయొక్క పరమార్థమంతయు దుఃఖనిరోధమునందె నెలకొని యుండుట గుర్తెఱిఁగి, బుద్ధిని మరలించుకొని, ఉద్యోగపుఁబనులను ముకుత్రాళ్ళతో మనస్సును బంధింప నుద్యమింతును. కాని యేమి చేసినను, మాణిక్యమువలననుండి నామనస్సు మరలి రాకున్నది. ఇది పట్టి భ్రమయని మిత్రులు గేలిచేసి నాకుజ్ఞానబోధనముఁ జేయఁ జూచిరి కాని, నాకుమాత్ర మాసుదతి సంగతియే పరమసత్యముగఁ గన్పట్టును. ఈమనఃక్లేశముల నన్నిటిని వివాహమై మఱచిపొమ్మని బంధువులు పలుమాఱు నా కుపదేశించిరి. కాని నాయవ్యాజప్రేమమున కాస్పదమై, నాతో సాంసారికసౌఖ్య మనుభవింపఁ బుట్టెఁడాసఁ బెట్టుకొనియును, తా నకాలమృత్యువు వాతఁ బడుటవలన విఫలమనోరథమైన వనితను విడనాడి, వేఱొక యింతి చెట్టపట్టుటకు నామనసున కిసుమంతయు నిచ్చపొడమకున్నది.

దుఃఖభూయిష్ఠమగు నీ మర్త్యలోక యాత్ర సమాప్తమై, విహంగము రీతిని నా యాత్మ నాకలోకమున కెగసి, యనతిదూరమున, నూత్న పారిజాత ప్రసూనములను గోసి, వానితోఁ బ్రియున కాతిథ్య మీయ వేగిరపడియును, నైసర్గికమగు తన హొయారపు నడకలను మొదలంట వీడనేరక మందగమనమున నేతెంచు మాణిక్యముయొక్క సందర్శనసౌభాగ్యము నాకుఁ జేకుఱినప్పుడు, విఘాతములేని శాంతిని సౌఖ్యమును గ్రోల నేనువ్విళులూరుచు నున్నాఁడను.

---




# యెంకి పయనం


నండూరి వేంకట సుబ్బారావు గారు, బి. ఏ.,


పడుకుంటె నాకేటొ బ్రమపుట్టినాదీ,
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

ఎడతెగని జలమంట
నడమనో పడవంట,
పడవెక్కినా యెంకి
పయినమయ్యిందంట. ప.

యెంకేటొ బ్రమపుట్టి
యెనకతిరిగిందంట,
సందెగాలికి పడవ
సాగిపోయిందంట. ప.

నీటిగాలికి యెంకి
పై టెగురుతాదంట,
పడిపోయిన ప్లేటొ
పడవెల్లినాదంట. ప.

పిల్లసిగలో పూలు
కల్లిప్పినాయంట,
మిడిసిపాటున దోనె
మిఱిగిపోయిందంట. ప.

మెడసాటుపూసోటి
మిణుకుమంటాదంట,
సంతాన గంతేసి
పడవపోయిందంట. ప.

అంసల్లె, బొమ్మల్లె,
అద్దాల బరిణల్లె,
సుక్కల్లె, నాయెంకి
సురిగిపోయిందంట. ప.



# చిత్రలేఖనము

భమిడిపాటి రామసోమయాజులు గారు, బి. ఏ.,

### చిత్రలేఖనమునందలి జాతులు : ప్రస్తుతకాలమున వాని వాడుక

జ్ఞానసంజనితములగు నుత్తమాభిప్రాయములను, చిత్రకారుడు తనచిత్రమునందు, కవి కావ్యమునను, శిల్పి శిల్పమునను, గాయకుడు గానమందునను జూపించి, ప్రపంచమెరుంగునట్లు జేయుదురనియును, ఈశక్తులన్నియును సమానములనియును, ఇదివరకే కనుగొంటిమి. ఈశక్తులన్నింటను, నొక్కొక్కదానిలో ననేకజాతులు గలవు. కవిత్వమునం దనేకవిధములగు కవిత్వమున్నది. ఒకకవి, వచన రచనయందే తనభావమునంతను దెలుపును; వేరొక కవి పద్యములందు దెలుపును; మరియొకడు పాటల రచించి బోధించుచుండును. అంతియే కాక వచనకావ్యములలో ననేకజాతు లున్నవి. పద్యకావ్యములలో గూడ ననేకజాతు లున్నవి. మరల నీ పద్యములం దనేకజాతులు గలవు. శిల్పమునందుగూడ ననేకవిధములగు శిల్పములున్నవి. బలపపురాతిశిల్పము, పిండిరాతిశిల్పము, మున్నగునవి. పాశ్చాత్యులలో, ప్రస్తుతకాలమం దన్నిదేశములవారును, పూర్వకాలమున గ్రీకులు, రోమనులును, బలపపురాతితో ననేకవిగ్రహముల జేసిరి. బలపపురాయి యులికి లొంగివచ్చుచు, శిల్పియొక్కభావము ననుసరించుచున్నదో యనునంతటిమెత్తనై యుండును. ఇటలీదేశమునందలి బలపపురాతినే ప్రపంచమున జాలదేశములవారుపయోగించుచున్నారు. ఆ బలపపురాయి (Italian marble) ప్రత్యేకము విగ్రహములనిమిత్తమై సృష్టింపబడినదో యన్నట్టులు, చక్కని పాలరంగుగలదై, మెత్తనిదై నునుపుఁగలిగి యుండును. నల్లసేనపురాతితో

నొక్క-హిందూదేశముననే విగ్రహములు చేయబడినవి. ఈ నల్ల సేనపురాయి పనిరాయి కాదు; అనగా శిల్పమునకు సులభసాధ్యమైనది కాదు. దానికాఠిన్యమునకుసాటిగలకాఠిన్యము శిలాప్రపంచమున వేరొండు లేదు. ఐనను హిందువులు వేలకొలది యేండ్లకిందట నీశిలతోడ ననేక దేవాలయముల గట్టిరి. హిందూదేశమునగల పురాతనశిల్పములన్నియు నీనల్లరాతితో జేయబడినవే. పిండిరాతిని ప్రస్తుత కాలమందు, 'పనిరాయి'యని యనేక దేశములవారు వాడుచున్నారు. ఇది సొగసునకు గాని చాలకాలముండుటకుగాని బలపు రాయి, నల్లరాళ్లతో సాటి కాదు. ఇట్లే గానమునందు గూడ ననేకజాతు లున్నవి. ఒక్కొక్క దేశమునం దొక్కొక్క విధమగు గానము వినవచ్చుచున్నది. పాశ్చాత్యగానము వేరు; హిందూస్థానగానము వేరు; కన్నడదేశగానము వేరు; వీనియన్నిటికిని బ్రత్యేక శాస్త్రములు కలవు. మరల, గాత్రగానము, వీణాగానము, సొన్నాయిపాట, హార్మోనియముపాట, జలతరంగిణి, ఫిడెలు మున్నగు విధములు పాటలలో గలవు. ఒక్కొక్క గాయకు డొక్కొక్క విధమగు గాన మభ్యసించి యం దౌన్నత్యము గాంచి, ప్రపంచమున పన్నె కెక్కుచుండును. ఆరీతిగనే చిత్రలేఖనమునగూడ ననేకజాతు లున్నవి. ఒక్కొక చిత్రకారు డొక్కొక దానియందు బ్రవీణుడై యొప్పుచుండును. రంగులతో జిత్రించుట, రంగులు లేక గీతలతోడనే చిత్రించుట, వెలుగునీడల జూపుచు (తెలుపునలుపులు వెలుగునీడలకు వాడుచు) జిత్రించుట యను నవి, మూడురకములు గలవు. మరల నీచిత్రములందు గుడ్డపైన వ్రాయునవి కొన్ని, కాగితముమీద వ్రాయునవి కొన్ని, గోడమీద వ్రాయునవి కొన్ని, అద్దముపైన వ్రాయునవి కొన్ని, యీ తీరుగా ననేకవిధము లున్నవి. శిల్పమునందుగాని, కవిత్వమునందు గాని, గానమునందుగాని, చిత్రలేఖనమునందుగాని, జాతు లెన్నియున్నను, మొత్తముపైన నన్ని జాతులయందును, శిల్పికవిగాయకచిత్రకారుల గమ్యస్థాన మొక్కటియే యై యున్నది. ఏ రాతితో జేసినను, ఏ శిల్పియైనను, దనభావమునే చూపించుచున్నాడు. వచనము వ్రాసినను, పద్యము వ్రాసినను, పాట వ్రాసినను, నేకవియైనను, తనయభిప్రాయములతత్త్వమే తెలియజేయుచున్నాడు. గాత్రమునందుగాని, వీణెయందుగాని, పిల్లనగ్రోవియందుగాని, యేగాయకుడైనను, వినువారి కానందము గలుగజేసి భగవంతునితో నైక్యమగునట్లు చేయుచున్నాడు. ఆ రీతినే యేచిత్రలేఖకుడైనను రంగులతో వ్రాసినను, గీతలతో వ్రాసినను, చేతితో వ్రాసినను, కాలితో వ్రాసినను, గుడ్డపైన వ్రాసినను, గోడపైన వ్రాసినను, కాగితముపైన వ్రాసినను- తన భావమునే చూపుచున్నాడు. మాటల నేర్చినవా "డన్నము కావలెన"ని యడుగుచున్నాడు. మూగవాడు కడుపు చేతితో తట్టి, మొగమున విచారముజూపి, యన్నముకావలెననుసంజ్ఞ చేయుచున్నాడు. మార్గ మేదైనను, నుద్దేశమును ఫలితమునునొక్కటియేయైయున్నవి.

రంగులతో జిత్రముల వ్రాయుట నేల కొలది యేండ్లనుండియు బ్రపంచమున వచ్చు చున్నది. భారతదేశమందేకాక, తదితర దేశములందుగూడ నిది పూర్వమునుండియు జాల గారాబముతో బెంచబడు చున్నది. ప్రస్తుతకాలమం దీరంగుల చిత్రలేఖనమునకు నన్ని దేశములందును విపరీతాదరణ చూప బడుచున్నది. ఎప్పటికైనను జిత్రలేఖనము నకుగాని, కవిత్వమునకుగాని, గానమునకు గాని, యిట్టి గౌరవస్థానమే యొసంగబడును. అనేకవేల సంవత్సరముల క్రిందటి మను ష్యులు, జంతువులు, నాడు మొదలుకొని నేటి వరకును నీరుత్రాగుట, గాలిపీల్చుట, పండ్లు తినుట, మున్నగునవి మార్పులేక వచ్చి, నీరునకును, గాలికిని, జీవనాధారభూతము లను ప్రాముఖ్య మొసంగ బడుచున్నదో; అప్పుడు నిప్పుడుగూడ, పగలు వెలుగున బని యొనర్చుకొనుట, రాత్రి చీకటిలో నిద్ర జెం దుట, మున్నగునవలవాట్లు, మార్పులేక యెట్లు వచ్చుచున్నవో; అట్లే, గానకవిత్వచిత్రలే ఖనమాదిగాగల విద్యలకు గౌరవముగూడ తగ్గకుండ వచ్చుచున్నది. హెచ్చుగుటకు నవ కాశమున్నది. సత్పురుషు లెప్పుడైన గౌర వింపబడుదురు. ఒకప్పుడు వారి కనాదరణము సంభవించినను, అది మారిపోయి వారి కం చితమగు గౌరవము కొంతకాలములోనే వచ్చుచుండును. అటులనే యిటుపైన నైన ప్రపంచములో నీవిద్యలకు నాదరణము మిక్కు టముగానే యుండును.

ఈరంగుల చిత్రములలో ననేకజాతులున్న లున్నవి. నూనెతో కలిపి వేయురంగులు, నీటితో గలిపి వేయు రంగులు, క్రొవ్వుతో గాని మరిదేనితోగాని కలిపి కణికలుగా జేయ బడిన రంగులతో వేయబడునవి. నూనెలతో వేయు రంగులు సాధారణముగా గుడ్డపైన వేయుదురు. అట్టిగుడ్డ ప్రత్యేకముగా నందు నిమిత్తము తయారు చేయబడును. ఈ నూనె రంగులలో ననేకవిధములు గలవు. బల్లపై నను కర్రపైనను వేయునవి కొన్ని; అద్దము పైన వేయునవి కొన్ని; లోహపురేకులపై వేయునవి కొన్ని. ఈ రంగులచిత్రములలో పూర్వ మారితేరినవా రిటలీదేశపు చిత్రకా రులు. తరువాత గ్రమక్రమముగా నన్నిదేశము వారును దీని నభ్యసించుచున్నారు. ముత్తము పైన పాశ్చాత్య దేశములయం దీనాడు వీని వాడుక యెక్కుడుగానున్నది. భారతదేశము నందుగూడ వీనివాడుక యున్నను, భారతీయ చిత్రకారులకు నీటి రంగులపైనగల యాసక్తి నూనె రంగులపై నాదినుండియు గానరాదు. ఈ నూనెరంగులచిత్రము లెండ కెండి వానకు దడసినను చెడిపోనేరవు. ఇండ్లలో గదులలో వీని నుంచుకొనినప్పుడు తక్కిన బొమ్మలవలె పురుగుల కవి సాధ్యము కావు. వీనిని పురుగు కొట్టలేదు. అందువలననే వీనిని చిత్రములం దుంచినపు డద్దము లేకుండనే యుంచుదురు. ఈ రంగులతో వ్రాసినచిత్రపటము లనేక సంవత్సర ముల వరకును చెడిపోకుండ నుండును. ఇట్టిరం గులలో కలుపునూనె సర్వసాధారణముగా స్వచ్ఛము గావింపబడిననూనెయై యుండును.

అన్నిరకములబొమ్మలు నీరంగులతో వ్రాయ
వచ్చును. ఈనూనెరంగులలోనే మరియొకజాతి
యున్నది. దాని నద్దములపై వేసి చిత్రముల
జూపింతురు. అద్దమునకు లోపలిభాగమున వేసి
చిత్రములం దుంచినచో నాచిత్రములు, పైకి
చక్కగా స్ఫుటములై కానవచ్చుచుండును.
ఇట్టివి జర్మనీమున్నగు దేశములో వేలకొలది
తయారుచేయబడి, హిందూదేశపు బజారులం
దమ్మబడుచున్నవి.

నీటిరంగులు వాడుటలో భారతీయులు
చాలకాలము క్రిందటినుండియు, మిక్కిలి
యాసక్తి గలిగియున్నారు. అజంతాలోని
చిత్రములు చిత్రింపబడిననాటనుండియు నేటి
వరకు, నీవిద్య భారతీయులందు గానవచ్చు
చునే యున్నది. భారతదేశమునం దనేకకథ
లలో జిత్రప్రశంస వచ్చుచుండుటంబట్టి యీ
విద్య బహుపురాతనమని యొప్పుకొనవలసి
యున్నది. నేడది చాల బలము గలదిగా
నున్నది. బంగాళాదేశమందును, ఆంధ్రదేశ
మందును,మహారాష్ట్రదేశమునందును, సీనాడు
నీటిరంగులపై ప్రేమ విపరీతమగుచున్నది. ఫల
ములజూచినను, అంతకంటె నెక్కుడుగా
బుష్పముల జూచినను, చిన్నపిల్లల కెంతటి
యానందమును నిష్కల్మష ప్రేమయు జనిం
చునో, యంతటి యానంద మీరంగులపై
భారతీయచిత్రకారులకు గలిగినది. గలుగు
చునే యుండును! చిత్రలేఖనవృక్షు మీమధ్య
కాలములో ననాదరింపబడి కృశించి యెండిపో
యినను, ప్రస్తుతకాలమునందు దన సుతుల
యొక్క యాదరణసేవలచే జిగిర్చినది; చక్కని
రూపుదాల్చినది;యెటుజూచినను గన్నులపండు
వౌనట్లు పెరుగుచున్నది; యనేకులకు దారి
ద్ర్యాతపవేదన నడంచి చల్లనినీడ నొసంగు
చున్నది; తనపుష్పసుగంధములను దేశదేశ
ములకు బంపి కీర్తిగాంచుచున్నది. ఈ వృక్షు
మునకు వార్ధక్యావస్థ లేదు; నిత్యయౌవన
ముతో దులతూగుచుండవలసినదే!—పాశ్చా
త్యదేశములందుగూడ నీ నీటిరంగుల జాల
వరకు వాడుచున్నారు. కాని మనదేశము
నందలి వాడుకకును, పశ్చిమదేశములందలి
వాడుకకును చాల భేదమున్నది. ఆసంబంధ
మగుచర్చమరియొకచోట జరుపవలసియున్నది.
ఈనీటిరంగులను జాలవరకు కాగితముపైనను
గోడపైనను వేయుదురు. కొంతవరకు గుడ్డ
పైనగూడ వేయుదురు. అజంతా గుహాల
లలో గోడలపైననే చిత్రము లత్యద్భుత
ముగా జిత్రింపబడినవి. ప్రస్తుతకాలమందు
గూడ నన్నిదేశములందును గోడలపై జిత్ర
ములు వేయుట వాడుకయై యున్నది. పాశ్చా
త్యదేశములం దనేకగొప్పపట్టణములలో
ననేకసౌధములలో గోడలనిండ ఘనులగు
చిత్రకారులచే జిత్రింపబడిన పెద్దపెద్ద చిత్ర
ములు చాలగా నున్నవి. ఈకాలమున నీ
గోడలపై చిత్రములు మన భారతదేశమందు
జాల తక్కువగా నున్నవి. కాగితములపై
చిత్రములు వేయుట యన్నిదేశములందును
విపరీతవ్యాప్తిజెందియే యున్నది. గుడ్డపై
వేయు నీటిరంగు చిత్రములు సాధారణముగా
నాటకప్రదర్శనార్థమై తెరలకొరకుపయోగిం
పబడుచున్నవి. అవికూడ ప్రస్తుతకాలమునం

దన్ని దేశములయందును వాడుకయగుచున్నవి. జపానునందీ రంగుల వ్యాప్తి హెచ్చుగా కానబడుచున్నది. రంగుసుద్దలతోడను, రంగుముక్కలతోడను, సర్వసాధారణముగా, దళమగు కాగితములపైనగాని, యట్టలపైనగాని చిత్రములు చిత్రింపబడుచున్నవి. ఈ చిత్రములు చిత్రించినపైన, వానిపై నేదేని రాపిడి కలిగినచో చెడిపోవును. ఇవి చాలకాలముండదగిన చిత్రములు కాకున్నను, చాల యందముగా కానవచ్చుచుండును.

ఈరంగుల చిత్రములుగాక, నలుపు తెలుపులతో నొక్క వెలుగునీడలనే చూపించుచు, వ్రాయబడు చిత్రములుకూడ గలవు. అవి చూచుటకు నచ్చుముగా ఫొటొగ్రాపులవలె గానుపించును. ఈ తెలుపునలుపులను, వేరు వేరు రంగుపొళ్లవలనగాని, నీటిరంగులనుండి గాని, నూనెరంగులనుండిగాని తీసి వ్రాయుదురు. ఇట్టి చిత్రములు పాశ్చాత్యచిత్రలేఖకులకు మిక్కిలి ప్రీతినొసంగుచున్నవి. హిందువులలో ననేకులు వీనిని వ్రాయగలిగియున్నను, వ్రాయుచున్నను, మొత్తముపైన పశ్చిమదేశములందువలె దాని నొకముఖ్యమైనదానిగా జూచుటలేదు. ఈ తెలుపునలుపుల వేయుటలో జాలవరకు, ననేకులగు చిత్రకారులు, తెలుపునకు మారుగా కాగితపు దెలుపును విడచిపెట్టుచు, నీడకు నలుపురంగు వేయుచున్నారు. కానియీయాయలవాటునకొక్క నీటిరంగులందే కాని నూనెరంగులందవకాశము లేదు. నూనెతో వేయునప్పుడు నలుపుతెలుపులను రెండింటిని, వలసినచో నెల్ల నుపయోగింపవలసినదే. ఈనలుపు తెలుపులవలన జూపబడెడి చిత్రములుకూడ జూచుటకు చాల స్వభావానుగుణముగా నుండి, నేత్రానందము నొసంగును.

పైన జెప్పినజాతులు కాక, గీతలతోడనే యాకారమును జూపి వ్రాయు చిత్రములు ప్రస్తుతప్రపంచమున జాలవర కాదరింపబడుచున్నవి. ఈగీతలను సిరాతో కలమువలనగాని, పెనిసిలువలన గాని, లేక రంగుతో కుంచెవలనగాని, వ్రాయుదురు. కుంచెతో వ్రాయబడు గీతల చిత్రములు చాలరమణీయములుగా నుండును. కథలను జిత్రములతో జూపుటకును, సంఘసంస్కారార్థము ప్రజలకు నేర్పదలంచుకొనిన నీతులను చిత్రములమూలమున దెలుపుటకును, ముఖ్యముగా పాశ్చాత్యులీగీతలచిత్రములను (కలము, పెనిసలు, తో వ్రాయునవి) వాడుచున్నారు. ఆచిత్రములందు వారు మహాసన్నత్యము గాంచుచున్నారు. ఇట్టి గీతల చరిత్రముల వ్రాయుటకు, వస్తువులయొక్క యాకారపరీక్షయు, నవస్థాజ్ఞానమును, జిత్రకారుని మనస్సున నాటుకొని యుండవలయును. ఏ మాసపత్రికగాని వారపత్రికగాని చూచినమొదల పాశ్చాత్య దేశములయందు నీ గీతలచరిత్రము లద్భుతముగా గానవచ్చును. అజంతాయందలి రంగుల చిత్రములందు నీగీత (line) మంచి పరిపక్వస్థితితో వెలుగుచున్నది. బొమ్మలకు రంగులు వేసి, యాకారము స్పష్టముగా దెలుపు నీగీతను, కుంచెతో జూపించుట, భారతదేశ చిత్రకళామర్యాదమై యున్నది.

పూర్వకాలమునందే కాక ప్రస్తుతమునగూడ, బంగాళా దేశమందుగాని, యాంధ్రదేశమందుగాని, తక్కిన బొంబాయిరాజధాని మున్నగు స్థలములందుగాని, వ్రాయబడు రంగుచిత్రముల గాంచినచో, నీగీత కిప్పుడొసంగబడుచున్న ప్రాముఖ్యము స్పష్టపడగలదు. ఆ గీతయొక్క సొగసు కన్నుల నాకర్షించుచున్నది. జీరలేని మధుర కంఠనాదము పాటకెట్టిదో, యడ్డులేని మృదుపదప్రవాహము కవిత్వమున కెట్టిదో, నునుదీగవంటి వయ్యారముగల యీకుంచెగీత చిత్రలేఖనమున కట్టిదై యున్నది. పాశ్చాత్యచిత్రకారులలోగూడ ననేకు లీ రేఖారహస్యమును గ్రహించి, దానిలోని సొగసునంత జూపి, భారత దేశ చిత్రలేఖనానుకరణ మొనర్చుచున్నట్టు లిటీవలవారు నారు వ్రాయుచున్న నూతనచిత్రములే చెప్పగలవు. చైనా జపాను దేశములందుగూడ నీ రేఖాచిత్రములు ప్రబలియున్నవి. చైనావారు పాత్రలపైనను, వాడుకొనదగిన తక్కుంగల వస్తువు లనేకములపైనను గూడ నీ చిత్రలేఖనము జూపుచున్నారు. పూర్వకాలమునుండియు నిట్టి చిత్రసహితములగు చైనాపాత్రలకు చాల విలువయొసంగబడుచున్నది. ఈ చైనారంగులు చెడిపోకుండ చాలకాలమునరకును పాత్రలపై నిలచియుండును.

చిత్రలేఖనమునం దెన్నిజాతు లున్న నన్నిజాతులందును, ఒకే గమ్యస్థాన మున్నదని, యిదివరకే యంటిమి. చిత్రలేఖకుడు తన భావమునే చిత్రమందు జూపించుచున్నాడు. అట్లు చూపించెడి చిత్రములందలి సంగతులలో ననేకవిషయము లున్నవి. చరిత్రలందలి మహాపురుషులయొక్క పరాక్రమాదులను గాని, భక్తినిగాని, జ్ఞానమునుగాని, దయనుగాని, దుఃఖమునుగాని, సంతోషమునుగాని, మరియేయవస్థనుగాని, చూపించుటకై వ్రాయబడునవియును, మనుష్యస్వభావాదుల నీతిబోధకములుగా ప్రపంచమునకు దెలియజేయుకొరకై చిత్రలేఖకు డాయాయవస్థలకు నాయా రసములకు నాయామహాపురుషులకు దగిన చిత్రముల దనభావమునందు గల్పించి, వాని దృఢపరచుకొని, చిత్రమునందు సృష్టించునవియును, ఒకవిధమగు చిత్రములు. అవి చిత్రకారునిభావమునుండియే పుట్టుచున్నవి. అట్లుగాక, ప్రపంచమున జీవించుచున్నవారిలోగాని, చనిపోయినవారియొక్క ఫొటోగ్రాపులను జూచిగాని, యెవరిపటమునైన వ్రాయవలసి వచ్చినపుడు, సరిగా వారివారి పోలికలతో నిజరూపములు దెలియునట్లు వ్రాయబడుచిత్రములు రెండవవిధములోనికి వచ్చుచున్నవి. ఇవి ప్రతిరూపచిత్రములు (Portraits). ఇవియునుగాక ప్రపంచమునందు గల నదులు, కొండలు, వృక్షములు, సౌధములు, సొంపులగు తావులు ప్రదర్శించుటకై వ్రాయబడు చిత్రములు మూడవవిధములోనివి ( Landscapes ). చెట్లనుండి తీయబడిన పండ్లు, కాయలు, కుర్చీలు, పెట్టెలు మున్నగు నిర్జీవవస్తువుల చిత్రములు నాలవజాతిలోనివి. కంటి కింపుగ గానవచ్చు లతలు మున్నుగా గలవానితో కల్పనాచాతుర్యముజూపు చిత్ర

ము లైదవజాతిలోనివి. ఇట్లే చిత్రములం దీ
విధములగు జాతు లనేకము లున్నవి. మొత్త
ముపైన నిన్నిటియందును జిత్రలేఖకునిభావము
కొంతమైన గానవచ్చుచుండును. భావము
బాగుగా నున్నవే ఘనములగు చిత్రరత్న
ములు.

పాశ్చాత్య చిత్రకారులలో జాలమంది,
తమ చిత్రములందు బ్రకృతి నున్నదాని
నున్నట్టులనే చూపుచున్నారు. వెలుగునీడలు,
రంగులు, ఆకారము, వస్తుదూరము, వస్తు
తారతమ్యము, మున్నగులక్షణములను, సరిగా
ప్రకృతిలోవలెనే చూపించుచున్నారు. అట్టి
చిత్రములందు భావము చాలతక్కువగా
నున్నది. పైపై వన్నెలకు బ్రాముఖ్యము
జూపుచు, చిత్రమున ముఖ్యముగా గాన
రావలయు భావమును ద్రొక్కివేయుచున్నారు.
ఫొటోగ్రాపు యంత్రమునకును, పాశ్చాత్య
చిత్రకారునకును భేద మేమియు లేదేమో
యనిపించుచున్నచిత్రములుగూడ పాశ్చాత్య
దేశములనుండి వెలువడుచున్నవి. భారత
దేశమునందుగూడ గొంద రట్టివాని జూచి
పైసొగసులతో వ్యామోహపడి, వాని నను
కరణము జేయుచున్నారు. అట్లని పాశ్చాత్య
చిత్రకారులందరు నిట్టి పనికిమాలినబొమ్మల
వ్రాసి, వ్యర్థజీవనులగుచున్నారని చెప్పుట
సత్యము కాదు. బుద్ధిమంతు లెచ్చటనేని వెల
యుదురు. ఏదేని యొక యంశమును, ఒక
యుద్ధమును గాని, యొకపట్టాభిషేకమును
గాని, లేక యొకమహాపురుషుని యాలోచ
నను గాని చూపవలసివచ్చినపుడు, పాశ్చాత్య
చిత్రలేఖకుడు, పాత్రలకు దగిన శరీరసౌష్ఠవ
ములు గలిగిన పురుషులను గాని, స్త్రీలను
గాని, యవస్థకు దగినరీతిని నిలువబెట్టియో,
కూరుచుండబెట్టియో, చూచి యున్నదున్న
ట్టులు దనచిత్రములోని కెక్కించుచున్నాడు.
చాణక్యుని జిత్రింపవలసియున్న యెడల
పాశ్చాత్యచిత్రలేఖకుడు, మంత్రిపదవియం
దుండుటకు దగినవాని నొకని జిత్రించును.
చిత్రముమాత్ర మచ్చముగా మనుజుని బోలి
యుండి చూపరుల కానందము గలుగజేయును.
అయినను దానియందు, చాణక్యుని కార్య
దీక్ష, బుద్ధిబలము, తపశ్శక్తి, కార్పణ్యము,
మున్నగుగుణములు బాగుగా మూర్తీభవించి
యుండనేరవు.

భారతీయచిత్రము లట్లుగాక భావ
గర్భితములై యుండును. భావమునే ప్రధాన
ముగా జేసికొని భారతీయ చిత్రకారులు పూ
ర్వమునుండియు చిత్రముల వ్రాసిరి. అజంతా
లోని చిత్రములు వ్రాసినవారుకాని, దక్షిణ
దేశ దేవాలయములలోని విగ్రహముల
జెక్కిన శిల్పులుగాని, యెదురుగా మనుష్యుల
బెట్టుకొని వ్రాయలేదని వారి చిత్రములును,
శిల్పములును చెప్పుచున్నవి. భావము నేతీరున
బాగుగా జూపింపగలయునో ఆ తీరుననే వారు
చూపించిరి. నేడు కూడ భారతదేశమం దనే
కులు భావమునే ప్రధానముగా జేసికొని చిత్ర
ముల వ్రాయుచున్నారు. బంగాళాదేశములో
నొక క్రొత్త విధమగు చిత్రలేఖనము ప్రారం
భమై ప్రబలుచున్నది. అది కేవలము మన
దేశమునకు క్రొత్తది కాకున్నను, క్రొత్తసం

గతు లందున జాలవరకు నున్నవి. ఈ బంగాళా దేశచిత్రములందు భావమే ముఖ్యముగా గానవచ్చుచున్నది. కొన్నింటిలో భావముతప్ప మరియేదియును గానవచ్చుటయే లేదు. పూర్వకాలపు జిత్రకారులు చాల తక్కువ రంగులతో జిత్రముల వ్రాసిరి. ఆజంతాలోని చిత్రములు "అయిదురంగులు నొకరేఖ" (Five colours and a line") తో వ్రాయబడియున్నవి. కాని యీ బంగాళా చిత్రములందు ననేకరంగులకూటమి గానవచ్చుచున్నది. ఇందునను రేఖకు (line) ప్రాముఖ్య మొసంగబడుచున్నది. కాని యిందు వస్తువుల యాకారముగాని, వస్తుభేదముగాని, వస్తుదూరముగాని, వెలుఁగు నీడలుగాని, బాగుగా జూడబడుటలేదు. బంగాళాదేశచిత్రకారుల యభిప్రాయము భావమునే చూపించుటయై యున్నది. అందువలన తక్కిన లక్షణము లెట్లున్నను, భావము స్పష్టముగా దెలియుచున్నపట్ల నది మానసిక చిత్రముగా వారెన్నుచున్నారు. ఈ యభిప్రాయకారణమున, నీనడుమ కొందరు బంగాళాదేశపు చిత్రకారులు, బొత్తిగా వికారములుగా గానవచ్చు చిత్రములను వ్రాసి, భావగర్భితములని చెప్పుచున్నారు. బుద్ధిమంతులగు చిత్రకారులు, పాశ్చాత్త్యులలోను, భారతీయులలోను, ప్రపంచమున నేదేశమునందైన నున్నారు. నారేవిధమున వ్రాసినను, సర్వలక్షణసంపూర్ణములై చావులేని చిత్రములనే వ్రాయుచుందురు. వారిని విడచి, తక్కిన సామాన్యచిత్రలేఖకులజూచినపట్టున, పాశ్చాత్త్యులలో భావహీనములగు చిత్రములును, బంగాళాదేశములో లక్షణహీనములగు చిత్రములును వ్రాయుచున్నారు.

ఆంధ్రదేశమున, బ్రస్తుతమున, నీమంచి చెడ్డల గ్రహించినబుద్ధిమంతులు, నూతనములగు మార్గములలో జొచ్చి చిత్రములవ్రాయుచున్నారు. ఇందు వస్తువుల యాకారములును వస్తుభేదమును, వస్తుదూరమును జూపించుచు, రంగులమైత్రి (Unity in colour treatment) గల చిత్రములను, భావగర్భితములుగా జూచుచున్నాము. ప్రస్తుతమున గానవచ్చు చిత్రములలో నీయుద్దేశములుగల చిత్రములు చాలవరకు నిజచిత్రలేఖనానైపుణితో నొప్పారుచున్నవి. కాని, యిందుగూడ, గొన్నిలోపము లున్నవి. వానింగూర్చి ముందు చర్చింపబడును.

మొత్తముపైన చిత్రలేఖనమున గల విధము లనేకములు. వానిలో దెలుపబడుచున్న భావము లనేకములు. వానిని ప్రపంచమున ననేకదేశములవారు వాడుచున్నరీతు లనేకములు. ఒక్కొక్కదేశములో నొక్కొక్క గుణము, ఒక్కొక్క లోపముఁగూడ గానవచ్చుచున్నది, పూర్వమునకంటె నిప్పుడు, చిత్రలేఖన మభివృద్ధిజెందినది. చిత్రలేఖకునకు ప్రపంచమున గౌరవము హెచ్చగుచున్నది. చిత్రలేఖనముయొక్క ప్రాముఖ్యము జనసామాన్యమునకు బోధయగుచున్నది. భారతదేశచిత్రలేఖనమునకు ప్రపంచమునందంతట గౌరవ మొసంగబడుచున్నది. నిజముగ నుత్తమమగు భారతదేశచిత్రలేఖనమున కింకను రానున్నది.

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ప్రేమతత్త్వనిరూపణము

(ప్రథమభాగము)



కూర్కి లేచిన వేళకును దల్లిపక్కలోఁ,
గనరానిచో మోముగందనేయుఁ;
దల్లి రాఁజూచి పాదంబు లాడించుచుఁ,
జిఱునవ్వుమోముతోఁ జేతులెత్తు;
దల్లిచేతులుచాచి 'దాదా' యనంగఁ బ్రాఁ,
కుచుఁ బోయి యొడిలోనఁ గూరుచుండుఁ;
బనిచేసివచ్చుతల్లిని జూచి పర్వెత్తి,
కదిసి నవ్వుచుఁ గాళ్లు గౌఁగిలించు;
నెంత మఱపించినను దల్లి యెచటి కెపుడు, వెడలునోయంచు నెప్పుడు వెంబడించు;
నెంద తెల్లమి చేసిన నీసడించు, సర్వమును దల్లి యే యంచు సంతసించు.

సీ. తండ్రి దవ్వులఁగని తమకించి పరుగెత్తి, కలకలనవ్వుచుఁ గలియఁబోవు;
నాతఁ డెందులకేని యరుగుచో దైన్యంబు, గదుర నెక్కడికంచుఁ గదిసియడుగు;
తినుబండములు నాకుఁ దెత్తువా యిప్పుడే, వత్తువా యని వెంటఁ బఱచు నడుగుఁ;
దులకించుతొక్కుఁబల్కులు పల్కుచును వేడ్క, వచ్చి నాన్నాయంచుఁ బక్కఁ జేరుఁ;
తండ్రి పొరుగూరికేగిన తఱిని మాటి, మాటికిని 'నాన్న యేఁడి యమ్మా?' యటంచు
నడుగు; నీరీతిఁ దలిదండ్రులందుఁ జిన్న, పిల్లలకుసాజముగనుండు ప్రేమఁ గనమె?

చ. జనకులఁ బిల్లలిట్లు సహజంబుగఁ గూర్మిని జూచునట్లుగాఁ
గనఁబడుచున్న నందులకుఁ గారణ మాత్మ సుఖాభిలాష మే ౧
యనఁదగి యాత్మరక్షకుల నవ్విధిఁ జూచుట యెల్లవారికిన్
జననముతోడఁ బుట్టినదినాఁగ నిదర్శనమౌను జూడుఁడీ!

చ. కనుఁగొనఁ దల్లి లేనికసుఁగందులు దండ్రిని బాసినట్టి నం
దనులును బెంచువారె తమతల్లులు దండ్రులుగాఁగ వారికిం
జనవయి ప్రేమఁజూపరె? విచారణచేయఁగ సౌఖ్యహేతువౌ
జనమునఁదోఁచునేస్సు సహజమ్మగుణంబగు నాత్మరక్తికిన్.

---

(౧) 'ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి' శ్రుతి

గీ. పసితనంబిట్లు కడసంగ బాలికలకు, బాలురకు నాటలందు నిబ్బరపుఁగూర్మి
గదురు, నప్పుడు వారలాఁ కలియు దప్పి, కేనియును లెక్క చేయక యిల్లు మఱచి.

సీ. త్రొక్కుడుబిళ్ల, దూదుముఁ, బుల్లపిచ్చుకగూళ్లు, కాళ్లాగజ్జె, కుందికాళ్లు,
పచ్చాకు, సరిబేసు, లచ్చనగాయ, లొప్పులకుప్ప, దాఁగురుమూఁత, లిరుసు,
ఆలంకి, కొక్కొ, వానాలప్ప, గొబ్బిళ్లు, చీఁకటిమొటికిళ్లు, చెమ్మచెక్క,
గుడిగుడిగుంచాలు, గుజ్జనగూళ్లను, గుజగుజరేకులు, గోటిబిళ్ల,
కోఁతికొమ్మంచి, చెడుగుడి, కుండబంతి, పరుగుపందెము, లుప్పనఁబట్టె లనెడి
యాటలాడుచు నందు రేపాటనైన, వారివారికిఁ గనినట్లు వారువారు.

క. వారికి సహజము మధురాహారంబుల కోర్కి, మాఱ్కి నాటలతమి, యా
కూరిమి హెచ్చైయల్లరి, కారంభంబగును దాని నణఁపక యున్నన్.

చ. మన మతి కోమలంబు వలమానము బుద్ధి, తదింద్రియంబులున్
దినదినవర్ధమానములు తీవ్రము, లాటలకూర్మి హద్దు దాఁ
టినఁ జెడుచేఁత లబ్బుట కడిందియె వారికిఁ? గాన నెట్లు వం
చిన నటునంగు వారి మృదుచిత్తము పెద్దలు వంపఁగాఁదగున్.

చ. గురుజనశిక్ష గల్గినను గొందఱచిత్తము మంచి త్రోవకుఁ
దిరలకయున్నచందము జనులుం గులవిద్యలు నభ్యసింపఁ బాలురు
తఱితోడిశిక్షఁ జనులుం గులవిద్యలు నభ్యసి పఁ గూ
ర్తురుగద, దానివారితమిఁ దోఁచిన మూఁడవ మార్పనందగున్

మ. అది కౌమారము, నిర్విచారదశ, విద్యావృత్తి ధర్మగ్రహా
స్పదకాలంబు, వికస్వరామలమనీషామానసంబున్ భవి
ష్యదవస్థాదృఢమూలబంధమగు ప్రాయం, బందు వారేమి నే
ర్చెదరో దేనికిఁగూర్తురో యదియ తచ్చిత్త స్థిరం బయ్యెడిన్.

చ. ఒకనికి విద్యయందు మఱియొక్కనికిం గ్రయ విక్రయంబులం
దొకనికి శిల్పమందు నిఁకనొక్క నికిన్ వ్యవసాయమందు నొ
క్కొకనికి దారులోహవసనోప లమృత్క్రియ లందు వారి వా
రికి మది కెక్కినట్టి కలఁ బ్రేమ దగుల్కొను జీవికార్థమై.

చ. అఱువదినాలుగుంగలలయం దెదియో కల యొక్కఁడొక్కఁడున్
గలుచును బ్రీతి, నొకలకుఁగాని వృథామతి చోరకర్మమే

నెఱుఁగునుగాని యూరకొనఁ, డింత నిజంబు వివక్షచేయ నే
తెఱుఁగునునైన జీవనగతిం దలపోయనివెఱ్ఱు లుండురే?

శా. ఆకౌమారముసం గుమారకులయభ్యాసంబు లెట్లుండునో
లోకజ్ఞానము వర్తనం బెనయుమేలుం గీడునట్లుండు, నా
లోకింపన్ ఋజువర్తనంబునకు నెట్లున్ మేలగుంగానఁ దా
మాకాంక్షింపఁదగుం గుమారులు సదభ్యాసంబులే యాత్మలోన్.

చ. అరయమిఁ జేసి యల్పమతియాత్మసుఖంబున కెల్ల భంగులన్
దొరఁకొనుచుండుఁగాని, సుఖదుఃఖము లెప్పుడు దైవయుక్తిచే
దొరకొనునందు నాతనికిఁ దోఁపదు, కావున దైవచింత నే
నరుఁడును సాధువర్తనమునన్ సుఖయత్నముచేయఁగాఁ దగున్.

ఉ. కొందఱు చిన్ననాఁడు చెడుకూరిమి పాల్పడి బుద్ధిహీనులై
క్రిందును మీఁదుఁగానక చరించుటచేఁ గడగండ్లమారులై
వందురుచుందు రెందు నెలప్రాయమువచ్చిన వెన్కఁ గాన నే
ర్వందగు జీవనంబున కుపాయము గోర్కె మెయిం గుమారకుల్

గీ. కొంతమందికుమారు లత్యంతభక్తిఁ, దల్లిదండ్రులనుడి జవదాఁటకుండ
నిజకులోచితవిద్యలు నేర్చికొంద్రు, మానసము తత్కలాభ్యాసమగ్నముగాఁగ.

గీ. ఎవరిచిత్తంబు లేవృత్తు లిచ్ఛగించి, తత్ఫలప్రాప్తికెంతయుఁ దత్తఱించు?
సకలమర్త్యాదిప్రేమ రక్షణముచూవె, కోర్కెలన్నింటికినిబ్రేమ కుదురుగాదె?

సీ. తఱివేచి బీళ్లఁబుంతలఁ ద్రిప్పియయ్యాయి మృగములకడుపుల మేపువారు;
అదనుగన్గొని దున్ని పదనార వెదచల్లి, కలుపుతీయుచుఁ జేలు కాచువారు;
కొనుగోలు నమ్మకంబును గాంచి ధరవార్త లెఱిఁగి బేహారంబు నెఱపువారు;
పనివానితనము మెప్పునుగాంచ బహువిధ శిల్పకర్మంబులు చేయువారు;
నగుచు నయ్యా కుమారకులాత్మవృత్తు లభ్యసించుచుఁ, గోర్కెమైనందు నేర్పు
గదుర గడిదేఱుచుంటకుఁ గారణంబు, భావికాలాత్మ సుఖలాభ పరతగాదె?

సీ. కష్టదీనమగు మాధుకరజీవనంబుగా వించివేదములు వల్లించువారు;
పరదేశములకేగి గురుకులావాసకష్టములోర్చి శాస్త్రముల్ చదువువారు;
పూఁట కొక్కొకయింటి కూటి కాసించియాసించికావ్యములు పఠించువారు;
అరుదైన యొజ్జల నాశ్రయించుచు వాద్య నృత్తగీతంబులు నేర్చువారు;
నగుచు నభిలాష మభిరుచి యభిమతంబు, దీరనావిద్యలం దెల్ల నారితేఱు;
వారలెందఱు లేరందుఁ గారణంబు, భావిసుఖకీర్తి ధనలాభపరతగాదె?

# ఆంధ్రులు

న్యాయమూర్తి శ్రీ వేపా రామేశం గారు

ఆంధ్రవంశపు రాజులకు ఆంధ్రభృత్యులనియు, శాతవాహనులనియుఁ గూడఁ బేరు. మత్స్య, వాయు, బ్రహ్మాండ, విష్ణు, భాగవత పురాణములలో ఈవంశపురాజుల పేళ్ల పట్టిక యీయఁబడినది. పురాణమునందలి పట్టిక లన్నిటిలోను మత్స్యపురాణములోనిది శ్రేష్ఠమైనది. కలకత్తా హైకోర్టు న్యాయమూర్తిమైన పర్జిటరుగారు పౌరాణికవృత్తాంతములను పరిశీలనాదృష్టితోఁ జదివి, తుదకు పౌరాణిక మూలము లన్నియు ఆదిభవిష్య పురాణము నుండి గ్రైకొనఁబడినవని తేల్చియున్నారు. (Vide, The Purana Text of the dynasties of the Kali age by F. E. Pargiter) పురాణములందు వర్ణింపఁబడిన యీ వంశ మున్నదనుటకు శాసనములును, నాణెములును దాఖలా యిచ్చుచున్నవి. యీవంశము వారి మొదటి శాసనములు నానాఘాటు, నాసిక, కన్హేరీలలో మాత్రమే కాన్పించుచున్నవి. ఇవియన్నియు బొంబాయి రాజధానిలో బొంబాయి పూనాల కుత్తరమున గలవు. ఇందున బట్టియు, ఋగ్వేదములోని మైతరేయ బ్రాహ్మణమునం దాంధ్రులు వింధ్యపర్వతముల కుభయపార్శ్వములనుండు పుండ్ర, శబర, పుళిందులతోఁ బాటు పేర్కొనంబడి యుండుటంబట్టియు చూడఁగా మొదటి ఆంధ్రులు నిజాం రాష్ట్రమందలి యిప్పటి పైతానుప్రాంతప్రదేశమున నెచ్చటనో పరిపాలించినట్లు ఊహింపవచ్చును. ఈవంశపు రాజులలో నిస్సందేహముగ గౌతమపుత్ర శాతకర్ణియే శ్రేష్ఠుఁడు. అతనిరాజ్యము దక్షిణముగ నొకవేళ కృష్ణాతీరమునకు వ్యాపించియుండవచ్చును. అందు గుంటూరు మండలమందలి సత్తెనపల్లిదగ్గటి అమరావతి చేరియుండుట మాత్రము నిశ్చయము. గౌతమపుత్రుని తరువాతి రాజులరాజ్య ముత్తరమున తగ్గి, గౌతమపుత్రుఁ డేలిన తెలుఁగు భాగము మిగులుటచేతఁ గావచ్చును. వారి శాసనములు తెలుఁగుదేశమున మాత్రమే కానవచ్చుచున్నవి. ఈ విషయముల ననుసరించి వింధ్యపర్వత ప్రాంతమున మొదట నొకతెగగా నుండిన ఆంధ్రులు ఆటుతరువాత ఇప్పుడు తెలుఁగుదేశ మనఁబడుదానిలో గొంత భాగమునకుఁ దమపేరు పెట్టిరనియు, అటుతరువాత నీ దేశమునకు ఆంధ్రదేశమని, ప్రజలకు ఆంధ్రులని, భాషకుకూడ ఆంధ్రభాషయని పేరువచ్చెననియు నూహింపవచ్చును.

ఈ వంశమునందలి మొదటిరాజుల చరిత్రతో మనకు జోక్యము లేకపోవుటచేత మనకథ గౌతమపుత్ర శాతకర్ణితోఁ బ్రారంభింపవచ్చును. ఆంధ్రరాజులలోఁ జాలమందికి పేరుచినర శాతకర్ణి అనుపదము కలదు.

వారిలో తల్లిపేళ్లనుబట్టి తెలియవచ్చువారు కొందఱు కలరు. ఉదాహరణము గౌతమీపుత్రుఁడు; వసిష్ఠీపుత్రుఁడు; మాధవీపుత్రుఁడు. శాలివాహన అనునది శాతవాహన పదముయొక్క ప్రాకృతరూపము. అందువలన 'శాలివాహన, అనునది నిజమునకు ఒక రాజుపేరు కాదు. ఒక రాజవంశముపేరు. క్రీ. శ. ౭౮ లో శకము స్థాపించినవాఁ డని చెప్పఁబడు శాలివాహనుఁడు ఈ వంశమువారిలో శ్రేష్ఠుఁడై యుండవలెను. రాజ్య విస్తారమునుబట్టి చూచినను, సైనిక విజయములనుబట్టి చూచినను ఈ వంశమువారిలో గౌతమపుత్ర శాతకర్ణియే నిస్సంశయముగ శ్రేష్ఠుఁడు. ఈతఁడే యొకవేళ శకస్థాపకుఁడైన శాలివాహనుఁడై యుండవచ్చును. పుదుచ్చేరియందలి జోవ్యో డుబ్రెయల్ దొరగారి మతప్రకారము శకులనఁబడు సిథియనుల నోడించినవాఁడు క్షాత్రప వంశజుఁడైన చస్తనుఁడు. ఈతఁడు గౌతమీపుత్రుని క్రింద రాజప్రతినిధిగ నుండెను. శకులను జయించినవాఁ డీతఁడే యనియన్నను, రాజుగాక అతనికి సేనాధిపతిగనో, సామంత రాజప్రతినిధిగనో యున్నయాతఁడు శకము స్థాపించినాఁ డనుట సంభావ్యముగ లేదు. అదిగాక శాలివాహన శకస్థాపకుఁడు క్షాత్రపరాజను ప్రతీతి లేదు. సంగతు లన్నియు నీశకము శాలివాహన వంశమువారి దనిచెప్పుటకే సరిపోవునపుడు ఈ శకస్థాపనమును ఏ యితరవంశపు రాజునకో ఆరోపించుటకుఁ గారణము కనఁబడదు. గౌతమీపుత్రుఁడే శాలివాహన శ్రేష్ఠుఁడని, నిశ్చయించుటచేతను, అతఁ డతని శాసనముల ననుసరించి ౨౪ సంవత్సరములు పరిపాలించె నని తెలియుటచేతను ఆతఁడు క్రీ. శ. ౭౮ మొదలు ౧౦౨ వఱకు రాజ్యము చేసి యుండవలెను. ఆతనిశాసనములలో రెండు నాసికలో నున్నవి. ఒకటి కార్లిలోఁ గలదు. అసిక, అస్మక, మూలక, సురఠ (సౌరాష్ట్ర), కుకుర, అపరాంత, అనూప, విదర్భ, అకర, అవంతి, వింధ్య, అచవట (సాత్పూరా కొండలు), పరిచట, సహ్య (సహ్యద్రి కొండలు), కన్హగిరి, మాక, శ్రీతాన (శ్రీశైల), మలయ, మహేడా, (మహేంద్ర), శ్వేతగిరి, చకోరములకు ఆతఁడే యధిపుఁడు. ఆతని తల్లిపేరు గౌతమీ బాలశ్రీ. ఆతనిభార్య వాసిష్ఠి. ఆతని కుమారుఁడు. వాసిష్ఠీపుత్ర శ్రీపులమాయి.

ఆతని కుమారుని పరిపాలనమునాఁటి శాసనములు అమరావతి, నాసిక, కార్లిలలోఁ గానవచ్చుచున్నవి. వాసిష్ఠీపుత్ర శ్రీపులమాయి క్రీ. శ. ౧౦౨ మొదలు ౧౩౦ వఱకు పరిపాలించెను. గ్రీకుచరిత్రకారుఁడైన టాలెమీ ఈతనిని పేర్కొనియున్నాఁడు. పైఠాణ ఆతని రాజధాని యని పేర్కొనఁబడినది (సం ౯-౧౮౨). పరిపాలనా ప్రారంభదశలో పు॥మాయికి ఆతనిముత్తవతల్లి బాలశ్రీ బహుశః తోడ్పడియుండవచ్చును. ఈమె శాసనము నాసికలోఁ గలదు. పులమాయి తరువాతిరాజు వసిష్ఠీపుత్ర శివశ్రీ. బహుశః ఈతఁడే క్షాత్రపరాజగు రుద్రదమనునిచే నోడింపఁబడినవాఁడై యుండవచ్చును.

రుద్రదమనుఁడు గౌతమపుత్రుని క్రింద రాజ
ప్రతినిధిగనుండిన చష్టనుని మనుమఁడు. గుజ
రాట్‌లోని జూనాగ్‌గడములోఁ గల క్రీ. శ.
౧౫౦ నాఁటి రుద్రదమనుని యొక శాసనము
ననుసరించి యాతఁడు శాతవాహనుల నోడించి
నట్లును, దగ్గఱబంధుత్వ ముండుటచేత శాత
వాహనరాజును జంపక విడిచినట్లును తెలియు
చున్నది. కనేహరిలోని యొకానొకశాసనము
న వసిష్ఠీపుత్ర శాతకర్ణిరాణి మహాక్షత్రప
రుద్ర...... కూఁతురని తెలుపఁబడినది. ఇందున
బట్టి రుద్రదమనుఁడు ఒకానొకశాతవాహన
రాజుమామగారని యూహింపవచ్చును. కాని
యీ క్రింది వంశవృక్షము ప్రకారము పుల
మావి రుద్రదమనుని అల్లుఁడగుటఁ అసాధ్యము,

గౌతమీపుత్రుఁడు..సమకాలికుఁడు..చష్టనుఁడు
| (క్రీ. శ. ౭౮-౧౦౨) |
పులుమావి(క్రీశ౧౧౨-౧౩౦)జయదమనుఁడు
|
రుద్రదమనుఁడు
(క్రీ. శ. ౧౩౦-౧౫౦)

కావున శివశ్రీకూడ వాసిష్ఠీపుత్రుఁ
డగుటచేత అతఁడైన రుద్రదమనుని యల్లుఁడై
యుండవలెను; లేదా, అతనితరువాత వచ్చి
నశివస్కందుఁడుకూడ వసిష్ఠపుత్రుఁ డగునేని
అతఁడైనఁ గావలెను. అమరావతిలోని 'శ్రీ
శివ మాక శాత' అనురాజుశాసనము బహుశః
శివశ్రీదై యుండవచ్చును. శివశ్రీ క్రీ. శ.
౧౩౦ మొదలు ౧౩౭ వఱకు ౭ సం౹లు పరి
పాలించెను. శివశ్రీ తరువాత వచ్చినవాఁడు
శివస్కంద శాతకర్ణి. అతఁడు ౧౩౭ మొదలు
౧౪౪ వఱకు నేడేండ్లు పాలించెను. అతని
తరువాతివాఁడు యజ్ఞశ్రీ శాతకర్ణి క్రీ. శ.
౧౪౪ మొదలు ౧౭౩ వఱకు రాజ్యమేలెను.
ఇతని శాసనములు నాసికలోను, కన్హేరిలోను
కృష్ణాజిల్లాలోని చిన్నా అను గ్రామమునను
గానవచ్చుచున్నవి. అటుతరువాత మఱి
ముగ్గురురాజులు కలరు. (౧) విజయుఁడు (౨)
చండశ్రీ (౩) రెండవ పులమావి. రెండవ
పులమావిశాసన మొకటి బళ్లారిజిల్లాలోని
మైకదోనిలోఁ గానవచ్చుచున్నది. వింధ్య
పర్వతముల కుత్తరమున మహాక్షత్రపుఁ
డగు రుద్రదమనుఁడు లాగుకొనిన ఆంధ్ర
రాజ్యమును చివర ఆంధ్రరాజులు తిరిగి సం
పాదింపలే దనుట స్పష్టము. పురాణముల
ప్రకార మీ వంశము ౪౩౦ సంవత్సరములు
పాలించినపిదప క్రీ. శ. ౧౯౬ వ సంవత్సర
ప్రాంతమున ఆఖరైయుండును. ఈ వంశము
శ్రీముఖునితో క్రీస్తు పుట్టుటకుఁ బూర్వము
౨౩౪వ ప్రాంతమున ప్రారంభమై యుండవలెను.

అశోకుఁడు తన శాసనములలో నీ వంశ
మును పేర్కొనియున్నాఁడు. శాలివాహన
శకము; తెలుఁగుదేశమునకు, భాషకు, ప్రజ
లకు వచ్చినపేరు ఇవిమాత్రమే యీ వంశము
వారి వని చెప్పుకొనుటకు నేఁటికిని మిగిలి
యున్నవి. ఆంధ్రుల శాసనములు ప్రాకృత
భాషలో, బ్రాహ్మీలిపితో నున్నవి. ఈ లిపి
లోనే మహాచక్రవర్తి అశోకుని శాసనములు
కలవు. ఆధునిక ద్రావిడలిపి దీనినుండియే
వచ్చినది. ఈ వంశమువారు బౌద్ధభిక్షువులకు
దానధర్మములు చేసినట్లు కనుపట్టుచుండుట
చేత వారు బౌద్ధమత పోషకులని చెప్పవచ్చును.
ఆంధ్రవంశమువారి నాణెములను గుఱించి
రేప్సన్ దొరగారి భారతీయ నాణెముల పట్టిక
(Rapson's Catalogue of Indian Coins)
అనుగ్రంథమున వివరముగఁ గలదు.

## ఆంధ్రులు లేక ఆంధ్రభృత్యులు లేక శాతవాహనులు
## ఆంధ్రదేశము పరిపాలించిన యీవంశపు రాజులపేర్లు

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి | (పరిపాలనము | క్రీ. శ. ౭౮ | మొదలు | ౧౦౨ | వఱకు) |
| (2) వసిష్ఠీపుత్ర శ్రీపులమాయి | ... | క్రీ. శ. ౧౦౨ | ... | ౧౩౦ | ... |
| (3) వసిష్ఠీపుత్ర శివశ్రీశాతకర్ణి | ... | క్రీ. శ. ౧౩౦ | ... | ౧౩౭ | ... |
| (4) శివస్కాంద శాతకర్ణి | ... | క్రీ. శ. ౧౩౭ | ... | ౧౪౪ | ... |
| (5) గౌతమీపుత్రయజ్ఞశ్రీశాతకర్ణి | ... | క్రీ. శ. ౧౪౪ | ... | ౧౭౩ | ... |
| (6) విజయుఁడు | ... | క్రీ. శ. ౧౭౩ | ... | ౨౭౯ | ... |
| (7) చండశ్రీశాతకర్ణి | ... | క్రీ. శ. ౧౭౯ | ... | ౧౮౯ | ... |
| (8) పులమాయి (రెండవవాఁడు) | ... | క్రీ. శ. ౧౮౯ | ... | ౧౯౬ | ... |

ఇందుకు ప్రమాణములు:—౧. పురాణములు

మత్స్య, విష్ణు, భాగవతపురాణములలో పైని పేర్కొనిన అందఱురాజులనుగుఱించియుఁ జెప్పఁబడినది కాని విష్ణు భాగవతపురాణములలో ఎవరెవ రెన్నేండ్లు పరిపాలించినది చెప్పఁబడియుండలేదు. వాయు పురాణమునందలి పట్టికలో మొదటి పులమాయి, శివశ్రీశాతకర్ణి శివస్కాంద శాంతకర్ణి - వీరిపేళ్లు లేవు; బ్రహ్మాండపురాణమున విజయుఁడుతక్క మిగిలిన అందఱు పేర్కొనంబడియున్నారు. పురాణపుపట్టిక లన్నిటిలో మత్స్యపురాణమందలిది ఉత్తమమైనది.

౨. నాణెములు

రేప్సన్ దొరగారు రచియించిన 'భారతీయనాణెముల పట్టిక' అను గ్రంథమున వసిష్ఠీపుత్ర శ్రీపులమాయి నాణెములను గుఱించి ౨౦-౨౩ పుటలలోను, శివశ్రీనాణెములను గుఱించి ౨౯ వ పుటలోను, చండశ్రీనాణెములను గుఱించి ౩౨-౩౩ పుటలోను, గౌతమీపుత్రయజ్ఞ శ్రీశాతకర్ణి నాణెములనుగుఱించి ౩౮-౪౧,౪౫ పుటలలోను వివరముగఁ దెలుపఁబడినది. ౨౪ వ పుటలో శ్రీ...స్వామి అనువాని నాణెములనుగూర్చి తెలుపఁబడినది కాని యీతఁడెవరో వివరముగఁ దెలియవచ్చుటలేదు. కడపలో దొరికిన శాతవాహనులకు సంబంధించిన కొన్ని నాణెములను గుఱించి ౨౫ వ పుటలోఁ దెలుపఁబడినది. కాని వాటిమీఁది పేరు స్పష్టముగఁ దెలియుటలేదు. ఇట్లే ౨౫,౨౬,౨౭,౨౯ వ పుటలలో మఱికొన్ని ఆంధ్రరాజులనాణెములనుగూర్చి తెలుపఁబడినది. ఈ నాణెము లన్నియుఁ దెలుఁగుమండలములలో దొరకినవే కాని వాటిమీఁది పేళ్లుకూడ స్పష్టముగఁ దెలియకపోవుటచేత అవి యెవరివో చెప్పుటకు సాధ్యముకాదు. ౪౬,౪౭ పుటలలో శ్రీరుద్రశాతకర్ణి యని చెప్పబడు నాణెములను గుఱించి కొంత తెలుపఁబడినది కాని యీతనిపేరు పురాణాదులలోఁ గానరాదు.

# సంకేతాక్షరములకు వివరణపట్టిక

| | |
|---|---|
| ఎ. ఇం. | ఎపిగ్రాఫియా ఇండికా. |
| పు. | పుట. |
| సం. | సంపుటము. |
| పట. | పటము. |
| ఆ. స. వె. ఇం. | ఆర్కియలాజికల్ సర్వే వెస్టర్న్ ఇండియా. |
| అ. లూ. నెం. | అప్పెండిక్సు లూడర్సు నెంబరు. |
| ఆ. స. సౌ. ఇం. | ఆర్కియలాజికల్ సర్వే సౌత్ ఇండియా. |
| బొం. గెజ. | బొంబాయి గెజటీర్. |
| భాం. ట్రాన్స్. ఇంటర్. ఓకాం. | భాండార్కరు ట్రాన్సాక్షన్సు ఇంటర్ నేషనల్ ఓరియంటలు కాంగ్రెస్. |
| ఎ. హి. డ. | ఎర్లీ హిస్టరీ డక్కను. |
| ఇం. ఏం. | ఇండియను ఏంటిక్వెరీ. |
| జ. బొం. రా. ఏ. సా. | జర్నల్ బొంబాయి రాయల్ ఏషియాటిక్ సొసయిటీ. |
| ఎ. రి. | ఎపిగ్రాఫి రిపోర్టు. |

## 3. ఆంధ్రదేశమును బరిపాలించిన ఆంధ్రవంశపురాజుల శాసనములు

| | రాజుపేరు | శాసనము ఉన్నస్థలము | పరిపాలన సంవత్సరము | వివరములు | శాసనవిషయములే గ్రంథములందు ప్రకటితమైనది. | విశేషాంశములు |
|---|---|---|---|---|---|---|
| 1 | గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి | నాసిక | 18 | రెండవపక్షము, వర్ష ఋతువు, ౧వదినము | ఎ.ఇ.సం౮. పు.౭౧పట: ౨:౪; ఆ.స.వె.ఇం.సం౪. పు౧౦౪. పట౫౩:౧౩; ఎ. ఇం. సం౧౦. అ. లూ. నెం౧౧౨౫రు. | |
| | | కార్లి | 18 | వర్ష ఋతువు,౪వ పక్షము, ౧వదినము | ఎ.ఇం.సం౭. పు౬౪ప౨:౧౯; ఆ.స.వె.ఇం.సం౪. పు౧౧౨ పట ౫౪:౨౦; ఎ.ఇం.సం౧౦.అ.లూ.నెం ౧౧౦౫ రు. | |
| | | నాసిక | 24 | గ్రీష్మఋతువు, ౨వ పక్షము౧౦వదినము | ఎ.ఇం.సం.౮. పు౭౩పట౨:౫; | |
| | | | 24 | వర్ష ఋతువు, ౪వ పక్షము, ౫వదినము | ఆ.స.వె.సం.౪. పు ౧౦౫,పట ౫౩:౧౪; ఎ.ఇం.సం౧౦.అ.లూ. నెం౧౧౨౬రు. | |

| | రాజు పేరు | శాసనము ఉన్నస్థలము | పరిపాలన సంవత్సరము | వివరములు | శాసనవిషయములే గ్రంథము లందు ప్రకటితమైనది. | విశేషాంశములు |
|---|---|---|---|---|---|---|
| 2 | వసిష్ఠీపుత్ర శ్రీపులమాయి (i) | అమరావతి | — | | ఆ.స.సౌ.ఇం.సం౧.పు౧౦౦, పట౫౬:౧; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౨౪౭రు. | |
| | | డిటో | 2 | హేమంతఋతువు ౪వపక్షము, ౬లేక ౭వ దినము | ఎ.ఇ.సం౭ పు౯౪పట౬:౨౫. ఆ.స.వె.ఇం.సం౪. పు౧౦౮, పట౫౪,పు౧౫. ఎం.ఇం.సం౧౦.అ.లా. నెం౧౧౪౮రు. | |
| | | నాసిక | 6 | గ్రీష్మఋతువు, ౫వ పక్షము | ఎ.ఇం.సం౭. పు౫౯,ప౩:౧; ఆ.స.వె.ఇ.సం౪.పు౧౦౮, పట౫౪,పు౧౬; బొం.గెజ.సం౧౬. పు౫౪౪; ఎ.ఇం.సం౧౦అలా. నెం౧౧౨౮ | |
| | | కార్లి | 7 | గ్రీష్మఋతువు, ౫వ పక్షము,౧వ దినము | ఎ.ఇం.సం౮ పు౬౧పట౨:౧౪; ఆ.సవె.ఇం.సం ౪ పు ౧౦౮, పట౫౪:౧౮. ఎ. ఇం. సం౧౦.అ.లా. నెం౧౧౦౦రు | |
| | | నాసిక | 19 | గ్రీష్మఋతువు, ౨వ పక్షము,౧౩ దినము | ఎ.ఇం.సం౭,పు౬౦,ప౧:౨ ఆ.స.వె.ఇం.సం౪.పు౧౦౭, పట౫౨:౧౭[౧౭౮౪ పు౩౦౮ భా.ట్రాన్స్.ఇంటర్.ఓ. కాం. ఎ.హి.డి. పు ౩౧౮ బొం.గెజ.సం౧౬. పుట౫౫౩; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౧౨౩రు. | |
| | | డిటో | 22 | గ్రీష్మఋతువు,— పక్షము, ౯వదినము | ఎ.ఇం.సం.౭,పు ౬౫,ప౨:౩. ఆ.స.వె.ఇం.సం౪. పు ౧౧౦, పట౫౨:౧౯. భాం.ట్రాన్స్.ఇంటన్.ఓ.కాం ౧౭-౮౪. పు ౩౧౪ ఎ.ఇం.సం.౮౦.అ.లా. నెం౧౧౨౪రు. | |
| | | కార్లి | 24 | హేమంతఋతువు, ౩వ పక్షము, ౨వ దినము | ఎ. ఇం. సం౮. పుట౮౧.ప౩:౨; ఆ. స. వె. ఇం. సం౪. పు ౧౧౩, పట౫౪:౨౧; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౧౦౬రు. | ౨౦వసం॥ రము హూడనీశాసనమునందు ఉదాహరింపఁబడినది. |

| | రాజు పేరు | శాసనము ఉన్నస్థలము | పరిపాలన సంవత్సరము | వివరములు | శాసనవిషయములే గ్రంథములందు ప్రకటితమైనది. | విశేషాంశములు |
|---|---|---|---|---|---|---|
| 3 | శివ శ్రీశాతకర్ణి. | కనేహరి | | | ఆ.స.వె.ఇం.సం౫-పు ౮౭, పట౫౧:౧౧; ఇం.ఏం.సం౧౨,పు౨౮౩; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౯౯౪రు. | ఇది వసిష్ఠపుత్ర శివశ్రీశాతకర్ణి రాణిది. |
| | | అమరావతి | | | ఆ.స.సా.ఇం. సం.౧. పు. ౬౧ పట౫౬:౨; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౨౮౯రు. | |
| 5 | యజ్ఞ శ్రీశాతకర్ణి | కన్హేరి | | గ్రీష్మఋతువు, ౫వ పక్షము | ఆ.స.వె.ఇం. సం౫. పు.౮౫, పట౫౧:౪; జ.బొం.రా.ఏ.సా.సం౬ ప.౪; ఎ.ఇం.సం.౧౦.అ.లా. నెం౯౭౮రు. | |
| | | నాసిక | 7 | హేమంతఋతువు, ౩వ పక్షము౧దినము | ఎ.ఇం.సం౭. పు౯౪,ప౧:౨౪. ఆ.స.వె.ఇం.సం౪. పు ౧౧౪, పట౫౫:౨౨ ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౧౪౬రు. | |
| | | కన్హేరి | 16 | మొదటిపక్షము, పంచమదివసము | ఆ.స.వె.ఇం.సం౫,పు.౮౯, పట౫౧:౧౪; జ.బొ.రా.ఏ.సా.సం౬ ప౪౪; ఎ.ఇ.సం౧౦.అ.లా.నెం౧౦౨౪ | |
| | | చిన్న (కృష్ణాజిల్లా) | 27 | హేమంతఋతువు, ౪వ పక్షము, ౫వ దినము | ఎ.ఇం.సం౧.పు.౯౬; ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం.౧౩౪౦రు. | |
| 7 | చండశ్రీ | కొడవగోలు (పిఠాపురము దగ్గఱది) | | | ఎ.ఇం.సం౧౦.అ.లా. నెం౧౩౪౧రు. | |
| 8 | రెండవ పులమాయి | మైకదోని (బళ్లారిజిల్లా) | | | ఎ.రి. సం॥౪ము ౧౯౧౫-౧౬. | |



# ప్రణయకోపము

అడివి బాపిరాజు గారు, బి. ఏ.,

ఏమీ చేసేదండి బాబు,
నేనేమీ చేసేదండి బాబు!
నా మాటామంతీ లేక-మత్తోరింటీకెళ్తే-ఏ॥

ఎట్టాగన్నేరంటి
ఏపూమొగ్గాపెదిమె
ఇట్టేవిరిచేసేసిందిసామి;
ఒట్టూపెట్టూకుంటానంది - దాని
చుట్టూగిరిసీగీసుకొంది - నేను
తిట్టూకొన్నానన్నీవింది - బాబు
నా చుట్టాలల్లోనాకు-చూపూతప్పించేస్తే-ఏ॥

ఎల్లాప్రేమించానో
ఎల్లాలాలించానో
చల్లావెలుగూచంద్రుడెరుగు;
పాలముకల్లావెళ్లీవచ్చినంత
పక్క-పిల్లాఅందీయివ్వకొంత
వేడి-నీళ్లూతానామాడిరొంత
పెరుగూఅన్నంమెక్కి- పిట్టల్లాగావ్రంటి- మే॥

జామాతోటాకన్న
సంగాపాలమూకన్న
వంగోలుపెదగిత్తకన్న,
ఎంతపొంగూతునేప్రేమలిస్తి;
సంతరంగూచీరాలెన్నొదెస్తి;
రెండు-బంగారపూమురుగులేస్తి;
పైన-బుంగాబుంగ్రాపూలబోస్తి;
పళ్లకొంగూకట్టిగ్రుంకులాడ్తి;
నా సంగాతంతాఎరిగి-సాగేపుట్టింటీకి-ఏ॥

గంటానిముసమైన
కాస్తఘడియలైన
నన్నొదిలితానుండలేదు;
కావి-డడితే కూడాబిందెతెచ్చె;
పొలముకదలా కూడూపట్టుకొచ్చే;
ఊరు-వదలా గుండెరొమ్మునాన్చె;
దానిపలుకూకులుకూ తీపి
వన్నె వెలుగూకనక-ఎన్నినాళ్లుంటాను-ఏ॥

నే నేమీ చేసేదండి బాబు
నే నేమీ చేసేదండి సామి
నా మాటామంతీ లేక-మత్తోరింటీకెళ్తే-ఏకిః ॥



# నీతిభవనము

## కొత్తపల్లి సూర్యరావు గారు

(తృతీయభూమిక)

శ్రీ మించు మించు మించుల
తోమురిపముచూపుజడల దూముడిగల
సామజముఖుదయ నలువది [యా
నేమపునీతులను వచ్చి నిల్చును మదిలోన్.

గీ. ఎన్నఁడును బల్కరింపక యున్నవారి
కైన సజ్జనులొసఁగుదు రరిగి ధనము
చేయి కొనిపోయి పెట్టు రుచిగలభోజ్య
వస్తువుల నాలుక కదేమి పలుకరించె? ౨

చ. అకలుషమానసు ల్పలుకు
నట్టికటూక్తుల మేలు చేకుఱున్
సకలుషమానసుల్పలుకు
చల్లనిపల్కులు మేలుచేయ లే;
వకుటిలవృత్తి శాక్యముని
యంపక అహ్వానతాళ్లో శూలికిన్
శుకతురగుండు వైచినవి
శుద్ధసుమంబులో ప్రీతి చూడుమా! ౩

గీ. ఒకరి యొద్దనున్న యొకవస్తు వదివారు
తమకు నీయ రేని దగినవాని
నొక్క మధ్యవర్తి నుంచికొందురు గోవు
పాలు దూడఁబెట్టి పడసినట్లు. ౪

గీ. ఒరుల కుపకరింపకయుండ నున్నలోభి
విత్తమును దాత గొని యిచ్చు పేదవారి
కబ్ధిలోనున్న యుప్పనీ రంబుదంబు
గ్రోలి పానార్హమగు వాన గురియునట్లు. ౫

గీ. గాఢమగు చెల్మి చెడి వెన్కఁ గదిసెనేని
దొంటిరీతి సుభావంబు లుంట కల్ల
యొలువఁబడియూకబియ్యము నుండి తొలఁగి
కలసినపుడుండునే యట మొలుచుశక్తి? ౬

గీ. అతిదృఢప్రేమగలయట్టి సతియుఁబతియు
నెప్పుడును నొక్కధర్మమే యెంచుచుంద్రు
తామరలఁ బోలు వికచనేత్రములు రెండు
నొక్కవస్తువునే చూచుచుండునట్లు. ౭

క. కడలేనిమెల్ల విద్యలఁ
బడసితిమని గర్జలేల పండితులారా!
దడబడలు సేయు జడధియుఁ
బడదే మునిచేత సందెవార్చెడు వేళన్? ౮

గీ. మనసును వశంబుగా నీక మట్టుమీఱు
కోపమును లోనలోననే కుదురఁబెట్టు
వఱదపొడిచిన నొడ్డలోపలనె నిల్పు
కొందురో పోతగట్టులు గొట్టివైతో? ౯

క. బలముగలవారిఁ జేరిన
బలహీనులుఁ బగఱఁగాంచి భయపడరెం
మలయల్లు జడలఁ గలయహి [దుర్
పులుఁగుల ఱేనిఁ గని భయముఁ బొందునె
[చెప్పుఁడా! ౧౦

గీ. తమకొఱంతలను దీర్చికోఁ దలఁప రొరుల
కొఱఁతలను దీర్పఁ బెద్దలు గోరుచుంద్రు
చంద్రుఁడందుంఁగి యిలఖరు ల్చెదరఁగొట్టఁ
జూచుఁ దనలోనికందు నెంచుకొనఁబోఁడు.

గీ. ఐదుదుష్టేంద్రియము లేచి యజ్ఞ నంటి
త్రిప్పచుండును బండితు శేఁపలేవు
చొరుగుతుక్కును సుడిగాల్లు చుట్టిత్రిప్పఁ
గాని తాతికంబంబును గదపఁగలవె? ౧౨

గీ. కష్టపడుచు నవద్వారకాయమందుఁ
బ్రాణములు పోకనిలుచుట బ్రంబు; చిల్లి
కుండలోఁ బోసినజలంబు లుండు ట బ్ర
మగునెకాజీపోవుటయ బ్రమగునొ చెప్పుడ?

గీ. హానివృద్ధులుగల యర్థ మరసి పెద్ద
లర్థులకు ననుగుణముగ నదన నొసఁగు
దురు; బహుళశుక్ల పక్షచంద్రునికిరణము
లవని కుపకారమొనరించు నట్లుగాను ౧౪

గీ. తఱుఁగనిధనంబుతోడ నుద్భవము నొంది
నారమని ధనులార! చెందకుఁడు గర్వ;
మంత బంగారుకొండ హేమాద్రి యొకని
మెడమ చేతనుబడివంగె నెఱుకలదె? ౧౫

గీ. జగముపైఁ బ్రీతిలేని యాజనున కెంత
ధనము భూములు నున్న వృథాతలంప
మూఁగవానికి సద్గ్రంథములును గన్ను
గ్రుడ్డివానికి దీపంబుఁ గొఱయెకాదె. ౧౬

గీ. తమ్ముఁ దమతాతతండ్రులఁ దలఁచి ఘనులు
హీనులను జేరి ధనమిచ్చి వృద్ధిపఱుతు
రాత్మగాంభీర్య మరయక యంబురాశి
యుప్పళంబునకుం బ్రాతి యుపకరించు. ౧౭

గీ. అర్థులకు దానమిచ్చి మా యయ్య వేద
వడియెనని పుత్త్రుఁడిచ్చుటయుడుగఁబోఁడు
పంక్తి గెల లోకమునకిచ్చి పడినయరఁటి
దుంపపిలకలు పెఱిగి ఫలింపకున్నె? ౧౮

గీ. శాంతవాక్యంబులకుఁ గడు జగము తుష్టి
నందుఁ గఠినోక్తులకుఁ దుష్టినంద దెపుడుఁ
జంద్రకిరణంబు వెడలిన జలధి యుబ్బ
సూర్యకిరణంబునకు నుబ్బ సూపునెక్కొ

గీ. సజ్జనులు రాఁగఁ బెద్దలు సమ్ముఖులగు
దురు విముఖులగుదురు రాఁగ దుష్టజనులు
తీయమామిడి పమ్యెర దిరుఁజిగురు
వెట్టు వసగాడ్పునకు బుల్ల విఱుగు ముదురు.

గీ. ఒరులకష్టములను గాంచి యుర్వఁ బెద్ద
లాత్మకష్టములట్టులె యడలువారు
తక్కునవయవములకు బాధజనియింపఁ
గన్ను గనుఁగొని దుఃఖించుఁ గాదె జగతి

గీ. లక్షణమెఱుంగనట్టి యల్పజ్ఞుచదువు
గడబిడలు లక్షణజ్ఞుని గనెడువఱకె
కలజగం బెల్లముంచెడు గంగయలవు
శంకరునిజడఁ గాంచిన సరుదుకొనదె. ౨౨

గీ. గుణముగలవారిఁ బండితు ల్గోరుచుంద్రు
కులముఁ బాటింపఁబోవరా గుణుల మెడలఁ
బాముతలఁబుట్టుమణి కాసపడినయట్లు
పాల్కడలివిసమున కాస పడరు గాదె. ౨౩

గీ. ఎంతవైరాగ్యచిత్తుండు నెంతతపసి
గాని సంతతకామినీగణపరిచితుఁ
డైన దిటవు చెడుం జీమ లనవరతముఁ
బ్రాఁక నఱుగదె కఠినంపురాయిగూడ. ౨౪

గీ. గుణులగుణములఁగనియును గొదవలెంచు
వారిగుణ మదియేమన వచ్చుఁ దేంట్లు
మధురముగఁ బాడుపూఁగుత్తి మాని వేప
కాయనేగద వెదకును గాకి వనిని. ౨౫

గీ. పండితులు మూఢు సేవింపవత్తు రేని
వారిగౌరవ మదితక్కువ యగునెందు
నెంతబరువైనవస్తువు లేని వచ్చి
పడవమెక్కినఁ దేలికపడవటయ్య! ౨౬

గీ. అల్పమూఢంబుతోఁ దోఁమ నధికు దేహ
పరిమితినిబట్టి విద్య నేర్పఁబడలేము
కిరణస్ఫూర్తిని కంటిపాప కెక్కినదియెంతొ
యంతయేగానిమింటలే దనఁగఁదగునె? ౨౭

గీ. కోవిదులు ప్రత్యుపకృతిని గోరకుండఁ
జేతనైనంత శ్రమపడి చేయుదు రుప
కృతిని దంతములే యుపకృతిని గోరి
నమలి రుచ్య పదార్థము ల్నాల్కకిడును?

గీ. అరఁటి పండక పచ్చికాయయును బనికి
వచ్చు ముసిఁడి ఫలించినఁ బనికిరాదు
కోపగించియుండియు ఘను లోర్కురువారి
కిడుదు రిడుదు రెయల్పులు హృష్టులయ్యు?

గీ. పరమపురుషుఁ తోఁగూడు భవ్యమతియు
దేహకష్టము లెక్కకుఁ దేడు మదిని
నిందుబింబంబులోనుండుమృగము భూమి
పైనిగలపెద్దపులిఁజూచి భయపడునెకో.

గీ. క్రూరుఁడై కాలుఁ డసుఘలు గొనఁగరాక
మునుపె దానధర్మంబులు చనును జేయ
నేఁటిరాకుండఁ గటగట్టు లేర్పరింప
కొత్తుకొనివచ్చినపు డేమి యొనరి చెదరు?

గీ. సజ్జనులు తమయాపద సరకుసేయ
కితరులకు సాయ మొనరింప నెంచుచుంద్రు
కట్టెఁగొని తలపైఁ గొట్టఁ గాఁ దలంప
హస్త మడ్డపడుం దన యలఁతఁ గనదు.

చ. చదివి సమస్తశాస్త్రములు
సారమెఱుంగఁగలేక యెవ్వఁడే
మొదలిడు ధర్మకార్యములు
ముఖ్యఫలం బొనగూర్ప వెన్నఁడున్
ముదిరినచేవబల్లదళ
ము న్మరిపంబునునైన తల్పుగాఁ
గుదిరిననేమి జేనెఁ డొక
గొండ్లెము లేక యదేమి చేసెడున్.

గీ. అల్పునకుఁ గిన్కరాకుండ నడఁగునట్లు
వలయఁ బొగడ నధికునకు వలదుగాదె!
చుట్టుదిరుగఁ జెఱువునకుఁ గట్టవలయు
వలయునే మహాంబునిధికిఁ దెలియు మయ్య!

గీ. యోగ్యునకు నిందపై భయముండుఁగాని
యుండు నేయయోగ్యునకు నాయదఁటు చె
జ్యోతిగలకన్నుచీఁకటి స్రుక్కు, లొట్ట(పుఁడ
కన్ను స్రుక్కునె ప్రళయాంధ కారమునను?

గీ. విద్యగలవాని మెత్తురు పెద్ద లెప్పు
డితరులకు వారితోఁ బని యేమిలేదు
అరఁటిపండునకును క్షీర మాసపడును
పుల్లకల్లేలపడు, నాన పోల్చికొనుఁడు. ౩౬

గీ. పాత్రునకు దాన మిత్తు రపాత్రునకును
లేదని వచింత్రు యోగ్యు లెల్లిదముచేసి
సస్యమున కైతేదరొయంత్ర జలము వనము
లోని మ్రోడులకై తైనరో నరయఁగ. ౩౭

గీ. ఘనుల మ్రోలను దనుగొప్పఁగానఁబలుకుచు
కొనెడు మూఢులయున్నతి కొంచెపడును
వింధ్యమంతటి కొండయు వీఁకదక్కి-
చదికిలం బడదే యగస్త్యముని మ్రోల?

గీ. మంచివారలతో మైత్రి మాటిమాటి
కెచ్చుఁగను జెడ్డవారితో నెచ్చఁబోదు
కాయముదిరినఁ గోయఁ బక్వమయి భోజ్య
మగును లేఁబిందె గోసిన నగు నెపండు?

గీ. పూవు వికసించినన్నాఁడె తావియుండు
మఱుదినంబున నుండియు మ్రగ్గిచెడును
అజ్ఞతోఁ జెల్మి చేసిన యపుడె సుఖము
పిదప నెల్లప్డు దుఃఖమే పెంచు నిజము.

గీ. హేమమయరత్నభూషల నెల్ల దాల్చు
రాజు లవిలేనికవులతో రారు తులకు
వివిధభూషణములు దాల్చు నవయవంబు
లక్షితాల్పని కన్నుతో నగునెయాడు?

గద్యము

ఇది సుప్రసిద్ధ శివప్రకాశస్వాములు రచియించిన నన్నెఱి యను ద్రావిడనీతిపుస్తకమునకుఁ గ్రొత్తపల్లి సూర్యారావు కావించిన యాంధ్రపరివర్తనము.

# నీతి భవనము

## ఉపోద్ఘాతము

అవ్వయారు:— పాండ్యులపరిపాలనములోని మధురలోఁ గడపటిసంఘ మున్న కాలముననుండిన పండితురాలు. ఆమె తండ్రి భగవన్, తల్లి, ఆది. ఈదంపతులు తా మేగ్రామములోనుండఁగా నేబిడ్డపుట్టునో యాబిడ్డ నాగ్రామములో విడిచిపెట్ట వలయునని శపథము చేసికొనిరి. చోళదేశములో ఉరయూరను గ్రామమున ధర్మశాలలో నుండఁగా నీ యవ్వపుట్టినది. ఈమెయే వారికి మొదటిసంతానము. తర్వాత మఱియేడ్గురు పుత్రులుపుట్టిరి. వీరిలో తిరువళ్లువనాయనారను నతఁడు విద్వాంసుఁడు. తమ యేర్పాటుచొప్పున నురయూరులోఁబుట్టిన బిడ్డను విడిచిపెట్టుటకుఁ దల్లికి మనస్సొప్పక విచారించునపుడామె తనతల్లితో నిట్లనియె.

మ. మనసారం దలపోసి నానొసటన
మ్మా! యేమిగా వ్రాసెనో?
తనహస్తంబులతీట దీర్చికొన నా
పై నంబుతాఁ జచ్చెనే?
యనుమానింపకు నన్నునీడ నిసుమం
తైన స్వేచ్ఛారంబులే
దనుకొన్నట్టులు మీరు పొందు సుఖదుః
ఖాదుల్ పరుద్దెత్తురే?

అని చెప్పినఁ దల్లి సమాధానమున నక్కడ విడిచిపోయెనట. పిమ్మట నాబిడ్డ నొకపానకులుఁ బెత్తిపెంచెను. కాలక్రమమున నవ్వ యతిసూక్ష్మముగఁ జదువునేర్చి యప్పుడున్న చదువుకొన్నస్త్రీలలో మిన్నయై యుండెను. అఱవమునఁ గవిత్వము నేర్చెను. ఈమె యనేక గ్రంథములను రచించెను వినాయ

కర్ అఘవల్, ఆత్తిసూడి, కొంన్రైవేందన్, మూదురై, నల్వళి, జ్ఞానకురళ్, వాక్కుండాం, మొదలైనవి. పై గ్రంథములలో, ఆత్తిసూడి, కొండ్రైవేందన్, రెండును సూత్రప్రాయముగానుండు నీతులగుటచే ననేకులనేక భాషలలోనికి వ్రాసికొనిరట. తెనుగులో, అవ్వగారి మన్వప్రనీతు లివియే.

అవ్వగారి తమ్ముఁడు తిరువళ్లువనాయనార్ తిరుక్కురళ్ అను గ్రంథమును, ధర్మార్థకామములమీఁద ౧౩౩౦ పాటలు (అర్ధవృత్తములుగ) రచించి యక్కగారికిఁ జూపించెను. తమ్మునికంటె బుద్ధి సూక్ష్మతగల యవ్వగారు చదివి నాల్గపదియగు మోక్షపురుషార్థమును గూడఁ జేర్చి యొక్క పద్యములో నిట్లు చెప్పెను.

గీ. అర్థులకొసంగునదె ధర్మ, మార్జవమున
గడన చేసిన దేయర్థ, ముడుగ కేక
మతిని, దంపతు లుంటె కామంబు నిట్టి
మూఁటి విడిపరునిగనుట మోక్షమగును.

తిరుక్కురళ్ - తెనుఁగులో నర్థకందములలోఁ గలవు. ఈమె కాలములో, పుగళ్ళేంది, ఒట్టకూత్తన్, కంబర్ మొదలగు పండితులుండిరట. ఈమె యితరులను గృహస్థాశ్రమమున నుండుమని బోధించుచుఁ దానుమాత్రము యావజ్జీవము కన్యగానే యుండెననియు, నిన్నూటనలువది యేండ్లు జీవించెన నియుఁ జెప్పుదురు.

ఈయవ్వ విఘ్నేశ్వరభక్తురాలు. నిత్యమును దీక్షఁబూని శాంతమతితో విఘ్నేశ్వరుని బూజించుచుండునది. ఒకనాఁడు తొందరపడుచుఁ బూజ శీఘ్రముగా ముగింపఁబోయిన నది విఘ్నేశ్వరుఁడెఱిఁగి యేల నీవిట్లు తొందరపడుచున్నదానవని యడిగెనఁట. "దేవా! సుందరమూర్తినాయనారు, చేరమాన్ పెరుమాళ్ నాయనారును కైలాసమునకుఁబోవుచున్నరు శీఘ్రముగా రమ్మని" రని పల్కెనఁట. నీకేమియుఁ దొందరవలదు, యథాప్రకారము పూజసేయుమని చెప్పి పూజ ముగిసిన పిమ్మట నామెను దనతొండముతో మీఁదికెత్తి కైలాసములో మెల్లఁగా విడిచెనఁట. తర్వాత ముందుగా బైలుదేరిన సుందరమూర్తినాయనారు మొదలైనవారు వచ్చి యాశ్చర్యపడి నీవ్రమాకంటె వేయిరెట్లు వెనుక బైలుదేఱి మాకంటె ముందెట్లు వచ్చితివని యడిగిరఁట. అపుడు

గీ. ఏనుగును దేరు గుఱ్ఱము నెక్కిమీరు
వడిగవచ్చితి రే విఘ్నపతికటాక్ష
మునను మెల్లఁగఁ జేరితి వినరెసామ్య
మవ్వయనుగుఱ్ఱమును నేక మయ్యె ననుట.

అని యామె వారితోఁబల్కెనఁట. ఈమె మహిమ లెన్నియో చెప్పెదరు.

(౨) శివప్రకాశస్వాములు:— మునున్నూఱు సంవత్సరములనాఁడు కాంచీపురములో కుమారస్వామిదేశికులని యుండిరి. వీరు తొండమండలము వెల్లాలవారికి దీక్షాగురువు. వీరికి ముగ్గురు తనయులు. పెద్దవాఁడు మన శివప్రకాశస్వామి, రెండవవాఁడు కరుణైప్రకాశస్వామి, మూఁడవవాఁడు వేలప్పస్వామి. వీరిబాల్యమునందే తండ్రిగారు శివలింగైక్యమును బొందిరి. కాఁబట్టి తమకుఁ

జదువు చెప్పువారులేక తమ్ములతోఁగూడి శివ
ప్రకాశస్వామి తిరుచునాపల్లి జిల్లా పెరంబ
లూరుతాలూకాలోని వాలికండపురము సమీ
పముననున్న తుఱైమంగళమను గ్రామమునకుఁ
బోయి యొకతోఁటలో శివపూజచేసికొను
చుండఁగా నాగ్రామాధిపతి యణ్ణామలై రెడ్డి
వారి కక్కడ నొక మఠముగట్టించి యందుండఁ
బ్రార్థించిరి. మంచిదని రెండేండ్లుండి, తామిల్లు
విడిచి వచ్చినది చదువుకొనుటకుఁగదా యిక్కడ
నుండనేలయని రెడ్డిగారు మున్నూఱువరా
లిచ్చినఁ బుచ్చుకొని తిరునల్వేలిజిల్లాలోఁ దామ్ర
పర్ణీతీరమున, చిందుపూందురై యను ధర్మ
పురాధీనమందున్న వెల్లియంబళవాణస్వామి
యొద్దకుఁజని మాకు వ్యాకరణశాస్త్రము నేర్పు
మని కోరిరి. వీరికి సాహిత్యమెంతవఱకున్నది?
శాస్త్రము చదువుటకు శక్తియున్నదా? యని
తెలిసికొనుట కాగురువుగారు "ఆద్యంతముల
యందు, 'కు' అను నక్షరమువచ్చునట్లు, నడుమ
"ఊరుక్షైయాన్" అను పదమువచ్చునట్లు పద్య
ములను రచింపుఁడని యాజ్ఞాపించి వారి సామ
ర్థ్యముం దెలిసికొని సంతోషపడి ముగ్గురకుఁ
బంచలక్షణములతోఁగూడిన వ్యాకరణశాస్త్ర
మును గఱపించిరి. రెడ్డిగా రిచ్చిన మున్నూఱు
వరాలుగురుదక్షిణగాసమర్పింపఁబోయినశిష్యు
లతో గురువుగారు, నాకు మీరు గురుదక్షిణ
యీయఁదలఁచితి రేని, తిరుచ్చెందూరులో నొక
గురు తిరస్కారి యున్నాఁడు; వాని నోడించి
రండు; ఓడించి వచ్చుటయే నాకు గురుదక్షిణ
యిచ్చినంతఫలము మీ కొసంగును పొండనిరి.
తోడనే వారు ముగ్గురు గురుతిరస్కారి కడ
కేగి, గుడిలోఁ గూర్చున్నవానింజూచి, నీతో
వాదింప వచ్చినారము; నీవు పండితుఁడవై
నచో, నాద్యంతయమకముగల ముప్పది
పద్యములు నిర్దోష్యముగఁ జెప్పు మని, చెప్ప
లేక నోరు తెఱచిన వానియొద్ద నా రీతిపద్య
ములు తాము చెప్పి, వాని లోఁబఱుచుకొని
గురుపాదముల యొద్దికిఁ దెచ్చిపెట్టి గురువు
వలన దీవనలంబొంది తమ మఠములోనికి
వచ్చి యనేకులకు వేదాంతము బోధించి
సలక్షణ గ్రంథములను రచించిరి. శివప్రకాశ
స్వామి ప్రభులింగలీల, తిరుక్కూవపురా
ణము, సిద్ధాంత శిఖామణి, వేదాంత చూడా
మణి, తర్కపరిభాష, శోణశైలమాల, వేంగై
అలంకారము, నన్నెఱి, భిక్షాటననవమణి
మాల మొదలగు నిరువదినాలుగు గ్రంథ
ములు రచించిరి. పెద్దతమ్ముఁడు కాళహస్తీ
శ్వరపురాణమును రచింప మొదలిడి ముగిం
పకయే మృతినొందెను. దానిని శివప్రకాశ
స్వామి కొంత పూరించుచు లింగైక్యము నొం
దిరి. వీరితమ్ముఁడు దానిని పూర్తిచేసి పేరూరు
పురాణాదు లనేకములు స్వయముగ రచిం
చెను.

శివప్రకాశస్వామి, పిళ్లైతమిళ్, మొద
లైన ప్రబంధములను శివజ్ఞానపాలయ స్వామి
మీఁద రచించి పండితపరిష్కృతము చేయిం
చెను. అణ్ణామలై రెడ్డిగారు పెండ్లి చేసికొమ్మ
నినను దిరస్కరించి కడపటికాల మంతయు
వేదాంతమార్గమునఁ గడపి ముప్పదిరెండేండ్ల
వయసున నల్లత్తూరులో శివైక్యము నొందిరి.

(3) నే నఱవము నేర్చికొనుచు మన తెనుఁగులో సుమతిశతకమువలెఁ బ్రచారములో నున్న యీ మూఁడు పుస్తకము నుజదివితిని. ఇందుఁ గొన్ని సంస్కృతసహాయమున నాకుఁ బూర్వపరిచితములవలెఁ గనఁబడినవిగాని పెక్కులు క్రొత్తగాఁ దోఁచినవి. నే నెఱింగనంతనే పండితలోకమునకుఁ దెలియక పోయియుండవు. సరళమని, కఠినమని యెన్నక నేర్చినట్లు మూలము ననుసరించి రచించితిని. నల్వాష్టిలోని ౩౮-వ పద్యమును విడిచితిని. ౮౦-వ పద్యమును, ద్రావిడ సంప్రదాయములను దెనుఁగున వివరింపఁ జాలక, స్వతంత్రించితిని.

అవ్వగారి మవ్వపునీతుల మూలమును, ఇప్పటి మూఁడుగ్రంథములను నాకు వివరించిన బ్రహ్మశ్రీ హరి సేతురామయ్యగారికిని, జంబుకేశ్వరనివాసులు తలముడుపు రాజగోపాలశాస్త్రి గారికిని వందనశతము నర్పించెదను. ఈ మూఁడుపుస్తకములును "వెణ్బా" యను ద్రావిడవృత్తములలోనున్నవి.

ఇట్లు సజ్జనవిధేయుఁడు
క్రొత్తపల్లి సూర్యరావు,
చెన్నపురము.

---

# అమ్మణ్ణి

**చింతా దీక్షితులు గారు బి. ఏ. ఎల్. టీ., (సాహితీసమితిసభ్యుడు)**

గంధము మెడకూ పూసుకొని
పసుపూ కుంకుం రాసుకొని
కంటికి కాటుక పెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! ౧

జడలో పువ్వులు తురుముకొని
తిలకము నుదుటా దిద్దుకొని
బుగ్గను చుక్కా పెట్టుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! ౨

కాళ్లకు గజ్జలు కట్టుకొని
చేతికి గొలుసులు పెట్టుకొని
దండలు మెడలో వేసుకొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! 3

నోట్లో బూరా పెట్టుకొని
చేత్లో ఛక్కా పట్టుకొని
పూవుల చొక్కా తొడుక్కొని
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! ౪

గాజుల చేతులు తట్టుతును
బోసి నవ్వులూ నవ్వుతును
చిటపట అడుగులు తొక్కుతును
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! ౫

ముద్దులు కులికే నీఆట
త్రిభువన మోహన కరమమ్మా!
సూర్య చంద్రులూ ఉండేదాకా
ఆడవె ఆడవె అమ్మణ్ణీ! ౬




# ఆర్షవిచారము

కౌశిక

## పూర్వపు పితృమందిరములు

గతసంచికలో 'డాల్మెను'లను చారిత్రిక పూర్వకాలపు కట్టడములనుగుఱించి ప్రస్తావన చేసియుంటిమి. ఈ 'డాల్మెను'లను నవియు వీటివలెనే చారిత్రకపూర్వకాలీనములయినట్టి కెయిర్నే, క్రామ్లెక్, కిస్ట్వేన్, అవెన్యూ, అనునవియు స్మారక మహాశిలల[౧] జాతిలో చేరినవి. వీటినిర్మాణమున పెద్దశిలల నుపయోగించుటచేతనున్ను, కీర్తిశేషులయిన పూర్వికులను స్మృతికి దెచ్చుటకుగాను నిర్మింపబడిన 'చిహ్నపుకట్టడములు'. ఇవి పలుతెఱంగులయి యుండుకారణమున వీటికి పైన పేర్కొనబడిన నామభేదములు కలిగినవి.

చెన్నరాజధానిలో నిపురాతనకట్టడముల యొక్కయు, శాసనములయొక్కయు పట్టావళులను తయారుచేసిన సివెల్ దొర యీ రాజధానిలో ననేకగ్రామములలో నిట్టికట్టడములున్నట్లు వ్రాసియున్నాడు. అందునను యీ డాల్మెనులు బహుసాధారణముగ కానవచ్చుచుండును. తెలుగుదేశమున వీటికి 'రాకసగుళ్లు' అని వాడుక పేరున్నట్లు తెలియవచ్చు

౧ వీటిని ఇంగ్లీషుభాషలో 'మెగలిథిక్ మాన్యుమెంటు' అందురు. మెగలిథిక్ అనుపదము గ్రీకుభాష నుంచి వచ్చినది. 'మెగస్' అనగా 'గొప్ప' యనియు 'లిథో' యనగా 'శిల' యనియు అర్థము. మాన్యుమెంట'ను పదము లాటిన్ భాషలో 'జ్ఞాపకముచేయు' అను అర్థముగల 'మనియొ' అను ధాతువునుంచి యుత్పత్తి యయినది. స్మృతికిఁ దెచ్చునదిగాన దీనికి 'స్మారకము' అను సంస్కృతపదము సరియగుచున్నది. 'లిథో' యను గ్రీకుపదము 'దృషద్' అను సంస్కృతపదమునుంచి వచ్చి యుండవచ్చును. ఈమార్పు యీక్రిందివిధమున వచ్చి యుండవచ్చును:—దృషద్, ద్లషద్, లిసద్, లిథ.

చున్నది. ఇవి చాల పురాతనమయిన కారణ
మున యీ పేరు వచ్చినదో లేక వాటియొక్క
ప్రత్యేకస్వభావమును బట్టియును, ఆకృతిని
బట్టియును యీ పేరు వచ్చినదో తెలియజాల
కున్నాము. వీటిలో ప్రసిద్ధికెక్కినవి నీలగిరి,
అనంతపురం, బళ్ళారి, గుంటూరు జిల్లాలలో
గమనించబడియున్నవి. ఇవిగాక యితర జిల్లా
లలోను ఇవి సామాన్యముగకనుబడుచుండును
రాజధానియంతటను పదిగ్రామముల కొకగ్రామ
మునకైనను నివి గానవచ్చును. నైజామునం
స్థానమున ఆర్షవిచారాధ్యక్షులయిన యజ్దాని
సాహెబులవారి రిపోర్టునుబట్టి యిట్టి స్మారక
'మహాశిలలు' గుల్బర్గ,కలుబరగి,రాయచూరు,
నల్లగొండ, వరంగలు (ఓరుగల్లు), కరీంనగర్,
నిజామాబాద్ జిల్లాలలో నున్నట్లు తెలియ
వచ్చుచున్నది.[౧] ఇవి అన్నివిషయములలోను
దక్షిణదేశములోనివాటిని బోలియున్నవి.
వీటినిగుఱించి యిప్పటికి సుమారు ౭౦ సంవ
త్సరములనుంచియు కర్నల్ మెడోస్ టెయి
లర్ మున్నగుపూరాతనాన్వేషకులు చర్చలను
సల్పుచు వ్రాసియున్నారు.

ఈకట్టడములన్నియు మృతినొందినవారికి
గాను స్మారకములు కాబట్టి సమాధివర్గము
లోనివనియే చెప్పవచ్చును. డాల్మెనులనునవి.
భూమిపైకి తెలియవచ్చునట్లు కట్టబడియుం
డును. తక్కినవి భూమిలోపలనే నిర్మింపబడి
యుండును. డాల్మెనులలో మూడుప్రక్క
లున్ను పైభాగమున్ను రాతిబండలతోగాని
చెక్కలతోగాని మూయబడియుండును.నాలు
గవప్రక్క పూర్తిగ తెరువబడియైన నుండును.
లేదా, అచ్చటి రాతిచెక్కలో ఒకరంధ్రము
చేయబడియుండును. దీనిక్రింద మంటిలో
చచ్చినవానిదేహము పూడ్చియుంచబడును.
ఇచ్చట అతనిపేరు చెప్పి యపుడపుడో, లేక
యేడాదికొకపర్యాయమో పూజాదులొనర్చ
బడి యాహుతులివ్వబడియుండవలెను. ఈయా
చారమునుబట్టియే వీటికి గుడియొక్కపదవి
తటస్థించి యివి జనులవలన 'రాకుసగుళ్లు'అను
నామమును పొందియుండవలెను. కాలక్ర
మేణ యీపూజలు నిల్చిపోయినమీదట
తరువాతివారు యీ కట్టడములపూర్వమును
తెలియక యనునైనగుడి యున్నదిగదా యని
యందొకశివలింగమును పెట్టుకొని దానికి
పూజాపునస్కారములఁ జేయఁ సాగియుందురు.
ఇట్లు శివాలయముగ మార్పుజెందిన డాల్మెను
లను రెంటిని అనంతపురంజిల్లాలోని కంబ
దూరు గ్రామములోనివాటిని గతసంచికలో
చిత్రరూపమున చూపియున్నాము.[౨]

ద్రావిడదేశపు దేవాలయములయాకృతికి
యీ డాల్మెనే మార్గదర్శియనియును దీని నను
సరించి యీ దేవాలయముల వాస్తువున్ను
ఆకారమున్ను నిర్ణయింపబడినవని కొందరి
యభిప్రాయ మయియున్నది.[౩] ఇది యెంత
వరకు రూఢియో మనము నిర్ణయింప నిపు

౧. ౧౯౧౫-౧౬సం॥ నైజాము ఆర్కియలాజికల్ రిపోర్టు పుట ౬. ౨. ఇవి మదరాసు ఆర్కియలాజికల్ డిపార్టుమెంటువారి ౧౯౧౫-౧౬ రిపోర్టునుంచి తీయబడినవి. ౩. మదరాసు రాజధాని ఆర్కియలాజికల్ సూపరింటెండెంటు లాంగ్‌హర్సు దొరవారీయభిప్రాయమును తెలిపియున్నారు.

డవకాశము లేకున్నది. డాల్మెనుయొక్క ఆకృతిలో నసామాన్యమైన దెద్దియును కానఁబడదు. నాలుగుసూాలలుగల కట్టడమును నిర్మించుట కేవలము ప్రాకృతావస్థలోనుండువారికిని సహజము కావున డాల్మెనులును వాటికంటెను విశాలమును విచిత్రమునునైన ద్రావిడదేశపు దేవాలయములును పూర్వీకులవాసగృహముల ననుసరించియే నిర్మించబడియుండవలెను. దేవాగారములు నరాగారముల కనుగుణములేను. ఆయాదేశములలోని దేవమందిరములు అచ్చటి నరమందిరములను బోలియుండుట తెలిసినవిషయమే. పితృపూజయొనర్చు సంఘములలో పితృమందిరములున్న వాని నరమందిరముల వలెనే కట్టబడియుండును. ఇజిప్టుదేశములోని 'పిరమిడ్' అను పితృమందిరములలోని గదులు మున్నగువానియేర్పాటు వారివాసగృహముల వాస్తువును అనుకరించియుండును. వానియొక్క శాశ్వతస్థితికిగాను అనశ్వరమైన శిలతోగాని శైలపార్శ్వములోగాని వానిని నిర్మించవలసినపుడు కేవలమవసరమైన మార్పులుమాత్రము చేయబడును. అట్లే శాశ్వతస్థితికై భూమిలోపల నీపితృమందిరము నేర్పరుచుటలో నది కొంతవరకైనను నరమందిరము ననుకరించి యుండును.

ఇందుకు నిదర్శనము యింకను మనకు సాంచి, అమరావతి మున్నగు పురాతన బౌద్ధస్తూపములలో నుల్లిఖితబింబములను పరీక్షించినచో కానవచ్చును. అందు చూపించబడిన కాపురపుకట్టడములు తరువాతి దేవమందిరములకు మూలమని తెలియవచ్చును. సాంచిలోని గజపృష్ఠాకృతిగల దేవాగారములకు అచ్చటి వాసగృహములే మూలములు. అమరావతి స్తూపములోని ప్రతిమలలో చూపబడిన గృహపురోభాగములుతరువాతిపల్లవులకాలపు గుహాదేవాలయములకు మూలములుగ నున్నట్లు తోచుచున్నది. ఈపోలిక మింకను విశదముగ జూపింపబడును. ప్రస్తుతమునకు దేవమందిరములును, పితృమందిరములును నరమందిరముల కనుగుణములని చెప్పవలసియున్నది.

మనదేశమునను యితరదేశములలోను పూర్వీకుల యాచారవ్యవహారములను తెలియుటకు దేవమందిరముల కన్నను పితృమందిరము లెక్కుడు పూర్వీకములుగ నగుపడుచున్నయవి. కావున దేశపు ఆర్ష విచారమును లెస్సగ కొనసాగించుటకు పితృమందిరముల వాస్త్వాదిస్వభావములను పరిశీలించవలయును. అమరావతి మున్నగు బౌద్ధస్తూపములును పితృమందిరములజాతిలోనివే. వీనినిగురించి వ్రాయుటకుముందు పితృమందిరముల నొకింత వర్ణించ నెంచినారము.

మృతులైనవారి దేహశేషములను గాని దేహములనుగాని నిక్షిప్తములుగావించిన స్థలముల నన్నిటిని పితృమందిరములుగ భావింపవలెను. ఇవి పెక్కుతెరంగులై యుండును. 'డాల్మెను' జాతిని పైని వర్ణించియుంటిమి. తక్కినవి 'కెయిర్న్, కామ్లెక్, అవెన్యూ, కిస్ట్వె' అని యింగ్లీషుభాషలో వాడబడుచున్నవి. 'కెయిర్న్', అనుపదము యూరోపుఖండములోని గాలిక్, ఐరిషు, వెల్షు భాషలలో 'దిబ్బ'

లేక 'గుట్ట' యనునర్థముగల "కర్న్" అను పదమునుంచి వచ్చినట్లు చెప్పబడియున్నది. కాని వీటి కన్నిటికిని సంస్కృతభాషలోని "కూర్చు" యనునర్థము గల "కీర్ణ" (సంకీర్ణ) పదముగా నుండవలెను. ఇవి మన్నును విడి రాళ్లను కలిపి చేర్చబడిన గొప్పగుట్టలు. వీని యొక్క యెత్తులును, వైశాల్యములును భేదించియుండును. వీటిమధ్యభాగమున నసగా నాభియందు రాతితోగాని బంకమంటితోగాని చేయబడిన శవపేటిక (Ccffin) గాని లేక శవావశిష్టములుగలిగిన యొకకుండగానియుంచబడియుండును. ఇవి పలుచోట్ల పలులోతులలో నుండును. గుట్టచుట్టును వలయముగా నొకటిగాని లేక రెండుగాని రాళ్లవరుసలు ప్రాకారమువలె హద్దుకుగాను వేయబడియుండును. అవెన్యూలనునవి చచ్చవుకముగా నాటబడిన రాళ్లవరుసతో కూడుకొని యుండును. దీని నాలుగుప్రక్కలు సరిగానైనను లేకమూలకు మూలకు నుండవచ్చును.

నిజాము రాజ్యములోని మాలా ఆలి యను ప్రదేశములో నీపురాతన మహాశిలోచ్చయములు గలవు. ఇవి రెండువిధములుగ నున్నవి. గ్రామమునకు ఉత్తరపుప్రదేశమున నుండునవి (కెయిర్న్) కీర్ణతరగతికి చేరినవియు పశ్చిమమున నున్నయవి క్రామ్లెక్ లుగాను నున్నవి. వీనిలో కొన్ని యిప్పటికి సుమారు 50 సంవత్సరముల క్రిందట డాక్టర్ బెల్ గారి చేత త్రవ్వించబడియుండినవి. వీటినిగురించిన సమగ్రవర్ణన మనకిపుడు దొరకలేదు. కాని వీటినిగురించి కర్నల్ మెడోస్ టెయిలర్ ద్వార బొంబాయి రాయల్ ఏషియాటిక్ సొసైటి వారిపత్రికలో ప్రచురించిన యొకచిన్న ప్రస్తావనమాత్రము దొరకియున్నది.

రాయగిరి, దోర్ణకల్లు ప్రదేశములలోని
కిస్తుకుండలపైని గీతలు




సం. 1, 2 రాయగిరి, దోర్ణకల్లులో పలుమారుదొరకినవి
,, 3, 4 దోర్ణకల్లులో విశేషము.
,, 6, 7 రాయగిరిలో ఒకగీర మాత్రము.
,, 5, 8 దోర్ణకల్లులో ,, ,,

ఇటీవల నిజాములోని ఆర్షవిచారణాధ్యక్షులైన యాజ్దానిసాహెబుగారు ఊరికి ఉత్తరపు వైపున నున్న కీర్ణములను త్రవ్వించి పరీక్షించి వీనివిషయమున నీక్రింది వివరములను తమ ౧౯౧౫ సం॥ వార్షిక ఆర్షవిచారణ నివేదికలో వ్రాసియున్నారు:—

ఇవియుండుప్రదేశము మెరకమైన రాతినేల. దీనివైశాల్యము ౩౦ మొదలు ౮౦ యెకరములు కీర్ణముల విస్తీర్ణములు పలువిధములుగ నున్నవి. వీటిమధ్యకొలతలు ౮ అడుగులు మొదలుకొని 33 అడుగులవర కున్నయవి. ఎవ్విధమునను చెరుపబడని కీర్ణములు నేలమట్టమునకుపైన ౨ మొదలు ౪ అడుగులయెత్తు

గలిగియుండును. చుట్టును నేలగా నాటియుండు రాళ్లు సుమారుగ చెక్కబడియున్నవి. సాధారణముగ నిరువదినాల్గురాళ్లుండును. కీర్ణముయొక్క వలయము చిన్నదిగనుండిన చోటులలో వెలికిపట్టినన్ని రాళ్లు వెలుపలివలయముగనమర్చబడి యధికమైనరాళ్లువలయము లోపలిభాగమున నుంచబడును. విడిరాళ్లు మన్ను కలిపిన పూడుపు సుమారు 5 లేక 6 అడుగుల లోతువరకు భూమిలోనికి పోయియుండును. దీనిక్రింద కిస్తుయొక్క పైమూతయైన రాతి చెక్క కనుబడును.

ఈ 'కిస్తు' అనునది కీర్ణముయొక్క మధ్యభాగమున నుండును. దీనిలో సాధారణముగ నుంచబడుకుండలు మున్నగునవి యీ మట్టమునకుపైన నుండవు. ఒకటిరెండు చోటులలో కొన్ని మంటికూజాలు, చిన్నకుండలు, గిన్నెలు, పేలాలు, యినుపవలయము, పైని వేయబడిన పూడుపుకు క్రిందనున్న, కిస్తుకు పైననున్న కనుబడినవి. చెన్నరాజధాని లోని కొన్ని కీర్ణములలో నీ కిస్తుకుపైన నొక శవమున్న, క్రింద కిస్తులోపల మఱియొక శవమున్న కనుబడియున్నవి.

మాలా ఆలీ కిస్తులో పైభాగమున శవమేదియును దొరకలేదు. ఈ కిస్తులలో దొరకిన కూజాలు మొదలగునవి నల్లనివర్ణమున్న మంచి మెరుపున్న కల్గియున్నవి. వాటి యాకృతులున్న బాగుగనున్నవి. ఈ కూజాలు యిప్పటి కూజాలకంటె కొంత భిన్నరూపముతో నున్నవి.

లోపలికిస్తు ఒక రాతిచెక్కలతో చేయబడిన పెట్టెలవలె నుండును. నాలుగు వైపులును నాలుగు రాతిపలకలున్న క్రింద నొక రాతిపలకయున్న పైన నొకమూత రాతిపలకయున్న ఉండును. రెండు ప్రక్కలలో నుండు రాతిపలకలును క్రిందిపైపలకలను కొంత మించి వెలుపలికి వచ్చియుండును. వీనికి మధ్య నా క్రిందిపైపలకలు ఇముడ్చబడియుండును. [1] ఈ ప్రక్కపలకల నిడుపు ౬ మొదలు ౧౦ అడుగులవరకు నుండును. ఎత్తు ౫ మొదలు ౭½ అడుగుల వరకు నుండును. ఇవి వెలుపలికొలతలు. కిస్తుయొక్క లోపలిభాగములోని కొలతలు నిడుపు ౩½ మొదలు ౬½ అడుగులు; వెడల్పు ౨ మొదలు ౪ అడుగులు; ఎత్తు ౪ మొదలు ౬½ అడుగులు. ఈ ప్రదేశములోని కొన్ని కిస్తులకు సాధారణముగ నుత్తరపువైపున వెడల్పు తగ్గియుండును. అవి యీ క్రిందివిధమున నుండును.






భూమిమట్టమునకు సుమారు ౮ మొదలు ౧౩ అడుగుల లోతులలో కిస్తుకుచుట్టును అచ్చటినేలమట్టమున వివిధాకృతులుగల మంటిపాత్రలు వివిధ పరిమాణములతో దొరకియున్నవి. వీనిలో ఉంగరపుమెట్టుగల చిన్న,

[1] అనుబంధించబడిన కీర్ణపటములను చూడునది.

పెద్దకుండలు, గిన్నెలు, మూకుళ్లు, ధూపారతులు మున్నగునవి దొరికినవి. ఇవి దక్షిణదేశములో దొరకిన పాత్రలను చాలవరకును పోలియున్నవి. చాలపెద్దకుండలు కొన్ని ౫½ అడుగుల అడ్డకొలతనున్న ౭½ అడుగుల యెత్తునున్న కలిగియున్నది. మిక్కిలిచిన్నవాటిచుట్టుకొలత కొన్నియంగుళములు మాత్రమే యుండును. కొన్నికుండలకు మూతివద్ద నలంకారపుగీర పనిచేయబడియున్నది. కుండలలో కొన్ని నల్లగను మఱికొన్ని యెఱ్ఱగను నున్నవి. చిన్న కుండలకు వెలుపల నొకవిధమైన మెరుపున్న కానవచ్చుచున్నది. ఇవి తుత్తియను నొకవిధమైన యాకుయొక్క బందనగల రసముతోటి తోముటవలనవచ్చునని కొందరియభిప్రాయము. ఇప్పటికిని మనదేశమున యీరసము నిట్లుప యోగించుట వాడుకలో నున్నది. ఈమెరుపువలన కుండకు చెమ్మ సోకజాలదు. కాని కత్తితోటి గీరినయెడల పెచ్చు సులభముగ లేచివచ్చును. ఈతుత్తియాకురసమును పూసి కుండను తిరుగ కాలిచినయెడల పైభాగమున పూతమెఱుగు యెక్కి యాపూతమెఱుగు కుండకుకవచమగుచున్నది. ఈపూతవలన కుండకు చెమ్మయెక్కకపోవుటయేగాక నది ఉష్ణరియుటయును లేకపోవుచున్నది. పగిలినకుండ పెంకులను పరీక్షించినమీదట యీపూతమెఱుంగు లోపలగాని పైనగాని చాలమందముగ నున్నట్లు కానరాదు. కుండలు చాలవరకును ఈజిప్టు, ఖాల్డియా,౧ అస్సిరియా౨ దేశములలో దొఱకిన పూర్వీకపుకుండలను పోలియున్నవి. అయితే యీదేశములలో దొఱకినకుండలమన్న కొంత మృదువై శ్రేష్ఠతరమయి యున్నది. ఇదిగాక వాటి కుండినట్లు మనదేశములో దొఱకినపాత్రలకు చేతిపిడ్లు లేవు. అయితే పైనచెప్పబడిన ధూపారతి మాత్ర మచ్చటిధూపారతులను పోలియున్నది.

(సశేషము)



౧ పరిషియా దేశములోని పరిషియన్ గల్ఫు అను సముద్రాంగమునకు ఉత్తరమున నుండుదేశము. ౨. ఇది ఖాల్డియాకు ఉత్తరమునను వాయువ్యమునను వ్యాపించి యుండిన దేశము. యూఫ్రటీస్ టైగ్రిస్ అను నదుల చెంతనుండు దేశము. బాబిలను పట్టణము దీనికి ముఖ్యపట్టణము.



మాలా ఆలీ పశ్చిమకీర్ణముయొక్క రాతివేలి




రాయగిరి కి స్తూల పలనున్న సల్లః కుంజ-పటములోని 1, 2 సంఖ్యలుగల గీరలున్నవి



రాయగిరి కిస్తువెలుపలనున్న ఎట్టికుండలు
వీనిపైన గీరలున్నవి. వీనిలో గీరలపటములోని 1, 2 సంఖ్యలున్నవి.



నునుపుగల నల్లని పలువిధములైన కుండలు ముందుతట్టున రెంటిలో మన్ను నిండియుండినది.
కుండల వెలుపలిపార్శ్వమున 1, 2 సంఖ్యగల గీరలున్నవి.



దోరణకల్లులో నొకకిస్తులో దొరకిన ఎఱ్ఱ నల్లని కుండలు.
ముందుతట్టు ఒకమూత వెల్లకిల త్రిప్పిపెట్టబడి యున్నది



దోర్ణకల్లుకీర్ణములలో దొఅకిన్న ఇనుపకొడవళ్లున్ను
మాలా ఆలీలో దొరకిన ఇతర ఇనుప ఆయుధములు

# బ్రహ్మగీతము

**చేవూరు సింహాచలము గారు**

వరుణతనయుండుభృగువనుపాఱుఁ డొకఁడు
బ్రహ్మజిజ్ఞాసచేఁ దండ్రిపజ్జకేఁగి
బ్రహ్మ మెటువంటిదని వాఁడు ప్రశ్న సేయ
నాదరాయత్తచిత్తుఁడై యపుడు తండ్రి
"బుడుత! ఎందుండి లోకముల్ బుట్టెనవియు
దేనివలన నీ జగమంత స్థిరతఁ గనునొ
దేనిలో మఱల జగము లీన మగునొ
అదియె బ్రహ్మంబు సుమి దానినరయు కొఱకు
నన్నమును బ్రాణమును మఱి గన్నుఁగనయు
వాఙ్మనశ్శ్రోత్రముల్ తగుద్వారము లగు"
నంచుఁ దెల్ప నతఁడు తపమాచరించి
యన్నమందున భూతమ్ము లన్ని బుట్టెఁ
బుట్టి యన్నంబునను వృద్ధిఁ బొందుచుండెఁ
మరల యవియె యన్నంబుగా మారుచుండెఁ
బుట్టుటకుఁ బెఱుఁగుటకును గిట్టుటకును
అన్నమే మూలకారణం బగుటవలన
నన్నమే బ్రహ్మమాయె నంచపు డెఱింగి
తృప్తిలేమిని వాఁడు దండ్రికడ కేఁగి
బ్రహ్మమున్ దెల్పుమాయంచుఁ బ్రణతిసేయఁ
"దపముచేఁ గాని వేఱొండుదారి గలదె
బ్రహ్మమున్ దెలియు?ట"కని పలికె నంతఁ
దనయుఁ డేగి నియతితోడ దప మొనర్చి
ప్రాణమే బ్రహ్మ మౌనని ప్రజ్ఞఁ దెలిసి
మరల తండ్రితో దానిని మనవి సేయఁ
దిరిగి తపము సేయుమనుచుఁ దెలిపెఁ దండ్రి

మనసు బ్రహ్మ మౌనంచును మరలఁ దపము
సేసి తెలిసి దానిని జెప్పెఁ బితకు
మరల తపము సేయుమనుచు వరుణుఁ డనఁగ
నంత విజ్ఞానమే బ్రహ్మమం చెఱింగి
తండ్రికడ కేఁగి తెల్పినఁ దపము నింకఁ
జేయుమన నతఁడు మరల జేసె తపము
నప్పు డానందమే బ్రహ్మ మౌ టెఱింగె.
విద్యలందెల్ల శ్రేష్ఠమౌ విద్య యిదియె
వరుణదేవుండు దీనినే యెఱుఁగఁ బఱచె
దీనినే మహాతపమునఁ దెలిసె భృగుఁడు
అదియె హృదయాంబరంబున నంత మొందు
నెవ్వఁ డీవిధిఁ దపమున నెఱుఁగఁ గలఁడొ
వాఁడె యానంద మందున్నవాఁడె యౌను
అనఁగ బ్రహ్మంబు నాతఁడే యౌట నిజము
వాఁడె యన్నంబు గలవాఁడు వాఁడె జఠర
మందు దీప్తాగ్నితోఁ గూడి బంధుమిత్ర
పుత్రపౌత్రాదికముచేతఁ బూజ్యుఁడగును
బ్రహ్మవర్చస్సుతో వాఁడు ప్రబలుచుండు
ప్రాణమన్నమే యౌనని బయలు పడియె
దేహమన్నాద మౌటయుఁ దేట పడియె
ప్రాణమందున దేహంబు ప్రబలియుండె
దేహమందునఁ బ్రాణంబు లిరుకుచుండెఁ
గాయమందునఁ బ్రాణంబు గలుగుకతనఁ
గాయమున కన్నమిట ప్రాణమాయె నిజము
ప్రాణమునకై శరీరంబు పదిల మగుటఁ

ప్రాణమున కన్నమే శరీరంబు సుమ్ము
ప్రాణదేహంబులందు నదైన నొకటి
కొక్కటన్న మన్నాదమై యొప్పుచుండె
భావమం దెవ్వఁడెఱుఁగు చుపాసనంబు
సేయుచుండును వానికి సేమ మొదవు
నన్నవంతుండు వాఁడె యన్నాదుఁడౌను
పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బూజ్యుఁడగును
వాఁడె కీర్తియుతుండౌను వాఁడె బ్రహ్మ
అందు నన్నంబుఁ ద్యజియింప నధమవృత్తి
పండితున కెప్పు డన్నంబు వ్రతము వ్రతము
అన్నముదకంబు జ్యోతి యన్నాదమగును
ఉదకమందుననే జ్యోతియుంట నిజము
ఉదకమంతయు జ్యోతిలో నుంట నిజము
గాన నన్నమన్నాద మొకటి కొకటియె
యిట్టి విషయంబు నెఱుఁగు వాఁడెవ్వఁడో య
తండె సకలంబు గలవాఁ డతండె బ్రహ్మ
అందు నన్నంబు నార్జింప నగును భువిని
వేదవేత్తకు నన్నంబు విధి విహితము.
అన్నమే భూమి యన్నాద మాకసంబు
భూమియం దాకసం బుండె, భూమియుండె
నాకసంబందు, నది దీని కన్నమగును
దీనికది యన్నమగుచుండె దీని నెఱుఁగు
వాఁడు సౌఖ్యాబ్ధిలో నోలలాడువాఁడు
వాఁడె యన్నంబు వాఁడెపో బ్రహ్మమగును
అందుచే నింటికెవఁడైన నతిథివచ్చి
నంతనే యిల్లు వీఁడి పొమ్మనఁగ రాదు
వాని కాతిథ్యమిచ్చుటే వ్రతము వ్రతము
గాన యన్నంబు ధర్మమార్గాను సరణిఁ
బాటు పడియైన నార్జింపవలయు భువిని
అతిథివచ్చి నంతనె సిద్ధమైనదన్న
మంచు వేదవేత్తలువాని నాదరింత్రు
అతిథిజనులకు గృహమందు నన్నమిడెడి
కాలమందున యన్నంబుగలుగు మరల
ననఁగవచ్చిన యతిథికి నాదరమున
వెంటనే భోజనంబును బెట్టు నతఁడు
భాగ్యయుతుఁడౌను శ్రమలేక బాల్యమందె
కొంచె మాలస్యమును జేసి కూడు బెట్టు
వాని కన్నమబ్బును మధ్యవయసునందు
పూజ్యుఁ డభ్యాగతుఁడు రాఁగఁ బొమ్మటంచు
గోశిగి విధిలేక చివరకుఁ గూడుఁ బెట్ట
ముసలితనమున శ్రమలేక భుక్తికలుఁగు
వాక్కునందున క్షేమమే బ్రహ్మమౌను
ప్రాణమున నపానమునను బయలు వెడలు
యోగమున్ క్షేమమున్ బ్రహ్మమౌఁగదంద్రు
హస్తమునఁ గర్మరూపంబె యౌను బ్రహ్మ
పాదమందున్న గతిసుమ్ము బ్రహ్మమౌను
బాయువందు విముక్తిరూపంబు బ్రహ్మ
బ్రహ్మజిజ్ఞాసగలవాఁడు బ్రహ్మనిటుల
నాత్మదేహమునన్ ధ్యానమాచరించు
వర్షమందున్న తృప్తియె బ్రహ్మమౌను
మెఱుపునబలము బ్రహ్మమం చెఱుఁగవలయుఁ
బశువులందున్న కీర్తియే బ్రహ్మసుమ్ము
చుక్కలందున్న కాంతియే చూవె బ్రహ్మ
యోనియందు సుఖంబుఁ బుత్రోద్భవంబు
తండ్రి ఋణముఁదీర్చెడి యమృతంబు నదియు
బ్రహ్మమౌ మీఁదఁజెప్పిన పంచకంబు
దైవికోపాసనములంచుఁ దలఁపవలయు
ఆకసంబందు లోకంబు లన్ని నిలుచుఁ
గాన నాకాశమే బ్రహ్మగాఁ దపంబు
సేయువాఁడె ప్రతిష్ఠను జెందు భువిని

నాకసంబందు నెవఁడు మహత్త్వ గుణముఁ
గాంచువాఁడె మహత్త్వము గల్గువాఁడు
ఆకసమున మననరూపమైన బ్రహ్మ
మెవఁ డుపాసించు వానికి నెల్ల కామ్య
వస్తువులు నశ్రమంబున వశముకాను
ఆత్మ నెవ్వఁ డుపాసించు నాకసంబు
విశ్వరూపంబె యంచును వేద మనుచు
వాఁడె విశ్వరూపుండౌను వాఁడె వేద
వేత్తయై కీర్తిగాంచును విశ్వమందు
ఆత్మవాయువుగాఁగల యాకసమును
బ్రహ్మమున కెవ్వఁడు "పరిమరంబు" గాఁగఁ
జేయుఁదప మట్టివాని ద్వేషించుచుండు
శత్రుజనమెల్ల మరణించు సత్యముగను
అప్రియంబుగా నుండెడి యన్నదమ్ము
లైన మరణించెదరు నిశ్చయంబుగాను

పురుషులందున్న యాత్మయుఁ బూజ్యుఁడైన
సూర్యునందున్న యాత్మయుఁ జూచు నొకఁటి
గాఁగ నెవఁడో యతఁడు లోకంబు వీడి
యన్నమయ మాత్మమాదిఁగా నున్నయాత్మ
లన్నియున్ బొంది లోకంబు లన్నితనదు
రూపమేయంచు భావించి లోపమింత
దనకు లేకయున్నను లోకమునకు బోధ
సేయవలెనంచు నెంచి నిశ్చింతతోఁడఁ
గోర్కెలెల్ల సన్నంబుగఁ గ్రోలుచుండి
కామగమనంబుతోఁడ లోకంబులెల్ల
"నాహా! యాశ్చర్య మాశ్చర్య! మానుదెలియ
నేనె యన్నంబు నన్నార్థి నేనె" యంచు
బ్రహ్మగీతంబు హాయిగాఁ బాడుచుండి
సర్వరూపాత్మ కంబాచు సంచరించు

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

---

## నిశీథము

"సౌదామిని"

చలి గడగడవణకించెను,
జగము గ్రమ్మె సంధకార;
మచ్చటచట మినుకు మినుకు
మనుదీపిక, లోనాథా!

ఈనిశిరాత్రిని నొంటిగ
నేకానని దేశాలను
గుండెదో? నిశ్శబ్దములో
విందువో నాయార్తగీతి?




# గానము

కాశీనాధుని భైరవమూర్తి గారు

వీణారసానుషంగం వికచమదామోద మాధురీభృంగమ్,
కరుణాపూరతరంగం కలయే మాతంగకన్యకాపాంగమ్.

గత సంచికయందు గనబరచిన శ్రుతుల నియామకము మన పూర్వుల శాస్త్ర గుంఫ రచనాసామర్థ్యమును వ్యక్తము చేయుచున్నది. వీటికి వాదరంగబలములు గనుగొనిరో కనుగొనకరో తద్విషయిక మగు సాధనసామగ్రీవైశేష్యము లేకయే ఆధునికశాస్త్రానుసరణముగను మరియు నధికముగను నిరూపింపబడియుండు విధులను గమనించినచో దెల్లమగును. ఆధునిక ప్రకృతిశాస్త్రమున నేయే శ్రుతి కెన్నెన్ని నాదతరంగములో వాటిని పరిగణించి బాగుగ సమవ్యవధిగల్గు శ్రుతులుమాత్రము చెవికింపగుననియు, సమవ్యవధి తగ్గినచో శ్రుతిసమ్మేళనము గాదనియు బొత్తుగ సమవ్యవధి గాకున్న శ్రుతికటుప్రగ నుండుననియు నిరూపించి యున్నారు. దీనిని మనపూర్వులును, వాది, సంవాది, వివాది, అను వాదీత్యాదికముల నిరూపించియున్నారు. దీని గమనించి చేయుగానమే శ్రోతృపేయముగ నుదాహరించి యున్నారు. శ్రీత్యాగరాజస్వామివారును నీ సందర్భమున నిట్లు నుడివి యున్నారు.

కళ్యాణవసంత—రూపకం

ప. నాదలోలుడై బ్రహ్మానంద మందవే మనసా!

అ. ప. స్వాదుఫలప్రదసప్తస్వరరాగనిచయ
సహిత; నా.

చ. హరిహరాత్మభూసురపతి శరజన్మ గణేశాది,

వరమానులుపాసించరే! ధర త్యాగరాజు తెలియు; నా.

ఇకను పాశ్చాత్యాధునిక ప్రకృతిశాస్త్రమున పరికించిన నీ నాదతరంగపరిగణన విషయము, సావర్ట్స టూత్ డ్ ఫీల్, సైరెన్ బెల్లోస్, మొదలగుయంత్రసాయమున సాధ్యమగుట గమనింపనగును. వీటిలో మొదటి దానియందు, మనము సామాన్యముగ గడియారమునందు గాననగున ట్లొక పెద్దచక్రపు పండ్లలో నిమిడియుండు పండ్లుగలిగిన మరియొక చిన్నచక్ర మమరియుండును. పెద్దచక్రమునకు సమదూరస్థములగుపండ్లు నూరుగలవనుకొనుడు. అట్లే చిన్నదానికి నైదేపండ్లు. దీనికే మరియొక చక్రము (మూడవది) ఆయిరుసునకే యమర్పబడియుండుటచే, చిన్నచక్ర మొకసారి తిరుగుసరికిమూడవచక్రమును ఒకసారియే తిరుగునుగాని పెద్దదగుట జేసి దీనికి నేబదిపండ్లున్నవనుకొనిన నేబదిపండ్లను నేకయావృతము చుట్టినచ్చును. మొదటి చక్రము (నూరుపండ్లది) ఒకపర్యాయము దిరుగుచో రెండవది (ఐదుపండ్లది) యిరువదిసార్లు, అట్లే మూడవది (ఏబదిపండ్లది) యు నిరువదిసార్లు తిరుగుటచే నొక్కొకపర్యాయము నేబది పండ్లను తిరుగురు. మూడవ చక్రపు పండ్లకు రాచుకొనిపోవున ట్లొక పల్చనిరేకు నొకదాని నమర్చి రెండవప్రక్కను కదలకుండ మేకుల బిగియించి మెల్లగ మొదటిచక్రమును త్రిప్ప నారంభించిన మూడవ చక్రమున నుండు పండ్లు రేకుపై గీచికొనుటచే టక్కు టక్కుమను శబ్దము విడివిడిగా విననగును. పిమ్మట చక్రమును క్రమముగ నెక్కుడు వేగముగ ద్రిప్ప కొలదియు పండ్లు తిరుగువేగ మతిశయించుటచే టక్కుటక్కుమను మ్రోత త్వరితమై యొక శ్రుతిగ నేర్పడి మొదట మిక్కిలి బొంగుగు, అనగ నతిమంద్ర శ్రుతులు, అతిమంద్రము అనగ మంద్రమంద్రము, మంద్రమధ్యమ, మంద్రతార, మధ్యమ మంద్ర, మధ్యమ మధ్యమ, మధ్యమతార తారమంద్ర, తారమధ్యమ, తారతార యనగ నతితారము మొదలగు నిత్యాద్యనేక స్థాయిల నాదశ్రుతులు విననగును. ఇట్లే మనకు గావలసిన యేశ్రుతియేని దానికి సమమగా శ్రుతి నీరేకు పలుకునంతవరకును త్రిప్పి యట సమవేగముతో ద్రిప్పుచు నిముషమున కెన్నిసార్లు మొదటిచక్రము ద్రిప్పుచుంటిమో లెక్కించి దాని కిరువదిరెట్లు చిన్న చక్రమును, ఇది యొకసారి దిరుగుచో మూడవదియును తిరుగుచున్నట్లు సులభవేద్యమే గనుక నన్ని యేబదిసార్లు రేకుపై కొట్టుకొనుటచే నా శ్రుతి యేర్పడినది గనుక నా శ్రుతికిన్ని నాదతరంగములని నిరూపించవచ్చునని గనిపెట్టబడినది.

ఇదిగాక ప్రతిశబ్దమును మన చెవిగ్రహించుట కేదియేని యొక మధ్యవర్తి (మీడియం) యనగా నాదతరంగపరంపరలను మన చెవి కందజేయు పదార్థ ముండినచే విననగును. లేనిచో వీలుగాదు. దూరపు ఘంటానాదము గాలివాటముగనున్న బాగుగను స్పష్టముగను విననగుటయు, పెడగాలిగ నున్న క్షీణించుటయు సామాన్యముగ

గ్రహింప్రచున్నాము. అట్లే గడియారమునకు నలారంగంట కొట్టుటకు బీగము నిచ్చి దాని నొకబల్లపైనుంచి అడుగు లేని సీసా నొకదానిని దానిపైబెట్టి సీసామూతికి గట్టిగ మూత బిగియించిన కొంతమట్టునకు శబ్దము తగ్గుటయు, ఆసీసాలోనిగాలిని "ఎయిర్‌పంపు" అను యంత్రసాయమున గ్రమముగ దగ్గించిన గడియారపు ఘంటాధ్వనియు గ్రమముగ క్షీణించి తుట్టతుదకు కొట్టునట్లు కనుపించుట మాత్రమే గాని బొత్తుగ విననలవిగాకుండుటయు గానవగును. దీనినిబట్టి చూచిన నాదతరంగోద్భవస్థానమునుండి మన చెవికి నాదవీచీ పరంపరను ప్రసరింపజేయుటకు మధ్యవర్తియగు పదార్థమవసరమనియు తత్పదార్థ మెంత పల్చనైన, నాద మంత క్షీణముగ విననగుటయు, అనతి దూరముమాత్రమే ప్రయాణము జేయుననియును, తత్పదార్థము చిక్కనైన కొలదియు వినబడు బలమును ప్రయాణము జేయుదూరమును వృద్ధియగుటయు దేలుచున్నది. ఇయ్యది ద్రవపదార్థమగుచో మాత్రమేగాక మృద్దారుశిలాలోహాదికములందునను గ్రమముగ వాటి వాటి ఘనమును చిక్కదనమునుబట్టియు సందర్భముగ నుండును. ఇయ్యది పాశ్చాత్యులచే నిరూపింపబడినది.

| | | | |
|---|---|---|---|
| జేబుగడియారపుమోత నీటియందున | | ౨౩ | అడుగులు అనియు |
| ,, | నూనెయందు | ౧౬.౪ | ,, |
| ,, | ఆల్కహాలుయందు | ౧౩ | ,, |
| ,, | గాలియందు | ౧౦ | ,, |

దూరపు రేటుచొప్పున బ్రయాణ మొనరింపగలదనియు నాధునిక ప్రకృతి శాస్త్రజ్ఞులు నిరూపించిరి. దీని ననుసరించియు, బైనుదాహరించిన టూత్‌డ్ వీలు (పండ్లచక్రము) సైరెన్, బెల్లోస్ మొదలగు జంత్రసాయమునను మన చెవి వాయువు మధ్యవర్తి (మాధ్యమం)గనుండునపుడు సెకండునకు ౧౬ నాదతరంగములు గల్గు శ్రుతికన్న తగ్గుదానిని, తొమ్మిదివేల నాదతరంగములు గల్గు శ్రుతికన్న హెచ్చుగుదానిని, గ్రహింపజాలదనిరి. మరియొకరు విన నసాధ్యములగు నీశ్రుతులను గూడ కొంతవరకు గాలికన్న నధిక ఘనమగు చిక్కనగు పదార్థమును మధ్యవర్తిగ నమర్చుటచేతను లేక యానాదమునే మిగుల బలముగ

ఉత్సవాదులందు నొట్లుపైన గాలిలో ప్రేలుట, మరియు తుపాకి పేలుట, గొడ్డలిచే చెట్లను నరుకుట, కంచరవాళ్లు సమ్మెటచే గొట్టుటయు ఇత్యాదికములు దూరమునుండి గమనించిన, బ్రథమమున నాయాక్రియలు గననగును. పిమ్మట తజ్జనితమగు శబ్దము విననగును. పర్వతప్రాంతముల నరచిన నట్లే మరల ప్రతిధ్వనితమై సరిగ వినబడుటయు సమదూరమున నెన్నిమారు లుచ్చరించినను సమవ్యవధిగ బ్రతిధ్వనిగల్గుటయు గమనింపనగును. దీనినిబట్టియు నాదోత్పత్తిస్థానమునుండి, అది వాయువు తనకు మధ్యవర్తిగ నుండినపుడు సెకండునకు ౧౧౨౫ అడుగులు అనగ సుమారు నాలుగు నిముషములలో నేబదిమైళ్ల

(Intense) నుద్భవింపచునట్లుగాని చేయుటచే విన
నగుననియు దెలిపియున్నారు. సావర్ట అను
వారు సెకండునకు నేడెనిమిది మొదలు ఇరువది
నాల్గువేల నాదతరంగముల వరకును గల్గిన
శ్రుతులను విననగు నని వారి యంత్రసాయ
మున నిరూపించిరి. దీనిని ఖండించి డెస్ప్రే
ట్జ్ అనువారు ౧౬ కన్న తక్కువ విన
వీలుగాదనిరి. హెల్మ్హోల్ట్జ్ అనువారు
ముప్పదికన్న దక్కువగు శ్రుతి విననసాధ్య
మనిరి. కనీసము నలుబది నాదతరగములైన
గల్గిననే గాని యేశ్రుతియైనను గానప్రపంచ
మున పరిగణింపబడదనిరి. ౩౮౦౦౦ వేల
తరంగముల శ్రుతివరకును వినవచ్చుననిరి. ఇది
యనుగాక గానమున విననగు ప్రతిశ్రుతియు,
ప్రత్యేకశ్రుతి గాదనియు మిశ్రమనియు నిరూ
పించియున్నారు. ట్యూనింగు ఫోర్కు అను
దానినుండి జనితమగు నాదముమాత్రము
ప్రత్యేకమనిరి (Simple) గాని ఇటీవల
నదియు మిశ్రమే (Compound) యనిరి.
అశ్లేతంత్రీ మూలకమగుశ్రుతులును మిశ్రములే
యనిరి. వీనిలో స్థాయికి (Pitch) అనియు,
బలమునకు (intensity) అనియు, శ్రావ్యతకు
(timbre or Colour) అనియు నింగ్లీషున వాడు
చున్నారు. అందు (౧) స్థాయి (Pitch)
శ్రుతులనమరు నాదతరంగసంఖ్యనుగూర్చిన
తారతమ్యముల దెల్పును. (౨) బలము (inten-
sity) దీనినమరు నొక్కొకశ్రుతికి నేర్పడిన
ప్రత్యేకనాదతరంగమున గల్గు వ్యాపకము
లేక వైశాల్యము నుద్బోధించును. (3) శ్రా
వ్యత (timbre or Colour) అను దానియందు
నాదతరంగములు సమన్వయవధిగలవిగ నుండు
టవసరమనియు దానిచే చెవికింపు జనింపజేయుట
కిది ముఖ్యమనియు దెల్పును. ఏ మూడు శ్రుతు
లైనను ౪. ౫. ౬ ఇట్టి నాదతరంగప్రమా
ణముగలవగుచో వినుటకు శ్రుతికటువుగ నుండు
ననియు ఆ శ్రుతులు ౧౦, ౧౨, ౧౫ ఇట్టిది
గలదగునేని కొంతసొంపుగ నుండుననియు
౫, ౧౦, ౨౦ ఇటులుండిన మిగుల శ్రావ్య
ముగ నుండుననియు గలదు. మన శంకరా
భరణమేళమునందుగల

స గ ప ౪ ౫ ౬
ప ని ౨రి ౪ ౫ ౬
మ ధ ౨స ౪ ౫ ౬

యీ స్వరశ్రుతులు పై నుదాహరించిన
ప్రమాణ మనుసరించి యుండినట్లు గలదు.
మఱియు నీరాగముననే

స కును రి కిని నాదతరంగప్రమాణము ౯/౮
రి - గ - ౧౦/౯
గ - మ - ౧౬/౧౫
మ - ప - ౯/౮
ప - ధ - ౧౦/౯
ధ - ని - ౯/౮
ని - స - ౧౬/౧౫

అనియు నిరూపించియున్నారు. ఇట్లే
సమన్వయవధితోనే శంకరాభరణమున "స" అను
దానికి నొక్కటియే ప్రమాణ మనుకొని పరి
గణనముచేసినచో గ్రిందటిసంచికయందు
దాహరించిన తృతీయచక్రమున మూడవ
కలమున నిరూపించిన నాదతరంగసంబంధ
పరిమాణము వరుసగ దేలగలదు.

కోనిగ్స్ అపారటస్ అను యంత్రసాయమున నేదేనియొక శబ్దమును అనగా మిశ్రశ్రుతులు గలదానిని, దాని ప్రత్యేకశ్రుతులుగ విభాగించ నగుననియు గలదు. ఇటుల నిరూపించుటలో మరల నాయా ప్రత్యేకశ్రుతి సమ్మేళనమున బ్రథమముననున్న మిశ్రమే విన నగు నట. హెల్ంహోల్ట్జ్ ఏ మిశ్ర నాదమైనను దానంగల ప్రత్యేక (Simple) శ్రుతులలోనికి విభాగించి నిరూపించుటయందు జయముగాంచిరట. ఈ శ్రుతులు మానవుని గాత్రమున నెంతవరకు సాధ్యమో నిరూపించియున్నారు. సామాన్యముగ మనుజుని గాత్రము రెండు స్థాయిలకంటె నెక్కుడుగ నుండదనియు గాయకులకు రెండున్నర మొదలు మూడువర కుండుననియు జెప్పియున్నారు. మనలోగూడ త్రిస్థాయి శారీరమనిన మిగుల శ్రేష్ఠమను ప్రతీతిగలదు. పాశ్చాత్యగాన నిపుణురాలగు కాటాలాని (Catalani) అను వారికి గాత్రము మూడున్నర స్థాయిలవర కుండెననియు నిరూపించిరి.

సామాన్యమనుషుని సామాన్యస్వరము గాలియందు సెకండునకు, ౮ మొదలు ౧౨ అడుగులు వరకుననియు స్త్రీలకును బాలుర కును...... ౨ మొదలు ౪ అడుగులవరకు ననియు జెప్పిరి. గ్రామఫోనునుండి పుట్టుశబ్దము గొట్టము వెంబడి బయటకు వచ్చుటచే బలముగను స్పష్టముగను విననగునట్లే కంఠమున (larynx) జనితమగు నాదము స్పష్టముగను బలముగను వినబడుటకు ఊపిరితిత్తులు మొదలగునవి (Sounding box & Resonance box శబ్దోత్పత్తి స్థానములుగను ముఖగహ్వరము గొట్టముగను సృజింపబడినది. యంకార్టి యనువారు మనశ్రోత్రేంద్రియము బరీక్షించి దానియందు ననంతసంఖ్యాకములుగ నున్న నీ శ్రుతులకు బ్రత్యామ్నాయముగ నాయా శ్రుతి కనుగుణమగున ట్లొక్కొక సూక్ష్మనర తంతువు (fibre) ను సృజింపబడి యున్నట్లు గనిపెట్టిరి. ఏశ్రుతి మనశ్రోత పుటముల జొర వడునో దాని కనుగుణమగుశ్రుతి నిస్వగల్గు సూక్ష్మ నరతంతువులు ప్రతిశ్రుతిగ చలింప బడుటచే మనకది నరముల ద్వారా మూల స్థానమగు మెదడునకు జేరుటచే మన మా శ్రుతిని గమనింప వీలగుచున్నదనియు నిరూపించిరి.

వీణాదితంత్రీవాద్యములందునను నాదతరంగపరిగణనము సొనోమెటరను యంత్ర సాయమున జేయనగును. దీనివివరము వీణాదివాద్యప్రకరణమున విపులముగ వ్రాయ బడును. ఇట్లే తతవాద్యములనమరుశ్రుతులకేగాక సుషిరావనద్ధఘనాది వాద్యములందు గలుగు శ్రుతులకును లోహాదిదండముల గల్గు శ్రుతులకునుగూడ నెట్లు నాదతరంగపరిగణనము సాధ్యమోదానినుదాహరించిరి. డహాసల్ అనువారు ప్రతిశ్రుతికిని దాని యాకారమును (Graph) వివరించిరి. ట్యూనింగుఫోర్కు అను శూలమువలెనుండు దానినుండి నాదతరంగ రూపలేఖనమగుచున్నది. వీనికి డహాసల్ గారి పద్ధతియనియందురు. ఇట్లే లిస్సేజస్ అనువారి పద్ధతి ననుసరించియు గలదు. దీని వివరము గొంతవరకు గ్రామఫోను రికార్డును భూతఅద్దము

మాళవకౌశికరాగ విగ్రహము



శ్లో. ఆరక్తవర్ణో ధృతరక్తయష్టిః వీరః సువీరేషు కృతప్రవిష్టః;
వీణైర్గృహీతో వైరికపాలమాలా మాలీమతో మాళవకౌశికోఽయం.



తోడి రాగిణీ విగ్రహము



శ్లో. తుషారకుందాజలదేహయష్టిః కాశ్మీరకర్పూర విలిప్తదేహా,
వినోదయన్తీ హరిణం వనాన్తే, వీణాధరా రాజతి తోడికేయం.
రాజపుత్ చిత్రము క్రీ॥ శ॥ ౧౭వ శతాబ్దము చివరభాగము

గౌరీ లేక గౌడీ రాగిణీవిగ్రహము



శ్లో. నివేశయంతీ శ్రవణేవతంసా, అమ్రాంకురం కోకిలనాదరమ్యా,
శ్యామా మధుస్యంది సునూక్తనాదా గౌరీయ ముక్తా కిలకోహలేన.



గుణకాలి లేక గుణకిరీ రాగిణీ విగ్రహము

శ్లో. శోకాభిభూతనయనారుణదీనదృష్టి నమ్రాననా ధరణిధూసరగాత్ర యష్టిః,
ఆముక్తహారకబరీ ఒప్రియదూరవృత్తా సంకీర్తితా గుణకిరీ కరుణోత్కృశాంగీ.

ద్వారా జూచిన యెడల స్పష్టమగును. ఒక్కొక యక్షరమునకును శ్రుతికిని ఆయా యాకార ములే సమ వ్యవధిగను నొకేమాదిరిగను నుం డుట గననగును. ఇట్లే వారు ప్రతిశ్రుతికి నాకా రము నిచ్చిరి.

లియాన్ స్కాట్ అనువారు వారిచే గనిపెట్టబడిన ఫోనో ఆటోగ్రాఫ్ (శబ్దలేఖక యంత్రము) అను యంత్రసహాయమున నురు ము యొక్కయు మనుష్యునికంఠధ్వని మొద లగువాటికిని నాదతరంగముల తెలుపగలిగిరి. ఆంగ్లమున ఆఁ అను అక్షరోచ్చారణమునకు ఆకారమును నిచ్చుటయేగాక దానికి సెకండు నకు నైదువందల నాదతరంగములు గలవనియు నిరూపించియున్నారు. ఈరీతిగ నొక్కొకయక్ష రమునకు నాదతరంగములును వాటికి గల్గు లేఖక రూపములును కొన్నిటి గనబఱచి యున్నారు.

ఇంతేగాక కోనిగ్స్ అనువారు మానో మెట్రిక్ ఫ్లేమ్స్ (Monometric flames)అను యంత్రమును కనిపెట్టి దానిసహాయమున శ్రుతులు సమవ్యవధి (Regular) గలవగునో గావోయని యరయుటకు నా యా జ్వా లల రూపమున గననగునని యుదాహరించిరి. వీటిని బట్టి గమనించిన సమవ్యవధి గల్గు శ్రుతులే గానమున కర్హములనియు, వాటి కనుగుణము లగు రూపములు కలవనియు దేలుచున్నది. ఇట్లు సమ్మేళనముజేయబడిన రాగములలో బూర్వుల నాదిగనేర్పఱచిన వాటిలో బ్రథమ సంచికయందు భైరవరాగమును ఆరాగము నకు భార్యలగు రాగిణులును తద్ధ్యానశ్లోక ములననుసరించి యిటీవలివారు లిఖించిన రూపపటములును గలవు. మంత్రాధిదేవతా రూపములను ఋషీశ్వరులు దర్శించిన రీతి నాయా రాగములకు నధిదేవతలును వాటిరూపములు గలవనుటకు తదనుభవ వేద్యులగు శ్రీత్యాగరాజస్వామివారిటుల నీసం దర్భమున నుడివియున్నారు.

ఆఠాణా - ఆది

ప. శ్రీపప్రియసంగీతోపాసన చేయవే ఓ మనసా!

అ. తాపసజనమానసధనమాత్రి తాప రహిత సప్తస్వరచారి. శ్రీ.

చ. రంజింపజేసెడు రాగంబులు మంజుళ మగు యవతారములెత్తి

మంజీరము ఘల్లని నటించు మహిమ దెలియు త్యాగరాజనుతుడగు. శ్రీ.

అట్లగునేని మహామహులు రాగరూప దర్శనము గాంచిరే ఆరూపపటమేనా ఇపుడు ముద్రితమనగా నది దురూహ్యము. అనుభ వైకవేద్యము. పూర్వులచే నిరూపింపబడిన తత్తద్ధ్యానశ్లోకముల ననుసరించి బుద్ధి మంతులగు వారలిటీవల రూపపటముల లిఖిం చిరి. ఆయారాగాలాపాదులందున నేదేని తప్పొనరించుచో నారాగమున కధిదేవతా సంబంధ మగు నవయవఖండనాది దోషము లుత్పాదితములగు ననియు గలదు. కనుక శుద్ధ ముగ చిత్తైకాగ్రతతో నారాధించిన రూప సందర్శనమగుటయు సాధ్యము. ద్వితీయపుం రాగమని నిరూపింపబడిన మాళవకౌశికయను రాగమునకును తద్రాగిణులకును పూర్వనిర్మిత

ముతైన ధ్యానశ్లోకములు వాని కనుగుణ
మగు రూపపటములు నిందుఁబొందు పరచ
బడినవి. మాళవకౌశికకు (1) తోడి (2) గౌరీ
లేక గౌడీ (3) గుణకాలీ (4) కంభావతీ లేక
ఖమాయచి (5) కకుభా అను నైదుభార్యలగు
రాగిణులు.

మాళవకౌశిక రాగధ్యానము:—శివతత్త్వరత్నాకరమున

శ్లో. ఆరక్తవర్ణో ధృతరక్తయష్టిః
వీరః సువీరేషు కృతప్రవీర్యః;
వీరైర్ధృతో వైరికపాలమాలా
మాలీమతో మాళవకౌశికోఽయం.

దీనికి సంగీతదర్పణమున పాఠభేదముగ
నిట్లుగలదు:—

శ్లో. ఆరక్తవర్ణోదితగౌరయష్టిః
వీరేరసేషు ప్రహితప్రవీరః,
వీరేర్ధృతో వైరికపాలమాలా
జ్వాలావృతో మాళవకౌశికోయం.

దీనికిస్వరము:—"సరిగమపదనిస, సనిదప
మగరిస ఇతిమధ్యమాంశ గ్రహన్యాసా సౌవీర
మూర్ఛనావతా." యీరాగరూపము తెల్లని
వస్త్రముల ధరించి, చేతపుష్పములును, కంఠ
మున ముత్యాలహారమును ధరించి తన పంచ
భార్యలతోగూడియున్న సుందరపురుషుని నిరూ
పించుచున్నది. మధ్యరాత్రమున గానము
సేయనగుననియుగలదు.

తోడి. శ్లో. తుషారకుంబాజలదేహయష్టిః
కాశ్మీరకర్పూర విలిప్తదేహా,
వినోదయన్తీ హరిణం వనాన్తే
వీణాధరా రాజతి తోడికేఽయం.

దీనికే తోడికాయనియు నామాంతరము
గలదు. "కుంబాజల" యనుటకు 'కుందోజ్వల"
యని పాఠాంతరము. దీనికి స్వరము మపధని
సరిగమ, అథవా సరిగమ పదనిస, అనిగలదు.
దీనికి రూపము ఎర్రనివస్త్రముల ధరించి, వీణా
గానమును, పికము ననుసరించు గాత్రగాన
మును, వీటిచే నాకర్షింపబడిన లేళ్లను
తట్టుచు వనాంతమందు విహరించుచున్నట్లు
దాహరింపబడినది. దీనిని ప్రొద్దున పాడవలె
ననియు గలదు. సాయంసమయమందని కొం
దరిమతము.

గౌరీ. దీనికే గౌడియనియు గలదు.

శ్లో. నివేశయంతీ శ్రవణేవతంసా,
ఆమ్రాంకురం కోకిలనాదరమ్యా,
శ్యామా మధుస్యంది సుసూక్ష్మనాదా
గౌరీయ ముక్తా కిలకోహలేన.

"కిలకోహలేన" యనుటకు "అతికుతూ
హలేన" యని పాఠాంతరము. ఈ రాగిణీ
రూపమతి సౌందర్యముగలిగి షోడశవర్ష
ప్రాయముగల్గి సుహాసవదనముగలదై, నూత్న
వస్త్రభూషితయై, గాలిచే నెగురగొట్టబడు
శిరోజములనుగల్గి, రెండుహస్తములచేతను
పుష్పగుచ్ఛములగొని యుపవనవిహారము
సల్పుచున్నట్లుదాహరింపబడినది. సాయం
సమయమున పాడదగినదనియు, దీనికి స్వరము,
సగమదనిస, సనిదపమగస, యనియు గలదు.

గుణకాలి, లేక గుణకరీ, గుణకిరీ
యనియు పాఠాంతరము. ఇదియే ప్రస్తుతపు
గుండక్రియా రాగమని పిలువబడుచున్నది.

శ్లో. శోకాభిభూతనయనారుణదీనదృష్టి
నమ్రాననా ధరణిధూసరగాత్రయష్టిః,
ఆముక్తచారుకబరీ ఒప్రియదూరవృత్తా
సంకీర్తితా గుణకిరీ కరుణోత్కృశాంగీ.

"దూరవృత్తా" అనుటకు "దూరవర్తి" చివరను "కరుణోత్కృశాంగీ" ఇత్యాది స్వల్ప పాఠభేదములు మాత్రము గలవు.

దీనికిస్వరము:— "రిధహీనా గుణకరీ" నిసగమపని, సగమపనిస, యనిగలదు గాని సంగీత దర్పణమందు, నిసగమపధ నిదమగసని అథవా సగమధనిస యనియు గలదు.

ఈరాగిణిరూపము తన ప్రియస్తోత్ర పాఠముల చేడియలకు సదా వినుపించుట యందాతురతగలిగిరక్తవర్ణాంబరముల ధరించి సర్వాభరణభూషితమై యున్నట్లును ప్రాతః కాలమున పాడవలెననియు గలదు.

కంభావతీ, ఖంభావతీ లేక ఖమాయచీ, ఖమాచి, కమాచి, తుదకు కమాసులోనికి దిగినది.

శ్లో. ఖంభావతీస్యాత్ సుఖదా రసజ్ఞా
సౌందర్యలావణ్యవిభూషితాంగీ,
గానప్రియా కోకిలనాదతుల్యా
ప్రియంవదా కౌశికరాగిణీ ఒయమ్.

దీనికిస్వరము:— ధనిసరిగమప,యనియు, ధనిసరిగమధ, యనియును గలదు. "సౌందర్య" యనుటకు "తారుణ్యా" యని పాఠాంతరము. ఈరాగిణీరూపము మిగుల సౌందర్యతారుణ్యా లావణ్యములనొప్పి శృంగారచేష్టాతత్పరమైన దనియు, బ్రహ్మ తనప్రక్క నగ్నిహోత్రము నుంచుకొని వేదము లామెకు వినుపించుచుండు ననియు నిరూపించుననియు గలదు.

కకుభా.

శ్లో. సుపోషితాంగీ రతిమండితాంగీ
చంద్రాననా చంపకదామయుక్తా,
కలాక్షిణీ స్యాత్స్వరమా విచిత్రా
దానేన యుక్తా కకుభా మనోజ్ఞా.

"రతి"యనుటకు 'రస" "కవి"యనియు "దానేన" యనుటకు "హాసేన" "గానేన" యనియు పాఠాంతరములు.

దీనికి స్వరము 'ధ స రి గ మ ప ద' యనియు "ద ని స రి గ మ ప ద"యనియు పాఠభేదములు. ఈరాగిణీరూపము:— చక్కని యౌవనస్త్రీ విలువగల దుస్తుల ధరించి మయూరమిథునమున కాహారమిడుచున్న ట్లుదాహరింపబడినది. సూర్యోదయాత్పూర మందు పాడదగునని నిరూపించిరి.



# ప్రభాత హృదయము

**తురగా వేంకటరామయ్య గారు**

శ్రీ మురళికంఠమెత్తి వెనుదీయక పాడవదేల!
బేల! కూ, కూయని యూరకే సణుగు
కోకిలమేమి రసప్రపంచజా, తీయలతావితా
నముల దేవి నవీనసుధాతరంగతా, ఛాయతజీ
వగానమునఁ నాంధ్రవనమ్మున బాలకోకిలా!

కాలశాసనుఁ గాఱుచీకటి
కారలోఁబడి కనలి పొడుపుం
గొండకొమ్ములఁ దేలునా బ్ర-
హ్మాండభానుని పెంపుఁ జెల్వఁగ
మేలుకొన వేలా కోకిల-జాల మింకేలా?

ఏటి యొడ్డుల-బీటిపొలముల
నాలమందలఁ దోలి పిల్లన
గ్రోవినూదుఁ డెనుంగుఁ గుఱ్ఱల-
భావవీథిన మ్రోళి వెతలఁగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

తెలుఁగుఁ గన్నియ యలరుఁ జేతుల
వలపుఁబూవుల సొలపు దండలు
వాకకుంచెఁగ మాధవుని మా-
వాకలకు రప్పింప వేగమె
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

తెలుఁగు వీణియ వలపుఁ దంత్రుల
తీయపదనిడి తేటపరచినపీన రాగరస ప్రపంచసు-
ఖానుభూతిఘటిల్లఁ జేయగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

చిన్నిసిగ్గులు వన్నెపూవులు
పూఁదాలిచి మూపియుయ్యెల
నూఁగు కన్నెలభావవీథుల-
కేగి పెండిలిపాటఁ బాడఁగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

వలపెఱుఁగని పలుగుఁ గ్రోతులు
జాతిపూవ్రలఁ జేరదూసి, ల
యంబొనర్ప రసప్రపంచవి-
హారుఁ గరుణాపీయుఁబిల్వఁగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

ప్రణయ మెఱుఁగని ప్రళయలోకము
మూయమంటల మ్రగ్గుచుండ, సు
ధానిదాన ప్రణవగానవి-
ధానమునఁ బ్రతికింప నిత్తఱి
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

దుడుకు సంద్రపు టుడుకుఁ గెరటపు
సుడులఁ దడబడు తెలుఁగు పడవల
శాంతతీరముఁ జేర్ప దేవ్రసి-
సామగానము లెత్తివేడఁగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

కత్తిపదునులఁ గమలనాళము
తెగడి వేళలఁ దేటితీయ వి
లాపరాగతరంగతాళిక-
లాపకరుణాగీతిఁ బాడఁగ
మేలుకొన వేలా! కోకిల జాలమింకేలా?

తే. ప్రేమపుష్పమరందాలఁ బ్రియుఁడు దన్పఁ
బ్రణయరాగతరంగసంభ్రమమ్మదంగ
రవళి జగతికిఁ గల్యాణరామణీతి
పాడఁ గలవమ్మ! లెమ్మికపరభృతమ్మ!

# తెలుఁగుమాటల తెన్నులు

విద్వాన్ గరిమెళ్ల సోమన్న గారు, ఎం. ఏ, ఎల్, టి.

మనయాంధ్రభాషలోనిపదజాలముయొక్క స్వరూపము నొకించు కవలోకింతము.

నౌకరు, దమ్మిడి, చాకిరి, సలహా, బాకీ, బదులు, అసలు, తతిమ్మా, మరమ్మత్తు, లగాయతు, మున్నగు పందలకొలఁది మాటలు పారసి, అరబ్బి భాషలనుండి, తెలుఁగును జేరినవి.

ఆసుపత్రి, రసీదు, పేక, కైమాను, తువ్వాలు, కిరసనాయిలు మొదలగునవి ఇంగ్లీషునుండి వచ్చినవి. గోడ, చక్కిలము, బట్ట, వాశి, మంచము లోనగు వేలకొలఁది పదములు సంస్కృత ప్రాకృతములనుండి తెలుఁగున కెక్కినవి. చెట్టు పుట్ట, ఊరు పేరు, నల్ల తెల్ల, ఆకు పాడు మున్నగుమాటలు దేశ్యములు. అనఁగా భాషలో స్వతస్సిద్ధముగ నున్నవి.

ఇట్టి సంకీర్ణస్వరూపముగల యాంధ్రపదజాలము నానాఁటికి వృద్ధిఁజెందుచునే యున్నది. దీనిని నిరోధించుటకు వీలులేదు; అవసరమును లేదు.

చేయి, కన్ను, ముక్కు, మున్నగు శరీరవిభాగములు అయ్యవి చేయు వ్యాపారములనుబట్టి పేర్కొనఁబడినవి. చేయునది చేయి, కనునది కన్ను, వినునది వీను, మూర్కొనునది ముక్కు, మిడియునది మెడ, అనఁగా ఎగయునది యని అర్థము. ఏమి మిడిసిపడుచున్నావు, మిడిసిపాటు, అనుట గలదు. మిడుత యను కీటకము కూడ మిడియునదియే. వ్రేలునది వ్రేలు; అనఁగా వ్రేలాడునది యని అర్థము. మడఁగునది మడమ. నాకునది నాలుక, అరవములో నాలుకకు నాక్కు అని పేరు. (நாக்கு)

వీఁగునది వీఁపనియు, నూరునది నోరనియు, మూయునది మూతి (మూఁతి) యనియు, అడఁగునది అడుగనియుఁ బొడకట్టును. తలఁచునది తల.

మడి, మడుఁగు అను మాటలు శుద్ధవస్త్రమునకు పర్యాయములు. ధౌతవస్త్రము నే మడత పెట్టుదుము. 'మడుగుచీరయందు మసి డాకినట్టుల' అనుచో నిర్మాలిన్యమే అర్థము. మన వెఱ్ఱియాచార మిందులేదు. అంటునది అంటు అగునుగాని తక్కినది గాదు.

పెదవి యను మాటకును పదరు లేక బెదరునకు సంబంధ ముండనోపును. చెక్కిలి తోఁక యనునవి చెక్కు (తోలు లేక) తూఁగు అను క్రియలకుఁ జేరియుండును.

మోయు మూపు, గీరు గోరు, నడుము నడచు, తల తలఁచు, అను జంటలకు సంబంధ మున్నట్టు తోఁచును. నడుమునకు మధ్యభాగమను నర్థము లాక్షణికము కానోపును. గోరునకును, ఖురశబ్దమునకును సంబంధము కల్పించుట సరియని తోఁపదు. తల యనునది

సంస్కృతములోని తలశబ్దమునకును అడుగు అనునది అధశ్శబ్దమునకును చేరువగునా? యను సంశయము పొడమును. తగులుట తాఁకుటయు త్వక్కునకును వాకొను వక్కాణించు వాఁగు అనునవి వాక్కునకును జేరియుండును. వాయి నోరు, చెవి శ్రవము, కడుపు గర్భము అను వ్యుత్పత్తులు ఒప్పినవే. కాలు అనునది క్రియను బోధింపక నాల్గవభాగమున కర్థమగును. కాలుపీసె కాలణా మున్నగు పదములలో నీయర్థమే సంస్కృతమునందు పాదశబ్దమునకు నాల్గవవంతు అనియు నర్థము గలదు. పల్లము చేయునది పల్లును దవురునది దవుడయు నని గోచరమగును. అవు దవ్వురుచున్నది. నీవు వాని యింటఁ బడి దవురుచున్నావు. అని ఉత్తరప్రాంతములలో నందురు. దవురు అనుమాట నిఘంటువులోనికి రాలేదు. దవురు అనఁగ దవుడలాడించితినుట.

మన భాషలో తిర్యగ్జంతువుల పేళ్లు కొన్ని బాగుగ నమరియున్నవి. "మేఁ"యను జంతువు మేఁక, అఁ యనునది ఆవు. క్రోయని జడిపించు జంతువు క్రోఁతి. కావుకావు మనునది కాకి. గుజ్జ్ అని సకిలించునది గుఱ్ఱము. కోయని కూయునది కోడి. ఈ యని రొద చేయునది ఈఁగ. నక్కునది నక్క. కోవ్ కోవ్ అనునది కోవెల. పిచపిచలాడునది పిచ్చుక. చిలచిలమని పలుకునది చిలుక. తీతీయనునది తీతువు. గూ గూయనునది గువ్వ. ఇట్టి పేళ్ల ఒప్పిదము ప్రాయికముగ ఇతర ద్రావిడభాషల లేని అచ్చ తెలుఁగుమాటలలోనే గాన్పించును.

ఇందుఁ గొన్నిమాటలు సంస్కృతపదములను బోలియున్నను వీనిని దద్భవము లనఁబనిలేదు. ధ్వన్యనుకరణములు గావున నివి తెలుఁగునను స్వతంత్రముగఁ బుట్టియుండును. కుందు జంతువు కుందేలు, ఏలు లేక ఏలువు మృగార్థకము, తోఁకునది అనఁగ కెల్లగించునది తోఁడేలు, పోటు ఏలు పొట్టేలు, అనఁగ పొడుచు స్వభావము గలది. తాఁపు ఏలు తాఁబేలు అని స్ఫురించును, తామేలు కాళ్లను దన్నుచు నీటిలోఁ దిగుటను బట్టి యీపేరు గలిగెనా యన్నసంశయము పుట్టును. అమై (ఆముడు) తాఁబేటికి అఱవపుఁబేరు, ప్రాము లేక పాము అను క్రియనుండి పాము అను సర్పార్థకపదము పుట్టియుండునా? ఉరగమను పేరు ఇట్టి తలంపునకెడ మిచ్చును. పాము అధోభాగమును నేలపై పామి చరించుట విదితము గదా? నేలపై తేలి చరించునది తేలు అగునా? ఏడ్చుట ఊడుట ఓడు కూడు అవులిత గూండ్రించు గొర్రె బర్రె చీమ దోమ ఉడుత (పరుగిడునది) మిడుత (మిడియునది) తళుకు బెళుకు ఉఱుము మెఱుము ఉబ్బు మబ్బు దిబ్బ గుబ్బ కఱకు చుఱుకు పోటు పాటు పకపక దడదడ చరచర మున్నగునూర్లు కొలఁది మాటలను విమర్శించినచో పదార్థములకు దగిన స్వరసౌష్ఠవము తెలుఁగు మాటల కమరియున్నదని పొడకట్టును. ఈస్వరసౌష్ఠవమును ఈధ్వన్యనుకరణములును మన తెలుఁగు తేటగను శ్రావ్యముగను ఉండుటకు ముఖ్యకారణము లని యూహింపనగును.

దేశ్యపదములయందుఁ గొన్ని వాడుకలో లేని యర్థములతో నిఘంటువు (శబ్దరత్నాకరము) లోఁ జూపఁబడినవి. నింపాది,

నింపు ఆది అనియు, సమృద్ధము అర్థమనియు దేశ్యవిశేష్య మనియు నిఘంటువు తెలుపును. కాని వాడుకలో నింపాదియన నిర్వ్యాధి యని గ్రహింపఁబడును. నింపాదిని నిర్వ్యాధితోఁ జేర్చుట సరి యని తోఁచును. పంచపాత్రమునకు పంచపాత్రముల సమాహారమని నిఘంటువునందు వ్రాయఁబడెను. 'పఞ్చ విస్తారవచనే' యనుటచే పంచపాత్రమన వెడలుపు మూతిగల పాత్రమగును. పంచాననము వెడలుపునోరుగల సింహము. కంగారునకు యుద్ధము అను నర్థము "కంగారు కంగిసగల నుదురము" అను ఆంధ్ర భాషార్ణవము వాక్యము నుండి గ్రహింపఁబడెను. కాని వాడుకలో కంగారనఁగ కలఁత, కలవరము గాభరా దిగ్భ్రమ అని అర్థము. ఈ యర్థమున కనుగుణముగ కను కారు కంటికి నలుపు అను పదసందర్భమమరియున్నది.

అసలు అనుమాట దేశ్యవిశేషముగను అసలు మూలధనము అను నర్థములతోను నిఘంటువుదాహరించును కాని అసల్ అను మాట అరబ్బిలో వేఱు. బున్యాద్ (పునాదు) అనునర్థములుగలది. అసలు అనుమాట కవిప్రయుక్తము కానట్టున్నది. బాకీ బదులును అన్యదేశ్యములే. అక్కస్సు అనుమాటకు, ఆగ్రహము అనునర్థమీయఁబడెను దేశ్యపదముగ గ్రహింపఁబడెను. కాని యీమాట అరబ్బీలో వైరము క్రోధము అనునర్థములు గలది. ఇది అన్యదేశ్యమే మంగలి యను మాట దేశ్యముగ చూపఁబడెను. కాని, శుభకార్యములయందు మంగళవాద్యములను సిద్ధపఱుచుటయు క్షురకర్మయు నీజాతివారియుద్యోగము లగుటచేతను మంగలి శబ్దము మంగళశబ్ద భవము కానోపును. వాద్యవికారమే బాజా అయ్యెను. భూతభవిష్యత్తుల నెఱిఁగించు ఎఱుకలవాండ్రకు ఈపేరు సార్థకముగనున్నది. వస్తువుల వెలకు దరకు మాఱుగ ధర యందురు. దరయనుమాట హిందీలో వెల యను నర్థముతో నున్నది. ఇది ఆంధ్ర దేశ్యము అగునా? పూచి యనుటకు నిఘంటువు తొలి కూర్పునందు తృణవిశేష మన్నయర్థము మాత్రము ఈయఁబడెను. బాధ్యత, కార్యము అనునర్థము లిటీవల చెప్పఁబడెను. పూచీకత్తు పూచీదారు అనుమాటలఁ బట్టి చూడఁగా పూచీ అన్యదేశ్యముగఁ గన్పట్టును. పేచి యనుమాట తొలిముద్రణమందు లేదు. రెండవ ముద్రణమునందుకన్నడపుమాటగనుభారము, తంటా అనునర్థములతోను చూపఁబడెను. పేచీకోరు అని వాడుకలో (ఉత్తరప్రాంతములలో) నున్నది. అఱవములో పేచి యను మాట తమ్మళపేచి మున్నగుజంటలు వాడుకలోనున్నవి. తేడా యనుమాట తొలినిఘంటువులో లేదు; ఇటీవలికూర్పులో వైకృతముగను పెచ్చు అనునర్థము గలదిగను చూపఁబడెను.

ఇఁకఁ గేవలము వాడుకలో మాత్రము కనఁబడి గ్రంథస్థములు గానిమాటలను గొన్నిఁటిఁ జూతము. హక్కు బాకి నగదు బదులు మున్నగు అన్యదేశ్యము లెన్నియో వ్యవహారములో నున్నవి. ఆస్తి స్థిరాస్తి చరాస్తి మున్నగువానిలోని ఆస్తి తత్సమముగ వ్యవ

హరింపఁబడుచున్నను సంస్కృతమున ఆస్తి యనుమాట కానరాదు. ఆస్తిమాన్ (ధని) అనుమాటయున్నందున ఆస్తి ధనపరముగ తీసికోనఁబడెను. ఉడకబోయుట ఉక్కబోయుట అనునర్థములో ఘుమాయించుట అని ఉత్తర మండలములలో వాడఁబడును. ఇది గ్రీష్మము లేక ఘర్మముతో సంబంధించును. ప్రాకృతము ఘిమ్మాందీనికాఁపరము సార్లా లేదు. వీనితో వ్యవహారము ఎన్నఁడు సార్లాగా నుండదు. ఇట సార్లా యనఁగా తిన్నగ అని యర్థము. ఇది సరళశబ్దభవము. వానికి ఆటపై సరదా గాని చదువుపై సరదా లేదు. ఇట్లు సరదా అనుమాట ఆయిదాఱుజిల్లాలలో వినఁబడును. ఇది శ్రద్ధ అనుమాటయొక్క వికృతిరూపము. పంచ పంచకచ్ఛము బట్ట పటము, వాని ప్రావారము గామంచ గ్రామ్యవస్త్రము అగును. అసింటా జరుగు ఇసింటా రమ్ము అని తెలుఁగు దేశమం దెల్లెడల వినఁబడును. ఇందలి సింటా యనునది ఇంచుక అనునర్థముగల సుంత అను మాటయొక్క వికారమై యుండును. కసింత, కుసింత, కాస్త, కూస్త అనుమాటలలో ఈసుంత దాఁగియున్నదని తోఁచును. ఈసుంత యను మాట ఇసుమంత యనుమాటయొక్క మాఱు రూపముగ నున్నది. కాసంత, కాసు అంత అనియుఁ బొడకట్టును. వాఁడు బైతురా అన్నప్పుడు బైతు అనఁగ భీతుఁడని యర్థము. గామంచా యనుమాట హిందీలో వస్త్ర పర్యాయముగ నున్నది. కొల్లాయిగుడ్డ యెట్లు ఏర్పడెనో తెలియకున్నది. అఱవములో కొల్లాయిల్ అనఁగ పెరడు. కొల్లాయిసీరు అన్నప్పుడు కొల్లాయి అను మాట కుజ్జాయి (குழாய்) అను అఱవపుమాటకు సంబంధించును. కుజ్జాయి అనఁగ గొట్టము. బుల్లి వాఁడు బుల్లి బుట్ట బుల్లి అమ్మాయి మున్నగువానిలోని బుల్లి యనుమాటకు గతి కానరాకున్నది. ఈతనికి ఆసాహుకారు గొప్ప ఆసరాగా నున్నాఁడు అనునప్పుడు సాహుకారు అనఁగ సాధుకారుఁడు సంపన్నుఁడు అని అర్థము. ఆసరా అనఁగ ఆశ్రయము. ఎవ్వరిఆసరా లేకుండ జీవనము చేయుచున్నాడు. చిట్టిబాబు చిట్టితల్లి మున్నగువానిలోని చిట్టికిద్వ్యోత్వటకార మెట్లువచ్చెనో తెలియదు. ఇది చిఱుశబ్దవికారమే. వానిఢాకాకు ఆగలేము అనునప్పుడు ఢాకా అనఁగ దెబ్బ, ప్రహారము అని భావము. (Dacoity) అను ఇంగ్లీషు మాటకూడ డాకా అను హిందీమాటకు సంబంధించినదే; పాగ ఉష్ణీషార్థములో హిందీలో నున్నది. ఇది కేవలము ఆంధ్రదేశ్యము కానేరదు. ఏమి హామని పడుచున్నావు. అను చోట ఆము అహంభావమని కొంద ఱూహించిరి. కాని ఋతుహామని ఆమని యనియు వసంతోత్సవసంభ్రమము దెలుపు ననియుఁ దోఁచును. భోగట్టా యనుమాట వృత్తాంతార్థములో ఉత్తరదేశమున నెక్కువగ వినఁబడును. ఈ భోగట్టాకు వ్యుత్పత్తి గానరాకున్నది. భాగమను నర్థమిచ్చువాటా విదేశ పదము కాఁబోలును. కాటామీది బస్తాలు అను నో కాటా బస్తా అనునవికూడ విదేశ పదములవలె నున్నవి. గందరగోళము అను నది గంధర్వకోలాహల మని కొంద ఱూ

ఖమాయచి, కంభావతీ లేక ఖంభావతీ రాగిణీ విగ్రహము



శ్లో. ఖంభావతీస్యాత్ సుఖదా రసజ్ఞా సౌందర్యలావణ్యవిభూషితా ...,
గానప్రియా కోకిలనాదతుల్యా ప్రియంవదా కౌశిక రాగిణీయమ్.



కుకుభా లేక కకుభా రాగిణీ విగ్రహము



శ్లో. సుపోషితాంగీ రతిమండితాంగీ చంద్రాననా చంపకదామయుక్తా,
కటాక్షిణీ స్యాత్పరమా విచిత్రా దానేనయుక్తా కకుభా మనోజ్ఞా.
రాజపుత్ చిత్రము క్రీ. శ. ౧౮వ శతాబ్దము చివరభాగము.

లక్ష్మి ఆర్ట్ ప్రెస్—బొంబయి.

## శ్రీ గాంధీ మహాత్ముఁడు



చికిత్సయం దున్నప్పుడు తీయఁబడిన ఛాయాపటము

(బొంబయి క్రానికిల్ పత్రికాధిపతుల యనుమతితో ప్రకటితము.)

హించిరి. గాని కన్నడమందు గందరగోళి యను మాట దీనికి జేరును. భార్యాభర్తలకు సరిపడనపుడు "మనోవృత్తి"కి దావా వచ్చును. ఇట మనువృత్తిగోరుట యుక్తముగాని స్వైర వృత్తి కోరరాదు. పెండరాడె సాయంత్రము పెండ్లికి తల్లివచ్చుట అనుచో పెందలకడ, సాయంతనము తరలివచ్చుట అనునవి శిష్ట రూపములు. ఆగిన్నె అక్కడపెట్టు అన్నప్పుడు అక్కడ వేసి పెట్టు అనుటకు అక్కడపెట్టు వచ్చెను. పితలాటకమనగ మోసము,పిత్తళము (ఇత్తడి) ను హాటకము (బంగారముగ) కట్టఁ బెట్టుట. తక్కిరి బిక్కిరి యన తస్కరవిక్రయము. దొంగ ఆమ్మువస్తు న్యాయార్జితము కాదు గదా. తవ్వాయి అని వివాదార్థములో వాడఁబడు మాటకు మూలము తెలియదు. ఫనాదు, ఉజ్జాయింపు, పురమాయింపు, బెత్తాయింపు మరస్తత్తు, అఘోరించు, అత్తకోడలిని సాధించును. విస్సాటము,నిస్సాకారము, కిచ్చాట్లు, ఎక్కములు, ఆపసోపములు, అడపతడప, అవకతవక, అమాంతము, అంచనా, కసాలా, టూకీ, అనాడి, అపసంతి, నిర్ఘాంతపడు, హైరాణ, హేమాహేమి మున్నగు పలు మాటలు వ్యవహరింపఁబడు చున్నవి. కాని వీని స్వరూపములును గోచరములు గావు సాదారకము తెమ్ము అనుచోట సాదా సాధారణశబ్దసంగ్రహరూపము. భరోసా అనఁగ ధైర్యము చెప్పుట. భద్రాశయ మనుదానితో సంబంధముపై యనుమాట ఉపరి,ఉపర్ అను మాట వికృతిగ హిందీలో వ్యవహరింపఁబడు చున్నది. ఈమాట అఱవములోఁ గాన్పింపదు. తద్భవమని తోఁచును. అశ్లీలపరిహారార్థము శబ్దగతి చిత్రచిత్రమార్గములం బోవును. చనిపోవుటలో చావు లేనే లేదు. చనుట పోవుటయు గమనార్థకములు తగులఁబెట్టుటలో నిప్పు లేనేలేదు. తగులునట్టు పెట్టుట అని మాత్రము పదములవల్ల స్పష్టము.నిప్పు ఊహ్యము. దీపము ఘనమయినది. బియ్యము నిండుకొన్నవి. తద్దినము దినవారములు. వానిపెద్ద దినము. రోజు మున్నగునవియు అశ్లీలమును వదలుటకేర్పడినరూపములు.నిజము సంతర్పణ, సంభావన, దాహము మున్నగుపదములు విపరీతార్థములతో తెలుఁగున వ్యవహరింపఁబడు చున్నవి. సంగతిసమాచారములు నిర్లేపనుచు, జరుగు, చెల్లుపడు మున్నగు క్రియలు తద్భవములునుకించిద్భిన్నార్థములునుఅయినట్లున్నవి.

ప్రపంచములోని యితరభాషలయందు వలెనే మన తెలుఁగునందుఁగూడఁ బదజాలము వృద్ధిక్షయములకునువ్యత్యయములకునులోనగు చున్నది. సజీవమగుభాష యెల్లప్పుడు నేకరూపముగ నుండదు. పదజాలమందే గాక ప్రత్యయాదిసందర్భములయందును గూడ మార్పులను జెందుచుండును.

భాష నదివంటిది. నదీజలములచే నానావిధసస్యములు పండునటులు భాషాపదసామగ్రిచేభౌతికజ్యోతిషాదినానావిధశాస్త్రములు వృద్ధికి రావలెను. లేనిచో పదసామగ్రివలన నేమిలాభము? చరిత, కృషి, వాణిజ్యము పరిశ్రమలు, మూర్లకొలఁది భౌతికశాస్త్రములు, ఇట్టి వేమియు మన ఆంధ్రవాఙ్మయమున లేవు. ఇది ఘోరమగు వాఙ్మయ దారిద్ర్యము. ఇది తీఱిన గాని మనకు మేలు గలుగదు. దీనికి ముఖ్యమగువిధానము ఏమన;

తెలుఁగుదేశమునం దన్నితరగతుల విద్యయు తెలుఁగున నేర్పఁబడవలయును. ఇదియేమృతప్రాయముగనున్న ఆంధ్ర వాఙ్మయమునకు సంజీవి.

భాషానది శాస్త్రసస్యములనే గాక కవితారామములను బెంచును; జనులవైభవాభిలాషాపిపాసం దీర్చును; స్వవర్తనవశ్యం బగుచుండు లక్షణతటములకు లోనై అవాంతరములును బాహ్యములునగు వాగుపనదులసంగముచేఁ బొంగుచు జగద్జ్ఞానాబ్ధిమార్గముగ సర్వకాలము చనుచుండవలెను.

“మనగోదావరి కృష్ణ పెన్నలకు సామ్యం బొప్ప నీ యాంధ్ర భా
షనయ జ్యోతిషవైద్య వాస్తు ముఖ శాస్త్రజ్ఞాన సస్యంబులం
దనసంయూథ వచః ప్రణాళికలచేఁ బెంచుచుం గీర్తిపా
ర, నవప్రాభవ భావదీప్తకవితారామంబులం దన్పుచున్.”

“జనతాగౌరవ వైభవైషణ పిపాసం దీర్చుచుం బూర్తిగా
ననయాలస్యమలాపనోదనపటుస్యందాత్మయై యాచున్ స్వవ
ర్తన వశ్యంబగుచుండు లక్షణ తటాంతర్వ్యాప్తిచే నొప్పుచున్
స్వనదావాంతర బాహ్యవాగుపనదీ సంగంబునం బొంగుచుం
జనుచుండ న్వలె సర్వకాలము జగద్జ్ఞానాబ్ధి మార్గంబునన్.

---

# ప్రణయమూర్తి

వేదుల సత్యనారాయణ శాస్త్రి, శతావధాని, (సాహితీసమితి)

ప్రణయమోహన గగనాంతరాళమందు
రెక్కలల్లార్చి శుభ్రవాదిదముతోడ
ధన్యవాదంబు లాడు చాతకలతాంగి
నాకడనె నేర్చుకొనియె ఆనందగీతి.
ప్రణయ హృదయాను రాగ విభ్రమను వోలె
అమల తరమైన కాచపాత్రాంతరమున
వెలుగు దీపిక నల్లాడు శలభకాంత
నాకడనె నేర్చె ఆత్మార్పణంబు సుంత.
ఆని యానని ప్రణయ పుష్పామృతంబు
ఆర్ద్రహృది కన్నెమరుల తీవ్రాగ్ని గొలుప
తెలిసికొనలేని ప్రేమకై తేటి కలికి
నాకడనె నేర్చె విధురగాన ప్రసక్తి.
పలుక తెలియంగ తలపగా వలనుగాక
ఆత్మను దహించు ప్రణయ దుఃఖాగ్ని కొదిగి
నీలమై వంగి వాపోవు నింగినెలత
నాకడనె నేర్చె ప్రణయ ప్రణామనిరతి.
అరుణరాగోదయోన్మీలితాంబుజంబు
చారుచంద్ర కరస్మేర కైరవంబు
పవన పరిరంభపులకిత ప్రసవచయము
నాకడనె నేర్చె ప్రణయసంధానరక్తి.
గున్న క్రొమ్మావి చిగురాకు గుడిసెలోన
జిలుగుటెండలనును తెరం జీల్చినైచు
జీవతంత్రుల హృద్విపంచిక నదించి
వలపురాగాల దీయుకోయిల పడంతి
నాకడనె నేర్చె ఎడబాటునాటిపాట
నాప్రణయగాన ఝురిణీనినాదములకు
విశ్వమె చలించి నిట్టూర్పు విడిచెనోయి!

# భర్తృహరి

## చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

### మొదటి ప్రకరణము

ఇతఁ డొక సంస్కృతమహాకవి. నీతిశృంగార వైరాగ్యములను గూర్చి గీర్వాణభాష యందు మూఁడుశతకముల రచియించి కవిశిఖామణియై యమితప్రఖ్యాతిగాంచెను. ఏ రసము వర్ణించినప్పు డారసము మూర్తి దాల్చి చదువరుల మనోరంగములందు తాండవమాడు నట్లు చేయఁగల యద్భుతశక్తి యీ కవిసార్వభౌమునియందుఁ గలదు. నీతిబోధకమగు గ్రంథముగాని శృంగారవైరాగ్యములను మనోరంజకములుగాఁ దెలుపు గ్రంథముగాని సంస్కృతభాషయం దేదియని యడిగిన పక్షమున వ్రేలుమడిఁచి భర్తృహరి విరచితమైన సుభాషితరత్నావళి యొక్కటియని చెప్పవలెను. ఇటీవల మహాకవు లనేకులు నీతిశాస్త్రముల రచించిరి గాని భర్తృహరి గ్రంథము ముందఱ అవి యంతగాఁ బ్రశంసనీయములుగావు. ఈ మహాకవి యేకాలపు వాఁడో తెలిసికొనుటకుఁ దగిన యాధారములు గానరావు. ఊహలపై నూహలఁ బన్ని పలువురు పలుతెఱంగుల వ్రాసిరి. ఆకారణమునఁ గాలనిర్ణయము చేయుట కష్టము. అయినను ఈతని జన్మమునుఁ గూర్చియు, ననంతర వృత్తాంతమునుఁ గూర్చియు మనోహరమైన కథ యొకటి గలదు. అది వ్రాయుటయే ముఖ్యోద్దేశ్యము.

### జన్మవృత్తాంతము

యమునానదీతీరమున మధురయను పట్టణము గలదు. ఇది దక్షిణదేశమున నున్న మధుర గాదు. ఈ మధురానగరము త్రేతాయుగమున రఘురాముని తమ్ముఁడైన శత్రుఘ్నునకు రాజధానియై ద్వాపరయుగంబున శ్రీకృష్ణుని మేనమామయగు కంసునకు రాజధానియై నారాయణావతారమని కొనియాడబడుచున్న వాసుదేవునకు జన్మస్థానమై మోక్షదాయకములైన యేడుపుణ్యక్షేత్రములలో నొకటియై యిప్పటికిని లక్షలకొలంది తీర్థవాసులచే సేవింపఁబడుచున్నది. పూర్వకాల మాపట్టణమును శృంగారశేఖరుఁడను రాజు పాలించుచుండెను. అతఁ డొకనాఁడు సచివులు, సామంతులు, దౌవారికులు, దండనాయకులు, చారులు, శూరులు, నటులు, భటులు, విదూషకులు, విద్వాంసులు, కవులు గాయకులు, పరిజనంబులు, బంధువులు పరివేష్టింప నిండుకొలువుండెను. ఆసమయమున శంకరునియనుగ్రహమున మరల రూపముఁ దాల్చి వచ్చిన మన్మథుఁడో, భూతలంబునఁ జరియింపవచ్చిన జయంతుఁడో, కాలుసేతులు మొదలగు నవయవములఁ గైకొని వచ్చిన చక్కదనంపుముద్దయో యన్న నొకబ్రాహ్మణుఁడు సభామంటపమునం బ్రవేశించి రాజున కభిముఖుఁడై నిలిచెను ఆమేనిచెలువము,

నాసౌకుమార్యము, నాలావణ్యము, నాతా
రుణ్యముం గని సభాసదు లచ్చెరువొందిరి.
అందఱిమొగములు వానిమొగమున కభి
ముఖము లయ్యెను. అందఱికన్నులు వాని
కన్నుల వైశాల్యమును తనివిసనక చూచు
చుండెను. అందఱిచెవులు వానినోటిమాట
వినుటకుఁ దత్తరపడుచుండెను. అందఱి వా
క్కులు వానితోఁ బ్రసంగింప ముచ్చటఁబడఁ
జొచ్చెను. గద్దియమీఁద రాజునకు నట్టికుతూ
హలమే జనియింప నతఁడిట్లనియె. "విప్ర
కుమారా! మారసమానుఁడవైన నిన్ను
జూచినకొలఁది కడుంగడుఁ జూడ బుద్ధియగు
చున్నది. నీముఖచంద్రమండలమునఁ గాయు
వెన్నెలలచే నీసభాసదుల మొగంబు లనియెడు
కలువలు విచ్చినవి. కొన్ని ప్రశ్నలు నిన్నడుగు
టకై నామనంబు తత్తరపడుచున్నది. నీవాల
కము నీవు బ్రాహ్మణోత్తముఁడవని చాటు
చున్నది. నీ దేదేశము? ఈ మధ్యమలోకమన్మ
థుని గని లక్ష్మీనారాయణులట్లు ధన్యులయిన
దంపతు లెవ్వరు? ఏకారణంబున మమ్మును
మానగరమును ననుగ్రహింప నిందు వచ్చితివి?
దాఁపక నీచరితంబు మా కెఱిగించి తత్తరపడు
చున్న మాశ్రవణంబులకు విందు సేయుము."
అనవుడు నాభూసురకుమారుఁ డిట్లనియె.
"రాజా! భగవంతుఁడగు వాసుదేవునకు జన్మ
స్థానమై కొంతకాలము మధ్యమలోకవైకుంఠ
మై వాసికెక్కిన మధురాపురము నేలుచు
ధన్యుఁడైన రాజన్యుని నిన్నుఁ గాంచి చరితా
ర్థుఁడ నగుటకై వచ్చితిని. నాకుఁ దల్లిదండ్రులు
లేరు. ప్రస్తుత మేకాకిని. వివాహ మింకను
గాలేదు. నాపేరు చంద్రగుప్తుఁడు. మీరన్న
ట్లు నేను బ్రాహ్మణుఁడనే. చిన్ననాఁటనే
కావ్యనాటకాలంకారగ్రంథములఁ జదివి కుశా
గ్రబుద్ధియని గురువులచేఁ బేరువడసితిని. అనం
తర మాఱుశాస్త్రముల నధిగమించితిని.
అఱువదినాలుగు కళలయందు నధికపరిచయ
ము సంపాదించితిని. వేదాధ్యయనమునందు
వినుతిఁ గాంచితిని. రసవంతమగునో కాదో
కాని కవిత్వముఁ గూడఁ జెప్పఁగలను. బంగారు
పళ్లెరమునకైనను గోడచేర్పు కావలయునన్న
ట్లు కవిజనకల్పకంబై, పండితజనపారిజాతంబై,
శ్రితజనచింతామణియై, కరుణాసముద్రుఁడై,
కీర్తివెల్లువలు దిగంతములయందుఁ బ్రవహింప
జేయుచున్న నిన్నుఁ జేరి నీయాస్థాన పండితుఁ
డనై కవినై గౌరవంబుగఁ గాలక్షేపముఁ జేయ
వచ్చితిని. అనుగ్రహించి నన్నుఁ జేకొనుము."
అని విన్నవించుటయు రాజు పరమానందభరి
తుఁడై యాతనిం దగినయాసనంబునఁ గూ
ర్చుండఁబనిచి నూతనవస్త్రాలంకారముల నిచ్చి
యాస్థానపండితుం జేసి దైన్యహీనమగు జీవ
నము కలుగునట్లు చేసెను. కవిపండితులకు
మిక్కిలి దగ్గఱచుట్టమై యెల్లయెడల వారి నెడ
బాయక తోడునీడయై చరియించుదారిద్ర్య
దేవత వానిని విడువలేక విడునలేక యెట్టెటో
విడనాడి రాజాశ్రయములేని తక్కినపండితుల
యొక్క యండ నుండుటకై పోయెను.

అతఁ డావిధమున సకలసౌఖ్యము లవ్వా
రిగాఁ బొందుచు సుఖించుచునుండ నొక్కనాఁ
డొక ముసలిది వానికడకుఁ బోయి దండము
పెట్టి యాతనితో నిట్లనియె: "మహానుభావా!

నాదొక్క మనవి కలదు. ఆగ్రహింపక యాల
కింపుము. ఈ పట్టణమేలుచున్న శృంగార
శేఖరమహారాజుగారి సేనాపతియగు వీర
వర్మకు మదనరేఖయను గారాపుఁగూఁతురు
గలదు. నే నాబిడ్డదాదిని. నీవు మొన్నసా
యంకాలమున నీ చెలికాండ్రతోఁగలసి సరస
సల్లాపము లాడుచుఁ బోవుచుండ నాబాలిక
కనుల పండువుగా నిన్నుఁ గాంచి వీనులవిం
దుగా నీ మాటలను విని మోహపరవశ యై
నది. అది మొదలుకొని యాకలి యనదు.
అన్నము దినదు. నీరుఁ ద్రావదు. నిదురపో
వదు. నీ నామమే స్మరియించును. నీ రూపమే
ధ్యానించును. నీ కథలే వినఁగోరును. కను
కొక వేళఁ బట్టినను నిన్నుగురించియే కలవరిం
చును. వేయేల? ఆమెప్రాణము నీదిగా భావిం
చుచున్నది. కావున గుణమణియగు నా బాలి
కను నీవు వివాహమాడి ప్రాణరక్షణముచేసి
వీరవర్మకుఁ బుత్రికాభిక్షము పెట్టవలెను" అని
వేడుకొనిన నా చంద్రగుప్తుఁడు కొంచెము
కోపము విస్మయము మొగంబునం దోఁప
నిట్లనియె. "మూర్ఖురాలా! పెద్దదాన వగు
టచే నీమతి పోయినట్లున్నది. కాకున్న నిట్టి
మాటలాడవు. నేను బ్రాహ్మణుండను. వేదా
ధ్యయన తత్పరుండను. సకలశాస్త్ర కోవిదుఁ
డను. విశేషించి నైష్ఠికుఁడను. ఇట్టి నన్ను
భయభక్తులు లేక మంచిచెడ్డలు విచారింపక
శూద్రకన్యను వివాహమాడమని పురికొల్పు
టకు నీకు నోరెట్లాడెను? పడుచుఁదనంపు
గర్వమున నీ మదనరేఖ నిన్ను నాకడకుఁ
బొమ్మని ప్రోత్సాహము చేసినఁ జేయుఁగాక!
వయస్సు మళ్లినదానవు. లోకానుభవము
గలదానవు. తగుదు నని నీ వెట్లువచ్చితివి?
చాలుఁజాలు. ఇంకఁ బ్రేలక యవ్వలకుఁ బొమ్ము"
అని కఠినముగా మందలించుటయు నామె
మాఱు మాటాడక చిన్నబోయిన మొగ
ముతో సంతకన్న చిన్నవోయిన మనస్సుతో
నీ మాటవినిన బాలిక యేమగునో యను
భయముతో వచ్చినదారిం బోయి మదనరే
ఖకు జరిగిన వృత్తాంతమంతయు విన్నవించెను.
ములుకులవంటి యాపలుకులు చెవినిబడినతో
డనే మబ్బుగప్పిన చంద్రరేఖవోలెఁ గాంతి
దొలఁగి విహ్వలచిత్తయై చంద్రరేఖ యన్న
ముఁ గుడువక, యలంకారములఁ దాల్పక,
నిదురవోవక, నెచ్చెలులతోఁ బలుకక జలక
మాడక చదనమొల్లక, నెండకుశోషిల్లినకలువ
పూవువలె నుండెను. చెలికత్తెలామెయవస్థను
వీరవర్మ కెఱింగించిరి. వీరవర్మ పుత్రి మృతి
నొందునేమో యని భయంపడి తనయందు
మిక్కిలి దయగల శృంగారశేఖరమహారాజు
కడ కరిగి తనకూఁతుకథయంతయు నాతని
కెఱిఁగించి బిడ్డను బ్రదికింపుమని ప్రార్థించెను.
అది తనచేతిలోనిపనిగావగచి మధురాపుర
మహారాజు వాని కభయమిచ్చి పంపి బ్రాహ్మ
ణకుమారుని రావించి గౌరవించి మదనరేఖను
వివాహమాడుమని చెప్పెను. బ్రాహ్మణుఁడు
కటకటంబడి చెవులుమూసికొని తనస్వాతంత్ర్య
భావము తేటపడ వినయగర్భితముగా నిట్ల
నియె "రాజా! సకలధర్మాధర్మవిదుఁడవైన
నీవు పరమపవిత్రుఁడనైన నన్ను నిట్టిపాపకార్య
మునకుఁ బనుపుట న్యాయమా? వర్ణాశ్రమ

ధర్మపరిపాలనము చేయనలసిన నీవే వర్ణసాం
కర్యము చేయఁదలఁచుకొన్నప్పుడు చెప్పెడువా
రెవరు? కంచెయే చేనుమేసినప్పుడు, తల్లియే
విషముఁ బెట్టినప్పుడు, రాజే ధర్మవిరుద్ధముఁ
గావించునప్పుడు నివారించువా రుండరు. నిరు
పమాననిష్ఠాగరిష్ఠుఁడనైన నేనెక్కడ? శూద్ర
కన్యాపరిణయ మెక్కడ? ఈవిషయమున
మీరు మహారాజులైనను నాకన్నవస్త్రము
లిచ్చి పోషించు ప్రభువులైనను ధర్మభంగ
సమస్య కలుగుటచే నేను సరకుచేయను. నన్ను
మీరాయాస్థానమునుండి వెడలఁగొట్టిననుసరే.
శిరచ్ఛేదము చేయించినను సరే. నేనుమాత్రము
ధర్మపథంబు దప్పను. ఇది త్రికరణ
శుద్ధిగాఁ జెప్పినమాట” అనుటయు రాజాతని
మనోధైర్యమునకును, ధర్మపరాయణత్వము
నకును, నిర్మలాంతఃకరణమునకును, స్వతంత్ర
భావమునకును విస్మితుఁడై లోలోన మిక్కిలి
మెచ్చియితనిపరిశుద్ధజీవనముఁ జెఱుపఁగూడదని
నిశ్చయించుకొని యాతని నింటికిఁబొమ్మని సెల
విచ్చి మదనరేఖను జన్మనాఁటనుండియుఁ దన
కూఁతురైన రాగమంజరితో సమానముగాఁ
బెంచుటం జేసి యామె మనోరథము నెఱవేఱు
కుంటకు మిక్కిలి వగచి యెట్లయిన నామె
కోరిక సఫలము చేయఁదలంచి మంత్రులతో
నాలోచించి యెట్టకేల కొక్క వ్యవస్థనేర్ప
ఱచి బ్రాహ్మణకుమారుని మరల రావించి
యిత్తెఱంగున భాషించెను. “విప్రకుమారా!
నీవు ధర్మము దప్పకుండునట్లు నామనోరథము
నెఱవేరునట్లు చేయుటకు మంచియుపాయ
మొకటి కలదు. అది యుభయకారకము.
కావున నీ వట్లుచేసి నాముద్దు చెల్లింపుము.
బ్రాహ్మణుఁడు మొదట బ్రాహ్మణకన్యను వివా
హమాడి పిదప క్షత్రియ, వైశ్య, శూద్ర
కన్యలను వివాహ మాడవచ్చునని శాస్త్ర
ములు చెప్పుచున్నవి. అందుచేత నా పురో
హితుఁడైన విష్ణుశర్మకూఁతురు శీలవతిని
ప్రథమభార్యగాఁ బరిగ్రహింపుము.
నాగారాపు బిడ్డయైన రాగమంజరిని ద్వితీయ
భార్యగాఁ బాణిగ్రహణముఁ జేయుము. నాదు
కోశాధ్యక్షుఁడైన ధనగుప్తుని ప్రియపుత్త్రిని
సుమతిని తృతీయకళత్రముగా స్వీకరింపుము.
వీరవర్మగారాలపట్టియగు మదనరేఖను జతుర్థ
పత్నిగాఁ జేకొనుము. దీనంజేసి నీకు ధర్మ
భంగమును నా కాశాభంగమును గలుగదు.
బహుకుటుంబికత్వముచే సాంసారికబాధలుసం
భవించునని భయపడకుము. నాయల్లుఁడవైన
నీకుఁ గొదవయుండునా? కావున మాఱు
మాటాడక నావిన్నపము సఫలము చేయుము”
అని ప్రార్థించినరాజుపలుకులు ధర్మవిరుద్ధములు
గాకపోవుటం జేసి మంచిదని రాజానుమతంబున
శుభముహూర్తములయందు బ్రహ్మ, క్షత్రియ
వైశ్య, శూద్రకన్యకలను వివాహమాడి వారి
తో నిరుపమాన సౌఖ్యముల నందుచు భూలోక
స్వర్గసౌఖ్య మనుభవించుచుండెను.

కాలక్రమంబున నలుగురు పడంతులు
గర్భవతులైరి. పురోహితపుత్త్రియగు శీల
వతికి వరరుచియను కుమారుఁడు జనియిం
చెను. రాజనందనయగు రాగమంజరికి విక్ర
మార్కుఁడు ప్రభవించెను. కోశాధ్యక్షుని
కూఁతురగు సుమతికి భట్టియనుసుతుఁ డుద

యించెను. మదనరేఖకు భర్తృహరి పుట్టెను. వారు క్రమక్రమంబునం బెరిగి విద్యాభ్యాసము చేసి సకలలోకవంద్యులైరి. వరరుచి వ్యాకరణశాస్త్రవేత్త యయ్యెను. విక్రమార్కుఁడు మాతామహుని యనంతరమున రాజై విశ్వంభరాభారము వహించెను. భట్టి విక్రమార్కుని మంత్రియై విఖ్యాతుఁడయ్యెను. భర్తృహరిసాహసవిక్రమార్కుని సేనాపతియై విశేషించి మేటి పండితుఁడై సుభాషితరత్నావళియను గ్రంథము రచియించి నాశనము లేని కీర్తికాయముఁదాల్చి నేటికిని సహృదయుల హృదయములందు సంచరించుచున్నవాఁడు.

## రెండవ ప్రకరణము

### అనుమానము

భర్తృహరి భానుమతియను కన్యను వివాహమాడెను! ఆమె గుణసంపదచేతను లావణ్యతారుణ్యవిలాసములచేతను కులశీలములచేతను భర్తృహరికిఁ దగినకాంతయై మగనిమీఁద మేరమీఱిన మక్కువ గలదై, చక్కఁదనంపు దీపమై, పుట్టినయింటికి మెట్టిన యింటికి నిరుపమానమైన కీర్తిని దెచ్చుచుండెను. భర్తృహరియుఁ బతివ్రతాలలామమైన యాపడంతియందు గాటమైనవలపు గలిగి సంసారసుఖంబు లనుభవించుచుండెను. విక్రమార్కుఁడు తన యాస్థానపండితుఁడును తన కన్నివిధముల నగ్రజన్ముఁడునైన వరరుచి యొక్కపాండిత్యమును మెచ్చుచుఁ బెద్దతమ్ముఁడైన భట్టియొక్క సమయోచితబుద్ధికుశలతకు మిక్కిలి హర్షమొందుచుఁ గడగొట్టు తమ్ముఁడైన భర్తృహరి రసములఁ గుమ్మరించు కవిత్వము చెప్పునప్పుడు మహానంద మొందుచుఁ బ్రకృతిజనరంజనమే ప్రధాన కర్తవ్యముగాఁ జేసికొని భట్టియొక్క బుద్ధిబలము భర్తృహరియొక్క బాహుబలము తనకుఁ బెట్టనికోటలై, వజ్రకవచములై, రక్షరేఖలై ప్రవర్తింప మహీమండల మేలుచుండెను. భర్తృహరి విక్రమార్కుని యొక్క వెలుపలి శత్రువులను శౌర్యసంపదచేత జయించినట్లే తనలోపలి శత్రువులను జ్ఞానవైభవముచేఁ జయించి, గంటముపట్టిన చేతనే ఖడ్గముపట్టుచు, ఖడ్గము పట్టినచేతనే గంటము పట్టుచు, తనజన్మము చరితార్థము చేసికొనుచుండెను. అట్లు కొంతకాలము గడచెను. ఒకనాఁడు భర్తృహరి భానుమతీ సమేతుఁడై తనమేడపై సుఖాసీనుఁడై సరససల్లాపము చేయుచుండెను. అది ప్రాతఃకాలము. దగ్గఱఁ జేరి మెల్లఁగ మీఁదఁ జేయివైచి రాత్రి సుఖనిద్ర పట్టినదా యని పరామర్శచేయు ప్రాణమిత్త్రుఁడువలె మందమలయానిలుఁడు దేహంబులు స్పృశియించుచుండెను. భానుమతీదేవి నెమ్మొగముమీఁది కుంకుమబొట్టు చందంబున పొడుపు కొండమీఁదఁ బ్రొద్దు పొడిచెను. పరాజితుఁడై పారిపోవుటకు సిద్ధముగా నున్న శత్త్రురాజు ముఖమువలెఁ గళాహీనమై యస్తమించుటకు సిద్ధముగానున్న చంద్రమండలము వెలవెలఁ బాఱుచుండెను. అప్పు డాదంపతులకు దూరమునుండి భేరీరావము వినఁబడెను. అది యంతకంతకు సమీపించెను. ఎట్టకేలకు

జనసమూహ మొకటి వారికంటఁ బడెను. ఆసమూహమునకు ముందుభాగమునఁ జెవులు చిల్లులుపడునట్లు భేరీలు మ్రోగుచుండెను. ఆ మేళము వెనుక నొకశవము కనఁబడెను. ఆపీనుఁగు వెనుక ముఖమునిండఁ బసుపు రాచుకొని కుంకుమబొట్టు పెట్టుకొని పసుపువన్నె చీర కట్టుకొని మనసులోనున్న దుఃఖమునంతయు దెలియఁజేయుచు రెండు కన్నులనుండి కాలువలై పాఱుబాష్పములతో నొకయంగన కనఁబడెను! అడుగులు తడబడ నడువలేక నడువలేక పోవుచున్న యామెను బంధువులు పట్టుకొని నడపించుచుండిరి. ఆమె వెనుక హరినామస్మరణ చేయుచున్న బంధుమిత్రుల బలగము కనఁబడెను. వీధి కిరుప్రక్కలనున్న గృహంబుల యరుగులమీఁద నుండియు మేడమీఁద నుండియు, నుజ్జయినీపురనివాసులు గుంపులు గుంపులు కూడి యాయుత్సవముఁ గనుగొనుచుఁ గన్నుల నీరునించుకొనుచు నిలిచియుండిరి. అదియేమో చూడవలయునని కుతూహలము జనియింప భానుమతియుఁ దన పీఠమునుండి లేచెను. ఆమెతో భర్తయు లేచెను. భార్యాభర్తలాయూరేగింపు కనుఁగొనిరి. అది యేమో భానుమతికి దెలియనందున "అయ్యో!" యిది యేమి యుత్సవమని భర్త నడిగెను. "కళ్యాణి! యిది యేమో యెఱుఁగవా? ఇట్టి దెన్నఁడు చూడలేదా? మగఁడు మృతినొందగ మహాపతివ్రతయైన యతనిభార్య భర్తతో సహగమనముచేయుటకై శ్మశానభూమి కరుగుచున్నది. బంధుమిత్రులుగూడఁ బోవుచున్నారు" అని భర్తృహరి యామెప్రశ్న కుత్తరము చెప్పెను. చెప్పుటయు భానుమతి విస్మయగర్భితమయిన చిఱునవ్వుతో "భర్త మృతినొందినచో సహగమనముచేయుటకై భార్య శవముతోఁ గూడ వెళ్లవలయునా?" యని యడిగెను. "ఏమి? వెళ్ల నక్కఱలేదా" యని భర్తృహరి పలికి యూరకుండెను. అంతట భానుమతి గృహకృత్య నిర్వహణమునందు సేవకులను నియోగించుటకై మేడదిగి క్రిందికరిగెను. భర్తృహరిమనస్సు కలఁతఁజెందెను. భార్య తనకడనుండి లేచి వెళ్లుచుండ నామె వాలకము నతఁడు ఱెప్పవాల్పక యొక్కనిమేషము చూచెను. ఆమె మేడమెట్లు దిగుచుండ నతని మన స్సగాధమైన యనుమానసముద్రమున దిగిపోవఁ దొడఁగెను. సముద్రతరంగములవలెఁ దలంపులపై దలంపులు తెంపులేక పరంపరలై పొడమి యడఁగఁజొచ్చెను. అతిగంభీరమయిన యాతని మనస్సాగరమందు మున్నడుగునఁబడియున్న క్రోధమాత్సర్యములని యెడు మకరతిమింగిలములు పైకివచ్చి యథేచ్ఛముగా సంచరింపఁజొచ్చెను. ప్రశాంతమయిన యాతనిమనస్సు మంచిచెడ్డ తలంపులు పోరాడు రణరంగ మయ్యెను. మాటిమాటికి నిట్టూర్పులు మొగమునుండి వెడలఁజొచ్చెను. ఒకమా రాసనమునుండి లేచి యిట్టటుదిరుగును. వెంటనే యాసనమునఁ జదికిలఁబడి పైకిఁజూచును. కాలితో నేలరాయును. అటు చేతితోఁ దలఁబాముకొనును. తలయూఁచును. పెదవికఱచును. పండ్లుకొఱుకును వెయ్యేల? ఆతఁడున్మత్తునివలె నుండెను. కొంతసేపటికి ధైర్యము దెచ్చుకొని తనలోనిట్లు తలపోసెను.

"భానుమతి మహాపతివ్రతయని నేనింతకాలము తలంచుచుంటిని. నేటిమాటవలన నీయామె సాధ్వికాదని తెల్లమైనది. భర్త మృతినొందినప్పుడు భర్తతో సహగమనము చేయుటకై భార్యపోవలెనా యని యీయామె యడిగినది కదా! ఉత్తమజాతి స్త్రీలక్షణ మీయామె యెఱుంగదా! ఎఱుంగకపోవుటకుఁగారణమేమి? సత్కులమందు జనన మొందినది. కొంత చదువుకొనినది. లోకజ్ఞానముకలది. ఈమాత్ర మెఱుంగదా! ఉత్తమవంశ సంజాతలగుస కాంతలు మగని మరణానంతరమున భయము లేక చిచ్చుటికి ప్రాణత్యాగముచేసి యిహలోకమునందుఁ గీర్తిని బరలోకమునందు మోక్షమును బడయుట సదాచారమని యీయామె యెఱింగియు నింతనిర్భయముగా నాయెదుట నట్లాడుట నరసిచూడ నిది యెంతకైనను సాహసురాలని తోఁచుచున్నది. అట్లు కాకున్నచో మగండనైన నా కట్టియుత్తర మిచ్చునా! అభిప్రాయము లనేకము లుండవచ్చును. కొన్ని వెలిపుచ్చవచ్చును. కొన్ని వెలిపుచ్చరాదు. ఆయుక్తాయుక్త వివేచనజ్ఞానమే దీనికి లేనట్లు తోఁచుచున్నది. ఈ సాహసురాలు నామరణానంతరమున సహగమనము చేయునా? చేసిన నాకేమి? చేయకున్న నాకేమి? నే నది చూడఁబోవుదునా? ఈమె యభిప్రాయము నిరంకుశమై విశృంఖలమై యున్నది. ఉండుగాక! దీని మన స్సెంత లోఁతున్నదో యారయవలయును".

## మూఁడవ ప్రకరణము

### పరీక్ష

అని మది నిశ్చయించుకొని యాపూఁట సరిగా నన్నము దినక పరధ్యానముగానుండి సేవకులతోఁడఁగాని భానుమతితోఁడఁగాని సంభాషింపక యడిగిన ప్రశ్నములకుఁ దగిన యుత్తరమీయక విచారగ్రస్తుఁడై యుండెను. అది కనిపెట్టి సేవకులు భానుమతిని సమీపించి "అమ్మా! అయ్యగా రేలాగుననో యున్నారు. బొందిమాత్ర మిచ్చట నున్నది. గాని మనస్సెచ్చటనో యున్నది. కారణ మారయలేకున్నాము. హేతువు మీ రెఱుఁగుదురా" యని యడిగిరి. అప్పలుకులు విని యామె మిక్కిలి యక్కజపడి ప్రాణనాయకుని సన్నిధి కరిగి మృదుమధుర భాషణంబుల నిట్లనియె. "ఎందుచేతనో మీమనస్సు మనసులో లేదు. చిత్తము పరాయత్తమై యున్నది. నేను కారణ మూహింపలేక యున్నాను. శ్రీవిక్రమార్కమహారాజుగారికి మీమీఁద నెందుకైన నాగ్రహము గలిగినదా? లేక మీకాప్తులైన చుట్టములు నెచ్చెలులు మృతినొందిరా? అట్లుగాకున్న నే నేదైన మీ యెడల నపచారము గావించితినా? పరిజను లెవరైన మీయాజ్ఞఁ దిరస్కరించిరా? అదియుఁ గాదేని మీ దేహమునందు స్వస్థత లేకయున్నదా? నాయెడల నపచార మున్న పక్షమున క్షమియింపుఁడు. సేవకులు తప్పుచేసిన శిక్షింపుఁడు. ఇతర కారణమున్న నా కెఱిఁగింపుడు. మీ రెప్పటివలె మనసిచ్చి మాటాడకున్నారు. ప్రేమతోఁ బలుకరింపకున్నారు. చిఱునవ్వులతో నెల్ల

ప్పుడు కలకలలాడు మొగము నేఁడు చిన్న వోయి యుండుటచే నామనస్సెంతో చిన్నవోయినది. ఇల్లంతయు చిన్నవోయినది. కావున మీవిచ్ఛిన్నదనమునకుఁ గారణంబు నాకెఱిఁగింపుఁడు" అనవుడు భర్తృహరి, "మహారాజునకు నామీఁద నాగ్రహము లేదు. బంధుమిత్రులు మృతినొందలేదు. నాయెడ నెవ్వరపరాధముఁ జేయలేదు. నావిచారమునకుఁ గారణము నే నితరులకుఁ దెలియఁజేయఁ దలఁచుకొనలేదు. కాలక్రమంబున నీవే యెఱుంగఁగలవు." అని యుత్తరమిచ్చి పీఠమునుండి లేచి సేవకులలో నొక్కనిని బిలిచి వేఁటకుఁబోవుటకు సన్నాహముఁ జేయుమని యాజ్ఞాపించెను. పరిజనులు, తెరలు, నురులు, నుచ్చులు దీమములు వేఁటకుక్కలు మొదలగువాని నన్నిటిని సిద్ధము జేసి సకలకళ్యాణలక్షణలక్షితమైన గుఱ్ఱముమీఁద జీనువైచి ప్రయాణమునకాయత్తముచేసి సన్నాహము సంపూర్ణమైనదని స్వామి కెఱిఁగించిరి. అది విని భర్తృహరి మృగయాక్రీడకుఁ దగిన వస్త్రాలంకారములను దాల్చి యాయుధములను సమకూర్చుకొని మునుపటియట్లు ప్రియురాలిని బిల్చి మాటాడక యామెతో నేమియుఁ జెప్పక యశ్వారూఢుఁడై సపరివారముగా వెడలిపోయెను. పూర్వము తనపై నింతింత యనరాని యనురాగముగల జీవితేశ్వరుఁడు నిష్కారణముగా నాఁడంతయనాదరణము తనయెడఁ జూపినందుకు భానుమతి దుస్సహమైన వేదనంబొంది గుఱ్ఱముపై నెక్కి పోవుచున్న భర్తృవిగ్రహము కన్నుదోయికి గనఁబడినంతసేపు చూచుచు నతఁడు దృష్టిపథము దాఁటిపోయిన వెనుక శయనాగారము ప్రవేశించి పానుపుపైఁ బవ్వళించి తనయవస్థను గూర్చి చింతింపఁ దొడఁగె. పరిచారికలామెను పలుతెఱంగుల నూరడించిరి. మనోవ్యాధులకు మాటలు మందులగునా? ఆమె విషాదము లేశమైన మందగింపలేదు. అట్లు నాలుగుదినములు గడచెను. అయిదవనాఁడు భానుమతి తనకిష్టదైవతమై పలుమారు తన మొఱ లాలకించి తనమనోరథములు సఫలముగావించిన జగన్మాతయగు పార్వతీదేవిని సమారాధనము జేయవలెనని నిశ్చయించి స్నానాదివిధులఁ దీర్చి పరిశుద్ధమైన యంతఃకరణముతో దేవిని బూజించి నానావిధములఁ గొనియాడి తన యెట్టయెదుట నామె నిజరూపముతో నున్నట్లు భావించి తనమనోవేదన యిత్తెఱంగున నెఱింగించెను. "అమ్మా! జగజ్జననీ! నీవు సకలలోకములలోఁపల వెలుపలను వ్యాపించియుండి యెల్లవారి యభిప్రాయముల నెఱుఁగుదువు. అయినను నామనోవ్యథ నానోటనే నీకు విన్నవింపవలయునని కుతూహలము గలదు. దేవీ! సావధానవై యాకర్ణింపుము. మనోవాక్కాయకర్మములచేత నాప్రాణేశ్వరునియెడల నే నపరాధముఁ జేసియెఱుఁగ. ఆయనమాట జవదాఁటియెఱుఁగ. ఆయన కనుసన్నలనే మెలఁగుచుంటిని. అమ్మహాత్ముఁడే నాపాలిటిదైవమని, నాపున్నెముల పంటయని, నాభాగ్యరాశియని భావించుకొని యాయన చరణంబులు శరణంబుగాఁ గాలక్షేపము సేయుచుంటి. ఇటులున్నను నాలుగుదినముల క్రిందట నాయనకు

నామీఁదఁ గారణములేకయే బిట్టలుక పుట్టి
నది. నాచరిత్రమును నే నెన్నివిధములఁ బరి
శోధించిచూచినను నావలన నేరములేదనియే
నానమ్మిక. కాని యొక్క సందియంబు మా
త్రము నామనంబును బాధించుచున్నయది.
అయిదుదినములక్రిందట నొకపతివ్రత తన
మగనిశవముతో సహగమనము చేయవలెనని
యుత్సవముతోఁ బోవుచుండఁగా నే నది
చూచి మొదట నదేమో తెలిసికొనలేక భర్త
గారివలన విని 'పతివ్రతయైనస్త్రీ భర్తశవము
తో సహగమనముచేయుటకుఁ బోవలయునా'
యంటిని. ఆమాటలు నానోటనుండి వెడలి
నదిమొదలు భర్తగారు విచారాక్రాంతచిత్తు
లై యుండిరి. ఈమాటలనుబట్టి యాయనకు
ననుమానము కాఁబోలును. నేను బతివ్రతను
గానని యాయన తలంచెను గాబోలు. నా
పలుకులకై యాయన కలుక పుట్టినదేమో
యని యాయన వేఁటకువెళ్లినతఱువాత నా
కనుమానము కలిగినది. వెళ్లకమునుపు తోఁ
చినపక్షమున నాయభిప్రాయ మాయన కెఱిం
గించి సంశయము నివారించియుందును. ఆయన
యిచ్చట లేఁడు. కావున నాయాశయము నేను
నీకు విన్నవించుచున్నదానను. పతివ్రతయైన
యంగన భర్తృమరణవార్త వినినతోడనే
ప్రాణములు వాయక మఱికొంతసేపు బ్రతికి
యుండి సహగమనముచేయుటకు నగరజనుల
యెదుటనుండి పోవలయునా యనునర్థముతో
నట్లంటినిగాని పతివ్రతలు సహగమనముచేయఁ
గూడదని నాయభిప్రాయము కాదు. పిడుఁగు
వంటి భర్తృమరణవార్త వినినతోడనే పతి
వ్రతయైన ప్రాణము లుండునా? యని నాసంశ
యము. నేను సత్యమే పలుకుచున్నానో యస
త్యమే పలుకుచున్నానో సకలభూతహృదయ
వర్తిని వైన నీవెఱుఁగవే? తల్లీ! సత్యమిప్పుడు
నీకు విన్నవించితిని. నాభర్తమనంబునఁ బ్రవే
శించియాయనకునాయందెప్పటియనుగ్రహము
గలుగునట్లు, నిరపాయముగా నామహాత్ముఁడు
వేఁటనుండి గృహంబునకు మరలివచ్చునట్లు
కటాక్షింపుము. నావందనములు చేకొనుము.
అని విన్నవించుకొని పూజాగారము విడిచి
యావలకుఁ బోయెను. అంతలో నొకసేవకుఁడు
పరుగుపరుగున వచ్చి రోదనముచేయుచు నామె
యెదుట నిలిచెను. భానుమతి యాతనిని జూచి
వెలవెలఁబారుమొగముతో వణకుచున్న నెమ్మే
నితో గద్గదమైనకంఠముతో "ఓరీ, విజయా!
ఏల యేడ్చుచున్నావు? కుశలమాభర్తగారికి?"
అని వానినోటనుండి ప్రత్యుత్తరము రాకునికి
మఱలమఱల రెండుమూఁడుసారు లడిగి వాని
వలన నేయుత్తరముఁ బడయలేక శరీరము కం
పించుటఁజేసి నిలువజాలక, "అమ్మా! ఆస
నముఁ దెచ్చుచున్నాను. క్రిందఁగూర్చుండ
వలదు" అని పరిచారిక పలుకుచున్నను సరకు
సేయక కటికినేలఁ జదికిలఁబడి మఱియు "విజ
యా! విజయా! చెప్పుము. ఏలయేడ్చెదవు?
కుశలమా భర్తగారి" కనియడిగెను. విజయుఁడు
కన్నీ రుత్తరీయమునఁదుడుచుకొని చేతుల
జోడించి హీనస్వరముతో నిట్లనియె. "అమ్మా!
యేమని విన్నవింతును? మేమందఱము మంద
భాగ్యులము. ప్రభువువారు శీకరాటవులకుఁ
జని క్రూరమృగంబుల వేటాడుచుండ నేమా

లనుండియో యతిభయంకరమైన పెద్దపులి యొకటి వచ్చి గాండ్రుగాండ్రుమని గుండె లవియునట్లు మహాటవి మారుమ్రోగునట్లు పెల్లఱచుచు స్వామిపైఁబడెను. అమానుష శక్తిగల ప్రభువు క్రూరమృగముతోఁ గొంత సేపు పెనఁగులాడెను. కాని తుదకు మనుష్య బలముకంటె జంతుబలమే యధికమయ్యెను. స్వామిశరీరమునిండ నెత్తురు వఱదలై ప్రవహించెను. ఒడ లెఱుఁగక స్వామి పడిపోయెను. అది మూర్ఛయనుకొంటిమి. హా! యేమిచెప్పుదును? అదిమరణమే కాని మూర్ఛ కాదు." అని వెంషియు నేదో చెప్పఁబోవుచుండ "హా! పరమేశ్వరా" యని భానుమతి



అసత్యపు భర్తృమరణవార్తనువిని భానుమతి నేలఁబడుట

నేలఁబడెను. "అయ్యో! దేవి! అయ్యోదేవి! యెంతకష్ట! యెంతకష్ట!" మని పరిచారికలాక్రందనముచేయుచుఁ జన్నీళ్లు పన్నీరు మొదలగు చల్లనిపదార్థములఁ దెచ్చి సముచితోపచారములు చేసిరి. కాని భానుమతికి స్పృహ రాలేదు. పరిచారికలు పెద్దపెట్టున నేడువసాగిరి. విజయుఁడు బొమ్మమోఁదుకొని యేడ్చుచు "హా! నేనెంత పాపాత్ముఁడను? ఈపాడు వార్త చెప్పిన దురాత్ముఁడను నేనేకదా! ఈమె నిజముగా మరణించియుండునా! అట్లయిన నీపరమసాధ్వి బలవన్మరణమునకు నేనే కారణముగదా! ఈపాపము వేయిజన్మములకైన హరించునా? నా బ్రతుకేల? ఇచ్చటనే నిలువఁగూడదు." అని ఖేదపడుచు నచ్చోటు విడిచిపోయెను.

## నాల్గవ ప్రకరణము

### వైరాగ్యము

విజయుఁడు శక్యమైనంత వేగముతో భర్తృహరి వేటకై విడిసిన యడవికిఁ బోయి భయము, దుఃఖము మనమునఁ బెనఁగొన స్వామిసన్నిధిని నిలిచెను. భర్తృహరి వాని మొగముఁజూచి "విజయా! ఏమి జరిగినది? నీ మొగము మిక్కిలి విచారమును సూచించుచున్నది. అప్రియముచెప్పవచ్చితివా?" యని యడిగెను. విజయుఁడు భయసంభ్రమములు గదుర నాతని కేల్లు విన్నపముచేసుకొనెను, "దేవా! నేను మిక్కిలి

పాపాత్ముఁడను. నాచేసిన పాపమునకు నరకమేగాని వేఱొకప్రాయశ్చిత్తము లేదు. దేవరవారియాజ్ఞ శిరసావహించి మీాయబద్ధపు మరణవార్తను నేను దేవిగారి కెఱిఁగించినందుకు నిజమైన మరణవార్తనే మీాకు మఱల నెఱిఁగింపవలసి వచ్చెను. స్వామీా! యిట్టిపంత మెన్నఁడు కనివిని యెఱుంగము. భార్యయొక్క పాతివ్రత్యము నీవిధముగా శోధించినవా రెందును లేరు. ఇది మీాకే తగియున్నది. పతిమరణవార్తను వినఁగానే యాయిల్లాలు పెద్దగాలిపెట్టిన కూఁకటివ్రేళ్లతోఁ గూలిపోవు చెట్టువలె నేలంబడెను పరిచారికలు కొన్ని శైత్యోపచారములు చేసిరి. కాని నేను బయలుదేరునప్పటికి తెలివి రాలేదు. ఆపరమసాధ్వి మృతినొందెనని చెలికత్తెలు భయపడుచున్నారు. ఈ దారుణవార్త నెఱిఁగించుటకై నాపాపుజీవనమును విడువలేక సిగ్గుమాలి మఱల మీాకడకు వచ్చితిని. మీాఁద దేవరచిత్తము."

అని విరమించుటయు, భర్తృహరి యాశ్చర్యవిషాదములతో "విజయా! యెట్టెటు! దేవి మృతినొందినదా? అంతపని జరిగియుండునా? కర్ణకఠోరమైన యావార్త శ్రవణగోచరమైనతోడనే దేవి శోకభారముచేత మూర్ఛిల్లియుండును. తెలివి నీవు వచ్చునప్పటికి రాకపోయినను నీపాటికైన వచ్చియుండును నీవు వెంటనే పోయి నాగుఱ్ఱమును బయనమున కాయత్తముఁ జేసికొని రమ్ము. ముందు నేను బోవుచుండెదను. వేట చాలించి పరివారమంతయు వెంటనే ప్రయాణమై నగరమునకు రావలయునని చెప్పుము. ఆలస్యము చేయకుము. నామన స్సిప్పుడు దేవి సన్నిధికే పోయినది" అని యానతిచ్చి తన మనంబున నిట్లు వితర్కించెను. "ఏమి? కుడిచి కూర్చుండి మహాపద తెచ్చుకొంటినే? అది మూర్ఛయైన పక్షమున సరే, కాక, మరణమేయైన పక్షమున హానియు లోకనిందయుఁ బొందినవాఁడ నగుదును. అది మూర్ఛయేయైనచో నెంతబాగుండును! పరమేశ్వరా! రక్షింపుము రక్షింపుము, నీ నామస్మరణమే సంజీవని యగుగాక! నీవే గతివి. నీ పాదద్వయమే నన్ను విపత్తునుండి దాటించుతెప్ప" అని తలపోయుచుండ నంతలో హయరత్నము ప్రయాణమునకు సిద్ధమై వచ్చెను. అతఁడు వెంటనే వారువము నెక్కి బయలుదేరెను. పరివారముగూడ నాతని వెనుకనే బయలుదేరెను. తనమనస్సు తన గృహము మీాఁద వ్రాలినంత వేగముగాఁ దనగుఱ్ఱము గూడ తన యింటిముందఱ వ్రాలవలయు నని యతఁడు కోరి యశ్వమును తఱటుచేసియుఁ, జేతితోఁ దట్టియు, మాటలచే నుత్సాహపఱచియు, నప్పుడప్పుడు కశాఘాతంబుల నొప్పించియు సాధ్యమైనంత వేగముగా నడపించెను. ఎట్టకేలకు గుఱ్ఱము శిప్రానదీప్రాంతమున నున్న శ్మశానభూమి సమీాపమునకుఁ బోయెను. అక్కడ వేలకొలఁది జనులు గుమిగూడి యుండిరి. భర్తృహరి గుఱ్ఱము నాపి యొకపురుషుని బిలిచి యాసందడి యేమని యడిగెను. అతఁడు భర్తృహరియని యాపురుషుఁ డెఱుఁగక యిట్లుచెప్పెను.

"అయ్యా! భర్తృహరి వేటకుఁబోయి పెద్దపులిచేతఁబడి చచ్చిరట. ఆ వార్తవిని యాతనిభార్య మృతినొందినది. భర్తశవము వ్యాఘ్ర మీడ్చుకొని పోయినందున నామెను మాత్రమే దహనముచేయుటకు బంధువులు శవమును గొనితెచ్చిరి." ఆ మాటలు తిన్నగా ముగియకమునుపే భర్తృహరి గుఱ్ఱము నుండి దిగి నేలఁబడెను. సేవకులాయనను లేవనెత్తిరి. అవయవముల పటుత్వము తప్పెను. అంగము వడఁకెను. చిల్లిపడిన కుండలోనుండి జలమువచ్చునట్లు కనులనుండి నీరు కారఁజొచ్చెను. భార్యశవము కడకుఁ దీసికొని పొమ్మని యతఁడు సేవకులతోఁ జెప్పెను. మఱియొకచేయి పట్టుకొని యిరువురు సేవకులాతని నచ్చోటికిఁ గొనిపోయిరి. ఎఱిఁగినవా రందఱునాతనిఁ జూచి నిశ్చేష్టులై కొంతవడికిఁ దెలివి దెచ్చుకొని "భర్తృహరి వచ్చె భర్తృహరి వచ్చె"నని కేకలు వైచిరి. అందఱాశ్చర్యము నొందిరి. తిన్నఁగా నతఁడు భానుమతి కళేబరమునొద్దకుఁ బోయి యాశవమును చూచి మూర్ఛవోయెను. చల్లని యుపచారములచేత మెలఁకువ గలిగి యిట్లు విలపించెను. 'ఓమహాపతివ్రత! నేను నీకు భర్తను గాను, నీపాలిటి యముఁడను. నీమాటల యర్థముఁ దెలిసికొనలేక నిన్నుఁ బరీక్షింపఁదలఁచి యబద్ధపుమరణవార్త యనుశూలముతో నిన్నుఁబొడిచి చంపితిని. మగని మరణవార్త వినినతోడనే పతివ్రత యచ్చటఁ జావవలెఁ గాని సహగమనము చేయుటకై నడచిపోవలయునా? యని నీ యభిప్రాయము. ఆహాహా! ఎంతగొప్పయాశయము? ఎంత యున్నతభావము? ఎంత పరిశుద్ధజీవనము? ఎట్టి యమానుషవర్తనము? నీయాశయములు దెలియ దేవతలకునైన శక్యము గాదు. నీ మహోదారభావములు నేను గ్రహింపలేక మందమతినై చేతులార నినుఁజంపుకొంటిని. క్షణకాలములో నీశరీర మాహుతిగాఁ జేసికొనఁదలఁచిన యీ యగ్నిహోత్రముకంటె నీవు పవిత్రురాలవు. మందభాగ్యుఁడనగు నాకు నీ వెట్లు దక్కుదువు? నాయబద్ధపు మరణవార్త విని నీవు ప్రాణములను విడిచితివి. నీనిజమైనచావుఁ జూచి నేను బ్రతికితిని. నాహృదయము దారువో, శిలయో, వజ్రమో కానోవు. మగనిమేనితోడఁ బతివ్రతయైన మగనాలు చిచ్చుఱుకుట సాంప్రదాయముగదా! నే నిప్పుడు కళేబరముతో నిప్పులదుమికి భార్యాసహగమనసాంప్రదాయము నెలకొల్పెదను. కళ్యాణి! మొగముమీఁద కళ పోలేదు. ఇంకను జీవించి యుంటివేమో యని యాశ కలుగుచున్నది. కాని నాది వట్టి యాశ!" అని వగచివగచి దుఃఖము పట్టలేక ప్రాణత్యాగము చేయఁదలచెను. బంధుమిత్రులు ఆతని వారించి కొంచెము దూరము తీసికొనిపోయి భానుమతీకళేబరమునకు నగ్నిసంస్కారము జేసిరి. ఆమె శరీరమువలెనే యాతని మనస్సుకూడ మండి పోవుచుండెను. ఆత్మహత్యగావించుకొని శోకము నివారించుకొనుటకతఁడు యత్నింప నాప్తబంధువు లట్లు చేయనీరైరి. అగ్ని నీటిచేతజల్లారునుగావున బాష్పజలముచే నతఁడు శోకాగ్ని నార్పుకొనుచుండెను.

ఆసమీపమున మఱ్ఱిచెట్టు కలదు. దానినీడ నొక సన్న్యాసి కూర్చుండి కొంతసే పిటునటు చూచి తన కమండలము ముక్క ముక్కలుగాఁ బగులగొట్టి యాతునియ లన్నియు నొకచోటఁ జేర్చి యిట్లు వాపోవఁ దొడఁగెను. "హా కమండలమా! భూమం డలమంతయు ధారవోసినను నిన్ను నే నెవ రికి నీయఁజాలను. అయ్యో! నీవు చెఱకురస మువంటి తియ్యని నీరిచ్చి దాహము తీర్చి తల్లి వలెఁ గాపాడితివి. ఎండకాలమున గాడ్పులు వీచునప్పుడు తాపమున కోర్వలేక చల్లఁదనము నకై నేను నిన్నుఁ గౌఁగిలించుకొనువాఁడను. ఇఁక నాకెవ్వరు దిక్కు? నాదాహ మెవ్వరు దీర్చెదరు? నేనెవ్వరిఁ గౌఁగిలింతును? అయ్యో? నీవు లేకపోవుటచే నాచేతులు చిన్నవోయి నవే? సూర్యుఁడు వెలుఁగు చున్నను లోకము చీకటికొనమైనదే! నీవాడ మెంత సుందర ముగా నుండెనే? నీకడుపుచలువ యేమని వర్ణిం తునే? నీలోనుండి నీళ్లు తొళుక్కు తొళుక్కు మని పైకి వచ్చినపుడు స్వర మెంత మనోహ రముగా నుండెనే? అయ్యో! నాకనుల చంద మామా! నాపాలిటి పారిజాతమా? నాము ద్దులమూటా! నాచింతామణీ! నాకామధే నువా! యెందుఁబోయితివే? నిన్నువిడిచి నే నెట్లుండెదనే!" అని తొమ్ము మోఁదుకొని మొత్తుకొని యతఁ డేడ్చుచుండ నెల్లవారికి నది వింతగాఁ దోఁచెను. తోఁచుటయు ననేకులు కాలక్షేపము నిమిత్తమై మఱ్ఱికడ కరిగిరి. బం ధువులు భర్తృహరిని గూడఁ నచ్చటికిఁ గొని పోయిరి. సన్న్యాసి పిచ్చివాఁడని కొంద ఱనిరి. కాదు కాదు. గంజాయిమత్తుచే నట్లు ప్రేలును న్నాఁడని కొందఱు వాదించిరి. పిశాచము పట్టిన దని కొందఱు వచించిరి. లేదు లేదు; సన్న్యాసి గొప్పజ్ఞాని యని కొందఱాడిరి. పలువురు పలుతెఱఁగుల భాషింపుచుండ భర్తృహరి తనదుఃఖము కొంతమఱచుకొని సన్న్యాసితో నిట్లనియె "స్వామీ! మీరు యతీశ్వరులు. జ్ఞాన సంపన్నులు. విశేషించి వయోవృద్ధులు. లోకానుభవము గలవారు. అట్లయ్యు మీ యాశ్రమధర్మవిరుద్ధముగా లోకవిరుద్ధముగా మట్టిపాత్రకై యింత విచారించెద రేల? మీము ఖము బ్రహ్మతేజస్సుచే వెలుఁగుచున్నది. కావున మీరు వెఱ్ఱియని నేననఁజాలను. మహానుభావులైన మీ సమీపమునకే పిశాచములు రావు. మీరు కోరిన యెడల నిట్టి కమండలములు నూఱు మీకు క్షణములో రాఁగలవు. కావున నిట్టి దుఃఖమునకు హేతు వెద్దియో నే నూహింపఁ జాలకున్నాను. అదియునుగాక మీచేతితో మీరు పగులఁగొట్టుకొని యేడ్వఁదగునా? నావుడు సన్న్యాసి మొగమునఁ జిఱునవ్వు సంధిల్ల నిట్లనియె. "నాయనా అడుగవలసిన ప్రశ్న మఱిగితివి కాని నాప్రశ్నమునకు ముందు నీవుత్తరము చెప్పుము. నీవు నీభార్యను చేతులారఁ జంపుకొని యామెకొఱకై యేల యేడ్చుచున్నావు? నాకమండలఘట మెట్టి దో నీభార్యఘట మట్టిదే. ఈకమండలపు ముక్కలదుకుట యెట్లుసాధ్యము కాదో నీక ళత్రమును బ్రతికించుటయు నట్లేసాధ్యము కాదు. కావలసిన యెడల నీకు నూఱుగురు



సన్న్యాసి భర్తృహరికిఁ దత్త్వము నుపదేశించుట

భార్యలు దొరకరా? ఆమాటలు శ్రవణగోచరములు కాఁగానే భర్తృహరి మనస్సు మాఱిపోయెను. దుఃఖము పటాపంచలై యెగిరిపోయెను. జ్ఞానసూర్యమండలము మనోగగనమునఁ దోఁచెను. శోకాంధకారము విచ్చు మొగ్గయ్యెను. అగుటయు నతఁడు సన్న్యాసి పాదములకు జాగిలంబడి మ్రొక్కి యిట్లు విన్నవించెను. "మహాత్మా మీకు పిచ్చి లేదు. పిశాచపీడ లేదు. నాకు జ్ఞానోపదేశముఁ జేయుటకై మీరీపన్నుగడఁ బన్నితిరి. నేను ధన్యుడ నైతిని. జ్ఞానోదయమైనది. నేఁక మీశిష్యుఁడను. నేనిప్పుడే సన్న్యసించుచున్నాను!!

---

# ప్ర ణ యో న్మా ద ము

(పా ణి ని)

నేను వేసిన ప్రశ్నల కేల నీవు
చెప్పవుజవాబు అదియేమిచెడ్డతనము
తెలతెలం బోవునింగిని తారలేల
కలికి నీకన్నులమెఱుంగుకాంతిముందు?
వెన్నెలలజేడు రాతిరి నచ్చుటేల
పడతినీముఖబింబంబుపగలుగూడ
స్ఫురితరుచులను వెదజల్లు సురుచిరముగ?
కవులుమెచ్చిన కోకిలారవముకంటె

మధురిమలజిల్కు నీకంఠమంజురవము.
తేటవెన్నెలలోఁగల నీటుకంటె
కలికినవ్వులు తేనెలజిల్కుగాదె!
బాలచంద్రుని వేడుకన్ బట్టితెచ్చి
చంద్రవంక చేయింతునే చెలియ నీకు!
తరుణి, నీకౌగిటనుజేరి తనువ్రమరతు;
నభమువిరిగి పైబడినను భయములేదు!

# శ్రీశైలక్షేత్రము

(గత సంచిక శేషము)

ఆరవ శతాబ్దమునందు కాదంబరాజు మయూరవర్మ శ్రీశైలప్రాంతమునుస్వాధీనముచేసికొనినటులితిహాసములు తెలుపుచున్నవి. తేవార మను ద్రవిడ కావ్యమునందు శ్రీశైల మాహాత్మ్యమువర్ణింపబడినది. తేవారమునుండి పద్యముపండ్రెండవశతాబ్దమునందు హైహాయ సలరాజులుపాతాళగంగనుండి లింగశిలలను దెప్పించినటుల శాసనములు తెలుపుచున్నవి. కాకతీయరాజు ప్రతాపరుద్రదేవునకుసంబంధించినశాసనములు దేవాలయమునందుఁ గలవు. ఆ రాజన్యుని కాలమునందు అరసి మఠాధిపతి ఈశ్వరశివాచార్యుడును ధర్మకర్తలును గలిసి శ్రీశైలక్షేత్రపాలనమున కేర్పాటులను జేసినటులు శాసనములు దెలుపుచున్నవి. ఆకాలమునందు క్షేత్రపాలనమునకు ౭౦ గ్రామము లుండెడివి. ఆ గ్రామములను నాంధ్రదేశమునందు గల రాజులు భక్తులు శ్రీమల్లికార్జునస్వామివారికి సమర్పించిరి. ప్రతాపరుద్రదేవుడు దేవాదాయమును క్షేత్రపాలనమునకై వినియోగపడునటు లేర్పాటును జేసెను. పదునాల్గవ శతాబ్దారంభమునందు వేమారెడ్డి భూపాలుడు పాతాళగంగకు సోపానంబులను గట్టించెను. ఈ సోపానంబులను పదునాలవశతాబ్దాంతంబున కాదంబరాణి శిథిలంబ భాగుచేయించెను. అన వేమారెడ్డి తండ్రి యనంతరము వీరశిరోమండపమును నిర్మించినటులు శాసనములు తెలుపుచున్నవి. వీరశిరోమండపమునందు కొంగవీరులు భక్తిపరవశులై తమశిరములను బాహువులను జిహ్వలను బలిచేసి శివసాయుజ్యమును బడసినటులు గాథలు కలవు.

విజయనగరరాజులు శ్రీశైలక్షేత్రమును బాగుచేసినటులుశాసనములు తెలుపుచున్నవి. రెండవ హరిహరరాయుడు ౧౪౦౫ సంవత్సరమునందు ముఖమండపమును గట్టించెను. వీరప్రతాప ప్రౌఢదేవమహారాజు సకుటుంబముగ శ్రీమల్లికార్జునస్వామిని సేవించెను. పదునైదవ శతాబ్దమునందు సాళువరాజులు పర్వతముమీదను నూతులను కోనేరులను గట్టించిరి. కృష్ణదేవరాయులసోదరుడు వీరనరసింహరాయుడు శ్రీశైలయాత్రను జేసెను. కృష్ణదేవరాయలు ప్రాగ్దేశవిజయయాత్రానంతరము విజయనగరాభిముఖుడై వెడలునపుడు శ్రీశైల మల్లికార్జునస్వామిని సందర్శించి భజియించెను. స్వామికి నగ్రహారంబుల నిచ్చెను. రథవీథియందిరుపార్శ్వములందును యాత్రికులకు సత్రములను గట్టించెను. శ్రీశైలమునకు బోవు మార్గములమీదను సుంకమును దీసివేసెను. కృష్ణదేవరాయలసామంతుడు చంద్రశేఖరరాయుడు బంగారునంది భృంగీశ్వరుల విగ్రహములను శ్రీశైలక్షేత్రమునకు

సమర్పించెను. ఆకాలమునందే శాంతలింగ మను శివభక్తుఁడు రథమును గట్టించెను. యాత్రికులసౌఖ్యమునకై నీటికాలువను నిర్మించెను. శాంతలింగము శ్వేతాంబరజైనుల శిరచ్ఛేదనము చేసినటులు శాసనములు తెలుపుచున్నవి. శాంతలింగము లింగధారి బ్రాహ్మణుల కగ్రహారంబుల నిచ్చెను. గోపురములను గట్టించెను. శిథిలములైన మంటపాదులను బాగుచేయించెను. ముఖమంటపశోరణంబులకు బంగారుపూతను పూయించెను. మల్లికార్జునస్వామి కమూల్యములైన యాభరణములను సమర్పించెను.

రెడ్డిప్రభువులును, అక్కన్న మాదన్న మంత్రివర్యులును మల్లికార్జునస్వామి దేవళంబునకు బంగారుపూతను పూయించిరి. శ్రీశైలక్షేత్రమునకు నాలుగుదిశలనుండియును సోపానంబులను గట్టించిరి. అనాదినుండియును కులసంఘములు వృత్తిపన్నును వసూలుచేసి ఏటేటను మల్లికార్జునస్వామి కర్పితముచేయుట యాచారముగనుండెను.

శ్రీశైలరాజ్యము విజయనగర సామ్రాజ్యమునం దొకభాగముగ నుండి సామంతరాజులపాలనమునందుండినటులు శాసనములు తెలుపుచున్నవి. తాలికోటయుద్ధముతో విజయనగరసామ్రాజ్య మస్తమించినపుడు శ్రీశైలక్షేత్రభాగ్యమును నస్తమించుట కుపక్రమించినది. శ్రీశైలప్రాంతమునకు మహమ్మదీయ లేలికలైరి. మల్లికార్జునస్వామికిని జంగమమఠములకును రాజులు భక్తులు సమర్పించిన యగ్రహారంబులను మహమ్మదీయప్రభువులు స్వాధీనముచేసికొనిరి. భోగభాగ్యవిజ్ఞానరహితమైన శ్రీశైలక్షేత్రము పాడుపడి జీవచ్ఛవమైనది. మహమ్మదీయుల వైరము శ్రీశైలమును నిర్మానుష్యముగ జేసినది. పదునెనిమిదవశతాబ్దమునందు మునవరుఖానుకాలమునందు శేషించిన ప్రజలు శ్రీశైలమును విడిచి ప్రాణములను దక్కించుకొనిరి. రోహిలాలు మహారాష్ట్రులు దేవాలయమును కొల్లబెట్టినటులు గాథలు తెలుపుచున్నవి. నాయకరహితమైన క్షేత్రమునకు చెంచులు రక్షకులైరి. చెంచువాండ్లు చేతికిచిక్కిన బంగారుపూతరేకులను విగ్రహములను నగలను తస్కరించి విక్రయించుట కుపక్రమించిరి. శేషించిన చిత్రలిఖితమైన రేకులను విగ్రహములను గాపాడుటకై వానిని నూజవీటికి కర్నూలునం దేలము వేసినపుడు బ్రిటీషు ప్రభుత్వాధికారులు పుష్పగిరిస్వామినుండి కొని చెన్నపురిమ్యూజియమునందు భద్రముచేసిరి. బ్రిటిషుప్రభుత్వాధికారులు ౧౮౮౧వ సంవత్సరమునందు పుష్పగిరి స్వాములవారిని శ్రీశైలక్షేత్రధర్మకర్తనుగ నియమించిరి. పుష్పగిరిస్వాములవారు శ్రీశైలక్షేత్రపాలనమును సంపూర్ణముగ బరిత్యజించిన విధము దేవాలయములదుర్దశ చెప్పక చెప్పుచున్నది. మహావైభవము ననుభవించిన శ్రీశైలక్షేత్ర మిపుడు పరమదుర్దశపాలైనది. క్షేత్రమునందు త్రాగుటకు నీరు లేదు. నిలుచుటకు స్థలము లేదు. క్షేత్రమంతయును నరణ్యామయమై పాడుపడినది. మహావైభవము ననుభవించిన శ్రీశైలనగర మిపుడు నిర్జనముగ నున్నది. మహర్షులకును యోగుల

కును సిద్ధులకును బౌద్ధులకును భక్తులకును నారాధ్యులకును జంగములకును వాసస్థలమైన మహాక్షేత్ర మిపుడు ఘూకవ్యాఘ్రములకు వాసమై కృశించియున్నది. శ్రీశైలయాత్ర దుర్గమంబై భీకరంబై దురారాధ్యంబై దుస్సహంబుగ నున్నది. రాజులు భక్తులు కట్టించిన సోపానములు శిథిలములై ప్రయాణము దుస్తరమైనది. మార్గములు చెడినవి. మార్గమునందు నీటివసతులు లేవు. విశ్రాంతి గృహములు లేవు. ఆహారము పుట్టదు. అయినను వేలకొలది యాత్రికులు శివరాత్రికిని వసంతనవరాత్రులకును సకల కష్టములను సహించుచు శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులను భజించి తరించుటకై శ్రీశైలయాత్రను జేయుచున్నారు. అంబారాధకులు శివభక్తులు ధర్మాత్ములు శ్రీశైలక్షేత్రోద్ధరణమునకై వారిసంపదలను వినియోగించి శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల యనుగ్రహమునుబడయుదురుగాత!



తూర్పు ప్రాకారమునందు గల దేవళము

## శ్రీశైలయాత్ర

శ్రీశైలక్షేత్రము ౨౦౦౦ అడుగుల ఎత్తు గల నల్లమలకొండలలోయయందు గలదు. క్షేత్రప్రస్థమును జేరుటకు ౩౦౦౦ అడుగులు ఎత్తుగల నగద్వారములు గలవు. శ్రీశైలక్షేత్రము మంచి దశయందుండిన కాలమునందు ద్వారములు మార్గములు యాత్రికులకు సౌఖ్యప్రదములై యుండి యుండును. స్వధర్మానుష్ఠాన మపహాస్యమై పరధర్మ ప్రాబల్యముగల వర్తమానకాలమునందా కాలపు సౌకర్యము లంతరించుటయందు విచిత్రము గనుపడదు. ఇపుడు శ్రీశైలయాత్రాసేవనము దుఃఖభూయిష్ఠమని శ్రీశైలమునకు బోయినవారలకు స్వానుభవమువలన దెలిసియున్నది. శ్రీశైలక్షేత్రమునకు త్రిపురాంతకము ప్రాగ్ద్వారము. ప్రాగ్దేశస్థులు సామాన్యముగ నీమార్గమున యాత్రను జేయుదురు. యాత్రికులు బెజవాడయందు రైలుబండి నెక్కి వినుకొండ స్టేషనునందుగాని గుండ్లకమ్మ స్టేషనునందుగాని గాజులపల్లి స్టేషనునందుగాని దిగవలయును. గుండ్లకమ్మయందు ప్రాతఃకాలమునందు సుస్నాతులై భుజియించి విశ్రమించుదురు. అచటనుండి పాదచారులైగాని బండ్ల నెక్కి

గాని శివపురము సాయంత్రము చేరుదురు. శివపురమునందు శివపూజనారాధించుచు రాత్రిని గడుపుదురు. వేకువ లేచి జాముప్రొద్దెక్కు సరికి త్రిపురాంతకము చేరుదురు. త్రిపురాంతకమునందు గల పెద్దచెరువునందు స్నానము చేసి త్రిపురాంతకేశ్వరుని సేవించుదురు. కొండమీదగల దేవాలయము గోపురమును మంటపములను గలిగి సంసేవ్యముగ నున్నది. ఈ క్షేత్రమునం దాంధ్రదేశచరిత్రకు సంబంధించిన పెక్కుశాసనములు గలవు. తటాకతీరమునందు గల విశాలాక్షీ దేవిని యాత్రికులు సేవించుదురు. ఈ యాలయ నిర్మాణము పల్నాటివీరచరిత్రము నందు ప్రసిద్ధిని బడసినది. వీరనాయడు చిరకాలము త్రిపురాంతకమునందు నివసించుచుండెను. ఈశ్వరుడు త్రిపురాంతకమునుండి త్రిపురాసుర సంహారమును జేసినందున నీస్థలము త్రిపురాంతక క్షేత్రమని యొప్పుచున్నది. ఈ త్రిపురాంతకుని మహిమను శ్రీ పర్వతపురాణమున:

కం॥ త్రిపురాంతకు దర్శించిన
నపరిమితాశేషపాతకాదులు తొలఁగున్
విపులసుఖంబులు పొందును
నపవర్గము నానురాగ మపుడే కలుగున్.

అని శేషనారాధ్యుఁడు పేర్కొనియున్నాఁడు. త్రిపురాంతకమునందలి తటాకతీరమునను త్రిపురసుందరి ఆలయము గలదు. ఆ యాలయ ప్రాంతమునందు, చెఱువునందు నీరు లేకపోయినను, నీరు నిలిచియుండును. త్రిపురసుందరి ఆపోలింగమైన జంబుకేశ్వరుని వలె నీటియందు తేలుచుండును. యాత్రికు లాతల్లి దర్శనమును జేసి పయనమునకుపక్రమించుదురు.



తూర్పు ప్రాకారమునందు గల రాజవిగ్రహము

యాత్రికులు భుజించి విశ్రమించి తిరిగి పయనమున కుపక్రమించుదురు. సాయంత్రము దిగువమెట్టయను గ్రామము చేరి యచట శంకరుని సేవించి రాత్రిని గడుపుదురు. వేకువ లేచి శివనామస్మరణను జేయుచు మల్లికార్జునసందర్శనాభిలాషతో బయలుదేరుదురు. పదిగడియల ప్రొద్దెక్కిన వేళకు రెం

డనముకాము చేరుదురు. ఇచట నొక మంచి శివాలయము గలదు. ముఖమంటపములు ప్రాంగణములు ప్రాకారములు గలవై భవమును జాటుచున్నవి. పరస భోజనానంతరము పర్వతోన్ముఖులయి సాయంత్రమునకు జంగాలపల్లి చేరి చింతలతోపనందు బసచేయుదురు. జంగాలపల్లి వరకును సామాన్యులు పాదచారులై పోయినను శ్రీమంతులు బండ్ల మీద పయనము చేయుదురు. జంగాలపల్లి నుండి క్రమమైన శ్రీశైలయాత్ర యారంభమగును. జంగాలపల్లియందు యాత్రికులు శ్రీశైలమును జేరువరకును గావలసిన తినుబండారమునుగొని సామగ్రిని మోయుటకు పనివాండ్ర నేర్పాటు చేయుదురు. మార్గమధ్యమున నేమియును దొరకదు. శ్రీమంతులు, పేదలు, వృద్ధులు, బాలురు, స్త్రీలు, పురుషులు, భక్తులు, భిక్షుకులు కలిసి మెలసి సరససల్లాపములాడుచు పదములను బాడుచు పాదచారులై శ్రీపర్వతారోహణమున కుపక్రమించుదురు. పదిగడియలవేళకు పెలముబావియను ప్రదేశమునకు జేరుదురు. ఇచట నొకబావిమాత్రమే గలదు. జనులు నీటికై పెనగులాడుదురు. పరీతినో బిందెడు నీటినిదెచ్చి తోచిన చెట్ల క్రిందను వంటకములను జేసి భుజించుదురు. జాతివర్ణభేదమును దృష్టిదోషమును పాటింపక యాత్రికు లనుకూలమైన స్థలములందు వండుకొని తిని విశ్రమించుదురు. చెంచులన్నకబళములను వేడుచుందురు. వారి యెదుటను బ్రాహ్మణులు భుజించుదురు. స్వకులస్థలరక్షితములైన యాచారములను సన్ని జాతులవారును మఱచి శ్రీశైల యాత్రాచారముల నవలంబించుదురు. నిజమైన వనభోజనమునకు శ్రీ శైల యాత్ర ముచ్చటగ నుండును. ఆచారములు మడులు మాటునడును. ఆకలిదప్పులయుద్రేక మాత్మారాముని వేధించుచుండును. భారతనారీమణుల యప్రతిమానమైన సహనశీలము విస్మయమును గలిగించును. కోమలాంగులు మార్గాయాసమును పాటింపక యన్నపానాదులను సతిశీఘ్రముగ సిద్ధముచేసి సతీధర్మమును సార్థకము చేయుదురు. భోజనానంతరము వెంటనే పరస పయనమగును. సూర్యాస్తమయ సమయమునకు మొల్లచెరువను మకామును జేరుదురు. ఈ తటాకమునకు నాలుగుపైపులను నెత్తయిన కొండలు కట్టలుగ నున్నవి. ఒక దిక్కునమాత్రము మొల్ల గలదు. శాపగ్రస్తమైన ఈపెద్దచెరువునం దొక బొట్టునీరైనను నిలువదు. యాత్రికులు పెద్ద నెగడులను మంటబెట్టి వానిచుట్టును గుంపులుగ విశ్రమించుదురు. యాత్రార్థులు పద్యములను జదువుచు పాటలను బాడుచు పురాణములను బఠించుచు భజనలనుచేయుచు నిద్రాపరవశులై రాత్రిని గడుపుదురు.

వేకువను లేచి కాలకృత్యములనుదీర్చి పర్వతయాత్రకు బూనుకొందురు. శ్రీశైల యాత్రయందు పూర్వద్వార మార్గమునందు చుక్కలపర్వతారోహణపుమకాము క్లేశభూయిష్ఠము. నల్లమలకొండ లిచటను ౨౨౦౦ అడుగులఎత్తును గలిగియున్నవి. కొండయందు

గట్టినమెట్లు ఎత్తుగ నేటవాలుగనుండి యాత్రి
కులభక్తిని బరీక్షించుట కేర్పడినటులున్నవి.
కొండనెక్కుటకు రెండుగంటలు పట్టును.
యాత్రికులు కొండనెక్కుసరికి యలసి సొలసి
దప్పిగొని విశ్రాంతి నభిలషించుదురు. నక్షత్ర
పర్వతముమీద నేవిధమైన పానీయములును
దొరకవు. ధర్మాత్ములిచటను చలిపందిరులను
బెట్టించి యాత్రికులకు తాపోపశమనమును
జేయుట యవసరము. పండితారాధ్యచరిత్రము
నందుపాల్కురికి సోమనాథకవిచేసిన నక్షత్ర
పర్వతారోహణవర్ణనము యాత్రావర్ణనము
రమణీయముగ నున్నది.

సురుచిరాభ్రంకషచూడాగ్రతతుల
నలులు నక్షత్రపర్వతమంత నెక్కి
తలఁ బరిషత్కోటి దాఁదిగసాగి
కమనీయసురదీర్ఘికానిత్యసంగ
మమునకానదిరోఁగు మాడ్కి నెప్పారె
భోరన నేఁగుచోఁ బొంగుచు బింక
మారయఁగొండతద వ్వాలరి పారుచును

* * * *

తప్పక యప్పురాతనతీర్థచరులు
చొప్పారు నుజ్జ్వలసోపానములుగఁ
ద్రొక్కుచు నెక్కుచుఁ దొట్రిల్లుకొనుచుఁ
జిక్కుచుమోకాళ్లఁ జేతు లూఁదుచును
వంగుచుఁ బ్రాలుచుఁ దొంగుచుఁ జనుచుఁ
జెంగుచునొండొరుఁ జేయూఁదికొనుచుఁ
జేదుకో చేదుకో శ్రీగిరినాథ!
చేదుకో మల్లయ్య! చేదుకొమ్మనుచుఁ
జేదుకో చేదుకో శ్రీశైలనిలయ!
చేదుకో మల్లయ్య! చేదుకొమ్మనుచుఁ
జేదుకో చేదుకో చేఁ జేత నెడయ!
చేదుకో మల్లయ్య! చేదుకొమ్మనుచుఁ
గనికసి పాటలు గట్టిపాడుచును
జనిచనిచిందుల జతులకాడుచును
బరమోత్సవామృతపరిపూర్ణపుణ్య
తరపరిషద్భావతతులు సంధిల్ల
శూలి శ్రీమల్లికార్జునుఁడు దయాను
కూలరజ్జులఁ జేదుకొన వెడల్ క్రియను
గట్టురువడి నగాగ్రంబెక్కఁ బరస
యట్టిదకాకిట్లు హరుకృప లేక
చెచ్చెర యోజనోత్సేధమెట్లెక్క-
వచ్చు నక్షత్రపర్వతమునా నంత
నంతంతఁ దత్పథశ్రాంతులై పరస
కొంతవిశ్రమమంది గొబ్బునఁ జెలఁగి.

* * * *

జయజయజయజయ శరణమా! యనుచు
పరగలిగొనకిట్లు లఖిల దేశముల
పరసయు నానందభరితమైననవ
నరుదొంద నందులో నాంధ్రదేశంబు
పరసబంతులుగట్టి పాడుకెట్లనిన
నల్లవో! నల్లవో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!
పరమపాతకకోట్లు భస్మమై పోలు
సిరిగిరి మల్లన్న! శరణన్నఁ జాలు
రాఁబోవ నెంతదూరంబైన నడవ
నేఁబోదుమల్లయ్య నేఁటేటఁగొలువ

* * * *

పాతాళ గంగాప్రవాహ మొంపైనఁ
జూతునే మల్లికార్జున దేవదేవు

* * * *

సిరిగిరిశరణు శ్రీగిరినాథశరణు
సిరిగిరిమల్లయ్య శరణులశరణు
లనుచు నీక్రియనుబ్బి యాడుచుఁ బాడు
చును బేర్చిపేర్చి యుత్సుకతమైనడువ
చెన్నారమఱియట్లు కన్నడపరస
ప్రన్నని కర్ణాటభాష సాంగముగ
అజగమ దేవయ్య బిజమాడిరయ్య
నిజభావిదేవయ్య నీకిత్తబన్ని

* * * *

సిరిగిరిమల్లయ్య శరణన్నిరయ్య
పరమపాతకగళు పరిహారిసువను
మంగళమూరితి మల్లయ్యనాళు
సంగదబసవయ్య శరణన్నిరయ్య
బసవన్నయిష్టార్థ ఫలకె హంబళిగను
పసరిసిమాడిభో బత్తిమల్లయగె
అనియిట్లుపాడుచు నాడుచుఁ బ్రీతి
పనుగొని కన్నడ పరస యేతేర
నరుదుగానట్ల తానారె దేశంపు
పరసమహారాష్ట్రి భాషపెంపార
మాగరగొనకొన మజభాప్రమణాలె
భాగవతేసలే భక్తితేమణాలె
పురహర కేతదూరి పురహాతేమణాలె

* * * *

ఆలానిబద్ధనతానిగీతాచే
మాలాసమర్పణ మల్లయ్యరాణ

* * * *

అంసిమహాభక్త యఖనెసమ్మెళ
యనుచుఁ జిందులు వెట్టి యాడుచుఁ బాడు
చునునారెపరసయుఁ జనుదేర మఱియు
నరుదొందనట్టుల నరవదేశంబు
పరుసయుద్రావిడభాష సాంగముగ
అరుగులుగిరితెన్నె ఆరనెబిరానె
సిరిగిరినిలయనే చిరనెఆండవనె

* * * *

యేశేరువీశనే మెల్లమల్లయనె
వేదియే దిస దిక్కుమాదియే చివనె
చోదియే మల్లికార్జునవె యున్నవనె
యనుచుఁ జిందులువెట్టి యాడుచుఁ బాడు
చును సర్వపరస యుత్సుకత నేతేర
అరవిరిగాక యిట్లఖిలదేశముల
పరసయు సంస్కృతభాష పెంపార
ఆయాత పరిషదాయాహి సఖి! త్వ
మాయాహి సన్మార్గ మతిరభసేన
ఆతపక్లాంతాసి హా మమరమణి

* * * *

శ్రాంతాసి కిం సఖి శైలతలేషు
శ్రాంతిర్గతా పూర్వసంవీక్షణేన
జలజాక్షి! యది పిపాసా తవ భవతి
కలశస్థపాదోదకం పిబస్వాదు

* * * *

మల్లికార్జున యశోమండితాశాంత
మల్లికార్జునదేవ మామేవపాహి
యనుచు సంస్కృతభాష నంతంత నెరపి
యనురక్తిఁ బాడుచు నాడుచు నంత

* * * *

........మల్లికార్జును పురము
కడునొప్పి ముందటఁ గానంగనయ్యె
(పండితారాధ్యచరిత్రము-పంచమప్రకరణము)

చుక్కలపర్వతమునకును సీటివసతి గల
యరట్లకోన మఠామునకును రెండుక్రోశముల

దూరముగలదు. కడుడస్సిన పరస పదెనిమిది గడియల ప్రొద్దెక్కునరికి మకాము చేరి స్నానమును జేసి వంటకములను జేసి భుజించుదురు. పూర్వ మీలోయయందు కదలీవనముండి యుండినను నిపుడు వంశవనము చూతవృక్షములు మాత్రముకలవు.

అరట్లకోననుండి యాత్రికులు సులభముగ శిఖరేశ్వరమునకు సాయంత్రికి జేరుదురు. శిఖరేశ్వరమునందు విభూతికుండమను చెరువు గలదు. శిఖరేశ్వరమునుండి మల్లికార్జున దేవాలయ శిఖరమును సందర్శించి యాత్రికులు పరమానందభరితులగుదురు. "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" యను ప్రమాణ వాక్యము శిఖరేశ్వరమున కిన్వయించుచున్నది. ఇతరమార్గములద్వారా శ్రీశైల యాత్రను జేయువారందరును శిఖరసందర్శనమును జేసి యానందించుటయును సనుస్రుతాచారముగ నున్నది. శిఖరేశ్వరమునందు పరసకు నీటివసతి బొత్తిగ లేదు. ధర్మాత్ములు పూర్వకాలమునందిచట సుందరమైన మహాతటాకమును నిర్మించి నాలుగు దిశలను సోపానములను మంటపములను నిర్మించిరి. ఇపుడా తటాకము మట్టిపూడికతో నిండియున్నది. మెట్లు శిథిలములగుచున్నవి. ధర్మాత్ములు శిఖరేశ్వర తటాకమును బాగుచేయించి యాత్రికులకు నీటిసదుపాయమును గలుగజేసి పుణ్యమును గట్టుకొని శ్రీశైలమల్లికార్జునుని దయకు పాత్రులగుదురుగాక!

### శ్రీశైలయాత్ర

యాత్రికులు శిఖరేశ్వమునందు ప్రాతఃకాలమున శిఖరసందర్శనమును జేసి శ్రీశైలమునకు బయనమగుదురు. ఇరువదేండ్ల పూర్వమువరకును బంగారుపూతతో మెఱయుచుండెడి శ్రీశైలమల్లికార్జునాలయశిఖరమును శిఖరేశ్వరమునుండియును జూచుట సాధ్యముగ నుండెను. ఇపుడా బంగారుపూతగల శిఖరముపోయి సున్నము పూతగల తెల్లశిఖర మేర్పడినది. శిఖరసందర్శనము నామమాత్రావశిష్టముగ నున్నది. శిఖరేశ్వరమునుండి శ్రీశైలము చేరుట సులభముగ నుండును. దూరము అయిదుమైళ్లు మాత్రమే యుండును. యాత్రికులు చేరినవెంటనే ధూళిదర్శనమును జేసి ఏచెట్టునీడనో జీర్ణమంటపమునందో బసలనేర్పరచుకొని కాలయాపనము చేయుదురు.

శ్రీశైలమునకు దక్షిణద్వారము సంపిమంటలము. ఆ మార్గమునను వెళ్లెడియాత్రికులు గాజులపల్లి స్టేషనునందుగాని నంద్యాల స్టేషనునందుగాని దిగి బండ్లమీద గాని నడచిగాని వెల్గోడు, ఆత్మకూరు, కృష్ణాపురము మీదుగ నాగలూటి చేరుదురు. అక్కడనుండి పాదచారులై పెద్దచెరువు భీమునికొలనులందు మకాములను జేయుచు శ్రీశైలము చేరుదురు. నక్షత్రపర్వతారోహణమువలె భీమునికొలను పర్వతారోహణమును మిక్కిలి ప్రయాసముగ నుండును కాని ఈ మార్గమునందరణ్యమునందు నడిచెడికాలము మూడు మకాములతో ముగియగలదు. ఇది మొత్తముమీద సుకరముగ నుండును.

పశ్చిమద్వారమునుండి వెడలెడివారు కర్నూలు మార్గమున యాత్రను జేయు

దురు. కర్నూలునుండి యాత్మకూరు నకు జట్కా బండ్లమీదను బోవుటకు మంచిబాట గలదు. ఈమార్గమున బోయెడివారు సయితము నాగలూటి మార్గముననే పర్వతారోహణమును జేయవలసియుందురు.

ఉత్తరద్వారము మార్గమున నైజాము రాష్ట్రమునుండి వచ్చెడివారు కృష్ణానదిని దాటి రెండు మకాములలోనే శ్రీశైలమును జేరగలరు. కాని దుర్గమమైన యీ మార్గమున యాత్రికులు విశేషముగను శ్రీశైల యాత్రను జేయరు.

పూర్వ దక్షిణద్వారములకు నడుమగల మార్కాపురము మీదుగ శ్రీశైలమునకు బోవుట కొంతసుకరముగ నుండును. ఈమార్గస్థులు జంగమ మిద్దెల, అరట్లకోనమీదుగ శిఖరేశ్వము చేరుదురు. ఈమార్గము చుక్కల పర్వతమును భీమునికొలనును బోలిన పర్వతారోహణక్లేశము లేక సుకరముగ నుండును.

శ్రీశైలయాత్రను జేయుట కష్టభూయిష్ఠముగ నున్నది. శ్రీశైలక్షేత్రము పర్వతారణ్యముల నడుమను గలదు. ఏమార్గముననుబోయినను 24 మైళ్లదూరమైనను పాదచారులై పోవలసిన యవసరము గలదు. అన్ని మార్గములందును పుణ్యక్షేత్రములు, దేవాలయములు చూడదగినవి కలవు. త్రిపురాంతకము, ఓంకారము, మహానంది, అహోబలము, ఆలంపురము మొదలగు పుణ్యతీర్థములు దివ్యవిభూతి విలసితములై సేవ్యములుగ నున్నవి. నాలుగు దిశలందును కొండల నెక్కుటకును, దిగుటకును సోపానము లమర్చబడినవి. యాత్రికులు నివసించుటకు మంటపములు, తటాకములు నిర్మింపబడినవి. ఇప్పుడు సోపానములు, మంటపములు, తటాకములు శిథిలములై శ్రీశైలయాత్రాసేవనము దుర్భరముగ నున్నది. శ్రీపర్వత పురాణమును, శ్రీశైల మాహాత్మ్యమును, కవుల వర్ణనలును, భక్తుల స్తోత్రములును, శాస్త్రజ్ఞుల ప్రశంసలును, శ్రీశైలక్షేత్ర ప్రతిభను, సంస్మరింప జేయుచున్నవి.

శ్రీశైలయాత్రను జేసినవారల కీ విషయ మనుభవసిద్ధము. వర్తమాన కాలమునందు యాత్రికులు సౌకర్యము లేవియును లేక మార్గమునందును పడెడిశ్రమ వర్ణనాతీతముగ నున్నది. అయినను ప్రతియేటను వేలకొలది యాత్రికులు మహాశివరాత్రికి శ్రీశైలయాత్రను జేసి కృతార్థు లగుచున్నారు. వర్తమానస్థితియందు శ్రీశైల క్షేత్రోద్ధరణము దుస్తరముగ గనిపించుచున్నను శ్రీమల్లికార్జునస్వామి యనుగ్రహము వలనను కాలాంతరమందీ మహత్కార్యము సాధ్యము కాగలదు.



# శైవలిని

మక్కపాటి వేంకటరత్నము గారు

శ్రీకరంబు మహానందశేఖరంబు
సకలలోకసమారాధ్య మకలుషంబు
సత్వసంయుత మోంకారతత్త్వ మెపుడుఁ
బ్రమదసంధాయి యగుఁగాత పాఠకులకు.

తమభవంబులు సార్థకత్వంబుఁ జెంద
భారతావనిఁ బుట్టొంది బహుళగ్రంథ
కర్తలై కీర్తిఁగాంచిన కవిజనాళి
ప్రతిభలకుఁ గేలుమోడ్తు సంతతము భక్తి.

మంజులంబగు నొకనాఁటి సంజవేళ
బాలుఁ డొకఁడు భాగీరథీప్రాంతమందు
నీటు దళుకొత్తు లేమావితోఁటలోన
నిలిచి వినుచుండెఁ దన్మృదు నిస్వనంబు.

పశ్చిమాశాగతుం డైన పద్మబంధు
బంధురారుణసాంధ్యప్రభామనోజ్ఞ
విమలసౌవర్ణలేపపృథ్వీతలంబు
కనులపండువు గాఁగను గానిపించె.

తాకినంతన నూత్నచైతన్య మొసఁగు
విమలగంగాతరంగిణీవీచికార్ద్ర
శీకరాంబువు లల్లల్లఁ జేరవచ్చె
బ్రణయలోలాత్ముఁ డొప్పిల్లువాని పదము.

అతనిపాదప్రదేశంబు నంటియున్న
ప్రకృతిసుకుమారమగు లేఁతపచ్చికపయి
బాలిక యొకర్తు సాగిలఁబడి తదీయ
ముఖముఁ దిలకింపుచుండె సమ్మోదముతోడ.

రమణులకుఁ జూడ్కు లతిచంచలములు గాన
నా హరిణనేత్ర యొకసారి యాకసంబు
నొకఁట వనమంజులతయు వే ఱొకఁటఁ దిరిగి
యతనిముఖమున దృష్టుల నాపుచుండె.

అప్పుడు గలకంఠుఁ డొకఁడు లల్లార్చుకొనుచు
గుజ్జులేమావికొమ్మపైఁ గూయుచుండి
మృదుమధురనిస్వనంబున మెల్లమెల్ల
గీతములు పాడఁజొచ్చె సంగీతసరణి.

చిగురులేమావికొమ్మపై మొగమువాంచి
ప్రణయమోహనశుభగతిఁ బాడి పాడి
యంతఁ దన చిన్నిఱెక్క లల్లార్చుకొనుచు
గూడుఁ జేరంగఁజనె మదకోకిలంబు.

ఆధ్వనుల ననుకరించి కన్యాలలామ
శైవలిని యప్పుడు గాంగనిస్వనముతోడ
మృదుల మాత్మస్వరంబును మేళవించి
సలలితంబుగఁ బాడె మోదములు జిగుర్ప.

పాటఁ బాడుచు నాబాల పరమమృదుల
కరమునను దత్సమాదృశకప్రసూన
తతులతోఁ బాగుగా నొకదండఁ గూర్చి
ముఖముఁ బైకెత్తె నా జగన్మోహనాంగి.

ప్రణయలోలాత్ములైన యాపడుచువారి
యవిరళప్రేమపూర్ణవాక్యామృతంబుఁ
గొంతయేనియుఁ దాఁ జవిగొనుట కేమొ
పరువులెత్తుట మానె నాతరుణమందు
విమలరసనిధి శ్రీజాహ్నవీస్రవంతి.

అప్పుడు ముద్దులుగారు నిజాననాబ్జ

మును బయికినెత్తి కను లఱమోడ్చియేమొ
యోజనముసేయుచుండె నాయువకుఁ డౌర
యనుసరించిన చిన్నారినైనఁ గనక.

పిల్లగాలికిఁ జెవిపొంత మెల్ల మెల్ల
లలితముగ నాడుకొను కిసలయ మొకండు
ఘనతరాలోచనంబున మునిఁగియున్న
యతనివృత్తికి నంతరాయం బొనర్చె.

చిత్తవృత్తికి భంగంబుఁ జేసినట్టి
కిసలయంబును గొనగోటఁ గిల్లివైచి
పాదతలముననున్న యాభవ్యమూర్తి
కమ్రవదనాంబుజంబుఁ గ్రేగంటఁ గనియె.

కనుటతోడన బాలికామణి ముఖాన
దివ్యమగు మందహాసచంద్రిక వెలార్చె
క్షోణితలమునఁ గేలూఁదుకొనుచు లేచెఁ
గుసుమదామ మొండొకచేత గునిసియాడ.

బాలకునియాత్మ గతమైన భావమేమొ
తెలియరా దేరికినిఁగాని తలనూఁచి,
వచ్చియునురాని మీసంపునవరుసతోన
నేమియో నవ్వునవ్వ నొక్కింతతడవు.

లేచి తనమోహనాకారలేఖఁ జూచి
చెలువచిన్నారిమోమునఁ గళలు దేర
ముగ్ధఁగా రెడిబాలునిమోము గాంచి
పూలమాలికతోఁ గరపుటము లెత్తి.

అస్రుజలములు రాలఁ గన్యాలలామ
కన్నులరమోడ్చి యాతనికంఠసీమఁ
దానుగూర్చిన మందారదామ మెట్లొ
జాఱవిడచెను మెల్ల హస్తములువడఁక.

బాలికాబాలకులు బరస్పర మదేమొ
కదలమెదలకయుండిరి క్షణముసేపు
చలనమెఱుఁగని నిర్వాతసమయమందు
లలితనవమాధవీరసాలములువోలె.

తోడనే వానిమెడ నూఁగులాడుచున్న
కుసుమదామంబుఁ దనమెడఁ జుట్టుకొనియె.
నుత్తరక్షణంబునదాని నూడఁదీసి
మఱల నాతనియఱుత మేల్పఱచె నపుడు.

ఆకుసుమదామ మెవ్వరి యఱుతనుండఁ
దగినదియు నిర్ధరింపఁగాఁ దెగక దరిని
బృథుతరానందమున నెమర్వెట్టుచున్న
గోపకొమ్మలఁ జుట్టె నాపూవుదండ.

హృద్గతంబగు భావంబదేమొ కాని
బాలికామణి రెప్పవాల్పకయ వానిఁ
జూడసాగెను సోగవాల్చూపుతోడఁ
చిన్నవారిమనోవృత్తు లెన్నఁదరమె?

బాల్యయౌవన సీమావిభాగమైన
ప్రాయమున విలసిల్లెడివారి నడుమఁ
బ్రేమబీజంబులకు సమావేశకములఁ
దఱచుగా నిట్టి కలహముల్ జరుగుచుండు.

అమృతశైత్యమాంద్యంబుల ననఁగిపెనఁగి
పుష్పాదుల సౌరభంబున దొప్పదోఁగి
యభినవానందజనకమందానిలంబు
లలసగతి వీవఁ జొచ్చె సంధ్యాప్రశాంతి.

# భారతదేశ పరిశ్రమలు

భారతఖండమునందు గల 31,60,56,183 ప్రజలయందును వ్యవసాయపరిశ్రమాదులవలనను జీవించెడివారి క్రింది సంఖ్యలను బరిశీలించినపుడు రాటపుపరిశ్రమ ప్రయోజనము విశదముగాగలదు.

| | భరతవర్షము | చెన్నరాష్ట్రము |
|---|---|---|
| వ్యవసాయవృత్తి | 22,41,09,190 | 302,93,165 |
| పరిశ్రమలు | 33709071 | 4822059 |
| వ్యాపారము | 22445678 | 3290798 |
| ఉద్యోగములు | 5020571 | 589838 |
| ఇతరవృత్తులు | 30770723 | 3798298 |

అన్నివృత్తులందును వ్యవసాయము ప్రధానమైన వృత్తిగనున్నది. దేశమునందు 1000 యందును 709 మందికి వ్యవసాయము జీవనాధారముగనున్నది. 10,000 యందును 1049 మందికి పరిశ్రమలు జీవనాధారములుగనున్నవి. పరిశ్రమలయందు 10,000 యందును సగటున 270 మందికి నేతపరిశ్రమ జీవనాధారముగ నున్నది. వ్యవసాయవృత్తి విశాలమైన భరతవర్షమునకు సహజమైనవృత్తిగ నున్నది. ఆవృత్తియందును సగమునుందికి పనిపాటులు జీవనాధారముగ నున్నవి. ప్రధానమైన వ్యవసాయవృత్తియందైనను ఆవృత్తిననలంబించెడివారలకు బూర్తిగ పనిలేదు. సగటునను వ్యవసాయము చేసెడివారు 2¼ యకరముల భూమిని సాగుచేయుచున్నారు. ఈ పనిని చేయుటకుగాను సగటున సంవత్సరమునందు 150 దినములుమాత్రమే వినియోగపడుచున్నవి. ఆ దినములందైనను నిండుగ పనిజేసెడి దినములు 30 కి మించియుండవు. ఈ స్థితియందు నిత్యదరిద్రమనుభవించెడి రయితులకును వారిమీద నాధారపడి యుండెడివారికిని దారిద్ర్యపోషమనమునకు సాధనములను నిర్ణయించుటయె ప్రభుత్వ ధర్మమైనను అధికారుల దృష్టి ఆ విషయమునందు లగ్నముగాకున్నది. అధికారుల దృష్టియును శ్రీమంతుల దృష్టియును యూరపు రాజ్యముల కలహములకు మూలాంకురమైన మహాపరిశ్రమలమీదను లగ్నమగుచున్నది.

గత జనాభాలెక్కలు పరిశ్రమలస్థితిని విశదము చేయుచున్నవి. అన్నివిధముల పరిశ్రమాలయములు చేరి భరతఖండమునందు 15,603 కలవు. వానియందు 19,94,314 పురుషులు, 6,86,81 స్త్రీలు, మొత్తము 26,81,125 జనులు పనిచేయుచున్నారు. పరిశ్రమలపరిమితి వివరములును దీనియందు ప్రకటించిన పటము బోధించుచున్నది.

10,000 ను అధికముగను పనివాండ్రుగల పరిశ్రమలను తెలుపు పటము 1921

| పరిశ్రమ | పనివాండ్రు |
|---|---|
| మోటార్ కార్ పరి | 10,276 |
| చర్మపరిశ్రమ | 10,495 |
| జనపనార ప్రెస్సులు | 11,246 |
| గ్యాస్, ఎలెక్ట్రిక్ పరిశ్రమ | 11,707 |
| హుక్రా, లక్క—ఫ్యాక్టరీ పరిశ్రమ | 13,156 |
| ఉప్పును బాగుచేయు పరిశ్రమ | 13,156 |
| ఇత్తడి, సీనారేకు, రాగి పరిశ్రమలు | 14,095 |
| నూనెమిల్లులు | 16,163 |
| రబ్బర్ తోటలు | 17,262 |
| మాంగనీస్ గనులు | 17,777 |
| అభ్రకపుగనులు | 18,220 |
| సున్నపుబట్టీలు | 19,242 |
| ఇనుము తయారుచేయు ఫౌండ్రీలు | 19,517 |
| నల్లమందు, పొగాకు, భక్ష్యములు తయారుజేయు ఫ్యాక్టరీలు | 20,646 |
| రంపపుకోత యంత్రాలయములు | 20,788 |
| నౌకానిర్మాణ, పోర్టుట్రస్ట్ యం॥లు | 21,329 |
| బంగారుగనులు | 22,180 |
| పంచదార ఫ్యాక్టరీలు | 22,369 |
| రాతిక్వారీలు, బలపపురాతిక్వారీలు | 25,470 |
| కిరసనాయిలుబాగుచేయు యంత్రాలయములు | 33,534 |
| ఇనుము, స్టీల్ పనులు | 39,449 |
| కాఫీతోటలు | 40,304 |
| ముద్రణాలయములు | 48,378 |
| పిండి, బియ్యము మరలు | 49,021 |
| ఇటిక, పెంకు ఫ్యాక్టరీలు | 75,020 |
| లోహముపనులు, ఇంజనీరింగ్ పనులు | 82,182 |
| ప్రత్తివిత్తులుతీసి ప్రత్తినిత్రొక్కుడు | 83,055 |
| ...మిల్లులు | 112,532 |
| రైల్వేపనులు | 181,594 |
| బొగ్గుగనులు | 287,336 |
| జనపనారమిల్లులు | 350,670 |
| నూలువడకి నేతమి॥ | |
| తేయాకుతోటలు | 747,0[illegible] |

ఈ పటము భారతప్రభుత్వపు 1921 సంవత్సరపు జనాభాలెక్కల రిపోర్టునుండి సంగ్రహింపబడినది.

పరిశ్రమలయందు మొదటి పరిశ్రమ తేయాకు మొదలగు తోటల పరిశ్రమ. రెండవది దూది నేతపరిశ్రమ. ఇపుడు దేశమునందు 2889 దూదిపరిశ్రమకు సంబంధించిన యంత్రాలయములు గలవు. ఆ యంత్రాలయములయందు 6,16,019 జనులు పనిజేయుచున్నారు. యంత్రాలయములందు 1409 ప్రత్తిమరలు గలవు. నేతపరిశ్రమాలయములు 613 కలవు. వానియందు 251 పరిశ్రమాలయములు యంత్రాధారముననను 362 సామాన్య విధముననను పనిజేయుచున్నవి. దూది యంత్రాలయస్వాములు ఫిబ్రవరి నెలయందు ప్రచురించిన లెక్క-లీవిషయ పరిజ్ఞానమును విశదము చేయుచున్నవి.

భరతఖండమునందు 1923 వ సంవత్సరమునందు ఏప్రిలునుండి సెప్టెంబరు మాసాంతమువరకును 31,80,00,000 రతుల నూలు, 192000000 రతుల బట్టలు తయారుచేయబడి, నవి. తయారైన నూలునందు సగముభాగము 1-25 నంబరు వరకును జెందియున్నది. ఈ రకము నూలును రాటములందు సులభముగ త నూరగుచున్నది. ఒక సెప్టెంబరు నెలయందు భరతఖండమునందు తయారైన సరుకుల విలువ రూ 5,05,00,000 లదియును, దిగుమతియైన సరుకుల విలువ రూ 532,00,000 లదియును గలదు. ప్రతిసంవత్సరమును రూ 65,00,00,000 విలువగల బట్టలసరుకులు విదేశములనుండి దిగుమతి యగుచు దేశదారిద్ర్యమును వృద్ధిచేయుచున్నవి. ఈ ధనప్రవాహము నరికట్టుట మె భారతదేశపరిశ్రమల యభ్యుదయమునకు మొదటి సాధనముగనున్నది. ద్రవ్యము పరదేశముల పాలుగాకను దేశమునందు నిలిచియున్నప్పుడు పరిశ్రమలు ప్రయత్నముగను వికసింపగలవు. ఈ ఫలప్రాప్తి కుపచరించెడి ప్రయత్నములన్నియును ప్రజాప్రభుత్వముల యాదరణమునకు పాత్రములగుచున్నవి.

విదేశములపాలగుచున్న ధనప్రవాహము నరికట్టుటకు వస్త్రయంత్రాలయములు సాధనములైనను యంత్రాలయముల నిర్మాణమునందును నిర్వాహణము నందును గల సాధక బాధకములను పరిశ్రమచరిత్రమనంత ముఖములను ఘోషించుచున్నది. మహాయంత్రాలయములు గలుగజేసిన యార్థికదుర్నయములను ధర్మాత్ములు గ్రహించి ప్రతీకారముల నరయుచున్నారు. ధనస్వాములకును కర్మకారులకును ప్రవర్థమాన మగుచున్న సంరంభము పాశ్చాత్యదేశములందు విప్లవరూపమును దాల్చిన విధమును రుష్యాసామ్రాజ్యమునందలి సోవియటుపరివర్తనము విశదము చేయుచున్నది. ధనస్వాములకును కార్మికులకును పరివర్తమాన మగుచున్న సంరంభమునకు ఫలమును నిర్ణయించుట యసాధ్యమైనను కాలము కార్మికపక్షమునకు విజయమును సమకూర్పగల విధమును వ్యవహారములు రుజువు చేయుచున్నవి. ఇపుడు బొంబయియందు వ్యాపించియున్న బట్టల యంత్రముల పనివాండ్ర సమ్మెకట్టు యంత్రాలయపద్ధతియందలి యనర్థములను విశదము చేయుచున్నది. మానవులు బొమ్మలవలె పనిజే

యుచు నాత్మస్తంభనమును జేసికొనుచున్నారు. కలహకారణము పుట్టినపుడు వేలమంది పనిపాటులు లేకను పరితపించుచుందురు. వీనికి దోడుగను ప్రజలకు సంప్రాప్తమగు దుర్నయములును ననంతములు. అన్నిలోపములను నంగీకరించినను సకల జనులకును జీవనాధారము యంత్రాలయ పరిశ్రమలవలనను గలుగుట యసంభవము. ఇపు డింగ్లాండునందు 20,00,000 ప్రజలు పనిపాటులేకను పరితపించుచున్నారు. పరిశ్రమాయత్తములైన యూరపురాజ్యములకు పరిశ్రమలే జీవనాధారములని యంగీకరించినను వ్యవసాయాధారముగల భరతఖండమునకు పాశ్చాత్యవిధానమును బలవంతముగను నంటగట్టుట యనర్థదాయకము. ఈ విషయావలోకనమును జేయగల గాంధిమహాత్ముడు రాటపు ప్రయోజనము నైకకంఠ్యముగను లోకమునకు వెల్లడిచేసి యజ్ఞుల పరిహాసమునకు బాత్రుడగుచున్నాడు. కాని బాగుగ విషయమును విమర్శించినవారలకు మహాత్మునియుపదేశమునందలి సత్యము తెలియుచున్నది. అన్నము లేకను మాడుచున్నవానికి కొంత యాకలియైనను తీరుట యుక్తముగదా? ఏవృత్తియును లేకను ఆరుమాసముల కాలమును వ్యర్థముగను గడపెడి నిరుపేదలయిన 20 కోట్ల ప్రజలకు సహజమైనట్టియును అవసరమైనట్టియును రాటపు పరిశ్రమ తరణోపాయము గాదా? పదికోట్ల ప్రజలు నెలకు నాలుగు రూప్యములవంతునను సంవత్సరమునకు 24 కోట్ల రూప్యములను గడించుట దేశాభ్యుదయమునకు మూలము గాదా? బట్టలకు నూలునకు పరదేశములకు బోవు ధనప్రవాహమునం దెంత దేశమునందు నిలిచిన దేశమున కంతమెలాభము. గతించిన మూడేండ్లయందును వేలకొలది జనులు రాటములవలనను బ్రతుకుచు గాంధిమహాత్ముని సంకీర్తనమును జేయుచున్నారు. ఆంధ్రదేశమునందు గావించిన మూడేండ్లయందు 15 లక్షల రూప్యముల ఖద్దరు నూలుబట్టలైనను సిద్ధమైయుండును. అం దైదులక్షలు కూలికై వ్యయమైయుండును. ఇతరపరిశ్రమ లేవియును నిట్టి ప్రయోజనమును సమకూర్చి యుండవు. అయినను పాశ్చాత్యాధికారులకును వారి యనుచరులకును రాటపు పరిశ్రమను హేళనము చేయుట యాచారమగుచున్నది. అధికారవర్గపు హేళన మెటులున్నను గత జనాభా లెక్కలయందు వెనుకటి జనాభా లెక్కలందు లేని గాంధి చరకమును మగ్గములను జేర్చుట గొప్ప విశేషముగ నున్నది.

గతించిన జనాభా లెక్కలను వేసెడి సమయమునందు చేతిమగ్గముల లెక్కలు సయితము కొంతవరకు వేయబడినవి. ఆ లెక్కల ననుసరించి భిన్నరాష్ట్రములందు గల మగ్గముల సంఖ్య యిటులు తేలుచున్నది.

| | |
|---|---|
| అజ్మీరు-మార్వార | 1,587 |
| ఆసాము | 421,367 |
| బెంగాలు | 213,886 |
| బీహారు అండు ఒరిస్సా | 164,592 |
| బర్మా | 479,637 |
| ఢిల్లీ | 1,067 |
| మదరాసు | 169,403 |

| | |
|---|---|
| పంజాబు . . . . | 270,507 |
| బరోడా సంస్థానము . . . | 10,851 |
| హైద్రాబాదు ,, . . . | 115,434 |
| రాజపుటానా (ఏజెన్సీ) . . | 89,741 |
| | 1938,072 |

దేశమునందు 300 దూది యంత్రాలయములు పనిజేయుచున్నను 20,00,000 చేతిమగ్గములు సయితము పని జేయుచున్నవి. యంత్రాలయములు 19,28,07 ప్రజలకును, మగ్గములు కోటిమందికిని పనిని గల్పించుచున్నవి. రాటపు పరిశ్రమను నిరసించిన లెంట్సు ఏథై గారులు సయితము కొన్ని ప్రయోజనములుగలవని యంగీకరించుచున్నారు. పనిలేనికాలమునందు ప్రజలు నూలును వడుకుటవలనను బట్టలు కుటుంబమునకు కొనకుండ వేలభించుచున్నవనిటూలెంట్సుగారు సయితమంగీకరించుచున్నారు. ఏథైగారును నేతపరిశ్రమయొక్క ప్రయోజనమును కొంతవరకంగీకరించుచున్నవిధము నీ క్రిందిభావములు తెలుపుచున్నవి. రాటపు నేతపనులను వీలైనపు డారంభింపవచ్చును. చాలింపవచ్చును. పరిశ్రమకు పెట్టుబడి యక్కరలేదు. నేసిన బట్టలను స్వయముగ వాడుకొనవచ్చును; లేక యితరుల కమ్మవచ్చును...కాని ఈ పరిశ్రమవ్యాపనమునకు కొంత పెట్టుబడియును వ్యాపారాభినివేశమును గావలయును...... స్వరాజ్య ప్రచారకులు గతించిన రెండేండ్లయందును జేసిన యాందోళనము సంయుక్త రాష్ట్రమునందు సఫలముగా లేదని దేశస్థితి తెలియజేయు చున్నది. కారణ ముపన్యాసమునందు జూపినపట్టుదల కార్యవిధానమునందు జూపకుండుటయని తేలుచున్నది.

జనాభా నివేదికయందలి ఖండన మెటులున్నను గాంధిచరకము మగ్గములు 1921-వ జనాభాయందు చేరుటయే యొక విశేషము. గతించిన మూడేండ్లయందును రాటము మగ్గముల యనుభవముగల వారలకు వీని ప్రయోజనము తెలిసియున్నది.

చెన్నరాష్ట్రపు పరిశ్రమల పరిశీలనము భారతదేశ పరిశ్రమలస్థితినే విశదము చేయుచున్నది. చెన్నరాష్ట్రమునందుగల 4,23,18,985 ప్రజలందును 3,08,69, 813 ప్రజలకు వ్యవసాయము దానికి సంబంధించిన పనులు జీవనాధారముగ నున్నవి. నేతపరిశ్రమ యంత్రాలయములు 15 మాత్రమే యున్నను చేతిమగ్గములు విశేషముగ గలవు. రమారమి ప్రతియేటను 30,000 టన్నులదూది పండుచున్నది. మూడుకోట్ల రూప్యముల దూది మెగుమతి యగుచున్నది. చేతిమగ్గములకుగాను ప్రతియేటను 5,42,20,500రతుల నూలు వాడబడుచున్నది. పూర్వముకంటెను ఈ మొత్తము 57 లక్షుల రతులుతగ్గినది. కారణమును నిర్ణయించుట సాధ్యము గాదు. ఈరాష్ట్రమునందు 1900 సంవత్సరమునందు 1,67,806 వేల మగ్గము లున్నటులు నిర్ధారణ చేయబడినది. ఇపుడు 1,69,403 ఉన్నటులు నిర్ణయింపబడినది. చేతిమగ్గములవలనను జీవించెడివారి సంఖ్య ఇరువదేండ్లలో రెండులక్షులు తగ్గినటులు జనాభా నివేదికయందు నిర్ణయింపబడినది. కాని ఈ

బుద్ధుని భార్యాన్వేషణము(యశోధరపటము మాఘసంచికయందు గలదు)



గీ. వేడుకను బతిప్రత్యాఖ్యంబు మెడలఁ బెట్టి, సఖ్యులను మాతృభావంబె పాకలింప
ధ్యాననిశ్చలుఁడైయుండినయెడను, నప్పు నిల్చె యశోధరా వారిజాక్షి.

బుద్ధచరిత్రము. ఆ. ౨ ప. ౫౯

చిత్రకారుడు:—డి. సి. జోగ్లేకర్ గారు

లక్ష్మీ ఆర్టు ప్రెస్—బొంబయి.

మూడేండ్లయందును గలిగిన వ్యాపకమును నిర్ణయించుట కాధారములు లేవు. కాంగ్రెసు సంఘములన్నియును రాటముల లెక్కలను, మగ్గముల లెక్కలను, నేతగాండ్ర లెక్కలను, వెంటనే తయారుచేసి ఖద్దరు ప్రచారమునకు గల సాధకబాధకములను నిర్ణయించుట కార్యసాధనముగ నుండగలదు. ఇతరులవలెను చెన్నరాష్ట్ర నివేదికను తయారుచేసిన బోగుగారు మనరాటమును హేళనముచేసిరి. కాని విషయపరిశీలనముచేసినవారి యనుభవము రాటముల ప్రయోజనమును నిర్ధారణచేయుచున్నది. వేలకొలది ప్రజలకు జీవనోపాధిని గల్పింపగల పరిశ్రమను సర్ కూర్మ రెడ్డినాయుడుగారివంటి విద్యావంతులు నిరసించుచున్నపుడు దాని వ్యాపకమునందు గల బాధకములు విశదమగుచున్నవి. చెన్నరాష్ట్ర పరిశ్రమశాఖాధికారులు చేతిమగ్గముల శాలలను బెట్టుటకు జేసిన ప్రయత్నము సఫలము గాకపోవుట సహజముగనున్నది. గాంధిమహాత్ముని లక్ష్యము రాటపు పరిశ్రమచేయుటగాని వ్యాపార పరిశ్రమచేయుటగాదు. వేలకొలంది రూప్యములను బెట్టి ఏర్పాటుచేసిన పరిశ్రమశాలలు వడ్డి లాభములేక నడువజాలవు. ఈ శాలలు పెద్దయంత్రశాలలందుగల యనర్థములనే గలుగజేయుచున్నవి. ఆ యనర్థములను పోగొట్టి సర్వజనసామాన్యమైన పరిశ్రమను వెంటనే వ్యాపింపజేయుటయె రాటపు పరిశ్రమకు ప్రయోజనము. రాటము పరిశ్రమవలన గలుగగల లాభము స్వల్పమైనను ప్రజల కవసరమైన బట్ట నీపరిశ్రమ సమకూర్చుచు దేశాదాయమును వృద్ధిచేయుచున్నది. పరిశ్రమశాఖవారు చేయుచున్న నిరర్థక వ్యయమునకీ పరిశ్రమయం దవకాశములు లేవు. పండ్లతాండ్ర పరిశ్రమాలయమునందును సర్వేసు యంత్రాలయమునందును సబ్బుయంత్రాలయమునందును నితరయంత్రాలయములందును వ్యర్థముచేసిన యెనిమిదిలక్షల రూప్యములును రాటము నేతపరిశ్రమల కుపయోగపడి యుండిన ప్రజల దుర్భరదారిద్ర్యమును నిసుమంతయైనను తగ్గించుటకు నాధన నేర్పడి యుండును. సర్ రెడ్డినాయుడుగారివంటి పాశ్చాత్య పూజారు లేమిచెప్పినను ప్రజలైనను గాంధిమహాత్ముడు ప్రఫుల్లచంద్రరాయిబోధించిన రాటపు సందేశమును సఫలము చేయుదురుగాక.

# అఱవభాషయొక్క యుత్పత్తి

తేకుమళ్ల రాజగోపాలు రావు గారు బి ఏ., యల్. టీ.

## ప్రాచీన ద్రవిడముయొక్క సరిహద్దులు

పందొమ్మిదివందల యిరువదిరెండవ సంవత్సరము జనవరినెలలో కలకత్తానగరములో ప్రాగ్దేశపండితుల మహాసభయొక్కటి జరిగినది. దక్షిణహిందూదేశమునకు సంబంధించిన భాషావిషయములనుగూర్చి చర్చించుటకు నాకును అందు అవకాశ మీయఁబడినది. అట్లు నే నాసభ యందుపన్యసించిన విషయములలో అఱవభాషయొక్క యుత్పత్తి యనునది యొక్కటి. ఈవిషయమునుగూర్చి ఆసభయందు నే నుపన్యసించుటయే కాక ఆవ్యాసము ప్రతులను ముద్రించి నే నాసభకు వచ్చినవారి కందఱి కును పంచిపెట్టితిని. భాషాశాస్త్రజ్ఞులు పెక్కండ్రు ఆంగ్లభాషయందు వ్రాయఁబడిన యావ్యాసమును జదివి ఆవిషయమునుగూర్చి దాక్షిణాత్యు లనేకులతో వాద ప్రతివాదములు చేసిరి. కొంద ఱఱవవారికి నాపై పట్ట రాని కోపము వచ్చెను. కాని నేను దానిని లక్ష్యము చేయలేదు. చేతనైనచో నావ్యాసమును ఖండించి దోష ములు చూపినయెడల దిద్దుకొనుటకు నేను సిద్ధముగా నున్నానని మాత్రము చెప్పితిని. ఎవ్వరును ఆపనికి పూనుకొనలేదు.

మహాసభ ముగిసెను. ప్రతినిధులు వారివారి గ్రామములకుఁ బోయిరి. మహాసభలోని వ్యాసములను బ్రచురించుటకు ఉపసంఘములు ఏర్పడెను. దక్షిణదేశము నకు సంబంధించినవ్యాసములలో ఏవి ముద్రింపఁబడవలసి నవో యేవి కావో నిర్ణయించు నుపసంఘములో నా పేరు చేర్పఁబడలేదు. అఱవవారు అందు చాలమంది యుండిరి. అంతేమి జరిగినదో అది బ్రహ్మరహస్యము. కొన్నిమాస ములు కడచినవి. దక్షిణదేశపుభాషలలో అఱవమే ప్రాచీనమని, అఱవమునందే లోకోత్తరములైన పుస్తక ములు కలవని, తక్కినభాషలకు అఱవము తల్లివంటిదని, అఱవలే వ్రాసికొని, అధికారపదవులయం దుండుటచేత అఱవమునకే ప్రాముఖ్యమునిచ్చి మసిఁబూసి మారేడు గాయ చేయుదమన్న యింద్రజాలతంత్రములతోనే యిప్ప డును వారు తమతెలను గాచుకొనిరో యేమో. పైసభ యొక్క చర్యలును అందు చదువఁబడినవ్యాసములలోని విషయములను నుండుపుస్తకములో నావ్యాసమును చేర్చు టకు తావులేకపోయినదఁట. అందువలన నావ్యాసమును నాకు తిరిగి పంపవలసివచ్చినదఁట. ఇది అఱవతంత్రమో బంగాళీమంత్రమో బుద్ధిమంతు లూహించుకొనవచ్చును. తమభాషనుగూర్చి తా మేమి వ్రాసికొన్నను తప్పు లేదుగాని అన్యభాషలను తక్కువపఱచు సిద్ధాంతములు తేల్చి అధికారకారణమున లోకవ్యాప్తి చేయుచు ఎన్నాళ్లు నెగ్గఁగలరు?

## అఱవముయొక్క యుత్పత్తినిఁగూర్చిన కొన్ని నమ్మకములు

వేదములందు వివరింపఁబడిన ఋషులలో అగస్త్యుఁ డొక్కఁడు. కాశీపట్టణములోని సంస్కృతపండితులతో వాదప్రతివాదము లొనర్చి యీఋషి సంస్కృతమునకు మించిన నూతనభాష నొకదానిని మధురతరమైనదానిని తనకు సయచేయు మని భగవానుఁడైన కంవసామిని ప్రార్థించెను. వరము సిద్ధించెను. సిద్ధిసూచకముగా నగ స్త్యునియింట నాకస్మికముగా గుమగుమలాడుపరిమళ ములు క్రమ్ముకొనెను. ఇంటిలోనియొకమూలను వెదకు మని కంవసామి తనభక్తుని కాజ్ఞాపించెను. అగస్త్యుఁ డటు వెదకుచుండఁగా నొకమూలఁ గొన్ని భూర్జపత్రముల సంపుటములు పరిమళములీనుచు పడియుండెను! వాని మధురసౌరభముల కలరుచు నగస్త్యుఁడు "తమిళ్", "తమిళ్" (మధురము, మధురము) అని యఱచెనఁట! ఆసంపుటములలోనిభాష నే అగస్త్యుఁడు దక్షిణదేశమున వ్యాపింపఁజేసెనఁట! అందువలననే దానికి తమిళ్ లేక తమిళము అను పేరు కలిగెనఁట!

మఱియొకసిద్ధాంతము:— అగస్త్యుఁడు ఉత్తర హిందూదేశమునుండి కొంద ఱార్యమహర్షులతో దక్షిణ దేశమునకు వచ్చుచుండెనఁట! అప్పటి కప్పుడే దక్షిణ మున నఱవభాష యున్నతదశలో నుండెనఁట! అగస్త్యుఁ డాభాషను చంపివేయవలె నని విశ్వప్రయత్నములు చేయఁగా అఱవలు ఆతనిధాటికి నిలువలేక ఇంకను దక్షిణభాగమునకు బాఱిపోయి యందు స్థిరనివాస మేర్ప ఱచుకొనిరఁట!

ఇంకొక సిద్ధాంతము:— హిమవత్పర్వతాగ్రము మీఁద గిరిజాకల్యాణము జరుగువేళ ఋషులును మును లును దేవతలును నెల్లరును కోటానఁగోట్లు గుమిఁగూడి నప్పు డా బరువువలన నచ్చటి భూమి క్రుంగిపోయి, దక్షిణప్రాంతములందు నేల పైకి లేచెనఁట. ఎట్టపల్లము లుగా నిట్లు లేచిన యీభూమిని చదునుచేయుటకు నగస్త్యుఁ డొక్కఁడే సమర్థుఁ డని తలఁచి యీశ్వరుఁ డితనికి విశ్వేమంత్రము లుపదేశించి గంధమాదనమున కంపెనఁట! అగస్త్యుఁ డిట్లు గంధమాదనమును స్థిరనివా సము చేసికొని అచట తమిళమును వెలయించెనఁట!

వేఱొకసిద్ధాంతము:— రవ మను సంస్కృతపద మునకు చప్పు డని యర్థము. శ్రావ్యమై మధురస్వర ములు కలదిగాన నీభాష నుచ్చరించునప్పుడు రవము రాదనియు, రవము లేనిదగుటచే శ్రోత్రపేయమైన యీ భాషను మాటలాడునప్పుడు వినువారు దీనిని అరవమందు రనియుఁ గొందఱిమతము.

కడపటిసిద్ధాంతము:—అఱవభాషలో రకారము ఆదియందుఁ గలమాటలు లేవు. సంస్కృతములోని రకా రాదులగుమాటలు అఱవములోనికి వచ్చునప్పుడు వానికి మొదట నొక యచ్చు చేర్తురు. ఉదా: సం. రాజన్ అఱవము. అరసన్. ఇట్లే సం. రవము. అఱవము-అర వము. కాఁబట్టి అరవమనునది రవమను సంస్కృతపదము నుండి పుట్టినదనియు, చప్పుడు చేయునది యని దాని యర్థ మనియు మఱికొందఱిమతము.

పైరీతి పిట్టకథలవలన నిజమైన సిద్ధాంతములు తేలవు. మన యాంధ్రమునకును నట్టి సిద్ధాంతములు కలవు. వారికి సముద్రోదకము నంతను ద్రావిన యగస్త్యుఁ డొక్కఁడే వేదర్షి. బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేసినవిశ్వా మిత్రుఁడు మనకు పితామహుఁడు. వేదకర్మలను శాసిం చిన యాపస్తంబుఁడు మనకు సూత్రగురువు. వేద ములోని బ్రాహ్మణములు మన పవిత్రజన్మస్థానములు. కృతయుగమునందు మనల నుద్ధరించిన మహర్షిసత్తములు. ఐన నేమాయె. వారెట్లు తమభాషకు పవిత్రత నొసఁ గిరో మనవారును నాంధ్రమున కంతకంటె ఎక్కుడు పవిత్రతనే యొసఁగజాలిరి.

### అఱవదేశమునకు ప్రాచీనపు సరిహద్దులు

"వడవేంగడన్ తెంకుమరియాయిడై త్తమిఴ్కుఱు నల్లులగుమ్"

ప్రాచీన వైయాకరణియగు తొల్కాపియరు "తమిఴకము" (అఱవదేశము)నకు సరిహద్దు లొసఁగుచు తొల్కాపియ మను తన మహాగ్రంథమునందు దానికి ఉత్తరమున వేంకటాచలమును (తిరుపతి) దక్షిణమున గుమారియు (గన్యాకుమారియు) హద్దులుగాఁ జెప్పు చున్నాఁడు. అతని గ్రంథములోని దీనికి సంబంధించిన యఱవ వాక్యము పైన "వడవేంగడన్" అనునది.

తొల్కాపియర్ చాల ప్రాచీనుఁడు. కొంద ఱఱవలు ఈతనిని క్రీస్తుకు పూర్వము వేయవసంవత్సరము వఱకును (౧౦౦౦బి.సి.) తీసికొనిపోవ నుంకించుచున్నారు. ఆంధ్రులకంటె అఱవలకు స్వదేశాభిమానమును స్వభా షాభిమానమును హెచ్చు. మేమే ప్రాచీనులమను వారి పట్టుదలవలన ఇంతవరకును అఱవకవుల కాలముగాని పాండ్యాది రాజ్యముల రాజుల సరియైన వంశావళులుగాని బయలుపడలేదు. అట్టి విపరీతాభిమానము లేనందుననే మనము మనకవుల కాలములను కృష్ణరాయాదిరాజేం ద్రుల చరిత్రములను సరిగా దెలియఁ జాలితిమి. అఱవల యభిమానమునకే తొల్కాపియమే ఒక్క దృష్టాంతము. తను ప్రాచీనగ్రంథములలో సంస్కృతమే లేదనియు, అన్నియు దేశ్యపదములే యనియు నొక విద్వాంసుఁడు నాకు ఎంతయో నొక్కినొక్కి వక్కాణించెను. "మీ ప్రాచీనగ్రంథరాజమైన "తొల్కాపియము" అను పుస్తకము పేరులోనే కావ్యశబ్దము కాపియముగా మార్పఁబడలేదా. తొల్కాపియ మన్న తొలికావ్యమే కదా?" యని నేనడిగితిని. కాపియము శుద్ధదేశ్య మనియు అఱవములోని కాపియ మను పదమును సాంస్కృతికులు కావ్యముగా మార్చి తీసికొన్నా రనియు

ఇప్పుడు సాంస్కృతికములుగా నెన్నఁబడు పంపలకొలది పదములు అఱవమునుండియే సంస్కృతములోనికి వచ్చిన వనియు నాతఁడు చెప్పెను. కాపియమనునది కావ్యశబ్ద తద్భవము కావునటకు వారొక విచిత్రమైన సిద్ధాంత మును గూడఁ గొని తెచ్చినారు. మధురకు దక్షిణమున తొల్కాపియకుడి యను నొకగ్రామము కలదఁట. ఆ గ్రామ వాస్తవ్యుఁడగుటచే నాతనికి తొల్కాపియరను పేరుకలిగినదఁట! ఆతఁడు వ్రాసినదగుటచే నాతని పుస్తకమునకు తొల్కాపియ మను పేరు కలిగినదఁట! అఱవ ములోని పుస్తకములన్నింటిలో తొలికావ్యము తొల్కాపి యమే యఁట కాని అందలి "కాపియ" మనుమాట సంస్కృతమునుండి మాత్రము అఱవవారు స్వీకరించినది గాదఁట.

ఈ తొల్కాపియరునుగూర్చి చిత్రములైన కథలు అనేకములు కలవు. అగస్త్యుని ప్రియశిష్యులలో నొక్కఁ డైన యీ కవి సమదాకినీగోత్రోత్పన్నుఁడు నూతన ముగా లేచిన దక్షిణదేశమునందు అఱవమును స్థాపింను టకై పరమేశ్వరుని ఆజ్ఞను పొంది హిమవత్పర్వతశిఖ రమునుండి అగస్త్యుఁడు హుటాహుటిని గంధమాదనమున కేగునప్పుడు శిష్యుఁడైన తొల్కాపియరునుజూచి "శిష్యోత్తమా! విదర్భరాజపుత్రియగు నాభార్య లోపా ముద్రకు నాలుగుగజములదూరమున నిలిచి" ముక్కునకు సూటిగా గొనిరమ్మనెనఁట. శిష్యుఁడును గురునియాజ్ఞను యథావిధిగా నిర్వర్తించనందున అగస్త్యుని కతనిపైఁ గోపము వచ్చెనఁట! ఇట్టికథలవలన తొల్కాపియరును అఱవలు మిక్కిలి ప్రాచీనకవినిఁగా భావించుచున్నారని మనము నమ్మవచ్చును.

తొల్కాపియరు చాల ప్రాచీనకవి యనుటకు అఱవలే మఱియొక దృష్టాంతమునొసఁగుచున్నారు. ప్రసిద్ధములైన మధురసంఘములను గూర్చి యాంధ్రులును వినియే యుందురు. ప్రాచీనకాలమున తమిళమును ఉద్ధ రించిన ఇట్టి సంఘములు మూఁడు. సంఘమని నేను వ్రాసినందుకు పాఠకులు మన్నింతురు గాక. సంగమని అఱవవారు వీని కిడిన దేశ్యపదము. ఈమూఁడు సంగము లును చేరి ౧౦౦౦౦ పదివేల సంవత్సరములు భాషావిమ ర్శనము చేసినవి. ౧౯౭ గురు రాజులు ఒకరివెనుకనొకరు ఈకాలములో వీనికి అగ్రాసనాధిపత్యము వహించిరి. అనఁగా సగటున ఒక్కొక్కరాజు ౫౦ సంవత్సరములు అగ్రాసనాధిపతియై యుండెను. ఈ సంగముల క్రింద ౬౫౭ ఉపసంఘము లుండెను. వీరు ఇంచుమించుగా ౮,౭౦౦ కవుల గ్రంథములను పరిశీలించిరి. అందు మొదటిసంగము మధురానగరమున కూడినది. అందు ౫౪౯ కవు లుండిరి. అందులో అగస్త్యుఁడు, శివుఁడు, మురుగుఁడు- ప్రధానమైనవారు. ఈ సభ ౪౪౪౦ సంవ త్సరములు జరిగెను. ఒకరివెనుక నొకరుగా ౮౯ మంది రాజులు దీనికి అగ్రాసనాధిపతులైరి. రెండవసంగము కపడపురమున కూడెను. అగస్త్యుఁడును తొల్కాపి యరును ఇందలి ముఖ్యవిమర్శకులలోని వారు. వీరు ౩౭౦౦ సం॥రములు సభచేసి ౩౭౦౦ కవుల గ్రంథము లను పరిశీలించిరి. మూఁడవసంగము ౧౮౫౦ సం॥ రములు పనిచేసెను. ఈ గ్రంథరచనమంతయు క్రీస్తు శకాబ్దమునకు ముందే జరిగినది. కాఁబట్టి తొల్కాపి యరు మిగుల ప్రాచీనుఁడని యఱవలమతమైనట్లుగా మనము గ్రహింపవచ్చును.

వేంకటాచలము (తిరుపతి) నకును, కన్యాకుమారి కిని మధ్యనుండుభూమి తమిళకమని తొల్కాపియరు చెప్పినమాటనే యితర కవులుకూడఁ జెప్పియున్నారు. "శిలప్పడికారము" అను మహాప్రబంధమును రచించిన ఇలంగో వడిగళ్ అను మహాకవీంద్రుఁడు.

> నడివోళ్ కుంద్రముᳵ తొడిమోళ్ పెణ్ణముᳵ
> తమిళ్వరంబరుత్త తణ్బువనాడు

అని తమిళకమునకు వేంకటాద్రిని ఉత్తరపు సరి హద్దుగాను, కన్యాకుమారిని దక్షిణపు సరిహద్దుగాను చెప్పుచున్నాఁడు. క్రీ॥ వె॥ రెండవశతాబ్దములో జరిగిన విషయ మొక్కటి యీతని గ్రంథములోనికథకు సంబం ధించి యున్నది. కాఁబట్టి యీతఁడు అంతకు తరువాత నెప్పటివాఁడైన కావచ్చును. కొందఱు అఱవలు ఈత నిని రెండవశతాబ్ద కవినిఁగా భావించుచున్నారు. క్రై స్తవులు కొందఱు ఈతనిని ఏడవశతాబ్దములోని కవి నిఁగా తలంచుచున్నారు.

అగస్త్యశిష్యులలో నొక్కఁడని కొందఱిచే తలంపఁబడెడి శిఖండియర్ అను నొక కవి,

వేంగడక్ కుమరితీం పునర్ పెణవమెన్ఱిణ్ణాక్
కల్లైతమిఴ్దునఴక్కే.

అని తిరుపతికన్యాకుమారిలకును, రెండుసముద్రములకును నడుమనుండు దేశము తమిళకమని చెప్పుచున్నాఁడు.

కర్ణాటకరాజ్యమును మలయాళమును దీనినుండి తప్పించినయెడల ఇప్పటికిని పైనిచెప్పఁబడినవి అఱవదేశమునకు ఇంచుమించుగా సరిహద్దులే యని మనము అంగీకరింపక తప్పదు.

“హళగన్నడము, నవీనకన్నడము” నని కాలభేదము ననుసరించి కన్నడములో ప్రాచీనకన్నడమును, ఇటీవలి కన్నడమును వెలసినట్లే అఱవమును కాలభేదమువలన మార్పుచెందినది. అందు ప్రాచీనకాలపు అఱవమునకు సెన్తమిఴ్ అని పేరు.

## పరిశుద్ధమైనయఱవదేశమునకు సరిహద్దులు

తొల్కాప్పియరు రెండవసంగమునకుఁ జెందినవాఁడని యిదివఱకే చెప్పఁబడియున్నది. మఱియు మొదటి సంగమునందు ౫౪౯ మంది అఱవకవులుండిరనికూడ మనము తెలిసికొనియున్నాము. తొల్కాప్పియ మెట్లు నిలిచియున్న గ్రంథములలో తొలికావ్యమో అట్లే తత్పూర్వమునఁగూడ అఱవగ్రంథములు అనేకము లున్నవన్నమాటకూడ పై కథవలన మనకు తెలియుచున్నది. తొల్కాప్పియము లక్షణగ్రంథము. ఈగ్రంథకర్త తన సూత్రములకు లక్ష్యముగా ననేక ప్రాచీనగ్రంథముల నుండి యుదాహరణము లిచ్చియున్నాఁడు. కాఁబట్టి తొల్కాప్పియరు ప్రాచీనకవి యగుటయు అతనికి ముందు అనేకకవులుండుటయు సత్యమని తేలుచున్నది. తొల్కాప్పియరు కాలమునాఁటికే, అఱవము తిరుపతి వఱకుఁగూడ మాటలాడఁబడుచున్న దనుటకు అతని గ్రంథమే ప్రమాణము. కాని యాభాషయంత శుద్ధమైనది కాదు. పాండ్యమండలముననే అనఁగా మధుర చుట్టు ప్రక్కలనే కవు లనేకులు విలసిల్లిరి. అప్పటిభాష పరిశుద్ధమైన యఱవము. అఱవము తిరుపతివఱకు వ్యాపించిన దన్నమాట యతిశయోక్తి కాకపోయినను, అతిశయోక్తులకు అఱవములో మితిలేదు. నచ్చినార్ కినియార్ అను నతఁడు మిగులప్రాచీనుఁడు. ఇతనివ్రాఁతలు అఱవమునకు పరమప్రమాణములు. తొల్కాప్పియమునకు ఈతని వ్యాఖ్యానము ప్రసిద్ధమైనది. సరిహద్దులను గూర్చిన పై వాక్యమునకు వ్యాఖ్యవ్రాయుచు ఈతఁడు ఈక్రింది హద్దుల మధ్యగతమైనది అఱవదేశమని చెప్పుచున్నాఁడు.

౧ సింహళము ౫ కొంకణము ౯ కుడసు [భూమి)
౨ లక్షద్వీపములు ౬ తుళువము ౧౦ వడుగు(ఉత్తర
౩ కొల్లాపురి ౭ కొడగు ౧౧ తెలుగు
౪ కుప్పము ౮ కర్ణాటకము ౧౨ కళింగము

కర్ణాటకమునకు పైన వడుగేదియో తెలుఁగునకు పైన కళింగమెట్లు అఱవదేశమునకు ఉత్తరపు సరిహద్దయ్యెనో యెట్లు విశదమగును? దేశములను సరిగా గుర్తెఱుఁగుటకు అవకాశములు లేని ఆకాలమున నిది యంత యతిశయోక్తి కాకపోవచ్చును గాని యీక్రిందిపద్యమును జూడుఁడు మఱియొకకవి.

“సింహళమ్, శోణకమ్, సవకమ్, చీనమ్, తుళుక్కుడగమ్.
కొంగణమ్, కన్నడమ్, కొల్లమ్, తెలుంగమ్, కళింగమ్, వంగమ్, కంగమ్, మగధమ్, కడారమ్, కవుడమ్, కరుమ్, కుసలమ్, తంగమ్ పుహామ్ త్తమిఴ్ సాల్ పువిదానివయే

అని వంగము, మగధము, చీనా మున్నగు రాజ్యములనుగూడఁ జేర్చుచున్నాఁడు.

ఏది యెట్లున్నను సెన్తమిఴ్, సెన్తమిఴ్, అని ప్రాచీనపు అఱవమునకు అత్యంతగౌరవమును వారు ఒసఁగుచున్నారు. ఆ సెన్తమిఴ్ భూమి యెయ్యది యని పలువురు తర్కములు చేసికొన్నారు. ఒక్కరొక్కరే, తమతమ భూములకు ఆగౌరవము నీయఁదలఁచినారు. కాని పాండ్యభూమికి మాత్రమే ఆమాట దక్కినది. పవిత్రమైన సెన్తమిఴ్ భూమి తిరుపతివఱకు వ్యాపించినది కాదు. పరిశుద్ధమైన యఱవము దక్షిణమున మధుర భూమినే యుండెను. తక్కినతావులకు అఱవము సెన్తమిఴ్ భూమినుండి వ్యాపించినది. ఇది అఱవవారు ఏకగ్రీవముగా నంగీకరించిన సిద్ధాంతము. తొల్కాప్పియము వ్యాఖ్యానములోనే నచ్చినార్ కినియారు అఱవభూమికి పైపండ్రెండు సరిహద్దులను ఇచ్చి, అందు సెన్తమిఴ్కు ప్రత్యేకపు హద్దుల నొసఁగుచున్నాఁడు.

ఉత్తరమున మరువయూరు.
తూర్పున మరువూరు

పడమట కరువూరు
దక్షిణమున వైఘూనది.
సెందమిళ్ నిలమావదు
వైఘూత్రిల్ వడక్కుం
మరువయాత్రిల్ ప్రెదం
కరువూలిల్ క్కిళ్క్కుం
మరువూరిల్ మేట్కుమామ్

శేనాపరియరును సెంతమిళ్భూమికి పై సరిహద్దులనే యొసంగియున్నాఁడు.

కాఁబట్టి అఱవవారి ప్రాచీనభూమి, పరిశుద్ధమైన సెంతమిళ్భూమి, వైఘూనది కుత్తరమున నున్నది.

ఇప్పుడు మనకు అఱవదేశముయొక్క సరిహద్దులు తెలిసినవి. ఇప్పటియఱవమునకు మాతృకయైన ప్రాచీన ద్రవిడము యొక్క ప్రదేశమును మనకుఁ దెలిసినది. ప్రాచీనద్రవిడము మధురజిల్లాప్రాంతములలోనిదని ఇప్పుడు మన మెఱిఁగియున్నాము. దీనితోఁబాటుగా తెలుఁగుభాషయు తెలుఁగు నాఁటిలో వ్యాపించియుండి నట్లు మనయాంధ్రభాషకు అఱవమునుండి నిదర్శనములు కూడ దొరికినవి.

## తిశైచొళ్ లేక అన్యదేశ్యములు

అఱవ లిపికంటె సంపూర్ణమైనలిపి మఱియొకటి లేదని మాణిక్యనాయకరుగారును మరికొంద రితరులును, ఎంతవాదించినను, సంస్కృతపదములు అఱవములోఁజొఱ లేదని మఱికొంద రెంత చెప్పినను, సంస్కృతములోని దిశ యను శబ్దము అఱవవ్రాఁతలో తిశై యైనదనుటకు సందేహము లేదు. తిశైచొళ్ అనఁగా దిక్కులలో మాటలాడఁబడు మాటలు అన్యదేశ్యములు. ప్రాచీనద్రవిడము (సెంతమిళ్, రెండువిధములైనది. స్వచ్ఛమైనయఱవము, తిశైచొళ్ అని.

సెంతమిళ్ నిలమ్‌సేర్ పన్నిరునిలత్తినుం
ఒంఱదిత్తిరెండినిల్ తమిళ్ఒళ్ నిలత్తినుం
తంకురిప్పినవె దిశైచ్చొళ్ ఎన్‌బా.

అన్యదేశ్యములు చుట్టుప్రక్కలనుండు పండ్రెండు దేశములనుండియు దూరముననుండు పదునెనిమిదిదేశములనుండియు సెంతమిళ్ ప్రాచీనద్రవిడములోనికి అన్యదేశ్యములుగా వచ్చినవని పైసూత్రము చెప్పుచున్నది. చుట్టుప్రక్కలనుండు నేపండ్రెండుదేశముల భాషనుండి ప్రాచీనద్రవిడములోనికి అన్యభాషాపదములు వచ్చినవి?

| దేశములు | ప్రాచీనద్రవిడములోనికి వచ్చిన యన్యదేశ్యముల కుదాహరణములు. |
|---|---|
| ౧ దక్షిణపాండ్యరాజ్యము. | పెత్రం-ఆవు;సొట్టి-బియ్యము. |
| ౨ కుట్టనాఁడు | తళ్లై-తల్లి |
| ౩ కుడనాఁడు | అచ్చన్-తండ్రి |
| ౪ కర్కనాఁడు | కయ్యర్-మోసగాండ్రు;కయ్య మాడువారని భావము |
| ౫ వేనాఁడు | కిళ్ల్-తోఁట |
| ౬ పులినాఁడు | పళ్ళి-చిన్న చెఱువు |
| ౭ పన్నినాఁడు | పై-శేరీపాలము |
| ౮ అఱువనాఁడు | కొని-చిన్న చెఱువు |
| ౯ అఱువావడదలైనాఁడు | ఏహిన్-చింతపండు |
| ౧౦ శీతంనాఁడు | ఎలువన్-స్నేహితుడు;ఇహుళై-మిత్రురాలు |
| ౧౧ మలైనాఁడు | వెళ్లం-వెల్లువ, నీరు |
| ౧౨ పుననాఁడు | అచియ్ తల్లి |
| కొన్ని దూరదేశములు | |
| ౧ తెలుంగు | సెప్పునల్-చెప్పుట;అయ్యో-అయ్యో హెచ్చరిక |

అవసరము లేనందున తక్కిన దేశముల కుదాహరణము లీయలేదు.

దీనినిబట్టి దక్షిణ పాండ్యరాజ్యముగూడ ప్రాచీన ద్రవిడభూమిగాదు. కావున అఱవభాషాశాస్త్రజ్ఞులమతము ననుసరించి ప్రాచీన ద్రవిడభూమి యెద్దియో తేలినది.

కావ్య మనుశబ్దముయొక్క వికారమే కాపియ మని చెప్ప నిష్టములేక, తొల్కాపియకుడి యను గ్రామమున కాకవిని కట్టిపెట్టినరీతిగానే ఆంధ్రమునకు సంబంధించిన జన్యభాషయే యఱవమని యంగీకరింప నిచ్ఛలేమిచే ప్రాచీన ద్రవిడమును వారు మధురమండలములోని వైఘూనది గట్టునకు దూరముగా గొనిపోయినారు. పై వ్యాసమునందు అఱవము ఆంధ్రేతరమైన భాష గాదని నిర్ణయింపఁ బోవుచున్నాను. ఆంధ్రమునందీ విషయమును చర్చించునప్పుడు అనేకములైన నూతన విషయములనుగూడఁ దెలుపవలసి యుండుటచే, నా యాంగ్లభాషలోని వ్యాసమునందు లేని పెక్కువిషయము లిందుఁ జేర్పవలసి వచ్చినవి.

# బుద్ధచరిత్రము

దశావతారములందును బుద్ధావతారము తొమ్మిదవ యవతారము. మహత్తరమైన బుద్ధావతారచరిత్రము హిందూపురాణములందు శ్రీరామకృష్ణాద్యవతారచరిత్రములవలె విశేషవ్యాపకమును బొందియుండలేదు. ఒకవేళను బుద్ధయుగమునందు విశేషమైనవ్యాపకమును బొందియున్నను కాలాంతరమునందు క్షీణించినది. శ్రీ శంకరాచార్యస్వాములు బౌద్ధజైన మతములను నిర్మూలముచేయుటకు బూనుకొనినపుడు బౌద్ధగ్రంథములను సయితము నిర్మూలము చేసియుండును. ప్రపంచ మతములందు మొదటి మతముగనున్న బౌద్ధమతము జన్మస్థానమునందు నామమాత్రావశిష్టముగనున్నను మతసిద్ధాంతములందును సాంప్రదాయాచారములందును కళావికాసమునందును గలుగజేసిన మహత్తరమైన పరివర్తనము భరతఖండమునందు సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. పురాణములందును కావ్యములందును నాటకములందును బౌద్ధధర్మసాంప్రదాయాచారములు సమ్మిళితములై హిందూమతధర్మసాంప్రదాయాచారములకు నవజీవము నొసంగినవి. బౌద్ధమతము దేశభాషలకును ప్రజాజీవనప్రవాహమునకును నుత్తేజమును గలిగించినవి. వర్తమానమునందు గాంధివిజయఘోషమువలె బుద్ధుని కాలమునందు బుద్ధవిజయఘోషములు దిగంతములందు నిండినవి. గతించిన మూడేండ్లయందును గాంధివిజయప్రభాలీలలను సందర్శించుచు నానందవిషాదముల ననుభవించిన వారలకు బుద్ధావతారలీలను సంభావించుట కొంతవరకు సాధ్యము. గాంధినాదము సర్వత్ర ప్రతిధ్వనించుచున్నది. కావ్యములందును కళలందును, నాటకములందును ప్రసంగములందును గాంధినామరూపములు గోచరం బగుచున్న విధమున బుద్ధయుగమునందు బుద్ధుని నామరూపములు సర్వత్ర ప్రతిబింబములయి యుండును. బౌద్ధమతగ్రంథములు చీనా జపాను సింహళము త్రివిష్టపముల నాశ్రయించినను బౌద్ధస్తూపములు విహారములు విగ్రహములు దిగంతములందు వ్యాప్తమైన బుద్ధదేవుని ప్రతిభను విశదముచేయుచున్నవి. మ్యూజియములందును విహారములందును స్తూపములందును సంరక్షితములైన బుద్ధవిగ్రహాదులు బౌద్ధమతము శిల్పవికాసమునకు జేసిన మహోపకారమును విశదముచేయుచున్నవి. అజంతాచిత్తరువులు సంచిస్తూపశిల్పము బౌద్ధమతముగాథలు శిల్పవికాసమునకు దోడ్పడిన విధమును విశదముచేయుచున్నవి. అజంత చిత్తరువుల సౌందర్యము అమరావతి సంచి స్తూపముల శిల్పనైపుణ్యము కళాభిజ్ఞులకు విస్మయమును గలుగజేయుచున్నవి. స్వస్తికాసీనులైన బుద్ధుని దివ్యమంగళవిగ్రహము స్వరూపప్రదర్శనమునందు దివ్యవిభూతులను విశదము చేయుచున్నది. బుద్ధుడు తన తపఃప్రభావ

మున బడసిన బోధిసత్త్వమునే బుద్ధవిగ్రహ
ములు విశదము చేయుచున్నవి. బుద్ధవిగ్ర
హములందు పాశ్చాత్యలక్ష్యమునకు మూల
మైన అంగవిన్యాసవిస్ఫురణములు గుప్త
ములై ప్రాచ్యజీవనసంవిధానమునకు లక్ష్య
మైన ఆత్మౌద్ధత్యము జితేంద్రియత్వము సుప్ర
కాశములగుచున్నవి. ముఖపటముగ ప్రచు
రింపబడిన బుద్ధవిగ్రహమును వేరొకచోట
ప్రచురింపబడిన వివాహోత్సవ పటమును
ప్రాచ్యకళకు లక్ష్యములైన అజంతాయందలి
చిత్రములు. బుద్ధచరిత్రను విశదముచేయు
టకు ప్రచురించిన పటముల పరిశీలనము
లక్ష్యభేదమును విశదము చేయుచున్నది.

బుద్ధచరిత్రపటముల భావములను విశ
దముచేయుటకు శ్రీతిరుపతివేంకటేశ్వరకవులు
రచియించిన బుద్ధచరిత్రమునందలి పద్యములు
సందర్భానుసారముగ ముద్రింపబడినవి.

* * * *

మాయాదేవి స్వప్నము

గీ. షట్కిరణయుక్తమైన నక్షత్ర మొకఁడు; పాటలప్రభ దిక్కులఁ దీటుకొనఁగ
నాకసమునుండి కుడిప్రక్కఁ దాఁకి తనదు, గర్భమునఁ జొచ్చినట్లు లక్కల తెలుంగు.

వ. ఇట్లుత్తలోదరి కలగాంచి యల్లన మేల్కని యక్కల నిక్కము తనపతికిం జెప్పి పద
పడి బంధుజాతమ్మున కెఱింగించిన శుభసూచకం బనుచు నెల్లరు నానందించి రదియు
నుం గాక.

* * * *

బుద్ధుని ప్రథమనగర ప్రవేశము

గీ. సురలు మోయు కలాచికోపరితలమున, జనని యొడికట్టులోపలఁ దనరునిసువు
సంజకెంజాయచాటున జనులచేతఁ, జూడఁబడు బాలశశిరేఖ జాడఁ జెందె.

వ. ఇట్లు దిక్పాలనీతం బగుయానంబు కపిలవస్తుపురవీథిం జనుదెంచుసమయంబున నబ్బు
రంపుపౌరు లంద ఱాకస్మికంబగు తదుదంతంబు సాంతంబుగా విని ముందుఁ జని
శుద్ధోదనున కెఱింగించిరి.

క. కని శుద్ధోదనుఁ డానం, దనిమగ్నుండయ్యె దేవతలు మనుజులు నాఁ
గను భేద మించుకయు లేక, నియతమోదాతిశయము నందిరి పౌరుల్.

* * * *

బుద్ధుని భవిష్యకథనము

ఉ. నాపుడు రాజచంద్రుఁడు మనంబున నుబ్బుచు లేచి వెంటఁ గొం
పోవఁగఁ బోయి కాంచె మునిముఖ్యులబాలు దయావిశాలు నీ
రావసితాంగు జక్రకమలాంకితపాదుఁ గళావినోదు దం
తావళపుష్టికేసు జనతానుతరూపు నిరస్తపాపునిన్.

అజంతాచిత్తరువు - స్వర్ణపంజరబంధము

సీ. లలనయొసర్పు విలాసమ్ము లట్టిట్టు, జననీని సంకెల లనఁగరాదె, కను గానకిక పైపైననురాగంబు, గాఢాంధకారంబు గాఁపు టరుదె
పంజరస్థము లైనపక్షులు తనసాటి, బంధుల దుస్థితిఁబడయు టరుదె, చంద్రానిలాంగజుల్ జముదూతలంబోని, యపయులౌ బంట్రౌతులనుట తప్పె



గీ. ప్రణయకోపపరాజ్ముఖిఁ బడఁతిఁ దేర్పఁ, బడెడిపలుపాటు లన్నటిపనులకొంటె, నల్పములె యెన్నివిధములనైనఁ జూడ, బంధనాగారతుల్యంబు పడుకటిల్లు.

బుద్ధచరిత్రము— ఆ ౨. ప ౧౫.

చ. తొలఁగి భయమ్ము భక్తియును దోరముగాఁ గనుపట్ట, 'సవ్వరో!,
తెలియఁగలేవు గా కితని తేజము సర్వజనాభివంద్య, మి
య్యలఘుఁడు నమ్ముఁ డెల్లరకు, నారయు నీతని కెంత పెద్దవా
రలును నసమ్ము" లంచును గరమ్ములు మోడ్చి నమస్కరించుచున్.

చ. ఎనిమిదిసార్లు ధూళి గదియించి శిరమ్మున నంతఁ బోక య
య్యనఘుని యంఘ్రులందుఁ జెలువారెడు చిహ్నములెల్లఁ జూచి యిం
తని యనరానిమోదమున నమ్మహనీయుఁ గుఱించి దైవభా
వన దనరంగ నిట్లనె నవార్యములై పులక ల్జనింపఁగన్.

క. "బుద్ధుఁడవై జగముల కవి,రుద్ధంబగు జ్ఞాన మిచ్చి పోచుచును నసం
బద్ధపుమతములఁ ద్రుంచుచు, నిద్ధచరిత నెగడ బుట్టితీవు మహాత్మా!

చ. పరపర యొక్క కారణము భవదీయగృహం బదృష్టవ
త్తరమనియు న్వచించుట కిదం గడు సందియమందుచుంటి నె
వ్వరికిని జన్మ మన్నది ప్రపంచమునం గడు దుఃఖదం బటం
చరసినవారికి న్మరణమన్నను జంకు జనింపకుండెడిన్.

శా. ఏతాదృశమహానుభావునకు మాతృత్వంబు చేకొన్న స
త్పాతివ్రత్యగుణాభిరామవగు నీభామ ల్చ్యలిం బొందు టే
లా తప్పున్? విను నేఁటి కేడవదినంబందున్ భవత్కాయసం
పాతంబౌ నిఁక సౌఖ్యదుఃఖముల సంబంధంబు నీ కేటికిన్"?

మ. అని యయ్యోగి తనంతఁ దాఁ జనియె, మాయాదేవియున్ యోగిచె
ప్పినకాలంబునకున్ మృతిం గని జగద్వేద్యంబుఁగా దేవతాం
గన లెల్లం దనుఁ గొల్వ స్వర్గమున వేడ్క ల్మీలఁ గానెప్పె స
త్యనిధుల్ యోగులు సెప్పువాక్యము లవంధ్యమ్ము ల్గదా యేరికిన్:

*　　*　　*　　*

వధూనిరీక్షణము

శా. ఆసిద్ధార్థుఁడు తండ్రియానతిని శాంతాకార మేపార మే
లౌ సింహాసనమందు సొరలర నధ్యాసీనుఁడై వచ్చు క
న్యాసంఘంబులవంకఁ గన్గొనక యేయద్దాని నొక్కొక్కతెం
దా సత్కారము చేయఁ జీరలును రత్నా ల్మున్నుగా నిచ్చుచున్.

ఉ. ఆతనియొద్ద కేగి వినయమ్మున భీతకురంగలో యనం
గాతరరీతి సత్కృతులు గైకొని వెన్కకు నేగుకన్నెలం
జేతము పల్లవింప నృప చెంతవసించుజను లున్నతింత్రు గా
నీ తనచిత్తమం దయిన నించుక రాసుతుఁ డెంచఁ డొక్కతెన్.

సీ. భ్రమరసమూహంబు పక్కగట్టినరీతి, జడ మడమలదాఁక సాఁగి యాడఁ,
బద్మేషుచాపంబుపై మణుల్తాఁపిన, సౌరున మేన భూషలు చెలంగ,
నిసుమువెన్నియలపై నివము వాల్చినభంగిఁ, గటిసీమఁ బావడ కళలసీనఁ,
జక్రమ్ములకు నిత్యసంగతికై యుపాయ మొనర్చె నన రైక యటనెసంగ,
గీ. మోమునఁ బతివ్రతాత్వంబు మొలక లెత్త, సభ్యులకు మాతృభావంబు చాకళింప,
ధ్యాననిశ్చలుఁ డైన యాతని యెదుటకు, వచ్చి నిల్చె యశోధరావారిజాక్షి.

ఉ. పచ్చలహారమిల్లు నరపాలసుతుం డవలగ్నసీమపై
నచ్చపలాక్షి కిం పొదవునట్టులు చుట్టిన యంత నామెకున్
హెచ్చె నృపాలసూతిపయి నింతన రాని మనోరథంబు పే
రచ్చెరువంది రందఱు నరాధిపుఁడు న్వని సంతసింపఁగన్.

శా. ఆరామమ్మునఁ గేళికాభవన మాహర్మ్యంపుఁగుడ్యంబునం
దారన్ వ్రాసిన బంధచిత్రములు నాయాచోట్ల మారాగమ
శ్రీ రాణింపఁగఁ జేయు కీరముఖపక్షిశ్రేష్ఠముల్ నృత్తగీ
తారూఢిం గడు నాటతేటఁ దగు వేశ్యల్లగ్గల సంధింపుచున్

సంసారస్వర్ణపంజరము

క. ఆకేళీసదనమునకుఁ, బ్రాకారము లొక్కమూఁడు పచరించి యయు
శ్శ్రీకకవాటదృషద్వా, రాకలితమ్ములుగఁ జేయు నట్లొనరించెన్.

* * * *

నగరసందర్శనము

చ. సిరిచెడి బిట్టువంగిన కసేరుకయుం గనుతెప్పలుం బర
స్పరము గదించు మైవళులు పాతరలాడు శిరంబు సర్వము
న్నరసిన కర్ణలోమము లణంగినపిక్కలబల్మి మోమునం
దొరఁగెడిలాలగల్గుముది తొక్కను గాంచెఁ గుమారుఁ డొక్కెడన్.

* * * *

ఉ. రూప మడంగు బుద్ధియును రూపఱు దేహబలంబు క్రుంగు సం
తాపముహెచ్చు నాశలును దామరతంపరలై జనించు వి

ద్యాపటిమంబు తగ్గు విష।యంబులుఁ బొల్పు దేనిప్రాపునం
దాపరమయ్యెనా జరయ।నందగు రోగ మొకండు వీనికిన్

*   *   *   *

క. చవి యెఱుఁగమి నింద్రియపా, టవమును లేకుంట సంస్ల।డంగుటయును ము
న్నన్ని విధములు దలఁపఁగ రెం,డవ బాల్యము సుమ్ము ముదిమి। యవనీంద్రసుతా!

ప్రబోధము - విషాదము

క. అన విని బుద్ధుఁడు చిత్తం, బునఁ గూరిన వంత పేర్మి।బోఁబోరి నాలో
చన మొనరుచుచుం జనియె స,దనమునకుం బనివి పనివి।తత్తర మొలయన్

*   *   *   *

మ. తరుణీపాశమునం దగుల్కొనక స।త్యజ్ఞానసంపన్నుఁడై
తరణోపాయముఁ జూడఁగావలయుఁ ద।త్త్వం బింతియే కాని యు
క్కురశిం దండముఁ గాషిచేలములు నే।కాలంబునం దాల్చుచున్
శిరముం బోడిగ యొనర్పఁ గారణ మొగిం। జెప్పంగదే నా ప్రభున్.

*   *   *   *

గృహభార్యావిసర్జనము

క. వెనుదీయు మనము జ్ఞాన, మ్మునకుం దానకము చేసి।పూర్ణస్థైర్య
మ్మును జెందె యశోధరవం, కను దృష్టి నిగిడ్చి మిగులఁ।గరుణార్ద్రుండై.

గీ. ఆపె యవయవసౌష్ఠవ।మరసి యరసి, తనివిఁ జెందఁగలేక।నితాంతరాగ
గాఢవిజ్ఞానములు మదిఁ।గదిసి పోరఁ,దుదకుఁ బోనెంచి తద్రద।చ్ఛదము గాంచి.

మ. మృదులం బంచు నెఱింగియు న్నిను సము।న్మీలన్మనోజాగ్నిదా
హదశ న్నిర్దయబుద్ధినై ప్రతిపదం।బత్యార్తి నొందించు నా
యదయత్వంబు సహించి స్వీయ మగు రా।గాఢ్యత్వము న్వీడ కో
యధరం బా సెల విచ్చి పంపుము కృపా।యత్తైకచిత్తంబునన్.

గీ. మదిన హింసయ పరమధ।ర్మంబటంచు, గుఱు తెఱింగియు నిను గోన।గోటిపోటు
లం గలంచితి నన్న చ।లంబు విడిచి, సెల వొసంగుమ యోషుచ।సీమ నాకు.

గీ. ఎప్పు డేరస ముచితమై।యెసఁగు నప్పు, డారసమ్మున నాహృద।యమ్ముఁ గరఁచు
నీకు నాకు ఋణము తీఱె।నేఁటితోఁ గ,నుంగనా యాన తిమ్ము చ।నుటకు నాకు.

క. అని తత్తదవయవమ్ములఁ, గనికర ముట్టిపడ నడిగి కాంత విడిచి శ
య్యను డిగ్గి ప్రదక్షిణముం, బొనరించె నమ్మోఁడుసార్ల పూర్వాభిరతిన్.

క. నెయ్యంబునఁ దగుమామా, కయ్యములం దొదవుగాఢకష్టంబులు నీ
వెయ్యెడ నోర్చితి విఁకనో, శయ్యా! నిను వీడెదను సెసంగుము సెలవున్.

సీ. అనవరతంబుఁ దియ్యనిపల్కులం బల్కి, ముదము గొల్పెడి కీరముఖ్యులార!
గాఢాంధకారంబు గలఁచి సంతతదీప్తిఁ, బరఁగించు రత్నదీపంబులార!
యనుపదంబును మమ్మునంతరమ్మున దాల్చు, తలతలనిల్వుటద్దమ్ములార!
పరిచారికలభంగిఁ బరిచర్య సల్పుచుఁ బొల్పారు జంత్రంపుబొమ్మలార!

గీ. యరమర యొకింత లేక కాయమున మైత్రి, దనర వాసించు మేల్సుగంధమ్ములార!
తక్కుఁ గల్గిన యోపదార్థమ్ములార! పనివి దయయుంచి నన్నింకఁ బంపుడమ్మ!

* * * *

వస్త్రా హా న వి స ర్జ న ము

ఉ. ఈవలయమ్ము లెంతకును హెచ్చు లనం దగదే ప్రశస్తను
శ్రీ వెలుఁగొందు నీమణుల చేరులు గాంచితె? వేయునేల నా
నావిధభూషణంబు లివి నా కిడె మజ్జనకుండు పిన్ననాఁ
డీవు ధరింపు మీ యిఁక మ జేటికి నా కిట సన్న్యసించితిన్

క. ప్రాణమునకంటె హె చ్చిది, దీనిం దీసికొని వేగఁ జెరలిచను మ టం
చానృపనందనుఁ డశ్వము, పై నెంతయుఁ బేర్మిఁ జూపి పదపడి యనియెన్.

శా. చెన్నా! మజ్జనకుండు నాకయి కడుం జీర్ణించు శోకంబు నా
పన్నేరం డెటులేని శీఘ్రముగ నే వత్తున్ బరిజ్ఞేయమై
యెన్నంగాఁ దగువస్తువ్రం దెలిసి నీ వీమాటలే తెల్పి త
ద్ఘృన్నిరేజము సంతసంబుఁ గనున ట్లెల్లేని సంధింపుమా.

మ. అటు లా చెన్ననిఁ బంపి చేరె నటసిద్ధార్థుండు స్వర్గంబు మా
ఱట నాఁ జెన్నగు బింబిసారుపురికిం బ్రాంతంబునందుం గురు
ట్పటలీ పక్వఫల ప్రసూననిచయ ప్రచ్ఛాయధారాలల
త్తటరమ్యోన్నతరత్ననామకకుభృ ద్దర్యంతరాళస్థలిన్

# గ్రంథస్వీకారము

## సోమనాథవిజయము

నోరి నరసింహశాస్త్రి గారు బి. యే. (సాహితీ సమితి) తెనాలి.

ఈగద్య నాటకమున మహమ్మద్ గజ్నవీ సోమనాథాలయమును ముట్టడించి నాశనముచేసిన కథ వర్ణింపబడినది. వ్యావహారిక భాష అంతటను ఉపయోగింపబడినది. సోమనాథుడు, మహంతు, గజ్నవీ మొదలగుపాత్రములను నాటకరచయిత చక్కగ పోషించెను. ఇస్లాం మతము యొక్క యాత్కృష్ట్యమును ఆర్యమతమునందలి భక్తిని రసవంతముగ గ్రంథకర్త యభివర్ణించెను. రవీంద్రునిఛాయలప్రయత్నముగ గ్రంథమున దొరలినవని గ్రంథకర్త భయపడ నవసరము లేదు. అట్టిఛాయలు మాకు గోచరింపలేదు. గ్రంథముద్రణము ముద్దులు మూటగట్టుచున్నది.

* * * *

## భారతీయకళాసంప్రదాయసంగ్రహ చరిత్రము

ఆనందకుమారస్వామిపండితవిరచితము. దివ్యజ్ఞాన ప్రచురణాలయము, అడయార్, మద్రాస్ వెల రూ 0-8-0

ఈ చిన్నిపొత్తమునందు భారతీయకళాసంప్రదాయముల చరిత్రసంగ్రహము తెలుపబడినది. ఆనంద కుమారస్వామిపండితులనాడు భారతీయకళలపై రచించిన యుద్గ్రంథముల సారాంశము సంగ్రహముగ నిందు బొందుపరుపబడినది. భారతీయకళాభిజ్ఞులమతమున భావనివేదనమే కళల పరమార్థమనియు, ప్రకృత్యనుకరణ మెన్నటికిని కానేరదనియు భారతీయశిల్పి యెల్లప్పుడును నిజభావసాక్షాత్కారము నాశ్రయించియే శిల్పసృష్టికావించుననియు, ప్రకృత్యనుకరణసంప్రదాయము పాశ్చాత్యసంసర్గజనితమనియు స్పష్టముగ నానందకుమారపండితులు నిరూపించిరి. గ్రంథమునందు శిల్పచిత్రకళలకే యెక్కువ ప్రాధాన్య మొసగబడినది. భారతీయకళలనుగూర్చిన యుద్గ్రంథములను చదువ నెంచువారికీ చిన్ని పొత్త మెంతయు సహకారి కాగలదు.

---

# పత్రికాస్వీకారము

## శారద

కాతా శ్రీరామశాస్త్రిగారిచే మచిలీపట్టణమున ప్రకటితము.

శారద ఈ సంచికతో "ప్రథమవత్సరము నతిక్రమించి ద్వితీయవర్షమున బ గార్పణం బొనర్చు" చున్నందు కెంతయు సంతసించుచున్నాము. అమితవ్యయప్రయాసల కోర్చి ఈపత్రికను ఉత్తమాదర్శానుగుణముగ నడుపుచున్న శ్రీరామశాస్త్రిగారెంతయు నభినందనార్హులు. పత్రిక చిరస్థాయి గను గాక యని యాశించుచున్నాము. ఈసంచిక మణీంద్రభూషణగుప్తగారిచేరచింపబడిన "పూజ" యను, చిత్రముతోడను, రమేంద్రనాథ చక్రవర్తిగారిచే రచింపబడిన "తాటిచెట్లు" అను చిత్రముతోడను, గాంధారశిల్పమునకుసంబంధించిన బొమ్మలతోడను, విజ్ఞానవిషయకములగు చిత్రములతోడను, ఆర్మీనియనుల జీవిత వ్యవహారములను ప్రదర్శించు చిత్రములతోడను నొప్పుచున్నది.

వివిధవిషయములకు సంబంధించిన వ్యాసము లనేకములు కలవు. ఉన్నవానిలో నెల్లనడింపల్లి జగన్నాథరావు పంతులు గారిచేరచింపబడిన "చేజర్ల చరిత్ర" మను సచిత్రవ్యాసమును, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారిచే రచింపబడిన "నన్నయకు పూర్వము పద్యములుకలవా?" యను వ్యాసమును, మామిడిపూడి వేంకటరంగయ్య యం.యే. గారిచే రచింపబడిన "ఆర్యులు, దస్యులు, ఆంధ్రులు" అను వ్యాస

మును, వేమూరు దుర్గా నాగేశ్వరరావు గారుబి.యే.యల్. యం. యస్ గారిచే రచింపబడిన "మహోదరము కడుపులోబల్ల Liver Enlargement" అనువ్యాసమును, కవిపురపు వేంకటఅప్పారావు గారిచే రచింపబడిన "భారతలోహపరిశ్రమ" అను వ్యాసమును, బుర్రా శేషగిరిరావు పంతులు యం. యే. గారిచే రచింపబడిన "జైనదర్శనము ముక్తితత్త్వము" అనువ్యాసమును ప్రత్యేకప్రశంసార్హము లు. ఈసంచికయందు ప్రకటితములైన పద్యకావ్యములలో నెల్ల నీ క్రిందిఖండకావ్యములు రసవంతములై యొప్పుచున్నవి: (1) "బాలతోనే కాలమును గడపేమురా" అధికార్ల సూర్యనారాయణరావు గారు (2) "బాటసారి" జంధ్యాల వేంకట శివకవులు (3) "ఆహ్వానము" వేలూరి చంద్రశేఖరశాస్త్రి గారు (4) "స్వాగతము" పెమ్మరాజు లక్ష్మీపతి గారు (5) "హేమంత యాత్రికుడు" శేషాద్రిరమణ కవులు. పత్రికాముద్రణము క్రొత్తముద్రణశాలయందు జరుగుటచే కాబోలు, ప్రూఫ్ తప్పులు విశేషముగ దొరలియున్నవి. పత్రికాధిపతు లీవిషయమున తగినంత శ్రద్ధవహించినచో పత్రికయొక్క విలువ అతిశయింపగలదని మా విశ్వాసము.

---

చెన్నపురి రాజధానియందు 1923 వ సంవత్సరము ఏప్రిల్, మే, జూను నెలలో ముద్రితములై ప్రకటింపబడిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక

## నాటకము

అహల్య:—మల్లాది అమృతరామశాస్త్రి
స్త్రీసాహస నాటకము:—
నిరంకుశనాటకము:—రాళ్ళ బండి చినకోటమరాజు
విశ్వనాథ విజయము:—భూతపురి నారాయణస్వామి
శాకుంతల నాటకము:—
రోషనారా శివాజీనాటకము:—ధర్మవరం రామకృష్ణమాచార్యులు
దుర్గాదాసు:—జే. శివన్నశాస్త్రి
కాశీవిజయము:—సుసర్ల రామమూర్తి
శ్రీకృష్ణలీలాశుకము:—కొంతి గంగాధరరామశాస్త్రి
సావిత్రి నాటకము:—శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి
రామదాసునాటకము:—డి. గోపాలాచార్య
తులసీదాస్:—గోడాలి సత్యనారాయణరావు
సంపూర్ణ రామాయణము:—మల్లాదిగోపాలకృష్ణశాస్త్రి
గోవిందం:—ద్రోణంరాజు సీతారామరావు
సుమతీదేవి:—బద్దిరెడ్డి కోటేశ్వరరావు
మాయ సన్న్యాసి:—
వైరాగ్య చింతామణి (మొదటిభాగము):—
రాజలక్ష్మి:—
హరిశ్చంద్రమహారాజు నాటకము:—టి. లక్ష్మణాచార్య
సీతాకల్యాణము:—కోలాచలము శ్రీనివాసరావు
సత్యాభామ:—బాలకవి జమ్ములమడక
ప్రహ్లాదనాటకము:—బి. సుబ్బకవి
సంగీత గులాబకావళి:—చక్రావధానుల మాణిక్యశర్మ
రోషనార:—కొప్పరపు సుబ్బారావు
వారకాంత:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
గర్వభంగము:—అయినపురపు సుందరరామయ్య
ప్రతిజ్ఞాయాదవము అను సాంబవిలాసము:—
జానకీ పరిణయ నాటకము:—గుండుప్రాడి సుందరరామయ్య
సంపూర్ణ భారతము:—పింగళి వెంకట నరసయ్య
ఉక్కీసులో ద్వాహము:—ఇక్కుర్తి తిరుపతిరాయడు
పాండవాజ్ఞాతవాసము:—గూడూరు వెంకట శివకవి
డంకాపలాస్:—కే. వెంకట సుబ్బారావు
టోపి
సభాభంగము:—కుండేరు వేంకటేశ్వరరావు

## జీవిత చరిత్రము

కబీరుదాసు చరిత్రము:—సీరిపి ఆంజనేయులు

(భద్రగిరి) రామదాసు:—వెలగపూడి దాసయ్య

శ్రీరామ తీర్థ స్వామి:—చెరువు రామకృష్ణరావు

క్లైవుచరిత్రము:—గోదావరి సత్యనారాయణ

శతకకవులచరిత్ర:—వంగూరి సుబ్బారావు

హిందూదేశ చరిత్రము రెండవపుస్తకము:--వి. నటరాజన్

## కథ

బేతాళ పంచవింశతి కథలు:—

నాలపల్లి (సంగుభవిజయం):—లెం. సం. ఉన్నవ లక్ష్మీనారాయణ

డిటో      మూ. సం.

దురంతమా!:—వి. యస్. శర్మ

జయచంద్రవిజయము:—నిడమర్తి వెంకటనరసింహరావు

మీరాబాయి:—మహాకాళి వేంకటేశ్వరరావు

## జ్యోతిషము

జాతక మార్తాండము:—ఆకెళ్ల వేంకటశాస్త్రి

గణకానందము:—(సంస్కృతము) ప్రతిపదార్థసహితము

జాతకామృతసారము (సంస్కృతము) తెనుగర్థము:—చక్రవర్తుల శ్రీనివాసాచారి

## భాష

బాలరామాయణము:—హాసన్ బిన్ వాసుదేవరావు

జైమిని భారతవచనము:—ధూళిపాళ యజ్ఞనారాయణశాస్త్రి

బాలశిక్ష:—యమ్. యస్. హరిహరయ్యరు

ఆంధ్రాక్షరమాల:—యన్. నరసింహము

వ్యాసబోధిని:—నూతలపాటి పేరరాజు

Notes on Telugu Grammar:—పి. యస్. రామశర్మ

1924 వ సం॥ మార్చినెలలో జరుగబోవు లోయర్ ఎలిమెంటరీ ట్రేనింగుటీచర్సు సర్టిఫికేటు పరీక్షకు నియమింపబడిన డిటైల్డు తెలుంగు పుస్తకముల టిప్పణాదులు—యస్. రామయ్య

సావిత్ర్యుపాఖ్యానముసటీకము-(మహాభారతములోనిది)

బాలగీతావళి, మొదటితరగతి:-వేంకటపార్వతీశ్వరకవులు

రెండవ తరగతి పుస్తకము:—మ. వెంకటరత్నం కే. వీరేశలింగముగారులు

## వైద్యము

రసప్రదీపిక:—సర్వేపల్లి అప్పారావు

ధన్వంతరి విజయము:—చిన్నపైరాగియోగి

## ఇతర గ్రంథములు

సనకసనందనోపాఖ్యానము:—కడలి ఆదినారాయణ

చిన్నమ్మకథ:—కే. చెంగల్వరాజు

నల్లదొరతనము:—మసుమతర్లన్న

హాస్యపుపాటలు:—పల్లారి జగన్నాథరావు

కామమ్మకథ :—

వ్యభిచారిణి:—బద్దిరెడ్డి కోటేశ్వరరావు

లక్ష్మణమూర్ఛ పదము:—

ప్రహ్లాదనాటకోనునందకీర్తనలు:--పాపట్లలక్ష్మీకాంతము

నమ్మళ్వార్:—మానిడాల శ్రీనివాసాచార్య

మహనీయ చరిత్ర, శ్రీగిరి, కట్టైల తిప్పన్న:—పి. రామచంద్రశర్మ

రిప్పును స్త్రీశీపాకాలు:—న. పి. యస్. రావు.

సర్వేశ్వర నిర్యాణము:—

సత్యభామాసరసము:—

చిప్పకట్టు:—(గొంటెపుల్లయ్యగారి ప్రత్యుత్తరం నెం. 6.

శ్రీమదాంధ్రాంగ్ల వేదమాతృకా విజ్ఞప్తి:—యం. సుబ్రహ్మణ్యశాస్త్రి

వేశ్యాపురాణము:—పెద్దింటి వేంకటశాస్త్రి

నాచికేతోపాఖ్యానము:—లోలేటి వేంకటసుబ్బరావు

కలిమహిమ:—పి. వేంకటసుబ్బరాయశర్మ

ఆదిమాంధ్ర కీర్తనలు:—సుంద్రు వెంకయ్య

చంద్రకాంత చరిత్రము:—అయ్యగారి వీరభద్రదాసు

మగపోరు:—శోభనాద్రి వీరరాఘవులు

స్త్రీభూషణము:—గుండాల వీరాస్వామినాయుడు

మానవసర్మ చంద్రిక:—(సంస్కృతము) ఆంధ్ర టీకాసహితము

వాస్తుసంగ్రహము:—(సంస్కృతము)   డిటో

## వేదాంతము

వైరాగ్య తత్త్వములు:—బద్దిరెడ్డి కోటేశ్వరరావు

## పద్యకావ్యము

పరమార్థ దర్పణ మను గురునర్య శతకము:—కడలి ఆదినారాయణ

వేశ్యామృతము:—ద్దిరెడ్డి కోటీశర్వరావు
అలర్కోపాఖ్యానము:—బత్తు లలక్ష్మయ్య
శ్రవణానందము:—వరదా మంగయ్య
పాండురంగ మాహాత్మ్యము:—తెనాలి రామలింగకవి
చిత్రాశ్వనిచరిత్రము:—సరికొండ రామరాజు
చెప్పుదెబ్బ:—కొడాలి సత్యనారాయణరావు
శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము ద్వితీయసంపుటము:-
వావిలికొలను సుబ్బరావు
సుమతి శతకము:—
డిటో సటీకము
కర్ణామృత మను శృంగార పద్యావళి, ప్రథమభాగము:-
కలికాల సంసారసుఖము:—మాడభూషణం వేంకటవర
సింహాచార్యులు
కృష్ణవేణి:—కలచవీడు వేంకటరమణాచార్యులు
శాకుంతల:—త్యాడి వేంకటశాస్త్రి
కవిసూక్తి సుధానిధి:—
బాలరామాయణము (సంస్కృతము-సటీకము)

రా జ నీ తి

సకల నీతి సమ్మతము:—మడికి సింగనామాత్యుడు

మ త ము

ఏకాంతసేవా కథా నామకం బగు యక్షగానము:—
కుందుర్తి ఆదినారాయణశర్మ
అమృతాధారము:—ఏలెక్ జోన్సు
స్తుతిరత్నమాల:—శృంగారం అయ్యమాచార్య
ఆంజనేయ చరిత్రము, నూతన దండకమును, అర్థమును
గలది:—చేతపూడి భగవంతరావు
శ్రీమన్నందీశ్వర శతకము:—కణితి భాస్కరము
శ్రీకాశీవిశ్వనాథ శతకము:—శ్రీపతి భాస్కరశాస్త్రి
మీనాక్షీ స్తవము:—ములుగు చంద్రమౌళిశాస్త్రి
శ్రీరామనామ మాహాత్మ్యము:—చెంచురామకవి
దత్తాత్రేయ శతకము:—పి. చిదంబరశాస్త్రి
దేవమాత పూజిత నెల:—
భక్త విజయము:—నాలుగు భాగములు (సంపూర్ణ
గ్రంథము) కోయిల్ ధనాల దేవరాజదాసు
గంగానమ్మ దండకము:—
దేవకీనందన శతకము:—బొప్పట్ల హనుమంతరావు
చతుర్వాటీమాహాత్మ్యము:—బమ్మరాజు జానకిరామశర్మ

గజేంద్రమోక్షము (హరికథ):—ధూళిపాటికృష్ణకవి
భక్తార్తి ప్రకటనము:—కందుకూరు లక్ష్మీప్రసాదరావు
మతిబోధిని:—
మదనగోపాల విలాసము:—పోనూరు మృత్యుంజయ,
సుమిత్రాంబ
నోముల కథలు:—ఆరుభాగములు
ఉత్తరరామాయణము (హరికథ), ముష్టి రాజ్యలక్ష్మమ్మ
మిాలోకము, మాలోకము:—చిట్టమూరు రామయ్య
రెండవమైలు:—జే. జి. బెన్నెట్, కే. డేవిడు స్యాంసను
శ్రీమదగస్త్యేశ్వరదండకము:—చింతపెంట శంకరనారా
యణబ్రహ్మ
కృష్ణశతకము:—మాదేటి సన్యాసయ్య
సీతారామస్వామికల్యాణదండకము:—సద్దిపర్తి సన్యాసిరాజు
భద్రాచల మాహాత్మ్యము, వచనము:— పి. సీతారా
మానుజాచార్యులు
శివపురాణము, రెండవ సంపుటము, (వచనము):—
వేంకట పార్వతీశ్వరకవులు
శ్రీశైలమాహాత్మ్యము (వచనము), స్కాందపురాణాంత
ర్గతము:—యస్. వి. రాఘవయ్య
గోపాలశతకము:—సత్యవోలు సోమసుందర కవి
కృష్ణశతకము:—యమ్మనూరు సుబ్రహ్మణ్యేశ్వరకవి
శ్రీరామహృదయము:--దూర్వాసుల నరహరనరసింహము
ఆంజనేయశతకము:—పంతుల వేదమూర్తి
శతకత్రయము (రామకృష్ణ):—తాడంకి వేంకటదాసు
శ్రీరామచంద్రశతకము:—నేహూరు వేంకటకృష్ణశర్మ
పార్థసారథిశతకము:--మేడేపల్లి వేంకటరమణాచార్యులు
శ్రీకృష్ణలీలా తరంగిణీ, ప్రథమస్తరంగః, (సంస్కృత
ము):—చాకిచర్ల బ్రహ్మయామాత్య.
నీతిశాస్త్రము:-(సంస్కృతము)ఆంధ్రతాత్పర్యసహితము
నిత్యపితృతర్పణము:—(సంస్కృతము):—డిటో
సంధ్యావందనము (సంస్కృతము)—డిటో
శ్రీలక్ష్మీ నృసింహస్తోత్రము (సంస్కృతము)—శ్రీ శంక
రాచార్య. సాంధ్రతాత్పర్యము
శ్రీమత్కన్యకాపురాణము:—భాగము, తెనుగు టిప్పణి

ప త్రి క లు

శ్రీశైలపత్రికా:—వీర,మల్లికార్జునలింగయ్య

బుద్ధుని సంసారవిసర్జనము



మ. ఒకనాం తేనను సంశయించుచు సముద్యుక్తప్రయత్నుం డెందు వే, లోకనాం తేప యాత్రాస్థితిం గను నియతోద్యోగస్థు వాటించు వె
న్కనుఁ దోఁతెంచుట కిచ్చగించు నను సన్న్యాసార్థియే యౌనుగా, కటకటా యొవ్వాని కేని శక్యమగునా యర్థాంగి వర్జింపఁగన్? —బుద్ధచరిత్రము ఆ. 3. ప. ౬౯.

లక్ష్మీ ఆర్టు (ప్రెస్సు)—బొంబయి.

## బుద్ధుని మహాత్యాగము



వ. అనిలిన ముష్ణవారి సఖా నాంచలప్రాంతరపూరుఁ జెక్కులంబడి దిగజారు నాల్కుదిగనంచి పదంబులు నాకఁబోకు

గీ ద్వ్యాసకము నీకు నాకు ఋణబంధము తీరెను నేఁటి కింక నీ పడినపరిశ్రమంబు పరిపక్వఫలప్రదమగు హరీశ్వరా.

బుద్ధచరిత్రము. ఆ. 3. ప. ౮౯

# సాభిప్రాయ విశేషములు

భగవదనుగ్రహానువలః గాంధిమహాత్ముని యారోగ్యము దినదినాభివృద్ధిని బొందుచున్నటులు వారి ప్రియపుత్రులు దేవదాసు గాంధి గారు తెలుపుచున్నారు. మహాత్ముఁడిపుడు లేచి తిరుగుచున్నాడు. వారు కొన్ని దినములలో సాసూను వైద్యాశ్రమమును వదలి విశ్రాంతికి బొంబయిదగ్గరనున్న అంధేరికి బోవుచున్నారు. గాంధిమహాత్ముని ప్రాణములనుగాపాడిన కర్నలుమాడకు పుణ్యాత్ముఁడు. మహాత్మునకు నివాసాశ్రయమైన సాసూనువైద్యాశ్రమము పుణ్యక్షేత్రము. గాంధి మహాత్ముని సాంగత్య సంభాషణముల లాభము ననుభవించిన వీరి పుణ్యామే పుణ్యాము. జనవరి 17 వ తేదిని మహాత్ముఁడు సాసూను వైద్యాశ్రమమునందు ప్రవేశము గాంచెను. ఫిబ్రవరి 5 వ తేదిని మహాత్మునకు బంధవిమోచనము గలిగినది. మహాత్ముఁడు ప్రవేశించిన శుభ ముహూర్తము నుండియును సాసూనువైద్యాశ్రమము పుణ్యక్షేత్రమైనది. ప్రపంచదృష్టి సాసూను వైద్యాశ్రమమునందు లగ్నమైనది. ఈ వైద్యాశ్రమమునందు నివాసమును గైకొనిన దుర్బల కల్యాణమూర్తిమీదను ప్రేమ కాంతులు ప్రసరించినవి. మహాత్ముని యారోగ్యప్రాప్తికి ప్రార్థనలు చేయబడినవి. అభిషేకార్చనలు సలుపబడినవి. దానధర్మము లొసంగబడినవి. ధర్మమూర్తికి ప్రజలు జాతిమతభేదము లేక ప్రేమాంజలులను సమర్పించిరి. నాయకులు, సామాన్యులు, సాసూను వైద్యాశ్రమవాసియైన గాంధిమహాత్ముని సందర్శించిధన్యులైరి. దేశభక్తకొండవెంకటప్పయ్యగారనుకంపాయత్తచిత్తులై సందర్శనసమయము నందానందాశ్రువుల సమర్పించిరి.ఆలిసోదరులు నెహ్రూ, దాసు, శాస్త్రి, లాలా, కిచ్లు, కెల్కారు, శ్యాంకరు, బజాజు, ఆండ్రూసు, ఆచారి, మొదలగు మహానుభావులు మహాత్ముని సందర్శించి కృతార్థులైరి. మూలమూలనుగల భక్తులు ప్రేమాంజలుల నర్పించి బ్రహ్మానందము ననుభవించిరి. లోకమంతయును గాంధి విజయధ్వానములతో నిండినది. విశ్వవ్యాప్తములైన విజయధ్వానములకు ఫలమవశ్యము ప్రపంచమునకు గలుగగలదు. ఆ మహాఫలము ననుభవింపగల సాధనము సాధకుల హస్తములందే గలదు.

గాంధిమహాత్ముఁడు ప్రపంచ శాంతికిని ఆత్మకల్యాణమునకును సనాతనమైన యహింసాధర్మము ననుగ్రహించెను. త్రికరణశుద్ధిగ నహింసాధర్మానుష్ఠానమును జేయగలభారము సాధకులమీద గలదు. లోకకల్యాణప్రదమైన స్వరాజ్యానుభోగముసకలరాజ్యములకునుసకల జాతులకును వ్యక్తులకును సంఘములకును అహింసాధర్మానుష్ఠామునందే సాధ్యముగా గలదు; అహింసాధర్మసంస్కారముగల భరత

ఖండమునందుసయితమీధర్మము లుప్తమై నది. ఆయుధబలమున కభ్యస్తమైన రాజ్యము నందీస్థితి గలుగుట సహజము. బ్రిటిషు ప్రభుత్వాధికారు లనవరత మాయుధములను మెఱపించెడి దేశమునందు ప్రజల హింసాధర్మానుష్ఠానమును జేయుట దుస్తరము. దుస్తరమైన యహింసాధర్మారాధనమును జేయుటకు నిర్మాణకార్యక్రమ మవసరం బగుచున్నది. రాట్నపు రోగమునందహింసా యోగాభ్యాసమున కవసరమైన సాధనములు గలవని యనుభవజ్ఞులకు దెలిసియున్నది. గాంధి మహాత్ముడు మౌలానా మహమ్మదాలీగారి ద్వారా ప్రజలకంపిన సందేశమునందును అకాలి జథాకు బంపిన సందేశమునందును చిరకాల పరిచితమైన ధర్మమునే మహాత్ముడు తిరిగి ప్రజలకుపదేశించెను. అధికార హృదయమునందు మార్పుగలుగ లేదని నిత్య వ్యవహారములు విశదము చేయుచున్నవి. మహాత్ముని విమోచనము, శాసనసభల చర్యలు, అకాలీల మీద గుండ్ల ప్రయోగములు, అధికారుల ప్రసంగములును, ప్రభుత్వహృదయమును విస్పష్టము చేయుచున్నవి. ఈ స్థితియందు దేశ విమోచనమునకు సహాయయోగము శరణ్యమో అసహాయయోగము శరణ్యమో మహాత్ముని హృదయమునకు సహజముగను దెలిసియున్నది. ఆ ధర్మమునే పండిత మోతిలాలు నెహ్రూగారికిని లాలా లజపతిరాయిగారికిని మహాత్మునకును జరిగిన సంప్రతింపులందు మహాత్ముడు సమర్థించినటు లూహింపదగి యున్నది. మహాత్ముని యభిప్రాయములు స్వరాజ్యపక్షనాయకుల కనుకూలములైనను ప్రతికూలములైనను స్వరాజ్యపక్షవ్యవహారములు దారి తెన్ను లేకనున్న విధమును శాసనసభా వ్యవహారములు తెలుపుచున్నవి.

* * * *

**శాసనసభలు**

మధ్యరాష్ట్ర శాసనసభయందు ప్రభుత్వము సంపూర్ణముగను పరాజయము నొందినది. స్వరాజ్యపక్షము నాలుగుబిల్లులను నిరాకరించి ప్రతిష్టంభనమార్గము నవలంబించుచున్నది. స్వరాజ్యపక్షము పదవులను స్వీకరించి ప్రభుత్వరథమును నడుపుటకు దోడ్పడుటకు నిరాకరించినది. కార్యనిర్వాహకవర్గము ప్రభుత్వమును యథాప్రకారము నడుపుచున్నది. గవర్నరు శాసనసభను నుపసంహారమును జేయునను వార్తలు వ్యాపించినవి. శాసనసభ నుపసంహారము చేసినను చేయకున్నను ప్రభుత్వరథము కుంటువడియైనను నడువగలదు. వంగరాష్ట్రమునందు రాజకీయ ఖైదీల విడుదలయందును ఇతర విషయములందును ప్రభుత్వము పరాజయము నొందినది. స్వరాజ్యపక్షబలము విశదమైనది. గవర్నరు దేశబంధు దాసుగారితో సంప్రతించిరి. దాసుగారు కొన్ని షరతులతో ప్రభుత్వరథమును నడుపుటకు సాయపడుట కంగీకరించిరి. ప్రభుత్వము దుర్బలయుతమైనను యథాప్రకారము సాగుచున్నది. బొంబయిరాష్ట్ర శాసనసభయందు జరిగిన యభిప్రాయవిభజనమునందు ప్రభుత్వమునకు నాలుగుసారులును సభ్యుల కయిదుసారులును విజయము

గలిగినను ప్రభుత్వము యథాప్రకారము నడుచుచున్నది. శాసనసభాప్రవేశానంతరము దాసుగారు ప్రకటించిన ప్రతిష్టంభనము సాధ్యము గాదని సభావ్యవహారములు విశదము చేయుచున్నవి. ధర్మబద్ధముగాని నిరంకుశాధికారవర్గము సభలప్రమేయము లేకనే ప్రభుత్వమును నడుపగలదని విశదమగుచున్నది. బహిష్కారమొ సహకారమొ సాధ్యముగాని సహకారాసహకారము సాధ్యము గాదని విశదమయినది. రాష్ట్రీయశాసన సభలయందువలె సామ్రాజ్యశాసనసభయందును వ్యవహారములు యథాప్రకారము నడుచుచున్నవి.

*　　*　　*　　*

సామ్రాజ్యశాసనసభ

సామ్రాజ్య శాసనసభయందు విచిత్రస్థితి యేర్పడినది. స్వరాజ్యపక్షము స్వతంత్రపక్షముతో గలిసినది. పండిత మోతీలాలు నెహ్రూగారు ప్రతిపాదించిన రౌండుటేబిలు కాన్ఫరెన్సు తీర్మాన మధికసంఖ్యాకులచే నామోదింపబడినది. సర్ మాల్కము హెయిలీ ప్రభుత్వపక్షమున నసమ్మతిని దెలిపెను. స్వరాజ్యపక్షమువారిచే నామోదితమైన తీర్మానము నాచరణయందు బెట్టుటకు శక్తి లేదు. సామ్రాజ్యశాసనసభయందు 78మంది సభ్యులు రౌండుటేబిలు కాన్ఫరెన్సు కావలయునని నిర్ణయించిరి. ఈ విజయము స్వరాజ్యపక్షమునకును స్వతంత్రపక్షమునకును గలిగిన సంయోగము మూలముననను సమకూడినది. ఈసంయోగమే స్వరాజ్యపక్షసిద్ధాంతములను శిథిలము చేసినది. స్వరాజ్యపక్షనాయకులు చాటిన సంపూర్ణ ప్రతిష్టంభనోపాయము పదచ్యుతిని బొందినది. సమయోచితమైన సహకారాసహకారోపాయము ప్రబలుచున్నది. స్వరాజ్యపక్షమువారు రాజప్రతినిధి విందులను నిరాకరించినను శాసనములను ప్రతిఘటించినను నిరంకుశప్రభుత్వ మడ్డులేక సాగుచున్నది. శాసనసభలయందు ప్రవేశించుటవలనను స్వల్పలాభములు లభించుచున్నను కాంగ్రెసు కోరెడి స్వరాజ్యముమాత్రము సన్నిహితమగుటలేదు. స్వరాజ్యపక్షమునకును స్వతంత్రపక్షమునకును నేర్పడిన సంయోగము క్రమముగ శిథిలమగుచున్నది. రాజ్యాంగసంస్కరణముల దౌర్బల్యము విదితమైనను హెయిలీగారును ఆలివియరుగారును వానినే పట్టుకొని స్వర్గము నెక్కవలయునని బోధించుట విపరీతముగనున్నది. అసహజమైన పక్షముల సంయోగమును చెడగొట్టుటకు గారణములును వెడలినవి. ఆ కారణములందు భారతమంత్రి ప్రసంగమును-బడ్జెటునిర్ణయములును ప్రముఖములు.

*　　*　　*　　*

భారతమంత్రి

భారతమంత్రి మోర్లిప్రభువైనను మోంటేగుగారైనను పీలుప్రభువైనను సర్ సిడ్ని ఆలివియరయినను భారతదేశమునకు సమానఫలమే గలుగుచుండును. విక్రమార్కుని సింహాసనపు కథయే వ్యత్యస్తముగ జరుగుచుండును. విక్రమార్కసింహాసనాధిష్ఠానమౌదార్యమునకు సాధన మయినటులు మంత్రి

పదానుష్ఠానము సంకుచితమునకు సాధన మగుచున్నది. తత్త్వజ్ఞుడైన మోర్లీ ప్రభువు మంత్రియైనను ఫేబియనుసంఘసభ్యుడైన సర్ సిడ్నిఆలివియరు మంత్రియైనను నిరంకుశబంధనములు హృదయబంధనమును జేయుచున్నవి. ఈ స్థితిని మార్చుటకు మంత్రికి శక్తిలేదని ఆలివియరుగారి ప్రసంగము విశదముచేసినది. శాసనసభాంగీకృతమైన రెండు బిలులు కాన్ఫరెన్సు అసంభవమని మంత్రి విస్పష్టము చేసెను. శాస్త్రిగారపేక్షించిన రాయలు కమిషను సయితమసంభవమైనది. హెయిలీగారు సూచించిన యధికారవిచారణమె స్థిరపడినది. ఆలివియరుగారి నిర్ణయము శాసనసభ్యులకు రోషావేశమును గలుగజేసినది. కాని చేయునదేమియు లేకపోయినను ఆశాపాశము మాత్రము విడువలేదు. బెజంటమ్మగారి హోంమురూలు కన్వెన్షను యెండమావులను జూచి భ్రమించుచున్నది. మితవాదులు బెజంటమ్మగారి భ్రమయందు మునుగుటయును సహజముగ నున్నది. స్వరాజ్యపక్షమువారి యావేశము బడ్జెట్టు నిర్ణయములందు గనుపట్టునని ప్రబలమైన వదంతి గలదు. నిరీక్షణభేదము గల స్వరాజ్యపక్షమునకును స్వతంత్రపక్షమునకును బడ్జెట్టు నిర్ణయములందు సంయోగ మెంతసాధ్యమో కాలము తెలుపగలదు. బడ్జెటునిర్ణయములందు సర్ బేసిలు బ్లాకెటు ప్రయోగించిన సమ్మోహనాస్త్రము సభ్యులయందు సంభ్రమమును గలుగజేయుచున్నది.

* * * *

## బడ్జెటు అంచనాలు

ఆర్థికమంత్రికి బడ్జెటు అంచనాలను సరిపెట్టుట ఇంద్రజాలముగ నుండును. నిరుడు ఉప్పుపన్ను లేక సరిపోని యాదాయవ్యయము లీయేడు ఉప్పుపన్ను తగ్గినను సరిపోవుచున్నవి. బ్లాకెటుగారుప్పుపన్నును2-8-0నుండి 2-0-0కుతగ్గించుట కంగీకరించెను. బ్లాకెటుగారు నిర్ణయించినపన్ను నిలిచియున్న రాష్ట్రముల మొత్తమునుండి తగ్గింపబడునని అభయహస్తమొసంగియున్నారు. చెన్నరాష్ట్ర మొసంగెడి మొత్తమునుండియును 80లక్షలు తగ్గుటకు గల యవకాశ మెవరికి సంభ్రమమును గలుగజేయదు? ఈ యుప్పుపన్ను రాష్ట్రముల ప్రతినిధులందు భేదాభిప్రాయమును గలుగజేయగల విధమును సర్ చార్లెసు టాడుహంటరుగారి దీర్ఘప్రసంగము విశదము చేసినది. చెన్నరాష్ట్ర యాదాయవ్యయములందు విశేషములేదు. ఆదాయవ్యయములను సరిపెట్టుటకు జేసిన ప్రయత్నములనే కోశాంగమంత్రి విశదము చేసెను. గతసంవత్సరనికరాదాయము౧౬౯౯ లక్షలు. వ్యయము ౧౬౪౦ లక్షలు. రాగలసంవత్సరము ఆదాయము ౧౬౭౯లక్షలు, వ్యయము ౧౬౬౦ లక్షలుఅని మదింపు వేయబడినది. అన్ని శాఖలును పోషణము లేక కృశించిన విధమును బడ్జెటుపరిశోధనము విశదముచేయుచున్నది. కాని మందుమాత్రము ఉప్పుపన్నును గాపాడుటయందు గనుపడదు. దుర్భరమైన సామ్రాజ్యప్రభుత్వవ్యయమునందే దేశప్రాణమును కృపజేయుచున్న జాడ్యము గలదు. గత సంవత్సరమునందు 129.52 కోట్ల

యాదాయము 192.90 కోట్ల వ్యయము. రాగలసంవత్సరమునందు 106.93 కోట్ల యాదాయము, 104.57 వ్యయము సామ్రాజ్యాదాయవ్యయములుగ మదింపు వేయబడినది. గత సంవత్సరము సైన్య వ్యయమునకు 65 కోట్లు మదింపు వేయబడినను 62 కోట్లు మాత్రమె వ్యయమైనది. రాగల సంవత్సరమునకు 60 కోట్ల సైనిక వ్యయము మదింపు వేయబడినది. బ్లాకెటు గారి ఇంద్రజాలమంతయును సైన్యవ్యయము లెక్కలయందు గనుపడుచున్నది. రాగల సంవత్సరపు 107 కోట్ల యాదాయమునుండి యును 63 కోట్ల సైన్యవ్యయమునకు వినియోగపడనున్నవి. ఈ యంకెలు చెప్పక చెప్పుచున్న విషయమువిూదను వ్యాఖ్యానమనవసరము. పాశ్చాత్యసభ్యత్వము ప్రపంచమునకు ప్రసాదించిన నవసరములం దాసుర సంపద్భాగ్యము ప్రధానముగ నున్నది. ఈ యాసురప్రసాదము సుందోపసుందవరముగ నాత్మవినాశనమునకు దోడ్పడుచున్న విధమును యూరపురాజ్యములచరిత్రము తెలియజేయుచున్నను ఆ రాజ్యములందు జ్ఞానోదయము గలుగలేదు. పాశ్చాత్యరాజ్యాధిపత్యముక్రిందను క్రుంగుచున్న భరతఖండమునకును నీదుర్దశ గలిగినది. భారతప్రభుత్వమున కగుచున్న యపారమైనసైన్య వ్యయమును నాసురబలాదాధనఫలమునె విశదము చేయుచున్నది. భారతప్రభుత్వము నిరీక్షణమును మార్చునంతవరకును ఉప్పుపన్నును తగ్గించినను ఇతరపన్నులను తగ్గించినను దేశమునకు శాంతిసుఖములు గలుగజాలవు. గాంధిమహాత్ముఁడీదృష్టి మారుటకె అసహాయోద్యమయోగమును అహింసాతత్త్వమును బోధించెను. రెండేండ్ల కారాగృహవాసానంతరమైనను ప్రభుత్వ నిరీక్షణము మారలేదని గాంధిమహాత్ముఁడు కనుగొనెను. జెయిటో ప్రాంతమునందు సంభవించిన అకాలీ మరణములు జలియన్వాలాబాగుహత్యలను సంస్మరింప జేయుచున్నవి. జలియన్వాలాబాగు హత్యలకువలె జెయిటో హత్యలకును ప్రతీకారము లేదు. ఈదుర్దశయందు సహకార మసంభవమని తెలియుచున్నను ప్రాతమార్గమునె యవలంబించుట దేశమోక్షణమునకు ప్రయోజనకరముగాదు. ఆలివియరు రెడింగు హెయిలి బ్లాకటుగారు లీపాటను పాడుటయందు విచిత్రము లేదు. దుఃఖానుభవము గల భారతనాయకు లీమార్గము నవలంబించుట విచిత్రముగనున్నది. ఇపుడైనను నాయకులు ప్రజలు గాంధిమహాత్ముని యాదేశముల నారాధించి దుఃఖనాశనమునకు సాధనమైన స్వరాజ్యవిజయమును బడయుటకు బ్రయత్నించుదురుగాక!

---

# గయ్యాళి యిల్లాలు

కో. నరసింహాచారిగారు

శ్లో. అనేక శతభాండాని భిన్నాని మమ మస్తకే,
అహో! గుణవతీ భార్యా భాండమూలం న యాచతే.



పాట:—

బుంగంటె బుంగకాదురా, బాపడా! బుంగ కరీ దివ్వరా॥
బుంగ కరీ దిచ్చి పోకుంటె నిన్నొక్క, అంగైన సాగనివ్వరా! బాపడా!
బుంగ కరీ దివ్వరా॥ బుంగంటె॥

రంగులమారి బుంగ, రాయివంటి గట్టి బుంగ
శృంగారమైన బుంగ, చేతి కింపైన బుంగ॥ బుంగంటె॥

బుంగ బుజాన బెట్టి పుక్కిట తమ్మ బెట్టి
రింగురింగు మని పోతే ఖంగుఖంగు మనునట్టి॥ బుంగంటె॥

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thumbu Chetty Street, G. T. Madras.

# విషయానుక్రమణిక

# చిత్రపటముల వివరము

రంగులపటములు— కృష్ణదేవరాయలు - అల్లసాని పెద్దన కవి, చిత్రకారుడు:—యస్. కే. వి. గోపాల్‌గారు; పశ్చిమకనుమలు - జలపాతము, చిత్రకారుడు: డా. రామారావుగారు, * మౌలానా ఆలి - ఉత్తర కీర్ణము 1, రాయగిరి కీర్ణము 1.

ఇతరపటములు—స్వామివివేకానంద, మధుకలశము, శ్రీశైలమునందలి శిల్పచిత్రములు, ఇతరచిత్రములును.

☞ పుట 92 "కృతార్థుడు" ఈపద్యము రెండవపాదములో 'సంతాన మిత్రబాంధవసమృద్ధి' అనుటకు మాఱుగా 'సంతానహిత బంధుజన సమృద్ధి' అని చదువుకొనునది.

---

* ఈచిత్రము భారతి 3-వ సంచిక ఆర్ష విచారమునకు సంబంధించినది.

కృష్ణదేవరాయలు - అల్లసాని పెద్దనకవి.



" సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి, కేలూఁత నొసఁగి యెక్కించుకొనియె, ........" — అల్లసాని పెద్దన - ఆంధ్రకవితాపితామహుఁడు.





చెన్నపట్టణము, ఏప్రెలు ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము చైత్ర మాసము సంఖ్య ౪.


# ఉగాది

## రక్తాక్షిసంవత్సరము


శ్రీయుత చిల్లరిగె యోగానంద కవిగారు (యోగానందరామాయణకృతికర్త)


ఆంధ్రవత్సరమా యేల యాగ్రహంబు?
సాంద్రగుణరత్నమా యేల సందియంబు?
సాంద్రగుణరత్నమా యేల సంశయంబు?
ఇంద్రలోకేంధ్రభారతీయేంద్రులేని,
యాంధ్రలోకేంద్రభారతీయేంద్రులేని,
నీకు నమ్రులై యుందురు వాకు లేల,
కమ్రచరితను విందురు గాథ లేల,
వినుతి ప్రణతులు గావింత్రు వింత లేల,
సకలపూజలు గావింత్రు శంక యేల,
అమ్మ! కనవమ్మ! రక్తాక్షి వయితి వేల,
మమ్ముఁ గనవమ్మ! యమ్మ! కోపమ్మ దేల,
చిమ్మచీఁకటి మాకు బల్ క్రమ్మెనమ్మ!
యెమ్మెయెమ్మెయిఁగాంతు మోమెఱుఁగమమ్మ!

నెమ్మి నేనెఱిఁ గాంతునో చుమ్మి యమ్మ!
పాదపూజ లొనర్తుము భరతమాత
కమ్మనీకట్టు కట్టులు వమ్మొనర్ప
దేవదేవుని నర్థింతు మో వినూత్న
వత్సరాంచిత మాత! మావలన నేవి
లోటు లగపడ్డ నీయెడ్డలోఁ దలంప
కమ్మ! రక్తాక్షి వై యుండి యభయమిడుమ
నూత్ననింబకుసుమయుతానూనచూత
నవశలాటుఖండోపేత భవికగుడసు
మిళితతింత్రిణీరసరసామృతము నీకు
దివ్య నైవేద్య మొనరించి తిందుమమ్మ!
గోకి గోకిలే యని పురికొల్పి తెల్పి
తిలక తిలకాయటం చెదఁ దెలిపి కొలిపి
కలిపి ప్రేముడి నిలిపితి కడుపునందుఁ
గాలచక్రాకృతిస్ఫూర్తిఁ గ్రాలుదమ్మ!
గాఢయశ మిద్ది మూఁడవ గాంధిశకము
కనులపండువు సలుపంగఁ గాంచవమ్మ!
యలుక యేలమ్మ! దక్షిణాంధ్రాబ్దదేవి!
కొమరులను గట్టేఁడు ల్పరుల్గోపధనులు
గోడుపఱచుచునుండి రన్గోల వింటె
కంటినీరిడి నల్పితే కన్నతల్లి!
కన్నులెఱుపెక్క నేమమ్మ! చెన్ను తోఱఁగి
చెన్నుమీఱెడి ప్రేముడి సెప్పనేల
చెప్పకయ చెప్పుచున్న నీచొప్పెఱింగి
దొరలు కరఁగరు నెఱుఁగరు పరఁగ రమ్మ!
దొరలుకన్నీరు మున్నీరు పఱపకమ్మ!
కవిత గలిగిన కవివరుల్ కవితకొఱకు
ధనము చెలఁగిన ధనిమణుల్ ధనముకొఱకు
బుద్ధి పరఁగిన మునిఘనుల్ బుద్ధికొఱకు
నొండొరుల మీఱునట్టు వే ఱుండునట్టు
పట్టుపట్టినయట్టును బరఁగి కలన
డీకొనుచునుండి రజ్ఞానవాకు లాడి
యనుచు నెఱఁగింప రక్తాక్షి వయితివమ్మ!
వాఁడిచూడ్కులఁ జూడకు వేఁడికొందు
గ్రోధనవు గాఁగనుండియుఁ గ్రోధనతను
గనకుమా మాత! యక్షయాఖ్యను బ్రజాలి
సౌఖ్య మక్షయముగఁ జేయ సంస్తుతింతు.

---



# విహంగవిమానము

వేంకట పార్వతీశ్వర కవులు

క. లలితకుహూకలరవమా! అల వనరమయింటివిందవగు కవివరమా!.
అలరు వసంతునిరాకం, దలఁపించెడి నీకు స్వాగతము! కోకిలమా!

## ప్రస్తావము

వసంతాభ్యుదయ మైనది. శిశిరవికల మగు ప్రకృతి చిత్రచిత్రముగ సింగారించుకొని చిగురుగే లెత్తి జీవలోకము నాహ్వానించు చుండెను. వనరమామాధవుల వైవాహిక శుభసమయమున నఖిలజగంబును నానంద ప్రపూర్ణమై యుండెను. అప్పుడు విహంగ విమానమునుండి వివిధస్వరములతో విశ్వ గీతములు వినవచ్చుచుండెను. ఆమధురస్వరము లప్రయత్నముగ శ్రవణగోచరములై యంత రంగమునఁ బ్రతిధ్వనించి యనేకసంకల్పముల నంకురింపఁజేయుచుండెను. ఆభిన్నస్వరముల యేకీభావమే వసంతగానము. ఆభిన్నప్రకృతుల సముత్సాహ సమీకరణమే వసంతకల్యాణ మహోత్సవము. సమస్తబంధుమిత్రపరివారసమాకీర్ణంబగు నాకల్యాణమండపమే విహంగవిమానము.

జగముచుట్టమగు వసంతుని పెండ్లికి బంధువులుగాఁ జేరనివా రెవ్వరును లేరు. ఆతని కందఱును జుట్టములే. కాని, వారందఱును దమలోఁ దాము పరస్పరబంధులు మాత్రము కారు. అందు సజాతీయులును, విజాతీయులును, శత్రులును, మిత్రులును, సములును, విషములును గూడ సమావేశులై యుండిరి.

పురోహితుఁడగుపూర్ణకాముఁడు పుష్పాక్షతలను జల్లుచుఁ బవిత్రప్రణయమంత్రములను బఠనము సేయుచుండెను. వధూవరుల ప్రథమావలోకన సమయమునఁ బరస్పరహృదయములే కాక ప్రకృతి యంతయును బులకించి పోయెను. ఆయానందములో నాటలు,

పాటలు, వింతలు, వినోదములు, ముద్దులు, ముచ్చటలు జరిగిపోవుచుండెను.

కొందఱు రసజ్ఞులు పెండ్లిపాటల నాలకించుచుండిరి. కొందఱు విచక్షణులు పెండ్లి వేడుకలఁ దిలకించు చుండిరి. కొందఱు సమర్థులు పెండ్లిపనులలోఁ బాల్గొను చుండిరి. కొందఱు ముగ్ధులు ప్రకృతిచిత్రములకు ఱిచ్చపడుచుండిరి. కొందఱు విదగ్ధు లీశ్వరవిలాసములకు మెచ్చుకొను చుండిరి. కొందఱు వాచాలురు తర్కవితర్కములలోఁ దత్త్వమును మఱచిపోవు చుండిరి. కొందఱు క్రియాశూన్యులు లోకాభి రామాయణమున నిమగ్నులగు చుండిరి. ఇట్టి యనేకభిన్న ప్రకృతుల భిన్నభావము లన్నియు నీపెండ్లివేడుకలలో నలక్షితములై యుండెను.

భావప్రపంచమున విహరించు పరమహంసల నవలోకించుచున్న యొకకవికుల భూషణుఁ డప్పుడు పర్ణకుటీరాంగణమునఁ గూర్చుండి ప్రణయగానమునకు శ్రుతులను సవరించుకొను చుండఁగా నెలమావిచిగురు జొంపమునం దూఁగుచుఁ దూఁగుచు వసంత కోకిల పంచమస్వరంబున 'కుహూ! కుహూ! కుహూ!" అని పాడఁ దొడంగెను. ఆపల్లవిలోఁ భ్రమదావన మంతయుఁ బల్లవితమయ్యెను. ప్రసవమంజరు లన్నియును బరిమళించెను. ప్రకృతి యంతయును బరవశమైపోయెను. భావగానలోలుఁ డగుకవి యప్పుడు—

"ప్రసవరసమాను నెలదేఁటి పాటకంటె
ఫలరసముఁ గ్రోలు రాచిల్క పల్కుకంటెఁ
గనరుజేప్రురాకుఁ గసగాటు గా గ్రసించు
మత్తకోకిలరవ మింత మధుర మేమొ?"
అని భావింపఁ దొడంగెను.

ప్రదేశము—మధువనము.

ప్రవేశము—రసాలశాఖపైఁ జిలుక, గోరవంక.

చిలు—(మెడ ఱిక్కించి) ఆహా! ఏమి యీయమృతగానము!

గోర—ఔను. అది యీఫలరసము కంటెను మధురముగా నున్నదే! కాకులలోఁ బెరిగినదానికిఁ గలకంఠ మెట్లువచ్చినదో?

చిలు—ఎక్కడఁ బెరిగిననేమి, ఎవ్వరు పెంచిననేమి? అది దాని జన్మస్వత్వమే కాదఁటే!

గోర—అక్కా! నీకుమాత్రము కళాలాపత్వము జన్మస్వత్వము కాదా?

చిలు—ఇదిమెట్లు? పలుకులు నేర్చి నంతమాత్రమునఁ బాటలు పాడఁగలమా? మన మిరుపురమును గలాలాపలమే కాని కలకంఠుల మెట్లగుదుము?

గోర—మనముకూడ దానివంటి పక్షులమే గదా! ఆపాట మన మేల నేర్చుకొనఁ గూడదు?

చిలు—అది సహజముగఁ బుట్టవలయునే గాని నేర్చుకొనిన వచ్చునది కాదమ్మా!

గోర—మనము మాత్రము రసజ్ఞులము గామా? కోకిల నాశ్రయించినచో మన కీరహస్యము బోధపడు నేమో?

చిలు—కోకిల కెవ్వరివలన బోధపడినది? మనకు సహజముగా రసానుభవమే గాని, రాగగరిమ మెక్కడిది?

గౌర — ఫలరసము మాని మనము కూడఁ బల్లవసేవనముం గావించిన నేమగునో?

చిలు — సోదరీ! పుష్పాలలో మసలినంత మాత్రమునఁ దేనెటీఁగ తేఁటి కాఁగలిగి నదా? ఊరక యాసపడి చిగురుమేయుట కారంభించినచో నుగరుబిగువుచే మన కున్న పలుకుబడికూడఁ జెడిపోవును. కష్టపడి ప్రయత్నించినంతమాత్రమున మనము కలకంఠ లము కాఁగలమా?

(కోకిలమరలమృదుస్వరముతో కుహూ! కుహూ! కుహూ!)

(గొరవంక తత్తరములో ఱెక్కలనప్పళించుచు మెడఁగుంచి పైకిఁజూచుచు నటునిటుఁ దిరుగుచుండును.)

చిలు — (కిలకిల నవ్వుచూ) సోదరీ! ఈ యావేగ మంతయు నేమే!

గౌర — అక్కా! వినఁబడ లేదా? ఆ కోకిల మనలను బిలుచుచున్నది!

చిలు — చెలీ! ఎంతవెఱ్ఱిదానవే! అది మనవంకఁ జూడనైనఁ జూచినదా? పలుకరించి నట్లు పరాకుఁ దెలిపినట్లు ప్రత్యుత్తర మిచ్చి నట్లు ప్రబోధించినట్లు బహుభావములు దాని పాటలోనే యున్నవి.

గౌర — అక్కా! నీమాటలు నిజమేనే! చూడుము! తమ్ముఁ బలుకరించినట్లుగా దెసలు మాఱుపలుకు చున్నవి. తమకుఁ బరాకుఁ దెలిపినట్లుగాఁ దరుణవల్లికలు పల్లవాంచల ముల సవరించుకొను చున్నవి. తమకుఁ బ్రత్యుత్తర మిచ్చినట్లుగాఁ బక్షిసంతతు లన్నియును బ్రతివాదముఁ జేయుచున్నవి. తన్నుఁ బ్రబోధిరచినట్లుగాఁ బ్రకృతి యంతయును దన్మయ మగుచున్నది. ఆహా! ఒక్కపాటలోనే యిన్ని భావములా?

చిలు — అదియే బహుజన్మతపఃపరిపక్వ మగు ప్రతిభ! అట్టి యమృతవృష్టిచేతనే జీవ చైతన్యమంతయు నానంద విలసితమగుచుండు ను. అట్టి యమృతప్రభచేతనే జీవలోక మంతయు నా లోకరమణీయ మగుచుండును.

గౌర — ఆకోకిల నిట్లు పాడుమన్న వా రెవ్వరే!

చిలు — అది యొక్కరికొఱకుఁ బాడుట లేదు. ఉత్సాహము పొంగి పొరలినప్పు డది యూరక పాడుకొనుచుండును. దాని కెట్టి కోరికయును లేదు.

గౌర — లేకేమి? మన మందఱము నిట్లు మెచ్చుకొను చుంటిమి గదా! వన మంతయు నిట్లానందకందళిత మగుచున్నది గదా! దెస లన్నియు నిట్లు ప్రతిధ్వనించుచున్నవి గదా! జగమంతయు ని ట్లభిముఖ మగుచున్నది గదా! లోకమును మోహింపఁ జేయుటకుఁ గాకున్నచోఁ గోకిల కీపాట యేల?

చిలు — సోదరీ! నీవు పొరఁబడుచున్నావు. కొమ్మ లెవ్వరిమెప్పుకొఱకుఁ బల్లవించు చున్నవి? తెమ్మెర లెవ్వరిమెప్పుకొఱకు వీతెంచు చున్నవి? పువ్వు లెవ్వరి మెప్పుకొఱకుఁ బరిమ ళించుచున్నవి? ఫలము లెవ్వరిమెప్పుకొఱకు ఫలించుచున్నవి? ఆనందోచ్ఛ్వాసముచే నగుచుండు దీనిం జూచి యనుభవజ్ఞు లభినుతిం చుచుందురు. రసజ్ఞులు రంజిల్లు చుందురు. కోకిల పాటకూడ నట్టిదే.

గౌర—అక్కా! నీవు కవిత్వమును గూర్చి ప్రశంసించినట్లు ప్రశంసించుచున్నావే!

చిలు—కాదా మఱి! హృదయమును రసమయముగఁ జేయుపలుకుపొందికయే కవిత్వము.

(కోకిల—కుహూ! కుహూ! కుహూ!)

చిలుక—గౌర— (ఆనందపారవశ్యము నందును.)

కవిపరమానందముతో

సీ. ఆనందమయవసంతారామమోహన
దివ్యతేజంబుపై దృష్టి నిలిపి
ఆనందరాగరసామోదపల్లవ
మృదులపీఠంబుపై మేను నిలిపి
ఆనందరసతరంగాయితనవసుధా
మధురభావంబులో మనసు నిలిపి
ఆనందగుప్తమంత్రాధారపావన
ప్రణవనాదంబులోఁ బాట నిలిపి
అఖిల మానందపారవశ్యమున మునుఁగ
వాస్తవానందతన్మయత్వంబుఁ గాంచి
చల్లగా రాగవల్లరుల్ పల్లవింపఁ
గోయిలా! హాయిగాఁ బాడు కోఁగదమ్మ!

కోకిల—కుహూ! కుహూ! కుహూ!—

గౌర—(ప్రకృతిస్థయై స్మృతినభినయించి) అక్కా! ఈమధురగానమునకు లోక మంతయు నిట్లు మైమఱచిపోవుచుండఁగాఁ దన బిడ్డగా నెంచి పెంచికొన్నకాకి యీకోకిల నెట్లు తన్నివై వఁగలిగినదో?

చిలు—దాని కారసజ్ఞత యెక్కడిది! పురుగులను బొడిచికొనితినుపులుగునకుఁ బువ్వులపరిమళ మెట్లు తెలియును?

("తురుతురుతురుతురుతుర్" అను ధ్వని యగుచున్నది.)

గౌర—(ఉలికిపడి) ఇది యేమి? ఈయనంత సుఖస్వరమునఁ గ్రిందినుండి యేదో యపస్వరము వినఁబడుచున్నది!

చిలు—అది యేదో కఠినవక్త్రమునుండి వెలువడిన కఠోరస్వరమువలె నున్నది.

("ఠక్ ఠక్ ఠక్" అను ధ్వనియగుచున్నది.)

గౌర—(భయముతో)అక్కా! ఎవ్వరో చెట్టుఁ గొట్టుచున్న ట్లున్నది!

చిలు—(ఆలోచించి) తెలిసినది. భయము లేదు. ఈవికృతచేష్టలు వడ్లంగిపిట్ట వని తోఁచుచున్నది.

గౌర—(క్రిందివంకఁ జూచి) ఔనే! తన యినుపముక్కుతో నది యీతరుస్కంధమును టక్కుటక్కు మని పొడుచుచున్నది. చూడుము!

చిలు—(పరికించి)ఫలవృక్షములను బగులఁ గొట్టుటయే దానిపని.

గౌర—ఈసుభసమయమున నిది యెంత రసభంగము చేయుచున్నది!

చిలు—అచ్చటికిఁ బోయి దాని నెట్లయిన మరలింతము రమ్ము.

(చిలుకయు, గోరవంకయు నెగిరి క్రింది కొమ్మపై వ్రాలుచున్నవి.)

వడ్లంగిపిట్ట—(చప్పుడు విని తల పైకెత్తి) ఓహో! చిలుకా గోరింకలవలె నున్నారు.

గౌర— వలె నుండుట యేమి? మేము చిలుకాగోరింకలమే!

వఙ్ల— మీయంతటి రసజ్ఞత నాకు లేదనియా నీవు నేనన్నమాటకుఁ బ్రత్యాఖ్యానముఁ జేయుచున్నావు?

చిలు— నీకు రసజ్ఞత లేదనియా? నీ చేష్టలు—

వఙ్లం— (అర్ధోక్తియందే) నాచేష్టలు మీ రేమని గ్రహించితిరి?

గొర— రసభంగములుగా నున్నవని—

వఙ్లం— ఓహో! తెలిసినదానివలె రసము రస మనుచున్నావు! రసస్థానమేదియో నీవెఱుఁగుదువా?

గొర— ఎఱుఁగ కేమి? పాటలో రస మున్నది పలుకులో రస మున్నది.

వఙ్లం— ఆలాగా? వానికి మూలము?

గొర— చిగురులో రస మున్నది. పుష్పాలో రస మున్నది. పండులో రస మున్నది.

వఙ్లం— అంతేనా? మఱి యెచ్చటను లేదా? సరే. వానికి మూలము?

గొర— రసజ్ఞునిహృదయములో రస మున్నది.

వఙ్లం— ఆఁగు మాఁగుము! గోరింకా! నీవొక్కసారిగాఁ గప్పగంతులు వైచుచున్నావు. వానికి మూలకారణ మగు కేంద్రస్థానము ఇప్పుడు నేను నిలిచియున్నచోటే! ఇందే మైన రస మున్నదేమో యనియే నేను పరీక్షించు చుంటిని.

గొర— ఏమైన నగపడినదా?

వఙ్లం— ఇంతవఱకు నాకేమియు నగపడలేదు.

గొర— (నవ్వుచు) ఇది మూలచ్ఛేద ప్రయత్నముగాని, రసగ్రహణప్రయత్నము గాదు.

వఙ్లం— చెట్టునలేనిరసము చిగురున కెక్కడనుండి వచ్చును? వెఱ్ఱిదానా! తత్త్వజ్ఞానములేని పాండిత్యముతోఁ దప్పులు దిద్ద వచ్చితివా?

గొర— ఆలాగా? అట్లయినచో నీతలకు మించినశక్తి ముక్కున కెట్లు వచ్చినది?

చిలు— (సాధుభావముతో వఙ్లంగిపిట్టం గాంచి) అన్నా! ఈ శుష్కతర్కములవలన నేమి ప్రయోజన మున్నది? కోయిల హాయిగాఁ బాడు చున్నది. ఒక్కింతసేపు నిశ్శబ్దముగా నుండి యానందింపరాదా?

వఙ్లం— ఆహా! ఏమి యీచిలుకపలుకులు! మ్రానుగోయిలమాట చిగురుగోయిల పాటపాటిది కాకపోయె నేమి?

చిలు—వాదము వల దంటిని గాదా?

వఙ్ల— వాద మక్కఱలేదు గాని వస్తుతత్త్వమును గ్రహింపవలదా?

గొర— (విసుఁగుతో) నీవిందు గ్రహించిన దేమి? రంధ్రాన్వేషణమే గాని నీకు రసగ్రహణశక్తి యేదీ? ఎంత పట్టిప్రాఁకులాడినను, ఎంతపొట్టుపొట్టు చేసినను, నీబ్రదు కింతే.

చిలు— అన్నా! రసజ్ఞులపని యిది గాదు. అమృతతరంగమాలికాఖేలనమున కానందింపక యడుగున నేమున్నదో త్రవ్వఁ గోరుట యవివేకము కాదా?

గొర— ఔను, అమృతఫలముల నారగింపవలయును గాని, గిల్లి గింజలను లెక్కిం

చుటవలన నేమి ప్రయోజనము?

వజ్లం— (కోపముతో) అమృతము, రసము, హాయి, యని మీరేమేమో కొసవెఱ్ఱి మాటలు చెప్పుచున్నారు. గ్రుడ్డినమ్మకమే గాని గుణాగుణపరిశీలన మక్కఱలేదా?

చిలు— దేనిగుణాగుణములను. దానిని బట్టియే గ్రహింపవలయును పనసతొలలరుచి పై పెచ్చులను నమలిన నెట్లు తెలియును?

వజ్లం—సరే. ప్రకృతమును విమర్శింతము. కోయిలపాట హాయిగా నున్న దంటిరి గదా! ఎట్టి దాహాయి?

చిలు—సకలజీవహృదయములను రసమయములుగాఁ జేయుమధురభావము లందు మూర్తీభవించి యున్నవి.

వజ్లం—సరిసరి! ఈమాటలవలన నాకేమి బోధపడినట్లు? పెండ్లిపాటయా? వసంతపుఁ బాటయా?

చిలు—నీకెట్లు తోఁచుచున్నది?

వజ్లం—ఏమియుఁ దోఁచుట లేదు ఒక్కటే పొలిపాటవలెనున్నది.

గొర—మధురకోకిలగానము మ్రాను గోయిల కెట్లు రుచించును?

వజ్లం—(కోపముతో) మర్యాద నతిక్రమించి మాటాడుచున్నావు!

గొర—ఉన్నమాట యన్న నులుకేల?

వజ్లం—(కోపముతో) ఆలాగా? ఇందెక్కువ తక్కువలు నీవేమి గ్రహించితివి?

గొర—గ్రహింపకేమి? చిదుకఁబొడిచి చెట్టుఁ దొలుచుదానవు నీవు—పాట పాడి చిగుళ్లను బెట్టించున దది—

వజ్లం— (అసహ్యభావముతో) నోరు మూయుము! గట్టిగ మాటాడుచున్నావు.

గొర—నీ యనుపముక్కుకంటె, నీటిక్కుటిక్కులకంటె నా మాటలు కఠినముగా నున్నవా?

(వజ్లంగిపిట్ట కోపమును బట్టఁజాలక గొరవంకను బొడువఁజూచుచుండఁగా గాలిపాటున రసాలఫలము జారి పడినచప్పుడగును.)

"తురుతురుతురుతురు తుర్రో."
అని వజ్లంగిపిట్ట యెగిరిపోవును.

చిలు—గొర—(యథాస్థానమున కెగిరి పోవును.)

కోకిల—కుహూ! కుహూ! కుహూ!

కవి

"చిన్నరు దినుము! పాడుము! మఱి
చివురులు వెట్టింపు మలరఁ జేయుము వనమున్
నవనవగీతాచాతురి
మిన్నుల మరల మరలఁ బాడు మీ! కోకిలమా!"

# ఆరణ్యపర్వము - ఎఱ్ఱా ప్రెగ్గడ

**నడకుదుటి వీరరాజు పంతులు గారు**

"యుక్తియుక్తం వచో గ్రాహ్యం" "వినదగు నెవ్వరు సెప్పిన"

శ్రీమదాంధ్ర మహాభారతము లోని యార ణ్య పర్వోత్తర భాగము నెఱ్ఱాప్రెగడ మహాకవి రచియించె నను వాడుక చిర కాలమునుండి యాంధ్రదేశమునందెల్ల యెడల నలమికొని యున్నది. దీనికి, ఆంధ్ర ప్రబంధములలోని కవిస్తుతిపద్యములు, ఆం ధ్రలక్షణగ్రంథములు, ఆరణ్యపర్వాంతము నం గానవచ్చు (రెండు) పద్దియములు, పెద్దల వచనములు మున్నగునవి యాధారములై యున్నవి

కొంతకాలము క్రిందట, మ. శతఘం టము వేంకటరంగ శాస్త్రి మున్నగు పం డితు లొకరిద్దఱు భారత ప్రథమపర్వములు మూడును నన్నియభట్టారకుఁడు తెలిఁగించె ననియు, నందుఁ గొంతభాగ ముత్సన్నము కాఁగా దాని నెఱ్ఱాప్రెగడ రచియించె న నియు, వ్రాసియున్నారు.

పై పండితుల వ్రాఁతలను గాంచియే కాఁబోలు, శ్రీ వీరేశలింగము పంతులవారు, తాము గ్రొత్త వెలయించిన కవుల చరిత్రము ప్రథమ భాగమున, "ఇప్పటివారు కొందఱు నన్నయ యారణ్యపర్వము సంపూర్ణము కా గానే చేసెననియు,...... ఏ కారణముననో యది నశింపఁగా నెఱ్ఱాప్రెగడ నన్నయ పే రనే పూరించెననియు, మున్నెవ్వరు కనని వినని క్రొత్తవాదము నొకదానిని నారంభిం చిరి. ఈ వాద మపూర్వమైనదే ..." ఇత్యాది వాక్యములు వ్రాసి కొన్ని యుక్తులతో పై వ్రాఁతలను పూర్వపక్షము సేయుచు, నన్నయ యారణ్యపర్వమునఁ గొంతభాగము వ్రాసి మృతినొందఁగా, మూఁడు వందలయేండ్లయిన తరువాతఁ దక్కిన భాగము నెఱ్ఱన నన్నియ పేరుపెట్టియే పూరించెనని సిద్ధాంతీకరించినారు.

పై పండితుల వ్రాఁతలను, కవుల చరి త్రములోని యుక్తులను, ఆంధ్రమహాభార తమును, ఎఱ్ఱాప్రెగడ యితర గ్రంథములను, మఱియుఁ గొందఱ యితర కవుల గ్రంథము లను బరిశోధింపఁగా నెఱ్ఱాప్రెగ్గడ కావిం చినది శిథిలభాగపూరణమే కాని సంపూర్ణ రచనము గానే కాదనియు, గ్రంథ మం తయు నన్నియ మహాశయునిదే యనియుఁ దెలియవచ్చెను. ఆంధ్ర వాఙ్మయ పరిశోధ కులు సత్యవిషయ నిశ్చాయకు లగుదురను తలంపున నారణ్యపర్వమునకును, నెఱ్ఱాప్రె గ్గడ మహాకవికిని గల సంబంధమును గూర్చి నాకుఁ గలిగిన యభిప్రాయమును, అయ్యభి ప్రాయ మొదవుటకుఁ గల కారణములను గ్రమముగ నిందుఁ బ్రదర్శించుచున్నాను.

### నన్నియ భారతాంధ్రీకరణము

నన్నియ మహాకవి భారతాంధ్రీకరణమునకుఁ దొడంగునప్పటికి వయసు మిగిలిన వాఁడయ్యెను. 'అవిరళజపహోమతత్పరుఁ' డగు నమ్మహితాత్ముని ప్రాయమున విశేష భాగము, 'సంహితాభ్యాసము' నందును, 'నానాపురాణవిజ్ఞాన' సముపార్జనము నందును, 'విపులశబ్దశాసన' క్రియానిర్వహణమునందును వ్యయపడియుండెను. పిమ్మట నాతఁడు, 'ఉభయభాషాకావ్యరచనాభిశోభితుఁ'డై, వయసు మీఱిన తరువాతనే భారతాంధ్రీకరణమహాకార్యమునకుఁ బూనుకొని, యందు దొలిపర్వములు మూఁడును సమగ్రముగఁ దెలిఁగించెను. మూఁడవపర్వము ముగించునాఁటికే యక్కవిసింహము మిక్కిలియు వృద్ధుఁడై, యుత్తరగ్రంథ రచనమునకుఁ గాలములేమి స్వకీయపరిశ్రమార్జితంబగు సలక్షణకవిత్వమహాధనమును, ఆచంద్రార్కస్థాయి యగు నిస్తులానంతయశోధనంబును నిహంబున విడిచి పరంబున జేరెను.

### నన్నియ భారతగ్రంథవ్యాపనము

భట్టారకమహాశయుని భారతములోని యాదిసభాపర్వములు రెండును విశ్వజనీనములై జగద్వ్యాప్తము లయ్యెను. సలక్షణకవిత్వనిర్మాణలాలసులు, పురాణశ్రవణాభిలాషులు, మొదలగువా రనేకులు, ఆతనిగ్రంథమునుండి ప్రతులను వ్రాసికొనుచు, వ్రాయించుకొనుచుఁ గొనిపోవుచుండిరి. రాజనరేంద్రుఁడును గొందఱు వ్రాయసకాండ్ర నేర్పఱిచి, తన యభిమానగ్రంథ మగు నాంధ్రమహాభారతమునకుఁ బ్రతులను వ్రాయించుచు ననేకరాజాస్థానములకుఁ బంపుచువచ్చెను. ఈరీతి నన్నపార్యుని కావ్యకన్యక మాతృకగా ననేకపుత్త్రికలును, పుత్త్రికాపుత్త్రికలును జనింప నాంధ్రభారతములోని మొదటి రెండవ పర్వములు దేశమున నెల్లయెడల వ్యాపింపఁగలిగెను.

### ఆరణ్యపర్వము

ఆరణ్యపర్వముమాత్రము దక్కినవాని పలెఁ గడల్కొనఁజాలదయ్యెను. ఏమన, అది విఘ్నకారి యను ప్రవాదము లోకమునఁ గలిగియుండెను. (ఈవాడుక యారణ్యపర్వాంధ్రీకరణదినసములయందు నప్పుడప్పుడు నన్నియకుఁ గల్గినవార్ధకచిహ్నములగు రోగాదులచేతను, పిమ్మటఁ గలిగిన మరణముచేతను మఱింత దృఢపడియుండును.)

ఆరణ్యపర్వమును సాధారణముగా నేఁటికిని గొందఱు పురాణముగానైనఁ జదువనొల్లరు. మఱికొందఱు, ఆరణ్యముగాక తక్కిన గ్రంథమంతయుఁ జదివి పిమ్మట నారణ్యపర్వమును బఠించి, కడపట శాంతినో, తొలిపర్వమునో మరలఁ జదివి పురాణపఠనమును ముగించెదరు. మహాభారతపఠనమున నిట్టి ననేకభేదము లున్నవి. కాని, వనపర్వమును మాత్రము మొదటివానితో వరుసను జేర్చి పఠింపకుండుట సర్వసామాన్యమైన విషయమేయై యున్నది.

మనపూర్వు లారణ్యపర్వపఠనలేఖనములకు భయపడుచువచ్చిరనుట నేఁడును వినఁబడియెడి. అప్పటివారికి దైవతాదులయందును, పురాణములయందును నపరిమితభక్తి

విశ్వాసము లుండెడివి. ఇక్కాలమునను గొందఱు పెద్దలు, ఉపనిషత్తులు భోజనానంతరము పఠింపరాదని శాసింతురు. దేవీనవరాత్రములయందు సరస్వతీపూజకుఁ దాటియాకు గ్రంథములనేకాని యచ్చుపొత్తములను పూజాపీఠమునఁ జేర్పనీయని ముదుసలులు గొందఱిప్పుడును గలరు. అందును గొందఱు గీర్వాణభాషాగ్రంథములనేకాని తెలుఁగుబాసలోనున్న తాటియాకు గ్రంథములనైనఁ బూజింపనీయరు. శ్రీకృష్ణాష్టమీదినసంబునఁ బోతనార్యునిభాగవతమును జదువువారి నధిక్షేపించిన వృద్ధవిద్వత్కవి యొకఁ డిప్పుడును గలఁడు. ఏతాదృశభక్త్యాదులు పూర్వమునుండి నేఁటిదాఁకఁ బరంపరగా వచ్చుచున్నవి.

చూడుఁడు! ఇక్కాలమున 'ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ' అనువారు (ఆనంద ముద్రాలయాధిపతులు) ఆంధ్రవచనభారతమును బ్రకటించుచుఁ దొలుత నాదిసభాపర్వములఁ బ్రకటించియు, "విఘ్నకారి" యను భయముచేతనే యారణ్యపర్వమును మాని, ముందుగ శాంతిపర్వమును బ్రకటించినారు. (ఇవ్విషయము తద్వచనగ్రంథకర్తలచే నాకుఁ దెలియవచ్చెను.)

ఇయ్యారణ్యపర్వవిఘ్నభయము మన భారతవర్షమున నేనాఁడు జనియించెనో తెలిసికొను నాధారములు కానరావుగాని మన యాంధ్రదేశమునందుఁబోలె వంగ, ఘూర్జర మహారాష్ట్రాదిదేశములయందును నారణ్యపర్వమును బ్రథమద్వితీయపర్వములతో నరుసను జేర్చి చదువరనియు, శాంతికి ముందో గ్రంథాంతముననో దానిని చదివి, శాంతిపర్వమును బఠించెద రనియుఁ దద్దేశవాసులు చెప్పెదరు.

సన్నియమరణముతరువాతనే యీ భయము హిందూదేశమునం దెల్లయెడల గతానుగతికముగ వ్యాపించియుండవచ్చు నని భావింతమన్నను, ఆంధ్రారణ్యపర్వము దేశమున నంతగా వ్యాపింపకుండుటకు ముఖ్యకారణమొకటి గానవచ్చుచున్నది:—

మనభాషయందుఁ బూర్వము విషాదాంతకథలు లేవు. ఎన్నికష్టములు వచ్చినను దుదకు సుఖముతోఁ గథ ముగియవలయు నని మనవారియాశయము. అరణ్యమునఁ బడిన సజ్జనులగు ధర్మరాజాదులు వెలుపలికి వచ్చి సౌఖ్యము నందినట్లు దెలిపెడికథ యప్పటికిఁ దెలుఁగున వ్రాయఁబడియుండలేదు. కావునఁ దెలుఁగు వనపర్వము నక్కాలమునఁ జదువువారు లేకపోయిరనియు, దానం జేసియే తత్పర్వపుఁ బ్రతులు వలసినన్ని దేశమున నప్పుడు వ్యాప్తిం గాంచియుండలేదనియు నూహింపనగుచున్నది.

మొదట దేశమునం దంతట నసంఖ్యాకముగ వ్యాపించిన తొలిపర్వముల రెంటి ప్రతులు నిర్దుష్టకవితాలక్షణమును దెల్పుటకు సమర్థములైయే యున్నవి. కావునఁ గవిత్వాభ్యసనపరులకు నారణ్యముతో నంతగాఁ బని లేకపోయియే యుండును. పురాణపఠనమునకది యుపయోగింపదని పైని నిరూపింపఁబడియేయున్నది.

నన్నియ మరణానంతరము రాజరాజు భారతాంధ్రీకరణపరిసమాప్తికై ప్రయత్నించి నట్లు కథయొకటి గలదు. అది నిజమైన, రాజ నరేంద్రునకుఁగూడ నారణ్యపర్వము ప్రీతి పాత్రము గాలేదని గ్రహింపవచ్చును. ఎట్లన ఆమహారాజు విద్వత్కవులచెంతకు నాదిపర్వ ములోని "నిండుమనంబు..." అను పద్యము నో, సభాపర్వములోని "మదమాతంగ..." అనుపద్యమునో పంపెనుగాని ఆరణ్యపర్వము లోని (నన్నియకడపటిపద్యమనఁబడు) "శారద రాత్రులు..." అనుపద్యమును పంపఁడయ్యెను! పై రెండుపద్యములును దీనికంటె రసవత్తర ములు గావు. మఱియు నిప్పద్యముతో సాటి వచ్చు పద్యమును వ్రాయుసమర్థుఁడే లభిం చుచో, నాంధ్రమహాభారతము అతుకు దెలియని మేలిహారమువలె నొప్పారియుండు నని యారాజేంద్రుఁడు భావించి దానినే పంపి యుండఁడా? కావున రాజరాజుసైతము వన పర్వమును బరీక్షింప వెనుదీసె నని యీకథ చెప్పుచున్నది కట్టుకథకుఁ గూడ నారణ్యపర్వ భయ మెట్లున్నదో!

ఎఱ్ఱాప్రెగడమహాకవి యారణ్యపర్వమున జేయిడినతరువాతఁ (బ్రదికి కీర్తి గడింపఁ గలుగుటచే) గొంతభయము దీఱె దేశమున నిప్పు డారణ్యపర్వపుఁబ్రతులు గన్నులఁబడు చున్నవి గాని యేడెనిమిదివందల యేండ్లక్రింద వనపర్వమునుగూర్చి జనుల కెట్టియడ లుండె డిదో యెవ్వరు చెప్పఁగలరు? కావున నక్కా లమున భట్టారకునియారణ్యపర్వము విశేష వ్యాప్తిఁ గాంచియుండదే దని పై విషయము లెల్లఁ బర్యాలోచించువారికి విశదముగాక మానదు.

ఇఁక నివ్విషయమును గూర్చిన చర్చ, నటుండనిచ్చి, తిక్కనసోమయాజి నాఁటికి నన్నియభారత మెట్లుండెనో కనుఁగొందము.

### తిక్కననాఁటియాంధ్రమహాభారతము

తిక్కనకవీంద్రుఁడు, తాను భారతాం ధ్రీకరణమునకు దొరకొనునప్పటికి, మొదటి పర్వములు మూఁడును నన్నియచే సమగ్ర ముగఁ దెలిఁగింపఁబడియె నను విషయమును బాగుగ నెఱిఁగియే యుండెను. కాననే యాతఁడు లేఖ్యమైన భారతామ్నాయము,

"ఉ. ఆదరణీయ..........నం, దాదిఁ దొ
డంగి మూఁడుకృతు లంధ్రకవిత్వవిశార
దుండు వి,ద్యాదయితుండు దొనర్చె మహి
తాత్ముఁడు నన్ని రు..."

"మ. హృదయాహ్లాదిచతుర్థ మూర్జితకథో
పేతంబు నానారసాభ్యుదయోల్లాసి
విరాటపర్వ మట యుద్యోగాదులుం
గూడఁగాఁ, బదునేనింటిఁ దెలుంగుబాస
జనసంప్రార్థ్యంబులై పెంపునం,దుదిముట్టన్
రచియించు డొప్పు బుధసంతోషంబు
నిండారఁగన్."

అని వ్రాసియున్నాఁడు.

ఇప్పు డెఱ్ఱాప్రెగడచే రచియింపఁబడిన దని చెప్పఁబడు భాగ మారణ్యపర్వమున సగ ముకంటె నెక్కుడుగఁ గానవచ్చుచున్నది. ఇంతభాగము మిగిలియున్నపుడు, తిక్కన వంటివాఁడు పైరీతి నంత విస్పష్టముగ వ్రాసి యుండఁడు. ఒకచిత్రకారుఁడు సర్వాంగసుందర

రమైన చిత్రప్రతిమ నొకదానిని వ్రాయఁదల పెట్టి, దానిచుట్టురేఖల నేర్పఱుచుకొని శీర్ష మును నిండుగ లిఖించి, కంఠమునఁ గొంత భాగమును వ్రాసి మృతినొంద, నాప్రతిమనే పూర్తిసేయఁదలంచు వేఱొకచిత్రకారుఁడు, తా నెంత రమ్యముగఁ జిత్రించునేర్పరియైనను, దాను లిఖించు తక్కినవిగ్రహమును బూర్వపుఁ గంఠభాగముతోఁ గలుపఁడేని, యా చిత్తరువు చూపఱకు సంతోషము నింపారఁ జేయు నని భావింపఁజాలఁడు అల్లే యారణ్య పర్వమున నంతభాగము కొఱవడి యుండెనేని "బుధసంతోషంబు నింపారు"నని తిక్కనయుఁ దలంపఁజాలఁడు. కావున వన్నియ మూఁడు పర్వములను సంపూర్ణముగఁ దెలిఁగించియుం డుటను గవి బ్రహ్మ స్పష్టముగ నెఱిఁగియుండె ననియే చెప్పవచ్చును.

సోమయాజిశిష్యుఁ డగుమారనయుఁ బై విషయము నిట్లు ధ్రువపఱిచినాఁడు

"ఉ. సారకథాసుధారసము......, భారతసం హితఁ ముదు ద్రిపర్వము లెన్వఁడొనర్చె నట్టి...నన్నియభట్టు గొల్చెదఁ." (మార్కండేయపురాణము)

ఎఱ్ఱాప్రెగడకుఁ బూర్వమున నున్న యీయిరువురును ఘంటారావముతో నన్నియ మూఁడుపర్వములను వ్రాసె నని స్పష్టముగఁ జెప్పియుండ, వారిది సామాన్యపు వ్రాఁత యనుట సమంజసము గాదు.

భారతవ్యాప్తి

కవి బ్రహ్మభారతము లోకమనోహర మయ్యెను. నూతనప్రియులగు లేఖకాదు లా తని కవిత్వపటుత్వసంపదకు వశులై తద్గ్రంథ మునుండి లెక్కలేనిప్రతులను వెలువరించిరి. సోమయాజి యనంతరము నాచన సోమనాథ మహాకవి భారతశేషమగు హరివంశమును దెలిఁగించి యాంధ్రమహాభారతమును సమ గ్రముఁ గావించెను. భారతపురాణపఠనమున దేశము నల్లెడల నభివృద్ధిఁ గాంచెను.

ఆరణ్యపర్వావశ్యకత

పురాణపఠనశ్రవణాభిలాషులకు నారణ్య పర్వ మావశ్యక మయ్యెను. అప్పుడు తెలుఁగు భారతము రమణీయహారము దెగినట్లుండెను. శాంతిపర్వ మాంధ్రమునఁ గలదు గాన వన పర్వము దోషావహము గా దని విద్వాంసులు చెప్పుచుండిరి. ఆరణ్యపర్వపుప్రతులకై య న్వేషణప్రయత్నములు జరుపఁబడెను. అచ్చ టచ్చట నసమగ్రములు సమగ్రములు నగు ప్రతులు కొన్నియుండెను. అవియును జిర కాలమునుండి స్పృశించువారు లేక ఖిల ములై యుండెను. వానినుండి ప్రతులను వ్రాసికొనుట సంకట మయ్యెను. సమర్థుఁ డగు కవిసత్తముఁ డెవ్వఁడైన శిథిలభాగములఁ బూరింపఁ గడంగనిచో నున్న భాగములు సయితము నశించిపోవు ననుకింవదంతి లోక మున వ్యాపించెను.

ఎఱ్ఱననాఁటివనపర్వము

ఆ సమయమునఁ* జెదలువాడ వంశపయః పారావారరాకాజైవాతృకుం డెఱ్ఱనార్యుం

* విప్రనారాయణ చరిత్రమున చెదలువాడ మల్లయ్య, ఎఱ్ఱాప్రెగడ దనవంశమునకుఁ గర్త యని వ్రాయు

డు జగద్ధితార్థమో యన నవతరించి సకలకలా కుశలుఁడై వెలుఁగొందుచుండెను. ఆతఁడు సామాన్యుఁడు గాఁడు "శంకరస్వామిసంయమీంద్రగురుచరణధ్యానాద్దసౌందర్య ధుర్యుఁడు." "గిరిశపదభక్తిరసతత్పరభావుఁడు' 'బహుపురాణధర్మశాస్త్రకథావిస్తర వేది.' మఱియు వినయసౌశీల్యాదిసద్గుణగణసంపన్నుఁడు.

ఇట్టిమహాత్ముఁడు పైయరణ్యపర్వశిథిలావస్థను గూర్చిన జనశ్రుతిఁ జెవ్రలార నాకర్ణించెను నన్నయ యారణ్యపర్వపుస్తకము నొకదానిని సంపాదించి చూచెను. అది చెదపురుగులు దిన్నవన్నెలగోడుగుంబోలెఁ గ్రిమికులదష్టమై యచ్చటచ్చట నష్టములైన యక్షరములు, పదములు, పద్యపాదములు, పద్యములు మొదలగువానితో నెప్పు తాటియాకులు గలదై యుండెను. (రెండు మూడు వందల యేండ్లక్రిందటి తాటియాకు పుస్తకములను గనఁగలిగినవారికీవిషయము విశదమే.) దానింగాంచి నిర్మలహృదయుఁడా శంభుదాసుఁ డిట్లు చింతించియుండును.

"హా! శబ్దశాసనమహాశయా! దిక్కుమాలిన యీయారణ్యపర్వము నిన్ను మ్రింగినట్లే నీయక్షరములతో నున్న తన్నుఁ దానే దిగమ్రింగు కొనుచున్నదా యేమి? నీ వెంత శ్రమము వహించి దీనిని రచించితివో కదా! అవసానసమయమున భగవన్నామస్మరణమునకంటె మున్ను నీమనోదృష్టి యెన్నిసాగులు నీయీయాంధ్రభారతపుత్రికారత్నముపైఁ బ్రసరించియుండెనో కదా! అకటా! సుజనుఁడవైన నీయీగ్రంథభాగమున కెంత గతిపట్టినది! ఏమాయెను లెమ్ము! నీకీర్తిని నిలుపువాఁడను—నీవాఁడను—నేనున్నాను. నీ గ్రంథములోని శిథిలభాగములను నేను బూరించి నీపరిశ్రమము వృథవోవకుండ దీనిని వెలయించెదఁగాక!..."

ప్రబంధపరమేశ్వరుఁడు ఋజుమార్గవర్తనుఁడు; ధర్మమతి, పరమార్థచింత గలవాఁడు. నన్నయభట్టారకునియం దాతనికిఁ బొడమిన యపరిమితభక్తిగౌరవాదులు తద్గ్రంథశిథిలభాగపూరణోద్యమమున కాతని సాహసింపఁజేసినవి. అప్పుడు జనించిన భావోద్రేకముచే నరణ్యపర్వమును గూర్చి యంతకుమున్ను లోకమునఁ గల ప్రవాదము నాతఁడు సరకుసేయఁ డయ్యెను. "ప్రప్రథమమున నే రామాయణములోని యుత్తరకాండము నే రచించిన తిక్కనమహాశయుఁడు దీర్ఘాయుష్మంతుఁడై భారతములోని పదునేనుపర్వములు గల గొప్పగ్రంథమును వ్రాసి శాశ్వతంబగు యశంబును గడింపఁగల్గెనే! ఖిలమగుచున్న భట్టారకుని గ్రంథమును బరమార్థబుద్ధితో నాతని పేర నే యుద్ధరించు నేనేల

టచే నిల్లు ప్రాయసయ్యెను గాని యెఱ్ఱనగాఁడీ యింటిపేరే యున్నదని చెప్పుటకు ధైర్యము చాలదు. ఎఱ్ఱనమల్ల నలకు నడుమఁ జాలతరములు గడచినవి. ఒక్కొకయింటిపేరు తండ్రినుండి కొడుకునికడకు వచ్చునప్పటికే మాఱిపోవుచుండుట గలదు. తిక్కనకొమరుఁడు కొమ్మన యనంతరము కొట్టరువువారు పాటూరివారైనారు. ఈ. తిమ్మకవ్యాదుల గురువైన బందులూరి లింగనారాధ్యుని శిష్యులందఱు 'అయ్యగారు' అనుటచే; నాయనవరువారి వారయ్యగారివారైనారు. ఇట్లే సరహరి ప్రెగడవారు ముత్తరాజువారుగను, పైఁడిపాటివారేనుఁగువారుగను. లైయినారు;

తిక్కనవలె నితరగ్రంథములను వ్రాయఁగల చిరంజీవిని గాఁగూఁడదు? ఏమైనఁ గానిమ్ము. నే నీమహాకార్యమునకుఁ గడంగెదను." అని యాతఁడు భావించుకొనెను.

శిథిలభాగపూరణము

పిమ్మట నాతఁడు దేశమునఁ గలయరణ్యపర్వపుఁ బ్రతులకై ప్రయత్నించెను. కొలఁది ప్రతులు లభించెను. అందుఁ గొన్ని యసమగ్రములు; కొన్ని సమగ్రములు. అవి యన్నియుఁ దన యొద్దనున్న ప్రతికిఁ దోఁబుట్టువులయియే యుండెను. ఆ ప్రతుల నన్నిటిని మిక్కిలి శ్రమచేసి సరిచూచుకొనుచు, నష్టభాగములను పూరించుచుఁ తుదకు వనపర్వమును బూర్తిగావించెను.

"నన్నయకవీంద్రుఁడు విశేషశ్రమమున కోర్చి వార్ధకదశయందు నవయవపటుత్వము తగ్గిపోయినను, ఓపికమెయి దీనిని రచియించినాఁడు. ఇందుఁ గొన్నిచోటు లచ్చటచ్చటఁ గాలవశమున శిథిలమైపోయినవి. అట్టి మహాత్ముని శ్రమ మూరకపోనేల? ఆతని శ్రమమును భూమిపై నేల నిలువరాదు? నే నెంత శ్రమపడిన నేమి? మొదటిశ్రమ మాతనిదే కదా? ఆతనికీర్తి యందు నాకు భాగమేటికి?" అని యా మహాదార్యశాలి తలంచి, నష్టభాగములను (సాధ్యమైనంతవఱకు నన్నయపదాదులనే నిలుపుచు) బూరించుచు, ఎక్కుడు పరిశ్రమము తనదేయైనను నందున్న నన్నయ రాజనరేంద్రుల నామములఁ జెఱుప నిచ్చగింపఁడయ్యెను.

ఇప్పు డెఱ్ఱాప్రెగడభాగ మనఁబడు గ్రంథమున నున్న నన్నయప్రయోగములు, ఎఱ్ఱనప్రయోగములు నన్నయభాష, ఎఱ్ఱనభాష రాజనరేంద్రుని సంబోధనములలో నన్నయవి, ఎఱ్ఱనవి- నన్నయ మధ్యాక్కరలకు నెఱ్ఱనదానికిని గలభేదము- మొదలగు విషయములకు మఱియొక యవసరమును గైకొనఁదలఁచి ప్రస్తుత మొండురెండు విషయముల నిచ్చట నిచ్చుచున్నాను.

(అ) చ. రయవిచలత్తురంగ మతరంగముల
న్మదనాగనక్ర సం
చయములఁ జంచలద్భటుల సై
నికమత్స్యములన్ భయంకరం,బయి..."

ఈ పద్యభాగము సభాపర్వమునను (ద్వి. 33.) ఎఱ్ఱనభాగమని చెప్పఁబడు ఆర. ష. 58 పద్యమునను గానవచ్చుచున్నది. ఈ రెంటికర్తయు నొక్కఁడు గాఁడన్నచోఁ బ్రబంధపరమేశ్వరునిపైఁ బదార్థచౌర్య మారోపింపవలసి యుండును. అంతకంటె వనపర్వమంతయు నన్నయ దనుట న్యాయ్యము గాదా?*

ఆరణ్యపర్వోత్తరభాగమును బరికించువారికి నం దనేకభాగములు నన్నయ కవిత్వములోనివే యని తప్పక స్ఫురించును. ఎన్నివిధములఁ బరీక్షించినను, ఎఱ్ఱాప్రెగడ

---

* (క) నన్నయ సీసగీతనియములు వేఱు, తిక్కనకవులవి వేఱు. నన్నయనియమము లెఱ్ఱన గ్రంథములలో లేవు. ఆరణ్యపర్వమునం దంతటను నీ నియమము గానవచ్చుచున్నది. ఇందుమాత్రమే నన్నయనియమము నెఱ్ఱన నిల్పినాఁ డందురేమో? సీసగీతనియముల నిలిపినవాఁడు మధ్యాక్కరలక్షణము నేల పాటింపలేదు? ఆర. చ. ౩౧.

చేసినది శిథిలభాగపూరణమే కాని ప్రత్యేక రచనము గాదనియే తోఁచుచున్నది. ఇవ్విషయమునఁ గల పూర్వపక్షసిద్ధాంతముల సమ* న్వయము నిచ్చట సంగ్రహించి చూపుచున్నాను.

(౧) భట్టారకుని యారణ్య పర్వభాగము "శారదరాత్రులు" అను పద్యమువఱకే వ్రాయఁబడినదయి యుండి, మిగిలినది వట్టి తాటియాకులుగలదే యై, పిమ్మట నెఱ్ఱనచే రచియింపఁబడినదే యై యున్నచోఁ, దాను రచించిన యీ గొప్పభాగము నాతఁడు నన్నియపేరనే వెలయించుటకుఁ దగిన ప్రబల కారణ మేదియుఁ గానరాదు- తనపేర నారణ్య పర్వశేషమును బ్రకటించుచో నన్నియ గతియే (మతిభ్రమణమో, మరణమో) తనకును సంభవించు ననుభయముచేత నాతఁడట్లు చేసినాఁడని కొంద ఱొకయుక్తి సెప్పెదరు. నన్నియకు మరణముఁ గలిగించినది యారణ్యపర్వాంధ్రీకరణమా? అందున్న నన్నియనామమా? ఇదేఁటి యుక్తి? నన్నియ పేరు సెప్పి యెఱ్ఱన నిప్పు ముట్టినను కాలదు గాఁబోలు! మున్నూఱేండ్లకు ముందున్న వానిపేరు సెప్పినంతమాత్రమున నారణ్యపర్వదోషము తప్పిపోఁగలదా?

పై భయమును మనవారు తిక్కనయందును నారోపించియున్నారు. తొలుదొల్తనే, యారణ్యపర్వము వంటిదే యగు నుత్తర రామాయణమును దెలిఁగించి, మనుమసిద్ధి భూపాలునకుఁ (అల్లునకుఁ?) గృతి (కన్యా) దానము నొనర్చి మించిన కవిచక్రవర్తికిఁ దిక్కన కట్టిభయ ముండిన దనుమాట నమ్మఁదగినదా?

"పడుచువాఁడైన తిక్కన కొకవేళ నట్టి భయ ముండిన నుండవచ్చు"నని యొకానొకరు వ్రాసిరి. ఎఱ్ఱనమాత్రము వనపర్వరచనమునాఁటికి ముసలివాఁడా? తిక్కనకన్నను బడుచువాఁడు!

లెక్కలేని యోధులచావులు గల యుద్ధపర్వములు, కేవలము శోకభూయిష్ఠమగు స్త్రీపర్వము, నూర్గురుకొడుకులును బంధుమిత్త్రులును జచ్చినదుఃఖము నిండికొనిన మనంబులతో ధృతరాష్ట్రాదులు వనంబునకుఁ బోయినకథ గలయాశ్రమవాసపర్వము, శ్రీకృష్ణనిర్యాణమును జెప్పు మౌసలపర్వము, ధర్మరాజాదులు రాజ్యకాంక్ష సంపూర్ణముగ భూమిపై దిగవిడిచిపోవు మహాప్రస్థానిక పర్వము (అరణ్యపర్వకథనాఁటి కింకను నెప్పటికేని రాజ్యము రాఁగలదను నాసయైనఁ

---

* నన్నియ భట్టారకుని సీసగీతాదులలోఁ గానవచ్చు నియమముల నన్నిటిని పూర్వము నేను బరిశోధించి- అప్పటి యచ్చుపొత్తము లిప్పటివానివలె స్వచ్ఛమైన ముద్రణముగలవియు, పాదమున కొకపంక్తి గలవియుఁ గాకపోయినను చిక్కులియు శ్రమపడి- యొకవిమర్శనము వ్రాసి వేఱొక సందర్భమును నామిత్రులగు పాఁడి వేంకటస్వామిగారికిఁ జూపఁగా వారు నన్నుఁ బొగడుచు, దానిం బరిశీలించి యిచ్చెద మని పుచ్చుకొని, నా వాక్యరచనను గొంతమార్చి, తమపేరితో నేను బంపెదనన్న పత్త్రికకు- అముద్రిత గ్రంథచింతామణికిఁ బంపి యందు బ్రకటించు కొన్నారు; అక్కాలమున సం. గ. చింతామణిలో నాయనకుఁ బరిచితియే లేదు;

గలదు! ఈపర్వమున నదియు లేదు!) తుదకు స్వర్గారోహణపర్వమును రచియించిన కవి బ్రహ్మమహాశయుఁడు, తనకాలమున నార ణ్యపర్వము కొఱవడియుండెనేని దానిని బూ రింప వెనుదీసియుండునా?

(౨) ఆరణ్యపర్వమున నన్నియకవిత్వ మని తలంపఁబడుభాగము ౧౩౦౦ పద్య ములు గలదైయున్నది. ఎఱ్ఱనకవిత్వమని చెప్పఁబడునది ౧౬౦౦ పద్యములు గలది. ఇంతగొప్ప గ్రంథమును దానే సంపూర్ణముగా నన్నియ కవిత్వము లేకయే రచియించియుండె నేని, యాగ్రంథమునకు నన్నియను కృతి కర్తగను, రాజనరేంద్రుని కృతిభర్తగను జేయునా యెఱ్ఱాప్రెగ్గడ? ఏనాఁటి నన్నియ? ఏనాఁటియెఱ్ఱన? ఏనాఁటిరాజరాజు? ఎవ్వరు చూచిన సతోషమిది?

పైసందేహమునకుఁ గొందఱు, "ఒకరి సంతోషముతో నెఱ్ఱనకుఁ బనిలేదు. నన్ని యపై నాతనికిఁ గలిగిన భక్తిగౌరవములే కారణములు." అని చెప్పుదురేమో!

నన్నియయెడఁగల భక్తిచేతనే యార ణ్యపర్వభాగము నాతనిపేర రచియించి యుండునేని, భారతశేష మగు హరివంశమును దిక్కనపేరనయినను వెలయించి యుండును. కావునఁ బైసమాధానము యుక్తియుక్తము గాదు. మఱియు, నన్నియయెడనే యట్టిగౌర వము చూపఁదలఁచినాఁడు గావున నారీతి నొనర్చినాఁ డందురేమో! అట్టియాశయమే యాతనికిఁ గలిగినచోఁ దద్భాగమును నన్ని యకుఁ గృతిగ నిచ్చివేయుండునే! ఎన్నఁడో మృతినొందినయాతఁడు రచియించిన ట్లసత్య విషయప్రకటన మొనర్చుటకంటె నాతనికిఁ గృతి యిచ్చియుండుట విశేషభక్తిగౌరవ ములఁ దెలుపునుగదా?

పోతనభాగవతమును భాస్కరునిరామా యణమును గనుఁగొనుడు! అందెవ్వరు వ్రాసిన భాగములను వారు తమనామములతోనే వెలయించినారు గాని యందొక్కఁడేని తన భాగమునందున్న ముఖ్యకర్తపేర వ్రాయలేక పోయినాఁడు! కృతిపతులనుసయితము దమ యిచ్చకు వచ్చినవారినే నిలిపికొన్నారు!

మఱికొందఱు "నన్నియ సగముపర్వము వ్రాసియేయుండెను గావునఁ దక్కినసగము నందు నొకొక కృతిపతిపేరును, నింకొకకవి పేరునునేల యని యెంచి యట్లుచేసినాఁ" డని యందురేమో!

(అ) తిక్కన సోమయాజి నిర్వచ నోత్తర రామాయణమున యల్పభాగము మిగిలియుండఁగా (లేక యుత్సన్నముకాఁగా) దానిం బూరించిన జయంతిరామభట్టు వేఱొ కయాశ్వాసముగ రచించి భద్రాద్రిరామున కంకితమిచ్చితనపేరనే వెలయించుకొన్నాఁడు.

(క) హుళక్కిభాస్కరుని యుద్ధకాండ మును బూరించిన యయ్యలార్యుఁడు దానిని వేఱుగ విభజింపకయే "అమరహుళక్కి భా స్కరమహాకవి సెప్పఁగ నున్నయుద్ధకాం, డము తరువాయి సెప్పె..."అని తనపేర వెల యించుకొనుటయేకాక యాశ్వాసాంతమునఁ గృతిపతిని సైతము మార్చివేసినాఁడు.

(గ) సాహిణిమారన సంబోధనముతో భాస్కరామాత్యుఁడు ప్రారంభించిన సుందర

కాండమును మల్లికార్జునభట్టు పూరించుచుఁ, దా నాతనిపుత్త్రుఁడైయుండియు నాశ్వాసాంతమునఁ దత్కృతిపతి పేరైన నెత్తిక తన యిష్టదైవమును సంబోధించి, గద్యమునఁ దననామమునే వెలయించుకొన్నాఁడు. కన్న కొమరుఁడై యుండియుఁ దండ్రియందుగాని, తమ్ములు ప్రభువునందుగాని కొంచెమేనియు (భక్తి గౌరవములమాట యటుండనిండు!) మోమోటమియైన లేకుండ సుందరకాండ పూరణ మొనర్చిన మల్లికార్జునభట్టు కాండమంతయుఁ దానేరచించినట్లు వ్రాసికొన్నాఁడే. మూఁడు వందలయేండ్లకు మున్ను పరమపదము నందిన నన్నియరాజరాజులపేర నేకారణము (నన్నియరచన) లేనిదే యయ్యారణ్యపర్వభాగమును ఎఱ్ఱాప్రెగ్గడ వెలయించినాఁ డనుట యుక్తియుక్తముగా నుండునేమో యోజింపుడు కీర్తికాముఁడు గానివాడెవ్వఁడు? "మహాకవులాద్యులు గావ్యశయ్యఁ గీలించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షసేసితిఁ" అని నృసింహపురాణమున నెఱ్ఱన వ్రాసికొనియున్నాఁడే.

(3) నృసింహపురాణములోని యీ క్రిందిపద్యములను బరీక్షించువారికి, ఆరణ్యపర్వమంతయు నన్నియకృతమే యనియు, నెఱ్ఱన యొనర్చినది యచ్చటచ్చటి శిథిలభాగములపూరణమే యనియు స్పష్టముగాఁగలదు-

వ. అని యీ క్రమంబునఁ బ్రధాన దేవతాసంకీర్తనంబును... సమర్థించి, కృతార్థతం బొంది కతిపయాతురపరిగ్రహజనితంబైన నైసర్గికచాపలంబుకతంబున.

ఉ. మించినవేడ్క వీనులకు మిక్కుటమై
మధువృష్టి గ్రమ్మ రా,యంచలు గూయఁ
గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగు
భంగిఁ బ్రా, ఘాంచితశబ్దసారులు మహా
కవు లాద్యులు గావ్యశయ్యఁ గీ,లించిన
కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షసే
సితిఁ."

నృసింహపురాణమునకు నిమ్మడు గు గ్రంథమును వనపర్వోత్తరభాగమును దాను ప్రత్యేకముగ వ్రాసియుండెనేని "కతిపయాతురచాపలంబున' ననియు, పూర్వులవలె నేనును గవిత్వమును జేయఁ గాంక్షసేసితి' ననియు నెఱ్ఱన వ్రాసియుండఁడు. శిథిలభాగపూరణముతోఁ దన గంటమునకుఁ బదను గలిగించికొన్నాఁడు. తరువాత స్వతంత్ర గ్రంథరచనమునకుఁ బూనుకొన్నాఁడు. కావుననే యయ్యతులానుభావభక్త్యుఁడు, స్వప్నమున సాక్షాత్కరించిన తన పితామహుఁడు తనతో,

ఉ. ఉన్నత సంస్కృతాంధ్ర చతురోక్తి
పదంబులఁ గావ్యకర్తవై, యెన్నికమై
ప్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే,
షొన్నయ మాంధ్రభాష సుజనోత్సవ
మొప్పఁగ నిర్వహించితి (వి)

అని పలికినట్లు వ్రాసికొన్నాఁడు. ఇందుగల ఉన్నయశబ్దమున కర్థము విచారించుచో "ఉన్నదానిని పైకి లేవనెత్తుట (ఉద్ధరించుట)" యని యేకాని "క్రొత్తగా సృష్టించుట" అను నర్థము లేదని విశద మగును. (ఉన్నయమ్. కూపాదితో జలాదే రుత్తాలనమ్.)

శ్రీవీరేశలింగము పంతులవారు, "ఆరణ్యపర్వశేషము" అనునప్పుడు 'శేష' మనగా మిగిలిన దని యర్థముగదా! నన్నయ రచింపఁగా మిగిలిన దనకపోయినయెడల నిచ్చట శేషశబ్దమున కర్థమేమగును?" అని వ్రాసి యున్నారు. ఆరణ్యపర్వశేషము-ఆరణ్యపర్వముయొక్క మిగులు-ఇతరములయిన ప్రబల హేతువు లనేకము లుండఁగా, నీ 'శేష' శబ్దమునకు "చేసినదానిమిగులు" అనునర్థమును దెచ్చుకొనుటకంటె "లభించినదానిమిగులు" అనునర్థమును గ్రహించుట సమంజసము గాదా? ఇచ్చట, "లభించునది" యనగా ఖిలముగాకుండ లభించినదని భావము. అరణ్యపర్వశేషోన్నయము - అరణ్యపర్వఖిలభాగముల నుద్ధరించుట.

పైపద్యమును జూచి శ్రీపంతులుగారు తమ కవిచరిత్రమున, "ప్రబంధధోరణిని భారతారణ్యపర్వశేషమును చమత్కారబంధురముగ రచించుటచేతఁ బ్రబంధపరమేశ్వరబిరుదము వచ్చిన" దని వ్రాసిరి. ఈపద్యమున నిట్టియర్థము గానరాదు. ఎన్నికమై, ప్రబంధపరమేశుడనంగ, సంస్కృతాంధ్రచతురోక్తిపదంబులఁ గావ్యకర్తనై (గవిత్వాధికారినై) యరణ్యపర్వశేషోన్నయము నిర్వహించితి వని పైపద్యము నన్వయము. ప్రబంధపరమేశ్వరుఁ డనఁదగినంత మేలికవిత్వ మలవడిన పిమ్మటనే వనపర్వశిథిలభాగములను బూరింప దొరకొన్న వాఁడుగాని, కవిత్వారంభము నఁగదే తత్పర్వమును బూరించి యట్టిబిరుదము నందలేదు. నన్నియ తిక్కనలకంటె నెక్కుడు ప్రబంధధోరణియు, నెక్కుడు చమత్కారబంధురతయు నెఱ్ఱనకు లేవు. పైపద్యములోని "చతురోక్తి" అనుదానిని గనుఁడు. మఱియు, "పరిభవింతుఁ బ్రబంధపరమేశ్వరుని శేవ సూక్తినై చిత్రి నొక్కొక్కమాటు" అను శ్రీనాథునిస్తుతిని, "ఈత్రయిఁ బ్రబంధ పరమేశ్వరుఁడై రచియించె శబ్దవైచిత్రి..." అను జక్కననుతిని గనుఁడు.

(ర) నన్నియతిక్కన లిరువురును భారతము సంపూర్ణముగాఁ దెలిఁగించినా రను భావమే కాని యెఱ్ఱాప్రెగ్గడకు వేఱుతలంపు లే దని యూహించుట కాతని నృసింహపురాణములోని యాక్రింది పద్యమునయితము మార్గముఁ జూపుచున్నది.

ఉ. భాసురభారతార్థముల భంగుల నిక్క
మెఱుంగనేరమిం, గాసటబీసటల్ సదివి
గాథలు ద్రవ్వ తెలుఁగువారికిన్, వ్యాస
మునిప్రణీతపరమార్థము దెల్లము సేసి
నట్టియ, బ్రాసనకల్పులం గొలుతు నాద్యు
ల నన్నియతిక్కనార్యులన్."

ఆంధ్రభారతములోని యరణ్యపర్వమున సగముకంటె నెక్కుడుభాగమునకు సంపూర్ణ కర్తృత్వము గలవాఁడు పై రీతిని వ్రాసి యుండఁడు.

(౫) ఆరణ్యపర్వాంతమునఁ గానవచ్చు, నెఱ్ఱనార్యుఁడు దదుత్తర భాగమును రచియించినాఁ డనువాడుక లోకమునఁ బ్రబలుటకు ముఖ్యహేతువు లై యున్న

"సీ. భవ్యచరిత్రుఁడు...ఇలఁ బాకనాటిలో
సిలకంఠేశ్వరస్థానమై మొనక మెసఁగు,

గుడ్లూరు నెలవుగా...నొప్పు...ఎట్టి నార్యుండు..."అను సీసపద్యమును,

"క. ధీరవిచారుఁడు దక్కవి, తాఁతియుఁ
గొంత దోసఁ దద్రచనయకా, నారణ్య
పర్వశేషము, పూరించె గవీంద్రకర్ణపుట
పేయముగన్."

అను కందపద్యమును ఎఱ్ఱన మహాకవి వ్రాసినవి గావు. ఎట్లన, ఆనంద ముద్రాక్షర శాలను ముద్రింపఁబడిన యాంధ్రభారత మును బరిష్కరించినపుడు తాము పెక్కు తాటి యాకు ప్రతులను జూచితిమనియు, సం దెచ్చటను పైపద్యములు గానరాలేదనియు, (కీ. శే) తం॥ తేవప్పెరుమాళ్లయ్యగారు చెప్పియున్నారు. దీని కుపబలముగా 1907 వ సంవత్సరము మొదలుకొని నేఁటి దాఁక ముద్రింపబడిన (ఆనంద) భారతము కూర్పు లన్నిటియందును, అరణ్యపర్వాంతమున పుట యడుగున, "భవ్యచరిత్రుఁడు- అని అచ్చు ప్రతులయందుమాత్ర మగపడియెడి" అని సూచింపఁ బడియున్నది. శ్రీ తేవప్పెరుమా ళ్లయ్యగారు పరీక్షించిన దాక్షిణాత్యకోశ ములు కొన్నిటియందుఁ బైపద్యములు లేకు న్నను, ఈ దేశములోని కొన్ని ప్రతులలో నివి కానవచ్చుచున్నవి. ఆపద్యము లెఱ్ఱనవే వ్రాసియుండునేని కొన్నిటియం దవి యుండు టయు, గొన్నిట లేకుండుటయు సంభవింపదు. ఇదియునుంగాక, యాపద్యముల నెఱ్ఱనయే వ్రాసియుండునేని, ఒక్కొక యాశ్వాసము కడపటనుండు గద్యమునందును దననామ మునే చేర్చియుండును. ఒకచోటఁ గల మరణ భీతి వేఱొకచోట నుండదనుటకు హేతువు గానరాదు.

కొన్ని వ్రాఁత ప్రతులలోనుండి, కొన్ని ట లేక గతానుగతికముగ ముద్రింపఁబడిన ప్రతులలోఁ గానవచ్చుచున్నపై "భవ్యచరి త్రుఁడు..."అనుపద్యము శంభుదాసునకుఁ దరు వాతఁ జిరకాలమునకు వ్రాయఁబడినదే యని యూహించుట కొకగొప్పయాధార మా పద్యముననే చూపట్టుచున్నది. ఎట్లన:— ఆ పద్యమున,

'పాకనాటిలో నీలకంఠేశ్వర స్థానమైన గుడ్లూరియందు నెఱ్ఱన యుండినట్లు చెప్పఁబడి యున్నది. ఈపద్యముదక్క నెఱ్ఱనది గుడ్లూ రనుటకు నితరాధారము గానరాదు. నృసింహ పురాణమున నెఱ్ఱన "వేఁగినాటఁ గరాప త్రి వృత్తిమంతుఁ"డని తనతాతను వర్ణించి నాఁడు. పిమ్మట, ప్రోలయవేముని తమ్ముఁడు మల్లారెడ్డి దన్నుఁ దీసికొనిరాఁగా నద్దంకి రాజధానియందుఁ దదాస్థానకవిగా శంభు దాసుఁ డుండినట్లు హరివంశము దెలుపు చున్నది. పిమ్మట నాతఁడు చెదలువాడ నివా సియైనట్లు విప్రనారాయణ చరిత్రము బోధిం చుచున్నది. వేమారెడ్డి జీవించియుండఁగనే యెఱ్ఱన పరమపదము నందినట్లు కవిచరిత్రము తెలుపుచున్నది. కావున నవసానదశయందు అద్దంకినుండి యాతఁడు చెదలువాడఁ జేరెనని భావింపవచ్చును. కవిగాని, తద్వంశస్థుఁడు గాని చెప్పని యీగుడ్లూరు, ఈపద్యమున నెట్లు చేరెననియారయుఁగా, వేమారెడ్డివంశ పువాఁడైన రాఘవరెడ్డి, గుడ్లూరు రాజ

ధానిగాఁ బాకనాటిసీమ నేలినట్లును, అచ్చట నీలకంఠేశ్వరుఁ డుండినట్లును విష్ణుపురాణము లోనియీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చెను!

"గాకీన మేతుఁడై గరిమతో నేవీట నేపారు నీలకంఠేశ్వరుండు,......అట్టి రాజధాని మైనొప్పు గుడ్లూరి నొనర నేలుచుండి యొక్క-నాఁడు."

రాఘవరెడ్డికి, వేమారెడ్డి పూర్వుఁడై నట్లు విష్ణుపురాణమున వర్ణింపఁబడియుండుట చేతను, ఎఱ్ఱనమహాకవి, వేమారెడ్డియాస్థాన కవి యని తెలియుటచేతను, రాఘవరెడ్డి యేలి యుండినగుడ్లూరినే పూర్వము వేమారెడ్డి గూడ నేలియుండు నని యూహించిన (చరిత్రము దెలియని) యే లేఖకమహాశయుఁడో విష్ణుపురాణమును జదివికొని; (ఎఱ్ఱనకుఁ బిమ్మటఁ జరకాలమునకు) పైపద్యములను వ్రాసి యారణ్యపర్వాంతమునఁ దూర్చినాఁడు! ఆ ప్రతికిఁ బుత్రికలయిన ప్రతులే యీపద్యములు గలవి! తత్పూర్వపుఁ బ్రతులపుత్రికలే యాపద్యములు లేనివి. కావున నారణ్యపర్వాంతమునఁ గానవచ్చు పై రెండుపద్యములును నెఱ్ఱాప్రెగ్గడ వ్రాసినవిగావనుట స్పష్టము. (కంద పద్యమున నున్న "తక్క-వితారీతియుఁ గొంత దోఁప" అనునది దైవికముగానే వ్రాయఁ బడినది!)

(౭) ఆరణ్యపర్వచతుర్థాశ్వాసము 142 వ పద్యముతరువాత.

"నన్నయభట్టుకవిత్వము సంపూర్ణము." "ఇక్క-డనుండి యెఱ్ఱాప్రెగడకవిత్వము", (ఇది యచ్చుప్రతులందుమాత్రమే యున్నది.)

అను వ్రాత లేఖకులదే యనుట స్పష్టము ఎఱ్ఱనయే యట్లు వ్రాయుచో నాశ్వాసాంత గద్యములయందు నన్నియపేరు పెట్టుటయందు లాభమేమి ? అతఁడే యట్లు వ్రాయునేని, "నన్నియ యింతదనుక వ్రాసి మృతినొందెను గావున నింతనుండి యాతనిపేరనే నేను రచించుచున్నాను." అని వ్రాసియేయుండును.

ఎఱ్ఱనయనంతరము కొంతగాలమునకు "భారతారణ్యపర్వశిథిలభాగముల నాతఁడు పూరించె" నను ప్రతీతి క్రమముగా "ఆరణ్యపర్వశేషమును జెప్పె" ననువిఖ్యాతిగామాఱి, దేశమున వ్యాపించినతరువాత, నేలేఖకుఁడో, ఎఱ్ఱన కవిత్వారంభమును గనిపెట్టనెంచి నృసింహపురాణము ప్రథమాశ్వాసములోని 113 వ పద్యమునఁ గానవచ్చు "స్ఫురదరుణాంశురాగరుచి" అనుదానిని, భారతములోనిదానిని వాని సామ్యమును బట్టి, "ఇక్క-డ నుండియే యెఱ్ఱాప్రెగడకవిత్వమైయుండు" నని భావించి యట్లు వ్రాసియుండును! కావుననే "ఇంతనుండి యఱ్ఱాప్రెగడవారు చెప్పిన ఆరణ్యపర్వశేషము అని కొన్నిటియందును, "ఇంతనుండి చదలువాడ యెఱ్ఱాప్రగడవారు చెప్పిన ఆరణ్య పర్వముశేషము" అని కొన్నిటియందును వ్రాయఁబడియున్నది. "నన్నియభట్టకవిత్వము సంపూర్ణము" అనునది తాటియాకు పుస్తకములందు లేనే లేదు మఱియు, "శారద రాత్రులు..." అనుపద్యముకడపట, "పాండురుచిపూరితసర్వదిగంతరంబులై" అనుపాఠము "పూరములం బరిపూరితంబులై" అని మాఱి "పూరము లంబరపూరితంబులై" అని తుదకుఁ

"పూరములఁ + పరపూరితంబులై" అను పాఠాంతరమై పదవిభాగమేర్పడఁగా, "అక్కడనుండి యితరులు పూరింపవలసివచ్చిన" దను నర్థముతో నొకకథపుట్టియుండ, ఆకథను విన్న యే లేకరియైన "ఇంతనుండి యెఱ్ఱాప్రెగడకవిత్వ" మని వ్రాసిన దేని యైయుండును.

(2) ఆరణ్యపర్వోత్తరభాగము ప్రబంధపరమేశ్వరుఁడు రచింపలేదనుటకుఁ బ్రబలకారణము నొకదానిని జూపుచున్నాను.

ఎఱ్ఱన రెడ్లయాస్థానకవిగదా! ఆతని తరువాత నచిరకాలముననే యయ్యాస్థానియందే మహాకవిగా నున్న శ్రీనాథుఁడు, తెలుఁగుభారతముకర్తలు నన్నియతిక్కనలే యైనట్లు భీమఖండమున నిట్లు వ్రాసియున్నాఁడు.

"క. నెట్టుకొని కొలుతు నన్నయ, భట్టోపాధ్యాయ సార్వభౌముని గవితా, పట్టాభిషిక్తు భారత, ఘట్టోల్లంఘనపటిష్ఠగాథ ప్రతిభుఁ. ఉ. పంచమవేదమై పరగు భారతసంహిత యాంధ్రభాషఁ గావించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁడ, క్కాంచనగర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింతు నిర్వంచితకీర్తి వైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్."

ఆరణ్యపర్వశేషము నెఱ్ఱన వ్రాసినట్లు శ్రీనాథుఁడు పొగడకపోవుటం దలంచి కాఁబోలు శ్రీ:వీరేశలింగముపంతులవారు తమ కవులచరిత్రము 417 వ పుటయం దిట్లు వ్రాసినారు:— "కవిత్రయములో నెఱ్ఱాప్రెగ్గడ యప్పటి కాధునికుఁ డగుటచేతఁ బొగడకపోయినను దాను రచియించిన యితరగ్రంథములయం దీకవి యాతనిఁ జేర్కొన్నాఁడు."

శృంగారనైషధ మీభీమఖండముకంటె ముప్పదియైదేండ్లకు మున్నే రచియింపఁబడినదని శ్రీపంతులవారే వ్రాసియున్నారుగదా! శ్రీనాథుఁడు నైషధమున నెఱ్ఱన నిట్లు పొగడియున్నాఁడు:— "ధీరమతి నన్నపార్యుని దిక్కయజ్వ, శంభుదాసుని గిరమర్థి సన్నుతించి" నైషధమునఁ బొగడఁబడినయెఱ్ఱన భీమఖండమునాఁటికి(35 ఏండ్లకుఁ దరువాత)నాథునికుఁ డెట్లగును?— ఆరణ్యపర్వములోని యంతగొప్పభాగము నెఱ్ఱనయే రచించెనేని, యారెడ్లసంస్థానమునందే యుండిన శ్రీనాథున కావిషయము తెలియకపోవుట యసంభవము. మఱియు నన్నియభట్టు వనపర్వము నంతను వ్రాసినాఁడనుటయే శ్రీనాథుని యాశయమైనట్లు పైకందములోని "భారతఘట్టోల్లంఘనపటిష్ఠగాథ ప్రతిభుఁ" అను విశేషమునుబట్టి గ్రహింపవచ్చును. (ఘట్టము= అరణ్యప్రదేశము. భయంకరమైన భారతారణ్యపర్వమును దాఁటిన ప్రజ్ఞగలవాఁడని భావము.) శిథిలభాగపూరణము శ్రీనాథునివంటి వానికొక ఘనకార్యముగాదు.

(౩) మడికి సింగన పూర్వకవిస్తుతి నిట్లు గావించినాఁడు:— "వ్యాస..., సకలభాషారసజ్ఞులసముల నన్న, పార్యతిక్కకవీంద్రుల నభినుతింతు" (వాసిష్ఠరా.) శ్రీవీరేశలింగము పంతులవారు, ఇక్కడి యెఱ్ఱాప్రెగడను బొగడకుండుటనుగూర్చి యిట్లు వ్రాసినారు. "ఈకవి యెఱ్ఱాప్రెగడకు మిక్కిలి తరువాతివాఁ డయినను ప్రబంధపరమేశ్వరు నేల స్తుతింపలేదో తెలియదు." ఆంధ్రకవులలో శంభుదాసుని

స్తుతింపనికవులు పలువు రుండఁగా, వారిచరిత్రమున వ్రాయని యీ వాక్యము నిచ్చట నేల శ్రీపంతులవారు వ్రాసిరో యని యారయ, సింగనకవి తనపద్మపురాణమున నాంధ్రభారతమును నన్నయతిక్కనలుమాత్రమే రచియించినట్లు పొగడినపద్యము గానవచ్చినది!:—

"ఉ. భారత వేదవాక్యరసభావము లజ్ఞు లెఱుఁ
గలేక ని, స్సారమనస్కులై తిరుగు చం
దము సూచి తెనుంగుబాస వెం, పార
రచించి యందఱఁ గృతార్థులఁ జేసిన
పుణ్యమూర్తులర్, సారమతి న్భజింతు నని
శంబును నన్నియతిక్కనార్యులర్.

(సింగనామాత్యుఁ డెఱ్ఱన కేఁబదియేండ్ల తరువాతివాఁడు.) ఈతఁడుమ శిథిలభాగపూరణము నొక ఘనకార్యముగా నెంచియుండఁడు.

(౯) నన్నియయనంతర మధ్వాచార్యులుగూడ విరాటపర్వము మొదలుకొనియే భారతాంధ్రీకరణమొనర్చెనని కవుల చరిత్రము దెలుపుచున్నది. ఈ వ్రాతసయితము నన్నియ మూఁడుపర్వములం దెలిగించె నని తెల్లము సేయుచున్నది. ఎట్లన, ఆరణ్యపర్వము కొఱవడియుండునేని, మతిభ్రమణమును గాని మరణమునుగాని సరకుసేయని (జైనుఁడైన) యాతఁడు దానిని దప్పక పూరించియే యుండును.

(౧౧) చెదలువాడ మల్లయ్య తనవిప్రనారాయణచరిత్రమున "ప్రతిభమైనారణ్యపర్వశేషము జెప్పె" నని యెఱ్ఱనను బొగడియున్నాఁడు. ఎఱ్ఱనకు మల్లయ్య ౭,౮ తరముల తరువాతివాఁడు. (పీఠికాకారుల కాలనిర్ణయము సరియైనను తరములసంఖ్య పొరఁబాటు.) ఆతఁడు, తనకాలమునాఁటికిఁ బ్రబలిన వాడుకనుబట్టి యట్లు వ్రాసియుండు నని పైని వ్రాయఁబడిన కారణములవలన నూహింపవచ్చును.

(౧౨) "ఆకాలమునందలికొన్ని ప్రతులు వనపర్వశేషము లేకయే కనంబడు చున్నవి." అనుకవిచరిత్రములోని వాక్యము భ్రాంతిజనకము. ఏమన, ఏఁడెనిమిదివందలయేండ్లనాఁటి తాటియాకులపొత్తము లిక్కాలమునఁ గనఁబడుట కడుదుర్లభము. తాళపత్రగ్రంథభాండాగారములఁ జూచువారికి, ఒక్కవనపర్వమే కాక యెల్లపర్వములును సగసగము వ్రాయఁబడినవియుఁ గానవచ్చును. ఒకవేళ ఆవనపర్వశేషము లేనిప్రతులు కొన్నియున్నయెడల, అవి నన్నియమరణప్రవాదమును విని భయపడి వ్రాయమానిన యేలేఖకునిప్రతినుండియో వ్రాసికొనఁబడిన (రెండుమూఁడువందలయేండ్లనాఁటి, ప్రతులై యుండును. కావుననన్నియ సగముపర్వమువ్రాసె ననుటకు నిది యొక కారణము గాదు.

(౧౩) ఒకకవీంద్రుని మొదటిగ్రంథములోని కవిత్వముకంటెఁ దరువాతివానిలోని కవిత్వ ముత్తరోత్తరాభివృద్ధిఁ గని యొప్పమీఱుట స్వభావము. ఆరణ్యపర్వోత్తరభాగకవిత్వమంతయు నెఱ్ఱనదే యై యున్నచో, దానితరువాత వ్రాయఁబడిన నృసింహపురాణాదుల కవిత్వము దానికంటె క్రమముగా జానుమీఱి యుండవలయునుగదా! అట్లు గాక యది మిక్కిలి తగ్గియున్నది. ఆరణ్యపర్వ

మును విడిచితిమేని తక్కినవి యథోత్తరశ్రేయ ములై యున్నవి. ఎఱ్ఱనమహాకవి కవిత్వము తగ్గిపోయిన దనుటకంటె, నారణ్యపర్వమున నాతఁ డొనర్చినది శిథిలభాగపూరణ మను టయే మేలు.

(౧౮) ఆరణ్యపర్వోత్తరభాగము తిక్కన యెఱ్ఱనల నడిమికాలమున నుప్పెన్నమైపోఁగా నెఱ్ఱన పూరించె నని కొందఱు వ్రాసినదియుఁ బ్రమాదమే.

ఏవంవిధము లగు ననేక కారణములచే నన్నయభట్టారకుఁడే మొదటి మూఁడుపర్వ ములను సమగ్రముగ రచియించినట్లును, అం దారణ్యపర్వముమాత్రము ప్రచారములేమిఁ గాలక్రమమున విశ్లథముకాఁగా, ఎఱ్ఱాప్రెగడ పూరించినట్లును నిర్ధారణమగుచున్నది.

అనేకహేతువులు గానవచ్చుచుండఁగా, ఎన్నఁడో మృతినొందిన నన్నియపేర,మూఁడు వందలయేండ్లయినతరువాత నెఱ్ఱాప్రెగడ రచి యించి (యసత్యప్రకటనమొనర్చి)నాఁ డనుట కంటెఁ బైసిద్ధాంత మెంతయు నొప్పును గదా?

అడిదము సూరకవి మొదలగులక్షణ గ్రంథకర్తలును, జక్కన, మల్లయ్య మొద లగు ప్రబంధకవులును, ఎఱ్ఱాప్రెగడ, ఆరణ్య పర్వశేషము విరచించినట్లు వ్రాయుట, అప్ప టికిఁ గలవాడుకనుబట్టియేమైయుండును. శిథిల భాగపూరణ మనుకొనఁబడునది కాలక్రమ మున గ్రంథరచనముగా మాఱిపోయియుండు ను. ఆంధ్రకవులచరిత్రములోని—నన్నియ, అథర్వణాచార్యభీమకవ్యాదుల గ్రంథములఁ గాల్పించె ననుకథలు, నన్నియపద్యమును రాజరాజు పంపఁగా, తిక్కన దానికి తమ్ముల పురంగుపూసె ననుకథ, పినవీరభద్రునకు సర స్వతి జైమినిభారతమును వ్రాసిపెట్టుచు బావ గారు వచ్చినారని లేచిపోయినకథ, ఆంధ్ర శబ్దచింతామణిగ్రంథమును బాలసరస్వతులకు సారంగధరుఁ డిచ్చె ననుకథ, కుమ్మరగురు నాథునికథ— వ్రాయఁబూనిన నిట్టి వెన్ని యేని గలవు—మొదలగు మూలములేని కథలే గోరంతలు కొండంతలైనప్పుడు, వన పర్వమునుగూర్చిన శిథిలభాగపూరణకథ కాల క్రమమున రచనకథగా మాఱుటయం దాశ్చ ర్యమేమి గలదు?

సింగరార్యకవిచే రచియింపఁబడి, చెన్న భూపాలునికిఁ గృతియీయఁబడిన “ఆంధ్ర బిల్హణీయమహాకావ్యము” నపహరించి తన పేర వెలయించుకొనిన “పండిపెద్దకృష్ణస్వామి” వలె ద్రోహచింతనము గలవాఁడు గాఁడు గావున, మహానుభావుఁ డగు శంభుదాస మహాకవి నన్నియయారణ్యపర్వమున కొన్ని చోట్లు లచ్చటచ్చట జీర్ణములు గాఁగా, వానిని పూరించి మొదటికవియశస్సును గాపా డుటకై యాతనినామమును, ఆతఁడు హృద యపూర్వకముగఁ గృతియిచ్చిన రాజనరేం ద్రునినామమును జెఱుపక, అట్లే నిలిపియుంచు టయేకాక యాచంద్రార్కముఁ దనపేరు గూడఁ బుడమిపై నిలిపికొనినవాఁడై, పర లోకమునను, నన్నియతిక్కనలను జేరి నిరతిశ యానందమునను భవించుచున్నవాఁ డయ్యెను.

“చిత్తశుద్ధి గల్గి చేసిన” సత్కార్యమల్ప మైన నేమి ఘనశ మనల్పమే!

# సస్యలక్ష్మి

## జంధ్యాల వేంకటశివకవులు

సమయముదయము; పుష్యమాసంపుదినము
తారకానాథుఁ డపరదిక్తటమునందుఁ
గ్రమముగాఁ గాంతిహీనుఁడై గ్రాలుచుండె;
కొక్కరోకోయటంచును కుక్కుటములు
కూయుచుండెను అటనట గొంతు లెత్తి;
కాఁపుటిల్లాండ్రు భుజములఁ గడవ లుంచి
నీటుగా నూరబావులనీటికొఱకుఁ
బోవుచును గోడెగాండ్రను ముద్దులొలుకు
పలుకులను బలుకరించుచుఁ గులుకునగవు
లలరఁ బోవుచునుండిరి యాసగొలిపి;
"హరిరొరంగాహరీ" యంచునరపు లిడుచుఁ
జిఱుతలం గేలఁబూని తంబురను నొక్క
చేత నుంచియు నున్ననిశిరముపైని
తామ్రపాత్రము నుంచి సాతానిభక్తుఁ
డడుగు వేయుచుఁ బాడుచు నడచుచుండె;
కుప్పనూర్పుడులం జేసి గోగణంబు
గంతు లిడుచుండె; నలగృహాంగణములకును
కూరగాయలు తట్టలఁ గోసి యెత్తి
విక్రయముచేయఁ బట్టణవీథులకును
బోవుచుండిరి కాఁపులు, పువ్వుఁబోండ్లు;
అమ్మరో! ముగ్గులను వేయుమనుచు నాఁడ
పిల్లకాయలు పూలు గొబ్బిళ్ళకొఱకు
సంగ్రహించుటకయి సహచరులఁ గూడి
పరువులెత్తుచు లలితలావణ్యమైన
పాదులం జేరి వెదకుచు వచ్చుచుండి
రరుగొ; వ్యవసాయకులు సాలులందముగను
దేహమంతట దిటముగాఁ దీర్చి కప్పి
యేఁగుచుండిరి సస్యసమృద్ధిఁ జూడ;
స్వప్నసంచారశాంత్యవస్థలను వదలి
యెల్లరును నిత్యకృత్యములెల్లఁ దీర్చు
కొనుటకై చనుచునుండిరి కొలనులకును;
వెండిపన్నులసన్నాయి నొండుఁబట్టి
హృద్యముగఁ బాడు మంగళవాద్యకులను
జూచుచును బ్రకృతిచిత్రంపు చోద్యములకుఁ
దన్మయత్వముఁ జెంది చిత్తమ్ము హర్ష
వారిధితరంగముల ముంచఁబడుచునుండె;
వీక్షణప్రసార మొనరింప వీలులేని
మాదిరిన క్రమ్మినట్టి హిమమ్మునుండి
బాలభానుఁడు దన ప్రభావంబుఁ దక్కి
మెఱయుచుండెను బంగరుబరిణపగిది
ఇట్టులే కొంతదూర మేనేఁగ నచటఁ
బ్రకృతిపరిణామమందుఁ జిత్రములవెన్నొ
కన్నులకుఁ బండువొనరింపఁ గర్ణపర్వ
ముగను ఆ ప్రక్కచేనిలో ముదితయొకతె
నిగనిగలు గేరు నల్లని నెరులు దువ్వి
కొండి చనఁ జట్టి బంతిపూదండఁ బెట్టి
తొట్రుపడుచున్న పాదాలతోడ నోఁగు
కూరఁ గోయుచు స్వాదుగానారసమున
మనసు కరఁగించి నీతిబోధనముసేయు
ఏలపాటను మధురిమామృతరసమ్ము

లుట్టిపడఁ బాడుచుండె; వేఱొక్కమూల
వంగలును మిరపలును గూడఁ బండియుండ
పైరుఁ జేయఁగ రైతు కాపాడుఁ గనుఁడు!
పూఁతతోఁ గాయతోడను మురియుచుండి
ఘుమఘుమాయించుకొత్తిమెర గుప్పెఁడంత
కోయఁగా నప్పుడే మది కోరుచుండు;
పిందెచేఁ గాయచే శోభఁ జెందు సెనగ
చేలమిసమిసఁ జూడు మాచెంత, కంది
కాయలును ముదిరినందున గలగలమను;
అన్ని రకముల ప్రత్తి కాయలును పండి
విచ్చియున్నవి, యజ్ఞోపవీతములకు
కొంచె మడుగుమ; నూర్చినకొమ్ము పెసలు
గోతములఁ బట్టి రిచ్చట; గొంతు నెత్తి
"జొన్న చేనున మంచెపై నున్న కాఁపు
పిల్లఁడా! వడిసెలం బెడ్డ పెట్టి బాట
సారులం జూచి పిట్టలఁ బారఁదోలు
మోయి" యంచును ఆనెంపు నొక్కమాట
వినఁబడుచు నున్న; దాత్రోవ వెళ్లువారు
చేనిలో మెల్లఁగా దూరి చిన్నదోస
కాయలం ద్రుంపి మూటలోఁ గట్టినారు
చూచితివ; తంపటిని బెట్టి జొన్నకంకు
లల్లదే కొటుచున్నారు అచట; నొక్క
తట్టలోఁ బచ్చగడ్డిని గట్టుపైనఁ
గూరుచుండియు నాసతోఁ గోయుచున్న
పడుచు యెదురుగ లేఁదూడబర్రె యొకటి
మేయుచున్నది. ఆతోఁట మిగుల మంచి
క్షేమనఁగ: నిమ్మలును దబ్బ లెక్కువైన
యూటఁ గలిగియు పెద్దవై యుండు; కమల
ఫలములును రుచ్యములు; ఆమ్రఫలము లిందు
పలురకంబులుగల వవే వరుస, చైత్ర
మాసమందున దినవచ్చు; మంచినారి
కేళములు నున్న; నీతోఁటమాలి చాల
బుద్ధిమంతుఁడు నుత్సాహమున మెలంగు
వాఁడు సుమ! చూడఁగోరిన భార మనక
పూలజాతులు, పొదరిండ్లు, ముఖ్యమైన
వానినన్నిఁటి నెఱిఁగించువాఁడు సఖుఁడ!
తనివిదీరఁగ కమ్మనితావిఁ బీల్చి
దేశమాతను బూజించునాశఁ గలిగి
జరుపుమా కాల మింక నైన భరతపుత్ర!
నవ్యసౌభాగ్యమతిమోహనమ్ములైన,
అనఁటి మొక్కలు లేఁతవై యవిగో? ప్రక్క
బాగుగాఁ బెరిగి పుర్వ్యచే నూఁగుచున్న
జనపచేలను గనినచో సంతసమ్ము
కలుగకుండదు పూర్వపుకథలు మఱల
జ్ఞప్తికిని రాకయుండవుగాదె? అవిగో
పెద్దకుసుమలు, సన్నాలు, పిన్నకుసుమ,
రామసాగరధాన్యముల్ రాసిఁ జేసి
గణపతిని ఉంచినారలు గాంచు; మెపుడు
సంపదల నిచ్చి ప్రాణరక్షణముఁ జేయు
సస్యలక్ష్మికి నానమస్కారశతము.

(పూఁదేనెనుండి)

# శ్రీకృష్ణ తులాభారము

పారనంది జగన్నాథస్వామి గారు ఎం ఏ. ఎల్. టి.

నాటకమునకు ప్రదర్శనధర్మము ముఖ్యగుణమైనా ప్రదర్శనమునకే ఉపచరించేవి, సారస్వతములో నిలిచేవి, అని రెండు రకములుగ నాటకములను విభజింప వీలున్నది. ప్రదర్శనఫలము మాత్రమే కోరు నాటకకర్త శిల్పి అగుననిన్నీ కవికానేరడనిన్నీ అభిప్రాయము. ప్రదర్శనమునకు రంగచాకచక్యము ఎంత ఆవశ్యకమో వాఙ్మయమునకు కవిత్వము అంతకంటె ఎక్కువగా ఆవశ్యకము. కథారచన, శైలి, సహృదయరంజనము, పాత్రపోషణము, నిర్దుష్టత్వము-మొదలైనవి కవిత్వమునకు ప్రధానధర్మములు. ప్రదర్శనమునకే వ్రాసే నాటకములలో ఈగుణములు లేవు అనేటంత అల్పస్థితిలో ఉండుట చేతనే వందలకొలది ధనము ఆర్జించగలిగే సురభికంపెనీవారినాటకములు వాఙ్మయగ్రంథములు కాలేకున్నవి. రంగస్థలమున ప్రదర్శించేటప్పుడు ప్రేక్షకులను, వారి హర్షధ్వనులను విస్తారముగా జమచేయగలిగిన నాటకములన్నీ అంతమాత్రాన వాఙ్మయస్థానమునకు అర్హములు కావు. నాటకకవిశిఖామణియైన షేక్సుపియరు తన నాటకములన్నీ ప్రదర్శనమునకై వ్రాసెననే సంగతి మరిచి ఈచర్చ చేయలేదు. ప్రదర్శనమున బాగా ఉండుట గ్రంథమునకొక లోపమనిగాని, ప్రదర్శనమున బాగా ఉండేది సారస్వతములో నిలవదనిగాని, బాగుండనిది నిలుచునని గాని, ఇట్టి ఏవ్యాప్తినైనా అంగీకరించలేదు. ప్రదర్శనమున నాటకము బాగా ఉండుటకు లక్షణములు వేఱు, గ్రంథముగా నచ్చుటకు లక్షణములు వేఱు, అనే భేదమును నొక్కి చెప్పటయే ఈచర్చకు ప్రయోజనము.

పోతుకూచి సుబ్బయ్యగారు ఎం.ఏ.ఎల్.టి. పరీక్షలలో ఉత్తీర్ణులు. "ఆంగ్లేయతత్వకళాధినాథులు; బోధనాశక్తి సంపూర్ణులు; పండితవంశోద్భవులు." అట్టి ఉభయసంప్రదాయవిదులైన గ్రంథకర్త వారి శ్రీకృష్ణ తులాభారనాటకములో ఏధర్మమును, ప్రదర్శనసారస్వతధర్మములలో దేనిని, ఎక్కువగా పాటించినారో అనే ప్రశ్న కలుగుచున్నది. నాటకముయొక్కఉత్కర్షనువర్ణించినఆగ్రంథకర్త ఆగ్రంథములపై అభిప్రాయములు ఒసంగినధీమంతులందరూ ప్రదర్శనమున నాటకము చక్కగా రాజిల్లెననే అంశమును నొక్కి నొక్కి చెప్పుటకు ధ్వనియేమైనా ఉన్నదా అనే సంశయము పుట్టుచున్నది. నాటకముగా రచించుటకు పురాణసంబంధమైన ఈ కథను ఎంచుటలో గ్రంథకర్త అభిప్రాయము ఏమైయుండునో ఈ కథను సూచించుపటమును చూచునప్పుడు, శ్రీ కృష్ణ శ్రీరామనామో

చ్చారణ చేయునపుడు గ్రంథకర్త హృదయమున ఉప్పొంగిన భావములు చదువువారికంటె వినేవారికి ఎక్కువ ఆహ్లాదకరముగ నుండును. "దైవమహిమ" గల దివ్యపురుషుడు కథానాయకుడు. అమానుషమైన మహిమచర్యలు నాటకమునకు వస్తువు. స్వర్గమునుండి వచ్చే నారదుడు, అన్నిచోట్లను కనబడే కృష్ణుడు, తులసీదళమాహాత్మ్యము, ఇవన్నీ పురాణ సంప్రదాయములో పెరిగిన ప్రేక్షకులకు చక్కగా రుచించును. పామర పండిత భేదము లేకుండా అందరికి ఆబాల గోపాలము ఈకథ తెలిసినదే. ఇంద్రశచీదేవులను భంగపరిపించైనా పారిజాతము తెప్పించుకొనగలిగిన సత్యభామకు పూర్వము కంటె ఎక్కువగా గర్వము ఉద్రేకించుటచేత, ఆమె కూర్మిని గోరు శ్రీ కృష్ణునికి ఒకవైపు, లోకసంగ్రహమే ప్రధానకార్యముగా పెట్టుకొనిన నారదునికి ఒకవైపు, సత్యభామాగర్వభంజనము ఆవశ్యకమైనది. ఇందుకు ఆమె సవతి రుక్మిణి సాధనమాయెను. దానానంతరము నారదునినుంచి భర్తను తిరిగి సంపాదించుటకు మార్గము కనబడనందున కలవరపడి కొట్టుకొనుచున్న సత్యభామ శ్రీ కృష్ణుని ఆదేశానుసారముగ రుక్మిణీపాదములపై పడి శరణు వేడవలసివచ్చినది. తాను వేసిన స్వర్ణవజ్రమాణిక్యములకు సరితూగని కృష్ణుడు రుక్మిణివేసిన ఒక తులసీదళమునకు తూగగా సత్యభామకు సిగ్గువచ్చినది. ఈకథ చాలునుప్రేక్షకులమనస్సులను ఆకర్షించుటకు. శ్రీకృష్ణనటుని చూచి పరవశులై, అతనిపాదరజస్సు శిరస్సునధరించుటకుఉద్యుక్తులగుపుణ్యా

రుషులు నాటకశాలలలోఉన్నప్పుడు, హర్షధ్వనులకు ఏమి కొదవ? తులసి అదృష్టమేమో కానిఅన్నిమతములవారికిశైవవైష్ణవస్మార్తులకందరికి పుణ్యప్రదమగుటచేత, దానిమహాత్మ్యమును చూచే రుక్మిణీపతకపాతుఁలీ నాటకస్థ్రమాడుచున్నప్పుడు పారవశ్యము పొందరా? ఇట్టికథను ఎంచుకొనిన కవి గొప్ప అదృష్టవంతుడు. అందుచేతనే అన్నివిషయములలోవలె నాటకవిషయములో కూడా మనము పురాణయుగమును దాటలేదని ఒప్పుకోవలసియున్నది. పాశ్చాత్యదేశమున నాటకారంభదశలో ఉద్భవించిన మహిమల నాటకముల*వంటి నాటకములు మన వాఙ్మయమున ఇప్పటికు రాజిల్లుచున్నవి. వాటినుండి నీతులను సంగ్రహించి, కథాపురుషులను దేవులుగ ఆరాధించి, కథాచర్యలను ఈశ్వర మహిమలుగ భావించి ఆనందమగ్నులగుచు నాటకమును మెచ్చుకొనే ప్రేక్షకులు పురాణయుగమును దాటినవారు కారుగదా. ఇట్టి కథ ఈరోజులలో సులభముగా రంగస్థలమున సంతోషపెట్టును. ఇక, రంగస్థలమందు ఏర్పాటులు, తెరలు, వేషములు, నటుల రూపు రేఖావిలాసములు, రంగమున జూపుసామగ్రిదీపములు,—ఈమొదలైనవి ప్రేక్షకులను రంజింపజేయుటకు తగినసాధనములు. అందుచేత ప్రదర్శనమున నాటకము బాగా ఉన్నదన్నంత

* Of Mystery and Miracle plays

మాత్రాన సారస్వతమునకూడా బాగాఉన్న దని అంగీకరించినట్లే కానేరదు.

కాని సారస్వతమునకు ఉపచరించేటట్లు రచింపవలెనని గ్రంథకర్త ప్రయత్నించినట్లు వారి యుపోద్ఘాతమువల్ల తెలుస్తూఉన్నది. పాత్రపోషణ నాటకమునకు ముఖ్యము. నాయకుని పాత్రపోషణ విషయమై కవి చాలా శ్రద్ధ వహించినట్లు వ్రాసియున్నాడు. అంతేకాక తన గ్రంథమును పఠనీయపుస్తకముగా విశ్వవిద్యాలయమువారు నియమించేటట్లు ప్రయత్నిస్తూ ఉన్నారు. నాటకరచనలో కూడా అట్టిపూనికి చూపి ఉంటారని మనమునూహించగలము.

ఈ నాటకకథకు మూలము లోకమే కాబోలు. దీనిని ఎక్కడనుండి సంగ్రహించెనో కవి చెప్పలేదు; పటావలోకము ఆతనిని పురికొల్పినట్లున్నది. అందుచేత కవి స్వతంత్రకల్పన లేవో, మూలమునుండి గ్రహించినవేవో నిర్ణయించి చెప్పుటకు ఆధారము లేదు. కాని ఈ కథాభాగములు అనగా దేవేంద్రుని కథలోనికి తెచ్చుట, కృష్ణుని కోపమునకు కారణము కల్పించుట, కథనుండి గ్రహించిననీతి, ఇవి లోకములో ఉన్నకథలో ఉన్నట్లు తోచదు. సత్యభామాగర్వోద్రేకమువల్ల రుక్మిణి, గోపికలు, లోకము, తుదకు కృష్ణుడు కూడా వ్యథనొందినట్లు చెప్పితేనే కాని సత్యభామాపరాభవమునకు కృష్ణుడు సర్వాంగీకారము ఇచ్చినట్లు వర్ణించుట సమంజసముగా ఉండదు. ఆలాగు మొదటిఅంకము అవశ్యకమే. తనతో కలిసి వెన్నెలరాత్రిని గడుపుటకు కృష్ణుడు ఇంకా రాలేదేమని రానంతసేపూ వగస్తూతీరా వచ్చినతరువాత బెట్టుకొరకు అతనిని నిరాకరించిన సత్యభామపై కృష్ణునికి కోపము వచ్చుట సహజమే. సత్యభామాగర్వాతిశయము యొక్క పరిమితి చూచుటకు ఈ భర్తృనిరాకరణము ఒక చక్కనిమానము. నారదుని పన్నుగడకు కృష్ణుడు ఏల సహకారి అయినాడో ఈ అంకములోని కథవలన తెలియుచున్నది. మొదట అంకములోని కథవలెనే రెండో అంకములోని కథకూడా కవియొక్క కల్పన అని నాయూహ. పారిజాతాపహరణమువలన సత్యభామపై శచీంద్రులకు గల అసూయను చూపి, ఇట్లు అన్నిలోకములలోను ఆమె గర్వోద్రేకము ఎట్లు ప్రబలియున్నదో సూచించి, ఆమె గర్వభంగమునకు ఏర్పరచిన పన్నుగడపైగాని, నారదునిపైగాని మనకు ద్వేషము కలుగకుండా మనభావములను సరిపెట్టుటకా? లేక శచీంద్రులకు వారిద్వారా మనకందరికిన్ని కృష్ణుని మహత్వమును రుజుపుచేసి, వారిపై ఉన్నస్త్రీలోలత్వనిందను పోగొట్టుటకా, ఈ రెండో అంకములోని కథాభాగము? శచీంద్రుల సంభాషణవలన సత్యభామాగర్వము, కృష్ణుని స్త్రీలోలత్వము ద్యోతితములగుచున్నవి. ఈ కథే . కాకుండా కృష్ణలీలలవర్ణనకూడా ఈ అంకములో ఉన్నది. కాని గర్వభంజన కథకున్ను ఈలీలకున్నుసంబంధము కనబడదు. రెండో అంకములో ప్రారంభమైన ఈచిక్కు నాటకమునంతా ఆవరించినది. మూడు, నాలు

ఐదు అంకములలోని కథ, అనగా భర్తృప్రయోజనము దానోపదేశము, ఆవ్రతము, తులాభారము, భర్తృసంపాదనము, ఈకథ క్రమముగా నడుచును. ఇదంతా గర్వభంజనకథాభాగమే కదా!

గర్వభంగనిరూపణము, స్త్రీలోలత్వఖండనము, ఈ రెండింటిలో ఏది ఈనాటకమునకు ప్రయోజనము ? ఒకటా, అయితే ఏది? రెండు, అయితే ఏకత ఎట్లు కుదురును? గర్వభంజనమునే కవి లక్ష్యమందుంచుకొనెనని చెప్పలేము. "పామరులు భగవద్గీతా సంప్రదాయము తెలియనివారు శ్రీకృష్ణుడు కేవల * మింద్రియలోలుడని తప్పభిప్రాయము పడుచున్నారు. బాగుగ నాలోచించినచో అట్టి యభిప్రాయమునకు దగిన * ఆధారము లేదు. * వేదాంతవేద్యుడై శ్రీమత్ భగవద్గీతోపదేశకుడైన శ్రీకృష్ణుడు స్త్రీలోలుడగునా? ......నాశక్తికొలది శ్రీకృష్ణుని దైవమహిమకుచితమగు పాత్రపోషణ చేయుటకు ప్రయత్నించితిని." అని కవి తనపీఠికలో వ్రాసియున్నాడు. ఈవిషయమునే నాటకములో కూడా అక్రూరకృష్ణుల నారదేంద్రుల, కృష్ణనారదుల సంభాషణలలో ఉటంకించడమైనది. నాటకపర్యవసానమున వచ్చినఇంద్రునికి ఈ ప్రశ్న వేసే నారదుడు చెప్పినాడు. ఈ హేతువులనుపట్టి కవిహృదయములో ఈవిషయము ముఖ్యముగా భాసిల్లెనని చెప్పకతీరదు. ఈ ప్రయోజనము లోకవిదితమైన తులాభారకథకు ఉన్నట్లు కనబడదు. అందుచేత ఈమార్పు కవి చేసెనని చెప్పకతీరదు; అలాగని దీనినే నాటకప్రయోజనముగా ఉంచలేదు. రెండున్నప్పుడు వాటికి సంగతి యెట్లు? ఒకటి ముఖ్యము, ఒకటి గౌణము అందమా? అన్నా సంగతము కాదు గదా! ప్రేక్షకుల రంజన కొరకనిగాని నారదుని సంతోషపెట్టుటకని గాని లీలల ప్రయోజనము చెప్పితే, నాటక రచనకు లోపము అంగీకరించినవార మగుదుము. ఒకమారు నిరాకరించినంతమాత్రాన సత్యభామకు కృష్ణునిపై మోహాము లేదని ఎట్లు వాదించలేమో, అట్లే ఒకమారు పరాభవించుటచేత భామపై కృష్ణునికి లోలత్వము లేదని ఎట్లు వాదించగలము? అంతే కాక, భామపై గల అనురాగాతిశయముచేతనే లోలత్వభ్రమ లోకములోని పామరులకు కలుగలేదు. భార్యలే కాక వేలకొలది గోపికలు, అప్సరసలు ఉన్నారు కదా! లోలత్వఖండనకు తులాభారకథ చాలదనే లీలలు ఆవశ్యకమైనవా? లీలలే ముఖ్యమైనప్పుడు నాటకముకొరకు ఈకథనే ఎంచుకొనుటకు సారస్యము చాలదు.

ఈ చిక్కును దాటుటకు ఇట్లు ఉపపత్తి చెప్పవచ్చునేమో విమర్శకులు ఆలోచింతురు గాక! భామను స్త్రీజాతికి ఉదాహరణముగా

---

* "కేవల" "తగిన" అనేమాటలను ప్రయోగించుటలో అభిప్రాయమేమైనా ఉన్నదా? కేవలము ఇంద్రియలోలుడు కాకున్నా, కొంతవరకైనా అగునని అంగీకరింతురా? తగిన ఆధారము లేకుంటే ఎటువంటిదైనా ఉన్నదా? ......వేదాంతులైనవారు స్త్రీలోలురగుట అసంభవమా ? "వేదాంతవాక్యంబులు వేరు; ప్రవర్తనా చాకచక్యంబులు వేరు" అని కవే చెప్పించియున్నాడు. లోకములో ఇందుకు ఉదాహరణములు లేవా ? ఈశ్లోకనిదర్శనము కృష్ణునికి వర్తించదనా ? సత్యభామాకథవలన ఈ యభిప్రాయము నిరసింపబడునా?

చేసి, ఆమె పరాభవమును ఆజాతికంతటికి చెందజేసెదమా? లేదా, లోలుడైనవాడు పరాభవింపబడుననే వ్యాప్తిని సిద్ధపరుచుకొని సత్యభామనే పరాభవించినవాడు లోలుడు కానేరడని చెప్పవీలుండునా? లేదా, లీలలచే దైవమహిమ సాధించి, అట్టి మహాత్వము కల వాడుగనుకనే తులలో చిత్రమును చేయ గలిగినాడని చెప్పి, తులాభారకథకున్ను లీల కున్ను సంబంధము కల్పించగలమా? దేనినో ఒకదానిని అంగీకరించక తప్పదు. ఏదైనా డొంకతిరుగుడు సమాధానమే కదా!

ఇంకొక ప్రశ్న, ఈకథకు ముఖ్యులెవరు? కృష్ణుడా? భామా? స్త్రీలోలత్వఖండనమే ప్రధానమైనచో కృష్ణుడు ముఖ్యమగును; గర్వ భంగమే ప్రధానమైనచో భామముఖ్యమగును; ఇద్దరూ ముఖ్యులు కారుగదా. ఇక ఎట్లు?

ఇంతవరకు నాటకప్రయోజనమును విచారించితిమి. ఇక పాత్రపోషణగురించి కొంచెము ఆలోచించెదము దానిగురించి చాలా శ్రద్ధతీసుకొనినట్లు కవి తనపీఠికలో తెలియ జేసెను. లోకసిద్ధమైనకథలోనిపాత్రలు, వారి శీలవివరణము లోకములో చాలావరకు సిద్ధమేకదా! సత్యభామ, ఆమె శృంగారవిలా సములు, ఆమె టక్కు, బెట్టు, గర్వము; రుక్మిణి, ఆమెభక్తి, ఆమెసౌందు; నారదుడు, వాని కలహప్రియత్వము, మాయలు, భక్తి; ఎందులోను వీరివిషయమై విశేషము కాన రాదు. కాని రుక్మిణియొక్కఆత్మ పక్వమైనదా అనేసంశయము కలుగుచున్నది. కృష్ణుని దేవు నిగ తెలుసుకొని, అతనియందు అద్వితీయ భక్తిని గల ఆమె త్రాసులో తులసివేయుటకు వచ్చి, భామను కసితీరా తూలనాడుటలో ఆమె గొప్ప హృదయమునకు ఔదార్యగాంభీ ర్యములకు ఒక కళంకము వచ్చినట్లు అయినది. చూడండి ౯౮, ౯౯ పుటలు. సుందరి కుము దలకు గల తారతమ్యమును శీలభేదమును కొనసవరకు చక్కగా నిలిపి యుంచుట ఒక మంచిసంగతి.

కృష్ణుని దైవమహిమను, భక్తపరా యణత్వమును, దుష్టదండనశీలమును వ్యక్త పరుచుటకు కవి ఉద్దేశించినాడు. కాని లోకులు ఈ గుణములను, అనగా ఈశ్వరాంశములైన ఈ గుణములను మనుష్యస్వభావముతో మేళనముచేసి కృష్ణుని భావిస్తూ ఉంటారు. అట్టి మేళనమును కవికూడా మానలేదు. ఒకమారు సాధారణమనుష్యునివలె ఒక మారు ఈశ్వరునివలె ప్రవర్తించుటలో కలిగే విరోధమును పరిహరించుట ఎట్లు? మొదటి అంకములో కృష్ణుడు మనుష్యుడు; అక్రూరునికి తత్వము బోధపరిచినంత మాత్రాన ఈ శృంగారపురుషుడు మనుష్యుడు కాక ఈశ్వరుడెట్లు అగును? సాధారణ స్త్రీలో లుడు శృంగారబాధలకు ఓర్వజాలక తనవలపు స్త్రీకొరకై చూపు దైన్యమంతా కృష్ణుడు కూడా వెలిపుచ్చును. భామ నిరాకరణచేత వచ్చిన కోపముయొక్క ఫలమే గర్వభంగ ప్రయత్నము. అక్రూరసత్యభామా స్వప్న ముల అర్థ మేమిటి? కృష్ణుడు మనుష్యుడై నపుడే ఆకలలకు అర్థమున్నది. సత్యభామకు భక్తిపురికొల్పుటే ప్రయోజనమైన ఈశ్వర

కృష్ణుడు పారిజాతమును తెచ్చియిచ్చి ఆమె గర్వమును ఎందుకు ఉద్రేకించవలెనో?

ఈ ద్వివిధశీలవర్ణనలో ఉండే చిక్కు-మాట అటుండనిచ్చినచో; కృష్ణుని లీలలవలన సూచించే భక్తినిగురించి కొంచెము విచారింతము. "భక్తికిగదా స్వాధీనుడు ఇతడు" అని నాందీపద్యములోనే ఉండుటచేత భక్తితత్త్వము ఈ నాటకమునకు ఒక ప్రయోజనమని కవి ఆశించినట్లు సూచన ఆగుచున్నది ఈభక్తి ఎట్టిది? స్త్రీని శృంగారపురుషుడు ఆకర్షించి తన్మయత్వము పొందించువిధాన, భగవంతుడు తన భక్తులను ఆకర్షించి తనయందు లయమొందించుననే వైష్ణవమత సిద్ధాంతమును కవి ఆమోదించినట్లు కనబడును. ఎట్లనగా, "నేను శృంగారవేషంబున నీభామను ఉద్ధరించి వచ్చెద" (పుట ౧౨) అని కృష్ణుడు అక్రూరునితో చెప్పినాడు. సత్యభామయెడల చూపిన వాత్సల్యము శృంగార సంబంధమైన కేళీవిలాసములు కావనిన్నీ, భక్తిశాస్త్ర సమ్మతమైన ఆకర్షణలీలలనిన్నీ చెప్పి కృష్ణుడు చేసినదంతా నటన అని అంగీకరించవలెను. చూడండి,"శృంగారవేషంబున" అని ఉన్నది. అట్టినటన శిష్యులకు పాఠములను బోధపరుచుటకున్నూ, భక్తులను ఆకర్షించుటకున్నూ అవలంబించిన సాధన కాని, అట్టికార్యము లేనప్పుడున్నూ అనగా తాను ఒంటరిగా ఉన్నప్పుడున్నూ, తనలో తాను ఆలోచించుకొంటున్నప్పుడున్నూ ఆవేషమునే, అట్టినటననే ధరించుటకు ఏమీ సబబు కానరాదు గదా! ఇంత రమణీయంబె హృదయతృప్తిని గాంచి నియమితకాముడై నిలుచుట" అనే సంసారపాఠమును అక్రూరునికి బోధపరుచుట ఒకటి, శిష్యుడు లేనప్పుడు కూడా ఆ ప్రవాహములో పడి కొట్టుకొనుట ఒకటి. "మోహనాకారమునుజూచి మోదపడుచుఁ బూవుబోణులెల్లను మోసపోదురహహా; సొంపైనరూపముచేతను నంతకంటె నింపైనమాటచేతను, నెట్టి యతివ మనసైనను నపహరింతురు" అని భామ వర్ణించిన శృంగారవేషమునకు శిష్యురాండ్రు ఉన్నప్పుడే ప్రయోజనముకాని, తాను ఒంటరిగా ఉండి భామ తనను ఆకర్షించుటకు ఎట్టిఏర్పాటు చేయలేదని కృష్ణుడు సామాన్యరసికునివలె విలపించుట యుక్తియుక్తముగా లేదు కదా! మొదటిఅంకము తుదను ఉన్న కృష్ణవిలాపమువలన నాటకము వినేవారికి చూచేవారికి కృష్ణునిస్వభావము ఎట్టిదని తట్టునో విమర్శకులు ఆలోచించవలసి ఉంటుంది. తనకు శృంగారాహ్లాదము కలుగలేదని విలపించవలెనా, లేక, తాను శృంగారము చూపి ఆకర్షించేసమయ మొకటి పోయినదని కించపడవలెనా? ఎట్టిది తగిన పాత్రపోషణము? చూడండి. విలాపభాగములలో కొన్ని ముఖ్యమైనవి. "తనలో" తాను అనుకొన్నవి. "భక్తుల బాలింప" "దీనుల మొరవిని" "నైవేద్యతతిగొన", "దాసులప్రార్థనల్ తలచుట", "యోగిహృదయబద్ధుండ"—ఈ మొదలైన

"యెన్ని యపరాధములా చేసియుంటిదీర
ఏమిసేయుదు నను భామ యెఱుఁగనేర."

అని తనలో తాను విలపించుచున్నాడు. భామ

కడకు రాక పూర్వమే. భామ కనబడిన తరువాత లేక అక్కడ దాగియుండవచ్చునని ఊహించిన తరువాత కనబరిచే శృంగార శోకము సమంజసమే. నిరాకరణతరువాత వచ్చినకోపము, కృష్ణుడు చేసిన గర్వభంజ నదీక్ష సామాన్యుల భావములకంటె ఎట్లు అసాధారణములో, ఎట్లు భిన్నములో కవి చూపలేదు. చూడండి. పుట ౨౦ (లేనలో) "నేను బ్రతిమాలినకొలదిని నీమెగర్వ మెంత హెచ్చుచున్నది? ... యతిశయమున్న దే మొ యణగార్చెద గర్వితమానసంబులన్" ఈమా టలు భక్తపరాయణుడైన భగవంతునకు ఉచితమైన వైష్ణవసంప్రదాయభక్తిశృంగార చేష్టలా? లే, తాను వలచి ఉన్నస్త్రీ నిరా కరించునప్పుడు ఉద్వేగముపొందు సామాన్య రసికుని ఆశాభంగకోపమా? ఈచిక్కుకు కారణము కృష్ణుని ద్వివిధస్వభావ మేళనము.

ఈ రచనాలోపము లున్నా, కవిఆశ యముమాత్రము భక్తినిర్వచనమే అని తెలుసుకొనుటకు సూచన లనేకములు నాటక ములో ఉన్నవి. నారదుడు చూచినలీలలవర్ణ నలో అట్టిమాటలు దొర్లినవి. రుక్మిణి అత్యం తానురక్త. రాధ అత్యంతభక్త. భామ అత్యంతగర్వాతిశయతప్త. ఈ సందర్భములో నారదు డన్నపాట ఒకటి ఉన్నది; "ఈ అహంకారము వదిలిననే కాని యామెకు నీ మహిమ గోచరము కాదు." ఇందువలన మ రొకసంగతి ఉల్లిఖితమైనది. శరీరసుఖము, ఇహలోకలాభములు.— వీటిపై గల అభి మానము పోతేనేగాని ఆత్మానందము, పర లోకప్రాప్తి ఎవరికైనా దొరకవు అనే సామా న్యధర్మమును కవి సూచించినాడా? ఇందుకు రుక్మిణీసత్యభామలుఉదాహరణములు. కృష్ణుని మోహనాకారశరీరమే సర్వమని భావించిన భామ అతని దైవమహిమను గ్రహించలే కున్నది. సర్వోత్కృష్టమైన సంపద భక్తే అని చూడలేకపోవుటచేతనే భామ వీగిపోయినది. భక్తిలేని వ్రతము భేషజము. ఆత్మకు శాంతి కలగనిదీ, మనస్సు పక్వముకానిదీ లౌకిక సామ్రాజ్యమునకు విలువ ఉండదు, అది చక్కగ ప్రాప్తించదుకూడా. అవి ఉన్నప్పుడు గడ్డిపరకకైనా విలువ కలుగును. "భగవద్భక్తు లకు వేషములతో పని యేమి" (పుట ౨). భక్తిమిళితమైన తులసీదళముతో భక్తి రహితమైన బంగారమునకు సాటి ఎక్కడ? భక్తులకు ఈశ్వరుడే స్వాధీనుడగుచున్నప్పుడు, ఇక లోకములో ఉన్నది ఏది స్వాధీనము కాదు? అంతేకాక, ఎట్టిహృదయముగలవారికి అట్టి లోకమే అనుభూతమగును. కృష్ణభక్తితో నిండిన ఆత్మలుగల రాధారుక్మిణీ గోపికలకు ఎక్కడ చూచినా కృష్ణుడే. ఏదైనా కృష్ణుడే? భామకో? బాహ్యసుఖము కొరకే లోలమై యున్నప్పుడు ఆదృష్టి యెట్లు సాధ్యపడును? ఈ ఆధ్యాత్మికతత్వము ఈ కథకు బీజమందామా? అంటే బాగానే ఉంటుంది. ఇదే నాటకప్రయోజనమని ఎం దుకు భావించకూడదు? అలాగన్నా నాటక రచనలోను, పాత్రశీలవివరణములోను ఉండి యున్న చిక్కులు పోవు. ముఖ్యగౌణవిభజన చేయుటలోను, అంతటికి ఏకసమన్వయము

ఏకత చక్కగ పట్టేటట్లు చూచుటలోను లోపములను తీర్చవలసి ఉంటుందని నాఅభిప్రాయము.

నా విమర్శనకు నాటకరచనవిషయ పరిశోధనలే ముఖ్యములు. భాషాశోధనతో నాకు ప్రసక్తిలేకున్నా, పుస్తకములో కొన్ని పొరపాటులు ఉన్నవని చెప్పవలసి ఉన్నది. ఇతర లోపములతో పాటు అవికూడా రెండో కూర్పులో పోతవని నాఆశ. ముఖ్యముగా సంస్కృత ప్రయోగములే మమ్మ బాధించేవి. అన్నిచోట్ల "ప్రపంచకము" (పుట ౪, ౩౮, ౪౬, ౫౯, ౭౯) అనేరూపమే కనబడుతున్నది. 'క' ఎందుకు? ఆలాగే 'జన్మజన్మేపి' (పుట ౪౫). ఇట్టివి ఇంకాఉన్నవి. చూడండి ౩౩ వుట; "కార్యనియత పూర్వవృత్తి; అనన్యథాసిద్ధ; దైవికకారణ" ఈ మొదలైన తర్కార్భాట మెందుకు అక్కడ?

పద్యరచనగాని, గద్యరచనగాని క్లిష్టమైనవి కావు. పద్యములలో గుంభన చాలదేమో. పద్యములో చెప్పినసంగతిని, దాని క్రిందే గద్యలో తిరిగీ ఎందుకు చెప్పడము? ఇది దేని సంప్రదాయమోకాని ఇప్పటినాటకములలో చాలాతరుచుగా కనబడుతుంది. ప్రాచీనాంధ్రనాటక సంప్రదాయమేమో అని నాఊహ. ముఖ్యముగా వినేది చూచేది నాటకమైనప్పుడున్నూ, పామరులకు సులభముగా బోధపడవలెను అన్నప్పుడున్నూ ఈ పునరుక్తి పుట్టి ఉండవచ్చును. వీధినాటకములు, బొమ్మలాటలు, భాగవతములు, పురాణముచెప్పుట ఈ మొదలైనవి ఇందుకు నిదర్శనములు.

గద్యపద్యములకు ఛంధస్సే భేదమా లేక వర్ణనాంశములోను, భావవివరణములోను, రచనసొగసులోను విశేషమేమైనా ఉన్నదా? ఈ చర్చయొక్క ప్రాధాన్యము ఆంగ్ల సారస్వత సుపరిచయముగల కవికి సులభముగా నచ్చునుగదా! ఐనచో, ౨౮, ౩౦, ౩౫, ౪౨, ౫౦, ౫౮ పుటలలోని పద్యములను చూడండి. ఇట్టివి ఇంకా చాలా ఉన్నవి. పద్యము లెందుకు? ఉంటేనే కాని నాటకముకాదా? సంగీతమునకు స్థానముండదనా? చక్కని పద్యములు రానపుడు, అక్కరలేనపుడు గద్య ఎంత బాగుంటుంది! తెల్లవారు నప్పటికిఁ బద్యములు తమంతటఁ దామె కుదిరి మనోగోచరము లగుచుండెను. ఆహా! ఏమి చిత్రము; ఏమి అదృష్టము?.. ఈనాటకములో ౯౨ పద్యము లున్నవి. అందులో ౧౪ వృత్తములు, ౩౦ సీసములు, ౪౯ గీతములు, ౩ కందములు. పద్యరచనానిపుణతను తెలుసుకొనుటకు ౧౧, ౩౦, ౫౧, ౬౯, ౯౧, ౯౩ పుటలలోని పద్యములను చూడవచ్చును. ఈభాగములో నా కంతగా ప్రసక్తిలేనందున ఇక ముగించెదను.

---

# రాధవలవంత

మంగిపూడి వేంకటశర్మ గారు

గొల్లవారింట నేను రేపల్లెలోను
రాధనై పుట్టకుండ నరణ్యమందు
వెదురుపొదలోనఁ బుట్టిన బ్రదికిపోదు
విరహవేదనలోఁ బడి వేగకుండ.
వెదురునై యుంటినా ప్రాణవిభుఁడు నన్ను
వేణువుగఁ జేసికొని యెల్ల వేళలందుఁ
గేలఁ గొని మాధురీగానలోలుఁడగుచు
విడిచిపెట్టక కడు గారవించును గద!
నా విభుఁడు నన్నుఁ బిల్లనగ్రోవిగాను
జేసికొని యూదుచుండిన నానదీర
వాని కమ్మని కెమ్మోవి యాని చొక్కి-
యవ్యయానందమున నోలలాడుదుగద!
రుక్మిణీసత్యముఖపురంధ్రులును సతముఁ
బడయఁగా రాని వల్లవీవల్లవేంద్రు
మధురమధురతరాధరసుధను ద్రావి
ధన్యనై మాన్యనై యొప్పుదాననుగద!
అట్టి భాగ్యంబె నిజముగా నబ్బెనేని
మురళిధరు వాతెరను నాతఁ డెఱుఁగకుండ
నల్లనల్లన ముద్దులఁ గొల్లలాడి
యమితసుఖపారవశ్యంబు నందుదుగద!
అట్టి భాగ్యంబె నిజముగా నబ్బెనేని
యష్టమహిషీమణు లసూయ నందకుండఁ
జుట్టపక్కాలు చురచురఁ జూడకుండ
నాకొలమువారు నను జూచి నవ్వకుండ
నళుకులేకుండ బాహాటమై చెలంగ
నా జగన్మోహనాకారు నా మనోవి
హారు నవమారు రామాంతరంగచోరు
స్వేచ్ఛమైఁ గూడి మాడి సుఖింతునుగద!
అహహ! వంశమ! యేపుణ్యమాచరించి
యేమినోములు నోచి నీ వీ ముకుందు
కరుణ కిటు పాత్రమైతివో యెఱుఁగఁ జెప్పి
మాన్పవే! నావగపు బతిమాలుకొందు.
నిన్నె యిలవేల్పుగాఁ గొల్తు నీదుకడుపు
నందుఁ బుట్టుదు, నీ పేరె నందనులకుఁ
బెట్టుకొందును, దయయుంచి వేణుధరుఁడు
కైవసంబగు కిటుకేదొ గరపఁగదవె!
వేణువా! నీవు శ్రీవల్లవీవినోదు
వలచియో వశ్యమంత్ర జపంబు చేయు
నట్లు నా ప్రాణసమునిచే నాలకింతు
నిక్కమో కాదొ చెప్పవే నిజము నాకు?
తమ్ము ధన్యులఁగాఁ జేయ దయఁదలంచి
కృష్ణభగవానుఁ డవతార మెత్తెననుచు
దేవకీవసుదేవులు దివ్యభక్తి
భరితు లక్రూరముఖ్యులు పాండవులును
అష్టమహిషులు గోపీసహస్రములును
యాదవులు నందుఁడును యశోదాదులెల్ల
నెంతు. రదికల్ల; వీరిలో నెవరికైనఁ
గలదె నీపాటి మేటి భాగ్యంబు వంశి!
రాకుమారుఁడుగద యశోదాకిశోరుఁ
డతఁడె కోరిన బూరల కడ్డమేమి?
మేలిమిపసిండితోఁ జేసి మిసిమి మించు
రతనములు దాపినట్టి బూరాల నిడరె?
శంఖశేఖరమగు పాంచజన్యముండ
ఘనతరధ్వాన మొలయు శృంగంబులుండ
వీణాముఖవాద్యములు పెక్కు వెలయుచుండ
నాదరసలోలుఁడగుచు నానందజలధి
వాలలాడంగ నీవె కావలయునటవె?
నీతపఃఫలమున శౌరి నిన్నె కోరె,
నినుఁ గృతార్థంబుగాఁ జేయ నిండుదయను
యాదవవంశమ్యో హరి నిశ్చయంబు మురళి!

# స్వామి వివేకానందుని చరిత్రము

మేడేపల్లి వేంకట రమణాచార్యులు గారు

సర్వజ్ఞుఁడు సర్వశక్తియు నగు నీశ్వరుఁడు సత్య సంకల్పముచేఁ దాను సృజించిన లోకమందు నానాఁటికి దుష్టులు ప్రబలి ధర్మముచెడి అధర్మము హెచ్చగుచుండెడి కాలమందెల్లఁ దా నజుఁడయ్యు రామకృష్ణాదిరూపములతో నిచట నవతరించి అధర్మ వర్ధకు లగువారిని సంహరించి జ్ఞానప్రదానాద్యనేకవిధ ముల సాధువులను రక్షించుచు లోకవ్యవస్థల నెప్పటి యట్ల స్థాపించుచుండునని పురాణేతిహాసాదులలో మన ము చదివియున్నారము. మఱికొన్ని సమయములందుఁ దా నీలోకమునందు స్వయముగా నవతరించుటకు మాఱుగా స్వాంశభూతులు దివ్యజ్ఞానసంపన్నులు నగు మహనీయుల నీ జగమునం దవతరింపఁజేసి వారిమూలము గా నీలోకమును దిద్దుబాటుఁ జేయించుచుండును. అట్లు భగవదంశచే నీభూమియం దనేకస్థలములలో భిన్నభిన్న కాలములందు జనించి తమ జ్ఞానప్రదానముచే చేతనుల నుద్ధరించిన మహానుభావు లనేకులు గలరు. అట్టివారిలోఁ జరిత్రలవలన మనము కొంచె మెఱిఁగినవారు బుద్ధుఁడు; క్రైస్తు; మహమ్మదు జోరోష్టర్; శంకరాచార్యులు; రామానుజాచార్యులు; వల్లభాచార్యులు; గౌరాంగుఁ డు; కొలదికాలముక్రిందట జీవించిన రామకృష్ణపరమ హంస మొదలగువారు. వీరందఱు స్వసుఖనిరపేక్షులై దేహాయాసమును గూడ లక్ష్యముసేయక ఖ్యాతిలాభ పూజలయందు లేశమయిన నభిలాష లేనివారయి కేవల లోకోపకారముకొఱకే తమ ఆయుష్యము నంతయును వ్యయపరిచిన మహాపురుషులు. ప్రకృతోపన్యాసనాయ కుఁ డగు వివేకానందస్వామిగూడఁ బైని జేర్కొనఁబడిన లోకమహత్తరులలో నొకఁ డని మనము దృఢముగాఁ జెప్పగలము.

## జన్మాదివృత్తాంతము

ఈ వివేకానందుఁడు బంగాళాదేశములో సిమోలా యను గ్రామమందు నివసించెడు దత్తయను వ్యవహార నామముతో గూడిన ప్రాచీనకాయస్థకుటుంబములో 1862 సంవత్సరమున జనేవరు తొమ్మిదవ తేదీని బుట్టెను. జననకాలమందుఁ దలిదండ్రులు ఇతనికి నరేంద్రుఁడని నామకరణముఁ జేసిరి. తరువాత నీతఁడు తన ప్రతిభావిశేషము తత్త్వబోధకతాశక్తి, ఆత్మానాత్మ వివేకజ్ఞానము సకలజనహృదయాకర్షకమగు వక్తృత్వ శక్తి మొదలగు ప్రజ్ఞలచే సకలదేశవిఖ్యాతమగు కీర్తిని సంపాదించి వివేకానందుఁ డను పౌరుషనామముఁ బడ సెను. ఈతనిపూర్వు లందఱు ఆస్తిక్యము, దైవభక్తి, శాస్త్రప్రామాణ్యము, మతవిశ్వాసము గలవారై యుండి రని తెలియవచ్చుచున్నది. ఇతనిపితామహుఁడు వార్ధక దశయందు సన్న్యసాశ్రమము స్వీకరించెనఁట. ఈతని జనకుఁడు కలకత్తా న్యాయాధికరణమునందు న్యాయ వాదిగాఁ బనిచేసిజీవించెను. ఇతనితల్లియు మాధత కిరనైన లోకపుస్త్రీలవలెగాక అసాధారణ స్మృతిశక్తి, మేధాసంపద గలదియై ప్రసిద్ధికెక్కినది. తరువాతి కాల మందు వివేకానందునియందు మొలకలెత్తి వితిమీఱిన వికాసమునొంది జగమునంతను నింపునట్లు ఫలించిన గాఢమగు నీశ్వరభక్తి, సూక్ష్మతత్త్వవిమర్శనశక్తి, లోకోత్తరబుద్ధివిభవము మొదలగు ప్రజ్ఞావిశేషములు బీజావస్థతోఁ దొలినీతని కుటుంబస్థులలోనే యున్నట్లు మనము నిశ్చయించుకొనవలయును. ఈతఁడు పెద్దవాఁ డైనపిదప నీతనికి జగత్ప్రసిద్ధి గలిగించిన సర్వభూత మైత్రి, పరోపకారవ్యసనము, ఆత్మశుద్ధి, ఆత్మసంయ మము, ధార్మికత్వము, దైవభక్తి మొదలగు నాత్మగుణము లీతని బాల్యావస్థయందే కానవచ్చెను. స్వభావసిద్ధముగా నితఁడు బాల్యమునుండియుఁ దత్త్వశాస్త్రవిమర్శనమం దభిలాష గలవాఁడైయుండెను. పాఠశాలయందు విద్యా భ్యాస మొనర్చుచున్న కాలములో సంగీతమును హిందూ

తత్వశాస్త్రమునే బహుశ్రద్ధాళువై చదువుచుండెడివాఁడు. పాశ్చాత్యతత్త్వజ్ఞులలోఁ బ్రధానుఁడగు హెర్బర్టు స్పెన్సర్ దొరవారి గ్రంథములయందుఁగూడ నధికారము గనఁబఱిచెను. స్పెన్సరు సిద్ధాంతములపై ఖండన పత్రికవ్రాసి పంపఁగా నది ఆతఁడుచూచి నరేంద్రనాథుని తత్త్వవిమర్శనబుద్ధిచాతురికిఁ గడు సంతసిల్లి నాకు నీపత్రిక అమితానందమును గలిగించెనని ప్రత్యుత్తరమిచ్చినట్లు చరిత్రయందుఁ గానవచ్చుచున్నది. తత్త్వశాస్త్రగ్రంథముల నధికముగాఁ జదివి చదివి తరచఁగా తరచఁగాఁ గొన్నాళ్లకీశ్వరసద్భావమందు సంశయము గలవాఁడ నయితినని ఈతఁడే యొకయుపన్యాసములోఁ జెప్పెను. ఇట్లు కొంతకాలము తనలోఁదాను విమర్శించుకొని తుదకు నాస్తికబుద్ధిని విడనాడెను. పిదప మఱికొన్నినాళ్లు బ్రహ్మసమాజమతము శుద్ధాత్మజ్ఞానము గలిగించునేమో యని పరీక్షించి స్వతంత్రమగు తనబుద్ధి కది సమంజసముగా నున్నట్లు కానరాకుండుటచే దానినుండి తనమనస్సును మరలించెను. పిమ్మట మఱికొంత కాలము తత్త్వ మెద్దియో యథార్థముగాఁ గనిపెట్టుట కమితమయిన మనోవ్యథ నొందుచు ధనము గోలుపోయిన దరిద్రునివలె దైన్యము గలవాఁడై లోకములో నుండు సకలమతకర్తల సిద్ధాంతములను వారు వ్రాసిన గ్రంథములను బరిశీలించుచు దేనివలనను దృప్తి నొందక మానసికాస్వస్థత గలవాఁడై పిచ్చెత్తినవానివలె నుండెను. అపుడు పట్టపరీక్షలో నుత్తీర్ణుఁడై న్యాయవాద్యాజీవిక (Profession of a Lawyer)చే జీవనము చేయుటకు సన్నద్ధుఁడయ్యెను. కాని చిరకాలమునుండి తన మనోగుహలో స్థిరనివాస మొనరించుచున్న యీశ్వరాస్తిత్వవిషయకమైన సంశయాంధకారమును నశింపఁ జేయజాలిన గురుభాస్కరు నెచ్చటను గానక మనోవ్యథ నొందుచునే యుండెను. ఆసమయమున భగవంతుని కటాక్ష మాతనిపై నిండుకొంత ప్రసరించుటచేఁ జిరకాలమునుండి తనకున్న మనోరథములు అన్నియు సఫలమగు కాలము ప్రత్యాసన్నమైనట్లు గాన్పించెను. ఎట్లన నాస్తికబహుళమగు నాకాలమందు ఆత్మజ్ఞానసంసిద్ధి నొంది ఋషివృత్తిగలవాఁడై జగదుద్ధరణశీలుఁడని కీర్తి వహించిన రామకృష్ణపరమహంస కితనిపినతండ్రి శిష్యుఁడైయుండెను. అతఁ డొకదినమం దీవివేకానందుని నారామకృష్ణుని సాన్నిధ్యమునకుఁ గొనిపోయెను. ఇదియే యీవివేకానందునిజీవనము నంతయును బూర్ణముగా మార్చి వేయుటకు ముఖ్యహేతువు. ఉపదేశించుట కుత్సాహుఁడై యున్నగురువగు పరమహంసకు నేర్చుకొనుట కాతురములోనున్న శిష్యుఁడగు వివేకానందునికి నానాఁడు గలిగిన సమావేశమును గన్నులారఁ జూచినవారి హృదయము నీరై ద్రవించెను. జితేంద్రియుఁడై ముక్తసంగుఁడై కాలమంతయు నీశ్వరోపాసనలోఁ గడపుచున్న నా ఋషివర్యుఁడును మన వివేకానందుని శ్రీకృష్ణునిపైఁ బాటలుపాడ నాజ్ఞాపించెనఁట. అందుపై నితఁ డతిరక్తకంఠముతో వినువారికి మిగుల శ్రావ్యముగా శ్రీకృష్ణునిపై గీతములు పాడుచుండఁగా శిష్యబృందముచేఁ బూర్ణమగు నాశ్రమమందు గూర్చుండి వివేకానందుని మధురగానమునకు లోలుఁడై యచటకువచ్చి ఆనందముతోఁ దాండవించుచు నెదుటనున్నట్లున్న యా దేవకినోములపంట యగు చిన్నికృష్ణుని మనోనేత్రముచేఁ బ్రత్యక్షీకరించి భక్తిపారవశ్యముచేఁ బులకాంకితసర్వగాత్రుఁడై కంటికొనలనుండి దిగజాఱెడు నానందబాష్పకణములచేఁ దడిసిన పుట్టములు గలవాఁడై ఆనందసముద్రములో నోలలాడెడు నా పరమహంస నయ్యెడ నొద్దనుండి కాంచిన పరమనాస్తికుల హృదయము లయినను భగవద్భక్తిపరవశములు గాకుండునే? ఆనాఁటికి వివేకానందుఁడు గురువుచే ననుజ్ఞాతుఁడై మఱుసటిదినమందు మరల గురువుగారి దర్శన మొనరించుట కింటికిఁ జనెను.

అప్పటినుండి వివేకానందుడు పరమహంసగారి శిష్యులలో నగ్రగణ్యుఁడై గురుపరిచర్య లొనర్చుచు వేదాంతశాస్త్రరహస్యములను సమగ్రముగాఁ దెలిసికొనసాగెను. మునుపటి మనఃకాలుష్యము సవాసనగా నంతరించెను. మహాత్ములనేకు లాసన్యాసికి శిష్యులైరి గాని వారిలో నొక్కఁడును వివేకానందునివంటి వాఁడు కాలేదు. అత్యుత్సాహముతో గురుశిష్యు లిరువురు నుపనిషన్మతచర్చలతో సుఖముగా గోష్ఠి గావించుచు నానందముతోఁ గాలము గడపుచుండఁగా నది గని సహింపనివానిఁబోలె నీశ్వరుఁడు 1886 వ సం. ఆగస్టు పదునాఱవతేదిని పరమహంసను తనపరంధామము

నకుఁ జేర్చుకొనియెను. పిదప నాతనిశిష్యులందఱు విరక్తులై సంసారసంబంధమును శుద్ధముగాఁ బరిత్యజించి తమ గురువువలె సన్న్యాసివృత్తి నవలంబించి దేశాభివృద్ధికి మతాభివృద్ధికిఁ బాటుపడసాగిరి. వివేకానందుఁడుకూడ వారిలో నొకఁడు. ఇతఁడు వేదాంతమును బ్రజలకు బోధించుచు మతమునే దేశమునం దెల్లెడల వ్యాపింపఁ జేయుట తనజన్మమునకు ముఖ్యప్రయోజనముగాఁ బరిగ్రహించెను. కొంతకాలము తనసహాధ్యాయులతో నిట్లు కలిసి పనిచేసికొన నీశ్వరోపాసనమునకు మోక్షశాస్త్రవ్యాసంగమునకు విజనప్రదేశవాసము మిక్కిలి సదుపాయమని యెంచి హిమాచలమునకుఁ బోయెను. టిబెటుదేశమునకుఁ జని యచట గొన్నాళ్లుండి బౌద్ధమతమునఁ గృషి చేసెను. అదిమొదలుకొని హిందూదేశమం దంతటఁ బ్రయాణములఁ జేయ నారంభించెను. మొదట ఖాత్రీనగరమున కరిగి యా పురము నేలు మహారాజును దనమతములోఁ గలిపికొని యచటనుండి పశ్చిమసముద్రతీరమందున్న తిరువనంతపురము మొదలగుప్రదేశములు చూడఁబోయెను. అచట వాసి చెన్నపట్టణమునకుఁ జేరెను. ఆయాయిప్రదేశములయందున్న దినములలో భరతఖండనివాసు లగు బాలురకు వేదాంతశాస్త్రసిద్ధాంతములను దివ్యజ్ఞానసంపన్ను లగు ప్రాచీనబ్రహ్మఋషుల మాహాత్మ్యమును వారి కాలమందు భరతవర్షముయొక్క ఉన్నతస్థితిని హృదయాకర్షమగు వక్తృత్వశక్తితో బోధించెడివాఁడు.

## అమెరికాదేశప్రయాణము

ఈతఁడు చెన్నపట్టణములోనున్న సమయమున నచ్చటి విద్వాంసులగు కొందఱు పెద్దమనుష్యు లొకసభ చేసి అమెరికాదేశమందుండు చికాగోనగరములో నాకాలమందుజరుగనుండిన (Parliament of Religions) పార్లమెంటు ఆఫ్ రిలిజియన్స్ అను మతసంబంధమైన పెద్దసభ కీతఁడు పంపఁబడ నర్హుఁడని నిశ్చయించి చందారూపముగా గూర్పఁబడిన కొంత ధనము నీతని కొసంగి అమెరికాకుఁ బంపిరి. స్వామి అమెరికాలోనోడదిగునప్పటికిఁ జేతిలోరొక్కమంతయుఁ జెల్లిపోవుటచే నిస్సహాయుఁడై దుఃఖకరమైన స్థితిలోఁ బడెను. అట్టియిక్కట్టులో నవ్వేళ మనస్వామి నాదుకొని సహాయము చేసిన యొకముసలిదొరసానివిషయమై హిందువులయినవారందఱుఁ గృతజ్ఞులయియుండక తీరదు. ఆముసలి దీతని వింతయగువస్తువుగాఁ దనవారికందఱికిఁ బ్రదర్శింపఁజొచ్చెను. తనమిత్రులగు కొంతమందికి విందు చేయఁదలంచి స్వామినిగూడ వారితోఁ బంక్తిభోజనమునకుఁ బిలిచెను. భోజనసమయమం దీతఁడు పంక్తిలోఁ గూర్చున్నవారందఱు మెచ్చుకొని యాశ్చర్యపడునట్లు సహజమయిన వాగ్మిత్వమును వెల్లడిఁ జేయుచు ననేకవిధశాస్త్రీయాంశములగుఱించి సంభాషింపఁ దొడఁగెను. విద్వజ్జనులే తెలిసికొనగల భావగర్భితములగుగంభీరవాక్యములతో హిందూవేదాంతము నుపన్యసించినపు డచటి వారందఱు ప్రతిపాదితాంశములను గ్రహింపఁజాలక చిత్తరువులో వ్రాయఁబడిన ప్రతిమలవలె నిశ్చేష్టులై రెప్పవేయక యితనివైపు చూడ్కి నిగిడించి యుండిరి. అపు డొక పండితుని నతనితో వాదమునకుఁ దగిలించిరి. గుణగ్రహణపారీణుఁడగు నాపండితుఁడు క్షణములో నీతనియంతస్సారమును గ్రహించి జరుగఁబోవు పెద్దసభ కగ్రాసనాధిపతి యగు (Barrow) బ్రారోదొరగారియొద్దఁ బ్రవేశపెట్టెను. అప్పు డాదొర సభలో హిందూమత ముపన్యసింపుమని యితని నుపన్యాసకసంఘములోఁ జేర్చెను. అట్టి గొప్ప సభలో మనస్వామి యుపన్యాసకుఁడుగాఁ గానవచ్చుట సకలజనులకు మహావిస్మయమును బుట్టించెను. పాశ్చాత్యులచూడ్కికిఁ జోద్యముగాఁ గానవచ్చు కాషాయవస్త్రముల ధరించి యున్న తాసనము నధిష్ఠించి హిందూవేదాంతమతమే జగత్తునం దుండెడు నితరమతములకంటె సారతమమయినదని యుక్తులచే సమర్థించి మేఘస్తనితగంభీరమగు కంఠధ్వనితో నుపన్యసింపఁగా నతివిశాలమగు నాసభారంగమంతయు మంత్రించినట్లు మత్తుమందు చల్లినట్లు, తరంగధ్వని లేని సముద్రమువలె నిశ్చలముగాఁ గన్పట్టెను. ఇతని యుపన్యాసము ముగిసినతరువాత "నిట్టివాఁడు తూర్పున నున్నాఁడా" యని కొందఱు, "నిట్టి విద్వాంసులున్న హిందూదేశమునకు మనమతము బోధింప మిషనరీలను బంపుట మన కెంతయవివేకపుఁబని" అని మఱికొందఱుఁ దమలోఁ దామనుకొనిరి. అమెరికాలోఁ బ్రకటింపఁబడు వార్తాపత్రికలన్నిటిలో నీతనిప్రశస్తియే శ్లాఘింపఁబడెను. అమెరికాఖండముయొక్క అన్నిభాగములనుండి మతోపన్యాసములకు రండని యితనికాహ్వానపత్రికలు వ్రాయఁబడెను. అమెరికాలో నున్నంతకాలము వేదశాస్త్రమాహాత్మ్యము నుద్ఘోషించుచు, శరీరేంద్ర

యాదులకంటె విలక్షణము, నిత్యము, శాశ్వతము నగు, ఆత్మ యొకటి యున్నదనియు, నది జ్ఞానానందస్వరూపమయినదనియు, కొనకు దానికే బ్రహ్మత్వము వాటిల్లుననియుఁ, బ్రమాణయుక్తులచేఁ బ్రతిపాదించి ప్రతివాదుల యుక్తుల నన్నిటినిఖండించి హిందూమతమే సర్వోత్తమ మయినదని వారంపఱచే నొప్పించెను.

అనంతర మమెరికానుండి యితఁ డింగ్లాండునకుఁ బోయెను. అచ్చటఁగూడ నట్లే సకలవిద్వజ్జనశ్లాఘాపాత్రుఁడై సర్వప్రతివాదిమదగజేంద్రకంఠీరవుఁడై విజయలక్ష్మీకరగ్రహణముఁ జేసెను. ఆకాలమునం దాదేశములోనున్న తత్త్వశాస్త్రజ్ఞులు కొందఱు జాత్యంతరులైనను ఈతనిమతబోధకతాశక్తికి లొంగిపోయి శిష్యులయిరి. అట్లు శిష్యులైనవారిలోఁ బ్రసిద్ధులగువారు (సాండోబర్గు Sandoberg–స్వామి కృపానందుని పేరు పెట్టుకొన్నవాఁడు. ఉభయానందుఁడను నామాంతరము నొందినవాఁడు) అనువాఁడు, సిస్టరు నివేదితా అనిపించుకొన్న మిస్ మార్గరెట్ నోబిల్ (Miss Margaret Noble) మొదలగువారు. వీరంద ఱతని శిష్యులగుటయేకాక యితనివలెనే వీతరాగులై నిర్వ్యాజశ్రద్ధతో నీమతమును వ్యాపింపఁజేసినవారు.

18[illegible]6 వ సంవత్సరము డిశెంబరు 16 తేదీని వివేకానందుఁడు స్వదేశమునకు మరలివచ్చెను. కొలంబోలో నోడ దిగెను. కొలంబో మొదలుకొని ఆల్మోరావఱకు వేలకొలది మనుష్యులు వెంబడిరాగాఁ బెద్దయుత్సవముతోఁ దీసికొనివెళ్లిరి. స్వదేశస్థు లంద ఱతనియం దతిగౌరవమును జూపిరి.

అతిసుందరము నత్యున్నతము నగు నాతనివిగ్రహము, మనుజులహృదయములయందు శాంతరసము నావేశింపఁజేయు చూపులు, శ్రావ్యమగు కంఠధ్వని, మనుష్యులకు వ్యామోహమును బుట్టించెను. కేవల ముపన్యాసముల నిచ్చుటయే అతనిపని కాదు. తాను బోధించుమతమునకు స్థైర్యము నాపాదింపఁ దలంచెను. పరమార్థము మోక్షప్రదము నగు నుపనిషన్మతమునే సకలహిందూజనము లవలంబించునట్లు చేయుట అతనికి ముఖ్యోద్దేశ్యమయి యుండెను. అజ్ఞానమువలన మతములోనికి సంఘములోనికి సంక్రమించిన దురాచారములను మాన్పించి తానుపదేశించు మతముయొక్క ప్రాశస్త్యమును జనులందఱు తెలిసికొనునట్లు చేసెను. సంసారమును విడిచిపెట్టి విరక్తులయినవారి కందఱికి వేదాంతపాఠములు చెప్పుటకుపయోగముగా హిమాలయమువీఁదను కలకత్తానగరమందును నాశ్రమములను మఠములను గట్టించెను. ఈరెండు స్థలము లతనికి ముఖ్యనివాసస్థానములుగా నుండెను.

ఇట్లు విశ్రాంతి లేక లోకహితముకొఱకు రాత్రి పగలు పాటుపడుటవలన వివేకానందునిశరీరము వ్యాధిగ్రస్త మయ్యెను. వైద్యులసలహాపైని శరీరారోగ్యమును వృద్ధిచేసికొనుటకు మరల నైరోపాఖండమునకుఁ జనెను. స్వల్పకాల మింగ్లాండులో నివసించి శరీరస్థితి కొంచెము బాగుపడఁగా నమెరికాకుఁ బోయెను. అచట Sanfrancisco అనుస్థలమం దొక ఆశ్రమమును నొకవేదాంతపాఠశాలను స్థాపించెను. అవి యిప్పటికి నభివృద్ధిలో నున్నవి. తరువాత France దేశములో Paris పట్టణమందు జరిగెడు పెద్దమతసభ కాహూతుఁడై దానిలో ఫ్రెంచిభాషను స్వమతోపన్యాసము గావించెను. అప్పటికిఁ దనయారోగ్యము మునుపటికంటెఁ జెడఁగా నిండియాకు మరలివచ్చెను. అతఁడు తాను జేయఁ బూనుకొన్న పని ముందరఁ దనశరీరారోగ్యమునుగూడ నంతసరకుసేయలేదు. వారణాసీనగరమున విద్యార్థుల కొకపాఠశాలయును వైరాగుల కొక మఠమును గట్టించెను.

నిరంతరము దానుగూడ విద్యార్థులకు వేదాంతగ్రంథములఁ బాఠములు చెప్పుచుండెడివాఁడు. ఇట్టి సమయములోఁ దమమతమును సంస్కరింప రమ్మని జపానుదేశస్థులు స్వామికాహ్వానము నంపిరి. కాని శరీరాస్వస్థత హెచ్చగుటచే నచటికిఁ బోవఁజాలకపోయెను. అట్టిస్థితిలోనున్నను స్వదేశప్రజలకు జ్ఞానప్రదానమం దవిశ్రాంతితోఁ బనిజేయుచునే యుండెను.

ఇట్టి మహాపురుషుని జీవిత మంతముగసమయ మాసన్నమయ్యెను. 1902వ సంవత్సరము జూలైనెలలో నొకనాఁటి సూర్యోదయకాలమున శుద్ధజలస్నానపూతుఁడై ప్రశాంతమగు చిత్తములో నీశ్వరప్రణిధాన మొనర్చుచుఁ గొంతవడియూరకుండి యావలఁ గొందఱుశిష్యులకు సంస్కృతభాషలోఁ బాఠమునుబోధించెను. ఆమధ్యాహ్నము గూడ నట్లే బ్రహ్మోపాసనలోఁ గడపి సాయంకాలమొక్కఁడు కొంతదవ్వు విహరించుట కేఁగి మరలివచ్చి

యాశ్రమములోఁ గూర్చుండి రాత్రి తొమ్మిదిగంటలవేళ యోగప్రణిహితచిత్తుఁడై పరబ్రహ్మసాయుజ్యము నొందెను.

అంతగొప్పవాఁడయ్యును పాపము వివేకానందుఁడు "సుకృతీ గతాయుః" అన్నట్లెంత అల్పాయుష్యము గలవాఁడయ్యెను! నలువదిసంవత్సరములే జీవించినప్పటికి నతనిజీవన మెంతప్రకాశమాన మైనదియో అతనిజనమనోవశీకరణశక్తి యెంతయద్భుతమయినదియో అతనిప్రభావ మెంతలోకోత్తరమో అంతస్వల్పకాలములో నతనికీర్తిలత దిగంతముల కెట్లు ప్రాఁకినదో చూడుఁడు.

రాజతేజస్సు గలశరీరము, దీనులయెడ దయను వర్షించుచూపులు, కంచుఘంటవంటి కంఠస్వరము, ఎట్టి దుర్బోధాంశములనుసయితము పరమమూఢులకును నిస్సంశయముగాఁ దెలియునట్లు బోధింపఁగలవాగ్జాలము నీశ్వరసృష్టిలో నతని కొక్కనికే యుండెను. అతనికి స్వదేశాభిమానము మెండు. మాతృదేశమగు భరతఖండముయొక్క ప్రాచీనోత్కర్షను గూర్చి మాటలాడునపు డాతఁ డానందపరవశత్వమొంది నేత్రములయం దానందబాష్పములతో నగపడెడువాఁడు. వేదప్రతిపాదితములైన రహస్యార్థములను దనకుశాగ్రీయబుద్ధిచే గ్రహించి శ్రోతలకుఁ జక్కగా బోధించెడివాఁడు. ఇప్పటినూతనశాస్త్రీయసిద్ధాంతములకు విరోధముగాని ఖండనముగాని లేకుండ వానిని జక్కఁగ సమన్వయింపఁజేసి వేదాంతము నుపన్యసించువాఁడగుటచే నతని కట్టియుత్కర్ష లభించెను. నూతన శాస్త్రములకుఁ బ్రాచీనవేదాంతశాస్త్రమునకుఁ గల పరస్పరైకమత్యమును గనఁబఱిచెడివాఁడు.

### ఈతని మతసిద్ధాంతము

మతమనఁగాఁ దన్నుదానుఁ దెలిసికొనుట యని నిర్వచించెను. వినువారి మనస్సునందు దృఢముగా లగ్నమగునట్లీయర్థమునే పలుమాఱు బోధించెను. మతమనఁగా మూఢవిశ్వాసమనియునదియుక్తికిఁ గట్టుపడదనియు మనుష్యులకుఁగల దురభిప్రాయమును నిశ్శేషముగా దొలఁగించుటయేగాక సదుక్తి మతమున కావశ్యకమయిన పరిచారికవంటిదని పలుమాఱు నొక్కిచెప్పెను. ఈతని మతము శుద్ధాద్వైతము. ఆత్మను దెలిసికొనుటయే దీనికి ముఖ్యప్రయోజనము. ఇతనివాద మిది: యాథార్థ్యవిషయికములు కాని యుక్తులవలన నీ కేమి లాభము? నీయుక్తులకు మూలమయిన యాథార్థ్యము ప్రాకృతములయిన నీయింద్రియములవలనఁ గలిగినదిగాని వేఱొకటికాదు. శరీరముకంటెను, ఇంద్రియములకంటెను వేఱుగా నాత్మను కేవలయుక్తులచే సాధింపవలసివచ్చినపు డింద్రియజన్యజ్ఞానమూలమయిన ప్రాకృతయాథార్థ్య మాయుక్తుల కెట్లు తోడుపడును? పరాఙ్ముఖము లయిన యింద్రియములను యోగబలముచేఁ బ్రత్యాహృతములుగా నొనర్చుచో నాత్మ సాక్షాత్కరించునుగాని యితరోపాయములవలన నాత్మదర్శనము సిద్ధింపదు. బాహ్యజ్ఞానద్వారములగు నింద్రియము లెంతమాత్రము నాత్మతత్త్వాన్వేషణమందు సహకార మొనరింపవు. వైశేషికరసాయనాదిశాస్త్రవేత్తలు ప్రయోగములవలనను శోధనలవలనను వస్తుయాథార్థ్యమును గనిపెట్టునట్లు ధ్యానముచేతను ఆంతరదృష్టిచేతను ఆత్మ కనుగొనఁబడును. కఠోపనిషత్ప్రతిపాద్యమగు నీయర్థము నీతఁడు స్వమతముగాఁ బరిగ్రహించి జనులకుఁ దెల్పెను. సచ్చిదానందస్వరూపుఁడగు భగవంతుఁడు సర్వభూతములకు నంతర్యామియై యున్నాఁ డని యితనిముఖ్యసిద్ధాంతము. అట్లైనచో లోకనీతికి భంజకముగాదా యని యెవ్వరైన వాదించినచో వారి కతఁడిట్లు ప్రత్యుక్తి చెప్పువాఁడట: "అట్టి వాదము కొరడాదెబ్బలచే నదల్చబడు పశువులు చెప్పవలసినది. నీ వట్టిపశువై నయెడల మనుష్యుఁడవై జీవించుటకంటె నాత్మహత్యచే జచ్చుట మేలు నేను బోధించు నీసిద్ధాంతమే లోకనీతి కనుగుణమయినది. పరులకు మేలుచేయుటయే గొప్పనీతియని సర్వమతము లేకగ్రీవముగా బోధించుచున్నవి. అఖండమగు మహాకాశమువలె నందఱిలోనున్న యాత్మయు నఖండముగావున నీవు పరులకు హానిచేసినయెడల నీకు నీవే హానిచేసికొన్నవాఁడగుదువని అద్వైతము దృఢముగా బోధించుచున్నది. మానవజాతి వారందఱు పాపులనియెడు క్రైస్తవమతసిద్ధాంతము నీతఁడు మొదలంట ఖండించెను." ప్రతిమనుజునియందు బ్రహ్మజ్యోతిస్సు ప్రకాశించుచున్నది. ఈశ్వరుఁడు శరీరముగలవాఁడని యవివేకులు తలంచెదరు. అతఁడు నిరూపుఁడు. పామరుల కీశ్వరునియందు గుఱికుదురుటకు విగ్రహారాధనము విధింపఁబడినదిగాని పూర్ణజ్ఞానులగువారు జగమంతయు నీశ్వరమయముగాఁ జూతురు. ప్రతిమనుజునికిఁ బరమతసహన ముండవలెను. పరమతనింద పరమతస్థుల హింసించుట మతనిష్ఠుని కివిరోధములు. ఆత్మసాక్షాత్కారమే

మతమునకు ముఖ్యప్రయోజనము. అది సిద్ధించుట కేమత
మయిననేమి? మనుష్యుఁడు మహమ్మదీయుఁడైగాని క్రై
స్తవుఁడైగాని బౌద్ధుఁడైగాని యుండవచ్చును. అట్టివాఁ
డుగూడ ముక్తినొందును. ఒకపట్టణమునకుఁ బోవుమార్గ
ము లనేకములున్నట్లు ముక్తిని సాధించుటకనేకమతములు
ననేకోపాయము లున్నవని తెలిసికొని స్వమతమే మంచి
దనియుఁ బరమతము మంచిది కాదనియు నెన్నఁడు
నాక్షేపింపఁగూడదు. సరియైన ఆత్మజ్ఞానము జ్ఞానానురూ
పముగ నాచరణము ప్రవృత్తిలేనివానికిఁ గేవలమతదురభి
మానము ముక్తినియ్యఁజాలదు. ఇదిగాక మన మవలంబించు
మతము సార్వలౌకికమైనదిగా నుండవలెను. ప్రతిమనుజుఁ
డును తనమనస్సుకిష్టమై తానొప్పుకొనునది మతముకానే
రదు. ఎట్లన ఒకఁడు తన కిష్టమగు నేదో యొకసిద్ధాంత
మునూహించి దానిని బలపఱచుటకుఁ బలువురకుపదేశిం
చి వారినందఱను దనకు లోఁబఱచుకొని యొకమతముగా
నేర్పఱచును. మతస్థాపనకర్త కిది తప్పుదారి. సర్వమత
ములయం దున్న మూలతత్త్వము నెఱుంగవలయును. ఆ
తత్త్వమే నానావిధములఁ దెలుపఁ బడును. ప్రతిమతము
నకుఁ దత్త్వశాస్త్రము, పురాణము, కర్మతంత్రము కలవు.
లోకములోఁ బ్రతిమనుష్యుఁడును తనమతములో సంబం
ధించిన జ్ఞానశాస్త్రమే పరమార్థ మనియు, పురాణగాథ
లన్నియు సత్యమయిన చరిత్రములనియు, కర్మతంత్రము
ముక్తిమార్గమనియుఁ దలంచుచుఁ బరమతస్థుల జ్ఞానశాస్త్ర
ములు మతాభిమానముచే వ్రాయఁబడినవనియు వారి
పురాణములు మూఢవిశ్వాసమూలకములనియు వారికర్మ
తంత్ర మతినింద్యమనియు నాక్షేపించుచుండును. ఇట్లె
న్నఁడు తలంపఁగూడదు. ఒకనిమత మెంతయథార్థమో
అట్లే మఱియొకనిమతముగూడ నంతయథార్థము. సర్వమత
ములలోనుండు తత్త్వ మొక్కటియే యని తెలిసికొనుట
సార్వలౌకికమతము (Univer al eligi n.) అదివృద్ధి
చేయునదిగాని పాడుచేయునదిగాదు. అది ఒకనికిఁగల
మతవిశ్వాసమును జెడఁగొట్టుటకుఁ బ్రయత్నింపకుండ వాఁ
డున్నస్థితినుండి మఱింతఅభివృద్ధికిఁ దెచ్చును. మనుష్య
బుద్ధులు నానావిధములు. ఒక్కొక్కనికొక్కొక్కదానియం
దు రుచికలుగును. కొందఱికిఁ దత్త్వచింతయందు, కొందఱికి
భక్తియందు, మరికొందఱికి కర్మయందుఁ బ్రీతిపుట్టును. నేని
పుడు చెప్పిన సార్వలౌకికమతము పైనిజెప్పఁబడిన యధి
కారులకందఱికిఁ దగియున్నది. ఇది కేవలముపనిషత్ప్రతి
పాద్య మయినది. ఆత్మసాక్షాత్కారమునకు జీవాత్మపర
మాత్మైక్యమునకు ముఖ్యమయినసాధనము యోగము.
తత్త్వచింతకునికి జ్ఞానయోగమనియు, భక్తునికి భక్తియోగ
మనియు, కర్మికిఁ గర్మయోగమనియు నీయోగము పలు
తెఱఁగులు. ఈయన్నిటియందు నంతర్యామితమై యుండు
సారాంశమేమనఁగా ఫలాపేక్షవిడిచి పనిచేయుట. ఇది
యే ముఖ్యమైనమతము" అని వివేకానందుఁడు స్వదేశస్థులకుఁ
జిరకాలము బోధించెను.

ఆతఁడు సంఘసంస్కరణవిషయమయి చెప్పినమా
టలుగూడ నిచట మనము స్మరింపఁదగియున్నవి.

1893 వ సంవత్సరమున అతఁడు జపానుదేశమునుండి
వ్రాసినజాబులో నిట్లు నుడివెను. "దేశీయసోదరులారా!
విదేశములకు నౌకలతోఁ బోవుటవిషయమయి మీకుండె
డు దురభిప్రాయములను పట్టుదలను విడువుఁడు. మీగూ
ళ్లలోనుండి బయటికిరండు. మగవాం డ్రనిపించుకొనుఁడు.
మీకన్నులుదెఱచి దూరముగాఁ జూడుఁడు. ఇతరదేశస్థు
లెట్టియభివృద్ధిలోనున్నారో విచారింపుఁడు. మీకు మీ
దేశమం దభిమానమున్నయెడల నింతకంటె గొప్పసంగతు
లను నేర్చుకొని విజ్ఞానులై దేశము నుద్ధరింపుఁడు. వెనుకకుఁ
జూడకుఁడు. మనజాతీయాభివృద్ధి యుగములతరబడి నై
నదిగాని స్వల్పకాలములో నైనదికాదు. సంఘసంస్కర
ణము లుత్తమవర్ణములవారివిషయమయ్యే గాక నిమ్నజా
తులవిషయమైగూడఁ జేయఁబడవలయును. మన నితరవర్ణ
ములవారికిఁగూడ విద్యగఱపి బ్రాహ్మణులస్థితికిఁ దీసికొని
రావలయును. బ్రాహ్మణులే హెచ్చుగువారు; తక్కినవర్ణ
ములవారు తక్కువయని వివాదములుపెట్టుకొనుట జాతీ
యాభ్యుదయమును జాతీయోత్సాహమునుపాడుచేయును.
అందఱికంటె మేమేగొప్పవారము మేమేస్వతంత్రులము
అని బ్రాహ్మణులు విఱ్ఱవీగుకాలము గతించినది. ఇపుడం
దఱు సమానులే. అబ్రాహ్మణులారా! బ్రాహ్మణులవలె
మీరుగూడ సంస్కృతభాషనభ్యసింపుఁడు. హిందూదేశ
ములో సంస్కృతభాష - గౌరవము సమానములైనవి.
మీరు సంస్కృతవిద్య నభ్యసించినచో బ్రాహ్మణతుల్యు
లగుదురు. బ్రాహ్మణులారా! మీరును మీదురభిప్రాయ
ములను మీమీపట్టుదలను విడిచి మీవివేకమునకుఁదగినట్లు

క్రిందిజాతివారివిషయమయి ప్రవర్తింపుడు. హిందూ దేశమందుండెడు తక్కినజాతులవారి నుద్ధరించుబాధ్యత మీయందున్నది." అని యిట్లు బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు బోధించెడివాఁడు.

ఇట్లు వివేకానందస్వామి వ్రాసినఉపన్యాసములు పత్రికలు మొదలగునవి అతిహృద్యములు నతిసుందరము నగు నభిప్రాయములచే నిండియున్నవి. అతఁడత్యుజ్జ్వలమైన ప్రతిభావిశేషమున సాధారణముగ బోధకతాసామర్థ్యముగలవాఁడు. అతఁడు తాను చేయఁబూనుకొన్న పనిని నిర్వహించుటకై తనయాయుష్యమునంతయును వ్యయపఱిచెను. విద్యార్థిమిత్రములారా! మన మతనిచరిత్రము చదువుటవలనఁ బనియందతనికున్న పట్టుదల, శ్రద్ధ, అతని సద్భావము, అతని నిష్కాపట్యము, అతని భూతదయ, అన్నిటికంటె హెచ్చగు స్వసుఖనిరపేక్షత్వము మొదలగు సద్గుణములు మనహృదయఫలకమునందుఁ జెక్కఁబడఁదగిన పాఠము లయియున్నవి. మహాపురుషులచరిత్రములు లోకమున కుదాహరణభూతములు. అట్టివారికి మనము సమకాలికులము కాకపోయినను వారిచరిత్రములనైన శ్రద్ధగాఁ జదివినయెడల వారిసత్ప్రవృత్తి, వారిసద్గుణములు కొంతమట్టునకు మనకుఁగూడ నలవడునని తలంచెదను.

---

# మాతృసందేశము

కొప్పర్తి నారాయణమూర్తిగారు, బి. ఏ., ఎల్. టి., (సాహితీసమితి)

గుండె బరువు నొకకొంత బాపుకొన
పంపుచుంటినీ వార్తను నేను
చెవినిబెట్టుమా చెప్పెడుదానిని
కన్నతల్లినని కాస్తతలంచి
పట్టెడు కూటికి పరదేశములకు
పరుగిడ నేలర? వరతనయా!
ఇంటియొద్ద నే నిటు లుండగను
వదలిపోవుటకు ప్రాణ మెటొప్పె
చిన్ననాఁటి నీ విభవంబును గని
విశ్వంబెల్లను వికసించె గద!
విన్నవోవునను వీక్షించెడి యీ
విశ్వం బిప్పుడు విలపించుకద!
కొదువలేనినా కూర్మిదినములను
తలచిన గుండెలు తరుగుకుపోవు!
కొడుకులుగల్గియు కోడలుగల్గిన
అమ్మ బదుకు నిక నడుగగ నేల!
మోదావహమై మ్రోగిపారెడివి
ఆనందాశ్రులు అడుగంటినవి
ఉడుకుబాష్పములె ఉబికిపారుచును
ఉన్నప్రాణముల నూడగజేయు!

కాలుసేతులను కదపగలేనుర
పెదవుల నరిగా మెదపగలేను
నిన్ను చూడకను నిలువగలేనుర
కన్నకడుపు నే కానటనోయి!
పూర్తిగ కన్నులు పోవక మునుపే
కంటబడుము నా కన్నులపాపా!
బొత్తిగ పుటములు పూడకముందే
అమృతపువాక్కులు నానగనిమ్ము!
స్పర్శజ్ఞానము చావకుండనే
వ్రాలిపడుము నాయొడిలోపలను!
ఐహిక సౌఖ్యము లాసింపను; నీ
పెట్టుపోత లిక వట్టివి సుమ్మ!
ఇపుడని యికనని యెపుడును కాటికి
కాళ్లను చాచుకు కూర్చుని యుంటి;
ప్రాణము నీపై పరుగిడుచున్నది
పట్ట శక్యమును బాయుదునేమొ?
అసల చెప్పితి ఆగ్రహ మొందకు
ధర్మమె నిల్చును ధారుణిలోన.
వెఱ్ఱిభ్రాంతియని విసుగు నొందకుము
గాలి ప్రాణ మేగడియకునేమొ!

# శ్రీ సింహాచలక్షేత్రమ్

దేవులపల్లి అప్పలనరసింహం గారు, ఎమ్. ఏ., ఎల్. టి.

శ్రీ సింహశైలశిఖరే నివస త్యయం భోః
వారాహదేహవిలసత్ప్రభు రాత్మయోనిః,
అ త్ర్యవమాం బహువిధాసు నిమజ్జితాంగీం
త్రాయేత గాం దితిసుతాదివ భారతీం యః.

శోభాయుక్తమై తనరారు నీసింహాచలశిఖరమున, పూర్వము దితిపుత్రుఁడగు హిరణ్యాక్షునిబారినుండి భూమిని రక్షించినరీతిని నేఁడు బహువిధములగు నాపదలలో మునిఁగియున్న యీభారతభూమి ని ఉద్ధరింపఁదగిన స్వయంభువగు ప్రభుఁడు వరాహవిగ్రహమున విలసిల్లుచు నివసించియున్నాఁడు, గనుఁడు.

హేమనేత్ర మథ హేమగాత్రిణమ్
భ్రాతరౌ జగదబాంధవౌ పురా,
సంవిదార్య నఖదంతహేతిభి
ర్యజ్ఞసూకరనృసింహ! శోభసే.

అన్నదమ్ములును జగత్తునకు శత్రువులును నగు హిరణ్యాక్షహిరణ్యకశిపులలో, మొదట హిరణ్యాక్షుని వరాహమూర్తివై దంతాయుధములచేతను, పిమ్మట హిరణ్యకశిపుని నరసింహమూర్తివై నఖాయుధములచేతను జీల్చి; అన్నదమ్ములిద్దఱను జంపుటకు "ఎత్తిన అవతారములు రెండును నొక్కటిగానే భావింపఁదగవలయును. అని సూచించుటకునై యీ క్షేత్రమున శ్రీ యజ్ఞవరాహ. లక్ష్మీనృసింహస్వామి " యను నామమున శోభిల్లుచున్నావు.

రూప ముగ్రమపి ధారయ న్మహుః
దుష్టదానవ విదారణోత్సుకః;
శాంతమూర్తి రితి శస్యసే బుధైః
హ్లాదితైః కరుణయా తవ ప్రభో!

ఓ ప్రభువా! దుష్టులగు దానవులను చీల్చుటకై మాటిమాటికి నుగ్రరూపమును ధరించుచున్నను నీకరుణచేత సంతోషింపజేయఁబడిన జ్ఞానవంతులచేత శాంతమూర్తివనియే ప్రశంసింపఁబడుచున్నావు.

అత్ర యే శరణ మాగతా న తే
భీతి మాప్నుయు రితీవ యంత్రితః;
ఉగ్ర! వారయసి దీప్తి మాత్మన
శ్చందనేన శిశిరేణ వల్గునా.

ఓ ఉగ్రమూర్తీ! ఇక్కడకు శరణార్థులై వచ్చువారు భయమునొందుదురను శంకచేతను నీదీప్తిని చల్లని చందనముచేఁ గప్పించుకొనుచున్నావు.

తేన సింహగిరిమధ్యసంస్థితమ్
రమ్యవృక్షవనరాజిశోభితమ్,
శీతలాచ్ఛమధునీర ముద్గిర
త్స్రవణం భవన మాదృతం త్వయా.

అందువలననే సింహశైలమధ్యమున నున్నట్టియు, మనోహరములగు వృక్షములు వనపంక్తులచే శోభించుచున్నట్టియు, చల్లని నిర్మలమైన తియ్యని నీరునిచ్చుధారలు గల్గినట్టియు ఆలయము నీచేత అంగీకరింపఁబడినది.

చూతబిల్వపనసైః పవిత్రకైః
నారికేళకదళీఫలద్రుమైః,
పుష్పితైశ్చ కరవీరచంపకై
రాతనోతి నయనోత్సవం నగః.

మామిడి మారేడు పనస మదనానప కొబ్బరి అరఁటి మొదలగు ఫలవృక్షములతోను పుష్పించిన చంపక వృక్షములు గన్నేరు (అనఁగా నూఱువరహాలు, వేయివరహాలు అనఁబడు) వృక్షములతోను నిండియున్న యీకొండ కన్నులకు పండువుఁ జేయుచున్నది. :—

కర్కశాశ్మశిఖరః క్వచి ద్గిరిః
కేసరీవ భయదో ఒపి రాజతే,
గోమహిష్యజకులాదిభి ర్వృత
శ్శాద్వలాంబరమనోజ్ఞసానుమాన్.

ఈ కొండ కొన్నిచోట్ల కఠినరాలతోఁ గూడిన శిఖరములు గలిగి కేసరజాలముగల సింహమువలె భయంకరముగ గనుపడినను మరికొన్నిచోట్ల నావులు, మహిషములు, మేకలు మొదలగువాని మందలతో నొప్పారుచు పచ్చికబయళ్లతో కప్పఁబడి మనోజ్ఞము లగు చరియలు గలిగి శోభిల్లుచున్నది.

నోదనో విబుధసంఘవిద్విషామ్
అర్థినాం హృదయతాపనోదనః,
యుక్తరూప మితి వాత్మనః స్థితే
రథ్యలిప్స దచలం నృకేసరీ.

తాను దేవతాసంఘములకు శత్రువుల నడఁచువాఁడును, భక్తుల హృదయతాపమును అడఁచువాఁడును అగుటను, ఒకేకాలమున భయంకరమును, శాంతికరమును నగు తనరూపమునకు ఒకప్రక్క భయంకరమును, ఒకప్రక్క మనోహరమును నగు నీ సింహశైలము తగిన నిలయ మని నరహరి యిందు నిలిచెనుగాఁబోలును.

హేమచంపకగులాబిమల్లికా
పుష్పదామపరిశోభివక్షసమ్,
కంఠలంబికరవీరమాలినం
శాంతరూప నృహరిం సదా భజే.

స్వర్ణచంపక, గులాబి, మల్లె మొదలగుపుష్ప మాలికలతో అంతటను శోభించుచున్న వక్షస్థలము గలిగినటువంటియు, కంఠమునుండి వ్రేలాడు తెల్లగన్నేరు (వేయివరహాలపుష్పముల) మాలికలు గలిగినటువంటియు శాంతరూపమును ధరించిననరహరిని నిత్యమును భజించుచున్నాను.

వ్యక్తవిగ్రహ మపీహ సంస్థితమ్
వ్యక్తరూప రహితం నిబోధత,
మామితి స్ఫుటయితుం ప్రణేముషాం
చందనేన హి తనుం నిగూహసే.

"ఇచ్చట స్పష్టముగా రూపమును ధరించి కనుపడుచున్నను నేను నిజముగా నిర్ణయింపఁగల రూపములేని అవ్యక్తుఁడను అని తెలిసికొనుఁడు" ఈరీతిని నీకు వందనము చేయుటకు వచ్చు భక్తులకు బోధింప నెంచి కాఁబోలు చందనముతో నిజరూపమును మఱుగుపఱచుచున్నావు.

రక్ష కేశవ జనార్ద నాచ్యుత
శ్రీశ సింహబల దానవాంతక!
సాధుదీనజనరక్షణోద్యతో
రక్ష న స్సుఖజలాయు శ్శ్రేషిణః

ఓ కేశవా, జనార్దనా, అచ్యుతా, లక్ష్మీశ్వరుఁడా, సింహవిక్రముఁడా, దానవాంతకుఁడా, సాధువులను దీనజనులను పరిపాలింప నుద్యుక్తుఁడవై సుఖమును బలమును ఆయువును గోరుచున్న నన్ను రక్షింపుము.

సంసృతే రతి విషణ్ణమానసమ్
శాంతిదానకృపయా సముద్ధర,
శ్రీనివాస భవదంఘ్రిచింతనాం
సుస్థిరాం మయి కురు ప్రసాదతః.

సంసారమువలన మిక్కిలి విషాదమును బొందిన మనస్సులోనున్న నన్ను శాంతి నిచ్చు కృపతోడ నుద్ధరింపుము. ఓ శ్రీనివాసా! అనుగ్రహముతో నీ పాదచింతనను నాయందు స్థిరముగా నెలకొల్పుము.

ఏకం వసంతతిలకంచ రథోద్ధతాఖ్యా
న్యేకాదశేహ కులకే రచితాని భక్త్యా,
శ్రీసింహశైలనిలయాయ సమర్పితాని
మాల్యాని సంతు హృదయోపవనోద్భవాని॥

నాహృదయవనము పూలతోఁటయం దుద్భవించినవియును ఈకులకమును పద్యమాలికయందు భక్తితోఁ గూర్పఁబడినవియును నగు ఒకవసంతతిలకముతోఁ గూడిన పదునొకండు రథోద్ధతావృత్తములు శ్రీ సింహాచలవాసునికి స్వీకారార్హంబు లగుఁగాత!

# పండిత ప్రతిజ్ఞ

## దువ్వూరి రామిరెడ్డిగారు

మొన్నటి పుష్యపంచమికి ముప్పదియేండ్లవయస్సు చెల్లె నిం
కెన్నిదినంబు లీగురునింట వసింతు? సమస్తశాస్త్రముల్
తిన్నగ నేర్చుకొంటి "మనతిమ్మనశాస్త్రికుమారుఁ డెంతలో
నున్నతి కెక్కె" నంచు నను నూరిజనుల్ వినుతింతు రెప్పుడున్.

గీ. సగము ప్రాయంబు విద్యావిచారమందె, గడచె; సంసారసౌఖ్యంబుఁ బడయ నైతి
గొప్పవారింటఁ బెండ్లాడఁ గోర్కె గలదు, గాని దారిద్ర్యదోషంబు కంటకంబు.

గీ. ఎవరి నడిగినఁగాని "మీ కెంతయాస్తి? పెండ్లికూఁతురి కేనగ పెట్టఁగలరు?
ఇంటిమర్యాద లెఱిఁగి మా హెచ్చు నెంచి, పెండ్లి వేడుక నడుపంగఁ బ్రీతి గలదె?"

చ. అని మఱి యేమొ యేమొ మఱియాదలుగీదలు దెల్ప నోర్పుతో
వినివిని చీదరించుకొని పెండ్లిపెడాకులు మానుకొంటి; నై
నను జెలికాఁడు నామనమునం దొక కోరిక విత్తు నాఁటి తి
య్యని నుడికారపుందడిని నంకురమెత్తఁగఁ జేసె యిట్లనెన్.

చ. జను లనుకోఁగ విందు; నెలజవ్వని, తాఁకినఁ గందిపోవు మె
త్తని చిన్నరాకుమేను, కనుదమ్ముల లోకము మోహపుచ్చు మో
హనమగు నింద్రజాల మెదో యాడుచునుండు; వివిక్తకాననం
బున నెలయేళ్లకూలములఁ బూఁబొదరిండ్ల వసించు నొంటిగన్.

గీ. పేరు "కవిత"యంట, పెద్దలుం బిన్నలు, గారవింపఁ బెంపు గాంచునంట;
ఇష్టమున్నఁ, గోర్కె లీడేర్పఁ దనకుఁ దా, వరుని సరసహృదయు వలచు నంట!

మ. కులముం జూడదు, డబ్బు గోరదు, మనఃకూలంకషప్రేమతో
వలచుం దాను గుహాపి నైన; నెటు నిర్బంధించి కామింప భూ
వలయాధీశున కైనఁ గానిపని; నీ పాండిత్యముం జూపి యా
పొలఁతిన్ లోఁగొను మన్నమాటలు మదిం బూరించెఁ జేరాసలన్.

గీ. అఖిలశాస్త్రపురాణేతిహాసములను, సంస్కృతాంధ్రకావ్యకలాపసంపుటముల
మూటముల్లెలుగాఁ గట్టి మోసికొంచుఁ, దరలితిని గవితాస్వయంవరమునకును.

గీ. జనకుఁ డొసఁగిన దేవతార్చనపుఁ బెట్టె, నంచు చినిఁగిన మడిపట్టుపంచఁ జుట్టి
చంకఁదగిలించి, వెలిబూది సంచిగూడఁ, బదిలముగ దాఁచికొని దారిఁ బట్టినాఁడ.

సీ. తలయూఁచినపుడెల్లఁ దళతళద్యుతి నింపు, మకరకుండలములు మాకు లేవు;
పాండిత్యమున కనివార్యలాంఛనమైన కాశ్మీరశాలువఁ గప్పలేదు;
లలితంపుఁగజ్జలగుండెలు ఝల్లుఝల్లన, గండపెండారంబుఁ గాలఁ దొడుగ
మునుకొని తనకన్నముందు బారెఁడు వోవ, బిరుదు పేర్లెవరైనఁ బెట్ట రయ్యొ!
ఐనఁ గానిమ్ము, నా కున్నయంతవట్టు, కేమి లోపంబు లేదెవ రేమి యన్నఁ
గంచుగంటపుఁబ్రాయసకాఁడఁ గానె! మిగత భారంబు దైవముమీఁద నిడితి.

చ. అని తలపోయుచుం దుదకు నాకవితాలలితాంగిఁ బెండ్లి యా
డినంతి మోరవి నడకొక్క సుమాళము సందడింప లోఁ
దానికెడి భావిభోగపరితోషప్రభావన జెప్పలార్పుచున్
వనమున కేఁగుచుండె మనపండితశాస్త్రి జయాభిలాషతోన్.

చ. చనిచని కొన్నినాళులు వసంతశుభోదయవేళఁ గొండదా
పున దిగఁబాఱు వాఁక కిరుప్రంతలఁ బూఁబొద లందగించు చ
క్కనివనిఁ జొచ్చి దప్పి నడగాసియుఁ దీఱ జలంబుఁ గ్రోలి చ
ల్లనిపొదరింటనీడఁ బదిలంబుగఁ గూర్కి సుఖంబు చేకుఱన్.

గీ. అంతలోన నెండయారాట మొక్కింత, దొలఁగఁ బూఁతగాలి తోడ వీచె;
కొండసెలలసడులు కోయిలపాటలు, మిళితమయ్యె నెడలు పులకరింప.

మ. చిత్రరాకుల్ దెగ మేసి పోతరమునం జెంగించుచున్ దాఁటుచున్
దప్రదవ్వేగుచుఁ, గొమ్ము పుట్టుతఱిఁ బంతాలాడి కండూతి వో
వ వడిన్ ముస్తల డీలుచున్ హరిణశాబంబుల్ వినోదించుఁ గే
ళివిహారంబుల నిర్భయంబుగను, వల్లీచ్ఛాయ లాసించుచున్.

గీ. అట్టినవమహారణ్యమందు నొక్క, మావికొమ్మకు నల్లిన పూవుఁదీవ
తూఁగుటుయ్యేలఁ గూర్చుండి, తునిగి రాలు, విరుల జడిగొట్ట నొకనవ్యతరుణి యూఁగు.

ఉ. ఆవలపించుతొయ్యలి కొయారము నేర్పఁ గలాపి ప్రేమసం
భావనతోడఁ గుత్తుకను బమ్మెదమీఁదుగ మూపుఁ జేర్చి పూఁ
దొప్పలఁ జల్లు క్రొవ్వెదతలాపిని మోమమర మోపి, మెత్తగం
జే వీరితక్కుపై నిమురఁ జెల్వయొడిం గను మోడ్చి హాయిగన్.

ఉ. కోయిలపాటకత్తె తనకూఁతలతప్పు ఘలుంగు దిద్దికోఁ
బాయక యభ్యసించుఁ జెలిపజ్జ పాఠము; గోరువంక క
త్త్యాయతశిక్ష నైన దొసఁగంతయుఁ బోదు; సమర్థుఁడౌ గురుం
డైయును జక్కఁ జేయఁగలఁడా ప్రతిభావిహీనశిష్యులన్.

మ అపుడే నిద్దురలేచి పండితుఁడు, నయ్యాలూఁగునాలేమ యం
దపుఁజందంబును రూపురేఖ వెలుఁగొందం గాంచి యూహించుఁబో
ణిపదాబ్జంబుల మ్రొక్కినం దొలఁగవే నిష్మలమై పాపముల్
అపురూపం బిటువంటిమూర్తి యని వెయ్యాఱుల్ విలోకించుచున్.

గీ. పలుకరింప నెంచి, పలికిన నేమేని, బెడఁద వచ్చు నన్న బెంగతోడ
నీళ్లు నములుకొంచు నెత్తిగోఁకుచు నిల్వఁ, జూచి చూడనట్లు చూచి చెలువ.

ఉ. ఉయ్యాల డిగ్గి పయ్యెదను నొరముసుం గిడి జవ్వనంపులా
గియ్యది యన్నపోల్కిఁ గను లెత్తియు నర్ధనిమీలితంబుగా
నయ్యలినీలవేణి నడయందము దోఁపఁగఁ జెట్టుచాటుకుం
జయ్యనఁ బోయి తేనియలు జాల్కొనఁ బల్కెఁ దెనుంగుమాటలన్.

గీ. సిగ్గు పైకొని చెక్కిళ్లు జేవురింప, సగముసగముగఁ బల్కె నాసొగసులాఁడి
"యతిథులరు, మీకు స్వాగతం బన్ననుడులు, పడెను జెవిలోన విని వినఁబడనియటులు.

గీ. ముగుదమాట సూదిమొన మోపునంతటి, సందుఁ జేయ నళుకు జాఱవిడిచి
పండితుండు పల్కె వనిత! నీవెవతెవు? ఒంటికత్తె వీచట నుండనేల?

చ. అన విని కాంత నేఁ గవితనయ్య! వనాంతరసీమలందు రే
యును బవ లెప్పుడుం బ్రకృతియుత్సవముం దిలకించుచుం బికాం
గనలు మయూరముల్ సఖులుగాఁ బరిచర్యలు సల్ప నొంటిగన్
దినములఁ బుత్తు జవ్వనముఁ దీరును దియ్యము శాశ్వతంబుగన్.

మ. కలికీ! యెంతటివింత! నీవె కవితాకళ్యాణివా? బాపురే!
తెలియం జాలకయుంటి, నీకొఱకు నే దేశాలు పట్నాలు కో
టలు పేటల్ గిరు లేళ్లు దాటుకొని మూటాముల్లెభారంబునన్
దల చెప్పట్టగ బట్టగట్ట విసుగెత్తన్ వచ్చితిం గానకున్.

గీ. నిన్నుఁగూడి ధర్మనియతులఁ బాల్గొనఁ, దలఁచి వచ్చినాఁడ, వలచినాఁడ;
నన్నుఁ ద్రోసిపుచ్చ న్యాయంబె? వైదిక, విధిహితంబుగాఁగఁ బెండ్లియాడు.

గీ. అన్నవేళకు నతిథు లభాగ్యతులును, నింటి కరుదెంచి కూర్చుండ, వంట గింటఁ
జేయ నిల్లాలు లే దని చెప్పలేక, తెగఁబడితిఁ గాంత! యాకొంటి దీర్చు మింక.

సీ. హేమంతమున నైన నేటికేట మునింగి, మడిదోవతులు పాతమైల లుదికి,
యిలు నూడ్చుటాదిగాఁ గల ప్రాచిపనులెల్ల, విసుగు వేసట లేక వెళ్లఁబుచ్చి
దేవతార్చన వేదదీపంబు వెలిఁగించి, ధానసంబున వంటకములఁ దీర్చి,
యిరుగుపొరుగునిండ్ల కేఁగక తమయిల్లు, కనుపెట్టుకొని, దూది వెనఁచి దివ్వె
వత్తులను జేయుటో, లేక వలయువిస్తరంబులు గుట్టుటో తలచిబట్ట లార్చుటయును
గాక యిల్లాలి కింకొక్క కార్య మున్నె? యట్టిగృహిణీపదంబు నీ కను చాన!

సీ. వేదవేదాంగముల్ వివిధపురాణేతిహాసముల్ నాబుద్ధి నరగిపోయె
పంచకావ్యాల నేపట్టున నేశ్లోక, మడిగిన వల్లింతు నప్పటపుడె
ఆక్షేపంబు పాణినీయము పీల్చి పిప్పిఁ జేసితి నది నాయందె జీర్ణమయ్యె
వసుచరిత్రంబున వ్యాఖ్యానయుతముగ, శ్లేషభంగుల విమర్శించినాఁడ
కడకుఁ జిన్నయసూరివ్యాకరణ మెల్లఁ, బుటలు మలినంబుగాఁగ నెప్పుడును జదివి
సిద్ధివడసితి; సమరంబుఁ జిత్తశుద్ధి, శోనుపాసించి పొందితి దొడ్డఫలము.

సీ. శాకుంతలములోన శతసహస్రములుగ, వ్యాకృతిదోషముల్ బయలుపఱతు
భవభూతిసాహిత్యభాండార మెల్లను, గాసుకుఁ గాకుండఁ గడిగి నైతు
బాణుని శ్రీహర్షు భారవి ఝూడింప, దొలిదెబ్బకైనను నిలువఁ గలరె?
తిక్కయజ్వకుఁ దలతిక్క మాన్పెద నన్నఁ, జెరపిగా నొకనాఁడు తీఱలేదు
ఇంకఁ దక్కినవార లదేమి లెక్క, ముక్కుఁ బట్టినఁ బ్రాణంబు మొదలె పోవు
కాంత! నాకన్న నేర్పరుల్ గలరె చెపుమ? నేను నన్నుఁగూర్చి పొగడుట నియతి గాదు.

గీ. సత్కవి, ప్రబంధ వేంకటేశ్వరవిజయవి, లాసకర్త నామది కెక్కులాగు వ్రాసెఁ
గాని, కొందలు పాండిత్యగణ్యతావి, హీనతను దాఁచ, రస మని యెంచినారు.

చ. అని తనమూటముల్లెలు రయంబున విప్పి నెలంత! పొత్తముల్
గనుమ, యధీతమయ్యె నివి; గ్రంథము లెన్నియొ మోయలేక యిం
టను బదిలంబు చేసితిని; నాశ్రమ మెల్లను జింత చేసి నీ
గనుమ కృపాకటాక్షములఁ గామిని! నీమన నేమి చెప్పుమా!

గీ. తనకుఁ బరమశత్రుఁ డెన లేనిఛాందసుం, డింత కెటులో దొరకె; నింతతోడ
విడువరా దటంచు వెలఁది సంతోషించి, హాస్య మనుభవింప నభిలషించి.

గీ. ధర్మశాస్త్రమెల్లఁ దనుదప్ప జీర్ణించె, నిగమవిధులయందు నిధులు మీఱు;
అట్టు లౌట దలఁప కెట్టుల నీనాఁడు, కులటతోడఁ బొందు గోరినారు?

గీ. అనిన విని ఛాందసుం డప్పు డదరి లేచి, వెలఁది యేమంటి? నీ వెట్లు కులట వైతి?
బహుపతిత్వము స్త్రీలకు భావ్యమగునె? ధర్మవైరుధ్య మక్కటా! దాపురించె.

గీ. ఇందుకా నేను బలుపాటు లెల్ల సైచి, యింత దూరమ్ము వచ్చుట యెమ్మెలాడి!
బ్రహ్మచారిని, బ్రాహ్మణపండితుఁడను, కులటసాంగత్య మేరీతిఁ గోరుకొందు.

చ. అని కపటంబులేనివెత లాననసీమను దేలియాడఁగా
మిని! కులటత్వ మెట్టు లనుమేయము నీయెడ నన్నుఁ గాంతయున్
మనమున నుబ్బుహాస్యరసమాధురి కన్నులఁ జిప్పిలంగ లోఁ
గొని మొగమందు మాయవగఁ గూర్చి వచించెఁ జరిత్ర మంతయున్.

సీ. వాల్మీకి ముసలితాపసి యయ్యు ననుఁ గూడ, రమణీయకళలఁ గరంచి యేలెఁ;
గాళిదాసుఁడు బిగ్గఁగౌఁగిట లాలింప, శృంగారభోగనిర్వృతిని గంటి;
భవభూతి పాండిత్యపటిమతో శాస్త్రరసామృతముగ ననుఁగూడి యాడినాఁడు;
భట్టబాణమయూరభారవిప్రముఖులు, దివ్యభూషాపేటి దీర్చినారు;
నన్నపార్యుఁడుఁ దిక్కన మున్నగాఁగఁ, దెలుఁగుఁగవు లెల్ల నాముద్దు సలిపినారు;
ప్రాఁతవారల యనుభోగ్యపటిమ సడలఁ, గ్రొత్తగోవాళ్ల నాసించి కూడుచుందు.

చ. అన విని పండితుం డనును నందఱు ముంచిన ప్రాఁతలంజ వ
య్యను బడుచుందనంబుఁ గనులారలఁ జూచెడి ముద్దరాలిసొం
పును, దనుసౌష్ఠవంబు, వలపుంబస,లెట్టులు గాచి యుంచితో
వనిత! శరీరరమ్యతకు బ్రహ్మ వినీతిని గూర్పఁ డేలొకో?

గీ. అనుచు గ్రంథంబు లెల్లను నట్టె జవిరి, మూఁటముల్లెగ సవరించి పోలఁతి! నేను
బోయి వచ్చెద, మనపొందు పోసఁగ దనినఁ, జెలియ చిఱునవ్వు నవ్వుచుఁ జెంతఁ జేరి.

ఉ. ప్రేముడితోడ నాయధరము బిట్టుగ నీకవ్వఁగింటఁ జేర్పకే
యోమనుధర్మశాస్త్రరత! యూరక పోయెదె యంచుఁ దెచ్చికో
ద్దీమస మూని కౌఁగిలిడఁ జేరకుఁ దత్తఱ మంది చూచు చే
మేమొ వచించుచుం గనుల నెత్తక చేతుల నూడఁబీకినన్.

సీ. ముద్దుమాటలు పల్క మోము చిట్లించుచు, శబ్దసంస్కారంబు చాల దనును;
అడవిపూఁదొడవులఁ దొడిగియుండుటఁ గాంచి, యాయలంకృతిలోప మెసఁగె ననును;
మురిపంబు దళుకొత్త మోవి యానఁగఁ బోవ, నెంగిలిరస మంచు నీసడించు;
బలిమిమై గిలిగింప నులికి బారెడుదాఁటి, జలిబిలినడ లెల్లఁ జెల్లవనును;
పెట్టరానట్టిసిలుగులఁ బెట్టి చెలువ, యాటపట్టించి చెర్లాట మాడుచుండఁ
గాననంబున నేడనో కానరాక, మురళిరావంబు వినవచ్చె మోహనముగ.

సీ. పూలగుత్తులఁ గాంచి పునికి ముద్దాడును, పికమనోహరగీతి విన్న మెచ్చు;
సెలయేళ్లపాటలఁ జెవియొగ్గి యాలించు, రాలుఁబువ్వుల నేరి మాల గ్రుచ్చు;

పొదరిండ్లలోఁ దూఱి పొదలయల్లికఁ జూచు, నడవిజింకలతోడ నాటలాడు;
సాంధ్యారుణాంకితజలదఖండముఁ గాంచు, వనరామణీయకమును దలంచు;
మధురరసము తేఁదు మనమునఁ దొలఁకాడ, లోకమెల్లఁ దేనెపాక మనును;
నిట్టిమృదులహృదయుఁ డెచ్చోటనుండియో, పిచ్చివానిపోల్కి వచ్చుచుండె.

ఉ. ఆతనిఁ జూచి కాంత, తనయంతట నెఱింగిన చెల్మికాఁడు సాం
ధ్యాతపకాంతులం బ్రకృతియందముఁ గాంచఁగ నేఁగుదెంచెఁ; దా
నాతరుణుం డొకళ్లొకరి యంసమునం జెయి వైచి ముగ్ధసం
గీతములన్ రసంబు లొలికింపఁ దలంపులు దీనరింపఁగన్.

సీ. వచ్చి రాక మున్నె వరునిఁ గౌఁగిటఁ జేర్చె, మూఁతవడ్డకనుల ముత్తైసరుల
గతినిఁ బ్రమదబాష్పకణములు చిప్పిల్ల, నెడలఁ బుల్కనారు లుప్పతిల్ల.

గీ. రెండుకేలలు నేకమౌరీతి నిరువు, రొకరొకరికౌఁగిళులలోన నుండి రపుడు;
వసుధఁ బ్రతిదియుఁ బ్రణయపిపాసతోడ, నొకటినొకటి నాశ్లేషించునొప్ప దోఁచె.

గీ. అనిమిషత్వమునొందె యాయద్భుతంబు, నరయుచుండెను శాస్త్రి నోరంత దెఱచి
యంతఁ గౌఁగిలి వీడి యాయబ్జనేత్ర, పిన్ననవ్వులు మోమునఁ జిన్నెలొలుక.

ఉ. చాలిఁక శాస్త్రిగారు! శ్రమ చాల వహించి మదర్థ మయ్యయో!
కాలుకుఁ గాలు గొట్టుకొనఁ గాననసీమకు వచ్చి యింత కే
మేలును బొందకే తిరిగి మీపురిఁ జేరుటఁ జూడ నాకునున్
జాలి జనించె; దైవము ప్రసన్నము గా, దిఁకఁ బొందు నావుడున్.

గీ. ఈర్ష్య యొకవంకఁ బరిభవ మింకనొక్క, కడను జిత్తమ్ముఁ జఱచుటఁ గాల్చుచుండఁ
గటము లదరఁగఁ గనుబొమల్ నటన సేయఁ, బండితుఁడు పళ్లు బిగఁబట్టి ప్రతినచేసె.

శా. నేనే తిమ్మయశాస్త్రిపుత్త్రుఁడయినన్ నిత్యమ్ముఁ గాత్యాయనీ
ధ్యానారూఢహృదబ్జతన్ విధులసద్ధర్మంబులం బ్రత్యుష
స్స్నానసంబుం బొసఁగింతు నేనిఁ గవితా! సత్యంబుగా నీజిగుల్
నీనాణెంబు నెయారియంచనడలున్ నిర్మూలముం జేసెదన్.

మ. అని కోపంబున మూటముల్లె గొని సంధ్యావందనాపేక్షచే
వనమార్గంబునుబట్టి యేటిదరికిన్ బాండిత్యవాహుండు పో
యిన, నాయిద్దఱు నెచ్చెలుల్ వనవిహారేచ్ఛన్ నదీసైకతం
బునకుం బోయిరి జంటఁబాయక మనంబుల్ దేహముల్ వర్తిలన్.

గీ. సందెచీఁకటిలో నేదో, చాయనుండి, వీనులం బడె నశరీరగాన మొండు;
ప్రకృతి నిర్మించె నాజోలపాటలోని, తియ్యఁదేనియ లక్కఱ దీఱ నాని.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

**చిలుకూరి వీరభద్రరావు గారు**

(గత సంచిక శేషము)

ఇప్పటికి రెండువేలయేనూరుల సంవత్సరములనాఁడు శాక్యులు, లిచ్ఛవులు, మొదలగు క్షత్రియసంఘములవారు బహుపరాక్రమశాలులుగ నుండి ప్రాచీన వైదికహిందూదేశమున గొప్పమార్పును బుట్టించినట్టి ప్రతిభాశాలులు. వీరికిఁ బూర్వము కురుపాంచాల శాఖలవారు వైదికమతమును విస్తరింపఁజేసియుండిరి. అధిరాజ్యములను స్థాపింపలేదు. కాని యీశాక్యులును, లిచ్ఛవులు, మొదలగువారు మౌర్యసామ్రాజ్యము, ఆంధ్రసామ్రాజ్యము, గుప్తసామ్రాజ్యమువంటి మహాసామ్రాజ్యములను, జైనబౌద్ధమతములవంటి మహామతములను స్థాపించి భరతఖండమునకు నెక్కువ ఖ్యాతిని గడింపఁజేసిరి. ఈక్షత్రియశాఖలవారెల్లరు వజ్జియను లను క్షత్రియసంఘమునకు సంబంధించినవారు. ప్రథమమున వీరిలో లిచ్ఛవులనుగుఱించి తెలిసికొనుటకుఁ బ్రయత్నింతము. వీరినిగూర్చి బౌద్ధజైనవాఙ్మయములలో నున్నదానినంతయుఁ గ్రోడీకరించి "బౌద్ధయుగమునాఁటిక్షత్రియకులము" లను గ్రంథములో వ్రాయఁబడియున్నది. ఈగ్రంథము బాబూ విమలచరణలా గారిచే రచింపఁబడి రెండేండ్లక్రితము ప్రకటింపఁబడినది. ఈ గ్రంథకర్తగారి యభిప్రాయములకును నాయభిప్రాయములకును గొంతభేద మున్నను ఈ క్షత్రియసంఘములనుగుఱించి యిదివఱకు విస్పష్టముగాక సందిగ్ధములుగా నున్న పెక్కువిషయములు వీరిగ్రంథమువలన నేఁడు తేటతెల్లము లయినవి. లిచ్ఛవులలోఁ బెక్కుతెగ లున్నట్టు తెలియుచున్నది. వేదములలోఁగాని, మహాభారతమునఁ గాని లిచ్ఛవుల నామములు గానరావు గాని మనుధర్మశాస్త్రములోను కౌటిల్యుని యర్థశాస్త్రమునను గనఁబడుచున్నవి. వీరిజన్మచరిత్రమునుగూర్చి యొకవిచిత్రమైనగాథ బుద్ధఘోషుఁడు 'బుద్ధకపాఠ' మను గ్రంథముపైని వ్రాసిన పరమాత్థ (పరమార్థ) జోతిక (జ్యోతిక) అను వ్యాఖ్యగ్రంథములో నిట్లు చెప్పఁబడినది.

కాశీరాజుపట్టమహిషి గర్భమును ధరించెను. దానినెఱింగి యామె రాజునకుఁ దెలియఁజేసెను. అతఁడు గర్భసంరక్షణార్థము చేయవలసినకర్మల నన్నిటిని గావించెను. నెలలు గడచినపిమ్మట నామె ప్రసవగృహమును బ్రవేశించెను. ఒకనాఁటి సూర్యోదయకాలమున నొక శుభముహూర్తమున నామె ప్రసవించెను. అపు డామెగర్భమునుండి లక్కవంటియు, బంధుజీవక పుష్పములవంటియు నెఱుపువన్నెగల యొక మాంసపుముద్ద వెలు

పల పడెనట! తక్కినరాణులు దీనినిజూచి తాము
రాజున కీవర్తమాన మంపినయెడల సువర్ణ
చ్ఛాయగల సుకుమారుని గాంచుననిని యెదురు
చూచుచున్న రాజునకుఁ దమపై నెల్లఁ
గోపము వచ్చునని భయపడి యాతనికిఁ దెలి
యఁజేయక వెంటనే వా రామాంసపుముద్ద
నొకపేటికలో నుంచి దానిపై రాజుముద్రి
కను ముద్రించి యియ్యది పట్టమహిషియొక్క
బిడ్డ యని యొకచీటిని వ్రాసి దానికిఁ గట్టిపెట్టి
యాపేటికను గంగాప్రవాహమున విడిచిరఁట.
ఇయ్యది మహాభారతములోని కుంతీదేవి కర్ణుని
గని యొరులకుఁ దెలియకుండ గంగాప్రవా
హమున విడిచినకథను బోలియున్నది. అప్పు
డాగంగయొడ్డున గోబృందములచెంత నున్న
యొకయోగి గంగాప్రవాహమునఁ గొట్టుకొని
వచ్చుచున్న యాపేటికను గాంచి దానిని
బట్టుకొని దానింగట్టిన చీటిని జదువుకొని కాశీ
రాజముద్రికను గాంచి దానిని దెఱచి చూ
డఁగా నం దొకమాంసపుముద్ద గానంబడియె
నఁట! అయ్యది గర్భములోని పిండముగా
భావించి యాతఁడు దానిని భద్రముగాఁ దన
యాశ్రమమునకుఁ గొనివచ్చి పదిలముగా
నొకమూల నుంచి సంరక్షించుచుండెనఁట! పక్ష
ముదినములు గడచునప్పటికి యామాంసపు
ఖండము రెండుభాగములుగ విడిపోయెనఁట!
అంత నాఋషి వానిని జాగరూకతతోఁ బోషిం
చుచుండెను. మఱిపక్షముదినములు గడచునప్ప
టికి శిరస్సు, కాళ్లు, చేతులు మొదలగునవి
యాకారము లేర్పడినవఁట! మఱియొక పక్ష
మునకు నం దొకటి సువర్ణచ్ఛాయను బోలిన
మగబిడ్డగను, రెండవది యాడుబిడ్డగను నేర్పడి
యెనఁట! పితృవాత్సల్యముతో నాతఁ డాబిడ్డ
లను బాలుబోసి పెంచుచుండెనఁట! వారలగర్భ
ములలోని కేపదార్థమును బోసినను మణుల
లోని పదార్థమువలె వికసించుచుండుటచేత
'నిచ్ఛవు' లని అనఁగాఁ జర్మము లేనివారని
చెప్పుకొనుచుండిరఁట! మఱికొందఱు 'లీనా
చవు' లని అనఁగా సంధింపఁబడిన చర్మములు
గలవారని చెప్పుకొనుచుండిరఁట! (ఇది జరా
సంధుని జన్మవృత్తాంతమును బోలియున్నది.)
ఆఋషి ప్రతిదినము గ్రామములోనికి నుదయ
మునఁ బోయి చాలప్రొద్దెక్కినతరువాతఁగాని
తిరిగివచ్చుట సంభవింపనందున గోపకులు దాని
నంతయుఁ గనుపెట్టి ఓఋషిపుంగవా! ఈబిడ్డ
లను మీవంటివారు పెంచుట కష్టము. మాకు
దయచేసినయెడల మేము పెంచెదము. అని
ప్రార్థింపఁగా నాతఁడు సమ్మతించెనఁట! ఆమఱు
నాఁడు గోపకులందఱు పతాకములను ధరించి
దారి చక్కఁజేసికొని మార్గముపొడవునను
బుష్పములు చల్లుకొనుచు సంతోషము పెంపు
మీఱ మేళతాళములతో రాఁగా నాఋషి
వారితో వీరిరువురు మంచిగుణవంతులు గావున
వీరిని జాగ్రత్తతోఁ బెంచి పెద్దవారయిన
పిమ్మట వీరిలో నాఁడుబిడ్డను మగబిడ్డకిచ్చి పెండ్లి
చేయుటయే కాక రాజు నడిగి కొంతభూమి
గైకొని యొకపురము నిర్మించి యందు వీరిని
పట్టాభిషిక్తులను గావింపవలసిన దని చెప్పి
యాబిడ్డలను వారల కప్పగింపఁగా, వారలు
సంతోషముతోఁ గొనిపోయి యాతఁడు చెప్పి
నట్లు మిక్కిలి జాగరూకులై పెంచుచుండిరి.

వీరలు పెద్దవారయినతరువాత బలాఢ్యులై గోపకులబిడ్డలతో నాటలాడుకొనుచుండు నపుడు తగవులు కలిగినేని వీర లాగోపకుల బిడ్డలను దయమాలి పిడికిటిపోటులం బొడుచుచు మోకాటిపోటులు పొడుచుచుఁ గొట్టుచుండువారగుటచేత నేడ్చుచు నిండ్లకుఁ బోయి తమ తల్లిదండ్రులను వీరివలనఁ జాలమందికిఁ గష్టములు వచ్చుచున్నవనియు వీరి నుంచరాదు వజ్జింపవలసిన దనియు (వజ్జితవ్య) మొఱ్ఱవెట్టి కొనిరఁట! అప్పటినుండి యాదేశము మూఁడునందలయోజనముల పరిమాణము గలిగి 'వజ్జి' యనుపేరఁ బరఁగుచుండెను. పిమ్మట నీగోపకులు రాజదయను సంపాదించి యాతనియనుమతిని బొంది యాదేశమును సంపాదించి పురమును నిర్మించి దాని కాతని పట్టాభిషిక్తుని గావించిరి. ఆ బాలునకు యుక్తవయస్సు వచ్చినవెనుక యుక్తవయస్సు వచ్చిన యాకన్యకకు వివాహము గావించిరి. ఆసమయమున రాజు 'నేఁటినుండి యేపెండ్లికొమరుని నిక్కడకుఁ దీసికొని రాఁగూడదు; ఇక్కడనుండి యేపెండ్లికొమార్తెను బైటకుఁ బంపరాదు' అని శాసించెనఁట! అప్పు డాదంపతులకుఁ బ్రథమమున నిరువురు కవలు జనించిరఁట! ఇట్లు పదునాఱుమాఱులు కవలు జనించిరఁట! ఇట్లొక జంటవెంబడి నొకజంట జనించి పెరుఁగుచుండుటచేత పురము విశాలము చేయఁబడవలసి వచ్చెను. పురము చుట్టును పాతికయోజనమున కొకొక్క ప్రాకారము చొప్పున మూఁడు ప్రాకారములు నిర్మింపఁబడి చాలకున్నందున రానురాను పెంపు చేయబడుచువచ్చిన దాటచే, 'వైశాలి కాకట' మనుపేరున (వేసలి) వ్యవహరింపఁబడుచుండెను. ఇయ్యది రామాయణములోని లక్ష్మణశత్రుఘ్నుల (కవల)యొక్కయు, మహాభారతములోని నకులసహదేవులయొక్కయు జన్మవృత్తాంతములను దలఁపునకుఁ దెచ్చుచున్నది. రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ గూడ వైదేహిని బెండ్లియాడుటకై మిథిలానగరమునకుఁ బోవుచు నీపురము నేలుచున్న సుమిత్రుఁ డనురాజుచే సన్మానింపఁబడినట్లు రామాయణమున వక్కాణింపఁబడియె నని (భారతి రెండవసంచికలో) యిదివఱకే తెలిపియున్నాను. కాని యీగాథలో మాంసపిండము రెండుతునుకలై యొకఋషి (ఆంగిదేవుఁడు) చే నతుకఁబడుటయు నయ్యవి బిడ్డలగుటయు నస్వాభావికమగుటచే నెవ్వియో రెండు జాతులసమ్మేళనమువలన నీసంఘ మేర్పడి యుండునను నూహతోఁ బరిశోధకు లగు పండితులు లిచ్ఛవు లెవరై యుందురని పరిశోధింప నారంభించిరి. వారిలో నిరువురను ముఖ్యులనుగాఁ జెప్పవచ్చును. అందు మొదటివారు విన్సెంటుస్మిత్తుగారు, రెండవవారు కీర్తిశేషులయిన మహామహోపాధ్యాయ సతీశచంద్ర విద్యాభూషణు లనువారు. లిచ్ఛవులు న్యాయవిచారణపద్ధతులయందును, మరణముఁ జెందిన వారి విషయమై జరుపుకర్మలయందును త్రివిష్టపు (Tibet) దేశపుపద్ధతు లనుసరించుటచే టిబెటునుండి వచ్చినవారని స్మిత్తుగారు నుడివిరి. అది సరికాదు. ప్రాచీనపారశీకము (పార్థియా, మేదియాలు) నుండి వచ్చినవారయి

యుండవలె నని మహామహోపాధ్యాయులు వ్రాసియుండిరి. వీనిని మనము విచారింపవలసి యున్నది. లిచ్ఛవులలో పురుషుఁడుగాని స్త్రీ గాని మరణముఁ జెందినపుడు వన్యమృగముల కాహారముగా విడుచుట చీనావారివైపునుండి శాక్యబుద్ధునిగాథలు చెప్పుకొనుసందర్భమున వినంబడుచుండెనని తెలియుచున్నది. (Beal's Romantic Legend of Sakya Buddha P. 159; Ksatria Clans in Buddhist India P. 29) ఋషులు తన ప్రశ్నకుజవాబు చెప్పుదురనిబోధిసత్వుఁడు(గౌతముఁడు) వైశాలిపురమునకుఁ బోయినపుడిట్టివర్ణన మందుఁ జేయఁబడియెనఁట. సమాధికడ శవములు రాంబందులు పీకుకొనితినుటకై విడిచిపెట్టబడునఁట. అక్కడ శవములనుగూడ దహనముగావించి యెమ్ములు ప్రోగుచేసి నిలువచేయుదురఁట. శవములను చెట్లకు వ్రేలాడఁ దీయుదురఁట! బంధువులచేతఁగాని మఱియెవ్వరిచేతఁగాని చంపఁబడినవారిని వారు తిరిగి సజీవులై వచ్చి బాధింతురేమో యనుభయముచేతఁ గొందఱు పాతిపెట్టుదురఁట. బహుశః వారు తిరిగి యెప్పటికైన బ్రదికివచ్చుట కవకాశము కలుగునట్లుగాఁ గొందఱు శవముల నక్కడ విడిచి వత్తురఁట. దీనిని బట్టి డాక్టరు విన్సెంటుస్మిత్తుగారు చరిత్రకాలమునకుఁ బూర్వమునుండియు నిట్టిపద్ధతు లాచరణములో నున్నవని తెలుపుటకు హిందూదేశములో నిట్టిసమాధులు పెక్కులు కనుగొనఁబడెననియు నచటగూడ నీమార్గములే యాచరణములో నున్నట్లు కనుగొనఁబడె ననియు వాదించుచున్నారు. (Indian Antiquary 1903. P. 234). వీరివాదమును విని బాబూ విమలచరణగా రిట్టిపద్ధతులు ప్రాచీనార్యులలో నుండెననియు, "యేనిఖాతా యేపరోప్తా యేదగ్ధా యేచోద్ధితాః సర్వాంస్తాఙ్గాహపితౄన్ హవిసే అతియవె" అను అథర్వవేదమంత్రములో (అ. వే. 23. 2. 34) నీమూఁడుపద్ధతులు గలవని వక్కాణించిరి. (K. B. I. Page 30) కాఁబట్టి యీపద్ధతులు టిబేటునుండి గ్రహించినవికావని వారియభిప్రాయము. న్యాయవిచారణపద్ధతులును బౌద్ధమతము విదేహదేశమునుండి టిబెట్టుదేశమునకుఁబోయినపుడు గ్రహించినవేగాని యటనుండి యిక్కడకు రాలేదని నుడువుచున్నారు. కాఁబట్టి లిచ్ఛవులు త్రివిష్టపదేశమునకుఁగానితత్ప్రాంతదేశమునకుఁగానిసంబంధించినవారు కారనియు, లిచ్ఛవు లార్యులే యనియు, మఱియు, బీలుగారు లిచ్ఛవులు యూచీలు (యకులాతులు లేక శ్వేతహూణలు)గఁ బరిగణించుచున్నారనియు వారు క్రీస్తుశకారంభమున హిందూదేశమునకు వచ్చినవారు గావున నెన్నఁడో క్రీ. శ. పూర్వము నైదాఱుశతాబ్దులుగా నత్యంతనాగరికులుగ నున్నజాతులవారిని వారితో బోల్చు టసందర్భముగ నున్నదని చెప్పకయే దానిమోమున గన్పట్టుచున్నదనియు నొక్కి వక్కాణించెను కాని యీసందర్భమున బాబూ విమలచరణలాగారు బాగుగా నాలోచించి వ్రాసిన వాక్యము కాదేమో యని నాకు గట్టిసందేహము కలుగుచున్నది. ఏమనఁగా పవిత్రమైన జైనవాఙ్మయములోని 'సూత్రకృతాంగ' మను గ్రంథమున లిచ్ఛవులు ఉత్తమకులస్థులుగ

జెప్పెడియీ క్రిందివాక్యము గనంబడుచున్నది.

"A Brahmana or a Ksatria by birth, a Scion of the Ugra Race or Licchavi, who enters the order eating alms given him by others, is not stuck up on account of his renowned Gotra." Jacobi Jaina Sutras, Part II S. B. E. Vol. xlv. P. 321)

ఉగ్ర లేక లిచ్ఛవీజాతీయుఁడై జన్మచేత బ్రాహ్మణుఁడైనవాఁడుగాని క్షత్రియుఁడైనవాఁడుగాని అగృహుఁడైనపుడు, ఇతరులవలన దానములను పరిగ్రహించుటకుఁ దన ప్రసిద్ధమైన గోత్రమును బట్టి కట్టువడియుండ నక్కఱలేదు.

పైజైనగ్రంథములోని వాక్యమువలన లిచ్ఛవులు ఉగ్రజాతికి సంబంధించినవారుగఁ గన్పట్టెదరు.(K. B. I. P. B.)ఉగ్రులన నెవ్వరు? ఉగ్రుఁడనఁగా క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁ డని ధర్మశాస్త్రములు వక్కాణించుచున్నవి. విశ్వంభరశాస్త్రమునందు:—

శూద్రాం క్షత్రా దుగ్రజాతి ర్యుద్ధశస్త్రాదిజీవికా। శస్త్రాస్త్రవ్యాసకుశలః సంగ్రామకుశలో భవేత్ । తయా వృత్త్యాహ్యాజీవన్నైవ శూద్రధర్మాంశ్చ పాలయేత్ । శూద్ర్యాం జాతస్తు వైశ్యా ద్వైకరణో లిపిలేఖకృత్ ॥

అని క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు ఉగ్రుఁడనియు, వానికి యుద్ధము శస్త్రవిద్యయు జీవికయనియు, దీనిచే జీవనము జరుగకున్న శూద్రధర్మము లాచరింపవలెనని యును జెప్పఁబడి యున్నది. "వైశ్యా శూద్ర్యోస్తు రాజన్యా న్మాహిష్యోగ్రౌ సుతౌ స్మృతౌ" అని క్షత్రియునకు వైశ్యశూద్రస్త్రీలయందుఁ బుట్టినవారు క్రమముగ మాహిష్యుఁడు నుగ్రుఁడు ననఁబడుదు రని యాజ్ఞవల్క్యుఁడు పలికియున్నాఁడు. టిబెటుదేశమునకు నుత్తరమునను మంగోలియాదేశము పడమటిహద్దులలో ఉయిగర్ లేక ఊషన్ (Uigur or Ushon) జాతివారున్నట్లు తెలియుచున్నది. ఈ ఉయిగర్శబ్దము ఉగ్రశబ్దముగను, ఊషన్శబ్దము ఉశనశబ్దముగను సంస్కరింపఁబడినట్లు కన్పట్టుచున్నది. ఉశనసుఁడు, ఔశనసస్మృతి మొదలగునవి సంస్కృతభాషలోఁ గలవు. మఱియును, ఉశీనరు లనువారు ఉత్తరకురుభూములనుండియు, ఉత్తరమద్రభూములనుండియుఁ గురుపాంచాలురతోడను వసులతోడను గంగాతీరమునకు వచ్చినట్లుగా భారతి మూఁడవసంచికలోఁ దెలిపియున్నాను. కంసునితండ్రి ఉగ్రసేనుఁ డనువాఁడు మధురాపురము నేలుచుండె నని భాగవతాదిగ్రంథములనుబట్టి మనము దెలిసికొనుచున్నారము. ఈ జాతివారు బ్రాహ్మణులు, క్షత్రియు లెట్లయిరో వీరు వాసిష్ఠగోత్రు లెట్లయిరో యిఁక ముందుఁ దెలిసికొనవలసి యున్నది. మొదటిసారి బుద్ధదేవుఁడు లిచ్ఛవులను గలిసికొన్న విషయమును దెలుపుచు, వైశాలికాపురమున మహామారిరోగము ప్రజలను బీడించుచుండ లిచ్ఛవులు పోయి బుద్ధదేవుని గౌరవముతో రప్పింపఁగా నాతడు సంభాషించునపు డెపుడును వారలను వాసిష్ఠులారా! యని సంబోధించుచుండువాఁడఁట. ఇఁక మనము మహామహోపాధ్యాయ డాక్టరు సతీశచంద్ర విద్యాభూషణు లనువారు తెలిపినయభిప్రాయ

మనుగూర్చి కూడ కొంత చర్చింపవలసి యున్నది. వీరు క్రీస్తుశకమునకుఁ బూర్వము ౫౧౫-వ సంవత్సరములో పారశీకపురాజగు డెరయసు అనువాఁడు భరతఖండమున్పై దండెత్తుటకై సైన్యములఁ బంపెననియు, ఆసైన్యములు హీరతునకు దూరముగా నున్న నిశిబిసు (Nisibis) అను ప్రదేశమునుండి పంపఁబడిన వనియు, వారు సింధునదీతీరమునకువచ్చియక్కడనుండి పంజాబులో ప్రాచీనాచారపరాయణులయిన బ్రాహ్మణులు మిక్కుటముగా నున్నందునను మగధప్రాంతమున వ్రాత్యులు (బహిష్కరింపఁబడినవారు) విశేషముగా నున్నందున మగధవఱకు వచ్చిరనియు, ఈనిశిబీలనే నిచ్ఛివీ లని మనువు వ్రాసినాఁడనియు శబ్దసామ్యము కలదు. కాఁబట్టి లిచ్ఛవులు ప్రాచీన పారశీకులని వ్యవహరించుచున్నారు. మనుస్మృతికి వ్యాఖ్యానము చేయుచు కుల్లూకభట్టు లిచ్ఛివిశబ్దము నిచ్ఛివిశబ్దముగఁ జదివి యట్లె వ్యాఖ్యానముచేసియుండుటచేత డాక్టరు సతీశచంద్రవిద్యాభూషణులు తప్పు త్రోవఁ ద్రొక్కిరని లాగా రాక్షేపించిరి. మఱియును గౌతమ బుద్ధుఁడు విన్సెంటు స్మిత్తుగారియభిప్రాయము ప్రకారము క్రీ. శ. పూర్వము ౪౮౦ లో నిర్వాణముఁ జెందినది వాస్తవమయినను సింహళగాథల ననుసరించి క్రీ. పూ. ౫౪౩ లో నిర్వాణముఁ జెందినది వాస్తవమయినను క్రీ. పూ. ౫౧౫ లో డెరయసు దండయాత్ర మూలముగా ప్రాచీనపారసీలువచ్చినారని తెలుపుట బొత్తుగా విశ్వసనీయముగా లేదని బాబూ విమలచరణలాగారి యభిప్రాయ మైయున్నది. కాని యిక్కడకూడ మనలాగారు పొరపడుచున్నారేమో యని భయము వేయుచున్నది. వీరికి డెరయసుదండయాత్రమాత్రమే జ్ఞప్తియందుండి భయముగొల్పుచున్నది గాని యంతకుఁ బూర్వపుస్థితిని గమనింపకున్నారు. బాబూ విమలచరణ లా గారు లిచ్ఛవులు ప్రాచీనపారశీకమునుండి వచ్చినారని యొప్పుకొన్నందున వాసిష్ఠగోత్రులనియు, బ్రాహ్మణులనియు, క్షత్రియులనియు, వక్కాణింపఁబడిన లిచ్ఛవుల యార్యత్వమున కెక్కడ భంగము కలుగునో యని భయపడుచున్నట్లు గన్పట్టుచున్నది. వైదికయుగముననే ప్రాచీన పారశీకమునకును భరతఖండమునకును నెక్కువసంబంధ మున్నట్లు గన్పట్టుచున్నది. రామాయణమునుబట్టి లిచ్ఛవులలో నుగ్రజాతివారు గలరని తోఁచుచున్నది. మహాభారతమును బట్టిగాని తదితరపూర్వగ్రంథములనుబట్టిగాని ప్రాచీనపారశీకమునకు సంబంధించిన తెగలు కూడ లిచ్ఛవులలోఁ గలిసిపోయినట్లు గన్పట్టుచున్నది. మఱియును కొన్నివేలసంవత్సరముల క్రిందటనే పార్థియా, మీడియా, అస్సీరియా, కాల్డియా, ఫొనీషియా దేశములకు నెక్కువసంబంధము గన్పట్టుచుండుటచేత డెరయసునకుఁ బూర్వము మనకును ప్రాచీనపారశీకమునకును సంబంధము లేదనుకొనుట భ్రమవలెఁ గన్పట్టుచున్నది. ఋగ్వేదకాలముననే యెక్కువ సంబంధ మున్నట్టు గన్పట్టుచున్నయది. అట్టి నాయభిప్రాయము నెప్పుకొనకున్నయెడల ఋగ్వేదమంత్రములు రచింపఁబడి ౫౫౦౦ సంవత్సరములకన్న నెక్కువ

కాలేదని చెప్పవలసివచ్చును. అది అంతవిశ్వస నీయముగఁ గనుపట్టదు కావున మహామహో పాధ్యాయులవారి యభిప్రాయములోఁ గూడ సత్యము కలదు గాని లేకపోలేదని కన్పట్టు చున్నది. లిచ్ఛవులనువారిలోఁ బెక్కు-శాఖలు గలవు. వీరియభిప్రాయము లన్నియు సత్యములే యని యింకముందుఁ దెలుపఁబోవు చున్నాను.

లిచ్ఛవులశీలమును దెలిసికొనుటకై వాని గూర్చినమఱికొన్నివర్ణనములను బౌద్ధగ్రంథము లనుండిచూపింపవలసియున్నది. బౌద్ధగ్రంథముల లోని వర్ణనములన్నియు బాబూవిమలచరణలా గారి 'బౌద్ధయుగమునాఁటి క్షత్రియకులము' లను గ్రంథమునుండి సంగ్రహించినవే కావున నీగౌరవమంతయు వారికిఁ జెందవలసియున్నది. బుద్ధుఁడు జీవించియున్న కాలమున వజ్జియనులు పెక్కు-కులములవారుగా నుండిరి. ఇయ్యవి లిచ్ఛవులు, వైదేహులు, తిరుభుక్తులు మొదలుగాఁ గల నామములతో నొప్పెడి 'అష్టకులము'లని కన్నింగుహాముగారు తెలిపిరి. ఒక్కొక్క-కులమునకు నొక్కొక్క-సభ్యుఁడుచొప్పున నెన్నుకొనఁబడిన మొనమండ్రు సభ్యులతోఁ, గూడిన న్యాయవిచారణసభ, (Jury) వీరికిఁ గలదట. (Cunningham's Ancient Geography of India P. 447). ఈతెగలవారందఱు యుద్ధవ్యాపారతంత్రములప్రావీణ్యమును గఱపునట్టియప్రశస్త్రాగారప్రతిష్ఠాపనలతోనొప్పుచు వీరాధివీరులై యెంకోరులయెడఁ బ్రేమాతిశయములం జూపుకొనుచు భరతఖండముయొక్క-యీశాన్యదిగ్భాగమునఁ బ్రసిద్ధులుగనుఁ బరా క్రమవంతులుగను నున్నవారని బౌద్ధసూత్రాది గ్రంథములలో వక్కాణింపఁబడి యుండెను. Buddhist Sutras, S. B. E. Vol. XI. P. 3, Vide also Turnour, Pali Buddhist Annals No. 5. J. A. S. B., Dec. 1838, P. 992.

ఒంకోరులయెడ వీరుచూపుప్రేమాశతియములు నిరుపమానములు. ఒకనికి జబ్బుచేసిన యెడలఁ దక్కి-న లిచ్ఛవు లెల్లరును వానిని జూడఁ బోయెదరు. ఒక లిచ్ఛవుని యింటఁ బండుగు వచ్చినఁ దక్కి-న లిచ్ఛవు లెల్లరును దోడ్పడుదురు. విజాతీయుఁడైన గొప్పవాఁ డెవ్వఁడయిన తమనగరమునకు వచ్చిన యెడల వా రెల్లరును వాని కెదురుగఁ బోయి గౌరవముతోఁ గొని వచ్చి యర్ఘ్య సత్కారములచే గౌరవింతురు. (సుమంగల విలాసము. Burmese Edition pp. 103-105) వారు సురూపులును, చిత్రవిచిత్రము లయినరంగులతో నొప్పెడి దుస్తులను ధరించుటయం దభిలాషగలవారును నఁట. (Watterson Yuan Chang Vol II. P. 79. బుద్ధుఁడు వారలను మొట్టమొదటఁ గాంచినపుడు వింతలగు వారిరూపరేఖావిలాసములను వీక్షించి వారిని దేవతాంశసంభూతు (Tava timsa) లనుగఁ దలంచెనఁట. మహా పరినిర్వాణసూత్రమునందు లిచ్ఛవు లిట్లభివర్ణింపఁబడిరి. బుద్ధుఁడు వైశాలినగరమునకు వెలుపలిభాగమున నున్న అంబపాలీయొక్క-మామిడితోఁటలో వసించియున్నాఁడని విన్నప్పుడు లిచ్ఛవులందఱును వానిని సందర్శింప పెక్కు-రథములను సమకూర్చికొని పోయి

రనియు కొందఱు శ్యామలవర్ణము గలవారుగను, కొందఱు గౌరవర్ణము గలవారుగను, మఱికొందఱు ఎఱుపు లేక తెలుపువర్ణము గలవారుగ నుండిరనియు, వారివారివర్ణములకుఁ దగిన యావర్ణములఁ బోలు రంగులు గల దుస్తులతో నేగిరనియు వర్ణింపఁబడి యుండెను. వా రలంకరించుకొన్న యాభరణములు కూడ వారి దేహచ్ఛాయలంబోలిన రంగులు గలవిగనే యుండెనఁట. (Buddhist Sutras, S. B. E. Vol XI. P. 31) అట్టి వర్ణనములే 'అంగుత్తరనికాయ'మను గ్రంథమునందును జేయఁబడినవి. వీరలు కేవలము పర్వదినములందు మాత్రమే కాక ప్రతిదినము సామాన్యసందర్భములయందుఁ గూడ నట్టి రంగుల దుస్తులనే ధరించుచుండి రని పై గ్రంథమును బట్టి తెలియుచున్నది. ఒకప్పుడు గౌతమ బుద్ధుని మహావనమునందలి కూటాగారశాల యందు వినయవిధేయులై ౫౦౦ లిచ్ఛవులు వానిని బరివేష్టించి సేవించుచున్నపుడు కొందఱు లిచ్ఛవులు నీలవర్ణముగల దేహములు, నీలవర్ణముగల దుస్తులు, నీలవర్ణము గల యాభరణములు; కొందఱు పీతవర్ణము (పచ్చని) గలదేహములు, పీతవర్ణముగల దుస్తులు, పీతవర్ణముగల యాభరణములు; మఱికొందఱు నిదేరీతిగ నెఱుపు, తెలుపు వర్ణము గలవారుగా నుండిరని తెలుపుచున్నది. Anguttara Nikaya P. T. S. Part III, P. 239). మఱియు నిదేవర్ణనము మహావస్తువను సంస్కృతబౌద్ధకావ్యమునందుఁ గూడఁ జేయఁబడినది. ఇట్లు నీల, పీత, గౌర, శ్వేత, రక్త, హారిత, ఆదిగాఁగల నానావర్ణములు గలవారు నానావిధము లయిన రంగులదుస్తులతో నొప్పారుచున్నవా రని తెలుపుట చూడఁగా లిచ్ఛవులలో నట్టివర్ణములు గల తెగలవా రుండిరని చెప్పకయ వేద్యమగుచున్నది. వారి వారి రథములకుం గట్టినగుఱ్ఱములు రంగులు నట్టివిగానే యుండెనఁట! మఱియు మహావస్తుకావ్యమునందలి వర్ణనములఁ జూచినపుడు మహారాజులు వారిమైశ్వర్య భోగములను వెంటఁ గొనిపోవురీతిగ నుండెను. వారు వేసలినగరమునుండి పోవునపుడు మౌక్తికములు, మణులు, సువర్ణము మొదలగు వానితోఁ బొదుగఁబడిన గుఱ్ఱములు, రథములు, ఏనుఁగులు మొదలగు వాహనాదికములు ౧౬౦౦౦ తోడ వారు పయనమై మహావనమునకుఁ బోయిరఁట. 'మహావస్తు' వను కావ్యములో

"లిచ్ఛవికా ఆహంసు అన్యదాపి భగవాన్ భగవానాహ అన్యదాపి వాసిష్ఠా. భూతపూర్వం వాసిష్ఠా అతీత మధ్వానే పాంచాలే జనపదే కాంపిల్లనగరే రాజా బ్రహ్మదత్తో నామ రాజ్యం కారేసి"

అని యుండుటచేత వేసలి యొకప్పుడు కాంపిల్యనగరమను పేరిటఁ బరఁగుచుండె నని తెలియుచున్నది. పాణిని వక్కాణించినప్రాక్పాంచాలు రనువారు వీ రేమో పరిశోధింప వలసియున్నది. అయినను బుద్ధుఁడు బ్రదికి యుండి నారిలోఁ జేరి వారికి ధర్మమును బోధించినకాలమున వారిస్థితి యింతమైశ్వర్యవంతమయినదిగఁ గన్పట్టుచున్నది. బుద్ధుఁడు

చెప్పినదానిని సంయుక్తనికాయ మను గ్రంథ ము పదిలపఱచియున్నది. ఓభిక్షువులారా! వీరిని చూడుఁడు! ఈ లిచ్ఛవులు సుస్థిరచిత్తులును, అప్రమత్తులును ధనుర్వేదపారంగతులునై యుండియుఁ గట్టెకదుంగలను దలగడలుగాఁ జేసికొని నిద్రించుచున్నారో! వైదేహీపుత్రుఁడైన మగధరాజు అజాతశత్రుఁడు. వీరిపై వైరము గల్పించుకొనుటకు లోపమేమియు వీరియందుఁ గన్పట్టదు. భిక్షువులారా! ఎప్పుడైన నీఁకముందు వీరు సుకుమారులై హంస తూలికాతల్పములఁ బన్నుండి ప్రమత్తులై మైమఱచి నిద్రపోయినయెడల వైదేహీపుత్రుఁడైన మగధరాజు వీరిలోపములను గనుపెట్టి వీరిపై దాడివెడలుటకుఁ గారణము గనుపెట్టఁగలిగి యుండును." (సంయుక్తనికాయ. P. T. S. Part II 267, 268.) చదువరులారా! ఈ పైబౌద్ధగ్రంథములందలి వర్ణనములు శ్రీకృష్ణుఁడు మహారణ్యమునందున్న పాండవులను జూడ వచ్చి దుర్యోధనునిదుర్న యమును దలపోసి మహర్షులకుఁ బాండవుల దుస్స్థితిని వ్యక్తపఱచినవిధమును దెలుపుచున్నది. బౌద్ధగ్రంథములందు వర్ణింపఁబడిన యజాతశత్రుఁడను మగధరాజే మహాభారతమునందు వర్ణింపఁబడిన దుర్యోధనుఁడు; గౌతమ బుద్ధుఁడే శ్రీకృష్ణుఁడు; లిచ్ఛవులు పాండుజాతులవారు. దేవతాంశసంభూతులు; వేసలిపురము కాంపిల్యనగరము; బ్రహ్మదత్తుఁడే ద్రుపదమహారాజు; బౌద్ధగ్రంథములు పెక్కులు మనకు మఱుఁగున నుండుటచేత మహాభారతములోని రహస్యములుగూడ మఱుఁగున నున్నవి. ప్రాచ్యులుగాని పాశ్చాత్యులలో మఱియెవ్వరుగాని తెలుపని విషయములను భగవదనుగ్రహమునవలన నేను దెలిసికొని మీకుఁ దెలుపుట సంభవింపుచున్నది గాన చదువరు లీనావాక్యముల కాగ్రహముఁజూపక దయ గలిగి శాంతచిత్తముతోడ నే నీసందర్భమున వ్రాయఁబోవుచున్న వ్యాసములను జదివి సత్యమును గ్రహింపవలయు నని ప్రార్థించుచున్నాను.



# దురాశ

(చిన్నకథ)

గుండిమెడ వేంకట సుబ్బారావు గారు

సత్యమునకు, ధర్మప్రతిష్ఠకును, దగిన
ఫలితము లొసంగుచును, నాల్గు పాదములను
తిరుగ ధర్మంబు, తొలి వంగ దేశమందు
కలఁడు శృంజయుఁడను ధరాఖండలుండు.

కం. ఆ నరపతి సంతాన వి
హీనుండై బంధుజనులహితమున భక్తా
ధీనుండగు నీశ్వరు వర
దానముఁగొననరిగి ఘోరతప మొనరిచెన్.

చం. బహుళతపోనిరూఢి వన
వాటములన్ వసియించుచున్న యా
మహిపతి భక్తికిన్ కరఁగి
మాన్యగుణాలయుఁడైన యా మహా
మహుఁడు శశాంకశేఖరుఁడు
మానవనాథుని ముందునిల్చి తత్
సహజకృపారసంబు పయిఁ
జల్లుచు రాజును బిల్చి యిట్లనున్.

ఆ. "ఓధరాతలేంద్ర! యుష్మదీయతపః ప్ర
భావమునకు నొదిగివచ్చినాఁడ
నేఁద్రిశూలపాణి నీ యిచ్ఛవచ్చిన
వర మొసంగు వాఁడఁ బల్కు మనఘ!"

మ. అనుచున్ తజ్జననాయకుండు మది బ్ర
హ్మానంద ముప్పొంగ, స
య్యనఘుఁ గాంచి నమస్కరించి యిటుల
త్యాత్రంబుతోఁ బల్కు, "నో
కనకాద్రీశ! సువర్ణదేహుఁడయి నా
కన్నంటఁ జల్లార్చు బా
లుని నాకున్ సుతుఁ జేసి నన్ సుఖవిలో
లున్ జేయవే యీశ్వరా!"

ఆ. కలదె యిట్టివింత ఘనగుణాఢ్యుండౌచుఁ
దనకుఁ గీర్తిఁ దెచ్చు తనయుఁ గోర
కకట! స్వర్ణదేహుఁడగు పుత్త్రు నర్థించె!
ప్రభు వదెంత మందభాగ్యుఁడొక్కొ!

కం. అద్ధరణిపు విపరీతపు
బుద్ధికిఁ గారణము లేకపోవునొకో? స్వత
స్సిద్ధంబైన ధనాశన్
బద్ధుండయియుంట నట్టివాంఛ జనించెన్.

గీ. కోరిన వరం బొసంగి పురారి యంత
తని పూజల నంది యదృశ్యుఁడయ్యె
ధరణిపతియు మహానందభరితుఁడగుచు
నరుగు దెంచె నిజాస్థానపురమునకును.

ఉ. అంతటఁ గొన్నిమాసముల
కా నరనాథుని రాణివాసను
ద్ధాంతము నవ్యకాంతులకుఁ
దావలమై విలసిల్ల, నమ్మహీ

కాంతుఁడు కాంచె నిర్మలిన
కాంచనగాత్రుని నొక్కపుత్రకున్
కంతునిఁ గేరువాని! శితి
కంఠుని వాక్యము రిత్త వోవునే!

ఆ. ఆకుమారుఁగాంచి యతులహర్షమహాబ్ధి
నెడలు మరచి యుండెఁ బుడమి ఱేఁడు.
సుతునికంటె వాని యతిలోకసౌవర్ణ
తనువె తనకు మోదధామమయ్యె!

కం. ఈవిధముగ నాశృంజయ　[చుం
భూపిభుఁడు కుమారధనవిభూషితుఁ డగు
జీవనయాత్రను బహుసౌ　[ఖ్యా.
ఖ్యావహముగఁ గడపుచుండె నవ్యాకులుఁ

మ పరమానందముతోడ నిట్టు లలభూ
పాలుండు నాల్గైదు వ
త్సరముల్ పుచ్చె ననంతరం బొక నిశీ
థంబందు నాభూతలే
శ్వరు సౌధంబునుఁ జొచ్చి రుజ్జ్వలఘనా
శన్ ఘోరపాపక్రియా
నిరతుల్ నల్వురు చోరు లీశ్వరుని ని
ర్ణీతంబు సామాన్యమే!

ఆ. గృహముఁ జొచ్చి నాల్గుకెలఁకుల శోధించి
సాధ్యమైనదెల్ల సంగ్రహించి
అచట నచట వెదకి యాచోరవరు లంత
నెడలు పులకరింప నొక్కచోట

కం. కాంచిరి నిద్రారతుఁడై
మంచముపయిఁ బండియున్నమహనీయతనూ
దంచితతేజస్సాంద్రునిఁ　[పుత్త్రున్
గాంచనమయగాత్రు, మనుజ కాంతుని

గీ. వానిఁగని స్వర్ణవిగ్రహభ్రాంతులగుచుఁ
జోరులంతట నారాజసుతునిఁబట్టి
లీలఁ గొని పోయి రటఁబాసి! లేశమేని
యెఱుఁగఁ డీచర్య పాపమాధరణి విభుఁడు!

ఉ. బాలునిఁ గొంచుఁబోయి యొక
పర్వతగహ్వరమందుఁబెట్టి, యా
కూళలు నాల్గు తునకలుగఁ
గోసిరి వాని సువర్ణదేహమున్;
కాలవశంబునన్ మనుజ
కాంతుఁడు మక్కువఁ బెంచుకొన్నయా
శాలత లిట్టినిష్ఠురవి
షంపు ఫలంబును గాసె నక్కటా !

ఆ. అసమతప మొనర్చి యార్జించినసుపుత్త్ర
భాగ్యరాశి భస్మపటల మయ్యె!
ఆశఁగొల్పి నట్టి యాత్మీయ వంశంబు
నక్కటకట! మరల దిక్కుమాలె!

ఆ. ఆమహేశ్వరుని జరాయురారోగ్యవం
తునిఁ గుమారు నొసఁగు మనక నాఁడు
అకట! స్వర్ణదేహుఁడగు పుత్త్రునేటి క
ర్థించె శృంజయుండు తెలివి మాలి!!

కం. ఈ పర్యవసానం బే
శాపంబోకాని, సర్వ సామాన్యముగన్
జూపట్టు నెల్ల యెడలను!
పాపిష్ఠి దురాశ మధురఫలముల నిడునే ?

---

# జ్యోతిశ్శాస్త్రము

### పిడపర్తి సుబ్రహ్మణ్య సిద్ధాంతిగారు

సుధాంబునిధి చంద్రమూర్తిక సమాన భాసాన్వితైః,
ప్రమాణపదవర్జితైః కపటనామభిస్తంతుభిః;
యదాశ్రితసుధీవరాః ప్రకటయంతి బ్రాహ్మ్యం నిజం,
తమానత ఇహార్థయే కలిపతిం స్వకార్యాప్తయే.

ఆకాశమందు మనకు కనిపించు తేజోగోళములకు జ్యోతులని పేరు. అట్టి జ్యోతులయొక్క స్థితిగతులను తెలుపునది జ్యోతిశ్శాస్త్రము.

ఈ జ్యోతిశ్శాస్త్రము రెండువిధములుగా విభాగింపబడినది: ౧. గణితభాగము(సిద్ధాంతము) ౨. ఫలితభాగము. ఫలితభాగము నాలుగు భాగములుగా నేర్పడియున్నది: ౧ సంహిత, ౨ జాతకము, ౩ ముహూర్తము, ౪ ప్రశ్న. సంహితాభాగమునుండి విడిన కేరళ- శకునాదిభేదములచేత పెక్కుభేదము లేర్పడినను ఫలితభాగమంతయు నైదుభాగములుగా మఱికొందఱిచే పరిగణింపబడి జీవులయొక్క చరిత్ర నిర్ణయమందు ప్రధానాధారమై ప్రకృతిశాస్త్రములలో నెల్ల నుత్తమమై రాజిల్లుచున్నది.

జనసామాన్యముగ జ్యోతిశ్శాస్త్ర విషయములను తెలుసుకొననివా రుండరని నానమ్మకము. ప్రకృతిశాస్త్రములలో నెల్ల పండితులు మొదలు పామరులువఱకును, బాలులు మొదలు వృద్ధులువఱకును జ్యోతిశ్శాస్త్రమం దభిరుచిలేని వారుండరు. గనుకనే,

"వనం సమాశ్రితా యేచ వృక్షమూల ముపాశ్రితాః,
అపి తే పరిపృచ్ఛంతి జ్యోతిషాం గతికోవిదమ్.

అను ప్రాచీనసూక్తి రాజిల్లుచున్నది. అందరికిని విశదమైన విషయములను నేను చెప్పుటయం దాదరముండకపోదు. ఇప్పుడు నేను వ్రాయబూనిన కొన్ని విషయములను మీరు పాశ్చాత్య గ్రంథములయందు చదివియే యుందురు. అయినప్పటికిన్ని,

"పాశ్చాత్యవిదుషాం నాహ మృణీ తద్గ్రంథకర్షణాత్,
యదస్మత్ప్రోక్తనేభ్యస్తు గృహీతర్ణం విశోధ్యతే."

అను పూర్వ ప్రతిజ్ఞను మరువకుండుడు.

రాసులు నిన్నగాక మొన్న నోడదిగినవని కొందరును, పూర్వమందు మనకు (భారతీయులకు) జ్యోతిశ్శాస్త్రము సమగ్రముగ లేదని కొందరును, విమర్శించియుండిరి. ఫలితభాగముపై పట్టుపల బూనినమనపాశ్చాత్యపండితులపలుకులు పరిపరివిధములుగ నుండుటయం దాశ్చర్యము లేదు. ఇది దృక్సిద్ధయుగము. ఇందు హేతువాదము హెచ్చుగనుండును; ప్రాచీన పండితుల పద్ధతియో ప్రమాణవాదము.

ప్రాచీనవిద్యలను నేర్చినవారు సంశయాస్పద విషయములయం దాప్తవాక్యమును స్వీకరింతురు. పాశ్చాత్యవిద్య నేర్చినవారు ప్రత్యక్షముగా జూచినదానియందు విశ్వాసము కలవారై యుందురు. వీరిరువురకును కల భేదమిదియె. జ్యోతిశ్శాస్త్ర విషయములో నేను రెండుతెగలవారితోను మాటలాడితిని. సిద్ధాంతభాగమునం దిరువురకును విశేషభేదాభిప్రాయము కానరాదు. నిన్నగాక మొన్న సృష్టిప్రారంభ మనువారుగూడ నిపుడు వెనుకకు బోవుచున్నారు. నవీనులు దేశకాలనిర్ణయములయం దాకాశమునందు పరిగణించిన గుర్తులకు పౌనఃపున్యము నాలోచించిన ప్రాచీనులమార్గమునకు వత్తురు. ఫలితభాగమునందు మాత్ర మిరువురకును పర్వతపరమాణ్వంతరము కలదు. ఫలితభాగము ప్రకృతిసిద్ధమే కాదని కొందరును, ప్రాచీనకాలమందు లేదని కొందరును, పాశ్చాత్యవిద్య నేర్చినవారిలో రెండుతెగలు కలవు. నాడీగ్రంథములు నమ్మతగినవి కావని నవనాగరికులలో కొందరిమతముకూడ కలదు. ఇపుడు

జ్యోతిశ్శాస్త్రవిషయములను బోధించుటకై ప్రయత్నించుచుంటిమి. జ్యోతిశ్శాస్త్రమందు మనము బోధింపతగిన విషయములలో నాకాశమందు దిరుగు గ్రహనక్షత్రాదులయొక్క స్థితిగతులను గురించి ముఖ్యముగా తెలుపవలయును. అందువిషయమై మనప్రాచీనమహర్షులు మిక్కిలి కష్టపడి యుండిరి. ఒక్కొక్కమహర్షి తన జీవితమునంతయును ప్రత్యేకముగ నొక్కొక్కగోళము యొక్క స్థితిగతులను కనిపెట్టుటకై ధారపోసి యాగోళమునకు తనపేరుగాని తనయాప్తులపేరు గాని పెట్టినటుల సుప్రసిద్ధము. ఆకాశమునందు గల నక్షత్రములలో అగస్త్య, అపాంవత్స, అరుంధతి, రేణుక, బృహత్కించిత్, ఆప, మృగవ్యాధ, వైనతేయ, శుని, శౌరి, మొదలగు పేర్లుగల నక్షత్రము లుండుట కిదియే కారణము. మహర్షు లాకాశపరిశీలనము చేసి గోళముల యొక్క చారప్రకృతివికృతిప్రమాణవర్ణకిరణ సంస్థాపనము మొదలగువానిని కనిపెట్టిరి. ఆకాశమందు సంచరించు తేజోగోళములయొక్క స్థితిగతులను బట్టి నిర్ణయించినచారాదులకు సుజనన్నృపరంజనమే ప్రయోజనమని కొందరిమతము. సరసులగు ప్రభువులను సంతోషపెట్టుటకై మహర్షులు శాస్త్రకల్పన మొనరించిరనుట యందు సారస్యము లేదు. ఆకాశమందు గ్రహములు మొదలగువాని నడవడికనుబట్టి భూగోళమందొక క్రొత్తవింత కలుగుననుటయం దిసుమంతయైనను సందియము లేదు. దానిం దెల్పునది ఫలశాస్త్రము (ఫలితజ్యోతిషము). ఈఫలశాస్త్రము జ్ఞాపకమే గాని కారకము కాదని కొందరిమతము. జ్యోతిశ్శాస్త్రమందలి ఫలిత భాగము జీవులయొక్కయు దేశముయొక్కయు నడవడికను చెప్పునదియే గాని మార్పుచేయునది కాదను వాదమువారుగూడ గొంద ఱుండియున్నారు. ఆకాశమందు గ్రహములు మొదలగువాని నడవడికచేత ప్రపంచము యొక్కయు జీవులయొక్కయు నడవడికయందు క్రొత్త సంగతులు పుట్టుటచేత జ్యోతిశ్శాస్త్రము మార్పుచేయునదని కొందఱిమతము. జ్యోతిశ్శాస్త్రము కారకమే గాని జ్ఞాపకము కాదని వీరినిశ్చయము. పైవారియవ్వరును అప్రాచ్యపద్ధతులయం దాసక్తి లేనివారు.

"మ్లేచ్ఛాహియవనాస్తేషు సమ్యక్ శాస్త్రమిదంస్థితమ్,
ఋషివత్తేఽపిపూజ్యంతే కింపున ర్దైవవిద్ద్విజః"

అను వరాహునివాక్యమును బురస్కరించుకొని భారతీయులకు బురాతనమునుండియు ఫలితజ్యోతిషములేదనియు వరాహుడు మొదలగువా రన్యభాషనుండి సంస్కృతభాషలోనికి మార్చిరనియు బల్లగుద్ది బలముగా వాదించువారుగూడ కలరు. వరాహుడు తనగ్రంథమునందు మ్లేచ్ఛులను పెక్కురీతుల వర్ణించినమాట సత్యము. ఆతడు యవనభాషయందు ఫలితజ్యోతిషమును చదివి యుండుట గాని లేక నచట ఆశాస్త్రమును విపులముగ జూచియుండుట గాని జరిగియుండవచ్చును. ఏభాషయందు వరాహుడు ఫలితజ్యోతిషమును విపులముగ జూచియుండెనో నాభాషయొక్క గొప్పతనమును వర్ణించినంతమాత్రమున నంతకు బూర్వమందు తదితర భాషలయం దాశాస్త్రము లేదని సిద్ధించదు. కాశీకా రాజకీయసంస్కృతపాఠశాలయందు ప్రధానగణితశాస్త్రాధ్యాపక మహామహోపాధ్యాయ పండితసుధాకరుడు దీర్ఘవృత్తలక్షణమును సంస్కృతభాషయందు వ్రాయబూని తాను యూరపుభాషయం దావిషయమును పూర్తిగా చదివియుండుటచేత నీక్రిందిపద్యమును వ్రాసెను.

"నిరణాయ మయా విచార్య సమ్యగ్బహుధా యూరపుదేశవిజ్ఞవేద్యమ్; సిద్ధాంత మిదంతు యుక్తి యుక్తం లఘుపుస్తం సురభాష యార్యతుష్ట్యై."

పై పద్యమును చదివినంతమాత్రమున పురాతన భారతీయులకు దీర్ఘవృత్తము తెలియదని చెప్పుటకు సావకాశముండునా? ఉండదు. దీర్ఘవృత్తమును "త్రినాభిచక్రమ"ని పూర్వమందు వాడిరి. పండితసుధాకరుని కాలమందు దీర్ఘవృత్తలక్షణము సంస్కృతభాషయందు నశించియుండుటచేత భాషాంతరమం దాసిద్ధాంతమును బాగుగ నభ్యసించి యుండవచ్చును. వా రభ్యసించిన భాషకు గౌరవ మిచ్చుట విశ్వాససూచకమే గాని వేఱు విషయము కాదు.

భరతవర్షమునందు బుట్టినగ్రంథముల నెన్నిటిని దేశాంతరములనుండి తిరిగి సంపాదించి ముద్రింపించుచుంటిమి. పై సుధాకరపండితుడే లల్లాచార్యకృత "శిష్యధీవృద్ధిద" మను గ్రంథమును యూరపుదేశమునుండి సంపాదించి యచ్చొత్తింపించెనని యాగ్రంథముపీఠికయందు,

ప్రాచీనచీనవరచర్చితపుష్పపుర్యా
మాపూర్య పర్యయజ మార్యథ శేన వేగమ్;
బద్ధం తదేవ వరలల్లసుధౌఘ(సార)
ధారాప్రనాహానికరేణ మహత్త్వమాప. ౧.
సా భాస్కరాదివరవైరికరానయేన
దూనాతిదీనహృదయాంగబలక్షయేన;
ఉత్తీర్య సాగర మహో! మహతో విరాగా
ద్యుర్వోపదేశ మథ లల్లవచస్సుధాఽగాత్. ౨.
తత్రాపి శీతబహుళేన జడత్వ మాప్య
కిం నాన్యదేశజనసంగపరాఙ్ముఖా సా;
మాయాభిధాననగరీత ఉపేత్య తూర్ణం
మా మత్రశుపూర్ణనయనా నయనాగరీతా. ౩.
సంశోధ్య వర్ణ మపహృత్య దురక్షరాణి
రూపం విభూష్య విమలాఖిలవాసనాభిః,
నేయం సుధా నిజకరేణ సుధాకరేణ
విస్తారితా బుధవరా జగతి ప్రసిద్ధా. ౪.

అని పైశ్లోకములచే తెలియుచున్నది. భారతీయ భారతమతల్లిక దేశాంతరములయందును భాషాంతరముల యందును బద్ధురాలై యున్నది. ఆయాతరుణములయందు గల సన్నివేశములచేత వరాహుడు సుధాకరుడు మొదలగువారు వేఱువేఱుభాషలయందు ప్రాశస్త్యమును సంపాదించినను సంస్కృతభాషయందు ప్రాచీనకాలమందు ఫలితజ్యోతిషము మొదలగు విషయములు లేవనుకొనుట ప్రమాదము. ఏకాలమందు యవనులు మొదలగువారినుండి జ్యోతిశ్శాస్త్రము భారతీయులగు మన మభ్యసించితి మనుకుంటిమో ఆకాలమునకు పూర్వమందు వేదము, శ్రీమద్రామాయణము, మహాభారతము మొదలగు గ్రంథములు భారతీయులకు గలవని యొప్పుకొనుచున్నాము కదా! యవనులకంటె పూర్వమందు భారతీయులకు కలశ్రీమద్రామాయణాది గ్రంథములయందు మనము యవనులు మొదలగువారి యొద్దనుండి నేర్చుకొనియుంటె మనుకొనిన విషయములుండిన సంశయము తీరకలదు. చిత్తగింపుడు. ప్రస్తుతమందు ఫలితజ్యోతిషమునుగూర్చి వ్రాయబూనితిని. ఫలితజ్యోతిషము భారతీయులకు పూర్వకాలమందులేదు. గ్రీకులనుండి నేర్చుకొనిరనికదా యూహ. శ్రీమద్రామాయణకాలమందు ఫలితజ్యోతిషముసంపూర్ణ వ్యక్తిత్వము నొందియున్నదని నేను జూపగలను, జాతక, ముహూర్త, శకున, సాముద్రిక, వాస్తు, కేరళ (లక్షణ, స్వప్న, సంకీర్ణ) భాగములను కదా ఫలితజ్యోతిషమునందు వాడుచుంటిమి. ఈమొదలగునవన్నియు శ్రీమద్రామాయణము మొదలగువానియందు గలవు.

### జాతకభాగము

"తత శ్చ ద్వాదశే మాసి చైత్రే నావమికే తిథౌ
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యాజనయ ద్రామం సర్వలక్షణసంయుతమ్;
* * * *
పుష్యే జాతస్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరేఽభ్యుదితే రవౌ
* * * *
కళ్యాణే బల నక్షత్రే మయిజాతోఽసి పుత్రక.
యేన త్వయా దశరథో గుణై రారాధితః పితా.

శ్రీమద్రామాయణము బాలకాండ ౧౮ వ సర్గ.

పైశ్లోకములనుండి శ్రీమద్రామాయణ కాలమందు జాతకభాగము ఎక్కువి ప్రచారములో నుండెనని తెలియుచున్నది. "కళ్యాణే బలనక్షత్రే" అను శ్లోకమును బట్టి చూడగ స్త్రీసామాన్యము సంభాషణమందు గూడ జాతకభాగము ప్రచారములో నున్నట్లు తెలియు చున్నది. "తండ్రీ! కుమారకా! నా గర్భమునందు మంచి నక్షత్రమున బుట్టితివి"అనికౌసల్యాదేవి శ్రీరామచంద్రమూర్తిని స్తుతించుచున్నది. జాతకభాగము వృద్ధిలోనున్నదనిచెప్పుట కింతకంటె ప్రమాణము లక్కరలేదు.

### ముహూర్తభాగము

"లక్ష్మణాగచ్ఛ భద్రం తే ఊర్మిళా ముద్యతాం మయా
ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూత్కాలస్యపర్యయః."

శ్రీ. రా. బాలకాండ ౭౩ వ సర్గ.

"తస్మాత్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి;
ఉదితే విమలే సూర్యే పుష్యే చాభ్యాగతేఽహని.

అయోధ్యాకాండ ౩ వ సర్గ.

లగ్నే కర్కటకే ప్రాప్తే జన్మ రామస్య సంస్థితే;
అభిషేకాయ రామస్య ద్విజేంద్రై రుపకల్పితమ్.

౧౫ వ అ. కాం. సర్గ.

చూచితిరా! "లక్ష్మ ణాగచ్ఛ భద్రంతే" అను శ్లోకము లక్ష్మణస్వామిని గూర్చి జనకచక్రవర్తి పలుకు

మన్నది. "నా బిడ్డయగు ఊర్మిళ కరగ్రహణ మొనరిం పుము. జాగు వలదు" అని యారెడు పలుకుచుం డెను. "మాభూత్కాలస్య పర్యయః", 'ముహూర్త కాలము మించును గనుక విలంబము వలదు' అని జనక చక్రవర్తి యాశయము. ఇటులే ముహూర్తభాగమును గురించి శ్రీమద్రామాయణమునందెన్నెన్ని విషయములో కలవు. గ్రంథము పెరుగుననే భయముతో నిచట వ్రాయ లేదు.

## శకునభాగము

అపిచాద్యాఽశుభాన్ రామ! స్వప్నే పశ్యామి దారు
సనిర్ఘాతా దివోల్కా చ పతతీహ మహాస్వనా.|ణాన్;
అవష్టబ్ధం చ మే రామ! నక్షత్రం దారుణై ర్గ్రహైః;
ఆవేదయంతి దైవజ్ఞా స్సూర్యాంగారక రాహుభిః.
ప్రాయేణ హి నిమిత్తానా మీదృశానాంతు సంభవే;
రాజావామృత్యుమాప్నోతి ఘోరాంవాపదమృచ్ఛతి.
అద్యచన్ద్రోఽభ్యుపగతః పుష్యాత్పూర్వంపునర్వసుమ్;
శ్వః పుష్యయోగం నియతం వక్ష్యంతే దైవచింతకాః
తతః పుష్యేఽభిషించస్వ మన స్త్వరయతీవ మామ్.

రా. అయోధ్యాకాండ ౪ వసర్గ

దివ్యం తరిక్షే భూమౌ చ ఘోర ముత్పాతజం భయమ్
సంచచక్షే చ మేధావీ శరీరే చాత్మనో జరాం.

అయోధ్యాకాండ ౧ వ సర్గ.

"శ్రీ రామచంద్రమూర్తితో దశరథమహారాజు చెప్పుచున్నాడు. ఓ రాముడా! ఇపుడు నాకు స్వప్న మందు పెక్కు-చిక్కులు కానంబడుచున్నవి. మరియు పగలునక్షత్రములు పడుట మొదలగు దుశ్శకునములు కానంబడు చున్నవి. లోకమం దిట్టినిమిత్తములు కని పించిన వెంటనే రాజు మృతినొందుట గాని పెద్ద యాపత్తును పొందుటగాని సంభవించును గనుక నెల్లి పుష్యనక్షత్రమున ని న్నభిషిక్తునిగా జేసెదను."

పైవిషయములనుబట్టి శ్రీమద్రామాయణ కాల మందు నిమిత్తములంబట్టి రాబోవుఫలములను నిర్ణయిం చుట పరిపాటిగా నున్నటుల దోచును.

తథా గతాం తాం వ్యథితా మనిందితాం
వ్యపేతహర్షాం పరిదీనమానసామ్;
శుభాం నిమిత్తాని శుభాని భేజిరే
నరం శ్రియాజుష్ట మి వోపజీవిన.
తస్యా శ్శుభం వామ మరాళపక్ష్మ
రాజీవృతం శుక్ల విశాలకృష్ణమ్;
ప్రాస్పందతైకం నయనం సుకేశ్యా
మీనాహతం పద్మ మి వాభితామ్రమ్.
భుజ శ్చ చార్వంచితపీనవృత్తః
పరార్థ్యకాలాగరుచందనార్హః;
అనుత్తమే నాధ్యుషితః ప్రియేణ
చిరేణ వామ స్సమవేప తాశు.
గజేంద్రహస్త ప్రతిమశ్చ పీనః
తయో ర్ద్వయో స్సంహతయో స్సుజాతః;
ప్రస్పందమానః పున రూరు రస్యా
రామం పురస్తా స్థిత మాచచక్షే.
శుభం పున ర్హేమసమానవర్ణ
మీషద్రజోధ్వస్త మివామలాక్ష్యాః;
వాస స్స్థితాయా శ్శిఖరాగ్రదంత్యాః
కించి త్పరిస్రంసత చారుగాత్ర్యాః.
ఏతై ర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూ
స్సంబోధితా ప్రాగపి సాధుసిద్ధైః;
వాతాతపక్లాంత మివ ప్రణష్టం
వర్షేణ బీజం ప్రతిసంజహర్ష.
తస్యాః పున ర్బింబఫలాధరోష్ఠం
స్వక్షిభ్రుకేశాంతమరాళపక్ష్మ;
వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం
రాహోర్ముఖా చ్చంద్రఇవ ప్రముక్తః."

సుందరకాండ ౨౯ వ సర్గ.

సీతాదేవికి ఎడమకన్నదరెను. ఎడమభుజ మద రెను. ఎడమతొడ యదరెను. పైటకొంగు జారెను. ఈ మొదలగు శకునములు శ్రీ రామచంద్రమూర్తిని శీఘ్ర కాలములో వచ్చువానిగా జెప్పుచున్నవి. అనికదా పైశ్లోకముల తాత్పర్యము. మనుష్య సామాన్యముగా పైశకునములు యోగసూచకములని యెఱిగియున్నవే.

"అథచాపిమహాప్రాజ్ఞ! బ్రాహ్మణానాంమయాశ్రుతమ్
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే.
లక్షణేభ్యో ద్విజాతిభ్య శ్శ్రుత్వాహం వచనం;గృహే
వనవాసకృతోత్సాహా నిత్య మేవ మహాబల!

ఆదేశో వనవాసస్య ప్రాప్తవ్య స్స మయా కిల;
సాత్వయాసహతత్రాహం యాస్యామి ప్రియ నాన్యథా!"
(సాముద్రికము) అయోధ్యాకాండ ౨౯-సర్గ.

శ్రీరామచంద్రమూర్తి అరణ్యమున కేగుచుండగ సీతాదేవియును పైన మయ్యెను. రామచంద్రమూర్తి దేవిప్రయాణమును వారింపుచుండగ నామె పలుకు చున్నది. 'పూర్వమందు నేను పితృగృహమం దుండగ సాముద్రికశాస్త్రజ్ఞు లరుదెంచి నాలక్షణంబులంబట్టి పదునాలుగు వత్సరంబు లరణ్యవాసము నుడివిరి. నేను న్ను దానిఫల మనుభవింపవలెను గనుక తప్పక వచ్చెద' నని పైశ్లోకములయం దున్నది.

"విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో శుభాననః;
గూఢజత్రు స్సుతామ్రాక్షో రామో దేవిజనైశ్రుతః.
దుందుభిస్వననిర్ఘోష స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్;
సమ స్సమవిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః.
త్రిస్థిర స్త్రిప్రలం బశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః;
త్రితామ్ర స్త్రిషు చ స్నిగ్ధో గంభీర స్త్రిషు నిత్యశః.
త్రివలీవాం స్త్ర్యవనత శ్చతుర్వ్యంగ స్త్రిశీర్షవాన్;
చతుష్కల శ్చతుర్లేఖ శ్చతుష్కిష్కు శ్చతుస్సమః.
చతుర్దశసమద్వంద్వ శ్చతుర్దంష్ట్రి శ్చతుర్గతః;
మహోష్ఠహనునాస శ్చ పంచస్నిగ్ధోష్టవంశవాన్.
దశపద్మో దశబృహ త్త్రిభి ర్వ్యాప్తో ద్విశుక్లవాన్
షడున్నతో నవతను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః."
సుందరకాండ. 35 సర్గ.

ఆంజనేయస్వామి సీతాదేవితో విశ్వాసముకొ అను శ్రీరామచంద్రమూర్తివారి రూపరేఖా విలాసాదిక మును జెప్పుచున్నాడు. పై శ్లోకములయందలి లక్షణము లన్నియు సాముద్రికపరిభాషతోనే యున్నవి.

లక్ష్మణా! నయ దారూణి దృఢాని చ వరాణి చ;
కురు ష్వావసథం సౌమ్యం వాసే మే భిరతం మనః.
తస్య తద్వచనం శ్రుత్వా సౌమిత్రి ర్వివిధాన్ ద్రుమాన్;
ఆజహార తత శ్చక్రే పర్ణశాలా మరిందమః.
తాం నిష్ఠితాంబద్ధకటాం దృష్ట్వా రామ స్సుదర్శనామ్;
శుశ్రూషమాణ మేకాగ్ర మిదం వచన మబ్రవీత్ .[మ్;
ఐణేయం మాంస మాహృత్య శాలాంయక్ష్యామహే వయం.
కర్తవ్యం వాస్తుశమనం సౌమిత్రే! చిరజీవిభిః.
మృగం హత్వానయ క్షిప్రం లక్ష్మణేహ శుభేక్షణ!
కర్తవ్య శ్శాస్త్రదృష్టో హి విధి ర్ధర్మ మనుస్మర.
భ్రాతు ర్వచన మాజ్ఞాయ లక్ష్మణః పరవీరహా;
చకార స యథోక్తం చ తం రామః పున రబ్రవీత్
ఐణేయం శ్రపయ స్వైతత్ శాలాం యక్ష్యామహే వయం. [యమ్;
త్వర సౌమ్య! ముహూర్తోయం ధ్రువశ్చ దివసోఽప్య
వాస్తుసంశమనీయాని మంగళాని ప్రవర్తయన్.
వేదిస్థలవిభాగాని చైత్యాన్యాయతనాని చ;
ఆశ్రమస్యానురూపాణి స్థాపయామాస రాఘవః."
వాస్తు. అయోధ్యాకాండ. 56 సర్గ.

"తాం వృక్షపర్ణచ్ఛదనాం మనోజ్ఞాం
యథాప్రదేశం సుకృతాం నివాతామ్;
వాసాయ సర్వే వివిశు స్సమేతా
స్సభాం యథా దేవగణా స్సుధర్మామ్."

పైశ్లోకములను బట్టి శ్రీరామచంద్రమూర్తివారు వాస్తుశాస్త్రప్రకారము పర్ణశాలను నిర్మింపజేసెననియు శాస్త్రము నతిక్రమింపక గృహప్రవేశ మొనరించెననియు తెలియుచున్నది.

ఈప్రకారముగనే శ్రీమద్రామాయణమున ఫలిత జ్యోతిషప్రచారము పెక్కుస్థలములయందు గలదు. ఇందునుండి శ్రీమద్రామాయణకాలమందే మనభారతీయులు ఫలితజ్యోతిషముయొక్క ప్రచారమందు నిపుణులని తెలియుచున్నది.

ఇప్పటివన్ని వేశములనుబట్టి జ్యోతిశ్శాస్త్రస్వరూపమును చెప్పబూనినవారు ముందుగ ఫలితభాగమునుంచి సిద్ధాంతగణితభాగముల కేగవలయును. కనుక నింతకంత ప్రాచీనులఫలితజ్యోతిషజ్ఞానమునుగురించిముచ్చటించితిని. ముందు ఫలితజ్యోతిషమునుగురించి ప్రత్యేకముగ నొక్కొక్కభాగమునుగురించి విపులముగ వ్రాసెదను.

సర్వానందము నంగీకరించి భాషాసాంప్రదాయములను కవివాగాడంబరములను విడనాడినందులకు భాషాభిమానులు మన్నింతురుగాక!

---

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ప్రేమతత్త్వనిరూపణము

(ప్రథమభాగము)



అదనెఱిఁగి కుమారలకును,
సదమలమతి బోధచేసి చదివించినచోఁ
జదువునన మరగినవారల,
మది యారుచి వదలి వెనుక మరలదు కనుఁడీ!

సీ. రఘువంశరసము నారంభించు రసన నై, షధమాధురిం గ్రోలసాగకున్నె?
దశకుమారచరిత్ర దరిసించుకన్నులు, కాదంబరీశోభఁ గాంచకున్నె?
శాకుంతలోత్తరచరిత భూషితబుద్ధి, ముద్రాదులనుదాల్చి మురియకున్నె?
కువలయానందంబుగోను మది గంగాధ,ర ప్రకాశంబులఁ గ్రాలకున్నె?
గీ. దివ్యరామాయణ సరస్వతీమహేతి, హాసపారాయణ పరాయణాననంబు
మఱచునే బుధసంస్తూయమానచరిత, భాగవతభారతేందిరా ప్రార్థనంబు?

చ. కనుగొన దిక్ప్రదర్శనముగా వచియించితిఁగాని సంస్కృతం
బున ననురక్తిఁ గాంచుమనముం దమసంకకు లాగునట్టి క
ల్పనపదసౌష్ఠవంబు రసభావసమృద్ధియు సౌచితీగుణం
బెనసిన గ్రంథరాజముల నెన్నిటి నిమ్యెడ నెన్ననయ్యెడిన్?

సీ. అలపెద్దనార్యు తియ్యనిపల్కు లాలించి, భట్టుచక్కని కుల్కుపల్కు లెఱిఁగి
కృష్ణరాయలప్రౌఢ గీర్భావ మూహించి, ధూర్జటివాక్య మాధుర్యమాని
నందితిమ్మనమాటలందంబు తిలకించి, నరసింహునుడులు కర్ణములఁ గ్రోలి
రామభద్రునివచోరామణీయక మెచ్చి, రామకృష్ణునివచః ప్రౌఢి వ్రాలి
అబ్బనకవిమనోహరభాష హర్షించి, తమ్మయ్యవచన సౌందర్య మరసి
శంకరకవివాక్య సంపత్తి గుర్తించి, గౌరననుడువులు గౌరవించి
వేంకటపతిపల్కు విన్నాణములు గాంచి, వేంకటకవివచో విభవ మెంచి
నారాయణోక్తి ప్రచారచాతురిఁ గాంచి, యితరసత్కవివాక్కు లెఱిఁగి తిరిగి
సూరనార్యునికొత్త సొంపులింపులు నేర్చి, వీరభద్రునివాణి వినుతి చేసి
శ్రీనాథకవినాథు సింగారములు నేర్చి, పోతనార్యునిభక్తిఁ బూజచేసి

రంగనాథునినవారంభరంగముఁజొచ్చి, భాస్కరాదులరామ భక్తిఁ బొగడి
సోమునిమహిమంబుచూచి చేతులుమోడ్చి, కేతనాదులమహాఖ్యాతి కలరి

గీ. ఎందఱెందఱుసూక్తు లింకెన్నియేని, యరసివచ్చు కుమారవిద్యానురక్తి
తుట్టతుదకుఁ గవిత్రయధుర్యభవ్య,దివ్యవాణీ సుధాంబుధిఁ దేలకున్నె!

గీ. విద్యనేర్చుట సదసద్వివేకమూల, మైన యాముష్మికంబున కనుట సత్య
మైన, నయ్యది ధనమూలమైన కేవ,లైహికంబున కుపయుక్త మగుచునుండె.

మ. పరసారస్వతనీరధిం దరిచి తద్భావామృతం బాని బా
లురు నిర్ణిద్రమతిం బరీక్షలఁ గృతార్థుల్ గారొకో! కాని యె
క్కరుఁ డెవ్వండయినన్ సహస్రశతసంఖ్యన్ దానిఁ బ్రేమించినన్
బరమార్థంబున కెల్లవారలయభిప్రాయంబు వీక్షింపుఁడీ!

మ. పురవాసశ్రమ మర్థనాశనమనోబుద్ధిశ్రమల్ సైచి దు
ర్భరనిర్బంధనిబంధనాంగలకలాభ్యాసంబు గావించుచుం
దురుగాదే యిపుడెల్లవారు కులవృత్తుల్ గూడఁ గ్రేడించి దు
ష్కరసేవాకలితాధికారధనభోగఖ్యాతికామంబులన్!

గీ. కాని యానందమునుగూర్చి మానసంబు, ధనము భోగంబు సమకూర్చి తనువుఁ దనిపి
యలరఁజేయునుగాన విద్యానురక్తి, యిరుతెఱంగుల నాత్మార్థమే నిజంబు.

క. ఈగతిఁ గౌమారము వడి, నేగెడితఱి యావనంబు నేతెంచుఁ దనూ
భోగానురక్తి కప్పుడు, లోఁగుదు రెల్లరును గామలోలుపబుద్ధిన్.

గీ. ఇదియె నైసర్గికప్రేమ మెనయునట్టి, నాలుగవమార్పు, దీనిచందం బభూత
పూర్వ, మిదిగాదె లౌకికపూరుషార్థ, కామధామంబు దంపతిప్రేమ మనఁగ.

క. చదువనివారని చక్కఁగఁ, జదివినవారనుచు శంకసలుపక మగఁడాఁ
డుదియని యెంచక యావన,మది మెల్లరమదుల నొక్కమాడ్కిఁ గలఁచుఁగా!

సీ. నవనవోన్మేషమానససారసంబుఁ జిం,దఱసేయు మత్తదంతావళంబు,
విద్యావివేకపుష్పితబుద్ధివల్లరి, నూఁచముట్టుగ నూఁచునోరుగాలి,
లోకవృత్తాంత మాలోకింప వికసించు, కందోయిబంధించు గాఢతమము,
సత్కథాకర్ణనాసక్తకర్ణములోన, శృంగారమంత్రంబు చెప్పుగురువు,
వినయనయభయవిధులార్చు వేరుపురుగు, కుటిలసాహస విధిఁ గూర్చు కుంటెనీఁడు,
మంచిచెడ్డలు మఱపించు మత్తుమందు, నగుచుఁబొడచూపు నభినవయావనంబు.

చ. పారవిహీన ముద్ధత మపాయపరీతము నైనఘోరసం
సారముఁ జొచ్చు జీవి సహజంబుగ జవ్వనమందు దానికిం
గారణ మాశరీరసుఖకాంక్షయె దానికి సాధనం బగుం
గోరినకాంత కాంతునకుఁ గోరినకాంతుఁడు కాంత కబ్బుటల్.

చ. పరిణయనిశ్చయం బనెడిభాగ్యము నాఁటినయట్టిచిత్తులై
కరమును బట్టువేళ మొలకల్ వొడమం జెలువన్నెచూపులన్
వెఱఁగి తలంపు సిగ్గు గనిపించురసోక్తులఁ బూచి యవ్వధూ
వరహృదయానురాగరసవల్లులు కూడికఁ గాచు నేకమై.

సీ. ప్రాణనాయికమేను బంగారుబొమ్మగా, సింగార మొనరించి పొంగువారు
కాంతాంగవల్లరి కాంచనవల్లిగాఁ, గాంచి యానందంబు గాంచువారు
మంజుభాషిణిపల్కు మాధ్వీరసంబుగాఁ, గ్రోలి మైమఱపునఁ దూలువారు
హరిణాంకవదనయపాంగవీక్షారేఖ, తమభాగ్యరేఖగాఁ దలఁచువారు
గీ. పక్వబింబాధరోష్ఠచుంబనఫలంబు, తనువు లెత్తినఫలముగాఁ దలఁచువారు
గాఁగ జాయానురాగసంక్రాంతహృదయు, లగుచు నానంద మొందనిమగలు గలరె?

సీ. భావజాతత్రపాబహుమానవలమాన, దరమానవీక్షణోదరములందు
జీవారుణాధరాంచితలాసవిలాస, దరహాసచంద్రికోదరములందు
వరకుందవాసనాభాసమానాసమా, దరవేషధారణోదరములందుఁ
బాహాసపరిరంభపరిచితాదరచితా, దరనర్మభాషణోదరములందు
గీ. యూహగూఢాతిగాఢసంవ్యూఢమగుచుఁ, గానవచ్చెడిస్వీయముగ్ధానురాగ
వల్లరులఁ బెంచుననుకూలవల్లభులకు, స్వాదుశృంగారరసఫలాస్వాద మరుదె?

చ. తరుణము వేచి కూర్చుసుఖదాయకభోజనపానశయ్యలన్
సరసవచోవిలాసములఁ జందనచర్చలఁ గమ్మతావిక
ప్పురపు విడెంబులన్ వలపు పొంగఁగఁ దన్పుచు మానినీమణుల్
వరులకుఁ గూర్చుచుండు రసవద్గుణాభరణాభిరామలై.

చ. చెలువము దీర్చుమేల్నగలు చీరలు రైకలు లేకయున్న న
ర్మిలి మెయి దాల్చి యందమున మించె నొకో యనఁ గొంద ఱంగనల్
చెలువ్రలఁ గూర్మిఁ గాంచి సుఖలీలలఁ దేలుదు రెందు నాథులన్
వలచినభామినీమణులు భాగ్యము భోగ్యము లెన్నఁజూతురే?

చ. కులమును శీలముం బలుకుఁ గోర్కియు నొక్కటి గాఁగఁ జిత్తముల్
గలిసినదంపతుల్ సమముగాఁ జవిగొందురు ప్రేమబద్ధులై
కలిమియు లేమియున్ సుఖముఁ గష్టము నెల్లయవస్థలందు మే
నుల నెడఁబాయునంతకు వినోదవిషాదము లారగించుచున్.

ఉ. ఎంతటికష్టమైనను సహింతురు కూరిమి గల్గు కాంతలున్
గాంతులు గూడి కష్టములు గాఁపుర ముందునె యంచుఁ జిత్తవి
శ్రాంతి యొనర్చుకొంచును బరస్పరభావిసుఖాభిలాషఁ దుః
ఖాంతమునన్ సుఖంబు గనునాసలు నైజము గావె జీవికిన్?

గీ. అలికి యతుకనియ ట్లుండునాలుమగల, యంతరంగంబు లొకటిగా నదుకఁబాలు
నందనానందరసము నొందంబు లారఁ, గ్రోలి సుఖియింత్రు దంపతుల్ కూర్మి వెలయ.

సీ. కొడుకుఁ గూఁతుల నెత్తికొని నెత్తిఁ గొని యాస్య,మున నద్దుకొని ముద్దుగొనెడువారు
లాలారసస్యంది బాలాంగపరిరంభ, లీలాసుఖంబులం దేలువారు
పుత్రులతక్కునవ్వులు చిల్కు తేనియ, లొల్కుపల్కులు విని కుల్కువారు
మందమందానందకందబాలక్రీడ, లందంబు గని వేడ్క నందువారు

గీ. ఐహికాముష్మికసుఖంబు లంద దిక్కు, నందనులె యంచు నానంద మొందువారు
గాఁగఁ గడగండ్ల పడి వారిఁ గాచునట్టి, జంతులపుత్రపూర్ణవాత్సల్య మరుదె?

క. ఈమెయి నడి నుచితంబుగఁ, బ్రేముడి సత్వాంశ మొప్ప వెలయుచు నడుమన్
గామక్రోధగతిం బయి, తామస మయి లోక మెల్ల దండడివెట్టున్.

ఉ. దారసుతాదిబంధము యథార్థముగా నెఱి నమ్మి వారి కె
వ్వారికి నెట్టిలోపము నపాయము రాఁ దగ దంచు నెన్నియో
దారుల వారికిన్ సుఖము దార్పఁగ నెంచుచు వారె తాముగా
వారియపాయమే తమయపాయముగాఁ గనుచుండరే జనుల్?

చ. ఒకనికి నొక్కఁడే కొమరుఁ డుండెను బో తన కాకుమారుఁడే
సకల మటంచు వాఁడు కడుసంతస మందును గాన వాని ప్రే
మకుఁ గుదు రాసుతుం డలఁడు మై విషనాడిన వానిఁబొంది తం
డ్రికిఁ గనుపట్టు నెల్లపుడుఁ బ్రేమపుటుయ్యల నూఁగులాడుచున్.

చ. కొమరులు నల్వు రుండి రనుకొందము వారలలో నొకండు కా
లముగతి నొంది తండ్రి యదిలంగొన నాప్తులు వచ్చి యున్నగాఁ

కొమరులఁ జూచికొమ్మ మదిఁ గుందకు మన్నను బ్రేమసూత్రబం
ధము మృతపుత్రుతోఁ బితయెదన్ మఱియింత బిగింప కుండునే?

చ. తనయుఁడు తప్పుదారిఁ బడి ద్రవ్యము దుర్వ్యయ మాచరించుచున్
దన కపకీర్తి తెచ్చె నని తండ్రి వగన్ విసుఁగెత్తి వీఁడు చ
చ్చిన మఱి చావ నిమ్మనుచుఁ జేరఁగ నీయఁడు కొంప కప్పు డా
చెనఁటికిఁ గీడు మూఁడె నని చెప్పినచోఁ బిత పర్వు లెత్తఁడే?

ఉ. పిల్లలు తీవ్రరోగపరిపీడన మొందినవేళ వారిసొ
మ్మెల్లను వేంకటేశ్వరున కిచ్చెద మంచును జబ్బు మళ్లినన్
జల్లఘటంబు మేఁకలను జాతర కిచ్చెద మంచు దేవికిన్
దల్లులు మ్రొక్కుకొందురుగదా! కనుఁ డీతనయానురాగముల్.

గాఢప్రేమ

క. ఒకయెడ నాటిన ప్రేమం, బకలంకము గాఢమును నహార్యము సహజం
బకుటిల మై యొప్పుచు వె, న్కకు వెంజనియుఁ బోదు దానికార్యము గనుఁడీ!

చ. మరణము వాసినంత నొకమానిని భర్తపదంబు లంటి మీ
చరణసరోజసేవ నిహసౌఖ్యము గాంచు ఋణంబు తీఱె మీ
స్మరణమె యింక నాకుఁ బరసౌఖ్య మొసంగెడు నంచు బాష్పసం
చరదనురాగదృష్టిఁ గడసారిగఁ గన్గొని చేరె నాకమున్.

చ. వరమతిశీలవృత్తిసమభావసమంచితదంపతిద్వయిన్
బరమపదంబుఁ జేరె నెలప్రాయమునం దలసాధ్వి యాసతీ
విరహవిషాదసాయకవిభిన్నమనస్కుఁడు నామెదీర్ఘసుం
దరనయనానురాగకలఁ దత్ప్రతిమం గనుచుండు నెప్పుడున్.

చ. ఒకనిఱుపేదవాఁడు మృతినొందినప్రేయసిదేహ మేటియం
తికముగఁ బూడ్చి యం దరుఁగు దీర్చి నిచ్చ గడించుకూలి నిం
చుక నొకపండు పూలు కొని సూనునిఁ గూడి దినాంతవేళ వే
దికకడ కేగి యం దిడి సతిన్ స్మరియించు నదెంతకూర్మియో!

చ. తరుణవయస్కుఁ డుత్తముఁ డుదారమనస్కుఁ డపుత్రుఁ డర్థసం
భరితుఁ డొకండు సాధ్వి యగుభార్య గతించినయంత వెండియున్
బరిణయ మాడ కాత్మసుఖవాంఛల నన్నిటి పీటఁబుచ్చి యా
మరణము తత్సతీనిహితమానసుఁ డయ్యె నదెట్టిప్రేమమో!



# ధర్మతత్త్వము

పండిత నేమాని వేంకట నరసింహశాస్త్రి గారు, కావ్యతీర్థ

"ధరతిలోకాన్ ధ్రియతే పుణ్యాత్మభిరితి వా ధర్మః" అను వ్యుత్పత్తులవలన నిశ్శ్రేయస సిద్ధి కలిగించునది ధర్మము. ఆచార్యప్రేరిత ములగు యాగాదులను జేయుటయే ధర్మమని జైమినికృత మీమాంసాదర్శనమందుఁ గలదు.

"యఏవ శ్రేయస్కరస్స ఏవ ధర్మశబ్దేనోచ్యతే"

(మీమాంసా ౧-౨ సూత్రభాష్యం)

ఏది మంగళజనకమో యదియే ధర్మము. మరణానంతర మేదియు వెంటరాదు కాని ధర్మ మొక్కటియె యనుసరించును. ధర్మము మిత్రునివంటిది.

"ఏకఏవ సుహృద్ధర్మో నిధనేఽప్యనుయాతియః,
శరీరేణ సమంనాశం సర్వమన్యత్రగచ్ఛతి."

హితోపదేశము.

ధర్మము వేఱు వేఱు వర్ణములవారికి వేఱు వేఱువిధముగ నుండును. ఏకార్యానుష్ఠానము బ్రాహ్మణులకు ధర్మమో యది క్షత్రియుల కధర్మము. ఎయ్యది క్షత్రియులకు ధర్మమో యది భూసురుల కధర్మము. వర్ణానుకూలమైన కార్యము ధర్మము. వర్ణప్రతికూల కార్య మధర్మము. వ్యాఘ్రము జీవహింసఁ జేయును. అదియే దానికి ధర్మము. మానవుఁడు జీవహింసను గావించిన వానిధర్మమునకు విరుద్ధము. సమాజము ననుసరించి కార్యకరణము సమంజసము. వర్ణాశ్రమములకు ధర్మములు భిన్నభిన్నములుగా నుండును. ఆధర్మసంచయము నాచరింపకుండిన నాశ్రమధర్మముల నుల్లంఘించినవా రగుదురు. ఆశ్రమధర్మములను పాటింపకుండుట యధర్మము. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాస మను నాలుగాశ్రమములు హిందూమతమునఁ గలవు. అట్టి చతుర్విధాశ్రమధర్మముల నాచరించిన మోక్షము చేకూరును.

"సర్వేషామపి చైతేషాం వేదస్మృతివిధానతః, గృహస్థఉచ్యతే శ్రేష్ఠః సత్రీ నేతాన్ బిభర్తి హి" (మనుస్మృతి)

ఆశ్రమచతుష్టయములోను గృహస్థాశ్రమ మత్యుత్తమము. కుటుంబి, బ్రహ్మచారిని,

వాన ప్రస్థుని, యతిని బోషించును. ఆశ్రమ ధర్మము లీక్రింద నుదాహరింపఁబడినవి.

"చతుర్భిరపిచైవైతే నిత్యమాశ్రమిభిర్ద్విజైః, దశలక్షణకో ధర్మస్సేవితవ్యః ప్రయత్నతః; ధృతిః క్షమా దమో ఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః, ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణం; దశ లక్షణాని ధర్మస్య యే విప్రా స్సమధీయతే, అధీత్య చాను వర్తంతే తే యాంతి పరమాం గతిమ్." (మనుస్మృతి)

ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, ఇంద్రియనిగ్రహము, ధీ, విద్య, సత్యము, అక్రోధము నను నవి ధర్మలక్షణములు. ఈ దశలక్షణములు గలవాఁ డుత్కృష్టగతి నొందును. ఇవి యన్నివర్ణములవారికి అన్ని యాశ్రమములవారికి నాచరణీయములు. బ్రహ్మచర్యము, సత్యము, తపస్సు, దానము, నియమము, మొదలగు ధర్మాంగములచేత ధర్మ మభివృద్ధినొందును.

"అద్రోహశ్చా ప్యలోభశ్చ దమో భూతదయా తపః, బ్రహ్మచర్యం తప స్సత్య మనుక్రోశః క్షమాధృతిః, సనాతనస్య ధర్మస్య మూల మేత ద్దురాసదమ్." (మత్స్యపురాణము)

అద్రోహము, అలోభము, దమము, భూతదయ, బ్రహ్మచర్యము, సత్యము, అనుక్రోశము, క్షమ, ధృతి మొదలగునవి సనాతనధర్మమూలములు.

"శ్రాద్ధకర్మ తపశ్చైవ సత్య మక్రోధ ఏవచ, స్వీయదారేషు సంతోష శ్శౌచం విద్యానసూయతా, ఆత్మజ్ఞానం తితిక్షాచ ధర్మస్సాధారణో నృప!"

శ్రాద్ధకర్మ, వ్రతము, అనఁగా స్నానము, దానము, పూజ, హోమము, జపము, సత్యము, అక్రోధము, స్వీయదారసంతోషము, విశుద్ధత, విద్య, అసూయారాహిత్యము, ఆత్మజ్ఞానము, తితిక్ష మున్నగునవి సాధారణ ధర్మములు.

ఆర్యు లెద్దాని నాచరింతు రదియె ధర్మము. ఆగమవేదులు దేనిని గర్హింతు రది యధర్మ మని విశ్వామిత్రునిమతము.

"య మార్యాః క్రియమాణం వై సంశోహ్యాగమవేదినః, స ధర్మోయం విగర్హంతి త మధర్మం ప్రచక్షతే."

ధర్మశబ్దమున కిట్టి యర్థములు గలవు. ధర్మశబ్దము సంస్కృతభాషాపదము. గీర్వాణభాషయం దీశబ్దమున కేయేయర్థములు గలవో యవియన్నియు నాంధ్రభాషలో వ్యవహరింపఁబడుచున్నవి. అతిప్రాచీనమైన ఋగ్వేదమం దిటులు ధర్మశబ్దనిర్వచనము గలదు.

"త్రీణిపదావిచక్రమే విష్ణుర్గోపా అదాభ్య అతోధర్మాణి" (ఋక్)

పరమేశ్వరుఁ డాకాశమధ్యమున త్రిపాదపరిమితిగల స్థానమును నిర్మించి లోకములు సకలధర్మములను ధరించునటుల నొనర్చుచున్నాఁడు. ఇచ్చట ధర్మశబ్దమునకు జగన్నియామకమైన నియమసమూహ మని యర్థము.

మనుస్మృతి ద్వితీయాధ్యాయమున ధర్మ విచారణ యిటులు చేయఁబడినది. రాగద్వేషములు లేని విద్వాంసుఁడు సమాజములో నే నియమమును బాలించునో యదియే ధర్మము.

పురాణములయందును శాస్త్రములయందును ధర్మశబ్దమున కేకార్థము కల్పింపఁబడక భిన్నార్థములు గల్పింపఁబడినవి.

"అహింసాలక్షణో ధర్మో హింసా చాధర్మ
లక్షణా" (మహాభారతము)

"విహితక్రియయా సాధ్యో ధర్మః పుంసాం
గుణోమతః, ప్రతిషిద్ధక్రియాసాధ్యస్సగు
ణో ధర్మ ఉచ్యతే" (ధర్మదీపిక)

ఏకార్యమువలన మానవసమాజమునకు మేలు గలుగునో యదియే ధర్మము. శాస్త్రసమ్మత మగు కార్యాచరణమువలన మంగళమే కాని యమంగళము కలుగదు.

"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్వి
పర్యయః" (శ్రీభాగవతము)
వేద ప్రణిహితం ధర్మకర్మ తన్మంగళం
పరం" (బ్రహ్మవైవర్తము)

శాస్త్రము—"శిష్యతేఽనేనేతి శాస్త్రం" శాస్త్ర మన శాసనవాక్యము. పుత్త్రుని మంగళమును గోరుచుఁ దండ్రి సంతానముయొక్క శైశవావస్థయందు "లాలయేత్ పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్" అను న్యాయమున సూనుని దండించును. అటులే ఋషులు లోకులు ధర్మభ్రష్టులగుదురని భావించి శాసనవాక్యములనుగాని విధివాక్యములనుగాని రచించిరి. అధర్మకార్య మాచరించిన బాధ జనించును. అందువలన సహజవ్యక్తికి గౌరవ ముండఁజాలదు. ఎట్టికార్యమాచరించుటకు సాహసము పుట్టదు. కావున ధర్మాచరణముకై శాసనవాక్యములు పుట్టినవి. సిపాయిని జూడఁగనే భీతిజనించుటులు ధర్మసూత్రములను వీక్షించినంత సాధ్వసము జనించును. అట్టిభయముండకుండిన ప్రతివ్యక్తియు మానసమునకుఁ దోచిన కార్య మాచరించి భ్రష్ట మగును. లోక మొక్కరీతినుండక భిన్నభిన్నమార్గములను బట్టును. ఇట్టిదురవస్థ సంభవించునుగదా యని యాలోచించి ఋషులు సత్కార్యముయొక్క స్వరూపము ఫలము సుఖము మొదలగునవి జన్మించునట్లు ధర్మవర్ణనము గావించిరి. ఈ సందర్భమునఁ గొన్ని యుదాహరణము లావశ్యకములు.

"ప్రతిపది కూష్మాండం నాశ్నీయాత్"

ప్రతిపత్తునాఁడు కూష్మాండమును దినఁగూడదు. ఈ నిషేధవిధి ననుసరించి గుమ్మడికాయ తినుటవలన దోష మేమి యని ప్రశ్నించిన "కూష్మాండే చార్థహానిస్స్యాత్" కూష్మాండభక్షణమువలన అర్థహాని కలుగునని సమాధానమును జెప్పవలయును. ఈ విషయమే తిథితత్త్వమను గ్రంథమున వర్ణింపఁబడినది.

"కూష్మాండే చార్థహాని స్స్యాత్ బృహ
త్యాం నస్మరే ద్ధరిం, బహుశత్రుః పటోలే
స్యాత్ ధనహానిస్తు మూలకే"

అందుచేత విధివాక్యములు క్షేమదాయకము లగుటచే వాని నుల్లంఘింపరాదు. నిషేధదివసంబునఁ గూష్మాండమును దినకుండిన నవశ్యము శరీరమునకు మనస్సుకు నుపకారక మగును.

ప్రభువాక్యములను సేవకుఁడు శిరసా వహించునటుల శాస్త్రవాక్యములను లోకము మన్నింపవలసినదే! కాఁబట్టి కూష్మాండభక్షణమునం దటులే ప్రవర్తింపవలయును.

"చతుర్దశ్యష్టమీచైవ అమావాస్యాచ పూర్ణిమా, పర్వాణ్యేతాని రాజేంద్ర! రవిసంక్రాంతి రేవచ, స్త్రీతైలమాంస సంభోగీ పర్వ స్వేతేషు వై పుమాన్, విణ్మూత్రభోజనం నామ ప్రయాతి నరకం మృతః, అను ప్రమాణమునుబట్టి "పర్వాణి మాంసం నాశ్నీయాత్" అను నిషేధ వాక్యము ననుసరింపవలయును.

ఒకవంక విధి-నిషేధవాక్యములు. వేఱొక వంక విధినిర్దిష్టకార్యములు. అందొకటి రెండు వాక్యములను జేర్కొనుచుంటిని.

"మాఘే మాసి సితేపక్షే పంచమీ యా శ్రియః ప్రియా, తస్యాం పూర్వాహ్ణ ఏవేహ కార్య స్సారస్వతోత్సవః"

(తిథితత్త్వము)

ఈ ప్రమాణమునుబట్టి "పంచమ్యాం శ్రియం పూజయేత్" అను విధిశాస్త్ర మనుసరింపవలయును.

"ఏకాదశ్యా ముపవసేత్" అనువిధి ననుసరించియే కాదశినాఁ డుపవాస ముండవలయును. అందుకుఁ బ్రమాణము:

"ఏకాదశీ సదోపాస్యా పుత్త్రపౌత్త్రవివర్ధనీ, భుఙ్క్తే యో మానవో మోహాత్ ఏకాదశ్యాం స పాపకృత్"

(తిథితత్త్వము)

అమావాస్యనాఁడు పితృశ్రాద్ధమును జేయవలయును. అందుకుఁ బ్రమాణము

"నిరాశాః పితరో యాంతి పాపం దత్వా సుదారుణమ్."

అను ప్రమాణము ననుసరించి "అమావాస్యాం పితృభ్యో దద్యాత్" అను విధిని ఆచరింపక తీరదు. "రోచనార్థా ఫలశ్రుతిః" అను వాక్యముద్వారా రుచిలేక ప్రవృత్తిగాని అరుచి లేక నివృత్తిగాని కలుగుచున్నది.

"పిబ నిస్వం ప్రదాస్యామి ఖల్వాతే ఖండ లడ్డుకం, పిత్రైవ ముక్తః పిబతి నఫలం తావదేవ తు."

పుత్త్రనియారోగ్యమును గోరెడి తండ్రి లోభపెట్టి సంతాన మను చేదుమందును ద్రాగునటులు చేయును. ప్రజలకుశలమును గోరెడి శాస్త్రము ఫలాఫలములచే నజ్ఞానులను లోభపెట్టి సత్కార్యములను జేయువారలనుగా నియమించును. బాలకుఁడు మోదకమం దుండెడిలోభమువలన తిక్తౌషధమును సేవించును. కాని జనకుఁడు బాలునకు మోదకము నీయఁడు. ఆరీతినే శాస్త్రమును నిజోపదిష్టకార్యము నాచరించువారికి యథోక్తఫలము నీయదు. పుత్త్రుఁ డరోగవంతుఁడై యుండుటయే తండ్రి యిచ్ఛ. శాస్త్రమును ప్రజాపర్గమునకు మొదట సుఖమును స్వాస్థ్యమును గలుగఁ జేయును. పిదప శాంతిభావము నందఁ జేయును. పితృప్రోత్సాహము వలన పుత్త్రుఁడు చేదుమందు త్రాగి రోగములేనివాఁడగును. కాని మోదకమును దినఁడు. ఆవిధముగనే శాస్త్రప్రేరణమువలన శాస్త్రోప

దిష్టమార్గము నవలంబించిన మానవుఁడు బాహ్యాధ్యాత్మికలాభముల నెందును. కాని లోభనీయఫలమును బొందఁడు.

అందుచేత ఋషులు స్థిరబుద్ధిగల వారై యాత్మజ్ఞానముద్వారా జనసాధారణము యొక్క హితమునకై పెక్కుధర్మ వచనములను రచియించి కీర్తివడసిరి. అందులకే శాస్త్రవాక్యముల యావశ్యకత. అట్లు ధర్మవాక్యములన్నియు గ్రంథాకారమును దాల్చి ధర్మశాస్త్రరూపమునఁ బ్రసిద్ధిఁ జెందినవి.

---

# వానప్రస్థుని విభ్రమము

## శ్రీ శివశంకరశాస్త్రి

సాహితీసమితిసభాపతి

౧

ఆ మనోహర మైన సాయంతనమున
ఇష్ట సఖులతోఁడఁ బథమున నేగుచుండ
అక్కజము గొల్పి తోఁచె నీయాననంబు
సరసిపైఁ దేలియాడెడి జలజమట్లు!
మధుపమై పోయె నపుడె నామానసంబు
నీముఖాబ్జముపై వ్రాల నీలవేణి!
పాదయుగళంబు తోడనె పార్శ్వమునకుఁ
దిరిగి కదలగఁ జొచ్చె విధేయ మగుచు.

సుందరద్వారదేశము నందు దేవి!
స్థిరముగా నిల్చియున్న నీదేహయష్టి
పటముపై వ్రాసి యావృతిబద్ధమైన
ప్రతిమవిధమున నాకు విభ్రమము గొలిపె!
పంకజాతాక్షి! నామీఁదఁ బఱపినట్టి
నీకటాక్షేక్షణావళి నిశితవిశిఖ
వితతి తాకఁగ నామనోవిహగ మపుడె
పల్లటిలి వ్రాలె నీపాదపద్మములను!
నీ మనోహరవసననిర్నిద్రవిమల
సాంద్రచిత్రితసహకారజాలకముల
మధ్యసీమను మీనాయమానమగుచు
సంచలించెను నాదులోచనయుగంబు!

ప్రమదభరమున నీనిరాభరణసుంద
రాననసుధాంశుబింబమునందు నిలిచి
మరల దయ్యెఁ జకోరముమాడ్కి దేవి!
దివ్యరాగార్ద్రమైన నాదృష్టి యపుడు.
తప్ప దయ్యెను నిను వీడి తరలి చనక!
మరలి చూచితి వీక్షణ మాలికలను
బఱపితివి శాంతగతిని నాపైన దేవి!
ధన్యతఁ గంటి నంచు నేఁ దలఁచుచుండ!

౨

అగ్రహారమునందు భక్తాళికెల్ల
వివిధకామ్యములం దీర్ప వెలసియున్న
శ్రీపయోధర కలశవాహిగ జేంద్రుc
గొలిచి ప్రాంగణభూమిని నిలిచియుంటి.
దేవి, యచటికి నీ వరుదెంచినావు!
అపుడు నీపార్శ్వవర్తిను లడ్డమగుటc
గానరాలేదు నీముఖకమల మయ్యొ!
పత్రముల మాటువడిన పుష్పంబువోలె.
మధురమంథరగతి నీవు మందిరంబు
లోని కేగుచు నుండి నా లోలదృష్టి
హర్షమునc దన్మయంబయి యనుసరించెc
బల్లవమనోజ్ఞమైన నీపాదయుగళి!
నీముఖజ్యోత్స్న నామీద నెఱయుకొఱకు
నాలయములోని కల్లన నరిగినాను
ఇంతలోపలనే తటిత్కాంతవోలెc
దరలిపోతివి వేఱొక ద్వారవీథి!
చిమ్మచీcకటి గ్రమ్మె హృత్సీమ నపుడు!
చూడ్కు లున్న సమస్తము శూన్యమయ్యె!
దేవి! యీదీనునకు నింక ధ్యేయ మొకటె
స్థలకమలరమ్యమైన నీచరణయుగళి!

౩

నీ మనోహరమూర్తి ధ్యానించుకొనుచు
మెల్లగాc బోవుచుంటి నీమేడదరిని
తలcపని తలంపుగా నీదు దర్శనంబు
కలిగినది దేవి, కన్నులకఱ్ఱదీర!
పద్మసంకాశమైన నీపాణియందు
సంస్కృతగ్రంథరాజము సంతరించి
యంచయానముతో నరుదెంచినావు
దివ్యశోభను భారతీదేవివోలె!
కమ్రసుస్నిగ్ధనీలాంశుకంబు దాల్చి
యెదురు పడితివి దేవి, నీ వింపు లొలుక!
అంబుదశ్యాముcడైన మురారిదేవు
లలితసంశ్లేషమందలి లక్ష్మివోలె!
శాంతశీతలత్వత్కటాక్షంబుచేత
నాదుహృదయంబు మిగుల నామోద మొందె
స్వచ్ఛచంద్రమయూఖ సంస్పర్శనమునc
బరిమళించెడి మల్లికాప్రసవ మట్లు!
కన్ను లరమోడ్చి యాననకమల మల్ల
రమ్యముగ వాల్చి లజ్జాభిరామగతిని
లలితజంగమకాంచనలతిక వోలె
హర్మ్యభాగంబులోనికి నరిగినావు!
చటుల విభ్రమ గతి భవత్కుటిలకేశ
జాలమునc జిక్కుకొనినమొలోచనయుగమ్ము
నవయు మోక్షములేక బంధనమునందె
త్వత్కటాక్షంబు వరలు నందాక దేవి!

# పండితరాయలు

## చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

ఇతఁడొక సంస్కృత మహాకవి. ఆంధ్రదేశస్థుఁడు. గోదావరీమండల మందలి ముంగొండగ్రామ మాతని నివాసస్థానమనియు, నతఁడు వేగినాటి శాఖలోఁ జేరిన వైదిక బ్రాహ్మణుఁడనియు ననేకులు చెప్పుదురు. ఇతనికిఁ దలిదండ్రులు పెట్టినపేరు జగన్నాథుఁడు. పండితరాయలనుపేరు డిల్లీచక్రవర్తి లిచ్చిన బిరుదనామము. ఈయనతండ్రిపేరు పేరుభట్టు. తల్లిపేరు లక్ష్మి. ఈయన 17-వ శతాబ్దముయొక్క మొదటిభాగమున ననఁగా క్రీస్తుశకము 1660 సం. ప్రాంతములయందు డిల్లీచక్రవర్తియైన షాజహానునియొక్క యాస్థానమందుండి యాచక్రవర్తియొక్క జ్యేష్ఠకుమారుఁడును సంస్కృతభాషాభిమానియు గుణగ్రహణపరాయణుఁడునగు 'దారా' యనునతని కాశ్రితుఁడై యుండెను. ఈయన మిక్కిలి బుద్ధిమంతుఁడు. అఖండప్రతిభాశాలి. మహావిద్వాంసుఁడు. ఇతఁడు రసగంగాధరమను నలంకారశాస్త్రమును గీర్వాణభాషలో రచియించి తనకు సమకాలికుఁడయిన యప్పయదీక్షితులవారియొక్క చిత్రమీమాంసయను నలంకారశాస్త్రముపై దృఢమయిన విమర్శచేసెను. గంగాలహరి, పీయూషలహరి, జగదాభరణము, ఆసఫవిజయము మొదలగు మఱికొన్ని చిన్నచిన్న పద్యకావ్యములను, భామినీవిలాస మను పేర మిక్కిలి సుందరములైన ప్రాస్తావికశ్లోకములను రచియించెను. ఈయన గ్రంథములలో నెల్ల భామినీవిలాసమే మిక్కిలి ప్రసిద్ధమైనదియు, మిక్కిలి ప్రచారము గలదియు నై యున్నది. నాగరలిపిలో నీ గ్రంథములోనివి మూఁడు వందలశ్లోకము లచ్చుపడినవి. వానినే మనయాంధ్రకవులు కొందఱు తెనిఁగించిరి. ఈ గ్రంథమునందు 1400 శ్లోకములు గలవని వాడుక గలదు. ఈ గ్రంథము మిక్కిలి నీతిదాయకమై యున్నది. ఇందలి ప్రతిశ్లోకము రసవంతమై యున్నది. కవి యన్యాపదేశముగా లోకులకు మిక్కిలి చమత్కారముగా నీతిని బోధించెను. కొన్ని విషయములలో భర్తృహరినీతిశతకముకంటె నీ గ్రంథ మెక్కుడురసవంతముగానున్నదని చెప్పవచ్చును. అన్యాపదేశమనఁగా నేర్పఁదలఁచిన నీతిని మఱియొకవస్తువుమీఁద వంకపెట్టి నేర్పుట. ఈపద్ధతి చదువువారిమనస్సులను రంజింపఁజేయును. అన్యాపదేశమనఁగా నెట్టిదో పాఠకులకు సులభముగాఁ దెలియుటకై యొక యుదాహరణము నిచ్చుచున్నాను.

శ్లో. మాగర్వ ముద్వహ బిడాల! మహీపతీనాం
అంతఃపురం మణిమయం నిలయం మమేతి;
పట్టాభిషేకసమయేతు మహీపతీనాం
బాహ్యస్థితస్య కలభస్య చ మండనశ్రీః.

"ఓ పిల్లీ! రాజులయొక్క మణిమయ

మయిన యంతఃపురము నాకు నివాసస్థాన
మని గర్వపడకుము. రాజులయొక్క
పట్టాభిషేకసమయమందు గ్రామము వెలు
పల నున్న యేనుఁగునకే యలంకారము
చేయుదురు" అని దీనియర్థము. పిల్లి రాచన
గరులోఁ దిరిగినంతమాత్రమున దాని కెక్కువ
గౌరవము లేదు. గొప్ప కార్యములు
వచ్చినప్పుడు నూరిబయటనున్న యేనుఁగుదే
గౌరవము. ఆ పట్టాభిషేకదినమున సకల
గృహవర్తియైన మార్జాలచక్రవర్తియొక్క
మొగమైనఁ జూడఁగూడదని కొట్టి తఱిమి
వేయుదురు. కవి దీనివలన నేర్పఱచిన నీతి
చూడుఁడు. రాజులయంతఃపురములయందు
నీచసేవకులు పెక్కుమంది యుందురు. మేమే
రాజుగారి సన్నిధానవర్తులమని వారు గర్విం
చుచుందురు. అట్టి నీచసేవకుల గర్వభంజనము
నిమిత్త మీశ్లోకము చెప్పఁబడినది. "ఓరోరీ!
యంతఃపురపరిచారకులార! రాచనగరులో
నీచకార్యములు చేయుటయే మీపని గాని
రాజుగారు కార్యాలోచనము చేయవలసి
వచ్చినప్పుడు దూరముననున్న మంత్రినో,
సేనాధిపతినో పిలిపించి యాలోచన మడుగు
దురుగాని యట్టిసమయమున మిమ్ము దగ్గఱ
కైనఁ బిలువరుసుఁడీ! యని వారికి హితము
బోధించుచున్నది.

జగన్నాథపండితుఁడు చిన్ననాఁటఁ దన
తండ్రిదగ్గఱఁ గొంతవిద్య నేర్చి శాస్త్రాభ్యా
సమునిమిత్తము కాశీపట్టణమునకుఁ బోయి
యచ్చట బహుశాస్త్రముల నభ్యసించి
పిమ్మట జన్మస్థానమైన యాంధ్రదేశమునకు
వచ్చి యానాఁడీదేశ మేలుచుండిన రాజుల
ననేకుల సందర్శించి వారివల్ల నేవిధమైన
సహాయమును బడయఁజాలక భగ్నమనో
రథుఁడై పండితపోషకు లగు మహారాజు
లుత్తర హిందూస్థానమం దుండుటచేత మఱల
నచ్చటికిఁ బోవ నిశ్చయించెను. అచిరకాలము
లోనే యతఁడు తనతలఁపు నెఱవేర్చుకొని
గంగాయమునాప్రముఖపుణ్యనదీ తీరముల
యందు యథేచ్ఛముగా విహరింపఁ జొచ్చెను.

ఆకాలమున నుత్తరహిందూస్థానమున
గొప్పపండితుఁ డగు మహమ్మదీయుఁ డొకఁ
డుండెను. అరబ్బీ పారసీ భాషలయందేగాక
యామౌలవి సంస్కృతభాషయందుఁ గూడ
నెన్నఁదగిన పాండిత్యము సంపాదించి హిందు
వులపురాణములయం దున్న లోటుపాటులను
శ్రద్ధతోఁ బరికించియాలోపముల నెన్ని హిందూ
మతము పనికిమాలినదనియు, మహమ్మదీయ
మతము మిక్కిలి ప్రశస్తమైనదనియు మహో
పన్యాసములు చేయుచు దేశమందలి నానాభా
గములకుఁ బోయి పండితులతో వాదములు చేసి
వారి నచ్చటచ్చట నోడించుచు విజయముఁ
గాంచుచుండెను. బ్రాహ్మణపండితులుఁ దమ
వేదశాస్త్రపురాణాదులయందు మిక్కిలి
ప్రవేశము గలవారయ్యు నరబ్బీభాష నెఱుఁగని
వారగుటచేతను మహమ్మదీయమతరహస్య
ములు దెలియనివారగుటచేతను వాని మత
మందలిలోపముల నెంచి యాతని నోడింపఁ
జాలరైరి. అందుచేత మౌలవీకిఁ జాలిన సం
స్కృతపండితుఁడు దేశమున లేఁడని మహమ్మ
దీయులేకాక హిందువులుఁగూడ వేయినోళ్లఁ

ప్రశంసింపఁ దొడఁగిరి. నిరుపమానపాండిత్య
ప్రకర్ష గల పండితశిరోమణులకు మాలవీ
యొక్క విఖ్యాతి కర్ణశూలాయమానమైనను
వార లేమియుఁ జేయఁజాలరైరి. దేశస్థితి
యిట్లుండఁగా జగన్నాథపండితుఁడు యము
నాతీరమున విహరించుచుండెను. మాలవీయొ
క్క విజయవార్త లతని శ్రవణగోచరము
లయ్యెను. సనాతనమై వ్యాసాదిబ్రహ్మర్షి
ప్రోక్తమై పరమపావనమై జగద్గేయమైన హిం
దూమతము పరమహాస్యాస్పదమగుట కతఁ
డెంతయు విచారించి తుట్టతుద కొక్కయుపా
యముఁ గనుపెట్టెను. అరబ్బీభాషను నేర్చి
మహమ్మదీయుల మతగ్రంథములలో నున్న
రహస్యములనెల్ల నెఱిఁగి పిదప మాలవీతో
వాదించినపక్షమున నతని నోడింపవచ్చునని
నిశ్చయించి యాభాష నభ్యసింప మొదలు
పెట్టెను. కుశాగ్రబుద్ధి యగుటచే జగన్నాథ
పండితుఁ డాభాష నచిరకాలమున నేర్చుటయే
కాక మహమ్మదీయుల వేదమైన ఖురానుగూడ
సవ్యాఖ్యానముగ నతఁడు చదివి యందున్న
పరమార్థములను లోటుపాటులనుగూడ నతఁ
డు గ్రహించెను. అనంతరము మాలవీకిని మన
పండితునకును వాదము జరిగెననియు నా
వాదమునఁ జిరకాలమునుండి యనేక
బ్రాహ్మణపండితులఁ బరాజయము నొందిం
చినమాలవి యోటమిఁ గాంచెననియుఁ
జెప్పుదురు. ఈతని విజయవార్తలు, మాలవీ
యొక్క పరాజయవార్తలు దేశమునందంతట
వ్యాపించెను. మాలవీ యది మొదలుకొని హిం
దూమతముపై దాడివెడలుట మానికొనెనఁట.

షాజహాను యొక్క పెద్దకుమారుఁడగు
డారా యనునతఁడు గుణగ్రహణపరాయ
ణుఁడనియు సత్యాన్వేషణరక్తుఁ డనియు నిది
వఱకే సూచించితిమి. జగన్నాథపండితుని
యొక్క మనీషావిశేషాదులు కర్ణగోచరము
లైనతోడనె యువరాజగు 'డారా' సహజ
ముగఁ బరమతసహనము గలవాఁడగుట
చేతను సంస్కృతమునం దదివఱకే కొంత
పాండిత్యము సంపాదించినవాఁ డగుటచేతను
జగన్నాథపండితుని రావించి సబహుమాన
ముగ నాదరించి గౌరవించి తనయాస్థానమందు
ముఖ్యపండితుఁడుగ నుండుమని యానతిచ్చెను.
నాఁటనుండి జగన్నాథమనీషి చక్రవర్తియైన
షాజహానునకాశ్రితుఁడై 'డారా'కుమారునకు
మిత్త్రుఁడై తన పాండిత్యవిభవముచేతను నఖండ
కవితారసప్రవాహముచేతను వారిమనసులు
రంజింపఁ జేయుచుండెను. ఆ కాలమందే
జగన్నాథపండితునకు ఢిల్లీచక్రవర్తులు పండి
తరాయలను బిరుద మిచ్చిరి. ఆ పేరాతని
యందు సార్థకత నొందెను. కవిత్వమునకు
భామినీవిలాసమును, శాస్త్రవైదుష్యమునకు
రసగంగాధరమును, జూచినవారు పండితరా
యలబిరుదమున కతఁ డన్నివిధముల నర్హుఁ
డని తలంపకపోరు. ఇఁకమీఁద జగన్నాథ
పండితుని గుఱించి చిరకాలమునుండి మన దేశ
మందలి పెద్దలు పరంపరగాఁ జెప్పుకొనుచున్న
యొక చిత్రకథఁ జెప్పెదను.

చక్రవర్తికుమారుఁడైన 'డారా' యును
జగన్నాథపండితుఁడును నొకనాఁడు సుఖోప
విష్టులై సరససల్లాపము లాడుచుండ 'డారా'

యొక్క యంతఃపురపరిచారిక యైన లవంగి యను మహమ్మదీయకన్య తనతలపై నీళ్ల కుండఁ బెట్టికొని యాదారిం బోవుచుండెను. అది సాయంకాలసమయము. భానుమండలము శోణవర్ణముఁ దాల్చి శోభాయమానమై పడమటికొండపై నిలిచెను. మలయమారుతము చల్లఁగ మెల్లఁగ వీచి ప్రియమిత్రుని యాలింగనమువలె నెమ్మేనికి సౌఖ్య మొసఁగుచుండెను. ఆబాలికయొక్క సౌందర్య మాసమయమున వర్ణనాతీతమై యుండెను. అందఱికన్నులు విశాలములైన యామెకన్నులమీఁదనే యుండెను. అందఱిమనస్సు లామె మొగముమీఁదనె యుండెను. పండితరాయ లామెను రెప్పవాల్పక చూచుచుండెను. 'డారా'యొక్క చిత్తవృత్తిగూడ నాబాలికయందే లగ్నమైయుండెను. అప్పుడు యువరాజు కవిరాజుం బలుకరించి గజరాజగమనముతో నరుగుచున్న యాజగన్మోహనాకారను వర్ణింపుమని కోరెను. వెంటనే యతనిభావము లప్రయత్నముగ ఛందోబద్ధములై యిట్లు వెడలెను.

శ్లో. ఇయం సుందరీ మస్తకన్యస్త కుంభా
కుసుంభారుణం చారుచేలం దధానా;
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం
గృహీత్వా ఘటే న్యస్య యాతీవ భాతి.

నెత్తిమీఁద నీళ్లకడవఁ బెట్టికొని కుసుంభావర్ణముగలచీరఁ గట్టుకొన్న యీసుందరి సమస్తజనుల యొక్క మనోవ్యాపారములను గ్రహించి యాకుండలో వైచికొని పోవుచున్నదో యన్నటు లున్నదియని యీ శ్లోకముయొక్క భావము. ఆమె నిజముగ నట్లే యుండెను. అందఱిమనస్సులు నందఱిహృదయములు నందఱిచిత్తవృత్తులు నామెయందే లగ్నమై యుండుటం జేసి యాశ్లోకము నందలిభావము స్వభావసిద్ధమై యువరాజునకమితానందము గలిగించెను. కలిగించుటయు నతఁడు 'నీవేమి కోరుదువో దానినిచ్చెద; వెంటనే యడుగు'మని కవితో ననెను. అప్పుడు జగన్నాథపండితుఁ డిట్లనియె.

శ్లో. న యాచే గజాళిం నవా వాజిరాజం
న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్;
ఇయం సుందరీ మస్తకన్యస్తకుంభా
లవంగీ కురంగీదృ గంగీకరోతు.

ఏనుఁగు నిమ్మని యాచింపను. గుఱ్ఱములఁ గోరను. నామనస్సెప్పుడు ధనముమీఁదికిఁ బోదు. నెత్తిపై నీళ్లకుండఁ బెట్టికొని పోయెడు నీసుందరాంగి యీ బాలహరిణనేత్ర యీలవంగి నన్నంగీకరించినఁ జాలునని యాపండితుఁడు బదులు చెప్పి మఱియు నిట్లనియె.

శ్లో. యవనీ నవనీతకోమలాంగీ
శయనీయం యది నీయతే కదాచిత్;
అవనీతల మేవ సాధు మన్యే
న వనీ మాఘవనీ వినోదహేతుః.

"వెన్నవలె మెత్తనైన యీతురకపడుచు నాపాన్పుఁ జేరనయెడల దేవేంద్రుని యుద్యానవనముకన్న నీభూతలమే ప్రశస్తతరమైనదని నేను తలంచెద" ననెను ఆపలుకులు విని రాజకుమారుఁడు పండితరాయలమనస్సు యవనకాంతపై దృఢముగ నాటుకొన్నదని

తెలిసికొని లవంగిని బిలిచి యాబ్రాహ్మణుని జేపట్టుమని చెప్పెను. పండితరాయలు మిక్కిలి చక్కనివాఁడై లేఁతప్రాయమందున్న వాఁడగుటచేత నామెహృదయమును జగన్నాథ పండితునిపైఁ దగుల్కొనుటం జేసి చక్రవర్తి కుమారునియాజ్ఞ శిరసా వహించి యాజ్ఞాభారముచేతనో యన్నట్లు తలవంచి సిగ్గున నూరకుండెను. ఆహాహా! వలపువలె మైకము గలిగించునది మఱియొకటి లేదుకదా. ఉన్మాదముకన్న మధుసేవకన్న భూతావేశముకన్న వలపే మానవుని నధికపరవశుం జేయుఁగదా. అందుచేతనే పండితరాయలు బ్రాహ్మణుఁడయ్యు శిష్టులగు తలిదండ్రులకు జన్మించినవాఁడయ్యు సకలశాస్త్రపారంగతుఁడయ్యు బంధువులు పరిహసింతురను సందియములేక కులమువారు వెలిపెట్టుదురను శంకలేక తనచరిత్రముఁ జూచి విద్వాంసులు నిందింతురనుభయములేక మ్లేచ్ఛకన్యకను వివాహమాడుట కొడంబడెను. అంతట వేదికలో నున్న యగ్నిగాక రాజకుమారుని హుక్కాలో నున్నయగ్నియే సాక్షిగా, గుడుగుడీయొక్క గుడగుడధ్వనులే మంత్రములుగ, మన్మథుఁడే పురోహితుఁడుగ, చక్రవర్తిగారిబానిసలే సభాసదులుగఁ బండితరాయలకు లవంగికిని బ్రణయప్రధానమైనవివాహము జరిగెను. ధర్మశాస్త్రప్రకారము హిందువుల కేర్పడిన యష్టవిధవివాహములలో నిది యేవిధమైనదని పండితరాయలు భావించెనో మన మెఱుంగఁజాలము. గాంధర్వము క్షత్రియులకే విధింపఁబడినది. అందుచేత నిది దానిక్రిందికి రాదు. పిల్లను దొంగిలించికొనిపోయి వివాహము జేసికొనుట రాక్షసమగును. ఇచ్చట నట్టిపని జరుగలేదు; కనుక నిది దానిలోను జేరదు. కాని యిది యొకవిధముచేత రాక్షస మనవచ్చును. గాఢమైన వలపనియెడు రక్షస్సుచేత నావేశింపఁబడి వారిరువురు దంపతులైరి. కావున నిది రాక్షసవివాహమని చెప్పనొప్పును. ఈనాఁడు సంఘసంస్కర్తలు మతసంస్కర్తలు వలపు గలిగినయెడల భిన్నమతస్థులైనను వివాహమాడవచ్చునని సూచించుచు దొరతనమువారి శాసననిర్మాణసభలలోఁ గొన్ని క్రొత్త చట్టములను బ్రవేశపెట్టుటకై చేయుచున్న మహాప్రయత్నరూపకములకు జగన్నాథపండితుని సాహసకార్యము పూర్వరంగము గావచ్చును.

లవంగీజగన్నాథపండితుల మనస్సులు పరమానందసముద్రమున నోలలాడుచుండెను. కాని, జనసామాన్యముయొక్కయు నందు ముఖ్యముగ విద్వజ్జనంబులయొక్కయు మనస్సముద్రములుమాత్రము శాంతిలేక నిరంతరసంక్షోభము నొందఁ జొచ్చెను. ఎల్లవారలనోట నీవిషయమే యుండెను. హిందువులందఱు నైకకంఠ్యముగ జగన్నాథపండితుని నిందింపఁ జొచ్చిరి. "చదువుకొన్నవాఁడు, ఈయన చదువు తగులఁబడ. తుఱకదానినా తుదకు వివాహమాడుట. చదువుకొన్నవానికన్న చాకలవాఁడె మేలన్న సామెత నిజమైన"దని మూలనున్న ముసలమ్మలు గూడ పండితరాజు నాడిపోసిరి. కాశీనగరపండితులందఱు సభ

చేసి యాతని బహిష్కరించిరి. స్వాములవారు శ్రీముఖముల నంపిరి. లవంగీముఖమే యతనికిఁ గావలయునుగాని శ్రీముఖములతోఁ బనిలేదు. లవంగీదర్శనము వెలియైన నతఁడు విచారించునుగాని తక్కిన వెలి కతఁడు వగవఁడు. ఇట్లు కొంతకాలము గడచినపిదప నతఁడు లవంగీసమేతుఁడై కాశీకానగరమునకుఁ బోయెనఁట. పోయి తన్ను నిరంతరము దూషించుచున్న పండితులకుఁ దన ప్రభావముఁ జూపఁ దలఁచి గంగయొడ్డున నున్న యొకమేడపైఁ గూర్చుండెనఁట. ఆమేడ కిరువదియేడుమెట్లుండెనఁట. కడపటిమెట్టు గంగాజలముఁ దాఁకుచుండెనఁట. అప్పు డతఁడు ద్రాక్షారసమధురము లైనశబ్దములతో రసవంతములైన కవితాధారలు వెలువడ గంగాదేవిని స్తవముచేయ నారంభించెను. ఒక్కొక్క శ్లోకముఁ జెప్పునప్పటికి గంగ యుప్పొంగి యానందపారవశ్యమునఁ దన తరంగహస్తములతో మహాకవిని గౌఁగిలించికొనుటకుఁ బోవుచున్నదో యన్నటు లొక్కొక్క మెట్టెక్కి పైకిఁబోయెనఁట. ఆ విధముగ నిరువదియేడు శ్లోకములు చెప్పునప్పటికి భాగీరథి యిరువదియేడు మెట్లెక్కి యచ్చట లవంగీసమేతుఁడై కూర్చున్న జగన్నాథపండితుని స్నానముఁ జేయించెనఁట. అప్పుడు విద్వజ్జను లతనిప్రభావ మెఱిఁగి జగన్నాథపండితుఁడు సామాన్యుఁడు కాఁడనియు నతఁ డీశ్వరాంశమున జన్మించినవాఁడనియు నందుచేత లోకాతీతుఁ డనియు నట్టివారిని ధర్మశాస్త్రములు మతనిబంధనలుఁ గట్టుబాటులు బంధింపఁజాలవనియు "నిరంకుశాః కవయః" అను లోకోక్తిని బట్టి పండితరాయలు విశృంఖలవిహారము సేయవచ్చుననియు నల్పప్రజ్ఞావంతులైన సామాన్యమనుష్యులు వానివలె నడువఁగూడదనియు నిశ్చయించి పండితరాజును మిక్కిలి ప్రశంసించి వెలి తీసివైచిరఁట. పండితరాయలు లవంగిని వివాహమాడినకథ నిజమైనను గంగాస్నానవృత్తాంతము కేవలము కల్పితమని యొప్పుకొనకతప్పదు. ఏలయన విద్వజ్జనగరిష్ఠుఁడైన పండితరాయలే దురాచారమునకు లోనై నింద్యకర్మముఁ జేసినపక్షమున సామాన్యులందఱు లేనిపోని నష్టములేక నిర్భయముగ యథేచ్ఛావిహారము సేయుదురని భయపడి బ్రాహ్మణోత్తములు పండితరాయలకు మహామహిమలు గల్పించి 'మహిమలుగలవాఁ డెట్లు చేసినను జేయవచ్చును. కాని, సామాన్యుఁడట్లు చేయరాదు. సంఘముయొక్క కట్టుబాట్లకు లోనై యుండవలయు' నని నియమమేర్పఱుపవలసిన యవసరము వారికిఁ గలిగెను. ఇట్టి మహిమారోపణములు మన దేశస్థులకు నూతనములు గావు. అవి ప్రతిదినానుభవములే. ఈ కథ నిజమో యబద్ధమో చెప్పుట మిక్కిలి కష్టము. కాని చిరకాలమునుండి మన దేశమున నీకథ వ్యాపించియుండుటచేతను శ్రవణానందకరముగ నుండుటచేతను వ్రాయవలసివచ్చెను. పండితరాయలు తనజీవితముయొక్క చరమదశను యమునాతీరమందలి మధురాపురమునఁ గడపియుండెనని చరిత్రకారులు వ్రాసిరి. కొంతకాలమైనతరువాత లవంగి మృతినొందియుండుననికూడఁ గొందఱు

వ్రాసిరి. ఏలయన నీతనిచే రచియింపఁబడిన భామినీవిలాసములో భార్యా వియోగదుఃఖమును సూచించు శ్లోకములు కొన్ని కనఁబడుచున్నవి. దక్షిణదేశమునందు మిక్కిలి ప్రసిద్ధపండితుఁడైన యప్పయదీక్షితు లుత్తరదేశయాత్రఁ జేయఁబోయి మధురలో లవంగీ సమేతుఁడైన జగన్నాథపండితునిఁ జూచి "వయసు గడచిపోవుచున్న దిప్పటి కైనను నీప్రాఁతత్రోవను విడిచిపెట్టవా" యని యడిగెనఁట. సకలదోషాపహారిణియైనతల్లి యమున దాపుననే యున్నదని పండితరాయ లుత్తరమిచ్చెనఁట. డిల్లీచక్రవర్తులపై నీతని కత్యంతమైన యభిమానము గలదు. ఒకప్పుడు రాజపుత్ర ప్రభు వొకఁడు తన యాస్థానపండితుఁడుగ నుండుమని పండితరాయనిఁ గోరెనఁట. కవిరాజు రాజపుత్ర ప్రభుపున కీక్రిందిశ్లోకము వ్రాసి పంపెనఁట.

శ్లో. డిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథం పూరయితుం సమర్థః;
అన్యైః నృపాలైః పరిదీయమానం
శాకాయ వాస్యా ల్లవణాయ వాస్యాత్.

"కోరికఁ దీర్చుటకు జగదీశ్వరుఁడు సమర్థుఁడు. లేక డిల్లీశ్వరుఁడు సమర్థుఁడు. తక్కిన రాజు లిచ్చునది కూరకుఁగాని యుప్పుగల్లు నకుఁగాని సరిపోవు"నని భావము.

---

# విభ్రాంతి

నోరి నరసింహశాస్త్రి, బి. ఏ., (సాహితీసమితి)

పూనికి మూావనంబున నమూల్యమహార్థము సంగ్రహింప నెం
దైనను కానరాదు జయహాని, అసాధ్యమె తోచె సాధ్యమై.
నిత్యము సాంధ్యవేళ భువి నిండి లభించె సువర్ణసంపదల్
ముత్యపు చిప్పతో రజతమున్ మృగతృష్ణ జలంబు గ్రోలితిన్.
ఎందు విలాసదీప్తి కనిపించె మనోహర మంచు చూచి, ఎం
దెందు కలక్వణంబు వినిపించె సుభాషిత మంచు డాసితిన్.
అస్త్రపు లేడ రాలెనో మహాశుభసూచనగా గ్రహించి హ
ర్షస్రుతు లాలకించి కనజాలితి నూతనమోద లీలలన్.
నీ సువిశాలనేత్రరుచి నీదు దరస్మితశాంతజల్పనల్
భాసురరూపముం గని తలంచితి ని న్నమృతంపు మూర్తిగా.
శాతశరం బపాంగము విషంబు స్మితంబు వచస్సు హ్లాదినీ
పాతము రూప మార్వపటవహ్నియుగా నెరుగంగ నక్కటా!

# జయసీతారామ్

(ఒక కథ)

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు

౧

"జయసీతారామ్! జయసీతారామ్" అను పవిత్రాక్షరములు నడుమనడుమ నుచ్చరించుచు వ్యాఘ్రాజినమునఁ బద్మాసనస్థుఁడై యొక బైరాగి పంపాసరోవరతీరమున మహాలక్ష్మీదేవాలయమునకుఁ బ్రక్కగనున్న మామిడిచెట్టుక్రింద జపము చేసికొనుచుండెను. ఆహా! ఈ సరోవరతీరముననే కదా జానకీదేవికొఱకు జగదానందకరమూర్తియగు జానకీరాముఁడు "హాజానకీ" యని మహాకరుణముగ విలపించినాఁడు! ఈసరోవరతీరముననే కదా శ్రీరామచంద్రమూర్తి దర్శనమునవలనఁ గృతార్థములైన తనకనులతోఁ బ్రాపంచికపదార్థమేదియు నిఁకఁ జూడనొల్లక, జానకీరామభక్తాగ్రణియగు శబరి యగ్నిప్రవిష్టయై తనుత్యాగ మొనర్చినది! అదిగో! ఆ మహాత్మురాలు సిద్ధిపొందిన ప్రదేశము మనబైరాగికెదుటి నైపున నలువదిగజములదూరమున నున్నది. ఆతనివెనుకవైపున నంతకంటె దగ్గఱగా నున్నదే యాతపస్విని తపమొనర్చుకొన్నగుహ. బైరాగికి దక్షిణపార్శ్వమున నాల్గుబారలలోనున్న పంపాసరోవరములోని పక్షులు కిలకిలలాడుచున్నవి. ఎదుటి బోడికొండపై సూర్యుఁడు కళకళ నుదయించుచున్నాఁడు. మహాలక్ష్మికోవెలలోని గంట గణగణమ్రోగుచున్నది. 'జయసీతారామ్' అని బావాజీ గొంతెత్తి యఱచుచున్నాఁడు. ఎందఱో బైరాగులు మహాలక్ష్మీదేవాలయము చుట్టియున్న మండపములలోఁ గూరుచుండి చిలుముగొట్టములలోని పొగఁ బీల్చుచు దగ్గుచు సీతారామస్మరణ మొనర్చుకొనుచున్నారు.

అప్పుడచ్చటికొక్కయుత్తమకాంతయుఁ దలపైఁ బెద్దగంప పెట్టుకొనియున్న యొక్కకూలిదియు వచ్చిరి. ఆయుత్తమకాంత పంపాపవిత్రోదకమున స్నానమాడి మహాలక్ష్మియాలయములోనికిఁ బోయి యాదేవిని సేవించి మండపములలో నున్న బైరాగులను జూచుటకుఁ బోవుచుండఁగా "అన్నపూర్ణామాయీ! ఆయియే" యని కేకలువైచి యక్కడిబైరాగులందఱు నామె[illegible] కాతిథ్యమిచ్చిరి. అంతలోఁ గూలిది యచ్చటకు రాఁగ, గంపలో నున్న గోదుమపిండి, నేయి, కందిబేడలు, పంచదార మొదలగు పదార్థములన్నపూర్ణమ్మ యెవరెవరి కెంత కావలయునో యిచ్చి వారికి నమస్కరించి తిరిగి యింటికిఁ బోవుటకై మండపపుమెట్లు దిగుచుఁ గుడినైపుననున్న మామిడిచెట్టుక్రిందిబైరాగిని

జూచి, “అయ్యో! ఆహారపదార్థము లన్నియు నయిపోయినవి. ఈ బైరాగిని జూడనేలేదు. రామరామ! ఎంతయపచార మొనర్చితి”నని లోన ననుకొని దగ్గఱ వట్టితట్ట చేతఁ బుచ్చుకొని తల గోకికొనుచు నిలువఁబడిన దాసిని జూచి “నీవు మనయింటికిఁ బోయి యీమహాత్మునికిఁ గావలసిన భోజనసామగ్రిని దె”మ్మని కన్నడబాసతో నాజ్ఞాపించి తా నాబైరాగి యొద్దకుఁబోయి నమస్కరించి యచ్చట నిలువఁబడెను. “జయసీతారామ్” అని చేయి యెత్తి యాశీర్వదించి, “బైఠీయే”యని గూబైరాగి యామెకాజ్ఞాపించెను. ఆమె యచ్చటఁ గూరుచుండి “మీ రిచ్చటకుఁ గ్రొత్తగా వచ్చినట్లున్నారు. స్వామీ! మీయీరాక యెక్కడి నుండియో యడుగవచ్చునా?” యని యుర్దూ బాసతో నాతని నడిగెను. “బదరీనారాయణమునుండి” యని యాతఁ డాభాషనే ప్రత్యుత్తర మిచ్చెను. తరువాత నాతని నేమి యడుగవలయునో తోఁపక యూరకుండెను. ఆతఁడు కనులు మూసికొని ధ్యానైకతత్పరుఁడై యుండెను. రామనామస్మరణ మొనర్చుకొనుచు నన్నపూర్ణ యక్కడనే నాల్గుగడియలు కూరుచున్నపిమ్మట దాసి భోజనపదార్థములతో వచ్చి వాని నామెయెదుట నుంచెను. బైరాగి కన్నులు తెఱచువఱకు వేచియుండి,“స్వామీ! ఈ సేవకురాలిపైఁ గటాక్షముంచి యీవస్తువులను బరిగ్రహింపలయు” నని ప్రార్థించెను.

బైరా: ఇవి నాకేల?

అన్న: మీరు భుజియించుటకై సమర్పించుకొంటిని.

బైరా: తున్నివారణమునకు గోదుమపిండియు నేయియే కావలయునా?

ఈ యడవిలో నెన్నికోటులప్రాణులు జీవించుచున్నవో! వాని కన్నిటికి ఘృతపిష్టశర్కరాదులు లభించుచున్నవా? అదిగో చూడు, ఆచెట్టున నెన్ని జీడిమామిడిపండ్లున్నవో! నాలుగుపండ్లతో నాఁకలి శాంతింపదా? అది గాక సీతాన్వేషణకార్యమున మహాశ్రమ నొందుచు రామచంద్రమూర్తి యిటకు వచ్చి కందిపోయిన తన శ్రీపాదములను గడిగికొనుటచే నత్యంతపవిత్రములైన యీపంపాసరస్సలిలముల నమృతప్రాయముగఁ గ్రోలెదను. బస్! ఇఁకఁ గావలసినదేమి? జయ సీతారామ్!

అన్న: స్వామీ! నాకు జ్ఞానమువచ్చినది మొదలిరువది సంవత్సరములనుండి యిక్కడ బసచేయు బైరాగులనెల్లర నిట్లే సేవించుచు నాతనువును దరింపఁజేసికొనుచున్నాను. నా ప్రార్థనము నిరాకరింపకుఁడు.

బైరా: నేను గ్రహింపనొల్లను అంతమాత్రమున నీపుణ్యమునకుఁ గొదవ లేదు.

అన్న: స్వామీ! మీకొఱకు వానిని సమర్పించితిని. తరువాత మీ చిత్తము; నా భాగ్యము. నమస్కారము; నాకు సెలవిండు.

బైరా: జయసీతారామ్.

ఆమె యక్కడకు దాదాపుగా రెండు మైళ్ళదూరములో నున్న ‘ఆనెగొంది’కిఁ బోయెను. ఇక్కడిగోదుమపిండిని బంచదారను గాకు లెత్తుకొనిపోయెను.

౨

మఱునాఁ డుదయమున యథాపూర్వముగ నన్నపూర్ణమ్మ సరోవరతీర్థావగాహన మొనర్చి లక్ష్మీదర్శనము కావించుకొని మండపములలోని బైరాగులకుఁ బిష్టాదు లిచ్చి పోవుచుఁ జెట్టుక్రింది బైరాగియొద్దకు వచ్చి నమస్కరించి కూరుచుండి చిన్నపుటికలోఁ బెట్టి తెచ్చిన తేనె యనఁటిపండ్లు నాతనిమెదుటఁ బెట్టి "స్వామీ! వీనినైన గ్రహింపుఁ" డని ప్రార్థించెను. అతఁడు "జయసీతారామ్" అని నిమ్మళముగ ననెను. స్వరమున నిన్న నున్న ఝూంకార మీదినమున లేదు. నిన్నఁ బద్మాసనమునఁ గూరుచుండినయాతఁడీదినమున గొంతుగూరుచుండి మోకాళ్లపై శిరమును వ్రాల్చి చేతులను బిక్కలచుట్టు గట్టిగ నదిమి యేమో కాని వడఁకుచుండెను. "స్వామీ! అస్వస్థతగ నున్నారా" యని యన్నపూర్ణమ్మ యాతని నడుగ "జయసీ సీ" యని యనఁ బోయి పండ్లు దగ్గఱగఁబడఁగఁ బైయక్షరములను బలుకలేక మూల్గెను. అన్నపూర్ణమ్మ మండపములలోని బైరాగులను'ద్వరగ రండ'ని పిలిచెను. గోదుమపిండి మెదాయించువారు కొందఱు, కందిపప్పులోని రాల నేర్చి పాఱవైచువారు కొందఱు, రొట్టెలు కాల్చుటకు నిప్పు చేయువారు కొందఱు, గంజాయిజడలను దులుపువారు కొందఱు నై యాబైరాగు లెవ్వరు కూడ నామె పిలుపును మన్నింపలేదు. ఇంతలోఁ జెట్టుక్రిందిబైరాగి కూరుచుండినవాఁ డా పాళముగనే యటులిటు లూఁగి యట్టె వ్యాఘ్రాజినముపైఁ బడిపోయెను అంత నన్నపూర్ణమ్మ యిది మన్నెపుజ్వరపు మాహాత్మ్య మని యనుకొని చప్పున దాసివానిచేత సందెఁడు చిదుగు లేఱించి యాతనిచుట్టు మంట వేయించి యచ్చటనే కనుపెట్టుకొనియుండెను. లోపలినుండి భూకంపప్రాయముగ నల్లలాడించు చలి చిదుగులమంటతో శాంతించునా? ఓ! పులిచర్మముపైఁ జలిచే నాతఁడెగిరియెగిరి పడుచున్నాఁడు.

అంత నన్నపూర్ణమ్మ మండపములలోని బైరాగులయొద్దకు వెళ్లి బైరాగి పడుచున్న బాధలన్నియుఁ జెప్పెను. "జంగ్లీ బొఖార్ - కుచ్ పర్వానహీఁ. అన్నపూర్ణా మాయీ! ఘర్ కూ జాయియే" యని వా రామె నోదార్చిరి. "చలిచే నెగిరియెగిరిపడుచున్నాఁడు. ఒక్క కంబళినిమ్మ"నియామె వారినడిగెను. 'నాకంబళి 'బిఛానా'లోఁ గట్టివైచితి'నని యొకఁడు'నా కంబలి చినిఁగిపోయిన'దని యొకఁడు'నాకంబళి జగన్నాథములో దొంగ లెత్తుకొని పోయినా' రని యొకఁడు, 'నాకుఁ గూడఁ గొంత చలిగానున్నది కావున నాకంబళి యిచ్చుటకు వీలు లే'దని యొకఁడు పలికిరి కాని కంబళిమాత్ర మిచ్చుట కొకఁడైన నంగీకరింపలేదు.

ఔను- అందునఁ దప్పేమున్నది? ఒక్కని కొక్కనికి సంబంధములేని సంగహీనులగుటచే నొకని వస్తు వొకని కేల యీయవలయును? ఒక్కఁడే పుట్టుచున్నాఁడు, ఒక్కఁడే చచ్చుచున్నాఁడు- ఈ నడుమనున్న మూఁడునాళ్ల సౌభాగ్యములో నొకనిపై నొకని కభిమాన మెందుల కుండవలయును? ఓ! ఎవ్వఁడేమై పోయినను సరే ఎవనికిఁ గావలయును? ఇట్లు జరుపుకొనఁగలిగినయెడల నింతకంటెఁ గావల

సిన దేది? కాని కాకి గోదుమపిండి మెత్తు కొని పోవుచుండఁగా దానిని గొట్టుట యెందులకు? అన్నపూర్ణమ్మ యిచ్చిన నేయి పంచదార తాము "జయసీతారామ్!" అని సంతోషమునఁ దీసికొనుట యెందులకు? ఆనేతి కొఱకే ఆపంచదారకొఱకే పదేపదే రాఁబోవు కుక్కను "జారే షైతాన్" అని కోపముతోఁ గొట్టుటకుఁ గఱ్ఱ తీసికొనుట యెందులకు? ఏమో! సంసారపరిత్యాగులమర్యాదలు సంసారుల కెట్లు తెలియును?

అన్నపూర్ణ యాలయములోని పూజరి యొద్దకుఁబోయి యాతనికంబళి తెచ్చి బైరాగికిఁ గప్పి యచ్చట నింక వంటచేయుచు రామనామస్మరణ మొనర్చుకొనుచుఁ గూరుచుండెను. క్రమముగఁ జలి యాతనికిఁ దగ్గినది. కాని జ్వరముహెచ్చిపోయెను. ఉష్ణమునకాఁగలేక యాతఁడట్టిట్టులు కొట్టుకొనుచు నడుమ నడుమ "జయసీతారామ్" అని జ్వరతీవ్రతచేఁ దొందరగ నఱచుచుండెను. ఆతనికన్నులు చింతనిప్పులవలె నుండెను. ఆతనియొడలి వేడిమి రెండుబారలలో నున్న యామెకు దుస్సహమైపోయెను. ఎండ హెచ్చినకొలఁది జ్వరము హెచ్చుచున్నట్లగపడెను. అప్పటికే జాము నర ప్రొద్దెక్కినది. ఇంక జ్వర మెంత హెచ్చగునో యని యామె యాందోళనపడుచు నటనే కూరుచుండెను. ఆమె యచ్చట నింకనేల కూరుచుండవలయును? తానచ్చటనున్న యెడల జ్వరము తగ్గు నని కూరుచుండెనా? తాను వైద్యమెఱిఁగి యుంటచే నేదో మందో మాకో వేయఁదలఁచి కూరుచుండెనా! అట్లు కాదు. ఆతఁడట్టిస్థితిలోనుండగఁ దానింటికిఁ బోవుటకుఁ గాళ్లాడక యట్లు కూరుచుండెను. ఈమె కీయ జ్ఞాన మెందులకో? తోడిమానవుని కింతసేవ యెందులకుఁ జేయవలయునో? ఆ మండపములలోని బైరాగులందఱు రొట్టె లాహరించి కిలకిలలాడుచుండ, వారిని జూచి యైన రవంత బుద్ధి తెచ్చుకొని యింటికిఁ బోయి భుజియించి పండుకొనఁగూడదా? ఊహు! అక్కడనే పీట పెట్టుకొని కూరుచుండెను.

ఎండతీవ్రతచేఁ గలిగిన మత్తువలన బొరలించిన తట్టపైఁ బెట్టిన చుట్టకుదుటిపైఁ దల మోపి దానికూరుచుండి యేమి నిద్రించుచుండెను. 'జయసీతారామ్' అని విశ్రవిరామములు లేకుండ జ్వరితుఁడఱచుచుండెను. నడుమనడుమ శ్రీరామకరామృతములు ప్రౌఢులుచిగుర్చనట్లు పాడుచుండెను. మామిడిచెట్లుపైనున్న కోవెల 'ఉఊఁ-ఉఊఁ!' అని యాతని హెచ్చరించుచుండెను, ఏబాధచేతనో కాని బైరాగి 'జయసీతారామ్' అని ప్రాకారము దరునట్ల అఱచెను. మండపముమీఁదనున్న కోఁతి గుబాలునఁ గ్రిందికి దుమికి బైరాగివంక నన్నపూర్ణవంకఁ జూచుచుండెను, ఇప్పటికిఁ గూడ రామనామమెక్కడనైన వినఁబడునేమోయని కోఁతి యపేక్షించియుండును గాఁబోలు. బైరాగికొఱకుఁ దెచ్చిన యరఁటిపండ్లన్నపూర్ణమ్మ కోఁతిమెదుటఁ బడవైచెను. అవి తీసికొని కోఁతి పోఁబోవునప్పుడు దానిదానిని రాచి పోవుటచేత, నది యులికిపడి లేచి యేడువ సాగెను. అన్నపూర్ణమ్మ దాని నోదార్చి,

యింటికిఁ బోయి భుజియించి బండియొకటి తోలించుకొనిరమ్మని చెప్పఁగ నది పోయెను.

బైరాగివార్థరణి యింత యంత యని చెప్ప నలవికాదు. భాగవతశ్లోకములు కావు. స్తవరాజములుకావు. దండకములు కావు. ప్రార్థనాగీతములు కావు. ఓ! తెలిపి లేకుండఁ బాడుచున్నాఁడు. ఆసన్నిపాత ప్రలాపములో నొక్క తప్పుమాటయైన వచ్చునా? ఊహుఁ- ఎంతపుణ్యాత్ముఁడో! ఆహా! ఇట్టి యపస్మృతి కంటె నదృష్టము మఱియొక్కటి యున్నదా?

మండపములలోని బైరాగులు "రోటీ ఖానా గంజా పీనా వగైరాలు" కానిచ్చుకొని కునికిపాటులు పడుచున్నారు. మధ్యాహ్నము మూఁడుగంటలు కావచ్చినది. అంతలో బండి వాఁడును దాసియు నన్నపూర్ణయొద్దకు వచ్చి నిలువఁబడిరి. మామిడిచెట్టువఱకుఁ దీసికొని వచ్చుటకు దారిలేకుంటచే నూఱుగజముల దూరమున మలుపులో బండి నిలిపి బండి వాఁడు వచ్చినాఁడు. ఆతనిఁజూచి యన్నపూర్ణ లేచి బైరాగియొద్దకు వెళ్లి "స్వామీ! స్వామీ!" యని చెవియొద్ద గట్టిగ నఱచెను. అతఁడు 'ఊఁ' అనలేదు కదలలేదు. కనులువిప్పఁ బ్రయత్నింప నైనలేదు. అంతబండివాఁ డాతనిని దలవైపున, నన్నపూర్ణ పాదములవైపున, దాసి నడుము నొద్దను బట్టి మెత్తి కష్టమునఁ దీసికొనిపోయి బండిలోఁ బెట్టిరి. ఆతని చిన్నమూటయు వ్యాఘ్రాజినమును బండిలో వేయించి యామె వెనుక నడచుచు బండి తోలించుకొని యింటికిఁ బోయెను.

3

స్మృతిరాకముందు బైరాగినోట నేమందు లన్నపూర్ణమ్మ పోయించెనో కాని స్మృతి యాతనికిఁ గలిగినతరువాతమాత్ర మాతని కొక్కమందైన నిప్పింపలేకపోయెను. ఎన్ని విధములఁ దాను బతిమాలినను, నెందఱచే జెప్పించినను నాతఁడు మందు పుచ్చుకొనుట కంగీకరింపలేదు. పట్టెఁడుతులసి మంచినీటిలో వైచి రెండుజాములు నాననిచ్చి, యది వడియఁబోసి యానీరుమాత్ర మిమ్మని యాతఁడు కోరెను. ఆప్రకారమే యామె యొనర్చుచుండెను. ఇట్లు పదునైదుదినములు గడచిన వెనుక నాతఁ డారోగ్యదశ నొందెను. ఒకదినమున నన్నపూర్ణయు నాతఁడు నిట్లు మాటలాడుకొనుచుండిరి.

బైరా: అన్నపూర్ణా! దిక్కుమాలిన వాఁడనైన నన్ను రక్షించి నీవు మహాపుణ్యమును గట్టుకొంటివి. నిన్ను శ్రీరామచంద్రమూర్తి రక్షించుఁగాక యని యాశీర్వదించుటకంటె నేను జేయఁగలది యేమున్నది? నే నింకఁ బోయెదను. జయసీతారామ్.

అన్న: స్వామీ! అప్పుడే పోయెదరా? ఇఁక నాల్గుదినము లుండరాదా?

బైరా: తగదు. ఇప్పుడే పోయెదను. జయ సీతారామ్. (పోఁబోవును).

అన్న: మహాత్మా! ఒక్కనిముస మాగుఁడు. నాకష్టసుఖములు రవంత మనవిచేసికొందును. నాకుఁ బుణ్యగతి యెట్లు కలుగునో మీ రానతీయవలయును. మీరు మహామహులవలె నున్నారు. మీ రెఱుఁగరాని వుండవు. ఏదైన

మంత్రమే యుపదేశింతురో మఱి యేమార్గ మైన బోధింతురో మిమ్ము నమ్మియున్నాను. ఒక్క యసత్యమైన లేకుండ నాపూర్వచరిత్ర మనవిచేసికొందును. మీదయకు నేనర్హురాల నని మీకుఁ దోఁచినయెడల నే నన్నుఁ దరింపఁ జేయవలయును.

బైరా: అందఱను దరింపఁజేయువాఁడా శ్రీరామచంద్రమూర్తియే. అయినను నీవేమి చెప్పఁదలఁచితివో సంక్షేపముగఁ జెప్పుము.

అన్న: సంక్షేపముగనే చెప్పెదను. నే నాంధ్రజాతిలోనిదానను. శూద్రకులసంభ వను. మావాసస్థానము చిరకాలమునుండి బళ్లారి. మాయింటిపేరు బళ్లారివారు. నాతల్లి నన్నుఁ గని చనిపోయినది. మాతల్లి మరణించి నప్పటినుండియు మాతండ్రి హృద్రోగపీడితుఁ డై యుండి నాపెండ్లియైనఁ జేయకుండఁ జనిపోవుదునేమో యను భయముచే నాకు నాల్గవయేఁటనే పెండ్లి చేసినాఁడఁట. నాపెండ్లి యయిననాల్గుమాసములకే నాతండ్రి గతించి నాఁడఁట. పిమ్మట మేనమామ సంరక్షణ మున నాకు యుక్తవయస్సు వచ్చువఱకుంటిని. అటుపైని పంపామహాలక్ష్మిని సేవింపఁదలఁచి యామహాక్షేత్రమున నిండ్లు లేకుంటచే నానె గొందిలో నిరువది సంవత్సరములనుండి నివ సించుచున్నాను. అయ్యయ్యో! ముఖ్యమైన సంగతి చెప్పుటయే మఱచిపోయినాను

బైరా: ఏ దది?

అన్న: నాతండ్రి పోయిన కొలఁదిదినము లకే నాభర్త యెచ్చటికో పాఱిపోయినాఁడఁట. అతఁ డెక్కడనో మరణించినట్లు కొన్నినిదర్శ నము లున్నవని మా మేనమామ చెప్పినాఁడు. యుక్తవయస్సు వచ్చినపిమ్మట భర్త లేక పోయెనే యని నే నెంత యేడ్చితినో యాపర మాత్మునికే యెఱుక.

బైరా: సీతారామ్. జయసీతారామ్. భర్త కొఱకు భార్య యేడ్చిన యేడ్పులు విరాగినైన నాకు వినిపించుట యెందులకు? సంక్షేపముగాఁ జెప్పుమంటిని గాదా?

అన్న: మహాత్మా! క్షమింపుము. ఆతనిని బరదైవముగ భావించుకొని పరపురుషుని మన స్సుననైనఁ జేరనీయక వయస్సు వచ్చినతరు వాత నిరువదిసంవత్సరములనుండి యథాశ్ర యన బ్రహ్మచర్యవ్రతములచే శ్రీరామచంద్ర పాదారవిందభక్తిచే విరాగి జనపూజచే సద్వ్రి తాచరణముచేఁ గాలక్షేపమును జేయుచు న్నాను. మహానుభావా! నాకింతకంటె సులభ తారకమైన మార్గమేదైన బోధించి రక్షిం తురు గాక!

కాలికిఁ బాము చుట్టుకొనినప్పుడు నరుఁడు కాలి నెంతబింకముగ దులుపుకొనునో యా మాటలు విని బైరాగి దేహమును మనస్సును నంతబింకముగ దులుపుకొని "జయ సీతా రామ్" అని బిగ్గఱగ నఱచి చెఱముకిసంచి విప్పి "నా పూర్వబంధ మింక నీయుంగరము మూలమున రవంత మిగిలినట్లగపడుచున్నది. దీనిని నీవుతీసికొని నన్నురక్షింపు"మని యామె చేతిలో నాయుంగరమును జాఱవిడిచి "జయ సీతారామ్" అని కేకవైచి యాతఁడు పోఁ బోవుచుండెను. "బ. రామనాథస్వామి అల్లుఁ డగు కం. స్వామినాథరావునకు వివాహకాల



అన్నపూర్ణాదేవి నాథా! నాథా! అని యేడ్చుచు సన్న్యాసిని కౌఁగిలింపఁబోవుట

మందు" అను నక్షరము లుంగరముమీఁదఁ జూచుకొని కెప్పున నార్చి, పోఁబోవువాని కెదురుగవచ్చి "నాథా! నాథా! ఎంతకాలమున కగపడితిరి." అని యేడ్చుచుఁ గౌఁగిలింపఁ బోయెను. వెనుకకుఁ దగ్గి మొగము మఱల్చి కుడిచేయి పైకెత్తి "జయసీతారామ్" అని గట్టిగ నఱచి "ఆఁగుము! ఒక్క యడుగైన ముందునకుఁ బెట్టకుము. నేనే నీభర్తను. అయిననేమి? నేను విరాగినై యుండుటకు సంకల్పించుకొంటిని. నీవు నాకేల?" యని తిరుగఁ బోఁబోవుచుండఁగ "నేనుగూడ మీతో వచ్చెదను. నావలన మీతపస్సునకు విఘ్న మెంత మాత్రము ను రానీయను" అని కూడఁ గూడఁ బోవసాగెను.

"నీవు పుణ్యశీలవు. బుద్ధిమంతురాలవు. నీవు చేయుచున్న విరాగిజనపూజ మిక్కిలి మంచిది. శ్రీరామచంద్రమూర్తి పాదధ్యానమున నీవు నాకంటె ముందుగాఁ దరింతువు. నీవు నాతో వచ్చి హిమాలయ ప్రాంతమునఁ జేయున దేదియును లేదు. నీవు నా భార్యవు కావునఁ జెప్పుచున్నాను వినుము. భర్తనైన నాయాజ్ఞ యిది. దీనికిఁ గట్టువడి నీవిచ్చట నుండకతప్ప"దని చెప్పుచు "జయజయ జయ సీతారామ్"అని మెగిఁరిమెగిరి పరుగెత్తుకొనిపోయెను. అన్నపూర్ణమ్మ కొయ్యయై క్రిందఁ బడిపోయెను.

కొంతసేపటికిఁ దెలివితెచ్చికొని యిట్లు తలపోసికొనెను:— "నాల్గవ యేటఁ బెండ్లియేమి? ముప్పదిరెండవయేట భర్త కంటఁబడుటయేమి? భర్తయని గుర్తించినక్షణముననే యాతఁడు మాయ మగుటయేమి? రామచంద్రమూర్తీ! నాభర్త నిట్లు కానఁబఱచు టెందులకు? మెఱపుమెఱసిన వెంటనే కల్గు గాఢాం

ధకారమున నన్నుఁ ద్రోయుట యెందులకు?
ఆహాహా! రామచంద్ర ప్రభూ! ఎందులకై సం
దగిన వాఁడవయ్యా:—

సీ. హరువిల్లు తుత్తుము కౌనట్లు విఱిచియు
నీసు స్థాపించి పూజించినావు,
ధారుణీపతివయ్యు ధారుణీసంజాత
బహుసంతసమునఁ జేపట్టినావు,
ఇంద్రాదిసురరక్షకిలను జన్మించియు
నింద్రజు తల నూడ నేసినావు,
తరుణికై రావణుఁ బరిమార్చియు సతి
వనవీథిఁ ద్యజియించినైచినావు
ఘనుండైన నిట్లాచరించు నో కో-
ఎటులో చేసినఁ గీర్తి దక్కించుకొనునె
దైవమవు కాన ధాటితో దాటిపోయి
తయ్యా! రామయ్యా! నిన్ను నేమందు నయ్యా!

---




వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

కనువిందుగూర్చు చక్కఁదనమ్ము, పొంగారు పాలఁబోలిన వయఃప్రాభవమ్ము
శీలవిద్యారూపశాలిని కులకాంత, సంతాన మిత్ర బాంధవ సమృద్ధి
విజ్ఞానసంపత్తి వెలయించు నైదుష్య, మిష్టభోగార్హ మీా హితధనమ్ము
ఉద్యత్పరిజ్ఞాన యోగసామర్థ్యమ్ము, పరమార్థనిశ్చయాభయవినోద

గీ. మెసఁగి పొసఁగి పొంపిరివోవ నెల్లవేళ, నల్ల నుల్లాసజలధి నోలాడువాఁడు
వాఁడు వో వాడువోవని వన్నెవాఁడు, సర్వసంపూర్ణ పురుషార్థసార్థవహుఁడు.



# చిత్రలేఖనము

భమిడిపాటి రామ సోమయాజులు గారు

చిత్రకారునిభావము: చిత్రము

చిత్రలేఖనమునందలి జాతులంగూర్చియు, ప్రస్తుతకాలమున వాని వాడుకం గూర్చియు, జెప్పుటలో గతసంచికయందు పాశ్చాత్యచిత్రకారులయొక్క చిత్రములలో జాలవరకు, భావహీనములగు చిత్రములును, బంగాళా దేశచిత్రకారులలో జాల వఱకు లక్షణహీనము లగు చిత్రములును గానవగు చున్నవనియు, ప్రస్తుతాంధ్రచిత్రములం దిట్టి లోపములు చాలవఱకు విడిచి నిజచిత్ర లేఖనానిపుణతకు సమీపములగు గుణములు గానవచ్చుచున్నవనియు నంటిమి. దీనిలోని సత్యమును సంపూర్ణముగా నెరుంగుటకు ముందు, భావగర్భితములగు చిత్రములెవ్వియో భావహీనములగు చిత్రము లెవ్వియో, చిత్రమునకును చిత్రకారుని భావమునకును సంబంధ మెట్టిదో, తెలిసికొనవలసి యున్నది.

బుద్ధిమంతుల మనస్సులు జీవనదులవంటివి. వాని యాలోచనాప్రవాహమునకు తెగుతెంపులు లేకుండును. ఆ నదులవలెనే, యొక్కొకకాలమున వారి యోజనాప్రవాహము వఱదమై, జేవురించి, యుబ్బి, పొంగి పొరలుచుండును. నిత్యమును వారిమానససీమ ఫలవంతమై యుండును. ప్రపంచముం గూర్చి యనేకములగు నభిప్రాయములు వారి హృదయములం దెల్లప్పుడు నుద్భవించి, యనుభవసాహాయ్యమున వృద్ధి జెందుచుండును. ఆద్యంతము లగపడక, కడు వింతనొసంగు నీ ప్రకృతిని, దానిలో మానవుని జీవనమును,

చూచి చూచి, యాలోచించి యాలోచించి, వారిమానసములు జ్ఞానపూరితములై యుండును. వారి మనంబులు పెద్ద పుస్తకములు. వానిలో లెక్కలేనన్ని ప్రకరణములు,పుటలు గాథలు! అట్టివి చదువనేర్చినవారు భూమిపై నున్నచో, నెన్ని క్రొత్తసంగతులేని తెలిసికొనవచ్చును. ఈ భూమిపై జీవించు ప్రతి మానవునకును, కష్టసుఖములు కలుగుచుండును. అందులో గొందఱకు విపరీతములగు కష్టములు గలుగుచుండును. అట్టి కష్టముల గాని సుఖములగాని, పొందినవా రెఱుంగవలసిన దేకాని వానిలోతు పైవారికి సంపూర్ణముగా తెలియనేరదుకదా! ఇట్టి భావములు తెలియజెప్పుటకు, తొలుత జెప్పబడిన, కవిత్వము, వాక్చతురత, చిత్రలేఖనము మొదలగు శక్తులు తోడ్పడుచున్నవి. భర్తృహరి యెన్నియాలోచనలతో నిండి పోయెనో, యెంతటి యనుభవము నందెనో, ప్రపంచ నిజతత్త్వ మిది యని గ్రహించి, గ్రహించిన దానిని పైవారల కెఱుకపఱచుట కెంతకష్టపడెనో! "బోద్ధలగువారుమత్సరపూర్ణమతులు, ప్రబలగర్వవిభూషితుల్ ప్రభువు లెన్న, నితర మనుజులు బోధోపహతులు గాన, భావమున జీర్ణమయ్యె సుభాషితంబు." వినెడువారు లేకుంటచే, సుభాషితము భావమున జీర్ణమయ్యెనట! ఆతని భావమునం దా సుభాషిత ప్రవాహ మెంతయుబ్బిపోయి, మనస్సంతయు నిండి, యుక్కిరిబిక్కిరియై పోయెనో చిట్టచివర కది, నీతి శృంగార వైరాగ్యశతకరూపముల ధరించి నేటికి నిలిచినది? భర్తృహరి చనిపోయినాడు; మత్సరపూర్ణమతులగునప్పటిబోద్ధలుగూడ నాతనితోడనే పోయినారు. శతాబ్దములు, మేఘశకలములట్లు గతించినవి. సుభాషితము మాత్రము మిగిలినది. దానికి చావు లేదుకాబోలును! అట్టిభావములను, నిత్యజీవములుగా జేయుటకు జిత్రలేఖన మొకముఖ్యాధార మని యీవఱకే చెప్పబడినది. చిత్రకారుని చావుతో నిమిత్తములేక యాతనిభావము లన్నియు జిత్రరూపములదాల్చి మిగుల గలవు. చిత్రకారునిభావమునకును జిత్రమునకును, గల సంబంధము తండ్రికిని పిల్లలకును గలసంబంధము వంటిది. తండ్రియొక్కరూపము పిల్లలయం దెట్లు కానవచ్చునో, తండ్రి చనిపోయినపిమ్మట నాతని పిల్ల లెట్లు జీవింతురో, ఆరీతినే, చిత్రకారుడు పోయిన వెనుక, నాతనిభావముం దమలో నుంచుకొని యాతనిచిత్రములు జీవించుచుండును. కాళిదాసు గతించి యెన్నోశతాబ్దము లైనవి. ఆతనిముఖసౌందర్య మెట్టిదో, మీసము ముండెనో లేదో, ఆతడుపొడుగరియో లేకపొట్టివాడో మనకు దెలియ లేదు. కాళిదాసు"శాకుంతలము"ను బాగుగా నెఱుగుదుము. దీనింబట్టియాతని చావులేనిభావము గూడ నెఱుగ గలము. బమ్మెరపోతనయొక్క మహాభక్తిపూరితమైన మానసము మన మెఱుగుట కాంధ్రభాగవతమేకదా యాధారము? అజంతాలోని చిత్రము లను జిత్రించిన చిత్రకారు లెవ్వరో వారిపేరులుగూడ మనకు దెలియదు. వారు ప్రపంచమున నెట్లు జీవించిరోకూడ నెఱుంగము. కాని, యెట్లు జీవించినను, నెంతటి

కష్టము లనుభవించినను, సుఖము లనుభవించినను, విపరీతమగు సౌదార్యము గల భావములను గలిగియుండిరని, తద్భావజనితము లగు నాయజంతాచిత్రములవలన తెలియనగుచున్నది కదా? చరిత్రలవలన, షాజహాను ముమ్తాజి మహాలులమహాప్రేమ, యేపాటి బయలుపడగలదు? టాజిమహాలు దానిలోని లోతునంతను జూపగల్గుచున్నదికాదా? ఈ రీతినే, కవిభావములు గ్రంథమందును, చిత్రకారునిభావములు చిత్రమునందును రూపించును. కొన్నిమాటల సముదాయము గ్రంథము కాదు; కొన్నిబొమ్మలకూటము చిత్రము కాదు. భావమున్నగాని వానికి జీవము లేదు. ఫొటోగ్రాఫులకును, లిఖితములైన చిత్రములకును నియ్యదియే భేదము

ప్రపంచమునందు, మానవునియున్నతదశకు, గవిత్వమువలెనే చిత్రలేఖనముకూడ నొకయాధారభూతమై యున్నది. మనుష్యులందఱు నొకేవిధమగు తెలివితేటలు గలవారు కారు. బుద్ధిమంతులు ప్రపంచమున జాల తక్కువమంది కలరు ప్రపంచమున నెప్పుడో కాని, బుద్ధదేవుడొకఁ డుదయింపడు. సామాన్యులెల్లప్పుడును పుట్టుచునేయుందురు; అంతరించుచునే యుందురు. వారి పుట్టుకంగూర్చి కాని, చావునుగూర్చికాని, ప్రపంచమునం దెవ్వరికి దెలియగలదు? ఇట్టిప్రపంచమున, శతాబ్దమునకును శతాబ్దమునకును, జ్ఞానమునందుజాలభేదము కానవచ్చుచున్నది. క్రమక్రమముగా మానవునిజ్ఞాననేత్రము విడుచున్నది. ఇందులకు గారణమేమి? బుద్ధదేవునికంటె, సృష్టిరహస్యములు మన కెక్కువ తెలియవు. మహాబుద్ధు లేనాడును పుట్టుచుందురు; అంతరించుచుందురు. కాని, బుద్ధదేవుని నాటి సామాన్యజనులకంటె నేటివారెక్కువ జ్ఞానముతో నున్నారు. ఇందులకుగారణము, బుద్ధదేవుడు, శంకరాచార్యుడు, మున్నగు మహాత్ములుజనించితక్కుంగల ప్రపంచమునకు నజ్ఞానమునుండి, జ్ఞానమునకు వచ్చుమార్గములను మాటిమాటికిని బోధించుటయే. ఇప్పటి జ్ఞానమునకు ఆనాటినుండి యీనాటివఱకు, నీమధ్యకాలములో జన్మించిన కవులు, వక్తలు, శిల్పులు, చిత్రలేఖకులు మున్నగుగల వారందఱును గలుగ జేసినజ్ఞానమే కారణము. ఇట్టులు నిత్యము వృద్ధికాగలమానవుని యౌన్నత్యమునకు, చిత్రలేఖనముకూడ నొకయాధారభూతమై యున్నది. చిత్రలేఖకుడు, మహాభక్తు నొకని భగవంతునితో నైక్యమగుచున్నస్థితిలో జిత్రించెనను కొందము. అనుకొను టెందులకు? అతిపురాతనములైన హిందూదేవాలయములం దెల్లెడ నీభావముం జూపుచిత్రము కానవచ్చుచునే యున్నది. యోగనిద్రాపారవశ్యము దెలుపు కలువ రేకులవంటికన్నులు, మహాశాపూరితమై యుబ్బి యెత్తుగానున్నవక్షఃస్థలము, మదిలోని మెత్తందనమెల్ల గానవచ్చునట్లు, మెత్తని గీతలతో జూపింపఁబడి నేత్రపర్వమొనర్చుచేతులు నేహిందువునకు గ్రొత్త? అట్టి చిత్రము, నిజముగా బలుకకుండియు, నెట్టి భావముల దెలుపుచున్నది! ఎట్టి భక్తిని చూచువారిమనములందు గలిగించుచున్నది!

భక్తిని గలిగించుట కొక గ్రంథ మెంతపని చేయునో, ఈచిత్రముగూడ నంతపని చేయుచున్నది.

తా నెకమాటయైన నాడకుండ చిత్రలేఖకుడు మన కెన్నివిషయములను జెప్పగలడు! కొన్నికొన్ని విషయములను మాటలు చెప్పలేవు. కొన్నిభావములలో గల మార్దవము మాటలందుగూడ గానరాదు. కవి సాధ్యమగునంతటి మృదుమధురశైలి నా భావములోని మార్దవమును గ్రహింపజేయును. చిత్రకారుని చిత్రము నందా మార్దవము విస్పష్టముగా గానిపించును. చిత్రకారునివలెనే చిత్రముకూడ మూగతనము గలిగియు; చూపఱులలో క్రొత్తభావములను జనింపజేయును. నిజమగుభావమును, మాటలు సూచించును. ఏమాటలైనను భావమును విప్పి చెప్పలేవు. ప్రేమనుగూర్చి మానవులందఱు జాలవఱకు నెఱుంగుదురు. అనేకులు కవులు దాని ననేకవిధముల జూపించియున్నారు. కాని యెవ్వరైనను, చదువరుల యొక్కభావమును తనభావముతో నేకీభవింప జేసికొనుటకు బ్రయత్నింతురే. కాని, ప్రేమయన నర్థము జెప్పగలరా? అదినిజముగా నసాధ్యము. కవిత్వమైనను, చిత్రలేఖనమైనను, కవియొక్కగాని, చిత్రలేఖకుని యొక్కగాని భావములను సూచించునేకాని, విప్పిచెప్పనేరవు. అయినను, ఆ సూచనవలననే, యా భావములను, మనము బాగుగా నెఱుంగ గలుగుదుము. చిత్రము మాటలాడకున్నను, ఎన్నియో మాటలాడినంతకంటె నెక్కువగా మనభావములను దనలోనికి మార్చుకొనగలదు. చంద్రునిగాని, మల్లెపూవులనుగాని, నూతనవికసితపద్మమైన కాసారముంగాని, సంధ్యాకాలమునం దాకాశముంగాని, చూచినప్పు డెల్లరకు నెకవిధమగు మహాసంతోష ముదయింపక మానదు. ఆ చంద్రుడుగాని, మల్లెపూవులుగాని, కాసారముగాని, మనతో మాటలాడుచున్నవా? మన కంతటియానందమేల కలుగవలెను? నిజముగా మాటలే యాడినచో నంతటి యానందము కలుగనేకలుగదేమో? చినిగిపోయిన బట్టలను కట్టుకొని, సంరక్షణలేక చిక్కులువడినజుట్టు జాలిగొలుపు పేదరికపుమొగముపై వ్రేలాడుచుండ, ముడుతలువడిన కడుపు, శుష్కించి మలినపూరితమైన దేహము గలిగి కర్రనానుకొని గాని నడువలేని వృద్ధుడగు బిచ్చగాని జూచినవెంటనే ప్రతిమానవునిహృదయమునను జాలి యుదయించుటకు గారణ మేమి? ఆబిచ్చగాడు మూగవాడైనమాత్రన మనజాలి తగ్గునా? మాటలలో నేమున్నది? ఆభావమే మనలగలచివేయ గలదు. ఆముఖమే మనహృదయమును నీరుగావింపగలదు. ఆ ముడుతలువడిన కడుపే జాలిగలవారి కనుకొలకులవెంబడి నీరు గార్పగలదు. మంచిదుస్తుల వేసికొని, పిసుగువంటివా డొకడు నచ్చి యెన్నివిధముల బ్రార్థించిననేమి? ఎవ్వరికైన నట్టికరుణ కలుగ గలదా? భావగర్భితమైన చిత్రముకూడ నారీతినే, చూపఱులయొక్క యాత్మల నాకర్షించివేయును. భావహీనమగు చిత్రము,

ఎంతకష్టముతో వ్రాసిన దైనను, వన్నె చిన్నె లెన్నియున్నను, లక్షణములు గలిగిన మాత్రన, మనస్సుల నాకర్షింపజాలదు. లక్షణయుతమై, భావయుతమైన చిత్రము నిత్యజీవమై యొప్పును. అట్టిచిత్రములను వ్రాయుటయే చిత్రలేఖకుని గమ్యస్థానమై యున్నది. అట్టి యుత్తమస్థితివచ్చినప్పుడే భారతదేశమునందు జిత్రలేఖన మభివృద్ధిజెందినదని చెప్పనగును. అట్టియున్నతపదవి మనదేశచిత్రలేఖనమునకు కొంతకాలములో నిస్సందేహముగా వచ్చునని చెప్పుటకు తగిన నిదర్శనము లగపడుచున్నవి. సత్యము గ్రహించుటయే కష్టము. గ్రహించిన వెనుక ముందుగాని, వెనుకగాని యాచరణలోనికి దెచ్చుకొని, సత్యవ్రతులగుట కవకాశమున్నది. మార్గము కానవచ్చినచో, నెప్పటికైన గమ్యస్థానము చేరుదుము. ఇది నిశ్చయము.

కవియొక్క భావము కావ్య మెట్లు విస్పష్టముగా తెలుపుచున్నదో, చిత్రకారునిభావము చిత్రముకూడ నట్లు తెలుపగలదా యని ప్రశ్నింపవచ్చును. ఎల్లైనను కావ్యమునకంటె చిత్రమున, కర్తయొక్క భావము తక్కువగా బోధయగునని కొందఱు చెప్పుదురు. కాని యట్లువచించుట కెంతమాత్రము నవకాశము లేదు. అట్లువచించువా రిట్లు చెప్పుదురు. "కావ్యమునం దేదైన కథను సంపూర్ణముగా కవివర్ణింపగలడు. దానిలో గొఱతయుండక సంపూర్ణమైయుండును. చిత్రకారు డెంతవ్రాసినను ఇక్కడ నొకబొమ్మ, అక్కడ నొకబొమ్మ వ్రాసి, కొన్నికొన్నియవస్థలనేచూపింపజాలు" నని యందురు. కాని, యీ బొమ్మలలోను చాల బొమ్మలవ్రాసి, కథయంతయు బోధపడునట్టులు వ్రాయవచ్చును గదా? అట్టిమెడల నాహెచ్చుతగ్గు లున్నవనివచించుట కవకాశముండునా? అదియునుంగాక, బయస్కోపులలో మనము చూచునది, యనేక బొమ్మలుగల పట్టీ మెడతెగక జరుపుటవలన నే కదా కలుగుచున్నది? అట్టిచో కావ్యమునకును, చిత్రమునకును భేదమేమున్నది? ఒకచిత్రము అట్టికావ్యములో నొకభాగము వంటిది. అది యట్లుండగా, కావ్యమునందుమాత్రము కవి యన్నిసంగతులను జెప్పగలడా? యెన్నిసంగతులను వర్ణించిచెప్పినను, వర్ణింపకుండ నుండిపోయినయంశము లెన్ని యుండునో! చెప్పినవానికంటె, చెప్పనిసంగతులే హెచ్చుగా నుండును. ఒకవనము వర్ణించుచు, కవి, మృగములపేర్లుకొన్ని చెట్లపేర్లుకొన్ని చెప్పి, నదులు, రాళ్లు మొదలైనవి కలవని వర్ణించును. ఆతడుచెప్ప విడిచినవెన్నివస్తువులు వనమునందు నున్నవి! అందువలన, కవియైనను, చిత్రకారుడైనను, ముఖ్యమైనయంశములజూచి, తాము పొందినభావమునంతను నితరులు పొందునటులు చేయుదురు. అన్ని సంగతులను చెప్పనక్కఱలేదు. అన్నిటిని వ్రాయ నక్కఱలేదు. ఒక మనుష్యుని వ్రాయుచు, జుట్టున కొకరంగును, శరీరమున కొకరంగును పూసి, యా మనుష్యునిస్థితివలన చిత్రకారుడు తనభావము జూపుచున్నాడు. తలవెంట్రుకల నన్నింటిని లెక్కపెట్టి వ్రాయడు. అట్లువ్రాయ నక్కఱ లేదు. వ్రాయగూడదు. వ్రాయుటకంటె హాస్యా

స్పదమైనసంగతి మఱియొండు లేదు. అట్టివి వ్రాయకుండనే బోధయగుచున్నవి. ఈరీతిని, తక్కువసంగతులను జెప్పి, హెచ్చుభావముం జూపగలిగినవాఁడే నిజమగు నేర్పరి. దస్త్రాల కొలది కాగితములను వ్రాసి యందు నిజము లగు భావము లేకుండుపిచ్చివ్రాత లెన్ని వ్రాసి నను, లక్షలకొలఁదిబొమ్మల వ్రాసి, యందు మెప్పువడయు భావములు లేకున్నను లాభ మే ముండును? ఎవ్వరుసంతోషించెదరు? కావున, నిజమగు భావముతోఁగూడియున్న పట్టున, కావ్యమువలెనే చిత్రమును చిత్రకారుని భావమును విస్పష్టముగా దెలుపగలదు.

అది యట్లుండఁగా, కావ్యమునకంటె జిత్ర లేఖనమున మఱియొకవిషయమున ఘనత కల దని యందఱు నొప్పుకొనక తప్పదు. కావ్య మే భాషలో వ్రాయబడునో ఆభాష నెఱిఁగినవారికే బోధయగును. చిత్ర మట్లుగాక, యేభాషవారి కైనను బోధయగును. దాని భాష నెఱుగని వా రుండరు. అది బోధపడుటలో బుద్ధితత్త్వముంబట్టి హెచ్చుతగ్గులుండ వచ్చును గాని యన్యభాషాకావ్యమువలె నబోధమైయెన్నఁడు నుండదు; అంతే కాక, మనుష్యేతరజంతువులు కూడ బొమ్మల దెలిసికొనగలవు. అందువలన నీభాషలో వ్రాయబడినభావములు చాలమందికి బోధపడు నను టకు సందియము లేదు. చిత్రకారునిభావము నాచిత్రమునందు, బాగుగా నెఱుగువారు, చూచువారిలోఁగొందఱేయుండ వచ్చును కాని యాచిత్రమునుసామాన్యముగా నెఱుఁగగలవారు పెక్కురుందురు. ఈకారణ ములం బట్టి, చిత్రకారుని భావముం దెల్పుటలో చిత్రము కవిభావముం దెల్పుటలో కావ్యమునకంటె దక్కువయని యెంతమాత్రమును చెప్పుటకు వీలులేదు. కవిత్వము చిత్రలేఖనము కూడ సమానశక్తు లనియు, మార్గ భేదమున్నను వానిలో గమ్యస్థాన భేదము లేద నియు నిదివఱకే తెలిసికొంటిమి.



# బేతాళ రెడ్డి*

(పాణకా పిచ్చిరెడ్డిగారు బి. యే. ఆనర్సు)

నరసింహపురము పూర్వము విఖ్యాతపట్టణము. ఓరుగంటి వీరరుదమదేవి సామంతుడుగ నుండిన వీరభద్రారెడ్డి రాజధాని. ప్రస్తుతము చుట్టునున్న దేశముతోగూడ చోళుల యేలుబడిలోనున్నది ఇప్పుడు ప్రతాపరుద్రుని సాయమున స్వాతంత్ర్య సంపాదనకై వీరభద్రారెడ్డి దేశీయులబురికొల్పుచుండుట నెఱిగి చోళచక్రవర్తి తనసేనాధిపతి నొకని తగు సైన్యముతో నాదేశమున నుంచెను. తన చర్యల గమనించుటకు నియోగింపబడిన కులోత్తుంగుని సైన్యముల, వీరభద్రుడు అత్యాదరముతో గారవించెను. పండుగ నాటిరాత్రి కులోత్తుంగచోడుని తనయింట విందునకు బిలిచెను. అతడు భోజనానంతరము మేడలో పచారు సేయు సమయమున కథ ప్రారంభమగును.

మధ్యరాతిరివేళ మానిసి యొకఁడు
చేపట్టు గోడపై జేతుల నూని
నిలుచుండి యోచన సలుపుచు నుండె
నిర్మలాకాశము నెత్తిపై గలదు
మినుకు మినుకని మెఱసె చుక్కలును
వెన్నెలఁ జల్లెడు విధునిబింబంబు
ఉద్యానవనమున నున్నవృక్షముల
వెన్నెలకాంతిలో వీక్షించె నతఁడు.
అప్పుడే పూచిన యందంపుబూల
తావులభారము తల దాన్చెనేమొ
మలయపవనంపు గోదమలకు నొక్కింత
మధురత్వమున కీడు మాంద్య మలవడియె
పవలంత కష్టించి బడలిన మేను
సౌరభసరసిలో స్నాన మొనర్చి
ఒకవింతయానంద మొందె నారాత్రి
నరసింహపురమున నగళ్ళలోన
వృద్ధరాజన్యుండు వీరభద్రుండు
ఓరుగల్లు ప్రతాపవీరునితోడ
గలసి చోళులపైన గత్తిగట్టుటకు
పన్నాగములు చాల బన్నుచున్నట్లు
సంశయించినచోళసైన్యాధికారి
చెంగటనే కులోత్తుంగుని, వరుణు
రాణువ నిచ్చి సంరక్షణ కునిచె
తనచేత నున్న పట్టణమును చుట్టి
దేశమంతయుజూచి ఈశాంత మేమి?
అన్నివేళలయందు నత్యాదరమున
ననుఁ జూచు వీరభద్రుని స్నేహ మేమి?
అధికారిభయమున కవకాశ మేది?
అని తలపోసెను ఆనిశీథమున.
ఇటు నటు దిరుగుచు నింతటిలోనె
ఊరిలో దివిటీలశారు గాన్పించె
పండుగ యైన నారెండు దినాలు

* ఫ్రెంచినుండి యాంగ్లమున కనువదింపబడి యున్న ఒక కథానుకరణము.

ఊరిలోపల దీప ముంచగరాదు
ఆఱుగడియల రాత్రి కావల నెవరు
అని యుత్తరువు జేసె నాదినమతఁడు.
నిర్దిష్టస్థలముల నిల్చుండి యున్న
భటులకత్తులు గాన బడియె వెలుతురున
దివిటీలవారలధ్వని యేమి లేదు;
ఉత్సవసందర్భయుత్సాహ మేమి
గానిపింపదు; ఏమికారణమొక్కొ!
ఇంత నిర్భీతితో నిట్లు వర్తింప
నిప్పుడే పోయి నే నెఱిగి వచ్చెదను
అని యావనోద్రేకమున మేడనుండి
క్రిందికి దూకి వేగిరమ సైనికుల
కడజేర నూహించునెడ శబ్ద మొండు
విని నిల్చె; నెవ్వరో వనిత యంచెంచె;
అటునైపు తలద్రిప్పె; అగుపించ రెవరు;
చదలు వెన్నెల జల్లుసంద్రము జూచె
స్తబ్ధుడౌ ఘోరదృశ్యము నేమి గనెనో!
ఇంద్రియంబులు మోసగించె నం చెంచె.
సాగరంబున దెరచాపల గనియె
కడుభీతి జెంది, ఆకానిపించునది
అలలపై బడెడి వెన్నెలకాంతి; అట్లు
వింతగ దోచెడు నంబియే యనుచు
మనసుకు సరిపెట్టుకొన జూచె నెవరొ
తను జేరఁబిలిచి న ట్లనుమానమయ్యె.
అటు జూడ నొకవ్యక్తి యచ్చట నిలిచి
"అది యెవరు? తమరేనా?" అని హెచ్చరించు
కొనె; వాఁడు వీరభద్రుని యింటి దాక
తనతోడ జనిన భటునిగా నెఱింగి
"అన్నను. సంగతు లేమి?" యని మెల్ల నడిగె.
"వార లచ్చట కదలబారుచున్నారు.
పురుగులవలె నట దిరుగుచున్నారు.
నేఁగన్నదంతయు మీకెఱింగింపఁ
బరుగెత్తి వచ్చితి" "సరి తరువాత?"
ఇంతకు ముం దొక డీయింటి నుంచి
దీపముతో కొండవైపుకు జనియె
ఇటువంటివేళలో నెచ్చటికేగు
మనల ముగించెడు పని యేమొ జరుగు
నని సంశయించి నే నరిగితి వెన్క
ఐదాఱునిముసములైన గాలేదు
కనిపించె నొకపెద్దకట్టెలమోపు"
అనియె నంతటిలోన నతిభీకరముగ
గ్రామంబదంత యొక్కటిగ కిలార్చె:
ఉత్తరక్షణము కులోత్తుంగునెదుట
నెఱసె తళుక్కని; మరణించె భటుడు;
తలలోన గుండు తగిలి పడి చచ్చె.
ఆతని యెదుటనె, అమితచేరువనె
కట్టె లంటుకొనియె; గణగణ మండె;
భవనంబులోపల పాటలు నిలిచె;
అంతయు నిశ్శబ్దమయ్యె; దూరమున
మూల్గులు వినవయ్యె; మ్రోగ దొడంగె
పర్జన్యగర్జనవలెను ఫిరంగి;
చల్లనిచెమట నొసలు నిండజేరె;
చేతగత్తియు లేదు; చేయున దేమి;
తనవారు మడసి రందఱు; రుద్రసేన
లేతేరనున్నవి; ఇక నేది దిక్కు?
బ్రతికిన గూడ తర్వాత దండనయె;
తన యజాగ్రత్తకుఁ దగిన ఫలంబు
అనుభవింపక తీర దవమానఫలము
అని యెంచి భూమికి నామిద్దెపైకి
కలదూరమెంతయో కన్నులతో గొలిచె

దుముక నుద్యుక్తుఁడౌ సమయమునందు
తను దట్టి మెల్లగ ననసూయదేవి
"పరుగెత్తి పొమ్ము; మావారలు నిన్ను
చంపి వేసెదరు చేజిక్కినయెడల
అచ్చట నా కొండకావలి ప్రక్క
మాయన్నగుఱ్ఱపు లాయము గలదు;
ఆలసింపకు; పొమ్ము" అని పల్కె నతఁడు
స్తబ్ధుఁడై మరల నా తన్విని జూచె;
ఆమె 'పో' యని నెట్టె; నాతఁడు దుమికె;
ఒకరాతినుండి యింకొక రాతిపైకి
మేకలు సైతము దూకని చోట్ల
బ్రతుకాశలేమి నిర్భయముగ దూకె
అనసూయ యనుచుండె ననుజలతోడ
పరుగెత్తె తలుముడు వధియింపుడడుగో
చంప వచ్చెడి వారిశబ్దము వినియె
వారలు కాల్చుతుపకీగుండ్లెన్నొ
చెవిప్రక్క రివ్వున జనె గుఱ్ఱ మెక్కి
అరనిముసములోనె నదృశ్యుఁడయ్యె!
జాముసేపటిలోన సైన్యము జేరి
తన యధికారి చెంతకు వచ్చి నిలిచె
"పిడికిట ప్రాణాల బెట్టుకవస్తి"
భయకంపితాంగుఁడై పలికె నతండు.
కూర్చుండి వివరించె ఘోరవృత్తమును
"అపరాధ మనగాదు అదృష్టహీన
తయె కారణం బని తలచెద" ననియె
నరిభయంకరుఁడగు నాయధికారి
"ఆంధ్రులొనర్చిన యానేరమునకు
నిన్ను మన్నించెద, నీచేసినట్టి
తప్పు లేదని నేను తలచిన యెడల"
"మనచక్రవర్తి దీనిని విన్ననెట్లు!
నిలబెట్టి గుండుతో నిన్ను గాల్పించు
చేయవలసినదేమొ చెప్పు తొందరగ
కర్తవ్యమును జేయగడగుడి మీరు
క్రూరకిరాతులౌ వీరలపైన
భూమికంతకు జంకు పుట్టెడురీతి
పగ నెట్లు సాధింప నగునో యోచింపు"
డని యుగ్రుఁడై పల్కె నా యధికారి.
గంటసేపటిలోన కదలె సైన్యంబు
శాత్రవుల్దమవారి జంపిన తెఱగు
విని యున్న సైన్యము విపరీతరోష
కలితులై నడచిరి గ్రామములన్ని
యుద్ధసన్నద్ధమైయుండుట గాంచి
క్రమ్మరివానిని కాలాగ్నిరీతి
భస్మము గావించి పయనముసాగె
రుద్రునిసేన సముద్రాన నిలిచె
సాయంబొనర్పగ జనుదేరదాయె
నమ్మిన రుద్రుండు నట్టేటముంచ
నరసింహపురమును నాల్గు పక్కలను
అవలీలగాదాకె ద్రవిడసైన్యములు
పౌరులు గనుగొని భయమంది బెగడి
అధికారిక్రౌర్యము నంతకు మునుపె
యెఱిగినవార లాపురివారు గాన
పట్టణమంతయు భస్మంబుజేసి
పౌరుల గత్తికి బలిజేయునంచు
తలపోసి తమలోన ద్రవిడసైనికుల
చంపినవారలు స్వయముగాఁ దమ్ము
మాతమె దండించి మన్నింపు డొసఁగ
నని విన్నపము లంప నందుల కతడు
"వీరభద్రునియింటివారి నందఱను
అప్పగించుటకు మీరొప్పెదరేని

మీరు కోరినయట్లె మిమ్ము మన్నింతు”
ననిమె నందుల కంద అంగీకరింప
వీరభద్రారెడ్డి వీరవంశజుల
బంధించి తనసొంతభటుల గాపుంచె
పౌఋలర్పించినవారి నిన్నూఱు
గురగాల్చి చంపించె గుండుతో నపుడె
ఉరిత్రాళ్ల గట్టంగ నొసగె నుత్తరువు
గ్రామహంతకు బిల్వగా బంపె. నింత
లో నరుదెంచి కులోత్తుంగుడనిమె
గద్గద స్వరముతో, “కల దొక్క మనవి
తనవారి వేఋవిధముగా వధింప
వీరభద్రారెడ్డి వేడెను మిమ్ము
తలలు ఖండించుట తగునని నుడివె
గండ్రగొడ్డలితోడగడ తేర్ప మనిమె”
అందుల కధికారి యంగీకరించె
“బందాలు విప్పంగ బ్రతిమాలుకొనిరి
పాఱిపోమంచును బాస జేసితిరి.”
“నిను నమ్మి యొప్పుకొంటిని భద్ర”మనిమె
“చిన్నికుమారుని మన్నించునెడల
ఆస్తినంతయు మీకు నర్పింతు”ననిమె
“అట్లనా! అతని సొత్తంతయు నిపుడె
చక్రవర్తిదిగదా!......సరి. అతడడుగు
నంత కెక్కువగానె యంగీకరింతు
విన్నప మేలనో విస్పష్టమాయె
వంశంబు నిలుపుకో సాధేయపడిరి.
వీరభద్రా రెడ్డి విశ్వాసఘాతు
కత్వము, వానికి గావింపబడిన
శిక్ష, తెలుంగు, దేశీయులెల్లరును
ఎల్ల కాలంబును నెఱిగియుందురుగ.
వానిపుత్రులలోని క్షాత్రవశ్రైన

సూనరికార్యంబు బూనినయెడల
వానికి నాస్తి సర్వస్వము నొసగి
విడిపించి పుచ్చెద: వినిపింపు పొమ్ము.”
ఎట్టుల చెలుపుదు నీవార్త వీరి
కని చాల యోచించి యరిగె నెట్టులనె
ఈగదిలో ననే నిన్నటిదినము
సుకుమారగాత్రల సుదతులిర్వురను
ముగ్ర్వురు యువకుల, ముచ్చటతోడ
ఆనందమున దేలియాడంగగనిమె
కటికహంతకు చేతిగండ్ర గొడ్డలికి
బలిగాగనున్నవారలదశ గాంచి
ఇట్టుల నుండెనా మృత్యువు మీకు
అనుచింత భీతిచే వణకెనతండు
కుర్చీలపై ననే కూర్చుండినట్లె
బంధితులై వీరభద్రరెడ్డియును
భార్యయు, సుతులును బాలికాద్వయము
చలియింపకుండిరి; నిలబడియుండ్రి
చేతులు గట్టున్న సేవకు లెదుట
బంధితులై యున్న పదునైదుగురును
హృదయభావంబుల వెలిదోప నీక
నొండొరు జూచుచునుండిరి. కార్య
వైఫల్యజనిత నిస్స్పృహ మాత్ర ముండె
గొన్ని ముఖాల; కాపున్న సైనికులు
బందీలఘనతను పాటించియేమొ
నిలుచుండియుండిరి నిశ్చేష్టముగను.
వచ్చుకులోత్తుంగు నైఖరి జూచి
ఆశతో గొన్నిముఖాలు వెలింగె.
వారలకట్లు విప్పగ నాజ్ఞ యిచ్చి
అనసూయ విడిపింప జనిమె సొంతముగ.
దీనవదనమునందు లేసన్వు గాంచె.

విప్పునప్పుడె తాకె వెలదిహస్తంబు
చారుమోహనసుకుమారిరూపంబు
తుమ్మెద రెక్కల తులయగుకురులు
ముగ్ధయై నిలుచుండె ముదితను జూచి
ఆంధ్రవీరునిపట్టియసమానరూపు
ఆంధ్రదేశపు కన్నె యపరంజివన్నె
చేరెడు కన్నులు, చిక్కని బొమలు
ఆంధ్రలక్ష్మి యనంగ నామె విలసిల్లె
"సఫల మాయెనె నీవు చనిన కార్యంబు"
ఉత్తర మొసగలే కూరక యతడు
అనసూయ ననుజుల గనుచు నిల్చుండె.
వారిలో బెద్ద ముప్పదియేండ్ల వాడు
బేతాళరెడ్డి యన్బిరుదుమగండు
అందగాడని మాత్ర మనరాదుగాని
గసువంపుజూపును గాంభీర్యగరిమ
ఆంధ్రదేశపుకీర్తి కాలంబమైన
శౌర్యధైర్యములవిస్తారత దెలుపు.
రామరెడ్డి ద్వితీయరత్నము రూపు
సోదరివలె నుండు సుకుమారి యిరువ
దేడులు వయసుండు. మూడవవాడు
పదివర్షములవాడు బాలచంద్రుండు
గోపబాలురతోడ గోవుల మేపి
బృందావనంబునఁ బిల్లన గ్రోవి
బ్రకృతి బరవశత్వమ్ము నొందించి
ఆనందలహరిలో నాడించువాడు
గోపకు ల్గాంచిన గోవిందురూపు
గోపికల్గాంచిన గోపాలురూపు
ముదుసలుల్గాంచిన ముద్దులరూపు
నందయశోద లానందించురూపు
కనిపించు బాలచంద్రుని జూచినంత
వృద్ధభూమీశుడు వీరభద్రుండు
వెంకిపోగులవలె వెండ్రుకల్గలిగి
భారతాచార్యునివలె గానిపించె
అధికారి వచియించు నా బేరమునకు
వీర లొప్పుట సంభవించునె? అయిన
నడిగెద గాకని యనసూయతోడ
మెల్లగ ననె గుండె ఝల్లుమనంగ
గడగడ వడఁకునాకన్నియ యపుడు
ఇంతలోన నెరింగి శాంతముదాల్చి
తండ్రితో వృత్త మంతయు వచియించె
"నాయనా! మీమాట మాయన్న మీఱ
కుండులాగున నాజ్ఞయిండయ్యా!" యనియె
పెనిమిటి యున్నవైపున గొంత వంగ
ననసూయ పల్కులు వినవచ్చె రాణి
తల్లిగావున మది తల్లడమంది
ఘోరవృత్తము విని కూలె నచ్చటనె
వృత్తాంతమంతయు వినియె బేతన్న
చెలరేగె బోనులో బులివలె నతడు
వీరభద్రుడు విన్నవించినయంత
సైనికభటుల నచ్చటినుండి పంపె.
ఇంతలో నరుదెంచె హంతకుడటకు
పరిచారకుల వానిపరమున నొసగ
మరునిముసమునందె యురిదీసె వారి
పెద్దకుమారుని బేతన్న గాంచి
ముదుసలితండ్రి గద్గదికతో బలికె
"నాయనా బేతన్న! నామాట! వినుము
రాజ్యస్వత్వముల సంరక్షణకొఱకు
ఖండన మొనరించు భాగ్యములేదు.
గొఱ్ఱెల మేకల కోళ్ల విధాన
చావంగవలసిన జాతక మయ్యె

ప్రాజ్యసామ్రాజ్యసంపాదనయందు
ఓరుగ ల్మెప్పించె వీరజీవనత
నీవీరవంశంబు చావంగవలసె
వీరభోజ్యం బగు ఘోరరణాన
అసువుల దొరగెడు నదృష్ట మేది?
కాలము సరిగానికతమున నిప్డు
కర్తవ్య మొక్కటే గనిపించు మనకు
పేరు చెందినయట్టి వీరవంశంబు
దొడ్డరాజుల గన్న రెడ్డివంశంబు
నశియింప కుండగ నగును రక్షింప
దేశము పరన్యపాధీనమైపోమె
మన కేల ప్రాణంబు లని యెంచరాదు
బ్రతికితే శుభములు పడయంగవచ్చు
కాలము గమనించి కనుపెట్టియుండి
నీతండ్రి పగదీర్ప నీ వుండు తండ్రి!"
నిర్విణ్ణుడై పోయె నిలుచున్నయల్లె.
ఒనరింపజాల నంచని చెప్పె శిరము.
అనసూయ, చెంతకు జని కూరుచుండి
"అన్న! నావిన్నపమంగీకరింపు
పాపిష్ఠిహంతకు పాడుచేతులతో
బట్టి వధించుట భరియింపజాల
నాయందు దయయుంచి నన్నడ తేర్పు
నాకష్టముల బాపి నన్ను రక్షింపు
పగవాని కప్పగింపగ న్యాయమయ్య!
పెఱవానివనితగా వీక్షింపగలవె?"
అని తీవ్రదృష్టి చోళుని వైపుబఱపి
తనదుభావంబు చేతన్నకు దెలిపె
రామరెడ్డి పలికె "రాజ్యాధిపతుల
నాంధ్రదేశంబున కందించినట్టి
వంశంబు నశియింపవలయునే యిపుడు!

"కాకతీయులు తేరి కనరానిముఖము
లస్పృశ్యహంతకు డంటఁగావలెనే?"
పిఱికితనము మాను చేతన్న యింక."
అనసూయ లేచె చుట్టును మూగియున్న
అనుజులు సందియ్య దనయుడు గాంచె
ఎదుటనె నిలుచున్న ముదుసలితండ్రి
వినిపించె మేఘగంభీరభాషణము
"నా యాజ్ఞ పాలింపు నాయనా!" యనియె.
నిలుచుండె చేతన్న నిశ్చేష్టముగను
మోకాళ్ల వ్రాలె ముదుసలితండ్రి
అనసూయ, రామన్న యటులె యొనర్ప
"పాదాలపై బడె బాలచంద్రుండు
వంశాంకురంబును వాడిపోకుండ
గాపాడ జాలిన ఘనుడని యెంచి
బ్రతికియుండు మటంచు బ్రతిమాలిరతని
తండ్రి వచించె 'ఓ తనయ! చేతన్న!
శౌర్యంబు నీలోన జచ్చెనా యేమి?
ఆంధ్రదేశపుశక్తి ఆంధ్రపౌరుషము
అడుగంటెనా యేమి? కడువృద్ధు నన్ను
ఎంత సేపిట్టుల నేడిపించెద వు?
నీజీవితంబును నీకష్టములను
పాటింపనగునె యిప్పట్టున నీవు"
"వినిపింపు దేవి! నాతనయుండా వీడు"
"అంగీకరించెను" అని పల్కె రాణి
కండ్లలో దా నేమి గాంచెనోగాని
సైన్యాధికారి యాజ్ఞాపించినట్లె
పురముఖ్యులెల్లరు నరుదేర వారి
బారులుగా నిల్పి భటుల గాపుంచె
వారిముందుగ పదిబారలలోన
శిల యుండె పైన గొడ్డలి తళ్కుమనియె




కుండలు

రాయి

1. నేలలో 9½ క్రింద రాగిగిన్నె
2. మట్టి పెంకులు
3. నేలలో $9\frac{1}{3}$ క్రింద త్రుప్పు పట్టిన ఇనప ముక్కలు
4. ఇనుప ఆయుధము
5. ఇనుప చేతి గొడ్డలి
6. తొలిగించిన రాయి
7. ఫోటో తీయుటకు త్రవ్వబడిన మెట్లు
8. ఎనిమిది అడుగులలోతు

మాలా ఆలీ-ఉత్తరము.

క్ష్ణము I

కిస్తు ఉత్తరముఖమై యున్నది.
ఎముకలు దొరక లేదు.
వెలిరాళ్లసంఖ్య 24.







చిత్రప్రమాణము:—8 అడుగులకు=1 అంగుళము







## రాయగిరి కీర్ణము I

దీనిలోని కిస్తు ఈశాన్యమునకు తిరిగియున్నది. ఎముకముక్కలు దొరకినవి. ఇచ్చటి కుండల లోపలనున్న శైవమున్ను గీతలున్నవి రాళ్లప్రాకారము (లేక వేలి) సంపూర్ణముగ లేదు.

నేల     మట్టము

ఎ. బి. మీదిసెక్షను

Skulls పుర్రెలు

తీసివేసిన ఘట్టవరాళ్లు

నేల     మట్టము

సి. డి. మీదిసెక్షను

చిత్రప్రమాణము:—8 అడుగులకు = 1 అంగుళము

బేతిరెడ్డి జంకుచో తయారుగనె
హంతకు డుండె. నా కింత సేపటికి
అనుగులశబ్దము సందడు వినిరి
అంతయు నిశ్శబ్ద మయ్యె నాయింటి
నై పేగ వారల వీక్షణపంక్తి
సవినయంబుగ చోళసైనికభటులు
బారి కిర్వంకల బారులు నిల్వ
భవనంబు వెల్వడి మందగమనమున
రాజకుటుంబము ప్రత్యక్షమయ్యె
వ్యసనలేశము లేదు వారిముఖాల
నిర్మలశాంతప్రపూర్ణత వెలిగె
ఒకడుమాత్రము ఖిన్నుడైయుండె నందు
బ్రదుకంగ శపియింపబడిన బేతన్న.
ముదుసలిరాజును ముదుసలిరాణి
అనసూయ కౌసల్య అనుజ లిర్వురును
వధ్యశిలకు చేరువనె నిల్చి రంత
అన్న నద్దకు ముందు అనసూయ యరిగి
"అన్నయ్యా! ముందుగ నన్ను వధింపు
నామెడ గగుణించి న న్గడతేర్పు
వాయుజవంబున బరుగెత్తివచ్చి
రోజుచు నిల్చె కులోత్తుంగు డచట
ఘోరదృశ్యము గాంచె గొడ్డలి బూని
భీకరమూర్తియై బేతాళరెడ్డి
ఆతనియెదుటనె అనసూయదేవి
మోకాళ్లపై నిల్చి ముఖమును వంచి
గండ్రగొడ్డలి బిల్చుకంబుకంఠంబు
గాంచి నిర్వీర్యుడై కడ కిట్లు పలికె
"అనసూయ నన్బెండ్లి యాడుచో నీకు
ప్రాణదాన మొనర్చు మాయధికారి"
ఉలికిపాటున లేచి యూరకనవ్వె

"అన్నయ్యా! కానిమ్ము అనుమాన మేల?"
గంభీరస్వరమున గద్దించి పలికె
తల దొర్లె రాజుపాదముల చేరువకు
ధ్వని విని కండ్లు మూసినరాణి వణకు
బాలచంద్రుం డను బాలకు డడిగె
"తల సరిగానున్నదా? అన్న! చూడు"
శూరుడు బేతన్నసోదరి ననియె
"కౌసల్యా! కన్నీరు గార్చుచున్నావు."
"అన్నయ్యా! నీమాట యనుకొనుచుంటి
మేము పోయిన నిన్ను ప్రేమింతు రెవరు?
పాపము నీ వెట్లు బ్రతికెద వింక!"
వృద్ధరాజన్యుండు వీరభద్రుండు
బిడ్డలరక్తము వీక్షించె నెదుట
నిశ్చేష్టులై ముందు నిల్చుండియున్న
ప్రేక్షకలోకంబు బ్రీతితో జూచి
స్పష్టస్వరంబుతో బలికె నీరీతి
"నన్ను నమ్మియున్న నాయకులార!
చాలనినా ళ్లాంధ్రజాతికి గలిగె
"సార్వభౌముల మార్చ జాలినయతడు
గ్రాసగానిని వేడ గక్కుఱితిపడియె"
శంకింపగానేల సమయముగాదు
ప్రత్యక్షుడుడా పార్థుడే మున్ను
"మాధవా! రథమును మఱలింపు" మనియె
ఇతరుల ననలేల? ఇప్పటివఱకు
బిడ్డలవలె మిమ్ము ప్రేమించినాడ
విధివశంబున మీకు బేతన్న మిగిలె
ప్రీతితో నాతని వీక్షింపుడయ్యా."
బేతాళరాయడా! వీరాంకవీర!
జనకునిదీవన గొనుమయ్య తండ్రి!
చింతింపబనిలేదు ఖేదింపు విరము

పాపరహితుడవయ్య భయమేల యింక"
చనుదెంచుతల్లిని గనినంతలోన
"కన్నకడుపు జీల్చుగాయికసాయి
ఘాతకు నన్నేల కంటివి తల్లి!"
అని పల్కి పెద్దపెట్టున నేడ్చెనతడు.
తనపట్టి పడెడుసంతాపము గాంచి
అతనిధైర్యము ఖాలియూట గుర్తెఱిగి
అత్యున్నతంబగు నాచోటినుండి
తల్లి క్రిందుగ బడి తనతల పగుల
ప్రాణాల బాసె నారాణి; బేతన్న
హా! హా! యటంచు దా నవసిపై వ్రాలె.

---

# చిలుకపాటివారి వచనాలు

ఈకాంతనుండి నీవేకాంతకేగేవో - నా కింత యెఱిగించు సది నాకు జీవి
భూకాంతపై కాంత పొంది పొందక మున్నె - యేకాంత సురలింగయింది నే నంటా (?)
ఎందునైన పొందు యేలాగు గనుగొందు - బొందితో కైలాస పురమెంపనయితి ౧
ఉండి యుండని ఓటికుండలోపలి నీళ్ళు - నిండబోసినరీతి నీకు నాకు
నండిగా పంకమున దగిలియుండినయట్లు - యెడ్లువిడిచిన బండివలెనాయ బ్రతుకు (?) ౨
తైల మందిన వత్తి తగలువడి దీపాగ్ని - తైలమంటని వత్తి దహనగతిని
తైలమే ప్రాణంబు తనువత్తి వీడినను - తైలంబు వత్తిగతి తగనాయె బ్రతుకహా ౩
ఆకు పోకయు సున్న మంతగంధనజేసి - తా కర్తయెందోయె తమ్మెందుబోయెఁ
జోక పంజరములో జొచ్చివేసిన చిలుక - మాకు మీకును యింత మాత్రమేకాదా ౪
కాకి కోవెలపిల్ల గని పెంచినావెనుక - చీకాకు పడదన్ని చెలగి చెలగి
యాకులము చిలుకపాటీశుభక్తులగన్న - కాకి కోవెలపిల్ల గతిని బసనన్నా? (మక్కికిమక్కి) ౫

---

# ప్రథమ జ్వాల

వింజమూరి పార్థసారథి గారు

౧

గవర్నరుపేటలో సామాన్యంగా సోమసుందరమును ఎరగనివాళ్లు లేరు. అతనందరికీ వింతగా కనపడేవాడు సౌమ్య స్వభావుడైనా చిన్ననాటినుంచీ ఎప్పుడూ ఇల్లు పట్టక తిరుగుతూ ఉండేవాడు. అతనికి సావాసాలెక్కువ. ముఖ్యంగా అతను లక్ష్మీకాంతముగదికి తరుచుగా వెళ్లుతుంటాడు.

లక్ష్మీకాంతము ఒంటరిగా వచ్చి బెజవాడలో చదువుకుంటున్నాడు. పెద్దవాళ్లు కోపపడతారనే భయము లేకపోవడముచేత పగలంతా పదిమంది స్నేహితులను చేర్చి చీట్లాడుతూ కాలము గడిపేవాడు.

వేసంగి ప్రవేశించింది. పొద్దుటిపూట స్కూలు పెట్టినారు. ఎండలు చిటపటలాడుతున్నవి. ఎట్టిటి మెండలో కూడా మన సుందరము ఆ చీట్లాడేచోటికి రోజూ పన్నెండు కొట్టేటప్పటికి హాజరయ్యేవాడు. కాని పాప మతనికి చీట్లాడడము బొత్తుగా రాదు. బస్తీలో పుట్టిపెరిగి ఇంగ్లీషు చదువుకుంటూ చీట్లాట రాకపోవడము తోడివాళ్లకు కేవలము హాస్యాస్పదంగా కనపడేది. వాళ్లంతా సోమసుందరాన్ని చీట్లాడ లేనందున ఎగతాళి చేస్తూఉన్నా, అతను మాత్రము రోజూ అక్కడికి వెళ్లి వాళ్లాడుతుంటే కాస్తసేపు ఊరికే చూస్తూకూచుని తర్వాత మరి ఒక స్నేహితుని ఇంటికి వెళ్లుతూ కాలము గడుపుతూ ఉండేవాడు.

మన చీట్లపేకక్లబ్బుకు అవతలి ఇంట్లో మాధవరావు ఉంటున్నాడు. అతనికి వెళ్ల పోకడలేమీ తెలియవు. ఎప్పుడూ చదువేమో తానేమో అన్నట్లు సంచరిస్తూ ఉంటాడు. చీట్లాటలో ఆరితేరినవాడే. ఐనప్పటికీ అతను లక్ష్మీకాంతం ఇంట్లో క్లబ్బులో మెంబరుగా చేరలేదు. ఓర్చలేనితనమువల్లనో మరి ఎందువల్లనో కాని, కొంతమంది మాధవరావు పెద్దమనిషితరహాఅంతా వట్టి టక్కరుతన మనేవాళ్లు.

ఆ వైశాఖమాసములో ఎండలూ గాడ్పులూ తీవ్రంగా ఉన్నవి. వడదెబ్బకు పాపము కొంతమంది పసిపిల్లలుకూడా పోయినారు. ఒకనాడు మధ్యాహ్నము సోమసుందరము భోజనము చేసుకుని లక్ష్మీకాంతము గదికి వచ్చినాడు. లోపల చాపలు వేసుకొని లక్ష్మీకాంతమూ స్నేహితులు ఆటమ్లు ఆడుతున్నారు. ఒకడు ఆట అన్నాడు. అడ్డు అన్నాడు ఇంకొకడు. ఆట వరతు పైవరతులదాకా పెరిగి పోయింది. దిగుడుచెయ్యివాడు గంభీరంగా ముక్కదిగినాడు. ఆట అనర్గళంగా సాగిపోతున్నది. అంత పట్టున వాళ్లు ఆడుతున్నప్పటికీ సోమసుందరము లోపలికి రాగానే సభవారంతా పక్కున నవ్వి

నారు. ఎందుకు నవ్వినారో సోమసుందరానికి అర్థము కాలేదు. అతని మనస్సు పుష్పవలె కోమలమయినది. ఎప్పుడయినా స్నేహితులు ఎగతాళి చేస్తే అతను ముఖము చిన్న పుచ్చుకొనేవాడు. అతనికి కష్టముగా ఉన్న కొద్దీ తోడివాళ్లు ఎక్కువ ఎగతాళి చేస్తూ ఉండేవాళ్లు. కాని ఆరోజున మరీ అతని కది దుర్భరమైనది. అక్కడ ఉండలేక బయటికి వచ్చి వడగాడ్పు తోలుతూ ఉన్న పంచలో అరుగుమీద కూచుని శూన్యభావంతో ముందువైపుకు చూస్తూ ఉన్నాడు.

అట్లా చూస్తూ ఉండగా సుబ్రహ్మణ్యా మనే కుర్రవాడు మాధవరావు ఇంటివైపు రావడ మతనికి కనపడ్డది. సుబ్రహ్మణ్యమూ సోమసుందరమూ మూడవఫారంవరకూ కోట వాడ హిందూ హైస్కూలులో కలిసి చదువుకున్నారు. కాని ఈమూడేళ్లనుంచీ చెడు సావాసాలవల్ల సుబ్రహ్మణ్యము సరిగా బడికి పోక చదువులేకుండా తిరుగుతూ ఉన్నాడు. అతన్ని చూడగానే షుమారు పందొమ్మిదేళ్ల ప్రాయమువాడని తెలుస్తుంది. కొంచెము ఎర్రనివాడే. అయినప్పటికీ అందగాడని చెప్పడానికి వీలులేదు. కాని అతనికిమాత్రము ఆవిషయమున అనుమాన మణుమాత్రమైనా లేదు. మరీ ఈమధ్య పిలకజుట్టు కత్తిరించుకుని క్రాపింగు పెట్టుకొన్నప్పటి నుంచీ తన ముఖానికి వికాసము హెచ్చినదనీ అసలునూ తనజీవమే వచ్చినదనీ అద్దంలో మాటిమాటికీ చూసుకుని ఆనందించేవాడు.

సుబ్రహ్మణ్యము మాధవరావింటికి రావడ మారంభించి కొద్దిరోజులే అయింది. అదివరలో వాళ్లకిద్దరి విశేషంగా స్నేహ మున్నదని మాత్రం చెప్పలేముకాని ప్రస్తుతము రోజూ అతను మాధవరావుగారింట్లో కనపడతాడు. ఇవ్వాళ చక్కగా తలదువ్వుకొని పచ్చటి రాజమండ్రిసిల్కు ఉత్తరీయము కమ్ములుతీర్చి డాబుగా కనపడేట్లు కప్పుకొని, కొత్తగావస్తున్న కోరమీసాలు దువ్వుకుంటూ తాంబూలము నములుతూ మాటిమాటికీ చెయ్యిపెట్టి క్రాపింగు సర్దుకుంటూ వస్తూఉం టే సుబ్రహ్మణ్యము బహు వింతగా కనపడ్డాడు. వేషమంతా మారిపోయింది. అదేమి, నడకకూడా మారిపోయిందే! వానికోడిపుంజు నడకా అదీ చూడగానే సోమసుందరానికి నాటకములో వచ్చేవేషాలు జ్ఞాపకము వచ్చాయి.

సోమసుందరానికి పదిహేనేళ్లకంటె ఎక్కువ ఉండవు వానిముఖంలో ఒక విధంగా అమాయకత్వము కనుబడుతుంది. అయినప్పటికీ తెలివితేటలూ ఊహలు తక్కువలేవని అంతా అనుకునేవాళ్లు. మాధవరావింట్లోకి పోతున్న సుబ్రహ్మణ్యునిచూచి అతను నవ్వినాడు. సుబ్రహ్మణ్యము ఏమీ మాట్లాడక అతనివైపు కొరకొరలాడుతూ చూస్తూ లోపలికి వెళ్లినాడు. సోమసుందరము అరుగుమీదనే కూచుని మళ్లీ శూన్యదృష్టితో ముందువంక చూస్తున్నాడు. అట్లా చూచేప్పు డతని పెదవులు చిరునవ్వుతో వికసించుతూ

సిస్తవి; కళ్లు కలవరిస్తున్నట్లు కనపడి చూచే వాళ్లను ముగ్ధులను చేస్తవి.

సుబ్రహ్మణ్యము మాధవరావు ఇంట్లోకి వెళ్లి రెండునిముషము లయింది. సోమసుందరు డేదో పరధ్యానంగా కూచుని ఉన్నాడు. ముందుకు సూటిగా చూస్తూఉన్న అతని దృష్టి లేలనో మాధవరావింటి వైపు మరలినవి. మెరుపు మెరసినంత సేపులో అతని కిటికికి పచ్చని రుమాలు గాలిలో ఎగరవేసి ఎవరినో పిలుస్తున్నట్టు కనపడ్డది. సోమసుందరునిధ్యానం మరలినది. ఉన్నట్టే ఉండి ఎదుటింటివైపుకు చూపులు మరలించినాడు. అప్పుడు వానికళ్లకు చక్కని మెరుపుతీగవంటి ఒకానొక బాలిక సొగసుగా సింగారించుకొంటూ ఆయింటి కిటికీవద్ద కానవచ్చినది.

ఆమేడలో స్వామినాథయ్యరుగారు ఉన్నారు. ఆయన కోయంబుత్తూరువాడయినప్పటికీ తెలుగు జిల్లాలో నే చాలాకాలము నుంచీ ఉద్యోగం చేస్తూ ఉన్నందువల్ల తెలుగు రకంగానే ఉంటాడు. ఆయన పిల్లలుకూడా తెలుగుదేశములోనే పుట్టి తెలుగుబళ్లలోనే చదువుకుంటూ ఉండటము చేత వాళ్లు మనపిల్లలవలెనే తెలుగు చక్కగా మాట్లాడుతారు. ఆయనకు ఆడపిల్ల ఒక్కతే. ఒకసారి వాళ్లంతా స్వదేశము చూడడానికి వెళ్లినప్పుడు తాతగారూ వాళ్లంతా అరవమే మాట్లాడడము విని అప్పటికి అందరిలోకి చిన్నదైన కమల, 'ఏమిటీ, ఈ అరవగోడూ' అన్నందుకు వాళ్ల తాతగారామెను తనజీవిత కాలములో క్షమించలేదట. ఆమెకు ఇప్పుడు పదమూడు సంవత్సరాల ఈడు ఉంటుంది. దక్షిణాదిస్త్రీలు ఎప్పుడూ కొర్నాటి చీరెలు కట్టుకుంటూ రెండుమూడు బట్టలతోనే కాలము గడుపుతూ ఉంటారని మనవేపున అంతా అనుకుంటారు. ఒకవేళ ఆమాట నిజమైనప్పటికీ కమల కొర్నాటిచీరలు మాత్రమే కట్టుకోక బొమ్మరంగు చీరెలు, ఊదారంగు సిల్కుచీరెలు రకరకాలవి కట్టుకొని ఎంతో నాజూకుగా ఉండేది. ఆడసలుసు ఒక్కతే కావటముచేత తల్లితండ్రులు ఆమె అడిగినదల్లా కొంటూ గారాబముగా చూచుకునే వాళ్లు. ఇంకా పసితనము పూర్తిగా వదలక పోవటమువల్ల ఆమె ముచ్చటగా ఇంట్లో ఇటు అటు తిరుగుతూ ఉండేది.

మంచి గౌరవముగలవంశములో జన్మించిన పదుహేనేళ్లకుఱ్ఱవానికి లోకానుభవము చాలా తక్కువగా ఉంటుంది. అది మంచీ చెడ్డా బాగా తెలియని ఈడు. అందులో భయభక్తులతో పెరిగిన సోమసుందరానికి ప్రపంచములో జరిగే విచిత్రకార్యాలు ఏమి తెలుస్తవి? అయినప్పటికీ విద్యావంతుల కుటుంబములో జన్మించిన హేతువున అతని బుద్ధి కుశాగ్రమయినది. అందులో మనస్సుకు కూడా వికాసము అప్పుడే కొద్దిగా ఏర్పడుతున్నది.

పక్కఇంటిలో సుబ్రహ్మణ్యము ఉత్తరీయము ఎగరవేయడమూ ఎదుటిమేడలో అప్పుడే చక్కని మెరుపుతీగవంటి ఒకానొక బాలిక సింగారించుకుంటూ కిటికీవద్ద కానరావడమూ చూడగానే సోమసుందరుని మన

స్సులో ఏదో సందేహము ఏర్పడినది. బా గుగా చూచినాడు. చక్కగా ఆలోచించి నాడు. కొంతసేపు పస్తాయించి అరుగుమీద నుంచి దిగి ఇహ ఆరోజు స్నేహితుల ఇళ్లకు వెళ్లకుండా సరాసరి ఇంటికి వెళ్లిపోయినాడు

కొంతకాలము గడిచినది. సోమసుందరుడు లక్ష్మీకాంతమింటికి మా మూ లు గా నే వస్తున్నాడు. మాధవరావింటికివచ్చే సు బ్రహ్మణ్యము వేషము ఆరోజుకారోజుకు విచిత్ర మవుతున్నది. అతను అంత సంప న్నుడు కాడు. మునుపు మురికిగుడ్డలు కట్టు కుని వీధులవెంట తిరిగేవాడు ఇప్పుడు పూట కొకరకము దుస్తులు ధరిస్తున్నాడు. పొద్దున పూట విస్త్రీమల్లు కట్టి పట్టుచొక్కా తొడిగి పైన పచ్చని రాజమండ్రీసిల్కు వేసుకొంటే సాయంత్రానికి అవి తీసివేసి జరీపంచె కుచ్చి కట్టుకుని, పిండిపెట్టి గ్లాసువలెనున్నగా విస్త్రీ చేసిన కఫ్సులుగల లాంగ్లాతు చొక్కా తొడుక్కుని నడుముకు వలిపెపు ఉత్తరీయము బిగించి మాటిమాటికి స్వామినాథయ్యగు గారి ఇంటివేపు తనగుంట కళ్లతో చూస్తూ తెచ్చిపెట్టుకొన్న కొత్త నడకలతో మాధవ రావు దగ్గఱకు వచ్చి పోతుంటాడు. ఇక అతను క్రాపింగు దువ్వే పద్ధతులకు అంతేలేదు. ఒక సారి జుట్టు అంతాపైకి దువ్వి విశాలమైన నుదురు కలవానివలె కనపడతాడు. ఇంకొక సారి ముందుకు దువ్వి ప్రబంధస్త్రీల ముంగు రులు జ్ఞప్తికి తెప్పిస్తూ ఉంటాడు. మరొక సారి వెంట్రుకలు పక్కకు వంకెలు వంకెలుగా దువ్వి గంగాతరంగములు శిరస్సున ధరించిన సాక్షా దీశ్వరుని అవతారమువలె ఉంటాడు. ఇక వాడు వాడుకున్న తలనూనెలకు, అత్తర్లకు లెక్క లేనే లేదు. సీతాకోకచిలుకవలె ఉం టున్నాడు.

౨

మండు వేసంగి వెళ్లిపోయినది. వానలు జోరున కురవడ మారంభించినవి. వానాకాల ములో గవర్నరుపేటలో కూడా రోడ్లు బొత్తుగా బాగుండవు.ఎక్కడచూచినా బురద. రోడ్డుమీదనే గుంటలు పడి నీళ్లతో నిండు కుంటవి. రోడ్డు మధ్యనున్నచెట్లు సుఖప్ర దంగా నీడ ఇచ్చినప్పటికీ ఇప్పుడుమాత్రము వాన వెలిసినతర్వాతకూడా చిటపట చినుకులు రాలుస్తూవీధులలో సంచరించేవాళ్లకు చికాకు కలిగిస్తూ ఉన్నవి.

బెజవాడలో సహాయ నిరాకరణోద్య మము ప్రజ్వరిల్లుతున్నది. గాంధిమహాత్ముడు దేశీయనాయకులతోవచ్చివెళ్లి ఎంతోకాలము కాలేదు. పెద్దలూ, పిన్నలూ, బాలురూ, బాలికలూ రకరకాల ఖాదీబట్టలు కట్టుకొని వూళ్లో అన్నిమూలలా కన్నులపండువుగా కన బడుతున్నారు.

సోమసుందరము పెద్దవాళ్ల భయం చేతనో, చదువుమీదనున్న ఆసక్తిచేతనో పాఠశాలా బహిష్కారముమాత్రము చేయ లేదుకాని ఖాదీబట్టలే కట్టుకునేవాడు. ఒక నాడతను కొత్తబట్టలు కుప్పడము అంచువి కట్టుకొని అనేకమైనరంగులు గలిగి పేముతో చేయబడ్డ చక్కని స్వదేశపుగొడుగు వేసు కొని విలాసంగా తిప్పుకుంటూ లక్ష్మీకాంత

మింటికి వచ్చినాడు. కాని లక్ష్మీకాంత మింట్లో లేనందున స్నేహితులతో కొంతసేపు కాలక్షేపము చేయకుండా ఊరికే ఇంటికి తిరిగి వెళ్లడానికి మనస్సు ఒప్పక నెమ్మదిగా వెళ్లి పోతున్నాడు. కాస్తదూరము సాగిపోగానే మాధవరావు ఎదురయినాడు. అతను సోమసుందరాన్ని చూడగానే, 'ఒరే! పాముకోళ్లు తక్కువేకాని కాశీకి వెళ్లుచున్నస్నాతకపు పెళ్లికొడుకులాగా ఉన్నావురా!" అని ఎకసక్కెమాడినాడు. పుష్పకోమలుడైన సోమసుందరుడు సిగ్గుపడి నవ్వగా అతనిమనోహరనేత్రములలో సౌందర్యము వెల్లి విరిసింది.

సోమసుందరుడు వీథివెంట నడుస్తున్నప్పుడు అతని లేడికళ్లు ఎక్కడా నిలవక ఊరికే సంచరిస్తూ ఉంటవి. అప్పుడతనిని చూచే వాళ్లకు ముచ్చటగా ఉంటుంది. 'మన సోముడికళ్లు మనఇంట్లో అందరి వాటికంటె అందంగా ఉంటాయి," అని అతని అక్కచెల్లెళ్లు అంతా అనేవాళ్లు. పూపవయస్కుడైన అతని కామాటలు ఎంతో ఆహ్లాదము కలిగించేవి. శుష్కప్రియాలు పల్కే భట్రాజుల స్తోత్రాలకే లోకానుభవము కలవాళ్లు కూడా ఉబ్బితబ్బిబ్బులవుతున్నప్పుడు హృదయపూర్వకంగా వాళ్లు ఆమాటలు అన్నప్పుడు సోమసుందరము పొంగడములో ఆశ్చర్యమేమున్నది? అతని కన్నులే కాక రూపము కూడా మనోహరమైనది. పచ్చని బంగారము వంటి ఛాయ. కొంచెము ఈడుకు మించిన పొడగరియై మనోజ్ఞమైనలతవలె సుకుమారముగా ఉంటాడు. ఈవోజున మరీ ఆవిచిత్రమైన గొడుగూ చక్కని అంచుల కొత్తఖాదీ బట్టలూ కట్టుకొని వెళ్లుతుంటే జగన్మోహనంగా ఉన్నాడు. కాబట్టి మాధవరావు అన్న మాటలలో వింత ఏ మున్నది!

తర్వాత కృష్ణాతీరాన చల్లగాలికి తిరుగుదామని వాళ్లిద్దరూ బయలుదేరి పోతున్నారు.

వాళ్లు నాలుగడుగులు సాగిపోగానే, చక్కని మబ్బురంగుచీరె కట్టుకుని కళ్లనిండా కాటుక తీర్చి, ఎఱ్ఱ కలవలవంటి పాదాల మీద పసుపు ముద్దు గొలుపుతూ ఉండగా ఒయ్యారముగా అడుగులు వేసుకుంటూ వస్తున్నకమల ఎదురైంది. పేరంటము చేసే ఆడపిల్లలను చూడడము ప్రతివాళ్లకూ నిర్వ్యాజమైనఆనందము కలిగిస్తుంది. సోమసుందరానికి పుట్టుకతోనే సౌందర్య తృష్ణ ఉన్నది. ఆకమల ముగ్ధమనోహరరూపము చూడగానే అతనిలో అప్పుడు నిర్వికారమైన ప్రేమభావముద్భవించి ఉల్లాసముకలిగించింది. వాళ్లు రావడము చూచి కమల పక్కగాతొలిగి పోతున్నది. సోమసుందర మాపిల్లవంక చూచి మాధవరావుతో, "ఈ అమ్మాయి స్వదేశి వస్త్రాలు వేసుకుంటే ఇంకా ఎంతబాగుంటుంది!" అని కమలకు వినబడేటట్లుగా పలికి ముసిముసి నవ్వులు నవ్వినాడు. కమలకు అప్పుడే సిగ్గు కాస్త తెలుస్తున్నది. ఆమాటలామె వినగానే సిగ్గుతో తలవంచుకుని కొంత దూరము నడిచి సోమసుందరమువంక ఓరచూపొకటి విసిరింది. సోమసుందర మది చూచినాడు.



"......కమలయెదురైంది.........పక్కగా తొలగి......సోమసుందరును వంక ఓరచూపొకటి విసరింది"

పొంగిపొరలుతున్న కృష్ణవేణిమీదుగా మలయమారుతమువచ్చి వాళ్ల దేహములను చుంబనముచేసినది. దగ్గరనున్న వేపచెట్టునుంచి పళ్లు జలజల రాలినవి. ప్రపంచమంతా సోమసుందరునికంటికి నూతనశోభతో కాన వచ్చింది. పక్కనున్న కాలవమీదనుంచి పల్లెవాని ప్రేమపాట వాళ్లకు కర్ణపర్వమైనది. అప్రయత్నంగా సోమసుందరుని పెదవులవెంట పున్నాగరాగము వెలువడినది. మందవాయువుతో శ్రుతి కలిసి అతనిరాగము అవ్యక్త మాధురి ఒలికింది. ఎగతాళి చేయ బోతున్న మాధవరావు కూడా ముగ్ధుడై పోయినాడు.

3

సోమసుందరమూ సుబ్రహ్మణ్యమూ ప్రతి రోజూ మాధవరావు ఇంట్లోగాని ఆ సమీపం లోగాని కలుస్తూ న్నందువల్ల ఉభయులకూ చిన్ననాటి పరిచయము వృద్ధి పొందుతున్నది. ప్రతిరోజూ సాయంకాలము ఇద్దరూ కలిసి ఇటు అటు షికార్లు చేస్తూ ఉండేవాళ్లు. కమల కనపడ్డప్పుడల్లా సుబ్రహ్మణ్యము వికారచేష్టలు చెయ్యడమూ సోమసుందరు డసహ్యాంచుకోవడమూ జరుగుతూవచ్చాయి. సాయంసమయమందు చక్కని దుస్తులు ధరించి వాళ్లిద్దరూ ఒకరితోఒకరు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అయ్యరు గారింటివేపు చూపులు మరలించి చూస్తూ ఉండేవాళ్లు. కమలమ్మ మనస్సును వీళ్లు ఆకర్షించినారని చెప్పలేము కాని ఏ ళ్లాదారిన వెళ్లినప్పుడల్లా ఆమె ముస్తాబై నిత్యము కంట బడేది. దూరదృష్టి సూక్ష్మాలోచనా లేని సుబ్రహ్మణ్యము తన అందం చందం చూచి కమల భ్రమించుకూ ఉందని తలంచి మురుస్తూ ఉండేవాడు. సోమసుందరునిహృదయంలో ఈగోడే లేదు. చక్కనివస్త్రవులనూ చక్కని మనుష్యులనూ చూడడమతనికి సరదా. కాబట్టి సౌందర్యరాశి ఐన కమల అతన్ని ఆకర్షించింది,

అది మంగళవారము సాయంకాలము. సోమసుందరము బడినుంచి వచ్చి పుస్తకాలు ఇంట్లో పడేసి కమలాదర్శనముకై వెళ్లినాడు. ఆమెను ఒక్కరోజు చూడకపోతే అతనికి తోచేదికాదు. సూర్యాస్తమయము అప్పుడే కాబోతున్నది. కమలమ్మ వాకిట్లో గుమ్మముదగ్గర చాపవేసుకొని పీఠపై పుస్తకాలు పెట్టుకొని పడుకొని ఉన్నది. సోమసుందరు డాదారిన వెళ్లుతూ "సుబ్రహ్మణ్యము!" అని కేకవేస్తూ కమల వంక తిరిగి చూస్తూ ఉన్నాడు. కమల అతనికంఠస్వరము విని కాబోలు, లేవకుండానే తలఎత్తి సోమసుందరము వంక చూచింది. అతనుకూడా ఆమెవంక చూచినాడు. ఇద్దరిచూపులూ కలిసినవి. సోమసుందరు డుల్లాసపూరితుడైనాడు. చీకట్లు ప్రపంచమున అల్లుకోసాగినవి. ఆహారార్థము పోయిన పక్షులు తమ కాంతలను కలుసుకొనవలెననే వ్యగ్రభావంతో గూళ్లకు చేరుకుంటున్నవి. సోమసుందరుడు ఇంటికి మరలిపోయినాడు.

ఇది జరిగిన కొన్ని రోజులకే ఒకనాడు సోమసుందరము చేత పుస్తకాలు పట్టుకుని బడికి వెళ్లుతూ తలవనితలంపుగా సుబ్రహ్మణ్యమును కలుసుకున్నాడు. వీళ్లిద్దరూ సాగిపోతూ ఉండగా దూరమునుండి ఎదురుగా వస్తూఉన్న కమలమ్మ కనబడ్డది. శాలువ అంచు ఖాదీచీరె కట్టుకుని నవ్వుముఖంతో చేతిలో కరేపాకు విలాసంగా ఇటుఅటు తిప్పుతూ మనోహరంగా వస్తున్నది. వర్షము కురిసి ఉండడమువల్ల రోడ్డంతా ఎండీ ఎండని బురదతో నిండి ఉన్నది. పాము మెలికెలు తిరిగి ఉన్న ఆ సన్నని కాలిదారిగుండా ఆమె జాగ్రత్తగా వస్తూఉంటే నాగకన్యకలు సోమసుందరానికి జ్ఞప్తికి వచ్చినారు. కవితాత్మ కలవాడగుటచేత అతను ఆమెలావణ్యమును సుబ్రహ్మణ్యం వంక తిరిగి వర్ణింపసాగినాడు.



"...సుబ్రహ్మణ్యము:—కమలమ్మను హఠాత్తుగా చేయిపట్టుకున్నాడు. కమల ముఖము చిట్లించుకొని ధుమధుమలాడుతూ......చేయివిదిలించుకొన జూచుచున్నది."

మొదట సుబ్రహ్మణ్యము పరవశుడైనాడు. "కమలమ్మను చేయిపట్టుకుని పలకరించేదా?" అని సోమసుందరాన్ని అడిగినాడు. సోమసుందరము భయముతో "వద్దు, స్త్రీ సౌశీల్యము కాపాడవలసినది" అని కఠినంగా చెప్పినాడు.

ఒక్క నిముష కాలములో కమల వాళ్ల సమీపానికి వస్తుంది. నిముషము గడిచినది. సోమసుందరము కాలిబాటనుంచి పక్కకు బురదలోకి దిగినాడు. సుబ్రహ్మణ్యము కదలలేదు. ఉద్రేకముతో అతనిదేహము కంపిస్తున్నది; ముఖ మెఱ్ఱబారినది; చెమటలు పోస్తున్నవి; ఉత్తరీయము జారుతున్నది. సుబ్రహ్మణ్యము మూర్ఖత్వమూ అతని ఆకారము చూచి కొంచెము భయముతో కాలిబాట నుండి అవతలికి తొలగ నుద్దేశించుతున్న కమలమ్మ నతడు హఠాత్తుగా చేయిపట్టుకున్నాడు. పక్కన ఉండి చూస్తున్న సోమసుందరము నిర్ఘాంతపోయినాడు. అతనికన్నులు చీకట్లు కమ్మినవి. ఇంతలో కమల ముఖముచిట్లించుకొని ధుమధుమలాడుతూ కాలభుజంగివలె చేయి విదిలించుకొని ముందుకు సాగిపోయింది. సుబ్రహ్మణ్యము నిశ్చేష్టుడైనాడు.

కమల కొంతదూరము నడిచిపోయి సోమసుందరమువంక తిరిగి జాలిగొలుపుతున్న చూపులు ప్రసరింపచేసింది. ఆచూపులతనిహృదయంలో ములుకులువలె నాటినవి. అతనికి కర్తవ్యతాజ్ఞానము వచ్చేలోగా సుబ్రహ్మణ్యము తలవంచుకొని నెమ్మదిగా జారిపోయినాడు సోమసుందరము కొన్నిక్షణములపాటు అచేతనుడై నిశ్చలుడై నిలిచి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని అతని కళ్లయెదుటనే జరిగినఆ భయంకరవిషయమును గూర్చి 'ఏమివిరసము! ఎంతసాహసము! అని ఆలోచిస్తూ నెమ్మదిగా బడికి వెళ్లిపోయినాడు.

౪

ఇప్పుడు సోమసుందరుని మనస్సునందు తరంగములవలె తలంపులు పొరలి వస్తున్నవి. ఉదయమున కమలమ్మను సుబ్రహ్మణ్యము అవమానము చేయడము, అప్పుడు తన్ను కమల కరుణరసము ఒలుకుతున్న నేత్రాబ్జములతో చూడడము పదేపదే జ్ఞాపకము వచ్చి అతని మనస్సును కలతపెట్టసాగినవి. స్కూలులో ఉన్నంతసేపు పిచ్చివానివలె ఉన్నాడు.

సాయంకాలము మామూలు ప్రకారముతడు లక్ష్మీకాంతము గదికి వచ్చినాడు. లక్ష్మీకాంతమూ మాధవరావూ మాట్లాడుకుంటున్నారు. వచ్చిన సోమసుందరాన్ని చూడగానే లక్ష్మీకాంతము "ఒరేయి!, నీవు రోజురోజు కిట్లా అయిపోతున్నావేమిరా?" అన్నాడు. మాధవరావు లక్ష్మీకాంతాన్ని చూచి వికటంగా కన్ను గీటినాడు. సోమసుందరము మనస్సు అక్కడ లేదు. అందుచేత వారి పరిహాసపుమాటలు అతను వినిపించుకోలేదు. ఏమీ బదులు మాట్లాడకుండా కాస్తసేపు అక్కడ ఉండి సోమసుందరము లేచి వెళ్లుతున్నాడు. వెనకనుంచి లక్ష్మీకాంత మాధవరావులు నివ్వెరపోయి అతనివంక రెప్పవాల్చక వికటపుచూపులతో చూస్తున్నారు.

సోమసుందరుని హృదయమంతా కమలతో నిండి ఉన్నది. అతను ఇప్పు డెక్కడికి వెళ్లుతున్నాడో అతనికే తెలియదు. లక్ష్మీ కాంతం దగ్గరకు వచ్చేటప్పుడుగాని మళ్లీ తిరిగి వెళ్లేటప్పుడుగాని నిత్యమూ కనపడే కమల మనోహర రూపము నే డతనికి కనబడ లేదు. సుబ్రహ్మణ్యం చేసిన సాహసకార్యానికి ఆమె ఎంత సిగ్గు పడుతున్నదో! అతని పక్కనే ఉండి అది నివారించలేకపోయినందుకు తన మీదకూడా కమలకు అసహ్యము కలిగిందేమో! ఈవిధంగా మనోవేదనపడుతూ కాళ్లు నడిపించుకొనిపోయిన చోటికి వెళ్లిపోయినాడు.

రాత్రి ఎనిమిదిగంట లయినది. పండు వెన్నెల కాస్తున్నది. భోజనమయినతర్వాత వాకిట్లో అరుగుమీద కూర్చున్న సోమసుందరుని మనస్సు తపిస్తున్నది. కమల తనను క్షమించినట్లు తెలుసుకోనిది అతని ఆవేదన శాంతించదు. చివాలున లేచి మాధవరావింటి వేపు వెళ్లినాడు.

ఆ వేపుగా ఎవరో పెళ్లివారు ఊరేగుతున్నారు. గుంటూరునుంచి రామదాసు మేళము వచ్చింది. సన్నాయిమీద గాళ్లు కరిగేట్లు నాగస్వరము వాయిస్తున్నారు. వేరేమీ ఆలోచించకుండా, పెండ్లికొడుకునూ పెండ్లికూతురునూ చూడకుండా, సోమసుందరము మేళమువద్దకు పోయి నిలుచున్నాడు. గానము మధురంగా ఉన్నది. రాగం వింటూన్న కొద్దీ సుందరముహృదయము అనేక మార్పులు చెందుతూ ఉన్నది. అతని ఆత్మ కొంత శాంతించింది.

సంగీతమాగిపోయింది; ఊరేగింపు సాగిపోతున్నది. అన్నిరకాలవాయిద్యములూ అతని శ్రవణములలో కర్ణకఠోరంగా ప్రవేశిస్తున్నవి. అక్కడనే నిలబడి అయ్యరుగారి ఇంటి వైపు చూచినాడు.

వాకిట్లో కమలమ్మ నిలుచున్నది. ఆమె తనవైపు చాలాసేపటినుంచి తదేకధ్యానంతో చూస్తున్నట్లు గ్లాసు లైట్ల వెల్తుర్లో అతనికి స్పష్టంగా కనపడ్డది. వాళ్ల ఇద్దరిచూపులు కలిసి సిగ్గుతో ఒండొంటితో పెనుగులాడినవి. ఆమె అప్పుడు తెల్లని వలిపెపుచీరె కట్టుకొని గ్లాసు లైట్ల కాంతితో మరింత ప్రకాశమానముగా ఉండి పండువెన్నెలశోభను తిరస్కరిస్తూ నిలుచుని ఉన్నప్పుడు సాక్షాత్తు మోహినీవిగ్రహం లాగా సోమసుందరానికి కనబడ్డది. ఇప్పటి కెన్నోసారులు ఆమె అతన్ని చూచి ఉన్నది; అత నెన్నోసారులు ఆమెను చూచి ఉన్నాడు. కాని ఈరోజునమాత్రము ఎందువల్లనో ఆమెచూపు అతన్ని కలచివేసింది. మునుపెప్పుడూ తనలో కలగనిభావాలు అతని హృదయంలో అప్పుడు మెరుపు మెరిసినట్లు ఉద్భవించి అతనికి అర్థము గాకుండా బాధ పెట్టినవి.

మార్పు చెందిన హృదయముతో సోమసుందరము మాటిమాటికి కమలమ్మ ఇంటి వైపుకు తిరిగి తిరిగి చూస్తూ నెమ్మదిగా ఇంటికి వెళ్లిపోయినాడు. రాత్రి పన్నెండు కూడా దాటింది; ఇంకా వానికి నిద్ర పట్ట లేదు. చాలాసేపు పక్కపై ఇటు అటు అశాంతితో తిరిగి సుబ్రహ్మణ్యము కమలచేయి పట్టు

కొన్నట్లూ కమల తనవైపు ఏదోగా చూచి నట్లూ కలవరిస్తూ ఎట్లెట్లో నిద్రపోయినాడు.

తెల్లవారింది. రాత్రి నిద్రలేని బడలికము తోనూ మనస్సు నింకా వదలి పోని ఆందోళ నముతోనూ సోమసుందరము అరుగుమీద కూర్చుని దంతధావనము చేసుకుంటున్నాడు. ఇంట్లోవాళ్లంతా ఎవరిపనిమీద వాళ్లు న్నారు. గడిచిన రాత్రి జరిగిన సంగతి ఊరికే ఆలోచిస్తూ నోట్లోపెట్టిన వేలు కదపక అట్లే ఉంచుకొని నేలవంక చూస్తున్నాడు. అప్పుడు హఠాత్తుగా వాని అన్నగారు కళ్లెఱ్ఱ చేసు కొని అతని వద్దకు వచ్చి వాసగడ్డము పట్టు కొని మోటుగా ముఖము పైకెత్తినాడు. సోమసుందరము ఉలిక్కిపడ్డాడు "ఒరే వెధవా! ఆ వెధవసహవాసముచేసిచెడిపోతున్నావట్రా!" అని గద్దించి పలుకుతున్న అన్నగారిమాటలు అతనికి వినబడ్డవి. ఈ సందడి విని వాళ్లక్క గారు ఇంట్లోనుంచి పరిగెత్తికొని వచ్చి అన్న మోటుతనము చూచి "పొద్దున్నే లేవగానే చిన్నవాణ్ణి పట్టుకొని అట్లా తిడతావేమిరా?" అన్నది. ఆమాటకు మరింత కోపంతో అన్న తమ్ముణ్ణి పట్టుకొని ఇటు అటు విదిలించి 'వీడా! పాడుసావాసాలవల్ల, చెడిపోతున్నాడు!" అన్నాడు.

"ఏమిచేశాడేమిరా"? అని అక్క అడిగింది.

"ఏమని చెప్పమన్నావు! చెప్పకుంటే సిగ్గు కూడానూ!" అని అన్న ధుమధుమలాడుతూ వెళ్లిపోయినాడు.

అక్కగారి మాటలకు నిర్వేరపోయింది.

ఇప్పటివరకూ సోమసుందరము ఇంట్లో వాళ్లెవరిచేతనూ ఒక్కమాటకూడా పడి ఎరగడు. అతని సత్ప్రవర్తనమూ శాంత స్వభావమూ కోమలబుద్ధి ఇంట్లో అందరికి ఆశ్చర్యం కలిగించేవి. అతను అభిమానవంతు డని తెలిసి ఇంట్లో అంతా బహుఆదరించే వాళ్లు. అందులో పసివాడు!

ఈవిధంగా అన్నగారు అని వ్రంపడానికి కారణము అతని నిష్కళంక హృదయానికి ఏమీ కనపడలేదు. తనను ఎప్పుడూ ప్రేమా తిశయంతో చూచే అకళంకమైన తన అన్న గారు నిష్కారణంగా ఏపాపమూ ఎరుగని తన్ను దూషించిన మాట లతనిహృదయ మును శూలములవలె భేదించినవి. అదికూ డా అక్కగారిముందు తనకు పరాభవము జరగడము మరింత కష్టకారణమైనది.

అతనికి పిచ్చి ఎత్తినట్లయింది. దానికి తోడుగా ఇంట్లోవాళ్లంతా అతనిమెడల ఏదో వింతగా ప్రవర్తించ సాగినారు. అవ మానము కలిగినతర్వాత ప్రథమోద్రేకము కొంత శాంతించిన పిమ్మట అతను అన్నగారి కటువంటి దురభిప్రాయము తనపై కలగడానికి కారణమేమని ఆలోచింప నారంభించినాడు. మనస్సు పరిపరివిధాల పోయింది. తానా మధ్యను చేసినపనులు పలికిన మాటలు మెరు పులు మెరిసినట్లు వెంట వెంట అతని మనో వీధిలో పొడగట్టినవి. కాని అతను ఎంత శోధించుకున్నా సోదరుడు ఆవిధంగా కోపించ డానికి తగిన హేతువు కనుపించలేదు. పోనీ, ఎవరైనా గిట్టనివాళ్లెవరైనా కల్పించి చాడీలు

చెప్పినారా అంటే అతని కటువంటివాళ్లు ఎవరు లేరే! అతన్ని చూచిన ప్రతివానికీ అతనిమీద ఒకవిధమైన ప్రేమ కలిగేది. ఆలోచించిన కొద్దీ అతనిమనస్సునందు కల్లోలము ఎక్కువ కాసాగినది. సుబ్రహ్మణ్యము ఆవెనకటి రోజున వీథిలో పట్టపగలు కమలచేయి పట్టుకొన్నప్పుడు తాను దురదృష్టవశాత్తుగా అతనివెంట నున్నసంగతి జ్ఞప్తికి వచ్చినది. అప్పుడెవరో ఒకరిద్దరు చూచి ఉన్నదికూడా ఘోడగట్టింది. "కాని ఆవిషయములో నేనే పాప మెరగనే! సుబ్రహ్మణ్యమును మొదటనే నివారించవలెనని ప్రయత్నము చేసినాను గదా! తర్వాత చీవాట్లుకూడా పెట్టినానే! ఇక నెన్నటికి ఆ దుర్మార్గునిముఖమునంక చూడనని ఒట్టుపెట్టుకున్నానుగా!" అని ఏమేమో వితర్కించుకున్నాడు. లోకానికి మనస్సు ప్రధానముకాదని పాప మాకుఱ్ఱవానికెట్లా తెలుస్తుంది!

౫

ఆరోజు మధ్యాహ్నము కమల కానరామికి మిక్కిలి చింతిల్లుతూ సుబ్రహ్మణ్యము కాలుగాలినపిల్లివలె ఆమెఇంటిచుట్టూ నడయాడుతున్నాడు. ఇంతలో చేయి కడుక్కుంటూ కమల అతన్నిచూచి లోపలికిపోయింది. వాడు కిటికీవద్దకు వెళ్లి చూరుక్రిందను నిలుచున్నాడు. వెళ్లినాడో లేదో అని కమల తొంగిచూచింది. అది సుబ్రహ్మణ్యము కనిపెట్టి గచ్చకాయంత తెల్లని కాగితపుచుట్టనొకదాన్ని కిటికీలో గుండా లోపల పడవేసి అక్కడనిలవక గృహాభిముఖుడై గబగబనడిచి పోతున్నాడు.

ఆసాయంకాలము సోమసుందరుడు లక్ష్మీకాంతం ఇంటికి వచ్చినాడు. దానిమ్మగింజలవంటి పలువరస కనపడేట్లు కిలకిలనవ్వుతూ రోజూవాకిట్లో కూచునే కమల నేడు కానరాకున్నది. మూర్ఖుడైన సుబ్రహ్మణ్యం ఏదో చేసుంటాడని ఊహించి అతను ఉగ్రుడైనాడు. లక్ష్మీకాంతంవాళ్లు తమదోవన తాము పేకాడుకుంటూ ఉంటే అతను వెళ్లి అరుగుమీద విచారమగ్నుడై కూచున్నాడు. సాయంత్రము ఆరుగంటలయినా కమలజాడ కనపడలేదు. ఇహ చేసేది ఏమీలేక హృదయభారంతో ఇంటికి వెళ్లి పోయినాడు.

ఒకనెలరోజు లిట్లా గడిచినవి. మాధవరావు ఇంటివద్దసుబ్రహ్మణ్యము కనపడటము లేదు. కాని ప్రతిసాయంత్రమూ సోమసుందరు డొక్కడుమాత్రము ఆవీథిన లక్ష్మీకాంత మింటికి పోతూ ప్రతి ఇంటిమీదనూ తన కమలనేత్రములు సారించి అలంకరిస్తున్నాడు. కాని కమలమల్లీ ఒక్కసారికూడా అతని కళ్లబడలేదు. ఆమె బయటికి రానందువల్ల ఆబజారుకంతకూ కళ తగ్గిపోయింది. కారణము తెలుసుకోవలెనని సోమసుందరానికి ఆదుర్దా ఎక్కువగుతున్నది. కాని అతనికేమి తెలియరాలేదు. రోజూ కమలాదర్శనవ్యగ్రుడై ఆశతో అత డావీథిన వెళ్లుతాడు. కాని రోజూ కొండంతనిరాశతో తిరిగివస్తాడు.

దసరాసెలవులు వచ్చాయి. బడి లేదు గనుక అత నిప్పుడు ఇంటిపట్టున ఉండక

బజార్ల వెంబడి తిరుగుతున్నాడు. ఒక నాడు ప్లీడరు గుమాస్తాలంతా కూడే తమలపాకుబీడీల దుకాణమువద్ద పదిమంది పోగయి బిగ్గరగా మాట్లాడుతూ ఉండడము చూచి సుందరము అక్కడికి వెళ్లినాడు. అతన్నిచూచి ఒకడు "మీ బావగారి గుమాస్తా ఎవరిప్పుడూ! సూరయ్యేనా?" అని ప్రశ్నించినాడు. సోమసుందరము దగ్గరకు పోయి "అవును" అని తమలపాకుబీడీ కొంటానికి జేబులు చూచుకుంటూ నిలబడ్డాడు.

గుమాస్తాలంతా కోర్టుసంగతులు మాట్లాడుకుంటున్నారు. "ఏరోయి, మన స్వామినాథయ్యరుగారిని గంజాము బదలాయించినారట. నాలుగురోజుల్లో ఆయనపోయి చార్జి పుచ్చుకోవాలట. బందరునుంచి, ఆయన ఎవరూ! సుబ్బారావుగారు కాబోలు నీకోర్టుకు వస్తారట అని ఒక గుమాస్తా ఇంకొకనితో అంటున్నాడు.

తమలపాకుబీడీ కొని నోట్లోపెట్టుకోబోతున్న సోమసుందర మామాటలు విన్నాడు. ఏమది! అతని ముఖమంతా మారిపోయిందే! అతనికన్నులు అశ్రుపూరితములయినవి. కన్నీటిబొట్టు కారుతున్నదానిని తుడుచుకున్నాడు. పెదవులు విచిత్రముగా వణుకుతున్నవి. నిర్విణ్ణుడై అతడు బయలుదేరిపోయినాడు.

ఆరాత్రి అతనికి అన్నము సయించలేదు. వానితల్లి 'భోజనము సరిగా చేయలేదేమిరా'? అని అడిగింది. వంట్లో బాగాలేదన్నాడతను. తల్లి వళ్లుపట్టుకునిచూచింది. వళ్లు కాల్తున్నది. తీవ్రమయిన జ్వరంతో నిద్రపోయినాడు. పొద్దున త్రిఫలకషాయంతో శీతాంశురసము తల్లి ఇచ్చినది పుచ్చుకున్నాడు. కాని జ్వరము రెండు రోజులు పట్టినపట్టు విడనలేదు. చలి పుట్టుతున్నప్పటికీ బయటికి రావాలని ప్రయత్నించినాడు. కాని ఇంట్లోవాళ్లు పోనీయలేదు. అయ్యరుగారు ఇవాళో రేపో వెళ్లుతారు. సోమసుందరానికి ఆందోళన మరింత ఎక్కువయింది.

మూడవనాటికి సోమసుందరానికి జ్వరము కాస్తజారింది. ఆ సాయంత్రము వాకిట్లో అరుగుమీద వచ్చి కాసేపు కూర్చున్నాడు. అప్పుడు రామమోహనగ్రంథాలయమునుంచి తిరిగి వస్తూ లక్ష్మీకాంతము సోమసుందరుని చూచి 'వంట్లో బాగాలేదూ!' అని అడిగి పక్కనువచ్చి కూర్చున్నాడు. సోమసుందరము ఆరోజంతా లంకణప్రాయంగా ఉన్నందున బాగా మాట్లాడేశక్తి లేక నీరసించి హీనస్వరంతో మాట్లాడుతున్నాడు.

మాటలసందర్భాన లక్ష్మీకాంతము "మీ బావగారు ఈమధ్య ఇళ్లకోసము వెదుకుతున్నట్లున్నారు. నేనున్నగదికి ఎదురింట్లో ఉన్న అయ్యరుగారు ఖాళీచేసి వెళ్లిపోతున్నారు. ఆ ఇల్లు బాగానే ఉంటుం దనుకుంటాను!" అన్నాడు.

అయ్యరుగారిమాట రాగానే సోమసుందరానికి ప్రాణాలు లేచివచ్చినవి. ఇప్పటికే వెళ్లి పోయినాడేమో! కమలను ఒక్కసారి చూచేందుకు కూడా వీలులేక పోయిందే అని ఇన్నాళ్లూ దిగులుపడుతున్నాడు.

'అయ్యరుగారు వెళ్లుతున్నారా? ఎప్పుడు వెళ్లుతారేం?'

'రేపు ప్రొద్దునవాల్తేరు ప్యాసెంజరులో'

'ఏవూరికయినా బదలాయింపుచేసినారా ఏమిటి?' అని ఎరగనివానివలె సుందర మడిగినాడు.

'ఎరగవా ఏమిటే? గంజాము బదలాయించినారుగా!' అన్నాడు లక్ష్మీకాంతం. తర్వాత కొంతసేపు లోకాభిరామాయణము మాట్లాడి అతను వెళ్లిపోయినాడు.

౬

ఆరాత్రి సుందరానికి మళ్లీ జ్వరము వచ్చినది. భళ్లున తెల్లవారేసరికే, జ్వరమింకా పూర్తిగా జారకపోయినా, ఓపిక చేసుకొని లేచి ముఖ ప్రక్షాళనము చేసుకున్నాడు. జ్వరమింకా విడవనందున కూరగాయవైద్యాలతో ఇహ లాభము లేదని ఆపూట డాక్టరు కోసము కబురంపించినారు. డాక్టరు వచ్చి ధర్మామీటరుతో చూచి 102 డిగ్రీల జ్వరమున్నదని ప్రక్కను నిలుచుని ఉన్న సోమసుందరుని తండ్రితో చెప్పి 'సీసా పంపించండి' మందిస్తాను. పిల్లవాణ్ణి గాలిలో తిరగనీయక కప్పుకొని పడుకోపెట్ట వలెను.' అని మరీ మరీ చెప్పి వెళ్లిపోయినాడు.

గడియారము ఎనిమిది కొట్టింది. లక్ష్మీకాంతం చెప్పిన మాటలు సుందరం మరిచిపోలేదు. వాల్తేరుప్యాసెంజరు తొమ్మిదింటికి బయలుదేరుతుంది. ఒక్కొక్క క్షణము గడిచిపోయిన కొద్దీ అతని కావేగము ఎక్కువవుతున్నది. మతిపోయిన వానివలె పక్కమీద కాసేపు పడుకొని కాసేపు లేస్తున్నాడు. "నేను తప్పక స్టేషనుకు వెళ్లి నాకమల నొక్కసారి చూచి తీరాలి" అని నిశ్చయించుకొన్నాడు. కాని తల్లి ఎదటనే కూచుని ఉన్నది. అతని ఆందోళన కనిపెట్టినఆమె ఎంతసేపటికీ అక్కడనుంచి కదలలేదు. ఇక చివరకు సోమసుందరము ఓర్చలేక లేచి నిలబడ్డాడు.'ఎక్కడికి వెళ్లుతున్నావురా!' అని తల్లి అంటూనే ఉన్నది.

'ఇప్పుడే బయటికి పోయి వస్తా'నని మెల్లగా వీథిలోకి జారినాడు. వెంటనే అతను ఆరండల్ సత్రమువద్దకు పోయి బండి ఎక్కి చురుకుగా తోలమని బండివానిని తొందర చేస్తూ స్టేషనుకు బయలుదేరినాడు. రయిలు దాటిపోతుందేమో అని అతను తహతహ పడుతున్నాడు. బండి స్టేషనువద్ద ఆగింది. సోమసుందరము చురుకుగా దిగి ఆతురతతో వంతెనదాటి ప్లాటుఫారంటిక్కెట్టు తీసుకొని వాల్తేరు ప్యాసెంజరు ఆగే ప్లాటుఫారంమీదికి వెళ్లినాడు. రైలు ఇంకా ఉన్నందుకు అతనికి కాస్త మనస్సు కుదట పడ్డది. కాని అప్పటికే రయిలు వచ్చి పదిహేను నిమిషా లయింది.

సోమసుందరము సరాసరి ఆడవాళ్ల పెట్టె వద్దకు పరిగెత్తినాడు. అక్కడ కమల కనపడలేదు. వెర్రెత్తినవానివలె ప్లాటుఫారముమీద ఈ చివరనుంచి ఆ చివరకు పరిగెత్తినాడు. సెకండుక్లాసుబండిలో స్వామినాథయ్యరుగారు కూచున్నాడు. ప్లాటుఫారముమీద గుమస్తాలు చేతులు కట్టుకుని నిలుచుని వినయంగా మాట్లాడు తున్నారు. కాని ఆ పెట్టెలోకూడా కమల లేదు. ఆమె కూచున్న

పెట్టె అతనికి అడావడిలో కనపడలేదు. అతని గుండెలుతటతటకొట్టుకుంటున్నవి. "వెళ్లేముందుకమల నొక్కసారి చూచే భాగ్యము కూడా నాకు లేదా!" అని విచారపడ్డాడు.

రైలు కూత వేసింది. గార్డు సిగ్నలు ఇచ్చాడు. దూరదేశము వెళ్లుతున్న మిత్రుల వద్ద వారి ప్రేమాస్పదులు సెలవు తీసుకుంటున్నారు. బండి సాగింది. సోమసుందరము దేహము కొయ్యవారుతున్నది. సాగిపోతున్న రైలు ఇంతలో ఆగింది. కమల ఉన్న పెట్టె సుందరానికి కనపడ్డది. అతని ప్రాణాలు లేచి వచ్చినవి. వేరేమీ ఆలోచించక అక్కడికి పరుగెత్తి పోయినాడు. 'కమలతో మాట్లాడడము ఎట్లా! పోనీ నావైపు చూడడమైనా లేదే!' అని దిగులుతో ఏమీ తోచక నిశ్చేష్టుడై నిలవబడ్డాడు. మళ్లీ రైలు కదలబోతున్నది. గార్డు జండానుపట్టుకుని నెట్టుకుంటున్న జనాన్ని ఎట్లాగో బండిలోకి ఎక్కించి తలుపు వేసి బుజ్జున బిగిలు ఊదినాడు. సోమసుందరుని ఆశలన్నీ అడుగంటినవి. కమల ముఖము కూడా చిన్నపుచ్చుకొనే ఉన్నది. ఆమె హృదయములో ఇప్పుడేమి భావములు నాట్యమాడుతున్నవో ప్రేమ తెలిసిన వాళ్లకే గాని తెలియదు. సోమసుందరాన్ని ఆమె ఇంకా చూడలేదు. చివరకు సుందరము ధైర్యము చేసి ఓరగా నిలుచుని ఎలుగు బడుతున్న స్వరముతో 'కమలా'! అని పిలిచినాడు. ఆస్వరము బాధ పడుతున్న వాని మూల్గు వలెనన్నది. కాని పిలుపుగా లేదు.

కమల అతని వైపు తిరిగి చూచింది. ఆమెముఖము వెలవెలబారింది. వక్షస్థలము కంపిస్తున్నది. వేడి నిట్టూర్పు విడుస్తూ అమృతము ఒలుకుతున్నదృష్టులతో సోమసుందరాన్ని ముంచివేసింది.



"సుందరము...'కమలా'! అని పిలిచినాడు...కమల అతనివైపు తిరిగిచూచింది. ఆమెముఖము వెలవెలబారింది."

గార్డు జండా చూపించినాడు. రైలుకూత వేసి కదిలింది. ఇక కంటికి కనబడకుండా కమల ఎగిరిపోబోతున్నది. కమలా సోమసుందరులు ముగ్ధులై ఒకరివంక నొకరుచూచుకుంటున్నారు. సోమసుందరుని హృదయం కొట్టుకోనారంభించినది. హృదయమును వేంబు సుత్తు

లుపెట్టి చితుకకొట్టు తున్నట్లు భావించి పరి
తపించినాడు. కమల కన్నులలో నీరు గిరు
క్కున తిరిగింది. నిస్సారముగా నున్న తన
బాహులత నామె బయటికి చాచి సోమసుం
దరునివంకకు ఊపింది! 'మరచిపోవద్దు' అని
కోకిలస్వరము మృదుమధురంగా సోమసుం
దరుని చెవులలో ప్రతిధ్వనించి పులకరింప
చేసింది.

రైలు ప్లాటుఫారం దాటింది. తన కంబు
కంఠము సారించి అతని వైపు చూస్తున్న
కమలముఖబింబము కనబడు తున్నంతసేపూ
సోమసుందరుడు తన్మయుడై ప్లాటుఫారము
మీద నిలుచున్నాడు. గంటకు ముప్పదిమైళ్ల
వేగముతో రైలు అతనివద్దనుంచి కమలమ్మ
ను క్రూరముగా ఎత్తుకుని పోతున్నది. మళ్లీ
వాళ్లు జీవితములో ఎట్లా కలుస్తారు!

సోమసుందరము నిశ్చేష్టుడైనాడు.
చెమటలు దేహమునిండా కారుతున్నవి. హృ
దయభారంతో ఎట్టట్లో నెమ్మదిగా వంతెన
దాటి బండిలో వచ్చి పడ్డాడు. ఇంతవరకూ
తాను జ్వరముతో బాధ పడుతున్న సంగతి
మరచిపోయినాడు. బండిలో ఎక్కగానే అతని
బలహీనత తెలియవచ్చి సొమ్మసిలినట్లు పడు
కున్నాడు.

బండి అరంపలు సత్రమువద్దకు వచ్చి
నిలిచింది. సత్రములో బొప్పాయికాయలను
కోసుకొని వచ్చిన అతని తమ్ముడు ఎదురై 'నా
న్నగారు నీకోసము వెతుక్కుంటున్నారు' అని
చెప్పినాడు. ఆమాటలు విని సోమసుందరము
ఇంటికి పరుగెత్తినాడు. ఎదురుగా తండ్రి వచ్చి
'వెళ్ల వద్దని ఎంత చెప్పినా వినక గాలిలో
షికార్లు చేసివచ్చినావా?' అని కోపపడినాడు.

సోమసుందర మామాటలు వినిపించు
కోకుండా ఇంట్లోకి వెళ్లి పచ్చడము కప్పుకుని
కన్నీరు కాల్వలై పారేటట్లు విలపిస్తున్నాడు.
కొద్ది సేపటిలో కప్పుకున్నపచ్చడమంతా
కన్నీటితో తడిసిపోయింది.





# యెట్టి నా యెంకి

నండూరి వేంకటసుబ్బారావుగారు బి.ఏ.

"యేనక జల్మములోన
యెవరమో" నంటె
సిగ్గొచ్చి నవ్వింది
సిలక-నాయెంకి



'ముందుమన కేజల్మ
ముందోలె" యంటె
తెల్ల తెల బోయింది
పిల్ల-నాయెంకి



"యెన్నాళ్లు మనకోలె
యీసుకము" లంటె;
కంట నీరెట్టింది
జంట-నాయెంకి.

# అస్పృశ్యత

గాడె నరసింగరావుగారు బి. ఎ., ఎల్. టి.

ప్రస్తుతకాలమున మనదేశమందు కొన్ని జాతులవా రంటరానివారని వ్యవహారమున్నది. తన్మూలకమగు నాచారము గూడ దేశమంతటను వ్యాపించినది. ఇట్టి యాచారవ్యవహారములకు యోగ్యమైన వారిని కడజాతివా రని చెప్పుచున్నాము. ఈ జాతులలో వచ్చువారు మాలలు మాదిగలు మొదలగువారు. వీరందరిని చండాలురని కూడ మనము వాడుచున్నాము. ఇట్టివారితో మాట మొదలగు వ్యవహారములందు ధర్మముపేరట జరుగుచున్న వ్యవహారము కడుంగడు శోచనీయముగ నున్నది. మనవారిని ప్రశ్నించినపుడు తమయాచారము ధర్మశాస్త్రసమ్మతమనియే వారు చెప్పుచున్నారు. అందువలన దేశమందంతటను ప్రమాణములుగ మనవారు గ్రహించిన మను యాజ్ఞవల్క్య పరాశర స్మృతులను పరిశీలించి మనవారియాచారమెంతవరకు స్మృతుల ననుసరించి యున్నదో చూచుట మనవిధియై యున్నది. "కలౌ పారాశరాః" అను నార్యోక్తి ననుసరించి పరాశర స్మృతినే ప్రధానముగ గ్రహించి యీవ్యాసమును వ్రాసితిని. కాని మనుస్మృతినుండియు యాజ్ఞవల్క్యస్మృతినుండియు యథోచితముగా ప్రమాణము చూపించెదను.

ఇందు మొట్టమొదటను ధర్మమూలముగ మనుస్మృతియం దున్నయంశ మొకటి గ్రహింపవలసియున్నది. మనుస్మృతి ౧౨ అ. ౧౧౮ వ శ్లోకమున శ్రద్ధావంతుడై చరాచరాత్మకమగు జగత్తంతయు నాత్మస్వరూపముగ గ్రహింపవలయు ననియు, నట్టిబుద్ధిమంతు డెన్నడును నధర్మముగ ప్రవర్తింప డనియును చెప్పబడియున్నది. ధర్మప్రవర్తనకు సర్వసమత్వబుద్ధియే ముఖ్యమని గ్రహింపదగియుండుటచే ద్వేషమూలకములగు నాచారములన్నియు నధర్మములే యని తోచుచున్నది. కాబట్టి ధర్మశాస్త్రములందు దర్శనస్పర్శనసంభాషణము లెట్టివాని విషయమున నైన నిషిద్ధములై యుండనోపు. మనవారి వ్యవహారములో కడజాతివారును చండాలురు నొకటేయని భావించుచున్నారు కాని యీ విషయమును గురించి ధర్మశాస్త్రములు చూచిన కడజాతివారలు చండాలురు కారని స్పష్టమగుచున్నది. పరాశరస్మృతి ౧౦ అధ్యాయము ౫౯ వ శ్లోకము వ్యాఖ్యానమున మాధవాచార్యులవా రిట్లు,

"బ్రాహ్మణ్యాం శూద్రాజ్జాతా చండాలీ
ఆరూఢపతితా జ్జాతా వా
సగోత్రా జ్జాతా వా
తదేత త్త్రివిధం చండాలత్వమ్."

అని చెప్పి యమస్మృతినుండి ప్రమాణ
మును చూపించిరి. దీనివలన చండాలత్వము
మూడువిధములు ౧. బ్రాహ్మణస్త్రీయందు
శూద్రునివలన జనించుటచే కలిగినది. 2. సన్న్యా
సియై తిరిగి గృహస్థు డైనవానికి జనించుటచే
కలిగినది. 3. సగోత్రులైన స్త్రీపురుషులకు
జనించుటచే కలిగినది. పరాశరస్మృతి
4 అధ్యాయము 19 శ్లోకము వ్యాఖ్యా
నమున "ధర్మపరాఙ్ముఖః కర్మచండాలః"
అని మాధవాచార్యులవారు వ్రాసిరి. ఇందు
వలన చండాలురు కర్మచండాలు రనియు
జన్మచండాలురనియు రెండువిధములుగ
గన్పట్టుచున్నది. అందు జన్మచండాలత్వము
పైని జెప్పిన మూడువిధములుగ నుండుటచే
చండాలత్వము నాల్గువిధములైనది. పరాశర
స్మృతి 6 అ. 19-28 శ్లోకములలోను చం
డాలసంభాషణము, సహవాసము, సహ
యానము మొదలగు నకార్యముల కన్నిటి
కిని ప్రాయశ్చిత్తము చెప్పి, 32, 33, 34 శ్లోక
ములలో చండాలాన్నభోజనప్రాయశ్చిత్తమును
గూడ జెప్పియున్నారు. ఇం దొకవిశేషము
విమర్శింపవలెను. పై శ్లోకములయందు చెప్ప
బడిన కార్యములు ప్రాయశ్చిత్తార్హము లని
యుండుటచే నెట్టివి ప్రాయశ్చిత్తయోగ్యము
లని ధర్మశాస్త్రములు చెప్పినవో కొంత
విచారింపవలెను. చేయవలసినకార్యములు
చేయకుండుటయు, చేయగూడనిపనులు చేయు
టయు కారణముగ మనుష్యుడు ప్రాయశ్చిత్త
యోగ్యు డగుచున్నాడని మనుయాజ్ఞవల్క్య
పరాశరులు చెప్పిరి. యాజ్ఞవల్క్యస్మృతి
యందుగాని మనుస్మృతియందుగాని పరాశర
స్మృతియందు చెప్పినటుల చండాలవిషయ
మున ప్రాయశ్చిత్తము చెప్పలేదుగాని యీ
రెండు స్మృతులలో యాజ్ఞవల్క్యస్మృతి
యందు తాను ప్రాయశ్చిత్తము చెప్పనటు
వంటి యకార్యములకన్నిటికి నొక ప్రాయ
శ్చిత్తము చెప్పెను. స్మృతిప్రారంభమున
ధర్మనిర్ణయముచేయుట కధికారము పరిషత్తు
నం దుంచెను. మనుస్మృతిలో చండాలాన్న
భోజనచండాలస్త్రీగమనములకు ప్రాయశ్చి
త్తము చెప్పి యనుక్తములకు ప్రాయశ్చిత్తము
చెప్పనధికారము పరిషత్తునం దుంచెను.
మనుస్మృతిలోను యాజ్ఞవల్క్యస్మృతిలోను
చండాలుడు బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలన
జన్మించినవాడనియు, నట్టివాడు బహిష్కృతు
డనియు చెప్పబడెను. వాడు బహిష్కృతిగతి
ననుసరించి సంఘమున వ్యవహార్యుడు
యుండవలెను. పరాశరప్రాయశ్చిత్తకాండమున
ప్రాయశ్చిత్తములు చెప్పబడినను, ఆచారకాం
డలో నీ కార్యములు నింద్యముల క్రింద వారు
చెప్పినందున మాధవాచార్యులవా రన్యము
లగువాని నాశ్రయించి వ్యాఖ్యానము చేసిరి.
మనుయాజ్ఞవల్క్యస్మృతులలో చండాలదర్శన
స్పర్శనసంభాషణములు నిషేధింపబడలేదు;
కాని, చండాలాన్నభోజన చండాలస్త్రీగమన
ములు మట్టుకు నిషేధింపబడెను. మొదట చెప్ప
బడిన చతుర్విధచండాలురలో కర్మచండాలురు
ప్రాయశ్చిత్తమును చేసికొని సంఘమున సర్వ
వ్యవహారయోగ్యులయిరని చెప్పుటకు ప్రాయ
శ్చిత్తకాండ మంతయును ప్రబలనిదర్శనము.

అయ్యది విపులముగ చర్చించుటయు ప్రస్తుతమున ననావశ్యకము. జన్మచండాలురని చెప్పబడినవారేమయినారో నిశ్చయించి చెప్పుటగూడ నంతయావశ్యకము గాదు. అయినను వారుమట్టుకు సంఘమున కలసిపోయియుండిరని పై యంశములబట్టి నిర్ణయింపవచ్చును. వారుమట్టుకు ప్రస్తుతమున లోకమందు ప్రత్యేకముగ నున్నట్లు గనబడదు. వారే యంత్యజాతులవారని చెప్పు మనవారియూహలు నిరాధారములు. యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యానము వ్రాసిన విజ్ఞానేశ్వరయోగియు పరాశరస్మృతికి వ్యాఖ్యానము వ్రాసిన మాధవాచార్యులవారును గూడ చండాలు రంత్యజాతులవారిలోనివారని యభిప్రాయపడినట్లు గనుపట్టునుగాని మనుస్మృతి 11 అ. 176 శ్లోకమున చండాలురును అంత్యజులును వేఱని స్పష్టమగుచున్నది. ఇదిగాక పరాశరస్మృతి 6 అ. శ్లో.31, 32 లను జూచినను చండాలురును అంత్యజులును వేఱనియే నిశ్చయమగుచున్నది. ఈశ్లోకముల వ్యాఖ్యానమున మాధవాచార్యులవారుగూడ నంత్యజాతులవా రేడు విధములుగ నున్నారని చెప్పినారు. వారెవ్వరనిన "రజకశ్చర్మకారశ్చ నటో జరుడ ఏవచ, కైవర్త మేధ భిల్లాశ్చ సప్తైతే చాంత్యజా స్మృతాః" అని ప్రమాణము నిచ్చినారు. నిఘంటువులందుగూడ నీవిధముగనే కన్పట్టుటచే నంత్యజాతులు ఏడే అని నిశ్చయింపవచ్చును. ఈ అంత్యజాతులవారైన, 1. రజకుడు, 2. చర్మకారుడు, 3. నటుడు అనగా యీటెవాళ్లు, 4. జరుడులు అనగా మేదరివాళ్లు, 5. కైవర్తులు అనగా జాలరివాళ్లు, 6. మేధులు, 7. భిల్లులు అనగా కొండజాతులలోనివారు. ఈ ఏడుగురిలో రజక, నట, జరుడ, కైవర్త, భిల్లులను గూర్చి యెట్టివివాదమును లేదు. కాని చర్మకారులైన వారినిన్ని, చర్మకారులుగాని మరికొందరినిన్ని మన మస్పృశ్యులనుగ జూచుచున్నాము. అంత్యజాతులను గురించి పరాశరస్మృతియందు అస్పృశ్యత చెప్పబడలేదు. కాని వారికుండలలోని నీరును త్రావినచో ప్రాయశ్చిత్తము విధింపబడినది. ఇట్టిది గూడ నితరస్మృతులయందు గానరాదు. ఇందుచే మనయాచార మెంతయంధపరంపరగ నున్నదో యెంతస్మృతివిరుద్ధముగ నున్నదో యెంత ధర్మవిరుద్ధముగ నున్నదో చెప్పనక్కఱలేదు. అందులో నంత్యజులను చాలమందిని విడిచి యొక్క చర్మకార మేధులనుమట్టుకు కిట్టి యాచారము పాల్చేసి మనము చేయుచున్న ధర్మద్రోహమును దేశద్రోహమును వర్ణింపనలవిగాదు. ఈ విషయముననే గాక యింకను ననేకవిషయములలో మనయాచారము లొకదారి మనధర్మశాస్త్రములు మఱియొకదారి. ఇట్టి యవస్థ కేవల మజ్ఞానముచేతను తన్మూలకమగు నభినివేశముచేతను గలిగినది గాని యన్యముగాదు. కాబట్టి వివేకము నవలంబించి ధర్మశాస్త్రములను పరిశీలించి యధర్మములగు నాచారములను దేశమునుండి బాఱదోలి పంకనిమగ్నమై యధోగతికి బోవుచున్న భారతమాత నుద్ధరింప బ్రార్థితులు.

---

# అఱవభాషయొక్క యుత్పత్తి

తేకుమళ్ల రాజగోపాలరావు గారు, బి. ఏ. ఎల్. టి. Ph. D. F, M. U. M. R. A. S. (Lond-)

నా మొదటివ్యాసమునందు అఱవవారిప్రమాణ గ్రంథములనుండి వారిదేశపుసరిహద్దులను వివరించియున్నాను. మొట్టమొదట అఱవము మధుర జిల్లాప్రాంతములందు మాటలాడఁబడెడివనియు, ఆదేశమునకు ఉత్తరమున మరుదయూరును, తూర్పున మరువూరును, దక్షిణమున వైఘానదియు, పడమట కరువూరును, నుండెడివనియు, ప్రామాణికగ్రంథకర్తలగు సేనావరియరును, నచ్చినార్కినియరును పరిశుద్ధమైన తమిళకమునకు ఇవియే సరిహద్దులని తెలిపిరనియు నే నావ్యాసమునందు వ్రాసియుంటిని.

### శెందమిళము

కాంచీపురము ప్రధానపట్టణముగాఁగల చోళ మండలముగాని, ప్రసిద్ధములైన చేర, తొండ మండలములుగాని శెందమిళభూములు కావు. పాండ్యమండలమే పురాతనపుతమిళభూమి. అందుండియే తమిళనాడు నానాఁట విస్తీర్ణత నంది యొకకాలమున ఉత్తరమున తిరుపతివఱకు వ్యాపించెనని అఱవవారు చెప్పుటకుఁ గలకారణములను నేను వెనుకటివ్యాసమునందే ప్రమాణములతోఁగూడ వివరించియున్నాను. ఇది అఱవవారిసనాతనసిద్ధాంతము. తమిళసంగములు మూఁడును ప్రాచీనకాలపు ప్రసిద్ధద్రవిడభూమియగు పాండ్యమండలమునసే ఆమధురానగరమునందే పదివేలయేండ్లు భాషాసేవ యొనర్చెనని వారిపురాతన సిద్ధాంతము. ఈశెందమిళభూమికి సరిహద్దులలో మాటలాడఁబడు భాషలు అన్యభాషలు. అందుండి వచ్చినమాటలు వీనికి అన్యదేశములైనవి. కాఁబట్టి అఱవసిద్ధాంతములప్రకారముగా మరుదయూరు వైఘానదుల మధ్యభాగములో మాత్రమే ప్రాచీనద్రవిడ ముండెను. వీని చుట్టుప్రక్క నుండునవి అన్యభాష లగుటచేతనే అందలిమాటలు అన్యదేశ్యము లయ్యెను.

### శోధనకు నే నవలంబించినమార్గము.

నా మొదటివ్యాసమునందు నిరూపించిన పై సత్యముల నాధారము చేసికొని అఱవభాషయొక్క పూర్వచరిత్రను నేను అన్వేషణముచేయ మొదలుపెట్టితిని. చెంగల్పట్టు, దక్షిణపు ఆర్కాడు, తంజావూరు, తిరుచినాపల్లి మున్నగుజిల్లాలలో ఇప్పుడు ద్రవిడమే మాటలాడఁబడుచున్నను, ఇవి శెందమిళభూములు కావన్న ప్రాచీనమహావాక్యముల ననుసరించి, మధుర మండలములోని శెందమిళభూమినే తొలుదొలుత అఱవము మాటలాడఁబడుచుండెనను సిద్ధాంతముపై నేను నమ్మక ముంచితిని. ఈ శెందమిళభూమికి చుట్టుప్రక్కల నుండు నాడులలోనిమాటలు వీరికి అన్యదేశము లగుటచే శెందమిళభూమిలోనే ఆకాలమున పరిశుద్ధమైన యఱవము ఉండెననియు, తక్కినచోట్ల వేఱుభాషలు మాటలాడఁబడుచుండె ననియు నే నూహించితిని. పరిశుద్ధమైన ప్రాచీనపుటఱవము ఎచ్చట నుండునో నిశ్చయముగా తెలిసినందున, అందుండి తిసైచ్చొల్ అనఁబడు అన్యదేశ్యములను తొలఁగించినయెడల మిగులునది. ప్రాచీనకాలపు శుద్ధద్రావిడ మగునని నిర్ణయించితిని. ఇట్లు ప్రాచీనకాలపు భాషయొక్క స్థలమును అందలి పదములును తెలిసికొనుటకు అవకాశ మేర్పడెను.

శెందమిళమే ప్రాచీనపుటఱవమా? దాని కింకను పూర్వస్థితి యొక్కటికలదా? యని నాకుసందేహము కలిగెను. పెక్కండ్రు అఱవవారిని నే నడిగితిని. కాని నేను చూచినంతవఱకును, ప్రసంగించినంతవఱకును, అఱవభాష విషయమున నాకొకచిత్రము కానవచ్చెను. తమభాష అతిప్రాచీనమని చెప్పువారు లక్షలకొలఁదిగా నున్నారు. వారివాఙ్మయము అతిప్రాచీనమైనదని వ్యాసములు వ్రాయువారు ఎందఱెందఱో కలరు. కాని ప్రాచీనమనుటకు ఒక్కయాధారముకూడ నీపదుమైదునక్షరముల

లోను ఒక్కనాఁడైన నేను చూచి యెఱుఁగను. ఎంతె లెంతలు చదివినవారును ప్రాచీనమని ముందు సంకల్పించు కొని ప్రస్తాపన కారంభింతురు. ఎట్లు ప్రాచీనమన్న సంశలు నంగీకరించినవిషయమే యందురు. ఆధారము లను జూపుమని గట్టిగా నడిగిన కోపగింతురు. కొందఱు ఆంధ్రులు సహితము ఈవిషయమున అఱవవారితోనే చేరి దాని ప్రాచీనతను కారణములు తెలుపకయే అంగీ కరింతురు. నే నిట్లు వ్రాయుట అసూయచేత కాదు. అఱవమునకు ప్రాచీనవాఙ్మయ మున్నయెడల మన కేమియు నష్టము లేదు. వేదములు ప్రపంచములోని గ్రంథ ములలో మొట్టమొదటివైనయెడల ఆంధ్రమునకు లోపము వచ్చెనా? కాని పరిశోధనలు చేయునప్పుడు తగిన ఋజువులనుగూడ పాటించుట మనధర్మము. క్రీస్తుపుట్టు టకు మునుపు వేయేండ్లక్రిందట వ్రాయఁబడిన గ్రంథ ములు గూడ అఱవములో నిప్పటికిని నున్నవని చెప్పి వానిని నమ్మి వానిమీఁదనే భాషాసంబంధమైన పరి శోధనలకు నన్నాధారపడియుండు మన్నప్పుడు, అట్టి సిద్ధాంతములను నే నంగీకరింపఁజాలను. ఇట్టి సందిగ్ధము లైన సందర్భములవలన శెన్తమిళముయొక్క పూర్వస్థితి నెఱుఁగుటకు నాకుఁ జాల కాలవ్యవధి పట్టెను. తుట్ట తుదకు ద్రవిడవ్యాకరణములే నా కాధారము లయ్యెను. పండితులును వ్యాకరణవిషయమని చెప్పినప్పుడు నాకు తోడుపడిరి.

శెన్తమిళము రెండు తెఱఁగులు కలది. అం దొకటి అప్పటికాలపుజనుల కెల్లఱకు అర్థమగునది. లోకవ్యవహారములం దప్పుడు వాడుకలో నుండు పద సముదాయమునే కలది. రెండవది పండితభాష. ఈ పండితభాష ప్రజలకర్థముకాదు. అందు ఒక్కపదమునకు పెక్కులర్థము లుండును. ఒక్కయభిప్రాయమును వెల్ల డించుటకు పెక్కుపదములు పనికివచ్చును. ఇందు పం డితభాష గ్రాంథికము. అనఁగా ప్రయోగశరణ్యమై ఆ కాలపుపుస్తకములలో వ్రాయ నునువైనది. ఇందు లోకుల కెల్లఱకుఁ దెలియు శెన్తమిళమునకు ఇయర్ చ్చొల్ అని పేరు. ఇతరులకు అర్థము కాకుండునట్లు పండి తులు తమలో తాము మాటలాడుకొనుభాషకు తిరు చ్చొల్ (=పవిత్రమైన మాటలు) అని పేరు.

ఈ విభాగమువలనఁ దోఁచు నర్థ మేమి యని నేను యోచించితిని. కొన్నిమాటలు పండితులకే కాని, అర్థము కావఁట. కాని యవి శుద్ధద్రవిడపదములే యఁట. వానికి గ్రంథములయందుఁ బ్రయోగములు కల వఁట! ఇప్పటికిని గ్రంథములందు వాడఁబడుచుండునఁట! కాని జనసామాన్యమునం దవి వాడుకలో లేవఁట! ఇందువలన ఇయర్ చొల్, అను విభాగము నవీనమనియు అంతకు ముందును ద్రవిడము ఉండెననియు, ఇయర్ చొల్ కంటెను ప్రాచీన మైన శెన్తమిళవిభాగము పవిత్రమైన తిరుచ్చొల్ కావలె ననియు నే నెంచితిని.

ఇయర్ చొల్ లోనిపదములు జనసామాన్యము నకుఁ జక్కఁగాఁ దెలియుటచే నవి యాకాలపువ్యావ హారికభాషకుఁ జెందినట్లు మనము తెలిసికొనఁగలిగితిమి కదా. ఇవే కొన్ని యుదాహరణములు: మణ్-మన్ను; పొణ్-పొన్ను (బంగారము); మరమ్-(మ్ + ర్ + అ + అ) మ్రాను, నడన్దాన్-(వాఁడు) నడచెను; వందాన్-(వాఁడు) వచ్చెను; అళగు-అలవు (అందము); అవనాల్-వానివలన (వల్ల);

"సెణ్ తమిలాహి తిరియాది యార్క్కుం
తంబొరణ్ విలక్కుం తల్మయ ఇయర్ చొల్."

ఇది ఇయర్ చొల్ కు సూత్రము.

ఇఁక తిరుచొల్లో? ఒక్కమాట చెప్పిన పెక్కు అర్థములిచ్చును. అనేకములైన పదములు ఒక్కటేయర్థ మును గలిగియుండును.

"ఒరుపొరుల్ కురిత్త పలచొల్ ఆకియుం
పలపొరుల్ కురిత్త ఒరుచొల్ ఆకియుం
అరి తునార్ పొరుల్ అన తిరిచొల్ ఆకుం"

అనునది దీనికిసూత్రము. ఉదా. "కిళ్లై" యను నొక్క మాటకు గిన్నె, చిలుక యని నానార్థములు. కాసునకు తప్పు, బంగారము, గంట యని నా. ఏకినాన్ అన్న వెళ్లినాఁ డనియు, స్థలమును విడిచినాఁ డనియు నా. కోల్ అనుమాటకు కోరుట లేక అడుగుట, సందే హించుట యని నా. అల్లే సమృద్ధి యనునొక్కయర్థ మిచ్చుటకు సాల, ఓవు (డు) దావ, నాని, కాళ్రి, కూర్ అని యనేకపదములు. ఇయర్ చొల్ లోని పద ములలో తిరుచొల్ లోనిపదము లుండజాలవనియు ఈ రెండును వేఱనియు దీనివలన విశదమగుచున్నది.

## ఈ విభాగములకు అర్థము.

ఇయర్‌చొల్‌ను వ్యాకరణదష్టముగాని వ్యావహారిక భాషనుగా మనము గణింపవచ్చును. ఇదియే ద్రవిడవైయాకరణులమతము. ఒక్కపదమే పెక్కులర్థములును, ఒక్క యభిప్రాయమునకే అనేకపదములును గల తిరుచొల్ అను పండితభాష శబ్దజాలము విషయమునఁగూడ వ్యావహారిక భాషకంటె భిన్నమైనది. లోకవ్యవహారములందు ఒక్కొక్క యభిప్రాయమునకొక్కొక్క ప్రదేశమున కొక్కొక్క పదము రూఢమై యుండును. భిన్నకాలములను గాని, వేర్వేఱుదేశములను గాని తీసికొన్నప్పుడు ఒక్కపదమునకే అనేకార్థములును, ఒక్క యర్థమునకే అనేకపదములు వచ్చుట సహజము. కాఁబట్టి ఇయర్‌చొల్ అనునది ఒక్కకాలమున ఒక్కదేశమున వ్యవహరింపఁబడుచుండిన శబ్దజాలమని మనము సులభముగాఁ దెలియఁగలము. "తిరుచ్చొల్" అనునది అప్పటి వ్యావహారిక భాషకంటె ప్రాచీనమై, కారణాంతరములచేత వాడుకలో లేనట్టిపదములను దెలుపును. మన తెలుఁగుభాషనుండియే యొక యుదాహరణమును దీసికొందము.

ఆ॥ వె. విన్న జన్నిగట్టుఁ గ్రొన్నెల వెన్నుని
చెన్ను మీఱ నవ్వు డెన్న మున్న
విన్న కలన నెపుడుఁ గన్నులఁ గట్టిన
ట్లున్న దెడము లేక యన్నలార.

క. ముద్దుల పట్టెవి నీ కీ
గద్దటి చందముల మెలఁగఁ గారాదు సుమీ
తద్దయుఁ బెద్దలఁ దలఁపక
ముద్దియ నీ కెంత డెంపమున వెత యున్నన్.

కూచిమంచి తిమ్మకవిసార్వభౌముని నీలాసుందరీ పరిణయములోని పైరెండుపద్యములలో గీఁత లుంపఁబడినమాట లన్నియు నచ్చతెలుఁగు లయ్యు, ఇయర్‌చొల్‌వలె వ్యావహారిక భాషయందుండక ఇప్పటికాలమున కేవలము గ్రంథస్థములై తిరుచొళ్ అనురీతి భాషావిభాగమునందుఁ జేర్పఁబడవలసి యున్నవిగదా.

పరిశీలించి చూచినయెడల తిరుచొల్ అనునది ఇయర్‌చొల్‌నకంటెను ప్రాచీనమైనభాష యని యెల్లరును అంగీకరింపకతప్పదు. అట్లే అంగీకరింపఁబడియును న్నది. మధురమండలములో నాకాలమున మాటలాడఁబడుచుండిన ఇయర్‌చొల్‌ను మనము వదలివేయుదము. అప్పుడు ఇయర్‌చొల్‌కంటెను ప్రాచీనమైన తిరుచొల్ మనకు మిగులును. ఈ తిరుచొల్లే సెన్‌తమిళ్ యొక్క ఆదికాలపుచరిత్రమును మనకుఁ దెలుపవలసి యున్నది. అరవభాషయొక్క యుత్పత్తిని దెలుపు మూలసూత్రము లిందే యిమిడి యున్నవి. ఈసందర్భమున నీయర్థమునే సూచించు నాయింగ్లీషు వ్యాసములోని యీక్రిందివాక్యములను వ్రాసి వానిభావమును విస్తరించుచున్నాను.

"The Vocabulary of IYAR CHOL therefore differs from that of TIRU CHOL of the ancient classical Tamil works and of the Scholars. TIRU CHOL is thus no doubt SEN TAMIL, but it is not the language of the masses. It is a difficult literary language, with its characteristic vocabulary and meanings, representing an earlier type, the ISAI CHOL being the language actually used by the people......................the divisions mark the growth of language..........................
We thus see that the original element in the Tamil language gradually grew by regular additions, and it is this that has grown considerably by various admixtures that became the standard SEN TAMIL. Sen Tamil therefore consists of the original element as well as further additions into it until a stage was reached centuries afterwards when in its standardised form Grammarians began to impose their restrictions on it to keep it from further admixture."

## ఇంతవఱకు తేలినవిషయములు

మధురకు సమీపమున పూర్వకాలమునందు ఒక చిన్నదేశ ముండెను. దానియందు ఒకజాతిజనులు నివసించుచుండెడివారు. వారేదేశమునుండి యచ్చటకు వచ్చిరో వారికి తెలియదు. ఒకకాలమునందు వారు ఒక భాషను మాటలాడుకొనుచుండిరి. ఏకారణముచేతనో వారిభాష దినదినాభివృద్ధి నంద మొదలిడినది. క్రమక్రమముగా నూతనపదము లందుఁ బ్రవేశింపఁ జొచ్చి

వని. క్రొత్తనీరు వచ్చి పాతనీటిని కొట్టివైచినది. ముందు వచ్చినచెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాఁడియైనవి. క్రొత్తమాటలు వాడుకలో హెచ్చినకొలఁదిని ప్రాఁత మాటలు వెనుకఁబట్టినవి. ఈవిధముగా కొన్నిపదములు వాడుకనుండి తొలఁగినవి. కాని విద్వాంసులకు మాత్రము అవి తెలిసియే యుండెను. ఇట్లు మఱల కొంతకాలము కడచెను. నూతనపదములు మఱల హెచ్చెను. వాడుకలో నున్నపదములు మఱల వెనుకఁబట్టెను. ఈవిధముగా పెక్కుతరములు కడచెను. భాష పెరుఁగుచుండెను. మార్పులధికమయ్యెను. ఇట్టిభాష పెరుఁగుటచేత రెండుచొళ్లులు ఏర్పడవలసివచ్చెను. గ్రాంథికభాష ప్రజలకు బోధపడదయ్యెను. ఒక్కమాటకు పెక్కులర్థము లయ్యెను. ఒక్క యర్థమునకు మాటలు పెక్కు లయ్యెను. అప్పటికి తిరుచొల్, ఇయర్చొల్ అను సంప్రదాయము లేర్పడెను. భాష యింకను పెరుఁగుచుండెను. అన్యదేశ్యములను జొరనీకుండ ఆపి అప్పటికి భాషను స్వచ్ఛముగా నుంపవలసిన యవసరము వైయాకరణులకుఁ గలిగెను. అప్పుడు వారు అన్యదేశములనుబట్టి అన్యదేశ్యములను వేఱుపఱిచిరి.

ఇక్కడ ఒక చిన్నవిషయమును మనవిచేయ నించు. ఒక్క యర్థమున పెక్కుపదము లుండుటయు, పెక్కులగు నభిప్రాయముల నొక్కమాటయే వెల్లడింపఁ గలుగుటయు భాషయొక్క దినదినాభివృద్ధిని సూచించునని భాషాశాస్త్రజ్ఞులమతము. నూతనప్రజలమధ్య నివసించుటచేతను, ఇతరభాషలతో నత్యంతసంబంధ ముండుటచేతను, జనుల యభిప్రాయములందును జీవనమునందును మార్పులు కలుగుటచేతను క్రొత్తవేళ్లును క్రొత్త యర్థములును భాషకు లభించును. సమస్తభాషలందును, అట్లే తెలుఁగునందును, ఒక్క యభిప్రాయమునకు పెక్కుపదములును, ఒకమాటకు పెక్కులర్థములును నుండుట కిదియే కారణము. కాఁబట్టి మొట్టమొదట శెక్తతమిళ్ భూమిని చేరిన యఱవవారి కెట్టిచరిత్ర గలదో విశదమయినఁ గాని అఱవభాషయొక్క యుత్పత్తియు, ఆంధ్రాదిభాషల పూర్వచరిత్రమును మనకు విశదముకాదు.

## అఱవము అను పదముయొక్క నిజమైన యర్థము

అఱవమనుపదమునకు అనేకులు అనేకవిధములుగా అర్థము చెప్పిరని నామొదటివ్యాసమునందే వ్రాసియున్నాను. అఱవవారు మాత్రము అఱవమనుపదమును తమ భాషకు పర్యాయపదముగా నెన్నఁడును ఉపయోగించి యెఱుఁగరు. కాని తెలుఁగును కర్ణాటకమును అఱవమునకు సంబంధించినభాషలు. కొందఱు ద్రవిడాంధ్రకేరళకర్ణాటదేశములభాషలన్నియు అప్పసెల్లెండ్రవంటివని తలఁచుచున్నారు. కొందఱు అఱవము ఆదిభాషయనియు, తెలుఁగును నితరభాషలును నందుండి పుట్టెననియు తలఁచుచున్నారు. ఏది యెట్లున్నను, ఈభాషలలోని శబ్దజాలము అనేకవిషయములలో నొక్కటియై యున్నది. తెలుఁగు-తల- అఱవము- తలై; మళయాళము తలై; కన్నడము- తలె. తెలుగు-కన్ను; అఱవము-కణ్; మళయాళము-కణ్; కన్నడము-కణ్ణు. తెలుగు-కై (చేయి); అఱవము-కై; మళయాళము- కై; కన్నడము-కై. ఇట్టి సామాన్యపదముల నెన్నింటినైన మనము చూపవచ్చును. ఒకకాలమునందు ఈ నాలుగుభాషలును ఒక్కటే భాషగా నుండెడివి. ఏకభాష నే మాటలాడు వీరందఱును కాలక్రమమున చీలిపోయి, వేఱువేఱుసమీప దేశములలో బహుకాలము వసించి, నేఁటికి భిన్నభాషల వా రయినట్లున్నను, ఒకప్పుడు వీరందఱును ఏకజాతి వారే. భాషాసంప్రదాయ మెద్ది యయినను, దానితొలి నాఁటిగాథలు నాలుగుభాషలకును సమముగా వర్తింపవలెను గాని విపరీతపరిస్థితుల కాస్పదము కారాదు. అఱవవారిదగ్గఱిచుట్టము లగు తెలుఁగువారు అఱవమును అఱవ మందురు. కర్ణాటకులును ద్రవిడభాషను అఱవ మనియే పిలుతురు. దూరముననున్న మహారాష్ట్రులుగూడ అఱవమును అఱవమనియే యందురు. కాని యఱవవారు మాత్రము దీనిని అఱవమనరు. తోడివారందఱును తమ్ము అఱవలనియు, తమభాషను అఱవ మనియు ఏల పిలువవలెనో వారికిఁ దెలియదు. కాని అనేకశతవర్షములనుండి వారికి సార్థకముగా నుపయోగింపఁబడుచున్న యీపదమును తప్పుపదమని మనము మూలకు త్రోసివేయరాదు. ఈ యఱవమను పదమే ఈనాలుగుజాతుల పూర్వచరిత్రమునకు ఆధారభూతమై యున్నది.

దీనియర్థమును దెలిసికొనుటకు పూర్వము అఱవవారు పాండ్యమండలమునఁ బ్రవేశింపని ప్రాచీన కాలమునకు మనము పోవుదము. దక్షిణదేశములో సహితము అఱవవారు ఇంకను బ్రవేశింపని యాదిమ దివసములకు మన మేగుదము. అప్పటిస్థితిని అఱవ గ్రంథములే మనకుఁ దెలుపుచున్నవి.

అగస్త్యుఁడు అఱవభాషకుఁ బితామహుఁడను సంప్రదాయము నీవఱకే నేను వివరించియుంటిని. అఱవ పుస్తకములలో మిక్కిలి పురాతనమైనవగు తొల్కాపియములోని మొదటిసూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు నచ్చినార్కినియర్ అను ప్రామాణికుఁడైన ప్రాచీనవ్యాఖ్యాత అగస్త్యుఁడు ముందు ద్వారసముద్రమునకుఁ బోయె ననియు, అక్కడనుండి శ్రీకృష్ణునిసంతతివారైన పదునెనిమిదిమందిరాజులను పదునెనిమిది వెళిర్ జాతివారి కుటుంబములను అఱువలారిజాతిజన సంఘమును వెంటఁబెట్టుకొని దక్షిణదేశమునకు వచ్చె ననియు తెలుపుచున్నాఁడు. కాఁబట్టి ఏ సిద్ధాంతము అగస్త్యునకును అఱవమునకును సంబంధముకూర్చుచున్నదో ఆ సిద్ధాంతమే అఱువలారు తెగ ఉత్తరమునుండి అగస్త్యునితోఁగూడ దక్షిణదేశమునకు వచ్చినట్లు ఘోషించుచున్నది. ఈతెగకాక అగస్త్యునితో దక్షిణదేశమునకు వచ్చినవారు 18 మంది యాదవవంశపు రాజపురుషులును, 18 కుటుంబముల వెళీరులును. అఱవముయొక్క పురాణగాథ యీరీతినున్నది. తొల్కాపియములోని మొదటి సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచుప్రామాణికుఁడైన ప్రాచీనవ్యాఖ్యాత,నచ్చినార్ కినియర్ అనునతఁడు అగస్త్యమహర్షి ద్వారకకుఁ బోయెననియు, అందుండి అఱువలారి తెగలను, పైనచెప్పిన పదునెనిమిదివెళీర్ కుటుంబములను, పదునెనమండ్రు రాజపుత్రులను దీసికొనివచ్చె ననియు తెలుపుచున్నాఁడు. దక్షిణహిందూదేశమును బ్రవేశించిన తరువాత ఈవెళీరులు మైసూరురాజ్యమున నివాస మేర్పఱచుకొని అందు 49 తరములు రాజ్యపాలన మొనరించినట్లు పురనానూరువలన మనకుఁ దెలియుచున్నది. ఇదియే పురనానూరు వచనము.

ఉవరాప్పికైత్తువరైయాణ్డు
నార్పత్తొంబదు వళ్ళి ముళైవంద
వెళిరుళ్ వేళై

ఈవెళీరులకథను వ్రాసిన పురనానూరు అను గ్రంథపుకవి క్రీ. శ. ౬00 నాఁటివాఁడట. అప్పటికి 49 తరములు చెల్లినయెడల తరమునకు 20 ఏండ్లు లెక్క వేసినను 780 ఏండ్లుఅగును. కాఁబట్టి ఇట్టి జనశ్రుతి సత్యమేని అఱువలారులు క్రీ. పూ. 280 ప్రాంతములందు మైసూరుప్రాంతములకు వచ్చియుందురు. కాని దృఢముగా కాలము నిర్ణయించుట కీయాధారము చాలదు.

ఏది యెట్లున్నను అగస్త్యునితో వచ్చినవారు అఱువలారని ఎల్లరు నెఱుఁగుదురు.

పాపమీయఱవవారు దక్షిణదేశమును చేరుటకు ముందే ఆప్రదేశము జనాకీర్ణమైయుండెను. ఈ యఱవలారు తెగలు వచ్చి దేశముపైఁ బడినప్పుడందున్న జనులు వీరిని మిత్రభావముతోఁ జూడలేదు. అది మనుష్యులకు సహజగుణమే. గుంపులుగుంపులుగా జనసమూహము వచ్చి మీయడవులలోని పదార్థముల నన్నిఁటిని మీకు లేకుండ తినిపోవుచు మీస్థలముల నాక్రమించి పీఠము వేసికొని కూరుచుండునప్పుడు సహన మెట్లు కలుగును? అంతముం దందున్నవారీయఱవలారిని చండాలురతో సమానముగఁ జూచిరి. వారు సమీపించినచో మైల పడుట లేటస్థించెను. ఇట్టిస్థితి అఱవలారులకు మాత్రమే పట్టలేదు. ఈయఱవలారులపెద్దలకును పితృదేవతలకును గూడ నిట్టిదుర్దశయే వచ్చెను. ప్రాచీనభాషలగు అఱవము, తెలుఁగు, కర్ణాటకము- ఈ మూఁటికినిగూడ నీశాపము తగిలెను. పవిత్రము ప్రాచీనము నని యేగ్రంథమును అఱవవారు మెచ్చుకొందురో ఆతొల్కాపియమే తనభాష అఱవలారులభాషయొక్క నూతనపరిణామమని తెలియక ప్రాచీనకాలపు జనశ్రుతినిఇట్లునుడువుచున్నది.

"వడకర్ అడవాళర్, వాణ్కరునాటర్ సుడిగాడు పేయేరుమై యెన్ఱినై యాఱుం కులుకారటివుడైయర్.
ఇందు వడుగరనఁగా తెలుఁగువారు. ఇప్పటికిని తెలుఁగువారిని వడుగ రనియే వారు చెప్పుదురు. వడుగనఁగా నుత్తరదిశవారి కుత్తరదిక్కునయుండువారని దీనియర్థము. తెలుఁగువారు, ఆఱవయారు, కరునాటరు (కర్ణాటకులు) శ్మశానము, దయ్యము, ఎనుఁబోతు, వీరిని సమీపించినవారు మైలఁబడుదురని దీనిభావము

రాఁబోవు వ్యాసమునందు తరువాతి చరిత్రమును వివరించుచున్నాను.

# మహాత్ముని నిర్బంధవిమోచనము

దామరాజు పుండరీకాక్షుఁడుగారు

"బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనకృపామూర్తి మోహనగాంధిమూర్తి"
కాలవశుఁడైన రామభూపాలుపగిది,
విధివశుండౌ హరిశ్చంద్రవిభునిభంగి,
ధర్మమునఁ గట్టువడియున్నధర్మరాజు
మొదలుగాగల పాండవపుత్రులట్లు,
సత్యమె జయించునను ధర్మసరణి నెఱిఁగి
సాత్త్వికుండైన క్రీస్తు సచ్చరితుమాడ్కి,
కానికాలంబునకుఁ జిక్కి ఘనయశుండు
ధీరుఁడై నీకనులముంచె దివికిఁ జనిన
బాలగంగాధరునిసాటివాఁడ వగుచు,
కర్మవశమునఁ జెఱసాలఁగాంచి మరల
బయట పడినావె భారతభాగ్యమూర్తి
ఘనకృపాసాంద్ర! మోహనగాంధిచంద్ర!
అడవిలో రాకసుల రాముఁ డణఁచినట్లు
జైలులో మృత్యుదేవత సాగనంపి
ధరణి శ్రీరామరాజ్య మేర్పఱచుకొఱకు
సత్య మెద నమ్మి స్వేచ్ఛాప్రసాది వగుచు
బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనకృపాసాంద్ర! మోహనగాంధిచంద్ర!
బంధములఁ జిక్కి నీతపోబలముచేత
దాస్యరణమును లోనుండి తఱిమివేసి
స్వచ్ఛమగు దేహమున నేడు స్వేచ్ఛ గాంచి
బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనయశస్సాంద్ర! మోహనగాంధిచంద్ర!
లంకలోపలఁ జొచ్చి శ్రీరాముప్రతిభ
గొంతవడిఁ దెల్పి కార్యానుకూలుఁడైన
ఆంజనేయుం డనఁగఁ జిత్తరంజనుండు
శాఖ్యవర్గంబుఁ జొచ్చి నీ ప్రతిభఁ జూపి
పలువిధంబుల నీకుఁ దోడ్పడుచునుండ
బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనకృపాసాంద్ర! మోహనగాంధిచంద్ర!
భర్త నెడఁ బాసి ధైర్యంబుఁ బాయకుండ
నెమ్మదిఁ దపం బొనర్చు సీతమ్మవోలె
భారతీయస్వరాజ్యసౌభాగ్యలక్ష్మి
నిన్నుఁ బాసి తపించుచు నున్నకతన
జయజయధ్వానముల పునర్జన్మ మెత్తి
బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనకృపాసాంద్ర! మోహనగాంధిచంద్ర!
రామరాజ్యసౌభాగ్య మేర్పడనికతన
అంధకారంబునం దయోధ్యాపురంబు
మునిఁగి కళకాంతు లుడిగినపోల్కి నేఁడు
నాయకుని నిన్నుఁ బాసి హైందవధరిత్రి
అంధకారమయమయి యల్లాడుచున్న
తరుణమున నీప్రపూర్ణవత్సలతఁ జూపి
బయట పడినావె భారతభాగ్యమూర్తి!
ఘనయశస్సాంద్ర మోహనగాంధిచంద్ర!
రాక్షసాధములైన ఘోరమగుతపముఁ
జేసి వాంఛాఫలంబు నాసించి యుండఁ
బరమయోగీంద్రుఁడవు భద్రపదుఁడ వీవు
కల్మష మనంగ నెఱుఁగని ఘనుఁడ వీవు
కల నయిన మనోవాక్కాయకర్మలందు
హింసయు, నధర్మ మెందు సహింపనట్టి
శాంతమూర్తివి, రెండేండ్లు సాత్త్వికమునఁ
జేసినతపంబు పుష్పవికాస మగుచు
పంట పండదె భారతభాగ్యమునకు
జయము చేకూరదె స్వరాజ్యసాధనమున
ఘనయశస్సాంద్ర! మోహనగాంధిచంద్ర!

# ఆంధ్రులు - తెలుగులు

కేవలీరుడాక్టరు బుర్రా శేషగిరిరావుగారు ఎం. ఏ; పి. హెచ్. డీ.

తెలివాహానది పరిసరములలో ఉన్న ఆంధ్రులవలస లతిప్రాచీనములనియు వాటి జాడలు పురాణములలో గల ఆంధ్రులగాథలతో సమన్వయము పొందుచున్నవనియు ఆయాస్థలములలో పరిశోధనలు చేసినగాని ఆంధ్రులచరిత్ర సరియైనది తేలదనియు "కళింగ మండలి ఆంధ్రుల"ను గూర్చిన ప్రసంగమువల్ల తేలును. ఇట్లు కళింగములోనికి వలసవచ్చిన ఆంధ్రులున్ను క్రీ. శ. ౧౧ శతాబ్దమునుండియు స్థిరముగా ఆంధ్రశబ్దము తమకే చెల్లుననుకొనుచున్న తెలుగులున్ను ఒక్కతెగవారేనా లేక భిన్నజాతులవారా అని యొకప్రశ్న యిదివరకే కలిగియున్నది. కొంతకాలము క్రిందట విజయనగరములో ఆంధ్రులనుగూర్చి ప్రసంగించిన చారిత్రకాచార్యులగు శ్రీమాన్ డాక్టరు. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్లు చారిత్రకప్రసిద్ధిగాంచిన ఆంధ్రులకును తెలుగువారికిని సంబంధము లేదని వ్యాఖ్యానించిరి. అంతకుపూర్వమే విశాఖపట్టణమున కళాశాలాధ్యక్షులుగ నుండిన శ్రీమాన్ పి. టి. శ్రీనివాసఅయ్యంగార్లున్ను "ఇండియన్ ఆంటిక్వారి" పత్రికలో నిట్లే వ్రాసియుండిరి. ఈ ప్రశ్న ఆంధ్రులచరిత్రకుముఖ్యమైనది. క్రీ.శ.౧౦౨౨ ప్రాంతమున తెలుగుదేశములో రాజమహేంద్రవరమున రాజ్యముచేసిన రాజరాజ నరేంద్రునికాలమున తెలుగునకు నియమ మేర్పరచిన "ఆంధ్రశబ్దచింతామణి"లో తెలుగుభాషకు "ఆంధ్ర" మనుపదము పర్యాయముగా వాడబడినది. రాజరాజనరేంద్రుని యాస్థానములో కవిభవబ్రాంకుశు డని పేరుపడ్డనారాయణభట్టు "ఆంధ్రమున" అనగా "తెలుగు"న కూడా కవిత్వముచెప్పసామర్థ్యము గలవాడని ఆతనినిగూర్చి నన్నయ (ఆంధ్ర మహాభారతకర్త) రచించిన శాసనములో కలదు. తరువాత "తిక్కనసోమయాజి" విరాటపర్వము చెప్పుచు "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" అని వచించియుండుటనుబట్టి తిక్కననాటికి ఆంధ్రపదము తెలుగుమాతృభాషగా వాడబడు తెలుగుజిల్లాలపట్లను తెలుగుభాషపట్లను రూఢిపడినట్లు నిశ్చయము. వీరందరికీ పూర్వము వేంగిమండలమున కర్ణాటభాషను వ్యాసభారతమును జైనకావ్యముగా చెప్పినపంపాకవి (క్రీ. శ. ౧౦ శతాబ్దము) ఆంధ్రపదమును తెలుగుదేశముపట్ల రూఢిగా ఆదిపురాణమున వాడినాడు. అనగా నేటికి ౧౦ శతాబ్దములనుండి ఆంధ్ర, తెలుగుపదములు పర్యాయములై దేశవాచకములుగాను జాతివాచకములుగాను భాషానిర్దేశములుగాను ప్రసిద్ధిగాంచినవి. ఇట్టి వాడుక "లా" ప్రకారముకూడా అనాదిసిద్ధమనియు నంగీకరింపక తప్పదు. అయితే

క్రీ. శ. ౧౦-వ శతాబ్దమునకు పూర్వము, అనగా ఆంధ్రశబ్దమును శాసన-చరిత్రా-ప్రసిద్ధముచేసిన శాతవాహనుల కాలమున, క్రీస్తుశకప్రారంభమున నీ ఆంధ్ర, తెలుగుపదముల వ్యవహార మెట్లుండెననిన ఆవిషయమునను కళింగమండలమున తెలివాహా ప్రాంతభూములలో విమర్శనీయము లగుజాడలు కనబడుచున్నవి.

ఈ ప్రాంతములందు ఆంధ్రులవలసలు చూపెడు ఆంధ్రశబ్దపూర్వకములగు గ్రామనామములకు తోడుగా "తెలుగు" శబ్దము పూర్వముగాగల గ్రామనామములును కనబడుచున్నవి. ఇది చిత్రమైనసంగతి. ఆంధ్రులును తెలుగులును మొదట నొక్క-జాతివారే. అయితే ఇట్లు గ్రామనామము లేర్పడవు. కావున్న నీ "తెలుగు" శబ్దము పూర్వముగా గల గ్రామనామములు ఆంధ్రశబ్దపూర్వకము లగువాటికన్న నవీనముగానో, ఆంధ్రశబ్దార్థము మరుగుపడినతరువాతనో పుట్టియుండవలెను. ఈగ్రామనామములు "కళింగ", "సవర" "గదబ", "తక్షర", "బడ్డ", "ముండారి"పదములతోకలసినగ్రామనామముల మధ్యకూడా కనబడుచున్నవి. ఈయంశమును బట్టి ఈ "ఆంధ్ర" "తెలుగు" తెగలు "కళింగే"త్యాదితెగలవలె పరస్పరభిన్నము లగు తెగలేమో అనుసంశయము కలుగుట సహజము.

దృష్టాంతములు విమర్శనీయములు.

1. రామగిరి మాళియా:—కొళింగిబాడి కొళింగి; తెలింగిపల్లి, తెలిగాం; హొంద్రతల, జరడ్రాయుసింగి, ఒంథరిగుడ.

2. బిస్సంకటకంమాళియా:—తెలంగపాదరొ, ఒంధరులిమ్మ

3. గుణుపురం మాళియా:—తెలిగోయి, తెలిగుడ, వెలుగొగొర్జంగి; ఒంస్రుగుడసాత.

4. జయపురం మాళియా:—తెన్గుగుడ, ఒంక్రాముండ.

5. నవరంగపురం మాళియా:—తెలుగాం, ఆంధ్రగుడ.

ఇట్టిగ్రామములు కళింగమందలిమాళియా (ఏజన్సీ)లో కనబడుచున్నవి. దీనినిబట్టియే ఇవి ప్రాచీనములుగాని నవీనములుగావనియు చెప్పవచ్చును. ప్రజలు కొండప్రాంతములనుండి పల్లపుభూములకు వలసవత్తురుగాని పల్లపు ప్రదేశములనుండి కొండలలోనికి సాధారణముగా వలసపోరు. ఏదేశపుచరిత్ర చూచినా ఒకప్పుడు ఫలవంతములై ప్రజావంతములై నాగరకములగుదేశములు పాడుపడి అడవి బలసిపోవుటయు, అప్పటి కడవులుగా నుండినభూములు పల్లపునేలలై వాసయోగ్యములై పట్టణము లగుటయు విశదమగును. నేడు కుగ్రామములై పాడుపడిన తెలివాహా ప్రాంతభూములు తొలుదొల్త నీఆంధ్ర, తెలుగు, కళింగవలస లేర్పడిననాడు వాసయోగ్యములై సర్వవిధములగునాగరకవై భవములతో విరాజిల్లుచుండెననుటయు నీప్రాంతపు గ్రామ నామములవల్లనే రుజువగుచున్నది. అట్టిప్రాంతములను నాగరకములుగా చేయుటలో ఆంధ్ర, తెలుగు, కళింగతెగలు పాల్గొనియుండుటయు వీటివల్లనే స్పష్టము.

ఈ గ్రామనామములలో తుదిభాగము "గుడ" అని ఈయిరుతెగలవారి గ్రామముల పట్లను ప్రసిద్ధము. "గుడ" అన్నది తెలుగు మాట. దీనికి రూపాంతరము "గూడెము". "కూటము", "కూడిక"అనుపదములు దీని వంటివే. ఇది సమూహార్థమున చెల్లుచున్నది. ఆంధ్ర అనుపదముతో లెగుడ" అను తెలుగు మాట కూడి గ్రామనామముగా ఏర్పడుట చూడగా, దీని కీపేరు తెలుగు పెట్టియుండవలెను; లేదా ఆంధ్రమును తెలుగును అప్పటికే ఒక్కభాషగా కలిసిపోయియుండవను. ఇట్లే-"పాదరు";-"వాడ (-ఆడ)"; "-పాడు" అనుపదములును ఈప్రాంతమున గ్రామద్యోతకములుగా వాడబడినవి. ఉ. "కళింగపాదరు"; తక్షరాడ; ఒడ్డెపాడు; ఈపదములును తెలుగు మాటలే. కాగా ఆంధ్రులవలెనే, కళింగులు; తక్షులు (తక్షకవంశస్థులు); ఓఢ్రులును తెలుగులమధ్య కీప్రాంతములకు వలసవచ్చియుందురనవలసి యున్నది. ఎట్లైనను గ్రామనామములలో ఆంధ్ర, తెలుగుపదములు కలిసిపోయినట్లే, ఆంధ్ర, తెలుగుభాష లీప్రాంతమున మొదట మిళితములై పోయియుండును. ఇది ఆంధ్రులును తెలుగులును కలిసి యేకజాతియై పోవుటనుగూడ సూచించును.

గుణుపురం మాళియాలో "ఒంప్రగుడ" తోపాటు "సాత" అను గ్రామము కానవచ్చుచున్నది. కళింగమందలి "శాలిహుండం"లో శాలివాహనరాజుల జాడలు కనబడ్డట్టె ఈ "సాత" గ్రామములో తవ్వించిచూస్తే శాతవాహనులజాడలు కనబడవలెను. గుణుపురంమాళియాలలో శాతవాహనులు రాజ్యముచేసినసంగతి స్థిరపడితే అది అతి ప్రాచీనకాలమందు అనగా శాతవాహనులు ధాన్యకటకము రాజధానిగాచేసికొనుటకు ముందు శాతవాహనులస్థితి చెప్పును. ఆంధ్రులచరిత్రను సమగ్రముగా సప్రమాణముగా సమన్వయించదలచినవారీజాడలు పట్టి కొంతవిమర్శించుట యుక్తము. ఈశాతవాహనులనాటికి కొన్నిశతాబ్దముల క్రిందటనే బౌద్ధజాతకముల ప్రకార మీప్రాంతములలో ప్రఖ్యాతములగు బౌద్ధక్షత్రియులరాజ్యాంగము లేర్పడియుండెను.

ఇట్లు పరస్పరము సన్నికటముగా వలసలేర్పరచుకొని ఏకమతానుసారులుగా నొకప్పుడన్యోన్యసహాయముతోనూ మఱియొకప్పుడు ప్రతిస్పర్థులుగాను పల్లెలలోనే గాక పట్టణములలోను, మతాస్థానములలోను, రణరంగములలోను సాహచర్యము గలిగి ఆంధ్రులును, తెలుగులును, కళింగులును, తక్షులును కాలక్రమమున కలిసిపోయి సంబంధబాంధవ్యములుగలిగి ఏకమతానుసారులై ఏకభాషాపరులై నేటి తెలుగులుగా పరిణమించియుందురనుట సమర్థనీయమగుచున్నది.

శాతవాహనులనాటి కాంధమండలమున బౌద్ధజైనదర్శనములు ప్రబలియుండెను. బౌద్ధమునకు "పాలీ"భాష మూలాధారము. గ్రామపద మీభాషలో "గాం" అని మారును. రామగిరిమాళియాలో "తెలిగాం" గ్రామమున్ను నవరంగపురంమాళియాలో "తెలుగాం" గ్రామమున్ను ఇట్టిబౌద్ధగ్రామములై యుండవనోపును.

అప్పటికే ఆంధ్రులున్న బౌద్ధులుగా నుండినట్లు "ఒంధరిగాం" అనుగ్రామనిర్దేశమువల్ల తేలుచున్నది. ఇట్లు శాతవాహనులనాటికే ఆంధ్రులు తెలుగులై యుందురు. ఈ గ్రామను లిట్టిసాక్ష్య మిచ్చునా? ఇవి వంశనిర్దేశకములా? అన్న ప్రశ్నకు సాజాత్య ప్రామాణ్యమున బదులు చెప్పవచ్చును. ఈభూముల లోనికి క్రీ. శ. ౬ వ శతాబ్దమందు గాంగులు వలసవచ్చిరి. వీరు దక్షిణమునుండి వచ్చిన వారు. తత్పూర్వము గంగాతీరమునుండి కళింగమునకు వలసవచ్చినగాంగులును కలరు. ఈ ఆరవశతాబ్దపు గాంగులు శాసన ప్రసిద్ధి చెందినవారు. వీ రీప్రాంతములలో తమ వంశముపేరను, తమలో ప్రసిద్ధులగురాజుల పేరను, తమయారాధ్య దేవతలపేరను గ్రామములు కట్టిరి. గంగవరం, గంగవలస, గంగాపురం, గంగాపురి అనుగ్రామములున్ను, చుడంగ (చోడగంగ)పల్లి, చోరంగపల్లి అనుగ్రామములున్ను, గంజాంవిశాఖపట్నంజిల్లాలలో పల్లపు జిల్లాలలోను మాళియాలలోను కనబడుచున్నవి.

ఇట్లే అస్కాతాలూకాలో "గోకర్ణమేరి", బరంపురంతాలూకాలో "గోకర్ణపుర", పర్లాఖిమిడి, సోంపేటతాలూకాలలో "గోకర్ణపురం", పాలకొండతాలూకాలో "గోకర్ణపల్లి" అనుగ్రామములును సుప్రసిద్ధములు. గోకర్ణేశ్వరుడు మహేంద్రగిరివాసుడగు గాంగుల ఆరాధ్య దేవత.

చోడగంగ (చుడంగ) వంశపురాజులపేర చోడంగిపల్లి, చుడంగుపురం అని గ్రామము లేర్పడినట్లే సాలంఖ్యాయన వంశముపేరట నీప్రాంతములందు "సాలంకోయి" గ్రామమును "శాతవాహనులపేరిట "సాత" గ్రామమును ఏర్పడినవి.

శాసన ప్రసిద్ధులగుగాంగులు తమవంశము పేరిటను, తమవంశమందలి ప్రసిద్ధులపేరిటను, తమయారాధ్య దేవతలపేరిటను గ్రామము లేర్పరచియుండుట నిశ్చయము కాగా ఆంధ్రులును, కళింగులును, తక్షులును తమ తమ వంశముల పేరిట గ్రామనామము లేర్పరచియుందు రనుట సత్యదూరము కాజాలదు కదా!

ఇక ఆంధ్రము తెలుగెట్లాయెనో నిరూపింపవలసియున్నది. ఇది మరియొక ప్రసంగమున విమర్శించెద మన్నను

# మధుకలశము

(ఉమర్ ఖాయ్యమున కనువాదము)

రాయప్రోలు సుబ్బారావుగారు

జముషెడు శీధు వానుచు యశస్సఖి నేలిన నేలలందు సిం
హములును దుష్టులుం సలుపునందురు రాచఱికమ్ము నేఁడు; 'బై
రము' మృగయావతంసునిశిరం బెట వ్రాలెను యమ్యోర్ధుం యథే
చ్ఛముగను ద్రొక్కగార్దభము, చాన! చలింపఁడు నిద్ర నాతఁడుం. ౧౮

చ. కడు నరుణమ్ముగా నెచట కన్నెగులాబి జ్వలించు నచ్చటం
బడఁదగు మున్ను సీజరునృపాలునిరక్త మటంచు నెంతు, నే
కడఁ బువుఁదోఁటతొయ్యలి సుగంధసుమమ్ములు రాసిపోయు, నా
కడ నొకయప్సరస్సఖినిగారపువీడెము రాలియుండెడిం. ౧౯

చ. కలకలఁబోవు తేటసొన కమ్మనివాతెఱ నంటి, పల్లవాం
గుళి బ్రతిమాలుచున్న యనుగుంబువ్రతీవియ యోర్తు, చూచితే
కలికి! నఖక్షతిం మధువు గ్రక్కనియే చెలిచాయమోవి యీ
చెలియలితీవెకుం మనసుచెల్ల నికోర్కుల నప్పగించెనో. ౨౦

చ. గతదివసప్రపీడనయు గాఢభవిష్యదపోహభీతియుం
హత మొనరింపఁ జాలుమధు వందపుగిన్నియనిండ నింపు, మీ
వితమున 'రేపు రే'పని తపించెద వెందుల? కెన్ని 'రేపు' లీ
క్షితిపయి 'నిన్న'లందు గలిసెం సఖి! యెప్పటి కేది ప్రాప్తమో! ౨౧

చ. నయమతు, లాప్తు, లున్నతమనస్కులు నౌమనమిత్రు లెంప జీ
ప్రియమగుతోఁటలోఁ దమయదృష్టవశమ్మగు ద్రాక్షపండ్లు పిం
డి యొకటిరెండుగిన్నియలు నిండుగఁ ద్రావి, విరామలాలనా
శ్రయు లయిరో సఖీ! యొకరు జాఱఁగ నొక్కరు తోడు గొండుగా. ౨౨

చ. పలుచనికావికోకలసొబం గొలసెం మధుమాసలక్ష్మి, పు
వ్వులపొదరింటిలోన తనివోము రతిం మన మిందు, ముందు రా
గిలినప్రియుల్ తొలంగిరి సఖీ! యిఁకఁ గ్రిందకుఁ బోదు మేము భూ
తలిఁ బవళింప, నన్యులకుఁ దల్పము లౌదుము మేము యావలం. ౨౩



చ. నయమతు, లాప్తు, లున్నతమనస్కులు నా మన మిత్రు లెంద ఱీ
ప్రియమగుతోఁటలోఁ దమ యదృష్టవశమ్మగు ద్రాక్షపండ్లు పిం
డి యొకటిరెండుగిన్నియలు నిండుగఁ ద్రావి, విరామలాలనా
శ్రయు లయిరో సఖీ! యొకరు జాఱుగ నొక్కరు తోడుతోడుగన్.

(ఎడ్మండ్ డూలక్‌గారి చిత్రపటమునుండి పునర్ముద్రితము.)

చ. మనమును మంటిక్రిందఁ బడి మాయఁకపూర్వమె లబ్ధమైనదా
ని ననుభవింపఁ బోలుఁ దరుణీ! యటుపిమ్మట ధూళి ధూళితోఁ
బెనసి యణంగిపోవు పృథివిన్, మధు వెండురు, గాన మాఁగు, గా
యనులును బవ్వళింత్రు, చెవి కందదు పైశ్రుతియున్ సమాప్తమై. ౨౪

ఉ. వేసుక నేఁటిభుక్తికి లభించినదెల్ల వ్యయించుపుణ్యులున్,
పీడితులయ్యు రేపనుభవింపఁగ డాఁచునికృష్టులున్, విసన్
బాడెడుచిత్రగుప్తుఁడు తమాలనికుంజమునుండి, "యేల యీ
యేడుపు మూర్ఖులార! సుఖ మేర్పడ దిందును నందు మీ కిఁకన్." ౨౫

చ. ఇహపరలోకతర్కముల నెంతొ చలంపడి శాస్త్రులున్ గుహూ
ద్వహులును పెక్కు రేగిరి, పదంపడి వారిభవిష్యదర్థసం
గ్రహమును త్రుప్పుపట్టె, సుడిగాలికిఁ బోయెఁ దదీయబోధనా
మహిమయు, దుమ్ముగొట్టికొని మాసెను వారిసమాధులున్ సఖీ! ౨౬

శా. ఆవేదాంతుల శుష్కతర్కముల వ్యాఖ్యానింపఁగా నిమ్ము, నీ
వీవ్యర్థుల్ సుఖపెట్ట రమ్ము సకియా! యేకాంతపున్ సేవ; నే
పూవుల్ విచ్చు సుఖప్రభాతముల నాపూలన్నియున్ రాలు సం
ధ్యావేళన్, నిజ మిద్ది, తక్కినది మిథ్యావాద మింకేటికిన్? ౨౭

ఉ. నేనును బాల్యమందు నతినిష్ఠమెయిన్ గురుపాదసన్నిధిన్
మానుగ నాలకించితిఁ బ్రమాణములైన పరేంగితార్థముల్,
గాని; నిజాన కెప్పుడును గన్నులు విప్పక బైట వచ్చితిన్
పూనిక వీడి, లోపలికిఁ బోయిన వాకిటనే సఖీమణీ! ౨౮

ఉ. వారలతోన నేనును నవంధ్యములై తగు జ్ఞానబీజముల్
కారునఁ జల్లి సొంతముగఁ గష్టముఁ జేసితిఁ బండినట్టియం
బార మిదేసుమీ! సకియ! వచ్చితి నచ్చపునీరుమట్టు లా
కారము లేనిగాలివలెఁ గన్పడ కేగుదు గుర్తు లాఱఁగన్. ౨౯

ఉ. ఏమిషనో యెఱుంగక మహిన్ బడితిన్, ప్రవహించుచుంటి నే
భూముల నింకనో జలముపోల్కి, ననిష్టమొ యిష్టమో సఖీ!
ఈమధువాటికన్ విడిచి యేదెసకో సుడివోదు, చాటిరా
సీమల వంగుగాడ్పులసరిన్ మది నచ్చిన నచ్చకుండినన్. 30

చ. ఇచటికి నన్నుఁ ద్రోయునపు డించుక కోరఁడు నాయభీష్ట, మిం
కెచటికొ యిందునుండి యెడయించెదున ష్డుగంగఁబోవఁ డే
ల చపలతర్క మిట్లు వగలంబడ జ్ఞప్తికిఁ దెచ్చుకొందువో
రుచిగలశీధుపాత్రికను రోయక వాతెఱఁ దార్పుమీ సఖీ! ౩౧

(పాఠాంతరము)

ఉ. ఆది సృజించున ష్డుగఁడాయెను నన్నిటఁ ద్రోతునంచు, నీ
మీఁదట నెందు నే నధగమింతునొ నిశ్చిత మాట తెల్లమో
పైదలి! యీప్రసన్నమధుపాత్రను బల్మిటు నింపియిమ్ము వి
చ్ఛేద మొనర్తు నీవెకిలిచింతలఁ జిత్తముఁ జీల్చకుండఁగన్. ౩౨

చ. ఇల నడిబొడ్డునుండి వడి నేడవవాకిట బైట వచ్చితిన్
జెలఁగి శనైశ్చరుం డధివసించెడుగద్దియ నెక్కితిన్, జగ
మ్ములఁ గికురించినట్టిపెనుముళ్లు సడల్చితి నెన్నొ; కాని చి
క్కెడల దొకింత మృత్యువను నీముడిమెల్కల నెన్ని విప్పినన్. ౩౩

చ. ఒకతలు పుండె దానిగడె లూడ్చెడుబీగము చిక్కలేదు, వే
ఱొకతెఱ యుండె దానికవలున్నది చూడఁగ లేకపోతి, నిం
చుక వినినట్టులయ్యె నట సుంత నరున్ నినుఁ గూర్చి ముచ్చటల్
సకి! యటుమీఁదటన్ మన ప్రశంస రవంతయుఁ జెప్ప రెవ్వరున్. ౩౪

ఉ. అంతఁ దెగించి గోడివడునాకస మేఁ గని యంటి, "ధ్వాంతమం
దెంతయు దారి గానక భ్రమించుప్రజాళికి బాటఁ జూప నే
కాంతులకాగడా గలదు కాలపుహస్తమునం" దటంచు, "వి
భ్రాంతుఁడ! అంధతుల్యమగు భక్తి యెసు"మ్మని మాఱు వాకొనెన్. ౩౫

చ. ప్రణయిని! నే ననంతరము భౌతికభాండము డాసి "ఆత్మజీ
వనసరసీరహస్యములు పాడెదవా" యని వేఁడికొన్న నే
మనియెనొ వింటివా! "బ్రతికినన్నిదినంబులు త్రాగవోయి తీ
యని మధువున్ గళించియును నావల వచ్చుట మిథ్య సుమ్మిలన్." ౩౬

చ. కలఁగి యెలుంగు తోట్రుపడఁగా బదులాడినయాఘట మ్మొక
ప్పుడు సుఖముండి వేడుకలఁ బొంపిరివోవఁగ నోపు నంచు నేఁ
దలఁచెద నెచ్చెలీ! కలలు తగ్గిన యీయధరమ్ము నైత మిం
పొలయఁగ నిచ్చి పుచ్చికొనెనో మును పెన్నిమిటారిముద్దులన్. ౩౭

# శ్రీశైలక్షేత్రము

(గత సంచిక శేషము)

శ్రీశైలక్షేత్ర మాంధ్రదేశక్షేత్రములందు పురాతనక్షేత్రముగ నున్నది. లోగడ సంచికలందు స్థలచరిత్రము భౌతికలక్షణములు పరిస్థితులు మార్గములు మొదలగు విషయములు తెలుపబడినవి. మొదటిసంచికయందు శ్రీశైలదేవాలయపు ప్రాకారాలయ స్థలాదులపటము ముద్రింపబడినది. ఆపటము యొక్క వివరము ఈసంచికయందు గొంతవఱకు వ్రాయబడును. శ్రీశైలక్షేత్రము విశేషముగ నాంధ్రదేశమునందు మతవిజ్ఞానవ్యాపనముతో సంబంధమును గలిగియున్నది. ఆసంబంధము మహర్షుల కాలమునుండియును గలిగియున్న విధమును నిత్యకర్మానుష్ఠానమునందు సంకల్ప సంకీర్తనము తెలుపుచున్నది. శ్రీశైలక్షేత్రము ప్రాచీనమైనక్షేత్ర మైనను క్షేత్రశిల్పమునందు కాలనిర్ణయమును జేయుటకు సాధనములు గనిపింపవు. క్షేత్రమునకు సంప్రాప్తమైన మతవిప్లవమునందు ప్రాచీనశిల్పలక్షణము లేవియును క్షేత్రశిల్పమునందు గనిపింపవు. నాగార్జునసిద్ధుడును నవనాథసిద్ధులును ౨౦౦౦సం. పూర్వ మీపుణ్యక్షేత్రమున దుజీవయాత్రను గడపినటులు ప్రమాణములు తెలుపుచున్నను బౌద్ధయుగమునకు సంబంధించిన శిల్ప మేమియును క్షేత్రమునందు గనిపింపదు. క్షేత్రశిల్పమంతయును విజయనగర సామ్రాజ్యకాలప్రాంతపు శిల్పమునకు సంబంధమును దెలుపుచున్నది. శాసనములును రెడ్డిప్రభువులకును విజయనగరరాజులకును సంబంధించినవియేగలవు. విజయనగరరాజులకాలమునకు శ్రీశైలక్షేత్రము మహావైభవము ననుభవించినను మహారణ్యమధ్యమున గల దేవాలయమంటపాదులందు శిల్పులనైపుణ్యమును ప్రదర్శించుటకవకాశములు విశేషముగ లేకపోయి యుండును. తాడిపత్రి, పెనుకొండ, హంపి మొదలగు స్థలములందుగల శిల్పకళా నైపుణ్య మీక్షేత్రశిల్పమునందు గనిపింపదు.

### శ్రీశైలశిల్పము

శ్రీశైలక్షేత్రమునందలి మంటపములును ఆలయములును శిథిలావస్థయందున్నవి. ప్రాకారమునకు వెలుపల గల మఠములును మంటపములును శిథిలావస్థయందున్నవి. శ్రీశైలదేవాలయముల ప్రాకారమును, గోడల మీదగలచిత్రములును నద్భుతముగ నున్నవి. ప్రాకారము తూర్పుపడమరలు ౬౦౦ అడుగులును ఉత్తరదక్షిణములు ౭౦౦ అడుగులు గల ఎత్తైనగోడలను గలిగి కోటవలె నున్నది. గోడ పెద్దబండలతో నిర్మింపబడి సుందరమైన బొమ్మలను గలిగియున్నది. ఆబొమ్మలు శివలీల, శ్రీశైలగాథలు, పార్వతీపరిణయము, కిరాతార్జునీయము, యుద్ధములు మొదలగు పురాణగాథలను రమ్యముగ బ్రదర్శించుచున్నది. ఆడబొమ్మలు సామాన్యముగ పైభాగము

నందు దిగంబరరూపముతో నున్నవి. ఆంధ్రస్త్రీలు రవికలను దొడుగుట సహజము. అయినను అజంతాయందును శ్రీశైలమునందును నీబొమ్మల నుపరిభాగమునందు దిగంబరముగ నుంచుటకు గారణము తెలియకున్నది. 'ఇయ్యది దేశాచారమును గాక చిత్రకారుల వాడుకను దెలుపుచున్నటు లూహింపదగియున్నది. ఏనుగులు గుఱ్ఱములు పసువులు మొదలగు జంతువ్రలబొమ్మలును రమ్యముగ జెక్కబడినవి. భరతఖండమున కపరిచితమైన జిరాఫిబొమ్మలు సహితము గలవు. ఈబొమ్మలు శిల్పులపరదేశసంస్కారమును దెలుపుచున్న దేమో యనుసంశయము పొడముచున్నది. బొమ్మలన్నియును సహజమై ఖరిని చిత్రింపబడి శిల్పనైపుణ్యమును దెలుపుచున్నవి. ప్రాకారపుగోడలందు చిత్రింపబడిన శిల్పములవివరములు పటములక్రిందను వివరింపబడినవి. ఇతర విగ్రహములకును శిల్పమునకును సంబంధించిన వివరములును బొమ్మలును వైశాఖమాస సంచికయందు విరళముగ వర్ణింపబడును.

మదరాసు దక్షిణఖండపు ఆర్షవిచారణశాఖవారి 1917 సంవత్సరపు కార్యనివేదికమునుండి యీ క్రింది చిత్రములును వాని వివరణమును గైకొనబడినది

చిత్రము 3



ఎ. కుడిప్రక్క చంద్రవతి పీఠముపై గూర్చునియున్నది. వెంబడి రెండు మ్రాకులనుమ పసువులకాపరి యున్నాడు. ఎడమవైపున చంద్రవతియావు శ్రీశైలారణ్యమునందలి శివలింగముపై తనంతట పాలనుగురియుచున్నది. ఈవింతను పసులకాపరి చంద్రవతికి చూపుచున్నాడు. ఇద్దఱును ఆవు వంకకు చూచుచున్నారు. చంద్రవతి చేరువ నామెను గొడుగును బట్టికొనియున్నట్టు లొకప్రతిమ చెక్కబడియున్నది.



బి. ఇందు చెంచు వేషమునుదాల్చిన శివుడును, ఆయన ప్రేయసియగు చెంచెతయును. పులిని వేటాడుచు న్నారు. ఇచట శివునకు నాలుగుచేతు లున్నవి. త్రిశూలముతో నాతడు పులిని పొడుచుచున్నాడు. చెంచెత పులిపై వింటితో నమ్ములనేయుచున్నది. ఆమె యాకులను గట్టియున్నది. నాలుగుకుక్కలు పులిని కఱచుచున్నవి.

చిత్రము ౧౧ బి.



బి. శ్రీశైలదేవాలయముయొక్క వెలుపలి ప్రాకారపు గోడపై చెక్కబడిన చిత్రములు: క్రింది వరుస యందు వెవ్వేలు విధములుగ నలంకరింపబడినయేనుగు లున్నవి. రెండవ వరుసలో నట్టనడుమ స్త్రీ పురుషు లిరువురునుగూడి యడవిపందిని వేటాడుట చెక్కబడినది. పురుషుడు గుఱ్ఱముపైనుండి యీటెతో పందిని పొడుచుచున్నాడు. ఆమెది వింటబాణముల దొడిగి పంది నేయుచున్నది. పంది మెడపైకెగిరి యొకకుక్క కఱచుచున్నది. ఆకాలమునకు దగిన వస్త్రాలంకారాదుల నా స్త్రీపురుషులు ధరించియున్నారు.

చిత్రము ౧౨.



ఏ. జిరఫీ మృగములు, ఒంటెలు. శ్రీశైలము: జిరఫీ మృగములను, ఒంటెలను పగ్గములతో బట్టి సేవకులు కొనిపోవుచున్నారు. వీరిచేత కుంచెకోరడాలును, జాటీలును గలవు.



బి. వేట, శ్రీశైలము. ఈ చిత్రమున ముగ్గురు గుఱ్ఱములపై నున్నారు. ఒక్కడు క్రిందనిలువబడియున్నాడు. ముగ్గురు అడవిపందిని వేటాడుచున్నారు. ఒక్కడు గుఱ్ఱముపై నెక్కి దూరమునుండి వేటను జూచుచున్నాడు. రౌతులిద్దఱు పంది నీటెలతో బొడిచియున్నారు. నిలిచియున్నవాడు బాకుతో పొట్టలో బొడుచుచున్నాడు. చిన్నకుక్క యొక్కటి యామృగముపై నెక్కి తీవ్రముగా కఱచుచున్నది. గుఱ్ఱములకు కళ్లెములు, పూసలపేరులు, జేరుబందుపట్టలు, దుశంచీలు, జీనుగుడ్డలు, వెనుక వైపున నెత్తుగనున్న జీనులు గలవు. నడుమనున్న గుఱ్ఱమున కలంకారముగా రెక్కలతో గట్టిన కుచ్చులు నాల్గువేయబడియున్నవి. రౌతుల వస్త్రాలంకారములు వింతగా నున్నది. వారిలో నిద్దఱు స్త్రీలవలె తలవెంట్రుకలను ముడువుకొనియున్నారు. విజయనగర రాజ్యకాలమున శిల్పులు రాజకుటుంబములోనివారియొక్కయు యితరప్రముఖుల యొక్కయు ప్రతిమలను చెక్కునప్పు డీపద్ధతినే యవలంబించుచుండిరి. దూరమున గుఱ్ఱముపైనున్నవానికిని, నిలువబడియున్నవానికిని వెంట్రుకలు తలయంట కత్తిరింపబడి యున్నవి. ఈ యిద్దఱును పై (ఏ) చిత్రముననున్న గుఱ్ఱపువారివలెనే వస్త్రములను గట్టియున్నారు. కావున వీరు గుఱ్ఱపు పనివారును, తక్కిన యిద్దఱు వేటకాండ్రునుగ నుందురు.



సి. ఆశ్వికయోధులు, శ్రీశైలము: ఇందు నలువురువిలుకాండ్రు గుఱ్ఱముల నెక్కి దౌడు తీయుచున్నట్లున్నది. వీరు నిర్భయముగ గుఱ్ఱములకళ్లెములనైన పట్టుకొనక విల్లెక్కుపెట్టి బాణములను విడుచుచున్నారు. వీరి దుస్తులు పదునాఱవ శతాబ్దియందలి హైందవాశ్వికయోధులదుస్తులను బోలియున్నది.



ఏ. యుద్ధ భటులు, శ్రీశైలము:—ఇందు క్రిందివరుస సైనికులు. వీరి నాయకుడుకుడిచేత పెద్దసంకత్తిని, ఎడమచేత నొకయుక్కుచక్రమును బట్టియున్నాడు. పై వరుసయందొక రాజపుత్రు డున్నతాసనమున గూర్చుని యున్నాడు. సమీపమున నిద్దఱు పరిచారికలున్నారు. ఒక్కతె విసనకఱ్ఱను చేతబట్టియున్నది. ఇంకొక్కతె యీవరుసలోనే యింకొకవైపున నిశ్చలభక్తితో శివలింగము నర్చించుచున్నయామెను గూర్చి రాజపుత్రునితో జెప్పుచున్నది. రాజపుత్రుడును దాసీలును ఆభక్తురాలిని నిలువబడి చూచుచున్నట్లు నడుమ చెక్కబడియున్నది. భక్తురాలు శివలింగముపై నొక పూలచెండ నర్పించినది. చంద్రవతియనురాజపుత్రి శివుని కామించి యనుదినమును శ్రీశైలమున శివలింగమున కొక్క మల్లెపూలచెండ నర్పించుచుండెడిదట. ఈభక్తురాలాచంద్రవతియే కానోపును.



బి. పైవరుసయం దొకవైపున పైన (ఏ.చిత్రమున) జెప్పినట్లు రాజకుమారి శివలింగమునుబూజించుచున్నది. ఇంకొకవైపున రాజపుత్రుడు చెట్టు క్రింద నిలువబడి యాపూజను చూచుచున్నాడు. ఈభక్తురాలి ప్రతిమయందు దేవతాలక్షణములులేవు కాన నీమె మనుష్యస్త్రీయగును. క్రింది వరుసయం దొకవేశ్య నాట్యము చేయుచున్నది. నలుగురు పురుషులు మేళముచేయుచున్నారు. వేశ్యయొక్కనడుమునకు పైభాగము నగ్నముగానున్నది. చక్కని యభినయము జీవకళ యీప్రతిమయందు స్ఫురించుచున్నది. అవయవ విభజననిర్మాణములు సొంపుగానున్నది.



చిత్రము ౧౪.

ఎ. క్రిందివరుసలో నలుగురు వేశ్యలు కోలాటమాడుచున్నారు. ఇద్దఱు పురుషులు మేళమును జేయుచున్నారు. ఈవేశ్యలవేణి కడుదీర్ఘముగానున్నది. వేషాలంకారములు సామాన్యరీతి నున్నవి.

పైవరుసయందొక రాజపుత్రి పీఠమున గూర్చునియున్నది. ఏడుగురు పరిచారికలామెను గొలుచుచున్నారు. రాజపుత్రి తన కుడిచేతిచూపుడు వ్రేలితో నొక్కపరిచారికను బెదరించుచున్నది. అదియు నామెయెడ నల్లే కానించుచున్నది. గాథ శ్రీశైలమునకు సంబంధించినదిగా నుండవలెను.



బి. పై వరుసయందొకమూల శివుని భిక్షాటనముచెక్కబడి యున్నది. శివుని బ్రహ్మహత్య విషయికమగు కథ ప్రసిద్ధము. ఇచట నడుమ శివుడు, ఇరువైపుల ఛత్రములను బట్టిన వామనపురుషులు, ఒక్కలేడి, ఎడమవైపున భిక్షాపాత్రమును తలనిడినబాలుడు గలరు. కుడివైపున శివుని సౌందర్యమునుగని, మోహించి స్తనావరణమునూడ్చి, శిశువును జేబూని శివునివెంట బరుగిడుచున్న మునిపల్ని గలదు. ఇందు శివునకు నాలుగుచేతులున్నవి. పై రెండుచేతులతో త్రిశూల డమరుగములను బట్టియున్నాడు. క్రిందిచేతులలో కుడిచెయిని లేడివంకకు జాపియున్నాడు. ఎడమ

చేతితో బ్రహ్మకపాలమును బట్టియున్నాడు. వేఱొకమూల ముగ్గురు మునిపత్నులు భిక్షాటనము చేయుచున్న శివుని గని మోహించి తమ్మేలుకొనరమ్మని వేడుకొనుచున్నారు. ఈముగ్గురును, తొలియామెయు దారుకావనమునందలి మునిపత్నులు.

క్రిందివరుసలో మునులును మునిపత్నులును గలరు. పైవివరించిన పత్నులకు చేష్టలకుకుపితులైన మునులు భార్యల నిక్కడ దండించుచున్నారు. ఒక్కతె భర్తకుసాష్టాంగముగ మ్రొక్కి మన్నింపవేడుచున్నది. ఇంకొక్కతె దగ్గరనిలుచుండి పాదములపై వ్రాలియున్నతనచెలియలిని మన్నింప నాతనినే ప్రార్థించుచున్నది. ఇంకొకమునికాంత యొక్కచేత గొడుగును, వేఱొకచేత నిత్తడిగిండినిబట్టి నిర్లక్ష్యభావముతో నిలిచియున్నది. మగడు తనయందు పట్టి నిందను మోపెనని యామెకోపమును జెందినట్లున్నది. ఇటగల వృక్షము లివి వన (దారుకావన) మధ్యమున జరిగినట్లు తెలుపుచున్నది.

చిత్రము ౧౭



ఎ. పైవరుస హైమవతీ వివాహోదంతమును దెలుపుచున్నది. నడుము వంగియున్నముదుసలి బొమ్మ శివుడు. ఆతని నాని బ్రహ్మ నిలిచి యున్నాడు. ఇతనికి మూడుశిరములున్నవి. విష్ణువు శంఖచక్రధారియై యాతనికె నిలుచుకొని హిమవంతునకు దన్ను దెలుపుకొనుచున్నాడు. పార్వతి, ఎదుటనున్న ముసలిమగనికి నమస్కరించుచున్నది. ఆమెవెనుక హిమవంతుడు నిలిచియున్నాడు. అతడున్నతమగు శిరోవేష్టనమును దాల్చి యున్నాడు. అతని పిఱుద భార్య మేనక యున్నది. ముదుసలిని బెండ్లాడనున్న కూతురుదుర్దశకు జింతించుచు నామె యావలి మొగమైయున్నది. హిమవంతుడు పార్వతిభుజముపై చెయినిడి తల్లిదుఃఖమును దెలుపుచున్నాడు. ఈగాతియొక్క పైయంచున నొక శాసనమున్నది. "శివుడు పార్వతిని బెండ్లి గాగోరి యిచట హిమవంతునికి దర్శనమిచ్చెను." అనియందుగలదు.

క్రిందివరుసలోకుడిప్రక్కను వేణుగానము చేయుచున్న కృష్ణుడు, నందిపై నెక్కియున్న శివపార్వతులు, కత్తినూని నిలువబడియున్న యొకపురుషుడు, గుఱ్ఱమునెక్కియున్న మూడుతలలదేవత యాతని ప్రియురాలు చెక్కబడి యున్నారు.

౧౯



బి. ఇందు పైవరుసలో కుడివైపున విశ్వకర్మ త్రాసునుచేబూని ఒకతట్టయందు శివుని, మఱియొక తట్ట యందితర దేవతలను ఉనిచి తూచుచున్నాడు.

ఈవిషయమును దెలుపు శాసన మిచట చెక్కబడియున్నది. శివుడు సకల దేవతలలో నుత్తముడని యిందువలన దెలుపబడుచున్నది. ఆవెంబడినున్న ప్రతిమ శివుడు. ఆప్రక్క నెద్దుపైనున్న ప్రతిమయు శివుడే. దీనిప్రక్క నగుఱ్ఱముపైనెక్కియున్న యతడు కుబేరుడు క్రిందివరుసయం దేడుగురుస్త్రీలు బాకాలను చేతులనుంచుకొని యున్నారు.

చిత్రము ౧౬



ఏ. పైవరుసలో నెడమవైపున మాయాకిరాతవేషములను దాల్చిన శివపార్వతులు చేత విండ్లనుబట్టి యున్నారు. నడుమ శివార్జునులు మల్లయుద్ధము చేయుచున్నటులు చెక్కబడినది. పార్వతిచెంతనిలిచి యర్జుననిమన్నింప శివుని వేడుచున్నది. ఆప్రక్కనున్నవారు వృషభారూఢులైన శివపార్వతులు. అర్జునుడు దండప్రణామము గావించియు, నిలుచుండియు వారిని బ్రార్థించుచున్నాడు. పార్వతి యాకులను గట్టియున్నది. కొన్నివందలయేండ్లకు బూర్వము చెంచువారిట్లే యాకులనుగట్టుచుండిరనుట యిందువలన డెల్లమగుచున్నది. ఈ కిరాతార్జునీయగాథసుప్రసిద్ధము.

క్రిందివరుసయు నొకశైవగాథనే తెలుపుచున్నది. నడుమ శివుడు తాండవమాడుచున్నాడు. ఇతనికి భుజంగలలితుడను పేరట. ఎడమమూలను నంది మానవాకృతితో మృదంగమును వాయించుచున్నాడు. అతనిప్రక్కను పార్వతి నిలిచియున్నది. ఆమెచేత నొక పొడవైన బాకా యున్నది.

ఆమెపను శివునికిని నడుమ త్రిశిరస్కుడయిన బ్రహ్మయున్నాడు. శివునికి కుడిప్రక్క విష్ణువున్నాడు. అతనివెంబడి కుమారస్వామి యున్నాడు. శివుని కాలిక్రింద నపస్మారుని ప్రతిమ చెక్కబడి యున్నది.



బీ. పైవరుసలో నెడమమూల నొకడు శివునిగూర్చియే కాబోలు తపము చేయుచున్నాడు. ప్రక్కను ఏడు గుఱ్ఱములను గట్టిన తేరిపై సూర్యుడు, ఛాయాదేవి, అనూరుడు, నింకొక విలుకాడు నున్నారు. ఎదుట నొక రాక్షసుడు చేయెత్తి సూర్యుని గమనమును వారింపుచు నిలిచియున్నాడు. ఇత డొక భీకరగదను దాల్చియున్నాడు. ఈ కథ ఎందలిదో తెలియరాదు. క్రింది వరుసలో రెండు భిన్నమతముల వివాదము పరిష్కరింపబడు చున్నట్లున్నది. ఇందు కుడివైపున రెండు జైన విగ్రహము లున్నవి.

# క్షాత్రకాల వ్యవసాయచరిత్ర

(క్రీ. పూ. ౧౮ శతాబ్దము మొదలు క్రీ పూ. ౧౦ వ శతాబ్దము వరకు)

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

ఈ కాలమునందు ఋగ్వేదకాలముకంటె, విశేషమైన వ్యవసాయ విధులును, బీజబాహుళ్యము, దున్నుటలో విశేషపద్ధతులు, వ్యవసాయదారునకు రాజునకుఁ గల సంబంధము, పశువైద్యము, మొదలగునవి హెచ్చుగ నేర్పడినవి. మరియు, వ్యవసాయమున కత్యవసరసంబంధముగల క్రిమి, కీట, పతంగ, వృక్షాది శాస్త్రము లుద్భవించినవి. వాని నాయాసందర్భములలో దిఙ్మాత్రముగ సూచించెదను. ఈ కాలమున నుద్భవించిన గ్రంథములలో "కృష్ణ యజుర్వేద సంహిత" మొదటిదనియు, శుక్ల యజుర్వేద, సామవేద, అథర్వవేద సంహితలు క్రమముగ బయలుదేరిన వనియు, బ్రాహ్మణములు ఉపనిషత్తులు, రామాయణ మహాభారతములు క్షాత్రకాలాంతమునందు, రచింపఁబడిన వనియు, ప్రాచ్య, పాశ్చాత్య, ఐతిహాసికులలో కొందరు తలంచుచున్నారు. పై గ్రంథములలో పెక్కులీక్షాత్రకాలచరిత్రను వ్రాయుటకు నాకుఁదోడ్పడినవి. "కృష్ణ యజుర్వేదము"ను మారుపేరుగల "తైత్తిరీయసంహిత" గద్యపద్యాత్మకమై, మంత్ర బ్రాహ్మణములు కలిసి యుండును. యజుర్వేద, అథర్వవేదములలో కొన్ని భాగములు ఋగ్వేదమునుండి తీసికొనఁబడిన ఋక్కులై యున్నవి. ఋగ్వేదకాల చరిత్రమును వ్రాసినపుడుదాహరించిన "ఋక్కుల" ప్రసక్తియే, క్షాత్రకాల చరిత్రకు యజుర్వేదాదులనుండి గ్రహింపవలసి యున్న యెడల ప్రమాణాదిక సంజ్ఞల నుదాహరింపఁబడును గాని గ్రంథమంతయు గ్రంథవిస్తరభీతిచే వ్రాయబడదు.



జనకుడు యాజ్ఞవల్క్యునకు గోవు నిచ్చుట

దున్నెడుపద్ధతు లీకాలమున, నెటు లుండెనో చూడుఁడు.

౧ యజుస్సుచేతనే నాగటిని గూర్చుచున్నాడు: యజుస్సుచేతనే లౌకికముగ దున్నుచున్నాడు. ఆరు యెద్దులచేతనే దున్నుచున్నాడు. ఋతువు లారుగాన, ఋతుసంజ్ఞచేతనే దున్నుచున్నాడు. లేక, సంవత్సరమునకుఁ బదిరెండు మాసములు గాన, పది రెండు యెద్దులచేతనే దున్నుచున్నాడు.

---

౧ యజుషా యునక్తి, యజుషా కృషతి, వ్యావృత్త్యై, షడ్గవేన కృషతి, షడ్వా ఋతవః, ఋతుభిరేవైనం కృషతి, ద్వాదశగవేన, సంవత్సరేణైవ. కృష్ణ యజుర్వేద సంహిత. ౫-౨-౫.

ఋగ్వేదకాలమునందు ఇన్ని యెద్దులచే నిట్లుం దున్నవలెనని లేదు. ఈకాలమునం దా భేదము కలిగినది. ఈ భేదము ననుసరించియే కాలాంతరమునందు, "హారీతా"ది స్మృతులలో నిన్నియెద్దులచే దున్నిన యిట్టి ఫలము కలదని, ఫలనిరూపణము చేయబడినది.

[1] దక్షిణమునుండి అరక లుత్తరమున కేగును. పిమ్మట నదియే తూర్పుగ తిరిగి, పశ్చిమాభిముఖముగ వచ్చి, సమాప్తింజేయును. (లేక) మూడరక లుత్తర దక్షిణములకును మూడరకలు ప్రాక్పశ్చిమములకును,దున్నును.

ప్రస్తుతమునం దీపద్ధతులు మృగ్యములై యున్నవి. స్వయముగ దున్నువారే దానిని, నిర్ధారణం జేయవలెను.

[2] యజ్ఞముఖమున, మూడేసిచాళ్లనుగా దున్నుచున్నాడు. అట్లు దున్నుటచే మూడావృత్తులను— (అనగా మూడుపర్యాయములు దున్నవలెను).

ఋగ్వేదమునం జెప్పినట్టులనే, దున్నునపుడు చేయు, ప్రార్థనము రాతిచిలుకగలమాటినుండి, తోలు త్రాడుగల, యేతముతో నీరు దోడుటయు కృష్ణయజుర్వేదములో, ౪ కాండ ౨ ప్రపాఠకము ౫ వ అనువాకమున వర్ణింపబడెను. ఋగ్వేదములోని ౧౦ వ మండలము ౧౦౧ సూక్తములోని ఋక్కులే యస్థలమున జెప్పబడుటచే, పునరుక్తిదోషభీతిచే నాఋక్కులను వ్రాయనైతిని. కాని యీకాలమున వృద్ధినొందిన విధానములు మాత్రము వ్రాయుచున్నాను.

[3] మంచిపిట్టిలుగోగి బలిసియుండి చురుకుగా నడుచుచుండిన యెద్దులచే లాగబడుచు, పట్టుకొనుటకను వగు పిడిగల నాగటిని వజ్రాయుధము రక్షించు గాక!

[4] కోరికలనిచ్చు నో సీతా, నీవు మిత్రావరుణులకు, నింద్రునకు, నశ్వికి, నోషధులకు, ప్రజలకు, గోరికలను సంపాదింపుము.

ఋగ్వేదకాలపు నాగలికంటె సూత్రకాలపు నాగలికి బట్టుకొనుటకనువగు పిడి కలిగియుండుట విశేషము. దుక్కిలో నిలువుగను, నడ్డముగను గలియదున్నుటయే కాక, మూడుసారులు దున్నుట యను విశేషముకూడ, నాటివా రెరుగుదురని తలంపబడుచున్నది. అథర్వవేదమునందు, ౩ కాండ, ౧౭ సూక్తమునకు, "కృషినిష్పత్తిసూక్త"మని పేరు. దీనిలోని గ్రంథమంతయు ఋగ్వేదకాలచరితమున వ్రాయబడిన, ౪ మండలము ౫౭ సూక్తము, ౧౦ మండలము ౧౦౧ సూక్తములలోని భాగములును, కృష్ణయజుర్వేదములోని ౪ కాండ, ౨ ప్రపాఠకము ౫ అనువాకములోని మంత్రములే స్వల్పభేదములతో నుండుటచే నవసరముండదని వ్రాయలేదు. ఋగ్వేదమునందు, యవలకంటె విశేషధాన్యములు కానిపింపలేదని వ్రాసియున్నాను. కాని సూత్రకాలారంభమునందు పదునాల్గువిధములగు ధాన్యము లుండినట్టులును సూత్రకాలాంతమునకు పదునేడు విధములగు ధాన్యములు కలిగినట్టులను, యీ క్రిందియంశములవలన దెలియనగుచున్నది. పదునాలుగను పక్షమునందు, ఏడుగ్రామ్యములు ఏడారణ్యకములునై యున్నవనియు గ్రామ్యములు దున్నిపండించునవి యనియు, ఆరణ్యకములు దున్నకనే పండుచున్నవనియు కలదు. చూడుడు.

[5] అన్నమునకు గాను, గ్రామ్యములగు నేడింటిని ఆరణ్యకములగు నేడింటిని జల్లుచున్నాడు.

ఈ యనువాకమునకు భాష్యమును వ్రాయుచు, విద్యారణ్యులు,నువ్వులు, మినుములు,యవలు, వడ్లు,కొఱ్ఱలు,నల్లవడ్లు,గోధుమలు ననుయేడును గ్రామ్యములనియు, వెదురుధాన్యము, చామలు, నీవారములు, కారునువ్వులు, అడవిగోధుమలు, మర్కటకములు, గారుత్మతములు, నను యేడును, ఆరణ్యకములని వ్రాసియున్నారు. "భట్టభాస్కరులు" తమ యజుర్వేదభాష్యమునందు,

---

[1] దక్షిణేన పర్యావర్తంతే స్వయమేవ వీర్య మనుపర్యావర్తంతే తస్మాద్దక్షిణోర్ధ ఆత్మనో వీర్యవత్తరోథో, ఆదిత్యస్యైవావృత మనుపర్యావర్తంతే. తస్మాత్పరాంచః పశవో వితిష్ఠంతే ప్రత్యంచ ఆవర్తంతే. కృ. య. ౬-౨-౫ (౨) త్రిస్సీతాః కృషతి త్రివృతమేవ యజ్ఞముఖేయాతయతి. య. ౫ కాం. ౨ ప్ర. ౫ అ. (౩) లాంగలం పవీరవత్ సుశేవగ్ సుమతిత్సరు ఉదిత్కృషతి గోమవీం ప్రఫర్వ్యంచపీవరీం ప్రస్థావద్రథవాహనం. య. ౪-౨-౫-౧౭. (౪) కామం కామదుఘే ధుంక్ష్వ మిత్రావరుణాయచ ఇంద్రా యాగ్నయే పూష్ణ ఓషధీభ్యః ప్రజాభ్యః య ౪-౨-౫-౧౯. (౫) చతుర్దశభి ర్వపతి, సప్తగ్రామ్యా ఓషధయః సప్తారణ్యాః, ఉభయేషా మవరుంధ్యా అన్నస్య. య. ౫ కాం. ౨ ప్ర. ౫ అను.

గ్రామ్యములలో భేదమును వ్రాయలేదుకాని, యారణ్యకములలోమాత్రము మర్కటగారుత్మతములకు మారుగా, ఆవాస్య, హాళిక, ధాన్యములని వ్రాసియున్నారు. "మర్కట"కాది శబ్దము లధునాతన నిఘంటువులందు న్మృగ్యములై యున్నది. "చనుక" మని చెప్పబడు కృష్ణయజుర్వేద సంహితయం దిట్లు కలదు.

౧ చిన్నయవలు, వడ్లు, యవలు, మినుములు, నువ్వులు, పెసలు, పెద్దపెసలు, గోధుమలు, (పెసలవలె పప్పునిచ్చు) మసూరములు, కొఱ్ఱలు, చిన్నవడ్లు, చామలు, నీవారములు, ఆకలియగునపుడు, నా కన్నము గాక!

౨ గ్రామ్యసప్తకమును దున్నియు, ఆరణ్యసప్తకమును దున్నకయు, వ్యవసాయమును జేయవలయును.

అని "ఆపస్తంబుడు" శ్రౌత సూత్రములలో వ్రాయుట, గమనింపఁదగి యున్నది. గ్రామ్యములగు ధాన్యములు పది రకములని, బృహదారణ్యకోపనిషత్తునందు కలదు. బృహదారణ్యకోపనిషత్తు, శాస్త్రకాలపు చివర నుద్భవించెనని యిందువలన నూహింపబడుచున్నది. బృహదారణ్యకమున నేటులఁ గలదో చూడుఁడు.

౩ గ్రామ్యధాన్యములు పదివిధములై యున్నవి. వడ్లు, యవలు, నువ్వులు, మినుములు, నల్లవడ్లు, కొఱ్ఱలు, గోధుమలు, చిరుసెనగలు, అనుములు, ఉలవలు, వీటిపిండిని, నేతిలోను, పెరుగులోను, తేనెలోను, ఉంచుచున్నాఁడు.

యజుస్సంహితలో జెప్పఁబడిన ధాన్యవిశేషములకంటె బృహదారణ్యకోపనిషత్తునందు, చిరుసెనగలు, అనుములు, ఉలవలు, నను మూడురకముల ధాన్యములు, గ్రామ్యధాన్యములలో జేర్పబడినవి. శాస్త్రకాలమునందు యవలకంటె, వ్రీహులకు ప్రాముఖ్యత హెచ్చుగ కలిగెనని యీక్రింది యంశములచే నూహింపఁబడుచున్నది. యజ్ఞాదులయందు, "పురోడాశము" వ్రీహులపిండితోఁ జేయవలసి యుండుటయు, మహారాజ్యాభిషేక కాలమునందు ఓషధీచతుష్టయము కావలెనని చెప్పుటలో వ్రీహ్యంకురములనే ముందుగ నుచ్చరించుటయు, పైయూహకు కారణములై యున్నవి. మహారాజ్యాభిషేకకాలమున "బురోహితు" డెటులు జెప్పునో చూడుడు.

౪ (ఓరాజభృత్యులారా) ఈ క్రింది నాలుగు విధములగు ధాన్యములయొక్క మొక్కలను సంపాదించి తెండు (1) ఎఱ్ఱజిలమ ధాన్యము (2) పెద్దవరిధాన్యము (3) కొఱ్ఱధాన్యము (4) యవధాన్యము (ఎందువలన వీనిని సంపాదింపవలెననగా) ఎఱ్ఱజిలమ ధాన్యము, ఓషధులలో క్షత్రియునివంటివి కాన వానిమొలకలను ధరింపవలెను. పెద్దవరిధాన్యము ఓషధులలో మహాసామ్రాజ్యమువంటివి. కాన, పెద్ద వరిధాన్యపు మొలకలను ధరింపవలెను. కొఱ్ఱలు, ఓషధులలో, భోజ్యమైనవి. కాన కొఱ్ఱల మొలకలను ధరింపవలెను. యవధాన్యము, ఓషధులలో సేనాధిపతుల వంటివి. కాన యవధాన్యపు మొక్కలను, ధరింపవలెను. ఈ యోషధీబీజములను ధరించిన, యీ మహారాజు, క్షాత్రమును, సామ్రాజ్యమును, భోజనద్రవ్యమును, సైన్యాధీశత్వమును, ధరించిన వాఁడగును"

(౧) మయవాశ్చమేన్నంచ మే ఖుచ్చ మే వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చమే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే గోధూమాశ్చ మే మసురాశ్చమే ప్రియంగవశ్చ మే అణవశ్చమే శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే య ౪-౭ ౪. (౨) సప్తగ్రామ్యాః కృష్టే, సప్తారణ్యా అకృష్టే—ఆపస్తంబశ్రౌత సూత్రం. (౩) దశగ్రామ్యాణి ధాన్యాని భవంతి వ్రీహియవా స్తిలమాషాః అణుప్రియంగవాః గోధుమా శ్చ మసూరా శ్చఖల్వాశ్చ ఖలకాశ్చ తాగ్ం పిష్టాగ్ం దధిని మధుని ఘృత ఉపనిషించతి. బృహదారణ్యకోపనిషత్ ౩-౧౩. (౪) "అథ తతో బ్రూయా చ్చతుష్టయా న్యోషధాని సంభరత తోక్మకృతాని వ్రీహీణాం మహావ్రీహీణాం ప్రియంగూనాం యవానామితి, క్షత్రంవా ఏత దోషధీనాం, యద్వ్రీహయో, యద్వ్రీహీణాం, తోక్మ సంభరంతి క్షత్ర మేవాస్మిం స్తద్దధాతి సామ్రాజ్యంవా ఏత దోషధీనాంయ న్మహావ్రీహయో యన్మహావ్రీహీణాం తోక్మ సంభరంతి. సామ్రాజ్య మేవాస్మిం స్తద్దధాతి, భోజ్యంవా ఏత దోషధీనాం యత్ప్రియంగవో యత్ప్రియంగూనాం తోక్మసంభరంతి భోజ్య మే వాస్మిం స్తద్దధాతి సైనాన్యం వా ఏతదోషధీనాం యద్యవా యద్యవానాం తోక్మ సంభరంతి సైనాన్య మేవా స్మిం స్తద్దధాతి" ఐతిరేయబ్రాహ్మణము. ౮ పంచిక ౪ అధ్యాయము ౧౬ సంఖ్య.

యజ్ఞమునందు, పురోడాశమును, వరిపిండితోఁ జేయవలెననియు, పశువును, యజ్ఞమున వధించుట కంటె, పురోడాశమునే పశుస్థానమునం దుపయోగించుట యుక్తమనియుఁ బశువినియోగమునకును, పురోడాశవినియోగమునకును, భేదము లేదనియు, సమాన ఫలమే లభించుననియు, "ఐతరేయ" బ్రాహ్మణమునం దొక "యర్థవాద" చెప్పబడియున్నది. ఇంపుగనుండు నని దానినిట వ్రాయుచున్నాడను.

౧ దేవతలు పురుషునిఁ బశువుగాఁ జేసి వధించి యజ్ఞముఁ జేసిరి. అపుడు పురుషుని మేధస్సు పురుషుని విడిచి, యశ్వమునం బ్రవేశించెను. అందుచే దేవతలాయశ్వమును వధించి యజ్ఞముఁజేసిరి. అశ్వమునఁ గల మేధస్సు, గ్రహింపఁబడుటచే నశ్వము "కింపురుష" డాయెను. అశ్వమునందుండిన మేధస్సు, గోవునం బ్రవేశించెను. గోవునందు మేధస్సుండుటవలననే గోవు మృగజాతికాలేదు. దేవతలు,గోవును వధించి, యజ్ఞముఁ జేసిరి. గోవులోని, మేధస్సు, గొఱ్ఱెలో బ్రవేశించెను. అందువలన, గొఱ్ఱెకు, "గవయ" మను పేరు కలిగెను. దేవతలాగొఱ్ఱెను వధించి యజ్ఞముఁ జేసిరి. గొఱ్ఱెలోని మేధస్సు, మేకలో బ్రవేశించెను. అపుడు, మేకనుఁ జంపి యజ్ఞముఁ జేసిరి. మేకయందు ధామేధస్సుయొక్క తేజము, నిలచి యుండుటచేత, యజ్ఞీయపశువులలో నది ముఖ్యమై యున్నది. మేకనుండి మేధస్సు, లేపుస్సున బరుగునిడ దేవతలు వెన్నాడిరి.అపు డామేధస్సు, వ్రీహియాయెను. అపుడు దేవతలువ్రీహులను పురోడాశముగాఁ జేసి యజ్ఞముఁ జేసిరి. పురోడాశముచే యజ్ఞము చేసిన బశువును వధించి చేసిన యజ్ఞఫలము కలుగును. మేధస్సు విడిచి పోవుటచేనశ్వాదు లభోజ్యము లాయెను.

౨ పురోడాశమునందు పశుధర్మములు కలవు. వరిధాన్యమునందుండుముండ్లే పశువునందుండు రోమములు. ఊకయే చర్మము. తవుడే రక్తము. పిండిలోని యెఱ్ఱనిచారయే మాంసము. పిండిలోనినలుగని భాగమే యెముకలు. కాన పురోడాశముతో యజ్ఞముఁ జేసిన సమస్తజంతువులతోను యజ్ఞముజేసిన ఫలములభించును. వరిపిండిచేతనే, పురోడాశముఁ జేయవలెనను సంగతిని, ఋగ్వేద కాలచరిత్రముననే వ్రాసియున్నాను. తైత్తిరీయసంహితయొక్క మొదటికాండ, ప్రథమకాండము యొక్క ౪,౫,౬ అనువాకముల యర్థమును, వాని కనుబంధములగు, శ్రౌతసూత్రములను, బరీక్షించిన యెడలఁ బురోడాశమునకుగాను ధాన్యమును దెచ్చుట, చేటతో జెరుగుట, ధాన్యమును దంపుట, ఊక మొదలగువానిని విడదీసి బియ్యమును సన్నెకంటిపై నూరి పిండిచేయుట మొదలగు నంశములు ధాన్యపుమరలు లేని పల్లెటూళ్లలోని చిన్నచిన్న వ్యవసాయకుల స్థితులు, జ్ఞాపకమునకు వచ్చును. గ్రంథవిస్తరభీతిచే నా యంశముల నన్నిటిని వ్రాయలేదు. సూత్రకాలమునందు

---

(౧) పురుషం వై దేవాః పశు మాలభంత, తస్మా దాలబ్ధా న్మేధ ఉదక్రామ త్సోఽశ్వం ప్రావిశ త్తస్మా దశ్వో మేధ్యోఽభవ దథైన ముత్క్రాంత మేధ మత్యార్జంత, స కింపురుషో ఽభవ త్తేఽశ్వ మాలభంత సో ఽశ్వా దాలబ్ధా దుదక్రామ త్స గాం ప్రావిశ త్తస్మాత్, గౌర్మేధ్యోఽభవ దథైన ముత్క్రాంతమేధ మత్యార్జంత. స గౌర మృగోఽభవ త్తే గామాలభంత స గో రాలబ్ధాదుదక్రామత్సోఽవిం ప్రావిశ త్తస్మా దవి ర్మేధ్యోఽభవ దథైనముత్క్రాంతమేధ మత్యార్జంతస గవయో ఽభవత్తేఽవిమాలభంత. సోఽవే రాలబ్ధా దుదక్రామ త్సోఽజం ప్రావిశత్తస్మా దజో మేధ్యోఽభవ దథైన ముత్క్రాంతమేధమత్యార్జంత. స ఉష్ట్రో ఽభవ త్సోఽజే జ్యోక్తమా మివారమత తస్మా దేష ఏతేషాం పశూనాంప్రయుక్తతమో య దజ స్తేఽజ మాలభంత. సో జా దాలబ్ధా దుదక్రామ త్స ఇమాం ప్రావిశ త్తస్మా దియం మేధ్యా ఽభవ దథైన ముత్క్రాంతమేధ మత్యార్జంత. స శరభో ఽభవ త్త ఏత ఉత్క్రాంతమేధా అమేధ్యాః పశవ స్తస్మా దేతేషాం నాశ్నీయా త్త మస్యా మన్వగచ్ఛం త్సోఽనుగతో వ్రీహి రభవ త్త ద్య త్పశౌ పురోడాశ మనునిర్వపంతి. స మేధేన నః పశు నేష్ట మసత్ కేవలేన నః పశు నేష్ట మస దితి. స మేధేన హాస్య పశు నేష్టం భవతి. కేవలేన, హాస్యపశు నేష్టం భవతియ ఏవం వేద—ఐతరేయబ్రాహ్మణము ౨-౧-౮. (౨) స వా ఏష పశు రే వాలభ్యతే యత్పురోడాశ స్తస్య యాని, కింశారూణి తాని రోమాణి, యేతుషాః, సా త్వ గ్యే ఫలీకరణాః. స్త దసృ గ్య త్పిష్టం, కిక్నసా స్త న్మాంసం, యత్కించి త్కంసారం, తదస్థి సర్వేషాం వా ఏషపశూనాం మేధేన యజతే, యః పురోడాశేన యజతే-ఐతిరేయబ్రాహ్మణము-౨-౧-౯.

ప్రజలు వ్రీహులను, యవలను, గోధుమలనే భుజించు చుండి రని యజుర్వేద అథర్వ వేదములలోను ఆకాల మునందే రచింపఁబడిన మహాభారతమునను గలదు. ఆ వృత్తాంతములను స్వల్పముగా నిట వ్రాయుచున్నాను.

౧ ఏ భూమియందు అన్నము, వడ్లు, యవలు అయి యున్నవో? ఏ భూమి యందు విశేషమగు వ్యవసాయ ములు కలవో? వర్ష విశేషము గల పర్జన్య పత్ని యగు, నా భూమికి నమస్కారము.

౨ యుగాంతమునందు జనులు, యవలను గోధుమ లను దినుచు, ఆ ధాన్యములు పండు దేశముల కేగెదరు.

క్షాత్రకాలమునందు విత్తనముల జల్లుట, ఆ కెదిగిన పిమ్మట నూడ్చుట నేఁటివలెనే యున్నది కాని, ఇంతకంటెఁ దక్కువ పద్ధతిగా లేదు.చూడుడు.

౩ దున్నినచోటునందు, విత్తనములఁ జల్లి,(మొలచినపిమ్మట) యా యాకును దున్నిన మఱియొకచోటునం దూడ్చుచున్నాఁడు- నాగేటిచాలు ననుసరించి, చల్లుచున్నాడు. నాగేటిచాలునందే చల్లుచున్నాడను టచేత, నేటి వ్యవసాయకుల కుచితానుభవముగల"డ్రిల్లు" పద్ధతిని క్షాత్రకాలార్యు లెఱుఁగుదు రని తలంపనగుచు న్నది. పై వేదవాక్యమునకు భాష్యమును వ్రాయుచు, విద్యారణ్యులు ఊడ్పును గుఱించి యిట్లు వ్రాసిరి:

౪ "ఊడ్పువలన మొక్కలయొక్క వేరులు, నానా దిక్కులకుఁ బ్రసరించి దృఢపడును." నా యూడ్పుపద్ధతి కలదని, ఈక్రింది శ్రుతివాక్యము మరింత దృఢపరుచు చున్నది.

౫ ఓ యోషధులారా! మిమ్ముల బాతువాడరోగ వంతుడగును గాన, మిమ్ముల నూడ్చుచున్నాను. మా మనుష్యులు, పశువులు, రోగరహితము లగుఁగాక.

ఋగ్వేదకాలపువారికి,మూడువిధములగునోషధులప్రయో జనమే తెలిసియుండె నని వ్రాసియుంటిని క్షాత్రకాల పువారికి నంతకంటె హెచ్చురకములగు నోషధులు తెలిసియుండెనని యీక్రింది యజుస్సు చెప్పుచున్నది.

౬ పుష్పములను, ఫలములఁగూడ నిచ్చునవి (అరటి జాతిలోనివి) పుష్పములను మాత్ర మిచ్చునవి (గులాబీజాతిలోనివి) ఫలములనుమాత్ర మిచ్చునవి (వంగ జాతిలోనివి) పుష్పములను ఫలములనుఁగూడ నీయనివి (తోటకూర జాతిలోనివి) అశ్వములవలె పరుగెత్తు తీగలు (సోమలతవంటివి)

ఈ కాలమునందు ఋగ్వేదకాలముకంటె హెచ్చువిధములగు వ్యవసాయములఁ జేయుచుండిరని పై మంత్రమువలన దెలియనగుచున్నది. ఋగ్వేదకాలపు సామాన్యకృషికంటె క్షాత్రకాలమునందు "విశ్రసేవ్యము" (ఒక క్షేత్రముననే కంది, ప్రత్తి మొదలగు ౨ ౩ రకముల విత్తనములఁ బెట్టు వ్యవసాయము కలదని) యీ క్రింది యజస్సు చెప్పుచున్నది.

౭ ఓ యోషధులారా ! మీ రన్యోన్యము దగ్గరగా నుండి యొకదాని నొకటి కాపాడు కొనుచు విజాతీయములై యుండుడు.

ఓషధులవలన రోగముల బోగొట్టుటను ఋగ్వేదార్యులు కని పెట్టిరి. క్షాత్రకాలమునం దంతకంటె నోషధులయుపయోగములను వృద్ధిచేసిరి. ఆ చర్చ యింద నావశ్యకమని విడిచితిని. ఋగ్వేదమున నోషధీసూక్తమని చెప్పిన ౧౦-౯౭ సూక్తమునే తైత్తిరీయ సంహిత యందు ౪-౨-౬లో పెంచి చెప్పఁబడెను. కాని దాని వివరమిట నసవసరము.

---

(౧) యస్యా మన్నం వ్రీహి యవాః, యస్యా ఇమాః పంచకృష్టయః, భూమ్యై పర్జన్య పత్న్యై నమోస్తు వర్ష మేదసే, అథర్వవేదము ౧౨-౧-౪౨. (౨) శ్లో. యే యవా న్నా జనపదాః గోధుమాన్నా స్తథైవ చ, తాన్ దేశాన్ సంశ్రయిష్యం తి యుగాంతే పర్యుపస్థితే. మహాభారతము-వనపర్వము ౧౯౦అధ్యాయం. (3) "కృష్టే వపతి, కృష్టే హ్యోషధయః ప్రతితిష్ఠతి" అనీనుతం వపతి. తై. సం. ౫-౨-౫. (౪) మూలానాం సర్వతః ప్రసరణే దృఢావస్థానం ప్రతిష్ఠా" విద్యారణ్యభాష్యం తై సం॥ ౫-౨-౫ (౫) మా వో రిష త్ఖనితా యస్మై చాహం, ఖనామివః, ద్విపంచతుష్ప దస్మాకం సర్వ మ స్త్వనాతురం. తై. సం. ౪-౨-౬-౧౯. (౬) పుష్పావతీః, ప్రసూవతీః, ఫలినీ రఫలా, ఉత అశ్వా ఇవ సజిత్వరీ ర్వీరుధః పారయిష్ణవః తై. సం. ౪-3-౬-3 ( ) అన్యా వో అన్యామవ త్వన్యా స్యా ఉపావత తా స్సర్వా ఓషధయః సంవిదానా ఇదం మే ప్రావతా వచః తై. సం.౪-౨-౬-౯.

## క్షేత్రకాలమునందలి భూవిశేషములు

అథర్వవేదములోని, ౧౨కాండ ౧ సూక్తమునకు పృథివీసూక్తమని పేరు. దానిలోని కొన్నియంశములు మనోహరము లగునని యిచట వ్రాయుచున్నాడను.

౧ భూదేవి, బాధలేకుండగ మానవుల నొకచోటను గూర్చుచు నందరు సమానముగ జీవించుటకుఁ దగియుండి నానావిధబలముల నిచ్చు నోషధులను ధరించుచున్నది. ఆ భూదేవి మమ్ములను రక్షించుఁగాక !

౨ ఏభూమి యందు, సముద్రములు, నదులు, నీటి నిచ్చుచున్నవో? ఏభూమియందు, దున్నుటచే నన్నము లుత్పన్నము లగునో? (అట్టి దీభూమి)

౩ చిన్నరాళ్లు, పెద్దరాళ్లు, ధూళి, కలభూమి, మమ్ముల భరించుచున్నది. అట్టి యీభూమి, బంగరు హృదయస్థానమునందు కలది. ఆ బంగారుగనులు గల యీభూదేవికి నమస్కారము.

౪ ఏభూమియందు, వృక్షములును, పుష్పింపక కాచెడి (మఱ్ఱి మొదలగు) వృక్షములును, వ్యాపించి యున్నవో? అనేకవిధములుగా, 'నినుమును' ధరించి యున్నదో? అట్టిభూమి రక్షించు గాక.

౫ తేజస్సును, బలమును, గలిగించు నన్నభాగమగు, "నేతి" నొసగు నో భూమీ! నిన్ను స్తుతించుచున్నాము.

౬ (అనేకవిధములగు) ధనమును, రత్నములను బంగారమును, దొరకెడి నిధులను, గుహలను, ధరించెడి భూమి, మంచి మనస్సుతో నాకు ధనము నొసగు గాక.

౭ (ఈభూమి) అనేకభాషలను మాటలాడుచు, నానాధర్మములు గల జనులకు, వారివారి స్థితుల కనుకూలముగా నుండి, గోవు పాల నిచ్చునట్లు సహస్రవిధములుగా, ధనము నిచ్చుచున్నది.

౮ ఓదేవా! ఏమార్గములు, విశేషజనులచే నడువంబడుచుండెనో, ఆ రథమార్గములు, బండిదారులు, కాందారులు మంచివారికి, చెడువారికి నుపయోగపడుచున్నది. ఆ దారులయందు, శత్రువులును, దొంగలును లేకుండఁగఁ గాపాడుము. ఈ భూమియందేది మంచిది కలదో, దానిని మా కిమ్ము.

౯ భూమిమీఁద గల గ్రామములలో, అరణ్యములలో, సభలలో, జనసమూహములలో, సమితులలోఁ మేము నీకుఁ బ్రియమైనట్టుల, మాటలాడుదుము గాక!

౧౦ ఓభూమీ? నీకుఁ గల, హిమవత్పర్వతములు, ఇతరపర్వతములు, అరణ్యము ఆనందము నిచ్చు గాక, పచ్చని, నల్లని, యెఱ్ఱనిరంగులఁ గలుగు ననేకవిధములగు క్షేత్రములు గలిగి, యింద్రునిచే రక్షింపఁబడు, భూమి జన్మాంతమువరకు, నానంద మిచ్చుగాక !

---

(౧) అసంబాధం బధ్యతో మానవానాం యస్యా ఉద్వతః ప్రవతః సమం బహు నానావీర్యా ఓషధీ ర్యా బిభర్తి పృథివీ నః ప్రథతాం రాధ్యతాం నః. అథర్వవేదం, ౧౨-౧-౨ (౨) యస్యాం సముద్ర ఉత సింధు రాపో, యస్యా మన్నం కృష్టయః సంబభూవుః. అథర్వ. ౧౨-౧-౩ (౩) శిలాభూమి రశ్మా పాంసుః సా భూమిః సంధృతా ధృతా, తస్యై హిరణ్యవక్షసే పృథివ్యా అకరంనమః. అథర్వవేదము ౧౨-౧-౨౬. (౪) యస్యాం వృక్షా వనస్పత్యా ధ్రువా స్తిష్ఠంతి విశ్వహా, పృథివీం విశ్వధా యసంభృతా మచ్ఛావదామసి. ౧౨-౧-౨౭. (౫) ఊర్జం పుష్టం బిభ్రతీ మన్నభాగం ఘృతం త్వాభినిషీదే సుభూమే. ౧౨-౧-౨౯. (౬) నిధిం బిభర్తి బహుధా గుహా వసుమణిం హిరణ్యం పృథివీ దధాతు మే, వసూని నో వసుదారాసమానా దేవీ దధాతు సుమనస్య మానా. ౧౨-౧-౪౪ (౭) జనం బిభ్రతీ బహుధా వివాచసం నానాధర్మాణం పృథివీ య దోకసం, సహస్రం ధారా ద్రవిణస్య మే దుహాం ధ్రువేవ ధేను రనపస్ఫురంతీ. ౧౨-౧-౪౫. (౮) యే తే పంథానో బహవో జనాయనా రథస్య వర్త్మానసశ్చ యాతవే, యై స్సంచరం త్యుభయే భద్రపాపా స్తం పంథానం జయే మానమిత్ర మతస్కరం యచ్ఛివం తేన నోమృడ. ౧౨-౧-౪౭ (౯) యే గ్రామా యదరణ్యం యా స్సభా అధిభూమ్యాం, యే సంగ్రామా! సమితయ స్తేషు చారువదేమ తే. ౧౨-౧-౫౬. (౧౦) గిరయ స్తే పర్వతా హిమవంతో ఒరణ్యం తే పృథివీ స్యోనా మస్తు బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం ధ్రువాం భూమిం పృథివీ మింద్రగుప్తాం అజీతో అక్షతో ఒభ్యష్టాం పృథివీ మహమ్. ౧౨-౧-౧౧

౨౦

పై సూక్తార్థము నాలోచించియే మహాకవియగు "బంకిమ్‌చంద్రఛటర్జీ" వందేమాతర గీతమును, రచించి యుండుననితలంచుచున్నాను. ఈ "పృథివీసూక్తము" నందు వర్ణింపబడిన యంశముల నాలోచింపఁగా క్షాత్ర కాలమునందు ననేకవిధములగు సస్యములు భూముల తత్వముల కనువగునటులు పండింపఁబడుచున్నటులును' నేటివలె, వివిధభాషలను మాటలాడువారు, వివిధజాతుల వారు, వివిధమతములవారు కలిసికొనుచు, వర్తకమునకు బండ్లపైని, రథములపైని, వాహనములపైని, కాలినడ కను, ప్రయాణముఁ జేయుచుండినటులును, నానావిధ లోహపుగనులు విశేషించి ఇనుము, బంగారము, రత్న ములుఁగల, గనులు త్రవ్వబడుచుండినటులును, నద్యాదుల నుండి నీటిని బారించి పంటలఁ బండించుచుండినటు లును, పాడియధికముగా నుండినటులును, గ్రామసంఘా దులచే ప్రజాపాలనము నెఱవేర్పబడుచుండినటులును, చోరాదిభీతులు లేకుండగ ప్రభుత్వము జాగ్రత్తను బుచ్చు కొనుచుండినటులును దోచును. సర్వవిధముల నేటి వ్యవ సాయస్థితికిని నాటి వ్యవసాయస్థితికిని భేదము కాన్పిం పదు. కాని గనులనుండి లోహములు విశేషముగాఁ ద్రవ్వబడుచుండుటచేతను, భూమిపై పన్ను నామమాత్ర ముగ నుండుటచేతను, ప్రభువులు ప్రజలు కూడ నేటి కంటె ధనవంతులుగా నుండిరని తలంపవలసియున్నది. ఆకాలమునందును నేటివలె కఱువు స్థిరముగా నుండక పోయినను, అతివృష్ట్యనావృష్టులవలన నపుడపుడు కలు గుచుండెడిది. నాటిప్రభుత్వ "మాక్షామ" నివారణము కొఱకు, చాల పరిశోధనల జేసి, కొన్ని శాశ్వతములగు, క్షామనివారణోపాయముల గనుపట్టి ధన్యులైరి, అం దును గురించి, రెండుగాథల నిట వ్రాయుచున్నాను. ఛాందోగ్యోపనిషత్తుయొక్క ౧ వ ప్రపాఠకము ౧౦ ఖం డ ౧ మొదలు ౭ అనువాకమువరకు నీక్రిందిగాథ వర్ణిం పఁబడెను. గ్రంథము పెరుగునని, తాత్పర్యమును మాత్ర మే వ్రాయుచున్నాను. "కురుదేశమునం దొకప్పుడు వడగండ్లవానచే పంటలు చెడినందున క్షామము కలిగెను. అపుడు, "చక్రునివంశస్థుఁడగు, నుషస్థుఁడ"ను ఋషి, "ఆటకి" యను భార్యతో భుక్తికి లేక కష్టపడుచు, గజములను శిక్షించువారి గ్రామమున వసించెను. ఇట్లు కష్టపడుచు నొకనాడు గజశిక్షాధ్యక్షుని నన్నము కొఱకు యాచించెను. ఆగజశిక్షాధ్యక్షుఁడు, తాఁ దినుట "కుచ్ఛిష్టపాత్రము" నందుంచఁబడిన "అలచందల"కంటె వేరుగా బ్రాహ్మణులకు వినియోగింపఁదగిన "కుల్మాషము" లు లేవని చెప్పెను. అపు డాయుషస్థుఁడు, క్షుద్బా ధితుఁడుగా నుండుటచే, నా "యుచ్ఛిష్ట కుల్మాషము" లనే యీయమని కోరెను. వా డా "యలచందల"నిచ్చి ముని భక్షించిన పిమ్మటను తా ద్రావగా మిగిలిన, తన పాత్రలోని నీరును ద్రావుమని గజశిక్షకుఁ డనెను. ఉష స్థుడు నే నాయుచ్ఛిష్టోదకముం ద్రాగిన, దోషినగుదు నని ను. కుల్మాషము లుచ్ఛిష్టములు గావా యని గజశిక్ష కుడు ప్రశ్నింపగా ప్రాణధారణమున కాధారము లేనం దున కుల్మాషోచ్ఛిష్టము దింటిని నీరు యథేచ్ఛముగ లభించుచున్నది. ఆపద్ధర్మముచే నుచ్ఛిష్టాన్నము దినుట దోషముకా దనెను. ఇది అతివృష్టిక్షామము. మహాభార తము శాంతిపర్వము ౧౪౧ అధ్యాయమున అనావృష్టి క్షామము వర్ణింపఁబడెను:

దానిని తిక్కన సోమయాజులు భాషాంతరీ కరించెనో చూడుడు.

క. ఏపారి తొల్లి త్రేతా
ద్వాపరములసంధి నొక్కపఱుపు ధరిత్రీ
తాపంబుఁ జేసె జనముల
పాపంబున వత్సరములు,పండ్రెండధిపా.శాం.ఆ౩

సీ. ఏఱులుఁ జెఱువులు నివురఁ గర్షనము లెం
దునుఁ జెడఁ దరులతాదులునుఁ గమర
భూవిఁయుఁ బసమాల గోమహిషాదిజీ
వనంబు వోఁయ భూవరులు మేర
దప్పి లోకములోని ధాన్యముల్ గొన నన
ర్థం బంతకంతకుఁ బ్రబ్బ నధిక
లనపలఁ జెఱుపంగ యాగముల్ దేవతా
పూజలు నెడలంగ భూసురప్ర

గీ. ముఖముఖ్యలైనవర్ణముల చొప్పు దప్ప నా,
హారరహితజనము లచట నచటఁ
బడఁగ జూడ ఘోర భంగిగాఁ దఱచయ్యె,
డొక్కలున్నవారి కెక్కుభయము.

ఈ యనావృష్టిక్షామకాలము త్రేతాద్వాపర సంధిలో జరిగెనట. ఆసమయమున

విశ్వామిత్రమహర్షి క్షుత్పీడితుఁడై, ప్రాణాపాయసమయమున చండాల వాటికయందు దొంగతనముగా కుక్కమాంసమును గొని భక్షించుట కుద్యమించుటయు చండాలుఁడు, విశ్వామిత్రుని హింసింపఁబోవుటయు ననుగాథ "పుల్కస విశ్వామిత్రసంవాద" మనుపేర చిత్రముగ మహాభారతమున వర్ణింపబడెను. ఇట్టి క్షామము లాకాలమున నపుడపుడు పొడచూపగా నాటి ప్రభువులు, "అతివృష్ట్యనావృష్టులనుఁ" దెలిసికొనుటకు దగిన విధానముల గనిపెట్టిరి. రాబోవు కాలమున వర్ష విధానాదుల బరిశీలించుటకు "ధాతుపరీక్షలను" "వార్షిక వాయు మార్గపరీక్షలను" జేయుటకు బ్రారంభించిరి. నేఁడు, "సిమ్లా" యందు "పవనశాస్త్రజ్ఞుల" సమూహము (మిటియరాలాజికల్ డిపార్టుమెంటు) ను ప్రారంభింపక పూర్వము ౩౦౦౦ సం.రములకు బూర్వమే మనదేశస్థులుపై డిపార్టుమెంటును స్థాపించియున్నారు. దీనికి "దైవజ్ఞ" సంఘ మని పేరు. భూతోత్పాతముల దెలిసికొనుటయే వారిపని. భూతోత్పాతములఁ దెలిసికొని రాజు తగిన జాగ్రత్తలఁ బ్రజలకొరకు చేయుచుండువాఁడు. ఇది అతివృష్టి సంభవింపఁబోవునపుడు పనికివచ్చును. అనావృష్టులు వచ్చునని జలసమృద్ధి కలుగునట్టుల తటాకాదులఁ ద్రవ్వించి దేశమాకాశమును నమ్మియుండకుండగ సర్వసస్య సంపూర్ణముగ నుండునట్టులఁ జాగ్రత్తపడిరి. ఇందులకు మహాభారతమునుండి కొంత వ్రాసెదను.

౧ (నారదుఁడు ధర్మరాజుతో నిటులనుచున్నాఁడు) ఓ ధర్మరాజా! దైవోత్పాతములఁ దెలిసికొనుటయందు నీచే నియమితుఁడగు దైవజ్ఞుఁడు, నిపుణుఁడే కదా!... నీరాజ్యమునందు కృషీవలులు, సంతుష్టులై యున్నారు కదా! నీరాజ్యమున చెఱువులు, పెద్దవిగాను జలసమృద్ధి కలవిగాను నుండెను కదా? చెఱువులలోని నీరు వంతులవారిగా పంపఁబడుచుండెను కదా! వాన కురియునని, ఆకాశమును, నమ్ముకొని వ్యవసాయము, చేయబడుచుండుట లేదు కదా! వ్యవసాయదారునకు, తినుటకు నన్నమును చల్లుటకు విత్తనములు, నిండుగ లున్నవి కదా? వ్యవసాయకునకు నూటికి నెల ౧-కి యరూ ౦-౪-౦ వడ్డీచొప్పున, బదుళ్లు నిచ్చుచుంటివి కదా? పల్లెలయందు, వ్యవసాయకులు సంఘముగాఁ జేరినపుడు క్షేమమును తలచుచున్నారు కదా?

నాటి పరిపాలకులు, దేశమునం దిట్టిప్రేమను జూపి యెట్టిస్థితిలో నుంచిరో శ్రీమద్రామాయణము, అయోధ్యాకాండ ౧౦౦ సర్గలోని, శ్రీరాముఁడు భరతునితో నాడిన వాక్యములవలన దెలియుచున్నది. వానిలో గొన్నిటి నిట వ్రాయుచున్నాఁడను.

౨ ఓ భరతుఁడా! అనేకశతయాగములు జరిగినయానవాళ్లు కలదియు, యోగ్యులగు జనులు నివసించినదియు, దేవస్థానముల చేతను, చలిపందిళ్ల చేతను, చెఱువుల చేతను శోభించుచున్నదియు సంతోషముతోఁ గూడిన స్త్రీపురుషులు కలదియు, ననేక సంఘములచేఁ జేయఁబడు నుత్సవములు కలదియు, మంచి పంటలు పండింపఁ బడుచున్నదియు, పశుసమృద్ధి కలదియు, రోగాదులచే హింసింపఁ బడనిదియు, ఆకాశమును నమ్ముకొని వ్యవసాయము జేయక కాలువలు మొదలగువాని పారుదలచే సస్యాఢ్యమైనదియు, క్రూరమృగముల చేతను, దొంగల చేతను, రోగముల చేతను పీడింపబడనిదియు, త్రవ్వబడుచుండిన పెక్కు గనులు కలదియు, పాపజనులు లేనిదియు, మన పూర్వులచే రక్షింపబడునదియు నగు, మనరాజ్యములోని, పల్లెటూళ్ల సమూహము సురక్షితమై, సుశోభితమై యుండెను కదా?

---

౧ శ్లో॥ ఉత్పాతేషుహి సర్వేషు దైవజ్ఞః కుశలస్తవ...కచ్చిత్తుష్టాః కృషీవలా; కచ్చిద్రాష్ట్రే తటాకాని పూర్ణానిచ బృహంతిచ, భాగశో వినివిష్టాని నకృషి ర్దేవమాతృకా, కచ్చిన్న బీజంభక్తంచ కర్షకస్యావసీదతి, పాదికంచ శతం వృద్ధ్యా దదాస్యృణ మనుగ్రహమ్. క్షేమం కుర్వంతి సంహత్య రాజన్! జనపదేతవ. మహాభారతమ్-సభాపర్వం ౫ అధ్యాయము. (౨) శ్లో. కచ్చిచ్చైత్య శతైర్జుష్టః సునివిష్ట జనాకులః, దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకైశ్చోపశోభితః; ప్రహృష్ట నరనారీకః సమాజోత్సవ శోభితః, సుకృష్టసీమా పశుమాన్ హింసాభిః పరివర్జితః; అదేవమాతృకో రమ్యశ్శ్వాపదైః పరివర్జితః, పరిత్యక్తోభయైస్సర్వైః ఖనిభిశ్చోపశోభితః; వివర్జితో నరైః పాపై మర్మపూర్వైస్సురక్షితః, కచ్చిజ్జనపదస్ఫీతః సుఖం వసతి రాఘవ! శ్రీమద్రామాయణము అయోధ్యాకాండ ౧౦౦ సర్గ.

# సాభిప్రాయవిశేషములు

ఇకారాంత వర్షసప్తకమునందారేండ్లు గతించినవి. ఏడవయేడు రక్తాక్షిప్రారంభమైనది. ఈవర్షసప్తకమునందు ప్రపంచవృత్తియందు సంప్రాప్తమైన మహా సంక్షోభము ప్రాజ్ఞుల హృదయమునందు ధర్మజిజ్ఞాసను గలుగజేయుచున్నది. ప్రపంచ మంతయును శాంతికి పరితపించుచున్నను పాశ్చాత్య రాజ్యముల పశుబలారాధనవ్యామోహము శాంతిస్థాపనమునకు ప్రతిబంధకమై ప్రపంచపీడకు దోడ్పడుచున్నది. ఫ్రాన్సురాజ్యము దివాలా స్థితియందున్నను జర్మనుపీడనమును తగ్గించుటలేదు. పాయిన్కేరుగారు తిరిగి మంత్రిగ నుండుట కంగీకరించిరి నష్టపూరణమువిషయమునను రక్షణమువిషయమునను పాయిన్కేరుగారు తెలిపినభావములు శాంతిసూచకములుగను గనుపింపవు. పాయిన్కేరుగారి భావములు క్రోధాయత్తములుగనున్నవి. గ్రేటుబ్రిటనుకును ఫ్రాన్సునకును నీవిషయము పట్లను సమాధానము గలుగనేరదు. "చిరకాలమవరోధితమై ప్రపంచము పరితపించుచున్న నూతనభాస్కరోదయమునకు ఫ్రాన్సునిరీక్షించుచున్నది." అని పాయిన్కేరుగారు మాటలయందు దెలిపినను చేతలుమాత్రము భావమునకు విరుద్ధముగ నున్నవి. స్వప్రయోజనపరాయణత్వముధర్మారాధనమునకు బ్రతికూలము. ఫ్రాన్సుహృదయము మారనంతవరకును యూరపునందును ప్రపంచమునందును శాంతిస్థాపనము సాధ్యముగాదని విదితమగుచున్నది.

* * * *

రుష్యారాజ్యము చీనాను బెదరించుచు యుద్ధమునకు కాలుదువ్వుచున్నది. యూరపు రాజ్యములన్నియును పరివర్తన భావభరితములై సంక్షోభమయముగ నున్నవి. గ్రీసుదేశము రిపబ్లికును ప్రకటించినది. తురుష్క-రాజ్యము ఖలాఫతుపదవిని విసర్జించినది. పర్షియా రిపబ్లికును ప్రకటింపనున్నటులు వార్తలు తెలుపుచున్నవి. అరాబియా పలస్తీనుదేశములందశాంతి పెరుగుచున్నది. భారతదేశమునందశాంతి తరంగములు ప్రబలమగుచున్నవి. ప్రపంచవ్యాప్తమైనయశాంతితరంగములు రక్తాక్షిసంవత్సరమునందెటులు పరిణమించునదియును భగవదధీనమునందు గలదు. ఈ సంక్షోభావస్థయందు ప్రపంచశాంతిని గాపాడవలసిన భారము బ్రిటీషు కార్మిక ప్రభుత్వముమీదనున్నను సామ్రాజ్యసంస్కారాభిమానము శాంతిసంరక్షణమునకు ప్రతిబంధకముగ నున్నది. శాంతికాముడైన గాంధిమహాత్ముని విమోచనము కార్మిక ప్రభుత్వమునకుగల శాంతి ప్రియత్వమును విశదము చేయుచున్నది. ఓలివియరు ప్రభువుచేసిన మహాత్ముని నిర్బంధసనిరసనమును శాంతిప్రియత్వమును విశదము చేయు

చున్నది. రక్తాక్షిసంవత్సరము తీక్ష్ణకరమైనను గాంధిమహాత్ముని నాయకత్వము క్రింద ప్రశాంతముగ బరిణమించుటకు భగవంతు డనుగ్రహించుగాత?

* * * *

భారత రాజ్యాంగ సంరంభమునం దొక రంగము ముగిసినది. రెండవరంగ మెటులు ప్రారంభము గావలయునో తెలియకున్నది. అన్నిపక్షములవారును భావికర్తవ్యమును దెలియకను ముందువెనుకాడుచున్నారు. ఎన్నికలయందు గలిగిన విజయమును స్వరాజ్యపక్షము బాగుగ వినియోగించినది. స్వరాజ్యపక్షనాయకుల రాజ్యతంత్రము ప్రభుత్వపక్షతంత్రమును మించినది. నెహ్రూ పటేలు జిన్నాగారులు మొదలగువారి చాకచక్యము ముందరను హెయిలీగారియాటలు సాగలేదు. వారి భేదనోపాయములు నిరర్థకమైనవి. దేశబాంధవుడు పండిత మదనమోహనమాళవ్యగారు నిరంకుశప్రభుత్వనటనమును నిర్భయముగను విశదము చేసిరి. చిత్తశుద్ధిగల భారతీయులు నిరంకుశ విధానమును సంరక్షింపజాలరని పరిస్ఫుటము చేసిరి. సామ్రాజ్యశాసనసభ ఆర్థికశాసనసభను నిరాకరించి ప్రజాభిప్రాయమును విశదము చేసినది. ఈవిజయము స్వతంత్రపక్ష సహాయమునను గలిగిదనునాక్షేపణ కవకాశము లేదు. నిర్బంధశాసనముల నుపసంహరింపవలయునని సామ్రాజ్యశాసనసభ తీర్మానించినది. రాజ్యాంగ సమస్యను నిర్ణయించుటకు భిన్నపక్షములవారి సభాసమావేశమును జేయవలయునని శాసనసభ తీర్మానించినది ఈ తీర్మానములను ప్రభుత్వము ప్రకటించినది. ప్రభుత్వపక్షమున కిట్టిపరాజయము లెన్నియో గలిగినవి. ధర్మనిరీక్షణవిరహితమైన ప్రభుత్వమున కీ పరాభవము జ్ఞానోదయమును గలుగజేయలేదు. రీడింగు ప్రభువు ధ్రువకరణాధికారమును వినియోగించుచు శాసనసభ్యుల నాక్షేపించుట విచిత్రముగనున్నది. ప్రజాప్రతినిధుల యభిప్రాయములకు వ్యతిరేకముగను బ్రవర్తించుచు న్యాయము తనపక్షమున గలదని సమర్థించుటమాత్ర మనాదరణీయము. నిరంకుశప్రభుత్వమున కన్నియుగములందును రాజ్యములందును నిది సహజలక్షణము. సామ్రాజ్యప్రభుత్వమునందు గలిగిన పరాజయము మధ్యరాష్ట్రములందును వంగరాష్ట్రములందును గలిగినది. చెన్నరాష్ట్రమునందునయితము పరాజయము గలిగినది. ప్రజాప్రతినిధులైన మంత్రులు నిరంకుశాధికారపక్షపు సహాయమువలన బ్రతుకుచున్నారు. సంస్కరణముల మిథ్యాస్వభావమును గవర్నరుల ధ్రువకరణాధికారము విశదముచేసినది. ఎంతకాలము ధ్రువకరణాధికారము నిలువగలదో చూడవలసియున్నది. ధర్మసందేహములేని ప్రభుత్వ మెంతకాలమైనను నీయధికారమును వినియోగించుచు కాలయాపనమును జేయవచ్చును.

* * * *

స్వరాజ్యపక్షము కొంతవిజయమును గడించినను ప్రభుత్వమును ప్రతిష్టంభనమును జేయజాలదని విశదమైనది. జెయిటో హత్యలు నిరంకుశాధికారహృదయము మారనివిధ

మును విశదము చేసినది. బ్రిటిషు ప్రభుత్వ స్థితికి పశుబలమే శరణ్యమని విశదమైనది. ప్రజా ప్రతినిధులకే పశుబలమును ప్రతిఘటించుటకు శక్తిలేదని ప్రభుత్వవిధానము విశదము చేయుచున్నది. స్వరాజ్యపక్షపు ప్రయోజన మింతటితో ముగిసినదని విశదమగుచున్నది. స్వరాజ్యపక్షపు రాజ్యనీతి ప్రతిష్టంభనమును జేయగడగినను జేయలేకపోయినను స్వరాజ్య సంపాదనమునకు వినియోగపడ జాలదని విశదమైనది. ఇకముం దీపక్షమేమి చేయవలసియున్నదియును తెలియకున్నది. పార్లమెంటును ఆంగ్లపత్రికలును నిరంకుశాధికారమును సమర్థించుచున్నవి. దేశమునకు మోక్షము శాసనసభలవలనను గలుగదని విశదమైనది. మహాత్మునితో నాయకు లిపుడు సంప్రతించుచున్నారు. మహాత్ముడు దేశదృష్టిని నిర్మాణ కార్యవిధానమునందు లగ్నముచేసి ప్రజాశక్తిని విజృంభింపజేయవలయునని నిర్ణయించుటసహజము. స్వరాజ్యమును బడయుటకిదియే సాధనమని దేశపరిస్థితులు స్పష్టము చేయుచున్నవి. ప్రజాశక్తిని నిర్మాణ విధానమునందులగ్నముచేసి వికసింప జేయుటయే కాంగ్రెసు ధర్మముగ నున్నది. ఈమహాకార్యమును సఫలముచేయుటకు గాంధిపూజానిధిని సమకూర్చుటయందు గలయవసరము విశదమగుచున్నది. మహాజనులు యథాశక్తిని పూజానిధికి ద్రవ్యమును సమకూర్చి గాంధిమహాత్మునిసంకల్పమును సఫలము చేయుటకు దోడ్పడుదురుగాత!

* * * *

రెండవయాంధ్ర చిత్రకళా ప్రదర్శనము కాకినాడ యందు గతమాసాంతమునందు జయప్రదముగ జరిగినది. కార్యదర్శి శ్రీయుత దామెర్ల వెంకట్రావుగారును వారిసోదరుడు రామారావుగారును ఆంధ్ర చిత్ర కళాభివృద్ధికి జేయుచున్న పరిశ్రమ ప్రశంసనీయముగ నున్నది. అధికారాదరణము లేకపోయినను చిత్రకళా ప్రదర్శనము జయప్రదముగ జరిగినది. ప్రదర్శింపబడిన చిత్రపటములు చిత్రకళయం దాంధ్రులకుగల యభినివేశమును వ్యక్తిత్వమును విశదముచేసినవి. చిత్రపటముల స్వరూప స్వభావములు ప్రత్యేకవ్యక్తిత్వమును విశదముచేసినవి. ఆంధ్రకళావైఖరి ప్రాచ్యకళావైఖరి నవలంబించుచున్నను ప్రత్యేకమైన వ్యక్తిత్వమును గలిగియున్న విధమును రామరావుగారు మొదలగువారు చిత్రించినచిత్రములు విస్పష్టము చేయుచున్నవి. ఈచిత్రపటములు రంగులందును రూపరేఖవిలాసనిర్మాణము నందును వంగదేశకళావైఖరినిగాని పాశ్చాత్య కళావైఖరినిగాని కేవలమనుకరణమును జేయక వ్యక్తిత్వమును గలిగి యాంధ్రప్రవృత్తిని విశదము చేయుచున్నవి. ఆంధ్రత్వవికాసమునకు చిత్రకళావికాసావసరమును ప్రదర్శనమువిశదముచేసినది. కాకినాడప్రదర్శనమునందలి చిత్రపటములవివరము రాగలసంచికయందువివరింపబడును. ఆంధ్రదేశమునందు చిత్రకళాభిజ్ఞానమును వికసింపజేయుటకు శ్రీయుత దామెర్ల వేంకట్రావుగారుచేయు ప్రయత్నములకు శ్రీమంతులును కళాభిజ్ఞులును దోడ్పడి స్వధర్మ నిర్వహణమును జేయుదురుగాక.

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thumbu Chetty Street, G.T.Madras

# విషయానుక్రమణిక

---

# చిత్రపటముల వివరములు

వర్ణచిత్రములు:—యశోధర-సిద్ధార్థుడు, చిత్రకారుడు: శ్రీ. డబ్ల్యూ ఏ. ఆర్యదాసు గారు; అనార్కాలి; బజబహదూరు-రూపమతి,

సాధారణచిత్రములు:—శ్రీయుత చెన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారు, బి. ఏ., శ్రీ. సి. బి. మల్లప్పగారు-కబీరుదాసు; శ్రీయుత బులుసు సాంబమూర్తిగారు; మధుకలశము, శ్రీ ప్రొఫెసర్. సి. వి. రామన్‌గారు, ఎం. ఏ., డి. యస్. సి., యఫ్. ఆర్. యస్.; బజబహదూరు మందిరము; డాక్టరు కజిన్సుగారు; శ్రీశైలమునందలి శిల్పచిత్రములు; ఇతరచిత్రములును.

## విజ్ఞప్తి

మా చందాదారులకు ప్రతినెలలోను 7 వ తేదినాడు 'భారతిని' పంపుచున్నాము. ఏ కారణముచేతగాని 15 తేదులలోపల సంచిక అందక పోయినచో దయచేసి మాకు వెంటనే తెలుపగోరుచున్నాము. మేము చేరని వారికి సంచికలను తోడనే అందచేయుదుము.

సంపాదకుడు.



యశోధర - సిద్ధార్థుడు

"సబ్బపాపస్స అకరణం కుసలస్స ఉపసంపదా, సచిత్త పరియోదపనం ఏతం బుద్ధానుసాసనమ్
యో చ బుద్ధంచ ధమ్మంచ సంఘంచ సరణం గతో, చత్తారి అరియసచ్చాని సమ్మప్పఞ్ఞాయ పస్సతి."—శ్లో. 5, 12. బుద్ధవగ్గో, ధమ్మపదమ్.

చిత్రకారుడు: శ్రీ డబ్ల్యూ. ఏ. ఆర్యదాసుగారు.

# "యశోధర - సిద్ధార్థుఁడు"

## చిత్రముయొక్క వివరణము

అడుగునవైపు మెట్లు, తటాకసోపానములు, తటాకభిత్తి, పశ్చాద్భాగము.

సోపానములు క్రిందినుండి పైకి క్రమముగ స్రోతాపన్న, సకృదాగామి, అనాగామి, అర్హత అను నాలుగవస్థలు; తటాకభిత్తి, ప్రత్యేకబుద్ధావస్థ; పశ్చాద్భాగము; బుద్ధావస్థ.

క్రింద కుడివైపున నొకతామరాకుపై నున్న పదిపూవులును దశశీలములు: అహింస, అచౌర్యము. అకామమిథ్యాచారము, సత్యవాక్కు, అపైశున్యము, అపారుష్యము, అసంభిన్నప్రలాపము, అనభిధ్య, అవ్యాపాదము, అమిథ్యాదృష్టి యనునవి.

యశోధరపరిధానమునందు కట్టులోని యెనిమిదికమలములు ఆర్యాష్టాంగమార్గములు; సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి అనునవి.

వెలుపలికి వ్రాలియున్న నైదుతొడిమలు పంచస్కంధములు; రూపము, వేదన, విజ్ఞానము, సంజ్ఞ, సంస్కారము అనునవి.

యశోధర బుద్ధునిచేతనుంచిన మూడు కమలములు శరణత్రయము; బుద్ధధర్మసంఘము లనునవి. యశోధర 'బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అని చెప్పునట్టులున్నది. యశోధర శిరమునకుఁ జుట్టియున్న పూలదండ యామె పవిత్రతను దెలుపుచున్నది. రెండుకంబములలో సిద్ధార్థున కాశ్రయమైయున్నది ధర్మము, వేఱొకటి యధర్మము.

సిద్ధార్థుని కంఠహారములు చతురార్యసత్యములు; దుఃఖము, దుఃఖసముదయము, దుఃఖనిరోధము, దుఃఖనిరోధగామినీప్రతిపత్తి అనునవి. అతనిముందట నున్న పుష్పము విజ్ఞానము. శిరస్సు నావరించియున్న కిరీటలోహితాభారమాంజిష్ఠవిశిష్టప్రభాపుంజము నిర్వాణసూచకము. అతని రెట్టకడియములును, ముంజేతికంకణములును, శిష్యులగు శారిపుత్ర మౌద్గల్యులు. సమీపమున నుండు వృక్షము బోధిద్రుమము.

# శంకరజయంతి

(వైశాఖ శుద్ధ పంచమి 9-5 24)

## శ్రీ. వై. కోటీశ్వరశర్మ శాస్త్రి గారు వ్రాసినది

శ్లో. శాస్త్రం శారీరమీమాంసా దేవస్తు పరమేశ్వరః,
ఆచార్య శ్శంకరాచార్య స్సంతు మే జన్మజన్మని.

సృష్ట్యాదినుండి నేటికాలమువఱకు అవిచ్ఛిన్నముగ ప్రకాశించుచున్న సనాతన ధర్మముయొక్క ప్రాచీనత్వము సుప్రసిద్ధముగదా. ప్రపంచమునందు నేటి వఱకు అనేకమతములు పుట్టి గిట్టుచున్నవి. యుక్తివజ్రాఘాతములకు కొంచె మైనను చలింపక ప్రకాశించుసనాతనమతపర్వతముతో పోల్చదగిన మత మింకొకటి మనకు గనంబడుటలేదు. ఈ మతధర్మములు వేదశాస్త్రములందు వివరింపబడియుండును. జీవహింసయే జీవికగా గలిగి జీవించు కటికవాడు మొదలు కొని 'అహం బ్రహ్మాస్మి' యను దృఢభావనముగల బ్రహ్మవిద్వరిష్ఠునివఱకు నున్న బహువిధసంఖ్యాక భేదములవారలలో వారివారి యధికారతారతమ్యాను సారము లెక్కలేని యుపాయములు భిన్నభిన్నములగు ఆచరణములు శాస్త్ర ములందు నిరూపింపబడినవి. శాస్త్రనియమములకు లోబడిన ఆయుపాయములు ఆచరణము లన్నియు సనాతనధర్మమునకు చేరినవియే. ప్రాయశః ఇతరమత ములం దిట్టి తరగతులు లేక అందఱకు ఒకేవిధమయిన యాచరణమేయుండును. మన యాచార్యులవారు దాదాపు ౨ వేల సంవత్సరముల క్రిందట భరతవర్ష మున కేరళదేశమున జన్మించి బాల్యముననే సకలవిద్యల నభ్యసించి బ్రహ్మ చర్యమునుండియే సన్న్యసించి అధికారతారతమ్యానుసారము ప్రస్థానత్రయ భాష్యాద్యనేకగ్రంథముల రచించి శిష్యులకు బోధించి ఆసేతుహిమాచలము పాదచారముచేత పవిత్రమొనర్చి దుర్మతముల ఖండించి దిగ్విజయమొనర్చి అధి కారతారతమ్యానుసారము షణ్మతముల స్థాపించిరి. కావున భారతీయులందఱు (9-5-24) నాడు శంకరజయంత్యుత్సవమును జరుపుట యుక్తము.

ఇట్టి జగద్గురు సార్వభౌము లగు ఆచార్యులవారి సంపూర్ణచరిత్రము ప్రతిమాసహితముగ అవకాశము ననుసరించి ఇందు ప్రకటింపబడగలదు.

శ్లో. వేదే బ్రహ్మసమ స్తదంగనిచయే గర్గోపమ స్తత్కథా
తాత్పర్యార్థ వివేచనే గురుసమ స్తత్కర్మసంకీర్తనే;
ఆసీ జ్జైమిని రేవ సూత్ర నిచయ స్యార్థోపసంవర్ణనే
వ్యాసే నైవ సమ స్స శంకరగురు ర్జేజీయతాం మానసే.




చెన్నపట్టణము, మే ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౫.

# వాఙ్మయపరిణామము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

శా. భాషాదేవత సుస్వరూప మది విస్పష్టంబుగాఁ గానరా;
దీషజ్జ్ఞానమ యెల్లవారికిని; మా కీనాఁడు బహ్వర్థముల్
భాషింపన్ వలసెన్; నిబంధముల నిర్బంధం బసంబద్ధమున్
ఘోషం బేర్పడె; మార్పు తప్ప; దిట లగ్గం గూర్పు మోయీశ్వరా!

పండితులదగ్గఱనుండి పామరులదాఁక, పుట్టిన నాఁటనుండి గిట్టిననాఁటిదాఁక, ఎల్లరకును, ఎల్లప్పుడును లోకప్రవృత్తికి భాష పరమోపకారము; అత్యావశ్యకము. కాని, వారివారిచిత్తసంస్కారములలోఁ ఆవశ్యకతలలో రుచులలో అర్హతలలో భిన్నలక్షణము లుండుటనుబట్టి వారివారి భాషలుకూడ భిన్నలక్షణములతోనే యుండును. పండితులభాష వేఱు; పామరులభాష వేఱు; బాలురభాష వేఱు; ప్రౌఢులభాష వేఱు. వారువారు వారి

వారిభాషలలోఁ దమతమ యవసరములను దీర్చుకొనుచుందురు. పండితునకు రామకథ భవభూత్యాదిప్రౌఢకవినాటకములచే దర్శనీయము కాఁగాఁ బామరునకుఁ దోలుబొమ్మలాటచే దర్శనీయమయ్యెను. పండితుఁడు తిక్కన భారతము చదివి భారతకథ తెలిసికోఁగాఁ బామరుఁడు "హరీహరీ నారాయణాది నారాయణా" మట్టుపదములు మొదలైనవి చదివి దానిని దెలిసికొనును. పండితుఁడు "వచ్చుచున్నా"నని"వస్తున్నా"నని యనఁగాఁ బామరుఁడు "వస్తుండాను" "వత్తుండాను" అని యనును. వారి రుచులు వేఱు; వీరి రుచులు వేఱుగదా! ఇట్లు భేదపరమావధులను జూపఁబూనినచో నొక్కొక్కని కొక్కొక్కతీరుభాష యున్నదన్నంతవఱకుఁ జూపవచ్చును. ఇందులో నెవ్వరుగాని సంఘమునుండి యెట్లు తొలఁగింపరానివారుగా నుందురో అట్లే వారిభాషయు నపరిహార్యమే యగును. కాని యింతవఱకుఁ గడచిచన్నకాలమం దట్లు జరుగలేదు. ఉన్నత సంఘములవారి యుత్కృష్టభాషయుఁ దత్ప్రయోజనములును,కొంతకొంత పరిరక్షింపఁబడినవిగాని, యధమసంఘములవారి యవనతభాషయు వారిభాషాప్రయోజనములును, పరిరక్షింపఁబడలేదు. అందఱకు సమానమయిన యర్హత సమ్మానము ప్రాచీనకాలమునం దెల్లేర్పడలేదో అట్లే వారివారిభాషలకును భాషాప్రయోజనములకును సమానమయిన సమ్మానము, అర్హత, కలుగదయ్యెను. ఇది సర్వలోక సర్వభాషాసామాన్యమయిన విషయమే.

ప్రస్తుతమగుటచే నిట మన తెనుఁగునాటి మాట తీసికొనుచున్నాను. ఇతరులచేఁ బ్రాజ్ఞులని సత్కరింపఁబడినవారు, ఇతరులను దమనిర్ణయముచొప్పున వినిపింపఁగల్గినవారు, ఎవరో కొందఱాయాకాలములయం దేవో కొన్ని ఛందోవ్యాకరణాదివిధుల నేర్పఱిచి యావిధుల చొప్పున గ్రంథరచనాదికము జరుగవలెనని నిబంధములు గల్పించుచు వచ్చిరి. అధమగతి నున్నతక్కినలోకమువారినిర్ణయములనుగొన్ని ప్రయోజనములందుఁ గొంతకొంత పాటించుచు వారిని వెంటాడుచు వచ్చిరి. దేశకాలపాత్రములనుబట్టి యానిర్ణయములును మాఱుచు వచ్చినవి. మఱియు నిట్లింతకాలమువఱకు నాభాషాలక్షణనియామకులు తమకుఁ బరిచితమయిన జనసంఘమును బ్రయోజనములను మాత్రమే లక్ష్యముగాఁ జూచుకొని నిబంధములఁ జేయుచువచ్చిరి. కాని,యాభాష ప్రచారముగాంచిన సర్వమానవసంఘమునుగూర్చియు, భాషవలన వారివారికిఁ గలుగవలసిన సర్వప్రయోజనములను గూర్చియుఁ, జర్చించి సర్వార్థసాధకమగునట్లు నిబంధముల నేర్పఱిచినవారు కారు. కావ్యాలంకారచూడామణికారునినుండి బాలవ్యాకరణకారునిదాఁకఁ గలపండితులు చేసిన నిబంధము లాంధ్రదేశమందలి పరిమితమానవసంఘమునకుఁ బరిమితభాషాప్రయోజనమునకు సంబంధించినవే. అనఁగా, నవి తిక్కనభారతాదిప్రౌఢచ్ఛందోఘటితగ్రంథములను జదువఁగలపరిమితమానవసంఘమునకుఁ బరిమితభాషాప్రయోజనమైన కావ్యానందమునకు మాత్రమే కొంత చాలి

యున్నవి. ఇంతదాఁకఁ గడచినకాలము తీరు వేఱు. నేఁటి కాలము తీరు వేఱు. పూర్వమువారు తలఁచియైన నెఱుఁగని యావశ్యకత లెన్నో యీనాఁటివారికిఁ గల్గుచున్నవి. పూర్వమువారు మానవులుగాఁగూడ గణింపనివా రెందఱో యిప్పుడు మహనీయులగుచున్నారు. ఇట్టిస్థితిలోఁ బ్రాచీనులనిబంధము లీకాలమునఁ బనికిఁజాలనివి, పనికిమాలినవి యగుచున్నవి. భాషావిషయముననే కాక సర్వవిషయములందు నిట్టిసంఘర్షమే సంఘటిల్లినది. నేఁ డొకయుద్భుతశక్తి యఖిలప్రపంచము నావహించినది. భారతదేశము నది బలముగా నలముకొన్నది. ప్రతిమానవునకు "నేను బరతంత్రుఁడనుగా నుండరాదు. స్వతంత్రుఁడను గావలెను" అను నాత్మాభిమానము పొడముచున్నది. ఒకనినిబంధమునకింకొకఁడు లోఁబడకున్నాఁడు. బ్రాహ్మణునియాధిక్యమును బ్రతిఘటించుటకు మాలవాఁడును, మహారాజు ప్రాభవమును బ్రతిఘటించుటకు దరిద్రుఁడును బ్రయత్నించుచున్నారు. ఈసంఘర్షమనివార్యముగానున్నది. నివారించుటకూడఁ గూడనిపనిగాఁదలఁపఁబడుచున్నది. దీర్ఘదర్శులు కొందఱు పెద్దలిందుకై చండాలాదుల యస్పృశ్యతాదులను దొలఁగింపవలెననియు, దరిద్రులు సంపన్నులగుటకు వలయుసాధనముల సమకూర్పవలెననియు సంస్కారములు సేయ సమకట్టుచున్నారు. భాషావిషయమునఁగూడ నట్టిదే జరుగుచున్నది. కొందఱుపండితులు, కొన్ని భాషాప్రయోజనములనే యుద్దేశించి చేసిన నిబంధములు నిలువరింపరానివనియు, భాషవలన నంతకంటె హెచ్చుప్రయోజనము లిప్పుడు పడయవలసిన యావశ్యకత యేర్పడుచున్నదనియు సర్వమానవసంఘమును భాషాప్రయోజనసర్వస్వమును సమముగాఁ బడయవలసియున్నదనియు, నందులకై వాడుకభాషను గ్రంథరచనము జరుగవలెననియు వాదించుచున్నారు. అట్లు గ్రంథరచనములు చేయుచున్నారు. నేనును నట్టిసంస్కారము నభిమానించినవారిలో నొక్కఁడను. కాని, దానిఁగూర్చి యిటీవల నా యభిప్రాయము మఱింత విపులముగా విరిసి దిక్కుదోఁచనిదిగా నున్నది.

ఇదివఱకు మేము కొందఱము సంకల్పించినసంస్కారములు సంకుచితభావములు గలవిగా నే నిప్పుడు తలఁచుచున్నాను. ఏలనఁగా: "వచ్చుచున్నాను" అను శబ్దరూపమువలెనే "వస్తున్నాను" అనురూపముకూడఁ బ్రాజ్ఞవ్యవహారమందుఁ గలదుగనుక ప్రయోగార్హమని యంగీకరింపఁదగునంటిమి. కాని ప్రస్తుత కాలపరిణామమునఁ జూడఁగాఁ బ్రాజ్ఞసంఘమిది యని వేఱుపఱుచుటకిఁక వీలుకలుగనట్టున్నది. సర్వమానవసంఘమందును విద్యావిజ్ఞానములు విపులముగా నెలయుచున్నవి. అహమిక నిండారుచున్నది. బ్రాహ్మణాదుల వ్యవహారమందుఁ గల 'వస్తున్నాఁడు' ప్రయోగార్హమయినప్పుడు చండాలాదుల 'వస్తుండాడు' మొదలగురూపములు ప్రయోగార్హము లేలకావు? బ్రాహ్మణులయాధిక్యమును జండాలురు వెన్నాడకున్నప్పుడు వారిభాషాప్రయోగరీతినిమాత్ర మేల వెంటాడుదుము?

'మాసంఘవ్యవహారమున నున్న రూపమునే మేము మా గ్రంథములం దుపయోగించుకొందు'మందు రేని "వస్తున్నారు" మాత్రమే ప్రయోగార్హమని తలఁచువా రేమి బదులు చెప్పఁగల్గుదురు? ఇట్టిరూపములే ప్రయోగార్హములని విధించుటకు వీరి కేమియధికారమున్నది? నాకు నేనయి యెంతవఱకుమాత్రమే సంస్కార మంగీకరింపఁ దగునని నిబంధింపఁబూనితినేని ఆనిబంధమునకు లోఁగువా రెవరు? ఇట్టిచిక్కు భాషావిషయముననేకాక, సర్వ విషయములందును గూడ సంఘటిల్లినది. సాంఘిక రాజకీయ విషయములందుఁ గొన్నిసంస్కారములు మహాత్ములకుఁ గూడఁ గొఱుకఁబడనివిగా నున్నవి. ఈ చిక్కు యొక్క పరమావధి యేమనగా: ఒక్కొక్క మనుష్యుఁడును 'నాభాషను నేనువ్రాయుదును. ఇంకొకరినిబంధము నాకు విధాయకముగాదు' అన్నంతవఱకుఁ బోవచ్చును. కాని, ఇట్టి సంఘర్షమునఁ జిదికిపోయెడిచితనము లేవో బ్రదుకఁగల్గెడి భావము లేవో వీనిపరిణామ మెట్టిదగునో నా యల్పబుద్ధి కగోచరము గాకున్నది. నేఁడు భాషాసంస్కారము నపేక్షించి చర్చించువారిలోఁగూడ నైకకంఠ్యము లేదు. "చూచినాడు, చూచాడు, చూసినాడు, చూశినాడు, చూశాడు, చూసేడు" అని యిన్నిరూపములును వ్రాయువా రున్నారు. ఇందుఁ గొన్నియే పరిగ్రాహ్యములని వ్యవస్థాపించి యాఁచిపట్టుట కధికారులు లేరు. సంస్కారమే పనికిరాదని యడ్డుపెట్టుట కంతకంటె నధికారులు లేరు. ఆసంస్కార మనివార్యముగా జరుగుచునేయున్నది. అయ్యో! ఎంతభయంకరమైనచిక్కు? ఇట్టిచిక్కొక్క భాషావిషయమందేకాక సర్వవిషయములయందు సంప్రాప్తమయినదిగదా! మానవమాత్రుఁడు ప్రాభవముచేఁగాని ప్రజ్ఞచేఁగాని యికమీఁదికాలమున లోకమున నేవిషయముగాని యనుశాసింపఁజాలఁడేమోయని నా సంశయము. భగవంతుఁ డొకఁడుండెనేని లోకమును బరమానందోద్దేశమునకుఁ జేర్చుటే తదుద్దేశమేని, యాయన కల్యాణమార్గమేదో లోకమునకుఁ గల్పింపఁగలఁడు. అదియేదో అందువఱకును మన ప్రయత్నములు గ్రుడ్డియెద్దు చేనఁబడినలాగున సాగుచుండవలసినవే కాఁబోలును! అట్టి శుభసమయము లోకమునకు లభించు టెప్పుడో!



# తన్మయత

మద్దూరి సాంబయ్య గారు

నగము గ్రుంకుచునున్న భాస్కరుని యరుణ
కిరణజాలంబు దివిని విస్ఫురణఁ గాంచె
తరణిబింబోపరి, వినీలతరవలాహ
కంబు జాంబూనదంపు రేఖలను బూని
తనదు సోయగమును జెప్పుకొనుచునుండె.

సంజకెంజాయ పేరివస్త్రంబుఁ దాల్చి
గగనవనజాక్షి గడుసోయగంబు మీఱఁ
బ్రాణపతి పాలమున్నీటిపట్టికొఱకు
నెదురుచూచుచునుండె సమ్మోదముతోడ.

జలముపైఁ దేలుమంచుకొండలను బోలి
శారదాభ్రద్వయం బొక్కచక్కిఁ దక్క
సాంతముగ నీలమై సుప్రశాంతమగుచు
నాకసం బొప్పె శాంతమహాబ్ధికరణి.

భాస్వరజపాప్రసూనవిస్ఫారభాను
బింబరోచిష్కదంబకం బంబుజాస
నాంశభాంశంబునం దెల్ల నావరింపఁ
జెలువమీఱ మతాబాల వెలుఁగునందు
నిలిచి కిలకిలన వ్వెడుకులుకులాఁడి
కలికి మొగమట్టు లొకవింత తెలివిఁ గాంచి
కలకలమటంచుఁ జెలువమై వెలిఁగె దిశలు.

మలయగిరినుండి పయనమై నిలువకుండ
గిరులఁ గమలాకరముల నిర్ఝరుల దాఁటి
అలయికం జెంది ఘర్మజలాప్తి నంది
తనదు క్లేశమ్ము వారించుకొనఁ దలంచి
ఇనుఁడు గ్రుంకుచునుండెనం చెంచి యేమొ
గంధవహపాంథుఁ డతిమందగతి వహించె.

అభిముఖంబున నున్న జలాశయంబు
నిండి తొణికిసలాడుచునుండె; దాని
గర్భమున నేమిగలదు? చొక్కంపుమేల్మి
రంగులీనెడుజరఠపతంగరుచుల
దొంగిలించి మఱొక్క రెఱుంగకుండ
దాఁచుకొనియున్న దది సంగనాచివోలె.

బాతుటువిదలతో నీఁతపందె మేసి
వీచికాకన్య లొకదానివెంట నొకతె
దరికి లోనికి ఊఁగుల నాతురత మెఱయఁ
బరువులిడుచున్న వా రెట్టిపట్టుదలయొ
ఏటి కీపందె మీచెరలాట మేల
బాతువుల వేడఁ, దామేడఁ, బందెమేడ,
వానియభ్యాస మెంత, వైభవ మదెంత,
అనుభవం బెంత, నేర్పరితన మదెంత,
కొలనుకూఁతుండ్రయినమాత్ర; గెలువఁగలరె?
జడమతులు, ముగ్ధ, లమితచాంచల్యవతులు,
తెలియలేరైరి తరగముద్దియలు వీరు.

నికటభూరుహశాఖపై నిశ్చలముగఁ
గూరుచున్నది యేలొకో గువ్వ యొకటి
ఏలరా గువ్వచెలికాఁడ! మెఱుఁగఁ జెప్ప
దుస్తరంబైన సంసారతోయరాశి
నీఁదఁగాలేక సతితోడ వాదులాడి
ఆత్మఁ దత్కాలవైరాగ్య మావహింప

శరణుఁజొచ్చితే యిట్టినిర్జనతలంబు?
కన్ను లరమోడ్చి పక్షయుగ్మంబుచేత
నొడలు నిండారఁ గప్పికొం చొక్క-సరణిఁ
జూచుచున్నాఁడవేమొ! విశుద్ధహృదయ
మేకగతి నిల్పి బహిరంతరింద్రియముల
నటునిటులఁ బోవనీక విస్ఫుటసమాధి
నిష్ఠనున్నాఁడ వేమొ వర్ణింపరాదు.

ప్రకృతియిటులుండ దానిశోభావిశేష
మరయవచ్చిన కవి యేమి యయ్యె నంచు
నడుగవే పాఠకుఁడ, బోధపడద యేమి?
అతనిహృదయంబు ప్రకృతితో నైక్యమందెఁ
దన్నుఁదాన యెఱుంగఁ డాచిన్నవాఁడు
కాఱుచున్నవి యేలొకో కనులనుండి
యతనికానందబాష్పమ్ము లమితముగను
దనకుఁ దా నేమియోచెప్పుకొను, ముదశ్రు
కణనిరోధనిదానగద్గదరుతమున
విస్మయంబును జూపుమందస్మితంబు
వెలుఁగుచుండెఁ దదాననజలజమందు.

దివ్యము, నదృష్టపూర్వము, నవ్యమగుచు
సమధికాశ్చర్యకరము, తేజస్స్వరూప
మగుచు నిట్టి దనఁగరాని యద్భుతంపు
వస్తు వొక్కండు గనుచున్నవానికరణి
నరయుచున్నాఁడ దెంత సౌఖ్యావహంబొ!

సురనదీతీర సైకత క్షోణియందు
వన్నెలకుమిన్న యచ్చరకన్నె యొకతె
వలపుఁజెలువునిఁ గూడి సంజఁ దదీయ
పూతశీతలవీచికాయాతవాత
పోతములఁ జేతముల నెంతొ ప్రీతి గలుగ
లీల దళుకొత్త వీణియ మేళవించి
చేతనంబు లచేతనస్థితి వహింప
ధర నచేతనములును జైతన్యమంద
నఖిలజగదభిరామమోహనసుగీతిఁ
బాడుచుండఁగ వినుచున్నవానికరణిఁ
దన్మయత నోలలాడు నెంతటి సుఖంబొ!

కనుల కెంతటియానందగరిమ యొక్కొ
వీనులకు నెంతయామోదవిహృతియొక్కొ
తనువునకు స్పర్శసౌఖ్య మెంతటిదియొక్కొ
మనకుఁ దెలియంగరాదు పామరులమాట!

ఇటుల శిశువునుబోలెఁ జెనఁటివిధానఁ
గొంతతడ వుండి యతఁ డేలొకో సకాతు
కంబుగాఁ బిల్చె నస్పష్టకమ్రఫణితి
"రార పోదమ"టంచు నాపేరు వెట్టి—
పిల్చినదెవండొ యయ్యది వినినదెవఁడొ
ఇరువు రెవ్వారలో కాని యెఱుకపడదు.

కన్నుచిట్లించుచప్పుడు కానుపించు
శశియుగం బట్టికంటితో సరిగఁజూడ
నొక్కఁడగురీతి నిరువుర మొకఁడనైతి.

కాదు జాగ్రత; స్వప్నమా కాదు; చిత్త
విభ్రమము కాదు; మఱియేమొ విశదపడదు.
అనుచు నీరీతి విస్మయాహ్లాదసంశ
యాదిభావము లంతరమందు బెనఁగు
లాడుచుండఁగ నాఁడు గృహాభిముఖుఁడ
నగుచు నేతెంచితిని రాత్రి మైనసరికి.



# తాండవకృష్ణుఁడు

అందపు ముంగురుల్ ముసరి యాస్యతలంబున లాస్యమాడఁగా
నైందవ పూర్ణకాంతిఁ బరిహాసము చేసెడు మందహాస మిం
పంపఁగ గజ్జె లందియలు సంఘ్రియుగంబున ఘల్లుఘల్లనన్
నందయశోద లుల్లసిల నాట్యమొనర్చెడు కృష్ణు నెన్నెదన్.
నందుని నాతిముందరను నందుని ముందర నల్ల రాధమున్
ముందర గోపగోపికలముందర గోవులముందరన్ మహా
నందముతో నటించి ఫణినాధునిముందల జిందులాడు గో
విందు పదారవిందములు వేమరు డెందమునం దలంచెదన్.
మందల నాలు లేగలును మ్రాన్పడి మేతలుమాని చూడ ప్రే
సుందరు లందరున్ మదులఁజొక్కుచుఁ దక్కుచు వెంటనంటఁగా
బొందిక వేణువున్ భువనమోహనమై ఖరి నూదుచున్ శర
చ్చంద్రికలన్ విహారములు సల్పెడు తాండవకృష్ణు నెంచెదన్.—వ. వేంకటశర్మ.

# వీడుకోలుపు

వెదురుమూడి వెంకటకృష్ణారావు గారు, బి. ఏ.,

శ్రీలలరార జగంబుల, నేలెడు మా రామదేవుఁ డేలుం గరుణా
లోలతఁ జెన్నాప్రగడకు, లాలంకృతి, భానుమూర్తి, సమరసుకీర్తిన్.

సీ. భాషాసతీదయాప్రాభవంబందిత్రి, భాషాకవితఁ బేరువడసినావు;
దేవగురుఖ్యాతి దీపింపవీరులౌ, శిష్యుల వెలయించి చెలఁగినావు;
స్వార్థ మెందును లేక పరహితం బర్థించు, ధర్మతత్పరుఁడవై తనరినావు;
మముబోటి లౌకికమనుజులు ఋజుగతిన్, విలసిల్ల వరవడిఁ బెట్టినావు;

గీ. ద్వంద్వవివశంబుకాని భవ్యమతి వౌట, యోగమర్మ మెఱుఁగు రాజయోగి వౌట,
నవ్య జనకుం డనంగఁ దనర్చినావు; భాసురసుగుణగణకీర్తి! భానుమూర్తి!

గీ. సేవచే బ్రతుకుఁ డటంచు నావిధాత, మా తలల వ్రాసి యున్నను, మదికి నద్ది
తోఁపకుండంగ నాత్మసుతులుఁగ మమ్ముఁ జూచు నీకొల్వు గల్గె మా సుకృతమహిమ.

గీ. ఎఱుఁగ కే మొనర్చిన తప్పులెల్ల సైఁచి, మించుకృపను మ మ్మాత్మఁ దలంచు మెపుడు;
సాధుసత్తముల దయయె సర్వజనుల, కైహికాముష్మిక సుఖదాయకము కాదె!

గీ. ఉర్విఁ దనువుండునందాఁక నోమహాత్మ! మిమ్ము మరవఁజాలవు మా మనమ్ము లెపుడు
లోకసంగ్రహణార్థంబు లోకవిభుఁడు, మహిని మిము బహుకాలంబు మనుచుఁగాక!"

శ్రీచెన్నాప్రగడభానుమూర్తిపంతులుగారు 1910 వ సంవత్సరమునఁ బ్రభుత్వాంధ్రభాషాంతరీకరణోద్యోగికిఁ బ్రధానసహకారిగ చెన్నపురికి విచ్చేయుటకుఁ బూర్వము, మచిలీపట్నమునందలి క్రైస్తవకళాశాలలో ఎఫ్. ఎ. బి.ఎ. తరగతులకు గణితశాస్త్రబోధకులుగను, సంస్కృతపండితులుగను చిరకాలము పనిచేసి, యనన్యసామాన్యమనీషావిశేషులగు గురువరేణ్యులని యాంధ్రదేశమునఁ బ్రఖ్యాతివడసియుండిరి. ఇటు ప్రభుత్వసేవయందేమి, అటు దేశసేవయందేమి వీరిశిష్యులలోఁ బెక్కండ్రు ప్రశంసార్హములగు పదవుల నలంకరించియున్నారని చెప్పిన, వీరిప్రతిభాధిక్యమెక్కింత తేటపడఁగలదు. ఇట్టియసమానమేధాసంపన్నునిసేవను బడయఁగల్గుట ప్రభుత్వభాగ్యమని చెప్పనచ్చును. ప్రభుత్వపుఁ గొలువులో నడుగిడినది మొదలు, స్వశరీరసుఖము నణుమాత్రమైనఁ బాటింపక తదేకదీక్షతో తమపదవిని నిర్వహించి, యుద్యోగమునుండి విరమించుతలంపుతో వీరు కడచిన ఏప్రిలు నెల 1 వ తేదినుండి యాఱు నెలలకుపైఁగా సెలవు తీసికొని, స్వగ్రామమున కేఁగియుండిరి. ప్రభుత్వభాషాంతరీకరణోద్యోగులును, వారియనుచరకోటియును రక్తాక్షిసంవత్సరాదిని మహావైభవముతో జరిపిన వీడుకోలుపు, శ్రీపంతులవారియందు వారికెల్లరకుఁగల గౌరవప్రేమాతిశయములకుఁ బ్రబలనిదర్శనము. సంస్కృతాంధ్రాంగ్లభాషలయందు పంతులవారిపాండిత్య మపారము. చెన్నపురియందు వారుండినయీపదునాలుగేండ్లకాలములోఁ బ్రాచీనాంధ్రసారస్వతమునకుఁ బెట్టనికోటయై వా రెట్లు నిలిచినదియు జగద్విదితము. ఆడంబరరహితమగు భావౌన్నత్యమునకు వీరినిర్మలజీవనము గుణపాత్రమై యొప్పుచుండునని చెప్పిన నెంతమాత్రము నతిశయోక్తికాదు. ఆత్మగౌరవమునకు వీరివంశము పుట్టినిల్లు. పండితకవిజనమండలికి వీరు కొంగుబంగారము. ఇట్టి మహోదారస్వభావు నెడఁబాయుట, చెన్నపురియందలి యాంధ్రలోకమునకు నిజముగా నొక కొఱఁత. వీరికి సర్వేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యముల నిచ్చుఁగాక!




శ్రీ. సి. బి. మల్లప్ప గారు

(కబీరుదాసు—చేత పుత్రుడగు కమాలుని శిరస్సున్నది)

గుబ్బి శ్రీచెన్నబసవేశ్వర కృపాపరితోషిత నాటకసమాజము, మైసూరు.

# పుష్ప నాటకము

(బంకిమచంద్రుఁడు)

వేంకటపార్వతీశ్వరకవులు

క్షణములోనె సుఖంబుఁ గష్టమ్ముఁగూర్చి
క్షణములోనె భవమ్ము నాశమ్ముఁగూర్చి
క్షణములో నెన్నియో నాటకములఁగూర్చు
కపటనటరాజునకు నమస్కారశతము.

ప్రదేశము—పుష్పోద్యానము

ప్రవేశము—పుష్పసుందరులు - వర్షబిందువు

యూధిక:—రమ్ము రమ్ము! ప్రాణేశ్వరా! రమ్ము! నా హృదయమధ్యమునఁ బ్రవేశింపుము! నాహృదయమును బరిపూర్ణముగఁ జేయుము! ఎంతకాలమునుండి నేను నీయందలి యాశచే నుత్కంఠనై యెదురుచూచుచుంటినో నీ వెఱుఁగవా? నేను మొగ్గనై యున్నప్పు డీ మహాగ్నిచక్రము — ఈ భువనసంతాపకమహాపాపము — పూర్వాకాశమునం దెచ్చటనో యొకచోటఁ బడి యుండెను. అప్పటి కది యింతటి విశ్వవిధ్వంసమూర్తియై యుండలేదు — అప్పటి దాని తేజ మంతటిజ్వాలాభీలమై యుండ లేదు! అయ్యో! అది యెంత కాలము! చూడుము! క్రమముగా నా మహాపాపతాపమూర్తి గగనమండలమధ్యస్థలమునఁ బ్రవేశించి బ్రహ్మాండ మంతయును బ్రజ్వలితముగఁ జేయుచుఁ బశ్చిమాకాశమున కొరఁగి యొరఁగి తుద కా యనంతసాగరమున విలీనమైపోయెను! పోనిమ్ము! దూరమై పోనిమ్ము! — కాని, ప్రాణనాథా! ఇన్నాళ్ళవఱకు నీవెచ్చట నుంటివి? — అయ్యో! నేలపైఁ గాలుంచెదవు సుమా! నీవు నా హృదయమున నిలిచినచో నా జ్వాలామయతపనమూర్తి యొక నన్నుడికింపఁజాలఁడు! మఱియు నిన్నుఁగూడ బాగుగ నలంకరించును. ఆ రౌద్రకిరణప్రపంచమున మనోజ్ఞరత్నభూషణాలంకృతమూర్తింబోలియున్న నీతోఁ గలసి నేనును మనోజ్ఞమూర్తి నయ్యెదను— రమ్ము! రమ్ము! నాయుల్లమును జల్లగఁ జేయుము! నా హృదయమధ్యమునందే ప్రవేశింపుము! క్రిందఁ గాలుంపవలదు!

నందివర్ధని:—(జనాంతికముగాఁ గృష్ణకళికం గాంచి) సోదరీ! ఈబిడ్డయవసం జూడుము!

కృష్ణ:—ఏబిడ్డ?

నంది:—ఈ మనయూధిక! ఇంతవఱకు నీమె మొగముఁ ద్రిగించుకొని, తలవంచుకొని యంగడిలోనిమూటవలెఁ బడి యుండెను. ఇంతలో నాకాశమునుండి వర్షబిందువు యువరాజువలె గాలిగుఱ్ఱముపై నెక్కివచ్చి యీమెతలవాకిటఁ బ్రవేశించెను. తోడనే యాకన్యక హాసవికసితవదనముతో నాతని

నాక్రమించినది! ఏమి దానిపడుచుందన
ము!—పడుచువాండ్రపద్ధతియే స్వతంత్ర
మైనది!

కృష్ణ:—సిగ్గు సిగ్గు!

నంది:—కాని, సోదరీ! మనముమాత్రము
వికసించుట యెఱుంగమా? సంసారమును
జేసికొనవలసివచ్చినప్పుడు దినదినమును,
మధ్యాహ్నమునను, దీవ్రాతపముననుశిశిర
మునను గూడ వికసింపవలసియేయుండును!
వికసింపకున్నచో సంసారము సాగుట
యెట్లు? మనకుమాత్రము వయసులేదా;
వాంఛలేదా?—కాని, యింతటి యహం
కారగర్వము మన మెఱుంగుదుమా?

కృష్ణ:—ఆమాట నిజమే!

యామి:—ప్రాణప్రియా! ఇంతకాల మెచ్చట
నుంటివి? నీవు లేకుండ నేనొకనిమిషమైన
నిలువంజాల నని యెఱుంగవా?

వర్షబిందువు:—ప్రాణేశ్వరీ! విచారింపకుము!
చాలకాలమునుండి రావలయు ననియే
ప్రయత్నించుచుంటిని. సమయము దొరకక
లేదు. ఆకాశమునుండి భూమిమీఁదికి
వచ్చుట సామాన్యమా? నడుమ నెన్ని
యంతరాయము లుండునో నీవుమాత్ర
మెఱుంగవా? ఒంటిగా వచ్చుట కవకా
శము లేదు! గుంపులోఁ గలసిరావలయు
ను! అన్నిసమయములయందు, నంకటి
స్థితిగతులు నొక్కరీతిగా నుండవుగదా!
కొందఱు తామే గొప్పవార మనుకొని
యాకాశమునందలి యున్నతాంతరమునం
దదృశ్యులై యుండుటకై బాష్పరూప
మును గోరుకొనుచుందురు; వాయునిమ్న
స్తర మిన్పుడు తాపముగా నున్నది
గావున నచ్చటికిఁ బోయినచో శుష్కించి
పోవుదు మని కొందఱు హిమాకృతిని
వాంఛించు చుందురు; అవనికి దిగుట
యధఃపతన మగును గావున మన మట్లు
పోవలయు నని కొంద అనుకొనుచుందురు;
క్రిందికిఁ బోవుటవలన లాభము లేదని
యు, నాకసమునఁ గాలాంబుదములమై
చిరకాల ముందమనియుఁ గొంద అను
చుందురు; నదీనిర్ఝరిణులమై లవణసము
ద్రమునఁ బడిపోవుటకంటెఁ బ్రచండాతప
మున విహరించుచు నందఱ మొక్కటై
యింద్రధనుర్మూర్తిందాల్చినచో భూచరు
లును, ఖేచరులును మనలం గాంచి
మోహితులై పోవుదు రని కొందఱనుచుం
దురు! మన మిచ్చటనే యుండి కాళిమా
మయకరాళకాదంబనీమూర్తిం దాల్చి,
విద్యున్మాలికలఁ గంఠహారములుగఁ
జేసికొని మన సౌందర్యమును బ్రకా
శింపఁజేసికొంద మని కొంద అను
చుందురు; జలవంశజుల మగు మనము
భూలోకసముద్ధరణమునకై యూరక
తత్తరపడి పోవుటయేల; ఆహ్వానము
రానిండని కొందఱనుచుందురు; కొందఱు
విద్యుల్లీలలం గాంచుచు, నీమేఘము
నెడిలోఁ గొంతసేపును, ఆమేఘము
నెడిలోఁ గొంతసేపును, ఆకాశప్రాంత
మునం దొకప్పుడును, ఆకాశమధ్యభాగ
మునం దొకప్పుడును గ్రీడించుచు—

యాధి:—ఆవిద్యుల్లతయందే నీకంతటి ప్రేమ యున్నచో నిచ్చటికేల వచ్చితివి? అచ్చటనే యుండఁగూడదా? ఆమెయెదుట నే నెంతటిదానను?

వర్ష:—సరిసరి! అంతకోపమేల? నేనట్టివాఁడ ననుకొంటివా? చిన్నవాండ్రగు నట్టియల్పు లెవ్వరు నిచ్చటికి రానేలేదు. మేమెంత గొప్పవార మనుకొన్నావు! అట నుండఁ జాలక దిగి వచ్చితిమి! చాల దినముల నుండి నిన్నుఁ జూడవలయు నని యున్నది.

పద్మిని:—(పుష్కరిణీమధ్యమునుండి) ఓహో! నీవు గొప్పవాఁడవా? ఎంతవాఁడవు! నీవంటివారిని బదిలక్షలమందిని, ఒక్క నాపత్రమునందు నిలిపియుంచఁ గలను! రారాదా?

వర్ష:—వత్సా! అసలు సంగతి మఱచిపోయితివా యేమి? ఈపుష్కరిణిని బూరించువాఁ రెవ్వరు? ఓపంకజ! వర్షమే లేకున్నచో జగంబునఁ బంకమెక్కడనుండును? జలమెక్కడ నుండును? ఇంక నీనీఁదుట యెక్కడ? నవ్వుట యెక్కడ? ఓజలజా! నీవు మాయింటి యాఁడుబిడ్డవు కావుననే నిన్ను మేమొడిని జేర్చుకొని పాలించుచున్నాము—కాకున్నచో నీ కీ రూపఁ మెక్కడిది? ఈనివాససుఖమెక్కడిది?— ఇంతటి గర్వమెక్కడిది? పాపాత్మురాలా! నీపితృకులవిరోధియగు నయ్యాగ్నేయ స్వరూపుని బ్రేమించుచున్నావు. నీకు బుద్ధి లేదా?

యాధి:—ప్రాణేశ్వరా! సిగ్గుసిగ్గు! ఆయవ్వతో నన్నిమాట లేల? ఆమె ప్రొద్దుటి నుండియు మొగమెత్తి యగ్నిమయుం డగు నాయకుని వంకనే తదేకదృష్టిం గాంచుచు సిగ్గులేకుండ నాతఁ డేవంకకుఁ దిరిగిన నావంకకు నోరుతెఱచుకొని నిరీక్షించుచున్నది! ఎంతపరాకు! ఈనడుమ నెన్నియో కణుదురీఁగలు, తుమ్మెదలు, తేనెటీఁగలు ఎన్నెన్ని వచ్చిపోవుచున్నను దీనికిఁ సిగ్గుఁ లేకున్నది!

కృష్ణ:—అదియేమే యాధికా! అట్లను చున్నావు? తుమ్మెదలగొడవ యింటింట నున్నదియే కాదఁటే!

యాధి:—సోదరీ! మాయింటిమాట చెప్పుము! నేనిప్పుడే కన్నుఁదెఱచితిని. నేనీ తుమ్మెదలబాధ యెఱుఁగనమ్మా!

వర్ష:—యాధీ! లజ్జావిహీనలగువారితో నీకీ సంభాషణ మేల? అకళంకినులు నీవిమల ధవళశోభాసౌరభములంగాంచి సహింపఁ గలరా?

పద్మి:—ఓరి తుచ్ఛుఁడా! నీకుఁ దగినట్లు మాటాడుచున్నావు! అదిగో! మహాబలుఁడు వచ్చుచున్నాఁడులే!

యాధి:—అయ్యో! అది యేమి?

వర్ష:—ఔను. ఇఁక నేనుండుట కవకాశము లేదు.

యాధి:—ఉండవా?

వర్ష:—ఉండజాలను. ఆ మహాబలుఁడు నన్నుండనీయఁడు! నే నాతని నెదిరింపఁ జాలను.

యూధి:—అయ్యో! జీవితేశా! ఇంచుకసే పాఁగఁజాలవా?

(వాయువు ప్రవేశించును)

వాయు:—(వర్ష బిందువ్రం గాంచి) దిగు!

వర్ష:—ఏమి మహాత్మా!

వాయు:—నే నీయమలకమలసుశీలసువాసిత ప్రఫుల్ల యూధికాకళికం గైకొని వినోదించెదను. నీ వల్పుఁడవు; అధఃపతితుఁడవు; నీచగామివి; నీచవంశజుఁడవు! నీవా యీ సుఖాసనమున నుండుట? దిగు!

వర్ష:—నేనాకాశమునుండి వచ్చితిని!

వాయు:—నీవల్పపార్థివజీవివి! నీచగామివి! పోయి యే నెరియలోనో, యే బొరియలోనో దాఁగికొనుము! దిగు!

వర్ష:—యూధికా! ప్రేయసీ! ఇఁక నేను పోవుదునా?

యూధి:—ప్రాణేశ్వరా! ఉండవా?

వర్ష:—ఉండనిచ్చుట లేదు!

యూధి:—ఉండవా?—ఉండవా?—ఉండవా?—

వాయు:—యూధీ! నీకంతతల త్రిప్పెందులకు?

యూధి:—మహాబలా! దయయుంచి నీవు పొమ్ము!

వాయు:—సుందరీ! నేను నీకొఱకే వచ్చితిని.

(యూధిక వాఁడుమాఁ బారిపోవఁ బ్రయత్నించును)

వర్ష:—ఈ గందరగోళములో నేనిఁక నిలువఁజాలను!

యూధి:—నాథా! అట్లయినచో నాకున్న యీయించుక సంపత్తిని నీకె సమర్పించెదను. తీసికొని పొమ్ము!

వర్ష:—నీయొద్ద నేమున్నది?

యూధి:—ఇంచుక మధువున్నది—కొంచెము పరిమళమున్నది!

వాయు:—పరిమళమును నేను గైకొందును! అందుకొఱకే నేను వచ్చితిని! తే—

(అని వాయువు బలవంతపెట్టును)

యూధి:—(వర్ష బిందువ్రంగాంచి) ప్రాణేశ్వరా! నీవుపొమ్ము! ఈదస్యుని జూచుట లేదా?

వర్ష:—హృదయేశ్వరీ! నిన్ను విడిచి నేనెట్లు పోఁగలను! కాని యీతని బలప్రయోగమున నిలువఁజాలకున్నాను — పోవుచున్నాను— పోయెదను—

(వర్షబిందువు భూమిపైఁబడును)

నంది, కృష్ణ:—అయ్యపని మైనది! ఆకాశమునుండి యూడిపడినాఁడుగా! ఆ! ఇప్పుడేమైనది? అధోలోకగతమైనది! కథావశేషమయినది.

యూధి:—(వాయువుతో) వదలుము! వదలుము!

వాయు:—వదలుట యేల? తెమ్ము! పరిమళమును నాకిమ్ము!

యూధి:—అయ్యో! ప్రాణేశ్వరా! నీవెక్కడనున్నావు? అమలుఁడవును కోమలుఁడవును, స్వచ్ఛస్వరూపుఁడవును, సుందరుఁడవును, సూర్యప్రతిఘాతుఁడవు నగునో రసమయ! జలకణమూర్తీ! నీవెక్కడకుఁ బోయితివి? ఓ జీవితేశ్వరా! ఈ హృదయమును స్నేహప్రపూర్ణముగఁ జేసి మరల నేల శూన్యముగఁ జేసివైచితివి?

ఒకసారి దర్శనమిచ్చి యానందముంగూర్చి మరల నెక్కడ దాఁగితివి? ఎందు లోఁగితివి? ప్రాణాధికా! నేను నీతోఁగూడ నేల రాలఁజాలనైతిని?—నీతో నేల మరణింపనైతిని?—అనాథంబును, నస్నిగ్ధంబును నగు నీపుష్ప దేహముం దాల్చి యీశూన్య ప్రదేశమున నేనేల జీవించి యుంటిని?—

వాయు:—ఈ యేడుపులు గట్టిపెట్టుము! పరిమళ మిమ్ము!

యూధి:—వదలుము! వదలకున్నచో నేను నాప్రాణేశ్వరునిమార్గమునే పట్టి పోయెదను.

వాయు:—పోయినఁ బొమ్ము — పరిమళ మిమ్ము—హుం—

యూధి:—హా! చచ్చితిని! చచ్చితిని!

వాయు:—హుం!—

(యూధికవృంతచ్యుతయై క్రిందఁబడును)

వాయు:—హుం—ఆహా! హా!

(తెరపడును)

ఉపసంహారము

ప్రథమశ్రోత:—ఈనాటకకవి యుద్దేశ మేమి?

ద్వితీయుఁడు:—ఇందు యూధిక నాయిక! వర్షబిందువు నాయకుఁడు! ఓహో! ఏమి నాటకము!

తృతీయ:—అయినఁగావచ్చును! ఇందొక నీతి యుండుటచే నీతికథయని చెప్పవచ్చును!

చతుర్థ:—అట్లుకాదు - ఇది యొక విధమగు విషాదాంతనాటకము!

పంచమ:—కాదు—ఇది యొక ప్రహసనము!

షష్ఠ:—ప్రహసనమునుగాదు! అన్యాపదేశ దూషణము! ఎవ్వరినో మ సునం దుంచుకొని యాక్షేపించినట్లున్నది!

సప్తమ:—అదికాదు—దీనికి గూఢార్థ మున్నది! ఇది గూఢమార్థవిషయికకావ్యమని నాకుఁ దోఁచుచున్నది. "కాంక్ష" యనిగాని, "తృష్ణ" యనిగాని దీనికిఁ బేరుంచినచో బాగుగనుండును! గ్రంథకారుఁ డంతవఱకాలోచింపలేదు!

అష్టమ:—ఇది యొక రూపకమనుట సత్యము! దీనికి నేనర్థము చెప్పుదునా?

ప్రథ:—దీని యభిప్రాయము గ్రంథకర్త యేల చెప్పరాదు?

గ్రంథకర్త:—ఇది మీరు చెప్పినదానిలో నేదియును గాదు! ఈ గ్రంథముపై నున్న యాంగ్లేయభాషాముఖపత్రమును దిలకింపుడు!—

" A true and faithful account of a lamentable Tragedy which occurred in a flowerpot on the evening of the 19th July, 1885, Sunday, and of which the writer was an eye-witness."

———

# బ్రహ్మగీతము

## చేవూరు సింహాచలము

ఎవని యిచ్ఛను బాలింప నీమనంబు
ప్రేరణంబొంది పోవును విషయములకు
నెవని ప్రోద్బలంబునఁ బ్రాణ మిటుల తిరుగు
వాక్కు పనిసేయు నాజ్ఞయె వ్వానిదగును
జెవులుఁ గన్నులుఁ బనిసేయు నెవని నియతి?"
ననుచు శిష్యుండు గురుఁజేరి యడిగినంత
"శిష్య! ఎవ్వనిన్ గూర్చి ప్రశ్నించినావొ
యతని సంగతిఁ జెప్పెద నాలకించు.
శబ్దమాలింప శ్రోత్రము సాధనంబు
సాధనంబున్న వినసౌనె శబ్దములను
వినఁగఁ జేయన దొకటున్నదని యెఱుంగు
మదియె బ్రహ్మంబు మనసున కదియె మనసు
వాక్కునకు వాక్కు ప్రాణంబు ప్రాణమునకు
నదియే నేత్రంబునకు నేత్ర మగుచునుండె
నదియె చైతన్య మానని యండ్రు బుధులు.
ఇట్టి చైతన్యమే లేక యేదియైన
ధరఁ బ్రకాశింపనేరదు దాని నెఱుఁగు
మునులు లోకంబులను వీడి ముక్తులౌదు
రాత్మనేత్రాద్యధిష్ఠాన మగును జూవె
వాక్కుచే బ్రహ్మమును దెల్ప వశము గాదు
కనులచే బ్రహ్మమును జూడఁ గానరాదు
మనసుచే బ్రహ్మము నెఱుంగు మార్గమౌనె?
శిష్యునకు బ్రహ్మరూపెట్లు చెప్పనగునొ
అట్టి మార్గమైన నెఱుంగ నలవిగాదు
తెలియఁగలదాని కన్నను దెలియఁబడని
దానికన్నను వేరైన దాని బ్రహ్మ
మనుచు నాచార్యులే తెల్పి రట్లె పూర్వు
లెల్లరుంబల్క వినుచుంటి మిపుడు నీకు
దానినే చెప్పుచుంటిమి, దాఁపనేల?
యేది వాక్సహాయంబున నెఱుఁగఁబడదొ
వాక్కు దేని సాయంబున బయలు వడునొ
దెలియు మదియె బ్రహ్మంబని దెలివి గలిగి
పెక్కు రూపముల్ కల్పించి పేళ్లుపెట్టి
ధ్యానమున్ జేతు రద్ది చైతన్యమగునె?
దేనిని మనంబు గల్పింపఁ గానశక్య
మౌను దేనివలన నది వ్యాప్తినొందు
నట్టిదానినే బ్రహ్మ మనని యెఱుంగు
మీశ్వరాది రూపంబగు నెట్లు బ్రహ్మ?
కనులచేత నెద్దానిని గానలేమొ
కనులు దేని సాయంబునఁ గాంచు జగము
నదియె చైతన్యమౌ నిశ్చయంబుగాను
గాని యీశ్వరాదులు బ్రహ్మ గాదుసుమ్ము!
శ్రోత్రమెద్దాని వినలేదొ శ్రోత్రమెట్టి
దానిచే వినుచుండునో ధ్వనుల నెల్లఁ
దెలియు మది బ్రహ్మమేయని తెల్లముగను!
ఏది ఘ్రాణేంద్రియముచేత నెఱుఁగఁ బడదొ
ఘ్రాణమెద్దాన నెఱుఁగును గంధములను
దానినే బ్రహ్మమంచును దలఁపవలయుఁ
గాని లోకు లుపాసించు కల్పితంబు
లైన యీశ్వరరూపంబు లౌనె బ్రహ్మ?

దేవతలయందు లేక నే దేహమందుఁ
దెలిసికొంటి బ్రహ్మననుచు దలఁచితేని
యేది తెలిసికొంటివో యది కాదు బ్రహ్మ
మింకను దపముచే బ్రహ్మ నెఱుఁగవలయు
ననిన శిష్యుండు యుక్తిచే ననుభవంబు
చే విచారించి గురునొద్దఁ జేరినేను
దెలిసికొంటి బ్రహ్మ ననుచుఁ దలఁచుచుంటి
నని వచింప గురుఁడంత నడిగె నిట్లు
"ఏవిధంబున బ్రహ్మము న్నెఱుఁగితీవు"
దేవ! బ్రహ్మమున్ జక్కఁగాఁ దెలిసికొంటి
ననియుఁ దెలిసికొనకపోతి ననియు నేను
దలఁపలేదన్న శిష్యుని ధైర్యమెంతొ
చూచిఁదలఁపుఁగలిగి శిష్య! చోద్యమాయెఁ
బలుకులు పరస్పరవిరుద్ధములుగ నుంట
సంశయంబైన విపరీతశాస్త్రమైన
గావలయునన్న ననుభవ జ్ఞానమగుటఁ
దండ్రి! "నోన వేదేతి వేదచ" యనియెడి
వాక్యమున కర్థము నెఱుంగు వాఁడెవండొ
వాఁడె బ్రహ్మమును దెలియుచున్నాఁడుసత్య
మనుచు జంకులేకయె శిష్యుఁ డనియెనంతఁ
దెలియలేదను జ్ఞానికిఁ దెలిసియుండెఁ
దెలిసితిననెడు వానికిఁ దెలియలేదు
ఇదియె వేదరహస్యంబు నిదియెసుమ్ము
వాదముల్ లేని సిద్ధాంత వాక్య మిలను
అనఁగ నింద్రియాదులయందు నాత్మబుద్ధి
గల్గునజ్ఞాని బ్రహ్మను గానలేఁడు
ఆత్మబుద్ధీంద్రియంబులయందులేని
జ్ఞానికే బ్రహ్మ గోచరం బౌనుసుమ్ము
సకలవృత్తులం దాత్మయే సాక్షిరూప
మొంది యున్నదంచుఁ దెలియుచుండు నెవఁడొ

వాఁడె యాత్మరూపమెఱుంగు వాఁడనంగ
సాక్షియున్ జ్ఞానములు రెండు సత్యమొక్క
టేయని యెఱుంగువాఁ డాత్మ నెఱుఁగువాఁడు
బుద్ధిచేఁ దెలియబడని శుద్ధమైన
స్వస్వరూపంబుచే మోక్ష సాధనమగు
శక్తినిన్ బొందు దానిచే ముక్తిగలుగు
నాత్మరూపమును దెలియ నట్టివాఁడు
సత్యమందున్న వాఁడౌను సత్యముగను
ఆత్మరూపమును దెలియ నట్టివాఁడు
నాశనమునొందు, ధీరులైనమునివరుల
కఖిల భూతంబులందున నద్వితీయ
మైన యాత్మతత్త్వంబుఁ దా మరయుకతన
జనన మరణంబులేని మోక్షంబుఁ గలుగుఁ
బూర్వమందు దేవతలకుఁ బోరుజరిగె
రక్కసులతోఁడ నట పరబ్రహ్మమంత
దేవతలకు జయంబిచ్చె దివిజులంత
తమబలంబె జయమున కాధారమంచు
భ్రమను గర్వించుచుండఁగ బ్రహ్మమెదుట
ఘోరరూపంబుతోడను గోచరించె
దేవతలు వాస్తవంబును దెలియలేక
"నేదియో యొకపెను భూత మిద్ది"యనెడు
భీతిని, మొదటఁ దమలోఁ బ్రవేశమైన
యగ్ని దేవుని దెలిసి రమ్మంచుఁ బంచి
రంతఁ బరుగున నేతెంచు నగ్నిఁ గాంచి
యెవ్వఁడవు నీవు నీ ప్రజ్ఞ యెద్దియనుచు
భూత మడుగ నే నగ్నిని జాతవేదుఁ
డను సకలసృష్టిని నిముసంబుననె భస్మ
మానటుల్ సేయఁగలవాఁడ నంచుఁ దెల్ప
భూతమట్లైన యీగడ్డి పోఁచనిపుడు
భస్మమున్ జేయుమన దనబలమునంతఁ

జూపెనే కాని కార్యంబు సున్నయగుట
దెలిసి యింద్రుని కడకేగి తలను వంచి
యామహాభూతము నెఱుంగ నలవి గాద
ని వచియింప దేవతలు వాయువును గాంచి
మాతరిశ్వ! నీవేగి యా భూత మేమొ
దెలిసి రమ్మన వడిగ నే తేరఁగాంచి
యెవ్వఁడవు నీవు నీశక్తి యేమటంచు
భూత మడుగ నేవాయుదేవుండ మాత
రిశ్వుఁడను నాదుశక్తి యీ విశ్వవస్తు
వులను గ్రహియింపఁగలదన్న భూతమంత
గడ్డిపోచను గొనుమన గాలితనదు
శక్తినిన్ జూపెనేగాని సాధ్యపడక
లజ్జచేఁగుంది దివిజుల పజ్జఁజేరి
యామహాభూతమున్ దెలియంగ నాకు
శక్తిలేదంచుఁ జెప్ప పిశాచమేదొ
దెలియ నశ్యుండ వీవంచు దివిజులెల్ల
ఇంద్రునిన్ బంప నాతఁ డదేమొ చూత
మంచు రాఁగ భూతంబది మాయమయ్యె
నాకసంబందు బ్రహ్మవి ద్యాస్వరూపి
ణియగు కాత్యాయనీదేవి నిలచియుండె
నాయమనుగాంచి యింద్రుండు మాయమైన
భూత మేమంచుఁ బ్రశ్నింప భూతరాజ్ఞి
పలికె నీవిటఁగిన్నదే బ్రహ్మసుమ్మి
బ్రహ్మవలననే విజయంబు వడసినారు
భ్రాంతిచేతను మేమె యారక్కసులను
జంపినారమని వచింత్రు సాహసమున
భ్రాంతిఁ బోగొట్ట నీరూపు బ్రహ్మవడసి
యెదుటఁ బ్రత్యక్షమాయెనో యింద్ర! యనుచు

పార్వతివలన నింద్రుండు బ్రహ్మ మెఱిఁగె
నగ్ని వాయువు నింద్రుండు నాదిభూత
మును సమీపించు కారణంబున దివిజుల
లోనవీరె ఘనులు వీరిలోన నింద్రుఁ
డేఘనుఁడు బ్రహ్మరూపంబు నెఱుఁగ వశమె
మెఱుపువంటి ప్రకాశమై మఱుఁగువడును
నేత్రమీలనంబువలెను నిముసమున నె
ఇదియె యధిదైవతంబని యెఱుఁగవలయు
బాగుఁగానిప్పుడు మనస్సు బ్రహ్మయొక్క
ప్రత్యగాత్మస్వరూపంబు వడసినట్లు
బోధయగుఁగాన మనసుచే సాధకుండు
బ్రహ్మవిషయైకసంకల్పప్రజ్ఞ నాకుఁ
గలుగుఁగాకని స్మరియించుఁ బలుతడవుల
దీని నధ్యాత్మమందురు ధీరవరులు
సకల జీవులయందును సత్యమైన
బ్రహ్మమే యుండెనంచు నెవ్వాఁడెఱుంగు
వాని నాజీవులన్నియు బ్రహ్మమనుచుఁ
బ్రార్థనల్ చేయుచుండును భక్తిశోడ
శిష్యునిన్ గాంచి గురుఁడిట్లు జెప్ప నతఁడు
గురువరా! నా కుపనిషత్తు నెఱుఁగఁజేయు
మనఁగ నిది బ్రహ్మసంబంధ మైనదియును
బరమగోప్యంబు నన ధర వరలుచుండు
నుపనిషత్తునే బోధించు చుంటిననియె
దీనితత్త్వంబు నెవ్వండు దెలిసికొనునొ
యతఁడె లోకంబులన్ని దా ననుచు నెఱిఁగి
బ్రహ్మగీతంబు హాయిగాఁ బాడుకొనుచు
సర్వరూపాత్మకంబాచు సంచరించు;

---

# ఆంధ్రకవిత్వచరిత్రము

భోగరాజు నారాయణమూర్తి గారు, (విజయనగరసంస్థానాస్థానకవి)

## విన్నపము

ఆంధ్రకవిత్వచరిత్ర యొక్కసంపుటములో ముగింపఁదగినది కాదు. † ఆంగ్లభాషలో నొక్కొకయుగమునందలి కవితాచరిత్ర యొక్కొక సంపుటముగా వ్రాయఁబడెను. అట్టులే యాంధ్రమునందుఁగూడ నాంధ్రకవితాచరిత్రమును వ్రాయవలెనని నాప్రయత్నము. కవితా సాంప్రదాయములును, అందుఁ బ్రత్యేకించి యాంధ్రకవిత్వప్రజాడలును, దృఢపరచినవ్యక్తి పరిసర విశేషములును, నిరూపింపవలసినభాగము కవితాచరిత్రకారునియం దున్నది. అట్టి మహాకార్యమును గొంతవఱకైనఁ గావించుతలంపున నీ భారతియందుఁ బ్రకటింపఁబడువ్యాసములు వ్రాయఁబడినవి.

ఈవ్యాసములపై రాఁగల విమర్శలతో నా యభిప్రాయములను సమన్వయించుకొని ప్రత్యేకగ్రంథరూపమునఁ బ్రకటింపవలె నని నాతలంపు. సహృదయులగు పాఠకులు భారతిలోఁగాని నాకుఁ బ్రత్యేకముగాఁగాని తమ యభిప్రాయములను దెలుపఁగోరుచున్నాను.

## కవి - కవిత్వము

"శ్లో. యానేవ శబ్దాన్ వయ మాలపామో, యానేవ చార్థాన్ వయ ముల్లిఖామః;
తైరేవ విన్యాసవిశేషభవ్యైః, సమ్మోహయన్తే కవయో జగన్తి." అప్పయదీక్షితులు

కవిత్వచరిత్రమును వ్రాయుటకుఁ బూర్వము కవియన నెట్టివాఁడో, కవిత్వమన నెట్టిదియో విద్వత్కవులు వీని నెట్లు నిర్వచించిరో మొదట మనము చర్చింపవలసియున్నది. శబ్దశాస్త్రముప్రకారము కవిత్వము ధర్మవాచకము, కవి ధర్మివాచకము. శూరునకు శౌర్యమును, మునికి మౌనమును, సుజనునకు సౌజన్యమునుబోలెఁ గవికిఁ గవిత్వము ధర్మమైయున్నది. ఇచ్చట ధర్మమనఁగా "న్యాయాయత్తమైన వేదోక్తవిధి" గాదు. వ్యక్తిస్వభావమని యర్థము. దీనింబట్టి శబ్దార్థముల చందమునఁ గవికిని గవిత్వమునకును నవినాభావసంబంధము గల దని తెలుచున్నది. శబ్దములేకయే యర్థ ముండనియట్లు కవి లేకయే కవిత్వ ముండదు. అర్థములేకయే శబ్దముండనియట్లు కవిత్వము లేకయే కవియు నుండఁడు.

కవికవితాపరస్పర సంబంధమును గూర్చి యీ వివరణము సామాన్యమైనది. ప్రత్యేక

† Age series. Edited by Prof. Herford, M. A.

దృష్టితో నీవిషయములను బరిశీలించినప్పుడు మఱికొంత చర్చ కవకాశము కనఁబడు చున్నది. మానవజీవిత మెడతెగని యాందోళనములచే సదా నిండియుండును.

మానవస్వభావము.

అందుకుఁ దోడు మానవుని స్వభావము సైతము చంచలమైనది సాధారణముగ నెన్నిసౌఖ్యములతోనైనఁ దృప్తి నెందదు. కష్టముల సహించుప్రయత్న మరుదు. మఱియు దురాశాయత్తమైనది. ఇంద్రియములకు బంటు. కామక్రోధాదిశత్రుషట్కము చేతికీలుబొమ్మ. ఇట్టిమానవస్వభావమునకుఁ గవి దూరస్థుఁడా? సాధారణముగాఁ గాఁడు కదా!

కవితాస్వభావము.

స్వాంతము సారవంతమై తగినంత శాంతము నోరిమియుఁ గలిగియుండవలయునఁట! కష్టసుఖములయందలి సమత్వముచే తాళ్లు అప్పలవంటి యైహికాందోళనములు తుడువఁబడ మిక్కిలి స్నిగ్ధముగా నుండవలయునఁట! అట్టి నిర్మలహృదయక్షేత్రము నుండియే గాని కవిత తానై నిరాఘాటముగాఁ బ్రవహింపదఁట! కవిత్వ స్వభావ మిట్టిది.

ఇట్లు పరస్పరభిన్నములైన యీ రెండు స్వభావములనుబట్టి, యొకానొక మానవుఁడు కవియై యుండవచ్చునుగాని, వానియందలి కవిత్వముమాత్ర మవస్థావిశేషమునుబట్టి, తదీయహృదయక్షేత్రమునుండి నిరాఘాటముగఁ బైకివచ్చుట కవకాశము లేకపోవచ్చు నని చెప్పవలసి వచ్చుచున్నది. ఇందుచేతనే కాఁబోలు మానవస్వభావజ్ఞుండును గవితాస్వభావజ్ఞుండును నగుపెద్దనార్యుఁడు తనకుఁ బ్రబంధరచనాప్రోత్సాహకుఁడగు ప్రభువును గావ్యనిర్మాణసౌకర్యముల నిట్లు ప్రార్థించుచున్నాఁడు:

> "చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు
> కప్పురవిడె మాత్మకింపయినభోజన మొయ్యెలమంచ
> మొప్పుతె, ప్పరయురసజ్ఞు లూహ తెలియంగలలేఖక
> పాఠకోత్తముల్, దొరకినఁగాక యూరక కృతుల్
> రచియింపు మనంగ శక్యమే?"

హృదయశాంతికై యైహికములగు కొన్ని తాత్కాలికాందోళనముల నొకప్పుడు తొలంగించుకొనవచ్చుఁగాక! కాని దైవికములగు మహావిపత్తులు తటస్థించినప్పుడుమాత్రము కవియైనమానవుఁడు, సహించి నిలువఁ గలవాఁడు. సాధారణముగాఁ గలుగఁబోఁడు.

జాన్ కీట్సు

పదునెనిమిదవశతాబ్దాంతమున జనించి, పందొమ్మిదవ శతాబ్దారంభమునఁ గల కవులలో నొకఁడైన "జాన్ కీట్సు" అను నొక యాంగ్లేయకవిజీవితము మన కీ సందర్భమునఁ దార్కాణముగాఁ గొనఁదగినది. ఇతఁడు పుట్టుకతోడనే నిఱుపేద. సాహిత్యమందమా గ్రీకుభాషలోఁగాని లేటినుభాషలోఁగాని లేశమును బ్రవేశములేనివాఁడు. ఇందుకుఁదోడు వీని సమకాలికు లాంగ్లకవితాచరిత్రమున సుప్రసిద్ధులైన "షెల్లి- వర్డ్సువర్తు- లేహంటు- హెజిలెటు-" మొదలగువారు. ఇట్టి స్థితిగతులలో కీట్సు తన కీశ్వరదత్తమైన యనుపమానమగు కవితాశక్తిని బ్రకటింప నారంభించెను. సాహితీసమర్థుఁడు గాసివానిపద్యములను (Odes) జూచి గ్రీకు లేటిను భాషా

విద్వాంసులు మేలని శిరఃకంపనము గావించుచుండిరి. బాల్యమునందే వానికవిత ప్రకృతిసౌందర్యలక్ష్మిని (The principle of beauty in all things) వరించినది. స్వభావము చెడకుండ సౌందర్యలక్ష్మిని జితించుటయందు మిక్కిలి విఖ్యాతి గాంచినది. మఱియు భాషాసౌలభ్యము, చక్కని శయ్య, మృదుమధురోచితపద గుంఫనము, శ్రవణసౌఖ్యము, భావనాశక్తి, మొదలగు విశేషములు వానికవితకు ముఖ్యాంగములు. తన హృదయస్థమగు భావమును, తద్భావాంతర్గతమగు ధ్వనియును రసవిశిష్టముగ స్పష్టపఱచుటయందును, ఒకానొక వస్తువునుగాని విషయమునుగాని కంటికిఁ గట్టినట్లు చిత్రించుటయందును, కీట్సు నతిక్రమించిన యాంగ్లకవి లేఁడఁట! తత్సమానుఁ డనఁదగిన వాఁ డొక్కఁ టెనిసను దప్ప మఱియొకఁడు గానరాఁడఁట!

కీట్సు దుర్బలచిత్తుఁడు

ఇట్లతిబాల్యమునందే సర్వాంగసౌందర్యముగల తనకవితాసుందరి లోకము నాకర్షించుచుండఁ బాపము కీట్సు తా నొకసుందరిచే నాకర్షింపఁబడి వ్యర్థమైన మనోవిచారమునందుఁ దగులుకొనెను. నానాఁటికి నమ్మోహాందోళనము మితి నతిక్రమించినది. పవనచలితమగు కేతనపటాంచలమునకును, పారావారతరంగములకును నొకప్పుడైన స్థైర్యము గలిగినఁ గలుగవచ్చును గాని కాముకునిచిత్తమునకు మాత్రము గలుగనేరదు. తన ప్రియురాలియందలి మోహాతిశయమునఁ గలిగిన దీర్ఘవిచారమున నహర్నిశలు మునిఁగిమునిఁగి తుద కతఁడు వ్యాధిగ్రస్తుఁ డయ్యెను. అందుకుఁ దోడు వానికి సహజమైనక్షయవ్యాధియుఁ బ్రబలమైనది. ఇట్టి వ్యాధిపీడచే శుష్కించి శుష్కించి పాపము కీట్సు తన యిరువదియైదవయేఁటనే కాలధర్మము నొందెనఁట!

కీట్సు మహాకవి యకాలమరణమునకుఁ గారణములైన క్షయరోగము దైవకల్పితము; మనోవ్యాధి స్వయంకల్పితము. మిక్కిలి స్వల్పమైన తనజీవితకాలములో నతఁడు గావించిన కావ్యరచన యుత్కృష్టకావ్యరచనకుఁ దార్కాణము కాకపోలేదు. కాని యాతఁ డాయుష్మంతుఁడై యుండియుండినయెడల నీశ్వరదత్తమగు వానియందలి యద్భుతకవితాశక్తి యంతయుఁ బ్రకటింపఁబడి యాంగ్లేయ భారతీయ కవిశిఖామణులచే నింతకంటె నెక్కుడుగఁ గొనియాడఁబడఁదగినదియై యుండియుండును. కాని పాప మతఁడు మిక్కిలి దుర్బలహృదయుఁడు. లోకవృత్తమునందు వానిచిత్తము పరిణతి చెందలేదు. ఐహికాందోళనములను దొలఁగఁజేసికొను మనోబలము తనకు లేనట్లు తానే యొప్పుకొనుచున్నాఁడు.

† "O that something fortunate" he cries in the closing months of his life "had ever happened to me or my brothers!—then I might hope—but despair is forced upon me as a habit."

ఇంతియెగాక తనయవస్థనుబట్టి తనకకాలమరణము సంభవించునని కీట్సు గ్రహించియుండకపోలేదు. గ్రహించి, యప్పటికిఁ దాను గావించిన కావ్యరచనతోఁ దృప్తి

† "The English poets" Edited by T. H. Ward, M. A.; Vol. IV., P. 436.

చెందక, తా నాయుష్మంతుఁడై యుండినయెడల ప్రకృతి సౌందర్యలక్ష్మిని జేపట్టిన తన కవితాశక్తిని సంపూర్ణముగఁ బ్రకటించి కవి లోకమునఁ దాను నిరంతరసంస్మరణీయుఁడుగాఁ గాఁజాలియుండు నని యతఁడు పశ్చాత్తాపపడుచుండెనఁట!

† "In his last days, Keats wrote 'If I should die I have left no immortal work behind me—nothing to make my friends proved of my memory; but I have loved the principle of beauty in all things, and if I had had time I would have made myself remembered.'

విషయలోలుఁడును దుర్బలచిత్తుఁడు నగు కవియందలి కవితాశక్తికిఁ గొంత . వినాశము తప్పదని చెప్పటకంటె నిచ్చట కీట్సుజీవితచరిత్రముతో మనకు మఱియొక ప్రయోజనము లేదు. విషయలౌల్యము, ఐహికసుఖైకానురక్తి, అసంతృప్తి, కష్టసుఖములయందు సమత్వాభావము, ఎడతెగనితాపత్రయము, మొదలగు దుర్గుణములకు లోఁబడక, స్వతంత్రుఁడై సంతృప్తుఁడై సమచిత్తుఁడై తన యుత్కృష్టకవిత్వమునకు వినాశము గలుగనీక పవిత్రతయు, మఱింత పెంపును గలిగించుకవి సాధారణముగ నేభాషాకవుల లోనైన మిక్కిలి యరుదుగా నుండును. ప్రాయికముగాఁ గవిప్రపంచమున కీట్సు లనేకు లుందురు. పోతనామాత్యు లెచ్చటనోగాని కానరారు!

పోతన పరమభాగవతోత్తముఁడు. సర్వసంగ పరిత్యాగము గావించిన యోగిగాని సన్న్యాసిగాని కాఁడు. దారాపుత్త్రాదులతో గృహస్థాశ్రమమునందే యుండి యోగులకంటెను సన్న్యాసులకంటెను నెక్కుడు పరిణతచిత్తుఁడైనవాఁడు. కష్టము లనేకము లనుభవించెను. ఆయనుభవమతనికి లోకానుభవజ్ఞానమునందు దుపయోగపడెనేగాని, తత్కవితాశక్తినిగాని, శరీరశక్తినిగాని,మనశ్శక్తినిగాని క్షీణింపఁజేయలేదు. జగన్నాటకరంగమునఁ దానొకపాత్రయయ్యు, నతఁడు తనపాత్రధారణోద్యోగమును జాలించి ప్రేక్షకుఁడై దూరముగఁ జూచ్చుండెను. మఱియు నమ్మహాకవి దరిద్రుఁడు కాఁడు. శమదమమ్ము లాతని కంగరక్షకులు; ఇంద్రియము లాతనికనుసన్నల మెలంగు సేవకులు; కామక్రోధాదులు వానికిఁ గప్పముఁ జెల్లించు పరాజితశత్రులు; సమత్వము వానియధివసించు సింహపీఠిక. ఇట్టి మహారాజచిహ్నములతోఁ గవితారాజ్యమును బాలించి కవిరాజగుపోతరాజు తుదకుఁ గైవల్యసామ్రాజ్యమును బొందఁగలిగెను!!!

ఒక్కపోతనామాత్యుఁడే కాఁడు. లోకమున నొకానొకమహాకార్యమును గావింప జనించు మహాపురుషులెల్లరు నిట్టిలక్షణములు గలవారే. తాము గావింపనెంచిన మహాకార్యమునందు దృఢనిశ్చయులై యిహముతో సంబంధించిన యితరవ్యాపారములయందువారంటియు నంటనియట్టు లుందురు. మానవవిధి నిర్వహించుటకై వారేదేనొకానొక కార్యభారమును బూనుకొనవచ్చును. కాని యయ్యది వారి కుపాంగము. నిశ్చితమహాకార్యమే వారి జీవితమునకు ముఖ్యాంగము.

† "The English poets" Edited by T. H. Ward, M. A., Vol. IV, P. 436.

కవిజీవితకార్యము కావ్యరచన

మిల్టను మహాకవిజీవితమును బరిశీలింపుడు! అతఁడు కీట్సువలెఁగాక పోతనవలెఁ బరిణతహృదయుఁడు. పామరులకు స్వర్గమార్గముఁ జూపినమార్గదర్శి. తనకవితామృతమును వర్షించి యాంగ్లభాషాప్రపంచమున యశఃకల్పతరువును గల్పాంతమువఱకుఁ బెంపొందించుట యమ్మహాకవి ముఖ్యోద్దేశము. అట్టి దృఢనిశ్చయముతో మిల్టను కావ్యరచనకుం గడంగెను. కాని ప్రారంభించిన కొలఁది కాలములోనే వానికావ్యరచనకు విఘ్నము చేకూరినది. ప్రజలకును బ్రభువునకును నంతఃకలహములు జనించుటచేత, మిల్టను ప్రజాపక్షమునఁ జేరి ప్రభువునకు విరోధముగాఁ బనిచేయవలసివచ్చెను. అందుచే నతఁడు తన జీవితకార్య మగు (Life work) కావ్యరచనను గొంతకాలము విడిచి, ప్రజాపక్షమునఁ బనిసేయు నాయకులలోఁ జేరుకొనెను. తనకావ్యరచన కడ్డము గలిగించిన యేతత్తాత్కాలికకార్యభార మెంతోకాల ముండదని యాతఁడు భావించెను గాఁబోలు! ప్రారంభించినకార్యము ఫలించువఱకు నుత్తము లెన్నఁడుఁ బరిత్యజింపరుకదా? అందుచే మిల్టను దాను బ్రవేశించిన రాజకీయవ్యవహారములలోఁ గృతకృత్యుఁడు కావలెనని పనిచేయుటలో నించుమించుగనిరువదిసంవత్సరములుగడచిపోయెను. అప్పటికైన నాకార్య మాతఁ డనుకొనినంత జయప్రదముగాఁ దుదముట్టలేదు. తుట్టతుదకుఁ బ్రజాప్రతిపక్షుఁడే ప్రభువుగా నేర్పడుటచేతఁ బ్రజాపక్షమున నాతఁడు గావించిన యుద్యమము వ్యర్థమైనది.

ఒకానొక కార్యమును గూర్చి యిరువది సంవత్సరము లఖండముగఁ గావించిన ప్రయత్నము నిష్ఫలమై పోయినయెడల, సామాన్యమానవుఁ డాత్మశక్తియందు విశ్వాసము చెడి, నిరుత్సాహచిత్తుఁడై తనజీవితమునందు మఱి యెట్టి స్వల్పకార్యమునైనను సాధింపలేక, జీవితశేషమును ననామకుఁడయియే గడపియుం

కవి చిత్తదార్ఢ్యము

డును. కాని మిల్టనుమాత్ర మట్టిదుర్బలచిత్తుఁడు గాఁడు. వాని కాత్మశక్తి మెండు. అందాతనికిఁ బూర్ణవిశ్వాసము గలదు. గతించిన యపజయముగాని, ప్రారంభించిన ముదుసలితనముగాని వానిభవిష్యత్కావ్యరచనాప్రయత్నమునకు నిరుత్సాహమును బుట్టింపఁజాలక పోయినవి. రాజకీయ వ్యవహారములు విడిచిన తోడనే యతఁడు తనకావ్యరచన ప్రారంభించెను. క్రొత్తగా వచ్చినరాజు ప్రజాపక్షమునఁ బనిచేసిననాయకుల ననేకుల ననేకవిధముల శిక్షించుచుండుట యెఱింగియు, వాని చిత్తము భయముగాని చాంచల్యముగాని పొంది కావ్యరచనాపరత్వమునుండి తప్పిపోలేదు. ఆదినములలో వానికిఁ గొన్నిబుణబాధలు సైతము నుండెడివఁట! మహాయోగనిమగ్నుఁడై పరబ్రహ్మమునందుఁ దన్మయత్వముచెందిన యోగీశ్వరునివలె నతఁడు బాహ్యప్రపంచమునందు లేశమును దృష్టియేలేక, కవితానందపరవశుఁడై తదేకధ్యానముతో మహాదీక్షతో, 'Paradise lost and paradise regained' అను రెండుభాగములు గల మహాకావ్యమును రచించి, యాంగ్లకవిపుంగవులలో, నాచంద్ర

తారార్క మైన యశస్సంపద సంపాదింపఁ గల్గెను. జితేంద్రియుఁడును జీవన్ముక్తుఁడును ననుటకిం కెట్టివాఁడు కావలయును?

కవికవితాసంబంధపర్యవసానము

నిజమైనకవి సర్వజ్ఞుఁడు. సాధారణముగ నేభాషాకవులలోనైనఁ బోతన మిల్టనుల వలెఁ జిత్తపరిణామముగలకవులు మిక్కిలి యరుదుగా నుందురు. పరిపక్వ హృదయుఁడు గాని కవికవిత్వము పామరత్వసంపర్కమున వన్నె చెడకపోదు. ఇట్టి కారణములచేఁ గవి యగువానియందలి యీశ్వరదత్తమగు కవిత తత్తదవస్థా విశేషములంబట్టి సంపూర్ణముగ వికసింపకపోవచ్చునని చెప్పుట కవకాశము గలుగుచున్నది.

వస్తు సౌందర్యము: కవిత్వము

కవికిని గవిత్వమునకును గల సంబంధమునుగూర్చి చర్చనీయాంశ మింకొకటిగలదు. పరమాణువు మొదలు బ్రహ్మాండమునం దంతటం గల జంగమస్థావరరూపకములగు సమస్త వస్తు విశేషములలోఁ గవి దేనినైన వర్ణింపవచ్చును. నిజమైనకవి రచించినరచనయందుఁ గవిత్వముండక తప్పదు. అందుచేఁ గవివర్ణించిన ప్రతివస్తువునందునుగూడఁ గవిత్వముండుట, కవియొక్క శక్తి విశేషమా? బ్రహ్మయొక్క సృష్టివిశేషమా? అడవియందనామకముగాఁ బెరుగు తెల్లుగడ్డియు, సముద్రపుటొడ్డున నలలయలజడిని బేరుకొనిన నురుఁగును నెంతటి ప్రయోజనములేని వస్తువులు! మహాత్ములయశస్సు వర్ణించు సందర్భమునఁ గవి వీనిని సాధనములుగా గ్రహించుచుండుటచేత, నీరెండల్ప వస్తువులకును నత్యున్నత్యము ప్రాప్తించినది. మఱియు నెట్టి వీలువయు లేని యీ రెండువస్తువులను యశోవర్ణనమున కుపమానములైన వజ్రములు, ముత్యములు, కర్పూరము, మొదలగు మహావస్తువులలోఁ జేర్పఁబడుచున్నవి. సృష్టియందలి వస్తుసౌందర్యము కవికిఁ దప్ప మఱియొకనికిఁ గానరాదు. ఆసౌందర్యము కవిత్వమును నాకర్షించును. కవిత్వ మాసౌందర్యమును నాకర్షించును. మఱియు నాసౌందర్యమే కవిత్వమనియుఁ జెప్పనొప్పును. అయ్యది తృణము మొదలు మహామేరువు వఱకుం గల ప్రతివస్తువునందును నిండియున్నది. కవిమనోనేత్రమునకు మాత్రమే దృష్టమగుచున్నది. అందుచే నట్టియదృష్టములేని యితరుని కంటికి తెల్లుగడ్డి తెల్లుగడ్డియే; సముద్రపునురుఁగు సముద్రపు నురుఁగే.

సృష్టియందలి ప్రతివస్తువును గవిత్వాత్మకమగు సౌందర్యముచే నిండియున్నప్పుడు, ఒకానొక వస్తువుకడకు నలువురు కవులొక్కమారే పోవుట తటస్థించునేఁ దద్వస్తుసంస్థితంబగు కవితాసౌందర్య మానలువురుకవుల నొక్కమారే యాకర్షించునుగదా! అప్పట్టున

కవితాస్వరూపము

నన్నలువురు రచించురచనలునుగూడ నొక్క ప్రతియే యగునా? యనుప్రశ్న వచ్చుచున్నది. కాని సౌందర్యమే కవిత్వమైనపుడు, తత్సౌందర్యమ్మునకుం బలెఁ గవిత్వమునకుఁ గూడ నిదమిత్థ మను నాకారనిర్ణయ ముండదు. నలుపు, తెలుపు, పసుపు, మొదలగువానిలో

నేరంగుగలవస్తువునందైనను సౌందర్య ముం డవచ్చును. ఆసౌందర్యము తద్వస్త్వాకారవిశేషమునుబట్టి ప్రకాశించుచుండును. ఒక్కదీపమే పలురంగుల గాజుకుప్పెలయందుఁ బలు విధములగు కాంతుల నీనుచున్నది. కవితా ప్రకాశముగూడ నట్టిదియే.

### కవులు: భిన్నతత్త్వములు

వస్తుసౌందర్యము కవిహృదయమునందుఁ బడి యందుండి వెడలునపుడు వానిహృదయ తత్త్వమునుబట్టి ప్రకాశించుచుండును. ఒక కవి శృంగారపురుషుఁడు. మఱియొకకవి మహాభక్తుఁడు. ఈయిరువురుకవుల కవితారచనలును బరస్పరభిన్నములై వారివారిమనస్తత్త్వముల కనుకూలముగనే యొప్పుచుండును గాని, సాధారణముగాఁ గలయనేరవు. కవిత విచిత్రమైన యొకయద్దము వంటిది. అందుఁ జూచినయెడల నెన్నిశతాబ్దముల క్రిందటనుండిన కవియైనను మనకుఁ గన్పడుచుండును.

### హృదయ తత్త్వప్రకాశము

మహాకవియైన ధూర్జటి కవితారచన నించుక పరిశీలింతము. అతఁడు శివభక్తాగ్రేసరుఁడు గదా? తత్కృతి దర్పణమునందుఁ జూచినప్పు డాతఁడు మూర్తీభవించిన శైవ భక్తివలె మనకుఁ దోఁచుచున్నాఁడు. వాని చిత్తము శ్రీ కాళహస్తీశ్వరునియందు సంపూర్ణతన్మయత్వము చెందుటచేతఁ బ్రపంచమునఁ బ్రతివస్తువును శివలింగాకారముతోడనే వానికిఁ గన్పడుచుండెను. చూడుఁడు! కవి గావించిన చంద్రోదయవర్ణన మెంతవింతగ నున్నదో!

"మ. ఉదయగ్రావము పానవట్టు, మభిషేకోదప్రవాహంబు వార్ధి, దరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాశి కౌముది, తారానివహంబు లర్పిత సుమంబుల్ గాఁ దమోదూరసౌఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్."

ఇంతియేగాక మఱియొకసందర్భమునఁ గవియంధకారము నిట్లు వర్ణించుచున్నాఁడు.

"క. పంకేరుహాప్తబింబము
గ్రుంకఁగఁ దిమిరం బజాండగోళము నిండెన్
శంకాతమఃపరంపర
శంకరచిద్రహితమానసంబును బోలెన్."

ఇంకొకచోటఁ గవి కొకకమలాకరము నాకారము పరబ్రహ్మమువలెఁ గానవచ్చిన దఁట!

"గీ. హంస సంసదభీష్ట విహారహేతు
వై బహూపకహృద్యమై యప్రతర్క్య
మగుచు, నద్వంద్వమై పంకజాకరంబు
పోలిచె బ్రహ్మంబు తెఱఁగునఁ బూర్ణ మగుచు."

ధూర్జటి యెంతటిశైవభక్తి ప్రపూర్ణుఁడైనను విష్ణునామశ్రవణా భావుఁడైన వీరశైవుఁడని చెప్పుటకుమాత్రము వీలులేదు. కేవల వైష్ణవమునుగాని, కేవలశైవమును గాని యభేదప్రతిపత్తిగల మహాత్ములు పామరత్వమనియే యూహింతురు. ధూర్జటి కట్టి పామరత్వము లేదని వానిహృదయ తత్త్వమును బ్రకటించు నీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

"మ. సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁ డనుటల్ సత్యంబుగాఁ జెల్వుపో, లికఁ జెంజీకటి నిండఁ దారకలు వెల్చెన్ నిర్జరాధీశ్వరా, దివి లర్పించినపువ్వులట్ల భవుఁ డద్దేవుండు భేదంబు గా, మిఁకిఁ దెల్లంబుగ నల్పు దెల్పగ దరన్ మించెన్ శశాంకాకృతుల్."

తన్మయత్వ ప్రతిబింబము

పోతనామాత్యుని మతము విష్ణుగుణ వర్ణనము. 'ఏనీగుణములు కర్ణేంద్రియంబుల సోక దేహతాపంబులు దీరిపోవు' అని యతఁడు రుక్మిణిచేఁ బలికించిన వాక్యమే వానిజీవితమునకు ముఖ్యసూత్రము. ఆసూత్రము ననుసరించియే యతఁడు భాగవతమంతయు రచించెను. వాని చిత్తము భగవద్గుణ వర్ణనమునందుఁ దన్మయత్వము నొందుటచేత నందుండి వెలువడిన కవితాప్రవాహమునందాతన్మయత్వ మెట్లు ప్రతిబింబించుచున్నదో చిత్తగింపుఁడు!

యశోద కృష్ణుని మందలించుట

"క. పట్టినఁ బట్టువడని నినుఁ
బట్టెద నని చలము గొనినఁ బట్టుట చెట్టే?
బట్టువడవండ్రు పట్టీ!
పట్టుకొన న్నాకుఁ గాక పరులకు వశమే!

క. ఎక్కడ నైనను దిరిగెద
వొక్కయెడం గుణము గలిగియుండవు, నియమం
బెక్కడిది నీకు? మఱచినఁ
జక్కఁగఁ బోయెదవు పెక్కు జాడలఁ బుత్రా!.

సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు
తలఁచెదు గట్టినఁ దరల నెత్త,
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నత స్తంభంబు లూఁపఁబోయె
దన్యుల నల్పంబు లడుగంగఁ బారెదు
రాచవేటలఁ జాల రవ్వదెచ్చె
దలయవు నీళ్లకు నడ్డంబుఁ గట్టెదు
ముసలిపై హరివృత్తి మొనయఁ జూచె
దంబరంబు మొలకు నడుగవు తిరిగెదవింకఁ గల్కిచేత లేలపుత్ర!

నిన్ను నంప వ్రాల్ప నే నేరననియె నీ
విట్లు క్రిందుమీఁదు నరయ కునికి."

ఇది వ్యంగ్యప్రధాన (Suggestiveness) మైన కవిత. అన్నివిధములైన కవిత్వములలో వ్యంగ్యకవిత్వ మత్యుత్తమమని లాక్షణికులు శాసించుచున్నారు. యశోద దుడుకుఁదనము నుండి తనకొడుకునుమందలించుటయే యిచ్చటి కథాభాగము. దీనిని రచించుటలోఁ గవిహృదయమునఁ బుంజీభవించియున్న భగవద్గుణములు వానికవితా ప్రవాహములో మునిఁగి వెలుపలికిఁ గొట్టుకొని వచ్చినవి. రుక్మిణి నపహరించిన కృష్ణుని, రుక్మిచేఁ దూలనాడింపవలసినపట్టునందుఁగూడ గవి తనకు సహజమైన భగవద్గుణవర్ణనాపక్షపాతమును విడిచిపెట్టలేదు.

"సీ. మాసరివాఁడవా మాపాపఁ గొనిపోవ
నేపాటిగలవాఁడ వేది వంశ
మెందు జన్మించితి వెచ్చటఁ బెరిఁగితి
వెయ్యది నడవడి యెవ్వఁ డెఱుఁగు
మానహీనుఁడ వీవు మర్యాద లెఱుఁగవు
మాయ నైకొనిగాని మలయరావు
నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు
వసుధేశుఁడవు గావు వావి లేదు
కొమ్మ నిమ్మ నీవు గుణరహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖాసమాన శితశిలీముఖముల
గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు"

ఇట్లు కవిహృదయ తత్త్వము తద్విరచితంబగు కవిత్వమ్మునం దందందుఁ బ్రతిబింబించుచుండును!

# ధన విచారము

### జంధ్యాల వేంకటశివకవులు

కమలాచంచలలోచనాంచలప్రతీకాశమ్ము విత్తమ్ము, దు
ర్భ్రమచే దీనినిమిత్త మిక్కఁగణి గర్వం బెక్కుడుం జూపనే
ల మనుష్యుల్, మెడయందు గట్టిగను ప్రేలం ద్రాటితోఁ గట్టినన్
యమయాత్రాసమయమ్మునం దమదు వెంటన్ రాదు నిక్కమ్ముగన్.

గీ. లేచినది యాదిగాఁ బవళించువఱకు, పాటులెల్లను బడుచును బరువు లెత్తి
ధనము ధనమని మ్రోగెడి జనులు తుదకు, మఱచిరే నిధనంబను మాట యకట!

గీ. ధనము వ్యయము సేయక సతతమ్ము నాలు, బిడ్డలను సుంతయును సుఖపెట్టలేక
శోభఁదక్కి మెలంగెడు క్షుద్రులకు దరిద్రులకు భేద మేమి వర్ణింపరాదు.

క. ధనసంపాదన రతివర్ధనులై నిధనావధిన్ సదా చూడరు, చ
చ్చిన వెనుక వీరిలోభమ్మును దిట్టుచు ధనము నొరులు భుజియింతురుగా.

క. ఎఱవగు ధనమ్ము చెప్పిన, నొరులకు వచియింపకున్న నెందును ఖలమున్
మఱియును సెలవై యంతః, కరణంబును నేఁచు చావుకాలమునందున్.

గీ. సకలకష్టమ్ము లోర్చి యార్జనముఁ జేసి, తాను లుబ్ధుఁడై తినుటయు మాని కూడఁ
బెట్టినధనమ్ము మృతిగొను వేళ నొరులు, పంచుకొందురో; యయ్యది వల దెవనికి.

చ. ఎవరికి విద్య వాదమున కేర్పడు, విత్తమహంక్రియాసము
ద్భవచణమౌను, ప్రజ్ఞ పరవంచనకారణమౌను, సర్వగౌ
రవపటువైన యున్నతి కరంబును లోకతిరస్క్రియాకరం
బవునె, ప్రకాశమున్ దిమిరమౌఁ జుమి, ధాత్రిని నట్టివారికిన్.

మ. ధనమున్ క్షారజలమ్ము చల్లినను నన్తస్తృష్ణ చల్లారలే
దనయం బేమెడ హేయభోజనము సేయన్ గాయమున్ జాయద
క్కెను, భూపాలకతస్కరాదులమనఃక్లేశమ్ము సంప్రాప్తమ
య్యెను, ఔరా! నిరుపేదకన్న ధనికుండే? దుఃఖియౌ లుబ్ధుఁడున్.

---

# వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము

రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారు

పదిపండ్రెండేండ్లక్రిందట గ్రామ్యగ్రాంథిక వాదము చెలరేగినప్పుడు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పంతగించి, వ్యావహారిక భాష గ్రామ్యమని దూషించి దానిని బహిష్కరించినారు. వారు ఏ పండితులతో ఈ విషయమై సంవదించినారో వారిలో అధిక సంఖ్యాకులు ఇందుకు సమ్మతించేటట్టు చేసినారు. సంస్కృతమందు వైదిక భాషకును లౌకిక భాషకును వ్యాకరణసిద్ధమైన భేద మెట్లు కలదో ఆ తెలుఁగుననే యాంధ్రమందును గ్రాంథిక భాషకును వ్యావహారిక భాషకును భేదము గ్రహింపవచ్చుననియు, లౌకిక భాష కేవల గ్రామ్య మని విసర్జింపక దానికిం దగినట్లు వ్యాకరణ మేర్పఱిచి యట్టి వ్యాకరణము ననుసరించి వ్యావహారిక భాషను గ్రంథములం బ్రయోగించుట కాక్షేపణ యుండఁగూడదనియు ప్రఖ్యాతపండితు లయిన శ్రీ పేరి కాశీనాథశాస్త్రులవారు చేసిన హితోపదేశము తృణీకరించినారు. లోకమందంతటా ఏకాలమందు ఏభాష శిష్టవ్యవహారమందు ఉంటుందో అదే దేశభాష అనిన్ని, దానిలోనే అందరూ చదువుట కుపయోగించే గ్రంథములు రచించడము సదాచారముగా ఉన్నదనిన్ని, ఇంగ్లాండు మొదలయిన దేశములందు నెలకొని ఉన్న సత్సంప్రదాయముచొప్పున శ్రీగురజాడ వేంకటప్పారావు పంతులుగారున్ను నేనున్ను చేసిన యుపదేశము త్రోసి పారవేసినారు. అంతుపిమ్మట పరిషత్తువారే కొందరువిద్వాంసులను అన్ని పట్టణములకు పంపి, ఈబహిష్కారము చాటింపించి, ఊరూరా సభలు కావించి, ఈబహిష్కారము ఆంధ్రమహాజనులు అంగీకరించినట్టుగా తీర్మానములు చేయించినారు. పదివేలసంతకములతో ప్రజలపేరిట మహజర్‌నామా ప్రభుత్వమువారికి అందజేయించినారు. అందులో వ్యావహారిక భాషను గ్రంథములు రచించుట పూర్వసంప్రదాయమునకు విరుద్ధమనీ, అట్టిగ్రంథములు దేశమందు లేవనీ, ఉంటే అవి గ్రాంథిక భాషాజ్ఞానము లేనివారు వ్రాసినవనీ, ఈకాలమందనేకులు నిర్దుష్టముగా గ్రాంథికాంధ్రమున నానావిధమైనగ్రంథములున్ను అనేకముగా రచిస్తున్నారనీ, వేలకొలదిగా వాటిప్రతులు పట్టణములలోను పల్లెలలోనూ ఆబాలగోపాలం అందరూ కొని చదువుతూ ఉన్నారనీ, బడులలో పిల్లలచేత గ్రాంథికాంధ్రాభ్యాసము చేయించడమే ప్రజలందరికి ఇష్టమనీ, వ్యావహారిక భాషాభ్యాసము ఎవ్వరికీ ఇష్టముకాదనీ గట్టిగా గవర్నమెంటువారికి నచ్చజెప్పినారు. అర్జీలు టెలిగ్రాములు పత్రికలు పుస్తకాలు అపరిమితముగా కురిపించి అందరిని అదలగొట్టినారు. కర్జన్ ప్రభువు నిరంకుశప్రభుత్వమునకు ప్రతికూలముగా అధికారవర్గమునకు ప్రతిఘటించి ప్రభుత్వమువారిని ప్రజలప్రతినిధులకు లొంగేటట్టు చేయుటకు పూనుకొని ఉన్న గౌ. శ్రీనరసింహేశ్వరశర్మగారు మొదలయినవారు ఈ విషయము తమ పనికి అనుకూలముగా నున్నందున ఇది ఆధారముగా జేసుకొని విద్యాధికారులు బడులలో ప్రవేశపెట్టిన వ్యావహారిక భాషను బహిష్కరించి ప్రజలస్వాతంత్ర్యముసాధించి కృతకృత్యులైనారు గాని దేశభాషను పరిషత్తుకు పండితులకు గుత్తకిచ్చివేసినవారయినారు. ఇట్లే యూనివర్సిటీవారి వ్యావహారిక భాషాభిమానముకూడా గ్రాంథిక భాషాభిమానుల నీతితంత్ర ప్రయోగముచేత నిష్ఫలమైనది. యూనివర్సిటీవారు నిర్ణయించిన కాంపోజిషన్ కమిటీలో నలుగురు గ్రామ్యవాదులున్ను నలుగురు గ్రాంథికవాదులున్ను ఇద్దరు మధ్యస్థులున్ను మొదట ఉండిరి. మధ్యస్థులు ఇద్దరున్ను గ్రామ్యవాదులతో ఏకీభవించి శిష్టవ్యవహారమందున్న భాష గ్రామ్యమన్నారు. ఆతీర్మానము తమకు ప్రతికూల మవుటవల్ల గ్రాంథికవాదులు, తమకు గల పలుకుబడిచేత మరినలుగురు గ్రాంథికవాదులను ఏదోసాకు కల్పించి కమిటీలో చేర్చుకొన్నారు. అందుచేత వారి పక్షమువారు కమిటీ

లో అధికసంఖ్యాకు లయి, మొదటితీర్మానము నిరర్థకమయేటట్లు చేసినారు.

పరిషత్తువారు చాలాధనము కర్చుపెట్టి చాలా శ్రమపడి వ్యావహారికభాషాభ్యాసమువల్ల సారస్వతము నశించి దేశమునకు ఉపద్రవము కలుగుతుందని ప్రజలను, ప్రభుత్వమువారిని, విద్యాధికారులను నమ్మించుటకై చెప్పిన మాటలన్నీ యథార్థమయినవి కావనిన్నీ దురభిమానముచేత తాము మోసపోయి లోకమును మోసపుచ్చినారనిన్నీ ఈవ్యాసమందు ఋజువు చేస్తాను. వ్యావహారిక భాష అపరిమితప్రయోజన మైనదనీ గ్రాంథిక భాష పరిమితప్రయోజనమై పండితలోకమున కైనా సులభముకాదనీ సప్రమాణముగా నిరూపిస్తాను. వ్యావహారికభాషాబహిష్కారము చెల్లదనీ, గ్రాంథిక భాషనే గ్రంథములన్నీ రచించవలెనని నియమ మేర్పరుచుటవల్ల చక్కగా దేశభాష వృద్ధిపొందదనీ ప్రజలలో విద్య చక్కగా వ్యాపించదనీ స్పష్టముగా తెలియజేస్తాను.

సాహిత్యపరిషత్తువారు వ్యావహారిక భాష నిష్ప్రయోజనమనో అనర్థకమనో భావించి బహిష్కరించినారు. సంభాషణలలోకూడా ఈ బహిష్కారము చెల్లవలెననే వారిసంకల్ప మయినట్టు కనబడుతున్నది. కీర్తిశేషులయిన కొక్కొండ వెంకటరత్నము పంతులవారివలె ఇంటిలోను వీథిలోను బాజారులోనూ కాకపోయినా బడులలోను న్యాయస్థానములందు కార్యస్థానములందు సభలలోనయినా గ్రాంథిక భాషనే మాట్లాడుట అందరూ అభ్యసించవలెనన్నారు. ఈపదిసంవత్సరములలో పరిషత్ప్రముఖులైనా అధమపక్షము అధ్యక్షులుగా నుండేవారయినా గ్రాంథికాంధ్రము యాదృచ్ఛికసంభాషణమందు వాడడము అలవాటు చేసుకొన్నారా? వారిబహిష్కారశాసనము ప్రకటించినప్పుడే నేను రచించిన మెమోరాండములో "ఈ శాసనము చొప్పున గ్రాంథికాంధ్రము మాట్లాడనేరనివారిని పరిషత్తులోనుండి తొలగించవలసి ఉంటుంది; అట్లాచేస్తే ఒక్కరయినా పరిషత్తులో నిల్చి ఉంటారా?" అని అడిగినాను. తామే అనుసరించలేనప్పుడు తమశాసనము లోకములో చెల్లుతుందా? దానిని లోకులందరూ అనుసరించగలరనుకొన్నారా? ప్రకృతివిరుద్ధముగా కొన్ని కుక్కలను గాడిదలను అత్యంతకఠినశిక్షచేత సర్కసులో నేర్పరులు ఆడించగలిగినట్లు పరిషత్తువారు ప్రజలందరిచేతనూ "గ్రాంథిక భాష" మాట్లాడించ గలరా? ఓహో! అవివేకవిలసితము! భాష అంటే ఏమిటో ప్రజలకు భాష ఏలాగున అలవడుతుందో చిన్నప్పటి నుండిన్ని వాడుతూ ఉన్న భాష పెద్దవాళ్లకు విడిచిపెట్టడము ఎందుకు అసాధ్యమో లోకమందెక్కడా చెవిని బడనిభాష పుస్తకాలలో చదువుకొని నోటను స్వేచ్ఛగా ఎందుకు మాటలాడలేరో, అట్టిభాష ప్రజలందరికీ విద్య నేర్పుటకు ఎందుచేత ఉపచరించదో తెలియనివారు ఎంతగొప్పవారైతే నేమి దేశభాషజోలికి రాకూడదు. ఇతరవిషయములలో వారికి గల గొప్పతనమూ పలుకుబడీ చూచి ప్రజలు భ్రమపడి వారిశాసనము దేశమునకు హితమయినదని నమ్మినారుగాబోలు. అయితే నమ్మినవారు ఎవరూ నమ్మినదానిని ఆచరించినట్టు తోచదు. పరిషత్తువారి బహిష్కారశాసనము ప్రకటితమైనపిమ్మటనే గాంధీమహాత్ముని ఉపదేశమమూలముగా మనదేశమందు అంతటా పుట్టి దినదినప్రవర్ధమానమయి పట్టరాకుండా ఉన్న ఉత్సాహమువల్ల స్వాతంత్ర్యాభిలాష స్వదేశాభిమానము స్వరాజ్యేచ్ఛ సంఘుజీవనమందు తక్కినవ్యాపారములను వికసింపజేస్తూ ఉన్నట్టే సకలవ్యవహారనిర్వాహమునకు పరమసాధన మైన దేశభాషనుకూడా అనేకవిధముల విజృంభింపజేస్తూ ఉన్నది. పరిషద్బహిష్కారము పాటించకుండా వ్యావహారికభాషలో పుస్తకములు వ్యాసములు అనేకముగా రచించి ప్రకటిస్తున్నారు. సభలలో అందరూ వ్యావహారిక భాషలోనే యథేచ్ఛముగా ఉపన్యాసములు చేస్తున్నారు. అధ్యక్షులుకూడా ఆభాషే వాడుతున్నారు. అందులో తీర్మానములు వ్రాస్తున్నారు. గోదావరీ కృష్ణవేణీ నదీప్రవాహములవలె సర్వసౌభాగ్యప్రదమై దేశనాయకుల ముఖములనుండి వాస్తవమైన దేశభాష వెల్వడి దేశస్థుల వ్యవసాయము సఫలము చేస్తున్నది. దానియోగ్యత దాని ఔచిత్యము దానిమాధుర్యము దాని ప్రాశస్త్యము అందరూ చవిచూస్తున్నారు. దానిసౌలభ్యము దాని ప్రాచుర్యము దానిని అందరికీ ఆదరణీయముగా చేస్తున్నవి. తెలుగువారికి వాస్తవమైన దేశభాష ఇదే అని బోధపడుతున్నది. గాంధీమహాత్ముడు తెలుగువారితో

తెలుగున మాట్లాడ గోరితే ఈతెలుగే కదా నేర్చుకొని అభ్యసించవలెను? ఈ తెలుగువంటిదే కదా ఆయనా ఆయన సతీమణి కస్తూరిభాయిగారూమాట్లాడేగుజరాతీ. అట్టి గుజరాతీలోనేకదా ఆచార్య గిద్వానీగారు తన శిష్యులకు పుస్తకములు రచింపుమన్నట్టు గుజరాతీవిద్యాపీఠకార్యనివేదనమందు ప్రకటించినారు? శ్రీరవీంద్రనాథఠాకురుగారి బంగాళీకూడా ఈతెలుగువంటిదే. ఆయన రచించిన సుప్రసిద్ధకావ్యములకు అదే ఉచితమైనది. ఏసుక్రీస్తుకూడా ఈతెలుగువంటి యూదులదేశభాషలోనే పామరులయిన తనశిష్యులకు పరమధర్మముపదేశము చేసినాడు. బుద్ధదేవుడు ప్రజలకు అహింసాధర్మము పాలీభాషలో ఉపదేశించినాడు. మనము మాట్లాడే తెలుగువంటిదే వారు ఆకాలమందు మాట్లాడే పాలీ. బౌద్ధసంఘముల వ్యవహారమంతా వ్యావహారిక భాషలోనే జరుగవలెనని బుద్ధుడుశాసించినాడట.* అన్ని దేశములందున్ను అన్నికాలములందున్ను ఆబాలగోపాలం అందరికీ ఉపచరించేటట్టు ధర్మోపదేశము చేసిన గురువులు తమనోటిమాటలతోనే ఉపన్యాసములు చేసినారు. వారిశిష్యులలో వ్రాతనేర్చినవారు ఆమాటలు వ్రాసిపెట్టుకొని తాము చదువుకొంటూ ఇతరులకు చదివి వినిపించేవారు. ఇదే లోకమందు సంప్రదాయము.

4. గ్రాంథికాంధ్రమునందు మనవారికి గల గౌరవము భారతాది ప్రాచీన గ్రంథములయందున్న గౌరవమునుబట్టి కలిగినదే; కాని దానిప్రాచీనతచేతనూ దానిని అభ్యసించుటకు పడవలసిన కష్టముచేతనూ కలిగినదికాదు. ప్రాచీనభాషలన్నీ ప్రాచీనకాలమందు వాడుకలో సర్వజనసామాన్యమయినవే. విషయమందుస్వతః లేనిగౌరవము ప్రాచీనభాషలో చెప్పితేమాత్రమువస్తుందా? విషయమందువాస్తవముగా ఉన్నగౌరవము సర్వసామాన్యమైన భాషలో చెప్పితే పోతుందా? లేక తగ్గుతుందా? భాష పరమార్థము కాదు. అర్థసిద్ధికి సాధనము; ఉపకరణము వంటిది. చిన్నప్పటినుండిన్ని అందరికీ సామాన్యముగా అలవడ్డ భాషకన్న ప్రయత్నపూర్వకముగా నేర్చుకొంటేనేగాని రానిభాష భావబోధకు అధికానుకూలమైన సాధనమవుతుందా? లౌకికభాష త్యజించేవారికి లోకయాత్ర జరగదు. అవసరోచితముగా వాడుకచొప్పున ఎవరివర్గానికొద్దీ వారు మాట్లాడవచ్చును. వచ్చీరాని "గ్రాంథికాంధ్రము"తో మాత్రము తమభాషాపాండిత్యము లోకవ్యవహారమందు ప్రకటింపజేయడము హాస్యాస్పదముగా ఉంటుంది. ఇంటర్ప్రెటర్లు, ట్రాన్సలేటర్లు వారి అభిప్రాయములు వాడుక మాటలతో తెలియజేస్తేనేకాని వ్యవహారహాని కలుగుతుంది. మనదేశభాష రానివారు మనదేశమువచ్చి హిందీలోనో ఇంగ్లీషులోనో ఉపన్యాసము చేస్తే వాటిఅర్థము ఆభాషలు నేర్చిన తెలుగువారు మనకు తెలిసినతెలుగున చెప్పక గ్రాంథికాంధ్రములో చెప్పడము వ్యర్థప్రయాసము కాదా? ఒకతెలుగువాడు ప్రాచీనాంధ్రభాషాపండితుడైనా, తెలుగుప్రజలతో మాట్లాడేటప్పుడు, అందరికీ సుబోధముగా తనవాడుకమాటలే వాడవలెను గదా.

5. నిత్యమున్ను జనులందరూ వాడుతూ ఉన్న భాష రద్దుజేసి, గ్రాంథికభాష దానికి మారుగా వాడవలసినదని శాసించేవారు వివేకులయితే, గ్రాంథికమేదో స్పష్టముగా నిరూపించి, దానిని సులభముగా అందరూ నేర్చుకొనుటకు అనుకూలమయిన సాధనములు ముందుగా ఏర్పర్చి ఉందురు. గ్రాంథికభాషాలక్షణము ఇంకా గ్రాంథికభాషాకావ్యములందే నిగూఢముగా ఉన్నది. ఇప్పుడున్న వ్యాకరణములవల్ల ఆలక్షణము స్పష్టముగా తెలియదనీ, ఇప్పుడున్న నిఘంటువులవల్ల శబ్దరూపములు శబ్దార్థములు శబ్దప్రయోగములు నిస్సంశయముగా తెలుసుకొనుటకు సాధ్యము కాదనీ, భారతాది ప్రబంధముల పాఠములు ఇప్పటి అచ్చుపుస్తకములలో శుద్ధమయినవని విశ్వసింపలేమనీ, ప్రాచీనగ్రంథములు అచ్చుపడకుండా ఇంకా అనేకమున్నవనీ, అవి కూడా శోధించి చూస్తేనేకాని ఆభాషాలక్షణము సంపూర్ణముగా ఏర్పడదనీ—మ. జయంతి రామయ్య పంతులుగారే విరోధికృన్నామ సంవత్సరాదిసంచికలో "ఆంధ్రభాషాసంఘము" అనే వ్యాసమందు వ్రాసి ప్రకటించినారు. ఇట్లే శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు నెల్లూరిలో జరిగినపరిషత్సభలో అధ్యక్షోపన్యాసమందున్ను శ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు ఆసభలోనే

* Bhandarkar Com. Vol. P. 443.

ఆంధ్రవ్యాకరణములనుగూర్చి చేసిన ఉపన్యాసమందున్ను విశదపర్చినారు. ఈభాష కేవలగ్రంథస్థమయి, ప్రయోగశరణముగానే ఉన్నది. ఒకవ్యాకరణమును బట్టి సాధువనవలసినశబ్దము మరి ఒకవ్యాకరణమునుబట్టి అసాధు వనవలసి ఉన్నది. ఒకకోశమునుబట్టి సాధువుగా కనబడే శబ్దరూపము మరిఒకకోశమును బట్టి అసాధువుగా కనబడుతుంది. ఈభాషలోని శబ్దములరూపము సందిగ్ధము. శబ్దములలో ఔపవిభక్తికము లేవో, అనౌపవిభక్తికము లేవో ఏర్పడలేదు. కావలసిన విభక్తిలోగాని, వచనములోగాని ఏశబ్దము పడితే ఆశబ్దము ప్రయోగించుటకు సిద్ధరూపములు తెలిస్తేనేకాని వల్లపడదు. ఏవి నిత్యైకవచనాలో, ఏవి నిత్యబహువచనాలో తెలియదు. శబ్దమూ శబ్దార్థమూ తెలిసినా, కారకము సందిగ్ధముగా ఉన్నప్పుడు ప్రయోగించుటకు పనికిరాదు. క్రియలన్నిటికీ గ్రాంథికాంధ్రములో ప్రేరణార్థకరూపము లెట్లుండునో వ్యాకరణములవల్లగాని కోశములవల్లగాని తెలియదు. ప్రయోగములయినా ఒకప్రయోగమునుబట్టి సాధువనదగినవి మరి ఒకదానినిబట్టి అసాధువు లనవలెను. భారతప్రయోగములయినా కూర్పులన్నిటిలో ఒకలాగున లేవు. ఈభాషాలక్షణము ఇట్లు పరమగహన మవుటచేత మనపూర్వులలో నయినా, లెస్సగా సంస్కృతాంధ్ర కావ్యములు చదివి నిరంతరభాషారచనాభ్యాసముచేసిన పండితులు మాత్రమే గ్రాంథికాంధ్రమున ప్రబంధములు రచించేవారు. వాటిలోని మంచిచెడ్డలు వారివంటిపండితులే విమర్శించేవారు. ఇది సంస్కృతమువలెనే బహుకాలాభ్యాసము చేసి నేర్చుకోవలసినభాష. అన్నవస్త్రములకోసము పాటుపడ నక్కరలేనివారికే సాధ్యము.

6. పరిషత్తువారు చక్కగా ఆలోచించకుండా వట్టి గ్రాంథికాంధ్రభాషాభిమానముచేత "ఈకాలమందు అనేకులు నిర్దుష్టముగా గ్రాంథికాంధ్రమున అనేక గ్రంథములు రచిస్తున్నారనీ, అవి చదివేవారు వేలకొలదిగా ప్రజలలో ఉన్నారనీ" సభలలోనూ, పుస్తకాలలోను, పత్రికలలోను మహజర్లలోను ఊరూరా ప్రకటించీ ప్రజలకున్ను ప్రభుత్వమువారికిన్ని నమ్మకము పుట్టేటంతనిబ్బరముగా దృఢీకరించి చెప్పినారు. అయితే, వారుచెప్పినమాట లోకమంతా నిజమని నమ్మినా, నేను నమ్మజాలను. నేను విమర్శించి తెలుసుకొన్న విషయము నిర్మొగమాటముగా చెప్పుతాను.

7. ఇందుకు తార్కాణగా గొప్పగ్రంథకర్తలని మనకాలమందు ప్రఖ్యాతి పొందినవారినే పేర్కొని చెప్పగలను. గ్రంథకర్తపేరు విని భ్రమప్రమాదములకు లోనుగాక, ఆయన గ్రంథము సవిమర్శముగా చూచినవారు నామాట వాస్తవమని నమ్మకపోరు. సభలో కొందరు గ్రంథకర్తలయెదుటనే వారిగ్రంథములలోని భాషాదోషములు నిరూపించిచూపించినాను. గొప్పపండితుల గ్రంథములలో తప్పులు పట్టడము సాహసమే; కాని ఆపని దురుద్దేశముతో చేయలేదని త్రికరణశుద్ధిగా చెప్పుతున్నాను. సుపరిచితము కాని కేవలగ్రాంథికాంధ్రభాషను రచించుటకు పూనుకొంటే, పండితులకైనా తప్పులు అనివార్యమైనప్పుడు, అపండితు లయినవారికి ఆభాష సుతరాం అసాధ్యమని రుజువుచేయడంకోసము విధిలేక నేను ఈపని చేయవలసివచ్చినది. భీమునివంటివాండ్లకే జీర్ణముకాని ఆహారము పిల్లలకు పడదని చెప్పడము తప్పుకాదు. గ్రాంథికాంధ్రభాషారచనకు మార్గదర్శకులు పరవస్తు చిన్నయసూరిగారు. వారినీతిచంద్రిక మొదటికూర్పు రెండవకూర్పు వారు స్వయంగా అచ్చొత్తించినారు; వాటిప్రతులుఆంధ్రసాహిత్యపరిషత్తువారివద్దనున్నవి. పిమ్మట అనేకమైనకూర్పులు అచ్చుపడ్డవి; ఎన్నో సవరణలు (కొన్ని మంచివీ, కొన్ని చెడ్డవీ) పరిష్కర్తలు చేసినారు; గాని, మొదటికూర్పులోని తప్పులు కొన్ని ఇంకా నిలిచిఉన్నవి. కొక్కొండ వెంకటరత్నంపంతులుగారిని, కందుకూరి వీరేశలింగంపంతులుగారిని అనేకదుష్టగ్రంథకర్తలకు ప్రతినిధులుగా గణించి, వారిగ్రంథములలోనిభాషాదోషములు శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు ప్రకటించినారు. ఈ శాస్త్రిగారితప్పులు వేలకొలదిగా నేను వారిగ్రంథాలలో చూచినాను. కొన్ని నా తెలుగుపత్రికలలో ప్రకటించి, పత్రికప్రతులు వారికి పంపినాను. వీరివంటివారే పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, కల్లూరి వెంకటరామశాస్త్రిగారు, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుపంతులుగారు, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు, కూచి నరసింహము పంతులుగారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు

పంతులుగారు, చెలికాని లచ్చారావు బహద్దరుగారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, జయంతి రామయ్యపంతులుగారు, వంగూరి సుబ్బారావు పంతులు గారు; ఇంకను అనేకులును ఇట్టివారే. వీరు రచించిన గ్రంథములలో "లక్షణవిరుద్ధమయినశబ్దములు (కొన్నిటిలో అపరిమితముగాను, కొన్నిటిలో కొలదిగాను) నేను కళ్లారా చూచి ఉన్నాను. విజ్ఞానచంద్రికాగ్రంథమాల, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల, వేగుజుక్క గ్రంథమాల, విజ్ఞాన భాషోదయ గ్రంథమాల, ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురములు, లక్ష్మీవిలాసకంపెనీప్రచురములు, రామాకంపెనీ ప్రచురములు—ఇంకను మరికొన్నిమాలలలోనివి, ప్రచురములలోనివి, ప్రచురణములలోనివి గ్రంథము లనేకమున్నవి. అవి అన్నీ కూడా ఇట్టివే. యూనివర్సిటీ పరీక్షలకు, స్కూలుఫైనలుపరీక్షకు పఠనీయములుగా నిర్ణయించే అధునాతనకవివిరచితగ్రంథాలున్నూ ఇట్టివే. యూనివర్సిటీ కాంపోజిషన్ కమిటీవారు 1914 వ సం. రిపోర్టులో గ్రాంథికాంధ్రరచనకు ఆదర్శముగా పేర్కొని ప్రకటించినగ్రంథాలలో ఒకటైనా నిర్దుష్ట మైనదిలేదు. ఒకటైనా నిర్దుష్టమైన గ్రాంథికాంధ్రగ్రంథము మచ్చుకోసము పేర్కొని ప్రకటింపవలెనని జయంతి రామయ్యపంతులుగారిద్వారా ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిని కోరినాను; గాని నాకోరిక వ్యర్థమైనది.

8. సలక్షణమయిన గ్రాంథి కాంధ్రభాషలోనే ఈకాలమందు అనేకులు గ్రంథరచన చేస్తున్నారని రుజువుచేయుటకు పదేండ్ల క్రిందట గ్రాంథికభాషావాదులు మహాజర్లలో ప్రకటించిన విషయములు వాస్తవము కాదని పైపేరాలో రుజువు చేసినాను. ఇకను, వ్యావహారికభాషలో గ్రంథములు పూర్వులు రచించి ఉండలేదనీ వ్యావహారికభాష లక్షణవిరుద్ధ మయినందున గ్రామ్యముగా దానిని పరిగణించి పూర్వులు బహిష్కరించినారనీ, అట్టిభాషలో నేడు గ్రంథములు రచించి బడులలో పిల్లలచేత చదివించుట సనాతనసత్సంప్రదాయమునకు కేవలము విరుద్ధమనీ, గ్రాంథికవాదులు ప్రకటించిన విషయముకూడా విమర్శించి అదికూడా అసత్యమని రుజువు చేస్తాను. వ్యావహారికభాష నిష్ప్రయోజనమని మన పూర్వులు ఎన్నడూ తలంచలేదు; అది అపరిమితప్రయోజనమైనదని పూర్వపండితులు అంగీకరించినట్లు వారిగ్రంథములే ప్రమాణము. చూడండి:—

9. మనపూర్వులు మనవలెనే ఉత్తరప్రత్యుత్తరములు, క్రయపత్రములు, దానపత్రములు, ఒడంబడికలు మొదలయినవి వ్యావహారికభాషలో వ్రాసేవారన్నందుకు ప్రాచీనులు తాటాకుల మీద వ్రాసినవ్రాతలు కనబడలేదు; గాని, మన తాతలనాడు, ముత్తాతలనాడు, అంతకు రెండుమూడు తరములకు పూర్వమందున్న వ్రాసినతాటాకు లున్నవి. (చూ. సాహిత్యపరిషత్పత్రిక II పుట 219, మధుర నాయకుల దానపత్రములు). ప్రాచీనకాలమందుకూడా అట్టిఆచారముండేనని చెప్పుటకు తగినప్రమాణము శిలాశాసనములందున్ను తామ్రశాసనములందున్ను కలదు. మహారాజాధిరాజులు తమకున్ను తమతల్లిదండ్రులకున్ను పుణ్యమూ కీర్తీ వృద్ధియగుటకై దేవాలయములు, ప్రాకారములు, మండపములు, చెరువులు కట్టించి, ఈశ్వరారాధనా బ్రాహ్మణులకర్మములా నిరంతరాయముగా జరుగుటకు అగ్రహారములు దానముచేసి తమధర్మములు ఆచంద్రార్కము చెల్లవలెనని శాసనములు చెక్కించి ప్రకటించినారు. కొందరు మహారాజులు వాణిజ్యవ్యాపారములు అభివృద్ధిపొందుటకై స్వల్పసుంకములు నిర్ణయించి "అభయశాసనములు" శిలాస్తంభములమీద చెక్కించినారు. రాజులవలెనే ప్రజలలో ధనవంతులు కొందరు కూడా చేసేవారు. ఈ శాసనములరచన సనాతనసంప్రదాయసిద్ధమైనది. దాతలప్రశస్తి వంశవర్ణన తరుచుగా సంస్కృతమున, క్వాచిత్కముగా తెలుగున చంపూకావ్యములో ఉన్నట్లు, గద్యపద్యాత్మకముగా ఉంటుంది. శాసనములోని ముఖ్యవిషయము వ్యావహారిక భాషలో అందరికీ సుబోధముగా ఉండేటందుకు ప్రకటించుట మామూలు. దానముచేసిన గ్రామముల సరిహద్దులు నిరూపించినప్పుడు వ్యావహారికభాష తరుచుగా వాడేవారు. "అస్య గ్రామస్య సీమానో దిక్షు. సర్వాసు చక్రమాత్, సర్వేషాం సుప్రబోధాయ లిఖ్యంతే దేశభాషయా" అని కారణముచెప్పి, తర్వాత ఎల్లలు వివరించేవారు. రాజరాజనరేంద్రునినందంపూడిశాసనము భారతకర్త నన్నయే రచించినాడు. ఆశాసనములోని తెలుగుకున్ను భారతములోని తెలుగుకున్ను భేదమున్నట్టు స్పష్ట

ముగా కనబడదు; గాని ఆపిమ్మట రెండుమూడు తరములు గడిచినప్పటినుండిన్ని, శాసనములలోని తెలుగుకున్న ప్రబంధములలోని తెలుగుకున్న కాలమును దేశమునుబట్టి, భేదము స్పష్టముగా నున్నది. ఇట్టి శాసనములు తెలుగుదేశమం దంతటా, అన్నిరాజ్యములలోను, క్రీ. శ. 12-వ శతాబ్దము మొదలుకొని 18-వ శతాబ్దివరకున్ను అపరిమితముగా ప్రకటితమై, పోయినవి పోగా; ఇప్పటికిన్నీ వేలకొలదిగా రాతిపలకలమీదను, రాగిపట్టాలమీదను నిలిచిఉన్నవి. వీటిలో నున్న దేశభాషాశబ్దములయందు ఇప్పటిపండితులు "గ్రామ్యములు"గా పరిగణించి దూషించేవి చాలాఉన్నవి. "గ్రామ్య"సంజ్ఞ వ్యావహారికభాషకు పూర్వము లేదుగాబోలు. ఉంటే దానియందు అప్పుడు ఏమీదోషము లేదు గాబోలు. మనకాలమందు "పరులఁదెగడుచోటఁ జెప్పనొప్పు"అని గ్రామ్యమునకు వ్రాతలోనింప ఒక్కటే ప్రయోజనముగా పండితులు నియమించుకొన్నారు. కాని, పూర్వులు తమవ్యావహారికభాష ఆచంద్రార్కమును సుప్రతిష్ఠితము లయి ఉండవలసినధర్మశాసనములరచనలో యోగ్యమైనదిగానే ఎన్నుకొన్నారు. శాసనములు రచించినవారు, (కొందరనుకొన్నట్టు) "గ్రాంథికాంధ్రము" తెలియనివారు కారు. శ్రీనాథకవిసార్వభౌముడు గ్రాంథికాంధ్రము ఎరుగనివాడు కాడుగదా. కొండవీటిరెడ్డిరాజుల ఆస్థానమందు విద్యాధికారిగానుండి అతడు అనేకశాసనములు రచించినాడు. వాటిలో "అస్యగ్రామస్యసీమా చిహ్నాని దేశభాషయా లిఖ్యంతే" అని చెప్పి, వ్యావహారికభాషలోనే సరిహద్దులు వివరించి శాసనముకొసను "విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః, అకరోదాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్" అని చెప్పుకొన్నాడు. ఇట్లే, ఆముక్తమాల్యద రచించినకృష్ణదేవరాయలు కోటానకోట్లు వెలగల నవరత్నఖచితసువర్ణాభరణములు తిరుపతి వేంకటేశ్వరస్వామికి సమర్పించి, "దేశభాషను" అనగా ఇప్పటిపండితులు గ్రామ్య మని దూషించి బహిష్కరించిన వ్యావహారికభాషను, తన ధర్మశాసనము తానే స్వయముగా రచించియో, లేక తనసమ్మతిని పండితులచేత రచియింపించియో, తాటికాయలంత లేసి అక్షరాలతో దేవాలయము రాతిగోడలమీద కలకాలమూ ఆబాలగోపాలము అందరూ చదివి తెలుసుకొనేట్టుగా చెక్కించి ప్రకటించినాడు. మనుచరిత్ర రచించిన అలసాని పెద్దనకూడా తాను చేసిన దానధర్మములు వ్యావహారికభాషలో రచించిన శాసనములో ప్రకటించినాడు. శ్రీరంగమాహాత్మ్యము, మాఘమాహాత్మ్యము గ్రాంథికభాషలో రచించి, కవి అని ప్రఖ్యాతిపొందిన దక్షిణ సింహాసనాధ్యక్షు డైన విజయరంగ చొక్కనాథనాయనయ్యవారి ధర్మశాసనములు కూడా ఇట్టి భాషలోనే రచితమయినవి. ఇది అన్నిదేశములందున్ను సనాతనమైన శిష్టాచారము. అశోకుని ధర్మశాసనములన్నీ వ్యవహారమందున్న పాళీభాషలో ప్రకటిత మయినవి. 1802 సం. మొదలుకొని నేటివరకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు తమశాసనములన్నీ వ్యావహారికభాషలోనే ప్రకటిస్తున్నారు. ఇది సంప్రదాయవిరుద్ధము కాదు.

10. ఇందుకు దాఖలాగా వేరువేరుప్రదేశములందు వేరువేరు కాలములలో వేరువేరు ధర్మకార్యములు ప్రకటించుటకు రచితమైనశాసనములు, వివరించకుండా, కొన్ని సూచించి పేర్కొంటే చాలు ననుకొంటాను. విమర్శింపనుద్దేశముకలవారు నేను సూచించిన గ్రంథములలో శాసనములు పూర్తిగాచదివి చూడవచ్చును. ఈదిగువనున్న పట్టీలో "ఎపి." అంటే, ఎపిగ్రాఫియా ఇండికాసంపుటములు. "ఎపి. ఇండో-మోస్ల" అంటే, ఎపిగ్రాఫియా ఇండో మోస్లామికా. "సా. ప" అంటే సాహిత్యపరిషత్పత్రిక. "నెల్లూ" అంటే, బటర్వర్తు వేణుగోపాల చెట్టిగార్ల నెల్లూరుజిల్లా శాసనములు. "లోకల్" అంటే, గవర్నమెంటువారి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమందున్న లోకల్ రికార్డు. "శృం గా." అంటే, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన శృంగారశ్రీనాథమునకు అనుబంధము. "హైద."అంటే, హైదరాబాద్ ఆర్కియొలాజికల్ సంపుటములు. "త్రిలిం" అంటే, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారి త్రిలిఙ్గపత్రిక. శాసనకాలము శకసంవత్సరములని తెలియవలెను. ప్రతిశాసనములో నుండిన్ని 'గ్రామ్య' శబ్దములకు ఉదాహరణముగా ఒకటి రెండు మాటలు ఎత్తిచూపిస్తాను.

1. ఎపి. IV, 1108. పిఠాపురం-కులోత్తుంగ మన్మకొంకరాజుల మహాదేవులు; ఉ. అఖండమున్ను, ఉత్సవార్థమున్ను.

2. హైద. III. 1157. ఓరుగంటివరి ఉపర్వల్లి - కాకతి గణపతిదేవనిప్రధాని. ఉ. వనమూను, సర్వమూను.

3. ఎపి. XII. 1166. మోటుపల్లి కాకతి గణపతిదేవని అభయశాసనము. ఉ. ఎల్లవారికిన్ని, ముత్యాలసూ.

4. త్రిలి. III. 40. 1231. నందలూరు, కాకతిప్రతాప రుద్రదేవ మహారాజు. ఉ. ఇస్తిమి.

5. ఎపి. IV. 1259. దోనెంపూడి. అంధ్రఖండ మండలాధిపతి నామనాయకుడు. ఉ. పెట్టింది.

6. ఎపి. IV, 1313. పిఠాపురం. కాటమరెడ్డింగారు. ఉ. రెడ్డింగారికిన్ని.

7. లోకల్. శృంగా. 1330. కొమరగిరి. ముక్కంటిరాజు. ఉ. రాజుగారికిన్ని.

8. డిటో. 1330. పొన్నుపల్లి. వేమారెడ్డింగారు. ఉ. వచ్చేవారున్ను.

9. ఎపి. IV. 1336. దాక్షారామం. వేమారెడ్డింగారి భృత్యుడు. ఉ. దేవులకున్ను.

10. లోకల్. శృంగా. 1336. కల్వపాములు. వేమారెడ్డింగారు. ఉ. ఇట్టికనూయిన్ని.

11. డిటో. 1336 పొన్నుపల్లి. డిటో. ఉ. రెండున్ను.

12. ఎపి. IV. 1350. తక్కెళ్లపాడు. రెండవ దేవరాయలు. ఉ. సంధుకు.

13. ఎపి. XIII. 1356. వేమవరం. అల్లయ వేమారెడ్డింగారు. ఉ. పొదలున్ను.

14. త్రిలి. III. 40. 1423. నందలూరు. సాళువ నరసింగరాయల సేనాపతి. ఉ. చేస్తుండే.

15. సా. ప. (ఆనంద) 1434. తిరుపతి; కృష్ణదేవరాయలు. ఉ. యింతవట్టున్ను.

16. కవిజీవితములు. 1. 440. కోటకాగ్రహారం. అల్లసాని పెద్దన. ఉ. ఇస్తిమి.

17. డిటో. 1441. సింహాచలం. కృష్ణదేవరాయలు. ఉ. నడిచేటందుకు, కూడా, పోతారు.

18. త్రిలి. III. 40. 1541. నందలూరు. సదాశివరాయలు. ఉ. నలభైఒకటి.

19. ఎపి. ఇండో. మోస్లా. 1587. గోల్కొండ. సుల్తాన్ అబ్దుల్లాకుతుబ్‌శాహి. పుచ్చుకొంటున్నాను, చాలా.

20. ఎపి. XVI. 1630. తిరిచినాపల్లి. విజయరంగ చొక్కనాథ నాయనింగారు. ఉ. వుండేటందున, చేసుకొను.

21. నెల్లూ. పు 436. 1713. ముత్యాలపాడు. కలిగిరి సుందరయ్య. ఉ. నడిపిస్తూ, రెండో.

11. వ్యావహారిక భాషాప్రయోజనములలో శిష్ట సంప్రదాయసిద్ధమైనది ఒకటి వ్రాతలయందు కూడా తెలుగుదేశమందంతటా 700 సంవత్సరములు శిలాక్షరమై ఉన్నట్టు రుజువుచేసినాను గదా. ఈభాష సంభాషణయందే కాని వ్రాతలయందు పూర్వులు వాడలేదని వాదించినవారిమాట అసత్య మనుటకు ఈ ఒక్క ప్రమాణమే చాలును. అయితే, ఈభాష అపరిమిత ప్రయోజనమని నేను రుజువుపర్చుటకు ప్రతిజ్ఞచేసి ఉన్నాను. కనుక, మరికొన్ని ప్రయోజనములు సప్రమాణముగా వివరించి చెప్పవలెను.

12. ఆబాలగోపాలము తెలుసువారందరికీ పాడుటకూ వినుటకూ ఆసక్తి పుట్టించే పాటలు, పదాలు, కీర్తనలు మొదలయినవి, వేలకొలదిగా ఉన్నవి. కొన్నిటిలో భక్తి, కొన్నిటిలో శృంగారము, కొన్నిటిలో జ్ఞానము, కొన్నిటిలో హాస్యము; ఇట్లే కరుణ, శోకము మొదలైన రసములు. అన్నీ వీటిలో వ్యక్తపడుతున్నవి. ఇవి వ్యావహారిక భాషలోనే సనాతనసత్సంప్రదాయానుసారముగా పూర్వకవులు రచించేవారని తాటాకులమీద వ్రాసిఉన్న ఈ పాటలపుస్తకాలు చూస్తే తెలుస్తుంది. ఇట్టిపుస్తకాలు దేశమందంతటా ఉన్నవి. తంజావూరి సరస్వతీమహాలులో, చెన్నపట్టణము గవర్నమెంటు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందు, ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమందు, చాలా గ్రంథములున్నవి. ఈపాటలకు "కావ్య" నామము చెల్లదా? సంస్కృతమందు జయదేవుడు రచించినగీతగోవిందము నంటివి కావా భరతశాస్త్రప్రవీణులయినవారు తిరుపతిలోని తాళ్లపాకవారు, తంజావూరిలోని త్యాగరాయలు, మన్నారుగుడిలోని సభాపతయ్యగారు, క్షేత్రయగారు మొదలయినవారు రచించిన తెలుగుకీర్తనలు? ఈకవులు పండితులు కారనగలరా? విద్వత్కవులు, వ్యావహారిక భాషలో ధర్మశాసనములు రచించినట్టే, ఆభాషలో పాటలూ పదాలూకూడా రచించినారు. తాళ్లపాకవారు

సంస్కృతమున, ప్రాచీనాంధ్రమున అనేక కావ్యములు రచించినవారే కదా. నిరంకుశోపాఖ్యానము రచించిన రుద్రకవి సుగ్రీవవిజయమనే యక్షగానముకూడా రచించినాడు. అందు "త్రిపుటలు, ఏలలు, ద్విపదలు, అర్ధచంద్రికలు, జంపెలు మొదలగు రాగతాళజ్ఞానమునం జదువవలసినభాగ మెక్కుడుగా నున్నది.'' అని సా.ప. పత్రిక VIII సంపుటములో విమర్శకులు చెప్పినారు. ఇవి అన్నీ వ్యావహారికభాషలో ఉన్నవి. ఉత్తర రామాయణము రచించినభగణిదేవుల రామమంత్రి విష్ణుమాయావిలాసమనే యక్షగానము ఇట్లే రచించినాడు. అప్పకవిరచించినయక్షగానము దొరకలేదుగాని, అదిన్నీ ఇట్లేరచితమై ఉండునని ఊహించవచ్చును. పూర్వకవుల సంప్రదాయమును అనుసరించి మనతాతలనాటి మృత్యుంజయవిలాసము, రామదాసుకీర్తనలు, తూమునరసింహదాసుకీర్తనలు, నిట్టలప్రకాశదాసుకీర్తనలు, కృష్ణమాచార్యకీర్తనలు మొదలయినవి తెలుగుదేశమందు నెలకొనిఉన్నవి. ఇవికాక, స్త్రీలపాటలు, పెద్దవీ చిన్నవీ, నవరసభరితమైనవి వేలకొలదిగా ఉన్నవి. పామరజనులు పాడేవి వాస్తవమైనగ్రామ్యభాషలో నుండుట ఉచితమేకదా; అట్టివి శిష్టులుకూడా పామరులకోసము నానావిధములా రచించినారు. సోహంభావతత్త్వములు పామరులకోసము పాటగా ఉన్నవి. భక్తిబోధకముగా సువ్విపాట ఒకరు రచించినారు. ఇట్లే స్తోత్రములు, విన్నపములు, అష్టకములు చూర్ణికలు, రగడలు, దండకములు, ద్విపదలు పాడుటకు అనుకూలముగా భక్తులు రచించినవి అపరిమితముగా ఉన్నవి. వీటిలోనిభాష శిష్టవ్యవహారమందున్నదేకాని కేవలగ్రంథస్థమైనది కాదు. వడ్డాది సుబ్బారావుపంతులుగారివంటి నేటికవులు వ్యావహారికభాష పాటలలో సయితము వాడకూడదని బహిష్కరించి, గ్రాంథికభాషలో పాటలు రచించినారు. గ్రామ్యభాషలో పాతపాటలు పాడినవారందరూ నరకములో పడిపోయినారు గాబోలు! గ్రాంథికభాషలో పాడితేనే కాని మోక్షము దొరకదు కాబోలు?

13. పూర్వకవుల సంప్రదాయమును అనుసరించి సంకీర్తనలక్షణము నిరూపించిన తాళ్లపాక అన్నయాచార్యులు భక్తులకీర్తనలు ఎటువంటివని చెప్పినాడో చూడండి:—

"మ. శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సజ్ఞానసా
రంబులై, యతిలోకాగమవీథులై వివిధమంత్రార్థం
బులై నీతులై, కృతులై వేంకటశైలవల్లభరతిక్రీడా
రహస్యంబులై, నుతులై తాళులపాక యన్నయ
వచోసూర్ణక్రియల్ చెన్నగున్.''

పదరచనలో గ్రామ్యోక్తులు బహిష్కరించలేదు సరే కదా అవి ఎట్లు ప్రయోగించవలెనో విశేషించి విధించినాడు. ఇక్కడ గ్రామ్యోక్తులు అనగా పామరజనులమాటలు అని అర్థము స్పష్టము.

"క. పదముల శృంగారవధూ
మృదుమధురమనోజ్ఞవాక్యమిశ్రము లైనన్
విదితార్థగ్రామ్యోక్తులు,
పదిలముగాఁ బొంక మెఱిఁగి పలుకం జెల్లున్.''

క. పురుషోక్తి సంస్కృతంబును
దరుణీవాక్యమునఁ బ్రాకృతము నీచవధూ
పరిభాష నితరభాషలు
పరగినక్రియ నుచితభాష పదములఁ జెల్లున్.

క. పల్లవ నారీ మ్లేచ్ఛా
ద్యుల్లాసమనోజ్ఞబంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యము లైనను
హల్లీసక ముఖ్యనాటకాదికఘటితిన్.

క. జగతి గల చెల్లుబళ్లై
నగినగి భాషించునట్టి నానుడిపలుకుల్
తగడన రహిచెడుఁ బువ్వుల
సొగ సుడుగం బిసికి కంపు చూచినభంగిన్.

14. ఇప్పుడుకూడా సామాన్యజనులు పాడే దరువులు, జక్కులరేకులు, ఏలలు, గొబ్బిళ్లు, చందమామపదములు మొదలయినవాటికి లక్షణము నిరూపించినాడు. అందరూ ఎరిగిఉన్న పాటలలోని వ్యావహారికభాషకు ఉదాహరణములు అట్టే అక్కరలేదు. "ఉపచారము చేసేవారున్నారని మరవకురా," "ఉండేది రాముఁ డొకడు," "చెడేబుద్ధి మానురా," "ఎవరని నిర్ణయించేదిరా," "రాజు వెడలె జూతాము రారె," "చింతిస్తున్నాడే యముడు," "ఇంకా దయరాకుంటే ఎంతని సైరింతునురా" ఇట్లు భజనచేసే విధము తెలిసిన రామభక్తుడు త్యాగరాయలు తనకీర్తనలు రచించినారు. ఐదవసంవత్సరాది

సంచికలో హరినాగభూషణముగారు రచించిన శ్రీమత్ త్యాగరాజచరిత్రము చదివితే తెలుస్తుంది త్యాగరాయలు ఎట్టివారో. వీరిభాష భజనపరుల కంచరికిన్నీ ప్రియమైనది. వాస్తవమైన గ్రామ్యభాషలో శిష్టసంసర్గములేని పామరులకోసము వేరే పాటలు రచితమై అనేకము లోకమందున్నవి. వాటిలోని గ్రామ్యము శిష్టులవ్యవహారమందుండదు. అట్టిగ్రామ్యము, హాస్యానికైతేనే తప్ప, శిష్టులు పాడితే అసహ్యముగా ఉంటుంది. శిష్టులు పాడే పాటలలో శిష్టవ్యవహార సిద్ధమైనమాటలే ఉంటవని నమ్మవలెను.

15. ఇట్టిపాటల పుస్తకాలు గవర్నమెంటువారి లిఖితపుస్తకభాండాగారమందున్నవి. కొన్ని పేర్లను చెప్పతాను: మృత్యుంజయవిలాసము, రుక్మాంగదచరిత్ర, కృష్ణమాచార్యకీర్తనలు, ముద్దుపలని సప్తపదులు, రుక్మిణీగోపాలసంవాదము, లక్ష్మణామూర్ఛ, తారాశశాంకము, సోహంభావతత్వములు, గోపికాగోపాలసంవాదము, దసరాపద్యాలు, రామదాసుకీర్తనలు, సిరియాళు చరిత్రము, వేదాంతకీర్తనలు, పారిజాతప్రబంధము, సువ్విపాట, జీవైక్యబోధము, మాధవాష్టకము, వేంకటేశ్వరాష్టకము, రఘురామాష్టకము, రాఘవాష్టకము, కడపాధినాయకాష్టకము, కోనేటిరాయాష్టకము, నవనీతచోరాష్టకము, దాక్షారామభీమేశ్వరాష్టకము. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమందున్నవి:- అధ్యాత్మరామాయణకీర్తనలు, ఒప్పగింతపాటలు, కీర్తనలు, కృష్ణకీర్తనలు, రామకీర్తనలు, గొల్లభామపదము, గొల్లకలాపము, జ్ఞానగురుస్తోత్రకీర్తనలు, తలుపులవద్ద పాటలు, పిల్లారప్పపదములు, మువ్వగోపాలపదములు, రామాయణపదము, వెంకటేశ్వరకీర్తనలు, వేదాంతకీర్తనలు, వేదాంతముపదము, వేదాంతముపాట, శారదారామాయణము, శివకీర్తనలు, శృంగారపుపాటలు, శ్రీశైలశివకీర్తనలు, క్షేత్రయపదములు, రామదాసుచరిత్ర, రామప్రభో అనేపాటలు, వారణాసిబ్రహ్మయ్య పదములు. శైలి ననుసరించి రగడలలోను దండకములలోను వ్యావహారికభాష, కొలదిగానో అధికముగానో, ఉంటుంది. భారతము, భాగవతము, రామాయణము మొదలైన ఇతిహాసపురాణములలోనికథలే కాక, పల్నాటివీరచరిత్రము, బొబ్బిలియుద్ధము, భక్తులకథలు, దేవతలమహిమలు, పెద్దపనులుగా పూర్వకవులు ద్విపదలు రచించి ప్రజలకు ప్రసాదించినారు. పరిషత్తువారిబహిష్కరణము ఆంధ్రమహాజనులంగీకరించి ఈపాటలన్నీ గ్రాంథికభాషలోనికి మార్చివేస్తే, లోకానికి ఉపకారమా అపకారమా? ఆలోచించుకోండి. తెలుగువారు, స్త్రీలు పురుషులు, పెద్దలు పిన్నలు, పండితులు పామరులు తాటాకులమీద వ్రాసుకొనికానీ, వ్రాయించుకొని కానీ, చదువుకొని కానీ, చదివించుకొనికానీ, ఈలాటిపాటలవల్ల చతుర్విధపురుషార్థములు సాధించేవారని చెప్పట అతిశయోక్తి కానేరదు. గ్రాంథికభాషలో రచించినగ్రంథములు పండితులకు మాత్రమే ఉపయోగించును; ఇవి అఖిలలోకోపకారకములు కావు. ఇట్టివి అందరికోసము వ్యావహారికభాషలో రచించుట సత్సంప్రదాయమని దానిప్రామాణ్యమును ఒట్టి సిద్ధాంతము కాదా?

16. తెలుగువారు నాగరికులు. నూటికి తొంభైమందికి ఓనమాలు రాకపోయినా పెద్దలసహవాసమున, పాటలూ పద్యాలూ విని, పండితులకు తెలిసినవిషయములు అనేకము నేర్చుకొని, తెలివితేటలుగలిగి ఉన్నారు. వారిరుచులకు తగినట్టినాటకములు కూడా పూర్వకవులు రచించేవారు. క్రీ. శ. 17 వ, 18 వ శతాబ్దులలో తంజావూరు రాజధానిగా చోళమండలమును పరిపాలించిన తెలుగురాజులూ మహారాష్ట్రరాజులూ సారస్వతమందు చాలా అభిమానము గలవారు. తెలుగురాజులలో కొందరు ప్రఖ్యాతపాండిత్యము సంపాదించి కావ్యములు రచించినారు. వారుంచుకొన్న వేశ్యలు కొందరు విదుషీమణులు; సంగీతసాహిత్యప్రవీణలు. వారి ఆస్థానమందు అన్నిభాషలూ, అన్నిశాస్త్రములూ, అన్ని కళలూ అభ్యసించి ఆరితేరినపండితు లుండేవారు. ఈ ఆంధ్రమహారాష్ట్రరాజులకాలమందు రాజులున్ను వారి పండితులున్ను వారివేశ్యలున్ను రచించిననాటకములు అనేకము ఇప్పటికిన్నీ అచ్చట సరస్వతీమహలులో ఉన్నవి. తెలుగున, అరవమున, కన్నడమున, మహారాష్ట్రమున, హిందీని, సంస్కృతమున ఇవి రచితమైనవి. 1918 వ సంవత్సరమున అచ్చట భారతప్రతులు చూచుటకు వెళ్లి ఆరువారము లుంటిని. ఉద్దేశించినపనికే కాలము చాలనందున సుమారు ఇరవై నాటకములు అక్కడక్కడ చదివి చూచి, మరియూ పైనాటకములపేర్లు

మాత్రము వ్రాసికొన్నాను. విజయరాఘవనాయనింగారు, రంగాజమ్మగారు, కోనేటిదీక్షితులు మొదలయిన కొందరి రచన విశిష్టముగా ఉన్నది. దానిలో వ్యావహారికభాష పాత్రోచితముగా ఆకాలమందు తంజావూరిలోనివాడుకను అనుసరించి ఉన్నట్లు కనబడినది. అనేక నాటకములలో వచనములమాదిరివే పద్యాలూ, పాటలూ వాడుకమాటలతో రచితమయి ఉన్నవి. ఉదాహరణార్థము రఘునాథనాయనింగారి కొమాళ్లు విజయరాఘవనాయనింగారు (గొప్పపండితుడు) రచించిన రఘునాథాభ్యుదయనాటకములోని "రాజ్యం జమాకర్చు అట్టవణరంగయ లెక్క వినిపించినవిధం" శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన "తంజావూరి యాంధ్రరాజులచరిత్ర" పీఠిక 32 న పుటలో చూడవచ్చును. శాహజీమహారాజు రచించిన పార్వతీపరిణయనాటకములోనివి ఒకటి రెండు వాక్యాలుమాత్రము మచ్చుకు ఇక్కడ వ్రాస్తాను.

సూత్రధారవచనం—యవరోయిభాగవతుల్లారా! విఘ్నేశ్వరుండు వచ్చినాండే పూజచేసేటందుకు పూజారి వాణ్ణి పిలవవోయి.

పూజారివచనం—నేనైతే వచ్చినాను. పరిచారకుణ్ణి పిలిపించండా.

పారిజాతాపహరణములోని సీసపాదం—'పలుమారు నాకొంగు పట్టే వదేమిరా, మాయత్త వింటేను మాట వచ్చు'.

17. ఆంధ్రభాషాసారస్వతముల పరిణామము నిరూపించుటకు ఈ నాటకములు ఆవశ్యకమయిన వని వేరే చెప్పనక్కరలేదు. (సశేషము)

---

# భావి చింతనము

బసవరాజు అప్పారావు గారు, బి. ఏ.

కాలచక్రముగతి గడచి ప్రపంచ
భావిభాగ్యమ్మెల్ల పండినవెనుక
ఆనాటి కెవరైన నడుగకపోరు
"శ్రీకృష్ణు డెవ్వారు చెప్పమా" యంచు
భాగ్యవశమ్మున భావికాలాన
నమృతతుల్యములు జీవితభారనమ్ర
ములునైన నాగీతముల వినిరాధ
ప్రేమ మగాధ మం చెఱుగక పోదు.

# సుశీల

కో. నృసింహాచారిగారు

సీ. కర్ణావతంసితకర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప
నపసవ్యకరమృదు లాంగులీచాతురీ షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప
డాకాలిమీఁద నడ్డము సాచి నిల్పిన పదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ
మౌళిపింఛము కంఠదామమున మెఱయ, విలసితగ్రామముగ నెక్కు వేణువందు
బ్రహ్మ గాంధర్వగీతంబు పరఁగఁ జేసెఁ, జతుర నటమూర్తి గోపాలచక్రవర్తి. (భాగ)

ఇట్లు లీలామానుషవిగ్రహుడు శ్రీకృష్ణుడు మురళీగానలోలుడై భీమరథీతటమనుపుణ్యక్షేత్రంబున రాసక్రీడ సలుపుచుండె. గోపగోపికాజనంబు లాబాలగోపాలంబుగ వచ్చి యాగానరసాస్వాదనతత్పరులై మేనులుమఱచి తన్మయులై యుండిరి. ఆకసమున బోవుచు నమరభామినులును బరవశలై తమనాథుల యంకగతలై వారికిగలిగిన గానమాధురీసుఖమునినుమడింప జేసి వారును పరవశులుగా నాసిర్జరమిథునములు పరస్పరవశులయిరి. భీమరథీతటపరిసరవనములగల మృగీమృగావళులును మేతలుమాని మెడలనిక్కించి యాసరసగానరసాస్వాదన మొనరింపసాగినవి. ఎరల దేబోవుఖగములును ఎరల మఱచి గానలోలము లయినవి. గోబృందంబులు పచ్చికలరోసి, పాలు గుడువమఱచిన లేగలవలెనే పాలు జేపమఱచి గానలోలము లయినవి. ఇట్టి తరుణమున సమీపమునగలయొకమానిహో మధేనువు యదుకులశేఖరుని నిరుపమానగానయానము మెఱుగుచుండెను.

రసాంబుధి దేలియాడి సంతోషపరవశయై దుగ్ధంబులను గురిపింపసాగెను. గంధవహుడును గానపరవశుడై శ్రీకృష్ణుని నభినందింప నతిత్వరిత గతిం బోవుచుండుటంబట్టి యాధేనువర్షితదుగ్ధకణ మొక్కటి యతనివెంబడి జని మురవైరి శిరము నలంకరించెను.

ఈపుణ్యము కారణముగ నాధేను వొక వైష్ణవవరునకు సుశీలాభిధానంబున దనయయై జన్మించెను.

సుశీల దినదిన ప్రవర్ధమానయై తన సుశీలతాదికములు తనసౌందర్యమునకు సౌందర్యము నబ్బజేయ మాతృపితృగురుదేవభక్తి గలిగి యొప్పుచుండెను. వివాహకాలము సమీపించెను. పరిణీతయయ్యెను. భర్తగుణములు, వర్ణించుటకన్న సుశీలగుణాదికము లెంతయొప్పిదములో అంతవిరుద్ధములని చెప్పిన జాలును. పతి అట్టివాడైనను అతనియందు కడుభక్తిశ్రద్ధలుగలిగి కొట్టినను దిట్టినను నోర్చికొని

"ఉ. తాళి విభుండు గట్టిన మొదల్ పతి
దేవత యాసుశీల పెన్
గోలతనంబునన్ మగఁడు గొట్టినఁ
దిట్టిన రట్టుచేసినం
దాళి దినంబుఁ దచ్చరణతామర
సంబులు గొల్చు నేలయున్
బోలునె యాపె కంచుఁ గృతబుద్ధులు
వృద్ధులు ప్రస్తుతింపఁగన్."-పాండురంగ.



అంత నొకనాడు వామనుని దెగడు బాలు దేహకాంతిగలిగిన బ్రహ్మచారి యొకడు కడుంగడు క్షుధార్తుడై అన్నాపేక్షచే వీరిగృహమున కేతెంచి "స్వస్త్యస్తుతే" యని యాశీర్వదించెను. సుశీలయు నావటువునకు నమస్కరించి, "అయ్యా! నీవెందుండి ఎందులకేగుచున్నావు? ఇచ్చటకి రాగతమేమి? నిన్ను జూడ నాకటిబాధకు లోనైనట్లున్నది. అదియేమైనయెడల నింటిమొగసాలలో గూర్చుండుము. గృహస్థు లూర లేరు. అర్ధయామముననే యన్నము వండెదను. ఆరగింపవచ్చు" ననెను. బ్రాహ్మణుడును "అమ్మా! అయిదు దినము లయ్యెను భుజించి. ఆకలిబాధ నన్ను మననిచ్చునట్లు లేదు. చలిది భుజించుట దోషమైనను ఆదోషపరిహారార్థము తర్వాత దపమైన జేసెదను కొంతచలిదియన్నము పెట్టియైన నాప్రాణముల నిలుపు" మని వేడెను. సుశీలయు "పాపరహితుడా! నీకు చలిది నేలాగు పెట్టగలను? కొంచెమోపికపట్టిన వంటయగును. భుజించి నీ యిష్టము వచ్చిన చోవ్వనబోవచ్చు" ననెను.

వటుస్తత్క్షుద్బాధ మిక్కుటమైనందున 'క్షుధాతురాణాం నరుచి ర్నపక్వమ్' అను న్యాయము ననుసరించి

"తే. త్రోవ గమియించుచోట నొప్పూవుఁ
బోఁడి, యవరవర్ణ సమాచారమైనఁ జెడఁడు,
బ్రాహ్మ్య మీతడ వేఁటికిఁ బ్రాణరక్ష,
నెఱపు మొకయింత మెదుకిన్ని నీళ్లులోఁగి.

ఆ. ఎంత భాండశుద్ధి? యెటువంటిగృహశుద్ధి?
యెట్టి చిత్తశుద్ధి? యిచట చలిదిఁ

కూడు చిక్కెనేడఁ బురోడాశమునకు నో
యమ్మ! సాటివచ్చు నదియుఁగాక.

క. సతి! యాత్మస్తుతి యతిగ, ర్హితమని
నాపెంపుఁ దెలుప నేనొకఁడ మనో, గతిఁ
దృప్తిఁగనిన భువన, త్రితయమ్మునకుఁ
బ్రతితుష్టి తిలకించుఁ జుమీ!"

అని వేఁడసాగెను.

సుశీలయు మనసుగరగ దనభర్త గ్రామాంతరమున కేగునప్పుడుఁ గట్టియివ్వగా మిగిలినయన్నమును వడ్డింపదలచి.

శా. "రారయ్యా!యని శుద్ధిమచ్చరణు గోత్రా
దేవతాపుత్త్రువి, స్మేరాగ్నిప్రభుఁ గూరు
చుండ నిడి మ్రొక్కెప్పట్టుఁగావించి నీ, రా
రంబండిన ప్రాఁతరాజనపుదివ్యాన్నంబు
నొక్కింతవా, ర్ధారాధాతముఁ గుండ
యూడ్చి మొసఁగెన్ రంభాపలాశంబునన్.

తే. ఒసఁగి యవ్వ్యంజనంబు దధ్యోదనంబు,
నారగింపుఁడు క్షమియింపుఁడనుచుఁ బలికి,
ముదిత ముదితాత్మభావసంపదయుఁ బోని
సలిలపరిపూర్ణమగు గిండి నిలిపి చనిన."

పాండురంగ.

తిరిగిచూచునంతలో నావటువు మందునకుఁగూడ నొకమెదుకు కానరాకుండ మెసవి గ్రుక్కలు మ్రింగుచు మరల నన్నము నాశించుచు "అమ్మా! నీవిడినయన్నము నాయాకలిని శమింపజేయఁజాలకున్నది. మరల నొకసారి కుండనూడ్చితె"మ్మనికోరెను.

తొలినాటిరాత్రి తనకనివంచి, భర్తయొక్క గ్రామాంతరగమనముదలచికొని భుజించక యుంచినయన్నమును సుశీల, దాలియందుఁ గ్రాగుచుండిన యావుపాలతో వడ్డించెను. బ్రహ్మచారియు దానినిగూడ మెసవి చాలనందున నింకనేదైన భుక్తికిమ్మని కొసర సాగెను. సుశీల అన్నమిఁక లేకున్నందున నింట నంతకుముందు చేసియుంచిన పిండివంటలు తైలపక్వంబుల దెత్తునాయని యడుగ నాతడును సంతోషముతో నన్నిటిని దెమ్మనెను. అపూపము లెన్నియో వడ్డింపబడెను. భర్త కోపగించునను



భయము పీడించుచున్నను సుశీల దానిని భరింప నిశ్చయించుకొనెనుగాని, యాకలితో వటువను బొమ్మనుటకు నేరద



య్యెను. పిండివంటలును నిరవశేషముగా భుక్తంబు లయ్యెను. బ్రాహ్మణునియాకలి యింకను దీరదయ్యెను. ఎంతభుజించియు నాకలి దీర లేదనుటకు దనభోజనసామర్థ్యమునుగూర్చి యామె యేమనితలంచునో యనులజ్జ పొడమువైఖరి ముఖమున గనుపరుపసాగెను. ఈ మారు మఱిదేనిని వాత్తి కోరజాలని మాడ్కి ముఖవైఖరి దెలుపసాగెను. సుశీల బ్రాహ్మణునియాకలిదీరమి గ్రహించి, చూచుటకు చిన్నవాడైనను దా నిడినభోజనము చాలమిమోఱంగి, "ఇది మాయయా? లేకని

జమా? మనుష్యమాత్రుఁడైన నేనిడినపదార్థము తీఱతీరని లకుఁ దృప్తిపడియే యుండును. ఇదిచూడ సీయన యాత్రిమూర్తులలో నొకఁడుగా నుండఁబోలు" నని వితర్కించి ఇంట నింక నేమియు నిడఁదగిన పదార్థంబు లేమికి జింతించి సంభ్రమముతో నా యాదిదేవుని గూర్చి క్షుధార్తుఁడగు నా వటుబాధానివారణార్థము నకుఁదగిన భక్ష్యభోజ్యములనిమ్మని ప్రార్థింపసాగెను.

ఆర్తరక్షకుఁడును, భక్తపరాధీనుఁడు నగునాయాదిపురుషుని ప్రభావంబున

"సీ. ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు, నొకకొన్ని తెలఁగులయొలుపుఁ
బప్పు, లొకకొన్ని ద్రబ్బెడ, లొకకొన్ని తాలింపు, లొకకొన్ని విధముల మొల్ల
చేరు, లొకకొన్ని కలగల్పు లొకకొన్ని బజ్జులు, నొకకొన్ని రీతుల యూర్పు వగలు,
నొక కొన్ని సిగరులు, నొకకొన్నియంబళ్లు, నొకకొన్ని వహుల పూపోత్కరములు,
వివిధ ఫలకందమూలము లవియుఁగొన్ని, యూరుబెండులు నొక కొన్ని యొక్క
కొన్ని, యూరుఁగాయలు పచ్చళ్లు

నొక్కకొన్ని, పెరుగు పాత్తైన నేతులు
పెచ్చుపెరుగ." పాండురంగ.

ఇంకను మహానసగృహమునం దప్పటి కప్పటికే యుద్భవించుచున్న యన్నవిశేష



ములును, పక్వఫలములును నపరిమితములు గాసాగెను. గృహిణియు దనవంతుఁ దీర నా బ్రహ్మచారికిడ రా నావటువును కడుసంతుష్టితో నాపతివ్రతాశిరోమణి దాతృతా గుణమునకును, నిత్యసత్యపరాయణతకును ఆత్మశుద్ధికిని మెచ్చి తనవటువేషమును వదలి నిజస్వరూపముతో సాక్షాత్కరించెను. సుశీలయు నపరిమితానందంబున మేనుమరచి యా దివ్యరూపుపాదంబుల వ్రాలి ప్రణమిల్లెను.

శ్రీహరియు "సతీవా! నీవుతొలిజన్మంబున జేసినసుకృత విశేషంబున, నేను భీమరథీతటమున వేణుగానలోలుడనై యుండునెడ నీవొకమాని హోమధేనువుగానుండి, మద్గాన మాధురీమహత్వంబున సంతోషస్వాంతవై దుగ్ధంబులను గురిపింప వాయువశంబున నందుండి యొక ఫేనకణంబు వచ్చి నా మౌళినలంకరించిన కారణంబుగా నీ పుట్టుకన నిట్టి సుగుణములప్రోవైనా కరుణకుఁ బాత్రవై తివి. నీభర్తయు నీ గుణపరీక్షార్థముగా నాచే నట్లు కఠినుడును దుర్జనుడునుగా బ్రవర్తింప జేయబడినవాడు గాని వేరుకాదు. ఇకమీద నీకనుకూలుడుగా నుండ నోపు; కాని

"ఉ. మన్నన చేసినాఁడు మురమర్దనుఁ డంచు న
హంకరింప కో, కిన్నరకంఠి! యట్లయినఁ
గీడొదవుఁ విను తొంటికన్నను, సన్ని
హితాంతరంగవయి సత్యసమార్జవ శుద్ధి
లక్ష్మికిన్, వన్నియ వెట్టుమీ మహిత
వర్తన కీర్తులు నిర్వహించుచున్."

పాండురంగ.

అని వరమిచ్చి శ్రీహరియు నంతర్ధానమయ్యె. సుశీల భర్తయు నింటికేతెంచి తదాది గడు సుగుణఖనియై యుండ నా దంపతులు పుత్రపౌత్రాభివృద్ధి గాంచి సుఖంబుండిరి.



# ప్రకృతిప్రపంచము

శ్రీ శేషాద్రిరమణ కవులు

కలకంఠంబులు రాగగీతకలనాకౌశల్య మేపారఁ బా
టలవాడంగ గురుట్కులాన తటపీఠస్థాయిపుంస్కోకిలల్
కలనాదంబు లొనర్చుచుండ నళినీకాంతుండు గాఢాతపం
బులఁ గాయింపఁగఁ గాలపున్ బ్రకృతి సమ్మోదంబుఁ జేకూర్చెడిన్.

మ. జలదప్రావృతుఁడై సుధాకిరణుఁ డాశాదేశమం దెల్ల వె
న్నెలమొల్కల్ నునుమంచువానచినుకుల్ నిండారఁగాఁ గూర్పఁ జెం
గలువల్ గొంచెము విచ్చివిచ్చనటులన్ గన్పించి క్రొందావులన్
వెలయింపన్ దగుయామినీప్రకృతి గల్పించున్ బ్రమోదప్రథన్.

మ. కలితాపుష్పితమాలతీనిచయసౌగంధ్యంబు సాలావళీ
ఫలభారానమితావనీజచయసౌభాగ్యంబుఁ గంజాతమం
జులకింజల్కచరన్మధువ్రతములున్ సొంపొందుకేళీవనం
బులలోఁ ద్రిమ్మరు పాంథుహృత్ప్రకృతి సమ్మోదంబుఁ గల్పించెడిన్.

మ. వివృతస్వచ్ఛకిసాలమధ్యగతవార్బిందుచ్ఛటానూత్నవై
భవముల్ బాలపయోజమిత్రనవశోభావ్యాప్తి నానారుచి
స్తవనీయాంబుదకాంతిలక్ష్మి కవితాంతర్లీనచైతన్యమున్
కవికేర్నిన్ బ్రకృతిప్రపంచసుఖసంకాశంబుగాఁ గన్పడున్.

మ. తరళోత్తుంగతరంగసంఘములచేతన్ గూలముల్ తాఁకు ని
ర్ఝరిణీనిర్మలవారిపూరమున నుజ్జాతంబులౌ వల్లికాం
తరనిర్మగ్ననితాంతముల్ ప్రణయబంధప్రావృతాశేషబం
భరగీతుల్ ప్రకృతిప్రపంచసుఖ ముత్పాదించుఁ బాంథాళికిన్.

---

# బౌద్ధమత సిద్ధాంతములు

సునీతి శ్రమణుఁడు

బౌద్ధమతసారము లనఁదగునవి యాత్మ ప్రబోధమును, నాత్మనిగ్రహమును. వటవృక్షము క్రింద నానాఁడు సిద్ధిపొంది జీవిత కాలమంతయుఁ, బావనంబై రాగకామరహితంబగు జీవనంబుననే మానుసవ్యథానాశనంబగునని బుద్ధుఁడు బోధించెను.

బుద్ధుఁడు గయనుండి వారాణసికిఁ బోయి నిజశిష్యపంచకమునకుఁ జతుస్తత్త్వములను, అష్టగుణమార్గములను బోధించెను.

"ఓయీ! భిక్షుకులారా! యిదియే ఘనమగువ్యథావిషయకతత్త్వము. జననము క్లేశము; లయము వ్యథ; రోగము పీడనము; మరణము దుఃఖము; విద్విష్టవస్తుసాన్నిధ్యము వ్యథ; ఈప్సితంబగు దానిని బొందకుండుట దుఃఖము; పంచభూతాశ్రయమగు జీవనము కేవలము క్లేశము.

"ఓ భిక్షుకులారా! ఇదియే ఘనమగు దుఃఖకారణముల తత్త్వము. సుఖకామసంకల్పితంబై యుచ్చుటను నచ్చుటను మోదంబుఁ జెందించు తజ్జన్మకారణంబైనతృష్ణయే దుఃఖమూలంబు. ఈతృష్ణ మూఁడు విధములు: సుఖతృష్ణ, సంసారతృష్ణ, వైశ్వర్యతృష్ణ యనునవి.

"ఓ భిక్షుకులారా! ఇదియే ఘనమగు దుఃఖనివృత్తి విషయిక తత్త్వము. దుఃఖము తృష్ణావిరామమున నుపశమించును. సర్వవితృష్ణాభావంబునను, దృష్ణావిసర్జనంబునను, దృష్ణానిరాకరణమునను, దన్మోక్షణంబునను; ఆశానాశనంబునను, దృష్ణానివృత్తి యగును. ఓ భిక్షుకులారా! దుఃఖవిరామమునకుఁ గొంపోవు ఘనమార్గవిషయకమైన తత్త్వమిదియే. పావనంబగు నాయష్టగుణమైనమార్గం బెద్దియనిన:

1. సత్యంబగు విశ్రంభము. 2. ధర్మాకాంక్ష. 3. యథార్థవాక్కు. 4. ఋజువృత్తి 5. సరళజీవనోపాధి. 6. ఋజువ్యాపారము 7. సత్యాపేక్ష. 8. యథార్థచింత. (మహావర్గము 1. 6.) ఈబోధసారంబేమియన? జీవనంబు దుఃఖము. సౌఖ్యార్థమైన తృష్ణయే దుఃఖకారణము. అట్టి తృష్ణానాశంబే దుఃఖవిరామంబు. పావనజీవనంబుననే యట్టివినాశంబగునని సత్యములగు నుద్దేశములును, విశ్రంభములును, గ్రహింపఁబడి పొందఁబడవలెను. మనమునమహాకాంక్షలనిడుకొనవలెను. వాక్శుద్ధియు,మార్దవంబును నుండవలయును. శుచియును న్యాయమును వర్తనమున నుండవలయును. ప్రాణులకును సచేతనజీవులకును హింసఁగావింపని జీవనోపాధిని సంపాదించి దాని నాచరించుచుండవలెను. ఆజీవాంతమును సచ్చరితంబులును బరశ్రేయోదాయకంబులును దయామయంబులు నగు కర్మల నాచరించుచుండవ

లెను. మనస్సును బుద్ధియు నప్రమత్తంబులు సోత్సాహంబులునై యుండవలయును. నిశ్చలంబైన ధ్యానంబుచే జీవనంబును శాంతిమయంబుగ నొనర్పవలయును. ఇదియే వాంఛలను గామములను రాగములను సంసారతృష్ణను జయించుటకుఁ దగినయష్టగుణమార్గము.

సిద్ధిం జెందుసమయంబున గౌతముఁడు తనశిష్యులను రావించి యాత్మకృషివిషయకంబగు తన సిద్ధాంతంబంతయు బౌద్ధధర్మంబున (సప్తమణులనఁబడు) సప్తధర్మంబుల బోధించెనని చెప్పుదురు.

"భిక్షులారా! నాచే గ్రహింపఁబడిన యేధర్మములు మీకు బోధింపఁబడినవి? వేనిని మీరు గ్రహించి మంతనంబుఁగావించి, ఏమతమును వ్యాపింపఁ జేయుటవలన దేవమానుషప్రీతియు, ఘనంబగు మానవకోటిసౌఖ్యోపకారవర్ధనంబు నగునో యట్టిమతవ్యాపనంబును మీరు చేయవలయును. అవి యెవ్వియన: చతుశ్శేకాగ్రధ్యానంబులును, జతుర్గుణంబులును, ఘనంబగు పాపనాశనంబునకుఁ బ్రయాసము, సిద్ధవృత్తిప్రాపకంబులగు చతుర్మార్గంబులు, నాత్మజ్ఞానసంబంధమైన పంచేంద్రియములు, సప్తవిధంబైన జ్ఞానంబు, ఘనంబగు నష్టగుణమార్గము ననునవి.

(మహాపరినిబ్బన సూత్తము III 25)

చతుశ్శేకాగ్రధ్యానంబు లెవ్వి యనిన: దేహచేతనోద్దేశవివేకవిషయకము లైనవి. రెండవది యెద్దియనిన? పాపనివర్తనంబునకును నుద్భవించిన పాపస్థితులనాశంబునకును సద్భావసౌజన్యదయాద్యుత్పత్త్యర్థమును వానిసంవర్ధనమునకును నైనప్రయాసమే. మూఁడవది సిద్ధిసంపాదనయందైననసంకల్పప్రయాసవిధానాన్వేషణంబులునుఁబంచధర్మానురూపశక్తులును. పంచాత్మజ్ఞానేంద్రియంబు లెవ్వి యనిన? విశ్రంభమును, శక్తియు, విమర్శయు, ధ్యానంబును, జ్ఞానంబును; సప్తవిధంబైన జ్ఞానం బెద్దియనిన, శక్తియు, జ్ఞానంబును, నన్వేషణంబును, నానందమును, బ్రశాంతియు, నిర్మలత్వమును. అష్టగుణంబగు మార్గంబింతకుఁ బూర్వమునఁ జెప్పంబడినది.

ఇట్టి దీర్ఘంబైన యాత్మకృషివలనను, శంకాకామాసక్త్యాదిదశపాశనిర్భేదనంబువలననే మనుజుఁడు నిర్వాణమును జెందఁగలఁడు.

"ప్రయాణాంతమును గావించి దుఃఖమును ద్యజించి యఖిలపాశంబుల ఛేదించి యన్నివిధముల నిరర్గళుండైనవానికిఁ బీడనంబు లేదు.

"చింతల లెస్సగ సంగ్రహించి, గృహవాసంబునఁ బ్రీతిం జెందక యట్టివారలు సరోవరంబును విడిచిన హంసలపోల్కి వారి వాసంబులను బరిత్యజించి చనుదురు.

"సత్యంబగు జ్ఞానంబుచే నిరర్గళుఁడై శాంతియుక్తుఁడైన వాని చింత శాంతిమయము. వానికర్మలును శాంతిమయములు. (ధమ్మపథ. 90, 91, 96.)

సామాన్యముగ నిర్వాణమన నంత్యమైన లయమని యూహించుచుందురు. కాని మాక్సుమల్లరాచార్యుఁడు మొట్టమొదటఁ గనుపరచినట్లు నిర్వాణమన మరణము కాదనియు మనఃపాపస్థితి యొక్కయు, సంసార

సౌఖ్యాదులయందలైన తృష్ణయొక్కయు నాశ
నమని రూఢియగుచున్నది. గౌతమబోధితం
బైన నిర్వాణం బీజీవనముననే పొందఁదగినది.
నిశ్చలపాపరహితంబైన మనస్సు యొక్కస్థి
తియుఁ గామరాగరాహిత్యంబును, ప్రశాంతి
యు, సాధుభావజ్ఞానంబును, నిర్వాణఫల మీ
జీవనముననే కలిగించును.

ఐహికంబైన పావనజీవనంబుకంటె నిర్వా
ణమును జెందినవారల కాముష్మికానందమే
కాని భవిష్యద్వైకుంఠం బెద్దియు లేదా?
బౌద్ధులు తరచుగ బుద్ధు నీవిషయంబుల బోధిం
పుమని యడిగిరిగాని గౌతముని ప్రత్యుత్తర
ములు సందిగ్ధములుగ నున్నవి. బౌద్ధమో
క్షంబగు నిర్వాణంబుకంటె వేఱగు మోక్షవి
షయకమైన యాశల గౌతముఁడు తనశిష్య
లకుఁ గలుగఁ జేయలేదు.

మాలుక్యపుత్త్రుఁడు గౌతము నీవిష
యముఁ గూర్చి ప్రశ్నించి, సిద్ధబుద్ధుని మర
ణానంతరస్థితిని గూర్చి యసందిగ్ధముగఁ దెలి
యఁగోరెను. అదివిని గౌతముఁ డిట్లు
ప్రశ్నించెను.

"మాలుక్యపుత్త్రా? నాశిష్యుఁడ వగుము:
నీకు నేను బ్రపంచము నాశరహితంబై యనం
త్యముగ నుండునో యుండదో చెప్పెదననుచు
నే నుడివితినా?

మాలుక్యపుత్త్రుడు:— తా మట్లు
చెప్ప లేదు.

గౌతముఁడు:— అట్లైన నన్నాప్రశ్నో
త్తరార్థమై నిర్బంధింపకుము. విషలిప్తబాణ
నిహతుఁడైన మనుజుఁడు చికిత్సకునితో
"అయ్యా! ననుఁ గొట్టినవాఁడు క్షత్రియుఁడో,
బ్రాహ్మణుఁడో, వైశ్యుఁడో, శూద్రుఁడో,
తెలియకమున్న నాగాయంబును మాచేఁ జికి
త్సఁ జేయనీయ" నని చెప్పిన వానిగతి యేమ
గును? ఆక్షతంబుచే వాఁడు మరణించును.
మరణానంతరమున రాఁబోవుదాని జ్ఞానంబు
లేకుండుటచేఁ బావనం బగు జీవనంబుఁ గూర్చి
యు, జ్ఞానార్థమత్యంతపరిశ్రమఁ గావింపని
వాఁడు నాశమును జెందును. కాన "ఓయీ?
మాలుక్యపుత్త్రుఁడా! నాచే నప్రకాశితంబైన
దాని నప్రకాశితంబుగను బ్రకాశితంబైన
దానిని బ్రకాశితంబుగను నుండనిమ్ము.

ఈరీతిగనే ప్రసేనజిత్తను కోసలరాజు
తనముఖ్యపట్టణమైన సాకేతపురమునుండి రాజ
ధానియగు శ్రావస్తీపురంబునకుం జనుచు విశిష్ట
జ్ఞానంబునకు విఖ్యాతిఁ జెందిన 'క్షేమ'యనుభి
క్షుణిం గలిసికొని యామె నర్చించి యిటు
లనెను.

ప్రసేనజిత్తు—పూజ్యా! సిద్ధుండు మర
ణాంతంబున నుండునా?

క్షేమ—ఓమహారాజా! అవ్యక్తముండు
సిద్ధుఁడు మరణాంతమున నుండునని మాత్రము
చెప్ప లేదు.

ప్రసేనజిత్తు—పూజ్యా! సిద్ధుండు మర
ణాంతమున నుండఁడా?

క్షేమ—ఓమహారాజా! దీనింగూర్చియు
బుద్ధదేవుం డేమియుఁ జెప్ప లేదు.

వీనింబట్టి గౌతమమతము నిర్వాణము
కంటె వేఱగుఫలము నంగీకరింపదని నిశ్చయ
మగుచున్నది. గౌతమునియొక్కయాశయ

మసందిగ్ధముగ నున్నది. మానవకోటికి నాతఁడాత్మకృషిచే వ్యథానాశంబును, భవిష్యద్వ్యథాస్థితి పరివర్జనంబును, ఇహంబుననే పావనానందమయమగునసంపన్ననిష్పాపస్థితిని బొంది నిర్వాణమును జెందఁ డని బోధించెను.

ఇహంబుననే నిర్వాణముఁ జెందకయున్న మనుజుఁడు పునర్జన్మమునకు లోనైయుండును. గౌతమునికాత్మయందు నమ్మకములేదు. ఆత్మయస్తిత్వము నంగీకరింపకయే, హైందవులకు దేహాంతరప్రాప్తియందు నిరున్మూలనం బగు విశేషనమ్మకముండుటం జేసి గౌతముఁడును బునర్జన్మ నంగీకరించెను. వానియాత్మ లేని పక్షమున నెయ్యది పునర్జన్మమును బొందును? దీనికిఁ గర్మసిద్ధాంతమున బౌద్ధులు సమాధానమును జెప్పిరి.

ఆ సిద్ధాంతమెద్దియన: జీవ్రని కర్మ వినాశమును జెందక తత్కర్మఫలంబునను బొందించునని. సజీవంబగుప్రాణి, మృతిఁ జెందిన నట్టిప్రాణి కర్మ ననుసరించుచు, నింకొకప్రాణి యుద్భవించుచున్నది. దీని కుపమాన బుగ బౌద్ధవిద్వాంసు లొకదీపజ్వాలకును దానిచే నుద్దీప్తంబగు నింకొకదీపజ్వాలకును గల పరస్పరసంబంధమును జెప్పుదురు. నిష్పాపి యెవ్వఁడైన నీ ప్రపంచంబునఁ బీడనంబుఁ జెందిన యట్టివాఁడు బౌద్ధుఁడైన నిట్లు చెప్పును. “ఈ దుఃఖము నాకర్మఫలమే. విలపనంబునకుఁ గారణములేదు.” ఆత్మలేనిపక్షమున వ్యథఁ జెందుచున్న మనుజునకును మృతిఁజెందినవానికిని నభేదం బెట్లు? దీనికి బౌద్ధులు చెప్పు సమాధానం బెద్దియన: “ప్రాణిమృతిఁ జెంది పరమాణువులలోనికి నిగ్రహించిన తజీవి నాశనములేని మనోవాక్కర్మానురూపమైన కర్మమాత్రముండును.” అని. బ్రాహ్మణవేదాంతమును డి గౌతముఁడు పునర్జన్మమతమునే కాక పావనజీవనోత్కృష్ట్యమును దానిఁ బ్రకాశింపఁజేయుటకుఁ దగిన విశ్వదేవతాగణమును గూడఁ గొన్నిమార్పులఁ జేసి పరిగ్రహించెను. త్రింశత్త్రీణియగు ఋగ్వేదదేవతలను బరిగ్రహించెను. కాని వారికిఁ బరమాత్మత్వమును నొసంగలేదు. ఉపనిషత్తులయందుఁ బూజింపఁబడుచున్న పరబ్రహ్మనుగూడ గౌతముఁ డంగీకరించెను. కాని యట్టిపరబ్రహ్మకు జగదాత్మత్వము నంగీకరింపలేదు. ఏలనన వారలుగూడఁ బునర్జన్మ పరంపరలచే నిరతిశయం బగు నిర్వాణమును బొందుటకుఁ బ్రయత్నములు సలుపుచున్నారు. ఏకాలమందైనను నేమానవ్రనిచే నైనను దైవికాతిమానుషంబు కంటె, పుణ్యంబగుజీవనంబే యుత్కృష్టమని యును, మనుజునిచేఁ బొందఁదగుసాధుత్వంబే యజ్ఞేయంబులగు బ్రహ్మాండముల నైన శక్తులకంటె గొప్పదనియును సాహసముగఁ జెప్పఁ బ్రయత్నము గావింపఁబడలేదు.

జన్మమాత్రముననే కాక జ్ఞానాధిక్యముచేఁగూడ యోగ్యుండైన బ్రాహ్మణుని గౌతముఁడు బౌద్ధశ్రమణు నెట్లు గౌరవించెనో యట్లే గౌరవించెను. వసిష్ఠభారద్వాజులను నిద్దఱు బ్రాహ్మణయువకులు బ్రాహ్మణత్వముం గూర్చి వివాదము గావించి గౌతముని వాని యుద్దేశము నడుగ నాతఁడొక సంకథనంబున జాతిభేదంబుల ఖండించి మనుజునియొక్క

ముఖ్యచిహ్నము వానికర్మయనియును, జన్మ కాదనియును జెప్పెను.

"గ్రాసంబును, వృక్షములును, గీటకములును, బిపీలికములును, జతుష్పాజ్జంతువులును, సర్పములును, జలజంతువులును, బక్షులును, వానివాని విశిష్టచిహ్నములచే వేర్వేరు జాతులుగ విభజింపఁబడుచున్నవి. మనుజుఁడును వాని విశిష్టచిహ్నంబుచేఁ దెలియఁబడుచున్నాఁడు. అది యెద్ది యనిన: వాని వృత్తియే.

"మనుజులలో నెవ్వఁడైనను గోరక్షణంబున జీవనంబు గావించిన నట్టివాఁ డార్యుఁడు గాని బ్రాహ్మణుఁడు గాఁడు.

"మనుజులలో నెవ్వఁడైన శిల్పముచే జీవించుచున్నట్టివాఁడు శిల్పిగాని బ్రాహ్మణుఁడు గాఁడు.

"ఎవ్వఁడు వాణిజ్యముచే జీవించునో వాఁడు వర్తకుఁడు (వణిజుఁడు) గాని బ్రాహ్మణుఁడు కాఁడు."

"ఎవ్వఁడు చౌర్యముచే జీవించుచున్నాఁడో వాఁడు దొంగగాని బ్రాహ్మణుఁడు గాఁడు.

"ఎవఁడు శస్త్రాజీవి యగుచున్నాఁడో వాడు యోధుఁడుగాని బ్రాహ్మణుఁడు కాఁడు.

ఎవ్వఁడు గార్హ్యకర్మానుష్ఠానంబుచే జీవించుచున్నాఁడో వాఁడు హోతయగుచున్నాఁడు కాని బ్రాహ్మణుఁడు కాఁడు.

"ఎవఁడు గ్రామమునకు స్వామియో వాఁడు రాజుగాని బ్రాహ్మణుఁడు కాఁడు."

"మనుజుని జన్మముంబట్టి కాని వానిమాతృజాతింబట్టి కాని బ్రాహ్మణునిగ నేవానిని బరిగణింపను. ఎవ్వాఁడు ఋక్షహీనుఁడై యెద్దానినైనం బరిగ్రహింపఁడో వానినే నేను బ్రాహ్మణునిగఁ బరిగణించెదను.

"ఏమనుజుఁడు, రోషరహితుఁడై, పూతకర్మానుష్ఠానియై, ధర్మపరాయణుఁడై, కామరహితుఁడై, శమదమాదియుక్తుండై, యంత్యదేహధారియగునో వానినే బ్రాహ్మణునిగఁ బరిగణించుచున్నాఁడను.

"ఎవ్వఁడు కమలపత్రంబుపై నుదకబిందువువలెను, సూచ్యగ్రంబున సర్షపబీజంబుఁబోలె విషయాసక్తి లేకయుండునో వానినే బ్రాహ్మణునిగఁ బరిగణించుచున్నాఁడను.

(వాసెత్థ సూత్తము.)

ఇట్లే మఝ్ఝిమనికాయంబున నస్సలాయనసూత్తమం దస్సలాయణుఁడను విద్వాంసుఁ డన్నిజాతులవారును శుచిత్వమున సమానులను సిద్ధాంతమును ఖండింపఁ బ్రయత్నించెను. గౌతముఁడు తార్కికునితో వాని యాయుధములతోనే సంవాదంబుఁ గావింప శక్తిఁగలవాఁడై, "బ్రాహ్మణయువతులితరజాతిస్త్రీలవలెఁ బ్రసవకష్టములకు లోనైయున్నారా? లేదా?" యని యాస్సలాయణుని బ్రశ్నించెను.

"అట్లే యితరజాతిస్త్రీలవలె వారుగూడ బ్రసవకష్టంబులకు లోనై యున్నారు." అని యాతఁడు ప్రత్యుత్తర మిడెను. "బాక్ట్రియా, యాఫఘనుదేశీయులలో వర్ణభేదముండినను దాసులు యజమానులుగను యజమానులు దాసులుగను నగుట లేదా? యని గౌతముఁడు ప్రశ్నింప. "అట్లే యగుచున్నది." అని యాస్సలాయణుఁడు ప్రత్యుత్తరముఁ జెప్పెను.

"అట్లైన బ్రాహ్మణుఁడు మానవహంతకుఁడుగను, చోరుఁడుగను, వ్యభిచారిగను, నన్నృతవాదిగను, పిసునుఁడుగను, తుచ్ఛపరుషవచనంబులు వల్కుచు, దురాశాపరుండై, యసూయాగ్రస్తుఁడై నన్నృజుమార్గవర్తియైన మరణానంతరమునఁ దదితరజాతివానివలె దుఃఖభాజనంబైన జననంబును బొందఁడా? "అట్లే" అనుచు నాస్సలాయణుఁడు సుకర్మలు, జాతిభేదంబు లేక కర్మికి మోక్షముకలుగఁజేయునని యంగీకరించెను. గౌతముఁ డీరీతిగనే చర్చ గావించుచు నాఁడు గుఱ్ఱమునకును గాడిదకును గంచరిగాడిద పుట్టుననియును క్షత్రియబ్రాహ్మణుల కుద్భవించువాఁడు జననీజనకులను బోలియుండుననియుఁ జెప్పుచు బ్రాహ్మణులకునుక్షత్రియులకు భేదంనుబు లేదనియును దదనుగుణ్యముగఁ జెప్పెను. ఆ యువకుండగు తార్కికు నిట్టి సంభాషణచే సత్యగ్రహణంబుఁ గావించునటులు చేసెను.

గౌతముఁ డింకొకతఱి తనశిష్యుల కిట్లు బోధఁగావించెను. "భ్రాతృలారా? ఎట్లు గంగాయమునానదులును, నసిరావతి, శరభు, మాహి మొదలగుగొప్పనదులును సాగరసంగమంబుఁ గావించి పూర్వోత్పత్తినామములను గోల్పోయి సాగరంబను నామంబును ధరించుచున్నవో అట్లే బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు బౌద్ధసంఘంబునఁ జేరి జాతిభేదంబులఁ బోగొట్టుకొందురు." ఉపాలి యనుమంగలి బౌద్ధభిక్షుకసంఘంబునఁ జేరి, బౌద్ధభిక్షుకులలో నతిపూజనీయుఁడును విద్వచ్ఛేఖరుఁడును నయ్యెను. థేరాగతంబున నెట్లు బౌద్ధమతము దీనులకును క్షుద్రజాతివారలకును హిందూదేశమున సౌఖ్యదాయకంబై వారలకు జాతిభేదంబువలన వచ్చినయన్యాయములఁ దగ్గించెనో సూచించుచున్నది. సునీతుఁ డను బౌద్ధుఁ డిట్లు వ్రాయుచున్నాడు. "నే నొక క్షుద్రకుటుంబమువాఁడను. బీదనై యష్టకష్టంబులం బడుచుండెడివాఁడను. క్షుద్రవ్యాపారినై జీర్ణపుష్పాపమర్దనంబుఁ గావించుచుండెడివాఁడను. క్షుద్రుఁడనై జనులచే నవమానింపఁబడుచుండెడివాఁడను. అణఁకువతో ననేకులఁ గులమర్యాదతోఁ జూచుచుండెడివాఁడను. భిక్షుకసంఘంబుతో మగధరాజ్య ముఖ్యపట్టణమునకుం జనుచుండిన బౌద్ధదేవుని నేఁగంటిని. నా భారంబుఁ బరిత్యజించి వానికి భక్తిపూర్వకంబుగ దండప్రణామంబుఁ గావించుటకుఁ బోతిని. మానవులలోఁ బరమోత్తముండగు నాతఁడు నాయందు దయఁబూని మార్గమున నాగెను. గురుపుంగవుని పాదారవిందములకు మ్రొక్కి నన్ను భిక్షుకునిగఁ బరిగ్రహింపుమని యానరశ్రేష్ఠు వేఁడితిని. దయామయుండగు నాయాచార్యపుంగవుండు "ఓయీ? భిక్షుకా? ఇటురమ్ము" అనెను. అదియే నేఁ బొందిన సంస్కారము. గౌతమునిచే నసంఖ్యాకముగ బోధింపఁబడిన తత్త్వ మీరీతిగ నాకథాంతమున నీయఁబడినది. "పవిత్రజీవనంబుననైన యుత్సాహంబుచేతను, బూతజీవనంబునను, నాత్మనిగ్రహంబునను, మనుజుఁడు బ్రాహ్మణుఁడగును. ఇదియే యుత్కృష్టంబగు బ్రాహ్మణత్వము.

దీనుండగు సునీతుని బౌద్ధమతాశ్రయ విషయకమైనకథ ప్రాథమిక బౌద్ధమతసంబంధమగు సప్రేమసమానతాచిత్తవృత్తిని నిరూపించుచున్నది. బౌద్ధదేవుఁడు జాతికులవృత్తులను నిరాకరించియే దరిద్రులకును ధనికులకును నభిజాతులకును నీచజాతులకును భేదంబు లేక పావనంబగు జీవనంబుననే పరమగతిం జెందుఁడని బోధించుచుండెను. కులీనునకును నీచవంశప్రసూతునకును సాధువృత్తియే యుత్తమగతి ప్రాప్తికిఁ గారణంబయ్యెను. పవిత్రాశ్రమస్థులకు జాతికులాదిభేదంబులు లేకుండెను. వేలకొలఁది పురుషులును స్త్రీలును జాతిభేదముల విసర్జించి ప్రేమమయంబును న్యాయానురూపంబును నగు బుద్ధునిమతము, నంగీకరించి యాచార్యునియందైన భక్తిచేఁ దమతమభేదములను మఱచిరి. పవిత్రాశ్రమంబున జాతిభేదంబులేదు. బౌద్ధగృహస్థులయందుఁ గూడ వర్ణభేదములవలనఁ గలుగు మనస్సంతాపములు తగ్గినవి. ఏలయన: నత్యధమజాతియం దుద్భవించినవానికైన నుత్తమస్థానప్రాప్తి నిరోధింపఁబడలేదు.

మనుజుఁడు శిఖలవలనను, కులమువలనను జన్మమువలనను బ్రాహ్మణుఁడు కానేరఁడు. ఎవఁడు ఋజుమార్గానువర్తియై సత్యపథము నతిక్రమింపఁడో వాఁడే బ్రాహ్మణశబ్దవాచ్యుఁడు. "జటావల్కలములవలన లాభమేమి? ఓయీ? మందుఁడా? మేషచర్మధారణంబున నేమున్నది? హృదయాంతర్భాగమున నాశ దహించుచున్నది. వెలుపల నీ వేమి చేసిన నేమి ఫలము?"

"ఎవఁడు విక్రాంతుఁడై వీరుఁడై యోగియై జయశీలుండై సుఖదుఃఖసముండై సంపన్నుఁడై జ్ఞానియగునో వానినే బ్రాహ్మణునిగఁ బరిగణింతును.

"నగ్నత్వముగాని, జటాజూటములుగాని, మలినంబుగాని, నిరాహారంబుగాని, క్షితితలశయనంబుగాని, మలినపరిమార్జనంబుగాని, నిశ్చేస్యవృత్తిగాని, నిష్కాముఁడుగాని వానిని బూతునిగఁ జేయనేరవు."

బుద్ధుఁ డందఱను సంసారమును బరిత్యజింపుఁడనియే శాసింపలేదు. విషయాసక్తిని గామములను జయింపుఁడనియే వానిబోధ. రాగాతిక్రమణముఁ గావింపవాని సంసారపరిత్యాగము బుద్ధుఁ డంగీకరింపలేదు. కాని సంసారసుఖముల ననుభవింపుచున్నప్పటికంటె సంసారపరిత్యాగమును గావించిన నెక్కుడు సులభముగ నిర్వాణప్రాప్తి యగునని మాత్ర మొప్పుకొనెను.



# వానప్రస్థుని విభ్రమము

శ్రీ శివశంకరశాస్త్రి, సాహితీసమితి సభాపతి

౧

దేహళీపార్శ్వమున నిల్చి దేవి, నీవు
వేడుకం గాంచుచుంటివి వెడలు "ప్రభలు"
చూచుచుంటిని మిగుల నుత్సుకతతోడఁ
బథమున న్నిల్చి నీముఖప్రభలు నేను!

స్తిమితకోమల మైన నీ సితవిలోక
నావళికి సాంద్ర మైన నాయసితనిశిత
దృక్కులకు సంఘటిల్లిన యెదురుకోలు
కుముదనీలాంబుజంబుల గుమివిధాన!

అపుడు నిలువెల్ల రోమాంచ మయ్యె నాకు
హర్షమున మే నెఱుంగఁగా నైతి నంత
నిన్ను విడిపోవ బుద్ధి జనింప దయ్యె
కాని ఘంటాపథంబని కదలిపోతి!

తృప్తి దీరక భవదీయదివ్యవదన
మంజురోచిస్సుపై దేవి, మరలమరల
వెనుదిరిగి చూచుచుం బోతి, వెగ్గలంపుఁ
దటిని కెదురేగుచుండెడి తరణివోలె!

రాగము భరింపలేక హర్మ్యమ్ముచుట్టు
శీఘ్రగమనముతోఁ బ్రదక్షిణము చేసి
మరల వచ్చితి వేఱొకమార్గమునను
నీముఖాంభోజ దర్శన నిష్ఠచేత!

అరుగ నుంటివి సౌధాంతరాళమునకు
ఇంతలో నాముఖమ్ము నీదృష్టిపథము
నందుఁ దోఁచుటచే భవదాననంబు
రక్తిమం దాల్చె లజ్జాభిరామ మగుచు!

కోమల మనోజ్ఞ విమల దృక్కోణతరల
దివ్యశీతల భవదీయ దృష్టు లంతఁ
బిక్కటిల్లి మదానన బింబముపయిఁ
జెలువుగా వ్రాలె వెన్నెలపులుగు లట్లు!

మరలి చనుచుండ నీ వంత మందిరాంగ
ణప్రదేశమువెంట నానయనయుగళి
క్రమసుస్నిగ్ధ భవదీయగండఫలక
భాగమున నాట్యమాడె జృంభణముతోడ!

గ్రీవమును రమ్యముగ వంచి క్రింది చూడ్కి
మోహనమయూరి పోలిక నాహరించి
యేకకాలమునందె మదీక్షణములు
చిత్తమును దేవి, హర్మ్యము చేరినావు!

౨

శాంతశీతలరమణీయసంధ్యవేళ
నరుగుదెంచుచు విద్యాలయంబునుండి
రమ్యరూపంబు మన్మనోరథము దాల్చి
యెదురుపడినట్లు నీవు కాన్పించినావు!

క్షౌమధారిణి వై చతుష్పథము వెంట
ధీరగమనముతో వచ్చు దేవి, నీవు
కమలగర్భుని కంత శృంగాటకమునఁ
జెలఁగు వాగ్దేవిపోల్కిఁ దోఁచితివి నాకు!

పార్శ్వవర్తిను లుంటచేఁ బక్ష్మలముల
నించుక కదల్చి యిటుఁ బ్రసారించినావు
మనసిజుని పుష్పపంచక మార్గణాభ
మైన నిశితేక్షణంబు రహస్యలీల!

ఫాలమున వ్రాలి నాసికాపథము వెంట
నధరబింబముపై జాఱి యవల నీదు
మృదుకపోలతలంబున నెదిగి తుదకు
దివ్యతాటంకసీమ నాదృష్టి నిలిచె!

భావభరమున నీమృదుపదయుగమ్ము
తొట్రిలగ సాగిపోతివి త్రోవవెంట
విస్మరింపక యేకాంతవేళలందు
నన్నుఁ దలపోతు వని దేవి, నమ్మువాఁడ!

౯

మెలఁగుచున్నావు నేత్రనిమీలనమున
మెలఁగుచున్నావు వీక్షణోన్మీలనమున
నిన్ను నిరతంబు ధ్యానించుచున్నవాఁడ
దేవి, నీనికి వేఱొండు దిక్కు లేదు!

ముకుళితమ్లాన మైన నాముఖసరోజ
జృంభణము సేయు తరుణార్కబింబ మీవ
యవసిపోయిన నానేత్రకువలయముల
శోషణము వాపు శీతల జ్యోత్స్న వీవ!

గాఢతాపార్త మైన నాగాత్రమునకు
సాంద్రసురభిళ చందన చర్చ వీవ
ఆధిభరమున నిర్జీవ మైనహృదికి
చారుశీతలతరసుధాసార మీవ!

ఇంపు లొలుకగ జంగమహేమవల్లి
భంగిఁ జెలఁగెడి నాబహిఃప్రాణ మీవ
నన్నుఁ బాలింపఁ గమనీయనవ్యగాత్ర
లతిక గై కొన్న నాభాగ్యలక్ష్మి వీవ!

అతివిశాలగభీరభవార్ణవంబు
నన్నుఁ దరియింపఁ జాలిన నౌక వీవ
స్థిర పవిత్రమదీయహృత్పీఠనిహిత
దివ్యవిమలానురాగాధిదేవి వీవ!

౧౦

నిర్మలప్రేమనిష్ఠను నీపదాబ్జ
పీఠమున నిల్పినాను నాస్ఫీతహృదిని
నీయఖండితకారుణ్యానిరతి నిపుడు
నాసమస్తము నర్పించినాను దేవి!

స్వచ్ఛభవదీయలావణ్యసరసిలోన
మజ్జనం బొనరించె మన్మానసంబు
చిత్తమందు వానప్రస్థవృత్తు లెల్ల
క్షాళితములయ్యె నిర్మలచ్ఛవి జనించె!

మహితజీవననిమ్నగామధ్యమందుఁ
బ్రబల నైరాశ్య భీషణావర్తవితతిఁ
బడి యడంగుదునేమొ! సప్రణయదృష్టిఁ
బాణి గ్రహియించి నన్నుఁ గాపాడు దేవి!

ఇంత లోకములోన నీవే మదీయ
మార్గదర్శక దేదీప్యమానతార
వింత సంసారజలధి నీవే మదీయ
దివ్యసంస్థితి కమృతంపు దీవి దేవి!

నాహృదయరాజ్యలక్ష్మి! యనారతమ్ము
నిన్నుఁ బూజించుచుంటి ననింద్యమతిని
ఈయకల్మషభక్తి నహీనవిమల
తావకీనకటాక్షంబు తనుపు నెపుడొ!

# అనార్కలి

చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

అనార్కలి యనఁగా దానిమ్మపువ్వు. ఆపేరుగలమహమ్మదీయస్త్రీ యొకతె రమారమి మూఁడువందల సంవత్సరముల క్రిందట ఢిల్లీచక్రవర్తియైన యక్బరుయొక్క రాణివాసమునం దుండెను. అక్బరుయొక్క యంతఃపురమునందు నించుమించుగ నైదువేలమంది చక్కనియువిద లుండిరని చరిత్రకారులు చెప్పుదురు. అందుఁ గొందఱు చక్రవర్తి భార్యలు; కొందఱుంపుడుకత్తెలు; కొందఱు దాసీస్త్రీలు. చక్రవర్తి వారి కందఱకు వారి వారి చక్కఁదనమునుబట్టి, సౌకుమార్యమునుబట్టి, లావణ్యమునుబట్టి, లాలిత్యమునుబట్టి, విలాసమునుబట్టి, విన్నాణమును బట్టి, జీతము లిచ్చుచుండును. అనార్కలి యొక దాసీపుత్రియయ్యుఁ జక్కని చుక్క. మొగలాయీల యంతఃపురమందలి యంగనలలో ననార్కలికి సౌందర్యమున సాటివచ్చులావణ్యవతు లొకరో యిద్దఱో యుండిన నుందురేమోగాని తక్కినవా రామె యెదుట దివిటీముందఱి దీపములు. చంద్రమండలముముందఱి నక్షత్రములు. బాల్యకాలమున నామెతల్లి చనిపోయెను. కాని యామెయందమునుబట్టి యామెయందు గాఢానురాగము గలిగి యంతఃపురకాంత లామె నరచేతి నిమ్మపండువలెఁ బెంచిరి. మొగ్గ పువ్వుగాక మానునా? పుష్పము వికసింపకయుండునా? వికసించిన వెనుక నెత్తావులు నలుగడల వ్యాపింపకుండునా? వ్యాపించినపిదపఁ దుమ్మెదలు జుమ్మని గ్రమ్మకుండునా? చిన్నబిడ్డయైన యనార్కలి శుక్లపక్షచంద్రబింబమువలెఁ గ్రమక్రమముగ వృద్ధిఁబొంది నిండుజవ్వని యయ్యెను. ముఖారవిందము ముద్దులు మూటగట్టుచుండెను. చూపులయందు సొగసు నెలకొనెను. మాటలలో మాధుర్య ముత్పన్నమయ్యెను. చిఱునవ్వులు శృంగారభూయిష్ఠము లయ్యెను. నడకలలో నవవిలాసంబులు కుదురుకొనెను. అంతఃపురమందలి యంగనలుసయితము దానిచక్కఁదనమును జూచి "వహ్వారే! వహవా" యని మెచ్చుచుండఁ బురుషులమాట వేఱె చెప్పనేల? అక్బరుచక్రవర్తి చండశాసనుఁడగుటచే నతనికి జంకి యంతఃపురమందలిపురుషు లనేకులు దానిం జూడక యోసరిల్లి పోవుచుండిరి. కాని భయంకరశాసనుఁడైన చక్రవర్తికి సయితము నప్పుడప్పుడు జంకనియాత్మ యొకటి మొగలాయీ రాణివాసములో నుండెను. ఆయాత్మ యెవ్వరందురా? అక్బరుచక్రవర్తికుమారుఁడు. ఆతని పేరు నూరుద్దీను సలీము. ఇతఁడు కొన్నివిషయములలో స్వాతంత్రుఁడు. కొన్నియంశములలో సాహసుఁడు. కొన్నియెడల దుండగీఁడు. అనార్కలిని రాజకుమారుఁడైన సలీము పలుమా రంతఃపురమందుఁ జూచెను.

ఆమెమీఁదఁ గన్నుపడినతోడనే మనస్సు కూడఁ బడెను. మనోహృదయములు రెండును ననార్కాళిమీఁద నిలిచెను. చూచినది మొదలుకొని యామెను బలుకరింపవలయునని యుండెను. ఏదో సందుచేసికొని యతఁడప్పుడప్పుడు పలుకరించెను. పలుకరించినది మొదలుకొని స్వేచ్ఛగా దానితో విహరింపవలయునని బుద్ధి పుట్టెను. కాని యనార్కాళి పంజరములోని చిలుకవలె నిరంతర మంతఃపురమందే యుండుటచేత సలీమునకు దానిం గలిసికొనుట కవకాశము చిక్కినదికాదు. అటులుండ నొకనాఁడా బాలిక సాయంకాలసమయమున జలకమాడి సన్నపట్టువలువలుఁ దాల్చి మన్మథుని మోహనాస్త్రమో యనునట్లంతఃపురోద్యానవిహారముసేయుటకై వెళ్లెను. వెళ్లి యిందందుఁ గొంచెముసేపు తిరిగి పుష్పసౌరభము నాఘ్రాణించి మలయమారుతస్పర్శసుఖము ననుభవించి యేమేమో యాలోచించుకొనుచు నొకచో నిలిచి యుండెను. అపుడు వెనుకపాటున నెవ్వరో వచ్చి యామెను బిగియారఁ గౌఁగిలించుకొనిరి. అదరిపడి తత్తరపాటున నామె వెనుకకుఁ జూచునప్పటికిఁ జక్రవర్తికుమారుఁడైన సలీము కానఁబడెను. అంతట నామెతత్తరపాటు హెచ్చెను. బిగికౌఁగిలి విడుపించుకొనుటకై యామె కొంత ప్రయత్నముఁ జేసెను. కాని సలీముయొక్క దీర్ఘబాహువులు పట్టు విడువవయ్యెను. అతని బాహువులపటిమకంటెఁ బ్రేమపాశములపటిమ యధికమై శరీరమును విడువకుండఁ జేసెను. “ప్రియురాల! నీవు తప్పించుకొనిపోవకుము నీవు నాదానవు. చిరకాలమునుండి నిన్నుఁ గలిసికొనుటకే నేను ప్రయత్నము సేయుచుంటిని. చిక్కిన యవకాశముఁ జెడఁగొట్టకు” మని తనివిదీరఁ గౌఁగిలించి ముఖారవిందము ముద్దిడుకొని మరల నేమేమొ యనఁబోవుచుండ నెవరో వచ్చినట్లయ్యెను. సమాగమము విఘ్నమయ్యెను. కార్యసిద్ధి కంతరాయము లనేకములు. విఘ్నములు వేనవేలు.

అంతట నిద్దఱు చెరియొకప్రక్కకుఁ జనిరి. ఎవరిస్థానము వారు ప్రవేశించిరి. చెరియొకచోట వారుండినను హృదయము లొకచోటనే యుండెను. మనసులు మాటలాడుకొనుచుండెను. కేవలశరీరములతోఁ గాకపోయినను స్వప్నములలో నాలింగనములు తఱుచు జరుగుచుండెను. స్వప్నసమాగమములవల్ల గలిగిన యానందమెంతో మేలుకొన్న తరువాతఁ గలిగిన యుత్సాహభంగమంత. ఇటులుండఁగా నక్బరుచక్రవర్తి లాహోరుపట్టణమునకు వెళ్లెను. అతనితో నంతఃపురమాతయు వెళ్లెను. అంతఃపురమే కాదు; డిల్లీనగరమంతయు వెళ్లెనని చెప్పవచ్చును. లాహోరునగరమున నుండఁగా నొకనాఁడు చక్రవర్తి నృత్యగానములచే వినోదింప వలయునని తలంచెను. ధరణీనాయకులు తలంచుటే తడవు గదా! సంకల్పమాత్రముచేతనే సకలకార్యములు వారికి సిద్ధించును. అంతఃపురమందలి స్త్రీలలో నాట్యమునందుఁ బ్రజ్ఞకలవా రందఱిని రావించి చక్రవర్తి నాఁటిరాత్రి గజ్జెకట్టించెను. కొందఱు ముందుగ నృత్యముచేసి నాఁడక్కడఁ జేరిన యంతఃపురస్త్రీలకును దక్కిన రాజబంధుగులకును నానందమును గలి

గించిరి. అనార్కాలియు నృత్యవిద్యయందు నిరుపమాన ప్రావీణ్యము గలదగుటచేఁ గట్టకడపట నామెవంతు వచ్చెను. వెండిబంగారపు దీపస్తంభములలో నత్తరుదీపములు వెలుఁగుచుండెను. దీపకాంతికంటె నెక్కుడుకాంతి గలిగి యనార్కాలి వెలయుచుండెను. నగలు దాల్పవలసినయావశ్యకత లేదుగాని జిలుఁగు బుటేదారుపనిచేసినదువ్వలువ లామెశరీరమునకందము నిచ్చుచున్నవని చెప్పుటకంటె నామె శరీరసంపర్కమువలన నెక్కువ శోభావంతములై యవియే మెఱయుచుండెనని చెప్పుట సత్యమునకు సమీపము. ఆదీపములనడుమ దానిమొగము నక్షత్రములనడుమ చంద్రమండలమువలె శోభిల్లుచున్నది.

అనార్కాలి కెదురుగా మస్నదుమీఁద నక్బరుచక్రవర్తి ఠీవితోఁ గూర్చుండెను. అతని ప్రక్కనే యువరాజగు సలీము కూర్చుండెను. మెఱుపుతీఁగవలె నాబాలిక ముందుకు వచ్చి సారంగుతో శ్రుతి కలిపి పాడ నారంభించి యందియలు ఝణంఝణధ్వనులు సేయ కుడికాలు ముందుకుఁ జాపి నాట్యము మొదలుపెట్టెను. ఆమె ముఖారవింద మందఱకు నేత్రపర్వము చేయుచుండెను. ఆమె పాట వీనులకు విందుగా నుండెను. అభినయము మనోజ్ఞతరముగా నుండెను. సభాసదులు దానివిలాసములకు నత్యంతచాతుర్యమునకు: జక్కఁదనమునకుఁ జొక్కి యానందపారవశ్యము నొందిరి. ఆనృత్యసమయమున ననార్కాలి తన్నుఁ దా మఱచి గానము చేసెననియు నభినయించె ననియుఁ జెప్పుట యతిశయోక్తికాదు. కొన్నిపాటలు పాడిపాడి కొట్టకొస కామె

"ద్వి. నీవ నే ననుమాట నిక్కంబు సుమ్మీ!
నేనె నీవై యుందు నెచ్చెలికాడ!
మనకు భేదము లేదు మనసులయందు
సంగముల్ రెండయ్యు నాత్మ యేకంబె!"

యని యర్థమిచ్చుపాట పార్సీభాషలోఁ బాడెను. పాడునప్పుడు దానిచూడ్కులు సలీముపై నిలిచెను. సలీము నిరీక్షణంబులు దానిపై నెలకొనెను. అన్యోన్యముఖావలోకనముచేత వారిద్దర మితానందము నొందిరి. ఆయానందము వారు పట్టలేకపోయిరి. కొన్నిబాహ్యచిహ్నము లాయానందమును వెల్లడించెను. ఆపాటఁ బాడుచు ననార్కాలి మందహాసము చేసెను. సలీము దానికిఁ బ్రత్యుత్తరముగాఁ జిఱునవ్వు నవ్వెను. తనపాడినపాటయొక్క రసము రసజ్ఞుఁడైన తనమనోహరుఁడు గ్రహించి మందహాసము చేసెనని యాజవ్వని తెలిసికొని సంతోషించెను. ఆనందాతిశయమున దానిశరీరమునఁ బులకాంకురములు దోఁచెను. సలీము శరీరముగూడ నటువంటి వికారమునకే వశమయ్యెను. తన్మయావస్థలో నున్నయోగియు యోగినియు నెటులుందురో సలీమును, జవ్వనియగు ననార్కాలియు నటు లుండిరి. ఈస్థితి సభాసదులు గ్రహించిరో లేదో కాని చక్రవర్తిమాత్రము గ్రహింపకపోలేదు. అనార్కాలి మందహాసము చేయుటయు, దానికి బదులుగా సలీము చిఱునవ్వు నవ్వుటయు నక్బరు కనిపెట్టెను. కనిపెట్టినతోడనే కాఱుచిచ్చువలె నతనికోపాగ్ని మండెను. పరమ

నీచురాలైనదాసీపుత్రి తనస్థితియుఁ దనకుమా రుఁడైన సలీముస్థితియుఁ బరికింపక వానిం దన వలలో వేసికొనుటకుఁ బ్రయత్నము సేయు చున్నదని యతఁ డభిప్రాయపడెను. అది పాపా త్మురాలని యతఁడు దృఢముగా నమ్మెను. వెంటనే యతఁడు ఖొజ్జా నొకనిం బిలిచి యనా ర్కాళిని వ్రేలితోఁ జూపి "ఓరీ! ఈదురాత్మ రాలిం దీసికొనిపోయి యీరాత్రి చీఁకటికొ ట్టులోఁ బారవేయుము. రే పుదయమునఁ బ్రతికియుండఁగానే శరీర మొలిచి దీనిఁ జంపు ము. మాయలమారి నవ్వులు నవ్వి, దొంగ చూపులు చూచి, పడుచువాండ్ర భ్రమపెట్టి పాడుచేయవలెనని యీపాపాత్మురాలు సంక ల్పించుకొన్నది. ఇటువంటి పడుచుబానిసకూఁ తునకు బుద్ధివచ్చునట్లు చేయించెద" నని కఠిన స్వరముతోఁ బలికెను. అప్పలుకులు విని సభా సదు లందఱు గడగడ వడంకిరి. సలీము కొయ్య బొమ్మవలె నిశ్చలుఁడై పోయెను. నృత్యము చేయుచున్న యనార్కాళి నృత్య మాపి నిలిచి చక్రవర్తి యెవ్వరి నుద్దేశించి యీపలుకులు పలికెనో యని తెలిసికొనఁ గోరి, యాతని వ్రేలు తననే చూపుటచేత నది తన్నుఁగూర్చి యే యని తెలిసికొని భయముచే గడగడ వడంకెను. అంతట నొకఖొజ్జా యామెమీఁదఁ జేయివైచి చేయిఁబట్టుకొని రమ్మని లాగెను. అనార్కాళి దుఃఖవశమునఁ బెద్దకేక వేసి విద లించుకొని వానిపట్టుఁ దప్పించుకొని చక్రవర్తి పాదములపైఁ బడెను. పడినపరువాత నామెకు స్మారకము లేదు.

మఱల స్పృహవచ్చునప్పటి కనార్కాళి దేదీప్యమానములగు దీపములనడుమఁ గాక చీఁకటికొట్టులో నుండెను. ఆమె మేనుమరచి పడియున్నకాలమునఁ జక్రవర్తియాజ్ఞప్రకా రము ఖొజ్జా లామెం దీసికొనిపోయి యంధ కారబంధురమగు కారాగృహమునం బార వైచిరి. తెలివివచ్చిన తోడనే యామె తన దురవస్థం దెలిసికొని కడుగడు విలపించెను. "హా! దైవమా! హా! దైవమా! నాకుజరిగినగా రామునకును నేఁబడినసుఖమునకును నా కీదుర వస్థ దగునే? భూలోకమందలిచక్రవర్తు లంద ఱిలో శిఖామణియని చెప్పఁదగిన మొగలాయి పాదుషా యంతఃపురములో నున్నస్ఫటికశి లాసౌధములమీఁద నివసించుదానికి, నతని రాణివాసపు స్త్రీలచే మిక్కిలిగౌరవింపఁబడిన దానికి, నతని యుద్యానవనములో విహరించు దానికి, నతనికుమారునిహృదయ మపహరిం పఁగలిగినంతసౌందర్యమునకు నిలయ మగు దానికి నిటువంటిదురవస్థ ప్రాపింపఁజేయుట నీకు న్యాయమా? నాకింతదుర్మరణమా? నర హంతకులకు, రాజద్రోహులకు, మతద్రోహు లకుఁ జేయవలసినదారుణదండనము పుష్పసు కుమారనగు నాకు విధించుట కాచక్రవర్తిమన సెట్లొప్పెనో? ఆహా! రాజులహృదయము లో కప్పుడు వజ్రములకంటె నతికఠినములు గదా! రాజుల నమ్మినవారిగతి యెన్నఁటికి నింతియే! పూర్వక్షణ మనుగ్రహము, ఉత్తరక్షణము నిగ్రహము. ఆహా! బ్రతికియుండఁగా శరీర మొలిచి చంపుటయే! నారింజపం డొలిచినట్లు మృదుశరీరముగలయంగన నొలిచిచంపుటయే!

ఓ అల్లా! యీపాదుషాలహృదయములను రాతితోఁ జేసితివా? హా మహమ్మదు! రక్షించు. రక్షించు. ఇంతకుఁ నేఁ జేసినతప్పేమి? నే నెవరికి ద్రోహముఁ జేసితిని? నే నందకత్తియనగుట నాలోపమా? యువరాజగు సలీమునకు నాపై వలపుగలుగుట నాలోపమా? నృత్యగానములలో నే నసమాననై పాదుషాసభలో నున్న స్త్రీపురుషుల మనఃకోశముల నానందరసముతో నింపుట నాలోపమా? రాణివాసమం దున్న రమణులకు నాపై దయగలుగుట నాలోపమా? నేను దన కుమారుని నావలలో వేసికొనుటకై ప్రయత్నముచేసితినా? నన్నే యతఁడు వలలో వేసికొనెను. నన్నే యతఁడు భ్రమపెట్టెను. నన్ను వెదకి కొనుచుఁ దోఁటలోని కతఁడే ముందువచ్చెను గదా! చదువ్రకొన్నవాఁడు తండ్రి యనంతరమున గద్దెమెక్కి హిందూస్థానము నేలఁదగినవాఁడు— అటువంటి సలీమునకు మనోబలము లేకపోఁగా విద్యావిహీనురాలను, మనోదేహబలము లంతగా లేనిదానను, నేనా దోషారోపణకుఁ దగినదానను? చక్రవర్తిమాటయే శాసనము. అతనిమాట నెదిరించువా రెవరు? న్యాయముకాదని తెలుపువా రెవ్వరు? తెలిపిన వారికి నాగతియే పట్టును. చావు కొనితెచ్చుకొనువా రెవ్వరు? రాజుల హృదయములు వారికొలువుకూటములవలెనే ధర్మశూన్యములు. వారికాగ్రహము కలిగెనా యనపరాధుని బుఱ్ఱ యెగురును. అనుగ్రహము కలిగెనా యపరాధి యందల మెక్కును. హా! తల్లీ! నీకుఁ గలిగినమరణము నాకేల గలుగదయ్యెను? ఇంతదారుణమృత్యువు కనిపెట్టుకొని యుండఁగాఁ జిన్నతనమున నే నేల చచ్చిపోదును" అని మఱియు నేమేమో యనుకొనుచుండఁగా నంతలోఁ దలుపు సందులలో నుండి యొకవెలుతురు కనఁబడెను. అడుగుల జాడ వినంబడెను. తలుపుగొళ్లె మూడఁదీసినట్లు చప్పుడయ్యెను. తలుపు తెరువఁబడెను. చెఱసాల కావలివాఁడగు రహీంఖాను కాగడాచేతఁబట్టుకొని నిలిచియుండెను. అతనిప్రక్క నెక్కవిలాసవంతుఁడు బిక్కమొగముఁ బెట్టుకొని నిలువంబడి యుండెను. అతనిముగముఁ జూడఁగానే యనార్కాళి లేచి నిలువంబడెను. ఆవిలాసవంతుఁడు గదిలోఁ బ్రవేశించి 'ప్రియురాలా'! యని యనార్కాళిని కౌఁగిలించికొనెను. అనార్కాళి కన్నులనుండి బాష్పబిందువులు రాలెను. నాతండ్రిగారు నీవిషయమై యతికఠినుండై నీకు విధింపరాని దండన విధించెను. దీనికై నీవు విచారింపకుము. నీప్రాణము రక్షించుటకు మంచియుపాయ మున్నది. అటువంటిదారుణమరణము నీవంటికుసుమసుకుమారికిఁ దగదు. నీమనోవేదన విడువుము." అని సలీము పలికెను. "రాజకుమారా! భగవంతుఁడు ప్రత్యక్షమై వచ్చినను నాయపాయము తప్పదు. నేను గుండె రాయిచేసికొని యుంటిని. నాకు విచారమే లేదు. అంతఃపురమందలి దాసీజనములోఁ గొందఱు రాణులు కాఁగలరు. కొంద ఱకాలమృత్యువు నొందఁగలరు. నేను రెండవదానిలోఁ జేరినదానను. నాఘోరమరణము

దప్పింప మీతరముగాదు." అని యనార్కాళి బదులుచెప్పెను. "ప్రియురాలా! చక్రవర్తి విధించినదండనముఁ జక్రవర్తికుమారుఁడే త్రిప్పఁగలఁడు. నాతండ్రి ముసలివాఁడు. ఆఱు నెలలకో, ఏఁడాదికో చావక మానఁడు. అప్పుడు నేను పట్టాభిషిక్తుఁడ నగుదును. అప్పుడు నీవు రాణివయ్యెదవు. ఈలోపుగా నిన్నుఁ దీసికొని నేను బాఱిపోయెదను. గుఱ్ఱము సిద్ధము చేసితిని. నావెంట రమ్ము! లే! త్వరపడు! ఆలస్యము చేయకు! తెల్లవారునప్పటికి మనము చక్రవర్తి కందకుండ కడుదూరము పోవుదము." అనిరాజకుమారుఁడు మరలఁ బలికెను. అనార్కాళి యిట్లనియె— "యువరాజా! మందభాగ్యురాలనగు నానిమిత్తము నీవు చక్రవర్తిని విడిచి, తల్లిని విడిచి, బంధువర్గమును విడిచి వచ్చుట న్యాయము కాదు. నేను దాసీపుత్రికను. చక్కఁదనముచేత నీయందను నేను నిలుచుటకుఁ దగియుంటిని గాని,స్థితినిబట్టి నీతో మాటలాడుటకైనఁ దగినదానను గాను. నన్నుఁ దీసికొని నీవు పారిపోయితివేని నీమీఁద నీ తండ్రి కాగ్రహమువచ్చును. వచ్చెనా నీవు రాజ్యము కోల్పోవచ్చును. ప్రాణములు కోల్పోవచ్చును. యావజ్జీవము కారాగృహమునం దుండవలసిచ్చును. పడుచుఁ దనపువలపునకై యిటువంటి యిడుమలు పడఁదగదు. నీకుఁ హానిచేయుట కిష్టము లేదు. నీవెంట నేను రాను."

ఆపలుకులు విని సలీము, బాలికయుదారభావమునకు మిక్కిలి యక్కజము పడి యామెతో నిట్లనియె. "ప్రియురాలా! నావిషయమై నీవు భయపడకుము. నేను జక్రవర్తి కుమారుఁడను గదా! నాపైఁజక్రవర్తి కాగ్రహము గలిగినను నాకు భయము లేదు. పుత్రులనేకులు నాపక్షము రాఁగలరు. మాతండ్రిపై మనంబున ద్వేషముగలవారందఱు నాపక్షము చేరుదురు. నిరపరాధురాలైననీప్రాణము రక్షించుటకు నేనెట్టిశ్రమనైనఁ బడుదును. కావున నేయాటంకముం జెప్పక నావెంట రమ్ము. కాలము పరుగెత్తుచున్నది. రెండుజాములకంటె నెక్కువరాత్రియైనది. ప్రతినిమేషము మనకు విలువ గలది. నిముసము దాఁటిన కార్యము మిగిలిపోవును." అన నామె కొంచె మాలోచించి 'సరే' యని యొప్పుకొనెను. అప్పుడు రహింఖాను పనిమీఁద నావలకు వెళ్లినట్లు వెళ్లి తిరిగి వచ్చి "మహాప్రభూ! పాదుషాగారు వచ్చుచున్నా"రని చెప్పెను. ఆమాటవినఁగానె సలీముగుండెలు చెదరెను. అనార్కాళి తనకు మరణ మప్పుడే సంభవించునని భయంపడి వడఁకెను. సలీము నిమిషమాత్రము భయావస్థకు లోనై యుండి కొండొకతడవునకు ధైర్యము తెచ్చుకొని "ఏఁడీ! పాదుషా. ఇట్టి యర్ధరాత్రమున నతఁ డెప్పుడైన బయలు దేరునా?" యని యడిగెను. అతనికి రహింఖానుఁ డిట్లనియె. "మహాప్రభూ! గులాములు తమతమకార్యములయందు శ్రద్ధకలిగి మెలఁగుచున్నారో, లేదో చూచుటకై యప్పుడప్పుడు పాదుషా యర్ధరాత్రమున సైతము బైలుదేరి వచ్చుచుండును. ఇది క్రొత్తగాదు. ఆప్రక్కనుండి వచ్చుచున్నారు. చప్పున మీరావలికి వెళ్లుఁడు. ఈగది తాళమువేయవలెను."



అ నా ర్కా ళి

" ......అందియలు ఝుణంఝుణ ధ్వనులు సేయ
కుశికాలు ముందుకుఁ జాపి నాట్యము మొదలుపెట్టెను. "

అనవుడు సలీము "నేనీగదిలో నుండెదను. మమ్మిద్దఱ నిందుఁ బెట్టి తాళము వేసికో! తాళము సరిగానుండుటఁ జూచి పాదుషా వెళ్లిపోఁగలఁడు." అని పలికెను. అనవుడు రహీంఖాను, "స్వామీ! ప్రభువుల చిత్తవృత్తులు తెలిసికొనుట కష్టము. తాళము భద్రముగా నున్నదని పాదుషా సంతుష్టుఁడై వెడలిపోవచ్చును. లేదా తానువిధించిన మరణదండనను గూర్చి యెట్లువిలపించుచున్నదో తెలిసికొనుటకై తాళముఁదీయించి యామెఁ జూడవచ్చును. అట్లుగాకున్న నతని కేదైన ననుమానము గలిగితాళముఁ దీయించవచ్చును. అందుచేత మీరాగదిలో నుండుట మీకును నాకును క్షేమము గాదు. కావున వేఱొకచోటికి దేవరవారు వేంచేయవలయు" నని మనవిచేసెను. సలీము చిన్నమొగము చేసికొని సమీపమున నున్నయొక మేడమీఁదికిఁ బోయెను. పోయి రహీంఖానునిఁ జూచి "పాదుషా వెళ్లిపోయినతోడనే నన్నుఁ బిలువు" మని యాజ్ఞాపించెను. "చిత్తము స్వామీ!" యని యతఁ డిట్టటు దిరిగి మరలివచ్చి "స్వామీ! యింకను పాదుషా వెళ్లలేదు. దేవరవారి కేమియుఁ దోఁచుట లేదు కాఁబోలు. దాహము కావలెనా?" యని యడిగెను. "కొంచెము ద్రాక్షసారాయము దీసికొనిరా" యని సలీము పలికెను. అతఁడు వెంటనే వెళ్లి ద్రాక్షసారాయి యొకగిన్నెలోఁ బోసి తన రొండినున్న యొక డబ్బామూఁతఁ దెఱచి యందున్నపొడుము కొంచెమందులోఁ గలిపి "తెల్లవారులోపుగా నీకు మరల మెలకువ రాదులే" యని తనమనసులో ననుకొని యాగిన్నె నాతనిచేతి కిచ్చెను. అతఁ డది త్రాగి "శహబాసు! రే రహీం! శహబాస్!" యని మెచ్చి మరల నొకగిన్నె తెమ్మని త్రావి మత్తుచేతఁ గన్నులు మూసికొని పండుకొనెను. రహీంఖాను సలీము గదివిడిచి పోఁగానే యనార్కలినొకతెనే యందులోఁ బెట్టి మరలఁ దాళము వేసెను. అనార్కలిఁదీసికొని సలీము పాఱిపోయినపక్షమున రహీంఖానునకు దారుణమైన దండన విధింపఁబడును. కారాగృహమున కధికారియతఁడు. గదితాళము లతనియొద్ద నుండును. అతనికిఁ దెలియకుండ ననార్కలి చెఱనుండి తప్పించుకొనుటకు వీలులేదు. ఆమె పాఱిపోయిన యెడల నితఁడు దాని కంగీకరించెనని చక్రవర్తి నిశ్చయింపకపోఁడు. నిశ్చయించెనా తలనఱకించియో, యొడలొలిపించియో, యేనుఁగు కాళ్లక్రింద వేయించి త్రొక్కించియో, కాఁగిన నూనె కొప్పెరలోఁ బడవేయించియో, త్రాఁచుపాములచేతఁ గరపించియో, కఱ్ఱలతోఁ గొట్టించియో, పెద్దపులిబోనులోఁ బడవేయించియో, పాదుషా యతనిని జంపింపకపోఁడు. అందుచేత రహీంఖానుఁడు సలీము చేయఁదలచిన ప్రయత్నము తనకుఁ బ్రాణభంగకరమని తలఁచి పాదుషా రాకపోయినను వచ్చుచున్నాఁడని యబద్ధమాడి సలీమును గదిలోనుండి వేఱొకచోటికిఁ బంపివేసి యతఁడు త్రాగుబోతగుటచేత దాహమగుచున్నదా యని వంకఁ బెట్టి యతనికి సారాయముమాట జ్ఞాపకము చేసి యతఁడు ద్రాక్షసారాయము దెమ్మన్నప్పుడు మరలఁ ద్వరలో మెలఁకువ రాకుండ

నట్లు దానిలో మత్తుమందుఁ గలిపి యిచ్చెను. అతనికోరిక నెఱవేఱెను. తెల్లవారువఱకు మరల సలీమునకు మెలఁకువ రాలేదు. రహీంఖానుని యాపద తప్పెను. త్రాగుబోతులచేత గడుసువాండ్రు తాము తలఁచినపని చేయింపఁ గలుగుదురు కదా!

అనార్కాలి మరల గదిలో నొంటిగఁ గూర్చుండి పాదుషా వెళ్లిపోయినతోడనే సలీము వచ్చి తన్నుఁ దీసికొనిపోవుననియుఁ దనకు ఘోరమృత్యువు తప్పిపోయినదనియు నెంతో యాసగలిగి యతనిరాకకు నిరీక్షించుచుండెను. ఆమెకు నిముస మొక జామువలెఁ దోఁచెను. ఏచప్పుడైనను మరల సలీము తన కడకు వచ్చుచున్నాఁడని తలుపుదగ్గఱకుఁ బోయి యాధ్వని నామె యాలకించుచుండును. కాని యెంతసేపటికిని సలీము రాలేదు. ఆమె ప్రాణము విసికి పోయెను. విరక్తి దోఁచెను. అపు డామె యిట్లు చింతించెను. "మొదట, నేను రాజకుమారునితో వెళ్లుట కిష్టపడక పోతిని. అతఁ డెంతో బలవంతపెట్టి తన వెంట వచ్చుటకు నన్నొడంబరచెను. అంతలో నాయ దృష్టహీనతచేత పాదుషా వచ్చుచున్నాఁడని తెలిసెను. పాదుషా వచ్చుటగూడ నాభాగ్యలోపమే. అర్ధరాత్రిసమయమున నంతఃపురములో నిద్రాసక్తుఁడై యుండు పాదుషా నేఁటిరాత్రియే చెఱసాలఁజూచుటకు బయలుదేఱవలసిన యవసర మేమున్నది. బంధమోక్షముఁ జేసి సలీము నన్ను వెంటఁగొని పోవునన్నవార్త యంతఃపురమునఁ బొక్కి యుండునా ? గంభీరస్వభావుఁడైన రాజకుమారుని మనఃపేటిక భేదించుకొని యావార్త యెట్లు వెల్లడి కాఁగలదు? అట్లనఁ గూడదు. ఏమో? యెవ్వరెఱుంగుదురు? ఆంతరంగికమిత్రున కెవ్వనికైన నతఁ డీమనోరథమును జెప్పఁగూడదా? ఆమిత్రుఁడు మఱియొకనితో ననఁగూడదా? క్రమక్రమముగ నది పొక్కఁగూడదా? అదియును గాక రాజకుమారులే సహజముగ నవ్యవస్థచిత్తులు. అందులో సలీము త్రాగుబోతు. సామాన్యుఁడైన త్రాగుబోతుకూడఁ గాఁడు. మద్యపానమున మితియు మేఱయు నెఱుఁగనివాఁడు. త్రాగియున్న సమయమున నతనినోటనుండి యీమాట యప్రయత్నముగ జారియుండివచ్చు. ఆమాట నాయందసూయ గలవానిసలచెవిని బడియుండవచ్చు. 'దొరికినదే సందుగదా' యని వారు పరమసంతోషమునఁ బాదుషా కెఱిఁగించి యుండవచ్చు. అట్లు కానియెడల సలీము నామనస్సు శోధించుటకై నాకడకు వచ్చియుండి నేను మెత్తఁబడఁగానే యిది కక్కుర్తిమానిసియని నావిషయమై నీచాభిప్రాయము పడి నన్నుఁ బరిత్యజించి యుండునా? రాజులచిత్తములు స్థిరములు కావు. నాచెట్టఁబట్టినపక్షమునఁ దన కెన్నో యపాయములు సంభవించునని పశ్చాద్విచారమున నాకడ కతఁడువచ్చుట మానియుండునా? లేక నక్కజిత్తులవంటి మాయోపాయములయందు మిక్కిలికుశలుఁ డగు రహీముఖానుఁ డేదేని పన్నుగడఁ బన్ని సలీముమనసు విఱిచియుండునా? ఏమైన నేమి? ఇఁక నతఁడు రాఁడు. అదిగో జాముకోడి కూయుచున్నది. తెల్లవారవచ్చుచున్నది. తెల్లవారఁగానే నాబ్రతుకు

తెల్లవారును. మరణమునకు నేను జడియను. ప్రాణము విడుచుట నాకు సులభసాధ్యము. కాని కిచ్చిలిపం డొలిచినట్లు మేనితో లొలిచి పాదుషా చంపఁదలఁచుచున్నాఁడు. మానిసి కంటె కంటె ఘోరమృత్యువు లేదు. అది తలఁచుకొనఁగానే నామేను జల్లు మనుచున్నది. అహాహా! స్త్రీయనియైన పాదుషా యాలోచింపలేదుకదా! చంపఁదలఁచుకొన్నపుడు రాజులకు స్త్రీ లేమిటి? పిల్ల లేమిటి? పెద్దలేమిటి? పడుచువాండ్ర శృంగారభావములు చూచి సహింపక ఘోరదండన విధించిన చక్రవర్తి యితఁడు తప్పఁ బ్రపంచమున మఱియొకఁ డుండఁడు. తనపడుచుఁదనమునఁ దా నెందఱు సుందరులఁ జూచి మందహాసముఁ జేసెనో, యెందఱిం జేతులు పట్టిలాగెనో, యెందఱికిఁ గనుసన్నలు చేసెనో, యెందఱిని వారి కిష్టము లేకయ కౌఁగిలించికొనెనో, యెందఱికి దూతికలచేత వార్త లంపెనో, యెందఱికి జాబులు వ్రాసెనో, యెందఱినిమిత్తమై యెక్కరానిచో ట్లెక్కి దిగరానిచోట్ల దిగి పడరాని శ్రమలం బడియెనో, యొక్కసారి యితఁడు స్మృతికిఁ దెచ్చుకొన్న బాగుండును. ఆమాటలడుగఁ గలవాఁ డెవ్వఁడు? పాదుషా! ఢిల్లీ పాదుషా! మొగలాయి పాదుషా! బుఱ్ఱలు దీయించు పాదుషా! శరీరము లొలిపించుపాదుషా! ఇంక నీవిచార మెందుకు? అతఁడు చేయఁదలఁచిన పని నేనే చేసికొనియెద. మాయమ్మ యిచ్చిన యుంగర మున్నది. ఉంగరములో వజ్ర మున్నది. వజ్రములో మృత్యు వున్నది. మృత్యువులో సుఖమున్నది. కొజ్జాలు నన్ను స్పృశించి చర్మ మొలువ నక్కఱలేకయే ప్రాణము విడువవచ్చును." అనియుంగరములోని వజ్రము నూడఁగొట్టి మ్రింగెను. మ్రింగినతరువాత నేమైనదో వేఱ చెప్పనక్కఱలేదు. సలీమునకు మఱునాఁడుసైతము సరిగ మెలఁకువ రాలేదు. వచ్చినతరువాత నతఁ డనార్కాలియని పిలిచి యెవ్వరి నడుగలేదు. మఱచియుండునా? మఱచియుండవచ్చు. రాజుల కెదుటనున్నదే పెండ్లికూఁతురు గదా! ఎదుట లేకపోయిన విషయము వారికి మనసులోఁ గూడ నుండదు. ఒకవేళఁ దనకు మెలఁకువ వచ్చునప్పటికిఁ బాదుషా యనార్కాలిని ఘోరమృత్యువుపాలు చేసి యుండునని తెలిసికొని యతఁ డామెపై రెత్తఁబోయి యుండవచ్చును. అనంతరము కొంతకాలమున కక్బరుచక్రవర్తి మృతినొందెను. సలీము హిందూస్థానమునకుఁ బాదుషాయై జహాంగీరను బిరుదువహించెను. ఒకపర్యాయ మతఁడు లాహోరుపట్టణములో నొక తోఁటలో సిట్టటుపిహారము సేయుచుండ నొక మట్టిదిబ్బ కనఁబడెను. ఇది యేమిటని యతఁ డొక కొజ్జావాని నడిగెను. అతఁడిట్లనియె- "మహాప్రభూ! నాయనగారు జీవించియున్నపుడు మనయంతఃపురమున ననార్కాలియని యొకపిల్ల యుండెను. ఆపిల్ల చనిపోయెను. ఇది దానిసమాధి" ఆమాటలు వినఁగానే జహాంగీరునకు మనోవైకల్యము గలిగెను. అతఁడు రెప్పవాల్పక యాసమాధివంకఁ జూచెను. అప్పుడు రెండుబాష్పబిందువులు రెప్పలనుండి జారెను. ఆతోఁటలో నే యామె నిలిచి యున్నపుడు వెనుకపాటునఁ దానుబోయి యామెను

మొదటిసారి కౌఁగిలించుకొనుటయుఁ, దరువాత రెండుమూఁడుసారు లామె నచ్చటఁ గలిసికొనుటయు, నామె జగన్మోహనముగఁ దనతండ్రి చదురులో నృత్యముసేయుటయు, నాసమయమునఁ దమకిరువురకు శృంగారభావ ముదయించుటయుఁ, దనమూలమున నామెకుఁ దన తండ్రి దారుణదండన విధించుటయుఁ దానామె యున్న చెఱసాలకుఁబోయి యామెను రక్షించుటకు వాగ్దానము చేసి త్రాగిపడియుండి రక్షింప లేక పోవుటయు నతని మనస్సునకు జ్ఞప్తికి వచ్చెను. వచ్చినతోడనే మనోవీథిని విషాద మేఘములు గ్రమ్మెను. మించినదానికి విచారించినఁ గార్యము లేదని పట్టపురాణి గావలసిన యనార్కాళి దిక్కుమాలినచావుఁ జచ్చి యూరుపేరులేక నశించుట యామె సౌందర్యమున కనర్హమని తలంచి యాపేరు శాశ్వతముగ హిందూస్థానమున నిలుప సంకల్పించి యాసమాధిపై మంచిగోరీ కట్టించి యాతోఁటకు నాఁటనుండి యనార్కాళియని పేరు పెట్టెను. కాలక్రమమున నక్కడ తోఁట నశించి పేఁట బయలుదేరెను. ఆపేఁట కిప్పు 'డనార్కాళి' యనిపేరు. ఇది లాహోరుపట్టణమున సుప్రసిద్ధమై యున్నది.




## కనుబొమ్మ

నండూరి వెంకటసుబ్బారావుగారు బి. ఏ.

నన్నుతలుసుకు మొంకి - కన్ను మూయాలి,
కనుబొమ్మ సూడాలి - కఱిగిపోవాలి.
నన్ను కలలో గూసి - నవ్వ కోవాలి,
కనుబొమ్మ సూడాలి - కరువు తీరాలి

నిదరలో సిగపూలు - సదరు కోవాలి,
కనుబొమ్మ సూడాలి - కమ్మ గుండాలి.
పిలుపేదొ యినగానె - తెలివి రావాలి;
కనుబొమ్మ సూడాలి - కతలు సూడాలి.



# వైదిక వాఙ్మయము

కనుపర్తి మార్కండేయ శర్మగారు

సర్వజ్ఞుఁడును సర్వశక్తిపరిపూర్ణుఁడును, అచింత్యామేయమహిమాన్వితుఁడును అగుపరమేశ్వరునియొక్క నిశ్శ్వాసభూతమగు వేదసముద్రముయొక్క పారమిట్టిదని చెప్పుటకు సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడుతక్క తక్కినవార లెవ్వరును సమర్థులు కాఁజాలరని ఆస్తికులగు మహర్షిపుంగవుల నిశ్చితాభిప్రాయము. భరతఖండమను సుప్రసిద్ధప్రాచీననామముగల యీహిందూదేశమునందు అనేకమతములు వెలయుచున్నవి. వానిని ఆస్తికమతములు నాస్తికమతములు అని రెండుగా విభజించవచ్చును. అనఁగా వేదములను, ఆవేదములను తపఃప్రభావముచేత నెఱింగిన వారలు తదంతర్గతార్థరహస్యములను స్మరించుటచేత స్మృతులనఁబడిన ధర్మశాస్త్రములను, తదనుకూలాచరణము గల మహర్షుల సదాచారమును అనుసరించి చరించువారలు ఆస్తికులనియు, తద్విరుద్ధముగ నాచరించువారలు నాస్తికు లనియు మన్వాదిశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. కావున ఆవేదములను గూర్చి యొకింత ఇచట వ్రాయఁబడుచున్నది.

౧. ఋగ్వేదము, ౨. యజుర్వేదము, ౩. సామవేదము, ౪. అథర్వవేదము, అని వేదములు నాల్గువిధములు.

ఒక్కొకవేదమునందు, సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యకభాగములను మూఁడుభాగము లుండును. తఱుచుగా ఆరణ్యకభాగమునందే ఉపనిషత్తులు చేరఁదగియుండును. ఒక్కొక చోట సంహితయందును, బ్రాహ్మణమునందునుగూడ ఉపనిషత్తు లుండుటగలదు. ఈ సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులను చతుర్విధభాగసమన్విత మగు వేదచతుష్టయము పరమేశ్వరునియొక్క నిశ్శ్వాసరూపము. అనఁగా ఋషులచేతఁగాని తత్తుల్యబుద్ధిగల మఱొకరిచేతగాని భారతాదిగ్రంథములవలె రచింపఁబడి యుండలేదు. కాని ఈ వేదరాశినంతయు జితేంద్రియులును, బ్రహ్మచర్యవ్రతపరాయణులును అగుమహర్షులు చిరకాలము తపస్సుచేసి ఆతపోబలమువలన వేదమంత్రములను కనిపెట్టి లోకమునందు వ్యాపింపఁజేసిరి. మహర్షు లనేకులచేత కనిపెట్టఁబడి శిష్యప్రశిష్యక్రమముగఁ బఠనపాఠన ప్రచారమునందినమంత్రరాశిని గొందఱు మహర్షులు సూక్తములుగాఁ జేర్చిరి. కొందఱు మహర్షులు ఆ సూక్తములను కాండలుగను అధ్యాయములుగను, వర్గలుగను జేర్చిరి.

మంత్రములఁ గనిపెట్టినవారిని మంత్రద్రష్టలనియు, సూక్తములనుగాఁ జేర్చినవారిని

సూత్రర్షులు, లేక సూత్రద్రష్టలనియు, కాండములను సేకరించినవారిని కాండర్షులనియు, వన్యవహరించుచున్నారు.

ప్రపంచమంతయు, యజ్ఞస్వరూపమనియు, ప్రపంచాంతర్గతవిషయము లన్నియు యజ్ఞమునకుఁ జేరినవేయనియు, అట్టియజ్ఞము నుగూర్చి బోధించుటయే వేదములయొక్క ముఖ్యాభిప్రాయమనియు, వేదాంగకర్త లచ్చటచ్చట వివరించియున్నారు. రానురాను తపస్సామర్థ్యము క్షీణించుచుండుటచేత వేదార్థమును దెలిసికొనుసామర్థ్యముసైతము క్షీణించుచున్నదనియు, ఆవేదార్థమును దెలిసికొనుటకుగాను శిక్షా, వ్యాకరణ, ఛందో, నిరుక్త, జ్యోతిష, కల్పములనుషడంగములను మహర్షులు స్వయముగా నిర్మించిరి. ఈషడంగములు మహర్షులచేత బుద్ధిపూర్వకముగ నూహించి రచింపఁబడినను వీనికి బీజభూతములును సూత్రప్రాయములును అగువిషయము వేదవాఙ్మయమగు బ్రాహ్మణభాగమునందుఁగలదు. దానినే గ్రహించి భాష్యప్రాయముగఁ దమతమ వేదాంగగ్రంథముల మహర్షులు రచించిరి.

### శాఖాభేదములు

వేదములు నాలుగు అని ఇదివఱకు చెప్పియున్నాఁడను.

ఋగ్వేదమునకు ౨౧, యజుర్వేదమునకు ౧౦౧, సామవేదమునకు ౧౦౦౦, అధర్వవేదమునకు ౯, శాఖలు గలవు. శాఖలనఁగా వేదముయొక్క భాగములుగావు. ఆయాయాచార్యుల అధ్యాపనసంప్రదాయముచేత రూఢము లయిన గ్రంథసముదాయముగాని భాగవతాది గ్రంథములకు గల ౧౨ స్కంధములవంటి విభాగముమాత్రము గాదు.

### ౧. ఋగ్వేదము

ఋక్కులనఁగా ఈమంత్రమునకు ఇన్ని పాదములు, పాదమునకు ఇన్నియక్షరములు అనునియమము గలమంత్రములు. ఇట్టిఋక్కులుగల సముదాయము ఋగ్వేదమని చెప్పఁబడును. ఈ ఋగ్వేదమునందు:— ౧౦ మండలములు, ౧౦౨౮ సూక్తములు, ౧౦౫౮౦ ఋక్కులు, ౧౫౩౮౨౬ పదములు, ౪౩౨౦౦౦ అక్షరములు గలవు. మఱొకవిభాగముగూడ గలదుగాని ప్రకృతమున నిచట ఒకవిధమయిన విభాగమునుమాత్రమే వ్రాసినాఁడను.

బ్రాహ్మణములు:— ఈఋగ్వేదమునకు ఐతరేయబ్రాహ్మణము, శాంఖ్యాయన బ్రాహ్మణము అని రెండుబ్రాహ్మణములు గలవు. ఈ యైతరేయబ్రాహ్మణమునందు ౮ పంచికలు, ఒక్కొక పంచికకు ౫ అధ్యాయములచొప్పున ౪౦ అధ్యాయములు గలవు. ఇతరాపుత్రుఁడగు మహిదాసాచార్యుఁడు ఈబ్రాహ్మణభాగమునకుఁ బ్రవక్త. ప్రవక్తయనఁగా శిష్యులకు అధ్యాపకుఁడు. శాంఖ్యాయనబ్రాహ్మణమునకే కాషీతకీబ్రాహ్మణమనియు నామాంతరము. ఇందు ౩౦ అధ్యాయములు గలవు.

ఆరణ్యకగ్రంథములు:— ఐతరేయారణ్యకమనియు, శాంఖ్యాయనారణ్యకమనియు ఋగ్వేదీయారణ్యకగ్రంథములు రెండు గలవు. శాంఖ్యాయనమునకు నామాంతరము కాషీతకి యని ఇదివఱకే చెప్పియున్నాఁడను. ఐతరేయకౌషీతక్యుపనిషత్తులు ఈయారణ్యకగ్రంథములకుఁ జేరినవియే.

ఋగ్వేదీయోపనిషత్తులు ౧౦:— ఐతరేయము, కౌషీతకి, నాదబిందువు, ఆత్మబోధ, నిర్వాణము, ముద్గలము, అక్షమాలి, త్రిపుర, సౌభాగ్యము, బహ్వృచము అనునవి.

౨. యజుర్వేదము

యజుర్వేదము, కృష్ణయజుర్వేదమనియు, శుక్లయజుర్వేదమనియు ద్వివిధముగానున్నది,

కృష్ణయజుర్వేదము

దీనికే తైత్తిరీయసంహితయని నామాంతరము. ఈ తైత్తిరీయసంహిత ౭ కాండలు, లేక అష్టకములు, ౪౪ ప్రశ్నలు లేక ప్రపాఠకములు, ౬౫౧ అనువాకములు, ౨౧౯౮ పఞ్చాశత్తులు, (పనసలు) ౧౯౨౬౦ పదములు, ౨౫౩౪౨౯౦ అక్షరములు గలిగి యున్నది.

తైత్తిరీయబ్రాహ్మణము కాండత్రయాత్మకమయి ౧౨ ప్రపాఠకములుగా విభజింపఁబడియున్నది. ౧౦, ౧౧, ౧౨ ప్రపాఠకములు కఠశాఖకుఁ జేరినవి.

కృష్ణయజుర్వేదమునందు, సంహితయందు బ్రాహ్మణభాగము, బ్రాహ్మణభాగమునందు, మంత్రములును, ఇట్లే ఆరణ్యకభాగమునందు మంత్రములు బ్రాహ్మణభాగము కలసియున్నవి.

ఈ తైత్తిరీయబ్రాహ్మణమునకే పరాయతమని యు నామాంతరము. పరాయాతమనునది సాధురూపము.

ఆరణ్యకగ్రంథము:— ఇది ప్రశ్నలను పేర ౧౦ విభాగములు కలిగియున్నది. ౭,౮,౯, ౧౦ ప్రశ్నములకుఁ దైత్తిరీయోపనిషత్తని పేరు. ౧౦వ ప్రశ్నమునుమాత్రము నారాయణీయోపనిషత్తనియుఁ జెప్పెదరు. ఈనారాయణీయోపనిషత్తు ఆంధ్రపాఠమనియు ద్రావిడపాఠమనియు ద్వివిధముగఁ గలదు. ఆంధ్రపాఠము ౮౦ అనువాకములుగను, ద్రావిడపాఠము ౬౪ అనువాకములుగను, గలదు. అనఁగా ద్రావిడపాఠమునందుకంటె ఎక్కువ మంత్రములు ఆంధ్రపాఠమునఁ గలవు. ఒక్క శ్రీవైష్ణవులుతప్పస్మార్తులగు ఆంధ్ర ద్రావిడమహారాష్ట్రకర్ణాటాదిస్మార్తబ్రాహ్మణులందఱు ఆంధ్రపాఠమునే పఠింపుచున్నారు. ద్రావిడదేశమగు తిరునెల్వేలి రామేశ్వరము మున్నగుతావులఁగల ద్రావిడులగు వేదపాఠకులను వేదపారాయణార్థము పిలువఁగా వారు ఆంధ్రపాఠానుసారము స్వస్తివాచనము చెప్పఁబ్రారంభించిరి. మీరు ఆంధ్రులుకారే, ద్రావిడులు గదా; ద్రావిడపాఠప్రకారము మేల చెప్పుటలేదు; ఆంధపాఠప్రకారము చెప్పెదరేల? యని ప్రశ్నింపగా "పూర్వకాలమున మాదేశమునందు ఘనపాఠులగువారలు లేరు. వేదాధ్యయనార్థము ఆంధ్రులగు ఘనపాఠులఁ బిలిపించి వేదాధ్యయన మొనర్చితిమి. తత్సంప్రదాయానుసారము మేము ఆంధ్రపాఠమునే అధ్యయన మొనర్చితిమి. మాశిష్యులకున్నూ అట్లే చెప్పుచున్నారము. ఇది నిన్న మొన్న వచ్చిన సంప్రదాయముకాదు. ఎన్నియో శతాబ్దములయిన" దని చెప్పిరి. సాధారణముగ ద్రావిడులు ఇతరులయుత్కర్షను దాము స్వయముగ నంగీకరింపరు. సమీపమునందున్న ఆంధ్రుల శ్రేష్ఠత్వమును అసలే నోటితోఁ

జెప్పరు. ఇట్టి ద్రావిడబ్రాహ్మణసోదరులు తాము వేదవిద్యను ఆంధ్రబ్రాహ్మణులనుండి గ్రహించితిమనియు, తాము ద్రావిడబ్రాహ్మణు లయినను ఆంధ్రబ్రాహ్మణులనుండి అధ్యాపన మొనర్చితిమనియు, కావున ఆంధ్రపాఠమే తమసంప్రదాయమనియుఁ జెప్పఁదగినంత వేద విద్యాగౌరవమును ఏయాంధ్రబ్రాహ్మణశిఖామణులు పొందిరో అట్టి ఆంధ్రబ్రాహ్మణులలో నేఁటికాలమునందు సంప్రాప్తమగుచున్న వేద విద్యాక్షీణతకు వగచుచున్నాఁడను.

కృష్ణయజుర్వేదీయోపనిషత్తులు ౩౨:— కఠవల్లీ, తైత్తిరీయక, బ్రహ్మ, కైవల్య, శ్వేతాశ్వతర, గర్భ, నారాయణ, అమృతబిందు, అమృతనాథ, కాలాగ్నిరుద్ర, క్షురికా, సర్వసార, శుకరహస్య, తేజోబిందు, ధ్యానబిందు, బ్రహ్మవిద్యా, యోగతత్త్వ, దక్షిణామూర్తి, స్కంద, శారీరక, యోగశిఖా, ఏకాక్షర, అక్షి, అవధూత, కఠరుద్ర, హృదయ, యోగకుండలిని, పంచబ్రహ్మ, ప్రాణాగ్నిహోత్ర, వరాహ, కలిసంతరణ, సరస్వతీ రహస్యములను ౩౨ ఉపనిషత్తులు.

కృష్ణయజుర్వేదమునకుసంబంధించిన ఇతర సంహితలు:— ౧. కాఠకసంహిత, ౨. మైత్రాయణీసంహిత, 3. కపిష్ఠలకఠసంహిత; ఇవి కృష్ణయజుర్వేదమునకు చేరినవియే. కాఠకశాఖీయులు మధ్యదేశమునందును, మైత్రాయణీశాఖీయులు బరోడాదేశమునందును, కపిష్ఠల కఠశాఖీయులు కాశ్మీర, పంజాబుదేశములందును గలరు.

శుక్లయజుర్వేదము

ఈ వేదమునకు వాజసనేయసంహితయనియు నామాంతరము గలదు. వాజసనియను మహర్షి యాజ్ఞవల్క్యమహర్షి యొక్క తండ్రి. వాజసని యొక్క పుత్త్రుఁడు వాజసనేయుఁడు. అతనిచేత ప్రచారమునకుఁ దేఁబడిన సంహిత గావున వాజసనేయసంహిత యనిపేరు.

శుక్లయజుర్వేదశాఖలు ౧౫లో కాణ్వశాఖ, మాధ్యందిన శాఖయను రెండుశాఖలుమాత్రమిప్పుడు ప్రచారములో నున్నవి. ఆంధ్రదేశమునందు గల ప్రథమశాఖీయ బ్రాహ్మణులందఱు ప్రాయికముగఁ గాణ్వశాఖీయులు. మహారాష్ట్ర, వంగ, గౌడ, ఘూర్జరాదిదేశములందుగల శుక్లయజుర్వేదబ్రాహ్మణులు మాధ్యందినీయశాఖీయులు. మైత్రాయణీయశాఖ కృష్ణయజుర్వేదమునకుఁ జేరినది గాదనియు శుక్లయజుర్వేదమునకుఁ జేరినదనియుఁ గొందఱి తలంపు.

బ్రాహ్మణములు;— ఈ శుక్లయజుర్వేదమునకు శతపథబ్రాహ్మణమనుపేర విపులమయిన బ్రాహ్మణగ్రంథము గలదు. కాణ్వమాధ్యందినశాఖలకు రెంటికిని ఎక్కువగా భేదమెటుల లేదో అట్లే ఈకాణ్వమాధ్యందిన శాఖలకు సంబంధించిన శతపథబ్రాహ్మణమునకున్నూ ఎక్కువగా భేదములేదు. కాని కాణ్వశాఖీయులు ౧౭, కాండలుగను, ౧౦౪ అధ్యాయములుగను, ౪౪౬ బ్రాహ్మణములుగను, ౫౮౬౬. కండికలుగను;

మాధ్యందిన శాఖీయులు, ౧౪ కాండలుగను, ౧౦౦ అధ్యాయములుగను, (లేక

౬౭ ప్రపాఠకములుగను), ౪౩౮ బ్రాహ్మణ ములుగను ౭౬౨౪ కండికలుగను, విభజించిరి.

సుప్రసిద్ధమగు బృహదారణ్యా కోపని షత్తు శతపథబ్రాహ్మణాంతర్గతమే.

శుక్లయజుర్వేదీయోపనిషత్తులు ౧౯;— ఈశావాస్య, బృహదారణ్యక, జాబాల, హంస, పరమహంస, సుబాల, మంత్రికా, నిరాలంబ, త్రిశిఖబ్రాహ్మణ, మండలబ్రాహ్మ ణ, అద్వయతారక, పైంగల, భిక్షు, తురీ యాతీత, అధ్యాత్మ, తారసార, యాజ్ఞ వల్క్య, శాట్యాయని, ముక్తికము లనునవి.

సామవేదము

సామవేదమునకు ౧౦౦౦ శాఖలుగలవని చరణవ్యూహాదిగ్రంథములందుఁ గలదు గాని ఇపుడు మాత్రము ౧. రాణాయనిశాఖ, ౨. కౌథుమశాఖ, 3. జైమినీయశాఖ, యని మూఁడుశాఖలు మాత్రము నిలిచియున్నవి.

మనదేశమందును మహారాష్ట్రదేశమం దును గలసామవేదీయులు రాణాయనిశాఖకుఁ జెందినవారలు.

గుజరాతుదేశమునందుఁ గౌథుమశాఖీయు లున్నారు.

కేరళ కర్ణాటదేశములందు జైమినిశా ఖీయు లున్నారు.

ఆర్చికమనియు, ఉత్తరార్చికమనియు నీ సంహిత రెండుభాగములుగా విభజింపఁబడి యున్నది. ప్రథమభాగమునందు ౬ ప్రపాఠక ములు గలవు. ఒక్కొక్క ప్రపాఠకమున ౧౦ దశకములుగలవు. ద్వితీయభాగమునందు ౯ ప్రపాఠకములు గలవు.

ఇదిగాక, ౧. గ్రామగేయమానము ౧౭ ప్రపాఠకములు, ౨. అరణ్యగానము ౬ ప్రపాఠ కములు, 3. ఊహగానము ౨3 ప్రపాఠకము లు, ౪. ఊహ్యగానము ౬ ప్రపాఠకములు అని సామవేదమునకుఁ జేరినవిగాన భాగములు నాలుగు గలవు.

సామవేదమునందుఁ బ్రథమభాగమున ౫౮౪ మంత్రములును, ద్వితీయభాగమున ౧౨౨౫ మంత్రములును గలవు.

సామవేదీయ బ్రాహ్మణములు:—తాం డ్యబ్రాహ్మణము షడ్వింశబ్రాహ్మణము వంశ బ్రాహ్మణము, అద్భుతబ్రాహ్మణము అని నాల్గు విధములు.

ఆరణ్యకము:—సామవేదము యొక్క ఆరణ్యకభాగము ఇతరవేదములయొక్క ఆర ణ్యకభాగమువలెఁగాక "ఆరణ్యకసంహిత" యనుపేరఁ బఱగుచున్నది.

సామవేదీయోపనిషత్తులు ౧౬:— కేన, ఛాందోగ్య, ఆరుణి, మైత్రాయణి, మైత్రేయి, వజ్రసూచికా, యోగచూడామణి, వాసుదేవ, మహత్, సన్న్యాస, అవ్యక్త, కుండికా, సావిత్రీ, రుద్రాక్ష, జాబాల, దర్శన, జాబాలిను లనునవి.

అథర్వవేదము

ఈవేదమునకు ౯ శాఖలుగలవని చరణవ్యూ హాది గ్రంథములందుఁ గలదు గాని ఒకశాఖ మాత్రమే యిప్పుడు లభించుచున్నది. ఇప్పుడు లభించెడి యీ అథర్వవేదశాఖ ౨౦ కాండలు గలిగియున్నది.

బ్రాహ్మణము:—గోపథ బ్రాహ్మణము అథర్వవేదమునకుఁ జేరినది. పూర్వఖండము

నందు ౫ ప్రపాఠకములును, ఉత్తరఖండము నందు ౬ ప్రపాఠకములును గలవు.

ఆరణ్యకము:—అథర్వవేదమునకు ఆరణ్యకమను పేరుతోఁ బ్రత్యేకగ్రంథము లేదు.

అథర్వవేదీయోపనిషత్తులు ౩౧ :— ప్రశ్న, ముండక, మాండూక్య, అథర్వశిరః, అథర్వశిఖా, బృహజ్జాబాల, నృసింహతాపినీ, నారదపరివ్రాజక, సీతా, శరభ, మహానారాయణ, రామరహస్య, రామతాపినీ, శాండిల్య, పరమహంసపరివ్రాజక, అన్నపూర్ణా, సూర్య, ఆత్మ, పాశుపత, పరబ్రహ్మ, త్రిపురాతపన, దేవీ, భావనా, భస్మజాబాల, గణపతి, మహావాక్య, గోపాలతపన, కృష్ణ, హయగ్రీవ, దత్తాత్రేయ, గారుడము లనునవి.

పదక్రమపాఠాదికము

ఋగ్యజుస్సామాథర్వ వేదములయర్థనిర్ణయార్థము శిక్షాదిషడంగము లేర్పడినవని యిదివఱకుఁ జెప్పియుంటిని. స్వరాక్షరపదవ్యత్యాస మిసుమంతయైనను, దానివలన వేదార్థము విపరీతమయి యజమానునకుఁ గీడుకలుగునని ప్రత్యక్షముగ వేదమునందే చెప్పియుండుటచేత అట్టివైపరీత్యము కలుగకుండుటకయి పద, క్రమ, జటా, ఘనసంహితలు కూడ ప్రతివేదమునకు మహర్షు లేర్పఱిచిరి.

తత్కర్తలు:—ఋగ్వేదమునకు: పదపాఠమును శాకల్యుఁడును, క్రమపాఠమును బాభ్రవ్యుఁడును;

యజుర్వేదమునకు:— పదపాఠమును ఆత్రేయుడును, క్రమపాఠమును హయగ్రీవుఁడును;

సామవేదమునకు:—పదపాఠమును గార్గ్యుఁడును, క్రమపాఠమును గాలవుఁడును;

అథర్వవేదమునకు :—పదపాఠమును క్రమపాఠమును బ్రహ్మదత్తుఁడును రచించిరి.

జ్ఞాపిక:—విషయ మపారమగుటచేతను, ఎంత సంగ్రహించి వ్రాసినను గ్రంథము ఇప్పటికే విస్తారమగుటచేతను ఆవశ్యకములగు విషయము లెన్నియో వదలవలసివచ్చినది.



నండూరి వెంకటసుబ్బారావు బి. యే., గారి

# 'యెఱ్ఱి నా యెంకి'

పాకలూరి లక్ష్మీనారాయణ గారు

భారతి ౧-వ సంపుటము. ౪-వ సంచిక.

"యెనక జల్మములోన-యెవరమో" నంటి
సిగ్గొచ్చి నవ్వింది-సిలక-నాయెంకి.
"ముందు మన కేజల్మ-ముందోలె" యంటి
తెల్ల తెల బోయింది-పిల్ల-నాయెంకి.
"యెన్నాళ్లు మనకోలె యీసుకమూ" లంటి;
కంట నీరెట్టింది జంట-నాయెంకి."

భాషాభిమానులారా ! కవితల్లజులారా !

లోకము స్వాతంత్ర్యవాయుపూరిత మై యొప్పారుచున్నది. స్వీయభావంబులే పరమ ప్రామాణ్యము లగుచున్నవి. ఈపరిణామ మాంధ్రకవితామతల్లికిని సంభవించినది. ఆయమ యెత్తువారిచేతిబిడ్డ యయ్యె. ఇక్కాలంబున కవన మల్లలేని వారరుదు. ఏదియో కొంచెము భావమున్నఁ జాలును. ఛందోనియమంబులఁ గాని పదసాధ్వమునుగాని భాషాసాహిత్యమును గాని పూర్వకవిప్రయోగంబులం గాని సరకుసేయ నక్కఱలేదు. అలంకారములఁ దలఁపఁబనిలేదు. నిజముగ నక్కఱలేదా?. కావలెనని శాసించువారు లేరు. ఏపలుకులు పలికిన 'వేమన చెప్పినదే వేద' మన్న తెఱంగున నెవ్వరేరీతి చెప్పినఁ జాలమంది తాటస్థ్యమును వహించుచున్నారు. కొందఱు సుప్రసిద్ధవిమర్శకులదృష్టి కూడ నీ విషయముపై మరలకుండుట కేమి కతము ?

ఇట్టి కవికల్పనలు ప్రస్తుతాంధ్ర సారస్వతమునందు పెక్కులఁ గాన్పించుచున్నవి. చిత్రచిత్రరీతులఁ గవితావధూటి నాట్యము సేయుచున్నది. ఛందస్సు సున్న. ఉన్నచో స్వాంతము.

"యెఱ్ఱినాయెంకి" యందలి భావము నెవ్వరికిని వివరింపఁబనిలేదు. కొదువవిష యంబులం దీయది కవన మనిపించుకొనఁజాలదు. ఈఖండకావ్యకర్తగారే యిట్టివానిచే నిదివరకే భారతి నలంకరించిరి. కవిగారు యెఱ్ఱి నాయెంకిని, యెంకి భారతిని, విడువఁజాలకున్నారుకాఁబోలు! ఇట్టి కవితలు వాఙ్మయము న కనర్థకములు గావా! తారాశశాంకవిజయాది ఆంధ్రశృంగారప్రబంధములు మచ్చునకైన లేకుండ మంటఁబెట్టవలె నన్న విమర్శకు లీ యెఱ్ఱిశృంగారరసప్రధానఖండ కావ్యంబులందలఁపరేలొకో? ఈరసప్రదర్శనమునకుఁ జిత్రపటముల సహాయముకూడ కావలెనా? ముందువెనుకల నక్షర సంకేతములు గల విద్వాంసులును సాహితీవిశారదులు నిట్టి కవనంబులు భాషాయోషామణి కలంకారంబులని రచియించుచున్నారా? అబ్బబ్బా ! కొన్నికవనంబులు వమనంబులఁ దెచ్చుచున్నవిగదా?

కాలక్రమంబునఁ బత్రికాసంఖ్య అభివృద్ధి నొందుచున్నందులకును వాఙ్మయము దశదిశల వ్యాపించుచున్నందులకును సంతసించువారిలో నే నొకఁడను. అయభివృద్ధి యొక్కొక్కయెడఁ గ్రమవిరుద్ధముగ నున్నదని సందియమునఁ గుందుచున్నాఁడ; ఏదైన నభివృద్ధియే యని నే నెంచఁజాల. ఈనావ్రాతలకు పెద్దలు కినియక సక్రమపద్ధతి నవలంబించి చిన్నలకు మార్గదర్శకులై యాంధ్రకవితామతల్లికి వన్నెవెట్టఁ బ్రార్థించుచున్నాను.

# ప్రాచీనార్యస్త్రీలు: భారతీయ నాగరికతయందు వారిస్థానము

దిగవల్లి వేంకటశివరావు గారు, బి. ఏ., బి. ఎల్.

వేలకొలది వత్సరములకుఁ బూర్వము, మన నాగరికత మహోన్నతదశయందుండిన కాలమున, ఆర్యావర్తమునఁ బురాణయుగమున స్త్రీలు చాల గౌరవ మందుచుండిరి. ఆకాలపు విధ్యుక్తధర్మములందును, ఆచార వ్యవహారములందును స్త్రీలు పాల్గొనుచుండిరి. యజ్ఞాదికములలో, క్రతువులలో వీరు నుచిత రీతిని పాల్గొనుచుండిరి. విద్యలందుఁ గళలందు వీరికిఁ బ్రావీణ్య ముండెను. ఆస్తియందు వీరికి దాయభాగపుహక్కు లుండినవి. మనము మహమ్మదీయాచారమునఁ జూచుఁగవిసెన లేకున్నను పాశ్చాత్యరీతిని స్త్రీపురుష భేదము గమనింపని యాచారమును లేదు. యుక్తసమయములందు స్త్రీలు పరులకుఁ గనఁబడుట తప్పుగఁ దలంపఁబడ లేదు. వేదములును బ్రాహ్మణములును ఆర్యుల యాచారవ్యవహారములను బాగుగఁ బ్రదర్శించుచున్నవి.

బృహదారణ్యకోపనిషత్తున, యాజ్ఞవల్క్యుఁడు వనముల కరుగునప్పుడు భార్యతోడి సంభాషణము కలదు.

యాజ్ఞ: మైత్రేయీ! నే నీగృహము విడిచి పోవుచున్నాను. దాయభాగమున నీకును గాత్యాయనికి నేదో విధమగు పరిష్కారము చేసిన మంచిదికదా!

మై: నాథా! ఈప్రపంచమున సమస్త సంపదలు నాకు లభించినను ముక్తి కలుగునా?

యా: కలుగదు. లోకమునందలి ధనవంతులజీవితమువలెనే నీజీవితము నగును. ధనమువలన ముక్తి చేకూరదు.

మై: ముక్తిలేనిధనము నాకేల? ముక్తి సాధనమును బోధింపుఁడని నాప్రార్థన.

యా: ప్రియురాలా! నీవు చాల మంచి మాటాడితివి. రమ్ము కూర్చుండుము. నీకు బోధించెదను

అని యామె కుపనిషద్ధర్మములను గూర్చి పరమాత్మనుగూర్చి యుపదేశించెను. ఆమెయు విద్వాంసురాలగుటవలన వానిని బాగుగ గ్రహించి లోకమునందలి సంపదలన్నిటికన్నను విలువగఁ జూచికొనినది. ఈ గ్రంథమునందే, విదేహరాజగు జనకుని కొలువుకూటమున జరిగినసంగతి యొకటి వర్ణింపఁబడినది. ఆప్రభుఁ డశ్వమేధమునకు వచ్చిన బ్రాహ్మణులనెల్ల సత్కరించి కురుపాంచాలద్విజులందెవ్వరు ఘనులో యని తెలియఁగోరి, సభయందు వేయిగోవులను, పదివేల బంగరునాణెముల నుంచి, "ఓసద్బ్రాహ్మణులారా! మీలో విద్యాధికుఁడైన యాతఁడు వీనిని గ్రహింపవలె నని పలుకఁగా, నచ్చటివారిలో ముందు

నకు వచ్చి తీసికొన నెవ్వరును సాహసింపలేక యుండ యాజ్ఞవల్క్యుఁడు తనశిష్యుని జూచి వానిని బుచ్చుకొమ్మనెను. అంతట నచ్చటి వా రెల్లరు నాతనితో వాదమునకు వచ్చిరి. శాస్త్రపరీక్ష జరిగెను అశ్వహోత్రి, జరత్కారార్థభాగుఁడు, బుజ్యులాహ్వాయనుఁడు, ఉషస్థచాక్రాయనుఁడు. కహోల కౌషీతకేయుఁడు, ఆరుణి, ఉద్దాలకుఁడు మున్నగుమహావిద్వాంసుల ప్రశ్నములకు యాజ్ఞవల్క్యుఁడు ప్రత్యుత్తరము లిచ్చెను. వారు నిరుత్తరులైరి. అంత, నాసభయందు విద్యలందును ఆచారవ్యవహారజ్ఞానమునను ఎవరికిని దీసిపోవని స్త్రీరత్నము గార్గి వాచాహ్నవి లేచి నిలువఁబడినది. యాజ్ఞవల్క్యునివంకఁ దిరిగినది.

"యాజ్ఞవల్క్య మహాశయా! లెమ్ము విదేహకాశీరాజపుత్రమహావీరులవలె యుద్ధసన్నద్ధుఁడవు కమ్ము. ధనుస్సు లంఘించి రెండస్త్రములను సిద్ధపఱుపుము. నే నడుగఁబోవు రెండు ప్రశ్నములకును బత్యుత్తర మిమ్ము"* అనినది!! యాజ్ఞవల్క్యుఁడు ఆమెతో వాదించినాఁడు!!!

ఈ రెండుదాహరణములును మనప్రాచీనార్యస్త్రీల యౌన్నత్యమును దెలుపుచున్నవి. ఆకాలమున శ్రుతిస్మృతిసదాచారములందు స్త్రీలు పురుషులతోపాటు సహభాగినులై యుండిరి. ఆకాలపుస్త్రీలకు బాల్యవివాహములు లేవు. యుక్తవయస్సు వచ్చిన తరువాతనే పెండ్లి జరుగుచుండెను. వివాహమంత్రములెల్ల దీనిని బుజువుచేయుచున్నవి. పాణిగ్రహణకాలమున సంస్కృతమున వధూవరులకుఁ జెప్పఁబడుచున్న బుద్ధులు, భార్యాభర్తలు చేయువాగ్దానములు నేఁటి బొమ్మపెండిలులకు వర్తింపవు. పూర్వము స్త్రీలకుఁ బునర్వివాహము చేయునాచారము నుండినది. మాఱుమనువునకుఁ బోవుస్త్రీ పాటింపవలసిననియమములును గ్రంథములందు కనఁబడుచున్నవి. ఒకవర్ణపు విగతభర్తృక, ఇంకొకవర్ణపుఁబురుషుని వివాహమాడినట్లును తెలియుచున్నది. ఒకస్త్రీకిఁ బదుంగురు పూర్వపు భర్త లుండినను, ఆమె యొకబ్రాహ్మణుని బెండ్లియాడెనేని, ఇతఁడే, ఆమెకు సరియగు భర్త యగునని అథర్వవేదమున నున్నట్లును తెలియుచున్నది. అందువలన నాకాలమున నిప్పటివలె ఆచారవ్యవహారములు వర్ణాశ్రమధర్మములు నుక్కుపంజరమునందువలె బిగియింపఁబడి యుండలేదని స్పష్టపడుచున్నది. ఇప్పటివలెనే ఆకాలమునను, ఒక పురుషుఁడు పెక్కురుస్త్రీలను బెండ్లాడవచ్చును కాని ఒక స్త్రీకిఁ బెక్కురుభర్త లుండరాదని ఐతరేయ బ్రాహ్మణమునఁ గలదు.

II

భరతఖండమున నాకాలమునఁ బాతివ్రత్య మొకగొప్పసుగుణము. అది లేనిస్త్రీలరుదు. వ్యభిచారము మహాదోషముగఁ బాపముగఁ బరిగణింపఁబడుచుండెను. యజ్ఞములందు, పుణ్యసమయములందు స్త్రీలుచేసినపాపములు బయల్పరుపఁబడుచుండినటులఁ దెలియుచున్నది. శతపథ బ్రాహ్మణము యజ్ఞము చేయునాయనభార్య చేసినపాప మొప్పుకొనుటావశ్యకమని నుడువుచున్నది.

* Early Hindu Civilization by R. C. Dutt.

భరతఖండమున పురాణయుగము ఆర్య నాగరకత వర్ధిల్లిన కాలము. రామాయణపు స్త్రీలు, ఆర్యనాగరకత మహోన్నతస్థితియం దుండిన కాలపు భారతీయస్త్రీలని చెప్పవచ్చును. "రామాయణము ఆదర్శప్రాయమగు సంఘమును జిత్రించుచున్నదని చెప్పినవారు సత్యమునే పలికిరి. అయిన నిందువలన నిది కేవలము కవికల్పన మని యెంచుట పొరబాటు. నిజమగు సంఘము నాదర్శప్రాయమగుట తటస్థించునను సంగతి మఱువరాదు." అని అరవింద ఘోషుగారు వ్రాసినారు. ఇది రామాయణపుస్త్రీలను గూర్చియు నిజమే. మంచివారైనను, చెడ్డవారైనను, రామాయణపుస్త్రీలు మానవాదర్శలను సహజముగఁ బ్రదర్శించుచున్నారు.

రామాయణమున అంతఃపుర కాంతలలో శ్రీరాముని తల్లులు, సీతాదేవియు ముఖ్యులు. పురస్త్రీలు, మునిపత్నులు, నింక నితరస్త్రీలును గలరు. వీరుగాక, మానవస్త్రీలుకాని వారుగ వర్ణింపఁబడిన వనవాసినులగు వానరకాంతలును, లంకాద్వీపవాసినులగు రాక్షసస్త్రీలును, కనఁబడుచున్నారు.

అయోధ్యానగరము సుందరమగుపురము. అచ్చట

"జననియు జనకుఁడు పధువులుఁ
దనయులు దనయలును గృహిణి దానును నతిథుల్
దనివిగ నిండక యుండెడి
మనికి యొకండైన లేదు మందునకైనన్." *

అయోధ్యానగరవాసు లెల్లరు సత్స్వభావులే. అందఱును ధర్మశీలనిరతులే.

"సాగయించు చొక్కఁదనముం
జిగిబిగులును లేని వారు క్షితిపతిభక్తిన్
దగులనివారలు లేరట
మగలందును మగువలందు మాటకునైనన్"!

అచ్చట నాల్గుకులములవారును దమతమ వృత్తులందుఁ బరమవ్రతులై మెలఁగుచుండిరి.

దశరథమహారాజుభార్యలు జలజాక్షుని సతులఁబోలు చంద్రనిభాస్యలు, రాచనగరున సుఖముగ విభవము లందుచుండిరి. రాజు అశ్వమేధము చేసినప్పుడు వీరును దీక్షాయుతలై యుండిరి. ఆ క్రతువునందుఁ గౌసల్యాదేవికి బ్రథానస్థాన ముండినది.

శ్రీరామునిగృహమునఁ బరిచారికలెల్ల పరమనారులే. వీ రెల్ల రుత్తమకులసంజాతలుగ, వర్ణింపఁబడినారు. నలుగిడునట్టివారు, అలంకరించునట్టివారు, వింజామరలు వేయువారు, ఇతరములగుపనులు చేయువారును బరమనారులుగనే పేర్కొనఁబడినారు. మంథర యొకరుకమాత్రము సాధారణస్త్రీ. కైకేయిపుట్టినింటనుండి చేరనస్త్రీ. రామునిపట్టాభిషేకము వలనఁ గైకేయికిఁ గలుగఁబోవు హీనదశకన్నఁ దనకుఁ గలుగఁబోవుస్థితికే మంథర పరితపించుచున్నట్టు లామె పల్కులవలననే తెలియుచున్నది.

ఆకాలమునాఁటిస్త్రీ లెల్లరును నాగరకులుగ విద్యావతులుగ, కనఁబడుచున్నారు. ఇహపరసుఖములకుఁ గావలసినజ్ఞానము వారికుండెను. అయోధ్యలో నేమి, అడవులలో నేమి అప్పటిజీవనము కాపురములు బాగు

* ఇందలి పద్యములు ఆంధ్రవాల్మీకిరామాయణములోనివి.

గనే యుండెను. అతిథిసత్కారము, మర్యాద, పనిపాటులు, స్త్రీలు బాగుగఁ జేసెడువారు. వారికి మంచిజ్ఞానము, వైరాగ్యము నుండెను. వేదాంతము, శాస్త్రములును దెలియును. సీతాదేవికి సంస్కృతమున బాగుగఁ బాండిత్య ముండినట్టు లామెసంభాషణమువలన నెఱుఁగ వచ్చును. ఆమె కనేకశాస్త్రములు వచ్చును. ఆయుధముల యుపయోగము, అస్త్రముల ప్రయోగము, ఉపసంహారమును వచ్చును. కైకేయి తనమగనితో రణరంగముననుండి సారథ్య మొనరించినట్లును స్పష్టపడుచున్నది. వాలిభార్య తారకు నౌత్పాతికశాస్త్రము తెలియును.

ఆకాలపుస్త్రీలకుఁ గళలందుఁ బ్రావీణ్యముం డెను సంగీతసాహిత్యములందు నిపుణత యుండెను. కుశనాభునిపుత్రికలఁ జూడుఁడు. భూష లకెంపుల తళతళలతోఁ జేతుల వీణె లూని పాడుచు విహరించుచున్నా రీనాగరికయువతులు!

"చేతుల వీణె లూని తమిచేఁతలఁ జేలము లుల్లసిల్ల వ
ర్ణాతటిదుత్కరంబు లనఁ జారుశరీరములొప్పుమండఁగే
శీతలతత్పరత్వమున లీలల బాళిని బాడుచు న్వనీ
జ్యాతలమంను వెల్గిరి ఘనాంతరతారలచందమొందఁగ౯"

ఆకాలపు స్త్రీలలోఁ గొంచెము 'ఘోషా' పద్ధతి యుండెను. అంతఃపురస్త్రీలు వెలికి రాఁగూడదనునియమమయోధ్యాపురినేకాదు, లంకాపురియందుఁగూడ నుండెను. రావణుని భార్యలు ముసుఁగులులేకనే ఆతఁడు మరణించి పడియున్న ప్రదేశమునకు వచ్చినప్పుడు మండోదరీవిలాపమువలన నిది తెలిసికొనుచున్నాము. తాను పాదచారిణియై వచ్చుటే యాశ్చర్యమనియు నామె చెప్పుచున్నది.

అయినను, స్త్రీలు పురుషులతో విహరించుపద్ధతి మానవులందును రాక్షసులందు నుండినది. స్త్రీలు పురుషులతో విమానము లందును విహరించుచుండిరి. విమానమున శ్రీరామునితో సీతాదేవి యయోధ్య కేఁగినచో రావణేశ్వరునితో మండోదరి కుబేరవనములందు విహరించినది. ఇట్టిసమయములందు స్త్రీలు కనఁబడఁగూడదను నియమము లేదు. ఈసంగతి శ్రీరాముఁడే చెప్పుచున్నాఁడు.

"సమరంబుల వ్యసనములఁ
డమరముల స్వయంవరంబుల౯ బెండ్లియెడ౯
సుమతీ! యజ్ఞములందుం
గమలాక్షులదర్శనం బకార్యం బగునే!"

అని విభీషణునితోఁ బలికినాఁడు. మఱియు;

"చెలువలఁ గావఁగ చేలములు, ప్రహరులు
ఆలయజాలములును తెఱలును"

చాలవనియు "శీలమే సంరక్షక" మనియు శ్రీరాముని యభిప్రాయము.

భారతీయయువతుల కాదర్శప్రాయయగు ననసూయను సీతాదేవి దర్శించినది. అత్రిమహాముని యాశ్రమము మిక్కిలి సుందరమైనది. దానికి అనసూయాదేవిగుణసౌందర్యమువన్నె పెట్టినది. ఆమెవలన సీతాదేవి అనేకవిషయములు నేర్చికొనినది ఆసందర్భమున సీతాదేవి సావిత్రీసతినిగూర్చియు రోహిణీదేవిని గూర్చియుఁ బ్రశంసించినది. వీరప్పటికే మన ఆర్యావర్తమున ఉత్తమాదర్శప్రాయలుగ నుండిరి. సీతాదేవి యితరఋషిపత్నుల ననేకులను దర్శించినది. వారినిరాడంబరజీవనము,పతిభక్తి,

ఆశ్రమమృగములందలి ప్రేమము, అతిథిసత్కారము ప్రశంసనీయములు.

రామాయణమునందు నితరపురాణములందువలెనే దేవవేశ్యలగు రంభమున్నగువారినిగూర్చియు నప్సరసలనుగూర్చియు వినుచున్నాము. రంభ విశ్వామిత్రునితపముఁ జెఱుపఁబోయి శపింపఁబడుటయు, ఋశ్యశృంగుని వేశ్యలు వంచించుటయుఁ జదువుచున్నాము. కులస్త్రీయగు నహల్య చేసినపాపము దానిఫలితమును దెలిసికొనుచున్నాము. అందువలన స్త్రీలలో నుత్కృష్టముకాని జీవనము నుండెనని గ్రహింపఁగలుగుచున్నాము.

స్త్రీలలో యోగినులు, విరాగులు నుండిరా యని యోజింప నొకభక్తురాలు రామాయణమునఁ గనబడుచున్నది. కేవలము భక్తిచేతనే ముక్తినంది జన్మసాఫల్యము పొందినశబరి మాతంగాశ్రమమున ప్రతివస్తువును భగవంతునిగనే తలంచి పూజించినది. రామునిగూర్చి వినినది. చూచినది. తరించినది.

అమానుషస్త్రీలుగ వర్ణింపఁబడినవారిలో వానరస్త్రీలు ముఖ్యులు. అయినను వీరియందు మానుషేతరగుణములు కనఁబడుటలేదు. సుగ్రీవునిగూర్చి కిష్కింధనుగూర్చి మనము చదువునప్పుడు, వాలిభార్య తారను చూచుచున్నాము. ఈమె చాల నందకత్తె; గుణవంతురాలు. వాలి కామెయందుఁ బ్రేమమును గౌరవము నుండినవి. వాలి యామెను "మేధోదార, నీతికళాధార" మున్నగు ఉత్తమవిశేషణములచే సంబోధించుచున్నాఁడు. తార చాల తెలివి కలట్టిది. శ్రీరాముని మహిమ నొక్క త్రుటిలో గ్రహించినది. వాలి కెన్నోబుద్ధులు చెప్పినది. కాని లాభములేకపోయినది. తుద కామె దుఃఖించుచు వెనుదిరిగిపోయినది. వాలికై పరితపించి ప్రాయోపవేశము చేయుటకుఁగూడఁ బ్రయత్నించినది. తారయొక్క సుగుణములను గ్రహించి యామెను శ్రీరాముఁడే స్వయముగ వచ్చి యూఱడించినాఁడు. తారయు తక్కినవానరస్త్రీలును సీతాదేవి యనురాగమునకుఁ బాత్రలై ధన్యలైరి. ఆమె యయోధ్యానగరమునకుఁ బోవునప్పుడు వారినిగూడ రమ్మని యాహ్వానించెను. వీరెల్లరు సంతసించి ఉత్సాహముతోఁ బేరంటమునకుఁ బోవుమనస్త్రీలవలెనే పయనమైరి.

రామాయణపు స్త్రీలలో రాక్షసవనితలను గూర్చి మనలోఁ గొందఱికి మంచి యభిప్రాయములేదు. రావణుని పదితలలును కుంభకర్ణునివికృతాకారమును మనమనసు విఱచినవి. వారెల్లరు గుణములవలన వికృతులును రాక్షసులు నైరి. కాని రూపమునఁ గాదని భగవద్గీతవలన నెఱుఁగవచ్చును. ఇది బాగుగ జ్ఞాపకముంచుకొనినచో వాల్మీకిముని లంకాద్వీపవాసులనుగూర్చి వ్రాసినవ్రాతలను బాగుగ గ్రహింపఁ గలుగుదుము. వాల్మీకి ఆర్యుఁడు. ఆర్యుల యభిప్రాయములనే చాటుచున్నాఁడు.

(సశేషము)

## మధుకలశము



చ. కడ కొకసంజెచీఁకటిని గాంచనభాండము నంసభాగమం
దిడి మెలమెల్లఁ గాలిడియె సేకర నిగా మధుశాలవాకిటన్
బడఁతి యొకర్తె, యా కనకభాండరసాయన మెంతొ ప్రేమ యే
ర్పడఁ జవిఁజూడుమం చొసఁగె, ద్రావితినే మధువయ్యె నద్ధియున్.

ఎడ్మండ్ డూలక్ గారి చిత్రపటమునుండి పునర్ముద్రితము.

# మ ధు క ల శ ము

(ఉమర్ ఖాయయమున కనువాదము)

రాయప్రోలు సుబ్బారావు గారు

ఉ. ఒకదివసప్రదోషమున నోపికతోఁ గనిపట్టినాఁడ, శ
క్తికొలఁది నార్ద్రమృణ్మథనకృత్యము సల్పెడు కుంభకారునిన్
సకియరో! సన్నగిల్లి నవిషాదరుతిన్ బతిమాలె నా ఘటా
త్మకమగుప్రాణి "అన్న! దయ దాల్చి మెత్తఁగ నొత్తు" మం చొగిన్. ౩౮

చ. వృథఁ గథఁ జెప్పనేల కృశియించుచునున్నది యాయు వంచు నీ
మధుకలశమ్ము నింపుము సుమంగలి! పుట్టని రేపుకోసమై
శిథిలతఁ గన్ననిన్నకయి చింతలవంతల మున్గ నేటికో
మధురము లేని నేఁడు లనుమానము మాని సుఖింపు మర్థిమై. ౩౯

చ. ఒకనిముసానఁ బ్రాణికళ లూడ్చినమృత్యువు శూన్యవీథి వే
ఱొకనిముసానజీవన పయోదధియొడ్డున నిల్తు మద్దిరా!
సకి! కనుమాసెఁ దారకలు, సాగిరి యాత్రికులెల్ల శూన్యరూ
పకమగు దిఙ్ముఖోదయముపైఁ దమలక్ష్యము పెట్టి వేగమే. ౪౦

చ. ప్రమదరో! 'నేతినేతి' యని పారము గానఁగరాని యీవివా
దముల నలంగు టెందనుక! ధారలుధారలుగా స్రవించు ద్ర
వ్యముగల ద్రాక్షతోఁ బరవశాదరసౌఖ్యము మేలు గాదొ! శూ
న్యమొ అటుగాక చేఁదొ యగు అందనిపండులకంటె నెప్పుడున్. ౪౧

చ. సహృదయులార! యెన్నిదినసంబులనుండియొ చేయుచుంటి నా
గృహమునఁ గ్రొత్తపెండ్లి సవరింపగ యత్నము, లెట్టకేల కీ
విహసితశయ్యనుండి యెడవెట్టి పురాణవిరాగతత్త్వమున్
సహజమధుప్రియన్ బ్రణయశయ్యకుఁ దీయగ నామతించితిన్. ౪౨

ఉ. సూత్రపదప్రమాణములు సూపఁగఁజాలుదు, అస్తినాస్తివా
దత్రసరంబు లల్లఁగ, పదంపడి లౌకికపారలౌకిక
క్షేత్రవిచారనిర్ణయముఁ జేయఁగనోపుదుఁ, గాని యీసుధా
పాత్రమునందుఁ దక్కఁ గనుపట్టవు లోఁతు లిఁకెందుసృష్టిలోన్. ౪౩

చ. కడ కొకసందెచీఁకటిని గాంచనభాండము నంసభాగమం
దిడి మెలమెల్లఁ గాలిడియె నేకత మీమధుశాలవాకిటన్
బడఁతి యొకర్తె, యాకనకభాండరసాయన మెంతొ ప్రేమ యే
ర్పడఁ జవిఁజూడుమం చొసఁగె, త్రావితినే మధువయ్యె నద్దియున్. ౪౪

చ. పొరపున నెండ్రొరుల్ పడక పోరెడి 'డెబ్బదిరెండు' శాఖలున్
మఱలిచె నేకదిగ్గతికి మాఱునకుండ, నిమేషమాత్రలో
మెఱుఁగుపసిండియై పరిణమింపఁగఁ జేసెను లోకలోహ మ
బ్బురముగ నెచ్చెలీ! తలఁపనో మధుమంత్రమహారహస్యముల్. ౪౫

ఉ. ఆబలవన్మహామ్మదుజయప్రభుశేఖరుమంత్రఖడ్గధా
రాబహుళప్రభల్, హృదయరాజ్యము ముట్టడివెట్టు నాస్తిక
క్లీబవిచారతండము ఖలీభవమంద వెలుంగుఁ జూడు గా
రాబుచెలీ! దిగంతములు ప్రామినచీకటు లింక విచ్చెడిన్. ౪౬

చ. ఉఱివడనిమ్ము పండితుల నుగ్రవివాదల, నిల్వనిమ్ము నా
శిరసుననే విచిత్రమగుసృష్టివిచారమునెల్ల నోసఖీ!
పరిమళశయ్యపైఁ బ్రణయభాగవతంబులు నాడుకొంచు నీ
మురిపము సాగునన్నిదినముల్ సుఖియింపుము మోజు దీఱఁగన్. ౭౪

చ. బయలను, లోన, ప్రక్కలను బైనను గ్రిందను గూడఁ జూడ నం
తయు నొకయింద్రజాలమగు నాటక, మాడుదు రొక్క వేదిపైఁ
బ్రియముగ, కాగడాయగురవిన్ వలగొంచును నీడలట్టులెం
తయు నటు వచ్చిపోదురు సుతారపుబొమ్మలు శేల్పవల్ సఖీ! ౪౮

చ. సొనకుదరిన్ గులాబిసొగసుల్ మిగులన్ వికసించుచుండ నె
ఱ్ఱనిమధుధార లానుచుఁ గరంగుము ఖాయ్యముతోడ నీవు, న
ల్లనికలశంబుతో మరణలక్ష్మి నినున్ దరియంగ వచ్చె నే
ని నిలిచి జంకకుండఁ దరుణీ! గ్రుక్కొమ్మదియున్ బ్రియంబుగన్. ౬౪

చ. ఒకచదరంగపాళి యిది యుగ్మలి! రంగులగళ్లు శేల్పవల్
సకలజగజ్జనంబులను సారెలుగాఁ గొని కాలుఁ డాడు; పా
చికలును గొంతసే పసుఁగుఁజల్మి నటించి, యొకింతలోనిమాం
రకు లయి యీపలావలఁ బరస్పరమున్ దెగి పేటికం బడున్. ౫౦




# గానము

కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. విపంచ్యా గాయన్తీ వివిధ మపదానంపశుపతేః,
త్వ యారబ్ధే వక్తుం చలితశిరసా సాధువచనే,
తదీయై ర్మాధుర్యై రపలపితతంత్రీకలరవాం,
నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్.

గత సంచికలందు శ్రుతులకు వాది, సంవాది, వివాది, అనువాది, భేదములను, ప్రత్యేకనాదతరంగ ప్రమాణమును, తత్పరస్పర సంబంధపరిమాణమును, ఎట్టిప్రమాణముగల్గిన శ్రోత్రపేయముగ నుండునదియు, నెట్టివి తద్వ్యతిరిక్తము లగునట్టివియు, వీటిని కనుగొనుటకు పాశ్చాత్యాధునిక ప్రకృతిశాస్త్రజ్ఞులచే గనుపెట్టబడిన యంత్రాదివిశేషములు నిత్యాదు లుదాహరింపబడినవి. ఈ శాస్త్రమును గమనించుచు నీయంత్రముల సాయమున శ్రుతిప్రభేదముల నిరూపింప బూనుట, కవిత్వమందు గణముల గుణించుచు గురులఘువుల సమకూర్చి, పద్యాదిరచనము నుద్యమించుట వంటిదిసే యన దగును. ఈయంత్రసాయమునకన్న నానాదమునం గల శ్రుతులు శ్రోత్రపేయము లౌనా కాదా యనునది ఈశ్వరనిర్మిత మగు శ్రోత్రేంద్రియమే మిగుల సమర్థముగ నిరూపింపగలదు. ఈశ్రావ్యతానిరూపణము "లోకో భిన్నరుచి" యనునట్లొక్కొక్కరి కొక్కొక్కతీరున నుండుటయు గలదు. కాని సకల పశు పక్షి మృగాదులను, మానవులనుగూడ చలింపజేసి యానందమొసగగల్గు శ్రుతులుమాత్ర మన్నిటికిని సామాన్యమే. మూడుస్థాయిల నమరుషడ్జముల గలిపిన

"ఆత్మావై పుత్రనామాసి" యనునట్లు రూపాంతరములయ్యు, మూడును లీనమై యుండును; వీటితో పంచమమునుగూడ జేర్చిన లీనము కొంచెము భిన్నమైనను, శ్రావ్యత తగ్గక, లీనమై యున్నను మిశ్రరుచిని జనింపజేసి హాయిని పుట్టించును. అనఁగ నాదతరంగసంబంధ ప్రమాణము (Relative Proportion) శ్రుతులకు 5: 10: 20, నిట్లుండేనేని సంపూర్ణలీనమగును. అట్లుగాక, 12: 18: 24: 36 ఇట్లుండెనేని కొంచెము ప్రభేదమయ్యును శ్రావ్యతగ నుండును. మొదటిది స. స. స. యగును. రెండవది స. ప. స. ప. యగును. లీనభావమున ద్వితీయము కొంతవరకు తగ్గినను శ్రావ్యతకు లోటుండక, ద్వితీయస్థానమును బడయగలదు. పంచమస్థానమున మధ్యమమును జేర్చిన స.మ. స. మ. వీటికి నాదతరంగసంబంధ ప్రమాణము 12: 16: 24: 32. ఈప్రమాణము తృతీయ స్థాన మలంకరింపగలదు. ఈమూడు సమూహములందునను శ్రావ్యతావిషయము ప్రపంచమంతటను నిర్వివాదాంశము ; గాని పాశ్చాత్యులు వారిగానమున స. గ. ప. స అనగా 12: 15: 18: 24 ప్రమాణము గల్గినట్టివియు, రి. మ. ప. ని 27: 32: 36: 45 ప్రమాణము గల్గినట్టియు శ్రుతుల జేర్చి పట్టుచు వాద్యాదులందు ననుకరించుచున్నారు. ఇటుల ఋషభ, గాంధార, నిషాదములఁ జేర్చి పట్టుట మనదేశమున నాచారము లేమి యంతగ శ్రావ్యత యుండకపోవుటయే కాక వినుటకు కటువుగ గూడ నుండును. కాని వారిగానమున నిది ముఖ్యముగ పరిగణింపబడుచు వ్యవహరింపబడుచుండుటచే నిది వారికి మిగుల శ్రావ్యముగ నుండును. ఏతద్విషయమున మానవ శ్రోత్రేంద్రియములన్నియు నీశ్వరసృష్టములే అయినను, ఆయాదేశకాలపాత్రముల ననుసరించియో, శీతోష్ణపరిస్థితుల ననుసరించియో యీ ప్రభేదము జనించెను. ఇదియును గాక పాశ్చాత్యులు మనగానమును విని యామోదింప నశక్తులగుటకును, మనము వారిగానము సేవగించుటకును గల యనేక కారణములలో ముఖ్యమగునవి యిట నుదాహరింపబడును. ఐరోపియనులు నందున సీమిషనరీలు సామాన్యముగ మన దేశదురాచారైకాన్వేషణతత్పరులగుటచే వాటిని వెలిబుచ్చ నిచ్చగించుచుందురు. తత్కారణమున జనసామాన్యమునకు మనమతమందు దీర్ష్యను బుట్టించి వారిమతావలంబకు లగుట కవకాశము జనింపజేతురు. ఇయ్యది వారికి వృత్తి. దీనికై సామాన్యముగ గ్రామాదులలో గ్రామదేవతలకు జరుపబడు పూజలు జాతరలందును, పర్వదినములందు, సముద్ర, పుణ్యనదీ స్నానాది సమయములందును, వీరి యుపన్యాసాదికములు గాననగును. ఛాయాపటముల దీసి పైకి పంపి హిందువులు దేవతల నారాధించు విధ మిది యని వారి దేశమున వెల్లడిజేసి యచ్చట నుండువారికి, మనలను చూడకయే మన మనిన సేవగింపు జనింపజేయునట్లే, మనగానమును, దొమ్మరవాళ్లు, పాములవాళ్లు, మొదలగువా రుపయోగించు నాగస్వరము డోలు, పిల్లనగ్రోవి, తిరుపతియూరేగింపు, గ్రామదేవతాది కొలుపులు, మొదలగువాటియం దుపయుక్తము

లగు సన్నాయి, వీరణము, డప్పులు, బాకా, పంబలు, తాషాలు, కొమ్ములు, వీటికి ఛాయా యంత్రములపటములఁగూర్చియు, వస్తుప్రదర్శన శాలలం దుంచియు, మనగానసాధనము లివ్వి యనియు మనగానమనిన నచటివారికి హాస్యాస్పదమగునట్లొనర్చుటచే, ప్రథమదర్శనమే హాస్యాస్పదముగ నుండినపుడు వినినను నట్లే యుండుననుట నిర్వివాదాంశము. అథవా ఎవరైన నొక పాశ్చాత్యగాయకమహానుభావుడు మనగానశ్రవణార్థమున కిచటికి వచ్చి ఏపాశ్చాత్యునో సామాన్యముగ నాశ్రయించి వారి ద్వారా ఏదో గానమును వినియు, వానివలన సరియగుశాస్త్రసంబంధములగు విషయముల దెలియనేరక, కొన్నిటిని గ్రహించి - కూపస్థమండూకమువలె వీరిగాన మింతియె యని, బ్రహ్మాండముగ వ్యాసములను పుస్తకములను ప్రచురించి మనగానవిద్య యనిన వారిదేశమందు చులకన జేసి వారి కసహ్యము పుట్టింతురు. పరదేశీయు లగు పాశ్చాత్యులమాట నటుంచుడు. ఈనడుమ మన దేశముననే బంగాళీయులలో నొకరు చెన్నపురికి వచ్చి దాక్షిణాత్యగానశ్రవణమునకై యీదేశవాస్తవ్యులును తమ స్నేహితులును, దేశీయులు నగు నొకరి నాశ్రయించి వారిద్వారా నొక వేశ్యాంగనాగానమును విని చని వారియభిప్రాయమును దాక్షిణాత్యగానము విషయమున నేర్పఱుచుకొనిరని వినుట కెంతయు విచారమగుచున్నది. ఇట్లే ముఖ్యమగుశాస్త్రసమ్మతమగు గానము వారు (పాశ్చాత్యులు) వినదలచుకొనినను నది సందర్భింపక పోవుటయు ముఖ్యకారణములలో నొకటి. అదివరకే మనసు త్రిప్పబడియుండుటచే వీరిగానము వినునదియేమి, యను యహంభావము, వినుటనిన అవమానమని తలచుటయు గలదు. మరియు మనజంత్రములు నతిపురాతనములు పూర్వనిర్మితములు, వారికి నూతనము లగుటచే, వికృతములు దర్శనమాత్రమే హాస్యాస్పదము. గాయకుని యాకారము గూడ వారికట్లే యుండును. కాని యొకదానిని మాత్రము, మనగానమును కొంచెమోపికతో వినిన, వారు గమనింపకపోరు. అనేకులు పాశ్చాత్యు లిట్లే వగించుకొనినను "అబ్బా! నిమిషమున కెన్ని నాదములు (Sounds) పలికించుచున్నాడు? ఏమియు లిఖితపూర్వకమగు గాన మాతనిసమక్షమున లేనిదే ఎట్లింతసేపు గానము జేయగలుగుచున్నాడు?" అను విషయము లాయన నాశ్చర్యమ్మున ముంపక యుండవు. రెండవది వారిలో గానము నెంతవరకు ప్రథమ, ద్వితీయ కాలములలో విశేషముగ గలదు. కాని మనగానమునందు షట్కాలమువరకును మఱియు ప్రథమకాలమునకంటె నింక విళంబాతివిళంబముగ గానము చేయుటయు గలదు. జంత్రముల నెట్లున్నను గాత్రమునమాత్రము ప్రథమకాలమునవే వారికి బాడుట విశేషము. మన కుండు గమకప్రభేదములగూడ వారు గమనించుటరిది. పియానా, ఆర్గన్ ఇత్యాదికములందు గమకభేదములు దుస్సాధ్యము లగుటచేతను, వారిగానమున నివియే ప్రధానవాద్యము లౌటచేతను, నివి వారికి గానమున దుర్గ్రాహ్యము లగుచున్నవి. గాన మన గానము గమకభూయి

ష్ఠమగుటచే వారి కింపు జనింప నవకాశ మెుసఁగ దనునది మఱియొకయంశము. ఇదియును గాక మనగానమున నే రాగమున నాలాపించి కీర్తనాదుల గానము చేతుమో ఆరాగమున కు విధించియుండు స్వరముల దప్ప మిగిలిన స్వరముల నంటఁగూడదు. అంటిన దప్పు. ఇదియు వారికి గష్టము. ఇది పురుషునికి నేకపత్నీ వ్రతము, లేక సతికి పాతివ్రత్యము నంటిది. అన్యస్వర గ్రహణము శుద్ధరాగమునకు వ్యభిచారమువంటి దనదగును. కాని అన్యస్వర గ్రహణమున హిందుస్తాని మెుదలగు గానమునందు వలె. సౌఖ్యము గల దనిన నయ్యది వ్యభిచార మందలి సౌఖ్యము నామోదించిన ట్లగును. ఇది పాశ్చాత్యులకు గష్టము - అన్యస్వర స్వేచ్ఛా గ్రహణమే వారిముఖ్యాంశము గనుక మనశుద్ధ గానము వారికి వినుటకు భారమై వినుగుపుట్టించును. అనుకరించుట మాత్రము దుష్కరము. రాగమాలికాది గానమునను మన కొక్కటియే శ్రుతి స్థాయిగ నేర్పఱచుకొందుము. ఆశ్రుతిలోనే పాడుట వాడుక. హిందుస్థానీ గానమున మాత్రము ప్రతి పాటకును శ్రుతి కొందఱు మార్చికొనుటయు, నొక్క పాటలోనే షడ్జమ, మధ్యమ, శ్రుతుల బాడుటయు విని యున్నాము. పాశ్చాత్యగానమున నట్లుగాక నొక్కొక్కగీతమునందును ననేక శ్రుతులు వచ్చుచుండుటయు, గమనింపనగును. మనగానమున పెక్కురాగములు మిశ్రములైనగాని వారిగీతము ననుకరింప వీలులేదు. ఇది మనకు శాస్త్రవిరుద్ధమగుటచే వినుటకు కటువుగనుండును. మఱియొకవిశేషము: వారిగానమున స్వతంత్రించి పాడుట దుర్లభము. ఏలయన వారిగానమునకు స్వరలయాదికముల జూపుపత్రము వారియెదుట లేనిదే పాడుటయు, జంత్రముల వాయించుటయు వారికభ్యాసము లేదు. ఆలేఖనమును గమనింపుచు, తాళమును పరిగణించుకొనుచుండవలయును. ఈ తాళపరిగణనమునకై ప్రత్యేకమెుకరు వేత్రహస్తులై, వన్, టూ, త్రీ, ఫోర్, అనుచు నార్భాటము చేయుచుండుట ప్రతి బ్యాండువాద్యములందును గనుచున్నాము. మనలో నెంతమంది గానముఁ జేసినను నొక్కటే శ్రుతి - వారిలో నట్లు గాక యనేక శ్రుతులలో ననేకవాద్య ప్రభేదములందు గాన మనుకరింపబడును. ఇది వారి గానమునందు విశేషము. రెండుమూడే గాక రెండు మూడువందలుగూడ భిన్నవాద్యములందు గాన మేకకాలమున జరుపబడును. ఇంక నెన్నిటినైనను నాయాగాయకుని సమక్షమున నుండుపత్రమున లిఖించిన దాని ననుసరించి తనగీతాభాగమును తాను పాడుటయో వాయించుటయో యభ్యాసము. దీన ననేక భిన్నశ్రుతులు భిన్నవాద్యము లం దుద్భవిల్లి యనేకభిన్నరుచులు రసనమునకును భిన్నవర్ణముగల్గు పటము నేత్రములకును పలుజాతులు గలసినసుగంధము నాసికకునువలెనే శ్రోత్రేంద్రియమునకుగూడ నిట్టిది యానందదాయకమగును. దీని కలవడిన పాశ్చాత్యులు ఒక్కటే శ్రుతిలో నతిసరళముగ, మృదువుగ, నానందమెుసగుమనగానము వారిశ్రోత్రపుటముల జొరుట కిచ్చగింపరు. వారిగానమున

పియానా, ఆర్గన్, ఇత్యాదికములు, 70-80 వేలమంది పాడినను వారికంఠధ్వనులను మించి పాడగలవు. మన కట్లుగాక జంత్రములలో నతి ప్రాచీనమును ప్రాధాన్యమును నగు వీణ బహు కొలదిమందికి మాత్రమే విన నగును. వారి గానము మానవాదుల ప్రచలింపజేయు వీరరస ప్రధానము. మనది యటులగాక యతిమృదులమై, భక్తిరసప్రధానమై చిత్తైకాగ్రతకు నమూల్యసాధకమై సచ్చిదానందసంధాయక మగుచున్నదనుట నిర్వివాదాంశము. కావున నాయాదేశపుగానమును బట్టి యోచించిన నాదేశీయుల స్వభావాదుల గుర్తింప వీలగును. వారిదియుద్ధసన్నద్ధోద్రేకోద్బోధకమగుగానము "హింసాదూరు"ల మగుట హిందువుల మగు మనకును, మనస్వాదుశోల్పపేయ సచ్చిదానంద సాధకమగు గానామృతము వారికిని, నింపు జనింపదు సరిగదా మిందుమిక్కిలి శ్రుతికటువుగనుండి విసుగు జనించును. గాని నిక్కముగ విచారించిన అనుకరణవాద్య ప్రభేదములును ఆధునిక ప్రకృతిశాస్త్రము ననుసరించి నిర్మితములగు వాద్యప్రభేదజనితము లగు నద్భుత నాదతరంగ వైశాల్యము (intensity) గల శ్రుతులును వారిగానమునం గలుగు వైశేష్యము. ఇది మనగానమున లేనిది. అయినను నితరవిషయముల నీక్రింద నుదాహరింపబడిన విశేషములమాత్రము ప్రతివిభాగమును అగాధమైనను నడుగంట పరిశోధించి మహావిపులముగ నిరూపించి యున్నారు. వీని నంతయు నెక్కింత యోపికతో గమనించిన సకలవిద్యలకాలవాలమగు మనభరతఖండమునందున గానము మహావిద్యలలో నాదివిద్యయై ప్రస్తుత పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులచే కనుపెట్టబడిన దానికన్న నెక్కుడుగ శాస్త్రమునందు మన పూర్వు లుదాహరించి యుండుట గానసగును. మనశాస్త్రమునందు గమనింపదగినఅంశములు శ్రుతులు,వీటినిగురించిన విశేషములు, ఇవిఎట్లు జనించినది? వీటికిగలపరస్పరసంబంధములు, స్థాయిలు,స్వరములు ఇందు సుద్ధవికృతులు. వాది, వివాదీత్యాదిభేదములు గతసంకీలం దుదాహృతములే గనుక శేషించినగ్రామభేదములు, స్వరమూర్ఛనలు, గమక ప్రభేదములు, అలంకారములు, గీతములు, వర్ణవిభేదములు, రాగప్రస్తారాదివివరములు, సంపూర్ణ, షాడవ, ఔఢవాదికములు రాగాంగోపాంగ భాషాంగ క్రియాంగ, ఘన, నయ, దేశీయాదివిభేదములు, పదములు, చౌకవర్ణములు, కీర్తనములు, సూళాది, రాగమాలికాదులు, రసవిశేషములు రాగాలాపనము తానవిభేదములు తాళము, కాల, మార్గ, క్రియాది దశవిధ తాళాంగములు. అనంతరము గీతప్రబంధము, పల్లవి గానము చేయువిధము, రాగ-తాళ, మాలికాదివిశేషము లనేకములు మనశాస్త్రమున గలవు. ఇంకను నేదేశమునగాని కని విని ఎఱుగని అంశము లుదాహరింపబడియున్నవి. వీటినన్నిటి ననుసరించి గాయకు లనుసరింపవలసినవిధులు, జంత్రములందు, తత, సుషిర అవనద్ధాదికములగు వీణా వేణు మృదంగాదుల నిర్మాణవిధానములు, వీటియందు వర్జనీయములగు దోషాతిశయములు, ఇత్యాద్యనేకములు మహావిపులముగ వ్రాసియున్నారు.

ప్రత్యేక మొక్కొక్క విషయమునుగూర్చి సాధ్యమయినంతవరకు విపులముగ ముందు సంచికలయందు వ్రాయబడును. ఈ విధుల నన్నిటిని గమనించి గానము సేయుమహాను భావులు అరుదనుట నిస్సంశయము. అట్టివారు దర్శనీయులు. వందనీయులు. ఇట్టివిషయమున శ్రీ త్యాగరాజస్వామివారిట్లు నుడివియున్నారు.

మాయామాళవగౌళ-ఆదితాళము.

ప॥ విధులకు మ్రొక్కెద-సంగీతకోవిదులకు
అ॥ ముదమున శంకరకృతసామనిగమ
విధులకు నాదాత్మక సప్తస్వరవిధులకు
చ. కమల గౌరి విధి గరుడధ్వజ శివ నారదులు
అమరేశ భరత కాశ్యప చండీశాంజనేయ గుహ
గజముఖులు, సుమృకండుజ కుంభజ తుంబురు వర
సోమేశ్వర శార్ఙ్గదేవ నందీ, ప్రముఖు లగు త్యాగ
రాజవంద్యులకు బ్రహ్మానందసుఖాంబుధి మర్మవిదులకు.

---

# ఏది? ముద్దు

సాపినేని వేంకటేశ్వరరావు గారు

వలపు లొలికెడు మధుమాసవాసరమున
విరియఁబూచిన సహకారతరుప్రసీక
కోయిల గళంబుతో స్వరస్థాయిగలిపి
యెవరికై, యెంటి, పాడుచుంటివి? నెలంత!
సందెతెరచాటు మబ్బుల చాయనుండి
లేత చీకటి ముసుఁగు చలించిపోవ
తొంగిచూచు నిశాకుసుమాంగిఁజూచి
హిమకరుఁడు మెల్ల లేత ముద్దిడుచు నుండె,
గోవులను దోలికొనిపోవు గోపజనుల
మురళిరవముల చే, గగుర్పొడిచినట్టి
ప్రకృతికాంతను, శాంతియావనుఁడు చేరి
ప్రేమ దనివారఁ దొలిముద్దు బెట్టుచుండె.
కడుకొనెడు కూర్మిఁబడుచు జక్కవపులుఁగులు
కొసరి వెచ్చని తుదిముద్దు గొనుచునుండె.
నిర్మలతరంగిణీనటదూర్మికలను
ఎల్ల గాడుపుటలలు చుంబించుచుండె.
ఎదలు చలియింపఁగా, ఎలుగెత్తిపాడు
పికముచుఁగోయిల తీయనిపాటగూడ
తడిసి పద్మనైన నాపూవుఁబొడఁద సోకి
యంటియంటనిముద్దు లీయంగఁ దొడఁగె
పట్టుపరుపట్టు లొత్తుగాఁ బడినవిరుల
నతిమనోహర మానికుంజాంతరంబు ... ...
రేకు విడిపోయియున్న నాహృదయసుమము
నీసొగసు కేలనంటి మన్నింపవేల?
ఆశలు ఫలింప, నీయధరామృతంబు
త్రావనీవేల యొకమారు తనివిదీర?
అంటినను గందునీచెక్కుటద్దములను
ఏది? ప్రేయసి! ముద్దైన నిడఁగనిమ్ము.

# శ్రీశైలక్షేత్రము

మదరాసు దక్షిణఖండపు ఆర్ష విచారణశాఖవారి 1917-1918 సంవత్సరపు కార్యాని వేదికమునుండి యీ క్రింది చిత్రములును, వీని వివరణమును గైకొనబడినది.

చిత్రము ౧




ఏ. శ్రీశైల మల్లికార్జున దేవాలయము: ఇందు దేవాలయముయొక్క ఉత్తరద్వారము దూరమున గాన్పించుచున్నది. ముఖమంటపము యొక్కచదునగు పైభాగము నాలుగు మూలలను, ఆమంటపమును జేరియున్న యితర మంటపముల యొక్కపై భాగము నాలుగు మూలలను ఇటుకతోను సున్నముతోను నిర్మింపబడినవందులున్నవి; శిల్ప విధానమును బరిశీలింపగా నీమంటపములు పదునైదవశతాబ్దియందు నిర్మింపబడినవిగా దోచుచున్నది. మల్లికార్జునుని గర్భాలయమునకు దక్షిణమున నొకచిన్న యాలయ మున్నది. పరిమాణమున జిన్నదియైనను ఆకారమున మల్లికార్జునుని గర్భాలయము నెల్లవిధముల బోలియున్నది. గర్భాలయము నాకారము సమాధిని బోలియున్నది. హైందవప్రాచీన దేవాలయము లన్నియు ప్రాయికముగా నిట్లే యుండెడివి. ఈయాలయాంతర్భాంగ పరిమాణము ఎనిమిది అడుగులు నాలుగున్నర అంగుళములు నిడివి వెడలుపులును, ఏడు ఆడుగులు నాలుగంగుళములు ఎత్తును గలిగియున్నది. వాకిలి ఉత్తరపుదిక్కుననున్నది. దీనికి,దూర్పువైపునను నొకచిన్న ద్వారముగలదు. దేవాలయప్రాగ్భాగమున గాన్పించుచున్న మఱ్ఱిచెట్టు మొదటియొక్క చుట్టుకొలత నలువదినాలు గడుగులు. దానిచుట్టు నొకరాతితిన్నె కట్టబడియున్నది. ఆతిన్నెపై పెక్కునాగప్రతిమలు, వీరప్రతిమలు ప్రతిష్ఠింపబడినవి. గర్భాలయముయొక్క గోపురము, ఎదుటనున్న మంటపముల ముంజూరులు, దేవాలయమంటపాదులపైనున్న నందివిగ్రహములు మొదలయినవానిపై రాగిరేకులు తాపబడియున్నవి

చిత్రము ౯



శ్రీశైలమునందలి సహస్రలింగము: ఇరువదియైదు పక్షములుగ చెక్కబడిన నిలువురాతిపై పక్షమునకు నలువది లింగములవంతున వేయిలింగములు చెక్కబడియున్నవి. లింగము మొదట మూఁడుతలల నాగుబాము చుట్టుకొని యున్నట్లు చెక్కబడియున్నది. ఈలింగము సొగసైన రాతిపానవట్టముపై నున్నది.

చిత్రము ౬



* ఏ. దక్షిణామూర్తి విగ్రహముపై తాపబడియుండిన రాగిరేకునందలి చిత్రాకృతి. శ్రీశైలము;

ఇందు శివుఁడొక వటవృక్షముక్రింద కాలిపైగాలుంచి శిష్యులకు తత్త్వోపదేశము చేయుచున్నట్లున్నాఁడు. ఈవిగ్రహమునకు నాలుగుచేతులుగలవు. ముందరిచేతులు వరప్రదానము కావించుచున్నట్లు చూపబడినవి. వెనుకటి వానిలో కుడిచేత జపమాలికను, ఎడమచేత నగ్నికలశమును బట్టికొనియున్నట్లున్నది; దారుకామునుల హోమ కుండమునుండి జన్మించిన యపస్మారుడను ఘోరాకార రాక్షసుని, నెత్తిపై చేతులను జోడించుకొని మ్రొక్కు చున్నవానిని, దక్షిణామూర్తి తనవామపాదమున ద్రొక్కి పట్టియున్నాఁడు. జటామండలమును విరియబోసికొని మూర్తిదాల్చిన శాంతిరసమో యన్నట్లున్నాఁడు. ఈతని పాదములచెంత నొకఋషి యీతనితత్త్వోపదేశమును గ్రహించుచు గూర్చునియున్నాఁడు. ఈవిగ్రహము కన్నులయందు రత్నములు పొదిగియుండినట్లు చూపట్టుచున్నది. ఇప్పుడవి కానరావు. వానిని శ్రీశైలమందలి చెంచువారూడదీసికొనియుందురు. ఈ విగ్రహమునకు ధర్మ వ్యాఖ్యానమూర్తియను పేరును గలదు.



బీ. ఇందుపై భాగమునందలి విగ్రహము చంద్రశేఖరమూర్తి. దీనినే యాలింగనమూర్తియనియు నందురు. శివుడు పార్వతిని తన యెడమతొడపై నెక్కించుకొని సింహాసనము నధిష్ఠించి యున్నట్లు చెక్కఁబడియున్నది.

---

*పూర్వము శ్రీశైలమున వసించెడు చెంచువాండ్రు తమంతదామే శ్రీశైలమునకును, అచ్చటి దేవాలయాదుల కును రక్షకులుగనుండిరి. వారొకప్పుడు రోహిలులచే ధ్వంసము జేయబడనుండిన యాలయాదులను రక్షించిరట. కొన్ని యేండ్లు పూర్వము తమ రక్షణ పరిశ్రమమునకు ప్రతిఫలముగా విగ్రహములపై తాపియున్న ఇత్తడి రాగి బంగారు పూత రేకుల నూడదీసి ఆత్మకూరులో విక్రయించుకొని ఆద్రవ్యముతో జీవయాత్రచేయుచుండిరట. ౧౯౦౯ వ సం వత్సరమున దేవాలయము యొక్క విచారణకర్త అప్పటికి మిగిలియున్న రేకుల నూడదీయించి కర్నూలులో బహి రంగముగ ఏలముపేయించెను. అప్పుడు వానిని ప్రభుత్వమువారు తమవశముచేసికొనిరి. అట్టివి చెన్నపురి రాజకీయవస్తు ప్రదర్శనశాల (మ్యూజియము)యందు 2 ఉన్నవి. అందలివే ఒక చిత్రమున చూపబడిన నాల్గు వెవ్వేఱుచిత్రములు.

క్రిందివానిలో కుడిచేయి వరము నిచ్చునట్టులున్నది. ఎడమచేయి గౌరిని జుట్టియున్నది. పైవానిలో కుడిచేయి డమరుకమును, ఎడమచేయి లేడిని పట్టుకొని యున్నట్లున్నవి. సింహాసనముసమీపమున శివుని వాహనము నంది యున్నది. ఈవిగ్రహమున కిరుప్రక్కల నొకవంక మద్దెల వాయించుచున్నట్లును వేఱొకవంక గంగ్రడగొడ్డలిని ధరించినట్లును నున్న విచిత్రాకృతులగు విగ్రహములు రెండు చెక్కబడియున్నవి. ఈచిత్రము పైభాగమున నొకమూల నర్థచంద్రబింబమును; ఇంకొకమూల సూర్యబింబమును జెక్కబడియున్నవి. ఇంవలి శిల్పముయొక్క తీరుచూడ నిది తొలుత నేదే నొకద్వారబంధనము పైభాగమున నమర్పబడియుండినదిగా బొడకట్టుచున్నది.

క్రింద కుడివైపున నెమలితోకవలెనున్న నథఃకాయముగల యొక స్త్రీవిగ్రహము చెక్కబడియున్నది. ఈపె యొకకిన్నరి. వీణవాయించుచున్నది. ఎడమవైపున నొకఋషి తపముగావించుచున్నట్లు చెక్కబడియున్నాడు. ఇది శ్రీశైలముననే తపముచేయుచు తనజీవితకాలమును గడపిన ఋషివిగ్రహముగా నుండవచ్చును.

చిత్రము ౭



బీ. శ్రీశైలమునందలి సోమస్కందుని లోహవిగ్రహము.

తామరపూవువలె నున్న గద్దియపై శివుడును పార్వతియు గూర్చునియున్నారు. నడుమ బాలకుడగు స్కందుడు నిలువబడియున్నాడు. దీనికే సోమస్కందవిగ్రహమని పేరు. శివుడు పైచేతులతో పరశువును, లేడిపిల్లను బట్టుకొనియున్నాడు. తక్కిన రెండును వరదాభయహస్తములు. గౌరికుడిచేయి వరదముగ నున్నది. ఎడమచేత కమలమున్నది. స్కందుని శిరోవేష్టనము మిక్కిలి పెద్దది. అతనిచేతుల పుష్పమును, మామిడిపండును ఉన్నవి.

ఈ మూడు విగ్రములును మిగుల సుందరముగనున్నవి. ఈవిగ్రహముల చరిత్రను దెలుపు శాసనములేవియు గానరావు. వాని యాకృతినిబట్టి యవి పదునాఱవశతాబ్దమునందు చేయబడినవిగా దోచుచున్నది. శ. 1514 లో కృష్ణదేవరాయలు ఒరిస్సాను జయించివచ్చుకాలమున వీనిని జేయించి యీ మల్లికార్జునదేవాలయమున నుంచియుండవచ్చును.

చిత్రము ౮





ఏ. బి. నటరాజ విగ్రహములు: రాగి యిత్తడికలిపి కరగించి చేయబడినవి. ఇత్తడికన్న రాగియే యింతధికముగా చేరియున్నది, ఈవిగ్రహముల యెత్తు ౨½ అడుగులు.

'ఏ' చిత్రములోనివిగ్రహము ప్రస్తుతము గుఱ్ఱపులాయముగ నుపయోగింపబడుచున్న యొక శిథిలమగు మంటపమున గుఱ్ఱములకు గట్టుగంబముగా నుండినది. విగ్రహముయొక్క చేత, అవయవవిభాగము మిగుల సుందరముగానున్నది. 'బీ' చిత్రమునందలివిగ్రహము దేవాలయమున నొకచోనున్నది. దీనిని యాత్రికు లిప్పుడును సేవించుచున్నారు. దీని పోత యంతనాణెముగ లేకున్నను అవయవవిభాగము సుందరముగనేయున్నది. ఈ రెండు విగ్రహముల నిర్మాణసంవిధాన మొకటేతీరున నున్నది. కుడివైపు పైచేయియందు డమరుకమున్నది. క్రిందిచేయి అభయము నొసగుచున్నది. ఈమణిబంధమున సర్పమొకటి చుట్టుకొనియున్నది. ఎడమవైపున పైచేత నగ్నిజ్వాల ప్రకాశించుచున్నది. క్రిందిచేయి గజహస్తవిన్యాసము గలిగియున్నది. దక్షిణపాదమున నపస్మారునిద్రొక్కిపట్టినట్టు లున్నది. అపస్మారునిచేత నొకసర్పమున్నది. ఇందువిరియబోసికొనియున్న శివుని జటామండలము తాండవముయొక్క యాథార్థ్యమును దెలుపుచున్నది. ఈవిగ్రహములశిరముననున్న కిరీటము మిగులపెద్దది. 'బీ'చిత్రమునందలి విగ్రహముయొక్క కిరీటము రత్నాదులచే నలంకృతమైయున్నది. ఈ కిరీటమున కిరువంకల గంగాచంద్రులు చెక్కబడియున్నారు. శివుని జటలలోనుండి గంగ ప్రవహించుచున్నట్లున్నది. ఈ విగ్రహములపైనున్న ప్రభలు చుట్టును అగ్నిజ్వాలలతో వెలుగుచున్నట్టు చేయబడియున్నది. ఈ నటరాజమూర్తియొక్క తాండవము దృశ్యప్రపంచ సృష్టిస్థితిలయకారియగు నీశ్వరశక్తిని స్ఫురింపఁజేయుచున్నది. కాళ్లయందు, 'భృంగిపాదము'లను రత్నఖచితపాదాంగదము లున్నవి. ఈవిగ్రహములున్న పీఠములకు పద్మపీఠములని పేరు.

చిత్రము ౯





ఏ. శ్రీశైలమునందలి భృంగియొక్క శిలావిగ్రహము : ఈ విగ్రహము దేవాలయప్రధానద్వార బహిఃప్రదేశమునన్నది. దీని యౌన్నత్యము 3½ అడుగులు. ఇది మిగుల సుందరముగానున్నది. ఈవిగ్రహమునకు మూడుకాళ్లున్నవి. కాని మూడవకాలు మోకాలియొద్ద విరిగిపోయినది. దీనికి సంబంధించిన గాథయిది:

భృంగికి శివునియెడ భక్తి మెండు. వేఱొక్కదైవమును, తుదకు పార్వతినిగూడ నతడు లెక్కసేయడు. ఎల్లప్పుడు శివునకు బ్రదక్షిణములు చేయుచు, బూజించుచుండును. శివు డొకసమయమున భృంగిభక్తిని బరీక్షింప గోరి యర్ధనారీశ్వరుడై ప్రత్యక్షమయ్యెను. పార్వతి నర్ధాంగమునదాల్చిన శివునకు బ్రదక్షిణముచేయ సహింపడయ్యెను భృంగి. అంత నతడు భృంగమై యర్ధనారీశ్వరునిశరీరమున రంధ్రమునుజేసికొని పురుషభాగమునకే ప్రదక్షిణము చేయుచుండెను. అదిచూచి పార్వతి కుపితయై భృంగిని శపించెను. ఆశాపకారణమున భృంగి క్రమముగ కృశించి నిలుచుటకు గూడ శక్తిలేనివాడయ్యెను. శివు డాతనిస్థితిని గాంచి కరుణించి మూడవకాలు ననుగ్రహించెను. అదిమొదలు భృంగికి మూడుకాళ్లయ్యెనట. శిల్పములయందును చిత్రములయందును గూడ భృంగికి మూడుకాళ్లే యుంచుచున్నారు. పదునేడవ శతాబ్దమున రాజమహేంద్రపురనివాసి శ్రీమంతుడగు నొకవర్తకుడు శ్రీశైలయాత్ర పోయియుండెనట. ఆసమయమున నతడీ భృంగివిగ్రహమును దేవాలయాంగణ ప్రదేశమునన్న వీరభద్ర శిలావిగ్రహమును బ్రతిష్ఠించెనట.

బీ.. రాజపుత్రికయొక్క పురాతన శిలావిగ్రహము

ఈమె మల్లికార్జునదేవుని భక్తురాలుగా నుండవచ్చును. ఇరుప్రక్కల నిలువబడియున్న పరిచారికలీమెకు ఛత్రమును బట్టియుండుట చూడగా నీమె యొకరాజపుత్రికగాని లేక యొకప్రసిద్ధపురుషునిభార్యగాని కానోపును. వక్రములగు కుచ్చులయొక్కయు జడలయల్లికలయొక్కయు తీరుచూడగా నిందలిశిల్పము మధ్యోత్తర హిందూస్థాన శిల్పములను బోలియున్నది. దక్షిణహిందూస్థాన శిల్పములయందిట్టి తీరుకాన్పింపదు. పరిచారికలకేశబంధములు దక్షిణ హిందూస్థాన శిల్పముల రీతిని- ముఖ్యముగ విజయనగర రాజ్యకాల శిల్పమురీతిని- బోలియున్నది. పరిభ్యా

తులగురాజులు, రాజపుత్రికలు తమ యంతఃపురజనముతోగూడ శ్రీశైలయాత్రకు వచ్చుటయు, భర్తలవలెనే భార్యలును మల్లికార్జునదేవునకు గానుక లర్పించుటయు నచ్చటి శాసనములు తెలుపుచున్నవి. పాతాళగంగకుబోవు మార్గమున శాసనములు చెక్కబడిన మూడుశిలాస్తంభములుగలవు. అందొక శాసనము ౧౪ వ శతాబ్దాంతమున విఠ్ఠలాంబయను కదంబరాజపుత్రిక స్వప్నమున మల్లికార్జునదేవుడు ప్రత్యక్షమయి యాజ్ఞాపించిన ప్రకారముగ నామె శిథిలములయిన పాతాళగంగా సోపానముల మరమ్మతుచేయించినట్లు తెలుపుచున్నది. ఈచిత్రమున పదునాలవ శతాబ్దమునందలి శిల్పనిర్మాణవైఖరి పొడకట్టుచున్నది. కాన నీప్రతిమ యాకదంబరాజపుత్రి కావచ్చును.

చిత్రము ౧౦



బీ. తూర్పుద్వారమునకు సమీపమున నొక పెద్దశిలాఫలకముపై నొకరాజు సింహాసనమున గూర్చున్నటుల చెక్కబడియున్నది. రాజునకు వెనుక రాజుపట్టాకత్తిని చేతపట్టిన సేవకు డొకడును, రెండు వింజామరములను జేతబట్టుకొని మరియొక సేవకుడును నిలిచియున్నారు. ఇంకొకడు రాజు కుడికాలియడుగును చేతులతో నానియున్నాడు. ఈశిల్పచిత్రమును ఇతరచిత్రములవలె పదునాఱవశతాబ్దియందలి విజయనగరరాజ్యకాలపు శిల్పచిత్రములను బోలియున్నది. ఇచ్చట చెక్కబడిన కత్తి విజయనగరరాజుల పట్టాకత్తియొక్క ప్రతిబింబముగా నున్నది. శ్రీకృష్ణదేవరాయలు ౧౫౧౬ వ సంవత్సర ప్రాంతమున శ్రీశైలయాత్ర విచ్చేసి మల్లికార్జున స్వామికి పెక్కుకానుకలను సమర్పించెననుట సుప్రసిద్ధ విషయము. ప్రసిద్ధులగు శైవభక్తులయొక్కయు, దేవాలయస్థాపకులు, పోషకులునగు రాజులయొక్కయు ప్రతిమల నాయాదేవాలయములం దుంచుట వాడుకయై యున్నది. కావున నీవిగ్రహము శ్రీకృష్ణదేవరాయల విగ్రహమే యగునని నిశ్చయింపవచ్చును.

చిత్రము ౧



ఏ. పాతాళగంగకు పోవురాతి బాట.



బి. పాతాళగంగ.

# దయ్యముల కొంప

శంకరదీక్షితులు

## I. సమావేశము

"కుముద్వతీ! కుముద్వతీ! ఇంత యాలస్య మేల?" కుముద్వతి పదునాఱేండ్ల ప్రాయముగల మహారాష్ట్రయువతి. ఆమె పితృకల్పుఁడుకాఁబోలును, నానారావనునేఁబది యేండ్లవాఁడాతి నామెను దొందరపెట్టసాగెను.

"వచ్చుచుంటిని" అని కుముద్వతి తనలో నేమియో సణుగుకొనఁజొచ్చెను. కాని,యామె విశేషముగఁ దొందరను గనఁబఱచుట లేదు. సాయంకాలము కాఁజొచ్చెను.

గుంటూరునగలపెద్దసత్రమున వీథిగుమ్మముపై నిల్చియుండిన నానారావు సత్రమునకు ముందుభాగమున నున్నగదియందు, దుస్తులను ధరించుకుముద్వతిని వేగిరపెట్టసాగెను. ఆవీథి యరుగుపై, విశ్వనాథమను విశాఖపట్టణవాసి తన ప్రక్కను సర్దుకొనుచు, పుస్తకమునందలి పత్రముల నిటునటుఁద్రిప్పుచుఁగూర్చుండియుండెను. ఆతఁడాసత్రమున దిగినరెండుదినముల నుండియు, నానారావునకును, కుముద్వతికిని గలసంబంధము నెఱుంగఁ గుతూహలుఁడై యుండెను. ఆతనిహృదయమున, నేకారణముననో గాని, కుముద్వతి విచారపరవశురాలై యున్నదనియు, నానారావామెయెడల సరియగుపితృవాత్సల్యముఁ జూపించుటలేదనియు దోఁచుచుండెను.

ఈవిశ్వనాథమను నాతఁడు రహస్యాపరాధపరిశోధకుఁడు. ఆతఁడు, సుమారు ౧౫ సంవత్సరములనుండియు, తనబుద్ధి విశేషముచేతను, యుక్తిచమత్కారముచేతను, పోలీసువారికి సహాయమొనర్చుచు, తనవ్యాపారము సందసమానుఁడని పేరునొందియుండెను. రహస్యాపరాధపరిశోధకులకుఁ గావలసిన విద్యలయందెల్ల నీతఁడారితేరిన బంటు. నేఁడీతఁడీగుంటూరున కేల వచ్చియుండెనో ముందు వివరించెదము.

"చీర నలంకరించుసప్పటి కూరంతయు మాటుమణుగును గాఁబోలును. రోజురోజునకు, నీపెంకెతన మభివృద్ధినొందుచున్నది. వచ్చుచుంటివా, లేదా?"

నానారావించుకస్థూలకాయుఁడు సులభముగాఁగ్రోధమును బూనినను లోకమునందలి ప్రథమక్రోధులయందువలెఁ గాక వీనియందా కోపము చిరకాలము నిల్చియుండును. క్రోధపరవశుఁడై "ధుమధుమ" లాడునప్పుడాతని సహజారుణాననము మెఱుఁగుపెట్టిన రాగిపాత్రవలె నుండును. స్థూలకాయుఁడైనను చురుకుదనము విశేషముగాఁ గలిగినవాఁడు. అంతియేకాక దేహదార్ఢ్యము కలవాఁడని వానిమఃశిబంధము లే సాక్ష్యమొసంగును.

"నే నిక్కడ ఆడుకొనుచుంటినా యేమి? సాధ్యమగునంత త్వరలోనే వచ్చుచున్నాను" అని కుముద్వతి తలుపునకు బీగమును బిగించి వీథిలోనికి వచ్చెను.

"ఎన్నినాళ్లైనను, నీనైజమును నీవు మానినావుకావు! ఆనల నాకెంతపని మించి పోవునోయెఱుంగుదువా? రమ్ము! త్వరగా నంగడి కేగి, వస్తువులను గొని, నిన్నింట దిగఁబెట్టి నే నేగవలయును." అనుచు వడివడిగా నాతఁడు బజారున కేగెను. విశ్వనాథము తన ప్రక్కను జట్టి, సత్రములోఁ దనగదియందుంచి, తాళము వైచి, తానును విహారార్థ మేగ నిశ్చయించుకొని యున్నను, నానారా వింటికిఁ దిరిగి యరుదెంచువఱకును వేచి యుండినచో, పిదప, వాని ననుసరించిన, నేమైన ఫలకారి యగునేమో యని యూహించి వీథియరుగు పైఁ గూర్చుండెను.

సహేతుకము కాని యనుమానము వలననో లేక, తాత్కాలికఘటికా ప్రభావమువలననో యణుమాత్రములై జనించి, చివరకు, ఘనకార్యములుగా నుద్దేశములు పరిణమించుట లోకప్రసిద్ధమే. విశ్వనాథమున కీకుముద్వతీ నానారావులయందు దాది నించుక పరస్పరసంబంధములను గూర్చి, శంక జనించుటయే, యీ గ్రంథమునకును, రాఁబోవు సుప్రసిద్ధచర్యలకును గారణము. నానారావు, కుముద్వతిని బేరుపెట్టి పిలిచిన దీసాయంకాలమే! తత్పూర్వ మాతఁ డామెను, "పిల్లా" అని పిలుచుచుండుట చేతను, కుముద్వతి, నానారావుపట్ల నిజతనూజవలె మెలఁగక పోవుటచేతను, నానారావుకూడ, నిజసుతవలె నామె నాదరింపకుండుటచేతను, విశ్వనాథము యొక్క హృదయమున నీయనుమాన ముప్పతిల్లెను. కానినిజమును చెప్పవలయునా? విశ్వనాథమున కామెయం దింతపరిశీలనబుద్ధి నుపయోగించుటకుఁదగినంత యుద్దేశ మేమో!

విశ్వనాథమును ముప్పదియైదేండ్లు గడచినను నేఁటివఱకును, వివాహమును జేసికొన వలయు నను బుద్ధి యాతని హృదయమున జనించియుండలేదు. ఆతని కత్యంతహితుఁడును, మేనత్తకొమారుఁడును నగు నారాయణదా సాతని నెంతబలవంతముచేసినను, "నాకై యెవ్వతె, పూజలుసేయుచున్నదో!" అని వేళాకోళము చేయుచుండెడివాఁడు. ఆతఁడనినమాటయు నిజమే! విధిని దాట నేరిశక్యంబు?

ఇంతలో బజారు పనిచూచికొని, కుముద్వతియును, నానారావును సత్రమున కరుదెంచిరి. నానారావు గదిలోని కేగి, తనదుస్తులను మార్చుకొని, చేత నొకదృఢమగు కఱ్ఱను బట్టుకొని, మెల్లగా నీలవైచికొనుచు, వీథిగుమ్మముపైఁ గొంతకాలము నిలిచి, కుముద్వతీ వంటచేయుట కారంభించినతోడనే యా చీఁకటిలో, వెనుదిరిగి చూడకుండ "రింగురోడ్డు" (Ring Road) వైపునకు వడివడిగా నడువఁజొచ్చెను. విశ్వనాథ మొక నూఱుగజములదూరమున నాతని వెంబడించెను.

నానారావు క్రమముగా "రింగురోడ్డు"ను జేరి ఫ్యాక్టొరీ వైపునకుఁబోఁజొచ్చెను. రైలుపట్టాలయొద్దకుఁ బోయి, యాతఁ డెవ్వరికొఱకో

నిరీక్షించికొనియున్న ట్లాసమీపముననే తిరుగులాడుచుండెను. విశ్వనాథముకూడ మెల్లగా నడచిపోయి, "రైలుపోర్టరు" (Railway Porter) యొక్క గుడిసెకు ముందుగాఁ గూర్చుండెను. నానారా వరగంటకాల మీరీతిని సంచరించునంతలో, దూరమునుండి వడిగావచ్చుచున్న బండిచప్పుడు వినఁబడెను. నానారా వా శబ్దమును విని, యీలను మాని, బండివచ్చెడి మార్గమున కెదురుగా, మెల్లగఁ జనఁజొచ్చెను. విశ్వనాథమును తనస్థానమును విడనాడి, నేపాళపుచెట్లమరుగున నాతని వెంబడించెను. ఇట్లు నానారా వఱువదిరెబ్బదిగజములదూరమున కేగునప్పటికి, బండి, వానికిఁ దారసిల్లెను. ఆశకటములోనుండి యిర్వురు పురుషులు దిగి నానారావును స్నేహపూర్వకముగా నాలింగన మొనర్చిరి. విశ్వనాథ మిరువదియైదు గజములదూరములో నున్న నేపాళపుచెట్లమరుగున నొదిగి యుండెను. బండి తనదారినేగెను.

"మహాదేవ్! పిల్ల సుఖముగా నున్నదా?" అని వచ్చినవారిలో యువకుఁడు ప్రశ్నించెను. చామనచాయగల దేహమును ఉన్నతమైన ఫాలమును విశాలమగు వక్షస్థలమునుగల యాతఁడు సుమారు 5½ అడుగుల ఎత్తుండును. రెండవయాతఁ డాఱడుగుల ఎత్తుండును; కాని తనసహచరునివలెఁ గాక యీతఁడు పచ్చని దేహచ్ఛాయయును, పలుచనిశరీరమునుగలిగి నాగరికునివలె గన్పట్టుచుండెను.

'సుఖముగా నుండ కేమి? సుఖముగనే యున్నది. ధుమధుమలుమాత్రము మానలేదు. క్రమముగా మార్గమునకు వచ్చుచున్నది" అని మహాదేవుఁడనెను.

"ఈదినమున మనతో సంప్రతించుటకు రత్నసామినిగూడఁ దీసికొనివచ్చితిని. మనమీ పనిని నాలుగైదుదినములలోఁ బూర్తిచేసికొనినఁగాని పట్నమునఁదలపెట్టుకొనియున్న మహత్కార్యమును సాధింపలేము. కావున పిల్లనెట్లయిన మార్గమునకుఁ దీసికొనివచ్చి ఈ నాలుగైదుదినములలో మనపని ముగించుకొనవలెను. ఆమెతో నిదియే కడపటిసారి యనియు, తన కేవిధమయినయవమానమును గలుగనీయమనియు, వచ్చినదానిలో నామె కేదైనఁ దగినంత సత్కారముఁ జేసి రెండుమూఁడు మాసములలోఁ బరిణయమాడెదననియు నచ్చఁజెప్పి మార్గమునకుఁ దీసికొనిరావలెను. వలసినచో"—అని ఆగంతుకులలోఁ బొట్టివాఁడనుచుండఁగా వానిమాట కడ్డి, నానాగావిట్లు చెప్పఁదొడఁగెను.

"మీపరిణయముసంగతి మీరే కుదుర్చుకొనవలెను గాని, నాచే నయ్యది ప్రోత్సాహపఱుపఁబడుట కల్ల! ఏలనందువా, నే నా ప్రశంస దెచ్చినప్పుడెల్ల కుముద్వతి మండిపడుటయే కాక, తనతండ్రి గతించిననాఁటి సంగతులనెల్ల మెత్తి నన్నునిందించుటకుఁ బ్రారంభించుచున్నది. వీలులేక, మనతో నున్నది కాని లేనిచో, మనలను విడిచి ఇదివఱకే గడసానివలె 'తెయ్యి'మని ఆడవలసినదే. ప్రస్తుత కార్యమున కెట్లయిన నామె నుపయోగించుట కడ్డుండరాదని నానమ్మకము. ఐనను నీవు కూడ నొకసారి మామకామునకు వచ్చి ఆమె

తో మాట్లాడుట శ్రేయస్కరమే కాని, తగి నవీ లెప్పుడు లభించునా యని యాలోచించు చున్నాను "రే పీవేళకు రాఁగలవా?"

అట్లయిన రేపీవేళకు సరిగా నావాను దీసికొని మనభవనమునకు నీవురావలయును. నేనాసమయమునకు సిద్ధముగా నుండెదను. రత్నసామి ప్రయాణముమాట నేమాలోచించితివి?"

"వెంకోబా! రత్నసామి ప్రయాణమునకుఁ దొందరయేమి? ఈగ్రామములో నాతని యవసరమేమైన నుండునేమో చూచికొనవలయును కదా! ఆతర్వాత నాలోచింతములేదు! "

అటు తర్వాత రెండుమూఁడు నిమిషములవఱకు మువ్వురును గుసగుసలాడికొని, షికారునకు వచ్చిపోయెడివారివలె నెవరిదారిని వారేగిరి.

విశ్వనాథము వారిని సాగనిచ్చి, మహాదేవనఁబడు నానారావును వెంబడించుటకన్న వెంకోబారత్నసాముల ననుసరించిన నేమైన లాభించునేమో యని తలంచి, కొంతదిదూరములో నెమ్మదిగా వారిని వెంబడించెను. వారును రింగురోడ్డు వెంబడి నెమ్మదిగాఁబోయి పురమును బ్రవేశించి, అరండేలుపేటయందొకవిశాలమైన యావరణలోనున్న భవనమును బ్రవేశించిరి. ఇరుగుపొరుగువారల నించుక విచారించి వెంకోబారా వొకసెఠిమంతుఁడనియు సాధారణముగా దేశసంచారమున కలవడిన బ్రహ్మచారియనియు సుమారు ముప్పదియేండ్ల వయస్సువాఁడనియు, నాలుగేండ్లకుఁ బూర్వమే యాగృహమును నిర్మించినాఁడనియు గ్రహించి విశ్వనాథము రాత్రి 9½ గంటలకు వంటపూటింట భుజించి సత్రమున కరుదెంచి తనప్రక్కను వీథియరుగుపై సవరించుకొని, ఏమియో యాలోచించుకొనుచు నిద్రకై యత్నించెను.

II. సందేహము

రెండునామములతో వ్యవహరించు మహారాష్ట్రునితో నించుక పరిచయము గలిగించుకొనుటకై మరునాఁ డుదయమున విశ్వనాథము ప్రయత్నించెను. నానారా వప్పుడే కాఫీ త్రాగి వీథిలోనికి వచ్చెను.

"అయ్యా! మన దేయూరు? ఈగ్రామమునకు వచ్చి యెన్నిదినములైనది?" అని విశ్వనాథ మారంభించెను. నానారా వాతని నెగాదిగ పరీక్షించి,యాతఁడు కూర్చుండిన యరుఁగుపై కరుదెంచెను.

"మాది మార్కాపురము! మేమిచ్చటకు వచ్చి వారము దినములైనది.మన దేయూరు? ఏమిపనిపై నిచ్చట కరుదెంచినారు?"

"నాది విశాఖపట్టణము. వ్యాపారముపై నే నీయూరు మూఁడునాలుగు దినములకుఁ బూర్వము చేరితిని. తమ కేమి పని?"

"నా కేయుద్యోగమును లేదండి! భగవంతుఁడింత ప్రసాదించినాఁడు. ఏదోగ్రామమును జూచుటకు వచ్చినాను. నాబిడ్డకు దేహ మస్వస్థతగానుండుటచే ఇచ్చట మిషను వైద్యశాలలోఁ బరీక్షచేయించి,మందిప్పించుటకుఁగూడ నాలోచించుచున్నాను" అని నానారావు ప్రత్యుత్తరమిచ్చెను. రెండుమూఁడు దినముల నుండి, తనగది ప్రక్కనే నివసించుచున్న యా

పురుషుం డెవ్వరో తెలిసికొనుకుతూహలముచే నాతఁడు విశ్వనాథముతో పరిచయము కలిగించుకొనఁదలఁచియే నెమ్మదిగా నాతనిప్రక్కనుపవిష్టుం డాయెను.

"తమనామధేయ మేమండి!"

"విశ్వనాథరావనెదరు? తమరీగ్రామమున నింకనెన్నిదినములుండఁదలఁచికొనియున్నారు? తమకుమార్తె కేమి వ్యాధియని మీ రనుమానము? నాకుఁగూడఁగొంచెము వైద్యమునఁ బ్రవేశమున్నది. నేనుపయోగముగా నున్నచో, సంతోషముగా నామెకు మందిచ్చి నాలుగైదుదినములలో గుణముఁ జూపెదను. మీయిష్టము!"

నానారావాలోచనానిమగ్నుఁడై నాలుగైదు నిమిషములైనతర్వాత "అట్లేకానిండు; కాని మీ రీగ్రామమున చాల దినము లుండ మనుచున్నారే? గుణాగుణములను బరిశీలించుటకు మీ కవకాశ మెక్కడ?" అనెను.

"గుణమున కేమి లెండు! ఔషధము పట్టిచ్చినదో లేదో రెండుమూఁడుదినములలోనే మనకు గ్రాహ్యము కాఁగలదు. సాధనకారియైనచోఁ గొంతయౌషధమును మీతోఁ దీసికొనిపోవచ్చును. లేనిచో మీ విలాసమునకు దానిని నేనుబంపవచ్చును. ఎట్లైనను జేయవచ్చును కదా?"

"అట్లేకానిండు. మాపిల్ల నేమనునో"! అని లేచి తనగదిలోనికిఁ బోయెను. అరుగుపైఁ గూర్చుండిన విశ్వనాథమున కన్యభాషలో కొంతరహస్యసంభాషణయు, నానారావు కఠినస్వరమును మాత్రము వినఁబడెను.

విశ్వనాథ మాయుర్వేదపండితుఁడు కాఁడు; కాని కొంచెమునాడీపరీక్ష నెఱుంగును. నాడిని గమనించి వ్యక్తి వ్యాధిగలవాఁడా కాఁడా యనునంశమును నిర్ధారణచేయుట కాజ్ఞానము చాలును. ప్రస్తుతవిషయమున నామె కేమం దెందులకీయఁదలఁచెనో మాకెఱుక లేదు కాని, వారిద్దఱితోఁ గొంతపరిచయమును గలిగించుకొనుట కాతఁ డుత్సహించుచుండుటచే నియ్యది తనకార్యమునకు సాధనకారి కాఁగలదని యాతఁ డెంచెను. ఆతఁ డాగ్రామమున కరుదెంచినపని యొకనేరమునఁ బరిశోధించుటకే. ఆగ్రామమునందే సుమారాఱుమాసములకుఁ బూర్వ మొకధనవంతుఁ డకస్మాత్తుగా హత్యచేయఁబడెనో, మరేమయ్యెనో, తెలియదు కాని, అదృశ్యుఁడాయెను. ఇంటివారితో నాతఁ డేగ్రామమునకును బోవనున్నట్లు తెలుపలేదట! ఆత్మహత్యగావించుకొను నంతటికష్టము లేమియు నతనికి లేవని యతనిమిత్రులును, బంధుగులునుగూడఁ దెలిపియుండిరి. ఆతఁ డిల్లువిడిచినమరునాఁ డాతని సంతకముతో వచ్చిన యుత్తరమును బట్టి యింటివారతఁ డెట్టియవస్థలో నున్నాఁడో యని కాఁబోలును, ఇంట నున్న పైకమును గొంతయు, మిత్రుల యొద్దనున్న పైకమును గొంతయు జతచేసి యుత్తరము దెచ్చినవానిచేతికి 1200 రూపాయల నిచ్చియుండిరి. సమీప గ్రామములో నెచ్చటనో భూములఁగొనుట కాతఁ డాగియుండెననియు, కంట నెంతపైకమెచ్చట నున్నది, నెఱింగించుటచే, వచ్చినవానిమాటల నింటివారలు నమ్మి యాతనికాపైకమిచ్చుటకుఁ గార

ణము. మరునాఁ డాయన రాఁగలఁడని చెప్పి, వార్తాహరుఁ డాపైకముతో నంతరించెను. రెండుమూఁడు దినములవఱకు నాతఁడు రాకుండుటచేతను దమ కాతనియొద్దనుండి యుత్తరమేదియు రాకుండుటచేతను గలవలపడి యాతని భార్యయు నితరబంధువులును బోలీసువారి కీవర్తమానము నెఱింగించిరి. కడచిన యాఱుమాసములనుండియుఁ బోలీసువారొనర్చిన ప్రయత్నము లేవియుఁ గార్యసిద్ధినందకుండుటచే ఎట్టులో యీ యుదంతము నెఱింగిన విశ్వనాథము తనశక్తిచే నేమైన గుట్టుబయటపడునేమో యని, బయలుదేరి యాగ్రామమున కరుదెంచి, యదృశ్యుఁడైన నారాయణప్పబందుగులవలనను, స్నేహితులవలనను, యాతనిపూర్వవృత్తాంతమును దమ యనుమానములను గనుఁగొని యాసత్రమునబస నేర్పరచుకొనియుండెను.

ఇంతలో నానారా వరుదెంచి విశ్వనాథమును గదిలోనికిఁ దీసికొనిపోయెను. కొంచెముగా సిగ్గును సూచించుచు, కుముద్వతి యరుదెంచి తనవామహస్తమును సాచెను. విశ్వనాథ మాచేతి నందుకొని నాడిని రెండునిమిషములవఱకుఁ బరీక్షించెను. నాడిని బరీక్షించుచు నామె వ్రేళ్లకున్నయుంగరములపైఁ గూడ దృష్టిఁ బరపెను. అం దొకయుంగరముపై కె. ఎన్. అను అక్షరములున్న ట్లాతఁ డనుమానించి, ప్రస్తుతవిషయమైనతర్వాత నాయుంగరముపైని యక్షరములసంగతి విచారింపవచ్చునని తలంచి నాడీపరీక్షయైనతర్వాతఁ బ్రక్కనున్నకంబళిపై నాసీనుఁ డాయెను.

“ఆమె కస్వస్థతగా నున్నదని మీ రేకారణములనుబట్టి చెప్పుచున్నారు? గుణగతము లొక్కింత నా కెఱింగించెదరా?” అని విశ్వనాథ మడిగెను.

నానారా వించుకకాల మాలోచించి “కొంచె ముబ్బసపుదగ్గుసంబంధమైన వ్యాధియని నా యనుమానము. మనస్సునకు సంతోషము లేదు. శ్రమ కోర్వలేదు. తల్లి గతించినది మొద లీమె కారోగ్యము చెడినది” అనెను.

“నాడి బలహీనముగానే యున్నది. కొంచెము బలముఁ జేయుట కేదైన నౌషధమిచ్చి పిదప వ్యాధి యేరూపమునఁ బరిణమించునో చూచెదము. ఆమె చేతివజ్రపుటుంగర మెచ్చట చేయించినారు. చాల బాగున్నది! ఒకసారి చూడనిచ్చెదరా?” నానారా వాయుంగరమును దెచ్చి విశ్వనాథముచేతి కిచ్చి,

“ఇది నాకై మొదటఁ జేయించుకొంటిని నా పేరు గుర్తులుకూడ నింగ్లీషున దానిపైఁ జెక్కఁబడినవి. పట్టణములోఁ జేయించినాను. నూఱురూపాయలైనది” అనెను.

విశ్వనాథ మాయుంగరము నందుపైగల గుర్తులను బరీక్షించి తిరిగి నానారావున కొసంగి “సాయంకాల మొకమం దిచ్చెదను. రెండుమూఁడుదినములు సేవించినతర్వాత గుణములనుబట్టి పిదపఁ జూచెదము” అని లేచెను.

విశ్వనాథము, కుముద్వతిని మధ్యమధ్య తీక్ష్ణదృష్టిచేఁ బరిశీలించుట యామెకూడ గ్రహించుటచేతనే కాఁబోలునచ్చటనుండియామె

లోపలిగది కేగెను. విశ్వనాథమున కామె దీర్ఘవిచారమున మునిఁగి యున్నట్లును, విధి లేని చిక్కులలోఁ దగుల్కొనియున్న రీతిని గన్పట్టెను. నానారావునొద్ద సెలవుదీసికొని యాతఁడు వీథిలోనికిఁ దిరిగి యరుదెంచెను.

ఆనాఁటిమధ్యాహ్న మాత్రఁ డూరిలోని కేగి కే. నారాయణప్ప బందుగులయింటికిఁ బోయి, వారివలన, నారాయణప్పకూడ తన నజప్రటుంగరముపై పేరుగుఱ్ఱులను జెక్కించు కొనినట్లును, ఆతఁడాదినమునదృశ్యుఁడైనప్పడయ్యది కూడఁ దన వ్రేలి కుంచుకొనిపోయి నట్లును దెలిసెను. ఆయుంగరమే కుముద్వతి యొద్దనున్నయుంగరమా? అదృశ్యుఁడైన నారాయణప్పకును, మార్కాపురవాసియైన నానారావునకును, గూఁతురునకును నేట్టిసంబంధము? ఆయుంగరము వీరెచ్చటనైనఁ గొని, చేయించుకొంటిమని యబద్ధ మాడుచున్నారా? ఈవిషయ మింకను విచారింపవలయునని విశ్వనాథ మాలోచించెను.

ఆదినమున సాయంకాలము నాలుగు గంటలకు విశ్వనాథము వెంకోబారావుభవన ప్రాకారమును బ్రవేశించి, ఆవిశాలమైన దొడ్డిని అందుమధ్యగట్టఁబడియున్న మేడను స్థూల దృష్టిని బరిశీలించి, ఇంటిగుమ్మముఁ దట్టెను. రత్నసామి వచ్చి తలుపు దెరచెను.

"ఈయింట భాగమేదైన నద్దెకిచ్చెదరా?" అని విశ్వనాథము ప్రశ్నించెను. కనుఁగొని వచ్చెదనని చెప్పి రత్నసామి మేడపై కేగ, రెండునిమిషములలోఁ దిరిగి వచ్చి, విశ్వనాథమును మేడపై నున్న యొక విశాలమైనగది లోనికిఁ దీసికొనిపోయెను. అచ్చటఁ గూర్చుండి యున్న వెంకోబారావాతని గూర్చుండుఁడని "మీకేనా యి ల్లద్దెకుఁ గావలసిన"దని ప్రశ్నించెను.

"ఔనండి! నాకేకావలయును. ఇల్లంతయునైనను సరే! తెమరు తఱచుగా నీయూర నుండకుండుటచే నిచ్చెదరేమోయని చుట్టుప్రక్కల వారనుటచే నే నరుదెంచితిని."

"ప్రస్తుతము నే నద్దెకీయలేను. కాని పదునైదిరువది దినములలో దీనినిగొంతకాలమువఱకద్దెకీయవచ్చును. అంతవఱకు మీరాగఁగలిగి నచోఁ దిరిగి దర్శన మిప్పించినయెడల మనము మాటలాడుకొనవచ్చును. ఇల్లు చూచెదరా?" అని వెంకోబారావు లేచి, విశ్వనాథమున కిల్లంతయుఁ జూపెను. ఇల్లు చాల విశాలముగా నున్నది. మేడపై మూఁడుగదులును వసారాయును, క్రింద నాలుగుగదులు నున్నవి. దొడ్డిలో రెండు పెద్దచింతచెట్లును నాలుగు మామిడిచెట్లు నున్నవి.

"పదిదినములు పోయినతర్వాతఁ దిరిగి దర్శనము చేసెదను. సెలవు" అని విశ్వనాథమాయిల్లు విడచి సత్రమును జేరెను. ఎత్తైనట్టియు దట్టమైనట్టియు ప్రహారీగోడలును "పోపులపెట్టె"లోని అరలవలె నున్న గదులను జూచి,యిట్టియింటికి యజమానుఁ డింతవఱకేలపరిణయమాడలేదని యాతఁ డాశ్చర్యమొందెను. ఆతడు సత్రమును జేరుసరి కప్పుడే కుముద్వతియు నానారావును సత్రమును విడిచిపోవుటకు సిద్ధముగా నుండిరి. వారిని బోనిచ్చి విశ్వనాథ మెవ్వరును లేకుండఁజూచి, వారి

గదికి వైచిన తాళమునకుఁ జెవిచేయించుటకు నమూనాకై తనయొద్దనున్న మైనముతో గుఱుతు దీసికొని, తిరిగి యూరిలోనికి బయనమై తాళములు మరమ్మతు చేయువానియొద్ద కేగి, తగినచెవిని చేయించి తిరిగి వెంకోబారావింటివైపు పోయెను. అప్పటికి సూర్యాస్తమయమై యొకగంటయైయుండెను. మేడపై దీపములు వెలుఁగుచుండెను. హోటలు నుండి కాఁబోలు నొకబ్రాహ్మణుఁడు పెద్ద "టిఫిన్ కేరియర్" లో భోజనము నింటిలో నిచ్చి మరలి వచ్చుచుండెను విశ్వనాథ మాతని గలిసికొని, "వెంకోబారావుగా రింటియం దున్నారా? ఇప్పు డాయనతో మాటలాడుటకు వీలున్నదా?" అని అడిగెను.

"నాకుఁ దెలియదండి! ఆయన లోపలనే యున్నారు కాఁబోలును. నేను జూడలేదు. భోజనమును దిగువఁబెట్టి వచ్చుచున్నాను" అని చెప్పి యతఁడు తనదారి నేగెను. విశ్వనాథ మాప్రాంతములనే యొకయరుగుపై నుపవిష్టుఁడై యాయింటివైపు దృష్టి నిలిపి కూర్చుండెను.

రాత్రి 8½ గంటల కాయింటినుండి కుముద్వతియు, నానారావును వెంకోబారావును బైకరుదెంచిరి. వారితో నింకొకపురుషుఁ డెవ్వరో యుండెను. నానారావును కుముద్వతియు, వెడలిపోయిన నాలుగైదునిమిషముల వఱకు వెంకోబారా వానూతన పురుషునితోఁ బ్రసంగించి, వాని నంపి యింటిలోని కేగెను. ఆనూతనపురుషుఁ డేబదిగజములదూర మేగిన తర్వాత విశ్వనాథ మాతని వెంబడించి, ప్రాత యూరులో నొకయింట నాతఁడు ప్రవేశించుట చూచి, మరునాఁ డుదయమున విచారించుకొన వచ్చునని నిశ్చయించుకొని, హోటలున కేగి భోజనము చేసి, సత్రమును జేరి నిద్రించెను.

### III. సంకల్పము

మరునాఁడుదయమున విశ్వనాథము తన యొద్దనున్న "పైత్యాంతకరసములో" కొంత భాగమును కుముద్వతి కిచ్చుటకై వారిగది తలుపు తట్టెను. నానారావు ధుమధుమలాడు మొగముతో వచ్చి తలుపు దీసి, వచ్చిన విశ్వనాథమును జూచి, చిఱునవ్వునకై ప్రయత్నించుచు, నాతని లోనికిఁ దీసికొనిపోయెను. విశ్వనాథము కుముద్వతిహస్తము నింకొక సారి పరీక్ష చేయవలయుననుటచే, నానారావామెను బిలిచెను. ఇంకను మొగమునఁ గనఁబడుచున్న కన్నీటిచారికలతోడను దీర్ఘదుఃఖతాపములను జూపు మొగముతోడను ఆమె తనతొట్రుపాటును గప్పి పుచ్చుటకుఁ బ్రయత్నించుచు, వచ్చి నిలుచఁబడఁగా, విశ్వనాథ మామె వామహస్తమును బట్టుకొని ధైర్యోద్బోధనసూచకముగా హస్తము నెత్తి ఆమె ముఖమును బరీక్షించుచు, నాడీపరీక్షఁ జేయఁ జొచ్చెను. కుముద్వతియు నడుమనడుమ, విశ్వనాథమువైపు దృష్టినిగుడించుచు, నాతని ముఖమును బట్టి గుణనిర్ణయముఁ జేయుటకు కాఁబోలు నిశ్చయించుకొనుచుండెను. ఆమె దేహముయొక్క వణఁకు నామెనాడియే తెలుపుచుండెను. ఆదీర్ఘనాడీపరీక్ష రుచింపక పోవుటచే కాఁబోలు నానారావు——

"రాత్రి దేహములో బాధవలన నిద్ర లేదని నాతోఁ జెప్పినది. ఈమధ్యాహ్నమేగి దొరసానితో సంప్రతించివచ్చెదను, మీ మందు నంతవఱ కాపియుంచఁగలరా?" అని కొంచెము విసుగుదలతో ననెను.

నాడియం దేవిధమైన దుర్గుణమును లేకపోవుటచే, నిది యెల్ల కపటనాటకమని గత దినముననే నిశ్చయించుకొనిన విశ్వనాథమున కాతనిమాట లాశ్చర్యమును గొలుపలేదు. అతఁ డాయనుమానమును, తన కామెయందు గల సదభిప్రాయమును సానుభూతియును రూఢిగాఁ దెలుపుచూపుతోఁ గుముద్వతి నొకసారి చూచి నిలువఁబడి "అట్లే కానిండ"ని గది దాఁటి వచ్చి తనగదిలోని కేగెను. ఆతఁడట్లు వచ్చునప్పుడు చూపిన కుముద్వతియొక్క జాలినిగొలుపుచూపు లాతనిహృదయమును గలఁతపెట్టుచుఁ దనపట్ల నామెకు సదభిప్రాయము కేవలము లేకున్నను, నానారావు చూపెడు ననుమానయుతమైన దురభిప్రాయము లేదని నిశ్చయించుకొనెను.

విశ్వనాథ మంతట ప్రాతయూరులో దిగవిడచిన పురుషునియుదంతము నెఱుఁగఁ గోరి, యచ్చటకేగి, యిరుగుపొరుగు వారివలన నాతఁ డొకనైష్యుఁడనియు నిటీవల "లాటరీ" యందుఁ దనకు లాభించిన 75 వేలరూపాయీలు నెట్లు వినియోగింపవలెనో యని యూహించుచున్నాఁడనియుఁ, దెలిసికొని తిరిగి యరండేలుపేటదారిని తనయింటి కేగుటకు బయలుదేరెను. నెంకోభారావింటిప్రాంతముల కాతఁ డేగుసరికి, ప్రాకారములోని కొక బండిపై కొన్ని కొబ్బరిమొక్కలు తీసికొని పోఁబడుచుండెను ఆవరణమునందు నాటించుటకుఁ గాఁబోలునని తలంచికొని, విశ్వనాథము భోజనానంతరముఁ సత్రముఁ జేరెను.

సరిగామధ్యాహ్నము మూఁడుగంటలకు నానారావు తనగదిని విడచి, యూరిలోనికిఁ బోయెను. తన కింతకంటె మంచిసమయము రాదని యోచించి, హైందవాచారములకు వ్యతిరేకమైనను, తనసదభిప్రాయమునే నమ్ముకొని, విశ్వనాథ మొకపదునైదునిమిషములు తాళి, తనగదిని బిగించి కుముద్వతియున్న గదిని దట్టెను. కుముద్వతి తలుపుదెరచి, తలుపుతట్టినదెవ్వరో చూచి "మానాయన యింట లేర"ని, తలుపు తిరిగి బంధింపఁ బ్రయత్నించుచుండఁగా విశ్వనాథ మామెకు భయముప్పతిల్లునట్లు "మీమేలుకై, మీతో మాటలాడవలయును. లేనిచోఁ మీకుఁగూడ ముప్పు రాఁగలదు. నావలన మీ కేవిధమైన అవమానమును, అమర్యాదయును సంభవింపదని,వాగ్దానము చేయుచున్నాను" అనెను. స్త్రీబుద్ధి చాలసూక్ష్మమైనదని లోకప్రతీతి. ఈ మాటలవలన నేమనుకొనెనో, యామె యాతనికి దారి నొసంగి, తలుపును దగ్గరగా వైచి నిలువఁబడెను.

"నేను సదభిప్రాయముతోడనే మీయొద్దకరుదెంచితిని. నామాటలను నమ్మి నేనడుగు ప్రశ్నలకు సరియగుసమాధాన మిచ్చెదరా మీకు మేలుచేసెదను. లేనిచో నే నేమియుఁ జేయఁజాలను. నలుగురితోపాటని విచారింతును" అని విశ్వనాథ మామెకు ధైర్యము కలుగునట్లు ప్రారంభించెను.

"నే నాఁడుదాననైనను నమ్మకద్రోహ మును జేయనని మీకు నాయందు విశ్వాస మున్నచో మీ యుదంతమునంతయు నా కెఱిఁగింపుడు. పిదప నాసంగతి మీకే గ్రాహ్యము కాఁగలదు. నే నొకనిర్భాగ్యురాలను" అని కుముద్వతి యనెను.

"మీరు నిర్భాగ్యులని యనుకొన్నను నా కట్లుకనఁబడుట లేదు. కావున మిమ్ములనునమ్మి నాయుదంతము నెఱింగించెదను. నేనో యప రాధపరిశోధకుఁడను. ఈగ్రామమున నాలు మాసముల క్రిత మదృశ్యుఁడైన కె. నారాయ ణప్ప సంగతి విమర్శించుటకై వచ్చితిని. ఏమి? అట్లు బెదిరి చూచెద రేల? మీ రాయన నెఱుఁగుదురా?" అని తన మొగమునుండి దృష్టి మరల్చినకుముద్వతి నాతఁ డడిగెను.

ఆమె మాటాడలేదు. విశ్వనాథము తన ప్రశ్నను దిరిగి యడిగెను. ఒకనిమిషమైన తర్వాత "ఆయనకేదో భయంకరమగునాపత్తు తటస్థించిన దెవరో రైలులోఁ జెప్పఁగా విని యుంటిని. అది జ్ఞప్తికివచ్చిన"దని యామె మొగమును ద్రిప్పకయే తనచేతివైపు చూచి కొనుచు నస్ఫుటముగాఁ బల్కెను. విశ్వనాథ మిది తప్పక బూటకమే యని గ్రహించెను.

"నాతో మీ రేదో హితముగూర్చు మాటల నాడెద నంటిరి? ఏవిషయమును గు ఱించియో, తెలిపెదరా?" అని యామె విసుగు దలతోఁ బ్రశ్నించెను.

విశ్వనాథము ధైర్యము దెచ్చికొని యిట్లు చెప్పెను. "మిమ్మున నీసత్రమునఁ జూచినది మొదలు మీ రేదో యొకకష్టమున నున్నా రనియు, మీకు సాధ్యముకానికారణాంతర ములచేఁ గృశించుచున్నారనియు నేను గ్రహిం చితిని. నన్ను సవిస్తరముగాఁ జెప్పుమనెదరా?" కుముద్వతి నెమ్మదిగా "ఊ" అనెను.

"ధైర్య మిచ్చితిరి కాన, చెప్పెదను. నే నవివాహితుఁడను. కావలసినంత యాస్తి యు న్నది. మీకు సర్వవిధముల సౌఖ్యము నొడఁ గూర్పవలయునను నుద్దేశము నాకుఁ గల్గినది. అవ్యాజ ప్రేమమహేతుకముఁగా జనించునం దురు! మీకింకను వివాహము కాలేదని గ్రహిం చితిని. మీతండ్రిగారి నడిగిన నేమందురో యని భయపడితిని. మీ రేవియో యల వికాని నిర్బంధములలోఁ జిక్కుకొని యున్నా రనికూడ నే ననుమానపడుచున్నాను. నామ నస్సు పరిపరివిధములఁ బరితపించుచున్నది. మి మ్మీనిర్బంధములనుండి తొలగించి, సౌఖ్య మెట్లయినఁ జేకూర్చవలెనని నే నుత్సహించు చున్నాను. ఇంతవఱకు చెప్పినందులకు మన్నిం చి నాకాజ్ఞ నిచ్చెదరా? మీ యుదంతమునం తయు నీస్నేహితునివీనులఁ బడవైచెదరా? ఈ స్నేహితుని సహాయమును స్వీకరింతురా?"

"నే నవివాహితనే కాని, యస్వాధీనను; నన్నావరించుకొనియున్న నిర్బంధములవలన నేనేవిషయమును జెప్పలేననిన, నన్నుక్షమింప వలయును. నానాలుక నాస్వాధీనమున లేదు. మీరు నన్ను నిష్ఠూర్యము చేయవలదు."

"అట్లయిన మీ రానిర్బంధములనుండి వెలువడరాదా? నేను మీకు సహాయము చేసె దను. మీ కేయాపదయు రాకుండఁ జూచె దను."

"అదేమియుఁ గార్యకారి కానేరదు. నన్నావరించిననిర్బంధములు మానవాతీతములని నానమ్మకము. మీరు నాజోక్యమునకు రావలదని నాప్రార్థన. వచ్చినచో మీకుఁ గూడఁ గీడు దాపరించునేమో యని నాభయము మీకుఁ గీడుకలిగినచో, నా కిఁక నుత్తరగతు లుండవు. మీమాటలను నామనస్సులోనే యుంచుకొనెదను. ఇఁక మీరు నాప్రశంస నెత్తవలదని వేయివిధములఁ గోరుచున్నాను. క్షమించి మీదారిని మీరు పొండు."

"అట్లు పట్టి విడుచుస్వభావమే కలవాఁడనైనచో,నీగ్రామమునఁగలపోలీసువారు విడిచిన పరిశోధనకు నే నేల పూనుకొనెదను? కార్యాంతమువఱకును విడువకుండుట నాయలవాటు. అట్టులేయీవిషయమునఁగూడ నాయోపినంత వఱకుఁ బ్రయత్నించి మీ కానిర్బంధములను దొలఁగింపఁ బ్రయత్నించెదను. ఆపైన మీయిష్టము."

"నేను మీయెడఁ బరిపూర్ణమైన స్నేహభావముతోఁ జెప్పుచున్నాను. నేనే స్వతంత్రురాలనైనచో మీదయకుఁ దగినట్లే వర్తించెడిదానను. నేను నిర్భాగ్యురాలను. నావిషయమునఁ బరిశ్రమచేసినచో, మీకును గీడుసంభవించునని నిశ్చయముతో మీకు సలహానిచ్చితిని. నాయందు దయయుంచి మీరా ప్రయత్నమును జేయక విరమింపుఁడు."

మీకుఁ దిరిగి స్వతంత్రత లభించువఱకు నే నాప్రయత్నమును విడచుట కల్ల.నాయుద్దేశము కొనసాగినచో, నాకుఁ గీడువచ్చినను సమ్మతమే! నే నిఁకఁ బోయెదను. నేను జెప్పిన వాక్యములను జ్ఞాపకముంచుకొనుఁడు. మీ కెప్పుడైనను, నాసహాయము కావలసినచో నేను సిద్ధముగా నున్నాను. ఈనారాయణప్ప సంగతి గనుఁగొనులోపల,మీకుఁగూడస్వాతంత్ర్యము నిప్పించెదన"ని విశ్వనాథ మామె ముఖమును జూచుచుఁబలికెను. ఈమాటల కామె దేహము కంపించుట నాతఁడు గ్రహించకపోలేదు. 'పోయివచ్చెద"నని చెప్పి, విశ్వనాథ మామెగదిని విడిచి వచ్చెను. ఆతని యనుమానమిప్పటికిఁ గొంత స్థిరపడెనని యాతనిముఖమే తెలుపఁ జొచ్చెను. ఎట్లైనను గుముద్వతి నావరించుకొనియున్న రహస్యనిబంధనాంధకారమును జీల్చి యామెకు సౌఖ్యమును జేకూర్పవలెనని యాతఁడు మనమున నింకను దృఢముగా నిశ్చయించుకొనెను. ఆమెకు వెంకోబారావును బెండ్లియాడు నుద్దేశమే యున్నచోఁ దన్నామె నమ్మఁదలఁచుటకైన మనమున నవకాశ మీయదని నిశ్చయించుకొనెను.

నాఁటిరాత్రినుండి కొంచెము తీవ్రయత్నములు జరుప నుంకించుటచే, నెట్లయిన మంచిదని యూహించి,నాఁటిమధ్యాహ్న మాతఁడు, పోలీసుపెద్ద ఇన్సిపెక్టరుగారియింటి కేగి ఆయనకుఁ దనను, తనకార్యము నెఱిఁగించుకొని, ఆయనచే నమితముగా గౌరవింపఁబడి వలసిన సహాయముఁ జేయఁగలఁడనివాగ్దానముఁబొంది, తనబసఁ జేరెను. గది తలుపుదెరచుసరి కాతని కొఱకొక యుత్తరము వేచి యుండెను. విప్పి చూడఁగా నందుఁ దొందరలో వ్రాసిన మూఁడుపంక్తులు మాత్రమే దస్కతేమియు లేకుండ నిట్లుండెను.

"నే నాఁడుదాననైనను నమ్మకద్రోహ మును జేయనని మీకు నాయందు విశ్వాస మున్నచో మీ యుదంతమునంతయు నా కెఱింగింపుడు. పిదప నాసంగతి మీకే గ్రాహ్యము కాఁగలదు. నే నేఁకనిర్భాగ్యురాలను" అని కుముద్వతి యనెను.

"మీరు నిర్భాగ్యులని యనుకొన్నను నా కట్లుకనఁబడుటలేదు. కావున మిమ్ములనునమ్మి నాయుదంతము నెఱింగించెదను. నేనో యప రాధపరిశోధకుఁడను. ఈగ్రామమున నాలు మాసముల క్రిత మదృశ్యుఁడైన కె. నారాయణప్ప సంగతి విమర్శించుటకై వచ్చితిని. ఏమి? అట్లు బెదిరి చూచెద రేల? మీ రాయన నెఱుఁగుదురా?"అని తన మొగమునుండి దృష్టి మరల్చినకుముద్వతి నాతఁ డడిగెను.

ఆమె మాటాడలేదు. విశ్వనాథము తన ప్రశ్నను దిరిగి యడిగెను. ఒకనిమిషమైన తర్వాత "ఆయనకేదో భయంకరమగునాపత్తు తటస్థించిన ట్లెవరో రైలులోఁ జెప్పఁగా విని యుంటిని. అది జ్ఞప్తికివచ్చిన"దని యామె మొగమును ద్రిప్పకయే తనచేతివైపు చూచి కొనుచు నస్ఫుటముగాఁ బల్కెను. విశ్వనాథ మిది తప్పక బూటకమే యని గ్రహించెను.

"నాతో మీ రేదో హితముగూర్చు మాటల నాడెద నంటిరి? ఏవిషయమును గు ఱించియో, తెలిపెదరా?" అని యామె ఓసుగు దలతోఁ బ్రశ్నించెను.

విశ్వనాథము ధైర్యముదెచ్చికొని యిట్లు చెప్పెను. "మిమ్మున నీసత్రమునఁ జూచినది మొదలు మీ రేదో యొకకష్టమున నున్నా రనియు, మీకు సాధ్యముకానికారణాంతర ములచేఁ గృశించుచున్నారనియు నేను గ్రహిం చితిని. నన్ను నవిస్తరముగాఁ జెప్పుమనెదరా?" కుముద్వతి నెమ్మదిగా "ఊ" అనెను.

"ధైర్య మిచ్చితిరి కాన, చెప్పెదను. నే నవివాహితుఁడను. కావలసినంత యాస్తి యు న్నది. మీకు సర్వవిధముల సౌఖ్యము నొడఁ గూర్పవలయునను నుద్దేశము నాకుఁ గల్గినది. అవ్యాజ ప్రేమమహేతుకముగా జనించునం దురు! మీకింకను వివాహముకాలేదని గ్రహిం చితిని. మీతండ్రిగారి నడిగిన నేమందురో యని భయపడితిని. మీరేవియో యల వికాని నిర్బంధములలోఁ జిక్కుకొని యున్నా రనికూడ నే ననుమానపడుచున్నాను. నామ నస్సు పరిపరివిధములఁ బరితపించుచున్నది. మి మ్మానిర్బంధములనుండి తొలగించి, సౌఖ్య మెట్లయినఁ జేకూర్చవలెనని నే నుత్సహించు చున్నాను. ఇంతవఱకు చెప్పినందులకు మన్నిం చి నాకాజ్ఞ నిచ్చెదరా? మీ యుదంతమునం తయు నీస్నేహితునివీనులఁ బడవైచెదరా? ఈ స్నేహితుని సహాయమును స్వీకరింతురా?"

"నే నవివాహితనే కాని, యస్వాధీనను; నన్నావరించుకొనియున్న నిర్బంధములవలన నేనేవిషయమును జెప్పలేననిన, నన్నుక్షమింప వలయును. నానాలుక నాస్వాధీనమున లేదు. మీరు నన్ను నిష్ఠూర్యము చేయవలదు."

"అట్లయిన మీ రానిర్బంధములనుండి వెలువడరాదా? నేను మీకు సహాయము చేసె దను. మీ కేయాపదయు రాకుండఁ జూచె దను."

"అదేమియుఁ గార్యకారి కానేరదు. నన్నావరించిననిర్బంధములు మానవాతీతములని నానమ్మకము. మీరు నాజోక్యమునకు రానలదని నాప్రార్థన. వచ్చినచో మీకుఁ గూడఁ గీడు దాపరించునేమో యని నాభయము మీకుఁ గీడుకలిగినచో, నా కిఁక నుత్తరగతు లుండవు. మీమాటలను నామనస్సులోనే యుంచుకొనెదను. ఇఁక మీరు నాప్రశంస నెత్తవలదని వేయివిధములఁ గోరుచున్నాను. క్షమించి మీదారిని మీరు పొండు."

"అట్లు పట్టి విడుచుస్వభావమే కలవాఁడనైనచో, నీగ్రామమునఁగలపోలీసువారు విడిచిన పరిశోధనకు నే నేల పూనుకొనెదను? కార్యాంతమువఱకును విడువకుండుట నాయలవాటు. అట్టులేయీవిషయమునఁగూడ నాయోపినంత వఱకుఁ బ్రయత్నించి మీ కానిర్బంధములను దొలఁగింపఁ బ్రయత్నించెదను. ఆపైన మీయిష్టము."

"నేను మీయెడఁ బరిపూర్ణమైన స్నేహభావముతోఁ జెప్పుచున్నాను. నేనే స్వతంత్రురాలనైనచో మీదయకుఁ దగినట్లే వర్తించెడిదానను. నేను నిర్భాగ్యురాలను. నావిషయమునఁ బరిశ్రమచేసినచో, మీకును గీడుసంభవించునని నిశ్చయముతో మీకు సలహానిచ్చితిని. నాయందు దయయుంచి మీరా ప్రయత్నమును జేయక విరమింపుఁడు."

మీకుఁ దిరిగి స్వతంత్రత లభించువఱకు నే నాప్రయత్నమును విడచుట కల్ల. నాయుద్దేశము కొనసాగనిచో, నాకుఁ గీడువచ్చినను సమ్మతమే! నే నిఁకఁ బోయెదను. నేను జెప్పిన వాక్యములను జ్ఞాపకముంచుకొనుఁడు. మీ కెప్పుడైనను, నాసహాయము కావలసినచో నేను సిద్ధముగా నున్నాను. ఈనారాయణప్ప సంగతి గనుఁగొనులోపల, మీకుఁగూడస్వాతంత్ర్యము నిప్పించెదన"ని విశ్వనాథ మామె ముఖమును జూచుచుఁబలికెను. ఈమాటల కామె దేహము కంపించుట నాతఁడు గ్రహించకపోలేదు. 'పోయివచ్చెద"నని చెప్పి, విశ్వనాథ మామెగదిని విడిచి వచ్చెను. ఆతని యనుమానమిప్పటికిఁ గొంత స్థిరపడెనని యాతనిముఖమే తెలుపఁ జొచ్చెను. ఎట్లైనను గుముద్వతి నావరించుకొనియున్న రహస్యనిబంధనాంధకారమును జీల్చి యామెకు సౌఖ్యమును జేకూర్పవలెనని యాతఁడు మనమున నింకను దృఢముగా నిశ్చయించుకొనెను. ఆమెకు వెంకోశారావును బెండ్లియాడు నుద్దేశమే యున్నచోఁ దన్నామె నమ్మఁదలఁచుటకైన మనమున నవకాశ మీయదని నిశ్చయించుకొనెను.

నాఁటిరాత్రినుండి కొంచెము తీవ్రయత్నములు జరుప నుంకించుటచే, నెట్లయిన మంచిదని యూహించి, నాఁటిమధ్యాహ్న మాతఁడు, పోలీసుపెద్ద ఇన్‌స్పెక్టరుగారియింటి కేగి ఆయనకుఁ దనను, తనకార్యము నెఱింగించుకొని, ఆయనచే నమితముగా గౌరవింపఁబడి వలసిన సహాయముఁ జేయఁగలఁడనివాగ్దానముఁబొంది, తనబసఁ జేరెను. గది తలుపుదెరచుసరి కాతని కొఱకొక యుత్తరము వేచి యుండెను. విప్పి చూడఁగా నందుఁ దొందరలో వ్రాసిన మూఁడుపంక్తులు మాత్రమే దస్కతేమియు లేకుండ నిట్లుండెను.

"మీ రీ ప్రయత్నమునుండి విరమించుట నా ముఖ్యోద్దేశము. భగవదనుగ్రహమున నేను స్వాతంత్ర్యముఁ బొందఁ గలిగినచో నే నీ నాఁడాడినమాటలను మరువను; కాని మీ రిట్టి ప్రయత్నమును జేసి కీడు బొందెదరని విరమింప మిక్కిలి వేఁడుచుంటిని".

ఈలేఖ వ్రాసినదెవ్వరో తెలియనవసరము లేదు. విశ్వనాథ మాయుత్తరమును నాలుగైదుసారులు పఠించి తానాదినమున నుండి సలుపఁబోవు తీవ్రప్రయత్నముల కీయుత్తరము శుభసూచకమని మనస్సులో నిశ్చయించుకొనెను. ఈయుత్తర మాతనిసందేహమును బలపఱచుటయే కాక, తప్పక తాను జేయఁదలఁచిన ప్రయత్నమును కొనసాగింపవలెననికూడ నిశ్చయమును వృద్ధిచేసెను.

నాఁటి సాయంకాలము తిరిగి యథాప్రకారముగాఁ గుముద్వతియును నానారావును సత్రవును విడిచిపోవుసమయమును జూచి, విశ్వనాథము తానిటీవలఁ జేయించిన మారుతాళపుచెవిచే వారిగదిని దెరచి, తలుపు లోనబిగించి సుమా రొక యరగంటకాలము తనయొద్దనున్న మారుతాళపుఁ జెవులగుత్తి సహాయమున వారిపెట్టెలను దెరచి సమస్తమును శోధించెను. కాని వానియాశోధన విశేషఫలదాయకమైనట్లాతఁడు తృప్తిపడలేదు. వెంకోబారావు వ్రాసిన రెండుమూఁడుత్తరములును నాలుగైదచ్చుపుస్తకములును రెండు భూవివరములను దెలుపుస్టాంపుపత్రములును, దానికి సంబంధించిన కవులుకాగితములు మొదలగునవియు గలవు. ఆభూములన్నియు రెండుఖండములుగా నంతకుఁబూర్వము నాలుగేండ్లనాఁడు నానారావు కొన్నట్లును, అందుపై గుత్తదారు లిచ్చుశిస్తులను దెలియఁజేయు పత్రములను జూచి, విశ్వనాథ మతఁడింకేటి ధనవంతుఁడగునా కాదా యనుసందేహముఁ బొంది ఆభూములున్న కర్నూలు సమీపమందలి గ్రామములపేరులను మనస్సులో నిలుపుకొని, త్వరలో నాయంశమును నిర్ణయించుకొనవలెనని నిశ్చయించుకొనెను. ఆయుత్తరము పైకవరులు లేకుండుటచే నేగ్రామమున కవివ్రాయఁబడియుండెనో నిర్ణయించుకొనుట కాతనికి సాధ్యము కాకపోయెను. కాని యుత్తరములలో నాతఁడు మహాదేవనానారావని పిలువఁబడుటచే నాతని సంపూర్ణనామ మదియని తెలిసికొనెను. ఇక జాగుచేసిన నేమగునోయని, యాతఁడు వస్తువులనెల్ల యథాప్రకారముంచి గది బిగించి బయట కరుదెంచెను. కర్నూలునకేఁగ నెప్పు డేఁగవలయునని యాతఁ డాలోచింపఁ దొడఁగెను.

IV. సంధానము

ఆతఁడు నానారావుగదినుండి శీఘ్రముగ పై కరుదెంచుట మంచిదే యయ్యెను. ఇఁక నొకయిరువదినిమిషము లైనను గడువకపూర్వమే, నానారావును, కుముద్వతియును దిరిగి వచ్చిరి. కుముద్వతి మొగము జేవురించుకొని యుండెను. ఆమె విశ్వనాథమువైపు చూడకయే, సరాసరిగ గదితలుపుదీసికొని లోనికేగెను. నానారా వరుగుపైఁ గూర్చుండిన విశ్వనాథమునొద్ద కరుదెంచి, "నేను దొరసానిచే నామెను బసీకుచేయించితిని. రేపటినుండి,

యౌషధము నిచ్చెదనని యామె చెప్పినది. మీమందిఁకనవసరము లేదు. మీకిచ్చిన శ్రమకు మమ్ములను క్షమింపవలెను" అని పలికెను. విశ్వనాథము "కానిండు; ఎచ్చట మందు నిప్పించినను, ఆమెకు స్వస్థత కలుగుటయే కదా మన యుద్దేశము." అనెను. కొంచెము కాలము గుంటూరునందలిఎండలనుగుఱించియు, రైళ్లను గుఱించియు మాటలాడి నానారావు తనగది కేగెను.

రాత్రి ఎనిమిదిగంటలకు, భోజనము చేసి తన జేబుననున్న పిస్తోలును సరిచూచికొని, తన యొద్దనున్న త్రాటి నిచ్చెనను గూఢముగాఁ గప్పుకొనియున్న వస్త్రములో దాఁచి, సత్రము విడచి, యాఁచీఁకటిలో నరండేలుపేట లోని వెంకోబారావుయొక్క యింటిప్రాకారము వెనుకభాగమును జేరి, యచ్చటనిర్మానుష్యముగ నుండుటకు సంతసించి, తన త్రాటి నిచ్చెనను గోడమూల కమర్చి, గోడ నెక్కి నిచ్చెన నావలకు లాగికొని, ప్రాకారమునం దెవ్వరును లేకుండుటచూచి మెల్లఁగాఁ గ్రింద కుదిగి దొడ్డిలోనిచింతచెట్టునెక్కి గుబురుగా నున్న శాఖలనడుమఁ గూర్చుండి నాల్గు దిక్కులను బరిశీలించెను. గతదినమునఁ దేఁబడినకొబ్బరి మొక్క లింకను పాతింపఁబడక, యావరణలో నొకమూల నుంపఁబడినవి. ఇంటఁగూడ నిశ్శబ్దముగ నుండెను. మేడపైగదియందు కిటికీలను దెరచికొని, వెంకోబారావును రత్నసామియు నేమియో మాటలాడుకొనుచుండిరి. రాత్రి పదిగంటలగుటచే వారాగవాక్షములను బంధించి, నిద్రకుఁ గాఁబోలు నేగిరి. ఒకయరగంట కాల మూరకుండి, విశ్వనాథము వృక్షము నుండి క్రిందకుదిగెను. ఆవరణము దాఁటి యిల్లు చేరవలయునను నుద్దేశముతో నాతఁడు బయలుదేరెను. కాని నాలుగడుగులు వైచుసరి కాతఁడు హఠాత్తుగా నొకపెద్దగోతిలోఁ బడెను. చీఁకటిలో దారి తెలియక యాతఁడు సుమారు పదియడుగులలోఁతుగల యాగోతినుండి, కష్టమున వెలువడివచ్చి, జాగ్రత్తతో ముందునకు సాగెను. ఆవరణమునం దింకను గొన్ని స్థలములయందట్టిగోతులు త్రవ్వఁబడియుండెను. కాని యందేదియు నింతలోఁతు లేదు. నాలుగైదడుగులలోఁతుకన్న నెక్కువలోఁతు లేదని యాతఁడందందు దిగి గ్రహించెను. త్రవ్విన మన్నంతయు నావరణలో నొకమూలఁ జేర్పఁబడియుండుటచేఁ దన కీయవస్థ కలిగినదని తలంచి యింతపెద్దగొయ్యి కొబ్బరి చెట్టును బాతుటకేలయని యనుమానించుచు నిల్లు చేరెను. గదులకున్న గవాక్షముల యినుపయూచల నాతఁడు చేతితోఁ దడుముచు వాటిగట్టిదనమునకు సంకోచించుచు, నింటినుండి వచ్చుశబ్దము లేమియు లేకుండుటచే, తానిఁక నందుఁ దడసినను బ్రయోజనముండదనియుఁ దన కారాత్రి గోతియందుఁ బడునవస్థ దుశ్శకునము కాఁబోలుననియు, నిర్ణయించుకొని, తిరిగి వచ్చినదారినే గోడదాఁటి తనత్రాటినిచ్చెనతో సత్రము నర్ధరాత్రమునఁ జేరెను.

ముందీనానారావుయొక్క యాస్తివిషయముగల యనుమానమును దీర్చికొనవలయునని నిశ్చయించుకొని, తనసామానును సర్ది

కొని, రాత్రి యొంటిగంటన్నరకు గుంటూరు నుండి బయలుదేఱిపోవు రైలులో నాతఁడు కర్నూలునకుఁ బ్రయాణమై పోయెను. మరు నాఁడు సాయంకాలమున కాతఁడు కర్నూలును జేరి రాత్రి యచ్చటనే యొకహోటలున భుజిం చి పరుండెను. తెల్లవారినతర్వాత నాతఁడు బండిని గట్టించుకొని నానారావునొద్దనున్న పత్రమునఁ జెప్పఁబడిన మొదటిగ్రామమునఁ జేరి, కరణమింటి కేగెను. ఆదినమున వానియింటనే భుజించి, విచారింపఁగా నాయూరున, నానా రావునకుఁ బత్రముల వ్రాసియిచ్చిన పేరులు గలవారైతు లెవ్వరు లేరనియు, మహాదేవ నానారావనుభూస్వామి యాధీనమున నా గ్రామమున భూములేవియు లేవనియు, ఆగ్రా మము పేరుగల గ్రామము కర్నూలు దగ్గరనే కాకుండ, యాజిల్లాలో మరెచ్చటను లేద నియు, ఖండితముగాఁ గరణము చెప్పుటచే, విధిలేక తిరిగిసాయంకాలమునకు కర్నూలుఁ జేరెను. ఇంతదూరము వచ్చినతర్వాత రెండవ గ్రామమునకుఁగూడఁ బోయి ఏల విచారింపరా దని, తలంచి మరునాఁడుదయమున నాతఁడచ్చ టకుఁ బండ్రెండుమైళ్లదూరముననున్న రెండవ గ్రామమును జేరెను; కాని యచ్చటఁగూడఁ దన కట్టినసమాధానమేలభించుటచే, నిరుత్సాహుఁడై కర్నూలునకుఁ దిరిగి వచ్చి, మరునాఁ డుదయ మున బయలుదేరురైలులో నాతఁడు ప్రయా ణముఁజేసి, రాత్రికి మార్కాపురమును జేరెను. గ్రామమున నెచ్చటవిచారించినను, మహాదేవ రావును గాని, నానారావునుగాని, మహాదేవ నానారావునుగాని ఎఱింగినవా రెవ్వరు నాత నికిఁ గన్పడలేదు. విసిగి నేసారి ఇదియంతయు నేదియో తప్పక మోసమని నిశ్చయించుకొని, బయలుదేరిన యాఱవదిన ముదయమున కా తఁడు తిరిగి గుంటూరును జేరెను.

ముం దెట్లు ప్రవర్తింపలెనాయని, సత్ర మున తనగదియందుఁ గూరుచుండి యాతఁ డాలోచింప నారంభించెను. ఉదయమునుం డియు, నానారావు కాని కుముద్వతికాని, యాతనికిఁ గన్పడకుండుట యటుండ, వారిగది తలుపు బీగము వైచి యుండుటచే నాతఁడను మానించి, యిటునటుపరీక్షించి, ఎవ్వరును లేకుండుటఁ జూచి, తనయొద్దనున్న చెవితోఁ దాళమును దీసి చూచెను. కాని, సామానంత యు నచ్చటనే యుండుటచే, నాతనియనుమా నము శాంతించెను. కాని సాయంకాలమున నానారా వొక్కఁడే సత్రమున కరుదెంచి, కొంచెము కాలముండి, తనతో మాటలాడ కుండఁ దిరిగి తలుపును బంధించుకొనిపోవుట విశ్వనాథమున కర్థము కాక, కుముద్వతి యేమై యుండునా యని యతఁడాలోచింప నారంభిం చెను. ఆమెను వెంకోబారావును పెండ్లాడు టకువారేమేమియొందర చేయుచుండిరో యని యాతఁ డనుమానించెను. చీఁకటిపడిన తర్వాత నాతఁడు భోజనాదులను ముగిం చికొని, వెంకోబారా వింటిముందు భాగ మునఁ గొంతకాలము వఱకు వేచియుండెను, కాని విశేషము లేమియు నాతనికి గోచరింపక పోవుటచేఁ దిరిగి రాత్రి పదునొకండుగంటలకుఁ ద్రాటినిచ్చెన సహాయముచే నాతఁడు లోని కేగి యావరణమును దాఁటి యింటిని సమీపిం

చెను. ఆవరణయందు, కొబ్బరి మొక్కలు పాతఁబడెనని యాతఁడు గ్రహించెను. తాను బసియున్న పెద్దగోతియందుగూడ నొక మొక్క పాతఁబడియుండెను. ఆతఁడింటిచుట్టును, రెండు మూఁడుసారులు దిరిగినను, మధ్యమధ్య నెవ్వరో బాధపడుచున్నట్లు పైభాగమున నొకగది నుండి కాఁబోలును మూలుగుతప్ప, వేఱేమియు నాతఁడు గ్రహింపలేక పోయెను. కుముద్వతి యేమై యుండునని యాతఁ డాందోళనపడఁ జొచ్చెను.

రాత్రి యొంటిగంట కాతఁడు సత్రమును జేరెను. తిరిగి యొకసారి నానారావు గదిని బరీక్షించు నుద్దేశముతో నాతఁ డాగదిని దెరచి, దీపికాసహాయమున నాతనిపెట్టెనుండి యిది వఱలోఁ దాను జూచినయుత్తరములను బత్రములను సంగ్రహించి మరునాఁ డుదయమున పోలీసుఇన్స్పెక్టరును జూడవలయునని నిశ్చయించుకొని, గదిబిగించి, పత్రములను తన గదియందు దాఁచి, నిద్రించెను.

ఇన్స్పెక్టరు రాఘవేంద్రరావుగారింట నే యుండిరి. విశ్వనాథమున కింకొకయద్భుత కథ నాతఁడాయుదయమునఁ జెప్పవలసివచ్చెను. ఆగ్రామములో నిటీవల లాటరీయందు లాభముపొందిన రామనారాయణయనువైశ్యుఁడు తెనాలిప్రాంతముల భూములను గొని రావలెనని, నాటి కైదుదినములకుఁ బూర్వమింటఁ జెప్పి, సుమారు ముప్పదియైదువేల రూపాయీలనగదుతో నింటివారి కీ విషయము రహస్యముగా నుంపవలయుననియు, తాను మరునాఁడు తప్పక రాఁగలననియు, చెప్పి బయలుదేరి పోయి నేఁటివఱకు నింకను దిరిగి రాలేదట! తెనాలి ప్రాంతములకు రెండు దినములనుండియు నెందఱు పోయి వెదకినను, వానిజాడ తెలియలేదట. ఆతనియొద్దనుండి యింటివారి కేయుత్తరమును రాలేదట. "ఇంటివారు కళవళపడుచు, నాకిప్పుడే 'పిఫూరీ'చేసి పోయినారు. కే. నారాయణప్పకుఁ దోడుగా నీ రామనారాయణకూడ నంతరించినాఁడేమో తెలియదు. నా కేమియుఁ దోఁచుట లేదు" అని యాయనవిశ్వనాథమున కెఱింగించెను. విశ్వనాథము దీర్ఘాలోచనాతత్పరుఁడై కొంతకాలము మట్లేయుండి, తుదకు రాఘవేంద్రరావునకుఁ బూసగ్రుచ్చినరీతిగా దైవికముగాఁ దాను దెలిసికొనిన వింతవిషయముల నెఱింగించి రామనారాయణ కర్నూలువైపుపోవు విషయము నెఱింగింపక, కోమటికావున గోప్యమునకై తెనాలివైపుపోయివచ్చెదనని యింటివారితోఁ జెప్పియుండవచ్చుననియు, తాను జెప్పఁబోవు విధమునఁ బ్రవర్తించినచోఁ దమసాహసమువలనఁ గుట్టుబయల్పడఁగలదేమోయని తుదకు రాఘవేంద్రరావును సమ్మతింపఁజేసి యాతనితో నొకయరగంట రహస్యగోష్ఠి సలిపి, తనమకామును జేరెను. "సాహసేలక్ష్మి"యని యాతఁడు విశ్వసించియుండెను.

V సన్మానము

సాయంకాలమునాలుగుగంటలకు మారువేషముతోనున్న యిద్దఱు కనిస్టేబులను సత్రపుటరుగుపైఁ గూర్చుండబెట్టి, రాఘవేంద్రరావు విశ్వనాథముగదిలోఁ బ్రవేశించెను. ఆ దినమునఁగూడ నొంటిగనే యాతఁడుఁ బూర్వ

మే తనగదిని బ్రవేశించిననానారావ్రను జూచి విశ్వనాథము, కుముద్వతి యేమైయుండనోపు నని కళవళపడుచున్న కాలమున రాఘవేంద్ర రా వరుదెంచుట యాతనికిఁ గొంత యుత్సాహము కలిగింపగా "నాతఁడు వచ్చి లోపల నున్నాఁడు. సమయ మునూచి పనిచేయదము కూర్చుండుఁడు" అనెను. రాఘవేంద్ర రా వ్రప విష్టుఁ డాయెను. ఇరువురు నాగదివంకఁ జూచు చుండిరి.

ఇఁక నొక నిరువదినిమిషములలో నానా రావు గదితలుపుదెరచి బయలు కరుదెంచి, తిరిగి తాళము వేయుసమయమున విశ్వనాథ మునురాఘవేంద్రరావును బయ లు వె డ లి వచ్చిరి. విశ్వనాథము నానారావుభుజముపైఁ జేయి వైచెను. రాఘవేంద్ర రా వతనిహస్త ముల కరదండములను దగిల్చి, "ఇప్పుడు నీ వేమి చెప్పిన, నది యెల్ల నీపై సాక్ష్యముగ నుపయోగింపఁబడున"ను మామూలుహెచ్చ రిక నొసంగెను. అరదండములఁ జూచి భయ విస్మయములకు లోనై యాతఁడు విశ్వనాథము వైపు తేరబారిచూచి, పండ్లు పటపటకొఱ కుచు "నీవేనా" యనెను. విశ్వనాథము సమా ధాన మీయలేదు. మామూలుహెచ్చరికల తో రాఘవేంద్రరావొక జట్కాను దెప్పించి యందాతనిని స్టేషనునకు దీసికొనిపోయి, ఖైదు నందుంచి, తిరిగి సత్రమున కరుదెంచెను. ఈ సంగతిఁ జూచిన స్వల్పసంఖ్యాకులు తన్నడిగి నను, తనకావిషయ మేమియుఁదెలియదను టచే, క్రమముగా విడిచిపోయిరని, విశ్వనాథము తిరిగి వచ్చిన రాఘవేంద్రరావుతోఁ జెప్పెను. చీఁకటి పడెను.

పరిశోధకు లిర్వురును, ఆగదిని దెరచి, లోపలఁబరీక్షించిరి. కాని వారి కందుపైకము కాని, నేరమున కాధారమైన యితరవిషయ ములుగాని, లభింపలేదు. రాఘవేంద్రరావు నిరాశఁ జెంది "మనమన్యాయముగాఁ దొందర పడలేదు కదా? దారిపోడుగున నాతఁడు మీ రేమో తనపై లేనిపోనినిందలను మోపియుండ వచ్చుననియు, దాను మర్యాదస్థుఁడననియును ఏమేమో నదరసాగినాఁడు" అనెను.

"మిగిలినవిషయముకూడఁ గడముట్టఁజేసిన తర్వాతనేకదా మనము నిరాశఁ జెందవలసి నది? త్వరలో మీరు భోజనముచేసి వచ్చిన చో, మన మదికూడఁ బూర్తిచేసెదము" రాఘవేంద్రరావ్రను, విశ్వనాథమును భోజన మునకు బయలుదేరిపోయిరి.

సరిగా రాత్రి ఎనిమిదిన్నరగంటల కిద్దఱు మారువేషముల నున్న కనిస్టేబులతో తనగది యొద్ద కిరుదెంచిన రాఘవేంద్రరావ్రతో బయలుదేరి విశ్వనాథము నెంకోబారావు భవనమును జేరి తలుపుదట్టెను. రత్నసామి వచ్చి తలుపుదీసెను. వెంటనే విశ్వనాథ మా తనినోటిపై చేయి వైచి, యదిమిపట్టినప్పుడే రాఘవేంద్ర రా వాతనిచేతుల కరదండములను దగిలించి," మాటలాడినచో చితుకగొట్టె దను; జాగ్రత్త" అనెను. చేయున దేమి యును లేదని కాబోలు నిస్పృహఁ జెంది, రత్నసామి మాట్లాడలేదు. వానిని దమతో వచ్చిన కనిస్టేబుల యధీనము చేసి, వీధి

వాఁకిటనుంచి,తలుపు లోపలబంధించి, రాఘవేంద్రరావును దలుపునొద్దఁ గావలియుంచి విశ్వనాథ మింటిదిగువ గదులన్నియుఁ బరిశోధించెను. కాని వాని కంటెట్టిదియు గోచరింప లేదు.తరువాత నాతఁడు రాఘవేంద్రరావుతో మేడపైకి మిగుల నెమ్మదిగా బయలుదేరెను. మధ్యహాలులో నెవ్వరును లేరు కాని, వెనుకవైపుననున్న యొకగదినుండి, ఎవియో సరిగా వినఁబడనిమాటలవలె శబ్దము వచ్చుటచే నిశ్శబ్దముగా నిరువురు నాగదిని జేరిరి.

"నీ కింకొక యర్ధగంటమాత్రమే గడువున్నది. ఈలోపుగా మహదేవ్రవచ్చినను రాకున్నను, నే నాసీసాలోని దానిని విడిచి తలుపుపైన బిగించి పారిపోయెదను. ఈరాత్రి దాఁటి మేమిఁక నీగ్రామమున నుండఁదలఁచుకొన లేదు. ఈగది గవాక్షములేవియుఁ, నీకుఁ దెరచుటకు సాధ్యముగావు. నన్నుఁ బెండ్లాడెదవా నీకుఁ గావలసినంత——"అని చెప్పుచున్న పురుషుని కంఠమునకడ్డై "నీవంటి దుర్మార్గునితోఁ బొత్తుకన్న నాకు మృత్యువే మేలు;విడువు మిప్పుడే యాసర్పమును విడువుము——నిశ్చింతగా మరణించెదను" అని బదులుచెప్పిన స్త్రీస్వరము కుముద్వతిదిగా నెఱింగ రోషము తనసహజబలము నినుమడింప, విశ్వనాథము తనశక్తి కొలఁదిని, తలుపును దన్నెను. తలు పాతాపునకు విడిపోయెను. పరిశోధకుల కిర్వురకు నెదుట విచిత్రమగురంగము కన్పించెను. కుర్చీకిబంధింపఁబడిన యవయవములతోఁ గృశించి బెదరియున్న కుముద్వతియు, నామెసమీపమున నున్నబల్లపైపెద్దగాజుసీసాయందుఁ బవ్వళించియున్న పెద్దసర్పము, నాబల్లకు సమీపముగా నీయద్భుతధ్యాన మేమైయుండునని కళవళపడుచు నిల్చియుండిన వెంకోబరావును గన్పడిరి. బల్లపైనున్నసీసా నెత్తి నేలపైఁ బడవేయుటకుఁ గాబోలు నాలోచించుచున్న వెంకోబారావును జూచి, "ఉన్నతావునుండి కదలినచో నీపిస్తోలు నిన్ను రూపుమాపును" అని హెచ్చరించి, విశ్వనాథ మాతనిపై కురికి, వానినినేల కదిమిఁపట్టెను. "హా! హా!" అనుశబ్దములమాత్ర ముచ్చరించి కుముద్వతి కుర్చీలో మూర్ఛిల్లెను. రాఘవేంద్రరా వావెంకోబరావును బంధించి, సంకెళ్లను దగిలించిన తర్వాత విశ్వనాథ మాతురతతోఁ గుముద్వతి బంధములను తొలఁగించి యామెకు శైత్యోపచారములు చేసి యామెకు స్పృహకలుగునట్లు చేసెనుకాని యామె యీలోకమున నున్నట్లు లేదు. వెఱ్ఱిచూపులఁ జూచుచు మహాభయము నెంబడి మహాసౌఖ్యము లభించినహేతువుచే మతితప్పినట్లుకన్పట్టెను.విశ్వనాథ మరగంటవఱకుఁ బ్రయత్నించినను ఆమె మాట్లాడకుండుటచేభీతిల్లి యామెను దత్‌క్షణమే వైద్యశాలకుఁ దీసికొనిపోవలయునని నిశ్చయించుకొని బంధింపఁబడిన వెంకోబారావును స్టేషనుకుఁదీసికొనిపోయి ఇంటికి బీగమును వైచి సీల్లువైచి మరునాఁడుదయమున నిల్లంతయుశోధింపవచ్చునని రాఘవేంద్రరావుకు సలహాయిచ్చి, విశ్వనాథ మొకజట్కాపై బలవంతముగాఁ గుముద్వతిని దీసికొని మిషన్‌ఆస్పత్రికి గొంపోయి, వైద్యురాలి కామెను జూపించెను. ఆమె దారుణమైన మెదడుజ్వరముచే బాధపడు

చుండవలెనని యచ్చటి వైద్యాధికారురా లా
మెను బరీక్షించి చెప్పెను. ఆమెకు శాంతియు
తమైన పరిస్థితులును, మంచి యౌషధసేవ
యు నవసరమనియు, దైవానుగ్రహము
వలన రెండు వారములలో నామె కారో
గ్యము కలుగవచ్చుననియుఁ గూడ నామె
దెలిపెను. ఆమె నారోగ్యవంతురాలుగాఁ
దిరిగి తన కప్పఁజెప్పుభార మావైద్యురాలిదే
యనియు, నామె యుపకారమునకుఁ దగిన
విశ్వాసము తా నుంచుకొనెద ననియు, దినదిన
మును దానుగూడ వచ్చి యామెను జూచిపో
వుచుందు ననియు, వాగ్దాన మొసంగి విశ్వనా
థము సత్రమున కరుదెంచెను. కాని యారాత్రి
యతని కెంతమాత్రమును నిద్ర లభింపకుం
డుట యాశ్చర్యము కాదు.

మరునాఁ డుదయముననే రాఘవేంద్ర
రావును నతఁడును, తగినవారిమెదుట నాయి
ల్లంతయు సోదా చేసిరి. నాలుగుగంటల కాల
మంతటను క్రిందను మీఁదను, మూలలను, సం
దులను బరీక్షింపగా ముప్పదియాఱువేలరూపా
యిలపై చిల్లరసొమ్ము వారలకు లభించుటచే,
వారినేరము నిశ్చయమని నమ్మి రామనారా
యణకళేబర మేమి చేసియుందురని వారాలో
చింపఁ దొడఁగిరి. అప్పుడు విశ్వనాథమునకు
దొడ్డిలో తానారాత్రి జారిపడిన పెద్దగోయి
జ్ఞప్తికివచ్చుటచే, రాఘవేంద్రరావునకుఁ దన
యనుమాన మెఱింగించి, కూలివాండ్రచే,
నందుఁ బాతఁబడిన కొబ్బరిమొక్క నూడఁబెరి
కించి, త్రవ్వఁగా త్రవ్వఁగా, నొకదుర్వాసన వెద
జల్లుబరువైనగోనెను పైకిఁదీయించి విప్పి చూ
డఁగా నందుఁ గ్రుళ్లి సిద్ధముగానున్న రామనా
రాయణశవము కన్పించెను. పంచాయితి జరిగి
నతర్వాత, నీదుర్మార్గు లిట్లన్ని చేసియుండిరో
యని శోధకుల కీర్ష్యరకు ననుమాన ముదయిం
చుటచే, దొడ్డినంతయును దేలోఁతువఱకుఁ ద్రవ్వ
వలసినదని కూలివాండ్ర కనుమతి నిచ్చి, అం
త్యక్రియలకు రామనారాయణుని యింటివా
రల కాశవమును వైద్యాధికారిపరీక్షానంతర
మిచ్చివేయవలయునని తీర్మానించుకొని, దానిని
వైద్యాలయమున కంపిరి. సాయంకాలమగుసరి
కాదొడ్డి యంతయుఁ బూర్తిగా 10 యడుగుల
లోఁతువఱకుఁ బదుగురుకూలీలలచేఁ ద్రవ్వింపఁ
బడెను. అందుండి ఇఁక నొకమూఁడస్థిపంజర
ములు వెలువడెను.

నేరము స్థిరమాయెను. విశ్వనాథము తన
యొద్దనున్న కాగితములను, కుముద్వతి వ్రేలి
నుండి తానా వెనుకటిరాత్రి తీసి యున్నయుం
గరమును రాఘవేంద్రరావున కిచ్చి యవస
రము కానిచోఁ దనసాక్ష్యమును గుముద్వతిసా
క్ష్యమునుగూడ వదలివేయవలయునని వేఁడు
కొని, తనమకామునకుఁ జేరెను.

కుముద్వతికి పదునాఱుదినములకుఁ దిరిగి
లోకజ్ఞాన మలవడెనుకాని, యామె యాజ్వర
ప్రభావముచే వెనుకటియంశముల నెల్ల మఱ
చిపోయెను. తనకొఱకు దినదినమును ఆస్పత్రి
కరుదెంచుచున్న విశ్వనాథ మామెకుఁ జిన్న
నాఁటిమిత్రుఁడట్లు మనమున నామె భావించు
చున్నట్లును, తన్నాతఁడు తప్పక పెండ్లియాడ
గలఁడనియు, మాత్రమే యామె తమతోఁ
జెప్పుచున్నదని వైద్యాధికారు రాలును,

కుముద్వతి కుపచారముఁ జేయుచున్నదా దులు నాతనితోఁ జెప్పిరి. నెలదినములకా మెకు సాధారణమైన యారోగ్యము కలుగుటచే గుంటూరుకంటె విశాఖపట్టణమున, సముద్రతీరమున నున్న తనయిల్లామె కెక్కువ యారోగ్యకరమని భావించి, తగిన రీతి నామెకుఁ బునర్జీవన మిచ్చిన వైద్యాధికారురాలిని బ్రశంసించి, సన్మానించి, యామెతోఁగూడి విశాఖపట్టణముఁ జేరి, యిల్లు ప్రవేశించిన యీజంటను జూచి విస్మయ పరవశుఁడై వెట్టినవ్వు నవ్వుచున్ననారాయణదాసున కాతఁడు సావకాశముగాఁ దనయుదంతము నెఱింగించి, "దయ్యములకొంప" కల్లుఁడను గావలసివచ్చిన దనెను.

శ్రావణమాసమున నొకశుభ ముహూర్తమున సింహాచలముకొండపైఁ గుముద్వతీ విశ్వనాథులవివాహ మహోత్సవము జరిగెను. ఆవివాహమునకు గుంటూరునుండి రాఘవేంద్రరావును,రామనారాయణుని బావమరదియు నరుదెంచిరి. ఈ దుర్మార్గులను రూపుమాపుటచేఁ దనకు జీతమభివృద్ధియైనదనుసంతోషముతో రాఘవేంద్రరావు వరున కొకవజ్రపుటుంగరమును; పోయిన యాస్తినంతయుఁ దిరిగి తమకు లభింపఁజేసినకృతజ్ఞతచే రామనారాయణుని భార్య తనసోదరునివలనఁ గుముద్వతి కొకకాసులపేరును బహుమానములుగా నాసమయమున నిచ్చిరి.

విశ్వనాథము రాఘవేంద్రరావు నా సాయంకాల మాకొండపై నొకచోఁ గూర్చుండిరి. "విచారణయంతయు ముగిసినది. ముగ్గురకు నురిశిక్ష విధింపఁబడినది. మీసాక్ష్యము లవసరమే లేకపోయినది.ఆమె ఎప్పుడైన గతసంగతులఁదలంచునా" అని రాఘవేంద్రరావనెను.

"ఆమె కాలోకమే లేదు. ఆమెదడు జ్వరముతో నామె గతమంతయు మఱచిపోయినది. ఇఁక నేను జ్ఞాపకముచేసినను బ్రయోజనము లేదు. నేరస్థులు తమనేరమే మైన నొప్పికొనిరా?"

"లేదు. చివఱకును ముగ్గురు నిర్దోషులమనియే చెప్పఁదొడఁగిరి. మహాదేవుఁడు మిమ్ములను మధ్యమధ్య నిందించి, మీరేమో మోసముచేసితిరని చెప్పినను మీ రాదినమున మ్యాజిస్ట్రేటుగారియెదుట నిచ్చినవాఙ్మూలమే మీరు రాకుండ మీపని నెరవేర్చినది"

మరునాఁ డెల్లరును విశాఖపట్టణముఁ జేరిరి రాఘవేంద్రరావు సెలవుదీసికొని, రామనారాయణ బావమఱదితో గుంటూరుచేరెను.

తాను వెదకఁబోయిన తీగె గుంటూరు సత్రమునఁ దనకాళ్లకే తగులుకొనుటచేఁ దనకుఁ దీవ్రమైన పరిశోధనాభార మంతయు తొలఁగుటయే కాక, తలవనితలపుగా సంసారతాపత్రయముకూడ తగుల్కొనెనని యాతడప్పుడప్పుడు నారాయణదాసుతోఁ జెప్పుచుండును.

——-——

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

## ప్రేమతత్త్వ నిరూపణము

### (ప్రథమభాగము)



ఒకమగనాలు తన్ను వల పుట్టిపడన్ సుఖపెట్టునట్టిభ
ర్తకు విషమజ్వరంబు స్మృతి తప్పఁగ వచ్చుటఁ జూచిచూచి త
ప్పక మరణించు నంచు భయవారిధి మున్గి యిఁకేల యంచు నం
తికమున నున్ననూతఁ బడి దేహముఁ బాసె నదేమిప్రేమమో!

చ. వరమతి పుణ్యశీల పతివత్ని యొకర్తెకు నొక్కకూర్మికూఁ
తురు గల దామె విద్యకయి దూరమునన్ వసియించెఁ గూఁతు చి
త్తరువును జూచి తృప్తిపడుతల్లియు నున్నటు లుండి పుత్రికా
మరణపుజాబు చూచినది మై విడనాడె నదెట్టిప్రేమమో!

చ చెలువము లేని దంచుఁ గులశీలసమన్విత యైన కాంతతోఁ
గలయిక మాని యొక్కఁ డొకకన్నియ వెండియుఁ బెండ్లియాడె నం
దులకయి కుంద కాసతియుఁ దొంటిగతిన్ బతిసేవ చేయు చ
గ్గలముగఁ గొన్నియేండ్లకును గాలముచేసె నదెట్టిభక్తియో!

## దుష్టప్రేమ

క. ఒక్కొకయెడ ననుచితమై, మ్రుక్కడియై యంధమగుచు మూఢుల నణఁగం
ద్రొక్కులె కాదీప్రేమం, బక్కట! చెలరేఁగి ప్రాణహానియుఁ దెచ్చున్.

చ. ఒకఁ డొకకన్నియన్ వలచి యుండును దానికి వానిమీఁద నిం
చుక వలపైన లే దతని చొప్ప నెఱుంగదు కానివార లొ
క్కొకయెడఁ దారసిల్లి తము నొండొరుఁ జూచెడిరీతి నైన దా
నికి వలపేమి లేమిఁ గన నేర్చునె యాతని గ్రుడ్డిభావముల్?

ఉ. వారవధూటిమక్కువకుఁ బాల్పడి యొక్కఁడు దానికుల్కులం
దీరినపల్కులన్ బ్రమసి తెచ్చుచు నిచ్చుచు నోజ జీవనా
ధారము లేక పేదవడి దాని కృపం గనఁ జూచిచూచి వే
సారియు దానిపంచ కొకసారియుఁ జేరక నిల్వఁజాలునే?

చ. ఎఱుఁగును దోసమంచు హితు లెల్లరు నందురు కూడదంచు వే
తెఱఁగుల, దాననైన పరధిక్కృతితాడనమర్దనాదులం
దఱచుగఁ బొందుఁ, గాని పరదారసమాగమలోలబుద్ధి యా
వెఱపున జంకునే వలపు వీడునె కంఠముఁ గత్తి డాసినన్?

చ. పరపురుషాభిలాషయగుభామిని భర్తకుఁ గూర్చు, నట్టులే
పరవనితాభిలాషుఁడగువాఁడును భార్యకుఁ గూర్చు, నప్పు డ
య్యిరువురు వారియిర్వురపయిం దమిగల్గి రనంగఁ దోఁచు, లో
నరసిన, వారియాత్మసుఖమందలిప్రేమ యొకండె తోఁచెడిన్.

చ. ధనములఁ గాంతలందు బహుధా పచరించెడి ప్రేమ లోకమం
దన విన రాని కార్యముల కాకరమై నయపుణ్యహీనవ
ర్తనమున హద్దుమీఱి భయదంబగు చొక్కొకపట్టునందుఁ గో
షనమయి జీవనంబుల కపాయము తెచ్చుచు నుక్కు గానమే?

చ. పరవనితానురాగరసపంకిలమానసుఁడై నమూఢుఁ డా
తరుణిపతిన్ వధించిన సదా తనకోర్కె ఫలించు నంచు న
చ్చెఱపనచేటసమ్మతి నిసింగొని, యంతనె యడ్డగించి ని
వ్వెఱపడుదానిఁ గొట్టి తెగవ్రేసెను దత్పతిఁ బ్రేమమెట్టిదో!

*  *  *  *  *

చ. తనకామించినకాంత యింకొకనిచేతం జిక్కుటం జూచి యా
తనిమీఁదం బగ దానిమీఁద వలవంతం బూని కామాంధలో
చనుఁడై క్రిందును మీఁదు గానక యవజ్ఞాలబ్ధసంరంభకో
పనుఁడై యొక్కరుఁ డాతనిం బనిచె రంభాసంగమప్రాప్తికై.

*  *  *  *  *

ఉ. జారిణులందు మక్కువను జారులు, జారులయందు మక్కువన్
జారిణు, లిట్లె యన్యులను జంపుట వీనుల సోఁకుచుండు, నీ
దారుణకృత్యకారణము తామసరాజసనీచభావ మీ
ఘోరపుఁబ్రేమ కేపనులు కూడనివో యిఁక నెంచి చూడుఁడీ!

*  *  *  *  *

చ. చదివినవార లిట్టిపని సల్పఁగఁ బోరని యెంచఁబోకుఁడీ!
చదువన మంచిచెడ్డలవిచారణయే యగు నట్లుకానిచో
నది యొకసాధనంబ యగు నన్యులఁ గన్నుమొఱంగ నీచదు
ర్మదమగుప్రేమ, కట్టి దెదురం గనరాదొకొ యెల్లవారికిన్?

చ. చదివినవారు లోకమును జక్కఁగఁ జూచినవారు కొందఱీ
మదమలినంపుఁ బ్రేమ నవమానము నెన్నక యన్యకాంతలం
గదియఁగఁ బోయి వచ్చుచు నెకానెకపట్టునఁ గాలుసేతులుం
గదలఁగరానిదెబ్బలకుఁ గాయము లీయరె వీథి కెక్కరే?

* * * * *

చ. మదమలినాత్ముఁ డొక్కఁడు కుమారులు భర్తయుఁ గల్గి యేఁబదేం
డ్లాదవినదానిమాయఁ బడి, యుత్తమశీలను ముగ్ధ "సేవ చే
యుదు నెదురాడఁబో నిచట నుండఁగ నిం"డని కోరుపత్నిఁ దా
నదయతఁ గొట్టి పంపె నకటా! కనుఁడీ యనురాగపద్ధతుల్!

* * * * *

చ. అలుకను సన్న్యసించు నొకయస్థిరచిత్తుఁడు వెన్క నాలుబి
డ్డల నెడఁబాయుటం గటకటం బడుచుం బదియేఁడు లల్లె ద
ర్వ్వాలఁ బడి యుండియుం దుదకుఁ బుట్టగతుల్ సెడ నిల్లుచేరి యా
కులపడుమానినిం గదియఁ గోరెను గంటిరె ప్రేమచెయ్దముల్!

* * * *

చ. మమత తొలంగకున్నఁ దనమానినిఁ బుత్రులఁ బెంచునట్టి క
ష్టమును భరింపలే కొకఁడు జందెము జుట్టును దీసివైచి దే
శములు తెగించిపోయి ధనసంగ్రహముం బొనరించి తొంటియా
శ్రమమున వారిపెండిలికి సాయపడెం గనుఁ డెట్టికూర్మియో!

చ. ఇఁక నొకఁ డాలిపైఁ గినిసి యెక్కడికో చని సన్న్యసించి త
న్నొకనిముసంబు నే నరయకుండఁగఁ జాలనికన్నబిడ్డలం
దకుటిలమైనప్రేమ విడనాడఁగఁ జాలక యొండు జందె మొ
ద్దిక మెడఁ దాల్చి వచ్చెఁ బెదతిర్మల కేగితినంచుఁ జెప్పుచున్.

ధనప్రేమ

క. జగమంతయు ధనమూలం, బగుఁ గావున ధనమునందు సఖలజనులకున్,
దగులము నైజం బయ్యది, తగు నిది తగ దనెడినీతిఁ దలపోయు నెవ్వఁడో!

చ. వినయదయానయాలయవివేకము శూన్యముగా నధర్మవ
ర్తనమున సత్యభాషణ మదక్షీణవంచన మూఁతగా ధనా
ర్జనపరమార్థసాధనవిచారణ చేయుచునుందు రెందఱో
ఘనులు మహానుభావు లధికారులు విద్యనెఱుంగువారు నై.

మ. కనులం గప్పను గన్నుఁ గ్రుచ్చు మతివైకల్యంబు గల్గించు నిం
దను రావించును గిన్కఁ జూపు నెదసంతాపంబు గావించు నిం
కను వే యేలొకొ! తిట్టుఁ గొట్టు మఱి పైగాఁ జంపనుం జంపు నై
నను లోకంబు ధనంబుపైఁ దమకముం దప్పింపఁగాఁ జాలునే?

చ. పరుసఁదనంబు చూపి పరవంచనఁ జేసి యసత్య మాడి పా
మరుల నణంచి యన్యులకు మచ్చర మెచ్చఁగఁ జేసి దుష్క్రియా
చరణమె వృత్తిగాఁగ ధనసంచయముం బొనరించుచుండరే?
యరయ ధనానురాగ ముచితానుచితార్థవిభేద మెన్నునే?

ఉ. రేపును మాపుఁ గూడి కడుఱిప్పన నాయువు పోవు, శక్తియున్
రూపము జవ్వనంబు మతి రోగజరాదులఁ బోవు, భార్యయున్
బాపలు బంధుమిత్రు లెడఁబాయుదు రయ్యయిపట్లఁ గాని యీ
పాపధనానురాగ మెడఁబాయునె దేహిని జచ్చుచుండినన్

మ. ధనముం బ్రాణముకంటెఁ దీపిగ సదా ధ్యానించుచున్ నిత్యమున్
గని యాసంచులు తృప్తిగాంచు నొకఁ డుగ్రవ్యాధికిం జిక్కి మా
టను గోల్పోయి మొగాదిగం గనుచు నుండన్ మూఁడు నాళ్లంత నం
దను లాసంచులు పక్కఁ బెట్టి, రతఁ డంతం బాసెఁ బ్రాణంబులన్.

ఉ. వడ్డికి వడ్డి దానికిని వడ్డిని గట్టి ధనంబుఁ గూర్పఁ జే
ర్వడ్డయొకం డనేకులచరస్థిరముల్ దిగమ్రింగి యూరికిన్
గొడ్డగ మాచు వడ్డితమిఁ గూళకు నప్పిడి వానికొంపయుఃౘ.
దొడ్డియు లాగి యూరికడ తోఁటనె చిత్రవధంబు పాల్పడెన్.

శా. కాయక్లేశము చేసి వెచ్చమునఁ బోఁగా నూఱురూపాయ లా
దాయంబు బొక్కఁడు దాఁచి నిచ్చలును సందర్శించుచుండంగనే
యాయర్థంబు హరించె వాఁడపుడు "డబ్బా దమ్మిడా పోయె నం
తా యింతా"యను చింత యొంచె గతనిద్రాహారుఁడై కొంతకున్

చ. జనకు మొఱంగి రోవెలఁదిసంగడికాఁడయి యప్పుగోరి వ
చ్చినయొకమూఢు నెక్కరుఁడు చేరిచి కోరినయప్పు డెల్ల ని
చ్చినపదులెల్ల వందలుగఁ జేసియు వందలు వేలుచేసి యా
తనిపొలమెల్లఁ గైకొనెఁ గదా! కనుఁడీ ధనకాంక్ష మెట్టిదో!

చ. ఖలులగుకొంద ఱాచెఱకుఁగట్టలలోపలఁ జొచ్చు నెట్టిచీ
మలవలె జారచోరగణమధ్యముఁ జొచ్చి తదంతరంగముల్
దెలియుచు నొవ్వపుట్టని గతిం జరియించి తదర్థసారముం
దొలిచి రసంబు పీల్తురు కనుండు ధనంబునఁ గూర్మి యెట్టిదో!

ఉ. అప్పులు దీర్చకుండఁ దనయాస్తిని గావఁగఁ గోరి నీతికిం
దప్పి యొకండు వేఱొకని దగ్గఱ దాఁపఱికం బొనర్చి, యొ
క్కప్పుడు దాని నిమ్మనిన, నాతఁడు మెల్లగఁ గల్లమాటలం
జెప్పి హరించె, సొమ్ముతమి చేయనిచేఁతలు గానవచ్చునే?

ఉ. కత్తులు చేతఁ బూని చని కన్నము వేయుట, దారి గాచి నో
రెత్తిన నెత్తి గొట్టి నిలువెల్లను దోఁచుట, తార్పుకత్తెవై
యెత్తుట, దొంగసాక్ష్యముల కేగుట జిత్తులతొత్తులాటయా
వృత్తులు లేనివారలకు వృత్తులు గూర్చు ధనేచ్ఛఁ గాదొకో!

చ. ఒకఁడు ధనంబుఁ దన్నుఁ దనయుగ్మలి నొక్కగతిం దలంచు భా
ర్యకు రుజ వచ్చెనేని "ధనమంతయుఁ బోయిన వంత లేదు దీ
నికి మృతి తప్పెనేని"యను, నిక్కముగా నటులైన వాఁడు భా
ర్యకు మదిఁ గూర్చుఁ గాని ధనహానికి నెంతయుఁ గుందకుండునే?

ఉ. అట్టులె యాలికిం దనకు నామయ మొక్కట వచ్చెనేని య
ప్పట్టున దానిదేహగతిపై దిగులొందుచు నున్న, నంతకున్
రెట్టిగ నాత్మదేహగతి నెవ్వగ లొందుచునుండు, నంతలోఁ
బెట్టెలు దొంగ దోఁచ విలపింపఁ డొకో తనకంటె ముల్లెకై?

ఉ. కాంచనయోగమందుఁ దమి గాంచిన యోగులు స్పర్శవేధిచేఁ
గాంచనమౌ నయస్సనెడికల్పము చెప్పిరి కాని పూర్ణజీ
వాంచితుఁడై నమానవుని యాదల నందలిసాధనంబుగా
నెంచిన ఘోరకల్ప మెవరేనియు విన్నదె కన్నదే యిలన్?

ఉ. క్రూరులు కొంద ఱొక్కనిసిఁ గూడి దయారసశూన్యబుద్ధి, బం
గారము చేయుబుద్ధి నొక కాఁపుతలం దెగఁగొట్టి కుండలోఁ
జేఱిచి దానిఁ బాదరససిక్తముగా నొనరించి భూమిలోఁ
గూరిరి చూడఁ డాపసిఁడికూరిమి యెంతటిఘోరమైనదో!

# వ్యవసాయచరిత్ర

## పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

(గత సంచికా శేషము)

దేశప్రభువుల కట్టిడ్రేమ జనపదములయం దుండని చో ప్రజల కేమికొదువ? ప్రజారక్షణార్థము రాజు ప్రజలనుండి యాఱవవంతు పన్నునే పుచ్చుకొను చుండెను. ఆఱవవంతు పన్నును బుచ్చుకొని ప్రజలను సుఖముగ పరిపాలింపని నాఁడు రాజునకు మహాద్దోషము కలదని శ్రీమద్రామాయణము నందు కలదు.

(౧) రాముం డడవికిఁ బోవుటకు నేను సమ్మతించి యుందునేని, ప్రజలనుండి పండినదానిలో నాఱవవంతు పన్నునుఁ దీసికొనుచు ప్రజారక్షణమునుఁ జేయనిరాజునకేపాపముఘటించునో నా కాపాపము ఘటించును.

ఈ వాక్యము భరతుఁడు కౌసల్యతో 'శ్రీరాముని వనవాసమును నేను సమ్మతింపలేదు. అందుకు సమ్మతించిన నీదోషము ఘటించు'నని చెప్పినాఁడు. ఈదోషము గోహత్య భ్రూణహత్యాదుల మధ్య నిముడ్చబడియున్నది. నాఁటికాలమునందు ప్రజలు కట్టుగట్టి రాజునకు పన్ను నీయక రాజ్యమును స్తంభింపజేసిరని యీక్రింది తైత్తిరీయబ్రాహ్మణములోని యర్థవాదమువలనఁ దెలియుచున్నది. "అనువాకము" నందుండు తాత్పర్యమును మాత్రము వ్రాయుచున్నాఁడను.

(౨) పూర్వకాలమునందు క్షత్రియులు గొప్పతపస్సు చేసి విజృంభించిరి. ఇంద్రుఁడు వారి వీర్యమునంతయు నణఁగఁ గొట్టి క్షత్రియులను నిర్వీర్యులఁ జేసి నిఃక్షత్రము చేసెను. ఒకప్పుడు ఇంద్రునికి ఆతని ప్రజలగు మరుత్తులు (మరుత్తులు వైశ్యులని తైత్తిరీయబ్రాహ్మణమునందే స్థలాంతరమునఁ గలదు. నాఁటికాలమున కృషివాణిజ్యములు వైశ్యులే చేయుచుండుటచే వారే పన్ను నిచ్చువారు) పన్నునిచ్చి గౌరవింపకుండిరి. ఇంద్రుఁ డిట్లగౌరవింపఁబడి ఆ యగౌరవమును పోగొట్టుకొనుట కొకదినమునందు మాత్రమే చేయదగిన, "విఘనము" అను యజ్ఞమునుజేసి, ప్రజలయొక్క స్తంభనమును, మాన్పుకొనెను. ఏరాజు

---

(౧) శ్లో. బలిషడ్భాగ ముద్ధృత్య నృపస్యా రక్షితః ప్రజాః, అధర్మో యోఽస్యసోఽస్యాస్తు యస్యార్యోఽనుమతే గతః. శ్రీ. రా. అయోధ్యాకాండ. ౭౫ వ సర్గ. (౨) ఇంద్రం వై స్వావిశో మరుతో నాపాచాయన్ స్తో నపాచాయ్యమాన ఏతం విఘన మపశ్యత్ త మాహరత్ తే నాయజత తేనైవాసాం తగ్ం సగ్ం స్తభం వ్యహన్, య ద్వ్యహన్ తద్విఘనస్య విఘనత్వం విపాప్మానం భ్రాతృవ్యగ్ం హతే, య ఏతేన యజతే, య ఉచైన మేవం వేద యగ్ం రాజానం విశో నాపచయేయుః యో వా బ్రాహ్మణ స్తమసా పాప్మనా ప్రావృత స్స్యాత్ స ఏతేన యజతే విఘనే నేవైన ద్విహత్య విశా మాధిపత్యం గచ్ఛతి. తస్య ద్వేద్వావశే స్తోత్రే భవతః ద్వే చతుర్విగ్ంశే ఔద్భిద్యమేన తత్ ఏత ద్వై క్షత్ర స్యౌద్భిద్యం యదస్మై స్వావిశో బలిగ్ం హరంతి. హరం త్యస్మై విశో బలిం ఐన మప్రతిఖ్యాతిం గచ్ఛతి. య ఏవం వేద. ప్రబాహుగ్వా అగ్రే క్షత్త్రాణ్యాతేపుః. తేషా మింద్రో క్షత్త్రాణ్యాదత్త నవా ఇమాని క్షత్త్రాణ్యభూవన్నితి—త ద్య థాహ వై సూత గ్రామణ్యః. ఏవం ఛందాగ్ంసి తే వ్వసా వాదితో వ్య బృహతీ రభ్యూఢః—వ్యతిషిక్తాభి స్తువతే వ్వతిషిక్తం వై క్షత్త్రిం విశావిశైవైనం క్షత్త్రేణ వ్యతివజతి వ్యతిషిక్తాభి స్తువతే వ్యషితిక్తో వై గ్రామణీ స్సజాతైః సజాతై రేవైనం వ్యతివజతి వ్యతిషిక్తాభి స్తువతే వ్యతిషిక్తో వై పురుషః పాప్మభిః వ్యతిషిక్తాభిరే వాస్య పాప్మనోనుదతే. తైత్తిరీయబ్రాహ్మణం 2 అష్టకం 7 ప్రశ్న 18 అనువాకము.

నకు బ్రజలు, పన్నునిచ్చి గౌరవింపరో, ఏబ్రాహ్మణు డజ్ఞానరూపపాపముం జేయునో ఆరాజును ఆబ్రాహ్మణుడును ఈవిసునక్రతువుం జేయవలెను. ప్రజలచే నగౌరవింపబడిన రా జీక్రతువుం జేసిన ప్రజలు గౌరవించి పన్ను నిచ్చెదరు. అజ్ఞానకృతపాపముఁ జేసిన బ్రాహ్మణుఁ డీక్రతువుంజేసిన నాపాపము పోవును. ఈ యజ్ఞమును "ద్వానవాఖ్యస్తోమములచే" రెండు స్తోత్రములను, చతుర్వింశాఖ్యస్తోమములచే రెండు స్తోత్రములనుఁ జేయుటచే నిర్వహింపవలెను.

ఆ స్తోత్రచతుష్టయముచే ప్రజాస్తంభనమును విడఁదీయవచ్చును. అపుడు ప్రజ లారాజును గౌరవించి పన్ను నిత్తురు. రా"జప్రతిష్ఠ" నొందఁడు. రథమును నడుపుటను నూతుఁడును, గ్రామపరిపాలనకు గ్రామాధికారియు నెట్టివాఁడో ఈస్తోమద్వయస్తోత్రములను నడుపుటకు, ఛందస్సు లన్నిటిలో, "బృహతీచ్ఛందస్సు" అట్టిది. బృహతీచ్ఛందస్సు—ఇతర ఛందస్సులతోఁగూడిన ఋక్కులతో గలిసికొనియే యుపయోగింపబడును—ఎట్లనగా రాజు, ప్రజలలో నొకఁడుగా కూడియుండియు వారల నుండి పన్నును దీసికొని ప్రజాపాలనము నెటుల చేయుచున్నాఁడో, గ్రామాధికారి గ్రామస్థులలో నొకఁడై యుండియు రాజాజ్ఞాప్రకారము గ్రామపాలనమును సజాతీయులతోఁగూడి యెటులఁ జేయుచున్నాఁడో, అట్లే ఛందస్సులలో బృహతీచ్ఛందస్సొకటైనను, ఈవిసునక్రతువునందు ప్రధానమై యుండును. పురుషుఁడు పాపములను జేయుచుండినను, ఈవిసునక్రతు సంబంధమగుస్తోత్రములచే పాపములఁ బోగొట్టుకొనును.

పైయర్థవాదమువలన నేఁటికాలమునందుదయించిన సహాయనిరాకరణాదివిధానములు శ్రౌతకాలమున నొకప్పుడు జరిగియుండెననియు, గ్రామాధికారులు వేదకాలమునందే కలరనియు తెలిసికొనుచున్నాము.

స్తోమద్వయ యుక్తస్తోత్రద్వయవిధానము శ్రౌతసూత్రములలో గలదుకాని, ఈగ్రంథమున కనవసరమని విడిచితిని. క్షత్రియుల నంపదను జయించిన యింద్రునికిఁ బ్రజలు పన్ను నీయక రాజ్యమును స్తంభింపఁ జేయుట యనునది విచిత్రాంశమై యున్నది. రాజాను గ్రహంబునొంది యీనాముభూములను ముఖాసాగ్రామముల నొందుటయు, శ్రౌతకాలముననే ప్రారంభింపఁబడెనని యీక్రిందియంశమువలన దెలియుచున్నది.

౧ ఈ లోకమునందు, రాజాజ్ఞ ననుసరించి పరిమితి- (కొలత) తోఁగూడిన గ్రామమును గాని భూమిని గాని ప్రయత్నించి పొంది యనుభవించుచున్నారు.

రాజు పట్టాభిషిక్తుఁడగుటకు ముందు, ప్రజోపయుక్త కార్యముల గురించి కొంత ప్రయత్నింపవలసి యుండెను. దానికి "ఇష్టాపూర్తములని" పేరు. "ఇష్ట" మనగా వర్ణాశ్రమ కులాచారములఁ దెలిసికొనుట. "పూర్త" మనగా చెఱువులు, బావులు, మొదలగు వానిని నిర్మించుట. రా జిష్టాపూర్తములఁ జేయుటను గురించి, ఐతరేయబ్రాహ్మణము, ౭-౫-౩, నందు కలదు. ఇష్టాపూర్తవిధులకు, భాష్యమును వ్రాయుచు విద్యారణ్యులు ఇష్టాపూర్త నిర్వచనము నిట్లు చేసియున్నారు.

" వర్ణాశ్రమత్రయీ నర్మ మిష్టము, తద్వ్యతిరేకము (చలివందిరులను వేయించుట, తటాకములఁ ద్రవ్వించుట మొదలగునవి) పూర్తము.

ఇష్టాపూర్తముల గురించి నామలింగానుశాసనాదినిఘంటువులు నిటులనే చెప్పుచున్నవి. తోటలను వేయించుట, తటాకాములఁ ద్రవ్వించుట మాత్రమే కాక స్వయముగ రాజు దున్నుట కలదని, జనకుఁడు దున్నునపుడు నాగటిచాలునందు "సీతామహాదేవి" పుట్టెననుగాథ, ధ్రువపఱుచుచున్నది. నాఁటి ప్రభువులు, వీరులు వ్యవసాయాంగ వస్తువులను చిహ్నములుగా ధరించుచుండువారు. సీతాజనకుఁడగు, "సీరధ్వజుఁడు" (నాగలిని జండాపై వేయించుకొనెను) బలరాముడు హలధ్వజుఁడు, సాంబమూర్తి, కృపాచార్యుడు, వృషకేతుడు, వృషభధ్వజులు. శ్రౌతకాలాద్యులు వ్యవసాయవిషయకప్రయత్నములను పెక్కువిధములఁ జేసిరని రామాయణ మహాభారతముల నుండి పెక్కు వ్రాయవచ్చును; కాని, గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

---

౧ "ఇహ ప్రజా అన్వావిశంతి, యథానుశాసనం యం యమం తమకాభిమా భవంతి. యం జనపదం యం క్షేత్రభాగం, తత మేవోపజీవంతి" ఛాందోగ్యోపనిషత్ ౮-౧-౫.

నదులకు నడ్డకట్టలఁ గట్టుట, వంతెనలను నిర్మించుట, నాఁడు వాడుకలో కలదని కృష్ణయజుర్వేదా థర్వవేదములలో కలదు. వంతెనగట్టి దాఁటుచున్నాడని యీ క్రింది యజుస్సు చెప్పుచున్నది.

౧ వంతెనను గట్టి, దాఁటుచున్నాఁడు.

రామాయణ మహాభారతములలో పెక్కు చోటులను రాజనీతులను వర్ణించు సందర్భమున "అదేవమాతృకము"గా (ఆకాశమునే నమ్మియుండక) వ్యవసాయము రాజ్యమునం దుండవలెనని చెప్పుటచే నీటిపారుదలవిధానములు, చిన్న పెద్ద (మైనర్ - మేజర్) పద్ధతులతో వ్యాపించి యుండెనని తలంపనలసియున్నది. ఋగ్వేదమునందే చెప్పబడిన నీటిపారుదల విధానముల కంటె క్షాత్రకాలమున, "తటాకాది" విధులచే నీటిపారుదల వృద్ధినొందినది.

## పశువృద్ధి

పశువృద్ధి క్షాత్రకాలమునందు ప్రభువులచేతను, ప్రజలచేతను పెంపు చేయఁబడెను. వైదిక వాఙ్మయము నుండి పశువృద్ధితోఁ గూడిన గాథలను, రెంటిని మూల రహితముగ వ్రాయుచున్నాఁడను.

౨ సత్యకాముఁడను జారిణీపుత్రుఁడు తనకు బ్రాహ్మణ్యము నీయుమని ఋషులను ప్రార్థింపఁగా, వారు చిక్కిన నాలుగువందలగోవుల నిచ్చి, వీని నెపుడు వేయిగోవులఁగాఁ జేసెదవో నాఁడే నీకు బ్రాహ్మణ్యము లభించు ననగా, సత్యకాముఁడు వన వనమునకు నాలుగువందల గోవులఁ దోలుకొనిపోయి, కొన్నియేండ్లు వనమునం గడపి ఆ గోవులను వేయి కంటె నధికముగనటుల వృద్ధి నొందించి, వానిని ఋషులకు సమర్పించి, వారివలన బ్రాహ్మణ్యము నొందెను.

3 జనకమహారాజు యజ్ఞమునొకదానినిఁ జేయగా పాంచాలాదిదేశముల నుండి మహాపండితు లాయజ్ఞముఁ జూడవచ్చిరి. అపుడు జనకుఁడు వారిలో నెవరు బ్రహ్మవేత్తలో తెలిసికొనఁ గోరిక కలవాఁడై, వేయి గోవుల నొక దొడ్డియందునిచి, ప్రతిగోవు కొమ్మునకు నేడు తులముల సర (౭½) బంగారమును గట్టి, బ్రహ్మవేత్తయగువాడు, వీనినిం దోలుకొని పొండనెను. అపుడు యాజ్ఞవల్క్యమహర్షి నేను బ్రహ్మవేత్తనని యచటి పండితులు వేయు ప్రశ్నలకు, సమాధానముఁ జెప్పి, ఆ గోవులను దోలుకొని పోయెను.

పై గాథలు వేదమునందు విపులముగా వర్ణింపబడెను కాని, గ్రంథవిస్తర భీతిచే క్లుప్తీకరించియే వ్రాసితిని. ఈకాలముననే, శ్రీకృష్ణభగవానుఁడును పాండవులలోని సహదేవుఁడును కొంతకాలము గోపాలురై యుండిరి. గో జాతి లక్షణములు వానిస్థితి వ్యాసభగవానుడు విరాటపర్వమునందు సహదేవపాత్రనుండి, పరికించి యున్నాఁడు. గ్రంథవిస్తరభీతిచే వాని నిట వివరింపలేదు. క్షాత్రకాలము మొదలు మహమ్మదీయ కాలారంభమునం దైన "అక్కన్న బయ్యన్నల" పశువుల బీడుల వివాదమువరకు, పశువులను గూర్చి పెక్కు యుద్ధము లీభరతఖండమున జరిగియున్నవి. జమదగ్ని గోవును కార్తవీర్యార్జునుఁ డపహరింపఁగా పరశురాముఁడు కార్తవీర్యార్జునునిం జంపుటయు, ఆ పగచే బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదలు పొడచూపుటయు, పరశురాముఁ డిరువదియొక్క సారులు దిగ్విజయ యాత్రఁ జేయుటయు, వసిష్ఠుని నందినీ ధేనువును విశ్వామిత్రుఁ డపహరింపఁ దలఁపగా వసిష్ఠ, విశ్వామిత్రులకు కలహము కలిగి, విశ్వామిత్రుఁడు బ్రాహ్మణ్యము నొందఁ బ్రయత్నించి యెట్టకేలకు బ్రాహ్మణ్యము నొంది, వసిష్ఠ శిష్యపరంపరలోని కల్మాషపాదత్రిశంక్వాదులను విడదీసి బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వివాదలను పెంపొందించుటయే కాక, వసిష్ఠుని ప్రియశిష్యుఁడును, సత్యసంధుఁడు నగు హరిశ్చంద్రుని ముప్పతిప్పలఁ బెట్టుటయు, గోవివాదముతో నారంభమైన మహోపప్లవములే. క్షాత్రకాలమునందు గోమేధములు (గోవుంజంపి యజ్ఞముచేయుట) విశేషముగ జరుగుచుండెడివి. దానికి బ్రాహ్మణులే యిష్టపడుటయు క్షత్రియులే యసహ్యించుకొనుటయు తటస్థించుచుండెది. మహాభారతము ఉద్యోగపర్వములోని నహుషునకు నగస్త్యునకుఁ జరిగిన వివాదము గోప్రోక్షణ మంత్రమూలమైనదేను.

(౧) "సేతుంకృత్వాత్యేతి" తైత్తిరీయ సంహిత ౬-౧-౪-౯. (౨) ఛాందోగ్యోపనిషత్ ౪-౪-౫. (3) బృహదారణ్యకోపనిషత్- పంచమాధ్యాయము.

షాత్రకాలమునుండి, సూత్రకాలాంతము వరకు ఋష్యాదులు వచ్చినపుడు వివాహసమయమున "వరు" నర్చించునపుడు గోమాంసము నిచ్చు నాచారము కలదు. దానిని విమ్మటను వ్రాసెదను. గోవివాదములలో జగత్ప్రసిద్ధమైనది విరటుని గోవులను కౌరవు లపహరింపఁగా నర్జునకృత మహాసమరము.

పెక్కువేల గోవు లొకచోటున నుండుటకు వీలులేక విడివిడిగా మేపుచుండిరి. విడిగా నుండిన మందలపై గోపాలు రను నధికారు లుండిరి. గోపాలురంపరపై "గోనాయకుఁ"డను పెద్ద యధికారి యుండువాఁడు. ఈ వృత్తాంతము, ఛాందోగ్యోపనిషత్తునందు సూచింపఁబడియున్నది. చూడుడు. ౬-౮-౫.

ఇట్టి "గోనాయకుఁడు"గానే పాండవసహదేవుఁ డుండెను. విశేషముగా పసువు లుండినపుడు వానికి, పెక్కులు వ్యాధులును సంభవించుచుండును. ఆవ్యాధి నివారణోపాయములుకూడ కావలసియుండును. అథర్వవేదమునందు గోరోగనివారణోపాయములు మంత్ర, తంత్ర రూపముగా పెక్కు లున్నవి. వానిలోఁ గొన్నిటిని మాత్రము వ్రాయుచున్నాను.

౧ పర్వతములందు వనములందు ఓషధులయందు పశువులయందు నీటియందు గల క్రిములను, మాయందు ప్రవేశించినక్రిములను, జన్మస్థానముతోఁగూడఁ చంపుచున్నాము.

౨ కనఁబడునట్టివి కనఁబడనట్టివి యగు, "అల్గండు, కురూరు, శలులా"యను క్రిమి సమూహమును మంత్రములచే నశింపంజేతును.

పై క్రిములలో, "కురూరు" వనునది కడుపునందు "జాలము"వలె నుండుననియు, "అల్గండు"వనునది రక్తముననుమాంసముననుప్రవేశించి పీడించుసూక్ష్మక్రిమియనియు, "శలులా" మరియొక విషమగు సూక్ష్మక్రిమి యనియు సాయన భాష్యమునందు, వివరింపఁబడియున్నది.



ఋషులు క్రిములను బరీక్షించుట

౩ ప్రతియవయవమునందును శిరసునందును పార్శ్వములందును తలక్రిందుగా దిరుగుచు, ననేకదారులఁ జేసికొని ప్రవేశించు, నీ పురుగులను, మంత్రములచేఁ జంపుచున్నాను.

౪ గోశరీరముల లోపల నుండు క్రిముల నన్నిటినువ యించుచుండినసూర్యుఁడును, అస్తమించు సూర్యుఁడునుఁ జంపు గాక.

---

౧ యే క్రిమయః పర్వతేషు వనేషు, ఓషధీషు, పశు ష్వప్స్వంతః ' యే అస్మాకం తన్వ మావివిశుః సర్వే తద్ధన్మి జనీమ క్రిమీణాం. అథర్వవేదమ్. ౨-౩౧-౫. (౨) దృష్ట మదృష్టమగృహ మథో, కురూరు, మగృహం, అల్గండూన్సర్వాంఛలులా న్క్రిమీన్ వచసా జంభయామసి. అథర్వవేదమ్. ౩-౩౧-౨. (౩) అన్వాన్త్ర్యం శీర్షణ్య మథో పార్ష్ణేయం క్రిమీన్ అవస్కరం వ్యధ్వరం క్రిమీన్ వచసా జంభయామి. అథర్వవేదమ్. ౨-౩౧-౪. (౪) ఉద్యన్నాదిత్యః క్రిమీన్ హంతు నిమ్రోచన్ హంతు రశ్మిభిః,యే అంతాః క్రిమయో గవి—అథర్వవేదమ్. ౨-౩౨-౧

౧ నానాకారములు కలిగి నాలుగు కన్నులు కలిగి శబలవర్ణముగాను శుభ్రవర్ణముగాను నుండు క్రిమియొక్క శిరమును, పార్శ్వావయవములను విష పుందిత్తిని, నాశనముఁ జేయుచున్నాను.

పై ఋక్కునందు పురుగునకు నాలుగుకండ్లు కల వని చెప్పఁబడినది. నేఁటి క్రిమిశాస్త్రజ్ఞులు నాలుగు కండ్లుగల పురుగులు లేవందురు; కాని, కొన్ని పురుగులకు, నేత్రస్థానమున చుక్కలుండుటయు, మరి కొన్నిటికి నేత్రస్థానమున మరికొన్ని యవయవవిశేషములు నుండును. వీనిలో గొన్నిటిని మంత్రద్రష్ట నేత్రములుగా భావించెనని తలంపవలసియున్నది. అత్రి, కణ్వ, జమదగ్నులు, నాటి క్రిమి శాస్త్రజ్ఞులని క్రింది మంత్రము చెప్పుచున్నది:

౨ అత్రి, కణ్వ, జమదగ్నులవలె, క్రిములఁ జంపుచున్నాఁడను. అగస్త్యుని మంత్రములచే క్రిములఁ జంపెదను.

"అగస్త్యుని మంత్రములచే క్రిములఁ జంపెదను" అను వాక్యమునకు విద్యారణ్య భాష్యమునందు ఋగ్వేదప్రథమమండలములోని యగస్త్య సూక్తమే, — క్రిమిహనన సూక్తమని వ్రాయఁబడియున్నదిగాని ఆ సూక్తము జదువఁగా ఈసూక్ష్మ క్రిమిహననమునకు సంబంధించి నట్టులఁ గాన్పింపదు. దానిచర్చ, యీగ్రంథమున కనవసరమని విడిచితిని. మంత్రద్రష్ట, తనకృషివలనఁ గ్రిములు నశింపఁగా నిట్లుసంతోషించు చున్నాడు,

౩ క్రిములయొక్క రాజు, స్నేహితుఁడు, తల్లి, సోదరుఁడు, తోఁబుట్టువ కూడ నాశముఁ జేయఁబడెను.

ఈక్రిమికులముయొక్క, ముఖ్యగృహములును, చుట్టునుండిన ప్రదేశములును, సూక్ష్మరూపకముగ, బీజావస్థవలెనే నాశనముఁ జేయఁబడెను.

౪ ఓక్రిమీ! యేకొమ్ములచే బాధించుచుందువో ఆకొమ్ములను, విషమును, నిలువఁజేసికొనెడి నీతిత్తిని నశింపఁ జేయుచున్నాను.

పై సూక్తార్థముల నాలోచింపఁగా నాఁటి యార్యులు పశురోగోత్పత్తికిఁ గారణములగు సూక్ష్మజీవులఁ బరిశీలించి యాసూక్ష్మజీవులనే కాక యాసూక్ష్మజీవోత్పత్తిహేతువులఁ గూడ నశింపఁజేసెడి సాధనములఁ గనిపెట్టిరని విశదమగును. ఈ క్షాత్రకాలమునం దార్యులు పెక్కు విద్యలను ప్రకృతిశాస్త్రములను, వృద్ధిపఱచిరని నాఁటివాఙ్మయముఁ బరిశీలించిన విదిత మగును. ఈ గ్రంథమున కవసరమైనంతవఱకు దిఙ్మాత్రముగ వైదికవాఙ్మయమునుండి నాఁటిశాస్త్రవిశేషములను వ్రాయుచున్నాఁడను.

౬ నామముకంటె వాక్కే గొప్పది. ఈవాక్కే దైవశాస్త్రమును, నిధిశాస్త్రమును,.........అంతరిక్షశాస్త్రమును, భూశాస్త్రమును, వాయుశాస్త్రమును, ఉదకశాస్త్రమును, తేజశ్శాస్త్రమును,...... మనుష్యశాస్త్రమును, పశుశాస్త్రమును, పక్షిశాస్త్రమును, తృణశాస్త్రమును, వృక్షశాస్త్రమును, జంతుశాస్త్రమును, క్రిమిశాస్త్రమును, పతంగశాస్త్రమును, పిపీలికాశాస్త్రమును...వాక్కే చెప్పుచున్నదిగాన వాక్కునుపాసింపుము. శాస్త్రములఁ జదివినంతమాత్రాన లాభము లేదనియు, శాస్త్రములను బాగుగ పరిశీలనము చేయవలెననియు, "ఛాందోగ్యోపనిషత్" (7-7) లోఁ జెప్పియున్నాఁడు. అవృత్తాంత మిచట నప్రస్తుతమగునని వ్రాయలేదు. గోవునుండి ప్రాతస్సాయంకాలములయందే కాక మధ్యాహ్నకాలముననుఁ బాలు పిదుకుచుండిరనియీ క్రిందియథర్వవేదమంత్రమువలన నూహింపవలసియున్నది.

(౧) విశ్వరూపం చతురక్షం క్రిమిం సారంగమర్జునం, శృణామ్యస్య పృష్టీరపి వృశ్చామి యచ్ఛిరః. అథర్వవేదమ్. ౨-3౨-౨. (౨) అత్రివద్వః క్రిమయో హన్మికణ్వవ జ్జమదగ్నివత్ అగస్త్యస్య బ్రహ్మణాసంపినష్మ్యహం క్రిమీన్- అథర్వసంహితా. 2-32-3. (3) హతో రాజా క్రిమీణా ముతైషాం స్థపతిర్హతః, హతో హతమాతా క్రిమి ర్హతభ్రాతా హతస్వసా. అ. సం ౨-3౨-౪. ఆ. (౪) హతాసో అస్య వేశసో హతాసః పరివేశసః అథో యే క్షుల్లకా ఇవ సర్వే తే క్రిమయో హతాః అ. సం. ౨-3౨-౫. (౫) ప్రతే శృణోమి శృంగే యాభ్యాం వితుదాయసి, భినద్మి తే కుషుంభం యస్తే విషధానః "అథర్వసంహితా. 2-32-6. (౬) వాగ్వావ నామ్నోభూయసీ వాగ్వా.. దైవం నిధిం...దివం చ పృథివీం చాకాశం చాపశ్చ తేజశ్చ—మనుష్యాగ్ శ్చ పశూగ్ శ్చ వయాగ్ంసి చ, తృణవనస్పతీం చ్ఛ్వాపదా న్యాకీటపతంగపి పీలికం...వాగ్వైవ తత్సర్వం విజ్ఞాపయతి వాచ ముపాస్వేతి ఛాందోగ్యోపనిషత్ 7-2-1.

౧ సాయంకాలమునందును ప్రాతఃకాలమునందును మధ్యాహ్నకాలమునందును పాలఁ బిదుకుచుంటిని. పిదికినవారిం గాంచి, సంతసించుచుంటిని.

కుక్కలు ఆకసమునకు గొంతుకల నెత్తి యేడ్చినటు లరచినచో నది వర్షసూచకమని వైదికవాఙ్మయమునఁ గలదు. పౌరాణిక మహమ్మదీయ కాలములలో బయలువెడలిన గ్రంథములలో నాశకునమ్ముల గురించి విపులముగ వ్రాయఁబడియుండెను. వైదికవాఙ్మయమునం దెటు లీశకునము చెప్పఁబడెనో చూడుఁడు. గ్రంథవిస్తరభీతిచే నాయర్థవాదము నిట మూలరహితముగ ఛాందోగ్యోపనిషత్తునుండి వ్రాయుచున్నాఁడను.

౨ బక దాల్భ్యుఁ డను నొకఋషి యొకగ్రామమునకు వెలుపలనుండు వృక్షముకడ వేదాధ్యయనముఁ జేయుచుండఁగా నొకతెల్లనికుక్క యట కేగుదెంచెను. పిమ్మట మఱికొన్ని కుక్క లటకు వచ్చి యొకశునకరాజా! యన్నము లేక కష్టపడుచున్నాము నీ గానవిద్యామహిమచే నన్నసాధనోపాయముఁ జేయుమని శ్వేతశునకము నకుఁగఁగా రే పిచటికి రండు చెప్పెద నని శ్వేతశునక మనెను. బకదాల్భ్యుఁ డీవృత్తాంతముఁ జూచి యవి యేమి చేయునో చూతమని మఱునాఁ డచటనే కనుపెట్టుకొనియుండెను. గతదినమునఁ జెప్పినరీతిని శ్వేతశునకము ముందురాఁగా దానితోఁ కనంటె, మరికొన్ని కుక్కలుకూడ వచ్చినవి. అపుడు శ్వేతశునకము 'ఓమింద్రా! అన్నమునిమ్ము' అని హింకారముతో "ఉద్గీథముఁ" బ్రారంభింపఁగా తక్కిన కుక్కలును, హింకారముతో నుద్గీథముఁజేసెను. ఇట్లు శ్వేతశునకముతోఁ దక్కిన శునకములు రెండుసారులు చేసి, హింకారముతోఁ బరిసమాప్తిఁ జేసినవి. పిమ్మట నాశునకము లన్నియుఁ దమ మార్గమునఁ బోయెను. బకదాల్భ్యుఁ డీయాశ్చర్యముఁ జూచి యుద్గీథమహిమనుఁ దెలిసికొనెను.— మహమ్మదీయ కాలమునకెటు లీ "శకునము" మాఱెనో ఆకాలచరితమును వ్రాయునపుడు విస్తరింపఁజేతును.



కర్షకుఁడు మహావృషభమును బూజించుట

ఆఁబోతును విడువుటయో, నేఁటికాలమున మకర సంక్రాంత్యుత్సవములలో వ్యావసాయికులు చేయు, నాఁబోతు సంబరమునంటిదో, శ్రౌత్రి కాలమునఁజేయుచుండిరి "కౌశిక సూత్ర" ములయందు దానికి "అనడుత్సవము" అని పేరుకలదు. దాని నంతయు నిట వివరింప నావశ్యకత లేనందున ఆయనడుత్సవమునందు చేయఁబడువృషభస్తుత్యాత్మకమంత్రార్థమును నిట నొకదానిని వ్రాయుచున్నాఁడను.

(౧) దుహే సాయం దుహే ప్రాతః దుహేమాధ్యం దినంపరి, దోహాయే అస్య సంయంతి తాన్ విద్వానుపదస్వతః. అథర్వసంహితా" 4-11-12. (౨) ఛాందోగ్యోపనిషత్. (1-12)

౧ ఈ వృషభము లిన నాలుగుపాదములచేతను అలక్ష్మినిఁ ద్రొక్కివేయుచు భూమిని కర్షణవ్యాపారముచే భేదించుచు కర్షణాదివ్యాపారములచే కష్టపడుచు దుఃఖించుచున్న వ్యవసాయదారున కన్నమునిడుచున్నది.

నేఁడు గోదావరి కృష్ణామండలముల లోని పల్లపుభూముల (డెల్టా) రైతులు వర్ష కాలమునఁ దమ పశువుల నరణ్యములకుఁ దోలునట్టుల శ్రౌతకాలమునను దోలివేయుచుండిరి. అడవులలో నేఁటివలెనే మృగాదులచే నాపశువులు నష్టమగుటయు కూడ సంభవించుచుండెడి దని ఈక్రింది మంత్రములవలనఁ దెలియనగును.

౨ గోవులు, మమ్ముల నానవాలు చూచి, మా కడకు వచ్చుగాక. మంగళముఁ జేయుగాక. మాగోష్ఠమున కవి, మునుపటివలెఁ జేరుగాక. పాలనిచ్చుచు, సంతతితో వృద్ధినొందుగాక. ఉషఃకాలమున, నింద్రుని కొఱకుఁ బాల నిచ్చుగాక.

3 పెద్దపులి మొదలగు క్రూరమృగములు మా గోవులఁ జంపకుండుఁగాక. కటికవానికంట మాగోవులు పడకుండుగాక. భయంకరరహితమై విశాలమైన బీడులయందు మాగోవులు సంచరించుగాక.

గోవులు పూజ్యవస్తువులని ప్రాచీనకాలమునుండియు భారతీయులకు తలంపుకలదు. గోవును కాలితోఁ దాఁకినయెడల మహాద్దోషమని అథర్వవేదము (13-1-56) లోను శ్రీమద్రామాయణము అయోధ్యాకాండ 75 సర్గలోను కలదు. కపిలగోవుల మహిమను మహాభారతము అనుశాసనిక పర్వమునందెట్టుల భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పెనో భారతపాఠకులకు విశదమే? శ్రౌతకాలమునుండియే, "బర్హి" (గేదె) నుండి, పాల పిదుకుటకు ప్రారంభించిరని యీక్రింది "సామవేద" మంత్రముచే నూహింపఁబడుచున్నది.

౪ అగ్ని (తృణాదులఁదిని) బర్హి, పాల నిచ్చినట్టుల చర్వన్నాదికమును భక్షించి, ఇంద్రునికొఱకు పిదుచున్నాఁడు, ద్యులోకమునందు దీప్తతేజస్కుఁడై ప్రకాశించుచున్నాఁడు. కాని, శ్రౌతకాలమునందు మహిషములతోఁ గృషికర్మ చేయుసలవాటు కాన్పింపదు. అది సూత్ర బౌద్ధకాలములలోఁ బ్రారంభింపఁబడెనని తోఁచుచున్నది. శ్రౌతకాలమున మహిషము మృగముగానే పరిగణింపఁబడెనని యీక్రిందిమంత్రము వలనఁ దెలియనగును. సూత్రకాలము మొదలు, మహిషమాంసమును భక్షించుచుండినట్టుల "చరకా"ది వైద్యగ్రంథములలోఁ గలదుకాని, అది యీగ్రంథమున కనావశ్యకమైనందునఁ జర్చింపలేదు.

౫ మహిషము, మృగములలో......పవిత్రము నొందుచున్నది.

## శ్రౌతకాలమునందలి యితర కృషులు

ఈకాలమునం "దుద్యాన" కృషి, తరుకృషి, విస్తరించెను. మహాభారతములో శాంతి పర్వాంతర్గత రాజధర్మానుశాసనపర్వమునందు, రాజున కుద్యానవనము లుండునని చెప్పఁబడియున్నది. శ్రీమద్రామాయణములోని సుందరకాండలో, "అశోక" వనమెట్టులు వర్ణింపఁబడెనో, రామాయణ పాఠకులకు విశదమే "తరు" కృషినిగుఱించి నాఁటివారు చాలపాటుపడుటయే కాక, మతముతో సంబంధముఁ గల్పిరి. "మఱ్ఱి, జువ్వి, మేడి రావి" చెట్లను పవిత్రవృక్షములనుగాఁ దలంచుటయే కాక మహారాజపట్టాభిషేకసమయమున, పై వృక్ష పదార్థములు తప్పక కావలెనని యైతరేయబ్రాహ్మణము (8-4-2) మంత్రము చెప్పుచున్నది. నాఁటివారు, పైవృక్షముల ఫలములను భుజింతురని పైబ్రాహ్మణము (7-5-4) లోఁ గలదు. నాఁటివారు మామిడిపండ్ల రుచి నెఱిఁగియుండిరని, బృహదారణ్యకోపనిషత్ (6-3-3)

(౧) పద్భిః సేది మవక్రామ న్నిరం జంఘాభిరక్షిపన్ శ్రమే ణానడ్వాన్ కీలాలంకీనాశ శ్చాభిగచ్ఛతః. అథర్వసంహిత (4-11-10) (౨) ఆగావో అగ్మ న్నుత భద్ర మక్రం త్సీదంతుగోష్ఠే రణయం త్వాస్మే, ప్రజావతీః పురురూపా ఇహస్యు రింద్రాయ పూర్వ రుషసో దుహానాః అథర్వసంహితా (4-21-1) (3) న తా అర్వా రేణుక టోఽశ్నుతే న సంస్కృతత్ర ముపయంతి తా అభి, ఉరుగాయ మభయం తస్య తా అను గావో మర్త స్య విచరంతి యజ్వనః. అథర్వసంహితా (4-21-4) (౪) ప్రజావతీః సుయవసో రుశంతీఃశుద్ధా ఆపః, సుప్రపాణో పిబంతీః మావ స్తేన ఈశత మాఘశంసః పరివో రుద్రస్య హేతి ర్వృణక్తు. అథర్వసంహితా. (4-21-7) (౫)మహిషోమృగాణాం......పవిత్ర మత్యేతి. తైత్తిరీయోపనిషత్. (5-10-3) తైత్తిరీయసంహిత 4-1-7.

వలనఁ దెలియుచున్నది. వృక్షశాస్త్రజ్ఞానము, నాఁటివారికి చాల కలదని, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తుల వలనఁ దెలియుచున్నది. ఛాందోగ్యోపనిషత్ (6-11-1,2) సంఖ్యలలో వృక్షమును కత్తితో నరికిన యెడల ద్రవపదార్థము స్రవించుననియు, అది నశించిన యెడల, వృక్షము మృతినొందుననియు, (6-12) ఖండలో, బీజమునం దత్యల్పభాగమునసే వృక్షాంకురభాగముండుననియు, మఱ్ఱి గింజవంటిదానిలో వృక్షాంకుర భాగము గుర్తింపలేనంత సూక్ష్మముగ నుండుననియుఁ జెప్పఁబడి యున్నది. బృహదారణ్యకోపనిషత్ (5-9-28) లో, వృక్ష, మనుష్య, శారీరక, నిర్మాణముల నెట్టుల వర్ణించెనో చూడుఁడు. (ఇది జనకసభలో యాజ్ఞవల్క్యమహర్షి యుపపాదించినవాదము)

౧ ఓ బ్రాహ్మణులారా! శరీరాకృతిగల యీ మనుష్యుఁడును పుష్పఫలాదులుగల వృక్షమును సమానము. పురుషునకు రోమములు, వృక్షమునకుఁ బత్రములు, పురుషునకు చర్మము, వృక్షమునకు బరడు, పురుషునకు చర్మ సమీపమున రక్తము స్రవించుచున్నది. వృక్షమునకు బంక స్రవించును పురుషునకు మాంసము కలదు వృక్షమునకు శకలములు కలవు. పురుషునకు నరములు కలవు. వృక్షమునకు నార కలదు. పురుషునకు, "యెముకలు" కలవు. వృక్షమునకు దారువు కలదు. పురుషునకు మజ్జ కలదు. వృక్షమునకు చేవ కలదు. కాని, వృక్షము నరకఁబడి తిరిగి మొలచును. పురుషుఁడు నరకఁబడి యెట్టుల మొలచును? రేతస్సువలనఁ బుట్టునసెదరా? చచ్చినమనుజుని రేతస్సునుండి పుట్టునా? బ్రదికి యుండినమనుజుని రేతస్సునుండియే పుట్టవలసియుండును. వృక్షమైతే చచ్చినను దానిబీజమునుండి పుట్టుచున్నది. వేళ్లతోఁ బెకలించిన యెడల వృక్షము తిరిగి పుట్టనేరదు. మర్త్యుఁడైతే మృతినొందిన పిమ్మట నే మూలమునుండి పుట్టును? వీనిని బుట్టించువా డెవఁడు? ఎవఁడును దెలిసికొనలేఁడు.

పైవర్ణనముఁ జూడ శ్రౌతకాలమునందు వృక్షశారీరక శాస్త్ర పరిశోధనము చాల చేయఁబడియుండెనని స్పష్టమగుచున్నది. ఇప్పటి "ప్రొఫెసర్, బోసే" వంటివారిని, వారికి మించినవారిని, భారతమాత యుగాంతరమునసే కనుటలో నాశ్చర్యముండదు. సమస్త శాస్త్రములు ప్రాచీనకాలమునసే వృద్ధినొంది నశించినవని తోఁచుచున్నది. సూక్ష్మక్రిమి పరిశోధనమునుఁ గురించి, పశువైద్య సంబంధమునందు కొంత వ్రాసియున్నాను. తోట కూరపైఁ బ్రాసి, పుష్పముగూర్చి బృహదారణ్యకోపనిషత్తు నందింపుగ, వర్ణింపఁబడినది కాని, గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

### సరఘాపర్ధనము (తేనెటీగలఁ బెంచుట)

ఈ కాలమునందు, తేనెటీగల పెంపకమును గుఱించియు, తేనెను సంపాదించుటను గుఱించియు, విశేషప్రయత్నములు జరిగెనని తోఁచుచున్నది. తేనెటీగలు పుష్పరసమును గ్రహించి, తేనెపట్టులఁ బట్టునని నాఁటివా రెఱుఁగుదురు.

౨ ఓ శ్వేతకేతువా! తేనెటీగలు నానావృక్షములనుండి పుష్పరసమును సంపాదించి తేనె తుట్టలో నొకచోటునఁ గూర్చుచున్నవి.

ఛాందోగ్యోపనిషత్తు 3 ప్రపాఠకము 1 వ ఖండ 6 వ బ్రాహ్మణము మొదలు ఖండ చివరవరకు తేనెతుట్ట వర్ణన నింపుగఁ జేయఁబడెను. తేనెతుట్ట, "యపూపాకారము" (అప్పముపోలిక) గానుండి, కొమ్మల నంటు

---

(౧) యథా వృక్షో వనస్పతి స్తథైవ పురుషోఽమృషా, తస్య లోమాని పర్ణాని, త్వ గస్యోత్పాటికాబహిః త్వచ ఏవాస్య రుధిరం ప్రస్యంది త్వచ ఉత్పటః, తస్మాత్తదా తృణ్ణా త్ప్రైతి రసో వృక్షా దివాహతాత్ మాగ్ంసాన్యస్య శకరాణి. కినాటగ్ స్నావతత్ స్థిరం అస్థీ న్యంతరతో దారూణి మజ్జా మజ్జోపమా కృతా, య ద్వృక్షో వృక్ణో రోహతి మూలా న్నవతరం పునః మర్త్య స్స్వి న్మృత్యునా వృక్ణః కస్మా న్మూలా త్ప్రరోహతి రేతస ఇతి మావోచత జీవత స్తత్ప్రజాయతే, ధానారుహ ఇవ వై వృక్షోఽఞ్జసా ప్రేత్య సంభవః యత్సమూల మావృహేయుర్వృక్షం నపునరాభవేత్ మర్త్యః స్వి న్మృత్యునా వృక్ణః కస్మా న్మూలా త్ప్రరోహతి. జాత ఏవ నజాయతే కో న్వేనం జనయే త్పునః. బృహదారణ్యకోపనిషత్. (5-9-28) (౨) యథాసోమ్యమధు, మధుకృతో నిస్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాగ్ రసాన్సమవహారమేకతాగ్ రసంగమయంతి. ఛాందోగ్యోపనిషత్. (6-9-1)

కొని యుండెనని యొకచోటనను, సూర్యమండలము వలె నుండెనని మఱియొకచోటునను ఇంపుగ వర్ణింపఁ బడియుండెను. వానరములకు తేనెపట్టు లిష్టము. అందు వలన వానరాధిపులగు వాలిసుగ్రీవులు ప్రత్యేకము తేనె తుట్టలఁ బెంచుటకే, వనమునొకదాని వేయించి "మధువన" మని దానికిఁ బేరిడిరి. పెద్దపెద్ద తేనెపట్టులందుండెనని, శ్రీమద్రామాయణాంతర్గత సుందరకాండలోకలదు. నాఁటి వాఙ్మయమునం దింకను తేనెను గుఱించి విస్తారముకలదు కాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

సముద్రపు నీటిచే నుప్పును బండించుట శాస్త్రకాలార్యులకుఁ దెలియును.

౧ ఉప్పురాయి నీటియందుప్పవించి నీటియందుంచఁబడిన నీటిలో నణఁగిపోవుచున్నది. దాని నెవరును చేతితోఁ దీయలేరు.

౨ ఉప్పురాయియొక్క, లోపలిభాగము, పైభాగము అంతయు నీటియొక్క ఘనభాగము లే. వివిధవృక్షములనుండి మద్యములఁ దీయుచు వాని నుపయోగించుచుండిన, నిదర్శనములు, శాస్త్రకాలవాఙ్మయమునఁ బెక్కు కలవు. మద్యము పాశ్చాత్యదృష్టిచే భోజ్యద్రవ్యము, ప్రాచ్యదృష్టిచే భోగ్యద్రవ్యము. అయినను మద్యమును వ్యవసాయాంగముగా గృషిశాస్త్రజ్ఞులు తలఁపనందున మద్యవిషయకచర్చ నిందు వివరింపలేదు. "బృహదారణ్యకోపనిషత్తు (8-4-17)"లో, నువ్వులపులగమును భుజించుట వర్ణింపఁబడుటచే కాయధాన్యములను శాస్త్రకాలపువారు మిగుల భుజింపుచుండిరని తలఁపఁ బడుచున్నది. నేఁటికాలమున భరతఖండమునందుండిన పెక్కువృత్తులు శాస్త్రకాలమునందే కలవు. "తివాసులు" పారశీకదేశీయులనుండి భరతఖండమునఁ బ్రవేశపెట్టఁబడి యుండుననియు మహమ్మదీయులచేతనే యీ పరిశ్రమ నెలకొలుపఁబడె ననియు, నధునాతనులలోఁ గొందరు తలంతురు. కాని, సామవేదమునందే తివాసుల నేత సూచింపఁబడినది. చూడుఁడు.

౩ (త్వరితగమనముగల) అశ్వ మెటుల నలంకరింపఁబడెనో, అటులు అన్నకాముఁడును, అనుమోచనీయుఁడును, విద్వాంసులగు ఋత్విక్కులచే, పవిత్రము చేయఁబడిన సోముఁడు, సూక్ష్మము లగు మేకవెండ్రుకలను అడ్డముగ నల్లుచు నలంకరించుచున్నాఁడు.

తైత్తిరీయబ్రాహ్మణముయొక్క 3 వ అష్టకము ౪ వన్నమునకు, పున్నాలపన్న మని పేరు. ఆపన్నమునందు, "నరమేధ" యాగవిధానము వర్ణింపఁబడెను. అందనేక వృత్తులతోఁగూడిన మనుజులు, వర్ణింపఁబడిరి. మూలరహితముగ కొందఱి పేరులను మాత్రము వ్రాయుచున్నాఁడను.

బ్రహ్మ, క్షత్రియ, వైశ్యశూద్రులుకాక,
ఈ క్రింది వృత్తులవారు, ముఖ్యులు.

1. యోగుఁడు=అక్రమముగా వస్తువుల నమ్మువాఁడు.
2. మాగధుఁడు=రాజులవద్దర స్తోత్రముఁ జేసి జీవించువాఁడు.
3. పుంశ్చలి=జారత్వముచే జీవించు నాఁడుది.
4. సూతుఁడు=సంగీతముఁ బాడి జీవించువాఁడు.
5. శైలూషుఁడు=నాట్యమాడి జీవించువాఁడు.
6. సభాచరుఁడు=సభలయందు ధర్మముఁ జెప్పి జీవించువాఁడు.
7. రేభుఁడు=సభలయందు యుక్తులఁ జెప్పి జీవించువాఁడు.
8. కారి=హాస్యముఁ జెప్పి జీవించువాఁడు.
9. రథకారుఁడు=నమోనాలను జ్ఞాపకముంచుకొని బండ్లనుఁ జేయువాఁడు.
10. తక్షుణుఁడు = ధైర్యముతో చులుకుగాఁ పనినిఁ జేయువాఁడు.
11. వర్ధకి=కష్టపడి పనినిఁ జేయువాఁడు.
12. కులాలుఁడు=కుమ్మరి.

(౧) సైధంవఖిల్యా ఉదకే ప్రాప్త ఉదక మేవాను విలీయే తనహాస్య్వ ద్గ్రహణా యేవ స్యాత్. బృహదా. (4-4-12) (౨) సైంధవఘనో నంతరో బాహ్యః కృత్స్నో రసఘన ఏవ. బృహదారణ్యకం. (6-5-13) (3) సమామృజే తిరో అణ్వా నిమేష్యే.మీఢ్వాంత్సప్తి ర్న వా జయుః, అనుమాద్యః పవమానో మనీషిభిః సోమో విప్రేభి ఋక్విభిః. సామవేదం ఉత్తరార్ధం (8-22-1)

13. మణికారుఁడు=వజ్రాది మణులతో నగలఁ జేయువాఁడు.

14. వపుఁడు=పొలములలో నేర్పుగ విత్తనములఁ జల్లువాఁడు. (ఇపుడును, పల్లెలలో నేర్పరులగు, వపులు ప్రత్యేకముందురు; వారికిఁ బ్రత్యేకవేతనము కలిగియుండును.)

15. ఇషుకారుఁడు=బాణములఁ జేయువాఁడు.

16. ధన్వకారుఁడు=ధనుస్సులఁ జేయువాఁడు.

17. జ్యాకారుఁడు=వింటిత్రాడులఁ జేయువాఁడు

18. రజ్జుసర్గుఁడు=పగ్గములఁ జేయువాఁడు.

19. మృగయుఁడు=మృగములను వేఁటాడి జీవించువాఁడు.

20: శ్వనితుఁడు=కుక్కల నాడి జీవించువాఁడు.

21. భిషక్=వైద్యముఁ జేసి జీవించువాఁడు.

22. నక్షత్రదర్శకుఁడు=జ్యోతిష్కుఁడు.

23. పేశస్కారి = బంగారుఁపు పనివాఁడు. (కంసాలి)

24. పౌంజిష్ఠుఁడు=చేపలఁ బట్టి జీవించువాఁడు.

25. నిషాదుఁడు=శూన్య స్థలములలో జీవించువాఁడు.

26. కితవుఁడు=జూదరి.

27. విదలకారుఁడు=మేదరిపనివాఁడు.

28. కంటకకారుఁడు=తోటలకుఁ గట్టవలను వేయువాఁడు.

29. స్మరకారి=మందులఁ బెట్టి స్త్రీలకుఁ గామోద్రేకముఁ గలుగఁజేయు స్త్రీ.

30. ఉపసదుఁడు=అనవసరముగ సభలకువచ్చి, వాదముఁ జేయువాఁడు.

31. ప్రశ్నవివాకుఁడు=ఎట్టి విషమ ప్రశ్నలకైన సమాధానముఁ జెప్పువాఁడు.

32. స్తేనహృదయుఁడు= దొంగల హృదయముఁ దెలిసి వారిం బట్టువాఁడు.

33. పిశునుఁడు=ప్రభువులచెవిలోఁ గొండెములఁ జెప్పువాఁడు.

34. క్షత్త=రథసారథి.

35. సంగ్రహీత=కోశాధ్యక్షుఁడు.

36. అనుచరుఁడు=సేవకుఁడు.

37. పరిష్కందుఁడు = గొప్పకొలువు కుంచముగాను బను సేవకుఁడు.

38. ప్రియవాది=రాజుకడ మంచిమాట లాడువాఁడు.

39. అశ్వసాది=గుఱ్ఱపు రౌతు.

40. వాసఃపల్పూలీ=బట్టలనుదుకువాఁడుది(చాకలి)

41. రజయిత్రి=బట్టలకు రంగులనువేయువాఁడుది. (ఉనుపులజాతిస్త్రీ)

42. దార్వాహారుఁడు=కట్టెలనమ్మిజీవించువాఁడు.

43. అగ్నీంధుఁడు=అగ్నిని రగుల్కొలుపువాఁడు (ఇటుక, పెంకామముల గాల్చువారు ప్రత్యేకము నేఁడును గలరు)

44. అభిషేక్త=రాజపట్టాభిషేకకర్మలఁ జేయించు పురోహితుఁడు.

45. పాత్రనిర్ణేగుఁడు=లోహపాత్రపరిశోధకుఁడు

46. పేశిత=యుద్ధనివారణోపాయములఁ జేసి, యుద్ధముల నాఁపువాఁడు.

47. విశ్లేషిత=స్నేహితులకు విరోధముఁ బెట్టి జీవించువాఁడు (దావాల యేజంటు)

48. ఉపసేక్త=సాధారణవిరోధముల నణఁచువాఁడు (తగవరి)

49. ఉపమన్థిత=స్వయముగ వచ్చి విరోధములఁ బెట్టువాఁడు.

50. భాగదుఘుఁడు=ప్రజలనుండి రాజు పన్నును రాఁబట్టువాఁడు (కలక్టరు)

51. పరివేష్ట=భోజనకాలమునందు వడ్డనఁ జేసి జీవించువాఁడు.

52. గజపాలుఁడు=ఏనుగులపై నధికారి.

53. అశ్వపాలుఁడు=గుఱ్ఱములపై నధికారి.

54. గోపాలుఁడు=గోవృషభములపై నధికారి.

55, అవిపాలుఁడు=గొఱ్ఱెలపై నధికారి.

56. అజపాలుఁడు=మేఁకలపై నధికారి.

57. కర్షకుఁడు=దున్ని జీవించువాఁడు (వ్యవసాయకుఁడు)

58. సురాకారుఁడు=కల్లుజేయువాడు (ఈడిగ, లేక, గవుండ్లవాఁడు)

59. గృహపుఁడు=ఇండ్లను గాపాడువాడు (గ్రామతలారి)

60. విత్తపుఁడు=ధనకోశముఁ గాపాడువాఁడు

61. అనుక్షత్త=రెండవసారథి (రథమున కిరువురు సారథులుందురు)

62. అయస్తాపుఁడు=ఇనుముఁ గఱఁగించువాఁడు (కమ్మరి)

63. నిసరుఁడు=వధ్యులఁ బయటికిఁ దీసికొని పోవువాఁడు.

64. అభిసరుఁడు=రథమునకుముందునడచువాఁడు

65. యోక్త=రథములకుఁ గట్టములఁగట్టువాఁడు.

66. విమోక్త =రథములయొక్క గట్టములను విప్పువాఁడు.

67. అంజనీకారుఁడు=కన్నులకుఁ గాటుకఁబెట్టి సంపాదించువాడు.

68. కోశకారిణి=కత్తులకు వఱలఁజేయువాఁడుది. సంగీతాంగమగు (శ్రుతి) తిత్తినూఁదునది యని మతాంతరము.

69. అథర్వుఁడు=అథర్వవేదముఁ దెలిసినవాఁడు (మంత్రవేత్త).

70. అపస్కస్వరి=కడుపులఁ దింపువాఁడుది. (వితంతుబాహుళ్యముచే, భరతఖండమునను, అవివాహిత లధికముగనుండుటచే పాశ్చాత్యదేశము లందును ఇపుడీ వృత్తికలవారు రహస్యముగనున్నారు.

71. అతిత్వరి=మంత్రసాని.

72. వనపుఁడు=వనపాలుఁడు (ఫారెస్టు సూపరింటెండెంటు)

73. దావపుఁడు=అరణ్యము లగ్నిపాలు గాకుండ రక్షించువాఁడు (రేంజరు).

74. ధీవరుఁడు, దాసుఁడు, బైందుఁడు, శౌష్కలుఁడు, కైవర్తుఁడు, మార్దారుఁడు, ఆందుఁడు, మైనాలుఁడు, పర్ణకుఁడు, అనువారు క్రమముగా, నీటిని రెండువైపుల బంధించియు, గాలము నుపయోగించియు, నిల్వ నీటినుండియు, గాలభేదము నుపయోగించియు, నీటిమొద్దుననుండియు, చేతులుమాత్ర ముపయోగించియు, రేవులందు శంకు నుపయోగించియు, వలనుపయోగించియు, విషముగల యాకులను నీటిపై నుపయోగించియుఁ జేపలఁబట్టు పల్లెవాండ్రయొక్క భేదములు.

75. కిరాతుఁడు = కేవలము మృగములఁ జంపి మాంసముచేతనే జీవించువాఁడు.

76. కింపురుషుఁడు = ఆరణ్యకులకు సంగీతమును వినిపించువాఁడు.

77. ఋషులుఁడు=చారిత్రకోపాధ్యాయుఁడు.

78. వీణావాది=నేర్పుగవీణవాయించువాఁడు.

79. తూణవధ్ముఁడు=వేణువును నేర్పుగవాయించువాఁడు.

80. దుందుభ్యాఘాతుఁడు=దుందుభిని వాయించువాఁడు.

81. శంఖధ్ముఁడు=శంఖము నూదువాఁడు.

82. అజినసంధాయి=చర్మపుఁ బనివాఁడు.

83. చర్మమ్నుఁడు=వీణను వాయించు నపుడు, వ్రేళ్లకును ధనుస్సులను లాగునపుడు చేతులకును, దెబ్బలు తగలకుండఁగ జర్మపుఁ గవచములఁ జేయువాఁడు.

84. పుల్కసుఁడు=నీచవృత్తిచే జీవించువాఁడు.

85. వణిజుఁడు=వస్తువులనుఁదూఁచియమ్మువాఁడు

86. హిరణ్యకారుఁడు = బంగారువస్తువులఁజేసి యమ్మువాఁడు (కంసాలి).

87. జనవాది=జనులలో నపవాదములను వ్యాపింపఁజేయువాఁడు.

88. గణకుఁడు=సంగీతసంబంధమగు శ్రుతి జాతి స్వరాదిగణన కుశలుఁడు.

89. తూణవధ్ముఁడు=కట్టెతోను, నోటితోను సమముగా సంగీతముఁ బాడువాఁడు.

90. గ్రామణ్యుఁడు=గ్రామాధికారి (మునసబు, లేక, రెడ్డి)

91. పాణిసంఘాతుఁడు = సంగీతముఁ బాడునపుడు చేతితోఁ దాళమువేయువాఁడు.

92. అనుక్రోశుఁడు=సంగీతాంతముఁజెప్పువాఁడు

93. తలవుఁడు=శాకానూదువాఁడు.

94. ఆకితవుఁడు=ద్యూతమునకుఁ బ్రోత్సహించువాఁడు.

95. సభావి=ద్యూతసభాధిపతి.

96. ఆదినవదర్శుఁడు = ద్యూతసభయందు గౌరవాధ్యక్షుఁడు.

97. సభాస్థాణుఁడు=సభలో నేపక్షముఁజెప్పక మొద్దులాగు కూర్చుండువాఁడు.

98. బహిస్సదుఁడు=వివాదసమయమున, నేపక్షముఁజెప్పక సభను వదలువాఁడు.

99. చరకాచార్యుఁడు = గడసెక్కి యాడుఁ దొమ్మరివిద్యను నేర్పు గురువు.

100. గోవ్యచ్ఛుఁడు=గోవులమందలను జాగ్రత్తగ నేయువాఁడు.

101. గోఘాతుఁడు= విషాదులచే గోవులఁజంపువాఁడు

102. గోవికర్త=గోవులఁగోసి చంపువాఁడు.

103. గోవికర్తృ యాచకుఁడు=గోవులఁగోయువానిని మాంసమును యాచించువాఁడు.

104. చండాలుఁడు = గ్రామ పారిశుద్ధ్యముఁ జేయువాఁడు.

105. వంశనర్తి=గడసెక్కి యాడి జీవించువాఁడు (దొమ్మరి).

పై వృత్తులలో వ్యవసాయమున కుపయోగించు వృత్తులును బెక్కు కలవు.

పై వృత్తులలోఁ గొన్ని నేఁడు మృగ్యములై యున్నవి.

క్షాత్రకాలపు వ్యవసాయకుల కోరికలు.

౧ ఓషధులు సారవంతములగు గాక, నావాక్కులు సారవంతములగు గాక, ధాన్యాదుల ననేక రెట్లు తీసికొని వత్తుముగాక!

౨ నేను మహిమగలదేవు నెఱుఁగుదును, ఆదేవుఁడు విశేషధాన్యము నిచ్చెను. పోషకుఁడగు నాదేవుని మేము సేవించుచున్నాము. యజ్ఞముఁజేయనివాఁ డెవఁడు కలఁడో వాని ధాన్యమును, దేవుఁడు మాకిచ్చుఁగాక.

౩ నూరు రెట్లుగనుండిన నీటి యాధారములు వేయురెట్లగు గాక, మాధాన్యము వేయిరెట్లు పెఱుగు గాక.

౪ శతహస్తుఁడవగునో దేవా? నీవు ధాన్యమునిమ్ము. సహస్రహస్తుఁడవగు ప్రభువా ? నీవు ధనమునుఁ గుటీపింపుము. నీవు మేము చేసినపనిని వృద్ధిచేయుము.

క్షాత్రకాలపు వ్యవసాయపు పనిముట్టులు.

ఈ కాలమునందు వెనుకటికాలముకంటె కొన్ని పనిముట్లు లెక్కువైనది. నాగలియొక్క మేడికిపట్టనను పగు పిడిని వేసిరి. దానికి, "త్సరు" వని పేరు. ధాన్యమును నుఱుచుటకుఁ గళ్లముఁ జేయుచుండిరి. దానికి "ఖల" మని పేరు. ధాన్యమును బండిపైఁ దీసికొని పోవుటకు, సంచులో బుట్టలో ప్రతిబండికి రెండింటిని వేయుచుండిరి. వానికి "స్థాఖ్య" అని పేరు. ధాన్యముఁ జెఱుగుటకుఁ జేఁటనుగని పెట్టిరి. "శూర్ప" మని దానిపేరు. పొలములోని నీరుఁ బారించెడి "బోదెకు" "కుల్య" యని పేరు. బండి చక్రమునకు వేయుపట్టాకు "ప్రధి" యని పేరు. బండికి కట్టితోడనే యిఱుసును వేయుచుండిరి. అది "కిట్టు" మనుచుండెను. దీనినింపుగ బృహదారణ్య కోపనిషత్తు (6-3-35) లో వర్ణించిరి. కట్టియిరుసు, నేటివరకుఁ బెక్కు చోటులలో నున్నది.

"స్ఫ్య" మను కొయ్యపనిముట్టుతో గడ్డిని గోయుచుండిరి. యిప్పటి కొడవలివంటిదియు నాఁడు కలదు. "స్ఫ్యం" మాత్రము నేఁడు లేదు.

---

౧ పయస్వతీరోషధయః పయస్వ న్మామకం వచః, అథో పయస్వతీనామ భరేహంస హస్రశః "అథర్వసంహితా" (3-24-1) (౨) వేదాహం పయస్వంతః చకారధాన్యం బహు సంభృత్వా, నామయో దేవ స్తంవయం హవామహే యో యో అయజ్వనో గృహే "అథర్వసం" (3-24-2) (3) ఉదుత్సం శతధారం సహస్రధార మక్షితం ఏవాస్మాకేదం ధాన్యం సహస్రధార మక్షితం "అథర్వ సంహితా" (3-24-4) (౪) శతహస్త సమాహర, సహస్రహస్తసంకిర, కృత స్యకార్యస్య, చేహస్ఫాతిం సమావహ "అథర్వసంహితా" (3-23-5)

# నాగరాజు

రాయసము వేంకటశివుఁడు గారు, ఎమ్. ఏ. ఎల్. టి.

మన దేశములో సర్పముల స్వభావాదులను గుఱించి జనులు సంపాదించిన జ్ఞానము శాస్త్రరూపకముగ మాత్రము గాక, పురాణగాథలుగాను, మంత్రములుగాను, ఐతిహ్యములుగాను, తరతరములనుండి వచ్చుచున్నది. నాకుఁ దెలిసిన యిట్టివృత్తాంత మొకటి యిచట వివరించుచున్నాను. పాఠకు లిందలి సత్యము నరయుదురు గాక!

ఆంధ్రదేశమున నొకగ్రామమున సర్పపురివారను నింటిపేరుగల బ్రాహ్మణకుటుంబ మొకటి గలదు. ఇన్నూఱుసంవత్సరములకుఁ బూర్వము, సర్పపురివారి పూర్వికులలో నొక స్త్రీగర్భమున నాగుఁబాము పుట్టెను. దానికి నాగరాజను పేరు పెట్టి, ఆయిల్లాలు సహజానురాగముతో దానిని బాలుపోసి పెంచెను. ఆమె గర్భముననే జనించిన తక్కిన పిల్లలతో నీచిలువకందు కలసి మెలసి యాడుకొనుచుండును. దినదినాభివృద్ధిగాంచుచున్న యాపాము జనని పోయుపాలతోఁ దనివిఁ జెందక, తన జాతికి నైసర్గికమగుమాంసాహారమునకై తిరుగుచు, కప్పలు మొదలగు చిన్నజంతువులను వేటాడుచువచ్చెను. అంతకంతకుఁ బెద్దదియై యాపాము, తన మానవసోదరులతో నెల్లప్పుడు నిండఁ గలసియుండుట కర్తవ్యముగాదని గ్రహించి, నిర్జనప్రదేశ మొకటి చూచుకొనఁ బ్రయత్నించెను. కాని, కన్న తల్లిని, తండ్రిని, నిజసోదరులను విడిచి పోవుట దానికి దుస్సహముగఁ దోఁచి, ఆ యింటనే యెత్తుగు కప్పుదగ్గఱను, వెలిసెలలోను, అటకమీఁదను, తన నివాస మేర్పఱుచుకొనెను. వెనుకటివలె నిపుడు నాగరాజు ఎల్లప్పుడును తమతోఁ గలసిమెలసి యుండకపోయినను, ఇంట నెచటనో యున్నాఁడు గదా యని జననీజనకులు, సోదరులును, మనస్సును సమాధానపఱుచుకొని యుండిరి. అటకమీఁదఁ బాము సంచారము చేయునపుడు, దాని పొడగాంచి క్రిందనుండి పిల్లలు, "అదుగో నాగన్నయ్య!" అని సంతోషముతోఁ జప్పట్లు గొట్టఁగా, నాగరాజు, దుముకుచు, మఱుఁగుపడుచు, తిరిగి కనులకగపడుచు, దన యానందము వారికిఁ దెలుపుచుండును. రాత్రి యందఱు నిద్రించుతఱి, నాగరాజు మెల్లఁగఁ గ్రిందికి దిగి వచ్చి, పాలదాలిలోఁ బండుకొని హాయిగ నిదురించి, వేకువనె లేచి పైకెక్కిపోవుచుండును.

ఇట్లు కొంతకాలము గడచిపోయెను. ఇపుడు నాగరాజు, ఈడునకుఁ దగిన యాకారము దాల్చి యుండెను. తన కిష్టమువచ్చినపుడెల్లఁ పగలు క్రిందికి దిగి వచ్చి జననీజనకులయొద్దను, అన్నదమ్ముల సమ్ముఖమునను మసలుచు, వారిచ్చుపాలు గ్రోలుచు, వారితోఁ జెరలాటము లాడుచుండును. అంతి

మెకాని, వారియెడ నించుకయైన ద్వేషబుద్ధి వహింపఁడు. ఏమఱుపాటుననైన నెవనిని భయపెట్టఁడు. కఱవఁడు.

గృహయజమానుని పెద్ద కుమారుని కిపుడు యౌవనము రాఁగా, వాని వివాహము సంగతి తలిదండ్రు లాలోచింపసాగిరి. వరునిఁ జూచిపోవుటకుఁ బలువురు వీరియింటికి వచ్చుచుఁ బోవుచుందురు. ఇట్లు వచ్చెడివారి కాగృహమున సాధారణముగ సర్పదర్శన మగుచుండెను. "అది మాపెంపుడు పాము లెండి! మిమ్మునేమియుఁ జేయదు." అని వారి కింటివారు సమాధానము చెప్పి, వారిసందియములఁ దీర్పఁజూతురు. కాని సర్పదర్శనము దుశ్శకునమని కొందఱును, పాము లింటఁదిరుగాడుచుండువారితో వియ్యమందఁ గూడదని మఱికొందఱును, మనస్సున నూహించి, వచ్చినదారినే పోవుచుందురు. కాబట్టి యెంతకాలమునకును పెద్దపిల్లవానికిఁ బెండ్లి కాలేదు. జ్యేష్ఠకుమారుని మాటయె యిటులైనపుడు, ఎదుగుచున్న తక్కినపుత్త్రులకును పుత్త్రికలకును నిఁక వివాహసంబంధము లెట్లు సమకూరునా యని తలిదండ్రులు దిగులుపడ సాగిరి.

ఆపద్ధర్మమను వ్యాజమున వివాహవిషయముల నెట్టి యకార్యములు చేయుటకును మనదేశమునఁ బలువురు వెనుదీయకున్నారు. ఒకరాత్రి గృహిణీగృహస్థులు, చాలఁబ్రొద్దుపోవువఱకును తమకుమారుని వివాహమును గుఱించి సంభాషించుకొనిరి. తుదకిల్లాలు, కంటఁదడిపెట్టికొని, పతిచెప్పినమాటలకుఁ దలయూఁచెను.

మఱునాఁటియుదయమున గృహిణి పడకనుండి లేచి, కన్నీరుమున్నీరుగ నేడ్చి, యింటిపనులు నెఱవేర్చుకొనుచుండెను. కొంతసేపటికిఁ బాలదాలినుండి పెద్దధ్వని వినఁబడెను. దుర్వాసన వెడలెను. గృహయజమానురాలంతమూర్ఛిల్లి పడిపోయెను. వేగమె యందఱు వచ్చి, చల్లనినీరు మోమునఁజల్లి యామె మూర్ఛను దెలిపిరి. ఆమె యంతట సైగచేయఁగా వారు పాలదాలినిఁ బెల్లగించి, చూచిరి. అందు, తనపైఁ బేర్చిన పిడకలంటుకొనుటవలనఁ దప్పించుకొని పోవుటకు వలనుపడక కొట్టుకొనుచుండు నొకసర్పము గానఁబడెను! దానినపుడు వారు వెలికిఁ దీసిరి. తల్లిమీఁదఁగల యపారప్రేమచేత, నాగరాజంతట సగముడికిపోయిన తనశరీరమును మెల్లఁగ నీడ్చుకొనుచువచ్చి యామెపాదముల నంటి ప్రాణములు విడిచెను!

ఆదినమా గృహము వారందఱిరోదనధ్వనులతోను మాఱుమ్రోఁగెను. ప్రమాదమున నసలమున కాహుతియైన తన సర్పకుమారునికి యజమానుఁడు రెండవమాఱు దహనసంస్కారము గావించెను. మొట్టమొదటిదినములలో వారందఱికిని దుఃఖము దుర్భరముగ నుండినను, నానాఁటకాంతిల్లెను. తల్లిమాత్రము పుత్త్రశోకము నెన్నఁడును మఱవలేకుండెను. ఆమె కన్నులయెదుటఁ బ్రియపుత్త్రుఁడు నాగరాజు సదా తాండవమాడుచున్నటులుండును. రాత్రులు పాపజీవినిగుఱించియో యామెకుఁ గలలువచ్చుచుండును. పుత్త్రఘాతుకురాలనని వగచివగచి,

దరిలేని సంతాపానలమునఁ గనలికనలి, యా కాంత యంతఁ గనులు మూసికొనెను. ఇంకఁ గొమరుని మృతిదినమునుండియు నేత్రపాటవము తప్పిన జనకుఁడు తన మహాపాతకమునకుఁ బరితపించి, యాఱునెలలలోన కాలగతి నొందెను. చావు లోకటికి రెండుమూఁడయ్యెనే యని వారందఱు మిగుల శోకించిరి.

ఒకరిద్దఱిచావులతో నెన్నఁడు నీప్రపంచ నాటక మంతమొందునది గాదు. ఇట్టి విషాదములు జరిగినను, జగతీచక్రమెప్పటివలె తిరుగుచుండెను. ఆ కుటుంబములో నుండువారికి మాత్రము, తాముకోలుపోయిన సర్పరాజును గుఱించి యెప్పుడును మఱపు రాకుండెను. ఇపుడు వారందఱును పెద్దవారలై, వివాహములు చేసికొని, కుటుంబ వ్యాపారములు నెఱవేర్చుకొనుచుండిరి. ఏలొకో కాని యావంశములోని వారికెవ్వరికిని సంతతిమాత్రము లేకుండెను! కొందఱు మహనీయులయాలోచన చొప్పున నంతట వారు, తమసొంతసొమ్ముతో నాగ్రామమున సుబ్రహ్మణేశ్వరుని కొకదేవళము గట్టించి, అది శాశ్వతముగ జరుగుటకై కొంత భూదానముఁ జేసిరి. తమ సంతతివారి కాదేవునిపేరు పెట్టెదమని మ్రొక్కుకొనిరి. అప్పటినుండియు వారికుటుంబము తామరతంపరగ వర్ధిల్లఁజొచ్చెను!

పై వృత్తాంతము జరిగి యిప్పటి కిన్నూఱుసంవత్సరము లైనను, ఆవంశమువారి కది నిన్నమొన్న జరిగినదానివలెఁ దోఁచుచున్నది. ఆయింట నిప్పటికిని మొదటిపుత్త్రునకు, పుత్త్రికకును తప్పక నాగరాజుపేరులే నామధేయములు. సర్పపురివారి వంశమున నెచటఁ జూచినను సుబ్రహ్మణ్యనాగరాజులును, శేషమ్మ సుబ్బమ్మలునే! వారందఱికిని సుబ్రహ్మణ్యుఁడే యిలువేల్పు.

ఇంకొక సంగతికూడ నిటఁ జెప్పవలయును. సర్పపురివారిలో ననేకులకుఁ బాము మంత్రము బాగుగఁ దెలియును. వారి పూర్వీకులలో నొక రీమంత్రప్రభావమువలనఁ దన సర్ప పరివారముతో దాడివెడలి, బలిష్ఠుఁడగు శత్రువు నొకని నోడించెను. ఆవంశములోని వా రిప్పటికిని సర్పమును గారవించుచు సర్పదష్టులగు వారిని మంత్రోచ్చారణము చేతను ప్రక్రియలచేతను రక్షించు చుందురు. వారెన్నఁడును పాములను జంపరు. సొరకాయ పొట్లకాయ మొదలగు కొన్నిశాకములు ముట్టక, మిక్కిలి నిష్ఠాపరులై యుందురు. వారికి గాయత్రికంటెను సర్పమంత్ర మెక్కువ యాదరణీయము. ఇటీవలవారిలో నొకరు కేరళదేశమునకుఁ బోయి, అచటఁ గొంతకాలము నివసించి, 'పాంబు మేక్కాట్టు నంబూద్రి'యను మహనీయునివలనను, తదితర 'మలయాల' మంత్రవేత్తలవలనను, క్రొత్తక్రొత్త సర్పమంత్రములను నేర్చుకొని యింటికి వచ్చెను. సర్పదష్టులగువారి నీతఁడుచూడఁగనే వారిమేనిలోనికెక్కినవిషమును బోగొట్టి వారిని రక్షించుచున్నాఁడు. ఎవనినైనఁ బాము కఱచినయెడల, ఆవార్తయాయన కెవనిచేఁ గాని, తంత్రిమార్గమునఁగాని, వేగమే తెలియఁబఱుపవలయును. అదివిని యాయన, "నాగరాజా! విడిచిపో" యని ముమ్మాఱు ఉచ్చరించును. తాను గట్టు

కొనిన వస్త్రమునుండి యొకపేలిక చించి, దండగాఁ జేసి, యది వార్త తెచ్చినవాని మెడలో వేయును. అంతఁ గొనయూపిరియున్నను, రోగి లేచికూర్చుండును!

సర్పపురివాసు కొన్నిసంవత్సరముల కొకసారి యందఱును తమగ్రామమునఁ గలిసికొని తమకులదేవతయగు నాగరాజుపేరట "సర్పశాంతి"యను గొప్పయుత్సవము చేయుదురు. ఆదినములలో బహిరంగముగఁ బూజలు పురస్కారములును జేయుటయేకాక వారందఱుఁ దమగృహమున నర్ధరాత్రిసమయమున నాంతరంగికసభయొకటి జరుపుదురనియును, ఆసమయమునలోకమునందలి యురగశ్రేష్ఠములన్నియునచటకేతెంచి, వారితోఁ గలిసి, తాండవమాడి, సూర్యోదయమునకుఁ బూర్వమే పాతాళమునందలి తమతమ యిరవులకుఁ దిరిగి చేరుననియును బ్రతీతికలదు!

---

# ఘాతుకప్రియ

నోరి నరసింహ శాస్త్రి బి. ఏ., (సాహితీసమితిసభ్యుడు)

నీ కృపార్ద్రకటాక్షంబు నిర్దయాత్మ,
కఠిన దృక్సర్జనముకన్న కలుషతరము!
నీవచించు సుధాస్వాదు స్నేహవాక్కు
పరుషపాషాణభాషకు పటుతరంబు!

నీ చిరుతనవ్వు భ్రాంతి సంధించి మెదను
లేనిపోనియాశలు చిగురింప జేయు!
మంచు తొలగును శశి యుదయించితోచు
అంతలో నీముఖంబు హిమాద్రి యగును!

తీవ్రతృష్ణాతురుని మృగతృష్ణవోలె
చపల మత్స్యాంగనల నామిషంబు రీతి
నీసుషమపేశలాకృతి నీ మృదూక్తి
బలిమి కర్షించి నాదుదర్పము హరించు!

అతితరామర్షమున కరం బందు నంత
వ్రేలబడు పాశి చైతన్యవిరహ మగుచు!
ఈషదుద్రేక మొంది నో రెత్తునంత
గళము స్తంభించు జిహ్వ నిశ్చలత గాంచు!

శాశ్వతవిసర్జనేచ్ఛమై సాగునంత
అడుగు కదలక దారులై యట్టె నిలుచు!
ప్రాణఘాతుక యనుకొన్న ఫలిత మేమి!
ప్రాణనాయిక యని నోట వాక్కు వెడలు!



డాక్టరు జేమ్సు కజిన్సు గారు

ఈ చిత్రముయొక్క బ్లాకును 'శ్యామా' మాసపత్రికా సంపాదకురాలు శ్రీమతి మృణాళిని ఛట్టోపాధ్యాయిగారు ప్రకటనార్థమై దయతో నొసంగిరి.



డాక్టరు సి. వి. రామన్ గారు, ఎం. ఏ., డి. ఎస్. సి. యఫ్. ఆర్, ఎస్.



పదార్థవిజ్ఞానశాస్త్రము రసాయనశాస్త్రము, గణితము వీనికి సంబంధించిన కార్యాగారము
నెం 92 రు అప్పర్ సర్క్యులరు రోడ్డు, కలకత్తా.
ఇందు మనశ్శాస్త్ర జీవశాస్త్రపరిశోధనలును జరుగుచున్నవి.

# ప్రొఫెసర్. సి. వి. రామన్‌గారు ఎం. ఏ., డి. యస్. సి., యఫ్. ఆర్. యస్.

దండా వెంకట సుబ్బారెడ్డి గారు

భారతీయులు ఆముష్మికమునందే దృష్టినిలిపి, వెఱ్ఱి వేదాంతములలో కాలము వృథాపుచ్చువారనియు, మానవకోటి కనంతసౌఖ్యములను చేకూర్చు విజ్ఞానశాస్త్రవిషయికపరిశోధనల సల్పగల మేధాశక్తి వారియందు శూన్యమనియు చెప్పుట నిన్నమొన్నటివరకు పాశ్చాత్యులలో నొకవాడుకయైయుండెను. ఈజాతీయ కళంకమును తొలంగించి, హైందవపరిశోధనాకౌశలమును లోకమునకు ప్రదర్శించి, ఆంగ్లసామ్రాజ్యమందలి సుప్రసిద్ధవిజ్ఞానశాస్త్రకోవిదుల మహామండలి యగు రాయల్ సొసైటిలోనికి గౌరవసభ్యులుగ వరింపబడిన హైందవపరిశోధకులలో జగదీశచంద్రబోసుగారు ప్రథములు. వీరిపిమ్మట రెండునెలలక్రిందట నిట్టి యుత్కృష్టగౌరవమును 36 సంవత్సరముల పిన్నవయసుననే పొందిన పదార్థవిజ్ఞానశాస్త్రపండితులు సి. వి. రామన్‌గారు. బోసుగారి ప్రయోగములును వారినూతనసిద్ధాంతములును నాగరకప్రపంచమునందెల్లమారుమ్రోయుచుండ నాసుప్రసిద్ధభారతపుత్రునిగురించి పాఠకులకు మరల విన్నవింపబూనుట చర్వితచర్వణము. రామన్‌గారన్ననో కొంతకాలముక్రిందట విజ్ఞానాకాశమున నవతరించిన ప్రొద్దుపొడుపుచుక్క. పెక్కుమంది వీరిపేరు వినియైన నుండరు. అంతియకాక వీ రాంధ్రావనిని పెరిగిపెద్దయయినవారు. ఆంధ్రులయెడ నత్యాదరమును స్నేహభావమును గలవారగుటచే వీరు మనకెంతయు నాప్తబాంధవులు. ఇట్టిసుప్రసిద్ధవిజ్ఞానశాస్త్రజ్ఞుని జీవితాంశములను గుణగణములను వారిపరిశోధనలను వారు భారతమాత కొనర్చినసేవను కొంతవరకు గమనించి కృతకృత్యులగుట సంభావ్యము.

రామన్‌గారు 1888 సం. నవంబరునెల 9 తేది నొకమహాశుభముహూర్తమున జనించిరి. వీరితండ్రిగారు విశాఖపట్టణ కళాశాలాప్రధానోపాధ్యాయులుగ నుండి కీర్తిశేషులైన చంద్రశేఖరయ్యరుగారు. ఈఘనాత్ముడు విజ్ఞానశాస్త్రమునందు పట్టపరీక్ష నిచ్చి పిమ్మట జ్ఞానార్జనమునందే నిమగ్నచిత్తుడై ప్రయోగములు (experiments) సల్పుటయందు తన్మయత్వము నొందుచుండెడివారు. అట్టిజ్ఞానాన్వేషియొక్క కుమారరత్నము విఖ్యాతవిజ్ఞానశాస్త్రజ్ఞుడగుట యేమివింత? జ్ఞానమూర్తియగు తండ్రిగారినీడ బెరుగుచు అనుదినమును శాస్త్రజ్ఞానమున, గణితమున సుశిక్షితుడగుచు కుశాగ్రబుద్ధి యగు నీరామనుగారు బాల్యముననే శాస్త్రజ్ఞానమును కరతలామలకముగ జేసికొనిరి. 'భారతి'ని పఠించువారికి భారవికథ స్ఫురించియేయుండును. 'పుత్రాదిచ్ఛేత్పరాజయమ్' అనునుడువు దోచును. తండ్రియే గురుమూర్తిగ పరిణమించినబిడ్డలు ధన్యాత్ములుగదా. చూడుడు. ఆధునికశాస్త్రవేత్తలలో నగ్రగణ్యుడగు లిస్టరుప్రభువు తనతండ్రిసాహాయ్యమున సూక్ష్మదర్శిని నుపయోగించుపద్ధతులు నేర్చెనట. ఖగోళశాస్త్రజ్ఞుడగు హర్చెల్, జీవశాస్త్రజ్ఞుడగు డార్విన్‌గారును తమప్రియజనకులశిక్షవలన విఖ్యాతపూరుషు లయిరి. రామనుగారితండ్రి శాస్త్రజ్ఞుడౌటయేకాక గానప్రియుడును. అక్కారణమున వాద్యములు, నాదములు, రాగములు మొదలగువానిని శాస్త్రదృష్టితో పరిశీలించుట వారికి సహజముగా నుండెడిది. తండ్రిగారు చేయు పరిశోధనలు చురుకైనబాలునకు ఉత్సాహము పుట్టించుట సర్వసాధారణమే గాన రామనుగారి హృదయభూమిని, ధ్వనియంత్రములచిత్రములకట్టు నరయవలయు ననునుత్సాహబీజమునాటుకొని యంకురించెను. విజ్ఞానప్రపంచవిప్పు డావృక్షముయొక్క ఫలములను పొందుచున్నది.

## విద్యార్థిదశ

రాజధానికళాశాలలో చేరినదిమొదలు రామను బుద్ధికుశలత సువ్యక్తమగుచుండెను. బి. ఏ. క్లాసులో చదువునపుడు పదార్థవిజ్ఞానశాస్త్రములో అసమానప్రజ్ఞానవంతుడుగ నుండుటయేకాక, ఆంగ్లభాషలో వ్యాసరచనానిపుణత్వమునందును ప్రథముడుగ నుండి, 1905 సంవత్సరపు ఎలిఫిన్‌స్టన్ బహుమానమును, ఆర్న

త్తునట్టు బహుమానమును గడించిరనిన వారిప్రతిభ తెల్లమగును. ఆకాలమున వారు విక్టోరియాహాస్టలులో నివసించుచుండిరి. అచటివారు రామను విశాఖపట్టణపువాడగుటచే వీరు తెలుగువారని తొలగిపోవుచుండిరట. ఆంధ్రులన్ననో తమిళుడని యెంచి దూరముగ నుండిరట. కట్టుకథలోని గబ్బిలముగతి తనకు సంభవించె నని చెప్పి రామనుగారు ఇప్పటికిని నవ్వుచుందురు. ఇంక, అతిలోత్సాహవంతు డగు యువకునకు వ్యాయామక్రీడల మీద బుద్ధిపోవుట దోషముగాదుగదా. కాని డాక్టరులు రామనుగారికి బలహీనహృదయ మనియు, ఆటలజోలికి పోరాదనియు శాసించిరట. అందువలన రామనుగారి కాలమంతయు, జ్ఞానార్జనమునందే వినియోగింపబడెను. తుదకు 1904 సం. లో పదునారేండ్లు నిండకపూర్వమే పట్టపరీక్షలో ప్రప్రథములుగ నుత్తీర్ణులైరి. అనంతరము, రెండువత్సరములకు వీరు ఎం. ఏ. పరీక్షలో నంతకుముం దెవ్వరును పొందనన్నిగుణములను సంపాదించి, ప్రప్రథముడుగ నుత్తీర్ణుడాయెను. ఈపరీక్షకు చదువుచుండగా వీరు తమ మొదటి పరిశోధనపత్రమును సిద్ధముచేసిరి. ఆవ్యాసము, విజ్ఞానసామ్రాజ్యమున గౌరవస్థాన మలంకరించు "ఫిలసాఫికల్ మాగజైన్"లో ప్రచురింపబడెను. ఈపరిశోధనకు సంబంధించినకథ యొకటిగలదు. ఆదినములలో, 18 యేండ్లబాలు డొకడు ప్రకాశవక్రీభవనము ననుసరించి యేదోపరిశోధన చేయిబూనినారనుట మన కెంతకుతూహలమును బుట్టించుచున్నదో, అంతకంటె పదిరెట్లెక్కుడుగ విసుగు, కోపము, రామనుగారిబోధకులగు జోన్సుదొరగారికి జనించెనట. కుఱ్ఱనికి సాయపడుటకుమాఱు, తనవిద్యార్థి బుద్ధికుశలతకు సంతసించుటకు బదులు, ఈగురువు సానుభూతిరహితుడై, రామనుగారి ప్రయోగములు నూతనములు గావని పలువిధముల పరిహాసముచేసెనట. కాని, రామను నిజమైనశాస్త్రజ్ఞుడు. లూయిపాస్ట్యూరు పడినబాధల నెరిగినవాడు. ఆరంభించినదానిని పరిత్యజింపక, ఒకటికి పదిమాఱు లా పరిశోధనలసల్పి, తుదకు జోన్సుగారిని సంప్రీతుంజేసిరి. ఆపరిశోధనఫలితమే 1907 సంవత్సరములో ప్రచురింపబడినది. ఇది రాబోవు మహాగ్రంథమునకు చిన్న ఉపోద్ఘాతమువంటిది. నాటినుండి రామన్ గారిపేరు విజ్ఞానశాస్త్రజ్ఞులకు పత్రికలమూలమున వినబడుచుండెను. ఇట్టి ప్రాశస్త్యమును పొందునప్పటికి రామనుగారు 18 వత్సరములబాలు డనువిషయము గమనింపదగియున్నది.

విద్యార్థిదశ ముగిసెను. రామనుగారు గణితమున గట్టివారు కావున సులభముగ ఆర్థికశాఖలో ప్రవేశించిరి. దానికై జరుగు పోటీపరీక్షలో ప్రథములుగ వచ్చిరి. ప్రథములుగ నుత్తీర్ణులగుట వీరి జన్మహక్కువలె నున్నది! ఆశాఖలో క్రమక్రమముగ రు. 800 జీతమాయెను. ఆశాఖలోనే యుండినచో నిపుడు 3000 రూపాయలవేతనము పుచ్చుకొనుచుండువారు. కాని లోకము ఎంతయో పేదపడియుండెడిది. వారి అదృష్టమువలనను, భారతీయుల పుణ్యమువలనను రామనుగారి జీవితములో నొక గొప్పమార్పు గల్గినది.

పై మార్పుయొక్క ప్రాముఖ్యమును గ్రహించుటకు భరతఖండమున విజ్ఞానశాస్త్రపరిశోధనాభివృద్ధిని, తత్సాధనములను నుద్యమములను కొంచెము వివరించెదను. 1850 సం. ప్రాంతములనుండి, శాస్త్రజ్ఞానబోధకులు పఠనీయగ్రంథములు వల్లించి విద్యార్థులకు నప్పగించుచుండిరి. ఇప్పటికి నీబోధనపద్ధతి నవలంబించుపండితులు గలరు. ఇక విదేశీయులగు పండితులు, గొప్పజీతములు గడించుటచేతనే తమవిధ్యుక్తధర్మము ముగిసినట్లు తలంచుచుండుట అనుభవైకవేద్యము. మొత్తముమీద విద్యార్థులకు పరిశోధనలపై నుత్సాహము, జ్ఞానతృష్ణ కలుగునట్లు బోధించుట అరుదుగనుండెను. జగదీశచంద్రబోసుగారును, ఆచార్య రేగారును మాత్రము ఆత్మబోధల ననుసరించి పరిశోధనల సల్పుచు, విఘ్నములకును, బెదరింపులకును జంకక విజ్ఞానరసాయనశాస్త్రములందు విదేశీయపండితుల కేమాత్రమును వెనుకబడక యుండిరి. ఇట్టిదుస్థితిలో విజ్ఞానశాస్త్రపరిశోధనప్రోత్సాహకసంఘ మొకటి కలకత్తానగరమున, దూరదృష్టియగు మహేంద్రలాలుసర్కారుగారిచే స్థాపింపబడెను. ఈధైర్యశాలి నిరంతరపరిశ్రమ చేసి చందాలసహాయమున నొకచిన్నభవనమును సంపాదించిరి. ఇట్టి సదుద్యమమునకు ప్రోత్సాహ మొసంగినవారలలో అషుతోషుముఖర్జీగారు ప్రథమగణ్యులు. భారతీయుల దురదృష్టమువలన, పరిశోధనలకును, తత్కార్యముల కుద్యుక్తులగు శాస్త్రకోవిదులకును వలయుధనసాహాయ్యము అందకపోయెను. ఈసందర్భములలో రామనుగారు 1907 సం.

లో తమపరిశోధనల మొదలుపెట్టిరి. వీ రప్పుడు ఆర్థిక శాఖలో నుద్యోగిగనుండిరి. అందువలన సెలవుదినముల లోను, ఉదయముననో లేక సాయంకాలముననో కొంచెము వీలుగలిగినపుడెల్ల పనిచేయననువగునట్లు, పైమండలివారి పరిశోధనాలయమును వీరిస్వాధీనమందుంచిరి. వీరిశాస్త్రాభిలాషజూచి యితరులు కొందరు కృషిసలుప నుద్యుక్తులైరి. అనతికాలముననే, శ్లాఘనీయములగు పరిశోధనాపత్రములు తయారయ్యెను. విదేశీయశాస్త్రజ్ఞులు గౌరవాభినందనములు తెలియజేసిరి. ఈసంఘముయొక్క ప్రాశస్త్యము 1917 సం. మేనెల 3-వ తేది వెలువడిన 'నేచరు' అనుపత్రికలోని సంపాదకీయవ్యాసము పఠించినవారికి ప్రస్ఫుటమగును.

దీనితోపాటు, కలకత్తావిశ్వవిద్యాలయమున సుప్రసిద్ధశాస్త్రజ్ఞులచేత నుపన్యాసము లిప్పించుట వాడుకయయ్యెను. ఇందువలన, అభ్యసించువిద్యార్థులలో, నూతనోత్సాహము ప్రబలెను. శాస్త్రజ్ఞానము పుస్తకములోని మాటలు వల్లించుటయే కాదనియు, ప్రత్యక్షానుభవమే నిజమైన శాస్త్రజ్ఞానమనియు విద్యార్థులమనస్సులకు తట్టెను.

ఇట్లు దేశమున, ముఖ్యముగ, కలకత్తానగరమున, పరిశోధనాభిలాష మొలకలెత్తుచుండు శుభకాలమున, భారతీయులకెల్ల స్మరణీయుడగు అషుతోషుముఖర్జీగారి ధైర్యసాహసములవలనను వారిజ్ఞానాభిలాషవలనను, కలకత్తా విశ్వవిద్యాలయముతరఫున విజ్ఞానశాస్త్రపరిశోధనలు సాగ్యముచేయుటకై యొకకళాశాల స్థాపింపబడెను. ప్రస్తుతము హైందవపరిశోధనలు పాశ్చాత్యభూములలో గొప్పగౌరవమునకు పాత్రములగుచున్నవని బోసుగారే నుడివియున్నారు. ఇట్టిగౌరవము మనకు సంపాదించునవి బోసుగారిపరిశోధనలును, కలకత్తాపరిశోధకకళాశాలయు. రసవిహారఘోషుగారు, తారకనాథపాలిట్ గారు అను నిద్దరు సుప్రసిద్ధవంగీయులు 25 లక్షల రూపాయలవరకు ఈసత్కార్యమునకు నుదారబుద్ధితో నొసంగిరి. ఈపరిశోధనాలయములో రసాయనశాస్త్రోపాధ్యాయులుగ ఆచార్య రే గారిని నియోగించిరి. బోసుగా రప్పుడే వృక్షశాస్త్రవిషయికపరిశోధనలకు గడంగిరి. అప్పటికే, జగద్విఖ్యాతశాస్త్రజ్ఞుల మెప్పువడసిన, సి. వి. రామనుగారికంటె సమర్థులెవ్వరును లేరని తీర్మానించి, అషుతోషుముఖర్జీగారు ఈ తనిని "పాలిట్" శాస్త్రజ్ఞుడు అనుపదవి నలంకరింప గోరిరి. ఒకమహాశయుడు వక్కాణించినట్లు దేశమంతయు అషుతోషుగారికి కృతజ్ఞులై యుండవలెను. ఏలయనగా, అషుతోషుగారి విమర్శనాశక్తి కొంచెము తక్కువగనుండెనేని లోకమునకు రామనుగారిశక్తి మరిగియుండునదియేకదా. ఈపదవినిగురించి రెండుమాటలు. భరతఖండమున విశ్వవిద్యాలయమువారిచే స్థాపింపబడిన పండితోద్యోగములలో నిదియే మొదటిది. వితరణశాలులగువారలు ఈ గౌరవస్థానము భారతీయులకు దక్క నితరుల కొసగరాదని శాసించి, వారి దేశాభిమానమును చాటిరి. అట్టినిధులు లేకుండినయెడల నేటికిని హైందవులకు ప్రస్తుతముండు అవకాశములును, పరిశోధనాభిలాషయు నుండుననుట కల్ల.

రామనుగారి కీయుద్యోగము 1914 సం. లో నొసగబడినను పెక్కుఆటంకములవలన వారు 1917 సం. వరకు నాపదవిని స్వీకరించుటకు వీలుగాకపోయెను. ముఖ్యమగు కారణము, పాలిట్ మహాశయునిఆస్తికి సంబంధించిన దావాలు, కలహములు. రెండవది వంగరాష్ట్రవిద్యాశాఖాధికారియగువారు రామనుగారు తమయుద్యోగమునకు రాజీనామా నిచ్చినగాని పండితపదవి నలంకరింప ననుజ్ఞ యియ్యమనిరి. వేలకొలదిగ వేతనము రాగలయుద్యోగమును విడనాడి కొద్దిపాటి వేతనముగలయదియు, నమ్మరానిదియు నగు పండితపదవి నొప్పుకొనుట సాహసకార్యమనుటకు సందియము లేదు. గొప్పవారి జీవితములు చదివినవారు ప్రథమమున మనుజుడు ఆత్మబోధల ననుసరించి వర్తించినగాని పూర్ణవికాసము జెందడని గ్రహించియుందురు. రామనుగారు తదితర ధీరస్వాంతులవలె ధనాపేక్ష విడనాడి, పైయుద్యోగమునకు రాజీనామాయిచ్చి పరిశోధనాలయముప్రవేశించిరి. నాటినుండి వీరాపరిశోధనకళాశాలకు శీర్షమై అనర్ఘపురుషులై వందలకొలదివిద్యార్థులకు తమయుత్సాహము, జ్ఞానాభిలాషయు భిక్షపెట్టుచున్నారు. భారతమాత ప్రతిష్ఠ నిలుపవలెనని వీరియాశయము. వీరు నిరుపమాన బుద్ధివికాసమును నెరపి పాశ్చాత్యులపొగడ్తలకు పాత్రులగుచున్నవారు. రామనుగారి యాధిపత్యముక్రింద నెందఱో కుశాగ్రబుద్ధులగు యువకులు పరిశోధనలు సల్పుచున్నారు. ప్రశస్తమగు ఆంగ్లపత్రికలలో నీపరిశోధన పత్రములు ప్రచురింపబ

డుటయే యీపరిశోధనల ప్రాముఖ్యమును తెలుపుచున్నది. వేయేల; కలకత్తాపరిశోధన కళాశాల యిప్పటికే లోకమున గౌరవము పొందియున్నది. కొద్దికాలములో కొన్నిశాఖలలో లోకమునకు దారిచూపగల జ్ఞానజ్యోతియై వెలుంగగలదు.

మరియొకవిషయము. రామన్‌గారు పైపరిశోధనాలయమున కథానాయకుడై యుండుటయే కాక తన శక్తుల నన్నిటిని జ్ఞానాభివృద్ధికిని, శాస్త్రిజ్ఞానప్రచారమునకును వినియోగించుచున్నారు. కాశీయందలి హిందూవిశ్వవిద్యాలయములో రామన్‌గారు గౌరవపండితుడుగ నుండ నొప్పుకొనిరి. అప్పుడపుడు, కాశీక్షేత్రమునకు బోయి, ఉపన్యాసము లిచ్చుచు, పరిశోధనలకు సలయుసలహాల నిచ్చుచుందురు. ఇంతియకాక, వెనుకంజ వేయుటలో పేరుగాంచిన మదరాసు విశ్వవిద్యాలయమువారును, పంజాబువారును, ప్రొఫెసర్‌గారిని ప్రత్యేకముగ నాహ్వానించి వారిచేత ప్రయోగసహితప్రసంగములకు కొన్నియేర్పాటులుచేసి తమవిద్యార్థులలో కొంతనూతనోత్సాహము పుట్టించిరి. ఇక వీరిదేశసేవయు పెక్కురూపుల గన్పట్టుచున్నది. అఖిలభారత విజ్ఞానమహాసభస్థాపించిన ప్రముఖులలో రామనుగారు ముఖ్యులు. నేటివర కామహాసభకు జీవమై, తత్సభకు కార్యదర్శిగ నున్నారు. ఇరువదియేండ్లనుండి తనకు వలయుసాకర్యముల నిచ్చి, తన నంతవానిగ జేసిన, విజ్ఞానశాస్త్రిపరిశోధనప్రోత్సాహకమండలికి గౌరవకార్యదర్శిగనుండి, తమకృతజ్ఞతను వెల్లడించుచున్నారు. వీరి యార్థికశాఖోద్యోగానుభవము మిక్కిలి యుపయోగకరముగ నుండుట యెరింగి బెంగాలు ఏషియాటిక్ సొసైటీవారు, కోరి తమ కోశాధిపతిగ నియమించియున్నారు.

ఇక రామనుగారి పరిశోధనలను గూర్చి కొంత ముచ్చటింతము. పదార్థవిజ్ఞానవిషయిక పరిశోధనలవీరు విద్యార్థిదినములలో ప్రారంభించిరని తెలిపియుంటిమిగదా. 1917 సం. వరకు వీరిపరిశోధనలు ముఖ్యముగ ధ్వనియంత్రములు, వాని నాదముల తత్త్వనిరూపణ మొదలగు విషయముల గురించినవియు ప్రకాశములో కొన్నివిషయముల గురించినవియు నై యుండెను. ఏకతార, తంబూర, వీణ, మొదలగువాద్యముల విమర్శించుపుస్తకరాజ మొకటి ప్రచురించియుండిరి. ఈవిషయములలో రామనుగారి కింతయిష్ట మేలనో అదియు సువ్యక్తము. సర్వకళాశాలపరిశోధనాలయము ప్రవేశించినదాది వీరు పదార్థములధర్మములు (Propertie; cf mitter) చలనము (Vibratio) మొదలగు మూలకారణములను ఎక్కువశ్రద్ధతో, పట్టుదలతో వివరించుచున్నారు. వీరిశోధనపత్రములపట్టిక మాత్రము పదికాగితముల నింపుచున్నది. రామనుగారి ప్రఖ్యాతి ముఖ్యముగ వారు నూతనముగ ప్రకటించిన సిద్ధాంతముపై నాధారపడియున్నది. సముద్రమురంగు యెట్లుకలుగుచున్నదో వీరు విపులముగ విశదీకరించియున్నారు. వీరి అవలోకనములును, ఊహలును సరియని లోకమెల్ల నొప్పుకొనుచున్నది. ఇవిగాక ప్రకాశము, ప్రతిధ్వనించుభవనములు, మొదలగువానిని గురించియు మంచుగడ్డవన్నెలు గురించియు యెన్నో పరిశోధనలు సల్పుచున్నారు. వీరిపరిశోధనసామర్థ్యము వర్ణనాతీతము. వీరు తమజ్ఞానార్జనమంతయు హిందూదేశముననే చేసినవారు. పరిశోధనపద్ధతులను ఏసుప్రసిద్ధశాస్త్రిపండితునియొద్దనైన నేర్చుకొను భాగ్యము వారికి లేకపోయెను. గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు, పైదొరల కన్నుబున్నులకు గురియగుచుండిరి. ఆయనచేతిక్రిందనుండిన పరిశోధనాలయములలో కావలసినట్టిసాధనములు పరికరములు, అన్నియు లేకుండుట మరియొకసంకటము. ఇట్టి వాతావరణములో యిన్నిఅడ్డులను దాటి, లోకైకస్తుత్యములగు పరిశోధనలు సల్పుమహాశయుని శతథా కీర్తింపవలసియున్నది.

వీరివక్తృత్వము, ఉపన్యాససరణి విద్యార్థులసమూహముల మనస్సుల నాకర్షించుచున్నది. మేము వినిన ప్రొఫెసరులలో నిట్టి అనర్గళధోరణిని, యింపసులభమును, సొంపుగను, భావోద్రేకముగను మాటలాడు సమర్థులు చాల కొద్దిమంది. శాస్త్రిజ్ఞులలో "ఫెరెడే" గారొక్కరు ప్రశస్తమగు వాగ్ధాటియు, సమయస్ఫూర్తియు గలిగి యొప్పినవారు. రామనుగారియుపన్యాసములు వినుటకు శాస్త్రిముల నభ్యసించువారే కాక యితరులునుపరుగెత్తుదురు. ఏలనందురా: రామనుగారిప్రసంగములు, డబ్బుకొరకో, విధిలేకనో, ప్రక్కబడు యెంగిలి మాటలుగాక వీరి మెదడు అనెడు చెలమయందూరి ప్రవహించు సుధాధారాప్రవాహములు. వసంతాగమమును

దెలుపు కోయిలపాట వినని జనుఁ డుండునా? అట్లే వీరి యొక్క జ్ఞానమును వర్షించు వాక్యములు, నవ్వును పుట్టించు పదప్రయోగములు, భక్తి, భయము, గౌరవము జనింపజేయు వీరివిగ్రహము, మెరపులవంటి చూపులు, మేఘగర్జనమువంటి కంఠధ్వని యేవిద్యార్థికబ్బంతము నైన హర్షాంబుధి నోలలాడింపక మానవు.

గౌరవాభినందనములు రామనుగారికి జన్మహక్కులని తోఁచుచున్నది. విద్యార్థికాలమున బడసిన బహూకృతులును, పరిశోధనాపత్రప్రచురణమును పేర్కొనబడినవి. ఇవిగాక, 1915 సం.లో మదరాసువిశ్వవిద్యాలయముతరఫున గొప్పపరిశోధనలకు బహుమతిగ నొసంగబడు తిరువాన్కూరు మహారాజావారి సన్మానమును బొందెను. వీరు పాలిట్ ప్రొఫెసరుగా నియమింపబడుట చదువరులు యెరిగినవిషయమే. అనంతరము యువరాజుగారు కలకత్తావిశ్వవిద్యాలయమును సందర్శింపఁబోయినపుడు రామనుగారికి, విశ్వేశ్వరయ్యరుగారికిని, సాహాగారికిని "డాక్టర్ ఆఫ్ సయన్స్" అను గౌరవబిరుదము నిచ్చిరి. భరతదేశములోనేగాక రామనుగారు విదేశములందును గొప్పగౌరవముల నందిరి. 1921 సం.లో ఐరోపాఖండమున పర్యటన సలిపిరి. కలకత్తా కాశీ విద్యాలయముల ప్రతినిధిగ ఆక్స్‌ఫర్డులో జరిగినవిశ్వవిద్యాలయమహాసమావేశములో పాల్గొనిరి. ఆంగ్లభూమిని గలవిజ్ఞానసమాజములును, వీరియెడల పరమాదరమును, స్నేహభావమును చూపియుండెను. జగద్విఖ్యాతపురుషు లెందరో వీరికి స్వాగతమిచ్చిరి. రూథర్‌ఫోర్డు, థాంసన్, బ్రేగ్, రేలేప్రభువు మున్నగువారు చాలకాలమునుండి రామనుగారి పరిశోధనల పరికించి, గౌరవించ నేర్చుకొనినవారు యీతరుణమున తాము రామన్‌గారి మిత్రవర్గములో చేరిరి. ఈమిత్రులప్రోత్సాహముచేతనే వారిప్పుడు రాయల్‌సొసైటిలోనికి ఫెల్లోగా ప్రవేశింపఁగల్గినటు నిర్వివాదాంశము. ఈగొప్పగౌరవము వారి పరిశోధనలకును మేధాశక్తికిని దగిన సన్మానము. ఒకవిధముగా, ధనార్జనకు విముఖులై ఆర్థికశాఖను విడిచి పరిశోధనయందే తనజీవితమునంతటి ప్రతినిమిషమును సమర్పించుచున్న యీతని స్వార్థత్యాగమునకు అనువగు గౌరవమును సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులకు నింగ్లాండులో "సర్" బిరుదమునిచ్చుట గలదు. బోసు రేగారలకు యీబిరుద మిచ్చిరి. రామనుగారికిని ఇచ్చిన వింతగాదు రామనుగారి జాతకముచూడ వీరి కింతకంటె నెక్కుడగు గౌరవము లభించు నను సూచనలు పొడకట్టుచున్నవి. వీరు F. R. S. గౌరవమును పొందిన వెనువెంటనే కలకత్తా విశ్వవిద్యాలయమువారు రామనుగారికి "ఘోసుఫెల్లోషిప్"నొసంగిరి. దీని మూల్యము 5000 రూపాయలు. అమెరికా యూరపుఖండములలో క్రొత్తగ గనిపెట్టబడు సంగతులు పరిశీలించి, పఠించి, పరిశోధనల సల్పుట కీధనసహాయ మొసంగబడినది. ఇట్టివితరణమాపించు విశ్వవిద్యాలయమువారెంతయు ప్రశంసాపాత్రులు. ఈపర్యటనములోనే, శాస్త్రజ్ఞానాభివృద్ధికై పాటుపడు ఆంగ్లసంఘసమావేశమునకు రామన్‌గారు ప్రతినిధిగా బోదురు. ఈసమావేశము ఆగష్టునెలలో టొరెంటో పట్టణమునగూడ నున్నది. ఈసభకు రామనుగారు ప్రత్యేకముగ నాహ్వానింపబడిరట. వీరాసమావేశము నెదుట ప్రకాశములో తామొనర్చిన నూతనపరిశోధనలనుగురించి కొన్నియుపన్యాసము లొసంగవలయునని పైసంఘమువారు కోరియున్నారు. ఈఅంతర్జాతీయ మహాసభలో రామనుగారు, నాడు వివేకానందునివలె, భారతమాతకు గౌరవమును, ప్రేమను, స్నేహభావమును విదేశీయపండితుల మనములలో మొలకలెత్తునట్లు ప్రకాశించుగాక! ఈవిదేశీయపర్యటన పువ్వము పూచి కాచి పండి, పదార్థవిజ్ఞానశాస్త్రి పరిశోధకులలో నగ్రగణ్యుల కొసంగబడు నోబెల్ బహుమానము వీరికి లభించెనేని, యట్టిగౌరవము విజ్ఞానసామ్రాజ్యాభిషేకమగుట రామనుగారికేగాక భరతఖండమునకును, ప్రాగ్దిశావాసులకును గౌరవసూచకమును ఆనందదాయకమును అగును. అట్టికళ్యాణము త్వరలో శ్రీరామనుగారికి చేకూర ముప్పదిమూడుకోట్ల భారతీయులు సర్వేశ్వరుని ప్రార్థింతురుగాక!

---

# వసంత గానము

తురగా వేంకట రామయ్య గారు

కాలజలధిని దేలుపూవుల
నావలో నానందకాంతా
రాగడోలాకేళిఁ బ్రణయపు-
యోగియైవిహరించుమాధవు
జాడ దెలియదటే; కోకిల! పాడఁజాలవటే!

నీలగిరిశిఖరాల జలదవ
నాల మధువిహగాల సుకలా
కలనఁ దాండవమాడు తేజః-
కామినీకాముకునిమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

కొండకొమ్ములనుండి పుడమికి
నడచుపూలవనాలతీరపు
జీవనది కెరటాలఁ జందురు-
చెంత నృత్య మొనర్చుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

పాడు టెఱుఁగని వలపుఁబూవులఁ
జిద్రసముల భుజించి సరసుల
వ్రాలి తామరపూలఁ బ్రణవము-
బాడు తుమ్మెదచెంత మాధవు
జాడఁ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

చెట్లనీడలఁ జివురుదొన్నెల
ఫలరసమ్ములఁ గుడిచి కుతుకపు
నెయ్యముల విహరించుమాధవు
జాడఁ దెలియదటే! కోకిల!పాడఁజాలవటే!

వన్నెపూవుల కన్నెవలపులఁ
దేలి తాండవ కేళి సల్పును
ధాసమీరకుమారకుల క-
ధ్యాత్మగానము దెల్పుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

తెలియఁజాలక తేనెపూవుల
చేదుతీవలఁ జేరి విసముం
గ్రోలి రాలుమదాళికులముం-
జాలిపాటలఁ బిల్చుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁ జాలవటే!

నీరులేని యెడారిభూముల
దారి గానక నీరసిల్లెడు
పాంథులకు లేఁదెనుఁగుఁదోఁటల
బాఁట లివియని దెలుపుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

వేఁడిపడమటి గాడుపులఁ గడు
వాడి తోఁటల నీడఁ జేరెడు
దెరువరులమన మలరఁ జల్లని-
తేనెసత్రా లిడెడుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

దేవసీధులఁ దెనుఁగువీరులఁ
బాడియాడెడు బ్రణయినీమృదు
పుష్పవీణావాదనామధు-
పూరముల విహరించుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

ఎండఁ బాఱిన కొండధారలఁ
జిన్నవోయిన జీవనదులను
నవ్యగానసుధాతరంగపు.
నః ప్రపూర మొనర్చుమాధవు
జాడ దెలియదటే! కోకిల! పాడఁజాలవటే!

పాటమెచ్చిన భవ్యభారతి
మాధవుని కోమలమనోజల
జాతప్రేమమరందరచితర-
సాభిషేక మొనర్పదే యికఁ!
పాడఁగదవమ్మా! కోకిల! భయము లేదమ్మా!

# రామరాజు

### (ఒక కథ)

### పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు

"ఏహెహే, ఎహెహె! నేను జెప్పినమాట విను. మన కేదేవులాట వద్దు. తెలియలేదు? అదిసంగతి" యని పార్వతమ్మను మందలించుచు నెల్లపాటి రామరాజుగారు మఱ్ఱియాకుల విస్తళ్లు కుట్టుటకై పూచికపుల్లలు చీల్చుచుండెను. "నేను జెప్పినమాట రవంత లక్ష్యపెట్టఁగూడదా" యని భార్య భర్తను యాచించెను. "ఓయబ్బ! నీమాటకేమి? ఆడ తిరుగంటి క్రిందఁ బెట్టినమఱ్ఱాకులు సందెడు తోడుకొని యీడఁ బెట్టు. ఏదో యున్నదేదో యున్నది. ఉన్నంతమట్టుకుఁ గుట్లకెల్లఁ (కడుపునిండ) దిని కూరుచుండక-యది లేదని యిది లేదని-దీని కేడకు? హద్దేడది?" యని రామరాజుగా రనిరి. మఱ్ఱియాకులు తెచ్చి భర్త కిచ్చి పార్వతమ్మ భర్తయొద్దఁ గూరుచుండెను. వారిద్దఱు విస్తళ్లు కుట్టుకొనుచు మాటలాడుకొనుచుండిరి.

రామ:—ఏదో నాల్గు కాడిగట్లమాన్యమున్నదికదా. బఱ్ఱెలు రెండు గోదలు రెండున్నవికదా, చిన్న పెద్ద, దూడ దుడికి, గాజుల గాదెలలో మస్తుగా జొన్నగింజలు, సరికదా! అపరదినుసు లపురులుకదా! మఱెందుకు నాస లేదుగదా! ఇన్ని యున్నను మఱి దేనికో వెంకులాడుకొనుట (అపేక్షతోఁ దడుముకొనుట) తప్పుకాదా?

పార్వ:—ఒకబిడ్డఁడైన లేనప్పుడు మన కివి యన్నియు నెందులకు?

రామ:—ఆరాముఁ డున్నాఁడే. ఇవి యన్నియు మనకు దొడ్డుగా (ఎక్కువగా) నిచ్చినాఁడు. మన రెండుపొట్టల కింత దాఁకఁ బని యేమున్నది? ఇవే యెక్కువయైనప్పుడింకను గొడుకొకఁడు కావలయు నని యడుగుకొనుట తప్పుకాదా?

పార్వ:—అందఱు సంసారులు కొడుకులఁ గని సుఖించుచుండ మన కెంతలోపమండి?

రామ:—ఓయబ్బ! నే నెఱుఁగనిసంసారాలా యేమి? మొఖాసాదారుపని చేసిన వెంకటరెడ్డిగారికిఁ గొడుకున్నాఁడా? నైజాము దేశములో సిద్ధిపొందిన మహాన్నప్రదాతయైన కొర్నిపాటి సుబ్బరాజుగారికిఁ గొడుకున్నాఁడా? పదునాల్గు శాస్త్రాలేమో చదివినాఁడఁట. ఆయనపేరేదో మంచిదబ్బ! ఆఁ! పరదేశిరాజుగారికిఁ గొడుకున్నాఁడా? సంసారి యైనప్పుడెల్ల కొడుకుండవలయునని పట్టెందుకు? తప్పుకాదా?

పార్వ:—అయ్యయ్యో! ఆఁడుప్రాణము యొక్క కష్టము మీ కెట్లు తెలియునండి. ఒడిలో బిడ్డను బెట్టుకొని పాలిచ్చుకొనుట, ముద్దు

ముద్దుగాఁ బెంచుకొనుట. వాఁడు తాతా అత్తా యని చిట్టిచిట్టిమాట లాడుచుండఁగా విని సంతోషించుట-ఈసుఖసంతతియు నాఁడుదాన నైననా కక్కఱలేదా?

రామ:-అదిగో ఆలాగన్నావు-బాగుగా నున్నది. తల్లిచచ్చిన బఱ్ఱెదూడ యున్న దే-దానికి రెండుపూఁటలనుబాలుఁబోసికొని పెంచుకో - తెలియలేదు? దానిని ముద్దుపెట్టుకో. అదిగో తెలివితక్కువగా నవ్వుచున్నా వెందులకు? పుట్టినబిడ్డ బఱ్ఱెదూడకంటె నెక్కువ ముద్దురాదని నమ్ము. బిడ్డయెక్కువ యేమి? పెయ్యతక్కువ యేమి? దూడ నిచ్చినను రాముఁడే. బిడ్డనిచ్చినను రాముఁడే. తెలియలేదు? నీవు వట్టివెఱ్ఱిదానవు కాని. బిడ్డ అత్తా తాతా యనుట యెంతముద్దుగా నుండునో బఱ్ఱెదూడ 'ఏ ఏ' యని యఱచుట యంత ముద్దుగానే యుండును. తెలియలేదు? నీవు పెంచుకొనకపోవుటచేత నాముద్దు ముచ్చట నీ వెఱుఁగవు.

పార్వ:—ఎంతసేపు గొడ్డు గోద పాఁడి పంట - యీమాటలే కాని యిఱువదియై దేండ్లనుండి కాఁపురము చేయుచున్నారుకదా ఒక్క కొడుకైన లేకపోయెనని మీకుఁ గాసంత చింతయైన లేదేమండి?

రామ:—ఓసబ్బ! నాకుఁ జెప్పవచ్చినావా? కొడుకు లేఁడన్నచింత నడుమ నా కెందుకు? ఆచింత రామునికుండవలెను. మనకుఁ గొడుకు నీయనక్కఱలేదని ఆయన స్థిరపఱచుకొన్నాఁడేమో? తెలియలేదు? ఇఁక మాటలాడఁబోకు. రేపు కొయ్యదువ్వెన తెచ్చెదను. నూనె రాచి బఱ్ఱెదూడకు సొగసుగా దువ్వి - ఉన్నదేదో బాగుచేసికోవలయును గాని-ఏహెహే! లేనిదానికొఱకు-అదేమి వెఱ్ఱిదానా! కనుల నీరుపెట్టుకొందువేల?

పార్వ:—మనకు బిడ్డ నీయనక్కఱలేదని రాముఁడు స్థిరపఱచుకొన్నాఁడంటిరా? ఇఁక మనగతి యింతే?

రామ:—ఇప్పు డున్నలోప మేమున్నది? ఇట్ట సాఁగినయెడల నదృష్టవంతులమే. నేనొక మాటచెప్పుచున్నాను విను. లేదని యెన్నఁడు తలపోసికోకు. ఈయాలోచనయున్నదే ఇదే బెంగకు హేతువు. తెలియలేదు? మనస్సున కేమాత్రము పని యీయకు. కాళ్లతోఁ జేతులతోఁ బనిచేసికోవలసినదే కాని యూరకే కూరుచుండి మనసుతో మాత్ర మెన్నఁడు పనిచేయకు- తెలియలేదు? నీకుఁ బనిలేకపోయి నప్పుడు రెండుకుంచాలజొన్నలు విసరి యాపిండి బుట్టలోఁ బోసికొని యూరువెంట బోయి నేను జేసినట్లే చీమలు మొదలగువానికిఁ బిచ్చుకలు మొదలగువానికి వేయుము-తెలియలేదు? జొన్నపిండిరొట్టెలు చేసి బీదపిల్లలయిండ్లకుఁ బోయి వారికిఁ బెట్టు. ఏదో యెప్పుడు మంచి పనిలో కదలికగా నుండవలసినదే కాని కాళులు చాచుకొని కూరుచుండి కడుపు కాయలేదని యెన్నఁడు చింతింపకు. కొడుకు లేఁడన్నందుల కొకయేడుపా? ఏదనో విరుద్ధపు మాట. కొడుకు పుట్టి బాగుగా నుండునెడలఁ గోఁడలు లేదని మఱియొక యేడుపా? కొడుకు కోఁడలున్నయెడల మనుమడు లేఁడని మఱి యింకొక యేడుపా? ఏహెహే! నీయేడుపునకు

నా కర్థమగపడుట లేదు. అనవసరముగా నేడ్చుటవలన రాముఁ డేమనుకొనునో కాసంత కనిపట్టనక్కఱలేదా?

పార్వ:—రాముఁడు మీకు దైవము కదా! ఒక్కబిడ్డనిమ్మని యాయనకు మ్రొక్కుకొనఁగూడదా!

రామ:—ఓయబ్బ! నన్ను దేవుని బ్రార్థింపుమంటివా? ఎంతమాట! దేవు నెన్నఁడు ప్రార్థింపఁగూడదని నేనుసిసలుపఱచుకొన్నాను. తెలియఁ లేదు? ఎందుచేతనో చెప్పనా? ఏవెట్టి మొట్టిప్రార్థనయో మొదలుపెట్టఁగానే నాకది కావలయు నిదికావలయునన్న పనికిమాలిన యాసు లాడక తప్పదు. మోక్షమైనను గావలయునని కోరుకొనకతప్పదు కదా! అట్లు కోరుకొనుటమైనఁ దప్పే. మరల రక్షింపవలయునని రాముఁ డెఱుఁగఁడనుకొన్నావా యేమి? ఆతఁ డెన్నికనులఁ గనిపట్టుచున్నాఁడో నీవెప్పుడైన పరకాయించినావా? ఇష్టమువచ్చియిచ్చునా-సంతోషము. ఈయఁడు? అంతకంటె సంతోషము. ఈయఁదలంచుకొన్నవానిని బ్రార్థింపనక్కఱలేదు. ఈయఁదలఁచుకోనివానిని బ్రార్థింపనక్కఱలేదు- తెలియలేదు?

పార్వ:-ఈయఁదలఁచుకొనకున్నను మన భక్తిని మనయార్తిని గని యాతఁ డీయఁగూడదా?

రామ:—ఓయబ్బ! నా కిఁకఁ జెప్పకు. రామదేవుని నే నేమియుఁ గోరను. క్రిందటి పుట్టువున నేది కోరుటచేతనో యీగఁపసిషి యిప్పుడు నాకుఁ గలిగినది. మన మింక నెవ్వరినిగూడఁ గోరవలదు. అట్లుచేసినయెడల— విన్నావా?—మన కింక నేఁడియు నుండవు. మనము గూడ నుండము. తెలియలేదు? అది పద్ధతిగాని—

పార్వ:-సంసారవృద్ధికొఱకు మన మపేక్షింపవలసినదా? అంతయుఁ దుడిచిపెట్టుకొని పోవలయు నని కోరుకొనవలసినదా?

రామ:—పార్వతీ! ఏడనో యడవి మృగమువలె నున్నావు. నేను జెప్పిన దేదో నీకడుపునఁ బట్టనేలేదా? సంసారము దొడ్డ కావలయునని కోరుకోవలదు. నాసికావలయు నని కోరుకోవలదు. మొదలు కోఁకయే వద్దన్న త్రాడుమీఁద నిల్చి నేనుండఁగా నన్నట్టయిట్ట లాగెదవేమి?

పార్వ:—మీరు మగవారు. పిల్లలు లేక పోవుటచే నే నెంత క్షోభపడుచున్నానో మీకుఁ జెప్పినను తెలియదు. నేను భద్రాచల రామదేవునకు మ్రొక్కుకొన్నాను. "రామచంద్రప్రభూ! నీతిరునాళ్లకు నీగుడికి వచ్చి నిన్ను సేవించుకొందుము. నిన్ను సేవించుకొన్న కిమ్మట మా కొక్కబిడ్డ నిచ్చి రక్షింపుము రక్షింపుము. రామయ్యతండ్రీ!" యని మ్రొక్కుకొన్నాను. మీ కిదివఱకుఁ జెప్పలేదు. క్షమింపవలయును.

రామ:—ఓసి నీబొందపడ! ఎంతపనిచేసినావే! రామదేవుఁడున్న భద్రాద్రి యేడ? రామరాజున్న మెట్లపాడేడ? ఏడకేదారి? ఎన్నికూఁతలదూరమున్నదో యెవఁడెఱుఁగును? ఎన్ని గుట్ట లెక్కవలెనో? ఎన్నిపాటి రేవులు దాఁట

వలెనో? మననాడా? మనపాడా? మనగోఁగాకు మనదోసకాయ యాడ దొరకునా? ఏమి పార్వతీ! నీకేంప్లు మీఁదఁబడినకొలఁది బుద్ధి వెనుకఁబడుచున్నది? దాఁకిష్టము లాడఁ బెట్టి కొడుకునిమ్మని అడిగినప్పుడు రామదేవుఁడు మనలఁగూర్చి యేమనుకొనునో రవంత యాలోచించినావా? ఇట్లచేయవయ్యా అట్లచేయవయ్యా యని రామదేవునికి నీవా చెప్పుట? ఆయనకుఁ జెప్పుటకు మన వైవరము? ఎల్లపాటిలో వారందఱు నెవరికిఁ దోఁచినట్లు వారు తల కొకమాట రామదేవునితోఁ జెప్పి చేయమను నెడల, ఇఁక రామదేవుఁ డన్నపే రెందుకు? నీ మలపసన్యాసయ్యలకోరికల ప్రకారమాయన నడవవలసినదా? ఆయనయిష్టమా? మనయిష్టమా? అదిగాక యడుగుకొని యడుగుకొని పుచ్చుకొనుట యేమంతగొప్ప?

పార్వ:—నాకుఁ దెలిసియో తెలియకయో యట్లు మ్రొక్కుకొంటిని. మనము భద్రాచల యాత్రకుఁ బోవలసినదినములు సమీపించుచున్నవి. అందుచే గింజలమ్ముకొని కొంత సొమ్ము చేసికోవలసి యున్నదికాదా?

రామ:—గింజలమాట కేమి సొమ్ము మాటకేమి కాని 'మన' మనుచున్నా వెందులకు? భద్రాచలయాత్ర నా కెందుకు? నామట్టుకు వంటయింటిఁగూటిలో నున్న రామదేవు డెంతో భద్రాచలరామదేవుఁడు నంతే - భద్రాచల మే డ నో యున్నదనుకొన్నావా? రాముఁ డేడ నున్నాఁడో యాడనే భద్రాచలము. రామునిబట్టి భద్రాచలముకాని భద్రాచలముబట్టి రాముఁడు కాఁడు. తెలియలేదు? ఈ వ్యవహారమంతయు నాకుఁ బెట్టి ముందిది చెప్పు. నేను భద్రాచల మెందుకు?

పార్వ:—మనమిద్దఱముకూడ వచ్చెదమని మ్రొక్కుకొంటి నని చెప్పలేదా?

రామ:—నన్నుఁగూడఁదీసికొనివత్తునని మ్రొక్కుకొంటివా? నీ వేడకుఁ బోవుదువో యాడకు నన్నుఁగూడఁ గట్టకట్టుకొని పోవుదువా? నేను నీచేతిలోనికాసండి ననుకొన్నావా? మొలలోనితాళపుఁజెవి ననుకొన్నావా? ఓయబ్బ! నీ కెంత తుల్లి బవాయించినదే! (ఎంత పొగరెక్కినదే).

రామరాజుగా రిట్లు పలుకుచుఁ జేతిలో నున్నపూచికపుల్లను బైకెత్తి తెప్పపాటుకాల మట్లె భీకరముగఁ బట్టుకొని భార్యవంకఁ జూచెను పార్వతమ్మ భర్తను గాంచి తెల్లబోయి యట్లె కనుల వ్రాల్చి యూరకుండెను. యాదృచ్ఛికముగఁ బలికిన తనకఠినవాక్యములకు భార్యమనసు నొచ్చినదేమో యని యామె వంకనే చూచుచు విస్తరి కుట్టినచోటనే కుట్టి "సరే! కనకయ్యసిద్ధాంతిని బిలిపించి ముహూర్తముపెట్టించు. ఇద్దఱముకూడఁ బోవుదము. కాని యొక్కయేర్పాటుమాత్ర మున్నది. అదేమనగా- మఱి- కొడుకు నిమ్మని రామదేవుని నీవు కోరుకోవలసినదేకాని నేను గోరను. కోరుకోమని నీవు నన్నాడ నిర్బంధపెట్టవద్దు. తెలియలేదు? అది సంగతి" యనియెను. భార్య యందులకు సమ్మతించెను. అంతలోఁ బదుగురు బ్రాహ్మణులు భోజనమునకు వచ్చిరి. భార్యాభర్తలు లేచి వారికర్ఘ్యపాద్యము లిచ్చి సేవించి, వారు భుజించిన వెనుక భుజియించిరి.

II

భద్రాచల రామదేవుని సేవించుకొని భార్యాభర్తలు స్వగ్రామమునకువచ్చి బ్రాహ్మణ సమారాధనాదులు జరిగించుకొని నిత్యాతిథి పూజఁ గావించుకొనుచు రామచంద్రమూర్తి వార్తలు చెప్పుకొనుచుఁ బసుసంరక్షణ మొనర్చుకొనుచు మహానందమునఁ గాలక్షేపము చేయుచుండిరి. ఒకనాఁటిరాత్రి పార్వతమ్మ "ఇదిగో మనపై రామదేవునకుఁ బూర్ణమైన యనుగ్రహము కలిగిన ట్లగపడుచున్న ద"ని చేఁటయంత మొగము చేసికొని యుప్పొంగుచు భర్తతోఁ బలికెను. బత్తెదూడమెడలో మువ్వలుగట్టుటకు దారము పేనుచున్న రామరాజుగారు రామాటలు వినిపించుకొనలేదు. "మాటలాడ రేమి? నేనెంతో ముచ్చటపడి చెప్పినమాటలను జెవిపెట్ట రేల"యని ముద్దులు గుడుచుపిల్లవలెఁ బలికి, భార్య, దీపమునొద్దఁ గూరుచుండి పేనుచున్న భర్తయొద్దకు వచ్చి బుజముపైఁ జేవైచి యాతనిని గదల్చెను. "ఏమంటివో మఱలఁ జెప్పుమ"ని భర్తయడుగ, "మనపై రామచంద్రమూర్తికిఁ బూర్ణానుగ్రహము వచ్చిన ద"నెను. "ఆయన కెప్పుడు మనపైఁ బూర్ణానుగహమే - ఈనాఁడు క్రొత్త యేమున్నద"ని భర్త బదులుచెప్పెను. "ఆమాట సరి లెండు. నేఁ డొక గొప్పవిశేషముండుటచేతనే చెప్పితి"నని భార్య యనఁగ "నదేమో నబ్బ! నాకు నిదానముగాఁ బట్టుకోలేదని" భర్త పలికెను. భద్రాచలయాత్రవెళ్లినట్లే జ్ఞప్తియున్నది. కాని యెందులకు వెళ్లవలసివచ్చినదో యాసంగతి రామరాజుగారు మఱచియే పోయినారు. "కొడుకును బ్రసాదింపుమని భద్రాద్రిరాముని నేను గోరుకొనిన మాట మఱచియే పోయినారా? బత్తెదూడ మెడలోనికి దార మేలాగున పేనుచున్నారో మనబిడ్డని నడుమునకు బంగరుమువ్వలు కట్టుటకు దారము నాలాగుననే మీరు పేనుట యిఁక నేఁడు మాసములకు సిద్ధింపఁగలదు" అని పార్వతమ్మ, పుట్టెఁడుసిగ్గుతో మూఁడు పుట్లనేప్పుతోఁ బదునాల్గుపుట్ల సంతోషముతోఁ బలికెను. "ఓసబ్బ; ఇంతేకాదా? నేనేదో యనుకొన్నాను. రామదేవునకు దయవచ్చునెడలఁ గొడుకు నిచ్చుట యొకవిశేషమాయేమి?ఆయనయెంతమందికిచ్చుచున్నాఁడో!" యని భర్త పలుకఁగ "రామదేవుని కిది గొప్ప కాదు కాని యిన్నియేండ్లకు నాకుఁ గడుపు ఫలించుట మనకు గొప్ప కాదా"యని పార్వతమ్మ పలికెను. "చూడు! కోటప్పకొండతీర్థములోఁ గొన్నమువ్వ లాచిలుకకొయ్యనున్న చిన్నగుడ్డమూఁటలోనున్నవి. ఈడ కవి తోడుకొనిరా"యని భర్త భార్యను గోరఁగ "ఈరాత్రియే దానిమెడలోఁ గట్టవలయునా - రేపు కట్టఁగూడదా?" యని పలుకుచు నామువ్వలు తెచ్చి యాతనియెదుట నామె యుంచెను. వానిని దారమున గ్రుచ్చి యాదండను దూడమెడఁ గట్టుట కాతఁడు పసువులపాకలోనికిఁ బోయెను.

III

ఆపల్లెటూరఁ జెఱువునొద్ద నుదయమున స్నానాదికృత్యములకుఁ జేరినస్త్రీలు పార్వతమ్మనుగూర్చియే మాటలాడుకొను చుండిరి. "అదృష్టము చెప్పవచ్చినప్పుడు పార్వతమ్మదే

యదృష్టమమ్మా”యని బోరలించిన బిందె మీఁదఁ గూరుచుండిన యొకయిల్లాలనఁగ సూరమ్మ “చిన్నీ! (పిన్ని) పార్వతమ్మకుఁ గడుపనియే నీనమ్మకమా? నేను మొన్నఁ జూచినాను. నాల్గవ నెలకుఁ దగినజాడలు నాకేమియుఁ గనఁబడలేద”ని యొక కాంత కాలియందె లిసుకతోఁ జింతపండుతోఁ దోముకొనుచుఁ బలికెను. ‘వెంకమ్మవదినె యెప్పు డెడ్డమనగాదెడ్డమే-జాడలు కనబడకపోవుటయేమి? నిక్షేపము లాగునఁ గనఁబడుచున్నవి” అని యొక బాల వింతువు పలుక, “సౌనమ్మా! ఇల్లు నిండునట్లు కని పెంచినదానవు. నీకుఁ దెలియక నాకుఁ దెలియునా యేమి!” యని వెంకమ్మ సుబ్బమ్మ వదినెను బరిహసించుచుఁ దుంట్లపైఁ జఱచుకొనెను. “జాడలు కనఁబడుచున్నవో లేదో నేను జూడలేదు కాని వన్నింపులయిన (పునస్సంధానము) యిఱువదియైదేండ్లకు నెలతప్పుటమాత్రము నేనెక్కడను విన లేదమ్మా”యని సగముబట్ట కట్టుకొని మిగిలినసగము నుదికికొనుచున్న యొకలజ్జావతి పలుక, “లేకేమి పుల్లమ్మత్తా! మాయాడుబిడ్డ యత్తగారిమేనమామ కూఁతున-కమ్మా-చెప్పిన నమ్మవేమో-కాఁపురమునకువచ్చినతరువాత ముప్పదిరెండేండ్లకుఁ గడుపమ్మా” యని నీటిలో మొలలోఁతువఱకు దిగి పసపు మొగమునకు రాచికొనుచున్న కోటమ్మ పలికెను. “ఇట్టియకాలపుఁగడుపులు సార్లాకావమ్మా! తల్లిగండాల కిట్టివి దాఁపురించునమ్మా-రెండుతలలు నేర్పాటగువఱకు నేమియు ననుకొనుటకు వీలులే”దని యంట్లు తోముకొనుచున్న యొకయంగన మంగళప్రదముగఁ బలికెను- “పిచ్చమ్మతల్లీ! నీవెఱ్ఱి కాని. రామరాజుగారు రామభక్తుఁడమ్మా! భద్రాచలరామదేవు నాతఁడు గట్టిగా మ్రొక్కుకొనుటవలన నిట్టుకలిగినదఁట. హాసామాషీకడుపులకు నీవన్న భయము కాని వరప్రసాదముచేఁ గలిగినవానికి నదరు బెదరు నుండవమ్మా!” యని సూర్యనమస్కారములుచేసికొనుచున్న తిమ్మయ్యమ్మ పలికెను. “అచ్చమ్మక్కయ్యా! నీవు కాఁపురమునకు వచ్చి పండ్రెండేండ్లయినది కాఁబోలు. భర్తను దీసికొని భద్రాచలము పోయి రామదేవున కేదో మీఁదుకట్టుకొని కట్టుదిట్టముగా మ్రొక్కుకోఁగూడదా”యని యిదివఱకుఁ దోమ తోలచినయట్లు కఱ్ఱతో వీఁపు గోకికొనుచున్న యొకకాంత పలుక, “భర్త! ఎందుకువచ్చినభర్త! దుర్గమ్మక్కా! నాబ్రదు కేమడుగుదువు? ఆమాత్రపచ్చికబుచ్చిక యల్లాయపుల్లాయ (అన్యోన్యప్రేమగల) సంసారమేమైన చెప్పినట్లు విని మిఱుకఁగలభర్తయే యైనయెడల నా కీకర్మ మెందుకమ్మా” యని తుడుచుకొన్నతలను జాడించుకొనుచు నచ్చమ్మ పలికెను. “అందరితో నొక్కమాట. మాయింటికేసనుంచియో యొకదూరపునాడునుండి యొక గొప్పసిద్ధాంతి వచ్చినాఁడు. ఆయనకుఁ దెలియనిసంగతి లేదు. ఆయనను మధ్యాహ్నము తనయింటికిఁ దోడుకొనిరమ్మని పార్వతమ్మ నాతోఁ జెప్పినది. మీరందఱా డకు రండు. ఎవరికిఁ దోఁచినది వారడుగవచ్చును” అని కనకయ్యసిద్ధాంతిభార్య పోచమ్మ పలికెను.

* * *

ఆనాఁటిసాయంకాలమునందు రామరాజుగారు పొలమునుండి వచ్చి గేదెలను గోవులను దూడలను యథాపూర్వముగాఁ బరామర్శించి లోనికిఁ బోయిరి. కాళులు గడుగుకొనుటకు నీరిచ్చుటకై భార్యరాలేదు. నూతియొద్దకుఁ బోయి పాదప్రక్షాళన మొనర్చుకొని వంటయింటిలోని కాతఁకు పోయెను. అక్కడఁ గూడ భార్యలేదు. పచనప్రయత్న మేమియుఁ గానఁబడలేదు. అంత పడుకగదిలోని కాతఁడు పోయి చూడఁగ పట్టెనేలపైఁ బార్వతమ్మ పండుకొని యేడ్చుచుండెను. భర్తను జూచి పట్టరానిసంతాపమునఁ బెద్దగోల పెట్టి యేడ్చెను. రామరాజుగారు తెల్లఁబోయి భార్యయొద్దఁ గూరుచుండి యామెపైఁ జేయి వైచి "యేమిది యేమిది"యని పలుమాఱడిగెను. భార్య తలపై మోదుకొనుచు "భర్త చెప్పిన మాటవినని దుర్మార్గురాలను. బుద్ధిగడ్డిదినుటచేఁ గొడుకు నిమ్మని రాముని గోరితిని. నాకుఁ గొడు కక్కఱలేదు. కడుపక్కఱలేదు. రామదేవుఁడా! నీవు ప్రసాదించిన దీనిని నీవు తీసికో నాయనా! నాతండ్రీ! రామచంద్రదేవా! యని యెలుగెత్తి యేడ్చెను. "సంగతి యేమి? వ్యవహారమేమి? ఈగొడవ కలుగుటకు మూలకారణమేమ"ని భర్తయడుగ "నయ్యో నేను భరింపలేను నాకు వద్దు. నా కక్కఱలేదు- నాకుఁ గొడు కక్కఱలేదు. ఇదిగో బుద్ధి లేక కోరుకొనినందులకుఁ జెంపలు వైచికొనుచున్నాను- మహాప్రభూ! యని యామె యేడ్చెను. బలాఢ్యుఁడైన రామరాజుగా రామె నెంత వారించినను రెండుచేతులతో నెత్తుకొని మంచముపైఁ బరుండఁబెట్టి కన్నులం దుడిచి "చూడు చెప్పినమాట విను. తొందర పడవద్దు. తెలియలేదు? నిదానించుకో- సంబాళించుకో- ఇప్పుడు కలిగినసంగతి యేమి"యని బతిమాలుకొనుచు నడిగెను. "నేనుజెప్పలేను. మనము తిరుగ భద్రాచలయాత్రకుఁ బోవుదము. ఆరామదేవుని రెంకుకాళులు పట్టుకొని 'నాకు దయచేసిన పుత్రభిక్షను నా కక్కఱలేదు. అనుగ్రహింపుము మహాప్రభూ!" యని మొఱ్ఱపెట్టుకొందును. అని పార్వతమ్మ పలుకునంతలోఁ గనకయ్యసిద్ధాంతి వచ్చి "పార్వతమ్మక్కా నీకీవెఱ్ఱి యేమి? తూర్పుసిద్ధాంతాలు స్థిరమనుకొన్నావా యేమి? మొదలుశాస్త్రానికే పార్వతీదేవిశాపమున్నది. ఆయవకతవకముండకొడుకు కేదో ప్రేలఁగ నదియే పట్టుకొని గుండె పగులఁబెట్టుకొనుట తగునా? తెరువంత నేను నాలుగుచీవాట్లు పెట్టినాను. ఆతఁడు చెప్పినదానిని ముక్కముక్కల క్రింద ఖండించినాను. నామాట నమ్ము"మని పార్వతమ్మను మందలింపఁగ, "నాయనా! నీ మాట నిజమేనా యని పార్వతమ్మ యడిగెను. నాది సిద్ధాంత మని కనకయ్య చెప్పుచుండఁగ, "మొదట దీనికి మూలాధారమైన గొడవయేమ"ని రామరాజుగారు పట్టుదలతో నడిగిరి. "ఏమియు లేదు- ఎవఁడో పంచపక్ష్యుపాసకుఁడు- త్రాగుబోతు ముండకొడుకు మీరు పొలములో నుండఁగా నిక్కడకు వచ్చి పార్వతమ్మకుఁ గొడుకు గలుగుననియుఁ గొడుకు పుట్టినగంటలోపలఁ దండ్రి మరణించుననియుఁ జెప్పిపోయినాఁడు" అని కనకయ్య చెప్పెను-

'హాహాహా'యని రామరాజుగారు గూడ కూలి పడునంతనవ్వు నవ్వి, 'ఓయబ్బ! ఇంతే కదా! ఈమాత్రపు వ్యవహారమున కింకేలొల్లి(అల్లరి) యెందులకు?' కని పలికి కనకయ్యయెదుటనే యిరుగుపొరుగువారికి వినంబడునంత గట్టిగ భార్యను ముద్దుపెట్టుకొని 'సిద్ధాంతీ! నీ విటఁ గూరుచుండుము, నేనుబోయి వంటచేసికొందు" నని వడమటింటిలోనికిఁ బోయెను.

సిద్ధాంతి యామెయొద్దనే కూరుచుండి వృద్ధపారాశర్యమునుండి "భాగ్యవ్యయాధిపత్యేన రంధ్రేశో నశుభ ప్రదః"అని చదివి ఊఁ యని రెండుమాఱులు మూల్గి,

"భాగ్యవ్యయాధిపత్యేన రంధ్రేశో నశుభ ప్రదః,
తత్తత్ఫలానిప్రబలా ప్రదిశేతాంతమో గ్రహా"

యన్న శ్లోకమును జదివెను. ఆశ్లోకమునకుఁ బార్వతమ్మ కర్థము తెలియకపోవుట యాశ్చర్యము కాదు. సిద్ధాంతికే తెలియలేదని చెప్ప వలసివచ్చినది. ఎందువలన? దానికర్థము లేక పోవుటవలన. ఒకశ్లోకములోఁ బూర్వార్థము మఱియొకశ్లోకములో నుత్తరార్థమును లంకెవేసిన శ్లోకమున కర్థముండునా?

కం. "అన్నాతిఁ గూడ హరుఁడవు
అన్నాతిం గూడ కున్న నసురగురుండౌ
బంతులు తామర మొగ్గలు
దంతులకుంభములఁ బోలు తరుణీకుచముల్"

అన్న కలగొలుగంప కందపద్యశ్రాద్ధ మున నర్థసమన్వయ ముండునా? కాని శ్లోకము వలన మాత్రము పార్వతమ్మకు ధైర్యము హెచ్చయ్యెను. పంచపత్న్యుపాసకుఁడు శ్లోక మేదియుఁ జదువలేదు. శ్లోకము చదవిన కన కయ్యయే పంచపత్న్యుపాసకునికంటె నెక్కువ వాఁడని పార్వతమ్మ నమ్మెను. వట్టిమాట లలోఁ కంటె గణబద్ధమైనమాటలలోఁ బ్రమా ణశక్తి హెచ్చున్నది. అందులోఁ దెలియని భాషలోఁ జదివినదానికి మఱింత ప్రమాణ శక్తి యున్నది. మనసు కొంత కుదుటఁ బఱచుకొని పార్వతమ్మ భర్తను వారించి తానే వంటచేయుటకు వంటయింటిలోనికిఁ బోయెను. కనకయ్య యింటికిఁ బోయెను.

IV

పంచపత్న్యుపాసకుఁ డాయూరికాంతల కెందఱకో ప్రశ్నలు చెప్పెను. వారివారికి నిదర్శనము లిచ్చుచున్నట్లు పార్వతమ్మ వినుచుండెను. "తనకుమాత్ర మేల నిదర్శన మీ యకుండును? అని తలపోసికొని యేడ్చుచుండును. అయిదవనెలలో గాజులు లేవు. సీమంతము లేదు. సూడిదలు లేవు. ముద్దుముచ్చట లేమియు లేవు. ఎవ్వ రేమి చెప్పినను వినక యెంగిలిలంఘనములు చేయుచు గృశించి మంచమున కంటుకొని పోయినట్లు పండుకొని యొక్కరీతిగ నామె నేడ్చుచుండెను. అతు రాభ్యాసమే యెఱుఁగని రామరాజుగా రేమి యితిహాసములు చెప్పి యామె నోదార్పఁగ లరు? అదిగాక భర్త కనులఁ బడునరి కామె గొల్లున నేడ్చుచుండును. ఆయూరిలోనికాంత లెందఱో యనుదినమును మధ్యాహ్నమున వచ్చి యామెయొద్దఁ గూరుచుండి యేవో యుబుసు లాడుచుఁ గాలక్షేపము చేయుచుం డిరి. భర్త తనయెదుట లేనప్పు డాతఁ డెదు టికి వచ్చినదాఁకఁ దొందరపడి యాతనిని బదే పదే పిలుచుచుండును. వచ్చినతర్వాత నాతనిఁ జూచి హోరున నేడ్చుచుండును. తాను గనఁ

బడుటచేనామె మఱియింతదుఃఖించుచున్నదని భర్తరవంత యావలికిఁ బోవఁగ, "రండు. రండు. రారేమి రారేమి" యని వచ్చినదాఁకఁ దపించి పోవును.

రామరాజుగా రొకనాఁడు మధ్యాహ్నమున వచ్చి "పార్వతీ నీవేడ్చినట్లయిన నే నిక్కడ కింక రాను. సంగతి యేమిదో వ్యవహారమేమిదో- తెలియలేదు? సందర్భమేమిదో- అదోయిదో ఉన్నదండుపా మఱి లేదండువా? అది మనము రాపాడించుకొనవలసినది కాని ఊఁ- తెలియలేదు? అది సంగతి" యని యుపన్యసించెను. దానికర్థ మేమాత్రము తెలియక కాఁబోలు పార్వతమ్మ "మీయిష్టము ఏది చెప్పవలయునో చెప్పుడు నేను వింటు" ననెను. వా రిట్లు మాటలాడుకొనిరి.

రామ:—పార్వతీ! మాతాతగా రిప్పుడున్నారా?

పార్వ:- ఆమాట యిప్పుడెందుకు? లేరు

రామ:—ఎందుచేత లేరు?

పార్వ:—చనిపోవుటచేత.

రామ:—సరే-అట్ల బాటలోనికి రా- ఎందుకుఁ జనిపోవలయును?

పార్వ:— ఏమి చెప్పఁగలను. కాలము వచ్చుటచేత.

రామ:—మాతండ్రిగారిమాట యేమి?

పార్వ:—ఆయనకును గాలమువచ్చినది.

రామ:—అట్టయిన మఱినామాట యేమనుకొన్నావు. తొందరపడకు. ఆఁగు. మనుష్యుఁడైనవాఁ డెల్లఁ జనిపోవకతప్పదు తెలియలేదు? గొడ్లు గోదలమాట రవంతసేఁ పాడఁబెట్టు. వెంకటాద్రినాయఁడుగారు వెళ్లిపోయినారు సుఖపడినారు. ధర్మప్పారావుగారు కాలమునేమైనఁగాని రొకాయింపఁ (అడ్డుకోఁ)గలిగినారా? వెడలిపోవుట యనఁగా నేడకోనా? రామదేవునిదగ్గఱకు - తెలియలేదు? ఇఁక దుఃఖాలతోఁ బని యేమున్నది?

పార్వ:—(ఏడ్చుచు) కొడుకు పుట్టిన వెంటనే మీరు మమ్ము విడుచుటకు నిశ్చయపఱచుకొన్నారా?

రామ:—నిశ్చయపఱచినవాఁడు రామదేవుఁడు. మన మెవరము? అందఱమాట యంతే.

అయ్యో! నిశ్చయమేనా! నిశ్చయమేనా యని పార్వతమ్మ వెక్కి వెక్కి యేడ్చెను. రవంతసేఁ పచ్చటఁ గూరుచుండి రామరాజుగారు పొలములోనికిఁ బోయిరి. ఎందఱతిథులు వచ్చినను దానొక్కఁడే వంట చేసి యందఱకుఁ బెట్టుచున్నాఁడు. భార్య చింతించుచున్నదన్న చింతతక్క తనచింత యేదియు నాయనకు లేదు. మట్టితిను దూడలమూఁతులకు బుట్టలల్లుచున్నాఁడు. ఆవులను దృష్టిదోషము తగులకుండఁ గంబళిత్రాళ్లు పేనుచున్నాఁడు. జొన్నపిండి చీమలకు వేయుచున్నాఁడు. జొన్నరొట్టెలు బీదపిల్లల యింటికిఁ దీసికొనిపోయి పెట్టుచున్నాఁడు.

V

ఒకనాఁటిరాత్రి రెండు యామములకుఁ బార్వతమ్మకు నెప్పు లారంభించినవి. ఆరాత్రి సామాన్యముగనుండెను. మఱునాఁటియుదయ

మున హెచ్చుగా నుండెను. ఈసంగతి తెలియుటచే నూరిలోని యనేక కాంతలు పురుషులు వచ్చి రామరాజుగారియింటిలోఁ గూరుచుండిరి. ఆయనకుఁ బుత్త్రోదయ మగు నని సంతసింతురా? ఆయననిర్యాణము సమీపించుచున్న దని దుఃఖింతురా? స్తంభీభూతులై కూరుచుండిరి. ఏమియుఁ దోఁపక యొకరి నొకరు చూచుకొనుచుఁ గూరుచుండిరి. అట్టి సమయమున రామరాజుగా రేమి చేయుచున్నారో? ఆవ్రనాలుకకుఁ దొండగజ్జి యైన దని దాని కుప్ప రాచుచున్నారు. ఉప్పరాచుచున్న రామరాజుగారు రాయించుకొనుచున్న పుస్తకంబె నెక్కువవారు కారని వారిలోఁ గొంద ఱనుకొనిరేమో ఎట్లు తెలియును? స్త్రీలు బుగ్గలు నొక్కుకొనిరి. పురుషులొకరి నొకరు చూచుకొని పెదవులు విఱుచుకొనిరి.

క్రమముగాఁ బార్వతమ్మకు నెప్పులు హెచ్చయినవి. సాయంకాలము నాల్గుగంటలకుఁ బుత్త్రుఁడు కలిగెను. పార్వతమ్మ గదిలో నుండి యేడ్చుచున్నది. ఆక్కడి స్త్రీ లందఱు కన్ను లొత్తుకొనిరి. రామరాజుగారు పుత్త్రోదయ మైనవెంటనే స్నాన మొనర్చి విభూతిని ధరించి యందఱయొద్దకు వచ్చి మందహాసముతో నటఁ గూరుచుండెను. "అయ్యా మీకుఁ గుమారుఁడు కలిగినాఁడు సంతోషమే" యని యొక్కఁడైన నాయనతో సనలేదు. అందఱుకూడఁ బ్రతిమలవలెఁ గూరుచుండిరి "నాయనలారా! మాతండ్రిగారు నాకు తిరిగి పుట్టినారు సంతోషమే. మీ రీడనే ప్రొద్దుటినుండియుఁ గూలఁబడి యున్నారు. మీ రీపాటి కింటికిఁ బొండని" రామరాజుగారు పలికిరి. "తొందర లేదు. సాయంకాలమగువఱకుండు"మనివారనిరి. "సరే"యని యొకఁడు లేచి "చీమలకుఁ బిండి వైచి పిల్లలకు రొట్టె లిచ్చి త్వరలోనే వత్తు న"ని వీథిలోనికిఁ బోఁబోవుచుండగ "నెక్కుగంటలవఱకైన మీరిక్కడనుండి కదలవలదని వారందఱేక గ్రీవముగఁ బలికిరి. కనకయ్యసిద్ధాంతి లేచి "పిండిరొట్టెలు నేను వైచి వచ్చెదను. మీ రిట కూరుచుండు" డనిపలికి లేచినరామరాజుగారిని రెండుచేతులు పట్టుకొని కూరుచుండఁబెట్టి వీథిలోనికిఁ బోయెను. "ఓయబ్బ! నా కీనిర్బంధ మేమయ్యా!" యనుచు రామరాజుగా రటనే కూరుచుండిరి. అయిదయినది. ఆఱయినది. దీపములు పెట్టినారు ఏడుగంటలైనది. "రామరాజుగారూ! ఇఁక బ్రదికినారయ్యా"యని యందఱాయన నభినందించి పంచపక్షిని బనికిమాలినముండకొడు కని తిట్టి యెవరియిండ్లకు వారు పోయిరి.

రాత్రి పార్వతమ్మ సుఖముగా నిద్రపోయెను. తెల్లవాఱినపిమ్మటఁ దిరుగఁ గొందఱు బ్రాహ్మణులు రామరాజుగారియింటికి వచ్చిరి. రామరాజుగారు స్నానముచేసి భస్మధారణ మొనర్చుకొని వారినందఱను గౌరవించెను. "రామరాజుగారూ! ఇది మీ బ్రదుకు కాదు. గ్రామమందలియ శేషజనుల బ్రదుకని నమ్మవలయును"అని కనకయ్యసిద్ధాంతి పలుకగ "జీమల మాట పసువులమాట చెప్పక పోయితివేల" యని మఱియొకరు రవంత చేర్చిరి. అందఱు

మహానంద మొందుచుండిరి. రామరాజుగారిని జూచుట కింక ననేకులు వచ్చుచున్నారు. వారి కందఱకుఁ దగినతా వింటిలో లేకుంటచేఁ గాఁబోలు రామరాజుగారు వారి కెదురుగ వీథిలోనికి వచ్చి వారిని గౌరవించి వీథిలోనే నిలువఁబడిరి. రామరాజుగారి నందఱు పదేపదే యభినందించిరి. "ఓయబ్బ! బ్రదికియున్నందులకు. నన్నింతగా నభినందించుచున్నా రేల?- బ్రదికియున్నందుల కెవ్వరినిగూడ నభినందింప నక్కఱలేదు. తెలియలేదు? నన్ను మీ రభినందింపఁదలఁచుకొన్నయెడల నే నిప్పుడు చెప్పఁబోవుదానికై యభినందింపుఁడు. అప్పుడైనను వద్దనియే నాకోరిక- ఆసంగతి యేదనగా- అది నా కడుపులోనే పెట్టుకొన్నాను. నేను భద్రాచలములో నుండగా నొకరాత్రి నాకు స్వప్నము. రామదేవుఁడు కనఁబడి నీవు వైశాఖశుద్ధైకాదశినాఁడు నాల్గుగడియలప్రొద్దెక్కున్నప్పుడు తనువును త్యజించి నాసన్నిధికిఁ జేరెద వని చెప్పెను 'ఓయబ్బ! అంత దూరపువాయిదా వేసినా వేమయ్యా! నీయిష్టాని కడ్డేమున్నదయ్యా! నామట్టుకు నే నిప్పుడు సిద్ధముగా నున్నాన'ని నేను రామదేవుని తోఁ బలికితిని. ఈదినమే యాయేకాదశి. నాల్గుగడియలు కూడఁ గావచ్చినది" అని రామరాజుగా రానందపరవశులై పలికిరి. అందఱును దెల్లఁబోయిరి.

ఇంతలోఁ బాలికాపువాఁడొకఁడు గడ్డిమోపు తలపైఁ బెట్టుకొని రామరాజుగారి యింటికి వచ్చుచుండెను— "వీరన్నా! నిన్న సాయంకాలమునఁ దోడుకొని రావలసినమో పిప్పుడు తెచ్చితివా? రాత్రి పశువులకు గడ్డి లేకపోవుటచే నేనెంత కటకటలాడిపోయితినో" యని రామరాజుగారు వానితో ననిరి. "బాబూ! నిన్న సాయంకాలమునఁ దేలు కుట్టినది. అందుచే రాలేకపోయినా న"ని వాఁడు పలుకుచు గుమ్మపు మెట్లెక్కుచుండెను. "వంగు వంగు - మోపు పైనఁ దగులును" అని రామరాజుగారు కేక వేయుచునే యున్నారు. ఇంతలో



మోపు వానితలమీఁదినుండి తిరుగఁబడి మెట్లమీఁదనుండి దొరలుచు వీథిలోఁ బడెను. దానిలో రాత్రి యేవేళనో దూరి యటనే నిద్రించి మోపు క్రిందఁబడుటతోడనే బెదరిపోయిన త్రాఁచుపా మొక్కటి యీవలకు వచ్చి రామరాజుగారిని గాలిపైఁ గఱచెను. రెండుచేతులు పైకెత్తి "రామచంద్ర ప్రభూ! దయగలిగినదా! దయగలిగినదా!" యని యానందబాష్పపూరితలోచనుఁడై రామరాజుగారఱచి "సిద్ధాంతీ! వసారాచూరిలో దర్భలు జాగ్రత్తపెట్టినాను. ఈడ కవి తోడుకొనివచ్చి యాతిన్నెమీఁద పరవవయ్యా! నీకుఁ బుణ్యముఁ కలుగునయ్యా!" యనిపలికి యాతఁడట్లుసేయఁగ దానిపై శయనించి "రామా! రాఘవా! రాజీవలోచనా!" యని స్మరించుకొనుచు మందహాసముతో నస్తమించెను.

---

# 'ఆశామృతము'

దామరాజు పుండరీకాక్షుడు గారు

నీవు లేకున్న నిజముగా నిఖిలప్రాణి
కోటి కాధారమే లేదు, కొదువలేని
పూలుకాయలు పిందెలు పూసి కాచి
లతలు లతె లల్లుకొనిపోయి జతలుజతలు
కలసి మెలసియు జగమెల్లఁ గలయఁబార
నిత్యకళ్యాణమున సృష్టి నిలిపినావు,
అఖిలప్రాణప్రదంబ! యాశామృతంబ!

కాంతిబింబంబుపై నాశఁ గలువపూవు
కామమబ్బులందాశఁ జకోరజాతి
దినకరుని జూచునాశఁ బద్మినికులంబు
మోక్షసౌఖ్యంబు లందాశఁబూని నరులు
లోకనాటకమునఁ బాత్రలుగ నటించు
చుందురేగాని నిన్ బాసియుండఁగలరె
అఖిలప్రాణప్రదంబ! యాశామృతంబ!

మాయసంసారజలధి నమాయకునకుఁ
గానికష్టంబులన్ గుందుమానవునకు
ఘోరపాపాటవులఁ జిక్కువానికైన,
విరహతాపాగ్ని చేఁ గాలుప్రియులకైన,
కారుచీకట్లుగ్రమ్మ నాకాశవీథి
మినుకుమినుకున మెరసెడు మింటిచుక్క
రీతి, సభయం బోసంగెడులీలఁ జూపి
ధైర్య మొనగూర్చి నీయమృతంబుఁ జిలుకు
చుందు, వాశామతల్లి, నీయందె జగము
లన్నియు వెలుంగు, నీశక్తి నెన్నఁదరమె
అఖిలప్రాణప్రదంబ! యాశామృతంబ!



# మండూకస్తుతి

గిడుగు వేంకట సీతాపతి గారు, బి. ఏ, ఎల్. టి

ఇది ఋగ్వేదమందు ఏడవమండలము:లో ఉన్న 103 వ సూక్తమునకు అనువాదము. కొందరు బ్రాహ్మణులు వేద స్తంగా చేస్తూ ఉండే సంస్కారం చూచి ఎగతాళిగా వసిష్ఠుడీసూక్తమును చెప్పి ఉండుననిన్ని, అందులో ఋత్విజులపని కప్పలకు ఆరోపించడమున్ను యవనసారస్వతమందు సైతము పరిహాసార్థముగా ఇటువంటి కావ్యములను రచించిన కవులు (హోమర్) పురాణవీరుల ఘనకార్యములను కప్పలకే ఆరోపించడమున్ను వింతగా ఉన్నదనిన్ని మాక్స్ముల్లరుగారు "హిందూదేశప్రాచీన సారస్వతచరిత్ర" మనే తమ గ్రంథమందు వ్రాసినారు.

అయితే, ఈ కప్పలతో సంబంధము గల ఆచార మొకటి మనకాలములో కూడా కనబడుతూ ఉన్నది. వానలు ఎగబెట్టినప్పుడు బ్రాహ్మణులు జపాలూ తపాలూ చేస్తూ ఉంటే, శూద్రుల పిల్లలు కప్పను గుడ్డలో వేలగట్టి

అది ఒకకర్రకు తగిలించి ఆకర్ర బుజాన బెట్టి పల్లకి మోచినట్టు మోస్తూ "కప్పా కప్పా నీలాలూ కడవలనిండావానాలూ," అని పాడుతూ వీథుల వెంబడి తిరుగుతూ ఉంటారు.

అప్పుడు ప్రతియింటివారున్ను ఆ కప్ప మీదను పసుపునీళ్లు పోసి, ఆపిల్లలకు డబ్బో ఏగానీ ఇస్తూ ఉంటారు. అట్లు చేసినయెడల వానలు పడుననన్న నమ్మకము చాలామందికి కలదు.

వ్రతముపూనిన బ్రాహ్మణులవలె
వత్సరము తపముండి కప్పలు
స్తుతులచే పర్జన్యు గొలచిన
వతడు ముద మొందరే.

ఎండబెట్టిన చర్మమట్టుల
నెండిపోయిన చెరువుపై దివి
నుండి వర్షము పడినవెంటనె
యుల్ల మలరారరే.

చిరుతదూడల నెట్లు గోవులు
చేరి యంబా యనుచు నరచునో
చెరువులోగల కప్ప లట్లే
చేరి మెలుగ త్తెరే.

వానకోసము పరితపిస్తూ
వరుగులై యున్నట్టి కప్పల
మేనులకు నభిషేక మయినది
వాన పడినంతనే.

కులుకుపలుకుల కొడుకు తండ్రిని
పలుకరిస్తూ చేరు విధమున
కలయవచ్చెను బెకబెకలతో
కప్ప లొండొంటికే.

జల్లుకొట్టుచు వాన పడగా
జలకమాడుచు జతలు కట్టుచు
అల్లిబిల్లిగ కప్పలన్నీ
అలుముకొను చుండెనే.

చెరువులోగల కప్పలన్నీ
చేరి యొకమారరవగానే
చిరుత దేహము లన్నివిధముల
పెరిగిన ట్లాయెనే.

ఇచ్చతో జడివాన నానిన
మచ్చమచ్చల కప్ప ముదమున
పచ్చకప్పను కలుసుకొని సం
భాషణముచేసెనే.

గురువు చెప్పిన సంతె వింటూ
తిరిగి పలికే శిష్యులట్టుల
చెరువులోగల కప్పలన్నీ
చేరి కడు నరచెనే.

ఆకుపచ్చని దావు గొంతుది
మేకగొంతుది మచ్చలున్నది
భేకముల గల విట్టివెన్నో
ఆకొలనియందునే.

వివిధరూపము లొప్పియున్నా
పేరుకన్నీ కప్పలొగతి
వివిధకంఠము లొక్క శ్రుతిలో
కవలు కొనుచుండెనే.

ధరణిసుర లతి రాత్రసోమము
  జరుపుకొనుటకు పూర్ణజలమగు
చెరువుచుట్టూ చేరి సంభా
  షించుకొన్నట్లే.

వానకాలము వచ్చె నేడని
  వలయముట్టుల చేరి చెరువున
వానఁ దడిసిన కప్పలారా
  పాట పాడండీ.

ధరణిసురులగు సోమయాజులు
  స్తవము లొప్పగ జేసి సాంవ
త్సరికయాగము జరుపుచుందురు
  సరిగ నేఁటికా.

కమలి మెండకు బుఱ్ఱ్వాజులవలె
  కలుగువెల్వడి వచ్చె బయటికి
చెమటపట్టిన కప్పలన్నీ
  చినుకు పడినంతన్.

క్రతువులను ప్రతియేట మనుజులు
  క్రమముగా పాలింతు రాయా
ఋతువులందున దేవకృతమగు
  వ్రతము చెడకుండన్.

తప్తమగు కప్పలకు విడుదల
  ప్రాప్తమైనది వ్రతము ఫలముగ
తృప్తుడగు పర్జన్యుదయచే
  వృష్టియొనగూడన్.

ఆకుపచ్చని దాన్రగొంతుది
  మేకగొంతుది మచ్చలున్నది
మాకు ధనముల నిచ్చి ప్రోవ్రత
  మమ్ము నెల్లపుడున్.

భేకములకృపచేత నిప్పుడు
  వృద్ధిపొందుత పాడిపంటలు
భేకముల కృపచేత నాయువు
  మాకు వర్ధిలుతన్.

---

## బూ రా

అడవి బాపిరాజుగారు, బి. ఏ.

అమ్మా - ఆపిల్లంగోరొకటే
  నాకిమ్మా - నీమెళ్లో ముత్తాలే.
తల్లీ - బూరాను నోట
మెల్లా - మెల్లాగఊది
పిచికీ - పిల్లాలుపలుకు
చల్లాని - పాటబాడ్త— అమ్మా.

నాకిస్తే - వేళ్లాను బట్టి
వవ్వా - కళ్లాను తిప్పి
తువ్వాయి - ఆవుచూచి
అంబాను - అరపులాడ్త— అమ్మా.
నీవమ్మా - బావికిపోతే
చెల్లీ - ఉయ్యాలచేరి
లాలి - లాలంచూను
జోలా - పాటాలు పాడ్త. అమ్మా.




# జగ్గయ్యపేటలో దొరకిన శిలావిగ్రహములు

భ. పట్టాభిరామయ్య, బి. ఏ., ఎల్. టి.

విశాఖపట్టణంజిల్లా, అనకాపల్లి తాలూకాలో నున్న జగ్గయ్యపేట అనుగ్రామములో రక్తాక్షినామ సంవత్సరాది కడచిన యేడవదినమందు నొక పొలములో రెండు శిలావిగ్రహములు దొరకినవి. ఆపొలము నందొక మూలలో దిబ్బయుండెను. ఇల్లుకట్టుకొనుటకై యొక్కడు మన్ను కావలెనని యడుగగా నాపొలముగల రయితు దిబ్బను త్రవ్వితీసుకొనుట కానతిచ్చెను. వాఁడు మూఁడడుగులు త్రవ్వగా ఖంగుమనుశబ్దము వినిపించెను. ద్రవ్యప్రాప్తియున్నదేమో యని యాసఁగొని అప్పుడు త్రవ్వక రాత్రి త్రవ్వందొడంగెను. అప్పుడు "మనుష్యుల సంపర్కముగలుగుచున్నదిరా" యను పలుకులు వినిపించెనట. మెఱుము మెఱసెను. బహుసుందరమై శంఖచక్రగదాధారియైన విష్ణువు విగ్రహముకన్పడెను. కొంతసేపటికి గరుడ విగ్రహముసైతము బయలుపడెను. ఇవి నల్లసానరాతితోఁ జేయఁబడియున్నవి. ఏమియు నొచ్చెములేక యతిసుందరములుగా నున్నవి. వెంటనే యాగ్రామమందలి పెద్దలకు వేంకటేశ్వరులు స్వప్నమునం గన్పడి, యుద్భవించిన మూర్తి తాననియు, ఇంకను త్రవ్వినచో నితర విగ్రహములును ఒకకొలను కనుపడుననియు చెప్పి యచ్చటనే యొక కోవెలగట్టుడని నియమించెనట. అందులకుఁ గావలసిన ద్రవ్యము తానే తెచ్చుకొందుననియు, లోకమునకుఁ దానుద్భవించినవార్త గ్రామస్థులు ప్రచురపరచినఁ జాలుననియు సెలవిచ్చెనట. ఆపల్లెవారు వెంటనే యొక కోవెల మట్టిగోడలతోఁ గట్టి దానియం దీవిగ్రహములను విభవముతో శ్రీరామనవమినాఁడుంచిరి. మూగుమండు గుంపుచేతను, లోపల చీఁకటిగానుండుటచేతను ఛాయాపటముతీయుట దుస్తరమయ్యెను. కావున నావిగ్రహముల చిత్తరువులిఖియించి ప్రకటనకై పంపితిని. వేంకటేశ్వరుల విగ్రహము రమారమి మూఁడడుగులు యెత్తుండును. గరుడవిగ్రహము $2\frac{1}{2}$ అడుగున్నను, పీఠము యెత్తు మరియొక చానికంటె నెక్కువ. శిథిలములుగాపడుటం జేసి తురుష్కులచేఁ బాడుచేయఁబడిన కోవెలకు సంబంధించినవిగాఁ గన్పడవు.

# డాక్టరు జేమ్సు కజిన్సు గారు

వి. ఎన్. శర్మగారు, బి. ఏ., బి. టి.

కజిన్సుపండితులు ఐర్లండుదేశస్థులు. ఐరిషుజాతిని దాస్యమునుంచి రక్షించి స్వాతంత్ర్యదేవతానిలయముగ చేయుటకు బాల్యమునుండియు వీరు చేసినసేవ వర్ణింప నలవికాదు. దాస్యవ్యామోహమున బడిపోవుచున్న ప్రజల గాఢనిద్రలోనుండి మేల్కొలిపి, స్వాతంత్ర్యసేవానిరతులుగ చేయుటకు వీరు వ్రాసిన జాతీయగీతములకు పద్యములకు లెక్కయే లేదు. ఆకాలపు ఐరిషుప్రభుత్వమునకు కంటకప్రాయుడై యుండెనని చెప్పిన, వారి మాతృదేశసేవాధురంధరత్వము వెల్లడికాగలదు. ఆదేశపు జాతీయనాయకులలో వీరగ్రగణ్యులని పేరొందియున్నారు.

ఒక్కతనదేశసేవతో తృప్తిపడియూరకుండలేదు. భారతదేశమును గురించి ఆయన యెంతయు వినియుండిరి. అచ్చటిమతకర్తలను సతతము స్మరించుచుండెడివారు. అట్టిమహాదేశమునసైతము తనశక్తినంతయు వినియోగించి సేవ చేయవలయునని బద్ధకంకణులై తగిన అవకాశమునకై యెదురుచూచుచుండిరి. ఇంతలో అనిబిసెంటుగారు ఆదేశమును సందర్శించుట తటస్థించినది. కజిన్సుగారీమెను గురించి యెంతయు వినియున్నారు. ఈమెసమాజమున సభ్యులై, ప్రాగ్దేశమతములను గురించి చాలవరకుచదివి యున్నారు. అనిబిసెంటుగారిని దర్శించి తనయాశయముల నివేదించినారు. ఆసమయముననే ఆమె మదనపల్లిలో గురుకులము నొకదానిని నిర్మింప ప్రయత్నములు సలుపుచు, సామర్థ్యులగు ఆచార్యుల సంపాదించుటకు ముందే కజిన్సుగారినిగురించి వినియుండిరికావున తమవిద్యాలయమునకు కజిన్సుగారే తగినవారని తీర్మానించి వారిని మదనపల్లికి ఆహ్వానించిరి. అపుడు కజిన్సుగారికి కలిగిన సంతోషము వర్ణింపనలవికాదు. తత్‌క్షణమే తనమాతృదేశమును బంధుమిత్రాదులను ప్రజలను వీడి ఆమెవెంటనే ఇచ్చటికి బయలుదేరి వచ్చిరి.

మదనపల్లికళాశాలకాచార్యులుగ నుండి కజిన్సుగారు భారతోదయమునకు చేసినసేవ వ్రాయుట అనవసరము. కళాశాలప్రఖ్యాతి భారతదేశమున కంతకును దెలియునుగదా! అచ్చట భారతదేశస్వాతంత్ర్యమునకుగాను బాలురకు గరుపబడు విద్యావిధానమును మనదేశీయులే కాక, ప్రభుత్వమువారుసైతము తమవిద్యాలయములలో ప్రవేశపెట్టుచున్నారని వ్రాయుట అనవసరము. మదనపల్లి గొప్పయాత్రాస్థల మైనది. దానిని గాంచని విద్యావేత్తలే లేరని చెప్పినయొకగొప్ప కాదు. కజిన్సుగారిసంగతిని జపానువారేరీతిగనో దెలిసికొనిరి. అచ్చట జాత్యుద్ధరణమునకు గొప్పవిశ్వవిద్యాలయమును ప్రజలునెలకొల్పియుండిరి. అచ్చటికి వచ్చి కొంతకాలముండి తమసేవావ్రతమునకు కేలూతనేయ విశ్వవిద్యాలయమువారువేడిరి. కజిన్సుగారొక్కసంవత్సరముమాత్ర మక్కడనుండిరి. అచ్చట ప్రజలలో జాత్యుదయమునకుగాను చేసినసేవ చెప్పనలవికాదు. తదనంతరము చీనా, సయాము, బర్మా, మొదలగు దేశములను సందర్శించి అచ్చటి పరిస్థితులను గాంచి వచ్చిరి.

ప్రాగ్దేశములు గాఢనిదురనుండి మేలుకొనుచున్నవనియు త్వరలో నవి తమపూర్వగౌరవప్రతిష్ఠల నిలుపుకొని ప్రపంచము కంతటికిని గురుప్రాయములుగాగలవని కజిన్సుగారు తమసంచారములవలన గ్రహించిరి. ఈకార్యము నెరవేరుటకు ప్రాగ్దేశసమ్మేళనమవసరమనియు, యీమహోద్యమమునునడపుటకు ముందంజవేయువారే పుణ్యవంతులనియు వారిఅభిప్రాయము. ఈమహాకార్యనిర్వహణమునకుగాను అడయారు క్షేత్రమున గొప్పవిద్యాలయము నొకదాని నిపుడు స్థాపించి, దాని కాచార్యులై యున్నారు. ప్రాగ్దేశసారస్వతముల గ్రహించుటకు అన్నిజాతులవారిని అన్నిదేశములవారిని ఆహ్వానించుచున్నారు. అంతటితో తృప్తిపొందలేదు. విరామకాలమున ఎచ్చటికివెళ్లినను, ఎవరిని గాంచినను,

యీవిషయస్మరణము తప్ప మరేమియు మనము గాంచ జాలము. ఈమహాకార్యము నన్నిదేశములలో చూచుట కుగాను,వారనుదినము వ్రాయుగ్రంథములకుపరిమితి లేదు.

కజిన్సుగారిప్రయత్నముల కన్నిటికిని తేలూతని చ్చుచున్న వారిసతీతిలకమును గురించి యిచ్చట ప్రస్తా పించక విడుచుటకు వీలులేదు. భారతదేశసేవాప్రతమున నామెకు పెట్టినదే పేరు. భారతమహిళలను విద్యావతు లనుగచేసి, వారినిసైతము భారతాభ్యుదయ సేవాప్రత లుగ చేయుట కామె యనుదినము చేయుచున్న ప్రయత్నము లనంతములు.

కజిన్సుదంపతులు పుణ్యమూర్తులు. భగవానుడు వారి కాయురారోగ్యముల ప్రసాదించి వారిమహోద్య మములు నిర్విఘ్నముగ కొనసాగుటకు అన్నివిధముల తోడ్పడు గాత !

---

# గుబ్బి శ్రీ చెన్నబసవేశ్వర కృపాపరిపోషిత నాటకసమాజము

## మైసూరు

ఈ సమాజము తొలుత 1884వ సం॥న శ్రీ చందన్నగారిచే నెలకొల్పఁబడి నది. ఇటీవల నాలేడేండ్ల క్రిందట ప్రస్తుతము ప్రొప్రయిటరుగా నున్న శ్రీ జి. హెచ్. వీరన్న గారి యాధిపత్యముక్రిందికివచ్చి మిగుల నభి వృద్ధినిగాంచినది. ఈసమాజమువారు నాలుగు నెలల క్రిందట చెన్నపురికి వచ్చి నిన్న మొన్నఁటిదాఁక బెక్కునాటకములను కన్న డమునఁ బ్రదర్శించిరి. వీరి పాత్రప్రవేశరంగా లంకారాదులు మెచ్చఁదగినవి. వీరిచేఁ బ్రద ర్శింపఁబడిన నాటకములలోనెల్ల 'కబీరుదాసు' ప్రశస్తమయినది. అందును కబీరుపాత్రము ప్రశస్తతమ మయినది. ఈ పాత్రమును శ్రీ సి. బి. మల్లప్పగారు ధరింతురు. (వీరిచిత్ర మిందుఁ గలదు.) రంగప్రదేశమున నీనటశిఖా మణిని గాంచినంతనే ప్రేక్షకుల శరీరములు పులకితము లగు ననుటయం దించుకయు నతి శయోక్తి లేదు. తమ సమాజమునందలి నట కులను సుశిక్షితులను గావించి పేరుగాంచిన శ్రీ వీరన్నగా రెంతయుఁ బ్రశంసార్హులు. కబీరుచిత్రముయొక్క బ్లాకును ప్రకటనార్థమై శ్రీ వీరన్నగారు దయతో నొసంగిరి.

---

బజబహాదూరు రూపమతి



౧౬ వ శతాబ్దము రెండవభాగము మొగలు కళావైఖరి

లక్ష్మీ ఆర్టు ప్రెస్సు—బొంబాయి.

# రాణీ రూపమతి

బజబహాదరు మాళవదేశమును బాలించిన రాజులలోఁ గడపటివాఁడు; మిగులఁ బరాక్రమశాలియగు మహమ్మదీయ యువకుఁడు; సుందరాంగుఁడు; సంగీతప్రియుఁడును. అతఁ డనుచరులనుగూడి నర్మదయొక్క దక్షిణతీరమునందలి వనమున వేఁటాడఁబోయెను. ఆయరణ్యమునఁగల మృగములఁ దఱిమితఱిమి చంపుచు బజబహాదరు చాలదూరము పోయెను. అనుచరులు వెనుకఁజిక్కిరి. పోవఁబోవఁ బరిసరాటవీప్రదేశమునుండి యొక మనోహర గాన మాతనివీనులకు విందుగొలిపెను. దాని జాడనుబట్టి పోయి యతఁడు శృంగారపురాశి యోయన నొప్పారియున్న యొకసుందరాంగిని, వృక్షచ్ఛాయను గూర్చుండి గానముచేయుచున్న దానిని గనియెను. మృగములు పక్షులు సైతము గుంపులుగూడి శరీరములు మఱచి యాగానామృతమును గ్రోలుచుండినవి. ఈలావణ్యవతియే కథానాయికయగు రూపమతి. ఈమె రాజపుత్రకన్యక. విదుషీమణి. కవయిత్రి. ఆచక్కనిచుక్క చెట్టునీడను సుఖాసీనయై తనమనోహరకంఠస్వరమును చేత మీటుచున్న సితారుయొక్క స్వరముతోఁ గూర్చి యింపుగఁ బాడుచుండెను. వక్రవినీలకుంతలావృతమగు నాసుందరాంగిముఖము మేఘమండలమునుండి వెలువడిన యర్ధచంద్రుని బోలియుండెను. ఆమెకన్నుల యందము, దంతములసౌరు, నాసికవాసి, వేయేల- ఆపాదకేశాంతముగల యాయంగనామణిసౌందర్యము వర్ణనాతీతము. ఒంటరిపాటున నున్న యిట్టియొప్పులకుప్పను గాంచిన జితేంద్రియుఁడైన మోహపాశబద్ధుఁడుగాకుండునే?

బజబహాదరు రూపమతిచక్కఁదనమును గని మోహితుఁడయ్యెను. ఆమధురగానామృతమును దనివిదీరఁ గ్రోలుచు నాతఁడు కొంతసేపాకయోర నిలుచుండి తుదకామెయెదుటికిఁ బోయెను. తనయభీష్టము నామెకుఁ దెలిపెను. తనకుఁ బట్టపురాణి గాఁగోరెను. రాజపుత్రయువతి తనకులాభిమానమును గోలుపోయి యన్యునిచేతి కంతసులభముగఁ జిక్కునా? అతఁ డెంత వేఁడినను సమ్మతింపదయ్యెను. తుదకాతని మితిమీఱిన మోహమును గాంచి "నర్మదానది మండూదుర్గమునఁ బ్రవహించునపుడు నేను నీకు రాణివాసము నయ్యెద. లేకున్నఁ గాఁజాల" ననెను.

ఈకార్యము సాధ్యమా! అత్యున్నతప్రదేశముననున్న మండూదుర్గ మెక్కడ? నర్మద యందుఁ బ్రవహించు టెక్కడ? కామాంధుఁడైన బజబహాదరు సాధ్యాసాధ్యవివేకశూన్యుఁడు. తనయాజ్ఞచే నర్మద పర్వతము మీఁది కయినను బ్రవహింపవలయు నని యాతఁడు నిశ్చయించుకొనెను. తన యనుచరులను జేర్చెను. 'నర్మదానదిని మండూనగరమునఁ బ్రవహింపఁజేయుఁ" డని యాజ్ఞాపించెను. వారలా ప్రయత్నములను సాగించుచుండిరి.

బజబహాదరుసాహసమునకు మెచ్చి నర్మద యాతనికి బ్రత్యక్షమయ్యెను. "రాజా! ఈ ప్రయత్నమును మానుము. నీవు ప్రేమించినరూపమతి నీకు లభించుఁగాక! నీరాజధానికిఁ బొమ్ము. అందుఁ జిచులవృక్షముగల పవిత్రస్థానమునఁ ద్రవ్వింపుము. ఆ ప్రదేశమున నీటిబుగ్గ వెలువడును. అచ్చట నొకకొలను గట్టింపుము. నాయంశ మందు నెలసియుండును. ఆపుష్కరిణి పవిత్రమై రేవాకుండ మనుపేర ప్రఖ్యాతి గాంచెడిని. ఆకొలనిదరి నొకరమణీయహర్మ్యమును నిర్మించి యందు నీ ప్రియురాలిని గూడి సుఖింపు"మని పలికెను.

బజబహాదరు కృతార్థుఁడయ్యెను. నర్మద యాజ్ఞ తెలియఁగునఁ దనరాజధానియందుఁ జిచులవృక్షముగల ప్రదేశమునఁ ద్రవ్వింప నొక బుగ్గ బయలువెడలెను. అచట నతఁడొకకొలను గట్టించెను. దానితీరమున సౌధమును గట్టించి యందుఁ గృతకహ్రదమును నిర్మింపఁజేసెను. రేవాకుండమునుండి యాహ్రదమునకుఁ గాలువఁ ద్రవ్వించెను.

ఆకాలమున నర్మదాతీరమున నున్నధర్మపురమును "తాకూ" రనురాజపుత్రవీరుఁడు పాలించుచుండెను. మనరూపమతి యాతనిపుత్రి. బజబహాదరురూపమతులవృత్తాంత మాతనికిఁ దెలిసెను. కడుఁ గుపితుఁడయ్యెను. విషముఁ ద్రావి మరణింపఁ దన ప్రియపుత్రి కాజ్ఞాపించెను. ఆమెశవమును దహించి భస్మమును నర్మదాజలములయందుఁ బోయింప నిశ్చయించెను. రూపమతికిఁ దండ్రియాజ్ఞ మీఱరానిదయ్యెను. బజబహాదరును బ్రేమించినదయ్యును విషమును ద్రావి మృతిఁజెందుట కామె యంగీకరించెను. రాజపుత్రకన్యల కభిమానముకన్నఁ బ్రియ మొండుకలదే? తండ్రి యిచ్చిన విషపాత్రము నామె గైకొనెను. నర్మదానదీతీరమును జేరెను. ఒక్కమాఱు నర్మదాప్రవాహముపై దృష్టి సారించెను.

తరంగాకులమైన యానిర్మలప్రవాహమును గాంచినంతనే రూపమతిమనస్సు కలఁతఁజెందెను. కన్యాత్వముననే మృతిఁజెందవలసినందులకై యామె యించుక చింతించెను. కొంతతడవున కూఱడిల్లి మనసు గట్టిచేసి యభిమానమువంక బుద్ధిని మరల్చి విషపూరితపాత్రము నోష్ఠపుటముఁ జేర్చెను. అప్పు డామె కేదియో శబ్దము విననయ్యెను. దానివంక కొకమాఱు చూచెను. దూరమున నొకయువకుఁ డశ్వముపై వచ్చుచుండెను. అతఁడు మెఱుపు మెఱసినట్టు లుత్తరక్షణముననే యామెముందఱ నిలువఁబడెను. అతఁడే బజబహాదరు. అతఁ డామె చేత నున్న విషపాత్రమును లాగి పారవైచి యామెను గుఱ్ఱముపై నెక్కించుకొని మండూనగరమును జేరెను. పిదపనతివైభవముతో రూపమతిని బెండ్లాడెను. రూపమతి మాళవదేశపు రాణియయ్యెను. ఆదంపతు లొండొరులను బ్రేమించుచు ననంతభోగములననుభవించుచుండిరి.

ఇప్పుడు రూపమతిభవనము గల కొండ ప్రబలారణ్యమున మఱుఁగుపడియెను. సౌధమునఁ జిన్నతుప్పలును గసవును దట్టముగా మొలచి పాడువడియున్నది. భవనమునకు వెనుకవైపున రూపమతి సహగమనము గావించిన ప్రఖ్యాతస్థలము కలదు. కాని యాస్థలమును నిర్దేశింపఁదగినచిహ్నము లేవియు నిప్పుడుగానరావు. ఆమందిరములు అంధకారబంధురములై మానవసంచారాయోగ్యములై నిశ్శబ్దముగా నున్నవి. దశాపరిణామ మిట్టిదే

గ. సు.

# సాభిప్రాయవిశేషములు

భగవదనుగ్రహమువలనసత్యాగ్రహదీక్షా పరాయణుడైన గాంధీమహాత్మునకు స్వస్థత కలిగినది. జుహూ పుణ్యమును గాంచినది. సర్ మురార్జీభవనము పవిత్రమైనది. యూరపియన్ భోజనశాలకై నిర్మింపబడిన దివ్యమందిరము మహద్భాగ్యమును గాంచినది. శాంతమూర్తియైన మహాత్మునకాశ్రయమైన ఈదివ్యభవనమునకు ముందేమి అదృష్టము పట్టగలదో జ్యోతిషము చెప్పుట సాధ్యము కాదు. మహాత్మునకు శస్త్రచికిత్స చేసి ప్రాణసంరక్షణ చేసిన కర్నల్ మేడక్కుగారికి జ్ఞాపకచిహ్నముగా నేర్పడవచ్చును. సత్యాగ్రహవ్రతునకు ఆశ్రయమైన ఈపవిత్రభవనము సత్యాగ్రహ ఆశ్రమముగ నేర్పడవచ్చును. గతించిన రెండుమాసములందును వేలకొలది దేశభక్తులపాదధూళిచే పవిత్రమైన జుహూ గ్రామము మురార్జీభవనము భావికాలమునందు పుణ్యక్షేత్రముగ వెలయుట సహజము.

* * * *

గాంధీ మహాత్మునకును, స్వరాజ్యపక్షనాయకులైన మోతీలాల్ నెహ్రూగారికిని జరిగిన రాయబారములు అతిగుహ్యములుగ నున్నవి. నెహ్రూగారీవిషయమై బొంబయియందుగంభీరోపన్యాసములనుచేసినను సారాంశము గుహ్యముగ నున్నది. గాంధిపక్షమునకును, స్వరాజ్యపక్షమునకును, ఢిల్లీ కాంగ్రెసునందును, కాకినాడ కాంగ్రెసునందును జేసిన తీర్మానము తాత్కాలికముగ విభేదముల నాపి సంయోగమును గలుగజేసినది. ఆసంయోగము స్వరాజ్యపక్షమునకు కొంతకు కొంత బలవిజయములను సమకూర్చినది. స్వరాజ్యపక్షము రాష్ట్రీయశాసనసభలయందును, సామ్రాజ్యశాసనసభయందును రణభేరిని మ్రోగింపగలిగినను ప్రతిష్టంభనము గలుగజేసి విజయమును బడయలేదు. నిరంకుశవిధానము నిరసనమును బడసినను యథేచ్ఛగా విహరించుచున్నది. గాంధీమహాత్ము డుపక్రమించిన యసహాయోద్యమమునకును, స్వరాజ్యపక్షముపక్రమించిన ప్రతిష్టంభనవిధానమునకును, సంబంధించిన సంబంధబాంధవ్యములు దుర్గ్రాహ్యములుగ నున్నవి. శాసనసభాప్రవేశమే అసహాయయోగమునకు ప్రతికూలమని గాంధీపక్షావలంబనులు వాదించుచున్నను స్వరాజ్యపక్షావలంబనులు శాసనసభలయందు సయితము అసహాయయోగము సాధ్యమని ప్రతిఘటించుచుండిరి.

* * * *

గతించిన మూడు మాసములయందును శాసనసభలయందుస్వరాజ్యపక్షమువారు విచిత్రకార్యములను చేసి సంభ్రమమును గలుగజేసిరి. మధ్య వంగరాష్ట్రముల శాసనసభలయందుస్వరాజ్య పక్షమువారు చూపిన ప్రతిఘటనసామర్థ్యము ప్రజలకానందము గలుగజేసినది. ప్రభుత్వపరాజయములు దిగంతములయందుమారుమ్రోగినవి లండనుటైమ్సు మొదలగుపత్రికలుగర్జించినవి. ఆంగ్లో-హైందవపత్రికలు బెదరించినవి. కర్కశవాదులు దండనోపాయమును బోధించిరి. లేబరు పక్షనాయకులు తియ్యనిమాటలను జెప్పుచు ముప్పును తప్పించు

కొనిరి. నిరంకుశవిధానము యథేచ్ఛగా సాగు చున్నది. స్వరాజ్యపక్షము ముం దేమి చేయవలెనో నిర్ణయించుట దుస్తరముగ నున్నది. బొంబయియందు గూడిన సమావేశమునందు కార్యవిధానపు నిర్ణయము కుదురలేదు. స్వరాజ్యపక్షమువారికిని, స్వతంత్ర పక్షము వారికిని ప్రారంభమున గలిగిన యేర్పాటులు శిథిలమగుచున్న విధమును నిత్య వ్యవహారములు విశదము చేయుచున్నవి. నెహ్రూగారు నియోగిగారికి చేసిన హెచ్చరికయం దీ యంశము విశదమగుచున్నది. మే, జూన్ నెలలయందు సిమ్లా కొండలలో గూడనున్న శాసనసభాసమావేశమునందు రెండుపక్షములవారికి గల సంయోగ పటుత్వము వెల్లడి కాగలదు. స్వరాజ్య పక్షమువారి ప్రతిష్టంభనసామర్థ్యమును శీఘ్రకాలముననే విశదము కాగలదు. ఈవిషమ పరిస్థితులందు చతురుడైన నెహ్రూగారు గాంధీమహాత్ముని యాశీర్వాదమును బడయగోరుట సహజము. ముఖ్యనాయకుడైన దేశబంధు చిత్తరంజనదాసుగా రస్వస్థతవలన జుహూ సమావేశమునకు పోజాలకుండుట విచారకరము.

* * * *

గాంధీమహాత్ముడు స్వరాజ్యపక్షమువారు శాసనసభలయం దవలంబించుచున్న ప్రతిష్టంభనవిధానమునకు సమ్మతించుట లేదని వదంతులు తెలుపుచున్నవి. ప్రతిష్టంభనము అహింసాధర్మమునకు ప్రతికూలమనియును స్వరాజ్య పక్షమువారికి యథోచితసహకారమార్గమె శరణ్యమనియును మహాత్ముడు తెలిపినటులు వార్తలు వ్యాపించినవి. శాసనసభలయందు స్వరాజ్యపక్షమువారు నిర్మాణకార్యవిధానమునకు సహకారయోగము నవలంబించుటకు బూనుకొనినపుడు వారికిని స్వతంత్ర మితవాద పక్షములవారికిని విశేషమైన భేదముండదు. దేశమునం దంతటను స్వరాజ్యపక్షపు ప్రతిభ పోవుట సహజము. స్వరాజ్యపక్షమునకు కాంగ్రెసునందును, శాసనసభలయందును కొంత వ్యక్తిత్వమేర్పడినది. ఆ వ్యక్తిత్వమును గోల్పోవుటకు దాసు, నెహ్రూ గార్లును, వారి యనుచరులును సంగీకరింపజాలరు. ఈ సందర్భములయందు గాంధీ మహాత్మునికార్యభారము దుర్భరముగ నున్నది. ధర్మజ్ఞుడైన గాంధీమహాత్ముడు తన యభిప్రాయము నచిరకాలముననే ప్రచురింపదలచి యున్నాడని జుహూవార్తలు తెలుపుచున్నవి. మహాత్మునియభిప్రాయములు దేశమునందు సంరంభమును వ్యాపింపజేయుటకు గాక శాంతిని వ్యాపింపజేయుటకు దోడ్పడునని నమ్ముచున్నాము. మహాత్ముడు మెయినెల నడుమను సత్యాగ్రహాశ్రమమును చేరగలడను శుభవార్త ప్రజాహృదయము లందు భక్త్యుత్సాహముల నుదయింపజేసి కార్య పరాయణులను జేయు నని నమ్ముచున్నాము.

* * * *

ఇప్పుడు దేశమునందుగల రాజకీయ పక్షములు నామరూపములు గలిగియున్నను దుర్బలములై నిరుపయోగములుగ నున్నవి. మితవాదపక్షమువారు పరువుప్రతిష్ఠలను గోలుపోయినను తీర్మానములను జేసి సంతసించుచున్నారు. స్వతంత్రపక్షమువారు బలసామర్థ్యములు లేక నామరూపములను మాత్రము గలిగియున్నారు. స్వరాజ్యపక్షమువారు బలసామర్థ్యములను గలిగియుండియును నిరంకుశ విధానమును ప్రతిఘటించుటకు తగినశక్తిని

గలిగియుండ కున్నారు. కన్వెన్షను పక్షనాయకురాలు బిసెంటమ్మగారు స్వరాజ్యటంటమ్ములను దేశమునందంతటను నాడంబరముగను మ్రోగించుచున్నను బలమునుగాని, ప్రతిపత్తినిగాని లేక స్వోత్కర్షను జాటుకొనుచున్నది. స్వరాజ్యసంపాదనమునకు కాంగ్రెసు పక్షమునకు మాత్రమె బలమును ప్రతిపత్తియును గలదు. ఆబలము సర్వతోముఖముగ బయలుదేరి విజయమును బడయుటకు దగిన ప్రజాబలము దేశమునందంతట సువ్యక్తమగుటకు విశాలమైన యంగనిర్మాణములు గావలసియున్నవి. గాంధిమహాత్ముడు రెండేండ్లు శ్రీకృష్ణజన్మస్థానమునందు తపస్సుచేసిన తరువాతను సయితే మీసందేశమునే ప్రకటించుచున్నాడు. దేశమోక్షమునకు నిర్మాణకార్యవిధానమే శరణ్యమని కార్యజ్ఞులు గ్రహించియును నాచరణమునందు నిర్లక్ష్యమును జూపుచున్నారు. కాకినాడకాంగ్రెసు ముగిసి నాలుగు మాసములు గతించినవి. దేశమునందు నిర్మాణవిధాన మెంతవరకు సాగినదియును యోచించునపుడు పరమాశాపరాయణుల హృదయములందు సయితము నిరాశజనించుట సహజము. ఆంధ్ర ద్రవిడకర్నాటక ఘూర్జరరాష్ట్రములం దీవిషయము కొంతవినబడుచున్నది. వంగ బిహారు సంయుక్తపంజాబు మధ్యరాష్ట్రములు మొదలగురాష్ట్రములం దీవిషయస్మరణమె వినబడుటలేదు. ఆరాష్ట్రములందు ప్రజానాయకులదృష్టి యుద్రేకపూరితములైన విషయావలోకమున లగ్నమగుచున్నది. శాసనసభలు అకాలీజట్టులు ప్రజానాయకులదృష్టి నాకర్షించుచున్న విధమును కాంగ్రెసుసంఘములు స్వరాజ్యనిధి ఖద్దరు ప్రజానాయకుల దృష్టి నాకర్షించుటలేదు. గాంధిమహాత్మున కుద్రేకమున కేర్పడిన విషయములందు విశ్వాసము లేకపోయినను ప్రజానాయకులహృదయముల నాకర్షించినవిషయములను ప్రతిషేధించుటకు సంశయభావము గలుగవచ్చును. నిర్మాణవిధానమునందు దృష్టిని నిలిపినరాష్ట్రములందు సయిత మభివృద్ధి సంతృప్తికరము గాదు.

* * * *

ఆంధ్రరాష్ట్రమునందు గాంధిపూజానిధికి రెండు మాసముల నిరంతరపరిశ్రమానంతరము రూ 25,000 చందాలును రూ 11,000 వసూళ్లును సమకూడుట సంతృప్తికరము గాదు. ఈ యభివృద్ధి ననుసరించిన రూ 1,00,000 వసూలగుట కెంతకాలము గావలయునో యూహింపజాలము. కాంగ్రెసు సభ్యులసంఖ్యయును స్వల్పముగ నున్నది. ఖద్దరు నిర్మాణమును వ్యాపనమును చురుకుగ జరుగుటలేదు. కారణము కార్యశూరులు చాలినంతమంది దేశమునందు లేకుండుటమె యని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. ప్రతిజిల్లాయందును పదుగురైనను కార్యపరాయణు లుండిన గాని నిర్మాణకార్యవిధానము వ్యాపకమును బొందజాలదు. విద్యావంతుల దృష్టి తిరిగి పత్రికలమీదను రాజ్యాంగసిద్ధాంతములమీదను లగ్నమగుచున్నపుడు ప్రజలదృష్టియును ఆమార్గముననె ప్రసరించుచుండును. ద్రవిడదేశమునందైనను తంజావూరు మిరాసిదారుల సంరంభము వైకము సత్యాగ్రహము ప్రజానాయకుల దృష్టి నాకర్షించిన విధమున నిర్మాణవిధాన మాకర్షింప జాలకున్నది. శ్రీయుత రాజగోపాలాచార్యులుగారు ఖద్దరు సూత్రములను వ్యాఖ్యానములను నెన్ని వ్రాసినను ప్రజా

నాయకులదృష్టి ఉద్రేకపూరితమైనవిషయము లందు లగ్న మగుచున్నటులు ఖద్దరునందు లగ్నమగుటలేదు. ప్రజలదృష్టియును నాయకులదృష్టియును నేకకాలమునం దనేకవిషయములందు లగ్నమగుటయును సాధ్యముగాదు.

* * * *

ప్రజాస్వాతంత్ర్య సంరక్షణమున కేర్పడిన వివిధవిషయములును పరోక్షముగను విజయమునకు సాధనంబులైనను స్వరాజ్యవిజయము ప్రజలసంయోగాచరణముననె సాధ్యము గాగలదు. ఈసత్యార్థమునె గాంధిమహాత్ముడు నిరంతరము ప్రతిపాదించుచున్నను ప్రజానాయకులచిత్తములందు స్థిరమైన వాసమును గైకొనలేదు. గాంధిమహాత్ము డొకటిరెండువారములలో స్వరాజ్యపక్షవిషయమునను నిర్మాణకార్యవిధాన విషయమునను కాంగ్రెసు వ్యవహారముల విషయమునను వారి యభిప్రాయములను ప్రకటింపనున్నారను వదంతులు వ్యాపించినవి. ఈప్రకటనమును గాంధిమహాత్ము డఖిలభారత జాతీయోపసంఘసమావేశానంతరము సహజముగను జేయవచ్చును. ఈసమావేశము జూను మొదటి వారమునందు సత్యాగ్రహాశ్రమమునందు జరుగు నని తెలియుచున్నది. ప్రజలు మహాత్ముని యాదేశములకై నిరీక్షించుచుండక మహాత్ముడు విధించినధర్మమును నిర్వహించుటకు పాటుపడుట ప్రయోజనకరము.

* * * *

గాంధి పూజానిధిని వెంటనే సమకూర్పవలసినభారమాంధ్రులమీదనుగలదు. ఇంతవరకును రూ 25,000 చందాలుపడినవి. రూ 11,000లు మాత్రము వసూలైనవి. ఇంకను రూ 90,000 వసూలు గావలసి యున్నవి. దేశభక్త వెంకటప్పయ్య పంతులుగా రీవిషయమున నాంధ్రులకు జేసిన హెచ్చరికను ప్రజలందరును గమనించి పూజానిధికి ద్రవ్యమును సమకూర్చి ఆంధ్రులు తమగౌరవమును గాపాడుకొనవలసి యుందురు. వెంకటప్పయ్య పంతులుగారు సూచించినటులు ఆంధ్రరాష్ట్రీయసభోపసంఘ సభ్యులందరును పూజానిధికి చందాలను వసూలుచేయుటకు దీక్షను వహించిన పూజానిధి వెంటనే పూర్తి గాగలదు. ఇతరులకై వేచియుండుట కాలహరణమునకు గారణము గాని కార్యసిద్ధికి సాధనముగాదు. గాంధిమహాత్ముడు విధించినధర్మయోగమునకును కర్మయోగమునకును సంయోగము నిత్యవ్యవహారములందు సాధ్యమైనపుడే స్వరాజ్యమును సాధ్యమగునని ప్రజలు గ్రహించి గాంధిమహాత్మునివలె నిరంతరము వ్యవసాయపరాయణులై స్వరాజ్యవిజయమును బడయుదురు గాక!

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thumbu Chetty Street, G. T. Madras.

# వి ష య సూ చి క.

పుటసంఖ్య.

---

## చిత్రపటముల విషయానుక్రమణిక

## గౌరీశంకరుల కల్యాణమహోత్సవము



సీ. శ్రీమీఱఁ గల్యాణచిహ్నాంకితయై గౌరి వామాంకమునఁ జేరి వలపుగొలుప, పాపసెట్టైపుఁజుట్టపై లేఁతజాబిల్లి చల్ల
వెన్నెల వెదచల్లుచుండ, బహుగణాధీశ్వరుల్ పటహాదివాద్యముల్ వింతరీతుల మేళవించుచుండ, నేత్రోత్సవము
గాఁగ నిఖిలబృందారకుల్ చూచి రాక్షసభీతిఁ బాచికొనఁగ, చక్కఁ వృషభేంద్రుపై నెక్కి, సకలజగము,
గొలువ నూరేఁగసాగిన లలితమూర్తి, శంకరుఁడు భక్తలోక శివంకరుండు, మనలఁ గరుణావిధేయుఁడై
మనుచుఁగాత !

Lakshmi Art, Bombay 8.




చెన్నపట్టణము, జూన్ ౧౯౨౪

సంపుటము ౧. | రక్తాక్షి సంవత్సరము జ్యేష్ఠమాసము | సంఖ్య ౬.

# పుష్పాంజలి

## మల్లినాథుఁడు

ఇతనిగుఱించి బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రులవారు ఆంధ్రపత్రిక యుగాది సంచికలో విస్తరించి వ్రాసియుండుట యెల్లరకు విదితము. ఇతని కాలనిర్ణయము సమర్థించుట కనుకూలముగ నితని గ్రంథ మొకటి యిటీవల లభించె. 'వైశ్యవంశసుధార్ణవ'మను నొకనిబంధన మితఁడు రచించి యందుఁ గోమటులకు వైశ్యశబ్ద ప్రయోగౌచిత్యమును దెలిపి వైశ్యవృత్తి వారలధర్మ మగునో కాదో యనునంశము శాస్త్రరీతిగాఁ బరిష్కరించియున్నాఁడు. కర్ణాటరాజగు వీరప్రతాప ప్రౌఢదేవమహారాయలు మల్లినాథునిఁ బిలువనంపి కాంచీపురమునుండి తత్రస్థవైశ్యమహాజనశాసనమును దెప్పించి పైయంశములను బరిష్కరింపుమని ప్రార్థింపఁగా మల్లినాథుఁడా గ్రంథమును సపరిష్కారముగా రచించెనఁట. ఈప్రౌఢదేవరాయఁడు విరూపాక్షుఁ డను నామాంతరము గలమహాపండితుఁడు. హరిహరరాయలపుత్త్రుఁడు. మల్లినాథుఁడు రసార్ణవసుధాకరమును దన వ్యాఖ్యలలో నుదాహరించి

యున్నందున దత్కర్తయగు సింగభూపతి 1400 క్రీ. శకమునకుఁ బూర్వుఁ డని యెఱుఁగవలయును. మల్లినాథుఁ డా గ్రంథములో—

"ప్రారీప్సితస్య గ్రంథస్య నిర్విఘ్నపరిసమాప్తయే లక్ష్మీనారాయణ స్యాంఘ్రికంజద్వయ మహంభజే" ఇతి మంగళం విధాయ వాణిజ్యనైర్జాత్యయో ర్వివాదమానయో ర్వివాదశాంత్యర్థం కాంచీస్థశాసనోక్తప్రకారేణ వైశ్యశబ్దాభిధేయనాగరవైశ్యనగరేశ్వరదేవతోపాసకత్వం తృతీయజాతీయత్వం కాంచీస్థశాసనే యస్య ప్రవర్తతే తస్య భవతు నేతరస్యేతి శ్రీమద్రాజాధిరాజరాజపరమేశ్వర శ్రీవీరప్రతాపప్రౌఢదేవమహారాయేణ విజ్ఞాపితమ్. ఆజ్ఞాపనానంతరం తచ్ఛాసనమానీయ దృష్టమ్, దృష్ట్వా తేనైవ విద్యానగర సర్వాక్షసనప్రకారోఽయమ్‌యస్తు-వైశ్య...."

అని తనశ్లోకములకే తాను వ్యాఖ్య వ్రాయుచుఁ బ్రారంభమున నవతారికఁ గూర్చియున్నందున నితనికాలనిర్ణయము కొంతవఱకు స్పష్టమగును. గద్యములో—

(ఇతి పదవాక్యప్రమాణపారావారపారీణమహోపాధ్యాయ కోలచర్ల మల్లినాథసూరివిరచితే వైశ్యవంశసుధార్ణవే స్మృతిపురాణేతిహాసనైఘంటికాది ప్రసిద్ధవైశ్యవాణిజ్యవణిజ్నాగరోరుజవైశ్యరత్న కాంచీస్థలశాసనోదాహరణోపరచిత విద్వజ్జనహృదయానందకమలే చతుర్వర్ణనిర్ణయో నామ దశమోఽధ్యాయః)

అని కడపటఁ గలదు. దీనిలో ధర్మపురాణ మనునాంధ్ర ద్విపదకావ్యము నుండియుఁ గొన్ని ప్రయోగములజాత్యాచారములను నిర్ధారించుటకుఁ గొన్నిపంక్తు లుదాహరింపఁబడినవి.

### సర్వజ్ఞ సింగభూపతి

రేచెర్ల వంశస్థులలో నితఁ డెన్నవపురుషుఁడో యితఁ డేకాలమునందుండెనో యన్న విషయ మింకను స్పష్టముగాఁ దేలినది గాదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును, బ్ర. వేటూరి ప్రభాకరశాస్త్రులవారును గొంత యభిప్రాయభేదములను జూపిరి. కవులచరిత్రకారులయూహ లన్నియు నిరాధారములై పూర్వపక్షితము లైనందున నిటీవలివారి యాధారములఁ బరీక్షించువారల కుపోద్బలముగా నీ క్రిందియంశముల నుదాహరించెదను. రసార్ణవసుధాకరమును భారద్వాజగోత్రజుఁ డగు విశ్వేశ్వరకవియే రచించి దానికి సింగభూపతి కర్తృత్వ మారోపించె నని చమత్కారచంద్రికలోను రసార్ణవ సుధాకరములోను "మమైవ కందర్పసంభవే" యను వాక్యరత్నమువలనఁ దేలుచున్నది. "సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే" యని చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవి దానిఁ బేర్కొనుటచే నా రెంటిలో రసార్ణవసుధాకరము పూర్వగ్రంథ మని విశద మగుచున్నది. విశ్వేశ్వరకవి యా రెంటినిగాక కందర్పసంభవము, వీరభద్రడిమము, అనపోతనాయకీయము, మొదలగు బహుగ్రంథములు రచించినవాఁడు. ఇతని చమత్కారచంద్రికలోని చక్రబంధోదాహరణపద్యమును సాయణాచార్యుఁడు తా రచించిన యలంకారసుధానిధిలో నుదాహరించుటయే కాక ప్రబంధవలయస్థసంకేతనామము లగు "చమత్కారజ్యోత్స్నా, విశ్వపతికవి, సింగప్రభుయశః" అనుమూఁడును, 3, 7, 9, వలయములలో నుండునట్లు వివరణము చేసి యెత్తిచూపియున్నాఁడు. (సాయణునివంశములో నొక విశ్వేశ్వరుఁ డున్నట్లు తోఁచుచున్నది. అది నిజమే యైనయెడల విశ్వేశ్వరకవి కర్ణాటరా

జ్యమునుండి యంధ్రదేశమునకు వచ్చి వెలమ
రాజులసభలోఁ కీర్తివడసినట్లూహింపనగును.)
సాయణుఁడు తనయలంకారసుధానిధిలోఁ
దనతమ్ముఁడగుభోగనాథుని యుదాహర
ణమాల, శృంగారమంజరి, గౌరీనాథాష్టకము,
త్రిపురవిజయము మొదలగు వానిలోని పద్య
ములను, బహుప్రాచీనపద్యముల నుదాహరిం
చెను. ఇతఁడు గద్యమున "ఇతి శ్రీమత్పూర్వ
పశ్చిమోత్తరసముద్రాధిపతి బుక్కరాజప్రథ
మదేశికమాధవాచార్యానుజన్మనః శ్రీమత్సిం
గమరాజ సకలరాజ్యధురంధరస్య సకలవిద్యా
నిధానభూతస్య భోగనాథాగ్రజన్మనః సాయ
ణామాత్యస్య కృతావలంకారసుధానిధౌ" అని
చెప్పుటచే సంగమరాజుకాలముననే యలం
కారసుధానిధిలో నుదాహరింపఁబడిన చమ
త్కారచంద్రిక యంతకంటెను ప్రాతదై
యుండవలయును. దానికంటెను రసార్ణవసుధా
కర మించుక పూర్వగ్రంథము. ఈయాధార
ముల నాలోచింప రసార్ణవసుధాకరకర్తృ
ప్రఖ్యాతి వహించినసింగభూపతి 1330 ప్రాంత
మున నుండియుండును. ఇతని శ్రీనాథుఁడు
దర్శించెననుట పొసఁగునని తోఁచదు. శ్రీనా
థుని యవసానకాలము క్రీ. శ. 1480 వఱ
కును దిగుచున్నది. రసార్ణవసుధాకరకారుఁ
డగుసింగభూపతికి సర్వజ్ఞబిరుదము లేదని
కొందఱు పొరపడుచున్నారు. రసార్ణవసుధా
కరనామమువలెనే సంగీతరత్నాకరవ్యాఖ్య
యగుసంగీతసుధాకర మనుగ్రంథము సింగ
భూపాలవిరచితము. అందు:

"అతిగంభీరవిషయే
కతిపయవేద్యేత్విహగ్రంథే,
సమ్యగ్వ్యాఖ్యాకుశలః
సర్వజ్ఞ స్సింహాహ్వయ ఏవైకః (?)"

అనియుండుటచే సింగభూపతికి సర్వజ్ఞ
బిరుద ముండియుండు ననుట విశదము.

దశకుమారచరిత్రములోఁ బాఠక్రమము

ఆంధ్రభాషలో దినదినము ననేకప్రా
చీన గ్రంథములు ముద్రింపఁబడుచున్నవి.
భారత భాగవతాది సుప్రసిద్ధగ్రంథ
ములు తక్కఁ దక్కిన యుద్గ్రంథములు ప్రాయ
శః మితమాతృకా సహాయముననే ప్రచురిం
పఁబడుచున్నవి. అనేకములకు రెండవమాతృ
కయు లభించుట యరుదు. లబ్ధమాతృకల
ముద్రణార్థము సవరించునపుడు గ్రంథకర్తృ
కృతములును లేఖకకృతములును అగుదోష
ముల వివేచించుట కష్టమై పరిశోధకులు తమ
యజ్ఞానమువలన నపూర్వ పదప్రయోగముల
దిద్ది తమమనోధర్మజ్ఞానమానముల కనుకూల
ముగాఁ బాఠముల సిద్ధాంతము చేసి ప్రచు
రించుటయుఁ గొన్నియెడలఁ జూచుచున్నాము.
ఏకమాతృకామూలములగు ప్రాచీనగ్రంథ
ముల ముద్రితప్రకారముగా నమ్ముకొని య
పూర్వలక్ష్యలక్షణ విమర్శమునకుఁ బూనుకొ
నుట ప్రశంసనీయము కానేరదు. బహుమా
తృకాలంబనముగల భారత భాగవతాదులు
సహితము లక్ష్యవిశేషములకు గతులు గానక
పరిభ్రమించుచు మాతృకాంతరములఁ బరి
కించి చూడఁగా సుందరము లగుప్రయోగ
ములు సర్వసమ్మతలక్ష్యప్రాయములుగా లభిం

చుచున్నవి. ఇట్టియవస్థ నాలోచింపఁగా సమస్తగ్రంథములకును దాళపత్త్రాదిలిఖితమాతృకలను సంపాదించుట యవశ్య మని తోఁచును. సంస్కృతమునను నీగతి నిశ్చయమే.

శాకుంతలోత్తర రామచరితాదులలోఁ గూడ ముద్రితగ్రంథపాఠములకంటె మిక్కిలి సరసతరమైన పాఠములు తాళపత్త్రమాతృకలలో లభించుచున్నవి లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడియుండు పాఠములు సామాన్యముగా ముద్రితపాఠములకంటె రమణీయములుగా నుండుట పెక్కుసందర్భములలోఁ జూచియున్నారము.

ప్రాచీనగ్రంథములలో నొక్కటి రెండు మాతృకలతో ముద్రింపఁబడియుండు సమస్త గ్రంథములును శుద్ధములు కా వని మాయభిప్రాయము. మేము ముద్రించిన గ్రంథములకును నీదోషము సామాన్యమే. పరిశోధనాభ్యాసపాటవమున నీరెంటికైన దోషబాహుళ్యమునఁ దారతమ్యము తోఁచవచ్చును. ఎఱ్ఱప్రెగ్గడ నృసింహపురాణము, కేయూరబాహుచరిత్రము, ఉత్తరహరివంశము, దశకుమారచరిత్రము, క్రీడాభిరామము, భీమఖండము, మొదలగునవి యబద్ధపాఠపూరితము లనుటకు సందియము లేదు.

ఇట్టియసందర్భముల నమ్ముకొని దేశచరిత్రకారులు యథేచ్ఛముగా గంధర్వనగరములఁ గట్టి త్రైశంకవసామ్రాజ్యముల స్థాపించుచుఁ గల్పనావికల్పడోలికలఁ బాఠకుల నూఁచుచుఁ బరివాదవాదమదిరాపరవశులై యద్భుతములు ప్రకటించుట విశ్రాంతిచింతావినోదులకు క్షణకాలహాస్యాదర్శము కలిగించుచున్నది.

కేతనదశకుమారచరిత్రము తిక్కనసోమయాజికీర్తిసౌరభమునకు నిదాన మనుటయట్లుండఁగా భాషలో స్వచ్ఛంద సౌకుమార్యమనోహరము లగుకావ్యములలో మిన్న యని నిశ్శంకముగాఁ జెప్పవచ్చును. అదియుఁ దంజాపురములో నుండునేకమాతృక ననుసరించియే ప్రచురింపఁబడియె. దానిలో నైదవయాశ్వాసమునుండియుఁ గడవఱకుఁ దన్ముద్రాపకులకు యథాశక్తి మేము మాతృకను ముద్రణమునకు నవరించి యిచ్చియుంటిమి. ప్రథమాశ్వాసమున, ముఖ్యముగా దేశచరిత్రకారుల కుపయోగించు ప్రదేశముల ననేకపాఠములు ముద్రాపకుల చిత్తభ్రంశమువలనఁ బ్రమాదపతితములై తిక్కనాదులచరిత్రసరణిలోఁ గంటకములుగాఁ దగులుచున్నవి. కొన్నిటి నీక్రింద నుదాహరించెదము.

నెల్లూరిమనుమసిద్ధితండ్రి యగుతిక్కనృపాలునివర్ణించు పద్యము—

సీ. బలిమిచేఁ బృథ్వీశవసుధేశుతల ద్రుంచె
గటకసామంతుఁగర్వ మడఁచె
గాళవవిభు నహంకారంబు మాన్పించెఁ
జాండ్యునిచేతఁ గప్పంబు గొనియె
ద్రవిడమండలికు లందఱఁ దక్కఁ గెలిచి చోడని నిజరాజ్యపీఠమున నిలిపె
నెలుకుమన్నీల నిల్వోల పుట్టఁగా నేసె
వైరివీరుల నామలూరు నొచ్చె
యోగహరిరాయ పెండెరుడుభయకటకవీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవని భారధౌరేయమహాత్మవిజిత
దిక్కుడీంద్రుండు ఘనచోళతిక్కనృపతి.

అనుపద్యము ముద్రాపకులమాతృకలో:

సీ. బలిమిచేఁ బృథ్వీశుతలఁద్రుంచి సేవణ
  కటకసామంతులగర్వ మడఁచి
ద్రవిడమండలికులందఱఁ దక్కనేలెఁ జో
  డని నిజరాజ్యపీఠమున నిలిపెఁ
గర్ణాటవిభునహంకారంబు మాన్పించెఁ
  బాండ్యునిచేతఁ గప్పంబు గొనియె
సేఱువమన్నీల నెఱపుట్టఁగా నేలె
  వైరివీరుల నామములార నోర్చె
త్రిభువనరాయపెండారుఁ డుభయకటక
వీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డనని భారధారేయమహాత్మ్యవిజిత
దిక్కరీంద్రుండు చోళల తిక్కనృపతి"

అని యున్నది. ఇందుఁ బాదములపరివృత్తి యటుండఁగాఁ బాఠములమార్పు చాల శోచ్యముగా నున్నది. ఇట్లే "కవులచరిత్రము"లోఁ బెక్కుచోట్ల నిట్లు మార్పఁబడినపాఠములతో నబద్ధసోపానపరంపరా పరీతములైన మా యీ సిద్ధాంతసరోవరములు త్వరలోఁ బ్రాచిపట్టి పాఠకులచిత్తాదర్శములకు మకరతవిభ్రాంతితరళత్వ మాపాదించుచున్నవి. పై పద్యమున సేవణకటక మనఁగా దేవగిరి. సేవణరాజుల మఱచి కటకశబ్దమునకు రాజధాని యను నర్థము స్ఫురింపక కటకపురిమీఁదఁ జిత్తము పాఱఁగాఁ దటుక్కున "వసుధేశు" శబ్దమును నడుమఁ దోపి కేతన సాధారణముగాఁ బ్రయోగి పని "వబ"లయతిని గవితలకుఁ గట్టిన ముద్రాపకులచాతుర్యము శ్లాఘ్యమైనదే. కటకశబ్దము నిట్లే పొరపడినపాశ్చాత్యపండితుఁడు రుద్రదేవునియనుమకొండశాసనములో 1162 క్రీ.శ."ప్రాచీచ్యాంతాకటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీః"అన్నచోట కాకతీయరాజ్యము చాళుక్యకటక మగుకల్యాణపురముసమీపమువఱకు వ్యాపించె ననుటకు మాఱు కటకపురము వఱకు విస్తరిల్లె నని భ్రమపడి లిఖించియుండఁగా మాపంతులవారికి దోష మేమి యని యెవరైన సమర్థింతురేమో! రెండవపాదమునఁ "దక్కనేలె" నను మాటలకు స్పష్టముగా నర్థము గాక "గెలిచి"యని పంతులవారు దిద్దిరి. తక్కనేలుట యనఁగాఁ బరాశ్రయమునకుఁ బోనీక తాన యేలుట యని యర్థము. "కేనము లేకనురక్తయైనభాషాంగనఁ దక్కనేలినమహత్త్వము" అని నన్నెచోడుని ప్రయోగము కలదు. మూఁడవపాదమునఁ గర్ణాటవిభుఁడు పద్యములోఁ జొచ్చె. ఇతఁడు పంతులవారిమనోరాజ్యములో విజృంభించినబుషికల్పనామూఁడు కాఁబోలు! తరువాత "సెఱువ" దొరలు, "ఎఱుకుమన్నీలు"గా నైరి. త్రిభువనరాయపెండారుఁడు యోధహరిరాయపెండరుఁ డయ్యె. ఈ బిరుద మిట్లు మార్చి యెదురఁబఱిచినయెడలఁ దిక్కనృపాలుఁడు విని యేమనునో! చోళ లనఁగాఁ జోళరాజులు. చోడఁ డనియే యేకవచనము. ఘనచోళ యని దిద్దుట తచ్ఛబ్దప్రయోగరహస్యమునకు స్వరూపనాశము కదా!

23 వ పద్యమునఁ గేతన తనవాసస్థానము వర్ణించుచోట, "వేఁగి విషయమున వెంటిరాల నుపేర," అనుటకు "వెణ్ణిరాల ను" నొకక్రొత్తగ్రామము సృష్టింపఁబడియె.

53 పద్యమున:— "వనజానన యన్యము కుఁ బ్రవర్ధితకీర్తుల్", అనియుండఁగా "యచ్చమకు" అని ముద్రింపఁబడియె.

58-పద్యమున, "సరసిజముఖకూచమ
కుర్ణా" అని యుండవలయు. "నూచమ"
యని దిద్దుట దోషము.

60-పద్యమున:—

"వనితాజనులచూపు లనుతూపులకుఁ
దన ప్రన్ననిమేను లెప్పంబు గాఁగ" అని మా
తృకలో నుండఁగా "లేపంబు" అని ముద్రింపఁ
బడెను.

75 పద్యమునకుఁ దరువాత, "ఆతనియ
నుజుండు" అనువచనభాగము తేలిపోయెను.

79-పద్యమున:-

"ఉరవడి నుగ్రసేవణపయోనిధి" యని
యుండఁగా సేవణశబ్దమున కర్థముగాక పంతు
లుగారు దాని "శాత్రవ" యని దిద్దిరి.

అందే— "భాచని నన్ననగంధవార
ణుర్ణా", అని పద్యము ముగియఁగా "సద్భట
గంధవారణుర్ణా" అని సవరింపఁబడుట వికా
రము. 'నన్ననగంధవారణుఁ' డనుబిరుదము
పెక్కండ్రు ప్రభువులకుఁ గలదు.

79 పద్యమునకు వెంబడిగా

క. "ఇమ్మడిఖచరాధీశ్వరుఁ
డిమ్మడిదిననాథతనయుఁ డిమ్మడిగుప్తుం (?)
డిమ్మడిబలీంద్రుఁ డనఁగాఁ
బెమ్మఁడు వితరణగుణమునఁ బెంపు వహించెన్"

అన్నపద్యము పంతులవారికి దృష్టిగోచ
రము గాక పాఠకులు చదువుభాగ్యముఁ బొంద
దయ్యె.

96 పద్యమునకుఁ బిదప మధ్యంతము
లలో:

క. భాస్వద్గుణబలరణజిత
భాస్వత్తనయునకు వినయపరునకుఁ గరుణా
ర్ద్రిస్వాంతునకు ననూనత
పస్స్వాధ్యాయాది సుకృతపరిపాకునకున్.

అన్న పద్యమును బంతులవారు ముద్రణములో
వదలిపెట్టిరి. ఇందుఁ దిక్కనకు విశేషణరూప
మగు "తపస్స్వాధ్యాయాది సుకృతపరిపాకము"
ముద్రాపకకర్మమునకుఁ బ్రతియోగి యగు
నేమో!

(సశేషము)

---

# చైత్రలక్ష్మి

శ్రీ శేషాద్రిరమణకవులు

పసరుబట్టనిలేఁత పల్లవంబులమేసి కూయుచున్నవిగాఁడు కోకిలములు
కసవుపూవుల తేనెకై పుచేఁ బాడుచు మలయుచున్నవి మధుమక్షికములు
తలిరుపళ్లెరమునఁ జెలితోడ ఫలరసంబులఁ గ్రోలుచున్నది చిలుకగుంపు
పచ్చికబయలుపైఁ బద్మరాగంబులఁ జిత్రించుచుండె రాజీవహితుఁడు
విచ్చివిచ్చని తమ్మిపై విందొనర్పఁ, దేఁటిజవరాలు ప్రియునకై తిరుగుచుండె
సృష్టియంతయు వెలయించె జీవకళల, సర్వమిది నీప్రభావంబె చైత్రలక్ష్మి.

# కవి-కవిత్వము

## II

భోగరాజు నారాయణమూర్తి గారు

కవితయందుఁ గవిహృదయ మెట్లు ప్రతిబింబించునో మనము కొంత చర్చించితిమి కాని యట్టిహృదయ ప్రతిబింబము మాత్రమే కవిత్వమని చెప్పుటకు వీలు లేదు. ఒకానొక వస్తు విశేషమునుగాని యవస్థా విశేషమును గాని (situation) వర్ణించునప్పుడు పైని వివరించినట్లు కవి యొకప్పుడు తనమనస్తత్వమును భావనాశక్తిచేఁ బ్రతిబింబింపఁ జేయవచ్చును. ఒకప్పుడు స్వభావము చెడకుండ వర్ణ్యమును దనరచనా చాతుర్యమునఁ జిత్రకారునివలెఁ జిత్రించి మనకన్నులకు వ్రేలాడఁగట్టవచ్చును.

కల్పనాశక్తి

ఒకప్పుడు తనకల్పనాశక్తి ప్రకటింపవచ్చును. కవి తనకవిత్వపటుత్వ మిన్నివిధములుగాఁ జూపుట కవకాశమున్నది. వీనిలోఁ గల్పనాశక్తిని మాత్రము కవి రసవిశిష్టములైన భాగములయం దుపయోగింపఁడు. రసపోషణమునకు భావనాశక్తివలెఁ గల్పనాశక్తి తోడు పడలేదు. అందుచే నయ్యది కవి కావ్యమునఁదుఁ బ్రాయికముగా రసానంతరమునందే కాని రసాంతరమునందుఁ గానరాదు. కావ్యరసార్ణవమగ్నుఁడై కవి పాత్రలయం దైక్యము నొంది తన్నుఁ దా మఱచిపోవును. కావ్యసృష్టియందలి సుఖదుఃఖాద్యవస్థలన్నియు ననుభవమునకుఁ దెచ్చుకొని తాను నవ్వి నవ్వించుచుండును. ఏడ్చి యేడ్పించుచుండును.

ఆంధ్రకవితాపితామహుఁడు, భావనాశక్తి ప్రపరుఁడు శుద్ధశ్రోత్రియుఁడు వరూధినిమహాప్రౌఢ. పెద్దన యియ్యిద్దర నొక్కమెడఁ జేర్చెను. ఇది కేవలశృంగారరసప్రకరణము గాదు. భక్తిశృంగారములను బోతనవలె శాంతశృంగారములను బెద్దన కడు నేర్పుతో జోడించెను. మిహికాహార్యప్రాంతమున నభోవాహినీలహరీ శీతల గంధవాహ పరిఖేలన్ మంజరీసౌరభగ్రహణోందిందిరతుందిలంబగు నొక్క కాంతారాంతరమునందుఁ బువ్వుఁదీవెలును ద్రాక్షతీవెలును నల్లుకొనిన నెలరాళ్లపందిళ్లు గల గరుడపచ్చలసుందరమందిరము ముందరి తీయమామిడిగున్న క్రింద నెప్పతిన్నెపైఁ గూర్చుండి యింపు దళుకొత్త వీణవాయింపుచుండిన వరూధిని, మకరాంక శశాంక మనోజ్ఞమూర్తియు నలేఖ్యతనూ విలాసుండు నగు ప్రవరునిం జూచినది. చూచి పూచినసంపెంగపొలుపు మధుకరాంగనలకుం బలె, వానిచక్కఁదనం బన్యకామినులకు భోగ్యబాహ్యంబని మెఱుంగక యాతనిం గామించినది. కామించి యింతలు కన్నులుంపఁ దెరువెవ్వారి వేఁడెద వనియు, కైతవకుసుమశరాసన యని సంబోధించియు, తా నేకాంతమునం దున్న జవరాలనియు, లోనికి రమ్మనియు, నాతిథ్యము గొమ్మనియు, ననేకవిధముల నర్మ

గర్భముగాఁ బలుకుచుఁ దనమనోవికారమును వానియెడ వెల్లడించినది.

ఇంక, ప్రవరుఁడో వేలిమియు సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కుటయుఁ, దనకుభుక్తికి వేళ యతిక్రమించుటయు,వృద్ధులైనజననీజనకు లాకట సోలుచుఁ దనరాకకై యెదురు చూచుచుండుటయుఁదలంచుకొనుచుఁ,దానిలు సేరకున్న సమస్తధర్మంబులుఁ దూలు నను చింతతోఁ దద్గంధర్వాంగన యనన్యసామాన్యలావణ్యాతిశయమునకుఁ గాని, తదీయశృంగారచేష్టలకుఁ గాని, నర్మగర్భముగాఁ బలికిన పలుకులకుఁ గాని లేశము కలంగఁ డయ్యె.

పాత్రైక్యత

ఈ ప్రకరణమునందు నాయకీనాయకుల వాక్యోపవాక్యములయందు నత్యుక్తులు లేవు. ఆకాశమునంటుకల్పనలు లేవు. ఇందలికవితాశక్తియంతయు రసోత్కర్షకు ముఖ్యోపకరణమగుభావనాశక్తియందే మిళితమై యున్నది. ఆభావనాశక్తి క్రమక్రమముగాఁ బరిణామావస్థకు వచ్చినంత నే కవి నాయకీనాయకులయందు సంపూర్ణతన్మయత్వము నొందుచున్నాఁడు. కవి తానేవరూథినియగుటచే సముచితవాచాభినయాంగాభినయాదులతోడను, నర్మగర్భోక్తులతోడను, నిష్ఠురోక్తులతోడను, మదిగరఁగించుననునయాలాపములతోడను, ప్రవరుని యెడమోహోత్కర్షావిష్కరణము నంత స్వభావసిద్ధముగాఁ గావింపఁ గలిగెను! మఱియుఁ గవి తానే ప్రవరుండగుటచే, శుద్ధశ్రోత్రియత్వము ఏకపత్నీవ్రతపరత్వము, ఇంద్రియజటుత్వము,నిత్యకర్మానుష్ఠానాసక్తి, సురార్చనావిప్రసపర్యానురక్తి, మాతాపితృభక్తి,నిష్కళంక వైరాగ్యదీక్ష, మొదలగు నుత్తమలక్షణముల నౌచిత్యము చెడకుండ నింతగాఁ బ్రకటింపఁ గలిగెను!

రసము పరిణతి చెందువఱకును గవి యిట్లు పాత్రలయందే తన్మయత్వము చెందియుండును. రసమునకుఁ బరిణామావస్థ తటస్థించిన పిమ్మట నారసము మఱి పోషింపఁబడదు. పోషించుటకుఁ గవియును బ్రయత్నింపఁడు.

ప్రవరసాంగత్యమునకై వరూథిని తన చాకచక్యమంతయుఁ బ్రకటించినది. కాని కార్యము లేకపోయినది. అందుచే నింకఁ గేవలశృంగారచేష్టలును వర్ణనలును గొఱగావని నిశ్చయించినది. నిశ్చయించి కుయుక్తులలోనికి దిగినది. యజ్ఞకోటులం బావనులౌటకు ఫలము మాకవుఁగిళ్ల సుఖించుటేకదా యని బోధించినది. వెన్నవలెం గరంగునలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యము లెన్నిభవంబులం గలుగునని హెచ్చరించినది. సశరీరస్వర్గసుఖ మనుభవింపుమని ప్రోత్సహించినది. "ఆనందో బ్రహ్మ" యనుశ్రుతివాక్యమును బ్రమాణము చూపినది.

ఇంకఁ బ్రవరుండు నీవన్నయర్థం బెల్లఁ గాముకునకు మాత్రమే నిజముగాని యకాముఁ డిది గణింపఁడని తృణీకరించెను. ఇంద్రియవశగతిచే బ్రాహ్మణుఁడు బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై చెడునని దృఢీకరించెను. మోక్షలక్ష్మీపథ్యాగమసూత్రపంక్తికి మీసాంప్రదాయార్థము లిట్టివియేనా యని "యానం

దో బ్రహ్మ"యనుసూత్రమున కామె యర్థము నుఖండించెను. ఇట్టితుచ్ఛసుఖములు మీసాలపైఁ దేనియలగుటచే నరణులు దర్భలు నగ్నులును నాకుఁ బ్రియంబు లగున ట్లన్యం బులు గావని వ్యక్తపరచెను.

రసపరిణామము

వరూధిని చేయఁ దగిన దింకే మున్నది.? ప్రవరుఁడు నిరాకరించుకొలఁది నామె మోహ ముద్రేకింపసాగెను. ఆమె మోహ ముద్రేకించుకొలఁది వానివైరాగ్యము బలపడఁ జొచ్చెను. శృంగార శాంతరసముల కిప్పుడు పరిణామావస్థ తటస్థించినది. రతిసంరంభ మతిక్రమించి నంతనే వరూధిని బలాత్కృతిని వానిపైఁ బడి, ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసించినది. శృంగారరసమున కింతకంటె మఱిపరిణతి యుండదు. ఆబ్రాహ్మణుండును హా!శ్రీహరీ! యంచు నోరమోమిడి, తదీయాంసద్వయం బంటి పొమ్మంచుఁ ద్రోసెను. శాంతరసమునకుఁగూడ నింతకంటెఁ బరిణతి యుండదు. ఇట్లు లీరెండురసములును బరిపక్వదశకు వచ్చినంతనే కవి పాత్రలనుండి వేరగుచున్నాడు. వేరయి, 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అని నవ్వుకొనుచున్నాఁడు !!

పిమ్మటఁ బ్రవరుండు సంపూర్ణవిజయముతో నగ్నిభగవానుం బ్రసన్నుం గావించుకొని తత్సహాయమున నిలు సేరఁగలిగెను. ఆదైవప్రసన్నతయే వానిశాంతరససర్వస్వమునకు ఫలసిద్ధి! కవిభావవీథియం దిపు డొక్క వరూధినిమాత్రమే యున్నది. మతిచెడి తప్తర్వతప్రాంతకాంతారములలోఁ బ్రవరాన్వేషణార్థ మున్మాదినివలెఁ దిరుగుచున్నది. కవి కామెయం దిప్పు డత్యంతకరుణారసము జనించినది. వరూధినీహృదయవేదన కవి తనయను భవమునకుఁ దెచ్చుకొనుటచేతనే వరూధినీ విలాపమునందుఁ గరుణారసవృష్టి యుట్టిపడుచున్నది. ప్రవరునికై యతికరుణముగా విలపించి విలపించి, తుద కక్కాంతామణి కుసుమితలతాంతనిశాంతశశికాంత వేదికాంతరమున మేను వాల్చినది. ఇంతతోఁ గరుణారసము ముగించినది.

కల్పనాశిల్పము

ఇంకఁ గవి భావనాప్రపంచమునం దెవ్వరును లేరు. శాంతశృంగారములయందుఁ గొంతసేపును గరుణారసమునందుఁ గొంతసేపును మునిఁగిమునిఁగి కవి యిప్పుడు రసార్ణవము నుండి పారమును జేరుకొనెను. వాని కిప్పుడు సంపూర్ణవిశ్రాంతి కలిగినది. అందుచేఁ దన యనల్పకల్పనా శిల్పమును (Meta-physical Poetry) బ్రదర్శించుటకుఁ బ్రారంభించెను. తత్ప్రదర్శనమునకు నాందిపద్య మిది.

చ. తరుణి ననన్యకాంత నతి
దారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవు
బారికి నగ్గముచేసి, క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డ
హంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించె నో యన న
భోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

కరుణారసవృష్టి యిప్పుడే యాఁగినందున నవ్వానచినుకు లిందులోఁ గొంచెము. తోఁణికి నవిగాని యీ తరువాతి పద్యముల కట్టి సంపర్కమే యుండదు.

క. తరణి యిదె క్రుంకుచున్నా
డరు దెమ్మని చంద్రుఁ బిల్వ నరిగెడురజనీ
తరుణీమణి దూతిక లన
నరిగెం దూర్పునకు నీడ లతిదీర్ఘము లై.

క. అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁ డౌట విని ముఖాలంబితముఁ
కుంతలములు దీర్పఁగఁ గొను
దంతపు దువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్.

చ. మరున ప్రసంగఁ గాలము త
మశ్చటకాటుక గా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక
శోణితసిక్తసితోడు భక్తమున్
హరిహయదిఙ్నభస్థలము
నం బలి చల్లి పటాంకమున్ వసూ
త్కరభరితంబునై వెలుగఁ
గాంచి సుధానిధి నెత్తె నత్తతిన్.

ఇట్టి కల్పనాశిల్పమునకును గథాకథనమునకును బరస్పర సంబంధముండవలయునను నియమము లేదు. ఒకప్పు డీ రెండును గలయవచ్చును. కలయకపోవచ్చును, ఈకల్పనాశిల్పమునందుఁ గవి, తననిరంకుశత్వమును వెల్లడించుచుండును. నూతన సృష్టికౌశలమును బ్రకాశింపఁ జేయుచుండును. ధూర్జటి యొక తామరకొలను నెంతచిత్రముగ వర్ణించెనో చిత్తగింపుఁడు.

చ. దళములలో రథాంగనిన
దంబు పరాగము రాజహంససం
కులము శిలీముఖభ్రమణ
ఘోషము నవ్యకబంధము ల్సము
జ్జ్వలవరపుండరీకములుఁ
జాలఁగఁ గల్గి మహాహవక్షితిన్
బోలుపు వహించు నక్కొలని
పొంతను నొయ్యనఁ జేరి యచ్చటన్

కవి నిరంకుశుఁడు

సరోవరమునకును సమరరంగమునకును జతుర్దశభువనములయం దెచ్చటను సామ్యము లేదు. ఏవిధమైనసంబంధముగాని, యాకృతియం దైనను బోలికగాని, సృష్టియందుఁ గానరాదు. అట్టియెడ సరోవరాకారమును సంగరరంగాకారముగా సమన్వయించుట యొక వింతసృష్టికదా? ఈసృష్టి కావ్యప్రపంచమునందుఁ గవియే గావింపఁగలఁడు. తదితరులకీయధికారము లేదు. అట్టినిర్మాణశక్తియుఁ గలుగదు. ఒకప్పు డెవఁడైన నక్కొలనిం గని యిది యుద్ధరంగమని పలికినయెడ, విన్నవారు వానికి మతిభ్రాంతి కలిగినదని యున్మాదవైద్యశాలకుఁ బంపివేసెదరు. సకలవిషయములయందుఁ గవియొకఁడే నిరంకుశుఁడు. ఆతనిదృష్టి గగనమధ్యవ్యాప్తమై నాట్యమాడుచుండును.

'The poet's eye in a fine frenzy rolling doth glance from earth to heaven and heaven to earth' (Shakspeare)

కవి బ్రహ్మ

ఈశ్వరసృష్టియందలి నిర్జీవపదార్థములను దనకవితాప్రపంచమునఁ జేర్చి కవి వానికిఁ బ్రాణప్రతిష్ఠ గావించుచుండు నపరబ్రహ్మ. తత్ప్రపంచమున వాహినీరత్నాకరులు కైరవశీతకరులు - పద్మినీ ప్రభాకరులు - కాముకీ

కాముకులై వింతవింతప్రయోగములు వహించుచుందురు. లోహకారుఁడు కనకద్రావకంబునందు వైచి లోహపదార్థములకు మాత్రమే మెఱుఁగు పెట్టఁగలఁడు. కావ్యకారుఁడు కవితారూపకమగు నపూర్వకనకద్రావకమున లోహలోహేతర సకలపదార్థములకును వన్నె పెట్టుచుండును. మఱియు లోహకారుని మెఱుఁగు కృత్రిమము, నస్థిరము; కావ్యకారుని మెఱుఁగకలంకము, నాచంద్రార్కము!

కవితాప్రతిబింబితసామాన్య విషయములు.

కేవలదృష్టికి సామాన్యముగాఁ దోఁచు విషయములును వస్తువులును గవితాదర్పణమునం దెంతయు మనోహరములై ఘనతరములై తోఁచుచుండును. నిగమశర్మకు వాని యక్క గావించిన ప్రీతిపూర్వకోపచారములు రామకృష్ణునికవితయం దెంత మనోజ్ఞములై యున్నవో చూడుఁడు!

క. ఇంతలు నంతలు నగు తన
సంతానము చంటె వెంట సందడి సేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని
కుంతలబంధనము విడిచి కుశలాశయయై.

గీ. ఎలయుసీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి
యంటుసంటులు పరికించి యంట్లఁ బొడిచె
గోరుముక్కల దిగదువ్వి తూరుపెత్తి
నెఱులు గలిగినవేల నన్నింటిఁ దిగిచె.

క. మెడమన్ను నలిచి యలకలు
ముడిగొని, నిజపాణిపద్మములు గరగరగాఁ
గడిగికొని, తనకు మఱఁదలు
విడె మొసఁగుచుఁ బసిమిపసిఁడి వీవన వీవన్.

వినవలసినవియుఁ గనవలసినవియుఁ గాని యీపనులు కవితాప్రపంచమునఁ గావింపఁబడుటచేత వాని కింతటిమనోజ్ఞత గలిగినది. వీని

కవిత ఛాయాగ్రహణకళ

వలనఁ బాత్రలు మనకంటిమెదుట మెలఁగుచున్నట్టులే మనకుఁ దోఁచుచుండును. ఇది యిట్లుండ హనుమంతుఁడు సముద్రమును దాఁటినప్పుడు మొల్ల తానాప్రాంతముననే యుండి చూచినది కాఁబోలు! తత్సముద్రోల్లంఘన మెంతయు యథార్థస్వరూపమునఁ జిత్రించినది.

చ. మొగము బిగించి, పాదముల
మొత్తముగా నట నూఁది త్రొక్కి నీ
టుగ మొగమెత్తి, భీకరక
ఠోరరవంబున నార్చి, బాహుల
త్యగణిశలీల నూచి వల
యంబుగ వాలము ద్రిప్పి, వ్రేగునన్
సగము సగమ్ము గ్రుంకఁ గపి
నాథుఁడు నింగికి దాఁటె రివ్వునన్.

ఇందలి ఛాయాగ్రహణకళాకౌశల్యము (Photographic art) ప్రశంసింపందగినది. కవిత్వము సకలకళావిజ్ఞానసర్వస్వము గదా? రంగులకు మారుగాఁ బదముల నుపయోగించుచుఁ జిత్రకారునివలె హనుమంతుని మొల్ల యత్యుల్లాసజనకముగఁ జిత్రించినది. కవిత్వమన్న నిట్టులే యుండవలెనని మెకాలే దొరగారి సంకల్పము.

"We mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by means of words what the painter does by means of colours"

ఆంగ్లకవుల భిన్నమతములు

సౌందర్యమును జిత్రించుటయే కవిత్వమని ఎడ్గార్-ఎలన్-పో. అనునొకయమెరికా కవి చెప్పుచున్నాఁడు. It is 'The rhythmic

Creation of beauty' అనఁగా లయతో మేళవించిన శ్రావ్యమగు సంగీతము వినునప్పుడు హృదయమునకుఁ గలుగునానందమువంటి యానందము ఔచిత్యము చెడనిశబ్దములతో సౌందర్యమును జిత్రించుకవిత్వమువలనఁ గలుగవలయునని వానియభిప్రాయము.

జాన్సను

కవిత్వము ఛందోబద్ధమైనరచన యనియు, భావనాశక్తిచే సహేతుక మొనర్చి సత్యమును నానందదాయకముగాఁ జెప్పఁ గళావిశేషమనియు నూతనసృష్టియే తత్ప్రయోజన మనియు, జాన్సను కవి నిర్వచనము.

"Poetry,"says Johnson "is metrical composition' It is 'the art of uniting pleasure with truth by calling imagination to the help of reason' and its 'essence' is 'invention."

కోల్రిడ్జి

కోల్రిడ్జి కవితామతము దీని కెంతయు భిన్నమైనది. సత్యము శాస్త్రోద్దేశమే కాని కవితోద్దేశము కాదనియుఁ గేవలహృదయానందము మాత్రమే కవితా ప్రయోజనమనియు నాతనితలంపు.

"In Coleridge's view, poetry is the anti-thesis of science, having for its immediate object pleasure not truth."

కాని సత్యరహితమైనయానంద మశాశ్వతము. మఱియుఁ గృత్రిమము. గారడివాఁడిసుకయందు మామిడిటెంకలం బాతిపి, గంపలో మాటుపఱచి కొన్ని నిముసములకుఁ జిన్నమామిడిమొక్కలం దోఁపించును. ప్రేక్షకు లయ్యది సత్యరహితమైన కృత్రిమసృష్టియని యెఱింగి వానిహస్తలాఘవమున కానందించెదరు. ఆయానందము తాత్కాలికము.

మనము ప్రత్యక్షముగ నాటి పెంచి ఫలోన్ముఖమునకుఁ దెచ్చిన రసాలములవలనఁ గలుగునానందము యథార్థమైనది. శాశ్వతమైనది. సత్యసమ్మేళనము లేనియానందము సుఖప్రదము కాదని యెఱింగియే 'లేహంటు' తనకవిత్వ నిర్వచనమునందుఁ గవితారచనకు సత్యమును నొకవస్తువుగా (subject) నిర్ణయించెను.

'The utterance of a passion for truth, beauty and power, embodying and illustrating its conceptions by imagination and fancy, and modulating its language on the principle of variety in unity'

సత్యమునందును సౌందర్యమునందును బ్రతిభయందును గల యుత్సాహము కవిత్వమునకు వస్తువట! భావములను భావనాశక్తిచే వ్యక్తపరచుటకుఁ బ్రయత్నించుట కవితామార్గమట! భావసమన్వయమున కనుకూలమైనశైలి (style) సమన్వయము కవితాభాషయట!

కావ్యరచనయం దొకానొకరసము నుత్కర్షించుటకు భావములును, తద్భావములను బ్రకటించుటకుఁ బదగుంఫనమును సాధనము లగుచున్నవి. ఈరసభావశబ్దములు మూఁడును గాఢమైనపరస్పరానుకూల్యమును బొందినప్పుడే వాస్తవమైనకవితాస్వరూప మేర్పడఁ గలదు. అందుచే 'లేహంటు' భావముతో సమానమైనగౌరవము శబ్దమునకు

సైతము నెసంగి, కవితారచన కుచితమైన భాషయును నిర్వహించెను. రసములును భావ

హెజిలెటు

నాశక్తియు నేశబ్దములయందుఁ బ్రకటింపఁబడునో యాశబ్దజాలమే కవిత్వమని చెప్పుచు నీమతమును 'హెజిలెట్' మఱింత దృఢపఱచెను.

'The language of imagination and passions'

మేథ్యూ ఆర్నాల్డు

మనుష్యులు మాటాడుకొనుభాషలోఁ బవిత్రతయు, హృదయరంజకత్వమును గుణములుగాఁ గల భాషయే కవిత్వమని మేథ్యూ ఆర్నాల్డు సంకల్పము.

It is simply the most delightful and perfect form of utterance that, human words can reach.'

* రమణీయార్థ ప్రతిపాదకశబ్ద మెట్లు కావ్యమగునో అట్లే రమణీయార్థప్రతిపాదక రూపము చిత్రమగును. రమణీయార్థప్రతిపాదకత్వము రెండింటికిని సామాన్యమే. అయినను రమణీయార్థముమాత్రము కావ్యమగును. తత్ స్థానమైనశబ్దము కావ్యమున కక్కరలేదని చెప్పుటకు వీలు లేదు. కాఁబట్టనే దండి మొదలైనవారలు శబ్దార్థములు రెండును గావ్యమందురు. దానినే పండితరాయజగన్నాథులు రమణీయార్థ ప్రతిపాదకమైనశబ్దము కావ్య మన్నారు. కావ్యము వలయుననఁ శబ్దముతప్పదు. అట్లే చిత్రము కావలయుననఁ రమణీయార్థ ప్రతిపాదకరూపము తప్పదు. చిత్రమందు రూపసామ్య మక్కరలేదు. రమ్యార్థమే కావలె ననియు జెప్పుట యసంభవమైనకోరిక గోరుట. నాదౌచిత్యమును విడిచి సంగీతానందము లేదు. రూపౌచిత్యమును విడిచి చిత్రవిద్య లేదు. శబ్దౌచిత్యమును విడిచి కావ్యము లేదు.

గీర్వాణలాక్షణికులు

కావ్యలక్షణములనుగూర్చి ప్రసంగించిన సంస్కృతాలంకారికులలో ననేకు లర్థముతోఁ బాటుశబ్దమునుగూడ నిట్లుగ్రహించుచున్నారు.

'అదోషౌ సగుణౌ సాలంకారౌచ శబ్దార్థౌకావ్యమ్'
హేమచంద్రుఁడు.

'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమితి కావ్య సామాన్యలక్షణమ్' ప్రతాపరుద్రీయము.

"సాధుశబ్దార్థసందర్భం గుణాలంకారభూషితమ్,
స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే"
వాగ్భటుఁడు.

'కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయో ర్వర్తతే'—వామనుఁడు.

'సగుణాలంకృతీ కావ్యం పదార్థౌ దోషవర్జితౌ'
సాహిత్యరత్నాకరము.

'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం'
జగన్నాథపండితుఁడు.

అలంకారములు

అర్థముతోఁ బాటు శబ్దమును గ్రహించుటయే కాక యీలాక్షణికులు గావ్యలక్షణములయందు నలంకారమును విధిగాఁ జేర్చుకొనుచు వచ్చిరి. అలంకారములు రసోత్కర్షావిష్కరణమునకు సాధనములనియు, శరీరమునకు నంగదాద్యలంకారములవలెఁ గావ్యమునకు నుపమాద్యలంకారములును శోభాతిశయము నెసఁగూర్చునవి యనియు లాక్షణికులు

* కీ. శే. కొ. లక్ష్మణరావు పంతులు గారు, ఆం. వ. సా. అనుబంధము.

చెప్పుచున్నారు. కావ్యలక్షణములలో నలంకారము ముఖ్యలక్షణముగా లాక్షణికులు విధించుచుండ, ఒకానొక కావ్యమునందు శ్రీకారము మొదలు సంపూర్ణమువఱకును బ్రతిపద్యమునందుఁ గాని ప్రతిశ్లోకమునందుఁ గాని యలంకార ముండితీరవలె ననునిర్బంధము లేక, అనలంకృతమైనచోటఁ గావ్యత్వమునకు హాని కలుగదని 'త దదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి' అను వాక్యమువలనఁ గావ్యప్రకాశకారుని మత మేమో యని స్ఫురించుచున్నది. అలంకారములను గూర్చి మతభేదము లనేకము లున్నవి. నేఁటికవితాతత్త్వజ్ఞులలోఁ గొందఱి యభిప్రాయము లీక్రిందఁ బొందుపఱచుటకంటె నీవిషయమును గూర్చి వేఱొకవిధమైనచర్చ యవసరము లేదు.

*"మొదటినుండి తుదవఱకు మధురాన్నభోజనము చేసినవాని కరుచి యెట్లు కలుగునో యట్లీయలంకారపూర్ణమగు కావ్యమును జదివిన నరుచి కలుగుననుట సాహసము కాదు. మఱియు నలంకారాంకీకరణ మప్రయత్నసాధ్యముగాదు. విశేష ప్రయత్నసాధ్యములగు నియమములతో రచింపఁబడిన కావ్యము హృద్యముగా నుండదు.

'రసాక్షిప్తతయా యస్య
బంధ శ్శక్యక్రియో భవేత్,
అపృథ గ్యత్ననిర్వర్త్య
స్సోఽలంకారో ధ్వనౌ మతః' ధ్వన్యాలోకము.
'కవితా వనితా చైవ
స్వయమే వాగతా వరా,
బలా దాకృష్యమాణా చేత్
సరసా విరసా భవేత్.'

ఉత్తమకావ్యము తోఁటలోనుండుపుష్పమువలె సహజపరిమళము గలది. కాని శిల్పి చేసినకృత్రిమకుసుమమువలె నిర్గంధము గాదు. నవీనకవు లలంకారములకై తక్కువ ప్రయత్నించి యున్నట్లయిన వారిప్రబంధములు హెచ్చుగ సంతోషము నిచ్చునని తలంచెదను అప్రయత్నసంచితాలంకారములు గల తిక్కనాదుల కవిత్వము లెంతబాగుగ నున్నవో నేను జెప్ప నవసరము లేదు."

♦ "నిజముగా నలంకారముల ధర్మము రసోపస్కారణమే యైనచో, వాని నెట్లెంతవఱకు ప్రయోగింపవచ్చునో కూడదో కవియే నియమింపవలయును గాని మనము నియమింపఁజాలము. మఱియుఁ గవికి రసమే యుపాస్య దేవత యగునేని యతఁ డలంకారశాస్త్రము నెంతమఱచిన నంత మేలు. అలంకారములు రసాధీనములుగాని రస మలంకారాధీనము గాదు. కావునఁ గవి కలంకారశాస్త్రపరిచయము యోగికి సంసారవాసనవంటిది.

† "కావ్యరచన ముందు సాగినది: కవి 'యిష్టార్థవ్యవచ్ఛిన్నమైన' పదావళిని గానము చేసెను. ప్రకృతివిలాసానుభవముచేఁ గవికి మహత్తరమైన రసానందభోగము గలిగినది. అందు లీనుఁడై ప్రసన్నహృదయమునందుఁ గందళించిన భావములను బైకిఁ జల్లెను. ఈభావప్రపంచము మానవలోకము నావహించిన

---

* శ్రీ కిడాంబి రామానుజాచార్యులు గారు. ఎం. ఏ.
♦ శ్రీ రాళపల్లి-అనంతకృష్ణశర్మగారు. No. I. Vol. II.P. 15-16.
† గ్రంథాలయసర్వస్వము. I. Vol. No. III. P. 258.

కొలఁది యభిరుచికిఁ బ్రచారము కలిగినది. ఆకర్షింపఁబడినకొలఁది జనులు పరవశులైరి. తరువాత స్థాయి కుదుర్చుకొనిరి. అనంతరము కావ్యప్రపంచము నార్ద్రదృష్టితోఁ బరిశోధింపసాగిరి. మొట్టమొదట తమ్మాకర్షించినది సౌందర్యమని కనిపెట్టిరి. రసోపలబ్ధి తత్ప్రసాదమని తనిసిరి. ఎచ్చటెచ్చటఁ దమకానంద మెక్కుడయినదో అచ్చటచ్చట నెల్ల సొగసు లున్నవని గుర్తించిరి. ఈసొగసులే పిదప నలంకారము లైనవి. అంతేకాని ముందు అలంకారములు సిద్ధము చేసి, అవి ధరించుటకు యుక్తమయిన కావ్యకన్యను సృజింపలేదు. కావ్యము లనలంకృతములైనను ఉత్తమస్థానము నవరోహించుట కాటంకము లేదనుట కీనిదర్శన మొక్కటియే చాలును. కావ్యమునందలంకారము లవశ్యపరిపోష్యములనుట ఉదాత్తవిమర్శనాలక్షణము గాదు. ఏలయన? మమ్మటాదులు తనివితీఱ పొగడి యుదాహరించిన యుత్తమశ్లోకము లన్నియును అనలంకృతములుగానే యున్నవి. ఇంత యేల, ఉదాత్తమగు వ్యంగ్యవైభవము విలసిల్లిన స్థలములయందు నియమప్రయుక్తములగు అలంకారములు నిలచుటకైన నవకాశము గానవచ్చుట లేదు.”

సర్వమత సమన్వయము.

అనేక భాషలయందు వందలకొలఁదిఁ గవులు వందలకొలఁది విధములఁ గవిత్వతత్త్వమును నిర్వచింపుచువచ్చిరి. ఆయా నిర్వచనము లన్నియు నాయాకవులయొక్క రుచివిశేషముల ననుసరించియే కావింపఁబడినవని చెప్పవచ్చును. ప్రకృతిని ప్రేమించుకవి ప్రకృతిసౌందర్యమే కవిత్వమనుచున్నాఁడు. రసము నుపాసించుకవి ‘వాక్యం రసాత్మకం కావ్య’మనుచు అందు వీరశృంగారరసములనుమాత్రమే మన్నించుకవి ‘వీరశృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే’ అనుచున్నాఁడు. ఒక్కకరుణారసమునుమాత్రమే కరుణించుకవి ‘ఏకో రసః కరుణ ఏవ’ అనుచున్నాఁడు. ఈ మతభేదము లన్నియుఁ గవులకే కాని కవిత్వమునకు లేవు. ఏలయన నాయామతముల కనురూపములగు గుణవిశేషము లన్నియుఁ గవిత్వమునం దున్నవి. ఆగుణవిశేషములలోఁ గొన్ని కొన్ని కొందఱకుఁ గొందఱకు స్ఫురించినవి. రుచించినవి. సగుణమని కొందఱచేతను నిర్గుణమని కొందఱచేతను, శైవమని కొందఱచేతను, వైష్ణవమని కొందఱచేతను, పెక్కుమతముల సచ్చిదానందమయమగు పరబ్రహ్మ మారాధింపఁబడుచున్నదికదా? నిశ్చలమహానందస్వరూపమగు కవిత్వము గూడ నట్టిదియే!!



# వేసఁగి

శంకరదీక్షితులు

ఈఁగలకుఁ బగలెల్లను, వేగలేక,
దోమలకు, నల్లులకు, గాలి లేమి, మేను
తెల్లవారెడువఱకును దిండియయ్యె,
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
సంధు లూటలరీతి నిచ్చలును, జెమ్మ
గిల్లుచున్నవి, తనువ్రలు గుల్లబారె,
మేను లిటులయ్యె జలమయమ్మృణ్మయములు
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
కానికైన మారనియసమాన మైన
స్థూలకాయంపుబాధశత్రునకు నైన
వలదు, వలదని, జనులు మ్రొక్కు లిడుచుండ
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
ఉడుకుచే, నున్న లేకున్న నెక్కలె, యని
ఇండ్ల నింటివాండ్రను జూడ కెల్లరకును,
రాత్రులందు సంసార వైరాగ్య మబ్బ,
మండు వేసఁగి తాపంబు మాన్పుమరుణ!
ఉడుకు బాపు నుపాయంబు లున్న నేమి,
తాళఁ జాలక నీపేరు దలఁచి, తలఁచి
తనుకు లాడుచు నున్నాఁడు, ధనికు లిండ్ల
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
పొట్టకూటికి కూలికై పోయి, యెండ
మలమలని మాడుచున్న పేదలను జూడు!
విధివలెనె, నీకు వారిపై వెగటదేల?
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
పేదలైనను, ధనికులు, పెద్దవారు,
బుడుత లబలలు, సబలలుఁ భోగి జోగు
లెట్టివారైన, నేమి, నీదృష్టి కొకటె!
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
మెడలు నిక్కించి, పై నేగు మేఘములకు
జీవులెల్ల, నీటికి సమస్కృతు లొనర్ప
దుష్టుఁడవె కాకపోయిన దోడుపడవె?
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ?
వర్ష మీయనిమబ్బులవైపు, తృష్ణఁ
జూచు ప్రజలను మోసగించుటయె కాదె?
శేషజలలేశమును, నీవు జేదుకొనుట;
మండు వేసవి తాపంబుమాన్పు మరుణ!
దుష్టుఁడ వటంచు నిన్నంత దూరమందు,
ప్రకృతి యుంచిన నేమి, స్వభావదౌష్ట్య
మింతఁగాఁ జూపు నిన్ను గర్హింప రెవరు?
మండు వేఁసగి తాపంబు మాన్పు మరుణ?
స్వేచ్ఛ విహరించు గాడుపే, సిగ్గు లేక,
దాసుఁడై నీకుఁ, దోడ్పడఁ దలఁచు నపుడు
ప్రజల కిం కేల సుఖము, జీవములు నిలుచు,
మండు వేసఁగి తాపంబు మాన్పు మరుణ!
విసుఁగు లేక త్రాగెడునీరు వెడలఁగ్రక్కు
నట్టిమముఁ జూచి యైన నీపొట్టనిండఁ
బీల్చి యున్ననీటిని దిగవిడిచి వేగ,
మండు వేసఁగితాపంబు మాన్పు మరుణ!
నోరెఱుంగనిపశువు లూరూర నీరుఁ
దిండియును లేక, అల్లాడుచుండ, జీవ
వధక! నీవు చేరితివి సత్పథమునందు
మండు వేసఁగితాపంబు మాన్పు మరుణ!

# వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము

## రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారు

(గత సంచిక శేషము)

**18.** కథలు ప్రతిదేశమందున్నూ ఆబాలగోపాలం అందరికీ ప్రియమైన సారస్వతముగా ఉన్నవి. పాటల వలెనే ఇవిన్ని జనులు నిరక్షరులై ఉన్న కాలమందే పుట్టినవి. వ్రాతనేర్చినతర్వాత జనులు ఈకథలు వ్రాసుకొని, తాము చదువుకొంటూ, ఇతరులకు చదివి వినిపించే వారు. సర్వజనసామాన్యముగా ఉన్న భాషలోనే వ్రాతయందుకూడా ఈకథలు కనబడుతున్నవి. మనదేశమందు కూడా ఇట్లు రచించినకథలపుస్తకాల వ్రాతప్రతులు అనేకమున్నవి. ఈకథలు అచ్చువేయించేవారు వ్రాతప్రతులలో ఉన్నట్లే గ్రంథ ముంచవలెను; లేదా, పూర్వకాలపుభాష దుర్బోధముగా ఉంటే తమకాలపు భాషలో ఉన్నట్లు సవరించి సుబోధముగా చేయవలెను; గాని, లోకులకు అపరిచితమయిన భాషలోనికి మార్చడము యుక్తమా? ఇట్టి దురాచారము మరేదేశమందున్న లేదు. గ్రాంథికభాషలోనే పూర్వులుకూడా కథలు రచించేవారని తోచునట్లుగా ఇప్పటి అచ్చుపుస్తకాలు దుష్టపరిష్కర్తల కూటకరణమువల్ల మారురూపము పొందినవి. వాడుకభాషలోని కథలు పిల్లలస్వంతసారస్వతము; పామరులస్వత్వము, సర్వజనసామాన్యసంపత్తి, వాడుకలోలేని భాషలోనికి వీటిని మార్చడము మహాపాతకము. ఇట్టి పాపకృత్యము పూర్వపండితులు ఎన్నడూ తలపెట్టలేదు. అచ్చుయంత్రములో మొట్టమొదట అచ్చుపడ్డ తెలుగుపుస్తకములు చూచినవారికి నిజము తెలుస్తుంది. ద్వాత్రింశత్సాలభంజికకథలు 1819 వ సం.న, పంచతంత్రకథలు 1834 వ సం.న, చెన్నపట్టణపాఠశాలలో అప్పుడు తెలుగుపండితుడుగా ఉండిన రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు వ్యావహారిక భాషలో రచించి అచ్చువేయించినారు. ఆయన తెలుగు వ్యాకరణము, శేషయ్యగారి తెలుగువ్యాకరణమువంటి గ్రంథములుకూడా అట్టిభాషలోనే రచితమై ఉన్నందున ఆకాలమందు అట్టిరచన సత్సంప్రదాయానుసారమయినదని ఊహించవలెను. చిత్రకథలు, నీతికథలు (1856), నారాయణసామిగారి తెలుగుకథలు (1839), పరమానందయకథలు (1861) మొదలయినవి అట్లే వాడుకభాషలోనే అచ్చుపడ్డవి. అంతకు పూర్వముకూడా ఇట్లు కథలు రచించుట శిష్టాచారముగా ఉండేదా అని విచారించగా, ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమందు వ్యావహారికభాషలో రచితమయినకథలు తాటాకుపుస్తకాలలో చాలా కనబడ్డవి. ఉదా: చిలుకచెప్పినకథలు, హంసవింశతి, ద్వాత్రింశత్సాలభంజికలకథలు, పంచతంత్రకథలు, తెనాలిరాముడికథలు మొదలయినవే కాక, రామాయణము, భాగవతము, భారతము మొదలయినపురాణేతిహాసములు కూడా ఇట్టిభాషనే వచనములూ కథలుగా రచితమయినవి ఉన్నవి. "రామాయణార్థంబు అందరికీ తెలియడానికి వచనరూపంబుగా మార్కండేయమహాముని పాండునందనులకు చెప్పినప్రకారం సింగరాజు దత్తాత్రేయులు చేసుకొన్న పుణ్యకథ సంపూర్ణం" అని గ్రంథకర్త గ్రంథాంతమందు ఏ ఉద్దేశముతో ఇట్లు రచించినాడో స్పష్టముగా తెలియజేసినాడు. ఇట్లు రచించిన రాజులచరిత్రలు భక్తులచరిత్రలు కూడాకలవు. సాహిత్యపరిషత్తువారివద్దనున్న రాయవాచకము, ప్రతాపచరిత్రము, కర్ణాటకరాజ్య వృత్తాంతము వ్రాతప్రతులలో ఉన్నట్టే అచ్చుపడ్డవి. గవర్నమెంటువారి లిఖితపుస్తకభాండాగారమందు తంజావూరిరాజుల చరిత్ర, సింహాళవిజయము, భాగవతచరిత్ర ఉన్నవి; మొదటిది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన పీఠికతో అచ్చువేయించినారు. తెలుగుదేశముచరిత్ర విశదపర్చగల వృత్తాంతములు, అపరిమితముగా మెకంజీ,

టెయిలర్, బ్రౌన్ మొదలయినవారు సంపాదించినవి కుప్పలుకుప్పలుగా గవర్నమెంటువారి పుస్తకభాండాగారమందు "లోకల్ రికార్డ్సు" అనే పేరితో ఉన్నవి. ఆంధ్రపత్రిక 149 వ సంచికలో 25-1-24 వ తేదీని "ఓరియంటల్ లైబ్రరీ" అనేశీర్షికతో క. మార్కండేయశర్మగారు ప్రకటించినవ్యాసము చూస్తే, ఇవి ఎంతవిలువయినవో తెలుస్తుంది.

19. వచనరచనాసంప్రదాయము పూర్వమిట్టుండేవని గ్రామ్యగ్రాంథికవాదము విమర్శించి తీర్పుచెప్పిన పరిషత్పండితులకు గాని యూనివర్సిటీ పండితులకుగాని శాసననిర్మాణసభలోని తెలుగుసభికులకుగాని విద్యాశాఖాధ్యక్షులకుగాని 1914 సం.రమునకు పూర్వము తెలియలేదు. ఇట్టివచనగ్రంథములు వందలకొలదిగా వ్రాతప్రతులలో ఉన్నవని నేనైనా మొదట ఎరుగను; లోకములో నేటికిన్నీ ఈసంగతి తెలిసినవారరుదు. అయితే, ఇట్టివచనగ్రంథములతోపాటు, పాండ్యచోళమండలములలో ఆంధ్రరాజులప్రభుత్వము సాగుచుండినప్పుడు "గ్రాంథికాంధ్రము"న వచనముగా రచించిన జైమినిభారతము, శ్రీరంగమాహాత్మ్యము, భారతము మొదలయినకొన్నిగ్రంథములకు వ్రాతప్రతులు సాహిత్యపరిషత్తువారికి దొరికినవి అందులో జైమినిభారతము మాత్రము పరిషత్తువారే, భాషలో కూడనిమార్పులు కొన్ని చేసి, అచ్చువేయించినారు. ఈప్రౌఢవచనములలోకూడా "వాటిని, "వాటికి'', ''రెండోఅధ్యాయము'', ఉండే'', ''చేస్తివి'', 'కూతురిని' 'పిలిచినా' 'దాంకా', 'రాజుకు', 'ఇరువై' మొదలయిన వాడుకమాటలు అనేకముగాఉన్నవి. ఇట్టివి దిద్దడము లోకాన్నిమోసపుచ్చడము కాదా? ఇవి రచించినవారు ప్రాచీనాంధ్రభాష శ్రద్ధగా అభ్యసించి, ఆభాషలో తమకుగల రచనాసామర్థ్యము ప్రకటించి పండితులమెప్పు పొందగోరినవారు. వాడుకభాషలో తాము రచించిన వచనగ్రంథములవలె ఇవి అఖిలలోకోపకారకమైనవి కావని వారెరుగుదురు.

20. లోకులందరికీ ఉపయోగించేటందుకు రచించినపుస్తకము లన్నీ వాడుకభాషలోనే ఉన్నవని రుజువుచేయుటకు చాలినంతసాక్ష్యము లిఖితపుస్తకభాండాగారములందే ఉన్నదిగదా! ఇంతవరకు, శాసనములు, పాటలు, యక్షగానములు, నాటకములు, కథలు, పురాణేతిహాసములు, చరిత్రలు వ్యావహారికభాషలో మనపూర్వులు రచించినవే అనేకమున్నవని నిస్సంశయముగా రుజువయినది గదా! ఇకను, శాస్త్రములు, కళలు అభ్యసించేతెలుగువిద్యార్థులకు గురువులు ఏట్టిభాషలో గ్రంథములు రచించేవారో తెలియజేస్తాను. అన్నివిద్యలలోనూ "అధ్యాత్మవిద్యావిద్యానాం వాదఃప్రవదతామహమ్"అని శ్రీకృష్ణభగవానులు చెప్పినట్టు, అధ్యాత్మవిద్య శ్రేష్ఠమయినది గదా. ఈవిద్యను తెలుగువారికి వాడుకమాటలతో బోధిస్తూ పండితులు, యతులు మొదలయినజ్ఞానసంపన్నులు రచించిన వచనగ్రంథములు వందలున్నవి. ఉదా: పరిషత్తువారివద్ద నున్నవి కొన్నిటిని పేర్కొంటాను. మోక్షశాస్త్రము, భగవద్గీతావచనము, వాసుదేవమననము, వేదాంతవార్తికలు, మహావాక్యలక్షణము, వేదాంతవచనము, తారకపంచకము, సకలోపనిషత్సారసంగ్రహము, సాత్వికబ్రహ్మవిద్యావిలాసము. గవర్నమెంటువారిపుస్తకభాండాగారమందు అజ్ఞానధ్వాంతచండభాస్కరము, వేదాంతసారసంగ్రహము, అర్చిరాదిమార్గము, తత్వము, రాజయోగప్రకాశిక మొదలయినవి కూడా ఉన్నవి. సంస్కృతమందున్న వేదాంతగ్రంథములు చదువగోరే తెలుగువారి కోసము వాడుకమాటలతోనే గురువులు వాటికి టీకలు రచించినారు. భగవద్గీతలకు ఆనందతీర్థులువారు, పరమానందయతీంద్రులు, తాళ్లపాక తిరుమలయ్యంగారు రచించినటీకలున్ను; ఉత్తరగీతలకు పరమానంద తీర్థులవారు సుదర్శనతీర్థులవారు రచించినటీకలున్ను, మహిమ్నస్తవటీక, ప్రౌఢానుభూతివ్యాఖ్య, పంచీకరణము మొదలయినవిన్నీ, గవర్నమెంటువారి పుస్తకములలో కనబడుతున్నవి: పూర్వసంప్రదాయము ననుసరించే శ్రీవేంకటగిరిమహారాజా శ్రీవెలుగోటి సర్వజ్ఞకుమారయాచేంద్ర భూపతులు నాస్తికధ్వాంతభాస్కరము, మనస్సాక్ష్యము మొదలయిన వనేకతత్త్వగ్రంథములు ("గ్రామ్య"భాషలోనే అందరికి తెలిసేటట్టు రచించుట యుక్తమని సిద్ధాంతీకరించి) రచించి ప్రకటించినారు. వీరిపాండిత్యము జగద్విఖ్యాతము. వీరు గ్రాంథికాంధ్రము రానివారుకారే?తక్కినశాస్త్రములలో

తెలుగుదేశమందు బాగా వ్యాపించి ఉన్నవి జ్యౌతిషమున్ను, వైద్యమున్ను. వీటిని తెలుగువారు అభ్యసించుటకుగాను సంస్కృతగ్రంథములకు వాడుకమాటలలోనే టీకలు రచించి గురువులు శిష్యుల కిచ్చినారు. జ్యౌతిషమందు గవర్నమెంటువారి వ్రాతపుస్తకములలో బృహజ్జాతకటీక, భీమకవి జోస్యము, ప్రతిభాగవివరణము, ప్రశ్నశాస్త్రము, గోపాలరత్నాకరము మొదలయినవిన్నీ గణితశాస్త్రములు కొన్నిన్నీ ఉన్నవి. సూర్యసిద్ధాంతము, తిథిచక్రము, అష్టకవర్గ శ్రీపతిజాతకపద్ధతి విశాఖపట్టణమందు చూచినాను. వైద్యమందు వైద్యశాస్త్రము, యోగసంగ్రహము సుశ్రుతసంహితటీక, వైద్యచింతామణి, రసార్ణవము గవర్నమెంటుపుస్తకాలలో ఉన్నవి. పరిషత్తువారివద్దను కూడా వీటిలో కొన్నిప్రతు లున్నవి. చెన్నపురి ఆయుర్వేదకశాశాలలో అనేకగ్రంథము లిట్టివి ఉన్నవి. ఇప్పుడుకూడా జ్యౌతిషికులు, వైద్యులు వాడుకభాషలోనే శాస్త్రచర్చ చేస్తారు. శ్రీపిడుపర్తిసుబ్రహ్మణ్యసిద్ధాంతిగారు రచించిన "జ్యోతిశ్శాస్త్రిసమ్మేళనము" గ్రంథాలయసర్వస్వము ( 5)లో ప్రకటితమయి ఉన్నది. దానినిండా కావలసినంతవాడుకభాషఉన్నది. వైద్యచంద్రిక మొదలయినపత్రికలలోని వ్యాసములందువాడుకమాటలు తరుచుగా కనబడుతూ ఉంటవి. గణితశాస్త్రము, ధర్మశాస్త్రము, వాస్తుశాస్త్రము, శిల్పశాస్త్రము, విశ్వవిద్యాభరణము, సాముద్రికశాస్త్రము, మృగయా, (వేట) ధనుశ్శాస్త్రము, మొదలయినవాటియందుకూడా తెలుగుటీకలతోనే తెలుగువారు పూర్వము చదువుకొనేగ్రంథాలు కొన్నిఉన్నవి.

21. సంస్కృతమున, ప్రాచీనాంధ్ర భాషను, ప్రాచీనులు రచించిన ఉత్తమగ్రంథములు తెలుగువారు తెలుసుకొనేటందుకు వాటికి వాడుక భాషలోనే టీకలున్ను, అమరము మొదలయినసంస్కృతనిఘంటువులకు, వాడుకమాటలతోనే అర్థాలున్ను, గొప్పపండితులు మున్నూరేండ్లకు పూర్వమే వ్రాసిపెట్టినారు. ఈప్రాచీనసంప్రదాయము చొప్పున మనతాతముత్తాతలకాలమందున్ను, ప్రబంధనిర్మాతలయిన విద్వత్కవులుకూడా టీకలురచించినప్పుడువ్యావహారిక భాషే వాడినారు. నామలింగానుశాసనమునకు ప్రఖ్యాతపండితుడు నాగదేవభట్టోపాధ్యాయుడు తెలుగున వాడుకమాటలతో రచించినటీక గవర్నమెంటు పుస్తక భాండాగారమందు ఉన్నది. తాళ్లపాకవారు కూడా అట్టిటీకరచించినారు. ఆసంప్రదాయముచొప్పున పరవస్తు శ్రీనివాసాచార్యులుగారు రచించిన సర్వశబ్దసంబోధిని అనేసంస్కృతాంధ్రనిఘంటువులో సంస్కృతశబ్దములకు తెలుగునవాడుకమాటలతో అర్థము వ్రాసినారు. వాల్మీకిరామాయణములోని కొంతభాగమునకు, సంస్కృతభాగవతములోని కొంతభాగమునకు, శ్రీశైలమాహాత్మ్యమునకు, సౌందర్యలహరికి, శ్యామలాదండకమునకు, భర్తృహరిసుభాషితరత్నావళికి, కృష్ణకర్ణామృతమునకు వాడుకభాషలో రచించినటీకలు ఆభాండాగారమునందే ఉన్నవి. వైష్ణవమతధర్మములను బోధించే అరవపుస్తకములకు తెలుగుటీకలు ఇట్లేఉన్నవి. ఇకను, తెలుగుప్రబంధములకు కూడా తెలుగుటీకలు వాడుకభాషలో రచించినవే ఉన్నవి గాని, గ్రాంథికభాషలో నున్నది మచ్చుకు ఒక్కటైనా ఎక్కడా ఇదివరకూ కనబడలేదు. రాఘవపాండవీయమునకు ప్రఖ్యాతపండితుడు ముద్దరాజు రామన్న; హరిశ్చంద్రనళోపాఖ్యానమునకు చిత్రకవి అనంతుడు; వసుచరిత్రకు సోమనాథపండితుడు, శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి, జూలూరి అప్పయపండితుడు; మహాభారతమునకు భారతము లక్ష్మీపతిపండితుడు, మనుచరిత్రకు జూలూరి అప్పయపండితుడు; ఆముక్తమాల్యదకు గట్టుపల్లి నృసింహకవి, గుడిపాటివెంకటకవి; రాఘవయాదవపాండవీయమునకు బాలసరస్వతి(?), లంకావిజయమునకు గ్రంథకర్త శిష్యుడు కోసూరి కృష్ణమాచార్యుడు, రామకృష్ణోపాఖ్యానమునకు కావ్యకర్తానూ వారణాసి లక్ష్మీపతికవిన్ని చేసినటీకలు వాడుకభాషలోనే(సాహిత్యపరిషత్పండితులూ గవర్నమెంటు పుస్తకభాండాగారమందున్న పండితులూ నివేదించినట్లు) సంభావనకైలని రచితమైఉన్నవి. వీటిలో కొన్ని ప. చిన్నయసూరికి, పూర్వము, కొన్ని ఆపిమ్మటను మొట్టమొదట అచ్చుపడ్డప్పుడు, వాటిలోనిటీక వ్రాతప్రతులలో ఉన్నట్లే వాడుకభాషలోనే ఉన్నది. పరవస్తు చిన్నయసూరిగారున్ను వైయాకరణ రామానుజాచార్యులవారున్ను కలిసి పరిష్కరించి 1847 వ సం. న భారతము ఆదిపర్వము

అచ్చువేయించినప్పుడు, భారతవచనమనే పేరు పెట్టి ఆపుస్తకమందే, ఆచార్యులవారు "ఛాయావ్యాఖ్యానము" వాడుకభాషలో రచించి చేర్చి ప్రకటించినారు. ఈ ఆచార్యులవారు సూరిగారికన్న చాలా గొప్పపండితులని విన్నాను. ఇటీవల, పూర్వటీకాకారుల ఊరూ పేరూ చెప్పకుండా: వారిటీక గ్రాంథికభాషలోనికి మార్చివేసి, నేటిదొంగ పరిష్కర్తలు అచ్చువేస్తున్నారు. ఎంతమోసము? ఎంతద్రోహము? దుష్టలక్షణమునకు విరుద్ధముగా ఉన్నవని చెప్పి, నన్నయాది మహాకవులప్రయోగాలు మార్చి గ్రంథాలు పాడుచేయుటకు సాహసించిన దొంగ "పండితులు" టీకలు మార్చుటకు జంకుదురా? ఇప్పటి అచ్చుటీకలు చదువుకొన్న ఆంధ్రపండితులు కొందరు వ్రాతపుస్తకములోని టీకలు గ్రాంథికాంధ్రము రాని అపండితులు వ్రాసినవని వాదించి తమఅజ్ఞానమున్ను అవివేకమున్ను ప్రకటించుకొన్నారు.

22. వ్యాకరణములు :—గ్రాంథికాంధ్ర మనగా 'భారతాదిప్రాచీనాంధ్రప్రబంధములలోనున్న తెలుగు;' ఆతెలుగుభాషకు ఆంధ్రశబ్దచింతామణి అనేవ్యాకరణమందు సంస్కృతభాషలో కొంతలక్షణము పూర్వము రచితమైనది. దీనికి కూడా వ్యావహారికాంధ్రభాషలోనే బాలసరస్వతి అనే విద్వత్కవి టీకరచించినాడు; మరి కొంచెము కాలము గడచినపిమ్మట, అప్పకవి అదిఆధారముగా చేసుకొని, పెద్దలక్షణగ్రంథము రచించినాడు దానిలో పద్యాలు గ్రాంథికభాషలోను, వివరణము వ్యావహారికభాషలోను వ్రాసినాడు. అప్పకవీయము 1859-వ సం-న మొట్టమొదట అచ్చుపడ్డప్పుడు గ్రంథపరిష్కర్త శ్రీరేకము రామానుజసూరి అనేపండితుడు (చిన్నయ్యసూరిగారి వియ్యంకుడు) వావహారికభాష గ్రాంథికభాషగా మార్చి వేసినాడు. నాటినుండి ఆలాగుననే ఆగ్రంథము మాలమరల చాలాకూర్పులలో అచ్చుపడ్డది. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు, పాతప్రతులలో ఉన్నట్టుగానే, ఆగ్రంథము నిరుడుముద్రించి ప్రకటించినారు. దానివల్ల నిజమైనసంప్రదాయము తెలుసుకోవచ్చును. దొంగపండితులు లోకమును మోసపుచ్చి చేసినమార్పులు ఈలాగున మరలసవరించి వ్రాతప్రతులలోనున్నట్టు గ్రంథములు సరిగాముద్రించి ప్రకటిస్తే కాని నిజము అందరికి వెల్లడికాదు. బాలసరస్వతీయమూ అప్పకవీయమూ వలెనే, తక్కినలక్షణగ్రంథములన్నీ, పద్యములు గ్రాంథికభాషలోను, వివరణవచనములూ, అవతారికలూ మొదలయినవి వ్యావహారికభాషలోను రచితమయి ఉన్నట్టు వ్రాతప్రతులన్నిటిలోను దేశమందంతటా కనబడుతున్నది. అంధ్రశబ్దచింతామణికి అర్వాచీనులు రచించినకవిజనాంజనమనే టీక మరిఒకటి ఉన్నది. అదిన్నీ అట్టిదే. గోపాలకవిరచించిన సకలలక్షణసారసంగ్రహమున్ను, మరిఒక "లక్షణగ్రంథమున్ను" పరిషత్తువారి వద్ద నున్నవి. ఇవిన్నీ అట్లే రచితమయినవి. గవర్నమెంటువారి పుస్తకాలయములో ఇట్లు పూర్వులు రచించినలక్షణగ్రంథము లనేకముగా ఉన్నవి. అక్కడనే ఉన్నది శృంగారామరుశతకము. దీనిలోని శ్లోకములకు అర్థము తాళ్లపాక తిరువేంగళాచార్యులు తెలుగుపద్యములుగారచించి ప్రతిదానికి అవతారికా టీకా వాడుకమాటలతోనే చెప్పినాడు. కూచిమంచితిమ్మకవి, కూచిమంచి వేంకట్రాయుడు, కావ్యములే కాక, లక్షణగ్రంథములుకూడా పూర్వాచారము చొప్పుననే రచించినారు. లక్షణగ్రంథాలకు ప్రతులు లక్షణమభ్యసించేవారే "స్వంతానకు" వ్రాసుకొనేవారు. మనతాతలనాడు జూలూరి అప్పయపండితుడు మొదలయినవారు బ్రౌన్‌దొరగారికోసము ఆంధ్రభారతాది గ్రంథముల ప్రతులు అనేకము సంపాదించి ఒక్కొక్కగ్రంథములోని పాఠములు సంప్రతించి వ్రాసిపెట్టిన పీఠికలు, మనుచరిత్రకూ వసుచరిత్రకూ ఆయనటీకలువ్రాసినట్టు వాడుకభాషలోనే రచించినాడు. గవర్నమెంటువారి పుస్తకములను గురించి నేను చెప్పిన విషయములు అచ్చుపడి ఉన్నక్యాటలాగులను బట్టిన్ని పరిషత్తువారి పుస్తకములను గురించిన విషయములు వారిపత్రికనుబట్టిన్ని చదువరులు సరిచూచుకోవచ్చును.

23. ఈవ్యాసమం దుదాహరించిన వివిధగ్రంథములలోని వ్యావహారిక భాష ఎటువంటిదో తెలియజేయుటకు ఒక్కొక్కదానిలోనుండి కొన్నివాక్యములు ఉదాహరించి అనుబంధముగా చేర్చవలెనని ఉద్దేశించినాను; గాని స్థలము లేదు. నావ్యాసము సుమారు ఎనిమిదిపుటలలో ఇమిడేటట్టుండవలెనని నిర్ణీతమైనది. ఈ వ్యావహారిక

భాషాప్రయోజనములు 1914 సం.మున నేను ప్రకటించిన "నిజమైన సంప్రదాయ" మనే వ్యాసమందు చిన్నమచ్చు వాక్యములు చేర్చిచూపించినాను. సవిస్తరముగా, సోదాహరణముగా, ఉపన్యసించి, ఈప్రయోజనములు మరల ప్రకటింపదలచి ఉన్నాను. ఆంధ్ర ప్రబంధములందు కూడా సరసకవులు వాడినవ్యావహారిక భాష ప్రకటీకరింప నుద్దేశముగలవాడనై బాలకవి శరణ్యమనే గ్రంథము రచింప నారంభించి "నా" తెలుగు పత్రికలో కొంచెము అచ్చువేయించినాను. అది పూర్తిగా రచించి కొలది కాలములోనే అచ్చువేయిస్తాను. వ్యావహారిక భాషకు సారస్వత సామ్రాజ్యమందుగలహక్కులు పోగొట్టి దాని స్థానము ఆక్రమించి, భాషాప్రపంచములో దానిని నిలవనీయకుండా హింసిస్తూ, నిరంకుశాధికారము చెలాయిస్తూ ఉన్నగ్రాంథిక భాషయొక్క ప్రవృత్తి ఎంత జుగుప్సావహముగా ఉన్నదో దానివికృతిచేష్టలు కొన్ని బట్టబయట పెట్టి పెద్దలకందరికీ తెలిసేటట్టు చూపిస్తే, దానిని తొలగించి వ్యావహారిక భాషను దానిపూర్వస్థానమందు మరల ప్రతిష్ఠాపించగలరని "కృతకగ్రాంథికాంధ్ర" మనే పేరు పెట్టి వేరే మరిఒక గ్రంథముకూడా రచించుటకు సంకల్పించి ఉన్నాను.

24. కట్టకడపటిమాట ఒకటిచెప్పి, నావ్యాసము ముగిస్తాను. తెలుగుదేశమందు మొట్టమొదటునుండినీన్ని అనేకశతసంవత్సరములు సమస్తసద్వ్యవహారయోగ్యముగా అఖిలాంధ్రమహారాజపూజితమై, సకలసద్విద్యాభ్యసనసాధనముగా నిఖిలాంధ్రపండితావలంబనమై, ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థసాధకమై, తెలుగువారి దేశభాషగా మనతాతలనాటివరకున్ను ప్రఖ్యాతమైన మనమాతృభాష మననోటనూ మనపండితులనోటనూ అపరిహార్యమై, సదావిహరిస్తూ ఉన్నా, మనకాలమందు అయ్యో! పరమనీచమై, నింద్యమై, హేయమై పండితులకే కాక పామరులకున్ను, పెద్దలకేకాక పిల్లలకున్ను, నాలుగుజాతులువారికీ అస్పృశ్యలుగా ఉండి, తమ అస్పృశ్యతను తొలగించుకొనుటకు ప్రయత్నిస్తూ ఉన్న పంచములకున్నుకూడా అస్పృశ్యమై, అవాచ్యమై, అధోగతిపాలయినది! అహో! కాలవిపర్యయము! ఈవైపరీత్యమునకు మొదటికారణము 1753 వ సం॥న పరవస్తుచిన్నయసూరిపూర్వసంప్రదాయవిరుద్ధముగా అను శాసించిన నూతనమార్గము. అంతకుపూర్వమందున్ను, ఆకాలమందున్ను, సర్వసామాన్యముగా అందరిపిల్లలకూ కలిపి విద్య నేర్పుటకు ఏర్పడినబడులలో, ఉపాధ్యాయులు "లోకవ్యవహారానుసారముగానే" విద్యార్థులచేత, మాతృభాషారచనాభ్యాసము చేయిస్తూ, భారతాదిగ్రంథములలోని పద్యములు కొన్ని వాడుక మాటలలో అర్థముచెప్పి చదివించడము సదాచారమై ఉండగా, ప్రాచీనప్రబంధస్థమై, కేవలప్రయోగశరణమై, పండితులకైనా బహుప్రయాససాధ్యమై, ఒక్కప్రబంధనిర్మాణమునందే ఉపయోగించునది, పండితులు మాత్రమే అభ్యసిస్తూఉండిన "గ్రాంథిక భాష" లో, అధికారానధికార తారతమ్యము ఆలోచించకుండా, ఆబాలగోపాలం అందరిపిల్లలచేతనూ, రచనాభ్యాసము చేయించ నుద్దేశించి, అందుకు సాధనముగా, అసమగ్రము, అనిర్ణాయకము, భ్రమప్రమాదాత్మకమున్ను అయిన చిన్నవ్యాకరణము ఒకటిన్ని అస్ఖలితముకాని చిన్న వచనగ్రంథమొకటిన్ని రచియించి ఇచ్చి, ఆసూరిగారు కీర్తిశేషులయినారు. 'కొండవీటి సీమలోని నూతులలోనుండి నీళ్లుతోడి తెచ్చుకొని వంటచేసుకొని భోజనముచేయండి' అని బారెడు చేంతాడు, తూట్లుపడ్డ చిన్న చిల్లిచెంబు ఆకలితోనున్న చిన్నపిల్లల చేతులలోపెట్టి, తల్లిదండ్రులు శ్రీశైలయాత్రకు వెళ్లినట్లయినది.

25. పూర్వము మనదేశమందున్నట్టే, సత్సహవాసమాత్రమువనే సంఘములోని వారందరికీ అలవడిన వర్తమానవ్యావహారిక భాష, గ్రాంథిక భాషగా అభ్యసించడము ఏదేశములలో సదాచారముగా ఉన్నదో ఆదేశములలోని ప్రజలందరూ, నిరక్షరుడు ఒక్కడైనా లేకుండా ఎవరివృత్తికి ఉపచరించే వృత్తులు వారు సులువుగా నేర్చుకొని, తెలివితేటలు గలవారయి, స్వతంత్రులయి, రాజ్యవ్యవహారముకూడా స్వయం నిర్వహించుకొంటూ వృద్ధిపొందడముచూస్తే, మనదేశభాషకు మన అవివేకముచేతను సంభవించిన దౌర్భాగ్యమువల్లనే మనమిట్టి నిర్భాగ్యులమై ఉన్నామని తోచి, దేశాభిమానులకు దుఃఖము కలుగకమానదు. నేడు బ్రిటిష్‌సామ్రాజ్యవ్యవహారమంతా ఎవరు నిర్వహిస్తున్నారో విన్నారుకదా చిన్నప్పటినుం

డిన్ని కాయకష్టము వల్లనే పొట్టపోషించుకొనే కామాటివాండ్లు రాజకార్యధురంధరులై మనచక్రవర్తికి మంత్రులుగా ఇప్పుడు ఉన్నారు. వీరందరూ ప్రాచీన గ్రాంథికాంగ్ల భాషాపాండిత్యము గలవారు కారు. బాల్యమునుండిన్ని నాగళ్లు, గుద్దళ్లు, గొడ్డళ్లు, సమ్మెట్లు, పారలు, బొరిగెలు మొదలయిన పనిముట్లు పట్టుకొని, చేతులు కాయలు కాచేటట్టు మోటుపనులుచేసి జీవించినవారు. అయితే, ఈకార్మికులు చదువురానివాళ్లుకారు. చదువురానివాళ్లు ఆదేశమందు లేనేలేరు; ప్రతిమనిషీ అక్కడ చదువునేర్చుకోకతప్పదు. అందరికీ సామాన్యముగా ఉన్నవాడుక భాష రెండుమూడేండ్లు అభ్యసించి, ఎవరిపని వారు సాగించుకొంటూ, తీరికయినప్పుడు తమ వృత్తివిద్య వృద్ధిపొందేటందుకు, ఆవిద్యలో ఆరితేరినవారు ఉపదేశించే విషయములు వింటూ, వారుప్రకటించేపుస్తకములూ, వ్యాసములూ చదువుతూ, తెలుసుకొన్నవిషయములు ఆచరణలోపెట్టిశోధిస్తూ, తమకు కొత్తగా తెలిసినవిషయములు ఇతరులకు తెలిసేటట్టు ప్రకటిస్తూ, ఆదేశమందు కార్మికులుకూడా లౌకికవిద్యలు దినదినప్రవర్ధమానముగాచేస్తున్నారు. ప్రాచీనాంగ్లభాషాపాండిత్యము; దేశాంతరభాషాపాండిత్యము వలెనే ఆవశ్యకమని కార్మికులు కూడా అంగీకరిస్తారుగాని, అది అందరికీ ఆవశ్యకమని తలంచరు. అపరిచితభాషలు అభ్యసించడమునకు తీరిక, ఓపిక, ఆసక్తి గలవారు అవి నేర్చుకొని, వాటిలో రచితమైన గ్రంథములందలి విషయములు దేశభాషలో సాధ్యమైనంత స్పష్టముగా ప్రకటీకరిస్తూ ఉంటారు. ఏభాషలోనున్నా, గ్రంథములో తెలుసుకోదగినది విషయముగాని, కేవలశబ్దముకాదు. మన దేశమందున్నట్టు ఆదేశమందు ప్రజలలో ప్రాచీనశబ్దదేవతార్చనచేసే పామరులూ లేరు, చేయిస్తూ జీవనముచేసే యాజకులు లేరు. చేస్తే పుణ్యమనీ చేయకుంటే పాపమనీ చెప్పే పండితపరిషత్తులూ లేవు.

26. గడచిన యాభై అరవై సంవత్సరములలో ఇతర దేశములందు జరిగినట్లే మన దేశమందున్న పరిస్థితులు మారినవి. ప్రజలలో అనిర్వచనీయమైన నూతనోత్సాహము పుట్టినది. సంఘవ్యవస్థ, రాజ్యవ్యవస్థ ప్రజలందరి శ్రేయోభివృద్ధికీ అనుకూలమైనట్లు మార్చుటకు సాధనముగా విద్యావిధానము ఏర్పడినది. ఆపుణ్యకాలమందు ఇతరదేశములందు పరిణమించి ఉన్నట్లే,మన దేశమందున్న, విద్యాభ్యాసమునకు అనుకూలసాధనమై పరిణమించి ఉన్న మనవ్యావహారిక భాషే ఇతరదేశములలోచేసినట్టు, మనదేశమందుకూడా బడులలో విద్యాబోధకు సాధనముగాచేసిఉంటే, ఆదేశములలో వ్యాపించినట్లే, మనదేశమందున్న ప్రజలలో విద్యవ్యాపించి, మనదేశభాష మెరుగెక్కి ప్రకాశిస్తూ ఉండునుగదా! సర్వజనసామాన్యమైన సారస్వతము విజృంభించి ఉండునుగదా! ఇంగ్లీషువారికైనట్టే సమస్తదేశముల విజ్ఞానమున్ను, మనతెలుగు వారందరికీ మన తెలుగు లోనే సుగమము, సులభము అయి, వారివలెనే మనమున్ను విజ్ఞానసంపన్నులము అయి ఉందుము గదా! ఇతర జాతులవారితో మన తెలుగువారున్ను సమముగా తులతూగుతూ ఉందురుగదా. ఇప్పుడు ఇంగ్లాండుదేశములో కుండలుచేసే కుమ్మరివాండ్లూ, గనులలో బొగ్గుత్రవ్వే ఉప్పరులూ, పొలములుదున్నే పాలికాపులూ, యంత్రాలుతోమే కూలివాండ్లూ, సామ్రాజ్యవ్యవహార నిర్వాహదక్షులగుటకు, చాలినంతయోగ్యత వర్తమానవ్యవహారాంగ్లభాషద్వారా సంపాదించినట్టే, మనదేశములోని కార్మికులుకూడా వర్తమానవ్యావహారికాంధ్రభాషద్వారా మనదేశవ్యవహార నిర్వాహదక్షులగుటకు తగినయోగ్యత సంపాదించి ఉందురుగదా! ఇంతకుపూర్వమే స్వరాజ్యము మనకు సిద్ధించిఉండునుగదా! అయితే మనదురదృష్టమువల్ల చిన్నయసూరి గ్రాంథికభాషా దురభిమానము, విద్యాధికారుల అవివేకముచేత మారిమసగినట్టు చెలరేగి, వాస్తవమైన దేశభాషను నాశనముచేసి, మనకీదుర్దశకలిగించినది. ఈమారీబాధను తొలగించుటకే పదిపంద్రెండేండ్లక్రిందట, పూర్వులతప్పు తెలిసికొని, ప్రభుత్వమువారు వ్యావహారికభాషను తిరిగీ ఉద్ధరించుటకు పూనుకొంటే, వారియందు విశ్వాసములేని మనదేశనాయకులు, ఈమారమ్మపూజారులను, వారు ఆడించినట్లు ఆడి శేకలువేసేమారీభక్తులను వెనుకబెట్టుకొని, ప్రభుత్వమువారికి ప్రతిఘటించి, వారి ప్రయత్నము నిష్ఫలంచేసి, ఆంధ్రసారస్వతనిర్మాణము

తిరిగీ ఈ పూజారులకే సత్తకిచ్చివేసినారు. ఇంగ్లాండు లోని ఇప్పటికార్మికమంత్రుల నోటినుండివెడలిన ప్రతి శబ్దమూసభ్యమై సార్థకమై, టెలిఫోనులద్వారానూ, టెలిగ్రాఫులద్వారానూ, కేబిల్సుగ్రాములద్వారానూ, వైర్లెస్సులద్వారానూ, మహాసముద్రములుదాటి, ప్రపంచమంతావ్యాపించి మారుమోగుతూ పత్రికలలోను పుస్తకములలోను ప్రకటించుటకు యోగ్యమైఉంటే, మనపరిషత్ పండితులు మాట్లాడేభాష అవాచ్యమా? నింద్యమా? నీచమా? "గ్రామ్య" భాషా? ఎంత అవివేకము! పండితులున్ను, వారినిరంతర బోధచేత మూఢులైఉన్నవారి శిష్యులున్ను, మంచిచెడ్డా తెలుసుకోలేక, ఎవరేమన్నా గంగిరెద్దులాగున తల ఊపే పామరజనులున్ను సభ్యమని మెచ్చుకొనే "గ్రాంథికాంధ్రము" ఎవరినోటనూ వెల్వడదు; ఎవరిచెవినీ పడదు! ఇకనైనా పెద్దలు మేల్కొంటారా? మేల్కొరా? దేశీయమహాసభ వారందరికీ వినబడేటట్లు "ఇకనైనా మేలుకోండి మనజన్మహక్కులను కోరండీ!" అని ఆధునికాంధ్రకవికుసుమ ధర్మన్నగారు తమ సంఘమువారిని ఉద్బోధిస్తూ మేలుకొల్పు పాటపాడినారు. తమనోటిమాటే అవాచ్యమని అస్పృశ్యమని బహిష్కరించిన తమ పౌరుసువారిని అవాచ్యులని అస్పృశ్యులని నిందించి మానభ్రష్టులై మడికట్టుకొని వేరేపోతున్న పండితులు ఇతరుల మొరవింటారా? ప్రజల వాడుక భాషయొక్క ప్రయోజనములు అంగీకరించని పండితులచేతిలోనున్న అంకుశము తీసివేస్తేనేకాని, ప్రజలహక్కులను నిరోధిస్తూ ఉన్నప్రభుత్వమువారి చేతిలోని అంకుశమును లాగివేసిన ప్రయోజన ముండదు. నేడు ఆంధ్రరాష్ట్రము ఏర్పడవచ్చును; రేపు స్వరాజ్యము రావచ్చును; ప్రభుత్వము ప్రజాస్వామికము కానూవచ్చును. అయితే, ఈ రోజులలో మనస్వాములు నిరక్షరకుక్షులయి ఉంటే, దేశమునకు ఎంత ఉపద్రవము కలుగునో మన దేశనాయకులు, దేశభక్తులు, దేశబంధులు లెస్సగా ఆలోచించవలసి ఉన్నది. మన తెలుగువారిలో నూటికి 90 మందికి ఇంకా ఓనమాలైనా రావుసుమండీ!

27. దేశమన్ని విధములా అభివృద్ధిపొందడానికి అనుకూలమయేటట్టుగా, మనవు ఉన్నట్టే, వర్తమాన వ్యావహారికభాషే గ్రాంథికభాషగా అంగీకరించక తప్పదు. అదే లౌకికశరణము. ప్రాచీనాంధ్రభాషారచన పోషించవలెనని ఆంధ్రసాహిత్యపరిషత్తువారికి ఉద్దేశముంటే వారు అట్లుచేయవచ్చును. కానిఅందుకొరకై వ్యావహారికభాషను అణగద్రొక్కుటకు వారికిఅధికారము లేదు. వారుచేసిన వ్యావహారికభాషాబహిష్కారము గొప్పతప్పు. దేశాభివృద్ధికి ప్రతికూలమయినది. వారు చేసిన పనిప్రాచీన సత్ సంప్రదాయమునకు విరుద్ధమయినదని తెలిసిన తరువాత నయినా తప్పనిద్దిని బహిష్కారము రద్దుచేయుటవారికి విహితకృత్యము. చెన్నపట్టణమందు మొదట గ్రామ్యభాషా నిరసనసభ జరిగినప్పుడు అధ్యక్షుడుగా ఉండి పరిషత్తు వారి ఉద్యమమునకు ఆలంబన స్తంభమై నిలచిఉండిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు దురభిమానము లేనివారు గనుక నావల్ల ప్రాచీన సంప్రదాయము తెలుసుకొన్న వెంటనే నాతో ఏకీభవించి వర్తమానవ్యవహారికాంధ్రభాషాప్రవర్తకసమాజము (28-2-1919) లేదీన స్థాపించి వారే దానికి అధ్యక్షులయినారు.



# వలపుపూవ

## సాయం సమయము

అడివి బాపిరాజు గారు

౧

ప్రమిదలో నాముదము పత్తి వత్తుంచి
దీపంబు వెలిగించి తీసికొనిగూట
బెట్టి లక్ష్మిమాత బిలిచి మ్రొక్కితిని
కంకణాల్ పోఁచీలు గాజులుఁ గదల,
కరపీరకుట్మలాధరకాంతు లాడ
వల్లకీస్వనములఁ బాట బాడితిని.

౨

నిద్రబుచ్చినబాబు నేత్రముల తెరచి
హృదయంబు చివ్వన నెలుగెత్తియేడ్చి,
తూగుటుయ్యెలశయ్య దుప్పట్లమధ్య
సిక్థకసువర్ణమా చిన్నదేహంబు
విరిచికొని కూర్చుండె వెఱ్ఱివామనుడు.
ఒక్కగంతునబోయి యువ్వెత్తునెత్తి
బుగ్గలు కనులు మోము మూర్ధంబుబుశికి
పక్కనే మంచంబు పైనకూర్చుండి
అడ్డాల వేసికొని ఆహారమీయ
కడగితిని నాబాబు కుడువంగపాలు

3

దిడ్డిగంతనువెల్గు తెల్పిపోవంగ
తొంగి చూచుచునుండె దోబూచులాడి
ఎఱ్ఱనై సందె మా యింటిగోడలను
జేగురు పూసింది జిలుగుముగ్గులతో

౪

సుతుని త్వరితంబుగా జోకొట్టి నిద్ర
వంటయింటికిం బోయి వండంగవలయు
తనయునకు భోజనము ధవునిభోజనము.

౫

దొడ్డిలో మాయావు దూడకై యరచె.

౬

సాంధ్యగోధూళికాశబలరుచిమధ్య
నుండి, గుమ్మముకడకు, నున్నతాకార
సుందరాంగుండు హృదయేందీవరాధి
పతి, నా ప్రణయమూర్తివచ్చి, లోఁజూచి
చిరునవ్వుపెదవులఁ జిందిల్ల జేసి
నాప్రక్కనిశ్శబ్ద నర్మభావముల
కూర్చుండి నామోవి గ్రోలగమకింప;
నవ్వుతో మెడివైపు నయనవ్యంజనము
న తెలిపితి, చెరగు నటుదీసిపుత్ర
ప్రేమ యుబికిపోవ ప్రియమారగాంచె
నావక్షమున పాల నానుచున్నట్టి
యాత్మజుం దనరూపు నలరుడింభకుని
కాంచి ముద్దీయగా గైవల్యమయ్యె
ఏయద్భుతమునాకు నింక కావలయు
నానాథుఁడునిసుంగు నాకున్న మెడల.

---

## రామ సుగ్రీవ మైత్రి



చ. అనిలసుతుండు కాష్ఠయుగ మప్పుడు గూర్చి మథించి యగ్నిసం
జనితముగాఁగ నర్చు లిడి చాలఁ బ్రవృద్ధముచేసి ముందటన్
దనరఁగఁ దెచ్చి పెట్టినఁ బ్రదక్షిణముల్ సని వచ్చి నమ్మి న
య్యనలము సాక్షిగాఁగ మనమారఁగ సఖ్యముసేసి రిద్దఱున్.

Lakshmi Art, Bombay 8.

భాస్కరరామాయణము-కిష్కింధాకాండము.

## వాలి వధ



శా. చండాశీవిష. ఘోరసాయకము చంచజ్జ్యా సమేతంబుగా
నిండారం దెగఁదీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీ
శుం డాస్ఫోటన సేసె దుందుభిఘనక్షోణీధ్రదంభోళి న
ద్దండారింఘనకేళి నిర్ధరణవిద్యాశాలి వాలిం బడన్.

భాస్కరరామాయణము-కిష్కింధాకాండము.

# ప్రాచీనార్యస్త్రీలు: భారతీయనాగరికతయందు వారి స్థానము

దిగవల్లి వేంకట శివరావు గారు, బి. ఏ., బి. ఎల్.

(గత సంచికా శేషము)

హనుమంతుఁడు లంకఁ జొచ్చినాఁడు. అచ్చటి స్త్రీలను జూచినాఁడు. వారిలో "సువర్ణవర్ణ లున్నారు. ముగ్ధమొగములవా రున్నారు. చందనమనోహర లేపములను బూయువారిని ముచ్చటలాడువారిని ఇంక ననేకశృంగారావస్థలయం దున్నవారిని మన యాంజనేయుఁడు చూచినాఁడు. రాక్షసకేళీగృహిణీసీమను నిద్రారతలను జూచినాఁడు. అందు శశినిభముఖ లగు బాలికలుకూడ కనఁబడినారు. రావణుని నగరున రాచకొమరితలు ననేకు లుండిరి. రత్నకిరీటములను ధరించినవారు, ముక్తాహారమణిమయాలంకారములను ధరించినవారు ననేకు లుండిరి. అచ్చటివారెల్లరు నందకత్తెలే. రావణునిపట్టమహిషి మండోదరి చాలచక్కనిస్త్రీ. హనుమంతుఁడు రావణాసురుని యంతఃపురమునఁ గలకాంతల నెల్లఁ జూచినాఁడు. సీతాదేవికొఱ కచ్చట నుండిన నాగకన్యకలందు నాకకన్యకలందు గంధర్వకన్యకలందును వెదకినాఁడు! తరువాత ఆంజనేయుఁడు రాక్షసపానశాలను జొచ్చినాఁడు. అచ్చట నొడళ్లపై బట్ట లెఱుఁగక వివిధావస్థలందు మైమఱచి పడియున్న స్త్రీలను జూచినాఁడు. అచ్చటి రాక్షసమదవతులు నందమైనవారే. నిజముగ వీరే రాక్షసులని తలంపవచ్చును. అట్టిరాక్షసస్త్రీ లేదేశమందు నేకాలమందు లేరు.

యుద్ధకాండలో హతపతులను హతసుతులను హతబాంధవులను గూర్చి దుఃఖించు రాక్షసాంగనలు కనఁబడుచున్నారు. "దిక్కుమాలి మనము దేవురించుచుండఁగ రావణుఁ డింకను రామువలన రాఁగలముప్పుఁ దెలియలేకున్నవాఁడు. ఇంకను వరము లున్నవికదా యని గర్వించుచున్నాఁడు. యుద్ధములందుత్పాతములెన్నో కనఁబడుచున్నవి. సీత యను రకులమును మ్రింగుటకేవచ్చినది. విభీషణుని మాటలు రావణుఁ డేల వినఁ" డని విలపించుచున్నారు. వికృతాకారలు అజ్ఞలు దుర్వర్తనలు మధుపానమత్తలు నగు అనాగరక రాక్షసు లిట్లు వితర్కింతురా? పాపము! ఈ రాక్షసాంగనలు దుఃఖములపాలయిరి. రావణుఁడు గతించినాఁడు. అతనిభార్యలును "నీవు కాముకుఁడవు కావు. సర్వకార్యములందును స్వతంత్రుఁడవు కావు. మహావీరుఁడవు. అట్టినీకు వినాశముకలుగుట దైవవిధి కాక వేఱేమి కారణ"మని తలంచుకొనుచు దుఃఖించిరి. రాక్షసస్త్రీలయందు యుక్తాయుక్తవివేచన, సద్గుణములును, తెలివితేటలునుగలవు. వీరిలో రాక్షసపురుషుల కున్న యహంకారము కానరాదు.

వారిదుష్టస్వభావము అసహిష్ణుత మొరటు దనము నున్నట్లు తోఁపదు. ప్రత్యేకముగ క్రూరస్వభావలుగ ఘోరాకారలుగ వర్ణింపఁబడిన తాటక లంకిణి మున్నగువారు రావణుని దాసీజనులు తప్ప, తక్కినస్త్రీలు సాధారణమానవస్వభావములనే కనఁబఱచుచున్నారు. మంచినాగరకతను కలిగియున్నారు.

రావణుని పట్టమహిషి మండోదరి. మహారాజపుత్రి కుండవలసిన సౌందర్యము, సద్గుణము లీమెకున్నవి రావణునికిఁ బ్రియురాలు. అతనితో మేరుపర్వతము మున్నగు నగాగ్రములను జైత్రరథోద్యానమునను విహరించినది. అసురమయుఁడను మహాశిల్పికొమరిత. ఘనుఁడగు నింద్రజిత్తుకుఁ దల్లి. ఎంతో తెలివికలయట్టిది. రాక్షసవనితయైనను, దైవభక్తి, అవతారమాహాత్మ్యము నెఱిఁగినది. శ్రీరామునిగూర్చి మహావిష్ణువునుగూర్చి వేదాంతమునుగూర్చి యెఱిఁగినది. మంచివిద్యాంసురాలు. రావణున కెన్నియో బుద్ధులు గఱపినది కాని లాభము లేకపోయినది. ఆమె విలాపమున నెన్నోవిశేషసంగతులు తెలియుచున్నవి. తనభర్త ఉత్తమశాస్త్రశ్రుతిచయవేత్త, సురనరసతీవిశేషాహర్త, సద్ధర్మమార్గవిధిమర్యాదాభేత్త, పుణ్యజనావిచ్ఛేత్త, యని చెప్పుచు దుఃఖించుచున్నది. పాపము; "పరమపాతివ్రత్యభవ్యశీలలగు ధర్మపరల భవ్యవృద్ధశుశ్రూషణావిరతచిత్తల నెందఱినో, పతిహీనురాండ్రఁ జేయుటవలన వారిశాపమే తన భర్తకు తగిలిన" దనుచున్నది. శూర్పణఖ నను తనభర్త చేసిననారీచౌర్యము నీచమని పలుకుచున్నది. ఆమె "నీవు మంచియో చెడుగో చేసి నీగతికి నీవు పోయితివి. నేనన్ననో, నీ వియోగముచేత నిట్లు దుఃఖించుచు బ్రదికియున్నా"నని భర్తనుగూర్చి విలపించుచున్నది. ఆమె భర్తవియోగము సహింపనేరక మూర్ఛపోయినది. ఇట్టి మండోదరి మనతలంపులో నొకఘోరరాక్షసి.

రావణుఁడు తన్నుఁ బరిగ్రహింపనిసీతాదేవిపై నాగ్రహపడినప్పుడు ధాన్యమాలిని యతని నడ్డగించి కౌఁగిలించుకొని "ఈమానవస్త్రీకై యేల యాసించెదవు? కామములేని కామినులను గామించుటవలన చెడుగు కలుగును గావున నామెను విడిచి నన్నుఁ గూడు" మని ధైర్యముగఁ బలుకఁగ నతఁడు నవ్వుకొనుచు నాప్రయత్నము మానెను! ధాన్యమాలినిపలుకులు కొంచెము నీచముగనే కనఁబడును గాని స్వైరిణి, సాహసవతియు నగు కాంత అట్టి యుక్తి తోఁచిన నట్లాచరించుటకు వెనుదీయునా?

సీతాదేవిని రావణుఁ డెన్నోహింసలు పెట్టినాఁడు. ఆమెచుట్టును క్రూరాకారలను కామరూపిణులను కావలియుంచినాఁడు. అయినను రావణాదిష్టలై రక్షించుకాంతలలో సరమ యుత్తమురాలు; దృఢవ్రత; సదయశీల. మాయారామశిరమును జూచి, వంచితయై దుఃఖించు సీతాదేవికి ఈ కరుణాళువు నిజమెఱిఁగించి రామునియుద్ధసన్నాహముఁ దెలిపి యూఱడించెను. త్రిజట మఱియొకయుత్తమస్త్రీ. ఇట్టిరాక్షసస్త్రీ లింక నెందఱో కలరు. రాక్షసకృత్యములు మానవులు చేసినను

రాక్షసకృత్యములే. సీతను జూచి వచ్చుటకుఁ బోయినహనుమంతుఁడు లంకను గాల్చి వచ్చి నాఁడు. అతఁడు చేసినదౌర్జన్యమును జూచి రాక్షసులు వెఱఁగంది ఏమిది యని సీతాదేవి నడుగ నది వారిమాయగనే తలంచి "మీమ టుమాయంపుఁ బనులు మీకే యెఱుంగఁ జెల్లు" ననినది! రామరావణయుద్ధ మైనతరు వాత సీతాదేవిని బాధించినరాక్షసస్త్రీలఁ జం పెదనని హనుమంతుఁడన రాజాశ్రయమున నుండి అతనియాజ్ఞానువర్తులగు దాసీజనులను జంపఁగూడదని సీతాదేవియే వారించినది.

రామాయణపుస్త్రీలు ఆర్యులనాగరకత యొక్క ఆదర్శములను వెల్లడించుచున్నారు. వాల్మీకిఋషి చిత్రించినస్త్రీలు సాత్త్వికస్వభా వలు ఆచారవ్యవహారములను జక్కఁగ నిర్వ హించువారు. విధ్యుక్తధర్మములను బాటిం చువారు. సాధ్వీమణులు. భారతజాతీయత యొక్క వేషభాషలు వీరియందుఁ జూడవ చ్చును. ఆర్యస్త్రీల ముగ్ధభావము సుగుణపరం పరలు వీరియందుఁ జూడనగును. హైందవస్త్రీ లలోపములును వీరియందుఁ గనఁబడుచునే యున్నవి. వీరివేదకాలమునాఁటి యాదర్శ ములును నిష్కళంకమగు పూర్వాచారము లును వీరియాదర్శము లగు సావిత్రి రోహిణి మున్నగు మహాపతివ్రతలచరిత్రములఁ గనఁ బడుచున్నవి. ఎనిమిదివిధములగు వివాహ ములు ద్వాదశవిధపుత్రులు వీరికాలమునఁ గానరావు.

వాల్మీకి స్త్రీలను వర్ణించుపట్ల చక్కని భాష నుపయోగించినాఁడు. మృదుపదములు అలంకారములు నాతనిసంగీతమును సీతాదేవి దుఃఖమున కనఁబడుచున్నవి. రామాయణపు స్త్రీలసౌందర్యము సద్గుణములు సచ్చారిత్ర ములు మనకు వాల్మీకిదయవలన లభించినవి. మహాభారతమున స్త్రీలనుగూర్చిన ప్రశంస యింతవిపులముగ లేకపోవుట యొకచిత్రము. వాల్మీకి మానుషేతరస్త్రీలను వర్ణించనపట్లను చక్కఁగాఁ జిత్రించినాఁడు. తారయు మండో దరియు వాల్మీకి చిత్రలేఖనమునఁ గొఱంత లేనిసుందరపాత్రములుగనే కనఁబడుచున్నారు. రామాయణకాలపుసంఘమున నున్నతస్థాన మునే యలంకరించుచున్నారు. కామక్రోధ ములు శూర్పణఖయం దెంతసహజముగఁ జిత్రించినాఁడో మాత్సర్యము మందరయందు నంతసహజముగ వర్ణించినాఁడు. భిన్నములగు నాచారవ్యవహారములఁ జూచి యేవగించుకొని దిగ్భ్రమఁ జెంది దస్యులను దూషించిన ఆర్యు లఋషి వాల్మీకిమహాముని. రాక్షసులదుర్గుణ ములు ఘోరరూపములు నార్యులవ్రాతలందు భూతఅద్దమునందువలెఁ బ్రకాశించి స్థూల భావము నందినవి. మనకు వివిధములగు నభి ప్రాయములు కలుగుటకును గారణ మైనవి. అయినను మొత్తముమీఁద మనలనుగూర్చి వ్రాసినపాశ్చాత్యులవ్రాతలకన్న నివి బాగుగ నున్నవనియే చెప్పవచ్చును. మహాభారతకాల మునాఁటికి రామాయణకాలమునాఁటి ఆర్యుల శ్రుతిస్మృతి సదాచారములు కలఁతఁ జెంది నవి. కొంతమార్పుకూడఁ జెందినవి. రామా యణమే పురాణ మైనది. సావిత్రిచరిత్ర నలచరిత్ర శకుంతలచరిత్ర మున్నగు నుపా

ఖ్యానములనుబట్టి యప్పటి కవియు సత్యకాలపుగాథలై పోయినట్లు భావింపవచ్చును. ధర్మరాజుపరిపాలనకాలముననే కలియుగపు చిహ్నములు కనఁబడినవి. మహాభారతముతో భారతీయుల క్షీణదశ ప్రారంభమైనదని చెప్పవచ్చును.

భారతమునాఁటిస్త్రీలును ఆర్యులప్రాచీనాచారముల నుత్తమాదర్శములుగనే తలంచిరి. కాని కాలమునుబట్టి కొన్నిమార్పులు కలుగక తప్పినవికావు. వివాహములందొక మార్పు కలిగినది. శుక్రునికొమరిత దేవయాన రాజగుయయాతిని బెండ్లాడినది. అందపక్రమములు లేకుండ శుక్రుఁడు వరమిచ్చినాఁడు! శకుంతల అప్సరసకును మునికిని గలిగినకన్య. కణ్వునిపెంపుడుకొమరిత. రాజగుదుష్యంతుఁడామెను బెండ్లాడినాఁడు. సత్యవతి పడవనడుపువానితనయ. మహారాజగు శంతనుఁ డామెను వివాహముచేసికొనెను. భీముఁడు రాక్షసస్త్రీయగు హిడింబను జేపట్టినాఁడు. అర్జునుఁడు నాగకన్యను బెండ్లాడినాఁడు. యాదవులును పాండవులును వియ్యమందిరి. వైదర్భరాజపుత్త్రి లోపాముద్రను అగస్త్యుఁడు వివాహము చేసికొనినాఁడు. రోమపాదుని కొమరితను ఋష్యశృంగుఁడు పరిణయమైనాఁడు!

ఒకకులమువా రింకొకకులమునఁ బెండ్లాడుటయేకాక వివిధములగు వివాహములును జరుపునాచారము వచ్చెను. గాంధర్వము మున్నగు నెనిమిదివిధములగు వివాహములు సంఘమునఁ గనఁబడుచున్నవి. అనుశాసనికపర్వమునందు భీష్ముఁడు వీని తెఱంగు ధర్మజునకెఱింగించినాఁడు. మఱియు నిట్టివివాహములు చేసికొనుట యెవ్వరెవరికి యుక్తమగునో తెలిపినాఁడు. ఒకవర్ణమువా రింకొకవర్ణమువారిని బెండ్లియాడిన "యొక్కమెయి దూష్యంబుగాక చెల్లు" నని చెప్పి బ్రాహ్మణునకు నాలుగు జాతులనాతులను బ్రసూతులైనసుతులకు దాయభాగనిర్ణయమునుగూడఁ జేసి చెప్పినాఁడు. ఇట్టిసందర్భమున హవ్యకవ్యములు, మజ్జన భోజనములు బ్రాహ్మణియే చేయవలయు నని చెప్పినాఁడు. అటుతరువాత బహువిధులగు కొమరుల తెఱఁగు చెప్పి అన్నికర్మలకును ఔరసుఁడే ముఖ్యుఁడనియుఁ బౌత్రుఁడునితనినిబోలు ననియుఁ జెప్పినాఁడు. భారతయుద్ధము ముగిసినది. ఈయుద్ధముతరువాత ఐరోపామహాసంగ్రామానంతరమువలెనే విగతభర్తృకలు పునర్వివాహము చేసికొనఁగ, తండ్రి చనిపోయిన తరువాతఁ బుట్టినవారు పౌరులుగ నిర్ణయింపఁబడినట్టులె మన దేశమునను నూతననియమములెన్ని వచ్చినవో చెప్పుట దుర్లభము. రామాయణమున భార్యలు భర్తలకొఱకు అగ్నిప్రవేశము చేసినట్లుకానరాదు. కాని పరిశుద్ధురాల నని తెల్పుటకు సీతాదేవి అగ్నిప్రవేశముచేసినది. మహాభారతమునందు శ్రీకృష్ణునిభార్యలు ఆయననిర్యాణానంతరము సహగమనము చేసినట్లు మౌసలపర్వమునఁ జెప్పఁబడుట చూడ నీకాలమున కాయాచారము విరివిగ నున్నట్లు స్పష్టపడుచున్నది.

ఆనుశాసనికపర్వమున ఉమామహేశ్వర సంవాదమునఁ బార్వతీదేవి శివునకు బోధించినట్లుగ పతివ్రతాధర్మములు వివరింపఁబడినవి.

ఇవి విధ్యుక్తధర్మములే. పతివ్రత భర్తృమత మూఁది యాచరింపఁదగిన దేవతాపితృసమర్చనములు, నతిథిపూజలు, పతివ్రతల కనర్హములగు భార్యల యధర్మములు, అధర్మాంగనకుఁగల యాసురి, పైశాచి, రాక్షసియను పేరులు మొదలయిన విషయములు చెప్పఁబడినవి.

కలియుగపుదుర్దినములు వచ్చినవి: ద్వారకానగరమున మహోత్పాతములు పుట్టినట్లు మౌసలపర్వమున "......తిరుగులజ్జ, విడిచి యభిలాషముల వెంట విభులఁపంపు, సేయ కున్మార్గములఁ దమచిత్తములకు,వచ్చినట్ల వర్తింతురు వనిత లధిప!" యనియు చదువుచున్నాము.

సవతులజీవనము పట్టుదలయు కద్రువవినతలకథయందు ఆనుశాసనికపర్వమునఁ జూచుచున్నాము. కద్రువ వినతను వంచించి దాస్యముచేయించుకొనుటయు గరుత్మంతుఁడామెకు దాస్యవిముక్తి చేయుటయుఁ జెప్పఁబడినది. ఈయసూయ సహజముగఁ బుట్టిన సవతియోర్వ లేమి.

ఆకాలమునాఁటిస్త్రీలకు ననేకవిద్యలందును గళలందును బాండిత్య ముండినది. ఉత్తరకు కళలయందు వేడ్కచొనిపి, నయముతోడ నర్తనంబుల శిక్షింపుమని విరాటుఁడు బృహన్నలను గురువుగ నియమించినాఁడు. ఉత్తరకొక ప్రత్యేకనర్తనశాలకూడ ఉండెను. సత్యభామకు ధనుర్వేదము వచ్చునని యామెచారిత్రమువలననె తెలియఁగలము. భారతములోని స్త్రీలెల్లరు విద్యావతులుగనే కనఁబడుచున్నారు. దమయంతి, సావిత్రి, దేవయానలు నాగరకస్త్రీలు; విద్యావతులు. శకుంతల తనభర్తతో నడిపిన సంభాషణమువలన నామె ధర్మశాస్త్రము లెఱిఁగినవిద్వాంసురాలని స్పష్టపడుచున్నది. ద్రౌపదీవివాహము దమయంతిస్వయంవరమును స్త్రీలకుఁగల స్వాతంత్ర్యమును దెలుపుచున్నవి. సావిత్రి తన జనకునితో వాదించి చిత్రాశ్వుని పెండ్లాడుటయు దీనికిఁ దార్కాణమె.

ఆకాలమున స్త్రీలకు శాస్త్రములందు విద్యలందుఁ గళలందుమాత్రమే కాక మంత్రములందుఁగూడఁ బ్రావీణ్యముండెను. ఉపాసనమంత్రశక్తియు వీరి కుండినట్లు సావిత్రి కుంతి మున్నగువారి చరిత్రములవలన గ్రహింపఁగలము.

భారతపుస్త్రీలు తమపతులతోఁ బడినకష్టములు వర్ణనాతీతములు. కుంతి పాండురాజుతో, ద్రౌపది పాండవులతో, దమయంతి నలునితో అడవులందుఁ గాలముఁ గడపిరి. సైరంధ్రులుగఁ బనిచేసిరి. వీరిపతిభక్తి, అతిథిసత్కారము నప్రతిమానములు. వీరు సాధారణస్త్రీలవలె గృహచ్ఛిద్రము లనుభవించి సంసారముల నీఁదినారు. సావిత్రిభక్తి,దమయంతియోర్పు, శకుంతలతెలివి యాదర్శప్రాయములు. భరతఖండమున జరిగిన ఘోరసంగ్రామమునఁ బతులను సుతులను బోఁగొట్టుకొని స్త్రీలు దుఃఖభాజన లైరి. యాదవస్త్రీలను దుదకు బోయలుకూడఁ బరాభవించిరి.

---



# ముద్దు కృష్ణుడు

మంగిపూడి వేంకటశర్మ గారు

పిలిచితేను పలుకవేమె గొల్లభామా—నాతో
నిలిచి మాటలాడ వేమె గొల్లభామా.

నిలుచుటకు వల్లగాదు కృష్ణమూర్తి—నన్ను
పలకరించకోయి యిపుడు కృష్ణమూర్తి.

మంచిమాట చెప్పుతానె గొల్లభామా—స్నేహ
మెంచి యాలకించి పోవె గొల్లభామా.

మంతనాల వేళగాదు కృష్ణమూర్తి—మాట
మంతికిపుడు వీలులేదు కృష్ణమూర్తి.

తత్తర మింతేలనీకు గొల్లభామా—మాట
కుత్తర మియ్యవె నాకు గొల్లభామా.

అత్తవారి యింటికాడ కృష్ణమూర్తి—నేను
కొత్తకోడలైతినోయి కృష్ణమూర్తి.

కొత్తకోడలైతె నేమి గొల్లభామా—నన్ను
కొత్తగాను చూడవలెనె గొల్లభామా.

అత్త విచ్చుకత్తిసుమ్మ కృష్ణమూర్తి—నన్ను
ఒత్తిడి బెట్టును నమ్ము కృష్ణమూర్తి.

అత్తయేమి చేయగలదె గొల్లభామా—మన
చిత్తములు ఒక్కటైతే గొల్లభామా.

మామ మంచివాడుగాడు కృష్ణమూర్తి—గరిడీ
సాములు చేసినవాడు కృష్ణమూర్తి.

మామ యేమిచేయగలడె గొల్లభామా—మన
మనసులు రెండేకమైతే గొల్లభామా.

ఆడబిడ్డ చాడీకోరు కృష్ణమూర్తి—మన
జాడగడితే చెడ్డపోరు కృష్ణమూర్తి.

ఆడబిడ్డ యేమిచేయు గొల్లభామా—మన
ఆత్మలందు ప్రేమలుంటే గొల్లభామా.

మగడు మానవంతుడోయి కృష్ణమూర్తి—శంక
తగిలితే మన్నింపడోయి కృష్ణమూర్తి.

మగడు యేమిచేయగలడె గొల్లభామా—మన
మక్కువలు నిక్కమైతే గొల్లభామా.

కత్తిరిలో పోకనైతి కృష్ణమూర్తి—మనసు
తత్తరించు నేమిగతి కృష్ణమూర్తి.

అన్యులెవరు చూడకుండ గొల్లభామ—ఒక్క
చిన్నిముద్దు బెట్టిపోవే గొల్లభామా.

ఇట్టిపట్టు చెల్లునోయి కృష్ణమూర్తి—ముద్దు
బెట్టినాను పోగదోయి కృష్ణమూర్తి.

దాటిపోయినావె గడుసు గొల్లభామా—వడ్డీ
తోటిపుచ్చుకొనె ముద్దు గొల్లభామా.

# రామ రామ!

పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు

'ఏదీ! ఒక్కముద్దే కాదా! ఊఁ' యనుచు నెడమ మోచేతిని బ్రక్కపై నాని కుడిచేతిని భార్యపై వైచి నడుమువఱకు లేచి తన మోమును భార్యమోమున జేర్పఁబోయి మూతి పొడుగు చేసిన రంగరావు నట్టె యదలించి మోము మఱల్చుకొని గిరుక్కున నెడమవంక కొత్తిగిల్లి "అబ్బ! నాకు నిద్ర వచ్చుచున్నది. ఎప్పుడు నొక్కటే ముద్దులా! చాలు" నని కృష్ణవేణమ్మ రంగరావును బలుచఁ బలుచఁగ మందలించెను. పదునైదు దినముల క్రిందటనే కాపురమునకు వచ్చినపడుచుపిల్ల. పగలెల్ల నింటిలో నేదో చిన్న పెద్ద, బరువు తేలిక పని తప్పదయ్యెను. పండ్రెండు గంటలు దాఁటిన తరువాతనైన నాపిల్లకు నిద్ర రాఁగూడదా? అది తప్పా! "అబ్బ! ఇటు తిరుగు; ఒక్కటే నిద్రయా?" యని రంగరావు భార్యను దనవంకకుఁ ద్రిప్పుకొనఁబోవఁగ మంచపుఁ బట్టెను గుడిచేత నామె కౌఁగిలించుకొని బిఱ్ఱబిగిసెను 'ఒక్కటే ముద్దులా' యని భార్య విసుఁగుదల యయ్యెను. 'ఒక్కటే నిద్రయా' యని భర్త సాధింపయ్యెను. ఇఁక సంధి యెట్లు? తనకేమి రెండవ పెండ్లివాఁడు; నలువది యేండ్లు గడచినవాఁడు; ప్రపంచకష్టముల నెఱిఁగినవాఁడు. తనకెంతకైన నిద్ర రాకపోవచ్చును. అయ్యో! కుఱ్ఱది - పదుమూడేండ్లది. దానియీడున వయస్సురాని వారెందఱో యున్నారు కదా! అది నిద్ర కాఁగ లేకపోవుట హానియా? అపకీర్తియా? ఈమాత్రపు టౌచిత్యము తనకేల యుండఁగూడదు? ఇంటిలో స్థిరముగాఁ బడియుండుటకు వచ్చిన పెండ్లాము కదా! నూఱేండ్ల కాపురము కదా! తిరుగఁ దెల్లవాఱదా? ఇంతలో నేమి ఫుట్టి మునిఁగినది. 'అద్దెద్దె' యని తన కొంటిగంటవేళ నొకముద్దెందుకు? భార్య లేఁతపిల్ల కావున నూరకున్నది కాని యాఱితేఱిన గడుసుదే యైనయెడల భర్తను మూఁతిమీఁదఁ బొడుచునేమో! అది యట్టిదే యైనయెడల దాని చిత్తము ననుసరించియే యాతఁడు ప్రవర్తించునేమో?..........................

కుడిచేతితర్జని నల్లలాడించుచు "నింతే కాదా! యింతే కాదా! సరే." యని భర్త రెండవవైపున నొత్తిగిల్లి పండుకొనెను. ఇంతే కాదా ఇంతే కాదా యనఁగా నర్థమేమో? ఇంతసేపు బతిమాలినదాని ఫల మింతే కాదా యనియా? ఇంతధనము దగులఁబెట్టుకొని పెండ్లిచేసికొని నందులకుఁ బర్యవసాన మింతే కాదా యనియా? ఇఁక నీకు నాకు నింతే కాదా యనియా? ఎట్లు తెలియవచ్చును? కాని 'సరే' యనఁగ నర్థమేమో? తెల్లవాఱినపిమ్మట నిన్ను బారగఱ్ఱలను గట్టించి కొట్టింతు ననియా? కాక, యిఁక నీదారి నీది నాదారి నాది యనియా? పాపము! ఆచిల్లాలివలన నెంత యపరాధము జరిగినదో? ఎంత సంసారఘాత సిద్ధించినదో? కాని, యీమాత్రమైన సహించుకొనలేని భర్తకు రెండ

వపెండ్లికూడ నెందులకో?..................
..............................................

ఏమి చేయవచ్చును? రంగరావు మిక్కిలి యొడిదొడుకు స్వభావముకలవాఁడు; కర్తృత్వ దనునైజముకలవాఁడు;అందులోమూఱుమనువు వాఁడు; మఱలుకల వయస్సువాఁడు; భార్య యందుఁ బంచప్రాణములు పెట్టుకొన్నవాఁడు; భార్యకూడఁ దనయం దంతప్రేమముతోనే యుండవలసిన దన్నవాఁడు,అట్లుండక తప్పదని సిద్ధాంతపఱచినవాఁడు; భార్యనుజూచి పొంగి పోవువాఁడు; భార్యకూడఁ దన్నుఁజూచి తన లాగుననే పొంగకపోయినయెడల వీలులేద న్నవాఁడు;భార్యాభర్తలనుకూలముగ నుండఁ దలఁచిన యెడల నొకరినొకరు కౌఁగిలించుకొని కూరుచుండవలసిన దన్నవాఁడు; కాని యెడల, భర్త యజ్ఞోపవీతము తీసివైచి కాశిలో, భార్య తల గొరిగించుకొని రామేశ్వరములో నుండవలసినదన్న మతములోవాఁడు; అంతే కాని, మధ్యమ మార్గ మొక్కటి యుండవచ్చు నను కొన్నవాఁడు మాత్రముకాఁడు.......
..............................................

అట్టి ప్రకృతిగల రంగరావునకు భార్య వెన్నిచ్చిన యెడలఁ దలమంచుకొని పోవదా! భార్య మొగము చిట్టించుకొనఁగ గుండెలలోఁ బొడిచినట్లుండదా? భార్య మంచపుఁ బట్టెను గౌఁగిలించుకొని పండుకొనినదనఁగ దన్ను గొంతువఱకుఁ బూడ్చినట్లుండదా?...........
..............................

తన ప్రకృతిలాగుననే తన యిల్లాలి ప్రకృతి యుండవలసినదని మెచ్చటనైన నున్న దా? లేకపోవుఁగాక! తనప్రకృతికి సరిపోయి నట్లు తన యిల్లాలు తన ప్రకృతినేల మార్చు కొనఁగూడదను పట్టుదలకలవాఁడు. ప్రకృతి మారుటకు సాధ్యమగునో కాదో యాసంగతి యటుండనిమ్ము. తానే తనప్రకృతిని భార్యా ప్రకృత్యనుగుణముగ నేల మార్చుకొనఁగూడ దో? ఊహుఁ! అది పనికిరాదు. ఏవరెవరిప్రకృతి పరిపాకము లెట్లున్నసరే; యెవరియిష్టానిష్టత లెట్లున్న సరే; యందఱుఁగూడఁ దాను'గీ' యనఁగఁ 'గీ' యనవలయుననియుఁ, దనకొనవె ట్రులకుశిరఃకంపన మొనర్పవలసినదనియు బ్రతి నరప్రకృతిలో నున్నదికాని లేకపోలేదు. కొం దఱకుఁ గోట్టగింజయంతయుఁ గొందఱకుఁ గుంకుడుగింజయంతయు నుండగ, రంగరావు నకుఁ గోడిగ్రుడ్డంతయున్నది...............
..............................................

భార్య ముద్దియకుండఁ బండుకొన్నదని తహతహలాడిపోవుచున్నాఁడు; అంటుకొన్న పూరికొంపవలె లోలోపలనే కుమిలికుమిలి కూలుచున్నాఁడు; కవులు తమగ్రంథములలో వ్రాసిన ప్రణయకలహమైన యుండునా యని రవంత సందేహించినాఁడు;మంచువలె వెంటనే విడిపోవలసినదే కాని యింత త్రాడు తెగు వఱకుఁ బ్రణయకలహ ముండదని సిద్ధాంతపఱ చుకొన్నాఁడు; కమ్మరితిత్తివలె నూపిరిని బూ రించి రెండేసిబారల మూల్గు మూల్గుచున్నాఁ డు; భార్యకుఁ దనయందిష్టత లేదని సిద్ధాంత పఱచుకొన్నాఁడు,ఎందుచేత — రెండవ పెండ్లి వాఁడగుటచేత; రెండుయామములు దాటిన వాఁడగుటచేత, పెండ్లి చేసికొనుమని చెప్పిన

స్నేహితులనుదిట్టినాఁడు. పెండ్లి కుదిర్చినబంధువులనుదిట్టినాఁడు. పెండ్లి చేయించినపురోహితునిదిట్టినాఁడు; ఇట్టి పనికిమాలిననిర్భాగ్యురాలి నేలకనవలయునని యత్తమామలనుదిట్టినాఁడు; తన్నుఁ దిట్టుకొన్నాఁడు; 'ప్రక్కలో ముండ్లకంపవు; నీ వెక్కడ దాఁపురించితివే' యని పెండ్లామును దిట్టినాఁడు; కాని యిల్లాలి ప్రక్కలోఁ దా నెలుఁగుబంటివలె నుంటిననుసందేహ మాత్రనికిఁ దోఁచిన ట్లింతవఱకు గపడలేదు....

..........................................

పెండ్లాము చెప్పవచ్చినప్పుడు మొదటి పెండ్లానే పెద్దామని తనపూర్వకళత్రమును గొంత ప్రశంసించినాఁడు; ఆమెకుఁ గ్రోధ మెక్కువయని కొంత మనసులో దిగఁబీఁకుకొనినాఁడు; ఆమెయెడల నప్పుడప్పు డనాదరణ చూపినందులకు లెంపలు వైచికొన్నాఁడు; ఆమెయే బ్రదికియుండునెడలఁ దన కిప్పు డీగతి పట్టకయే యుండునని పరితపించినాఁడు.......

..........................................

ప్రస్తుతభార్యకుఁ దనయం దిష్టము కలుగుట కేమిచేయవలయునా యని గుబ్బెటలు పడుచున్నాఁడు; ఆతంకని గ్రహమాత్ర లందులకు మంచివేమో యని మదరాసువంక తిరిగినాఁడు; స్త్రీవశ్యపుమందు లమోఘములని గోదావరిజిల్లావంక తిరిగినాఁడు; బాలెంత చావు చచ్చినపెద్దభార్య దీని నావేశించి యిప్పుడు తనకు ముద్దీయకుండఁ జేసినదేమోయని సందేహపడి మంత్రశాస్త్రవేత్తయైన కృష్ణశాస్త్రులుగారు మరణించినందులకు రవంత విచారించినాఁడు; గ్రహవిముక్తికి గంగాస్నానము దురాకట్టని స్థిరపఱచినాఁడు;..........

..........................................

ప్రక్కపాటుఁ దలగడకుఁ జివరఁ బెట్టినతల రవంతజాఱుటచే మంచముపైనుండి క్రిందికిఁ బడిపోవుచున్నానేమోయని యులికిపడి లేచి వెంటనే సంబాళించుకొని వీఁపుపైఁ బండుకొని కన్నులు తిరుగ మూసికొనినాఁడు... ...గుండెలపై రెండుచేతు లున్నవి. చెవియొద్ద దోమ గుయ్యిమనుచున్నది. తాను గుఱ్ఱుతీయుచు నడుమనడుమఁ గెక్కు కెక్కు మనుచున్నాఁడు.

స్వప్నము

చెదఱిన ముంగురులతో మేలుముసుఁగుతో రవంత చొక్కిన దౌడలతోఁ బండ్లకప్పుతోఁ దేలిపోవుచున్న కన్నులతోఁ దాంబూలరక్తిగల పెదవులతోఁ జెవుల దూఁదిపింజలతో, నడుమునకుఁ గట్టుతో, నిండైన వక్షముతోఁ బ్రత్యక్షమైన పెద్దభార్య సుబ్బమ్మయు, రంగరావు నిట్లు మాటలాడుకొనుచుండిరి.

సుబ్బ:—నేను బోయినపిమ్మటఁ దిరుగఁ బెండ్లి చేసికొనననని నీవనలేదా? ఆమాట మఱచిపోఁదగునా? అది నీప్రక్కలో నుండుట నేను సహింతునా?

రంగ:—బుద్ధిలేక చేసికొంటిని. క్షమింపుము.

సుబ్బ:—చేసికోఁబోయి చేసికోఁబోయి యిట్టి కొంకనక్కను జేసికొంటివేల?

రంగ:—అబ్బే! అది యనాకారణియా?

సుబ్బ:—దానిసౌందర్యమును జూచి మురిసిపోవుచున్నావా? ఛీ! ముద్దిమ్మని నీ వెంతబతిమాలిననైన నొప్పుకొన్నదా? నీవనఁగ దానికిష్టమనియే యనుకొంటివా?

రంగ:—ఆనాయం దిష్టత లేనేలేదా?

సుబ్బ:—నీపైఁ గావలసినంత రోఁత కూడను.

'అట్లైనఁ జెప్పుదీసి కొట్టెద'నని బిగ్గఱగ నఱపఁబోయి మాట పైకిరాక 'బే' యని యఱచి యులికిపడి రంగరావు నిద్రనుండి లేచెను..........................................

..........................................

గడగడ వడఁకుచున్నాఁడు; ఒడలినిండ ముచ్చెమటలు పట్టినవి; అటునిటు కొంతసేపు గుర్తులేకుండఁ జూచినాడు. కనులు రవంత మూసికొని తెఱచుసరికి దీపము గంటలాగున వెలుఁగుచున్నది. దోమ చెవియొద్దగాన మొనర్చుచునే యున్నది. చిన్నగుఱకఁ దీయుచుఁ గృష్ణవేణమ్మ ప్రక్కపాటుననే పండుకొని యున్నది. తహతహలాడుచున్న మనస్సును రవంత కుదుటఁబఱచుకొని నిదానించుకొని స్వప్నమంతయుఁ దిరుగఁదోఁడికొనినాఁడు. "నాపై రోఁతయే! నాపై రోఁతయే!" యని గుప్పిళ్లు గట్టిగఁ బట్టుకొని పండ్లు బిగఁబట్టి కొంతసేపు గింజుకొనినాఁడు. "అనిష్టత యుండవచ్చునుగాని యసహ్యతకూడ నేల యుండవలయును? పెద్దభార్య స్వప్నమునఁ జెప్పినమాటలసత్యములు కావు. ప్రస్తుతభార్య దుష్టశీల యయి యుండుట నిశ్చయము. దానికి మఱియొకనియం దిష్టముండుటచేతనే నాయం దింత రోఁతకలిగినది. ఆహా! ఆపాదశిరఃపర్యంతము మండుకొనిపోవుచున్నదే? ఏమి చేయుదును? దీనిసత్యము నా కెట్లు తెలియఁగలదు? అయ్యయ్యో? పులివిస్తరాకునాఁకితినే? ఎంతదుర్గతి సంభవించినది? ఓసినిర్భాగ్యురాలా! ఓసితుచ్ఛురాలా! నన్నుఁ దగులఁబెట్టితివే! పాంసులా! నీముద్దులమగనికి ముద్దిచ్చెదవుకాని నాకిచ్చెదవా? ముద్దిమ్మని నిన్నడిగి నానోరపవిత్రముగఁ జేసికొంటినే? థూ! థూ! నీగొంతుకోసిననైనఁ బాపమున్నదా!......
.........................................."

బీరువామీఁది గడియారము టంగుటంగున రెండుగంటలు కొట్టినది. రంగరావు మంచముమీఁదఁ గూరుచుండి భార్యవంకఁ జూచుచున్నాఁడు. ఆమె ప్రక్కపాటునఁ బండుకొనుట చాలించి వెలికిలఁబడి పండుకొని నిద్రించుచున్నది. మడఁచినకుడిచేయిఁ యెడమడొక్కపై నున్నది. ప్రక్కపాటున నిలువుగఁ జాఁపఁబడిన యెడమచేతివ్రేళ్లు పఱుపును రవంత దాఁటియున్నవి. ఒత్తగిలి పండినప్పుడు కుడిజెబ్బనందిటఁ బడిన మంగళసూత్రపునానిక నచ్చటనే యున్నది. కోలవాటగుమోమగుటచేతను నెత్తైన తలగడపైఁ దల యుండుటచేతను గడ్డముకొన నంటియున్న పైఁట చెఱఁగుటంచు బోడతరపుఁ బూలు చిన్నారి శ్వాసముచే రవంతకదలిన ట్లగపడుచున్నవి. ఒడ్డాణమునడుమ నున్న పుష్ప మనఃపండు రవంత దాఁటి తను స్పర్శనాభిలాషచే వట్టికడుపు నంటి పట్టుకొని సొమ్మసిల్లిన ట్లున్నది. కుడిపిక్క యెడమపిక్కపై వైచి

యుంటచేఁ గుడియెడమ బొట్టనవ్రేళ్ల గోళ్ళు లోకదాని నొకటి ముద్దుపెట్టుకొనుచున్నవి. ఒత్తగిల్లి పండుకొనునప్పుడు చెదరుటచేఁ గుడి చెంపముంగురులలో రెండంగుళముల పొడుగు గలకుచ్చొక్కటి తిలకమును సమీపించి దానిలోని కస్తూరి నాఘ్రాణించుచున్నదేమో? రవంత విడిన పెదవులనడుమనుండి పలువరుస యంచు కాసంత కానఁబడుచున్నది. మొగమెంత ప్రసన్నముగనైన నున్నది. బంగరు బొమ్మవలె నున్న యాబాలికను గాంచి భర్త-పనికిమాలిన భర్త- గుట్టుమను చున్నాఁడు; గుడ్లు త్రిప్పుచున్నాఁడు; తలపంకించుచున్నాఁడు..............................

ఆహాహా! అదియేమి? గుల్‌షబుపూవు వికసించిన ట్లామె నిద్రలోనే మందహాస మొనర్చుచున్నదే! దీపకిరణములగిలిగింతచేఁ బది దినముల బిడ్డఁడు నవ్వగ నెట్లుండునో యామెనవ్వట్లు ప్రకాశించుచున్నదే! స్వర్గమునుండి దిగి వచ్చిన ట్లున్న యానవ్వును గాంచి యింత రౌద్రస్వరూపుఁడైన రంగరావుకూడఁ జెల్లబోయినాఁడు. అట్టె జలదరించినాఁడు. అంతలో శాంతించినాఁడు........................

ఆమె యెందులకు నవ్వెనో! "నీ వెంత వెఱ్ఱిముండకొడుకవురా" యని యామె ప్రకృతి నవ్వియుండునేమో? అట్లుకాదు. ఆనవ్వులో హేళనకళంక మెటను గానఁబడలేదు. కాక పాప మింకఁ బసిబాలకావునఁ దోడిపిల్లలతో గ్రచ్చకాయ లాడుకొనినట్లో దాఁగుడుమూఁతలాడుకొనినట్లో కలఁగని యాసందర్భమునఁ గలిగిన చమత్కారమునకు నవ్వినదేమో? అదియుఁ గూడఁ గాదేమో? ఏమైననేమి? పాలమీఁగడవంటి యాపిల్ల గొంతు గోయుటకు భర్త యింతకుముందే కాదా సంకల్పించికొనినాఁడు. ఎందువలన నట్లు సంకల్పించికొనినాఁడు? ఆమె దుష్టచారిత్ర యగుటవలన— నిదర్శన మేమున్నది?— ముద్దియకుండఁ బండుకొన్నది —సాక్షి యెవరు? చచ్చిన పెద్దభార్య— ఎప్పుడు చెప్పినది? — స్వప్నములో. ఆహాహా! ఇల్లునిండిన మగఁడు! కథాలంకారమైన నాయకుఁడు!..............................

కాని రంగరా వేదో దీర్ఘాలోచన చేయుచున్న ట్లున్నాఁడు. ప్రస్తుతభార్యయందుఁ గ్రోధమున్న పెద్దభార్యమాటలకంటెఁ బ్రబలతరమైన నిదర్శన మేదైన లభించువఱకు నీమెను జంపఁగూడదు. అప్పుడైన నింతలావణ్యవతిని జంపుటకంటె విడిచిపెట్టుటమంచిదేమో! ఎందువలన? ఈమెను జంపిన యెడలఁ దిరుగఁ బెండ్లి కాదు—వహవ్వా! లోకోత్తరమైన కారణ మిక్కడకు వెల్లడియైనది. ఈమె పరిశుద్ధి స్పష్టమగువఱకు నీమెను దగులకుండ దూరముగాఁ బండుకొనవలయును. ఈరాత్రి కిటనే పండుకొనెదను.............వెలికిలఁబడి పండుకొనినాఁడు..............................

### స్వప్నము

తిరుగ స్వప్నమున సుబ్బమ్మ సాక్షాత్కా-రించినది. రంగరావు నామెయు నిట్లు మాటలాడుకొనుచుండిరి.

రంగ:—దానికి నాపై రోఁత యంటివి కదా? ఏందులకు రోఁతకలుగవలయును?

సుబ్బ:—అందఱ మర్యాదయు నొక్కటే. ఆకారణమున నీవు నన్నడుగఁ దగదు. నేను జెప్పఁదగదు.

రంగ:—ఆఁ—నే ననుకొన్నమాటయే నీవు చెప్పక చెప్పుచున్నావు. సరేకాని దాని దోషమును గూర్చి నాకుఁ దగిననిదర్శనము గలుగు టెట్లు?

సుబ్బ:—నిదర్శనము కలిగినయెడల నేమి చేయుదువు?

రంగ:—దానిని విడిచిపెట్టెదను.

సుబ్బ:—ఏడువలేకపోయినావు. అట్లు చేసినయెడల నీయింటియెదుటనే గుడిసె వైచి యది సంత సాగించును.

రంగ:—నామనస్సులోని సందేహమే నీవు చెప్పినావే. అటులైన నేమి చేయవలసి నది?

సుబ్బ:—ఏమి చేయవలసినదని నన్నడుగుట యెందులకు? నీవు దానిని జంపుటకు సంకల్పించుకొనియే యున్నావు కదా. దానికి నీచేతిలోఁ జావున్నది.

రంగ:—ఆమాట నిజమేలే. దానికెప్పుడు చావున్నది?

సుబ్బ:—ఎప్పుడో యన నేల? ఇప్పుడే.

రంగ:—చంపుటకుఁ బ్రబలమైననిదర్శన మేది? అది లభించునంతవఱకుఁ జంపను.

సుబ్బ:—మొత్తుకొనిన ట్లే యున్నది. పదిమంది నెదుటఁ బెట్టుకొని నీభార్య తప్పు చేసియుండునా?

రంగ:—ఆమాటయు నిజమే. మఱి అటులైన?

సుబ్బ:—నీమొగము- నీమోర. నీకు నిదర్శనము కావలయు నేమి? న్యాయస్థానములలో నిదివఱకు జరిగిన వ్యవహారములలోఁ బ్రబలనిదర్శన మొక దానిలో నైనఁ గలిగినట్లు నీవు వినియుంటివా? ప్రబలనిదర్శనములు లేవని న్యాయస్థానశిక్ష లాఁగినవా? గుఱికి బారెడు హెచ్చుతగ్గయినకారణములకొఁ గాలక్షేపము జరుగుట లేదా?

రంగ:—పోనీ! అట్టిస్వల్పకారణములైన నా కేమి లభించినవి?

సుబ్బ:—నేను జెప్పితిని గాదా? నే నసత్యమాడితినా?

రంగ:—నీకు దానికి శత్రుత్వము. నీ మాట నేను నమ్మను.

సుబ్బ:—అటులైన నీవుదానిని జంపవు?

రంగ:—ఊహుఁ.

సుబ్బ:—చేతఁగాని చచ్చుపెద్దమ్మను. నీవలన నేమగును? దానిగొంతుకోఱికి నేనే చంపెదను. (సుబ్బమ్మ 'ఆ'యని నోరు తెఱచి సమీపించును.)

రంగ:—దానిని ముట్టుకొనినయెడల నీ గొంతు నులిమెదను. (గొంతుపట్టుకొనినులుము చున్నాఁడు). నాభార్యను నేను జంపవలయును గాని నీ వేల చంపవలయును? చావుము చావుము. తన్నెదవా? నేలను బడఁగొట్టి త్రొక్కెదను. (కావు కేకలు వైచుచు మంచమునుండి క్రిందఁబడెను.)

రంగరావిట్లు క్రిందఁబడి కెవ్వన నార్చి కనులు తెఱచి చూచునరికిఁ దనకాళ్లముందు కృష్ణవేణమ్మ చచ్చి పడియుండెను. ఎంతదారుణహత్యజరిగెనో! రామరామా!

# ముండకోపనిషత్తు

మలకపల్లి శేషగిరిరావుగారు, శతావధాని

### ప్రథమముండకము - ప్రథమఖండము

శ్రీశుఁ డవ్యయుఁ డాద్యుండు సృష్టికర్త
విశ్వపరిపాలన క్రియా విదుఁడు దేవ
తాగ్రగణ్యుండు దనసృష్టియందు జ్యేష్ఠుఁ
డౌ నథర్వున కాత్మవిద్యను నచించె.

అట్టి బ్రహ్మవిద్య నథర్వుఁ డంగిరునకు
నంగిరుఁడు సత్యవాహున కాతఁ డాంగి
రసున కెఱిఁగించి రిట్టుల క్రమముగాను.

సన్నుతగృహస్థుఁ డైనట్టి శౌనకుండు
ప్రకటశాస్త్రోక్తముగ నాంగిరసున కెఱిఁగి
"యనఘ! యేపదార్థముచేత జనుని కెల్లఁ
దెలిసి గల్గెడి; నది యానతీయఁగదవె."

అనిన విని శౌనకున కిట్లు లనియె నాంగి
రసుఁడు పరమార్థమును గన బ్రహ్మవిదులు
ద్వివిధవిద్యలు గలవని తెలిపియుండి
రవియె పరవిద్య యపరవిద్యయు ననంగ

అలచతుర్వేదషట్శాస్త్రములను గలుగు
విపులమైన ధర్మాధర్మ విధులఁ దెలుపు
నట్టి దపరంబు పర మెట్టి దనిన వినుము
తెలియఁజేసెద నిపుడు. సుధీవరేణ్య!

గోత్రహీనంబు దృష్టి కగోచరంబు
వర్ణరహితంబు, నభవ మవ్యాకృతంబు
స్వప్రకాశ మనంతంబు శాశ్వతంబు
నగుపర బ్రహ్మమును దెల్పు నదియె పరము

అణువు స్థూలంబు సూక్ష్మ మన్యంబు లేక
ద్రుమముఁబోలి తటస్థభావమున వెలయు
నీశ్వరునిచేత నశ్రాంత మీజగత్తు
సతతసంపూర్ణ మహితసంగతి వహించె.

సాలెపురు వెట్లు దారంబు లోలిఁ గూర్చు
భూమి నెట్టుల నోషధుల్ పుట్టుచుండు
నట్టిరీతులఁ బరమాత్మ నధిగమించి
జనన మొందుచు నుండె నో మునివరేణ్య!

ఆపర బ్రహ్మమునను నవ్యాకృతంబు
ప్రాణము మనంబు సత్యంబు పంచభూత
ములును లోకములును గర్మములును జీవ
రాసులును సంభవించెను గ్రమముగాను.

సర్వవేత్త యెవండో శాశ్వతుఁ డెవండొ
జ్ఞానమయుఁ డెవ్వఁడో తపస్తత్త్వమెవఁడో
యట్టిపరమాత్మవలన బ్రహ్మమును మఱియు
నామమును రూపమును దదన్నమును గలిగె.

### ప్రథమముండకము - ద్వితీయఖండము

సత్యమై శాశ్వతంబై ప్రశస్తమగుచు
మును వసిష్ఠాదిసకల సన్మునులచేతఁ
జేయఁబడినట్టి కర్మముల్ సేసినయెడ
మీకు సౌఖ్యోన్నతులు గల్గు లోకమందు.

ప్రజ్వలింపఁ జేయఁబడిన వహ్నియందు
దక్షిణోత్తరదిశల శ్రద్ధాసభక్తి
కముల హోమంబు గావింపఁ గర్మచయము

పరమపావనతాతి విస్తరత లొరయు.

పౌర్ణమాసియు దర్శయు వైశ్వదేవ
వర్జిత మతిథిసహోమహాన్యంబు వీని
యూర్ధ్వలోకంబు లేడింటి నూడ్చివేయు.

ఘనకరాళి మనోజవ కాళి విశ్వ
రూపియును ధూమ్రవర్ణ సులోహిత స్ఫు
లింగినియు నన్నయట్టి సులీలమైన
సప్తజిహ్వలు గల హుతాశనుని వ్రేల్వ
నమ్మహాహుతు లర్కబింబాంశులగుచు
రమ్ము రమ్మని యాదరణమ్ముతోడ
జేరి పూజించి స్వర్గంబుఁ జేర్చుచుండు.

వితతమైన యష్టాదశ స్మృతుల నదృఢ
మైన కర్మముల్ శ్రేష్ఠంబు లనుచు నెవరు
సలుపనెంతురో వారలు సంతతంబు
దమము లేక జరామరణములఁ గాంత్రు.

కర్మమున మున్గుచుండు రజ్ఞానపరతఁ
బండితులమంచు శేముషీ పరులమంచుఁ
దలఁచుచుండెడిమూఢు లంధత వహించి
జననమరణైకసంసార జలధి యందు.

ప్రకృతిసంబంధమగు నీ ప్రపంచమందు
గర్మములు చేసి బాలిశుల్ జ్ఞానపథము
గాంచఁగా లేక మిగుల దుఃఖంబుచేతఁ
గూలుచుండు రధోలోక కోటియందు.

మూఢమతులు శ్రౌతస్మార్త ముఖవిశేష
కర్మములె మంగళములు మోక్షమున కంచుఁ
దత్పరత స్వర్గభోగసంస్థత వహించి
నరకలోకంబు గాంతు రనంతరంబు.

శాంతయుతులైన మహిత విజ్ఞానమతులు
స్వాశ్రమోపేతవిధులఁ బ్రశస్తి గాంచి
యర్కముఖమున సత్యలోకాదికముల
కరుగుచుందురు సంతతాహ్లాదములను.

కర్మమున వృద్ధినొందు లోకములఁ జూచి
యాపరముకన్న శాశ్వతమైనవస్తు
వెఱుఁగరాదని తద్జ్ఞానపరత గురుని
కడకుఁ జనవలె ద్విజుఁడు యోగ్యత వహించి.

ప్రవిమలాత్ముండు వేదపారంగతుండు
పృథుకళాఢ్యుండు సతత జితేంద్రియుండు
నై సదాశిష్యతతికి విజ్ఞానమహిమ
మెఱుఁగఁ జేసెడినాతఁడే గురువరుండు.

ద్వితీయముండకము - ప్రథమఖండము

క. ఓ శౌనకుఁడా! వినుము ప్ర
కాశించెడునగ్నియందుఁగడుమిఁఱుఁగురులు
ద్భాసిల్లెడు క్రియ నీజగ
మాశశ్వన్మూర్తి వలన నఖిలం బలరెన్.

ఆపర బ్రహ్మ మప్రాణ మజ మమూర్త
మఖిలపరిపూర్ణ మమరంబు నక్షరంబు
నై ప్రకాశించుచుండు బాహ్యాంతరముల
నతనికన్నను నింక నన్యంబుగలదె?

వినుమ యామూర్తవలన నా విర్భవించె
బ్రాణము మనంబు నింద్రియ వర్గములును
భూజలానలముఖపంచ భూతములును.

రహి ద్యులోకంబు శిరము నేత్రములు సోమ
భానులు దిశలు కర్ణముల్ వాగ్వివృతులు
శ్రుతులు ప్రాణంబు వాయువు క్షోణి పాద
ములు జగంబు మనము సర్వభూతసంత
తాంతరాత్ముం డతనికి సత్యంబు లరయ.

అగ్నివలనను సూర్యుండు నతనివలనఁ
జంద్రుఁ డాతనివలనఁ బర్జన్యుఁ డతని

వలన నోషధు లద్దాని వలన శుక్ల
మందుచేతను బహుప్రజ లైరి సుమ్మి.
కలిగె నాపరబ్రహ్మంబువలన నాగ
మములు గ్రతువులగున్నలుయజమానియు నియ
మములుసూర్యేందుమహితలోకములు ధనము
నరసురాండజ పశుపరంపరలు మిగుల
ప్రాణము నపానమును వ్రీహి యవలు తపము
శ్రద్ధయును సత్యమును బ్రహ్మచర్యము విధి.
హృదయకుహరాంతరంబునఁ బొదలియున్న
యేడుప్రాణంబులును మఱి యేడులోక
ములును జ్వాలలనునియేడు జిహ్వలును నేడు
విషయసమిధలు నిండె యా విర్భవించె.
సకలగిరులును నదులును సంద్రములును
సస్యసముదాయములు షడ్రసములు జీవ
తతులు సంతతపంచభూతమయమైన
విశ్వమంతయుఁ గల్గె నా విభునివలన.
సర్వపరిపూర్ణకుఁడు జగత్సాక్షియాట
దపము లమృతంబు వ్రతము నతండె వాని,
హృదయగుహయందు నలరు పరేశ్వరు నమృ
తస్వరూపంబు గాంచెడి తత్త్వవిదులు
ప్రకృతిసంబంధ మంటరు ప్రవిమలాత్మ!

ద్వితీయముండకము - ద్వితీయఖండము

సర్వపరిపూర్ణమై మహాఖర్వమై ప్ర
సిద్ధమై పూజనీయమై చెలఁగునట్టి
సదమలాచారమహిత తేజంబు మదినిఁ
దెలిసికొనుమయ్య! ప్రియతమా!ధృతివహించి.
శుద్ధతేజంబు గలదేదొ సూక్ష్మసూక్ష్మ
మేదొ లోకంబులున్ లోకు లెందునుండు
రదియె యక్షరమున్ బ్రహ్మ మదియె యమృత
మాత్మ సత్యము వేధవ్య మనియెఱుంగు.
ఓ మునీశ్వర! ఉపనిషత్ ప్రోక్తమైన
సుమచిరోంకార మను ధనుస్సుఁగొని ధ్యాన
మానసాన నుపాసనాఖ్యాన బాణ
మెక్కిడి పరంబు లక్ష్యంబు దక్కు మిఁక.
ఇట్లు వచియించు నోంకారమే ధనుస్సు
శరమె జీవ్రంపు లక్ష్యమే పరుఁడు గాన
స్థిరతరాత్మను జీవ్రఁ డాపరము నరయఁ
దన్మయంబగు బ్రహ్మంబు దానె యగును.
ఏమహాత్మునియందు సంహృతము లమ్యో
మహిత భూమ్యంతరిక్షాది బహుజగంబు
లట్టిసర్వేశు నాత్మను నక్షరునిగఁ
దెలియునదె సుమ్మి సంసారజలధి తరణి.
బంధిచక్రమునం దాకు లుండునట్టు
లుంచు నాడులు మనమున నుండు జీవ్రఁ
బ్రణవమనియెంచి ధ్యానింపఁ బరమశుభము
లొదవుచుండెడి మీకు మహోన్నతముగ.
ఎవనిమహిమను భాసిల్లె నీజగంబు
విపులజ్యోతిర్మయుఁడు సర్వవిదుఁ డెవండు
అట్టి సర్వజ్ఞుఁ డీశ్వరుఁ డంతరాత్ముఁ
డై ప్రకాశించు హృదయపద్మాంతరమున.
ప్రాణదేహ మనోమయుం డైనవాని
నమృతమయుని సదానందు నాత్మదృష్టి
హృత్సరోజంబునను: జేర్చి చెలఁగిఁ గాంతు
రనయమును బ్రహ్మవిదులైన యట్టిమునులు.
కార్య కారణరూప విఖ్యాతమైన
యాపరబ్రహ్మ మారయ నలఘుమతిని
సకలబంధంబు లెడఁబాసి సంగరహితుఁ
డై ప్రకాశించి జ్ఞాని విజ్ఞానరూఢి.

విమలమై యమృతమంబు హృత్కమలమందు
ఘనత జ్యోతిర్మయాకారమునఁ జరించు
నట్టియవ్యయ బ్రహ్మతేజోంశకుని ని
రంతరము గాంతు రెలమి బ్రహ్మైకవిదులు.

రవిశశాంకాగ్ని విద్యుత్పరంపరాక్ష
తతి వెలుంగఁగ నేర దెంతయును నెవని
యతులతేజంబు మున్దట నతనిచేత
సర్వము వెలుంగు నతఁడె తేజఃప్రదుండు.

ప్రాక్ప్రతీచియామ్యోత్తర భాగములను
మఱియు నూర్ధ్వాధరాది సమస్తగతుల
విపులతేజస్వియగుచు వ్యాపించియుండె.

తృతీయముండకము - ప్రథమఖండము

క్షరము గలయట్టిదేహ వృక్షంబునందు
వరలుజీవేశ్వరులలోనఁ గరము జీవుఁ
డంధత వహించి కర్మఫలాదికములఁ
గాంచు నీశుఁ డయ్యవి యంటకయె వెలంగు.

అజ్ఞత శరీరమే యాత్మ యనుచు జీవుఁ
డందు దుఃఖించుచుండు మోహమున నెప్పు
డవ్యయబ్రహ్మసామర్థ్య మాత్మఁ దానె
యని యెఱుంగునో యప్పుడే కను సుఖంబు.

కర్తయై బ్రహ్మమై రుక్మ ప్రకాశమైన
వరము నెప్పుడు విజ్ఞాని యరయఁగలుగు
నప్పుడే కాంచుఁ బాపపుణ్యములు లేని
పరమసామ్యంబు దుఃఖసంకరుఁడు గాక.

ఎవఁడు ప్రాణస్వరూపకుం డెవఁడు సర్వ
భూతమయుఁ డట్టిపరమాత్మ బుద్ధియందు
నాత్మరూపునిఁగా నెంచు నట్టిజ్ఞాని
యాత్మరతిఁ గల్గి శ్రేష్ఠుఁడై యలరుచుండు.

పీతభవులైన ధీరు లేవిమ ౹ తేజ
మాత్మరూపంబుగా నెంచి యలరుచుంద్రొ
యట్టిజ్యోతిర్మయాకార మైనబ్రహ్మ
మెఱుఁగఁబడు జ్ఞానదీప్తిని హృన్నభమున.

సత్యము జయించు నన్ృతంబు చక్కఁగాదు
సత్యమున దేవయానంబు సవిరళమగు
జ్ఞాన మే బ్రహ్మమున నాప్తకాములైన
మునులు గాంతురయ్యదె సత్యమునకు మేలు.

దివ్యమై సూక్ష్మసూక్ష్మమై భవ్యమై య
చింత్యమై స్వప్రకాశమై శ్రేష్ఠమైన
యాపరం బజ్ఞులకు దూరమై మనీషు
లకు సమీపమై హృత్కమలమున మెఱయు.

ఒలసి నిజచక్షురాదికములను గాని
తతవచోర్భటిచేఁగాని తపముఖాది
విధులచేఁ గాని యామహావిభుని జనుఁడు
గాంచఁగా లేఁడు జ్ఞానసంగతినె కాంచు.

ప్రాణవాయువు లైదుగాఁ బరిణమించి
యెనరు దేహంబునను సూక్ష్మమునఁ జరించు
నట్టిబ్రహ్మంబు మహితశుద్ధాత్మచేతఁ
దెలియవలెసుమ్ము;హృదయమింద్రియగతంబు;

విమలవిజ్ఞాని తనమానసమున నెట్టి
వాంఛలును లోకములు సదా వలయుననును
యట్టివన్నియు బ్రహ్మమం దలరుఁ గాన
భూతి కాముని కాతని పూజ వలయు.

తృతీయముండకము - ద్వితీయఖండము

ఏపరబ్రహ్మమున నెప్పె నీప్రపంచ
మట్టిబ్రహ్మంబు గాంచెడి నాత్మవిదులు
గడఁగి నిష్కాములై గుర్వుగా నుపాస
నములు సేతురో వారె బ్రహ్మమును గాంత్రు.

ఎవఁడు బహుకామ్యములు గోరు హృదయ
నతఁడు పుట్టెడివాని నందందఁ బెలుచ [మందు
నాత్మవిజ్ఞాని యగువాని కాప్తకామ్య
మున శరీరంబు నశియించు మునివరేణ్య!

వినుము బ్రహ్మంబు వాక్కుచే వినుటచేత
నలఘుమేధను బొంద శక్యంబుగాదు
యాత్మవిదులకుఁ దత్తేజ మభిలషించు
నిచ్ఛచేతనె విపులమై యెఱుఁగఁబడెడి.

అలవి గానిది దృష్టి కయ్యాత్మతేజ
మటులఁ గావున జ్ఞాని విజ్ఞానజనిత
నియమితాలింగుఁడై మహా నిష్ఠతోడ
సాధనముసేయఁ దత్ప్రకాశమును గాంచు.

ఆత్మదర్శనులౌమును లాత్మవిదులు
జ్ఞానతృప్తిని బహుళ కృతార్థు లగుచు
సర్వమయమైన యాత్మసంస్థత వహించి
బ్రహ్మమునుగాంచుచుందు రోప్రవిమలాత్మ!

శౌనకమహర్షి! ఉపనిషద్ జ్ఞానవిపుల
మహితరార్థాఢ్యులౌ మహామహులు మునులు
విమలమతి యోగరూఢి బ్రహ్మమునఁ జేరి
బ్రహ్మతేజస్కులై ముక్తిఁ బడయుచుంద్రు

కళలు గర్మము లింద్రియంబులును స్థితులు
జ్ఞానరూపౌఘజీవాది కములు మిగుల
నమృత మజ మప్రమేయ మవ్యయ మనంత
మైన బ్రహ్మంబునం దైక్యమై వెలుంగు.

నదులు లహరీనియుక్తి సంద్రములఁ జొచ్చి
నామరూపంబులను విడనాడుపగిది
బ్రహ్మవిదుఁడును నామరూపములు వీడి
యద్వితీయపర బ్రహ్మ మందు మెఱయు.

ఆపర బ్రహ్మమెవఁడు ప్రత్యక్షులీల
నాత్మఁ దెలియనో వాఁడె బ్రహ్మైకనిరతి
నమృతమయుఁడై భవాదుల నంటఁ డట్టి
వంశమున బ్రహ్మవేత్తలే వరలుచుంద్రు.

సతతశాస్త్రోక్తకర్మానుసారు లెవరు
విపులమోక్షార్థులై యగ్ని వ్రేల్తు రెవ్వ
రల యథర్వణవేద విద్యాప్రకాశు
లైనవారికి వచియింపు మాత్మవిద్య.
మున్ను వచియించె సత్యమై వన్నె కెక్కు
నక్షర బ్రహ్మవిద్యామహత్త్వ మాంగి
రసుఁడు శౌనకునకు నిట్లు బ్రహ్మవేత్త
లైన ఋషులకు వందన మాచరింతు.

ఇది ద్వితీయఖండము సమాప్తము.



# వానప్రస్థులు

"సునీతిశ్రమణుఁడు"

హైందవ ధర్మశాస్త్రములన్నియు, వర్ణాశ్రమములను ధర్మమూలములుగఁ జాటింపుచున్నవి. శ్రుతియందును మూలవర్ణములు పేర్కొనఁబడినవి. ధర్మశాస్త్రములును బురాణములును సత్యధికముగ వర్ణోత్పత్తిభేదములంగూర్చి తెల్పుచున్నవి. పాశ్చాత్యపండితులు సంస్కృతవాఙ్మయపరిచయముఁ గావించిననాఁటనుండియు వర్ణవిషయికములైన సిద్ధాంతము లెన్నియో వెలువడినవి. అందు నాశ్చర్యము లేదు. మఱి యేదేశమున జను లీరీతిగ విభజింపఁబడకుండుటంబట్టి భారతవర్షపరిచయముగలవి దేశీయులకు వర్ణవిభాగము వింతగఁ గన్పట్టకమానదు. కొంతవఱకు వృత్తులు జాతుల ననుసరించియుండుటంబట్టి యీవింత హెచ్చినది. యవన మెగాస్థనీసు క్రీస్తుజననమునకు మూఁడుశతాబ్దములకుఁ బూర్వము భారతవర్షమునఁ దా నుండి చూచినవిషయములంగూర్చి వ్రాసినపొత్తములలో హైందవసంఘమునను౦డువర్ణముల నేడింటిగఁ బేర్కొనెను.

వృత్తులే కాక యాశ్రమములుగూడ వర్ణములంబట్టి నియమింపంబడినట్లు ధర్మశాస్త్రములవలన దెలియవచ్చుచున్నది. మన్వాది ధర్మశాస్త్రములు ద్విజులకుఁ జతురాశ్రమములఁ బేర్కొనుచున్నవి. శూద్రులంగూర్చిమాత్ర మేమియుఁ గాన్పింపదు. వారలకు ద్విజులసేవయే నియమింపంబడినది. తపము నాచరించెడిశూద్రు లెట్టులు వధ్యులుగఁ జాటింపంబడిరో శంబూకునికథవలనఁ దెలియవచ్చుచున్నది. కాని భవమందైన నిడుమల సహింపనోపక సంసారవిముఖతం జెందిన శూద్రులు వనవాసమునకుం జనినవారలను ద్విజన్ములు బాధించియుండరని మానమ్మకము. విఖనసాది ధర్మశాస్త్రకారులు బ్రాహ్మణులకు బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థయత్యాశ్రమముల నాల్గింటిని, క్షత్రియులకు నందు మొదటి మూఁడింటిని, వైశ్యులకు నందు మొదటి రెండింటినిమాత్రమే చెప్పిరి. రామాయణంబునను లక్ష్మణుఁడు శ్రీరామునితో ముచ్చటించుచుఁ బుత్రులు యుక్తవయస్కులైనతరి రాజ్యభారంబు వారలపై నిడి వానప్రస్థాశ్రమమును స్వీకరించుట తమ కులాచారమని నుడివి నట్లున్నది. శ్రీరాముఁ డీరీతిగనే తన పూర్వులాచరించినటులఁ జెప్పెను. ఇక్ష్వాకువంశస్థులఁ గూర్చి కాళిదాసుఁ డిటుల వ్రాసెను.

శ్లో. శైశవే ఽభ్యస్తవిద్యానాం
యౌవనే విషయైషిణామ్,
వార్ధకే మునివృత్తీనాం
యోగే నాంతే తనుత్యజామ్.

ఏతన్మహాకావ్యంబుననే రఘుమహారాజైహికభోగ విముఖుండయి తరుణవయస్కుండగు పుత్రునకు సామ్రాజ్యచిహ్నమగు శ్వేతఛత్రంబు నొసంగి భార్యాయుక్తుండయి

యిక్ష్వాకుకులధర్మానుసారముగఁ దపోవనంబు నకుం జనినట్లు చెప్పఁబడియున్నది. మహాభారతంబునను దుర్యోధనుండు మడుగున దాగి యుండి యుధిష్ఠిరదూరితుండై యాతనికిట్లుఁ బ్రత్యుత్తర మిడెను.

క. ఏ నింక సమర మొల్లను
హీనాయక! నీవు రాజ్య మిచ్చిలి శాంతిం
గానకుఁ జని వల్కలపరి
ధానుఁడనై తపము సలిపెదను మునులకడన్.

పుత్రవినాశానంతరము, ధృతరాష్ట్రుండు భార్యాసమేతుండై వనవాసంబుఁ గాంచుటకుం జని దావానలదగ్ధుం డైనట్లుఁ జెప్పంబడియున్నది. ధ్రువుండు పితృనిరాకృతుండై బాల్యముననే తపోవనమునకుం జనినట్లు భాగవతము నుడువుచున్నది. యుధిష్ఠిరుఁడు కర్ణవృత్తాంత మెఱిఁగి యర్జుననితో నిటుల విలపించెను.

క. "మన కేటిరాజ్య మొండొక,
జనపదమున కేఁగి భైక్షచర్యావిధి జీ
వనము నడిపికొని యుండుద,
మనఘా! యట్లయిన సుఖుల మవుదము సుమ్మీ."

ఆచార్యభిక్షు వానప్రస్థాశ్రమమును గూర్చి వ్రాయుచు నీయది బ్రాహ్మణవాఙ్మయమునఁ గొంత యసాధారణముగఁ గన్పట్టినను బ్రాహ్మణదేశంబుల రాజువృద్ధుండైన రాజ్యభారము జ్యేష్ఠపుత్రునిపైఁ బడవేసి కాంతారవాసమునకుం జనుట కన్పట్టక పోలేదని వ్రాసెరి. వానప్రస్థాశ్రమంబు బ్రాహ్మణునికివలె క్షత్రియునకును బ్రతిధర్మశాస్త్రమును ద్వితీయగ్రహణీయాశ్రమమని యుద్ఘోషింపుచుండఁ బురాణాదులయం దెన్నియో మన కీ సంబంధమయినగాథలు గన్పించుచుండ భిక్షుదొరవా రెందులకట్లుల వ్రాసిరో తెలియరాకున్నది.

వానప్రస్థుం డెట్టులు జీవింపవలయును? వానివ్యాపార మెద్ది? భార్యాయుక్తుండై కాని యద్వితీయుండై కాని, వల్కలంబుల ధరియించి, గ్రామంబుఁ బరిత్యజించి, వనంబుఁ జేరి, పర్ణశాల నిర్మించుకొని, గ్రామభోజనంబు విసర్జించి, ధరాశాయియై, కందమూలఫలనీవారాదుల భుజింపుచు బ్రహ్మచర్యమునఁ దపము సల్పుచుఁ గాలముఁ గడుపవలయును. అహింస, శమదమాదిగుణములు, తపశ్చర్యము, బ్రహ్మచర్యము, బ్రహ్మజిజ్ఞాసఁ గలిగి జీవించుటయే యీయాశ్రమికి ముఖ్యములు. వానప్రస్థులలో ననేకశాఖలవార లున్నారని వైఖానస ధర్మప్రశ్నవలనఁ దెలియవచ్చుచున్నది. అట్టివా రెవ్వరనిన:—

1. ఔదుంబరులు
2. వైరించులు
3. వాలఖిల్యులు
4. ఫేనపులు
5. కాలశికులు
6. ఉద్దండ సంవృత్తులు
7. అశ్మకుట్టులు
8. ఉదగ్రఫలినులు
9. దంతోలూఖలికులు
10. ఉంఛవృత్తులు
11. సందశనవృత్తులు
12. కపోతవృత్తులు
13. మృగచారికులు

14. హస్తాదాయినులు
15. శైలఫలకాదినులు
16. అర్కదుగ్ధాశనులు
17. బైల్వాశనులు
18. కుసుమాశనులు
19. పాండుపత్రాశనులు
20. కాలాంతరభోజనులు
21. ఏకకాలికులు
22. చతుష్కాలికులు
23. కంటకశాయినులు
24. వీరాసనశాయినులు
25. మౌనులు
26. పంచాగ్నిమధ్యశాయినులు
27. ధూమాశనులు
28. పాషాణశాయినులు
29. అభ్యవగాహినులు
30. ఉదకుంభవాసినులు
31. అవాక్శిరస్కులు
32. సూర్యప్రతిముఖులు
33. ఊర్ధ్వబాహుకులు
34. అధోబాహుకులు
35 ఏకపాదస్థితులు

ఈ పదములయర్థంబులఁ బట్టియే వివిధ శాఖలవారి వ్యాపారములం గుర్తెరుంగవచ్చును. ఇప్పటికిని మనము దేశమునందుఁ గంటకశాయినులను పంచాగ్నిమధ్యశాయినులను గనుంగొనఁగలముగాని యట్టివారలు భేషజమున కీవ్యాపారముఁ గలవారలై, ధనము నార్జించి జీవింపుచున్నారు.

బుద్ధుఁడు జాతిభేదము లేక యందఱును నీయాశ్రమమును స్వీకరింపనచ్చునని బోధించెను. మనుజుండే జాతివాఁడైనను జాతిని గోల్పోయి బౌద్ధసంఘమును జేరిన బౌద్ధశ్రమణుం డగును. మఱియు సంసారవిముఖతం జెందిన ముదుసలులే కాక రాజ్యవిభవోన్నత్యముల ననుభవించురాజులు, అపారసౌఖ్యంబుల నోలలాడుచుండు తరుణవయస్కులగు నృపకుమారులు, అధికైశ్వర్యయుక్తులగు వైశ్యులు, దారాపుత్రాదులను సకలైశ్వర్యములను విడనాడి హిమవత్ప్రాంతకాంతారప్రదేశములకుం జని, కందమూలఫలాశనులై, శాంతిమయంబగుజీవనమును సల్పుచుండిరని బౌద్ధవాఙ్మయమునుండి తెలియవచ్చుచున్నది. బుద్ధుఁడు శాక్యులకు యువరాజై యుండియు యౌవనముననే ప్రియురాలినిబుత్త్రునివిడనాడి శాంతిం బొందుటకు విపినంబులకుం బోయిన సంగతి జగద్విఖ్యాతంబు. జాతకకథలలో నీసంబంధమగు విషయము లెన్నియో యున్నవి. "యువంజయజాతకము" అట్టిదొకకథ. ఒకదినమున యువరాజు ప్రాతఃకాలముననే రథముపైఁ బ్రభావశీలురగు ననుచరులతో, గూడ నారామంబునకుం జని యందు నతిరమ్యంబగు ప్రదేశమును జేరెను. తుషారబిందువులు గ్రాసదళంబులపైని యూర్ణనాభితంతుజాలంబులపైని సరములయందైన ముత్యములమాడ్కి మెఱయుచుండఁజూచి సూతుని 'నవియేమి' యని ప్రశ్నించెను. అతఁడు 'హేమంతఋతువునం గనంబడు తుషారబిందువు'లని ప్రత్యుత్తరమిడెను. సాయంసమయమునఁ గుమారుండు

తిరిగి యచటకుం జని బిందువులను గానక 'యవి యేమయిన' వని యడిగెను.

సూతుఁడు:—'ఓరాజా! సూర్యుం డుదయింప నవి భూమిపై నంతరించును.' కుమారుం డిది విని యధికదుఃఖంబున నిట్టుల విలపించెను.

"ఈజీవనంబును గ్రాసదళంబున నీటిరుగ నుండు మంచుబొట్టువంటిది. రోగజరామరణంబులు నన్నధిగమింపక పూర్వము, జననీజనకులయాజ్ఞ వడసి నే శ్రమణుండ నయ్యెదను"

పురమునకుం జని పేరోలగమున వైభవముతో నాసీనుండై యున్న జనకునిం గని భక్తిపురస్సరముగ యాతని నభివందించి నిర్నికేతనస్థితి నవలంబించుటకు నాతనియనుజ్ఞ వేఁడుచు నిట్టు లనియెను.

"మిత్రామాత్యపరివృతుండైన రథని యంతృప్రభువగువాని నమస్కరించుచున్నాఁడను. ఓమహారాజా! నేను నిర్మానుష్యప్రదేశమును బ్రవేశింప నున్నాఁడ. కాన నందులకు భవదాజ్ఞను వేఁడుచున్నాఁడను." రాజాతని నాయుద్దేశమునుండి మరలింపంబూని యిట్టులఁ జెప్పెను.

"నీకు సంతోషము లేకున్న నేను నీ కదియొసఁగ గూర్చెద. నీకు వ్యథఁ గలుగఁ జేయువాని నే నాశనం బొనర్చెద. కాంతారములకుం జనకుము, ఓయువంజయా! చనకుము."

యువరాజు:— "నాకు సంతోషవిరామంబు లేదు. నాకు దుఃఖంబుఁ గలుగఁ జేయువాని నే నెఱుంగను. కాని జరావినాశంబుఁ జేయనేరని జ్యోతిని నేఁ బ్రజ్వాలంబుగ నొనర్పఁ గోరుచున్నాఁడను". ఇది విని రాజు ప్రియపుత్త్రుని యట్టికార్యంబునుండి మరలింపం బూనఁ బ్రయత్నించెను గాని కుమారుండు వనవాసమునకుం జనఁ గృతనిశ్చయుండై యుండెను. సంసారపరిత్యాగంబుఁ గావింపవలదని ప్రార్థించుజననితో నాతఁ డిట్టులనియె "ప్రభాతంబున గ్రాసదళలంబమానంబగుతుషారబిందువును బోలియున్నది మనుష్యజీవనంబు. కాన నోప్రియజననీ! న న్నీప్సితకార్యంబునుండి నివర్తింపఁ జేయకుము."

పైఁ జెప్పంబడిన కథయం దెట్టు దుషారబిందువు, సంసారవిముఖతను, జీవితానిత్యవిషయికంబగుజ్ఞానమును గలుగఁ జేసెనో యట్టులనే యింకొకనికిఁ బలితకేశంబు సంసారపరిత్యాగంబును, వనవాసంబును సమకూర్చెను. "కుల్లసుతసోమజాతకం"బున నాపితుఁడు సుతసోముని శిరమునుండి ధవళకేశంబుం దీసి యతనికిం గనుపఱుప సుతసోముఁడు తృతీయాశ్రమమునం బ్రవేశింపఁ గృతనిశ్చయుం డాయెను. జనకుం డెన్నిరీతుల బోధఁ గావించినను నాతఁడు వినఁడాయెను. తుదకు "వత్సా! సుతసోమా! నీజననీజనకులయందు నీకుఁ బ్రేమ లేకుండినను ద్వదీయసంరక్షణవిరామంబున జీవింపలేని యీ లేఁబ్రాయంపుపుత్త్రికాపుత్త్రులను గనుము. వారు యుక్తవయస్కులైనపిదప నీవు నిర్నికేతనుండవగుము." కాని జనకుని బోధలు, గర్భవతియగు భార్యయొక్క ప్రార్థనలు నిజకంఠలంబమానుండగు సప్తవర్షీయుండైన పుత్త్రునిప్రార్థనలు కృతనిశ్చయుం

దగునాసుత సోముని నీప్సిత కార్యమునుండి మర
లింపఁ జాలకుండెను.

ఫిక్కుదొరవారు రాజాశ్రితులగు బ్రాహ్మ
ణులు వానప్రస్థాశ్రమంబునఁ బ్రవేశింపం
బూనిన రాజాజ్ఞఁ గైకొని యటులఁ జేయ
వలసియుండెడిదేమోయని యూహింపుచు
న్నారు. అందుల కనుగుణంబుగ దొరవా
రొక జాతక కథను గనుపఱచిరి.
అందుఁ గశ్యపుండను రాజపురోహితపుత్రుం
డిటులఁ జింతించుకొనెను "నామిత్రుఁడు రాజై
నవాఁడు నిశ్చయముగ నాకాతఁడు ప్రబల
సాహాయ్యం బొనర్పఁగలఁడు కాని నాకేఁదు
ల కాతనిసాహాయ్యంబు? మాతాపితృలయు,
నృపునియొక్కయు ననుజ్ఞవడసి నిర్నికేతనస్థి
తిని జెందెద." ఈకథ దొరవారి యూహ కంత
ప్రమాణమైనటులఁ గాన్పింపదు

మిత్రాదులచేఁ గావింపఁబడిన ద్రోహమో,
లేక దుఃఖపరంపరలచేఁ గలిగిన సంసారవిము
ఖతయో, లేక ప్రపంచంబునఁ బ్రతిదినమున
దృష్టంబులగు క్రౌర్యాధర్మంబులో, ఇతరుల
యన్యాయచర్యలో, తఱచుగ మనుజునిదృతీ
యాశ్రమమునఁ బ్రవేశింపఁ జేయును. సవతి
తల్లి వెక్కిరింపులును, పితృప్రదర్శితంబగు
నిరపేక్షయు, లేఁబ్రాయంపుధ్రువుని సకలసౌ
ఖ్యస్థానంబులగు రాజప్రాసాదంబులనుండి కష్ట
భూయిష్ఠంబులగు కాంతారంబులకుం బంపివే
సినవి. చిరకాల మిడుమలఁ బడిపడి యకుం
ఠితసామ్రాజ్యముఁ బొందియు నజాతశత్రుండు
శాంతిఁ గానక బంధునాశనంబున సంపరితప్త
మనస్కుండై యడవులం జేరెను.

ఇటులనే జాతకకథలలోఁ గొన్నికథలు
పైఁజెప్పంబడిన కారణములచే సంసారవిము
ఖతం జెంది తృతీయాశ్రమప్రవేశముం గావిం
చిన వారింగూర్చి యున్నవి. బ్రాహ్మణబ్రహ్మ
చారి యొక్కరుఁడు, ఆచార్యుని "ప్రపంచ
మున సంపదలఁ బొందుమార్గం బెద్ది?" అని
ప్రశ్నింప, "లోకజ్ఞానము గలయాతఁడు దుష్ట
మార్గావలంబనను, కపటప్రబంధంబునను,
పొందనోపు"నని ప్రత్యుత్తరమిడ; "భిక్షాపాత్ర
హస్తంబునఁ బూని మనుజుండు నిర్నికేతనుం
డయి సంచరించిన నీపాపచరితంబుకంటె" మేల
ని నుడువుచు సన్న్యాసి యయ్యెను. సుఖము
లుగాని, కష్టములుగాని ద్విజన్ముల నేకాధికా
రమున నే యుండక, అన్యసాధారణంబులై
ప్రతిమనుజుని జాతిభేదంబులేక యల్లలాడించు
చున్నవి. వ్యథావిరామంబును బ్రతిమనుజుం
డును గోరుచుండును. సంసారమందైనదుఃఖ
ములు మిక్కుటములై దుర్భరంబులైన య
ట్టివాఁడే జాతివాఁడైనను, సంసారవిముఖుం
డగునను టలో వింత యేమియుఁ గన్పడదు.
ప్రపంచమున నధికారస్థానముల నధిష్ఠించువా
రలు గావించు నన్యాయకార్యములు, బలవం
తుల దుష్టప్రవర్తనలు, జనులలోఁ గన్పట్టు
బీదరికము మొదలగునవి భూతానుకంపఁ గలి
గిన సువిచారునకు, ఖేదంబుఁ గలుగఁ జేయు
ను. అట్టివానికిఁ గాంతారవాసంబె శ్రేష్ఠతమం
బని తోఁచిన నాశ్చర్యం బేమియును లేదు.
కాని సంసారపరిత్యాగముఁ గావించునపుడు
దుఃఖితాప్తబాంధవులు నిరోధముఁ గావిం
తురు. "బంధనగరజాతకం" బిందునకుఁ దార్కా

ణంబు. పూర్వము బ్రహ్మదత్తుఁడు వారాణసిని బాలించుచుండినపుడు, బోధిసత్త్వుఁ డొకబీద గృహస్థునికుటుంబమున జన్మించెను. కుమారుండు పెద్దవాఁడగునప్పటికి జనకుఁడు మృతిం జెందెను. పుత్రుండును వేతనమునకై కొలువు సేయుచు మాతృసంరక్షణఁ గావించుచుండెను. వానిజననియు వానికయిష్టముగనె సువంశజాత యగునొకకన్నియను వానికి వివాహముఁగావించెను. వివాహమైనకొలఁదికాలములో నాతనిజనని మృతిం జెందెను. ఆతనిపత్నియు గర్భమును దాల్చెను. భార్యగర్భవతియని గుర్తెరుంగక నాతం డొకదినమున నామెతో నిట్టులనియెను.

భర్త: "దేవీ! ఉద్యోగంబువలన నీయంతట నీవు జీవించుటకుఁ బ్రయత్నముఁ గావింపవలయు; ఏలనన నేను సన్న్యసింపనున్నాఁడను.

భార్య: "నాథా! నేనుగర్భవతిని. శిశుజననానంతరము వఱకును మీరుండి వానిం జూచినతరి సన్న్యసింపుఁడు".

అటులనే యాతఁడు భార్యసుఖప్రసవిని యగువఱకు నుండి శిశుజననానంతరమున నామెతో నిటులఁ జెప్పెను.

"నీవు సుఖప్రసవినివై తివి. కాన నేను సన్న్యసించెదను.

భార్య: "ఓ దేవా! శిశువు పాలుఁద్రావుట విడుచువఱకును మాత్రమె మీరుండుఁడు"

కొలదికాలములోనె యామె రెండవసారిగర్భముఁదాల్చెను. "నే నామె యంగీకారమునుఁ బడయువఱకును వేచియుండిన నెన్నండును సన్న్యసింపనేరను. కాన నే నామెతో నేమియును జెప్పకుండగనే సంసారమును బరిత్యజించి సన్న్యసించెదను" అని చింతించుకొనుచు, గృహము విడచి చనెను.

---

## విప్రలబ్ధ

కొత్తపల్లి సుబ్బణాచార్యులు (సాహితీసమితి)

మలయానిలములు చెలువుగ నొలయగ
　నలరులనెత్తావులు చెలఁగఁగ
భవనాగ్రోద్యత్ప్రదేశమందుఁనఁ
　బ్రవితతముత్సంభ్రమ మెసఁగఁగ.
వెన్నెలవేళను నిన్నాతోఁటకుఁ
　గ్రన్నన రమ్మని కడకిటులక

మోస మొనర్చెను మోహనాంగ! నీ
　యాసలు వృథాలౌనటు సేసెక
వయసుదాన! యిఁక వ్యాకుల మేలా?
　ప్రియునిం దూఱుట నయమొక్కో?
రమ్మా! ముద్దులగుమ్మా! యింటికి
　నమ్మిగ నుండుట వల దచటక.

# కాలరథము

కుందూరి ఈశ్వరదత్తు గారు, బి. ఏ,

[‘విశ్వభారతి’ మాఘమాససంచికయందుఁ బ్రకటింపఁబడిన రవీంద్రుని ‘కాలరథము’ అను ఏకాంక నాటకమునకు భాషాంతరీకరణము]

## నాటకమునందలి పాత్రలు

| | | | |
|---|---|---|---|
| రాజు | క్షత్రియయోధులు | శూద్రనాయకుఁడు | చారుఁడు |
| పురోహితుఁడు | ధనపతి-వైశ్యశిఖామణి | శూద్రసంఘము | కవి |
| మంత్రి | ధనపతి పరివారము | పౌరులు | |

(కాలరథము సభికులకు దృష్టిగోచరముకాదు)

### రంగము: రాజమార్గము

(ప్రవేశము-కొందఱు పౌరులు)

మొదటిపౌరుఁడు:—(రథము నవలోకించుచు) వృద్ధకాల పిత్రుని రథోత్సవము సమీపించినది. కాని యతని తేరు కదలక స్తంభించినట్లు కనఁబడుచున్నది. కదల నని ప్రతినఁ గైకొనినదా యేమి? అది యేరితప్పిదమో దైవజ్ఞునివలన నాకిదివఱకే తెలిసినది.

రెండవ పౌరుఁడు:—అది యెవ్వరితప్పును గాదు. వృద్ధకాల పిత్రుఁడలసియుండవచ్చును. అతనికి విశ్రాంతి కావలెను.

మొ-పౌ:—అసందర్భ ప్రలాపము లేల? కాలము తిరుగకున్నచో మనము బ్రదుకుటెట్లు? అదిగో, క్రిందబడియున్న రజ్జువు నీక్షింపుము. ఏనాఁటిత్రాడు! అసంఖ్యాకులైన జనులు దానిని లాగియుందురుసుమీ! కాని, యెప్పుడు నీవిధముగా నది ధూళియందుఁ బడియుండలేదే!

మూఁడవపౌరుఁడు:—తేరు కదలకయుండి, త్రాడు పడియున్న తావుననే యున్నచో నదిమనరాజ్యముయొక్క కంఠముచుట్టును నురిత్రాడు కాఁగలదు.

రెం. పౌ:—అయ్యో భగవంతుఁడా! గుణము చూపఱకెంత భయంకరముగా నున్నది! చుట్టచుట్టుకొనిభుజంగమువలె శిరము పైకెత్తునట్లు తోఁచుచున్నది.

మూ. పౌ:—చూడుము. చూడుము. అది కదలుచున్నట్లు కనఁబడుచున్నది.

మొ. పౌ:—రథమును గదల్పకయుంచి దానిగతికి దానిని మనము వదలినచో మన కిక్కట్లు తప్పవని నేను రూఢిగాఁ జెప్పఁగలను.

మూ. పౌ:—అట్లయినచోఁ బ్రపంచకమునందలి పాశము లన్నియు విప్పఁబడుటయే కదా! అప్పుడు రథము మనశరీరములపైనుండియే పోవును. దాని నీడ్చుటకు మనము సహాయము చేయుచున్నాము. కాఁబట్టియే మనము దానిచక్రములక్రిందఁ బడుటకు వీలుకలుగుట లేదు. ప్రస్తుతకర్తవ్యాంశ మేమి?

మొ. పౌ:—పురోహితుఁడు రథముపై నాసీనుఁడై మంత్రోచ్చారణము సల్పుచున్నాఁడు. చూడుము.

రెం. పౌ:—అతనిమంత్రములకు స్యందనము కదలదు. పూర్వకాలమునందు సర్వమును బురోహితాధీనమైన యపుడు, ఆచార్యుఁడే ప్రథమమున రథమును లాగవలసియుండెను. ప్రస్తుత మతనిమంత్రములచే నాకార్యము ఫలించునా? మంత్రములకుఁ జింతకాయలు రాలుకాలము గతించినది.

మొ. పౌ:—స్నేహితుఁడా? లాగుట కిదివఱకే వారు ప్రయత్నించిరి. కాని విఫలమనోరథులు కావలసినవారైరి. ప్రత్యూషముననే పురోహితు లందఱి కన్న ముందుగ మేలుకొని, పెందలకడనే పోయి, దానిని

## హనుమంతుని రావణాంతఃపుర ప్రవేశము



చ. అలఘునితంబసైకతచయంబుల నాభిసరోవరంబులన్
విలసదురోజచక్రముల వేణిభరాళులఁ జారులోచనో
త్పలముల భ్రూతరంగముల బాహుబిసంబుల వక్త్రపంకజం
బులఁ దగి సుప్తవాహినుల పొల్పున నొప్పెడువారిఁ జూచుచున్.

Lakshmi Art, Bombay 8.

భాస్కరరామాయణము-సుందరకాండము

## అంగుళీయకప్రదానము



క. అంగనఁ జూడఁగని నీ వి,య్యంగను గడుఁ జాలువాఁడ ననుచును నాచే
నుంగర మంపెను శ్రీరఘు,పుంగవుఁ డిదె కొమ్మటంచు భూమిజకిచ్చెన్.

మొల్లరామాయణము-సుందరకాండము.

లాగుటకు వారిశక్తిసామర్థ్యములన్నియు వినియోగించిరి. వెలుతురువచ్చి జనులు చేరువేళ కాపనిని జాలించుకొని మంత్రపఠన కారంభించిరి. కలియుగమునందు విప్రులకు బలమున్నదని నీవు తలంతువా?

మూ. పౌ:—సరి సరి, రజ్జువు యుగాంతరరక్తనాళముచలె కొట్టుకొనుచున్న దేమి?

మొ. పౌ:—ఒకఘనపుణ్యమూర్తిహస్తస్పర్శముచేఁగాని స్యందనము కదలఁజాల దని నాకుఁ గనఁబడెడు.

రెం. పౌ:—అట్టి ఘనపుణ్యమూర్తి యవతారమునకై మనము వేచియుంటిమా పుణ్యకాలము గడచిపోవును. అల్లుఁడు వచ్చువఱకు నమావాస్య యాఁగునా? ఇఁకఁ బాపాత్ములమైన మనబోఁటిసామాన్యజనులగతి యేమి?

మూ. పౌ:—భగవంతునకుఁ బాపాత్ములజోలి యవసరము లేదు.

రెం. పౌ—ఏమీ? ప్రపంచము పుణ్యజనులకుమాత్రమే నిర్దేశింపఁబడినదా? అట్లయినచో మన మేగంగలో గలియవలెను? సృష్టి సామాన్యజననికాయముకొఱకే యని యెఱుంగుము. పుణ్యజను లప్పుడప్పుడు జన్మించి పోవుచుందురు. మనయొత్తిడిఁదాళఁజాలక గగనగహ్వరములకుఁ బాఱిపోదురు.

మొ. పౌ:— వృద్ధుఁడా? నీవు రథమును లాగుటకు యత్నింపఁ గూడదా? అది కదలునో, నీముక్కచితుకునో చూచెదము.

రెం. పౌ:—పుణ్యమూర్తులకును మనకును గలవ్యత్యాస మేమియనః వార లొకరిద్దఱు, మనము బహుసంఖ్యాకులము. మనము సంఘీభావము కలిగి పౌరుషములోఁ బనికిఁ గడంగితిమా, రథము శీఘ్రముగాఁ బరుగెత్తకలదు. మన కైకమత్యము లేనిచో దానిని కదల్చు టెట్లు? అప్పుడు మనము నివ్వెఱగంది, వింత పురుషునియొక్కనికై నిరీక్షింతుము.

మూ. పౌ:—త్రాడు కదలుచున్నది, మీరు బహుజాగ్రతతో మాట్లాడవలెను.

మొ. పౌ:-ప్రభాతసమయమున నొక్కసుముహూర్తమునందుఁ బురోహితుఁడు లాగవలెననియు, పిమ్మట నృపతి లాగవలెననియు శ్రుతులయందు వ్రాయఁబడినది. వారిరువురు నపజయము గాంచిరి. ఇఁక మూఁడవవా రెవ్వరు?

ప్రవేశము: క్షత్త్రియయోధులు

మొదటియోధుఁడు:—సిగ్గు! సిగ్గు! ప్రభువు స్వయముగా వటిని లాగుటయు, మనమందఱము వేలకొలఁది వచ్చి తోడ్పడుటయు, రథాంగములు కొంచెమైనను కదలకుండుటయునా?

రెండవయోధుఁడు:— సఖా! మనము క్షత్త్రియులము కామా? శూద్రులవలె పశువులము కాము. మనము స్యందనారోహులము. రథమును లాగుట మనవృత్తి కాదు.

మూఁడవయోధుఁడు:— లేక పోయినచో మనవృత్తి శతాంగమును బగులఁగొట్టుట కాబోలు! గండ్రగొడ్డలినిగైకొని దానిని ముక్కముక్కలుగఁ జేయుటకు నాహస్తము తొందఱపడుచున్నది. వృద్ధకాలపిత్రుఁ డేమిచేయఁగలఁడో చూచెదను!

మొ. పౌ:—శూరుఁడా! నీవుధరించు ప్రహరణములు రథమును గదల్పుటకుఁగాని, బ్రద్దలు చేయుటకుఁగాని వినియోగపడవు. దైవజ్ఞుఁ డేమివచించెనో నీవు వినియుంటివా?

మొ. యో:—ఏమిచెప్పెను?

మొ. పౌ:—మఱల నీకలికాలమందుఁ ద్రేతాయుగము నందలికథ నడచుచున్నదని.

మొ. యో:— త్రేతాయుగమునందు మర్కటములు లంకను బరశురామప్రీతి గావించుటయా?

మొ. పౌ:—అది కాదు.

రెం. యో——శ్రీరాముఁడు వాలిని జంపుటయా?

మొ. పౌ:—గురికి బారెఁడెచ్చుతక్కువగఁ జెప్పితివి. ముక్తిని బడయుటకై శూద్రుఁ డొక్కఁడు ఘోరతపమును గావించెనన్నసంగతి జ్ఞాపకమున్నదా? రఘురాముఁ డాశూద్రుని శిరమును ద్రుంచిన తరువాతనే కదా వృద్ధకాలపిత్రుని కోపానలము చల్లారినది?

మూ. యో:—ఇప్పు డాభయము లేదు. మహీసురులే జపతపసంధ్యానుష్ఠానముల వదలివేసి_నప్పుడు, శూద్రులమాట తలపెట్టు టెందులకు?

మొ. పౌ:—మనశూద్రసోదరులలోఁ గొందఱు రహస్యముగా బురాణేతిహాసములఁ బఠించుట కారంభించిరి, అది కనిపట్టి 'ఇదియేమి పాప?' మని యడిగినచో, 'మేముమాత్రము మనుష్యులముకామా?' యని ప్రత్యుత్తర మిత్తురు. ఈనాస్తికయుగము నందలి దుర్బుద్ధిప్రయ్యమే వారల నింతపనికిఁ దెచ్చినది. కాలపిశాచుఁడు మతిమంతుఁడు కాఁబట్టియే రథమును గదల్పకున్నాఁడు. కర్మముచాలక యది కదలినచో సూర్యచంద్రులు, భూమి దానిచక్రములక్రిందఁ బిండిపిండి కావలసినదే! ఒక్కటిచూడుము. శూద్రుఁడు తన యురముపైఁ గరమువైచి నేనుగూడ 'నరుఁడ' నని చాటుచున్నాఁడు. ఈశ్వరా! ముందేమి విపరీతములు కలుగనున్నవో?

మొ. యో:—ఈదినమున శూద్రుఁడు వేదమును జదువుట కారంభించును. మఱునాఁడు బ్రాహ్మణుఁడు కృషీవలుఁడు కావచ్చును. అప్పుడు వినాశము సంభవించును.

రెం. యో:—రా, రమ్ము. యుద్ధసన్నద్ధులమై శూద్రనివాసస్థలికిఁ బోదము. ఎవ్వరు బలవంతులో వారికిఁ జెల్లెదము.

మూ. యో:—ఎవ్వరో భూపతిసన్నిధికిఁ జని, కలియుగమునందు శాస్త్రములుగాని శస్త్రములుగాని పని చేయవనియు, నంతయు ధనమూలమనియుఁ జెప్పిరి. కావున నృపతియు వణిగ్వరుఁడైన ధనపతికి వర్తమాన మంపెను. వారంపఱకిని ధనపతిచల్లఁ గాని రథము కదలవని నమ్మకము.

మొ. యో:—స్యందన మొక్కవైశ్యునిశక్తిచేఁ గదలినచో మనశస్త్రాస్త్రములన్నింటిని గంపములకుఁ దగిలించుకొని గంగలో దిగవలసినదే.

రెం. యో:—ప్రస్తుతము మనము రోషావేశులమైనచోఁ గార్య మేమైనఁ గలదా? వైశ్యుల కిప్పుడు గురుఁడు పదునొకటవస్థానమున నున్నాఁడు. సుమఘన్విశింజినియైనను అతనిహస్తస్పర్శమునకు టంకారధ్వని నిచ్చును.

మూ. యో:—అదిసత్యమే. క్ష్మాపతిసతతము ముందు నతనివెనుక వైశ్యుఁడు సెప్పుడు నున్నవిషయమే.

మొ. యో:—సరియే. ఆర్యుని వెనుకనే యుండనిమ్ము. మనము భూపతి కిరుప్రక్కల వరుసలుదీరి నిలువఁబడియుండెదము. అప్పుడు ఈజయభేరీమృదంగాది మంగళతూర్యారావంబులు మనకే చెల్లునుగదా?

మూ. యో:—కావచ్చును. కావచ్చును. కాని వెనుక నున్నవాఁడే సుతియిచ్చువాఁడు.

ప్రవేశము: ధనపతి పరివారము

మొ. యో:—ఎవ్వరో దయ్యములవలెఁ దోఁచుచున్నది!

రెం. యో:— వారి రత్నద్యుతులు మిడుతలవలె నెగిరి మనకండ్లలోఁ బడుచున్నవి!

మూ. యో:—వారి కంఠములవ్రేలాడు ప్రాలంబికములఁ గనుము: సంకెళ్లవలె నున్నవి.

మొ. పౌ:—వారు ధనపతిపరివారము. వారు మనకాలపిశాచుని దమ సువర్ణశృంఖలములచే బంధించిరి. అందుచేతనే కదా తేరు కదలుటలేదు!

మొ. యో:—(భృత్యులతో)ఎందునిమిత్త మిటకు వచ్చిరి?

మొదటిభృత్యుఁడు:— రాజుగారు మాప్రభువైన ధనపతికొఱకు వర్తమాన మంపిరి. ఎవ్వరును రథమును గదల్పకుండుటచే నతనివలన నాపని యగునని యంపఱు దలంచుచున్నారు.

రెం.యో:—'వారంపఱు' ఎవ్వరు? వారట్లు తలపోయుట కవసర మేమివచ్చినది?

రెండవభృత్యుఁడు:— ఈదినములలో నడచువ్యాపారమంతయు మాయజమానుని హస్తముమీదుగనే కదా సాగుచున్నది?

రెం.యో:—ఖడ్గము మాత్రము, మాకరములందే తిరుగుననియు, నతనిహస్తమునందుఁ దిరుగదనియుఁ జూపెదను.

మూఁడవభృత్యుఁడు:—నీచేయి త్రిప్పెదువా రెవ్వరో నీకుఁ దెలియనట్లు పలికెద వేమి?

మొ. యో:—అనాగరికుఁడా! నోరు మూయుము.

రెం. భృ:— నోరుమూయవలసివచ్చినచో మూసెదను. మాయధికారస్వరమే ప్రస్తుతము పంచభూతములయందును బ్రతిధ్వనించుచున్నదని నీనెఱుఁగవా?

మొ. యో:—ఏమీ మీస్వరమా? మాశతపవనశతఘ్నిగర్జించునప్పుడో?

రెం. భృ:—ఆగర్జనమే మాయాజ్ఞ నొకపణ్యస్థలమునుండి మఱియొకపణ్యస్థలమునకుఁ గొనిపోవుచున్నది.

మొ. పా:—వానితో వృథా కలహమేల? మీరు వారిని గెల్వలేరు.

మొ. యో:—ఏమీ? మఱియొకసారి పల్కుము.

మొ. పా:—మీకృపాణముల మీయొరలో నుండి తీసినవెంటనే, వానిలోఁ గొన్నిఁటిని వారిలంచములఁ దిన్నవానిని, గొన్ని వారితిండితినినవానిని జూతువు.

మొ. భృ:— నర్మదాతీరమునుండి యొక యతిపుంగవుని దీసికొనివచ్చిరనియు, నతఁడే యీశతాంగమును గదల్పుటకుఁ బ్రయత్నమొనర్చుననియు వినియున్నాము. దానిఫల మేమైనదో యేరికైనను దెలియునా?

రెం. భృ:—నాకుఁ దెలియును. వా రతనిగుహకుఁబోవువేళ కతఁడు పద్మాసనము వైచికొని కూర్చుండి సమాధిలో నుండెనట. అంతట వా రతనికిఁ దెల్వి వచ్చునట్లు చేయుటకై, యతనిఁ ద్రోసియు గుంజియు విఫలమనోరథు లైరి.

మూ. భృ:—అరువదియైదేండ్లనుండి దీక్షగా గాలుకదల్పక కూర్చుండుటచేతఁ గాబోలు' కాని యతఁ డేమి చెప్పెను?

రెం. భృ:—అతఁడేమియుఁ జెప్పనులేదు; చెయ్యను లేదు. అతఁడు మాట్లాడు పాపముకట్టుకొనవలసియుండునని నాలుకను గోసికొనెనట. అతఁడు మూల్గుట మాత్రము ప్రారంభించెను. ప్రతివాఁడు నొక్కొకమూల్గునకుఁ బ్రతియొక యర్థమును గ్రహించిరి.

మొ. భృ:—తరువాత?

రెం. భృ:—వా రతనిని పైకెత్తి మోసికొని వచ్చిరి. అతఁడును స్యందన శుల్బమును స్పృశించినంతనే తేరు భూమిలో గ్రుంక నారంభించెను.

మూ. భృ:—అయ్యో, తనమనమునుపలెనే కాలరథమును గూడఁ పాతాళములోనికిఁ గొంపోవ నుంకించెనా?

మొ. భృ:—కాదు. అతని యరువదియైదేండ్ల నిరంతరోపవాసభారము రథాంగములకుఁ గష్టముగఁ దోఁచెనేమో! అంతదూర మెందులకు? మన మొక్కనాఁ డుపవాస ముండినఁ గాలు కదల్ప లేముకదా.

మూ. పా:—భారములసంగతి మాట్లాడెదవు. మీ గర్వభారము మాత్రము విస్పష్టముగా నున్నది.

రెం. పా:—ఆగర్వభారమే తనంతట తా నణఁగద్రొక్కఁ గలదు. (భృత్యులతో) మీరు తొందఱ జెందకుఁడు. మీధనపతికి గర్వభంగము కాఁగలదు.

మొ. భృ:—సరియే, చూచెదము; కాలపితృని భోజనసామగ్రి యెవ్వరు సమకూర్తురో? సమకూర్పనిచో రథము నిలుచుండినను బరుగెత్తినను నొక్కటియే. కడుపునిండినఁ గదా దినములు గడచుట!

ప్రవేశము.

మంత్రి - ధనపతి.

ధన:—మంత్రివర్యా! ఏల న న్నిటకురమ్మని యానతిచ్చిరి?

మంత్రి:—రాజ్యమున క్షేమకొఱత వచ్చినను మిమ్ముల నేకదా ప్రప్రథమమునఁ బిలువవలసియున్నది?

ధన:—వలయుసామగ్రి యేదియైన నున్నచో సెలవిచ్చిన యెడల సిద్ధపఱచెదము. ప్రస్తుతమున్నవిపత్తు తొలంగు టెట్లు?

మంత్రి:—రథము కదలలేదని నీవెఱుఁగుదువుగదా?

ధన:—వినియున్నాను; కాని ఆవిషయము చాలకాలమునుండి.

మంత్రి:—పురోహితులయధీనమునం దున్నవిషయ మే నెఱుంగుదును. పూర్వకాలమునందు వారు స్వసామర్థ్యముచేతను స్వకాయకష్టముచేతను నభివృద్ధిగాం చుటయేకాక దేశవర్ధనమునకై గూడఁ దోడ్పడిరి. ప్రస్తుతము వారు నీద్వారముకడ సుస్థిరముగా గూరుచుండిరి. పామ్మన్నఁ బోరు; వారు పోరు సరిగదా, ఇతరులను బోవునట్లు చేయరు.

ధన:—అదిగాక భూపతియు, నతనిమంత్రులు, సైనికవర్గముకూడ నుండిరి. వారలు ఒక్కొకనివంతుగఁ ద్రాళ్లను లాగెడివారు. కావుననే దినములు సుఖముగఁ గడచుచుండెను. మే మమాత్రము చక్రములను శుభ్రపఱచెడివారము. న న్నేపనియందైనను నియోగించుట కిదియే ప్రథమతరుణము.

మంత్రి:—ఆర్యవర్యా! చూడుము. ఈరథము కదలుటయే మనలనంపత్తిని శోధించుటకు ముఖ్యప్రమాణము.

దానిచక్రములుకదలుటయే ప్రపంచ మిప్పుడు ఎవ్వరి ప్రాజాపత్యముక్రింద నున్నదో విశదముచేయును. పురోహితుఁడు నాయకుఁడుగా నున్నపుడు రాజు నాయకుఁడుగా నుండెను. అప్పుడుతేరు వారుచెప్పునట్లు నడచుటయేకాక నిద్రనుండి మేల్కొలుపఁబడిన మృగరాజువలె దుముకుచుండెను. ప్రస్తుతము వారివల్ల నేమియుఁ గాకుండెను. అనగాఁగలమును, ఖడ్గమునుగూడ త్రుప్పుపట్టెను. నాయకత్వము మీచేతికి వచ్చెను. ఆహస్తములే త్రాళ్లనుబలపఱచవలెను.

ధన:—సరియే. ముందుగ నాపరివారము ప్రయత్నించుచు. రథ మేమాత్రమైనను జలనము చూపినయెడల, నేను వారికిఁ దోడ్పడెదను. కానియెడల నింతమందిలో నా కప్రతిష్ఠ చేకూరఁగలదు.

మంత్రి:—ఆర్యవర్యా! అట్లయినచో వేగముగా వారిని దొందఱ పెట్టవలెను. రాజ్యమంతయుఁ గటికోపవాస ముండి, నీకొఱ కాతురతతో వేచియున్నది. స్యందనము దేవసదనమును సమీపించినఁగాని యెవ్వరును భోజనములుచేయరు. అదియుఁగాక, నీవుకూడ యత్నమొనర్పుము. జయముఁగాంచనిచో వచ్చిన యపకీర్తి యేమి? భూపతికిని బురోహితునకును వచ్చిన యవమానముకంటె నెక్కువలోనిదికాదు.

ధన:—వారు మాకుఁ బైవారు. మేము వారికిఁ గ్రిందివారము. లోకము మమ్మొకరీతిగను, వారల వేఱొకరీతిగను విమర్శించును. రథము కదలకున్నచో నన్నవమానింతురు. కర్మము చాలక నది కదలనిచో నా పని మట్టమయినట్లే. నాయపృష్టమును ఎవ్వరును సహింపరు. ప్రతివాఁడును దాని నెట్లయినను సంగ్రహింపుటకుఁ బన్నుగడలు పన్నుచుండును.

మంత్రి:—నీవు వచించినదంతయు సత్యమే. రథ మెట్లయినను గదలునట్లుచేయవలెను. ఆలస్యము చేసినచోఁ బ్రజలుమనపై దాడి వెడలుదురు.

ధన:—సరియే ప్రయత్నింతముగాక! అదృష్టవశమున జయముఁగాంచినచో నదినాకు విషాదమూలముగాకుండుగాక!

(పరివారముతో) భృత్యులారా! మనము కార్యసిద్ధికై మనఃపూర్వకమైన ఉత్సాహమును బ్రకటింతము, రండు.

పరివారము:—జయసిద్ధి! జయసిద్ధి!

ధన:—మన కులదేవత, సిద్ధి!

పరివారము:—జయసిద్ధి! మన కులదేవత!

ధన:—ఆగుఁ డాగుఁడు. ఈత్రాటిని లాగుటయటుంచి, దానిని బైకెత్త లేకపోతిని. అది రథమంత బరువుగానున్నది. ఇది మనుష్యమాత్రునిచే నయ్యెడు కార్యముగాదు.

(భృత్యులతో) రండు; మీరందఱును రండు; ధనాగారాధిపతి యెచ్చటనున్నాఁడు? మీరందఱునుగలసి మఱియొక్కసారి ప్రయత్నింపుఁడు. జయసిద్ధి! జయసిద్ధి! భృత్యవరులారా! హుసార్- ఇఁక గార్యములేదు. త్రాడు నిమిషనిమిషమునకు బిగిసిపోవుచున్నది.

(అందఱును 'సిగ్గు', 'సిగ్గు' అని కేకలువేయుదురు)

మొ.యో:—బ్రతికిపోతిమి. మన మర్యాద దక్కినది.

ధన:—కాలపిత్రుఁడా! నీకువందనము. నీవు నిజముగా మాయందు కరుణార్ద్రచిత్తుఁడవు. కనుకనే నీవు కదలలేదు. నీవు మాహస్తములవలననే కదలినచో నీవు మా వక్షములపై నుండిపోయి మమ్ముల పిండిచేసియుండెడి వాఁడవు.

భృత్యులు:—అయ్యో! యజమానుఁడా! నేటివఱకును దినదినప్రవర్ధమాన మగుచున్న మన గౌరవము నేటితోఁ దగ్గిపోయెనుగదా!

ధన:—చూడుము; ఇంతవఱకును బ్రజాబాహుళ్యము కంటఁబడకుండ, నీచంచలరథచ్ఛాయక్రిందఁ గ్రమక్రముముగా ముందునకు వచ్చి యభివృద్ధిగాంచుచుంటిమి. ప్రస్తుతము రథమున కెదురుగా వచ్చుటచేత మన మందఱకండ్లఁ బడితిమి. అప్పుడే పండ్లఁ బటపటఁ గొఱుకుచున్నారు. ఇఁక రథముననే నడపుభాగ్యము పట్టినచో మనకు దినములుచెల్లెనని యెఱుంగవలెను.

మొ. యో:—(ధనపతితో) పూర్వకాలమునం దీపరాజయమునకుమీతలలుమీభుజములపైనుండక పోవలసినదే.

ధన:—అనగా మీచేతులకుఁ బని తగిలియుండెడిది. ఖండించుటకు శిరఃప్రకరంబులు లేకపోయినను,వృథామృషావాక్యము లేలయాడెదరు?

మొ. యో:—ప్రభువుమాట యటు లుండనుంచి, కాలపిత్రుఁడే మీప్రియభృత్యుఁడు గాకుండనిచో నీకుఁ దగినప్రత్యుత్తర మిచ్చియుండును.

ధన:—పరికించి చూచినయెడల మే మింతపవిత్రశరీరులము కాకపూర్వమే మా కెక్కుడు సుఖముండెడిది ప్రస్తుతము మనసెత్తిపైఁబడిన యీసేవకావృత్తియే మనమరణమునకుఁ గారణము గాఁగలదు. అమాత్యవర్యా! ఏలవిషాదాయత్తచిత్తుఁడవైతివి?

మంత్రి:—మనము కడపటి యత్నముఁగూడ నొనర్చి పరాజయము గాంచితిమి. పునఃప్రయత్నమునకే మార్గమును లేకుండుటచే నేమియుఁ దోఁచుటలేదు.

ధన:—విచారపడకుఁడు. ప్రస్తుతము మీరు ప్రయత్నాంతరములన్నియు వినియోగించి విఫలమనోరథు లగుటచే, కాలపిత్రుఁడే తనప్రయత్నముఁ దానుజేసుకొనును. అదియుఁగాక, మనకొఱకై కాదుగదా యాతఁడు కదలుచుండుట? అతని స్వప్రయోజనముకే యతఁడు కదలుచున్నాడు. కాలపిత్రుని యుచితాశ్వములే, యతని యాజ్ఞాడిండిమము నలుదిక్కుల మ్రోఁగునప్పుడు పరుగెత్తికొని వచ్చును. ప్రస్తుతము తెరమఱుగుననున్నవారే యప్పుడు ముందునకు వత్తురు. ఇంతలో నాధనాగారమునకుఁ బోయి దానిని సరియైనక్రమమునం దుంచెదను. ధనాగారాధ్యక్షా! రమ్ము పోదము. మొదట గదికి రెండుతాళములు బిగింతము. ఆలస్యము చేయఁగూడదు.

(ధనపతి, పరివారము నిష్క్రమింతురు)

ప్రవేశము: చారుఁడు.

చారు:— మంత్రిపుంగవా? శూద్రనివాసస్థలమునందు గొప్ప సంక్షోభము కల్గినది.

మంత్రి:—సంక్షోభమునకుఁ గారణమేమి?

చారు: —వారలసం ఘొకటి యిటకు వచ్చుచున్నది. కాలపిత్రునిరథము మేమీడ్చెదమని పల్కుచున్నారు.

అంపజులు:—ఏమీ? వారలను మోఁదులను మట్టుకొననిచ్చువా రెవ్వరు?

చారు:—వారల నడ్డుపెట్టువా రెవ్వరని పల్కుఁడు.

యోధులు:—భయములేదు. మేము కాపాడెదము.

చారు:—మీ రల్పసంఖ్యాకులు. వారలఖండించునప్పటికి మీకరవాలములవాఁడిమి పోఁగొట్టుకొనియెదరు. ఇంకను వేలకొలఁది యుందురు. మీరు రథముసమీపమున నిలుచుటకైనను దావు లేకపోవును. మంత్రిపుంగవా! ఏల మీశరీరము కంపించుచున్నది?

మంత్రి:—వారేమియైనఁ జేతురని కాదు నాకుఁ గల్గుచున్నభయము.

చారు:—ఇఁక భయమేల?

మంత్రి:—వారలు జయము గాంతురని.

యోధులు:—అమాత్యవర్యా! ఏమని పల్కుచున్నారు? వారలు రథమును లాగెదరనియా! ఘనపాషాణము వారినిధిపైఁ దేలునా!

మంత్రి:—కాని వారు జయమే కాంచినచోఁ బరమేశ్వరుఁ డొక్కనూతనవిధానమును లోకమునందుఁ బ్రవేశపెట్టుచున్నాఁడని ప్రస్ఫుటము కాదా? నట్టిల్లు (Ground floor) గృహోపరిభాగ(Top floor) మైనచో మహాప్రళయ సూచకముకాదా? మహాభయంకరభూకంపమనఁగా నేమి? భూగర్భమునందు జరుగు విషయమేకదా? కాలచక్రమునం దొకనూతనయుగము ప్రారంభమయ్యె ననఁగా, ఏది యిదివఱకు గూఢమై, ప్రచ్ఛన్నమై యుండెనో, యది బహిర్గతమై ప్రకాశమాన మాటయేకదా?

యోధులు:—మనుష్యుల నేమియొనర్పఁడని యానతిచ్చెదరు? సెలవిండు. ప్రపంచమునందు మా కడ్డువచ్చునది యేదియును లేదు.

మంత్రి:—ఇట్టి మననిర్భయాడంబర ప్రకటనమోహమే, మన మహాభయంకర సమస్యలఁ గల్పించుచున్నది. ప్రాణపరిత్యాగమునకైనను సిద్ధపడి వచ్చిన యెట్టిసైనికసమూహమైనను గాలప్రవాహమును నిరోధింపఁగలదే?

చారు: --అయ్యా! అట్లయినచో మీయుపదేశమేమి?

మంత్రి:— నిరోధము సల్పకుండుటయే యుత్తమపద్ధతి. ప్రతిబంధము లెప్పుడు నంతర్గత మహాశక్తిని బ్రజ్వలింపఁజేయును. అట్టి మహాశక్తియే తనయునికియుఁ దనబలమును దానుస్మరించినచో నిఁక మనము గంగలోఁ గలయవలసినదే.

యోధులు:—అట్లయినచో మేము ప్రక్కల నిలుచుండి, వారిని రానియ్యవలసినదేనా?

చారు: —అదిగో, వారప్పుడే సమీపించుచున్నారు.

మంత్రి:—మీరేమియుఁ జేయవలదు. నిశ్శబ్దముగా నుండుఁడు.

ప్ర వే శ ము : శూ ద్ర వ ర్గ ము

మంత్రి:—(శూద్రనాయకునితో) నాయకుఁడా! మిమ్ముల నందఱిని జూచుటకు నాకు సంతోషముగా నున్నది.

శూ. నా:—సచివపుంగవా! మేము కాలపిత్రుని స్యందనమును నడపించుటకు వచ్చితిమి.

మంత్రి:—అదియే మీరెప్పుడును జేయుచున్నారు. వ్యవహారమునకు మాత్రము మే మిచ్చట నుందుము. అది నాకుఁ దెలియదా?

శూ. నా:—ఇదివఱకును మేము రథాంగముల క్రిందఁబడి పనిచేయుచుంటిమి. దానిగమన మెప్పుడును మాఖండిత శరీరములపై నుండియే. ప్రస్తుత మేలకో కాలపిత్రుఁడు మాపూర్వస్వార్థ త్యాగమునకు సమ్మతించుటలేదు.

మంత్రి:—ఓహో! తెలిసినది. ప్రభాతకాలమున వందల కొలఁది మీరందఱును రథముక్రిందనున్న ధూళియందు పొర్లాడుచుంటిరి. సంతోషధ్వానములతోఁ జక్రములు పూర్వమువలె మీపైనుండి పోలేదు. చక్రముల యాఁకలి చచ్చెనుకాబోలు. అట్టియశుభసూచకమైన హాని మే మమ్ముల భయపెట్టుచున్నది.

శూ. నా:—మార్గమును జక్కపఱచుటకుఁ గాలపిత్రుఁడు మమ్ముల నీదినమునఁ బిలువలేదు. అతనిరథగుణములను లాగుటకుఁ బిల్చెను.

పురోహితుఁడు:—ఓహో! అది నీ కెట్లు తెలిసెనో చెప్పఁగలవా?

శూ. నా:—ఈసంగతు లెట్లు తెలియునో యెవ్వరికిని దెలియదు. కాలపిత్రుఁ డాబాలగోపాలమును రమ్మని యాజ్ఞాపించెనని సూర్యోదయమునుండియు జనప్రవాద మొక్కటి పుట్టినది.

ఒకయోధుఁడు:—మీరక్తమును బీల్చుటకు రమ్మనెనా?

శూ. నా:—కాదు; రథమును నడపుటకు.

పురో:—కుమారా! ఒక్కసంగతి యాలోచింపుము. కాలపిత్రునిరథశుల్బములు ప్రపంచము నుద్ధరించెడి వారిహస్తగతము చేయఁగూడదా?

శూ. నా:—స్వామీ! ప్రపంచమును నడపువారు మీరే యని మీరు నిజముగా నూహించుచుంటిరా?

పురో:—కాలము విపరీతముగా నున్నదని నాకుఁ దెలియును. ఎవ రెట్లుచెప్పినను, ఏవి యెట్లుజరిగినను, మేము బ్రాహ్మణులము కామా?

శూ. నా:—(మంత్రితో) గౌరవనీయులైన మీరా ప్రపంచమును నడపుటకు హక్కుకలవారు?

మంత్రి:—ప్రపంచము మీతో నున్నది. మీగమనమునకు మీరలే కారకులు. మేము బుద్ధిమంతులము కావున మిమ్ముల నడపుచున్నామని మేము నటింతుము. మీరు లేకుండినచో నల్పసంఖ్యాకులమైన మేము బ్రదుకఁగలమా?

శూ. నా:—మీసంఖ్య యటులుండనిచ్చి, మేము లేకుండ మీరు జీవించఁగలరా?

మంత్రి:—అవునవును.

శూ. నా:—మే ముత్పత్తిని జేయుచున్న యాహారమును దిని మీశరీరములఁ బోషించుకొనుచున్నారు. మేము నేయుచున్న బట్టలను గట్టుకొని మీహోదాను నిలువఁబెట్టుకొనుచున్నారు.

ఒకయోధుఁడు:—ఏమీ, యీపొగరుఁ బోతులేమము! ఇది వఱకును జేతులు మోడ్చి 'అయ్యా! మీరే మాకుఁ దినుటకుఁ గూడును, కట్టుటకు గుడ్డయు నిచ్చుచున్నారు' అని పలుకుచుండి, యిప్పు డీవేషముఁ దాల్చుచున్నారా? ఇట్టి చర్యలు మాదగ్గఱ పనికిరావు.

మంత్రి:—(యోధులతో) మాట్లాడకుఁడు (శూద్రనాయకునితో) అవును నిజమే నీకొఱకై మే మిచట వేచియున్నాము. మీరే కాలోచితతురంగములని యూహించుకొన కేసంతటి మూర్ఖుల మనుకొంటివా? పోయి నీపని నీవుచేయుము. అప్పుడు మేము చేయునది మేము చేసెదము

శూ. నా: సోదరులారా! రండు, మనఃపూర్వకముగ కార్య మొనర్పుఁడు. మనము చచ్చినను, బ్రతికినను, రథమును గదల్పవలెను.

మంత్రి:—నాప్రియ నాయకుఁడా! మార్గమును మఱిపోకుఁడు. రథము పూర్వమువలె రాజమార్గముమీఁదుగనే ప్రయాణము చేయవలెను. మీరు కుడిప్రక్కకు మఱలిన ట్లున్నది. చూడుము.

శూ. నా:—మేము గబ్బిమూలము. కుడిప్రక్కయు నెడమప్రక్కయు మాకుఁ దెలియదు. అది సారథిపని. మీరంతలును రండు. రథముపై ధ్వజ మెట్లు కదలుచున్నదో చూచితిరా? అదియే కాలపిత్రుఁడొసఁగిన సంకేతము. రండు. జలముతో నీడ్చుఁడు.

పురో:—అయ్యో! త్రాటిని స్పృశించిరే! ఎంత పాప కర్మము పట్టినది!

పౌరులు:— అయ్యో!. ఎంతటి గర్హ్యమైనకార్యము.

పురో:—బిడ్డలారా? మీరు కన్నుల మూసికొనుఁడు. కాలపిత్రుఁడు కోపానలమును గ్రక్కుచు వారిపైఁ బడునప్పుడు, మీదృష్టి యతనిపైఁ బ్రసరించెనేని మీరుఁగూడ దగ్ధము కాఁగలరు.

ఒకయోధుఁడు:—ఏమి? చక్రములు గర్జించుచున్నవా? లేక యాకాశము నిరాశచే నూల్గుచున్నదా?

పురో:—అది కాదు.

పౌరుఁడు:—అవునవును. రథము కదలుచున్నది.

యోధులు:—అదిగో ధూళి పై కెగరుచున్నది! ఎంత దోష మెంత దోషము! రథము కదలుచున్నది! ఎంతపాప మెంతపాపము!!

శూద్రులు:—జయము! జయము! కాలపిత్రునికి జయము!!

పురో:—నాపాపము బ్రద్దలుకాను! రథము నిజముగా నడచుచున్నది.

యోధులు:—అయ్యా! మీరు మాకాజ్ఞ నీయుఁడు. అల్లరిమూకపైఁబడి వారొనర్చుపాపకార్యమును దుడ మట్టించెదము.

పురో:—నేను సాహసింపను. కాలపిత్రుఁడే, వర్ణభేదమును బాటింప నప్పుడు, మనయాజ్ఞ లేమియు నతని పశ్చాత్తాపచిత్తుని జేయఁజాలవు.

యోధులు:—అట్లయినచో మనయుద్ధపరికరములఁ బాఱవేయుదము.

పురో:—నేనుగూడ నావేదములను బాఱవేసెదను.

పౌరులు:—మనము రాజ్యమును విడచి వలసపోవుదము. మంత్రివర్యా! నీ వెక్కడికిఁ బోయెదవు?

మంత్రి:—నేను వారికి సాయము చేయఁబోయెద.

పౌరులు:—నీవా? వారలతోఁ గలిసెదవా?

మంత్రి:—అప్పుడు కాలపిత్రుని కనుగ్రహముకల్గును. శూద్రు లతనివయకుఁ బాత్రులైరని మీకు స్పష్టము కాలేదా? ప్రస్తుతము జరిగినవిషయము కలగాని కల్లగాని కాదు. నేఁడు మనగౌరవము వారితో నున్నది. కాకపోయినచో మన కగౌరవము నిశ్చయము.

యోధులు:—వారిస్పర్శచే నపవిత్రమైన త్రాటిని మీరు స్పృశించుటయా? అది యెప్పుడును భగవదుద్దేశ్యము కాదు. మనము వారిని దండించవలెను. మాసైన్యమునంతటిని సమకూర్చుటకు మేము పోయెదము. రథము నాఁపనిచో నది రక్తప్రవాహములోనుండి తప్పక నడచును.

పురో:—నేను మీతో వచ్చెదను. మీకాలోచనచెప్పుట కైన నుపయోగపడెదను.

మంత్రి:—మీరు వారల నడ్డుపెట్టలేరు. రథాంగముల క్రిందఁ బడి ద్రుంగుటకు మీవంతు వచ్చినది.

యోధులు:—పోనిండు చాలకాలమునుండి నీచులరుధిరముచేఁ గాలపిత్రుని రథాంగములు అపవిత్రము కావింపఁబడినవి.

పురో:—మంత్రివర్యా! చూడుము, చూడుము. రథము రాజమార్గమును వదలి పొలములలోనికిఁ బరుగెత్తుచున్నది. ఏగ్రామము ధ్వంసముకానున్నదో ఆపరమాత్మునికిఁ దెలియవలెను.

యోధులు:—ధనపతి పరివారము కేకలువేయుచున్నట్లున్నది. మన సాహాయ్యమునకై పిల్చుచున్నట్లు తోఁచుచున్నది. తేరు ధనాగారమున కెదురుగఁ బోవుచున్నట్లు కనఁబడుచున్నది. తప్పించుఁడు, తప్పించుఁడు.

మంత్రి:—మీ తనువుల మీరు రక్షించుకొనుఁడు. తరువాత నితరుల రక్షించుట యాలోచించుకొనవచ్చును. రథమాయుధశాలవైపు పోవుచున్నదేమో యని నాకనుమానము. అట్లయినచో దానిలో మిగులున దేదియు నుండదు. అటు చూడుఁడు.

యోధులు:—ఏమిచేయవలెను?

మంత్రి:—త్రాళ్ళను గట్టిగా పట్టుకొనుఁడు. అదియే రథమును సురక్షితముగా నడపుమార్గము. ఆలోచన కిది సమయము కాదు. నేను బోవుచున్నాను.

(మంత్రి నిష్క్రమించును)

యోధులు:—(ఒకరితో నొకరు) ఏమిచేయుదము? (పురోహితునితో) అయ్యా! మీయభిప్రాయమేమి?

పురో:—శూరులారా! మీ రేమినిశ్చయించుకొంటిరి?

యోధులు:—యుద్ధముచేయుటయా? లాగుటయా? మా కాలోచన తుదముట్టలేదు. అయ్యా! మీయభిప్రాయమేమియో సెలవీయుఁడు.

పురో:—మోఁకులను లాగుటయా? లేక వేదపారాయణ మొనర్చుటయా? యేమిచెప్పుటకును దోఁచకున్నది.

మొ.యో:—ముక్కముక్కలై పోవునో యనునట్లు పుడమి యెట్లు కంపించుచున్నదో మీకుఁ దెలియుట లేదా?

రెం.యో:—నీ వటుఁ జూడుము. వారు రథమును లాగుచున్నట్లు కనఁబడదు. రథమే తనంతటఁ దాను ముందుకుఁ బోవుచున్నది.

మూ. యో:—రథమునకుఁ బ్రాణము వచ్చినట్లున్నది. అది యెట్లు ఘోషించుచున్నదో పరికింపుము. ప్రతి రథోత్సవ సమయమునందు నే నిక్కడనుంటిని గాని రథ మింత యుల్లాసకరముగా నున్నట్లు నే నెప్పుడును జూడలేదు. అందుచేతనే యది రాజమార్గమున నడవక నూతన పథమునఁ బోవుచున్నది.

రెం. యో:—అది చేయఁబోవు విధ్వంసముమాటయేమి? అదిగో కవివరుఁడు వచ్చుచున్నాడు. అతని నడిగి దీనియర్థ మేమియో తెలిసికొందము.

పురో:—మూర్ఖుఁడా! మాకుఁ దెలియని విషయము కవులకుఁ దెలియునని నీవు తలంచుచున్నావా? ఛందస్సుల నల్లమనినచో నల్లెదరు, వేదములలో నేమియున్నదో వారి కేమి తెలియును?

మొ. యో:—అయ్యా! వేదగ్రంథములు నాలాకాలము క్రిందటనే నశించినవి. తత్కారణముచేతనే మీవాక్కులయందుఁ గల గురుత్వము పోయినది. కవులు సజీవభాషయే పల్కుచుందురు. సత్యమే వారికావ్యములందుఁ బ్రకాశించునది.

ప్రవేశము - కవి.

రెం. యో:—కవీ! ఏల రథోత్సవ మీసంవత్సరమున తాఱుమాఱైనదో చెప్పఁగలవా?

కవి:—నేను జెప్పఁగలను.

మొ. యో:—రథము పురోహితునివలనఁగాని, భూపతి వలనఁగాని కదలలేదనఁగా నర్థమేమి?

కవి:—ఒక్కకాలరథమునుమాత్రమే విశ్వసింపఁగూడఁ దనువిషయము వారు మఱచిపోయిరి. దానిగుణముల విషయముఁ గూడఁ దలపోయవలెను.

మొ. యో:—కవీ! మీవాక్కులయం దర్థమున్నట్లు ధ్వనించుచున్నది. కాని మాకు బోధపడలేదు.

కవి:—వారికి గమనమునందే నమ్మక మున్నదిగాని న్యాయమైన పురోవృద్ధికి నిమిత్తములైన బంధములయందు నమ్మకము లేదు. కావుననే యీబంధములు రోషపూరితతోదనములై వారిని బ్రదికియుండఁగనే చీల్చివేయుటకు భయపెట్టుచున్నవి.

పురో:—అయినచో మీశూద్రు లీబంధములయర్థము తెలిసికొని వానిబాధ్యత గుర్తింతురా?

కవి:—వారి కావిల్వ లేదు. వారివాహనమునందే, వారియందే నమ్మక ముంచి, సర్వవస్తుసంచలనము (పురోవృద్ధి)నకుఁ గారణమైన ముఖ్యజీవమును ద్వారలో మఱచిపోదురు. దీనికై మీ రెంతోకాల మాఁగ నక్కఱ లేదు; తరువాత వారు, 'హలమునకు జయ, రాటమునకు జయ, మగ్గమునకు జయ'అని కేకలువేయుదురు. అప్పుడు వారి ప్రమత్తతయే వారి విధ్వంసమునకుఁ గారణమగును. అప్పుడు ప్రపంచమంతయుఁ దలక్రిందుఁ గాఁగలదు.

పురో:—అప్పుడు రథమాఁగినచోఁ గవివరుని బిలువవలెను కాఁబోలు!

కవి:— నీవు పల్కునది హాస్యము కాదు. సత్యమే. కాలపిత్రుఁ డనేకపర్యాయములు కవులను బిల్చుచుండెను. కాని వారు జనబాహుళ్యమునుండి త్రోసికొని పోనఁజాలక యూరకుండిరి.

పురో:—రథమును లాగుటకు వారికి సత్త్వ మెక్కడిది?

కవి:—అది స్నాయువులసత్త్వము కాదు. మృదుమధుర కావ్యరచనా శక్తి గల మాకు ప్రాసయమకాదులయందునమ్మక మున్నది. ఎక్కడ విరామ ముండవలెనోయక్కడ విరామము లేకున్నచోఁ గాలానిక్రమణమే! ఆదియనుగాక పద్గములు శృంగారహాస్తగతమైనప్పుడే, సత్యము సరళమార్గముఁ బట్టును. మీకు దౌర్జన్యమునందు నమ్మకము. అది బలహీనుని

యొక్కయు, భీరునియొక్కయు, జడునియొక్క మతేము.

మొ.యో:—కవివరుఁడా! రాజ్యము వినాశము చెందు చుండ నీ వుపన్యసించుచున్నావు.

కవి:—ప్రతియుగమునందు నారాజ్యములు వినాశమును జెందినవి. కాని యేది జీవించవలసియుండెనో యది యే మిగిలియుండెను.

రెం.యో:—కవీ! నీ వేమిచేయ నిశ్చయించుకొంటివి?

కవి:—ఆశ, ధైర్యోద్రేకములఁ బుట్టించు నొకపాటను బాడెదను.

మూ. యో:—దాని వలన నేమి ప్రయోజనము?

కవి:—అది, ప్రజలు రథమును లాగునప్పుడు, వారేయే కాలములందుఁ గార్యసాధనమునకుఁబూనుకొనవలెనో ఆయాకాలములను సూచించును. ఆకాలములందు లాగుటయే ప్రపంచమునందలి సర్వబాధలకు మూలకారణము.

యోధులు:—మే మేమి చేయవలెను?

పురో:—నే నేమి చేయవలసి యున్నది?

కవి:—తొందఱపడకుఁడు. మఱల మీయాకాజ్ఞ యయ్యెడి వఱకుఁ గనిపెట్టుచు, నాలోచించుచుఁ గార్యముల నొనర్పుఁడు.

(తెలుపడును.)

---

# అనురాగమా - విరాగమా?

జంధ్యాల వేంకట శివకవులు ('పూఁదేనె' నుండి)

కుసుమముం గాంచి నంత నీగుణగణమ్ము
గానముం జేయఁ బూను నామానసమ్ము
ఔర! యెంతటి సౌందర్యసార మిందు
నించితివి! జీవకళయు నర్పించి తెంత!
చిన్నికుసుమమ్ము నీ విన్నివన్నె లొలుక
ఎంత ప్రేమను దీని నిర్మించినావొ?
ఱెప్ప లార్పక విస్మయదృష్టి దీనిఁ
గాంచుచునె కాంచుచునె మేను గగురు లెత్త
దానినిన్ నన్ను మఱచెదఁ గాన నింక
వేఱువస్తువు నినుఁ దక్క విశ్వమందు
అదిర! నీపను లెంతటియద్భుతములు
నిను గిడున్ సులభమ్ముగఁ గనుట పొంతె
ద్వారముల నెన్ని తెఱచి తవ్యాజకృపను!

* * * *

ఎవ్వ రీవంక నాగుండె చివ్వుమనఁగ
నన్ను నవతలికిని నెట్టుచున్నవారు?
"తొలఁగి పొమ్ము మాయాజాలకలితమైన
యీప్రపంచరతిన్ జిక్కి తేని యింక
పృథగ నశియించి పోదు తప్పించుకొనుము
ఈప్రతారిణి యెల్లెడ నెసఁగువాని
నెడము సేయుచు నినుఁ గొని యేగుచుండె"
అనుచు వచియించుచున్నమహాత్ము లెవరు?

* * * *

ఏటివిపరీత మియ్యది యెల్లెడలను
నీవ యుండిన నిన్ బాసి పోవు టెట్లు?
అసలు జగము మాయాజాలమగును గాక
దీని విడిచి బైటకుఁ బోవు తెరువు గలదె?
నాథ! యేయీప్రసూనవనమున కీవు
తోఁటమాలివై వాత్సల్యపాటవమున
దీని సర్వాశుభముల నీ పైన వైచి
కొనుచు దీనికై శంకరతను వహింతు
వట్టిదీనిపై దుష్టభావనలు గనుట
పాపమును, నీచమును నశుభమును గాదె?

* * * *

తత్త్వ మింతయు నెడఁదను దరిచి చూడ
ఎవని కెల్లెడలను గోచరించు మాయ
వాఁడె నిజముగఁ దా మాయపాశమందు
కట్టఁబడె నేమొ యనుశంక గలుగు నాకు.

# ప్రాచీన హైందవ గణితములు

దర్భా యజ్ఞేశ్వర సోమయాజిగారు. బి. యే., యల్. టి.

క. పలుసందియములఁ దొలఁచును, వెలయించు నగోచరార్థ విజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర మయ్యది, యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్. —చిన్నయసూరి.

ఆంధ్రవచనరచనను సృజించి, యాబాలగోపాలము నీతి విద్యాపారంగతులగునట్లు, నన్నయసరణి నవలంబించి, నీతిచంద్రికను వ్రాసి, వన్నెకెక్కిన సూరిశేఖరుఁడౌ చిన్నయసూరి యీపద్యమునే విష్ణుశర్మచే కవిమండలికి వెల్లడింపజేసె నన్న సంగతి యెల్ల తెలిసినవిషయమే. ఇందు శాస్త్రవిజ్ఞానావశ్యకతనుగూర్చియే యాతడు ప్రశంసించియున్నాడు. ఈత డొక్క నీతిశాస్త్రప్రాశస్త్యమునుగూర్చియే యిందు వచియించెననుట యంత సమంజసము గాదు. అన్నిశాస్త్రములను సమదృష్టినే చూచి, వానివాని ప్రత్యేక ప్రాధాన్యములను సమగ్రముగ గ్రహించి విశేషార్థమును స్ఫురింపజేయు "శాస్త్ర" శబ్దమునే భావగర్భితముగ బ్రయోగించియున్నారు. వీరీపద్యమున నుడివినవిషయములన్నియు గణితశాస్త్రజ్ఞానమునకు గూడ వర్తించును.

౨. గణితశాస్త్ర మన నేమియో, దాని ప్రాశస్త్యమెట్టిదో, దానితో దనదేశస్థుల కెట్టి యనుబంధ ముండెడిదో, రానురా నాబాంధవ్యము మననాఁటి కెట్లుపరిణమించినదో, తిరిగి యిపుడు దానితో సాంగత్యపురస్సరంబుగ వియ్యమందు టెంతయావశ్యకమో, యను సంగతులనుగూర్చి యీదిగువ నానేర్చినకొలది నుగ్గడించెదను.

౩. గణితమన నేమి? గణితమనుపదము "గణ్" అనుసంస్కృతక్రియనుండి సేకరింపఁబడినది. గణనమనఁగా లెక్కించుట. గణనమే ప్రధానముగాఁ గలవిజ్ఞానవిభాగమును గణితమందురు. శుద్ధగణితమని ప్రయుక్తగణితమని గణితము ద్వివిధము. శుద్ధగణితము నంకగణితము, బీజగణితము, జ్యామితి (రేఖాగణితము), త్రికోణమితి (Trigonometry), క్షేత్రగణితము (Mensuration), కలనము (Calculus), బీజజ్యామితి (Analytical Geometry), మున్నగువిభాగములుగ విభజించి వ్యవహరించుచున్నారు. ప్రయుక్తగణితము శుద్ధగణితఫలితముల నూతగ గైకొని పంచభూతమయప్రపంచవిషయికవికారాదులతత్త్వముల నెక్కసరణికి దెచ్చుచున్నది. ప్రయుక్తగణితమును ఖగోళశాస్త్రము (Astronomy), గతివిద్య (Dynamics), స్థితివిద్య (Statics), జలస్థితివిద్య (Hydrostatics), తదితర భౌతికశాస్త్రగణితభాగములుగను విభజించియున్నారు. ఈగణితభాగములన్నియు గూడ మానవుల

కావశ్యకములే. గణితజ్ఞానంబునం జేసి మానవుల కెట్టిలాభములు గల్గుచున్నవో యరయుదము.

౪. మాతృభాష మానవుల కెంతయుపయోగకరమో గణితజ్ఞానముకూడ వారి కంత యుపయోగకరమనుట యతిశయోక్తి గాదు. వర్తక వ్యాపారముల కెల్ల నాయుష్పపట్టైనది యేది? రాజకీయవిషయములకు మూలాధారమైనది యేది? గ్రహసంచారముల నిర్ణయింప సామర్థ్యముగలది యేది? ప్రకృతిశాస్త్రమునకు జీవగఱ్ఱయైనది యేది? "రాల్గరగించువిమలగాంధర్వ"విద్య కట్టిసౌకుమార్యము నొసగినది యేది? శిల్పనిర్మాణములకు స్థైర్యము గూర్చిచిరస్థాయిగ నొనర్పగల్గు విజ్ఞాన మేది? ఇట్టి ప్రజ్ఞాపటలజటిలంబగు శాస్త్రము గణితమే.

౫. ఇక మన దేశమున గణితశాస్త్ర మెట్లు పెంపొందినదో యరయుదము. మన వీలునుబట్టి దీనిచరిత్రమును మూడుభాగములుగ విభజింపవచ్చును.

౧. శుళ్వసూత్రముల కాలమునాటిగణితము. క్రీ. శ. 200కు పూర్వకాలమునాటివి.

౨. ఖగోళశాస్త్రములకాలము. క్రీ. శ. 400-600.

౩. హైందవగణితముల యుచ్చదశ. క్రీ. శ. 600-1200. విషయములను యథార్థముగ బ్రకటింపకున్నను, యీవిభజన మనకు విషయవ్యక్తీకరణమునందు జాలవఱకు దోడ్పడి, దానిని తగు వాస్తవముతో బ్రకటించుచున్నది.

౬. వేదములకాలము: మిక్కిలి ప్రాచీనమగు వేదములకాలమునే గణితములకు బ్రారంభకాలముగ జేయుదమన్న, వేదముల కాలమునాటి సారస్వతమునందు దాత్కాలికముగ బేర్కొన్న యొకకొన్ని కొలతలు, సంఖ్యలు తక్క, గట్టిగ గణితభాగములుగ వ్యవహరింప దగిన విషయజాల మెందును గానరాదు. పైన పేర్కొన్న మూడుకాలభాగములలో శుళ్వసూత్రములకాలపు గణితభాగములకును, దక్కటి రెండుకాలములం దభివృద్ధినందిన గణితములకును, నెట్టిసంబంధము లేదనుసంగతి కడుంగడు శోచనీయము. తరువాతకాలమునాటి వారలందరును, శుళ్వసూత్రగర్భితగణితవిజ్ఞానము నెఱుగనట్లే తేటపడుచున్నది. ఈగణితభాగములనుగూర్చి వారెన్నడును బ్రశంసింపకుండుటయేకాక, వానియందున్న విజ్ఞానఫలితములను గూడ వాడుక చేసిన ట్లగపడదు. ౧౯ వ శతాబ్దమునకు బూర్వముననున్న హిందువు లెవ్వరునుగూడ శుళ్వసూత్రములలో నెట్టిప్రశస్త్యమేని గల గణితభాగము లున్నట్లు చెప్పుటకూడ నెఱుగరు. మూడవవిభాగకాలమునాటి గణితము రెండవవిభాగకాలగణితము నుండియే పెంపొందినట్లు పొడకట్టుచున్నది.

౭. శుళ్వసూత్రములు: బలిపీఠముల నిర్మాణములనుగూర్చి చెప్పుకల్పసూత్రములకు తోడై వానిని సంపూర్ణముగ నొనర్చుచున్నవి యీశుళ్వసూత్రములే! ఈ "శుళ్వసూత్రము" లనునామమునకు "త్రాళ్లకొలతలను గూర్చిన విధు"లని యర్థము. శుళ్వసూత్రములను వ్రాసి

నకాలమునుగూర్చి పండితోత్తములు భిన్నాభిప్రాయములను వెల్లడించియున్నారు. శుల్వసూత్రములు యాగాదివైదికకర్మలందు దోడ్పాటుగ నుండుటకై నియోగింపబడినవి. గణితవిభజన ప్రకర్షవీనిముఖ్యోద్యమముమాత్రము కాదు. దీనంజేసి వీనియందు మతోద్యమ ప్రసక్తియే కాని గణితోద్యమప్రసక్తియంత మెండుగ నున్న ట్లగపడదు. వీనియందు గణితఫలములనుమాత్రమే పేర్కొనిరికాని వాని కేవిధమైన యుపపత్తులనుగాని యెట్టిప్రతిపాదనములను (Demonstrations) గాని ప్రకటించియుండలేదు. ఈఫలితములను గణితాచార విధినిగూడ రూపించియుండలేదు.

౪. శుల్వసూత్రములలోనిగణితము:జ్యామితిభాగము:—

౧. ఆయతములను వర్గములను గల్పించుట.

౨. కర్ణమునకును భుజములకును గలసంబంధము.

3. ఆయతములయు వర్గములయు తుల్యతలు.

౪. వృత్తములయు వర్గములయు తుల్యతలు.

ఈ నాల్గువిషయములగూర్చి గణితభాగమునకు సంబంధించిన సూత్రములు కొంతవఱకు ప్రశంసించుచున్నవి. మొదటి రెండు భాగములసందర్భమున, పైథాగరసు ప్రమేయముయొక్క సాధారణవిధిని ప్రకటించియున్నారు. బౌధాయన కాత్యాయనములం దీ సూత్రమున్నది.

"దైర్ఘ్యచతురశ్రస్యాక్ష్ణయా రజ్జుః పార్శ్వమానీ
తిర్యఙ్మానీచ యత్ పృథగ్భూతే
కురుత స్తదుభయం కరోతి".

"ఒకయాయతముయొక్క కర్ణము పొడుగు నడిమిపట్టినత్రాడు కల్పించు వైశాల్యము, దానిదీర్ఘహ్రస్వభుజముల నేర్పరించు త్రాళ్లు రెంటను విడివిడిగా కల్పించు వైశాల్యములరెంటిని గూడ బ్రకటించును. అనగా ఆయతపు కర్ణోపరివర్గము తక్కటి రెండుభుజములమీది వర్గముల మొత్తమునకు సమానము" అని యీసూత్రముసకర్థము. ఆపస్తంబము "చతురశ్ర" మనుపదమును వదలివేసి యీసూత్రమునే నివేదించుచున్నది. ఈసూత్రము నీదిగు యుదాహరణములచే స్పష్టీకరించియున్నారు.

$$3^2 + 4^2 = 5^2$$

$$5^2 + 12^2 = 13^2$$

$$8^2 + 15^2 = 17^2$$

మున్నగునవి. ఆపస్తంబ బౌధాయనములందట్లుకాక, కాత్యాయనమునందు వర్గముయొక్క భుజకర్ణములతో దుల్యములగు భుజములుగల సమకోణ త్రిభుజముయొక్క కర్ణముల నవ్యక్తగణితవిధిని (algebraically) సంకేతముగ బ్రకటించిరి. అనగా సమకోణ త్రిభుజపు భుజపరిమాణములు. క్రమముగా "భు, $V_2$ భు, $V_3$ భు" లని ప్రకటించిరి. దీనియందు మాత్రమే "$1^2 + 3^2 = 10$" అనియు, $2^2 + 6^2 = 10$" అనునట్టియు సంబంధములను గూడ పేర్కొనియున్నారు. ఏదో యొకయు

త్సర్గము (Generalrule) నుండి వీనినన్నిటిని గ్రహించినట్లు సూచించుచిహ్నము లేవియు నీశుల్వసూత్రములందు గానరావు.

౯. తాత్కాలికముగ వర్గకర్ణపుపరిమాణమును బ్రకటించిరి.

$$V_2^- = 1 + \frac{1}{3} + \frac{1}{3\ 4} - \frac{1}{3.4\ 34}$$

ఒకటిలవముగగల భిన్నములప్రయోగమే యీయనుబంధమునుండి మనము గ్రహింపవలసినవిషయము. ఈఫలముగాని, యీరూపము గలభిన్నములుగాని, దీనితరువాతిహైందవగ్రంథములందు గానరావు.

౧౦. తుల్యవర్గములను నాయతములను గూర్చిన ప్రశ్నలు నియములగు యజ్ఞవేదికలకల్పనములందు సంభవించుచుండుటచేతమున శుల్వసూత్రములు పైథాగొరసుప్రమేయసహాయమువలన సాధింపగల్గు నొకకొన్నిన్యాసములను బ్రకటించుచున్నవి.

౧. ఒకవర్గమును రెండువర్గములయోగమునకు సమానమగునట్లొనర్చుట.

$$క^2 = ల^2 + భు^2.$$

౨. ఒకవర్గమును రెండువర్గములవ్యత్యాసమునకు సమానముగ నొనర్చుట.

$$భు^2 = క^2 — ల^2$$

3. నియతవర్గమునకు సమానముగ నొకయాయతమును గల్పించుట.

$$భు^2 = V_2^-\ భు.\ \frac{V_{2భు}^-}{2}$$

౪. నియతాయతమునకు సమానముగ నొకవర్గమును గల్పించుట.

$$క.చ = \frac{(క + చ)^2}{2} - \frac{(క — చ)^2}{2}$$

౫. ఒకవర్గన్యూనమును (Decrease)మరియొకవర్గముగఁ జేయుట ఈయైదవసూత్రమంతవిపులముగా లేదు.

౧౧. వృత్తము. బలిపీఠములనిర్మాణమునందు గొన్నిటవృత్తతుల్యములగు. వర్గములగల్పించుటావశ్యకముగానుండెడిది. ఈసమస్యయొక్క వివరణము శుల్వసూత్రములందుఁగూడ గాన్పించుచున్నది. ఈవివరణము లసంపూర్ణస్థితి (crude form) నున్నను వీనిలో నొకయంశము మాత్ర మించుమించు రూఢముగానే యున్నది. వర్గముయొక్క భుజమును (భు) చేతను, వృత్తము యొక్క వ్యాసమును (వ్యా)చేతను, ఆవర్గవైశాల్యమును (భు²) చేతను ప్రదర్శించినచో శుల్వసూత్రములందున్న యీసమస్యఫలముల నీదిగువరీతిగ వివరింపవచ్చును.

$$(1)\ వ్యా = భు + \frac{1}{3}(V_2^-\ భు — భు)$$

$$(2)\ భు = వ్యా — \frac{2}{15} వ్యా$$

$$(3)\ భు = వ్యా \left(\frac{1}{8} + \frac{1}{8.29} — \frac{1}{8.29.6} + \frac{1}{8..9\ 6.8}\right)$$

ఈఫలములలో మొదటిరెండును బౌధాయనాపస్తంబములందున్నవి. మూడవది ప్రత్యేకముగా బౌధాయనమునందే కాన్పించుచున్నది. ఇది $V_2^-$ యొక్క పరిమాణముగ (౬9) నుపయోగించి (1) నుండి గ్రహించినట్లగపడుచున్నది. అది యెట్లనిన

$$\frac{భూ}{వ్యా}=\frac{3}{2\sqrt{2}}=\frac{3}{2+\frac{577}{408}}=\frac{1224}{1393}=$$

$$1-\frac{1}{8}+\frac{1}{8.29}-\frac{1}{8.29.6}+\frac{1}{8.29.6.8}-\frac{41}{8.29.6.8.1393}$$

ఇదియు (3) నందలిఫలితము నొక్కటే. దీనినిబట్టిచూడగా శుల్వసూత్రముల కాలము నందే భిన్నముల నొకటి లవముగాగల పాక్షికభిన్నములుగ (Partial fractions) ప్రకటించువిధుల నెఱిగినట్లే గోచరించుచున్నది. కాని దీనిని ధ్రువపరచుట కెట్టియాధారము లును గానరావు. ఇంతియగాక తరువాత వారెవ్వరు నీపాక్షికభిన్నప్రక్రియ నవలంబించి యుండలేదు. తరువాత కాలమునందలి హైందవగణితజ్ఞు లెవ్వరు నీవృత్తవర్గీకరణ (squaring the circle) సమస్య వివరణను గూర్చి చర్చించినట్లుకాని, శుల్వసూత్రములం దీవిషయవివరణ మున్నదనిగాని వారి వారి గ్రంథములలో వాడియుండలే దనుసంగతిని జ్ఞప్తియందుంచుకొనుట యుత్తమము.

II ఖగోళశాస్త్రములకాలము. క్రీ. శ. 400-600

౧౨. శుల్వసూత్రముల కాలమునాటి గణితమునకును నటుతరువాత పెంపొందిన హైందవగణితమునకును నేవిధమైన సంబంధముగాని యున్నట్లగపడదు. గ్రీసునందు గణితప్రసక్తి (research) క్షీణించిన వెంటనే హిందువులు తమగణితవిజ్ఞాన కౌముదిని బ్రపంచమునంతటను వ్యాప్తముచేయ నారంభించిరి. అంకగణిత, బీజగణితములందు మాత్రమే వారు ప్రఖ్యాతిగాంచిరి. రేఖాగణిత విజ్ఞానమునందు వారు చాల వెనుకబడియున్నారు. అవ్యక్తవిశ్లేషణ మనుగణితశాఖను జక్కగా బెంపొందించి యుచ్చదశకు దెచ్చిరి. 19 వ శతాబ్దమువరకు నీవిషయము పాశ్చాత్యులకు దెలియకుండిన కతమున నానాటి (క్రీ. శ. 400-600) పాశ్చాత్యగణితవేత్త లీవిషయమును గూర్చి యేమియు నెఱుగరు.

౧3. హిందువులలో ప్రత్యేకగణితశాస్త్రజ్ఞులమని కంకణము గట్టుకొనినవా రెవ్వరును లేరు. మనము వ్రాయ సమకట్టిన గణితజ్ఞులందరును కేవలసిద్ధాంతుల మనియే వ్యవహరించికొనిరి. సిద్ధాంతవిద్యాభ్యాసమునందు వారు గణితమును కేలూతగా జేసికొనిరి. అప్రధానముగ గైకొనిన గణితవిజ్ఞానప్రకర్షయందే వారు ప్రఖ్యాతిగాంచి తమ కభిరుచి గల్గి యప్రమత్తులై ఖగోళశాస్త్రమున నవలోకనములు సల్పి, తత్స్థానాంశములను బ్రోవుచేసి, య ను గ మ ప రి శో ధ న ము ల (inductive inferences) నొనర్చి విజ్ఞానసంస్కరణము నొనరింపజాలకపోయిరని వచించుటంతయు నాశ్చర్యకరము గా నున్నది.

౧౪. హిందువుల గణితములో గొంత, గ్రీకుగణితజన్యమనుసంగతి నిశ్చయమైనవిషయమే. హిందువులయొక్కయు, గ్రీకులయొక్కయు నాలోచనవిధుల యనుబంధక్రమము ల నిదమిత్థమని నిరూపించుట కష్టతరమైనదయ్యును హృద్యమైనవిషయమే.

౧౫. హైందవగణితముల యభివృద్ధిని గూర్చి ప్రస్తుతము మనకు దెలిసినది మిక్కిలి స్వల్పము. తరతరంబులనుండియు వచ్చుచున్న యీస్వల్పసంఖ్యగల గణితములన్నియు గూడ

నీశాస్త్రముయొక్క సంపూర్ణస్థితినే ప్రకటించుచున్నవి. వీనిలో మొదటిగ్రంథపుకాలముతప్ప దక్కినవానిని వ్రాసినకాలములను శాస్త్రవేత్తలు నిర్ణయించియున్నారు. హిందూదేశము యొక్క వాయవ్యదిశయందున్న తక్షశిలానగరమున క్రీ. శ. ౧౮౮౧ సం. నందు భూస్థాపితమైన యొకప్రాచ్య లిఖితాంకగణితమొకటి దొరికినది. దానిని వ్రాసినవారిపేరందు లేదు. దానిలోని శ్లోకములవికారవిశేషములనుబట్టి యది క్రీ. శ. మూడవశతాబ్దముననో లేక నాల్గవశతాబ్దముననో వ్రాసినట్లు తోచుచున్నది. ఇది భూర్జపుపట్టమీద వ్రాసిన గ్రంథప్రతునక. ఇది యెనిమిదవశతాబ్దమున లిఖించిన మతియొకప్రాత ప్రతికి పుత్రికగా దోచుచున్నది.

౧౬. మనకు దెలిసినగణితశాస్త్రజ్ఞులలో ప్రాచీను డార్యభట్టాచార్యుడు. గంగానదికుత్తరతీరముననున్న పాటలీపుత్రమున క్రీ.శ. ౪౭౬ సం. మున నీతడు జన్మించెను. ఈతడార్యభట్టీయమను గ్రంథమును వ్రాసెను. దీని తృతీయాధ్యాయము గణితమునుగురించి వ్రాసినదే. సుమారు నూరేండ్లైనతరువాత, ననగా క్రీ. శ. ౫౯౮ సం. మున బ్రహ్మగుప్తుడు పుట్టెను. ఇతడు క్రీ. శ. 628 సం. మున "బ్రహ్మస్ఫుట సిద్ధాంత" మనుగ్రంథమును వ్రాసి వాసికెక్కెను. ఈగ్రంథముయొక్క పండ్రెండవ యధ్యాయమును, పదునెనిమిదవ యధ్యాయమును, గణితమునకు జెందినభాగములు. తరువాత శతాబ్దములందు లెక్కకు వచ్చెడివా రిరువురుమాత్రమే పుట్టిరి. వీరిలో శ్రీధరుడు గణితసారమును, పద్మనాభుడు బీజగణితమును వ్రాసిరి. బ్రహ్మగుప్తుని తరువాత నీగణితశాస్త్ర మంతగా వృద్ధిజెందినట్లు కాన్పింపదు. క్రీ. శ. 1150 ప్రాంతమున భాస్కరాచార్యుడు వ్రాసిన సిద్ధాంతశిరోమణిమాత్రము, దాని కైదువందల సంవత్సరములకు క్రిందటనే వ్రాసిన బ్రహ్మగుప్తుని సిద్ధాంతముకంటె కొంచము మిన్నయై వర్తించుచున్నది. భాస్కరుని గ్రంథమునందు, లీలావతి, (అంకగణితము) బీజగణితము, లనబడు రెండు ప్రకరణములుమాత్రమే మిక్కిలి ప్రశస్తములైన గణితభాగములు. రానురాను శోధనప్రసక్తి (Spirit of research) క్షీణించినది. తరువాతికాలమున పొగడ్తకెక్కిన గణితజ్ఞు డెవ్వడును లేడు.

౧౭ అంకెలకు స్థానికమూల్యము (Place value)ను గల్పించి, గణితవ్యాపారములందు సున్నయొక్క ప్రయోగము నాచరించి, యాచారములోనికి దెచ్చినది హిందువులే. గణితశాస్త్రమున కాయుప్రప ట్లనదగు. వీని నాచరింపక పూర్వ మీశాస్త్ర మంతబాగుగ నభివృద్ధిజెందలేదు. వీనిని బురస్కరించికొనుట చేతనే గణితము లత్యద్భుతముగ నలతికాలముననే పెంపొందినవి.

౧౮ 'తక్షశిల' ప్రాచ్యలిఖిత పుస్తకము: తక్షశిల ప్రతినుపయోగించువారు, లెక్కపెట్టుట తెలిసినవారుగా నుందురను నుద్దేశమును మనస్సున నుంచుకొని వ్రాసినట్లే, కాన్పించుచున్నది. దీనియందు మధ్యగీత లేక యేలవము క్రింద హారమును

వ్రాసి భిన్నములను బ్రకటించియున్నారు. పూర్ణాంకములను నొకటి హారముగాగల భిన్నములుగా రూపించిరి. మిశ్రసంఖ్యలలో పూర్ణాంకమును భిన్నముకుపైననే వ్రాసియున్నారు. ఉ. "$\frac{2}{3}=2\frac{1}{3}$". మన మిపు డుపయోగించుసమీకరణ చిహ్నమునకు (=) బదులు "ఫల"మనుపదమును "ఫ" యనునక్షరసంకేతముచే బ్రదర్శించి వాడియున్నారు. సంకలనమును "యు" అను "యుత" శబ్దసంకేతముచే సూచించిరి. సంకలనమును జేయవలసిన సంఖ్యల నొక యాయతమునందే వ్రాసి ప్రకటించియున్నారు. ఉ. "ఫ. 12 [$\frac{7}{1}$-$\frac{5}{1}$ యు]" యన్నది "5 + 7=12"ను ప్రదర్శించుచున్నది. అవ్యక్త పరిమాణమును (Unknown quantity) శూన్యమని వ్యవహరించుచు దాని నొకస్ఫుటమగుచుక్కచే(.)సూచించిరి. శూన్యశబ్దమునకు వట్టిదని (ఏమియులేనిదని) యర్థము. ఇచ్చట పెద్దబొట్టుచే ప్రకటింపబడ్డ సున్నకుఁగూడ నీపదమునే పర్యాయపదముగ వాడుచున్నారు. ఈపదముయొక్కద్వ్యర్థిప్రయోగమును, చుక్కప్రకటనయును, నాస్థానము పూరింపబడక వట్టిదిగా నున్న దని తెలుపుచున్నట్లు గ్రహించుచున్నాము. ఇంతియకాక యాస్థానము నాక్రమించికొనవలసిన సంఖ్య నిర్ణీతము కానంతవఱకు నది వట్టిదిగనే యుండవలె ననుసంగతినిగూడ నిది సూచించుచున్నది.

౧౯ తక్షశిలయంకగణితమునందు నొకటిని భావనయందు సంకల్పించుకొని వాస్తవ ఫలితమును నిర్ణయించుట యనుమిథ్యావిధి (False position) నుపయోగించి చేసెడిప్రశ్నలు గలవు. ఈమిథ్యావిధిప్రయోగమును ప్రత్యేకగణితకర్మముగ గ్రహించి భాస్కరుడు విశేషించి వాడియున్నాఁడు. తక్షశిలప్రతి యొకటినే యవ్యక్తపరిమాణముగ గ్రహించుచున్నను, భాస్కరు డొకటికి బదులుగా మూడు నుపయోగించి వ్యవహరించి యున్నాడు.

ఆర్యభట్టు

౨౦ ఈతడు క్రీ. శ. 476. సం. మున జన్మించెను. దేశాచారమునుబట్టి యార్యభట్టు గణితశాస్త్రజ్ఞులలో మొట్టమొదటివాడుగ నెన్నబడుచున్నాడు. గణితశాస్త్రమునుగూర్చి ప్రత్యేకముగా వ్రాసినవారిలో దొల్తటివాడీతడే. ఈతడు ప్రఖ్యాతసిద్ధాంతి యగుటచే సిద్ధాంతభాగములలోనికి గణితశాస్త్రసమ్మతములై యారూఢములైన మార్పులను జేయనుంకించెనుగాని ఛాందసులగునితరసిద్ధాంతులు దీనిని నిరోధించిరి. ఈత డార్యభటీయమను గ్రంథమును వ్రాసెను. దీనియందు సూత్రములయు, ప్రమేయములయు తత్త్వములను సాంకేతికశ్లోకములలో నీతడు వ్రాసెను. దీనిలో నుపపత్తులుగాని యభ్యాసములుగాని కానరావు. దీనియందలిభాష క్లిష్టముగను సంగ్రహముగను నుండి చాల దురవగాహముగా నున్నది. బీజగణిత విశ్లేషణమును(Algberaical analysis) గల్పించిన దీతడేయని పెక్కండ్ర యభిప్రాయము. ఈగ్రంథముయొక్క నాల్గధ్యాయములలో మూడుభాగములు ఖగోళశాస్త్రమునుగూర్చియు, గోళీయత్రికోణమితిక

ప్రాథమికాంశములను (Elementary portions of Spherical Trigonometry) గూర్చియు బ్రశంసించు చున్నది. చతుర్థభాగమునందలి ముప్పది మూడుద్విపదలలో నంకగణిత బీజగణిత, సరళ త్రికోణమితులందలిసూత్రములను వ్రాకుచ్చి యున్నాడు. కేవలసిద్ధాంతియగు నీతడు తన సిద్ధాంతమునకు వినియోగించుగణితభాగము లనుమాత్రమే యభ్యసించెను.

౨౧ అంకగణితము సంఖ్యానీకముతో బ్రారంభించి సంఖ్యలవర్గములను వర్గమూలము లను గనిపెట్టురీతులను గూర్చి చెప్పి, వైశా ల్యములను గూర్చియు, ఘనఫలములనుగూర్చి యు కూడ చర్చించుచున్నది. ఘనఫలములను గూర్చి చెప్పుసూత్రములు చాలవఱకు దోష భూయిష్ఠములుగ నున్నవి.

"సూచీఘనఫలము (Vol. of a pyramid) $=\frac{1}{2}$ భూమి × లంబము" అని యీగ్రంథ మున నున్నది. దీనితరువాత ఖగోళశాస్త్ర సాంప్రదాయము గల గణితభాగ (Semi-astronomical section) మున్నది. దీనియందు వృత్తమునుగుఱించియు, ఛాయలనుగూర్చిన ప్రశ్నలనుగూర్చియు, నిట్టి మఱికొన్నివిషయ ములను గూర్చియు ప్రకటించియున్నాడు.

౨౨ బీజగణితవిభాగమునందు మొదటి "న" సహజాంకములయొక్క ప్రథమ, ద్వితీయ, తృతీయ ఘాతములమొత్తములను గను గొనువిధులను దెల్పియున్నాడు. వర్గాత్మక సమీకరణపు సాధారణవివరణమును (The general solution of a quadratic equation) ప్రథమఘాతసమకాలిక సమీకరణముల (Simultaneons equations of the first degree) వివరణముల నొకకొన్నిటిని దెలిపియున్నాడు. సమకాలికసమీకరణముల సాధారణవివరణ మును పరంపరాభిన్నముల (Continued fraction) విధి నుపయోగించి ఫలముల గనుం గనుగొనుటకు యత్నముచేసినవారిలో నీత డే ప్రథముడు. ఈతడు గ్రంథమున వ్రాసిన సూత్ర మంతయథార్థమైన ట్లగపడదు. కాని వీరియాశయము మాత్రము శ్లాఘ నీయము. ఈవిధినిగూర్చి మిక్కిలి విస్తరించి వ్రాసి, చదువరుల నాశ్చర్యమగ్నులుగ నొనర్చు సామర్థ్యమును బ్రకటించిన బ్రహ్మగుప్త భాస్కరులకల్పనలకు మార్గదర్శకముగ వర్తిం చిన దీయార్యభట్టీయవిభాగమే యని వేరె చెప్పనక్కఱలేదు. దీనియందుగల యంకె లతో గూడిన సమీకరణవ్యాపారముల నరసి చూచిన దశాంకకలనవిధిని యీతడెఱిగియే యున్నట్లు ద్యోతకమగుచున్నది.



# వానప్రస్థుని విభ్రమము

శ్రీ శివశంకర శాస్త్రిగారు, (సాహితీసమితి సభాపతి)

౪

దేవి, యీనేత్రములకు యాదృచ్ఛికముగఁ
ద్వన్మనోహర రూప సందర్శనాభి
సిద్ధికయి యెన్నిసార్లు నిల్చితినో తెలియ
దహహా! వాతాయనమ్ముల కభిముఖముగ.

విమలకమనీయ వదనారవిందదివ్య
వీక్షణక్షణరక్తి దేవీ, త్వదీయ
సౌధసవిధమ్మునకు నెన్నిసార్లు తీర్థ
యాత్ర సల్పితినో తెల్ప నలవి కాదు!

అమలసంజీవనౌషధం బైననీదు
శాంతరమ్యకృపాకటాక్షంబు కొఱకు
చెలగి హర్మ్యమునకుఁ బ్రదక్షిణము లెన్ని
చేసితినొ దేవి, లెక్కించి చెప్పలేను!

హృదయభారఘనధ్వాంతవిదళనాచ్ఛ
చంద్రికాకాంతిపూరయుష్మన్మనోజ్ఞ
దివ్యదరహాసమునకు మందిరములోని
కెన్నిసారులు వచ్చితి నెఱుక లేదు!

౫

వీతరాగులు సంత్యక్తవివిధసుఖులు
శూన్యవాదులు బుద్ధభిక్షుకులు దేవి!
కలవు వారల కెల్ల సంఘమ్ము బుద్ధ
దేవుఁడును ధర్మ మనియెడి "త్రిశరణములు."

సతతహృదయాంతరాళజాజ్జ్వల్యమాన
దివ్యవిమలానురాగసందీప్తిశాలి,
నఖిలభుజమార్గకలితభోగాభిరతుఁడ:
దేవి, ఉన్నవి నాకును త్రిశరణములు!

నిన్ను వర్ణించి నీయెడ నిరుపమాను
రాగ ముదయింపఁ జేసిన రమ్యమూర్తి
ఆర్ద్రహృదయుఁడు మామకప్రాణసఖుని
యమృతనిష్యంది వాక్కుల నాశ్రయింతు!

అఖిలశృంగారనిధి జగదాశ్రయుండు
భక్తవాంఛితనిఖిలసంపత్ప్రదుండు
నన్ను నినుఁ గూర్చు రాధికానాథదేవు
నంఘ్రిపంకేరుహంబుల నాశ్రయింతు!

నావిలోచనతారవు నాదుహృదయ
రాజ్యలక్ష్మివి శృంగారరససరసివి
నాతపఃఫలనిధివి ప్రాణమవు దేవి!
అట్టి నీదుకటాక్షంబు నాశ్రయింతు!

౮

మినుకు మినుకని దిక్కులు మెఱయుచుండె
నావరించెను జిఱుమబ్బు లాకసమ్ము
నెదురుగాఁ దోఁచుచుండె మహీధరమ్ము
పార్శ్వములఁ బాదపశ్రేణి పరగుచుండె.

కలరవంబున బందరుకాల్వ మిగుల
నింపు లొల్కెడిగతిఁ బ్రవహించుచుండె
నీరరేఖను బ్రాకించి కూరుచుంటిఁ
బ్రాణసఖుతోడ సందలి పడవ మీద.

తన్మధురరాత్రి వేళఁ దత్ప్రాంత మెల్ల
నిర్జనమనోహరంబయి నెగడుచుండె
శ్రవణగోచరమగుచుండె శాంతరీతిఁ
గృష్ణవేణీస్రవంతికాగీతరవము.

మందపవనకుమారుఁడు మధురగతిని
కోమలములైన మాదు ముంగురులతోడ
లలితమానుత్తరీయాంచలములతోడ
నాడుచుండెను సయ్యాటలను పదమ్ము.

నిన్ను వర్ణించె నప్పుడు నిస్తులముగ
భావభరమున నాగిరాందేవి దివ్య
స్తన్యబిందుకదంబకాస్వాదవిమల
మంజులకవిత్వధోరణి మత్సఖుండు!

శ్రవణయుగళమార్గంబున సర్వగాత్ర
మాక్రమించితి వల్లన నపుడు దేవి!
అఖిలభువనమ్ము విస్మృతమయ్యె, నెదుట
నీమనోహరరూపంబు నిలుచు కతన!

హంసపల్కులచే నిషధాధిపతికి
భీమభూపాలపుత్త్రిపైఁ బ్రేమవోలె
ఆప్తువాక్యము లాలించినంత నాకుఁ
బ్రణయ ముదయించి నీమెడఁ బరిఢవిల్లె.

విజయవాడ పురమ్మును విడిచి యవలఁ
గృష్ణవేణీమహోత్తరంగిణిఁ దరించి
తూర్పు కనుమల దాటుచుఁ దుదకు నాదు
మానసము చేరె గుంటూరు మండలమ్ము!

౧౧

విరహసంతాపభరమున వేగివేగి
త్వన్ముఖసుధాంశుబింబసందర్శనాభి
రతిని నిల్చితి మీహర్మ్యరమ్యపట్ట
భంగపాళీలసత్పురోభాగమందు.

అంగణవిరాజమాననవ్యామ్రవిటపి
లలితకుసుమపరిమళలహరిఁ దెచ్చి
గంధవాహకుమారుఁడు కరుణతోడ
నాకు నామోద మొనగూర్చినాఁడు దేవి!

దీపికల్ సదనాంతర దేశమందు
వెల్గుచున్నవి తారకావిలపథమున;
మురువు గుల్కెడి భవదీయముఖసుధాంశు
బింబ ముదయింపలేదు సంప్రీతి నెఱప!

నిష్ఫలం బింక నిచ్చట నిలుచుటయుచు
మది నిరాశను వ్యథ చెంది మరల నుండ
అంబువాహతిరస్కరిణ్యంతరోది
తేందుమండల మట్లు కాన్పించినావు!

దుస్సహవిరహభారదోదూయమాన
మానసము చల్లబడియె నమందలీల
భవ్యమందారకల్పకపారిజాత
పల్లవరసాభిషేకంబు భంగి నపుడు.

ధవళకౌశేయపరిధానధారిణివయి
దేహలత హేమదీధితిఁ దేజరిల్ల
వల్గుగమనంబుతో నీవు వచ్చినపుడు
కేవలము లక్ష్మివనియెడి భావ మొదవె!

అమృతబిందుకదంబకస్యందిహృదయ
హారివిస్ఫారితవిలోచనాబ్జయుగళి
నిండుగా నీవు నామీఁద నిల్పినపుడు
లయము నెందితి మాధుర్యలహరిలోన

ద్వారదేశమునుండి తత్పార్శ్వసీమ
కతిమృదుమనోజ్ఞగతిని నీ వరిగి దేవి
ఇంతలో రత్నపుత్రిక హేలతోడఁ
గ్రమ్మరిలినావు ద్వారోపకంఠమునకె!

అలసవలితములై యీషదార్ద్రములయి
ముగ్ధహరిణీవిలోకనస్నిగ్ధము లయి
యలరునీనేత్రకోణనిర్యత్కటాక్ష
పంక్తులకు నైతిఁ బాత్రము ప్రణయమూర్తి!

మధురభావావశీలసన్మతిని నేను
మధురిమముకన్న మధురమౌ మధురమూర్తి
మధురయామిని వేళ నీమధురిమమునఁ
బూర్ణముగ ముగ్ధభావము పొందినాఁడ!

౧౨

బౌద్ధులకు నాకు బుద్ధిలోఁ బ్రణయమూర్తి!
అరయ నెంతటి తారతమ్యంబు కలదు!
ఉభయులకుఁగూడ సాదృశ్య మున్న దొకట:
నాకు వారలకును "త్రిరత్నములు" కలవు!

నిర్మలం బయి సంస్తవనీయ మగుచు
నుత్సుకోత్క్షిప్తమత్కర్ణయుగ్మమునకు
దివ్యభూషాయమానమై తేజరిల్లు
త్వద్గుణగణంబు ప్రథమరత్నంబు దేవి!

చతురవాణీ లసద్గ్రంథజాత పఠన
సక్తదృఢమత్యనాదృతసమయ మగుచు
నక్కజము గొల్పు నీదు విద్యాభినిరతి
తరళరూపద్వితీయరత్నంబు దేవి!

ధీరగంభీరశాంతమదీయహృదయ
చలన మొనరించి మరల సంసారవాంఛ
పొడమఁ జేసి నీ కమృతంపుఁబూత యైన
రమ్యలావణ్యము తృతీయరత్న మప్సర!

అమలినములైన యీ త్రిరత్నముల దేవి!
స్తవము చేయుచునుందు నక్తందినంబు
స్వాంతసంస్థితమౌ వ్యథాధ్వాంతపటలి
తెరలుచుండును నీనిదీధితులచేత!

తరుణమార్తాండరుచివోలె నరుణమగుచు
జృంభితాంభోరుహముభాతి స్మేరమగుచు
పృథుశిరీషసంవర్తికాపేశలమయి
యలరు నీపాదయుగళి ధ్యేయంబు నాకు!

వికసితసరోజనిర్నిద్రవిభ్రమంబు
పూర్ణిమాచంద్రబింబసంస్ఫూర్తిశాలి
ఇందిరామందిరము సుధాహేమకలశ
మగు భవద్వదనంబు ధ్యేయంబు నాకు!

ఫుల్లనీలోత్పలప్రభాపుంజ మగుచు
నమలబాదామఫలరూపహారియగుచు
మంజులాకర్ణవిశ్రాంతిమహితమగుచు
నలరు నీనేత్రయుగళి ధ్యేయంబు నాకు!

వాసవమణిద్యుతిచ్ఛటాభాసురంబు
చిక్కణితమాలదీధితిస్నిగ్ధముగ్ధ
మా కళిందసుతాతరంగాభిరామ
మగు భవత్కైశికంబు ధ్యేయంబు నాకు!

౧౪

అప్సర! నాకంటె నెంతటియధికవిశద
పుణ్య మొనరించె మీయింటి పొగడ తరువు!
వివిధగీతుల నిన్ను సేవించుచుండు
ధ్యేయమైన ఫలమ్ముల నెందుచుండు!

ఆయతగవాక్షపార్శ్వ వేత్రాసనమ్ము
నధివసించి పికాంగనామధురఫణితి
సరసకావ్యముఁ బఠియించు సమయమందుఁ
జల్లదన మిచ్చు వకుళవృక్షంబు నీకు.

క్లాంతిఁ గని నీవు మధ్యాహ్నకాలమందు
మృదులపర్యంకతలమున మేను చేర్ప
సలుపు శీతలమారుతచాలనంబుఁ
దాళవృంతాయమానమై తరువు నీకు.

చారువిమలసాయంతనసమయములను
మధురవిలసనమున నీవు మంజనమ్ము
చేసికొనుచుండునపుడు విచిత్రపత్ర
విభ్రమము గొల్పు నీకుఁ బృథ్వీరుహమ్ము.

జాలమార్గమునందు నిషణ్ణవైన
నీకు రజనిని వకుళావనీజ మమల
సౌరభవ్యాప్తిఁ గొల్పు విహారలీల
మధురభావోపవనదివ్యమార్గములను.

నీవు తల్పశయానవై నిదుర వోవఁ
గన్నుగవ మూయ వకుళవృక్షంబు నీకు
మందపవనచలత్పర్ణమర్మరంపు
మృదులగానముతో స్వాప మొదవఁ జేయు.

నీవు కరుణాతరంగితనేత్రయుగళి
వేడ్క సారించు వేళల వృక్షరాజు
సమ్మదోదితసంచలనమ్ముఁ గ్రమ్ముఁ
గంపమానపత్త్రావళీకైతవమున.

కుసుమములు సంగ్రహించెడి కోర్కె నీదు
మృదులహస్తసంస్పర్శచే ముదితమైన
వేపథువు మాటుకొనుచుండు వృక్షరాజు
భూరిసంభ్రమపతయాళుపుష్పమిషను.

అప్సర! నాకంటె నెంతటి యధికవిశద
పుణ్య మొనరించె మీయింటి పొగడతరువు!
వివిధరీతుల నిన్ను సేవించుచుండు
యోగ్యమైన ఫలమ్ముల నొందుచుండు!



# ధర్మశాస్త్రము - మహామహేంద్రజాలము

వాసా సూర్యనారాయణ శాస్త్రి గారు

శ్యామావధాని నరసింహశాస్త్రి ప్రవేశింతురు.

రంగము: శ్రీకృష్ణవిలాస గ్రంథాలయము.

శ్యామావధాని:—నరసింహశాస్త్రీ! ధర్మశాస్త్ర మహామహేంద్రజాలమును ఉగాదిసంచికలో చదివినావా? చాలతమాషాగా నున్నది కాదూ!

నరసింహశాస్త్రి:-ధర్మశాస్త్రంసంగతి తెలియనివాళ్లకు బాగానే యుంటుంది.

శ్యామా:-మొదటియాక్షేపములన్నీ పొరంబోకులే కాని ప్రాయశ్చిత్తం తమాషాలోమాత్రం ఊపిరిఆడకుండా కారికలను కురిపించి తమసిద్ధాంతమును గురువుగారు బలపర్చుకొన్నారు కారూ!

నర:- అవధాన్లూ! తెయితక్కలపనస, డమడక్కలపాట వలె, అర్థం పర్థం లేనిమాటలహడావుడికి నీవు మెచ్చుతావు గాని పండితులు మెత్తురా?

శ్యామా:-నీమాటలువింటే నావొళ్లుమండుతున్నది. ఆతప్పులేదో చూపింపుమిరా!

నర:,ఏస్థలంలో చూపించమన్నావు?

శ్యా:-శ్లో. అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం విదు ర్బుధాః; కామకారం కృతే ఒప్యాహు రేకే శ్రుతినిదర్శనాత్. అని మనువు "ఏకే" అనుటలో మతాంతరమం దస్వరసతను దెలిపి యున్నాడు. కాబట్టి కామకృతంలో ప్రాయశ్చిత్తంలేదు. శాస్త్రుల్లూ! దీనిలో తప్పేమి యున్నది?

నర:-దీనిలో బండతప్పు ఉన్నది చూడు "శ్రుతినిదర్శనాత్" అనే హేతూపన్యాసముయొక్క అర్థమునువిచారిస్తే ఆతప్పు బయలుపడుతుంది. వేదములో కామకృత మహాపాతకములకు ప్రాయశ్చిత్తము స్పష్టముగా చెప్పబడియున్నది. కాబట్టి కామకృతంలో కూడా ప్రాయశ్చిత్తం కలదని కొందరు ఆచార్యులు చెప్పిరి అని దానితాత్పర్యము. వేదంలో చెప్పబడినదే అస్వరసము, మతాంతరము అప్రమాణము, అంటే మన ఆస్తికత్వము మనశిష్టత్వము మనవైదికత్వము ఏరేట్లో కలుస్తవి? మనువే. శ్లో. ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః' అనంగా ధర్మనిర్ణయమునకు వేదమే ముఖ్యప్రమాణము అని చెప్పియున్నాడు. "ఏకే" అనుపదము సర్వత్ర అస్వరసతా సూచకము కాదు. ఉజ్వల మస్కరీ, మన్నగు భాష్యములలో "ఏకే ఆచార్యాః" అని వ్యాఖ్యానమును చేసియున్నారు.

గౌతమ:-సూ. త్రిరోష్ఠౌ పరిమృజేత్, ద్విరిత్యేకే, సకృదుపస్పృశేత్, ద్విరిత్యేకే; ఈరెండుస్థలములలోను తుల్యవికల్పము. అస్వరసతలేదు.

సూ:-"తస్యాశ్రమవికల్పమేకే బ్రువతే!" ఇది జాబాలిశ్రుతిలము. నేడును మనవారందరున్నూ వికల్పమతమునే ఆశ్రయిస్తూఉన్నారు గాని సముచ్చయమును ఆశ్రయించలేదు.

కఠశ్రుతి:-"అస్తీత్యేకే; నాయమస్తీతి చైకే" ఈరెండున్నూ మతాంతరములేనా?

సూ:-"షడిత్యేకే" ఇది మనుమతము.

ఇట్టివి శ్రుతిస్మృతులలో వేనవేలు గలవు. నాటి పరిచయంగలవారికి "ఏకే"అన్నది సర్వత్ర అస్వరసతా సూచకమని తోచదు. 'ఏకే' అనుపదమునకు ముఖ్య, అన్య, కేవల, అనేఅర్థములే యున్నవి గాని నింద్యార్థము లేదు. మాధవాచార్యులుగారు"గవాంబంధనయోక్త్రేషు" అనుశ్లోకవ్యాఖ్యలో "అకామతః కృతే పాపే" అనే యీవచనమునే ఉదాహరించి మనువుకు ప్రాయశ్చిత్తసద్భావవాదులలో మొదటివానినిగా పేర్కొన్నాడు. వేదవేదాంగభాష్యకర్తయగుమాధవునకు మనపాటిపాండిత్యం లేక పోలేదు. మనువును అవైదికునిచేయుటకంటే శ్రుతికిన్నీ మనువునకున్నూ, కామకృతములలో ప్రాయశ్చిత్తము ఇష్టమని చెప్పుటే స్వరసము. మనువు దీనిపైశ్లోకము. "కామతస్తు కృతం మోహా త్ప్రాయ

శ్చిత్తైః పృథగ్వ్రతైః" అని విస్పష్టముగా కామకృతమునకు ప్రాయశ్చిత్తమును విధించియున్నాడు.

శ్యామ:—శాస్త్రుల్లూ! ఆశ్రుతియేదో చూపిస్తావా?

నర:—కుల్లూకభట్టుగారే ఆశ్రుతిని వ్యాఖ్యలో చూపించినారు. శ్లో. ఇంద్రో యతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్; త మశ్లీలా వాగేత్య వదత్; స ప్రజాపతి ముపాధావత్; తస్మా ఏత ముపహవ్యం ప్రాయచ్ఛతి" ఇతి.

తా. ఇంద్రుడు యతులను కుక్కలచే కరిపించి చంపించినాడు. వానికి బ్రహ్మహత్య చుట్టుకున్నది. బ్రహ్మదేవునిదగ్గరకుపోయి మొరపెట్టగా ఉపహవ్యమనే ప్రాయశ్చిత్తమును విధించినాడు. అని ఈవిధంగా శ్రుతిలో కామకృతమునకు ప్రాయశ్చిత్తం ఉండుటచేత మనువుకున్నూ ప్రాయశ్చిత్తం ఇష్టమే అని సిద్ధాంతము.

శ్యా:—శాస్త్రుల్లూ! నాకొకప్రశ్న పుట్టినది. ఇంద్రుడు చచ్చిన యతులను కుక్కలకు వేసినాడా? లేక బ్రతికిన యతులను కుక్కలకువేసినాడా? శ్రుతిలో హత్యా జ్ఞాపకము లేదుకదా?

నర:—అవధాన్లూ! నీకున్నూ తర్కము బాగా ముదిరినదిలే.

ఈకథ వేదంలో మూడునాలుగు స్థలములలో చెప్పబడినది.

"శ్లో. యతీనా మద్యమానానాగ్ం శీర్షాణి పరాపతన్ తా ఉత్తరవేద్యా అవన్. ఇతి"

ఇంద్రుడు కర్మపక్షపాతి. యతులు కర్మత్యాగులు. ఆకోపంచేతను యజ్ఞంలో ఉత్తరవేదిదగ్గరకు కుక్కలచే కరిపించి చంపించినాడు. ఇది బుద్ధిపూర్వకమే. విద్యారణ్యభాష్యమును చూడుము. కుల్లూకభట్టు మనవలెనే వేదవేదార్థజ్ఞానములేని భట్టాచారికాడు. ఇంకనూ అనేకశ్రుతులు కామకృత మహాపాతకములకు ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నవి, శ్లో. ఏషా వా సర్వా ప్రాయశ్చిత్తిః తరతి సర్వపాప్మానం తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే. బ్రహ్మహత్యాం వా ఏతే ఘ్నంతి. భ్రూణహత్యాం వా ఏతే ఘ్నంతి; వీరహత్యాం వా ఏతే ఘ్నంతి. ఇట్టివి అనేక శ్రుతులు బ్రహ్మహత్యాదిమహాపాతకములకు కామకృతములకు ప్రాయశ్చిత్తమును విధిస్తూ ఉన్నవి. శ్రోత్రియులు నీప్రశ్నను వింటే నవ్వుతారు. పైన యెక్కడా యిట్టిప్రశ్న వేయకుము.

శ్యా:-ఈప్రశ్న మహామహేంద్రజాలవ్యాసంలోనిది కాదుగాని కర్ణాకర్ణికగా విని వేసినాను. సమాధానమును జక్కగానే చెప్పితివిలే.

నర:-ఎన్నిప్రమాణములను, యుక్తులను, చూపి సమాధానమును చెప్పినా నీపల్లవిని నీవు విడువువాడవు కావు.

శ్యామ:-శ్లో. ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య దైవాత్పూర్వకృతేన వా; న సంసర్గం వ్రజేత్సద్భిః ప్రాయశ్చిత్తే ఽకృతే ద్విజః. దీనిలోకూడా "దైవాత్" అనుపదముచేత అనిచ్ఛాకృతములకే మనువు ప్రాయశ్చిత్తమును చెప్పినాడుగదా!

నర:-పూర్వోత్తరసందర్భముల నెరుగనివారికల్లే కనపడవచ్చును. అది కేవలము పొరపాటు.

మూ:-శ్లో. అకుర్వ న్విహితం కర్మ నిందితం చ సమాచరన్, ప్రసక్త శ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః.

తా. విహితకర్మలను చేయక పోవుటచేతనున్నూ నిందితకర్మలను చేయుటచేతనున్నూ ఇంద్రియార్థప్రసక్తి (భోగలంపటు) డగుటచేతనున్నూ ప్రాయశ్చిత్తార్హుడగుచున్నాడు. శ్లో. ఇంద్రియార్థేషు సర్వేషు న ప్రసజ్యేత కామతః" అని స్మృత్యంతరవచనముచే కామకృతము లయిన యింద్రియార్థప్రసక్తులే ప్రాయశ్చిత్తనిమిత్తములని స్పష్టమగును. "౮౮ శ్లో. కామకారకృతే ప్యాహు రేకే శ్రుతినిదర్శనాత్. ౮౯ శ్లో. కామతస్తు కృతం మోహా త్ప్రాయశ్చిత్తైః పృథ గ్విధైః." అని న్నీ కామకృతమునకు ప్రాయశ్చిత్తమును చెప్పినమనువు ౮౬ వ శ్లోకములో అనిచ్ఛాకృతములకే ప్రాయశ్చిత్తమని స్వోక్తివిరోధముగా సూచించునా?

శ్యా:—"దైవాత్" అంటే అర్థమేమి?.

నర:—దానికి కుల్లూకభట్ట యొక్కవ్యాఖ్యానమును చూడు "ప్రాయశ్చిత్తీయతామితి దైవాత్ ప్రమాదాత్. అన్యశరీరకృతేన పూర్వజన్మార్జితేన దుష్కృతేన క్షయరోగాదిభి స్సూచితేన ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య అకృతేప్రాయశ్చిత్తే సాధుభిస్సహ యాజనాదినా సంసర్గం నగచ్ఛేత్." అని

తా. గతజన్మలలో బ్రహ్మహత్య మొదలయిన పాపములు చేసినవారికి ఈజన్మలో క్షయరోగము, పుప్పిగోళ్లు, పుప్పిపన్ను మొదలయిన చెడులక్షణములు కనపడును. ఆచిహ్నములను బట్టి గతజన్మపాపస్వరూపమును తెలిసికొని వాటికిన్నీ విహితప్రాయశ్చిత్తమును చేయించుకొనక సత్పురుషులతో సంసర్గము చేయకూడదని యీ శ్లోకములో నిరూపించినాడుకాని అనిచ్ఛాకృతములకే ప్రాయశ్చిత్తమని నిరూపించలేదు. దీని తరువాయి శ్లోకములను చూడుము. "౪౭. ఇహ దుశ్చరితైః కేచిత్ కేచిత్పూర్వకృతైస్తథా. ౪౮. సువర్ణచోరః కౌనఖ్యం సురాపః శ్యావ దంతతాం" అని చెప్పినాడు.

శ్యామ:—పూర్వోత్తరసందర్భాలను బాగా కప్పివేసి ఇంద్రజాలం తమాషాగా నే చేసినారు. బోధపడ్డదిలే.

నర:—ఇంద్రజాలమే కాదు. విమర్శనాశక్తి పసకూడా అంతే.

శ్యామ:—శాస్త్రిల్లూ! ఇంకొకముఖ్యప్రశ్నకు సమాధానం చెప్పుము.

శ్లో. ఇయం విశుద్ధి రుదితా ప్రమాప్యా కామతో ద్విజమ్
కామతో బ్రాహ్మణవధే నిష్కృతి ర్నవిధీయతే.

అనియే చెప్పినాడు. 'అవిధీయమానం' అనగా అనిర్దేశ్యం "మరణాంత మనిర్దేశ్యం" అను పరిభాష చేతనున్ను "భృగ్వగ్నిపతనా ద్వృతే" అను నితరమహర్షి వచనముల చేతనున్ను మరణాంతప్రాయశ్చిత్తం సిద్ధిస్తున్నది కాదా!

అవధాన్లూ! వ్యాకరణజ్ఞానము దివ్యచకోరంగా ఉన్నది. శానచ్ప్రత్యయాంతమయినవిధిన్నీ, యక్ప్రత్యయాంతమయిన నిర్దేశమున్నూ తుల్యార్థకములెట్లు అగును? విధినిర్దేశములు భిన్నార్థకములు. కావుననే యేవ్యాఖ్యాతయు నట్లు సమన్వయించలేదు. కుల్లూకభట్టు వ్యాఖ్య "ఇయ మితి: ఏతత్తుప్రాయశ్చిత్తం విశేషతః ఉపదేశమంతరేణ అకామతో బ్రాహ్మణవధే అభిహితం. కామతస్తు బ్రాహ్మణవధేనేయం నిష్కృతిః నైత త్ప్రాయశ్చిత్తం కిం త్వితో ద్విగుణాధిక మరణాత్మక మితి ప్రాయశ్చిత్త గౌరవార్థం న తు ప్రాయశ్చిత్తాభావార్థం 'కామతస్తు కృతం మోహా త్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః' రితి పూర్వోక్తవిరోధాత్" ఇతి.

తా. పూర్వార్థమందున్న "ఇయం" అను సర్వనామను ఉత్తరవాక్యమందున్న "నిష్కృతి" అను పదమునకు విశేషణముగా సమన్వయించి అకామకృతమునకు ఈపూర్వోక్త ద్వాదశవార్షిక ప్రాయశ్చిత్తము విహితమనిన్నీ, కామకృతమునకు ఈ ద్వాదశవార్షిక వ్రతము విధింపబడదనిన్నీ చెప్పి ద్వైగుణ్యమున్ను, మరణాంతికాదులున్ను కామకృతమునకు విహితప్రాయశ్చిత్తములని చెప్పి ప్రాయశ్చిత్తమే లేదంటే మనువుకు స్వోక్తివిరోధమును చూపి సరసంగా సమన్వయించినారు.

శ్యా. 'ఇయం' అంటే ఒక్క ద్వాదశవార్షికమునకు గ్రహణమెట్లు? మనవు దీనికి పూర్వమందు ద్వాదశవార్షికమును, మరణాంతికమును, అశ్వమేధమును, ఇంకను మరికొన్నిటిని చెప్పినాడు కాదా?

నర:—అవును; ఆమత ప్రకారము సమన్వయముచేసి చూడుము.

శ్యా:—"అకామతః ద్విజం ప్రమాప్య ఇయం విశుద్ధిః ద్వాదశవార్షికం మరణాంతికం అశ్వమేధాదిచ ఉదితా" ఉక్తాఅంటే అకామకృతమునకే మరణాంతికముకూడా సిద్ధిస్తుంది.

నర:—అవధాన్లూ! మహామహేంద్రజాలవ్యాసంలోనే "ప్రాణాంతికం చ యత్ప్రోక్తం...తత్కామకారవిషయం" అని యున్నదిగదా. మరణాంతికప్రాయశ్చిత్తమును అకామకృతమునకు చెప్పితే స్మృత్యంతరవిరోధము రాదా? ఇంతే కాక యిదివరకే మరణాంతికమును మనువు విధించియుంటే తిరిగీ యిక్కడ "నవిధీయతే" అవిధీయమానం అనిర్దేశ్యం మరణాంతికం" అని క్రొత్తగా మరణాంతికమును విధించనేల? అకామకృతమునకు కామకృతమునకు రెంటికిన్నీ మరణాంతిక ప్రాయశ్చిత్తము మనువుచే విధింపబడునా? ఆలోచింపుము.

శ్యా:—"ఇయం" అను సర్వనామకు పూర్వోక్త బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తముల నన్నిటినీ గ్రహించుటకు వీలులేదని యిప్పుడు స్పష్టమయినది. కాని ద్వాదశవార్షికమునే గ్రహించుటకు ఉపపత్తి యింకను కుదరలేదు.

## భారతి

### సీతా సందర్శనము



మ. గళదశ్రూదకసిక్తవక్త్రిఁ గుటిలక్రవ్యాదసంతర్జనా
కులచిత్తన్ విరహాగ్నితప్తఁ గృపణం గ్రూరవ్యథాసంశ్రితన్
మలినాంగిన్ సతతోపవాసకృశ రామప్రేమచింతాసమా
కలితన్ శోకసమేత సీతఁ గనియెం గార్యంబు ధుర్యంబుగన్. — భా. రా. సుందరకాండము.

Lakshmi Art, Bombay 8.

నర:—అదెన్నీ కుదురుతుంది. "ఇయ విశుద్ధి రుదితా" అనుదానికి పూర్వశ్లోకములయందు ఏప్రాయశ్చిత్తమును మనువు విధించినాడో చూడుము.

శ్యా:—"హృత్వా గర్భ మవిజ్ఞాత మేత దేవ వ్రతం చరేత్" అని భ్రూణహత్యాదులకు బ్రహ్మహత్యా వ్రతమును విధించినాడు.

నర:—మరణాంతికము వ్రతమగునా? అశ్వమేధాదులు అగునా?

శ్యా:—కావు. కావు. ద్వాదశవార్షికమే వ్రతమగును.

నర:—అవ్యవహితపూర్వ మయిన ద్వాదశవార్షికమునే "ఇయం" అను సర్వనామము గ్రహించును. ఇప్పుడు ఉపపత్తి కుదిరినదా?

శ్యా:—కుల్లూకభట్టు చాల సరసముగానే పూర్వోత్తర సందర్భములను చూచి సమన్వయంచేసినాడు.

నర:—ఆతడే కాదు. విజ్ఞానేశ్వరుడున్నూ "ప్రాయశ్చిత్తై రపైతి" అనే శ్లోకవ్యాఖ్యలో నిట్లే వ్రాసినాడు; చూడు.

"యత్తు మనువచనం ఇయం విశుద్ధి రుది తేత్యాది, తదపి ఇయ మితి సర్వనామపరామృష్టద్వాదశవార్షిక వ్రతచర్యాయా ఏవ. 'కామతో బ్రాహ్మణవధే నిష్కృతి ర్న విధీయతే' ఇత్యనేన ప్రతిషేధః న ప్రాయశ్చిత్త మాత్రస్య మరణాంతికాదేః ప్రాయశ్చిత్తస్య దర్శనాత్" అని 'ఇయం' అనుపదమును నిష్కృతితో నన్వయించి కామకృతంలో ద్వాదశవార్షికము చాలదని స్పష్టముగా చెప్పినాడు.

శ్యా:—శాస్త్రుల్లూ! ఇప్పుడు "ఇయం విశుద్ధిః అను శ్లోకమునకు అర్థము చక్కగా తెలిసినది. నిబంధనకర్తలు న్యాయముగానే సమన్వయించినారు. మహేంద్రజాలవ్యాససమన్వయము కేవల మింద్రజాలమే.

నర:—వారిసమన్వయములను చక్కగా గ్రహించలేమన పాండిత్యము. మన మెక్కడ! స్మృతులకు క్రొత్త సమన్వయ మెక్కడ? నక్క యెక్కడ? దేవలోక మెక్కడ? సిగ్గు! సిగ్గు! ఈసమన్వయం చూస్తే పండితులు పక్కుమని నవ్వరా?

శ్యామ:—కామకృతంలో ప్రాయశ్చిత్తం లేదని చెప్పిన బోధాయనాది వాక్యములకు వ్యవస్థ ఎట్లు?

నర:—దానికి నేను వేరుగా చెప్పనక్కరలేదు. విజ్ఞానేశ్వరుడు. "ప్రాయశ్చిత్తై రపైత్యేనః" అనుశ్లోకవ్యాఖ్యలోనున్నూ, మాధవాచార్యులు "గవాంబంధనయోక్త్రేషు" అనుశ్లోకవ్యాఖ్యానములోనున్నూ చక్కగా కుండకొట్టి వ్యవస్థను ఏర్పరచియున్నారు. వాటినిచూచిన వారికి సంశయమే కల్గదు.

యాజ్ఞ:—శ్లో. ప్రాయశ్చిత్తై రపైత్యేనః యదజ్ఞానకృతం భవేత్, కామతో వ్యవహార్యస్తు వచనాదిహ జాయతే.

తా. బుద్ధిపూర్వకమహాపాతకములలో ప్రాయశ్చిత్తములచే వ్యవహార్యత్వము మాత్రమే సిద్ధిస్తుంది. నరకనివృత్తికి స్మృత్యంతరములు మరణాంతిక ప్రాయశ్చిత్తమును విధిస్తున్నవి. అని. విజ్ఞానేశ్వరీయవ్యాఖ్య... "యత్రతు బ్రహ్మహా సురాప...అపతితత్యాగినః పతితాః, పాతకపాతకసంయోజకా శ్చేతి గౌతమోక్తమహాపాతకాదౌ వ్యవహార్యత్వం నిషిద్ధమ్, తస్మిన్ పతనీయే కర్మణి కామతః కృతే వ్యవహార్యత్వమాత్రమ్ న పాపక్షయః......పతనీయేఽపి కర్మణి మరణాంతికప్రాయశ్చిత్తేషు కల్మషక్షయో భవత్యేవ; ఫలాంతరాభావాత్. నాస్యాస్మిన్ లోకే ప్రత్యాపత్తి ర్విద్యతే. కల్మషం తు నిర్హణ్యతే. ఇత్యాపస్తంబవచనాత్."

తా. గౌతమునిచే చెప్పబడిన బ్రహ్మహత్యసురాపానము మొదలయిన కామకృత పతనీయకర్మలయందు వ్యవహార్యత్వము నిషిద్ధమయినది. అట్టి కర్మలయందు ప్రాయశ్చిత్తములచే వ్యవహార్యత్వమే సిద్ధించును గాని పాపక్షయము కాదు. మరణాంతికప్రాయశ్చిత్తము చేసుకుంటే అట్టి పతనీయములయందున్నూ నరకనివృత్తి కలుగుతుంది. ఇతరఫలము లేదుగనుక ఆపస్తంబుడు, "మరణాంతికప్రాయశ్చిత్తం చేసుకున్నవానికి ఈలోకంలో వ్యవహార్యత్వము లేదు. నరకనివృత్తి అవును" అని చెప్పినాడు.

మాధవాచార్యులు : "అతో ద్విగుణప్రాయశ్చిత్తేన ఇహ లోకే వ్యవహార స్సిధ్యతి. యస్తు వ్యవహార మనపేక్ష్య పరలోకనిర్వాహమేవ కేవలమపేక్షతే తస్య బుద్ధిపూర్వకేషు మహాపాతకేషు మరణాంతికమేవ ప్రాయశ్చిత్తమ్.

తా. అంగిరోవచనప్రకారము ద్విగుణప్రాయశ్చి
త్తం చేస్తే వ్యవహార్యత్వము సిద్ధిస్తుంది. మరణాంతికము
చే నరకనివృత్తి అవుతుంది. కాగా కామకృతమహాపాత
కములకు ప్రాయశ్చిత్తము లేదనే మునులకు అభిప్రాయ
మేమిటి అంటే వ్రతాదులచే నరకనివృత్తి కాదని.
ప్రాయశ్చిత్తము ఉన్నదనే మునులయొక్క అభిప్రాయ
మేమిటి అంటే వ్రతాదులచే సవ్యవహార్యత్వము కలుగు
తుందని. ఇట్లే శూలపాణివైద్యనాథకమలాకరాదులు
ఏకగ్రీవముగా వ్యవస్థచేసినారు. ఆవ్యవస్థలను సావకాశ
ముగా చూచినవారియెదుటను ఈ యింద్రజాలం పారదు
అని స్పష్టముగా చెప్పగలము.

శ్యా:—ఇంద్రజాలవ్యాసంలో "కామకారంకృతే"
"ప్రత్యాసత్తిః" అనేపాఠము లున్నవి. నీసమాధాన
ములలో "కామకారకృతే" "ప్రత్యాపత్తిః" అనే
యుచ్చారణ వినబడుచున్నది. వీటిలో ఏపాఠములు
సాధువులు?

నర:—'కామకారం'అనుద్వితీయకు దేనితోనన్వయమో
నీవే చూచుకొనుము 'ప్రత్యాసత్తిః' అంటే సామీ
ప్యము అర్థము. ఆయర్థము ఇచ్చట సరిపడదు. ఈ
గ్రంథములయొక్క తెనుగుఅచ్చుప్రతులలో ఈరెండు
తప్పులు ప్రమాదంవల్ల పడ్డవి. వాటిని దిద్దుకొనుటకు
శక్తి లేక పప్పులో కాలు వేసినది. ఇంతకున్నూ
ఇంద్రజాలమునకు ఒప్పులు తప్పులు చేయుటయే
స్వభావంగాని తప్పులను ఒప్పులు చేయుట స్వభావం
కాదుగదా:—

నాగరి ప్రతులను ఒకసారి చూడుము.

శ్యా:—ఈమాత్రానకేనా స్మృతులకు నూతన వ్యాఖ్యా
నములను చేస్తామని బడాయీలు చెప్పకొనుట?

శ్లో. 'ప్రాయశ్చిత్తై రపైత్యేనః' అను శ్లోకముయొక్క
ఉత్తరార్థము ఏల ఉదాహరింపబడలేదు?

నర:—"కామతో వ్యవహార్యస్తు వచనా దిహ జాయ
తే" అని దానియుత్తరార్థము ఉన్నది. కామకృత
పాపసామాన్య మంతకున్నూ ప్రాయశ్చిత్తములచే
వ్యవహార్యత సిద్ధిస్తుంది. అనిదాని తాత్పర్యము.
ఆయర్థము ఇంద్రజాలవ్యాసమునకు గిట్టను.

శ్యా:—కోడిని కుంపటిని పట్టుకొని కొండ యెక్కి
పోతే మరి తెల్ల వారదా?

నర:—ఇంకొక్క దానినికూడా చూడుము. "అభి
సంధికృతే పాపే సకృ ద్వ్యా నేహ నిష్కృతిః"
అనే వచనమునకు సరిగా అర్థం కాలేదు. దీనియు
త్తరార్థము "అపరే నిష్కృతిం బ్రూయు రభిసం
ధికృతేపిచ" అనియున్నది. ఇది ప్రాయశ్చిత్తసద్భా
వమునే బోధిస్తూయున్నది.

శ్యా:—"శ్లో. విధేః ప్రాథమికా దస్మాత్" ఈప్రమా
ణము ఏయర్థమును బోధిస్తూ ఉన్నది?

నర:—బుద్ధికృత మహాపాతకాదులు మూడుసారులు చేసి
నను ప్రాయశ్చిత్తము గలదనిన్నీ నాల్గవసారి తిరిగి
చేస్తే లేదనిన్నీ దానితాత్పర్యము.

శ్యా:—అబ్బా! ఋషిహృదయములు ఎంతకరుణామయ
మయినవి? అయితే ఈవచనము స్వపక్షమునకు బాధ
కంగాని సాధకంకాదు.

నర:—స్వపక్షసాధకంగా ఏక్రొత్తవ్యాఖ్యానము బయ
ల్పడునో? నేను విజ్ఞానేశ్వరమును బట్టి చెప్పితిని.

శ్యా:—"గురూణా మప్యధిక్షేపః" ఈవచనమెందుకు?

నర:—ఇది మహాపాతకవిషయం కాదు. పాతకవిషయం.
ప్రకృతసిద్ధాంతమునకు అదిన్నీ అసంబద్ధమే. ఉదా
హృతప్రమాణములన్నీ కుంభకర్ణయుద్ధమువలె స్వపక్ష
పరపక్షవిభాగం లేకుండా పామరవ్యామోహకము
లై యున్నవి.

శ్యా:—మనువు అకామకృతమునకు ద్వాదశవార్షికము
నున్నూ, కామకృతమునకు మరణాంతికమునున్నూ
విధించినట్లు మొదట సిద్ధాంతముచేసి చివరకు గౌత
మాపస్తంబవచనములను పేర్కొని అకామకృతమున
కే ద్వాదశవార్షికమున్నూ మరణాంతికమున్నూ
తుల్యవికల్పములని సిద్ధాంతితమయినది. అకామకృత
మునకు మరణాంతికప్రాయశ్చిత్తమును చెప్పరాదని
"ప్రాణాంతికం చ యత్ప్రోక్తం......తత్కామ
కారవిషయం" అను స్వోదాహృతప్రమాణమే బాధి
స్తున్నదే! ఇచట ఇంద్రజాలవ్యాసము ఏవ్యవస్థ
చేసినది?

నర:—దానికి సమాధానమును చెప్పుటకు నేనా బాధ్యు
డను? వితండవాదమునకు విరోధపరిహారము వ్యవస్థ,
ఈఘోష లేల?

శ్యా:—అంగిరస్సు విజ్ఞానేశ్వరీయంలో "విహితం య దకామానాం" "మ్లేచ్ఛేనాధిగతశ్శూద్రః......జ్ఞా నేతుద్విగుణం భవేత్" అను వచనములచే ద్వైగుణ్య ము ఇతరపాపవిషయంగాని మహాపాతకవిషయం కాదని స్పష్టంగా చెప్పినాడట. సత్యమేనా?

నర:—పైరెండు వచనములున్నూ అంగిరఃకర్తృకములు కావు. మమ్మాటికిన్నీ కావు. సంశయముంటే నా కండ్లు ఎరువుతీసుకొని చూడు. మహాపాతకాదిసర్వ పాపములయందున్నూ ద్వైగుణ్యమును విధించేవచన ములు స్మృతులలో అనేకములు గలవు. నిబంధన కర్తలు కుల్లూకభట్టు, విజ్ఞానేశ్వరుడు, మాధవుడు, వైద్యనాథుడు, శూలపాణి, మొదలయినవా రందరు న్నూ ఏకగ్రీవముగా మహాపాతకాదులయందు ద్వై గుణ్యమును జెప్పినారు. స్మృతిపరిచయం కలవారికి ఈద్వైగుణ్యము క్రొత్తది కాదు. చూడుము.

కుల్లూకభట్టు:—మనుస్మృతి 11 అధ్యాయము 72 శ్లో. "బ్రహ్మహా......కామకృతేతు బ్రాహ్మణవధే ద్వి గుణం బ్రహ్మవధప్రాయశ్చిత్తం చతుర్వింశతివర్షం;" తదాహాంగిరాః. శ్లో."అకామతః కృతే పాపే ప్రా యశ్చిత్తం నకామతః" ఇత్యాది; యాజ్ఞ ప్రాయశ్చి త్తకాండ అగి: శ్లో."ద్విగుణం సవనస్థేతు బ్రాహ్మణే వ్రతమాదిశేత్."

అత్ర విజ్ఞానేశ్వరాః:—తస్మిన్ ద్వాదశవార్షికాదివ్రతం ద్విగుణం సమాదిశేత్.

పరాశరమాధవీయం 8 అధ్యాయము ౧ శ్లో:—"అం గిరాస్తు ద్విగుణం వ్రత మాచష్టే. శ్లో. అకామతః ఇత్యాది......వచనంచ కామకృతానాం ద్విగుణం వ్రతం దర్శయతి. "శ్లో. విహితం య దకామానాం కామాత్తు ద్విగుణం భవేత్." అతో ద్విగుణప్రాయ శ్చిత్తేన ఇహ లోకే వ్యవహార స్సిద్ధ్యతి......నిర్ణ యసింధువు కలియుగవర్జ్యప్రకరణము "త దన్యాని మహాపాతకాని బ్రహ్మహత్యాసురాపగురుతల్పాని త్రీణి తేషాం కామకృతానాం మరణాంతికం ప్రా యశ్చిత్తం విప్రాణాం కలౌ నేష్యర్థః. మరణాంతి కేవా జాతివధనిమిత్తం ద్వాదశాబ్దద్విగుణం బ్రహ్మ వధనిమిత్తంచ ద్విగుణం భవతి.

హేమాద్రి:—బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తములో: య దాహగౌతమః శ్లో. యోవిప్రో బ్రాహ్మణం హన్యా త్స్వయం భృత్యాదభి ర్యదా; చతుర్వింశతివర్షాణి వ్రతకృత్ శుద్ధిమాప్నుయాత్" పై నుదాహరించిన ప్రమాణము లన్నిటివల్లను కామకృతమహాపాతకాదు లలో ద్వైగుణ్యము గలదని భాషాజ్ఞానం కలవారం దరికిన్నీ నిస్సంశయముగా తెలియగలదు. "శాస్త్ర దీపిక"కు సుప్రసిద్ధవ్యాఖ్యానమయిన "యుక్తిస్నేహ ప్రపూరణి" అనే మీమాంసాశాస్త్రగ్రంథమందు "విహితం యదకామానాం" అనువచనమునే ఉదా హరించి బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తవిషయము చెప్ప బడినది. శబ్దార్థకల్పద్రుమవాచస్పత్యములయందు శూ లపాణి మతప్రకారం కామకృతమహాపాతకములలో సర్వత్ర ద్వైగుణ్యవ్రతము విధింపబడ్డది. నిబంధన కర్త లెవ్వరున్నూ అంగిరోవచనమునకు ప్రతిపదవ్యా ఖ్యను చేయలేదు. కాని తాత్పర్యమునుమాత్రము వ్రాసియున్నారు. దాని ననుసరించి మన మిట్లే వ్యా ఖ్యానము చెయ్యవలసియున్నది.

శ్లో. అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం నకామతః,
స్యాత్త్వకామకృతే యత్తు ద్విగుణం బుద్ధిపూర్వకే.

సమన్వయము:—"అకామతః కృతే పాపే విహి తం ప్రాయశ్చిత్తం కామతః కృతే పాపే నభవతి. కింతు అకామకృతే యత్ప్రాయశ్చిత్తం, తత్ బుద్ధిపూర్వకే ద్విగుణం స్యాత్" అనగా అకామకృతమునకు విహితమ యిన ప్రాయశ్చిత్తము కామకృతమునకు చాలదు. విశేష మేమంటే ద్విగుణము చేయవలయును. అని ఈసమన్వ యంలో పూర్వోత్తరవిరోధం ఉండదు. శాస్త్రీయమ యినదోషం లేదు. ఇంద్రజాలవ్యాసం ఈసమన్వయం తప్పని యెంతో ఆర్భాటము చేసినది గాని దోషమును మాత్రము చూపలేక "అంతర్గుడమగుడాయతే బహిర్వక్తుం నశక్యతే" అన్నట్లు ఒక పేజినిండా తనగాభరాను వెలి బుచ్చినది. దోషములకు లక్షణము, లక్ష్యమందు సమ న్వయము చేయక తప్పు తప్పు అనుట కలతగొట్టు పాండిత్యలక్షణము. నేను చేసిన సమన్వయము నిబంధనకర్తలయొక్క తాత్పర్యానుగుణమయిన దని ఖండితముగా చెప్పగలను; దానికి సహృదయులే సాక్షులు. సత్యమిట్లుండగా అంగిరస్సు "బాబులారా!

ద్వైగుణ్యము మహాపాతకవిషయముకాదని మెుర పెట్టియుండడు. అంగిరస్సున్నూ, మహర్షులున్నూ ఇట్లు మొరపెట్టుచున్నారు. ఎలాగంటే "పెద్దనాయన లారా! ఏపాపమునకున్నూ ప్రాయశ్చిత్తం లేదని చెప్ప కండీ! అది మాహృదయంకాదు. మాకున్నూ మనుష్య కారుణ్యమున్నది. మామనస్సులు శిలానిర్మితములు కావు. కుటుంబములను కూలద్రోయుటకు మేము సహింపము. మాకు అసూయామత్సరాదులు లేవు. జగత్కల్యాణమే మాకు సమ్మతము. ప్రాయశ్చిత్తము నైమిత్తికము. నిత్య నైమిత్తికములను ప్రతిపురుషునకున్నూ చేసియే తీరవల యును. అది సర్వసమ్మతసిద్ధాంతము. జాతిని శక్తిని కా లాదుల నాశ్రయించి పరిషత్తు ప్రాయశ్చిత్తమునువిధింపవ లయునని ఘంటాఘోషమున మొరపెట్టుచున్నారు. ఆమొరను వినియే విజ్ఞానేశ్వరుడు "నచ మహాపాతక మనుక్తనిష్కృతికం సంభవతి" అనిన్నీ మాధవాచార్యు లు "తదేవ మైహికవ్యవహారాయ పరలోకాయవా కామ కృతానాం మహాపాతకానా ముపపాతకానాం చాస్త్యే వ ప్రాయశ్చిత్తమితి సిద్ధం" అనిన్నీ తమశాస్త్రీయ సిద్ధాంతమును సర్వమహాపాతకములకు కామకృతములకు న్నూ ప్రాయశ్చిత్తంగలదని ఘంటలో చాటిచెప్పినారు.

శ్యామ: అబుద్ధికృత పాపస్థలీయ ప్రాయశ్చిత్తమునకు బుద్ధికృతస్థలమందు ప్రాప్తి యెట్లు? ప్రాప్తిలేక నిషేధముండునా?

నర. అవధాన్లూ! ఒక్కొక్కప్రశ్నలో పాండిత్యంపస బాగాబయలుపడుచున్నది. "న పరదారాన్ గచ్ఛేత్" "నసురాం పిబేత్." ఇత్యాదిస్థలములలో ప్రాప్తి యెట్లో ఆలోచించు. శృంగగ్రాహికాన్యాయమున ప్రాప్తి రాగాదిమూలకమయి యుండును. ప్రాప్తి న్నీ నిషేధమున్నూ తుల్యబలములే అయితే ఉదితా నుదితహోమములకువలె తుల్యవికల్పమే వస్తుంది. ప్రకృతంలో చంపుట అకామకృతంలోనూ కామ కృతంలోనూ సమానమే కాబట్టి తుల్యయుక్తిచే అకామకృతప్రాయశ్చిత్తమే కామకృతంలో ఆభా సతః ప్రాప్తించగా దానిని నిషేధించి ఆంగిరోవచన ముచేద్వైగుణ్యము విధించబడ్డది.

శ్యా:—ఇచట ప్రతియోగితావచ్ఛేదకం ఏద్ది?

నర:—నీప్రశ్న చాలా బాగాఉన్నది. ప్రతియోగి తెలి యక ప్రతియోగితావచ్ఛేదకమును చెప్పుట సాలరం కాదు. "ఘటోన" అనేస్థలంలో ప్రతియోగితావ చ్ఛేదకం "ఘటత్వం"అవుతుంది. ఇచట"ప్రాయశ్చిత్తం న" ఆనేవాక్యములంటే ప్రతియోగితావచ్ఛేదకం "ప్రా యశ్చిత్తత్వం" అవుతుంది.

శా:—ఇది తెలిసిన లాభమేమి?

నర:—నాకున్నూ తెలియదు. వ్యాసంలో ఒక అవ చ్ఛేదకాన్ని అభికరిస్తే పామరులకు పాండిత్యప్రక టన అవుతుందనికాబోలు!

శ్యా:—శాస్త్రుల్లూ! ప్రాయశ్చిత్తం తమాషాలో ముఖ్య ప్రశ్న లన్నిటికిన్నీ బాగానే సమాధానమును చెప్పి తివి. కాని పూర్వపక్షిక వెక్కిరింపులకుకూడా సమా ధానం చెప్పతావా?

నర: ఇక్కడికే చర్చ పెరిగిపోయినది. ఉదారాశయ ము గల పండితులు నామనిర్దేశమున్నూ విషయనిర్దేశ మున్నూ లేకుండ కాకిపిచికలమీద పెట్టి గోడమీద పిల్లివలె సందిగ్ధముగా ఏవిషయములను ఆక్షేపింపరు. ఆఆక్షేపములన్నీ కళింగవైశ్యశాఖవారు చేసుకొను చున్న పౌరాణికోపనయనములను ఉద్దేశించినట్లు కనపడుచున్నది. ఆవెక్కిరింపులన్నిటికిన్నీ "వైశ్య" అనుపత్రికలో విశాలసమాధానములు గలవు.

శ్యా:—సరే బాగానేయున్నది. కాని "ఇప్పటిహిందూ పండితుల యభిప్రాయపుచీట్లు" అనే వెక్కిరింపుకు ఒక్కదానికిమాత్రము సమాధానమును చెప్పుము:

నర:—దీనికి చిన్న గాథగలదు. పర్లాకిమిడి శ్రీకృష్ణ విలాసగ్రంథాలయములో నేటికి 8 మాసములక్రిందట నుంచి క్రీస్తుమతంలోప్రవేశించిన ఒకబ్రాహ్మణ యువకునకు శ్రీపీఠాపురసంస్థాపితసదాచారనిబంధినీ పరిషత్తుచేనిర్ణయింపబడిన పాదోనబ్రహ్మహత్యావ్రత ప్రాయశ్చిత్తమును చేయించి సంఘంలో చేర్చుటకు వీలుకలదనిన్నీ మతాంతరప్రవేశము బ్రహ్మహత్యా సమమనిన్నీ ఆహత్యాప్రాయశ్చిత్తమునే ప్రత్యా మ్నాయరూపంగా దీనికి చేయించవచ్చునని నిరూ పింపబడినది. ఈప్రాయశ్చిత్తము ఇంద్రజాలవ్యాస మునకు కిట్టదు. అందుచే బ్రహ్మహత్యకు మరణాంత వ్యతిరిక్తప్రాయశ్చిత్తము లేదని వాదింప మొద

లిడినది. దానిపైని గ్రంథాలయంవారు ఈధర్మ సంశయమును పలుపండితపరిషత్తులను అడుగగా మధుర, పట్టాంబి, ఉడిపి, శ్రీజగన్నాథం, విజయనగరం, పరిషత్తులు ఏకగ్రీవంగా కామకృతి ప్రత్యాహత్యకున్నూ ద్విగుణప్రాయశ్చిత్తంచే వ్యవహార్యత్వము సిద్ధిస్తుందని యభిప్రాయపత్రికలను అంపినారు. ఆపత్రికలనే "ఓట్లు" అని వెక్కిరింపు. పైవిషయమును గూర్చియే రావుసాహెబ్ శ్రీ. గిడుగురామమూర్తి పంతులుగారి యధ్యక్షతక్రిందను మూడుసభలు జరిగినవి. అధ్యక్షులున్నూ ప్రాయశ్చిత్తము గలదనియే తీర్మానించినారు. ఈచర్చ అంతా కొద్దిదినములలోనే ముద్రితమై వెలువడనున్నది. ఇచ్చట యొక్కడనున్నూ ఇంద్రజాలం పారనందున నేను ఉగాది సంచికలోనికి వ్రాసినది—

శ్యా:—సగం పరువు సంతలో పోతే ఉన్న పరువు వూళ్లో పోయింది. సర్వే మెన్నటికిన్నీ దాగదు.

శ్లో:—ఆర్తానాం మార్గమాణానాం ప్రాయశ్చిత్తాని యే ద్విజాః, జానంతో న ప్రయచ్ఛంతి గచ్ఛంతి సమతాం తు తైః.

శాంతిః శాంతిః శాంతిః

అనుచూ ఇద్దరున్నూ నిష్క్రమింతురు.

---




## "ఏల? ఏల? ఏఁ"

కవికొండల వెంకటరావు గారు

పడవగదిలోఁ బండుకొని నే
పయనమును సేయుచును నుండగ
"ఏల ఏల ఏ"
అనెడుపాట హఠాత్తు వినబడె.

ఆవలకు నే తొంగిచూచితి
"నిడదవోలు మదుపు" లోన
పడవపడినది పడిపడిగను
పడవవారలు లాగుచుండిరి.

'ఏల ఏల ఏ'
అనెడుపాటను పాడుచుండిరి.

"అట్లపాడు" రేవు రావి
చెట్లకొమ్మలఎత్తు చివ్వరులు
అంతరాళంబందు మాఱున
'ఏల ఏల ఏ'
అనెడుపాట చెలంగె వింతగ.

సన్నసన్న ప్రభాతపవనపు
టున్నమతవీచీకిశోరము
లన్నదమ్ములపహాసు జూపెడు
తెన్నునే నిదురించువారికి
నున్నతపు మేల్కొల్పు గొలుపుచు
'ఏల ఏల ఏ'
అనెడుపాట రహించె నెల్లెడ.

చెట్లచాటున తొంగితొంగి
తొగరుప్రొద్దుదయించుశోభలు
సొగసుగను జూపట్టుచాయనె
మొగము జూపనిముద్దకోయిల
పరవశముగా

'ఏల ఏల ఏ'
అనెడు పాట నిజేచ్ఛ మ్రోసెను.

'ఏల ఏల ఏ
ఏల ఏల ఏ
ఏల ఏల ఏ'
అనెడుపల్లవిమాత్రమే కను
వెల్లడిని విస్పష్టమగుచును
అన్నిరకముల గొంతు లెత్తున
వీనులకు విందగుచు వినబడె.

పల్లవికి వెనుముందు బాడెడు
ఎల్లచరణము లొక్కగొంతుక
వెల్లడించినగాని సుంతయు
తెల్లముగ వినిపింపవయ్యెను
'ఏల ఏల ఏ'.

'ఏల ఏల ఏ'
అనెడుఎలుంగొక ప్రశ్న మగుచును
ఆలకించెడు వారి నెవ్వగ
లనునయించెడు అఖిలరుతమో
'ఏల ఏల ఏ'.



# కళింగము—కళింగపట్నం (గంజాం)

కెవలీరు డాక్టరు బుర్రా శేషగిరిరావు గారు, ఎం. ఏ., పి. ఎచ్. డి.

కళింగరాజ్యమునకు కళింగపట్నమే ముఖ్యస్థానమని (రాజధాని) కొందరున్ను ముఖలింగం రాజధాని అని కొందరున్ను అంటారు. కళింగరాజ్యం కొన్ని శాసనములలో "సమస్త కళింగములు" అనీ, కొన్ని శాసనములలో "సప్తకళింగములు" అనీ, కొన్నిటిలో "త్రికళింగము" అనీ పరిపరివిధముల వర్ణింపబడి ఉన్నది. గంగవంశపురాజులు శాసనములలోనే ఒకదానిలో కళింగము అయిదు ప్రత్యేక రాజ్యములుగా ఉన్నప్పుడు వాటిని కలిపి ఏకరాజ్యముగా ఒకరాజు చేసినట్టు ఉన్నది. గంగవంశపురాజులు కళింగమును ఆక్రమించుకొన్ననాటికి కళింగరాజ్యమునకు ముఖలింగం ముఖ్యస్థానముగా ఉండెను. తరువాత గంగవంశపురాజులు "అనంతవర్మ దేవచోడగంగు" న్ను అతనితండ్రి తాతలున్ను "ముఖలింగం నగరికటకం" ప్రాంతమును తమ యేలుబడిలో నున్నకళింగరాజ్యమునకు ముఖ్యస్థానముగా చేసుకొనిరి. కాని "రఘువంశము"ను బట్టి కళింగపట్నమొకప్పుడు కళింగమునకు రాజధానిగా నున్నట్టు తేలుచున్నది. రాజధాని కళింగపట్నము కాకపోతే మరియొక రేవుస్థలము, సముద్రతీరము అయియుండవలెను.

కళింగపట్నములో బౌద్ధమతముజాడలు కనబడ్డట్టు ఆర్కియలాజికల్ రిపోర్టులవల్ల తేలుతున్నది. దీనినిబట్టి కళింగపట్నము చాలా ప్రాచీనమైనపట్నమై యుండవలెనని యెరుగవలెను. ప్రస్తుతము కళింగమండలివిజయనగరము పాలించుచున్న పూసపాటిమహారాజుల పూర్వులు కళింగపట్నంలో రాజ్యము చేసి యుండినట్లు అముద్రితమగు మార్కండేయ పురాణములో నున్నది. అందులోనిభాగములు "విజయనగరం మహారాజాస్ కాలేజీ మాగజైన్"లో ప్రచురించియుంటిని. ఆయంశమును బలపరచు నొకక్రొత్తరుజువు లోకల్ రికార్డులలో దొరికినది. అది యీపత్రికలో నుదాహరించుచున్నాను.

కళింగపట్నంలో రాజకళింగగంగు అనే రాజు పరిపాలన చేస్తూఉండినట్టున్ను ఆతడు వేములవాడభీమకవిని అవమానించుటవల్ల రాజ్యచ్యుతుడైనట్టున్ను వేములవాడభీమకవి చెప్పిన చాటుపద్యములవల్ల తెలియవచ్చుచున్నది. అది ఆంధ్రులందరును ఎరిగినదే గనుక వివరింప నక్కరలేదు. రాజకళింగగంగురాజ్యాంగములో కళింగపట్నము రెండుయోజనములు పొడవున్ను రెండుయోజనములు వెడల్పున్ను కలదిగా ఉండెను. ఈతని అవసానదశలో ఈ పట్నమును సముద్రము ముంచివేసినదట. తరువాత కళింగరాజ్యము కటకపురిగజపతుల యధీనమయినది.

లోకలురికార్డ్లు వాల్యూము 9 లో పుట 363లోను ఆతరువాత పుటలలోను "కళింగ పట్నం" వర్ణన కలదు. ఈవర్ణనగలపద్యములు రాజకళింగగంగునాటినైభవమును తెలియపర చనుద్దేశము గలవి. వీటిలో ఆఖరుపద్యము లోగల "ఫరంగిగములు" "వళందుజనులు" "ఇంగిరీజులు" అనుపదములనుబట్టి ఇవి 19 శతాబ్దపుపూర్వభాగమందో అంతకుముందో చెప్పబడియుండునని తోచును.

కళింగపట్నము—వర్ణనపద్యములు

సీ. యోజనద్వయవిశాలోన్నతి జెలువొంది
  పట్టణం బమరె శోభావిభూతి
హాటకరత్నకవాటానుమోనమై
  నూటివింంచెను కంచుకోటవహలు
నూటొక్కగుళ్ల చెన్నుగ శివానందమై
  నిత్యోత్సవక్రీడ నెమ్మి దనరె
వంశధారానదీవారాశిసంయుత
  సాగరసంగవిస్రంభ మమర
కలిగి రాయకళింగభూకాంతు నడుగు
రంగమై నవలక్షకళింగ యనగఁ
శృంఖలద్వీప మనగ ప్రసిద్ధి వించి
నాశెమయ్యె కళింగపట్నంబు ధాత్రి.

సీ. తారాపథోత్తుంగతీరవిహారాభి
  వారాశిగంభీరవారితంబు
లీలారసానేకబాలాచమత్కార
  ఖేలానిరంతరలోలనంబు
నానావిచిత్రితోద్యానఘనామోద
  గానామృతోత్సవమానితంబు
స్వాంతవినోదనితాంతాభిరాజహ్రూ
  దంతానుమోదసభాంతరంబు
వీరకీరమయూరకిశోరసార
శారికారావకలకలోజ్జ్వలకదంబ
నింబజంబీరవననికురుంబములను
డంబమయ్యె కళింగపట్నంబు ధాత్రి.

సీ. విలసితమత్తేభములబారు లొకచోట
  యురుతరతురగంబు లొక్కచోట
బంగారుజలతారుపల్లకీ లొకచోట
  చక్కనియందలా లొక్కచోట
భేరీలసన్మృదంగారావ మొకచోట
  ఒప్పైనవస్త్రము లొక్కచోట
కర్పూరకస్తూరిగంధంబు లొకచోట
  చొక్కపుశ్రీగంధ మొక్కచోట
(?)యినులుగల రాజకావిను లొక్కచోట
ఒనరవిద్యలవారలు నొక్కచోట
గలిగి తండోపతండమై ఘనతవించి
నయముతోడ కళింగపట్నంబు వెలసె.

సీ. నవరత్నమందిరోన్నతిసౌధవీథుల
  ముత్తమై వెలయు విప్రోత్తములను
సూర్యసోమాన్వయస్ఫురితసౌజల్యప్ర
  భాతిచే వెలయు భూపాలకులను
నవనిధానంబులు భువివించు వైశ్యులు
  శుభవిభవాఖిలశూద్రవరులు
కాంచనరత్నసంఘటితసౌధస్థితి
  పంచాననంబు లపరిమితములు
విధిచతుష్షష్టివిద్యాప్రవీణసుకవి
చటులవిటనటగాయకచారికాది
చారుభేరీమృదంగగంభీరమగుచు
నవచె నార కళింగపట్నంబు ధాత్రి.

వ. మరియును.

సీ. రంగత్తురంగసారంగవాణిజ్యత
  రంగమై వెలయుఫరంగిగములు(French)
కుందనంబుల నొప్పు కోట్లకుపడగలు
  పొందుగా నిడినవళందుజనులు (Ducth)
వారణానేకసద్వస్త్రకస్ఫూర్తిచే
  వాసిమించినయింగిరీశచయము(English)
అమలముక్తాప్రవాళాదినానారత్న
  రుచిరికాదీనుమరుంగు (?)ఘనులు
బహువిచిత్రాంబరానేకపంచలోహ
హారికస్తూరిగంధశిలాభ్రమహిత
జాతిఫలములచేత హజార మమర
నాణె మయ్యె కళింగపట్నంబు ధాత్రి.

ఇందలి ఆఖరుపద్యములో "ఫరంగి", "వళందు", "ఇంగిరీశ" అనుపదము లాయా పాశ్చాత్యప్రజాబోధకపదముల పూర్వపు రూపములు. ఇవి క్రీ. శ. 1850 కి దరిమిలాను ఆంధ్రవ్యవహారమునుండి లోపించినవి. పై నుదాహరించిన పద్యములలో మొదటిదానినిబట్టి కళింగపట్నము రాజకళింగగంగు కాలములో "నవలక్షకళింగ" అనుకళింగరాజ్యమునకు రాజధానిగా నుండెననుట స్పష్టము. "నవలక్షకళింగాధీశ్వర" అనుబిరుదము "నవకోటికర్ణాటంకలు బరగీశ్వర" అను పూర్వపుకళింగగజపతివంశ్యుల బిరుదమువలె, నేటికిని శ్రీవిజయనగరరాజ్యపరిపాలకులగు శ్రీ శ్రీ శ్రీ పూసపాటిమహారాజులకు వంశపారంపర్యముగా చెల్లుచున్నది. (చూడుడు. విజయనగరం మహారాజులకు కృతిగాచేయబడిన పంచాంగములపీఠికలు.) "నవలక్షకళింగము"నకు రూపాంతరము "నవకళింగము" ప్రస్తుతపు విజయనగరమహారాజులకు తాతతండ్రియగు శ్రీనారాయణగజపతిమహారాజులకు కృతిగా చాట్రాతిలక్ష్మీనరసుకవి (అడిదము సూరకవిసమకాలికుడు) రచించిన "శ్రీ విజయరామమహారాజచరిత్రము"లో కృతిపతిని వర్ణించుచు, కవి.

క. శ్రీ రవికుల కలశాంబుధి
తారాధిప నవకళింగధరణీప మహో
దారయశ పూసపాటీ
నారాయణగజపతీంద్ర నరనాథేంద్రా.

అని సంబోధించియున్నాడు. ఇందు "నవకళింగధరణి" యనునది "నవలక్షకళింగ" మనబడుచు వచ్చినకళింగరాజ్యము.



ఇట్లు శ్రీ విజయనగరమహారాజవంశ్యులు, ఆంధ్రక్షత్రియవంశోత్తములు, సూర్యవంశ్యులగు పూసపాటిమహారాజులు కళింగపట్నము రాజధానిగా గల్గిన నవలక్షకళింగమున కధిపతులై యుండినట్లు తెలుచున్నది. ఇది మార్కండేయపురాణమందలి గాథను బలపరచును. దీని కింకొకయాధారముకూడా కలదు. లోకల్‌రికార్డులు 4 వ వాల్యూములో రాజకళింగగంగువంశమువారు "కుమిలికోట" నుండి కళింగమును పరిపాలించిరనియు, "ఈ కుమిలికోట" పొట్టునూరు భోగాపురము పరగణాలకు "కసుబా"యనియు చెప్పబడియున్నది. ప్రాచీనకళింగమందలి యాకళింగపూసపాటివంశీకులసంతతివారో లేక వారిపూర్వుల జ్ఞాతులగు బెజవాడకోవలోనివారీప్రాంతములకు వచ్చి వీరికి దత్తులైనవారో లాంగూలగజపతికటాక్షమువల్ల నొక్కప్పుడును, ఆదరిమిలాను మొగలాయిపాదుషా వారివల్ల నొక్కప్పుడును తమకుటుంబములో కుమిలి, పొట్టునూరు, భోగాపురం పరగణాలు స్థిరపరిచుకొన్నారు. ఇవే యెందుచేత ననగా ఇవి వారిపూర్వులురాజ్యస్థానములుగా నేర్పరచుకొని యందుండి "నవలక్షకళింగ"ము నేకాతపత్రముగా నేలినపుణ్యభూములు. రాజకళింగగంగు కోవలోనివారని చెప్పబడిన ఆంధ్రరాజులు "కుమిలికోట" రాజధానిగా నవలక్షకళింగరాజ్యము నేలిననాడా "కసుబా"కు సీమలీవిధముగ నుండెనని ఈలోకల్‌రికార్డులలో నున్నది.

కుమిలెకు తూర్పున నాలుగుక్రోసులదూర మున సముద్రమున రెల్లివలస.

పడమట క్రోసుదూరమున పడువంపుల గెడ్డ.

ఉత్తరమున రెండుక్రోసుల దూరమున బలివలసలోవ; ఈలోవకు పడమట మూడు క్రోసులలో నెల్లిమర్లకోట.

పూంసపాటివంశపురాజకవులు చేసిన ప్రబంధములలో కుమిలికోట స్థలదుర్గముగాను నెల్లిమర్లకోట వనదుర్గముగాను వర్ణింపబడినవి. కుమిలికోట యిప్పుడు ఖిలమైపోయినది. ఆ భూమి అంతా చిరకాలమునుండి సాగుబడిలో నున్నది. ప్రాకారపుదిబ్బమాత్రము ఎత్తుగా గట్టుగా కనబడును. నెల్లిమర్లకోట జాడలు కనబడకుండా ఖిలమైపోయినది.

"కుమిలికోట" అత్యున్నతదశలో నున్నప్పుడు కుమిలెకు కుంభిళాపురమను నామాంతరము వాడుకలో నుండెను. గంగవంశానుచరితము (అముద్రితము. చూడుడు చెన్నపురి ఓరియంటల్ లయిబ్రరీలో) అనుగ్రంథములో ఈకుంభిళాపురము వర్ణింపబడినది. అది పురుషోత్తమగజపతియను కటకపుగజపతి మహారాజు నాస్థానకవి రచించినది. పాదుషావారి చెలిమియున్ని ఆసరాయున్ను పూంసపాటివారికి కలుగుటకు చాలాపూర్వము వారియున్నతి నీగ్రంథము సూచించును. ఈయున్నతి తగ్గిన తరువాతనే తిరిగీ పూంసపాటివారికి మొగలులవల్ల నీపరగణాలు జాగీరు కాబడవలసివచ్చినది. ఆగ్రంథములో కుంభిళాపుర మిట్లు వర్ణింపబడినది.

అథాఽహోభిః కతిపయై రుల్లంఘ్య విషయాన్ బహూన్,
కుంభిళా నికటే రామరాజరాజ్య ముపాగతాః.
ఆస్థానికా మేష దేశః పరిచీను సుభగేలాలనాపాలనాభిః
యేషా మేషాం విశేషా జ్జనయతిపరమానన్దమానన్దరాజః.
తేచామీ మీనకేత్రే విపులకనమదో న్మాదమత్తైకచిత్తా
విత్తాధీశాదిత త్తత్సురగణగణానాం గర్వతః కుర్వతే కిమ్.

వీటినిబట్టి "కుంభిళ" ముఖ్యస్థానముగాగల "రాజ్య" మాంధ్రరాజ్యమనియు అందు పరిపాలించు రాజవంశము సర్వసంపదలతో మహేంద్రాదిదేవతలతో తులతూగుననియు వారిలో "రామరాజు", "ఆనందరాజు" అను పేరులు సుప్రసిద్ధములనియు తెలియవచ్చుచున్నది.

"ఇదానీ మపి.
దోర్భాఖ్యం శ్రీరామరాజస్య పూర్వవత్పరిపాలితాః,
సానన్దా నిష్ప్రతిద్వన్ద్వాః కాలింగాః సుఖ మాసతే.

దీనినిబట్టి అప్పటి (పూంసపాటి) (శ్రీవిజయ) రామరాజప్రభుపరిపాలనము ధర్మపరిపాలనమై పూర్వరాజుల రాజ్యాంగమును బోలియుండెననియు తెలియును. "కాళింగాః" అనుపదము జాతివాచకమై "నవకళింగ" అను "కాళింగరాజ్యముల"ను గూడ స్ఫురింపజేయును. తరువాత శ్లోకములలోను గద్యలలోను ఈరామరాజు నుద్దేశించి "కలింగేశ్వర"; కళింగక్షోణీంద్ర" అనుసంబోధనలు కనబడుచున్నవి. దీనినిబట్టి అప్పటికే వీరికి కళింగేశ్వర" బిరుదము వంశపారంపర్యమైనట్లు తోచకమానదు. ఆంధ్రులు, సూర్యవంశపుక్షత్రియులు, రామరాజు, ఆనందరాజు అనుప్రసిద్ధనామములు గలవారు, "కళింగాధీశ్వర" బిరుదమును వంశపారంపర్యముగా గలవారు పూంసపాటి

వారు తప్ప వేరొకరు కుమిలి (కుంభిల)లో రాజ్యము చేసినట్టు దృష్టాంతములు లేవు. పూంసపాటివారు రాజ్యముచేసిన ట్లున్నవి. కనుక తురకలరాజ్యాంగమునకు పూర్వము ఈపూంసపాటివారే కుంభిళలో కళింగాధీశ్వరులుగా రాజ్యము చేసినవారు లోకల్‌రికార్డులలో వీరికిన్ని రాజకళింగగంగునకున్ను సంబంధము (జ్ఞాతిత్వము) ఉన్నట్టు చెప్పబడ్డది. మార్కండేయపురాణములో రాజకళింగ గంగుపట్న మగు కళింగపట్నము (నవలక్ష. కళింగావనీనగరము)లో కూడా పూంసపాటి వారియేలుబడి యుండినట్లు కలదు.

---

# సమాగమము

నోరి నరసింహశాస్త్రి, బి. ఏ., సాహితీసమితి.

చిరవిరహతాప మంతయు మరుగు పరచి
　　పొంగి పొరలెడి ప్రేమంబు పొదువబట్టి
వెట్టియభిమానవశమున వేచియుంటి
నీ యెదుర్కోలు వేళ సునిశ్చలముగ.

దూరమున నీమనోహరాకార మపుడు
ఛాయగా కానవచ్చె నస్పష్టరీతి
పెదవులం దంతట నటించె పిన్ననవ్వ
హృదయమున నంకురించె నుద్రేకకలిక.

అంతికము చేరుచుంటి నీవంతకంత
చిత్తనైశ్చల్య మల్లన చిటులజొచ్చె
అంత నిల్చితి నీసఖి యగ్రమందు,
ధూర్త! మానాతి ప్రియతరమూర్తి దాల్చి.

ఏమి యయ్యెనో నా కపు డెరుకలేదు!
శిథిల మగునంత కంఠసంశ్లేషణమ్ము.
కలవరము తగ్గ నెక్కింత యొడలు తెలిసె
బాహులతలు నిస్సారత వ్రాలియుండె.

అరయక భవన్ముఖాబ్జంబు శిరము వాల్చి
ఫాలభాగము నీభుజోపరి శయించ
అస్రుధారల నీకు పూజార్పణమ్ము
సేయు నను జూచుకొనుచు నే సిగ్గుపడితి!

---

# మాలతీ

రాయసము వెంకటశివుఁడు గారు, ఎం. ఏ, ఎల్. టి.

కొలఁది కాలముక్రిందట నే నొకకార్యార్థము విజయవాటికిఁ బోవుట తటస్థించెను. అపు డొక స్నేహితునియింట బస చేసితిని. ఒకనాఁడు వేకువనే పడక విడిచి మేడవసారాలోనికి వచ్చి వీథివంకఁ జూచుచుండఁగా, పచ్చని చీరఁ గట్టి, మేలి ముసుఁగు వైచుకొని, ఏటిలో స్నానముచేసి, జలకలశము చేత నుంచుకొని యింటికిఁ బోవుచుండెడి స్త్రీ యొకతె గానవచ్చెను. ఆవేడియ ధరించిన చక్కని పసుపుపచ్చనిచీర, బంగరుకాంతులీనెడి యాసహజ సుందరశరీరమునకు వన్నె తెచ్చుటకుఁ గాక చూపఱ దృష్టిదోషము దగులకుండుటకుఁ గా నిడిన రక్షవలెఁ దోఁచెను. అపుడే



వియత్పథము నలంకరించుచున్న వెలుంగుఱేని లేఁత యరుణకాంతు లాకాంత ముఖసరోజమునకు నైసర్గికముగ లేని సోయగ మేమియుఁ గలిగింప నేరకున్నను ఆలలితాంగి చేతుల నలరారు రంగుగాజులను, జలకలశమునుమాత్రము తళుకుబెళుకులతోఁ దాంపవింపఁజేయుచుండెను. ఆంధ్రవధూటియొక్కయు, నన్యదేశపు వనితయొక్కయు లక్షణము లాసుందరియందుఁ గానవచ్చెను. తెలుఁగుజాతిస్త్రీయే యైనయెడల, పచ్చని చీరయు, మేలిముసుఁగు నెటులు వచ్చెను? నగలును, నగలుంచుకొనినరీతియుఁ జూచినచో నాంధ్రభామినియే యనవచ్చును. ఆ నెలఁతవయస్సు నిర్ధారణచేయుట సులభసాధ్యము కాదు. యౌవనము విడిపోవ సాహసించుచున్నను, సోయగముమాత్ర మాతన్వంగితోడి సంశ్లేషమును వదలఁజాలకుండునటులుఁ దోఁచెను.

ఆ స్త్రీరత్న మెవ్వరో, తదీయజన్మస్థల మేదియో గ్రహింపవలయు నను కుతూహలము ప్రేరేపింప నామిత్రుని నే నంత నడిగితిని. అతఁడు చిరునవ్వు నవ్వి, "ఓహో! మాలతియా! ఆపుణ్యవతి నామిత్రుఁడగు మురహరిరావుభార్య. ఆయువిదచరిత్రము వినఁదగినదియే", యని నా కది యిద్విషయమున వాక్రుచ్చెను.

## మాలతి బాల్యాదికములు

ఈకాంతరత్నము ఓఢ్రదేశపుస్త్రీ. తలిదండ్రులు గౌడబ్రాహ్మణులు. జన్మస్థలము గంజాముమండల మందలి బొమ్మాళి. ఇరువదియైదు వత్సరముల క్రిందట బొమ్మాళి గ్రామమునందలి స్థితిమంతులలో విశ్వనాథపాఢీ యొకఁడు. ఈయనకు సంవత్సరమున కిరువదిగరిసెల ధాన్యము వచ్చు భూవసతి గలదు. కుగ్రామనివాసులగు లక్కి-నేవారివలె విశ్వనాథపాఢీ తనసొమ్మును వ్యర్థవ్యయముల వెచ్చఁబెట్టక కుటుంబపోషణమునకును, పిల్లల విద్యాభివృద్ధికిని నుపయోగించుచుండును. ఆగ్రామమున కేతెంచు నతిథులకును అభ్యాగతులకును పాఢీగారి గే

హమే శరణ్యము. పాఢ్యే తనకుఁదీరికయున్న కాలమంతయు వేదాంతగ్రంథపఠనమునందు వినియోగించును.

విశ్వనాథపాఢ్యే కిరువురు బిడ్డలు. వారిలోఁ బెద్దవాఁడు శశిభూషణుఁడు. ఈయనకంటె నేఁడెనిమిది సంవత్సరములు చిన్నది యగు మాలతి రెండవది. అన్నయుఁ జెల్లెలును వయస్సున జాల వ్యత్యాసము గలవారయ్యును, చిలుకగోరువంకలవలె మిగుల నన్యోన్యతతో నుండురు. అన్న గ్రామపాఠశాలకుం బోవునపుడు విడిచి యింట నుండనొల్లక చిన్నిచెల్లెలు వానిని వెన్నాడుచుండును. అన్న యేపనిచేసిన చెల్లెలు నది చేయవలసినదే. కావుననే, మాలతి కెప్పుడు అక్షరాభ్యాసముచేసిరో తెలియదు. మొదలక్షరాభ్యాసకర్మయే యెఱుఁగదని చెప్పవచ్చును. కర్మయోగ మక్కఱలేకయే యొక్కొకరికి జ్ఞానప్రాప్తి సంఘటిల్లుననున్యాయమున కాబాలిక విద్యాప్రాకమే తార్కాణము. ఇంతియె కాదు. అజ్ఞానావస్థ తొలంగకమునుపే యాబాలకు జ్ఞాన మంకురింపసాగెను. నేలమీఁదను పలకమీఁదను వ్రాసివ్రాసి వ్రేళ్లు మొద్దుపడి యన్న నేరువఁగలిగిన పద్యములు పాఠములును మాలతికి సులభముగనే కంఠస్థము లయ్యెను.

దినదినప్రవర్ధమానయగుచున్న శశిభూషణుని విద్యకొఱకు పాఢ్యే యంత సొంతగ్రామము విడిచి కుటుంబముతో బ్రహ్మపురముఁ జేరెను. అచటమాత్రము మాలతి విద్యాభ్యాసమున కనువగు బాలికాపాఠశాల కలదు. ఇప్పుడాబాలిక క్రమముగఁ బాఠశాలకుఁ బోయి, విద్య నేర్చి తోడిబాలికలకంటె నెక్కుడుబుద్ధికుశలతను గాంచియుండెను.

కొంతకాలమున కచటి కళాశాలలో విద్యాపరిపూర్తిచేసిన శశిభూషణునికిఁ జేరువనున్న విజయనగరములోఁ గాక, దూరస్థమగు రాజమహేంద్రవరమునఁ గళాశాలలో విద్య నేరువవలెనని యభిలాష గలిగెను. చిన్నతనమునుండియు నతఁడు గోదావరీనది యెంతో రమ్యమైనదనియు, మాహాత్మ్యముగలదనియు వినుచుండెను. ఇప్పుడానదీమతల్లిని కన్నులకఱవుదీఱునట్టుగ సందర్శించి, యందలి పావనోదకములఁ గ్రోలి, తత్తీరమందలి రాజమహేంద్రవరమునఁ దాను విద్యాస్వీకారముఁ జేయవలయునని యాతనికి సంకల్పము గలిగెను. మొట్టమొదట పాఢ్యేయును ఆయనభార్యయును దీనికొప్పుకొనకున్నను, తుదకుఁ గొమరునిమక్కువ చెల్లింపనియ్యకొనిరి.

గౌతమీతీరమున కేఁగి, యచటికళాశాలలోఁ జేరి చదివి, పిమ్మట సెలవుల కింటికి కేతెంచియున్నయన్నవలన మాలతి రాజమహేంద్రునిపట్టణపువింతలను వృత్తాంతములను వీనులలర వినఁ దొడంగెను—సోదరుని విడిచియుండుటామె కిదివఱకే మిగులఁ గష్టముగఁ దోఁచెను. అన్నయుఁ జెల్లెలును రాజమహేంద్రవరపు సొంపులను గుఱించియే రేయింబగళ్లు ముచ్చటించుకొనుచుండురు. ఇప్పుడాతనితోఁ దానును బయనముచేయ మాలతి సమకట్టెను. పెండ్లియీడువచ్చిన బాల నొక్కతె నన్నతో దూరదేశము పంపుట కాగృహస్థులు మిక్కిలి సంకోచించిరి. కాని శశిభూషణుఁడు, తానును జెల్లెలు నుండుట కన్నివిధములఁ సదుపాయములు గల గృహమును, సహవాసులను, కుదిరియుండుట నొక్కి చెప్పఁగా, జననీజనకులు వీరిప్రయాణమున కెట్టకేల కొడఁబడిరి.

## మాలతి చెలికత్తెలు

మాలతి కాంధ్రదేశపు సంగతులన్నియు మొదట క్రొత్తలే. గోదావరీనది విశాలజలప్రవాహము వీక్షించిన యాకలికి విశాలనయనము లెన్నఁడును నిమీలన మొల్లనట్టులు గానఁబడెను. ఇచటఁ దమదేశమునందు వలె స్త్రీలు రాణివాసమున నుండ నక్కఱ లేదు. ఇరుగుపొరుగు బాలికలతోఁ గలసి మాలతి యాటపాటలయందు వినోదించుచుండును. నానాఁట వారిలోఁ గూడఁ దానును బాలికాపాఠశాలకు రాకపోకలు సలిపెను. తెలుఁగులిపి యదివఱకుఁ దనకుఁ దెలియకున్నను అచిరకాలములోనే యందు వ్రాయను చదువను మాలతికిఁ బట్టుపడెను. తొలుదొల్త తెలుఁగు బాలికలు మాలతివంకఁ దేఱిచూచుచు, ఆక్రొత్తపేరు వినుటకాశ్చర్యమొందుచు దూరదూరముననే యుండినను అంతకంతకు వారికి మాలతి ముఖ్యస్నేహితురా లయ్యెను. "వడ్డి" బాలికయని మొదట మాలతిని జూచి మూతి విఱచువారలే యిపుడా సుందరి సహవాసమున కాశింప మొదలిడిరి.

మొదట శశిభూషణుఁడు క్రొత్తప్రదేశమునఁ జెల్లెలికి సహవాసినులు దొరకరని భయపడెను. తాను కళాశాల కేతెంచునపుడు మాలతి యింట నొంటరిగ

నుండవలయునని యాతఁడు భీతి నొందెను. తలిదండ్రు
లను విడిచి యాయబల పరదేశమున నుండఁగలదా యని
యతఁడు సంశయించెను. కాని యిపుడాతనికన్నులకల్లెడ
లను చెలియలి చెలికత్తెలే యగపడిరి. మాలతిమూలమునఁ
దా నందఱికిని దగ్గఱిబంధువగుచుండుట కాతఁ డెంతయు
సంతసించెను. ఇంటను బాఠశాలలోను చెలికత్తెలు మాల
తిచుట్టును పండ్లగంపచుట్టునువలె గుమిగూడి యుందురు.
వారి కందఱికి మాలతిపట్ల నింత చెలిమిగలుగుటకుఁ గార
ణము లేకపోలేదు. మాలతి సుస్వభావముగలబాలిక ఈ
క్రొత్తదేశపుబాలిక యుచ్చారణము, పావడగట్టుకొనుట,
జడముడుచుకొనుట మొదలగు చిన్నపను లన్నియుఁ దెలుఁ
గుబాలలకు వింతలే. క్రొత్త దీఱినవెనుక మాలతి చెలిమియే
వారి హృదయముల నాకర్షించెను. గంజాము బాలిక
లెట్లు పయఁట వేసికొనెద రని యొక చెలికత్తె యడు
గును. తలదువ్వుకొనునపు డోఢ్రిబాలిక లోరపాపట
యెట్లు తీసికొందురని వేఱొకతె ప్రశ్నించును. వారి
దేశమున బాలికలు జడలో ముడుచుకొను "చెట్టుసం
పెంగ"పూవు లెటులుండునని యింకొకసహచరి యచ్చె
రువొంది యడుగును. తెలుఁగుబాలికలు తన్ను వేయు
లెక్కలేని యాప్రశ్నముల కేమియు విసివికొనక, వా
రికి మఱింత నోరూరునట్టుగ నుత్తరము లిచ్చునైపుణ్యము
మాలతికే కలదు. వినినకొలఁది నింకను ఓఢ్రిదేశమును
గుఱించియే చెప్పుమని యామెచుట్టు వారు మూఁగుదురు.
వట్టిమాటలలోనే కాక, చదువునందును మాలతి వారిని
మించెను. కావుననే సెలవులకు ముందు చేయఁబడిన పరీ
క్షలో మాలతి తనతరగతి బాలికలలో మొదటిదగుట
చేత, గొప్పబహుమానమును బడసెను.

### శశిభూషణుఁడు

శశిభూషణుఁడును దన చెల్లెలివలెనే సహచరుల
హృదయముల నాకర్షించెను. సామాన్యవిద్యార్థులవలె
నతఁడు పఠనీయగ్రంథములే మోక్షదాయకములని నమ్మి
యుండువాఁడు కాఁడు. ఎంతో శ్రమ కోర్చి, సవిమ
ర్శముగ సద్గ్రంథపఠనముఁ జేయును. ఇంతియ కాదు.
అతఁడు విద్యాలాభము తనకొక్కనికే కాక, దేశీయు
లందఱికిని జేకూఱవలెనను సదుద్దేశము గలవాఁడు. దేశ
క్షేమాభివృద్ధికరములగు కార్యములందుఁ బాల్గొనవలయు
ననుట యాతని ముఖ్యాశయము. కావుననే యాపట్ట
ణమునందలి "సంఘోజ్జీవనసమాజము"న కాతఁడు సహా
య కార్యదర్శి యయ్యెను.

శశిభూషణుఁడు తాను జదువుకొనుట కేర్ప
ఱుచుకొన్న చిన్నగది రానురాను పిన్నలు పెద్దలు
విద్యార్థులు విద్యాధికులును దీఱికసమయమునఁ గార్యా
లోచనము సలుపుటకువచ్చు రచ్చపట్టయ్యెను. తాను
గంజాముమండలమున నున్నప్పుడు ఆంధ్రులకును ఓఢ్రుల
కును గల వైషమ్యము లలంఘనీయములని శశిభూషణుఁ
డు తలంచుచుండెడివాఁడు. "కొమ్మ్మ బ్రాహ్మలు కొండ
గొఱ్ఱెల"ని యాంధ్రుల నోఢ్రులును, "వడ్డివారు మడ్డి
వార"ని యోఢ్రులను దెలుఁగువారును గేలిచేసి యొండొ
రులను ద్వేషబుద్ధితో నిందించుచునికి అతని కెఱుకయే.
కాని యన్యదేశీయుఁడగుతా నాంధ్రదేశకేంద్రస్థానమగు
నొకపట్టణమున నిపు డొంటరిగ నున్నను, తెలుఁగువారు
తనయెడల ననూయలేక మీఁదుమిక్కిలి తనతోఁ గలసి
మెలసి యుండుట చూడఁగా, నాతని కాశ్చర్యము గలిగి,
దేశహితైకకార్యములపట్ల నందఱి కేకీభావము గలుగునని
యాతఁడు సిద్ధాంతము చేసికొనెను. భేదబుద్ధివదలి ప్రజా
క్షేమము నొడఁగూర్చునట్టి దేశసేవ చేయుటకే యాతఁడు
పూనియుండెను.

### ము ర హ రి

శశిభూషణపాఢీకిఁ గల తెలుఁగు మిత్రులలో ముర
హరి ముఖ్యుఁడు. ఇతనికి దేశోజ్జీవనకరములగు కార్య
ములపట్ల పాఢీకిఁగల యుత్సాహమున్నను, పైకిమాత్ర
మట్లు గానఁబడువాఁడు కాఁడు. శ్రోతలకు హృదయరం
జకముగ పాఢీ యుద్రేకముతో సభలోఁ బ్రసంగించు
నపుడు, మురహరి పుల్లవిఱుపుమాట యొకటి నడుమఁ
బ్రయోగించి, యుపన్యాసకునికాళ్లకు బంధములు గల్పిం
చును. వాదనిర్వాహణమందలి విజయము నభిలషించి ముర
హరి యిట్లు చేయువాఁడుకాఁడని యాయిరువురి హృద
యముల నెఱిఁగిన మిత్రులకుఁ దెలియును. పాఢీవలె ముర
హరి వాచాటుఁడు కాఁడనియు, కార్యశూరుఁడనియు
నందఱు నెఱిఁగియున్నారు.

ఒకనాఁటి సాయంకాలము గోదావరినదియొడ్డున
చల్లగాలి సేవించుచు మురహరి శశిభూషణులు గూర్చుం

డి యుండిరి. మలయమారుతము వీచుచుండినను, గొప్ప విషయములను గుఱించి వీరికి తీవ్రవర్చ జరుగుచుండుటచేత మానసములు మాత్రము తహతహపడుచుండెను. ఇంకఁ గొలఁదికాలములోనే విద్యాపరిపూర్తియై యిరువురు నాపట్టణము విడిచి పోయెదరు. తాను పరీక్షలో జయ మొంది, యుద్యోగస్వీకారము చేసినతోడనే, లోకోపకారకార్యములందుఁ దనకుఁ గల యమితోత్సాహమను మహాప్రవాహమందు జనులహృదయములు మున్కలు వేయునటులు గావించెదనని శశిభూషణుఁడు పలికెను. మురహరి యట్లు ప్రసంగింప నొల్లక, తన యొద్దనుండుగు మంచైన సంతతియనుండుననియును, నిక్కముగ లోకము నుద్ధరింపఁగలని మాటలకంటె పనులే యనియును వక్కాణించెను. అంత వారిద్దఱికిని ప్రబలమైనవాదము జరిగెను. కాని దానిపర్యవసానము, "శేషం కోపేన పూరయేత్" అనువిధముగఁ బరిణమింపక అది వారిహృదయములను మఱింతమిత్రభావముతోఁ గట్టునట్టిసూత్ర మయ్యెను. తుట్టతుదకు పాఢీ, "అటులైనయెడల నీ వీకార్యమునకుసిద్ధముగ నున్నావా?" యని యడుగఁగా, "మీ రిద్దఱుసిద్ధముగ నున్నయెడల, నేనును సిద్ధమే," యని మురహరి పలికెను. ప్రేమ యుట్టిపడునట్టులు నంత నామిత్రులొకరినొకరు కౌఁగలించుకొని, తమయిండ్లకు వెడలిపోయిరి.

## అన్నచెల్లెండ్ర సంభాషణము.

ఆరాత్రి మాలతీ శశిభూషణులకుఁ గంటఁ గూర్కు రాలేదు. వారుమాటలసందడిని నిద్రమాటయే మఱచిరి. రాత్రి యగుట, తెల్లవాఱుట,—ఇవి రెండు మాత్రమే వారికన్నులకుఁ బొడఁగట్టెను. కాని, తెల్లవాఱు లోన నన్నయుఁ జెల్లెలును దీర్ఘకాలానుభవము వలనఁ గాని తేలని విషయములఁగూర్చి చర్చలను గావించుకొనిరి. ఆసోదరీసోదరులకు జరిగిన రహస్యసంభాషణ మంతయు నిచట వెలిపుచ్చ నక్కఱలేదు. ఇకఁ దెల్లవాఱు ననఁగా శశిభూషణుఁడు చెల్లెలు నిట్లు మాటాడుకొనిరి:—

శశిభూషణుఁడు:—"కాని, అమ్మాయీ! నీకాతని యందుఁ గలయనురాగము, ఇదివఱ కెన్నఁడును సూచింపనైన సూచింప లేదే?"

మాలతి:—"అవసరములేని ప్రసంగములకు అంగనలు పోఁగూడదని."

శశి:—"మనతలిదండ్రులు నీ కీవేసవిలో వివాహము చేయఁబూని యున్నారుసుమీ!"

మాలతి:—"నీ వేమి చేయఁ బూని యున్నావు?"

శశి:—"పెద్దవారలుండఁగా పిన్నవారేమిచేయఁగలరు?"

మాలతి:—"నాబోఁటిబోటు లిచ్చుసమాధానము విద్యాధికుఁడగు పురుషునినోట వినవచ్చుచున్నదే!"

శశి:—"కాదు మాలతీ! నీవు మనసిచ్చి ధారాళముగ మాటాడుము."

మాలతి:-"అన్నయే నాకీవిషయమున దారిచూపవలెను."

శశి:—"ఐతే విషము మురహరి నాకుఁ బ్రాణసమానము."

మాలతి:-"అన్నయ్యకు నాకును హృదయ మొకటియే."

శశి:—అతఁడే నీకుఁ దగినవరుఁడని భావించెదను."

మాలతి:—"ఐన?"

శశి:—"మనజననీజనకులు పూర్వాచారపరాయణు లగుటచేత ఓప్పుకొనువు నాంగ్రముని కీయరని నా భయము.''

మాలతి:—"భయపడి యేమి లాభము?"

శశి:—"కాఁబట్టి యేమి చేయవలెను?"

మాలతి:—"నీకుఁ దెలియదా?"

శశి:—"అంతరాత్మ ప్రబోధమునుంచుట జననీజనకుల పట్ల మనకున్న విధుల నొక్కింత తగ్గింపవచ్చును."

మాలతి:—''ధైర్యములో మెలఁగఁగలవారే యిట్లుచేయవలెను."

శశి:—"చెల్లీ! ఈవిషయమున నీకు మాటలకంటెఁ గ్రియలే ముఖ్యమని నేను మురహరియుఁ దలంచుచున్నాము.''

మాలతి:—"నన్నుఁగూడ మీలోఁ జేర్చుకొనండి."

శశిభూషణుఁడు తనచెలియలి హృదయ మెఱిఁగి, తనప్రాణమిత్రమగు మురహరిప్రణయము తా నొనఁ గూర్పఁగలిగినందున కెంతయు సంతసించెను.

## మాలతి వివాహము

ఈ సంభాషణము జరిగిన రెండుమూఁడు దినముల పిమ్మట నొకనాఁటి ప్రాతఃకాలమున రాజమహేంద్రవరమున గోపాలస్వామి దేవళమునందలి ముఖమండపము

పచ్చనితోరణములతోను, సుందరములగు రంగుపూలతోను నలంకరింపఁబడియుండెను. ఒకమూల వాద్యములు మ్రోగుచుండెను. సదస్యులలోఁ జాలమంది హూణవిద్యాభ్యాసము చేయుయువకులును, సంఘసంస్కరణాభిమానులును, వయస్సువచ్చిన స్త్రీలకంటె బాలికలు మెండుగ నుండిరి. పురోహితుఁడు గ్రుక్కత్రిప్పక, మంత్రము పఠించుచుండెను. అచటఁ గూడినవారెల్లరును వరుని విద్యాబుద్ధులను గుణించియు, వధువురూపగుణాధికతను గూర్చియుఁ, బ్రశంసించుకొనుచుండిరి. ఎట్టకేలకు వివాహము పరిసమాప్త మయ్యెను. సదస్యులు మంత్రములు చదివి యాశీర్వాదము లొసంగిరి. అగ్రతాంబూల మెవరికీయవలెనను సంగతి యపుడాలోచనకు వచ్చెను. అంత నచటి ప్రముఖుల యనుమతిచొప్పున, ఒకప్రక్కఁ గూర్చుండియుండు వయోవృద్ధునొద్దకు నూతనవధూవరులు వచ్చి, ఆయనకు మ్రొక్కి, ఆయనచేతిలో నగ్రతాంబూలము నుంచిరి. ఆయన మంత్రములమూలమున నాశీర్వదింపక పొంగి పొరలివచ్చు నుత్సాహమున నాలుక తడఁబడుచుండ, మాటి మాటికిని వచ్చుదగ్గు నాఁపుకొనుచు తేటతెలుఁగు మాటలతో నిట్లు పలికెను. "మురహరీ! మాలతీ! హిందూజాతీయైక్యమునకును, దేశాభివృద్ధికిని, పరమసాధనమగు నంతర్జాతీయవివాహపథమున మీరు మార్గదర్శులై ధన్యులైతిరి. మీరు నేఁడు చూపించిన ధైర్యమున కీశ్వరుని నేను మిగుల వినుతించుచున్నాను. శశిభూషణా! నీవుకనఁబఱచిన కార్యోత్సాహ మెంతయు శ్లాఘనీయమైనది!" అని పలికి, తాను రచించినగ్రంథరాజము లానూత్నదంపతులకు మొదటికట్నముగ నొసంగెను. ఈయనయే, సంఘసంస్కరణోద్యమము నుద్ధరించుటకును, దేశోపకారకార్యములు జరుపుటకును తనసర్వస్వమును ధారపోసిన పంతులుగారని యందఱు చెప్పుకొనిరి. వధూవరుల నభినందించుచు సదస్యులలో ననేకులు బహుమతులతో వారలను ముంచివేసిరి.

వివాహవేదికనుండి నూతనదంపతులు క్రిందికి దిగుచుండఁగనే, యపుడే వచ్చిన పొగబండినుండి దిగి, పెండ్లివారెక్కడనని యడుగుచు గుండెలు బాదుకొనుచు నిద్దఱు ముదుసలు లచటికి వచ్చేసిరి. వీరు విశ్వనాథపాఢీయును, ఆయనభార్యయును, అని చెప్పవలయునా? తమయనుమతిలేకయే కుమారుఁడు చేయనున్న యీయశాస్త్రీయమును అనాచారము నగు వివాహముసంగతి తంత్రీమూలమున నెవ్వరో క్రిందటిదినముననే వారికిఁ దెలియఁబఱచిరి! లేడిగుంపును దఱియవచ్చు పెద్దపులివలె పాఢీ యాగ్రహావేశపరవశుఁడై, తనతనయులను సమీపించెను. కాని వధూవరులు తత్క్షణమే యాయనపాదముల కెరఁగి, యాయనదీవనలఁ గడసి కాని లేవమని చెప్పిరి. నూతనదంపతులను దీవింపుఁడని సదస్యులొక్కపెట్టునఁ గేకలిడిరి. అంత పాఢీగారియొక్కయు, ఆయన భార్యయొక్కయు దీవనలందుకొని ఆ క్రొత్త పెండ్లికొడుకును పెండ్లికూఁతురును, అప్పుడే పట్టాభిషేకమునొందిన రాజును దేవేరియువలెఁ దేజరిల్లిరి. కొమరుని కొమరితను, గౌఁగిలించికొని, పాఢీయు భార్యయు నానందబాష్పములు విడిచిరి వారి కోపానల మంతటితోనే యుపశమించెను.

తరువాతి వృత్తాంతము విపులముగఁ జెప్పనవసరము లేదు. విశ్వనాథపాఢీగారిపుడు వయోవృద్ధులై యున్నారు. వేదాంత కాలక్షేపములు సలుపుచు నీయన, "ఆర్యజనైక్యము" అను గ్రంథరాజము రచియించుచున్నారు. దానిలో గౌడ ద్రావిడు లిరువురును ప్రాచీనార్యులసంతతివారలే యనియును, వివాహసంబంధములు భోజన ప్రతిభోజనములును వారలలో నుండుట న్యాయమనియును వారు నిర్ధారణచేయుచు, దీనికి వలసిన శాస్త్రప్రమాణములను జూపించుచున్నారు. శశిభూషణుఁడు ఆంధ్రదేశమం దొకగొప్ప యుద్యోగమున నున్నాఁడు. దేశములోని సంఘసంస్కర్తలలో వీరు పేరెన్నికగన్నవారు. మాలతీ మురహరులు విజయవాటికయందుఁ గాఁపురమున్నారు. న్యాయవాదివృత్తిఁ జేకొని మురహరి ఋజువర్తనముచేతను పరోపకారపారీణతచేతను నందఱిచే గౌరవింపఁ బడుచున్నాఁడు. వీరి పుత్త్రులు పుత్త్రికలును, ఆంధ్రులకు ఓఢ్రులకును గలసు గుణసౌశీల్యములు గలిగి వర్ధిలుచున్నారు. మాలతి యిపుడు బెజవాడలో హిందూకాంతలజ్ఞానాభివృద్ధికై యనేకవిధములఁ గృషిచేయుచున్నది. మాలతి కుసుమపుఁ బరిమళలహరులవలె మాలతి గుణగణములు, ఎల్లెడల వ్యాపకములై, స్త్రీజాత్యుద్ధరణమునకుఁ దోడ్పడుచున్నవి.

# సుఖము

కూచిమంచి వేంకటరాజు గారు

I

భర్మనిర్మితాంతఃపురపంక్తియందుఁ
జారుతర రత్నదీపిత సౌధమందు
నమల మణిమయ దివ్యపర్యంకమందు
లాలితం బగు తూఁగుటుయ్యాలలందు
నిలువఁజాలదు సౌఖ్యంబు నిశ్చయముగ.

కులుకుజవరాండ్ర వైన వక్షోజములను
రంగురంగుల పయ్యెదకొంగులందుఁ
బలుకులందును సొంపుసంపదలయందుఁ
దళుకుబెళుకులఁజూపుల కలిమియందు
నిలువఁజాలదు సౌఖ్యంబు నిశ్చయముగ.

రాజితంబగు శారదరాత్రులందుఁ
బండువెన్నెల తెలినిగ్గుపంటలందు
సలలితంబగు సెలయేటి సైకతముల
మరునిశరములభరమున మనసు విఱుఁగఁ
దామరసనేత్రపైఁ గూర్మిఁ దగిలితగిలి
తెలి సిఁగారంపుచూడ్కులఁ దలఁచితలఁచి
యింతిచెన్నారుహా యలుఁదా నెంచిమెంచి
ఘల్లుఘల్లనవిని గుండె జల్లుమనఁగ
దిక్కు వీక్షించి ప్రేయసిఁ దేఁచూచి
యట్టె బిగియారఁ గౌఁగిట నాదరించి
చెక్కు ముద్దాడి ముంగురుల్ చిక్కుదీసి
ప్రీతిఁ గ్రీడించు వేడుక క్రీడలందు
నిలువఁజాలదు సౌఖ్యంబు నిశ్చయముగ.

* * *

II

ప్రథితధనధాన్యరత్నసంపచ్చయంబుఁ
గరము గలిగియు నిజుపేదనరునిబోలె
హేమకూపంబులోఁ బడి యీఁదుచుండి
చిల్లిగవ్వకు వినతుఁడై చేయిచాఁచు
నేదిసంతృప్తి? జనుల కిం కేదిసుఖము?
ఆశ విడనాడకున్న సౌఖ్యంబు గలదె?

అరయ నిఖిలలోకముల నాశానలంబు
మించి మూలముట్టుగను దహించుఁ గాన
లేదు సంతృప్తి; సంతృప్తి లేకయున్న
నిలువఁజాలదు సౌఖ్యంబు నిశ్చయముగ.

ఆశ దుర్భరచింతల కాస్పదంబు
చింతగల్గిన మనసున శాంతి కల్ల
యింతకును శాంతి లేకున్నఁ దృప్తి లేదు
లేదు సౌఖ్యంబు తృప్తియే లేకయున్న.

శాంతి,సత్యంబు,శౌచంబు,శమము,దమము
గలిగి తృష్ణను వీడి నిర్గర్వియగుచు
నఖిలజీవుల కాధారమైనవాని
నాదిమధ్యాంతరహితుఁడై యలరువానిఁ
బరమపావను నఖిలాత్ము భక్తిఁగొలుచు
వాఁడెపో సుఖి; సంతోషి వాఁడె కాదె?

# కుటుంబరావుగారి సంసారగోష్ఠి

వెలువలి వీరరాఘవస్వామి గారు, బి. ఏ., ఎల్. టి.

కుటుంబరావుగారు:—దేవుడిచేత సృజింపబడి, మనుష్యుడిచేత ఎన్నె తేబడిన, ఈమానవప్రపంచకంలో ముఖ్యమైనపదార్థములలో ఒకటి అయి ఉన్నటువంటిది—నిచ్చెన.

అయితే ఒకఇల్లుమార్చి ఇంకోఇంట్లోకి వెళ్లేటప్పుడు నిచ్చెన లేకపోతే, మరీ అవస్థపడిపోతాం. ఇంటికప్పూ, గోడలూ, బూజులేకుండా దులుపుకోడానికి, సున్నం గట్రా కొట్టుకోవడం వగైరా పనులన్నిటికీ కూడా నిచ్చెన లేకపోతే వీలేలేదుగదా?

పోనీ, ఇరుగుపొరుగువాళ్లని అడుగుదామంటే, ఆవీధిని మనం కొత్తవాళ్లం అవడంచేత, నిచ్చెననిండా సున్నవేఃపోసేస్తారేవో, లేకపోతే నాలాంటి తేలికమనుష్యులెక్కితే విరిగేపోతుందో అనినిర్మొహమాటంగా, అసత్యదోషం తగుల్తుందనైనా అనుకోకుండా—"మాయింట్లో నిచ్చెనెక్కడుందినాయినా, నిచ్చెనకేం భాగ్యం ఉంటే ఇవ్వడానికి" అని వాకట్లో కూర్చున్న బోడిముసలమ్మ జవాబుచెబుతుంది. నిచ్చెనఎదురుగుండా గోడకుచేరవేసి కనబడుతూనే ఉంటుంది. అందుచాత—"ఆగోడకు చేరవేసిననిచ్చెన ఒకపర్యాయం ఇప్పిద్దురూ, మళ్లీ ఇప్పుడే ఓగంటలో పంపించేస్తాను" అని అడిగితే, ఆముసలమ్మ—"ఆనిచ్చెన మాదికాదు నాయినా! మా నిచ్చెన బంగారంలాంటిది ఎరువని తీసికెళ్లి—వాళ్లమ్మ కడుపుకాలా!—విరిచి తీసుకొచ్చారు. ఈనిచ్చెన, ఆ వీథినున్న కోమట్లది. నిచ్చెనకోసం ఇప్పుడే కబురు పంపించారు, దానీది రాగానే పంపించేదామని బైట పెట్టాను. మానిచ్చెనైతే ఇంతసేపా నాయినా! అడగ్గానే పట్టుకెళ్లమందునూ" అని చమత్కారంగా కథ కల్పించి సంతెనాగా మాటలు చెబుతూనే వెళ్లమంటుంది. ఇల్లాగ 'ఉపకారంఅంటే ఊళ్ళోంచే వెళ్లిపోతాం' అని అననివారెవరైనా ఎరువిచ్చినా నిచ్చెనమెట్లు దూరంగా ఉంటే ఇంట్లోపనిచేసే కాపగుంట చిన్నదవడంచేత ఆనిచ్చెనెక్కలేక పనిమానేసి పారిపోతుంది. అందుచేత ఈ అవస్థంతా తప్పించుకోవాలంటే, స్వంతనిచ్చెన, మెట్లు దగ్గిరదగ్గిరసా ఉండేది, అత్యవసరంగా ఉండితీరాలి.



ఇదంతా ఆలోచించే నే నోనిచ్చెన కొన్నాను. దానిసంగతి చాలాఉంది తరవాత చెబుతాను. ఇప్పుడు నిచ్చెనయొక్క అగత్యమును గురించి మాట్లాడుతున్నాను.

ఒక్కకాపగుంటకే కాదు, ఇంటి ఏజమానుడికీ, ఏజమానురాలికీకూడా నిచ్చెనవసరముంటుంది. పెద్దగడియారం, రవివర్మబొమ్మలూ, ఫొటోగ్రాఫులూ, అవ్వీ ఎత్తుగా తగిలించుకోవాలా! ఎత్తుగా తగిలించుకోకపోతే మారెండోవాడు మాపెంకివెధవ చేతికర్రతో పొడిచి తనకికావలసినబొమ్మ కింద పడేస్తాడు. చెబితే వినడు,

కొడితే ఏడుస్తాడు. ఏడిచేటప్పటికి తల్లి "వాడి కేంతెలుసూ! చిన్నపిల్లాడూ—ఆఁ!! మీ కుందిబుద్ధీ వాడికి లేకపోయింది!" అని వెనకేసుకొస్తుంది. ఈఅవస్తంతా పడేకన్న బొమ్మలే నిచ్చేనేసుకుని అందుకు రాకుండా ఎత్తుగా తగిలించుకుంటేనే మంచిది—అంత ఎత్తుగా ఉంటే కనపడవంనా మీఅభిప్రాయం? కనబడకపోతే అదేపోయిరి. ఏ టెలెస్కోపైనా (Telescope) పెట్టి చూసుకోవచ్చు. కుట్టాడుపగలేస్తే మళ్లీ కొనుక్కోలేము. అసలే గ్లాసు మాఖరీదుగా ఉంది.

అటుకమీద ఊరగాయకుండలూ, పొయ్యిలో కర్రలూ, పిడకలూ, అవ్వీ పడేసుకోవాలి. అవి ఎప్పటి కప్పుడు తీసుకుంటూండాలి. ఒడియూ లెంపబెట్టుకోడానికి డాబా ఎక్కాలంటే నిచ్చ నుండి తీరాలి. వంటింట్లో, నెయ్యీ పెరుగూ పెట్టుకోడానికి ఉట్టె ఒహటిన్నీ, పోపులపెట్టా అది పెట్టుకోడానికి బల్లఒహటిన్నీ కట్టి ఇవ్వకపోతే, ఇంటావిడ చేతులాడించుకుంటో వచ్చి, "ఎల్లాగండీ! ఈయింట్లో కాపరంచెయ్యడం? గోడల్ని గూళ్లూ లేవు ఏమీలేవు. గూడు తవ్వాలంటే ఇంటివాళ్లు దెబ్బ లాడతారాయనూ. ఓ ఉట్టేనీ ఓబల్లాను కట్టిపెడితేనే కట్టిపెట్టారు. లేకపోతే ఈయింట్లో కాపరం చెయ్యడం నావల్లకాదుసుమండీ!" అని బెదిరిస్తుంది. ఈపనులన్నిటికీకూడా నిచ్చెన ముఖ్యాధారంగదా? నిచ్చెనయొక్క ఉపయోగాలు ఇంతటితో సమాప్తిచేసి నేను కొన్ననిచ్చెనసంగతి చెబుతాను.

దీన్ని గురించి మొట్టమొదట చెప్పవలసిన ముఖ్యాంశం ఏమిటీ అంటే- మీరెవరూ మాత్రం నేనుకొన్నలాంటినిచ్చెన మాత్రం కొనొద్దని. ఎందుకు కొనొద్దన్నానో దానిసంగతంతా చెప్పేతరవాత మీకే తెలుస్తుంది.

కొత్తగా జపాన్‌నుంచి ఒచ్చాయి మూడువిధములుగా ఉపయోగించే మడతనిచ్చెనలు. దీనికే నేను, 'త్రిగుణయంత్రం' అని పేరుపెట్టాను. ఇది మూడుపనులకి ఉపయోగిస్తుంది.

ఒహటి:—నిచ్చెన (ఎక్కిదిగడానికి)

రెండు:—గడమంచీ (వంటింట్లో పడేసుకుంటే మంచినీళ్ల బిందెలూ అవీ పెట్టుకోవచ్చు.)

మూడు:—టేబిల్ లేక మేజాబల్ల (దానిమీద ఒహ అట్టలాంటిగి పడేసుకుంటే దగ్గిరకూచుని ఆఫీసుపనీ అదీ చేసుకోవచ్చును.) దగ్గిరకూచోడవేఁగాని దానిమీద కూచుంటే ప్రమాదంఉంది. ఆసంగతి తరవాత మనవి చేస్తాను. ఈనిచ్చెనకి కొన్ని స్ప్రింగులున్నాయి అవి కొంచం మార్చుకుంటే సరి—ఇప్పుడు చెప్పిన నిచ్చెన, గడమంచీ, టేబిల్—ఈమూడింట్లో ఏదికావాలంటే అది అవుతుంది.

బాగుంది:—"ఏకక్రియాద్వ్యర్థకరీ" అన్నాడు. ఇది అంతకన్నా ఇంకోటి ఎక్కువే "కరీ" అని సరదాబడి కొన్నాను. ఒకటికొంటే మూడూ కొన్నంతఫలం. ఈకరువురోజుల్లో కొంచం ఎకనామిక్ (economic)గా నడుచుకోవాలి అనుకొన్నానుగాని దీనియకానమీ యిట్టిదని అప్పుడే తెలిసుంటే దానిజోలికే వెళ్లకపోయుందును.

ఏంజరిగిందంటే:—నిచ్చెన కొన్నరోజునే కాపసుంటని, పఠాలూ, గ్లోబులు తీసి, గోడలూ పైనా చీపురుతో బూజు దులపమనిచెప్పి వీధులో కెళ్లాను. ఆగ్లోబూ తియ్యడంలో ఓపక్కకి బరువానడంచేత, అక్కడ స్ప్రింగేమైందోగాని నిచ్చెన 'చప్' మని విరిగి టేబిల్‌గా మారిపోయింది. కాపసుంట దభీమని తాటిపండు పడ్డట్టు బోర్లాపడిపోయింది. చేతులో ఉన్నగ్లోబు కిందపడి తుంబితుంబాలైపోయింది. మోకాలు బెణికి మరి నడవలేకపోయింది. నే నింటికొచ్చేటప్పటికి వీథంతా ఎగిరిపోయేటట్టు ఆపగిలిపోయిన గాజుపెంకులమధ్య కూర్చుని సప్తమస్థాయిని రోదనం చేస్తోంది.

'ఇదేమిట్రాబాబూ ఈకొత్తఉపద్రం' అనుకొని ఒకరూపాయి తీసుకొచ్చి దానిచేతులో పెట్టి ఊరుకోమని బతిమాలి, కొంచం అమృతాంజనం మోకాలికి రాసి, తోమి, ఏంజెయ్యడం 'నిచ్చెనెక్కించి నాకాలు విరగ్గొట్టేశారు కుటుంబరావుగారు' అని కేసుచేస్తే!! ఈరోజుల్లో ప్రతీదానికీ కేసే కాదూ? లేకపోతే ఇన్నికోర్టెందుకు? ఇందరుప్లీడర్లెందుకు! మొన్న నోరోజున గట్టిగా తుమ్మేసరికి పక్కింటిఆయన కోపంగా వొచ్చి "మేమంతా హడలిపోయాం, మా పీస్ అఫ్ మైండు (Peace of mind) అంతా చెడిపోయింది. మాకు నిద్రాభంగంగలిగింది. రాత్రి తొమ్మిదిదాటింతరవాత ఈమాటు అంతగట్టిగా తుమ్మకూడదండి. ఏంజరుగుతుందో చూదు

రుగాని? ఈమాటు మీమీద న్యూసెన్సు (nuisance)కి చార్జీ ఇయ్యకపోతే నేను బ్రాహ్మణ్ణేకాను" అని గదవాయించాడు. 'ఇదేమిట్రా బాబూ పాడుపీడ' అనుకుని అప్పట్నుంచీ స్వేచ్ఛగా తుమ్ముకోడవేఁ మానుకున్నాను. అది ఆలాఉండ్నీండి.

కాపసుంటకి బండీ కుదిర్చి వాళ్ళింటికి పంపించేసి కాలునొప్పి తీసింతరువాత పనిలోకి రావలసిందని కబురు పంపించాను. "ఆనిచ్చెన మీయింట్లో ఉన్నంతకాలం మీయింటికి పనిలోకిరా" నని తిరిగి కబురు పంపించింది. దీనికోసం బోలెడుసొమ్మెట్టి కొనుక్కున్న నిచ్చె నెక్కడపారెయ్యడం. ఇంకొకర్తెని కుదుర్చుకుందాం అనుకుని టేబిల్‌లాగ దానిమట్టుకు అదే ఎడ్జస్టు (adjust) అయిన నిచ్చెన్నికచేరీ సావిట్లో వేయించి దానిమీదే ఆఫీసుపనీ అదీ చేసుకుంటూండే వాణ్ణి.

నాకేం ఉద్యోగం అనా అడుగుతున్నారు? కలెక్టరుకచేరీలో హెడ్డుగుమాస్తాగాఉంటున్నాను. ఇప్పుడు 65 ఇస్తున్నారు. ఫార్టి(40) పెర్సెంటు. ఓల్డుమెట్రిక్యులేట్ని, నావయస్సా?—రెండుమైనారిటీలు దాటి మూడోమైనారిటీప్రవేశం అయింది. అనగా 37 వ సంవత్సరం. పది హేడేళ్లు గవర్నమెంటు సర్వీసుంది. ఇద్దీ నాసంగతి.

సరి:—దానిమీదే ఆఫీసుపనీ అదీ చేసుకుంటూండే వాణ్ణి. ఒకరోజు నేవైందీ, కాళ్ళాడిస్తో తలూంచుకురాసుకుంటూంటే మళ్ళా ఏస్ప్రింగుకదిలిందో గాని రెండు ఊపులు ఊగి 'చప్' మని తన్నింది. దాంతో నాచేతులోఉన్న పౌంటెన్ పెన్ ఎగిరిపోయి పాళీ గోడకిగుచ్చుకొని కలం దమ్మిడీకి పనికిరాకుండా పోయింది. నానుదురుమీద దొరగారికి ప్రెజెంటిచ్చే నిమ్మకాయంత బొణిపి కట్టింది. టేబిల్ మీద రెండుపుస్తకాలుంటే అవి బైండుకూడిపోయి అట్టకిఅట్టా, లోపలి కాయితాలికి లోపలికాయితాలు,విడమర్చినట్టు ఎనలైజ్ (analyse) అయిపోయినాయి. ఆఫీసుకాయితాలుకొన్ని చిరిగిపోయాయి, కొన్ని కత్తిరించుకుపోయాయి. మర్నాడు దొర ఇన్‌స్పెక్షన్‌కి ఒస్తున్నాడు. ఆరాత్రల్లా కూచుని ఆకాయితాలన్నీ తిరగరాసి ఏడ్సిమొత్తుకున్నాం. తీరిపోయింది.

టేబిల్ వెళ్లి నిచ్చెనరూపం దాల్చి గోడకి చేరబడి తానుచేసినపని తప్పన్నసంగతి తెలుసునేమో అన్నట్టు వణకడం ఆరంభించింది. ఈనిచ్చెన్ని ఇంట్లో ఉంచడవాఁ? వీధులో పారెయ్యడవాఁ? (To keep or not to keep the ladder; that is the Question.) అని కొంచెం ఆలోచించేసరికి ఏంతోచిందీ—దీన్ని నిచ్చెనగాను, టేబిల్‌గాను ఉపయోగించిచూసి తిరగబడ్డాం—పోనీ మూడోవిధంగా గడమంచీలాగ ఉపయోగించుకుంటే పడిఉంటుందేమో అని, ఇల్లాలికి మేర్కానీగా ఉండాలని వంటింట్లో పెట్టించాను. పెట్టించానేవిఁటి—వెన్నవగొప్ప—నేనే పెట్టాను.

కొన్నాళ్లదాకా బాగానే పనిచేసింది పాపం! అయితే ఏవైందీ మాయింట్లో తద్దినం ఒచ్చింది. మంచినీళ్ళెక్కువ పడుతుందిగదా అని గంగాళం దానిమీద పెట్టింది. ఆగంగాళం మూడుబిందెల నీళ్ళు పడుతుంది. నీళ్లబ్రాహ్మడు వెంకన్న ఓకకావిడి నీళ్లందులో పోసి రెండోకావిట్లోవికూడా ఓబిందెనీళ్లందులోపోసి, నాలుగోబిందె కింద దించి వెళ్ళిపోయాడు. వంటిల్లు చిన్నదవడంచాత ఆ బిందెకూడా గడమంచిమీద పెడితే విశాలంగా ఉంటుందని ఇంటావిడ అట్లా వేసింది. బిందపెట్టే పెట్టడంలో గడమంచీ కిరకిరమని వణకడం ఆరంభించింది. వణుకు ఊపుగా పరిణమించింది. ఊగి ఊగి "చప్" మని తన్ని పెరట్లో కెగిరిపోయి మళ్లీ మొదటి అవతారం అయిన నిచ్చెనరూపంగా, పెరట్లో తులసికోటకి చేరబడి ప్రత్యక్షమైంది. బిందె ఎగిరివెళ్లి పొయ్యిమీదపడి పొయ్యి చితికిపోయింది. గంగాళం తిరగబడిపోయి వంటిల్లు చిన్నచెరువులాగ తయారైంది. మాయింటావిడకి గాభరా వేసిపరుగెత్తుకొచ్చి:—

"ఏమండోయి! మీరుకొన్ననిచ్చెన వంటింట్లో మొగ్గలేసి, పెరట్లో సర్కస్తు చేస్తోంది. బిందె నెగరేసి గంగాళాన్ని తిరగదోశేసింది. దాంట్లో దెయ్యవోఁ భూతవోఁ ఉన్నట్టుంది. ఇంకానయంవేఁ బిందె నామీద పడలేదు; పొయ్యిమీదపడి పొయ్యి విరిగిపోయింది. కర్రలన్నీ తడిసిపోయాయి. సహావైఁన వంటకూడా తగలడిపోయింది. అసలే పొద్దెక్కిందనీ, పొయ్యిమండలే

దనీ, ఏదుస్తూంటే ఎల్లాగండీ మరిఇప్పుడూ ?—దాన్ని తీసికెళ్లి ఊరుబైట స్మశానంలో పారేశొత్తురూ. అక్కడ దెయ్యాలతోపాటు ఆడుకుంటుంది. ఎక్కడ దొరుకుతాయండీ మీకు ఎప్పుడు—న్నా ఇల్లాటి వెధవ వస్తువులే కొని పట్టుకొస్తారూ? నాప్రాణాలమీదకి." అని ఆవిడచీరచెంగుతో కళ్ళద్దుకోవడం ప్రారంభించింది.

కొంచం ఓదార్చి బుజ్జగించి,మంచిమాటలాడి ఎర్రపొళ్లదుద్దులజత కొనిపెడతానని చెప్పి మళ్లీ వంటప్రయత్నం చెయ్యడానికి ఒప్పించేసరికి నాతలప్రాణం తోక్కొచ్చింది. పారుజాతాపహరణంలో శ్రీకృష్ణుడు సత్యభామతో పడ్డంత అవస్థా పడ్డాను. సత్యభామ పారుజాతం తీసుకురమ్మనీ—మాఆవిడ నిచ్చెనపారేసిరమ్మనీ—అంతే శ్రీకృష్ణుడికీ నాకూ భేదం. అయితే మా ఆవిడచేత తన్నులు తినలేదుగాని శేబిల్ అవతారాంత మందు నుదురుమీద తగిలినదెబ్బ నొప్పి ఇంకాలియ్యక పోవడం చాత శ్రీకృష్ణుడికీ నాకూ పోలిక ఉందని చెప్పుకుంటున్నాను.

ఇంతసేపూ చెప్పిన, ఈమూడుగుణాలూ గలిగిన ఈవింతపదార్థానికి స్ప్రింగులు వొదులైపోయి గట్టిగా తుమ్మినా, దగ్గినా, అవతారభేదాలు చూపించడం ఆరంభించింది. ఇది ఇహాపైనుంటే ప్రమాదం అనిచెప్పి జాగ్రత్తగా సాయంపట్టి తీసికెళ్లి, పాత సామాను కొట్టులో పారేసి తాళం వేసీశాం. రాత్రప్పుడు ఎలకైనా, ఏదైనా దానిమీద నడిస్తే ఆదిశేబిల్ లాగ ఉంటే గడమంచీలాగ, గడమంచీలాగుంటే, నిచ్చెనలాగ తనంతట తానే మారి ఆగదులో సామాను చిందరవందర చేస్తూ, నిద్దరపట్టకుండా గగ్గోలుచేసి గెంతుతూ ఫీట్సు (feats) చేస్తూఉంటుంది.

పక్కఇంటి ఆయన "ధాం, ధాం" అంటూ వొచ్చి "ఏమిటాఅల్లరి?" అని గంభీరంగా అడిగాడు. ఈమాటు తప్పకుండా నాఛ్జీ ఇచ్చి న్యూసెన్సు కేసుతెస్తాడుగాబోలని నిశ్చయించుకుని అయినా ఇల్లాగనిచూద్దాంఅని "ఆగదిలో దెయ్యాలు దెబ్బలాడుతున్నాయయ్యా! వెధవదెయ్యాలకొంప రేపు మరో ఇల్లు చూసుకు వెళ్ళిపోతాం. ఈయింట్లో ఎవడుండగల్డు బాబూ" అన్నాను. దెయ్యంమాటవినగానే గుమ్మందిగి వీథులోకెళ్ళి నిలబడ్డాడు. దెయ్యాలూ, పిశాచాలూ, ఎవిడెన్సు ఏక్టు (Evidence Act) లో పనికిరావుగనక నామీద కేసు చెయ్యడానికి అవకాశం చిక్కలేదు. దెయ్యం భయం చేత అప్పట్నుంచీ ఆబ్రాహ్మడు మళ్ళీ మాయింటికి రాలేదు.—(సశేషం)

---

# ఆకాశము - పేదరాసి పెద్దమ్మ

(హాస్యకథ)

అధికార్ల సూర్యనారాయణరావు గారు బి. ఏ, బి. ఎల్.

వెన్నెల వీధిలో పిండారబోసె;
ఆటలెన్నోబాగ ఆడుకొందామె?
అన్నము తింటుండి రమ్మ నానమ్మ
లేనిచో బైటికి పోనీకుమన్ని!
ఆపరికిణీచాలు అల్లరేమిటికె?
తలుపుమెల్లగమూసి దాటిరాలేవె?
అట్లురావే చెల్లి అందాలతల్లి!

ననుచూచిచంద్రుడూ నవ్వుతున్నాడె;
చల్లనికిరణాల జార్చుతున్నాడె!
మేఘాలవెన్నాడి మిణగవ్వతును
పరుగెత్తుతున్నాడె పంతాలుపట్టి!
నేలపై చెట్లపై పాలవెన్నెలలు
పోస్తూను హాయిగా పోతున్నాడె!
"ఎన్నిబారలదూర మున్నాడెవాడు?

రమ్మని పిలిస్తేను రాడటే అక్క?"
ఎంతదూరమొయేమొ నేచెప్పగలనే?
వేలొ లక్షలొ మైళ్ల వెనక నున్నాడు?
వచ్చువాడేదూరభారంబునందు.
మసలుచుండేవాడు మనము పిల్వగనె?
హాయిగా ఆటల నాడుకోటాని
కిద్దరమే మరి మెవ్వరూలేరె!
లలితయింటికిపోయి పిలిచిరారాదె?
ముగ్గురైనా లేక ముచ్చటేలేదె!
తొలి తల్లిగావొకరు, దొంగగావొకరు
వెన్నంటి దొంగని వెదికేందుకొకరు
మాయక్క నిన్ను రమ్మందనిపిలువు!
నీవు వచ్చేదాక నేనుందు నిచట!
లలితను మెల్లగా పిలుచుచునుండ
వెళ్లవద్దని యామె తల్లియన్నాది
అందుకనిరాదట ఆడుకోటానికి.
పోనిలే, ఆటలుమానివేతాము
చిన్నకథయేదైన చెప్పవేనాకు!
ఆకాశమెందు కనంతదూరముగ
పోయినదోనీవు పోల్చుకోగలవె?
చిన్నదానవు నీవు చెప్పలేవు,
వినిపింతునే నీకు వింటావె చెల్లీ!
అనగనగవొకపల్లె అవనియున్నాది,
పల్లెలోవొక చిన్నయిల్లు వెలిసింది.
ఆయింటిలో పేదరాసి పెద్దమ్మ
కసరుతూ తిట్టుతూ కాపురం వుండె!
ఏలనో ఆమెకు ఎరుగనుగాని
చీటికిమాటికీ చీకాకుమెందు;
ఊరంతకోపమ్ము ఊ అనంగానె!
పరుషమ్ము లామె నని బతికిపోలేమె!
పెనుగాలి ఒకనాడు పెట్టెనేచెల్లీ!
చాలగావాకిట ధూళికూడింది!
ధూళిచూచినకొలది దుఃఖమొచ్చింది!
వెంటనేచీపురు బిగియించికట్టి

నడివాకిలిని వేగ తుడవసాగింది.
మునుపు ఆకాశమూ పొట్టిగావుండి
వడివడిగా నట్లు తుడుచుచున్నపుడు
పెద్దమ్మవీపుకీ ఫెళ్లని తగిలె.
కళ్లుగిడతలుకమ్మి కందిందినడుము
ఫెళ్లుమన్నంతనే వెర్రికోపమ్ము
వచ్చె పెద్దమ్మకూ, పట్టలేదామె.
చీపురుతిరగేసి ఛెళ్లుఛెళ్లుమని
బాదింది పెద్దమ్మ బాధపడలేక
అంతరిక్షానికి ఆకాశమెగిసె!
చెల్లి యాపెద్దమ్మ చెయ్యిపడిపోను!
కళ్లుమణగించు ఆకాశాన్నిమెంత
పాపిష్టిపనిచేసి పారతోలిందె?
ఆకాశమే మన కందుకొస్తేను
ఎంతహాయిగవుండునే చిన్ని చెల్లి!
చూడనక్కరలేదు పాడుముత్యాలు
చుక్కలేనాడు మన ప్రక్కనేవుంటే!
ఇటుఅటూ మేఘాలు యీదాడుతుంటే
దాగుడుమూతకు దాపులేలేవె?
వింతరంగులచిట్టిపిట్టలన్నిని
అంతమీదికిపోక చెంతనుండవటే?
దిగువనే చంద్రుండు తిరుగుతుంటేను
రమ్మని లలితను బతిమాలనేల?
వెళ్లవద్దని దాని తల్లి అననేల?
ఇట్లు మన పాలిటి కేలపుట్టిందో
రాకాసిలా పేదరాసిపెద్దమ్మ?
చంద్రుడు మేఘాల చాటు నిద్రించె.
వెలుగు లేదాడంగ వేడుకలేదె!
ఎంతసేపాయనో యిచటికొచ్చాము
భోజనాలీపాటి ముగిసివుంటాయి
పక్షులొక్కటైన పలకనేలేదు.
వేగముపోకుంటె వెదకుకుంటారె!
చప్పుడుచేయక చలచల్లగాను
పోయి యింట్లో నిద్రపోదాముదారావె!

# జంతువు లెట్లు పగతీర్చుకొనును?

కో. నృసింహాచారిగారు

శ్లో. మాతృవ త్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్,
ఆత్మవ త్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి.

ప్రపంచమున మేలునుగాని కీడునుగాని జ్ఞాపకము పెట్టుకొనుటయు దానికి బ్రతిగా మేలునుగాని కీడునుగాని చేయుటయు మనుష్యులలో సామాన్యముగా నున్నది. ఇట్టిది నోరెరుగని జంతువులలోగూడ నున్నదన్న సాధారణముగా నూటికొక్కటిగా నుండునని తలచెదముగాని సర్వసాధారణముగా నున్నదనుట నమ్మజాలరు. కారణ మేమనగా: ప్రత్యుపకారాపకారములను జేయుటకు జాల జ్ఞాపకశక్తియు, ఇంగితజ్ఞానమును, యోచనాశక్తియు కావలసియున్నవి. ఇట్టిశక్తులు జంతువులకు సాధారణముగా, లేవనునమ్మకమే మెండు; కాని యిదిపొరబాటు కొద్దిగనో గొప్పగనో జంతువులకు నిట్టిశక్తులు గలవు. ఏటికి నీటికొఱకు పోవుచుండిన ఏనుగు, తనకు ప్రతిదినమును దినుట కిచ్చుచుండిన దర్జీవాని యొద్ద కొకనాడు వాడుకచొప్పున బోవుటయు, వా డానాడు తినుట కిచ్చుటకు మారుగా తనసూదితో దానితొండమును బొడుచుటయు నాయేనుగు తత్కాలమున కేమియు దెలియని దానివలెనే యేటికి బోయి నీరు ద్రావి తొండమునిండ బురదనీటిని నింపుకొని మరల వచ్చునప్పుడు దర్జీవానిని, వానిక్రొత్తకుట్టుబట్టలను నాబురదనీటితో తడిపి పగతీర్చుకొనుటను కథారూపమున మనబాలురు వారిపాఠపుస్తకములలో జదివియున్నారు. ఇంకను నిట్టి వెన్నియో కలవు.

ఒకానొక సమయమున నొకమనుష్యు వానర మొకనావలో తీసికొని పోబడునట్లు తటస్థించెను. ఓడలోనివారందఱు నీవానరముతో నెకసక్కెము లాడుటకును ఆటలాడుటకును నిష్టపడుచుండిరి. అదియు వెనుదీయక వారితో సమానముగ వేడుక లొనరించుచు వారిని నవ్వించుచుండెను. వారు భోజనముచేయునపు డంతయు వారియొద్ద కదిపోవుటయు, దానికి వారు తినెడు పదార్థముల నిచ్చుటయును జరుగుచువచ్చెను. ఇట్లు కొంతకాల మాకోతి, యాజనులనడుమ చనవుతో మెలగుచుండెను. అంత నొకనా డానావోడలోనికి నూతనప్రయాణికులు వచ్చిరి. వారియొద్ద నొకచిన్నబిడ్డ యుండెను. ఆబిడ్డ చాల ముద్దుగొలుపుచున్నందున నావోడలోని వారికి బ్రీతిపాత్రమయ్యెను. ఇట్లు వారియొక్క ప్రీతియు లక్ష్యమును దినక్రమమున నాబిడ్డవైపుతిరుగుటయు వానరముతో నాటలను గొంతవరకు మట్టగించిరి. ఆకోతి వారిప్పు డా

బిడ్డయందలి ప్రేమాతిశయమున దన్నాదరించుట మానిరని గ్రహించి చింతాక్రాంతమై యుండెను. వారుగా బిలిచినగాని యెవరియొద్దకును బోవకుండెను. పోయినను ఎక్కువ చెరలాటమాడకుండెను. దానిమనస్సులోని యోచనయెట్టిదో యెవరికిని దెలియదు; కాని ఆయోడలో బ్రయాణమొనరించుచుండిన స్వభావశాస్త్రజ్ఞు డొకడుమాత్రము దానియందు గల భేదమును గ్రహించి దానిచర్యలను గమనించియే యుండెను. ఇట్లుండ నొకనా డాయోడలోనివారందరు భోజనమున కొకచోట చేరిరి. కోతియు నేమియు నెరుగనిదానివలె వాడుకప్రకారము వారియొద్దకు జేరెను. అందఱు నక్కడికి వచ్చి చేరిరాయని చూచుకొనియా కోతిమాత్రము భోజనము చేయకయే వారియొద్దనుండి లేచిపోయెను. స్వభావశాస్త్రజ్ఞుడు మాత్రము దీనిని గనిపెట్టవలెనను బుద్ధితో దానును లేచి చేతితుపాకితో దానివెనుకనే దానికి తెలియకుండురీతిని వెంబడించెను. అట్టి సమయమున నాబిడ్డతల్లి, నిద్రపోవుచుండిన తనబిడ్డ నుయ్యాలలో బెట్టి క్రింద వచ్చియుండెను. దానిని గుర్తించినది గాన నాకోతి మెల్లమెల్లగా నుయ్యాలకడకు బోయి బిడ్డనెత్తుకొని వేగముగా సముద్రములో వేయనుంకించుసరికి నాజంతుశాస్త్రజ్ఞుడు తటాలున నడ్డుపడి తుపాకిని గాల్చువానివలె నటించెను. కోతియు భయపడి బిడ్డ నక్కడనే పారవైచి తాను దప్పుచేసినసంగతి నెరిగినదిగాన వణకుచు, నరచుచు నాతనికాళ్లపై బడి మన్నింప వేడుదానివలె దీనముగా నుండెను. అప్పటి నుండి దానిని ఖైదుగా జేసి జాగ్రత్తగా కని పెట్టి యుండిరి. ఇట్టిపని చేయుటకు దాని కెంతయోచనయు, క్రోధమును నుండియుండవలెనో యోజింపుడు.

ఒకానొకసమయమున సైనికులకు నీరు కావలసివచ్చెను. ఏళ్లును, చెరువులును ఎండినందున వారికి బావులే గతియయ్యెను. అట్టి తరుణమున నొకబావియొద్దకు నొకటి తనతొండమున బొక్కెనతోను, మరొకటి యూరకయు రెండేనుగులు మావటివాండ్రతో వచ్చినవి. బొక్కెన లేనియేనుగు బలముగలదిగా నుండెను. ఈయేనుగు స్వబుద్ధివలననో మావటివానికుట్రవలననో చిన్న యేనుగునుండి తటాలున నాబొక్కెనను లాగుకొనెను. బలహీనతవల్లను చిన్నదియైనందునను ఆయేనుగు బదులు చేయజాలనందున, నప్పటికి జగడమాడు నుద్దేశ్యమును జూపలేదు. ఆపెద్దయేనుగును దాను సులభముగ జయించినందులకు



## లంకాదహనము



ఉ. మింటఁ జటచ్చటధ్వనులు మేఘఘనధ్వను లై చెలంగ నిం,టింటికి దాఁటి వాలమున నేఁచిన చిచ్చు దగిల్చి దిక్కుల
న్నింటను విస్ఫులింగములు నిండఁగఁ జల్లుచు మంటలాకసం, బంటఁగ నుబ్బి యుగ్రగతి సమస్తగృహంబులు గాల్చుచున్నెడన్.

భాస్కర రామాయణము - సుందరకాండము

**Lakshmi Art, Bombay 8.**

## హనుమత్ప్రత్యాగమనము



క. కనుఁగొంటి సీత సేమం,బున నున్నది మిమ్ము భావముననిడికొని వా
టున రామ రామ నృపయం,చును వెస మీరాక కెదురుచూచుచు నెపుడున్.

భాస్కర రామాయణము - సుందరకాండము

గర్వపడుచు నిర్లక్ష్యముగ నాబావియొద్దనతి సమీపమున పరాకుగా నుండెను. సమయము కొరకు వేచియుండినది గాన నా చిన్న యేనుగు ఇదియే సమయమని యెంచి తటాలున బెద్ద యేనుగును బావిలోనికి ద్రోసెను. అజాగ్ర త్తగా నుండినదిగాన పెద్దయేనుగు బావిలో పడెను. తర్వాత బావిలోనికి పెద్దదూలముల దింపి యామావటీండ్రు దానిని బైకి లాగివేసిరి.

ఒకయోడపై నొకకోతిగూడ ప్రయా ణముచేయుచుండెను. సౌకర్యార్థము నావికు లను పేరుల బెట్టి పిల్చుటకు మారుగ సంఖ్యల గుర్తు నిచ్చియుండిరి. అటులనే యీకోతికి '4' సంఖ్యను గుర్తుగా పెట్టుకొని యుండిరి. ఎవరిసంఖ్యను బిల్చిన వారు పలుకుచుండిరి. భోజనసమయమున ఒకటి, రెండు అని సంఖ్య లను పిల్చుటలో వేడుకార్థము '4' ను పిలు వక యే తక్కిన సంఖ్యలను పిలిచిన నాకోతి తన్ను పిల్చునంతవరకు పోవునది కాదు. '4' అనిపిలిచినవెంటనే యది పోవును. ఒకనాడు ఓడపనివాండ్రోడను శుభ్రపరచుటకు బొక్కె నలలో నీరు తెచ్చి యోడను కడుగుచుండిరి. కోతియు వారివలెనే తా నొకబొక్కెననీటితో యోడను కడుగ మొదలు పెట్టెను. అప్పుడు తుంటరిపనివాడొకడు పనియంతయు తీరిన వెనుక నొకబొక్కెన నిండ నీటినిదెచ్చి యా కోతిముఖమున బోసి పరుగెత్తి పోయెను. అదియు వానినేమి చేయుటకు నవకాశము చిక్కనందున పగ తీర్చుకొనుటకు వేచియుం డెను. మరియొకతరుణమున పనివారందరు ఓడ పై భాగమున మరమ్మతులు చేయుటకొరకు త్రాళ్ల నిచ్చెనల నెక్కి పనిచేయుచుండిరి. అప్పు డాకోతియు దాను పనిచేయుదానివలె నొక త్రాటినుండి మరియొకత్రాటికి బ్రాకుచు ప్రతి కూలివానిముఖమును దేరిపారజూచి పోవు చుండెను. తుదకుదనమీద నీరుగ్రుమ్మరించిన పనివానియొద్దకు రాగానే వానిని గుర్తించి వాని రెండుదౌడలను కరచి తప్పించుకొని పారి పోయెను. ఈకోతికి దన్నుపిలుచుట కివ్వబడిన సంఖ్యయు అసంఖ్యను పిలువకున్నదన్ను పిలువ లేదను జిజ్ఞాసయు, దన కపకారము చేసిన వానిని గుర్తించుశక్తియు నుండుట చిత్రములు కదా!

పక్షులయందును నిట్టి పగతీర్చుకొను గుణము గలదు. గుడ్లగూబలు రాత్రించర ములు గదా! అవి రాత్రులందు దక్కినచిన్న పక్షులకు జేయు నపాయము విపరీతముగా నుండును. అయిన నవి దివాంధములు గాన తప్పి జారి పగటిపూట బయటకి రా దటస్థిం చిన, పూర్వవిరోధమును దీర్చుకొనుటకు గూబ లను తరుముటకును బొడుచుటకును గుంపు లుగా జేరుపిట్టలను జూచియే యుందుము. ఈచిన్నపిట్టలచేతను, కాకులు మొదలగు పక్షు



లచేతను వేటాడబడునవి యీగూబలే కావు. ఇతరమాంసాహారములగు డేగ, గ్రద్ద మొదలగుపక్షులు కూడను వానియవస్థను జూచియే యుందుము. కోవెలలు తామెంత యితర చిన్నపక్షుల వేధించుచున్నవో అంత యితర పెద్దపక్షుల బాధనుండి తప్పించుకొనుటకు బాధపడుచున్నవి.

ఒక్కొక్క సమయమున గొన్నిపక్షులు తమగూండ్లను కట్టుకొని వాటియుపయోగము దీరిన వెనుక వాటిని వదలి మరుసంవత్సరమున క్రొత్తవాటిని గట్టుకొనక నాగూండ్లకే వచ్చు వాడుక గలదు. ఇటు లాగూండ్ల ప్రాతకాపులు వచ్చులోపల వేరొకపక్షి దాని నాక్రమించు కొనుటయుఁ గలదు. ఒకసారి యొకపక్షి యొక గూటి నాక్రమించుకొనినయెడల దానిని వెడలదరుముట కష్టము. ఏలనన లోపల చేరి తన వాడిముక్కున బయటగల యెన్నిపక్షులనైన నిరాకరించగలదు. అట్టి సమయములయందు గూండ్లను కష్టపడి కట్టుకొని యిప్పుడు వాటి ననుభవింప నోచుకొనని చిన్నపక్షులకు గల మనస్సంతాపము వర్ణింప నశక్యము. లోపలి పిట్టను బలవంతముగ బయటికి లాగలేకపోయి నను దమ కపకారమొనర్చిన యాశత్రుప్రను వేఱువిధముగ శిక్షింప బ్రయత్నించును. పిట్టలన్నియు దక్షిణమే పోయి తడిబంకమట్టిని తీసికొనివచ్చి గూటిపైన గూటిని(కోటను) గట్టును. లోని పక్షి తనకు మూడుకీడును కనుగొనజాలక లోపలనే యడగి యుండును. ఇట్లు క్రమముగా బయటికోట పూర్తియగుడు లోనిపక్షి బయటికి రా మార్గము లేకను, ఊపిరియాడకను చావవలసి వచ్చును. ఇట్టిపని కెట్టియోచన కావలెనో యోచింపుడు.



ముత్యములు సముద్రమున గల యొక విధమగుప్రాణుల శరీరములలో గలుగునవని చాల మందికి దెలిసియే యున్నది. సముద్రమున గల సూక్ష్మజీవములు మెల్లగా నీ ముత్యపుచిప్పలలో బ్రవేశింపగలుగుచున్నవి. అటులు ప్రవేశించగనే యీప్రాణు లాముత్యపు చిప్పలో నొకభాగమున జేరి యాముత్యపుబురుగునకు, మనకంటు నలుసుపడినరీతి, సంకటము గలుగ జేయును. ఆబాధ నివారించుటకు పురుగు తనలో ప్రవేశించినయాప్రాణిని యొక విధమగు ద్రవముతో గప్పుచువచ్చును. ఇట్లు క్రమక్రమముగా గప్పుటకుపయోగింపబడినపదార్థము గట్టిపడి ముత్యముగా నేర్పడుచున్నది. అందులో జిక్కినయాప్రాణి నశించుచున్నది. ఒకనత్తగుల్ల తేనెగూడులో ప్రవేశించెనా దాని నాతేనెటీగలు నలువైపుల జేరి కుట్టుటయే కాక దానిచుట్టును మైనపుగూటిని గట్టి చంపుచున్నవి.



ఇట్టినిదర్శనములఁ బట్టియు, యింకను మన కనుభవగతములగువిషయముల బట్టియు జూడ కీటకములు, పక్షులు, జంతువులు మొదలగువాటిలో బ్రతిప్రాణియు దనశక్త్యనుసారము తనకు సంభవించినకీడునకు దగిన రీతిని బగ దీర్చుకొన జూచుచున్నవి. వాటిజ్ఞానమునకు దగినట్లు చేసినమేలునకు బ్రత్యుపకారమును జేయుచునుగూడ నున్నవి. కాన నోరులేనిజీవముల బాధించక యాచిన్నప్రాణులను సహితము తనవలెనే చూడవలసినది మనుష్యునకు విధియైయున్నది.

---




బసవరాజు అప్పారావుగారు బి. ఏ.

ఎంతలోతుంటుందో
యీసముద్రము చిట్టి!
అంతులేనే లేద
నంటారుకాదా?

ఈసముద్రముదరిని
నీ అగాధపుహృదయ
మదియేమొ, చిట్టి, నా
కట్టె తలపొచ్చింది!

బ్రహ్మాండమైనసీ
ప్రణయాబ్ధిలోబడే
పిల్లకాలవను నా
ప్రేమలెఖ్ఖాజమా?

# కలికి-చిలుక

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

"కలికీ! నాలుగుదినములనుండి నీచెలికారము నన్నెంతసంతోషపెట్టుచున్నదో చెప్పుటకు నాకు చేతగాకున్నది. ఆహా! భవభూతికవి ఉత్తరరామచరిత్రలో 'అద్వైతం సుఖదుఃఖయోః' అని ఆరంభించి దాంపత్యమునుగూర్చి ఎంతమంచిపద్యము చెప్పినాడనుకొన్నావు! ఏదీ! నీవు సంస్కృతము నేర్చుకోవైతివిగదా! మీనాయనగారికి అప్పుడప్పుడు ఉత్తరాలలో వ్రాస్తూవచ్చినాను. "మీకుమార్తెకు సంస్కృతము నేర్పించండి" అని, అట్లాయేమీ జరుగలేదుగదా! అబ్బ! ఆయనమాటే ఆయనమాట ఆయన నింకొకరుచెప్పి ఒప్పించడము కష్టసాధ్యము. ఇంతవరకు వారియిష్టము. అయినది అయినది గాని, యికనైనా నా దగ్గరకు వచ్చినతర్వాత సంస్కృతము నేర్చుకోవలెసుమా! నేర్పుతాను; ఏమయినది చెప్పవు నీప్రయాణముమాట యింతకూను? మీనాయనగారు, అమ్మగారు, ఏమనుకొంటున్నారు? ఇప్పుడు పంపిస్తారా? గట్టిగా కనుక్కోవద్దూ! ఎట్లా యిక మరి? నీవూ కనుక్కోలేకపోతివి; అంతకంటె నేను అసలే అడుగలేకపోతిని; పాడుసిగ్గు. నిన్నసాయంకాలము అట్లా వీధిలోకి వెళ్లినప్పుడు ఎట్లాగో మనసును గట్టిపరచుకొని మీఅన్నయ్యతో చెప్పినాను; కాని; ఆయన 'నాయనగారితో అనకపోయినావా, నాతో చెప్పితే ఏమి లాభము, నామాట వింటారా? అయినా చెప్పిచూస్తాను' అన్నాడు. అడిగితే ఆయన అడుగవలసినదే గాని నే నడుగలేను సుమా! నాకు అసలే మీనాయనగారిని చూస్తే భారు! ముఖము చాటుగా ఉన్నప్పుడు ఏదయినా ఉత్తరాలలో వ్రాస్తే వ్రాయగలను గాని ఎదట బడితే మెదలలేను. మీనాయనగారికి మీమీద వెఱ్ఱిప్రేమసుమా! మీమీద అంటే కూతుళ్లమీదనే, కొడుకులమీద అంతలేదు. కూతుళ్లను పంపించండి అని అడుగకుండా ఉంటే అల్లుళ్లమీదకూడా అంతప్రేమ ఉంటుందిగాని ఆమాట వస్తేమాత్రము బెదుస్తుంది. ఇక నాకు సెలవులేదు. అదీ కాక ఇంటిదగ్గర మాఅమ్మ ఒక్కర్తే ఉన్నది. రేపు వెళ్లక తప్పదు. నిన్ను విడిచి వెళ్లడానికి కాళ్లాడడము లేదు. ఎట్లాగయినా తీసుకొని వెళ్లవలెనని ఉన్నది." అని శ్రీరామమూర్తి మధ్యాహ్నము భోజనమయినతర్వాత పడకగదిలో కూర్చుండి తాంబూల మియ్యవచ్చిన ప్రేయసి కో సీతతో ముచ్చటించెను.

ఎదట ఎవరూ లేకుండుటను చూచి సీత గదితలుపు ఓరవాకిలిగా వేసి కవటాకులను

చిలుకలుగా చుట్టి వ్రేళ్లకు పెట్టుకొని ఒక్కొ-



క్కటిగా వల్లభునిపల్లు మొగ్గలకు అందిస్తూ ఈవిధముగా బదులు చెప్పెను. "నిన్న మీ రిట్లా అడిగినారని మాఅన్నయ్య ప్రొద్దున నాన్నగారితో అన్నాడు."

శ్రీరామ:—ఏమిటీ! బావ అడిగినాడూ! మీనాన్నగారేమన్నారు? మీఅమ్మగారేమన్నది?

సీత:—నాన్నగారు కసురుకొన్నారు. 'ఇప్పుడేమిటోయి పంపించడము? అయినా నీ వడగడమేమిటి? నీకు బదులు చెప్పడమేమిటి, పోపొమ్మని;

శ్రీరామ:—మీ అమ్మగారేమన్నారు?

సీత:—మాఅమ్మ మీపక్షము మాటాడింది. "ఎందుకు అట్టా కసురుకొంటారు బావ మరిదిచేత అడిగిస్తే తప్పువచ్చిందా యేమిటి? ఎట్లాగూ పంపక తప్పుతుందా? ఇంకా వారంరోజులలో చిన్నమ్మాయిపుట్టినదినము పండుగ వస్తున్నది. అది అయినతర్వాత పంపిస్తానని చెప్పండి" అన్నది. "కార్యమయి వడ సారం ఆర్నెల్లు కాలేదు. ఎవడు చెప్పాడే! ఇప్పుడే పంపించమని! ఛట్! వల్లకాదు. ఆ మాట ఇప్పుడు ఎత్తరాదు. కొన్నాళ్లదాకా పంపించడానికివీలే లేదు. పసికూనను పంపిస్తుందట పదిరోజులైనతర్వాత!" అని నాన్నగారు మరింత గద్దించినారు గాని, మా అమ్మ నిమ్మళంగా తప్పించి ఎట్టాగో సర్ది మీతో ఈవిషయము చెప్పమని మాఅన్నయ్యతో చెప్పినది. పదిరోజులయినతర్వాత పంపిస్తానన్నది. కాని మానాన్నగారికి ఇష్టములేదు."

శ్రీరామమూర్తి ముఖము చిన్నబుచ్చుకున్నాడు. కటకట పడ్డాడు. ఏమి చెయ్యగలడు! ఆలోచించినాడు. తోచలేదు. 'సరే— ఇంటికి వెళ్లి నేనూ, గట్టిగా ఉత్తరము వ్రాస్తాను. ఇంతకంటె ఏమి చేసేది.' అనుకొన్నాడు.

పంజరములో చిలుక కిలకిలలాడింది. మూన్నాళ్లనుండి దానిముచ్చటలతో కూడా కొంత వినోదము అతనికి కలుగుతూ ఉండేది. శ్రీరామమూర్తి కిప్పుడు సీతను వదలి వెళ్లడమే కాక చిలుకను వదలి వెళ్లడముకూడా దుస్సహమే అని తోచినది.

శ్రీరామ:—నీవియోగదుఃఖము నాకు దుస్సహముగా ఉంటుంది. ఇంటికి వెళ్లిన తర్వాత కాలక్షేపము ఎట్టాగో నాకు తోచ లేదు. నీపలుకులకు బదులు చిలుకపలుకు

లయినా వింటూ ఉంటే కొంతఉబుసు పోకగా ఉంటుందేమో! దీనిని తీసుకు వెళ్లుదునా? దీనిని తీసుకువెళ్లడానికి మాఅత్తమామలపె త్తన మక్కర లేదుగద!

సీత:—మీసంతోషముకంటె నా కింక కావలసిన దేమున్నది? తప్పక తీసుకొని వెళ్లండి; కాని దానితో వినోదము కుదిరి నన్ను మరచిపోతారేమోనని దిగులుగా ఉన్నది. మళ్లీ ఎప్పుడు వస్తారు? ఎపుడు వస్తారో? నన్ను కూడా తీసుకువెళ్లుదురూ!

శ్రీరామ:—కన్నుల నీరు కమ్మగా— "ఏమి చెప్పేది. ఉత్తరము వ్రాస్తాను గదా? ఇప్పుడెట్టా తీసుకువెళ్లడము? నీ వేమయినా అడిగి ఏర్పాటుచేయగలిగితె సరే! నేను గట్టిగా పట్టుపట్టి అడగలేను."

అంతలో బావమఱది సావడిలో 'బావ ఎక్కడున్నా' డని విచారించడము విని శ్రీరామమూర్తి గదిలోనుండి బయటికి వచ్చెను.

శ్రీరామమూర్తి ఒక్కడే వెళ్లేటట్టు ఏర్పాటయినది. అల్లుడు బదు లాడక అంగీకరించి నందులకు మామగారు మహానందభరితులయినారు. కూతుర్ని పంపండి అని కోరినపుడు పుట్టినతలపులన్నీ యిపుడు తలక్రిందులయినవి. అంతకుముందు పదిపండ్రెండురూపాయలదోవతులచాపు కట్టబెట్టదలచు కొన్నవారు ఏబదిరూపాయలపట్టుత్తరీయము పట్టంచుధోవతి, కట్టనిచ్చినారు. రైలుచార్జి క్రింద పాతికరూపాయ లిచ్చినారు. ఊరినుండి పది మైళ్లు ఎద్దుబండిమీద వెళ్లి తర్వాత రైలెక్కవలెను. తెల్లవారుజామున ఏకారణము చేతనైనా బండివాడు పాలుమాలి బండి తోలుకొని రాకపోతే ప్రయాణము మొండి పడిపోతుందేమో, మళ్లీ కూతుర్ని పంపండని అల్లుడు అడిగిపోతాడేమో నని దిగులుచేత మామగారు సాయంకాలానికే బండి తెప్పించి వాకిటిముందర ఊడదీయించినారు. ఆబండిని జూచి, శ్రీరామమూర్తి, సీత, కంటతడిపెట్టుకో సాగించినారు. అవతల ఉద్యోగపు తొందర మొదలయినచిక్కులు ఎట్లా ఉన్నా శ్రీరామమూర్తి అప్పుడు ఏదయినా కారణము ఏర్పడి ప్రయాణము నిలిచిపోతే బాగును అనుకొంటాడు.

ఊరుమిరపకాయలు, బుడమదోసకాయలు, మక్కజొన్నకండెలు, మొదలయిన తినుబండారములు మూటకట్టినారు. ప్రయాణము సర్వసిద్ధమయినది. రాత్రి శ్రీరామమూర్తికి, సీతకు, కలిగినవిచారము ఎట్టిదో ప్రాయపుదంపతులు కొంతయినా తెలుసుకోగలరు. తెల్లవారుజామున బండి సిద్ధపరిపించి మామగారు అల్లుని పిలిచినారు. నాలుగు పిలుపులు పిలిచినతర్వాత నిద్ర మెలకువ నటిస్తూ కన్నులు నులుముకొంటూ ఉన్నట్టు కన్నీరు తుడుచుకుంటూ, శ్రీరామమూర్తి చిలకపంజరము చేత పుచ్చుకొని గదిలోనుండి బయటికి వచ్చినాడు.

గదిలోనుండి వచ్చేటందుకు ముందు ఆతడు, సీతచీరచెంగున ఏదో ముడివేసి తర్వాత చూచుకొమ్మని చెప్పెను. కార్యము నాడు కట్టినట్టు బంగారమేమో కట్టినా రనుకొని సీత కన్నీరుకారుస్తూ 'మీదగ్గిరే ఉంచు



ఊడదీస్తూ, సీతతండ్రి సావడిలోఉండగా టపా బంట్రౌతు సుబ్బయ్య 'ఉత్తరాలు,ఉత్తరాలు' అని కేక వేసుకొంటూ వచ్చి ఉత్తర మిచ్చిపో యినాడు. బంట్రౌతుకేక విని వచ్చి సీత ఉత్త రము కేసి చూస్తూ తండ్రి ఊడదీసినతాళ్లను

కొంచి, నా కిప్పుడు సొమ్మెందుకు, వద్దు వద్దు.' అని చెప్పి విప్పబోయినదిగాని, 'అదికాదు, తర్వాత చూచుకొమ్మని శ్రీరామమూర్తి కన్నీరుతుడుస్తూ చెప్పలేక చెప్పలేక, చెప్పి మరీ బయటికి వచ్చినాడు. తెల్లవారవస్తున్న దని తొందరపరిచి ప్రయాణము చేయించి మామగారు ఊరిబయటిదాకా బండి సాగ నంపి మరీ యింటికి వచ్చినారు.

ఆతర్వాత సీత ముడి ఊడదీసి చూచు కొన్నది. కాకితము ఉన్నది. అందులో ఈ క్రిందిపద్యా లున్నవి.

క. కలికీ! చిలుకల కొలికీ!
చెలువమ్ములు చిలికి తేర్చి చేర్చిన వెన్నా!
చెలి మిన్నా! బలవంతపు
వలవంతను బొలుపఱుతువా నను? సెలవా?

క. రిక్కలరాయనిచెలువపు
ధిక్కారమ! ముద్దుగుమ్మ! తేనియసోనల్
చిక్కనువా తెలి చుక్కని
చుక్కా! నిన్నెపుడు మరలఁ జూచెదనొక్కా!

౨

పూర్వదినము చిన్నకూతురు పుట్టిన దినముపండుగకు కట్టిన ఉయ్యాలతాళ్లను,

చుట్టిపెట్ట మొదలు పెట్టింది. ఉత్తరము తెరచి సగము ముప్పాతిక పాలు చదివి ఆయన విసరి పుచ్చుకొని దూరముగా పారవేసి మొగాన గంటుపెట్టుకొన్నాడు. ఇంతలో ఆయనకుమా రుడు వచ్చి ఉత్తరము ఎత్తి పుచ్చుకొని, తల్లి దగ్గిర చదువుటకు లోనికి తీసుకొనిపోయెను. అయిదారునిమిషాలయినతర్వాత ఆగ్రహ వికారము అణచుకొని లోనికిపోయి భార్యా పుత్రులయెదుట ఈ క్రిందివిధమున ఆయన మాటాడెను.

"ఏమే! అల్లుడుగారు వ్రాసిన ఉత్త రము విన్నావా? చిలక బెంగపెట్టుకున్న దట! ఆహారము తినడము లేదట! అందుకని దానిని పెంచుతూఉన్న అమ్మాయిని వెంటనే పంపవలెనట! లేదా చిలుకను వెంటనే తీసు కొనివెళ్లనైనా వెళ్లవలెనట! నక్కజిత్తులు! ముఖము యెదుట నత్తురు నత్తురుమని ఊరు కుంటాడు! మొగము చాటుచేసుకుని ఉత్తరా లలో చూపిస్తాడు పాండిత్యము అంతాను. ఈ పదిరోజులలోనే యింత పన్నుగడ పన్నుతా

డనుకొంటే, అన్నిరూపాయలు కర్చుపెట్టి కట్టుబట్టలు అవీ కొనియిచ్చేవాణ్ణటే! అవీ కాజేశాడు. మళ్లీ ఆటా సాగించాడు. వీణ్ణి చిలక నెవ్వడు తీసుకు వెళ్లమన్నాడు? ఈఎత్తు లెవ డెత్తమన్నాడు? నిజమే వ్రాయరాదూ? చిలకనెపమెందుకు? చిలకకథే నిజమయితే మరేమీ ఫరవాలేదులే! నాలుగురోజులు పోతే అదే అలవాటు పడుతుంది. ఇట్లాగనే బదులు వ్రాస్తాను. కన్నులలో మెదలుతూ ఉండే కన్నతల్లిని విడిచి నేనుండగలనా? నన్ను విడిచి మాఅమ్మాయి ఉండగలదా?"అని కన్నీరు తెచ్చుకొనెను!

కుమారుడు:—నాన్నా! మీ ర న్న మాట నిజమే! బావ అమ్మాయిని పంపండని బాహాటంగా వ్రాయలేక చిలకమీద నెపం పెట్టి ఉత్తరము వ్రాసినాడు. అతనిసిగ్గరితనమును గుర్తించి మీరు అమ్మాయిని పంపిస్తే బాగుంటుంది. నాలుగురోజులు పోతే బెంగ తీరి చిలక అలవాటుపడుతుందని మీరంటిరి గదా! అట్లాగే నాలుగురోజులు పోతే మీకూ బెంగతీరుతుంది. అలవాటవుతుంది. అమ్మాయికీ అంతే;

తండ్రి:— ఓరీ! నీవెక్కడపుట్టావురా నాకూ! ఏతి అంటే పైతి అంటావు!

అంతలో కోడలు వచ్చి మామగారు చూడకుండా భర్తకు ఏదో సూచించి పని మిషమీద ఆప్రక్కనే నిలుచుండెను.

కొడుకు:—కాదు నాన్నా! ఆన్నెల్లయినా అమ్మాయిని పంపడానికి అభ్యంతరము చెప్పడము బాగుండలేదు. కబుర్లమీద కబుర్లు కురిపించి నెలలోనే కోడలిని మనము తీసుకు వచ్చినామా లేదా? అది తలుచుకోవద్దా?

తండ్రి:—ఓరిదుర్మార్గుడా! 'కోడల్ని వెంటనే ఎందుకు తీసుకురావడము? వద్దు. కొన్నాళ్లు పుట్టింటనే ఉండనివ్వమని అప్పుడనక పోయినావట్రా! నీ బులపాటాన్ని పట్టికాదూ నే నప్పుడు అన్నికబుర్లు పంపింది; తీసుక వచ్చిందీని! అది నా కిప్పుడు తంటా అయినదీ?

కొడుకు:—నాన్నా! అప్పుడు నాబుల పాటాన్ని బట్టి మీరు తీసుకువచ్చినట్లే, ఇప్పుడు బావబులపాటాన్నిబట్టి పంపించండని కోరుతున్నాను.

తండ్రి:—ఛా! పో! పిల్లకాకి కేమి తెలుస్తుంది. నీముఖము! నీవు చెప్పేదేమిటి! నేను వినేదేమిటి!" అని తుటారించి భార్యనుచూచి.. ఏమిటే! ఏమంటావు? నీవుద్దేశ మేమిటి? మాటాడవు. నేను నిన్నడిగితే వీడేమో బదులు చెప్పవస్తాడు.

భార్య:— న న్నేమి చెప్పమంటారు! మీయిష్టము. నే నేదైనా చెప్పితే కొడుకుకు తగిలినచీవాట్లే నాకూ తగుల్తవి. మీరు ఎదటివాళ్లను గురించి మాట్లాడేటప్పుడు మిమ్ము మరచిపోతారు. చచ్చి స్వర్గాన ఉన్నాడు మానాయన; అనేవాడు మిమ్మల్ని "నాయనా! నీకడుపునకూడా నాలుగుకాయలు కాస్తే నే గాని తెలియ"దని. ఆయన ఆశీర్వచనము ఫలించినది. నన్ను కార్యమయినతర్వాత మూడునిద్రలు అయినతోడనే ఈడుచుకు వచ్చారు. జ్ఞాపకమున్నదా? నన్ను చిన్నప్పటి నుంచీ పెంచిన పెద్దముండ మానాయనమ్మ

## శ్రీరామపంచాయతనము



శ్లో. వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే, మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్;
అగ్రే వాచయతిప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం, వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే
[శ్యామలమ్.

Lakshmi Art, Bombay, 8.

మంచంమీద ఉండగా 'నాయనా! ముసలమ్మ స్థితి చూచుకుని పదిరోజులయినతర్వాత పంపిస్తా'నని మానాన్న చెప్పుతూ ఉంటే ససేమిరా అని పట్టుపట్టి తీసుకు వస్తిరి. మరచిపోయినారా యేమిటి? సరే! ఆకాలము ఆకథ వెళ్లిపోయింది. ఇప్పు డెందుకు! చిన్నవాళ్ల ప్రేమలు చిన్నవాళ్ల మనస్సులు కొంత ఆలోచించుకోవద్దా! ఆచిన్నవాడు ఎదుట అడగలేక వెళ్లి ఉత్తరము వ్రాసినాడు. మీవంటివాడే అయితే అప్పుడే పట్టుపట్టేవాడు. నన్నడుగుతున్నారుగనక చెప్పుతున్నాను పంపడం మంచిది. ఆతడు కోరినప్పుడు మనం పంపితే మనం కోరినప్పుడు పంపడానికి అతనికీ బుద్ధి పుట్టుతుంది. ఎట్లాగూ వాళ్ల బిడ్డగాని మనబిడ్డగాదు గదా!"

తండ్రికి అల్లునిమీద ఆగ్రహము, కూతురుమీద కూర్మి, చిడిముడిపడినవి. సీతను చేరబిలచి దగ్గరకూర్చుండబెట్టుకొని కన్నీరు నించుకొనెను. సీత వెక్కి మొగము పెట్టెను.

"నామాట కేమి గాని, పసికూన! ఎట్లా పంపేది. వెళ్లి ఉండగలదా! బిక్కముఖం పెట్టినది. ఏమయినా సరే ఇప్పుడు పంపను" అంటూ తండ్రి సీత నడిగెను—అమ్మా! నీవేమంటావు?

సీత:—(పెదవులు అదరగా)ఇప్పు డేదో సాహసించి అనకపోతే చెడుతుందని లోన అనుకొని, "నాన్నా! చిలక ఏమయిపోతుందో!—" అంటూ యింకా ఏదో చెప్పనున్నదిగాని తండ్రి కీక చెవి కెక్కేటట్టు లేదయ్యెను. కోపము వచ్చినది. ప్రేమ పరిణామము మనస్సులో తట్టినది. చట్టుమని లేచినాడు. "సరే! రేపో యెల్లుండో మంచిరోజు చూచి ప్రయాణం చేసి దిగవిడిచి రండయ్యా తల్లీ కొడుకూను;" అంటూ కిఱ్ఱుచెప్పులు తొడుగుకొని కఱ్ఱచేతపుచ్చుకొని "పాలానికి పోతున్నా"నని భార్యతో చెప్పి బయటికి వెళ్లినాడు. మూడు రోజులు అయినతర్వాత అల్లె అంపించినారు.

గీ. ఉభయవంశలలామ మయ్యుత్పలాక్షి
యత్తవారింటి కరిగెడునవసరమున
మాతృజనకసఖీజనభ్రాతృవిరహ
మధిపతిప్రేమజలరాశి కార్వ మయ్యె.

శృంగారనైషధము.

3

సీత వచ్చి పదిరోజులే అయినదిగాని యింతలోనె చిక్కి సగమయినది. కడు గారాబముతో కన్నులలో కప్పుకొని పెంచిన తల్లిని తండ్రిని విడిచి వచ్చినదుఃఖ మాచిన్నదానికి దుస్సహముగా ఉండెను. ఒంటరిపాటున పులుకుపులుకున ఏడ్చును. భర్త చేరవచ్చినప్పుడు కొంతసమ్మాళించుకొనునుగాని ఒక్కొక్కప్పుడు అక్కడకూడ కన్నీరు కార్చుచుండును. ఈవైక్లబ్యము చూచి భర్త తెపుచుగా ఇట్లు బెదరించుచుండెను. "నీవు మిక్కిలి దుఃఖిస్తున్నావు. 'కడుపునిండ ఆహారముకూడా తినడము లే'దని మాఅమ్మ అంటున్నది. మీ నాయనగారికి వ్రాస్తాను. వచ్చి తీసుకువెళ్లవలసినదని; నీవిట్లాదుఃఖిస్తూ ఉంటే నా కేమి ముచ్చట గనుక! పుట్టినింటిదగ్గిరనే దిగులు లేకుండా ఉందువుగాని." ఈమాటలకు సీత మరింత దిగులంది చితికి పోతూ ఉన్న చిత్తమును చేరదీసుకుంటూ ఉండెను. తండ్రిని

చూడవలెనని కోరిక ఉన్నదిగాని, ఆయన వస్తే తన్ను పుట్టినింటికి తీసుకువెళ్లుతాడనిన్నీ అదితనభర్తకే కాక తనకుకూడ దుస్సహామే అనిన్ని ఆచిన్నది తెలుసుకొన్నది. తల్లిదండ్రులనువిడిచి వచ్చుట ఎంతవిచారకరముగా ఉన్నదో, భర్తను విడిచి వెళ్లుట అంతకంటె హెచ్చుగా విచారకర మవునని ఆచిన్నదానికి అప్పుడు బాగా తెలిసివచ్చినది.

ఒకనాడు ఉదయము తొమ్మిదిగంటల వేళ సీత దొడ్లో ఏదో పని చేస్తూ ఉండగా అత్తగారు వచ్చి 'పిల్లా! మీనాయనగారు వచ్చినారు. అల్లుడూ మామా సావిట్లో ఏమో బిగ్గరగా మాటాడుకుంటున్నారు" అన్నది.

అదివిని సీత చీకాకుపడి తొందరగా దొడ్డిదోవను గదిలోనికి వచ్చి తలుపుచాటున నిలిచి వారిమాటలు వినెను. అప్పటి వారి మాట లివి:—

మామ:—ఎవడు చెప్పినాడోయి నీకు? వచ్చినపదిరోజులలోనే అటువంటి ఉత్తరము వ్రాయమని? అంతతొందరా? కష్టసుఖాలు ఆలోచించ అక్కరలేదా? కన్నమోహము, కడుపుతీపు, ఎట్టిదో నీకిప్పు డెట్టా తెలుస్తుంది? వచ్చి తీసుకువెళ్లవలసినదని కూడా ధిమాకా?

అల్లుడు:—అంతకంటె ఏమి చేయుటకూ నాకు తోచలేదు. నాదగ్గర ఉన్నదన్నసంతోషము నా కేమీ లేదాయెను. ఆహారము తినదాయెను. కన్నులనిండా నీరు తెచ్చుకొని బిక్కచూపులు చూడడము, పలుకరిస్తే పలుకకపోవడము, చూచేటప్పటికి ఏమవుతుందో అని నాకు దిగులు తోచింది. ముచ్చటా అచ్చటా లేక చిక్కి చీకాకయి, చెడుతూ ఉంటే ఏమి చేసేది? ఆతర్వాత ఎందుకు తెలుపలేదని మీ రేమన్నా అంటా రేమో అని కూడా తోచింది. అక్కడ మీరు అంత ప్రేమతో పెంచుకొంటిరి. నాకెందుకు ఈ దుఃఖము? మీ కెవరయినా వచ్చి తీసుకువెళ్లుతారని అట్లా వ్రాసినాను.

మామ:—"పదిరోజులు అలవాటుపడితే బెంగతీరదూ! దాని కంత తీవ్రముగా వెంటనే రావలసినదని వ్రాయవలసినదేనా? ఇందుకోసమే కాబోలు నీవు కోని తెచ్చుకొన్నది! సరే నాయనా! నీయిష్టప్రకారమే జరిగి స్తినిగదా! ఎట్లాగూ పిల్లనిచ్చుకొన్నతర్వాత వంగివంగి సలాములు చేయవలసినదే!" అంటూ అక్కడ నుండి లేచి, కూతుర్ని చూచుటకు కాబోలు అయన లోపలికి వెళ్లెను. సీత గదితలుపుపై చిటిక వేసి కదల్చెను. శ్రీరామమూర్తి గదిలోని కరిగెను. తెలికన్నులు తేలవేసి కన్నీరు నింపగా, పెదవులు అదరగా డగ్గుత్తికతో సీత మగనిచేతులు రెండూపట్టుకొని యిట్టు పలికెను.

సీత:—"నన్నా! నన్నేనా! పుట్టినింటికి పంపివేస్తారా? నేనుపడుస్తున్నానని, వచ్చితీసుకువెళ్లవలసినదని, మానాన్నకు ఉత్తరము వ్రాసి పిలిపించినారా? నావల్ల మీకు ఆనందము కలగడములేదా? అప్పటికీ మీకు వ్యాకులత కలుగుతుందని నేను ఎంతో బెంగదిగమింగు

కొని ఉంటూ ఉంటే"— పుటపుటకన్నీరు జారెను. పయిని పలుకజాలదయ్యెను.

శ్రీరామ:—"కలికీ! చిలుకమాట నేను చెప్పితే నీమాట అనుకొని ఉలికి పడితివిగదే! నిన్ను పిలిపించుకొనేటందుకు చిలుకమీద మిషపెట్టి నేను వ్రాసినఉత్తరము మాటగదే మేము ముచ్చటించినది!" అని కన్నీరుతుడిచి చెక్కిలి పుడికెను అంత సీత ముఖము చిత్రముగా మారెను. వల్లభునిరొమ్ముమీద వ్రాలెను.

గీ. పెదవుడుల కుక్కి కడు దిగుల్పడినకొక్కెఁ
చేర్చి యతఁడట్టె చెయిచెక్కుఁ దార్చె నట్టె
వింతకళ తోఁచె మొగముపై వేడ్క పూచె
నెనరుఁ గన్నీరు రాలెఁ బన్నీరు వోలె.

---

# అభిలాష

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

పర్వతములందుఁ దిరుగాడ వానిశిఖర
కోటి వసియింప సెలయేళ్లఁ గ్రుంకులిడఁగఁ
గనఁగ నాయావిశేషముల్ మనసు పుట్టె
వారిదంబ! కొంపొమ్ము నీపైని నన్ను.

అలలపై నెక్కి తూఁగుటుయ్యాల లూఁగఁ
గడల వెలఁదుల గీతరాగములు వినఁగఁ
బూలతీవల శయ్యంప బుద్ధి గలిగె
మారుతంబ! కొంపొమ్ము నమస్కరింతు.

ఆకసమునందుఁ బడి వలయములు దిరుగఁ
బల్లటీల్గొట్టుకొంచును బరుగు లెత్తఁ
గొమ్మలందునఁ గూర్చుండి కూయ బుద్ధి
గలదు కొనిపొందు నన్నుఁ బతంగంబులార!

తారకాబృంద మండలోద్యానమందు
సమ్మృగముతోడసీతోడనిత్యమాడు [దిరుగ
కొనుచు గంగలోఁ బడి యీఁదుకొనుచుఁ
మనసుగానుండెఁ గొనిపొమ్ము నను మృగాంక!

శయితదయితునిముద్దాడు ప్రియయువతినిఁ
దన్నుఁ దలఁచుచుఁ గూర్చుండియున్నతన్వి
వెనుకగా వచ్చి గిలిగించు ప్రియునిఁ గాంచ
నాశ గలదు కొంపొమ్ము యనంగ! నన్ను.

---

# శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యుల చరిత్రము

శ్రీ. బ్ర. కోటీశ్వరశర్మ శాస్త్రి గారు

౧

కేరళ దేశమునందు గల 'కాలటి' యను అగ్రహారమునందు దాదాపు ౨ వేల సంవత్సరముల క్రిందట 'విద్యాధిరాజు' అను సార్థకనామకుఁ డగు పండితోత్తముఁ డుండెను. అతనికి శివగురుఁడను పేరు గల పుత్రుఁడు జన్మించెను. ఆ శివగురువునకు ఆర్యాంబ యను ధర్మపత్నియందు శివాంశచేత పుత్త్రుఁ డొక్కఁడు జన్మించెను. శంకరుని యనుగ్రహముచేత జన్మించినవాఁడు కావున శంకరుఁ డని పేరు పెట్టిరి. ఇతఁడే మన కథానాయకుఁడు. ఈ శంకరుఁడు బాలుఁడుగా నున్నప్పుడే సాముద్రికశాస్త్రమునందు మహాపురుషలక్షణము లని చెప్పఁబడిన చిహ్నము లన్నిటిచేతఁ జూపఱులకు సంతోషమును గలుగఁజేయుచుండుటచేత (శం=సుఖమును, కరుడు=చేయువాఁడు కావున) శంకరుఁ డను పేరితనియెడ సార్థక మాయెను. శిరమున బాలేందురేఖయు ఫాలమున నేత్రచిహ్నము భుజశిరములందు శూలరేఖలును గలిగియుండుటచేతఁ జూపఱు లంద ఱీబాలకుఁడు పరమేశ్వరావతారమని తలంచుచుండిరి.

శంకరుఁడు తనబుద్ధివైభవమును దివ్యమయినప్రతిభను బాల్యమునుండియే చాటుచుండెను. మొదటిసంవత్సరమున స్వభాషయం దక్షరముల గ్రహించెను. రెండవయేట వ్రాసినవ్రాఁతలఁ జదువ నేర్చెను. మూఁడవయేటఁ గావ్యపురాణములను సకలదేశభాషాలిపులను గ్రహించెను. గురువు లొకసారి చెప్పిన విషయము శిలాక్షరమువలె బాలకుఁడు గ్రహింపఁ జొచ్చెను. బాలకుని బుద్ధిసూక్ష్మతకు సంతసించి మూఁడవయేట కాలకర్మ నొనర్చిరి. బాలకుఁడు చిన్నవాఁ డయినను అతనియుక్తులకు నెంతటిపండితు లయినను సమాధానము చెప్పఁజాలకుండిరి. చాల మయినపిదప "పంచమే బ్రహ్మవర్చస కామస్య" యను న్యాయానుసారము ఉపనయనము చేయవలయునని శంకరుని జనకుఁడు ఉవ్విళ్లూరు చుండెను గాని దైవ మిందుల కోర్వక శంకరునితండ్రిని మృత్యులోకమున కాహ్వానించెను.

అనాథయగు శంకరునితల్లి బాలుఁడగు పుత్త్రుని సంరక్షణాదులందు జాగరూకత గలదై యైదవయేట మంచిలగ్నమున నుపనయన మొనర్చెను.

తరువాత గురుకులవాసముచేసి ౪ వేదములను షడంగసహితముగ నతిస్వల్పకాలమున నధ్యయన మొనర్చెను. ఒక్కొక యాచార్యుఁడు తనజన్మమంతయు విద్యార్జనమునకు వినియోగించి చదివినవిద్య యంతయు శంకరుఁడా యాచార్యులకడ రెండుమూఁడు మాసములు చదివి ఆయా యాచార్యులతోడ సమానపాండిత్యమును గడించుచుండెను. నాల్గువేదములు, షడంగములు, షడ్దర్శనములు చతుష్షష్టికళలు వీనియం దపారమయిన పాండిత్యమును గడించెను. శంకరుఁడు గురుకులమునం దుండి విద్యాభ్యాసము చేయుచు భిక్షాన్నము తెచ్చుకొనుచు భుజించుచున్నప్పు డొకసంఘటనము జరిగెను. దానివలన శంకరుఁడు దైవాంశగలవాఁ డనువిషయము స్ఫుటమాయెను. అది యేదనఁగా ఒకనాఁడు శంకరుఁడు భిక్షార్థియయి ఒకానొకబీద బ్రాహ్మణు నింటికిఁ బోయెను. భిక్షార్థియై వచ్చిన బ్రహ్మచారికి భిక్ష నొసంగనియెడల రౌరవాదినరకములు కలుగునను ధర్మశాస్త్రసిద్ధాంతము నెఱింగిన యా బ్రాహ్మణునిభార్య శంకరుని జూచి "నాయనా మేము దైవవంచితులము. నేను నీ కొక యన్నకబళమునైనను పెట్టుటకు గతిలేక యున్నాను. నేను బ్రతికిన నేమి? చచ్చిన నేమి?" యని డగ్గుత్తికతో పలుకుచుఁ గన్నుల నీరు గ్రమ్ముచుండఁగా నింటి నాలుగు మూలలయందు వెదకఁగా గనంబడిన ఉసిరికకాయను తెచ్చి శంకరునిజోలెయందుఁ బడవైచెను. దయాళువగు శంకరుఁడు ఆపతివ్రతయొక్క దీనవాక్యము విని హృదయము కరగినవాఁడయి అక్కడ నిలువంబడి కమనీయ

పదవిలసింతంబులగువృత్తములతో శ్రీమహాలక్ష్మిని స్తుతించెను. దీనికే "కనకధారా స్తవ"మని పేరు. ఈస్తోత్రము రచించినపిదప దేవి ప్రత్యక్షమయి యాపతివ్రతారత్నము యొక్క గృహమంతయు బంగారు ఉసిరికకాయలచేత నింపఁజేసి యంతర్ధానమాయెను. ఆవిచిత్రము గాంచిన వారందఱు నాతని దేవాంశసంభూతునిగాఁ దలంచిరి. ఇటులు శంకరుఁడు ఏడవ సంవత్సరమునందే సకలవిద్యాపారంగతుఁడయి సర్వానుజ్ఞాతుఁడయి నిజగృహంబునకు వచ్చి తల్లికిఁ బరిచర్యఁ జేయుచుండెను. ఆయల్పవయసునందుఁ గలశంకరుని పాండిత్యము, ఆశ్రమనియమపరాయణత్వము, దేవబ్రాహ్మణవిశ్వాసము, పెద్దలయెడ వినయము మున్నగునవి గాంచి వయోజ్యేష్ఠులగుశ్రోత్రియులు సైతము ఎదుర్కొన్నప్పుడు దోసిలియొగ్గి గౌరవించుచుండిరి. వృద్ధయగు తల్లి యొకనాఁటిమధ్యాహ్నము స్నానార్థము నదికిఁ బోయి స్నానమొనర్చి యింటికి మఱలివచ్చుచుఁ ద్రోవలో నెండదెబ్బకుఁ దాళలేక సొమ్మసిలి క్రిందఁ బడిపోయెను. మాతృదేవుఁడగు శంకరుఁడు తల్లికి శీతలోపచారము లొనర్చి సేదదేర్చి గృహంబునకు జేర్చినవాఁడయి తనతపఃప్రభావమువలన నది గృహసమీపముగాఁ బ్రవహించునటులు చేసెను. సకలవిద్యాపారంగతుఁడగు తనయునకు వివాహము చేసి ఒకయింటివానిని జేయవలయునని తల్లిసంకల్పించఁగా యెందఱో కన్యాజనకులు 'మే మిచ్చెదము మేమిచ్చెదము' అని యింటిచుట్టును దిరుగసాగిరి. కాని శంకరుఁడుమాత్రము వివాహముచేసికొనుట కిష్టపడక సన్న్యాసాశ్రమము స్వీకరించుట తన కభిమతమని తల్లితో మనవిచేసికొనెను. లేక లేక ఈశ్వరానుగ్రహమువలనఁ గలిగిన పుత్త్రుఁడు పెండ్లాడి తనకులమును నిలుపునని, సర్వజ్ఞుఁడగు పుత్త్రుని జూచుకొనుచు భర్త గతించిన దుఃఖమును సైతము దిగమ్రింగుకొనియున్న ఆర్యాంబ పుత్త్రునిమాట నాలకించి చలించినహృదయముకలదయి 'నాయనా! నీవు పెండ్లాడి యజ్ఞయాగాదిక్రతువుల నొనర్చి సత్సంతానముఁ బడసి నన్ను బూడిదచేసి తర్వాత సన్న్యాసము తీసికొనుము. ఎంతయో తప మొనర్చి యీశ్వరానుగ్రహమువలన సర్వజ్ఞుఁడవగు నీవంటిపుత్త్రునిగన్న నాకుఁ దుట్టతుదకు దిక్కులేనిచావు చావవలసిన గతి పట్టునుగదా" యని కన్నులఁ గన్నీళ్ల ధారలు గారుచుండఁగాఁ బలుక నాచార్యులవారప్పుడేమియు బదులు చెప్పక మిన్నకుండిరి. కొన్నాళ్లకు శంకరుఁడు తల్లితోడ నదికి స్నానార్థము పోయి నదియందు స్నాన మొనర్చుచుండఁగా నొకమొసలి శంకరుని కాలుకరచిపట్టుకొని లోనికీడ్చుకపోవఁ బ్రయత్నించెను. శంకరుఁడులికిపడి 'అమ్మా! నాకాలును మొసలిపట్టుకొనియున్నది. నిమిషములో నాప్రాణముపోవును. సన్న్యసించినయి చచ్చిన మోక్షము కలుగును. లేదా! సన్న్యసము పునర్జన్మమువంటిది; కావున ఒకవేళ యీగండము తప్పిపోవునేమో' యని సకరుణముగా నాశ్రమస్వీకారమునకు ననుజ్ఞ నొసంగఁ బ్రార్థింప సన్న్యసిగానైనను దనపుత్త్రుఁడు బ్రతికియున్నఁ జాలునని ఆశ్రమస్వీకారమునకుఁ దల్లి యనుజ్ఞ నొసఁగెను. శంకరుఁడు "సన్న్యస్తం మయా" అని ప్రైషోచ్చారణము చేయఁగానే మొసలి శంకరుని కాలువదలి పాఱిపోయెను. అంతట శంకరుఁడు జలములనుండి బయటకు వచ్చి తల్లిని క్షేత్రియధనమును జ్ఞాతులకు నొప్పఁజెప్పి మీరు నిన్ను యావజ్జీవము నన్నవస్త్రాదుల మొసంగి పోషించి మరణానంతరము ప్రేతసంస్కారాదికృత్యముల నాచరించెదరని చెప్పఁగాఁ దల్లి యందుల కంగీకరింపక "నాయనా! తిండికయి నాకేమియు భయములేదు. నీవంటి సర్వజ్ఞుఁడగు నవతారపురుషుని గన్నందులకు నీచేతిమీఁదుగా మృతసంస్కారము జరుగనియెడలఁ బ్రయోజనమేమి? "పుత్రె మంత్యే చ కర్మణి" యని గదా పెద్దలు చెప్పుచున్నారు. ఆశ్రమధర్మవిరుద్ధమో కాదో ఆధర్మసూక్ష్మము నాకుఁ దెలియదు. నే నింతమాత్రమునకయినను నోచుకొనలేదు గదా!" యని డగ్గుత్తికతోఁ బలుకఁగా మాతృదేవుఁ డగు నాచార్యుఁడు నీయిష్టానుసారము" నీదేహసంస్కారమును నేనే స్వయముగ నాచరించెదననియు నీవెపుడు నన్నుఁ దలంచిన అప్పుడే నేను నీకడకు వచ్చెదననియు నీపద్దఱు నున్నప్పటికంటె దూరమున నున్నప్పుడే అధికముగ నిన్నొకకంటఁ గనిపెట్టి యుండెదననియుఁ దల్లికి మాట యిచ్చి అనుజ్ఞఁగైకొని బయలువెడలి అరణ్యమార్గమునఁ బోవుచుఁ గొంతకాలమునకు నర్మదానదీతీరమున గోవిందపూజ్యపాదులవారిని సందర్శించి కొనియాడి మోక్షార్థి నగునాకుఁ దత్త్వోపదేశమును జేయవలయునని ప్రార్థించెను. గోవిందపాదులవారు శంకరుని యల్పవయస్సును బుద్ధిని బ్రహ్మవర్చస్సును జూచి యోగదృష్టిచేత శంకరా

వతారునిగ నెఱింగి సంప్రదాయపరిపాలనార్థము 'తత్త్వమస్యాది మహావాక్యనిర్ణీత మగు అద్వైతబ్రహ్మతత్త్వము నుపదేశించెను. పిమ్మట నొకనాఁడు గోవిందపాదులవారు సమాధియం దుండఁగా వర్షాకాలము కనుక నర్మదానదిరెండుగట్టులు పొర్లునటులు ప్రవహించుచుండగా నదీప్రవాహధ్వని ప్రళయకాలగంభీరఘోషము వలె నుండెను. ఈధ్వనిచేత గురువులవారికి సమాధి భంగమగునని శంకరుఁడు తలంచి తనకమండలమును గైకొని నర్మదానదికడకుఁ బోయి కమండలుజలమును నదీప్రవాహముమీఁద బ్రోక్షించి అగస్త్యుఁడు సముద్రోదకమునంతయు నాపోశనమొనర్చినవిధముగాఁ బ్రవాహోదకమునంతయుఁ గమండలువునందు గ్రహించెను. తరువాత కొంతకాలమునకు సమాధినుండి గోవిందపాదులవారు లేచినవారై ఇతరులవలన శంకరుఁ డొనర్చినప్రవాహనిగ్రహరూపమగు నద్భుతకృత్యమును దెలిసికొని "నీ వద్వైతతత్త్వమును జక్కఁగా గ్రహించితివి. విద్యాపీఠమగు కాశీక్షేత్రమునుచేరి యచట ముముక్షువులకుఁ దత్త్వజ్ఞానమును బోధించుచుండుము. శ్రీవిశ్వనాథుఁడును వ్యాసమహర్షియు నిన్ననుగ్రహింతురు. మున్నొకకాలమున బ్రహ్మసూత్రములకు యథార్థమగుభాష్యమును రచింపఁగల మహానుభావుఁ డెవ్వఁడని వ్యాసమహర్షిని బ్రశ్నింపఁగా నీశిష్యులలో నెవ్వఁడు నదీజలమునంతయు తన కమండలువునం దిముడునటులు నొనర్చునో అతఁడే భాష్యమును రచింపఁగలఁడు అని వ్యాసమహర్షి నాకుఁ జెప్పెను. కనుక నీవే యందుల కర్హుఁడవు" అని పలుకఁగా శంకరుఁడు స్వగురువునకు నమస్కరించి యనుజ్ఞ గైకొని కాశీనగరమునకుఁ జేరి విశ్వేశ్వరసందర్శన మొనర్చి యచట నివసించి ముముక్షువులకుఁ దత్త్వోపదేశము సలుపుచుండఁగాఁ గొంతకాలమునకుఁ జోళదేశమునుండి సనందనుఁ డను పేరుగలశిష్యుఁడు వచ్చి చేరెను. ఇతనికే తరువాత పద్మపాదుఁ డను పేరు ప్రసిద్ధికి వచ్చెను. చిత్సుఖుఁడు, ఆనందగిరి మున్నగువారు పలువురు శంకరునకు శిష్యు లయిరి. వయోవృద్ధులగుశిష్యు లెందఱో శంకరుని చుట్టు చేరి తత్త్వజ్ఞానోపదేశమును బొందుచుండఁగా "చిత్రం వటతరో ర్మూలే వృద్ధా శ్శిష్యా గురు ర్యువా" యను దక్షిణామూర్తివర్ణనము స్ఫురణకు వచ్చుచుండెను.

శంకరుఁ డొకనాఁడు మాధ్యాహ్నికాహ్నికము నొనర్చుటకు గంగానదికిఁ బోవుచుండఁగాఁ ద్రోవలో నాల్గుకుక్కల వెంటనిడుకొని చండాలుఁ డొకఁడు నిలుచుండఁగా "గచ్ఛ గచ్ఛ" యని (త్రోవ తొలఁగి పొమ్మని) వానితో శంకరుఁ డనెను. అందులకుఁ జండాలుఁడు "శంకరా! నీవు తొలఁగిపొమ్మనిచెప్పునది దేహమునా! లేక చైతన్యమునా? దేహము నైనయెడల మన యిద్దఱిదేహములున్నూ అన్నమయములే గదా! చైతన్యము నైనయెడల మనయిద్దఱియందున్నది ఒకేచైతన్యమే కదా! నీవు సర్వజ్ఞుఁడవయియుండియు యతివేషధారివయియుండియు ఇటులపలుకవచ్చునా?" యని యనఁగా శంకరుఁ డాలకించి "నీ వన్నది నిజమే. శాస్త్రజ్ఞులు గలరు గాని పృథగ్భావనతో సర్వదా అట్టిసదాచరణముఁ గలవార లుండఁజాలరు. అట్టిపృథగ్భావనగలవాఁడు చండాలుఁడయినను బ్రాహ్మణుఁ డయినను వాఁడే నాకాచార్యుఁ డని నాయభిప్రాయము" అను అర్థముగల "చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషా మమ" అను మకుటముతో మనీషాపంచకమును చెప్పఁగాఁ జండాలదేహమునువదలి విశ్వేశ్వరుఁడు ప్రత్యక్షమయి "నీవు సర్వజ్ఞుఁడవు గనుక వేదవ్యాసమహర్షికృతబ్రహ్మసూత్రములకు భాష్య మొనర్చి ప్రచారము చేయు" మని పలికి యంతర్హితుఁ డాయెను. శంకరుఁడు విశ్వేశ్వరసందర్శనమువలన సంతుష్టుఁడయి ఈశ్వరాజ్ఞానుసారము సూత్రభాష్యాదికము చేయుటకు నిశ్చయించుకొని కాశీక్షేత్రమునుండి బయలువెడలి బదరికాశ్రమము చేరెను. ఆబదరికాశ్రమమునందుఁ దపశ్శీలురగుబ్రహ్మర్షు లనేకులతోడ నుపనిషచ్ఛాస్త్రసిద్ధాంతములఁ జర్చించి తత్త్వనిర్ణయమును స్థూణానిఖననన్యాయముచేత దృఢపఱుచుచు ని దశోపనిషత్తులు, భగవద్గీతలు, సనత్సుజాతీయము మున్నగువానికి భాష్యములను, ఉపదేశసాహస్రి మున్నగుగ్రంథములను రచించెను. అప్పుడు శంకరునకు ౧౬ సంవత్సరముల వయస్సు. శంకరుఁడు సనందుఁడు మున్నగుతనశిష్యులకు పనిషద్భాష్యాదిగ్రంథములను ప్రవచనము చేయుచుండెను. తనశిష్యులలో నతిసూక్ష్మబుద్ధియు భక్తశిఖామణియునగు సనందుఁడనుశిష్యునకు నాచార్యులవారు తమభాష్యగ్రంథములను ముమ్మారు సవిమర్శముగ బోధించిరి. ఈసనందుని

యందే గురువులవారికెక్కుడభిమానము చూపుచున్నారని తలంచి సనందునియందుఁ దక్కినశిష్యు లందఱు నీసు వహించి యుండఁగా ఆచార్యులవా రీసడి తెలిసికొని సనందునిగురుభక్తిని వారికిఁ దెలుపవలయునని భావించి ఒకనాఁడు నదియందు దివలియొడ్డునందుఁ దా నుండి యవతలి యొడ్డునందున్న సనందుని రమ్మని ఆచార్యులవారు పిలిచిరి. "అగాధజలమే యెటులు బోవునది" యని ఇసుమంతైన సంశయింపక నదియందు దిగి అవతలియొడ్డునకు నడచిపోవుచుండఁగా నీటియందు నొక్కొకపద్మము గనంబడుచుండెను. ఆపద్మములమీద కాలు పెట్టినడచుచు గురువులవారిసమీపమునకు సనందుఁడు వచ్చెను. ఈయద్భుతచర్య నచటగలశిష్యు లందఱు చూచి యది మొదలుకొని సనందునియందుఁ దామున్నూ భక్తిగలిగియుండిరి. నాఁటినుండి సనందుఁడు పద్మపాదుఁడని ప్రసిద్ధిని వహించెను. తరువాత పండితు లెందఱో ఆచార్యులవారి ఉపనిషద్భాష్యాదిగ్రంథములను ఖండించుటకయి వచ్చి వాదవివాదములు సలిపి యోడిపోయి శిష్యులయిరి. తరువాత పరమశివునియాజ్ఞానుసారము శారీరకభాష్యము (సూత్రభాష్యము)ను రచించి శిష్యులకుఁ బ్రవచన మొనర్చుచుండెను.

## వ్యాసశంకరసంవాదము

శంకరాచార్యు లొకనాఁడు గంగానదియందు స్నానము చేసి ఆహ్నికము చేసుకొని మణికర్ణికాఘట్టమున ఆఱునేలశిష్యులచేతఁ బరివేష్టింపఁబడినవాఁడయి శిష్యులకు భాష్యగ్రంథముల బోధించుచుండఁగా ఒకానొకముసలిబ్రాహ్మణుఁడు శంకరునికడకు వచ్చి "నీవేమో వ్యాససూత్రములకు భాష్యమొనర్చితివని ఇచటివారలు చెప్పఁగా విని నిన్ను గొన్నివిషయము లడుగుటకు వచ్చినాఁడను. నిజముగా వ్యాససూత్రార్థమును నీవెఱింగియే యున్నయెడల మూఁడవ యధ్యాయప్రారంభమునఁ గల "తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం" అనుసూత్రముయొక్కభావ మేమియో తెల్పుము" అని యడిగెను. తనకుఁ దెలిసినయర్థమును శంకరుఁడు వచించెను. ఆముసలిబ్రాహ్మణుఁ డనేకవిధములుగా శంకరుఁడు చెప్పినవిషయమును ఖండించెను. శంకరుఁ డాబ్రాహ్మణుని వాదము ఖండించెను. మఱల ఆబ్రాహ్మణుఁడు శంకరునియుక్తుల నన్నిటిని ఖండించెను. ఇటులు వారియుభయులకు నెనిమిదిదినములు వాదము జరుగుచుండఁగా సమీపమునందున్న పద్మపాదుఁ డాముసలిబ్రాహ్మణుని వ్యాసునిగా నెఱింగినవాఁడయి "గురువరా! మీరు సాక్షాచ్ఛంకరావతారులు. ఈబ్రాహ్మణోత్తముఁడు నారాయణావతారుఁ డగు వ్యాసభగవానుఁడు. మీ రిరువురు వాదించుచుండఁగా నే నేమిచేయఁగల"నని పలుకఁగా శంకరుఁ డాశ్చర్యపడి వెంటనే యాముసలిబ్రాహ్మణునకు వందన మొసఁగి "నాభాష్యము వ్యాససమ్మతమగునెడల స్వయముగా నిజరూపమున వ్యాసభగవానుఁడు నాకు దర్శన మిచ్చుఁగాక" యని పలుకఁగా నశిష్యుఁడయి వ్యాసుఁడు, దర్శనమొసంగి భాష్యమ్మునంతయుఁ బరికించి "నీ భాష్యము నాకు సమ్మతే"మని పల్కి శిష్యసమేతముగ నచ్చటనుండి వెడలి పోవుటకు వ్యాసుఁడు ప్రయత్నపడుచుండఁగా "మునిసార్వభౌమా! నే నెందులకు వచ్చినాఁడనో ఆకార్యము నెఱవేరినది. కొంతకాల మిచటనే యుండుము. నీసమక్షమున నీమణికర్ణికాక్షేత్రమున నీశరీరమును వదలఁదలఁచితిని" అని శంకరుఁడు పలుకఁగా" నీ వింకను దిగ్విజయ మొనర్చి యద్వైతసిద్ధాంతమును ప్రచార మొనర్పవలయును. నీకు మొదట

౧. ౮ సంవత్సరముల ఆయుస్సును ఈశ్వరుఁ డనుగ్రహించినాఁడు.

౨. నీవు నీశక్తివలన ౮ సంవత్సరముల ఆయుస్సును గడించితివి.

౩. మఱియు ౧౬ సంవత్సరముల ఆయుస్సును పరమేశ్వరుఁడు నీ కనుగ్రహించును.

అని పలుకుచు వ్యాసుఁ డంతర్ధానుఁడయ్యెను.

## దిగ్విజయము

శంకరుఁ డంతట దిగ్విజయార్థము బయలువెడలి వేదప్రామాణ్యము చేర జైనబౌద్ధాదివేదబాహ్యమతముల జయించినకుమారిలభట్టును జయించి తనభాష్యమునకు వార్తికమును జేయించవలయు నను కుతూహలముతో ప్రయాగతీర్థరాజమునకు వచ్చి త్రివేణీస్నాన మొనర్చి కుమారిలభట్టును సందర్శింప నతఁడంతకు ముందే తుషాగ్నికుండమునందు దిగి దేహమును వదలుటకు సంకల్పిం

మానిని యాతుసాగ్నిలో సగము దేహము కాలియున్న సమయమున నాచార్యులవారు కుమారిలభట్టును జూచి కరుణార్ద్రహృదయుఁడయి స్వతపస్సామర్థ్యముచేత నా యగ్నిని శమింపఁజేసి కుమారిలభట్టు దేహమునకు నగ్ని బాధ కలుగకుండునట్టులొనర్పఁ బ్రయత్నింపఁగా "యతి వర్యా! నాసంకల్పమును నెరవేరనిమ్ము. నేను గర్మల నాచరించిననే మోక్షము సిద్ధించునని దుర్వాదముచేసి పరమేశ్వరసద్భావమును గూర్చి యంగీకరింపనైతిని. తత్పాపపరిహారార్థ మీతుసాగ్నియందుఁ బ్రవేశించితిని. నాశిష్యుఁడు మండనమిశ్రుఁడు గలఁడు. అతని జయించి మతప్రచారము చేయుఁడు."అని కుమారిలుఁడు పలుకఁగా నతనికిఁ దత్త్వోపదేశముచేసి మండనమిశ్రునిగృహమునకుఁ బోయి యతనితోడ స్వసిద్ధాంతము నుపన్యసించి వాదించుటకుఁ బ్రతిజ్ఞ గైకొని యతనిపత్నియు విదుషీమణియునగు ఉభయభారతిని మాధ్యస్థముగ నంగీకరించి యుభయులుఁ దమతమసిద్ధాంతములఁగూర్చి వాదింప నిశ్చయించుకొనిరి.

'ఓడిపోయినవారు జయించినవారలకు శిష్యులయి వారియాశ్రమమును గ్రహించి తీరవలయును' అని పందెమును నిర్ణయించుకొనిరి. ఆయుభయులకు నిట్టు లెనిమిది దినములు వాదము జరుగుచుండఁగాఁ జివరకు మండనమిశ్రుఁ డోడిపోయెను. మండనమిశ్రునిపత్ని యగు నుభయభారతి భర్తయొక్క పరాజయము నంగీకరించినదై 'మీరు మండనమిశ్రుని సగముమాత్రము జయించితిరి. తక్కిన యర్ధభాగము నన్నుఁగూడ జయించినఁగాని సంపూర్ణముగ జయించినట్లు కాదు' అనిపలుకఁగా శంకరుఁ 'డట్లే' యని యంగీకరించెను. పలుశాస్త్రములందు శంకరునితోడఁ బ్రథమమున నామె వాదించి వాదించి "ఈ శాస్త్రములయం దితనిజయించుట యసాధ్యము. బాల్యమునందే సన్న్యసించినవాఁడు కావునఁ గామశాస్త్రమున నితనిజయించెద"నని భావించి కామశాస్త్రసంబంధములగు ప్రశ్నలను గొన్నింటిని వేయఁగా శంకరుఁ డందులకు నొకమాసము గడువు తీసుకొని పరకాయప్రవేశవిద్యచేత నమరకుఁడను రాజుయొక్క దేహము బ్రవేశించి కామశాస్త్రము నభ్యసించి పిదప నాదేహమును వదలి స్వదేహమునందుఁ బ్రవేశించి యుభయభారతికడకువచ్చి యాశాస్త్రమునందు నైత మామెను జయించెను. సరస్వత్యవతారమగు నామె వెంటనే దేహమును జాలించి బ్రహ్మలోకమునకుఁ బోవుటకుఁ బ్రయత్నింప "లోకజననీ' నీవు నేను స్థాపింపఁబోవు పీఠములందు నెల్లప్పుడు నీసాన్నిధ్యము కలిగియుండునట్టు లనుగ్రహింపు"మని ప్రార్థింప 'అట్లే' యని యంగీకరించి బ్రహ్మలోకమునకుఁ బోయెను.

పిదప మండనమిశ్రుఁడు యథాశాస్త్రముగ సన్న్యసించి బ్రహ్మోపదేశమును బొంది సురేశ్వరాచార్యుఁ డనునామము వహించెను.

శంకరాచార్యుఁ డొకప్పుడు సమాధినిష్ఠయందుండఁగాఁ గాపాలికమతస్థుఁడగు భైరవుఁ డనునతఁడు త్రిశూలముచేత నాచార్యునిఁ జంపుటకు రాఁగాఁ బద్మపాదుఁడు ఈవిషయము నెఱింగి నృసింహావతారుఁడయి వానిని వధించెను.

తరువాత శంకరుఁడు గోకర్ణక్షేత్రమునకుఁ బోయెను. ఆక్షేత్రసమీపమునఁగల బలియగ్రహారమునందలి బ్రాహ్మణకుమారులలోఁ గల ప్రభాకరుఁడను బాలకుఁడు పిచ్చివానివలె నుండఁగా వాని తలిదండ్రులు బాలకుని శంకరుని కడకు పిలుచుకొని వచ్చిరి. శంకరుఁ డాబాలకుని నీవెవ్వఁడవని యడుగ "నాహం జడః కింతు జడః ప్రవర్తతే" మన్నశ్లోకములతో నద్వైతతత్త్వమంతయు నాబాలకుఁడు వివరించెను. చేతియందున్న యుసిరికకాయవలె నద్వైతతత్త్వ మంతయు నాశ్లోకములయందుఁ దెలియవచ్చుచుండుటచేత శంకరుఁ డాబాలకుని "హస్తామలకుఁడని" సంబోధించి స్వశిష్యునిగాఁ బరిగ్రహించి తుంగభద్రాతీరమున శృంగేరికిఁ బోయి యచ్చట విద్యాపీఠము స్థాపించి సురేశ్వరు నాపీఠమున కధ్యక్షునిగా నేర్పరచెను. శంకరునిశిష్యులలో గిరి యనుపేరుగల మందమతియగు శిష్యుఁడు సర్వదా గురుశుశ్రూషయే ప్రధానముగ భావించి యాయాసమయములందు భాష్యము నితరశిష్యులందఱితోడఁ గలసి చదువుచుండెను. సూక్ష్మబుద్ధిగలతక్కినశిష్యులందఱు "మందబుద్ధి"యని యతనిఁ బరిహసించుచుండిరి. ఒకనాఁడు శిష్యులందఱు భాష్యమును జదువుటకు శంకరునికడకు వచ్చిరి. ఆసమయమునందు గురువులవారికాషాయవస్త్రముల నుతుకుచు గిరి యుండెను. శిష్యులు శాంతిపాఠము నుపక్రమించిరి. 'గిరి వచ్చువఱకు నిరీక్షింపుఁడు' అని శంకరుఁ డనఁగా 'మందబుద్ధియగు నితఁడు భాష్యముచదువుట కనర్హుఁడు. చదివినను జదువకపోయినను అతనికి

ఒక్కటియే' యని శిష్యులందఱు అనిరి. పరమదయాళువగు
శంకరాచార్యుఁడు శిష్యులగర్వమును గ్రహించి గిరియను
శిష్యునకు మనస్సుచేతనే పదునాలుగువిద్యల ననుగ్రహిం
చెను. అతఁ డప్పుడే సకలవిద్యాసనాథుఁడయి తోటక
వృత్తములచేత నద్వైతతత్త్వమంతయు వర్ణింప శిష్యులం
దఱు నాయద్భుతమునుగాంచి ఆశ్చర్యపడిరి. గిరి తోట
కాచార్యుఁ డాయెను.

తరువాత శంకరాచార్యశిష్యులందఱు నద్వైతమత
మును గూర్చియు ఆచార్యులవారిభాష్యములమీఁదను గ్రం
థములను వ్యాఖ్యానములను రచించిరి:—

౧. పద్మపాదుఁడు పంచపాదికయనుపేర శారీ
రకభాష్యమునకుఁ డీకను రచించెను. ఇది పూర్వభాగ
ము. తక్కినభాగమునకు వృత్తియని ప్రసిద్ధి. 'విజయ
డిండిమ' మనుపేర వ్యాససూత్రములకు వివరణభూత
మగుగ్రంథమును రచించెను.

౨. సురేశ్వరుఁడు తైత్తిరీయ బృహదారణ్యకోప
నిషద్భాష్యములకు వార్తికములను రచించెను. నైష్క
ర్మ్యసిద్ధి యనుప్రకరణగ్రంథమును గూడ రచించెను.
మఱికొందఱు శిష్యులు కొన్నిగ్రంథముల రచించిరి.

తరువాత పద్మపాదులవారు తీర్థయాత్రకుఁ బో
యిరి. శంకరుఁడు శృంగేరియందే కొంతకాలము నివ
సించియుండఁగా యోగశక్తిచేతఁ దల్లికి మరణకాల
మాసన్నమయినదని గ్రహించి వెంటనే కేరళదేశమునం
దున్న తల్లికడకుఁ బోయి యామెకు వందన మొనర్పఁగా
సంతుష్టురాలయి 'నాయనా! నా కిహలోకవాంఛ లన్ని
యుఁ దీరినవి. నీవును సమీపమునం దున్నావు. ఈదేహ
మును వదలఁదలచినాను.' అని తల్లి యనెను. ఆమెకుఁ
దత్త్వోపదేశమును శంకరుఁ డొనర్చెను. సంతుష్టహృదయ
యై యామె పాంచభౌతికశరీరమును వదలెను. మాతృ
వాక్యానుసారము శంకరుఁడే తల్లికి దహనాదిసంస్కార
ముల నాచరించెను. దహనాదిసంస్కారముల నాచరించు
టకు నధికారము లేదని జ్ఞాతులందఱు పలికి శంకరునకుఁ
దోడ్పడక పోయిరి. పిదపఁ గొంతకాలమునకుఁ దీర్థయా
త్రకుఁ బోయిన పద్మపాదుఁడు శంకరుని వచ్చి కలిసికొని
యెను ఆదేశవాసియగు రాజశేఖరభూపాలుఁడు తాను
రచించిననాటకత్రయము నాచార్యులవారికి నివేదించి
సంస్కరించికొనియెను.

తరువాత సుధన్వుఁడను రాజుతోడను, వేలకొలఁది
శిష్యులతోడను దిగ్విజయార్థము శంకరుఁడు బయలు
వెడలి ప్రథమమున సేతువునకుఁ బోయి పాండ్య చోళ
ద్రవిడ దేశముల సందర్శించుచుఁ గాంచీనగరమునకు విచ్చే
సెను. తరువాత క్రమముగ నాంధ్రదేశము, వేంకటా
చలము, విదర్భము, కర్ణాటకము మున్నగు దేశములకుఁ
బోయియచటనుండుపండితులను జయించి తనశిష్యులనుగా
నొనర్చుకొనుచు గోకర్ణక్షేత్రమునకు విచ్చేసి నీలకంఠ
పండితునితో స్వసిద్ధాంతమును బ్రతిపాదించుట కా
చార్యుఁ డుపక్రమింపఁగా నిట్టి స్వల్పవిషయమునందు
గురువులవారు శ్రమపడ నక్కఱలేదని సురేశ్వరా
చార్యుఁడే నీలకంఠుని మతమును ఖండించెను. హర
దత్తాదిశిష్యబృందసహితముగ నీలకంఠుఁడు శంకరునకు
శిష్యుఁ డాయెను. పిదప నుదయనాదిపండితులు పరాజితు
లయిశిష్యులయిరి. తరువాత సౌరాష్ట్ర ఉజ్జయిని బాహ్లిక
దరద భరత శూరసేన కురు పాంచాల కామరూప అంగ
వంగ గౌడాదిదేశములను దిగ్విజయముచేయుచుఁ బండితు
లను స్వశిష్యులనుగాఁ జేసికొనుచు మతమును వ్యాపింపఁ
జేసిరి.

ఆచార్యులవారిచేత జితుఁడయిన యభినవగుప్తుఁ
డను మాంత్రికుఁ డభిచారక్రియ నొనర్చెను. ఆత్మ
ర్థ్యములవలన నౌషధములవలన నివారింపఁ శక్యముగాని
"భగందర రోగము" ఆచార్యులవారికి సంభవించెను.
సహింపశక్యముగాని బాధను శంకరుఁ డనుభవించు
చుండెను. తోటకాచార్యుఁ డహర్నిశములు పరిచర్య
చేయుచుండెను. ఆచార్యుఁడు వలదని వారించుచున్నను
శిష్యులందఱు ధన్వంతరితుల్యులగు వైద్యుల రావించి
చికిత్సచేయించిరి. ప్రయోజనము లేకపోయెను. ఆభి
చారికముచేతఁ గలిగినయారోగ మౌషధములచేత నివా
రింపఁబడదని పెద్దలు చెప్పఁగాఁ బద్మపాదుఁడు విని జగ
ద్గురుసార్వభౌమునియందుఁ గూడ నిట్టి దుష్కృత్యము
చేయునరాధముఁ డుండునాయని క్రోధములో నరసింహ
మంత్రమును జపించినవెంటనే శంకరుఁడు రోగవినిర్ము
క్తుఁడయ్యెను. అదేరోగముతో అభినవగుప్తుఁడు మర
ణించెను.

పిదప గంగాతీరమున నొకనాటి సాయంకాల
మున నాచార్యులవారు బ్రహ్మతత్త్వానుసంధానము చేయు

చుండఁగా శంకరుని పరమగురువు లగు గౌడపాదా చార్యులవారు గనంబడి 'వత్సా! నీవు భాష్యాదిగ్రంథ ములు నొనర్చితివని గోవిందయతి చెప్పఁగా విని నిన్నుఁ జూచుటకు వచ్చినాఁడ'నని పలుకఁగా స్వకృతభాష్య గ్రంథములనుఁ బరమగురువులగు గౌడపాదులవారికి సమ ర్పింపఁగా వా రచ్చటచ్చట పరీక్షించి సంతుష్టులయి వరమొసంగి యంతర్ధాను లయిరి. ఆచార్యులవారు తను శిష్యులతో గౌడపాదాచార్యులవారి సందర్శనము మున్నగువానిని దెలిపిరి.

మరునాఁ డుదయమున గంగాతీరమున స్నాన మొనర్చి ప్రాతరాహ్నికమును శంకరాచార్యుఁడు చేయు చుండఁగాఁ "గాశ్మీరదేశమునందు శారదాదేవిపీఠ మొకటి గలదనియు, ఆమఠమునకు నాల్గుదిక్కుల నాలుగుద్వార ములు గలవనియు, సర్వజ్ఞుఁడయినవాఁడుగాని నాద్వార మును దెఱువజాలఁడనియు నా శారదాలయముయొక్క ప్రాక్పశ్చిమోత్తరదిగ్ద్వారము లాయాదేశపండితులు స్వ సామర్థ్యముచేతఁ దెరవఁగలిగిరనియు దాక్షిణాత్యులలో సర్వజ్ఞుఁడగువాఁ డొకఁడును లేనందువలన నాద్వార మట్లే మూయఁబడియున్నదనియు" నసెడిజనశ్రుతి నాల కించి దాక్షిణాత్యులకు వచ్చిన యపకీర్తిని బోఁగొట్టఁ దలఁచి కాశ్మీరదేశమునకుఁ బోయి శారదామఠమునకుఁ బోగా దాక్షిణాత్యులయందుఁగూడ సర్వజ్ఞుఁడగు పండి తుఁడుండునా యను దురహంకారముతో నొకరితర్వాత నొకరు చొప్పున సకలశాస్త్రపండితులు శంకరుని తోడ వాదించి పరాజితులయి శిష్యులయి జయజయ ధ్వానము లొనర్చుచుండ సర్వజ్ఞపీఠము నధిష్ఠించి సర్వజ్ఞపదమును స్వీకరించిరి.

తరువాత శంకరుఁడు ధర్మకార్యనిర్వహణార్థము మతాచారపరిపాలనార్థము;

౧. తూర్పున జగన్నాథమున గోవర్ధనమఠమును,

౨. పశ్చిమమున ద్వారకయందు శారదామఠమును

౩. ఉత్తరమునఁ గేదారమున జ్యోతిర్మఠమును,

౪. దక్షిణమున శృంగేరియందు శృంగగిరిమఠమును

స్థాపించి అచట శిష్యులను దన్నిర్వహణార్థము నియ మించి కేదారక్షేత్రమునకుఁ బోయి యచట కొంత కాలము వసించి కైలాసలోకము చేరిరి.

ఆచార్యులవారు కాంచీక్షేత్రమునందుఁ గామకోటి పీఠమునుగూడ స్వయముగ స్థాపించిరనియే పెద్దలు చెప్పుచున్నారు.

శంకరుఁ డొనర్చినగ్రంథములసూచియు, శంకరుని కాలనిర్ణయమునుగూర్చిన బహువిధములగు నభిప్రాయ భేదములను మఱొకపర్యాయము వివరించెదను.

ఆచార్యులవారు ౭౨ మతములవారిని జయించి రని సుప్రసిద్ధి:

కొన్ని మతములనామముల నిట వేర్కొనుచున్నాఁడను

౧ శైవమతము
౨ శివముఖైకదేశిమతము
౩ భాగవతమతము
౪ వైష్ణవమతము
౫ పాంచరాత్రమతము
౬ వైఖానసమతము
౭ కర్మహీనవైష్ణవమతము
౮ హైరణ్యగర్భమతము
౯ సౌరమతము
౧౦ అగ్నిమతము
౧౧ మహాగణపతిమతము
౧౨ హరిద్రాగణపతిమతము
౧౩ ఉచ్ఛిష్టగణపతిమతము
౧౪ నవనీతస్వర్ణసంతానగణపతిమతము
౧౫ శక్తిమతము
౧౬ మహాలక్ష్మీమతము
౧౭ వాగ్దేవతామతము
౧౮ వామాచారమతము
౧౯ కాపాలికమతము
౨౦ కాపాలికైకదేశిమతము
౨౧ చార్వాకమతము
౨౨ సౌగతమతము
౨౩ జైనమతము
౨౪ బౌద్ధమతము
౨౫ మల్లారిమతము
౨౬ విష్వక్సేనమతము

౨౭ మన్మథమతము
౨౮ కుబేరమతము
౨౯ ఇంద్రమతము
౩౦ యమమతము
౩౧ వరుణమతము
౩౨ ప్రాణమతము
౩౩ భూమిమతము
౩౪ శూన్యమతము
౩౫ వరాహమతము
౩౬ చతుర్దశలోకోపాసకమతము
౩౭ గుణమతము
౩౮ సాంఖ్యమతము
౩౯ కపిలమతము
౪౦ అణువాదిమతము
౪౧ కర్మవాదిమతము
౪౨ చంద్రమతము
౪౩ రాహుమతము
౪౪ క్షపణకమతము
౪౫ పితృమతము
౪౬ శేషోపాసకమతము
౪౭ గరుడోపాసకమతము
౪౮ సిద్ధమతము
౪౯ గంధర్వమతము
౫౦ భూతబేతాళమతము
౫౧ దిగంబరమతము
౫౨ భక్తమతము

## ఆచార్యచరిత్రవలన మనము గ్రహింపఁదగిన ఉపదేశములు

౧. "న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదైవతమ్" అను ప్రమాణవచనము ననుసరించి అందఱుఁ దల్లియాజ్ఞను బరిపాలించవలయు నను ధర్మమును దాము సన్న్యాసాశ్రమమునందుండియుఁ దల్లియొక్క యంత్యకర్మ నాచరించి లోకులనుగూడ నట్లే పరిపాలించవలయునని శాసించుచుఁ దమయాచార్యత్వమును సార్థకపఱిచినారు.

౨. కేరళదేశీయులను ధర్మభ్రష్టులనుగా శపించుటచేత నాపత్కాలమునం దందఱు నొకరికొకరు సహాయము చేయుట విధియనియు నట్టివిధి నతిక్రమించు దుష్టులను నిగ్రహించుటయు సమర్థుఁడగు నాచార్యునకు నావశ్యకమనియుఁ బ్రకటీకరించిరి.

౩. తాము సాక్షాచ్ఛివావతారులయి తత్త్వార్థమంతయు నెఱింగియున్నను గురూపదేశరహితముగ నాత్మవిచారము సలుపకూడదను శాస్త్రీయసంప్రదాయమును గోవిందభగవత్పాదులవారికి శిష్యులై కాపాడిరి.

౪. సంసారమునం దట్టిసౌఖ్యములభించినను నది తుచ్ఛమను విషయమును బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి లోకులకు గనంబఱిచిరి.

౫. నిర్వ్యాజభక్తితో గురుశుశ్రూషచేయువానికి విద్య అవశ్యము లభించు ననువిషయమును మందమతియగు తోటకాచార్యునకు సంపూర్ణానుగ్రహముతో సకలవిద్యల నొసంగి ప్రకటించిరి.

౬. తాము బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి పీఠాధిపత్యమువహించినను సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టులగువారలు గృహస్థులయి సన్న్యసించినను పీఠాధిపత్యమునకు నర్హులగుదురను విషయమును సురేశ్వరాచార్యుని శృంగేరిపీఠమున నధిష్ఠింపఁజేసి ప్రకటించిరి.

౭. జ్ఞానులు సైతము తీర్థయాత్రల సేవించి దేవతాదులఁ గొనియాడుట ఆవశ్యకమనువిషయమును స్వయముగ నాసేతుహిమాచలము తీర్థయాత్రచేసి నిరూపించిరి.

౮. జగద్గురుపీఠము నధిష్ఠించినవారలు దుర్మతఖండనపూర్వకముగ స్వమతస్థాపనమును జేయుట అత్యావశ్యకమను విషయమును స్వయముగఁ దా మాచరించి లోకులకు బోధించిరి.

౯. సాధనచతుష్టయసంపత్తిగలవారలు ప్రతిబంధకాతిశయముచేత గృహస్థులయియున్నను వారికి బ్రహ్మవిద్యయం దధికారము గలదనువిషయమును బ్రాభాకరాదిశిష్యులకుఁ దత్త్వోపదేశ మొనర్చి విశదీకరించిరి.

# ప్రేమతత్త్వము



మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ప్రేమతత్త్వ నిరూపణము

(ప్రథమ భాగము)

ఖిలమతియైన కాపు విటకత్తె యొకర్తుక మింటఁగాండ్ర రూ
కలఁ దనివోక ప్రార్థన నొకానొకభూసురు నిల్లుచొచ్చి రోఁ
కలిగొని యొంటి నున్నతటి కన్నియ నెత్తి పగిల్చి కంటకా
సులు హరియించె మున్న నిఁకఁ జూడుఁడు దుర్ధన కాంక్ష యెట్టిదో!

చ. తమపయి వారిఁ గన్నెఱఁగి దగ్గఱఁ జేరినవారియొద్ద లం
చములు గ్రహించి బందుగులచాటున భూములు విల్చి వానితోఁ
దమయధికారవృత్తులకుఁ దప్పినవారలఁ జూచియైన లం
చములు గ్రహింపకుందురె విచారణయందు నొకో ధనార్థికిన్

చ. దురితము చూడఁబోరు జనదూషణ మెన్నఁగఁబోరు కాళికే
శ్వరి తమయిష్టసిద్ధుల నొసంగునయంచుఁ దలంచి శక్తికిన్
గరకరిఁ గోడిగొర్రెలను గానుక లిచ్చుటయే! లభించినన్
నరబలికూడ నిత్తురు ధనంబున కూరిమి కన్న గానునే?

వ్యసనములు - ప్రేమ

గీ. వెలఁది జూదంబు పానంబు వేఁట యనెడి, వ్యసనములఁ బ్రేమ కామదోషావిలంబు
పరుషవచనార్థదూషణపరుషదండ,నాభిరతి యెన్నఁ గోపదోషావిలంబు.

చ. పరసతిఁ గోరి రావణుఁడు వాలియుఁ బానముచేత యాదవుల్
పరుసపుమాటఁ గౌరవులు, పాపపువేఁటను బాండురాజు పం
క్తిరథుఁడు, జూదమాడఁగ యుధిష్ఠిరుఁ డున్నలుఁ, దర్థనిందతోఁ
దర బలిచక్రవర్తి, కడుదండన మాగధుఁ డగ్గుచెందరే?

ఉ. ఈయవకార్యముల్ నరుల కీర్తిఫలంబు లొసంగునంచు రా
మాయణభారతాదు లనయంబును మొత్తులు వెట్టుచున్న, నీ
హేయకృతుల్ వొనర్చు మతిహీనులపాటులు చూచుచున్న, వి
ద్యాయుతులైనవారిమదులైనను వీనిని గోరకుండునే?

ఉ. ఆఁకలి నీరునట్టు నణఁగారు, దయారస మింకిపోవుఁ, బెం
జీఁకటి క్రమ్మినట్టులు నశించును దృష్టి, పణంబు రాకయుం
బోకయుఁ గానరాదు, చెడిపోవుట బుద్ధియు నాలుబిడ్డలల్
సోఁకదు జూదప్రుందమిని సోఁకని దుర్గుణ మొండు గల్గునే?

చ. అలవజసేని యొక్కపరి యా చెడుజూదము నాడ నెంతవా
రలమన మేని ముందుగనఁబోదనుచోఁ బరమప్రమాణమై
నలుఁగడఁ బెద్దపెద్దలె కనంబడుచుండఁగఁ ద్రాగుఁబోతునీ
చులహృదయంబు దానిఁ జవిచూచినఁ జూచునె ముందు వెన్కనున్.

చ. చోరనయు నేర్పు గల్గు నొకజూదరి యెప్పుడు గెల్చుదానికిన్
బరకితవుల్ సహింప కొకపండుగునాఁడు మఱొక్కచోఁ దురో
దరమని చెప్పి పుచ్చిరి, యతండును జూదపుఁ గూర్మి వారిమ
చ్చరము గణింప కేగి తనసంచియుఁ బ్రాణము లిచ్చె వారికిన్

ఉ. పానము నొక్కనాగరికపద్ధతిగాఁ దలపోసి నేఁటివి
ద్యానిధులందుఁ గొందఱు దురాసవసేవల నర్థశక్తి వి
జ్ఞానము లోటుపోవుచు విషాదకరస్థితిఁ గాంచుచుండ, న
జ్ఞానులు త్రాగుఁబోతులయి కష్టము లొందుచు నుస్కి చిత్రమే?

ఆ. ఒడలు గుల్లయైన నుడుగును వెలయాలి, కోర్కి యొడలు నిల్లు గుల్లయైన
నుడుగకుండుఁగాదె చెడుగు త్రాగుడుకోర్కి, ద్యూతచౌర్యములకు నూఁత యగుచు.

చ. సురయనఁ బ్రాణమిచ్చు నొకశుంఠ నిజాంగనఁ గూడఁ గూర్మియై
నరయుచు నుండు, నాతఁ డొకయప్పుడు త్రాఁగఁగ డబ్బులేక వం
దురి కరభూషణం బడిగి తాఁ నియ్యలేఁ, గోరిక తీర కాసతీ
శిరమును ద్రుంచి యామురుగు చేకొనిపోయెను పానశాలకున్.

ఉ. కోపము పెంచు నస్థిరతఁ గూర్చు ధనంబు హరించుఁ జిత్తసం
తాప మొనర్చు సత్యకరుణాశుచితాదులఁ ద్రుంచు నమ్మికన్
బాపు బలంబు కాంతి మతి నాశముచేయును వేయువేల! యే
పాపగుణంబు లీచెడుగుపానమునం గనరావొ చూడుఁడీ!

ఉ. సారమతోన్నతిం బమలసాంఘికజీవన మార్యధర్మవి
స్తార మశేషభూస్థలి నుదారగుణంబుల కాదిమంబు వి

ద్యారమణీయనాగరకతన్ గణుతింపఁ బురాతనంబు నా
భారతదేశ మిప్పు డతిపానరతిం జెడుచుండె నక్కటా!

ఉ. న్యాయము చెప్పువారును సమర్థపదంబుల నుండువారు శా
క్తేయులుఁ గొంద ఱన్నిటను దీనవారయి మద్యరూపపా
నీయము గ్రోలుచుండి రన, నీచపు వెంగలిమూఁక కల్లుసా
రాయిని ద్రాగునంచు వసరం దగునే? మధువాంఛ యెట్టిదో?

ఉ. నాఁటికినాఁడు మద్యము ననారత మానినఁగాని దానిపై
గాటపుఁగూర్మి తీరనియొకం డొకకాసు గణింపలేక యా
రాటము చెంది తాఁ దు లెగఁబ్రాఁకుట నేరిచి యొక్కరేయి పై
త్రాటిని బ్రాఁకి లొట్టికలు ద్రాగియు డిగ్గుచుఁ గూలె విస్మృతిన్.

ఉ. సారపువృత్తి గాదు, సుఖసాధకమార్గము గాదు, జీవనా
ధారము గాదు, కాని తనదారిని బూరిని మేసి కానలోఁ
గేరెడి లేడిఁగూడ నడగించుచు నుందురు గొంద ఱట్టిని
ష్కారణహింసఁ జొచ్చు తమకంబునకుం జొరరాని దున్నదే!

ఉ. ధారణిఁ బొట్టపోసికొను దారు లనేకము లున్నఁ గొందఱా
బారులుతీరి కన్నులకుఁ బండువుగా దివినేగు శారికా
కీరకపోతవారములఁ గేలిమెఱుఁగు గుఱిపెట్టి కొట్టఁగాఁ
గారణమేమి? వేటతమకంబ, బ[illegible] తమి కడ్డమున్నదే!

చ. ఘనమృగయందు వేటతమకంబునఁ గానకుఁ బోయి మచ్చుమేఁ
కను దినవచ్చు బెబ్బులిని గాంచి తుపాకిని గాల్చి కూల్చి వెం
టనె పరుగెత్తి వేడ్కఁ జరణంబున దానిమొగంబు దన్ని కా
లిని బులినోటఁ బట్టి కబళింపఁగఁ జచ్చెను గొన్నినాళ్లకున్

సీ. పరుషవచనార్థదూషణపరుషదండ,నంబు లణఁగించుచుండె లోకంబు నిల్చె
మైహికాముష్మికసుఖంబు లణఁగఁద్రొక్కు, పరమశత్రువు వ్యసనసప్తకముగాదె?

అధికారులు - ప్రేమ.

ఉ. పిన్నలయం దవజ్ఞయును బెద్దలయందు ననాదరంబు నా
పన్నులయందు నిర్దయత బంధుగులం దవలేప మర్థసం
పన్నులయందు నీసును సమానులయందు నసూయ దీనులం
గన్న జుగుప్స నాఁగ నధికారమదప్రియతావికారముల్.

చ. చులుకన చేసి మెల్లరను జూచు భుజంబుల శంఖచక్రముల్
మొలచినయట్లు చూచుఁ బెడమోమిడిపల్కుచు మీఁదుచూచుఁ బె
ద్దలు తను మ్రొక్కఁ జూచుఁ దనదర్శన మిచ్చుటె యర్థికోటికిం
గలిమి యటంచుఁ జూచు నధికారబలప్రియుఁ డెట్టి మోహమో!

ఉ. భూసుర పాంథ బంధుజనముల్ ధన మన్న మొసంగి తన్పుచుం
గాసు గడింపకుండి తనకల్గినముప్పదిపుట్ల భూమిఁ గాఁ
జేసి యొకండు పుత్రులకుఁ జప్పయుఁ గట్టయుఁ జేతి కిచ్చి స
న్న్యాసులఁ జేసె నవ్వితరణప్రియతామహిమంబుఁ గంటిరే?

ఉ. లోకమునందుఁ గొంద ఱతిలుబ్ధులు పిల్లికి భిక్ష వేయ క
ర్కైకపరాయణత్వమున నార్జనచేయుచు విజ్ఞవీఁగి సు
శ్లోకతఁ గోరి తా ముభయలోకసుఖంబొనగూర్పరాని యే
వో కొఱగానికార్యముల కూరక దుర్వ్యయ మాచరింపరే?

చ. తనగతిఁ దా నెఱుంగక వదాన్యతకుం బరుగెత్తు, ముందు వె
న్కను గనఁ, డైన దాకునను గానిది కంచమునందుఁ బెట్టు, వం
చనము నిజంబుగాఁ గను, విచారణ చేయఁడు కార్యరీతి నే
ర్పొసర, ముఖస్తుతిప్రియత నుబ్బులరంగఁడు దుర్విదగ్ధుఁడై.

ఉ. ఇంతకు నంతచేర్చి వచియించుచు నన్నిటియందు నాత్మవృ
త్తాంతము దూర్చి వానికి నుదాహరణంబు ప్రమాణమంచుఁ ద
న్నెంతయుఁ దానె చాటికొను, నేమనుకొందురొ యన్నచింతయా
వంతయు లేక గొప్పకయి యాత్మనుతిప్రియుఁ డెట్టిమోహమో!

రసములు - ప్రేమ

శృంగారము:—

గీ. హాస్యరతిశోకకోపభయాదులైన, స్థాయిభావంబులకు నెల్ల సదనమైన
మానసంబు ప్రవృత్తిప్రేమమున నగుట, సకలరసములు ప్రేమమూలకము లన్యో.

ఉ. కోరికలూరుపల్కులను గుల్కులుచిల్కెడి నవ్వుఁ బున్నెలం
దేరెడి మోవి తావి తఱిదీపుల ముద్దుల మేను మేనువాం
గారెడి కౌఁగిలింతల సుఖానుభవంబను పేరఁ దీరు శృంగా
గారము రాజధానిగ జగంబును ప్రేమమహీశుఁ డేలెడిన్.

చ. పరిణయబంధబీజ మనుభావబలాంకుర ముత్సవక్రియా
పరిచయమాల ముల్లసితభాషణపల్లవ మాద్యసంగమ
స్థిరహృదయానుసంధిమ సుదివ్యసుమంబగు ప్రేమకల్పవ
ల్లరి సుఖవిస్తరామృతఫలప్రదమై యజరామరం బగున్.

మ. కనులారం గని యాననాబ్జ మనురాగశ్రీనివాసంబు నె
మ్మన ముప్పొంగ, వచోఽమృతం బధరబింబంబాని కూర్మిం జిగి
ర్చిన మైదీఁగను దాఁకి మే నలరఁగా శ్రేష్ఠాంతరాత్ముండు పా
వనసంపూర్ణసతీసుఖామృతరసాస్వాదైకలోలుం డగున్.

మ. స్మరబాధం బడలేక రాత్రిచరుఁడై సంకేతముం జేరుచోఁ
బరు లీక్షించుదురన్న సంశయభయభ్రాంతుల్ మనంబందు ము
ప్పిరియై వేఁచిన, మానలేక చని యల్పిష్ఠాంతరాత్ముండు దాఁ
బరకీయాసుఖమద్యపానవినశప్రజ్ఞావిమూఢుం డగున్.

సీ. పరివారుచూచిరా! పరియాచకముచేసి, చీచీయటంచు దూషింతు రేమొ
తమవారు చూచిరా! తలయెత్తికొని యింట, నల్లాడ మొగ మికఁ జెల్లదేమొ
మగనికిఁ దెలిసెనా! మఱిలేదు తప్పక, ప్రాణాలమీఁదికే వచ్చునేమొ
పెండ్లాము చూచెనా! పెఱవారి కెఱిఁగించి, తిట్టిపోయుచు రచ్చఁ బెట్టునేమొ
గీ. యనెడిసందేహముల గుండె లదరుచున్న, జారిణీజారు లనురాగసారసుఖము
లనుభవింపరె? చూడుఁడీ యయ్యలార! వలపుచెలరేఁగు చెడుగునర్మిలి విధంబు.

మ. ఎవ రేమన్నను నిర్దయాత్ముఁడయి మే లిల్లాలి నేడ్పించుచో
నవమానంబును దోషముం గనక తన్నావేశ్య కామింప రో
యి విశేషంబని కాంచలేక మదభూయిష్ఠాంతరాత్ముండు వా
రవధూటీమృగతృష్ణికాసుఖజల భ్రాంతాక్షి కాణుం డగున్.

శేషము:—

ఉ. కోరినయట్టియర్థమునకుం బ్రతిబంధము గల్గినంత నే
పోరానరించియుం, గరుణఁ బూని పదార్థము నిర్వహించియున్
గోరిక దీర్చియుం బరులకున్, ఘను లిష్టమునిర్వహింతు రా
వీరము ప్రేమరాజనకుఁ బెట్టనికోట గుణత్రయంబునన్

---

# అజంతా చిత్రములలోని ఆయుధములు

కొ. నరసింహాచారిగారు

౧ ఆయుధములు

బౌద్ధయుగమునాటి ఆయుధములును యుద్ధపరికరములును ఆకాలపుజనుల నాగరికతావిశేషములను, యుద్ధనైపుణ్యమును వెల్లడిచేయదగియున్నవి. మఱియు నివి ఈ కాలములోఁ జూడ నుపయోగములో నుండుట వారికీర్తి నినుమడింపఁ జేయుటయే.

పటము ౧



కత్తులు వంకరగానుండి, 1 పటము "అ"లో నంపుతట్టు వాదర కలిగియున్నవి. కొన్ని కత్తులు సాధారణముగా వంకర లేక యున్నవి. 2 పటము "ఛ" పూర్వపు ఒరకత్తిని వెలియఁజేయుచున్నది. దాని పిడియందుగల పనితనము చిత్రకళా కౌశలమును జూపుచున్నది.

బాకులు 1 పటము "ఇ" పూర్వము సర్వసాధారణముగానుండిన ఆయుధములు.

1 పటము "ఉ" పూర్వము రాకసులుపయోగించుకత్తులను తెలియపరచుచున్నది.

1 పటము "ఈ" పరశువు లేక గండ్ర గొడ్డలి. ఇదియు సాధారణమైన ఆయుధముగా నుండినది.

1 పటము "ఊ" కురుచగానుండు బల్లెములు వీటికి క్రిందివైపు పెద్దగుబ్బ లున్నవి.

1 పటము "ఎ" పొడుగైనబల్లెము. కొన్నిసమయములలో దీనికే పతాకములనుగూడ కట్టుట కలదు.

చీనా, టిబెట్టు మొదలగు పాశ్చాత్యదేశములలో మిక్కిలి ముఖ్యమగు చిహ్నముగాను, ఇంద్రునియొక్క ఆయుధముగాను నుండు "వజ్రము" పూర్వకాలపుయుద్ధభటులు వాడు ఆయుధము (1 పటము "ఋ") గాగూడ నుండినది. శ్రీకృష్ణుని ఆయుధవిశేషమగు "చక్రము" (1 పటము "ౠ") కూడ వాడఁబడుచు వచ్చినది. దీనికిచుట్టును వెలివైపు వాదరఁ గలిగియున్నది.

పటము ౨



### కేడెములు లేక డాళ్లు

కేడెములు సామాన్యముగా వలయ, చతుర్భుజ, త్రిభుజాకారములుగలిగియున్నవి. అన్నియు లోవైపు పల్లముగా(తాబేటిచిప్పవలె) నున్నవి. 2 పటము "క, ఖ, గ, చ" ల పైన వింతయగు వికారరూపములు చిత్రింపఁబడియున్నవి. చతుర్భుజాకారము లగు కేడెములు పొడ వెక్కువమై విలువంపుగా నున్నవి. వీటికిఅంచులయందు (2 పటము "ఖ, ఘ,") పట్టుకుచ్చులు అలంకారారము కట్టబడియున్నవి 2 పటము "గ"

చిత్రమగు చిహ్నములతో గూడి యున్నది.

కత్తియు డాలును తోలుపట్టాకు గట్టబడి భుజమున వ్రేలవేయుట కనువగుమాదిరి 2వ పటము "ఘ" లో చూపఁబడియున్నది. కొక్కులు తగిలించుమాదిరి పూర్వమున్నమాదిరియే ఇప్పుడును ఉన్నదని ఈచిత్రమునుండి తెలియనగును.

పటము 3



## విండ్లు

విండ్లు రెండువిధములు. 3 పటము "క" ఒకటేబద్దను గలిగియున్నది. 3 పటము "ఖ" రెండుగాని మూడుగాని బద్దలను కట్టి రెండు వంపులు వచ్చునట్లు చేయఁబడియున్నది.

## వేత్రములు మొదలగు పరికరములు.

కోలలు, వేత్రములు, బల్లెములు, (3 పటము "గ,ఘ") పూర్వపుయుద్ధభటులఆయుధములలో జేరినవే.

వేత్రములు 3 పటము "ఘ" వెండి, బంగారుమొదలగు విలువగల లోహములలోఁ గూడఁ జేయబడి, మంచి చెక్కడపుబనితనమును జూపుచున్నవి.

పతాకములు సాధారణముగా చిత్రవర్ణములు గలిగి యుద్ధవీరుల కుత్సాహదాయకములై యున్నవి.

3 వ పటము "చ, ఛ," అంకుశముల చిత్రములు.

భారత యుద్ధములో భీముని హస్తమునలంకరించి దుర్యోధనునిగర్వము నణచిన గదయుః (3 వ పటము "జ,") బుద్ధ యుగములో నుండియున్నది. ప్రస్తుతము దీనిని బోలు లోడీల (Clubs) ను యుద్ధములలో నుపయోగింపక పోయినను, వ్యాయామము సలుపువారు చేత్రః ద్రిష్టనభ్యసించుట కుపయోగించుచున్నారు.

౨ పాత్రములు





# చుక్కలు

దేవులపల్లి వేంకటకృష్ణ
శాస్త్రి, బి. ఏ.,

మింట నెచ్చటొ మెఱయు చుక్కలఁ
గంటఁ జూచితిఁ గాంక్ష లూరఁగఁ
గాంక్ష లూరినకొలఁదిఁ జుక్కలె
కాంచి బ్రదుకే గడపితిన్.
చేతి కందెడు పూలకొఱకై
చేయి చాపక చేరి కోరక
దూరముగ లే వంపు వానిని
దూఱి వదలితిని.
మింటఁ జుక్క లదృశ్యమాయెను
చేతికందెడు పూలు వాడెను
సారహీనపు జీవితమునకుఁ
గోరికలె మిగిలెన్.
పక్షివలె నాకాశ నిర్మల
పథవిహార స్వేచ్ఛఁ గోరితి
పక్షములు లేవం చెఱుంగక
ప్రాకులాడుచుఁ బొగిలితిన్.
ముగిసిచనె నూ ఱేళ్ల బ్రదుకిటు
మూఁడునాళ్ళకె ముక్కలాయెను
మోడు మ్రాఁకై పూయకుండగ
వాడితూలిన తీవయై.
తళుకు బంగరు తారలేలా?
తలకు మీఱిన తలఁపు లేలా?
వలచి పొందగ గగనసుమములు
కలయె జీవితము?

భా ౧ ౮

## వేళావలీరాగిణీ



• సంకేతదీక్షాం దయితేచ దత్వా విలస్వతీ భూమణ మంగకేషు;
ముహుస్స్మరంతీ స్మర మిష్టదేవం వేళావలీ నీలసరోజకాంతిః.

## పదమంజరీ రాగిణీ



శ్లో. వియోగినీ క్లాంతవిశీర్ణగాత్రా, స్రజం వహంతీ వపుసాచ శుష్కా;
ఆశ్వాస్యమానా ప్రియయాచ సఖ్యా, సుధూసరాంగీ పదమంజరీయమ్.

Lakshmi Art, Bombay, 8.




కాశీనాధుని భైరవమూర్తి గారు

శ్లో. వందే వాగ్భవ మైందవాత్మసదృశం వేదాదివిద్యాగిరో
భాషా దేశసముద్భవాః పశుగతా శ్ఛందాంసి స_ప్తస్వరాన్,
తాళాన్ పంచమహాధ్వనీ న్ప్రకటయ త్యాత్మప్రసాదేన య
త్త ద్బీజం పదవాక్యమానజనకం శ్రీమాతృకే తే పరమ్.

క్రిందటి సంచికయందు నిరూపింపబడిన విధుల ననుసరించి చేయబడు గానముగూడ, సద్వినియోగార్థ ముపయోగింపబడవలెననిన, భ_క్తియుతము కావలె ననిరి. లేనిచో సన్మార్గసాధనమగుట దుష్కరమనిరి. భక్తియనగ త్రికరణశుద్ధిగ ననగా మనోవాక్కాయకర్మలను నీశ్వరు నారాధించుటయే.

శ్లో. అంకోలం నిజబీజసంతతి రయస్కాంతో
పలం సూచికా, సాధ్వీ నైజవిభుం లతా
క్షితిరుహాం సింధు స్సరిద్వల్లభమ్; ప్రాప్నో
తీహ యథా తథా పశుపతేః పాదార
విందద్వయం, చేతోవృ_త్తి రుపేత్య తిష్ఠతి
సదా సా భ_క్తి రిత్యుచ్యతే.
(శ్రీశంకరాచార్య విరచిత శివానందలహరి)

అట్టిభ_క్తిచే నాయాయింద్రియముల నీశ్వరాయ_త్తముల జేయుటయే ముఖ్యమని శ్రీ శంకరులవారు నిరూపించిరి.

శ్లో. మన స్తే పాదాబ్జే నివసతు వచః స్తోత్ర
ఫణితౌ, కర శ్చాభ్యర్చాయాం శ్రు తిరపి
కథాకర్ణనవిధౌ; తవ ధ్యానే బుద్ధి ర్నయ
నయుగళం మూ_ర్తివిభవే, పరగ్రంథాన్
కై ర్వా పరమశివ! జానే పర మతః.
(శ్రీమచ్ఛంకరాచార్యకృత శివానందలహరి)

ఇటులనే శ్రీత్యాగరాజస్వామి శ్రీరామధ్యానతత్పరులగుటకై వేడుకొనియున్నారు.

ఖరహరప్రియ - త్రిపుట

ప. ప్రక్కల నిలబడి గొలిచే ముచ్చట బాగా
తెలుపరాదా.

అ. చుక్కలరాయనిగేరు మోముగల
సుదతి సీతమ్మ, సౌమిత్రి, రాముని కిరు-
ప్రక్కల.

చ. తనువుచే వందన మొనరించుచున్నారా?
చనువున నామకీర్తన సేయుచున్నారా?
మనసున దలచి మైమరచి యున్నారా?
నెనరుంచి త్యాగరాజునితో హరిహర
మీ రిరు-ప్రక్కల.

మఱియువారు "సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్యదమేమనసా" (ఇది ప్రథమసంచిక యందు ముద్రితము) అని చెప్పియున్నను మరి యొకచో భక్తియుతమగునేని సన్మార్గసాధన మగు ననిరి.

ధన్యాసి - ఆది

ప. సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము
గలదే? మనస!

అ. భృంగి, నటేశ, సమీరజ, ఘటజ, మా-
తంగనారదాదు లుపాసించు-సంగీత.

చ న్యాయాన్యాయములు దెలుసును, జగ
ములు, మాయామయమని దెలుసును,
దుర్గుణ, కాయజాదిషడ్రిపుల జయించెడి
కార్యముదెలుసును త్యాగరాజునకు-సం.

అనగా సంగీతానుభవము గల్గియున్నను దాన భక్తిచేరనిదే గానమున కుద్దేశింపబడిన పరమసాధనమగు నట్టియు, చిత్తైకాగ్రతా మూలకమగు నట్టియు, మోక్షప్రాప్తికి సోపానమును బడయజాలరు. దీనికి దార్కాణముగ పాశ్చాత్యాధునికభీము డన బఱగు శాండోయనువారు తమ శరీరవ్యాయామవిధులరందు, నొక్కొక్క కండరమునకును దాని యభివృద్ధికై నియామకమగు పరిశ్రమ నొనర్చునపుడు, సంపూర్ణసాఫల్యము నొందవలె నన్న తనచిత్తమును నాయాకండరప్రదేశ మందు నిల్పవలెనని వక్కాణించియున్నారు. మనస్సు నన్యథా యుంచి శారీరవ్యాయామము చేయుచో సంపూర్ణసార్థక్యము లేదనిరి. అట్లే ఏపనియందైనను చిత్తైకాగ్రతయే ముఖ్యము. చిత్తము ప్రమత్తమైనచో కార్యసాఫల్యము నందుట దుర్లభము. గానమునకును ముఖ్యసార్థక్యము మనసు నిల్పుటయే యనిరి.

అభోగి - ఆది

ప. మనసు నిల్ప శక్తి లేకపోతే
మధురఘంట విరుల పూజేమిచేసును?

అ. ఘనదుర్మదుడై తా మునిగిన
కావేరి మందాకిని ఎటు బ్రోచును?-మ

చ. సోమిదమ్మ సొగసుగాండ్ర గోరిన
సోమయాజి స్వర్గార్హుడౌనే?
కామక్రోధుడు దప మొనర్చిన
గాచి రక్షించునే? త్యాగరాజనుత- మ.

అని నుడివియున్నారు. కాని మనసు నిల్పుటనిన సన్మార్గమున నేకాని, దుర్మార్గమున గాదనిరి. అనగ చౌర్యజారత్వాదిపాపకర్మలం దాసక్తిం దగుల్కొనియెడు చిత్తైకాగ్రతవలన చెడుగే కాని మంచి లేదు. గానమునకు పరమమిత్రమైముక్తిసాధకమగునట్లొనర్చునట్టిది భక్తియే. అట్టిభక్తి నవలంబించి, అంతరింద్రియ బహిరింద్రియముల నిగ్రహించి సమర్పించి యీశ్వరారాధనమందు గానముచేసినచో గానమునకు ముఖ్యోద్దేశమగు జీవేశ్వరైక్యకారణమును సచ్చిదానందసంధాయకము

నగుచున్నది. యిట్టిది భక్తియుత గానము. దీనిని శ్రీ త్యాగరాజస్వామివా రిట్లుపాడిరి.

నవరస కన్నడ - రూపకము

ప. నినువినా నామ దెందు-నిల్వదే శ్రీ హరి! హరి!-నిను.

అ. కనులకు నీ సొగసెంతో - కమ్మియున్నది గనుక-నిను.

చ. సీదుకథలు వీనులందు - నిండియున్నది - రామ, శ్రీద! నీనామము నోట - జెలగి యున్నది గనుక రామ-నిను.

నేను ఎచట జూచినను నీవై యున్నది- రామ,భానువంశతిలక! నీదు-భక్తు డనుచు పేరుగనుక-నిను.

కపటమౌ మాటలెల్ల కమ్మనై నది-నాదు, తపముయొక్క ఫలము నీవే, త్యాగరాజ సన్నుత-నిను.

కం. ఇందు గలఁడందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి! వింటే.

(భాగవతము)

అనునట్లు త్యాగరాజస్వామి తనమనసు నర్పించుటచే నీశ్వరుని స్థావరజంగమములం దంతటను జూచుచు నానందవారాంనిధియం దునిమగ్నుడౌట గమనింప నగును. ఇట్టిభక్తి యను సామ్రాజ్య మబ్బినవారిసందర్శనమాత్రమే పరమానందదమని నుడివియున్నారు.

శుద్ధబంగాళ - ఆది

ప. రామభక్తి సామ్రాజ్య మేమానవుల కబ్బెనో మనస!

అ. ఆమానవుల సందర్శన మత్యంత బ్రహ్మానంద మే మనస! రామ.

చ. ఈలాగని వివరింపలేను చాలా స్వానుభవ వేద్య మే, లీలాసృష్టజగత్త్రయమున కోలాహల త్యాగరాజనుతుడౌ - రామ.

అని పాడియుండుటయేకాక అటువంటి మహనీయ మూర్తుల వివరించి వర్ణింపుచు వందనముల నర్పించియున్నారు.

శ్రీరాగము - ఆది

ప. ఎందరో మహానుభావు లందరికి వందనము-లెంద.

అ. చందురువర్ణునియంద- చందమును హృదయార - విందమున జూచి బ్రహ్మా- నంద మనుభవించువా-రెంద.

చ. సామగానమనసిజలావణ్యాధన్యమూర్ధన్యు-లెందరో.

మానసవనచరవరసంచారము నిలిపి
మూర్తి బాగుగ బొడగనెడువా-రెంద.
సరగున పాదములకు స్వాంత మను
సరోజమును సమర్పణముసేయువా-రెంద.
పతితపావనుడగు పరాత్పరుని గురించి, పర
మార్థమగు నిజమా - ర్గముతోను బాడుచును సల్లాపముతో. స్వరలయాదిరాగ
ముల దెలియువా-రెంద.
హరిగుణమణిమయ - సరములు గళమున,
శోభిల్లు భక్తకోటు లిలలో, తెలివితో
జెలిమితో కరుణ గల్గి, జగమెల్లను
సుధాదృష్టిచే బ్రోచువా-రెంద.
హొయలుమీర నడలు గల్గు సరసుని
సదా కనుల జూచుచును పులకశ-

రీరులై యానందపయోధినిమగ్నులై
ముదమ్మునను యశముగలవా-రెంద.
పరమభాగవతమానివర శశి-విభాకర సన
కసనందన-దిగీశ సుర కింపురుషకనకకశిపు
సుత నారద తుంబురు- పవనసూను బాల
చంద్రధర సుక సరోజభవభూసురవరులు,
పరమపావనులు ఘనులు శాశ్వతులు, కమ
లభవసుఖము సదానుభవులు గాక-ఎంద.
నీమేను నామవైభవంబులను, నీపరాక్రమ
ధైర్యముల శాంతమానసము నీవను వ
చనసత్యమున రఘువర! నీమెడ, సద్భక్తి
యు జనించకను దుర్మతములను, కల్ల
జేసినట్టి నీమది, నెఱింగి సంతతంబునను గుణ
భజనానందకీర్తనము జేయువా-రెంద.
భాగవత రామాయణగీతాది శ్రుతి శాస్త్ర
పురాణపు, మర్మములన్ శివాదిషణ్మత
ముల-గూఢములన్ ముప్పదిము-క్కోటి
సురాంతరంగముల భావంబుల, నెఱిగి భావ
రాగలయాదిసౌఖ్యముచే చిరాయువు గ
లిగి నిరవధిసుఖాత్ములై, త్యాగ-రాజాప్తు
లైన వా- రెంద.
ప్రేమ ముప్పిరిగొను వేళ నామము దలచువారు
రామభక్తుడైన త్యాగరాజనుతుని నిజ
దాసులైనవా- రెంద.

ఇట్టి మహనీయులకు వందనమర్పించుచు శ్రీ త్యాగరాజస్వామి భక్తియుతగానోపాసకుల వివరము నిచ్చియున్నారు. దీని ననుసరించి గానము నుపాసించియనేకులు తరించినట్లు గమనింపనగును. భక్తియుతగానము : ఇట్టిది పరమోత్కృష్టదశయందుండవలసినదిగా ముఖ్యోద్దేశము. ఇయ్యది దైన్యస్థితినందిహీనజాతి పాలైనను భక్తిసహితమగునేని యనుష్ఠించువారిని సన్మార్గావలంబకులుగనే చేయుననుట సర్వవాదాంశము. కాని నానాటికి గానమునకును భక్తికిని విరోధము ఘటించి యనేక శృంగారరసప్రధానములగు జావళీలు మొదలగువాటిని కల్పించి శృంగారరసప్రవాహోద్వేగ జనితాగాధావర్తముల మున్గి, వెలువడ మార్గము గనుటకేని యిచ్చ జనింపకయు, జనించియు గానకయు, నథఃపతనమొనరించుటచే, నీగానముయొక్క మొదటి యుద్దేశ మడుగంటిన దనవచ్చును. ఇట్టిహీనదశ ఆధునికగాయకోత్తమోపాసితగానమునకే యనదగును. హీనజాతులందును గొంతవైనను గానము భక్తియుతముగ గననగును. ప్రతిగ్రామమునందును "రామయ్యా నీనామమెంతరుచిరా" అనుచు బాడుచు నాడుచు తన్మయత్వము బొందువారిని గననగును. గాని గాయకులన్నో పిడేలువాద్యకుడు మార్దంగికుతో, మార్దంగికుడు గాయకునితో, గాయకుడు తాళము వేయువానితో, పరస్పరము కరాకరి, బాహాబాహి, కేశపాశము లూడిపోయి అవస్థపడి పోరాడుచున్నట్లు గాననగునేకాని, పాడుచున్న పాటయొక్క-భావము నెరుగుటకాని, దానిననుభవించుట గాని తనచిత్తమున నాభావమును గల్పించి యారాధించుటగాని యేదియును గానరాదు. హాయి హాయియని శ్రోతలు తలలూచుటయు గనుచున్నాము. ఇదియు గొంతమేలే. గాయకుడు "జారచోరశిఖామణి" యను బిరుదము

నకు గురియగు చింతయు శోచనీయము. దీనికి ముఖ్యకారణము, యీగానవిద్య నిపు డుపాసించువారు విశేషముగ వేశ్యాంగనలౌటయు నగును. ఏలనన వారికి తగిన ప్రోత్సాహ మున్నదిగనుక. శృంగారరసభూయిష్ఠమగు గానమునే వా రుపయోగించుట, వినువారి నాకర్షింపుట యే, వృత్తియగుడు వారి ముఖ్యోద్దేశము. ఇదిమిగులననర్థక మగుచున్నది. ఇదిగాక వివాహాదిసందర్భములందును, దేవతాద్యుత్సవాదులందును, దేవతాదర్శనమునకన్నను, దేవునివిగ్రహ ముండు తావునకన్న, ఆవిగ్రహముతో నూరేగు వేశ్యాంగనాసమీపమున నెక్కుడు జనసమూహము గాననగును. భక్తికై దేవతాదర్శనమునకు బోయి, బహువిధాలంకృతులై, శృంగారరసప్రధానులై, దేవతయందు చిత్తైకాగ్రతానిమగ్నులగుటకుమారుగ, నచట నటించు వేశ్యాద్యంగనాదర్శన, స్పర్శన, భాషణ, శ్రవణ, మననములందదేకధ్యానపరాయణులై, దేవతారాధనమునకు దూరులై, కామాదిదేవతాలోలత్వమున చిత్తైకాగ్రతను సాధించుచున్నారనుట మిగుల శోచనీయము,నింద్యము. మరియు గానము సర్వజనాకర్షణము. అందు శృంగారమిశ్రమయిన మఱియు పామరులకేగాక పండితులకుగూడ సమ్మోహనము. (అనగ క్షేత్రయ్యగారి పదములు మొదలగునవి ఇందు చేరవు.వివరము ముందు వ్రాయబడును). దీనికి తార్కాణముగ భక్తి వినా సంగీతఫలమునకు శ్రీత్యాగరాజస్వామివా రిట్లు చెప్పియున్నారు.

ఉదయరవి చంద్రిక - ఆది.

ప. ఎంత నేర్చిన, ఎంతజూచిన
 ఎంతవారలైన, కాంతదాసులే.

అ. సంతతంబు శ్రీకాంత స్వాంత సి
 ద్ధాంతమైన మార్గ-చింతలేనివా-రెంత.

చ. పరహింస పరభామా న్యధన పరమానవా
 పవాదపరజీవనాదుల కన్నృతమే-భాషించెద
 రయ్యా! త్యాగరాజనుత-ఎంత

దీనినిబట్టి ఎట్టివారైనను కామాదిలోభులగుటచే శృంగారరసయుతమై మఱియు నంగనామణిసాభినయముగ నాట్యమాడుచు గాన మొనరించిన జనుడు పడిపోవుచున్నాడు. ఇట్టిది వీరికి బోధించుగురువులగు నాథునికగాయకులకు పై బిరుదము నారోపించబడినదనిన నాక్షేపణ ముండదు. కాని దీనికి బాసి తప్పించుకొనినవారుమహనీయులుబహుకొలదిమంది నూటి కొక్కరు వేయికొక్కరు మాత్రము లేకపోలేదు. వారికి వందనశతములు."బ్రహ్మకైన బుట్టు రిమ్మతెగు" లనినట్లు సామాన్యగాయకుడు నిట్టి దుర్వస్థకు లోలుడు గావలసివచ్చుచున్నాడు. ఇయ్యది గానము భక్తివిరహితమగుచో మాత్రమే గాయకుల కిట్టి దుస్థితి చేకూర్చునది. కాని భక్తియుతగానము మాత్ర మట్లుగాక యుపాసకుని పరిశుద్ధునిగ నొనర్చుననియు నందు గల్గు నానందము వర్ణనాతీత మనియు శ్రీత్యాగరాజస్వామివా రిట్లనిరి.

కాపి - ఆది

ప. ఇంత సౌఖ్యమని నే జెప్పజాల
 ఎంతో ఏమో ఎవరికి దెలుసునో?

అ. దాంత! సీతాకాంత! కరుణా
స్వాంత! ప్రేమాదులకే తెలుసునుగాని-ఇం
చ. స్వరరాగలయసుధారసమందు
వరరామనామమనెడు కండ చ
క్కెర మిశ్రము జేసి భుజించు శం
కరునికి తెలుసును త్యాగరాజవినుత-ఇంత
"స ఏవ శంకరో వేత్తి సమగ్రం వేత్తి నాపరః"

ప్రస్తుతమున వ్యవహరింపబడు చున్న మనగానము దాని ముఖ్యసార్థక్యసాధనమును గోల్పోవుటయే కాక తద్వ్యతిరిక్తమగు దీన దశ నందియున్నది. ఇట్టితరుణముననే "సంభవామి యుగేయుగే" యనునట్లు శ్రీత్యాగరాయలు మొదలగు వాగ్గేయకారకభక్తాగేసరు లుద్భవిల్లి భక్తిరసప్రధానములగు గేయముల రచించి తమ రుత్తీర్ణులగుటయే కాక, పండిత పామరజనులందరి నుత్తరింప జేయుటకై పాడి యుండిరి. వీరి యుద్దేశము ననుసరించి గానమును భక్తిరసముతో జేర్చి పాడుభక్తజనులకు నైహికాముష్మికములు కరతలామలకములై యొప్పారుననుట నిర్వివాదాంశము. ప్రతిమనుజుడును దనయంతరాత్మ సరియని బోధించిన రీతి సాధించి యొనరింపబూనుట ముఖ్యకర్తవ్యము. ఈతీరున ఆత్మ బోధించినరీతిని తనమనసు ఆచరించునట్లొనర్పసాధించుటకు ముఖ్యసాధనము భక్తియుతగానమే.

శంకరాభరణము - ఆది.

ప. స్వరరాగసుధారసయుతభక్తి
స్వర్గాపవర్గమురా - ఓమనస.
అ. పరమానందమను కమలముపై
బకభేకము గలిగియేమి- స్వర!
చ. మూలాధారజనాద మెరుగుటే
ముదమగుమోక్షమురా
కోలాహలసప్తస్వరగృహముల
గురుతే మోక్షమురా ఓమనస. -స్వర.
బహుజన్మములకు పైని జ్ఞానియై
బరగుట మోక్షమురా
సహజభక్తితో రాగజ్ఞానసహితుడు
ముక్తుడురా ఓమనసా! -స్వర.
మద్దళతాళగతులు తెలియక యే
మర్దించుట సుఖమా?
శుద్ధమనసు లేక పూజచేయుట
సూకరవృత్తిరా ఓమనసా! -స్వర.
రజతగిరీశుడు నగజకు దెల్పుస్వ
రార్ణవమర్మములు
విజయముగల త్యాగరాజు కెఱుకే
విశ్వసించి తెలుసుకో ఓమనసా! -స్వర.

దీనిని గమనించి గానముచేయుటచే గాయకు లుపాసించవలసినవిధు లుద్బోధితము లగుచున్నవి. అట్లు గానము భక్తియుతము గావలెనని పెద్దలయుద్దేశము గావున నిట్లారాధించి గాయకులు తమచెడుబిరుదమును మాపుచేసికొనుటయు నైహికాముష్మికముల నందుటయు సుకరము.

ఇందు హిందోళ యనురాగమునకును దత్ పంచరాగిణులకును ధ్యాన శ్లోక రూపపటములు ముద్రితములు. వాటి వివరము:—

హిందోళ రాగము.

శ్లో. హిందోళికా(=హిందోళము)రిధత్యక్తా సత్రయఃకధితోబుధైః, మూర్ఛనాం శుద్ధ మధ్యాస్యా దౌఢవః కాకలీయుతః.

శ్లో. నితంబినీ మందతరంగితాసు డోలాసుఖేలా సుఖ మాదధానః, సర్వః కపోతద్యుతికామయుక్తో హిందోళరాగః కథితో మునీంద్రైః- దీనికిస్వరము 'సగమపనిస'

రాగరూపము:— పీతాంబరములను రత్నయుష్ణీషమును ధరించి, కాంచనదేహకాంతి గల్గి మన్మథుడను నాహ్వాయమంది, హేమడోలికయందు మిగుల శ్లావ్యమగు కంఠస్వరమున బాడుచున్నట్లు గలదు. భార్యలు మహోత్సాహులై యీతనియందే మోహపరవశలై ఎల్లప్పుడు నేమరక యీతని జుట్టి యుందురు. ప్రాతస్సాయంకాలములందు గేయము.

వేళావళీ =బిలావల్ =బిలహరి

శ్లో. ధైవతాంశ గ్రహన్యాసః పూర్ణా వేళావళీ తథా; పైరవీ మూర్ఛనా జ్ఞేయా రసే వీరే ప్రయుజ్యతే.

శ్లో. సంకేతదీక్షాం దయితేచ దత్వా వితన్వతీ భూషణ మంగకేషు; ముహు స్స్మరంతీ స్మర మిష్టదేవం వేళావలీ నీల సరోజ కాంతిః. పాఠాన్తరము (శివతత్త్వరత్నాకరం) "వితన్వతీ"యనుటకు "నితంబినీ", యనియు "స్మరం" అనుటకు "నృపం" అనియు గలదు. దీనికి స్వరము:—'ధనిసరిగమపధనిస, దనిసరిగమపద.'

రాగరూపము:—

విద్యుల్లతా భాతిదేహకాంతిగల్గి, రక్తాంబరములను నల్లని మేలిముసుగును ధరించి ద్వాదశవిధము లగు భూషణముల నలంకరించికొని సాంకేతికస్థలమునందు, సర్వమునుమరచి, తనవిభునిరాకకై ప్రతీక్షించుచున్నట్లుగాని దర్పణమందు తన ముఖమును జూచుకొనుచున్నట్లుగాని గానవగునని కలదు. ఉదయాది ద్వితీయయామమున గేయము

రామక్రియా - రామకిరి - రామకలి

శ్లో. షడ్జగ్రహాంశ కన్యాసా పూర్ణా రామక్రియా మతా, మూర్ఛనా ప్రథమా జ్ఞేయా కరుణే సా ప్రయుజ్యతే. షడ్జగ్రహాంశన్యాసఋషభధైవతవర్జమని కొందరు, పవర్జమని మరికొందరు "శ్లో. ఋధత్యక్తస్తుకైశ్చిత్తు కైశ్చిత్పంచమవర్జితా" ఇతి

శ్లో. హేమప్రభా భాసురభూషణాచ, నీలం నిచోళం వపుషా వహన్తీ, కాన్తేసమీపే పదమాశ్రితేపి, మానోన్నతారామ కిరీమతేయమ్ "పదమాశ్రితేపి" యనుటకు "కమనీయకంఠా" యని పాఠాన్తరము. స్వరము:—'సరిగమపదనిస-సగమపనిస- సరిగమదనిస' అనిగలదు.

రాగరూపము:—

మహాగర్వభూయిష్ఠయై ఎల్లపుడును ప్రియునితో నలిగియుండుననియు, ఆమె సంతసముదయింప కాంతుడువచ్చి సఖులెంతవేడి ప్రయత్నించి విసివినను, తనకాంతుడు వచ్చి తన పాదములను ముద్దుబెట్టుకొను వరకును తృప్తినొందజాలదనియు గలదు. ఆవిభుడువచ్చి పాదప్రణామమాచరించి తనను క్షమింపుమని మిగుల దైన్యముగ వేడికొనునట. ప్రాతఃకాల గేయము సంగవకాలగేయమనియు పాఠాన్తరము.

దేశాఖ్=దేశాఖ్యా=దేశాక్షీ.

శ్లో. షాడవ ఔడవ: ప్రోక్తః సంపూర్ణశ్చ త్రిధా మతా; వీరే రసే వ్యంజితరోమ హర్షా, నిరుధ్య యుద్ధే సవిలాసబాహుః, ప్రాంశు: ప్రచండా కిల ఇంద్రరాగా, దేశాక్షిరాగ: కథితో మునీంద్రైః.

శ్లో. దేశాక్షీ షాడవా జ్ఞేయా సత్రయేణవిభూషితా, ఋషభే వారియుక్తాసా శార్ఙ్గదేవేన కీర్తితా. నిరుధ్య "సంబద్ధ" యని పాఠాన్తరము.

స్వరము - 'గమపధనిధగనిసగ, గమపద నిసరిగ.'

రాగరూపము:—

స్థూలకాయము గల్గియు సౌందర్యవతియనియు, నీలవస్త్రముల ధరించి, తనభర్త వద్దకు మరి యేస్త్రీనిగాని పోనీయక యాతని మిగుల ప్రేమించుననిగలదు. దేహపరిశ్రమ జేసిన యోధునివలె పురుషవేషధారిణియై, ఖడ్గపాణియై, యుద్ధసన్నద్ధునివలె కాన్పించునని మరికొందరు వర్ణించియున్నారు. ఉదయాది ద్వితీయయామమున గేయము. ప్రాతర్గేయమనియు గలదు.

రాగరూపము: —

పదమంజరీ - పటమంజరీ - ఫలమంజరీ.

శ్లో. పంచమాంశగ్రహన్యాసాపూర్ణాచ పదమంజరీ, ఋషభే మూర్ఛనా జ్ఞేయా రసికానాం సుఖప్రదా "ఋషభే" యనుటకు హృష్యకా" యనియు గలదు.

శ్లో. వియోగినీ క్లాంతవిశీర్ణగాత్రా, స్రజం వహంతీ వపుషాచ శుష్కా, ఆశ్వాస్యమానా ప్రియయాచ సఖ్యా, సుధూసరాంగీ పదమంజరీయమ్.

"శిరోధరా బద్ధవిలాసబాహు" అనియు "విధూసరాంగీ"యనియు. పాఠభేదములు. స్వరము:- పధనిసమప-సరిగమపమ-పధనిసరిగమప.

భర్తకై విరహవేదన నొందుచు శుష్కాంగియై, దేహతాపమున పుష్పమాలయు వదలియుండ, చేయుంబనఖులు ప్రియునికై నిరీక్షింపుచు తదేకాయత్తచిత్తయై, మంచి యుడుపునైన, ధరింపనొల్లక యుండుననిగలదు. రాత్రి ప్రథమయామమున గేయము.

లలితా

శ్లో. రిపవర్జాచ లలితా ఔడవా సా త్రయా మతా, మూర్ఛనా శుద్ధమధ్యాస్యాత్ సంపూర్ణా కేచి దూచిరే; దేవతాత్రయ సంయుక్తా ద్వితీయా లలితా మతా.

శ్లో. ప్రఫుల్లసప్తచ్ఛదమాల్యధారీ, యువాచ గౌరోల్లసదాననశ్రీః; వనే శ్వసన్ దైవ వశాత్ప్రభాతేవిలాస వేషాలలితా ప్రదిష్టా.

"యువా...శ్రీః" యనుటకు "రుజాచ గౌరోత్పలలోచనశ్రీః", యనియు "వనేశ్వసన్" బదులు "విసర్గతా" "విలాస ప్రదిష్టా" బదులు" యస్యాః పతి స్సాలలితా ప్రదిష్టా."

స్వరము:—'సగమపదనిస' అథవా. 'ధనిసరిగమధ'

పాఠాన్తరము:—సగమపదనిస . దనిసగమద, యనియు గలదు. రాగరూపము:—

మిగుల సన్నని వస్త్రముల ధరించియుండుటవలన మిక్కిలి సౌందర్యవతియగు నామె మెరుగుతీవవంటి మైచాయగననగు ననియు, మందహాసమున నొప్పి పూర్ణశశాంకుని గేరు వదనముగల్గి యుండుననియు గలదు. కొందరు భర్తృవిరహిణి యనియు. పుష్పమాలికాహస్తయై చేటిక యొక్కతె ప్రక్కను నిలువబడియుండినట్లును వర్ణించిరి. ఉదయకాలగేయము. సాయంగేయమనియు పాఠాన్తరము.

దేశాక్షీ రాగిణీ



శ్లో. వీరే రసే వ్యంజిత గోమహర్షా, నిరుద్య యుద్ధేషవిలాస బాహుః;
ప్రాంశుః ప్రచండా కిల ఇంద్రరాగా, దేశాక్షి రాగః కథితో మునీంద్రైః.

లలితా రాగిణీ



శ్లో. ప్రఫుల్ల సప్తచ్ఛదమాల్యధారీ, యువాచ గారోల్లసదాననశ్రీః;
వనే శ్వసన్ దైవవశాత్ప్రభాతే, విలాసవేషా లలితా ప్రదిష్టా.



శ్లో. నితంబినీ మందతరంగితాసు డోలాసు ఖేలాసుఖ మాదధానః,
సర్వః కపోతద్యుతికామయుక్తో హిందోళరాగః కథితో మునీంద్రైః.



శ్లో. హేమప్రభా భాసురభూషణాచ, నీలం నిచోళం వపుసా వహన్తీ,
కాన్తే సమీపే పద మర్థితేపి, మానోన్నతా రామకిరీ మతేయమ్.

Lakshmi Art, Bombay, 8.

# ఆంధ్రకన్య

తురగా వేంకటరామయ్యగారు

రారా! నందకుమారా!
రాగలోకసంచారా!
గోపీహృదయవిహారా!
కోమలజలదాకారా!

ఆయము నాతోయములే
యందమె? చలి యేటికి! నా
కాటుకకన్నీటియేటి
కెరడుల జలకేళి దేల: రారా!

నేఁటిదె బృందావన! మే
నాఁటిదో! సొంపేమి మధుర
పరిమళాలఁ బొంగునాంధ్ర
వనవీథుల విహరింపఁగ: రారా!

తుమ్మెద లాననిపూవులు
తోఁటలెల్ల వెదకి తెచ్చి
తేనెసరాల్గూర్చితి నీ
తీయనికంఠానఁ దాల్ప: రారా!

కోయని తీయనిమామిడి
గున్నల తోఁటఁగఁబండిన
తొలిపండులవిందుకు మా
తోఁటకు రావేటికిరా: రారా!

ఆవులఁ బిదికినపొంగే
యారని తీయనిపాలం
గేరుచుఁ ద్రావుచుఁ దాండవ
కేళీలీలలఁ దేలఁగ: రారా!

ప్రాభాతసుమాంబుప్లుతం
బదనగువలపుంగందము
చేతులారఁ బూసెద నా
చెంతకు నీవింతనడల! రారా!

వేణుగానవీథుల నీ.
విశ్వము నాడింతువె! నా
వీణానాదసుధాలహ
రీనవడోలల నూఁపెద! రారా!

ప్రేమపుఁదోఁటల బూసిన
యామనిపూవుఁబానుపు
వలపుఁదరంగాల సుధా
భరితకళలఁ దేలింపుదు! రారా!

తెల్లనిచల్లనివెన్నెల
తెన్నులఁ బూఁదేరు నెక్కి
మామోహనపుష్పలతా
మందిరముల కాఁతిసె: రారా!

తెల్లనివెన్నెలకాంతుల
నల్లనయిన నీమూర్తిని
జగమెల్ల గ్రహించుననే
సందేహము వలదువలదు: రారా!

పరునాలినిగాను రాచ
పడఁతిని గా నసలె, నింద
పడ వోయీ! నాయంతనె
వలచినకన్నెకు భయమే: రారా!

నినుఁ బూజింపఁగఁ బెంచిన
నిరుపమానరాగసుమము
నంటక ముట్టక నింకే
యంబుధిలోఁ బడనైతువు: రారా!

మాయామర్మము లేక న
మాయికహృదయము నిచ్చిన
తెలుఁగుంగన్నియ నీలా
సిలుఁగులఁబెట్టుట మేలా: రారా!

అమ్మ నెఱుఁగ నయ్యనెఱుఁగ
నసలే మెఱుఁగను లోకము
కమ్మనైన నీరూపమె
కన్నులఁ దాండవమాడును: రారా!

# నేఁటితెలుఁగు కవిత-ఒకమిత్త్రుని ఆందోళనము

సోమంచి సూర్యనారాయణ శర్మ గారు

కవిత్వతత్త్వము ననేకుల నేకవిధములుగ నిర్వచించియున్నారు. ఎట్లైనఁ గవిత్వము భావావేశజన్యము. రసైకప్రధానము. అద్వైతి పరబ్రహ్మ మగురీతిని భావనావశమునఁ గవి సర్వప్రపంచము తా నగును. చిత్రకారుఁడు ప్రకృతినిఁ జిత్రించి ముదముఁ గొల్పినట్లు కవియు స్వభావవర్ణనముల బాఠకులఁ దనియించును; కోకిల వసంతమును గానము చేసినట్లు పరమేశ్వరుని సృష్టివిలాసములఁ గీర్తించుచుండును; జాతుల నజ్ఞానాంధకార మలముకొనినప్పుడు తన యఖర్వసాహితీశక్తిచేఁ బ్రబోధించి విజ్ఞానచంద్రికలఁ బర్వఁజేసి ప్రజలగోడుడుపును. ప్రకృతిరహస్యమును వెల్లడించుటయే యాతనిపని. ఒరుల నిందాస్తుతుల నాతఁడు గణింపఁడు. మానవనిర్మితశాసనముల కాతఁడు కట్టువడఁడు. అట్టికవి మానవయత్నమువలనను, అభ్యాసబలమువలనను నగువాఁడు కాఁడనియు నాతనిశక్తు లీశ్వరాపాదితములే యనియు "కవి ర్జాయతే నతు క్రియతే" యను సూక్తియే చాటుచున్నది.

తొలుతఁ 'దెలుఁగుకవులు అంతకుమున్నుఁ గలప్రయోగముల నరసి సంస్కరించియు క్రొత్తవి చేర్చియు రసావేశము నీభాషలోఁ జిల్కరించవలెను. ఈ యీ పద్యముల రూపమునఁ గూర్పవలెను. ఈయక్షరగణబద్ధ మీ వృత్తము.' ఇట్లే యేవో భాషానిబంధనలను ఛందోలక్షణములను నేర్పరచిరి. వాని నన్నిటి నానాఁడే పాటింపక కవు లెవరియిచ్చవచ్చిన మచ్చున వారు పలుపోకలఁ బోయి రని యిప్పుడు ధీమంతులగు సోదరులు పరిశోధించి వ్యాసములమూలమునను ఉపన్యాసములమూలమునను బోధించుచున్నారు. అట్టి సందర్భముల వాడుకలనేఁ గొన్నిటిని మనవారు నేఁడు మహాకవిప్రయోగములగుట సాధువుల నెదరు. అట్లు కొన్నియుద్గ్రంథములు స్వతంత్రరీతుల బయలువెడలి యనేకవిషయముల విజ్ఞానవ్యాపకమునకుఁ గారణములైనవి. "నిరంకుశాః కవయః" అను లోకోక్తి పుట్టిన దట్టిహేతువుల నేమో? భిన్నకాలికులగు నన్నయ శ్రీనాథాదు లితరలక్షణములవలన నుత్తమకవులేయని వారిని భాషాభిజ్ఞు లంగీకరించుచునే యున్నారు. ఆకవులనుబట్టియుఁ గొన్నిలక్షణగ్రంథము లవతరించినవి. తరువాత గొందఱుకవులు ఆయానిబంధనలను, కల్పనలను, ప్రయోగములను గూడ నక్షరధర్మములుగా గ్రహించి యనుకరించి యంధపరంపరగాఁ గేవలశృంగారరసప్రధానములగు కావ్యములను లిఖించి యొకటిచదివిన నింకొకటి చదువ నక్కఱలే దనిపించిరి. ఆకాలముల బూతులబుంగలగు గ్రంథములును బయలుదేరకపోలేదు. అందులకును

వారిని నిందింపరాదు. అప్పటి మహీపతుల మెప్పించుటకు వా రట్లు చేసియుండవచ్చును. నాఁటివారి కవి రుచించియుండవచ్చును. అది యంతయుఁ గాలమహిమ!

ఇట్టి పరిస్థితులలో మామిత్రులు శ్రీ ప్రాక్కులూరి లక్ష్మీనారాయణగారు 'నండూరి... యెంకి' అనుశీర్షికతో నేటికావ్యరచనను నిరసించుచు గతసంచికలో వ్రాసిన లేఖను జూడ నవ్వ వచ్చినది. ఆంధ్ర కవితామతల్లి స్వతంత్రవీథిని విహరించుచున్నదని వీరివిచారమైనట్లున్నది. ముందు చెప్పఁబడినట్లు కవిత యారీతి నేగదా విలసిల్లవలసినది! ఆమెను బంధించుఛాందసు లెవరు? కవితకును స్వేచ్ఛయుండఁగూడదా? కవితయన్న వీరిభావము వేఱుగునెడల వీ రింత శ్రమపడవలసిన పనియే లేదు. 'యెంకి' అనుపేరితో నొకరు వ్రాసినపాటను వీరు నిదర్శనముగాఁ గైకొనిరి. దానినే శీర్షికగాఁ జేసిరి. ఛందోనియమాదులు లేవని వీరి యాక్షేపణము. చాఁకలిపద్దును జంపకమాలలో వ్రాసినయెడల వీరు సంతసింతురా? కవిత ఛందస్సు నాధారముచేసికొన్నదా? ఛందము కవితపై నాధారపడియున్నదా? కవితను బట్టియేకదా ఛందస్సు బయలువెడలుట! అట్టిచో నొకకవి తనరచనకు ఛందమును దానే నేల నిర్ణయించుకొనఁగూడదు?

అందలిభావమును వివరింపఁ బనిలేదనిరి. భావమే లేదనియో అయ్యది యసభ్యమనియో వీరియభిప్రాయ మైయుండును. కొందు వవిషయములలో నయ్యది కవిత్వ మనిపించుకొనఁజాలదఁట. లక్షణవిషయము ముందే చర్చింపఁబడినది. వీరిని రేఁచినది భాషయా? కాదు. ఆ సంగతి వీరు తేల్చలేదు. రసమును గుఱించి యేమో వీరి కసహ్యము?

వీరివాదమును ఖండించుట కాదిచట కావలసినది. వాదమే లేనిది ఖండించుటెట్లు? ఖండించువా రెవరు? సమరసభావ ముండవలెనుగాని యట్లుచేసి యంతము చేయఁగలరా? తుదకు వ్యక్తిదూషణలలోనికిఁ దిగుటా? ముఖ్యముగా నాకుఁ బ్రసక్తి కల్గించినది వీరి విమర్శనస్వభావము; తన్నిరంకుశత్వము. ఆ ఖండకావ్యకర్తగారే భారతి నదివఱకు రెండుమారు లలంకరించిరఁట. రెండుమారులే కాదు. అనేకసారు లలంకరించిరి. భారతిపత్రికలో వారు వ్రాయఁగూడదనియా వీరియభిప్రాయము? కానిచో భాషాయోష నలంకరించుటే కవి బాధ్యత కాదా? ఒక్కవారే కాదు. పలువు రలంకరించిరి. పలుతెఱఁగుల భూషణములచే నలంకరించిరి. ఇప్పుడే కాదు. శతాబ్దులక్రిందటనే బయలువెడలినపాటలను, పదములను, దత్త్వములను, కృతులను వినరో వీరు? అట్టి రచనలను కవిత్వమనరో పెద్దవారు?

రసలోలుఁ డగు కవి యొక్కొక్కయెడ నొక్కొక్కరసమును బ్రదర్శించుచుండును. దుర్నీతిబోధకము సంఘబాధకము కానంతవఱకు నట్టి రచనలను గర్హింపవలసిన పని యేమి? దాన వాఙ్మయమునకు గల్గుననర్థక మేమి? బండబూతులను బంధపద్యముల నల్లిన నుపయోగమేమి?

'ఇట్టి వెఱ్ఱిశృంగార రసప్రధానఖండ కావ్యములం దలంపరేలొకో' అని వీరు, ఆంధ్ర శృంగారప్రబంధముల మచ్చునకేని లేకుండ మంటఁబెట్టనలె ననిరట మెవరో, ఆ విమర్శకులను హెచ్చరించుచున్నారు. ఇందలిరసము వీరేవగించుచున్న ట్లిందుమూలమునఁ దేట పడినది. శుద్ధప్రణయరసమును గవియైనవాఁడు చిత్రింపకుండెనా? దీనిని జిత్రపటములు ప్రదర్శింపఁగూడదఁట. వీరు గొప్పసంస్కారమును గోరుచున్నారు. విపరీతమైనసంస్కారమనుట నిజమునకు దూరమా? వీరికోరిక ప్రకారము చాలదూరము పోవలసివచ్చును. అజంతో చిత్తరువులవంటి యనేకప్రాచ్యకళలను నాశము చేయవలసివచ్చును. వాఙ్మయమునుండి చాల గ్రంథములఁ దొలగింపవలసివచ్చును.

ఇంతటితో వీరు తృప్తినొందక కవిగారు మొంకిని, మొంకి భారతిని విడువఁజాలకున్నారు కాఁబోలునని యొకవక్రోక్తిఁ బ్రయోగించిరి. అది కవిగారిమాట యటుండఁ బాఠకులకే కటువుగాఁ దోఁచుచున్నదని నా యభిప్రాయము. నామట్టునకు నాకవి యసభ్యముగఁ దట్టుచున్నది. మొంకిపేరును విడిచిన మాత్రమున వీరికి శాంతిజనించునా? వీరిహితోపదేశము విని విడువఁదలఁచుకొనిరేమో కవిగారు! వీ రెంత యాగ్రహపడినను కృపావల్లి భారతీమతల్లి యెట్లు తిరస్కరింపఁగలదు?

"కాటుకకంటి నీరు చనుకట్టుపయింబడ నేలయేడ్చెదో కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో హాటకగర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్ల కర్నాటకిరాటకీచకుల కమ్మఁ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

అని పరమభాగవతోత్తముఁడు పోతన యభయవాక్యము వల్కినటు లట్టి యకృత్య సమయములఁగాని యేపల్కులతోఁ గీర్తించిన నామె యలరదు? తనయునగు బిడ్డల మృదు వాక్యములను దల్లి త్రోసిపుచ్చునా?

క్రమము దప్పి యట్టిరచన లొనర్చువారు ముందువెనుకల నక్షరసంకేతములుగల విద్వాంసులు సాహితీవిశారదులు నట! వారు చేయురచనలను—భారతి విడువక చేపట్టుచున్న రచనలను—సక్రమమార్గమునకుఁ దెచ్చుటకు వీ రిట్లు విమర్శించుచున్నారా? వారేదో వహించిరన్న స్వేచ్ఛను వీరు సహింపలేక భంగము చేసెదరా?

ఇఁక నొక వాక్యముతో శ్రీలక్ష్మీనారాయణగారి విమర్శనము పూర్తియైనది. "అబ్బబ్బా! కొన్ని కవనంబులు వమనంబులు దెచ్చుచున్నవి". అట్టికవనమున ముఖ్యమైనదానిని గదా విమర్శకులు ముందుంచిరి. అంతకన్న వీరికి వమనంబులు దెచ్చునదియుండదు. పాపము! దానిపై వీరికున్నయసహ్యభావము నంతయు నిందులో నెడలఁ గ్రక్కిరి. ఇఁకనైన శాంతింతురా వీరు? అనఁగా వీరివ్యాసమున నుదహరింపఁబడిన పాట మీ కంతమోటుగాఁ దోఁచుచున్నదా?— కాదు— వమనములఁ దెచ్చుచున్నదా?

శ్రీవారు లోకానుభవము భాషానుభవము గలవారని వారివ్యాసమే చాటుచుండుట లేదా? పెద్దలగువారికి వేఱ విన్నవింపవలసినది లేదు. అభిప్రాయము భిన్నముగ నున్నప్పుడు వెల్లడింపవచ్చును. దోసములని తోఁచి

నవానిని విమర్శింపవచ్చును. తమకు నచ్చినయెడల నభిప్రాయము మార్చుకొనవచ్చును. కాని యేమిది? విమర్శనవికారమా? సంస్కారమా? సంస్కారతిరస్కారణమా? నిష్కారణనిగర్వాణమా? మొదలు విద్వాంసుల కవనమును గూర్చి వీరికి యేవకలుగుచుండఁ దమలేఖ కట్టి ప్రత్యేకవ్యక్తినిందార్థసూచకమగు నామమిడుటా? భారతిని బెదరించుటా? ఇది యరసికజనసహజధోరణియో? ఎల్లఱు నట్లు విమర్శింపవలసినదో? మాకొంట్లందఱకు మార్గదర్శకమా యిది? అని నాయట్టివాఁ డనవలసినదా? నారాయణా! నీకోడలు వాగ్దేవియెడఁ బ్రసన్నుఁడవు కమ్ము!

ఇంతదనుక నంటరానివాఁడు ననరానివాఁడు ననఁబడినవాఁడు నేఁడు సంఘమునందు సమాన ప్రతిపత్తిగౌరవములఁ బడయుచున్నాఁడు. దానికేమి? చుట్టలఁ గాల్చువారు వాతావరణమంతయు పొగధూమముతో నింపుచుండ సహించుట లేదా? మోటరుబండ్ల వలనఁ జెలరేగు పెంధూళిని భరించుచు పాదచారులు ముక్కుమూసికొని పోవుట లేదా? ఇట్టిహింసయేదైనను ఆరచనలలో విమర్శకునిదృష్టికిఁ దగిలెనా? లోకము స్వాతంత్ర్యవాయుపూరితమైయున్నదని వారే సెలవిచ్చిరే? ఎందుల కీగందరగోళము? వృథాయాసము? భిన్నభిన్నరుచులకన్నియు నవశ్యములే యగుచున్నవే? సమరసభావమను నవయుగనీతిని ప్రాజ్ఞులవలంబింపఁజనదా? ఎవరికిఁ బనికిరాని దేదైన దానియంత నదియే నశింపదా? బుద్ధిమంతులు నసంబద్ధవివాదములతో గాలము గడుపుచున్నందులకు సిగ్గుపడుచు మిత్రులగు లక్ష్మీనారాయణగారియెడఁ గలచనవు పెంపున నిట్టియనర్థకలేఖనముల విరమించి సావధానమగు భాషాసేవఁ జేయఁబూనుఁడని వేడుకొనుచున్నాఁడ.

పూర్వాధునికపండితకవిశిరోమణులయందలి సంపూర్ణగౌరవముతోనే యియ్యది వ్రాయఁబడినది. ప్రాచీనుల ప్రయోగములను వ్యాకరణాదినియమములను బాటించుచుఁ బద్యములు సెప్ప నేఁటిసమర్థుల నిందింపలేదు. ఛందోబద్ధముగఁ గూర్చినదే కవిత్వమని నూతనపథగాములు నీసడించి దూషణలలోనికి దిగువారి దురభిమాన దురహంకారములు పరిత్యాజ్యములని వెల్లడించుటే నాయుద్దేశ్యము. మామిత్రులయాగ్రహమునకుఁ బాత్రమయిన యీఖండకావ్యమునందలి యుత్కృష్టభావములనించుకేనియుఁ గాంచునటులఁ జేయగల్గునేమో యనునాసతో 'మెంకి' అనుపేరును గూడ మాని యీపద్యమును వ్రాయ సాహసించితిని. కవిగారును, పాఠకులును దోసఁగులను మన్నింపఁ బ్రార్థన.

చ. వెనుకటి జన్మమందునను బ్రేయసి! యెవ్వరమౌచునుంటిమో
యనఁగను వ్రీడచే నగుచు నద్భుతమందె; నీకెట్టి బాముసుం
గనెదము ముందు చెల్వ! యనఁ గ్రక్కునఁ దాఁ దెలఁబోయె; నింతిరో!
మన కిటు లెంతకాలము యమందసుఖంబుల సందుటన్నఁ గ
న్గొనలను బాష్పతోయమును గొబ్బున రాల్చె నదెట్టి ప్రేమయో. *

---

## నేను

[ ఒకరు ]

జిలుఁగు వసనాల మణిమయోజ్జ్వలమనోజ్ఞ
కాంచనాంచితభూషణగణముఁ బూని
రాజవీథుల రతనాలరథము నెక్కి-
వెడలు నిర్జీవపాషాణవిగ్రహంబ
చిమ్మచీఁకటి పొగల నిశీథమందు
క్షుద్రమందిరాంతరజీర్ణకుడ్యతలము
లందుఁ గన్నులు మూసి, యానందనిశిత
యోగవిజ్ఞాన మబ్బిన యోజ, నెడలు
మఱచి కులుకు దివాంధమా! మెఱుఁగులొ
చలువరాతి మేడల చెఱసాలలందుఁ [లుకు
దళుకు బంగారు సంకెళ్ళఁ దాల్చి, లోక
పాలకుని వోలె మురియు నో బానిసీఁడ!
ఓకుటిల పన్నగము! చెవి యొగ్గి వినుఁడు!
ఏను స్వేచ్ఛాకుమారుఁడ నేను, గగన
పథవిహారవిహంగమపతిని నేను,
మోహనవినీలజలధలమూర్తి నేను,
ప్రళయ ఝంఝూప్రభంజన స్వామి నేను!

---

*[శ్రీనండూరి వేంకటసుబ్బారావుగారిచే రచింపబడిన "ఎంకినాయెంకి" పై అనుకూలముగను ప్రతికూలముగనుకూడ వ్రాయబడిన విమర్శనములను ప్రకటించితిమి. వారిపాటలలో భావసంపదయుండుట వలననే భారతిలో వానిని ప్రకటించితిమి. విమర్శకులును ప్రతివిమర్శకులునుకూడ పాటయందలి భావమును వివరింపఁబూనుకొనక అనవసరవిషయములలో తమ వాదకౌశల్యమును ప్రదర్శించిరి. ప్రాకృతజనుల జీవితమును రసవంతముగ వారికి సహజమగు భాషలో గేయరూపమున బ్రదర్శించి వారి కుత్తేజమును పాఠకులకు వినోదమును మానసికానందమును గూడ గూర్పనెంచు శ్రీసుబ్బారావుగారి ప్రయత్నము శ్లాఘ్యము. విమర్శనపాత్రమైనపాటలో నసభ్యతగాని యనౌచిత్యముగాని లేదని మావిశ్వాసము. ప్రాకృతజనులు ముందువెనుకల జీవితమును పారజూచి కొని సంతోషవిచారాదిభావానుభవముల జెందు రసావస్థయే ఇందు యథోచితరీతిని బ్రదర్శింపబడినది. కాని పాఠకులయొక్క రుచిభేదములను ప్రదర్శించుననునూహతో మాత్రమే అనుకూలప్రతికూలవిమర్శనముల రెండిటిని బ్రకటించితిమి. ఈపాటను గూర్చిన చర్చను ఈపత్రికయం దింతటితో విరమించుచున్నాము.]

సంపాదకుఁడు.

# హిందూదేశమునందలి గోదుపరిశ్రమ

## గోదును తయారుచేయువిధము దాని కగువ్యయము

వి. ఎస్. చిన్నస్వామిగారు, బి.ఏ., సూపరింటెండెంటు, గవర్నమెంటు గ్లూఫ్యాక్టొరి, మదరాసు.




గోదు పరిశ్రమాలయము

వస్తుసామగ్రిని తయారు చేయునపుడు మిగులు వ్యర్థపదార్థములను మరియొకదానికి ఉపయోగించుటకంటె పారిశ్రామిక ప్రపంచములో అభ్యున్నతి సూచకమగునది మఱియొకటి గానరాదు. అందు ఒకపరిశ్రమ దానికి గావలసిన ముడివస్తువులకు చర్మపరిశ్రమలోనివ్యర్థపదార్థములపై నాధారపడి యున్నపుడు అది చాల నభివృద్ధి నొందిన దనుట స్పష్టము. సంశ్లేషణద్రవ్య (గోదు) నిర్మాణమునకై చర్మములను చివ్వగా వచ్చు నిరుపయోగమైన పొలుసుపదార్థము జర్మనీదేశమునకు విశేషముగా ఎగుమతి చేయబడుచుండెడిది. యుద్ధకాలమున వెల్లడియైన అనేక వాణిజ్యరహస్యములలో నిది యొకటి. ఒక్క చెన్నపురినుండియే యిపుడు లక్షరూపాయలకు మించియున్న కిమ్మతుగల యీపొలుసు పదార్థ మెగుమతి చేయబడుచున్నది.

దిగుమతి చేయబడుచున్న తక్కిన అన్ని రకములగోదులకంటె చర్మమునుండి చేయబడు గోదు గుణమునందు శ్రేష్ఠతరముగా నుండుటచే, పారిశ్రామికశాఖవారు 1916 సంవత్సరమునందే, చర్మశాలలయందు ద్వితీయపరిశ్రమగా దీనిని దయారుచేయుటకు యత్నములు సల్పిరి.

తయారుచేయు పద్ధతి

చర్మశాలలలో దొరకు నీపొలసు పదార్థము మొదట యంత్రసహాయమునను, తదుపరి రసాయనములవల్లను నీటిలో పరిశుభ్రము చేయబడును. నీటియందు కడుగబడిన యీ పొలసు గట్టిగా నదుమబడిన తరువాత యంత్రములలో (డ్రై జెస్టర్లలో) వేయబడును. అచ్చట నది ద్రవమై పరిశుభ్రముగా చేయఁబడి అవసరమగుచో తెలుపుగా కూడ చేయబడును. క్రమక్రమముగా కాచుటవలన యీగోదు ద్రవము మార్పు చెందును గాఢతనుష్ణమును బెంపొందించు పలుయంత్రముల (ప్రీహీటర్సు, ఫిల్మ్ ఎవాపరేటర్లు, వ్యాక్యూంప్యాన్సు) సహాయమున కాయఁబడును. ఆపిమ్మట ద్రవరూపమునను న్న యీ పదార్థము లోతులేని పళ్లెరములలో పోయబడి ముక్కలుగా గోసి యెండబెట్టబడును. ముడిపదార్థమును దానిద్రవమును కాచునపుడు ఎంత స్వల్పకాలము వినియోగించిన నంత మంచిది.

ఉపయోగములు

గోదు నిత్యనైమిత్తికములలోనిది కాకపోయినను, దానియొక్కయుపయోగములనేకములై దినదినాభివృద్ధి నొందుచున్నవి. వడ్రంగికిని పుస్తకముల బైండుచేయువానికిని నిది అత్యంతావశ్యకము. నిప్పుపుల్లలకును, రత్నములకు మెరుగుబెట్టు కాగితములకును, మెరుగుకాగితములకును, అచ్చుకాగితములపరిశ్రమలకును నిది ఉపయోగింపబడుచున్నది. దీనిని తెల్లసీసము సీమసున్నము రంపపొట్టులతో కలుపగా చిత్రపుపనులలో కొన్నిటికి పనికివచ్చు నొకపదార్థముగా తయారగును. గ్లిసరీనుతో చేరి అచ్చుయంత్రముల రోలర్లు చేయుటకు పనికివచ్చునదియై యున్నది.



పరీక్షాయంత్రము

గోదుపరిశ్రమప్రాముఖ్యము

హిందూదేశములోని కీపదార్థమెంత దిగుమతిచేయబడుచున్నదో తెలుసుకొనినట్లయిన నీపదార్థమునకు భరతఖండమున ప్రస్తుతమెంత గిరాకియున్నదో తెలియును. కడచిన కొన్నిసంవత్సరములలో 4 లక్షల రూపాయలవిలువగల దాదాపు 600 టన్నుల గోదు హిందూదేశములోనికి దిగుమతి కాబడినది. సంవత్సరము పొడుగునను

విరివిగా దీనిని తయారుచేయుటకు గల అనుకూలములు చెన్నపురిలో చూపబడినవి. చెన్నపురిలో పరిశోధనదశలోనున్న కర్మాగారము 1922 సంవత్సరమునుండియు పారిశ్రామికశాఖవారి యధ్యక్షత క్రింద నున్నది. అచ్చట తయారు చేయబడిన గోదు మిక్కిలి శ్రేష్ఠముగా నున్నది. గుణమున దీనితో సమానమై ధరలో దీనికంటె చవుకయగుగోదు హిందూదేశములో మరియొకటి తయారుచేయబడగలదనుట నమ్మశక్యముగాదు. చర్మములనుండి తయారుచేయబడు ఇటాలియా, ఇంగ్లీషు గోదులు మిక్కిలి ప్రియమగుటచే పోటీకి నిలువజాలవు. పైనజెప్పిన విషయములవలన యీపరిశ్రమయొక్క ప్రాముఖ్యము విశదమగుచున్నది. ఈపరిశ్రమను చేయదగిన చోటును అందుకు కావలసిన పెట్టుబడియు, గోదు మొదలయినపదార్థములు అమ్ముడుబోవు చోట్లను పరీక్షించితిమేని ఉపయోగకరమైన యీపరిశ్రమయొక్క అభివృద్ధి స్పష్టమగును. ఈ పరిశ్రమాలయమును స్థాపించుటకు తగినప్రదేశమును నిర్ణయించుటయే స్థాపకునకు మిక్కిలి కష్టసాధ్యము. ఈపరిశ్రమకు చర్మశాలలును, ఆస్థానములు మధ్యస్థముగా గలిగిన మార్కెట్టులును, చవుకయగుకూలి వీనిని స్థాపకులు శ్రద్ధగా గమనింపవలెను. ఈపైన జెప్పబడిన విషయములకు తోడుగా ఆప్రదేశము సమశీతోష్ణమైనదైన యెడల వేడిగాని తడిగాని ఎక్కువగాగల ప్రదేశములయందు కంటె గోదు మరింత చౌకగా తయారగును. కాబట్టి గోదు పరిశ్రమాలయములు చౌకగా ముడివస్తువులను సంపాదించుకొనుటకై (సాధ్యమైనంతవరకు) చర్మశాలలకు చేరువలో నుండవలెను. ఈకారణములవలనను మరి యితర కారణములవలనను ఈపరిశ్రమకు చెన్నపురియు కాన్పూరును మిక్కిలి తగియున్నవి. ఈగోదు తయారుచేయుటకు మరియొకమార్గము కలదు. ప్రస్తుతపు పరిస్థితులతో నున్న చర్మశాలలలో నొకయంగముగా గాని లేక మెరుపులు తయారుచేయు పరిశ్రమాలయములలో నొకయంగముగా గాని యుండవచ్చును. మొదటిరీతి నైనచో చర్మశాలచేయవలసినవిధులు రెండుగలవు. గోదు అమ్మకము, గోదులో మిగిలిన అనవసర పదార్థముయొక్క అమ్మకము, రెండవరీతి నైనచో గోదుఅమ్మకము తక్క అనవసరపదార్థము నమ్ముటలో కష్టముండదు. ఏలయన: ఎరువులు తయారుచేయువారు వ్యర్థపదార్థమును త్వరగా అమ్మ గలరు. అదియును గాక చర్మపుగోదును ఎముకగోదును కలిపి చక్కనిమిశ్రమమును తయారు చేయుదురు.

ప్రస్తుతపుపరిస్థితులతోనున్న చర్మశాలలో నొకభాగముగా గాని, లేక మెరువులు తయారుచేయుస్థానములలో నొకయుపాంగముగా గాని యీపరిశ్రమను సాగించినయెడల కలుగులాభముల నించుమించుగా నీక్రింది వివరములు చూపింపగలవు. ఈ పరిశ్రమకు కావలసినఆవిరి, నీరు, శక్తి చర్మశాలలలోని యంత్రములుగాని, ఎరువులు తయారుచేయుయంత్రములుగాని సప్లయి చేయునను నమ్మకము గలదు. అందుచే వానికి గావలసిన

పెట్టుబడివిషయ మీాక్రింది లెక్కలలో చేర్చ బడలేదు.

ఆవిరి మొదలగు వానికి నెలకు చొప్పున రు 500 రు 6,000

కూలీలకు నె 1-కి రు 500 చొప్పున రు 6,000

రసాయనశాస్త్ర వేత్తకు నెలకు రు500చొప్పునరు6,000

ఆఫీసు ఖర్చులు, ప్రకటనలు రు 3,000

పెట్టుబడిమీాద వడ్డీ రు 3,000

మొత్తము రు 48,000



పవరుహౌసు

I యంత్రస్థాపనకు వలసిన మూలధనము

| | | |
|---|---|---|
| 6 డైజస్టర్లు | రు | 1500 |
| 2 రియాక్షన్‌వాట్లు | రు | 500 |
| 2 ఫిలిమ్ ఎవాపరేటర్లు | రు | 12000 |
| 2 ఫినీషర్లు | రు | 10000 |
| స్టీమ్ కనెక్షనుకు | రు | 1500 |
| డైయింగు ర్యాకులు, మోల్డుప్లేట్లు | రు | 5000 |
| శుభ్రముచేయుట మొదలయిన వానికగు వ్యయము | | 7800 |
| మొత్తము | రు | 38,000 |

II ఒక సంవత్సరము పరిశ్రమను సాగించుట కావలసిన సొమ్ము.

400 టన్నుల పాలసు

. టన్ను 1-కిరు 60 చొప్పున రు 24,000

III సంవత్సరమునకు ఆదాయము

100 టన్నులగోదు, టన్ను 1 కి రు 600 చొప్పున రు 60,000

100 టన్నులగోదులో మిగిలిన వ్యర్థపదార్థము టన్ను రు 20 చొప్పున రు 2000

మొత్తము రు 62,000

ఈవిధముగా యంత్రములపై వెచ్చించిన ధనము 3 సంవత్సరములలో తీరిపోవును.

పైనచెప్పబడిన విషయములుగాక యీ కర్మాగారము ననుసరించి రోలగు కాంపోజిషను రత్నముల మెరుగుపెట్టు కాగితములు మెరుగు కాగితములు మొదలగు చిన్నపరిశ్రమలుచేయవచ్చును. రోలక్ కాంపొజిషను పరిశ్ర

కూడ నొకవాణిజ్యరహస్యము. ఇప్పుడు హిందూ దేశశీతోష్ణస్థితికి తగినరోలరు కాంపొజిషను తయారుచేయుటకై పలుపు పరిశోధన లభివృద్ధి చెందుచున్నవి. ఈపదార్థమును సరిగా జేసి అమ్మగలిగిన యెడల కర్మాగారము స్వాతంత్ర్యముగా నడుచుననుట కెట్టిసంశయమును ఉండదు.



ఎవాపరేటరులు

గోదుపరిశ్రమ రాసాయనికవాణిజ్యము. పైన చెప్పినదానింబట్టి వాణిజ్యసంపద యీ పరిశ్రమాభివృద్ధికి సాయపడగలదు. ముడి వస్తువులపై విధింపబడు కేవు, యీపదార్థము విరివిగా తయారుచేయబడినయెడల తగ్గును. మరియు తయారుచేయుటకగువ్యయముకూడ తగ్గును. హిందూదేశములో గోదుపరిశ్రమ ముఖ్యమైనది. మంచిగోదును బాగుగా తయారుచేయుట కగుకష్ట మిదివరకే నివారింప బడినది. కాని వీని నమ్ముటలోను, విదేశపు పోటీల నెదుర్కొనుటలోను గల కష్టమింకను తీరలేదు. చిరకాలముగా స్థాపింపబడియున్న విదేశకర్మాగారములు పోటీకష్టములను బాగుగ నెదుర్కొనగలవు.

హిందూదేశములోని వర్తకులలోను పారిశ్రామికులలోను గల పలువురు ప్రముఖులు యీ కర్మాగార స్థాపనముల విషయమున భిన్నాభిప్రాయములు గలవారై యుండిరనుసంగతి యెల్లరెఱింగినవిషయము. ఏలయన: ఇది "బలవంతపు బ్రాహ్మణార్థ'మనియు 'అలవాటులేని ఔపాసన' యనియు వీరియభిప్రాయము. కాని వీరొకముఖ్యవిషయమును మరచిపోవుచున్నారు. అదేదన: హిందూదేశమును కేవలము పరిపాలించుటయే కాక రక్షణను కూడ చేయుచుంటిననిచెప్పు ప్రభుత్వమునకు, ప్రజలయొక్క ముఖ్యాశయములను రక్షించుటయే కాక వృద్ధినొందించుటకు తగిన సదుపాయములు కల్పించుట కూడ విధియైయున్నది. మరియొక విషయము; హిందూదేశమున విద్యయు వ్యాపారసాహసమును చాలతక్కువగా నున్నవి. అందుచేత పరిశ్రమల స్థాపించుబాధ్యత ప్రజానాయకులలపై నాధారపడి యున్నది. అంతయేల?

ఇట్టికర్మాగారములను స్థాపించుట ప్రజలకు వర్తమానమహోన్నతపారిశ్రామికపద్ధతుల యందు విద్యగరపుట కాని అన్యముకాదు. కావున నిటువంటి ముఖ్యమైన పరిశ్రమను స్థాపించుటకు ప్రభుత్వపుసాయము అత్యావశ్యకముగా కన్పట్టుచున్నది. ఇంతకంటె కొంత కాలమువరకు దిగుమతి సరకులపై పన్నును విధింపుమని క్రొత్తగానేర్పడినటారిఫుబోర్డువారుశిఫారసు చేసినప్రకారము శాసనము లేర్పరచినట్లయిన హిందూదేశములోని ప్రయివేటు పెట్టుబడిదారులు తమపరిశ్రమలను సాగించుకొనుటకును గట్టిపరచుకొనుటకును సాయపడగలదు; కాని ప్రభుత్వమువారుదానిని నిర్వహించుచున్నంతకాలము తక్కువఖర్చులతో దానిని నడుపుచు అభివృద్ధిగాబోవు పరిశ్రమను స్థాపించుటలో తమ విధిని తాము నిర్వహించితిమని ప్రజలకు తెలుపుట ప్రభుత్వమునకు విధియైయున్నట్లు కన్పట్టుచున్నది. చెన్నపురిలో నున్న కర్మాగారము60-80టన్నులగోదానరకు తయారుచేయశక్తిగలది. మూడుసంవత్సరముల నుండి పనిచేయుచున్నది. కాన పెట్టుబడిదారులు ముందంజవేసి యీపరిశ్రమ నభివృద్ధిచేయుటకు అనుకూలముల నరయవలసియున్నది. ఇది కావలసినవారలు అనుకూల విమర్శనచేసి దీనిగుణమును పెంపొందించుటకు మార్గములను చూపవలసియున్నారు. పారిశ్రామికభాగ్యమునకు దీని స్థాపన మరియొక లాభముగా ప్రజలు తృప్తిపొందుదురు.

---

## ఒకనాఁడు

సంద్యారం వెంకటసుబ్బయ్యశర్మగారు

పేడిపండువోలె మిసమిసలాడక,
వేశ్యవోలె వెఱ్ఱి వేడబములు
కానుపింపబోక, చాన యించుకనవ్వి
సౌకుమార్యమెల్ల నాకుఁ దెలిపె.
అరయరాని తావులందుఁ బుట్టువుగాంచి
ప్రణయరసము నేత్రపల్వలముల
నినిచెఁగెలఁకులందుఁ దానికె నానందము
ప్రకృతి యెల్లఁగనులపండువయ్యె.

### మఱొకనాఁడు

చెలికుదంటు తీపిదొఱఁగిన విధమునఁ
గలికి కనులు ముదము చిలుకరింప
వకట, పెదవులందు నణఁగిన యెలనవ్వ
వెలయదిపుడు, సిగ్గువిడువదపుడు.
విన్నుమానికంబు విరియింప లేదటె
తమ్మిపూవ్రునలవు దప్పిచనెను?
కన్నుదోయి జగముగాంచగా లేదటె
వెల్లివిరిసి వలపు గొల్లగొనెను?



చిత్తూరు — ఫుట్టసింహుని సౌధము

16.వ శతాబ్దము - మొగలాయిసామ్రాజ్యము

Lakshmi Art, Bombay, 8

# పుట్టసింహుఁడు

(చిత్తూరు ముట్టడి)

మొగలాయి చక్రవర్తులలో నాక్బరు చండశాసనుఁడు. అతని తీవ్రప్రతాపమునకు వెఱచి రాజస్థానమునఁదలి రాజపుత్ర రాజ్యములన్నియు నతని యధీనములయ్యెను మేవారు రాజ్యముమాత్రము కాదయ్యెను. మేవారు రాజపుత్రవీరులు ధైర్యసాహసములచే నొప్పియుండువారలు కావున నాక్బరును లెక్కగొనకుండిరి. అయ్యది యాక్బరునకు హృదయశల్యమువలె సహింపశక్యముగాకుండెను. ఎన్నిసారులో యతఁడు మేవారురాజధానియగు చిత్తూరుపై దండయాత్ర సాగించెను. కాని ఫలితము లేకపోయెను.

1567 వ సంవత్సరమునఁ జిత్తూరు రాజపుత్రవీరులలో నంతఃకలహములు పుట్టెను. దానిని చారులవలన నెఱిఁగి యాక్బరు వెంటనే పెద్దసైన్యముతోఁ జిత్తూరును ముట్టడించెను.

మేవారు రాజపుత్రవీరుల ధైర్యసాహసాదిగుణములు, దేశభక్తి, యాక్బరునకు సువిదితములు. తన సైన్యము లెక్కకు మిగిలి యున్నను జిత్తూరును జయించుటకుం దాతనికి సంశయము మెండుగనుండెను. కాని యతఁడు ధైర్యమును వీడక ముట్టడి సాగించెను. అక్బరు సేనలు చిత్తూరును నలువైపులఁ బది మైళ్ల మేరనుండి సముద్రమువలె ముంచివైచెను.

ఆసమయమునఁ జిత్తూరు నుదయసింహుఁడు పాలించుచుండెను. ఆతఁడు మిక్కిలి పిఱికివాఁడు. యుద్ధముమాట చెవినిబడినమాత్రమున నాతనికి దిగులు పుట్టెను. వీరాగ్రణులచే నొప్పారుచుండిన మేవారురాజవంశమునకతఁడు కళంకమును గూర్చెను. మొగలాయి సేనలను గాంచి యతఁడు భయమునుజెంది ధైర్యముతోపాటు పురమునుగూడ విడిచిపాఱిపోయెను. పాలకుఁడులేకున్నను జిత్తూరుప్రజలు పరాక్రమమునెఱపి తమదేశమునురక్షించుకొనఁ దలఁచిరి. వారు తమలోఁ గొందఱు పరాక్రమశాలురను దమకు నాయకులుగా నేర్పరుచుకొనిరి. వారల ముందుంచుకొని దేహములఁ బ్రాణములుండు వఱకు మాతృదేశరక్షణార్థ మనల్పప్రయత్నములు గావింప నిశ్చయించుకొనిరి. రాజపుత్రవీరులు దమప్రక్కను గాలసర్పములవలె వ్రేలుచున్న ఖడ్గములు కేవల మలంకారములు గాక శత్రుకంఠరక్తమును గ్రోలఁజాలినవని యెఱుఁగుదురు. కావుననే వారు యుద్ధమునకు వెనుదీయరైరి.

ఆయుద్ధమున రాజపుత్రవీరులు చూపిన పరాక్రమము వర్ణనాతీతము. వారలలో నసామాన్యధైర్య శౌర్యములతో శాత్రవసైన్యములఁ జించి చెండాడి తుదకుఁ దమరక్తధారలచే రణభూమిని బవిత్రముగావించి వీరస్వ

ర్గము నలంకరించిన వారు పదునార్గురు. వారి కీర్తి నీనాఁడును రాజస్థానమునందలి కవీశ్వరులు గౌరవముతో గానముచేయుచున్నారు. ఆపదునార్గురిలోఁ బేరెన్నికగన్నవారలిరువురు. వారు బెడ్నూరు జయమల్లుఁడు, కెల్వ పుట్టసింహుఁడు ననువారలు. వీరినామముల నాక్బరుచక్రవర్తి స్వర్ణాక్షరములతో మేవారు చరిత్రమునఁ జేర్చెను. మేవారు రాజపుత్రులలో వన్నెగాంచిన యీ వీరాగ్రణుల నామములాచంద్రతారకము రసపుత్రుల స్మృతిపథమును వీడవనుట యతిశయోక్తి కానేరదు.

మొగలులు పట్టణమును ముట్టడించి సూర్యద్వారమువలనఁ గోటలోనికిఁ బ్రవేశింపఁజూచిరి. వారినాఁగి యనేకులు రాజపుత్రవీరు లచ్చట హతులైరి. తరువాత ద్వారసంరక్షణము పుట్టసింహుని పాలఁబడినది. ఆతఁడపుడు పదునాఱు సంవత్సరముల ప్రాయమువాఁడై యుండెను. అంతదనుక నాతఁడాటలయందే కాలముగడపుచుండెను కాని యుద్ధములయందుఁ దన పరాక్రమమును జూపించు నావశ్యకత లేకపోయెను. ఐన నాతని బాహుబలము, శౌర్యము, యుద్ధముల నాఱితేఱిన పోటుమానిసులకైనను దలవంపులు గల్గించుచుండెను.

పుట్టసింహుఁడు జన్మించిన వంశ ముత్తమమైనది. పుట్టసింహునితండ్రి యతిపరాక్రమశాలి. ఆతఁ డంతకుమున్నచట జరిగిన యొక యుద్ధమున దేశసేవాపరాయణుఁడై తనజీవములఁ గోలుపోయెను. అపుడు పుట్టసింహుఁడు పిన్నవయసువాఁడు. అతనిని బెంచి పెద్దఁగావించుటకై తల్లి భర్తృసహగమనము గావింపక జీవించియుండెను. కడుగారాబముతో నామె పుత్రుని బెంచి గురువులచే నెల్లవిద్యలను నేర్పించెను. పట్టణమునందలి పోటరులందఱిలో నాతఁడు మేటియయ్యెను. తల్లియు నట్టిపుత్త్రుని గాంచుటచేఁ దన జీవితము సార్థకమయ్యెనని యానందించుచుండెను.

పుట్టసింహుని తల్లి చిత్తూరికిఁగల్గిన దుఃరవస్థకుదుఃఖితమై ప్రియపుత్రుఁడగుపుట్టసింహుని జేరి చెక్కిలి నొక్కి ముద్దాడి "పట్టీ! రసపుత్రవీరా! ఇంతకాలము శత్రుహృదయ శల్యమైయుండిన యీచిత్తూరు రాజ్య మీనాఁడు మొగలులచేఁ జిక్కనున్నది. పెక్కండ్రు రాజపుత్రసోదరులు దేశాభిమానముతో దేహాభిమానమువీడి యీయిక్కట్టు సమయమున శత్రువులతోఁబోరి తమ ప్రాణములను బలియిచ్చుచున్నారు. నీవును దేశాభిమానమును జూపి నీ పరాక్రమమును శత్రువులపై నెఱపుము. వీరాగ్రణియని పేరుగాంచిన నీతండ్రి కీర్తికివన్నెవెట్టుము. వెంటనే యుద్ధమునకుఁ దరలుము. విజయలక్ష్మిని వరియించి కీర్తిని దిక్కుల నింపుము. ఒకవేళ రణరంగమున హతుఁడవగుదువేని వీరస్వర్గము లభింపఁగలదు. వీర పురుషులకు రణరంగమువిహారస్థానముగదా. పగతురకువెన్నిచ్చి జీవించియుండుటకన్న, మాతృదేశరక్షణార్థమై చంచలములైన ప్రాణముల వీడుట మేలు." అని యతని కభినివేశముగలుగునట్లు బోధించెను.

పుట్టసింహునితల్లి ధైర్యవతి. పరాక్రమమునకుఁబుట్టినిల్లు. ఆమెమాటలు పుట్టసింహున

కుతూహలమును గలిగించెను. అతని శరీరము పులకరించెను. రోషమునఁగన్నులెఱ్ఱనయ్యెను. చేతులజోడించి యతఁ డనుజ్ఞ వేఁడెను. రౌద్ర రస మాకారమును దాల్చెనో యన్నట్లున్న కుమారుని బలుమాఱు తల్లి ముద్దాడి యానందాశ్రువుల నభిషిక్తుని గావించి సమరమునకుఁ బోవ ననుజ్ఞయిచ్చెను.

అక్కడనుండి పుట్టసింహుఁడు ప్రేయసి గృహమునకుఁ బోయెను. అతనికి వివాహమై యప్పటి కల్పకాలమే యయ్యెను. అతఁడు భార్యను మిగులఁ బ్రేమించుచుండెడివాఁడు. నిర్మల హృదయముతోఁ దూఁగుటుయ్యేలపైఁ గూర్చుండి సవిలాసముగ నూఁగుచున్న సౌందర్యరాశియగు భార్యనుగాంచెను. అకాలమున వచ్చిన భర్తనుగాంచి సంభ్రమమును సిగ్గును బెనఁగొన నుయ్యెలనుండి దిగి వినయముతో నామె నిలువఁబడెను. పుట్టసింహుఁడు ప్రేమార్ద్రహృదయముతోఁ బ్రియురాలిని గౌఁగిలించుకొనియెను. యుద్ధోచితాలంకారములఁ గని యతని రాకకుఁగారణము నడుగక యే తెలిసికొనియెను. కన్నుల నానందబాష్పములచే నింపెను. వలసినచోఁదామే యుద్ధమునకు సిద్ధమగు రాజపుత్రయువతులు మగఁడు యుద్ధమునకుఁబోవునన దిగులొందుదు రే? ఆసుందరీమణి విజయసూచకముగ భర్తకంఠసీమను బుష్పదామముతో నలంకరించి సంతోషముతో ననుమతిని దెలిపెను. పుట్టసింహుఁడు ప్రేమబంధముతోఁ బ్రేయసిమైఁదీగెను జుట్టియున్న హస్తబంధమును వీడి వెలుపలికి వచ్చెను. ఆయత్తముగనున్న యుత్తమాశ్వము నెక్కి యుద్ధభూమి వంకకు మరలెను.

రణరంగమునుండి వినవచ్చుచున్న భయంకరధ్వను లాతని శౌర్యమును స్వదేశాభిమానమును నినుమడింపఁ జేసెను. అతఁడొక చేతఁ దళతళ మెఱయుచున్న నిశితఖడ్గమును వేఱొక చేతఁ గళ్లెమునుబట్టి గుఱ్ఱమును వడివడిగ నడపుచుండెను. గుఱ్ఱము మెఱుపు మెఱసినట్లు లొక్కమొగిని జనశూన్యములైన చిత్తూరుపట్టణపు వీథులఁ దీవ్రవేగమునఁ బోవుచుండెను. అచట సౌధములనుండి యంగనామణులు తమ తమ భర్తలు, పుత్రులు, సోదరులు మొదలగు వారు యుద్ధమున నెఱపుచున్న పరాక్రమము ననన్యమానసలై చూచుచుండిరి.

కుసుమసుకుమారములగు నాపొలఁతుకలహృదయరంగములు రోషకలుషితములై యాసమయమున రణరంగముకంటె భయంకరములై యుండెను. పుట్టసింహుని తల్లియు రాణియు నట్టియువతీబృందముతోనివారుగనుండిరి. పుట్టసింహుఁడతి జవముతోఁ బోవుచు నొక్కపరి తన దృష్టిని వెనుకకు మరల్చెను. అతని దృష్టి సౌధముపై నిలువఁబడి తన్నుగాంచుచున్న రాణిపై వ్రాలెను. ఒక్కమాఱుగఁ బ్రేమవాహినిపొంగి పొరలి యాతని మనస్సును గలఁచి వైచెను. ఇంచుకసేపాతఁడుతన్ను దామఱచియుండెను. ఆహా! ఎట్టి దుఃఖసమయము? నూనూఁగు మీసాలప్రాయము. భార్యయౌవనవతి; సుందరాంగి. యుద్ధమున జయముగాంచి వచ్చుట సందియము. ఇట్టిసమయమున నెట్టివాఁడైనఁ జింతానిమగ్నుఁడు కాకుండునా? దైవముచేఁతలను దప్పింప నెవరితరము?

పుట్టసింహుని విచార మొక్కనిముసముననే దూరమయ్యెను. పరాక్రమశాలురు తుచ్ఛమగు మోహపాశములచే గట్టుపడుదురే? ఉత్తరక్షణమున నాతఁడు సూర్యద్వారమును జేరెను. నాయకవిహీనులై నిరుత్సాహులై

యున్న రాజపుత్ర సేనలు పుట్టసింహునిఁగాంచి జయవాదములు సలిపిరి. పూర్వనాయకుల మరణమున వారిహృదయముల నణఁగియుండిన ప్రతాపాగ్ని యపుడు దేదీప్యమానమై ప్రజ్వరిల్లసాగెను. పుట్టసింహుఁడట్టి సేనలను బురికొల్పుచు నెక్కడను దానమై శత్రువులకు భీతిని గలిగించుచుండెను. అంతనుభయసేనలకును ఘోరముగఁ బోరాటమయ్యెను. రాజపుత్రసైన్యమును నడపుచు యుద్ధమును జేయుచుండిన పుట్టసింహుని చాతుర్యము వర్ణనాతీతముగ నుండెను.

పుట్టసింహుని భార్యయుఁ దల్లియు నంతఃపురసౌధమున నుండి యతని రణపాండిత్యమును గాంచుచుండిరి. మొగలు సేనలు పెచ్చు పెరిఁగి రాజపుత్రవీరులపైఁ బడుచుండుటయుఁ గ్రమముగ రాజపుత్రవీరులబలము తగ్గుచుండుటయు నెఱిఁగి పుట్టసింహునకు జయముకల్గుట సందియమని యాయువతులు తలఁచిరి. వారి చిత్తము లంత రోషపూరితములయ్యెను పుట్టసింహుని మరణానంతరము తాము బ్రదికియుండుట భావ్యముకాదనియు, స్వదేశసంరక్షణము కొఱకయి పోరాడి తాముసు ప్రాణములఁ గోలుపోవుట లెస్సయనియు వారునిశ్చయించిరి. వెంటనే కవచములఁదొడిగి కత్తులను గైకొని గుఱ్ఱముల నెక్కి యుద్ధరంగమునకుఁ దరలిరి.

అపుడు పుట్టసింహుఁడపారపరాక్రమమును నెఱపుచు శత్రువుల నుఱుమాడుచుండెను. అతని సమరకౌశలమారితేఱిన పోటరులకైన నాశ్చర్యము గలిగించుచుండెను. తండతండములుగఁ దన్ను మూఁగుచున్న మొగలులను వీరావేశముతోఁ దన నిశితఖడ్గమున కెఱసేయుచుండెను. ఇట్లు లెంతసేపాతఁడొక్కఁడు పైపయిసముద్రతరంగములవలెఁ బొంగివచ్చు శత్రుసేనల తాఁకున కోర్చినిలువఁగలఁడు? అతని శక్తిసాహసములు గ్రమముగ క్షయించుచుండెను. అతనికన్నులు చీకట్లు గ్రమ్ముచుండెను. గెలుపాస యాతనిని ధైర్యముతోడ వీడిపోయెను. మరణము సమీపించుచుండెనని యతఁడించుక విచారమునుజెందెను. కన్నుల నీరు గ్రమ్ముచుండ రాజధాని వంకకు మరలి చూచెను. గుఱ్ఱముల నెక్కివచ్చుచున్న యిరువురు చక్కని యువతుల నాతఁడుగాంచెను. వారి నతఁడు గుర్తించెను. వారినిజూచినమాత్రమున డస్సి యున్న యతఁడుత్సాహపూరితుఁడై పూర్వముకన్న నినుమడియగు బలపరాక్రమములతో నొప్పారి ప్రళయకాలునివలెఁ జూచువారలకు గుండెదిగులై యుండెను. అతనిని గాంచి తల్లి "ఈదినము సుదినము. నేను ధన్యురాలను. నిక్కముగ నిపుడు వీరమాతనయితి" నని తలఁచెను భార్య "నేనీనాఁడు వీరపత్నినయితి"నని యానందించెను.

ఆ ముగ్గురు నుత్సాహభరితులై పగతురను మార్కొని భయంకరముగఁ బోరిరి. హతశేషులగు రాజపుత్ర సేనలును వారివెంబడి ద్విగుణీకృతోత్సాహమున శత్రువులనుదాఁకిరి. వేలకొలఁది మొగలుల నాముగ్వురు చంపిరి. స్త్రీలిరువురు పురుషులు సైతము మెచ్చుకొనునట్లు యుద్ధముచేసి తుదకుఁ జిత్తూరు సూర్యద్వారముకడఁ బుట్టసింహునితోఁ దమప్రాణముల నర్పించి వీరస్వర్గమును జూఱకొనిరి. ఇట్టి వారిదేకదా జన్మము!

ఈ దండయాత్ర సమయమున నాక్బరు చక్రవర్తి స్వవిజయచిహ్నముగఁ దానువిడిసినచోటఁ గట్టించిన ముప్పదియాఱుగజములయెత్తుగల గోపుర మీనాఁడును గలదు. దానిని "అక్బర్-కా-దివా!" అందురు. గ. సు.

# గ్రంథ పరిచయము

కన్నీరు:—ఈపాటలపొత్తమును రచించినకవి శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి గారు, బి. యే. కాని సహజముగ్ధులగుటచేతను పేరుతో గ్రంథమును ప్రకటింపలేదు. ఈకవిగారు పీఠికాపురమునందు పూర్వ మాస్థాన కవీశ్వరులుగనుండిన శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి కుమారులై పైతృకధనముగ కవితాశక్తిని బడసి, "కవిర్జాయతే" అనుసూక్తికి లక్షీభూతులై ఎనిమిదేండ్లప్రాయమునుండి ను సరసకవిత్వము జెప్పుచుండినను నేటివరకును నజ్ఞాతముగనే యుండుటకు నిశ్చయించిరి. కాని పుష్పము ఆకులసందున దాగియుండవలెనని యెంతయత్నించినను దానిసౌరభమే దానిని బయలుపెట్టకమానదు కదా? పుస్తకమునకు పీఠికను వ్రాసిన శ్రీ పెద్దాద రామస్వామి యం.యే. గారుకూడ కవిహృదయమును బయలుపరచిరే కాని కవినామమును మాత్రమును బయలుపరుపరైరి. తెరచాటుననున్న కవిగారిని కొంచెము పదిమంది కనులయెదుట నిలిపినందుకు వారు మమ్ము మన్నింతురుగాక యని కోరెదము.

ఈపుస్తకమునందు కవి తన విచారమును జీవితనాథునకు పరమేశ్వరునకు నివేదించి యాతని ప్రణయానుగ్రహమును వేడుకొనుచున్నాడు. "కన్నీరు" అను గ్రంథనామమే ఇందలి కరుణరసమును సూచించుచున్నది. లోలోపల పొంగి ఘూర్ణిల్లెడు దుఃఖసముద్రము పైకుబికిన ప్రళయోపద్రవజనకమగునేమోయను భీతిచే కాబోలు కవిదుఃఖమంతయు నొక్క కన్నీటిబిందువురూపమున వెలిబుచ్చెను. ప్రియునికిని ప్రియురాలికిని మధ్య గోప్యమును మొగమోటమియు నెట్లుండవో అట్లే భక్తునకును భగవంతునకును మధ్య నేగోప్యమును మొగమోటమియు నుండవగదను వైష్ణవభక్తసంప్రదాయము నవలంబించి కవి తన కష్టనిష్ఠురములను పరమేశ్వరునకు నివేదించుకొనినాడు. కవిత్వమనగా మదోన్మత్తులై తామరాకుపాన్పులపైనను హంసతూలికాతల్పములపైనను తూగుటుయ్యాలపైనను పొరలాడుచు ప్రేలుచుండెడి యేప్రాతకాలపు రాజకన్యలయొక్కయు రాజులయొక్కయు చరిత్రములనో వర్ణించు ప్రబంధములుమాత్రమే యనియు, కవియొక్క స్వంతకష్టనిష్ఠురములను ఆశయములను భావములను నివేదించు గీతములును ఖండకావ్యములును కావనియు వాదించువారికి నచ్చజెప్పుట లాభము లేనిపని. సహృదయులగువారుమాత్ర మిట్టిభావనివేదనము సరసకవిత్వమని యంగీకరించి తీరెదరు. ప్రబలవ్యాధిపీడితులై నిరంతరమృత్యుసాన్నిధ్యమున దిగులుపడి స్రుక్కుచు పరమేశ్వరుడే తనదిక్కనినమ్మి జీవితము నెట్లెట్లో భరించుచుండిన కవికి భగవంతుని ప్రణయానుగ్రహము లభించినప్పుడు కన్నీరుగాక ఇంక నేబాహ్యభక్తిచిహ్నము ప్రకటితమగును? భక్తియొక్క పరిణామములగు స్నేహము, చనవు, అనురాగము మొదలగు భావములన్నియు నిందలి గీతములలో ప్రదర్శితములైనవి. పీఠికవ్రాసినవారు కవిగారి పాటలలోకన్న పద్యములలో నెక్కువ స్వారస్యమున్నదని యభిప్రాయమిచ్చిరి. రసవంతమగు ఫణితిని జదువగలవారు చదివినచో నీపాటలుకూడ పద్యములకన్న నెక్కువమధురముగను భావోద్బోధకములుగను నుండగలవని మావిశ్వాసము. గీతములయందేమి పద్యములయందేమి మృదుమధురమై సలక్షణమైన శైలి యుపయోగింపబడియున్నది. ఈమధురశైలి వీరికి జన్మతః లభించియుండవలెనని మాయూహ. గ్రంథము వలయువారు పిఠాపురము హైస్కూలునందుపాధ్యాయులుగనున్న గ్రంథకర్తగారికి వ్రాయవలెను.

# పత్రికావిమర్శనము

శారద:—సంపాదకులు కాతా శ్రీరామశాస్త్రి గారు, మచిలీపట్టణము. పైపత్రికయొక్క వైశాఖమాస సంచిక మాకార్యస్థానము చేరినది. ఇందు సామాన్యపాఠకులకు వినోదమును విజ్ఞానమునుగూర్చు "ఆస్ట్రేలియా దేశము" "సింగపూరు" "యానాదులు" "ఆఫ్ఘన్ స్థానము" "భారతీయులరాజనీతి" "సంఘము-వ్యక్తి", "ప్రస్తుత పరాసు రాజ్యాంగపద్ధతి" అను వ్యాసములును, శ్రీబలిజేపల్లి లక్ష్మీకాంతముగారిచే రచింపబడిన ఉత్తరరాఘవనాటకవిమర్శనమును "హిమబిందు", "శౌర్యము", "అంధునికథ" "విఫలమనోరథవిలసనము-రవీంద్రుని కథకనువాదము" మొదలగుకథలును కలవు. అధికార్ల సూర్యనారాయణరావుగారిచే రచింపబడిన "విభుడేలరాడే" యను ద్విపదఖండకావ్యమునందు శృంగారహాస్యరసములుచక్కగా మేళవింపబడి నేటివాడుకభాషకు దరిదాపుగావచ్చు సులభశైలిని ప్రదర్శింపబడినవి. అనంతపంతుల రామలింగస్వామిగారు నటకులకు తాము చెప్పదలచుకొన్న నీతులన్నియు వచనములో చెప్పక శ్రమపడి పద్యములలో నేలచెప్పవలెనో మాకూహ్యము కాకున్నది. పద్యముయొక్క రసప్రయోజనమును గుర్తించి రసవత్తరవిషయములందుమాత్రమే దాని నుపయోగించుటయే రసికధర్మమగును. కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరుగారిచే "మాతృదేశము"నగూర్చి రచింపబడిన పద్యము లుద్రేకపూరితములై ధారాశుద్ధములై యున్నను విషయము కేవలము రాజకీయమగుటచే రసభావప్రకటనమునకును భావనాశక్తి ప్రదర్శనమునకును తగినంత యవకాశము లభించియుండలేదని యూహ పొడముచున్నది. లోహములను శుద్ధిచేసి పోతపోయుటకు అగ్నిసంస్కారమెట్లవసరమో, కావ్యవస్తువును రసవంతముగ ప్రదర్శించుటకు భావనాశక్తియంతయవసరము. (Imaginative Idealism) చాలినంతలేనిది ప్రస్తుతరాజకీయసమస్యలనుగూర్చి రచింపబడిన పద్యములు రసవత్కావ్యజాలమున చేరజాలవు. "భిక్షుకుడు" అను ముత్యాలసరమునందు భావమును ఆవేదనమును తీవ్రముగనుండుటచే సమరసదృష్టి కవి కలవడకపోవుటయును, శైలినిమ్నోన్నతములు కలిగియుండుటయును సహజములేయగునని తోచుచున్నది. అడివిబాపిరాజుగారి "క్రొత్తపూవు"అను పాట తమాషాగానే యున్నది. నాల్గవ చరణమున కన్వయము కుదరకున్నది. దువ్వూరిరామిరెడ్డిగారిచే రచింపబడిన "అనార్కలీ" యను ఖండకావ్యమునందు కరుణరసము వాచ్యముగ ప్రదర్శింపబడినది. హెన్రీ ఉప్పన్ ఈమెనుగూర్చియేరచించిన గీతమునందు కరుణరసము వ్యంగ్యప్రధానముగవర్ణించెను. రామిరెడ్డిగారీగీతమును తిలకించియేయుందురని మా తలంపు. చిలుకూరి వీరభద్రరావుగారు "ఇదికలియుగమా? కాదు" అను విపరీతవిషయమునుగూర్చి యపూర్వమైనవ్యాసమును రచించిరి. ఇప్పటివరకు కలియుగధర్మోపదేష్టయగు పరాశరుడును, భారతేతిహాసకర్తయును పరాశరకుమారుడును నగు కృష్ణద్వైపాయనుడు క్రీస్తుకు 165 సంవత్సరముల కన్న పూర్వులుకారని తేల్చిరి. ముందేమి తేలనున్నవో? నూతులు త్రవ్వగా భూతములు బైటపడెనన్నట్లగునేమో? భావరాజు వేంకటకృష్ణరావుగారు ప్రస్తుతం నాటకరచననుగూర్చి కావించిన యాక్షేపణములు నిజమైనవేయని యంగీకరింపక తప్పదు. వివిధభావముల యొక్కయు ఒక్కొక్కప్పుడు విరుద్ధభావములయొక్కయు సంఘట్టనమువలనను మథనమువలనను నాటకమున రసము జనింపవలెను అట్టిసందర్భములలో కావ్యప్రాణమనదగు భావమునకుగల ప్రాధాన్యమునుతగ్గించి కేవలము ప్రేక్షకజనరంజనమే యాదర్శముగాగ్రహించి నాటకములను కుప్పతెప్పలుగారచించు ప్రస్తుతాంధ్రనాటకరచయితల యపూర్వోత్సాహమును నమందగమనమును కొంతవరకు కుంటించుట రసికులకు కర్తవ్యమేయగునని తోచుచున్నది. నట్టు లనుకరణము పొంతపోక స్వతంత్రమార్గముల నన్వేషింపవలయునని కృష్ణరావుగారొసగిన హితము నటులు నిశ్చయముగ పాటింపదగినదై యున్నది. రసవంతములగుపద్యములను సంగీతముతో మేళవించి నటుడు చదివినచో రసనిష్పత్తి కెక్కువసహకారిగా నుండునని

యంగీకరించిన కృష్ణరావుగారు రసవత్తరమైన పాటలను తత్తదుచితగానఘణుతులలో పాడుటకేల యభ్యంతరము జెప్పవలెనో యూహింప శక్యముగాకున్నది. షేక్స్పియర్, మిల్టన్, ఈస్కిలా, సాఫక్లా, గీతే, టాగూరు మొదలగు కవిశేఖరు లందరును తమనాటకములందు పాటల జొప్పించియేయున్నారు. కాళిదాసాది సంస్కృతకవులుకూడ తమనాటకములందు ద్విపదీ ఖండము లాదిగాగల గేయఘణుతుల జొప్పించియున్నారు. ప్రజారంజకరూపకము లగు యక్షగానాదులయందును పాటలే యెక్కువగా వాడబడుచువచ్చినవి. ఔచిత్యమును, ప్రత్యేకరసప్రయోజనమును గుర్తించి పాడబడినచో పాటలుకూడ నాటకమున నుపయోగార్హములగునని మా మతము. వచనముకన్న పద్యమును, పద్యముకన్న పాటయు శ్రోతల కెక్కువ రసావేశము జనింపజేయుననుట నిశ్చయము.

సాహిత్యయాత్రికునిగూర్చి వేలూరి సత్యనారాయణగారు వ్రాసినవ్యాసము చదువుట కింపుగనున్నది. "అమృతాన్వేషణ" మనువ్యాసమునందు సూరి నృసింహశాస్త్రిగారు అమృతమును గూర్చి శ్రుతి స్మృతి శాస్త్రాదులయందును మహమ్మదీయసారస్వతమందునుగల గాథలను వివరించియున్నారు. నిజముచెప్పవలసివచ్చిన ఈసంచికలోని వ్యాసములలో నెల్ల "కరుణరసము—ట్రాజెడీ" అను శీర్షికతో ప్రో. రామమూర్తిగారు రచించిన వ్యాసము రసికహృదయంగమమై యొప్పుచున్నది. పాశ్చాత్యకవులు ద్వంద్వమునే కవిత్వమునకాలెగాగొని దుఃఖాంతరూపకములను రచించిరనుట సత్యమేయైనను, వ్యాసరచయితలును వారూహించినట్లు ప్రేక్షకులును నడుగవగిన "తతః కిం" అను ప్రశ్నమునకు సమాధానము ధ్వన్యా తప్పక స్ఫురింపగలదను విశ్వాసముననే పాశ్చాత్యకవులు చెప్పక విడిచిరనట న్యాయ్యము. సాధకునియొక్క జీవితమంతయు నీ "తతః కిం"అను ప్రశ్ననుగూర్చిన మీమాంసలోనే గడుపదగినదగుచున్నది. ఈమీమాంసయొక్క భిన్నపరిణామములే వివిధరసానుభూతులు. సాధకుడు కాంక్షించెడు సిద్ధి సారస్వతమున కేవల లక్ష్యప్రాయమును సూచ్యమును నగునుగాని రసమున కాశ్రయమమాత్రము కాజాలదు. అందుకనియే కొందరు సంస్కృతలాక్షణికులు నవరసములనుమాట నంగీకరింపక రసము లెనిమిదియే యనియు, ద్వంద్వాతీతావస్థను వర్ణించుశాంతి తొమ్మిదవరసముగ నంగీకరింపదగినది కాదనియు వాదించిరి. కావున ప్రాచ్యపాశ్చాత్య సారస్వతములందలి రసపరమార్థముల గ్రహింపనెంచు విమర్శకులు విశాలదృష్టితో సంప్రదాయభేదముల మాటుననడగియున్న లక్ష్యైక్యము నుపలక్షింపవలెనని మావిజ్ఞప్తి.

వ్యాసములు కాక సంచికయందు "బుద్ధదర్శనార్థము వచ్చిన మహారాజులు, రాజులు, భిక్షుకులు-తీర్థప్రజ" అను నజాంతాచిత్రమును, క. ఆనందమోహనశాస్త్రిగారిచే రచింపబడిన 'ఉయ్యల' యను రంగుల పటమును, సందర్భోచితములగు నితరపటములును కలవు.

సాహితి:—బెజవాడయందలి శారదాభాండారముద్రాశాలాధికారులచే ప్రకటితము. సాహితి పత్రిక ఈమధ్య చేతులు మారినను దాని ఆదర్శములు మాత్రము యేమీ మారనందుకు సంతోషమగుచున్నది. నవీనాంధ్ర హృదయముల మొలకలెత్తుచున్న కావ్యబీజముల నీసాహితిపత్రిక చక్కగ, నీరోసి పెంచినదిన్నాళ్లును. దేశకాలపాత్రముల ననుసరించి సారస్వతస్వరూపస్వభావములు మారుచుండునను సత్యము నాశ్రయించి ఈపత్రికానిర్వాహకులు నవీనఘణుతులతో రచింపబడు పాటలను పద్యములను హాస్యరసప్రపూర్ణములగు కథలను ప్రచురించి పాఠకుల కుల్లాసము కలిగించుచున్నారు. మొత్తముమీద వీరు ప్రచురించెడి కథలన్నియు వాడుకభాషలోనుండినవి. పద్యము లెక్కడనో రెండుమూడు తప్ప సామాన్యముగ గ్రాంథిక భాషలోనే యున్నవి. వాడుకభాషను సరసకావ్యరచనయం దుపయోగింపగల సమర్థులింకను చాలతక్కువమందిగనే యున్నారు. సామాన్యజీవితవిషయములందలి సారస్యమును గ్రహించి దానిని రసవంతముగ కావ్యములయందు చిత్రించు నేర్పు సాహితిపత్రికయొక్క విలేఖరులలో చాలమందికి కలదు. కాని ఇంతవరకు ఈనేర్పు జీవితమందలి లోతుపాతుల దెలుపు గభీరవిషయావగాహమున కుపయోగింపబడుటలేదు. పత్రికానిర్వాహకు లీహితమునుయథా సంకల్పితముగ గ్రహించెదరుగాకయని కోరుచున్నాము. మాఘఫాల్గుణమాసముల సంచికయందలి పద్యావళులలో, పాపినేనివేంకటేశ్వరరావుగారి "మద్దు", కొత్తపల్లి సుబ్బ

న్నాచార్యులుగారి "ఆంధ్రకన్య",నోరి నరసింహశాస్త్రి గారి"అర్ధబిన్దుస్తవము","తల్లి","జీవితాంచలము","అనాగతము",కొడాలి ఆంజనేయశర్మగారి "కవితాగానము", "పెండ్లికూతురు", శివశంకరశాస్త్రిగారి "పుష్యపూర్ణిమ ము", మునిమాణిక్యం నరసింహారావుగారి"వేణుగీతి"అను నవి ప్రశంసాపాత్రములుగ నున్నవి. "ఇల్లాలు మాటతప్పు తుందా" అనుకథలో శేషాద్రిరమణకవులు ప్రాకృత జనుల యమాయికభక్తియొక్క ప్రభావమునుచూపించు టకు యత్నించిరికాని కొంచెము వాక్పారుష్య మచ్చు టచ్చుట కథలో కాననగుట విచార్యము.మునిమాణిక్యము నరసింహారావుగారిచే రచింపబడిన " పదోయేట " అనే వ్యాసము తమాషాగానున్నది. "తుపాను" అను కథలో కొప్పర్తి నారాయణమూర్తిగారు చిన్నిపిల్లల మనఃప్రవృత్తి, ఊహాపోహలు మొదలైనవానిని సరసముగ వర్ణించిరి. "పరీక్షపంతులు" అనుకథలో (Orginality) విశేషముగ లేకపోయినను కథారచనావిధానముమాత్ర మింపుగనున్నది. "శారదా"పత్రికలో ప్రకటింపబడిన క్రాపింగ్ కల్పద్రుమమునకు సంబంధించిన తమాషాకథ నొక దానిని కొప్పర్తి నారాయణగారు సరసముగ రచించిరి. తమ క్రాపింగులు కల్పద్రుమములోని కెక్కలేదని విచారించెడి లాకాలేజీ విద్యార్థి, ముత్తయ్యశెట్టి, తురుకఉద్యోగిగార్ల సంభాషణమును, గడ్డిదుబ్బుజుట్టు అయ్యర్ ప్రలాపములు, సర్వకక్షారనిపుణులకుకృష్ణనాయకరుగారి ఉపన్యాసధోరణి, శారద స్త్రీయగుటచే ఆడవాళ్ల క్రాపింగులను ముందుగా కల్పద్రుమములో వేయనందుకు తత్పత్రికాధిపతి వెంటనే పత్రికాముఖమున క్షమాపణ వేడుకొనవలెనని గద్దించిన స్త్రీయొక్క చాతుర్యమును హాస్యజనకములుగనున్నవి. ''నూర్జహాన్'' అను నాటకముయొక్కద్వితీయాంకములో నూర్జహానెట్లు భ్రాతృమిత్రాదుల యొత్తిడివలన భర్తృహత్యాప్రతీకారదీక్షను సడలించి తుదకు తనభర్తయొక్క హత్యకు కారణభూతుడైన జహాంగీరుపాదుషాకు రాణియగుట కంగీకరించెనో, ఎంతమనోవేదన ననుభవించి యందుల కియ్యకొనెనో అతిరసవంతముగ వర్ణింపబడినది.''కైలాసశిఖరము''అను నేకాంకరూపకముద్దిష్టరసభావవ్యంజకమై యొప్పుచున్నది. పత్రికయొక్క ముద్రణము రమణీయముగ నున్నది.

---

# ప్రళయభీతి

దాసురాజు పుండరీకాక్షుడుగారు

సాంధ్యరాగంబు రక్త వస్త్రంబుదాల్చి
ప్రళయలీలల నాట్యంబు సలుపుచుండె
భూనభోంతరాళంబు లంభోయటంచు
చీకటి మరుంగుఁజొచ్చి వాల్చినవి తలలు;
నాయకుడు లేని వెఱ్ఱి సైన్యంబుకీతి
నంధకార పరంపరలందు దగిలి
మినుకు మినుకన చుక్కలు మిడుకుచుండె,
ప్రళయ కాలాహి తన నిండుపడగవిప్పి
వేడిసుడిగాడ్పు వీచ్పుల విసరుచుండె;
కాలయము డంత మే ఘూస్త్రజాలమూని
ఉరుము లురుముచు రుద్రమహోగ్రలీల
భీకరాకృతి సంగ్రామ వీథిపడలె,
కాలమున కందుకొనలేక కంపమయుడు
దూరమునఁ జిక్కగాఢాంధకార పటలి
బ్రద్దలుగఁ జీల్చు ఛళఛళల్ ప్రస్ఫురింప
మెఱుపుతీగెల బాణముల్ బఱపుచుండె
ఆశలున్నవో లేవో! జయాపజయము
లడుగఁబోకుము ధైర్యంబు విడువఁబోకు,
నమ్మువారికి విజయమే సుమ్ముమనస!
నమ్మకుండిన చింతయే నాస్తిమనస!
భక్తివిశ్వాసములె మోక్షపథము మనస!

# సాభిప్రాయవిశేషములు

క. మనమున ధర్మము నర్థం,బును గామముఁ గీలుకొనక పొరపొచ్చెములై
చన సుఖదుఃఖంబుల మన,మును దైన్యముఁ బొందకునికి మోక్షకరముగన్. — భార. శాం.

మహాభారతమున పురుషార్థములందు ధర్మార్థకామమోక్షములతారతమ్యంబును దెలుపుట కొకయితిహాసంబు గలదు. ఈ యితిహాసరహస్యము సకలార్థములందును ధర్మారాధనావసరమును బోధించుచున్నది. ధర్మరాజు విదురుని పాండవులను చతుర్విధపురుషార్థములందును అవశ్యానుష్ఠేయధర్మమును దెలుపుమని కోరెను. ధర్మజుని ప్రశ్నకు విదురుడు ధర్మంబుత్తమానుష్ఠేయధర్మమని తెలిపెను. పార్థుడు ధర్మకామములకు మూలంబైన యర్థముత్తమంబని తెలియబలికెను. నకులసహదేవులు ధర్మార్థంబులుత్తమములని తెలిపిరి. భీముడు చతుర్విధపురుషార్థములును ననుష్ఠేయములని తెలిపెను. ధర్మజుడు సుఖదుఃఖములను మదదైన్యములను గమనింపకను ధర్మార్థకామముల నారాధించుట యుత్తమమార్గమని తెలిపెను. వర్తమానకాలమునందు గాంధిమహాత్మునకును దేశబంధుదాసునకును శాసనసభాబహిష్కారసందర్భమునను జరుగుచున్న ధర్మసందేహనిరూపణమున కీయితిహాసము ప్రమాణముగ నున్నది. అసహాయోద్యమసిద్ధాంతము ననుష్ఠించుటకు పంచవిధబహిష్కారము మూలమని గాంధిమహాత్ముడు నిర్వచించుచున్నాడు. ఆనిర్వచనమును కాంగ్రెసు ఆమోదించినది. స్వరాజ్యసంపాదనమునకు దౌర్జన్యరహితమైన యసహాయయోగము సాధనమని కాంగ్రెసు నిర్ణయించినది. ఈ సిద్ధాంతము నంగీకరించెడి వారందఱును కాంగ్రెసునందు సభ్యులుగ నుండగలరు. కాంగ్రెసు విధానము నామోదించుచు పంచవిధబహిష్కారము నామోదింపకపోయినను కాంగ్రెసునందు సభ్యుడుగ నుండవచ్చును. ఈ సిద్ధాంతము ననుసరించి కాంగ్రెసుసభ్యులు శాసనసభలయందును శాసనసభాసభ్యులు కాంగ్రెసుసంఘములందును జేరవచ్చును. ఇది సంభవమైనను కాంగ్రెసుమూలసిద్ధాంతమీయర్థమునకు వ్యతిరేకముగ నున్నది. కాంగ్రెసుసిద్ధాంతమీ ధర్మమును సామాన్యధర్మముగను నంగీకరించిన శాసనసభాబహిష్కారము నిరర్థకమగును. ఢిల్లీ కాకినాడ కాంగ్రెసులు స్వరాజ్యపక్షము వారికి శాసనసభాప్రవేశమునకు సమ్మతించినను అసహాయోద్యమమునకు మూలమైన బహిష్కారసిద్ధాంతమును సయితము పునఃప్రతిపాదనమును జేసినది. ఆ తీర్మానములు కాంగ్రెసుధర్మమును సంరక్షించుచు స్వరాజ్యపక్షమువారికి శాసనసభాప్రవేశమును గోరెడివారికి సమ్మతి నొసంగినవి. ఢిల్లీ కాకినాడ

కాంగ్రెసు తీర్మానములు మూలసిద్ధాంతము
లను మార్చలేదు. మూలసిద్ధాంతములకు విరు
ద్ధముగను ప్రవర్తించెడివారు కాంగ్రెసు
ధర్మమును సంరక్షించుటకు దగియుండరు.
మానవుడు రెండు దైవముల నొకసమయ
మున నే కొలువజాలడు. శాసనసభలను గొలి
చెడివారు కాంగ్రెసును గొలువజాలరు. శా
సనసభలయందు సహాయయోగాభ్యాసము
సాధ్యము గాదని అయిదారుమాసములయను
భవమును విశదముచేసినది. రాగలయనుభవ
మీవిషయమునందలి యసంబద్ధతను విశదము
చేయగలదు. మఱియును గాంధిమహాత్ముడు
దెలిపినటులు కేవలము ప్రతిష్టంభనము దా
ర్ఢ్యరహితమైన అసహాయోద్యమధర్మము
నకు ప్రతికూలముగ నున్నది. శాసనసభలను
దేశప్రయోజనముల కుపయోగింపదలచిన
వారు లోకమాన్యతిలకు నిర్ణయించినటులు
ప్రయోజనమున కనురూపముగను సహాయ
యోగము నవలంబించుట దేశాభ్యుదయము
నకు ప్రయోజనకరము. కాంగ్రెసుధర్మ మ
సహాయయోగమైనను సహాయవాదులు నయి
తము కాంగ్రెసునందు జేరి వారిశక్తికొలది
దేశాభ్యుదయమునకు పాటుపడవచ్చును.
అట్టివారు కాంగ్రెసు నీతిని అసహాయవాదు
లకు వదలుటయె ధర్మానుకూలమును శ్రేయ
స్కరమును అని గాంధిమహాత్ముడు దెలిపిన
భావములు యథార్థములుగ నున్నవి. గాంధి
మహాత్ముని నిర్భయత్వమునకును సత్యప్రియ
త్వమునకును వారిభావములు నిదర్శనములుగ
నున్నవి. కాంగ్రెసుపక్షమునందు మహాత్ముని
భావములు సంక్షోభమును గలుగజేయకను
స్వధర్మారాధనమునకు వినియోగపడు నని
నమ్ముచున్నాము. రాగల భారతజాతీయమ
హాసభోపసంఘసమావేశమునందీవిషయము
యథోచితముగను రాగద్వేషావేశములులేకను
నిర్ణయింపబడు నని నమ్ముచున్నాము.

* * *

సప్తాహములు.

పూర్వకాలమునందు మహర్షులు ధర్మో
పదేశములను జేయుటకు దీర్ఘమైన సత్రయా
గములను జేసినపథమును పురాణములు దెలు
పుచున్నవి. సత్రయాగములందు మహర్షులు
చేసిన ధర్మేతిహాసబోధలను సూతాదికథకులు
పురాణరూపమునను లోకమునకు శ్రుతపఱ
చినవిధమును పురాణప్రస్తావనలు విశదము
చేయుచున్నవి. ఆ యాచారపారంపర్యము
నేటిసప్తాహములందు గోచరంబగుచున్నది.
ఇటీవల ఆంధ్రగీర్వాణవిద్యాపీఠస్థానమైన
కొవ్వూరునందు జరిగిన సప్తసప్తాహములు
సత్రయాగవిషయములను సంస్మరింప జేయు
చున్నవి. నలువదితొమ్మిదిదినములంతరా
యములేక ననుక్షణమును శ్రీరామనామస్మ
రణముతో ప్రతిధ్వనిల్లిన యాంధ్రగీర్వాణ
విద్యాపీఠనిలయము పుణ్యాశ్రమమైనది. వేన
వేలు జనులుగూడి రామనామమును తాళగా
నములతో నేకగ్రీవముగను మనోహరముగను
నుత్సాహముతో సంకీర్తనముచేయుచు ప్రదే
శమునంతను రామనామమయము చేయుచుం
డిరి. హరిదాసు నంబూరి రామమూర్తిగారు
రామభక్తిపరవశులై సర్వేంద్రియములను

రామనామస్మృతితో మేళగించుచు తన్మయత్వ
మును బడయుట రామభక్తుల నానందపరవ
శులను జేయుచుండెను. భాగవతోత్తములు
నృత్యగీతాభినయములతో భక్తిపరవశులై
శ్రీరామకీర్తనలను అధ్యాత్మరామకీర్తనలను
పాడునపుడు చైతన్యాంకురములుగల యాంధ్ర
హృదయము శ్రుతిసమ్మేళనమును బొందుచు
నానందపరవశ మగుచుండినది. ఇపుడా భాగ
వతవిజ్ఞాన మనసాన స్థితియందున్న విధమును
దేశావృతమైన భోగవ్యామోహము సంశయ
శీలమును విశదము చేయుచున్నవి. రామమూ
ర్తి రామదాసుగారు దేహేంద్రియములను
శబ్దబ్రహ్మముతో శ్రుతిలయసమ్మేళనమును
జేయుచు నాడుటపాడుట భక్తిరసానందానుభ
వమును ప్రత్యక్షము చేయుచు డును. భజనను
జేసెడివారు సంతుబవరుస నవిచ్ఛిన్నముగను
రామభజనను వారిగాఢమైన రామభక్తిని వ్య
క్తము చేయుచుండిరి. చిన్నపెద్దలు స్త్రీపురుషు
లు బీదలుభాగ్యవంతులు బ్రాహ్మణులు బ్రాహ్మ
ణేతరులు జాతిస్థితిమతభేదములను మఱచి శ్రీ
రామభజనయందేకస్థాయిని రామభజనరసా
నందము ననుభవించుచుండిరి. కోవూరునందు
జయప్రదముగను జరిగిన సప్తసప్తాహములును
శ్రీరామభక్తిలక్ష్యమైన యాంధ్రహృదయ
శీలమును స్వరూపమును విశదము చేయుచు
న్నవి. ఈసప్తాహములను జయప్రదముగను
నిర్వహించిన శ్రీయుత తల్లాప్రగడ సూర్య
నారాయణరావుగారును వారి సహచరులును
ధన్యులు. సప్తాహములందు ప్రజలు సప్తాహ
నిర్వాహకులకు ద్రవ్యవస్తుసహాయము వలె
నిర్వహణసహాయమును సయితము చేయుట
యవసరము. వందలమంది ప్రజల కన్నాద్యు
పచారములను జేయవలసి వచ్చినపుడు ప్రజల
తోడ్పా టత్యవసరంబగుచున్నది. ప్రజలతో
డ్పాటున్నపుడు దుర్ఘటమైన కార్యము గన
బడదు. శ్రీరామచంద్రుడు వానరులసహాయ
మునను వారిధిని గట్టి రావణసంహారమును
జేయగలిగెను. భారతదేశసౌభాగ్యమున కన్ని
రంగములందును ప్రజలసంయోగ మవసర
మని గాంధిమహాత్ముడు చేయుచున్న యుప
దేశమునె కోవూరిసప్తాహములు నుపదేశించు
చున్నవి. తిలకుమహారాజు బోధించిన కర్మ
యోగమును గాంధిమహాత్ముడు నిర్ణయించిన
నిర్మాణవిధానమును నీకర్మయోగమునే బోధిం
చుచున్నవి. ప్రజ లీమహోపదేశమును సఫ
లము చేసి ధర్మనిర్వహణమును జేయుదురు
గాక!

* * *

### ఆంధ్రసారస్వతసాహిత్యమహాసభలు

ఏడవ యాంధ్రసారస్వతమహాసభ వై
శాఖబహుళమునందు కోవూరునందుగూడినది.
మూడునాళ్ళముచ్చట ముగిసినది. జ్యేష్ఠబహు
ళమునందుతణుకునందు సాహిత్యపరిషత్తుమహా
సభ గూడనున్నది. మూడునాళ్ళముచ్చట తీర
గలదు. సన్మానసంఘాధ్యక్షులు సభాధ్యక్షులు
మహాసభలయందు గంభీరోపన్యాసములను
చదువగలరు. పండితులు పరిశోధకులు కవీశ్వ
రులు భావభరితములైన వ్యాసములను చదు
వుదురు. మహాసభలు తీర్మానములను జేయు
ను. ఉపసంఘము లేర్పడును. ఈభాగవత
మేళేటను జరుగుచుండును. ఈమహాసభల

యందు జరిగిన భాగవతమే యితరసభలయం దును ఏదోవిధముననను నడుచుచుండును. పని మాత్రము గనబడదు. సాహిత్యపరిషత్తు సూర్యరాయనిఘంటు నిర్మాణాది మహా కార్యములను దలపెట్టినది ఈమహాకార్య ముల నిర్వహణభారమును శ్రీపిఠాపురము మహారాజుగారు వహించుచున్నను మహాజను లుత్సాహములేకను పని నెమ్మదిగను జరుగు చున్నది. నిఘంటునిర్మాణ మస్థిసంచయసమీ కరణ మని కొందర తాక్షేపించినను శూన్యావ స్థయం దస్థిసమీకరణము సయితము కార్యసి ద్ధికి ప్రయోజనకర మగుచున్నవి. శ్రీపీఠికా పురాధీశులు నిఘంటునిర్మాణమును త్వరిత గతిని జేయించుటకును మహాజనులు వారి ప్రయత్నములకు దోడ్పడుటకును పరమేశ్వ రుడుతోడ్పడుగాక!

ఆంధ్రసారస్వతమహాసభ సమగ్రమైన వ్యాకరణమును నిర్మింపవలయునని ఆజేండ్ల కు బూర్వము తీర్మానించినది. ఇంతవఱకును ఈ తీర్మానమును ఆచరణమునందు బెట్టుటకు పని జరుగకపోయినను నీయేడీపని జరుగుట కుప సంఘము నిర్మింపబడినది. శ్రీయుతులు కురు గంటి సీతారామయ్యగారును తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారును నితరమహాజను లును నిర్వహింపదలచినకార్యభారము భగ వదనుగ్రహమువలనను సఫలమగుగాక! ఇమ్మ హాకార్యనిర్వహణమునకు నిఘంటునిర్మాణము నకువలె వ్యయభారము నైనను భరింపగల మహారాజులు గనుపట్టుటలేదు. ప్రజలీభార మును నిర్వహించుటకు దగిన ప్రయత్నములను జేసి సారస్వతాభిమానమును సార్థకముచేయు దురుగాక! నిఘంటువ్యాకరణములనిర్మాణము లవలెను ఆంధ్రవాఙ్మయ మంతయును సహా యము నపేక్షించుచున్నది. ఈసహాయము ప్రజలయొక్క సంయోగమువలననె సాధ్యము గాగలదని నిత్యానుభవము విశదముచేయుచు న్నది! ఈసందర్భమునందు సారస్వతసేవకై కంకణమునుగట్టి సాహిత్యపరిషత్తును సారస్వత మహాసభయును ఆంధ్రసారస్వతసేవయందు గలిసి పనిజేయుట శ్రేయస్కరమని సర్వేశ్వ రుడు జ్ఞానోదయమును ప్రసాదించుగాత!





Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thumbu Chetty Street, G. T. Madras.



# స న్నా హ ము

(రవీంద్రుని గీతాంజలి
౯౦ వ పద్యమున కనువాదము)

నిడుమోలు కనకసుందరముగారు,
బి. ఏ. (ఆనర్సు)

మృత్యుదేవత నీయింటియెదుట నిలచి
తలుపుఁదట్టిన నేమీయఁ దలఁచినావో?—
అహహా! నాజీవభాండంబు నతిథికై వాల
నిడుదు, రిక్తహస్తంబుల నేగనీయ
వేసవినిశీథముల నంబురాసు లోడ్చు
దివముల, స్వీకరించిన తీపివిరులు,
తడయు మెలుఁగని నాజీవితంబునందు
వలపునైఁ గూడఁబెట్టిన స్వార్జితములు, ?!
మృత్యుదేవత నాయింటి యెదుటనిలచి
పిలుచునాఁడు సమర్పింపఁ దలఁచినాఁడ.

